# భారతి - తృతీయ సంపుటము — భా. ౧

# భారతీప్రశంస

కవిరాజ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు

౧

శ్రీనాగేశ్వరరాయ కర్తృకమునన్ జెల్వొంది రమ్యాకృతిన్
నానాచిత్రవిచిత్రితంబ వయి నానాశాస్త్రతత్త్వార్థముల్
గానంజేయుచు నెల్లవారిమదికిం గల్పించుచున్ హర్షమున్
నానాభూముల స్తోత్రపాత్ర మగుచున్ వర్తింపు మోభారతీ !

మ. విను మోభారతి! నీ వలంతిపదమున్ వేష్టింపఁగా లే దిలన్
నినుఁ బోషించుట కెంతవిత్త మగునో నీ కెట్టిపత్రాదికం
బును రత్నాభరణాదికంబులును బెంపుం గల్గఁ గావించుచుం
డెను నీనాథుఁ డెఱింగి దానికిఁ దగన్ నీవృత్తి మెప్పింపుమా!

ఉ. ఈవు జగంబునం గలుగు నెల్లరమెప్పును బొందు టొప్పగా
నీ! వగలాడి వై ప్రకృతినే యలరింపఁగ నుంటి వంచు నీ
భావము పండితాళిదెసఁ బర్వఁగ నీయక యుంట పాడిగా
దో వరవర్ణినీ! వినుతి నొందుము పండితపామరేష్టతన్.

చ. అలఁతు లలంతులం బలుక నయ్యవి నీవు జగజ్జనాళికిం
దెలుపఁగ వచ్చుఁ గాని భవదీయమతం బది యంచు నెప్పుడుం
దెలుపఁగఁ బోకు ముత్తమగతిన్ బొలుపొందిననీ కలంతిపే
రలవడకుండ నిన్నుఁ బరమాత్ముఁ డనుగ్రహదృష్టిఁ జూచుతన్.

# భా ర తి

## ౧. తెలుగుపద్యములు

చ. ఒకలతకూన క్రొందళుకుహొన్నతళత్తళ లెల్లచోటులం
ప్రకటము గాఁగ నాంధ్రమునఁ బర్వ సుపర్వము లందఁబోక నే
లకు నయి గుంటపూ ల్గలిగి లక్షణలక్షిత గాక యున్నచో
నొకపురుషుండు దాని మహిమోన్నతి యెల్ల నెఱింగెఁ దొల్లిటన్.

చ. పురుషుఁ డతండు నన్నయ సముత్సుకతం గొని దానికల్మషం
బరుదుగఁ బాయఁ ద్రోచి యమృతాప్తి నెసంగఁగఁ జేసి వాసి కా
కరఁ మగుభారతంబు మడి గట్టి యటన్ మొలవేసి సద్రస
స్ఫురణము గల్గఁ జేసె నది సొంపలరారె ఫలప్రదాత్రి యై.

చ. ఫలముల తియ్యతేనెలను వాచవిసేయుచు నప్పొలంబునన్
మొలఁగెడువారు వేల్పులన మించి మనోరుజఁ దొట్టి రోగముల్
గలుగక దుఃఖ మన్ననుడి గానక సంతతసౌఖ్య మందుచున్
నిలిచెద రెల్లకాలమును నెంజిలి పీడిన సత్పదంబునన్.

ఉ. ఆలత కంటురోగముల నంటగనీయక దోహదక్రియా
లీలలఁ దిక్కనాది కవిలేఖులు ప్రోచి ఫలింపఁ జేసి రీ
కాలము దాకఁ దత్కృతుల కల్పనముల్ సుమనోమనోజ్ఞముల్
పాలిత సర్వలోకములు పండితపామరలోకవేద్యముల్.

ఉ. ముద్దులు మూటగట్టుచును ముచ్చట గూర్చెడు చిక్కపల్కులన్
సద్దళముల్ మధువ్రతవిసారితగానకలాకలాపముల్
సుద్ది నెసంగువృత్తములు సొంపునడల్ కుసుమప్రహాసముల్
పద్దున కెక్కు నావ్రతతి పాటలగంధి యనంగఁ బేర్వడెన్.

మ. బహుదేశంబులపండితవ్రజముతో భాషించి తత్త్వగ్గుణా
గ్రహణప్రాప్తిఁ బ్రశస్తికెక్కి జగతిం బ్రఖ్యాతికై సజ్జన
స్పృహణీయోన్నతి నాలతాంగి వెలయుం బ్రేమించి సేవింప న
న్వహమున్ సర్వమనోరథంబులును దీర్పం జాలి భక్తాళికిన్.

ఉ. ఎల్లరకన్న మిన్న యని యెన్నఁగ నై వెలుఁగొందుదాన కో
చెల్లి! విపత్ప్రవాతమునఁ జేసి జనించిన...... బెణా మన్
చెల్లనిచీడ పట్టుకొని చేడ్పడఁ జేయఁగ నుండ నిస్వహో
సల్లలితాత్ములార, కవిచంద్రములార, తగం బొసర్పుఁడీ!



చెన్నపట్టణము జనవరి ౧౯౨౬

సంపుటము 3 క్రోధన సంవత్సరము, పుష్యమాసము సంఖ్య ౧

# స్వవిషయము

పరమేశ్వరానుగ్రహమువలన భారతికి రెండేండ్లు నిండినవి. మూడవయేడారంభ మైనది. రెండేండ్ల స్వవిషయవృత్తాంతమును విమర్శించుటయును భావిపరిణామమును నిరూపించుటయును కార్యనిర్వాహకులకసాధ్యము. స్వప్రశంస హేయము. స్వనిరసన మనుచితము. మానవప్రయత్నము లన్నియును నిందాస్తోత్ర విలసితములు. గుణాభివర్ణనము, దోషనిరూపణము పరుల పనియైయున్నది. మమకారాహంకారములు స్వవిషయములందు గుణములను, పరవిషయములందు దోషములను ప్రత్యక్షము చేయుచుండును. భారతీసేవాపరాయణులు, పండితులు గుణదోషములను నిర్ణయింప సమర్థులు. భారతియం దామూలాగ్రము గల లోపములు పత్రికానిర్వాహకులకు సువిదితములు. కార్యసిద్ధికిని సంకల్పమునకును గల యంతరము మహత్తరము. ఆరంభములు మహదాశయములతో నిండియుండును. కార్యము లతిసంకుచితముగ బరిణమించును. పండితులు స్వల్పగుణములను గొప్పగను సంభావించి యానందింతురు. రంధ్రాన్వేషణపరాయణులు దోషాన్వేషణమును జేయుచు సంతసించుచుందురు. ప్రకృతియం దుభయపక్షములకును స్థానముగలదు. గుణగ్రహణము,దోషాన్వేషణము పురోభివృద్ధికిసాధనములు. ద్వివిధాభిప్రాయములను గ్రహించి సంస్కరించుకొనుటయే నిర్వాహకులధర్మము.

ఆంధ్రసాహిత్య మనంతమై దిగంతవ్యాప్తమై విరాజిల్లుచున్నది. జీర్ణములైన స్థా

ములందును, భూస్థాపితములైన శాస
నాదులందును, సజీవమైన ప్రకృతియందును,
విజ్ఞానవిలసితమైన యాంధ్రహృదయమునం
దును ఆంధ్రసాహిత్యము ప్రత్యక్షమగుచున్నది.
ఈయనంతసాహిత్యమును నింద్రియగోచర
ముచేసి యానందరసోదయమును గలుగజేయు
టకు దేశమునందంతటను ననంతముఖముల
నిర్మాణములు జరుగుచున్నవి. కవులు
సాహిత్యస్వరూపముల నభివర్ణించుచున్నారు.
గాయకులు సాహిత్యతత్త్వమును పాడుచు
న్నారు. చిత్రకారులు సాహిత్యసౌందర్యమును
చిత్రవిచిత్రవైఖరులను చిత్రించుచున్నారు.
కాపులు సాహిత్యసారమును ప్రజాపోషణము
నకు పండించుచున్నారు. దేశమునందంతటను
నూతనములైన కావ్యములు, పాటలు, పద్య
ములు, చిత్రములు పుట్టుచు, నూతన
కాంతులను ప్రసరించుచున్నవి. ఈమహో
దయసమయమునందు భారతీదేవి నుపాసించి
నిజరూపరేఖావిలాస సమన్వితమైన దేవిని
ప్రత్యక్షముచేయుటదుష్కరముగనున్నది.ఇట్టి
దుష్కరకార్యము సాధించుట కెందరోమహాను
భావులు కావలసియున్నారు. ఎన్నియో
పత్రికలు గావలసియున్నవి. పెద్దరైలుస్టేషను
లందలి పుస్తకాలయములం దమ్మెడిపత్రికలను
జూచినపుడు భయభ్రాంతులు గలుగుచుండును.
ఆపత్రికలయందలి రంగులపటములు, కథలు,
ముద్రణము దిగ్భ్రమను గలుగజేయును.
మానవుడు కొలది గొప్పలను పాటింపక ధర్మ
నిర్వహణమును యథాశక్తినిజేయుట ధర్మా
రాధనము, సాధనము.

గతించిన రెండేండ్లయందును యథా
శక్తిని సాహిత్యసేవను జేయుటకు భారతి పాటు
పడినది. వివిధ సాహిత్యాంగములను వెల్లడి
చేయుటకు బ్రయత్నించినది. భారతియందు
వివిధవిషయములకు సంబంధిం
చిన వ్యాసములు ప్రకటింపబడినవి. వ్యాస
ములందు కావ్యములకు, విమర్శనలకు,
రాజ్యాంగములకు, సంబంధించిన వ్యాసములు
గలవు. భిన్నవైఖరుల చిత్రకళను వ్యక్తము
చేసెడి చిత్రములుగలవు. చిత్రోపేతము
లైనకథలుగలవు. భావగీతములు, పాటలు,
పద్యములుగలవు. వివిధ సాహిత్యాంగముల
కును సంబంధించిన విషయములు భారతి
యందు ప్రవేశమును గాంచినవి. సాహిత్య
బృందావనము నవలోకించి ఈస్వల్పారం
భమును దలపోసినపుడు పరమ విషాదము
గలుగుచున్నది. చేసినది చేయవలసిన దాని
యందు సహస్రాంశమైనను లేదని నిర్వాహకు
లకు విదితమైయున్నది. వ్యాసములను సేకరిం
చుటయందును, త్రివర్ణఫలకములను చేయుట
యందును, వాటిని ముద్రించుటయందును గల
సాధకబాధకము లనుభవజ్ఞులకు విదితములు.
కాలక్రమమున భారతి సర్వాంగశోభితయై
సాహిత్యసేవను జేయుటకు భగవంతు డనుగ్ర
హింప వేడుచున్నాము. భారతీనిర్వహణ
మునకు దోడ్పడిన మహాజనులకు కృతజ్ఞతాం
జలులను సమర్పించుచు ముందును నాంధ్రమ
హాజనుల సాదరపోషణమును వేడుచున్నాము.

—సంపాదకుడు.




తుమ్మల సీతారామమూర్తి చౌదరి గారు

నిరతంబు గోపికల్నినుఁ గూడి క్రీడింప, మున్నెట్టి తీర్థాల మునిఁగిరొక్కొ?
నిను ముద్దుకొమరుగాఁ గని పొంగ దేవకీ, వసుదేవు లేదాన మొసఁగిరొక్కొ?
లాలించి నిన్నెత్తికేలుబొమ్మ నొనర్ప, రాధ యెంతటి భాగ్యరాశియొక్కొ?
హాయిగా నీతోడ నాటపాటలుసల్ప, గోపబాలకులేరిఁ గొలిచిరొక్కొ?
శిలల నవలీల నీరుగాఁ జేయు నీదు, మృదుమధుర వేణుగాన సత్సుధను గ్రోలి
పరవశత నంద ద్వారకాపురనివాసు, లెన్న నేమేమిచేసిరో చిన్నికృష్ణ!

సీ. గీర్వాణభాష నిన్ గీర్తించి నుతిఁ గాంచ, బాదరాయణతపఃఫలమదేమొ?
తెలుఁగుపల్కుల ముద్దులొలుక నిన్బలుకంగఁ, బోతనార్యుని పూర్వపుణ్యమేమొ?
నీలీలలెల్ల వర్ణించి సన్నుతిగాంచ, లీలాశుకునిభాగ్యరేఖ యేమొ?
నినుఁగాంచి జగమందు నిత్యకీర్తిగడించ, భరతమాత తపఃప్రభావ మేమొ?
మృదుమధురగేయఫణితిఁ గోవిదులు మెచ్చ, నీచరిత్రంబులెల్ల వర్ణించినట్టి
దివ్యమూర్తి నారాయణతీర్థసుకవి, సుకృతమదియేమొ లోకైకసుందరాంగ!

సీ. పసివాఁడవని జోలపాటఁ బాడెనుగదా, దేవకీదేవి నిన్ దెలియ లేక
దొంగవాఁడవటంచుఁ దూలనాడిరిగదా, అల గోపసతులు నిన్నరయ లేక
వెఱ్ఱికుఱ్ఱవటంచు విసమొసంగెనుగదా, మొఱకురాకాసి నిన్నెఱుఁగ లేక
ఆలకాపరివంచు నాటలాడిరిగదా, గోపబాలకులు నీగుర్తు లేక
నహహ బ్రహ్మాదిదుర్జ్ఞేయమైన నీదు, మహిమ నెఱుఁగంగ నెవరికే మహిమకలదు?
కమలబాంధవ సమభాస! కనకవాస!, చిత్రలీలావికాస! లక్ష్మీనివాస.

సీ. పాపంబులను మనస్తాపంబులను బాపు, రూపంబు నొకసారి చూపుమయ్య!
కారుణ్యరసపూరకలితమై విలసిల్లు, చూడ్కి నన్నొకసారి చూడుమయ్య!
అందమై మకరందబిందుబృందముఁ జిందు, పలుకుతో నొకసారి పలుకుమయ్య!
విశ్వమోహనమైన వేణుగానామృతం, బెలమిమై నొకసారి చిలుకుమయ్య!
“వత్స! సకలమనోరథావాప్తి ర” స్తటంచు నొకసారి వేడ్క దీవించుమయ్య!
జాల మీలీల నేల నేతాళఁజాల, భవ్యగుణజాల! వేణుగోపాలబాల.

---




## ఎలకూచి వేంకటకృష్ణరాయ కవి

ఇతఁడే బాలసరస్వతియను బిరుదముతోఁ బ్రఖ్యాతుఁడై నన్నయభట్టీయవ్యాకరణమునకుఁ డీక రచించి కవిచరిత్రకారుల నిందాస్తుతి శరపరంపరలకు లక్ష్యమై యంధ్రలోకము నలంకరించినకవి. ఇతఁడు రచించిన యంధ్రశబ్ద చింతామణీవ్యాఖ్యను బెక్కండ్రు మూలాంచలశాఖాంచలముల ఛేదించి ప్రకటించి యున్నందునఁ బలుభావనలకుఁ దావలంబయ్యె. తద్గ్రంథప్రారంభ మిట్లున్నది:

" శ్రీకరశాఖమై ద్విజనిషేవితమై
సుమనః ప్రజీవనం
బై కలధౌతసుందరమహాచ్ఛదమై
సుమసౌరభద్యుతి
ప్రాకటమై ప్రశస్తనవపల్లవమై
యలరారు నాశ్రితా
నీకఫలప్రదంబు హరినిర్జరశాఖి
సమాశ్రయించెదన్.

సీ. చిన్ని చెందొవవిందు కన్నె కేదఁగి రేకు
దోఁపినయందపుఁ దుఱుముతోడ
సరసదూర్వా దళాంకురగుచ్ఛకచ్ఛాయ
లీనునిద్దంపు నెమ్మేనితోడఁ
గరుణారసమరందభరసంభృతములై త
నర్చు నేత్రారవిందములతోడఁ
గాలాహితక్రియ నభక్తజనంబులకు భయో
త్పాదియౌ నభయ హస్తంబుతోడ
హృదయమునఁ గానిపించి యభీప్సితప్ర
బంధశబ్దార్థవిజ్ఞానభవ్యశక్తి
యొసఁగుఁ గావుత తల్లి భక్తౌఘదురిత
లావి దక్షిణకాళికాదేవి మాకు.

వ. అనియిష్టదేవతాప్రార్థనంబుచేసి మున్ను కర్ణాటపు విద్యానగరిలో నచింత్యకారణోపాయోగమజ్ఞ సాహచర్యుండగు శివయోగివర్యుచేత శైవవోదనంబునఁ బరిప్రాప్తంబైన యంధ్రశబ్ద చింతామణిగ్రంథంబునకు సకలలోకోపకారకంబుగాఁ డీక గావింపం గోరి నెమ్మనంబున,

ఉ. ఏమిమహాద్భుతం బిది హ
రీహరి యెక్కడి యంధ్రశబ్దచిం
తామణి భక్తి యెక్కడిమ
తంగనగంబు యుగాదిసంభవుం
డై మునుచన్న నన్నయ మ
హాకవి యెవ్వఁడు సిద్ధుఁ డెవ్వఁ డా
హా! మదగణ్యపుణ్యనము
దగ్రతఁ జేకుఱెఁగాదె యింతకున్.

మ. ఇలఁ బ్రజ్ఞాధికులౌ కవుల్ మునుపు లే
రే వారు వ్యాఖ్యానక
ర్తలు గానోపరె పెక్కువత్సరములం
... న్నయా

తెలుఁగున వ్యాకరణంబు నాకొసఁగెఁ శ్రీ
తిం డీక గావింపుమం
చలసిద్ధుండు మదిష్టదేవత విరూ
పాక్షుండు నిక్కంబుగన్.

వ. అని గణించి లోకోపకారసుకృత
కీర్తిసంభరితోదర్కంబునకుఁ బ్రహర్షించి
యంధ్రవ్యాకరణభాష్య నిబంధనోత్సుకుండనై
యం దాది నస్మచ్చరిత్ర మభివర్ణించెద:

సీ. స్థిరకీర్తి యెలకూచి తిప్పనార్యుఁడు గాంచె
శుచిశీలు వల్లభసోమ......
.....సుచరిత్రు లిద్దఱు
సుతులు......
...తిప్పనకు భైరవన్న నన్నయనాఁగ
నలఘు లిద్దఱు తనూజులు జనించి
ఈతని...నకునొజ్జప తిర్మలయ్య రా
మనయుఁ జిట్టనయు సూరనయు నాఁగ
.........లేంద్రుఁ డళియరామావనీశ
దత్త యెడపల్లెముఖ్యసద్గ్రామహేమ
......వచ్ఛత్ర పల్యంకికామణీవి
భూషుఁడై నైదుషీస్ఫూర్తిఁ బొలుపుమిగిలె

అత్యనఘుండు రామఘనుఁ
డాత్మజులం గనియెన్ శుచిత్వసాం
గత్య...రుభైరవుని
నాగన నప్పన రామధీమణిన్
ధృత్యమరాద్రి భైరవమ
నీషికిఁ గల్గిరి సత్కుమారు లా
దిత్యుఁడు కృష్ణసత్కవి సు
ధీజనవందితుఁ డబ్బనార్యుఁడున్.

ప్రాకనాటి సకలపండిత కవిజనా
చార్యుఁడైన కృష్ణయార్యవర్యు
నకును లక్ష్మమాంబికకు నేను నాదిత్య
కవియుఁ గల్గితిమి జగన్నుతముగ.

సీ. భాషాధిక గ్రంథపరిచయోదాత్తుండఁ
గౌముదీ నాటకకావ్యకలన
భాషావివరణాఖ్య భవ్యశాస్త్రకరుండ
బాహటస్థాననిబంధనుండఁ
జంద్రాపరిణయాది సత్కృతిస్రష్టను
దీప్రవామనపురాణప్రబంధ
భామతీగీతిప్రబంధౌఘకర్తను
దక్షిణకాళికాతంత్రచణుఁడఁ
బ్రకట యాదవ రాఘవ పాండవీయ
నామకశ్లేష కవితాప్రణాయకుండ
నలఘు కౌండిన్య గోత్రుండ నఖిలసుకవి
తాస్వతంత్రుండ బహుకళాదరుండ నేను.

వ. వేంకటకృష్ణరాయాఖ్యుఁడ నంధ్రశబ్ద
చింతామణిఁ దెలిఁగించెద నిది తొల్లి సకల
కవితాప్రవర్తకుండగు శబ్దశాసనుండు సకల
కవిహితంబుగా యథోచిత సూత్రగర్భితంబు
లగు నార్యావృత్తంబులఁ బంచపరిచ్ఛేదకం
బుగా సమకట్టె. నేనును నానేర్చుకొలందిఁ
దత్తత్సూత్రవిభాగంబును, దత్ప్రమేయ వివ
రణంబును, దదుదాహరణస్వరూపంబులును
నంధ్రభాషా మయగద్యపద్యంబుల నేర్పఱిచి
నాయాత్మదేవతయగు నంబాదేవి కర్పించు
వాఁడఁ దదుపక్రమం బెట్టెదనిన."

అని ప్రారంభింపఁబడి పరిచ్ఛేదాంతముల
దక్షిణకాళికామంత్రాక్షర పరిపూతంబగు సం
బోధనంబుల ఘటింపఁబడిన యీ గ్రంథమున
నంకితాంకపద్యము లీనడుమ నెవ్వరో యాంధ్ర

పత్రికలోఁ బ్రకటించినందునఁ జర్వితచర్వణమ
గుటచే వానినదలితిమి.

ఇతని గ్రంథములలో యాదవరాఘవ
పాండవీయము ముద్రితమయ్యెఁ బ్రఖ్యాతి
చెందదయ్యె. గ్రంథాంతపత్రము మాత్రము
చెన్నపట్టణమునఁ జిరకాలమునకుఁ బూర్వమే
మంగళద్రవ్యము లమ్మెడుప్రసారమునఁ జూడఁ
గలిగె. భాషావివరణము, ప్రాకృతసూత్రము
లకు వివరణగ్రంథము సంస్కృతభాషలో
రచింపఁబడియె. దీనిని జదువంగలిగితిమి; కాని
యుత్పలదేవత్రివిక్రమ కృష్ణలీలాశుకాదుల
సర్వంకషపాండిత్య మిందుఁ గానరాదు.
చంద్రికాపరిణయము ద్వితీయాశ్వాసమధ్య
పర్యంతమే లభించుచున్నది. అదియు రేచర్ల
మాధవరాయల చంద్రికాపరిణయమునకుఁ
దీసిపోవునేమో? బాహటాంధ్రకృతియు,భామ
తీగీతప్రబంధములు లభించినవికావు. భామతి
శంకరభాష్యమునకు వ్యాఖ్యానమగు వేదాంత
గ్రంథము. ఇదిగాక వేఱొకభామతి యున్నదా?
భామతి గీతరూపముగాఁ దెనిఁగించుట శ్లాఘ్య
మేకాని గీతపద్యచక్రవర్తియని పేరుగన్న
నేఁటికాలపుఁగవికి బిరుదలోపము లేకుండు
టకుఁగాఁబోలు తత్కృతి యంతర్ధానమయ్యె.
కౌముదియే రంగకౌముదియను సంస్కృత
నాటకము.

ఇతనిముత్తాత యళియ రామరాయల
యొద్ద నెడపల్లెగ్రామము నందినందున 1608
క్రీ. శ. లో వ్యాకరణము రచించెననుట
యాశ్చర్యముకాదు. గ్రంథమునిచ్చిన శివ
యోగియే సారంగధరుఁ డగునని యప్పకవి
యూహించియుండును. నన్నయభట్టుకాలము
యుగాదియని బాలసరస్వతియే వచించె. అప్ప
కవికి బరువు తఱిగెఁ బరువుకలిగె. ఇతఁడు
నియోగికులజుఁ డనుటకుఁగూడ నిదుఁబొంది
కలు గలవు.

---

# దినోదయము*

నిడుమోలు కనకసుందరం గారు, బి. ఏ., (ఆనర్సు)

అన్నలార ! నాకిట సెలవాయెనయ్య !
నన్ను దీవింపుఁడీ ! వందనము లొనర్చి
యందఱకు మీకు, నింక వీడ్కొందు నేను.

ఇవె కవాటపుఁదాళపుఁజెవ్వు లొసంగి
మద్గృహంబున నెల్లసామ్యముఁ ద్యజింతు :
మీదఁదుదియాదరపుఁబల్కెచూనాదుకోర్కె—
ఇరుగుపొరుగున మనముంటి మిన్నినాళ్ళు
లేను మీ కీయఁగల్గినదానికంటె
నధికముగనే గ్రహించినయది నిజంబు.
నాదు చీఁకటికోణంబునను వెలుంగు
జ్యోతి యాఱె, నల్లదియె దినోదయంబు !
ఆగతాజ్ఞానుబద్ధుఁడ నగుచుఁబయన
మునకు నే నిప్డె సంసిద్ధుఁడనుగ నుంటి.

---

* రవీంద్రుని 'గీతాంజలి' యందలి 93-వ పద్దెమున కనువాదము.

# రావుసాహేబు గిడుగు రామమూర్తిపంతులు గారికి

# కడపటి విన్నపము

విద్వాన్ గరిమెళ్ల సోమన్న గారు, యం. ఏ., యల్. టి.

పంతులుగారు "నిత్యమున్నూ జను లందరూ వాడుతూ ఉన్న భాష రద్దుచేసి గ్రాంధికభాష నెలకొల్పరాదు" అని రక్తాక్షి వైశాఖభారతిలో ప్రకటింపఁగ నాకుఁ గలిగిన సంశయములను భారతీముఖముగ వెల్లడించి ఉత్తరములు కోరితిని. నా ప్రశ్నల కుత్తర మొసఁగుట దుష్కరము అని పంతులు గారు నాకు వ్రాసిరి; మఱియు నాతో ననిరి. వ్యవహారభాషావిషయకము లగు నా ప్రశ్నలను మే మిరువురము కలిసి ఒకపూట విమర్శించితిమి. ప్రత్యుత్తరము భారతిలో ప్రకటింతు మనిరి.

"చెప్తాను, నలభై, తెలుసుకోను, వస్తే" మున్నగు సార్వజనీనప్రయోగములే కాక "నువ్వు, ఆపూరు, వాడోస్తే, వక్కడు, వెళ్దాం, ఉంది, పడ్డాయ్, ఇచ్చేస్తే" అనునట్టివియు, "ఇతరఖర్చులు, నిత్యరాబడి, దారాపుత్రాదులు, స్వంతదారుడు" మొదలగు విలక్షణ సమాసములును—పంతులుగారు సామాన్యముగ ఒప్పుదురు. ఇట్టిప్రయోగములు ధారాళముగ ఉపయోగింప నగు నని వీరి యభిప్రాయము. ఇట్టి ప్రయోగములను పద్యరచనల లోకూడ ఒప్పుదురా అను ప్రశ్నకు వీ రిచ్చిన సమాధాన మేమనిన—"కవులు స్వతంత్రులు; వారి యిష్టముచొప్పున వారు పదములను వాడుదురు. మనము పద్యకావ్యములలో ఇట్టిప్రయోగములు కూడునా అను ప్రశ్నకు సమాధానము ఈయ నక్కఱలే"దనిరి. గద్యభాషయు పద్యభాషయు ఇంచుమించుగ నేకరూపముగ నుండుట భాషాసామాన్యలక్షణము. పంతులుగారి సందిగ్ధ ప్రత్యుత్తరము వలన తెలిసిన విషయ మేమనగా వీరి కైనను ఇట్టి ప్రయోగములు, పద్యకావ్యములలో చొన్పుట ఇష్టము అంతగ లేదని; కాని వీరు అట్లు చెప్పుటకు సంకోచపడుదురు.

పంతులుగారి వాదములో ఇది యొక దుర్బలవిషయము. ఈవాదమునఁ గల ఇతర బాధలను బరికింతము. తెలుగు పుస్తకము లన్నియు ప్రాచీనములును, నవీనములును తెలుగుదేశమం దెల్లెడ నేకరీతిగ విదితము లగుచున్నవి. వేయియేండ్ల నాటి ఆంధ్రభారతమును, ఇప్పటిఆంధ్రబ్రహ్మాండపురాణమును (శ్రీజనమంచి శేషాద్రిశర్మగారిది) భాషాభేదములు లేక లిపివ్యత్యాసములు చెందక ఆంధ్రదేశమునం దెల్ల సమముగ గ్రాహ్యము లగుచున్నవి. మనవాఙ్మయమునకు ఇంచుమించుగ నంతటికి ఈయేకభాషా మహాలాభము కలిగియున్నది. బళ్లారిలో వ్రాయబడిన పుస్తక

ములు గంజాములోను, నెల్లూరిలోనివి గోదావరిలోను సులభముగ చదువబడుచున్నవి. ఇప్పటివఱకు ఆంధ్రభాష పుస్తకగత మగునది ఏకస్వరూపమును దాల్చియున్నది. ప్రసంగభాషలో కొన్ని భేదము లుండిన నేమి? గ్రథిత విషయ సుగ్రాహ్యత్వము ఆంధ్రదేశమునకు ఐక్యమును ఒసంగుచున్నది. ఆలోచించిన కొలది ఈలాభముయొక్క విలువ అపరిమితముగ తోచును.

పంతులుగారి సంకల్పమును ఆంధ్రలోక మంగీకరించి పైనుదహరించినవిలక్షణరూపములను గ్రంథములలోనికి జేర్చనెడలకొంతకాలమునకు ఆంధ్రభాషయొక్క ఐక్యము చెడు గంటి దూరమండలములవారి వ్రాతలు ఒకరివి ఇంకొకరికి గ్రాహ్యములు గావు. మఱియు వేయియేండ్లనుండి పెంపొందిన వాఙ్మయము నానాటికి జనులకు తెలియకుండ బోవును. ఈ ఉపద్రవము దుర్భరముగదా! పంతులుగారు దీనిని పునఃపునః తలంచిన తమయుద్యమమును ఇప్పటికి నిలుపుట ఉచిత మని తోచును.

వ్యావహారికభాషను గూర్చిన వ్యవహారము వైదేశికుల ప్రోత్సాహముచే మనదేశమునందు ప్రారంభ మయినది. ఆరంభమునకు ముందు ప్రయత్నము లేకయో, విద్వాంసుల సమ్మతిపడయకయో, జనాభిప్రాయమునునిరాకరించుచునే, వీరుతమభాషల తెన్నుపోక తెలుగును సంస్కరింప బూనిరి. పంతులుగారు వీరికి కుడిభుజ మయిరి. ఇట్టి విపరీతసందర్భములలో భాషాసంస్కారము జరుగునా?

ఆంధ్రవిశ్వవిద్యాలయము ఉదయించుచున్నది. వివిధశాస్త్రములు ఆంధ్రములో వ్రాయబడును. ఇతర భాషలలోని ఉత్తమ గ్రంథములు తెలుగులోనికి పరివర్తితములు అగును. ఉత్తమవిద్య లన్నియు తెలుగులో నేర్పబడును. పరీక్షలు తెలుగులో జరుగును. ఇప్పుడు తెలుగుభాషకు లేని స్వాతంత్ర్యములు త్వరలో ప్రాప్తించును. అర్థానుస్వార శకటరేఫాదులు తొలగిపోవును. క్రొత్తగ పుట్టు మహాప్రవాహములో అనవసరమగు భాషాశృంఖలములు విడిపోవును.

పంతులుగారు ఆంధ్రభాష యందును ఆంధ్రవాఙ్మయమునందును అసమాన ప్రజ్ఞగలవారు. భాషోత్పత్తి, భాషాభివృద్ధి, భాషాతత్త్వము మున్నగు విషయములను వీరు లెస్సగ విమర్శించి గొప్పగ్రంథములు వ్రాయగలరు.

వీరు ఇట్టిపనికి తొడంగవలయునని నా ప్రార్థన.






గొల్లపూడి శ్రీరామ శాస్త్రి గారు

## ర స మ న నే మి?

" విభావానుభావ వ్యభిచారిభి రభివ్యక్తః
స్థాయీ భావో రసః. " (భరతసూత్రము)

'విభావములు, అనుభావములు, వ్యభిచారిభావములు అనువానిచే వ్యక్తమైన స్థాయిభావము రసమని చెప్పఁబడును.' అని సూత్రార్థము. విశేషముగఁ దెలియఁబడుచున్నవి కాన విభావము లనఁడును కావ్యనాటకాదులలో కథాలంబనము లగు నాయికా నాయకాదులు ఆలంబన విభావములు. ఆనాయికాదుల గుణములును, మలయమారుతాదులును తద్భావోద్దీపకము లగుటచే నుద్దీపనవిభావము లనఁబడు. ఈ యుద్దీపితములైన రతిహాస క్రోధాదులు కటాక్షప్రసాదాదుల మూలకముగ ననుభవ గోచరము లగుటచే ననుభావము లనఁబడు చున్నయవి. ఇట్లు అనుభవగోచరమై భావనావిశేషలబ్ధమగు పరగత సుఖదుఃఖాది భావనవలన మానసమునకుఁ గలుగు మార్పు సత్త్వమనఁబడు. ఈసత్త్వమువలన స్తంభాదులు జనించును. కనుకనే వీనికి సాత్త్వికభావము లనిపేరు. ఇవి యను రూపము లగుటచేఁ బ్రత్యేకముగ సూత్రమందుఁ జెప్పఁబడలేదు. ఇట్లు భావనావిశేషముచేఁ దాదాత్మ్యము నొందియున్న వానికి సముద్రంబునఁ దరంగములవలె నిర్వేదాదులు పుట్టుచు నశించుచుండును. ఈయవి స్థిరముగ నిలుచునవి గాకపోవుటచే సంచారిభావములనియు, వ్యభిచారిభావములనియు వ్యవహరింపఁబడుచున్నవి. ఈవిభావానుభావ వ్యభిచారిభావములవలన వ్యక్తమైనభావము స్థాయియనఁబడును. ఆస్థాయియే యనుభవసిద్ధమై రసత్వము నొందుచున్నది. విభావాదులచే వ్యక్తమైనస్థాయి యనుచోఁ బాలుపెరుగుగ మారిన చందంబున నాభావము లే స్థాయిగఁ బరిణమించునని యర్థముగాని దీపముచే ఘటమువలె పూర్వసిద్ధవస్తువ్యక్తత యని తలంపఁజనదు,

ఇంకను నీవిషయమును యించుక విశదీకరింప యత్నించెద గాక !

భావమన దలంపు - అనగా మనోవ్యాపారము జ్ఞానసామాన్యమునుగుఱించి మనస్సు కారణమగుట సర్వవిదితము. మనస్సంబంధము లేక యెట్టికార్యముగాని కాజాలదనుటయు ధ్రువము. కనుక, ప్రకృతములో మనకు వర్ణ్యమైనరసమును దదాశ్రయమే యగునుగదా ! ఎట్లన? శ్రవ్యకావ్యమున గుణాలంకారాది మహిమచేతను, దృశ్యమున నాంగికాద్యభినయాదులచేతను, ననుకార్యులగు రామాదులకును ననుకరించునటులకును ద్రష్టలకును సహృదయులకును గలయంతర మంతర్ధానమై వేద్యాంతర తిరస్కారముచే సర్వేంద్రియంబులును స్వస్వవ్యాపారవిరతములై మనస్సును సమీపించును. అట్టితఱి చంద్రస్పర్శముచేఁ జంద్రకాంతమువలె మానసము మార్పునెందును. ఆసమయమున ననిర్వాచ్యమగు నొక యానందమనుభూతమగును. అదియ రసమని చెప్పఁబడును.

విశ్వనాథకవిరాజు రసస్వరూపమును గుఱించి ముచ్చటించుచు, 'రజస్తమోగుణములచే నస్పృష్టమగు నొక యాంతర ధర్మమే సత్త్వమనఁబడు. అట్టి సత్త్వోద్రేకమువలన నావిర్భూతమై యవిచ్ఛిన్న స్వప్రకాశానంద చిన్మయమై, లోకోత్తర చమత్కార సారమై, బ్రహ్మానందసోదర మగురసము సహృదయులగు కొందఱిచే నాస్వాదింపఁబడు'నని నుడువుచు, 'ప్రకాశశరీరముకంటె రసమన్యముగాక పోయినను ఉపచారమువలన రస మనుభవింపఁ బడుచున్న' దని వ్యవహారములోనున్నదని విశదీకరించి యున్నాఁడు. ఈరసశబ్దమును నిర్వచించుటలో సాహిత్యవేత్తలలో జనించిన యభిప్రాయభేదము లనంతములు.

అనుకార్యులైన రామాదులయందుండు రసము రామాదిరూపత్వాను సంధానమువలన నటునియందుఁ

ప్రతీయమానమై సామాజికులచే ననుభవింపఁబడుచున్నదని భట్టలొల్లటాదులమతము.

అనుకర్త యగునటునియందు రసావిర్భావము లేకపోయినను నభినయవిశేషమువలన, సమ్యక్, మిథ్యా, సంశయ, సాదృశ్య, విలక్షణ మగుజ్ఞానముచే చిత్రతురగాదిన్యాయమున సామాజికునిచే రస మనుభవింపఁబడునని శ్రీశంకుకాదులమతము.

రసము పుట్టునదికాని ప్రతీయమానముగాని కానేరదు. సహృదయనిష్ఠమగు భావుకత్వ వ్యాపారముచే భావితమై భోగమను వ్యాపారముచే ననుభవింపఁబడునని భట్టనాయకాదుల యాశయము.

ఇంకను నిట్టిమతములు కొన్నిగలవు. ఒకవిషయమును విమర్శించుటలో నింతటికిన్ని యభిప్రాయములు జనించుట కేమిహేతు వందురేని, అనుభవైకవేద్యమగు మనోభావవిశేషమును పరిమిత పదజాలముతో నిర్వచింపఁ బూనుటయే. ప్రాచీనభారత దేశౌన్నత్యమును జాటుటకుఁ బ్రాచీనాలంకారికు లొనర్చిన యీరసవిచార మొక్కటియే చాలుననవచ్చును. అట్టిపండితరాజులఁ గనిన భారతమాత సర్వవిధముల ధన్యురాలు. అట్టి తల్లి బిడ్డల మగుటకు నోచుకొనిన మనమును ధన్యులమే యగుదుము. ఈ రసవిచారము ప్రత్యేక గ్రంథరూపముగనే ప్రకటింపఁ దగినదైనను, నీ వ్యాసమునందు సంగ్రహముగఁ దెలుపఁదలఁచితిని.

## రసాస్వాదనము

"పానకరసన్యాయేన చర్వ్యమాణః ......... బ్రహ్మానందాస్వాదమి వానుభావయన్ అలౌకికచమత్కారకారీ శృంగారాదికో రసః." (కావ్యప్రకాశకారుఁడు)

బ్రహ్మానందసదృశమగు నీకావ్య రసాస్వాదన మొనరించుటకుఁ బూర్వజన్మసంస్కార మావశ్యకమనియు, వాసనాశూన్యుఁడీఫలము ననుభవింపఁ జాలఁడనియు నాలంకారికాభిమతము.

"శ్లో. స వాసనానాం సభ్యానాం రసస్యాస్వాదనం భవేత్, నిర్వాసనాస్తు రంగాంతఃకాష్ఠకుడ్యాశ్మసన్నిభాః."

పూర్వజన్మ సంస్కారముగలవారే యీయానంద మనుభవింపఁగలరు. తద్భిన్నులు రంగస్థలమునందలి కుడ్యాదులవంటివారని పైశ్లోకాభిప్రాయము. అట్లని పూర్వజన్మసంస్కారమున లెరసాస్వాదనమునకు నైహిక సంస్కారమనావశ్యక మనుటకు వలనుపడదు. అంకురరూపముననుండు ప్రాక్తనసంస్కార మభివృద్ధినొందుటకు విద్యాదోహదము మిగులముఖ్యము. ఈసంస్కారము లేకపోయినను, రసాస్వాదన మొనర్పగలవారు లేరనుటకు వీలు లేకపోయినను చాలఅరుదనుటకు సంశయములేదు. పఠితయు నావాసన సంస్కారవిరహితమే యైనచో నొకప్పు డంతరించుననికూడఁ జెప్పనగును. కనుక కావ్యామృతముఁ గ్రోలవలయునన్న ప్రాక్తన సంస్కారమునకుఁ దోడుగ నద్యతనజన్మసంస్కారమును నావశ్యకమే యగును. విశ్వనాథపండితులు పైశ్లోకమును వివరించుచు 'వాసనా చేదానీంతనీ ప్రాక్తనీచ రసాస్వాదనహేతుః' అని నుడువుచు ఇదానీంతన సంస్కారమునావశ్యక మనినచో శ్రోత్రియజరన్మీమాంసకాదులకును రసాస్వాదనము గలుగవలయుఁగదా? అట్లుకలుగుచున్నదా? పోనీ, ప్రాక్తన జన్మసంస్కారము నంగీకరింపకపోయిన బాధక మేమందు రేని విద్యావిశారదులకును గొందఱకు రసోద్బోధజనించుట యసంభవముగఁ జూపట్టెడి. కనుక ఇదానీంతన ప్రాక్తన రూపమగువాసన రసాస్వాదనమునకు హేతువగునని చెప్పక తప్పినదిగాదని వక్కాణించి యున్నాఁడు.

ఆలోచింప దయామయుఁడగు సర్వేశ్వరుఁడు అసాధారణమగు బ్రహ్మానందము ననుభవింపఁ జాలని సంసృతి మగ్నులకుఁగాని తత్సదృశమగు కావ్యానందమును అనుగ్రహించి యున్నాఁడ నుటయొప్పును. కనుకనే పండితులు 'సంసారవిషవృక్షమునకు సత్సాంగత్యము, కావ్యామృతపానము అనునవిమాత్రమే యమృతఫలము'లని చెప్పియుండుట.

అటుగాక; స్రక్చందనాదులవలనఁ గలుగు నానందమునకంటె నీకావ్యానందమునందుఁ గల విశేషమేమని యడుగవచ్చును. స్రక్చందనాదులు అనిత్యములుగాన తజ్జన్యమగు నానందమును ననిత్యమే యగునుగదా. ఇంకొకవిశేషమేమన, నిమిత్తనాశమున నది దుఃఖహేతువుగఁ బరిణమించుట. 'నీకుఁబుత్రోద్భవమయ్యె' అని య

నినతోడనే యెంతో సంతసముద్భవించును పుట్టియొకగంట కాలమైనను నాశిశు వింకను నేడువలేదనినతోడనే శరీరము చల్లఁబడును. దీనింబట్టి యాలోచింప లౌకికానందము ఇంద్రియజన్యమని యేర్పడుచున్నది. మంచిమాట వినఁబడినతోడనే యింద్రియవికాసముగలుగును. ఇక కావ్యానందమన్ననో యట్టిదిగాదు. ఇయ్యది శబ్దార్థసన్నివేశము వలనఁ గలుగునది. శబ్దార్థములకునాశమసంభవమగుటంజేసి యనిత్యము గానేరదు. అక్షరజన్యమగు నానంద మక్షరముగాక నవ్యమెట్లగును? నిత్యమగుటచే నాయానందము దుఃఖోన్ముఖమును గానేరదు. కావ్యార్థము స్మృతిరూపమున మానసమున నెలకొనియుండి యనుస్యూతముగ వచ్చుట యనుభవసిద్ధము.

“కావ్యపాఠమువలనఁగాని, నాటక ప్రదర్శనము వలనఁగాని,యుద్భవించునది యానందమనికదా నుడివితిరి. అయ్యది భ్రమ యేలకాఁగూడదు. అనియందురేని వినుడు”

రజ్జుసర్పభ్రాంతియనియు, శుక్తి రజితభ్రాంతి యనియుఁ జెప్పుచుందుము. ఇంచుక దూరములో నున్న త్రాడును జూచినతోడనే సర్పమనుభ్రాంతి గలుగువెంటనే యనుభావము లగుస్వేదాదు లుద్భవించును. కొంతవడికిఁ బరమార్థము దెలిసినతోడనే యాభావ మంతర్హితమై తత్త్వమవగతమగును. ఈ భ్రమలక్షణమును పెద్ద లిట్లు నుడివియున్నారు:

“శ్లో. యథా త్వం వర్తతే తస్య తథా త్వం భాతి మానతః,
అన్యథా త్వం భ్రమేణేతి న్యాయోఽయంసార్వలౌకికః.”

(లోకమునం దేయేవస్తు వేయేరూపముతో నుండునో యాయారూపముచే ప్రమాణమువలనవాస్తవముగ దెలియబడుచున్నది. ఆవస్తువు భ్రాంతిచేత మఱొకవిధముగఁదోఁచుచున్నదనెడిన్యాయముసర్వలోకప్రసిద్ధము)

మఱియు నీయుభయమునకు గల తారతమ్య మీ స్వల్పదృష్టాంతమువలనఁ గనుఁగొననగు. ‘ఒకత్రాడును జూచి తొలుత సర్పమనుకొని పిదప యథార్థ మరసి ఎంతమోసపోయితిని. త్రాడునుజూచి పామని భీతిల్లితి’ అని యనుకొనుట సర్వవేద్యము. అట్లే యొక నాటక ప్రదర్శనమున కేగి తదేక దృష్టితో నాటకమంతయుఁ జూచి తరువాత ‘నెంతమోసపోయితిని మన నాగరాజరావుగారిని నిజమైన పిచ్చివాఁడనుకొని యింతవఱకట్లే చూచుచుంటిని. ఎంతబుద్ధి పొరపాటు’ అని యనుకొను సామాజికప్రవరులు నేఁటికాలమందైననుగలరేమో యోచింపుఁడు. కనుక మిథ్యాద్యోతకమైనభ్రమకును, పైన నుడివినట్లు యథార్థమైన యానందమునకును నెట్టిసంబంధము లేదని తెల్లమయ్యెడి.

తొలుత మన మారంభించిన యంశమునకు ఫలితార్థమేమన! సహృదయులె సత్కావ్యమువలనను సన్నాటక ప్రదర్శనమువలనను నుద్భవించు నానందమును గ్రోలనర్హులని చెప్పవలసియుండును.

## రసము యన్నిష్ఠము?

రసము మనోభావ విశేషమనినపుడు ‘కావ్యమెట్టిదైననేమి? సత్కావ్యమనుటయేల?’అనుపృచ్ఛ రాకమానదు. విచారించెదముగాక.

‘రసాత్మకమైనకావ్యము’ అనుట ‘పాలు మంచి బలము’ అన్న ట్లౌపచారికము. బలమునకు పాలు హేతువుగాని పాలేబలముగాదు. అయినను ‘పాలు బలమ’ని వ్యవహరించుచున్నాము. అట్లే రసహేతువైనకావ్యము రసాత్మకమని వ్యవహారములో నున్నది. కనుక రసము మనోనిష్ఠమేకాని కావ్యనిష్ఠ మెన్నఁటికిని గానేరదు. అని ప్రాచీనులలోఁ గొందఱి యభిప్రాయమైయున్నది. మఱికొందఱు దీనికి విరుద్ధముగ రసము కావ్యనిష్ఠముగాని మనోనిష్ఠ మెంతమాత్రమును గానేరదు అని యందురు.

రసము కేవలము మనోనిష్ఠమేయైనఁ గావ్యాభాసములఁ బఠించినపుడును, ప్రదర్శనాభాసములఁ దిలకించినపుడును సహృదయులకు రసోత్పత్తి గలుగవలయుఁగదా. అట్లెన్నఁడైనఁ గలుగుచున్నదేమో విచారింపుఁడు. ఈస్వల్పదృష్టాంతమును గనుఁడు: చక్కెరఁ దినినపుడు తియ్యగనుండుట యెల్లరకు ననుభవసిద్ధము చక్కెరయందు తియ్యదనముండుటయు నిర్వివాదాంశము. అయినను నట్టి మాధుర్యము గల వస్తువును నొక జ్వరపీడితున కొసంగినచో నిచ్చినవారికి మంగళహారతు లొసఁగుచు నివేశనము క్రిందఁ దననోటనుండు నద్దానినాతని మొగముననే యుమియునుగదా. దీనింబట్టి తోఁచెడిదేమి? భోక్తృభోజ్యము లనురెంటియందును గుణమావశ్యకమని. ఇందెద్దాని గుణము లేకపోయినను విరసముగఁ బరిణమిం

చుట సిద్ధము. అట్లే కావ్యము రసవంతముగ నుండినంతనే ప్రయోజనములేదు. పాఠకశ్రోతలును రసజ్ఞులుగ నుండవలయు. ఈవిషయమై మద్విరచితమగు 'ఆంధ్రనాటకరంగ' మనుశాస్త్రమున 'నటుఁడు తన్మయుఁడుగానగునా?' అనుశీర్షికక్రిందఁ గొంతవఱకు విపులముగఁ జర్చించియున్నవాఁడను.

## రసవిభాగము

"శ్లో. శృంగార హాస్యకరుణ రౌద్రవీరభయానకాః
బీభత్సోఽద్భుత ఇత్యష్టౌ రసాః శాన్తస్తథామతః."
(సా. ద)

ఈ రసవిభాగవిషయమున నుండు భిన్నమతముల గుఱించి ముచ్చటించుట ప్రకృతములో నావశ్యకము గాకపోదు. 'రస్యతఇతిరసః' అనువ్యుత్పత్తిచే సుఖాస్వాదరస స్వరూపముగు శృంగారమొక్కటియే రసశబ్దవాచ్యము గాని సుఖానుభవశూన్యములగు తక్కిన వీరాదులు రసములని వ్యవహరించుటకును ననర్హములని భోజునిమతము.

"శ్లో. వీరాద్భుతాదిషు రసేషు రసప్రవృత్తిః
సిద్ధా కుతోపి వటయక్షసిద్ధా విభాతి ;
లోకే గతానుగతికత్వవశా దుపేతా
నిర్వర్తయితు...మేవ పరిశ్రమో నః."

పితృ ప్రాదులకుఁ బుత్రాదులయందుఁ బ్రీతిస్థాయికమైనవత్సలమను నొకరసము సర్వజనసాక్షికముగ గలదు గదా. గనుక వత్సలమనురసముతోఁగూడఁజేరి పదిరసములని కొందఱిమతము.

మిత్రాదుల యందార్ద్రితాస్థాయికమైన స్నేహము, సేవ్యగురుదేవతాది గోచరమై తాత్పర్యస్థాయికమైనభక్తియు, రసశబ్దవాచ్యములే కాన రసములు పండ్రెండు విధము లని మఱికొందఱి యాశయము. 'అష్టౌనాట్యే రసాస్స్మృతాః' నాట్యమునం దుపయోగింపఁదగినవి యెనిమిదే రసములు. ప్రపంచ విలయరూపమైన శాంతరసము శ్రవ్యకావ్యములం దుచితమే కాని యభినేయమునం దనర్హమని మమ్మటాదులమతము. ఇట్లే యింకను గొన్ని మతములు గలవు. విశ్వనాథ కవిరాజు కావ్యప్రకాశకారుని మతమునే యవలంబించి 'ఇత్యష్టౌ రసాః శాంతస్తథామతః' అని నుడివి యున్నాఁడు. 'నాట్యాభిప్రాయముచే అష్టరసములు. శాంతము నాట్యమునందు పుష్టిరహిత మగుటవలన నందు నంగీకరింపఁబడదయ్యె' అని పైవచనమునకు వ్యాఖ్యాన మొనరించి యున్నారు.

## రసనవకత్వ నిరూపణము

'శృంగార మొక్కటియే రస'మను భోజుని మతమును దొలుత విచారింతము.

కరుణాదులు దుఃఖమూలములుగాన రసశబ్దవాచ్యములు గావనిగదా యాపండితప్రకాండుని యాశయము. అట్లయిన శృంగారభేదములలో నన్యతరమగువిప్రలంభము గూడ నట్టిదియే కాన శృంగారైకదేశమునకును రసత్వసిద్ధి లేకపోవలసివచ్చును. అప్పుడు స్వమతమునకే భంగము వాటిల్లినట్లైనది. కనుక విభావాది మహిమచేతను వేద్యాంతర తిరస్కారముచేతను విప్రలంభమునం దట్లునిరతిశయానంద మనుభవింపుచున్నట్లు అంగీకరింపఁ బడుచున్నదో, యట్లే కరుణాదులయందును నానంద సద్భావముగలదని యంగీకరింపవలసియుండును. ఇద్దానికిఁ బ్రమాణమేమందురేని సహృదయవర్యుల యనుభవమే యైయున్నది. ఈభావమునే సాహిత్యదర్పణకారుఁడును సూచించియుండుటఁ గనుడు:

"శ్లో. కరుణాదావపి రసే జాయతే యత్ పరం సుఖమ్;
సచేతసా మనుభవః ప్రమాణం తత్ర కేవలమ్."

ఇంతయేల? లోకోత్తర కావ్యమగు శ్రీమద్రామాయణము కరుణరసప్రధానముగదా! ఆకావ్యామృతమును గ్రోలి యానందాబ్ధి నోలలాడని మనుజుఁడు మందునకైన గాననగునేమో యోచింపుఁడు.

మఱియు 'హర్ష శోకాదికారణముల వలన హర్ష శోకాదులే జనించుట సంభవము. రామవనవాసాదులు దుఃఖకారణము లగుటయు సత్యబద్ధము. అట్లుండఁ దద్వర్ణితము లగు గ్రంథము లానందజనకము లెట్లగును? అని మఱొక యాక్షేపమునకుఁ జోటు లేకపోలేదు. ఈప్రశ్నమునకు సమాధానము సులభము. లోకమునందు శోక హర్షాదికారణములవలన శోకహర్షాదులే కలుగుట' నిస్సంశయము, కాని యవియ కావ్యాశ్రయము లైనపుడు అలౌకి

కవిభావత్వము నొంది సుఖదాయకములేయగుట సహృదయైకవేద్యము

అయిన హరిశ్చంద్రాది చరిత్రముల పఠనశ్రవణాదులచే నుద్భవించు నశ్రుపాతాదులకు హేతువేమన: మానసము ద్రవీభూతమగుటయే. సుఖియు నశ్రుపాతాదులఁ గాంచుచునే యుండుట ప్రత్యక్షసిద్ధము.

కనుక ఫలితార్థమేమన: శృంగారమువలె కరుణాదులును రసశబ్దవాచ్యములేయనుట నిర్వివాదాంశమని.

ఇఁక వాత్సల్యము, స్నేహము, భక్తియనునవి రసములలోఁ బ్రత్యేకముగ నేల పరిగణింపఁ బడఁగూడదనుటకు సమాధానము విచారింతముగాక.

ఒక్క రతియను (ప్రేమ) స్థాయిభావమే విభావాదులతోఁగూడి కామినీ విషయమైనపుడు శృంగార రసత్వము నొందుచున్నది. ఆరతియే దేవతాగురు నృప పుత్రమిత్ర విషయకమైనపుడు తత్తద్భావముల నొందుచున్నయది కాన వత్సలాదులు రతిస్థాయిలోనే అంతర్భూతములని యేర్పడుటచే వానికిఁ బ్రత్యేకముగ రసత్వసిద్ధి లేదని తెల్లమగుచున్నది.

ఇఁక నాట్యమునందు శాంతమునకు స్థానములేదను వారిమతమును గుఱించి చర్చించెదముగాక.

భరతాచార్యులు శాంతమునకు స్థాయిభావనిరూపణ మొనరింపలేదు. గనుక శాంతమును రసములలో, బరిగణించుటకు వీలులేదని కారణము చెప్పుటకు వలనుపడదు. ఆయన నిర్వేదము శాంతమునకు స్థాయియని నుడివియున్నాఁడు. నాట్యమునం దెనిమిదిరసములని చెప్పిన మమ్మటాచార్యుఁడును,

'నిర్వేదస్యామంగళ ప్రాయస్య ప్రథమ మనుపాదేయత్వేపి ఉపాదానం, వ్యభిచారిత్వేపి స్థాయిత్వాభిధానార్థం తేన నిర్వేదస్థాయి భావ శ్శాంతోఽపి నవమో రసః'

(వ్యభిచారిభావ నిరూపణావసరమున నమంగళప్రాయమైన నిర్వేదమును దొలుతఁ జెప్పఁగూడకపోయినను భరతాచార్యుఁడు నిర్వేదమునే ప్రథమమున వక్కాణించియుండుట స్థాయిత్వాభిధానార్థ మేయగును. కనుక తొమ్మిదవరసము శాంతముగలదని యెఱుంగునది.) అని వచించియున్నాఁడు.

'పోనీ' శాంతమునకు విభావాది సామగ్రిగలదా? యనియందురా ? కలదు. వైరాగ్యపరమేశ్వరానుగ్రహ సత్పురుష సేవాదులు విభావములు. యమనియమాదు లనుభావములు. మతి స్మృతి చింతా స్మృతి వితర్కాదులు సంచారిభావములు. ఇట్లు విభావాది సామగ్రి సంపత్తిచే శాంతము రసపరిగణనీయ మనుటలో సంశయములేదు.

అయిన 'సర్వజనాదరణీయము కాకపోవుటచే నశ్లాఘ్యమందురా '

రాగద్వేష కలుషితాంతః కరణులగువారికి రుచింపకపోయినను వీతరాగులకు ప్రేమాస్పదమేకదా. రాగద్వేషకలుషితులకు రుచింపమి హేతువుగ నంగీకరించెద మేని శృంగారము వీతరాగులకు రుచింపక పోవుటచే నద్దానికిని అంతు యనివార్యమే యగును. కనుక రసములు తొమ్మిదని ధృవపడుచున్నది.

"ఈశాంతరసము శ్రవ్యమునందు నంగీకరింపఁబడినను అభినేయమగు నాట్యమునందు నిషిద్ధమేకదా." అను నాక్షేపణమునకు సమాధానము మిగిలియున్నది. ఇద్దానికి జగన్నాథపండితులు చెప్పిన జబాబెంతయు శ్లాఘాపాత్రమగుటదాని నిచట వివరించెదగాక.

శాంతము శమసాధ్యమగుటచేతను, నటునియందు శమత్వము లేకపోవుటచేతను నాట్యమునం దెనిమిదే రసము లర్హములని కొంద ఱనెదరు. నటునియందు రసాభివ్యక్తినే యంగీకరింపనపుడు ఆతనియందు శమము లేకపోవుట యిందులకుఁ గారణమనుట యసంగతము. ఇట్లు కొంతదూరము చర్చించి,

అతఏవ చరమాధ్యాయే సంగీతరత్నాకరే:
'అష్టావేవ రసా నాట్యే ష్వితి కేచి దచూచుదన్,
తదచారు రసః కంచి న్నరసం స్వదతే నటః.'

ఇత్యాదినా నాట్యేఽపి శాంతోరసో స్తీతి వ్యవస్థాపితమ్. అనివచించియున్నాఁడు. ఇంకనునీసందర్భమునఁ జర్చింపఁదగినయంశములు పెక్కులున్నను, విస్తరభీతిచే విరమించుచు, నవరసములలో సర్వప్రాణి సులభమును సర్వహృదయంగమమును, నాద్యపఠితమును నగుశృంగారమును గుఱించియు, నన్నింట, తద్వ్యతిరిక్తములగు శాంతములను గుఱించియు నిందుక విచారించి యీవ్యాసము నంతటితో ముగించెదముగాక.

## శృంగారము

శృంగం ప్రాధాన్య సాన్వోశ్చ, అను నిఘంటూ క్తిచే శృంగమన ప్రాధాన్యమనియర్థము.'శృంగంబుచ్ఛతీ' అనువ్యుత్పత్తిని, బట్టి శృంగారమన ప్రధానరసమని యేర్ప డుచున్నది. ప్రాచీనులని నవీనులని భేదములేక సామాన్య ముగఁ గవీశ్వరులందఱును ఈరసమును బోషించు పొంతేఁ దమ ప్రతిభావిశేషమును జూపియుండుట యొక్కటియే చాలు ఈరసాధిక్యమును వేనోళ్ల నుద్ఘోషించుటకు. ప్రాచీనాలంకారికుఁడగు నానంద వర్ధనాచార్య్యలీరస మును గుఱించి చెప్పియుండుట గనుఁడు: మధురమై పర మాహ్లాదకర మగు రసము శృంగార మొక్కటియే. తద్ర సమయమై మాధుర్యము కావ్యమునందు విలసిల్లుచు న్నది" అని.

## శృంగార పవిత్రత

ఈ శృంగార రసాస్వాదాభివిష్టులై మనప్రా చీన సంస్కృతాంధ్రకవులలోఁ గొందఱు దమ కావ్య రత్నముల ననౌచిత్య భాజనములనుగఁ జేసియుండుట యెల్ల రనుకొను విషయమేకాన, నావిషయము నిటఁ బ్రస్తాపిం పఁదలపెట్టక యీరసమును గుఱించి ప్రాచీన పండితవ ర్యుల యాశయములమాత్రమే కొన్నిటి నుదాహరించెద.

అలంకార శాస్త్రమున కాది పీఠమైన భరతా చార్యులు ఈరసమును గుఱించి ముచ్చటించుచు "ఇది రతిస్థాయికము. లోకమునందుఁ బరిశుద్ధములును, భావ నములును, ప్రకాశవంతములును నగు వస్తువులు శృంగార ముతోఁ బోల్చఁబడును!" అని నుడివియున్నాఁడు.

'శృంగార శ్శుచిరుజ్జ్వలః' అని యమరసింహుఁడు. శృగారమునకు శుచియని నామాంతరము. "ఉత్తమ ప్రకృ తిప్రాయో రసః శృంగార ఇష్యతే,"అని సాహిత్య దర్ప ణకారుఁడు.

రసగంగాధరుఁడు ఈరసమును గుఱించి చర్చించు చు, శృంగార భేదములగు నీసంయోగవియోగములు అంతః కరణ వృత్తివిశేషములని చెప్పియుండుట నరయుఁడు:

"తత్రశృంగారో ద్వివిధః, సంయోగో విప్రలంభశ్చ. .........తయోర్ద్వావిమౌ సంయోగ వియోగౌ.

అంతః కరణ వృత్తివిశేషౌ సంయుక్తో వియుక్తశ్చా స్మీతి ధీః."

ధ్వన్యాలోక కారుఁడు రసౌచిత్యవిచారణము చేయుచు నీసందర్భమును గుఱించి ముచ్చటించి యుండు విషయ మాదరణీయము.

'అభినేయములందు రాజాదివిషయమున గ్రామ్య సంభోగ వర్ణనమెచటను నొనరింపఁబడలేదు. గనుక నుత్తి మదేవతా విషయమునను వర్ణింపగూడదు. నాటకముల యందట్టి వర్ణన చేయకుండుటకు కారణము అభినయింప దగినదగుటయే యని యందురేని, అందు జనించు నసహ్యత కావ్యమునందేల లేకయుండు. గనుక కావ్యము నందుఁగాని, నాటకమునందు, గాని ఉత్తమ ప్రకృతిగల నాయకులకు నుత్తమప్రకృతిగల నాయికలతోఁగూడ గ్రా మ్యసంభోగవర్ణనము తల్లిదండ్రుల సురతవర్ణనమునలె కేవల మసహ్యమైనది. అట్లే యుత్తమదేవతా విషయమునను. సంభోగశృంగారమును వర్ణింపఁదలఁచినచో, సురతి మొక్క టియే కాదు, తద్భేదములగు పరస్పరదర్శనాదులు పెక్కు లుగలవు. వానినేల యుత్తమప్రకృతివిషయమున వర్ణింపఁ గూడదు' అని వచించియున్నాఁడు

పైవిషయమునుబట్టి ప్రాచీన కవివర్యుల చేతను, ప్రాచీనాలంకారికులచేతను, ఈ శృంగారరసము పరమ పవిత్రమైనదిగ భావింపఁబడినట్లు విదిత మగుచున్నను, తరువాతివారగు కావ్యకర్తలు దద్విరుద్ధముగ నహమహమి కచేఁ బ్రవర్తించుట చింతనీయము గాకపోదు.

ఈరసమునుగుఱించి 'శృంగారరసవిచారము' అను శీర్షికక్రింద శారదాపత్రికలో విశేష చర్చఁ గావించి యున్నాను. ఇకశాంతమునుగుఱించి యొకింతమాట లాడెదము.

## శాంత రసము

ప్రాచీనవాఙ్మయమున నీ శృంగారశాంతములలో మొదటిది యతివ్యాప్తిదోషమునకును, రెండవదియవ్యాప్తి దోషమునకును బలియైనదనవచ్చును. ఆంధ్రవాఙ్మయమున ఈరసవ్యాపకత్వమునుగుఱించి ప్రస్తాపింపవలసినదియే లేదు. విచారింప శృంగారమువలె నీశాంతరసమును లోక మునకు మహోపకారమైనదనుట నిస్సంశయము. వాఙ్మయ

ప్రపంచమున శాంతరసము నకు నగ్రస్థానము గలిగినపుడ లౌకికప్రపంచమున సౌఖ్యము నెలకొనునని చెప్పుట యతిశయోక్తి గానేరదు పెద్దలుశాంతరసాతిశయమునుగుఱించి వక్కాణించియుండుట నరయుఁడు:

"శ్లో. యచ్చకామసుఖం లోకే
యచ్చ దివ్యం మహత్సుఖమ్;
తృష్ణాక్షయ సుఖస్యైతే
నార్హత షోడశీం కలాం."

(లౌకికవిషయేచ్ఛవలన జనించుసుఖమును, దివ్యమగు మహత్సుఖమును, తృష్ణాక్షయసుఖములో పదునారవపాలుతోఁగూడ సరిరావు.)

శాంతము రసశబ్దవాచ్య మని నిరూపించుచు నిది పురుషార్థప్రదము గావని నిరసించెదరేమోయని శంకించుకొని చెప్పిన యంశమును వినుఁడు.

"శ్లో. సర్వప్రకారైస్సం పూర్ణ కామ స్సంతుష్టమానసః,
ప్రాప్నోతిముక్తిం చరమే శాంతేనైవరసేన సః."

(సర్వవిధముల సంపూర్ణకాముఁడగు మనుజుఁడు చరమావస్థయందు శాంతరసముచేతనే ముక్తిని బొందఁగలుగుచున్నాఁడు.) గనుక నీరసము పరమపురుషార్థప్రదమని తెల్లమగుచున్నది.

శాంతరసప్రధానమగు 'సంకల్పసూర్యోదయ'మను నాటకమును రచించిన శ్రీవేదాంతదేశికులవారు ఆనాటకప్రస్తావనలో ఈరసాధిక్యమునుగుఱించి చెప్పినవిషయమీ సందర్భమున మనకు ముఖ్యముగ సంస్మరణీయము.

'నటి. ఆర్యునిచేఁజక్కఁగఁ జెప్పఁబడినది. కాని శాంతమను రసము లేదని భరతాచార్యులచే సమర్థింపఁబడినది. గనుక నట్టిరసప్రకాశ మెట్లాదవును ?

సూ. (సావజ్ఞావహిత్థం) ఆర్యే నఖలు సంభావయామి తానహం భరతమత పారదృశ్వనః (విమృశ్య)

(అనాదరాకార గోపనములతోఁగూడ) పూజ్యురాలా! భరతాచార్యులను శాంతరసాభావమును వాదించువారినిగనే తలంపను. (ఆలోచించి)

శ్లో. అథవా తాదృశాన్ సభ్యాన్,
మత్వాజగతి దుర్లభాన్
శంకే శాంతిరసోల్లాస
మశక్య మభిమేనిరే.

'భరతాచార్యులవారు శాంతి రసాభినయముఁ జూచువారు లోకములో దుర్లభులు గాన తదభినయము అశక్యమని తలఁచిగని తోఁచెడి)

అపిచ;

శ్లో. అసభ్య పరిపాటికా మధికరోతి శృంగారితాః;
పరస్పర తిరస్కృతిం పరిచినోతి వీరాయితమ్
విరుద్ధగతి రద్భుత స్తదల మల్పసారైః పరైః,
శమస్తు పరిశిష్యతే శమితచిత్త ఖేదోరసః.

(అసభ్యునిసయిత మాశ్రయించు చున్నదగుటచే శృంగారము సభాయోగ్య మెంతమాత్రమును గాదు. వీరరసము శూరులకుఁ బరస్పరతిరస్కారాదుల వృద్ధి బొందించుచున్నది అద్భుతరసము విరుద్ధ గమనముగలది. తుచ్ఛములైన బీభత్సాదుల ప్రసక్తితో పనిలేదు. శాంతరస మొక్కటియే మనోదుఃఖములఁ బోగొట్టుసామర్థ్యము గలదగుట నదియే రసశబ్దవాచ్యము. తక్కినశృంగారాదులు మనోదుఃఖమును వృద్ధిఁబొందించునవిగాన హృద్యము లెట్లగును ?)

కనుక మనసారస్వతమున శృంగార రసప్రధానములగు కావ్యనాటకాదులవలె శాంతరస ప్రధానములైన గ్రంథములు రచింపబడుట శ్రేయోదాయకమని నుడువుచు నింతటితో విరమించుచున్నాను.





# ఆశ్రయవృత్తి

జనమంచి సీతారామస్వామి గారు

భక్తిం గాలముఁ బుచ్చఁగోరినఁ గుటుంబం బెంతయో పెగ్గచున్
భక్తిం గూర్చియె సంతతంబు శ్రమము న్బొందించెడిన్; భాగ్యసం
యుక్తుల్ మత్తతచేత దుర్విషయలౌల్యోపేతులై భక్తి నా
సక్తిం బొందుటె యర్థు; నీకొలువనన్ సామాన్యమా, రాఘవా.

మ. సిరిచేఁ గాక మఱేవిధంబునను గొంచెంబేనియున్ గౌరవా
దర సేవార్హత లేనిమానవుల చెంతం జేరి మండాడుచున్
ధరపై జీవనయాత్ర సల్పుటతిచింతాహేతువౌ నక్కటా
పరులన్ వేఁడుటకంటె సత్కవికి నాపత్తేదయా, రాఘవా.

మ. మనసం దెంతయుసిగ్గు పొందెడిని; సంసారార్థ మీపాట్లు గ
ల్గెనుగా యన్నవిచారమొందు; నెటు నేఁగేల్మోడ్చి సంపన్మదాం
ధున కంచు న్గడుఁగుందెడున్; విసుఁగుజెందున్; ధైర్యము న్గోలు పో
వును; ఛీ! యీబ్రదుకేల యంచుఁ దలఁచున్; బొమ్మందు రేమో యటం
చనుమానించెడి నెట్టివాఁడు నొరులన్ యాచించువో, రాఘవా.

ఉ. మానక నీదుసేవ నియమంబునఁ జేయఁగఁ బూనితిం బ్రభూ!
మానము భంగమొంద బతిమాలుచు నిచ్చక మాడుచున్ భువిన్
మానవు నెవ్వనిం గొలువ మానస మొప్పకయున్నదయ్య; ఓ
నేనుఁగు నెక్కి దిడ్డిఁ జొరనేటికి నాకు మహాత్మ, రాఘవా.

శా. ఏయుద్యోగము చేయఁబూనకయె, తా నెవ్వారిఁ బ్రార్థింపకే
మాయల్పన్నక యీకలిన్ నరుఁడు సంసారాంబుధిన్ దాఁటలేఁ
డే యం చెందఱో పల్కుమాటయు నిజంబేయైనఁ గావచ్చు; నీ
దే యాబాధఁ దొలంచు భారమును దండ్రీ ప్రోవవే రాఘవా.





# భీమకవి జన్మస్థానము


కేశవరపు కామరాజు గారు (భారతీ సమితి)


నేను క్రోధన సంవత్సరపు టుగాది సంచికయందు "నిజాము రాష్ట్రీయ-పరిశోధనోద్యమము. — కాకతీయ మహాయుగ" మను శీర్షిక క్రింద శతావధానులు శ్రీ శేషాద్రిరమణకవులు ప్రకటించిన వ్యాసమును జదివితిని. పిమ్మటశతావధానులు శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యులు గారు హైదరాబాదు "ఆంధ్రపరిశోధకసంఘము" వారి యాహ్వానముపైఁ జేసిన పర్యటనఫలితములను "పరిశోధక నివేదిక" యనుశీర్షికను, శారద 2 వ సంపుటము 6 వ సంఖ్యలోఁ బ్రచురించిన వ్యాసమును జదివితిని. మఱియుఁ గవిజనాశ్రయమున శ్రీ జయంతి రామయ్యపంతులుగారు చర్చించినవిషయములఁ జదివితిని. వీనిని జదివినమీఁదట నే నదివఱకు దాక్షారామముఁ గూర్చి వ్రాసియుంచిన క్షప్తవిషయముల విమర్శన మత్యావశ్యకమని దీనికిఁ గడంగితిని.

ఈవిమర్శన సందర్భమున నీక్రింది నాల్గుప్రశ్నలు బయలు వెడలుచున్నవి:

అ: దక్షారామము గోదావరి మండలము లోనిదా? లేక నిజాము రాష్ట్రీయములోని కరీంనగరము మండలము లోనిదా?

క: వేములవాడ భీమకవి వరప్రదాత యెచ్చటి భీమేశ్వర స్వామి?

గ: భీమకవి జన్మస్థాన మెద్ది?

జ: భీమకవి యేకాలపువాఁడు?

దక్షారామ మేమండలములోనిదైననేమి? భీమకవి వరప్రదాతతో మనకేమిపని? విశేషించి యిట్టివిమర్శనములవలనిలాభ మేమి? అనుప్రశ్నలు బయలుదేరవచ్చును. మొదటిది మతవిషయము. యాత్రికులకుఁ జాలముఖ్యము. మిగిలినవి సారస్వతచారిత్రకవిషయములు. మతవిషయముతోఁ బరస్పరసంబంధమునఁ బయలువెడలినవి. ఇది వఱకే నామమాత్రావశేషమైయున్న మనమతచారిత్రక సారస్వతవిషయములఁ బునరుజ్జీవింపఁజేసికొనినఁ దప్ప మనకెన్నఁటికి ముక్తి లేదు. మఱియు సత్యము సర్వశ్రేయము. సత్యనిర్ధారణకుఁ గారణ మవసరము. దానికదియే పరమావధి. కాన నే నీపనికి దొరఁకొంటిని

అ :- ఈప్రశ్నను గూర్చి యోజించుటలోఁ గేవల తైర్థికజనప్రతీతికంటె గ్రంథస్థాంశములు ప్రబలప్రమాణములు. ఆగ్రంథములలోను నీవిషయమై చర్చరానిక్రితము వ్రాయఁబడినవి యుత్తమములు. వానిలోను నాంధ్రదేశమునఁ బుట్టి పెరిగి దేశపర్యటనముఁ జేసి చక్కఁగ స్థలనిర్దేశముఁ దెలిసినవారిగ్రంథము లుత్తమోత్తమములు. శ్రీనాథకృత భీమేశ్వరపురాణ కాశీఖండ శివరాత్రిమాహాత్మ్యము లట్టివని యొప్పుకొనక తప్పదు. శ్రీనాథుఁడు క్రీ. శ. 1365 లగాయతు 1445 వఱకు జీవించెననియు 1415-20 ప్రాంతమున భీమేశ్వర పురాణమును, 1420-35 ప్రాంతమునఁ గాశీఖండమును, చరమదశయందు శివరాత్రి మాహాత్మ్యమును రచించినట్టులుఁ పెద్దలు నిశ్చయించినారు. ఇవిరెండును సంస్కృతమునుండి భాషాంతరీకరణములు. మూలమును మాత్రము వదలక కొన్నిస్థలములఁ బెంచియుఁ, గొన్నిశాస్త్రల క్షప్తపఱచియు, మఱికొన్నిట మూలమునలేని క్రొత్తవిషయములఁ జేర్చియు నివి బహుస్వేచ్ఛగ నాంధ్రీకరింపఁబడెను. పంచాశత్ఖండమండితంబగు స్కాందపురాణము నాకు లభింపలేదుగాని విడిగా నొక్కకాశీఖండమే దొరకినది. మూలమున నగస్త్యుఁడు గోదావరీనదీప్రాంతమును జేరి కొల్లాపురలక్ష్మిని దర్శింపనేఁగెనని మాత్రము గలదు. కాని శ్రీనాథుఁ డాంధ్రుఁడవుట నాంధ్రదేశప్రాశస్త్యమును వర్ణింపనెంచి తనకాశీఖండము

తృతీయాశ్వాసమున "కుంభసంభవుండు గోదావరి నోరసి కొనుచు నాంధ్రదేశంబున నరుగునప్పు"డని యారంభించి గోదావరీతీరమున వరుసగఁ బట్టిసము, రాజమహేంద్రవరము, కోటిఫలి, పల్వాల (పలివెల), దక్షారామము మొదలగు పుణ్యక్షేత్రముల దర్శించి భోగమోక్షనివాసంబైన దక్షారామంబునఁ గొన్నిదినంబులుండి కొల్లాపుర శ్రీమహాలక్ష్మిం దర్శింపఁబోయెనని వ్రాసెను.

"సీ. పట్టిస శ్రీవీరభద్రేశు సేవించి
తిలసోమనాథు నంఘ్రులకు నెరఁగి
పురశాసను ననంతభోగేశ్వరస్వామి
హిమశైలకన్యకాధీశుఁ గొల్చి
పద్మాద్రిపై రుద్రపాదంబు లర్చించి
చేరి మార్కండేయశివు భజించి
కోటిపల్లీతీర్థ కుండలాముఖముల
నర్ధేందుధరు విరూపాక్షుఁ దలఁచి
గీ. పల్వలస్థానమున భూతభర్త నిలిపి
కణఁకఁ గౌంతేయమున వృద్ధగంగఁ గ్రుంకి
దక్షవాటిక సప్తగోదావరమున
మునిఁగి భీమేశ్వరునిఁ గాంచె మునివరుండు."
ఆశ్వా. 3, ప. ౧౬.

శ్రీజ్ఞాన ప్రసూనమాలికా గ్రంథమాలలో ద్వితీయప్రసూనముగ 1901 వ సంవత్సరమున ముద్రింపఁబడిన శ్రీభీమేశ్వరపురాణ పీఠికయందు "గోదావరిజిల్లాలోని దక్షారామము లేక భీమేశ్వరంబను నొక శివస్థల మాహాత్మ్యముం దెలుపునది భీమఖండ"మని వ్రాయఁబడియున్నది. వ్యాసులు శిష్యవర్గముతోఁ గాశికిఁ దీర్థయాత్రఁ జని యందుండిన నేడునాళ్లు భిక్ష లభింపకపోఁగాఁ గాశిని శపింపంబూన, నన్నపూర్ణ ప్రత్యక్షమై భిక్షనిడెను. శంభుఁడు మాత్రము కోపించి వ్యాసుని శిష్యులతోఁ గాశి వెడలిపొమ్మనెను. వ్యాసులు కాశీవియోగజనిత వేదనాభరంబునఁ గుంది చనునప్పుడు కతిపయ దినప్రయాణంబున వరుసగఁ బురుషోత్తమము (జగన్నాథము), శ్రీకూర్మము, సింహాద్రి(సింహాచలము) పిఠాపురము, కుమారారామము, సర్పపురము (సర్పవరము)ల మార్గమున వచ్చి సాంపరాయణగ్రామముఁ జేరెను. దీనిని సంపర యనియెదరు. దక్షారామ భీమేశ్వరుని సేవించి పీఠికాపురమునకు వచ్చుచున్న యగస్త్యుఁడును, సాంపరాయపురము నప్పుడే చేరెను. వ్యాసులకోరికపైని, నగస్త్యుఁడు తిరుగ దక్షారామము వ్యాసులతో వచ్చునపుడు పులుగుర్త- ఓంకారపురి, మీఁదుగ శీలయను గ్రామమునకు వచ్చి విశ్రమించెను. అభిజిల్లగ్నమున దక్షారామ ప్రవేశము నిశ్చయించి,యింకను వ్యవధియున్నందున వ్యాసాదు లాకసముననుండి భీమమండలిని గనుఁగొనిరి. పిమ్మట దక్షారామము శుభముహూర్తమునఁ బ్రవేశించి శ్రీభీమనాథుని సేవించిరి. కాశీఖండము నందలి యగస్త్య మార్గమువలె భీమఖండమునందలి వ్యాసమార్గమును మనకు ముఖ్యము. ఈరెండును వేర్వేఱు మార్గములై యొకస్థలమున సంధించినవి.

ఇప్పటికిని ఆలయమున కెదుటఁ దూర్పుదెస సప్తగోదావరము గలదు. ఆలయోపాంతమునఁ దమలపాకుల తోఁటలు గలవు.

"ప్రాగ్దిశావప్రగోపుర ప్రాంగణమున
సప్త మునిసింధు సోపాన సరణికలన."
భీమ. ప్ర. ఆ. 74

"నాగవల్లీసమాక్రాంత పూగఖండ
మండితోద్యానవాటికా ఖండ విభవ
పాత్రమగు భీమమండలీక్షేత్రమునకు."
భీ. తృ. ఆ. 20

భీమమండలిగోదావరీనది కెడమవైపునఁ గలదు.

"పట్టిస శ్రీవీరభద్రేశు........ మందిరముదాసి
గోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి,
భీమమండలి దాపలఁబెట్టుకొనుచు
గౌతమీగంగ లవణాబ్ధిఁ గౌఁగిలించె"
భీ. తృ. ఆ. 21

భీమమండలి క్రిందివిధమున సీమావిభాగము గావింపఁబడినది.

"గీ. జంభరిపుదిక్కునకు సీమ సలిలరాశి
పశ్చిమమునకు సీమ త్ర్యంబకతనూజ
ద్యుమ్నపతిదిక్కునకు సీమ తుల్యభాగ
దక్షిణమునకు వృద్ధగౌతమియె సీమ."
భీ. తృ. ఆ. 3

వ్యాసాదులాకసంబుననుండి కనుఁగొనునప్పుడు కుంభసంభవుం డిట్లు భీమమండలిని వ్యాసునకుఁ జూపించెను

మ. అదె సంవేద్యము ; కోటిపల్లి యదె ; ద
　　క్షారామమత్పట్టణం
　బదె ; యభ్రంకష సౌధకూటమున హే
　　లావాస ముచ్ఛ్రాయసం
　పద సొంపారెడు భీమలింగము మహా
　　ప్రాసాదభూమీధరం
　బిదె, సప్తర్షినదీప్రవాహ మిదె ; సం
　　వీక్షింపు మేకాగ్రతన్."
　　　　　　　　　　　భీ. తృ. ఆ. 53 54

సీ. అదె పట్టిసస్థాన మందుండు వీరభ
　　ద్రేశ్వరస్వామి యర్ధేందుమౌళి
　యదె పుండరీకాద్రి యచట మార్కండేయు
　　నిలువేల్పు ముక్కంటి వెలసెఁ దొల్లి
　యదె కుమారారామ మాహార్మ్యరేఖయ
　　చాళుక్యభీమేశు సదనవాటి
　యదె కుక్కుటేశ్వరం బయ్యుపాంతము మేడ
　　హుంకారిణీదేవి యోలగంబు
గీ. వాఁడె మాయింటివేల్పు పల్వాలపురమున
　నుండు లింగంబు ఫణిరాజకుండలుండు
　సప్తమునిసింధుసంగమేశ్వరుఁడు వాఁడె
　కుండలాముఖ మదె మానికులవరేణ్య!

దేవేంద్రుఁడు భీమేశ్వరుని కేకభోగముగ నేలేరు సముద్రము గౌతమీగంగల మధ్యమునఁ ద్రియోజనముల వసుంధరను గట్టడఁజేసెననియు, శ్రీకుమారవనికా చాళుక్య భీమేశ్వరుఁడు (చామర్లకోట భీమవరము) సరిసామంతుఁడనియు, పల్వాలేశుఁడిరుగుపొరుగువాఁడనియు, భైరవుఁడు సమీపబాంధవుఁడనియు, భీ.ఆ. 5;76,88,89, పద్యములలో వర్ణించియున్నాఁడు. ద్వాదశక్షేత్రములనడుమ ద్వాదశతీర్థములమధ్యమున భీమనాథుఁడు, పరివేషోదరస్థ సూర్యునివలెను బద్మమధ్యగత రాజహంసవలెను వెలుంగుచుండెనని భీ. ఆ. 3-77,78 పద్యములఁ గీర్తించెను. విస్తరభీతిచే నిటఁ బద్యముల నుదాహరింపలేదు.

పూర్వచరిత్రను నిట్లు ఆ. 3-17 పద్యమునఁ జక్కఁగ వర్ణించెను.

సీ. దక్షప్రజాధినాథ మహాధ్వర క్రియా
　　దీక్షాధిగమపుణ్యదేశమునకు
　బ్రహ్మవిష్ణు పురందర ప్రధానసుపర్వ
　　పరమసంయమి సభాభవనమునకు
　దాక్షాయణీయోగ దహనార్చి రున్మేష
　　సామిధేనీమంత్ర జాతమునకు
　వీరభద్రభుజావిహార హేలాసమా
　　రంభ నాటక నాట్యరంగమునకు
తే. నమృతమయ దివ్యతేజస్స్వయంభులింగ
　కాంత భీమేశ్వరస్వామి స్థానమునకు
　దక్షవాటంబునకు మోక్షధామమునకు
　భోగజన్మస్థలమున కేపురము సరియె.

మఱియు శివరాత్రిమాహాత్మ్యమునఁ జతుర్థాశ్వాసమునందలి 28 వ పద్యమున, 'మాఘవేళ మునులు దీర్థమాడంగ నేఁగుదెంతు'రను సందర్భమునఁ బీఠపురిఁ (పిఠాపురము), దక్షవాటము (దాక్షారామము), మార్కండేయపురము, (రాజమహేంద్రవరము)ల నొకటితరువాత నొకటిని జెప్పెను. 30-వ వచనములో వర్ణనాసందర్భమున "హృదయోత్కంఠాతిరేకంబునఁ గంఠమూలకఠోరకాలకూటవిషమషీకళంక పంకచ్ఛాయాచ్ఛటాకుండు, భువనరక్షాదాక్షిణ్యుండు, దాక్షారామ భీమేశ్వరుండు దక్షిణజలధివేలావలయితంబులగు నేలాలవంగవల్లీమతల్లికా కుడుంగక్రోడంబులం గ్రీడింపటకునై సారంగలోచనలు దానును గోరంగి వెడలె" నని వ్రాసెను. దాక్షారామమునకు సమీపమున సముద్రపుటొడ్డున గోరంగియను పట్టణం బుంట గోదావరిజిల్లాయందె కదా! కోరంగి యిప్పటివలెఁగాక పూర్వము ప్రసిద్ధిఁజెందిన గొప్పరేవుపట్టణమై ధనధాన్యములతోఁ దులఁదూగుచుండెడిని.

మఱియు నీదాక్షారామ భీమేశ్వర స్వామివారి దేవాలయముమీఁద పురాతనశాసనములు గలవు.

"శ్రీశాకే కరబాణదిగ్విగణితే సాధారణే వత్సరే,
వైశాఖ్యాం వరగౌతమాన్వయమణిః శ్రీకేశవార్యో ముదా,
దేవేంద్రో భువి దక్షవాటినగరే భీమేశితుః పశ్చిమద్వారే
చానయ మండితో గణపతే రమ్యప్రతిష్ఠామదాత్."

దిక్కునకు నాల్గులెక్కించినచో 452యగును. క్రీ. శ. 530 యగును. దిక్కునకు పది లెక్కించినచో 1052 యగును. క్రీ. శ 1130 యగును. ఈరెండును సాధారణ సంవత్సరమునకు సరిపోవుచున్నవి. దిక్కునకు ఎనిమిది లెక్కించినచో సంవత్సరమునకు సరిపోవుటలేదు,"

2. "ధీరోదాత్తుడు సామినాయకుడు భక్తిం జేసి నిత్యస్థితిం భూరిఖ్యాతిశశక్షితీశసముల్ భూశైలదిక్సంఖ్యయం దారామంబులకెల్ల నాయకముగా నత్యున్నతిం బొల్చు దాక్షారామంబున నిల్పె దీపము సదాఖండప్రభాభాసిగాన్." దిక్కునకు నాల్గు లెక్కించినచో 471 యగును. క్రీ. శ. 549 యగును. దిక్కునకు పది లెక్కించినచో 1071 యగును. క్రీ. శ. 1149 యగును.

3. "శుకాదిద్విజసంఘాత సేవితాదక్షవాటికా, కాచిదస్తి లం తస్య, చెతుర్వర్గఫలావహాం. ......... శ్రీశాకే నిధివార్ధిరామవసుధా సంఖ్యే ప్లవంగాహ్వయే వర్షే మాసిచ కార్తికే హ్ని మృడయా రామస్థితం మంటపం శ్రీశ శ్రీమపికుంబనాయకభువి శ్రీయం నమం శ్రాత్యాత్మజః, పుంణ్యే దక్షిణకాసికాధిపతయే భీమేశ్వరాయార్పితం." ఇవి 1349 శకవత్సరములు క్రీ. శ. 1427 సంవత్సరము. పైశాసనములవలన నిది దక్షవాటినగరమనియు, దక్షిణకాశియనియు, నిం దారామము గలవనియు, నిది పంచారామములకు నాయకమణి యనియుఁ దెలుచున్నది.

సుమారయిదువందల సంవత్సరముల క్రిందట నాంధ్రదేశంబునఁ గొండవీటిసీమను బుట్టి పెరిగి, గోదావరీమండలములోని రాజమహేంద్రవరమునఁ జాలకాలము గాపురముండి, యాంధ్ర, కర్ణాటక, ద్రవిడాది దేశములం బర్యటన మొనర్చిన శ్రీనాథమహాకవి వ్రాఁతలవలన పురాతన శాసనములవలన గోదావరిమండలములోనిదే, దాక్షారామమని స్పష్టము. నిజాంరాష్ట్రములోని వేములవాడనే వేములవాడ దాక్షారామమనుటెంతయు సమంజసముగాదు.

క. గ:— ఈరెండుప్రశ్నలకు నేవివరించువిషయములు పరస్పరసంబంధము గలవిగాన, రెండింటినిఁగూర్చి యొక్కమాటే చర్చించుచున్నాను. భీమకవి తాను రాజసభలకుఁ బోయినపుడు దక్షారామభీమేశ్వరపుత్రుఁడ ననియే చెప్పుకొనుచు వచ్చినట్లు లీక్రిందిపద్యమువలన స్పష్టమని శ్రీవీరేశలింగముపంతులుగారు తమ కవులచరిత్రమున వ్రాయించిరి.

మ. ఘనుఁడన్ వేములవాడవంశజుఁడ దా
క్షారామభీమేశనం
దనుఁడన్ దివ్యవిషామృతప్రకట నా
నాకావ్యధుర్యుండ భీ
మన నాపేరు వినంగఁ జెప్పితిఁ దెలుం
గాధీశ! కస్తూరికా
ఘనసారాదిసుగంధవస్తువుల వే
గం దెచ్చి లాలింపురా.

"ప్రభాకరశాస్త్రిగారు నైజామురాష్ట్రములోని వేములవాడ, భీమకవిజన్మస్థానము గాదని సంశయించిరి గాని వారిచట భీమేశ్వరాలయముంట యెఱుంగకట్లు వ్రాసియున్నా" రని శ్రీశేషాద్రిరమణకవులు వ్రాయించిరి. శ్రీప్రభాకరశాస్త్రిగారి కీవిషయము దెలియ నట్టులు వీరి కెట్లు తెలియును? శ్రీప్రభాకరశాస్త్రిగారి కావిషయము తెలియనిండు తెలియకపోనిండు. మన కంతగా దానితోఁ బనిలేదు. కాని యెవ్వరికైనను జన్మస్థానమందలి దైవతమే వరప్రదాత గావలయునా? కవి తిక్కనకు హరిహరనాథుఁ డిష్టదైవముగదా? తిక్కన జన్మస్థానమందుచే నెల్లూరు గానలెను. అట్టులుగాదే! ఇట్టితార్కాణములకుఁ గవిలోకమున లోటులేదు. శ్రీశేషాద్రిరమణకవులు గ్రామనామమును పెద్దయక్కరములతో "వేములవాడ" యని వ్రాసి క్రిందివివరణమున దీనిని "వేములవాడ" యందురనియు నిచ్చటిభీమేశ్వరుఁడే భీమకవి వరప్రదాత యని చెప్పుదురనియు "కొలనుపాక" స్థలపురాణమున దక్షిణకాశియని ప్రశంసింపఁబడినట్లు వ్రాయించి యిదమిత్థమని నిరూపింపకముందు విమర్శకులకుఁ గొంచెము తావొసంగినారు. కాని శ్రీమాన్ దూపాటి వెంకటరమణాచార్యులుగారు మాత్రము దానికి వేములవాడ యనియే నామకరణమిడి దీనిని "వేములవాడయని నాగరికులు, వేండాల, యేండాల యని యనాగరికులు వ్యవహరించుచున్నారు" మొదలగుసంగతులు వ్రాసిరి. శ్రీజయంతి రామయ్యపంతులుగారు "దీనికి వేములవాడ యనియును వేములవాడ

యనియు నామాంతరములుగలవు. ఆగ్రామమందున్న కొన్ని శాసనములలో "వేమ్బలవాడ" యనుపేరు గనఁబడుచున్నది. "వేమ్బల" క్రమముగ, వేమల, లేముల, వేముల, యయియుండవచ్చు" ననుసంగతులను వ్రాసిరి. వేములవాడకే లేములవాడయను పేరున్నచో ననాగరికులు దానిని లేండాల వేండాల యనిమాత్రము పిలువవలెనుగదా! అటులుగాక లేండాల, యేండాల యనియే పిల్చుచున్నారు. లేములవాడ లేండాల యయినదనినను వేములవాడ వేండాలగావలయును. ఒకవేళ లేండాల లోని లవర్ణలోపమువలన, నచ్చుమిగిలి ఏండాల కాఁగా హలాదిగా వాడుటవలన యేండాల యయినదనవచ్చును. అప్పుడు వేండాలగూడ నట్లేకాఁగూడదా యనునాక్షేపణ రావచ్చును. కాని వేండాల నామముగూడ వ్యవహారమందున్నగదా యేండాలరూపమును దానినుండి సమర్థించుట. వేండాలయనునామ మున్నట్లెవరును వ్రాయలేదు. శ్రీ రామయ్యపంతులుగారు "లేమ్బల" లేముల, లేమల, వేముల యయినదనుట కొకకథను వ్రాయించినారు. "ఈగ్రామమున కరక్రోసుదూరములో నామపల్లియను నొకయూరు గలదు. నామపల్లియు వేములవాడయు గలిసి పూర్వ మొకపెద్దపట్టణముగా నుండెననియు నచట రాజరాజనురాజు రాజ్యముఁ జేసెననియు నా కాలమునందు వేములవాడలో లేమలు (భోగస్త్రీలు) నివసించుటచే నాగ్రామమునకు లేమలవాడయను పేరు గలిగినదనియు వేములవాడ ప్రాంతమందుఁ ప్రబలమైనవాడుక గలదు. రాజరాజేశ్వరుఁడనురాజీదేశమును నేలినట్లు శాసనప్రమాణముగూడఁ గలదు." శ్రీ రామయ్యపంతులుగా రీవిషయమునఁ బుక్కిటిపురాణము నాధారముచేసికొనిరి. మొదట శాసనములభాష తప్పులతడక. పిమ్మట జనప్రవాదము కేవలకల్పనాకథ. అయినను "లేమ్బల" లేమల, లేముల యయినటులుఁ గథవలన సమర్థింపలేనందిరేకాని "వేముల" యనుట కేకారణము నుఁ జెప్పఁజాలరైరి. లేమలన స్త్రీలుగాని భోగము స్త్రీలు గారు. వాడయనియుండుటవలనఁ బ్రత్యేకము స్త్రీలుండునది భోగమువాడయని గౌణార్థమునఁ జెప్పియుండవచ్చును. ఈశాసనము లేకాలమునాఁటివి? భీమకవికిఁ బూర్వమా లేకపరమా? సారంగధరకథాంశస్థానమీనామపల్లియే యనువాసమున కిచట బీజమును నాటఁ దలఁచిరిగాఁబోలు. "గ్రంథాధారములు లిఖితాధారములు బొత్తిగా లభింపలేద"ని శ్రీ యాచార్యులవారు వ్రాసిరి. శాసనములు గలవని శ్రీ రామయ్యపంతులుగారు వ్రాయుచున్నారు. బోధపడకున్నది. శాసనములఁ బ్రకటించినగాని పూర్ణచర్చకువీలుగలుగదు. తెలుచిమాడ శ్రీ శేషాద్రి రమణకవులు వ్రాయించినటులు దీనిపేరు లేములవాడ యనియుఁ బిమ్మటఁ గారణాంతరములచే నాగరికులు వేములవాడయని పిలుచుచున్నారనియుఁ దేలుచున్నది. నాగరికులకు మార్పునం దభిరుచి మెండు గదా! లేములవాడ వేములవాడగ మార్పుఁజెందఁగఁ గవియింటి పేరునకు సరిపోయినది. భీమేశ్వరాలయ మున్నది. నాగరికులకు భీమకవి జన్మస్థానముగ సిద్ధమైనది. "దక్షారామ భీమేశ నందనుఁడఁ"అని యుండుటవలన వేములవాడదక్షారామమైనఁగాని పూర్తిగ నిర్ధారణచేయ వలనుగాదు అందునకుఁగా నాచార్యులవా రిట్లు వ్రాసిరి. "ఈగ్రామము సుప్రసిద్ధుఁడగు వేములవాడ భీమకవిజన్మస్థానము. దక్షుఁడు యజ్ఞముఁ గావించినస్థలమగుటచేత క్షేత్రమహాత్మ్యమునుబట్టి యీస్థలమే ద్రాక్షారామము. భీమకవి వరప్రదాతయిచటి భీమేశ్వర మహాదైవతమే." దక్షుఁడు యజ్ఞము గావించిన స్థలమని తెలియుభాగములఁ బురాణమునుండి వ్రాయలేదు. శ్రీ రామయ్యపంతులుగారు కొంత భాగమును రాజేశ్వరమాహాత్మ్యము నుండి వ్రాయించినారు, భీమేశ్వర మాహాత్మ్యమునుండి యెవరును వ్రాయించలేదు. శ్రీ రామయ్యపంతులుగారు వ్రాయించినదానివలన దక్షవాటిక యనునర్థము రాదు. మీఁదుమిక్కిలి దక్షవాటిక యనునది మఱియొకటి గలవని తేలుచున్నది. కనుకనే సాహసించలేక శ్రీ రామయ్యపంతులుగారు "దక్షవాటిక యను సంజ్ఞకూడ గలద"ని వ్రాయించినారు. ప్రస్తుతాంశముగల రెండుపంక్తుల నీక్రిందనిచ్చుచున్నాను.

> "శివౌ; జనయామాసతు స్తత్ర శివలింగం సనాతనమ్,
> దక్షవాట్యాం భీమలింగం యత్ర రాజేశ్వర శ్శివః."

పూర్వాపర సందర్భములఁజూడ దీనికర్థమిటులని తోఁచుచున్నది. శివౌ, యత్ర, రాజేశ్వర శ్శివః, (స్థితః) సనాతనమ్, శివలింగం, భీమలింగం, జనయామాసతుఃఅన తత్ర దక్షవాట్యాం (స్థితం). పార్వతీ పరమేశ్వరులు ఎచ్చట రాజేశ్వర శివలింగము (ఉన్నదో) అచ్చట దక్ష

వాటిక (యందలి) సనాతన శివలింగమైన భీమలింగమును బుట్టించినారఁట. దీనివలన భీమేశ్వరప్రతిష్ఠకుఁ బూర్వము రాజేశ్వరుఁ డచ్చట గలఁడనికూడా తేలుచున్నది. శ్రీ రామయ్యపంతులుగారు ఆచార్యులవారిద్వారా (గ్రామస్థులయొద్దనుంచి తెప్పించిన పత్రము మాజువానీ సాక్ష్యము) లోని భాగమున నీక్రిందివిషయముగలదు. "రాజేశ్వరమాహాత్మ్యము"లోపల యీ రాజేశ్వరుణ్ణిన్ని భీమేశ్వరుఁడని చెప్పియున్నది. అయితే భీమేశ్వరుఁడు వేఱు, రాజేశ్వరుఁడు వేఱునా? లేక రాజేశ్వరుఁడంతటనుండి భీమేశ్వరుఁడుగా మారెనా? ఈయసందర్భములఁజూడ భీమేశ్వరలింగమును పార్వతీపరమేశ్వరులు పుట్టించుటకుమాఱుగ నెవ్వరో సృష్టించి యుండవచ్చును. జైనవిగ్రహములుభీమేశ్వరాలయమున లేదని శ్రీరామయ్యపంతులుగారువ్రాసిరి. రాజేశ్వరాలయముఖద్వారము నొద్దను, ప్రాకారము లోపలితట్టు గర్భాలయమునొద్దను వివిధములు వివిధాకృతులుగల జైనవిగ్రహములు పెక్కులు గలవని శ్రీయాచార్యులవారు వ్రాసిరి. రాజేశ్వరాలయము పూర్వమొక జైనమతమై శైవులచే నాక్రమింపబడెనని చెప్పుదురనియు, నీయాలయావరణలో పెక్కుధ్యానజైనవిగ్రహములు గలవనియు శ్రీశేషాద్రిరమణకవులు వ్రాసిరి. భీమేశ్వరుఁడు వేఱు, రాజేశ్వరుఁడువేఱు వని తేలుచున్నది. స్థలపురాణమో మాజువానీసాక్ష్యమో తప్పు కావలెను; లేక రెండును దప్పుగావలెను. మాడఁజూడ జైనమతప్రాబల్య మంతరించినతర్వాతను రాజేశ్వరప్రతిష్ఠయు నాపిమ్మట భీమేశ్వరునిసృష్టియు జరిగెననియు, సనాతనదక్షవాటిక భీమలింగము వేఱనియు, దక్షుఁడు యజ్ఞము గావించిన స్థల మిది గా దనియు నూహింపవలసియున్నది. ఈప్రాంతమును రాజేశ్వరుఁడు పరిపాలించు కాలమున, జైనమతమును శైవులాక్రమించి రాజేశ్వరలింగమును ప్రతిష్ఠ గావించియుండవచ్చునని తోఁచెడిని. కవిజనాశ్రయమునఁ జర్చితమైన యంశములుపక్క నూతనాంశములు తెలియలేదని శ్రీయాచార్యులవారు వ్రాయించిరి. వీరీసారి బ్రాహ్మణపటువులదుంపగములమధ్యను బ్రతిమఁ దీసితిమని వ్రాసిన శిలాశాసనమునం దీవిషయమగు సంగతులు లేవని స్పష్టము. ప్రభావతీప్రద్యుమ్నమునఁ బ్రాహ్మణవటువుల దుండగపు వాక్యము లుత్తరకథాఫలోదయసందర్భమున కుపశ్రుతియయినట్లు లిచటనుండగను లుత్తరకథాఫలోదయసందర్భమున కుపశ్రుతియేమో! శ్రీశేషాద్రిరమణకవులు కొలనుపాక యనివ్రాసిన గ్రామనామమునే శ్రీయాచార్యులవారును కొద్రుపాక యనివ్రాయించిరి. పరిశోధకులలో నిట్లొకరికి దొరికిన గ్రామనామముగూడ స్వల్పవ్యవధిలో మఱియొకరికి గొరకుట ప్రస్తుతకాలమున దుస్తరముగుచుండగ, జను లనుకొను కొన్నిమాటలఁ బత్రములఁజేసి, తదాధారమున గ్రంథాంశముల ననాదరించి నరిత్రాంశముల నిర్ణయమునకుఁ గడంగుట కగుసాహసము. శతావధానిప్వయము వ్రాయించిన స్థలపురాణక్షేత్రమాహాత్మ్యము లనునవి శ్రీరామయ్యపంతులుగారు వ్రాయించిన రాజేశ్వరమాహాత్మ్యమేనా? లేక వేర్వేరా? కాన వేములవాడ యెన్నటికి దక్షవాటిక గాఁజాలదు. "ఘనుఁడఁట వేములవాడకశలఁజూడ దాక్షారామభీమేశ నందనుఁడఁట" అనుపద్యము శ్రీ రామయ్యపంతులుగారనుకొనినట్లు స్థూలసృష్టికే బోధకముగాక సూక్ష్మసృష్టికినిగూడ బోధకమే యైనది. ఇఁకఁ గవిజనాశ్రయావతారికలోని యేడుపద్యములలో నొకటగు

క. వేములవాడను వెలసిన
భీమేశ్వరకరుణఁగల్గ భీమసుకవినేఁ
గోమటిరేచనమీఁదను
నీమహిఁ గవు లెన్న ఛందమేలమి రచింతుఁగా.

అనుపద్యము నాధారముచేసికొని శ్రీరామయ్యపంతులుగారు తర్కించినారు. ఈయవతారికపద్యము లేడును ప్రక్షిప్తములు. శ్రీరామయ్యపంతులుగారు పదిప్రతులను బరిశోధించి యీగ్రంథము నచ్చొత్తించినారు. ఈయవతారికపద్యము లేడును దొమ్మిదిప్రతులలో లేవు. 'జ' యనునొక్కప్రతియందే కలవు ఇది పూర్తిప్రతి కాదు. గ్రంథాది పద్యత్రితయము మాప్రతియందు లేదు. 'బ' యనుప్రతి సమగ్రము. మొదటి మూడుపద్యము లిందుఁ గలవు. మఱియు

క. పరగినవిమలయశోభా
సురనిరతుఁడు భీమనాగ్రసుతుఁ డఖిలప్రభా
పరిణతుఁ డయ్యెను భూసుర
వరుఁడు ప్రసాదోదితధ్రువశ్రీయుతుఁడై.

క. అసమానదానరవితన
యసమానోన్నతుఁడు యాచకాభరణుఁడు ప్రా
ణసమానమిత్రుఁ డీకృతి
కి సహాయుఁడుగా సుదాత్తకీర్తిప్రీతిన్.

యను రెండుపద్యములు గలవు. ఇట్టులుండ నీ రెండింటిని ననన్వయములనియు వీనివలన భీమునకు గ్రంథమునకుఁ గల సంబంధము నిర్ణయింప వలనుగాకున్నదనియుఁ బరిహరించిరి. వారివాదమునకు ముఖ్యాధారమగు పద్య మందు గలదుగాన నవతారికలోని యేఁడుపద్యములను గ్రహించిరి. ఈరెండింటినిగూడ ముద్రించఁగూడదా యనిన నందలియర్థము పరస్పరవైషమ్యము. గ్రంథసంఖ్యలోఁ జేర్చక, పైగా నవతారికయనుపేరఁ గవి యేడుపద్యముల నేల వ్రాయవలసివచ్చెనో తోఁపకున్నది. ఇవి ప్రక్షిప్తము లనుటకు నందే తగుసాక్ష్యము గలదు. కవి జైన మతకవులసాంప్రదాయముగ ముందు సరస్వతినిమాత్రము ప్రార్థించి కావ్యమును వ్రాసినాఁడని శ్రీరామయ్య పంతులుగారే వ్రాయించినారు. అట్టిచో నవతారిక మొదటిపద్యమున 'మురారి' (విష్ణుమూర్తి) ప్రార్థన గలదు. ఇది వీరివాదమును మూలచ్ఛేదముఁ జేయునుగదా? విశేషించి సంజ్ఞాధికారమున నీయవతారికపద్యములు గల 'జ' యను ప్రతియందును 'చ' యను మఱియొక ప్రతి యందును నీక్రిందిరెండుపద్యములు గలవు.

కం. చను మగణము శ్రీనాథా
యనిన, ముకుందాయనంగ యగణము, రగణం
బననొప్పు మాధవా, యన
జను నో వరదాయనంగ సగణం, బగుచున్.

కం. తగణము శ్రీకృష్ణ యనఁగ
నగు, జగణంబును మురారియనఁగా జగతిన్
భగణము శ్రీపతి యనఁగా
నగణంబగు నృహరి యనఁగ నలినదళాక్షా.

"జైనుఁడగు కవి విష్ణుప్రతిపాదకములగు పద్యముల రచించుట యసంభవమని" వ్రాసి శ్రీరామయ్యపంతులు గారు ముద్రింపక పరిహరించిరి. మురారిప్రార్థనగల యవతారికపద్యముల నేల పరిహరించలేదు? ఇది కేవల మక్రమముగదా! 3౦0 కుఁబైగా పద్యములుగల గ్రంథమునఁ గవి ఛందము, లక్షణము, నని ప్రయోగించెనేకాని లచ్చనము, అని యెచ్చటను వ్రాయలేదు. ఈయేఁడుపద్యములలో రెండుసార్లు లచ్చనమనుప్రయోగము గలదు. రాజులమెప్పునగూర్చి యీకవి గ్రంథమునం దెచ్చటను వలపెట్టలేదు. అవతారిక నాల్గవపద్యమునఁ బ్రభుప్రశంస గలదు. గ్రంథమునం దెచ్చటను లేని, లక్షణమునలేని చ ఛ లకు ప్రాస, యవతారిక 5- 6- పద్యములయందుఁ గలదు.

అవతారిక ప్రథమపద్య మనంతునిఛందస్సులోనిది. అంత్యచరణమునందుఁ గొంచెము మార్పుగలదు. కవిజనాశ్రయము శైలికిని నవతారికపద్యములశైలికిని భేదమున్నది. గ్రంథమునందలిపద్యములలోఁ గొన్నిట రేచనను సంబోధించియుఁ గొన్నిట రేచనను బొగడియుఁ గొన్నిట నాశ్వాసాంతగద్యముల రేచఁడే రచియించినట్టులును, రేచనతననే తాను పొగడుకొనినట్టులు నుండుటయుఁ, బ్రతీతి భీమకవికృతమని యుండుటచే ననంతుని కీవలిబుద్ధిమంతుఁ డెవఁడో, విశిష్టాద్వైతి, రాజాశ్రయుఁడు, గవి (నీమీద- నీవుసంతోషింపగ-నీపేర- నిను నీవుపొగడుకొనునట్లు (వ్రాసెదనను నర్థముగల) యేడు పద్యములఁ జేర్చియుండవచ్చునని తోఁచెడిని. కాన 'జ'యనుప్రతిలోని మిగతపద్యము లెట్లో యిదియును నట్లే ప్రక్షిప్తములు. వీని నాధారము చేసికొని వాదించుట సమంజసము గాదు. వేములవాడనున్న భీమేశ్వరుఁడే వరప్రదాతయను శ్రీరామయ్యపంతులవారివాదమున కింక నాధారములేదు. విశేషించి మాతృకలోనున్న "వేమున వాడ" యనుదానిని వేములవాడ క్రింద దిద్ది యచ్చు వేయించిరి. రెడ్డిరాజులు తమ పేరను వేమనయను వీరశైవ మతాచార్యుని నామమునుబట్టి ధరించి యుండురని ప్రభాకరశాస్త్రిగారు శృంగార శ్రీనాథమున వ్రాయించిరి. కాటయ వేమన యను పేరుదాహరణముగ గైకొనదగు. ఈ వేమాభిధానులగు రెడ్లీ యాంధ్రదేశమును బాలించినట్లు చరిత్రప్రసిద్ధము. వేమున నాఁడను నర్థమున నీవేమనవాడ యుపయోగింపఁ బడెనా యేమి? పరిశోధకు లీవిషయమును నిర్ణయించెదరు గాక! హిందువుఁ డగు భీమన మతాంతరుని కేల కృతి యీయ వలసివచ్చె ననుసందియ మొకటి బాధింపవచ్చును. ప్రా

ర్వము గోదావరిమండలమున జైనమతము వ్యాపించి యుండెనని శ్రీరామయ్యపంతులుగారే యంగీకరించిరి. కాని తాము భీమకవికి నిర్ణయించినకాలమున లేదని శాఖాచంక్రమణము గావించిరి. మత మప్పటికి లేనేలేదనియా లేక ప్రబలము గాలేదనియా? తొమ్మిదవ శతాబ్దము నుండి బౌద్ధజైనమతిమ్ముల ప్రాబల్యము మనప్రాంతములఁ దగ్గెనని తోఁచెడిని. మఱియు బౌద్ధమతము నశించెనుగాని జైనమత మెన్నఁటికిని నంతరించలేదు. కాన జైన మతస్థులు 12,13 శతాబ్దముల లేరనుట యసందర్భము. గోదావరిజిల్లాలో నిప్పటికి నచ్చటచ్చట జైనవిగ్రహములుగలవు. వేములవాడయందును దానికి రెండుమైళ్లదూరమున నున్న యార్యవటము, కరప గ్రామములలో నిప్పటికిని జైన విగ్రహములు విశేషముగ దొరకుచున్నవి. ఆర్యవటమున దొరకిన గొప్పజైనవిగ్రహమొకటి యిప్పుడు కాకినాడ పట్టణమునందలి పైడా వెంకటచలపతి టవున్‌హాలునందుగలదు. పిఠాపురమున గొన్ని వీథులమొగను గలవు. ఈ విగ్రహముల నచ్చటివారు "సన్యాసిరాళ్ల"ని పిలచెదరు. పిఠాపురమునందలి యొకవీథి కిప్పటికిని సన్న్యాసిరాళ్ల వీథి యను పేరు గలదు. గుజరాతీవీథి యనునదొకటి గలదు. ఎవరైన నెత్తుగనున్నచో పిఠాపురపు జైనదేవుఁడు వలె నున్నావనుసామెత యీప్రాంతములఁ గలదు. భీమకవి వితంతుపుత్రు డనియు నితనినివర్ణస్థులువెలివేసినారనియుఁ గలప్రతీతి నందఱు నంగీకరించినదే! ఈతని యమానుష చర్యలవలన నావెలిపోయినదనుకథ యతిశయోక్తి గావచ్చును. ఎంతపండితుఁడైనను గవిశిఖామణియైనను వెలికారణమున నీతని సవర్ణస్థులు స్వమతస్థులు గౌరవింపని కారణమున వితంతుపుత్రుని కృతికి (విఘవముండకొడుకు కవిత్వమునకు) భర్తగా నుండుటకు ప్రభువు లంగీకరింపనందున నితనికి వేఱుగతి లేక మతాంతరుఁడు, గసికుఁడు, ధనికుఁడు నగు కోమటిరేచనకుఁ దీనిని గృతినిచ్చినటులు తోఁచెడిని. మఱియుఁ బూర్వపుగవులలోఁ గొందఱు మతాంతరులగు మహమ్మదీయులకుఁ గృతుల నీయ లేదా?

ఇఁక గ్రంథమునకుఁ గ్రంథకర్తకు సంబంధము లేదనియు ననన్వయము లనియు శ్రీరామయ్యపంతులుగారు విడిచిపెట్టిన పద్యములరెండింటి నించుక విచారింతము. గ్రంథస్థపద్యముల నన్వయించుటలో సౌఖ్యమైనంత వఱకు సమర్థించ నెంచవలెనేకాని త్రోసివేయుటకే యత్నించుట సమంజసముగాదు. మొదటిపద్యమునందలి భీమనాగ్రసుతుఁడన భీమేశ్వరపుత్రుఁడైన భీమనయేయని యు, భీమనకుమారుఁడుకాఁడనియు శ్రీవీరేశలింగముపంతుల వారు యుక్తియుక్తముగఁ దమకవులచరిత్రలో వ్రాయించిరి. రెండవపద్యమునందలి ప్రాణసమానమిత్రుఁడనఁ బైపద్యమునందలి భీమనయే. దీనియందలి వాచకాభరణుఁడను కర్తృవాచకమునకుఁ గ్రియ తరువాతిపద్యమున "ఘంపము దెలుఁగుఁబాస నరుదుగఁ జెప్పెన్" యను దానియందున్నది. ఈరెండుపద్యములవలన రేచన భీమనసహాయమునఁ గవిజనాశ్రయమును గచించినటులు దెలుపుచున్నది. దీనియందు వింత యేమున్నది? అనన్వయమేమున్నది? సహాధ్యాయుఁడైన నారాయణభట్టు సహాయమున నన్నయ భారతమును రచింపలేదా? ఇచ్చట మాత్రము కవిజనాశ్రయకర్తనుగూర్చి జనప్రతీతిసేఱు. శ్రీరామయ్య పంతులవారి యాశయమున నీపద్యముల యర్థము బాధకము. ఇవి రెండు నవతారికలోని యేడు పద్యములవలెఁ బ్రక్షిప్తము లేమో! కవిజనాశ్రయము (ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకాశితము) [25-వ పేజీ]

క. జనసుత భీమతనూజా!
సునయార్చిత విభవ తేజ సుభగమనోజా!
వినుతవిశిష్టసమాజా!
యన నంత్యప్రాస మగు నపార్వతి తేజా!"

యనుపద్యమున భీమతనూజా యనుదానికి శ్రీరామయ్య పంతులుగా రేమియర్థముఁ జెప్పెదరో? భీమనాగ్రసుతుఁడు, భీమతనూజుఁడు అనువార లొకరుకారా? దీనినిగూడ ననన్వయమని యేల తీసివేయలేదు? ఇది యంత్యప్రాసంబునకు లక్ష్యమైనదా? నన్నయ యాంధ్రశబ్దచింతామణిని భీమన నడంచె ననుసందర్భమున నప్పకవి యీక్రిందిపద్యమును వ్రాసెను.

క. ఆదిని భీమకవీంద్రుఁడు
గోదావరిలోనఁ గలిపెఁ గుత్సితమున నా
మోఁదట రాజనరేంద్ర
త్మ్రాదయితునిపట్టి దాని మహి వెలయించెన్.

భీమన నన్నయసమకాలికుఁడు గాఁడు గాన నిది యసంభవ మని శ్రీవీరేశలింగంపంతులుగారు నిర్ణయించిరి.

ఆంధ్రశబ్దచింతామణిని నన్నయ గలియుగాదిని వ్రాసినట్లు చెప్పిన యప్పకవివ్రాత సత్యేతరమని శ్రీరామయ్య పంతులుగారనిరి. దీని నప్పకవి కల్పించి నాఁడ నినను, గ్రంథము గోదావరియందుఁ గలిపెననుట వలన నప్పకవి మానసికస్థితినిబట్టిచూడ నీభీమకవి గోదావరితీరస్థుడని యూహింపనొప్పును. గోదావరిమండలమున వేములవాడయను గ్రామము గలదు. దీనినామమం దెట్టి మార్పు లేదు. ఇది దాక్షారామమునకుఁ బదిమైళ్లదూరమున నున్నది. భీమకవిజన్మస్థాన మిదియేయని యిచ్చటి పెద్దలు చెప్పుదురు. భీమకవిసంఘమను నొకపఠనమందిర మాగ్రామమునఁ గలదు. మార్పుచెందని గ్రామనామము చేతనేమి, దాక్షారామమునకు సమీపముననుండుటచేత నేమి, జనప్రతీతిచేతనేమి, శ్రీనాథగ్రంథస్థాధారముల చేతనేమి, శ్రీ వీరేశలింగముపంతులుగారు శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారు నిర్ణయించినటుల గోదావరిజిల్లాలోని వేములవాడయే భీమకవిజన్మస్థానమనియు దాక్షారామభీమేశ్వరుఁడే వరప్రదాతయనియుఁ దేలుచున్నది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి యనుమానమే లెస్స యయినది.




## వ్యాసాగస్త్యమార్గములు




౧౮ వ పుట చూచునది




ధనికులార! నిర్భాగ్య సత్కవుల మేము, వచ్చితిమి బిచ్చ మడుగ మీద్వారములకు!
ఇచ్చి సెలవీయుఁడయ్య! లేదేని త్రిభువనావనుండైన జగదీశుఁ డాగ్రహించు!

సీ. వలదు మాకుఁ గుటుంబ పరిపోషణార్థ మక్షయములౌ ధనధాన్య సంచయములు!
వలదు మా కిచ్ఛానివాసంబునకు దివ్య, మణిమయాభోగ రాణ్మందిరములు!
వలదు మాకు శరీరపరిరక్షణము నిమిత్తం బమూల్యములు రత్నాంబరములు!
వలదు మాకు వినూత్నకళల నాపాదింపఁ, బాలుపారు సౌవర్ణభూషణములు!
గీ. వలదు మాకిట్టి ధుర్భిక్ష వలదు వలదు!, తగవు మాకివి! పడవు మాతత్త్వములకు!
కవుల మేము దారిద్ర్యలోకంబునందు, సౌఖ్యమును పొందెడు విచిత్రజాతి మాది!!

గీ. సదమలానంద నవసుధాసారనిధుల, గర్భములఁ దాల్చు నీలమేఘముల మేము!
తమకృపాదృష్టి యనుగాలి తాకినంతఁ, గురియుదుము ధాత్రిపై సుధాకుంభవృష్టి!

వె. ఆత్మసుఖముఁగోరి యర్థింప మేవేళ, లోకసుఖమె సుకవిలోకసుఖము!
మాకుఁజేయు మేలు లోకం బనుభవించు, వలయు బిచ్చ మిచ్చి పంపరయ్య!

సీ. సుకవీంద్ర సహవాస సుఖముఁబొందని వాని, ధన మేల, వాని యార్జన మదేల?
కవిరాజసన్మానగణుతిఁగాంచనివాని, ధన మేల, వానియార్జన మదేల?
కవిచంద్ర చంద్రికా కలనమబ్బనివాని, ధన మేల, వానియార్జనమదేల?
కవిరక్షణోద్యోగకాంక్ష గల్గనివాని, ధనమేల, వానియార్జన మదేల?
గీ. ఆదరామృతపాన భిక్షార్థులగుచు, పంచఁజేరి సత్కవులు ప్రార్థించుచుండ
కంటఁజూడని పాపిష్ఠ ఘాతుకాత్మ, ధనమదేల, యార్జనమేల, తను వదేల?

గీ. సత్కవుల దుఃఖపెట్టంగఁ జనదు మీకు, వారి వేఁడి నిట్టూరుపుల్ భవదనంత
వంశనాశంకరోద్ధూత ప్రళయదహన, దారుణజ్వాల లగుఁజుఁడీ ధనికులార!



# సొహ్రాబు రుస్తుములు

దేవులపల్లి అప్పల నరసింహం గారు, యం. ఏ., యల్. టి. 

పలు దేశముల నడతలను, భావరీతులను ఆంధ్రలోకమునకు తెలియజేయుట కిట్టి నాటకము లవసరము. పారసీకులు, తురకలు గూడా మానవకుటుంబములో నెన్నికగాంచి వీర్యౌదార్యగుణములతో నొప్పారుచున్నారు. వారిదేశపు మహాశయుల చరిత్రములను, వారినిగురించినకథలను యింకను చదువవలయునని యీనాటకము చదువువారికి కుతూహలము కలుగును. మహమ్మదు, ఆలీ, సాదియనుకవి, బాగ్దాదునగరచక్రవర్తులు(కాలీఫులు) మొదలగు కీర్తివంతులను గురించి నాటకముల మూలముగా నాంధ్రజనులు తెలుసుకొనుటకు ఈయభినవాంధ్రగ్రంథమాల తోడ్పడునని యాశించుచున్నాను.

తండ్రికొడుకులకలహములు సామాన్యజనమందనేకములు గననగును. కొన్నిరచ్చలకు ప్రాకి న్యాయస్థానములయందు ప్రచురణము నొందుటయును గలదు. వీనియందు ఉన్నత భావములు అరుదు. దుర్యోధనుడు దాయాదులతోడనే కాక తండ్రితోగూడ కలహించుచునేయుండెను. కాని అతని అధర్మవర్తనను అంగీకరించి ధృతరాష్ట్రుడు లొంగిపోయినందున యిది భారతము చదువువారలకు స్ఫుటముగా దోపదు.

ఈనాటకమునందలి వస్తువు తండ్రికుమారుల పరస్పరయుద్ధమును, తండ్రిచే కుమారుడు మల్లయుద్ధమున చంపబడుటయు నైయున్నది. ఒకరినొకరు తెలుసుకొనకుండా చేసిన దైవవిధికి సొహ్రాబుయొక్క దుర్మార్గులగు అనుచరులు సహాయము చేసిరి. తండ్రిని కలుసుకొనుటకు అత్యంతకుతూహలముతో యుద్ధమునెపమున పరిషియాకు వచ్చిన సొహ్రాబుకు తండ్రిచేతులలోనే మరణము సంప్రాప్తించెను. తండ్రికుమారు లిద్దరును ఉత్తమాశయప్రేరితులయ్యు, ప్రేమపూరితమనస్కులయ్యు, మల్లయుద్ధమున డీకొనుట యీప్రపంచమును అగోచరరీతుల పరిపాలించుచు చిక్కుపరచువిధియొక్క విషమహాస్యమునకు (Irony of fate) ఉదాహరణము. "జగదీశ్వరుడు తనసృష్టికి మకుటమై బుద్ధికౌశల్యముచే దేవతల సామ్యము నొందజూచు మానవులను వెక్కిరించుచున్నాడా?" యనిపించును. ఈకథను వొల్లాపంతుల జగన్నాథముగారు చిన్నకావ్యముగా తెనిగించియున్నారు. వంగభాషలోని నాటకము ననుసరించి శ్రీపాద కామేశ్వరరావుగారు తెలుగునాటకముగా మనకు అందజేసినారు. కావ్యముకన్న యీనాటకము ప్రౌఢముగా నున్నది.

తనతండ్రియగు షాజహానుని జెయిలులో నుంచిన ఔరంగజీబును యొకతురుష్కుడే. తండ్రియని తెలియకపోయినను లోపలనుండి పొంగిపొరలివచ్చు ప్రేమచే మల్లయుద్ధమున క్రిందపడిన రుస్తుమును పొడువజాలక విడిచి క్షమాపణ గోరుకొన్న సొహ్రాబునూ ఒకతురుష్కుడే. చదువరు లిట్టి వ్యక్తివ్యత్యాసములను గనిపెట్టుదురు. అందువల్ల మనోభావములు పరిశుద్ధినొందును. ఎదిరివీరుడు రుస్తుమేయని సొహ్రాబుకు తెలియకుండ నుంచుటయందు ఆతనితల్లి, తండ్రియగు రుస్తుము, మొదలుగాగల వ్యక్తులందరకు గల ప్రత్యేకరహస్యకారణములు బహునేర్పుతో నిరూపించబడియున్నవి.

ఇది విషాదాంతనాటకము. దీనియందలి నాయకుడగు రుస్తుమునందు ధీరోదాత్తగుణములుకొన్ని గలవు. తనను తానుపొగడుకొనుట, బీరములు పలుకుటయును ధీరోద్ధతగుణములు; మృగయాసక్తియు, కడపటిమల్లయుద్ధమునందలి అన్యాయప్రవర్తనమును కళంకములు. దారపుత్రాదులను మరచియుండుట ఆతని వీరశపథమువల్ల కలిగినది. ఇది కేవలము కళంకమనజనదు. అన్యపాత్రల నోళ్లనుండి వీరిపరాక్రమము, కార్యమునం దేకాగ్రత బాగుగా తెలియుచున్నవి. పుత్రుడు లేడను చింతవల్ల చిన్నవయసుగల ఎదిరివీరుడగు సొహ్రాబునందీతనికి గలిగిన మృదుభావము, కించిద్యుద్ధవిముఖత్వము గమనింపదగును. ఈనాటకకర్త యిప్పట్టున భావములను మానవప్రకృతి కనుగుణముగ నేర్పుతో ప్రదర్శించియున్నారు.

తుద కెట్టులైన కీర్తికాంక్ష వాని ధర్మబుద్ధిని గూడా పోద్రోలగలిగెను. ఇట్టి పొరపాటులే మనకుగలుగు నుపద్రవములకు కారణములు. మనగతులు మనచేతల నాధారము చేసికొనియే సంభవించుచుండును. "మనుజుడు తనగతికి తానే కారకుడు" అని షేక్స్పియరు యొక్క విషాద నాటకములు బోధించును. ఈవిషాదనాటకముగూడా అట్టి బోధన ప్రబలముగా జేయుచున్నది. సొహ్రాబు గుణములన్నియు ఆదర్శప్రాయములే; పరికిని నురువరానివి. వీరుడుగానైనను, పుత్రుడుగానైనను, రమణుడుగానైనను మిక్కిలి మనోరంజకుడై యొప్పారుచున్నాడు.

ఈనాటకమున తార్తారురాజునొద్ద విదూషకుడొకకొంత వినోదము గలిగించును. భావములు తీవ్రరూపమునుదాల్చు కడపటిరంగములలో నిట్టివినోదములు రాకూడదు. ఈకవి యట్టిపొరపాటును జేయలేదు. రుస్తుము తనదగ్గరకు వచ్చుచున్నప్పుడు తార్తారు రాజుగారి చర్యయున్నూ హాస్యకరముగానే యున్నది. ఈరాజున్నూ పరిషియా రాజున్నూ గూడా "యీ రా జు లు రా జు లే పె ను త రా జు లు గా క ధ రా త లం బు న న్" అను అడిదము సూరకవిగారి చాటూక్తిని జ్ఞాపకము తెచ్చుచున్నారు. పరిషియారాజు తన పిరికితనమునకు భోగలోలత్వము, దుష్పరిపాలన, కృతఘ్నత, శాఠ్యమునుగూడా జతగూర్చుచున్నాడు. తార్తారురాజు యింతకన్న చాలా మేలు. రుస్తుమువద్ద జడిసినను వీరగుణము

బాగుగా గలిగియున్నాడు. కొంచెము బుద్ధిమాంద్యమున్నను, ప్రేమయనుసుగుణము దానిని కప్పివేయుచున్నది.

తామీనా సొహ్రాబునితల్లి; ఉత్తమగుణముల కాకరమగు పరమసాధ్వి. పుత్రుడు గాదు; పుత్రిక గలిగినదని తనభర్తకు అసత్య వార్తపంపినతప్పు యీమెయొక్క హృదయ మార్దవమును, మాతృప్రేమను తెలియజేయు చున్నది. "కుమారుడు కలిగినయెడల వీరుడగు తనమగడు వానిని-తనవద్దకు తీసుకునిపోవును. పతిసుత విహీననై నే నెట్లుజీవింతును" యని యామె వెరచి యిట్లుబొంకుటా ప్రకృతి క్లనుపుగనేయున్నది. ఈమెయొక్క అవ్యాజప్రేమయందు, అశంకితముగ తనయాత్మగోరిన నాథుని సమీపించి స్వయముగా వరించుటయందు, షేక్స్పియర్ నాటకములోని "మిరాండా" యనుకన్య జ్ఞాపకమువచ్చును. ఈమె సాధుత్వము, నిశ్చలప్రేమ, యీమె శాంతమున్నూ యీమెకును యీమె తనయునకును జరిగిన సంభాషణలో వ్యక్తమగుచున్నవి.

ఉన్నతప్రేమకును, వీరరసమునకున్నూ లంపటము గలుగుచుండును. పురుషులలో రుస్తుమునందేలంపటము వ్యక్తమగును. తుదకు వీరరసము ప్రేమను అణచివేసెను. స్త్రీలలో 'అఫ్రిద్' అనువీరబాలికయందు యట్టిభావసంకలనము యీనాటకమునందు కనుపర్చబడియున్నది. ఈమెచర్య పరిపిమహావీరుల కాశ్చర్యము గలిగించెను. చదువరులకును ఆశ్చర్యము గలిగించును. పరిపియనురాణి తన మగనికి శౌర్యము పుట్టించు మాటలను ఆడుచుండినను యింతస్పష్టమైనవ్యక్తి గాదు. ఒక రంగమంతయు యీ అఫ్రిద్ అరణ్యమునందు తనతండ్రిపోయిన విచారమువలన దాగి యున్నపుడు తనయాత్మశోధ చేసుకొనుటకు వినియోగింపబడియున్నది. "ప్రేమయా, పగయా ముఖ్యము?" అని సంకులమనస్సుతో చర్చించుకొని పగ మొదట తరువాత ప్రేమ యని నిశ్చయించుకొని తన యాత్మవరించిన సొహ్రాబును జంపించుటకు యీమె యత్నములు చేయును. మూడవఅంకమున ఎనిమిదవ రంగమున "యీమెరక్కసియా?" యనిపించు నంతలో తన యపూర్వప్రేమను ప్రకటించి తనమనోనాథునితో విచిత్రసహగమనముజేసి చదువరుల మనముల నొకింత స్తంభింపజేసి చూరగొనును. ఇట్టిపాత్రలుగల నాటకములు "సాద్భుతములు" అనదగును. యిదియొక సాద్భుత విషాదనాటకము (Ramantic Tragedy). అయినను దీనియందు ప్రకృతివిరుద్ధము లేవియును లేవని చెప్పవచ్చును.

కొన్ని నాటకములలో నాయకుడు తొలుత చిన్నపిల్లవాడై తరువాత మహావీరుడై విజృంభించుట అచ్చటచ్చట గనుచుందుము. కాళిదాసనాటకములలోగాని భవభూతి నాటకములలోగాని యిట్టిది కానము గాని భాసుని "బాలచరిత"మునం దిట్టిది గలదు. ఆంధ్రనాటకములలో "చంద్రకాంత" నాటకమందుగూడాగలదు. షేక్స్పియర్ కవియొక్క "వింటర్స్ టేల్" (Winter's Tale) అనునాటకమందుగలదు. అందుచేత ఆనాటకములో

నాయికకు పదునారేండ్లు ప్రాయము వచ్చు వరకుగల మధ్యకాలమును మనస్సులయందు ఊహించుకొనవలసినదని చూపరులకు బోధించుటకు "టైమ్" అనునొకపాత్ర రంగమందు మూడవయంకము తరువాత ప్రవేశించి మాటలాడును. అట్లే యీనాటకమందు మహాకాలప్రవేశము ఏర్పరుచబడినది. "కాలుఁడు" అన యముని కర్థమగుసుగనుక, టైమ్ (Time)అను ఇంగ్లీషుమాటకు "మహాకాలుఁడు" అని కామేశ్వరరావుగారు ప్రయోగించియుందురు. సొహ్రాబుపుట్టుటకుముందు వాని తల్లిదండ్రులస్వయంవర రంగములనున్నూ, సొహ్రాబు గిట్టుటకుసంబంధించిన రంగములనున్నూ మాత్రమే యీ నాటకమందు ప్రదర్శించుట వింతగొల్పును. మధ్య గడచిన యిరువదేండ్ల కాలమునున్నూ మహాకాలుఁడు చదువరులకు స్మృతిమాత్రముగ తెలియ జేయుచున్నాఁడు. ఇట్టికథావిస్తర ప్రదర్శనము కావ్యములందును, నవలలయందును నిరాక్షేపణీయము; గాని నాటక రచనయందలి పటిమను పోగొట్టును. ఇట్టి మధ్యవివరణ లవసరములేకుండ, రంగముల లోనిసంభాషణలవల్లనే జరిగినసంగతులు,జరుగబోవు సంగతులు, పాత్రలనడవడులు మొదలగునవన్నియు చూపరులకు గ్రాహ్యాను గావలయును. అట్లైన రచన జిగి గలిగియుండును. చూపరులకు, చదువరులకు కథను, వ్యక్తులను నచ్చజేయును.

పద్యములు, గీతములు లేనిలోప మొకింత చదువరులకు యీనాటకమున తట్టును, ప్రదర్శనమందుగూడా యీలోపము గనుపడునను కొందును. రుస్తుముప్రకృతిని వర్ణించు సందర్భమునను, అఫ్రిదు ఆత్మశోధ జేసికొను సందర్భమునను పద్యములను కొంచెముగా జేర్చవచ్చును. విషాదనాటకమునకు పాటలక్కర లేదు. అయినను అఫ్రిద్ యొక్క గాథానురాగమునున్నూ, కొడుకును జంపుకొన్న రుస్తుముయొక్క భావస్తంభనమునున్నూ, పాటలకు గాని పద్యములకుగాని పోటీయవు. వచనమే తగియున్నది. నాటకమునందలి చివరిరంగము మాత్రము అంతస్పష్టముగా లేదు. దానిలో చివరమాటలాడు వ్యక్తిగాని ఆయనమాటలు గాని నాకు బోధపడలేదు. సంస్కృతసమ్మిశ్రము రుస్తుము, సొహ్రాబులయొక్క వాక్యములయందు యుక్తమే. కాని స్త్రీలసంభాషణములయందంత హృద్యముగా గనుపడలేదు. అయినను ఉద్రేకభావపూరితయగు అఫ్రిద్ భాషణములలో నిట్టి సంస్కృతసమ్మిశ్రము తగదనియనుటకు మనసొప్పకున్నది. జాలిగొల్పు పట్లయందీసంస్కృతసమ్మిశ్రము అంతగాగనుపడలేదు. ఈ విషయమున "చంద్రగుప్త" కన్న యీ నాటకములోని శైలి సరళముగా నున్నది.

మొత్తముమీద యీ"సొహ్రాబువిషాద నాటకము" కథావస్తువునందును, భావనిరూపణమందును మనస్సు కుత్తేజము గలిగింప జాలియున్నది. దీనిని ఆంధ్రలోకము పుస్తకరూపమునను, విద్యాశాలలయందును, రంగప్రదర్శనములయందును మిక్కిలి ఆదరింతురు గాక!



# గుహుని స్వాగతము

చింతలపూడి శేషగిరిరావు గారు

తొలిజన్మంబునఁ జేసినట్టి సుకృతస్తోమంబునం జేసి యో
నలినాక్షా ! నినుఁ గాంచఁ గల్గితిని నానందాబ్ధిలో మున్గితిన్
గులమెల్లన్ దరియించె సార్థకత నక్షుల్ గాంచఁగా నొప్పె నీ
యెడ ధన్యుఁడనగ నేనెకద స్వామీ రామచంద్రప్రభూ !

ఒప్పులకుప్ప ! నిన్ను నయనోత్సవ మొప్పఁగఁ గాంచు టెప్పుడో
యెప్పుడటంచు నాదుమది నెంతయు నువ్విళులూరుచుండ నా
యప్పరో ! యస్మదీయ సముదంచిత భాగ్యముకల్మి దర్శనం
బిప్పటికబ్బె జన్మము తరించె ఫలించెను నోములన్నియున్.

మ. అరిషడ్వర్గ మొగిన్ జయించి యితరవ్యామోహముల్ ద్రుంచి సు
స్థిరనిష్ఠన్ దలక్రిందుగాఁ దపము భక్తిన్ జేయు యోగీంద్రు లాం
తరదృష్టిన్ భవదీయదర్శనముఁ బొందన్ లేక కుందంగ; నీ
కరుణన్ నన్నిటు ధన్యుఁ జేసితిగదే, కాకుత్స్థవంశాగ్రణీ !

ఉ. ఇయ్యదె మాదుపల్లె యివియే తిలకింపుము వన్యభూము లో
యయ్యరో ! వీరలెల్ల భవదాజ్ఞ మెలంగుదు రింకమీఁద నీ
వియ్యెడనుండి మమ్ము మదికింపగు రీతిఁ బ్రోవుమయ్య ! రా
మయ్య ! నిషాదుఁ డీతఁడని యాత్మఁ దలంపకె సంశయింపకే.

ఉ. ఎవ్వఁడొ కారణంబు వచియింపుము నిన్నిటు నిర్దయాత్ముఁడై
యివ్వనభూమికిన్ బనుప ? నిప్పుడె తీవ్రశరానలంబున

క్రొవ్వడఁగింతు వాని నిఁకఁ గొండలమందరు డెందమందు నీ
కివ్వనవాస చేటికి? నహీనబలుండను నేనుఁ గల్గఁగన్.

మ. ఇవిగో పా; లివె పిండివంట; లివిగో; యిందుండె భోజ్యంబులున్;
జవిమైనట్టి ఫలాదులున్ గను మివే; శాల్యోదనం బియ్యదే;
యివె చోష్యంబులు లేహ్యముల్; గలవివే; యీచాయఁ బానీయముల్;
రవివంశోద్భవ, యారగింపఁగదవే రామా, దయాంభోనిధీ !

ఉ. ఆఁపుము తేరు రామ ! యిట నందఱునుం డిగిరంపు; వైళ మేఁ
బాపెద మీపథశ్రమముఁ బాదము లొత్తియు స్వేద మార్చియున్;
మేపెద నశ్వరాజముల మిక్కిలి డస్సినభంగిఁ దోఁచె; మీ
రాపయి నేగవచ్చును దయామతిఁ గైకొనుఁ డాతిథేయమున్.

చ. అరిగెడిభూమి యుగ్రభయదాటవి, క్రూరమృగాకులంబు; మీ
రెఱుఁగరు దారి డొంక; నట నెందఱొ దుష్టనిశాచరాధముల్
దిరుగుచునుండ్రుఁ గావున సుధీర ! యధిజ్యశరాసనుండవై
కర మనురక్తి వీరిఁ గను కంటికి ఱెప్పవిధాన లక్ష్మణా !

మ. అలరారన్ నెలతాలతిన్నియల దివ్యంబైన గేయొండ నే
జలజాతాక్షులఁ గూడి యాడుటకునై సంకోచముం బొందదు సీ
లలనారత్న మరణ్యభూములకు నిర్లక్ష్యంబుగా నేఁగెడున్
గలదే యిట్టిమహాపతివ్రతయు ? లోకంబందు నెప్పట్టునన్.

ఉ. ఎట్టులనైన గంగఁ దరియింపఁగఁ జేసెదఁ గాని రామ ! యే
పట్టునఁ దావకీనమృదుపాదము సోఁకినఁ జట్టురాయియే
యట్టుల స్త్రీత్వముంగని యహల్యగ మారియు నిల్వఁగల్గె; న
పుట్టియు నట్టులైన నిఁకఁ బుట్టి మునుంగదె నాకు ? రాఘవా !





౮. శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయమునందలి ధ్వజస్తంభము_తిరుమల

ధమునుగూడ మనము తెలిసికొని సమన్వయింపఁగలుగుదుము. పాశ్చాత్యవిమర్శకాగ్రేసరు లనేకులు షేక్స్పియర్ మహాకవి నాటకచక్రము నట్టిపరిశోధనకు లోను జేయుటచేతనే యాతని నాటకకళాభివృద్ధియందలి యంతరావస్థలను, తత్కళాపరిణామమునకు నాతని జీవితమునకుఁ గలసంబంధము నీమొదలగు ననేకాపూర్వాంశములను గనిపెట్టియున్నారు.

ఇట్టి విమర్శాపూర్వకమగు గ్రంథాధ్యయనము మనదేశమునఁ గొంతవఱకుఁ దక్కువనియే చెప్పవలసియున్నది అనఁగాఁ గవితావిమర్శనమే యీదేశమున లేదని చెప్పుట కాదు. కాని యొకగ్రంథముఁ జదువునప్పు డందలివిషయము లాలంకారిక నియమముల ననుసరించి యున్నవా! కవిగ్రంథాదినియమములను పాటించేవా! సూచ్యార్థసూచనగలదా! పాకశయ్యాలంకార కల్పనా చమత్కృతు లేమైనఁ గవి జూపినాఁడా? వ్యాకరణదోషము లేమైన నున్నవా? రసపోషణము సమంజసమా? అను నీమొదలగు విషయములఁ జర్చించి యాగ్రంథమున కింతవఱకుఁ బ్రాచీనకవితాలక్షణములు పట్టుచున్నవని మాత్రము చూపుట కలదు. గ్రంథములను విమర్శించుటలో నిదియు నొకవిధముమాత్రమే యైయున్నది. దీనివలన గ్రంథపఠనవిషయమున వీరిదృష్టిలో కేవల గ్రంథమునకుఁ గలప్రాముఖ్యము గ్రంథకర్తవిషయమునకేమాత్ర మున్నట్లు గనుపడదు. కవి యెవఁడైన నేమి; యేకాలమువాఁడైన నేమి; యాతనిబుద్ధివైభవ మెట్టిదైన నేమి; యెట్టిపరిణామములఁ బొందిన నేమి, యాతనిజీవితచరిత మెట్టిదైన నేమి! వానితోఁ జదువరుల కేమియు నగత్యము లేదు. ఆతనిగ్రంథమునందలి భావ, కల్పన, రసము మొదలగునవియే వీరికిఁ గావలసినది. ఇవి పూర్వలాక్షణిక మతానుసారముగ నుండెనా కవి గొప్పవాఁడే; కావ్య ముత్కృష్టమైనదే. లేక, యొకఁ డెట్టిస్వల్పవిషయమునైనను బ్రాంతపుంతను వదలి క్రొత్తమార్గమును ద్రొక్కిన నాతనికి లక్షణము తెలియదు. ఆతఁడు లాక్షణికకవులలోఁ జేర్పఁదగఁడు. గ్రంథ ముత్కృష్టమైనదేయైనను లక్షణకవులచే నది పరిగ్రాహ్యము కాదు. పోతనామాత్యుని భాగవతమువంటిగ్రంథ మెంత రసవంతమైనదైనను రేఫశకటరేఫముల ప్రాసమైత్రితోఁ గూడినకతంబుననే దా లాక్షణికుల యుపహసింపులకుఁ బాత్రము గావలసివచ్చినది.

"బమ్మెరపోతరాజకృత భాగవతంబు
సలక్షణంబుగా,
కిమ్మహి నేమిటం గొదువయెంతయు
నారసి చూడగాను రే
ఫమ్ములు ఱాలునుం గదిసి ప్రాసము
లైన కతంబునం గదా
యిమ్ముల నాదిలాక్షణికులెల్లరు
మాని రుదాహరింపఁగన్."

అని చెప్పుచు నప్పకవియుఁ బూర్వులమార్గమునే యనుసరించెను. కావునఁ గవికి, వానికవితకు నిట్టిలక్షణగ్రంథములు విమర్శనలును ప్రోత్సాహకములగుటకు బదులుగా నొకవిధమగు శృంఖలములగుచు తటస్థించినది. వీని నతిక్రమించి తన స్వాతంత్ర్యమును నెలయించి యొకఁడు వ్రాసెనా యాతఁడు కావ్యరసాస్వాదనిపుణులగు సహృదయుల మెప్పు వడయఁగలిగినను లాక్షణికులవలన బహిష్కారమునే పొందుచున్నాఁడు. ఇట్లు మహాకవుల కావ్యములను బరిశీలించి విమర్శించుటవలననే బయలుదేఱిన లక్షణముఁ గొంతకాలమునకుఁ దనపుట్టుక పూర్వోత్తరములను మఱచిపోయి యాకవితనే శాసించి బంధింపఁగడంగుచున్నది

విమర్శనయనునది తజ్జ్ఞులనుది కెక్కినకవితయందలి విశేషలక్షణములఁ బరిశీలించి, వానికిఁ గలకారణముల నారసి యాయాదేశకాలపరిస్థితులకును దత్కవితారీతికిని గలసంబంధమును దెలిపి, యాకవీశ్వరునికవితాశక్తి యిట్టిదనియు, నాకావ్యమందలి యుత్తమగుణము లివ్వియనియుఁ సానుభూతితో నిరూపించుటయును, కొన్ని నిర్దిష్టలక్షణములను, ప్రాక్పరికల్పితపద్ధతులను అనుసరించి యున్నదా లేదా యనియుఁ, దక్కిన కావ్యములకంటె నిది గొప్పదియా తక్కువదియా యని విచారించుటయుఁ గాదు. కవితావిమర్శనకుఁ గావ్యమందలి విశేషలక్షణముల గ్రహించుట యెంత యవసరమో యాయాలక్షణములకును దత్కవిమనస్తత్త్వమునకును గల సంబంధము నారసి సమన్వయించుటయు నంతయావశ్యకమే. కావున కవియొక్క దేశకాలపరిస్థితులు, ఆతని మత

భిప్రాయములు, ప్రతిభాశక్తులు మొదలగువాని పరిజ్ఞానము నాతనికవితాపద్ధతులను దెలిసికొనుటలో నత్యంతసహకారి యగుననుటలో సందేహములేదు. ఇంతేకాక చరిత్రము తెలియనికవుల జీవితవిషయములను, మన స్తత్వమునుగూడఁ గొంతవఱకు వారిగ్రంథములను బరిశీలించుటచేఁ దెలిసికొనుట కవకాశము కలుగుచున్నది.

ఒక కవీశ్వరుని మనస్తత్త్వమును, కావ్యకళాపరిణామమును, గనిపెట్టుట కాతనిగ్రంథముల పౌర్వాపర్యజ్ఞాన మావశ్యకము. ఇట్టి జ్ఞానముతోఁగూడిన కవితాపరిశీలనమును సానుపూర్వియగు నధ్యయన విధానము 'Chronological Method of Study of Literature' అని యందురు. ఒక కవిచే రచింపఁబడిన గ్రంథముల నొకదానితో నొకటిఁ బోల్చి చదివి విమర్శించుటచేఁ దత్కవిత్వసారము గ్రహింపఁబడు చున్నది. ఈకవిని, వీనికృతులను అంతకుఁ బూర్వులును సమకాలికులు నగు కవులతోడను వారికృతులతోడను సరిపోల్చిచూచి యాయాకవులకుఁ గృతులకుఁ గలసంబంధమును, పోలికలను, భేదములను విమర్శించుచో నట్టి దానిని దారతమ్య పరిశీలనతోఁ గూడినయధ్యయన విధానము (Comparative Method of Study of Litareture) అని యందురు. పౌర్వాపర్యవిచక్షణ లేక యేక విగ్రంథముల నైనను బ్రత్యేకముగఁ జదివినప్పుడు దానివలనఁ గలుగు నానందమునంతేను బొందఁగలిగితి మనుటకు వీలులేదు. కవియొక్క భావగాంభీర్యమును సరిగఁ గొలిచి చూచితి మనలేము. ఆతనికావ్యకళ యేయేమార్గముల వృద్ధినొందినదో, ఆతనికిఁ గాలక్రమమునఁ గలిగిన లోకానుభవ మెట్టిదో, అద్దాని నాతఁడె ట్లుపయోగపఱుచుకొనెనో, దానిమూలమున నాతనిమన స్తత్త్వమునఁ గలిగినమార్పు లెట్టివో అను విషయములను గనిపెట్టుట కవకాశ ముండదు. పారమార్థిక చింతాతత్పరులగు మన పూర్వకవులు తమయైహిక చరిత్రను దెలుపువిషయమున విశేషశ్రద్ధ వహించినవారు గాకుండుటచే వారిగ్రంథములఁ బౌర్వాపర్యముమాట యటుండ నయ్యవి యాయాకవులు రచించినవియే యని నిరూపించుటగూడనొక్కొక్కప్పుడు కష్టమగుచున్నది. కవులకాలనిర్ణయవిషయముననే యనేకములగు చిక్కులు, అభిప్రాయభేదములు గలుగుచున్న పుడు ఒకకవిని, వాని గ్రంథములను, వానికి సమకాలికులు, పూర్వులు నగుకవులతోడను,వారికృతులతోడను బోల్చి విమర్శించి యాకవియొక్క విశేషగుణములు, ప్రతిభాశక్తి యిట్టివని కనుగొనుట మఱింతకష్ట మగుచున్నది. స్థలకాలములు తెలిసిన సుప్రసిద్ధాంగ్లకవీశ్వరుఁడగు షేక్స్పియరు విషయముననే నిశ్చయముగ నాటకములగచించినవాఁడాతఁ డగునా కాదాయను సందేహమును,సమ్మూలకములగు వాదోపవాదములును బయలుదేఱియున్న పుడు స్థలకాలవిషయముననే సందేహముగల కాళిదాసాది ప్రాచీనదేశీయకవుల విషయము చెప్పెడిదేమి? అయినను షేక్స్పియర్ వలెనే జీవితచరిత మంతనిశ్చయముగాఁ దెలియని హైందవనాటకకర్తయగు కాళిదాసుని కళాప్రతిభలనుగూర్చి తెలిసికొనవలెనన్నచో నాతని గ్రంథములను బరిశీలించుటయే ముఖ్యమగుమార్గముగాఁ దలంపఁబడియున్నది.

కాళిదాసుని నాటకకళాచాతుర్యమును, దానిపరిణామమునుగూర్చి తెలుసుకొనుట కాతనినాటకములు తక్క యితరాధారము లేవియుఁ గనుపడవు. కాళిదాస విరచితములని ప్రఖ్యాతిఁజెందిన నాటకములు మూఁడు గలవు. అందు విశేషప్రసిద్ధిగాంచినది నాటకరాజంబనఁదగిన యభిజ్ఞానశాకుంతలము. ఇందలికథ మహాభారతమునఁ బ్రసిద్ధమైనకథలలో నొకటి. నీరసములగు చారిత్రికపౌరాణికకథ లనేకములు షేక్స్పియర్ మహాకవి భావనాశక్తిచే మెఱుఁగుపెట్టఁబడి యెట్లు నూతనశోభ కలవయ్యెనో యట్లే దుష్యంతుని పురాణకథయుఁ గాళిదాసునియసమానంబగు ప్రతిభావిశేషముచే నూతనజీవనమును బడసి ఖండాంతరమహాపండితులనుగూడఁ దాండవమాడించినది. కాళిదాసుని యీనాటకములఁ జదివినందువలనఁగలిగిన యానందపారవశ్యముచే జర్మనీదేశపు పండితుఁడగు 'గెటే'యనునాతఁడు దీనినిగూర్చి చెప్పినప్రశంసావాక్యములు పలువురకుఁ దెలిసినవియైనను మఱియొకమారు వాని నిచ్చట స్మరించుట యతిప్రసంగము కాదు.

" Wouldst thou, the young years blossom and the fruits of its decline. And all by which the soul is charmed, enraptured, feasted, fed, wouldst thou the earth and heaven itself in one sole name combine: I name thee, O Sakuntala! and all at once is said."

ఉపదేశైక ప్రయోజనంబగు నీవ్యాసుని పురాణకథ హిందూజనుల కత్యంత మాదరపాత్రంబగునని యెంచి

గ్రహించి రసైకప్రవాహంబులగు నాటకపరిస్థితులకనుగుణంబుగమార్పులొనర్చి కథాప్రవృత్తివిషయమునను, స్వభావపరిపోషణ విషయమునను, రసనిర్వహణమార్గమునను వన యప్రతిమానచాతుర్యమును బ్రకటించి దీనిని హైందవనాటకముల కాదర్శముగఁ జేసి భారతీయనాటకకళకు వన్నెవెట్టినవాఁ డయ్యెను. ఇట్లే ఋగ్వేదమునను, పురాణములందును మూలఁబడి కళదక్కియున్న విక్రమునికథఁ గూడ బయటికిఁ దీసి జీవముపోసి తనభావనాపటిమచే మెఱుఁగువెట్టి శోభాయమానమగునట్లు చేసెను. శాకున్తలమందువలె దీనియం దీతనినాటకకళ పరిపూర్ణపక్వావస్థను బొందినట్లు కనఁబడదు. కాని,యీరెంటియందును భాసిల్లుచుండెడి భావసౌకుమార్యము, రీతీమాధుర్యము, కల్పనాపటిమ, మొదలగునుత్తమగుణములు కొన్ని మాళవికాగ్నిమిత్రమునఁ గనుపడకపోవుటచేతను, యిందలికథ కవికల్పితమై సార్వజనీనంబగు ననుభవసంతానంబును (Unversal experience), నున్నతమగు ధర్మవృత్తమును (High Morality), జూపునది గాకుండుటచే నిది యీ కాళిదాసవిరచితమే కాదని విల్సన్ మొదలగుకొందఱు పండితుల యభిప్రాయము. కాని, యిది కాళిదాసుని తొలి రచనలలోనిదగుటచేతనే పరిపక్వంబైనయాతని ప్రతిభకును లోకానుభవోద్దీపితంబగు బుద్ధివిశేషంబునకును నిదర్శనంబగు శాకున్తలముతోఁ దులఁదూగలేకుండెనని తలంపవలసియున్నది. ఇందలి భావములేకాక పదగుంభనలుఁ గూడఁనక్కినరెండు నాటకములలో సమానసందర్భములు గన్పడుటచే నీమూఁడునుగూడ నొకనిచేతనే రచింపఁబడినవని యీమూఁడు నాటకముల యందలి కథాంశములను, భావములను, పదబంధములను సరిపోల్చి చూచిన వారికి స్పష్టము గాకమానదు. మఱియు దొలిరచనయందుకంటె నుత్తరోత్తరములగు నాటకములయం దీతని భావనావిలాసము, భావగాంభీర్యము మిన్నయగుటయే కాక యాతనిబుద్ధిపరిపాకము, కళానైపుణ్యము ప్రకటితము లగుచున్నవని చెప్పనొప్పును.

కర్ణాలంకారమగు కిసలయమును గ్రహించిన మాళవికయొక్క పాదాఘాతమును బడసిన యశోకమును ప్రమదవనమున నొకచో వేచియుండి చూచినయగ్నిమిత్రుఁడు తన కత్తియుత్కృష్ట మబ్బలేదుగదాయని

"వయస్య, పశ్య,

శ్లో. ఆదాయ కర్ణకిసలయ మస్యా దియ మత్ర చరణ
మర్పయతి; ఉభయో స్సదృశవినిమయా దాత్మా
నం వఞ్చితం మన్యే"

అని చింతింపందొడఁగెను. అట్లే కణ్వాశ్రమమున వృక్షసేచనముఁ జేయుచుఁ జెలికత్తెలతోఁగూడిన శకున్తలను బాదపాన్తర్హితుండై చూచుచున్న దుష్యంతుఁడు శకున్తలముఖముమీఁద వ్రాలిన తుమ్మెదను జూచి,

"చలాపాంగం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీం,
రహస్యాఖ్యా యీవ స్వనసి మృదు కర్ణాంతికచరః;
కరౌ వ్యాధున్వన్త్యాః పిబసి రతిసర్వస్వమధరం,వయం
తత్త్వాన్వేషా న్మధుకర! హతా స్త్వం ఖలు కృతీ."

అని వస్తుతత్త్వాన్వేషణముచే దాను నిరుద్ధప్రవృత్తుఁడగుచుండ నాతుమ్మెద కృతకృత్యంబగుటఁ గూర్చి విచారింపఁదొడఁగెను. అగ్నిమిత్రుని వస్తువినిమయమును గూర్చిన వర్ణనముకంటె దుష్యంతునిచే శృంగారనాయకుఁడుగాఁ జేయఁబడిన మధుకరునిగూర్చిన వర్ణనమే కాళిదాసుని భావనావిలాసమును స్ఫురింపఁజేయుచున్నదనుటకు సందేహములేదు. మఱియు నాయికానాయకుల నేకాన్తమున విడువనెంచిన చెలులు హరిణశాబకంబుల నావలకుఁ దోలుమిషచేతనే వారిచెంతనుండి చనుట యీ రెండు నాటకములందును గాననగును.

"విదూషకః—(పరిక్రమ్య - ససంభ్రమం)వకుళావళికే! ఏష బాలాశోకవృక్షస్య పల్లవాని లంఘయతి హరిణః; ఏహి నివారయావ ఏనమ్.

(వకు)—తథా ప్రస్థితా.—(మాళవికాగ్నిమిత్రమ్)

ప్రియంవదా-(సదృష్టిక్షేపం) అనసూయే, ఇతోదత్తదృష్టిరుత్సుకో మృగపోతకో మాతర మన్విష్యతి. ఏహి;సంయోజయావ ఏనం (ఇత్యుభే ప్రస్థితే). — (శాకున్తలమ్)"

ఇంక నీరెండునాటకములయందును జెలులతో సంభాషించుచున్న నాయికలపలుకులు వినుచు నామెయెదుటకుఁ జనుటకై తగినతరుణము నిరీక్షించుచు నాయకులు తీగెపొదలచాటున దాగియుండుటయు, మాళవికాగ్నిమిత్రమున నిరావతి నిపుణికాద్వితీయయై యగ్నిమిత్రుని రహస్యచర్యలను గనిపెట్టుటకుగా వానిని వెద.

కుచు నుద్యానవనమునఁ దిరిగినట్లే విక్రమోర్వశీయమున న్నాశినరీదేవి తన పరిచారికయగు నిపుణికతోఁ జేరి పురూరవుని వెదుకఁజనుటయుఁ, బురూరవాగ్నిమిత్రుల యను రాగశూన్యములగు నాయికోపచార విధులనుగూర్చిన ప్రశంసలను;

"అగ్ని—వయస్య, నిసర్గనిపుణాః స్త్రియః. కథం మాం
అన్యసంక్రాంతహృదయం ఉపలాలయంత మపి
తే సఖీ నలక్షయతి. అతః పశ్యామి:

శ్లో. ఉచితః ప్రణయో వరం విహాంతుం
బహవః ఖండనహేతవో హిదృష్టాః,
ఉపచారవిధి ర్మనస్వినీనాం
నతు పూర్వాభ్యధికో౽పి భావశూన్యః.

పురూ:—

శ్లో. ప్రియవచనశతో౽పి యోషితాం
దయిత జనానునయో రసా దృతే;
ప్రవిశతి హృదయం న తద్విదాం."

ఈమొదలగు సమానసందర్భము లనేకము లీనాటకము లేకకర్తృకములని సాధింపఁగలవు. ఇంతేకాక:

రాజా "(ఆత్మగతమ్) అహో! సర్వాస్వవస్థాసు చారుతాశోభాం పుష్యతి. — (మాళవికాగ్నిమిత్రము)

కంచుకీ—(రాజానమవలోక్య)అహో! సర్వాస్వవస్థాసు రమణీయ మాకృతివిశేషాణామ్—(శాకున్తలమ్)"

నాయికతోడి రహస్యప్రాయము బయలుపడినతోడనే నాయకుఁడు లోప్త్రహస్తుఁడగు కుంభీరకునితోఁ బోల్పఁబడుటయు,

"విదూ—(జనాన్తికమ్)ప్రయోజయేదానీంకిమపి కర్మగృహీతేన కుంభీరకేన సంధిఛేదనే శిక్షితః ఇతి వక్తవ్యం భవతి. —(మాళవికాగ్నిమిత్రమ్)

లోప్త్రేన గృహీతస్య కుంభీలకస్య అస్తివాపరిహైణం. — (విక్రమోర్వశీయమ్)"

స్వభావముచే భీరువగు విదూషకునకుఁ గలిగినసర్పభ్రాంతి;

నిపుణిక—"ఇమం భుజఙ్గభీరుకం బ్రహ్మబంధుం అనేన భుజఙ్గకుటిలేన దండకాష్ఠేన స్తంభాంతరితా భూత్వా భీషయామి. (విదూషకస్యోపరి దండకాష్ఠం పాతయతి)

విదూ—(సహసా ప్రబుధ్య) అవిహా అవిహా భోః, దర్వీకరో మే ఉపరి పతితః...కథం, దండకాష్ఠమేతత్!
—(మాళవికాగ్నిమిత్రమ్)

విదూష—అవిద భోః!కి స్స్వేతిత్ భుజఙ్గనిర్మోకః! కిం మాం ఖాదితుం నిపతితః?

రాజా —(దృష్ట్వా) నాయం భుజఙ్గనిర్మోకః భూర్జపత్రగతో౽యమక్షరవిన్యాసః—(విక్రమోర్వశీయమ్)"(?)

ఈమొదలగు భావసామ్యములును;

"కల విశుద్ధాయాః గీతేః స్వరసంయోగః శ్రూయతే—(శాకుం 6);

ఆర్య కౌశిక్యా ఇవ స్వరసంయోగః—(మాళ—5)

వసంతప్రథమావ తార సుభగాని—(మాళ—3)

వసంతోదారసూచకం అభిరామత్వం ప్రమదవనస్య.
—(విక్ర—3)

మా అత్రభవతీ ధారిణీ విసంవాదయిష్యతి
—(మాళవికా—1)

రమణీయః ఖలు అవధిః విధినా విసంవాదితః—(శా—6)

కి మిదానీం తత్రభవతీ ఊర్వశీ భవతః మనోరథానాం కుసుమం దర్శయిత్వా ఫలే విసంవదతి (విక్ర—2)

ఎతావా నేవమే మతివిభవః —(విక్ర—2)

ఈమొదలగు ననేకములైన సమానార్థక పదబంధవిశేషములుగూడ నీనాటకము లేక కర్తృకములనుటకు మఱింత యుపబలకము లగుచున్నవి. మాళవికాగ్నిమిత్రమునఁ దక్కినవానియందువలెఁ గాళిదాసుని భావనాశక్తిస్ఫురణయు భావసౌకుమార్యము నంతగాఁ గన్పడకుండినచో నది యాతని నాటక రచనా విషయమునఁ బ్రథమప్రయత్నమగుటచేతనే యైయుండవలయును. కాని యీకారణముచే నాగ్రంథము కాళిదాసకృతము కాదనుట సమంజసముగఁ గన్పడదు.

ఈరూపకములయందలి నాందీప్రస్తావనాంశములఁ గూడ నీ పైవాదమునే బలపఱచుచున్నవని చెప్పఁదగియున్నది. వీనియందలి నాందీశ్లోకము లన్నియు రఘువంశమందలి యాద్యశ్లోకమువలెనే శివస్తుతి పరము లగుటయే కాక మాళవికాగ్ని మిత్రమున

"అష్టాభి ర్యస్యకృత్స్నం జగదపి తనుభిర్బిభ్రతో నాభిమానం" అనియు, శాకున్తలమున "ప్రత్యక్షాభిః ప్రసన్న స్తనుభి రవతు న స్తాభి రష్టాభి రీశః" అనియు, నాతని యష్టతనువులనుగూడఁ బేర్కొనుటచే నీగ్రంథము లేకకర్తృకములనుట ధ్రువపడుచున్నది. పూర్వ రంగాంగ భూతమగు నాంది యిష్టదేవతా స్మరణపూర్వకమును, ఆశీర్వచనాత్మకము నగు శ్లోకరూపమున నాటకకర్తయే రచించునాచారము కాళిదాసుని కాలమునుండియే బయలుదేఱి యుండవలయునని తలంపఁదగియున్నది. ఏలయన, నంతకుఁ బూర్వ కాలమున రచియింపఁబడినవిగా తలంపఁబడుచుండిన భాసునినాటకములలో "నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అని మొట్టమొదటనే కనపడుచుండుటచే రంగ ప్రసాధనము, నాంది మొదలగు పూర్వ రంగాంగము లన్నియు ముగిసినపిమ్మటనే సూత్రధారుఁడు లేకసూత్రధార గుణాకృతులుగల స్థాపక నామకుఁడు ప్రవేశించి నాటకవస్తువును, పాత్రప్రవేశమును సూచించి నిష్క్రమించుట యాచారముగనున్న ట్లూహింపఁదగియున్నది. ఇట్టి భాసునికాలమునాఁటి యాచారము కాళిదాసుని కాలమునఁ గొంతమార్పు చెందుటచేఁ గాఁబోలు కాళిదాసునికిఁ దరువాతివాఁడగు బాణుఁడు భాసనాటకముల కిదియొక విపరీతలక్షణ మైనట్లుగా

"శ్లో. సూత్రధారకృతారంభై ర్నాటకై ర్బహుభూమికైః;
సపతాకై ర్యశో లేభే భాసో దేవకులైరివ." అని

(నాందీశ్లోకము లేకుండగ, సూత్రధారునిచేతనే ప్రారంభము చేయఁబడిన నాటకములచేత భాసుఁడు ప్రఖ్యాతి గాంచెను) అని చెప్పియున్నాఁడు. వీనియందు వస్తుసూచనముఁగూడ సామాన్యముగ నాయానాటకములయందలి ప్రధానపాత్రల నామనిర్దేశముతోఁగూడిన యొక మంగళ శ్లోకమూలముగఁ జేయఁబడియుండెనే కాని నాటకము యొక్కయు కర్తయొక్కయు ప్రశంస యేమాత్రము గానరాదు. మొదటి నాందీశ్లోకము నాటకకర్త రచియించు నాచారము కాళిదాసుని కాలముననే బయలుదేరి యుండవచ్చును. ఒకవేళ కాళీదాసుఁడగుకాళిదాసు తనకుఁ బరమదైవతంబగు ప్రకృతితోఁగూడిన పరమ పురుషుని వర్ణింపఁదలఁచి తనగ్రంథముల మొదట నీశ్లోకములను రచించుటచే నిదియే యొకయాచారమై తరువాతి కవులచే నవలంబింపఁబడినదేమో, భాసుని నాటకములన్నియుఁ బ్రాయికముగా రాజాజ్ఞచేఁ దదాస్థానమునఁ బ్రయోగించుటకుఁగా రచియింపఁబడియుండుటచేఁ గాఁబోలు కవి యీ నాటకములయందు స్వీయనామ నిర్దేశాదికమునకుం గడంగక మంగళశ్లోక పఠనానన్తరమే పాత్రప్రవేశమును సూచింపుచు స్థాపనమును ముగింపఁ జొచ్చెను. సూత్రధారుఁడు మంగళశ్లోకమును జదివి "ఏవ మార్యమిశ్రా న్విజ్ఞాపయామి" అని యేదో విజ్ఞాపనచేయఁ బోఁగా నేపథ్యమునుండి యొక శబ్దము వినవచ్చుటయు నాతఁడు,

"అయే కిన్ను ఖలుమయి విజ్ఞాపనవ్యగ్రే శబ్ద ఇవ శ్రూయతే; అంగ, పశ్యామి; (నేపథ్యే)ఉ స్సరహ ఉస్సరహ, అయ్య! ఉస్సరహ.

"సూత్రధారః-భవతువిజ్ఞాతం" అని నాటకపాత్ర ప్రవేశమును సూచించి నిష్క్రమించుట యీనాటకములలోఁ (వాసవదత్తాపంచరాత్రము మొదలగు నెనిమిదింటిలోఁ) గానవచ్చుచున్నది- తక్కిన వానిలో నటీసూత్రధార సంభాషణము (ప్రతిమానాటకమున శరదృతుగానము) కొంతయున్నను, అది నాటకమునుగూర్చిగాని తత్కర్తను గూర్చిగాని ప్రశంసించునదిగాఁగనఁబడదు. ఈ నాటకములు రాజాస్థానముననే ప్రయోగింపఁబడి యుండవలయుననుటకు వీనిలోఁ బెక్కింటియందు భరతవాక్యములో రాజసింహునిప్రశస్తి గానవచ్చుచుండుటయే ప్రబలకారణముగఁ గైకొనఁదగియున్నది. భాసునినాటకములు రాజాజ్ఞచేఁ దదాస్థానమునఁ బ్రయోగింపఁబడుటకుగా వ్రాయఁబడినవిగావుననే యాతఁడు స్వీయనామ నిర్దేశాదికమును జేయక పాత్రప్రవేశమును సూచించి స్థాపనలను ముగించినవిగఁ జేయుచుఁ దుదను భరతవాక్యమున మాత్రముఁ దనప్రభువును గీర్తించుచు వచ్చెనని తలంపఁదగియున్నది. కాళిదాసుకూడ నేదోయొక ప్రభువరుని యాస్థానము నలంకరించియే యుండెనని యనేక కథలు చెప్పఁబడుచుండినను, ఆతఁడు తననాటకములను రాజాజ్ఞచేఁగాని, తదాస్థానమునఁ బ్రయోగించుటయను ప్రధానోద్దేశముతోఁ గాని రచించినట్లు గనుపడదు. ఏలయన, మాళవికాగ్నిమిత్రనాటకప్రయోగ సందర్భమున సూత్ర

ధారుఁడు పరిషదాజ్ఞచే నానాటకమును ప్రయోగించు చున్నట్లుగాఁ జెప్పుచున్నాఁడు.

"అభిహితోఽస్మి పరిషదా కాళిదాసగ్రథితవస్తు మాళవికాగ్నిమిత్రం నామ నాటకం అస్మిన్వసంతోత్సవే ప్రయోక్తవ్యమితి"

దీనివలనఁ గాళిదాసీనాటకమును సామాజికుల యానందముకొఱకే, లేక, పండితుల పరితోషము కొఱకు (ఆపరితోషాద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం) రచించియుండును. కాని కేవలము రాజాజ్ఞచేఁగాదనియు; నీతనికాలమున నిట్టి నాటకములు వసంతోత్సవము మొదలగు నుత్సవసమయముల నాకాలమునకే ప్రబలియున్న నాటకసమాజముల చే బహిరంగప్రదేశములయందుఁ, బండిత సభలయెదుటఁ బ్రయోగింపఁబడుచుండెడివనియుఁ దెలియ వచ్చుచున్నది. ఆకాలమున నాటకప్రయోగ విషయము నను, దద్దర్శనవిషయమునను గూడ జనుల కమితోత్సాహ ముండెడిది. ప్రతియుత్సవ సమయమందు నే భాసునిదో, సౌమిల్లునిదో, కవిపుత్రునిదో యేదో యొక నాటకము ప్రయోగింపఁబడు చుండుటయు, జను లత్యంతోత్సాహముతో నానాటకములంజూడ నేగుచుండుటయుఁ గలదు. మాళవికాగ్నిమిత్రము నానాఁడు చూడవచ్చిన పారిషద్యులింతకుఁబూర్వము భాసాదులనాటకములఁ జూచి యానందించుచున్నట్లు అందుఁ బారిపార్శ్వకుఁడు సూత్రధారునితోఁ జెప్పిన "మా తావత్ ప్రథితయశసాం భాససౌమిల్లకవిపుత్రాదీనాం ప్రబంధా నతిక్రమ్య వర్తమానకవేః కాళిదాసస్య కథం పరిషదో బహుమానః" అను పలుకులను బట్టియే తెలియుచున్నది. జనులకు నాటకములందును, తత్ప్రయోగమునందును నభిమానము గలిగిన వెంటనే అనేకులు నాటకకర్తలేకాక నాటకములఁ బ్రయోగించు సమాజములుఁగూడ బయలుదేఱియుండును. కాని సామాన్యముగా జనులకుఁ బ్రాచీనకవులందును గవితయందును గలయభిమానము వర్తమాన కవులయందు లేకుండుట స్వాభావికమే. కావున నాకాలమునందలి పారిషద్యులును భాసాదినాటకములయందువలెఁ దక్కిన సమకాలికులగు వర్తమానకవుల నాటకములయందుఁ దగినయభిమానముఁ జూపియుండకపోవుటచే నెట్లో కాళిదాసు కొందఱు స్నేహితుల సహాయముననో, నాటకప్రదర్శకుల తోడ్పాటువలననో తన తొలిరచనను బ్రయోగింపఁజేసి యచ్చటి సామాజికుల కేవల పురాణకావ్యాభిమానమును, నవ్యకావ్యానాదరణమును ఖండించువాఁడుఁ బోలె "పురాణమిత్యేవ నసాధు సర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యం" అని సూత్రధారముఖమున తనభావమును వెల్లడించి భాసాదుల కావ్యములవంటి కావ్యములు వర్తమానకవులలో నైనను, ప్రతిభావంతులగు వారు రచింపలేకపోరనియు, నంతకంటె రసవత్తరములగువానినే రచింపఁగలవారు కలరనియు సూచింపుచు బండితులగు సత్పురుషులైనను పరప్రత్యయనేయబుద్ధులు గాక పురాణకావ్యమును దమ నవ్యకావ్యములతోఁ బోల్చిచూచి గుణవత్తరంబగు దానిని గ్రహింతురుగాక యని,

"సంతః పరీక్ష్యాన్యతమద్భజంతే మూఢః పరప్రత్యయనేయబుద్ధిః" అని స్వపక్షస్థాపనకై యుద్ఘోషించి చెప్పుచున్నాఁడువలె గన్పడుచున్నాఁడు. ఇది వఱకు జనులమనముల నాకర్షించియున్న భాసాదులనాటకములఁ బ్రచారము నణఁగద్రొక్కి యాస్థానమును వర్తమానకవియగు తా నాక్రమింపఁదలఁచినవాఁడు గావుననే యీప్రస్తావనయం దీకవికి స్వీయగ్రంథ సమర్థనము, స్వనామనిర్దేశాదికము నవసరమైనది. ఇట్లు కాళిదాసు ఆతని కాలపరిస్థితులనుబట్టి ప్రత్యేకఫలాపేక్షచే నామనిర్దేశాదిక మొకయాచారమై కాలక్రమమున నాటక రచనయం దొక నిబంధనమైనది.

"తత్రపూర్వం పూర్వరంగః సభాపూజా తతఃపరమ్,
కథనం కవిసంజ్ఞాదేః నాటకస్యాప్యథాముఖమ్"

అని నాటకాదులయందుఁ బూర్వరంగాదులైనపిమ్మటఁ గవినామగోత్రాదులను నాటకనామమును జెప్పవలయునను సాహిత్యదర్పణకారాదుల లక్షణవాక్యములకుఁ గాళిదాసునినాటకములే మూలలక్ష్యమై యుండనోపు. భాసుని నాటకములయందువలె "నాంద్యంతే తతః ప్రవిశతి సూత్రధారః" అని నాంద్యంతమున సూత్రధారప్రవేశమును సూచించుటకుబదులుగాఁ గాళిదాసుని నాటకముల మొట్టమొదట నాందీశ్లోకమునుపిదప "నాంద్యంతే సూత్రధారః—అలమతివిస్తరేణ" అని సూత్రధారుని వాక్యమును గన్పడుచుండుటచే నీసూత్రధారుఁడే యానాందీశ్లోకమును బ్రథమమునఁ జదివి పిదప కవినిగూర్చియు, నాటకమును

గూర్చియుఁ బ్రస్తావించుచున్నట్లు కనఁబడుచున్నది. దీనిని బట్టి కాళిదాసుని కాలమునకే "పూర్వరంగం విధాయాదౌ సూత్రధారే వినిర్గతే, ప్రవిశ్య తద్వ దపరః సూత్రధార గుణాకృతిః; సూచయే ద్వస్తుబీజం" అను నాచారము మారి నట్లు కన్పడుచున్నది. "ఇదానీం పూర్వరంగస్య సమ్యక్ప్రయోగాభావాత్ ఏకఏవ సూత్రధారః సర్వం ప్రయోజయతీతి వ్యవహారః" అను సాహిత్యదర్పణకారుని వాక్యమందలి "ఇదానీం" అను వాక్యమున కర్థము కాళిదాసుని కాలమునుండియని గ్రహింపవలసియుండునేమో!

మొత్తముమీఁద నీమాళవికాగ్నిమిత్ర మందలి సూత్రధార పారిపార్శ్వకుల సంభాషణమూలముననాకాలమందలి నాటకప్రయోగవిషయములకు పరిస్థితులేకాక లబ్ధప్రతిష్ఠులగు భాసాదులతోఁ గాళిదాసు పోటీకి నిలువబడుట కిదియే మొదలనియు కావున నీనాటకమే యాతని ప్రథమప్రయత్నము అనియుఁగూడ మనము గ్రహింపవచ్చును. ఏలయన సూత్రధారుఁ డాదినమునఁ బూర్వము నందువలెఁగాక కాళిదాసగ్రథితవస్తువగు నవీననాటకము నొకదానిని బ్రయోగింపవలయుననఁగాఁ బారిపార్శ్వకుఁడు భాసాదుల నాటకములను వదలి యీయాధునికుని నాటకమునందు సభ్యులకేమియాదరముండుననుటయుఁజూడగా నాదినమున సూత్రధారుఁడు తా మాడఁబోవు నాటకము నే కాక నూతనముగా నాటకములను రచింప మొదలుపెట్టిన కాళిదాసునే సామాజికులకుఁ బరిచితునిగాఁ జేయఁదలఁచినట్లు తెలియుచున్నది. కాళిదాసుని నాటకములఁ బ్రయోగించుట కిదియే మొదటిసారియని తెలియవచ్చుచుండుటచే నీమాళవికాగ్నిమిత్రమే యితని మొదటినాటకమనికూడ మనము నిశ్చయింపవచ్చును. కవి యాధునికుఁడై యాతనికావ్యముఁ గ్రొత్తదైనంతమాత్రమున నది గర్హ్యము కాదు. అది సత్పురుషుల కాదరపాత్రము కాకపోదు. వారు గుణవివేచనఁజేసి రసవత్తరమైనదానినే తప్పక గ్రహింతురు అని సూత్రధారుఁడు లేక సూత్రధార ముఖమునఁ గాళిదాసు చెప్పిన సమాధానము పూర్వనాటకములకంటె నిది రసవత్తరంబేయను నర్థమును ధ్వనింపజేయుచున్నదివోలె నున్నది.

ఇఁక విక్రమోర్వశీయ ప్రదర్శనసమయమునఁ గవి యాధినవఱకే సామాజికులకుఁ గొంత పరిచితుఁ డగుటచే నాతనిగూర్చి చెప్పవలసిన యవసరము లేకపోయినది. కావున సూత్రధారుఁ డీసారి ప్రదర్శింపఁబోవు నాటకము యొక్క విశేషగుణములను బ్రశంసింప మొదలిడెను.

మారిష—"బహుశస్తు పరిషదా పూర్వేషాం కవీనాం దృష్టః ప్రయోగబన్ధః; సోఽహ మద్య కాళిదాస గ్రథితవస్తునా విక్రమోర్వశీయం నామాపూర్వం నాటక ప్రయోక్ష్యే."

ఇదివఱలో సామాజికులు పూర్వకవులనాటకములనేకములు చూచియుండిరి. (కాళిదాసుని మొదటినాటకమగు మాళవికాగ్నిమిత్రము కూడ నా పూర్వనాటక పద్ధతి ననుసరించినదే) కాని యిట్టినాటకమును జూచియుండరు. అపూర్వతయే దీని విశేషగుణముగాఁ జెప్పఁబడినది. మొదటిది పూర్వకవుల భాసాదుల రచనలనే పోలియుండుటచే నీమాఱు కాళిదాసు నూతనపద్ధతి ననుసరించి తన ప్రతిభను మెఱయింప సమకట్టెను. అందుకు నాటకవస్తువుగా ఋగ్వేదమందును బురాణములందును బ్రఖ్యాతమగు విక్రమునికథను స్వీకరించెను. ఈ కథయు నగ్నిమిత్రునికథవలెనే నాయకుని యంతఃపుర చర్యలనే విశేషముగఁ జెప్పునదియైనను యిందలి నాయకుని ప్రభావాతిశయము, దివ్యసంబంధము నీనాటకమున దివ్యమర్త్యోభయాంశముల సమ్మేళనమునకు నద్భుతరసంబునకుఁ గారణంబై దీనికొక యపూర్వత నాపాదించినది. కావుననే యిది వెనుకటినాటకమువంటిది కాదు; అపూర్వమైనది. ఇందలి సద్వస్తు పురుషబహుమానము చేతనైనను కాళిదాసుని యీనాటకమును సావధానులరై చూచి యానందింపుఁడయ్యా యని సూత్రధారుఁడు,

"ప్రణయిషువా దాక్షిణ్యాత్ అథవా సద్వస్తు పురుషబహుమానాత్; శ్రుణుత మనోభి రవహితైః క్రియామిమాం కాళిదాసస్య" అని యిట్లార్యమిశ్రులను హెచ్చరింపం దొడంగెను.

కాని యిందిట్టి హెచ్చరింపున కవసరమేమి యను ప్రశ్న కలుగక మానదు. ఇదివఱకుఁ బ్రాచీనకవులనాటకములఁజూచి యానందించుచుండిన సామాజికులయెదుట నీనూత్నకవి ప్రథమకృతి యగు మాళవికాగ్నిమిత్ర

మును బ్రదర్శించుచు అందలి గుణములను గ్రహించుపని సహసద్వివేచనాపరులగు పారిషద్యులకే వదలివేసెను. వా రాప్రయోగమును జూచి యానందభరితులయియుందురు. ప్రాచీనకవుల ప్రతిభతోఁ దులఁదూగు ప్రతిభాశాలియాత డని తలంచియుందురు. ఇట్లాసమాజికులకు నీనూత్న కవి యగు కాళిదాసునియందుఁ గొంత ప్రణయమేర్పడి యుం డును. కాని యీతఁడింకను లబ్ధప్రతిష్ఠుఁడు కాలేదు. కావుననే యీమహాతుఁడు తనయప్రతిమానంబగు ప్రతి భావిశేషమును భావనాశక్తిని జూపుట కనువగు వస్తువు (లేక) యితివృత్తమును గ్రహించి పూర్వకవులను వెను దన్న యత్నించెను. అందువలననే సూత్రధారుఁ డీమాఱు ప్రఖ్యాతవస్తువు గలదై యుత్తమనాయకునితోఁ గూడి కాళిదాసుని విశేషప్రజ్ఞను జాటెడి యీ యపూర్వ నాటకము నవహితచిత్తులరయి చూడుఁడీ యని హెచ్చ రించుట తటస్థించినది. భాసనాటకాదుల ఫక్కినే యను సరించి రచించిన మాళవికాగ్నిమిత్రమువలెఁ గాక కొంత వఱకు నూతనమార్గమున ననుసరించి రచింపఁబడిన యీవిక్ర మోర్వశీయముతో నీతఁడు ప్రకటితవిశేషప్రజ్ఞుఁడు.లబ్ధ ప్రతిష్ఠుఁడు నయ్యెను. కావుననే శాకుంతలనాటకప్రయో గసందర్భమున నానాఁటిసభ పండితులతోఁ గూడినదైనను సూత్రధారున కెట్టిసంకోచములు, హెచ్చరింపులు విజ్ఞా పనలు నవసరము లేకపోయినవి. ఇదివఱకు రెండునాటక ములు చూడవచ్చిన పారిషద్యులలోఁ బండితు లుండిరో లేరో తెలిసికొనుట కవకాశము కలుగలేదు. అనఁగా నారెండునాటకములచేతను తాను పండితులనుగూడ మెప్పింపఁగల ననునిశ్చయము కాళిదాసున కున్నదో లేదో మన మెఱుఁగము. కాని యీశాకుంతలనాటక ప్రయోగ మును జూడవచ్చినసభ పండితులతోడఁ గూడియున్నది. (అభిరూపభూయిష్ఠా పరిషదియం) అని చెప్పుచు అట్టి పండితమండలియెదుటనుగూడ సంకోచమేమియును లేక "కాళిదాసునిచే రచియింపఁబడిన యభిజ్ఞాన శాకుంతల మను నూతనమగు నాటక మిపుడు ప్రయోగింపవలసి యున్నది."(అద్యఖలు కాళిదాసగ్రథితవస్తునా అభిజ్ఞాన శాకుంతలనామధేయన నవేన నాటకేనోపస్థాతవ్యమస్మాభిః")అని సూత్రధారుఁడు పలుకుటచే నీ నాటక మెట్టి హెచ్చరింపులు లేకయే పండితుల మెప్పునుగూడ సులభ ముగఁ బడయఁగలదను భావము సూచింపఁబడు చున్నది వోలె నున్నది. లేదా వెనుకటి రెండునాటకముల మూల మననే కాళిదాసునికీర్తి నలుగడల వ్యాపించుటచేఁ బం డితప్రకాండు లనేకు లీతనినాటకమును జూచి యానం దించుటకుఁ గుతూహలాయత్తచిత్తులై వచ్చియుందు రను భావమైనను దీనివలన వ్యక్తము కాకమానదు. ఇఁక విశేష మేమనఁగా నింతకుఁబూర్వము తాను ప్రయోగించు నాట కముయొక్క గుణమునుచెప్పి సామాజికులను హెచ్చరించి నాటకమునం దాదరము గలిగింపఁజూచిన సూత్రధారుఁ డీశాకుంతలమున

"ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగ విజ్ఞానమ్; బలవదపి శిక్షితానా మాత్మ న్యప్రత్యయం

చేతః" అని తన ప్రయోగవిజ్ఞాన విషయముననే సం శయగ్రస్తమనస్కుఁ డయ్యెను. తగినశిక్షనందినను నుత్త మనాటకప్రదర్శన విషయమునఁ బ్రదర్శకులకుఁ గొంత భయ ముండకపోదు కాబోలును. లేక కొందఱు పాశ్చా త్యవిమర్శకులు చెప్పినట్లుగా నీనాటకమందలి భావసౌకు మార్యము, రసోత్కర్ష యుఁ బ్రయోగమున కంపనంతటి సున్నితములు (లేక) సూక్ష్మములు (Too Subtle to berepresented on the stage) నై యుండె నను భావమున కిది సూచకమేమొ? లేక, కాళిదాసునకే యిట్టి సంశయము నాపాదింపవచ్చునా? ఇదివఱకే లబ్ధప్రతిష్ఠుఁడై తన నాటక కళాప్రావీణ్యమునంతను జూపి దాని తన నుత్కృష్టమగు నాటకముగ రచియించితి నను నిశ్చ యము కలవాఁడయ్యెను. పండితు లద్దానింజూచి యేమని తలయూపుదురోయని స్వీయగ్రంథప్రాశస్త్యమునుగూర్చి సంశయమనస్కుఁడు కాకమానఁడు గదా! "బలవదపిశిక్షి తానా మాత్మ న్యప్రత్యయం చేతః"అనువిషయము సర్వ లోకసామాన్యము. వినయశీలుఁ డగు కాళిదాసుకూడ దానికి లోఁబడియుండెను.

ఇంతకుఁ దేలిన దేమనఁగాఁ బ్రప్రథమమునఁ గాళి దాసు తనకుఁబూర్వమున బ్రసిద్ధిగాంచిన భాసాదినాట కకర్తల మార్గమునే యనుసరించి మాళవికాగ్నిమిత్రమను నాటకమును రచించి పిమ్మట పూర్వకవులకన్నఁ దాను విశేష ప్రజ్ఞావంతుఁ డనిపించుకొని లబ్ధప్రతిష్ఠుఁ డగుటకు

పైకథను బోలినదానినే ప్రాచీనగాథలనుండి దీసి కథా సన్నివేశవిషయమునను నెక్కుడు జాగరూకత వహించి విక్రమోర్వశీయమున దానికిఁగొంత యపూర్వత గలుగఁ జేసెననియుఁ దిదపఁ దన కవితాశక్తియు లోకాను భవమును నాటకరచనా ప్రావీణ్యమును పరిపక్వావస్థ నొందుటచే, ప్రఖ్యాతేతివృత్తమునే గ్రహించి యున్నతాదర్శములతోఁగూడిన శాకుంతలమును న త్తమనాటకంబును రచించెననియు స్పష్టమగుచున్న దనుటయే.



# పోతకవిరాజ స్మృతి

సోమంచి సూర్యనారాయణ శర్మ గారు

శ్రీరామభద్రుఁడే నో
రారం బలికింపఁ బల్కి యలభారతికిం
గూరిమి నేసిన నీ కవి
తారసదైవతము నెంచెదను పోతన్నా!

దివ్వోఁగొని యినునిఁ జూపిన
యవ్విధమున నీదు ప్రతిభ ననఁ బూనిన న
నవ్వారె? యెవరే నైనను
నొవ్వను మదిలో గణింప నో పోతన్నా!

నినుఁ బొగడఁజాలు చణులే
కనఁబడ రింతవఱకన్నఁ గనదాంధ్రకవుల్
నినుఁ బోలువారు లేరని
యనఁబోలదె నాకునేఁ డనా, పోతన్నా!

నన్నయ తిక్కన్నలు నీ
కన్న న్రసవిరచనమున ఘనులే యెవ రే
మన్నను దచ్ఛోభారమ
నిన్నే వరియించెఁ దత్త్వనిధి, పోతన్నా!

శ్రీనాథాదులు సింగ
క్ష్మానాథాదులను గొల్చి కాంచిరి సుఖముల్
శ్రీనాథుఁ దక్క నన్యుల
భూనాథుల నెప్పుడొల్లవో పోతన్నా!

ఇచ్చితివఁట యొకనృపతికి
గ్రుచ్చి దండకంబు పదుపుఁ గోమలిపై నీ
సచ్చరితకు నిజమే నది
మచ్చయగుట నిక్కవముసుమా పోతన్నా!

నీ తెన్నెఱింగిసన్న వి
భూతియుతుఁడుఁ గాడె, కాడె పుణ్యపురుషుఁ
మాతకు నాతతమగుఁ వి [ఖ్యా
ఖ్యాతిఁ గొని తేఁడె నేఁటికవి పోతన్నా!

మాటికి మాటికి వాదము
లేటికి సుకవీశ్వరుం డదేనాటికిఁ దాఁ
గూటికి నృపవాటికిఁ జని
పాటులఁబడునన్న బేలుపడి పోతన్నా!

అరయవలెఁ బూజ్యుఁడని కవి
ధరణీశ్వరుఁడే తనంతఁ దక్కినవైనన్
సిరులిడవచ్చిన నైనను
వరకవి మనఁగలఁడే? యచటఁబడి, పోతన్నా!

కాసులకొఱకై యెంతయొ
చేసి పొగడి బానిసీలసిబ్బితి విడియున్
గూసినకూఁతల విడిచెద
రోసి 'యిసీ' యనుచు మనములోఁ బోతన్నా!

పెట్టినఁ బెండ్లియుఁ దమకుం
బెట్టుకున్న శ్రాద్ధమన్న పెద్దల పల్కుల్
గట్టిగ సత్యము చేసిరి
కట్టెఁడి కవులంది పుట్టుకనుఁ బోతన్నా!

మానధనినైన సత్కవి
భూనుత సత్కీర్తి యనఁగఁ బొగడందక దు
ర్మానుఁ డగు హీనజనుఁ డా
హా! నుతియింపఁబడునెఁ 'కవి'యనిపోతన్నా!

పురుషార్థ యుతంబగు బ్రదు
కరనిముసమె చాలు వేయి యబ్దము లీయు
ర్వర జీవింపదె కాకము?
పరుషకఠోర రవమయి ప్రబలి పోతన్నా!

కవికృత గ్రంథంబులకుం
గవితాశిల్పమునఁ గలరు ఘనరసికమతుల్
కవిజీవితంబు నరయరా?
కవికాఁడో మార్గదర్శి, కనఁ బోతన్నా!

మేటిచవులూరు తేనియ
తేటలు స్వాతంత్ర్యకవితదివ్యపదవికిం
బాటలు నీమాటలు స్వే
చ్ఛాటన మానసుల కనుట సరి పోతన్నా!

పరమదరిద్రంబున నే
నిరతైశ్వర్యమును గాంచి నెగడందుచు ని
ర్భరమోద వార్ధిఁ దేలిన
వరభక్తాగ్రణివి నీ వవనిఁ బోతన్నా!

పావనము మాతృపదసం
సేవన మొనరించి కాంచు జీవన మహాహా!
లావనము బంధలతలకు
భావన మొనరింతు నాసపడి పోతన్నా!

హాలికవృత్తియె కద మన
పాలికిని సువృత్తియనుచు భాగవతుఁడు నీ
పోలిక జీవించిన-చో
నేలిక యేల నిఁక వాని కిలఁ బోతన్నా!

శివకేశవు లందున నెం
చవు కించిత్తేని భేదసంగతి నద్వై
తివి సామ్యధన్య మూర్తివి
కవిజనహృత్కుముదశీతకర! పోతన్నా!

పరమేశ్వరు నురులీలల
బరమభాగవతుఁడ వీవు వర్ణించినటుల్
ఒరులు వినుతింపఁగలరే?
యరయనైనఁ జాలుదురె యనఘ, పోతన్నా?






చిత్రగుప్తుడు

కలియుగము వచ్చినది. ఒక్కనిముసమైనను తెరిపి లేకుండ నున్నది. ఈయుగములో మనుష్యులకు తెలివితేటలు ఎక్కువ నడంచెను బ్రహ్మ. అయితే ఆయువు తక్కువయే కనుకనే పాపాలు పెరిగిపోవుచున్నవి. అన్ని పాపములు ఇక్కడనే అనుభవించవలసివచ్చినది. యమమహారాజుగారైన యీవిషయమై శ్రద్ధ వహించరైరి.

యముడు (ప్రవేశించి)

చిత్రగుప్తా! ఏమో విసుగుకొనుచున్నావు? ఈకలియుగం వెళ్ళిపోతే మనలోకములో నరక మనుభవించువారు తక్కువగనుందురు; మన పనియు తగ్గును. కొంతకాలము ఓపికతో నుండుము.

చిత్రగుప్తుడు

ఓపికతోనుండక నేను చేయగలది యేమున్నది? కాని భూలోకములో దుర్మార్గులు సంపదలతోనుండినట్లును, సన్మార్గులు కష్టములు చెందుచున్నట్లును తోచుటచే కలియుగములోజనులు యెక్కువగాపాపభీతి చెందుట కవకాశము లేకపోవుచున్నది. కనుక దుర్మార్గులు సంపదలతో నుండుట వారిమంచికి కాదనియు, సన్మార్గులు కష్టములొందుట వారిశ్రేయస్సుకే యనియు భూలోకములో తెలిసేటట్లు బందోబస్తి చేయనలెనని నా మనవి.

యముడు

దుర్మార్గుడు ఒకసమయములో మంచిచేయుట చేత తత్ఫలితముగా లాభము కనబడును. అది వాడు గ్రహించజాలక తనదుష్కార్యము యొక్కఫలమే ఆలాభ మనుకొనుచున్నాడు. సన్మార్గుడు ఒక్కొక్కసమయములో ప్రమాదపడి పరమార్థమును మఱచును అట్టిపరమార్థమునకు ఆటంక మగుదానిని పరమేష్ఠి తీసివేయుచుండును. (భగవద్ధ్యానమునకు పుత్త్రుడుఅడ్డయిన—అనగా పుత్రవ్యామోహము—పుత్త్రుడుకూడ తొలగింపబడును). ఇది వీడు గ్రహించజాలకున్నాడు. మన మేమి చేయగలము?

చిత్రగుప్తుడు

అయితే స్వామి, ఇప్పు డేమున్నది? ముందున్నది ముసళ్ళపండుగ అనుకొందును.

యముడు

అవును. ఇదివఱకు మనిషికి నూరేండ్లు పరమాయుష్షు. ఇప్పుడు అరువదియేండ్లు పరమాయు వైనది, ఇకముందు ఇరువదేండ్లే. ఇప్పు పాపాత్ములసంఖ్య యేమాత్ర ముండు

చిత్రగుప్తుడు

భరతఖండము మొత్తముమీద 33 కోట్ల ౬౮ లక్షల ౨౦ వేలు జనసంఖ్య. ఇందు పాపాత్ములు ౨౪ కోట్ల ౫౦ లక్షలు. మిగిలిన వారిలో ఒకకోటికి తక్కువగా నున్నారు మధ్యములు.

యముడు

ఎంతమంది యేయేపాపముల జేసిరి?

చిత్రగుప్తుడు

మనవిచేస్తా (చిట్టాచూచి)

| | |
|---|---|
| నరహంతకులు | ౭౮ లక్షలు |
| ఇందు స్త్రీలవిషయమై | ౬౮ ,, |
| ఆడపిల్లలను పెండ్లిండ్లలో అమ్ముకొన్నవారు | 3౨ ,, |
| మగపిల్లలను అమ్ముకొన్నవారు | ౨౮ ,, |
| మోసగాండ్రలో— | |
| దొంగపత్రములుసృష్టించినవారు | ౨౮ ,, |
| అప్పులు ఎగవేసినవారు | ౧ కోటి ౫౦ ,, |
| అసలు ఋణమునకు రెట్టింపునకు పత్రములు వ్రాయించి ఋణగ్రస్థులకొంపలు తీసినవారు | ౬౮ ,, |
| దొంగసాక్ష్యములు చెప్పినవారు | ౨ కోట్లు |
| ,, చెప్పించినవారు | 3 కోట్లకు కొంచెము తక్కువ |
| స్వామిద్రోహులు | ౨ కోట్లు |

మిగ్గిలినవారందఱు ఇతరబాపతులక్రింద అను

యముడు

భరతఖండం చెడిపోయింది. కర్మభూమిగదా! కర్మబాహ్యుల వివరము చదువండి.

చిత్రగుప్తుడు

స్వకర్మలను విడిచినవారు ౧౫ కోట్లు. స్వధర్మములను విడచి పొరుగింటిపుల్లకూరను రుచి మరగినవారు ౮ కోట్లు.

[యమభటులు పాపాత్ములను తీసికొనివత్తురు]

ఒకపాపాత్ముడు

అయ్యో! అతడేకాబోలు యముడు. నరకము లేదనుకొని చేయరాని దుష్కార్యము లెన్నియేని చేసితిని. నరకముసంగతి పెద్దవాళ్లు అంటువుంటే భయపెట్టుటకని అనుకొంటిని. భూలోకములో చేసినట్లు ఇక్కడ రికార్డుదిద్ది ఉంచుటకు వీలు కనబడదు. సాక్షి విచారణయైనఉంటేపదొంగసాక్ష్యమో తెచ్చుకొనుటకు వీలుగా ఉండేది. ఇక అప్పీలేమున్నది? ఏమిచేతును?

చిత్రగుప్తుడు

అయ్యా! వీడొకరాజకీయోద్యోగి. లంచగొండి. ౧౦౦-కి ౯౦ పాళ్లు పాపము.

పాపాత్ముడు

ఈ వ్రాత లంచ మీయలేదని వ్రాసిన ట్లున్నదండి. పాపపుణ్యములు తారుమారైనట్లు తోచుచున్నది.

యముడు

దురాత్మా! భూలోకములోని నీ దుర్నడతలను ఇక్కడను మానవైతివి. నిజము చెప్పుము. [పాశము మెడకువేయును]

పాపాత్ముడు

అయ్యా! పాశము వదులు చేయించండి. నాలుక పీక్కొనిపోతున్నది. [దగ్గుచు] ౧౦ లక్షలండి.

యముడు

లంచమీయని నెపమున ఎందఱి కపకారము చేసితివి?

పాపాత్ముడు

౫౦౦ లకు కొంచెముపైన అనుకుంటాను.

యముడు

ఈ దుర్మార్గుని చర్మ మొలిపించి అగ్నిస్తంభ మునకు కట్టుడు.

పాపాత్ముడు

మీశిక్షవింటే నవ్వుగా నున్నదండి. నాచర్మం ఒలిచేసరికే ప్రాణములు పోవును. ఇంక అగ్నిస్తంభమునకు కట్టించనేల?

యముడు

మూర్ఖుడా! (నవ్వుచు) ఈలోకములో మీకు చావులేదు. బాధతప్పదు. పొమ్ము.

[ఇంక నిద్దఱుపాపాత్ములు పోట్లాడుచు వత్తురు]

ఒకడు

[రెండవవానితో] ఇప్పుడెక్కడికి పోదువు? సుబ్బయ్యను చంపితే ఆస్తి అంతయు నాకే వచ్చునని చెప్పి చంపించి చివరకు కేసులో నావద్ద రు ౧౦౦౦ లు సంగ్రహించి నన్ను ల్లరిపాలు చేసినవాడవు నీవుకాదా? నీపైన మాడుము ఎట్టిసాక్ష్యము పలికెదనో!

రెండవవాడు

[గదమాయించి] నీ డబాయింపులు మాను. పండంటిపిల్లను, చూచినకొలది కళ్లకు కఱువు తీరని నీముద్దుకూతును డబ్బుకాశించి, బిడ్డ సౌఖ్యము తలపెట్టక ముసలిమొద్దున కంట గట్టిన పాపాత్ముడవని యమమహారాజుగారికి నీవిషయమై నేనును చెప్పగలను. కాపురము చేయుచున్నప్పుడు నీ ముద్దుబిడ్డ కంటినుండి కారు కన్నీరు చుక్కలన్నియు అన్ని విక్రుతాకారములతో నిన్ను పీక్కొని తిన సిద్ధముగా నున్నవిలే.

యముడు

చిత్రగుప్తా! వారిద్దఱు తగవు లాడుకొనుచు ఒండొరుల గుట్టులను బయటవేసికొనుచున్నారు. వీ రెంతపాపము చేసిరి?

చిత్రగుప్తుడు

పాపము ౯౦ పాళ్లు.

యముడు

వీరిని ౧౦౦ సంవత్సరములు మఱగిన నూనెలో పడవేయించండి.—ఆవచ్చువా డెవడు?

చిత్రగుప్తుడు

ఆయన న్యాయవాది అనబడు అన్యాయవాది; పరద్రవ్యాపహారి; స్త్రీలోలుడు; త్రాగుబోతు. ౯౬ పాళ్లు వీనిపాపము.

పాపాత్ముడు (ప్రవేశించి)

[యమునితో] సర్, నేను సంఘము బాగు చేయవలెననియే యంగ్విడోస్‌కు పునర్వివాహములు తలపెట్టితే ఆ రాస్కెల్సు నా [illegible] స్సు పాడుచేశారు. అక్కడకు ఇక[illegible]

తిరుగుటలో కొంచెము ద్రింకింగు అలవాటు అయినది. అది ఒకరిని బాధించేది కాదు. నామనస్సు చలించిన దనగా గాడ్ స్పష్టిలో లోపముసన్నదన్నమాటే! ఈ విషయమై ఒక గొప్ప లెక్చె రిస్తాను.

చిత్రగుప్తుడు

ఓహో! నీ విప్పుడైనను నీవృత్తి మానవైతివి. దొంగదారులు దీయుటయేకదా నీపని!

యముడు

నిస్తోత్ర పాఠములు కట్టిబెట్టి నోరు మూయుము. భటులారా, వీనిని ఇనుపముక్కు కాకులతో పొడిపించుడు. పొండు.

ఇంకొకపాపాత్ముడు (ప్రవేశించి)

అయ్యో! నాబిడ్డలేరి?నన్నీలోకములో పలుకరించేవారు ఒకరైన లేరే! కూడునీళ్లు సరిగానైన లేకుండ అన్నికూళ్లు తిని కూడ డబ్బు సంపాదించితిని! [భటులతో] అయ్యో! నా [మేడలు, మిద్దెలు, సొమ్ము లేమయినవో! అని ఏడ్చుచు] అబ్బ! నాయనలారా! మంచి దారినైన తీసికొనిపోదురు?

భటులు

నీజన్మలో ఎన్నడైన పాదుకలైన దానముచేసి యుంటివా?

పాపాత్ముడు

ఒకరైన నా స్థితికి జాలినొందరే?

భటులు

ఎటులు జాలినొందెదరు? నీవెప్పుడైన ఒకరి స్థితికి జాలినొందితివా?

అయ్యో! ఆకలి! ఆకలి!! నాలుక పీక్కొనిపోతున్నది. దాహము! దాహము!!

భటులు

భూలోకములో ఆకలియని దాహమని నీవాకిట్లో నిలువబడి దైన్యముతో నడిగినవారిని తిట్టి కొట్టిన సంగతి మఱచితివికాబోలు!

చిత్రగుప్తుడు (యమునియెదుట)

అయ్యా, వీడు మహాలోభి; ఉదరపోషకుడు. ఒకనాడైనను ఒకరికైనను అన్నముగాని నీరుగాని యిచ్చినపాపానపోలేదు. అత్యాశ. ఎన్ని కొంపలు తీసియో డబ్బు సంపాదించినాడు. దమ్మిడీకి ఏమిచేయమనినను సంతోషముతో నొప్పుకొనును.

యముడు

వీనిని పాములచేత కఱపించుడు. పాషాణము తినిపించుడు.

[చిత్రగుప్తునితో] ఈరోజుకు ఇక పాపాత్ములను విచారించలేను. రేపు తీసికొనిరండు. పొండు.

చిత్రగుప్తుడు

ఇంక ఒక్కటిమాత్ర మున్నది. చిత్తగించి అది విచారించుడు.

[భటులు ఇంకొకని తీసికొనివత్తురు]

పాపాత్ముడు

ఏమి, యీ యన్యాయము. నే నేపాపము చేయలేదే! గోముఖవ్యాఘ్రమువలె నే నే యుద్యమములోను పనిచేయలేదే! వేసిన చందాలను ఏనెపముమీదను ఎగగొట్టలేదే! ఎవరిని అవమానపరచలేదు. ఒకరిని ముందు

నడువమని బయలుదేరదీసి వెనుకకాళ్లకు బుద్ధిచెప్పలేదు. జన్మమెత్తి అబద్ధమాడి యెఱుఁగను. ఎందులకయ్యా మీరు నన్ను పీడించుట ?

చిత్రగుప్తుడు

పాప మొకబాటసారి దొంగలకు వెఱచి ఒక పొదచాటున దాగియుండగా నీవుచూచి దొంగ లడిగిన చెప్పినసంగతి మఱచితివి కాబోలు.

పాపాత్ముడు

అందు నిజమే ఆడితినిగదా?

చిత్రగుప్తుడు

అట్లాగా; [నవ్వి] అది నిజముకాదు. ఆ దొంగలు ఆబాటసారిని చంపి ద్రవ్యము నపహరించిరి. అక్రమముగా ఒకరికి అపకారముగా పరిణమించు నిజము పాపమూలమే.

పాపాత్ముడు

అయ్యో! ఈధర్మసూక్ష్మములను తెలిసికొనక పోతిని. పురాణములువింటే అనేక ధర్మసూక్ష్మములు తెలిసికోవచ్చునని మాతాత చెప్పేవాడు. ఆమాటలు లక్ష్యపెట్టనైతిని. శిక్షనను భవింపవలెను గాబోలు.



# ప్రేమాతిశయము

జంధ్యాల శివన్న శాస్త్రి గారు

అభిమతం బగు రీతి నాట్యంబు సేయ
నేరమిఁ నేర్చినకొలంది నీదుముందుఁ
గుప్పిగంతులు వేతు సంకోచ మెడలి
దానినే నిర్నిమేషనేత్రములఁ గాంచి
యేల యమృతంబు నిటుల వర్షించెదీవు?
అరయు మిటు దాన మత్తుఁడనైతి నెటుల
అడుగు సాగుటలే దున్నగొడవపోయె
ఇదియె నీకు మహానంద మిచ్చు నొక్కొ?

*　*　*　*

అద్భుతుఁడ వీవు నీకు మోహమ్ముఁ గూర్ప
నాడుచుండిననాకె మోహమ్ము గూర్చి
యిచ్చవచ్చినయాట యాడించుచుంటి

*　*　*　*

జ్ఞాతమయ్యెను నాప్రేమకంటె నీదు
ప్రేమ ప్రబలమ్ముకావుట నామనమ్ము
సారె కాకర్షితమ్మును సలుపుచుంటి
వింతపనియేల నీకుఁ బ్రాణేశ! యింత
క్రితమె యాత్మార్పణ మ్మొనర్చితిని గాదె
ప్రియతమా! వేఱుచింతల విడిచితడవు
సేయ కిఁక నన్ను నక్కునఁ జేర్చుకొనుమ!








౮. పడికావలిగోపురము, దక్షిణపునైపు_తిరుమల



౯. శ్రీ వేంకటేశ్వరస్వామి కళ్యాణమండపము—తిరుమల



౧౦. పడికావలిగోపురము, తూర్పువైపు—తిరుమల



# బ్యాంకి బుచ్చిరాజు

[ఒక కల్పితకథ]

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

ఈ పేరు చూడగనే బ్యాంకి యనుమాట యింగ్లీషుమాటగదా, బుచ్చిరాజు శుద్ధ తెలుఁగువాఁడుగదా ఇతని నీయింటి కీయింటి పేరెట్లు వచ్చెనని చదువరులకు సందేహ మొదవవచ్చును. అతనియింటిపేరు కల్లపల్లి వారు. కాని యాసేగు వ్రాతయందేకాని వాడుక యందు లేదు. కల్లపల్లి బుచ్చిరాజుగారనిన నిప్పు డాతని నెవరు నెఱుఁగఁజాలరు. అయితే నిజగృహ నామమును నిర్మూలము చేయు నంతటి యీ బ్యాంకిపే రెట్లువచ్చెనని సందే హింపవచ్చును. అందు కొకకథకలదు.

బుచ్చయ్యకు చిన్నతనముననే తండ్రి పోయినాఁడు. ఆస్తిలేదు. కాన జీవనోపాయ మును గానక భాగీరథీ కొమారుడగు బుచ్చి రాజును, కొమార్తెయగు వెంకాయమ్మను దీసికొని తెనాలి వచ్చినది. భాగీరథమ్మ తా నొక ప్లీడరుగారియింట్లో వంటచేసి నెలజీతము గొనుచు బుచ్చిరాజును మధూకరమునకు బంపి యాయన్నముతో పిల్లలిద్దఱకు భోజన ముగడపుచు దినములు పుచ్చసాగినది. నాలు గేండ్లు యిట్లు గడచినవి. వెంకాయికి పెండ్లి యీడు వచ్చినది. నలుబదేండ్లు మించిన వరునకు నాలుగువందలుపుచ్చుకొని పిల్లనిచ్చి పెండ్లిచేసి భాగీరథమ్మ కన్యచెఱ విడిపించు కొనినది. పిల్లను వెంటనె యత్తవారు తీసికొని వెళ్లిరి. భాగీరథమ్మ యంతటితో కొమారు నకు మధూకరవృత్తి మాన్పించి పెద్దమను ష్యులయిండ్లలో వారము లేర్పఱచెను.

ఈవిధముగా మఱియైదారేండ్లు గడచి నవి. యెట్లెట్లో యేడవతరగతి ముగించి బుచ్చి రాజు నాటకసమాజములలో వెట్టిచాకిరి చేయుచు కూనిరాగములు తీయుచు నాయికా పాత్రముధరించుటలో కుశలుడగుచుండెను. చదువు సంధ్యలు చాలించి సోమరియై తిరుగు టనుజూచి భాగీరథమ్మ బడిపంతులుచేసికొని యైనను బ్రదుకునని బోధనాభ్యాసనపాఠ శాలలో (ట్రైనింగుస్కూలు) ప్రవేశపెట్టెను. రెండేండ్లు యెట్లెట్లో కష్టపడి చదివి యాపరీ క్షనుగూడ బుచ్చిరా జైనా డనిపించెను. ఇప్ప టివలె - "నీవు బ్రాహ్మణుడవా? అయినచో నుద్యోగమీయము, పొమ్మ"ను ప్రత్యక్ష బ్రాహ్మణద్వేష మాకాలపుబ్రాహ్మణేతర మహాశయులకు లేమింజేసి తాలూకాబోర్డు ప్రెసిడెంటు బ్రాహ్మణేతరుడైనను, భాగీర థమ్మ పోయి యాచింపగనే బుచ్చిరాజుకు సులభముగానె యుద్యోగము లభించినది.

బుచ్చిరాజు ఒకపల్లెటూరిబడికి పంతులుగా నియమింపబడుటచే తెనాలి వీడి యాగ్రామమునకు వెళ్లిపోయెను.

౨

పంతులు బుచ్చిరాజు తనయుద్యోగ గ్రామములో నల్లకోటుతో, కుచ్చుపాగతో, కిర్రుచెప్పులతో రీవిగా చరించుచుండెను. బుచ్చిరాజు నాటకగీతములు యువకులను, రాత్రులుచేసెడి రామాయణ కాలక్షేపము వృద్ధులను, నాకర్షించుటచే నాతని పని బాగుగా నుండెను. కాయగూరలు, చల్ల, పుల్లలు వగైరాలు పంతులుకు గ్రామజనులుచితముగా బంపుచుండిరి. పైపెట్టు దసరా రాబడులు మున్నగు యితరమామూళ్లుగూడ వచ్చుచుండెను. మఱియు బుచ్చిరాజు చిన్నతనమునుండియు మాటలలో చతురుఁడు; ఇతరులవద్ద రాబట్టుకొనుటలో దిట్ట; తనసొమ్ము వ్యయపఱచుటలో గట్టి; కాన కొద్దిలో కొద్ది సొంతమునకు వ్యయపఱచుకొని మిగిలినది వెనుక వేయుచుండెను.

దైవానుగ్రహమువలన కొమారునకు నుద్యోగము లభించినది. ఇక నొక యింటివానిని జేయవలయుననెడి కోరికయొకటి భాగీరథమ్మ మనస్సున పీడింపుచుండెను. అందుకొఱకు భాగీరథమ్మ భగీరథప్రయత్నములు చేయసాగెను. ఊరూరుతిరుగుచుండెను. కన్నకన్న వారిని ప్రార్థింపుచుండెను. ఈకార్యసాఫల్యముకొఱకామె తాత్కాలికముగా దనవంటకత్తె తనమునుగూడ చాలించుకొనెను. పుత్త్రప్రేమ యనుపమానమైనదిగదా! పండ్లు కండ్లు లేని ముదుసళ్లకును, పొట్టపొడిచిన యక్షరములేని నిరక్షర కుక్షులకును, గివ్వగిడించలేని యప్రయోజకులకును, కన్యకిలసీయ వెనుదీయని తల్లిదండ్రులుగల మననిర్భాగ్య దేశములో బుచ్చయ్యవంటి సంపాదనాపరునకు కన్యదొరకుట యొకకష్టమా!

మట్టిపూడిలో వేంకటసుబ్బయ్యగారొక సామాన్యగృహస్థుఁడు. ఆయనకు నేఁడుగురు కుమార్తెలు. నాలుగవపిల్లకు మనువుకుదుర్చుకొని పెండ్లి చేయు ప్రయత్నముమీద ఉండెను. అయిదవకొమార్తెయగు పున్నమ్మ యేడేండ్లపిల్ల. పాలదంతములూడిన బోసినోటితో, దుబ్బుతలతో, సేఁడుచేతులతో, జేనెడుజుట్టునకు బారెడునూలు బందుపెట్టి యల్లిన జడతో, బెత్తెడు బెత్తెడు తెల్లపువ్వుల పరికిణీకట్టుకొని బొడ్డునదోపుకొనిన పలుగురాళ్ల యచ్చనగాయలతో, కాపుపిల్లలతో గలిసి విచ్చలవిడిగా నాడుకొనుచున్నది. భాగీరథమ్మ వెళ్లి యాపిల్లను నాకొమారునకీయవలసినదని యడిగినది. అడుగుటయే కాదు; నిర్బంధించినది. ఆడపిల్లలెక్కువగా గలవాడగుటచే సొమ్ము కలిసివచ్చునని వేంకటసుబ్బయ్యగూడ యొప్పుకొనినాఁడు.

భాగీరథమ్మ యఖండ కృషివలననైననేమి, గ్రామస్థులసాహాయ్యమువలననైననేమి, బుచ్చిరాజు సంపాదనాచాకచక్యమువలననైననేమి బుచ్చిరాజువివాహమైనది. సప్తవర్షకన్యాపరిగ్రహముచేసి బుచ్చిరాజు గృహస్థైనాడు. కన్నె చిన్నదైనను జందెము పెద్దదిపడినది. ఇక నేమికావలెను?

## 3

వివాహమైన యేడేండ్లకు పున్నమ్మ కాపురమునకు వచ్చినది. పెద్దతనమువచ్చుటచే భాగీరథమ్మకూడ కొమారునివద్దకు చేరినది. తల్లి భార్యలను పోషించుభారము, పాపము, బుచ్చిరాజు నెత్తిపైనొక్కమాఱే పడినది. బుచ్చిరాజు చిన్నతనమునుండియు ఒంటరితనమునకు నలవాటుపడినవాడు; పొత్తుగిట్టనిపొట్లచెట్టు; పైసరూకగా మూటగట్టనేర్చిన లోభి కాని శనగపప్పు మూడుదినములు దాచుకొని తిను పొదుపరి. ఒక్కకోటుకుట్టించుకొనెనేని మరలమరల మరమ్మతులతో పురుషాంతరములు గడపును. ఒక్కగానొక్కతోబుట్టువునకు పదేండ్లనుండి యుద్యోగముచేయుచుగూడ, నొక్కచీరకాదుగదా రెండుగజముల రవికలగుడ్డకాదుగదా, ఒక్కకాని కుంకుమపొట్లము కొనియిచ్చిన పాపమున బోలేదు. అట్టివానికి అమాంతముగ నొక్కమాఱు మాతృపత్నీసంరక్షణబాధ్యత పైబడినప్పుడు మిన్నువిఱిగి మీదబడినట్లుండదా! పాపము! పప్పు, ఉప్పు, బియ్యాము, వగైరాలు యింటికి తీసికొనిరావలసివచ్చినప్పుడెల్ల బుచ్చయ్య ప్రాణము విలవిలలాడుచుండెను. నానాపాట్లుపడి తల్లి చదువుసంధ్యలుచెప్పించి, పెండ్లిచేసి నానావిధముల తనపురోభివృద్ధికి దోడ్పడిననాడును, యేడేండ్లునిండని పసిబాలను పెండ్లాడి పల్లకీలోయెక్కి యూరేగునాడును, వీరిసంరక్షణబాధ్యత నాదేనని బుచ్చిరాజు తలపలేదు కాబోలు, పాపము!

పున్నమ్మ శ్రీమంతుల యింటియాడుపడుచుకాకున్నను అన్నవస్త్రములకు లోటైనచోటునుండి వచ్చినది కాదు. పాడిపంటలు సమృద్ధిగాగలిగిన పల్లెటూరి కుటుంబములో బుట్టి పదిమందితో మెలగిన పిల్ల. చిట్టెడుపొట్టెడు గింజలతో జేయు బస్తీరంగరింపు లాబాలకు సరిపడవు. పదిపదార్థములు లేకున్నను పట్టెడు పప్పును, పట్టెడుగోంగూర పచ్చడిని వేసికొని పదిముద్దలు మెక్కి కంచెడన్నములో గిజ్జునదిరుగునట్లు చిక్కనిమజ్జిగ బోసికొని కడుపునిండ తినమరగిన మనిషి. తిండియందెంత మోటయో, పనియందంత మోట; పనియందెంత మోటయో, యునికియందంత మోట; ఉనికియందెంత మోటయో మాటయందంత మోట; కాని స్వాభిమానమునకు మాత్రము పున్నమ్మ పెట్టినది పేరు. పొరుగింట అగ్గిపుడకనైనను నడిగి తెచ్చుట కిచ్చగింపదు. పరులగొడవకు తాను బోదు; తనగొడవ నొరులతో జెప్పదు. తన్నెవరైన కాని మాటలాడిరా యోర్వదు. ఒకటికి నాల్గుపెట్టును. ఇది పున్నమ్మస్వభావము. చేతి దమ్మిడీవదలకుండ కల్లబొల్లిమాటలతో కాలక్షేపముచేయు బుచ్చిరాజుదృష్టిలో పున్నమ్మ వట్టిపనికిమాలినదిగా దోచినది. నలుగురను మంచిమాటలాడి యేదియు తెచ్చుకొనుట చేతగాదు. తెస్తే తింటాను; చస్తేముండమోస్తా"నని కూర్చుంటుందని బుచ్చిరాజు పున్నమ్మను దూషింపసాగినాడు. ఇంటింట యిచ్చకములాడి పనిపాటలుచేసి సంపాదింప నలవాటుపడిన భాగీరథమ్మకు

గూడ పున్నమ్మ బుద్ధులు రుచింపలేదు. కాని పున్నమ్మను చీవాట్లుపెట్టుటలోను, చీదరించుటలోను తల్లికొడుకు లేకమైరి. నిత్యము అన్నములోనికి, జేసికొనిన పప్పు, కూర, వగైరా పదార్థములలో కొంతకొమారునకు వేసి మిగిలినరవ్వంత తనవిస్తరిలో రాల్చుకొని యింతగోగు ఉండదో, చింత ఉండదో మాగాయబద్దయో, కోడలికంచములో వేసి చూరునీళ్లవంటి మజ్జిగనీళ్లను గిన్నెలోబోసి దగ్గరపెట్టి భాగీరథమ్మ పొరుగింటముచ్చటలాడ వెళ్లెడిది. పెండ్లాడునాడు పెనిమిటికుండు సంబరమును, కోడలువచ్చుననప్పుడు అత్తగారికుండెడి సంబరమును, స్థిరమును మర్మరహితమును నైనచో నేటేట కోడండ్రజలమరణముల వినవలసినకర్మమేమి మనకు ?

ఒక్కయేడాది గడచినది. పున్నమ్మ యెటులనో బయటపడకుండ కాలక్షేపము చేసినది. ఇంతలో పున్నమ్మకు నెలతప్పినది. నిత్యము తినుపదార్థములయందు యిష్టము తప్పినది. క్రొత్తక్రొత్తవానిపై కోరిక లుదయింపసాగినవి. కాని యెట్లుతీరును? ఎవరు చేసిపెట్టుదురు ? కాకకాక కొమారునకు వివాహమైనందులకు మనుమల నెత్తుయోగము పట్టినదిగదా యను సంతసముచేనైన భాగీరథమ్మ కోడలికోరికలం దీర్ప యత్నింపలేదు. అన్నము రుచింపకపోవుటచే నిత్యోపవాసములు చేసిచేసి పున్నమ్మ కృశించిపోయినది. మనిషి చిక్కినకొలంది మనస్సున క్రోధాగ్ని విస్తరించినది. భరింపలేక పున్నమ్మ యొకనాడు విడివడినది. తిండిపెట్టకచంపుచున్నారని అత్తను మగనిని నానామాటలని శోకముపెట్టుచు నట్టింట కూర్చున్నది. "ఇంటబడి దయ్యమువలె తింటూ, తినలేదని వీథికెక్కి అల్లరిచేస్తున్నావా" అని బుచ్చిరాజు భార్యను రెండు కొట్టెను. "తిని లేదంటే తిరిచినా పుట్టదు. పూటపూటా రెండుకంచాలు మెక్కుతూ వీధిలో అల్లరిచేస్తున్నది చూడు" మని పండ్లు పటపటకొఱుకుచు భాగీరథమ్మ గూడ కోడలిని రెండుదెబ్బలు వేయవచ్చెను. ఆసవ్వడి కనిపెట్టి పున్నమ్మ యత్తగారిచేతిని కసక్కున నోట కఱచుకొనెను. కుయ్యో! మొఱ్ఱో! యని భాగీరథమ్మ యూరునాడు లేకముగునట్లు గోలపెట్టెను. ఇంతలో బుచ్చిరాజువచ్చి తల్లిని తప్పించి రెండు బాదెను. పున్నమ్మ నోటిపట్టు వదలినది. "ఆరి దొంగముండాకొడుకా, పెండ్లాము నోటికితోకలుస్తుంటే విడిపించవలిసిందిపోయి, నీవుకూడా చావ కొట్టావట్రా ! నీకుచ్చితం కూలిపోను !!" అని కొమారునిగూడ భాగీరథమ్మ శపింపసాగెను. "అయ్యో, నన్ను తిట్టుతావేమిటమ్మా! నిన్ను కొట్టడం నీమేలుకొఱకే; ఆలోచించావో లేదో. నేను కొట్టకపోతే అది నీచెయ్యి వదిలేదేనా? అన్యాయంగా చెయ్యి రెండుముక్కలైపోక పోయిందా? అనక యేమనుకుంటే యేముంది. అందుచేత కొట్టితినిగాని నీమీద పగచేతనటమ్మా !" యని బుచ్చిరాజు తల్లిని ఊరడించెను. బుచ్చయ్య చెప్పిన సమాధానమునకు జగడముచూడవచ్చిన పిన్నపెద్ద లెల్లరు పకపక నవ్విరి. ఈజగడములో తప్పు భాగీరథమ్మదో, బుచ్చిరాజుదో, పున్నమ్మదో, ప్రేక్ష

కులు నిర్ణయింపలేకపోయిరి. ఒకచేయి కోడలినోటఁ జిక్కినప్పుడు భాగీరథమ్మ రెండవచేయి యేమిచేసినది? కాన పున్నమ్మ మొగమున నైదు గోటిపీకులు! భాగీరథమ్మ చేతికి నాలుగుపంటినొక్కులు! తగవు ముగిసినది. మఱునాఁడు గొల్లున గోలెత్తుచు భాగీరథమ్మ కొమార్తెయింటికి లేచిపోయినది. భాగీరథమ్మ కొమార్తెను అమ్మి కొమారుని వృద్ధిలోనికిఁ దెచ్చినది. వృద్ధిలోనికిదెచ్చిన కొమారుడు వెడలగొట్టినాఁడు. అమ్మకొనినకొమార్తె యన్నముపెట్టుట కాధారమైనది. చిత్రముగదా దైవఘటన!

౪

ఏడుమాసములు వచ్చినవి పున్నమ్మకు. సూడిదచేయవలెనని చలిమిడి, అరిసెలు, మణుగుబూరెలు, పసపు, కుంకుమ, పండ్లు, ఆకులు, పోకలు, చీర, రవికెలగుడ్డ వగైరా వస్తువులెల్ల తీసికొని పున్నమ్మ తల్లివచ్చినది. తెచ్చినవస్తువు లన్నియు బైటపెట్టువఱకూరకొని సాయంత్రపువేళ ముత్తైదువు లందఱను బిలిచి వేడుకచేయవలెననుకొనువేళకు "మాయింట నానువాయిత లేదు. ముత్తైదువులను బిలుచుటకు వీలుగా" దని బుచ్చిరాజు అత్తగారిని నిరోధించెను. పెండ్లియే యానవాయితలేని బుచ్చయ్యయింట గర్భవతుల సూడిదల యానువాయిత యుండునా! కన్నతల్లి కోపమువచ్చి వెళ్లుచున్నప్పుడు వలదనలేదు; వెళ్లినతరువాత రమ్మనలేదు; అట్టివాఁడు బుచ్చిరాజు. అత్తగారు వచ్చి రెండు దినములైనది. మూఁడవనాఁటి యుదయము బడికి వెళ్లబోవుచు బుచ్చిరాజు అత్తగారివద్దకువచ్చి "నేను కొద్దిజీతగాఁడను; నాది పేద కాపురము. ఈదిన మెవరింటికి వారు వెళ్లిన దప్ప లేకున్న నేను భరింపజాల"నని చెప్పెను. అత్తగారి మనస్సు చివుక్కుమనెను. కన్నుల నీరువచ్చెను. అయినను మానాభిమానములను సిగ్గుఎగ్గులను గూడ తోపింపజేయునిది గదా కడుపుతీపు! కాన యామెయల్లునిజూచి "నాయనా! నేను యీపూటనే వెళ్లెదను. కాని పిల్లకు యేడవమాసముగూడ వచ్చినది గదా పురిటికంపవా" యనెను. "మహారాజులాగ తీసికొనివెళ్లండి నా యభ్యంతరము లే" దని బుచ్చిరాజు నిస్సంకోచముగా బలికెను. అత్తగారికి రెండుపూట లన్నము పెట్టజాల ననిన బుచ్చిరాజునకు భార్యభారముకూడ తీరుననిన సంబరము కాదా! పున్నమ్మతల్లి రెండెడ్ల బండి కట్టించుకొని యాపూటనే స్వగ్రామము వెళ్లిపోయెను. భార్య వెళ్లినందులకు చింతింపలేదు గాని యత్తయు, భార్యయు పిండివంటలు వగైరా పదార్థములు వదలిపెట్టివెళ్లినందులకు మాత్రము బుచ్చిరాజు మహాసంతసించెను.

పున్నమ్మ పుట్టినింటికి వెళ్లిన మూఁడు మాసములకు ప్రసవమైనట్లును, ఆడ శిశువు కలిగినట్లును వార్తగల శుభలేఖను తీసికొని బ్రాహ్మణుఁ డొకఁడు బుచ్చిరాజు వద్దకు వచ్చెను. ఆవార్తను జూచుకొని బుచ్చిరాజు నిర్విణ్ణుడైపోయెను. గుండె కొట్టుకొని "అయ్యో! ఆడపిల్ల! ఆడపిల్ల! ఆడపిల్లే! ఏడవలేకపోయినది. వెధవకాన్పు! ఈ ఆడచెత్తను కనుటకేనా అన్నిసూడిదలు, అన్ని ముచ్చ

బులు." అని విసుగుకొని, తిట్టుకొని, చీదరించు
కొని నా నాకంగారుపడెను. బుచ్చయ్య కొంచెం
స్థిమితపడిన వెనుక శుభలేఖగొనివచ్చిన బ్రాహ్మ
ణుడు, "అయ్యా! నాకు సెలవిప్పించరా"
అనెను.

బు—చిత్తము. వెళ్లండి, బాబు. దీని కింత ప్రార్థన
యెందుకు?

బ్రా—మరి నాకు కట్నమిప్పించరా?

బు—(దిగ్భ్రమతో) ఏమికట్న మయ్యా!

బ్రా—శుభవర్తమానము తెచ్చిన బ్రాహ్మణు
నకు పంచెలచాపు యిచ్చే ఆనవాయి
తండీ!

బు—పంచెలచాపా! ఘనుడవే! ఇంకా నూట
పదార్లు మామూలన్నావు కాదు! ఒకవర
హాపట్టుకొనివెళ్లు గుంటూరులో పంచెల
చాపు కొనుక్కోవచ్చును.

బ్రా—చిత్తము, అదే దయచేయండి.

బు—ఎవరు? నేనియనా? ఆడపిల్ల పుట్టిందేమో
స్వామీ యని నే నేడుస్తుంటే పంచెలచా
పిమ్మని నీయేడుపొకటా! అసలు నిన్ను
రమ్మన్న దెవరు? కానికార్డు వ్రాయక
పోయినారా; తప్పితే ప్రారుకోక పోయి
నారా! నా భార్యాబిడ్డ యింటికి వచ్చిన
నాడే చూచుకొందునుగదా!

బ్రా—నాకేమి తెలుసునండీ, వారు పంపితే
వచ్చాను. లేకపోతే నా కీకాళ్ల తీపెందుకు?

బు—అవునండీ; మామామముండాకొడుక్కు
బుద్ధిలేదు. మీ తప్పేముంది.

బ్రా—ఎందుకయ్యా! పెద్దవాడు ఆయనను
తిట్టుతావు? పాపము ఆచిన్నది మూడు
రోజులు కష్టపడి ప్రసవించింది. తొలి
కాన్పు. వారికి సంతోషంగా ఉండి పం
పించారు.

బు—ఎన్నిదినములు కష్టపడితేనేమి పిల్ల
జీవించే ఉన్నది కాదా!

బ్రా—ఛీ అప్రాచ్యుడా, ఎంతమాటన్నావు?
ఆడపిల్లంటే యింత ద్వేషం కలవాడవు
కాబట్టే నా ముప్పదేండ్లు దాటినతరువాత
ఏనుగుగున్నవలె ఉండి యేడేండ్లపిల్లను
పెండ్లాడిందాకా ఏడ్చావు. పెండ్లాడటాని
కాడపిల్లలు, కనటానికి మగపిల్లలు కావ
లెనా? నీవు పుట్టి వంశ ముద్ధరించావు;
ఇక నీకు కొడుకుపుట్టి నిన్నుద్ధరిస్తాడు!
చాలు, చాలు! నాకు డబ్బునద్దు. గిబ్బ
వద్దు. నాల్గుపరుగులు నడిచివస్తే నాకేమి
శ్రమ? నాఘల మెక్కడకు పోదు. నీబుణ
మెక్కడకు పోదు." అని యాబ్రాహ్మ
ణుడు నానామాటలాడి చివాలున లేచి
పోయినాడు. ఎన్నితిట్టినేమి భోజన
వ్యయమైన తగులకుండ బోడడు వదలి
నందులకు బుచ్చిరాజుకు పరమసంతోష
మైనది.

పిల్లను గోవృద్ధనపునకో యమ్మి నాల్గు
వందలు లాభముతీయుటకు పున్నమ్మ యంగీ
కరించునను విశ్వాసము బుచ్చిరాజు కుండె
నేని యాడపిల్ల కలిగినందులకు బుచ్చిరా
జెంతైన సంతసించువాడే; భార్య భాగ్య వరాల
భాగ్యయని మురియువాడే; కాని భార్యయెడ
బుచ్చిరాజు కట్టి విశ్వాసము లేదు. పున్నమ్మ
తండ్రి యేడుగురుకొమార్తెలు కలవాడైనను

విశేషవిత్తవంతుఁడు కాకపోయినను నందజను కన్యాదానముచేసి పితృదేవతల తరియింపఁజేసెను గాని కన్యలయెడ నెట్టియాసుర బుద్ధిని తలపెట్టినవాఁడు కాఁడు. ఆయనచేసిన సంబంధము లన్నిటిలో బుచ్చయ్యసంబంధమే తక్కువైనది. యది పున్నమ్మ దురదృష్ట మనవలెను గాని తండ్రిలోప మనరాదు. పున్నమ్మగూడ తండ్రివంటి యభిమానవతియే యని బుచ్చిరాజు నమ్మకము; కనుకనే బుచ్చిరాజు కంత కంగారు కసుపు, మంట ! పాపము !

౫

పున్నమ్మకొమార్తె కైదుమాసములు వచ్చినవి. పిల్ల చక్కగా పుష్టిచేసి బంతివలె నున్నది. 'ఊఁ ఆఁ' యని యుయ్యాలలో బరుండి ముచ్చటలాడుచు కేకిసలుకొట్టి నవ్వుచు ముద్దుగూర్చుచున్నది. బుచ్చిరాజు వచ్చి కొమార్తెను చూచిపోఁడయ్యె. బారసాల మాట తలపెట్టడయ్యె. తుదకు భార్యాబిడ్డలను తనయింటికి తీసికొనిపోవుటకుగూడ ప్రయత్నింపఁడయ్యె. పున్నమ్మ పుట్టింటికి వచ్చినతరువాత యిద్దరక్కలు వచ్చి పురుడు పోసికొని వెళ్లిరి. పున్నమ్మ మాత్రము యెనిమిదిమాసములనుండి పుట్టింటనే పడియున్నది. పిల్ల కైదుమాసములు వచ్చినను గూడ యింకను నత్తవారియింటి కేగకుండ పుట్టింటనే యుండుట పున్నమ్మ కెంతో యవమానకరముగ నుండెను. మఱియు మిక్కిలి దుఃఖముగా గూడ నుండెను. తుదకు పున్నమ్మ గత్యంతరములేక తానే స్వయముగ పెనిమిటివద్దకు బోవ సమకట్టెను. తన్ను భర్తవద్దకు బంపవలసినదని తండ్రి నడిగెను. తండ్రి కోపముతో మండిపడుచు "భార్యను పంపెంచినదాది సుఖసమాచారమును దెలిసికొనుటకైన నొక్కయుత్తరము వ్రాయని నీచునికొంపకు అతను పంపమని అడుగకుండా, అన్నము పెట్టలేనివానివలె నేనుముందుగా పంపుతానా, నావల్లగా"దని కోపించి పలికెను. పున్నమ్మ తల్లి నడిగెను. "నాబొందిలో యూపిరుండగా నీగడప త్రొక్క" నని తల్లి యనెను. పాపము! పున్నమ్మ యేమి చేయును? ఆహారనిద్రలులేకుండ తలపోయ సాగెను. ఇక పున్నమ్మ సొదచూడలేక తల్లిదండ్రులు మేనమామను తోడొసగి పెనిమిటి వద్దకు బంపిరి.

పున్నమ్మను జూచి బుచ్చిరాజు నిర్ఘాంతపోయి "ఏమిపుట్టిమునిగిందనివచ్చావు? ఎవరు రమ్మంటే వచ్చావు?" అని యాగ్రహముతో ప్రశ్నించెను. "నాయింటికి నేను వచ్చుటకు, ఒకరిపిలుపేల" నని పున్నమ్మ యింటిలోనికి వెళ్లెను. బుచ్చిరాజు భార్యవెంబడే లోపలికి వెళ్లి "ఆయనగూడ యీపూట యిక్కడనే భోజనంచేస్తాడా యేమి" టనెను. "అయ్యో! అవ్వూరునుంచి తీసికొనివచ్చిన వాడికి భోజనం గూడ పెట్టకుండా ,పంపుతారా యేమి"టని పున్నమ్మ కనుల నీరుపెట్టుకొనుచు దీనముగా బలికెను. బుచ్చిరాజు మాఱు మాటాడకుండ ఒకశేరు బియ్యమును ఒకపావుశేరు కందిపప్పును తెచ్చి యింటిలో బోసి బడికి వెళ్లెను. పున్నమ్మ వెంటనె వంటచేసి మామకు భోజ

సముపెట్టి పంపించెను. నాటినుండి భార్యా
భర్తలకు కరిమకరిసమరము ప్రారంభమైనది.
భార్య తెమ్మనినది తీసికొని రాకుండుట
బుచ్చియ్యవ్రతము; మగడు చేయుమనినది
చేయకపోవుట పున్నమ్మవ్రతము. ఇంక సమ
రముగాక సఖ్యత కుదురు టెట్లు? పున్నమ్మ
అన్నములోనికి కూర, పప్పు, చేసెద ననును.
"గోంగూరపచ్చడి చాలును. ఏమియు చేయ
వలదనును బుచ్చిరాజు. వాకిట నిలిచిన భిక్షు
గానికి భిక్షమును, ఇంటికివచ్చిన బంధువునకు
భోజనమును బెట్టుటకు పున్నమ్మ కుతుక
పడును. నాయింట నట్టి యాటలు సాగవని
బుచ్చిరాజు జగడమాడును. పున్నమ్మ పిల్ల
కాముదమనును, వెంటనే బుచ్చిరాజు నావద్ద
డబ్బు లేదనును. పిల్లకొక క్రొత్తచొక్కా
యనును పున్నమ్మ. ఊరిలో పేదపిల్లలందఱు
చొక్కాయతొడుగుకొనుచున్నారాయనును
బుచ్చిరాజు. ఇంట నిప్పుపెట్టలేదు. తీసికొని
రండని భార్యయనును. ప్రొద్దున పొరిగింట
నిప్పుతెచ్చుకొని సాయంత్రము దీపము వెలి
గించుకొని తెచ్చుకొనిన దినములు వెళ్లవా
యని బుచ్చిరాజు సలహాయిచ్చును. ఇట్టి దరి
ద్రపుపనులు నాచేతగావని పున్నమ్మ ఛీంక
రించును. ఈ దుబారాఖర్చులు నేచేయలేనని
బుచ్చిరాజు అంకెలు వెట్టును. ఈ విధముగా
బుచ్చిరాజు కృపణస్వభావము పున్నమ్మకు
గిట్టక పున్నమ్మ విరివిబుద్ధి బుచ్చిరాజుకు
నచ్చక నిత్యవివాదములతో అర్ధపస్తులతో కటి
కిఉపవాసములతో కాలము గడచుచున్నది.
అత్యల్పవిషయములోగూడ భర్తయొక్క లుబ్ధ
చేష్టచూచిచూచి పున్నమ్మ ప్రాణము విసిగి
నది. క్రమక్రమముగా భర్తయందు గౌర
వముపోయి భయభక్తులుసడలించి ఎదురుమాట
లాడనేర్చి జగడమాడసాహసించి సున్నితపిలు
పులు దూరమై తిట్టుటకు వెనుదీయనట్లుగా
మారిపోయినది పున్నమ్మస్వభావము. పిల్లకు
యెనిమిదినెలలు వచ్చుటచే అన్నప్రాశనము
చేయవలెనని పున్నమ్మ యెంతయో కుతూ
హల పడినది. కాని బుచ్చిరాజు, భార్య బావి
వద్దకు నీళ్లకువెళ్లగా జూచి పిల్లను తిన్నగా
యెంగిలివిస్తరివద్దకు వదలెను. ఆపిల్ల చల్లగా
ప్రాకివెళ్లి విస్తరివద్ద కూర్చుండి యెంగిలిమెతు
కులు తీసి నోటబెట్టుకొనినది. ఇంతలో పున్న
మ్మవచ్చి తానే యన్నప్రాశనము గావించు
కొనిన పిల్లనుజూచి మగనిని నాల్గు శపించి
తనదురదృష్టమునకు గొంత దుఃఖించి
కన్నులు తుడుచుకొని యూరుకొనెను. అంత
టితో పిల్లయన్నప్రాశనబాధ బుచ్చిరాజుకు
పోయినది.

పున్నమ్మ పుట్టింటినుండి తెచ్చుకొనిన
పాత్రిగుడ్డలన్నియు చినిగిపోయినవి. పిల్లను
వట్టినులక మంచముపై పరుండబెట్టుటచే
పిల్ల వెన్నునను, చేతులపైనను నులకవత్తుకొని
యెఱ్ఱగా నులకత్రాళ్లవలె అచ్చులేర్పడినవి.
పిల్లయొడలును జూచునప్పటికి పున్నమ్మ
కనులనుండి బొటబొట నీళ్లు కారినవి. భరింప
లేక నాటిరాత్రి పున్నమ్మ "పిల్లకు పక్క
గుడ్డ పైగుడ్డలేదు. వట్టినులకపై పడుకోపెడితే
నులక ఒత్తుకుంటున్నది. ఒక్క జంపకాణా

ముఖుణ్ణా, ఒకదుప్పటైనా తెచ్చిపెట్టమని మగ
నిని యడిగెను.

బు——నావద్ద డబ్బులేదు. జంబుకానాలు,
శాలువలు నేను కొనలేను.

పు——వట్టిమంచముమీద పడుకోబెడ్తే నులక
వత్తుకోదూ, రాత్రి నత్తుకున్న అద్దలు
చూడండి యెఱ్ఱగా ఎట్లాగున్న యో.

బు——నులకవత్తుకుంటే నేలమీద పడుకోబెట్టు.
పదినెలల పసిపిల్లకు పెద్ద జంబుకానాలు
కావాలె కాబోలు.

బుచ్చిరాజు పలికిన పలుకులకు పున్నమ్మ
కున్న భయ్యము మండిపోయినది. ఆకోపముతో
రిప్పనబోయి, "పదినెలల పసిముండకు కాక
పోతే పక్కగుడ్డలు నలుబదియేళ్ల పెద్ద చచ్చి
నాళ్లి" కెందుకని మగని కప్పుకొనిన దుప్ప
టిని లాగుకొని వచ్చి పిల్లకు పక్కవేసినది.
ఆదశ్క్కి యంతా సకారముచూచి బుచ్చిరాజు
కిక్కురుమనకుండ పడుకొన్నాడు. అధర్మియ
గుభర్తకు ధర్మపత్నియగుసతి యెప్పటికైన
సింహస్వప్నమేగదా.



# "నవ్వు నవరత్నములు"

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

పలుకులను దేనె లొలుకఁగఁ బలుకరించు
మోముతోనచ్చు మధుమాసమునకు
స్వాగతంబిడి మన్నింపు స్వచ్ఛహృదయ [నలరి
మట్టి తెల్లంబుగాఁగ మోహంబు దూఁగ
కలకలలు మీఱఁ గన్నులకఱువుదీర
మల్లికాసూనముఖమున మసలియాడు
తెల్లముత్తెములను రువ్వు తేట నవ్వ
చాలుచాలును! హృదయ ప్రశాంతమునకు.

మోము నిర్మలరాగసుభూషితమ్ము
అంతరంగంబు మధురసాయనపుఁ జేటి
యనవరతమందు నిందు తునుదార్తిఁ దిరుగు
యాచకాళికి నలయు నాహారమిడుట
జీవితాశయు మట్టి సచ్ఛీలమతిని
వరిలుఁ గాశికా రత్నపుష్పమ్మునుండి
కెంపులను రువ్వ మది పులకించు నవ్వ
చాలుచాలును! హృదయ ప్రశాంతమునకు.

నలి తొలియులేని మేనిక్రొందళ్కుతోడఁ
దలఁప వలపించి మించు నెత్తావితోడ
తేర్పుమైజారు నోటితేనియలతోడ
గానమిడి సేవఁజేయు భృంగములతోడ
నిత్యకళ్యాణముగ జీవనియతిఁ గడపు
వికచపున్నాగముఖమున విందుసేయు

వజ్రములరువ్వ కెంపులు సంపదలనవ్వ
చాలు చాలును! హృదయప్రశాంతమునకు.

కాలగతి లెక్కసేయక కాంక్షఁగొనక
తాపి వీడక లేని తత్తరముఁబడక
ఉన్నదే భాగ్యమని తృప్తినొందనట్లు
కంటకావృతమయ్యు వికలతఁగనక
రక్తిలో రక్తి దోఁప విరక్తిఁ జెందు
శోభనప్రదమైన గులాబినుండి
పగడములరువ్వ విమలభావంపు నవ్వ
చాలు చాలును! హృదయప్రశాంతమునకు.

భ్రమ జనింపఁగఁ దగినహాసమ్ము లేక
హృదయమాధుర్య మొకలవమేని లేక
తిక్కఁగలవాని సహజమార్దవము లేక
కలసిమసలు హితాళి సంగతియు లేక
అన్నియుం గల్గినట్టి లోనలరి పొంగు
గంధఫలి మోమునందునఁ జిందులాడు
పచ్చలను రువ్వ తృప్తభావంపునవ్వ
చాలు చాలును హృదయప్రశాంతమునకు.

పవనభక్షుణ కీఁకొని వసము సొచ్చి
కలుగుభోగేచ్ఛలెల్ల చీఁకటిని డాచి
కువలయానందమునకు నొక్కులను దీర్చి
జీవనము జీవనముపొంటెఁ జేసికొనుచు
మనుగడనుసగమ్ము యోగనిద్రను మరల్చి
వరలు నీలోత్పలముఖమ్మునయి నటించు
నీలములరువ్వ నర్మిలి నెఱపు నవ్వ
చాలు చాలును! హృదయప్రశాంతమునకు.

మెత్తనయి జాఱుచాపనెమ్మను గలిగి
చేరి యొండొంటు నాటుకుచ్ఛిల్లితోడ
సరసగతి నంద మట్టి క్రమ్మగిలు మసలి
యలరు మోహనకృష్ణు పీతాంబరాంగు
తలఁపఁగా నాకె సాటి యనఁదిమురిసి
విడిన చేమంతిముఖమున వెలుఁగుఁ జిలికి
కోరి గోమేధికము రువ్వ క్రొత్తనవ్వ
చాలు చాలును! హృదయప్రశాంతమునకు.

వన్నియల మాని హంగులనమ్ము మాని
వేషబాహుళ్యమును రోసి ప్రేముఁ జేసి
వెసనకునైనఁ బ్రతిఫలాపేక్షఁ ద్రోసి
తగఁ "బరోపకారార్థ మిదం శరీర"
మనుచు మనుచును లోకసౌఖ్యమును గూర్చు
మాలతీసూనముఖమున లీల నాడు
పుష్యరాగములను రువ్వ ముద్దునవ్వ
చాలు చాలును! హృదయప్రశాంతమునకు.

నిర్మలంబయి సౌరభాన్వితము నయ్యు
వన్నెలూనక వట్టిడంబముల ననక
అడఁగి మడఁగియు దిక్కుల నలమికొనుచు
రాపులకు డస్సిపోక మార్దవము విడక
శాంతమే భూషణమ్మను చదువు నెవ్వ
పొగడ ముఖమున భూషణంబుగ నటించి
మించు వైడూర్యములరువ్వ మేలినవ్వ
చాలుచాలును హృదయ ప్రశాంతమునకు.





# జైనులమతకథలు

## 8. మృగసేనధీవరుని అహింసా వ్రతకథ

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు

శ్లో. ఓంకార బిందు సంయుక్తం నిత్యం ధ్యాయంతి యోగినః;
కామదం మోక్షదం చైవ ఓంకారాయ నమో నమః — అభయనందిసూరి.

భారతవర్షంలో వుండే తక్కిన అన్నిదేశాల కంటె అవంతిదేశానికి ప్రసిద్ధి ఎక్కువ. ఎంతమందో మతప్రచారకులు, ఆచార్యపురుషులు, కవికులగురువులు, దార్శనికులు, ధర్మసందేశకులు, మొదలయినవారందఱును దాదాపుగా అవంతి ప్రాంతాలలో జన్మించినవారే. అవంతి కేవలమూ ఒక్క మహాపురుషులకు మాత్రమే కాకుండా, ప్రపంచంలో ప్రసిద్ధికెక్కిన ఉత్తమోత్తమాలగు రత్నాలకన్నింటికిన్నీ పెట్టిందేభిక్ష. కాబట్టే అవంతి చారిత్రికంగా మనకు మేల్బంతిఅయింది.

ప్రస్తుతం మనమనుకున్నే అవంతిదేశంలోనే శిరీషపురమని వకగ్రామం ఉన్నది. ఈశిరీషమే ఇప్పటికాలంలో దిరిసీ అని వాడుతున్నారు. శిరీషగ్రామం చిన్న పల్లెటూరు. అయినా ప్రధాననగరమైన అవంతికి దగ్గఱగా వుండడంచేత, బస్తిఅనే అనవలసివుంటుంది. అంటే ఆగ్రామస్థులు తరుచు గ్రామీణ (పల్లెటూరి) జీవనంకలవాళ్లుగా వుండక, పట్నవాసాలవాడుకలకు అలవాటుపడి వుంటూఉండేవారని అర్థము. మన కథానాయకుడగు మృగసేనుడు పుట్టింది ఈశిరీషమే.

మృగసేనుడు జాతినిబట్టి జాలరి. అంటే తాతలు ముత్తాతలు మొదలయిన తరతరాలనుండి అతనివృత్తి జాలరివృత్తి. ప్రొద్దుట లేవడంతోటే చేపలుపట్టేవలలు, గాలాలు, ఉరితాళ్లు, ఉచ్చులు మొదలయిన పరికరాలతో సిప్రానదిలోకి పుట్టగోచీతో అవతరించడమున్నూ ప్రొద్దస్తమానమూ చిన్నచేపలు పెద్దచేపలు చిన్నమీలు పొలసులు నత్తలు మొదలుగావుండే జలచరాలని పట్టుకొని గట్టుమీదవేసి ఉంచి బారెడు ప్రొద్దుండగా ఆచచ్చిన శవాలన్నీ మోసుకొని అవంతిలో అమ్ముకొని గడియప్రొద్దుపొయ్యేటప్పటికి ఇల్లుచేరడమున్నూ, ఇంటిలో తావచ్చేసరికి తయారుగా కాచివుంచిన కల్లో గంజో ఇంత త్రాగి నిద్దురపోవడమున్నూ, ఇవే పనులు. అతనికింతకంటే వేఱేపని ఏదిన్నీ లేదు. ఓపుణ్యంగాని పాపంగాని, పండగకాని, పర్వంగాని అతనికి తెలియవు. అతనికి తెలిసిందల్లా సంగ్రహంగా చెప్పేటట్టయితే కడుపే కైలాసం. జీవహింస చేయడంలోనే ముక్తి. ఇంతకంటే వేఱే లేదు. ఔను నిజమే పెద్దలు చెప్పలేదామఱి.

శ్లో. కలా వేక స్సాధు ర్భవతి కథ మప్యత్ర భవనే
సచా ఘాతః క్షుద్రైః కథ మకరుణై ర్జీవతి చిరమ్
అతిగ్రీష్మే శుష్యత్సరసి విచరచ్చంచరతయా
బకోటానా మగ్రే తరలశఫరీ గచ్ఛతి వియత్.
—ఆచార్యపద్మనంది.

[ఈకలికాలంలో ప్రతిదినం పుట్టుతూగిడుతూవుండే ప్రాణుల్లో ఎక్కడో కోటికొకడు మాత్రమే సజ్జనుడుగా ఉండిఉండడం సంభవిస్తుంది. అందులోకూడా ఎక్కడైనా తప్పిదారి ఒకరో అరో వుంటే వారికి దయాధర్మాలంటే ఏమిటో ఎరగని క్షుద్రులతో సహవాసం చాల మఱుమ కలుగుతూవుంటుంది. ఏమంటారా? మండిపోతూవుండే గ్రీష్మంలో సరస్సులన్నీ ప్రాయశః ఎండిపోకతప్పదు. అనవా, ఎక్కడనైనా ఒకటే అరా వుండడ

మంటూ వుంటే, ముక్కులు తెఱచుకొని మింగడానికి కాచుకొనివున్న కొంగలబారినుండి తప్పించుకొని వర్తింపగల చిరుచేప ఎక్కడైనావుంటుందా? అట్లే ఇదిన్నీ.]

ఇట్లావుండగా అవంతికి మతప్రచారమునకై యశోధరుడనే జైనముని వచ్చాడు. యశోధరుడు మాంచివేత్త. మహోత్తమమైన శాంతి, భూషణంగా కలవాఁడు. ఆకాలంలోవుండే రాజాధిరాజులందరి మెప్పున్నూ పొందినవాడు. తక్కినవారి మాట లెట్లావున్నా జైనసాంప్రదాయం గృహస్థులంటారుకదా- 'యశోధరుడు అంటే ఏంసామాన్యుడనుకున్నారా? ఇంద్రుఁడు చంద్రుడు నాగేంద్రుడు మొదలైన దేవతలకుకూడా ఆయన పాదాలుపట్టవలసిందే. ఇదంతా వుండనీయండి; వక్కమాటచాలు. ఆయన వాదంచెయ్యడం ఆరంభించాడా అంటే ఎంతెంతపండితులున్నా పిపీలికాయమానం కావలసిందే' అని. అన్నట్టుగానే ఆయన ఒకమాటు ఉజ్జయినిలోవున్న పండితులతో స్యాద్వాదతర్కంలో శాస్త్రార్థము చెయ్యడం ఆరంభించాడట. స్యాద్వాద తర్కం అంటే జైనన్యాయమన్న మాట అప్పుడే మైందంటే తక్కిన పండితులందరున్నూ ఒక్కటే; ఇతగాడుచక్కటే. అయితేమాత్రమేమి? లేళ్లను చెదరగొట్టే సింహంలాగ అట్టే హుంకరించి వాదంలో దిగేటప్పటికి, ఒక్కడుకూడా జవాబుచెప్పలేక ఎక్కడివాళ్లక్కడ మొగాలువేలవేసికొని పారిపోయారట. అంతట ఈయన ఆసభలో నిల్చొని తనవిజయాన్ని ప్రశంసిస్తూ బిరుదపద్యం చెప్పుకొన్నాడుట. ఆపద్యం ఇది.

† శ్లో. వయ మిహ పదవిద్యాం తర్క మాన్వీక్షికీంవా,
యది పథి విపథే వా వర్తయామ స్స పంథాః;
ఉదయతి యదియస్యాం భానుమాన్ సైవపూర్వా
నహి తరణి రుదీతే దిక్పరాధీనవృత్తిః.

[శబ్దశాస్త్రంలో కానీ, తర్కంలో కానీ, ఆన్వీక్షికిలో కాని, వాదంచస్తే మంచికానీండి చెడ్డకానీండి (అంటే, మేంతీసికొన్నకోటి సత్యమైనాసరే అసత్యమైనాసరే) మేము ఏత్రోవ తొక్కితే లోకానికి అంతకూ ఆదే త్రోవఅవుతుంది. అనగా మేమెందులోనడిస్తే అదే సరియైనమార్గం అనిపిస్తామన్నమాట. ఏలాగని శంకిస్తారా? వినండి చెబుతున్నాము. ఏదిక్కున సూర్యుడుదయిస్తే అదే తూర్పుదిక్కవుతుందేకాని తూర్పుదిక్కు ఏవైపుంటే ఆవైపుకుపోయి సూర్యుడుదయించవలెనంటూ వుంటుందా. అట్లాగే మావిషయంలోనూ అని భావము.]

అయితే ఇప్పుడు మతప్రచారకుడుగా వచ్చిన యశోధరుడివేషం మునుపటి యశోధరుడివేషంకాదు. అప్పటిబిరుదపద్యాలుగాని, ఆవాద కోలాహలముగాని ఆజిగీష కాని, ఇప్పుడతనిలో కనపడవు. పైగా ఆరత్నాంబరాలు మున్నగు డాబు దాంభికాలన్నీ పోయి ఇప్పుడు కామక్రోధాదులను జయించిన దిగంబరస్వామి వేషం అతనికి అబ్బినది. ఇప్పుడతనికి వాదిజిగీష ఎంతమాత్రమున్నూ లేదు. కాని ఆస్థానంలో ప్రజాసామాన్యమునకు ప్రజ్ఞాదానంచెయ్యవలెననే దృఢసంకల్పంమాత్రం వున్నది. మునుపటిలాగ్గా ముఖ్యులైనపండితు లెవ్వరెవ్వరో వాళ్లను ముగ్గొయ్యలుగా వుండే ప్రశ్నలు ఏమేంచెయ్యాలో అనేచింతలేదు. కాని దానికి బదులుగా 'మూర్ఖులు, అలసులు అయిన జనులు ఎవ్వరెవ్వరో వారికి ముక్తిదొరకించే ఉపాయం ఏమిటా'' అనే చింత ఇప్పుడున్నది. కాఁబట్టే ఆయన అవంతిలోకి అడుగుపెట్టడంతోటే పామరజనం మూగేసందుల్లో, వీథులమొనల్లో, విపణిమార్గాల్లో, పాఠశాలలదగ్గరా, భాండాగారాలదగ్గరా, ఒక ఓరగా నిలువబడడమున్నూ, జనసామాన్యానికి తెలిసేభాషలో, దానం, దయా, సత్యం, శౌచం, అహింస, క్షమ, శాంతి, మొదలయిన విషయాలని గురించి మంచి శ్రావ్యమైన సంగీతధోరణితో ప్రాచీన మహర్షుల గాథలను వుదాహరిస్తూ ఎల్లాంటివాళ్లకూ ఒక్కమారు వినడంతోటే భక్తి, శ్రద్ధ, భూతదయ, శమందమం, ఉట్టిపడేటట్టుగా దివ్యంగా ఉపన్యసించడం ఆరంభించాడు.

మొదటినాఁడు త్రిరత్నములను గురించి * రత్నఘురట్టంలో వుపన్యసించాడు. ఆరోజు వచ్చిన జనం

---

† ఇది ఉదయనాచార్యులవారి బిరుదపద్యమని పెద్దలుచెప్పగా చాలమార్లు వినియున్నాను. కాని యశోధరుడిదెట్లాగైందో ఆలోచింపవలసియే యున్నది. [పం-అ-శా.]

* రత్నఘురట్టం అనేది అవంతిలో ఒక భాగముఅని తలుస్తాను. అనఁగా ఇప్పుడు మనబస్తీలలోవుండేమాదిరిగా పట్నాలలోని పేటలకు ఆకాలములో ఘురట్టములని పేరుండేదేమో అన్నమాట.

చాలా కొద్దిమందే కాని యశోధరుడి వుపన్యాసధోరణిని వినడంతోటే వాండ్లందరికీ ఒక కొత్తచైతన్యం వచ్చింది. మఱునాడు తెల్లవారే సరికల్లా ఊరంతా వ్యాపించింది. "సిద్ధాఘట్టంలోనే యశోధరుడు స్థావరంగా వుపన్యసిస్తాడని" జనం ఆనాడు మొదలుకొని తోర్లబడడం ఆరంభించారు. వీళ్లా వాళ్లా అనేభేదం లేకుండా నానారకాలవాళ్లూ, నానాజాతులవాళ్లూ రావడం మొదలుపెట్టారు. యశోధరుడు మహోత్సాహంతో వుపన్యాససుధను ప్రసరిస్తున్నాడు. ఈర్ష్యాళువులైకానీ, మఱేదైనా కారణంచేతగాని ఎవరైనాకొందరు రాకపోతే రాకపోయ్యారేమో కాని, సామాన్యజనమంతా వచ్చిచెవులు దోరగిలబెట్టుకొని ఆయన వాక్సుధను త్రాగుతూనే వున్నారు. వచ్చే జనానికందరికిన్నీగూడా యశోధరుడు తనవిదీర ఉపదేశిస్తున్నాడు. ఒకనాడు దయాధర్మాలనుగుఱించిన్నీ, ఇంకోనాడు నిశ్చయపంచాశత్తును గుఱించిన్నీ, మఱోనాడు దశలక్షణధర్మాలనుగురించిన్నీ, వేఱేనాడు శ్రావకధర్మాలను గుఱించిన్నీ, ఆతర్వాత అనిత్యత్వ ఏకత్వాది కరణాలను గురించిన్నీ దానితర్వాత పూజాష్టకం, కరుణాష్టకం, మొదలయిన వాటిని గుఱించిన్నీ ఒకేధారగా ఉపన్యాసాలు కురిపిస్తున్నాడు. పోయినజనులలో ఎవరికందినమట్టుకు వారు జ్ఞానామృతాన్ని పట్టుకోవచ్చి నిల్వచేసుకొంటున్నారు.

సిద్ధాఘట్టంలో రోజూ చేపలపట్టుకోవడమునకు వెళ్లుతూవుండటాన్నిబట్టి యశోధరుడి మహత్తు మనమృగసేనుడివైపుకూడా కాస్త వ్యాపించింది వచ్చేటప్పుడూ పొయ్యేటప్పుడూ దినమూ, ప్రజలు ఇసుకవేస్తే రాలకుండా మూగివుండడాన్ని చూస్తూ వుండడంవల్ల ఒకనాడు మృగసేనుడికికూడా 'పోయి ఏం చెబుతాడో వకసారి వింటే బాగుండును' అనిపించింది. కాని పోవడం ఏలాగా? ఇంట్లో జల్లకు వేస్తే జల్లెడుమంది పిల్లలున్నారాయెను. పైగా రాకాసిపెండ్లాముకూడా దాపరించెను. తానుఏదినమూ ఏకష్టమో చేసి ఒకప్రస్థాతెస్తేవుందీ, లేకపోతే లేదాయెను. ఏ ఒక్కనిమిషం వృథచేసినా తనకు జీవితం జరగదుకదా! ఇల్లాంటివిషయాలన్నీ ఒక్కసారిగా ఆజాలరికండ్లకు కనిపించి అతన్ని ఏనాటి కానాడు పోవద్దనిపించేవి. అయినా, అతనిమనస్సు మాత్రం నిరంతరమూ ఆందోళనం చేస్తూనే వుండేది. ఇట్లావుండగా తుదకొకనాడు ఏమైనాగానీ ఇవాళ్లి తప్పకుండా వెళ్లవలసిందే అనుకున్నాడు. ఏవరికైతే ఏంగనుకాను, ఏదైనా వకటిచెయ్యవలసినట్లు దృఢమయ్యేదాకానే కష్టంగాని, ఆకాస్తసుళ్లాతీరిపోయి దృఢనిశ్చయం కలిగిందా అంటే మఱి తిరుగుండదు. కాబట్టే మృగసేనుడు ఇన్నాళ్లదాకా మనసపడిపడీ చివఱకు దృఢనిశ్చయానికి వచ్చింది. ఇంకను అడ్డుఏమున్నదీ? సరేననుకొని మఱున్నాడు యశోధరుడి ఉపన్యాసానికి తయారైనాడు.

సరిగ్గా ప్రొద్దుటే ద్వితీయార్ధప్రహర* కావడంతోటే మామూలుకుమల్లే నాడున్నూ యశోధరుడి ఉపన్యాసం ఆరంభమైంది. ఆనాటి వుపన్యాస విషయం అహింసావ్రతాన్ని గుఱించింది. యశోధరుడు ఉపన్యాసం ఇచ్చేస్థలానికి వచ్చేటప్పటికే జనసమ్మర్దం ఎక్కువైంది. ఎట్లాగో ముందుగానే సందుజేసికొని యశోధరుడు నిలుచుండే రావిచెట్టుకు చాలాదగ్గఱగా చేరి కూర్చున్నాడు. మృగసేనుడు. మామూలుప్రకారం దేవతాప్రార్థనతోటి ఉపన్యాసం ఆరంభించాడు యశోధరుడు.

శ్లో. జయత్వత్రార్హతీ వాణీ సర్వసందేహహారిణీ,
ప్రాణినాం ప్రాణవత్ప్రీత్యా సేవితా శర్మకారిణీ;
సంతుమే గురవోనిత్యం మానసే బోధసింధవః,
ఘోరసంసార వారాశే ర్భవ్యానాం యత్రసేతవః.

అని కోవిలలాలకించే కంఠమాధుర్యంతో యశోధరుడు గురుప్రార్థనమునుచేసి తాను చెప్పదలచిన అహింసా విషయానికి అంకురార్పణచేశాడు. శ్రోతలు నిశ్శబ్దంగా ఉండిపోయినారు. తర్వాత 'యాహింసా సర్వభూతానాం నామతోఽపిభయప్రదా'అని మొట్టమొదట హింసఅనగా ఏమిటో, దానివలన భూతజాలము ఎల్లా తల్లడిస్తుందో దాన్ని వారించడంవల్ల ఎంత శ్రేయం వుందో, అట్టిశ్రేయస్సును ఆర్జింపవలసిన ఆవశ్యకత ప్రతి

* ప్రహర అనగా జాము. అర్థప్రహర అనగా మూడుంగాలు గడియ అంటే ఒకటిన్నర గంట. ద్వితీయార్ధప్రహార ఆరంభమైందంటే ఏడున్నరగంటలు దాటి ఎనిమిదోగంట ప్రవేశించేటప్పటికి అనిభావము.

ప్రాణిమీద ఏవిధంగా ఆధారపడివుందో, చక్కంగా వివరించి చెప్పి శ్రోతలను తన్మయావస్థ పొందించాడు. తర్వాత అహింసావిషయానికి మూలకందమైన దయాధర్మము నుల్లేఖించినాడు.

శ్లో. ధర్మో జీవదయా గృహస్థశమినో ర్భేదా ద్ద్వి ధా చ త్రయం, రత్నానాం పరమం తథా దశవిధోత్కృష్ట క్షమాది స్తతః; మోహోద్భూత వికల్పజాల రహితా వా గంగ సంగోజ్ఝితా, శుద్ధానందమయాత్మనః పరిణతి ర్ధర్మాఖ్యయా గీయతే.

[నాయనలారా! ధర్మంధర్మమని అంటే ఏమిటను కొన్నారో, కాని ముక్తసరిగా చెప్పవలసివస్తే జీవదయే సుమా ధర్మమవుతుంది. అట్టిధర్మము మొత్తముమీద గృహస్థధర్మమనిన్నీ, యతి ధర్మ మనిన్నీ రెండువిధములు. గృహస్థులైనవారందఱున్నూ ఆచరింపవలసిన భూతదయా రూపమైన ధర్మమే గృహస్థధర్మము. యతులు ఆచరింపవలసినధర్మము యతిధర్మము. సమ్యజ్ జ్ఞానము, సమ్యగ్దర్శనము, సమ్యక్చారిత్రము అనిచెప్పబడే మూడురత్నాలలోనున్నూ ఇదియే ప్రాధాన్యముగా చేరియుండుటచేత ఉత్తమోత్తమమైంది. దీనిని ఆచరించుటవలన దశవిధములగు క్షమాశమాద్యుత్కృష్ట ధర్మములలవడును. దానిమూలాన మోహవికల్పరహితమై, నిస్సంగమై ఒప్పెడివాక్కు సిద్ధించును. అద్దానివలన కేవలశుద్ధానందమయ మగు నాత్మరూపమున పరిణమించుట కలుగును. కాబట్టియే జీవదయయే ధర్మమని పెద్దలు సెలవిచ్చుచున్నారు— అని భావము.]

యశోధరుడికి ఈఒక్కశ్లోకము ప్రవచించేటప్పటికి దాదాపు ఒకఘటిక పట్టింది. ఆయన ధర్మస్వరూపాన్ని నిరూపించేసందర్భంలో లోకంలోవుండే తక్కిన మతాలవారంతా (వేదప్రామాణ్యవాదులగు మీమాంసకులు మున్నగువారు)ఏంచెబుతారో వాటికిన్నీ, తను ఏర్పఱచిన లక్షణానికిన్నీ, ఎల్లా అన్వయంకుదురుతుందో ఆవిషయాలన్నీ తేల్చినిగ్గదీసి ప్రదర్శించాడు. శ్రోతలు చెవులు దోరగిలపెట్టుకొని వింటున్నారు. తర్వాత ఆయనధర్మాలకన్నింటికిన్ని మూలకందమైన దయను గురించినాలుగు శ్లోకాలు చదివి ఉపన్యసించాడు. అందులో మొదటి శ్లోకము ఈక్రిందిది:

శ్లో. ఆద్యా సద్వ్రత సంచయస్య జననీ సౌఖ్యస్య సత్సంపదాం, మూలం ధర్మతరో రనశ్వరపదారోహైకని శ్శ్రేణికా; కార్యా సద్భి రిహాంగిషు ప్రథమతో నిత్యం దయాధార్మికైః, ధిఙ్నా మా ప్యదయస్య తస్య చ పరం సర్వత్ర శూన్యా దిశః.

[నాయనలారా, విన్నారా? దయయెంతప్రాముఖ్యమును పొందినట్టి యుత్తమవస్తువో! అది సమస్తములగు వ్రతములు సమస్తములగు నియమములు సమస్తాలైన ధనాలకూ— వీటికి వాటికని విభేదమెందుకూ— సర్వానికీ మూలకందము సుమండీ. సమస్తసౌఖ్యములు కల్గించడానికిన్నీ అది తల్లివంటిది; సమస్త సత్సంపదలకున్నూ అది కుంకుమవేరు (అనగా మొదటివేరు); ధర్మవృక్షమునకు అదిచక్కని మెట్లుగట్టివుంచినట్టి నిచ్చెనలాంటిది. కాబట్టి ఇల్లాగా సమస్తానికీ మూలాధారమై సమస్తవస్తువులలోను శ్రేష్ఠమై రత్నములన్నింటిలో నుత్తమరత్నమై వుండే ఆదయను సత్పురుషులైనవారు ప్రతివారున్నూ అలవరుచుకొని సమస్తభూతకోటిపైనను ప్రసరింపజేయడమనేది విధిగా చేయవలసినపని. ఎవ్వడీదయను ఆచరింపడో, ఆచరించికూడ జీవకోటిపై ప్రసరింపజేయడో అట్టి నిర్దయుడికి ఇహమూ పరమూ అంతా శూన్యమే కాని వేరేలేదు.]

సంసారే భ్రమత శ్చిరం తనుభృతః కేకేన పిత్రాదయో, జాతాఃతద్వధ మాశ్రితేన ఖలు తే సర్వేభవం త్యాహతాః; నన్వాత్మాపి హతో యదత్ర నిహతో జన్మాంతరేఽపి ధ్రువమ్, హంతారం ప్రతిహంతి హంత! బహుశ స్సంస్కారతో నా ధ్రువః.

[నాయనా! అవిరతంగా ఈప్రపంచంలోఎన్నెన్ని జీవులో పుట్టిగిట్టుతూ జన్మాంతరాలను పొందుతున్నవి గదా. ఇల్లా రూపాంతరాన్ని పొందుతూ నిత్యమూ మన హింసించడానికి పాత్రములైనఈజీవులలో మనతాతలెంతమంది వున్నారో మనతండ్రు లెందరున్నారో భవిష్యత్తున మనమెందరము ఉండబోతామో ఒక్కమాటైనా ఆలోచించారా? అయ్యయ్యయ్యో! ఆప్రాణులను చంపడమనే మిషతో మనలను మనమే నిత్యమూ నాశం చేసికోవడమే సంభవిస్తున్నదే! నాయనా! అల్పపుజీవుడు దీనికే మనుకొన్నా. మనయాత్మనే మనం నశింపజేస్తున్నామే

ఒకసారి మన మిూశకీరంతో చంపిన జంతువే మరలనింకో జన్మంలో మనలను చంపుమన్నది. అయ్యో! మనం చంప డమున్నూ చావడమున్నూ ఇంతేనా చేయవలసినప్రయోజకత్వం? వేరే గతిలేదా? ఛీ! ఎంత పాపప్రపంచ మయింది!]

శ్లో. త్రైలోక్యప్రభు భావతోపి సహజోస్త్యేకం నిజం జీవితం ప్రేయస్తేన వినా న కస్య భవితేత్యాకాంక్షతేః ప్రాణినః; నిశ్శేషవ్రత శీల నిర్మలగుణా ధారాత్ర తో నిశ్చితం జంతోర్జీవిత దానతః త్రిభువనే సర్వ స్వదానం లఘు.

[ఎంతదరిద్రుడికైనా లేక ఎంతటి ఐశ్వర్యవంతుడికైనా సరే, శక్తికలవాడికైనా లేనివాడికైనాసరే, ప్రయోజకుడికైనాసరే, అప్రయోజకుడికైనా సరే, ఎవడిమట్టుకువాడికి తనప్రాణంకంటే ప్రియతనుమైనవస్తువింకోటివుండదు. ముల్లోకాలూ ఏలేసామ్రాజ్యం ఇచ్చినాసరేతనప్రాణాలు అందుకు బదులుగా ఇచ్చేవాడు లోకంలో ఎవ్వడూ వుండబోడుకదా! కాబట్టే సమస్తవ్రతాలు, సమస్తశీలాలు, సమస్తగుణములు మొదలయిన వాటినన్నిటినీ అలవరచుకోవడంకంటే జంతుమాత్రానికి ఇదీఅదీభేదం లేకుండా ఎంత అల్పమైనా సరే ఎంతఘనమైనా సరే ప్రతీదానికీ జీవిత దానం చెయ్యడమనేదివుందే (అంటే అభయదానమన్న మాట)దానితో సమానమైన దానము ఏలోకంలోకూడా లేదు. దానిముందఖ సర్వస్వమిచ్చినప్పటికీ అల్పమేకాని వేయుకాదు.]

ఈవిధంగా వుపన్యసించి శ్రోతలసందెలుజాలితో కరిగి కన్నీటి రూపాన వెల్లువలై కనిపించేటట్టు చేశాడు యశోధరుడు. చివఖ ఉపన్యాసం చాలించబోతూ మిూ మాంసకాదుల మతాన్ని [అనగా హింసను యజ్ఞార్థము చేసినచో నయ్యది హింసకా నేరదు అని వాదించేవైదిక మతాన్ని] అవలంబించినవారికి జవాబుగా ఒకశ్లోకాన్ని చదివి వివరించి ముగించినాడు.—ఆశ్లోకమిది:-

శ్లో. పిత్రర్థం దేవతార్థం వా శాంత్యర్థం వా\ కనిర్మితా;
శర్మణే న భవే ద్ధింసా కిం తు దుష్కర్మణే తథా.

[అయ్యా వేదములను అనుసరించేవారమని చెప్పుకొనే ప్రబుద్ధులలో కొందరు శ్రాద్ధాదులందు పితృదేవతాదులనుద్దేశించి చేస్తే అది హింసకాదని యందురు. మరికొందఱు (యజ్ఞాదులలో) దేవతల నుద్దేశించిచేస్తే అదికూడా హింసకాదని అందురు. ఇంకాకొందరు శాంతిపుష్టికాదులనుద్దేశించి చేసేదిహింసకానేకాదంటారు. నాయనలారా! ఎవ్వరినుద్దేశించి ఎట్లాచేసినా హింసహింసే అవుతుందిగాని అహింసకాదు. కాబట్టి పైవిధంగా పిత్రర్థంగాని, దేవతార్థంగాని, శాంత్యర్థంగాని ఏరూపానచేసేదైనప్పటికిన్నీ అది తప్పకుండా హింస అవడమేకాకుండా దుష్కర్మమున్నూ దుష్ఫలప్రదమున్నూ అయితీరుతుంది.]

యశోధరుడి వుపన్యాసం ముగిసింది. ఉపన్యాసమును వినడానికి వచ్చిన శ్రోతలంతా తన్మయావస్థతో బయలుదేరి ఎక్కడివారక్కడ వెళ్లారు. యశోధరుడున్నూ లేచి నిర్జ్రానదీగట్టున తాను నివాసముచేసిన రావిచెట్టుదగ్గరికి వెళ్లాడు. కాని కొంతదూరం వెళ్లేప్పటికి ఎవ్వరో తనవెనుకనే వస్తూన్నట్టు తోచింది. వెనుకదిరిగి చూచునగదా నల్లగా జుంజురువెంట్రుకలతో పుట్టగోచితో చేతులుకట్టుకొని భక్తి భయసంభ్రమాలను సూచిస్తూన్న ముఖముతో మృగసేనుడు వస్తున్నాడు. యశోధరుడు అతన్ని చూచికూడా మాట్లాడకుండా మెల్లిగ సాగిపోయి తిన్నగా తనస్థానాన్ని చేరికూర్చున్నాడు. మృగసేనుడు కూడా మెల్లగాపోయి దాపున ఒకమూలగా నిలుచుకొని చేతులు కట్టుకొనియున్నాడు.

సరిగా రెండుయామములూ కడచి, మూడవ యామము ప్రవేశించింది. మృగసేనుడు కదలకుండా అలానే వున్నాడు. మృగసేనుణ్ణి చూచేకొద్దీ యశోధరుడికి ఎందులకో ఒకవిధమైన జాలి కలిగింది. చాలసేపు ఆతడు ఏమనుకున్నాడో ఏమో కాని, మృగసేనుణ్ణిపిలిచి "ఏమి? ఎవరు నీవు? నీ కేమి కావలెను?" అని పలికాడు. "బాబూ! నేను ఒక మహాపాపిని; ఇంతవఱకూ తాము సెలవిచ్చిన మహాపాపమైన హింసను నేటివఱకూ జీరు పోకుండా శ్రద్ధతో చేస్తూన్న దౌర్భాగ్యుణ్ణి అయ్యా నాబుద్ధి తెలిసింది మొదలు ఇంతవఱకూ నేనుచేసిన హింసలకు మితి లేదు. నావృత్తే అది; హింసలో పుట్టాను. హింసలో పెరిగాను; హింసలో తేలుతున్నాను; బాబూ! నావేషాన్ని బట్టే తమకు బోధపడుతున్నది;

గదా! అయినా చెప్పుకుంటున్నాను; జాలరిని; గంపెడు మంది పిల్లలు; చేపలు తప్ప మరేం కోపని నాకు తెలియదు. నా కేమి గతి? ఇంతవరకూ తెలిసో తెలియకో బతుకు పోస్తున్నాను. మీయుపదేశాన్ని విన్నతర్వాత మరి అపని చేయడానికి మనస్సు రాలేదు. కాని పామరుణ్ణి గదా; మహాలక్ష్మీ సంకల్పం కాకుంటా, నాకు ఏదో ఇంత తోవ కాస్త చూపించి రక్షించాలి" అంటూ కాళ్లమీద పడ్డాడు.

యశోధరుడు చాలాసేపు ఆలోచించాడు. శరణన్న వారిని వదలిపెట్టడం ధర్మముకాదు; కాని ఇల్లాంటి అసమర్థుడికి మహాదీక్ష యివ్వడంయిష్టంలేదు. ఎంతోసేపు ఆలోచించి ఆలోచించి "సరే, ఏమయితే అది కానీండి, మహాత్ములైనవారి సంకల్పం మంచిదిగనుక మనం చోటు ఇవ్వవలసిందే" అనుకొన్నాడు."మంచిదే నీకు తరణోపాయం నేనుచెపుతాను. నాకుగురుదక్షిణగా ఒకవూచీ ఇవ్వాలెను. నీవు రోజూ ఇప్పుడు చేసికొంటూన్నట్టే నీవృత్తిని చేసికొంటూ వుండవచ్చును. ప్రతిదినమూ చేపలను పట్టుకోవడానికి పోయినప్పుడు మొదట వలలోబడ్డ చేపను మాత్రం వదలి వేస్తుండవలెను. ఇదే నేను కోరేది; చేస్తావా?" అని అడిగాడు 'సరే చేస్తానండీ' అని అనిపించుకొని వాడికి పంచనమస్కారమంత్రాన్ని ఉపదేశించి పంపాడు. అంతట మృగసేనుడు ఉబ్బిపోయాడు. ఇంతలో అస్తమానం అయింది. ఆరాత్రి అల్లా అక్కడే వుండి మర్నాడు తెల్లవారింతర్వాత యశోధరుడిదగ్గర సెలవు తీసికొని, మంత్రం ధ్యానించుకొంటూ పోయి * మృగసేను డీవ్యాపారం చేస్తున్నది మొదలు ఇంతదనుకా ఎన్నడూ ఇలాంటి చేప చిక్కలేదు. చూడగానే కన్ను కోరగించింది. కాని ఇంటిలో యశోధరుడిమాట జ్ఞాపకానికి వచ్చింది. అప్పుడు జాలరి తనగోచీలో వుండే ఒకభాగాన్ని చింపి ఆచేప తొక్కకు తనకు గుర్తుండటానికై గట్టి మళ్లా నీటిలోనికి విసిరి వేశాడు. తర్వాత కొంచెంసే పూరుకొని మళ్లా వల వేశాడు. మళ్లా ఆచేపే వచ్చింది. మళ్లా వదలిపెట్టాడు. తర్వాత ఇట్లా ప్రొద్దస్తమానం ఎన్నిమాట్లు వలవేశినా, ఎన్నిచోట్లు మార్చివేసినా ఆచేపతప్ప మరి ఇంకొకటి రావడం లేదు. ఇట్లా సంధ్యచీకటి పడేదాకా వేశాడు; కాని ఫలితం అంతే. చివరకు విసుగెత్తి ఏంచెయ్యడానికి తోచక వట్టిచేతులతో జాము ప్రొద్దు పొయ్యేసరికి కొంప చేరాడు. అదివరకు రెండురోజులనుండీ అంతూపొంతూ లేదన్న కోపంతో సురసురమంటూన్న వాడిభార్య ఆవేళ్ల వాణ్ణి ఇంట్లోకిగూడా రానీయక పోట్లాడి వెళ్లగొట్టింది. మృగసేనుడు మారుమాటాడకుండా బయట చూరుక్రిందనే నిలుచబడి మంత్రం జపం చేసుకొంటున్నాడు.

ఇంతలో పాటపాటమని చినుకులు ఆరంభమయినాయి. వర్షము కొంచెమంత సేపట్లో పెద్దదై పోయింది ఇది ఇల్లాగుండగా ఇంతలో సమీపంలో వున్న పుట్టలోనుండి మంచి నల్లతాచుఒకటి బుసకొట్టుకుంటూ మృగసేనుడున్న పంచలోకి వచ్చింది. మృగసేనుడు చూసో చూడకో ఆమనికిపాట్లల్లో దానిమీద పడ్డాడు. త్రాచు గట్టిగా కరిచింది. మృగసేనుడు ఆపంచనమస్కార మంత్రాన్ని ఆలాగే జపంచేస్తూ చచ్చి క్రిందపడ్డాడు. తెల్లవారినతర్వాత వాడిపెండ్లాము ఇదంతా చూచి పరితాపంతో సహగమనం చేసింది. మృగసేనుడికథలో ఒక తరంగం ముగిసింది.

కథ ఇది ఇల్లావుండగా; ఆవుజ్జయనిలోనే విశ్వంభరు డనురాజు ఒకడున్నాడు. ఆయనే ఆపట్నానికంత కున్నూ రాజు. అతని రాణీపేరు విశ్వంభరాదేవి. విశ్వంభరాదేవి సాక్షాత్తూ విశ్వంభరాదేవే అన్నిగుణాలల్లోను! విశ్వంభరుడికి పెద్దసెట్టి యుద్యోగిగా గుణపాలు డనే కోమటి ఆవూళ్లో వున్నాడు. ఆయనకు ధనశ్రీ అనే ఆవిడ భార్య. వారిద్దరికిన్నీ సుబంధువు అనిఒకకూతురు చక్కనిచుక్క పుట్టింది. మళ్లాకొన్నాళ్లకు ధనశ్రీ గర్భం ధరించింది. ధనశ్రీ గర్భంలో మృగసేనుడి ఆత్మ ప్రవేశించింది. విశ్వంభరుడు (రాజు) తన మంత్రికొమారుడికని పేరుపెట్టి సుబంధువును పెండ్లిచేయవలసిందని పట్టుబట్టాడు. గుణపాలుడు ఆవిశ్వంభరుణ్ణిఎరుగును. ఈమంత్రికొడుకును ఎరుగును. వారి ప్రవర్తనలు మంచివి కావని తన కూతురిని ఇయ్యక నిరాకరించాడు. రాజ నిర్బంధం ఎక్కువకావడం మొదలుపెట్టింది. గుణపాలుడు చివరకు వేగలేక ఒకనాడు అర్ధరాత్రిపూట నిండుచూలాలు లయిన

* సిప్రానదిలో వలవేసాడు, వేసేవెయ్యడమేతరవాయి వెంటనే తళతళమంటూ పెద్దచేపఒకటి వలలోపడ్డది.

ఒకసారి మన మిాశకిరంతో చంపిన జంతువే మరలనింకో జన్మంలో మనలను చంపుమన్నది. అయ్యో! మనం చంపడమున్నూ చావడమున్నూ ఇంతేనా చేయగలిగిన ప్రయోజకత్వం? వేరే గతిలేదా? ఛీ! ఎంత పాపప్రపంచ మయింది!]

శ్లో. త్రైలోక్యప్రభు భావతోపి సహజో హ్యేకం నిజం
జీవితం ప్రేయ స్తేవ వినా న కస్య భవితేత్యాకాంక్ష
తః ప్రాణినః; నిశ్శేషవ్రత శీల నిర్మలగుణా ధారా త్త
తో నిశ్చితం జంతోర్జీవిత దానత స్త్రిభువనే సర్వ
స్వదానం లఘు.

[ఎంతదరిద్రుడికైనా లేకఎంతటి లుబ్ధుడికైనా సరే, శక్తికలవాడికైనా లేనివాడికైనాసరే, ప్రయోజకుడికైనాసరే, అప్రయోజకుడికైనా సరే, ఎవడిమట్టుకువాడికి తనప్రాణంకంటే ప్రియతమమైనవస్తువింకోటివుండదు. ముల్లోకాలూ ఏలేసామ్రాజ్యం ఇచ్చినాసరేతనప్రాణాలు అందుకు బదులుగా ఇచ్చేవాడు లోకంలో ఎవ్వడూ వుండబోడుకదా! కాబట్టే సమస్తవ్రతాలు, సమస్తశీలాలు, సమస్తగుణములు మొదలయిన వాటినన్నిటినీ అలవరచుకోవడంకంటే జంతుమాత్రానికి ఇదీఅదీభేదంలేకుండాఎంత అల్పమైనా సరే ఎంతఘనమైనా సరే ప్రతీదానికీ జీవితదానం చెయ్యడమనేదివుందే (అంటే అభయదానమన్న మాట) దానితో సమానమైన దానము ఏలోకంలోకూడా లేదు. దానిముందఱ సర్వస్వమిచ్చినప్పటికీ అల్పమేకాని వేరుకాదు.]

ఈవిధంగా వుపన్యసించి శ్రోతలగుండెలుజాలితో కరిగి కన్నీటి రూపాన వెల్లువలై కనిపించేటట్టు చేశాడు యశోధరుడు. చివఱ ఉపన్యాసం చాలించబోతూ మీమాంసకాదుల మతాన్ని [అనగా హింసను యజ్ఞార్థము చేసినచో నయ్యది హింసకానేరదు అని వాదించేవైదిక మతాన్ని] అవలంబించినవారికి జవాబుగా ఒకశ్లోకాన్ని చదివి వివరించి ముగించినాడు.—ఆశ్లోకమిది:-

శ్లో. పిత్రర్థం దేవతార్థం వా శాంత్యర్థం వా తనిర్మితా;
శర్మణే న భవే ద్ధింసా కిం తు దుష్కర్మణే తథా.

[అయ్యా వేదములను అనుసరించేవారగమని చెప్పుకొనే ప్రబుద్ధులలో కొందరు శ్రాద్ధాదులందు పితృదేవతాదులనుద్దేశించి చేస్తే అది హింసకాదని యందురు. మఱికొందఱు (యజ్ఞాదులలో) దేవతల నుద్దేశించిచేస్తే అదికూడా హింసకాదని అంటారు. ఇంకాకొందఱు శాంతికపుష్టికాదులనుద్దేశించి చేసేదిహింసకానేకాదంటారు. నాయనలారా! ఎవ్వరినుద్దేశించి ఎట్లాచేసినా హింసహింసే అవుతుందిగాని అహింసకాదు. కాబట్టి పైవిధంగా పిత్రర్థంగాని, దేవతార్థంగాని, శాంత్యర్థంగాని ఏరూపానచేసేదైనప్పటికిన్నీ అది తప్పకుండా హింస అవుతుంది కాకుండా దుష్కర్మమున్నూ దుష్ఫలప్రదమున్నూ అయితీరుతుంది.]

యశోధరుడి వుపన్యాసం ముగిసింది. ఉపన్యాసమును వినడానికి వచ్చిన శ్రోతలంతా తన్మయావస్థతో బయలుదేరి ఎక్కడివారక్కడ వెళ్లారు. యశోధరుడున్నూ లేచి సిప్రానదీగట్టున తాను వాసముచేసిన రావిచెట్టుదగ్గరికి వెళ్లాడు. కాని కొంతదూరం వెళ్లేప్పటికి ఎవ్వరో తనవెనకనే వస్తూన్నట్టు తోచింది. వెనకతిరిగి చూచునుగదా నల్లగా జుంజురువెండ్రుకలతో పుట్టగోచితో చేతులుకట్టుకొని భక్తి భయసంభ్రమాలను సూచిస్తూన్న ముఖముతో మృగసేనుడు వస్తున్నాడు. యశోధరుడు అతన్ని చూచికూడా మాట్లాడకుండా మఱల సాగిపోయి తిన్నగా తనస్థానాన్ని చేరికూర్చున్నాడు. మృగసేనుడు కూడా మెల్లగాపోయి దాపున ఒకమూలగా నిలుచుకొని చేతులు కట్టుకొనియున్నాడు.

సరిగా రెండుయామములూ కడచి, మూడవ యామము ప్రవేశించింది. మృగసేనుడు కదలకుండా అలాగే వున్నాడు. మృగసేనుణ్ణి చూచేకొద్దీ యశోధరుడికి ఎందులకో ఒకవిధమైన జాలి కలిగింది. చాలసేపు అట్టే ఏమనుకున్నాడో ఏమో కాని, మృగసేనుణ్ణిపిలిచి "ఏమి? ఎవరు నీవు? నీ కేమి కావలె?" అని పలికాడు. "బాబూ! నేను ఒక మహాపాపిని; ఇంతవఱకూ తాము సెలవిచ్చిన మహాపాపమైన హింసను నేటివఱకూ జీరుపోకుండా శ్రద్ధతో చేస్తూన్న దౌర్భాగ్యుణ్ణి అయ్యా నాబుద్ధి తెలిసింది మొదలు ఇంతవఱకూ నేనుచేసిన హింసలకు మితి లేదు. నావృత్తే అది; హింసలో పుట్టాను. హింసలో పెరిగాను; హింసలో తేలుతున్నాను; బాబూ! నావేషాన్ని బట్టే తమకు బోధపడుతున్నది;

భార్యను శ్రీగుప్తుడనే తనమిత్రుని ఇంట్లో వదిలిపెట్టి తన తాలూకుచరాస్తి అంతా శ్రీదత్తుడికి ఇచ్చివేసి తాను పూతుర్నొకదాన్ని తీసుకొని కౌశాంబికివారిపోయినాడు. శ్రీదత్తుడు అతనిభార్యను పోషిస్తూన్నాడు. తర్వాత కొన్నాళ్లకు శ్రీదత్తుడే పెద్దసెట్టిగా అయినాడు.

ఒకనాడు శ్రీదత్తుడింటికి శివగుప్తుడు, మునిగుప్తుడూ అనే జైనసన్న్యాసులు వచ్చారు. వారికి భిక్షోపచారాదులను జరుపుటకు శ్రీదత్తుడు ధనశ్రీని నేమించాడు పాపం ధనశ్రీ నిండు చూలాలయినా వేరే గతి లేక అల్లాగే పడుతూ లేస్తూ తన దీనభావానికి విచారపడుతూ ఆమునులకు ఉపచారం చేస్తున్నది. ఆమె చేసే ఉపచారాలను అంగీకరిస్తూ అందులో శివగుప్తుడన్నాడుకదా "ఏమోయి మునిగుప్తా! చూశావా! ఈమె ఎవరోగాని గర్భిణి. గర్భభారం వల్ల ఎంతఆయాస పడుతున్నదో చూడు. ఇంత గర్భక్లేశాన్ని కలిగించడానికి ఆ గర్భంలోని శిశువు ఎంత లోకకంటకుడవుతాడో గదా! అని మునిగుప్తుడామాట విని కొంచె మాలోచించి నీ తెలివితేటలు తెల్లవారినట్లున్నాయి. నేను సత్తత్వదృష్టితో చూశాను. ఈమె గర్భంలో వుండేవాడుచాల పుణ్యాత్ముడవుతాడు. మహాదాత కూడాను. ఇంకా దైవం రక్షిస్తే ఈవూరి రాజుగారికి ముఖ్యమైన శ్రేష్ఠిగాకూడా అవుతాడు. తప్పదన్నాడు. శివగుప్తుడున్నూ ఆలోచించి "నాదేపొరపాటు నిజమే" అన్నాడు. ఈ మాటలు చాటున వుండి వింటూవున్న శ్రీదత్తుడి చెవులకు వజ్రపుమేకులవలె నాటినవి. శ్రీదత్తుడు ఇతరవిషయాలలో శ్రీదత్తుడేకాని ఇందులోమాత్రం అశ్రీదత్తుడైనాడు. అతనిమనస్సులో లోభం ప్రవేశించి "ఎప్పటికైనా గుణపాలుడు మళ్లీ వెనక్కొచ్చి తన కడ్డం వస్తాడేమో. కాబట్టి ఇంతట ఎల్లాగైనా ఈగర్భంలో వున్న శిశువును తుదముట్టించి ఆఅడ్డంతొలగించడమే"లని బోధ చెయ్యడం ఆరంభించింది. సరిగ్గా దైవబలంచాలక ఆనాడే ధనశ్రీ ప్రసవించింది. శ్రీదత్తుడు మంత్రసానికి లంచమిచ్చి ఆశిశువును కసాయిదుకాణాలవద్ద పారవేయించాడు. మర్నాడు కసాయి ఆపిల్లవాడిని తీసికొనిపోయి పెంచడం ఆరంభించాడు. తర్వాత కొన్నాళ్లకు ఏదో వర్తకపుపనిమీద కసాయివాడింటికి శ్రీదత్తుడి బావమరిది ఇంద్రదత్తుడనేవాడు వచ్చి పిల్లవాని రూపరేఖావిలాసాలకు ఆశ్చర్యపడి కసాయివాడికి కోరినంత ద్రవ్యమునిచ్చి ఆపిల్లవాడిని తాను తీసికొనివెళ్లి పెంచుతున్నాడు. ఇల్లా కొన్నాళ్లు జరిగేటప్పటికి ఈసంగతి శ్రీదత్తుడికి తెలిసింది. తర్వాత అతడు యుక్తిగా ఇంద్రదత్తుడింటికివచ్చి ఆపిల్లవాడిని పోల్చుకొని "ఏమోయీ బావా! మేనల్లుణ్ణి నా కొప్పగిస్తూ. నేను పెంచవలెనని వున్నది" అనిచెప్పి తనయింటికి తీసుకోపోయి రహస్యంగా మళ్లో కసాయిని పిలిపించి వాడిచేతికి ఆపిల్లాణ్ణి చంపెయ్యమని చెప్పి వేయి దీనారములను బహుమతిగా ఇచ్చాడు. ఆకసాయి సరే అని తీసుకోపోయి చంపడానికి చేతులురాక వూరికిదగ్గరగావుండే ఒకముండ్లపొదలో పారవేసిపోయినాడు. తర్వాత మర్నాడు కొందరుగొల్లపిల్లలువచ్చి ఆపిల్లాడిని తీసుకోపోయి తమ నాయకుడైన గోవిందుడనే నాయకుడి కిచ్చారు. వాడు బిడ్డలులేనివాడైనందున ఆపిల్లడు చాలా అదృష్టవంతుడౌతాడని తలంచి పెంచి పెద్దవాణ్ణిచేశాడు. ఆపిల్లాడికి గోవిందనాయకుడు పెట్టినపేరు ధనకీర్తి అని.

ఇట్లావుండగా ఏదో రాజకార్యాలవల్ల మరికొన్నేండ్లయినతరువాత శ్రీదత్తుడు ఆగొల్లపల్లెకు రావడం తటస్థించింది. ధనకీర్తికి పదహారేండ్లు నిండినవి. మంచి అందమైన రూపమూ దానికితగినట్టి ముద్దొచ్చేగుణాలూ అలవడ్డాయి గోవిందుడు కులోచితరీతిని వెంషికంటె చేయించి ఆపిల్లాడికి పెట్టాడు. ఊళ్లో చిన్నదగ్గర్నించీ పెద్దదాకా ధనకీర్తిఅంటే తల్లోనాలుక; మంచి కలేకలుపుల పిల్లవాడు. అదృష్టవంతుడుకూడాను. ధనకీర్తి దొరకినప్పటినుండి గోవిందుడిపని వేస్తే వేయిరూపులుగా వున్నది. కాబట్టి పంచప్రాణాలూ ఆపిల్లవాడిమీద పెట్టుకొనివున్నాడు గోవిందనాయకుడు.

గోవిందుడు ఏదో ఇష్టాగోష్ఠిలో శ్రీదత్తుడితో తనకు ఐశ్వర్యం వచ్చినవృత్తాంత మంతా చెప్పి ధనకీర్తిని పిలిచి 'వీడుగోనండీ నా నిధానము' అని చూపించాడు. శ్రీదత్తుడు ఒక్కక్షణంలో జరిగినదంతా పోల్చుకొని నీరైపొయ్యాడు. అయినా పయికి తెలియనీయకుండా ఆ ఆవేగాన్ని అప్పుకోని 'నీవు చాలా అదృష్టవంతుడవోయి నాయకుడా" అనిచెప్పి కొంచెమునే పూరుకొని

గోవిందనాయకుడా! నాకో అవసరమైన పనివచ్చింది. ఒకజాబును రేపు తెల్లవారేటప్పటికి మాయింటికి పంపవలెను. మనవాడుగా నమ్మకగినవాడుగా వుండాలి. మరి ఇందుకు ఏం వుపాయం చేస్తావోయి అన్నాడు. గోవిందుడు కొంచెంసేపు ఆలోచించి "సరేకానీండి. మాఅబ్బాయినే పంపిస్తా" నన్నాడు. శ్రీదత్తుడు తనరొట్టె విరిగి నేతిలో పడ్డట్టు సంతోషించాడు. అనుకున్నట్టుగానే ప్రయాణం సిద్ధమైంది. తండ్రి మాట ప్రకారం పాపం నిమ్మ-పటీ-ధనకీర్తి శ్రీదత్తుడి జాబు తీసికొని పోయిపోయి రోజల్లా ప్రయాణంచేసి మరునాడుమధ్యాహ్నానికి ఉజ్జయినికి చేరినాడు. ఏకాయెకీన ఒకటిన్నర రోజల్లా నడవడంచేత అలసిపోయి ఊరిబయట ఉండే మామిడితోపులో ఒకచెట్టుక్రింద పడుకొని గాఢముగా నిద్దురపోసాగినాడు. కాని చేతికివెండిమురుగులూ, మెళ్లో వెండికంటె, నిండు చంద్రబింబంలాగా కళకళ్లాడుతూ వుండే ఆనెమ్మోము, వీటి అన్నిటికంటె మెళ్లో వెండి కంటెకు కట్టుకొన్న ఆజాబు అతని అమాయకత్వాన్ని సౌందర్యాన్ని కొల్లబెడుతున్నవి.

ఈకథ ఇంతలో వుండగా మరో సంగతి వచ్చింది. ఉజ్జయినిలో అనంగసేన అని ఒక బోగపు చిన్నది వున్నది. ఆపిల్లను లేకలేక పుట్టినందున ఆమె తల్లి వసుసేన మహాగారాబంగా పెంచుతూ వస్తూన్నది. అనంగసేన కిప్పుడు పధ్నాలుగేండ్లునిండి పదిహేనోఏడు వచ్చింది. "చక్కనిచుక్క అందాల భరిణె; చదువుల సరస్వతి" అని ఆమెను అందరూ పొగడడమే కాకుండా ఎంతెంత మందో రోజూ ఆచిన్నదానికి కన్నెచెర బాపుతామని లక్షాధికార్లూ కోటీశ్వరులూ వస్తూవున్నారు. వచ్చిన ప్రతీవాళ్లనీ "కన్నెచెర ఏమిటి బాబయ్యలారా" అని ఎకసక్కెంగా ఆపిల్ల ధిక్కరించి పంపుతూంది. వచ్చిన శ్రీమంతుల్లోకొందరు 'ఎంత పొగరుబోతూ!' అని కన్నెఱ్ఱచేసి పొయ్యారు. మఱికొందరు 'పాపం! సాంది ప్రతివ్రత అవుతుంది కామోసు' అని వెటకారాలు ఆడి పొయ్యారు. ఇంకా కొంత కుజ్జజట్టు 'కానీ వంటఇంటి కుందేలు ఎక్కడికి పారిపోతుందిలే' అని గుండెనిబ్బరం చేసికొని వెళ్లారు. ఇల్లా తలా వకామాదిరిగా అంటూవుంటే వసుసేన ఆపిల్లను నిర్బంధపెట్టలేదు. సరేకదా! పైగా "ఏం పిచ్చిదాన్నబ్బ నేను సంపాదించాను చాలదా? ఆపిల్లను పూరా చెడిపిచెయ్యడ మెందుకూ" అనుకొని వూరుకున్నది 'ప్రపంచం పుట్టిన ఇన్నాళ్లకు సానివాడలో తప్పపుట్టినవాళ్లు ఈతల్లికూతుం డ్లిద్దరే నయ్యా' అని పెద్దలు నవ్వుకున్నారు.

ధనకీర్తి ఉజ్జయినికి వూరిబయట మామిడితోటలో అలసి పడుకొన్ననాడు అనంగసేన ఒంటరిగా చల్లగాలికి ఆతోటకే వచ్చింది. వచ్చి తోటలో అటూఇటూ తిరుగతూ తిరుగతూ, దైవచిత్రం ఏమోకాని సరిగా ధనకీర్తిపడున్న చెట్టుకిందికే వచ్చింది. ధనకీర్తి మోచేతిని మడచి తలకింద పెట్టికొని ఆపరుండటాన్ని, మెళ్లో చల్లగాలికి ఇటూఅటూ కొట్టుకొంటూన్న వుత్తరాన్ని చూచి మెల్లగా ఆవుత్తరాన్ని వూడదీసికొని కొంచెం జరిగి కూచొని చదువుకొన్నది. అందులో ఇల్లా రాశి వుంది:

శ్లో. మద్భార్యాచే ద్గుణవతీ మన్యతే మాం యది ప్రియమ్;
పుత్రో మహాబల శ్చాపి చే న్మాం జానాతి తాతకమ్.
అస్మత్కులద్రుమస్యాంసీ జ్వలత్కాలానలోపమః;
హన్తవ్యో బ్రహ్మపుత్రేణ మద్వాక్యై ర్దుస్సహలేన వా.

అనంగసేనకు వుత్తరమంతా చదువగానే ఏంసంగతో ఏమో చెప్పలేముగాని తనకాపిల్లవాడు చాలా పరిచితుడనిన్నీ ఆప్తుడనిన్నీ ప్రాణాధికుడనిన్నీతోచింది. వెంటనేఆమెకు ఎల్లాగయినా ఆధనకీర్తిని కాపాడవలెనని తలంపుకలిగింది. అప్పుడు ఆమె ఏంచేసిందనుకొన్నారూ? అక్కడి చెట్టుపసరుతో ఆఅక్షరాలను మెల్లెగా తుడిచివేసి, దానిస్థానంలో తనకవిత్వం కలిపి ఈవిధంగా పూర్తిచేసి తన కంటికాటుకతో వ్రాసి దాన్ని మడచి ఎప్పటిలాగానే ఆపిల్లాడి మెళ్లో కట్టి తాను తనదారిని వెళ్లిపోయింది. అనంగసేన దిద్దినరీతి ఇది:-

శ్లో. మద్భార్యాచే ద్గుణవతీ మన్యతే మాం యదిప్రియమ్,
పుత్రో మహాబల శ్చాపిచే న్మాం జానాతి తాతకమ్.
తదా వత్సా ప్రదాతవ్యా సత్వరం ధనకీర్తయే;
శాఖాస ప్తకపర్యంతం శోధితోయం సుధీ ర్మయా.
మధ మేషాం వివా హేక్షణం మాంగళ్యం వినివర్త్యతామ్.

భార్యను శ్రీగుప్తుడనే తనమిత్రుని ఇంట్లో వదిలిపెట్టి తన తాలూకుచరాస్తి అంతా శ్రీదత్తుడికి ఇచ్చివేసి తాను మాతుర్కొనికదాన్ని తీసుకొని కౌశాంబికివారిపోయినాడు. శ్రీదత్తుడు అతనిభార్యను పోషిస్తూన్నాడు. తర్వాత కొన్నాళ్లకు శ్రీదత్తుడే పెద్దసెట్టిగా అయినాడు.

ఒకనాడు శ్రీదత్తుడింటికి శివగుప్తుడు, మునిగుప్తుడూ అనే జైనసన్యాసులు వచ్చారు. వారికి భిక్షోపచారాదులను జరుపుటకు శ్రీదత్తుడు ధనశ్రీని నేమించాడు పాపం ధనశ్రీ నిండు చూలాలయినా వేరే గతి లేక అల్లాగే పడుతూలేస్తూ తన దీనభావానికి విచారపడుతూ ఆమునులకు ఉపచారం చేస్తున్నది. ఆమె చేసే ఉపచారాలను అంగీకరిస్తూ అందులో శివగుప్తుడన్నాడుకదా "ఏమోయి మునిగుప్తా! చూశావా! ఈమె ఎవరోగాని గర్భిణి. గర్భభారం వల్ల ఎంతఆయాస పడుతున్నదో చూడు. ఇంత గర్భక్లేశాన్ని కలిగించడానికి ఆ గర్భంలోని శిశువు ఎంత లోకకంటకుడవుతాడో గదా! అని మునిగుప్తుడామాట విని కొంచెమాలోచించి నీ తెలివితేటలు తెల్లవారినట్లున్నాయి. నేను సత్తత్వదృష్టితో చూశాను. ఈమె గర్భంలో వుండేవాడుచాల పుణ్యాత్ముడవుతాడు. మహాదాత కూడాను. ఇంకా దైవం రక్షిస్తే ఈవూరి రాజుగారికి ముఖ్యమైన శ్రేష్ఠిగాకూడా అవుతాడు. తప్పదన్నాడు. శివగుప్తుడున్నా ఆలోచించి "నాదేపొరపాటు నిజమే" అన్నాడు. ఈ మాటలు చాటున వుండి వింటూవున్న శ్రీదత్తుడి చెవులకు వజ్రపుమేకులవలె నాటినవి. శ్రీదత్తుడు ఇతరవిషయాలలో శ్రీదత్తుడేకాని ఇందులోమాత్రం అశ్రీదత్తుడైనాడు. అతనిమనస్సులో లోభం ప్రవేశించి "ఎప్పటికైనా గుణపాలుడు మళ్లీ తిరిగొచ్చి తన కడ్డం వస్తాడేమో. కాబట్టి ఇంతట ఎల్లాగైనా ఈగర్భంలో వున్న శిశువును తుదముట్టించి ఆఅడ్డంతొలగించడమే"లని బోధ చెయ్యడం ఆరంభించింది. సరిగ్గా దైవబలంచాలకఆనాడే ధనశ్రీ ప్రసవించింది. శ్రీదత్తుడు మంత్రసానికి లంచమిచ్చి ఆశిశువును కసాయిదుకాణాలవద్ద పారవేయించాడు. మర్నాడు కసాయి ఆపిల్లవాడిని తీసికొనిపోయి పెంచడం ఆరంభించాడు. తర్వాత కొన్నాళ్లకు ఏదో వర్తకపుపనిమీద కసాయివాడింటికి శ్రీదత్తుడి బావమరిది ఇంద్రదత్తుడనేవాడు వచ్చి పిల్లవాని రూపరేఖా విలాసాలకు ఆశ్చర్యపడి కసాయివాడికి కోరినంత ద్రవ్యమునిచ్చి ఆపిల్లవాడిని తాను తీసికొనివెళ్లి పెంచుతున్నాడు. ఇల్లా కొన్నాళ్లు జరిగేటప్పటికి ఈసంగతి శ్రీదత్తుడికి తెలిసింది. తర్వాత అతడు యుక్తిగా ఇంద్రదత్తుడింటికివచ్చి ఆపిల్లవాడిని పోల్చుకొని "ఏమోయీ బావా! మేనల్లుణ్ణి నా కొప్పగిస్తూ. నేను పెంచవలెనని వున్నది" అనిచెప్పి తనయింటికి తీసుకొపోయి రహస్యంగా మళ్లో కసాయిని పిలిపించి వాడిచేతికి ఆపిల్లాణ్ణి చంపెయ్యమని చెప్పి వేయి దీనారములను బహుమతిగా ఇచ్చాడు. ఆకసాయి సరే అని తీసుకొపోయి చంపడానికి చేతులురాక వూరికిదగ్గరగావుండే ఒకముండ్లపొదలో పారవేసిపోయినాడు. తర్వాత మర్నాడు కొందఱుగొల్లపిల్లలువచ్చి ఆపిల్లాడిని తీసుకొపోయి తమ నాయకుడైన గోవిందుడనే నాయకుడి కిచ్చారు. వాడు బిడ్డలులేనివాడైనందున ఆపిల్లడు చాలా అదృష్టవంతుడౌతాడని తలంచి పెంచి పెద్దవాణ్ణిచేశాడు. ఆపిల్లాడికి గోవిందనాయకుడు పెట్టినపేరు ధనకీర్తి అని.

ఇట్లావుండగా ఏదో రాజకార్యాలవల్ల మఱికొన్నేండ్లయినతరువాత శ్రీదత్తుడు ఆగొల్లపల్లెకు రావడం తటస్థించింది. ధనకీర్తికి పదహారేండ్లు నిండినవి. మంచి అందమైన రూపమూ దానికితగినట్టి ముద్దొచ్చేగుణాలూ అలవడ్డాయి గోవిందుడు కులోచితరీతిని వెంఢికంటె చేయించి ఆపిల్లాడికి పెట్టాడు. ఊళ్లో చిన్నదగ్గర్నుంచీ పెద్దదాకా ధనకీర్తిఅంటే తల్లోనాలుక; మంచి కళలేకలుపుల పిల్లవాడు. అదృష్టవంతుడుకూడాను. ధనకీర్తి దొరకినప్పటినుండి గోవిందుడిపని వేస్తే వేయిరూపులుగా వున్నది. కాబట్టి పంచప్రాణాలూ ఆపిల్లవాడిమీద పెట్టుకొనివున్నాడు గోవిందనాయకుడు.

గోవిందుడు ఏదో ఇష్టాగోష్ఠిలో శ్రీదత్తుడితో తనకు ఐశ్వర్యం వచ్చినవృత్తాంతమంతా చెప్పి ధనకీర్తిని పిలిచి 'వీడుగోనండీ నా నిధానము' అని చూపించాడు. శ్రీదత్తుడు ఒక్కక్షణంలో జరిగినదంతా పోల్చుకొని నీరైపోయ్యాడు. అయినా పయికి తెలియనీయకుండా ఆ ఆవేగాన్ని ఆపుకొని 'నీవు చాలా అదృష్టవంతుడవోయి నాయకుడా" అనిచెప్పి కొంచెమునే పూరుకొని

"ఎక్కడికోయి బావా!" అని అడిగాడు. ధనకీర్తి వివరంగా చెప్పాడు. 'ఓసీ! ఇదిటోయి! నీవు కొత్తవాడివి; దారి తెలుసుకోవడం చాల కష్టం. ఇంతట పెందరాళే ఇంటికి చేరు. నేనెళ్లి ఇచ్చివస్తా తే' అని బలాత్కారంగా లాగుకొని ధనకీర్తిని ఇంటికి పంపి తానే కాత్యాయనీగుడికి వెళ్లి గడ్డలు అయ్యాడు. ధనకీర్తి పూర్వపుణ్యం వల్ల సురక్షితంగా ఇంటికి చేరాడు. పుణ్యమనకు ఉండే ప్రభావం ఇల్లాంటిది కాబట్టే ఆచార్యభద్రశాలి చెప్పిన సుభాషితాలు పెద్దలు చదువుతూ అంతా నిజమే చెప్పాడని ఆయన్ను మెచ్చుకొంటూ వుంటారు. తాగయతీ నుండిన్నీ ఆయన ఏం చెప్పా డంటే!

శ్లో. పూర్వపుణ్యేన జంతూనాం కాలవహ్ని ర్జలాయతే,
స్థలాయతే సముద్రోపి శత్రు ర్మిత్రాయతే భృశమ్;
హాలాహలం సుధాభావం యాత్యాపత్సంపదాయతే
విఘ్నా నశ్యంతి నిశ్శేషాః మహోభ త్యేవ సత్వరమ్
తస్మాత్ పుణ్యం ప్రయత్నేనచార్జయేత్సుఖబీజకమ్.అని

[అంటే పూర్వజన్మాన పుణ్యమంటూ చేసి వున్నట్టయితే అట్టిజీవులు ప్రళయాగ్నిలో బడినా చల్లగా మారిపోతుంది. సముద్రంలో దూకినా మెట్టన ఉన్నట్టే అవుతుంది. ఆజన్మశత్రు వైనా నిముషంలో మిత్రుడు అవుతాడు. విషం తాగినా అమృతమే అవుతుంది. ఇంత ఎందుకూ? ఏఆపదలు వచ్చినా అవన్నీ అతగాడికి సంపదలు అవుతవి. సమస్తవిఘ్నాలూ ఆజీవుణ్ణి చూస్తే బెదిరి పరిగెత్తిపోయి దాగుకొంటవి కాబట్టి ప్రయత్నపూర్వకంగా మనుజుడై పుట్టిన ప్రతీవాడున్నూ పుణ్యాన్ని ఉత్తరత్రజన్మాలలో సుఖాన్ని కల్గించేందుకు కారణమైన దానిని ఆర్జింపవలసి యున్నది.—అని]

ఈమాటు విశాఖ ఒక తే ఏంచేస్తే బాంగుంటుందో ఆలోచించింది. "ఎల్లాగూ వంశానికి ఆధారం లేకుండా పోనేపోయింది గదా ఈ దేబెకూతురు విధవై పోతేమాత్రం వచ్చినహాని ఏ ముంది" అనుకొన్నది. తర్వాత భోజనసమయంలో ధనకీర్తికి విషం పెడితే సరిపోతున్నది కదా" అని నిశ్చయం చేసికొని శ్రీదత్తుడితో చెప్పింది. ఆయన భలే వుపాయం అన్ని మెచ్చుకొన్నాడు. అనుకొన్నట్టుగా తీవ్రమైన విషం బాజారుకు వెళ్లి తానే కొని తెచ్చి, దానితో కలిపి లడ్డూలు చేసింది. కూతురితో "అమ్మాయీ! ఇదిగో లడ్డూలు సిద్ధం చేశాను. కొన్ని నల్లవి. మరికొన్ని తెల్లవి. నేను స్నానానికి వెళుతున్నాను. నేను వచ్చేసరికి నీవు మీనాన్నకూ మీయింటాయనకూ వడ్డించి వాళ్ల భోజనాలు ముగించు. మనం ఇద్దరమూ కలసి కూచుందాము. ఇదిగో చెప్పడానికి మఱచిపోయ్యాను. ఆ తెల్లటి లడ్డూలు చాలా విలువుగలవి. మాంచివి కూడాను. వాటిని అల్లుడికోసము చేశాను. అవి అల్లుడికే వడ్డించు. మీనాయనకు వెయ్యవద్దు సుమా!"అని చెప్పి వెళ్లిపోయింది. శ్రీదత్తుడు అల్లుణ్ణి మహోత్సాహంతో వెంటబెట్టుకొని పిలువనిదే (అంటే ముందుగానే) భోజనానికి వచ్చి కూర్చున్నాడు. భద్రశాలి శ్రీదత్తుడి కూతురు తొందరపడుతూ 'ఇంకా వంట పూర్తిగా లేదు' అని వినవచ్చి వినరాకుండాఅనబోతున్నది. శ్రీదత్తుడు ఏం వంటమ్మా! ఎంతసేపు! రెండుయామాలు దాటుతున్నవి. రసోనా (రసాయన మేమో?) సిద్ధమైతే అవుతుంది. కాకపోతే పోతుంది. అయినంతవరకూ ఆలడ్డూలు వేసి వడ్డిస్తూ"అని తొందరపెట్టినాడు. భద్రశాలి 'సరే' నని వడ్డించింది. ఆవడ్డించడంలో తొందరపాటులో విశాఖ చెప్పిన ఆ తెల్లలడ్డూలు తనతండ్రికిన్నీ నల్లవాటిని భర్తకున్నూ వడ్డించింది. వాళ్లిద్దరూ తిని లేచిపోయినారు. శ్రీదత్తుడు పసారా ల్లో వెళ్లి పడుకున్నాడు. ఒక్కక్షణంలో నిద్ర పట్టింది. ఆనిద్ర నిద్ర ఒకటే నిద్ర అయింది. అంటే దీర్ఘనిద్ర. మళ్లా లేచి తిరుగవలసిన అవసరంలేనట్టి శాశ్వతనిద్ర. ఇంతలో విశాఖ వచ్చి జరిగినపనికి విచారపడుతూ అల్లుణ్ణి కూతురుని పిలిచి తానుచేసిన ద్రోహాన్ని అంతా వెల్లడించింది. చివరి పశ్చాత్తాపంతో అన్నది "నాయనా ధనకీర్తీ! అదృష్టవంతుణ్ణి చెరపేవాడూ లేడు. దురదృష్టవంతుణ్ణి బాగు చేసేవాడూ లేడు కాబట్టి, అయినదేమో అయింది; నీవు వెంటనేపోయి శ్రేణీపతి*యైన వసు సేనుణ్ణిపిలుచుకొనిర"మ్మని పంపింది. పంపినప్రకారం వెంటనే శ్రేణీపతివచ్చాడు

* శ్రేణులని ఆకాలంలో పట్నాలను పరిపాలించే స్వతంత్రసభలుండేవి. పౌరు లందరూ ఈసభద్వారా తమ రాజకార్యాలను చక్కపెట్టు కొనేవారు. శ్రేణికి సర్వాధిపత్యం వహించేపెద్దపేరు శ్రేణీపతి. రాజు నామమాత్రానికి పాలకుడుగావుండి శ్రేణీపతి ఆర్డరుప్రకారం పాలించవలెను. చూడుడు, నా కౌటిల్య అర్థసూత్రవివరణమును.

విశాఖ గుణపాలుడు ఆవూరినుంచి పారిపోయిన్పటి మొదలుకొని ఆనాటిదాకా జరిగిన కథంతా ఆయనకు చెప్పింది. చివరకు తాను సహగమనం చేస్తున్నాననిన్నీ చెప్పి, తమతాలూకా ఆస్తికి శ్రీదత్తుణ్ణే వారసుగా ఉంచమనిన్నీ, రాజుగారితో చెప్పి పెద్దసెట్టి యుద్యోగం తనఅల్లుడు ధనకీర్తికే ఇప్పించవలసిం దనీ కూడా చెప్పింది. చివరకు ఆమె సహగమనం చేసింది. ఆమె కోరినట్లే వసుసేనుడు ఏర్పాట్లు అన్నీ చేశాడు. విశ్వంభరుడు పెద్దసెట్టి యుద్యోగం ధనకీర్తికి ఇవ్వడమే కాకుండా కౌశాంబికి మనుష్యుణ్ణి పంపి గుణపాలుణ్ణి కూడా పిలిపించి వారి ఎప్పటి వస్తువాహనాలు వారికి స్వాధీనం చేశాడు. గుణపాలుడు దైవవశమున గలిగిన ఈ మార్పుకు అబ్బురపడుతూ కొడుకూ కోడలితో సుఖంగా వుంటున్నాడు.

కాని గుణపాలుడికి మాత్రం ఈవిపర్యయాన్ని తలచుకొనప్పుడల్లా చాలా ఆశ్చర్యం కలుగుతూ వుండేది. ఇట్లా వుండగా, మరికొన్నాళ్లకు గుణపాలు డింటికి యశోధ్వజుడనే జైనసన్యాసి వచ్చాడు. గుణపాలు డతనికి భిక్షోపచారాలు జరిపి తనమనస్సులో వున్న ఆశ్చర్యాన్ని ప్రకటించి అడిగాడు: "అయ్యా! తెలియక అడుగుతున్నాను. ధనకీర్తి ఇన్ని ఆపదలలో నుండి విడిపడడానికిన్నీ, ఇంత గొప్ప శ్రేయస్సును పొందడానికిన్నీ అతను పుణ్యంచేసి వుండవలెగదా! ఆపుణ్యం ఎటువంటిదై ఉంటుందీ?" అని. యశోధ్వజుడు కూడా మొదట కొంచెం అబ్బురపొయ్యాడు కాని, * సప్తతత్వవిచారణ చేయగలవాడు కాబట్టి ఒక్కక్షణంలో తెలిసికొని మృగసేనుడి పుట్టుక మొదలుకొని అంతవరకున్నూ జరిగిన సంగతులన్నీ చెప్పి మృగసేనుడే ధనకీర్తి అనిన్నీ, వాడిభార్యయే అనంగసేన అనిన్నీ, తక్కినవంతా అతడవలంబించిన అహింసావ్రతఫల మనిన్నీ బోధించి వెళ్లిపోయినాడు. మరికొన్నాళ్లకు గుణపాలుడు విరక్తుడై భార్యతో సహా తీర్థయాత్రలు చేసికొంటూ పరతత్వంలో లీనమై పోయినాడు. క్రమంగా ఇంక కొన్నాళ్లకు ధనకీర్తికి జాతిస్మరత్వం కలిగి సన్న్యాసియై జినపాదపద్మాలను సంస్మరిస్తూ పరమాత్మలో కలిసాడు. అనంగసేనకూడా ఇంకకొన్నాళ్లకు ఆత్రోవే తొక్కింది; ఇది మృగసేనధీవరుడి [జన్మాంతరముతో సంబంధించిన] కథలో రెండో తరంగం ముగిసింది. కాబట్టే సింహానంది అన్నాడు గదా "ఆరాధ్య జైనం జంతుః కో నప్రాప శుభాం గతిమ్' అని. ఇది జైనుల మతకథలలో మృగసేన ధీవరు డనే జాలరియొక్క అహింసావ్రతకథ,

'విజ్ఞాపిక:— ఈకథ సింహానందిరాసిన జైనసూత్రవాఖ్యనుండి తీశాను అందులో మూలంలో వున్న 'మియసిణ్ణధీవరాణం' అన్నచోట్లల్లా ఛాయలో మృగసేన ధీవర అని పఠింపబడ్డది; కాని కథధోరణి చూస్తే మనతెలుగులో చంద్రహాసతో పోలిక కనిపిస్తున్నది. 'మియసిణ్ణధీవర' అనేమాటకు మృగచిహ్నాధీవర అని ప్రాకృతచ్ఛాయగా మనం గ్రహిస్తే [మృగచిహ్న= మృగలాంఛన- చంద్ర; హాసము అలంకారంగా చేర్చినతోక అయి వుంటుంది] చంద్రహాస అనే పేరుకూడా సరిపొయ్యేటట్టేవున్నది; అయినా భాషాపారిశ్రామికులగు సోదరులు ఈపోలికలో గల తత్వాన్ని పరికింపవలసియున్నదని తలుస్తాను."



* సప్తతత్వవిచారణ అనగా యోగబలంతో జీవుల పురాకృతాలను పరీక్షించే ఆత్మవిద్య యని కుందకుందాచార్యులు అర్థం వ్రాసినాడు.




మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు

(పశ్చాత్తాపగీతము)

నా తల్లి భారతీ, నను గన్న తల్లిరో,
నాపైని కోపమేలే,

నీవు కోపించితే, నిఖిలలోకము లడగ,
చేసనగ నేపాటినే!

నీముద్దుబిడ్డలౌ ఋషులు చేర్చినమంచి
ధర్మములు మొగనేస్తినే,

నీకనిష్టములైన దుష్కార్యములు చేసి
నిన్ను నిందలు చేస్తినే!

నీ కగౌరవమిచ్చు ఘోరకృత్యముచేసి
నీకు లోపము చేస్తినే,

పావనంబైన నీనామమంత్రము మాని
బ్రతుకు వ్యర్థము చేస్తినే,

జీవనంబైన నీ పాదసేవను మాని
పరమపాపము చేస్తినే,

సవతమ్మ చెప్పినవి చావాటబుద్ధులే
శ్రద్ధగా ఆలిస్తినే,

సుజన సేవ్యములైన నీ పాదపద్మములు
తలచుటే చాలిస్తినే,

అమృతతుల్యముగాగ ప్రేమతో నిచ్చు
అన్నమానల చేస్తినే,

సవతమ్మ వేసిన యెంగిలాకును నాక
ఆవలీవల చూస్తినే,

నాపాపములు పైని నన్ను [illegible] నే
నాపైని దయచూపవే!

బుద్ధివచ్చిన దింక బుద్ధివచ్చిన దింక,
నాపాపములు మాపవే!

నీపాదపద్మములె నిత్యమూ సేవింతు,
నిజము నిజమని నమ్మవే!

నాతల్లి భారతీ, నను గన్న తల్లిరో,
నాపైని కోపమేలే,

నీకోపమును మాని నన్ను రక్షింపవే,
దయచూపి కాపాడవే.





సోమయాజుల వేంకట రామమూర్తి గారు, బి. ఏ., యల్. టి.

సరస్వతి—"శ్యామలా! శ్యామలా!"
(లోపలినుండి)—"ఏమమ్మా."

సర—"లోపల నేమి చేయుచున్నావు?"

శ్యామల సత్వరముగా తల్లి వద్దకు వచ్చి వినయముగా "నే నాలోచించు చుంటిని" అనెను. "ఏమాలోచించుచుంటివి?" అని మాత బిడ్డను ప్రశ్నించెను.

"పరిపరివిధముల నాఆలోచన పరుగులిడుచున్నది. మొన్న సాయంకాలము నాయనగారు వెంకడిని శిక్షించినవిషయమై నే నాలోచించుచుంటిని. పాపము, వాడు నిరపరాధియని నానమ్మకము. వెండిగిన్నె సమాచారము వానికేమియును తెలియదని నేనూహింతును. ఒకవేళ నాయనగారనినట్లు నిజముగా వాడే దొంగతనముచేసియుండినచో వాడు ధైర్యముగా నాయనగారి నెదుర్కొని స్పష్టముగ, తడబడక, కొంచమైనను వెనుకదీయక, భీతిల్లక నాయనగారి ప్రశ్నలకు ప్రత్యుత్తరము లొసంగి యుండగల్గునా? నిజముగా వెంకడు నిరపరాధి. దోషి తనదోషమునకు బహుభంగుల భీతిజెందుచుండును. వానియంతరాత్మ వానిని వేధించుచుండును. మానవుడొకడు నిజముగా దోషమొనర్చినను వానియంతరాత్మయే వానికి తగినశిక్ష నొసంగును. వేరుగ శిక్ష అవసరములేదు. కాని వెంకడివిషయమై నాకు తోచినంతవరకును ఎట్టియనుమానమును లేదు. నాయనగారు సరిగా యోచింపక వానినేల దండించి, తిట్టిరో నాకు తెలియకున్నది. వెంకడిని తలచికొనినచో నాకు జాలి యగుచున్నది."

సర—"వెండిగిన్నె వెంకడు తీయకున్న మరి తీసినదెవ్వరు? దయ్యా మెత్తుకొనిపోయి నదా! ఇంతకును నాయనగారి చేష్టలకు నన్ను ప్రశ్నించిన నే నేమిచెప్పగలను? నీకు ధైర్యమున్నచో పోయి ఆయననే ప్రశ్నింపుము."

శ్యామల—"సరే, క్రమముగా అట్లే చేయుదును."

శ్యామలముఖ మెర్రవారెను. కన్నులశ్రుపూరితము లయ్యెను. కంఠము తనసహజమాధుర్యమును గోల్పోయెను. గిర్రున తిరిగి యింటిలోనికి బోయెను. తల్లి విస్మితురాలయ్యెను. నిశ్చలమై శ్యామల వెనువెంటనే చూపులం బరపుచు నిలిచియుండెను.

## ౨

వెంకడు రామారావుపంతులుగారి యింట్లో పాతిక యేండ్ల నుండియును నమ్మకముగా పనిచేయుచుండిన నౌకరు. సరస్వతి కాపురమునకు రాకపూర్వమునుండియు వాడు రామారావుపంతులుగారియింట నౌకరుగా నుండెను. శ్యామల బాల్యమునుండియు వాడామెను ముద్దుగా, ప్రేమపూర్వకముగా, ఆటలాడించుచు, పాటలు పాడుచు, భుజముపై

గుర్తించుకొనుచు, సీమలో దృశ్యములు చూపుటకై త్రిప్పుచు, అమితమగు గారాబముగా పెంచెను. శ్యామలకు చీమచిటుక్కుమన్న ఆవేదనను వాడు తనహృదయమందు నూరురెట్లు ఎక్కువగా అనుభవించును. ఆతనిమెడ శ్యామలకును అట్టియభిమానమే. ఇంటిలో నెప్పుడైనను రామారావుగారును, ఆతని గృహిణియును శ్యామల వివాహవిషయమై మాటలాడుకొనుట వెంకడిచెవులయందు పడినచో, వాడు పెరటిలోనికి జని ఎవ్వరును చూడకుండ ఏడ్చి, ఎవ్వరైన వచ్చినచో తనకన్నీరు తొందరగా తుడుచుకొని ఎప్పటివలె, ఏదోపని చేయుచుండినవానివలె నటించుచుండువాడు. తాను గారాబముగా పెంచిన శ్యామలమ్మ అత్తవారింటికి బోయినపిమ్మట వృద్ధుడగు వెంకడు కాలము గడుపుటెట్లు? ముందెన్నడో శ్యామల అత్తవారింటికి బోవునని వెంకడు రామారావుగారికంటెను ఎక్కువదుఃఖ మనుభవించుచుండెడువాడు. ఒకనాడు వెంకడు రామారావుగారివద్దకు పోయి "బాబూ! శామలమ్మగోరికి పెల్లి సేస్తే, ఆయమ్మ అత్తోరింటి కెల్లేటప్పుడు నానుకూడా ఆయమ్మయెంట ఎల్లిపోతాను. శామలమ్మగోరు దగ్గరలేకుంటే నాపానాలు నిలవవు బాబయ్యా" అని గద్గదస్వరముతో బలుక, రామారావుగారు, "వెంకా! శ్యామలఅత్తవారు నిన్నుకూడా వాళ్లింట్లో పెట్టుకోనేటందుకు ఒప్పుకోకపోతేనో?" అని ప్రశ్నించిరి. అందుకు వెంకడు, "వెంకడు సోమరిపోతులాగ కూకోని బోంచెయ్యడు, బాబయ్యా! సెనూరుగార్చి, కష్టపడి మరీ కూడు తింటాడు. మీకు తెల్దా ఏటేటి? నా నక్కడి కెల్లి ఇంట్లో పనిపాట్లు సేస్తానంటే పూటకు పెట్టడన్నా? ఈముసిలోడికి ఎయ్యకుంతారా? ఎయ్యకుంతే శామలమ్మగో రూరుకుంతారా? ఎవడు కూడు లేక సస్తానంటే శామలమ్మగో రూరుకోరు. నాకు తెల్సును," అని ప్రత్యుత్తర మొసంగెను. ఆమాటలకు రామారావుగారు చిరునవ్వునవ్వి, ఆశ్చర్యపడిరి. ఇంతనమ్మకముగా కష్టపడి పనిచేయుచుండు వెంకడియందు రామారావుగారికి చాలవిశ్వాసము. ఆకారణముననే వెంకడిగిన్నెవిషయమై ఆతడు మరేమియును మాటలాడకుండెను. కాని వెండిగిన్నె పోయినదినముననే, ఆతనికోపము పట్టలేక "వెంకడు తీయకున్న, వెండిగిన్నెను తీయువా రెవ్వ"రని సమూహించి, వెంకడిని తిట్టి దండించియుండిరి. కాని అంత కెక్కువేమియును చేయలేదు. చేయదలచుకొనియుండలేదుకూడను. "పోలీసు, గీలీసు" అని కొంచమైనను బెదరించియుండలేదు. అయినను వెంకడికిమాత్రము, నాటిరామారావుగారి మాటలకు మూడు ప్రాణములు పోయినవి. వెంకడిపరాభవమునకు శ్యామల పరితపించియుండెను.

## 3

రెండుదినములనుండియు వెంకడు పనిచేయుటకు రామారావుగారియింటికి రాలేదు. వాడు వారియింట్లో కొలువుకుదురుకొన్న తరువాత పనికి రాకపోవడం ఇదే మొద

సారి. ఇదే కడసారికూడను. రామారావు గారు, వెండిగిన్నె దొంగతనం తనమీద ఆరోపణచేసిన సాయంకాలమే వెంకడికి జ్వరము వచ్చియుండెను. వాడు తక్షణము తనయింటికి పోయి పండుకొనెను. మరునాడు పనిచేయుటకు వాడు రాలేదు. మూడవ నాడును వచ్చుటలేదు. శ్యామలకు ఆతురత ఎక్కువైనది. వెంకడికి జ్వరము వచ్చియుండె నని ఆమెకు తెలిసియుండెను; కాని కొలది కాలములోనే వానిదేహము స్వస్థతను జెంద గలదని యూహించియుండెను. కాని మూడవ నాడుకూడను వెంకడు రాకపోయేసరికి శ్యామలమనస్సులో అనేక ఆలోచనలు పుట్టినవి. వెండిగిన్నె దొంగతనము వానిపై ఆరోపింపబడిన కారణమున వెంకడు నొచ్చు కొని పనికిరాకపోయెనని శ్యామల ఊహించి నది. వెంకడు నిరపరాధియని ఆమెకు గట్టి నమ్మకము. తనతండ్రి అకారణముగా, ముసలి నౌకరును తిట్టి దండించినందులకు వ్యసన పడినది. వెంకడు నిర్దోషియని ఋజువు చేయుటకు నానావిధముల లాలోచించుండెను. ఏయుపాయమును తోచలేదు. పెరటిలోనికి జని ఈవిధమున తలపోయ నారంభించినది. "ఈశ్వరుడు మానవుల నందరిని ఒక్కతీరున సృజించినప్పటికిని కొందరు యజమానులని యును, కొందరు భృత్యులనియు నేల యుండ వలయునో? ఈశ్వరుని కరుణారసపూరిత ప్రపంచమునం దిట్టి నియమ మేలయుండ వలయును? ఒకమానవునిపై వేరొకమాన వునికి గలయధికారమేమి? భృత్యులును, యజమానులవలెనే మానవులై యుండ, ఒకరినొకరు శిక్షించుట కెట్టిహక్కుకలదు?— ఆహా! ప్రపంచమున న్యాయవిచారముపేర ఎట్టి అత్యాచారములుజరుగుచున్నవి! న్యాయ మూర్తులు న్యాయవిచారము గావించిరను కొని, ఎందరునిర్దోషులను విగతజీవులుగా నొనర్చుచున్నారు! నిజమగున్యాయమునకును సాంసారిక న్యాయమునకును ఎంతవ్యత్యాస మున్నది! వెంకడిని నాయనగా రేల దండింప వలయును? అట్లు దండించుట కాతని కేమి యధికారము కలదు? నాయనగారు చనవుచే నట్లు గావించినను, వెంకడి కిపు డది మనః కంటకమైనదే! వెంకడు స్వాభిమానముచే తిరిగి పనిచేయుటకు రాలేదు. ఇన్నిదినముల నుండియు విశ్వాసముగా పనిచేయుచున్న నా కింతటియవమానమా అనుమనోవ్యాకులతకు బాల్పడి తనగృహమునందే యున్నాడు.— ఏమైనను సరియే. వెంకడి నిర్దోషత్వము బైలు పెట్టెదను. ఈవిషయమును తుదముట్టువరకును పరిశీలించెదను" అని దృఢనిశ్చయము చేసికొని ఈరీతినాటి విషయములన్నియును చర్చింప సాగెను.—

"మొన్న నేను తలంటుకొని, దుద్దులు కడిగి చెవులకు పెట్టేసుకొని, వెండిగిన్నె నూతిదగ్గరనే విడిచియుంటిని. తరువాత నేను తలతుడుచుకొని, అమ్మతో యింట్లోకి వెళ్లి పోయినాను. ఆతరువాత వెంకడు పెరటిలో పనిచేయుటకు వచ్చియుండెను. అందుచేత వెండిగిన్నె ఈమధ్యలోనే పోయిఉండాలి.—

ఒకనాళ్ళ అట్టడుగానీ పెరటితలుపు తీసివుం పెట్టుకుపోయిందేమో! లేక—"

ఇంతలో పొరుగింటావిడ అన్నపూర్ణమ్మ, తనచీరకొంగులో కుడిచేయి దాచుకొని, పెరటితలుపుతీసుకొని వచ్చింది. "ఏమే, శ్యామలా, మీఅమ్మేదీ?" అని అన్నపూర్ణమ్మ ప్రశ్నించెను. శ్యామల త్రుళ్ళిపడి చూచి, "అన్నపూర్ణత్తా, మీరా? ఏమిలా గొచ్చారు?" అనెను. అన్నపూర్ణమ్మ చీరె కొంగులోనుంచి వెండిగిన్నె తీసి—" ఇది మీ దేనా?" అని ప్రశ్నించెను.

శ్యామల వెండిగిన్నె నాతురతతో తన చేతులం గొని, పరీక్షించి—"అత్తా, ఇది మాదేను. ఇదిగో 'వి. రా' అని నాయనగారి విలాసం క్రింద కనిపిస్తూంది. ఇది చిన్నప్పుడు నాన్నగారు నాకు బొమ్మరింట్లోకి చేయించి నారు. ఇది మీ కెక్కడ దొరికింది?

అన్న—మా పెరట్లో పాదుగొప్పిలో దొరికింది. ఏదో కాకి తెచ్చిపడేసినట్లు కనిపిస్తుంది.

శ్యామలకు నిజం తెలిసిపోయింది. ఆ రోజున తను ఇంట్లోకి పోవుటకును, వెంకడు పెరట్లోకి వచ్చుటకును లోపల కాకి వెండిగిన్నె ముక్కున బెట్టుకొని, ఎగిరిపోయి, పొరుగున అన్నపూర్ణమ్మగారి పెరట్లో ప్రమాదవశాత్తూ పడేసుంటుందని ఊహించింది.



'ఇదిగో 'వి. రా.' అని నాయనగారి విలాసం క్రింద కనిపిస్తూంది.'

వెండిగిన్నె పట్టుకుని మరి మాటలాడకుండా పెరటి త్రోవనే వెంకడింటికి బయలు దేరింది.

## ౪

వెంకడికి నిజముగా జ్వరమే. శ్యామల వెళ్ళేసరికి వాడికి శరీరముమీద స్పృహ లేదు. క్రింద పండుకొని గాభరాగా అటూ ఇటూ దొర్లుతున్నాడు. శ్యామల పోయి చూచింది. కన్నీరు విడిచింది. వెంకడు కొంచం కన్నెత్తి శ్యామలవైపు చూశాడు. ఏమో మాటలాడుతున్నాడు. మాటలు సరిగా తెలియుట లేదు.

అస్పష్టముగా నున్నాయి. మాటకూ మాటకూ సంబంధం లేకుండా వుంది. "అయ్యో—వెండిగిన్నె—శ్యామలమ్మగారూ—అబద్ధము—నాకు తెల్దు—బాబయగారు కోంపడ్డారు—సిగ్గు — అవమానం — అయ్యో" శ్యామల కన్నీరు కాల్వలై పారుతూంది. తన తండ్రి రామారావు పంతులుయొక్క అకారణ మగు క్రూరవాక్కులు వెంకడి హృదయమును భేదించినవి గదా యని దుఃఖించినది. తుదకు వెంకడు నిరపరాధుడయ్యెను, నిష్కారణముగ మనోవ్యాధిచే పీడింపబడుట చూచి, శ్యామల వానిబాధ నివారించునుద్దేశముతో, వెండి గిన్నె నెత్తి వెంకనికండ్లయెదుట బెట్టినది.



"వెంకా, వెంకా, వెండిగిన్నె దొరికింది, నీవు నిర్దోషివి."

"వెంకా, వెంకా, వెండిగిన్నె దొరికింది, నీవు నిర్దోషివి. భయములేదు. నీవు వ్యాకులపడ నిలదు" అని చెప్పినది. వెంకడు వెండిగిన్నె చూచాడు. శ్యామలమాటలు విన్నాడు. "అబ్బ—ఉశ్శు— అమ్మయ్య— ఇంక— నేను—నిశ్చింతగా— ప్రాణాలు వొదిలేస్తాను—ఆఁ—ఆఁ—" అని కండ్లువిప్పటికిని మూసుకొనెను. వెంకడి జీవితకాలము సమాప్తమై పోయినది. శ్యామల దుఃఖమున కంతములేదు.



"నాన్నగారూ, ఇదిగో వెండిగిన్నె"

౫

శ్యామల మెల్లగా ఇంటికి వచ్చింది. తండ్రి రామారావుగారు చావడిలో కూర్చుని వ్రాసు

కుంటున్నారు. "నాన్నగారూ, ఇదిగో వెండిగిన్నె" అని గిన్నె నాతనియెదుట నుంచి, కరుణారస ముట్టిపడుదృష్టులచే నాతనివైపు జూచుచు నిలువబడెను.

రామారావుగారు—వెండిగిన్నె ఎక్కడ దొరికింది?—వెంకడిఇంటిలోనా?—

శ్యామల— (దుఃఖము, క్రోధము సూచించుచు) వెంకడింట్లో ఏమియును లేదు. వెంకడింటిలో కేవల మంధకారము. ఈ వెండి గిన్నె పొరుగు అన్నపూర్ణత్తగారింట్లో పడి యుండెనట. ఆమె ప్రొద్దున్న తెచ్చియిచ్చింది.

రామా—అలాగైతే వెంకడి కిప్పుడే కబురుపెడతాను. పాపం! ముసలాడిని నిష్కారణం కోప్పడ్డాను. వాడు పనిచెయ్యడానికి రావడం మానుకున్నాడు.

శ్యామ—వెంకడి కిప్పుడు మీకబురు అందదు.

రామ—ఏమి?

శ్యామ— వెంకడు చనిపోయినాడు. (భోరున నేడువసాగెను.) రామారావుపంతులు తెల్లబోయెను.




# అణఁగియున్నాఁడ నేఁడు దివాంధమట్లు

వింజమూరి రంగాచార్యులు గారు, యమ్. ఏ., బి. యల్.

నవనవోత్సాహ భావకందళము లొలయ
పండు టామని కన్నులపండు వయ్యె;
ప్రత్యూషః పద్మహేళిభాస్వన్మయూఖ
పాళి యెగఁబ్రాకి జగమెల్ల మేలుకొలిపె. ౧

కలకలారావసంకులంబుల ఖగంబు
లవధరించెడు స్వేచ్ఛావిహారములను,
అటులె యానందవీధి వాహ్యాళిసలుప
టెక్కలే యాడవయ్యె నా కక్కటకట!. ౨

సలలితోత్సాహ ఝుంకారములు సెలంగ
నమృతరసమాను నల్లదే! భ్రమరచయము;
తద్రసాస్వాద భాగ్య మింతయును బడయ
రసన రుచిదప్పె జ్వరతప్త రసనవోలె. 3

సమయ సముచిత నవ్యమంత్రముల బుధులు
సన్నుతు లొనర్తు రిదె జగచ్చక్షువునకు!
తత్పురస్కృతపాక దూరవర్తనుఁడ నయ్యొ!
లేవలేనైతి నక్కటా! చేవదక్కి. ౪

క్రొంజిగు ళ్లాని గొంతెత్తి కోకిలములు
ప్రణయపరవశగీతముల్ పాడుచుండె;
నవ్య తద్గానలహరిఁ గంఠమ్ము గలుపఁ
దూలె, నాస్వర మక్కటా! తూలిపోయె.

దేశమెల్లెడ దివ్యదీధితుల నించు
ధన్యసంపూర్ణ నవ్య చైతన్యమందుఁ
బాలుగొన లేక చీఁకటిమూలఁ దూలి
యణఁగి యున్నాఁడ నేఁడు దివాంధమట్లు.



# మహలక్ష్మి

కాళ్ళూరి వెంకటరామారావు గారు

౧

"ఇదుగో! యేంచేస్తున్నావు లోపల. తలుపు ఓమారు తియ్యి" అనిజగన్నాథము ఉదయము పదకొండుగంటలకి రామచంద్రపురంలో తనయింటితలుపు తట్టెను. శేషమ్మ యింకొకకొంతసేపటికి తలుపుతీయుట తోడనే యిద్దరును లోపల ప్రవేశించినారు.

శేషమ్మ—అదేమిటి! అంత ఆదావిడిగా వస్తున్నారు? చేతులో ఆఉత్తరంయేమిటి?మావాళ్లదగ్గిరనుంచేనా? అంతా క్షేమంగా ఉన్నారుగద?



"చేతులో ఆఉత్తరం యేమిటి? మావాళ్లదగ్గరనుంచేనా ? అంతా క్షేమంగా ఉన్నారుగద?"

జగన్నాథము—వచ్చిన ఉత్తరాలన్నీ మీవాళ్ల దగ్గిరనుం చేనా యేమిటి? ద్రాక్షారంనుంచి మాఅక్కయ్య నర సమ్మ రాసింది. పిల్లకి కార్యంచేసెయ్యాలని చాల తొందరపడుతూంది. రేపు తదియనాడు మహూర్త ముట; ఏం! వింటూన్నావా!

శే—ఆ!ఆవిడ తొందర నిత్యం ఉండేదేలేస్తురూ. సంవత్సరమైందో లేదో పిల్లయీడేరి. అప్పుడే యిలా కొట్టుకుంటే. యెలాగవుతుంది?

జ—యీవుత్తరంధోరణిమాస్తే యీమారు యేమీ ఆగే టట్టు కనపడదు. ఆవిడ చాలా పట్టుదల మనిషి. ఎలాగో సంవత్సరం యీడ్చుకొచ్చేంగదా? ఎప్పుడైన చెయ్యవలసిందే కాని మనపిల్ల మనయింట్లో యెల్ల కాలం ఉంటుందా యేమిటే?

అని జగన్నాథం నరసమ్మ వ్రాసిన ఉత్తరము పూర్తిగా శేషమ్మకు చదివి వినిపించినాడు. ఎంతోసేపు బోధపరచగా శేషమ్మ చివరకి పిల్లకి కార్యంచేయుటకు ఒప్పుకొన్నది.

జగన్నాథము కొంతసేపు తనగదిలో యేవో కొన్నిగ్రంథములుచదువుకొని శేషమ్మ పిలుచుటతోడనే భోజనార్థము లేచెను.

౨

జగన్నాథము రామచంద్రపురమున మంచిపలుకు బడిగల వైద్యుడు. ఈవృత్తి ఆతనితండ్రి తాతలనుండియు వచ్చుచున్నదే కాని క్రొత్తది కాదు. ఔషధప్రయోగ మునందేమి,హస్తమందేమిజగన్నాథ మతిచతురుడు.ఆయన అనిన ప్రజలకునమ్మక మెక్కువ.ఎంతప్రాణోపద్రవకరము లైన వ్యాధులైనను జగన్నాథముపేరు చెప్పినచో పరా రీ. చుట్టుప్రక్కలలో నెంతదూరమందైనను, ఎంత

అర్ధరాత్రివేళలయినను—ఆపద—అనుమాట ఆతని చెవిలో పడినంతమాత్రమున తక్షణం రెక్కలు కట్టుకుని అక్కడవ్రాలినాడన్నమాటే.

ఎర్రంచుల పాటినూలుఖండువా తలపాగా చుట్టి, వేరొక జలతారుఖండువా మెడతవిప్పకుండ భుజముపైన వేసుకొని, ప్రాతగోడుగును, పెద్దలనాటి మందుల సంచిని చంకనుపెట్టి, కిర్రుచెప్పులతో, కుక్కమూతి చేతికర్రతో జగన్నాథము ప్రత్యక్షమయే సరికి ఎంత యాపదయందున్న వారికైనను భగవంతుడు వచ్చినట్లుగా నుండును.

దీనికితోడుగా ఆయన దయార్ద్రహృదయప్రవృత్తి వల్లనో, ఆయన అమృతహస్తప్రభావమువల్లనో యింత వరకూ అతనిచేతిమాత్రకు తిరుగులేకుండా పని జరుగు చున్నది.

పిత్రార్జితమగు ఆస్తికాక జగన్నాథము పరి యేబదియెకరముల పల్లపుభూమిని స్వశక్తివల్ల సంపాదించి నాడు. రామచంద్రపురమున నితని లోగిలి సౌఖ్యమున కును, సౌందర్యమునకును నెలవు. వీథిసావడిలో నిత్యము వందలకొలది మనుష్యులు ఔషధములకోసము పడి గాపు లు పడియుందురు.

ఇతనికుమార్తె మహాలక్ష్మికి యిపుడు పదునైదవ యేడు. కుమారుడు నరసింగరావునకు పదిసంవత్సరములు. వీ రిద్దరుమాత్రమే ఆతని సంతానమున కంతకును మిగిలినవారు.

మహాలక్ష్మి నల్లరూపున మంచికళ కాంతులు గల పిల్ల. చేరడేసికన్నులు, తీరైనముఖము, అవయవపరిపుష్టి గలిగి ఆ మెచక్కదనము పూర్ణమై దర్శనీయమై యున్నది.

మహాలక్ష్మి యామె మేనత్తకుమారుడగు రమణా రావున కిచ్చి వివాహముచేయబడి మూడుసంవత్సరము లైనది. వివాహము కాకముందే రమణారావును తన గృహమున నుంచుకొని జగన్నాథము రామచంద్రపుర మున విద్యాబుద్ధుల నేర్పించెను. పెండ్లిఅయిన కొద్దిరోజు లకు, ఆతడింకను రెండవ ఫారము పూర్తికాకుండ నే నరసమ్మ కుమారునిచదువుమానిపించి ద్రాక్షారామము నకు పిలిపించుకున్నది. ద్రాక్షారామము కరణీకము రమణా రావుదే.

రమణారావు విద్య యీరీతిగ చెడిపోవుట జగ న్నాథమున కిష్టములేదు. కాని యేమిచెయ్యగలడు? నర సమ్మ పూర్వాచారపరాయణురాలు. ఆమె తమ్ముడగు జగన్నాథము హితములను చెవిని బెట్టినది. ఆతడెన్నిసారులు బోధపరిచినను "ఆ! మావాడికి చదువుచాల్లే. యేదో యింతతినడానికి లోటులేకుండా ఉందిగనుక తింటూ కరణీకం చేసుకుని బ్రతుకుతాడులే. ఉన్న ఒక్క నలుసూ నాకళ్లకుదూరమైపోతే నేనేంచేసేది?" అనిజవా బిచ్చెడిది. ఆమె గుణమెరిగినవాడు కావున జగన్నాథము చెప్పిచెప్పి ఊరుకొన్నాడు. ఇంతలో మహాలక్ష్మి ఈడేరుటయు తరువాతకథయు మన మెఱిగిన విషయమే.

## 3

సరిగాఅనుకున్న నాటికి మహాలక్ష్మికి పునస్సంధాన మహోత్సవము జరిగినది. ఆమె మొదటిసారి అత్తవారింటికి వెళ్లి నెలరోజు లుండివచ్చినది. ఇంటికివచ్చి పది రోజులయినదో లేదో తక్షణము పిల్లనుపంపమని నరసమ్మ అప్పుడే నాలుగైదుమారులు ఉత్తరములువ్రాయించినది.

మొదటిసారి కాపురానికి మహాలక్ష్మి వెళ్లినప్పుడే నరసమ్మకోడలిని యేలుబడిచేయు విషయమున నశ్రద్ధ చేయక కొంతదాకా కనపరిచెను. కోడలువచ్చిన మరు నాటినుండియు గృహకృత్యము లన్నిటియందును నరసమ్మ వైరాగ్యము పూని మహాలక్ష్మి కిచ్చివేసినది. కాని తప్పులుపట్టు పనిమాత్రము తాను పూర్తిగా నిలుపు కున్నది.

ఒకనాడు మహాలక్ష్మి యింట్లో పను లన్నియు పూర్తియైన తర్వాత ఒక్కసారి పుస్తకము పట్టుకుని చదువుకొనుటకు కూర్చునేసరికి నరసమ్మవచ్చి "ఆ! చాల్లే చదువు. ఇదివరకు చదివినచదు వీఉద్యోగానికి చాలు. చదువులొచ్చేక ఆడవాళ్లు బొత్తిగా హద్దుమీరి పోయేరు. మానాడిన్ని పోకిళ్లు లేవమ్మా! భయం భక్తి లేక పోతేసరి. ఆడపిల్లలకి చదువెందుకురా అని యెన్నిసార్లు చెప్పినా వినక జగన్నాథం పాడుచేసేడు" అని కల్లెర్ర చేసినది. పాపము మహాలక్ష్మి గడగడలాడుచు పుస్తక మొకమూల పారవేసి ఊరకొన్నది. ఆమె బహునేర్పుతో నేర్చుకున్న కుట్టుపని చేయబోయేసరికి నరసమ్మ కేవి లేనిపోనిపనులు కనబడుచుండెడివి.

మొదటిసారియే యింతపని జరుగుటచేత అనూయకురాలగు మహాలక్ష్మి హడలిపోయినది. తల్లిదండ్రుల దగ్గిర అతిముద్దుగా పెరిగిన దాఅమ్మాయి. జగన్నాథము పైనికాని, మేనల్లుడగు నరసింగరావు పైనిగాని ఉన్న అభిమానము నరసమ్మకు మేనకోడ లగు మహాలక్ష్మిపైని లేకపోయినది. కోడ లగుటయేకాబో లందుకు కారణము ?

నరసమ్మ అన్నిరీతుల కోడండ్రికము పెట్టుచున్నను ప్రేమపూరితహృదయుడగు ప్రాణేశ్వరుని సమాదరణ మహాలక్ష్మికి పూర్తిగాకలదు. తల్లి యెదుట నిలిచి యెదురుమాటలాడు సాహసము లేకపోయినను, రమణారావు మహాలక్ష్మిని యేకాంతమున నోదార్చుచుండెడివాడు. హృదయేశ్వరుని నిర్మలప్రేమ తనసొమ్మకదా యను తలపుమాత్రము మహాలక్ష్మికి అత్తింట్లో ఊరట కలిగించెడిది.

౪

రెండవసారి మహాలక్ష్మి ద్రాక్షారామమునకు పంపబడెను. ఈమధ్యను రమణారావును ఒక్కసారి పంపమని జగన్నాథము నరసింగరావును మూడుసారులు ద్రాక్షారామమునకు బంపెను. కాని నరసమ్మకుమారుని పంపుటకిష్టపడలేదు. మేనల్లుడు తన తండ్రిపేరువాడగుటచేత నరసమ్మ నరసింగరావునకు వేయివిధముల మర్యాదచేసి అభిమానము పడెడిది. కాని రమణారావును పంపమను సరికిమాత్రమామెకు కష్టముగా కనబడెడిది. అందుచే జగన్నాథము సాధనోపాయముగానక మహాలక్ష్మిని ప్రయాణముచేసి అత్తవారింట దిగబెట్టినాడు.

కోడలు యింటప్రవేశించినపుడు నరసమ్మ ఆమెను పలుకరించనైననులేదు. మహాలక్ష్మి తిన్నగ గదిలోనికి బోయినది. రమణారావు నిండారుప్రేమతో హృదయేశ్వరిని కౌగిటజేర్చి యశ్రువులు రాల్చినాడు. మహాలక్ష్మికి కూడ దుఃఖ మాగలేదు. చిరవియోగానంతరగాఢపరిష్వంగసుఖమున మైమరచి ఆయువతీయువకు లట్లేకొంతసేపుండిరి

ఇంతలో నరసమ్మ గది యవతలనుండి "ఏమి నాయనా! అవతలమున్నబూ వాళ్లూ నీకోసం కనిపెట్టుకుని కూర్చుంటే నువ్వింట్లోఉండిపోతే యెలాగ? అవతల పనులు ముందుచూసుకో, గదిమాటకేం? గది యెక్కడికీ పారిపోదు" అన్నది

నిజభార్యాపరిరంభణమున తన్మయుడై యున్న రమణారావునకు మెలకువవచ్చినది. మహాలక్ష్మికి తా నున్నది అత్తిల్లుగాని జన్మగృహముకాదని జ్ఞప్తికి వచ్చినది. ఇద్దరను లక్షణము గదిదాటి పైకివచ్చిరి. రమణారావు వీథిలోనికి పోయినాడు. మహాలక్ష్మి గృహకృత్యములలో మునిగిపోయినది.

రమణారావు పై అధికారులవద్దనూ, గ్రామములోను మంచిమర్యాదస్థు డనిపించుకొనెను. కరణీకపు విధులు చురుకుగా నిర్వర్తించుచు నలుగురు కరణముల లో తెలివిగలవా డనుపించుకొనినాడు. నాఖిల్లకీ, చాకర్లకీ యేమియు లోటులేదు.

ఉదయమునసే లేచి కాల్యకృత్యముల నిర్వర్తించుకొని పెరటిలోనున్న పూలమొక్కలకును, కూరకాయల చెట్లకును మహాలక్ష్మిసహాయముతో నాతడు నీళ్లు పోయుచుండెడివాడు. బాలభానుని అరుణకిరణములు తనవిశాలఫాలముపై ప్రతిఫలించుచుండ, మహాలక్ష్మి గమనాలసయై కలశమున జలముదెచ్చి భర్త కందించుచుండెడిది. ఉదయమున లక్ష్మీనిలయమైన యాపూలతోటమధ్య నాదంపతులను జూచినవారికి ప్రణయదంపతులగు "సీతారాములు" జ్ఞప్తికిరాక మానరు.

తాను పెంచినట్లుపుష్పించి కాయలు కాచినపుడు రమణారావు సంతోష మింతంతకాదు. దినమును ఉదయమున కూరగాయలు స్వయంగా కోసితెచ్చి తరుగమని మహాలక్ష్మికి అతడిచ్చుచుండువాడు. సాయంసమయమున పుష్పములుతెచ్చి ముడుచుకొమ్మని యిచ్చుచుండును. మామిడిచెట్లున పండినపండుతెచ్చి ముక్కలు చేసి యింటఅందరకును సరిగా పంచిపెట్టుచుండును.

ఇంటికి సరిపోవునన్ని కూరగాయలు స్వస్థై అగుచున్నవికదాయని నరసమ్మ మహాలక్ష్మిని ఆపనినుండి మాత్రము అడ్డుపెట్టలేదు.

౫

మహాలక్ష్మి రెండవసారి ద్రాక్షారామము వచ్చిఆరు నెలలు కావచ్చినది. విజయదశమిపండుగకు అల్లుని కూతు

కుని తీసుకువచ్చునని నరసింగరావును జగన్నాథము పంపినాడు. నరసమ్మ కుమారుని పంపకపోవుట సరికదా కోడలినిసహితము పంపుటకు వీలులేదని ఖండితముగా చెప్పివేసినది.



"మహాలక్ష్మి గమనాలసయై......భర్త కందించుచుండెడిది."

సంక్రాంతిపండుగకు గూడ నిదేరీతిగ జరిగినది. శేషమ్మ పాపము కుమార్తెనుచూచి వచ్చుటకై ద్రాక్షారామ మెన్నిసారులో ప్రయాణమైనను జగన్నాథము అడ్డుపెట్టుచుండెడివాడు. నరసమ్మనే పట్టుదలమనిషిఅనుకుంటే. ఆమెకంటెను పట్టుదలమనిషై పోయినాడు జగన్నాథము. "మనపిల్లాణ్ణి యెన్నిమార్లు పంపినా ఒక్కమారు పిల్లని పంపని దానింటికి నువ్వెలాగెళతావు; సిగ్గు లేదూ?" అని భార్యని కూకవేయుచుండెడివాడు జగన్నాథము. శేషమ్మ యేమిచేయుటకును తోచక కుమార్తెకొరకు చెంగపెట్టుకుని కంట నీరుకార్చుచుండెడిది.

క్రమక్రమముగా రమణారావున కింటిలోని పోరు ఎక్కువై పోయెను వీధిలోనివ్యవహారములుచూచుకొని విసుగెత్తి యింటికివచ్చేసరికి ఆతని మనస్సునకు శాంతిలేకపోయెడిది. నరసమ్మ ఏలుబడి అంతకధికమై పోవుచుండెను. నేరముండినను లేకపోయిననుగూడ కోడలిని చూచునపుడు కామెకు"నల్లేరుపైబండి''సామ్య మైనది. కుమారునిసౌఖ్యము నామె గమనించుటలేదు. చుట్టుప్రక్కల గృహములలో చెప్పుకొనుచున్నమాటల నామె లక్ష్యపెట్టలేదు సహజ సదయహృదయయైన తమ్ముని ముఖమైనను ఆమె చూడక పోయెను. ఆమె తన సృష్టినంతను కోడలిని యేలుబడిచేయు విషయమున కేంద్రీకరించినది. కుమారునితో కోడలుపైన నేరములు చెప్పుచుండెడిది. అతి దేమియును భార్యననకపోవుట చూచి గూమె చరింత మండిపడెడిది. కొడుకును కోడలును ఒకగంట కాలము విలాసముగ గదియందుండినవో నామె కట్రగిసముకొనెడిది. "మొగణ్ణి వలలోపడేసుకుందమ్మా! వాళ్లిద్దరూ ఐకమై పోయేరు. ఇంక నేను ఏ నుయ్యో గొయ్యో చూసుకోవలసిందే" అని ఆమె నిష్కారణము ఇరుగు పొరుగులతో ముచ్చటించుచుండెను. ఈవిధముగ నామె నిరంకుశత్వము భరింప శక్యముగాక పోయినది.

అమాయకురాలగు మహాలక్ష్మి ఒక్కనాడైనా భర్తతో అత్తగారు పెట్టు బాధలను గురించి చెప్పలేదు. కాని రమణారావు మాత్ర మీ సంగతినంతను కనిపెట్టినాడు. తనకొరకుగదా పరమసాధ్వి యగు మహాలక్ష్మి యిన్నిబాధల నందుచున్నది? దీని కేదైన సాధన మాలోచించి మహాలక్ష్మి బాధలను నివారింపకున్నచో, ఆపాపమంతయు తనదని యాతడు గ్రహించినాడు. అది మొదలు ఆతడనేకవిధములగు నాలోచనలలో మునిగిపోవుచుండెడివాడు.

౬.

రమణారావున కింక నింటిలో నుండుట కష్టమై పోయినది. అకారణముగ పరమసుగుణఖనియగు మహాలక్ష్మిని తల్లి బాధించుట నాతడు చూడలేకపోయెను. ఇంట కలతలు తగ్గుమార్గ మగుపడలేదు. భార్య నొక కొంత కాలము రామచంద్రపురము పంపుటకు తల్లి ఒప్పుకొనదు. నిరంకుశత్వము మానదు. తెగించి చివరకు భార్యనైగాని తల్లినిగాని యెవరినో యొకరిని కొంతకాలము



౧౮. శ్రీ హాత్తీరాంజీ మఠము—తిరుపతి



౧౯. ఆళ్వారుచెరువునొద్ద ధర్మశాల—తిరుపతి

విడిచిపెట్టకుండినచో నీస్వాహారము స్థిరపడదని యాతడు నిశ్చయించెను. తత్క్షణమే కరణికపుటుద్యోగమునకు రెండు సంవత్సరములు సెలవుపెట్టినాడు

ఒకనాటియుదయము ఎనిమిదిగంటలకు రమణారావు యింటిముందొక రెండెడ్లబండి వచ్చి నిలిచినది. తత్క్షణము మహాలక్ష్మియు, రమణారావును ఎక్కగా బండి సాగినది.

నరసమ్మ ఆశ్చర్యమునకు మేరలేదు. తన నిరాఘాట నిరంకుశత్వమున కెన్నడుగాని యెదురాడియెరుగని కుమారుడిట్లు తనతో చెప్పకుండ భార్యతోగూడ ప్రయాణమైపోవునని యామె కలలోనైన ననుకొనలేదు. కుమారునిమాటకేమి? కోడలైనను "అత్తా, వెళుతున్నాను''అని చెప్పినపాపమున బోలేదు. తీవ్రబుద్ధిగల నరసమ్మకు శృంగభంగమైనట్లైనది. ఆమె యేదియో కొంప మునిగిపోయిన ట్లేడ్చినది.

ఇరుగుపొరుగు లమ్మలక్కలు నరసమ్మ చుట్టుజేరి ఓదార్పనారంభించిరి. ఈ ఓదార్పు లన్నియూ నరసమ్మ కోపాగ్నిపై నాజ్యధారలైనవి. "ఏమిటో! ఉన్నంతకాలం కొడుకునీ కోడలినీ ఒక్కనాడైనా సుఖపడనిచ్చిందమ్మా? రాక్షసిలాగ యేలుబడిచేసికొని తినేసిందిగాని. పాపం! మహాలక్ష్మి నిజంగా మహాలక్ష్మిలాంటిదేనమ్మా; ఆ అమ్మాయిగనక భూదేవిలాగ ఓర్చుకొంది. ఇంకొకర్తెఅయితే యీపాటికి యిల్లుమూడు ముక్కలూ నాలుగుచెక్కలూ అయివుండును. పాపం, యీ పోరుపడలేక రమణారావు చివరకి తెగించేడు'' అని తిరిగిపోవునపుడు వారిలోవారు ముచ్చటించుకొనుచు సాగిపోయిరి.

౭

ఆనాడే రమారమి పదకొండుగంటలగుసరికి రామచంద్రపురములో జగన్నాథము గారియింటిగుమ్మము ముందు బండి నిలచినది. రమణారావును, మహాలక్ష్మియును అందునుండి దిగి యింటిలోనికి బోయిరి. మహాలక్ష్మి అశ్రుగళితనయనములతో చప్పున తల్లి కౌగిటిలోనికిబోయినది. మాతృప్రేమవాహిని యిరుదరులను దాటి పొంగిపొరలి శేషమ్మకండ్లనుండి ధారారూపముగా బయలుదేరి మహాలక్ష్మి మూర్ధమును ముంచివేసినది.

తలవనితలంపుగ కుమార్తెయును అల్లుడును వచ్చుటచేత జగన్నాథము "దీనికేదో తగినకారణం ఉండాలి" అనుకున్నాడు. జగన్నాథమునకు రమణారావు నమస్కార మొనర్చెను అల్లుడు కూర్చొనినతర్వాత "అబ్బాయీ! నువ్విలాగైపోతావని నే ననుకోలేదుసుమా! నరసింగరావుని యెన్నిమాట్లు పంపినా ఒక్కమారూ పిల్లని పంపడానికి నీకు ధైర్యంలేకపోయింది. నీతల్లి మూర్ఖురాలైతే నీకైనా ధైర్యం ఉండొద్దూ? నువ్వు చదువుకున్నవాడివేమో, నీతెలివితేట లెక్కడికి పోయేయి?" అని మేనల్లునిదగ్గరనున్న చనువున కోపము చేసినాడు.

రమ:—మామయ్యా! నన్నేంచెయ్యమంటావు? ఆవిడ ముందర ఎదిరించి మాట్లాడ్డం నాకెన్నడూ అలవాటు లేదు. నేను మీపిల్లని పంపమన్నా ఆవిడ కిష్టంలే



"మహాలక్ష్మి అశ్రుగళితనయనములతో... తల్లికౌగిటిలోనికిబోయినది.''

నప్పుడు యేంలాభం ఉంటుంది? కొసకి యింట్లో అల్లరులు భరించలేక తెగించి బైలుదేరి యీలాగొచ్చేసేం. ఇంతకంటే నా కేంచెయ్యడానికీ తోచలేదు.

అని రమణారావు కొన్నివివరములు చెప్పిన తర్వాత జగన్నాథము శాంతిపొందినాడు.

## ౫

ఐదారురోజులు గడిచినవి. గృహమునం దేపనులును చేయనవసరములేనందున మహాలక్ష్మి నిత్యమును పతిసాన్నిధ్యమున నుండెడిది. ద్రాక్షారామములోవలెగాక ఏయాటంకములును లేక వారిద్దరి ప్రేమలతలును దినదినమును పెరిగి గాఢముగ నల్లుకొని పోవుచుండెను. శేషమ్మ వారియన్యోన్యానురాగమునుచూచిఅమితానందభరితురాలయినది. ద్రాక్షారామములో మహాలక్ష్మిపడిన బాధలు వినుటచేత నామెకు గలిగిన విచారము మాయమైపోయినది. రోజుకిరోజునూ ఆదంపతులు ద్విగుణీకృత ప్రణయపూరితులై గడుపుచుండిరి. గడియ యెడబాటు వారికి యుగమైపోయినది.

ఇట్లు నెలరోజులు జరిగినవి. ఇంకెన్నాళ్లు రమణారావ త్తవారింట్లో నుండగలడు? ఈసంగతిని గురించియే అతడు మహాలక్ష్మితో నిత్యము ఆలోచించుచుండెను చివర కాతడు రామచంద్రపురముననేయుండిపోయి వర్తకము చేసుకొనుటకు నిశ్చయించెను.

రామచంద్రపురములో జగన్నాథమునకు వేరొక గృహమున్నది. రమణారావాగృహమం దుండుటకును ప్రస్తుతము వర్తకమునకుకావలసిన మూలధనమును సాధన సామగ్రిని యిచ్చుటకు జగన్నాథ మొప్పుకొనెను. కూతురును, అల్లుడునూ, ఉన్న ఊరిలోనుందురు కదా యని శేషమ్మ సంతోషించినది. తమపిల్లలు సుఖపడితే యెవరికి సంతోషము ఉండదు?

చెరువుగట్టున జగన్నాథమునకున్న రెండవగృహముచాలసౌఖ్యమైనది. తక్షణం కూలీలనుపెట్టి ఆయింటికి వెల్లవేయించి శుభ్రపరిపించినారు. రమణారావు స్వయముగ నాయింటికి వెళ్లి తగినసౌకర్యము లన్నియును ఏర్పాటుచేసుకున్నాడు. జగన్నాథముగారి ఒంటిఎద్దు బండిమీద మహాలక్ష్మి తల్లితోగూడ క్రొత్తయింటికి జని తగిన యిక్కువలన్నియు చూచుకొని పురమాయింపులు చేసినది.

మహాలక్ష్మి ఆనందానికి మేరలేదు. ప్రాణేశ్వరునితో నేకశయ్యపైనుండి భావియోచనలలో నామె తేలిపోయినది.

## ౬

క్రొత్తయిల్లు తయారైన తరువాత, రమణారావు మామగారితో మరునాటిరాత్రికి వచ్చెదనని చెప్పి కాపురమునకు కావలసినసామగ్రి తెచ్చుకొనుటకు ద్రాక్షారామము బయలుదేరెను.

మహాలక్ష్మి ప్రాణేశ్వరుని పాదపద్మముల నంటుకొని తప్పక మరునాటిరాత్రికి రావలెనని ప్రార్థించినది. ఆ ప్రేమమయమూర్తిని కౌగిలించుకొని ముద్దాడి రమణారావు బండియెక్కెను.

నరసమ్మ కుమారుడు చేసినపనికి ఆగ్రహపరవశురాలై యుండెను. ఆతడు యింటిలోనికి వచ్చుచున్నపుడామె పలుకరించలేదు. రమణారావు మాత్రము తల్లికి నమస్కరించి "అమ్మా! నా తప్పు క్షమించు. మనశ్శాంతి దొరక్క నేను నీతో చెప్పకుండా యీపనిచేసేను. ఇప్పుడు మనం రామచంద్రపురంపోయి హాయిగా వేరొక యింట్లో ఉండవచ్చును. నిన్ను తీసు కెళ్లడానికి వచ్చేను" అన్నాడు.

నరసమ్మ మారు పలుక లేదు. ఆమె కండ్లలో నీళ్లు ప్రత్యక్షమైనవి. దుఃఖము, కోపము, పుత్రప్రేమ ఒక్కమారుగ నామెహృదయమున ముప్పిరిగొన్నవి. ఆమె కొంతసేపట్లుఊరుకొని చివరకు మనస్సు నిశ్చయముచేసుకొన్నట్లు నిట్టూర్పువిడిచి "నాయనా! వెంకట్రమణా! లేక లేక ఒక్కబిడ్డడవైనందుకు నాకు నువ్వుచేసిన శాస్తి చాలును. యింకొకొడుకు నాకున్నట్లయితే నువ్వునన్నిల్లా దుఃఖపెడతావా? నీకు నాకంటే పెళ్లాము యెక్కువైపోయింది. ముసలిముండనై బ్రతికిఉండడం నాదే పొరబాటు" అన్నది.

రమ—అమ్మా! ఇల్లాకోపగించకు. ఇంట్లోఉన్న పోరుకి మనశ్శాంతి లేక తొందరపడ్డాను. నావల్ల అపరాధం వచ్చింది. క్షమించు.

నర—నీవల్ల అపరాధంలేదు. మొండిదాన్నైనలుగురిలో నా అవమానంపొందికూడా బతికుండడం నాది అపరాధం. చిన్నప్పటినుంచీ నిన్ను పెంచి పెద్దవాణ్ణి చేసినందుకు నాకు ప్రతిఫలం యిది. మొన్న వచ్చిన దాన్ని వెనకేసుకుని దానిముందర నన్ను గడ్డిపరకకింద కట్టేసేవు.

రమ—జరిగిందేదో జరిగిపోయింది. అమ్మా!త్వరగావంట చేసుకుని భోంచేసి మనం రామచంద్రపురం వెళ్లాలి. నేను కరిణీకానికి రెండేళ్లు సెలవుపెట్టేసేను. యీ రెండేళ్లపాటూ మనం అక్కడేవుండి మళ్లొద్దాం.

నర—నాయనా! నాకు నీపెళ్లాం ముందరజరిగిన పరాభవం చాలు. యింకా నీఅత్తవారందరిముందరా అవమానం పొందడానికా నేను రావడం? నేను మాత్రం అక్కడికి రానుసుమా!

రమ—ఇంక యెంతచెప్పినను తల్లిరాదని నిశ్చయించి "అమ్మా! సరే! నీయిష్టమెలాగో అలాగే కాని—నేనిప్పుడు కొంతపాత్రసామాను ప్రస్తుతం నాఅవుసరం కోసం పట్టుకెళ్లాలి. ఏమేం పట్టుకెళ్లమంటావో చెప్పు—" అన్నాడు.

నర:—యిక్కడ కాపురంఉండేవాళ్లకే యీసామానుకాని, దేశాలవతలకి తీసుకెళ్లడానికి వీలులేదు. నిన్ను రామచంద్రపురంలో ఉండమని యెవరుచెప్పిపెట్టేరో వాళ్లే నీకుసామానుకూడా యిస్తారు.

రమ:—అమ్మా! నువ్వు అలాగంటే నేనేంచెప్పేది? నేను తప్ప యింకెవరు నీసామాను వాడేవాళ్లు నీకున్నారు చెప్పూ? దయదలిచియిస్తే ఒక్క కాసంతైనా పోకుండా తీసుకొచ్చేస్తాను—"

నర:—అబ్బాయీ! నా కిన్నిమాటలు పనికిరావు. నువ్వు యిక్కడ ఉంటే వుండు—లేకపోతేమానే— కాని సామానుమాత్రం యిక్కణ్ణుంచి కదపడానికి వీలులేదు.

రమణారావు శాంతవచనము లెందుకును పనికిరాలేదు. ఆతడెంత ప్రార్థించినను నరసమ్మ మనస్సు కరిగినది కాదు. చివరకతనికి కోపమువచ్చినది. ఎంతసేపని ఓర్చుకొనఁగలఁడు?

"అమ్మా! నీ అనుమతిలేకుండా యేపని చెయ్యడానికి యిష్టంలేకనే నింతసేపు నిన్ను ప్రార్థించేను. కన్నకొడుకునైన నాసుఖం నువ్వాలోచించలేదు. పెద్దదానవు నీకింతకార్పణ్యం తగదుసుమా! మా నాన్నగారి ఆస్తికి నీకెంత హక్కున్నాదో నాకూ అంతే ఉన్నది. నాకుకావలసిన సామాను నేను తీసుకెళ్లకమానను."

కొడుకుజవాబు నరసమ్మకు ఆశ్చర్యంకలిగించినది. అంతధైర్యముగా జవాబుచెప్పునని యామె యనుకొనలేదు. ఆమెకోపాగ్నికీమాట లింధనములైనవి. "సరే! తీసుకెళ్లు.ఎంతతీసుకెళ్తావో చూస్తాను" అని యామెయన్నది.

## ౧౦

ఈసంభాషణ అయినతర్వాత రమణారావు తల్లిమాటలు వినకుండనే వీథిలోనికి పోయెను. కుమారుడుపైకి దాటినవెంటనే నరసమ్మ కొంతసేపు దీర్ఘాలోచనలో మునిగిపోయినది. భావసంఘర్షణచేత నామెముఖము మెఱ్ఱబడిపోయెను. ఆమె కనుగొలుకులయం దశ్రువులుచిమ్మినవి.

పుట్టినదిమొదలుగ తలిదండ్రులవద్దను అత్తవారింటనుగూడ నరసమ్మయాజ్ఞ నిరాఘాటముగ కొనసాగుచుండెడిది. అట్టి యామెకు నేటి ఎదిరింపుమాటలు శూలములై తాకినవి.

ఆదీర్ఘాలోచననుండి ఎట్టకేలకామె లేచినది. ఆమెముఖమందొకసునిశ్చలభావము ప్రస్ఫుటమగుచున్నది. సర్వప్రపంచసంబంధమును వదులుకొనిన నిర్భయురాలివలె నామె కనబడుచుండెను. ఆక్షణమున నామె ముఖలక్షణములు భయంకరములై యుండెను.

నరసమ్మ త్వరితగతిని లేచి వీథితలుపు బిగించినది. లోపలయింటితలుపులకు లోపలనే గడియలు వేసినది. వెంటనే పెరటిలోనికిపోయి, నడుమునకు కట్టు బిగించుకుని "గుభాలు"న నూతిలోనికి ఉరికినది! ఆగంభీరశబ్దము అప్పుడే యింటికిచేరుకొనుచున్న రమణారావు విన్నాడు. అతిసాధుహృదయుడైన యాయువకుడాతడు. "ఏదోప్రమాదం జరిగిందిరా" అనుకున్నాడు. వీథిద్వారముదగ్గరకు పోయిచూడగా నది లోపలబిగించియున్నది. దీనితో అతని యనుమానము మరింత దృఢమైనది. వెనుకముందు లాలోచించకుండ ప్రహరీగోడ నొక్కదాటునదుమికి పెరటిలో

బడినాడు. అతఁడు నూతిలోనికి తొంగిచూచుసరికి, యింకే మున్నది ? తల్లి నూతిలో కొట్టుకొనుచుండుట చూచినపు డతనికి ధైర్యమాగినదికాదు. నూతిగిలకమీద సన్నని చే ంతాడు వ్రేలాడుచున్నది. ఆ త్రాడు తనబరువును ఆపఁ గలదా ? లేదా ? యనుసందేహ మాసమయమున నతనికి తోచలేదు. "అమ్మా" యని కేకవైచి తక్షణ మా త్రాడు పట్టుకొని నూతులోనికి దిగజారినాడు. త్రాడు తెగి



"అమ్మా! యని కేకవైచి...నూతులోనికి దిగజారినాడు."

పోయినది. రమణారావు "గుభాలు"న నూతిలో పడి పోయెను.

రమణారావున కీతరాదు. నూతిలో రెండునిలువు లపైగ నీరున్నది. నూతిగోడకు మెట్లులేవు. తల్లిని రెండుచేతులతోడను గట్టిగా పట్టుకొనినాడతండు. తల్లి యు, కొడుకును ఒకరినొకరు పట్టుకొని, మునుగుచు, తేలుచు చివరకు ప్రాణములను వదలివేసి అడుగుబట్టి పోయిరి. నరసమ్మ మూర్ఖత్వము రెండుప్రాణములతో శాంతించినది.

* * * *

సాయంత్రము నాలుగుగంటలైనను యింటి తలుపులు తెరువబడకపోవుటచూచి యిరుగు పొరుగులవా రనుమానించిరి. రమారమి ఉదయము పదిగంటలపుడు నూతినీళ్లలో నేదోశబ్దము విన్నట్లుగా కొందరు చెప్పిరి.

నలుగురు పెద్దమనుష్యులను దగ్గరపెట్టుకొని యిద్ద రు యువకులు గోడదాటి వీథిద్వారము తెరచిరి. ఇల్లం తయు నిర్మానుష్యముగ నున్నది. ప్రొద్దుట వంట చేసినజాడలే లేవు. రమణారావు రామచంద్రపురము నుండి తెచ్చినచేతిపెట్టె యింకను వీథిచసారాలోనే యున్నది.

అందరును నూయిదగ్గర కేగి బలమైన పగ్గ ములతో మనుష్యులను లోపలకు దింపి వెతికించి రెండు శవములను బయటికి తీయించినారు. జననీ బాహుబంధముల జిక్కి రమణారావును, కుమారుని బాహువుల నిమిడి నరసమ్మయును కొయ్యబారి పోయి యుండిరి. ఆ శవములను విడదీయుటకై యచ్చటివా రొనర్చినప్రయత్నము లన్నియు విఫ లము లయినవి.

౧౧

* * * *

మహాలక్ష్మి తల్లితో తమ ముందు కాపురము నుగూర్చి యెన్నియో ముచ్చట లాడుచుండెను. "అమ్మా! మాయింట గృహప్రవేశంనాడు మీరంతా భోజనానికి రావాలిసుమా! తరుచు నువ్వూ తమ్ము డూ మాయింటికి మనబండిమీద వస్తూవుండాలి. మీఅల్లుడు యింక ద్రాక్షారం వెళ్లనే వెళ్లరుట. రేపే గృహప్రవేశం గనుక యీరాత్రి యే వేళకే నా ఆయన రాకమానరు. ఇక్కడ ప్రవేశించిన తరువాత యెవరిపోరూ లేకుండా రోజూ మిమ్మల్ని అందరినీ చూస్తు సుఖంగా వుంటాము. తమ్ముణ్ని మాత్రం వారంరోజులుపాటు ముందుగా నాదగ్గిరే వుంచుకుంటాను. నాబీరువా, బొట్టుపెట్టె, హార్మోనీపెట్టె, పుస్తకాలుఅన్నీ అప్పుడేసర్దీసుకున్నాను. కోడికూసినప్పుడు లేచితలంటుకుని బయలుదేరాలని నాన్న చెప్పినారు. ఈవాళే ఆయింటికి తోరణాలు కట్టించి గుమ్మాలకి పసుపూ కుంకుమా దానీ వాళ్లచేత నాన్న పెట్టించేరట ! అమ్మా ! నాపరమటాళ్ళ

దూడని నేనింక మీకివ్వను. నేనే తీసుకుపోయి పాలు తీసుకుంటాము. ఇన్నాళ్లిలా మీరే ఉంచుకున్నారు. యింకా నాకిచ్చేరా యేమిటి ?"

శేషమ్మ వంటచేసుకొనుచు కుమార్తె ముద్దుమాటలకునూ, అమాయకపు హృదయమునకును ఆనందభరితురాలగుచుండెను. ఆవిడ కూతురును ముద్దుపెట్టుకుని "తల్లీ! నువ్వు వేరింటికాపురం చేస్తూంటే, నేనూ, మీనాన్న తరుచు భోజనానికి వస్తూ ఉంటాములే, హాయిగా ఒక్కపూటైనా ముట్టుకోకుండా నీచేతవండించి పెట్టించుకుంటాను. మాఅమ్మా! నువ్వూ, నీ మొగుడూ కాపురం చేస్తూ సుఖంగాఉంటే మాకం తేచాలమ్మా!" అని నిండారుసంతోషముతో నవ్వుచు మారుపలికినది.

పైవిధమగు సంభాషణలతో, హృదయాహ్లాదకరములైన భావియోచనలతో, మహాలక్ష్మి కారోజు పగలంతయు క్షణంలో గడచిపోయినది రాత్రి యెనిమిదిగంట లైనది.

సాయంత్ర మగుటతోడనే మహాలక్ష్మి చక్కగ నలంకరించుకొని ప్రాణేశ్వరునిరాక కెదురుచూచుచుండెను. నాటిరాత్రి భర్తతో తానుముచ్చటించవలసిన భాగములను సరిచేసుకొనుచు పడకగదిలో పందిరిమంచముపై నామె శయనించియుండెను. సర్వప్రపంచమును ఒక స్వర్గమువలె నామెభావనాదృష్టికి గోచరించుచుండెను

ఇంతలో జగన్నాథము ఇంటిలోనికివచ్చి "అమ్మాయీ! భోజనానికి రావమ్మా, రమణా రావింకారాలేదు. రాత్రి భోంచేసి బండికట్టించుకుని వస్తాడేమో మరి. మనకేం పైవాడా యేమిటి? కనిపెట్టుకుని కూర్చోనక్కరలేదు. దా, అమ్మా" అన్నాడు.

మహా—నాన్నా! మీరంతా భోంచెయ్యండి. యీలోపుగావస్తే యిద్దరమూకలిసి భోంచేస్తాము. లేదా, నేనూ అమ్మా తింటాము.

సరేకదా అనుకుని జగన్నాథము భోజనమునకు కుమారునితోగూడ లేచెను.

మహాలక్ష్మి భర్తరావడమే తడవుగ ఆలస్యము గాకుండ భోజనమునకు లేచుటకై యాతని పట్టుపంచను పెట్టెలోనుండి పైకితీసి దండెముపై సిద్ధముగానుంచినది. గదిలోనున్న నిలువుటద్దము ముందుకు బోయి తన అలంకారములన్నియు సరిగానున్నవో లేవో చూచుకొని ఆ నాటి తనయందమునకు తనలో తానేమురిసిపోయినది. భర్తకొరకు తను జడవేసుకొనగా మిగిలిన మగిలిన మల్లెపూలతో నొకదండగూర్చి పరుపుపై నుంచినది ఆహా! ఏమి మధురభావప్రపంచమున విహరించుచున్నది మన మహాలక్ష్మి!

## ౧౨

రమారమి తొమ్మిదికావచ్చినది. జగన్నాథము భోజనము ముగించిలేచెను. ఆతడు తాంబూలము వేసుకొనుచు వీథివసారాలో నొకకుర్చీపైఁ గూర్చొనియుండెను. నరసింగరావు గదిలో కూర్చొని చదువుకొనుచుండెను. శేషమ్మ యింక అల్లుడు రాడని నిశ్చయించి కుమార్తెను భోజనమునకు పిలుచుటకయి యువతలకు వచ్చినది. మహాలక్ష్మి రాత్రి తొమ్మిదిగంటలైననూ భర్త రానందుకు కారణమరయుచు శయనించియుండెను.

ఇంతలో వీథిగుమ్మమువద్ద నెవరో గట్టిగ తలుపు తట్టినశబ్దము వినవచ్చినది. తక్షణము మహాలక్ష్మి శయ్యనుండిలేచి "అమ్మా! అదుగోనే అల్లుడొచ్చేరు, యీ వేళకి రారనిచెప్పేశేవు" అని చేతులో "హరికేన్" లాంతరు పట్టుకొని ఒక్కదాటున వీథివసారాలోనికి వచ్చెను.

జగన్నాథము "ఎవరువారు? అవతల?" అని గంభీరముగా ప్రశ్నించెను.

"మాది ద్రాక్షారం బాబూ" అని అవతలనుండి జవాబు వినవచ్చినది.

మహా:—అదేమిటినాన్నా! అలాగడుగుతారు? బండీ వచ్చింది. తలుపుతియ్యండి" అన్నది.

జగన్నాథము తలుపు తీసినాడు. మహాలక్ష్మి భర్తృసందర్శనలాలసయై గుమ్మము దిక్కు చూచుచుండెను. శేషమ్మ అల్లుడువచ్చుచుండె నని యచ్చటనే నిలచియుండెను. "బావ వచ్చేడా యేమిటి?" అని అడుగుచు నరసింగరావు చదువుమాని లోపలినుండి వచ్చినాడు.

అప్పుడొక నల్లనిలావుపాటిమనిషి లోపల ప్రవేశించెను.

"ఏమోయ్! రామస్వామి! బండి యింతరాత్రి దాకా ఉండేమిటి?" అని మహాలక్ష్మి చిరపరిచితుడగు నాపురుషుని ప్రశ్నించెను.

రామస్వామి మారుమాటాడక జగన్నాధము చేతి కొక జాబిచ్చి "బాబూ! ఉత్తరం సిత్తగించండి. అన్ని సంగతులూ తెలుస్తాయి" అన్నాడు.

జగన్నాధము కవరుచింపి జాబు చదువుచున్న కొలదియు నాతనిముఖము వివర్ణమైపోవుచుండెను. ఆతని కంఠతలు కొట్టుకొనుచుండెను.

ఉత్తరము ముగించి ఒక్కక్షణమాత్రము గాఢముగ నాలోచించి "ఒశేయ్! నువ్విలారా!" అని భార్యను లోపలికి పిలిచి చెవిలో నేదియోచెప్పి "నువ్వు ధైర్యంగా ఉండాలి సుమా! లేకపోతే పిల్ల చచ్చిపోతుంది" అన్నాడు.

శేషమ్మ "ఇంకేంధైర్యం, నాయనో" అని ఒక్క అరుపరచి నేలపై గుభాలున పడిపోయినది. ఆమె రోదన ధ్వనులు మిన్నుముట్టుచుండెను. ఇదంతయు క్షణములో జరిగిపోయెను.

ఈ అడావిడిచూచి మహాలక్ష్మి లోపలికి పోయినది. నిముషములో సంగతులన్నియును ఆ నిర్భాగ్యురాలికి తెలిసిపోయినవి. ఇంకేమున్నది! మహాలక్ష్మి 'అమ్మో' అని మొదలునరకిన వృక్షమువలె నేలపైబడి పోయినది. ఆమె నోటినుండి మరి మాట రాలేదు. ఆమె హృదయ వ్యథయంతయును "అమ్మో" యను నార్తనాదమున నిమిడిపోయెను.

ప్రాణేశ్వరునితోగూడి నాటిరాత్రి యనిర్వచనీయానంద మనుభవించి సుఖప్రదమగు జీవనము గడుప నిశ్చయించుకొనుచు భావికల్పనల జేసుకొనిన సరళహృదయ— శుద్ధసాత్వికమూర్తి— మహాలక్ష్మి— నాటి రాత్రియే— హతాశయై— దుర్భర వైధవ్య దుఃఖమను నా జన్మాంతము గడపవలసివచ్చినది.

హావిధీ! నీకల్పన లచింత్యములు—అమానుషములు— అద్వితీయములు !!

* * * *

మహాలక్ష్మి సుఖాశాసౌధము నేలకూలిపోయినది. ఆమెసౌఖ్యలతలు— ప్రేమబంధములు— విచ్ఛేదము లైనవి. ఆమె జీవనద్వారమున నిలిచి విధి కఠోరకంఠస్వరమున భయంకరాట్టహాసము జేసినాడు. మహాలక్ష్మి వినిర్మల జీవనాంబరతలమున కారుమేఘములు క్రమ్మినవి; ఉరుము లురిమినవి; పిడుగులుపడినవి. మహాలక్ష్మి జీవనము దుఃఖభాజనమై పోయినది.

* * * *

## ౧౩

కాలము గడిచిపోయినది. ఎవ్వరికొరకును కాలమాగదు. ఈ నిరాఘాటకాలప్రవాహమునబడి కొట్లకొలది జీవననౌకలు, సుడిగుండముల గొట్టుకొనుచు, కెరటములతాకుడున భంగపడుచు, తుదకు మునిగిపోవుచుండును.

ప్రస్తుతపు మహాలక్ష్మి పూర్వపుమహాలక్ష్మికాదు. పూర్వపు మహాలక్ష్మి నవ్వులబండి — సంపూర్ణ వికసిత పద్మపత్రాయతేక్షణ — మహోత్సాహపూరిత సుందరానన—నవయౌవన పరిపోషిత మనోహరాంగి—సర్వజనానందసంధాయిని— నిరంతర హృదయేశ్వర పాదసేవా పరాయణ—మహాసాధ్వి.........ప్రస్తుతపు మహాలక్ష్మియో—నిరంతరవిషాదసంజనిత బాష్పధారాకలితలోచన—నిర్భరవైధవ్య దుఃఖనిదాఘ సంతప్త వివశీకృత మ్లానవదన—భర్తృవియోగశోకకాగ్ని కృశీభూతాంగి—అనవరత ప్రాణేశ్వర పవిత్రపాదధ్యాన నిర్వికల్ప సమాధినిష్ఠాగరిష్ఠయగు ప్రణయయోగిని—కఠినోపవాసదీక్షాపరాయణ.

కృష్ణపక్షచంద్రునివలె మహాలక్ష్మి దినదినము క్షీణించిపోవుచుండెను. ఆ మనోహర సుందరాననమున నవ్వులేదు. కన్నులు లోతుకిపోయినవి. ఒక యమానుష తేజముమాత్ర మామెముఖమున విస్పష్ట మగుచుండెను. నిద్రాహారము లామెకు దూరమైపోయెను. జీవనాధార మగు నాహారముమాత్ర మామె బలవంతమున పుచ్చుకొనుచుండెను. ఆమె చిక్కి శల్యావశిష్టయై చూపరకు భయము గొల్పుచుండెను.

జగన్నాధముగారి పెరటిలోనున్న అంటు మామిడితోటలో నామె తన నివాసమేర్పరచుకొనెను. మూర్తీ

భవించిన శోకదేవతవలె నామె యొక్క చూతవృక్షమూలమున శీతలచ్ఛాయనుగూర్చొని నిరంతర భర్తృసాన్నిధ్యమును గల్పించుకొనుచుండును. తదేకధ్యాన నిమగ్నయగు నాయోగినీమూర్తినిగాంచి తల్లిదండ్రులు గుండెలు పగులునట్లుగ దుఃఖించుచుండెడివారు.



"మూర్తీభవించిన శోకదేవతవలె.........భర్తృసాన్నిధ్యమును గల్పించుకొనుచుండును.

సంవత్సరము గడిచిపోయెను. మహాలక్ష్మిస్థితి బొత్తిగ హీనమై పోయినది. ఆమెకు పరధ్యానము హెచ్చిపోయెను. ఒక్కొకరోజున నామె యీ ప్రపంచములో నున్నట్లే యుండదు. ఆనాడామె తల్లిదండ్రు లెంతపిల్చినను పలుకదు, భోజనముచేయదు, నిద్రపోదు. తనలో తా నేదియో యర్థములేనిమాటల నాడుకొనుచుండును.

ఒకనాటిసాయంత్రము మహాలక్ష్మి యథాప్రకారము తోటలో చెట్టుక్రింద గూర్చొని యుండెను. ఆనాటి ఉదయమునుండియు నామెయట్లే తోటలో నుండెను. జననీజనకు లెంత బతిమాలినను ఆమె పలుకలేదు సరికదా, భోజనముకూడ చేయలేదు. ఆనాడామె కన్నులనుండి అవిరళాశ్రుధార లొలుకుచుండెను.

సాయంకాలము నాలుగుగంటలకు జగన్నాథము వీధిలోనికి పనిమీదపోయెను. శేషమ్మ కుమార్తె దుస్థితికి విచారించుచు వండుకొనుచుండెను. ఆరుగంటలకు నరసింగరావు ఆడుకొని యింట్లోకివచ్చి సోదరిని చూచుటకయి తోటలోనికి పోయెను. అక్కడిస్థితి చూచు సరి కాతనిగుండె లదరిపోయెను. "అమ్మా! అక్కయ్య పడిపోయిందే" అని కెవ్వున కేకవేసెను.

శేషమ్మ ఒక్కచెంగున తోటలోనికి వెళ్లినది. కుమార్తె నేలపై బడియుండెను. చలనములేదు; ఊపిరి యాడుటలేదు. శరీరము కొయ్యవారిపోయి చలువలు గ్రమ్మియుండెను. పవిత్రతేజమొకటి యామెశుష్కించిన వదనమున నింకను తాండవించుచుండెను.

శేషమ్మ కుమార్తెపై వ్రాలి యేడువసాగెను. మాతృదేవి దుఃఖముపొంగిపొర్లి పోయెను. ఇంక జగన్నాథము సంగతివేరుగ చెప్పనక్కరలేదు. ఆతడట్లే కూలబడి సంతతధారగ గన్నీరు గార్చుచుండెను.

నిశ్చలధ్యాన నిమగ్నయగు నా ప్రణయయోగిని కనులు మూతలుపడిపోయెను. ఆమహాసాధ్వి—ఆపతిప్రాణ ఆశుద్ధసాత్వికమూర్తి—ఆప్రణయ యోగిని—మహాలక్ష్మి—దుఃఖభాజనమగు నిహలోకమునకు స్వస్తి చెప్పినది.

* * * * *

ఏగృహమున నిజనాథునితో గలసి యిహలోక సౌఖ్యముల ననుభవింప నువ్విళ్లూరినదో, ఆయింటి యావరణమున మహాలక్ష్మివంటి వ్యక్తి ప్రశాంతకౌముదీ ప్రవాహమున నిప్పటికిని సంచరించుచుండ చూచిన ట్లిరుగుపొరుగువారు చెప్పుచుందురు.

ద్రాక్షారామమున ఘోరదురంతములు జరిగిన గృహాంగణములందొకముదుసలిస్త్రీ, తలవంచుకొని నిశీథులందు విహరించుచుండునని యా గ్రామవాసులు చెప్పుదురు. ప్రొద్దుపోయినపిమ్మట నిప్పటికిని ఆ యింటి పరిసరములకు బోవుట కెంతధైర్యవంతుడును భయపడుచుండును.

# అమృతవాహిని

పెనుమర్తి వెంకటరత్నము గారు [యువకవిమండలి]

౧ రంగము

మనుమసిద్ధి — మామా! యిప్పుడు కనఁబడిన యీకావిసంజ చీఁకటిలో వ్రాలిపోయిన దే!

తిక్కన — అవును, మానవజీవితముయొక్క చాంచల్యముతెల్పు నీ యుపాఖ్యానము జగన్నాటకకర్తయొక్క అపూర్వకల్పనా వైచిత్ర్యము —

మనుమసిద్ధి — మామా! జగమున దృశ్యము లగు నన్నియు నశ్యములేనా? మానవ జీవితములో మధురిమ లేదా?

తిక్కన — "యద్దృశ్యంతన్నశ్యమ్." నశ్యమగు వస్తు సృష్టిలో రసాపగ లుర్విఁ బ్రవ హింపఁజేసి, వానికి ననంతత్వము కలుగఁ జేసుకొనుటయే మానవజీవితములోని మధురిమ.

(నేపథ్యమున)

అస్తంగతుఁడైనాఁడర్కుఁడు.

(ఇర్వురు నిష్క్రమింతురు.)

౨ రంగము

(మనుమసిద్ధి యేకాంతవిహారములోనుండును)

అవును, నశ్యమగు వస్తుసృష్టిలో రసాపగలు ప్రవహింపఁజేసి వానికి ననంతత్వము కలుగఁజేయుటయే జీవితమధురిమ.

(ప్రవేశము: ప్రతీహారి)

ఏలినవారి నెదురుచూచుచున్న వారెవరో!

మనుమసిద్ధి — శీఘ్రముగ ప్రవేశపెట్టుము.

(ప్రవేశించును: ఒకశిష్యుఁడు)

మహారాజా! ఇంతకంటె దుర్వార్త యేమున్నది? కవిబ్రహ్మ-తిక్కన సోమయాజి-మరణించినాఁడు. (కన్నీరు)

మనుమసిద్ధి — (రసతన్మయుఁడై) విప్రుఁడా! ఏమంటివి? మామ చనిపోయెననియా?- అదిగో! చూడుము! ఆ భారతరణరంగమున వీణాగానము చేయుచున్నాఁడు. కను లుండియు చూడలేవేమి? ఆహా! యేమి, అమృతవాహిని?

(విప్రుఁడు-నిశ్చేష్టుఁడు)

నశ్యమగు వస్తుసృష్టిలో రసాపగలు ప్రవహింపఁజేసి అనంతత్వము నొసంగిన నా మామ చనిపోవుటా?

హరిహరనాథా! ఏమి వీరి వెఱ్ఱి?

(నిశ్శబ్దము)

(సంపాదకుని సంతకము)



౧. ముఖలింగేశ్వరాలయముయొక్క సింహద్వారము



# ముఖలింగనగరము

భావరాజు వేంకటకృష్ణరావు గారు, బి. ఏ., బి. యల్.

[ఆంధ్రదేశ యైతిహాసిక పరిశోధకమండలి]

పర్లాకిమిడి శ్రీకృష్ణవిలాస గ్రంథాలయము వారి యత్యంత గౌరవాస్పదములకతన గడచిన క్రిస్మస్ సెలవుదినములందు గ్రంథాలయసభ్యులతోపాటు నేను శ్రీముఖలింగక్షేత్రమును సందర్శింప నేగియుంటిని. ఈశ్రీకృష్ణవిలాస గ్రంథాలయము, శ్రీరాజావారి హైస్కూలు ప్రధానోపాధ్యాయులగు, శ్రీయుత ఇవటూరికనకాచలంపంతులుగారి ప్రోత్సాహమున నిప్పటికి సుమారు రెండుసంవత్సరముల క్రిందట నెలకొల్పబడి దినదినాభివృద్ధిగాంచుచున్నది. గ్రంథాలయ సభ్యులకు అన్నిటికంటె చరిత్రపరనమందభిరుచిమెండు. తమయూరి కనతిదూరమునున్న ముఖలింగక్షేత్రము, పరమపవిత్రమైన శివలింగక్షేత్రములలో నొకటి యగుటయేకాక, ప్రసిద్ధమైన పురాతన నగర మగుటవలన, గ్రంథాలయసభ్యులకు, ఆయూరినిసందర్శింపవలయునను కుతూహలము చాలకాలముక్రిందట జనించెను. ఆకోరిక జనించినతరువాత నొక్కముఖలింగక్షేత్రమే కాక, కళింగవిషయమునంతటను యాత్ర వెడలి రావలయునను కోర్కెయు గలిగెను. అంతట గ్రంథాలయ యజమానులగు శ్రీయుత కనకాచలంపంతులుగారు, తమసభ్యులందఱు కళింగ దేశయాత్ర త్వరలో వెడలనున్నారనియు, నాయాత్రయందు చరిత్ర ప్రసిద్ధములయిన ప్రాచీన కళింగనగరములను స్థలములను మొదలగువాటిని సందర్శింపవలచియున్నారనియు, నాయా స్థలములందు దర్శనీయములును, చరిత్రనిర్మాణమున కుపయుక్తములెయ్యున వస్తువులు మొదలయినవాటికి దేవాలయములకు శిల్ప. ఇపుడకు చిత్తరువులకు చిత్రపటముల నెత్తింప వానియై ఒసమ స్తసన్నాహములతో నాయత్తపడి కప్పుడు, కరకినన్నుగూడ నాయాత్ర యందు పాల్గొనవలసినదని దయతో గ్రంథాలయపక్షమున నాహ్వానించియుండిరి. ఇందులకు శ్రీయుత కనకాచలంపంతులుగారికిని గ్రంథాలయమువారికి నేనెంతయు కృతజ్ఞుడను. చిరకాలమునుండి మఱుగుపడియున్న కళింగదేశ చారిత్రమునుగూర్చియు, కళింగ దేశమునుగూర్చియు స్వయముగ దెలిసికొనగలుగుట మంచియవకాశము కడు చిత్రముగను, తలవనితలంపునను లభించెగదా యని నాలోన నేను సంతసమందితిని.

ఆసమయమున, కొన్ని యనివార్యములయిన కారణాంతరములవలన కళింగదేశపర్యటనము అప్పటికి ముఖలింగక్షేత్రయాత్రతోడనే ముగింపవలసి వచ్చెను. అయినను మాయుత్సాహమేమియు తగ్గియుండలేదు. ఈ యాత్రకు గ్రంథాలయమువారు పయన మగుచుండ, ప్రాచీనచారిత్రకవస్తుపరిశోధనమందు, మంచియనుభవము సంపాదించిన చరిత్రజ్ఞులయిన మహారాజరాజశ్రీ రావుసాహెబు గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు, మాతోగూడ నుండిన చాలబాగుండునని తోచి, వారిని గూడ యాత్రికసమాజమునకు మార్గదర్శకులయి దయచేసి రావలసినదని ప్రార్థించియుంటిమి. శ్రీరామమూర్తి పంతులుగారు, ఇంతకుపూర్వము రెండు మూడుపర్యాయములు, ముఖలింగమును సందర్శించి, యచ్చటివిశేషములనుగూర్చి యొకప్పుడు మిక్కిలి యుపయోగకరమైన వ్యాసమొకటి ప్రకటించిరి. ఆయూరుసంగతులు, ఆ యూరివారికంటె పంతులుగారికి పదిరెట్లెక్కువగ తెలియునన్న అతిశయోక్తి కాజాలదు. అది చలి వీపెక్కి దువాళించు పుష్యమాసపు శీతకాలమయ్యును, తాము అరువదేండ్లుదాటిన వృద్ధులయినను,

ఇంచుకయును శ్రమయని యెంచక, అద్వితీయమైన యుత్సాహముతో మాయం దత్యంత కరుణాళులరై, మేము కోరినవెంటనే, యంగీకరించి ప్రయాణమునకు సన్నద్ధులయిరి.

వారు మాతోనుండి, ముఖలింగమును సంపూర్ణముగ జూపించి సర్వము నెఱుకపఱుప గలిగినందున, మాచారిత్రాత్మకమైన యాత్ర కడుజయప్రదముగా జరిగెనని చెప్పుచున్నాము. వారికతన మేము కళింగదేశ చరిత్ర పరిశోధనయందును, ముఖలింగనగర పరిశోధనయందు చేయవలసిన పనిని దెలిసికొనగలిగితిమి. మేము గ్రహించినదానినంతయు నీవ్యాసమున దెలుప నవకాశముండదు. చెప్పవలసినదానినంతయు చెప్పుటకు నాకు పరికరములును చాలవు. దానిని మరియొకసారి ప్రయత్నింతును. పదిహేను దినములయినను ఏకదీక్షగా నాయూర నివసించి పరిశ్రమచేయుటకు గావలసినంత విషయ మున్నది. తొందరగా నీయాత్ర ముగించి వచ్చితిమిగావున ప్రతివిషయమును పరిశీలించి, యుండుటకు మాకు అవకాశము చాలదయ్యెను.

మాముఖలింగయాత్రకై గడచినడిసెంబరు ౨౫-వ తేదిని బయలుదేరితిమి. ఆనాడు ఆదివారము. యాత్రికులలో ప్రధానులు మహారాజశ్రీ రావుసాహెబు గిడుగు వెంకటరామమూర్తి పంతులుగారు, బి. ఎ., ఇవటూరి కనకాచలం పంతులుగారు, యం. ఎ. యల్. టి., గిడుగు వేంకటసీతాపతి పంతులుగారు, బి. ఏ. యల్. టి., గిడుగు సూర్యనారాయణరావుపంతులుగారు యం.యే. యల్. టి., పారనంది జగన్నాథస్వామి పంతులుగార్లు,యం. ఎ. యల్. టి., వీరుగాక, దేశచరిత్రయందు, ప్రాచీనవస్తు పరిశోధనయందును, అభిమానమును, కౌతుకమును గల యొకరిద్దరు గవర్నమెంటు ఉద్యోగులును, హైస్కూలు చిత్రలేఖనోపాధ్యాయులు సింహాచలంగారును, చిత్రపటముల దీయుటకు ఫొటోగ్రాఫరును మరికొందరు గ్రంథాలయ సభ్యులు నుండిరి.

ఆదివారమునాటిరాత్రి పదిగంటలు కొట్టుసరికి, మా బండ్లు బయలుదేరినవి. ముఖలింగము పర్లాకిమిడికించుమించుగా నిరువదిమైళ్ల దూరమున నుండును. రైలు మార్గమున వచ్చినయెడల శ్రీకాకుళంరోడ్డు స్టేషనునొద్ద గాని, తిలారిస్టేషనునొద్దగాని రైలుదిగి నాటుబండిని పదునారుమైళ్లు బండిమీద ప్రయాణముచేసి ముఖలింగమును జేరవచ్చును.

ఎటుచూచినను, మైళ్లకొలది చీలిన పంక్తులక్రింద వ్యాపించియున్న ఎత్తయిన పాలకొండలు, ఆ పర్వతపంక్తుల చీలికలనడుమ వ్యాపించియున్న ఘోరారణ్యములు, నాటి నొరసికొనుచు ప్రవహించు వంశధారాస్రవంతియు యాత్రికుని కౌతుకవిషయమైన నెలవును, ఆశ్చర్యమును, ఆనందమును గొలుపుచుండును. అచ్చట గానవచ్చు ప్రకృతిసౌందర్యము మిక్కిలి రామణీయకము. ఆభీకరారణ్యప్రదేశములనడుమనుండి పర్లాకిమిడినుండి ముఖలింగమునకుబోవు రాచబాట గలదు. ఆమార్గము భయంకరమయిన దనియు, నప్పుడప్పుడు క్రూరజంతుభయము రాత్రివేళలందు కలుగుచుండుట గలదనియు, బాటసారులు చెప్పుచుందురుగాని యానాటిరేయి మాకట్టియొడుగొడుకు లేమియు తటస్థించియుండలేదు. మేము నాల్గుబండ్లమీద ప్రయాణముసేయుచుంటిమి. మా బండివాండ్లు నెమ్మదిగైన వాండ్రును, తెలివిగలవాండ్రును నగుటచేత మాప్రయాణ మెంతో సుఖప్రదముగా సాగెను. రోడ్డు యీనాడును సుగమ్యముచేయబడనికారణమున సరిగా లేక మాకు బండి కుదుపుగలిగి, రాత్రితెల్లవారువఱకును నిద్రలేకుండ జేసియుండెను గాని ఉత్సాహపూరితులమైయున్న మాకు అదియేమియు కష్టముగా దోచియుండలేదు. కాని తిరిగివచ్చునపుడు నిద్రాభంగమునకు వెఱచి ప్రయాణము పగటిపూట సాగించితిమి.... మేము ప్రయాణముచేయుచుండిన బాట వంశధారానది నంటియుండెను. ఆనాటి చీకటిరాత్రియందు బండికుదుపుచే మాకు మెలకువ వచ్చినపుడెల్ల స్వచ్ఛమైన నక్షత్రకాంతియందు ముఖలింగేశ్వరుని జటాజూటమున బ్రకాశించు క్రొన్నెలరేఖవలె యాస్రవంతి మనోహరమై కన్పట్టుచు వింతభయమును గలిగించుచుండెను.

మేము మరునాడు తెల్లవారుసరికి, వంశధారయొడ్డున "పద్మనాభుని కొండ" దరిని జేరియున్న అగ్రహారమును జేరితిమి. కరకవలసకు ముఖ క్రోసెడుదూరమున పల్లమునందు గాన్పించును. అ మునందలి ప్రసిద్ధమైన ముఖలింగేశ్వరాలయ శిఖరమ

దానిచుట్టునుండు తోటగుంటలు, కన్నులపండువు సేయుచు గానవచ్చుచుండును. అచ్చట, మేము బండి డిగి, కాలినడకను, ఏడుగంట లగుసరికి ముఖలింగమును జేరితిమి. మారాక, ఆగ్రామవాస్తవ్యుల కెవరికిని దెలియకపోయినను శ్రీ రామమూర్తిపంతులుగారి నందఱును ఎఱిగినవారగుటచే మా కన్నిసదుపాయములును కుదిరెను. ఆగ్రామము పర్లాకిమిడి రాజావారిది. అచ్చట వారిసత్ర మొకటి గలదు. అందు మేము విడిది దిగితిమి.

ముఖలింగము నేడు కుగ్రామమనియే చెప్పవలయును. జనసంఖ్యయు, మూడు నాలుగువేలకు మించియుండదు. ఇచ్చట జనులలో చాలమంది కాళింగులు. తెలుగువారు చాలకొలదిగా నున్నారు. ఊరంతయు కలిపిన నొక పెద్దవీధియే. దానికిరుప్రక్కలవరుసగా పూరిండ్ల వరుసలుగల చిన్న వీథులుమాత్రముగలవు. ఊరిలో నెక్కడజూచినను పూర్వపు టౌన్నత్యమును, సౌందర్యమును, వైభవమును దెలుపు నల్లశానపుఱాళ్లును, అందు చిత్రితములయిన శిల్పపుబనులును, శిలావిగ్రహములును చెదరి విరిసి, కానబడుచుండును. ఎప్పుడైనను వర్షపాతముచేతనో, యిండ్లకు బునాదులు త్రవ్వినపుడో కూరుకొనిపోయిన ప్రాచీనకట్టడములకు జెందిన పెద్దరాళ్ల విగ్రహములు, శిల్పపుపనిచేసిన చిత్రబిళ్లలు, బయల్పడినపుడు వాటిని గ్రామస్థులు తమయిండ్ల కుపయోగించుకొనగా మిగిలినవాటిని, రావిచెట్లక్రిందను, మఱ్ఱిచెట్లక్రిందను నుంచుటవలనను, ఇంటిగోడలలో నమర్చియుంచుటవలనను, ఊరంతయు నొకచిత్రమైన ప్రాచీనవస్తుప్రదర్శనశాలవలె గాన్పించును.

ముఖలింగము చాలప్రాచీనమైననగర మనుటకు సందియము లేదు. ఆనగరము వైభవము ననుభవించుచుండినపుడు వంశధారనది నగరమున కిరుప్రక్కలను ప్రవహించుచుండినట్లు గాన్పించును. నగరమున కిరుప్రక్కల నేకకాలమందు గాకపోయినను ఒకప్పుడైనను రెండవవైపునగూడ ప్రవహించియుండినట్లు చిహ్నములు నేడు కానవచ్చుచున్నవి. ఇప్పుడుమాత్రము నది యూరికిపశ్చిమమున దక్షిణవాహినియై ఒరసికొని ప్రవహించుచున్నది. పూర్వమొకప్పుడు, కరకవలసచెంతను, పద్మనాభునికొండ నొరసికొనుచు ప్రవహించినట్లు ఏఱు పారిన చిహ్నములు నేడునుగానబడుచున్నవి. ఇపుడా భూభాగమంతయు సేద్యమగుచున్నది. వర్షకాలమున నిప్పటికిని చిన్నపాయ యొకటి ఆస్థలమునడుమ, వంశధారనుండి చీలి ప్రవహించుచు ఊరికిదక్షిణమున నదిలో గలియుచుండును. వంశధార జీవనదియే యని చెప్పవచ్చును. నీరు చాల వడిగాబారుచు మిక్కిలి లోతైనతావులందు శీతకాలమున మొలబంటిలోతున ప్రవహించుచుండును. వర్షకాలమున నీనది మిక్కిలి లోతుగా ప్రవహించుచుండును. పూర్వము కళింగ రాజ్య మతివైభవమునం దుండినకాలమున నాదేశపు రాజకుమారులకు నౌకాయాత్ర నేర్పవలసిన నిర్బంధవిద్యగా నుండిన కాలమున నీనది యందుల కుపయుక్తముగా జేయబడియుండెనేమో తెలిసికొనుట కాధారము లేవియు లేవు. కాని నది కిపుడు పడమటియొడ్డున వాడవలస యనియు, (ఓడలవలస), వాడపల్లి, (ఓడపల్లి)యనియు రెండుగ్రామములు ఒకదానికొకటి అరమైలుదూరమున నుండినట్లు గ్రామవాస్తవ్యులు దెలిపెదరు. వాడపల్లిపేరును శాసనములందును గానబడుచున్నది. కాని యీకాలమున వాడవలసయేకాని వాడపల్లిగానవచ్చుటలేదు. దరిద్రదేవత నానగరమున నివాసము నిల్పుకొని పూర్వపు వర్తకవైభవమును సాగనంపుటచేత నాగ్రామ మీకాలమున బేచిరాకయిపోయినది. ఇక నిలచియున్న వాడవలసగ్రామము నొరసికొనుచు వంశధార ప్రవహించుచునే యున్నది. వంశధారయొడ్డుననే ప్రాచీనముఖలింగనగరపుకోట యుండినటుల నేటివఱకుచిహ్నములుగాన్పించుచున్నవి. దుర్గముమంచిస్థితియందున్నపుడు సుమారురెండుమైళ్లుపొడవును, ఒకమైలు వెడల్పును కలిగియుండె ననవచ్చును. ఆగ్రామవాస్తవ్యులు, పూర్వముండిన బురుజుల స్థలములను ఎత్తైన మంటిదిబ్బలను జూపించినపుడు, పూర్వనగర వైశాల్యమును భావింపగల్గితిమి. శ్రీ రామమూర్తి పంతులుగారును, తాము ఇరువది ముప్పదిసంవత్సరములక్రిందట నీగ్రామమును చూచినపుడును, అంతకు బూర్వము చూచినప్పుడును గ్రామముచుట్టును కోటగోడ స్పష్టముగా గాన్పించుచుండెనని చెప్పియుండిరి. కోటదిబ్బలు, ఒకటి రెండు ఇప్పటికిని ఊరికి ఉత్తర దక్షిణదిక్కులందు చూడనగును.

ముఖలింగమునందు చూడదగిన వనేకములుగలవు. అందు చరిత్రకారుని కుపయుక్తములైనవి చాలవరకు భూగర్భమున కూరుకొని పోయియున్నను, పైకి గనబడుచున్నవాటిలో అత్యంతోపయుక్తములయినవి దేవాలయములు మూడుమాత్రము గలవు. అందు ముఖలింగేశ్వరాలయము, తప్ప మిగిలినవి రెండు శిథిలావస్థయందుండి రూపముతోమాత్రముగాననగుచున్నవి. అందొకటి సోమేశ్వరాలయము. అది దక్షిణమున ఊరికి చివరనున్నది. రెండవది (అణ్యాంక)భీమేశ్వరాలయము. ఇది పైరెండింటికి నడుమనున్నది. ఇందులో పూజపునస్కారము లొక ముఖలింగేశ్వరాలయమునందు తక్క మిగిలినవాటికి జరుగుటలేదు. చరిత్రకారుని కత్యంతోపయుక్తములయిన విషయము లనేకము లీమూడు దేవాలయములందును గాన్పించును.

గంజాము మండల వాస్తవ్యులకు ముఖలింగము మిక్కిలి ప్రియమైన పుణ్యక్షేత్రము. ఈక్షేత్రమందు గల మూడు దేవళములందు నీశ్వరుడు లింగరూపమున ప్రతిష్ఠింపబడి యున్నాడు. అందు ముఖలింగేశ్వరాలయమునకు శ్రీపర్లాకిమిడిరాజావారు నిత్యధూపదీప నైవేద్యములు, అంగరంగవైభవములు, ఉత్సవములు మొదలయినవాటికి మంచివసతుల నేర్పరిచియున్నారు. ఈదేవళము ఇంచుమించుగా క్రీ. శ. ఎనిమిదితొమ్మిదిశతాబ్దములందు నిర్మింపబడినట్లు శాసనాదులవలన తెలియుచున్నది. ఈ క్షేత్రమహిమలను దెలుపు స్థలమాహాత్మ్య కథ యొకటి కలదు. అతిప్రాచీనమైనదనుటకు సందియము లేదు. ఇప్పటి జనులకీక్షేత్రము వారణాశియంతటి పుణ్యస్థలము కావున ప్రతిసంవత్సరమును మాఘమాసమున మహాశివరాత్రినాడు యాత్రికులు, భక్తులు, నానాప్రాంతములనుండి యేగుదెంతురు. క్షేత్రమాహాత్మ్యము చాలవరకు పురాణగాథయై, విశ్వసనీయముగాకయుండునుగాని యందలి విషయములు ఒకప్పుడు చరిత్రకారుని కత్యంతోపయుక్తములని తోచుచుండును. క్షేత్రమాహాత్మ్య మిట్లున్నది:

ద్వాపరయుగమున, వంశధారనది యొడ్డున వామదేవు డను మహర్షి యొకడు తపము చేసికొనుచు నొకప్పుడొక యాగమును దలపెట్టెను. ఆ యాగమునకు దేవతలు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు సిద్ధసాధ్యులును, మొదలగువారి నాహ్వానించెను. ఆతాపస్వి యాశ్రమసమీపమున ప్రవహించు వంశధారానదికి తూర్పుగా మహారణ్యము వ్యాపించియుండెను. అది మధూకవృక్షములచే నిండియుండెను. అందు కిరాతులు లింగాలు కట్టుకొని వాసము చేయుచుండిరి. అనాగరికులగు నా కిరాతులు దిగంబరులయి సంచరించుచుండుట యజ్ఞమున కతిథులయి వచ్చిన గంధర్వులా ప్రదేశములందు గ్రుమ్మరుచు కని మోహాతిరేకమున ప్రవర్తించియుండిరి. హవిర్భాగములను పంచియిచ్చునపుడు వామదేవమహర్షి గంధర్వుల నచట గానక కిరాతస్త్రీలతో నుండుట తనదివ్యదృష్టిచే నెఱింగి కుపితుడై వారిని కిరాతులుగా జన్మింప శపించెను. గంధర్వు లాశాపమును నారదునివలన విని, యామహర్షిని సమీపించి, కరుణించి శాపముపసంహరింపవలసినదని ప్రార్థించిరి. అందులకా తాపసి, పశ్చాత్తప్తులయినవారినిగని ద్వాపరయుగాంతమందాప్రాంతమున శివుడు మధుకేశ్వరనిరూపమును దాల్చి యావిర్భవించుననియు, నాదేవుని ముఖలింగరూపమున సందర్శించినంతమాత్రమున, మీరు శాపవిముక్తులయి, ఎప్పటిరూపమును దాల్చి తమలోకమునకు బోవుదురనియు వరమిచ్చెను.

పిమ్మట శాపహతులయిన గంధర్వులు కిరాతులై జన్మించిరి. వారిలో చిత్రసేనుడనువాడు రాజై పరిపాలించుచుండెను. ఆతడు నివసించు మధూకవనవాటికయందొక్క ఋతుకాలమందేకాక, సంవత్సరమంతయు, పువ్వులు పూయు మధూకవృక్ష మొకటి రెండుశాఖలుమాత్రము గలిగి, యొకపుట్టపై పెరిగియుండెను. ఆకిరాతరాజా యిప్పచెట్టును తనభార్యకిచ్చెను. ఆమె దానినుండి రాలినపూవుల నేరి, వంశధారానది కావలియొడ్డున, మధూకవనమునకు సమీపముగా నున్న సుమంతపురమున నుండు సుమంతుడను వైశ్యునికమ్మి యాక్రయధనముతో భోజనాదికపదార్థముల గొనితెచ్చి వంటచేసి భర్తకు పెట్టి తాను భుజించుచుండెను. ఇట్లు కొంతకాలము గడచెను. అంత నొకనాడు శ్రీశైల ప్రాంతమునుండి యొక జంగమస్త్రీ కాశీయాత్ర కావింప దలపుగొని, ప్రయాణము సేయుచు దైవవశమున త్రోవతప్పి యావనమును ప్రవేశించెను. అప్పటికి సాయంసమయ మగుటచే భయము జెంది చెంతనున్న

యాకిరాతకులపల్లె జొచ్చి యారాత్రి యచ్చట నివ
సించుటకు తావు చూపవలసినదని ప్రార్థించెను. ఆమె
నిరుపమాన సౌందర్యమును, యౌవనమును గాంచి, చిత్ర
సేనుడు మనసుచెదరి యామెకనేకవిధముల నాతిథ్యము
గఱపును. ఆరాత్రి గడచెను. మరునాడు చిత్రసేనుడు
అపరిచితస్త్రీమీద జనించిన మోహమును మరల్చుకొని
యాజంగమయువతికి కాశికి బోవుమార్గమును జూపించి
పయనము గమ్మని ప్రార్థించెను కాని, చిత్రసేనుని
రూపగాంభీర్యమును జూడగనినది మొదలు ఆజంగమ
యువతియు నొకవిధమైన మనోవికారమునకు లోనయి
తన కింక కాశికి బోవ నిచ్ఛగలుగ దనియు, నాస్థలము
కాశింబోలు పుణ్యస్థలముగా గన్పట్టు చున్నదనియు
వానక్కడే నివాసముండ నిశ్చయించు కొన్నదనియు,
తన్ను పరిణయ మాడవలసినదనియు ప్రార్థించెను.
చిత్రసేనుడును తొలుతనే యామెయందు మనసు
కొనియున్నవాడగుటచే నందుల కంగీకరించి యామెను
రెండవభార్యగా పెండ్లియాడెను.

ఈవృత్తాంతమును జ్యేష్ఠభార్యకు దెల్పి యామె
యనుమతి గైకొని ఆజంగమస్త్రీని ఒకయింట నుండ
నేర్పఱచి తమకు జీవనాధారమైయున్నట్టియు సర్వకాల
ములందు పూవులుపూయునదియు నగు మధుకవృక్షమును
జూపి యొకశాఖ పెద్దపెండ్లమునకు రెండవశాఖను రెండవ
పెండ్లమునకు నిచ్చి దానినుండి రాలుచుండుపూవులనమ్మి
జీవనము చేయుమని యాజ్ఞాపించెను. అప్పటినుండి యాతడు
ఒకదినము పెద్దభార్యయింటను మరుచటిదినము రెండవభా
ర్యయింటను గడపుచుండెను. అట్లు కొంతకాలముగడచెను.
ప్రతిదినమును తెల్లవారకమునుపు చిత్రసేనుని భార్యలిరువు
రును రాలిన మధుకపుష్పముల నేరికొని సుమంతపురము
నకు బోయి విక్రయించి భోజనసామగ్రిని దెచ్చుకొను
చుండిరి. వీరిలో జంగమభార్య శివభక్తురాలు గావున,
ప్రాతఃకాలముననే లేచి వంశధారానదిలో తీర్థమాడి,
యా మధుకవృక్షము మొద నున్న పుట్టనే భగవంతుడగు
పార్వతీపతిగా భావించి యభిషేకముచేసి పూజలు గా
వించి భక్తిపూర్వకముగా ప్రదక్షిణములుసల్పి ప్రార్థించు
చుండెను. ఇట్లామె యనుదినము భక్తితో జరుపుచుం
డుట దేవునకు సంతోషదాయకమయ్యెను. అంత నాదేవ
దేవుడు భక్తురాలియెడ కనికరము కల్గి యామె వంతునకు
వచ్చిన శాఖనుండి సువర్ణపుష్పములు నిత్యము రాలు
చుండునట్లు చేసెను.

ప్రతిదినమును రాలుచున్న సువర్ణమధుకపుష్ప
ములు గొనిపోయి, చిత్రసేనుని జంగమభార్య సుమంతుని
కమ్ముచు, విశేషముగ విలువగల పదార్థములను గొనివచ్చి
తనభర్తకతి ప్రీతిజనకముగ ఆహారాదుల నిడుచు,పతిపూజ
యొనర్చుచుండెను. సవతికిచ్చిన కొమ్మనుండి బంగారు
పూవులు రాలుటయు, తనకొమ్మనుండి యెప్పటి
యిప్పపూవులే రాలుటయు గని యసూయాగ్రస్తయై
పెద్దభార్య మగనితో కయ్యమాడి, సవతి కిచ్చినశాఖయం
దొకమహత్తు గలదని మూఢవిశ్వాసము గలిగి దానిని
తన కీయవలసినదని భర్తను ప్రార్థించెను. భార్యల నిరు
వురను సమానముగ ప్రేమించు చిత్రసేను డేమియు నేయ
నోపక తుద కామెకోరిక నెరవేర్చెను. కాని కొమ్మ
లు మార్చినంతమాత్రమున పెద్దభార్యతలంపు లీడేరవ
య్యెను. పూర్వము తనకొమ్మనుండి యిప్పపూవులే
రాలుచుండినను, జంగమభార్య కిచ్చిననాటనుం
డియు దానినుండి సువర్ణపుష్పములు రాలుచుండెను.ఈ
విషయము పెద్దభార్యకు మిగుల బాధాకరముగానుండెను.
ఆమె యసూయకు, మగనిమానము ఇంధనమయ్యెను.
ప్రతిదినమును చిత్రసేనుడు వేటకరిగి యిల్లుసేరుసరికి
భార్యలిద్దరు కయ్యముపెంచుకొనియుండుటాతడుచూచి
సహింపజాలకపోయెను. తనభార్య లిరువురకును నిత్య
మామధుకవృక్షమువలన గదా యిట్టికలతలు కలుగుచున్న
వనియెంచి జ్యేష్ఠభార్యాప్రేరితుడై యామధుక వృక్ష
మును మొదలంట నరికివైచెను. జంగమభార్య భర్తచేయు
దుష్కార్యమునకు వెఱచి వారింపజూచెను. కాని యామె
ప్రార్థనలు నిష్ప్రయోజనములయ్యెను.

చిత్రసేనుడు మధుకవృక్షమును నఱికివేసినతోడనే
పుట్టలోనుండి అగ్నిజ్వాల లుదయించెను. వాటిని గాంచి
చిత్రసేనుడు భీతచిత్తుడై మూర్ఛవోయెను. అతని మూర్ఛ
గని పెద్దభార్య దేశాంతరమునుండివచ్చిన యొక మాయ
లాడి తన మగనిని ప్రయోగముచేసి చంపెనని రోదనము
సేయనారంభించెను. ఆమె దుఃఖము నాలకించి, యావన
మునందలి కిరాతులెల్లరు జంగమస్త్రీని జంపుటకై ఆయు

సపాణులయి యేగుదెంచిరి. ఆసమయమున జంగమభార్య దిక్కుమాలినదయ్యు ధైర్యము వహించి పరమేశ్వరుని ప్రార్థించెను. ఆమెప్రార్థన నంగీకరించి మహేశ్వరుడు మధూకవృక్షమూలమున ముఖముదాల్చి ప్రమథగణముల తోడ కిరాతులకు దర్శనమిచ్చెను. కిరాతులును ఆదివ్య సందర్శనమువలన శాపవిముక్తులయి పూర్వపు గంధర్వ రూపమును దాల్చి స్తోత్రము చేసిరి. మధూక వృక్షమునుండి యావిర్భవించినదేవర, మధుకేశ్వరుడని వ్యవహరింపబడ నారంభించెను. నేడీ మధుకేశ్వరుడు ముఖలింగేశ్వరుడనబరగుచున్నాడు. కాని ప్రాచీన శాసనములందు మధుకేశ్వరుడనియే కలదు. మధుకేశ్వరునికి జయంతీశ్వరుడనియు, గోకర్ణేశ్వరుడనియు, గూడ నామాంతరము లున్నట్లు తెలియుచున్నది. ఈ సంగతినిగూర్చి మున్ముందు దెలిపెదను. ఇక దేవాలయమును బ్రవేశించి యచ్చట వింతలను గాంచెదము. ముఖలింగేశ్వరునిగుడి యూరికినడుమ పూర్వదిశాముఖమై యున్నది. దేవాలయముచుట్టును ప్రాకారమున్నది. ప్రాకారములోపల దేవాలయమును, దానిచుట్టు అష్టదిక్పాలకలింగములు, కళ్యాణమంటపములు మున్నగునవి కలవు. ప్రాకారమునకున్న సింహద్వారమున కెదురుగా ధ్వజస్తంభము నడివీథిలో నున్నది. ఆధ్వజస్తంభమున కెదురుగా సింహద్వారమును, దానికి ముందర యిరుప్రక్కలను సింహములును, వాటినడుమ సోపానములును గలవు. ఆసింహములు రెండును, వెనుక కాళ్లపై కూర్చుండినట్లు రాతితో చెక్కబడినవి. సింహద్వార మొకమంటపములో నమర్చబడియున్నది. దేవాలయమును ప్రవేశించుటకు మెట్లెక్కునపుడు సింహద్వారమునకు ముందు ఎడమవైపున ఒకజాయి, అమర్చబడి కానవచ్చును. ఆవెనుక మంటపశిఖరమును సింహద్వార తలాటమును ఆనియున్న రెండుశిలాస్తంభములు గలవు. ముందటి జాతిపలకమీద నొకవిలుకాని విగ్రహమును, వానికిపింజావరవీమవానివిగ్రహమును చెక్కబడియున్నవి. ఆవిలుకాడు తనపాదములక్రింద నొకనిని త్రొక్కివేయుచున్నట్లు చిత్రింపబడియున్నది. ఆవిగ్రహ మెవ్వనిదో తెలిసికొనుట కచ్చట నేమియు నాధారము లేదు. కాని, [illegible]కడు తనవైరిని జయించి యవమానించుచున్నట్లు [illegible]దవివక్షత మూహించుకొంటిని. సింహద్వారమున్న మంటపములోని రెండు స్తంభములమీదను, గోడలమీదను, ప్రాచీనశాసనము లనేకములు గలవు. ఆశాసనములన్నియు, [illegible]గాంగవంశపురాజులకు జెందినవైనట్లు కానవచ్చుచున్నవి. వానిలో నొకటిరెండు అనంతవర్మవజ్రహస్తదేవునిశాసనములు తెనుగులిపియందు ఆస్తంభములపై గానవచ్చును. ఒకటిరెండు ప్రాచీనఓఢ్ర వంగీయసంస్కృతలిపియందున్న శాసనములును గలవు. ఆశాసనములున్న స్తంభముల వెంట, సింహద్వారమును జేరి యెడమవైపున నొకశిలాఫలక మొకటి యమర్చబడి మాదృష్టి నాకర్షించెను. దానిపై నొకపురుషుడును, స్త్రీయును లింగరూపియైన శివుని పూజించుచున్నట్లున్నది. ఆజాతిమీద యా స్త్రీపురుషులకు, శివలింగమునకును పైన, సూర్యచంద్రులును, నడుమ న్యాసహస్తము చిత్రింపబడియున్నవి. ఆవిగ్రహ మెవ్వనిదో తెలిసికొనుటకాధారము లేనియు నచ్చట మేము గాంచలేదు; కాని శివభక్తితత్పరుడైన గాంగవంశపురాజెవడో అయి యుండవచ్చుననిమాత్ర మనుమానించితిమి. ఆజాతిపలక పూర్వమక్కడిది కాదేమోయని కూడ మాకు సంశయము జనించెను. సింహద్వారమును బ్రవేశించునప్పటికి యెదురుగా పెద్దనంది యొకటి గాన్పించును. ఆనందికెదురుగా నొకమంటపమును అందొకద్వారమునుగూడ నగుపడుచుండును. ఆద్వారమున కిరుప్రక్కలనున్న గోడబల్లపై నేవియో స్త్రీపురుషవిగ్రహములు కొన్ని నాట్యముతో నిలువబడియున్నట్లు చెక్కబడి కాన్పించును. ఆవిగ్రహము లెవ్వరివో, వాటి నచట చిత్రించుటవలన శిల్పి యుద్దేశమేదియో, మేము గ్రహింపజాలకపోతిమి.

ఆసింహద్వారమును దాటి లోపలి భాగమును జొచ్చినపుడు మాయెదుట నొక చిన్నమంటపము, దాని యగ్రభాగమున [illegible]యిన విశాలప్రాంగణమును, దాని తరువాత దేవాలయ సింహద్వారము విచిత్ర, పత్ర, లతా పుష్పములతో శోభిల్లుచు గానవచ్చుచుండును. ఆసింహద్వారముపైకి చూచిన దేవాలయశిఖరమును గానవచ్చుచుండును. తెలుగుదేశపు దేవాలయములనేచూచిన మనవారలకు నాదేవాలయపు శిఖరపైఖరి యొక వింతగానుండును. మనము దాటివచ్చిన రెండవసింహద్వారము మొదటిదానికంటె చిన్నది. కాని యిందు చూడదగిన విశేషము లెక్కుడు గలవు. అంతయు శిలామయమగుటచే నాద్వారమునకు తలుపులు లేవు. ఇరుప్రక్కల యందును

త్రాయి వెడల్పుగా లేనందున వాటిపై శాసనములును లేవు. ఆద్వారమును మేము వెనుకతిరిగి చూచునప్పటికి సొరుగు బల్లమీద ద్వారబంధమునకు నెత్తిమీద నొక చిత్తరువు మాకు గోచరమాయి రామణీయకతచే మా దృష్టి నాకర్షించి యానందపరవశులను జేసెను. అద్దాని చిత్రపటమును చదువరి వేరొకచో చూడగలరు. అయ్యది సుమారు పదునారంగుళములు వెడల్పుగలిగి ఏడెనిమిదియంగుళముల పొడవుగల యొకఱాతిబల్లపై చిత్రింపబడి ద్వారబంధమునకు నెత్తిమీద నమర్పబడియున్నది. ఆఫలకముపై నడుమ నొకవృక్షమును ఆవృక్షమునకు నెడమవైపున ఎత్తైన యొకవేదికపై నొకడు కూర్చుండి నట్లును అతనికొకడు చెంత నిలుచుండి, వింజామర వీచుచుండినట్లును గలదు. అట్లుకూర్చున్న పురుషునికి వెనుక ప్రక్కను కొందరు పురుషులు పదునైదుమంది వరుసగా నాసీనులయి యుండిరి. వారందరు అతిశాంతచిత్తులయి, మిక్కిలి గాంభీర్యముతో మనస్స్థైర్యముతో నున్నట్లు చిత్రింపబడియున్నారు. వారికెదురుగా నడుమనున్న వృక్షమునకు కుడివైపున నొకడు ప్రాకుచు వచ్చి వెడల్పును, పొడవును గలబలమైన కత్తితో నావృక్షమును చేదింప నుంకించుచున్నట్లు గలదు. ఆతని ప్రయత్నమునుండి, వేదికపై నాసీనుడైయున్న పురుషుడు వారించుచున్నట్లున్నాడు. చెట్టు నఱుకదలచిన వాని వెనుక నిద్దఱు స్త్రీలున్నారు. అందొకరితె కూర్చుండియు నింకొకతె నిలువబడియు, హస్తముల మోడ్చి నమస్కరించుచు, దైన్యభావము నగపఱుచుచున్నారు. ఆవెనుక నాయుధపాణులయిన పురుషులు కొందరు ఇరువదియొక్కరు వరుసగా నిలువబడి క్రోధావేశపరవశులై యగపడుచున్నారు. నడుమనున్న వృక్షముచెంత నొక పద్మపీఠము గలదు.

ఈచిత్తరువునందలి జనులయుడుపులు, అలంకారములు నెత్తిపై యొకప్రక్క గుండ్రని తలవెండ్రుకల కొప్పులును క్రీస్తుశకారంభమునాటి ప్రాచీన కాళింగుల నాగరికతను స్ఫురింపజేయుచున్న వనుటకు సందియము లేదు. నడుముచుట్టును బిగదీసికట్టిన యంగవస్త్రమును, దానిపై బిగించిన కాసెయు, మొలనూలును, చూపఱుల కచ్చెరువు కలిగించుచున్నవి. ఆయుధపాణులయిన వారి కెవ్వరికి ద్వితీయవస్త్రము లేదు. మెడలోని హారములు మాత్రము గానబడుచున్నవి. చెట్టు నఱుక నుంకించుచున్న వానికి ముంజేతులందుమురుగులు, కడియములవంటి యలంకారములు గలవు. ఆతని వక్షముచుట్టును నొకపట్టవలె గాన్పించునది కంచుకమై యుండనోపు. వీనియుడుపులు ఆకారములు, భూషణములు, వీడు మిగిలినవారి యేలికయని తోపజేయుచున్నవి. మొత్తముమీద నీ చిత్తరువునంతయు మావి యాలోచించిన వెనుక ముఖలింగేశ్వరక్షేత్రమాహాత్మ్యములోని మధుకేశ్వరుని యావిర్భావకథను సూచించునున్న దేమోయనియూహించితిమి.

ఈచిత్తరువుమీద నొకశక్తివిగ్రహమున్నది. ఆమె యొక యాడుసింగముపై సుఖాసనమున నధివసించియున్నది. ఆమెకు పదిచేతులున్నవి. కుడివైపున నున్న చేతులలో మొదటిది ధ్యానముద్రను సూచించుచున్నది. రెండవదానిలో నొకకంకణమున్నది. మూడవదానియందు రుద్రాక్షజపమాల గలదు. నాలవదానియందు గదయు, నైదవదానియందు త్రిశూలమును గలవు. ఎడమచేతులలో మొదటిది వరదహస్తమును దాల్చియున్నది. పిమ్మట వరుసగా రెండవదానియందు జయఘంటయును, మూడవదానియందు కమలమును, నాల్గవదానియందు చక్రమును, ఐదవదానియందు వజ్రాయుధమును నున్నవి.

మావారలు శక్తిరూపమును జూచినపుడారూపకల్పన శైవశక్తులలో ప్రధానమైన దుర్గయొక్క చండిక, లేక చాముండికాశక్తులనబడియెడువారిరూపాంతరమని యూహించిరి. కాని నా కది జైనశక్తియనియు, చక్రేశ్వరియనియుదోచెను. ఈశక్తిరూపమును దానిక్రిందిశిల్పమును దేవాలయము మిక్కిలిప్రాచీనమైనదని దెలుపుచున్నది.

ఈ చిత్తరువు బిళ్లలున్న కవాటమున కెదురుగా నందియును, దానిముంగిట నొకమంటపమువంటి యెత్తైనదియు, దానినంటియె సింహద్వారము మునున్నదనియు నీనడుకె చదువరి కెఱిగించితిమికదా! ఆమంటపమును అర్ధమంటపమని శిల్పవేత్తలుపల్కుదురు. శిల్పవిషయమున నీదేవాలయమును జూచినవారికెల్లను, దక్షిణదేశమున, పల్లవాంధ్ర ద్రావిడచాళుక్య సంప్రదాయములబట్టి నిర్మితములయిన దేవాలయములను జూచినవారికెల్లను, ఈదేవాలయపు వాస్తుసంప్రదాయపుశైలి పూర్తిగా విలక్షణ

పైనవని తప్పక గోచరమగును. భువనేశ్వరమునందలి దేవాలయమును సందర్శించినవారు, ఈదేవాలయపు వాస్తు సాంప్రదాయమును, దానికి తప్పక పోల్తురు. ఈదేవళము ఓడ్రదేశమునందు వ్యాపించిన ఔత్తరాహ ఆర్యవాస్తు సంప్రదాయము ననుసరించి కట్టబడినదని నిర్ణయింతురు. కాని యింతంతయు ఔత్తరాహ సంప్రదాయమనిపల్కుటకు వీలులేదు. దక్షిణదేశపు చాళుక్యసంప్రదాయము గూడ కొంత కానబడకపోదు. మనదేవళములకు గర్భాలయమును, అందుమీద గోపురమును, దానిముంగట అర్థముఖమంటపము నుండును. అర్ధముఖమంటపమే ముఖమంటపముగా నెంచినను, గర్భాలయమునకును మంటపమునకును, ఏవిధమయిన సంబంధము గనపడదు. ఒకదానికొకటి చేర్చి కట్టబడి యుండుననుటతప్ప గర్భాలయము దానిపై గోపురమే గుడి యగుచున్నది. ఇక నీసంప్రదాయమున నట్లుగాదు. గర్భాలయమును, ముఖమంటపమును గలసి గుడియగుచున్నది. గర్భాలయముమీద గోపురమున్నట్టె ముఖమంటపముమీదను విమానములేక గోపురముండును. కాని రెండవది మొదటిదానికంటె చిన్నదిగా నుండును. ఇంతియేకాదు. పల్లవ, చాళుక్య శిల్ప సంప్రదాయమునందువలె గోపురము ఔత్తరాహ ఆర్యసంప్రదాయమున నుండదు. మొదటి దానిగోపురమునందు చిత్రవిచిత్రములయిన విగ్రహము లుండును. ఒకభూమికంటె రెండవభూమిక చిన్నదిగ, అంచులు గోళాకారముగ మలుపుదీర్పబడి, గోడిగా నుండును. దక్షిణదేశమునందు దేవాలయములందు భూమికలు మూడుగాని, యైదుగాని, తొమ్మిదిగాని యుండును. ఔత్తరాహవాస్తు సంప్రదాయమున నిట్లు కాదు. భువనేశ్వర సంప్రదాయమునందు భూమికలు పొట్టిగాను విశేషముగాను నుండును. ఒకదానికంటె నొకటి చిన్నదిగ నుండుటయేకాక అంచులు తీర్చినట్లు పలకలు దేరియుండును. ఒక పిరమిడ్ బోర్లించిన నెట్లుండునో, యీసంప్రదాయపుగోపుర మట్లుండును. గోపురము మీదనున్న 'ఆమలక' మనుచక్రము పల్లవ చాళుక్య దేవళముమీద గానరాదు. ఈసంప్రదాయమునందు గర్భాలయములు చతురములుగా నుండును. కాని మనపల్లవచాళుక్య దేవాలయములందువలె, వెడల్పు తక్కువగను, పొడవు ఎక్కువగను నుండును.

పైనజెప్పిన అర్థముఖ మంటపమునంటి విచిత్రపత్రలతాపుష్పాలంకారశోభితమై మనోజ్ఞమై యున్నతమైన సింహద్వార ముండును. ఆసింహద్వారమున కిరుకెలంకులనున్న చేర్పుశిలలపై స్త్రీపురుషుల విగ్రహములు శృంగారాభినయములతో నిలువబడియున్నట్లును నాట్యము చేయుచున్నట్లును మనోహరముగ చిత్రింపబడియున్నవి. ఈబొమ్మలన్నియు నీముఖలింగనగర మతివైభవము ననుభవించుచుండిన కాలమున, చిత్రవిచిత్రములగు రంగులతో పూయబడి శోభలుట్టిపడుచుండినట్లు చిహ్నములు నేటివరకు గాన్పించుచున్నవి. సింహద్వారమునకు కుడివైపుననున్న స్తంభమును, దానినంటియున్న చేర్పుశిలాఫలకము, దానిచేరియున్న ద్వారపాలక విగ్రహమును చదువరి చిత్రపటమునందు చూడగలరు. ద్వారపాలకుని, శిల్పి యొకమంటపమును చెక్కి యందు నిలువబెట్టినాడు. ఆమంటపము చిత్రించుటలో శిల్పి తననేర్పరితనమును చక్కగా తేటపఱచినాడు. అప్పటిశిల్పపుపనినంతయు జూచినవెనుక, సౌత్తరాహసంప్రదాయకుడైన యాశిల్పి, కొంత పల్లవశిల్పమునుగూడ నెఱిగినవాడని తోపకమానదు. ద్వారపాలకవిగ్రహ మమర్చబడిన మంటపమునకు సింహతలాటతోరణ మమర్పబడియున్నది. ఈరీతిగనే, ఎడమవైపునగూడ సింహద్వారమునంటి కంబమును చేర్పుశిల్పయు, దానినంటిగోడలో ద్వారపాలక మంటపమును గానవచ్చును; కాని చిత్రకారుడు కుడివైపు చిత్రించినదానినే యెడమవైపున కూడ రచించియుండక క్రొత్త విగ్రహములను, అలంకారములను, యిచ్చవచ్చిన తెఱగున స్వేచ్ఛతో రామణీయకముగ చిత్రించినాడు. ఈసింహద్వారమంతయు, తూర్పుగాంగులశాసనములలో వర్ణింపబడియున్నది. దాని నిట పొందుపఱుపజాలకపోయితినని విచారించుచున్నాను

సింహద్వారమును శోభాయమానముగ జేయుచున్న యీముఖమంటప గోపుర భూమికల నాల్గింటిమీదను, మనోహరమయిన చిత్రములు చెక్కబడియున్నవి. వాటినిజూచి యానందించుటకే మాకు తీరిక లేకపోయెను. వాటిచిత్రపటము నిట పొందుపఱిచితిమి. ఈనాల్గుభూమికలలో మొదటిదానిమీద నారుహంసలున్ను వాటిలో రెండేసి అంచలనడుమ నొకషోడశదళ కమలమును చిత్రింపబడియున్నవి. ఈచిత్తరువులమీదనున్న చిత్రే

ఫలకముమీద మల్లయుద్ధప్రదర్శనము చిత్రింపబడియున్నది. అందు నడుమ యిరువురుమల్లులు ద్వంద్వయుద్ధము సేయుచున్నారు. ఆమల్లుల కిరుకెలంకులందు జనసమూహము ప్రదర్శనమును వీక్షించుచున్నది. ఆజనసమూహమున కెగువగా నెడమవైపున నొకవేదికపై రాజు, రాణియు గాబోలు ఆసీనులయి, ప్రదర్శనమును దిలకించుచున్నారు. వారి కిరువురుసేవకులు క్రిందనుండి మల్లయుద్ధవృత్తాంతమును గాబోలు విన్నవించుచున్నారు. రాజును చెవియొగ్గి వినుచున్నాడు. రాణికి ఎడమవైపున అంతఃపురస్త్రీలును,వారిచెంత దాసీజనమును సఖోపవిష్టులయి యున్నారు. మల్లులకు కుడివైపున జనసామాన్యముకంటె యెత్తయినస్థలమందు బ్రాహ్మణబృందము కూర్చుండియున్నది. వారిముంగట యేనుగులు దలపడుచున్నవి. వీరివెనుక జనులనేకు లాసీనులయి యున్నారు.

ఈచిత్రఫలకమంతయు నయిదారుగజములు పొడవుగను, అగుగు లేక అడుగున్నర వెడల్పుగలిగియున్నది. ఇంతటిస్వల్పవైశాల్యముగల ప్రదేశమునందు శిల్పి చిత్రపుపనిచేసి యచ్చెరువు కలిగించుచున్నాడు. జనసమూహమునందు ప్రతివ్యక్తియు స్పష్టముగ చిత్రింపబడియుండుటయు,ముందువెనుకప్రదేశముల,వేదికలు సోపానములు అతిసూక్ష్మముగ చూపబడుటయు శిల్పపనితనమును వేనోళ్లజాటుచున్నది. ఇంతకంటె యచ్చెరువైనచిత్రము దీనిపైభూమికయందు గానవచ్చున్నది.

ఈ ఫలకమందు రాజు అరణ్యమున వేటాడు విధము చిత్రితమై యున్నది. అందు పర్వులెత్తుచున్న వాయుతేజీలును, రాజును, విండ్లు నాకర్ణాంతముసారించి, మృగములను, వెంటదఱుముచున్న వేటకాండ్రును, స్పష్టముగ చిత్రింపబడియున్నారు. వేటకాండ్రవెనుక సేవకులు సంహరింపబడినమృగములనుకఱ్ఱలకు వ్రేలాడదీసి, తమభుజములపై పెట్టుకొని నడచుచున్నారు. వారివెనుక తప్పెటకాండ్రు, మద్దెలకాండ్రు సింహనాదములు, శృంగనాదములుసేయుచున్నారు.వారివెనుకవారుమృగములను మోసికొనిపోవుచున్నారు. మరికొందరు ఆయుధపాణులై పరుగిడుచున్నారు. వారివెనుక కొంద రాశ్వికులు బల్లెములుపట్టుకొని ముగ్రములనునడపించుకొనివచ్చుచున్నారు. ఈచిత్తరువులోనియెడమవైపు అర్ధమునందు వేటమృగములుబరువెత్తుచుండుటయు,వాటివెనుకను, ముంగటను వేటకాండ్రు ఆశ్వికులు సాయుధులయి తరుముచున్నట్లును చిత్రింపబడియున్నది. వేటరంగములు ఇంతమనోహరముగ చిత్రింపబడుట ఎచ్చటను గానము. స్థలము సంకుచితమయినను, శిల్పి తనచిత్రమునందు జీవమును బోసినాడు.

దీనిపై భూమికయందు, ఏనుగులవేట చిత్రింపబడియున్నది. దాని ఎడమభాగమున నొకవేదికపై నొకపురుషుడు ఆసీనుడైయున్నాడు. ఆయనచుట్టును సేవకులు, పరిచారకులు, విలుకాండ్రు, ఖడ్గహస్తులు, మూగియున్నారు. వారియెదుట మచ్చిక చేయబడినయేనుగులపై, మావటీలు కూర్చుండి, ఏనుగులవేట గావించుచున్నారు. మచ్చికయేనుగులకు ముంగటిభాగమున, అడవియేనుగులు త్రాళ్లతో, నురులతో బంధింపబడి, పెనగులాడుచు, పారిపోవుటకు ప్రయత్నము సేయుచున్నవి.

ఈమూడుభూమికలమీద చిత్రితములయిన శిల్పము, పూర్వము సున్నపుపూతగలిగి, దానిపై రంగు వేయబడియున్నకాలమున మిక్కిలి అందముగ కాన్పించియుండవచ్చు ననుకొందము. ఈగుడియందున్న చిత్తరువులన్నియు నీవిధముగనే యున్నవి.





# భీష్ముఁడు

గీత మాల

విన్నకోట వెంకటరత్న శర్మ గారు

"కరికి లంఘించు సింహంబుకరణి మెరసి
ఉరుకుచున్నాఁడు కమలాక్షుఁ డుగ్రు
రహిని స్వచ్ఛందమరణవరప్రసాది [డగుచు
నైన ని న్నెంచుకొఱకు; ధర్మాత్మజునకు
బాహ్యలోకాధిపత్య మలవడఁగఁ జేయు
కొఱకు; ద్రౌపదికి సుభద్రకును ముదంబు
గూర్చుకొఱకు; భూభారముం దీర్చుకొఱకు
"అల త్రినేత్రుఁడు నాకడ్డమైన నోర్తు
సమరభర్తయు నన్నింపఁడనగ; లోక
పాలకులఁగూర్చి నేఁ బాటఁ బాడ నేల?"

*     *     *     *

"ఊరుపేరు నాకారమ్ము లుండఁబోని
వాఁడు నాయెదుటను నిల్చినాఁడు గాన
భక్తిఁ గేల్దమ్మిని మొగిడ్చి ప్రణతు లిత్తు
ననుచు యుద్ధప్రయత్నమ్ము నణఁచె దేమొ?"
'అదె కనుంగొనినాఁడవా? ఆ కిరీటి
బాహుయుగళమ్ముఁ జూచి, అప్పద్మనేత్రుఁ
బట్టి తన మొగంబును ముందు నట్టె త్రిప్పి
కెంపుకనుఁగవ నిష్ఠ వీక్షించుచుండె
చారువక్షమ్మునం గటాక్షంబు నింపె
చక్రహస్తుని చక్రసంజనిత దావ
దహనకీలల నార్ప యత్నమ్మొనర్చు;
'తనకుఁ గల్గు ప్రతిష్ఠకుం జినతనంబు
గలుగునను భ్రాంతియో' కాక 'కమలనయను
చెల్మి కీతఁడు సమ్మతించెను గదన్న'
అనుచు లోకులు తిన్నందు రని తలచియొ?"

*     *     *     *

"అదె! యదనుసుమ్ము; వినుము గంగాకుమార!
నృపకుమారులఁ గూల్చి తనేకమంది; (?)
నదియుఁగాక పరశురాము నట్టె; ముప్పు
త్రిప్పలం బెట్టినావు; భీతిల్లఁబోక
పీకచూపుము; లోకైకవీరుఁడ నను
ఖ్యాతిఁ గాంచుము; దుర్యోధనాదివీర
వరుల కుత్సాహ మొసరింపు; పక్షపాత
బుద్ధి వహియింపు; ముప్పునం బలుసు నెప్ప
రిది భుజింపుచు నుంటి; వారి వెస ద్రోహ
మూన నాయంబు కాదఁడుగో! ముకుందుఁ
డర మొగంబున నున్న ముంగురులు పైకిఁ
ద్రోసి, చక్రానలజ్వాలతోఁ దుమికెను!"

*     *     *     *

"కృష్ణ! యిది యేటినాయమోయీ, తలంపు!
మొకరికిం జెప్పఁదగువాఁడ వొకరిచేత
నీవు చెప్పించుకొనె దేలనో? వచింపు!
నాఁడు దుర్యోధనుండు నిం సమరమునకుఁ
బిలువ "నే నొకండన యొక్కవలన, యాద

వులును పదివేవు రొండొక్కవలన, నేను
సమర మొనరింపఁ, జక్రపుంజాయఁ బోవ"
ననుచు వచియింపలేదె? నీయంతవాఁడ
విటులనైనఁ దక్కుంగలవీరవరులు
ధర్మయుద్ధ మ్మొనర్తురా, తలఁపుమయ్య?
పార్థసారథివే కాని బవరమందు,
పార్థుఁడవు గావు; కల్లిముల్ బట్టుకొమ్ము!"

* * * *

"తాత! నీపరాక్రమము, విఖ్యాతమయ్యె!
నేలనన నంతవానిచే నింతకార్య
మహహా! చేయించినందులకు—
అడుగో! ధర్మ
రాజు; వచ్చుచున్నాఁడు కాల్నడకతోడ!
ధర్మరాజు కాఁడితఁడు; మెత్తనిపులి సుమి!
ఇతఁడు నీ జీవితరహస్య మెఱుఁగుకొఱకు,
ఇతఁడు నీ ప్రాణధార బిగించుకొఱకు,—
నమ్మకుము; వంకవంక దండములు పెట్టు
చున్నవాఁడు; నోర్జారినచో! హుళిక్కి
యగును నీరాజసంబు; నిన్నరయుతేని
యెడల ద్రోహ మ్మొనర్చితల్ నుడికి నీవు
పాలుపడకుము, బ్రహ్మచారీ, లనంబు!
తాతముత్తాత లాదిగాఁ దనరుచున్న
ధైర్యసాహసముల్ విడల్ దలఁపకయ్య!"
"ఓయి! అసహాయవీర! విద్యుత్ప్రకాశ!
పోవుచుంటివె! ధర్మజా! బుద్ధిమంతుఁ
డవు కదయ్య! నీదా సమయానుకూల
వర్తనములు మఱొకరికిఁ బ్రాప్త మానె?
నీకు నోరెట్లు వచ్చె? నిల్ బెంచినట్టి
వాని, మీవంగడమ్మునందైన వాని,
శీతలజలంబు మీపయిల్ జిమ్మువాని,
పడుచుఁదనపు సౌఖ్యమ్ములల్ విడుచువాని
మమ్మ మడుగంగ? నెంత తెంపరివి నీవు?
అనుభవింపకపోవులే! ఆ రవంత!'"

* * * *

"అదిగో! బడబాగ్ని వచ్చుచున్నయది కంటె!
మనల నందఱ నొక్కట మసియొనర్చు;
నీదు గాండీవరవము విన్పింపఁ జేయు
మతఁడు వృద్ధుఁడటంచు నేమఱకుమోయి!
ఆరితేరిన వాఁ డెన్నియో రణాల!
గురుని గగ్గోలొనర్చె నిష్ఠురకృపాణ
ధారి! నస్ఖలితబ్రహ్మచారి సుమ్ము!
వాడి నారాచములను గుప్పల్ దొడంగె
నదుగో! రోషభూయిష్ఠుఁడై అంత్యకాల
దావదహనునిమాడ్కిఁ గెందామరలను
బోలుకన్నులల్ జింతనిప్పులను జిమ్ము!
నీవ కాదు నేనునుగూడ నేర్వ నితని
నెదురుకొన ముఖాముఖి; బాణవృష్టి నెరపి
ఆర్పవేమి? బాణాగ్ని రవ్వంత లోన!"

* * * *

"మేలొనర్చితి వర్జునా! మేలొనర్చి
తరసినాఁడవా? యిపుడు తాతయ్య ప్రజ్ఞ!
గోవులం బట్టునాఁటి నీ కావరమ్ము
చాల దిప్పుడు భీష్ముని మ్రోలఁ బార్థ!
నాఁడు శాంతిని వహియించినాఁడు మీర
లెన్నియో చిన్నము లనుగ్రహించియుంట!
అదిగో! అనలాస్త్రజనితమైనట్టి జ్వాల!
ఏయుమా! వరుణాస్త్ర మొక్కింతలోన
నార్పఁగలదు దానివిభూతి! నంతలోన!
విజయ! శలభాయమానులై వెడలిపోవు

చున్నవవె! మనవాహిను లుగ్రవృత్తి
భీష్ముఁ డుప్పొంగుచున్నాఁడు వెడలవేమి?
ఆ సుయోధనుచే విజయధ్వజంబు
నిప్పు డెత్తింపఁగలఁడు పిల్పింపవేమి?
అలశిఖండిని ముందుద్రోయవదియేమి?
వాడి నారాచసంపదఁ బరపవేమి?
అక్కటా! అరణ్యవాస దుఃఖాంధకార
మార్పఁగాఁ దలపోయవా? దర్పమేచి!
ముదుసలియటంచు దలఁతువేమో? రణాన!
వీరువారని తలఁచుట వెఱ్ఱిగాదె?
మొసలి సుమ్ము మాతాత తామోహరమున!
తనకుఁ దానయి, మామీఁద నెనరుకతనఁ
జెప్పుకొనియెను దనపాటు;—శీఘ్ర మెదురు
చనుము:-"ఇదిగో సంధింతు నీక్షణమునంద-"

* * * *

"అకట నిన్నెత్తి పెంచె బాల్యమున; ముద్దు
లాడె నందఱకన్న నిన్నధికప్రేమ!
కొన్ని చెప్పె ధనుర్వేదగోప్యములను!
నీకుఁ జేతు లెట్లాడె? లోకైకవీర!
ఇపుడు మత్సరమేల? యందేగి వేగ
నలుపు ముపచారవిధులు; నిశ్చలపుభక్తి
అంపశయ్య కావలెనంట—అరుగవేమి?
కర్ణ! తెలతెలఁబోయె దాగతి నదేమి?
ఓ సుయోధన! చేతగాదో? రవంత!
అర్జునా! తాతగారికి నందినట్టి
మన్మఁడవు నీ వొకఁడవె! సమ్మర్దనంబు
కూడదనుచుండె; నీరమ్ము గోరుచుండె;
దివ్యపాతాళజలము నందింప వేమి?

* * * *

"దాహ మిప్పుడు తీరెనా? తాతగారు!
పదిదినంబులదాహ మిప్పటికిఁ దీఱె;
గాని మొనలేని కీరితిఁ గాంచినావు
బ్రహ్మచారి వటంచు భావమునఁ దలఁతొ?
ఈవు కీరితికాంత వరించినావు!
ఎంత విజితేంద్రియుఁడవో యీ! తమంత
చావు చెప్పెడివార లెచ్చటఁ గలారు?
క్రోధనమయుమ్మునఁ శాంతి కుదురు నెచట!
శాంతిపర్వంబు నీనోట జారెనెట్లు
ఈవు లోకైకవీరుండవె! మహాత్మ!
ఆర్య! తానకోజ్జ్వల మహాకార్యదీక్ష
ఆత్మవిశ్వాస మద్భుతాహవ విహార
మంచితానురాగమ్ము వాత్సల్యగరిమ
ఈ దరిద్రులయందుఁ బూరింపవేమి?
పిఱికిపందలయందు గుప్పింప వేమి?
బీదవారలయందుఁ జూపింపవేమి?
కుంటివారలలోఁ బురికొల్పవేమి?
మాపయి ననుగ్రహంబు నింపవదియేమి?
తప్పటడుగులనుంటి మో తాతగారు!"
"తాతగారికి మాదరిద్రత వచించి
మా పిఱికిమందుఁ గ్రక్కించి మనుపుమయ్య!"





# శంకరము కొండపైని బౌద్ధులమఠము

## ౧

కో. నరసింహాచారి గారు

మద్రాసు దక్షిణమహారాష్ట్ర ఇనుపదారిపైగల అనకాపల్లిస్టేషనుకు తూర్పున నొకమైలు దూరమున 'శంకర'మను ('సంఘారామము' ఇదిబౌద్ధ సన్న్యాసులమఠములకు పేరు) చిన్నగ్రామము కలదు. ఈగ్రామమునకు ఉత్తరమున, ననతిదూరమున రెండు కొండలు తూర్పుపడమరలుగా నొకదానికొకటి యానుకొనియున్నవి ఆరెండుకొండలును 23 ఎకరములపై శాల్యముకలవై ఒంటిరాతిశిల్పములచేతను, ఇతరకట్టడముల చేతను నిండియున్నవి. శిల్పములన్నియు బౌద్ధులచే కట్టబడి గణనార్హములై హిందూదేశదక్షిణభాగమున ఆతరగతిశిల్పములలో మిక్కిలి సనాతనములై యున్నవి. ఇట్టి యొంటిరాతికట్టడములు కలప్రదేశము దక్షిణ హిందూదేశమున మహాబలిపురము మరియొకటియైయున్నను శంకరగ్రామమునందలి కట్టడములే ప్రాచీనములై యున్నవి.

### తూర్పుకొండ (చిత్రము ౧.)

కొండలు రెంటియందును తూర్పుకొండ పెద్దది. దానిపశ్చిమవారమున రాతిలో మలచబడిన గుహలును, కొండయడుగునుండి శిఖరమువరకును సోపానములవలె రాతియరుగులును, చెక్కబడి వాటిపై మలచబడిన 'డాగోబా'[1] (లింగాకృతికల రాతికట్టడము)ల సమూహము లనేకములును, శిఖరమున నొక గొప్పరాతి స్తూపమును కలవు పశ్చిమమునుండిచూచిన నీయేక (చిత్రము ౨.) శిలాశిల్పము లన్నియు కన్నులపండువై యొప్పుచుండును. తూర్పుకొండయొక్క పశ్చిమ పార్శ్వమున గొంతదూరము రాతిలో మలచబడియు గొంతదవ్వు వేఱురాలతో గట్టబడియునున్న యొకమెట్లవరుస కలదు. ఇందు ప్రస్తుతము 65 మెట్లుమాత్రము నిలిచియున్నవి. ఈమెట్లమార్గము కొండపై నొకరెండంతస్థుల గుహాయొద్దకు చేరుచున్నది. గుహాలయము ముందుభాగమున 41′–9″ వెడల్పుగల యరుగుకలదు. ఆలయముఖమునకు కుడిప్రక్క గోడయందు అసంపూర్తిగా మలచబడిన గూడు కలదు. ఎడమప్రక్క నొకగోపురమును, దానియందు అంజలిముద్రతో నొక విగ్రహమును, నొకజంతు విగ్రహమును కలవు. గుహాలయద్వారము 6′–6″ ఎత్తును, 4′ వెడల్పును నై (చిత్రము 3 ) ఇరుపార్శ్వము 12½ అడుగుల ఉన్నతిగల గొప్పద్వారపాలుర విగ్రహముల గలిగియున్నది. ద్వారము పైభాగమున యస్పష్టముగా నుండు చిత్రములును మధ్య ఆసీనబుద్ధవిగ్రహమునుకలవు. మొదటిగుహాలయము 31′–6″ పొడవును, 34′–, 2″ వెడల్పును, 8′–4″ ఎత్తునుకలది. (చిత్రము ౪) ఇందు పొడవునను వెడల్పునను నాలుగేసివరుసలుగా 16 స్తంభములుకలవు. వీటికి నేరుగా గోడలయందును స్తంభములనుపోలి(Plaslters)చెక్కబడియున్నవి. ప్రతిస్తంభమును 1′–9″ చతురశ్రమై, 8′–4″ ఎత్తు కలిగియున్నది. స్తంభపాదము 4 ముఖములతోడను, మధ్యభాగము 8 ముఖములతోడను శిరము చెక్కబడిన

---

1. సకలైశ్వర్యసంపన్నమగు రాజ్యమును త్యజించి బుద్ధుడు చేకొనినభిక్షాపాత్రము బౌద్ధులకు పూజార్హమై నందున బౌద్ధులు తదాకృతిని వారియాలయమున నెలకొల్పి పూజించుచుండిరి. డాగోబా లిట్టి యాకృతిని కలవి.



చిత్రము ౧. తూర్పుకొండయొక్కయు, ఆలయముయొక్కయు ప్లాను.

శిఖరముతోడను ఒప్పియున్నది. ఆలయమధ్యమున నుండు 4 స్తంభముల మధ్య వాటి నానుకొని యొక యరుగును దానిపై ఒక డాగోబాయును కలవు.

ఈగుహాలయమునకు పైన (రెండవయంతస్థు) నుండు ఆలయముఖము క్రింది ఆలయముఖమున కన్న 8′ వెనుకకు త్రోసి కట్టబడి ద్వారము కొంచె మెడమునై పునకు జరిగియున్నది. ద్వారపరిమాణము 4¾′ వెడల్పును 5½′ ఎత్తును నైయున్నది. ద్వారమునకు కుడిప్రక్క ఆసీనబుద్ధవిగ్రహము ఇరుగడల నంజలీబద్ధులగు నిరువురుభక్తుల విగ్రహములతోడను శిరస్సునకు పైభాగమున నొకగంధర్వునితోడను ఒప్పియున్నది. ఆలయముఖమున కెదుట 8′ చతురము ఖాళీస్థలముకలదు. ఎడమప్రక్క నొక గోపురశిఖరముకలదు. ద్వారబంధము పైన 6¾ అ. ఎత్తుగలగూడు కలదు. దానియందు ఆసీనబుద్ధుడును ఇరువైపుల భక్తులును, పైమూలలందు ఖేచరులును కలరు. ఆలయమున 14¾′ పొడవును 5′-1″ వెడల్పును గలకూటము (నడవ, Vestibule)ను దాని వెనుక 9¾′ పొడవును. 6′ వెడల్పును, 6¾′ ఎత్తును కలగది కలదు. కూటము యొక్క గోడలపై బుద్ధ విగ్రహములు వలచబడియున్నవి. (చిత్రము ౭) ఆలయమును వదలి వెలుపల వచ్చినయెడల నచ్చటచ్చట డాగోబాలు విశేషముగా కానవచ్చును. (చిత్రము ౨)డాగోబాలన్నియు సమపఱుచబడిన రాతియరుగులపై నున్నవి. కొండయొక్క పడమటియంచున రాతియందు 115′ పొడవును, 22¾′ వెడల్పునుగల విశాలమగు అరుగు కలదు

అరుగుపైని నవరాత్రిబొమ్మలకొలువువలె డాగోబాల సమూహములుకలవు. ఇచ్చటగల డాగోబాలు సగటునకు 54. డాగోబాలలో పెద్దది 10⅓′ వ్యాసము (సుమారు 32½′ చుట్టుకొలత) కలిగి 4½′ ఎత్తు కలదైయున్నది. అరుగునకు తూర్పున 11¾′ ఎత్తును 75½′ పొడవు గలకొండరాతిగోడ యున్నది. పడమట ఇటుకరాతి గోడయు కలదు.

పర్వతశిఖరమున నొకస్తూపము కలదని పైన చెప్పబడినది. ఈస్తూపము అడుగు 76½ × 70½′ వైశాల్యమును 11¾′ ఎత్తును గలయరుగు కలదు. దానిపై నొక యావరణము వర్తులమైనది కలదు. దాని చుట్టు ఇటుకగోడ యొకటి యున్నది. ఆవర్తులముపై 60′ వ్యాసమును 4½′ ఎత్తునుగల సమ్మటమును ఉండినట్లున్నది. ఈస్తూపమున గలచిహ్నములం బట్టిచూడ 80′ చతురముగ నరుగును దానిపై 4¾′ వ్యాసముగలయొకస్తంభాకారముగు రాతిగోడయు (Drum Shaped Structure) దానిపై 60¾′ వ్యాసముకల సమ్మటమును ఉండినట్లు తెలియుచున్నది. అరుగుయొక్క ఈశాన్యమూలయందొకబిలము త్రవ్వబడి స్తూపములోనికి పోవు భూగర్భమార్గముగా జేయబడియున్నది. అరుగునకు దక్షిణమున 9 డాగోబాలు కలవు వాటిలో నొకదాని యందొక రాతిపెట్టె దొరకినది.

స్తూపముయొక్క వాయువ్యమూలను కొండదిగుడులో 2 గుహాలయములు కలవు. ఇందొకటి చిన్నది. దీనిద్వారమునకు ఎడమప్రక్క నొక బెంచీయును దానిపై నొక గడ్డముపెంచుకొనిన సన్న్యాసియు మరియొక విగ్రహమును రాతిలో మలచబడినవి కలవు. ఆలయగర్భమున గోడపై బుద్ధుని యొక్కయు, శిష్యులయొక్కయు విగ్రహము లున్నవి. ఆలయము ప్రక్క మరియొక గది కలదు దీనిలో వెనుకటిగోడపైనగూడ బుద్ధుడు ద్వారపాలుడు కలరు. ప్రక్కగోడపైన మత్స్యముపై గూర్చుండిన యొకవిగ్రహమును నాగశిరము కలసేవకుడును క్రింద సింహమును కలవు.

కొండయొక్క తూర్పుశిఖరమునంతయు నాక్రమించుకొని యనేకకట్టడములు అచ్చట నుండు నొక చైత్యాలయమును చుట్టియున్నవి. ఈకట్టడములకు గాను కొండపై భాగమంతయు చదునుగానున్నది. ఇట్టిప్రదేశములన్నింటిలోను పెద్దది తూర్పుపడమరలుగా 154′ ఉత్తరదక్షిణములుగా 73′ ను కలిగియున్నది. ఇవి ముందు పేర్కొనబడిన స్తూపము యొక్క అరుగు మట్టమున నుండి స్తూపమునకును అరుగునకును మధ్య 23′ వెడల్పుమార్గ మొకటి యున్నది. చైత్యాలయమునకు తూర్పు, దక్షిణ, ఉత్తరములయందు గూండ్లవంటి గదులు కలవు. ఆలయము యొక్క ముఖము పశ్చిమమున నున్నది. చైత్యాలయమునకు ముందు భాగమున తూర్పు పడమరలుగా 44½ అడుగుల పొడవును, 29½′ వెడల్పును కలశాల యొకటి కలదు.

దీనికి వెలుపలచుట్టును రెండుగోడలును వాటివెలుపట గోడల నానుకొని చిన్నగదులును గలవు. శాలయొక్క యుత్తరపుకోనయందు మృత్పాత్ర మొకటి దొరకినది. ఈపాత్రయందు ఏవస్తువును కానబడకపోయినను పూర్వకాలమున శవములనుంచి పూడ్చుచుండిన పాత్రగా నుండునట్లు కనుపడుచున్నది. ఉత్తరదిశయందు గల గూండ్ల (గదుల)యందు రాగినాణెములును, మట్టిముద్రలును, కుండలును, దొరకినవి. ఈగదుల వరుసకు వెలుపల సమాంతరము (Parallel)గా మరియొక గదులవరుస కలదు. తూర్పున 9 గదులు కలవు. ఈకట్టడము లన్నియు బహుశః క్రీస్తుయుగమునకు పూర్వికములై (అశోక చక్రవర్తికాలమున చేరినవై) యుండవలెను. ఇటగల యేకశిలా నిర్మితగోపురములుగూడ నశోకుని సమకాలికములై యుండవలెను. కొన్నిగదులయందు రాతియరుగులను అరుగులపై రాతి [illegible]దిండ్లును కలవు. తూర్పుకొండయొక్క పడమటివారమున 'సలకమ్మదేవి' యనునొకయమ్మవారివిగ్రహము కలదు. ఈదేవత కిరువైపుల నిద్దరు సేవకులగుంపుగాను, బడియందు ఒకబిడ్డయొక్కయు విగ్రహములు కలవు. శిరస్సుచుట్టును పరివేషమువలె బిడ్డలశిరస్సులనా[illegible] [illegible]యు [illegible]గమున గూడ నట్టిమూర్తి[illegible]లవు. [illegible]సంపూగ (నాకరసం క్రమానుసారము) ఆవిగ్రహము ప్రక్కగా పోవు ప్రతి స్త్రీయును ఒకరాగిని ఆవిగ్రహముపై వేసిపోవుట విధియట. ఇట్లు వేయబడిన రా[illegible] గప్పబడి విగ్రహము పూడిపోవుట నాటినాటికిని [illegible]వల్ల నప్పుడప్పుడీరాళ్లను తీయించుట వాడుకగా యున్నది.

చిత్రము ౬.



క్రీ. పూ. 50 మొదలు క్రీ. శ. 150 వరకు కనిష్కునికాలమునాటి యూసఫ్‌జాయి పట్టణములోని ఒక స్తంభశిఖరము. ఈదేశము సింధునదికి పడమటను కాబూలునదికి ఉత్తరమునను ఉన్నది.



# శంకరముకొండపైని బౌద్ధులనుతములోని చిత్రములు

## చిత్రము ౭.





1. మొదటిగుహాలయము ప్లాను



2. రెండవగుహాలయము ప్లాను





3, 4. పై రెండుగుహాలయముల సెక్షనును, ముఖమును (Section and Elevation)



# జీవితము

కాశీ వ్యాసాచార్యులు గారు

ఘనఘనావళి గగనభాగమ్ముఁ గప్పె, స్తనితనిర్ఘోషముల దిగంతములు నిండె,
క్ష్మాతలంబెల్ల గాఢాంధకారమయ్యె, బ్రహ్మాండభాండస్ఫోటనసరణి సంప్రాప్తమయ్యె.

చ. కడవలఁ గ్రుమ్మరించుగతిఁ గాలఘనావళు లుద్ఘటార్భటిన్
గడువడి వారిధారల నఖండముగాఁ గురియంగఁజొచ్చెఁ బా
ల్పడుచుఁ దటిచ్ఛయంబు, కనులన్ మిఱుమిట్లుఁలు గొల్పవచ్చె నం
దడి మదులందు హెచ్చె, నొకదారియు డొంకయుఁ గానరామిచేన్.

ఉ. అత్తఱిఁ బాంధుఁడొక్కఁడు, నిజాంగమునన్ మలినాంబరంబు లా
యత్తమొనర్చి, కన్నుఁగవ నశ్రువు లాజడివాన కీడుగా,
మొత్తములై ధరన్ గురియ, మోహసమావృతుఁడై సహాయసం
పత్తి యొకింత లేక బహుభంగులఁ జింతల మున్గి తేలుచున్.

చ. "అరరె! యిఁకేమిసేతు నకటా! జగమంతయు నంధకారబం
ధురమయి కానవచ్చెడిఁ గనుంగవ కెద్దియుఁ దోఁచరాదు; భీ
కరతరవారిపాతమునఁ గాయము వ్రయ్యలు చెందఁజొచ్చె, నె
వ్వరు శరణంబు నాకిట? నభాగ్యుఁడనైతి" నటంచు నెంచుచున్.

కం. పరిపరివిధముల నటునిటు, దిరుగుచు, స్రుక్కుచును, దిక్కు తెలియక యొక భీ
కరకూపంబునఁ బడి వెలి, కరుగునుపాయంబు గాన కటమటపడుచున్.

చ. ఘనతరపంకమగ్నమయి కాయ మపాయముఁ జెందుచుండ, బ
ల్మిని బలుమాఱులందలి మలీమసవారులఁ దేలితేలి, చే
యునదొకయింత లేక, తనయుల్లమునన్ బరితాపమొంది "యిం
దునఁ బడిపోతి; నాకిచటఁ దోడు మఱెవ్వరుఁ గానరారుగా.

ఉ. వాడలవాడలన్ దిరిగి వచ్చితి నీపురి కిందుఁ జేరినన్
గూడదు సౌఖ్య మించుకయుఁ గూపమునం బడినాఁడ నింతఁ కే

నాఁడు నిజస్థలంబు విడనాడితినో యపుడే సుఖాస్థితుల్
గూడ ననున్ ద్యజించె నతిఘోరవిపజ్జలరాశి ముంచెనున్.

ఉ. అర్మిలి మ్రొక్కువాఁడ, సుగుణాకరులార! వినుండు పూర్వపుఁ
గర్మవశంబుచేత నధికమ్మగుకష్టము లందుచుంటి, నన్
బేర్మి ననుగ్రహించి దరి నిల్పుఁడు, పుణ్యముఁ గట్టికొండు, మీ
ధర్మముఁ గొల్ప రండు, తనుధర్మము సర్వము నొప్పఁ జొప్పడన్

ఉ. దీనుఁ డితం డెవండని మదిన్ దలపోసెదరేమొ యయ్యలా
రా! నుడువంగఁ బూనితి మదద్భుతవృత్తములన్ వినుండు, నే
శ్రీనగరేశ్వరుండు, నృపశేఖరుఁ డార్తశరణ్యమూర్తి, ప్ర
జ్ఞానిధియౌ త్రివిక్రమజగత్పతి సేవకులందు నొక్కఁడన్.

ఉ. ఆవిభుఁ డాత్మసేవకులయందు దనుకంప నెలంగి సర్వభూ
తావనమున్ బొనర్చుచు, నిజానుచరావళిఁ దత్పదీయ సే
వావిధి సల్ప నాజ్ఞఁ గొలుపన్ బహుమోహసమావృతుండనై
సేవలఁ జేయ మాని, ప్రభుశేఖరునాజ్ఞఁ దిరస్కరించితిన్.

ఉ. కావున నా త్రివిక్రమ జగత్పతి నాపయిఁ గూర్మిదప్పి య
స్సీవిధి నన్యదేశము లనేకములన్ దెగఁద్రిప్పుచుండి ని
త్తావిధి కూర్చెనో విబుధసత్తములార! ననుం గృపార్ద్రని
ద్భావముతోడఁ దీరమున వైవుఁడు దుర్భరమయ్యెఁ గష్టమున్."

క. అని యిటు పరులసహాయం, బునకయి దురపిల్లి, దారిఁ బోయెడివారా
ధ్వని నొక కొందఱు విని, యి, ట్లని రాతనికడకు నేగి యాసమయమునన్.

చ. "ఘనుఁడగు నా త్రివిక్రమ జగత్పతి నీక విభుండు కాడు, మా
కును విభుఁ డాతఁడే యతనిఁ గోరి భజింతుము సుమ్ము! వాని శా
సన మవిలంఘ్య; మావిబుధసన్నుతికిన్ కడుఁ బాలు గొన్న నిన్
మనుపఁగ శక్తి మాకు నణుమాత్రము లే దని పోయి రెల్లరున్.

శా. దీనత్వంబునఁ బొంధుఁ డివ్విధము, ధాత్రీగర్భగోళంబునన్
నానాక్లేశము లందుచుండి యొకఁడైనన్ దోడు రాకుంట వ్యాత్
[illegible]నంబుడుఁ త్రివిక్రమేశ్వరు వినా శక్తాత్ముఁ డన్యుం డెవం
[illegible] గావఁగ శక్తుఁడౌ యనుచు నెంతేభీతిమెం గుందుచున్.

ఉ. "ఓయి త్రివిక్రమా! త్రిభువనోత్తమ! చిత్తమునం దవజ్ఞ చే
మీామొఱ సల్పు తప్పుల క్షమింపఁగవే॑డెద యుష్మదీయ సే
వాయతమానసంబున నహర్నిశమింక మెలంగువాఁడ రా
వే! యతిదీను నన్నుఁ గనవే! తగవేటికి నుద్ధరింపవే!"

చ. అని యిటు మొఱ్ఱవెట్టుసమయంబున వర్షజలప్రవాహముల్
గొనకొని, యేకమై దెసలఁ గ్రుమ్మర నందలి మిట్టపల్లముల్
మొనసి తదీయవారి పరిపూర్ణములై ప్రళయాబ్ధికైవడిన్
దొన కొనరింపఁ గూపపతితుండగుపాంధుఁడు దేలె నీటిపై.

క. జలముల నటునిటు లూఁగుచుఁ, దలక్రిందులుగాఁగ నపగతస్పృహుఁ డగుచున్
సులలితలతికారామా, విలసితధాత్రీపదప్రవేశితుఁ డయ్యెన్.

మ. ఎది యెట్లున్ననుగాని దుర్భరవిపద్వృత్తిన్ స్వనాడీతతుల్
సెదరెన్; శాఖలుదప్పెఁ; జిత్తము భ్రమించెన్; మాటయున్ బోయెఁ బూ
ర్వదశావిస్మృతియున్ జెలంగె; నవురా! ప్రారబ్ధ మేమందు నీ
నుదుటన్ వ్రాసినవ్రాఁతఁ దప్పఁదరమా నూఱేండ్లు చింతించినన్.

చ. అలజడి శాంతిచెందఁగ, దృగబ్జము లల్లన విప్పి దిక్తటం
బులఁ దిలకింపఁజొచ్చెఁ; బరిపూతపయస్స్రితిఁగ్రోల, మేనిలో
బల మొకకొంత హెచ్చె; నటుపై నతఁ డల్లన నందునుండి యిం
దులకును బ్రాకఁజొచ్చె; నొకనూతనవైఖరి పెంపు సూపుచున్.

శా. తీరస్థప్రమదావనాధిగతధాత్రీహస్తశాఖాసుఖా
ధారుండై, రసవత్పదార్థములచేతన్ బుష్టి చేకూరఁ, ద
త్తీరోపాంతములన్ జరింపఁ దొడఁగెన్; దేహంబునన్ నూత్నసం
స్కారంబబ్బె; గతాగతాఖిలవివక్షా శూన్యుఁడై యొప్పెఁ దాన్

కం. గురుసాహాయ్యపరంపర, వరల నిజాపదలు మట్టుపడినటు లెనఁగన్
బరమానందముచే నటఁ, బరువులిడన్ జొచ్చె నంతఁ బాంథుం డెలమిన్.

గీ. అటుల మెలఁగుచునుండ, వర్షాదిమైన, ఋతుచతుష్టయమును జనె; నింతలోన
పూర్వభావముల నెలకొల్పుచువసంతుఁ, డిమ్ముగా నటఁ దనదుకాణమ్ము దెఱచె.

సీ. ఒకవంక శుకపికప్రకరసంగీతశ, బ్దముల దిక్కుల ప్రతిధ్వనులు సెలఁగ
ఒకచెంత మిత్రత్వ మూని సంఫుల్లప, ద్మినులు నేత్రానందమును దనర్ప

ఒకదండ వికచపుష్పకదంబసౌరభం, బులు దిగంతములయం దలఁదుకొనఁగ
ఒకక్రేవ దివ్యామృతోపమానఫలంబు, లందందు రాసులై యనఘళింప
సధికమోహనమగు వసంతాగమంబు, గాంచి చిత్తంబు నూత్న వైఖరిఁ జెలంగఁ
బగ్గములతోడ బిగలాగఁబడినవాని, చంద మాతంపు శత్రు ప్రదేశంబుఁ జేరె.

మ. కరముల్ బుష్పవతీత్వగౌరవముచేఁ గల్యాణముల్ గూర్చుచున్,
దరుణత్వంబున నేత్రపర్వమగు కాంతారాగసౌభాగ్యవి
స్ఫురణన్ జిత్తము నూత్న భావములఁ బెంపుం జెంద నాసాంఘ్ర, ప
త్త్రతిఁ దత్పల్లవహస్తశాఖల సముద్యత్ప్రీతిమైఁ జూచుచున్.

చ. కుసుమితయౌవనప్రతిభఁ గోమలభావము సూపి, యాత్మమా
నసమున కింపుసొంపును దనర్చు లతాతనురాగ కాంక్షచే
త, సతతముబ్బి యట్లతఁ డుదారత దానిఁ బరిగ్రహించి భ
వ్యసుఖసమన్వితుండయి తదన్యము వీడి చరింప కెప్పుడున్.

గీ. సరసులన్ డాసి జీవనస్వాస్థ్య మంది, సతము సహకారశాతుల విశ్రాంతి నొసఁగి
సరస భోజన మిడఁ దద్రసంబు లాని, చేవఁ దనరారెఁ దప్ప్రియమదానసమున

క. ఒకటఁ గలకంఠసంతతి, ప్రకటత రానందపారవశ్యముఁ గూర్పన్.
సకలంబు మఱచి "శాశ్వత, మిఁక నా కిదియే" యటంచు నెంచఁ దొడంగెన్.

ఉ. ఎందులనుండి యెందులకు నేగుచు నీప్రమదావనానుర
క్తిం దగులొందెనో యుచటికిన్ దనరాకకుఁ గర్జమేమొ లో
నం దలపోయఁడాయె; నిజనాథుని శాసనమెంచఁడాయె నే
మందుఁ దదీయవైఖరి! నహర్నిశ మాతఁ డిటు ల్మెలంగఁగన్.

గీ. ఇటులు మెలఁగుచు నుండఁగా నింతలోనఁ, దద్వసంతర్తు ధర్మవిధాన మెల్ల
నల్లనల్లన క్షీణించి యఖిలదిశల, గ్రీష్మఋతుతాప మేపునఁ గీలుకొనియె.

చ. అరుణమయూఖుఁ డత్తఱి సహస్రకరంబులతోడ నిప్పులన్
జెరుగుచుఁ దీవ్రతాపము జనింపఁగఁజేసి క్రమక్రమంబునన్
సరసుల జీవనంబుల విచారణ యించుకయేని లేక పాం
పిరిగొని మిత్త్రుఁడయ్యును నమిత్రతఁ జూపఁగఁడంగె నొక్కటన్.

గీ. సవితృసంతప్తధాత్రీజచయము లంత, నామమాత్రావశిష్టంబులై మెలంగ
నిలువనీడ యొకింతయేనియును లేక, క్లాంతుఁడై పాంథుఁ డిట్లు దలంపఁదొడఁగె.

ఉ. 'పల్లవితానురాగగుణబంధురమై కలకంఠ సంతతి
ప్రోల్లసితంబునై యెదుటఁ బొల్చెడి యీ ప్రమదావనంబునన్
మెల్లన నింతకాలము భ్రమించితి నాత్మభవోపలబ్ధ సం
ధిల్లఁ బరం బొకింతయు గణింపఁగఁబోక తదేకవృత్తినై.

సీ. తమ్ములతోడ సంతతము సంతసమూని, పాటపాటలఁ దేలి యాడినాఁడ
సహకారనికరవాసముల భాసురలీల, నగతశ్రముఁడనై యలరినాఁడ
సరసుల డాసి నిచ్చలుఁ దత్సరోజాత, జీవనస్వాస్థ్యంబుఁ జెందినాఁడ
కలకంఠసంతతి గానమాధురిచేత, దేహంబు మఱచి నిద్రించినాఁడ
గీ. అతులలలితలతికాసుమనోనుకూల, సరసరింపగాన సౌస్వరస్వనాసక్త
భావమోహాంకుర ప్రమదావనంబె, జీవితావధి యనుచుంటి నేనినాఁడ.

ఉ. ఇంతకు సౌఖ్యదంబనుచు నెంచిన యీ ప్రమదావనంబె, మ
ద్భ్రాంతివిపన్నిధాన మయి, తద్దయు భీతి నొసంగుచుండె; న
త్యంతకఠోరతాపపరితప్తశరీరుఁడ నైతి; నిల్వఁగా,
సుంతయు నీడ నాకుఁ గనుచూపున కెందును గానరావుగా.

ఉ. ఏమి యొనర్చువాఁడ? నిఁక నెందుల కేగెదువాఁడ? దిక్కెవ్వ
రేమియుఁగానరా; దిచటి కెట్టుల వచ్చితి? నిందు రాఁగతం
బేమి? యిఁకేమి నాకుగతి? యెవ్వని వేఁడుదు? నంచుఁ దీవ్రబా
ధామథితాంగుఁడై, మది నితాంతము యోజన సేయఁ బూనినన్.

ఉ. అత్తఱిఁ బూర్వసంస్మృతియు నల్లన నుల్లము సోఁకఁ బొంగుచున్
దత్తరపాటుతోడ, నిజనాథుఁ ద్రివిక్రము ధిక్కరించుటన్,
జిత్తమునందు నిట్టి వ్యథ చేకురెఁగా యని నిశ్చయించి, లో
కోత్తరుఁడైన తద్విభుని నుద్ధతిమైఁ దలపోసి యిట్లనున్

మ. ఎఱుఁగన్ జాలక మోహసంవృతుఁడనై యీశా! త్వదీయాజ్ఞలన్
జరుపన్ విస్మృతిఁ జెంది, యింతకును గాంతారాగసౌభాగ్యమే,
తిరమంచెంచుచునుంటి, నేఁటికిఁ దదుద్దేశంబు మిత్రాప్తిచే,
కుర శూన్యంబయి ఘోరతాపజలధిన్ గూల్పన్ దొడంగెన్ జుమీ!

చ. నిలుపఁగఁ జాల నీతనువు; నిల్వఁగ నీడనొసంగువారి నేఁ
దలఁపఁగఁజాలఁ, దీవ్రపరితాపముచే వెతచెందుచుంటి, బా
ధల వెసఁదీర్పవే; హృదయతాపము మాన్పవె; మ్రొక్కువాఁడ ని
శ్చలతరభక్తితోడ ననిశంబును నోయి! త్రివిక్రమేశ్వరా!'

చ. అని యిటు లెంత వేఁడిన సహాయ మొనర్చు మహాత్ముఁ డొక్కఁడేఁ
గనులకుఁ గానరామి భయకంపితమానసుఁడై జ్వరార్తుఁడై
ఘనతరయాతనాజనితకష్టపరంపర నోర్వలేక తాఁ
బనివిని లేచిపోయె నటుపై నెటకేగెనొ తెల్పరాదుగా.

గీ. ఇంతకును దత్త్వమాత్మ నూహించిచూడ, స్థిరముగా నొక్కచోని యీశీవిరామునఁ
గానరా దైన మోహాబ్ధిలోనఁ బడుచు, నఖిలకర్తృత్వమును మూపునందుఁదాల్చి
క్షణములో వచ్చునది యెఱుఁగంగలేక, యాకసంబున దివ్యహర్మ్యములఁగట్టఁ
దలఁచుచుండు నరుండు సంతతముఁగాని, తానొకండు తలంచిన దైవ మొండు తలఁ
[చుననుమాట నిక్కంబె తరచిచూడ.

శా, "నానారీమణి, నాదుపుత్త్రు"లను నున్నన్నాళ్లు నీదేహిగా
ప్రాణంబుల్ విడిపోవఁగా నెవనిత్రోవన్ వాఁడు పోఁజూచునే
కానీ చచ్చినవానితోడ నరుగంగాఁ బోవఁడెవ్వాఁడును
జ్ఞానాంధత్వము గప్పిగాదె తదవస్థాప్రాప్తి హాపోవుటల్.



# విజయనగరసామ్రాజ్యము - చైనాదేశముతో రాయబారము

## An Embassy from Vizianagar to China

కుందూరి ఈశ్వరదత్తు గారు, బి. ఏ.,

కర్ణాటకసామ్రాజ్య స్థాపనాచార్యులలో నొకఁడును, విద్యానగరనిర్మాణకుఁడు నగు ప్రథమబుక్కరాయల కాలముననే నూతన కర్ణాటసామ్రాజ్యమునకును బ్రాచ్యదేశములలో నత్యంతప్రాచీనమగు చైనాదేశమునకును రాజకీయసంబంధము లున్నట్లు కీర్తిశేషుఁడైన స్మిత్తుపండితుఁడు మన కొక నూతనచరిత్రాంశమును దెలిపియున్నాఁడు.[1] ఈ విషయము కర్ణాటక సామ్రాజ్య చరిత్రకారుల కత్యంత ముఖ్యమైనది "బ్రెక్నీడర్" పండితుఁడు తనచే విరచింపఁబడిన 'మిడీవల్ రీసర్చెస్ (Mediaeval Researches by Bretschneider) అను గ్రంథమునం దీ విషయము నుదాహరించెను.

'పశ్చిమస్వర్గము[2]' నందలి 'ఆనంగుండె[3]' రాజ్యము నేలు 'బుహోలు[4]' అను రాజు తన ముఖ్యరాయబారియగు 'బిసిసి' యనునతనిని చైనాచక్రవర్తికి కప్పము గట్టుటకుఁ బంపెను. అతఁడు తనతో విషమునకు విరుగుడైన యొక రాతిని దెచ్చెను. ఈ రాయబార మైనతరువాత మఱల చైనాతో నిట్టి దెప్పుడును జరిగి యున్నట్లు కనఁబడలేదు. ఈబుక్కరాయలకాలముననె విద్యానగరము విజయనగర నామము దాల్చి నూతనకర్ణాటసామ్రాజ్యమునకు రాజధాని యయ్యెను. ఇతఁడే తన సోదరుని మరణానంతరము పట్టణము నభివృద్ధికి దెచ్చెను.

ఈవిషయము నా 'హంపీ-విజయనగరము' అను గ్రంథమునందే కొంచెము చర్చించియుంటిని. విషయము కర్ణాటకచరిత్రకారు లెవ్వరును జేర్కొన కుండుటయు, నాంధ్రులచరిత్రకుఁగూడ నత్యంత ప్రధానాంశ మగుటచేతను నేనీవిషయము వ్రాయవలసివచ్చెను.



1. Indian Antiquary. (August 1916)

2. ఈపేరు చైనాదేశభాషలోనున్న బౌద్ధమతగ్రంథములందు హిందూదేశమునకుఁ బర్యాయపదముగ వ్రాయఁబడెనట.

3. ఆనెగొంది—ఇది విజయనగరమున కుత్తరమున తుంగభద్రాతీరమున నున్నది.

4. బుక్కరాయలు.




నాళము కృష్ణారావుగారు

## సోయగము

నిండుచంద్రుండు నీముఖమండలంబు,
కందు ముంగురు, లుదయరాగంబు మోవి;
అమలచంద్రిక మందహాసాంకురంబు;
అహాహా! నీముఖంబు సుధాకరాత్మకంబు.

వదనలావణ్యసరసిలోఁ గదలియాడు
వాలుమీనులో యన నొప్పుఁ గ్రాలుకనులు,
నురువులో యన నలరారుఁ జిఱునగవులు,
విమలశైవాలమో యన వెలయుఁ గురులు.

నిగనిగలు దేఱు నిద్దంపునీలమణులు
నట్టనడుమను, కెంపులు తుట్టతుదను
చెక్కి తాపిన ముత్తెంపుఁజిప్ప లనఁగ
చెన్ను మీఱెడి నీవాలుఁగన్నుదోయి.

కలువఱేకులు మెఱుఁగులు గండుమీలు
నీదు రామికి, కనులతో జోడు గూర్ప
తమ్మిపువ్వులఁ గల్పించెఁ దమ్మిచూలి;
పుట్టినిలు పెద్ద సేయరె యెట్టివారు?

కన్నుగొలనులు రెండును గలియకుండ
నడుమ ముక్కను సేతువు నలువ కట్టి
పైకి పొరలకయుండ నేర్పఱచినట్టి
పోతగట్టులో యన కనుబొమ్మ లలరు.

రమ్యభవదీయముఖ సభారంగమంధు
కొలువు దీరిచి మారుండు కూరుచుండ
డంబు మీఱిన సింహాసనం బనంగ
నీదునాసిక విలసిల్లు నిండుజిగిని.

మంజులం బగు నీకంఠపంజరమున
గోరువంకయొ చిలుకయొ కోకిలంబొ
కాపురము సేయుఁ గాఁబోలు, కాకయున్న
లలితమాధుర్య మెట్లొప్పె పలుకులందు?

మోవి పవడంబు, గోరులు ముత్తియములు,
కురులు నీలాలు, కెంపులు చరణయుగళి,
పల్లువరుసలు రవ్వలు; పద్మభవుఁడు
నిన్ను నిర్మించెఁ నిక్కంబు నిఖిలమణుల.

కొమరుమోవిని సుధ గిలకొట్టవచ్చు
మొలకనవ్వుల వెన్నెలల్ చిలుకవచ్చు
చిన్నికురులందు చీఁకట్లు జిమ్మవచ్చు
తీయపలుకుల కలకండ తీయవచ్చు.

విమల మగు నీదుచిఱునవ్వు వేయి సేయు
లలిత మగు నీదువాల్చూపు లక్ష సేయు
కులుకువయ్యారినీనడ కోటి సేయు
నిద్ద మగు నీదునునుసిగ్గు నిధులు సేయు.

చలువనునుమంచుబిందుల జాలుకొలిపి
పండువెన్నెలపిండిని పదనుచేసి
మెఱుఁగులందలితళుకుల మేళగించి
చేసెఁ గాఁబోలు నలువ నీచెలువ నహా!

ఒప్పు లన్నిటి నొకచోట కుప్ప వోసి
అందముల నెల్ల నొక్కెడ పొందుపఱచి
గుణము లన్నియు నొకచక్కి గూర్చి పేర్చి
సలిపె విధి నీదునెమ్మేని చక్కఁదనము.



౧౯. కపిలతీర్థము—తిరుపతి



౨౦. దేవస్థానము విచారణకర్తగారి కార్యాలయము—తిరుపతి

## ప్ర ణ య ము

ఏమిమహిమంబు గలదో నీనామమందు ?
'పాప' యనుపల్కు వీనులఁ బడినయంత
నిలువునను నాదుమే నెల్లఁ బులకరించు
జల్లు మని నాదుహృదయంబు జలదరించు.

ఓహో ! నీనామ మెంత మనోహరంబొ !
మించువేడుకతో స్మరియించుకొలఁది
నిశ్చలం బగుభక్తి ధ్యానించుకొలఁది
కూర్చుచున్నది నానాఁట క్రొత్తరుచులు.

సర్వసారస్వతప్రపంచంబునందు
'పాప' యనియెడి యక్షరద్వయముతోడ
సాటివచ్చెడు కొండొకమాట కలదె
మార్దవంబున మధురిమ మంజులతను ?

జల్లు మని నోట ముత్యాలు జాఱ, నీవు
పలుకు తొలిపల్కులే నాకు తొలిపలుకులు;
జిలుగుగా నీవు పలకపై గిలుకు మొదటి
యక్షరమె నాకు మొదలిటియక్షరంబు.

నీదునవ్వులు నిండువెన్నెలలు, నీదు
శీలసంపద భూషణశ్రేణి, నీదు
తళుకునిద్దంపుసిగ్గుదొంతరలు తలఁప
పరమసౌభాగ్యశుభపరంపరలు నాకు.

ఈవు కలకల నవ్వితి వేని, నాకు
పండువెన్నెల జగ మెల్ల నిండినట్లు;
ఈవు వలవల యేడ్చితి వేని, నాకు
చిమ్మచీఁకటి జగ మెల్ల నిండినట్లు.

విమలభవదీయగుణవర్ణనములఁ గాని
చిత్తి మరుగదు తదితరచింతనముల;
రమ్య మగు నీదువదనదర్శమునఁ గాని
దృష్టి నిగుడదు తదితరదృశ్యములను.

ఎట్లు ముచ్చిలితివో నాదుహృదయ మీవు?
లేఁతనవ్వులమొలకలచేతఁ గాదు,
చెలువు గులికెడుపలుకులచేతఁ గాదు,
సిరుల నీనెడు నునుసిగ్గుచేత నేమొ ?

నిండుబిగియారుకౌఁగిట నిన్నుఁ బొదివి
నీదుతనుధూళి తనమేనినిండ సోఁక,
హాళి నిన్నెత్తికొని ముద్దులాడునట్టి
వానిజన్మంబు జన్మంబు వసుధమీఁద.

నిగ్గుదేఱెడి నీపాలబుగ్గలందు
గిలిగిలింతల గిలకొట్టి, తళుకునవ్వ
వెన్నముద్దలఁ జిలికించి యెన్నిసార్లు
జట్టియుంటినో చుబ్బనచూఱ గాఁగ?

సరససంగీతసాహిత్యభరిత మగుచు
శ్రుతిహితం బగు త్యాగయ్యకృతిని బోలె,
చిన్నదయ్యును తావకజీవితంబు
రసికజనరంజకం బయి రమణ గాంచె.

స్వచ్ఛతర మయి మాధురీసహిత మగుచు
సురుచిరామోదజనకమై సుమముపోలె,
చిన్న దయ్యును తావకజీవితంబు
బంధురానందకర మయి వన్నెకెక్కె.





# జాతీయ విద్య

కొలచలమల కృష్ణ సోమయాజి గారు, యం. ఏ., యల్. టి.

## ౧

### ఆ రం భ ము

ఈ పదమునిప్పటికి ౧౫-౧౬ వత్సరములనుండియు వినుచున్నాము. ఇది మొదట ౧౯౦౫ వ సంవత్సరములో నుదయించిన 'స్వదేశీ' యుద్యమముతో నారంభమైనది. భారతము స్వతంత్రదేశముగ నుండవలయును, భారతీయులును స్వతంత్రులు గావలయును అనుకోర్కె యప్పుడె యుత్పన్నమైనది. రాజ్యమందు, వాణిజ్యమందు, విద్యయందు, వినయమునందు, సకల ధర్మమునందును, 'మేము' 'మాది' యను నహంకృతి యేర్పడినది. పరరాజ్య మిది భయావహ మంటిమి. పరులభాగ్యమే మన దారిద్ర్య మంటిమి. వారివిద్య మమ్ముల జెఱచిన దంటిమి. మనల నావరించిన దోషములన్నియు వారి సహవాసముచేతనే యంటిమి. వీరల రూపుమాపు టెట్లని యోజించుచుంటిమి.

ఇదియంతయు దామసమే యనవలె. కాని శుద్ధసత్త్వమం గుటియు దొలికాలమునకు వేసవిగాడ్పు లవసరమైన ట్లీతామస మదునుగనే యుండెను. పాపభీతిచే నొకప్పుడు పుణ్యాసక్తి గలుగును. పరనిరసనముచే మన కాత్మవిశ్వాస మొకింత గుదిరినది. వారిదోషము లెంచి యెంచి మనగుణలేశముల గొన్నిటినైన గనుగొంటిమి. వారు పరులని దోసినంతనె మనము మనమని దెలిసికొంటిమి. ఆలాభ మంతేచాలుకే. ఇతరవిషయము లటుంచి విద్యావిషయ మేమయ్యెనో విచారింతము. ప్రభువు లిడుచున్నవిద్య దుష్టమని ఖండించితిమిగద; వెంటనే మనమొక సిద్ధాంతము చేయవలసియుండె. అందుకు 'జాతీయవిద్య' గావలయు నంటిమి. దీని లక్ష్యలక్షణ విచార మొకింత సాగినది- లక్ష్యము మున్ముందు రాజోద్యోగబంధములనుండి విడిబడి స్వతంత్రవృత్తుల జీవించుట యని తేలెను. స్వతంత్రజీవనము 'శిల్పములు' కళలు నేర్చికొనినచో సాధ్యమగుననిరి. ఇందుకు దేశములో నలుగడల నట్టి విద్యాసంస్థల బొడుకొలుపు టయ్యెను. అప్పుడు కాళీఘట్ట (కలకత్తా) మీయుద్యమమునకు నెలవై యుండుటచే నచట నైద్యపాఠశాలయొకటి సాహిత్యపాఠశాల యొకటి మొట్టమొదట సాగించిరి. దానిం జూచి మన యీాంధ్రు జాతీయకళాశాలను, స్థాపించిరి ఇట్లే దక్షిణమున ద్రావిడులు పశ్చిమమున మహారాష్ట్రులుగూడ నొకటి రెండు కళాశాలల గట్టిరి.

ఇక లక్షణము: విద్యావిషయమనగా మొదుమిక్కిలి భాషావిషయము. స్వదేశీ యుద్యమానురూపముగ దేశభాషలందే విద్య చెప్పవలయు ననుసూత్ర మేర్పఱచిరి. కాని దేశభాషలందు దగినగ్రంథసామగ్రి లేమి ఈలేమిడి యిప్పటికి నిట్లే యున్నది. ఆంగ్లముతో గలిపి వాడుచ వచ్చిరి. దేశభాషలలో నున్నంతలో వంగభాషయే ముందుకు సాగియుండుటచే నందుమాత్రము కొద్దిగొప్ప పని జరుగుచుండిన ట్లుండెను. పిల్లలిచ్చు బడిజీతముల బాధయు నొకింత తగ్గెను. ఇంతకన్న నెక్కుడు జరిగె నని చెప్పలేము. శిల్పములు, కళ లంతగ నభివృద్ధిలోనికి రాలేదు. దేశభాష లంతకన్నను రాలేదు. భారతీయ మనదగిన విద్యావిధాన మెద్దియు సిద్ధాంతము గాలేదు. ఇక వంగ విభాగోపసంహారముతో స్వదేశీయోద్యమ మంతరించినది. దానితో జాతీయ విద్యాప్రసంగముగూడ మాటుమడగినది. కాళీఘట్టములోని సాహిత్యకలాశాలకాధారములు లేమి యది యట్లై కృశించినది. శిల్పశాలొకటిరెండుమాత్రము రూపాంతరములతో నేటికిని నిలిచియున్నవి. ఇతరములు కాలప్రవాహమున గలిసి నేడు 'నేషనల్ స్కూళ్లని', 'కాలేజీలని' నామమాత్రము

వహించి విజాతీయ విద్యగఱపుటకే తావులయినవి. ఇది యొకఘట్టము.

రెండవది మరల శ్రీగాంధిమహాత్ముని యసహాయోగముతో నారంభమైనది. దీన స్వదేశీయుద్యమాంకురములే మరింతప్రౌఢములై స్ఫుటములై యగుపడుచున్నవనిన జదువరు లాశ్చర్యపడరాదు. మరల మనదేశమని, మనభాషలని, మనవిద్యయని యభిమానము దలసూపినది. జాతీయవిద్యాలయములు సర్వత్ర నెలకొలిపి విదేశీయవిద్య నంతె మొందింప సమకట్టిరి. కాని యిది పూర్ణమనస్సుతో జేసిరనిచెప్ప వలనుపడదు. అసహాయ యోగమున రాజ్యవిషయము ముఖ్యలక్ష్యమగుటచే బాలురు జాతీయ విద్యాలయములకెక్కి విద్య నభ్యసించుటకన్న విజాతీయములగు నింగ్లీషు పాఠశాలలనుండి బయలువెడలుటే కార్యమనిపించెను. పెట్టిన జాతీయ పాఠశాలలైనను, తలిదండ్రులూ అకతమ పిల్లల నితరములగు బడులనుండి మాన్పింప రను హేతువుచే బెట్టినవియేకాని పరమార్థము గలవి గావు. ఈవిధముగ గొంతవఱకు బాలశిక్షనొసంగు బడు లెల్లయెడల బయలుదేరినవి. నేడుగూడ బల్లెలందును, బట్టణములందును జాతీయ పాఠశాలలను పేరితో దేశభాషలలో జిన్నచిన్న పాఠములు చెప్పుచు, నూలువడికించుటె యొకశిల్పముగ బెట్టి పనిచేయుచున్నారు. కాని వీనివలన దేశములో విద్య వృద్ధియగుచున్నదనికాని, జాతీయతావికాస మొదవుచున్నదనికాని చెప్పుట తప్పు. ౧౦౦కి-౯౯ మంది ఇంగ్లీషు బడులకే పోవుచున్నారు. జాతీయపాఠశాలల జదివినవారలుగూడ బాలశిక్ష పూర్తియగుటతోడనే యాబడులకే పోవలసినవారగుచున్నారు. ఉన్నతవిద్యకు జాతీయపాఠశాల లెక్కలేదు. ఇంతలో నెక్కుడను నాశయు లేదు. కేవల సత్యాగ్రహావలంబులకు పైనజెప్పినట్లు జాతీయవిద్య సద్యో ముఖ్యాంశము గాకపోయినను దేశమందలి యాఘోషమునకు వెఱచి కొందఱు పెద్దలజేర్చి "జాతీయవిద్యాపరిషత్తని" యొకటి నిర్మించిరి. జాతీయవిద్యావిధానము నిర్ణయించుట వీరిముఖ్య ధర్మమనిరి. కొలదికాలములో వీరినిర్ణయములు దేశమునకు దెలిపి యెల్లెడల బాఠశాలల స్థాపింప యత్నములు చేయుదుమనిరి. ఇంతవఱకీ విషయము సాగునప్పటికీయసహాయోగమే వెనుకడుగు వైచెను. దీనితో బరిషత్తులు, నిర్ణయము లన్నియును ముగిసెను. ఇప్పు డీమాట తలపెట్టువారు గానరారు. ఇది జాతీయ విద్యావిషయపు పూర్వచరిత్ర. ఈపురాణ మింతటితో నిలిపి జాతీయ విద్యావిధాన మొకటి సమరకుండుటకును, సర్వధర్మమునకు మూలమగు నీవిద్యావిషయికోద్యమ మొకటికి రెండుసారు లీవిధముగ భగ్నమై పోవుటకును హేతువు లరయవలసి యున్నది.

విద్యకును, రాజ్యవ్యవహారమునకును సన్నిహిత సంబంధ మేదేశమందును, ఏకాలమందును గలదు. ఎచ్చటను చదువు నేర్వనివారికన్న నేర్చినవా రల్పసంఖ్యాకులై యుందురు. రాజ్యవ్యవహారము విద్యాబుద్ధులు సాధనముగా గలదగుటచేత విద్యావంతులకిది సాటపట్టుగ నుండును. విద్యచే ధనమార్జించి సంసారములు గడుపుకొనుట విద్యావంతులకు సామాన్యలక్షణము. ధనార్జనకు దోడ్పడనివిద్య సామాన్యదృష్టిచే పనికిరానిపని. కానసాగదు. విద్య, కీర్తిసనకాంక్ష గలవని యెఱింగియే, యట్టి బాధ లోదవకుండునట్లును, విద్య యథేచ్ఛముగ బెంపొందును బోవునట్లును మనపూర్వులు తగిన సమాజవ్యవస్థ గల్పించికొనియుండిరి. నేడు పాశ్చాత్యదేశములలో విద్య లభివృద్ధి చెందుచున్నవనిన రాజ్యవ్యవహారముల జిక్కని వారివలనను, ధనసంచయవ్యసన మెఱుంగని వారివలనను అభివృద్ధికి దేబడుచున్నవని చెప్పవచ్చునేకాని యితరము గాదు. ఒక్కల కేవలతత్త్వసమాన్వేషణమునకు ధారవోసిన బ్రాహ్మణప్రాయులే ఎచ్చటనైన నేటికిని విద్యల బోషించికొని వృద్ధికి దెచ్చుచున్నారు. కాని, యిప్పుడు మనదేశమునను, కోటివిద్యలు 'కూటికొఱకె' కనినట్లు రాజోద్యోగముల సంపాదించువిద్యయే విద్యయైనది. దీని లక్ష్యము కూడు; దీని కధిదేవతలు ప్రభువులు; దీనిభాష యాంగ్లము; దీని కాశ్రయములు కచేరీలు; ఆశ్రితులు ముఖ్యముగ బ్రాహ్మణులు; దీనిమహాఫలములు అధికారము, అల్పాయువు, ఆత్మవిస్మృతి యనిన అన్నియు జెప్పినటులే. ఇంతకన్న భారతీయులకు దగినవిద్య లేదని వనాగరతా ధూర్వహులగు మన మహాప్రభువుల యభిప్రాయము. దేశములో నిదివఱకు విద్యానాథులై యున్న బ్రాహ్మణు లీయభిప్రాయానుసారముగ దమపుత్రుల

రాగతములైన పరాపరవిద్యల నన్నింటిని దిగదుడిచివైచి కూటివిద్యయగుటచే ప్రభువు లొసంగినదానిని మహాప్రసాదమని గ్రహించిరి. ఈవిధమున ఉన్నవిద్యలూడి పైవిద్య ప్రజానురంజకమై ప్రబలుచుండగా నిక జాతీయ విద్య కెడమెచ్చట?

రెండవది జాతీయ విద్యావిధానము. రాజోద్యోగములకును జాతీయవిద్యకు నిట్టి సహజవైషమ్య మేర్పడియున్నను, జాతీయవిద్యను నిలువబెట్టదగిన బ్రాహ్మణులు చాలామంది రాజాశ్రయమున బడిపోవుచున్నను 'జాతీయవిద్య' యని చెప్పదగిన స్వరూప మొకటి గాన్పించి, దానికి వలసిన విధివిధానము లేర్పడినచో నింతయన్యాయము జరుగదు. కాని యిట్టి జాతీయవిద్యాస్వరూపము నిర్ణయింపకుండుటకు ప్రజాసామాన్యమునకేమి, తన్నాయకులకేమి, తన్నియుక్తులగు విద్యాపరిషదులకేమి, స్వజాతియందును, స్వవిద్యయందును, భక్తియుండినను విశ్వాసము లేకుండుటయని తోచుచున్నది. జాతీయమనగా జాతిగతము; అనగా బూర్వలబ్ధమె జాత్యభ్యుదయమున కనుకూలమైనదని యర్థము. ఇట్టివిద్య మనకు గలదా? మనకు బూర్వచరిత్రయున్నదా? అది సారవంతమైనదా లేక నిస్సారమా? దానియుత్తేజమును గోరుచు జాతీయమనుచున్నామా? లేక మనము, మనదేశము, మనజాతి, విద్య యిన్నియు నేడు పుట్టి నేడు పెరుగుట యని భావించి మాటాడుచున్నామా? ఇంతమాత్రము మాత్రవిచారము గల్గినచో జాతీయవిద్య దనకుదా ప్రత్యక్షముగాకుండు టెట్లు? కనుక బుద్ధిశాలురగు మన నాయకులు పదిమంది చేరినపట్టున నెంతమాత్ర మాత్మవిచారము లేకుండదు; మనపూర్వచరిత్ర, పూర్వవిద్య, పూర్వజాతీయత యివియొనుమనోవీథిని స్ఫురింపకుండవు. ఇక జాతీయవిద్యాస్వరూప మేల నిర్ణయము గాలేదని యడిగినచో పైనచెప్పినటులు వారు జాతీయమని, విద్య యని మహోపన్యాసము లొనర్చుచున్నను వారిజాతియందుగాని, వారి విద్యలందుగాని వారికి నిజమైన విశ్వాసము, లేకుండుటచేతనే యని చెప్పవలసివచ్చుచున్నది.

మనపూర్వచరిత్ర, పూర్వవిద్య, లమేయములుగ నున్నవి. పరప్రశంసకు బాల్పడని పాశ్చాత్య విద్వాంసుల యభిప్రాయములే కొనినను, భారతీయుల పూర్వచరిత్ర కొన్నివేలసంవత్సరముల ప్రాచీనమైనది. నాటికి నాటికి వెలువడుచున్న పరిశోధనఫలములు దిలకించినచో మనచారిత్రవిషయములు మన పూర్వులు చేసిన కాలనిర్ణయములకే తావలమన్నవి గాని విపరీతసూచన లిచ్చుట లేదు. ఇక మనవిద్య లందమా, వేదములు, శాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు, కావ్యములు, కథలు లెక్కకు మిక్కిలిగ నున్నవి. ఐరోపాఖండమునం దంతటను జ్ఞానబీజములు వెదజల్లిన గ్రీసు, రోమను మహాగ్రంథసంపుటి భారతీయుల పూర్వ విజ్ఞానసంచయముతో బోల్చి చూచినప్పుడు సముద్రమునకు పిల్లకాలువ యగునని వారిపెద్దలే యనుచున్నారు. ఒక్క వేదరహస్యముల బయలుపెట్టుటకు ప్రపంచములో నున్న పండితవరులందరును గలసి తమజీవితములంతయు ధారవోయుచుండినను ౫౦౦ సంవత్సరముల శేషమైన కృతార్థులగుదురేమో యని పాశ్చాత్యవిద్వచ్ఛిరోమణి యనదగు మోక్షముల్లరు, సుప్రసిద్ధజర్మనుపండితుడు, వారిసాంప్రదాయముల ననుసరించి లెక్కచేసి యభిప్రాయ మిచ్చియున్నాడు. మనగ్రంథముల జదివిన జర్మనుదేశీయు లేమి, యితరు లేమి, బ్రహ్మానందమునొంది లోకమునకీదేశము, ఈవేదము, ఈభాషయ పురోగామియని నిశ్శంకముగ జాటియున్నారు. ఇట్టి యపారవిద్యాసముద్రమున బడియున్న మనకు జాతీయవిద్యయన నేమియో, యెచ్చటి నుండి తేవలయునో, యేమార్గములబట్టి పోవలయునో తెలియ లేదనిన మనదుర్భాగ్యమునకు, మనయవిశ్వాసమునకాదేవత లెంతయేడ్చిరో! ఎంతయోజించినను ఈవిషయమున మన నాయకులను వారి కీయవిశ్వాసమునకన్న యితర బాధక మేమియు నున్నట్లు గనుపింపదు. వారికి వేదములందు, శాస్త్రములందు నవ్వుకమునున్న. జ్ఞానలవదుర్విదగ్ధ డాయాంగ్లమూర్తి మెకాలే పండితమ్మన్యునికి వలెనే వీరికి నవి పాతపురాణములు; ఆకాశపంచాంగములు, అభూతకల్పనలు. వానిని జాతీయములని బిగ్గరగ చెప్పినచో నాగరికప్రపంచము పక్కున నవ్వదా? ఆవిద్యల నుద్ధరించుటనిన అపహసింపదా? ఇట్టి యవిశ్వాసపిశాచమే మననాయకుల బట్టుకుండినచో జాతీయవిద్య నేటికి గొంతగాకున్న గొంతవఱకైన కొనసాగియుండెడిదనుటకు సందియము లేదు. ఉద్యోగములకై చదువువారెందఱున్నను కేవల విద్యాసక్తిగలవా రన్య లెందఱో దేశములో గలరు. దినదినమున కీసంఖ్య వృద్ధియగుచు

న్నది. ఉద్యోగములు దొరకిపోయి యిప్పటికే కొన్నిసంవత్సరము లైనది; కాని యిప్పటికి విద్యయం దభిమానము వదలలేక, యితరమార్గములు గానక, ఏదో యొకయక్షర మబ్బిన జాలునని దమపిల్లల నింగ్లీషుబడులకు బంపువారనేకులు నేడు గనుపడుచున్నారు. ఇప్పటి కైనను మంనాయకులు మేల్కాంచి దమదేశభక్తితోఁగూడ విశ్వాసముం జిక్కబట్టి పూర్వపుశాస్త్రముల, శిల్పముల, గళల నుద్ధరించుటకు యత్నమొనర్చినచో దేశమునకు మహోపకార మొనర్చినవా రగుదురుగాని జాతీయవిద్యయని యూఁటక శుష్కప్రియములు పలికిన లాభము లేదు.

౨

## ప్రస్తుతవిద్య

ఇది కేవలము విజాతీయము. ఇంగ్లండులో నున్నజను లెట్లు చదువుదురో మనము మనదేశములో నట్లు చదువుచున్నాము. అనగా వారి భాష మన భాష; వారి గ్రంథములే మనగ్రంథములు; వారిపద్ధతులే మనపద్ధతులు; వారిజన్మభూమియె మనకు జనని; వారినదీనదములె మనకు దీర్థములు; వారివీరులె మనవీరులు; వారిమతమె మనమతము; వారిబుద్ధులె మనకు బ్రమాణము. ఇక వారివేషములె మనవేషములై, వారియాచారములే మనకు నాచారములై, వారిలో మనము రంగుగలిసినంతవఱకైన గలిసిపోకుండుట యాశ్చర్యముగాని గలియుట యాశ్చర్యముగాదు.

అడ్వొకేటుజనరల్ శ్రీ. వేంకట రామశాస్త్రి గారి కీయాంగ్లవిద్య సర్వథా శ్రేయమై, యిందు దోషమేమియు గాన్పింపకుండుటయు నాశ్చర్యముగాదు. శ్రీవారు దానిధర్మముననే యింతవారైరి. ఆకృతజ్ఞత పురికొలుపుచున్నంతవఱ కిట్లు చెప్పక తప్పదు. శాస్త్రి గారిస్వస్థానవేష భాషాభిమానము లెట్టివో స్వయముగ బరిచయభాగ్యము లేమి నిరూపింపజాలకున్నాము. ఇవి వినా వీరు మహోరస ప్రబుద్ధబుద్ధులని మాత్రము తెల్లమగుచున్నది. ఆంగ్లవిద్యారసము వీరితత్త్వమునకు బడి, వీరి కిచ్చినహాయి నింకొకరి కిచ్చినట్లు గనుపడదు. ఇంతస్థూలమైన యనుభవ మాధారము చేసికొని నిశ్శంకముగ మాటాడు శ్రీశాస్త్రిగారిని ఖండించుటగాని, వారివృష్టిని మఱల్చుటగాని సామాన్యుల కసాధ్యమైనపని. నేను, నాది, నాతలిదండ్రులు, నా దేశము, నా భాష, నాయాచారము, నా వేషము, నా ధర్మమని యిట్టిమమకారము, యిట్టియహంకృతి, యిట్టిస్వాతంత్ర్యము గలయెడనే జాతీయవిజాతీయవిచార మున్నదిగాని పండితులై దాన సర్వమొక్కటే యనువ్యక్తి గలిగి, ముక్తసంగులై, తపోధనాకాంక్షులై యధికరించుచుండు నఖండాద్వైతభావసంపన్నులకు గానిమాట ముమ్మాటికి సత్యము. నీ యిల్లుగాలుచున్నదని చెప్పినప్పుడు నేనున్నదిగాక, నాయిల్లెక్కడ? ఇదికాలుటలేదే, యని సమాధాన మిచ్చు నిర్గుణ పరబ్రహ్మల కొక్కనమస్కారము కన్న చేయునది లేదు. ఇంతకు బ్రస్తుతవిద్యావిషయమున, నది విజాతీయము, పరధర్మప్రేరక మంటిమి. మన నిరసనమున కిదట నీహేతువొక్కటియె చాలును. దేశభేదములు, జాతిభేదములు, ధర్మభేదములంతరించుకాలమిప్పుడు రాలేదు. వచ్చినప్పుడు లేకుండబోయిన బోవుగాక. మన కది యప్రస్తుతము. ఏనిదేశధర్మముల వాదు కావాదుకొనుటరో నేమి పరమార్థమని చెప్పినజాలును 'వసుధైకకుటుంబ'మ్మను వారు నేడు క్రొత్తగ నూడిపడలేదు. లోకమున వివేకోదయమైనప్పటినుండియు గలరు. కాని నేల విడిచి సాము చేయునట్లు దనదేశముం బోనాడి లోకమున కుపకారము చేయుమార్గ మెవ్వరు చెప్పియుండలేదు. కవితల్లజుండగు షేక్స్పియరు 'తనదేశమునకంగ ధరణిదానిలగు' ననియే యుపదేశించినాడు. దేశకాలము లతిక్రమించినవిశాలన్యాయముల మనిపించుకొనుటకు జెప్పెడి సొల్లుమాటలేకాని విశేషమిం దేమియు లేదు. "Nationalism is a disease" అనగా 'జాతిభావమొక జాడ్య' మనునొక సూక్తి యొకటి యీనడుమ బ్రాకుట గనుచున్నాము. జ్వరము లెక్కువ పనితక్కువైన యిక్కాలమున వీరు మాచిన దానికెల్ల జాడ్యము పేరిడి చికిత్స జేయజూచుట సహజమే; గాని మూఢలోక మిట్టిజాడ్యములనింకను గుర్తించుటలేదు. ఇది యొక మేలు. విచారింపగా నీసూక్తులన్నియు నాంగ్లీకృత మనస్కుల వికటకవిత్వములనియే తేలుచున్నది. ఇట్టి విపరీతబుద్ధులు చేసిన దిదియే యాంగ్లభాష మన కొనరించిన మహోపకారము. శాస్త్రిగారి యాత్మసంతుష్టి వారిదిమాత్రమె కాదు. ఆంగ్లభాష తలకెక్కిన ప్రతి భారతీయున కమరినదని చెప్పనగును- తనపేరున కెన్ని వంకలో తెలియక తలపాగిట దిద్దుకొనుచు బడికి బోవు విద్యార్థి కిదియ సంతుష్టి! ఏమిచేసినను న్యాయవాదులని

లోకము పిలుచుచుండుటచే సహాయకులగ్రగామిణులకు సాక్ష్యము లుత్తరసాక్ష్యములు సూరిపోసి వారిని రచ్చల కెక్కించి మాట కొకమాడ గడించు ప్లీడరుల కిదియ సంతుష్టి! రాజద్వారమున గావలియుంచినంతనె తన దేశీయులనక తనవారనక బిఱ్ఱబిగిసి మిఱ్ఱులజూచుచు నధికార మదమున దన్నమోల వచ్చుమాన్యుల నవమానించు భటుని కిదియసంతుష్టి. తండ్రితాతలు నేర్చినవిద్యల దగులబెట్టి పది యింగిలీమాటలు నేర్చి పరీక్షలిచ్చి బాలురకు నదియ పరమార్థమని చాటుచు (పటాటోపమున) బ్రదుకు జీవుడా యని పోవుచుండు బడిపంతుల కిదియ సంతుష్టి! సభల,కార్యస్థానములకెక్కి సామంతులై తిమసి స్వాభిమానముం దిగ ద్రిమింగి ప్రభులచిత్తమె పరమధర్మ మని ప్రియములు పల్కుచు దేశద్రోహమునకేని వెఱవక శిష్టులశిక్షణమునందును, దుష్టులరక్షణమునందును పాల్గొనుచు మహాపరాధ చేతస్కులగు రాజోద్యోగుల కిదియ సంతుష్టి! ఇది గదా మహాజాడ్యము మనల దినినేయునది; ఇంతకన్న జాడ్య మేది! ఈసంతుష్టి యెన్న డడంగునో నాడు మనకు విముక్తి. నాదేశమిట్లయ్యె, నాధర్మ మిట్లయ్యె, నావిద్య లిట్లయ్యె, నా భాష లిట్లయ్యెనని యీపరితాప, మీహృదయవేదన యేనాడు జనించునో యానాడు మనజాడ్యము దరిగినదని యనవలె. ఇది యీవిద్యచేతగాదు. ఆత్మగౌరవము బురికొల్పువిద్య విద్యగాని పరులసేవారతి నెంచువిద్య విద్యగాదు. స్వాతంత్ర్య మున్మోఘించువిద్య విద్యగాని పరతంత్ర్య మాపాదించువిద్య విద్యగాదు. మనయాంగ్లవిద్య మనకు "సేవాధర్మః పరోధర్మః" యనియు, "పారతంత్ర్యం హి పౌరుష" మ్మనియును ప్రాథమికపాఠశాలలనుండి విశ్వవిద్యాలయ గోపురశిఖరములవఱకు నూపిరిద్రిప్పుకొనకుండ బోధించుచున్నది. ఈవిద్య యికచాలు. ఒక్కమాట; ఈ యాక్రోశమంతయు నాంగ్లభాషపై జేసితిమనిచదువరులు పొరబడకుందురు గాక. ఆంగ్లభాషకు స్వతః అట్టిదోషములు లేవు. ఏభాషకును లేనవచ్చును. మీదుమిక్కి యాంగ్లభాష మహాకవి వాక్ప్వరములతో నిండియున్నది. అపారముగ నభివృద్ధి జెందుచున్నది. ఖండ ఖండాంతరముల వ్యవహరింపబడుచున్నది. కాలమేతెంచి రాజ్యబంధము దెగిపోయినను మన మాంగ్ల భాషాసంబంధమును మాత్రము బాయకుందుము గాక! నేడది మన కింతకంటకప్రాయము, విషప్రాయ మగుటకు మన ప్రభువులు, వారితంత్రములు, వారిదు విద్యాఫలములే కారణములుగాని యన్యముగాదు. ఉత్తమజ్ఞాన సాధకమై యశము గడింపవలసిన యీ భాషామోహమ వారు దుష్టంత్రములబట్టద్రోసి వారి రాజ్యపట మొగ బట్టుట కొకచెంపను, మన పొట్టకోతల దీర్చుట కొకచెంపను నుపయోగించుచున్నారు. ఇది చాల బలహీనమైనపని. ఇది గర్హ్యము. (సశేషము)



# ఆశీర్వాదము

(చా)

సీరిపి ఆంజనేయులు గారు

శ్రీరమ్యాకృతిఁ దాల్చి, సూరిజనతా హృద్వాటి వాహ్యాళి స
ల్పి, రహిఁ భావ సుమాళి నందుఁ గని, మేల్మిఁ వాని మన్నించి, భా
షా రసపుష్టిఁ గొల్పి, జనసంగతిఁ దానఁటునర్చి, మెప్పు పే
ర్మి రతిని బ్రాహ్మలోకము భరించెడు 'భారతి' పొల్చు నిచ్చలున్.



# ఆంగ్ల శాసనసభలు

కె. రంగాచారిగారు యం. ఏ. బి. యల్.

ఆంగ్లదేశమున ననేక శతాబ్దములనుండియు శాసనసభ లుండినట్లు చరిత్రవలనఁ దెలియుచున్నది. సక్సనులకాలమునందే ఆదేశపు ప్రజ్ఞావంతులసంఘ మొకటి యుండెను. అది "విటనెజిమాట్" (Witanegemot) అను నామమునఁ బఱగుచుండెను. నార్మనులచే జయింపఁబడిన కొంతకాలమువఱకును రాజకీయ వ్యవహారములంగూర్చి చర్చఁ గావించుటకు రాజుయొక్క అగ్రాసనాధిపత్యము క్రింద సామంత రాజసభలు జరుగుచుండెను. కాని యిప్పటి శాసనసభలను బోలియుండు సభలు మాత్ర మప్పుడుండియుండలేదు. ప్రజలబలాత్కారమువలన "జాన్" ప్రభువు (King John) ప్రఖ్యాతిచెందిన శాసనపత్రము నొసంగుటయే(The great Charter) యాంగ్ల శాసనసభలయాత్కృష్ట్యమునకుమూలకారణము. క్రీ.శ. 1264-5సంవత్సరములో మొదటిపర్యాయము మూఁడవ "హెన్రి"చే (Henry III) సామంత ప్రభువుల బలాత్కారమువలన సభ యొకటి జరుపఁబడినదని చరిత్ర చెప్పుచున్నది. ఆసభను యోధులును, బుర ప్రతినిధులును బౌరులును నలంకరించిరి.

"వెస్టుమినిస్టరుహాల్" (West minster Hall) లేక యింకేదైన (రాజప్రాసాద మందైన)శాలలో శాసనసభ రాజకీయవ్యవహార నిర్వాహణార్థము సమావేశ మగుచుండెను. ఇప్పటివలె సామాన్యజన ప్రతినిధులసభయును (House of Commons) సామంతరాజసభయును (House of Lords) వేరువేరుగనుండి వ్యవహారములఁ జర్చ గావించుచుండుట లేదు. మొదటి "ఎడ్వర్డు"(Edward I) రాజుయొక్క పరిపాలనలో మొదటి పదునొకండు సంవత్సరముల వఱకును రాజసన్నిధానములోనే సామాన్యజనప్రతినిధులు, మతాచార్యులు, సామంత ప్రభువులు కలిసి యొక్కసభయందే రాజకీయవ్యవహారముల విమర్శించుచుండెడివారు; కాని, అటుతరువాత రాజకీయ వ్యవహారావసరములంబట్టియు, సభ్యులసంఖ్య హెచ్చగుటంజేసియు, నందఱును గలిసి యొక్కసభయందే సమావేశ మగుటకు వీలు లేకయుండెను. దానంజేసి సామాన్యజన ప్రతినిధులు వేఱై రాజప్రాసాదంబున నింకొక కోష్ఠమందుఁ దమచర్చలం జరుపుకొనుచు స్వాతంత్ర్యవృత్తిని గల్పించుకొనిరి. ఈసభాభాగమే సామాన్య జనప్రతినిధుల సంఘము (House of Commons) అనునామమును వహించి రానురాను రాజ్యాధికారమునకు స్థానమాయెను.

ఆకాలమున నిప్పటివలె సభ్యత్వ మంత కామితంబై యుండియుండలేదు. చాలకాలము నజకును సామాన్యప్రతినిధి తనకంటె నధిక ధనవంతుల నమక్షమున సంఘములో సమ్యుం డైయుండి ప్రభువునకుం గావలసినధనము నొసంగుటకు సమ్మతించుచుండెను.

రాజబాటలు కష్టభూయిష్ఠము లగుటం జేసియు, ప్రయాణవ్యయ ప్రయాసములు మిక్కుటములై యుండుటంజేసియు, సభ్యత్వ మిప్పటివలె సగౌరవంబుకాక యగౌరవయుక్తంబై యుండుటంబట్టి వణిజుండు భూస్వామియు నగు ప్రతినిధి శాసనసభ కిష్టములేకయే చనుచుండెను. సభ్యుండు పౌరప్రతినిధియైన వాండు దుష్కరంబులును,నప్పుడప్పుడ ప్రియంబులునునగుకార్యములం జేయవలసియుండినను బెద్దనౌకరువలెం బరిగణింపం బడుచుండెను. అట్టి ప్రతినిధి యభిప్రాయములను సరకుగొనక యతినీచముగ ధనికులగు నితరసభ్యులు చూచుచుండెడివారు.

ఆకాలమున సేవకుని కిచ్చునటులు సామాన్యజనప్రతినిధికి వేతన మిచ్చువాడుక యుండెడిది. వేతనమును ధనరూపమునంగాక వస్తురూపకముగం గూడ నొసంగువాడుక యుండెను. ఈజీవితములును గాలమునుబట్టి మారుచుండెను. హూణశకము 15 శతాబ్ద మధ్యమునం బ్రతినిధివేతనము దినమునకు రెండుషిల్లింగు లైనట్లు తెలియవచ్చుచున్నది. 16వ శతాబ్దమధ్యమున సభయందుం గాని, ప్రయాణమునంగాని గడుపంబడిన ప్రతిదినమునకు నైదుషిల్లింగు లైనటులం జారిత్రకపుస్తకములు నుడువుచున్నవి. కొన్నిపట్టణము లత్యధికౌదార్యముతోం దమప్రతినిధులకుం దినముం కుంబదిషిల్లింగులిచ్చినటులు చెప్పంబడినది. కాని శాసనసభకుం బ్రతినిధులను బంపుగౌరవమును మాత్రము పెక్కుపట్టణము లభిలషించినట్లు కానుపింపదు. వీలైన నీశాసనసభకుం బ్రతినిధులను బంపువిధిని దప్పించుకొనం బ్రయత్నమును మాత్రము పట్టణములు సల్పుచుండెడివి. రెండవరిచర్డు Richard II) ప్రభువు కోల్చెష్టరు (Colchester) పురవాసులు తమ పట్టణమునకు శ్రద్ధతోం బ్రాకారపరిఖాది నిర్మాణాదులం గావించినందులకు సంప్రీతుండై వారల నైదుసంవత్సరములు శాసనసభకుం బ్రతినిధులను బంప నవసరములేకుండం బ్రసాదించెను. మూండవయెడ్వర్డు (Edward III) ప్రభువు స్కాట్లాండుదేశస్థుల యాపాతముల వలన ధనహీను లగుటచే నార్థంబరుల్యాండు (North umberland) జనుల కట్టియుపకారమునే యొనర్చెను.

వేతనమేమియుం బుచ్చుకొనకుండంగనే యప్పుడప్పుడు కొందఱు ప్రతినిధులు తమ విధులను నెరవేర్చుచుండెడివారు. "సర్ రాబర్టు హిచన్"(Sir Robert Hitchan) అనునాతండు "కింగ్సు లిన్ను" (King's Lynn) అను జనస్థానపుం బ్రతినిధిగం బనిజేయుటంబట్టి యొకప్పుడాయన తనస్వగ్రామమున కాపురములోనుండి పోవుచుండ నాపురసంఘము మాతని కొకగొప్పవిందుం గావించి యిరువదిపౌన్లు నొసంగిరి.

# సమస్యాపూరణము

[సమస్య భారతి 2 సంపుటము 12 వ సంచిక యందుఁ బ్రకటింపఁబడినది]

౧

సీ. నీ దృక్ప్రసారణ నీరహా రాజకాంతంబు కీవార్త వజ్రంబెయయ్యె
నీవాగమృతధార నెదఁ ద్రష్టిఁ గనఁగోరు, చాతకి కిది శిలాపాతమయ్యె
నీ పరిష్వంగంబు నెదఁ గోరు లతికకు, నీ సేత ఘోరకరాసి యయ్యె
నీమోము నెలగని నిండుహర్షాబ్ధికి, నీలీల బాడబజ్వాల యయ్యె
గీ. చిర వియోగాగ్ని చే మనస్సీమ కాఁగి, జీవనంబెల్ల శూన్యతఁ జెందఁదొడఁగ
నీదయారసవృష్టిచే నిగుకున్న, ప్రాణబిందువు లిగురు టేపాటి యుండక.

మల్లంపల్లి రాజమల్లికార్జునుడు గారు
పెదపాలపఱ్ఱు గుడివాడ తాలూకా.

౨

సీ. నీమోము నెలఁగని నిండు హర్షాబ్ధికి, నీలీల బాడబజ్వాల యయ్యె;
నీ గుణంబులఁ గని నెగడు ప్రేమలతకు, నీలీల దావాగ్ని లీలయయ్యె;
నీ పాండితిం గని నిండుహృత్సుమమునకు, నీలీలయే విష జ్వాలయయ్యె;
నీ భూతదయ నెంచి నెగడు స్నేహలతకు, నీలీల తరవారిలీల యయ్యె;
గీ. దైవవశమున నా కిట్టి తనయుఁ డబ్బె, ననుచు నెంచితిఁ గాని నీ వధముఁడనని,
యెంచనైతిని; హా! పుత్ర! యెట్టు లింక, బ్రతుకఁగలవాఁడ! నిన్ జూచి పరమనీచ.

బులుసు వేంకట రమణయ్య గారు
విజయనగరము.

ప్రతినిధులు శాసనసభకు సమముగ వెళ్లకుండిన నట్టివారి వేతనములఁ దెగఁగోయుచుండువారు గ్లాస్టరు (Gloucester), ఆక్స్ఫర్డు (Oxford) ప్రతినిధులజీతములు మూఁడవయెడ్వర్డు ప్రభునికాలములో నొకపర్యాయము కొట్టివేయఁబడినదని లేఖాప్రమాణములున్నవి.

సమముగ సభ్యుఁడు సభకుఁ జనకుండిన యట్టివానికి జీతములఁ గొట్టివేయుటయేకాక జరీమానాలను విధించువాడుకగూడ నుండెను. క్రీ. శ. 1382 సం. ప్రతినిధులు సమముగ శాసనసభకు వెళ్లునట్లుచేయుట కొకశాసనము కావింపఁబడినది. ప్రతినిధి యెట్టియున్నతపదవి నలంకరించినవాఁడైనను రాజుచేనాహూతుఁడై యుచితమగుకారణము లేకయే రాకుండిన నట్టివాఁడు శిక్షాపాత్రుఁడని శాసింపఁబడినది. మేరీరాజ్ఞి (Queen Mary) కాలమున ముప్పదియేడుగురు ప్రతినిధు లుపప్లవకారణములైన ప్రయోగములందుఁ బాలుఁగొనకుండ నుండుటకై శాసనసభకుఁ బోకుండుటచే వారు దండింపఁబడిరి. ఎలిజబెతురాజ్ఞి (Queen Elizabeth) కాలములో జరీమానాలిరువదిపౌన్లవఱకును విధింపఁబడుచుండెనఁట. స్టూఅర్టు (Stuart) రాజులకాలములోఁగూడ శాసనసభయొక్క చర్చలకు సమముగఁ బోనివారలు శిక్షితు లగుచుండెడివారు. క్రీ. శ. 1647 సం. అక్టోబరుమాసములో నొకనాడు సభకు రానివారిని దెలిసికొనుటకు సభ్యనామామంత్రణముఁ గావింపఁబడ నేఁబదిమంది ప్రతినిధులు సభలో లేకపోయిరి. అట్లు హాజరులేని సభ్యున కొక్కొక్కనికిని యిరువది పౌన్లచొప్పున జరీమానా విధింపఁబడెను. ఇట్టి పదునెనిమిదవ శతాబ్దారంభమువఱకును జరుగుచుండెను. ఈశతాబ్దారంభము నుండియు ధనికులై వేఱువ్యాపార మేమియు లేనిభూస్వాములు శాసనసభ్యులుగ నుండఁ బ్రారంభించుటచే ననుపస్థితులైన సభ్యుల సంఖ్య తగ్గిపోయెను.

సామంతప్రభువుల మతాచార్యులు మొదలగువారలనుండి వేఱైనతరువాత సామాన్యజనప్రతినిధులు "వెస్టుమినిస్టరు చాప్టరు హౌసు" (Westminster Chapter House) లో సమావేశమగుచుండెడివారు. ఎనిమిదవ హెన్రి (Henry VIII) మరణించినదినమున నాఖరుసారి సామాన్య ప్రతినిధుల సభ సమావేశ మయ్యెనఁట. ఆరవయెడ్వర్డు (Edward VI) ఎనిమిదవహెన్రి తరువాత రాజ్యమునకు వచ్చినపుడు సామాన్యజనప్రతినిధి సంఘము తిరుగ రాజప్రాసాదమునందే సమావేశమగుటకుఁ బ్రారంభించెను. అప్పటి నుండియు మూఁడువందల సంవత్సరముల వఱకును "కల్లీజియేట్ చాపెల్ ఆఫ్ సెంట్ స్టిఫెన్సు" (Collegiate Chapel of St. Stephens) సమావేశస్థానముగ నుండెను.

ఆఱవయెడ్వర్డు కాలములో వారు కొంతవఱకుఁ దమస్వాతంత్ర్యమును గనుపఱచినను మేరీరాజ్ఞికాలములో స్వాతంత్ర్య మేమియు లేక యామెచే సామాన్యజనప్రతినిధి సభ యవమానింపఁబడెడిది. మేరీరాజ్ఞి స్పెయిను దేశపురాజును వివాహమాడఁ దలఁచి యున్న

పుడు ప్రతినిధులు దానివిషయమై తమకుఁ గల యనంగీకారమును సూచించిరి. ఆమె యప్పు డీకరణిని నిరసంపువాక్యములను బల్కెను. "మావివాహమువలన రాఁబోవు కష్టములనుగూర్చి మీరు చెప్పినదంతయు మేము వింటిమి. వివాహసంబంధవిషయమున మీరాడినమాటలలో సుప్రసంగములెవ్వియు వినఁగానము. ఈవిషయమున మాచిత్తవృత్తిని మీ రెంతమాత్రమును గనుపెట్టలేదు. రాజ్యాభిషేకము నాఁటి సమయమునుమాత్రము మేము మరువలేదు. దైవయోగానుసారముగ దైవోన్నత్య సంస్థాపకకారణమును దేశోపకారకమును నగువివాహమును మేము కావించుకొనియెదము" అను నీనిరసనవాక్యములను విని వా రూరకుండిరి. కాని, సంఘారామముల (Abbeys) సంస్థాపించుటకు రాజ్ఞి యుద్యుక్తురాలై యున్నదని విని ప్రతినిధులు కుపితులై యుద్ధసన్నద్ధులైరి. అందులకు వెఱచి రాజ్ఞి సంఘారామపునస్సంస్థాపనప్రయత్నమును విడిచిపెట్టెను.

ఎలిజబతురాణి యామెసోదరియగు మేరీ రాణికంటె నెక్కుడు నిరసనభావముతో సామాన్యజనప్రతినిధి సభను జూచుచుండెడిది. అహంకారయుక్తురాలగు నారాజ్ఞి, యనుచితముగఁ దనయధికారము నాసభ తగ్గించుచున్నదని యెంచి వారల నవమానించుచుండెడిది. ప్రతినిధులు వివాహమాడుమని రాజ్ఞిని వేఁడుకొనిరి. ఆప్రార్థనల కామె యొసంగిన ప్రత్యుత్తర మేకారణమువల్లనోకాని ప్రతినిధ్యవమాన సూచకంబు గాకయే యున్నది. "ప్రజలశ్రేయస్సుకొఱకే నేనుజీవింపనున్నాను. నేవివాహ మాడఁదలఁచిన, వారి శ్రేయస్సుకొఱకే నావలెఁ బాటుపడు భర్తను నే నన్వేషించెద. కాని, యిప్పటికి నాకున్న యవివాహచింతయే నన్ను విడువకుండిన, నాసంతానముకంటె దేశమున కెక్కుడగు నుపకారము నొనరింపఁగల యుత్తరాధికారి నీశాసనసభ కనుఁగొనఁగలదని నమ్ముచున్నాను. సంతానమన్ననో సంశయగ్రస్తంబగు వరము. రాజ్ఞి యొకతె కన్యకగ జీవించుచు నీకాలములోఁ బరిపాలనమునొనర్చి కన్యకగనే మరణించినదని విశదీకరించు శిలాఫలకంబుమాత్రము నాకుఁ జాలును." ఇంకొకపర్యాయము సామాన్యజన ప్రతినిధులును సామంతప్రభువులును గలిసి రాజ్ఞిని వివాహమాడుమని ప్రార్థింప నామె "సామాన్యజనప్రతినిధు లల్పజ్ఞానులును, బాలురవలె సంచరించువారును గాన వారియీవ్యాపారముంగూర్చి మేమేమియు నాశ్చర్యమును జెందలేదు. కాని, సామంతరాజులు వారల ననుసరించి నడిచి రనునదిమాత్రము మమ్ము నాశ్చర్యపూరితులుగ నొనర్చినది." ఎలిజబతురాణి తరువాత రాజ్యమునకు వచ్చిన మొదటి జేమ్సుప్రభువు వృథాభిమానియై యుండెను. ఎలిజిబతురాణి యహంకారపరురాలైనను వివేకవతియగుటంజేసి యామె తనమంచిని గాని ప్రజలశ్రేయస్సునుగాని మఱువక వానికి హానికలుగునపు డహంకారమును వదలి వృథాభిమానమును బాఱఁద్రోలి రాజ్యపరిపాలనఁ గావించెను. జేమ్సుప్రభువన్ననో యాత్మోత్కృష్టచింతనలచే నంధుండై తన

మంచినిగాని రాజ్యముయొక్క శ్రేయస్సును గాని గుర్తెఱుంగక యహంకారపరుఁడై వృథాభిమానియై కాలమును గడపెను.

పరిపాలనారంభమునుండియు శాసనసభకును రాజునకును మైత్రి లేక కలతలుండెను. శాసనసభ కొక యెన్నికవిషయముంగూర్చి వివాదమును, శాసనసభ్యుల కుండిన విశేషాధికారములకు వ్యతిరేకముగ శాసనసభ్యు నొకని నప్పుఁ దీర్చ లేకుండుటచేఁ గారాగృహంబున బంధించుటయు, సభయందుఁ జేయఁబడిన యుపన్యాసమునకై సర్ క్రిస్టఫర్ పిగట్ (Sir Christopher Piggot) గారిని గారాగృహమునఁ బడవేయుటయు, నొకదానివెనుక నొకటి రాజునకును సభ్యులకును వివాదాంశములాయెను. కాని, రాజు వివేకముఁ బూని పైవిషయములలోఁ దానవలంబించినమార్గము సరియైనది కాదనియుఁ దా నవలంబించినమార్గముచొప్పున నడచుటకుఁ దన కధికారము లేదనియు, నొప్పుకొనుటం జేసి సామాన్యజన ప్రతినిధులుకూడ నేమియును జేయక యూరకుండిరి. ఇదియైన కొలఁదికాలములోనె రాజు శాసనసభయొక్క యనుజ్ఞ లేకుండఁగనే శుల్కముల విధించుచుండ శాసనసభ్యులు రాజున కట్టియధికారము లేదనిమాత్రము ప్రౌఢముగఁ బల్కి యాతనిచే విధింపఁబడిన కరముల నివర్తించుట కొకచట్టమును సాధింపఁ బూని విఫలమనోరథులై మఱియేమియును జేయకయ యూరకుండిరి. ఈతీరుననె ప్రభువునకును సభ్యులకును సంవత్సరములకొలఁది వివాదములు జరుగుచుండెను. తీవ్రముగ నట్టివివాద మొకటి జరిగినపిదప రా జీరీతిని వ్రాసెను.

"ఏరీతిగ మేమయుక్తముగఁ బ్రవర్తించితిమో మాకుఁ దెలియదు కాని, మాకీర్తియుఁ, గర్మలును, టెన్నిసుబంతులవలె వారలలో నిటునటు విక్షేపింపఁబడినవి. మా కపకీర్తిఁ దెచ్చి మమ్ములఁ గుపితులుగఁ జేయఁగల యీర్ష్యామాత్సర్య ప్రబోధితంబు లగు సర్వకార్యంబులును గావింపఁబడినవి. ఈ సామాన్యజన ప్రతినిధులు తమయాచరణచే మాదేహారోగ్యమునకు హానిని, మాకీర్తికిఁ గళంకమును, దుశ్శీలురగు రాజద్రోహులకు ధైర్యమును, మావిశేషాధికారమున కన్యాయ్యమగు నడ్డంకులను, గార్యవిలంబమువలన జనులకు హానిని గలుగఁజేసిరి."[1]

ఇచట జేమ్సుప్రభువు కావించిన వైపరీత్య మొకదానింగూర్చి వ్రాయవలసియున్నది. ఒకనాఁడు సభయందు సర్ ఎడ్విన్ సాండిస్ (Sir Edwin Sandys) గారి యుపన్యాసమునకు రాజు మిక్కిలి కుపితుఁడై యాతనిఁ

(1) "Wherein we have misbehaved we know not, but our fame and actions have been tossed like tennis balls among them and all that spite and malice durst do to disgrace and inflame us hath been used. To be short, this lower House, by their behaviour, have perilled and annoyed our health, wounded our reputation, emboldened all ill-natured people, encroached upon many of our privileges, and plagued our people with their delays."

గారాగృహమునఁ బడవేసెను. సభ్యు లిట్టి కృత్యమంగీకరింపక దానిని నిషేధించిరి. సాండిసు దొరను గారాగారమున నుంచుట యాతని యుపన్యాసమువలనఁ గాదని నుడువుచు జేమ్సుప్రభువు సభయందుఁగాని తదితర స్థలములం దెచ్చటనైనఁగాని కావింపఁబడు ననార్యవృత్తికై సభ్యుల దండించునధికారము తనకున్నదని దృఢముగఁ జెప్పుచు నమర్యాదతో నేసభ్యుఁడైనఁ బ్రవర్తించిన నట్టివానిని ఖైదు చేయుటకుఁ దా నుద్యుక్తుఁడై యున్నటులు దెలియఁజేసెను. కొంతవివాద జరిగినపిదప క్రీ. శ. 1621 సం. డిసంబరు 18 తేదీని సభయొక్క వార్తాపుస్తకములయందు రాజవచనంబులపైఁ దమకుంగల యంగీకారమును సభ్యులు వ్యక్తముగ నిట్లు వ్రాయించిరి. "శాసనసభయొక్క స్వాతంత్ర్యమును, నధికారమును, నాంగ్లేయరాజ్యస్థులకుఁ బురాతనంబులు, క్రమాగతంబులు నైన పైతృక స్వత్వంబులు. మఱియు రాజసంబంధమైనవియు, దేశసంరక్షణ విషయికములైనవియు, ధర్మసంరక్షణకు సంబంధించియుండునవియు, శాసనసంరక్షణకుఁ జెందియుండునవియుఁ, బ్రతిదినమున నీదేశమున జరుగు దుష్టకర్మములవలనఁ గలిగెడుదుఃఖమునుండి ప్రజలం గాపాడునట్టివియు, నగుదుష్కరింబులును నావశ్యకములు నైనవ్యవహారములఁ బొందు పఱచుటలోఁ బ్రతిసభ్యుఁడు నట్టి వ్యవహారములంగూర్చి న్యాయముతోఁ జర్చఁ గావించుటకును, వాని దగినటులఁ బరిష్కరించుటకును, దగినస్వాతంత్ర్యమును గలిగియుండవలయును. అంతియకాక, ప్రతి ప్రతినిధియును దనబుద్ధికి యుక్తమని తోఁచినటులు వ్యవహారములంగూర్చి చర్చఁ గావించుటకు వీలైనస్వాతంత్ర్యాధికారమును గలిగియున్నాఁడు. శాసనసభావిషయికములైనవికాని, శాసనసభా వ్యవహారసంబధములైనవికాని, యగు శాసనములంగూర్చి యథేచ్ఛగఁ జర్చఁ గావించునపు డట్టిసభ్యుని యనార్యవృత్తికై దండించుటకుఁగాని, యభిశంసించుటకుఁగాని యధికారము శాసనసభకుఁదక్క వేఱెవ్వరికిని లేదు."2

---

(2) "that the privileges, liberties, franchises and jurisdiction of Parliament are the ancient and undoubted birthright and inheritance o the subjects of England; and that the arduous and urgent affairs concerning the King, state and defence of the realm and of the Church of England and of the making and maintenance of laws and redress of mischiefs and grievances which daily happen within this realm are proper subjects and matter of counsel and debate in Parliament and that in the handling an prosecuting of those businesses, every member of the house and of goodright ought to have freedom of speech to propound, treat, reason and bring t conclusion the same; and that every such member of the said House hat like freedom from all impeachment, imprisonment and molestation (othe than by censure of the House itself)"

దీనింబట్టి మిక్కిలికుపితుండై శాసనసభను బలాత్కారముగ వ్యక్షేపించి యావార్తాపుస్తకములఁ దెప్పించి యీ యనంగీకార సూచకం బగు విషయము వ్రాయఁబడినపత్రమును బుస్తకమునుండి చింపివేసినపిదప దృఢోక్తితో రాజకృత్యమును బ్రతిషేధించినందులకు సర్ ఎడ్వర్డుకోక్ (Sir Edward Coke), సర్ రాబర్టు ఫిలిఫ్స్ (Sir Robert Philips) అనుసభ్యులను టవర్ (Tower) అను కారాగృహమున బంధించి, సెల్డన్ (Seldon), పిమ్ (Pym), మెల్లరీ (Mellory) అనువారలను వేర్వేఱు కారాగృహంబులయం దుంచి సర్ టామన్ క్రూ (Sir Thomas Crew), సర్ డడ్లె డిగ్సు (Sir Dudley Digges), సర్ పీటర్ హేమన్ (Sir Peter Haymen) అను వారలను స్వదేశమునుండి బహిష్కరించెను.



# భావిగతి యెట్లున్నదో!

గున్నేపల్లి అక్షయలింగము గారు

ఆర్యపుత్త్రున కెంత
యపరాధ మైతినో!
కంటకావృత ఘోర
గహనాళి నొంటిగా
డించిరమ్మని పంచెనే?
లక్ష్మణా!
వంచింప మదినెంచెనే?

తనసుఖమె సుఖముగాఁ
దనముదమె ముదముగాఁ
దలఁచి వర్తిలు నాకుఁ
దలఁచె నింతటి యెగ్గు
కఠినమానసమయ్యెనో!
లక్ష్మణా!
కనికారమేమయ్యెనో!

భాగీరథీతీర
వనవాటికలఁ జూడ
నభిలషించినయట్టి
యభిమతార్థము నిట్లు
నిర్వహింపఁగ నోపెనే?
లక్ష్మణా!
నెమ్మి యిమ్మెయిఁ జూపెనే?

పలుకుపలుకునఁ దేనె
లొలుకునట్టి ప్రియుండు
పలికెనే ననుఁ గూర్చి
ములుకుఁబోలిన పల్కు-
తానెంత పగఁబూనెనో!
లక్ష్మణా!
నేనెంత నిర్భాగ్యనో!

తన పదాంబుజసేవ
ధన్యురాలను గాఁగ
మెలఁగ నేర్చినయట్టి
కులకాంత ననుఁబాయ
నింత మోసమునేయునే?
లక్ష్మణా!
వంత నీగతిఁ ద్రోయునే?

అలయశోకవనాన
నిలుపఁ జాలితి మేను
చెనఁటిశాత్రవు ద్రుంచి
చేపట్టునని యెంచి
యిప్పుడేమని తలఁతునో!
లక్ష్మణా!
యిచట నెమ్మెయి నిలుతునో!

లంకలో నగ్ని ని
శ్శంకఁ జొచ్చినవిధం
బెఱుఁగఁడో! యెఱిఁగియును
మొఱకు లాడినమాట
పాటినేయగఁ బోలునే?
లక్ష్మణా!
పరిభవింపఁగఁ జెల్లునే?

సాధ్వియని యెల్లరును
సన్నుతింపఁగ నెంతో
సంతసిల్లుదు నాకు
వంత నెక్కొ-న నిట్టి
కటికినిందలు పుట్టెనే?
లక్ష్మణా!
కలుషమానస నైతినే?

అగ్రసన్నతి, సాగ
మానశ్వాస, మాంకూర్తి
మాగారసంబెల్ల
నాకస్మికంబైన
యుడు వాదమును మఱచెనే?
లక్ష్మణా!
యభిమానమును విడిచెనే?

పురుషు లెంతయు స్వార్థ
పరులంట నిజము స్వ్యం
దనకీర్తినే నింపు
కొనిగాదె? ననుసీరం
సర్ధాంగి నని యెఱుంగెడో!
లక్ష్మణా!
యన్యాయముని సాంఱఁచెఁడో!

పూర్వజన్మా నే
పుణ్యాదంపతుల నే
నెడఁబాపి నవ్వితినో?
యెటుసంభవించెనం
తాప మొందనలిప్పనే?
లక్ష్మణా!
పాప మూరకపోవునే?

కాయ మున్నది చింత
గంగమపు గున్న దీకఁ
జెప్పులారఁ జెల్పు మిది
జీవితేశునకు నా
ప్రారబ్ధ మెటులున్నదో?
లక్ష్మణా!
భావిగతి యెట్లున్నదో!



# దశావతారముల పాట

[ఒకరు]

ఈక్రిందిపాటయందు దశావతారములు వర్ణింపబడి యున్నవి. ఇది జయదేవకృతమగు అష్టపదులను సంస్కృత గ్రంథములోని మొదటి గేయమున కనువాదము. ఇది పామరజనమునకు సులువుగ తెలియదగిన తేటమాటలతో నున్నది. కవియొక్క పేరును, కాలమును నిర్ణయింప వలను లేకున్నది. కడపటిచరణమునందలి అంకితమునుబట్టి యీ కవియొక్కఊరు మైసూరు రాజ్యములోని కోలారుజిల్లా బాగేపల్లితాలూకా చిల్లగట్టుగనుండవచ్చునని తోచుచున్నది. కోలారుజిల్లా కడప, చిత్తూరు, అనంతపురముజిల్లాలకు సరిహద్దుగనున్నది. అందును బాగేపల్లితాలూకా సదరు తెలుగుజిల్లాలకు కడుసమీపమున నున్నది. అచట తెలుగువారు బహుజనమున్నారు. బహుశః ఈకవి తెలుగువాడుగ నుండును. తెలుగువారు గానున్నను పాటకు తెలుగునకు మించిన భాష మఱియొకటి లేనందున, తెలుగున రచించియుండును. పదములయొక్క పొందికయు, భావములకూర్పును మనోహరములుగ నున్నవి. కడపలో క్లీడరుగనుండి కీర్తిమూర్తులయిన శ్రీవావిళ్లకొలను రామానుజరావుగారు ఈపాటయొక్క ప్రతినొకదాని వ్రాసికొనియుండిరి. అదియె యిందు బ్రకటితమగుచున్నది. ఈపాటను మైసూరు రాజ్యములో నొకగొల్లడు రచించినటుల వారు గుర్తు వ్రాసియున్నారు.

కడచిన అనంతపురం మైసూరు లోనగుమండలముల వారు దీనిని విశేషముగా వాడుకొనుచుందురని తెలియుచున్నది. నోటిపాటకును రామానుజరావుగారిపాఠమునకును కొన్నికొన్నిమాటలలో భేదము లున్నవి. అర్థమునందు భేదము లేదు. అందుచే నాపాఠభేదములనెల్ల నిందు వివరింప లేదు.

పల్లవిలోని "బెట్రాయి" కదరికి నామాంతరమో, చిల్లగట్టుకు నామాంతరమో, లేక, మఱియొకయూరిపేరో విచారింపవలసియున్నది. "కదరి" అనంతపురంజిల్లాలోని కదరితాలూకాలోని ముఖ్యగ్రామము. ఇది పాకాలధర్మవరం రైల్వేలైనులో నున్నది. ఆగ్రామమున అనాదిప్రసిద్ధమగు శ్రీనరసింహస్వామివారి దేవాలయము గలదు. పూర్వకాలమున నీదేవుడు కదరిచేరువనుండు నొకకొండపై వెలసియుండినటులును, ఏకారణముననో ఆచోటును వదలి కదరిగ్రామము చేరినటులును జనశ్రుతి గలదు. ఆకొండకు 'బెట్రాయి'యను పేరు ఉండెనుగాబోలును. మఱియు, కదరిశబ్దము ఖాదిర వికృతిగనున్నది. ఖాదిర మనగ చండ్రచెట్టు. పూర్వ మచట పట్టుగు చండ్రయడవి యుండినట్లు పెద్దవారు చెప్పుదురు.

తిరుపతి తిరునారాయణపురముల మధ్యదేశమున నింతగొప్ప క్షేత్ర మింకొకటి లేదు. ఫాల్గుణశుద్ధమున నందు బ్రహ్మోత్సవము జరుగును. తిరునారాయణ పురము (మేల్కోట) నందువలె తిరునాళ్లకడపటిదినమున పంచములను (మాలమాదిగలను) ధ్వజస్తంభమువరకు రానిచ్చి మూలవిరాట్టుదర్శనము సహా చేయించుచుండు ఆచారము కదరియం దనాదిగ గలదు. ఈపంచమదర్శనమయిన మరుదినము సంప్రోక్షణ జరుగునట. అది యెటులుండినను, పంచములకు నిరభ్యంతరముగ నొక్కనాడైన దేవాలయములోనికి ప్రవేశార్హతయు దేవతాదర్శనముగలుగుటయు కొనియాడదగిన విషయములై యున్నవి. ఇచటియర్చకులు శ్రీవైష్ణవబ్రాహ్మణులు.

ఈపాటలో స్తుతింపబడిన కదరినరసింహుడిచటి దేవుడు. ఈదేవునిపట్టమహిషి లక్ష్మీదేవి. మరియొక దేవేరికి "చిన్నాదేవి" యనివాడుక పేరుగలదు. కదరినరసిం

హుునకు "కాటమరాయడను" పే రేల గలిగెనో తెలియ లేదు. చిన్నా దేవికి కాటమ యను పేరుగూడ గలదేమొ? పల్లవిలోని "నీకైన పేరుగాడ"యను దానికి "నీకైనవేటకాడ" యను పాఠ భేదము గలదు. కదిరినరసింహుండు నీకైన వేటకాడయినయెడ అడవులలో సంచరించు నా దేవునికి కాటమ్మ (కాడు=అడవి)యు నొక భార్యగ నుండదగు.

రెండవచరణమునందలి కూర్మావతారప్రశంసయందు "సావులేని మందు లెన్న - దేవర్ల కిచ్చినోడ" యనుటకు "సావనించానియెన్న" యనుపాఠాంతరము గలదు. మొదటి దానికన్న రెండవదియె బాగున్నది. "సావనించనియెన్న" అనగా చావనియ్యని వెన్న—అనగా యమృతము. మథన మున బుట్టినందున వెన్న యనుట యుక్తముగ నున్నది.

ఏడవచరణమున "త్యాగుసుందరి" యని సీతమ్మ తల్లికి విశేషణము గలదు. కవిస్వాసరళిని జూడ ఈపదము మిందు ప్రయోగింపబడియుండునాయని సందేహముగున్నది. "సీతమ్మతల్లి— త్యాగుసుందరి నన్ను మెచ్చెగా" యనుటకు "మాకల్ల ఈభూమిలోను బుద్ధిగెప్పరా" యనిపాఠమున్నదిగాని ఇదియు సగసయుగ లేదు. కవిమాటలు పోయినవిగాబోలు!

పాట యంగముగను ఇంపుగను ఉన్నందున ప్రకటించుటకు గారణమైనది. తెలుగున నిట్టి వెన్నియో గలవు. అట్టివానినెల్ల గూర్చి ప్రచురించిన యాంధ్రభాషకు గొప్పసేవ చేసినటులగును.

పున్నాగవరాళి - ఆదితాళము

(కమాజులోను పాడవచ్చును)

బెట్రాయిసామి దేవుడా
నాయేల్నినోడ—
బెట్రాయి సామి దేవుడా.
కాటమ్మరాయుడా
కదిరి నరసింహుడా
నీకైన పేరుగాడ
నిన్నె నమ్మితినోర— బెట్రాయి...

చేపకడుపున చేరిపుట్టిగా—
రాకాసిగాని—.
కోపాము నేసి కొట్టిగా
ఓపినన్ని నీళ్లలోన
వలచి వేగామె తిరిగి
బాపనోళ్ల సదువులెల్ల
బమ్మదేవరకిచ్చినోడ—బెట్రాయి...

తాబేలై తానుబుట్టిగా—
ఆ నీళ్ల కాడ—
దేవాసురెల్ల గూడగా
దోవసూసి కొండకింద
దూరగాను సిలికినపుడు
చావులేని మందులెన్న
దేవర్ల కిచ్చినోడ— బెట్రాయి...

అందగాడ వవుదులేనయ్యా—
గోపాల గో—
విందరచ్చించ రావయ్యా
పందిలోన నేరి కోర
పంటితోన నెత్తి భూమి
కిందు మీదు నేసినట్టి
సందమామ నివేగాద—బెట్రాయి

నారసింహా నిన్నెనమ్మితి—
నానాటికైన—
కోరిన నీపాదమే గతి
ఓరి నీవు కంబాన
నేరి ప్రహ్లాదు గాచి
కోరమీసాల శత్రు
గుండె దొర్ల నేసినోడ—బెట్రాయి-

# మృష యనుకొందు నేను

దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు

నిన్నుఁ బొగడిన నుబ్బి మన్నింతు ననుచు
నిన్నుఁ దెగడినఁ గినిసి దండింతు ననుచుఁ
గొంద ఱందురది మృష యనుకొందు నేను
స్వామి! నీకును రోష తోషములు గలవె?

ప్రియు లని కొందఱికి మేలు చేయుదందు
రన్యు లని కొందఱికిఁ గీడు నాచరింతు
వందు రదియెల్ల మృషయను కొందు నేను
తండ్రి! నీకును బక్షపాతములు గలవె?

శిష్ట సంరక్షణార్థంబు దుష్టశిక్ష
ణార్థ మపుడప్డు పుట్టువు నందుచుందు
వందు రదియేమొ మృషయను కొందు నేను
దేవ! నీకును బుట్టువు, చావు గలవె?



డాక్టరు మురారిలాల్ గారు
ఆహ్వాన సంఘాధ్యక్షులు



శ్రీ బి. గణేశశంకర విద్యార్థిగారు
కార్యదర్శి



శ్రీ యల్. భగవాన్‌దాసుగారు
ఆహ్వాన సంఘోపాధ్యక్షులు

బుడుత బాపనయ్యవైతివి—
ఆ చక్రవర్తి—
నడిగిభూమి నేలుకొంటివి
నిడుపుకాళ్లోడవై
అడుగు వాని నెత్తి బెట్టి
తడవులేక లోకమెల్ల
పాడవుతోడతొక్కినోడ-బెట్రాయి...

రెండుపదులు నక్కమారుతో—
ఆ దొర్లనెల్ల—
సెండాడి తవుర పరశుతో
చండకోలబట్టుకో
దండరామసామిగాడ
బెండుకోలసేసికోని
కొండకష్టు యేగినోడ— బెట్రాయి...

రామదేవ రచ్చించుమా—
సీతమ్మతల్లి—
శ్యామసుందరి నన్ను మెచ్చగా
సామితండ్రిమాటగాచి
ప్రేమభక్తుల నాదరించి
ఆమీద లంకనెల్ల
దోమగాను సేసినోడ—బెట్రాయి...

దేవకిదేవి కొడుకుగా—
యీ జగమునెల్ల—
దేవుడై నిలిచినావుర
ఆవులమేపుకొని
ఆడోళ్ల గూడుకొని
తావు బాగసేసికొని
తక్కిడిబిక్కిడి సేసినోడ-బెట్రాయి...

వేదాలు నమ్మరాదని—
ఆశాస్త్రాల—
వాదాలు బాగలేదని
బోదాలుసేసికొని
బుద్ధులు సెప్పికొని
నాదావినోదుడైన
నల్లనయ్య నీవెగాద— బెట్రాయి...

కలికి నాదొరవు నీవెగా—
నాతోడ దయతో —
పలికిన బాలశిశువుడా
చిల్లగట్టు పురములోన
చిన్నగోపాలుడౌర
పిల్లంగోవి చేతబట్టి
పేటపేట తిరిగినోడ— బెట్రాయి...







గండికోట సత్యనారాయణమూర్తి గారు, యమ్. ఏ.


## ౧ వ ప్రకరణము

### అర్థము

#### అర్థలక్షణము

అర్థశాస్త్రమనన అర్థమును గూర్చి తెలిపెడు శాస్త్రము కావున అర్థ మన నేమో మనము మొదట తెలిసికొనవలెను. ఈపదము మనము సాధారణముగ నుపయోగించినదైనను దాని భావమును దాని లక్షణములను అందరు తిన్నగా బోధించుకొనరు. అర్థము, భాగ్యము, ధనము అనేపదముల కెట్టిభేదము లేకుండ లోకవ్యవహారములో మనము ప్రయోగించుచున్నాము. అయినను అర్థమునకున్ను ధనమునకున్ను చాల వ్యత్యాసమున్నది ఒక భాగ్యవంతుని భాగ్యమునంతటిని మనము పరిశీలించినచో, భూమి, ఇల్లు, వస్త్రములు, ఆభరణములు, పాత్రములు, తిండివస్తువులు, ఎద్దు, గుర్రము, బండి, మొదలగు వాహనములు, ధనము, వర్తక వ్యాపారములందలి హక్కులు మొదలగువాటి నెన్నిటినో కనుగొనుచున్నాము. కాబట్టి ఒక్క ధనమనునదియే భాగ్యమని వాదించుట తప్పు. వెలలేక ప్రతిఫలమును ఇవ్వకుండ మనము పొందలేనట్టి ప్రతివాంఛనీయమైన పదార్థమును, సౌఖ్యమును, భాగ్యరాశిలో చేరియుండునని మనము గ్రహించవలెను. గాలి, నీరు, ఇవి మన కెప్పుడైనను ముఖ్యముగా కావలసియుండు ననుసంగతి అందరకు తెలిసినవిషయమే. కాని ఇవి మన కన్నిచోట్లను అమితముగా దొరకుచుండుటచేత వీటిని వెలనిచ్చికొనుచుండుట లేదు. కావుననే ఇవి సాధారణముగా అర్థజాలములో చేరవు. అయినను మిగుల లోతైనగనులలో పనిచేయువారికొరకు యంత్రములద్వారా లోపలికి సరఫరాచేయబడు గాలిని, పట్టణములకు బహుదూరముగా నున్న చెరువులు నదులు మొదలగు జలాశయములనుండి తీసుకరాబడు నీరును అర్థమనియే గ్రహించవలెను. గంగాతీరమందు వసించెడివారికి నీటికరువులేదు గాన అచ్చటగొరకెడునీరు అర్థము కాదు; కాని ఆనీటనే బిందెలలో పోసి పడమటి హిందూదేశమునకు తీసుకవచ్చినచో అది భాగ్యమగుచున్నది కావున సాధారణముగా మనము వెలనివ్వకుండ సంపాదింపలేని ప్రతి ఉపయోగకరమగు వస్తువున్ను అర్థము లేక భాగ్యము అనిపించుకొనును. అమ్ముటకును కొనుటకును అనుకూలముగానుండి విలువగలిగియుండుట, మన కోరికలను తృప్తిపొందించుటకు కావలసిన ప్రయోజనము (లేక ఉపయోగము) కలిగియుండుట అర్థమునకు ముఖ్యలక్షణములు.

#### ధనమన నేమి?

ధన ముపయోగకరమైనది కాదా? అదెంత మట్టుకు భాగ్యమగుచున్నది? మనము భాగ్యవంతుని ధనవంతునిగ దలచలేదా? మన మొకని కొక బంగారపు కాసు నిచ్చి దానిని నీవు కరగ్చి వెయ్యకూడదు ఏవిధముగానైన దానిని వినియోగించుటకు కూడ వలనుపడదని ఆజ్ఞాపించినట్లయిన దానిని ఎవడైన బహుమానముగ పరిగణించునా? ధనమును సంపాదించుటయు, దానిని కోరుటయును అందువలన లభించెడు ఉపయోగము నుద్దేశించియే. తినుటకు తిండివస్తువులు, కట్టుటకు బట్టలు, ధరించుట కాభరణములు, వెళ్లుటకు వాహనములు, చదువుటకు పుస్తకములు,—వీటినన్నిటిని ధన మిచ్చియే కొనవచ్చును. మన కాధనము కావలెనన్న మన మేదైన ప్రయోజనకరమగు వ్యాపారము చేసియో లేక మనవద్దనున్న సరకుల నమ్మియో సంపాదింపగలము. కావున భాగ్యరాశిలో చేరినవస్తువులను అమ్ముటకున్ను కొనుటకున్ను ధన మొకప్రశస్తసాధనము. అర్థము యొక్క పరిమాణమును, ఉపయోగమును కొలత చేయునది ధనమే. ఉపయోగమునకురాని ధన మర్థము

కాదు. "మంత్రవాదియు, అల్లాడ్డీనును" అనేకథ మన మందరము విన్నదియే. అల్లాడ్డీన్ అనేకుర్రవానిని మంత్రవాది ఒకడు పిలుచుకొనిపోయి తనమంత్రబలముచే ఒకగుహను తెరచి దానిలో వానిని ప్రవేశపెట్టెనట. వాడా గుహలోనికి పోయి చూచుట కద్భుతముగానున్న అనేకవిధముల బంగారునాణెములను, మిగుల విలువగల రత్నములను అందులనుండి తీసుకొని బయటికి రాగామంత్రవాది వాటినన్నిటిని దొంగిలించ నెంచెనట; అప్పుడు వారిరువురకును పెద్దజగడమైనది; మంత్రవాది తనమంత్రప్రభావమువలన ఆగుహాద్వారము మూసుకొనిపోవునటులు చేసెను. అట్టిస్థితిలోనున్న అల్లాడ్డీనుని భాగ్యవంతునిగా పరిగణించవచ్చునా? లెక్కలేనిసొమ్మునకాకుర్ర డధికారియైనను దానివలన వాడు ఊపిరి తీయుటకు వలయు గాలినైన గ్రహించగలిగెనా? అట్టివానిని భాగ్యవంతునిగ నెన్ను టెట్లు? కావున భాగ్యమును బడయుశక్తి ధనమున కెంతమట్టుకు కలదో అంతమట్టుకే ధనము భాగ్య మగుచున్నది.

## నాణెములు

మన వస్తువుల మదింపు ఇన్ని రూపాయలు లేక ఇన్ని పౌన్లు అని నాణెములవలనను ధనమువలనను ఏర్పరుచుచున్నాము. ధాన్యమును కొల్చుటకు కుంచము, బట్టను కొల్చుటకు గజంబద్ద, చింతపండును తూచుటకు వీశెకర్ర ఎట్లు లుపకరించుచున్నవో అదేవిధమున ప్రతివస్తువుయొక్క వెలను (ధర, ఖరీదు) కొలుచుటకు నాణెము లుపయోగపడుచున్నవి. నాలుగుమేకల నిచ్చి ఒకఎద్దును కొనవచ్చు ననుకొందము; మేకఖరీదైదురూపాయలైతే ఎద్దువెల 20 రూపాయలు కద! ఇదేవిధమున రెండెడ్లనిచ్చి ఒకగుర్రమును కొనగలిగిన యెడల గుర్రముఖరీదు రూ. 40 అగును. ఈనవనాగరికకాలములో వస్తువునిచ్చి ఇంకొకవస్తువును పుచ్చుకొనే సాటాబేరపుపద్ధతి అతికష్టము. ప్రతిమనుజుడు అనేకులతో వ్యాపారము చెయ్యవలసి ఉన్నది. పూర్వకాలమందువలె ఒకడు తనవద్దనున్న వస్తువుల నొక చిన్న అంగడిలో నున్న ఇంకొకని కిచ్చి వానివద్ద తనకు కావలసిన పదార్థము లన్నిటిని పుచ్చుకొని వ్యవహారము సేయుట ఈకాలములో సాగదు. యానసౌకర్యములం జేసి ఈకాలపుమార్కెట్లు విస్తరించినవి. ఇంగ్లాండులో తయారగు దీపపువత్తులు హిందూదేశపు టిండ్లలో చీకటిని పోగొట్టి వెలుతురు నిచ్చుచున్నవి; గంగాతీరమందు పైరు కాబడు గోధుమలు నాలుగువేలమైళ్ల కవతలనుండువారికి ఆహార మగుచున్నది. ఇట్టిస్థితిలో సాటాబేర మెట్లుసాధ్యపడును? నాటకశాలకు ప్రతివాడును తనసొమ్మునిచ్చి టిక్కెట్టు కొనవలసియున్నపుడు ఒకడు నాలుగు కుంచములధాన్యము, ఇంకొకడు రెండుకోడిపెట్టలు, మరియొకడెనిమిదివీశెల ఉరలగడ్డలు, ఇంకొక డొకపాదరక్ష, మరియొకడు రెండుసంచులకాక ఇట్టిపదార్థముల నిచ్చి నచో పుచ్చుకొని ఎవడు నాటకమాడును? కాబట్టియే నాణెములను విలువలను కొలుచు సాధనములుగా నుంచుకొని వస్తువులను అమ్ముట కొనుట మొదలగు వ్యవహారములను ప్రజలు సులువుగా జరుపుచున్నారు. ఏదేశమందైనను మొట్టమొదట సాటాబేరమే జరుగుచు వచ్చెనని దేశచరిత్రలు ఘోషించుచున్నవి. రానురాను నాగరికత అభివృద్ధికాగా వస్తువునిచ్చి ఇంకొకవస్తువును పుచ్చుకొని కాలక్షేపము సేయువ్యాపారపు కష్టనష్టములు ప్రజలకు విదితమైనందున వస్తువులమారకమునకును, వాటి పరిమాణమును సరిగా కొలుచుటకును ఋణములను, తీర్చుట కనుకూలముగా నుండుటకును, చాలకాలమున్నను చెడని ప్రశస్తలోహములతో తయారుకాబడు నాణెములను ప్రతిదేశపు దొరతనమువారు ఏర్పరిచిరి. ఒకదేశపు నాణెము ఇంకొకదేశపు నాణెములెన్నటికి సమానమగునో నిర్ణయించి నానాదేశవ్యాపారములను నిరాటంకముగా సాగనిచ్చెడుకట్టుదిట్టము లెన్నియో ఇప్పుడు ప్రబలియున్నవి.

## నాణెములు భాగ్యరాశిలో చేరవా?

ధనమే భాగ్యమని చెప్పుటకు వీలు లేకున్నను నాణెములు భాగ్యములో ఒకభాగమని చెప్పవచ్చును. అవి సకలవస్తుమూల్యపరిమాణమును కొలుచు సాధనములైనను బంగారము, వెండి, రాగి, మొదలగు లోహములతో చేయబడియుండుటవలనను, పాత్రములు, ఔషధములు, ఆహారములు మొదలగువాటికి ఆలోహములు ఉపకరించుచున్నవి గాన లోహనిర్మితనాణ్యరూపకమగు ధనముకూడ భాగ్యమే అని ఒప్పుకొనక తీరదు. రూపాయ అనేది విలువయొక్క కొలత. రూపాయలో నున్న

వెండి భాగ్యరాశిలో చేరినవస్తువు. బంగారపుకాసు విలువను కొలిచెడు సాధనమైనను కాసులపేరు భాగ్యమనుట కేమి సందేహము?

## అర్థము, ప్రయోజనము

మనుజులు ఉపయుక్తము లని నమ్మి ఉపయోగమునకు తీసుకరాదగిన వస్తుజాలమంతియు అర్థమని చెప్పితిమి. కావున మనుజున కుపయోగపడని వస్తువు లేవియును అర్థమనిపించుకొనవు; అవి, అనుభవయోగ్యములు కాగానే భాగ్యమనిపించుకొనుచున్నవి. సముద్రమందుండు ముత్తెపుచిప్ప, గనులందుండు మరకతమణి ఇవి వాస్తవముగా భాగ్యమనిపించుకొనవు. మనుష్యులు వాటిని సంపాదించి అనేకవిధముల శ్రమపడి వాటికి తేటున్ను నీటున్ను కలిగించినగాని అవి అర్థములు కావు. కావున మనము చేయునదంతియు ఈశ్వరుడు సృజించిన వస్తుజాలమున కనేకవిధములగు ప్రయోజనముల గల్పించి వాటిని అనుభవయోగ్య మగునట్లుల చేయుటయే.

## అర్థమెల్లప్పుడును శుభదాయకముగనుండునా?

నిషావస్తువులవలన మనకు నష్టముగాని లాభ ముండదు. అవి మెదటిని చెరిచి దేహారోగ్యమును పోగొట్టును. అయినను అవి సుఖదాయకములని నమ్మి మిగుల శ్రమపడి సంపాదించిన కూలినియిచ్చి ఉత్సాహముతో కొని ఆనందముగ వాటి ననేకులు సేవించుచుండుటంజేసి అవి భాగ్యరాశిలో చేరినవనియే చెప్పవలసి యున్నది. తుపాకిమందు, తుపాకులు మొదలగు యుద్ధోపకరణములు మానవుల కతినష్టదాయకములై యున్నను కొన్ని ప్రయోజనములకొరకు వాటిని వెలనిచ్చి ప్రజలు కొనుచుండుటవలన అవికూడ అర్థములే. నష్టదాయకములైనను సరి, సుఖదాయకములైనను సరి మనము ప్రియపడి ఉపయోగించు వస్తుజాలమంతయు అర్థమె. అది యెల్లప్పుడును శుభప్రదముగా నుండవలెనన్న నిబంధన లేదు.

## అర్థముయొక్క జాతులు

మన కనుభవయోగ్యములై వలయునప్పుడు అమ్ముటకు వీలుగానున్న వస్తువులన్నియును అర్థములే. అవి అనేకవిధములైనవి. కొన్నివస్తువులు మనుజుని శ్రమవలనను ఉత్సాహమువలనను జాతమగుచున్నవి. మరికొన్ని వస్తువులీప్రపంచమందు స్వభావసిద్ధముగనే దేవుని సృష్టిజాలములో చేరినవి. మన మనుభవించుఅర్థము నంతటిని ఈదిగువవిధమున విభజింపవచ్చును. (1) అడవులు; పాదరసము మొదలగునవి దొరకుచోటులు; ఇదేవిధమున కొన్ని భూభాగములలో దొరకు నిసర్గజములు. (2) గనులు; (3) నానావిధములగు వృక్షమృగజాతులు (4) తావునుపూర్పుటవలన మనకుపరికరించెడువస్తువులు (5) రూపభేదముంజేసి మనకు ప్రయోజనపడు పదార్థములు. కొందరు శాస్త్రజ్ఞులు అర్థమును మూడువిధములుగ విభజించిరి:- (1) జలము, భూమి, సారంగము (గని) మొదలగు నైసర్గికోత్పత్తిస్థానములు: (2) ఆహారపదార్థములవలె మనుష్యులశ్రమవలన జాతమై వారిసుఖానుభవముల కేర్పడిన వస్తువులు; (3) యంత్రోపకరణములు: మనుజుని దేహబలముచేతను బుద్ధిబలముచేతను కనిపెట్టబడి ప్రయోజనసహితంబులగు పదార్థముల పేరోళముగా నిర్మించు సాధనము లివి.

## అర్థోపయోగము

మీదజెప్పినవాటిలో కొన్ని మన కుపకరించుటలో నశించుచున్నవనియును, మరికొన్ని చాలకాలమువరకు మనకార్యములకును, భాగ్యాభివృద్ధికిని సాధనములై యున్నవనియును తెలియవచ్చుచున్నది. ఏవస్తువైనను మనకు వినియోగపడుటలో ఒకవిధమగు నాశన మొందుచున్నది. అయితే కొన్ని శీఘ్రముగను మరికొన్ని కాలక్రమమునను లయమొందుచున్నవి. తిండివస్తువులు, ఇండ్లు, ఇవి అర్థములే; అయితే ఆహారపదార్థము లొక్క సమయమందు మనకు ప్రయోజనపడుటలో నాశనమొందుచున్నవి; ఇండ్లో అట్టులకాక చాలకాలమువరకు వసతి నొసగుచున్నవి. అవికూడ కాలోచితమగు మరమ్మతులు లేనియెడల కొంచెము కాలములోనే అంతమొందుచుండునని మనకు తెలియును. ఇదేవిధమున యంత్రోపకరణములుకూడ అనేక సంవత్సరములవరకు మనుష్యుల కుపయోగపడి వారి కనుభవయోగ్యములైన చాల సరకులు తయారుచేయుచున్నవి.

### దేశపుభాగ్యము

ఈలోకమందున్న అర్థజాలమంతయు ప్రతివానికి దాస్యముచేయును వాని స్వంతమనిపించుకొనుచుండుట లేదు. కొన్ని వస్తువులు ప్రతిమనుష్యునకును చెందిన ప్రత్యేకభాగ్యములై యున్నవి. మరికొన్ని అటులుకాక దేశీయులందరికిని చెందిన అర్థములైయున్నవి. ఈకడపటివే దేశపుభాగ్యములో చేరినవి. వస్త్రము, ఆభరణములు, ఆహారము, మేకలు, ఎద్దులు, ఇండ్లు, భూమి మొదలగునవి మన ప్రత్యేకపుభాగ్యము. పర్వతములు, అరణ్యములు, సారంగములు, సముద్రము, నదులు మొదలగు ప్రదేశములు, రస్తాలు, వంతెనలు, ఆనకట్టలు, జలాశయములు, దేశీయులందరు ఉపయోగించదగు కట్టడములు భూములున్ను, విద్యుత్కాంతినొసగు జలపతనములు మొదలగునవి అన్నియును దేశపుభాగ్యములో చేరినవి. మనకు అర్థమగునదంతయును దేశమునకు అర్థము కాదు. దేశపుభాగ్యమనిపించుకొనిన డబ్బియును మన ప్రత్యేకభాగ్యకూటమునకు చెందినది కాదు. తాకాపత్రములు కుదువపెట్టబడిన ద్రవ్యములు ఇవి అప్పులనిచ్చువానికి భాగ్యమే. అయితే ఇవి దేశపుభాగ్యములో చేరవు. మన ప్రత్యేకభాగ్యమును లెక్కవేయుట సులభమనియే చెప్పవచ్చును. ఎగుమతి దినుసులు, స్థిరాస్థులు, స్వభావసిద్ధములగు వస్తువులు, మొదలైనవాటిని లెక్కవేయుట ఒకవిధముగా సులభమైన పనియే. అయితే దేశమందుండుజనులు వారి వారి ప్రయోజనముకొరకు తయారుచేయు సరకులను లెక్కించి ఖరీదులుకట్టుట సులభసాధ్యమైన పనికాదు. కావుననే జనసంఖ్యనాధారముగా దీనికొని దేశముల ఆర్థికతారతమ్యములను కనుగొనుట అంతప్రశస్తమైనవిమర్శనపద్ధతి కాదు. దేశభాగ్యపు మదింపును అంచనా వేయునప్పుడు దేశీయుల గుణసంపత్తి (వినయము, ప్రాశస్త్యము, నిపుణత, బుద్ధిసూక్ష్మత మొదలగునవి), రాజకీయవిధానముల ఉత్కృష్టత మొదలగువాటిని మరువగూడదు; గాని వీటెని సరిగా మదింపుచేయుట సుకరమైన పనియా? కావున ఒకదేశమందలి అర్థము ఇంకొక దేశమందలి అర్థముకన్న విస్తరించి యున్నదని సాధారణముగా కొన్నికారణములంజేసి చెప్పవచ్చునుగాని ఆరెండింటికిని నికరముగా ఇంతమదింపుగల వ్యత్యాస మున్నదని స్థిరీకరించుట బహుకష్టమని మనము గ్రహింపవలెను.

### అర్థశాస్త్రమందలి భాగములు

మనుజుల ప్రత్యేకభాగ్యమైనను సరి, దేశపుభాగ్యమైననుసరి దానియుద్దేశము వారివాంఛల దీర్చుటయే. ఏతద్విషయమును విపులముగా దెలుపు అర్థశాస్త్రభాగమే "వినియోగకాండము." వస్తువులు వినియోగార్హములగు టెట్లు? ఏయేసాధనములంజేసి భాగ్యవృద్ధియగును? ఈసమస్యలను వర్ణించుభాగము "ఉత్పత్తికాండము" అర్థ మొకనిచేతినుండి ఇంకొకనిచేతికెట్లు మారును? వస్తువులవెల లెట్లు నిర్ణీతమగుచున్నవి? నాణెములు, బ్యాంకులు. వాణిజ్యవిధానములు ఇవి లోకవ్యాపారమున కెట్లు తోడ్పడుచున్నవి? ఈవిషయములను విశదపరచు శాస్త్రభాగమే "వినిమయకాండము" అర్థోత్పాదకులెటులు లభించినభాగ్యమును తమలోవిభజించుకొనుచున్నారు? ఈమార్గములను, వాటిసంబంధించిన ఆర్థికసమస్యలను, దెల్పుభాగము "విభజనకాండము." వినియోగము, ఉత్పత్తి, వినిమయము, విభజనము.— అర్థమీమాంసకుల సేయున్యాయముల ననుసరించి యుండునో విదితపరుచుశాస్త్రమే అర్థశాస్త్రము.

## 2వ ప్రకరణము

## వినియోగకాండము

### వినియోగము, వాంఛాస్వభావము

వినియోగమన నేమి? అర్థశాస్త్రపఠనములో వినియోగమునుగూర్చి మనమేల మొదట చదువవలయును?

మన మేల భాగ్యమును లేక అర్థమును సంపాదించుచున్నాము నన్నప్రశ్నకు జవాబివ్వగలిగినచో మీదిప్రశ్నల కుత్తరములు సులభసాధ్యములగుచున్నవి. శ్రమపడి భాగ్యమును సంపాదించుట మనఅనుభవముకొరకే; అనగా ఇండ్లు నివసించుటకు, ఆహారపదార్థములు తినుటకు, వస్త్రాలంకారములు ధరించుటకు, ఇతరవస్తువుల నుచితవిధముల ననుభవించుటకునుమనముసంపాదించుచున్నాము.

నివసించుట, తినుట, ధరించుట, అనుభవించుట మొద లగు ఉపయుక్తమార్గములున్నవే అవే భాగ్యమును విని యోగించుమార్గములు. మన మాయావస్తువులను వినియో గించుటకు కారణమేమి? మనకాంక్షలను తీర్చుకొను టకు ప్రతిమనుజునకును కొద్దిగనో గొప్పగనో వాంఛ లుండుట సహజముగదా. ఎట్టివాడైనను మనుజునికి కొన్నికోరికలు ఉండును. వాటిని తీర్చుకొనుటకే భాగ్యసంపాదనము చేయుచుండును; అనగా భాగ్య రాశిలో చేరినవస్తువులను కొనుచుండును; అమ్ముచుం డును; తాకట్టుపెట్టుచుండును. లేదా, ఆవస్తువులకు స్థల రూపాదిభేదములు కలుగజేసి క్రొత్తక్రొత్త వస్తువులుగా తయారుచేయుచుండును. ఇదియే వినియోగము. మనకుగల వాంఛల దీర్చుకొని తృప్తిబడయుట కుద్యమించుట ఏవి షయమునకైన ప్రథమసోపానమువంటిది; కావున, అర్థ తత్త్వమును దెలిపెడు శాస్త్రములో అర్థ వినియోగము గూర్చియే మనము మొదట నేర్చుకొనవలెను అంతే కాక వెనుకటిప్రకరణములో అర్థలక్షణముల దెలుపు నపుడు అనుభవయోగ్యములైనట్టియు, మూల్యము లేక విలువగలిగినట్టియు, వస్తువులన్నియును భాగ్యకూటములో చేరినవని గదా చెప్పియుంటిమి. మన కేవస్తువైన అనుభవయోగ్యముగా నున్నదో లేదో కనుగొనుటకు మన కుండు వాంఛలం దీర్చే శక్తి ఆవస్తువులకు కలదో లేదో విచారించవలసి యుండును. కావున ఇంచు మించుగా మనకు గల వాంఛలే ఇది అర్థము, లేక భాగ్యము అని నిరూపించుచున్నవి. అట్టివాంఛలస్వభా వమును, అవియెప్పుడెప్పుడు ఏయేన్యాయముల ననుసరించి తృప్తినొందు ననే విషయములం దెల్పు శాస్త్రభాగము కదా మొదట చదువవలయును. ఆభాగమునకే వినియోగ మనిపేరు.

## వాంఛాస్వభావము

వాంఛలు మనకుండుకాంక్షలచే పుట్టుచున్నవి. ఆవాంఛలు తృప్తినొందుటకు వలయుసాధనము లున్నవా లేవా, ఏవాంఛనైన తీర్చుకొనుట సాధ్యమా, అసాధ్యమా, అనేసంగతి ఆలోచనీయము. రాష్ట్రమందుగల భాగ్య మంతయు నాకు రావలెనని కోరినమాత్రమున కార్య మేమి! చక్రవర్తికిరీటమందుగల వజ్రమణి నాకుకావలెనని కోరినమాత్రమున కార్యమేమి? ఇట్టిఅసాధ్యపువాంఛల తత్త్వముతో మనకు పనిలేదు. ఏవస్తువునైన మనము వాంఛించినచో ఆవస్తువును సంపాదించుటకదియే వెల నిచ్చుసమర్థత మన కుండవలెను. వాస్తవముగా అట్టి వాంఛలంగూర్చియే మనము ఆలోచించవలసి యున్నది. ప్రతిఫలము నివ్వనొల్లకయే వస్తువులను వాంఛించుటవలన ప్రయోజనమేమి! వెలల నాశించక వాంఛించుపదార్థములనెల్ల నొసగు వర్తకుడెంగటైన ఎచ్చ టనైన ఉండునా! ఇచ్ఛామాత్రమున కోరినవస్తువులన్ని యు లభించినయెడల మనమందర మతిశీఘ్రముగా భాగ్య వంతులమగుదుమే.

ఇక వాంఛలముఖ్యగుణములను విచారించెదము: -

(1) మనుజులకుండువాంఛలసంఖ్యములు. మానవు డభివృద్ధినొందుటకు చేయు ప్రతిప్రయత్నముయొక్క అంతరార్థ మేమన కోరికలమితములు; వాటిని దీర్చుకొను మార్గము లనేకములున్నవి; క్రొత్తమార్గములనుకూడ కని పెట్టవచ్చును. నాగరికత ఎక్కువయగుకొలది మన వాంఛ లుకూడ ఎక్కువఅగుచున్నవి. వాంఛ లనేకవిధములుగా నుండును కొందరికి తినుటకన్నము, కట్టుటకు బట్ట, నివ సించుటకు వసతి ఉన్నచాలును. మరికొందరి కింక నెన్ని యోవస్తువు లావశ్యకమై యుండును; ప్రాణసంరక్షణము నకే కాదు, తమ మర్యాదకున్న స్థితికిన్ని తగినవని ఎన్నియో అలంకారముల నీకాలపుప్రజలుకోరుచుందురు. నాగరికతాభివృద్ధికి వాంఛానేకత్వము ముఖ్యము. నాగరి కత శాస్త్రవిజ్ఞానము ఇవి అతిశయించుకొలది మన కోరి కలుకూడ అధికమగుచున్నవి. మన పూర్వికులకంటె మన కెన్నియో యెక్కువవస్తువులయెడల వాంఛలు కలుగుట కిదియే కారణము.

(2) వాంఛ లనంతములుకావు; అవి ఒకసరిహద్దు చేరినపిమ్మట తృప్తినొందుచున్నవి. వాంఛల దీర్చగల వస్తు వులు అధికము అయినకొలది ఆవస్తువుల ప్రయోజనము తగ్గుచుండును. ఇది ఒకముఖ్యమైన ఆర్థిక న్యాయము; వస్తువులవెల లీన్యాయముంజేసియే ఏర్పడుచున్నవని చదు వరులు ముందు తెలిసికొనగలరు.

(3) వాంఛలు పరస్పరవిరుద్ధములు. ఒకవాంఛను దీర్చుకొనుట కింకొకవాంఛను మార్పు నొందించుటయో

పారదోలుటయో జరుగవలసివచ్చుచుండును. ఏతద్విషయ మాధారముగాఁగల ఇంకొక ఆర్థిక న్యాయసూత్రమును మరుపటి ప్రకరణములో వివరించెదము. కల్లుత్రాగవలెనన్న వాంఛ పోవలెనని కాఫీక్లబ్బుకువెళ్లుట, చెడువిషయములందాసక్తి పోగొట్టుటకు మంచి నీతిబోధకములగు పుస్తకములను చదువుట ఈ వాంఛాలక్షణమున కుదాహరణంబులు.

(4) వాంఛలు ఒకప్పుడు ఒకదాని నొకటి అనుసరించి యుండును.

ఉ. మోటారుబండిని మనము వాంఛించి కొనినప్పుడు పెట్రోలుకూడ ఆవశ్యకము; ఏమన, పెట్రోలు సహాయము లేక మోటారుబండి నడువదు.

(5) మనవాడుకలు, అభ్యాసములు, ఆచారములు వీటివలన వాంఛ లుద్భవిల్లి పెంపొందుచుండును. మనము పలుమారు దేనినైనను వాంఛించి ఇచ్ఛాపూర్తి చేసుకొనుటంజేసియే వాడుకలు, అలవాటులు, ఆచారములు ఏర్పడుచున్నవి మానవప్రవర్తనమున కీవిషయముముఖ్యమని వేరే వ్యాఖ్యానముసేయు టనవసరము.

## సార్థక నిరర్థక వినియోగములు

వినియోగయోగ్యపదార్థములను రెండువిధములుగ అర్థశాస్త్రజ్ఞులు విభజింతురు. వినియోజకుడు (అనగా వాంఛాతృప్తికి వస్తువులను వినియోగించువాడు) కొన్ని వస్తువులను తన స్వంతవాంఛలను తీర్చుకొనుట కుపయోగించుచున్నాడు. ఉ. శీతకాలములో చలిబాధ లేకుండ వెచ్చగా నుండుటకై కుంపటిలో నిప్పుగా చేసి కాచుకొనును; ఆకలి పోగొట్టుకొనుట కాహారమును తినుచున్నాడు. ఆవస్తువులనో, మరికొన్ని వస్తువులనో భాగ్యోత్పత్తికొరకు ఉపయోగించవచ్చును. ఉ. నేలబొగ్గును కుంపటిలో నిప్పుగాచేసి చలితీరేటటులు కాచుకొనుటకు బదులుగ ఆ నేలబొగ్గును ఒక నీటి ఆవిరియంత్రములో వేసి దానిని నడిపించుటవలన అర్థోత్పత్తి చేయవచ్చును. ఆహార పదార్థములను తానుతినుటకు బదులుగ అర్థమనిపించుకొనే ఒకవస్తువును తయారుచేసే కూలివానికి ఆతిండివస్తువులను కూలిగా నివ్వవచ్చును. మొదటితరహా వినియోగము భాగ్యోత్పత్తికి సహకారి కాదుకావున దానిని నిరర్థక వినియోగమనియు, రెండవతరహా వినియోగము అర్థోత్పత్తికి సాధకమగుటవలన సార్థకవినియోగమనియు శాస్త్రకారులు నిర్ణయించిరి. వాస్తవముగా ఈ భేదనిర్ణయమంత ప్రశస్తమైనది కాదు. కారణమేమన, దేహారోగ్య సంరక్షణకు కదా మనుజుడు నిప్పును కాచుకొనుచున్నాడు; ఆహారపదార్థముల దినుచున్నాడు. దేహారోగ్య సంరక్షణము భాగ్యోత్పత్తికి సాధనముకాదని వాదించలేము ఈ భేదమున కిట్టి ఆక్షేపణ ఉన్నప్పటికిని మనము ముఖ్యముగా గమనింపవలసినవిషయ మేదియన; అర్థము స్వకార్యోపయోగమునకే కాదు, ఇంక అధికముగ అర్థమును అతిశయింపజేయుటకుగూడ వినియోగింపఁజాలను. సాగబడి భూమిలో పండినధాన్యములో కొంతభాగము ఇంటివారందరు భోజనము చేయుట కుపయోగించవచ్చును; ఆ ధాన్యములో ఇంకొంత భాగము విత్తనములుగా ఉపయోగించి ఇంకఎక్కువభాగ్యము ఉత్పత్తి అయ్యేటటులు చేయవచ్చును.

## వినియోగోత్పత్తులకుగలపరస్పరసంబంధము

మీద చెప్పిన భేదమే దీనిని తేటపరచుచున్నది. కొన్ని వస్తువుల నొకానొకవిధమున వినియోగించుట వలననే అర్థోత్పత్తి అగుచున్నది. కావుననే ఉత్పత్తికికారణము వినియోగము. కొంతవినియోగము లేనిచో ఉత్పత్తి అసంభవము. ఉత్పత్తి అనగా వాంఛల దీర్చుశక్తిగల ప్రయోజనముల గలిగించుట. వినియోగమన అట్టిప్రయోజన సహితంబగు వస్తువులనుపయోగించుట. వినియోగోత్పత్తులన్యోన్యాశ్రయములు. వినియోగముకొరకు భాగ్యోత్పత్తి అగుచున్నది. మనమువినియోగించుపదార్థములు ఉత్పాదితములు. వినియోగము ఉత్పత్తియొక్క ముఖ్యోద్దేశము; వినియోగము ఉత్పత్తికి సాధనముకూడ అయియున్నది.

(సశేషము)






౧

ఋషులు మేల్కొను సుముహూర్తమీ
వేడుకైన నేను ప్రార్థనలాచరింప, [యుషస్సు
సృష్టి కన్నెబాలికవలె నిద్రించుచుండె
దివ్యవిభువిశ్రాంతిధనము భావింప నాత్మ.

౨

కావ్యపరమార్థలోకసంగ్రహములందు
నేఱుపఱచు చిత్తవృత్తు లభేదపడియె,
విచ్చుపల్లము లనక భూమిపయిఁబడిన
జలము లొక్కటే ఛత్రమై నిలుచునట్లు.

3

తల్లిఱెక్కలక్రింద మెత్తని కవోష్ణ
తూలికల మెయిమఱచి నిద్దురలుపోవు
కన్నెపారావతమ్ము భాతి కదలదాయె
నా యహంకారమేమి బంధమ్మొ కాని.

౪

విరులలోపల మధువు స్రవించువేళ,
పుడమి నలమిన దోషము నడలువేళ,
ప్రాణి కర్మాభిముఖమగు భద్రవేళ,
అబ్బె బ్రాహ్మముహూర్తభాగ్యంబు నాఁడు.

౫

హృదయ మొక 'గోపికాగాన' గతిఁ గసంత
నిఖిలలోకరాగోన్మత్తసుఖగమించున
శ్రుతికి మేళనమయ్యె; విరోధగతులు,
ద్వంద్వములును, కరఁగి నేకధారగాఁగ.

౬

అంతరిక్షమందున్న యనంతకోటి
తారలును నిశ్చలధ్యానధారగాని
మగ్నములయి బ్రహ్మానందమధురగీతి
నాలపించె మనశ్శ్రుతి కనుగుణముగ.

౭

లేఁతవరియెన్నులను బవళించి పోచు
చవయవవిలక్షణన్యాస మభినయించి,
నేర్పుచుండె జగత్ప్రాణనేత యపుడు
శైత్యశైలూషికిఁ బ్రభాతచాలనంబు.

౮

తమసమున నుండి జ్యోతిష్పథంబునకు న
సత్యమున నుండి సత్యసాంగత్యమునకు,
మృత్యువుననుండి యమృతసమీపమునకుఁ
జేర్పుమని యుపనిషదుక్తిచే స్తుతించి,

౯

రమ్యమయిన దేవీపంచరత్నములను
గంరమెత్తి పఠించితిఁ గదల నోడలు,
సగము విచ్చఁ బచ్చని వనస్పతుల తలల
పూలతోఁ బాటు వాగర్థముకుళములును.

౧౦

కౌఁగిలింతలఁ గరఁగిన క్రౌంచమిథున
హింసతో నార్ద్రకవితారరంస వొదల,
మధుమధురమైన శ్రీరామకథ వచించు
సుకవికోకిల శ్రుతికయి సాగెను మనసు.

౧౧

గండుదోపిడికాండ్రతో నిండియున్న
పూర్వరంగము కర్మచొప్పున నిలువగ
అశ్రుధార ఛందోధార ననుకరింప
కొండవలె గానబడియె నొక్కరుండు నాకు.

౧౨

శివధనుర్భంగము నొనరించిన మనస్వి
పెండ్లికొడుకును జూడఁ దపించె నెడఁద,
కాని బాష్పస్ఫటికమాలికను ధరించి
విభుని భజియించు పరమసాధ్వియె కనఁబడె.

౧౩

కేకయకుమారి గర్భపంకిలతల్పి మొ
లచిన పుండరీకము జూడ లాగె; కాని
మగతనమ్మును కత్తిరించి మడిచి వినయ
కోశమందుంచు తమ్ముఁడే గోచరించె

౧౪

యుగయుగాంతరములఁ బెరుఁగుచున్న, పు
రాణగాథలను గంటి, ప్రమాణభూమ
లను వెదకి, విభాగించుచున్న, నిరవధిక
భాసు, వ్యాసుని చూడఁగా వాంఛఁ గొంటి.

౧౫

గర్భపాతమయిన మాంసఖండములకు
ఘృతఘటీగర్భగోపనక్రియ లొనర్చు
ప్రాతహస్తామలక్ష్మాయ ద్యోతమయ్యె
పూవులోని సువాసనవోలె నంత.

౧౬

క్షత్రియుండయి బ్రాహ్మణసహజమైన
బ్రహ్మచర్యముఁ బూనినభద్రపురుషు
బాణమోక్షణమును కర్మబంధమోక్ష
ణమును దలచితి చేకలక్ష్యమున నరయ.

౧౭

కాని వేదాంతచీవరకము తొలంగె;
డేగవలె నహంకృతి విజృంభించుచుండ
హరిని నరునిఁ జెండాడు భయంకరాకృ
తియె స్ఫురించె; రజోవాంత మయిన పగిది.

౧౮

పిదుకుచున్న గీతాదుగ్ధబిందువులను
శాంతిమైఁ ద్రావు పాండువత్సమును దరిసె
బుద్ధి; సృష్టిమధ్య నిలచి శుద్ధసత్త్వ
వచన మరయఁబోయెడి ఋషివాణిభాతి.

౧౯

కాని కాయము నెత్తుట నాగ కంప
సెజ్జనున్న భీష్ముని యభిషేకమునకు,
ధాత్రివిచ్చి స్వచ్ఛందపాతాళగంగ
యెగయ శరమేయు విలుకాని మొగమె తోఁచె.

౨౦

మయుఁడు సృజియించిన యపూర్వమణిసభాసు
భాసురణమందుఁ గృష్ణతో ననుజసహిత
మోలగంబున్న ధర్మభూపాలు దరిసె
మనసు, భారతైశ్వర్యదర్శనము పొందె.

౨౧

కాని త్రిజగతీదుర్లభమైన యామ
హాభ్యుదయరంగము తొలంగె; నరయనయ్యె
నుభయవంశవధాభయక్షుభితహృదయ
యాతనాచ్ఛన్నముఖుఁడైన యమసుతుండె.

౨౨

సత్యకుఁ బతివ్రతాసూత్రసామరస్య
మెఱుఁగఁ జెప్పద్రోవదిత్రోవ కెగిరె మనసు;
కాని ప్రశ్నించుచుండె నఖండమయిన
వీరసభను ధర్మాధర్మభేద మావె.

౨౩

రాజసూయావభృథపవిత్రమయి యొప్పు
కృష్ణమంగళమూర్ధము నెంచె దృష్టి;
కానఁబడె కురుకలుషరక్తమునఁ దడిసి
ముడినడినకృష్ణఫణివంటిజడయె యపుడు.

౨౪

అగ్నివలె నధోముఖముగా నట్టిబ్రాహ్మ
ణమహనీయవర్చస్సుకోసము తపించె;
కాని ధనురనురక్తరక్తమునఁ జివికి
తెగియు తెగని జందెములె ప్రేలఁగఁ దొడఁగె.

౨౫

అన్నదమ్ము లేకోదయ న్యాయసీమ
దాటిపోని రామాయణధర్మ మరసి;
ఆసకై పున ననుజు లన్యోన్యకంఠ
ములకుఁ జెగిన భారతనీతిఁ గలఁగె మనసు.

౨౬

శుకముకడుపునఁ బుట్టి వ్యాసునకుఁ గడుపు
చుమ్మలం దార్చినట్టి శ్రీశుకమహర్షి
ధీరమయినదిగంబరాకార మపుడు
ప్రాయనెంచితి భావాంబరమును గడిగి.

౨౭

పొదుగుఁ గ్రుద్ది పాల్ద్రావు గోపుత్రి లేఁత,
సెలవుల సరస్వతీసితస్మేరమట్టు
లమలమయిన పయఃఫేన మారగించు
బాలకాకృతిఁ జూపించె భాగవతము.

౨౮

నవ్వువలె నిర్మలంబైన నగ్నరేఖ,
ప్రేమవలె తీయనయిన లీలాముఖంబు,
శ్రుతివలె ననంతమయిన నిర్ముక్తసూత్ర
మం దదుకులై యగపడె నానందవీథి

౨౯

కృష్ణుఁ డేఁడని యడిగితిఁ గేకపెట్టి,
యమునదరినొ, బృందావనమందొ, సత్య
యింటనో యుండుననుచు వెఱ్ఱెత్తె మదికి;
నాత్రమున దిగ్భ్రమించు వేదావుమాడ్కిఁ.

౩౦

కౌస్తుభం బేది? వనమాలగంధ మేది?
వేణు వేది? రాధాపరిత్రాణ మేది?
చూడనయ్యెఁ గుచేలుఁ డిచ్చునటుకులను
గృతపురోడాశమ ట్లారగించు హరియె.

౩౧

అంత లజ్జావిముగ్ధుఁడ నయితిఁ గొంత
వంగె వాక్ప్రగల్భత వింటిబద్ధభంగి;
దారి యేదని యంధుచందమున నడిగి
కలయ వెదకితి రోదసీవలయ మెల్ల.

౩౨

వినఁబడదు శ్రుతి వాణివిప్పినవిధాన,
కనఁబడదు స్మృతి ఋషివచించినవిధాన,
చెదరె నంతఃకరణమెల్ల ఛిద్రభాండ
దుగ్ధమట్లు నానాముఖధూతమగుచు.

౩౩

అట్లు చెదరిన చిత్తలతాగ్ర మెట్లొ
త్రిప్పికొంటిని మఱల వైదికమహర్షి
భగవదుపదిష్టగీతానువాకములకు;
ఛాయ లేగె రూపములకు స్థానమిచ్చి.

౩౪

నీలతోయదవిస్ఫురత్ఫాలమందు
బాలనివారశూకము భాతి వెలుఁగు
వహ్నిశిఖను, సర్వాంతరవ్యాప్తమున
జ్యోతిరణువులు లీనమౌచుండఁ గంటి.

౩౫

ప్రకృతివిత్తు దుకూలమై పరిణమించు
మాద్రి; పచ్చిక పాలుగా మాఱురీతి;
సృష్టి బహురూపములఁ బ్రసరించెఁ గర్మ
లమృతభాగ్యానుభవమున కగుచునుండె.

౩౬

వెలుఁగుచున్న యాదిత్యులు, వీచుచున్న
వాయువర్గము, పూతప్రమేయములగు
సుజలదేవతలును ఆదిసూత్రములకుఁ
గట్టువడిరి, ధర్మమున జగత్తు వోలె!

౩౭

అక్షులెత్తక, హస్తము లంజలించి
దేవదేవ! మహాప్రభో! దివ్యతేజ!
ఇవి విరాడంశ లనుచు నూహింతు నింక
చూపుమీ పరమాత్మస్వరూప మంటి.

౩౮

వినఁబడియె నొక్క సూక్తి హృద్వివరమందు.
స్మృతులు మూసి; ముక్కోటిదేవతల వదలి
బ్రహ్మవిష్ణురుద్రులపరంపరఁ ద్యజించి;
అగ్నిముఖమున బురుషుని యరయు మనుచు

# 40-వ దేశీయమహాజనసభ - కాన్పూరు

# తీర్మానములు

## ౧

### చనిపోయిననాయకులకై విచారతీర్మానము

"భారతదేశనాయకులై చిరకాలము సేవచేసిన దేశబంధు దాసు, సర్ సురేంద్రనాథ బెనర్జీ మున్నగు నాయకులను గోల్పోయినందులకు యీసభ విచారమును దెల్పుచున్నది."

ఉపపాదకులు—శ్రీమతి సరోజినీదేవి.

## ౨

### 'దక్షిణాఫ్రికా' తీర్మానము

"ఈకాంగ్రెసు దక్షిణఆఫ్రికారాయబారులకు మనఃపూర్వకమైన స్వాగత మొసంగుచు, ఆఖండమునందు తమయునికికే భంగము కలిగింపనున్న బలములతో పోరాడునప్పుడు దక్షిణాఫ్రికాలోని భారతీయులకు కావలసినంత సాయము చేసెదమని నమ్మకముగా జెప్పుచున్నది గూడెములగట్టము, వలస, రిజిస్ట్రేషనుబిల్లులు మొదలగునవి 1914 లో గావింపబడిన 'స్మట్సు-గాంధి' యొడంబడికకు విరుద్ధముగావున ట్రాన్సువాలు భారతీయుల విషయమున 1893లో గావింపబడినట్లుగా యీవిషయము మధ్యవర్తులచే పరిష్కారము గావలెనని ఈకాంగ్రెసు గట్టిగా చెప్పుచున్నది. సరియైన భారతీయప్రతినిధులతో కూడిన రౌండు టేబిలు సమావేశమే యీప్రశ్నను పరిష్కరింపవలెనను సూచన నీకాంగ్రెసు హృదయపూర్వకముగ నామోదించుచు యీ సూచనను యూనియను ప్రభుత్వమువారు గూడ ఆమోదించెదరని నమ్ముచున్నది పంచాయతీసూచన గెలుపొందకున్న యెడల, ఆబిల్లు యూనియను పార్లమెంటులో అంగీకరింపబడినను యింపీరియలు ప్రభుత్వమువారు దాని నంగీకరింప కూడదని కాంగ్రెసు తన యభిప్రాయమును దెల్పుచున్నది."

ఉపపాదకులు—గాంధిమహాత్ముడు.

## 3

### 'బెంగాలు ఆర్డినెన్సు' తీర్మానము

"1818 (3) రెగ్యులేషనును దుర్వినియోగము చేసి బెంగాలు ఆర్డినెన్సుచట్టమును నిరంకుశముగ గావించి అరెస్టుచేసి యేచార్జియు, విచారణయు లేకుండను దేశభక్తులగు బెంగాలు యువజనుల ననేకులను నిలవయుంచుటను ఈ కాంగ్రెసు ఖండించుచున్నది. ఇంతేకాక బెంగాలుకావల ప్రదేశములకు వీరలను బంపి బాధపెట్టి హింసించుచు శాసనసభలలోను యీవలను ప్రజలు నిరంతరమును బెట్టుమొరలను ప్రభుత్వ మాలింపకుండుట నీసభ ఖండించుచున్నది."

ఉపపాదకులు—సేనుగుప్తగారు.

## ४

### 'సిక్కు- గురుద్వార' తీర్మానము

"గురుద్వార చట్టమువలన పరిష్కారము గుదిరినప్పటికిని గురుద్వారఖైదీలు హామీ నీయలేదను సాంకేతిక కారణముచేత యింతవరకును వారిని పంజాబు ప్రభుత్వమువారు విడుదలచేయనందులకు యీ కాంగ్రెసు చాల విచారమును దెల్పుచున్నది. గురుద్వార ఖైదీలను అనిమిత్తముగ విడుదలచేసినదప్ప గురుద్వారసమస్య సరిగా పరిష్కారము గాజాలదని ఈ సభ యభిప్రాయమైయున్నది."

ఉపపాదకులు—లాలాలజపత్రాయిగారు.

## ౫

### 'బర్మాబిల్లుల' తీర్మానము

"బర్మనులు కాని నేరస్థులను వెడలగొట్టుబిల్లును, సముద్ర ప్రయాణికులపై పన్ను విధించు బిల్లును పౌరులస్వాతంత్ర్యమునకు భంగకరమని యీకాంగ్రెసు తలంచుచున్నది. మొదటిబిల్లు అమాయకులను ప్రభుత్వనిర్వాహకుల దయాపాత్రతకు వదలి బర్మాలో వాస మేర్పరచుకొనియున్న భారతీయులకు నష్టదాయకముగ నుండును. కావున యీబిల్లులను రాజప్రతి

నిధి అంగీకరింపరాదని యీకాంగ్రెసు అభిప్రాయమును దెల్పు చున్నది."

ఉపపాదకులు—టి. ప్రకాశంగారు.

## ౬

## నూలుచందా సభ్యత్వ తీర్మానము

"అఖిలభారత కాంగ్రెసుసంఘము పాట్నాలో సమావేశమైనపుడు ప్రత్యామ్నాయ సభ్యత్వతీర్మానమును గావించి అఖిలభారతతంతుకారక సంఘమును స్థాపించుటకు సంబంధించిన తీర్మానములో (ఎ) భాగము నీసభ ధ్రువపరచుచున్నది."

ఉపపాదకులు—మహోత్సనిస్థానమున డాక్టరు సత్యపాలుగారు

## ౭

## రాజకీయ కార్యవిధాన తీర్మానము

సెప్టెంబరు 2 వ తేదీని పాట్నాలో జరిగిన అఖిలభారత కాంగ్రెసు స్థాయి సంఘ సభ గావించిన తీర్మానములోని (బి) భాగము నీ కాంగ్రెసు ధ్రువపరచుచు నిట్లు తీర్మానించుచున్నది:

దేశ క్షేమమున కవసరమగు రాజకీయకార్యవిధానమంతయును కాంగ్రెసే వహించి నడుపవలయును. ఇందులకు కాంగ్రెసుయొక్క డబ్బును, సామగ్రినంతను వినియోగింపవచ్చును. అయితే ఆ తీర్మానముప్రకారము అఖిలభారత తంతుకారక సంఘమునకు సంబంధించినట్టి డబ్బును ఆ స్తినిన్ని యెంగులకైన ప్రత్యేకింపబడిన నిధినిన్ని యుపయోగింపరాదు.

"దేశగౌరవమును, వాంఛితమును సఫలము చేసికొనుటకు తుట్టతుదకు శాసనోల్లంఘనమే సరియైన యస్త్రమని యీకాంగ్రెసు తనవిశ్వాసమును మరల దెల్పుచున్నది. కాని దేశమింకను అందులకు సిద్ధముగలేదని గుర్తించుచున్నది."

"అందుచేత రాజకీయకార్యవిధానము నంతను నడుపుటలో స్వయంసహాయమే ముఖ్య మనియు, యిందువలన దేశమభివృద్ధిగాంచగలదనియు, ప్రభుత్వమువారుగాని యితరులుగాని దేశము స్వరాజ్యమును బడయుట కడ్డుపడునెడల నిరోధించుటకిదియే ఆచరణీయధర్మ మనియు యీకాంగ్రెసు తీర్మానించుచున్నది.

1. "ఇకను యీకాంగ్రెసు యీక్రింది రాజకీయ కార్యవిధానమును యీదేశములో జరుపుటకు నిర్ణయించుచున్నది:

అ. ప్రజలకు వారికిగల రాజకీయస్వత్వములను దెలియజేయవలయును. ఆస్వత్వములను సంపాదించుటకు కావలసిన బలమును, నిరోధశక్తిని సంపాదించుటకు కాంగ్రెసు నిర్మాణకార్యవిధానము ననుసరించియు, ముఖ్యముగ రాటమును, ఖద్దరును ప్రచారము చేసియు, సర్వమతైక్యమును, అస్పృశ్యతా నివారణమును, నిమ్నజాత్యుద్ధరణమును, మద్యనిషేధమును, గ్రామ పునర్నిర్మాణమును, స్థానికసంఘముల నాక్రమించుటయు, జాతీయవిద్యావిధానమును, వ్యాపారాయిక పారిశ్రామిక కార్యవిధానమును కార్మికులకు యజమానులకు, భూస్వాములకు రైతులకు, సత్సంఘమును, దేశముయొక్క జాతీయ,సారస్వత, ఆర్థిక, పారిశ్రామిక, వాణిజ్యాభివృద్ధియు మనసునం దిడుకొని పనిచేయవలయును.

ఆ. "ఈదేశమున కావల చేయవలసినపని, విదేశములందు సరియైనవార్తలను ప్రచురించుటయై యున్నది.

ఇ. అసెంబ్లీలో 1924 ఫిబ్రవరి 18 వ తేదీని ఇండిపెండెంటు స్వరాజ్యపక్షములుగలసి కావించినతీర్మానమునే ప్రభుత్వమువారు పరిష్కరింపవలసిన విషయముగ దేశపక్షమున ఈకాంగ్రెసు అంగీకరించుచున్నది. అయితే ప్రభుత్వము వారింతవరకును దానికి ప్రత్యుత్తర మేమియు నీయకుండుటవలన అసెంబ్లీలో స్వరాజ్యపక్షము ప్రభుత్వమువారిని సాధ్యమైనంతత్వరలో దీనికి తుదిప్రత్యుత్తర మీయవలసినదిగ కోరుచు, ఫిబ్రవరిలోపల తమనిర్ణయమును ప్రకటింపకున్నను, అట్లు ప్రకటించినది తృప్తికరముగ లేదని అందుకునిర్ణయింపబడిన స్పెషలుకమిటీ నిర్ణయించినను, సభయందే ప్రభుత్వమువారి కావిషయమునుదెల్పి యిదివరకువలె శాసనసభలలోనుండి పనిచేయజాలమని ప్రకటించి అసెంబ్లీలోను స్టేటుకౌన్సిలులోను, ఫైనాన్సుబిల్లుకు ప్రతికూలముగ వోటుచేసి వెంటనే తమస్థానమును వదలిరావలయును. (ఈస్పెషలు కమిటీలో కాంగ్రెసువర్కింగు కమిటీసభ్యులును, అఖిలభారత కాంగ్రెసు స్థాయిసంఘము నియమించు సభ్యులును సభ్యులుగనుందురు.) ఆ సమయముననే సభలు జరుగుచున్న రాష్ట్రీయశాసనసభలందలి స్వరాజ్యపక్ష సభ్యులుగూడ తమస్థానములనువదలి, శాసనసభా సభ్యులటులు వదలినవారందరును అట్లు చేసినట్లు స్పెషలు కమిటీకి నివేదించి ముందేమి చేయవలెనో యడుగవలయును.

అప్పుడు సభజరుగుచుండెని శాసనసభల సభ్యులు తరువాత సభకు వెళ్లకుండనుండి స్వెషలు కమిటీ కావిషయమును దెలుపవలయును. ఇకను ఆశాసనసభయొక్క గాని, కమిటీ యొక్కగాని సభకు తనస్థానము ఖాళీగాకుండ జేయుటకును, రాష్ట్రీపుబడ్జెటును త్రోసివేయుటకును, లేదా, క్రొత్తపన్నులువచ్చిన త్రోసివేయుటకునుమాత్రము పోవచ్చును. అయితే తమ స్థానములను కాళీచేయవలెనని కోరుటకుముందు శాసనసభ లందలి స్వరాజ్యపక్షసభ్యులు ప్రస్తుతము పార్టీనిబంధనలవలన వీలైనంతవరకు తగిన పనులను చేయుచుండవచ్చును. ఏశాసనసభయందైనను సరే, స్వరాజ్యపక్షసభ్యులు ప్రత్యేకముగ అవసరమైనపనికి బోవలసి యుండునెడల స్పెషలుకమిటీ అట్లు పోవుటకు త్తరు వీయవచ్చును. పైన ఆ సబ్‌క్లాజులలో దెల్పిన రిపోర్టులు రాగానే స్పెషలు కమిటీ అఖిలభారత కాంగ్రెసు స్థాయి సంఘమును సమావేశపరచి కాంగ్రెసు స్వరాజ్యపక్షసంస్థయు గలసి దేశమునందు జేయవలసిన కార్యవిధానమును నిర్ణయింపవలెను. ఈకార్యవిధానముపైన 1,2క్లాజులలో దెలుపబడినదియు, నిందు దెలుపబడిన విధానమును యెన్నికదారులకు చేర్పుటయు, యీసారియెన్నికలను యేపద్ధతిమీద కాంగ్రెసు నడుపవలయునో, కాంగ్రెసుసభ్యులు యే అంశములమీద యెన్నికలందు పాల్గొనవలెనో నిర్ణయింపవలెను. అయితే ప్రభుత్వమువారు పైదెల్పిన పరిష్కారమునకు తృప్తికరముగ ప్రత్యుత్తరమిచ్చెనని కాంగ్రెసు అభిప్రాయపడువరకును ప్రభుత్వోద్యోగముల నంగీకరింపకుండనే యుండవలెను.

" వివిధ రాష్ట్రీయకాంగ్రెసు సంఘకార్యనిర్వాహకులు రాష్ట్రీయ శాసనసభలకును, భారత శాసనసభకును తమతమ రాష్ట్రీయులనుండి త్వరలోనే అభ్యర్థులను బెట్టవలయును. అసెంబ్లీ తీర్మానముపై ప్రభుత్వమువారిచ్చు తీర్మానము తృప్తికరముగ నుండి అంగీకారార్హముగనుండెనని స్పెషలుకమిటీ నిర్ణయించునెడల వెంటనే అఖిలభారతకాంగ్రెసు సంఘము సమావేశమై స్పెషలుకమిటీ నిర్ణయమును ధ్రువపరచియో త్రోసివేసియో భవిష్యత్తును నిర్ణయింపవచ్చును.

"స్వరాజ్యపక్షమువారు శాసనసభలను వదలివచ్చువరకును స్వరాజ్యపక్ష నిర్మాణ నిబంధనలే శాసనసభలం దనుసరించుచుండవలెను. అయితే మధ్య మధ్య అవసరమని తోచి, ఈ సబ్‌క్లాజులలో దెల్పిన పనులను ప్రారంభింపదలచిన యెడల మార్పులను జేయుచుండవచ్చును.

ఇందులకు ప్రథమమున ఖర్చులకు గావలసిన డబ్బును అఖిలభారత కాంగ్రెసు స్థాయిసంఘము యీయవలయును. ఇంకను డబ్బు గావలసియుండునెడల వర్కింగుకమిటీ ధనమును సేకరింపవచ్చును. లేదా ఆకమిటీ యుత్తరువుపై ప్రజల విరాళములను దీసికొనవచ్చును."

ఉపపాదకులు— పండిత మోతీలాలు నెహ్రూ.

## ౫

## 'భాషా' తీర్మానము

"కాంగ్రెసు, అఖిలభారతకాంగ్రెసుసంఘము,వర్కింగు కమిటీ సభలలో హిందూస్థానీలోనే కార్యక్రమము నడుపవలెనని గలదు. కాని హిందూస్థానీలో మాట్లాడజాలకున్న యెడల ఇంగ్లీషులోగాని మాట్లాడవచ్చును. రాష్ట్రీయ కాంగ్రెసుసంఘ కార్యక్రమము రాష్ట్రీభాషలో నడుపవచ్చును. హిందూస్థానీ గూడ నుపయోగింపవచ్చును."

ఉపపాదకులు—అధ్యక్షులు.

## ౬

## విదేశాంగ శాఖానిర్మాణము

" విదేశములందలి భారతీయుల క్షేమము ను గమనించుచు బ్రిటిషు సామ్రాజ్యమునందును,విదేశములందును వారిస్థితినిగూర్చి ప్రచారము జేయవలెనను నుద్దేశముతో కాంగ్రెసు క్రింద విదేశాంగ శాఖ స్థాపించడమైనది."

ఉపపాదకులు—అధ్యక్షులు.





# జీవితాదర్శము

పంగనామముల రామచంద్రరావు గారు

తరుణప్రాయులు వృద్ధికాములగు విద్యార్థుల్ దురభ్యాస త
త్పరులై లంకపొగాకు తమ్ములచేతన్ బుగ్గనానించుచుం
బురిలో రక్తసమానసహా రసముతోఁ బ్రోక్షింత్రు ఘంటాపథా
వరణంబాతయు నేనుఁ బూనితి యథాభక్తిం దదారాధనల్.

గీ. బాలసూర్యుండు వయసులోఁ బసచునుండ, మృదులశయ్యాతలంబును మెల్లవీడి
కాల్యములఁదీర్చి తిండి యాగిజీ భుజించి, మరులుగొంటిని సలపుఁ గస్వరపువిడెము.

(వక్రోక్తి)

గీ. ధూమపత్రంపుఁ బొడుము బెత్తులను బొడుగు, మేలికపురంపుఁ "గారకిల్లీ"ల నమలి
కాలమిత మెంచకుండ బుగ్గలను నాన్చి, మురిసి కొసరి యానితి దాని మొఱకుఁగంపు.

ఉ. సంతతవీటికాగ్రహణసంగతికై మది పల్లవింప గ
త్యంతర మేమి లేమికి నహర్నిశముం దములంబు నానుటన్,
దంతపుమల్లెమొగ్గలసితప్రభ లెల్ల నశించిపోవన
త్యంతము కావిగార జిగు రంతటఁ బట్టె నసహ్యవాసనన్.

మ. తములంపుం బెలిపండుటాకుమడతల్ దర్పంబుతో సేవితో,
నమలన్ భోజన మావలం బడక పైనన్ బుద్ధిపోలేన్ నితాం
తమనోరంజకధూమపానరచనానందంబు నాసించితిన్
భ్రమసంజాతతదీయసౌఖ్యములు దుర్గ్రాహ్యంబు లెవ్వారికిన్.

గీ. అప్పటికె నాకుఁ గౌమార మరిగెఁ గొంత, యవయవంబుల నింత సౌష్ఠవము గలిగెఁ
జూపుమార్గంబునందు నించుక విభేద, సిద్ధి వాలసెఁ బ్రకృతిపరిశీలనమున.

గీ. బ్రాహ్మణసనాతనాచారధమ మెల్ల, దోషభూయిష్ఠమంచు నీతులకు దిగితి
నంగసౌష్ఠవదార్ఢ్యముల్ చెంగలింపఁ, గొంటెమదనునిసేవ కాఁకొంటిఁ గరము.

మ. అతులానందమునం బ్రదోషసమయంబం దచ్యుతస్థాణుని
ర్మిత దేవాలయవాటికాంతరము దర్శింపం గరద్వంద్వసం

గంధపుష్పాద్యుపహారముల్ గొనుచు నేగం జూచి మాయమ్మ కా
మతి పోంద్రోలంగ వాదులాడితి ననన్మార్గప్రమాదంబునన్.

క. మడుగు సదాచారము నా, నుడుగులు విన నేనగింపు న్యూనతయుం బ్రియం
పడి జపతపములు సలుపుట, యడియాసలు తెల్విలేమి యంచుం దలంచితిన్.

మ. చిరకాలానుగతంబు భారతమహీశ్రేయస్కరోద్యద్గుణో
త్కరలనానాసుమదామచంపక మనంతా! పూర్వ మీగడ్డలో,
నెఱి జీర్ణించిన పుణ్యబీజము ప్రభాసిద్ధిద్ర దేవాలయాం
తరసందర్శనలాలసత్వ మిపుడౌనా దాని మాయింపంగన్.

క. దానిం బోకార్చుటకుం, గానము తగుకారణంబుం గాని మనోవా
దానుభవంబుల బలమును, బూనితిం దద్విముఖబుద్ధి ముద మిగురొత్తన్.

సీ. ఆశిరఃపాదమత్యంతనిర్మలదీక్షం, జల్లనితెలిసీట స్నానమాడి,
ఆఱవైచినపవిత్రాంతరీయంబగు, చేనూలుఖద్దరు మేనగట్టి,
ఫాలభాగంబునం గీలుకొల్పి నితాంత, మంజులోజ్జ్వల కుంకుమద్రనంబు,
నారంగరంభాది సారఫలంబులు, పసిండిపళ్లెరములం బట్టుకొనుచు,
నాత్మం బరమేశనామంబు నాడికొంచు, గాంధిపేట నాలయముల కడకుంబోవు
భక్తవర్యులదర్శనభాగ్యమునకు, మార్గ్మగముం గొంటిం బండితమ్మన్యుండ నయి.

ఉ. ఆయమతో వివాదముల నాండి "పరాత్పరమూర్తి దానిలో
నేయది? కానిపించు నొకడే కఠినోపలపిండ ఖండ; మా
తాయియె వేల్పుగాం దలంతురా? యవివేకము సంతతానుసం
ధేయము నిర్గుణాహితవినిశ్చితబుద్ధియె" యంచుం బల్కితిన్.

ఉ. నిర్గుణతత్త్వ మారయుట నేరుపు కాదన "ముట్టియొక్కరే
స్వర్గము నెక్కలేరని ప్రశాంతత యోచన సేయలేదు నా
మార్గమె యుత్తమంబని భ్రమంపడియుంటిని దల్లిమాట ను
త్సర్గమొనర్చి మార్వలికి దానికి నారడివోతి నెంతయున్.

## శ్రీ శారదా నికేతనము—గుంటూరు




పే ము త ర గ తి



గురుకుల భోజనారంభమున ప్రార్థనము




**తైత్తిరీయ స్మార్తబ్రాహ్మణనిత్యకర్మాష్టకము**

**బ్రహ్మశ్రీ కనుపర్తి మార్కండేయశర్మగారు**

బృందావనము, 82 పూనమల్లి హైరోడ్డు, కీల్పాకము, చెన్నపురి:—

వీరిప్పుడు క్రొత్తగా మూడవతూరి తాము ముద్రించిన 'నిత్యకర్మాష్టక' మను గ్రంథమును ఆదరముతో నొసఁగగా నందుకొని యీగ్రంథమునుగూర్చి నాయానందము నించుక యీక్రిందివిధమున వెల్లడించుచున్నాను.

ఇప్పటి కేనుబదియేండ్లక్రిందట శ్రీ చిదానంద సరస్వతీస్వాములవారని యాశ్రమనామమందిన బ్రహ్మశ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితులవారు ఆంధ్రద్విజులందు శిథిలమగుచున్న వైదికధర్మమును సంరక్షించి ప్రబలఁజేయుట ప్రఖ్యాతమేకదా! వారాకాలమున గుప్తములుగానున్న శ్రౌతస్మార్తగ్రంథములఁ గొన్నింటిని జక్కఁగా, బరిశోధించి నిర్దుష్టపఱిచి శిష్యులమూలమున ముద్రింపించి ప్రకటింపఁజేసిరి. వారు ప్రకటింపఁజేసిన స్మార్తానుక్రమణికకుఁ దెలుగుదేశమున మంచిగౌరవము గలదు.

వారి శిష్యపరంపరలోనివారగు శ్రీమార్కండేయశర్మగారు, ఇటీవల మరల నట్టిగ్రంథములను మిక్కిలి జాగరూకతతోఁ బరిశోధించి ఆంధ్రటీకాతాత్పర్య ప్రయోగవివరణాదులతో ముద్రించి ప్రకటించుచు వైదికకర్మాచరణపరాయణులగు నాంధ్రద్విజులకు నత్యంతము నుపకారము చేయుచున్నారు. వీరు మంచి విద్వాంసులగుటచేతను మిక్కిలిశ్రద్ధతో జక్కగా గ్రంథపరిశోధనము నెఱపి ప్రకటించుటచేతను వీరిగ్రంథములు ప్రామాణికములయి ప్రాజ్ఞులచే నాదృతములై ప్రఖ్యాతి కెక్కుచున్నవి.

ప్రస్తుతమయిన "తైత్తిరీయ స్మార్తబ్రాహ్మణనిత్యకర్మాష్టకము" అచిరకాలముననే మూఁడుముద్రణములఁ బడసిన దగుటచేతనే దీనికాంధ్రదేశమునఁగల సమాదర మెఱుకపడుచున్నది. పలువురు ద్విజు లీగ్రంథమును బారాయణము చేయుచుండుట నేనెఱుఁగుదును.

నిత్యకర్మలయిన స్నానసంధ్యాదుల యనుష్ఠానప్రకార మిందు స్పష్టముగాఁ దెలుపఁబడినది. ఉపోద్ఘాతప్రకరణము, స్నానప్రకరణము, సంధ్యావందనప్రకరణము, హోమప్రకరణము, బ్రహ్మయజ్ఞప్రకరణము, దేవతార్చనప్రకరణము, నిత్యవైశ్వదేవప్రకరణము, ప్రకీర్ణకప్రకరణము, అతిథిభోజనప్రకరణము, అని యీగ్రంథ మెనిమిదిప్రకరణములుగా విభక్తమైనది. అఱువదిపుటలలో వైదికకర్మాచరణావశ్యకతను, దత్స్వరూపమును దెలుపు పీఠిక గొప్పది గలదు. విద్యారణ్యభాష్యము ననుసరించి మంత్రములకన్నింటికిని తెలుగుటీక గ్రంథాంతమున ననుబంధముగాఁ జేర్పఁబడినది; గ్రంథమున నెక్కడికక్కడ ప్రయోగవివరణాదులు విస్పష్టముగాఁ దెలుఁగున వ్రాయఁబడినవి. పెక్కుచోట్ల ధర్మశాస్త్రపరిష్కారములు దెలుపఁబడినవి. సంస్కృతభాషాజ్ఞానము లేనివారుగూడ నీగ్రంథమును, సుస్పష్టముగా, నిర్దుష్టముగా నాయాకర్మల నాచరింపఁగల్గుదురు. వైదికకర్మాచరణమం దాదరము గలవారు, బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు— నీగ్రంథమును దగ్గఱనుంచుకొనఁ దగుదురు. ధ్యానశ్లోకానుసారము చిత్రింపఁబడిన గాయత్రీ త్రివర్ణచిత్రము ఈగ్రంథమున కొకవింత శోభను గూర్చుచున్నది. సాధారణబైండు 2-8-0 మేలు 3-0-0. వే. ప్ర.

## పూలదండ భా-౧.

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు (ప్రబుద్ధాంధ్రసంపాదకులు) కళాభివర్ధనీపరిషత్తు, ఇన్నీసుపేట, రాజమండ్రి. వెల రూ. ౧-౪-౦.

ఆదినుండియు నైతిక, చారిత్రక, జాతీయ, సాంఘిక జీవితములను వివరించుకథలు మానవవికాస విజ్ఞానములయొక్క అభివృద్ధికిఁ దోడ్పడుచుండు టెల్లరకు విదితమే. కాలము కడచు కొలఁది సాంప్రదాయములలో మార్పు కలుగుచుండును కాన నూతన సంప్రదాయవిలసితములగు నంశములను పొందికగాఁ గూర్చి యాయాకాలపువారికి రుచిపుట్టునట్లు చిన్నికథల నల్లుటయే కథకునికిఁ గలనేర్పు. అట్టికథలు సర్వజనసమాదరణపాత్రము లగును. వాని మూలమున మానవహృదయములయం దొకగొప్పమార్పును గలుగును. ఈ పూలదండలోనికథ లట్టి యుత్కృష్టగుణము గలవియే.

ఈభాగమున నిరువదికథలు గలవు. అవి ఇదివఱకే భిన్నపత్రికలయందు ముద్రితములైనవికాన వానియందలి సారస్య మాంధ్రలోకమునకుఁ గ్రొత్తగాదు. వానిలోఁ గొన్ని సాంఘికదురాచారముల నుద్ఘాటించుచు నున్నతముగ మార్పు లావశ్యకములని బోధించుచున్నవి. కొన్ని ప్రణయమాహాత్మ్యమును జాటుచున్నవి కొన్నివిధవావివాహరజస్వలానంతరవివాహావశ్యకతను వివరించుచున్నవి. కొన్ని సేవయొక్క కష్టములను, స్వాతంత్ర్యముయొక్క సుఖములను ఉల్లేఖించుచున్నవి. కొన్ని సాంసారికజీవితములందలి సుఖదుఃఖములను జవిచూపుచున్నవి. కథలన్నియు స్వతంత్రరచనములే. కథావస్తువు, సన్నివేశము అన్నిటియందును ఒప్పియున్నది. పాత్రపరిపోషణము సముచితరీతి నలరారియున్నది. అనావశ్యకప్రసంగ మెందును అంతగాఁ గానరాదు. వాడుకమాటలయందు రచింపఁబడిన పాటచే కథలమాధుర్యము ద్విగుణీకృతమైనది. అన్నియు యథారుచిగా నాంధ్రలోకమున కుపకరించునవియే.

శ్రీశాస్త్రిగారి కథకాగ్రణిత్వమును, సంఘసంస్కరణాభిలాషయు నీకథలయందుఁ బ్రత్యక్ష మగుచున్నవి. ఈసంస్కరణాభిలాష పాఠకజన హృదయసీమలఁ గూడ నెలకొనియుండునేని వీనివలని ప్రయోజన మనల్ప మని చెప్పకతప్పదు.

మున్ముందును శాస్త్రిగారికలము ఇట్టికథలను జిత్రించుటయందు మొక్కవడకుండునుగాక !



## శి ల్ప క ల్ప న ము

గున్నేపల్లి మృత్యుంజయ కవి గారు

ఉరియపడల్చిన దీపికాంకూరములు ప్రజ్వలించె మించులసురాళించురుచుల
మీటఁద్రొక్కిన గానపేటిరాగము లాలపించె నించులఁబిసాళించు చవుల
మఱి గదల్చినగంధమలయానిలము లేగు,రెంచెఁ గుంచెల దువాళించుగతులఁ
గీలుఁద్రిప్పిన భర్మసాలభంజిక లుపాసించె నంచల గుబాళించునడల
జంత్ర మదిమిన నవసుధాసారమధుర, జలము ప్రవహించె సురనదీ ఘులఘులారవముల నిరసించునటుల నీభవనసీమ, గరిత కీసుక మింకఁ గానఁగాన నగునె?

[సావిత్రీచరిత్రము

# एक-लिपि

## [महात्मा गांधीजी का अभिप्राय]

यदि हमको अपना यह दावा मजबूत बनाना हो कि हम एक-राष्ट्र हैं तो हमें बहुतेरी बातें एक-सी रखनी पड़ेंगी। भिन्न भिन्न धर्म-मतों और पन्थों के रहते हुए भी हमारे यहां संस्कृति की एकता तो है। हमारी त्रुटियां भी एक-सी हैं। मैं यह दिखलाने की कोशिश कर ही रहा हूं कि पहनाव के लिए एक तरह की वस्त्र-सामग्री केवल इष्ट ही नहीं आवश्यक भी है। हमें एक-भाषा की भी जरूरत है। प्रान्तीय भाषाओं की जगह पर नहीं, बल्कि उनके अलावा। और आम तौर पर यह बात मान ली गई है कि वह माध्यम हिन्दुस्थानी ही होना चाहिए, जो कि हिन्दी और उर्दू के मिलाप का फल हो और जिसमें न तो भारी भारी संस्कृत के शब्द हों और न अरबी या फ़ारसी के। अब हमारे रास्ते में सब से बड़ी बाधा है हमारी प्रान्तीय-भाषाओं की अनेक लिपियां। यदि हम एक-लिपि को अपना सकें तो हम अपने एक-भाषा-संबंधी वर्तमान स्वप्न को सच बनाने के रास्ते की एक भारी रुकावट दूर कर देंगे।

लिपियों की बहुतायत एक नहीं अनेक तरह से बाधक है। वह ज्ञान-प्राप्ति के रास्ते में एक जबरदस्त विघ्न है। आर्य-भाषाओं में इतनी समानता है कि यदि हमें उनकी विविध लिपियों को सीखने में बहुतेरा समय नष्ट न करना पड़े तो हम कितनी ही भाषाओं को बिना अधिक कठिनाई के जान सकें। जैसे-यदि किसी मनुष्य को थोड़ा भी संस्कृत का ज्ञान हो तो उसे कविवर रवीन्द्रनाथ ठाकुर की अनुपम रचनाओं का स्वाद लेने में कोई कठिनाई न होगी, यदि वे देवनागरी लिपि में प्रकाशित हों। जब कि मैं १९०५ में भारतवर्ष को लौटा तब, मैं समझता हूं, कलकत्ते की किसी एक समिति से मेरा पत्र व्यवहार हुआ था जो कि एक-लिपि-विस्तार के लिये प्रयत्न कर रही थी। यदि कुछ उत्साही लगनवाले कार्यकर्ता उठा लें तो इस दिशा में बहुत पक्का और सार-रूप काम हो सकता है। हां, इस कार्य की मर्यादायें जरूर हैं और वे स्पष्ट हैं। सारे हिन्दुस्थान के लिये एक-लिपि का होना एक दूरवर्ती आदर्श है। परन्तु उन सब लोगों के लिए जो कि संस्कृत से उत्पन्न होने वाली भाषायें जिनमें दक्षिण की भाषायें भी शामिल हैं, बोलते हैं, एक लिपि का होना व्यावहारिक आदर्श है, यदि हम सिर्फ अपनी प्रान्तीयता को दूर कर दें। उदाहरण के लिए एक गुजराती के लिए गुजराती-लिपि पर चिपक रहना कोई खास गुण नहीं है। प्रान्त-भक्ति अच्छी चीज है जब कि वह देश भक्ति की बड़ी धारा को सहायक होती हो। इसी तरह देशभक्ति भी उसी हद तक अच्छी चीज है जिस हद तक वह बड़ी धारा विश्व-भक्ति को सहायक होती हो। वह प्रान्त-भक्ति जो कहती है कि भारतवर्ष अपने घर गया, हमारे लिए गुजरात ही सब कुछ हैं, बुरी चीज है। जो वृत्ति हर प्रकार की बोली को स्थायी और उन्नत रूप देना चाहती है—इतनी संकुचित और दूसरे से फटक कर रहती है, वह राष्ट्र-धर्म और विश्वभाव के प्रतिकूल है। मेरी नाकिस राय में तमाम अनुन्नत और अलिखित

बोलियां महान्-हिन्दुस्थानी के प्रवाह में शामिल हो जानी चाहिए । यह बड़ी ऊंची कुर्बानी होगी, कोई खुदकुशी न होगी । यदि सुसंस्कृत हिन्दुस्थान के लिये हमें एक-भाषा बनाना है तो हमें भाषाओं और लिपियों की वृद्धि और भिन्नता को इस बढतीको रोकना होगा। हमको जरूर एक-भाषा तैयार करनी होगी। उसकी शुरूआत कुदरती तौर पर लिपि से ही होगी और जबतक हिन्दु-मुसलिम प्रश्न हल न होगा देश के हिन्दू लोगों में ही वह मर्यादित रहेगी । यदि मेरी चलती तो देवनागरी और उर्दू दोनों लिपियों का, अन्य प्रान्तीय लिपियों के अलावा हर प्रान्त में पढना अनिवार्य्य कर देता और मैं भिन्न भिन्न देशी भाषाओं के मुख्य ग्रंथों को देवनागरी लिपि में छपवाता और साथ ही उसका अक्षरशः अनुवाद भी हिन्दुस्थानी में छपाता । दुर्भाग्यवश अब तक थोडे ही कांग्रेस-वादियों ने देवनागरी लिपि सीखने की और उससे भी थोडों ने उर्दू-लिपि सीखने की तकलीफ गवारा की है ।



# సంశయాత్ముఁడు

జనమంచి వేంకట రామయ్య గారు

నింగి నడుచక్కినుండి యున్నిద్రమైన
తారకమునో లేఁదోఁచు సద్భావ మొకటి
నా మహృదిలోనఁ; గాని మర్నాఁడె యద్ది
క్రొత్తవెలుఁగిడిన నడఁగిపోయెఁ గసిరె నకట.

కొలనిసెజ్జను మెల్ల మేల్కాంచు పద్మ
ముకుళమటు సుమనోభాన మొకటిపుట్టె
నెడఁదయును; గాని యా సంజవేళనె యది
మొగిడి ముడిఁగెఁ దమం బయ్యె నిగుడ నకట.

చీఁకటియు వెల్గు వెలుఁగును జీఁకటియును
నట్టులున్నది నాబ్రదు కేమి చెప్ప !

చేటిలోపల నొక్క కావేటిగట్టు
మీఁద నొకకాలుగా నిల్చు మిడుకుచుండు.

హార్ద నడపును తేని గృహాంబులోని
వస్తుప్రకర్లు యట్లె నా భావమునకుఁ
రూపునుం బుట్టుకయు నోలి సంభవించు
నిలువ దొకవోట ముందు నే నిలిపినట్లు.

నేలఁ బర్విడఁజాలను కాలికొలఁద
నింగి కెగయంగఁజాల నుఱ్ఱక్కబలిమిఁ
గోడిపోలికఁ గాలుని కూరదాక
లోనఁ బడుదునొ చివరకు హీనగతిని.






## జాతీయ పర్వవారము

హిందూ మతమునకు నిలయమైన భరత ఖండమునందు క్రైస్తవపర్వ దివసములు జాతీయపర్వదినములుగను వెలయుట భారతీయధర్మార్థవిలయస్థితికి నిదర్శనము. స్వల్పసంఖ్యాకులైన యాంగ్లేయులును, వారి యనుచరులును వారి మతానుకూలముగను దేశమును నడుపుచున్న విధమును క్రిస్మసుపర్వదినములయుదంతము విశదము చేయుచున్నది. "యథారాజా తథా ప్రజా" యను నార్యోక్తికి క్రిస్మసుపండుగలు నిదర్శనము. రాజు బలవంతుడు. ప్రజలకు బలవంతమైన రాజధర్మావలంబన మలంఘనీయము. పాలకవర్గమునకు కాలక్షేపమును జేయుటకు క్రిస్మసుపండుగ లేర్పడినవి. పాలకవర్గము మీద నాధారపడిన ప్రజలకును తమమనోరథములను తర్కించి నిర్ణయించుకొనుటకీ సమయమే కుదిరినది. కాంగ్రెసుశీతకాలమున నుత్తరప్రాంతములందు గూడుట సామాన్యము. దుర్భరమైన చలికాలమునం దవ్యవధిగను కాంగ్రెసుయాత్రను జేయుట మాత్రాతత్పరులకు విధికృతమైనది. కాంగ్రెసు సమావేశమును సౌమ్యమైన చైత్రమాసమునకు మార్చుటకు జేసిన ప్రయత్నములు విఫలములైనవి. కాన్పురమునందును, నితర ప్రాంతములందును శీతలబాధ ననుభవించిన వారల క్షేమాన్వేషణను జేయవలసినయావసరము విశదమగుచున్నది. ఇతరకాలములందు నెల్లవారలపండుగల కేర్పడినసౌకర్యములు భారతీయులకు దుర్లభములు. రైలుబండ్లయందు మొదటిరెండవతరగతుల ప్రయాణీకుల కేర్పడిన రిటరనుటిక్కెట్లులును, నితరసౌకర్యములును వసంతనవరాత్రములందు దుర్లభములు. సకలసందర్భములందును భారతీయులకు పాశ్చాత్యప్రభుత్వానుకరణమే శరణ్యమని సామాన్య విషయములునయితము చాటుచున్నను భారతజాతీయప్రత్యభిజ్ఞానమునకు మూలమైన వివేకోదయముమాత్రము దూరస్థమగుచున్నది.

*　　*　　*　　*

వివిధమహాసభలు

భారతజాతీయప్రత్యభిజ్ఞానమునకు మూలాధారములైన మహాసభలు డిసంబరు మాసాంతమునందు భిన్నప్రాంతములందు గూడినవి. అనేకసభలు కాన్పురమునందు గూడినను ఇతరప్రాంతములందు సయితము మహాసభలుకొన్ని సమావేశమైనవి. ఆమహాసభలతత్త్వమును కాన్పూరుమహాసభల తత్త్వమునే విశదము చేయుచున్నది.

సభల ప్రయోజనములందు, సూక్ష్మదృష్టితో జూచునపుడు, భేదములు గోచరంబైనను స్థూలదృష్టితో నవలోకించునపుడు విశేష భేదము గనుపడదు. వివిధసభలయందును స్వప్రయోజనపరాయణత్వము దేశప్రయోజనములసంఘటనమునకుగొంత ప్రతిబంధకముగ నున్నను భారతిజాతీయప్రయోజనములు సభారంగములందు తాండవ మాడుచున్న విధమును సభలయుదంతములు విశదము చేయుచున్నవి. వివిధసభలయందు బ్రత్యక్ష మగుచున్న విభేదములు జాతీయదౌర్బల్యమును విశదముచేయుచున్నవి. అమరావతియందు శ్రీపానగల్లురాజాగారి యాధిపత్యముక్రిందను బ్రాహ్మణేతరమహాసభగూడినది. బ్రాహ్మణేతరోద్యమఫల మనుభవించినరాజాగారు బ్రాహ్మణేతరోద్యమప్రభావమును పొగడుటయందు విచిత్రము గనుపడదు. అధికారాభిమానుల కధికారప్రభావమునందు గల యాదరణము ప్రజాస్వాతంత్ర్యమునందు గనుపడదు. బట్లరుగారి తంత్రమునందు గనుపడిన సంభ్రమము తాంజేగారి ధర్మచ్యుతియందు గనుపడలేదు. బ్రాహ్మణేతరులుత్తమస్థానముల నాక్రమించుటకు బ్రయత్నించుట శుభావహము. బ్రాహ్మణేతరుల యుద్ధరణమునకు బ్రాహ్మణుల యుద్ధరణము వినియోగపడునుగాని బ్రాహ్మణుల పతనము వినియోగపడదు. బ్రాహ్మణేతరులు ధర్మరక్షణభారమును బూనునపుడు బ్రాహ్మణులకును శుభము సమకూడగలదు. మద్రాసునందు జాదవజిగారు పాడిన ద్వేషగీతమునే. రాజా రామారాయణంగారునుపాడకను బ్రాహ్మణేతరోద్యమము నుద్ధరింప గలిగిరి. రాజ్యాంగసంస్కరణవిషయముపట్లను లిబరలుపక్షము వారవలంబించినమార్గమునే బ్రాహ్మణేతరోద్యమమును నవలంబించుచున్నను సాంఘికప్రాతినిధ్యము బ్రాహ్మణేతరపక్షమునకు బీజముగ నున్నది. సాంఘిక ప్రాతినిధ్యము బ్రాహ్మణేతరపక్షదృష్టిని సర్వతోముఖమైన దేశమునుండి సంకుచితమైన స్వపక్షముమీద లగ్నము చేయుచున్నది. వర్తమానకాలమునందు బ్రాహ్మణేతరసంఘములనువలె నితరసంఘములను సాంఘిక ప్రయోజనములు బలీయముగను నాకర్షించుచున్నవిధమును నితరసభలవృత్తాంతములును విశదముచేయుచున్నవి.

దృష్టిని కలకత్తా సభారంగమునుండి అలిఘడుసభారంగమునకు బ్రసరింపజేసినపుడే విషాదనాటక ప్రదర్శనమే గోచరం బగుచున్నది. అలిఘడు విశ్వవిద్యాలయమును ఇస్లాము విజ్ఞానమునకు కేంద్రస్థానమును జేయుట ప్రశంసార్హమై సకల జనామోదమును బడయగలదు. విజ్ఞానాలయమును బ్రవేశించుట కేసంఘమునకును బ్రతిబంధకములు లేవు. విజ్ఞానస్వరూపమునందు హిందూమహమ్మదీయ, బౌద్ధ, క్రైస్తవవిభేదము లపరూపములు. విజ్ఞానము నెవరేవిధముగ నుపాసించిన నావిధమునను ప్రత్యక్షమగుచుండును. మానవులు విజ్ఞానమతవ్యాజమునను స్వప్రయోజనములకు భేదావరణములను గల్పించుకొని కలహకారణములను గల్పించుకొనుట విచి

త్రముగ నున్నది. అలిఘడునందు మహమ్మదీయ మహాసభ గూడినది. సర్ అబ్దుర్ రహీముగారు మస్లిము సభాపాలిగీతమును బాడిరి. అబ్దుర్ రహీముగారి దృష్టియందు 22 కోట్ల హిందువులుగాని ఇతరులుగాని నిలుచుటలేదు. ఆదిమవాసులగతి యెట్టులున్నను మహమ్మదీయుల క్షేమమునుమాత్రము రహీముగారు గోరుచున్నారు. భరతఖండమునకు వెలుపల నున్న మహమ్మదీయుల మీదను ప్రసరింపజేసిన కటాక్షవీక్షణములలో శతాంశమునైన ను స్వదేశవాసులైన భారతీయుల మీదను ప్రసరింపజేయకుండుట సంతాపకరము. రహీముగారు మహమ్మదీయులకు సకల సంస్థలయందును ప్రత్యేకప్రాతినిధ్యమును భాగధేయమును గోరుచున్నారు. రహీముగారు ప్రత్యేక ప్రాతినిధ్య ప్రయోజనములతో సంతృప్తిని బొందకను హిందువులు స్వీయాభివృద్ధికి జేసెడి ప్రయత్నములను సయితము నిరసించుచున్నారు. హిందూమహమ్మదీయ విభేదము లిప్పుడు ప్రబలియున్నట్లు లిదివరలో ప్రబలియుండలేదని అబ్దుర్ రహీముగారు నుడువుచున్నారు. విద్యావంతుడును, రాజ్యాంగవేత్తయును నైన రహీంగారే స్వసంఘాభిమానమునుబూని దేశ ప్రయోజనములను వెనుకకు బెట్టునపుడు దేశ దౌర్భాగ్యస్థితిని వర్ణించుట యనవసరము. కాన్పూరునందుగూడిన ఖిలాఫతుసభయందు చేసిన ప్రసంగములును మహమ్మదీయుల దృక్పథమును హెజాజుమోసులు ఇరాకు ఆకర్షించునట్లులు జన్మభూమి ఆకర్షించుట లేదని విశదమగుచున్నది. హిందూమహమ్మదీయ విభేదములను నశింపజేయుటకు గాంధి మహాత్ముడవలంబించిన త్యాగమార్గ మంతరించి రాగమార్గము ప్రబలినపుడు దేశస్థితి దుర్భరముగ నున్నవిధము విశదమగుచున్నది. గాంధిమహాత్ముడు నడిపినట్టులు దండప్రయోగముగాని యుభయసంఘములకును జ్ఞానోదయమును గలుగజేయజాలదని యూహింపదగియున్నది.

* * * *

### కాన్పూరు సభలు

కాన్పూరుప్రదర్శనము, కాన్పూరు సభలు,జననివహంబులు ప్రజాహృదయమునందుదయించుచున్న సర్వతోముఖమైన ప్రబోధమును విశదముచేయుచున్నవి. ఇతరస్థలములందును, కాన్పూరునందును ననేకసభలుగూడినను దేశము నాకర్షింపగల సభారాజము భారత జాతీయమహాసభయని విశదమగుచున్నది. కాన్పూరునందు కాంగ్రెసుమహాసభ నాశ్రయించుకొని హిందూమహాసభ, ఖిలాఫతుసభ, గాయకసభ, ప్రకృతివైద్యసభ, హిందుస్థాన సేవాదళసభ,సాంఘికసభ,రాష్ట్రభాషాసభ, సాంఘికవాదసభ, మొదలగు సభలుగూడి స్వధర్మనిర్వహణ సాధనములను నిర్ణయించినవి. ఇన్ని సభ లేకప్రాంతమున గూడుటయును నాలుగైదుదినములలో కార్యప్రణాళికను నిర్ణయించుటయును నసాధ్యమైనను నానాప్రాంతవాసులైన సేవాపరాయణుల సాహచర్యమునకునుసంప్రతింపునకునుకాంగ్రెసుయాత్ర వినియోగపడుచున్నది. సభ్యులకుగల స్వల్ప కాలావకాశములు సంపూర్ణ

ముగను వారిన్నట్టిని కార్యసాధనమును పను
లన్నము చేయుటకు వీలుగలుగకున్నది. ప్ర
త్యేకవిషయములకు సంబంధించిన సభలు
ప్రత్యేకప్రదేశములందు సమావేశానుకూలము
గను గూడి విషయనిర్ధారణను జేయవలసిన
కాలము సంప్రాప్తమైనవిధమును దేశపరిస్థితులు
విశదము చేయుచున్నవి. అన్నివిషయము
లను నసంపూర్తిగను నాలోచించుటకంటెను
కొన్నివిషయములనైనను బాగుగ నాలోచించి
నిర్ణయించుట ప్రయోజనకరము.

హిందూమహాసభ నేలకొలది ప్రజల
దృష్టి నాకర్షించినది. అధ్యక్షులు చింతామణి
కేల్కారుగారు, లాలాలజపతిరాయిగారు,
మదనమోహన మాలవ్యగారు హిందూమహా
సభ హిందువుల యాత్మోద్ధరణమున కేర్పడిన
విధమును విశదముచేసిరి. మహమ్మదీయ పక్షా
భిమానుల కిది యక్రమమార్గముగను గనుపడి
నను దేశపరిస్థితులు హిందూసంఘటనము
సక్రమమార్గమని విశదము చేయుచున్నవి.
ఆత్మసంరక్షణ సామర్థ్య మాత్మగౌరవ విశ్వా
సములను గలుగజేయగలదు. ఇతరసభల
వ్యవహారములును స్వయంవికాసమునకు వివి
ధాంగములందును భారతీయులు చేయుచున్న
ప్రయత్నములు విశదము చేయుచున్నవి.

* * * *

కాంగ్రెసు నిర్ణయము

అసహాయోద్యమ మారంభమైనతరు
వాతను జరిగినకాంగ్రెసులందు కాన్పూరు
కాంగ్రెసు సకలవిధములను సారహీనముగ
నున్నది. కాంగ్రెసుక్రమముగను కార్యరంగ
మునుండి యుపన్యాసరంగమునకు తిరిగి మారినది.
శ్రీమతి సరోజినిదేవి యధ్యక్షోపన్యాసము
కాన్పూరు కాంగ్రెసునకు గొప్పప్రముఖత
నొసంగినది. సరోజినిదేవిగారి గంభీరమైన
భావములు,మధురమైనశైలి,అనర్గళమైనధార,
మంజులమైనస్వనము, అపారమైనవక్తృత్వ
సామర్థ్యము సభాసదుల చిత్తవృత్తి నాకర్షిం
చినది. దేవిగారి యుపదేశము సిద్ధాంతముల
తోను సదాశయములతోను సద్భావముల
తోను, నిండియున్నను, కార్యసాధనమును
నిర్దేశించి యుండలేదు. దేశము నైదేంప్లు
గను కలవరపరచుచున్న యసహాయోద్యమ
ప్రశంసయె కనుపడకున్నది. దేశమును కలవర
పరచుచున్న క్లిష్టసమస్యలను విమర్శించి
నిర్ణయించుట కేవిధమైన సాధనములును
సూచించియుండలేదు. ఉపన్యాసము భారతీ
యాశయములను హృద్యముగను దెలిపెడి
భావగీతముగ నున్నది. కాంగ్రెసు ఆమోదిం
చిన తీర్మానములును నిరర్థకములుగ నున్నవి.
ఖద్దరు,నూలుచందా విషయములందు పాట్నా
తీర్మానమును కాన్పూరు కాంగ్రెసు సమర్థించి
నది. నూలుచందాను ఖద్దరుధారణమును
తొలగింపవలయునని మహారాష్ట్ర నాయకు
లుపపాదించిన తీర్మాన మోడిపోయినను దేశ
మునావరించిన విషాదావస్థను విశదము చేయు
చున్నది. శాసనసభల వ్యామోహా
ముతో ప్రాతపద్ధతులు బయలుదేరినవి.
న్యాయవాదులబలము కాంగ్రెసురంగమునందు
ప్రబలినది. మాటలరాజ్యము తిరిగి స్థాపిత
మైనది. అసహాయయోగము క్రమక్రమము



శ్రీ యం. సింగారవేలు సెట్టిగారు
అధ్యక్షులు, కమ్యూనిస్టుమహాసభ-కాన్పూరు



శ్రీ తులసీచరణ గోస్వామిగారు
అధ్యక్షులు, అఖిలభారత స్వచ్ఛందసేవాదళ సమావేశము-కాన్పూరు



యన్. సి. కేల్కారుగారు

అధ్యక్షులు, హిందూమహాసభ-కాన్పూరు



స్వామి శ్రద్ధానందులు

అధ్యక్షులు, నిమ్నజాతిమహాసభ-కాన్పూరు

తగిన ప్రత్యుత్తరమును బడయనపుడు సభ్యత్వస్థానములను ఖాళీగనుంచవలయునని నిర్ణయించినది; కాని ఈపని బడ్జెటు చర్చ ముగిసినతరువాత జరుగవలయునని నిర్ణయించినది. బడ్జెటుచర్చ జరిగిన తరువాత శాసనసభలు సామాన్యముగను నంతము నొంద నున్నవి. రాజ్యాంగశాఖను కాంగ్రెసు నిర్వహింపవలయునని నిర్ణయించినది. శాసనసభాందోళనమే రాజ్యాంగాందోళనముగను బరిణమించినపుడు రాజ్యాంగాందోళనము పట్లను కాంగ్రెసు నిర్వహింపవలసిన భారము గనుపడదు. స్వరాజ్యపక్షము రాగలసంవత్సరమునం దెన్నికల యాందోళనముగాకను చేయగల రాజ్యాంగాందోళనము గాని, నిర్వహింపగల కార్యవిధానముగానిమృగ్యముగనున్నది. ప్రజాహృదయమున కుత్తేజమునుగలుగజేయగల కార్యవిధానమును స్వరాజ్యపక్షము నిర్ణయించనపుడు కాంగ్రెసుపక్షమునకును నితరపక్షములకును శాసనసభా వ్యవహారములందును ఎన్నికలసిద్ధాంతమునందును విశేషమైన భేదముగనుపడదు. స్వరాజ్యపక్షమునకును, నితరపక్షములకును భేదము మంత్రిపదవులను స్వీకరించుటయందు మాత్రమే కలదు. ఇదియొక విశేషమైనను ప్రజాహృదయము నాకర్షింపగల విషయముగ గనుపడదు. కాన్పూరుకాంగ్రెసు స్వరాజ్యపక్ష విజయమును ప్రకటించుచున్నను స్వరాజ్యపక్షబలమునకుగాని భిన్నపక్షముల సంయోగమునకుగాని వినియోగపడలేదని వ్యవహారములు విశదము చేయుచున్నవి.

### గాంధిమహాత్ముడు

ప్రపంచదృష్టి సత్యాగ్రహవ్రతపరాయణుడైన గాంధిమహాత్మునిమీద లగ్నమైనవిధమును కాంగ్రెసువేదికనుండి హోమ్సు పండితుడుచేసినప్రసంగమువిశదము చేయుచున్నది. మహాత్మునకు భరతఖండమునందు బుట్టిపెరిగి ఆఫ్రికాయందు సత్యాగ్రహవ్రతానుష్ఠానమును జేసినను ప్రపంచమునంతకును నూతన ధర్మము నుపదేశించుచు నన్ని దేశములకును జెందియున్నాడు. సత్యాగ్రహసాధనమునను వ్యక్తులు, సంఘములు,జాతులు, సంకల్పమును బడయగలవిధమును మహాత్ము డుపదేశించుచున్నాడు. ఆయుపదేశబీజములు సారవంతములైనను క్షేత్రబలములేకను నిర్వీర్యముగనున్నవి. అసహాయోద్య మారంభమునందు సత్యాగ్రహోదయారంభమునందు గల యుత్సాహము క్షీణించినది కాంగ్రెసునందు దౌర్జన్యపక్షము నయితము తలయెత్తుచున్నవిధమును హజరతుమోహానిగారి ప్రసంగములు విశదముచేయుచున్నవి. ప్రపంచమునం దంతటను సంగ్రామానలము చల్లారకమునుపే సంగ్రామ చిహ్నములు బయలుదేరుచున్నవి. శాంతిదూతయైన గాంధిమహాత్ముని సందేశము పశుబలారాధనపరాయణమైన ప్రపంచమునకు తలకెక్కకున్నది. హిందూ మహమ్మదీయ విభేదములు, బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములు, బహిష్కారప్రతిష్టంభన విభేదములు, సహకార ప్రతిఘటన విభేదములు దేశమును కీలాభీలము చేయుచున్నవి. పరమనిగ్రహా

పరాయణుండైన మహాత్ముఁడు నయితము నిరాశను జెందినటులు గనుపడుచున్నది. గాంధిమహాత్ముని యారోగ్యము చెడినది. అనారోగ్యము, సందిగ్ధస్థితి, ఆశ్రమవాసస్వీకారమునకు వినియోగపడినవి. గాంధిమహాత్ముఁడు 1926 సంవత్సరమంతయును సబర్మతి యందు నివసించుటకు నిశ్చయించెను.

మహాత్ముని బలములేని రాజ్యాంగాందోళనము బలహీనముగనుండగలదు. గాంధిమహాత్ముఁడు వర్తమానసంవత్సరమును తన కామధేనువైన ఖద్దరు నారాధించుటకు వినియోగించదలచినటులు ప్రకటించియున్నాఁడు. తంతుకారసంఘమును, ఖద్దరును వికసింపజేయుటకు మహాత్ముఁడు పూనియున్నాఁడు. గాంధిమహాత్మునిపట్లను, మాతృభూమిపట్లను భక్తిగలవారందరును వర్తమానసంవత్సరమునందు మహాత్ముని సంకల్పమును సఫలముచేయుటకు యావచ్ఛక్తిని వినియోగించి ధన్యవాదములకు పాత్రు లగుదురుగాత! లాలా లజపతిరాయిగారు తెలిపినటులు సకలమును నంధకార బంధురముగ నున్నది. ఈ విషాద సమయమునందు భారతీయులు హృదయదౌర్బల్యమును విడిచి స్థితప్రజ్ఞులై గాంధిమహాత్ముఁడు సంకల్పించిన నవధర్మసంస్థాపనము చేయుటకు కర్మయోగులై లోకకల్యాణమునకు దోడ్పడుటకు భగవంతు డనుగ్రహించుగాత!




# జీవితమ్మదియేల? చింతలింకేల?

తురగా వేంకటరామయ్య గారు

పండువెన్నెలబయట పాడేటివేళ
  రాగాలు వనవీధి రంజిల్లువేళ
భావంపుటుయ్యాల పై కేగువేళ
ఆకాశమార్గాల కరిగేటివేళ
  ఆకారమేలా? యహంకారమేలా?
  జీవిత మ్మదియేల? చింతలింకేల?

అంతరంగము సంద్రమై పొంగువేళ
మేఘాలు పడవలై మెలగేటివేళ
చంద్రుండు పయనమ్ము సాగించువేళ
ఆలోక మీలోక మందేటివేళ
  ఆకారమేలా? యహంకారమేలా?
  జీవిత మ్మదియేల? చింత లింకేల?

ఆకాల మీకాల మనలేనివేళ
ఆపాప మీ పుణ్య మనుకోనివేళ
ఆరూప మీరూప మనరానివేళ
ఆనందమయుఁగూడి యాడేటివేళ
  ఆకారమేలా? యహంకారమేలా?
  జీవితమ్మదియేల? చింతలింకేల?

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press No. 7 Thambu Chetty Street, G. T., Madras

# శ్లిష్టాక్షరపదబంధము

## (CROSS WORD PUZZLE)

మార్గశిరమాసమున ప్రకటించినదానికి ఉత్తరము

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వి 1 | దు 2 | ర 3 | కా 4 | వ 5 | లి | ■ | పే 6 | రా 7 | ల 8 | ■ | నే 9 |
| డ 10 | మ్మా | యి | చ 11 | క్ర | వా 12 | క 13 | ము | చు 14 | ప్ప | నా | తి |
| ■ | ర 15 | క | ము | వా 16 | త | రు | జి 17 | ■ | ము | ■ | జీ |
| యు 18 | ము | నా 19 | న 20 | వి 21 | నా 22 | ణా | ము | ల | నా 23 | గ | ర |
| యూ | ■ | గా 24 | లి | గు | తి | క 25 | డా | ర | ము 26 | ■ | కా |
| తి 27 | రు 28 | వ 29 | ని 30 | ■ | జా 31 | ము 32 | ■ | క్రౌ 33 | స | శ్వే 34 | య |
| ■ | మ్మా 35 | శ్రీ | గ 36 | రా | గ | రి | కే | మ్మా 57 | లి | మి | ■ |
| అ 38 | ణి | మ | ని | క్ర 39 | ర 40 | వా 41 | లు | ర 42 | వ 43 | తి | అ 44 |
| మ | ■ | మా 45 | గ | ధి | త 46 | డ | ■ | ము 47 | ర | ■ | మ |
| రు 48 | మా 49 | ల | లు | గో 50 | వ | స 51 | ము | ■ | దా | గో 52 | రా |
| క 53 | వి | వి | ■ | పు | ము 54 | ర | జా 55 | రా 56 | వ | ము | వ |
| ము 57 | ల | క | నా 58 | డు | ■ | కు | యూ 59 | మి | నీ | ప | తి |

గెలిచినవారు

మొదటి బహుమానము-శ్రీమత్కందాడై గోవిందాచార్యులుగారు, విజయరాయి, విజయరాయి పోస్టు, పశ్చిమగోదావరి

రెండవ ,, శ్రీ.న.చ. వరదాచార్యులయ్యవార్లుగారు, [బ్రహ్మానందదాయినీ గ్రంథభాండాగారముతోసహ]

విస్సాకోడేరు, విస్సాకోడేరుపోస్టు, పశ్చిమగోదావరి

మూడవ ,, భమిడిపాటి సుబ్బారావుగారు, నరసాపురం, పశ్చిమగోదావరి


విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—ప్రేమారాధనము, తటాకము, గాజుచెంబు, వర్షర్తువు.

ఏకవర్ణ చిత్రములు:—40 వ జాతీయ మహాసభ వి ౮, ముఖలింగనగరము వి ౬, నయగారా జలపాతము, ప్రథమార్య వైశ్య యువజనమహాసభ, చెన్నపురి; ఆహ్వాన సంఘాధ్యక్షుడు, అధ్యక్షుడు, శ్రీమతి వేముగంటి పాపాయమ్మగారు; ఇతరచిత్రములును.





చెన్నపట్టణము ఫిబ్రవరి ౧౯౨౬

సంపుటము 3 | క్రోధన సంవత్సరము, మాఘమాసము | సంఖ్య ౨

# మేఘము

అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి గారు (శతావధాని)

తొలుదొల్తన్ జిలుజొంపముల్ వెలయఁగాఁ దోఁచున్ భవన్మూర్తి వా
నలకాలం బొకయింత దవ్వులనె కన్పట్టంగ నేఁటేఁటఁ దా
వులఁ దత్కాలమునందుఁ బొల్చుకుటజంబుల్ గాన్కఁగా నిత్తు వ
ర్థిలు మోదంబున నీకుఁ జేకొనుము ప్రీతిన్ బ్రావృషేణ్యా భ్రమా!

చ. కురియదు తేనెబిందువులకుం దులఁదూఁగెడు వర్షబిందువుల్
పొరిఁబొరి నంచు సావహితబుద్ధి దలిర్పఁగఁ జూచునోయనన్
దరువులు దోఁచె గాడ్పులు గదల్పమి నిశ్చలభావమొప్ప స
త్వరముగ వర్షహర్షమునఁ దన్పుము లోకముఁ బ్రావృడబ్దమా!

మ. పొరి మోమెత్తి కృషీవలాంగనలు సభ్రూభంగ శృంగార భా
స్వర చేష్టావిరహీవలోకముల వాంఛల్ వారఁ బ్రేమించుచున్
గఱువల్ దీఱఁగఁ గాంచుచుండఁ జెలువౌ కంపంబులన్ మిన్నునన్
వరుసల్ దీరెదు వానపందు వెపుడో! ప్రావృట్పయోవాహమా!

చ. మసకలువాఱు నల్పులఁ గ్రమంబుగఁ బింజలు బింజలై దిశా
విసరముఁ గ్రమ్ముచున్ విషమవిస్తృతులం జనుఖండరూపముల్
ప్రసరదనల్పవాతగతులం జెదరంగ నభస్స్థలంబునన్
మసలెదు వారిసంపన్నులమాటఁ దలంపు ప్రావృడభ్రమా!

ఉ. చల్లని వర్షబిందువులు నారెకు నీయుదరంబునుండి పు
మ్మెల్లరఁ జిమ్ముచున్ సలుపఁ బృథ్వి నేడాఫెడ దాలు టెన్నఁడో!
వెల్లు హృదాలవాలముల వెల్లునలోఁచుఁ బ్రమోదపూరముల్
కొల్లలుగాఁగ నిన్నుఁ గనుఁగొంటయు నెన్నఁడొ! ప్రావృడభ్రమా!

చ. ఒకపెను పిప్పొఱజూపెదు మఱొక్కనెపన్ గుమిగూడి దాకసం
బౌకపరిఁ గ్రమ్ముచుండెదు సముద్ధతమారుతకంపితాకృతి
ప్రకటనముల్ సెలంగఁగ నభస్స్థలి నాటలఁగోఁటః సూఁగా
నోకా! మధురాంబుబిందువుల యోగము గూర్పుము ప్రావృడభ్రమా!

చ. చెలువఁపుఁ గప్పడాల్ కటికిచీకటి పల్పులఁ బోల సచ్ఛపుం
జెలిజిగిమేళనన్ మెలఁగఁ దిన్నని రేఖలవెల్గు లేర్పడన్
జలలవదానమంగళముఁ జాటెడు నీహృదయంగమ ప్రభా
వళి భువిఁ జూపఁజన్ దనుప వర్తిలుచుందువు వర్షుకాభ్రమా!

మ. కరువంపుం బొఁగవన్నెఁ బొల్పుచిత్రచాపల్ గ్రాలద్యోవారిధిన్
మరుదుచ్చావచనౌప్రచారములు సమ్మర్దంబుఁ గల్పించె నీ
శ్వరుఁ డత్యాయతరోదసీకుహరసంచారాఢ్యమా నీ మహో
వరణాంబున్ దెసలందుఁ గీల్కొలుపుచున్ బ్రావృట్పయోవాహమా!

ఉ. తోరపురేఖవై గగనతోయధియందలి పెద్దయోడగాఁ
దీరిచియుండు దిగ్వలయతీరము డాసి మనోహరోజ్జ్వలా
కారము లొప్ప ఖండములుగాఁ జనుచున్ బ్లవపాళిఁబోలు ది
చ్ఛారచితాకృతుల్ గొనఁగఁ జాలినజాణవు వర్షుకాభ్రమా!






## లీలావతీకథ

ఇది యొకప్రాకృతకావ్యము. సంపూర్ణవ్యాకరణము లేని యంధ్రభాషలో శబ్దసంస్కారక్రమ మెఱుంగుటకుఁ బ్రాకృతభాషలు చాలఁ బ్రయోజనకారు లగు. నన్నెచోడుని కుమారసంభవములోని ప్రాచీనప్రయోగములకంటెఁ, గొన్ని శిలాతామ్రశాసనప్రయోగములకంటెను బ్రాచీనతరము లగు వేఱులక్ష్యములు గానరాకున్నందునఁ దెనుఁగుశబ్దములమూలమును బరీక్షింపఁ సంస్కృత, ప్రాకృత, శౌరసేని, మాగధీ, పైశాచులుతప్ప గత్యంతరము లేదు. పాశ్చాత్యులగు శబ్దతత్త్వజ్ఞులు సకలభాషామూలపరిశోధకులై యార్యభాషాసంఘముతో ద్రవిడభాషాసంఘమునకు సంబంధము లేదని యుద్ఘోషింతురు కాని, ద్రవిడభాషలకు సంస్కృతప్రాకృతములే మూలము లనియు, విశేషించి ద్రవిడభాషాసంఘములో నాంధ్రభాషాశబ్దములే తమిళకర్ణాటభాషాపదములకంటెఁ బ్రకృతిరూపసంపన్నములనియు, నంధ్రభాషాశబ్దధాతురూపములకు మూలధాతువులు కొన్నియే యనియు, నవి ద్రవిడభాషాసంఘమున కెల్ల సాధారణధాతువు లనియుఁ దత్ప్రత్యయతత్త్వము ప్రాచీనసంస్కృతప్రాకృతవికారధర్మసంగత మనియు మా యభిప్రాయము. ఏతద్భాషానాసంస్కారముతోఁ సంస్కృతప్రాకృతకావ్యపరిశోధనము ముఖ్య మని నివేదించుటకే యిప్పుడిప్పుడు తద్భాషా గ్రంథసంజల్పముతోఁ గాలవిడంబనము చేయఁగోరుచున్న మమ్ము భాషాసేవకులు క్షమింతురుగాక.

ప్రాకృతభాషను మనపూర్వులు చాల నాదరించి రనుటకుఁ బెద్దకోమటి వేమభూపతి శ్రీనాథాదులు సాక్షు లగుచున్నారు. ప్రాకృతములో సప్తశతియు, సేతుబంధమును జాలఁ బ్రౌఢము లైనవి. బహుకవిసుభాషితరత్నముల సమాహరించి శాలివాహనుఁడు పద్యకోశముగా సప్తశతి యనుపేరఁ గూర్చెను. సేతుబంధకర్త ప్రవరసేనుఁ డను కుంతలాధీశ్వరుఁడు కాళిదాసునకు మిత్రమట. కాళిదాసభవభూతులు విదర్భదేశవాసు లనియు నాంధ్రు లనియు విశ్వసించుచున్నారము. విక్రమాదిత్యుఁడు సంస్కృతమును బోషించినట్లే శాలివాహనుఁడు ప్రాకృతమును గొనియాడెను. బౌద్ధమతప్రచారబలమున దేశభాషాప్రవృద్ధి చెందుచున్న కాలములో మహారాష్ట్రదేశవ్యాప్త మగుప్రాకృతవిశేషమును శాలివాహనాదులు గ్రంథస్థ మగునట్లు లక్ష్యలక్షణ

సంపన్నముగాఁ జేసిరో యని యూహించె దము. "శ్రూయతే చ కుంతలేషు సాతవాహనో నామ రాజా, తేన ప్రాకృతభాషాత్మక, మంతఃపుర ఏవేతి సమానం పూర్వేణ." అని రాజశేఖరుండును,

"కేఽభూవన్నాఢ్యరాజస్య
రాజ్యే ప్రాకృతభాషిణః,
కాలే శ్రీసాహసాంకస్య
కేన సంస్కృతివాదినః"

అని శృంగారప్రకాశమున భోజుండును సాతవాహనుని ప్రాకృతభాషాదరమును వర్ణించియున్నారు. ఆఢ్యరాజే శాతవాహనుఁడని రత్నేశ్వరమిశ్రాదులమతము. ప్రాకృతభాషలో మధురమై ప్రసన్నగంభీరభావగర్భమైన కావ్యసంచయమే మనకాలమువఱకు శేషించె. సర్వసేనునిహరివిజయము, నాఢ్యరాజు రావణవిజయము, మారీచవిజయాదులు నంతరించె ననుట శోచనీయము.

శాతవాహననామకరాజ సంశజులు ప్రాకృతభాషాదరణ మఖండముగాఁ జూపి సంగీతసాహిత్య శాస్త్రములుకూడ నందే కూర్పించుచుండిరి. తుంబురుఁడు తననాట్యశాస్త్రమును ప్రాకృతముననే రచించి శాతరాజును దద్గ్రంథాంతమున నిట్లు పేర్కొనుచున్నాడు:

"జఇ వడఇ సాలశాఅ
గంధర్వకళంజ...తుంబురుణా,
సరదవిణోదేణ కిదం
నాడఅగేఅంసలక్ఖణం ఏదం"

ఛాయా---

[యదిపఠతి శాతరాజా గంధర్వకళాం నో(గంధర్వకులజేన?)తుంబురుణా, శరద్వినోదేన కృతం నాటకగేయస్యలక్షణమేతత్.]

"అమిఅం పాఉఅకబ్బం" (అమృతం. ప్రాకృతకావ్యమ్) అని శ్లాఘఁ గన్నతద్భాషాకావ్యజాలములో లీలావతియనునొకగ్రంథము మేము చదివి యానందింపఁగంటిమి. సహృదయాహ్లాదకర మగు దానిగుఱించి యించుక నివేదింపంబూనుట కేవలము జిహ్వాచాపలమే.

లీలావతీకథానాయకుఁడు సుప్రసిద్ధుఁడగుహాలుఁ డను శాతహనుఁడు. లీలావతి సింహళరాజకుమారిక. దానిచెలులు మహానుమతియుఁ గువలయావళియు. కాదంబరీకథలో మహాశ్వేతవలె మహానుమతి యిందునాయికయయ్యు హృదయదారణ మగు శోకరససామ్రాజ్యమును నెలకొల్పుచున్నది. కవిపేరుమాత్రము గానరాదు. అతనితండ్రి భూషణభట్టు; తాత బహులాదిత్యుఁడు. వీ రిరువురును నాల్గువేదము లనేకముఖముస నక్లిష్టముగా వహించినవారు; యజ్ఞముల నొనర్చి దేవఋణమునఁ బాసి త్రివర్గఫలమును బొందినవారు. ఇట్టిశ్రోత్రియవంశమునఁబుట్టిన మహాకవియయ్యుఁ దననామధేయమును బ్రకటింప నొల్లక "యసారమతి" యను నొకవిశేషణమును బ్రయోగించుకొనుట వినయధార్ష్ట్యములలో నొండని కొందఱు తలంతురు. ఈకవి యేకాలమువాఁడో స్పష్టముగాఁ దెలియరాదు. హేమచంద్రుఁడు కావ్యానుశాసనమున "గద్యేన పద్యేన వా సర్వభాషాకథా

...కాచిద్గద్యమయీ కాదంబరీ కాచిత్పద్యమయీ యథా లీలావతీ” అని దీని స్మరించుచున్నాఁడు. క్రీ. శ. 1000 లో నుండిన వల్లభాచార్యుఁడు న్యాయలీలావతియను వైశేషికగ్రంథమున వార్షిక ప్రకరణమున, “యథా వా స్వేచ్ఛాస్మృతపదార్థసార్థే భవతి శాలివాహనో నృపతి రిదానీం శృంగారసరసీతీరే దేవ్యా లీలావత్యాసహ లలితమధురం సంగీతక మనుతిష్ఠతీతి జ్ఞానమ్” అని దీని నుదాహరించెను. క్రీ. శ. 1000-1050లో నుండిన భోజుఁడు దాశృంగారప్రకాశమున “సహాపాంసుక్రీడా కువలయావళీ మహానుమత్యాం లీలావత్యాం” అనియు, ఒమనోకొంపెన ప్రకాశమునఁ గథా లక్షణఘట్టమున, “యా నియమితగతిభాషా దివ్యా దివ్యోభయేతి వృత్తవతీ, కాదంబరీవ లీలావతీవ వా సా కథా కథితా” యనియు లీలావతిం బేర్కొనెను. ఈ లీలావతి సంస్కృతకృతియా లేక భాషాంతర నిబద్ధకావ్యాంతరమో యనియుఁ గొందఱు తలఁపవచ్చును. భోజుఁ డనురాగ ప్రకాశమున నుదాహరించిన

“తా కిం బహు ఏహిం మి
చింతి ఏహిం నలకూబరో వరో హోఉ,
విత్థాహివస్స తణఓ
గఅముహా మహాతుహా పసాఏణ”

అనుపద్యము లీలావతిలో 321 వ పద్యముగా నున్నది. మఱియు నందే యుదాహరింపఁబడినది.

“జం అణుఇఅం కుమారీ
అణస్స లజ్జాఏ సాహిఅకులస్స,
తం సవిసేసం పఅసహ
మహాహఅహిఅఏణ పారద్ధం.”

అనునది 485 వదిగాను,

“తం సిద్ధకుమారం పే
చ్ఛిఊణ ఏఏహిం సహిఅణజ్జేహిం,
అవిణయమగ్గో హాఅలో
ఉణాహిం నిఅస్సు కం భణామో.”

అనునది 487 వదిగాను,

“ప సహాఇ కాలక్ఖేవో
హిఅఅంమహామయణహు అవహాపత్తిత్తం,
తస్స వి సందేహాగఅం
నిసుఅం చిఅ తప వి.”

అనునది 566 వ పద్యముగాను లీలావతిలోఁ గానవచ్చుచున్నందున భోజుఁడు పేర్కొన్న గ్రంథము మన ప్రాకృతకావ్యమే యని యూహించుకొనవచ్చును. కావ్యశైలి నిపుణముగాఁ బరీక్షింపఁ బ్రవరసేనుని సేతుబంధరచనకును, హరివిజయరావణవిజయరచనలకును జాలవఱకుఁ బోలియున్నది. ఈ కడపటి రెండుగ్రంథము లిప్పుడు లభింపకున్నను నూఱులకొలఁది పద్యములు భోజాదులచే నుద్ధరింపఁబడినవి విమర్శకులకు గోచరములే. హరివిజయకారుఁడు ప్రవరసేనునకుఁ బూర్వుఁడు. ప్రవరసేనుఁడు వాకాటకరాజగు కుంతలేశ్వరుఁ డాంధ్రదేశమునుగూడ జయించి రామగిరిలోఁ గొంతకాల మేలుచున్న ట్లూహింపనైయున్నది. ఇతఁడు క్రీ. శ. 420 కాలములో నుండియుండును. లీలావతిలోని ప్రాకృతరచనను గ్రంథకర్తయే,

" భణిఅం చ, ణియఅమాప
రఇఅం మరహట్ఠదేసిభాసాప,
అంగాఇఁ ఇమీఅకహాప
సజ్జణాసంగజోగ్గాఇం"
[భణితం చ ప్రియతమాయై
రచితం మహారాష్ట్రదేశభాషాయామ్;
అంగాన్యేతత్కథాయాం
సజ్జనాసంగయోగ్యాని.]

అని చెప్పుటచే మహారాష్ట్రప్రాకృతిమున నిది రచింపఁబడియె నని చెప్పుచున్నాఁడు.

" మహారాష్ట్రాశ్రయాం భాషాం
ప్రకృష్టం ప్రాకృతం విదుః,
సాగరః సూక్తిరత్నానాం
సేతుబంధాది యన్మయమ్."

అని దండి ప్రశంసించిన యీప్రకృష్ట ప్రాకృతమున నే హరివిజయ సేతుబంధ లీలావతులు రచింపఁబడుటచే నించుమించుగా నివి నాఁటి చిరకాలాంతరప్రబద్ధములై, ప్రాకృతభాషా పఠనావేశకాలవిద్వద్గోష్ఠీ రంజకములై యుండు ననుటకు సందేహము లేదు. అట్లు తలంచిచూడ లీలావతి క్రీ. శ. 600 నుండి 700 లోఁగా రచింపఁబడియుండును. లేకున్న దత్పూర్వకాలకృతమేమో. దీనిలోఁ గాళిదాస కవనచ్ఛాయయు బాణుని శ్లేషరేఖయు రెండుమూఁడు స్థలములలోఁ గలవు. కాళిదాస బాణులయందు మనకుఁ గల పరమ భక్తియే లీలావతీకారుఁడే వారిగ్రంథములలో నుండి యొండురెండు భావములు గ్రహించె నేమో యని యతనికే కళంక మాపాదింపఁ బురికొల్పుచున్నది. కాళిదాసుఁడు విక్రమోర్వశిలో-

"అస్యాః సర్గవిధౌ ప్రజాపతి రభూ
చ్చంద్రో ను కాంతిప్రదః
శృంగారైకరసః స్వయం ను మదనో
మాసో ను పుష్పాకరః;
వేదాభ్యాసజడః కథం ను
విషయవ్యావృత్త కౌతూహలో
నిర్మాతుం ప్రభవే న్మనోహరమిదం
రూపం పురాణో మునిః."

అని వర్ణించిన యుర్వశీవర్ణనలోని "వేదాభ్యాసజడః" "విషయవ్యావృత్తకౌతూహలః," "పురాణః" అను విశేషణములకును లీలావతిలో-

"అహ కహ వేయజడస్స
తస్స విసయాహిలాస విముహస్స,
నిప్పజ్జఇ లోఅ పిఅ
మహస్స ఏవం విహం రూపం."
[అథ కథం వేదజడస్య తస్య
విషయాభిలాష విముఖస్య,
నిష్పద్యతే లోకపితామహ
స్యైవం విధం రూపమ్.] 777

అను కథానాయికా వర్ణనములో 'వేదజడస్య, విషయాభిలాషవిముఖస్య, పితామహస్య' యను విశేషణములకును బోలిక గల దని తోఁచుచున్నది.

మఱియు లీలావతిలో శాలివాహన ప్రశంసలో-

"జో సో అవిగ్గహో వి హు
సవ్వాంగావయవసుందరో సుహఓ,
దుద్దంసణో వి లోఅణం
లోఅణాణందసంజణణో. 63

కుసఈ వి వల్లహో ఇణ
ఘిసాణ తహ నయపరో వి సాహసిఓ,
పరలోఅభీరుఓ వి హు
పీరేక్కరసో తహ చ్చేఅ." 64

సూరో వి న సత్తాసో
సోమో వి కలంకవజ్జిఓ నిచ్చం,
భోఈ వి న దోజీహో
తుంగో వి సమీవదిన్నఫలో. 65

[యోఽసావవిగ్రహోఽపి ఖలు
సర్వాంగావయవసుందరః సుభగః,
దుర్దర్శనోఽపి లోకానాం
లోచనానంద సంజననః.

కుకవిరపి వల్లభః ప్రణ
యినాం తథా నయపరోఽపి సాహసికో,
పరలోకభీరురపి ఖలు
వీరైకరసస్తథైవ.

సూ(శూ)రోఽపి న సప్తాశ్వః
సోమోఽపి కలంకవర్జితో నిత్యమ్,
భోగ్యపి న ద్విజిహ్వ
స్తుంగోఽపి సమీపదత్తఫలః.]

అనునది బాణకవి రచనాచమత్కృతితో నాశ్లేషించుచున్నది.

లీలావతిలోని మధుపానవర్ణనమున—

"వివిహాఇం వివిహవణ్ణు
జ్జలాఇం సహాఆరసురహివాసాహిం,
సెలుప్పలఽరిమఅవా
రిఆఇ దిజ్జంసి పాణాఇం" 1263

[వివిధాని వివిధవర్ణోజ్జ్వలాని,
సహకారసురభివాసితాని
సేలోత్పలఽరిమళవాసితాని,
దృశ్యంతే పానాని]

అనుభాగముతో సీత్వరసేనుని ధూర్తవిటసంవాదములోని—

"సచకిల శక్యం సముకచిత్రోత్పలఖండకానాం సహకారశైలోద్గత చంద్రకాణాం, కామినీనిశ్వాసవిక్షోభితతరంగాణాం ప్రనృత్తబర్హిణాకారాణాం వారుణీచషకాణాం గంధమాత్రమపి విజ్ఞాతుమ్."

అనుభాగము సంవాదము చెందుచున్నది. ఈముప్వురిలో బాణుడర్వాచీనుఁడు. కావున లీలావతీకారుఁడు పరభావగ్రహణపారంపరీవిలాసదృష్టితోఁ జూచినను క్రీ. శ. 700 కంటె నిటీవలివాఁడు కాఁడు.

మఱియుఁ గథాభాగమున నుపనాయిక యగు మహానుమతి సప్తగోదావరీక్షేత్రమగు భీమేశ్వరాలయ సమీపమునఁ బాశుపతాశ్రమమును నిర్మించుకొని తనవిరహావస్థచేఁ బూనిన పాశుపతవ్రతమునఁ గాలము పుచ్చుచుండెననియుఁ దక్షిణాకిభవనపాశుపతాశ్రమములు గోదావరీతరంగపవిత్రితప్రాంతములనియునిందు వర్ణింపఁబడియె.—

"తం సత్తముహావిహత్తం
బునివహానిద్ధోఅకలిమలుప్పంకం,

కహ కహ వి దేవ సుఇరే
ణస త్తగోదావరీభీమం"
[త్వం సప్తముఖవిహస్తాం
బాలివహనిర్ధూతకలిమలోత్పంకమ్,
కథం కథమపి దేవ
సుచిరేణ సప్తగోదావరీభీమమ్] 190

"ఇయ తస్స కణఅదేవా
లయస్సదాహిణదిసాఇ అణులగ్గం,
గోలాణఇవయణవిసె
సఅంజ రమ్మం మఠాయఅణం."
[ఇతి తస్య కనకదేవా
లయస్య దక్షిణదిశ్యనులగ్నమ్.
గోదావరీనదీవదనవిశే
షకమివరమ్యం మఠాయతనమ్] 242

"ఏవం భణిఓ సో తే
ణ నరవఈఅగణిఏహిం దియహేహిం,
సంపత్తో కమలదళ
చ్ఛిసత్తగోదావరీభీమం"
[ఏవం భణితః స తే
నరపతి రగణితై ర్దివసైః;
సంప్రాప్తః కమలదళాక్షి
సప్తగోదావరీభీమమ్.] 1147

ఇత్యాదివర్ణనములచే మహాబుమతి యాత్ర మము సప్తగోదావరీక్షేత్ర మగుదాక్షారామములోనని యూహింపవలసియున్నది. దీనిలో దక్షదాక్షారామప్రశంసలు గానరాదు గాని భవానీప్రాధాన్యము చూపఁబడియె. ఈసందర్భమున దక్షారామము అష్టాదశశాక్తేయపీఠములలో నొకటియని స్మరించుకొనవలయును.

"కొల్లాపుర్యాం మహాలక్ష్మీ
ర్మాహురా రావేక వీరికా,
ఉజ్జయిన్యాం మహాకాళీ
పీఠాపురాం పురుహూతికా.
ఒడ్డా దా గిరిజా దేవీ
మాణిక్యా దక్షవాటకే"

అను పురాణవచనము కలదు. మఱియు దక్షారామమున సప్తగోదావర మనుసరస్సు కలదు కాని సప్తహస్తాలంకారభీమ మగుగోదావరినది కానరాదు. మఱియు నానది మూఁడు క్రోశములదూరమున నున్నది. భీమేశ్వరపురాణమున గోదానది యచ్చట భయంకరముగాఁ బ్రవహించినట్లును మహర్షులప్రార్థనమున నంతర్వాహిని యయ్యె ననియుఁ జెప్పఁబడియె. నన్నయభట్టు "జగదాది యైనభీమేశ్వరంబును" అని పొగడిన యనాదిక్షేత్రము మొట్టమొదట గోదావరీతీరముననే సప్తశాఖా ప్రవాహదర్శనరమణీయంబుగ నిర్మింపఁబడియుండు నని యుఁగాలక్రమమున నది దక్షిణదిక్కునకుదూరముగాఁ దొలఁగి ప్రవహించుచుండ నచ్చటిసరోవరమే సప్తగోదావరనామంబునఁ బరఁగుచున్న దనియు నూహించుచున్నాము. లీలావతీరచనాకాలమున గోదావరి దాక్షారామమునొద్దనే సప్తహస్తాభిరామమై విహరించి కొంతదూరముననే సముద్రునిం జేరుచుండును. దక్షునిసంబంధ మగుస్థలమహాత్త్వము కాలక్రమమున నుద్భవించియుండునేమో! కావున నీదృష్టితోఁ జూచినను లీలావతీకారుఁ డించుక ప్రాచీనుఁడై యుండును.

మఱియుఁ గథానాయకుఁ డగుశాలివాహనుఁడు హాలుఁ డనునామాంతరము గల సుప్రసిద్ధుఁడు; ప్రాకృతభాషాభిమాని; గుణాఢ్యుఁడు పైశాచీభాషతో బృహత్కథను రచించి యితనియొద్దకే పంపెను. శ్రీపాలితుఁ డను మహాకవి యితని యాస్థానభూషణము. తరంగలోల యనునద్భుతకథావిశేషమును ప్రాకృతమున రచించి కీర్తిగన్నవాఁడు. లీలావతీకారుఁడు శ్రీపాలితుఁడా లేక హాలునిసభాలంకార మగు మఱియొకఁడా? అట్లు కాలము వాఁడైనయెడల మహానుమతి మొదలగు గంధర్వజాతి స్త్రీలకథతో మనుష్యనాయకు లగు లీలావతీ శాలివాహనులకథ కలిపి యసంభవమును హాలుని జీవితకాలములో నెట్లు సంభావితముగాఁ గవి ప్రచురింపనేర్చు? ఈసంశయమును దొలఁగింపఁ గవికల్పనలు కలవు. పరిమళకవి సింధురాజు నాశ్రితుఁడై నవసాహసాంకచరిత్ర మనుపేర నతనికథయే రచించి యందు సింధులుఁడు పాతాళమున కేఁగి శశిప్రభయనుకన్యను వరించినట్లు వర్ణించుటను సింధురాజెట్లు మన్నించె? ఇది యసంభవము కాదా?

(దీనినే మేము సప్తపదీవిలాస మను షడ్దర్శనీగర్భిత హాస్యప్రబంధమున సంస్కృతకవివర్ణనమున నిట్లు లిఖించితిమి:

"సీ. పద్మావతీదేవి పడకింటఁ గలఁ గాంచి
వాసవదత్తకై భాసుఁ డేడ్చె
నూఱేండ్ల కగ్నిలో దూఱి శూద్రకరాజు
చిత్తమ్మె వసంతసేన కిచ్చె
జానకీహరణంబు జగము మెచ్చఁగఁ జేసి
రావణుఁ దన్నె లంకావిభుండు
భిక్షాటనము చేసి బృందారకస్త్రీల
శివభక్తదాసుఁడు చెఱలఁబట్టె
పందికొక్కులవోలెఁ బాతాళమును ద్రవ్వె
బరిమళుఁడు శశిప్రభాగవేషు
సప్తపదుల నేఁడునారులు ద్రొక్కించు
తమిఁ గొనఁగి వాఁడ ధర్మకవిత."

ప్రాకృత కావ్యవిమర్శన మహాగహనానుసంధానము పాఠకమహాశయులకు విశ్రాంతికరముగానో లేక, నాటకరంగము నడుమ నసంబద్ధప్రలాపమున విదూషకుఁడుంబోలె నుత్కర్షించియు తాడనంబుననో మనఃశ్రోత్రాయాసకరముగా మాపద్య ముదాహరించినందునకు వారు క్షమింతురుగాక.)

కాలకలభకవి భల్లాళరాజగుసోమేశ్వరుఁడు చోళరాజును మహేంద్రమంగలమనుస్థలమున నోడించి యతనిపుత్రిని వివాహమాడి పరమేశ్వరసాన్నిధ్యమునఁ దనకీర్తిని నారదవ్యాసులచేఁ బాడించుకొనియె నను నద్భుతకల్పనఁ గల్పింపఁగ సోమేశ్వరునివిద్వత్సభ దాని నెట్లంగీకరించె? కావున దివ్యమానుషసంపర్కతరంగితము లగు ప్రభుచర్యావర్ణనంబులును గవులయెడఁ గావ్యధర్మమే యగుచున్నందున లీలావతియు శాలివాహనునియాస్థానకవికృతమై యుండునన్నవాద మంతయసమంజసము కానేరదు.

ఇఁకఁ గథానాయకుఁడగు హాలునిఁగూర్చి విచారింతము. శాలివాహనశబ్దము వంశనామము. పెక్కండ్రు వంశమునఁ బుట్టి మగధాంధ్రకుంతలావంత్యనూపవిదర్భదేశములఁ బరి

పాలించిరి. వారిలో హాలుఁడు సుప్రసిద్ధుఁడు. వీరి నాంధ్రచరిత్రకారు లాంధ్ర రాజులని పేర్కొనుచున్నారు; కాని యది యెట్లు సిద్ధాంత మగునో యెఱుఁగరాదు. వా రాంధ్ర దేశమును గూడఁ బరిపాలించుటయు గోదాతీరమున నుండు ప్రతిష్ఠానపురమునను బిదప నాంధ్రమండలములోని ధాన్యకటకమందును రాజధానుల నిర్మించుకొనియుండుటయు నిక్కమే కాని వారు పుట్టుకచే నాంధ్రులా యని సందియము కలదు. వారిలో హాలుఁ డేకాలమువాఁడు? వానిసమకాలికు లెవ్వరు? వానికథలు విలసిల్లునంత ఘనకార్యము లతఁడేమి చేసె? అను సందేహము లుప్పతిల్లుట యెల్లరకు సహజమే.

లీలావతిలోఁ గవి శాలివాహనుని సాలాహణుఁ డనియు సాలవాహణుఁడనియుఁ బ్రాకృతరూపములఁ బేర్కొనుటయ కాక స్పష్టముగా హాలుఁ డనిసహితము పర్యాయవాచకముఁ బ్రయోగించుచున్నాఁడు.

"తో గురునఅణేణ ఏసా
తం చియవహుమన్ని ఊణ తహ భణిఅం,
సవ్వాయరేణ హాల
స్స పేసిఅవచ్చఓ పహాఏ"
తతో గురువచనేనైషా
[తమేవ బహుమత్వా తథా భణితమ్,
సర్వాదరేణ హాలస్యప్రేతా
ప్రజతుప్రభాతే 673"]
"కేచ్చిరయాలంవఇమో
కోస అ హాలస్స పరివసిఓ 974."

ఈహాలుఁడు మత్స్యాది పురాణవంశాను చరితముల ననుసరించియుఁ పాశ్చాత్యుల కాలనిర్ణయముననుసరించియు క్రీ. పూర్వము మూఁడవశతాబ్దిలో నుండె నని చెప్పవలసియుండును. లీలావతితండ్రి సింహళరా జగు శిలామేఘుఁడు హాలునియాస్థానమున మంత్రి పదవిలో నున్నవాఁడు నాగార్జునభిక్షు వని మనకావ్యములోఁ గలదు.

"బహుమన్నంతో తం చిఅ
మరణంసంతోసదిన్ననియహిఅఓ,
నాయజ్జుణో వరోహే
ణనిగ్గఓనియపురా హెంతో. 1018
నాయజ్జుణ భిక్ఖుపుర
స్సరేణసరితీరసంఠిఓ రాయా,
విజయాణందేణ సమం
వివరాహు త్తం పరిక్కంతో"
[బహుమన్యత స్తమేవ
మరణం సంతోషదత్తనిజహృదయే,
నాగార్జునో పరోధేన
నిర్గతో నిజపురాభిముఖః
నాగార్జున భిక్షుపుర
స్సరేణ సరిత్తీరసంస్థితో రాజా,
విజయానందేన సమం
వివరాభిముఖం పరిక్రాంతః.]

సిద్ధనాగార్జునభిక్షువు క్రీ.శ. రెండవశతాబ్దిలో నుండి మాధ్యమిక సిద్ధాంతమును నెలకొల్పె నని పాశ్చాత్యపండితుల యభిప్రాయము. కథాసరిత్సాగరములోనే నాగార్జునకథకలదు. గుణాఢ్యుఁడే యక్కథను బృహత్కథలోఁ

బొందించియుండవలయును. గుణాఢ్యహాలులు క్రీ. పూ. మూఁడవశతాబ్దివా రని తోఁచుచున్నది.

మఱియు హాలునకుఁ గుమారిలుఁ డను మంత్రి యొకఁ డున్నట్లు లీలావతిలోఁ గలదు. అతఁడు మీమాంసాప్రవర్తకుఁ డగుకుమారిలభట్టు కాఁడు; అట్లు ద్యోతింపఁజేయువిశేషణములును గానరావు. శాతవాహనునిసప్తశతిలో ప్రాచీనకవిపద్యములును, హాలునియుఁ, దత్సమకాలికులయు పద్యములును గలవు. అతనియాస్థానకవి యగు (శ్రీ)పాలితుని శ్లోకములు పెక్కులు గలవుగదా! బొంబాయిలో ముద్రింపఁబడిన సప్తశతిలోఁ బ్రథమశతకాష్టమగాథ కుమారిలకృతము. కావున మీమాంసకునకంటెఁ బ్రాకృతకవి కుమారిలుఁ డన్యుఁడును బ్రాచీనతరుఁడు నై యుండును.

మఱియు నిందు నగ్నపాశుపతుఁ డొకఁడు మహానుమతీకథాసందర్భమున భీమేశ్వరమునఁ బాశుపతమఠమున నుండువాఁడుగా వర్ణితుఁడై యున్నాఁడు. పాశుపతశైవము చాల నధునాతన మని కొందఱియభిప్రాయము. లకులీశుఁడే దాని స్థాపించె ననియు నతఁడు క్రీ.శ. పదియవశతాబ్ది వాఁడనియు, భావించెదరు. లకులీశుఁ డంతకంటెను బూర్వుఁడే కాని యతఁడు తన్మతోద్ధారకుఁడే కాని తన్మతజనకుఁడు కాఁడు. క్రీ.శ.ఆఱవశతాబ్దిలోనే పాశుపతసిద్ధాంత మనుష్ఠానములో నున్నట్లు మహేంద్రవిక్రముని మత్తవిలాసప్రహసనమువలనఁ దేలుచున్నది.

భరతమహార్షియు నాట్యశాస్త్రమున

"నానాచిత్రాణి వాసాంసి
కుర్యాత్పాశుపతే ష్వథ."
—అధ్యా. 21 శ్లో. 110

"మునినిర్గ్రంథ శాక్యేషు
యతిపాశుపతేషు చ."
—అధ్యా. 211 శ్లో. 108

అని చెప్పుటచేఁ బ్రాచీనుఁ డగుభరతుని కంటెఁ బాశుపతులు ప్రాచీనతరులనుట నిర్వివాదాంశము. వీరిలో సంయమావస్థ యను నుత్తమయోగమున నగ్నత్వ మాచార్యులకు విధానమే యనుటకు హరిభద్రాచార్యుఁడు షడ్దర్శనసముచ్చయమను గ్రంథమునఁ బాశుపతసమయప్రకరణమున ని ట్లుపష్టంభముగాఁ జెప్పుచున్నాఁడు. "తే చ దండధరా ప్రౌఢకౌపీనపరిధానాః, కంబళికాప్రావృతాః, జటాధారిణో, భస్మోద్ధూళనపరాః, యజ్ఞోపవీతినో, జలాధారపాత్రకరాః, నీరసాహారాః, ప్రాయో వనవాసినో, దోర్మూలే తుంబకం బిభ్రాణాః, కందమూలఫలాశినః, ఆతిథ్యకర్మనిరతాః, సస్త్రీకాః, నిస్త్రీకా స్తేషూత్తమాః, తేచ పంచాగ్ని సాధనపరాః, కరే జటాదా చ ప్రాణలింగధరాశ్చ భవంతి. ఉత్తమాం సంయమావస్థాం ప్రాప్తాస్తు నగ్నా భ్రమంతి" అని.

ఈసందర్భమున నొకయంశ మపభ్రంశప్రాయ మైనను నించుకవ్యవధానముతోఁ బరీక్షించినయెడల దేశచరిత్ర సమ్మార్జనమునకు సహకారి యగునని యప్రస్తుతముగా స్మరించుచున్నారము. దీనిలో లీలావతి సింహళరాజకుమారి. ప్రాకృతమున సింగళ మని యున్నందున సంస్కృతమున సింహళ సింగళ శబ్దముల

లో దేనినైన గ్రహింపవచ్చును. సింగళ మనునొకద్వీపము శ్రీకూర్మమునకు దక్షిణ ముగా గోదావరీమండల ప్రాంతసముద్రముననే యున్న దని చెప్పుదురు. దానిసమీపముననే రామేశ్వరం మనుమఱియొక ద్వీపముకూడఁ గలదు. మేఘనామకు లగురాజులు కళింగ మునఁ బరిపాలించుచున్నట్లు తెలియుచున్నం దునను మనగ్రంథములోని సింహళమే యా సింగళద్వీప మని కొందఱు వాదింపవచ్చును. మాకు నేఁటివఱకును విశదముగా నర్థముకాని భీమకవిపద్య మగు,

"ఆసీతాభ్యుపదాను సింగళపద
భ్యాలం బిత స్తంభమా"

అనుదానిలో శృంఖల సింగళాదిపారము లీసింగళద్వీపమునే సూచించినను లీలావతి లోని సింగళము రావణునిలంక యగు సింహళ మనియే తోఁచుచున్నది. దీనిలో మలయాచ లమును, కేరళపురమును ప్రధానకథలో వచ్చుటయేకాక సముద్రవేలావన రామణీయ కవర్ణన ప్రఘట్టకమున

"లక్ఖిజ్జఇ అజ్జ వి గుం
జిరాలి ఉలవలయవా ఉలలఆహిం,
మహాణుత్తిణ్ణో రావణ
మగ్గోసత్తచ్ఛ అతరూహిం.
సేవిజ్జఇ సరసోహం
సకణ అ భవణేసు సిద్ధమిథుణేహిం,
జమ్మిలవంగేలావణ
పరిమళవాసిఓ పవణో" 174.

అని యేలాలవంగ సంవాససురభిశ్వసిత ము ఖమ గు దక్షిణాశావధూవిలాసమును వర్ణించుటయుఁ బ్రాకృతభాషానుసంధిమహి మచే అమృతమథనోత్తీర్ణమగు నైరావత మార్గమును . గుంజదళికులవ్యాకుల శాఖం బులగు సప్తచ్ఛద తరుపులు సూచించుచున్న వని వర్ణనమున రావణమార్గము సప్తచ్ఛదతరు వులచే గుంజదళికుల శాఖాహస్తవ్యాజమున నిరోధింపఁ బడియె ననుధ్వనిత ప్రక్రియయు సింహళమనియే శాసింపనేర్చును.

ఇఁక నిట్టిసంశయ డోలాధిరోహణక్రీడల విమర్శకభావనా విలసితంబుగ వదలి కొంతతడ వుకథ, శరీరసౌందర్యవిభాగవిస్మితహృదయు లమై విహరింతము.

"నిశ్శేషసస్యసంపత్తి ప్రముదితాశేష పామరజనౌఘంబును, సుఖసంవర్ధిత గోస హస్ర హంభారవముఖరితదిగంతంబును, అవి యుక్తకృతయుగ ధర్మ సన్నివేశంబును, నిశ్శే షసుఖనివాసంబుననగు ప్రతిష్ఠానపురంబు, "మర హట్టి ఆపయోహార హాళిద్ద పరిపింజ రంబువాహి" యగు గోదావరీ లహరిచేఁ బవి త్రితంబైయుండును. అందు "నిఖిలగుణావ గూహిత శరీరుండును," యశఃపూరపరిపూత త్రిభువనుండును, నగుశాలివాహనుఁడు నిజ స్నేహప్రసాధిత ప్రజామండలుండై పరిపాలిం చుచుండు. ఈరాజు నాశ్రయములేకున్న-చో దుఃఖితుల మనోరథంబులును సత్కావ్య విని వేశయోగ్యంబులగు కవుల మనోరథంబులును హృదయములయందే విలయించుచుండును. అతఁడు పాంథజన దురాలోక మాకంద మంజ

కీనమనుమేయమన్మథ కిరాతదురాగతం
బగు వసంతకాలంబున మధుశ్రీ సమాగ
మోన్మత్తమంటపంబున నవమాలికా సురభిళం
బగు మలయమారుతంబున వికసన్మనోరథుండై
సుందరీప్రభావపరిభావిహావభావలగు
వారవిలాసినులచేఁ బరిచరితుండై వికసితశత
పత్రికా శతమధ్యవిరాజమానరాజహంసం
బును బోలెఁ బత్రరాగరంజితుండైయుండఁ
జనన్మ్రోల నిలుచుచున్న చంద్రరేఖయను
తరుణి దరహాసచంద్రికా క్షాళితనిజనఖలిక
యగుదానిఁ దిలకించి తత్తరంగ చిత్రితంబగు
మకరికాపత్రంబు నైపుణ్యంబుపరికించి "యిట్లు
సర్వాంగ మనోరమంబుగ నెవ్వఁడు మదనశర
బంధురంబగు తనకుంచికతో నైకైకవదన
మృణాళదానసనాళత కంఠరాబంధంబగు హంస
మిథునంబును జరణయుగంబున లిఖించి, రాగ
రంజితంబగు హృదయంబును జిత్రంబుతో
నున్మీలింపఁజేసి నిజవిజ్ఞానప్రకటనాదరంబున
నవిభావితగుణదోషుం డయ్యె" నని సపరిహాస
పేశలంబుగ నడుగఁగా నయ్యువతియు లజ్జావ
నత వదనయగుచు నిట్లనియె.




# లోకానుభవము

కవిత

తల్లాప్రగడ సూర్యనారాయణరావు గారు

పాటలె కావ్యముల్ రససమంచితముల్ హృదయంగమమ్ము లె
చ్చోటను నైనఁగాని మనసుం గరఁగించెడిదే కవిత్వమ
ప్పాటవ మున్నవాఁడె కవి; పద్యమొ పాటయొ గద్యమో సిరా
ఘాట రసప్రవాహమునఁ గావ్యమగుం జరితార్థ మీశ్వరా!

చం. అనుభవ ముండు నందఱకు, నయ్యది చెప్పగ లేరువిప్పి; వా
కొనఁగలశక్తియే కవిత; కొందఱ కబ్బు తనంత నద్ది; యా
యనుభవమందు మేలివిషయంబుల నన్యులకుం వచింత్రు; తీ
యనిపలుకుల్ మనోహరములౌ తలఁపుల్ కవిపొందు నీశ్వరా!

చం. శ్రవణసుఖంబు సంఘటిలు శబ్దముసన్ బదమాత్రమేళనన్
గవి చరితార్థుఁడే? యతఁడు గన్నది కన్నటు విన్నవారికిన్
దవులవలెన్ మనస్సుల; వినన్ వినఁ జిత్తము పొంగిపోవలెన్
నవనవభావముల్ దొరలి నాట్యముసేయఁగ వాణి యీశ్వరా!

శా. సౌందర్యమ్మె ప్రధానమా కవిత కేసందర్భముల్ గన్న నా
నందమ్మే కద లక్ష్యమా కవికి నానందమ్ము చేకూర్పనే
ఛందస్సుల్ విలసిల్లు; మానసము లాస్వాదించి సౌందర్య మా
నందించున్ రసలబ్ధిచే; రసము సౌందర్యాత్మకం బీశ్వరా!

చం. వన్నెలు చిన్నెలున్ గలుగు వర్ణనలం దుపమాద్యలంకృతుల్
బన్నుపడున్ దమంత నవి భారము గాఁదగ దెట్టిదైన రూ
పోన్నతు లంతరించు; నగలున్నను లేనటు లున్ననే యెడన్
జెన్నలరారు నెప్డు; కయినేఁతల రూపును రూపెయీశ్వరా !

చం. శ్రవణము చేత సంతసము సంధిలఁజేయును గాయకుండు; క
న్గవ నలరించి మానసవికాసము గూర్చును చిత్రకారుఁ డిం
పవు నటులన్ వచించి హృదయంబు ద్రవింపఁగఁజేయు వాక్కుచేఁ
గవి; యొనరింత్రు ముగ్గు రొకకార్యమె మూఁడువిధాల నీశ్వరా!

చం. స్ఫుటముగ భావ మొక్కపరిఁ జూచుట తోనె స్ఫురింపకున్న సం
పుటములు వ్రాతచేటు; తలఁపుల్ కవిగన్న వొరుల్ గ్రహించికొం
చుటకుఁ గదా ముదం బతఁడు చూచెడి చూపదిసాగు నెట్లు లో
పటఁ గలభావముల్ పయికిఁ బ్రాకనె ప్రాకక యున్న నీశ్వరా!

చం. పలుకులు హెచ్చు కొందఱికి భావము హెచ్చొకకొంతమందికిం
దలఁపులు పల్కులున్ సముచితమ్ముగఁ దావియుఁబూవునున్ బలెన్
గలియుట దుర్లభం బెటనొకాని; తలంపులఁ దావిగమ్మనన్
పలుకులు చిమ్మగా వలయుఁ బండువుగా వినువారి కీశ్వరా!

మ. ఇతివృత్తంబు చెలంగుఁ గావ్యమున కం దేరూపుచిత్రింపగా
గృతినిర్మాత మతిం దలంచునొ మనం బింపార నారూప మా
కృతి రాణింప ఘటింపఁగావలయు హర్షింపన్ సుధీంద్రుల్ 'నహి
ప్రతి' యంచున్ గనుముక్కు తీరు గని యబ్రంబంది సర్వేశ్వరా!

---



# కాళిదాస భవభూతులు

కో. రామకృష్ణరావుగారు, యం.ఏ.

(వెనుకటి సంచిక తరువాయి)

ఇంకఁ గథాచమత్కారము, పాత్రపోషణము, కావ్య కళాసౌందర్యము మొదలగువిషయముల నీనాటకములకుఁ గలతారతమ్యము, వీని గుణవివేచనమూలమున సువ్యక్తంబగుచున్న కాళిదాసుని ప్రతిభావిశేషము, తన్నాటక కళాపరిణామమందలి యంతరావస్థలనుగూర్చి తెలిసికొనవలసియున్నది.

పైఁజెప్పిన కారణములఁబట్టి కాళిదాసుని తొలి రచన యనఁదగియున్న మాళవికాగ్నిమిత్రము నందలి వస్తువు మాళవికాగ్నిమిత్రులప్రణయకథ. ఈయగ్నిమిత్రుఁడు క్రీస్తునకుఁ బూర్వము సుమారు నూటయేఁబది సంవత్సరములనాఁడు మగధరాజ్యము నేలిన శుంగవంశమునకు మూలపురుషుఁడగుపుష్యమిత్రునికుమారుఁడు. ఈతఁడు విదర్భదేశరాజకన్యయగు మాళవికను వివాహమాడఁ గోరగా నామెసోదరుఁడగు మాధవసేనుఁ డామెను దీసికొని యగ్నిమిత్రుని పట్టణమునకుఁ బ్రయాణమయ్యెను. అప్పుడు విదర్భదేశము నేలుచున్న యజ్ఞసేనునకు నీతనికి దాయాదత్వపుద్వేష ముండుటచే నీవివాహమూలమున నీతనికి సహాయసంపత్తి కలుగఁగలదని యెంచి మార్గమధ్యమున యజ్ఞసేనుఁడు మాధవసేనుని జెరఁబెట్టుటయు, నాతని విడిపించుటకుగా నగ్నిమిత్రుఁడు కొంతసైన్యమును బంపి విదర్భేశ్వరు నోడించుటయు, పిదప అగ్నిమిత్రుఁడు విదర్భయందు ద్వైరాజ్యమును స్థాపించుటయు మొదలగు రాజకీయ విషయములను ప్రాసంగికములుగను, ఇందలి ప్రణయకథ కాధారవస్తువుగను జేసి ముఖ్యముగ నగ్నిమిత్రుని యంతఃపురచర్యలనే తెలుపుచుఁ గాళిదాసు దీనిని గృహ జీవితమును వర్ణించు నాటకముగనే ( domestic drama) రచియించినాఁడు. ఈతని నాటకరచనయందు ప్రథమప్రయత్న మిట్టిదగుటకు కారణము నాతఁడు తనకుఁ బూర్వులగు కవులమార్గ మనుసరింపఁ దలఁచుటయేకాని వేఱు కానోపదు. షేక్స్పియరుమహాకవి ప్రథమమున మార్లో మొదలగు పూర్వకవులపద్ధతులనే యనుసరించి కాలక్రమమున నాతనిబుద్ధి పరిపక్వముఁ బొందినకొలఁది రచనాపద్ధతియందు స్వాతంత్ర్యమును వహించి స్వీయకళాచాతుర్యమును జూపినట్లే కాళిదాసును మొదట పూర్వకవుల ననుకరించినను గాలక్రమమునఁ బరిణతకళాసౌందర్యమును బ్రకటించి తనప్రతిభను మెఱయించినాఁడు. ఈతఁడు మానవజీవితమందలి యసంఖ్యాకములగు దశావిశేషములను, మానవస్వభావ వైచిత్ర్యములను యథాస్థితంబుగ వర్ణించి షేక్స్పియరు మహాకవివలెనే వాఙ్మయాదర్శంబున విశ్వరూపినియగు ప్రకృతియొక్క యనంతములగు రూపవైచిత్ర్యములను జూపకపోయినను హైందవప్రపంచమునకుఁ బొడగట్టుచున్న యాదేవి పవిత్రస్వరూపమునుమాత్రము తనశాకుంతలముమూలమునఁ జూపియున్నాఁడు. హైందవప్రపంచమున కాదర్శమగు నీధర్మస్వరూపమును గనుఁగొనుటకునాతనికి మఱికొంతకాలము పట్టినది. మఱికొంతప్రయత్నము లోకానుభవము కావలసివచ్చినది.

ప్రథమమునఁ గాళిదాసు భాసాదుల నాటకములఁ బోలిన నాటకమునే యంతకంటె రసవత్తరంబుగ రచియించి సామాజికులయాదరమును బడయుటకు యత్నించియుండెను. భారతరామాయణకథ లింతకుఁబూర్వమే భాసాదులచే నాటకములుగా రచియింపఁబడియుండుటచేతనో లేక స్వభావముచేతనో అపరిచితవస్తుదశా (Romanatic Situtions) వర్ణనాకౌతుకాయత్తచిత్తుఁడును, అద్భుత ప్రియుఁడు నగుటచేతను, ఈతఁడాకథలను మొదట గైకొన దలంపలేదు. కాని మిగుల జనప్రీతికరములై గ్రామాదులందుఁగూడఁ వ్యాప్తిఁజెందియుండిన "ప్రాప్యావంతీ నుదయనకథాకోవిద గ్రామవృద్ధాన్" మేఘ

మాత్రము, ఉపయనునికసలు నాటకరూపమునఁ భాసర చితములై ప్రదర్శింపఁబడుచు జనానురంజకముగ వెలయు చుండుటఁ జూచి తాను నట్టికథను నాటకముగ రచింపఁ దలఁచి యాకాలమున దేశమున మిగులవ్యాప్తిఁజెందియుం డిన మాళవికాగ్నిమిత్రుల ప్రణయకథను నాటకవస్తువు నుగా గ్రహించెను. అగ్నిమిత్రుని యాస్థానముననే యుండి కాళిదాసీ నాటకమును రచించెనని కొందఱు తలంతురు.

ఇట్లు భాసాదులవాసవదత్తాది నాటకములే యీతని ప్రథమప్రయత్నమున మార్గదర్శకములై యున్నను యీతఁడు మాళవికాగ్నిమిత్రమునఁ దనప్రతిభావిశేష మును మెఱయింపకపోలేదు. అగ్నిమిత్రుఁడు వత్సరాజు వలెనే రాజ్యభారమంతయు మంత్రుల కప్పగించి తా నంతఃపురమున గామచర్యలతోఁ గాలము పుచ్చుచు వినోదించుచుండెను. సిద్ధాదేశమునందలి నమ్మకముచేఁ పద్మావతీకరగ్రహణలాభము వత్సరాజ్యలాభములకుఁ గారణమగునని యౌగంధరాయణుఁడు లావాణకదాహాదిక కృత్రిమతంత్రమును బన్ని వాసవదత్తను బద్మావతియొద్ద నిక్షేపముగానుంచెను"మాధవసేనుఁడు చెఱఁబెట్టఁబడుటచే నారణ్యకులచేతులలోఁ బడి తుదకు ధారిణియొద్ద చేరినమా ళవికను బరివ్రాజికావేషమున నచ్చటఁ జేరిన పండిత కౌశిక గుర్తించియు మాళవిక సంవత్సరకాలము ప్రేష్య భావము ననుభవించి పిదపఁ దగినవరునిఁ బొందఁగలదనెడు సిద్ధాదేశమందలి నమ్మకముచేతనే తమసంగతి బైలుపఱు పక కాలము ప్రతీక్షించియుండెను. ఇట్లు సిద్ధాదేశమే యీరెండునాటకములందుఁ గథాప్రవృత్తికి మూలకారణ మైనది. కథానాయికలు యీరెంటియందునుగూడ నా యకుల యంతఃపురములఁ బ్రచ్ఛన్నముగనుండి రక్షింపఁ బడుచు నాయకునియనురాగాతిశయమునకుఁ బాత్రములై విదూషకుని తంత్రములమూలమున నాయకునితో రహస్య సమావేశములఁ బడయుచుండఁ దుదకు వీరు తమపుట్టినింట నుండి పంపఁబడినజనముచే గుర్తింపఁబడి నాయకుని యొక్కయు, నాతనిమహిషులయొక్కయు మన్ననలకుఁ బాత్రములగుచు వచ్చిరి. ఈనాటకములలో నాయకుని కామచర్యలే ప్రాధాన్యము వహించినను యీప్రణయక థారచనకుఁ గొంత రాజకీయవృత్తాంతము సముచిత సన్ని వేశంబై యొప్పినది. మఱియు వాసవదత్తయందు గథా ప్రవృత్తియంతయు యౌగంధరాయణు నితంత్రముమీఁదనే నిలిచియున్నటులే మాళవికాగ్నిమిత్రము విదూషకుని తంత్రములమీఁదనే యాధారపడియున్నది. మాళవికాగ్ని మిత్రమునందువలెఁ దక్కిన నాటకములందు భాసనాట కానుకరణ మంతవిశేషముగఁ గన్పడకపోయినను వాని యందు భాసునిరచనాశక్తి కొంతలేకపోలేదు.

ఈతెలినాటకరాజంబగు శాకున్తలముననే పోలి కలుఁ గొన్నిగలవు. అభిషేకనాటకమున నాల్గవయంక మందలి

" శ్లో. యస్యాం నప్రియమండనాపి మహిషీ
దేవస్య మందోదరీ
స్నేహా ల్లుంపతి పల్లవాన్ నచ పున
ర్వీజంతి యస్యాం భయాత్;
వీజంతో మలయానిలా అపి తరై
రస్పృష్టబాలద్రుమా
సేయం శక్రరిపో రశోకవనికా
భగ్నేతి విజ్ఞాప్యతామ్."

అను శ్లోకముతో భావసామ్యము రచనాసామ్యముగల "పాతుం న ప్రథమం వ్యవస్యతిజలం......సేయంయాతి శకున్తలాపతిగృహం సర్వై రనుజ్ఞాయతామ్" అను పద్యము శాకున్తలమునఁ గానవచ్చుచున్నది.

అట్లే "విస్రబ్ధం హరిణా శ్చర న్త్యచకితాః... ...
అచకితా దేశాగతప్రత్యయాః." ... ...
—స్వప్నవాసవదత్త.

"విశ్వాసోపగమా దభిన్నగతయః
శబ్దం సహంతే మృగాః."

స్వప్నవాసవదత్త చతుర్థాంకమున విదూషకుని వాక్యమునకును శాకున్తలమున విదూషకుని వాక్యముల కునుగూడఁజాలపోలిక గలదు.

ఇట్లే భవభూతినాటకములను శూద్రకునిమృచ్ఛక టికమును భాసునినాటకములతోఁ బోల్చిచూచినచోఁ బ్రథితయశస్కుఁడగు భాసునిరచనల ననుసరించిన దొక్క కాళిదాసే కాదని తెలియవచ్చుచున్నది.

అగ్నిమిత్రుడు స్వయము యుద్ధమునకైన బోక వీరసేనునిచే నమ్మని జాబుమాత్రము వ్రాయించి తాను శృంగారవిషయములఁ బ్రొద్దుపుచ్చుచున్నవాఁ డగుటచే నతని పరాక్రమాది రాజపురుషలక్షణము లేవియు నెంత మాత్రము ప్రకటితములు కాలేదు. ఇఁక విక్రమోర్వశీయ మందన్ననో, విక్రముఁడు కేశి యనురాక్షసునితోఁ యుద్ధముచేసి యూర్వశిని రక్షించుటయు నింద్రునకు రాక్షసులతోడియుద్ధమున నాపనికిఁ దోడుపడుటయు నాతని పరాక్రమాది గుణములను వెల్లడించుచున్నవి. ఆతని పరాక్రమప్రపన్నరక్షకు ప్రతిఫలమో యనునట్లు రాక్షసునినుండి రక్షింపఁబడిన దేవవేశ్య ఊర్వశి యాతని సౌందర్యవిలాసములచే మోహితయగుటయుఁ, దుద కామె యాతనికి భార్యయగుటయు సంభవించినది. మాళవికాగ్నిమిత్రమున నాయికానాయకుల యనురాగావిర్భావము లకుఁ గారణమగు ప్రథమసమావేశ మంత రమణీయముగ లేదు. విక్రమోర్వశీయమందువలె శాకుంతలమున దుష్యంతుని పరాక్రమాదిగుణ ప్రకటనమున కిట్టి యాదృచ్ఛిక ప్రసంగమును కాళిదాసు గ్రహింపలేదు. కణ్వుని యాశ్రమమున యజ్ఞమునకు విఘ్నమాచరించుచున్న రాక్షసులను ధనుష్టంకారములచేతనే పలాయితులను జేయుటచేతను, యింద్రునకు జయింపశక్యముకాని రాక్షసులను రూపుమాపి యాతనియర్ధాసన మధిష్ఠించి గౌరవింపఁబడుటచేతను, దుష్యంతుని పరాక్రమము విక్రముని పరాక్రమముకంటె సుప్రకాశిత మగుచున్నది. ఇంతియే కాక వేటయందాసక్తి, శ్రమాదుల నోర్చియుండుటకు వలయుసహనసత్త్వాదికము, వీరపురుషులకు సహజమగు దృఢకాయమును గలిగి యౌవనవంతుఁడు, బలిష్ఠుఁడునగు సుందరరాజపురుషుని యాకారము నీకవి మనయెదుటఁ బెట్టుచున్నాఁడు. దుష్యంతుని వేటకై పురికొల్పినది కేవల మృగయాసక్తియే కాదు; వరాహ శార్దూలాది దుష్టమృగసంహారముచేఁ దపోధనులగు నాశ్రమవాసుల సంరక్షణయు నీతని కవశ్యకర్తవ్యమైనది. అనసూయ వాని నాతపోవనమునకు వచ్చుటకుఁ గలకారణ మడుగఁగా ఋషులతపస్సులు విఘ్నములులేక జరుగుచున్నవా లేవా యని విచారింపఁజొచ్చితిని. "అథర్మాధికారే నియుక్తః అవిఘ్నక్రియోపలంభాయ ధర్మారణ్య మిద మాయాతః" అని బదులు చెప్పెను. అరణ్యములందలి తాపసులయోగక్షేమములవిషయమై యాతఁడు వహించిన విశేషశ్రద్ధకు నాటకాంకమున గాఢ్యపసందేహహారు లగు ఋషికుమారుల యాగమనకారణమునుగూర్చి "కింతావ ద్వ్రతినా ముపోఢతపసాం విఘ్నై స్తపోదూషితం............ ......ఇత్యారూఢ బహుప్రతర్క మపరిచ్ఛేదాకులం మే మనః" అని వితర్కించుచు నాతఁడుపొందిన మనోవ్యాకులత్వమే నిదర్శనమగుచున్నది. రాజ్యమందలి ప్రజల నీతఁ డెంతజాగరూకతతో స్వసంతానమువలెనే పరిపాలించుచున్నదియు మిత్రుని వృత్తాంతమువలన మనకుఁ దేటపడుచున్నది. ఇట్లు ఇంద్రునకు జయింప శక్యముకాని రాక్షసులను జంపి దేవతలను రాక్షసులను క్రూరమృగములను సంహరించి యరణ్యములను, నివసించు తపోధనులను, స్వసంతానమువలెనే రాజ్యమందలి ప్రజలను ఒక్కరీతిగ రక్షించి పాలించుచుండుటచే వ్యక్తమగుచున్న యాతని పరాక్రమము, ఆర్తరక్షణపరాయణత్వము, ప్రజాహితైక జీవితత్వము, ధర్మపరత మొదలగు విశేషగుణములచే విక్రమాగ్నిమిత్రులకంటె నీతఁడు హైందవ క్షాత్రధర్మమునకు ఆదర్శభూతుఁడై వెలయుచున్నాఁడు.

ఈ నాటకత్రయమందు నాయకుల క్షత్రధర్మపరిపాలనవిషయముననేకాక నాయికానాయకుల ప్రణయవిషయమునఁగూడఁ గొంతభేదము కలదు. తనకంటెఁబడకుండ దేవిచే రహస్యముగ రక్షింపఁబడుచుండిన యొక కన్యను మోహించినవాఁ డగుటచే నగ్నిమిత్రుఁడు యితరులకుఁ దెలియకుండఁగ నాకన్యను దనకుఁగూర్చుటకుఁ గావిదూషకు నభ్యర్థింపవలసినవాఁ డయ్యెను. ఈనాయకుఁడు చిత్రగతయగు నాయికను జూచి మోహాము కలవాఁ డయ్యెనేకాని యామెను జేపట్టనచ్చునా యను సందేహమైనఁ గలుగలేదు. విదూషకుఁ డీనాయికానాయకుల సమాగమము సమకూర్చినపుడెల్ల నిరావతి ప్రత్యక్షమగుచు వీరి విస్రంభభాషణములకు భంగము కలిగించుటయు, నీతఁడామెవలని భయముచే నేదోరీతి నొకబొంకు బొంకి యప్పటికిఁ దప్పించుకొనుటయుఁ దటస్థించును వచ్చినది. ఇచ్చటనాయిక కేవలము పరతంత్రయగుటయు, నామెను జేపట్టుటకు నాయకునకు స్వాతంత్ర్యముగాని ధైర్యముగాని లేకుండుటయు, నీతని రహస్యతంత్రములను

దేవి తెలిసికొని నాయిక నీతనికంటఁబడకుండ బంధించియుఁ దుదకు లాభము లేదని యెంచి యామె నీతని కిచ్చి వివాహ మొనర్చుటయు, నీ నాటకమందలి నాయికానాయకుల ప్రణయపద్ధతియై యున్నది. విక్రముఁడుగూడ నూర్వశిని ప్రేమించి యామెతోఁ గూడియుండుటకు దేవివలనిభయము కలవాఁడై తనవిరహవేదన నామెకుఁ దెలియకుండఁ గప్పిపుచ్చినవాఁడే యైనను ఆతఁడు వలచిన స్త్రీ దేవియధీనమందు లేకుండుటచే నామెతోడి సమాగమమునకుఁగాను రహస్యతంత్రములను బన్నవలసిన యవసరము లేకపోయినది. ఇచ్చట దేవియు నీతనిమనం బన్యాసక్తంబని గాలికిఁ గొట్టుకొనివచ్చి తన చేతంబడిన యూర్వశీలేఖాదులచే నిశ్చయముగఁ దెలిసికొని రోషకషాయితమనస్కయై విక్రముని యనునయంబులను లక్ష్యపెట్టక సహించుకొని పోయినదైనను దుదకుఁ బశ్చాత్తప్తయై ప్రియప్రసాదనవ్రతమను మిషచే మరల నాతని చెంతఁజేరి "అద్యప్రభృతి ఆర్యపుత్రో యాం స్త్రియం కామయతే, యా ఆర్యపుత్రసమాగమప్రణయినీ తయాసహాఽప్రతిబంధేన వర్తితవ్యం" అని చెప్పిపోయినది. ఇట్లే దేవి తనకోపముచే నాతనిమనమును ద్రిప్పలేకుండుటను దెలిసికొని తానే మఱియొక స్త్రీని ప్రేమించుట కాతనికి ఉత్తరవిచ్చి మాట దక్కించుకొన్నది. రాజును ఆమె యెదుట "నాహం పున స్తదా త్వయి యథాహి మాం శంకసే భీరు" అని తానన్యాసక్తమనస్కుఁడు కానట్లుగాఁ జెప్పుకొనుచు నామె తన చెంతనుండి మరలినతోడనే "అపి నామోర్వశీ.

"గూఢం నూపురశబ్దమాత్రమపి మే
కాంతం శ్రుతౌ పాతయేత్,
పశ్చా దేత్య శనైః కరోత్పలవృతే
కుర్వీత వా లోచనే,
హర్మ్యేఽస్మి న్నవతీర్య సాధ్వసవశా
న్మందాయమానా బలా
దానీయేత పదాత్పదం చతురయా
సఖ్యా మమోపాంతికమ్"

అని యూర్వశిరాక కూటలూరుచుఁ గూర్చుండెను.

ఈనాయిక పరాధీన యగు కన్యగాని లేక తల్లిదండ్రుల యధీనమం దుండిన యొకయువతి గాని కాక స్వైరిణియగు దేవవేశ్య యగుటచేఁ దనప్రియుని వెదకికొనుచుఁ దానేవచ్చి యీసమయముకనిపెట్టి వెనుకనుండి యాతనికన్నులు మూసినది. విక్రముఁడును దేవియెదుట చెప్పినమాటలను ద్రోసిపుచ్చి తనప్రియురాలిని చల్లనిస్పర్శచే గుర్తించి ప్రియోక్తులఁ బల్కుచు నంతఃపురముఁ జేర్చినాఁడు.

ఇఁక శకుంతలాదుష్యంతుల ప్రణయమందలి విశేష మేమనఁగా నది మొదటినుండియు ధర్మనిష్ఠంబే కాక ధర్మబద్ధంబై యుండెను. కావుననే వీరియనురాగము హిందూదాంపత్యమున కాదర్శభూతంబగుచున్నదని చెప్పఁ దగియున్నది. పై రెండుకథలయందును గాళిదాసు నాయికానాయకుల యనురాగబంధముయొక్క పటిమను జూపినాఁడు. అచ్చట ధర్మచింతకే ప్రసక్తి కలుగలేదు. ఈకథయందన్నో యట్టియనురాగము ధర్మబద్ధంబై దాంపత్యనిష్ఠ మగుచో నద్దానికిఁ గలుగు పవిత్రతావిశేష మిట్టిదని వ్యక్తపఱచినాఁడు. ధర్మప్రేరితమగు నాత్మనిగ్రహ ప్రకటనమున కవకాశము కల్పించియున్నాఁడు. కావుననే యింద్రియలోలత్వమునకుఁ జిక్కి రాజ్యభారమునుగూడ వహింప నిచ్చగింపని నాయకులతోఁ గూడిన తక్కిననాటకములకంటె నీశాకుంతలమే కాళిదాసుని బుద్ధిపరిపాకముయొక్క యౌన్నత్యమును సూచించుచున్నదని చెప్పఁదగియున్నది. ఆశ్రమవృక్షములకుఁ జెలులతోఁగూడి నీరువోయుచున్న శకుంతల యవ్యాజమనోహరంబగు శరీరంబును, దల్లావణ్యాదికమును జూచినతోడనే దుష్యంతునిమనమున లోకవిషమగు నభిలాష పొడమినది. వెంటనే కణ్వాశ్రమమునుండి యామహర్షి కుమార్తెయని చెప్పఁబడినయీయామె బ్రాహ్మణకన్యయే యైయుండవలయుఁ గావున క్షత్రియుఁడగు తనకుఁ బరిగ్రహణయోగ్య కాదని తలంచి తనమనోవృత్తి నడ్డగించెను. కాని యార్యంబగు తనమనం బామెయం దభిలాష గలదగుటచే నామె తప్పక క్షత్రియపరిగ్రహయోగ్యయే కావచ్చునని తనయంతఃకరణప్రవృత్తినిబట్టి నిశ్చయించెను.

"సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణమన్తఃకరణప్రవృత్తయః"— పిమ్మట నమేజన్మవృత్తాంతమును, ఆజన్మాంతము నీమె బ్రహ్మచర్యవ్రతము జరుపవలసినదో

లేక యనురూప వరప్రదానమునఁ గణ్వున కిష్టము కలదో యనువిషయము నాతఁ డీమెచెలికత్తెల నడిగి తెలిసికొనెను. అట్లు తెలిసికొనినపిమ్మటనే తనమనంబు నామెపై లగ్నము చేసెను. తనహృదయప్రార్థనము వ్యర్థము కాదని నిశ్చయించుకొనెను. శకుంతలయు నాతనిఁ జూచినప్పటినుండియు 'నేమి? నామన మాశ్రమవాసమునకు విరుద్ధమగు వికారమునకు లోనగుచున్నది. "కింను ఖల్విమం ప్రేక్ష్య తపోవనవిరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా" అని సాశ్చర్యముగ వితర్కించుకొనసాగినది. రాజునెదుట తన చెలికత్తెలు తనవివాహవిషయము ముచ్చటింపగా దానుపోయి వీరి యసంబద్ధప్రలాపములను గౌతమి కెఱింగించెదనని బెదరించి పోఁబోయినది. తాను విరహానలతప్తయై శైత్యోపచారముల నపేక్షించుచున్నను "హలా కమ్ అన్తఃపురవిరహపర్యుత్సుకస్య రాజర్షే రుపరోధేన" అని యాతనిహృదయమును శోధింపఁజొచ్చినది. రాజునొద్ద నేకాంతముగ విడిచి పోయిన చెలుల ననుగమింప నుద్యమించుచున్న యామెను దుష్యంతుఁడు నిరోధింప "పౌరవ! రక్ష వినయం, మదనసంతప్తాఽపి నఖ ల్వాత్మనః ప్రభవామి"—అని యాతని నివారింపుచు తాను పినతండ్రియధీనములో నున్నదగుటచే నాతనియనుమతి లేకయే స్వతంత్రించుట కొప్పుకొనలేదు. తుదకు రాజామెకు బూర్వగాథలను దెల్పి క్షత్త్రియకన్యలకు స్వయంవరస్వాతంత్ర్య మున్నదని నచ్చఁజెప్పి గాంధర్వవివాహమున కొడఁబఱచెను. ఈవివాహము వీరి యనురూపదాంపత్యమును గూడ కణ్వమహాముని సమ్మతిని బడయుటయేకాక యాతని యాశీర్వాదమును గూడఁ బొందినది. పిదపఁ గణ్వుఁడే యీమెను భర్తయగు దుష్యంతునియొద్దకుఁ బంపుటకు గౌతమితోడను మఱియిద్దఱు శిష్యులతోడను ప్రయాణము చేయించెను. కానియీమె యూర్వశివలె గురుశాపహతయై యధోలోకమునఁ దననాయకునితోఁ గూడియుండుటకుగాముక్తాభరణభూషితయై నీలాంశుక పరిగ్రహముకల యభిసారికావేషమును ధరించి సంధానకర్త్రియగు చెలికత్తియతోఁ గూడిబయలుదేఱలేదు. శకుంతలాప్రయాణ సమయమునఁ బరిశుద్ధంబగు నాయాశ్రమమున నామె పవిత్రజీవితమునకుఁ దగినట్లుగా కణ్వమహాముని ప్రభావాతిశయంబున,

"క్షౌమం కేనచి దిందుపాణ్డుతరుణా
మాఙ్గల్య మావిష్కృతం
నిష్ఠ్యూత శ్చరణోపభోగ సుభగో
లాక్షారసః కేనచిత్,
అన్యేభ్యో వనదేవతాకరతలై
రాపర్వభాగోత్థితైః
దత్తా న్యాభరణాని తత్కిసలయో
ద్భేదప్రతిద్వంద్విభిః."

ఒకవృక్షము పట్టుబట్ట నిచ్చినది; మఱియొకటి చరణముల కలవరించుకొనుటకు మాంగల్యసూచకమగు పారాణి నిచ్చినది ప్రస్తుతము నాకాలమునఁ బ్రబలుచున్న నవనాగరకత యిప్పటి తెల్లని మల్లుపంచెలను అంతకంటె స్వచ్ఛతరంబులగు జనులవసనంబులను రాగయుక్తంబులై పోవునని కాఁబోలును యీ లాక్షారసలేపనమును దూరాపాస్తముగాఁ జేయఁదొడఁగినను కాళిదాసుమాత్రము దీనిని మాంగళ్యసూచకముగనే యెంచియుండుటచే నీయాచారమునకు సుమారు రెండువేలయేండ్లకంటె నెక్కుడు వయస్సీయున్నట్లు మనకుఁ దెలియవచ్చుచున్నది. ఇట్టి వనదేవతాదత్తంబులగు మఙ్గళవస్తువులను ధరించి ఋషికుమారులచే ననుగమ్యమానయై కాశ్యపునిచే నత్తవారింటికి నంపఁబడుచున్న శకుంతలను, పైఁజెప్పఁబడినరీతిని యభిసారికావేషము గ్రహించి సహచరీసహాయయై ప్రియుని వెదకఁబోవుచున్న యూర్వశిని మన మనోముకురంబునఁ బ్రతిఫలింపఁజేసి చూచినచో నీనాయిక హైందవధర్మంబుల కాదర్శభూతం బగుచున్నదో యెవరు కాళిదాసుని పరిణతబుద్ధిచేఁ జిత్రింపఁబడియుండునో మనము సులభముగా గ్రహింపఁగలుదుము.

కాళిదాసునినాటకకళ పరిపక్వము నొందిన కొలఁది యాతనినాటకముల విదూషకునిచర్యలు నాతఁడు నాయకుని కామతంత్రమునఁ జేసిన సహాయమును తగ్గిపోవుచుండుటేకాక నాయకుల ప్రణయతంత్రములకు వీరి పెద్దభార్య లొనర్చెడి భంగపాటును తగ్గుచువచ్చెనని చెప్పఁదగియున్నది. అగ్నిమిత్రునివలె విక్రమునకుఁ బ్రియాసమాగమవిషయమున నంతగా విదూషకునిమీఁద నాధారపడవలసిన యవసరము లేకపోయినది. ఇక శాకుంతలమునందు విదూషకుఁడు నాయికానాయకుల సమాగమమున

కెట్టిసహకారియుఁ గాలేదు సరిగదా! దుష్యంతుఁడు తనప్రణయకార్యము నాతనియపేక్ష లేకయే నిర్వర్తించుకొనెను. విదూషకుని కీప్రణయ వ్యాపారమునఁ బ్రసక్తిలేకుండఁ జేయుటచేతనే యాతఁడు కథాప్రవృత్తికి (development of the Plot) తోడ్పడునట్లే మహాకవి యిందేర్పఱచినాఁడు. మఱియు నిందు రాజభార్యయగు వసుమతి యంగుళీయకము దొంగిలినప్పటి నుండియు రాజునకుఁ గలిగినయస్వస్థతను విని శంకితమనస్కురాలై యుండి చతురిక రాజుకై తీసికొనిపోవుచున్న వస్త్రములపెట్టెను దానే తీసికొనిపోయి యిచ్చెదనని బలవంతముగా లాగికొని రాజు చెలియలను గనిపెట్టవలెనని బయలుదేఱినదైనను ప్రతీహారి చేత నొకకాగితముఁ బట్టుకొని రాజునొద్దకుఁ బోవుచుండుటను జూచి రాజకార్యమునకు భంగము కలుగునేమో యనుభయముచే వెనుకకు మఱలిపోయినది. ఇది వసుమతి సమయజ్ఞతనేకాక దుష్యంతునకు రాజధర్మనిర్వర్తనమందుఁ గల విశేషాదరమును సూచించుచున్నది. ఇట్లీనాటకమున దేవి నాయకుని ప్రణయకార్యములకుఁ గలిగించిన భంగ మేమియు లేదు. నాయకుఁడును నామెను భయపడి బొంకవలసిన యవసరమును లేకపోయినది. ఇట్లీశకున్తలాదుష్యంతుల ప్రణయకథ తక్కిన రెండుకథలకంటె నున్నతావర్ణంబుల నెలకొల్పునుఁ గాళిదాసుని బుద్ధివికాసముయొక్క పరిపూర్ణతకుఁ దార్కాణంబగుచున్నది.

ఇఁక నీశాకుంతలమందే యాతని కళాచాతుర్యము గూడ పరిపూర్ణతను బొందెననుటకు నొకటిరెండు నిదర్శనములు చాలును. మాళవికాగ్నిమిత్రమునఁ గథాప్రవృత్తి యంతయుఁ జాలవఱకు విదూషకునిమీఁదనే యాధారపడినట్లు కన్పట్టక మానదు. అగ్నిమిత్రుఁడు చిత్రగతయగు మాళవికను జూచినదాది దేవియనుగ్రహముచే నామెను చేపట్టువఱకు విదూషకుఁడు పన్నినపన్నుగడల కనుకూలంబుగ నడచుకొనుచు నాతఁడు త్రిప్పినట్లెల్లఁ దిరుగుచు వచ్చెను. విక్రమోర్వశీయమునఁ గథయంతయు నొకఁడు త్రిప్పినట్లు తిరుగకుండుటయేకాక యందలి కథాసంధులు పైదానియందునకంటె విశేషమైన పుష్ట్యముతో సమర్పఁబడి యున్నది. విక్రముఁ డూర్వశిని రక్షించుటచే నింద్రుని బహుమానమునకుఁ బాత్రుఁడయ్యెను. ఈసందర్భమున నూర్వశికి విక్రమునియందుఁ గలిగినయనురాగము భరతమునిశాపమునకుఁ గారణముగాఁగ నింద్రునికి విక్రమునియందుఁ గలిగిన యాదరమే పైశాపమును నూర్వశీవిక్రముల మనోరథసిద్ధికిఁ గారణ మగునట్లు మార్చివేసినది. మఱియొక విశేష మేమనఁగా నీశాపమునందే, లేక శాపావధియందే యుత్తరకథకు వలయుబీజము లిమిడియున్నవి. ఎట్లనఁగా నీశాపావధిని గూర్చిన జ్ఞానమే యూర్వశి తన కుమారుని చ్యవనఋష్యాశ్రమమున విడిచివచ్చుటకు హేతువై పంచమాంకమున నాయువునుగూర్చినకథకు దారి తీసినది. మొత్తముమీఁద నీకథాచక్రమంతయు తరువాత శాకుంతలమందువలెనే యొకశాపమనుకీలునందు తిరుగుచున్నదని చెప్పవచ్చును.

శాకుంతలమునఁ గణ్వమహాముని శకుంతలాప్రతికూలదైవమును శమింపఁజేయుటకుఁగా సోమతీర్థమునకుఁ బోఁదలఁచి పర్ణశాలయం దామె నతిథిసపర్యకై నియోగించి వెళ్లుటయే నాయికానాయకుల సమాగమమునకును వారి పరస్పరానురాగమునకునేకాక తన్మూలమున దుర్వాసుని శాపమునకుఁగూడ మార్గము నేర్పరచియే పెట్టినది. ఋష్యాశ్రమములయందు నతిథిసత్కారములకుఁ గల ప్రాముఖ్యము, దూర్వాసునికిఁ గలముక్కోపితనము, కణ్వునిచే నాశ్రమమున నతిథిసత్కారమునకుఁగా నియమిత యయ్యును అనురాగావిష్టచిత్తయగు శకుంతల తనధర్మముపట్ల నలసత్వము వహించుటయు నివియన్నియు శాపమున కనువగు పరిస్థితులను గల్పించినవి. ఈశాపకీలక మీకథాచక్రమునకేకాక నాటకచక్రమునకుఁ గూడ నట్టనడుమనే (అనఁగా నేడంకములుగల యీ నాటకమున నాల్గవయంకము మొదటనే) యమర్చి యీ మహాకవి కథాచక్ర మెంతరమ్యముగనో త్రిప్పుచున్నాఁడు. అయిదంకముల విక్రమోర్వశీయమునను మూఁడవ యంకమున నట్టనడుమనే పొందుపఱుపఁబడినది. దీనియందుఁ గథాప్రవృత్తిమాత్రమునకే తోడుపడిన యీశాపము శాకుంతలమునఁ బాత్రపోషణమునకును రసోత్కర్షకును గూడ సహాయమును జేసినది. లోకమున వ్యాసుని దుష్యంతునకు (అనఁగా భారతమందలి దుష్యంతునకు) వచ్చిననిందను దొలగించి యిందలినాయకుని ధీరోదాత్తలక్షణసమన్వితుఁడగు నుత్తమనాయకునిగాఁ జేయుటకు

గాను గాళిదాసీశాపసహాయమును గొనినవాఁ డయ్యెను. దూర్వాసుఁడు శకుంతలకు నిచ్చినశాపము దుష్యంతుని యందు సంక్రమించి పూర్వగాథావిస్మృతిరూపమునఁ బరిణమించినది. శాపహతుఁడగుటచే శకుంతలయెడఁ గావించిన యన్యాయమువలన నీతఁడు గళంకితుఁడు కాలేదు. ఇట్లు శాపము నాయకునిస్వభావమును బోషించి సమర్థించుచుండ శాపవిమోచనకారణముఁ గథాప్రవృత్తికిఁ దోడ్పడుచుండును. ఈకారణ మభిజ్ఞానాంగుళీయకము శకుంతలభర్తృగృహమునకుఁ బోవునపుడామె చెలికత్తెలు శాపవృత్తాంతము చెప్పినచో నామె దుఃఖించుననియో లేక తచ్ఛాపపరిహారకారణంబగు నంగుళీయకమునే భద్రముగా నామె కిమ్ముచున్నపుడు మరల శాపవృత్తాంతప్రసంగ మనవసరమనియో తలంచి యేమియుఁ జెప్పక భర్త తన్ను గుర్తింపనిచో నాయంగుళీయకమును జూపుమని యిచ్చిరి.

"యది నామ రాజా ప్రత్యభిజ్ఞానమంథరో భవేత్
తదా ఏతదంగుళీయకం దర్శయ"

కాని విధివశమున నీమె యుంగరమును గోల్పోవుటయు, నద్దాని గుర్తింపకుండుటయు నిందఱి నాయికానాయకులవియోగమునకుఁ గారణమై కథాప్రవృత్తికిఁ దోడ్పడును రాజు ధర్మశీలత్వమును వెల్లడించినది. ఈయభిజ్ఞానాంగుళీయకమే మరల ధీవరునిమూలమున దుష్యంతునిచేతిఁ బడినదై శకుంతలాపరిణయగాథ నాతనిస్మృతిపథమునకుఁ దెచ్చి యీనాటకమున విప్రలంభశృంగారరసము నుద్వేలము గావించుటకుఁ దోడ్పడినది. మఱియు నీయభిజ్ఞానదర్శన మైనపిమ్మట పశ్చాత్తాపదోహూయమానుఁడగు నాయకునకును, భర్తచేఁ దిరస్కృతయైనను పతిదైవతయైయై "పరిధూసరితవస్త్రయు, నియమక్షామముఖియు, నేకవేణియునై విరహవ్రతమును ధరించుచున్న" నాయికకును మిగుల పవిత్రవంతమును బుణ్యవంతమును నగు మారీచాశ్రమముననే పునస్సమాగమమును గల్పించి కవి యీకథానిర్వహణము నతి హృదయంగమముగ జేసినాఁడు.

విక్రమోర్వశీయమందలి కథానిర్వహణము నద్భుతంబైయైనను ఇంత ఉన్నతపవిత్రభావోత్తేజకంబుగఁ గన్పడదు. కాని వీరి సమాగమమునకు శాకుంతలమునందు వలెనే వీరికుమారుఁడే సన్నిహితకారణ మయ్యెను. ఈకుమారుల సత్త్వోత్కర్ష వాక్రీడాదికముచేతనే స్పష్టమగుచున్నది. కాని సర్వదమనునికంటె నాయువు పెద్దవాఁ డగుటచే నీతనిబాల్యచేష్టలకంటె భక్తిభావమే మన మనముల నెక్కుడుగ నాకర్షింపఁగలదు. సర్వదమనుఁ డన్ననో తనబాల్యచేష్టలచేతను అవ్యక్తమధురములగు ముద్దుమాటలచేతను, వాత్సల్యభావోత్కర్షకుఁ గారకుడై అప్పటి దుష్యంతుని హృదయముతోపాటు మన హృదయములఁగూడ కరిగించివేయుచున్నాఁడు.

కావున నిట్లు పరిశీలించిచూడగ నీమహాకవి కాళిదాసు మాళవికాగ్నిమిత్రరచనచే నాటకకళయందుఁ గొంతయభ్యాసముఁ జేసికొని పిదప విక్రమోర్వశీయమునఁ గొంత యపూర్వత గనఁబడునట్లుచేసి తనప్రతిభను సూచించుచు నందుఁ దనుభూతమున నుత్తమనాటకమునకు వలయు పరికరమునంతను గూర్చిపెట్టుకొని వానినేమరలఁ దీసికొని శాకుంతలకథయం దమర్చి దిద్ది వంకలుదీర్చి సానపెట్టి మెఱుఁగులొమి తుదకు దానిని సంపూర్ణప్రభాభాసమానంబగునట్లొనర్చినాఁడోయని తలంపఁదగియున్నది.






## "గాంధిభక్తుఁడు"

"మతయుగ మంతరించె; ననుమానములయ్యెఁ దదీయసత్యముల్;
వ్రతనియమాదులెల్లఁ గడువ్యర్థములై కనుపట్టె; హేతుస
మ్మతియె శరణ్యమయ్యె భువి, మాదృశముగ్ధజనాళి కింక నే
గతి?" యని నెమ్మనంబు కలఁగంబడఁ జొచ్చె ననేకచింతలన్.

గీ. కోటివిద్యలు గఱచుట కూటికొఱకె, జ్ఞానియై ముక్తివడయుట కల్లమాట
యెన్నియుక్తులు మోసముల్ పన్నియైన, ధనము నార్జింపఁగలుగుట ధర్మ మిలను.

క. దైవము మానుషకల్పిత, భావమె, సౌందర్య ప్రేమ భంగులు కవితా
జీవనపథములె నీతులు, కోవిదలోభులు నటించు కుత్సితవిధులే.

సీ. "ఇహభోగములకు వే ఱేస్వర్గమును లేదు; భుక్తికి వేఱైన ముక్తి లేదు;
ప్రకృతిశోధనకు వే ఱొకశాస్త్రమును లేదు; హేతురీతికి వేఱు నీతి లేదు;
యంత్రసాధన వేఱు మంత్రం బొకఁడు లేదు; యుక్తిపేర్మికి వేఱు శక్తిలేదు;
స్వార్థంబునకు వేఱు సత్య మొక్కఁడు లేదు; విత్తంబునకు వేఱు వేల్పు లేదు;
మతము ధర్మంబు పుణ్యమన్ మాటలెల్లఁ, బ్రాఁతకాలపు ఛాందసుల్ వడినభ్రమలె;
వినుఁడు నిజ" మంచునవయుగవేదఘోష, మొఱసె వీనుల దుందుభుల్ మ్రోయుకరణి.

శా. ఆరావం బతిఘోరబాణవిసరంబట్టుల్ మదీయశ్రుతి
ద్వారంబుం బెకలింపఁ, జిత్త మవశత్వంబొందెఁ; ద్రైలోక్యసం
హారారంభముభంగిఁ దోచెఁ, బ్రళయవ్యామోహసంఛన్నమై
క్రూరార్తిన్ జగమెల్ల దీనగతి నాక్రోశింపఁగా నయ్యెడన్.

శా. కర్ణానంద మొనర్చె, గాఢతిమిరాక్రాంతత్రియామన్, బ్రఘూ
ర్ణార్ణోరాశి ప్రచండవాత జనితోగ్రాకారకల్లోలమై
జీర్ణం బొందఁగ, నౌక నావికునిదృష్టిన్ దీర దీపద్యుతుల్
వర్ణాతీతముదంబు గూర్చుక్రియ, దివ్యశ్రావ్యసంగీతికల్.

క. ఊరక నీవరు చింతా,శ్రమమున; స్మరింపు, 'ధర్మభంగికి నెందే
వైరమునకపుడు, చేసెద, తాం బెత్తు దాను, పరమవైనవచనముల్.

ఉ. ధర్మముఁ బ్రోవ, నీతిమతతత్త్వ వితానికి నేత్ర, భూరి స
త్కర్మల మానవోద్ధరణ కంకణమూనఁ, బరోపకృద్ధిక్ష్మా
ధర్మిపదంబు స్వార్థ విరహితయు శాంతియుత ప్రవృత్తి యుం
ధర్మిలిఁ జాలు, భూమి నుదయంబయినట్టి మహాత్ముఁ గాఁడె ?

సీ. జనకవిభూతి ధరించు తన సత్యనియతి హరిశ్చంద్రునకును నాఁ గ్రేలువాఁడు;
ఘనతరాంగుఁ జలింపని దైవభక్తిచేఁ, బ్రహ్లాదకల్పుఁడై పరఁగువాఁడు;
స్వార్థవిరతి, నహింసామహావ్రతరతి, నభినవబుద్ధుఁడై యడరువాఁడు;
పతితజనావనపరత నవ్యాజకరుణామయుఁడై క్రీస్తు నాఁ దగువాఁడు;
దురిత భూయిష్ఠహింసాత్మధరణి నరక, మమృతశీలాభ్రగంగచే ననురతలము
గా రచనసేయ, నవ్యభగీరథుండు; భరతఖండపు మహాపుణ్యఫలము గాంధి.

సీ. దక్షిణాఫ్రిక భారతక్షేమదీక్షమై, పడరానియిడుమలఁ గుడిచినాఁడు;
వైరచాంపరనార్తకార్మిక రక్షార్థ, మరిది యాత్మబలంబు నెరపినాఁడు;
సత్యాగ్రహాశ్రమ స్థాపనాచార్యుఁడై, వినుత సేవకకోటిఁ బెనిచినాఁడు;
అహితాసహాయోద్య మాద్భుతనాథుఁడై, సాత్వికసమరంబు జరపినాఁడు;
ఘోరహింసామయాహవ క్షుభితభూమి, నలఘుఖడ్గ శతఘ్నికా బలముకన్న
సారతర మాత్మబలమంచుఁ జాటె నాఁడు; గణుతిసేయంగ సాధ్యుఁడే గాంధిహాని ?

సీ. అనలోకనము సేయ నల్పతనుండయ్యు, వీరశేఖరుఁ డంచుఁ బేరువడసెఁ;
గరకృత కర్కశకౌపీనధారియై, నాగరక విధాతృనాముఁ డయ్యె;
రాట్నచక్రనిరంతరప్రయోగార్థియై, నవజగన్నిర్మాతనాఁ జెలంగె;
భయదకారాగార బందీకృతుం డయ్యు, భువనైక సుగుణవిభూతి మెఱసె;
రుగ్ణతాధీన మృదుశరీరుండె యయ్యు, లోకపరహితనిష్ఠమై స్వీకృతాతి
కఠిన దీర్ఘోపవాససంకల్పుఁడయ్యెఁ ; గలితమోహారఘృణి గాఁడె గాంధితరణి ?

క. 'అప్రతిభుఁడ; మందుఁడ; జ్ఞానప్రభ లేశ మెఱుఁగ; నహి నాకడ మహనీ
యప్రకృతి' యను; నయినధర్మప్రవణత గాంధి యపరరాముఁడు గాఁడే?

ఉ. 'కాదె యరణ్యరోదనసఖంబు మహాత్మునిబోధ మీ భువిన్ !
కాదె మహాత్ముచాగ మిలఁ గానసచంద్రికలీల' యంచు దు
ర్వాదము లాడఁబోవకు; తిరంబిది నమ్ము; మహాత్మమార్గమే
ప్రోది వహింపఁగాఁ గల దపూర్వసుఖోత్తమ ధర్మవంశమై.

సీ. ఆత్మ శాట్నకృత దివ్యాంబరశోభియై, భారతలక్ష్మి పెంపారఁ గలదు;
అన్యోన్య ప్రీతచిత్తాత్మజమై యుండి, యీజనని స్వరాజ్య మందఁగలదు;
నీతికోవిద మహనీయ సనాథయై, మనుజమండలి శుభం బెనయఁగలదు;
భువిఁ బశుశక్తి యభూత కల్పముగా న,హింసయె ధర్మమై యెసఁగఁగలదు;
బహువిధాసంఖ్య నవయుగ ప్రాణికోటి, సమయవేణీగతంబయి సమసిపోవ,
బుద్ధ మహమదు క్రీస్తు రాములను బోలి, గాంధి పరదైవమై పూజఁ గాంచఁగలఁడు.

క. కావున నమ్మహనీయు భవ,ద్భావవిలోకన మొనర్పు; పాసెడి సంతన్
నీవగపని యాదివ్యా,రావము వలుకంగ, మది కరంబుఁదలిర్పన్.

శా. కాంచన్ మానసనేత్ర ముజ్జ్వల శుభాకారున్, మహాజ్ఞానదీ
ప్తాంచద్దివ్య మనోహరాననుఁ, గృపార్ద్రాపాంగు, మోహానిలా
చంచద్భవ్యపవిత్రశీలు, విలసచ్ఛాంతిస్వరూపాత్ముఁ, బ్రా
పంచాతీత విలక్ష్య దివ్య సుషమాప్రద్యోతనున్, గాంధినిన్.

సీ. విష్ణు హస్తంబుతో వియ్యమాడెడు కేలఁ, జక్రప్రయోగంబు జరగుచుండ,
శంభుమధ్యంబుతోఁ జదురాడు కటిసీమఁ, గౌపీనచేలంబు గ్రాలుచుండఁ,
జతురాస్యకాంతితోఁ బ్రతివచ్చు మోమున, విమలసుందరవాణి వెలయుచుండ
నమృతవాహినులతో సమమైన కన్నుల, దరహాసవీచికల్ దనరుచుండ,
ఘనవిగత సత్యభానుండు గ్రాలినట్లు, శాంతరసమయ పూర్ణిమాచంద్రు లీలఁ
గరుణ రూపంబు చేకొన్న కరణి, నున్న, గాంధిఁ బొడగంటిఁ; జింతాబ్ధిఁ గడవఁగంటి.



## ౪౦-వ జాతీయమహాసభ-కాన్పూరు



౩. శ్రీమతి సరోజినీదేవిగారు అధ్యక్షోపన్యాసము నొసగుట



౪. ఆహ్వానసంఘాధ్యక్షులు డాక్టరు మురారిలాలుగారి స్వాగతోపన్యాసము కావించుట



# భీమకవి జన్మస్థానము

శేషవరపు కామరాజు గారు

[వెనుకటి సంచిక తరువాయి]

ఇఁక కవికాలమును గూర్చి యోజింతము :

"మ. ఘనుఁ డెన్ వేములవాడ భీమకవి.... తెలుంగా
ధీశ! కస్తూరికా......యింపుర !"

అను పద్యమున తెలుంగాధీశ యను పాఠము గల్పించి శ్రీ రామమూర్తిగారు భీమన నన్నయకుఁ బూర్వుఁడనియు, తెలుంగాధీశ యను పాఠమును గల్పించి శ్రీ వీరేశలింగం పంతులుగారు పదునాల్గవ శతాబ్దమువాఁ డనియు వ్రాసిరి. "ఈరెండు నసమ్మతములే" యని శ్రీరామయ్యపంతులుగారు వ్రాయుచు వీరుగూడ యెవ్వరును లేని కళింగాధీశయను పాఠమును గల్పించి కాలనిర్ణయమునకుఁ గడంగిరి. శ్రీ రామయ్య పంతులుగారి ఖండనమున ముఖ్యాంశ మేమన తెలుంగాధీశ, తెలుంగాధీశ యనునవి దుష్ప్రయోగములుగాన కళింగధీశ యనునది సాధు ప్రయోగమని. తెలుంగాధీశ యనునది దుష్ప్రయోగము గానిచో కళింగాధీశ యనునది త్యాజ్యముగదా? తెలుంగాధీశ యనునది యెంతమాత్రమును దుష్ప్రయోగము గాదు. (తెలుంగు + అధీశ) యని పరిచ్ఛేదముఁ జేసి సంధియగుచో - తెలుంగధీశ - సంస్కృతసంధి యగుచో 'తెలుంగ్వధీశ' యగుఁగాని తెలుంగాధీశ కాదనిరి. వీరు దీని పదచ్ఛేదమునఁ బొరపాటు పడిరిగాని మిగత తర్కము సరియే. తెలుంగు + ఆధీశ యని పదచ్ఛేదముఁ జేసినచో తెలుఁగుసంధివలన తెలుంగాధీశయగును. చిన్నయసూరి బాలవ్యాకరణము, సంధిపరిచ్ఛేదము, ప్రథమ సూత్రము. 'అధీశ' ఏవ, ఆధీశః. స్వార్థమందు అణ్ ప్రత్యయము వచ్చినది పాణిని "తద్ధితేష్వచామాదేః" భట్టోజీదీక్షితులవారివృత్తి "ఞితి ణితిచ, తద్ధితే పరే, అచామాదేరచో వృద్ధి స్స్యాత్." వరదరాజవార్తికము "స్వార్థ ఉపసంఖ్యానమ్-త్రిష్టుభేవ త్రైష్టుభమ్." ఇంక నొకవిధమునను జూచినను ఆధీశయనునది సాధువే. ఆఙ్ + అధి + ఈశ=ఆధీశ. ఇట ఆఙ్, అధి, రెండును ప్రాదులు-ఉపసర్గలు. ఉపసర్గవృత్తియందు "ఏకేన ద్వా త్రైః కృశానుస్విర్వా" యనన నొకటిగాని, రెండుగాని, మూడుగాని యుపసర్గలుండవచ్చునని యున్నది. భీమన యుభయభాషాపండితుఁడు. దుష్ప్రయోగముఁ జేయని మాట వాస్తవము. తర్కవ్యాకరణపండితుఁ డగు శ్రీనాథుఁడుగూడ తెలుంగాధీశ యనియే ప్రయోగించినాఁడు.

శా. అక్షయ్యంబుగ సాంపరాయని తెలుం
గాధీశ, కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరా-
డ్బృందారక శ్రేణికిన్
దాక్షారామచళుక్య భీమవరగం
ధర్వాప్సరో భామినీ
వక్షోజద్వయ కుంభి కుంభములపై
వాసించు నవ్వాసనల్.

శ్రీరామయ్యపంతులుగారు స్వపక్షవాద నిర్ధారణార్థము గల్పించిన కళింగాధీశయనుపాఠ మెంతమాత్రము సరికాదు. శ్రీనాథుఁ డంతిమదశయందు "రంభ గూడెఁ దెనుంగ రాయరాహుత్తుండు కస్తూరి కేరాజుఁ బ్రస్తుతింతు" నని చెప్పియున్నాఁడు. "తెలుంగాధీశ కస్తూరికాభిక్షాదానము సేయరా" యని పైనవివరించిన పద్యమందుఁ జెప్పెను. దీనింబట్టిచూచిన తెలుఁగురాజులు శ్రీనాథునికాలమునకును, గస్తూరికిఁ బ్రసిద్ధిఁజెందినవా రనుట స్పష్టము. భీమనయుఁ దెలుంగాధీశుని గస్తూరి నిమ్మని కోరెఁగదా? శ్రీనాథునికాలపుఁ దెలుంగాధీశుఁ డొక

వ్యక్తియు, భీమనకాలపు తెలుంగాధీశుడు మరియొక వ్యక్తియు గాని వీరల కిరువురకును సంబంధము గలదు. తెలుంగాధీశుఁ డనునది తెలుఁగుదేశపు రాజను నర్థమున నొక బిరుదుగాని కొందఱనుకొనినట్లు వ్యక్తిపేరుగాదు. భీమనకాలపువ్యక్తి తెలుంగాధీశుఁడును, శ్రీనాథుని కాలపువ్యక్తి సాంపరాయని తెలుంగాధీశుఁడును. (సంపర అయనం యస్య సః=సంపరాయనః) సంపర రాజధానిగ నెవరికిఁగలదో వాఁడు సంపరాయనుఁడు. ఇతఁడు మొదటిరాజు. (సంపరాయనస్య అపత్యం, పుమాన్ సాంపరాయనిః) సాంపరాయనునియొక్క కుమారుఁడు సాంపరాయని. ఇతఁడు రెండవరాజు. సాంపరాయని తెలుంగాధీశుఁడన సాంపరాయని కుమారుఁడు లేక మొగటిరాజు మనుమఁడు. గోదావరిమండలమున దాక్షారామమునకు సమీపమున సంపరయనుగ్రామము గలదు. శ్రీనాథుఁడు సంపరతెలుఁగుప్రభువులను పేరివారిలో మనుమని కాలపువాఁడును భీమన తాతకాలపువాఁడును నగుచున్నాఁడు. శ్రీనాథునకును భీమనకుమధ్య నొకతరము గలదు. శ్రీనాథుడు 1365 మొదలు 1445 వఱకు నుండెనని చాలమంది యభిప్రాయము. కాన తరమునకుఁ జరిత్రకారులందఱి వలె ముప్పదినత్సరములు లెక్కచూచిన 1335 ప్రాంతమువాఁడు గావలయును. భీమనకాలనిర్ణయమునుజేయుటలో శ్రీరామయ్యపంతులుగారు గ్రంథస్థవిషయము లని రెండింటినిమాత్రము చర్చించిరి. అవి యెంత మాత్రము సమంజసముగ లేవు.

"కవిజనాశ్రయమున 10 యతులు గలవు. పెద్దన కృత కావ్యాలంకారచూడామణియందు 12 గలవు. అనంతునిఛందస్సున 24 గలవు. తరువాతివారు కొందఱు 27 చెప్పిరి. అప్పకవి 41 చెప్పెను. కాన యతులసంఖ్య కాలక్రమమున వృద్ధియైనదిగానఁ దక్కువయతులుగల గ్రంథమైన కవిజనాశ్రయము ప్రాచీన"మని శ్రీరామయ్య పంతులుగారు నుడివిరి. పెద్దన్న యతులు 4 కాని 12 కావు. వేదము వేంకటరాయశాస్త్రిగారు 1909 సంవత్సరమున ముద్రించిన కావ్యాలంకార చూడామణి సప్తమోల్లాసము 30-వ పద్యమునఁ జూడుఁడు:

క. స్వరజులు వర్గజ లితరే
  తరవర్గజ లనఁగ నేకతరజ లనంగా
  బరసారు ఖిల్లు నాలుగు
  విరసఁ గనుంగొనదు వాని విలసము దెలియన్.

శ్రీరామయ్యపంతులుగారి వాదప్రకారము పెద్దన కావ్యాలంకార చూడామణి ప్రాచీనము. విశేషించి వీరలు ముద్రింపించిన కవిజనాశ్రయమున 10 యతులన్నవిగాని 'క, ష' యను రెండుప్రతులలోనున్న (1) అభేదయతి, (2) వృద్ధియతి, (3) ఆదేశయతులను, ష యనుప్రతిలోనున్న (4) నిత్యసమాసయతి, (5) కాకుస్వరయతి, (6) వాశవర్ణయతి, (7) ప్రాసయతులను నేడింటిని పరిహరించినారు వీనింగలసి కవిజనాశ్రయకారునివి 17 యతు లగుచున్నవి. పెద్దన్న తెరువాతి పద్యమున యచ్చుగమి పంద్రెండని చెప్పి యా పంద్రెండిటిని మూఁడు భాగములుగ విభజించెను.

(1) అఆఐఔలు 4 అకారవడి
(2) ఇఈఋౠఎఏలుఁ 5 ఇకారవడి
(3) ఉఊఒఓలు 3 ఉకారవడి
మొత్తం 12 } స్వరజలు

భీమన, అకార, ఇకార, ఉకారములనన్నిటినిగలిపి స్వరయతియని వాడెను. శ్రీరామయ్యపంతులుగారు పొరపాటునఁ బెద్దనస్వరజల మూఁడిటిక్రిందను, భీమనవి యొకటిక్రిందను లెక్కించినారు. పెద్దనయుదాహరణము లిచ్చినయంతర్భాగముల నన్నిటిని వేర్వేరుగా లెక్కించినను 10 యతులగును గాని 12 కావు. ఆంధ్రపత్రిక క్రోధనసంవత్సరాది సంచికయందు నన్నయభట్టు భారతములోని యతులను శీర్షికక్రింద చిలుకూరి నారాయణరావుగారు, పెద్దన 12 యతులఁ జెప్పెనని పైనవ్రాసి పట్టికలో 11 మాత్రమే కనబరచుచుఁ బొరపాటునఁ బెద్దన చెప్పని వృద్ధి వళిని గూడఁ జేర్చినారు. అటులైనను 10-యతులేకదా ! ఇది 'పంచపాండవుల నేనెఱుఁగనా మంచపుకోళ్లవలె ముగ్గురేకదా యని రెండు వ్రేళ్లుచూపి క్రిందనొకటి వ్రాసి' రను కథవలెనున్నది. శ్రీరామయ్యపంతులుగారు ముద్రింపక పరిహరించిన 7-యతులు తీసివేసి భీమనవి 10-యనియుఁ' బెద్దనవి యతఁడు చెప్పినట్లు నాల్గుగాక యుదాహరణము లిచ్చిన పదియు ననియు వాదముకొఱకంగీకరించిన నిద్దఱి

వేఁగాఁబోలు పెద్దనకావ్యాలంకార చూడామణిలోని బన్యముల నెరువుఁదెచ్చికొని శ్రీరామయ్యపంతులుగారు ముద్రించినారు. పైన నుదహరించిన నాల్గుయతుల నేల చేర్చ లేదు? చేర్చినచో భీమనయతులసంఖ్య హెచ్చుగును గదా? అప్పుడు వారివాదముప్రకారము పెద్దన్న ప్రాచీనుఁడగును గదా !!

కవిజనాశ్రయము 11-వ పేజీ 33-వ పద్యము.

కం. అళి వృషభ సింహ తుల యుగ
జలచర చాపాది కటకసంజ్ఞకవాసుల్
లలి మభజసన యరతగణ
ముల కయ్యెను జగతిలోను మోహనరూపా!

24-వ పేజీ, 80-వ పద్యము.

కం. స్వఃకాంతా సమయోషిదు
రఃకృతరతి చిహ్నదుష్కరప్రాసం బా
విఃకృతమగు నిట్లు సుపు
త్రః కులదీపకయనంగఁ దగుచు మహాత్మా!

పైన వివరించిన కారణములవలన భీమనయతులు పదికంటె నెక్కువ యనియు వానిని శ్రీరామయ్యపంతులుగారు సరిగ శోధించి వ్రాయలేదనియుఁ దేలుచున్నది. నన్నయభట్టు కలియుగాదివాఁడని చెప్పిన యప్పకవిని నమ్మఁగూడదని శ్రీరామయ్యపంతులుగారు సెలవిచ్చిరిగాని తనకు భీమన పదియతులఁ జెప్పెనను నప్పకవివ్రాసినదే వీరికిఁ బథ్యమైనది. ఆహా! ఎట్టిచింత! ఇఁకఁ బంతులవారి రెండవకారణము. నన్నయభట్టుకాలమున మధ్యాక్కరకు యతి యయిదవగణము మొదట నుండినట్లు భారతమువలన విశదమగును. ఈగ్రంథమున నాల్గవగణము మొదట విధింపఁబడినది. తిక్కన కవిత్వమందు మధ్యాక్కరలు నాకుఁ గనఁబడలేదు. ఎఱ్ఱాప్రెగడకృతమగు నారణ్యపర్వశేషమునందు యతిచతుర్థగణాదియందే యున్నది. కాన నీమార్పు నన్నయభట్టునకును నెఱ్ఱాప్రెగడకును మధ్యకాలమునఁ గలిగియుండవలయునని. ఇందలి యాలోచనీయాంశ మేమన, భీమనలక్షణమును జూచి యెఱ్ఱాప్రెగడ భారతమును వ్రాసెనా? లేక యెఱ్ఱాప్రెగడ భారతప్రయోగమును జూచి భీమన లక్షణమును వ్రాసెనా? యని. లక్ష్యము ముందనియు లక్షణము తర్వాతియనియు, నేకగ్రీవముగాఁ నంగీకరించినవిషయము. నన్నయభట్టు "ప్రయోగమూలం వ్యాకరణ" మ్మనినాఁడు. శాస్త్రముల కన్నిటికి నటుగాదా? నన్నయను వ్యతిరేకించి భీమన మధ్యాక్కరకు యతిస్థానమును నిర్ణయించుటకుఁ దగిన యాధారములను శ్రీరామయ్యపంతులుగారు చెప్పలేదు. కన్నడమునుండి గ్రహించెనని యూహింతమన్న నందుఁ బ్రాసమేకాని యతిలేదు. విశేషించి నన్నయభట్టునకుఁ బూర్వపుదియగు యుద్ధమల్లుని శాసనాక్కరలలో సైతము నాల్గవగణము తర్వాతనే పడియుండుటచేతఁ బూర్వకాల మట్లే యుండెనని యూహింపవలసియున్నదని ఆంధ్రపత్రిక రక్తాక్షిసంవత్సరాది సంచికయందు "నన్నయభారతమందలి ఛందోవిషయముల"ను శీర్షికక్రింద శ్రీగిడుగు వేంకట సీతాపతిరావుగారు వ్రాయించిరి.

భారతకవులు బహుస్వతంత్రులు. ఎఱ్ఱాప్రెగడ తనస్వేచ్ఛ నుపయోగించి మధ్యాక్కరలను జెప్పియుండవచ్చును. నన్నయకు నెఱ్ఱాప్రెగడకుమధ్య తిక్కన తప్ప మఱియితర కవులుగాని, లేక, లాక్షణికులుగాని లేకపోలేదు. భీమనకుముందు లాక్షణికుఁడైన పెద్దన యఖండయతి నంగీకరింపలేదు గనుకనే, భీమన తా నెచ్చటను బూర్వకవులసంగతి నెత్తికొనియును నఖండ యతిసందర్భమున "ఆదికవిప్రసిద్ధమై"యని వ్రాయవలసివచ్చినది. దీనివలనను భీమన ప్రయోగములనుజూచియే తనలక్షణమును వ్రాసెననుట యెంతయు సమంజసము. భీమన నన్నయకు యెఱ్ఱాప్రెగడకు మధ్యకాలములలోని వాఁడను నాశయమున కిది యెంతమాత్రము నాధారముగాదు. మొదటిలక్షణగ్రంథమగుటచేతఁ గాఁబోలుఁ బెద్దన విపులముగ ఛందోత్పత్తి వంశానుక్రమణిక, పింగళగణోత్పత్తి విధానము, పూర్వపుఛంద శ్శాస్త్రజ్ఞులను వరుసగ నీశ్వర, అజ, భరత, పింగళ నాగపాలాయుధజయదేవులను బేర్కొనెను. భీమన పింగళ జయదేవులనుమాత్ర మధికారాంతమున నొకచోట వ్రాసెను. పెద్దన పేర్కొనిన నాగకవి తెలుఁగుదేశమునుండి కర్ణాటకమునకేగిన నాగవర్మ యేమో!

"ఏకటకవులు కొన్నివింతలు గల్పించి కవిజనాశ్రయమునఁ గల్పినా"రని యప్పకవి యతిప్రకరణమున




శ్రీ శివశంకర శాస్త్రిగారు (సాహితీసమితి)

ఆప్తుడు:

ఎంతకాలము గడచె నీకడ
నింతయుల్లాసంబు గన్గొని!
నేత్రపర్వం బయ్యెగద నీ
నేటిరూపము గన్!

ముద్దు లొల్కుచునున్న దదె నీ
ముఖసరోజం బనుగుణంబుగా,
దిద్దు కుంకుమ తిలకరేఖా
దీప్తిమంతంబై!

తనరుచున్న దపూర్వశోభను
తావకగ్రీవంబు లోల
స్వర్ణజాతపయోజ హారా
మలిన కాంతులతోన్!

ఒప్పుచున్నా వద్భుతంబుగ
నుజ్జ్వలాకృతితోడ! ఏదో
సంఘటిల్లెను వింత, తెల్పుము
సఖుడ, విపులముగన్

నాయకుడు:

తిరిగి వచ్చుచునుంటి లక్ష్మీ
దేవిదర్శనహర్షపులకిత
మానసుడనై అనుగుసఖుడా,
మందిరంబునకున్

ఇప్పటికి నాలోచనమ్ముల
యెదుట మెలగుచునున్న దోహో
ప్రేయసీవదనాంబుజాత
స్మితరూపంబే!

అహహ నాకర్ణద్వయమ్మున
నవిరతంబుగ మ్రోయుచున్నది
కూర్మి లక్ష్మీదేవి మంజుల
కోకిలస్వరమే!

అనుపదంబు తరంగితంబగు
నంగకంబులయందు లక్ష్మీ
స్వచ్ఛకాంతికరాంచల మహత్
స్పర్శసౌఖ్యంబే!

ఆమనస్యము తొలగిపోయిన
దన్ని గడియల కొలది కాలము
నేడు నా ప్రియురాలి శుభసా
న్నిధ్యలాభముచే!

ఆప్తుడు:

వారిసౌధమ్మునకు నేడో
వంకపై బని యుదయవేళను
వదినతో మాటాడి యిచటికి
వచ్చుచుంటివొకో!

నాయకుడు:

వారియింటికి పోవలేదు
వదినతో మాటాడలేదు

మంగళా హృదయేశ్వరీముఖ
మండలంబును గాంచు చయ్యెడ
నలసగమనముతోడ వెలుపలి
కరిగినాను సఖా!

కదలిపోవు జనప్రవాహము
గాంచు చల్లన ధ్వజస్తంభము
నికట భూమిని నిల్చియుంటిని
నిండుహృదయముతో.

శ్రవణగోచర మయ్యె కర్ణ
జ్వరము 'పోనగ నింతలోపల
కూర్మి లక్ష్మీదేవిమంజుల
కోకిలస్వరము!

అంతలో వారెల్ల నచటికి
నలసగతి నరుదెంచి సఖుడా,
తలలు వాలిచి పోవ నాగిరి
స్తంభనికటముగన్.

వెనుక నడచుచు నున్న ప్రేయసి
వికసితాస్యముతోడ నాపై
బరపె నోయి మనోజ్ఞదీర్ఘా
పాంగ వీక్షణమున్!

ఆముహూర్తమునందు నెట్లో
యనిలవశముగ జేసి పయ్యెద
తొలగిపోనగ నామె కించుక
తొట్రుపా టొదవెన్.

పాణికమలముతోడ ప్రేయసి
పైట సవరించెడు నిమేషము
లోన చేలాంచలము పవనో
ల్లోల మయ్యె సఖా!

కొంగుగాడుపు తగిలినంత నె
కోరకితమై పోయె దేహము!
తన్మయత్వం బొదవె హర్షో
త్కర్షరభసమునన్!

ఇది పవిత్రం బైనవాసర
మీమహోత్సవదినము జన్మము
మధ్యమున నా కెన్నడేనియు
మరపు రాదోయీ!

ఆప్తుడు

భాగ్యవంతుడ వోయి నీ! వా
భామినీమణి హృదయసీమను
నిరుపమం బగుశక్తి నీయెడ
నెగడుచున్న దహో!

కామినీ నిరురుంబచిత్తా
కర్షకం బగు నీవిలాసము
నదిన కేలా కలుగకుండును
వలపు నీమీదన్!

కాని మీయీనాటి కార్య
క్రమముచేత సమాగమమ్మున
కంతరాయం బొదవునేమో
యరసి చూడదగున్.

నాయకుడు

ఎన్నినాళ్లకు వింటి నవురా
యీమనోహర వాక్యములు నీ
నోటివెంటను! తార్కికుండవు
నూనముగ సఖుడా!

అంతరాయం బొదవనీ, వివ
లానురాగము విజయ మొందదె
భక్తవత్సలుడైన! రాధా
ప్రాణనాథు కృపన్!




ఓలేటి వేంకటరామశాస్త్రి గారు

"అయ్యా! క్రోధనసంవత్సర కార్తికశుద్ధనవమీ భానువాసరము (25-10-1925) సాయంకాలము 4 గంటల 30 నిమిషములకు ద్రాక్షింగదేశాభివర్ధనీ సభాకార్యాలయమున బరశురామకవిగారు పద్యోపన్యాసము నిచ్చెదరు; కావున నెల్లరను విచ్చేయఁ బ్రార్థింపఁబడుచున్నా"రని ప్రకటింపఁబడినపత్త్రికను జూచి నేనచ్చటి కరిగితిని. అప్పుడామహాగ్రామములోనున్న పిన్న పెద్దలును స్త్రీలనుగూడ నక్కడకుఁ బెక్కండ్రు విచ్చేసిరి. వారిలో శాస్త్రజ్ఞులును, విమర్శకులును, కవులును, గాయకులును, విద్యార్థులు, నుద్యోగస్థులును, వర్తకులును, కృషికులును మొదలగు వివిధవృత్తులవారును వివిధజాతులవారును నున్నట్లు నేను దెలిసికొనఁగలిగితిని. ఇంతలో సభాప్రారంభమునకు నిర్ణీతమైన సమయమైనది. సభ్యులపక్షమునఁ గార్యదర్శిచే "సబ్ మేజిస్ట్రీటు" (Sub-Magistrate) గారు సభాధ్యక్షుఁడుగా నెన్నుకొనఁబడి యగ్రాసనము నధిష్ఠించిరి. ఇట్లు సభోపక్రమలాంఛనములన్నియు యథావిధిగా నడచినతర్వాత, సభలో నొకచోటఁ గూరుచున్న పరశురామకవిగారు లేచి యగ్రాసనాధిపతియొద్ద నెత్తుగా వైచినబల్లపై నిలఁబడి— తత్పూర్వము తాను సభలోఁ గూరుచుండి లేచునపుడు వదులైన బిళ్లకచ్చ బిగించుకొని — పైనున్న ప్రాఁతసాలువుమడత ప్రక్కకు జాఱుచుండఁ గాఁజక్కఁ జేసికొని, యిష్టదేవతాప్రార్థనమునకుఁ గాఁబోలు నొక్కింతసేపు గన్నులుమూసికొని యూరకుండిరి. నేనాసభామధ్యమున నొకచోటఁ గూరుచుంటిని. నాచుట్టును బెక్కండ్రు పెద్దమనుష్యులు క్రిక్కిఱిసి కూరుచున్నారు. ఆసమీపముననే తమకై ప్రత్యేకముగా నిర్ణయింపఁబడిన స్థలమందుఁ గొందఱు స్త్రీలుపవిష్టలై యున్నారు.

అంతట నాసమీపమునఁ గూరుచున్న యొకయువకుఁడు (విద్యార్థి కాఁబోలును) మెల్లఁగాఁ, దనప్రక్కనున్న మిత్రునితో "కవిగారు కన్నులుమూసికొని తెఱవలేదు, దైవప్రార్థనమునకని కన్నులుమూసికొనఁగాఁ గునికి పాట్లురాలేదుగదా?" యని పలికెను. మఱియొకపడుచువాఁడు (ఆవిద్యార్థిగ్రామములోనివాఁడే) కావచ్చును "ఈ మహానుభావుఁడా యిప్పుడు పద్యోపన్యాసము చెప్పువాఁడు? చాలు! చాలు! ధనధాన్యసమృద్ధియు, గోసంపదలపాడియును. పదండు పోవుదము. (Foot ball) ఫుట్ బాలైన నాడుకొందము; ఈయచ్చునైదికపుముండకొడుకు చెప్పెడి యుపన్యాసము —అంతర్వేది వెలుపుగట్టు మీఁద— ఆవేళ మాయమ్మమ్మ చేసిన పచ్చిపులుసులాగున నఘోరించుచుండును. ఆతర్వాత మీయిష్ట"మనెను. పిమ్మట సభలో నేమూలనుండియో రెండుమూఁడు ఈలలు, చెవులు గింగురుమనునట్లుగా వినవచ్చినవి. అప్పుడు పరశురామకవిగారు కన్నులువిప్పి తలయెత్తి సభవంకఁ జూచి కంఠముసవరించుకొని కల్యాణిరాగముతోఁ బద్యోపన్యాసము నిట్లు ప్రారంభించిరి.

కం. అగ్రాసనాధిపా! విబు
ధాగ్రేసరులార! సభ్యులారా! యిపు డీ
సీగ్రామములో నిటుమీ
యగ్రమున నుపన్యసింప నైయుంటిఁగదా?

ఒకసభ్యుఁడు:—(మెల్లఁగాఁ దలయూఁచుచు) కష్టపడి ప్రాసము కడముట్టించినాఁడు; కాని యన్నియు సగ్రముతే వచ్చుటచే నంత ప్రౌఢముగా లేదు.

మఱియొకఁడు:—ప్రస్తుత మీయూరు పట్టణములలోఁ జేర్పఁదగినదేయైనను గ్రామసముతోఁ బనుఁ గాఁబోలు

నీకవిగారు దీనిని గ్రామములలో జమకట్టించినారు; పోనిండు! ఏమిచేయుదుము?

వేఱొకఁడు:—ఆంధ్రపత్రికయం దానడుమ జంఘాల శాస్త్రి గద్యోపన్యాసములు ప్రకటించుటచూచి, పులినిజూచి నక్క వాఁతలుపెట్టుకొన్న ట్లీపరశురామకవి పద్యోపన్యాసములు ప్రారంభించినాఁడా యేమి?.

ఒకయువకుఁడు: (మిత్రునితో) ప్రెసిడెంటును (President)ఆడియన్సును (Audience) ఎడ్రస్సు (Address)చేయుటకుఁగూడఁ బద్యాలే "బజాయింపవలయునా యేమిరా?

మిత్రుఁడు:—కొంచెము సే పూరకుండుము రా, చవటా!

ఇంకొకఁడు:—పురాఁవు "బాణీ" పూర్వపుఁ గల్యాణి రాగమువిని చాలఁగాలమైనది. మఱల నిన్నాళ్లకిచ్చటఁ జెవులతుప్పు వదలిపోయినది!

ఇతరుఁడు:—(సశిరఃకంపముగాఁ బెదవులు బిగఁబట్టి) గట్టివాఁడే! పద్యాలు మహోఘుంకారముగాఁ జమవుచున్నాఁడు!

ఒకస్త్రీ:—(తోడియామెతో) ఆహా! ఆలాగున నిలఁబడిన పాళముగాఁ గవిత్వ మేలాగునవచ్చునో?.

తోడియామె:—"అభ్యాసము, కూసువిద్య" అన్నారు; వినలేదఁటమ్మా?

ఇఁక నొకసభ్యుఁడు:—(తనముందు గూరుచుండి మిక్కిలి శ్రద్ధగా వినుచున్న యొకసభ్యునిభుజముపైఁ జేతితోఁ దట్టి పిలిచి) అయ్యా! ఈయనపేరెవరో?.

ముందటిసభ్యుఁడు:—(ముఖమువెనుకకుఁ ద్రిప్పి) ప్రకటన పత్త్రికయందుఁ బరశురామకవిగారని యున్నది. చూడలేదఁటయ్యా?.

వెనుకటివాఁడు:—నే నాపత్త్రిక చూడలేదులెండు. వీరి యింటిపేరేమి?.

ముందటివాఁడు:—ఇంటిపేరు- పరశువారును, పేరు-రామకవియును గాఁబోలును! (అనిచెప్పి ముఖము త్రిప్పుకొనెను.)

వెనుకటివాఁడు:—ఆలాగా? నేను—"పరశురామకవి"యను నదంతయుఁ బేరే యనుకొన్నాను. (మఱల వీపుపైఁ దట్టి) చూడుఁడు; వీరి దే యూరైయుండునో?

ముందటివాఁడు:—(విసుగుతో వెనుకకుఁజూచి) ఏమో నాకుఁదెలియదు. మహాప్రభూ! ఊరకుండుమింక; కావలసినయెడల నీపత్త్రికఁ జూచుకొమ్ము. (అని జేబులోనున్న ప్రకటనపత్త్రికను దీసియిచ్చెను.)

వెనుకటివాఁడు:—(పత్త్రికకొంతచూచి మఱల ముందటివాని వీపుఁదట్టి) అయ్యా! చూడుఁడు! త్రిలింగదేహోభివర్ధనీ సభయనఁగా నేమి?.

ముందటివాఁడు:—(విసుగుతో)"త్రిలింగదేహో"కాదయ్యా బాబూ! "త్రిలింగదేశా".

వెనుకటివాఁడు:—కాదు, కాదు! దీనిలో-"త్రిలింగదేహో" యనియున్నది; చూడుఁడు!.

ముందటివాఁడు:— (కొంచెము శాంతముతో) ఔను, దానిలో నట్లేయున్నది; కాని, యది యచ్చుతప్పు!

వెనుకటివాఁడు:—అచ్చులోఁగూడ దప్పులేలయుండును?

ముందటివాఁడు:—(కోపముతో) నీకర్మముచేతను, నా ప్రారబ్ధముచేతను, తెలిసినదా?

వెనుకటివాఁడు:— (కొంచెము గట్టిగా) అదేమయ్యా! అంతకోపపడెదవు?

ముందటివాఁడు:—కోపమును లేదు; తాపమును లేదు; ఊరకుండుము, బాబూ! నీకొకనమస్కారము.

పరశురామకవి:—(తనకతిసప్రాస పద్యమునకు సభ్యు లేమనుకొనుచున్నారోయని తెలిసికొనుటకో యనునట్లు నలుగడలఁ బరికించి)

ఆ. పలుకులోనఁదప్పు; భావంబులోఁ దప్పు
రచనయందుఁ దప్పు; రక్తియందుఁ
దప్పు గలుగుననుటతప్పదు నాయట్టి
యజ్ఞునకు; క్షమింపుఁ డయ్యలార!

ఒకయువకుఁడు:—(మిత్రునితో) అయ్యలారా! అక్కలారా! యని వీథీభాగవతములోని పరిహాసకునివలె మొదలిడినాఁడేమి?

మిత్రుఁడు:—అబ్బా! ఊరకుండుమన్న నూరకుండవు! ఒక్కటేవాఁగుదు; ఈమాట మాట్లాడిన నోరు నొక్కుదను.

ఒకసభ్యుఁడు:—(మెల్లఁగా) రక్తిశబ్దమునకు రాగమనియూ, రంజించుటయనియూ, యర్థము?

మఱియొకఁడు:—ఇవి సర్వజనసామాన్యములైన స్వాహంకారపరిహారోక్తులు; వీనికేమి లెండు.

ఇఁకనొకఁడు:—పైకీలాగునఁ జెప్పుచున్నాఁడన్న మాటయే కాని భావములోమాత్ర మిందులకు వ్యతిరేకమే. తనకెక్కుడను దప్పురాదనియును, దానే సర్వజ్ఞుఁడ ననియును దీనికర్థము. ఇఁదియెవ్వ రెఱుఁగరు?

వేఱొకఁడు;—(ప్రక్కవానితో) ఆయన పద్యముచదువునపు డాలాగునఁ నూగుచుండు నెందులకు?

ప్రక్కవాఁడు:—సభాకంపము వెల్లడికాకుండవలయునని యేమో?

మఱియొకఁడు:— వఙ్స్ మోర్ ప్లీజ్! (Once more please) (పరశురామకవి పైపద్యమును మఱలఁ జదివెను.)

అన్యుఁడు:— "వఙ్స్ మో" రనినప్పుడు వాఁడు రాక మానదు. విచారింపకుఁడు.

ఒకస్త్రీ:—చూచినారమ్మా! చూడమ్మగారూ! ఆపద్యములోనున్న పటుత్వము?

చూడమ్మ:—నామొగము! నాకుఁ బద్యములోనున్న పటుత్వము తెలియునా?

ఒకవిశ్వస్త:—మనయూరిలో నిటువంటి సభయుండఁబట్టి మనకిటువంటి మహాత్ములు కన్నులఁబడుచున్నారు. లేకున్న నేమియున్నది యీపాపపుఁగన్నులకు?

పరశురామకవి:—

శా. నాపాండిత్యము నాసమర్థతయు వి
న్నన్ మీరు నాచెప్పు ప
ద్యోపన్యాసముఁ జిత్తగించుటకె యు
ద్యోగింపరేమో వృథా
టోపంబుల్ పచరించునా హృదయమె
ప్పున్ సమ్మతిం బొందదు; ద
య్యా! పూర్వాపరశుద్ధిలేనియవి నా
యాలాపముల్ సెప్పుఁడీ!

ఒకసభ్యుఁడు:—కవి సమగ్రుఁడైనట్లే కనఁబడుచున్నాఁడు.

వేఱొకఁడు:—కల్యాణిరాగము మాఱి భాగవతపుఁ "గత్తు" కాంభోజిలోనికి దిగినది.

మఱియొకఁడు:—"చెప్పు"కటియు "బొంకు" యొక్కటియుఁ దీసివేసినయెడల నీపద్యము బాగుగనే యుండును.

ఇఁకనొకఁడు:—మన కక్కఱకుఁ బోయినను బూర్వాపరాలు తప్పవా యేమయ్యా, సోమభట్టూ!

సోమభట్టు:—ఎట్లుతప్పును? బావగా రదృష్టవంతులు. అదృష్టవంతులను జెఱపెడువారును, నిర్భాగ్యులను బాగుచేయువారు నున్నారా లోకమున?

మఱియునొకఁడు:—కవిత్వమునకు భావనాశక్తి లేకపోయినయెడల శోభింపదు. అన్నియుఁ గవిత్వములే!

ఒకకృషికుఁడు:—(తనదగ్గరనున్న యొక బ్రాహ్మణునితో) అనఁగా— ఆపాట కర్థమేమి బాబూ!

బ్రాహ్మణుఁడు:—పాటయంతయు నైనతర్వాతఁ జెప్పెదనులే; ఇప్పు డూరకే విను.

కృషికుఁడు:—చిత్తము! చిత్తము! చిత్తము!

ఇంకొకసభ్యుఁడు:— ఆహా! అంత మహానుభావుఁడయ్యును ఎంతవినయముగాఁ జెప్పుచున్నాఁడో:

అన్యుఁడు:—మీరెన్ని చెప్పినను నాకీపద్యముమాత్రము నచ్చలేదు. కారణమేమో చెప్పఁజాలను.

కార్యదర్శి:—(లేచి) అయ్యా! మాటలాడకుఁడు! మాటలాడకుండఁ జక్కఁగా వినుఁడు!

ఒకవిశ్వస్త:—అబ్బ! పాడుముండగోలమ్మా! ఆమహాత్ముఁడేదో రామా, కృష్ణాయని చెప్పుచున్న మంచిముక్కలు చెవిలోఁ బడనియ్యరు. వీండ్రనోళ్లు నొవ్వకొని పోను. (కవినుద్దేశించి మెల్లఁగా) చెప్పు బాబూ! చెప్పు.

పరశురామకవి:—

ఆ. పద్య మెపుడు చెప్పవలయునో, వచనంబు
నెపుడు చెప్పవలెనో యెట్లు చెప్ప
వలయునో యెఱుంగువాఁడను గాను; నా
వైదికతకు నవ్వవలదు మీరు

ఒకఁడు:—నిదానించి చూచినచో నిదికూడఁ బ్రగల్భవచనములే. అబ్బా! యీయనకుఁ బలవిసురెక్కువగానే యున్నది. పైకిమాత్రము సాత్త్వికునివలెఁ గనఁబడుచున్నాఁడు.

మఱియొకఁడు:—నీవైదికత్వమునకు నీవు నవ్వవల దనినంత మాత్రమున మానువారెవరు?

ఒకయువకుఁడు:—(మిత్రునితో) ఇంతకు మున్ను నీవనిన మాటవిని నీకు దెబ్బగొట్టినట్టున్నాఁడురా సుబ్బన్నా!

సుబ్బన్న:—వానిమొగము! నామాట — అంతదూరము వినఁబడియేడ్చినదా? వినఁబడియేడ్చినను, వానికా పాటి తెలివియుండియేడ్చినదా?

వేఱొకఁడు:— (ప్రక్కవానితో) ఈ పద్యాలన్నియు నింటిదగ్గఱ సావకాశముగాఁ జెప్పుకొని బట్టిఁబట్టిన వనుకొనెదను.

ప్రక్కవాఁడు:—కాదు; కాదు; అది న్యాచురల్ ఫ్లో (Natural Flow). అది యందఱకును రాదు. దట్సీజ్ ఎ గిఫ్ట్ (That's a gift).

ఇకనొకఁడు:— ఉపన్యాసములు పద్యములతోఁ జెప్పఁగూడదని తన్నెవరైన నాక్షేపించెదరేమో యని యీయెత్తు వేయుచున్నట్లున్నాఁడు.

మఱియు నొకఁడు:— అతివినయము వెల్లడిచేయఁబోయి —ఆత్మగౌరవము చెడఁగొట్టుకొనకయ్యా! వెఱ్ఱివాఁడా!

పరశురామకవి:—

మ. ఎవరుం ద్రొక్కని క్రొత్తదారిఁ బడి నీ
విట్లేల నేదో మహా
కవి వైనట్టులు పద్యధోరణిని బ
ల్కంబూనుకొన్నాఁడె; వం
చు వచింపం దలపోయఁబోకుఁడు వచ
శ్శోభావిశేషజ్ఞులై
తప్పు మీచెంగటనేఁ గవీశపదమ
ధ్యాసింపఁ గాంక్షింతునే?

ఒకఁడు:—(దగ్గఱనున్న వానితో) ఏమి సార్! (Sir) ఇంకను తలయుఁ దోఁకయుఁ దేలకుండఁ గొట్టుచున్నాఁడు. హ్వాటీజ్ హి గోయింగ్ టు స్పీ కెబౌట్? (What is he going to sp:ak about).

దగ్గఱవాఁడు:—ఏమో! ఐ డోంట్ నో సార్! (I don't know sir) నేను నదియే యాలోచించుచున్నాను.

మఱియొకఁడు:—ఈయనకుఁ దెగులు క్రమముగా ముదురుచున్నది. తానెవ్వరును ద్రొక్కని క్రొత్తదారిఁ ద్రొక్కుచున్నానని సభ్యులతోఁ జెప్పుటకొఱకుఁ దలక్రిందు చేసినాఁడు. పయిఁగా సభ్యులందఱును పట్టివెఱ్ఱిముండకొడుకులనియుఁ దాను మహాకవి ననియుఁగూడ నర్థమువచ్చునట్లు భావకవిత్వము ప్రారంభించినాఁడు.

వేఱొకఁడు:—ఔచిత్యభంగము కాకుండ నింక నుపన్యాస విషయమునకు దిగిన బాగుగనుండును.

ఇఁకనొకఁడు:—ఆహా! యేమికవిత్వమయ్యా! మహాపాకముగా నున్నది! మహామృదువుగా నున్నది!

ఒకచంటిపిల్ల:—(ఏడ్చెను.)

ఒకవిశ్వస్త:—పిల్ల యేడ్చుచున్నది; సుబ్బమ్మా! ఊరకుండఁ బెట్టుము.

చంటిపిల్లతల్లి:—(కోపముతో) ఏమూరకుండఁ బెట్టనమ్మా! వచ్చినదిమొద లొక్కచిక్కముగానే పీఁకుకొని తినుచున్నది. ఎట్లుచావను?.

పరశురామకవి:—

కం. అవివేకి నగుచు నేనే
కవిననుగర్వమ్ము చేతఁ గాదుసుఁడీ స

త్కృవులార! పద్యరచనకుఁ [సుండీ!
దవ్వురట; వచనంపుఁగూర్పు తెలియకయె

ఒకయువకుఁడు:—ఉన్నదున్నయట్లు చెప్పి వేసినాఁడు; వీనియమ్మకడుపు చల్లఁగా.

ఒకసభ్యుఁడు:—నాకు వచనము వ్రాయుటకూడఁ దెలియును సుండీ! యని చెప్పుటకు బదులుగాఁ జేసిన ద్రావిడ ప్రాణాయామము కాఁబోలునిది.

మఱియొకఁడు:—నేనే కవినను గర్వముగలవాఁడైయైనను, దనకటువంటి గర్వమున్నదని చెప్పుకొనునాయేమి? అందఱు నిటువంటి శ్రీరంగనీతులు సెప్పువారే.

వేఱొకఁడు:—(తనపరిచితునితో) రాగసంకరమున కేమిగాని యపస్వరము రాకున్నయెడల బాగుగానుండును. సాయంకాలమువేళ సచేలస్నానము చేయ నక్కఱ లేకుండ.

పరిచితుఁడు:—వర్ణసంకరమే యైపోవుచున్న యీదినములలో రాగసంకరము కాక యెట్లుండును? మీరు గాయకులు కాఁబట్టి యపస్వరమేదియో సుస్వరమేదియో మీకుమాత్రము తెలియును. మాకంతయు నొకటే స్వరము గార్దభస్వరము. పోనిండు, ఎట్లుపోవు నదట్లు పోక మానదు.

విశ్వస్త:—(విచారస్వరమున నొకస్త్రీతో) నేను బ్రతికి యున్నప్పుడు మాయింటి కీలాగుననే వచ్చెడివారమ్మా ప్రజలు. మీ యన్నయ్యకూడ నిట్లే-యీయీడుననే యుండెడివారు-పురాణము చెప్పుచున్నయెడల-చెప్పిన నమ్మెదవో లేదో కాని-అచ్చముగా - అక్కడ జరగుచున్నట్టులే యుండెడిది.

ఒకస్త్రీ:—ఆఁ! ఆలాగా వదినే,మాయన్నగారు పురాణము చెప్పుట మీరు బాగుగా నెఱుఁగుదురన్న మాటయే.

విశ్వస్త:—అయ్యో! నాకర్మముకాల, నేనప్పటికిఁ బదుమూఁడేళ్లదానను; పరికిణీలు విడిచివేసి పైటవేసికొనుచుండెడిదానను, మా మామగారు మా కోడలింకను రజస్వలకాలేదు; ఆసంగతి తర్వాత చూచుకోవచ్చును. ప్రస్తుతము కార్యము కానిండని మావాండ్రను దొం

పరచేయుచుండెడివారు. అంత యోగము పట్టలేదు కాని (అని పంచెకొంగుతోఁ గన్ను లొత్తుకొనును)

పరశురామకవి:—

గీ. నవలలును శాస్త్రములును నుపన్యాసములును
కథలు మున్నగునవియును గద్యమునఁ జె
ప్పాయఁదగునని మీవారు తెల్పినారు సెప్ప
వింటి నైనను బద్యముల్ వినుచు నుంటి.

ఒకయువకుఁడు:— అట్లయినఁ జాల చెప్పినాఁడవన్న మాటయే.

ఒకసభ్యుఁడు:—యస్ దే మస్ట్ బి రిటెన్ యిన్ ప్రోజ్! (Yes; they must be written in prose).

మఱియొకఁడు:—(ప్రక్కవానితో) భేష్! మహాగమత్కారముగానున్న దీపద్యము; ఆయనగారు చెప్పుచున్నఁగాని కళగట్టదు; ఏమనెదరు?

ప్రక్కవాఁడు:—ఏమో, నాకుఁ దెలియదయ్యా! యమకమనఁగా నెట్టిదో నేనెఱుఁగను. నేనేమి మనవిచేయఁగలను?

వేఱొకఁడు:—(పెదవి విఱిచి) ఈ పన్యాసమునకు ముందంత ఛాందసముగా నుపోద్ఘాత ముండఁగూడదు.

ఇకనొకఁడు:— (తోడివానితో) సబ్జక్టు (Subject) తేలకపోవుటచేత-ఇట్టీజ్ నాట్ ఇంటరెస్టింగ్, వాట్ డు యూ సే? (It is not interesting, what do you say) తోడివాఁడు:—యస్ (Yes) ఔనయ్యా! యూ ఆర్ రైట్ (You are right)

పరశురామకవి:—

గీ. గద్యకావ్యమ్ము సెప్పుటకే చేతఁ బద్య
కావ్య మొనరించు నీ పాతికయని యిప్పుడు
పలువురు వచింపఁగా విని వచనరచన
విడిచి పద్యములను జెప్పఁ గడఁగినాఁడ.

ఒకయువకుఁడు:—అదియా కారణము? మొదటనే యీ సంగతి మనవిచేసినయెడల సంతోషింతుముకాదా?

ఒకసభ్యుడు:—ఇది యెవ్వరినో హేళనము చేయుటకాఁ బోలును; చూడఁగా నట్లేయున్నది.

మఱియొకఁడు:—కవిత్వమును గుఱించియా యేమి? యీ యుపన్యాసము? గద్యము — పద్యము — నను చున్నాఁడు.

వేఱొకఁడు:—గద్యముకంటెఁ బద్యము తేలికయన్నా రేమ రయ్యా! పద్యము చెప్పుటలో నున్నకష్ట మెఱుంగని వారెవ్వరైన ననిన ననవచ్చును గాని పద్యము చెప్పు వాఁడవు గదా, నీకేల తెలియలేదు?

ఇఁకనొకఁడు:—(సమీపస్థునితో ననాదరముగా) ఏమో—ఏమికవిత్వాలు? పూర్వము, రామరాజభూషణుఁడు, శ్రీనాథుఁడు, ముక్కుతిమ్మన్నఁ, యల్లసాని పెద్దన్న మొదలయిన కవీశ్వరులు చెప్పినపద్యములవంటిపద్యములు వచ్చిపోయినమైన నొక్కటి చెప్పఁగలరా వీండ్రు? ఏదీ! చెప్పుమనుఁడు! చూతము; "సహసానఖంపచ స్తనవ త్తపరిరంభమామూల పరిమంబితాధరోష్ఠ." ఇటువంటిపద్యము చెప్పినచోఁ జెవి తెగఁ గోయించుకొని పోయెదను!.

సమీపస్థుఁడు:—ఔనౌను! అటువంటి కవీశ్వరు లేరీ యిప్పుడు? ఆదినములన్నియు వెళ్లిపోయినవి. అందులకే "గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్" అని నారు పెద్దలు.

పరశురామకవి:—

గీ. గద్యమున వ్యర్థపద మొండు గానఁబడిన
వెక్కిరించినయట్లు గాన్పించుచుండు
బద్యముననున్న నావ్యర్థపదమె యతియొ
ప్రాసమో యయి సార్థకంపడుచు నుండు.

ఒకడు:—అవును, ఆమాట నిజమే, కాని, కవులు యతిప్రాసములయందు వ్యర్థపదములువైచి సార్థకపఱచుచున్నారని కవిలోక రహస్యము వెల్లడి చేయఁగూడదు.

మఱియొకఁడు:—అదేమనినమాట? వ్యర్థపదము లెక్కడనున్నను వెక్కిరించుచునే యుండును.

వేఱొకఁడు:—కల్చర్డుమ్యాన్ (Cultured man); చచ్చుముండకొడుకాయేమి? లిటరేచరు (Literature)లో బోలెడు పనిచేసినవాఁడు; అయిననేమి? కొంచెము గాంగసము వచ్చినది. మనపండితులకున్న కర్మమే యిదికాదా!

ఒకయువకుఁడు:—సరి తెలిసినదా, యింక? ఏదో కవిత్వపు గొడవ మొదలుపెట్టినాఁడు; వీనిదుంపతెగ; ఇది పెద్దాపురపుఁ జేఁపట్రాముపలె నింతలోఁ దేలునది కాదు; రమ్ము! పోవుదము!

మిత్రుఁడు:—ఉండుమురా "పచ్చా" పోవుదము; తొందరయేమి? వచ్చెడిపండుగలలో మనము నాటకములాడునపుడు వీనిఫార్సు (Farce) వేయుదమని చూచుచున్నాను. చూడనిమ్ము కొంచెముసేపు; కథ తేలఁజూడనిమ్ము.

ఒకకృషికుఁడు:—(గట్టిగా) అయ్యో! బాబూ! మాలవైష్ణవపువానిదగ్గఱ అన్నిపురాణాలు విన్నాను గాని, యీపాట కర్థమే కాకున్నది. దీనితల్లిసిగ దఱుగ.

ఒకసభ్యుఁడు:—అదేమోయి! వేంకటరెడ్డీ! ఆలాగున గట్టిగా మాటలాడఁగూడదు సభలో.

వేంకటరెడ్డి:—ఆలాగా, బాబూ! అట్లయిన మనకెందులకా గొడవ? ఊరకుందము.

పరశురామకవి:—

గీ. కానఁ బద్యముసెప్పుట కవికిమిగుల
సులభమగుపని;

ఒకఁడు:—ఇది వట్టిశుంఠ చెప్పవలసినమాట.

పరశురామకవి:—

నాబోటిశుంఠ కేది
యైననొక్కటె కాని,

పైవాఁడు:—(సంశయముతో) నామాట వినఁబడలేదు కదా వినఁబడదు. ఏదియెట్లున్నను దనయెడల నంత నైచ్యము తెచ్చుకొనుట యుచితముగా లేదు.

పరశురామకవి:—

పద్యంబుకొంత
మెఱుఁగు; కావున దానితో మిడుకవలసె,

మఱియొకఁడు:—మిడికినట్లేయున్నది. తాను నిజముగా శంకరయేయైనను — ఇటువంటిసభలో నట్లు చెప్పుకొందురా?

వేఱొకఁడు:—ఆహా! ఏమికవిత్వము! మహాప్రవాహము!! మంచినీళ్లు త్రాఁగినట్లే పోవుచున్నది. అనర్గళము!

ఇఁకనొకఁడు:—(మొగము చిట్లించుకొని యసమ్మతి సూచకముగాఁ దలయూఁచెను.)

అన్యుఁడు:—(ఒకనితో) ఎందులకు వచ్చినకవిత్వము? కవిత్వమున కుండవలసినలక్షణము లేనె ననున్న వాదీనిలో? కవిత్వమనఁగాఁ బ్రకృతిని జిత్రించినదే కవిత్వము! ప్రకృతిని జిత్రింపఁ గల్గినవాఁడే కవి. కవియైనవానికిఁ దన్మయత్వ ముండితీఱవలయును; అనఁగా కవి తా నేది వర్ణింపుమన్నాఁడో యది తానై పోవలయును. ఎట్లనఁగా—కవి యొకస్త్రీని వర్ణింపుమన్నప్పుడు— తాను బూర్తిగా స్త్రీయైపోయి—ఆ స్త్రీకుండవలసిన వగ, యొద్దికలు—అందచందములుటక్కుఁడెక్కులు కనఁబఱుపవలయును. ఒకపక్షిని వర్ణింపుమన్నప్పుడు— తానుగూడఁ బక్షియైపోయి రెండు ఱెక్కలును జాచుకొని యాకాశముమీఁది కెగిరిపోయి యంతరాళమునందుఁ బల్టీలఁ గొట్టవలయును! ఇన్నిమాట లెందులకు? కవి యొకగాడిదను వర్ణింపఁదలఁచినయెడలఁ దాను ముందు నిజముగా గాడిదయయిపోయి యసలుజాతిగార్దభసమూహమునఁగలిసియభేదాధ్యవసాయముగా సంచరించుచు మందబయట మంద్రమధ్యతారస్వరములతో మనకందఱకును వినఁబడునాగున నోండ్ర పెట్టవలయును; అటువంటివాఁడే కవి! వాఁడు చెప్పినదే కవిత్వము! అంతియేకాని యీపోడిపోడి చప్పచప్పని నిస్సార నిరుపయోగ నిర్భాగ్యపు మాటలన్నియుఁ గవిత్వములే!

పరశురామకవి:—

ఉ. గంటకుఁగొన్ని వందలు చె
కాపికిఁ బద్యము లల్లఁగల్గు బల్
దంటనుగాను; నాకుఁగల
దార్ఢ్యము నే నెఱుఁగంగలేక మీ
సంటి ప్రవీణు లుండిరి సఁ
భాస్థలిఁ బద్యము లిట్లు సెప్పఁ బూ
నొక్కంటిని; మగీయసాహసము
కోవిదులార! సహింపఁ జేయుఁడీ.

ఒకయువకుఁడు:—నీవెంతబతిమాలుకొనినను మేము సహింపమయ్యా, కావలసినయెడల సీర్యాదు చేసికొనుము; లేదా? నీకు నెక్కున్న నోటఁ జెప్పుకొనుము.

ఒకసభ్యుఁడు:—ఈకవిగారెన్నిపద్యములు చెప్పినను—ఓల్డ్ డెడ్ ల్యాంగ్వేజీ(లోనే Old dead languge) చెప్పుచున్నాఁడు; ప్రాతయొఱిరికకాయపచ్చడిపలె నిది యీయనకు మహాపథ్యము గా నున్నది. ఇటువంటి చాండసు లింకను గొందఱు మిగిలియుండఁగా భాషాభివృద్ధి కావలయునన్న నెట్లగును?

ఒకవిశ్వస్త:—తులసికోట గూటిలోఁ బెట్టిన విభూతిపండు తెచ్చి యిటువంటిశ్రోత్రియపు బ్రాహ్మణున కిచ్చిన యెడలఁ బథ్యమైన నమ్మును; తెమ్ముటంపూఱచితిని; మందమతిపీనుఁగను.

వేఱొకఁడు:—"చెకాపికి" యను పదము ప్రౌఢము గాలేదు. "బల్" అనునది న్యర్థము.

పరశురామకవి:—

మ. కవితాధర్మ మెఱుంగ నింముకయు లో
కజ్ఞానముఁ లేదు; స
త్కవు లున్నారను భీతిఁ బోవిడి యసం
దర్భంబుగా నివ్వ, నే
నెవియో చెప్పఁదలంచియుంటిని; నిఁక నే
నేమన్న సైరించి నా
యవివేకంబు గణింపఁబోక బుధులం
రా! నన్ను మన్నింపుఁడీ!

ఒకఁడు:—ఔను; పాపము! లోకజ్ఞానము లేదన్నమాట వాస్తవమే. ఏమిచేయుదుము? మీ రదిపెట్టిపుట్టలేదు.

మఱియొకఁడు:—నారాయణ నారాయణా! వైష్ణవప్రపత్తికంటెనుగూడ వైద్యానుసంధానము చేసికొనుచున్నాఁడే! పాపము; వట్టియమాయికుఁడు!

వేఱొకఁడు:—ఇంతకంటెను నసందర్భముఁగాఁ జెప్పెడి విషయ మింకను మిగిలియున్నదా? సరే! కానిండు!

ఇంకొకఁడు:—(ప్రక్కవానితో) గానమునకు గాంధర్వంబె ముండవలెను; "కూనిదీర్ఘము తీయలేనిమగవాఁడును— కడుములువండలేని యాఁడుదియు నున్నారా" యని మునవారు సామ్యముచెప్పినట్టుగా — ఇప్పుడందఱును సంగీతము పాడెడువారే! సంగీతము తోటకూరకంటెనుగూడఁ జవుక యయిపోయినది.

ప్రక్కవాఁడు:—ఏదో, పోవుచున్నది; తలక్రిందైపోవుచున్నది! చూచుచుండుఁడు! కొంత కాలమున కన్నియు నశించిపోఁగలవు. నామాట నమ్ముఁడు!

పరశురామకవి:—

కం. అణుమాత్రమైన నాలో [సుధీ
గుణమున్న గ్రహించి విసువుగొనఁబోక
గణ మాదరించునని నే [టిక.
గణించి యిచ్చోట నిల్వఁగాఁ బూనొ౯ం

ఒకయువకుఁడు:—అణుమాత్రమైనను గుణములేకపోయిన యెడల నేమిచేయుమనెదవో, యదికూడఁ గొంచెము మనవిచేయుము. బాబూ!

మఱియొకఁడు:— నాల్గవపాదములో జగణప్రయోగము చేసినాఁడు! ప్రాథకవిలక్షణము వెల్లడించుకొనుటకుఁ గాఁబోలు!

వేఱొకఁడు:—కేదారగౌళలోఁ గ్రొత్తసంగతివేసినాఁడే? ఇఁకనేమి? క్రమముగా రక్తికట్టుచున్నది!

ఒకయువకుఁడు:—పోయినది! పద్యము పోయినది! (మిత్రునితో) ఈపద్యములో గణముతప్పినదిరా సుబ్బన్నా! ఫిఫ్త్‌ఫారముక్లాసులో (Fifth Form Class) మనశాస్త్రిలు నాకుఁ గందపద్యపు లక్షణము చెప్పినపుడు "పద్యముకుంటినయెడల గణముతప్పినట్లే" యని చెప్పినాఁడు. మఱిప్పుడు పద్యము కుంటినదా లేదా?

మిత్రుఁడు:—మాకొప్పతప్పు పట్టుకొన్నావులే; చాలు! నోరుమూసికొనుము. ఆవెనుక నీప్రతాపము చెప్పుకొని యేడ్చెదుగాని—

ఇఁకనొకండు:— (పెదవివిఱచి) ఈ భావములన్నియు నింతకుఁబూర్వము సంస్కృతములోను— తెలుఁగులోనుగూడఁ జాలమంది చెప్పినవేకాని క్రొత్తవి కావు; గ్రంథచౌర్యమును, భావచౌర్యమును లేకుండఁ గవిత్వము చెప్పువాఁడే లేఁడు. కావుననే "బాణోచ్ఛిష్టం జగత్సర్వం" అనెడిమాట వచ్చినది.

అన్యుఁడు:—వహవ్వా!వహవ్వా! కవిత్వమనఁగా — ఆలాగున నుండవలెను. మాడభూషి వేంకటాచార్యులుగారి తర్వాత ఈలాగునఁ గవిత్వము చెప్పుకవీశ్వరు నేఁ జూడలేదు!

ఇతరుఁడు:—(పైవానితో) అయ్యా! మాడభూషి వేంకటాచార్యులుగారు కవిత్వముచెప్పుట మీరెక్కడఁ జిత్తగించినారు?

పైవాఁడు:—నేను ప్రత్యక్షముగాఁ జూడలేదు; కాని— పిఠాపురములో లేట్ రాజా గంగాధరరామారావు బహద్దరుగారి టైములో మామామగా రాయూరిలో నుండెడివారు. అప్పుడు వేంకటాచార్యులుగారువచ్చి— కోటలో—నిలఁబడినపాళముగా— అచ్చముగా— ఈలాగుననే—కవిత్వము చెప్పునప్పటికి నిర్జీవప్రతిమలై సభలోని వారందఱును—నిర్ఘాంతపడి, నిశ్చేష్టులై పోయినారఁట! మా మామగారు చెప్పుచుండెడివారు.

ఇతరుఁడు:—(పరిహాసము పైకిఁదెలియకుండ) అయ్యా! మీమామగారికిఁ గోటలోనేమైనసుద్యోగముండెడిదా —లేక—కోటలోనికిఁ బోవుచుండుటకును వచ్చుచుండుటకు—రాజావారి పరిచయ మేమైన నుండెడిదా?

పైసభ్యుఁడు:—అదియు నిదియుఁగూడ లేదు. ఊరకే ఆయూరిలో నుండెడివారు.

ఇతరుఁడు:—(లోలోన నవ్వుకొనుచు) ఆలాగా? అట్లయిన యెడల వేంకటాచార్యులుగారు కవిత్వము నాఁడు ఆయన కోటలోని కెట్లువెళ్లినారు?

పైసభ్యుఁడు:—సరి; మాబాగుగానున్నది మీప్రశ్న! ఆయనకోటలోకి వెళ్లుట యెందులకు? కోటలో జరిగినసంగతు లూరిలోఁ దెలియవా యేమి? ఒక్కటున్న యెడలఁ బొంబడి తెలియును; తెలిసినదా?.

ఇతరుఁడు:—అలాగా? ఈమాటు తెలిసినది.

పైవాఁడు:—ఏమి అట్లంత నొక్కినొక్కి యడుగుచున్నారు నే నీమాత్రమున కబద్ధము చెప్పుచున్నా ననుకొనుచున్నారా యేమి?

వేఱొకసభ్యుఁడు:—ఇది యేమ య్యా, బాబూ! రామాయణములోఁ బిడుకలకొట్లాట మొదలుపెట్టినారు?

కార్యదర్శి:—(లేచి) అయ్యా! ఊరకుండుఁ డూరకుండుఁడు! అప్రస్తుతప్రసంగము చేయక, కవిగారు చెప్పెడువిషయము బాగుగా వినుఁడు!

ఒకవిశ్వస్త:—(పండ్లు కొఱుకుచు మెల్లఁగా) ఆలాగున నొక్కు, నాయనా! పీంద్రవనోళ్లు నొక్కు! (ముసుఁగు సవరించుకొనుచు) నొక్కి ఇంతగడ్డిపెట్టు! ఒక్కటే గోలా, మాయముండగోలు?

ఒకస్త్రీ:—(తోడివారామెతో) మగవాండ్రకు వచ్చినట్లు కవిత్వము ఆఁడువాండ్రకు రాదేమమ్మ, యెన్నినాళ్లు తంటాలుపడినను?

తోడివారామె:—మగవాండ్రకు వచ్చినట్లు — మీసాలు వచ్చునా—ఆఁడువాండ్ర కెన్నినాళ్లు తంటాలుపడినను?

పైస్త్రీ:—(జుగుప్సతో) చాలు లేవమ్మా! మంచిసమాధానము చెప్పినావు! ఈమోటుసమాధానము నీవేలాగునఁ జెప్పితివో కాని, యిది యాఁడువాండ్రు చెప్పవలసినది కాదు. సిగ్గు! సిగ్గు!.

మఱియొకతె:—అబ్బా! ఊరకుండుఁడమ్మా! ఆయన యేదో చెప్పుచున్నాఁడు వినుఁడు!

ఒకసభ్యుఁడు:—వాట్ ఈజ్ దిస్ వండర్ఫుల్ స్పీచ్? (What is this wonderful speech?) రండు! సార్! (Sir) పోవుదము.

ఒకకృషీకుఁడు:—పొలములో పనితొందరచేత ప్రొద్దుటివేళనుండి కాసంత చుట్టముక్కయైన - కాల్చుకోలేదు. ఈబాపనివాఁడు ఎంతసేపు - ఒకచేపదము పాడుచున్నాఁడు; వీనియబ్బసిగఁగోయ! ఇది కాకుండ లేచిన నేమితంటా వచ్చునో!

ఒకసభ్యుఁడు —(ఒకగాయకునితో) అయ్యా; ఆకవిగారు పద్యములు చదువుచున్నారాగ మేమిరాగము?

గాయకుఁడు:—(వికటముగ) ఆరాగమా! అది-తోడికాంభోజిభైరవియని యొకక్రొత్తరోగము. ఆవలకు వెళ్లిన తర్వాత దానిసంగతియంతయు సావిచేసెదను లెండీ పాటికి; పోవుదము.

(ఒకరివెనుక నొకరుగా సభ్యులలోఁ బెక్కండ్రు లేచిపోఁబోవుచుండిరి)

అగ్రాసనాధిపతి:—(లేచి) సభాసదులారా! మీ రెవ్వరును లేవవలదని నా ప్రార్థము—ఐమీన్ (I mean) నాప్రార్థనము. కవిగారు ముందికను బాగుగావిష—(విరమించి) మంచివిషయము చెప్పఁబోవుచున్నారు. కార్యదర్శిగారు రెండుసారులు—ఇంతకుముందు—మిమ్ములను మాటలాడవలదని కోరుకొనుచు (గొంతు సవరించుకొని) కోరుకొనియున్నారు. ఇంతకుముందు—ఐమీన్ (I mean) ఇఁకముందు — ఇక్కడ మీ రెవ్వరును మాటలాడకుండనుండవలయునని నమ్రత- (వట్టిదగ్గుదగ్గి) కోరుచున్నాను. (అని చెప్పి చేతిరుమాలుతోఁ జెమ్మటఁ దుడిచికొనుచు మరల నగ్రాసనము నలంకరించిరి. లేచిన సభ్యులందఱుఁ దిరిగి కూర్చుండిరి. లేచిన సభయంతయు నిశ్శబ్దముగా నుండెను).

పరశురామకవి:—

గీ. జ్ఞానమునుగూర్చి కొంత పల్కఁగదలంచి
నాకుఁ దోఁచినవేవియో నాల్గుముక్క
లల్లి వినిపింతు; మీరవి యనధరించి
నన్ను ధన్యునిఁ జేయుఁడో యన్నలార!

ఒకయువకుఁడు:—(స్నేహితునితో మెల్లఁగా) ప్రెసిడెంటు—"ఇంకెవ్వరును మాటలాడవల"దని చెప్పినను- ఈవెఱ్ఱిముండకొడుకుమాత్రము పద్యములు "బజాయించుచునే" యున్నాఁడు. వీనికర్మము కాలినది. ఆయన సబ్మేజస్ట్రేటు (Sub-magistrate). 144 వ సెక్షను వడ్డించినయెడల—దానితో—తెగులుకుదురును; ఈపైత్యము విఱుగును,

ఒకసభ్యుఁడు:—అబ్బా! పెద్దవిషయమేయందుకొన్నాఁడు

మఱియొకఁడు:—అయ్యా! సార్! (Sir) దారిలోఁ బడినాఁడు.

ప్రక్కవాఁడు.—ఆలాపననేకసంబడుచున్నది చూడఁగా—

వేఱొకఁడు:—(దగ్గఱివానితో) కవిగారు — ఇంతసేపటికి —ఉపన్యాసపీఠిక విడిచినారు.

దగ్గఱివాఁడు:—అట్లయిన మనము లేచిపోవచ్చునా యేమి!

పైవాఁడు:—(నవ్వుచు)అదికాదయ్యా! ఉపన్యాసమునకు ముందుచెప్పుపీఠిక, విడిచినా రంటిని. అంతియేకాని యుపన్యాస మింకను మిగిలేయున్నది.

ప్రక్కవాఁడు:—ఆలాగా? ఉపన్యాస మిచ్చుచున్న బల్ల మీఁదనుండి దిగినాఁడేమో; పెందలకడనే యింటికిఁ బోవుదమనుకొన్నాను.

ఇంకనొకఁడు:—ఇదియేమి! కవిత్వములోనుండి జ్ఞానము లోఁబడినాఁడు!

అన్యుఁడు:—ఆహా! మీతల్లిదండ్రులపుణ్య మేమిపుణ్య మయ్యా! మహానుభావా! నీకిటువంటికవిత్వ మెట్లు వచ్చినదయ్యా! మహానుభావా! అమృతము! అమృతము!!

ఇతరుఁడు:—ఆ బుట్టతలపాగా తలనిసురు ముండకొడు కెవ్వఁడయ్యా, సాంబయ్యా! మెడనరముపట్టులాగున—ప్రతిపద్యమునకుఁ దలఁద్రిప్పుచు— నవ్వుకొనుచు —ఎగిరియెగిరిపడుచు సిపమెత్తిన ట్లాడుచున్నాఁడు?

సాంబయ్య:—వాఁడా? వానినెఱుఁగవా? వాఁడే బంగారమ్మమగఁడు!

పైవాఁడు:—ఔరా! వీఁడా? వీఁడింతటివాఁడా! వీనికిఁ గవిత్వముకూడఁ దెలియునా? ఏమో, పెళపెళ!

పరశురామకవి:—

ఆ. జ్ఞానమనఁగఁ దెలివి;

ఒకయువకుఁడు:—(వికటముగా) ఆఁ? ఇది క్రొత్తసంగతియే.

పరశురామకవి:—

జ్ఞానంబుగలవాఁడు

జ్ఞాని;

పైయువకుఁడు:—అవును! ఇది మఱియుఁ గ్రొత్తసంగతి!

పరశురామకవి:—

అనఁగ—తెలివిగలుగువాఁడు

జ్ఞాని యన్నమాట;

పైయువకుఁడు:—సరే. మేమింతవరకు — "అమ్మమాట" యేకాని — "అన్నమాట" యెక్కడను జదువుకోలేదు. కనుక నిది మఱియును గ్రొత్తసంగతి! అర్థము గూడ సెలవిప్పించుచున్నారా? సరే. బాగుగనే యున్నది. అజ్ఞానములేనివాఁడో!

పరశురామకవి:—

జ్ఞానవిహీనుఁ, డ

జ్ఞానియనుచుఁ జెప్పఁగా వలయునె?

పైయువకుఁడు:—(సంశయముతో) నే నింత మెల్లఁగా నని నను వినఁబడినదా? లేదు; ఊరకే గ్రుడ్డివానిచేతి జాయిలాగున — ఆయనచెప్పినది — నామాటకు సమాధానమైనది. అంతియే.

ఒకసభ్యుఁడు:—ఈపద్యమంతయు నుత్తరము మతలపువలె వట్టిపేలవముగా నున్నది.

మఱియొకఁడు:— వ్వాటీజ్ ది డెఫినిషన్ ఆఫ్" (What's the defitntıon) జ్ఞానం? అది చెప్పఁడేమి?

వేఱొకఁడు:—జ్ఞానమనఁగా — తెలివి; జ్ఞానముగలవాఁడు —జ్ఞాని; —సరే—బాగుగానేయున్నది. తక్కినదంతయు —తుక్కు—అనవసరమైనచెత్త!

అగ్రాసనాధిపతి:—(మహాగ్రహముతో లేచి) సైలెన్స్ (Silence) అని బల్లమీఁదఁ జఱచి) ఏమా గొణగొణ! యెన్నిసారులు చెప్పినను?—ఇంక మాటలాడినవారి మర్యాదలు దక్కవు. (అనిహూరుచుండెను.)

ఒకవిశ్వస్తః—పండ్లుకొఱుకుచు మెల్లఁగా) అయినది— మాబాగుగా—అయినది! పెండ్లి!.

(సభ్యులందఱును చలలువాల్చి గుసగుసలాడిరి. సభయంతయు నిశ్శబ్దమైనది.)

గీ. ఈశ్వరుఁడు సృష్టిచేసినయెల్లజీవ
కోటికిని జ్ఞాన మనునది కొంతయుండు;
నందు మనుజులలోన నత్యధిక మగుచు
వెలయుచున్నది; యది సృష్టివిధముగాన.

కం. ఆజ్ఞానమునే పలువురు
విజ్ఞులు బహుమార్గములుగ విభజించి నిజా
భిజ్ఞత లోకములోని ర
సజ్ఞశిఖామణులకెల్లఁ జాటిరి తొలుత౯.

గీ. జ్ఞాన మింద్రియములనుండి గలుగుననియు
జ్ఞానమునఁ గొన్ని భేదముల్ గలవనియును
దాత్త్వికజ్ఞానమే ప్రశస్తం బనియును [లు.
బలుకుచుందురు మఱికొంద ఱలఘుమతు

గీ. జ్ఞాన మది యెన్ని తెఱంగులఁ గానఁబడిన
నరసి చూడఁగ నొక్కటే యగును దుదకు
నగలు బహురూపములుగఁ గానంగఁబడినఁ
గాంచనం బొక్కటే యగుఁగాదె! తెలియ.

గీ. వర్తకమ్మునఁ గృషియందు వైదికమున
లౌకికంబున నధ్యాత్మలక్షణమునఁ
గలుగు జ్ఞానంబు వివిధమై కానిపించుఁ
గాని పరికింప నంతయు జ్ఞానమొకద?

కం. జ్ఞానం బనునది సర్వము
నే నీచందమున నొక్కటే యనుబుద్ధిం
బూని వచింపఁ దలంచితి
దీనం దప్పున్న నెఱిఁగి దిద్దుకొనియెద౯.

ఉ. జ్ఞానమువెంట మోహమునఁ
గాఁబడు నొక్కపదార్థ మీశ్వరే
చ్ఛానుగుణంబుగా నుదయ
మై సతతంబును బాయకుండు నా
జ్ఞానము వృద్ధినొంది తగువి
కాసముఁ జెందకయుండెఁ గ్రమ్ముచు౯,
భానునిఁ గప్పి తజ్జలద
పఙ్క్తియుఁబోలెఁ బ్రతిక్షణంబున౯.

గీ. కారుమొయిలులు దన్నుఁ గప్పిన ఖరకరుం
డయినఁ దనదు తేజ మడఁగ దీప్తుఁ
బాసి యెట్లు మఱుఁగుపడుచుండునో యట్లు
మోహ మడర జ్ఞానమును నడఁగు.

గీ. సతము మోహాంధకారసంఛన్నమైన
లోకమున జ్ఞానదీప్తి వెలుంగకున్న
నట్టియంధకారావృతం బైనచోటఁ
గన్నులున్నను ఫలమేమిగలదు మనకు?

ఆ. గీ. కాన, మోహవృద్ధిగాకుండఁ దోడ్తోన
యడఁపవలయు జ్ఞాన మతిశయిలు;
నపుడు మోహమింక నడుగంటసాగుచు
జ్ఞానబలము వృద్ధిఁ గాంచుకొలఁది.

గీ. అడఁప కూరకున్న నామోహ మేగింబు
క్రమ్మి మఱుఁగుపఱుచు జ్ఞానభాను;
నడఁగియడఁగి తుదకు నాజ్ఞానభానుండు
మెల్లమెల్ల నస్తమించిపోవు.

కం. జ్ఞానాక్రమణము నే యం
బూనెడుమోహంబునడఁచిపుచ్చుట కెట్టులీ
మానవుఁడు నేర్చునని యను [స్యస్థ౯.
మానముఁ జెందకుఁడు మీరుమనవి యు

గీ. విద్యవలన, సాధుసాంగత్యంబువలనను
విబుధసేవవలన, విషయవిరతి

వలన, నియమబుద్ధివలనను మోహాంధ
కార ముడుపవచ్చుఁ గ్రమముగాను.

కం. ఆభ్యంతరనియమంబున
నభ్యాసము సేయుకొలఁది నదియలవడుఁ ద
త్యభ్యాసపాటవమ్మున
లభ్యముగాకుండునది యిలన్ మఱి గలదే?

గీ. జ్ఞానమునకు బలము గలిగిన మోహంబు
నడఁచు; మోహమునకె యధికబలము
గలిగెనేని నదియె జ్ఞానంబు నడఁగించు
బలము గలుగునదియె పడయు జయము.

గీ. ఈ చరాచరకర్తయా యీశ్వరుండు
జ్ఞానరూపుండు, విమలవిజ్ఞానమయుఁడు.
జ్ఞానలభ్యుండు ననియంత్రు కాన, మనము
జ్ఞానముంగన్న భగవంతుఁ గన్నయట్లె.

కం. ఏవేళ మనుజునకు జ్ఞా
నావిర్భావంబు గలుగు నావేళనె యీ
భూవలయమునందుండియె [డన్.
దేవత్వముఁ గాంచు నాత్మ దేహముతో

సీ. అఱచేతిలో జగం బాడింపఁ గావచ్చు
జ్ఞానంబు తనలోనఁ గలిగెనేని
శాశ్వతైశ్వర్యంబు సమకూర్పఁగా వచ్చు
జ్ఞానంబు తనలోనఁ గలిగెనేని
భూలోకమున స్వర్గభోగ మందఁగవచ్చు
జ్ఞానంబు తనలోనఁ గలిగెనేని
భగవంతుక్షణములోఁ బరికింపఁగావచ్చు
జ్ఞానంబు తనలోనఁ గలిగెనేని

గీ. ప్రబలమోహాంధకారసంబంధ మెడలి
దివ్యవిజ్ఞానదీపిక తేజరిల్ల
గాంక్షితములెల్లఁ గన్నులఁ గట్టినట్లు
కనుఁగొనఁగవచ్చుఁ బరితుష్టిఁగాంచవచ్చు

కం. మనభరతభూమి జ్ఞానం [జ్ఞానం
బునకున్, లయంబు తొల్లి; ప్రాగ్వ్యాలు
బున నే యిహపరసుఖములఁ
గనిభవసాగరముదాఁటఁగలిగిరియిచటన్.

సీ. పరశురాముఁడు జ్ఞానభాగ్యమ్ము లేకున్న
నెటుగెల్చునృపులమువ్వేడుమార్లు
కశ్యపమునినేత జ్ఞానశక్తిఁ దొఱంగి
యిలయెల్ల గడియింప నెట్లునేర్చు?
వార్ధి సేతువుఁగట్ట వశమె దాశరథికి
జ్ఞానసంపత్తియేఁ కలుగకున్న?
జ్ఞానబలంబుచేఁ గాక యెక్కటివోరఁ
బరమేశు నెట్టు లాపార్థుఁ డోర్చు?

గీ. జ్ఞానమునకున్న వాఁడి యగ్గలపువాఁడి
జ్ఞానమునకున్న నీతి యగమ్యనీతి
జ్ఞానమునకున్న శక్తి యఖండశక్తి
జ్ఞానమునకున్న పేర్మి యక్కజపుఁబేర్మి.

గీ. జ్ఞానబలయుక్తిచేతనే కాదె మున్ను
చారుతరమైన సుకవితాశాఖ నెక్కి
మధురరవమున "రామరామా" యటంచుఁ
గ్రోల్చి తరియించె వాల్మీకికోకిలమ్ము.

కం. పారాశర్యుండు మహా
భారతసంహితయు జ్ఞానబలముననే కా
దా రచియింపంగలిగె ను
దారత నదివేదమట్లు ధారుణి వెలయన్?

ఉ. అంతములేనిశాస్త్రనిచ
యంబుసృజించి మహాద్భుతక్రియా
సంతతు లాచరించి నిజ
శక్తి మహామహులై దిగంతవి

శ్రాంతేయగిఃక్రీస్తు సని
శింబువిరాజిలి చన్నయట్లు ద
గ్దంతులవంటి పూర్వులకు
జ్ఞానమెకాదె శరణ్యమై తగన్?

కం. అఱువదినాలుగువిద్యలు
మెఱయించితదీయశక్తి మిక్కుటముగఁ గ
న్పఱచి పొగడ్తలు గాంచిన
గఱువల కాధార మొక్కజ్ఞానం బెకదా?

గీ. జ్ఞానమే యన్నిటికి మూలకారణంబు
జ్ఞానమే యన్నిటికిని ముఖ్యంబు మనకు
జ్ఞానశూన్యుండు మనుజుఁడే కాఁడు తలఁప
జ్ఞానమునకన్న మేలొండు గానఁబడదు.

గీ. అఖిలసౌఖ్యములకు నదే యాటపట్టు
సర్వకార్యములకు నదే సాధనంబు
నిఖిలవస్తువులం దదే నిరతిశయము
భోగభాగ్యమ్ములకు నదే పుట్టినిల్లు.

గీ. జ్ఞానమునఁగాని మనకు లోకంబు లేదు
జ్ఞానమునఁగాని మనకు సౌఖ్యంబు లేదు
జ్ఞానమునఁగాని మనకు స్వర్గంబు లేదు
జ్ఞానమునఁగాని మనకు మోక్షంబు లేదు.

కం. కావున జ్ఞానోపార్జన
గావింపగవలయు నన్నిగతుల మనుష్యా
ళీవిషయము మీరలు మే [ప్టిన్.
ధావులగుటఁ దెలియఁగలరు తాత్త్వికదృ

ఉ. తాతలనాఁటిమాటలవి
ధంబిది, యెవ్వ రెఱుంగి రిప్పుడీ
నీతులు ప్రాతపాత్తముల
నిండఁ గనంబడుచుండ నేటికీ

పాఁతరిం ద్రవ్వుచుంటివని
పల్కనఁ బల్కఁగవచ్చు మీరు; నా
కీతెఱఁ గొక్కటే తెలియు నించుక;
కావున నిద్ది చెప్పితిన్ .

(సభలో నొక చోటినుండి యెవ్వఁడో యొకఁడు తటాలున "(What is this non-sence?) హ్వాటీజ్ దిస్? నాన్సెన్స్!" అని బిగ్గరగా నఱచెను.)

పరశురామకవి.—

కం. "హ్వాటీజ్ దిస్ నాన్సెన్" సను
మాటయొకటి యిపుడు సభ్యమండలిలో నే
నోటనో వెలువడె; నే నీ
పాటికి విరమింపకున్న భావ్యంబగునే?

ఆ. గీ. తామసంబువిడిచితత్త్వంబు గ్రహియించి
పరుల కింత తెలిపి భక్తిఁ గొలిపి
యెవ్వ రేమియన్న నెఱుఁగనియట్లుండి
మనఁ దలంపు నాకు మాన్యులార!

కం. తెలిసినముక్కలు నాలుగు
పలికితి నా కింతకన్నఁ బాండిత్యము లే
దలఘుమతులార! తొలుత నె [దపన్.
తెలిపితి "నాన్సెన్సు" గూడఁ దెలిపెం బి

కరతాళధ్వనులు

పరశురామకవిగారు రుపన్యాసపీఠమునుండి దిగిరి. అధికారియైన యగ్రాసనాధిపతిగారి యాదేశమున నరుణోష్ణీషధారులగు రక్షకభటు లతిప్రయత్నమున నన్వేషించిరి; కాని, యన్నిదొంగతనములవలెనే యాకతాయ దుండగముగూడ నగమ్యగోచరమే యయ్యెను. అగ్రాసనాధిపతి మహాగ్రహముతోఁ జేసినయాదేశము ననుసరించి పయికి వినరాకుండ గొణుఁగుకొనుటచేఁ బిమ్మట నుపన్యాసమధ్యమున సభ్యులుచేసిన వివిధప్రసంగములు వినరావయ్యెను. సభానంతరమున సభ్యుఁడుచెప్పి

యంత్రోపన్యాసవాక్యములుగూడ, సభలోనుండి లేచి సభ్యులసందడిలోను, గరతాళధ్వనులలోను లీనములై, పరిచయసమయమున బాజాలచప్పుళ్లలోఁ బరిప్రాప్తముగాఁ బరాస్తములైపోవు పౌరోహితమంత్రములవలె వినవచ్చినవికావు; ఆకారణమున నవి నేను వ్రాయఁజాలనైతిని. సభాభవనమునుండి వెడలి నేనింటికిఁ బోవుచుండఁగా వీథిలో నెవ్వరో "ఇటువంటి పబ్లికు (Public) సభలో—మాటలాడినవారిమర్యాదలు దక్కనుటకు—మాజస్ట్రేటున కధికారమేమున్నది? ఆ పేపరోపన్యాసమును భారతీపత్రికలోఁ దుక్కుదుక్కుగా నేకివైచి విమర్శించెదను! అప్పుడేమిపెద్దమువచ్చునో చూచెద" ననెను. సభ్యులుఁ బలువురు పలువిధములుగాఁ బరిహాసముకవిగారిని దిట్టుచు దీవించుచుఁ బలుకుకొన్న పలుకులు గూడఁ గొన్ని వినినాఁడను గాని గ్రంథవిస్తరభీతిచే నవి యన్నియు వ్రాయలేదు.

[ఒక ప్రేక్షక సంక్షిప్తలేఖకుఁడు.]




# ప్రకృతి

## ఉపాధ్యాయ

చంద్రికా శాంతనిర్మల సైకతముల
విహరణము సేయువేళ విన్వీథినుండి
తారకాగీతికా ప్రబోధంబు నొంది
నీదుమూర్తిని స్తుతియింతుగాదె ప్రకృతి!

పద్మినీకాంత ప్రణయకోపమును మాన్పఁ
దరణి తరుణాంశుమాలికాతరలకాంతి
విలసితంజేయ నొయ్యార మొలయ విచ్చు
పద్మములు ప్రణయతత్త్వంబు ప్రకృతి! నేర్పు.

ననధరవిహార శృంగార భరితభూమి
ధరతటంబులఁ దిరుగాడు తరుణములను
జీవితాశయబోధంబు సేయ నీవు
ఘనఘనాకృతి వచ్చినకరణిఁ దలఁతు.

ప్రకృతిలలితాంగి నీదుప్రభావకలన
వెలయు విజ్ఞానచంద్రికల్ విశ్వమందు
రాజులేకయ రాజించు రాత్రియెట్లు
ఇనుఁడు లేకయ శోభిల్లు దినమదెట్లు?

మ. సదసత్సంశయతర్కలోలురయి వి
జ్ఞానాలసుల్ గొంద ఱ
త్యుదితజ్ఞాననిధాన మీవనక యో
హో నిష్ఫలోద్యోగముల్
వెదుకం జేతురు హో! యనంతమగు గం
భీరాబ్ధి గర్భస్థనం
పదలన్ గాంచునె చిల్లిగవ్వ యెపుడేన్
వ్యాలోల వీచీహతిన్?

'జ్యోతిష్మతి'



# శ్రీ కృష్ణుడు - ఆయన సందేశము

గాధి నరసింగరావు గారు, బి. ఏ., యల్. టి.

"యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభి సంవిశంతి" అనీ తైత్తిరీయోపనిషత్తునందు చెప్పబడిన ప్రకారము, "ఈ చరాచరభూతజాలమంతయు బ్రహ్మనుండివచ్చుచున్నదనియు, నంతమందు బ్రహ్మను కలియుననియు సంపూర్ణవిశ్వాసము గలదని యెల్లరకును విశదమే. బ్రహ్మనుండివచ్చిన యీ జగత్తు ధర్మమార్గానువర్తియై గమ్యస్థానమును చెందును; అధర్మము దీనిని గమ్యస్థానమునుండి దూరముగ బారదోలును" అను నీయుభయము గూడ మనకు తేటతెల్లమే, గాని ధర్మమన నెట్టిదో, అధర్మమన నెట్టిదో అంతబాగుగ తెలియదు. ఇది ధర్మముయొక్క పరమరహస్యము. దీనినిగూర్చి మానవధర్మశాస్త్రమందిట్లున్నది.

> సర్వ మాత్మని సంపశ్యే త్సచ్చాసచ్చ సమాహితః;
> సర్వంహ్యాత్మని సంపశ్య న్నాధర్మే కురు తే మనః.
>
> **12. అ, 118. శ్లో.**

"స్థూలసూక్ష్మరూపమగు జగత్తునంతను వివేకము వలన నాత్మయందు చూడగలెను. అట్లు చూచినవాడు బుద్ధిని అధర్మమునందు జొరనీయడు." అని దీనియర్థము. దీనింబట్టి ధర్మవర్తనకు మూలభూతమైనది సర్వసమత్వబుద్ధియని మనువు చెప్పినాడు. సర్వసమత్వబుద్ధి చెడిపోయినప్పుడు అనగా పరస్పర ద్వేషములు ప్రబలియున్న కాలమున దేశము చెడుత్రోవనుపోవుటచే పాపాచరణమందాసక్తి మెండుగనుండి ధర్మదూరమగును. అట్టిసమయములందు దయాసముద్రుడగు భగవంతు డవతరించి పరస్పరద్వేషముల నణచి సర్వసమత్వ బుద్ధిని అంకురింపజేయును. ఈవిషయమునే భగవద్గీత చెప్పుచున్నది:

> యదాయదాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
> అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్.-

ఈ యంశమే మన పురాణములయందు చెప్పబడినది.

భరతఖండమంతయు పరస్పర ద్వేషములతో నిండియుండి ధర్మమార్గము తప్పి నడచుచున్న కాలము లనేకము లున్నవి. అందొక కాలమున నుద్భవించినవాడు శ్రీకృష్ణుడు. ఈయన తనకాలమునందుండిన పరస్పర ద్వేషముల నెట్లణచెనో ధర్మమార్గస్థాపన కెట్టి యుపదేశముల జేసెనో, ఎంతవర కతని పావన చరిత్రము లోకమునకు మార్గదర్శిగ నుండెనో, ఆసంగతు లన్నిటినిగూర్చి కొంచెము కొంచెముగ నీవ్యాసమున విచారణ చేయబడును. "కృష్‌కర్షణే" యను ధాతువునుండి నిష్పన్నమగుటచేతనున్నూ, క్రాన్తివిషువ్వృత్తముల సంపాతస్థలము సమీపముననున్న క్రాన్తివృత్తభాగమునకు దేవకియని పేరు కనబడుటచేతనున్నూ, సూర్యునకు విష్ణు అని పేరుండుటచే విష్ణ్వవతారమగు కృష్ణుడుగూడ సూర్యశబ్ద వాచ్యుడని యూహించుట కవకాశముండుటచేతనున్నూ, రాధ, విశాఖ మొదలగు చెలులపేర్లును, నక్షత్రనామములును, సమానములగుటచేతనున్నూ, శ్రీకృష్ణుడు సూర్యుడనియును శ్రీకృష్ణుని దివ్యచరిత్ర యంతయు ఖగోళవిషయముల జ్ఞానమును కలుగజేయునిమిత్తము కల్పించబడినదే కాని యథార్థముగాదనియును కొందరనుచున్నారు. సర్వప్రాణి సమాకర్షణ సమర్థమగునది ప్రేమ కాన నట్టి సర్వోత్కృష్టమగు ప్రేమ పురుషాకారము జెందినట్లు చెప్పుటచే పరమేశ్వరుని నిరుపమాన దయామయత్వమును బోధించుచు ప్రేమమార్గమున నాపరమేశ్వరుని సందర్శించుటకు మార్గదర్శకముగ నీ చరిత్రనంతను కల్పించిరే కాని నిందేదియు సత్యమగు చరిత్రాంశము లేదని మరికొందరనుచున్నారు. శ్రీకృష్ణుడను ప్రసిద్ధ వ్యక్తి చరిత్రము కాకపోయినను ఈకథయందొక చారిత్రక-విశేష మున్నదని కొందరనుచున్నారు. కృషి కృష్ణశబ్దము లేకధాతుజన్యములగుటచే కృషియొక్క

చరిత్రాంశ మీకథయందు కొంతగలదనియును, పర్వ కాలమందు శ్రీకృష్ణుని జన్మము చెప్పుటయును, ఈ శిశుసంరక్షణమునకు నదీప్రవాహముల నరికట్టుట చెప్పబడుటయును దానిని బలపరచుననియు, శ్రీకృష్ణుడు యమునాప్రాంతముల నుండుటచే నీతని కథవలన గంగా యమునా మధ్య దేశముల కీ కృషి వ్యాపించిన యంశము చుట్టుకు చరిత్రను సంబంధించినదనియును కొందరనుచున్నారు. దీనికుదాహరణముగ శ్రీరాముని చరిత్రనుజూపి దానివలన దక్షిణ హిందూస్థానమున కృషి వ్యాపించినదని గ్రహింపవలసిన విధి యెట్లో అట్లే శ్రీకృష్ణుని చరిత్రవలన గంగా యమునానదీప్రాంత భూముల నీ కృషి వ్యాపించినదని తెలియవలయుననియును, శ్రీకృష్ణునకును శ్రీరామునకును గల పౌర్వాపర్యమంతగా పాటించుటకు వీలులేదనియును, రామాయణము రచించినతరువాతను మహాభారతము రచించుట సత్యమేకాని మహాభారతములో జరిగినట్లు చెప్పబడిన కురు పాంచాలయుద్ధము జరిగినతరువాతనే రామాయణమందు జరిగినట్లు చెప్పబడిన యంశములు జరిగియుండవలెననియు కొందరు వాదించుచున్నారు.

పైవాదములున్ను శ్రీకృష్ణుని యద్భుత బాల్యలీలలున్ను కలిపి మొత్తముపై నాలోచించినచో శ్రీకృష్ణుడనునొక మానుషవ్యక్తి లేదని కొంతమంది అభిప్రాయపడుచున్నారు. భరతఖండవాసులమగు మనమందర మీకృష్ణుని భావించువిధముకూడ దీనిని బలపరచుచున్నదని వారియభిప్రాయము. ఈతడు సాక్షాత్పరమేశ్వరుని యవతారమనియె మనవారు భావించిభగవదంశమున నద్భుతచర్యలు లేక మహత్తులే యని యెన్నుచున్నారు. ఈతడు నద్భుతకరమగు పౌరుషవ్యక్తినిమరచి భగవంతుడని యనుచు నాయననుగురించిచెప్పిన యంశములన్నియు సత్యములే యని దేశవాసులకేకాక మనవారిలో ప్రాచీనులకుగూడ సందేహములు కలిగినట్లున్నది. లోకములకు ధర్మోపదేశము చేయవచ్చిన భగవదవతారమగు శ్రీకృష్ణుడు పరదారాభిగమనదోషదూషితుడు గాడేయను విషయమున నొకప్రశ్న శ్రీమద్భాగవతమున నున్నది. దానిసమాధానము సూక్ష్మదృష్టితో జూచినచో నతనియం దానింద నారోపించుటకు వీలులేదని తోచకమానదు. అతనిని పూజించు మనముగూడ నాగరకతా హీనులముగాము. గాని యద్దాని సమాలోచనము చేయక మనదేశమున కొలదికాలము క్రిందట నొకవివాదము జరిగినది. అదియేమనగా —ప్రస్తుతకాలమున హిందూదేశము నుద్ధరించుటకు కృష్ణుడు తగినవాడా లేక క్రీస్తు తగినవాడా యని ఇప్పటికిగూడ కొందరు క్రీస్తుమతాభినివేశముగలవార లా క్రీస్తే హిందూదేశోద్ధారకుడు కాగలడను నుద్దేశమున హిందూదేశ మతస్వరూపములను గూర్చి వ్రాయుచున్నారు. ఈపక్షమునకు ప్రతికూలురగువారిలో ప్రాచీన మతాభినివేశముగలవారు కొందరు నూతన ప్రకృతిశాస్త్రాంశముల నవలంబించి కృష్ణుని బాల్యములన్నియు సమర్థించుటకు ప్రయత్నించినారు. ప్రాచీనములగు మనదేశము వాటి యందు గౌరవముగల మరికొందరు కొన్నిటిని ప్రక్షిప్తము లనియును మరికొన్నిటిని అతిశయోక్తు లనియును చెప్పుచున్నారు. మరికొందరు శ్రీకృష్ణుని విడనాడి క్రీస్తుని గ్రహించుట కిష్టపడక నుపనిషత్తులందు చెప్పబడిన బ్రహ్మోపాసనమార్గముల ననుసరించుట శ్రేయస్కరమని తలచుచు మనల నుద్ధరించుటకుగాను మూర్తిగ్రహణము చేసిన పరమేశ్వరు డనావశ్యకమని వెల్లడి చేయుచున్నారు. ఈ వాదోపవాదముల వివిధవిభాగములను సువిమర్శ దృష్టితో జూచిన నొకయంశము వెల్లడి కాగలదు. అదేమన, ప్రస్తుతకాలమున మనదేశము నుద్ధరించుటకు నెల్లయు సాధన సామగ్రి మనలోనే కలదని చూపించు కోరికయే.

కొంద రాధ్యాత్మికాభివృద్ధికిగూడ మూర్తిధరుడగు పురుషవిశేష మవసరమని చెప్పుచున్నారు. వీరిని చారిత్రకులని చెప్పవచ్చును. వీరందరి మనస్సులు నొకయవస్థయందున్నవి. ఉపనిషన్మతావలంబులు లేక బ్రహ్మమతావలంబు లందరిమనస్సులు వేరొకయవస్థయందున్నవి. వీరి బుద్ధివిశేషముచే పురుషవిశేషము వీరియభివృద్ధి కవసరము లేదు, గాని కొన్నియమూర్తివిశేషములు మట్టుకు కొందర కవసరమగుటచే నీచారిత్రకులు బ్రహ్మమతావలంబకులును నొకేయవస్థయందున్నవారుగ గ్రహించవచ్చును. ఇంక నద్వయబ్రహ్మవాదులు కొందరు బ్రహ్మైక్యానుభవముగలవారై సర్వమునందును బ్రహ్మదర్శనము చేయుచున్న వారని చెప్పినచో వీరి బుద్ధివిశేషము పరమోచ్చస్థానమునందినది. ఇదియే యభివృద్ధియొక్క పరమా

వధి. మానవకోటియందలి విశేష భాగము మొదటియవస్థ యొక్క వివిధ భాగముల నున్నవారని తెలియ నగును. వారి యాధ్యాత్మికాభివృద్ధి కేదియో యొకసాకారవిశేష మవసరమై యున్నది. అట్టి విశేషము శ్రీకృష్ణభగవానులగునా? లేక మరియేదియైన వలయునా? యను నంశమును తెలుసుకొనుటకుగాను శ్రీకృష్ణుని చరిత్రను కొంత విమర్శించిచూతము. ఈచరిత్రమును రెండుభాగములుగ విభజించవచ్చును. ఒకటి ఆధ్యాత్మిక భాగము, రెండవది చారిత్రక భాగము. ఈవిభాగములను విమర్శించక పూర్వము మన మొకయంశము విచారించవలసి యున్నది. ఈ ద్వివిధచరిత్రమును తెలియుట కాధారము లేవనినచో మన పురాణములేయని చెప్పవలెను. ఈపురాణములు చారిత్రక విషయమున నప్రమాణములని విదేశీయులును మనవారిలో చాలామందియు తలచుచున్నారు. అందుచే నీపురాణముల ప్రామాణ్యమునుగురించి విచారణ చేయవలసి యున్నది. గాని దానిని పూర్తిగ నిచ్చోచేయుట కిది యదనుగాదు. స్వల్పముగనైన నిచ్చో వివరించుట యావశ్యకమని తోచుచున్నది. పురాణములం దతిశయోక్తు లున్నవన్నమాట సత్యమేకాని మనమొక విషయమును బుద్ధిగ్రహింపుచుంచ వలెను. ఆరోగ్యదాయకమగుచేదును తినుటకష్టముగాన నద్దానిని సుఖకరముగ గ్రహించునటుల చేయుటకై యట్టిమాత్రకు పైపూతగా పంచదార నుంచవలయునన్న యంశము కొందరి కభిమతమై యున్నది. ఇట్టిదానినే యనుసరించి వేదములను, ధర్మశాస్త్రములను జనసామాన్యమునకు సులభముగ దెలియుటకై వ్రాయబడిన పురాణములందు కొన్నిరకములగు నతిశయోక్తులు చేర్చబడినవి. మరియొక రీతి ననుసరించిన యతిశయోక్తులుగూడ గలవు. వాటి కన్నిటికిని యాధారముగ నున్నది మనదేశమునందు చాల కాలము క్రిందటనే విశేషవ్యాప్తిని జెందిన పతంజల యోగశాస్త్రము. దీనియందు చెప్పబడిన సాధనలవలన సహజముగా రావలయు నట్టి పరమావధియవస్థలను వాటి కాధారము చేసుకొనియున్నవి కొన్ని యతిశయోక్తులు. ఇందు కుదాహరణముగ నాకాశగమనము, స్వేచ్ఛచే శరీరముయొక్క లయము, శరీరముయొక్క సృష్టి మొదలగువాటిని సూచించి సూత్రములు యోగశాస్త్రమునందు గలవు. ఇంకను ననేకరకములగు వింతలు గలవు. వాటినా ధారముచేసుకొని జనుల కద్భుత రసావేశము గలుగజేసి యాద్వారమున కొంత బోధకలుగజేయవలయునని కొన్ని యతిశయోక్తులు పురాణములందు జెప్పబడినవి. ఈరెండు విధములగు నతిశయోక్తులను వేరుచేసి చూచినచో నీపురాణములు చరిత్రాంశములనే బోధచేయునని తోచకమానదు. ప్రస్తుతము విద్యాలయములలో జదువబడుచున్న చరిత్ర గ్రంథముల వంటివి కాకపోయినను కొన్ని యుగములందు (Epoch) జరిగిన పారమార్థిక, సాంఘిక, రాజకీయ విషయములగు చరిత్రాంశములను వెల్లడిచేయుచున్నవని చెప్పవచ్చును. ఈయంశముల భిన్నరుచులుగల శ్రోతల కింపగునట్లు వ్రాయబడినవని యూహింపవచ్చును. ఎందుచేతనంటే, ఈ పురాణములన్నియు సూతులచే పెద్దపెద్ద సంఘములందు చెప్పబడినట్లు వాటియందే వ్రాయబడియున్నది. అయితే వీటియందలి చరిత్రాంశములలో కాలభేదమును చూపించగలమేకాని పౌర్వాపర్యము నిర్ణయించుట కష్టతరమే. చాలామట్టుకు సాధ్యమేకాని సంపూర్తిగా యసాధ్యమని చెప్పుటకు వీలులేదు. ఈ విషయము పురాణముల నన్నిటిని పరిశీలించిన తేటపడగలదు. ఈ పరిశీలనము దుస్సాధ్యమగు పనివలె గన్పడునుగాని ఓర్పుయు, పట్టుదలయు గలిగి పనిచేసినచో నెట్టిపనినైనను సాధింపవచ్చును. గాన దీనినిగూడ జేయవచ్చునని తోచుచున్నది.

శ్రీకృష్ణుని చరిత్రను జెప్పు పురాణము లనేకములు గలవు. అవేవనిన–1. విష్ణుపురాణము, 2. భారతము, 3. హరివంశము, 4. భాగవతము, 5. దేవీభాగవతము 6. గర్గసంహిత. ఇన్నిటియందలి కథను విషయవిభాగము చేసి పరస్పర విరోధము లేకున్నవాటిని గ్రహించి, పరస్పరభేదములున్నవాటినుండి గ్రహింపవలసిన విషయ మున్నచో గ్రహించుచు లేనివాటిని పరిత్యజించుచు వ్రాయవలెను. లౌకికశిఖామణులలో లాలాలజపతిరాయి మొదలగువారును, పారలౌకికులగు సన్న్యాసులలో శ్రీప్రేమానందభారతి మొదలగువారును శ్రీకృష్ణునిగూర్చి విపులముగ రచియించియే యున్నారు. నాబుద్ధికి గోచరించిన విషయములను చారిత్రకములనియు నాధ్యాత్మికములనియును విభాగముచేసి చర్చించుటకు పూర్వము నతని జీవితమునందుగల యంశములను సంగ్రహముగ జెప్పుచున్నాను. శ్రావణమాసమున కృష్ణపక్షమున అష్టమి

దినమున జడివానగురిసి వెలిసినతరువాత నర్ధరాత్రమున మధురలో జన్మించి, తోడనే యానగర సమీపమున నున్న గోకులమునకు గొనిపోబడెను. మధురాపురాధిపతి యగు కంసుని సహోదరి దేవకి యాతని తల్లి. యాదవ రాజన్యుని సామంతుడగు వసుదేవు డాతని తండ్రి. వసుదేవుని రెండవభార్యయగు రోహిణి కొడుకగు బలరాము డాతని యగ్రసోదరుడు. ఈసోదరు లిద్దరున్నూ గోకులమునకు పతియగు నందునిచేతను, నతని భార్యచేతను పెంచబడిరి. ఈకృష్ణుడు శిశువుగనున్న కాలమున పూతన, శకట, తృణావర్తులను రాక్షసుల జంపెను. కొంతకాలమైనపిదప రెండు మద్దిచెట్లను విరచెను. బలరామకృష్ణులు గోపకులతోగూడి గోవులను గాచుచుండిరి. కృష్ణునకుగలిగిన యాపదలుచూచి మధురా సమీపమును విడిచి నందాదులు బృందావనమునకు జనిరి. బృందావనమున నున్న కాలమున ననేకాద్భుతచర్యలను జేసెను. అనేకమంది రాక్షసులను జంపెను. వారిలో బక, వత్స, ధేనుక, గర్దభులనువారు ముఖ్యులు. ఇచ్చటనే కాళీయుడను సర్పమును మర్దించెను. ఈకాలముననే గోపికలను వేణునాదముచే మోహింపజేసి యద్భుతమగు రాసలీలను జరిపెను. వీటి నన్నిటిని బాల్యలీలలని చెప్పుదురు. ఇచ్చట నుండగనే కంసుడు వీరిని గూర్చి విని తనపట్టణమునకు వీరిని బిలిపించెను. ఇప్పటికి శ్రీకృష్ణుని వయస్సు పదకొండు సంవత్సరములనియున్నది. మధురకు వెళ్లిన తరువాతను రెండవయుగ మారంభమగును. దానియందు మొట్టమొదట వీరు చాణూర ముష్టికులను వధించి మరికొందరు మల్లులను గూడ జంపి పిదప కంసుని జంపిరి. కంసవధానంతరము జరాసంధునితో వైరము కలిగినది. రెండుకక్షు లేర్పడినవి. తుదకు విసుగుదలజెంది జరాసంధుడు యుద్ధము లమానెను. శ్రీకృష్ణుడు ద్వారకచేరెను. కాని కొంతకాలమైనపిదప భీమార్జునులతోగలిసి మగధకు వెళ్లి జరాసంధుని జంపించెను. ధర్మరాజుచే రాజసూయయాగము చేయించెను. శిశుపాలుని జంపెను. అందువలన శిశుపాలునిపక్షము వారికిని, అనగా, అతని పినతల్లి పెదతల్లి బిడ్డలకును కృష్ణునకును యుద్ధము తటస్థించెను. పిమ్మట కురుపాండవయుద్ధము గలిగినది. ఈ యుద్ధానంతర మతని చరిత్ర మతిసంకుచితముగ నున్నది. నూట యిరువదియారవ సంవత్సరమున శ్రీకృష్ణుడు కాలగతి నొందెను.

ఈ జీవితకాలమునంతను నాలుగు భాగములుగ విభజింపవచ్చును. మొదటిది బాలలీలలు. ఇది మధురాగమనముతో పరిసమాప్తి నందెను. రెండవది ద్వారకానిర్మాణముతో ముగియును. మూడవది కురుక్షేత్రయుద్ధాంతము. నాల్గవది నిర్యాణమువరకును. ఈనాల్గింటిలో బాలలీలలం దద్భుతములు మెండుగ నున్నవి. తక్కిన భాగములలో గూడ నచ్చటచ్చట కొంచెము గన్పడుచుండును గాని తరముగ లేవు.

బాల్యమందలి చరిత్రను కొంత విచారించినచో పురాణములలో పరస్పరభేద మత్యల్పముగ నున్నది. మాసము, పక్షము, తిథి, అర్ధరాత్రికాలము అన్నిటియందును సమముగనేయున్నవి. జననముతో సంబంధించిన విశేషములయందు స్వల్పభేదము లున్నవి. ఇతర బాల్యలీలలు పురాణములయందు దొరకేటిగ నున్నవిగాని వస్త్రాపహరణము, రాసలీల, ఈరెండును హరివంశమునందు లేవు; భాగవతము మొదలగు కొన్నిటియందే కలవు. దీనిని బట్టియే యితని చరిత్రము నిందాస్పదమైన చర్యగలదని యూహించుచున్నారు. ఇట్టి దన్ని పురాణములయందును లేకపోవుటచేతనున్నూ ఇది చెప్పబడిన భాగవతమందే సంశయసహితముగ ప్రశ్నయు దాని సమాధానమును ఉండుటచే నా సమాధానమును విమర్శించినపై నాకు తోచిన దేమంటే ఈభాగము భగవద్భక్తులకును భగవంతునికి గల సంబంధము తెలుపుడుచేయుటకు గాను మనోరంజకమగు నీ ప్రేమరసపూరితమగు కథ చేర్పబడెను. ఇట్టిదే యనుటకుగాను భారత భాగవతములందు సూచన లనేకములు గలవు. వాటినన్నిటి నిందు వివరించుటకు వీలులేదు కాన ఫలితార్థములను వివరించుచున్నాను.

వస్త్రాపహరణ రాసలీలలును, వాటికిపోద్బలముగ నందు చెప్పబడిన ప్రేమోదయమును ప్రేమపోషణమును ప్రేమపరాకాష్ఠస్థితిని జూపించు భాగములను విడచి తక్కినభాగములను కొంత విచారింతము. పూతనయనునది చిన్నపిల్లల జబ్బుగనున్నది. శకటతృణావర్తుల కథలు స్థిరనివాసములేక నివసించువారల పిల్లలకు సహజములే. ఆయాపదలు గడచిపోవుట యద్భుతమేకాన యట్టికథల

వలన అట్టి యూపదలకు శ్రీకృష్ణుడు కూడ లోనై దైవాను కూల్యమున వాటిని దాటెననియే గ్రహింపవలెను. అవతారమని నిశ్చయమైన వెనుకను, భక్తిభావ ముదయించుటకును, పెంపొందుటకును, నలయుననియో లేక, కార్యకారణభావముచు మరియొక విధముగా గ్రహించుట చేతనో వీటి నిట్లు వర్ణించియుందురు. వత్స, బక, ధేనుకాదులకు రాక్షసుల కథలన్నియు బృందావనమందు జరిగినవి. నివాసమునకు యోగ్యముగాని యారణ్యక ప్రదేశమును నివాసయోగ్యముగ జేయుటయందున్న కష్టములను వెల్లడిచేయుటకును, భక్తిభావమును పోషించుటకును వీటి నిట్లు చెప్పియుందురని యూహింపవచ్చును. దావాగ్నిని ద్రావుటయును, గోవర్ధనోద్ధరణమును పాతంజలి యోగముయొక్క పరమావధి స్థితులను ప్రదర్శించుటకును, తన్మూలమున నాధ్యాత్మికబోధ కొంతచేయుటకును జెప్పబడియున్నవి. ఇవిగాక మరికొన్ని స్వల్పవిషయములు గలవు. వాటివలన నప్పటికాలపు ప్రజలయందున్న నమ్మకములు మొదలగువాటిని తెలియజేయుచు వాటియందు శ్రీకృష్ణుడుచేసిన మార్పులు బోధింపబడుచున్నవి. ఈతని బోధనలనుగురించి ముందుకొంత విపులముగ జెప్పదలచియున్నాను గనుక నిప్పు డాయంశమును విడచి చారిత్రక భాగమునే చెప్పుచున్నాను. మధురాభిగమనము మొదలు కురుక్షేత్ర యుద్ధమువరకు గల రెండవభాగముల విషయములను జూచినచో భక్తిభావోదయపోషణములకు చేర్చిన మహాకథయని సులభముగ విడపరచవచ్చును. తక్కినయంశములు జూచినచో తప్పక శ్రీకృష్ణుడను నొక వ్యక్తి చరిత్రమున గలడను నమ్మకము హరివంశము చదివినచో గలుగకమానదు ఇట్టివ్యక్తి దేశమం దుద్భవించిన కాలమేదియో తెలిసిన నాటిదేశకాల పరిస్థితులను, వాటియం దీవ్యక్తివలన గలిగిన మార్పులను సులభముగ గ్రహించుటకు అవకాశము గలుగును. కాబట్టి శ్రీకృష్ణావతార ప్రారంభకాలమునుగురించిన చర్చ కొంత యిచ్చట యావశ్యకము.

శబ్దకల్పద్రుమమునం దిట్లున్నది:—

ఖమాణిక్యనామక జ్యోతిషగ్రంథమందు శ్రీ కృష్ణుని జాతకము తెలుపుడుజేయు శ్లోకమున్నది.

ఉచ్చస్థాః శశిభౌమచాంద్రిశనయో
 ల్లగ్నం వృషో లాభగో
జీవః సింహ తులా ళిషు క్రమవశా
 త్పూషోశనో రాహవః;
నైశీథస్సమయోఽష్టమీ బుధదినం
 బ్రహ్మర్క్ష మత్రక్షణే
శ్రీకృష్ణాభిధ మంబుజేక్షణ మభూ
 దావిః పరం బ్రహ్మ తత్.

ఇందలి గ్రహస్థితి కలి 647 కు సరిపోవునని యున్నది గాని కొందరిచే గణితము చేయించి చూడగా నది సరిపడలేదు కొన్ని పురాణములందుమాత్రము ద్వాపరయుగాంతమున కృష్ణావతారకాలమని చెప్పబడినను చాలా పురాణములందు కలియుగముననే కృష్ణావతారమని చెప్పబడినందున నదియే గ్రహింపవలయునని కూడ పై గ్రంథమునందు గలదు.

మహాభారతయుద్ధమందు శ్రీకృష్ణుడు పాల్గొనియెను గనుక భారతయుద్ధకాలము దెలిసినచో శ్రీకృష్ణుని కాలము దెలియగలదు. మహాభారత యుద్ధమునాటికి శ్రీకృష్ణుడు 90 సంవత్సరముల వయసువాడనియును మహాభారత యుద్ధానంతరము 36 సంవత్సరములు జీవించియుండె ననియును దెలియవచ్చుచున్నది. అందుచే మహాభారతయుద్ధకాలమును దెలియుట యావశ్యకము. రాజతరంగిణీకారుడగు కల్హణుని ప్రకారము కలియుగము ౬౫౩ వ సంవత్సరమున మహాభారత యుద్ధము జరిగినది. కాశ్మీర దేశపురాజుల కవిలెలున్నూ బృహత్సంహిత యున్నూ రాజతరంగిణీ గ్రంథకారుని యాధారములు. కాశ్మీర దేశపురాజులలో నొకరు మహాభారత సంగ్రామ రంగమున మడిసిరి. అందుచే నావంశీయులకవిలెలు మంచి ప్రమాణమని యూహింపవచ్చును. ఇక బృహత్సంహితను రచించినవరాహమిహిరుడు మహాభారతయుద్ధకాలమును గూర్చి తానేమియు చర్చజరుపలేదుగాని వృద్ధగర్గ వచనమునే తాను తన గ్రంథమునందు జెప్పెను. అందుచే నాతడు గ్రహించినది పారంపరాగతకాలము. మహాభారతమునందున్న కొన్ని జ్యోతిషాంశముల నాధారము చేసుకొని గణితము చేసినచో కలియుగ 6౫౩ సంవత్సరమున యుద్ధముజరిగినట్లగును. మహాభారతమును విడిచి తక్కిన

గ్రంథముల నున్న వాటినిబట్టి గణితముచేసినను కలి 653 సంవత్సరమే వచ్చును. అందుచే కలి 653న మహాభారత యుద్ధము జరిగినదనుకొన్నచో శ్రీకృష్ణునిజన్మ కలి 564 వ సంవత్సరమున కాగలదు. అనగా నిప్పటికి 4461సంవత్సరముల క్రిందట శ్రీకృష్ణుడు జన్మించెననియును 4311 సం. క్రిందట మహాభారతయుద్ధము జరిగెననియును తెలియ వచ్చుచున్నది. ఈతారీఖు ప్రస్తుతకాలపు పరిశోధకు లెవ్వరును నంగీకరింపరు. వారి మతమున 3424 లేక 3124 క్రిందట యీమహాభారతయుద్ధము జరిగినట్లున్నది. వారి మతమునకును పైమతమునకును 1236 లేక 1536 సం. తేడా కనిపించుచున్నది. కాని నవీన పరిశోధకులు గూడ రాజతరంగిణి మొదలగు గ్రంథములను సమాలోచన చేయుటయేకాక మనదేశమునకు వచ్చిన విదేశీయుల గ్రంథములుగూడ నాధారముచేసికొనియున్నారు. దీని సత్యాసత్యములను విచారించవలెనన్నచో నా యంశము గూర్చియే ప్రత్యేకముగ వ్రాయవలయునుగాని యిట్టి వ్యాసమందది చెప్పుటకు తగినంత యవకాశ ముండదు గాన నీయుభయవాదులయొక్కయు వాదముల సారాంశమును వారి యాధారములను సంగ్రహముగ వివరించితిని. ఇందేది స్థిరపరచినను తత్కాలిక రాజకీయాదివ్యవస్థలు దెలియుటకు మహాభారతమును హరివంశమును ఆధారము లగుచున్నవి. గాన వాటినిబట్టి తెలిసినమట్టుకు నా కాలపు రాజకీయవ్యవస్థయు నద్దాని మార్పుటయందు శ్రీకృష్ణుని పాలును ముందు చర్చించి తరువాత నాకాలపు మతాచారములను వాటియందు శ్రీకృష్ణుడుచేసిన మార్పులను జెప్పుచున్నాను.

ఆకాలమున యమునానదీప్రాంతమున మధురా పట్టణముగలదు. అదియొక ప్రబలమగు రాజ్యమునకు ముఖ్యపట్టణము. దాని నాకాలమున పరిపాలించువాడు కంసుడు. ఆగ్నేయకోణమున మగధ రాజ్యము కలదు. ఇది ఆకాలపురాజ్యములలో మిక్కిలి బలవంతమైనరాజ్యము. దీనిపరిపాలకుడగు జరాసంధుడు మధురానాథుడగు కంసుడును సంబంధబాంధవ్యములచేపరమమిత్రులు. దక్షిణమున కొన్నియసురరాజ్యములు గలవు. ఇవిగాక యదువంశీయులగు రాజుల రాజ్యములు దక్షిణమునకొన్నియు, నాగ్నేయమున ననగా మగధసమీపమున గొన్నియు గలవు. మధ్యదేశమున కురుపాంచాలరాజ్యములు గలవు. [illegible] కాలయవనుడనురాజు రాజ్యము చేయుచుండెను. జరాసంధుడును, కంసుడును, సాల్వ శిశుపాల దంతవక్త్రులును గలసి యొక సమయ మేర్పరచు కొనుటచే మగధరాజ్యమున్న ప్రాంతమందలి రాజ్యముల నన్నిటిని జరాసంధుడు స్వాధీనపరచు కొనుచుండెను. జరాసంధుని బందీలుగ ననేకమంది రాజులుండిరని భారతము వలన తెలియవచ్చుచున్నది. జరాసంధ బాంధవ్యముచే నలరి మధురాధిపతియగు కంసుడు చాలరాజ్యముల నాక్రమించి ప్రజలను బాధించుచుండెను. పశ్చిమ సముద్రతీర మందున్న ఘూర్జరము గుజరాతు మొదలు [illegible] ప్రతీరమునందున్న [illegible] ను గలప్రదేశమున నొకమాలాకారముగ యదు, వృష్ణి, భోజ, అంధక కుకురవంశీయుల రాజ్యములున్నవి. అందు కొన్ని జరాసంధునికి లోనైనవి మిగిలినవాటికి మధురాధిపతియగు కంసుడధిపతి. ఈరాజ్యముల రాజులలో కొంత మంది మధ్యదేశాధిపతులగు కౌరవులతో సంబంధబాంధవ్యములు కలిగియుండిరి. యదువులు, వృష్ణులు, అంధకులు, కుకురులు వీరునల్వురును కంసుని బాధల సహించలేక యతని నాశనముచేయుటకు ప్రయత్నములను జేయుచునేయుండిరి. గాని బహిరంగముగనే పనిచేయుటకును శక్యముగాని సమయము నిరీక్షించుచుండిరి. ఇది గాక వృష్ణులకును ఆకాలపు ఆర్యాజాతులవారగు నాగులు మొదలగు వారలకును స్నేహభావ ముండెను. తక్కిన యార్యజాతులవారికిని వీరికిని కలహములు మెండగుచుండెను. ఈ సాంఘిక రాజకీయకలహములను దీర్చుటకు నేకప్రయత్నములు జరిగినట్లు గన్పడును. కాని యవి ప్రయోజనకరములు గాలేదు.

ఈకాలమున భరతఖండపు చరిత్రమున నూతనయుగాంకురమైనది. ఆర్యావర్త దేశమందంతటను నివసించుచున్నవారి పరస్పరసంబంధములను నూతనముగనిర్ణయింపవలసిన కాలమువచ్చినది. ఒకక్రొత్తశక్తి దేశమందలిప్రజల నావహించినది. ఇట్టి సమయమున నగ్రేసరులయి ప్రజలను నడిపించుటకు తగిన రాష్ట్రీ మేదియు లేదు. దేశాధిపతులందరు నంతఃకలహములలో మునిగియుండిరి. అందుచే రాజకుటుంబములందు గాక వారితో సంబంధించిన యొక కుటుంబమున మధురలో శ్రీ కృష్ణుడు జన్మించెను ఇతను సాధించవలసిన ప్రధానసమస్య సాంఘికమైనది.

జాతుల సంబంధవిషయమున వసిష్ఠ విశ్వామిత్రులకాలమున నారంభింపబడి శ్రీరామచంద్రునిచే సమాకరింపబడిననాటి ప్రాతసమస్య క్రొత్తగ యిప్పుడు తలయెత్తినది. నాగులు, గంధర్వులు మొదలగువారితో సంబంధబాంధవ్యములుగల యదువులును, వృష్ణులును నిరాకరింపబడుచుండిరి. శ్రీకృష్ణుని తండ్రి వృష్ణికులమువాడు. శ్రీకృష్ణుని తల్లిది భోజకులము. శ్రీకృష్ణుడు తన బాల్యమంతయు గోకులమందు గోపికలతో గడపి వారి యాచారవ్యవహారములనన్నిటిని బాగుగ గ్రహించెను. తరువాతను మధురకువచ్చి వేదవేదాంగములయందు సుశిక్షితుడయ్యెను. అందుచే నీతని కుభయులయొక్క యాచారవ్యవహారాదులు బాగుగ తెలియుట వారలకు గలిగిన సమస్యా పరిష్కారమునకు వలయు సమర్థతగలవాడయ్యెను. కంసవధానంతరము మధురలోని జనసంఘమొక సభచేసిరి. దానిలో శ్రీకృష్ణుని మధుర విడిచి వెడలుమని యుపదేశించిరని హరివంశమువలన తెలియవచ్చుచున్నది. ఆ యుపదేశానంతరము బలరామకృష్ణులు మధురవిడచి దక్షిణదేశములకుబోయి అచ్చటనున్న తమ వంశజులగు రాజులనుజేర్చి జరాసంధునకు ప్రతిపక్షమగు కక్షయొకటి యేర్పరచిరి; గాని దానివలన జరాసంధు నడ్డగలిగెనే కాని యాతని నశింపజేయుటకు శక్తిచాలకుండెను. జరాసంధ శిశుపాల దంతవక్త్ర సాల్వు లొకపక్షమువనుండి విదర్భ లేక కుండినరాజపుత్రుడగు రుక్మిని తమవశము చేసుకొని రుక్మిణీవివాహ విషయమున శ్రీకృష్ణున కడ్డుదగిలిరి. తమకు శక్తిచాలదని యూహించి కాలయవనుని సహాయము కోరిరి. కృష్ణుడు కాలయవనుని ఉపాయముచే జయించి మధురను విడచి ద్వారకయందు వాస మేర్పరచుకొనెను. తుదకు కుండినరాజపుత్రియగు రుక్మిణిని వివాహమై రుక్మిని యాతని బంధుగులగు రాజపుత్రులను తనపక్షమునకు త్రిప్పుకొనెను. పాండవులు, పాంచాలురుగూడ వీరిపక్షము చేరిరి. కౌరవులు విరోధించలేదుగాని విరోధ మంతర్ముఖము చేసుకొని పాండవులతో సఖ్యమున కొంపంబడిరి. అటుతరువాత జరాసంధుని భీమునిచే జంపించి మగధనుగూడ తనపక్షమునకే త్రిప్పెనుగాని కురువంశీయుడగు దుర్యోధనునకు మనస్సున నసూయ యధికమయి రాజగు తన తండ్రిని తన వశముచేసుకొని పాండవులతో విరోధము కల్పించుకొనెను. ఈసమయమున శ్రీకృష్ణుడు చేది కరూశ మార్తికావతముల రాజులతో యుద్ధమందు నిమగ్నుడై యుండుటచే కురుపాండవులకు వైరము ప్రజ్వరిల్లి బహిరంగముగా పాండవులకు రాజ్యచ్యుతి కలిగెను. మార్తికావత కరూశరాజన్యులగు సాల్వ దంతవక్త్రుల జయించి యా రాజ్యములందు తనపక్షమునందు రాజుల నిలిపి పాండవుల రాజ్యచ్యుతివిని వారిపక్షముననుండుటకు మరికొందరు రాజులనుగూర్చి యుద్ధమునకు సన్నాహము చేయుచు నకారణ జనవిప్లవము నాపుటకుగాను తా స్వయముగ కౌరవరాజసభ కేగి రాజీనామ చేయుటకు ప్రయత్నించెనుగాని కౌరవ రాజపుత్రుడగు దుర్యోధనుడు గూడ తన స్నేహితులను గూర్చుకొనెను. వారందరు కృష్ణునిపై నసూయతో నుండుటచే యుద్ధము తప్పకకలిగెను. ఈయుద్ధమే కురుక్షేత్రరంగమున జరిగిన మహాభారతసంగ్రామము. ఇందు భరతవర్ష పురాజన్యులందరు పాల్గొనినట్లు గనుపించును. ఈ సంగ్రామమున పాండవులకు జయముకలిగెను. దేశమున శాంతి నెలకొల్పబడెనుగాని దేశమునకుకలిగిన నష్ట మింతంతయని చెప్పనలవిగాలేదు. కాలక్రమమున దేశమునకు బలముగలిగి అశోకవర్ధనుని కాలమున జగద్విదితమగుటకవకాశము గలిగినది. శ్రీకృష్ణుడు భరతఖండమునకు పాండుపుత్రుల రాజాధిరాజులుగజేసి, భరతఖండముననే కాక భరతవర్షమునగూడ శాంతినెలకొల్పి వివాదములు, పొందుచు పరస్పరద్వేషములతో చెడుచున్న దేశస్థుల కైకమత్యము గలుగజేసెను. పాండవులు నాగులతోను గంధర్వులతోను అసురులతోను సంబంధబాంధవ్యములుచేసిరి. అన్నిజాతులవారికిని పరస్పరవైషమ్యము లణగునట్టి యేర్పాటులు చేయబడెను. ఇట్టి రాజకీయవ్యవస్థను మార్చి తనూత్కాలమున సాంఘికవ్యవస్థనుగూడ మార్చెను. ఈమార్పులను మొదటినుంచియు మతసంబంధమగు సంస్కారములతో గలిపి చేయుచునే వచ్చెను. పారలౌకిక విషయమున శ్రీకృష్ణునిచే ప్రతిపాదింపబడిన సంస్కారములనుగూర్చి యింక కొంత విచారించిచూతము.

ఆకాలమునాటికి జను లెట్టిస్థితిలోనుండిరో యెట్టి నమ్మకములు గలిగియుండిరో మనకు స్ఫుటముగ దెలియు

టకుగాను భాగవతమున రెండుసందర్భములు గలవు. అం దొకటి గోవులను గాచుట గోపకుల నన్నము నిమిత్తము మునులయొద్దకు బంపుసందర్భము. రెండవది: గోవర్ధనోద్ధరణకథ. వీటివలన దెలియదగినవాటిని సంగ్రహముగ వివరించెదను. అప్పటికాలపుమునులందరు యజ్ఞయాగాదుల యందు బహుశ్రద్ధ గలిగియుండిరిగాని ఒక్క లోపము మాత్రము గలదు. భూతదయను మట్టుకు వారు కర్మప్రధానాంగముగ గ్రహించలేదు. సాంఖ్యమతమును యోగమతమును వ్యాపించియున్నను వాటియందు నమ్మకము లేనివా రుండిరి స్త్రీలుమట్టుకు యోగమహిమలను నమ్ముచు వచ్చిరి వారియందుమాత్రము భూతదయ యనునది గలిగినట్లగపడుచున్నది. పురుషులుమాత్రము కర్మయొక్క ఇతికర్తవ్యతయందు శ్రద్ధగలవారై కర్మఫలసిద్ధికి ప్రధానము భూతదయలేనివారై యుండిరి. కర్మయొక్క బలమే యధికముగ నుండెను. జనసామాన్యముమట్టుకు ఉత్సవాదులయం దాసక్తి గలిగియుండిరి. ఆకాలమున ఇంద్రుడు ప్రధానదేవతయు సర్వఫలప్రదాతయు నను నమ్మకము గలదు. ద్విజులు యజ్ఞములను, ద్విజేతరులు ఇంద్రయాగములనేఉత్సవములను ఏటేట జరుపుచువచ్చుచుండిరి. బహుదేవతారాధనము బలముగనుండెను. సర్వజగన్నియామకుడగు జగదీశ్వరుడు జనులచే మరచిపోబడెను. అందుచే గూడ ద్వేషములు మెండగుచుండెను. ఇట్టి కాలమున శ్రీకృష్ణుడు తన యుపదేశములను మొదట గోకులమం దారంభించెను. ఏటేట చేయు నింద్రోత్సవము నిలుపుచేయించి దానికి బదులుగ మరియొకటి జరిపించెను. దానివలనగలిగిన కల్లోలమును తుదకు శ్రీకృష్ణుని విజయమును మనము గోవర్ధనోద్ధరణమువలన గ్రహింపదగియున్నది. ఇదిగాక గోపకన్యకలకు పూజావిధానము, ధ్యానమార్గము మొదలగునవి కొన్ని యుపదేశించి వారలను తననూతనమార్గమున తయారుచేసెను. వారల కుపదేశించిన వాటిలో ప్రధానమైనది యాత్మసమర్పణము, భగవంతునియం దేకబుద్ధి. వారలను తమగృహకృత్యములు విడువుడనిగాని వివాహములుమాని సన్యాసినులు కండనిగాని బోధించలేదు. కర్మలను జేయుచునే భగవంతు నారాధించుచు నుభయలోకములను సాధించుమార్గము వారికుపదేశించినటులు వెల్లడి

చేయుచున్నవి. ఇన్నియుపదేశములు యిట్టి యుపదేశములకు గలవనుట సందియము మాత్రము గలదు. అందుచే నిపుడు యజ్ఞాదికముల నుపదేశింపబడిన భగవద్గీతలయందు చెప్పినవాటి కనుకూలములు నీభాగము లందు కల్పించి వ్రాసిరని యనవచ్చును. శ్రీకృష్ణు డీ సంస్కారవిషయమున నేమి చేసెనదియును మనకు విస్తరముగ దెలియదుగాని తాను సకలకర్మల నాచరించుచు కాలము గడిపెననియును [illegible] వాటిని తాము జేయునపుడు విధివిహితములుగాన జేయుచున్నామని యెంచవలయుననియును, ఆత్మజ్ఞానమును, [illegible] యుండుటచేతనే తాను బోధించు [illegible] న [illegible] గలరని యును బోధించెను. [illegible] ప్రధానముగా చేసుకొనినచో జనులకు ద్వేషముండదు. అందుచే నైకమత్యము సుగమమగును. ప్రస్తుతకాలమున నున్న భిన్నమతములవారందరును శ్రీకృష్ణు డుపదేశించిన "సహజంకర్మ కౌంతేయ! సదోషమపి నత్యజేత్; సర్వారంభాహిదోషేణ ధూమే నాగ్ని రి వావృతాః" యను వాక్యానుసారము నడుచుకొనుచు నన్యమత నిందలను, నన్యాచారగర్హణమును మానిరేని నైకమత్యము గలుగుటకు సందియములేదు. దీనిని పరిపాటియందుంచు కొనకపోవుటచేతనే యీకాలమున ద్వేషములు ప్రబలినవి. దీనిని బోధపరచి లోకోపద్రవము నివారించి శ్రీకృష్ణుడు చనిపపిమ్మట మనదేశమందు గలిగిన మార్పులచే దయామైనవియే మనసంఘమందున్నవి. కలిసి భోజనములు, పరస్పర వివాహములు లేకపోయినను పరస్పర మైత్రిగలిగియుండుభావము నేయాత్మపరిజ్ఞానము గలుగజేయునో యట్టియాత్మ పరిజ్ఞానము నామమాత్రావశిష్టమై యుండుటచేతనే మనసంఘమున కిట్టి దురవస్థ వచ్చినది. పరమతసహనము, సర్వభూతసమత్వమును ప్రధానములుగ బోధించి వీటి కాధారభూతమయినది ప్రేమయే యనియు,నట్టిప్రేమనువిడువవలదనిబోధచేసినశ్రీకృష్ణుని యుపదేశములు ప్రస్తుతకాలమున కెంతయుపయోగించునో నేను వేరె చెప్పనక్కరలేదు ఈ శ్రీకృష్ణుని యేర్పాటులు ప్రపంచమునందున్న సమస్తజాతులవారిని, సమస్తరాజ్యముల వారిని నొకేరాజ్యమువారినిగా కూర్చుట

కెంతయో ఉపయోగించును. ఎవరి ప్రత్యేకవ్యక్తిని వారు విడువనక్కరలేదు. అందరును గలిసి యొక కుటుంబమువలె నేకీభావము గలిగియుండవచ్చును. అందుచే శ్రీకృష్ణుని యుపదేశములు ఒక మన భరత ఖండమునకే కాక సర్వప్రపంచమునకు వలయు విషయములను గలిగియున్నవి. కావున శ్రీకృష్ణుడే జగదుద్ధరణమున కావశ్యకమైన పురుషవిశేషము. అతనినే మన మారాధించవలెను. ఆరాధనయన పూవులతో పూజచేసి యుత్సవములు చేయుటే కాదు. ఆయన యుపదేశముల నాచరణలో నుంచుకొనుటయు, నాతని యుపదేశములను సర్వప్రపంచమునందును వ్యాపింపునటులు చేయుటయును ప్రస్తుతకాలమున భారతీయులముఖ్యకర్తవ్యమైయున్నది. శ్రీకృష్ణసందేశములు వ్యాప్తము చేయుటయే శ్రీకృష్ణుని యారాధించుటగా భావించి పనిచేయుట కర్తవ్యమని భారతీయాంధ్రసోదరులకు విన్నవించుచున్నాను.



# సౌందర్యపిపాస

నాదెళ్ల వెంకట్రావు గారు, బి. ఎ.

కనుఁగొనినమాత్ర నీసోయగం బదేమి
తఱిగిపోవునో? లేక నేఁ దస్కరింతు
నని తలంచితో? యాస్యంబు నట్టె త్రిప్పి
వైచికొంటివి నీవంకఁ జూచినంత.

కనులు మూయక నీవైపు గడియసేపు
ముదముమీఱఁ జూచినంత; నీముద్దుమోము
కందునోయంచు సుకుమారసుందరాంగి
డెందమందున సందియం బందినావొ?

అందముగ భ్రూలతల్ పైకిఁ గ్రింది కెగుర
వింతగాఁ గనుల్ ద్రిప్పుచుఁ జెంతనున్న
సకియతో నేదొ ముచ్చటించుకొను నీకు
నేను నినుఁ జూచినంతనే హానమేల?

మృదుల సుస్నిగ్ధములు నీదు పెదవులందుఁ
గమ్ర దరహాసవీచికల్ గంతు లిడఁగఁ
గులుకుకొను చేమొ సకియతోఁ బలుకుచుంటి
వింతలో మూతిముడుపేల? యింతి! నీకు

అన్యభామను నానంక కదియు నిగ
సంభ్రమంబునఁ జూడ్కు లీసరణి నీవు
తెప్పపాటైన లేక సారింతునేమి
పాప మనుచును నాపైనఁ గోపమొక్కొ?

ఈశ్వరుండను శిల్పి రచించినట్టి
రమ్యతరవిగ్రహంబవు రమణి! నీవు
అట్టి నినుఁ జూచి ముదమంది యతనిశిల్ప
నైపుణిని మెచ్చుకున్నచోఁ గోపపడఁదె?

స్వచ్ఛసౌందర్యరాసులౌ సతులఁ గనినఁ
దుచ్ఛవిషయోపభోగ్యవస్తువు లటంచు
భావనము సేయ నలవాటుపడిన పశువఁ
గాను; సౌందర్యదాహార్తకవిని నేను.

అందమగువస్తు వెప్పు డానందకరము,
అట్టియానందలబ్ధికై యన్ని వెసల
నరయుచుందును సతతంబు నంతెకాని
పాపచింతలు లేవు నాచూపులందు.



త టా క ము

చిత్రకారిణి:— శ్రీమతి డి. బుచ్చికృష్ణమ్మగారు.




శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

[వెనుకటి సంచిక తరువాయి]

## ౬

"రక్షితులు గానివారిని రక్షింపను చక్రి రాజై యుండు"నను భాగవతసూక్తి యథార్థమైనది. ఎట్టిపోషణసౌకర్యములు లేకున్నను, బుచ్చిరాజు కొమార్తెకు మూఁడేండ్లు వచ్చినవి. పున్నమ్మ మరల గర్భిణియైనది. ఈ మాఱు తండ్రి వచ్చి స్వయముగా బిలిచినను పున్నమ్మ పుట్టింటికి వెళ్లలేదు. మరల పదిరూపాయలు బ్యాంకిలో వేసికొనవచ్చును గదా యని పున్నమ్మను పుట్టింటి కంపుటకు బుచ్చిరాజు విశ్వప్రయత్నముచేసి విఫలుఁడైనాఁడు. పున్నమ్మపట్టు రాహుపట్టుగదా!

భార్యకు పురుడుపోయు దిక్కులేమిచే మూఁడేండ్లనాఁడు యిల్లువిడిపోయిన తల్లిని బుచ్చిరాజు బలవంతపెట్టి తీసికొనిరావలసి వచ్చినది. ఒక శుభముహూర్తమున పున్నమ్మ ప్రసవించినది. మగశిశువు కలిగినాఁడు. అమ వస వెళ్లిన మూఁడవనాటి సాయంకాలమున పశ్చిమదిశాంగనమోమున గన్పట్టు స్వల్పకాంతితోఁగూడిన చంద్రికారేఖవలె బుచ్చిరాజు మొగమున ఆనందరేఖ పొడసూపి నిరంతరము లుబ్ధవ్యసనరుజాపీడితుఁడై మొగము ముమ్మిడుతలు వడి యెట్టి కళాకాంతులులేక వెలవెల బాఱుచున్నదని పోషకుని వదనమునకు నూతన సోయగమును కూర్చెను. ఎట్టి పేద వానినైన, ఎట్టి లుబ్ధమానవునినైన కుమారోదయ మంత హర్షదాయకము కాఁబోలు!

ఉదయించినవాఁడు వంశోద్ధారకుఁడగు తనయుఁడగుటచే సంతోషముతో బుచ్చిరాజు వలసిన వస్తువులలో సగమునకు సగమైన తెచ్చియిచ్చుటచే వినదింపవలసినంత జగడములు లేకనే పదదినములు వెళ్లినవి. పదునొకండవనాఁడు బారసాలగూడ చేసికొని పిల్లవానికి 'అబ్బయ్య'యని తండ్రి పేరుబెట్టి బుచ్చిరాజు పితృ ఋణమును దీర్చుకొనెను. కోడలికి పురుడుబోసి భాగీరథమ్మ మరల కొమార్తెయింటికి వెళ్లిపోయినది. అత్తగారు వూరికి వెళ్లునప్పుడు బట్టలు పెట్టవలెనని పున్నమ్మ యుబలాటపడినది. కాని బుచ్చిరాజు చల్లగా పొరుగూరువెళ్లి తల్లివెళ్లిన తరువాత యింటికి చేరుకొనినాఁడు. మన బుచ్చిరాజు పక్షపాతిగాఁడు పెట్టుపోతలలో; తల్లితోఁబుట్టువులను, భార్యాబిడ్డలను నొక్క విధముగనే చూచును.

పిల్లవాని కొక్కయేడాది వచ్చినది. బుచ్చిరాజు కొమారుని మహామమకారముతో నెత్తుకొనుచు నేరవ్వంతతినుబండమునో కొడుకుకు బెట్టుచు మురియుచుండెను. కొమారుని యెడనైన బుచ్చిరాజు వాత్సల్యముతో బ్రవర్తించుట పున్నమ్మకు మనస్సున కొకవిధముగా సంతోషముగా నున్నను ప్రత్యక్షముగా పిల్లపై నుదాసీనత వహించి పిల్లవానిని నెత్తి నెక్కించుకొనుట యకల్మషహృదయయగు పున్నమ్మకు దుస్సహముగా నుండెను. "ఇద్దఱు మనకడుపునబుట్టినవారే, కొమారుడైననేమి; కొమార్తె యైననేమి; చెట్టునుండి కోసికొనివచ్చినవా రెవరు? కన్నకడుపునెడ స్త్రీపురుషవివక్షత పెట్టుకొని పక్షపాతబుద్ధితో నుండుట పాపహేతువు. తెచ్చిన వస్తువు యిరువురకు సమానముగా బెట్టుడు; లేదా, మొదలే తీసికొనిరావలదు. ఒకకంటిలోసున్నమును ఒకకంటిలోవెన్నను బెట్టుకొనుట న్యాయముగా"దని గయ్యాళితనముగా పెద్దగొంతుకతో అఱచి చెప్పినను పున్నమ్మ సబబైనమాటలనే సర్వదా చెప్పుచుండును. కాని బుచ్చిరాజామాటలను చెవిని పెట్టడు; తనపని మానడు. పున్నమ్మ "యికసాత్వికమార్గముసరిగా"దనుకొని దౌర్జన్యపద్ధతికి బూనుకొనినది. ఎప్పుడు పిల్లవానికేమిపెట్టునో యని వేవిధముల కనిపెట్టియుండి యమాంతముగా పిల్లవానిచేతిలోనిపదార్థము నూడబెరికికొని సగముచేసి పిల్లకుబెట్టి మిగిలిన యర్థము పిల్లవాని కిచ్చివేయును. భార్య యొక్క దౌర్జన్యయుతధర్మపద్ధతికి బుచ్చిరాజేమియు చేయనేరక గుప్పు మిటకరించి యూరకొనును.

పిల్లకై దేండ్లు వచ్చినవి. పిల్లవానికిమూడేండ్లు వచ్చినవి. దీ పా వ ళి పం డు గ వచ్చినది. బా ణా స ం చు కా వ లె న ని పిల్లలు గోల; డబ్బు తగులబెట్టుట బుచ్చిరాజు కిష్టములేదు. కాన యూరిలో టపాకాయలు కాల్చుకొను వేళ యింట పిండినంట సందడి పెట్టినచో టపాకాయపోరు తప్పునని యూహించి బుచ్చిరాజు ఒకశేరు మినుములు, ఒకసవాశేరు నేయి తెచ్చి గారెలు వండుమని భార్యను నిర్బంధించెను. 'టపాకాయలు లేకపోయినను పిల్లలకు గారెలైన తినుభాగ్యమొదవిన దంతియే చాలునని పున్నమ్మ దానికే యొడబడెను. సాయంత్రము గారెలు వండువేళకు బుచ్చిరాజు భార్యచెంత గారెల బుట్టవద్ద కూర్చుండి బుట్టలో వేసినగారెల్ల నోటవేసికొనసాగెను. నిండునేతిలో నెక్కువ పిండిబెట్టి బండిచక్రములవలె పెద్దవిగా వండిన తొలిగారెలెల్లదాదాపుయిరువదివఱకు బుచ్చిరాజు కుక్షిలోబడి ఆహుతైపోయినవి. బుచ్చిరాజు పొట్టలో నిక నర్థగారె పట్టు తావులేదు. గట్టిన త్రేపుగూడ వచ్చినది. ఇక నాలుగు గారెలు బాణలిలో వేగుచున్నవి. అవి భార్యాబిడ్డలకు చాలును. కాన మిగిలినపిండిని మఱునాడు రొట్టిముక్క చేసికొనుటకు నిలువచేయవలెనని బుచ్చిరాజు ఆలోచన. ఆమాట సాత్వికముగా చెప్పినచో భార్య వినదు; దౌర్జన్యముగా చెప్పినచో మొదలే వినదు. కాన, సలహా పూర్వకముగా చెప్పిన

బాగుగా నుండునని యుద్దేశించి 'ఇదిగో' పొద్దు పోయింది; పండుగపూట; వీధిలో లవాకాయలు, దీపాలు ముచ్చటగా చూడకుండా ఈపిండివంట పిడేమిటి; ఈపూటకు చాలించు; రేపు రొట్టెముక్కైనా వేసుకుందాము" అనెను.

పు—వినాయకుడాలె నీవు పొట్టనిండా తిని మేము తినకుండా చాలించమంటున్నావా? పిల్లలకూ నాకూ కావద్దూ.?

బు—పిల్లవాడు నాతోనే తిన్నాడా? ఇక పిల్లకూ నీకూ, అవి చాలవా?

పు—ఇరవై గారెలు తింటేకాని నీకు చాలలేదు. నాలుగుగారెలు మాయిద్దరికా? మరల రేపు నీకు రొట్టె నైవేద్యమా? ఇటువంటి సలహా నాకు చెప్పవద్దు; లేచిపో.

బు—సంపాదించుకొనే మొండావాడిని నాకు ఎక్కువవద్దా!

పు—చేనేదానికో?

బు—అవిచాలు; ఇక చాలించు; పిండి ఉంచు; ఆడదాని కింతకన్నా ఎందుకు?

పున్నమ్మకోపముతోమండిపడిప్రొయ్యిలోనికొ అవిబయటకు తీసినది. ఆకొఱకంచుతనపై విసరునేమోనని బుచ్చిరాజు వీధిలోనికి పరుగెత్తినాడు. పున్నమ్మ తలుపుగొళ్లెం పెట్టుకున్నది. ఒకపావుగంటలో మజిపది గారెలు బుట్టలో పడినవి. ఇంతలో బుచ్చిరాజు పెద్దశోకము పెట్టుచు, "తలుపుతీయవే, కొంపమునిగిందే, చేయిపోయిందే" అని కేకలు పెట్టుచు వచ్చినాడు. తొందరపడుచు పున్నమ్మ వచ్చి తలుపుతీసి "ఏంమునిగిం" దనెను. "చెయ్యికాలిపోయింది. నాన్నోయ్ నాయన పోయాకేకాడు. చేయికాలింది. మంట- మంట - కొబ్బరినూనె - సున్నెత్తు సున్నపుతేట-చెయ్యా-చెయ్యా! అయ్యో! అయ్యో" అని బుచ్చిరాజు గోలపెట్టెను. పున్నమ్మ గాభరాతో వంటింటు చాలించి కట్టులాగ్గి, సిప్పుపిండిని, గారెలను మూతపెట్టి భర్తకు వైద్యము చేయుటకు మొదలిడినది. ప్రొయిలో మంట తగ్గిపోయినా బుచ్చిరాజు చేతిమంటగూడ తగ్గెను. ఆరాత్రి గడచినది. మరునాడు వాలుమాలు జగడములో రాత్రి కాల్చు అబద్ధమనియు పిండివంట చాలించుటకు చేసిన యుక్తి నియు తేలినది.

౭

బుచ్చిరాజుకు మూడవ సంతానము కలిగినది. ఈశిశువు మరల ఆడపిల్ల. బుచ్చిరాజు మరచిపోయిన చింత మరల చిగురించినది. ఇంటిలో యితరాడసాయము లేదు. అన్నియు బుచ్చిరాజు చేతిమీదనే రావలెను. బుచ్చిరాజు ఆడపిల్లమీంది యీసుచే వలసినవస్తువు లీయడు. ఇరుగు పొరుగు అమ్మలక్కలెవరైన సాయముచేయ దలచినను, బుచ్చిరాజు వారిని నమ్మి యింటిలోనికి రానియడు. కస్తూరి కావలెననియు, ఇంగువ కావలెననియు, వెల్లుల్లి కావలెననియు, ఆముదము కావలెననియు,మంత్రసానిగోల—బుచ్చిరాజు మూకవలె,బధిరునివలెవహానము. ఎక్కట్లో పది దినములు గడచి నీళ్లుపోసికొనినది పున్నమ్మ. కానిపథ్యపానములు సరిగాజరగకయు,నాహార

పుష్టిలేకయు, పున్నమ్మకు ప్రాణోపద్రవ కరమగుజబ్బు చేసినది. ఈసంగతి తెలిసి తండ్రి వచ్చి పున్నమ్మను తమయింటికి తీసికొనివెళ్లి మందు యిప్పించినాడు. మృత్యు ముఖము నుండి బయటపడి పున్నమ్మ మూడు మాసములకు మరల పెనిమిటివద్దకు వచ్చినది. పున్నమ్మ జబ్బుపడుటవలన శిశువునకు పాలు లేవు. ఏపుణ్యాత్మురాలో దయయుంచి పోసెడి కొంచెముపాలు పిల్లకు చాలునవి కావు. పల్లెటూరిలో నేవస్తువైనను, కొనుటకు దొరకుటరిది. ఉచితముగా నిచ్చువారు చాలినంత యీయరు. పున్నమ్మ పిల్లకుపాలుచాలక నీళ్లెక్కువగా కలిపిపోయుచుండెడిది. పిల్ల యెల్లప్పుడు ఆకలిచే రోదన. ఆఆవుపాలైనను పిల్లకు పడక నిక్కాకచే యెండిపోయి జ్వరముకూడ తగులసాగినది. 'మందు తెచ్చిపెట్టు'మని పున్నమ్మ భర్తను యాచించెను. కాని యతడు వినిపించుకొనలేదు. నెలదినములు జ్వరము ఒక్కవిధముగా కాసి పిల్ల పుల్లవలె శుష్కించినది; కాళ్లు ఉబ్బుచూపినవి. 'మందుతీసికొనిర'మ్మని పున్నమ్మ భర్తను మరల ప్రార్థించినది. "నావద్ద డబ్బులేదు; డబ్బునీయకుండ మందు నెవ్వరిచ్చెదరు? దైవయోగ మున్న నేమందు నక్కఱలేదు. అదే నయమగు"నని బుచ్చిరాజు జవాబిచ్చెను. ఇక మగనికి చెప్పిన కార్యము లేదని పున్నమ్మ పిల్లను బుజముపై వేసికొని తానే వైద్యునింటికి వెళ్లెను. పొరుగిల్లెఱుగనిది పున్నమ్మ. చూడుడు! ఆకడుపుతీపు; అభిమానమును చంపివేసినది. పున్నమ్మ వైద్యుని మం?గు? "మీఆయన పరమలోభి. అవసరముతీరిన డబ్బునిచ్చువాడు కాడు. మాకు మందు లూరకరావు. రెండురూపాయలిచ్చినగాని మందిచ్చుటకు వీలుగాదు" అని యావైద్యుడేవియో రెండుమాత్రలను చేతిలో బెట్టెను. పున్నమ్మవద్ద డబ్బులేదు సరిగదా, ఒడలున చిన్నమెత్తుబంగారము లేదు. రెండు రూపాయలు వైద్యున కెట్లిచ్చును! పాపము! కన్నుల నీరుతుడుచుకొనుచు పున్నమ్మ మరల యింటికివచ్చెను. ఇంటికివచ్చిన వెంటనే పున్నమ్మ "పూజారిమల్లయ్య రెండురూపాయలిచ్చిన మందు నిచ్చెదననెను. కావున రెండురూపాయలి"మ్మని భర్తతో పెద్దజగడము పెట్టుకొనెను.

బు—నావద్ద యెఱ్ఱని యేగాని లేదు. రెండు రూపాయ లెక్కడ తెచ్చేది? నీవు యెంత యేడ్చినాసరే, డబ్బుపని నావల్ల జరగదు.

పు—ప్రాణముమీద వచ్చిన బిడ్డకు రెండు రూపాయ లిచ్చి మందు యిప్పించ జాలక పోతే ఇక నీవుద్యోగ మెందుకు? ఉన్న డబ్బు ఆ బ్యాంకిలో పూష్చకపోతే రెండు రూపాయలుపెట్టి పిల్లకు మందు యిప్పించరాదా!

బు—బ్యాంకిలో! ఏబ్యాంకిలో? నేనా! నా పన్నెండు రూపాయల జీతంలోనా!! బ్యాంకిలో నిల్వగూడానా !!!

పు—అబద్ధమాడవద్దు; క్రిందటి శనివారమే గదా, తెనాలి పోస్టాఫీసులో 30 రూపాయలు కట్టివచ్చింది!

బు—ఎవరు చెప్పింది?

పు—ఎవరైతేనేమి, ఎవరో ఒకరు. నిజమా, అబద్ధమా?

బు—అది మనసొమ్ము కాదు.

పు—మనసొమ్ముకానిది మనపేర బ్యాంకిలో యెందుకు పడుతుంది?

బు—అది వేఱేబాపతు.

పు—ఏబాపతైతేనేం? జీతంవచ్చినాక యియ్యవచ్చు, లేకపోతే అప్పుతేండి.

బు—నాకు ఋణము పుట్టదు.

పు—నీకు ఊరిలో ఋణము పుట్టదు; కాన ఇంట్లో అన్నంగూడా పుట్టదు. నాపిల్ల జబ్బు యెక్కువగా వుంది. మందుకు రెండురూపాయలు తెచ్చేవఱకు నేను వంట చేయను. పిల్లతోపాటు మనమునుగూడా చావవలసిందే.

అని శోకముపెట్టుచు పున్నమ్మ పిల్లవద్ద కూర్చున్నది. ఊరిలో పూటకూలియిల్లు లేదు. ఇంట పున్నమ్మవంట లేదు. స్వయముగా వండుకొనినచో భార్య మట్టిపాలు చేయునే కాని పెట్టుకొని తిననీయదు. కాన బుచ్చిరాజు అతనిభార్యగూడ ఆపూట పస్తు. సాయంత్రమైనది. ఈపూటనైన భార్యతో మంచిమాటలాడినగాని కూడుదొరకదని బుచ్చిరాజుకు తోచినది. కాన తిన్నగా భార్యవద్దకు వచ్చి "ఈయూరిలో నెవరినడిగినను ఋణమీయ లేదు. తెల్లవారుజామున లేచి తెనాలి వెళ్లి తేపు జాము ప్రొద్దెక్కనప్పటికి రూపాయలు తెచ్చెదను. నడుచుటకు శక్తియుండవలెను గదా, ఈపూటనైన వంటచేయవా?" యనెను. ప్రొద్దటినుండి మగనిని కష్టించినందులకు పున్నమ్మ మనస్సు పీకుచుండెను. మఱియు తేపు రూపాయలు తెచ్చేసరికి పొద్దుపోవు చూచెను గాని పున్నమ్మ వెంటనే కిమ్మనకుండ లేచి వంటచేసి మగనికి బిడ్డలకు పెట్టి తానుగూడ భుజించెను. ఆ రాత్రి రెండుజాములనుండి పిల్లకు అపాయముగాడ పుట్టెను. తెల్లవారుజామునకే పున్నమ్మ భర్తను లేపి "పిల్లకు అపాయంగూడా పుట్టింది. తొందరగా వెళ్లి డబ్బుతీసుకొరా"యని నిర్బంధపరచి గెను. "పొద్దెక్కి బ్యాంకిలో డబ్బు యిస్తారు. పదిగంటలనుంచి యిస్తారు. తెల్లవారక్రుంగానే బయలుదేరిపోతే వెంటనే పైకం తీసుకొని రావచ్చు" నని బుచ్చిరాజు రెండవవైపు తిరిగి పడుకొనెను. మగవాడు దానవబుద్ధితో చరించుచుండ కన్నీళ్లు పుచ్చుకొని నిట్టూర్చుట తప్ప యాడుదేమి చేయగలదు?

ఉదయము బుచ్చిరాజు యెప్పటివలె పాఠశాలకు వెళ్లెను. కాని తెనాలి వెళ్లలేదు. మరల పదిగంటలకు యింటికి వచ్చెను. పిల్ల అపాయముతో మూల్గుచున్నది. భార్య దుఃఖముతో వేచుచున్నది. బుచ్చిరాజు కాకలితో కడుపుమాడుచున్నది. కాన "తెనాలి వెళ్లమంటివిగదా! వంటచేయలేదా?" యనెను. "పిల్లకు మందుకు రూపాయలు తెస్తానంటిరే ఏవి? పిల్లచూడండి ఎట్లా బాధపడుతున్నదో? ఈబిడ్డను యిట్లావదలి వంటచేయుడమెట్లా? డబ్బుకు వెళ్లిరండి. ఇంతలో వంటచేస్తాను" అని పున్నమ్మ జాలికరముగా పలికెను. ఇంతలో పొరుగింటియమ్మ యొకతెవచ్చి "పున్నమ్మా, ఎందుకు చావనన్నావు పెడతావు; పిల్ల నీదైతే యింతజబ్బేరాదు. తొందరగా వంటచేసుకొని

నాలుగు మెతుకులు తినండి" అనెను. ఆమాటలచే పున్నమ్మ మరింత బెంగపడి "డబ్బో! మందో! బిడ్డో!" యని పెద్దగా విలపింపసాగెను. డబ్బు తెచ్చి బిడ్డకు మందువేయించిన బ్రదుకునను పున్నమ్మ మూఢవిశ్వాసమును మరల్పలేక యింట భోజనము లభించునాశ లేక బుచ్చిరాజు మిటమిటలాడు నెండలో తెనాలి వెళ్లెను.

బుచ్చిరాజు వెళ్లిన యొక గంటకు పిల్ల ప్రాణము పోయినది. పున్నమ్మయు, పిల్లలును గొల్లున నేడ్వసాగిరి. నల్వురు వచ్చి చూచు నప్పటికి బుచ్చిరాజు తెనాలి వెళ్లినట్లు తెలిసెను. బుచ్చిరాజుకొఱకు మనిషినంపి యిరుగుపొరుగువారు పున్నమ్మకు సాయము గూర్చుండిరి.

మనిషి వెళ్లునప్పటికి బుచ్చిరాజు పూటకూటింట భోజనముచేసి బొట్టు తుడుచుకొని బ్యాంకిలో వేసిన సొమ్ము తీయుటకు జేతులాడక చిడిముడిపడుచు తపాలాకచ్చేరి యరుగుపై తారాడుచుండెను. ఇంతలో మనుష్యుడు సమీపించి "అయ్యా! మిమ్ములను వెంటనే పిలుచుకొనిరమ్మన్నారండీ!" యనెను.

బు—ఎందుకు? ఎవరు?

మ—పెద్దమేష్టరుగారు. జబ్బుగానున్న తమ కుమార్తె—

బు—పోయిందా?

మ—ఆఁ!

బు—నిజంగా, ఖాయపు మాటేనా?

మ—నిజమేనండీ, పున్నమ్మగారు తల పగుల గొట్టుకొని యేడుస్తున్నారు.

బు—అయితే వైద్యావసరము తీరినట్లే.

మ—అయ్యో! పిల్లే పోయిందంటే వైద్య మెవరికయ్యా?

ఒకమహాభారమును దించినట్లుగా బుచ్చిరాజు హృదయము తేలికపడెను కాని యొక బిందువైన రాలలేదు కన్నులనుండి. వచ్చిన మనుష్యునితోపాటు బుచ్చిరాజు త్వరితముగా స్వగ్రామమునకు బయలుదేరెను. బుచ్చిరాజు చిన్నతనమున తెనాలి నాటకసంఘములలో చెలరేగి తిరిగినవాడగుటచే లేనిది యున్నట్లును యున్నది లేనట్లును నటించుటలో గడుచతురుడు. అందు శోకరసాభినయము నందు బుచ్చిరాజు కడు నిపుణుడు. నేడు బుచ్చిరాజు చంద్రమతియో దమయంతియోయై యేడ్చునని ప్రకటించిన ప్రేక్షకులు పెండ్లుగట్టి వచ్చెడివారు. నాటకవిద్య బుచ్చిరాజు నేడు స్వోపయోగమునకు వినియోగింప దలంచెను. లేకున్న పున్నమ్మ తనను నిలువనీయదని బుచ్చిరాజుకు భయము. బుచ్చిరాజు దుఃఖాభినయమును, గ్రామపు పొలిమేరవద్ద నారంభించి క్రమక్రమముగా వృద్ధిపొందించి భార్యకు పదిబారల దూరమునకు వచ్చునప్పటికి యఖండము గావించెను. రసపోషణయందు మెలకువ తెలియని నటకుడు రసస్ఫూర్తి యందునున్మాదియై మితిమించి చరించి యపహాస్యము పాలైనట్లు కుడిచేత నుత్తరీయముతో కన్నీళ్లనద్దుకొనుచు నెడమచేత ముక్కునీళ్లు చీదివేయుచు, "అయ్యో! నాకన్నతల్లీ! నాకడుపున నెంతచిచ్చుపెట్టిపోతివే! ఈకడుపుచిచ్చు నెట్లా భరించేదే! అమ్మా! డబ్బుపోయినా బిడ్డ

నక్కి తేచాలు ననుకొంటినే అమ్మా! తల్లీ! సొమ్ము తెచ్చి ఒక్కమాత్ర వేసిందాకా ఉండక పోతివే అమ్మా! నాసొమ్ము కెంతలో ఋణము తీరిపోయినావే అమ్మా! పదిరూపాయ లైనా పోసి మందు యిప్పించాలనుకొంటినే అమ్మా! ఎంతలో ఎంతచేసితివే! మా అమ్మా, మా తల్లీ! మా అమ్మా, మా తల్లీ!" అని పిల్ల పైనను నేలపైననుబడి దొరలి దొరలి యేడ్చిన బుచ్చిరాజు దొంగయేడ్పు పరుల పరిహాసమునకును, పిల్లకు జబ్బుచేసినది మొదలు చిక్కి సగమై, నేడు పిల్లపోవుటచే మఱింత దుఃఖించుచు, బొట్టుచెరిగి, కురులు వీడి, కండ్ల నీళ్లుధార రూపెత్తిన శోకదేవతవలె నున్న పున్నమ్మ కడుపుమంటకును గారణమైనది. బుచ్చిరాజు దుఃఖమొకింత తగ్గగనె పున్నమ్మ యినుమడించిన దుఃఖముతో పిల్లకు జబ్బుగా నున్న సమయములో మందుమాకు లొసగి బాగుచేయుటకు ప్రయత్నింపక, పైస ఖర్చు పెట్టుట కనుమతింపక, చచ్చినతరువాత యిచ్చ కపుయేడుపు లేడ్చుచున్న బుచ్చిరాజు యకృత్యములన్నియు కడిగిపోయుచు బ్యాంకి పల్లవితో రెండుగంటలేడ్చినది. అంతటితో బుచ్చిరాజు అభినయము పూర్తియైనది; పున్నమ్మ కడుపుమంట తగ్గినది.

## ౭

బుచ్చిరాజు పిల్లపోయిన కొన్ని దినములకు ఒక భీమాకంపెనీ యేజంటు గ్రామము లోనికి వచ్చి బుచ్చయ్య పాఠశాలకు గూడ వచ్చెను. పాఠశాలలోని యుపాధ్యాయులు నలుగురు ఆయనచుట్టుచేరి మాట్లాడుచుండిరి. సంవత్సరములు నా కేమెరుగు "అయ్యా! అనేక మంది జనులకొరకు ద్రవ్యమును సేవింగ్సు బ్యాంకిలో దాచుచుందురు. కాని దానివలన వారికేమిలాభమో?" అనియా యేజంటు మాట పూర్తిచేయకపూర్వమే బుచ్చిరాజు కన్ను లెఱ్ఱచేసి కోపముతో మండిపడుచు "ఏమయ్యా, నీవు, మనుష్యులను వెక్కిరించడానికి? మేము సేవింగ్సుబ్యాంకిలో దాచుకుంటే నీకేమి, గోతిలోపూడ్చుకుంటె నీకేమి? పెద్దమనిషిగా వచ్చినవాడవు పెద్దమనిషితరహాగామాట్లాడితేనేగాని మర్యాదగాని యిటువంటి యధిక్షేపణలు తగవుగాదు" అనెను. ఏజంటు తెల్లబోయెను. తక్కిన యుపాధ్యాయులు గూడ విభ్రాంతులైరి. అంత బుచ్చిరాజు ఉపాధ్యాయులను జూచి "చూచారా, ఈపెద్దమనిషి, నేను సేవింగ్సుబ్యాంకిలో డబ్బువేశానని యేకుఱ్ఱకుంకో చెవిలో వూదితే ఆమాటలు పట్టుకొని నన్నిక్కడ దెప్పవచ్చాడు! ఇతనెవరు, నేనెవరు? ఇతను నన్నాక్షేపించేవాడా? ఇదుగోనయ్యా! ఈవ్వారినుండి తిన్నగా పోతలుచుకుంటె ఇటువంటి ప్రసంగాలు చేయకు"మనెను. ఉపాధ్యాయులు పకపకనవ్విరి. ఆయేజంటు "ఏమిటయ్యా! అట్లా పేలుతావు. నీకు మతిలేదాయేమిటి? నీవు సేవింగ్సుబ్యాంకిలో సొమ్ము దాచినసంగతి నాకేమి తెలుసు? మాటసామెతగా చెప్పిన మాటకు మండిపడతావేమిటి? ఈవ్వారి నుండి తిన్నగా బోక నాకేమీ? తలగొట్టి మొలవేయిస్తావా? ఎవడిచ్చాడయ్యా, నీ కీమేష్టరుద్యోగ"మనెను. అంత వ్యవహారము ముదురునని ప్రధానోపాధ్యాయుడు కలుగజేసికొని "ఆయన లోకములో మాటచెప్పెనుగాని నీ సంగతిగా"

దని బుచ్చిరాజును మందలించి "అయ్యా! ఆయ నకు కొద్దిదినముల క్రిందట పిల్లపోయినది. ఆ విచారముచేత మతిచలించినది; కోపపడకం" డని యేజంటును బతిమలాడి వివాదము నుప శమింపజేసెను. నాటినుండి పిన్నపెద్దలచే లో లోన ననుకొనబడుచున్న బ్యాంకిపేరు బహిరం గమై స్థిరరూపమును దాల్చెను. ఉడికిలువారిని యుడికించ నెల్లరకు వేడుకయేకదా! వ్యవహార ములు చేసికొనెడి పెద్దమనుష్యులు, మంచినీళ్ల కేగెడిమగువలు, పనిపాటులకేగెడికాపుజనులు, పాఠశాలలకరిగెడి బాలబాలికలు బుచ్చిరాజు నుజూచి "బ్యాంకి, బ్యాంకి" యని యఱచు టయు, నాతడు నానాతిట్లు తిట్టుచుండుటయు నిత్యవేడుకయ్యెను. అంతటితో యూరుకొనక గ్రామజనులు:

"పంతులు పంతులు బుచ్చయ్యా
పైకం బ్యాంకిలో దాచయ్యా
మందువేయక పిల్లనుజంపి
దొంగయేడ్పుతో దొర్లయ్యా!
బ్యాంకిలో పైకం స్టోర్
పెనిమిటిపెండ్లము పోర్
నోటిమాటలు జోర్
పెట్టడమంటే తార్"

అని బుచ్చయ్యపై పదములుగూడ కట్టిరి. ఆపదములు వినగనె బుచ్చిరాజుకు ఒడలు మండి మఱింతతిట్టుటయు రాళ్లు విసరుటయు, చేతికందినపిల్లలను చావగొట్టుటయు గావింప సాగెను. బుచ్చిరాజు అల్లరిచేసినకొలది పిల్లలపదములు మెండయ్యెను గాని తగ్గలేదు. ఒకనాడు బడి వదలగనె పిల్లలందఱు జతలుగా నేర్పడియొకరు "బ్యాంకిలో పైకంస్టోర్?" అనిన రెండవవారు 'పెనిమిటి పెండ్లము పోర్' అని యీవిధముగా పాడుకొనుచు పోసాగిరి. బుచ్చిరాజు అప్పుడే యాపిల్లల బట్టి కొట్ట దలచియు లేడిపిల్లలవలె బరుగెత్తెడి యాబా లుర పట్టజాలక విఫలుడై మధ్యాహ్నము వీరిని తరగతిలో శిక్షింపదలచి యింటికి వెళ్లెను.

మధ్యాహ్నము పిల్లలందఱు బడికి వచ్చిరి. బుచ్చిరాజు తనతరగతిలోని బాలు రను "అరే! ప్రొద్దున నాపైపాటలు పాడిన కుంకలెవరో లేచి నిలువబడిరా" యనెను. ఒక్కరు లేవలేదు. "అరే! ప్రొద్దున నాపై పాటలుపాడిన వెధవలు కూర్చోండిరా" యనెను. అందఱు లేచినిలువబడిరి. బుచ్చి రాజు కోపము పట్టజాలక అందఱనొక్క మాఱు చిత్తమువచ్చినట్లు బెత్తముతో గొట్టె ను. పిల్లలందఱొక్కమాఱు గొల్లున నేడ్చిరి. ఈవిధముగా రెండుమూడుమాఱులు జరిగెను. బుచ్చిరాజుకు వెఱచి చాలమంది పిల్లలు బడికిరా మానిరి.

పైన పిల్లలతిండ్రులు "బుచ్చిరాజు మా పిల్లల నక్రమముగా గొట్టుచున్నాడు గాన నాతనిపై చర్యజరుపవలసిన" దని పాఠశాలాధి కారులకు విజ్ఞప్తి నంపిరి. ప్రధానోపాధ్యా యుడుగూడ 'బుచ్చిరాజు దండనవలన పిల్లలు బడికివచ్చుటలే' దని పైవారికి దెలియబఱచెను. పైకాగితములు చూచుకొనినవెంటనే యధి కారి పాఠశాల పరిశీలననిమిత్తము వచ్చెను. అధికారి వచ్చెనని తెలిసిన వెంటనే బుచ్చి

రాజు చినిగిన చింపులు చెవులపై వ్రేలాడు చుండ, మర్కటమూకుడువలె మాసిన కనుపడు చుండు నల్లకమ్ముల యుత్తరీయమును తలకు జుట్టి వేలు గుడ్డచే నతుకులమర్చిన తెల్ల కోటు తొడుగుకొని మోకాళ్లుదిగని యంగ వస్త్రమును గట్టి, భయభక్తులతో మెల్లని యడుగులు వేయుచు పాఠశాలకు వచ్చెను.

కొంతసేపటికి అధికారి కూడ బడికివచ్చి ప్రధానోపాధ్యాయునితోపాటు పెద్దతరగతులలో గొంతసేపు మసలి నెమ్మదిగా బుచ్చి రాజు తరగతికి వచ్చెను. తాను కూర్చుండెడి కుర్చీ యధికారి కొసగి చేతులుకట్టుకొని బుచ్చిరాజు అధికారి వెనుక నిలువబడెను. అంత యధికారి కోపముతో చిడిముడిపడుచు "బుచ్చిరాజు!" అనెను.

బు—అయ్యా!

అ—నీప్రవర్తన యేమాత్రము బాగుగా లేదు. నీయుద్యోగము నిలువదుసుమా!

బు—అయ్యా! పదునాలువత్సరములనుండి యుద్యోగముచేయుచున్నాను. అసమర్థుడనని యొక్కరాక్షేపింపలేదు. పిల్లలను పరీక్షించి చిత్తగించండి నాలోప మున్నదేమో!

అ—చదువుమాట యట్లుండుము. సంవత్సరారంభమున నీతరగతిలో నిరువదినలుగురుబాలురు ప్రవేశించినట్లు తెలియుచున్నది. ఇపుడారుగురుబాలురుమాత్రమే నిత్యము బడికి వచ్చుచున్నారు. ఈలోప మెవరిది?.

బు—[illegible]

అ—[illegible]

బు—చిత్తము, లేదు.

అ—ఇదిగో! అక్కడ! తల్లిదండ్రులు స్వయముగా నాకు వ్రాసిరి. ఇది యబద్ధమా!

బు—చిత్తము! పిల్లలవిధేయులుగా ప్రవర్తించుచున్నప్పుడు తీవ్రమైన దండించుకొనవలెను. అందులో యుపాధ్యాయుడు దండించకుండుట దుస్సాధ్యము.

అ—పిల్లలకు కంటిచెవ యుండవలెను గాని బెత్తముతో పాశవికముగా గొట్టుట పాఠశాలానియమములకు విరుద్ధము.

బు—చిత్తము; నాకు తెలియును. పిల్లలు నాకు కన్నబిడ్డలవంటి వారు. వారియెడ క్రూరముగా నేను ప్రవర్తించిన దబద్ధము. అంత అధికారి బాలురవైపు చూచి "ఏమిరా, మీపంతులుగారు మిమ్ము కొట్టినారా" యనెను.

పి—అవునండి!

అ—ఎన్నిమాఱులు?

పి—మూఁడుమాఱులు.

అ—, అందఱను కొట్టెనా; లేక కొందఱను కొట్టెనా?

పి—అందఱును.

అ—ఎందులకో తెలియునా?

పిల్లలు మాటాడలేర.

అ—ఏమిటి! మీకు తెలియదా?

ఒకచిన్న బాలుఁడు—బ్యాంకి అంటే కొట్టినా రండీ!

అ—బ్యాంకి యేమిటి బుచ్చిరాజు?

బు—"వాళ్లపిండము, నాపిండము! తనకెందుకు స్వామీ" యని బుచ్చిరాజు తన యధికారి మాటను గూడ మఱచి కోపముతో జవాబిచ్చెను. అంత అధికారి యాగ్రహముచే కన్నులెఱ్ఱచేసి, బాలురవైపు చూచి "బ్యాంకి వృత్తాంతమేమిటో చెప్పు"డని రౌద్రముగా బలికెను. ఒకపెద్దబాలుడు ముందుకువచ్చి "అయ్యా, పంతులుగారు బ్యాంకిలో డబ్బుదాచుకొని డబ్బులేదని జబ్బు చేసిన కొమార్తెకు మందువేయకపోతే ఆపిల్ల చచ్చిందండి. అప్పటినుండి పంతులుగారికి బ్యాంకిఅంటే కోపము"అని చెప్పెను. అంత నాయధికారి బుచ్చిరాజువైపు చురచురజూచి "బుచ్చిరాజు! నీ వుద్యోగమున కర్హుడవుగావు. కన్నపిల్లను జంపినవాడవు; పరులపిల్లలయెడ ప్రేమతో ప్రవర్తించుట కల్ల! ఉద్యోగమునకు తగవని వ్రాయుచున్నా"ననెను. "అయ్యా, పేదవాడను, అన్యాయముచేయకండి. పిల్లలాపదమును పాడ మానిరేని నేను వారినేమి చేయనండీ"యని బుచ్చిరాజు అధికారి పాదములపై బడెను. అధికారి "నీవు స్వయంకృషిచే తెచ్చుకొనినదానిని నీ యుద్యోగమునవలె నేసినేయ సాధ్యము కాదు" అని ప్రత్యుత్తరమిచ్చి బడినుండి వెడలిపోయెను. పిల్లలు యెప్పటివలెనె పాటలు పాడుకొనుచు నిండ్లకేగిరి. అధికారానధికారముల లెక్క సేయనిదిగదా బాల్యస్వాతంత్ర్యము!

పాఠశాలాధికారి వెళ్లిన కొలదిదినములకు బుచ్చిరాజు నా గ్రామమునుండి బదలాయించినట్లు పైనుండి యుత్తరువు వచ్చెను. పాపము! బ్యాంకిపేరుచేత పదునాఱుసంవత్సరములనుండి స్థిరనివాసమేర్పఱచుకొనియున్న గ్రామమును బుచ్చిరాజు వీడవలసివచ్చినది. బుచ్చిరాజా గ్రామమును వీడలేక పైకి మనవి చేసికొనెను. స్వయముగా వెళ్లి యధికారుల వద్ద మొత్తుకొని వచ్చెను. కాని యుత్తరువు తిరుగలేదు. వెళ్లనే వెళ్లినాడు.

పూనినకర్మము పొరుగూరు పోయినను పోదనినట్లు, ఊరువదలినను బుచ్చిరాజుకు పేరు వదలలేదు. అక్కడివారికిగూడ బుచ్చిరాజు బ్యాంకిపేరు క్షణములో తెలిసినది. అక్కడగూడబుచ్చిరాజు దల్లరిబ్రతుకైనది. మరల బుచ్చిరాజును మఱియొకయూరికి బదలాయించిరి. అక్కడగూడ నిదేగోల. ఈ రీతిగా బుచ్చిరాజు బ్యాంకిపేరుచేత పల్లెటూళ్లలో పరువుదక్కక మరల తెనాలిచేరుకొన్నాడు.

ఊదినకొలఁది యుబికెడు రబ్బరుతిత్తివలె బుచ్చిరాజుకథ వ్రాసినకొలది విస్తరిం

చినది. సారములేని బుచ్చిరాజుగారి నిరతి
దీర్ఘముచేయుట చదువరుల యమూల్యకా
లమును దుర్వినియోగము చేయుటయగునను
కారణముచే కొంతవిడిచిపెట్టితిని. మన్నింపవేడెదను.

బుచ్చిరాజు నాటకసంఘములకు చిర
మిత్రుఁడగుటచే మరల నందు చేరినాఁడు.
కాని వయసు మరలినవాడగుటచే నాయిక
పాత్రము ధరించుట కర్హుఁడుగాక యప్పుడప్పు
డు చేటిక, చెలికత్తె యిత్యాదిపాత్రములను
మాత్రమే ధరించి తననటనాకౌశలమును
వెల్లడించుచుండెను.

ఒకనాఁడు ఉదయ మగునరికి తెనాలి
పురమునందలి యేయెత్తుగోడలపై జూచినను,
ఏయొంటియెద్దుబండిపై జూచినను, ఏజట్కా
బండిపై జూచినను, "శాకుంతలము" నేటి
రాత్రి ప్రదర్శింపబడునను పెద్దయక్కరము
లు గల ప్రకటనపత్రములే కానవచ్చెను.
మఱియు, చెన్నపురి సింహపురులనుండి వే
తెంచిన సుప్రసిద్ధనటరత్నములు శకుంతలా
దుష్యంతపాత్రముల ధరియింతురనికూడ యా
ప్రకటనలయందు వివరింపబడియుండెను.

తెనాలిపౌరులకేకాక యాపురము చుట్టు
పట్టులనుండెడి గ్రామస్థులకుగూడ నాటక
ముల గాంచెడి దప్పి యెక్కువ. గుంటూరు
వంటి పెద్దనగరములో వందలు పోగుచేయని
నాటకసంఘములు తెనాలిలో వేలు మూట
గట్టును. నాఁడు ప్రధానపాత్రల ధరించువారు
సుప్రసిద్ధ నటకులని తెలియుటచే వేలకొలది
టిక్కట్లు పగలు పదిగంటలకే యమ్ముడు
పోయినవి. స్థలసంకోచముచే నావలటిక్కట్ల

నమ్ముట మానివేసిరి. నాటి జనులు
నాయందు మేకించలేకుండిరో నాటక
శాలకు రాకపోయిరి. ఎనిమిదిగంటలకే
నాటకశాల జనులతో క్రిక్కిరిసిపోయెను.
ఆవల కచ్చేరనాటిక విలుప్తికౌతుకము, ప్రశ్న
ప్రాప్తమయ్యెను. సరిగా తొమ్మిదిన్నరగంటలకు
నాటకము ప్రారంభమైనది. జనుల యుప్పొంగు
తగ్గినది.

ఇతరరంగములతో బనిలేమి మనకు;
శకుంతల చెలులతో గలిసి చెట్లకు నీళ్ళోయు
రంగము వచ్చినది. దానిలో మన బుచ్చిరాజు
గూడ శకుంతల కొకచెలియై సఖురాలిగ నిల
చిరశిరోజములు సగముగప్పుడు నెంబరగ్రీన్ నిన్న
నెంత్రకలక్ష్మీ మపు కీలుగింటుజాలుముక్తో,
పొగచూరిన వంటయింటి గోడకు వేసిన
సున్నపుపూతవలె కనుపట్టునిమోము పై నద్దిన
ఫేస్‌పౌడరు అందముతో, పూర్వసువాసిని
త్వమును స్ఫురింపజేయు నంచుకమ్ములు లేని
తెల్లచీరలుచుతో, నూర్ధ్వశరీరము నినుమడించి
వచ్చిన రంగని నిడుపుగాళ్లతో, జలకలశ
హస్తుడై రంగమున నవతరించినాడు. కొంతసే
కోణంగి యెవ్వడో బుచ్చిరాజును క్షణములో
గుర్తుపట్టినాడు. 'హ్యాంకీ,' అని యొక్కుముడి
పిలిచినాడు. ఆవొక్క కేకవెంట పదికేకలు
లేచినవి; ఆపదితో వందలు బయలుదేరినవి;
ఆవందలతో నే లుప్తతిల్లినవి. సహజ
ముగా నుడుకుబోతగు బుచ్చిరాజునకా కేక
లు చెవిసోకుటతోడనే యొడలు కంపము
పుట్టినది. పిచ్చియెత్తినవానివలెనైనాడు. అంత
తినయునికి మఱచి, పనిమఱచి, చేతిలోని జల
కలశమును నేలగొట్టి, ఒడలున తొడిగిన

రవిక యక్లేయుంచి, పైటను, కుచ్చిళ్లను నేకముచేసి గుదిపట్టి నడిగోచీపెట్టి నెత్తిమీద మాయజుట్టు కట్టుత్రాళ్లు సడలి కంఠహారమై మెడను వ్రేలాడుచుండ రంగస్థలమునుండి ప్రేక్షకసమూహములోని కొక్కదూకు దూకినాడు. ప్రేక్షకులు బుచ్చిరాజు నేమిచేసిరో, బుచ్చిరాజు ప్రేక్షకుల నేమిచేసెనో, వివరము తెలియదు. సభ చిందరవందర యైనది. నాటకము భగ్నమైనది. సుప్రసిద్ధనటకుల నటనా కౌశల్యము గాంచ కుతూహలులై నేతెంచిన పెద్దమనుష్యు లాశాభంగము నంది, ధనసష్టమునకు బాల్పడి కొంపల కేగినారు. వేడుకలను వినోదములను భగ్నముచేయవచ్చెడి తుంటరిసంఘమునకు మాత్రమే నాడు కనుల పంపు వైనది. నాడు మొదలు బుచ్చిరాజు మరల యెప్పుడుగూడ నాటకరంగమున గన్పడలేదు. నాటకసంఘాధికారులు గూడ నాతని మరల పిలిచియుండరు బహుశః.



# మ ల్లె పూ వు

సహదేవ సూర్యప్రకాశరావు గారు

గుబురుగా విరివిగఁ జూచి గుప్పుగుప్పు
మనుచుఁ దావి దిగంతము లల్లుకొనఁగఁ
జేసి నీదు సత్వమును ఘోషింతువు మధు
మాసవాసరములయందు మల్లెపూవ!

మెపెసఁగ వసంతాగమవేళయందు
చంద్రికాధౌతయామినీ సమయమందు
రమ్యతరుగణ విలసితారామవీథి
ఫుల్లమై ప్రకాశింతువు, మల్లెపూవ!

భాసుర మనోజ్ఞమృదులపుష్పములయందు
రమ్యము గులాబియే, సుమరాజ్ఞియనుచు
నెంతురేకాని, నీకున్నయంత తావి
మార్దవము మసృణములేదు మల్లెపూవ!

జగతి మూర్కొంచు నీదివ్యసౌకుమార్య
విలసనము చవిఁజూడక విడుచునేని
విడుచుఁగాక నీజాతికి విస్నదనము
మలినము గలుగనేర్చునే మల్లెపూవ!

సరసప్రత్యూష పవన ప్రసారమునను
వాహినీవక్షమున లేచు భంగపంక్తి
వలె హృదంతర్గతమున భావంబు లెన్నొ
వెల్లివిరియును నినుఁ జూడ మల్లెపూవ!

దివ్యచంద్రాతపములోని తెల్లఁదనము
మలయ పవనాంకురములోని చలువఁదనము
పరగ శ్రీచందనములోని పరిమళంబు
వెల్లివిరియును నీలోన మల్లెపూవ!



[illegible] దాసుగారిచేతి [illegible] [illegible] వారిద్దరు [illegible] పు నుండెను. [illegible] [illegible]ము, పరమేశ్వరుని విచిత్రలీలల విచిత్రమింతయు [illegible] దాసుగారు [illegible] చెన్నంటిపోయిరి.

## 3

Wilson Goggles ధరించి న్యాయమూర్తులైన గోపాలరావుగారు, చేతి కరపంతెములతో నున్న జగన్నాథదాసుగారితోఁ గారాగృహమున నిట్లు మాటలాడుచుండిరి.

గోపా—అయ్యా! మీరేనా నిజముగా Guilty Person?.

దాసు—నే నేపాప మెఱుఁగను.

గోపా—నేనడిగినప్రశ్న యేమి; మీరిచ్చిన Reply యేమి? అంతయు Incoherent.

దాసు—(లోన నవ్వుకొనుచుండును).

గోపా—పోనిండు. చంపఁబడిన యామె మీ భార్య యేనా?

దాసు—ఔను.

గోపా—ఇంక నేమి? మీ భార్యపై సర్వాధికారముఁ గలవారు కనుక మీరే ఆమెను జంపియుండవలయును. కాన మీరేహంతకులు.

దాసు—అయ్యా! ఆసమయమున నేను నిదురయం గుంటిని.

గోపా—ఐన నేమి లెండు. నిదురయందున్నయెడ వికృత చేష్టలఁ జేయువా రెందఱో కలరు. వారిని ఆంగ్లమున Somnambulists అనెదరు లెండు. మీరా Category లో వారేమో?

దాసు—అయ్యా! అనవసరప్రసంగములఁ జేయక అప రాధపరిశోధకుని నొకనిని పిలిపింపుఁడు. (నెమ్మదిగా) మీకిష్టమగు రీతిఁ బోనిచ్చువాఁడను గాను.

గోపా— Thanks; Yes! Yes! ఔను! ఔను! You are right; Perfectly right Our duty is only to punish but not to detect I shall wire for a detective Boy!
(కుఱ్ఱవాఁడు వచ్చును.)

దాసు—(లోనలో) ఓహో! [illegible]! [illegible] [illegible]?

గోపా—([illegible]) అయ్యా! దాసుగారూ! [illegible]

Detective Raghunath, Suryaraopet, Cocanada—Your help wanted on the spot please start forth with —Justice Gopal

Boy నీ వీ Telegram ను Post office లో నిమ్ము. Charges నా Clerk నుండి తీసికొనుము. Hurry up.
(టంకితవార్తతో కుఱ్ఱవాఁడు పోవును.)

అంత రెండుగంటలలో సుందరాకారుఁ డగు నొకపురుషుఁ డటకు వచ్చెను. ఆతనినిఁ జూచి దాసుగారి కెందుచేతనో కాని విపులకారాఁగలన సుధైర్య మొదవెను. అంతటనుకొనినికిపాట్లు పడుచున్న గోపాలరావుగారా నూతనపురుషునిఁ జూచి 'Oh! A Daniel has come to Judgment I hope' అనెను.

అంత నానూతనపురుషుఁడు "అయ్యా! నేను రఘునాథరావుగారి యొద్దనుండివచ్చితిని. మీరపరాధ పరిశోధకునికొఱకు వ్రాసితిరిగదా!"

గోపా—Yes! Yes! ఔను! ఔను! I mean I wired only for a detective. Excuse me, [illegible] Club లో సభవారైన Ex shaw No. I నే నా Tenacious memory క్షీణించుచున్నది. I mean A Sherlock Holmes has come to detection' Yes! Yes (లోనలో) Oh! Incarnation of Beauty!

నూ. పు.—రఘునాథరావుగారస్వస్థులై యుండుటచే నన్నంపిరి.

దాసు—(లోనలో) నాభార్య మేనమామ రాకుండుటచే—నాకర్మము—విధి వ్రాఁతఁ దప్పింప నెవరితరము?

గోపా— Alright, You can investigate. I have nothing to do here. I shall take leave, Dear Das! Do not Forget me (నూతనపురుషుని వైపు తిరిగి) "అయ్యా! చిన్నతనమునుండియు, నాంగ్లమున మాటలాడుట లవాటైనది. కాన క్షమింప వేఁడెదను." అని గోపాలరావుగారు పోయిరి.

## క్రోధన సం. మాఘమాసము

## ౪౦-వ జాతీయమహాసభ-కాన్పూరు



౬. ఖద్దరు ప్రదర్శనశాలయందొక భాగము



౭. ఖద్దరు ప్రదర్శన ప్రారంభమున గాంధీమహాత్ము డుపన్యసించుట

అంత నానూతనపురుషుఁడు దాసుగారిపై పునకుఁ జరిగి "అయ్యా! తామెఱిఁగినది సవిస్తరముగ సెలవీయవేఁడెద" ననెను. దాసుగారు తూచాలుతప్పకుండ జరిగినదంతయుఁ జెప్పెను.

నూ. పు.—దీనినిబట్టి చూడ మీరు నిర్దోషులని తెలియుచున్నది. అయ్యా! తాము తీర్జా నెప్పుడు వివాహమాడితిరి?

దాసు—C· B· M· Church, Pithapuram.

నూ. పు.—అయ్యా! మీరు నిర్దోషులనిబుజువుపఱచిన నాకేమిబహుమాన మొసఁగెదరు?

దాసు—అంతటిభాగ్యవంతుఁడనైనయెడలఁ దాముకోరిన దిచ్చెదను.

నూ. పు.—సంతోషము. నాకిఁక సెలవు దయచేయుఁడు; అని యానూతనపురుషుఁడు వెడలిపోయెను. దాసుగారు చింతించుచుఁ గారాగృహమందుఁ గూలఁబడిరి.

౪

ఈనూతనపురుషుఁ డెవఁడోకాని మిక్కిలి పట్టుదలతోఁ బనిచేయుచుండెను. జగన్నాథదాసుగారి దాసి యనుమతిపై దాసుగారు హత్యజరిగిననాఁటిరాత్రి కూరుచున్నగదినంతయుఁ బరికించుచుండెను. అరలబీరువాలో మూఁడవయరకును గవాక్షమునకు నున్న దూరముఁ గొలిచికొని వ్రాసికొనెను. గవాక్షము నేలనుండి యెంత యెత్తుగలదో కూడఁ గొలిచికొని వ్రాసికొనెను. ఆవలకుఁబోయి యిట్లని వితర్కించుకొనుచుండెను. "ఆహంతకుని దేహముభుజములవఱకైనఁగోడయం తెత్తుండవలయును. తుపాకీ యీగవాక్షముగుండనే దొంగిలింపఁబడి యుండవలయును. ఏలనన, పోవుటకు దాఁటి మఱియొకటి లేదు. ఆసమయమున ద్వారము లోన గొళ్లెము వేయఁబడియున్నది. జగన్నాథదాసుగారు మూర్ఛావస్థయం దున్నారనిన సంగతి నెఱిఁగియుండి హంతకుఁడు తుపాకిని దొంగిలించియుండవలయును. కాన భార్యాభర్తలసంభాషణ హంతకుఁడు తప్పక వినియుండవలయును. హంతకునకు తీర్జాకిఁ దప్పక సంబంధ ముండవలయును. లేనియెడలఁ జంపినతరువాత "చచ్చితివా జంకులాడి" అని యనుచియుండఁడు. ఇట్లు వితర్కించుకొనుచు నేలపై నున్న యడుగులజాడ కనఁబడునేమోయని నేలనంతయు నేయిగన్నులతోఁ బరికించెను.

ఒకచోట military Boots Soles ఆకారము కానవచ్చెను. వానియాకారము నాతఁడు సరిగఁగాగితముపై వ్రాసికొని, తీర్జా తుపాకితోఁ జంపఁబడెనుగాన, తుపాకులసంగతు లెఱిఁగిన తుపాకులమేస్త్రీ యెవరు గలవ్వరని తెలిసికొని వెడలిపోయెను.

మాళవుఁ డప్పుడుకీళ్లనొప్పులచే బాధపడుచుండెను. ఈనూతనపురుషుఁ డీసంగతిఁ దెలిసికొని, వైద్యునివేషము ధరించి, మాళవునియింటికి రిగి, మాళవునకు మందిచ్చుచున్న వైద్యుఁడు తన్నంపెనని మాళవునకుఁ జెప్పి మందొసంగెను. ఒకబాలుఁడు వచ్చి మనఅపరాధపరిశోధకుని లోనికిఁ దీసికొనిపోయెను. పోవుదారిలో నొకగదిలోన military Boots కానబడెను. అంత నాతఁడు వాని Soles పరీక్షించెను. జేబులోనున్న కాగితముఁ దీసి దానిపై వ్రాసియున్న Soles ఆకారముతోఁ బోల్చి చూచెను. ఆశ్చర్యము! రెండింటి యాకారములు సరిగనుండెను. అంత నాతఁడు లోన విమపునవ్వు నవ్వుకొనుచు, లోనికిఁ బోయి మాళవునితోఁ గొన్నిమాటలాడి వాని దేహము సౌష్ఠవమును, చేతులసౌష్ఠవమును గనిపట్టి 'తిరిగి దర్శనముఁజేసికొనెద'నని యీవలకువచ్చి 'ఈతఁడే' అనుకొనుచుఁ బోయెను.

౫

ఒకనాఁటి యుదయమున చేత నొక తంతివార్తఁ బట్టుకొని సంపూర్ణవిజయదృష్టులతో నీనూతనపురుషుఁడు మాళవునింటికిఁ బోయి "అయ్యా! మాళవరాయిగారూ! ఇదిగో మీచేతికరదండములఁదగిలించుచుంటిని. తీర్జాను చంపినవారు మీరే" అనెను. అంత మాళవుఁడు తెల్లబోయి 'ఆఁ! నిజముగ నేనే. ఆఁ! కాదు' అనెను.

నూ. పు.—అయ్యా! మాళవరాయిగారూ! తమరు జగన్నాథదాసుగారి మొదటిభార్య (తీర్జా) నెఱుఁగుదురు. తీర్జా నొక్కసంవత్సరముక్రితము వివాహమాడియుండలేదా? అంతకుఁబూర్వమే జగన్నాథదాసుగారి భార్యయగు తీర్జా నీటబడి చనిపోలేదా? మీ భార్యయగు తీర్జా హత్యజరిగిననాఁటి రాత్రి జగ

...దాసుగారితో మాటలాడుచున్న ఒని యామె యపుడె నామెను జంప నుద్దేశించి, జగన్నాథదాసు గారు వాగ్విశ్వాసులై యున్న సమయమందు, మాంచెవ



"ఆc! నిజముగ నేనే."

యారయందున్న తుపాకిని దొంగిలించలేదా? మీ కేయి పొడవుగ గొలిచికొనుడు. గవాక్షమునకు మాంచెవరియరకున్న దూరమంత పొడవున్నది. మఱియు మీరు Military boots తొడుగుకొని యాకృత్య మాచరించితిరి. వాని Soles యాకారము నేల పైcబడినది. నేను వాని యాకారము సరిగ వ్రాసితిని. మీ Military bootsయొక్క Soles ఆకారము, నేను వ్రాసిన యాకారము నొక్కరీతిగ నున్నవి. ఇదిగో! మీరు తీర్జానను వివాహ మాడినట్లును, ఆమె అక్కయగు తీర్జాను జగన్నాథదాసుగారు వివాహ మాడినట్లును, ఆమె నీటcబడి మరణించినట్లును, అక్కచెల్లెం డ్రిరువు రొక్కపోలికగలవా రటంచును, C.B. M. Church నుండి వచ్చిన తంతి వార్తcజూడుండు' అనెను. అంత మాళవుcడు చేయ జాలినదేదియు లేక పశ్చాత్తప్తహృదయుcడై "అయ్యా! అపరాధపరిశోధకా! దాసుగారి పూర్వపు సంగతి నా కిసుమంతయుc దెలియదు. తెలిసికొనవల సిన యవసరమునా కుపపడలేదు. నాకాసంగతియెంత మాత్రమైనc దెలిసియుండిన, నేను కొంచము లాలోచింపక నిష్కారణముగా నాభార్య నిట్టి యకాల మృత్యువుపాల నిడియుండను. నాభార్య దాసుగారితో మాటలాడుచున్న సంగతులు విని, దాసుగారిని నాభార్య మొదట వివాహమాడెననితలంచి, మొదలు చెప్పిన వాcడనై, దాసుగారు వాగ్విశ్వాసయందున్న సమయమందు వారితుపాకిని దొంగిలించి, నాభార్యను నా చేతులలోc జంపి, ఇసీతీగను 'చచ్చితివా' అంకు లాచి' అనియుంచి, దాసుగారితుపాకి శిరసు ప్రక్కనc బడవైచి తీర్జా తండ్రియొద్దనుబోయియిలని పిమ్మటను దాసుగారు చంపినారని చెప్పితిని. దాసుగారిని గారాగృహమందుc ద్రోయించితిని. అగ్నిసాక్షిగ వివాహమాడినభార్య పరుని 'నాథా' యని నోరారcబిలిచిన ప్పుడు, మగవాcడెవ్వcడు సహింపcగలcడు? స్వామీ! నేనే నాభార్యను జంపినవాcడను అనెను."

మాళవునకుc గొలcదిదినములు కారాగృహశిక్ష విధింపcబడెను. దాసుగారు నిరపరాధు లనుటచే విడిచి పెట్టcబడిరి. ఆనూతనపురుషుcడు దాసుగారి వ్రేలనున్న యుంగరమును బహుమతిగాcగొని యదృశ్యుcడాయెను.

## ౬

... కచిలుకలెక్కలవలెనున్న ఘనఘుం దొడ్డి పాలరాతిగిన్నెపై, జగన్నాథదాసుగారును, ఆయన భార్యయగు కమలాదేవియుc గూర్చుండి ముచ్చటగ మాటలాడుకొనుచుండిరి.

కమ—నాథా! పెండ్లిసవరమేది?

దాసు—ఒకరికిచ్చితిని.

కమ—మఱల నాకొకసవతిని సంపాదించితిరా?

దాసు—లేదు. నా ప్రాణరక్షకుcడగు నపరాధపరిశోధకున కొసcగితిని.

కమ—అటులైననాయుంగరము నాకుc జూపించుము లేకున్న నేను మీభార్యనుగాను.

దాసు—ప్రాణకాంతా!

కమ—అదిగో, తిరుగనట్లు పిలిచెదరు?


"నాథా! ఇదిగో, తిరిగి మఱియొకయుంగరమిచ్చుచుంటిని"

దాసు—ఇచ్చినదానిని దీసికొనుట పెద్దమనుష్యులకుఁ దగునా!

కమ—అట్టియెడ నా కా యపరాధపరిశోధనమే చాలదు.

దాసు—అట లనుట భావ్యమా?

కమ—నాథా! ఇదిగో తిరిగి మఱియొక యుంగరము మిచ్చుచుంటిని. దీనినైనఁ బరులకీయక భద్రముగా నుంచుకొనుఁడు. (ఉంగరమిచ్చును.)

దాసు—(ఉంగరముఁజూచి)"ఆఁ! ఇదియేమి? నీవే నా ప్రాణరక్షణ మొనర్చినదానవు! అపరాధ పరిశోధకుండవు! రఘునాథరావుగారి మేనకోడల వైనందులకు రావుగారి పేరు నిలువఁబెట్టితివి. నా ప్రాణముల రక్షించితివి. ఆహా! ఏమి నా భాగ్యము!" అంత నలుదెసలఁ జీకటులు క్రమ్ముకొనుచుండెను. ప్రణయ స్వరూపులగు నా దంపతులు మన కగుపడుటలేదు.



# కుకవి ప్రబోధము

అనంతపంతుల రామలింగస్వామిగారు (భారతీసమితి)

వును కవులు రచించిన త్రో, వన్నుఁజను చౌకకావ్య మేను వ్రాయుచుఁ గుకవిన్
పనిపడి తిట్టితి నిదురన్, గనుమూసితి రేయి నొక్కకలఁగంటిఁ గవి!

మ. కలలోఁ గాంచితి నంత నొక్కకుకవిన్ గాఢస్మర పున్నెలువున్
దలఁజుట్టెన్, వలకేలఁ బట్టె నొకపొత్తంబొననంబర్దుఁ గొం
దళుకుం గుంకుమబొట్టుఁ బెట్టె నొడలంతన్ బూసె భస్మంబు ను
స్తులదృష్టిన్ ననుఁ గాంచి పల్కె నిటు నాతో నాతఁ డుద్దాముఁడై.

"క. కుకవీ! కుకవీ! యంటివి—కుకవిత్వము వీవుఁ గావా? కుశలకవీశుల్
కుకవీశులు గాకుందురొ? కుకవి సుకవి భేద మెంచి కులుకకుము కవీ!

మ. భళిరా! నాకమునుండి వచ్చితొ? కవీ! భావ్యస్వభావార్థివై
వెలయం జూచెడునట్టి నీజత్వమౌర్ఖ్యాన్ సాధ్యమా? లేనిదీ

విల సృష్టించఁగలావా? లేదనుచు నీవెంచుం బదార్థంబు వ
ర్థిలునెందో సుమ! మానుమా కుకవి నర్థిన్ దిట్టు నీగర్వమున్.

మ. కవి సృష్టించుపదార్థజాలమున నొక్కం డీవు, నీపూర్వజ
న్మవిశేషంబు నెఱుంగలేక “కవి నెన్న న్నేనెకా” యంచు గ
ర్వవిదగ్ధుండవు గాకుమోరి! కుకవిప్రాంచత్కుటుంబాన ను
ద్భవ మీ వొందితి వందులో యశము సంపాదించు మోయీ, కవీ!

శా. ‘బాణోచ్ఛిష్ట మిదం’ జగత్తనెడి యావాక్యార్థతత్త్వంబు హృ
త్కోణావాస మొనర్చుచున్న నిఁక జంకు ల్లేక నీవ్రాఁత వి
జ్ఞానానూనవినూత్నమం చనెదవన్నా! హాస్యమో యిద్ది? య
జ్ఞానంబో? మఱిగర్వమో? పలుకుమా! శాంతాంతరంగుండవై.

ఉ. ఒక్కనియర్థ మింకొకరుఁ దుర్విని సంగ్రహణంబు సేయుటే
నిక్కము కానిచోఁ దొలుత నీవు జనించిననాఁడు లేక నీ
కెక్కడనుండివచ్చె నిది యెంచుము చౌర్యము లోకనైజమా
నొక్కఁడు చెప్పి చేకొను నికొక్కఁడు చెప్పక సంగ్రహించెడున్.

మ. తనలోపంబుల నాడిపోదు రనుచింతన్ జార మున్ముందు ధా
రుణి సాధ్వీమణులందు లోపముల నేరున్ గాదె తద్రీతి నీ
వును నాదిన్ గుకవిప్రకాండమును నెప్డున్ దిట్ట నుంకింతు, భ
ర్తను దండించి గయాళి ముందు మొగసాలన్ జేరు టిట్లేకదా!

చ. కుకవుల నీవొకండవయి కొంటెతనానను దిట్టు నీదు వా
లక మపహాస్యభాజనము, భ్రాతృవినిందను నీవొనర్చె నా
వకట! కృతాపరాధమున కందుము నీవనుతాప మింక, నీ
కుకవివినిందనంబు నినుఁ గూడెడువైఖరి నేర వేలొకో!”

గీ. ఇంక నేమన నతఁ డెంచెనేమొకాని, యంతఁ గాకములార్చె గృహాంతికమున
నిదుర చెదరెను, మేల్కాంచి నేను నాల్గు, దెసలఁ బరికించి కాననైతిని గుకవిని.





# పిట్టకథలు

అనగనగా ఒక అబ్బాయి. అత డెంతో అందంగా ఉండేవాడు; నీటుగా ఉండేవాడు. అలా ఉంటోంటే ఒకపిల్లిపిల్ల చూసింది.



దాని కా అబ్బాయిని పెళ్ళాడాలని బుద్ధి పుట్టింది. అందుకోసం తపస్సుచేసి స్త్రీరూపంధరించాలని ఆలోచించింది. అడివిలోకి వెళ్ళిపోయి ఓచెట్టుక్రింద ఒంటికాలిమీద లక్ష్మీదేవిని గురించి తపస్సు చేసింది. లక్ష్మీదేవి ప్రత్యక్షమై ఏం కావాలని అడిగింది.

"తల్లీ ! లక్ష్మీదేవీ ! నా కాఅందగాణ్ణి పెళ్ళాడాలని ఉంది. నన్ను స్త్రీగా మార్చాలని నా ప్రార్థన" అంది. దానితో 'సరే' నని వెళ్ళిపోయింది లక్ష్మీదేవి.

అతి సుందరమైన స్త్రీరూపం ధరించి ఆపిల్లిపిల్ల ఆ అబ్బాయిని పెళ్ళిచేసుకుంది. పెళ్ళయింది; సుఖంగా కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు.



లక్ష్మీదేవి ప్రత్యక్షమై “ఏం కావా”లని అడిగింది

లక్ష్మీదేవికి ఈ పిల్లి స్త్రీకి ఏమైనా బుద్ధిమారిందో లేదో చూద్దామని తలచి ఓ ఎలుకని ఆగదిలోకి విడిచిపెట్టింది. ఆ పూర్వనైజంపోక ఆ ఎలుకమీదకి దుమికిందా అమ్మాయి. ‘ఇదేమిటా’ అని ఆ పెళ్లికొడుకు తెల్లబోయి లేచాడు.






లక్ష్మీదేవి నవ్వుకొని 'పిల్లికి స్త్రీగా మారి నా బుద్ధి పోకపోతే ఏంలాభం' అనిపిల్లిగా మార్చేసిందిమళ్లీను. పాపం, ఏజాతి వా జాతిగానే ఉండాలనీ, దురాశ కూడదనీ, ఆపిల్లి పిల్లిగానే ఉండి పోయి సుఖంగా కాలం గడిపిందట.

[కమల]



# చేమంతులు

సెట్టి లక్ష్మీనరసింహము గారు



సంతోషము నీ కీసం
క్రాంతి మహోత్సవమునందుఁ గలుగింగా న
త్యంతముఁ గోరుచు నీ చే
మంతు లనిపినాఁడ నరయుమా ప్రియమార్గా.

శా. శ్రీమంతంబుగ స్వాంతముల్ వికసిలన్ జేమంతిసీమంతినుల్
హేమంతుండను కాంతు రాకకును నెంతే వింత మీరన్ వని
భూమిన్ మేన నలంకరించుకొను కెంపుల్, నీలముల్, వజ్రముల్,
గోమేధంబులు నాఁ జెలంగెఁ బలుచెందున్ గల్గు పుష్పావళుల్.

మ. ఇనుఁ డంతంతకు వేగిరంబుగ నహఃకృత్యంబులన్ మాని పె
ల్చన నిద్రించుచు వేకువన్ మిగుల నాలస్యంబుగా నిద్ర మే
ల్కొనఁగాఁ గారణమైన యీచలికి రంగుల్ గల్గు మేల్ సేలువం
గొని యుద్యానము కప్పుకొన్నదనఁ గుల్కున్ వింత చేమంతులన్.

సీ. పసుపును నెమ్మేన మిసిమిగల్గు విధాన, రాచుకొనిన ప్రియురాండ్రఁ దలఁచి
కుంకుమపుం బొట్టు గొనబారఁగాఁ బెట్టుకొను ముదిపెంపు భామినులఁ దలఁచి
కన్దోయికిం గాటుకం గరంబుగ నీటుమైఁ దాల్చు ముద్దుగుమ్మలను దలఁచి
యచ్చంపుఁ దెలిచీర లతివిలాసంబార, ధరియించు ప్రాణకాంతలను దలఁచి,
గీ. యభిలషింతురు హస్తంబులందుఁ దాల్ప, వృక్షముల నిల్ప రమ్యోపవనములందుఁ
దనరు పీతరక్తవినీల ధవళవర్ణ, కలిత సేమంతిపుష్పముల్ గను రసికులు.

సీ. కను జారులకు నోరు కడునూరు నన మీఱు, మధురంబులగు తమ యధరములను
ఘనజాలముల నీలతను నేలఁ దగి చాల, నుంగరమ్ములయిన ముంగురులను
చెలివన్నె గల వెన్నెలల చిన్నెలను మున్నె, దోసంబులెంచెడి హాసములను
నును మొవ్వులను బువ్వులను జివ్వనను నవ్వు, భంగి మార్దవమొప్పు నంగములను
గీ. మీఱునని తలఁదాలిచి గౌరవింతు, రింతులారామసీమల నెఱుపు నీలి
వన్నె, తెల్లందనంబుఁ గ్రొంబసుపు రంగెసంగు చేమంతులం గని సంతసమున.

ఉ. ఎంతశిరంబు మూరుకొని యెంతగ నక్కునఁ జేర్చుకొన్నఁ జే
మంతులమీఁది ప్రేమ విటమండలికిన్ నెఱసున్నయే; సతుల్
బంతులు కట్టి ఱువ్వఁ దమపైఁబడి శిక్ష యొనర్చునంచు లో
నెంతయుఁ గిన్కఁబూని నలియింతురు వానిని .........

గీ. బంతిపూలు చేమంతుల పగిది వన్నె,చిన్నెలున్నను, వాసనల్ చేకుఱమి ధి
టీవిటావళిఁ దనియింపలేవుగాన, బంతులయి వారిఁ దనుపుఁ జేమంతిపూలె.

గీ. పెద్దవయ్యు బంతులు చిన్నపిల్లల జడ, లంచె ముడువంగఁబడుఁ; జిన్నవయ్యు జవ్వ
నుల సిగలయందుఁ జేమంతు లలరుచుండు, జన్మవాసన లూరక చనవు గాదె!

ఉ. కాంతల చెక్కులంచుఁ గసికాటులచే రసికుల్ కలంపఁగా
గొంతభయంబు గొల్ప ములుగోళ్లను అక్కు గులాబు; లంగవి
భ్రాంతిని ముట్టి, మూరుకొని, రాపిడి పెట్టిన మాఱులేక, సే
మంతి లతాంతముల్ తలలుమాత్రము వంచును లజ్జపెంపునన్.

లయగ్రాహి

కంతుఁ డిపు డేయుటకుఁ గుంతములివే; సిగల నింతులు దళంబుగ ధరింతురివియే; శ్రీ
మంతులకు శయ్యలివె; కాంత లపరాధులగు కాంతులను గొట్టుటకు బంతులివియే; హే
మంతమునఁ దక్కిన లతాంతములు లేవనుచుఁ జింతిలఁగ నేటికి? వనాంతరములన్ సే
మంతిసుమమంజరులు వింతలుగఁ బూచి కడు సంతసమిడున్ రసికసంతతికి నెల్లన్.




# వాఁడే వీఁడు

మంచికలపాటి శంకరరావు గారు

౧

**క**ల్యాణరావు—ప్యూన్, గంగులూ!

గంగులు—సామీ!

క—ఈ కాగితములు తీసికొనిపోయి గుమాస్తా దీక్షితులవారి టేబిల్ మీద నుంచిరా.

గం—చిత్తము.

(అని కాగితములను తీసికొనిపోయి దీక్షితులవారి బల్లమీద పెట్టును.)

దీక్షితులు—ఒరే గంగులుగా! ఎంత అన్యాయమురా, మాలవాఁడివి. ఈవిధమున మాదగ్గరకువస్తే ఎట్లారా. కాగితములు తెచ్చి దూరమునుండి బల్లమీద పెట్టరాదా! ఈబైండుబుక్కుల కన్నిటికి అట్టలు గుడ్డలతో తగలబడ్డవే! నీవు వీటి దగ్గరకువస్తే వానిని తడుపకుండ మరల ముట్టుకొను టెట్లురా! నిన్ననుకొను టేమి? నిన్ను 'అప్పాయింటు' చేసిన ఆ ఆఫీసరు ననుకొనవలె.

గం—సామీ! మీ రిట్లా శెలవిస్తారే; నేను తమ ఆఫీసుప్యూన్ నుగదా; తమదగ్గర రాకుండ పనిచేసేది యెట్లనండి?

దీ—చేయలేకపోతే రాజీనామా గోకి పారవేసి వెళ్లరాదూ! మాలవాడివి నీవు మా మళ్ళీ తిరుగుతుంటే చేమెప్పి చూస్తూ ఊరుకున్నాను!

గం—సామీ! బ్రాహ్మణులు అట్లా కోపం చేసుకుంటే మాలవాళ్లు ఎట్లాగండీ బ్రతికేది. ఇంతమంది గుమాస్తాలదగ్గరకు పోతున్నాను గాని వారు ఒకనాటి కోపపడరే. తుదకు మన అనధాములుగారు కూడ ఇట్లా అనడంలేదే! బ్రాహ్మలందరి కంటె అధికబ్రాహ్మలుగా నున్నారే!

దీ—(మహాగ్రహముతో) ఫూల్! నోటికి వచ్చినట్లెల్ల వదరుతావేమిరా! వాళ్లి కిష్టమైతే నాకేమి? అధికప్రసంగము చేసితివో నీమీద 'నోటీస్' వ్రాసి నిన్ను క్షణంలో డిస్మిస్ చేయించుతాను చూడు! వాఁడూ వీఁడూ అనుకున్నావా యేమి? జాగ్రత్త!

గం—అబ్బా! వాఁడూ వీఁడూ అని నేనెందు కనుకుంటాను సామీ! మీరు దీక్షితులు గారు కదూ, తమకు నామీద ఇంత కోపం ఎందుకండీ! రాతచాలక కులమున తక్కువై జమాను నౌకరి చేయవచ్చినా నని కాబోలు! అదే నేను ఏ మెట్రిక్ పాసైనో, ఏ బియ్యేనో అయితే మీ సరి గుమాస్తాగా వచ్చియుంటే మీరే నాకు

గంకెమార్లంగలు, పేకహ్యాంగ్లు చేయరూ! మమ్మింత అనాదరణచేస్తే మీ కేమి లాభముంది, సామీ! భగవంతుం డొకండేలేండి సామీ! మన మందరం ఆయన బిడ్డలమే కదటండీ!

దీ—చాలునయ్యా గంగులుగారూ! నాబుర్ర దగ్గరనుంచి అవతలపోండి. నాకు మీ వేదాంతం ఏమీలేదు లేండి. మీ సరివారికి పోయి చెప్పుకోండి.

గం—చిత్తము సామీ! ఆరునెలల నుంచి యీ కాకినాడలో ఉంగే యమబాధగా ఉన్నది. ఈ ఆఫీసు జమానుషని నాకింక నద్దు. నూరురూపాయల జీతగాడికిగూడ యీదబాయింపు తాళుకోవడం కష్టం.

నాగరాజరావు—సార్, దీక్షితులు గారూ! వాండేమిటి పుర్యాను. వాడితో నేమిందండీ! ఏమి ఇప్పుడు వాడు మాలవాడైతే? వాడునూ మనవలె మానవుడుగదా! ప్రపంచమున మనకెంత స్వాతంత్ర్యమో వాడికిమాత్రం అంత లేదా? ఆఫీసుకువచ్చి నతర్వాత ఇన్ని పెట్టుకుంటే జరుగునా?

దీ—సార్, నాగరాజరావుగారూ! ఎక్స్క్యూస్ మి; చాలు, వానిపై మీకంత ప్రేమ ఉంటే మీయింటికి దీసికొనిపోయి మీతో భోజనం పెట్టండి. మీ ప్రక్కలపై నిదుర పుచ్చండి. నా కిష్టంలేదు. పోవోయి, గంగులూ! నాదగ్గరకు రావద్దు ఇక.

గం—సామీ! తమబాధ దినానికి దినానికి ఎక్కువగా ఉన్నది. నౌకరిలేకున్న పీడ పోయినాది కాని మీ యమబాధ సగలితే చాలునండీ! నేనోయి నా నెలకొద్దికాలం గడుపుకొంటాను. ఇంకనా ప్రక్కనా సౌకరీ చేసి బ్రతకగలను. మూతికింత మూతుకుతో ముష్టియెత్తుకుంటానుగాని మీనౌకరిమీరు తీసుకోండి. ఇదిగో, రాజీనామా కాగితం. ఇంక మీరు బ్రహ్మణులనే జమానులుగా పెట్టుకొని పనిచేయించుకోండి. (అని తటాలున జేబులో కాగితం తీసి అప్పటనే రాజీనామా వ్రాసి దీక్షితులు గారి చేతి కిచ్చి) సామీ! గంకెమార్లంగలు, శిహాళీ లంగవారు క్యాంపునుండి బాగానే వారి కిచ్చుకోండి. సబ్ కలెక్టరుగారు నాకీ తాలూకాలోనే నౌకరిచ్చి పుణ్యము కట్టుకున్నారు. మహారాజులు మీరు తాళ్చి మట్టికొట్టినారు నానోట. నే పోతున్నాను. మీరుమాత్రం నేపుగా దేవుణ్ణి చేరుకోండి. (అని ఏమేమో గొణుగుకొంటూ బయలుదేరెను).

దీ—ఒరే! జాస్తిగావదరకు. మాంట్లాడితివో, ఆఫీసునుండి 'నెక్ అవుట్' చేయిస్తా; జాగ్రత. నీవు మా ఆఫీసునవదలితే మాపీడ వదలినట్లే. (అని ఇవతలికి వచ్చి తల తడుపుకుంటూ) అబ్బ! ఎంతఅన్యాయం. మాల మాదిగలకు నౌకర్లిచ్చి మమ్ముల చంపుతారు. కులము లేదు, గోత్రము లేదు. కాలము నాశనం అయిపోయ్యే రోజులు వచ్చినవి. వీడిపోరుపడలేక వీనితో తగవులాడలేక నాఅస్థు లడగిపోయినవి. ఈ నాటితో సుఖమయినది. అయినా మరి

మాలవాండ్లు మనమూ ఒక్కటైపోతుంటే; అబ్బబ్బా! ఏమికాలవైపరీత్యము !!!

## ౨

(ఒక బంగళా)

సాల్టుకమీషనర్—బాయ్! రాబిన్! ఏమి చేస్తున్నావ్, బజారుకుపోయి, రోజర్ అండ్ బ్రదర్స్‌లో మూడు లైమ్‌జ్యూ స్‌లు, 'టూ హార్సెస్' ఐస్ తీసుకొనిరా

రాబిన్—చిత్తము. (అని బజారుకుపోయి లైంజ్యూసులు, ఐసు తెచ్చియిచ్చును.)

సా.క.—రాబిన్! పైప్ తే.

రా.—చిత్తం, సార్! (అని పైపు తెచ్చును.)

(దొరగారు ఆ ఐస్ వేసుకొని లైంజ్యూస్ త్రాగి పైపుముట్టించి పీల్చి, గడియారము 11 కొట్ట, రాబిన్ లాగుచుండిన పంకానుండి గాలి చల్లగా వీచుచుండ స్ప్రింగుకాట్ పై బరుండి నిదురించుచుండెను.)

దొరగారు నిదురించుటచూచి రాబిన్ లేచి ఆవలకుబోయి తృష్ణతీర్చుకొని బంగళా కాంపౌండులోని ఒకవట వృక్షచ్ఛాయ శయనించి తనలో తా నిట్లనుకొన ప్రారంభించెను—“అసహాయులకును, దీనులకును దైవ మొక్క డేకదా దిక్కు. ఎంత కులహీనులైనను, మానవులకు దేవుడు కాలము మంచిదైనచో సహాయముచేయక వదలునా! ఔరా! వానిప్రేమ? నేను హీనజాతివాడనైనను, నేర్పున కొద్ది వాడనైనను దేవుడు నాయందు కరుణ చూపుచున్నవాడు. దీక్షితులుగారు నన్ను నిండుగా విశ్వాసముంచెను. దేవుడు నన్ను దయ జూచెను. ఇన్నాళ్ళకీ అదృష్టము నేనెట్లు తప్పింపగలను? దీక్షితులుగారి దయాబుద్ధివల్లను దొరగారియింట నాకు కొంత సౌఖ్యము సమకూరినది. దొరగారికి నాయందు అనురాగము కలిగించినట్టి పరమాత్ముడు నాకు తోడ్పడునుగాక!”

సా.క.—బాయ్ రాబిన్!

రా.—సార్!

సా.క.—ఐస్!

రా.—చిత్తము. (అని తెచ్చియిచ్చును.)

సా.క.—(ప్రీతిగా) రాబిన్! నీకు చదువు చెప్పుకొన నిష్టమా!

రా.—(ప్రీతితో) యస్, సార్!

సా.క.—నీ వెన్ని క్లాసులు చదివినావు?

రా.—లోయర్ సెకండరీ ప్యాసు చేసినాను, సర్.

సా.క.—సరే! రేపు నిన్ను ఈయూరిలో హైస్కూలులో చేర్చుతాను, నావద్దనే యుండి నీవు చదువుకో! (అనిచెప్పి దొరగారు రాబిన్‌యొక్క బుద్ధికుశలతకును జిజ్ఞాసకును సంతోషించి మరునాడే హైస్కూలులో రాబిన్‌ను ఫోర్తు ఫారములో ప్రవేశపెట్టిరి.)

రాబిన్ ప్రతిసంవత్సరమును పరీక్షలో జయము గాంచుచుండెను. మెట్రిక్యులేషన్ పరీక్షలో సామాన్యజయమేకాక ఆంగ్లవ్యాస రచనాస్వర్ణపతకవిజేతు డయ్యెను. ఈ విధమున రాబిన్ వృద్ధికివచ్చుట చూచి దొరగారు

ఆతని ఇంటర్ మీడియట్ కు మద్రాసునకు పంపెరి. కాలేజీక్లాసులయందు సైతము రాబర్ట్ అగ్రస్థానమున జయముగాంచుచు దైవవశమున బి. ఏ. పరీక్షను ఆంగ్లమున మద్రాసు విశ్వవిద్యాలయమున కెల్లను ప్రథముడుగా నుత్తీర్ణు డయ్యెను. ఇప్పుడు రాబర్ట్ కు ఇరువదినాల్గు వత్సరములు.

రాబర్ట్ కుశ్రువా డగుటచేతను, విద్యయం దసమానప్రజ్ఞగలవా డగుటచేతను సాల్టుకమీషనరుకు రాబర్టును ఒక గొప్పవాని జేయ దలంపు కలిగెను. దీనికి దోడుగా ప్రభుత్వమువారే రాబర్టుయొక్క ప్రజ్ఞావిశేషములకు సంతసించి తమ పోషణక్రింద అతనిని ఐ. సి. యస్. పరీక్షకై లండనునగరమున కంప తీర్మానించిరి. ఈవిషయము సాల్టుకమీషనరుగారు విని పడినసంతోషము వర్ణనాతీతము. అపుడే దొరగారు రాబర్టును పిలువనంపి అతనికి ఆతిథ్య మొసంగి, చేతనైనంత ధనసాహాయ్యముచేసి, లండనువిషయము కొంత తెల్పి తనయాశీర్వచనములతో వీడుకొల్పెను. రాబర్ట్ మాతృభూమిని వదలుటకు గొంత చింతించియు విధ్యుక్తధర్మముగా నేర్పడిన తన విదేశయానమునకు సంసిద్ధుడై బయలుదేరెను.

## 3

[కాంచీపురమున కలెక్టరుగారి బంగళా]

దీక్షితులు—(అప్లికేషన్ తీసికొని బంగాళా లోనికివచ్చి బట్లరునుచూచి) సార్, గుడ్ మార్నింగు.

బట్లరు—హూఆర్, యు ?

దీ—నే నీరేంజీ రివిన్యూ ఇన్స్పెక్టరును; బహు కుటుంబిని. చాలకాలమునుండి ఈయూరి తాలూకాకచ్చేరిలో 'రైటర్' అయ్యుండి రెండేండ్లనుండి రెవిన్యూ ఇన్స్పెక్టరుగా పనిచేయుచుంటిని. ప్రస్తుత మొక హెడ్ అకౌంటెంట్ పోస్టు ఇచ్చటనే ఖాళీ అయియుం దండి. అది నా కిప్పించితి రేని మీవల్ల నాకుటుంబం నిలుస్తుంది. ఆపుణ్యం కట్టుకోవలె.

బ—ఆల్ రైట్, మ్యాటర్స్ వెరి లిటిల్, మై రివార్డ్?

దీ—ఓయస్!

బ—టెన్.

దీ—సార్! అంతకు ఆగలేనండీ. ఫయివ్.

బ—నోనో, ఐడోంట్ వాంట్ (అని పోబోవును).

దీ—(పోవు బట్లరునుపిలిచి బేరమాడి తుదకు నైన్ రుపీసుకు ఒప్పుకొనెను. బట్లరుపోయి ప్యూన్ద్వారా విసిటింగు కార్డు దొరగారికి పంపెను).

కలెక్టరు—యస్, లెట్ హిం కమ్.

దీక్షితులు—(మహావినయముతో ప్రవేశించి 'గుడ్ మార్నింగుసార్'అని అర్జీయిచ్చును)

క—(అర్జీ చదువుకొనితనయెదుట నున్న వానిని ఎన్నడో చూచినట్లు తోచ, వాని నాపాదమస్తకము పరిశీలించి) వాట్ ఈస్ యువర్ నేమ్?

దీ—ఆం. దీక్షితులు.

క.—యస్, హూ యూ బిలాంగ్ టు దిస్ ప్లేస్?

దీ.—యస్, యువరానర్.

క.—(తనప్రాతదీక్షితులు వ్రాసిన ప్రతిని, వానిని గూర్చి కొంత యాలోచించి, తత్క్షణమే మేజాపైని ఫౌంటెన్‌పెన్ దీసి తటాలున చివచివమని దీక్షితులుగారి అప్లికేషన్‌మీద ఏమోవ్రాసి) "ఆల్ రైట్, దీక్షితులూ, యు మే గో నౌ!" అనెను.

దీక్షితులు బైటికిరాగానే బట్లరు ఎదురు వచ్చెను. (బలవంతముగా శ్రీదీక్షితులుగారు జేబునుండి వెండినాణెములు తీసి కన్నీటితో వానిని దసపుచు టంగుటంగుమని ఎంచి యమకింకరునివలె నిలిచియున్న బట్లరు చేతిలోనుంచి), "అయ్యా! కార్యమేమో కాలేదు. జేబుమాత్రము ఖాళీ అయిన ట్లున్నది" అనెను.

బట్లరు—వాట్‌సార్, నో ఫియర్ పేపర్ నా; దేర్ యస్ పుట్ కలెక్టర్.

ఈమాటలకు దీక్షితులుగారికి కొంత హృదయము శాంతించెను. అయినను మనసు నకు పూర్తిగ స్వాస్థ్యము కుదురలేదు. మెల్లగా నిజగృహముచేరెను.

రాత్రియంతయు దీక్షితులు జాగరము చేసిన ట్లుండెను. మనసు నిలుకడ లేదయ్యెను. ఇంతలో నుదయమయ్యెను. గడియారము పదిగంటలు కొట్టెను. పోస్టుమ్యా నొకడు వాకిట కేకవేసెను. దీక్షితులుగారు అత్యాతురతతోపోయి సర్వీసుబిళ్లలతో నలంకరింప బడిన కవరు నొకదాని తీసికొని, దానిలో నున్న సర్వీసుఆర్డరు నిట్లు చదివికొనుచు జరుపుకొనెను.

Collector's Office.
D. Dis. 859   Cocoanada.
20—9—25

Service order

To

M R. Ry. R. Deekshitulu,
R. I., Cocoanada Range,
Cocoanada

Ref   His Arzi No 562; Subject: application for a Hd. accountant's place

Order

M R. Ry R Deekshitulu, R. I, Cocoanada is appointed to be the Tq. Head accountant, Cocoanada, on Rs 100,- v-s, M R. Ry P. Bhaskara Row, retired—to join forth with.

R. Robin.
Collector.

Copy to T. D C
" " R. D. O.
" " Tahsildar.
" " Party
" " file

దీనిని చదివినంతనే దీక్షితులుగారి ఆనంద మేమని వర్ణింపవచ్చును. ఆహా! ఏమి కృతజ్ఞత! ఏమివిశ్వాసము.

ఆనాడు సాయంసమయమున దీక్షితులు గారు తనమిత్రవర్గముతో బీచ్‌వంకకు షికారు పోయెను. తత్సమయసంభాషణలో దీక్షితులుగారి సర్వీస్‌ఆర్డరును గురించి కొంతచర్చ జరిగెను.

పే——అయ్యో, కళ్యాణరావుగారూ! ఈయూరి కలెక్టరుగ క్రొత్తగా వచ్చియున్నారే వారు మిగుల కరుణార్ద్రహృదయులైన ట్లున్న దండీ. వీనివృత్తాంతము ఎవ్వరికిని తెలిసి నట్లు లేదు.

కళ్యాణరావు——వాటీసార్! వీడిసంగతి నాకు తెలుసును. పది పదునారు సంవత్సరముల క్రిందట వీడొక పేదమాలవాడట. మన రంగరాయశాస్త్రులవారు చెప్పడంచూస్తే వీడెవ్వరో మనఆఫీసులోనే కొద్దిరోజులు జమానుకానిచేసినట్టున్నది కూడాను. అది మాత్రం నమ్మడానికి లేకుండా వున్నది. ఇంకా ఆయన చెప్పడంలో ఎవరో గుమాస్తా దబాయిస్తే వీడు రాజీనామా యిచ్చి పోయి ఎక్కడనో ఒక ఆంగ్లోయిండియన్ దొర దగ్గరచేరి వృద్ధికివచ్చినట్టు చెప్తాడు. వీడిపేరు గంగులుగాడట మొట్టమొదట. ఏమియేమో ఎవరికి తెల్సు.

ఈమాటలు దీక్షితులుగారు వినుట తోడనే ఏదో సాకుచెప్పి మిత్రబృందమును వీడి త్వరితముగా గృహోన్ముఖుడై యిల్లు చేరెను. చేరి తనగదిలో 'యీజీచేర్' మీద వ్రాలి యిట్లు తనలో చింతింప దొడంగెను :— "ఔను!! వాడే వీడు."

కట్టా! నే నెంతపాపాత్ముడను. వాని, నే నిరాకరించినను, మహోదారస్వభావుడై న న్నెంతసన్మానించెను; నాకెంత మహోపకార మొనర్చెను! మాలవాడని వీని నే నెంతగ దూలనాడితిని. వాడాదినమున నుడివినట్లు నేను వీనికి గుడ్‌మార్నింగు చేసి గులామును గాలేదా! అయ్యో! బ్రాహ్మణుడనైన నాతెలివి కన్న పంచముడైన వీనితెలివి వెయ్యిరెట్లెక్కువగ నున్నదే! దైవమున కొకరెక్కువ గను, మరొక్కడు తక్కువగను ఉందురా! ఆనాడు నేనెంత త్వరపడితిని! బ్రాహ్మణత్వమున జేసి గర్వించితిని. గుణము ప్రధానము గదా! కులమున హీనుడైనను వానికెట్టి యుదారబుద్ధి సర్వేశ్వరుడు ప్రసాదించెను.

"కలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు;
కులము ప్రధానమే గుణము లేకున్న!"

---

# మధుపము

శ్రీ రాజా వాసిరెడ్డి దుర్గా సదాశివేశ్వర ప్రసాద బహద్దరుగారు

కవి కుమారులకు లోకక్రొత్త కావ్యవనము
నాకుచున్నారు నేఁడెందుఁ జవులు లేని
వాసనలులేని పువ్వుఁదీగ లేనరేగు
చుండె నటు పోకు నీగాన దంపుగగును.

తీపులం బెక్కు తెఱఁగులు తెలియు నీకు
మధురగాన మెఱుంగుదు మధుపరాజ!
కమ్మనగు పుష్పరస మాని జుమ్ముమనుచుఁ
బోడుచుండకు మీ ప్రాఁదోఁటబాటఁబట్టి

వర్ణవైభవమాత్రాన వార్త కెక్కు
లతలదరి నీవు రసలుబ్ధమతిఁ జరింపఁ
బోవ భ్రమరమా, సుఖపడఁబోవు నీవు
బేలుపడుదురు నీచేతఁ బెక్కు రింక.



# శివాజీ మహారాజు - రామదాసు*

ఆలూరు హనుమంతరావు గారు, బి. ఏ., యల్. టి.,

అక్బరుచక్రవర్తికాలమునుండి షాజహాను మరణమువఱకును మొఘల్ సామ్రాజ్యము నిరాతంకముగ సాగినది. ఈచక్రవర్తిత్రయకాలములో సామ్రాజ్య మత్యున్నతస్థితియం దుండెను. వీరలశౌర్య మప్రతిహతము; వైభవ మసమానము. ఇమ్మహాచక్రవర్తుల ధర్మనిరతబుద్ధియే సామ్రాజ్యమునకు మూలముగా నుండెను. జాతిమతవైషమ్యరాహిత్యము, ప్రజాపాలనమందు సమదృష్టి, హిందువులయం దనురాగము, వీరాగ్రేసరు లగు రాజపుత్రులతోడి సఖ్యము—ఇవియే వీరి ముఖ్యాశయములు.

ఔరంగజేబు ఢిల్లీసింహాసనమెక్కెను. అతని యాశయములు వేఱు. సున్నీముసల్మను మతమే శ్రేష్ఠమనియు, మోక్షదాయకమనియు నతఁడు తలఁచెను. హిందువులు విగ్రహారాధకులు, కాఁబట్టి శిక్షార్హులు. వీరల దేవాలయములు అసహ్యకరములు; అపవిత్రములు. దానంజేసి, వీనిని బడఁగొట్టవలయును. ఇట్టి యభిప్రాయములు గలవాఁ డగుటచే నతనికాలమందు హిందూమతమునకు, హిందూధర్మములకు, హిందూస్వాతంత్ర్యమునకు దుర్దశ సంభవించెను. ధర్మయుక్తములైన మొదటియాశయము లడఁగంటెను; అధర్మము ప్రబలెను; జాతిమతవైషమ్యము హెచ్చసాగెను. హిందువు లత్యంతహేయమైన జిజ్యా లేక జుట్టుపన్నుకు లోఁబడిరి.

ధర్మరక్షణార్థము భగవంతుఁడు శివాజీ మహారాజును బుట్టించెను. హిందూమతధర్మములను, హిందూస్వాతంత్ర్యమును, గోబ్రాహ్మణులను రక్షించెద నని దీక్షవహించిన శూరాగ్రేసరుఁ డీశివాజీమహారాజు. ధర్మమార్గమును వీడిన ఔరంగజేబుయొక్క గర్వనిర్వాపణముఁ జేసిన శౌర్యధుర్యుం డీ శివాజీ మహారాజు.

ఒక్కనాఁడు శివాజీమహారాజు భావి కార్యక్రమాలోచనాపరవశుఁడై రేగఢ్ దుర్గములోఁ దనభవనమందుఁ గూర్చుండియుండెను. ఈతని హృదయమందలి యభిప్రాయములను, ఆశయములను గ్రహింపఁగలవా రొక్కరిద్దఱుమాత్ర ముండిరి. అందఱికీతని హృద్గతాభిప్రాయము లెట్లు తేటపడఁగలవు? ఎట్లు

* ఈ వ్యాసమున కాధారము 1911-వ సం. మార్చినెల సి. హెచ్. సి. మాసపత్రికయందుఁ బ్రకటింపఁబడిన "శివాజీ—రామదాసు" అను చిన్నవ్యాసము.

వ్లిష్టిచేయఁగలఁడు? హిందూసామ్రాజ్యస్థాపనము, హిందూధర్మరక్షణము, అధర్మనాశనము—ఇవియే ఈతని జీవితాశయములు. సామ్రాజ్యస్థాపనకర్మదీక్షామగ్నుఁడై యుండ "జయజయ రఘువీర సమర్థ" యను తన గురువైన రామదాసుగీత మతనివీనులఁబడెను. ఆక్షణముననే శివాజీమహారాజు భక్తిపరవశుఁడై బయటికేగి, గురువునకు నమస్కరించి, నాతనిఁ దోడ్కొనివచ్చి సుఖాసీనుం జేసెను.

"పుత్రా! నీకు క్షేమమా? సర్వము ననుకూలముగ నున్నదిగదా?" యని మందహాసముతో రామదాసుఁడు శివాజీ నడిగెను.

"శ్రీరామభక్తవర్యులగు మీ యాశీర్వాదబలముండ క్షేమముతప్ప వేఱుండునా? మీసందర్శనముచే మామనోవ్యథలు, కొఱంతలన్నియును దీఱును! మిమ్ముఁ జూచు భాగ్యము మాపూర్వజన్మకృత పరిపాకంబుచేఁ గాక లభింపఁజాల"దని శివాజీ సవినయముగా నుడివెను.

"నీమానసంబులో నేకొఱంత లేదని విని చాల సంతసమాయెను. భిక్షయిమ్ము. ప్రతిదినభిక్షాటన మున్నదిగదా మాకు?"

మాఱుమాటాడక శివాజీమహారాజు లోపలికివెళ్లి, త్వరలోఁ గాగితములకట్ట నొకటినిదెచ్చి రామదాసుని వస్త్రములో నునిచెను.

ఆశ్చర్యమగ్నుఁడై రామదాసు, "ఇదేమి?" అని యడిగెను.

"ఇదినఱకును నేను సాధించిన జయపత్రములివి. నాసర్వస్వము మీయదియ. మీ కర్పించియున్నాను. కావలసినది చేయుఁడు. ఇవితప్ప వేఱొండు మీకియ్యఁజాలను. వీనికంటె నెక్కుడు నాయొద్ద లే"దని శివాజీ మిక్కిలి భక్తితో నుడివెను.

శిష్యుఁడగు శివాజీమహారాజుయొక్క ధర్మానురక్తియును, సంపూర్ణస్వార్థత్యాగమును, కర్మదీక్షయును, కర్మఫలములయందు విరక్తియును గని రామదాసుఁ డపరిమితానందకందళితహృదయుఁడై శిష్యుని వీపును దట్టుచు నిట్లనియె.

"శివబా! తాపసులకు రాజ్యమెందులకు? మేము మాసర్వస్వముఁ ద్యజింపవలయును గదా! భిక్షువునకు సామ్రాజ్యపదవియా? ప్రాణాధారమునకుఁ బిడికెడు బియ్యము



ఆశ్చర్యమగ్నుఁడై రామదాసు "ఇదేమి?" అని యడిగెను.



1200 సంవత్సరములకు ముందు ప్రసిద్ధమయి యుండిన బ్రాహ్మణాబాదను పట్టణమున ద్రవ్వబడిన కాచెంబు. నీలవర్ణము గల గాజుతో చేయబడి పైన పింగాణిపూత వేయబడినది. పింగాణిపూత చాలభాగము పోయినది. ఇది నిజమైన పరిమాణమునకు రెండురెట్లు పెద్దదిగా నున్నది.

చాలదా? ఇతరులకు జ్ఞానోపదేశము చేయుటయే మాపవిత్రకృత్యము. నీవు నా కొసరించిన గౌరవమున కెంతయు ముదమందితి; నీభక్తికి మెచ్చితి. నీవు మహారాష్ట్ర సామ్రాజ్యపరిపాలనమున కత్యంతార్హుడవు. ఈజయపత్రములను నీవతీసికొనుము. నాకివి నిష్ప్రయోజనములు."

"ఇచ్చినదానిని మరలదీసికొనను. తీసికొన్న క్షత్రియధర్మమునకు విరుద్ధముగ నడచిన ట్లగును. జయపత్రము లిప్పుడు మీయవి" అని శివాజీ నొక్కి చెప్పెను.

"అట్లయిన, నీబహుమాన మంగీకరించితి. రాజ్యభారమును నే వహింపజాలను. కాఁబట్టి నీవు నాపేరఁ బాలింపుము. రాజ్యము నాయది. నీవు నాప్రతినిధివని తెలుపుటకు నీపతాకము సన్న్యాసియుడుపుచాయ గలదిగా నుండని" మ్మని రామదాసుఁడు శివాజికిఁ జెప్పి యతనిని దీవించి వెడలిపోయెను.

అప్పటినుండియు శివాజిమహారాజు కాషాయాంబరపతాక ముపయోగించెనని చెప్పుదురు. ఔరా! ఇదిగదా గురుభక్తి! ఇదిగదా స్వార్థత్యాగము! ఇదిగదా కర్మదీక్ష! ఇదిగదా కర్మఫలమందు విరక్తి! రాజ్యమును మరల శివాజి కిచ్చుటయం దతస్యసామాన్య లోకోపకారబుద్ధి వెల్లడించెనుగదా రామదాసుఁడు!

మహారాష్ట్రులు తమసామ్రాజ్యము రామదాసుని యనుగ్రహమువలనఁ గలిగినదని జ్ఞప్తియం దుంచుకొన్నంతవఱకు, వారల రాజ్యలక్ష్మి యత్యున్నతస్థితియందుండెను. ఈవిషయమును మఱచి, వారెప్పుడు ధర్మమార్గచ్యుతులైరో, స్వార్థపరాయణులైరో, యప్పటినుండి వారల సామ్రాజ్యము క్షీణించుట కారంభించెను; అప్పటినుండి వారలకును, ఇతరులకును వ్యత్యాస మగపడలేదు.

# ఆ వృ త్తి

శ్రీ వేదుల సత్యనారాయణ శాస్త్రి (సాహితీసమితి)

ఆ ప్రశాంత నిశాజరరాంతమందు
　　కలత యెరుగని నిద్దురగాంచి యున్న
గౌతమీనది నా మనోగత విషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె.

ఆనదీసైకతముల నాయడుగుజాడ
చెరిపివేయగ వెనువెంట పరుగుదెంచు
గాలితరగల చల్లనికడుపులోన
కన్ను మూసెను నాయూర్పు గాడ్పులెల్ల.

చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగువిషయంబులను దటస్థముగ నాయ
నంతగగనమునందుండి యరయుచుండు
తారలె మదస్రుకణముల నేరుకొనియె

నేనె మిగిలితి నీగౌతమీనదీ ప
విత్రగర్భంబులో మ్రోతవెట్టుచున్న
యుగయుగాంతర విశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పుకొనగ.



# ముఖలింగ నగరము

భావరాజు వేంకటకృష్ణారావు గారు, బి. ఎ., బి. యల్.
[ఆంధ్ర దేశీయేతిహాసపరిశోధకమండలి]

[వెనుకటి సంచిక తరువాయి]

పిమ్మట సింహద్వారమును దాటి కుడియొక్క ముఖమంటపమును ప్రవేశింతుము. ముఖమంటపమునే ఆస్థానమంటపమని యందురు. ఆముఖమంటపమునం దారు జాతికంబములు శిఖరములు లేనివి మూడేసి చొప్పున రెండువరుసలుగ నున్నవి. వీటిపై మంటపము యొక్క కొప్పు నిలచియున్నది. తూర్పువైపున నున్న సింహద్వారముగాక ఆస్థానమంటపమునకు దక్షిణపువైపునగూడ నొకద్వారము కలదు. అయ్యది గర్భకోవెలకు సమీపముగా నున్నది. ముఖమంటప మారుగజముల వెడల్పును, ఆరుగజములు పొడవును గల్గి చతురముగా నున్నది. కంబములపై శిల్పపుపనులు లేవుగాని శాసనములు అసంఖ్యాకములుగ నున్నవి. వీటిపై నేటేట పూయబడు సున్నపుపూతవలన నవి గానబడకున్నవి. ముఖమంటపమునందు లోపలిగోడభాగముమీద చిత్తరువులుగాని, శిల్పపుపనులుగాని గానరావు. కాని, యెచ్చటనుండియో కొనిరాబడి యచ్చటనుంచబడినట్లుతోచెడు కొన్ని శిలావిగ్రహములుమాత్రము గానవచ్చును. వాటిలో ముఖ్యమైనవి చాలభాగము వైష్ణవాంశములయిన విగ్రహములుగ నున్నవి. మంటపమునందు, మేము ప్రవేశించినపుడు మాకుడివైపున త్రివిక్రమావతారము గాన్పించెను. బలిచక్రవర్తిని దానమడుగ నేగుదెంచిన వామనుడు విక్రమించి యొకపాదముతో భూమిని, రెండవదానితో స్వర్గమును ఆక్రమించి, మూడవదానిని బలిచక్రవర్తి శిరముపైనుంచి పాతాళమునకు అణచివేయు భీమరూపమునకు త్రివిక్రమమని పేరు. త్రివిక్రమమూర్తికి కుడివైపున నొకజాతి పలకపై వరాహమూర్తి విగ్రహమున్నది. ఈ వరాహమూర్తికిని, దక్షిణదేశమున గానబడెడి మూర్తికిని చాల వ్యత్యాస మున్నది. ఈవిగ్రహమునకు నాలుగు చేతులు గలవు. అందామె మీదిరెండుచేతులందును, భూమిని గాబోలు గట్టిగాపట్టుకున్నట్లు గలవు. క్రింది రెండుచేతులలో కుడిదానియందు చక్రమును, ఎడమదానియందు శంఖమును గలవు. వరాహమూర్తిక్రింద యిరువురు నాగకన్యలు చిత్రింపబడియున్నారు. వీరు అమరావతిస్తూపమునందు గానవచ్చు నాగకన్యల విగ్రహములబోలి యున్నారు. వీరికి బొడ్డుమీదనుండి మనుష్యరూపము, తలకు వెనుక పాముపడగ యుండును. క్రిందభాగము, పాము శరీరముగా నుండును. ఈప్రదర్శనములోని యొక నాగకన్యచేతులందు తామరపద్మమున్నది. దానిపై వరాహమూర్తి యెడమపాదముంచినాడు. రెండవనాగకన్య తన హస్తములతో కుడికాలిపిక్కను బట్టుకొనియున్నది. వరాహమూర్తికావల సూర్యనారాయణమూర్తి విగ్రహము కలదు. సూర్యనారాయణమూర్తికి శిరమువెనుక తేజోవంతమయినబింబముంచబడినది. రెండుచేతులందును దివియలున్నవి. అవి యొకటి ఎర్రదీపమును, రెండవది తెల్లదీపమును సూచించును. ఈవిగ్రహమునకు కుడివైపున గరుడనారాయణునిమూర్తి యున్నది. గరుడునిపై నారాయణుడధివసించియున్నవేళ విష్ణువుగరుడనారాయణుడన బరగును. ఈదేవాలయము శైవక్షేత్రమగుట బట్టి విష్ణువు, పద్మనాభుడను పేరుతో, లక్ష్మీసమేతుడై, క్షేత్రపాలకుడుగా నున్నాడు.

ముఖమంటపమునందు రెండవవైపున మనోహరమైన సరస్వతీవిగ్రహ మొకటియున్నది. మొదట నది అక్కడిది కాదనియు, ఊరిచివర నొకరు పొలముదున్నుచుండగా దొరికెననియు, నంతట దాని దీసికొనివచ్చి యిట

నుంచిరనియు స్థానికులు చెప్పియుండిరి. ఆసరస్వతి, నేడు వల్లలనాడు అభంగముతో సుఖాసీనయై యున్నది. ఆమె 'మహాంబుజ' మనుపీఠముపై నధిష్ఠించి యున్నది. ఈ విగ్రహపుచిత్రము నెత్తించితిమి. చదువరియిచ్చట దానిం జూడగలరు. ఈసరస్వతి విగ్రహము సాధారణముగా మనకు గనబడునట్టిది కాదు. ఈమెను బౌద్ధులు, బ్రాహ్మణులు, తాంత్రికులుకూడ నుపాసింతురు: కేవలము వాగీశ్వరికాదు. కాని వాగీశ్వరీలక్షణములుకల్గియు భయంకరస్వరూపిణిగాం, సుంపిరవదనయై, మండస్మితము పెదవులపై దోలకాడ, నిమీలితనేత్రయై మోహనముగ నుండు "సౌభాగ్యవాగీశ్వరి"యేమో యని సంశయము గొలుపుచున్నది. ఈ "సరస్వతి"యందు, శైవపరము లయిన లక్షణములు కొన్ని గాన్పించుచున్నవి. శిరము నందు కెంజడ, శివునిజటామకుటము వలె నమర్చబడి యున్నది. ఆజటామకుటమున పెడమవైపున చంద్రకళ యు నున్నది. ఈసరస్వతి ముంజేతులతో వీణ వాయించుచున్నది. వెనుకనున్న హస్తములలో నొకదానియందు పుస్తకమును రెండవదానియందు కమలమును బట్టుకొని యున్నది. ఈవిగ్రహము మంచిస్థితియందున్నపుడెంత అచ్చెరువు గొల్పుచుండెనో కాని, యా చిహ్నములు కొన్ని యిప్పటికిని గానగును. శిల్పియు చిత్రకారుడు నగు కాసెవాడు ఈతాతిబొమ్మపై తన పనితనమును నేర్పుగా జూపినాడు. దీనిపై తొలుతి నున్నని పాలగచ్చును, అందుమీద జీవకళలూరు రంగు లుండినట్లు కనబడుచున్నది.

ముఖమంటపమునంటి గర్భకోవెల యున్నది. ఇం దాశ్చర్యము గొలుపువిషయములు రెండు కలవు. అందు మొదటిది ముఖలింగేశ్వర లింగము. ఇది సాధారణముగా మనముచూచు శివలింగములవలె నుండదు. సాధారణముగా లింగములు నల్లజాతితో నునుపుగా నుండునట్లు చేయబడి పానవట్టమునం దమర్చబడియుండుట మన మెల్లరు నెఱిగినవిషయము. కాని ఈలింగ మట్లుగాక తెల్లనిశిలవలె గాన్పించుచు, వెనుకప్రక్క మామూలు ప్రకారమే యుండి, ముందువైపున లీనముగా నేత్రములు, ఫాలము, నాసిక, ముఖరూపము గలిగినట్లుగా గాన్పించును. అది శిలయేయగనో కాదో తెలియదు; కాని, దానిపై నల్లని మచ్చ లున్నవి. స్థానికుల, ఆదర గౌరవములవలనను, మేము గర్భాలయమును బ్రవేశించి, శివలింగమును స్పర్శించుటతప్ప, మిగిలిన పరీక్ష నంతయు చేసితిమి. మధుకవృక్షమునం దావిర్భవించినాడని క్షేత్రమాహాత్మ్యము పల్కుటచేసి, యా లింగము మధుకధారు నిర్మితమేమోయని సందేహము నొందితిని. కాని ధారా[illegible], [illegible]? [illegible] కేశ్వరునకు, ముఖలింగేశ్వరునకు [illegible] లింగము [illegible] యని అనుకొనుచున్నారు. అచ్చట [illegible] జయంతీశ్వరుడనియు, [illegible] మాంతరము లుండెను. [illegible]! [illegible] నకు జయంతపురమని పేరుండెనట, జయంతీశ్వరుని పేరు ఈ దేవళమునకు [illegible]. [illegible], గాంగులకు, [illegible] శ్వరుడు కలడనుటచే సోమేశ్వరస్వామి యని యను గూడ ప్రతిష్ఠించబడియున్నదని మేము భావించుచున్నాము. పశ్చిమగాంగుల రాజధానియైన [illegible] ప్రాంతమున నొక సోమేశ్వరస్వామి ఆలయము కలదనియు, పశ్చిమగాంగులవలెనే తూర్పుగాంగులు పూర్వదేశభాగమును పాలించుచుండినపుడు వారు [illegible] సోమేశ్వరుని గాంచిరి, తొలుత మహేంద్రగిరిపైనను, పిమ్మట, జయంతపురమునకు సమీపమున [illegible] స్థానమందును ప్రతిష్ఠించియుందురు. నా యభిప్రాయము సరియైనచో, ముఖలింగేశ్వరునకు సోమేశ్వరుడను నామాంతరముండుటకు కింకొక కారణాంతరముండెను—ఈ విషయమింకను ముందు పరిశీలింపబడును.

గర్భాలయమునందు లింగమునకు వెనుక నొక పెద్దమట్టిబాన గలదు. దానిని బాన అనుటకంటె పెద్ద అనుట మంచిదని తోచును. స్వామి నభిషేకించుటకు జలమును దానియందు పోసి యుంచుదురు. అది మిక్కిలి బరువు గలదై, సుమారు రెండడుగులు లోతును, అయిదడుగులు నడిమివెడల్పును గలదై యున్నది. మట్టి పెంకు బిళ్ళసరియై, రెండంగుళము లున్నది. అది నోరవారిజిల్లా యందు, బెల్లమువండుట కుపయోగించు, పెనుక "పెనము"ను బోలియున్నది. ఈపెనమునుగూర్చి స్థలజ్ఞులు, మాకొకమాహాత్మ్యమును జెప్పిరి. ముఖలింగేశ్వర దేవరకు భక్తిపరవశుడైన కుమ్మరియొకడు, ఇట్టి పెనములను రెండింటిని చేసి తీసుకునివచ్చెనట. అంతకుపూర్వమే గుడి కట్టుట పూర్తియయిపోయినందున, నవి, గర్భాలయమును జేరునుపాయము లేకపోయెను. ఒకదాని నాతడెట్లో లోపలకు ప్రవేశపెట్టవలయునని ప్రయత్నించెను. కాని, పాపము, వానిదౌర్భాగ్యమువలన నది విచ్ఛిన్నమై పోయెను. అంతట నాతడు, చింతాక్రాంతుడై, కష్టపడి చేసి తీసుకొనివచ్చిన పెనములలో నొకటి వ్యర్థమయ్యెగదాయని వగచుచు నాలేయెల్ల గడపెను. కాని, భక్తవత్సలుడైన పరమేశ్వరు నాతని

భక్తికి మెచ్చి, కరుణాళుడై, యేశ్రమయు లేకుండ రెండవ పెనము గర్భగుడిలోనుండునట్లు గావించెనట. ఉదయమున కుమ్మరి దైన్యముఖముతో వచ్చుసరికి తన యభీష్టము నెఱవేరియుండెను. ఈకథ యంతయు విచిత్రము, విశ్వసించువారికి మహత్తువలె గన్పట్టును. కాని యిలా కళ్ళ గోచరింపలేదు. మేము గర్భాలయపుద్వారబంధము యొక్క ఎత్తు వెడల్పులు కొలిచి, యానపును, ఈ పెనము నిలువబెట్టి చక్రమువలె నడపించిన దూరగలదా యని పరీక్షించి చూచితిమి. ఆపని సులభసాధ్యముగాదు, కాని ఒక్కమ్మడి యిరువదియైదుగురు మనుష్యులయినను ఎత్తినగాని కదలని యా పెనమును, లోపలి కెట్లు తీసికొనివచ్చిరో యదియు నాశ్చర్యకరమగు విషయమే కదా! అందువలననే ప్రాకృతజనులు దానిని మాహాత్మ్యముగా విశ్వసింతురు.

ముఖమంటపముయొక్క వెలుపలి గోడమీద విగ్రహము లనేకములు చెక్కబడి యున్నవి. కాని అట్టివి గర్భాలయముయొక్క వెలుపలి గోడమీద లేవు. మేము వాటినన్నిటిని బరిశీలించి చూచితిమిగాని, అందు కొన్ని మాకు గ్రాహ్యములు కావయ్యెను. శిల్పశాస్త్రము తెలిసియు మాకడ నప్పుడు అందుబాటులో లేకపోవుట వలన, మేము జూచిన విగ్రహముల రూపకల్పననుబట్టి నామమును నిరూపింపలేకపోతిమి. తెలిసినవాటిని మాత్రము నిరూపించితిమి. ముఖమంటపములోనుండి, దక్షిణపువైపునకు వెళ్ళి ప్రాకారములోనికి సుమ్ముముండెనని తెలిపితిమి గదా! ఆ సుమ్ముదగ్గరనున్న రూపములను ఏడెనిమిదంటిని ఇచట వివరించెదము. దీనినిబట్టి మిగిలిన వాటిని గూర్చి చదువరి యూహించుకొనవచ్చును. సుమ్మునకు పడమటి వైపున, శివునిరూపమొకటి గానవచ్చుచున్నది. ఆ రూపమునకు పండ్రెండు చేతు లున్నవి. ఊర్ధ్వరేతస్కుడై నృత్యముచేయుచున్న యామూర్తి నటరాజస్వామి యని మే మూహించితిమి. ఈమూర్తిచిత్రమును చదువరి వేరొకచోట గాంచగలడు. సుమ్మునకు తూర్పు వైపున వరుసగా నేడు విగ్రహము లున్నవి. ఇవి, దక్షిణ హిందూదేశపు శిల్పసంప్రదాయముతో సంబంధము లేని కతనను, మాకుత్తరహిందూస్థానపు శిల్పముతో పరిచయము లేనికతనను, వాటి నామరూపనిర్ణయము సరిగాక పోవచ్చును. తూర్పువైపుగా నున్న విగ్రహములలో మొదటిది మాకు 'నటరాజస్వామి'గా దోచెను. ఆ విగ్రహమునకు పండ్రెండు బాహువులు గలవు. తాండవరూపియై, ఊర్ధ్వరేతస్కుడైయున్న ఆ విగ్రహమునకు ఇరుప్రక్కల నిరువురు స్త్రీ లున్నారు. వారిరువురును, గంగా, పార్వతులయియుండురని మా యూహ. ప్రక్కనే నందియు నున్నది. తలపై పరివేషము గలదు. మిగిలిన రెండు చేతులందును పతాకలువిప్పిన చాపము లున్నవి. ఈ విగ్రహముతరువాత ఉగ్రనారసింహ విగ్రహ మున్నది. కాని యుగ్రనరసింహావతారము నెత్తిన శ్రీ మన్మహావిష్ణువును న్యూనపఱచుటకై శరభమూర్తిగా శివు డవతరించినట్లు "కారణాగమము" తెలుపుచున్నది. అట్లయినచో నీమూర్తి శరభమూర్తియొక్క రూపమని నిశ్చయింపవచ్చును. దీని తరువాత విగ్రహమునకు నాల్గుచేతులు గలవు. ఈమూర్తి సింహముపై ఊర్ధ్వరేతస్కుడై నిలువబడి యున్నాడు. ఉభయపార్శ్వములందును, పార్వతీగంగాదేవులు గలరు. మీదికుడిచేతియందు త్రిశూలమును, యెడమదానియందు పరశువును క్రింది కుడిచేతియందు అక్షమాలయు, నెడమదానియందు కపాలమును గలవు. కుడిభుజముపై నాగమొకటి పడగ నెత్తిపెట్టుకొని యున్నది. ఈ భయంకరాకారమును, మేము పశుపతిమూర్తిగ్రహింప గుర్తించితిమి. క్రీ. పూ. రెండవశతాబ్దము నందు భండార్కరుగారి మతమునుబట్టి పాశుపతశైవోపాసన ఆరంభమయ్యెను. "శిల్పసార"ములో వర్ణింపబడిన పాశుపతమూర్తికి పదిచేతులు ఐదుతలలుగలవు; కాని కొన్ని ఆగమములు ఒకతలయు, నాల్గుచేతులను మాత్రము తెల్పుచున్నవి. పాశుపతమూర్తి భయంకరరూపమైయుండును. కాని యుపాసకు లా సౌమ్యరూపమున రూపకల్పన జేసికొని యుపాసింతురు. ఆ సౌమ్యరూపము మందస్మితవదనము గల చంద్రశేఖరుని బో యుండును. ఇప్పుడీరూపము, చంద్రశేఖరుడైన గావలయును. లేకున్న సౌమ్యపాశుపతమూర్తియైన గావయును. ఈ పాశుపతమూర్తి ప్రక్క భీమస్వరూపమైన నటరాజు గలడు. ఆతనికి నాల్గుచేతులు గలవు. త్రిభంగములతో, నూర్ధ్వరేతస్కుడై నర్తన సలుపుచున్నాడు. మీదికుడిచేతియందు అక్షమాల యున్నది. మీది ఎడమ చేయి, ఒక స్త్రీరూపముపై నుంచబడియున్నది. క్రింది దక్షిణహస్తము, వరదముద్రను సూచించు కమలమును బట్టుకొని



3. కుమారస్వామి (సోమేశ్వరాలయముయొక్క విమానముపై నొకగూటియందున్నది)



౪. బుద్ధవిగ్రహము-భూమిస్పర్శముద్ర

యున్నది. ఎడమచేతియందు కపాలమున్నది. ఈమూర్తికి కుడిప్రక్క ఎడమకాలు వంకరించి యొక స్త్రీ ప్రార్థించుచున్నది. ఎడమప్రక్కనుగూడ నొక స్త్రీవిగ్రహము నిలువబడియున్నది. దీనికావల, వరాహమూర్తివిగ్రహమున్నది. దానికి నాల్గుచేతులు, ఎడమమోచేతిపై భాగమున భూదేవి స్త్రీరూపిణియై అధివసించియున్నది. మరియొక చేయి, భక్తినమ్రుడై నిలువబడియున్న యొకపురుష వ్యక్తిపై నుంచబడి యున్నది. దీనితరువాతిది డాకిని వరుణి యను పరిచారికలుగల దుర్గాశక్తివలె గానుపించుచున్నది. దాని కావల కుమారస్వామి విగ్రహముగలదు.

ఈరీతిగ, ముఖమంటపమునకు రెండువైపులను, పరశైవరూపము లయిన ఏకాదశరుద్రరూపములు అష్టమూర్తులు, లీలామూర్తులగు పంచదేహమూర్తి, దక్షిణామూర్తి, లింగోద్భవుడు, ఏకపాదమూర్తి, భిక్షాటనమూర్తి, ఉమామహేశ్వరుడు, చంద్రశేఖరమూర్తి, అర్ధనారీశ్వరుడు, అఘోరమూర్తి, రక్షోఘ్నమూర్తి, భైరవుడు, కాలభైరవుడు, పాశుపతమూర్తి మున్నగు నవెన్నియో కలవు. వాటినన్నింటిని మేము, బరిశీలించుట కవకాశము లేకపోయినది.

ఆస్థానమంటపమునుండి దక్షిణద్వారమున వెలికి వచ్చినపుడు, పైని, యొక్కశిల్ప ప్రదర్శనము, మాదృష్టి నాకర్షించెను. అందు పార్వతీపరమేశ్వరులు జూదమాడుచు వినోదముగా కాలము బుచ్చుదురు. పాచికలాడుటలో పాటవము లెక్కువైన, శివుడు పందె మోడిపోవుచుండెను. తుదకు తనకున్న దానినంతయు నోడుటయేకాక, తిరిపమెత్తుకొను నాభూతభర్త, వాహనమయిన నందినిగూడ నోడ్డియోడెను. అంత పార్వతి చెలికత్తెలు జయముగాంచిన సంతోషముతో, నొడలెఱు గనియానందముతో నందిని తోలుకొని పోవుచుందురు. పతియు, దీనవదనుడై చిన్నబోటుతో దిలకించుచుండును. ఈశిల్పము నెంతచూచినను, మాకు తనివితీరలేదు. వెలుతురు చాలనందున చిత్రపటము తీయజాలమైతిమి.

గుడికిచుట్టును ప్రాకారముగలదు. అందు అష్టదిక్పాలకుల దేవాలయములు గలవు. ఇంద్రుని దేవాలయపు గుమ్మముపై సారువబిళ్లమీద సూర్యభగవానుడు రథారూఢుడై వెడలుచున్నట్లును, అనూరుడు సప్తాశ్వములను పగ్గములతో బట్టి [illegible] నడుపు [illegible] చెక్కబడియున్నవి, [illegible] ఇరువైపుల [illegible] తెనము, అల్లూర్వమున [illegible] యున్నది. ఈ గుడికి, [illegible] ప్రాచీనకాలపు [illegible] చేతియందు [illegible], [illegible] లన్నియు, [illegible] యున్నవి. [illegible] పులను [illegible] ప్రాచీన[illegible]. ఈ [illegible] చిత్రించబడిన [illegible] మాకు సంశయము తోచుచున్నది. [illegible] ప్రాచీన కాలమునాటిది. చిత్రించబడిన [illegible] విగ్రహము, [illegible] రుడు గానలయును. ఈ [illegible] వలయును.

అష్టదిక్పాలకుల గుళ్లు, సరిగా [illegible] లందు లేక, [illegible] చెడియున్నవి. మధ్య నొక కోట దక్షిణపువైపున వినాయకుని గుడియు, పడమటను గర్భగుడికి వెనుకవైపున కుమారస్వామి గుడియు గలవు. అష్టదిక్పాలకదేవాలయములలో, ఇంద్రుని దేవాలయముపై కొన్ని ప్రాచీనశాసనములు, వేంగి, పల్లవ, తెలుగు, కన్నడ లిపియందు గానవచ్చుచున్నవి. అవి ఛందోబద్ధములయి యుండినట్లు సంశయము దోచెడిని. వాటిలో "నృపతుంగ నరసింహుడు" అనునా పేరు చెక్కబడియున్నాది. అప్పుడు మావద్ద పరికరము లేనిదియు లేని కలిన శాసనములను ప్రతులెత్తించి సావకాశముగా చదువుటకు వీలు లేకపోయెను. ఎండకు ఎండి, వానకు తడిసి అక్షరములు అరిగిపోయి, స్పష్టముగా గానరానందున శాసనమును స్పష్టముగా జదువలేమైతిమి. ఈకుడివైపుంగ మున్న గుడి కెదురుగా నుత్తర దిక్కున స్వామికల్యాణమంటపము గలదు. దానిపై నిప్పటికిని ఉత్సవవేళలందు, పర్వవేళలందు స్వామికి సేవలు జరుపుచుందురు.

గుడి దక్షిణపువైపు ప్రాకారములోనుండి, యొక గుమ్మము గలదు. అందుండి, చెంతనేయున్న ఆంజనే

యాలయమును, దానికావల కొంతదూరములో నున్న మఠమును జూడబోయితిమి. ఆంజనేయాలయమును, మఠమును నవీనముగా గట్టబడినవే యయినను, వానిని కట్టుటకు, ప్రాచీనకట్టడములలోని శిథిలభాగము లుపయోగింపబడినట్లుగానవచ్చును. ఆంజనేయాలయమునందు ఒకరాతిపై యుద్ధరంగమునందు ఏనుగును డీకొనుట చిత్రింపబడియున్నది. బాణములు పరంపరగ వచ్చి గ్రుచ్చుకొనుచున్నను ఆమత్తేభము ఒకనిని తనకాలిక్రింద పెట్టి యణచివేయుచు, తొండముతో యుద్ధము సేయుచున్నది. దానిపై మావటీ డొక డాసీనుడై యున్నాడు. ఇదిగాక గర్భాలయపు వెలుపలిగోడమీద నుత్తరదిక్కు మొగమైయున్న చిత్తరువొకటి మాదృష్టి నాకర్షించెను. అందు మనుష్యుని మొగముగల మకరముపై కొందరు యోగులు, ప్రయాణము సేయుచున్నట్లును, మత్స్యసంతతియు జలమున్నట్లును చిత్రింపబడియున్నది. ఇందలి యైతిహ్య మేదియో గుర్తింపజాలకపోతిమి గాని దీనికి బౌద్ధులజాతకకథలతో సంబంధముకలదనిమాత్రము మాకు బొడగట్టెను. చిత్రమును చాలపురాణమైనది. కావున ఈవిషయ మింకను విమర్శింపవలసియున్నది.

ఇక నాసమీపముననున్న మఠములో మాదృష్టి నాకర్షించిన విశేషములు పెక్కులు లేవుగాని యున్నవి మాత్రము చాలప్రాచీనశిల్పము లయియున్నవి. మఠమునందొకచోట నొక మంటపముయొక్క సోపానముల పార్శ్వమునగల పిట్టగోడపై నొకశిల్పప్రదర్శన మున్నది. అందు లంబినీవనమును, మాయాదేవిప్రసవమును, బుద్ధుని జననమును గలవు. సిద్ధార్థుని యవతారమునకై వేచియున్న దేవతలు సాష్టాంగనమస్కారము లాచరించుచున్నారు. దేవతలను నిరూపించుటకు శిల్పివారిని ఆకాశమునందు అడ్డముగా పరుండబెట్టినాడు. ఈశైలి కడుంగడు పురాణమైనది. బుద్ధుని జన్మప్రకారమును పరిచారకులవలన శుద్ధోదనుడు గాబోలు దూరమునుండి వినుచున్నాడు. అతనిచెంత నొకస్త్రీవిగ్రహము ఆసీనురాలై, పెక్కుమంది పరిచారకులచేతను, ప్రతీహారులచేతను పరివృతయై దానములు చేయుచున్నది. మాయాదేవి, శిశువునకు, ప్రక్కలో పరుండబెట్టుకొని పాలిచ్చుచున్నట్టులొకచిత్తరువును, ప్రసవవేదనపడుచున్న ట్లొక ప్రదర్శనమును, బిడ్డనెత్తుకొని మాపంగుచున్నట్లును, దేవతలు పుష్పవర్షము గురిపించుచున్నట్లును, మారునియొక్క ప్రయోగమును గూడ నందే కలవు. ఈప్రదర్శనమంతయు నేకకథకు సంబంధించియుండునా యని చాలసేపు చింతించి తుదకు బుద్ధ జన్మకథగా నిర్ణయించితిమి. మఠమునకు నొక చిన్న పువ్వులతోటగలదు. అందు గోడలో నతికింపబడి యొక రాతిపలకపై పల్లవానుగ పీఠము నాయింగుచున్నట్లున్నది. ఇదియు మిక్కిలి మనోహరమైనదియును. మిగుల ప్రాచీనము.

ఇంతటితో ముఖలింగేశ్వరాలయము దర్శనము ముగించి, ప్రక్కనున్న భీమేశ్వరాలయమును సందర్శింపబోయితిమి. భీమేశ్వరాలయము, ముఖలింగేశ్వరాలయమునకు నాలుగుజాములదూరమున నున్నది. అంతయు శిథిలావస్థయందున్నది. గోపురమును, ప్రాకారమును దప్ప మిగిలినవంతయు కూలిపోయినవి. దేవాలయమునం దొకత్రాచుపాము నివాసముగా నున్నదని యచటి పూజారివారు తెల్పిరి, మాతోడ రాలేదరి. కాని, మేము నిర్భయముగా నందు ప్రవేశించితిమి. భీమేశ్వరాలయమునకును, మధుకేశ్వరాలయమునకును ఏమియు భేదము లేదు. ఈగుడియు, ముఖలింగేశ్వరాలయము మాదిరి పూర్వదిశాభిముఖమై యున్నది. ముఖమంటపమునకు గల గోడలమీదను, కంబములమీదను, ద్వారములమీదను, దండనాథ ప్రహస్తుని నాటివి, అనంతవర్మ చోడగాంగ దేవుని నాటివి శాసనములు పెక్కులు గలవు. అవిఅన్నియు నాంధ్ర భాషయందే కలవు. సింహద్వారముమీదనున్న శాసనములలో నొకదానియందు:

"ప్రోలినాయకు ఎఱమనాయకునింటి
కొడుక్కు శ్రీకరణగంగవిద్యాధర
దేవరాశ్వరుండైన సొమ్ములరేవల
సంధివిగ్రహారేచన పెట్టిన అఖండదీప
దీప ౧. నే మాడా ౫"

అనియున్నది. ఇందలి సంధివిగ్రహారేచన కవిజనాశ్రయ కృతిపతి యేమో యని మాకు సంశయముతోచెను. దాని క్రిందనే "తిరువాండి" యను ఒకని శాసనము, రాజరాజ దేవరపూంతుఋది యొక శాసనము పెక్కులు గలవు, మంటపమునందు కుడివైపున రెండు విగ్రహ

గానవచ్చుచున్నవి. అందొకటి తారాశక్తి గూ యూహించితిమి. రెండవ కుమారస్వామియని ంపగలిగితిమి. గర్భాలయమునందు శివలింగ ది. నల్లసానర యితో నున్నగా చేయబడి నిగనిగ న్న లింగ మొకటి యగు శివుడు ఇక్కడ అణ్యాంక గుడని వ్యవహరింపబడుచున్నాడు. ఇంద్ర నీల చీకటియందు కాంతు లీనుచు ప్రకాశించు డు. మంటపమునకు ముఖలింగేశ్వరాలయము దక్షిణమున ప్రాకారములోనికి గుమ్మము అన్నిట ననేక శాసనములున్నవి. ఈశాసనములం మాచిన జయంతపురమందు వెంచేసియున్న ఖేశ్వరమహాదేవరయని ప్రస్తుతింప బడుటచే అణియంక భీమేశ్వరుడనువే రున్నట్లూహించి అణియంక' అనుపదమున కర్థమేదియో, మాకు లేదు. ఇది సరియగుటగా మే మూహింతుము. గానియందు " అనియంకభీమ " యనునది గుపమునగా గోచెను. నాదిండ్లపురవరాధీశ్వ కొంపదుమ చిననంశప్రవహా మండలేశ్వరులు, భీము' అని చెప్పుకొనుచుండుట ప్రసిద్ధము. ఈదేవాలయమునందలి శాసనములు మేము తొం పరీక్షించినపు డొక వింతవిశేషమును జూడగం భీమేశ్వరదేవరకు అఖండవర్తి దీపములను, డులను, మోదాలను, గొఱియలను మేకలను ేసిన దాతలు. తండ్రి పేరు చెప్పుకొనక,తల్లిపేరు పచుండిరి. దీనినిబట్టి మేము రెండుస్థితు లూహిం ఇందేదియును యథార్థములు గాకపోవచ్చును. తుర్థకులజా లాకాలమున మాతృసంతతినే యుగ్గ చుండెడలయును. లేదా వారితల్లులు దేవ నేడు సానులన బరగుచున్నవారల పూర్వు స్వామినులుఅని పిలుచుకొనుచు అవివాహిత తాసమును బడయుచుండువారుగా నుండవల విషయ మింకను పరిశోధింపవలసి యున్నది.

రికి వెలుపల పెద్దదిబ్బ యొకటి కలదు. దాని సోమేశ్వరాలయము గలదు. దూరమునుండి ేకిసయుత మీ దేవాలయము, భువనేశ్వర దేవాల నిర్మింపబడినట్లు గోచరించును. ఏబదిసంవత్సర ముల క్రిందట పిడుగుపడి, దేవాలయమంతయు, పునాదుల లోనికి కదలిపోయినది. అప్పుడే శిఖరముమీదనున్న 'ఆమలకము'విరిగి నూరుగజములదూరమున నెగసిపడెను. ఏబదిమందియైన ఎత్తజాలని ఆ మామలకమును, శిల్పి, దేవాలయశిఖరముపై నెట్లమర్చినాడోకాని యూహకు మీఱినవిషయముగా గన్పట్టుచున్నది. దేవాలయము చుట్టును ప్రాకారముగాని చిల్లరగోపురములుగాని యితర ములుగాని యిప్పుడేమియు గానరావు. చుట్టుప్రక్కల ప్రదేశమంతయు నేడు సేద్యమగుచున్నది. ఈగుడి మిగి లిన రెండింటివలెగాక, పశ్చిమముఖముగా నున్నది. దేవా లయమున నందిగాని, మరియొకటి గాని యిపుడు లేవు. కాని గర్భాలయమునకు నలుబదియేబది అడుగుల దూరమున, పైనాలుగుముఖములును, ఉదరబంధనమును యోగపట్టమును గల యొకఱాతివిగ్రహముగలదు. ఆఱాతి పైప్రదర్శింపబడిన దేవుడు విష్వగ్దేవుడని శ్రీరామమూర్తి పంతులుగా రూహించుచున్నారు. నేనును వారియభి ప్రాయమునే యనుసరింతును. విష్వగ్దేవుడు, వైష్ణవాం శముగల దేవుడుగాన, శైవక్షేత్రమగు సోమేశ్వరాలయ మునకు క్షేత్రపాలకుడని యోచింపవలసియున్నది.

ఇపుడున్న దేవాలయమంతయు గలపి, యొక్క విమానము. అందు నల్లనిఱాతితో జేయబడి, నిగనిగ లాడుచు, సాయంకాలపు టెండ దానిపై బడినపుడు, మిక్కిలి మనోహరముగ కాంతు లీనుచుండు శివలింగ మొకటి గలదు. ఈదేవరకు పూజాపునస్కారములు జరుగుట లేదు. దారినిపోవుచుండు భక్తు డెవడైన నొక పాత్రతో జల మభిషేకించి యొకపత్రమునో పువ్వు మునో లింగముపై నుంచుచుండుట తక్క మరేమియు లేవు. దేవాలయనిర్మాణమునందు, విశేష మొకటిగలదు. అది మితిలేనియచ్చెరువు గలిగించును. గుడియంతయు వెదకినను గుప్పిడిసున్న మెచ్చటను గానరాదు. ఎఱ్ఱ ఱాళ్లు చెక్కబడి అత్యద్భుతముగ గుడిగా నమర్పబడి నది. ఆఱాళ్లనమర్చుటలో నాదేవాలయపురీఠము,వేదిక, విమానములయం దంతటను, చుట్టును చక్కని,మనోహర ములయిన, శిల్పప్రదర్శనములను, చెక్కడపుపనులను, శిల్పి గొనివచ్చినాడు. సింహద్వారమున కిరుకెలంకులను ద్వారపాలకుల నమర్చినాడు. మీదికూర్పులో నడుమ గజలక్ష్మియు, నుభయపార్శ్వములందు నవగ్రహములును

చిత్రింపబడియున్నవి. వీటిపై ఊర్ధ్వకేశుడుగానున్న నటరాజువిగ్రహ మున్నది. గుడికి, ఉత్తరపువెలిగోడమీద వెలిగోడ పార్శ్వములలో నేక పాదకాలభైరవ విగ్రహ మున్నది. అదెనిమ్నమును, భీకరముగా లేక, మంచిస్థితిలో, తోలు కాడుచు మోహనముగానున్నది. ఇట్లెందుచేతనో గాంచలేము తెలియదు. ఈభైరవునికి నాలుగుచేతు లున్నవి. వానిలో యందు వరుసగా త్రిశూలము, రుద్రాక్షమాల, పిడుగ కము, పాశము గలవు. భైరవుని పార్శ్వమునందు మహిషాసురమర్దని ప్రదర్శింపబడి యున్నది. ఆమె పార్శ్వమున నొక పురుషవిగ్రహ మున్నది. దానిని మేము పోల్చుకొనలేక పోతిమి. ఆవిగ్రహమునకు నాల్గుచేతులు గలవు. వానిలో కుడిచేతులయందు త్రిశూలమును, డమరుకమును, ఎడమచేతులలో పరశువును, రుద్రాక్షమాలయు గలవు. గుడికి పూర్వపుదిశ వైపు వెలిగోడమీద నడుమ నునోకరముపై కుమార స్వామి విగ్రహమును, ఇరుపార్శ్వములందు శ్రీసూర్యనారాయణుని విగ్రహమును, అర్ధనారీశ్వరుని విగ్రహమును చెక్కబడి యున్నవి. చదువరి వీటిలో కుమారస్వామి విగ్రహమును చిత్రమున జూడగలరు. గుడికి దక్షిణపు వైపు వెలిగోడమీద నొక పురుషవిగ్రహమును విఘ్నేశ్వరుడును,వ్యాసుడును చిత్రింపబడియున్నారు. వీటిలో పురుషవిగ్రహమును చేతులలోని త్రిశూలమును, రుద్రాక్షమాలను, నాల్గుచేతులను జూచి భైరవ స్వరూపముగా భావించితిమి.

ఈసోమేశ్వరాలయశిల్పశైలి భువనేశ్వరాలయమును బోలియున్నది. గర్భాలయమని మనము పిలుచు భాగము లేక "ప్రాసాదము" చతురాకారమున నున్నది. ఈదేవాలయమును నిర్మించినవిధానము,గోదావరిజిల్లాలో పూర్వము బిరుదాంకరాయపుర మని పిలువబడుచుండిన బిక్కవోలుగ్రామమునందలి ప్రాచీన శివాలయములను బోలియున్నది. ఈదేవాలయము మధుకేశ్వర, భీమేశ్వరాలయములకంటె నవీనమయినదని మా విశ్వాసము.

ముఖలింగమున నీ మూడుదేవాలయములు గాక చూడదగినవి ప్రాచీనవస్తుసమూహములో జేర్పదగినవి పురాణదుర్గము బురుజులు, కోట దిబ్బలు, పద్మనాభుని కొండ మున్నగునవి యున్నవి. పూర్వకాలపుకోటలలో ముట్టిన, పూర్ణకుంభాకారములు, [illegible] చేయబడియున్నవి. ఈ దిబ్బ [illegible] సింహద్వార [illegible] ప్రకాశించుచుం డెనుగదా! [illegible] గా [illegible] చిత్రించినను [illegible] పద్మనాభుని కొండ [illegible] నొక [illegible] విగ్రహ [illegible] నాలుగు చేతులు గలవు. [illegible] త్రిశూల [illegible] బడియున్నది. [illegible] గమునందు త్రవ్వించినచో [illegible] నా విశ్వాసము. పద్మనాభునికొండమీద ప్రాచీన [illegible] మొకటి దేవాలయమై యుండవచ్చును. [illegible] చిహ్నములు గాన్పించును. [illegible] సోపానసంపత్తి, లీనముగ గాన్పించును. దానినిబట్టియే మేము కొండశిఖరమున కెక్కితిమి.

ముఖలింగమునకు క్రోశదూరమున నగరకటక మను గ్రామ మొకటిగలదు. పూర్వమిది మహానగరమై యుండెననుట నిస్సంశయము. ఇప్పు డాయూరు [illegible] నామమాత్రావశిష్టము. [illegible] గుళ్లు, కట్టడములు, మందిరములు మంటపములు నానరూపములు లేక ముఖలింగము వెలుపలికొని క్రోశపరి గనను నగరకటకమువరకును గాన్పించుచుండును. పాంథుడైనవాడైన ముఖలింగమునుండి నగరకటకము వైపు నడచిపోవునపుడు ప్రాచీనకట్టడముల చిహ్నముల జూడ గలడు. పూర్వము నగరకటకమును, ముఖలింగమును గలసి యొక మహానగరముగా నుండెననియు, నది కళింగనగర మని పిలువబడుచుండెననియు, నదియే కళింగరాజధాని యనియు నూహించుట కనేకములు అవకాశములు



నయగారా మహాజలపాతము

శీతకాలమగుటచే మంచు పేరుకొని జలపాతము ఈగగా నమగుచున్నది

కొన్నట్లున్నది. ఆంధ్రభాషయందు 'నగరు' శబ్దమును రాజు నివసించు నగరమునకే వాడుట ప్రసిద్ధమై యున్నది. కటకమనగా రాజధాని పట్టణము వలెనే కటకముగూడ నొకకాలమున సర్వనామమై యుండెనని తోచుచున్నది. రేవులు పట్టణములనియు, రాజధానులు కటకములనియు వాడబడుట చరిత్ర ప్రసిద్ధము. ఇట్టివి కళ్యాణకటకము, ధాన్యకటకము, కటకము, వైజయంతికటకము మున్నగునవి యెన్నో కలవు. నగరకటకము గాంగవంశపురాజుల శాసనములందు పలుపాళ్లు పేర్కొనబడియున్నది. విజయకళింగనగరము ముఖలింగము నంటియున్న నగరకటకమే కావలయును. ఇందుకు రెండు ప్రబలప్రమాణములున్నవి. గాంగవంశకర్త యని చెప్పబడు మొదటికామార్ణవునకు రాజధాని జయంతపురమని చెప్పబడినది. జయంతపురమను పేరు ముఖలింగమునకు బరగుచుండెనట్లు క్షేత్రమాహాత్మ్యము నొక్కాణించుచున్నది. మఱియు ముఖలింగేశ్వర, అణ్యాంకభీమేశ్వరాలయములందలి శాసనములును చాటుచున్నవి. రెండవ కామార్ణవుడు[1] - మొదటి కామార్ణవుని సోదరుని కుమారుడు—మధుకేశ్వరుని నాభిర్భవించిన ఈశానునికి తన నగరమున మధుకేశ్వరుడను పేర నొకలింగమును ప్రతిష్ఠించి గొప్పదేవాలయమును గట్టించినట్లు తెలియుచున్నది.[2] మధుకేశ్వరుడను పేరుతో, నీనాడు ఈముఖలింగమున దప్ప వేరొకచోట లేదు. మధుకేశ్వరుడను పేరున ఈశ్వరునికి వేరొకచోట దేవళము లేదు. మధుకేశ్వరుడే, శబ్దోచ్చారణసాదృశ్యము వలన, ముఖలింగేశ్వరు డైనట్లు తోచెడిని. శైవాగమములందు శివునికి ముఖలింగరూపముగూడ గలదు కాని, యాగమప్రకల్పనయందలి లక్షణము లేవియు నీముఖలింగేశ్వరునియందు గానరావు.[3] ఒకవేళ యెట్లో నీలింగమునకు ముఖముగలదని సరిపెట్టుకొనినప్పటికిని ముఖలింగశబ్దము, మధుకేశ్వరశబ్దమునుండి వచ్చినట్లు స్ఫురించుచున్నది. ఈవిషయమును శ్రీరామమూర్తిపంతులుగారే మొదట ప్రతిపాదించినారు. ఓఢ్రదేశమునందు మాట్లాడబడుచుండిన ప్రాకృతభాషయందు "మధుకలింగ" శబ్దము, "మొహాలింగ"మని యుచ్చరింపబడుచున్నది. ఆంధ్రులీమొహలింగమును, సంస్కృతముగావించి, ముఖలింగము జేసియుందురు. అప్పటినుండియు, మధుకలింగము, ముఖలింగమయ్యెను. ఈమార్పు ప్రాయశః, పదునాల్గు, పదునైదు శతాబ్దములందు జరిగియుండును. ఏలనన అప్పటికప్పుడే, మధుకేశ్వరునికి గుడికట్టించినాడని చెప్పిన మధుకార్ణవగజపతిదేవుడు రాజ్యముచేసి యనినాడు. ఉత్కలరాజ్యము చీకటి, చిల్కాసముద్రము వరకును వ్యాపించినతరువాత నీమార్పు వచ్చియుండవలయును. ఒకవేళ మధుకలింగశబ్దము ముఖలింగముగా మారెనని యొప్పుకొనకుండినను, కళింగనగరము మధుకేశ్వరుడున్న నగరమేయనియు, నదియే రాజధానియనియు ననుటకొక బలవత్తరమైన సాక్ష్యమున్నది. ముఖలింగమున నున్న దేవాలయమునందు, ముఖలింగేశ్వరుడు శాసనములందు మధుకేశ్వరుడనియే పేర్కొనబడి యున్నాడు. అదిగాక ప్రాచీనశాసనములందుగాని, మరియెచ్చటగాని, ముఖలింగేశ్వరశబ్దము గానరాదు. ఒక క్షేత్రమాహాత్మ్యమే యీపేరును వాడుచున్నది. మధుకేశ్వరుడు శాసనములందు "కళింగావని నగరే శ్రీమాన్ మధుకేశ్వరాయ, శర్వాయ" కళింగదేశ నగరే శ్రీమాన్ మధుకేశ్వరాయ దేవాయ", అని సంస్కృతమునందును, "నగరమున శ్రీమధుకేశ్వరదేవరకు", "నగరమున వీటి శ్రీమధుకేశ్వరదేవరకు" అని తెలుగునందును వ్యవహరింపబడియున్నాడు. కావున పైనిచెప్పినరీతి రెండవకామార్ణవుడు, తన రాజధానియందు మధుకేశ్వరుడను పేరట ఈశానునికి ఆలయము కట్టించినాడని యుండుటయు, నగరమున "వీటిమధుకేశ్వరు"డని శాసనములందుండుటయు జూడ, కళింగరాజధానియైన నగరము, ఈ ముఖలింగనగర కటకములై యుండునని స్పష్టపడుచున్నది. అంతేయు శిథిలమయిపోయిన యీ కాలమున పూర్వము జయంతపురమని పిలువబడుచుండెడి నగరమంతయు నిపుడు రెండుభాగములయి, ఒకటినగరకటకమనియు, రెండవది, ముఖలింగమనియు రెండు కుగ్రామములక్రింద చేర్పడి, ప్రాచీనతనుమాత్రము ప్రకటించుచు పేరు నిల్పుకొనియున్నవి. పూర్వము, ఈనగరమునకు జయంతపురమను నామాంతర ముండినప్పటికిని, నగర

1. Ind. Ant. Vol XVIII, P. 170 ff.
2. Ind. Ant, Vol. XVIII, Page 170 ff
3. Elements of Hindu Iconography, T. A. Gopinatha Rao, M.A. Vol. II.

...కనే, వ్యవహరింపబడుచుండెనని తోచుచున్నది. ఇప్పుడు నీకాలమున ముఖలింగమని పిలువబడుచున్న గ్రామమునకు పూర్వము, “నగరము” అనెడి భాగమనియు స్పష్టపడుచున్నది. అందువలననే “నగరమున వీటివమధుకేశ్వరస్య” అని శాసనములందు జూడగానవచ్చెడిని. రాజాంతఃపురము కోటలోపలినగరు, కొలువుకూటము, రాజాంతికులు మున్నగునవి నేటికిని నగరకటకమని పిలువబడుచుండెడి భాగమున నుండి యుండవలయును. కావుననే కటకశబ్ద మింకను, ‘నగర’మునకు జేర్చి వాడబడుచున్నది రాజధానియంతయును, “నగరము,” అందులోని పూర్వభాగము కటకము అనియు, పశ్చిమభాగము మధుకలింగము, లేక, మధుకేశ్వరమనియు, “శ్రీకరం”అనియు వ్యవహరింపబడుచుండవలయును. ఆవ్యవహారము [illegible], అట్లే నేటికి నిలిచిపోయినది. కావున నీకాలపు ముఖలింగనగర కటకములే పూర్వపు కళింగరాజధానియై యుండెనని నిస్సంశయముగా నుడువవచ్చును.

ముఖలింగసీమ కడు ప్రాచీనమైనదనియు, నెప్పుడును ఏదోయొకమతమువారికి పుణ్యక్షేత్రమైయుండెననియు, నిచ్చట గన్పట్టువింతవిషయములు చాటుచున్నవి. ఒకప్పు డీప్రాంతము, కిరాతజనులకు నివాసముగా నుండెను. రాజధాని యైనతరువాత, ముఖలింగప్రాంతము కిరాతులకు ఆటపట్టుగా నుండుట మానియుండనోపు. మేము ముఖలింగమున నడుగుపెట్టినదిమొదలు మాకు గనబడిన ప్రతివస్తువునుగూడ నీక్షేత్రము శైవక్షేత్రముగా మారుటకు బూర్వము, బౌద్ధమతమునకు, జైనమతమునకును ఆలవాలమైయుండినట్లు తోపింపజేసినవి. అన్నిటికంటె నీవిషయము మాచదువరికిని ప్రీతికరముగానుండునని తలంచెదము. మేము బసచేసిన సత్రమునందు తొలుదొలుత మాకు గనబడిన కొంత ప్రాచీనవస్తు సామగ్రి, ఈయూహకు కారణ మయ్యెను. అచ్చట నొకగదిలో బుద్ధదేవుని విగ్రహ మొకటి యెచ్చటనుండియో కొనిరాబడి యుంచబడినది. దానితోపాటు చక్కని ప్రదర్శనములు చెక్కబడియున్న నలుపలకల రాతి స్తంభములు రెండు మాదృష్టి నాకర్షించెను. ఈరెండును గాక మరియొకగదిలో శక్తివిగ్రహమొకటి రాతిమీద చెక్కబడి నడిమికి రెండుగా విరుగగొట్టబడియుండి కానుపించెను. స్థలజ్ఞులెవ్వరునుగూడ నివియన్నియు నెక్కడివో, యెట్లు సత్రములోనికి కొనిరాబడినవో తెలుపజాలకపోయిరి. అందువలన నవి యెప్పుడో యే పునాదులు త్రవ్వుచుండగనో బయల్పడియుండుననియు, ముఖలింగపు సీమలలో నివేయనియు నిశ్చయించుకొంటిమి. భూమిస్పర్శముద్ర దాల్చియున్న బుద్ధభగవానునివిగ్రహము గానబడుటయు, ఊరిలో సమములోపలగల కొన్ని చిత్రములందు బుద్ధదేవునిజీవితములోని ప్రథమభాగమున జరిగిన వృత్తాంతములు—లంబినీవనమున మాయాదేవిప్రసవించుట, సిద్ధార్థునిజన్మము, దేవతల పుష్పవృష్టి మున్నగునవి—మాకు నొకప్పు డీస్థలమున మహాయన సంప్రదాయమునకుచెందిన బౌద్ధులసంఘారామ మొకటి యుండెనని నిస్సంశయముగదోచెను.

చిత్రపటమునందు బుద్ధభగవానుని శిరుపార్శ్వముల నిలువబెట్టిన రాతికంబములపై చెక్కబడిన చిత్తరువులు ఇచ్చట జైనమతమును, తాంత్రికోపాసనయు వర్ధిల్లినట్లు నిరూపించుచున్నవి. ఇచ్చటి కంబములపై మూడుముఖములందు ప్రదర్శనము లున్నవి. ప్రతిముఖమునందు రెండుచిత్రములు ఒకదానిక్రింద నొకటిచొప్పున గలవు. మొదటికంబముపై మొదటిపైపున బుద్ధదేవుని నిర్యాణముగాబోలు సూచింపబడి యున్నది. పురుషవిగ్రహమొకటి పరుండినట్లును, పాదములపైపున నొక వృషభమును, ఆపురుషవిగ్రహముపైన నొక ఛత్రమును చిత్రితములై యున్నవి. దీనిక్రిందిచిత్రమున పరివేషము గల పురుషవిగ్రహము నాలుగు బాహువులతో నిలువబడియున్నట్టున్నది. ఒకచేతిలో నొక కలశ మున్నది. ఉభయకక్ష్యములందు రెండు చిన్న పురుషవిగ్రహములు గలవు. రెండవపైపున పై చిత్తరువునందు ఒక మనుష్యుడు, ఎడమచేతితో నొకద్రుమమును కౌగలించుకొనిన ట్లున్నది. ఆచెట్టుమీద నొకమనుష్యుడు నొక పక్షియు, కొన్ని ఫలములు గలవు. దీనియర్థము మాకు గోచరింపలేదు. దీనిక్రింద నొకస్త్రీవిగ్రహము నాలుగు బాహువులు గలది చిత్రింపబడియున్నది. ఆమెహస్తములలో నొకదానియందు త్రిశూలము, నింకొకదానియందు విల్లును, మిగిలినవాటియందు స్పష్టముగా గానరాని వేవియో కలవు. ఈవిగ్రహ మొకశక్తివిగ్రహ

ముగా దోచుచున్నది. రెండవ స్తంభముపై మొదటివైపున పైన పార్వతీపరమేశ్వరులు సింహాసనమున గూర్చుండి యున్నట్లున్నది. వారిపైన నొక యోగీశ్వరుడు గలడు. ఆతని కొకప్రక్క- కోతిమొగముగల నరు డొకడును మరియొక పార్శ్వమున స్త్రీయొకతెయు నున్నారు. ఈచిత్తరువుక్రింద అర్ధనారీశ్వరవిగ్రహ మున్నది. ఈ స్తంభపు రెండవముఖమున మీదచిత్తరువులో రెండు శిరములు గలవు. దానిక్రింద ఒక స్త్రీ కలదు. ఆమెచెంత నొక పెద్దత్రాసున్నది. అందొకవైపున కాళ్లును, తలయును వ్రేలాడుచున్న మనుష్యు డొకడు నున్నాడు. రెండవవైపున నొక మనుష్యుడు- తలలేనిమొండెము- చేతిలో నొక మాంసకత్తిని బట్టుకొని పడియున్నాడు. క్రింద కొందరు స్త్రీ లున్నారు. ఇందలి ప్రయోగము శాక్తేయసంబంధమైన నరబలిని సూచించుచున్నట్లున్నది.

ఈప్రసర్పనము క్రింద నొక శక్తివిగ్రహ మున్నది. ఆశక్తికి నాలుగు చేతు లున్నవి. నిలువబడి యున్నది. ఆమె కుడిచేతులలో త్రిశూలము, మాంసకత్తి, డమరుకము కలవు. ఎడమచేతులలో నొక దానితో దేనినో బట్టుకొని యున్నది. స్పష్టముగా గానవచ్చుట లేదు. మిగిలినవి రెండు నొక పురుషుని బట్టుకొని యున్నవి. ఈశక్తిని మేము నిర్ణయింప లేక పోతిమి. ఈ రెండు స్తంభములుగాక నాలుగమూలలు పొడవుగల యొకతాయి గలదు. దానిపై నాలుగు ప్రసర్పనములు గలవు. అవి అడ్డముగా చెక్క-బడియున్నవి. ఆతాతికి చివరభాగములు రెండువైపులను విరిగిపోయెను. అందువలన చిత్తరువులు స్పష్టముగా గానవచ్చుట లేదు. ఆ చిత్తరువులు నాల్గింటిలో నెడమవైపునుండి వరుసగా మొదటిదానిపై భజనసంకీర్తనము చేయు జనసమూహమును, మద్దెలలు, తాళములు బట్టుకొని బయలుదేరుచున్నారు. రెండవదానిలో నొక లింగము గలదు. దానికావల నొక పురుషు డొక స్త్రీని పాదముల బట్టుకొని తలక్రిందుగా వ్రేలాడజేయుచున్నాడు. వారి నెత్తిపైన నొక దేవతావిగ్రహ మున్నది. ఆమెకు ఇరుపార్శ్వములందును, పరిచారికలిరువురు వింజామరల వీచుచున్నారు. కుడివైపుననున్న పరిచారిక కావల నొక పురుషుడు యోగబంధమున నాసీనుడై యున్నాడు. ఈచిత్తరువునందలి యైతిహ్యమును మేము గుర్తింపజాలమైతిమి. మూడవదానియందు ఒక పురుషు డొక శిశువును బట్టుకొని యున్నాడు. అతడు జలాశయము చెంత నిలువబడియున్నాడు. నాలవదానియందు నాలుగైదు ఆబోతులుగలవు. మనుష్యు డొకడు చేతిలో కత్తిని బట్టుకొని యున్నాడు. రెండవచేతిలో కలశ మొకటి గలదు. సమీపమున నావులును, పాలు గుడుచున్న లేగదూడలును గలవు.

ఈచిత్తరువులందు గానవచ్చు వృత్తాంతములు, నరబలి, పశుబలి, శక్తిపూజలు మున్నగునవి జైన, బౌద్ధ, శైవ, తాంత్రిక, మతసంప్రదాయములు, ఈప్రాంతమున ప్రబలియుండినట్లు సాక్ష్యమిచ్చుచున్నవి. ముఖలింగేశ్వరాలయములోని లోపలద్వారబంధముపై, సొరుగుబల్లమీద మధుకేశ్వరుని యావిర్భావకథను సూచించు చిత్తరువుపైని గానవచ్చు చక్రేశ్వరియను జైనశక్తివిగ్రహమును, అచ్చటచ్చట చెదరియున్న జైనచిహ్నములు నీప్రాంతమునం దొకకాలమున జైనమతము వ్యాపించియున్నట్లును, జైనదేవాలయ మొకటి ముఖలింగనగరమున నుండినట్లును, నిరూపించుచున్నవి. అంతియేకాదు. ఈక్షేత్రము జైనక్షేత్రమేకాక యొకకాలమున బౌద్ధక్షేత్రముగూడ నైయుండెననిగూడ కొన్ని చిహ్నములు సాక్ష్యమిచ్చుచున్నవని మునుపే చెప్పియుంటిమి.

ఇక, నేడు ముఖలింగమున నిలచియున్న దేవాలయము లేకాలమునాటివో యింకను విమర్శింపవలసియున్నది. క్షేత్రమాహాత్మ్యమునందు ముఖలింగము ప్రాచీనకాలమునుండి, వరుసగా, గోవిందకాననమనియు జయంతపురమనియు, మధుకేశ్వరమనియు, ముఖలింగమనియు, నొక్కొక్క కాలమున వరుసగా వ్యవహరింపబడినట్లు తెలుపబడియున్నది. గోవిందకాననమని యెప్పుడు పిలువబడెనో, తెలిసికొనుట కాధారము లేవియు గాన్పింపవు. జయంతపురమని నామాంతరము మొదటి కామార్ణవుని కాలమునాటినుండియు నున్నట్లు అనంతవర్మ చోడగంగదేవుని శాసనములు వాకొనుచున్నవి. అంతియేకాదు. మధుకేశ్వరునికి ఉత్సవసేవలందు నితరసేవలందును, పూజారులు కొన్ని పాటలు పాడుదురు. మేము ముఖలింగమున నున్న రాత్రి స్థానికులు, స్వామి

కార్తికపౌర్ణమాదివ్రతోత్సవము జరుగునని చూపెడిశాసన మిచ్చి, ప్రతిష్ఠించియుండిరి. ఆనాడు వారువాడిన గ్రామ పేర్లలోనుండు "శ్రీజయంతిపురనివాస" "మధుకేశ్వర" "ముఖలింగేశ్వర" అనుపదములు వినబడు చుండెను. తూర్పుగాంగరాజులు రెండువంశములవారు గన్పట్టుచున్నారు. మొదటివంశమువారికి ముఖలింగమునకు సంబంధము గన్పట్టుటలేదు. రెండవవంశములోనివాడైన రెండవ కామార్ణవుడే యీదేవాలయమును గట్టించినాడని చెప్పబడెడి జయంతిపురనామము యెట్లు అతడు తన నగరమునకు పెట్టెనాయని విచారింపవలసి యున్నది. పశ్చిమగాంగులకును, తూర్పుగాంగులకును నేదైన సంబంధ ముండెనన్నచో, జయంతిపురమను నామము యెట్లు వచ్చెనో కొంతవరకు కారణ మూహింప నగును. పశ్చిమగాంగులకు బనవాసి-వైజయంతి నగరము రాజధానిగా నుండెనన్న సంగతి తెలిసినవిషయము. ఈతూర్పుగాంగులు బనవాసి-వైజయంతీ నగర వాస్తవ్యులయి యున్నను, ఈ ప్రాంతమునకు వలస వచ్చినట్లును, నమ్ముటకు సమ్మతించితిమేని, వారీప్రాంతమున వైజయంతీపురమును నిర్మించుకొని దానిని రాజధానిగా జేసికొనియుండవచ్చునని యూహింపవలయును. కాలక్రమములో "వైజయంతీ" యనుపదములోని, 'వై' నశించిపోయి జయంతిపురమనియే మిగిలియుండు నని తెలుపుటకు గ్రంథస్థమేమియు గాన్పింపదు. పశ్చిమగాంగులకు తూర్పుగాంగులకు గోత్రక్షేత్రము గాన్పింపదు. మూలపురుషుల పేరును, నొక్కటే మరుగా నున్నది. లూవెర్సుశాసనపట్టికలో, వైజయంతీపురమునకూడ నొకమధుకేశ్వరాలయ మున్నట్లు తెలుపబడియున్నదని వింటిని. అయ్యది నేను స్వయముగా జూచిలేదు. అట్లు వైజయంతీపురమునకూడ నొకమధుకేశ్వరాలయ ముండెనేని, యీజయంతిపురని వాసులైన మధుకేశ్వరునకు గాంగులను ఇష్టకులదైవమనియు, వారెక్కడెక్కడకు బోయిన నచ్చటచ్చట మధుకేశ్వరుని గొంపోవుచుండెడివారనియు నూహింపవలసి యున్నది. ఇక మధుకేశ్వరునికే గోకర్ణేశ్వరు డని నామాంతరమున్నట్లు గూడ తెలియుచున్నది. జయంతిపురమను గ్రామ మొకటి కృష్ణాజిల్లాలో నందిగామతాలూకాలోనున్నది. అచ్చట నేమయిన గాంగులరాజ్యచిహ్నములుగాని, మధుకేశ్వరాలయముగాని యున్నవేమో ఆరయవలసియున్నది. ఆజయంతిపురమును కృష్ణానది కుపనదియైన వాలేరుబడ్డుననున్నది. అచ్చటను కొన్ని ప్రాచీనదేవాలయముల చిహ్నము లున్నవి.

పైన జెప్పినవిషయముల నాలోచించితిమేని తూర్పుగాంగరాజుల రెండవవంశమువారికి జయంతపురమని పిలువబడుచుండిన నగరమొకటి రాజధానిగా నుండెనని విశ్వసింపవలసినదగును. ఈరెండవ తూర్పుగాంగ వంశము వారు క్రీ. శ. ఎనిమిదవ శతాబ్దాదినుండి రాజ్యము నేయ నారంభించిరి. వారిలో నగరనిర్మాతయని చెప్పబడు రెండవ కామార్ణవుడు క్రీ. శ. ౮౦౯ మొదలు కొని ౦౫౮ వరకును పరిపాలించి యుండెను. కావున ఇంచుమించుగా నేడవశతాబ్దము మొదలుకొని తొమ్మిదవ శతాబ్దాంతమువరకు ఈనగరమునకు జయంతపురమను పేరు వ్యవహారములో నుండియుండవచ్చును.

ఇక, ముఖలింగమునగల దేవాలయములు మూడు నేకాలమున నిర్మింపబడియుండెనో? పునో యింగుర విమర్శించి యీవ్యాసమును ముగింతును. మధుకేశ్వరాలయమును రెండవకామార్ణవుడుగట్టించెనని యీనగరకే పలుసార్లు చెప్పియుంటిమిగావున, మొంటిదేవాలయప్రతిష్ఠ క్రీ.శ. తొమ్మిదవ శతాబ్దానని జరిగియుండవలయును. పిమ్మట వరికొంతకాలమునకు రెండవ కామార్ణవుని మనుమడు రెండవవజ్రహస్తదేవుడు (క్రీ.శ. ౧౦౩౮—౧౦౭౮)రాజ్యమునకు వచ్చెను. ఈతడు అనియంకభీముడని బిరుదము ధరించియుండిన ట్లితని శాసనములు దెలియ జేయుచున్నవి. ఈతడు తా నేపేరు బిరుదముగ ధరించెనో, యాదేవునికి దేవాలయమును పునర్నిర్మాణము గావించియుండునని మావిశ్వాసము. అంతకుపూర్వ మచ్చటభీమేశ్వరాలయము ఉండియుండలేదని నిక్కాక్షింపజాలము గాని యున్న దానికి క్రొత్తప్రాసాదము నిర్మించెనని యూహింప నగును. ఇంతకు రెండవవజ్రహస్తుని పూర్వుల కెవరికిని అనియంకభీమబిరుద మున్నట్లు మనకు దెలియనందున నీ యూహకు తావ్పడవలసివచ్చెను. ఇయ్యది నిజమయినను గాకున్నను, మధుకేశ్వర, భీమేశ్వరాలయములు ఒకే కాలమునగాని, యించుమించుగా యేబది సంవత్సరముల లోపుకాలమునగానినిర్మింపబడెనను నిర్వివాదాంశము.

అందులకు ప్రబలప్రమాణములు అనేకములు గలవు. ఈ రెండు దేవాలయములును, పూర్వచాళుక్య వాస్తు శిల్పశాస్త్రము ననుసరించి నిర్మింపబడినట్లు సామాన్యముగ జూచువారికైనను దోచును. మధుకేశ్వరాలయమున లోపలి పెద్దసింహద్వారముపై చిత్రింపబడిన పుష్పములు లతలు మున్నగునవి చాళుక్య శిల్పమును బోలుచున్నవి. స్తంభములశిరము, ఘంటసముల నిర్మాణము, మున్నగునవిగూడ చాళుక్య సంప్రదాయమును నిరూపించుచున్నవి. ఇంతకు చాళుక్యులకును గాంగులకును గల సంబంధము జగత్ప్రసిద్ధము. మరియు యీ రెండు దేవాలయములును అనంతవర్మ చోడగంగదేవుని కాలమున శిథిలములై యుండెనో, మరి యెందుచేతనో, పునర్నిర్మాణము గావింపబడి ప్రతిష్ఠించియుండునని నా యూహ. దేవాలయప్రాకారములమీద ననంతవర్మ చోడదేవుని శాసనములు, అతని సేనపతులవి, సామంతులవి, బంధువులవి, అన్నియును నిరూపించు బలమైన కారణములగుచున్నవి.

ఇవి రెండవసారియో, మూడవసారియో, దేవాలయములు, పునరుద్ధారములు గావింపబడుటచే. అనంతవర్మ చోడగంగదేవుని కాలమున చాళుక్య, చోడ, గాంగ సంబంధములు స్పష్టముగా ప్రత్యక్షమగుచున్నవి. కావుననే అప్పటికాలమునాటి శిల్పపు బయలయందు, చాళుక్యసంప్రదాయము స్పష్టముగ గోచరమగుచున్నది. అనంతవర్మ చోడగంగదేవుడు క్రీ. శ. ౧౦౭౮ మొదలు కొని ౧౧౫౦ వరకు సింహాసనమందుండగా డెబ్బదిరెండు సంవత్సరములు పరిపాలించినాడు. అతనినాటి రెండు శతాబ్దముల నాటికి గాంగరాజ్యప్రతిష్ఠ సన్నగిల్లి యుండెను. అంత దేవాలయములును కొంత శైథిల్యమును బొందియుండును. పిమ్మట మధుకర్ణ గజపతి క్షేత్ర మాహాత్మ్యమునందు జెప్పనట్టులు తిరిగి యీ దేవాలయములను బాగుచేయించి పూజాపురస్కారములు సాగునట్లు చేసియుండును. మధుకర్ణగజపతి, గుడికి ప్రాకారమును గట్టించినట్లును, దేవాలయప్రాసాదమును బాగు చేయించినట్లును, గర్భాలయమునందొక శాసన మున్నట్లు స్థలజ్ఞులు చెప్పుదురు. ఈమధుకర్ణగజపతిపదునాల్గవశతాబ్దమువాడని ఓఢ్రదేశచరిత్ర వలనవగుచున్నది. క్షేత్రమాహాత్మ్యమును బట్టి చూడ, మధుకర్ణగజపతికాలము నాటికి, ముఖలింగ-నగర-కటకము గాంగరాజుల రాజధానిగా నుండుట మానెననియు, నా ప్రాంతమంతయు, కొంచెమించుమించుగా నిర్జన మగుచుండెననియుగూడ విదితమగును.

ఇట్లు మూడు నాలుగు పర్యాయములు కట్టబడియుండుటచేతనే, మధుకేశ్వరాలయమునందు ఓఢ్రశిల్పము చాళుక్యశిల్పమును, ఒకదానిమీద నొకటి గానవచ్చుచున్నవి. దేవాలయ శిఖరములు నిస్సంశయముగా మధుకర్ణగజపతి కట్టించినవే యైయుండుననుటకు సందియమావంతయు లేదు. అందుచేతనే వాటియందు ఓఢ్రశిల్పము గానబడియెను.

ఇక సోమేశ్వరాలయ మేకాలమునాటిదో తెలిసికొనుట కాధారములు లేవు. నాయూహ ననుసరించి, ఓఢ్రదేశమునయితము జయించిన అనంతవర్మ చోడుడే యీయాలయమును గట్టించినాడని తలంతును. అయినను ఈవిషయ మింకను పరిశోధింపవలయును.

ఇంతటితో, నావ్యాసము పూర్తియైనది. నేను జూచినదానిని, చరిత్రజ్ఞుని కుపయుక్తముగా నుండుటకును, పరిశోధనకు బురికొల్పుటకు నుద్దేశించి వ్రాసితిని గాని, మరియొండు గాదు. ఈవ్యాసమును జదివినపిమ్మట చారిత్రకపండితులు ముఖలింగమును సందర్శించి విశేషముగ కళింగదేశ చారిత్రమును బయట పెట్టుదురను నాశతో విరమించుచున్నాను. ఈవ్యాసమునందు, నేను జెప్పవలచిన దానినంతయు, నాకుగల స్వల్పజ్ఞానముతో వ్రాసితిని. చదువరులు నన్ను బెద్దసేయక యూదరింతురుగాక.





# పాపాయి

నాళము కృష్ణారావుగారు

## చిత్రపటము

కన్నులారఁగఁ బ్రతిమను గాంచి యైన
కొంతవేసియు నూరటగాంతు నంచు
నీదుపటమును నాచెంత నిలిపికొనఁగ
ఊఱటకు మాఱు జనియించె నారటంబు.

చిత్రమాటికఁ జేరి నీచిత్రపటము
ముద్దుగొందును; కన్నుల కద్దుకొందు.
అకట! ననుఁబాసిపోయితే యనుచు జాలిఁ
పలుకరింతును; పలవింతు; బలవరింతు.

అట్టి కాంతును తెప్ప లల్లార్పకుండ
అనుదినంబును నీదుఛాయాపటంబు
క్రమ్ముకొనుచున్న బాష్పముల్ కన్నుదోయి
నిండి చూపున కడ్డమై నిలుచుదాఁక.

చెంత నిడుకొని యెపుడు నీచిత్రపటముఁ
గనులు చిల్లులు వోవఁగఁ గాంచి కాంచి
అగ్గలం బగుకోర్కుల కగ్గ మగుచు
ఉలికిపడి కన్నుమూయుదు నుస్సు రంచు.

చెప్ప సిగ్గగు నొకసారి చిత్రపటము
గాంచి సంభ్రమ మొంది నిక్కముగ నీవె
యనుచు నేమేమొ చేసితి! నకట! నాదు
చిత్తవిభ్రాంతి యే మని చెప్పవాఁడ?

బాళి నొకసారి నీచిత్రపటముఁ గాంచి
ఔర! యిటువంటి మోహనాకారు నాదు
పట్టిగాఁ గొన్నినాళ్లైనఁ బడయుభాగ్య
మబ్బెఁ గా యని యానంద మనుభవింతు.

చిత్ర మది యేమొ కాని నీచిత్రపటము
నాన దీఱఁగఁ గాంచినయప్పు డెల్ల
పూజ్యభావంబు నామదిఁ బొంగిపొరల
ఫాలి యొక్కింత వంచి నమస్కరింతు.

ప్రేక్షకచకోరములకోర్కె క్రేళ్లువాఱ
కన్నుదోన్నెల జిగినవ్వు వెన్నెలలను
కొసరివడ్డించుగతి, నీదుకులుకుచూపు
డంబు మీఱెడు ఛాయాపటంబునందు.

వాలుఁగన్నులఁ గూరిమి జాలువాఱ
గొనబుమాటలఁ జూపఱఁ గుస్తరించి
పలుకరించెడిరీతి నీకులుకుచూపు
డంబు మీఱెడు ఛాయాపటంబునందు

ఇహసుఖంబులపైఁ గడు నేవపుట్ట
మోక్ష మర్థించి తపమును బూని సేయ
యోగముద్రను గొననున్న యోగిలీల
చిత్రపటమున నీమూర్తి చెన్ను మీఱు.

ఎట్టయెదుటను శ్రీహరి నట్టె కాంచి
పరవశంబున సకలంబు మఱచియున్న
ధ్రువుఁడో ప్రహ్లాదుఁడో యని తోఁచులీల
చిత్రపటమున నీమూర్తి చెన్ను మీఱు.

మానవాళికి దుర్లభ మైనయట్టి
దెద్దియో వింతవస్తువు నెదుటఁ గాంచి
దానిఁ జేకొన తహతహఁ బూనినట్లు
చిత్రపటమున నీమూర్తి చెన్ను మీఱు.

# బిడ్డడు

చిన్నబిడ్డలమృతి కింతచింత యేల?
అంచు మిత్రులు నన్నా రడించుచుండ్రు
ఎన్నివిధముల వారించుకొన్నఁ గాని
అలవి గాదయ్యె నాదుఃఖ మపనయింప.

పెద్దవారలు మరణింప తద్దినములఁ
బెట్టుచుందురు శ్రద్ధతో, పిన్నవారి
మరణమును గూర్చి చేయరు స్మరణమేని
ఇట్టిభేదంబు గలుగుట కేమికతమొ ?

వయసునం జిన్నఁ దక్కువ యయిన నేమి?
ముద్దుముచ్చటలందును మురిపమందు
అలఁతి యగునొక్కొ? అధికంబ యగును గాక
పెద్దవారలకంటెను పిన్నవాఁడు.

ప్రియము గూర్తురు కూర్ప రప్రియము నెపుడు
మోదమే కాని ఖేదంబుఁ బొరయనీరు;
పెద్దవారలకంటెను పిన్నవారె
కొల్లగొందురు పితరులయుల్లములను.

తల్లిదండ్రులు కినుకచేఁ దన్ను గొట్టఁ
దనశిరంబును వారియక్కున గదించి
జాలి పుట్టంగ నేడుచు బాలుఁ జూడ
ఉల్ల మెవ్వారి కైన రంజిల్ల కున్నె?

ఇంతలో నవ్వు, నేడుచు నంతలోనె,
ఇంతలో వేఁడు, బెదరించు నంతలోనె,
ఇంతలో నల్గు, మనసిచ్చు నంతలోనె;
చిత్రములు గావె పసిపాపచేష్టలౌర.

వింతవస్తువొ తాయమో చెంత నిడిన
యంత కనకాభిషేకంబు నందినట్లు
పొంగి గంతులు వైచుచు నింగి ముట్టు
అల్పసంతోషి కాఁడటే యర్భకుండు ?

పువ్వుఁ దేనెయు తావియుఁ బుప్పొడియును
చిందకున్నను జెడకున్నఁ జెదరకున్న
ముద్దుబిడ్డలనవ్వుతోఁ బోల్పవచ్చు
క్రొత్తగా విచ్చు పున్నాగగుచ్ఛకంబు.

కన్నె వెన్నెలకన్నను, వెన్నకన్న,
మంచుబిందులకన్న, క్రొమ్మించుకన్న,
కుసుమ మకరందమునకన్న కోమలంబు
చిఱుతపాపల చిన్నారిచిన్ని నగవు.

నల్లనివి యెల్ల నీళ్లును తెల్ల వెల్ల
పాలు నంచును సూటిగాఁ బలుకుచుండు,
కల్లకపటంబు లెఱుఁగఁడు పిల్లవాఁడు;
బిడ్డఁ డన దేవుఁ డన వేఱె భేద మున్నె?

ఆడు, నేడుచు, పలవించు, పాడు, సోలు,
తేఱిపాఱఁగఁ దిలకించు, కేరి నవ్వు,
గొణుఁగుఁ దనలోన, వేదురు గొన్నభంగి
నుండు; పసిపాప కేవలయోగి కాఁడె ?

తీవి బొటవ్రేలె పిల్లనగ్రోవి గాఁగ
మోవిఁ గీలించి యెల్లరు మోహజలధి
నోలలాడఁగ గానంబు నాలపించు
ముద్దుబిడ్డఁడు గోపాలమూర్తి కాఁడె?

తనదు నవ్యక్త మధుర గీతంబులకును
కాలుసేతులయల్లార్పు తాళములుగ
వెలికిల పరుండి క్రీడించు బిడ్డఁ డెన్న
లోకకల్యాణమునకు మాఱాకు గాఁడె?

వెండిపళ్లెరమందున వెలుఁగుచున్న
కప్పురపుదీపమో యన నొప్పు మీఱు,
జిలుఁగువెల్లనిదుప్పటి సెజ్జమీఁద
తీవిఁ గూర్చుండి క్రీడించు డింభకుండు.



# కాశీ హిందూ విశ్వవిద్యాలయము

కె. వి. కృష్ణమూర్తిగారు బి. ఏ.

మన హిందూదేశములో ఉన్న విశ్వవిద్యాలయములన్నిటిలోను, క్రొత్తగా స్థాపింపబడినదయ్యును మిగిలినవాటికి మార్గదర్శకముగా నున్నది హిందూవిశ్వవిద్యాలయము. యిది, యితర విశ్వవిద్యాలయముల మాదిరి విద్యాప్రచారముకే కాక, భారతీయున కుండవలసిన ఐహిక, నైతిక, మానసిక పరిపక్వమునకు నిర్మింపబడినది. దీని నిర్మాణచారిత్రమును విచారించుటకుముందు, యిది నిర్మింపబడిన ప్రదేశమునుగూర్చి కొంత తెలుసుకొనుట మంచిది.

విశ్వవిద్యాలయ నిర్మాణప్రదేశము

హిందువులకు అనాదికాలము నుండియు, పుణ్యక్షేత్రముగను, విద్యల కునికిపట్టుగను, కళలకు కేంద్రముగను ఉండినది కాశీపట్టణము. పుణ్యనదియగు గంగయొడ్డున నుండుటచే నీపట్టణము గొప్ప పుణ్యక్షేత్రముగ పరిగణింపబడుచున్నది. కనుకనే అన్ని ప్రాంతముల నుండియు, ఏటేట వేలకువేలు యాత్రికులు గంగాస్నానమును విశ్వేశ్వరుని దర్శనమును గావించుటకు పట్టణమునకు వచ్చుచుందురు. ఇట్టి పవిత్రస్థానమైన కాశీలో ఈ విశ్వవిద్యాలయము నెలకొల్పబడుట సగము నశించిన హిందూదేశౌన్నత్యమును పునరుద్ధారణచేయుటకే.

విశ్వవిద్యాలయము పట్టణమునందు కాక, దానికి నానుకొని రెండుమైళ్లదూరమున నున్న నగవా (Nagwa) ప్రదేశమునందు నిర్మింపబడినది. నగవా ప్రదేశము పంచక్రోశమునకు ఆనుకొని, పూర్వమునుండియు కాశీరాజులకు నివాసస్థానమయిన రామనగరునకు ఎదురుగట్టున, గంగానదికి అరమైలు దూరమున ఉన్నది. ప్రస్తుతము విశ్వవిద్యాలయపు భూములన్నియు రెండుచదరపుమైళ్ల విస్తీర్ణము గలిగియున్నవి. ముందుముందు యీవిస్తీర్ణము ఎక్కువకావచ్చును. ఈనగవా ప్రదేశమునకు తూర్పుదెసనున్న గంగాప్రవాహమువలనను, ఉత్తరముననున్న అస్సీనదీసంగమమువలనను, కొంత సహజసౌందర్యమలవడి యున్నది. దీనికితోడు ప్రాచీన, నవీన భారతసహజ కళా సౌందర్యముతో నిర్మింపబడిన విశ్వవిద్యాలయ భవనములు, వేయిమడుంగులు సౌందర్యము నిచ్చుచున్నవి.






౧. కాశీ హిందూ విశ్వవిద్యాలయ భవనములు




౨. రెండవ వసతిగృహము-కాశీ హిందూ విశ్వవిద్యాలయము



3. ఎంజనీరింగు కర్మాగారము, ప్రక్క-వైపు-కాశీ హిందూ విశ్వవిద్యాలయము




४. ఎంజనీరింగు కర్మాగారము, ముందువైపు-కాశీ హిందూ విశ్వవిద్యాలయము

విశ్వవిద్యాలయ సంస్థ చారిత్రము

విశ్వవిద్యాలయము కొలది వత్సరముల క్రిందనే స్థాపింపబడినను, దీనియొక్క వైఖరిని చూచిన, అట్లుకనుపడదు. 1916వ సంవత్సరములో హార్డింజిప్రభువు శంకుస్థాపన చేసినప్పుడు, నగరప్రదేశము ఏమియులేక చేలచే నిండి, అక్కడక్కడ చిన్నచిన్న పల్లెటూళ్లతో నుండెను. శంకుస్థాపనమైన సంవత్సరముననే నిర్మాణపుపనులు మొదలుపెట్టబడినవి. 1921 సంవత్సరమునకు భవనములన్నియు తయారైనవి. ఆజులై నెలలో విశ్వవిద్యాలయము గృహప్రవేశమైనది. దీనిని చూడ ఒకవింతగా తోచును. ఇంత కొలది కాలములో ఇన్నిగొప్పభవనములు సుమారు 50 లక్షలు ఖరీదుచేయునవి నిర్మింపబడినవి. అవి భవనములైనను సాధారణమైనవిగా కన్పట్టవు. అవి ఇసుకరాతితోను, గట్టియిటుకలు, సున్నములతోను, అతివిశాలముగను, శాశ్వతముగ నిలుచునట్లుగను కట్టబడినవి. కనుకనే ఈ విద్యాలయముయొక్క ఔన్నత్యమును చూచి కల్నలు వెడ్జివుడ్డు (Wedge wood) "ఇది హిందువులు ఈశకములో చేసినపనులన్నిటిలోను గొప్పది" ("It is the greatest thing Indians have done in this Century") అని ఆశ్చర్యపడెను. ఈవిధమైన గొప్ప భవనములకును, అసలు విశ్వవిద్యాలయమునకును, మూలకారకుడు పండిత మదనమోహనమాలవ్యాగారు. వారే హిందూదేశములో కాశీపట్టణమున ఇంత సుప్రసిద్ధవసతి విశ్వవిద్యాలయమును (Residential University) స్థాపించి హిందువులకు పేరుతెప్పించుటకు కారకుడు. మరియు భవన నిర్మాణమునకును, ఇతరకార్యములకును, తోడ్పడిన దుర్భంగ మహారాజుగారును, కాశీమహారాజుగారును, సుందరలాలుగారును వందనీయులు. మరియు ఈవిశ్వవిద్యాలయమునకుమూలమైన సెంట్రల్ హిందూకళాశాలను(Central Hindu College స్థాపించిన అనిబిసెంటు (Mrs. Annie Besant) గారును, దీని నిర్మాణార్థము సహాయముచేసిన ప్రతిహైందవుడును గడుంగడు వందనీయులు.

విశ్వవిద్యాలయపు నిర్మాణపద్ధతి

ఇక విశ్వవిద్యాలయ నిర్మాణమును గురించి తెలిసికొందము. భవనము లన్నియు తూర్పువైపునున్న గంగానదిని, మరియు కాశీ రాజుల నివాసస్థానమైన రామనగరును చూచునట్లు కనుపడును. గంగానదినుండిచూచిన వివిధకళాశాలా భవనములన్నియు అర్ధచంద్రాకారముగా నుండునట్లు కట్టబడినవిగా కన్పడును. వీనివెనుక అర్ధచంద్రాకారముగనే విద్యార్థివసతి గృహములు కట్టబడినవి. కళాశాలలకును వసతిగృహములకును మధ్యనుండు రెండుఫర్లాంగుల మేరప్రదేశము, విద్యార్థులకు విశాలమైన ఆట ప్రదేశములుగా (Play grounds) అమర్పబడినవి. ఈవసతిగృహములకు వెనుకవైపున ఒక ఫర్లాంగుదూరములో విశ్వవిద్యాలయా ఆచార్యులకు (Professors) వసతిగృహములు నిర్మింపబడినవి. భవనములను బట్టి రోడ్లన్నియు కూడ అర్ధచంద్రాకారమున అతి విశాలముగా వేయబడినవి. ప్రతి రోడ్డునకును ఇరుప్రక్కల, దగ్గరదగ్గరగా

మనుమాన్లు రెండురెండు వరుసలలో చెట్లు నాటబడి యున్నవి. ఒక్కొక్క కళాశాలా భవనమునకును, ఒక్కొక్క అష్టకోష్ఠ [illegible] గోష్ఠపరకును చేయబడినవి. వీనికిని యిరుప్రక్కలను పైపైకిపోవు చెట్లు వేయబడినవి.

[illegible] భవనములు

ఇక నిటుపై భవనములనుగురించి ముచ్చటింతము. గంగానదినుండి విశ్వవిద్యాలయము వైపునకు నడచిన, ముందర మన కగుపడునది, ఒక విస్తృతమైన ప్రేక్షకభవనము (Amphitheatre). ఇది వేల్సుయువరాజుగారు వచ్చిన సందర్భమున కట్టబడినది. సుమారు రెండువేల మంది ప్రేక్షకులకు తావునిచ్చును. ప్రస్తుతము బందియాటపందెములను(Matches)చూచుప్రేక్షకులు కూర్చుండుట కుపయోగపడుచున్నది. దీనిముందర అతి సుందరమైన ఆటపట్టులు అమర్చబడియున్నవి.

ఈప్రేక్షకభవనమును దాటి, ముందరకు నడచిన కళాశాలాభవనములు తగులును. భవనము లన్నియు అతిసుందరముగాను విశాలముగాను కట్టబడినవి. దేవాలయపు గోపురములమాదిరి గోపురములతోడను, వానిమీద శిఖరములతోడను, నిర్మింపబడిన యీ భవనములను చూచిన యెడల, అచ్చపు హిందూపద్ధతిని కట్టబడిన దని ప్రతిప్రేక్షకునకును తట్టును. హిందూ దేవాలయమువలె నిర్మింపబడిన ఈభవనములే విశ్వ విద్యాలయముయొక్క నామమును, చాటుచున్నవా యనిపించును. అన్నిభవనములు యింకను కట్టబడలేదు. ప్రస్తుతము ఉన్నవానినిగురించి తెలిసికొందము. ఈభవనములలో శాస్త్రములను కళలను నేర్పు సెంట్రల్ హిందూకళాశాల(Central Hindu College)యును, ప్రస్తుతము భవనము నిర్మింపబడక పోవుటచేత, కళాశాలగా వాడబడుచున్న ఎంజినీరింగు కర్మాగారములును (Engineering Work Shops) కలవు. సెంట్రల్‌హిందూకళాశాలాభవనములు ప్రస్తుతము మూడుమాత్రమే. (చిత్రముచూడుడు). అన్నిటికిని కుడివైపున నున్నది కళలనునేర్పు కళాశాల (Arts College). మధ్యది పదార్థవిజ్ఞానశాస్త్రభవనము (Physical Laboratory). ఎడమచివర నున్నభవనము రసాయనశాస్త్రభవనము (Chemical Laboratory). కావలసిన భవనములన్నియు యింక నిర్మింపబడక పోవుటచేత, ప్రస్తుతము మిగిలిన అన్నిశాఖలును (Departments) యీ మూడుభవనములలో నిమిడియున్నవి.

ఆర్ట్సు కళాశాలాభవనములో ఆంగ్లభాష (English),సంస్కృతము(Sanskrit), వేదాంతశాస్త్రము (philosophy), హిందూదేశపు భాషలు (Indian Languages), గణితశాస్త్రము (Mathematics), చరిత్ర, అర్థశాస్త్రము (History & economics), మొదలయినవాని శాఖలు గలవు. మరియు గ్రంథాలయము (Library), విశ్వవిద్యాలయపు కార్యస్థానము (University Office)న్యాయశాస్త్రకళాశాల (Law College) లకు వేర్వేరు భవనములు యింకను ఏర్పడలేదు. కనుక ప్రస్తుతము

వానికి ఇందులోనే తావు ఈయబడినది. పదార్థవిజ్ఞానశాస్త్ర భవనము (Physical Laboratory)లో, కూడ వృక్షశాస్త్ర(Botany) జంతుశాస్త్ర (Zoology) శాఖలకు వాటిభవనములు తయారగుచుండుటకు చోటు యీయబడినది. రసాయనశాస్త్రభవనములో(Chemical Laboratory)రసాయనశాస్త్రశాఖ,అప్లైడుకెమిస్ట్రీ(Applied chemistry) శాఖకలవు. ఇవికాక, మైనింగు అండు మెటలర్జి (Mining and Metallurgy) శాఖకును, భూగర్భశాస్త్ర (Geology) శాఖకును,వాటిభవనములు కట్టువరకు తావీయబడినది.

తర్వాత ఉన్నభవనము యింజనీరింగు కర్మాగారములు(Engineering Workshops) ఇంకను కళాశాల కట్టికానందున, యిదికూడ, కర్మాగారభవనములందే ప్రస్తుతముంచబడినది. ఇందులో ఎలెక్ట్రికల్ (Electrical), మెకానికల్ (Mechanical), సివిల్ (civil) ఎంజినీరింగుశాఖలు కలవు. (పటముచూడుడు) పెద్దదిగాను, ఎత్తైనదిగాను ఉండి, కుడివైపుననున్నభవనము మెకానికలు కర్మాగారము (Mechanical Work shop). దానికి కుడి ప్రక్కన నొకచిన్నభవనము కలదు. అది బాయిలరుహౌసు (Boiler House ). ఇది చిత్రమునందు కన్పడదు. కర్మాగారమునకు ఎడమప్రక్కన రెండుచిన్నభవనము లున్నవి. అందులో మొదటిది వడ్రంగపుకర్మాగారము (CarpentryWork shshop) రెండవది విద్యుచ్ఛక్తికర్మాగారము(Electrical Workshop) ఈమూడింటిని కలిసి 'కర్మాగారములు' అని పిలుతురు. వీనినిగురించి విపులముగా ముందు తెల్పబడును.

కళాశాలా భవనములను దాటిపోయిన తర్వాత కన్పించునది వసతిగృహములు (Hostels).ఇందు మొదటపట్టణమునుంచివచ్చు రోడ్డు కలియుచోట క్రొత్తగా ముగింపబడిన విద్యార్థినీ వసతిగృహము గలదు (Women Students Hostel) అయితే విద్యార్థినులు ఎక్కువమంది లేకపోవుటచేత అది విద్యార్థులకు నీయబడినది.తర్వాత వసతిగృహములలో మొదటిభవనము, విశ్వవిద్యాలయపు వైద్యశాల ( University Hospital). దీనిముందరిభాగము కొద్దిదినములక్రిందనే తయారయినది. వెనుకభాగము తయారగుచున్నది. ప్రస్తుతము ఆయుర్వేదవిద్యాలయము, దీనిలోనే ఉంచబడినది.

యీభవనము దాటినతర్వాత వచ్చునది, విశ్వవిద్యాలయపు వైసుచాంసలరు (Vice chancellor) గారగు పండిత మదనమోహన మాలవ్యగారి వసతిగృహము. దీనిని దాటిన తర్వాత వచ్చునది నాలుగవ వసతిగృహము (IV Hostel). దీనిలో సగభాగము సెంట్రల్ హిందూ కళాశాలావిద్యార్థులచే నాక్రమించుకొనబడినది. మిగిలిన సగము లో, ఓరియంటలు లెర్నింగు థియాలజీకళాశాలలున్నూ (Colleges of Oriental Learning and Theology), సంగీత కళాశాలయును (Music College) గలవు. ఈకళాశాలల విద్యార్థులకు తరగతులును వసతియు యీభవనములోనే అమర్చబడినది.

ఈభవనమునకు ఎడమప్రక్కన ఒకదాని తర్వాత నొకటిగా రెండుపెద్దవసతిగృహ ములు కలవు. రెండును ఒకేమాదిరిగా కట్టబడి నవి. ఈరెండును సెంట్రల్ హిందూకళాశా లకు సరిగా వెనుకభాగమున నున్నవి. ఇందులో మొదటిదానిని ఒకటవవసతి గృహము(First Hostel) అని పిలుతురు. ఇది హిందూకళాశాలావిద్యార్థులకు వసతినిచ్చును. రెండవదానిని రెండవవసతిగృహము(Second-Hostel)అందురు.(చిత్రముచూడుడు). ఇంకను ఇంజనీరింగు కళాశాలా విద్యార్థివసతిగృహము (Engineering College Hostel) కట్టకపో వుటచేత దీనిలో ప్రస్తుతము, యింజనీరింగు విద్యార్థులు వసించుచున్నారు.

దీనికి వెనుక నుండు రెండు వరుస లలో ఆ చా ర్యు ల (Professors) గృహ ములు ఉన్నవి. రెండవచంద్రికలో యూనివ ర్సిటిక్లబ్బును, ఒకపోస్టు - టెలిగ్రాఫు ఆఫీసును కలవు. ఆచార్యుల గృహములన్నియు ఒకే మాదిరిగా అతిరమ్యముగా నిర్మింపబడినవి.

ఇవియే ప్రస్తుతము విశ్వవిద్యాలయము నకు నున్నభవనములు. వలసినసొమ్ము చేకూ రినతర్వాత యింక అనేకములు కట్టవలసి యుండును.

ఈ పై తెలుపబడినవిషయమునుబట్టి చూ చిన కాశీ హిందూవిశ్వవిద్యాలయముయొక్క గొప్పతనము తెలియకపోదు. యింక, యితర విద్యాలయములకును దానికిని ఉండుభేదము స్ఫురింపకపోదు. ఇప్పుడే యింత ఔన్నత్య మున నున్న యీవిద్యాలయము సరియైన ధనసహాయము కూడినతర్వాత ఎట్లుండునో మనము చెప్పుటకు చాలకష్టము. సర్వేశ్వ రుడు యీవిద్యాలయమునకు సర్వవిధము లయిన ధనసహాయమును చేకూర్చి, దీనిని హిందూదేశములలో నున్నవానిలో ముఖ్య మైనదానినిగా జేయుటకును, యీవిద్యాల యము మూలస్థాపకుడును దేశభక్తాగ్రేసరు డును, అగు పండితమదనమోహన మాలవ్య గారికి ఆయురారోగ్యైశ్వర్యములు యిచ్చుటకు లందులకును వేడుచు, యీ వ్యాసమును ముగించుచున్నాను.






(వెనుకటి సంచిక తరవాయి)

సగుణంబే సముపాస్యమా విషయఘూసస్వాదుతాభోగికిన్
జగదుద్ధారకశంకరాదు లది వర్జ్యంబంచుఁ బోనాడిరే?
భగవంతుండు గుణైకయుక్తుఁడయి యాపాషాణరూపంబుగా
నగుపించెన్ శిలగానెఱింగిన జనుం డారాధనల్ సేయునే?

శా. ఎందో బ్రహ్మపదార్థ ముండ దది నీవేయంచు బోధించినన్
మందాత్ముండగు మానవుం డది గ్రహింపంజాలఁ డిట్టుల్ శిలా
సందేహంబు వెలార్చి హస్తచరణాంచద్దివ్యతేజోమయా
నందస్ఫూర్జితుఁ డీశుఁ డన్న నవధానం బింత చేకూరదే?

క. ఈచందంబు గ్రహింపక, వాచాలతఁ దల్లితోడ నదరితిఁ గని యీ
ప్రాచీననాశల్వి వినీ, తాచిత్తము చెడదుమో యథాపూర్వముగన్.

వ. ఇటు లెడతెఱపిలేని యవివేకమార్గంబులం జిక్కి పలుపాట్లంబడి ననయుచుంటి; నింకఁ గొంతపట్టు పరమేశా! పాఠశాలావిద్యావిధానంబు విన్పించెద; నింతసావధాన చిత్తుండవు గమ్ము.

చ. తెలుఁగుకవుల్ మహాశయు లు దీర్ఘయశస్కు లమర్త్యకావ్యకో
టు లనెడి పూవుఁబోన్పున నెటుల్ కవితాయువతీసమేతులై
చెలఁగిరొ పూర్తిగా నెఱుకసేయకపోయెను బాఠశాల నా
వలె నింక నెందఱుందురో యభాగ్యులు తల్లికిఁగాని పుత్రకుల్.

శా. నోరా ఆంధ్రము; నేవసించునది గుంటూ; రందుఁ బల్నాటిలో;
వీరుల్ చూపిన శౌర్య మేనెఱుఁగఁబో విద్యాపురీ కృష్ణరా
ట్చారిత్రం బితరాంధ్రదేశజకథాసందర్భముల్ రావు వి
స్తారం బేగ ధనప్రవాహము పరీక్షాపుస్తకాపేక్షలన్.

శా. కాలక్షేపముగొంటి రోగభరశుష్కస్తన్యపానక్రియా
లోలద్బాలుని మాద్రి నాఁబడిన; నాలో నాకె సిగ్గయ్యెఁ ద
చ్చాలన్ వర్షపరంపరల్ గడపినన్ సామ్రాజ్యపుంబాలసం
జేలీలన్ సవరింతురో యెఱుఁగ నిస్సీ! బోధనప్రక్రియల్.

గీ. దశశరత్కాలమందు విద్యార్థినయ్యు, వయసువచ్చుచునున్న నాఁటికిం గూడ
భరతమాతృయోగక్షేమభంగి యేమొ, జాడ తెలియదు నా తెల్వి పాడుగాను.

వ. ఆయుపాధ్యాయునిబడియందుఁ గొన్నివర్షంబులుండి పదియవతరగతికి నొక్కప్రభుత్వ పాఠశాలం బ్రవేశించి విద్యార్జనంబుఁ గావించుచుంటిని. అయినను;

మ. అరయన్ సంస్కరణంబు లెన్నియొ యవశ్యాపేక్ష్యముల్ నేఁటిబా
లురకై పుట్టినపాఠశాలలకుఁ జాలున్ మూలతే కట్టులో
కఱపంగూడదు సుమ్మి; యీతరము మొల్కల్ గావె ప్రాఁనేసి చే
ల్విరులంబూచి ఫలింపఁబోవు భరతోర్విన్ భావి కాలంబునన్.

వ. ఈపాఠశాలలందుఁ గొలఁదిగొప్ప నైతికవిద్య గఱపుచుండినను దగినంత లేకుండుట శోచనీయంబు. మఱియును;

గీ. మోకయే కాని మ్రాను వంపులను గొనదు, ఎండుతడిసేల చరణాంక మెసయఁగలది
నవపటం బద్దకంపుటందంబుఁ జిలుకు, నీతిబీజంబు మొలచుఁ జిన్నితనమునె.

సీ. కరుణావివర్జితతష్మామండలేశ్వరు, పనుపున సాగు పాలనమువోలె
రసముత్పాదకరసికత్వ మెసవైన, కుసుమకోమలనభూగోష్ఠిసరణి
భ్రూభంగసంగత ముగ్ధత్వ మెఱుఁగని, తరుణసుందరిప్రేక్షితములమాడ్కి
ఖద్దరువస్త్రదీక్షా భ్రష్టకంకణ, కలిత హైందవునిదుస్తులవితాన
ఆత్మ జిజ్ఞాస లేని వేదాంతమట్లు, కొడుకుఁగుఱ్ఱఁడు వెలియైన కొంపమాద్రి
సకలశాస్త్రంబులందు శిక్షలను నిడిన, నీతివిరహితమగు బోధ నిష్ఫలంబు.

గీ. పూర్వబుధసంప్రదాయముల్ ముద్దుపెట్టు, నీతివిభవంబు గఱపమి నేఁటిబాలుఁ
డాత్మగురుదండనాదికాభ్యాసములకుఁ, బాలువడుచుండె లేదింత పాపభీతి.

గీ. మెదటిచదువుతోడ మేళవింపఁగ వలె, హృదయవిద్య; లోకమెల్ల నపుడు
తానుగాఁగ నెంచుఁ దత్త్వంబు గ్రహియించుఁ, 'జదువరి'యను బిరుదు సాధ్యపడును

శా. విద్యావంతుఁడె వాఁడు వేశ్యకరణిన్ బృధ్వీన్ ధనావాప్తికై
యుద్యోగించి విలాసభాసురవచోయుక్తిన్ సమాకర్షణీ
యోద్యద్బాహ్యపటాదిధారణమునన్ బ్రోద్దాముఁడై దేశసం
ద్భాగ్యాగ్ని కొసంగకుండిన సనల్పత్యాగసేవాహుతుల్.

గీ. భరతమాతను జీతి సఃర్య సేయ, నాంగ్లవిద్యార్జనంబు ననాదిసిద్ధ
కర్మయోగస్థ నీతితోఁ గడగవలయు, వెనుకఁ దెలియు ననుభవైకవేద్యమగుచు.

మ. ప్రతిపారంబు స్వదేశమాతృగుణసంపత్ప్రోత్రితమై యామె సం
గతిగాఁ దెప్ప యుతఃపరం బిడనిలక్ష్యం బీవలెంగాని యే
కతలో కూటికిక గుడ్డ కందనివి యుద్ఘాటింప లాభంబు లే
దతులానందము దేశభక్తికిద దేవా! వేంకటేశప్రభూ!

ఉ. భారతమాతృభక్తి పసిబాలునికిం దగ నుగ్గుఁబాలతోఁ
జేరిచి యూపలేన్ వయసు చేరినచో నదె మేదుతిండిగా
నారయు టుంతయో శుభ మహర్నిశ మీమతిలేనివాని క
వ్వారిగఁ గాచికొన్న ననివారిత నారకలోకదుర్వ్యథల్.

శా. పారిశ్రామికశిక్షచే సలవడన్ వ్యక్తిస్వతంత్రత్వ మా
న్యాయంబై టను నింబవృత్తిములచాయం బోకముల్ సెప్పచో
నారోగ్యప్రద— మం చెఱుంగుచు నుపాధ్యాయుల్ గళాభిజ్ఞు లీ
డాపుల్ గొన్నిఁటి సంస్కరించిన మనోదారిద్ర్య మూటాడదే?

శా. దీనిం జెప్పితి నింత సేపు విసుగెత్తెన్ నీకుఁ గాఁబోలిఁకన్
నానిర్భాగ్యచరిత్రసూత్రములవంకం జూడు మాభంగి వి
ద్యానైపుణ్యము సంగ్రహించుకుతిచేతన్—బోయె దుస్స్నేహముల్
నానాఁటం గవితావిలాసరచనాజ్ఞానంబులుం బాటిలెన్.

గీ. పాఠశాలానుభవము పై పాటుచేత, హైందవవ్యక్తిధర్మంబు బొంద వెట్టి,
యాదరించితి నన్యదేశానుభూత, నాగరకతావిశేషసాంగత్యబుద్ధి.

శా. నాదేశంబున నేరుపాతుకొనె సంఘప్రస్ఫుటాచారర
తాదీక్షాపరతంత్రబుద్ధిలత పాశ్చాత్యస్వరూపానుకా

రాదుల్ దానిని దుంపనాశనము చేయంబూని నాబోటిదు
ర్మేదస్సారుల లేకిసాయముల కల్మిన్ నిర్విశంకంబుగన్.

గీ. శిష్టపరిపాలితాచార సీమకౌకటఁ, బాదు దప్పించి వెనుకకుఁ బట్టిత్రోవ,
ముందుగాఁ బెట్టి కొంటెని ముందుజుట్టు, గోష్పదీకృతకైశికకుట్టనమున.

గీ. పదులఁ జలినీటి తేటస్నానం బొనర్ప, శౌచ మాకృతిఁ గొను నగ్రజాతికెపుడొ
పెట్టియుండిరి నియమంబుఁ బిలకజుట్టు, దాని రూపార్చి కొంటెఁ దొల్తన తలంచి.

గీ. సాత్త్వికాశ్రయమైన యుషస్సునందు, నీట మునుఁగుటలేక పెన్నిదుర మునిఁగి
అవల లేచుచు ముందు సోయగపుఁజుట్టు, పాపటను దిద్దియుంటి సంపంగినూనె.

ఉ. భూసురజాతి యెందు స్మృతిశాసనబద్ధము ప్రత్యహంబు సం
ధ్యాసమయక్రియాపరిచయంబులు లేమియెకాక కర్మస
న్న్యాసులుగాని పెద్దల ననాహృతధర్మపరైకబుద్ధులన్
దోసమటం చెఱింగియును నోటికి వచ్చినరీతి నాడితిన్.

ఉ. పాపటఁ దీర్చి దిద్ది ముఖపట్టమునం గయిసేసి వాసనల్
జేపెడిచిత్రకంబుఁ బరసీమలఁ గొన్న జలుఁగు వల్వలన్
వాపిరి దీఱఁగాఁ దొడిగి వచ్చుచుఁ బోవు మిటారికత్తెలన్
బాపపుఁ గంటఁజూచి పలుపాట్లకు లోనయితిం గ్రమంబునన్.

మ. చదువున్ నేరుచుచుంట చాలదొకొ? పాశ్చాత్యస్వరూపంబుకై
మొదలంటన్ భరతావనీశ్వరి ప్రజల్ పూజించునాచారముల్,
చెదరంగొట్టుట యీడు గాదనుచు యోచింపంగఁబో రెంతహై
న్యదశాఘోరపిశాచబాధలకు లోనై నార లీహైందవుల్.






కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో॥ వీణాగానవినోదినీం విజయినీం వేతండకుంభస్తనీం
విశ్వైర్వందితపాదపద్మయుగళాం విద్యాప్రదాం శాంకరీమ్;
విద్వేషిణ్యరిభంజనీం స్తుతిభవాం వేదాంతవేద్యాం శివాం
ధ్యాయే చేతసి కాళహస్తినిలయాం జ్ఞానప్రసూనాంబికామ్.

ఇంతవరకును గానవిషయమై ప్రచురితములగు వ్యాసములు సారాంశము ఇందుదాహరింపబడినది. ప్రథమమున సృష్టికి బూర్వము పరమాకాశమున నాద ముద్భవిల్లెననియు దానివలన పరమస్వరాట్టును, శక్తి సమాగమమువలన త్రిమూర్తులును, ఆకాశాది పంచభూతములును గల్గినవనియు నిరూపింపబడినవి. ఈ నాదము వర్ణాత్మకమనియు, ధ్వన్యాత్మకమనియు రెండువిధములు. వర్ణాత్మకము అనగ అచ్చులు హల్లులు మొదలగునవి సర్వ మాత్రాధార ములగు చున్నవి. రెండవది ధ్వన్యాత్మకము. దీన, నాహతము, అనాహతము అని మరి రెండు భేదములు. అనాహతము-అనగ మన చెవుల కగోచరమగునది. యోగాభ్యాసమువలన చిత్తమును నిర్వికల్పకసమాధియం దునిచి పరబ్రహ్మైక్యానుసంధి నొనరించి ప్రణవనాదశ్రవణమున యానందింపగల్గుట మహాయోగీశ్వరులకు మాత్రము వేద్యము. రెండవది ఆహతము-అనగ మనము వినగల్గిననాదము. ఇందు వీనుల కింపు జనింపజేయునది గానము. దీనిని మరల గాత్రజము, యంత్రజము అని విభాగింపవచ్చును. యంత్రగానము ఛాయాచిత్రమువంటి దనదగును. జీవస్వరూపమును జ్ఞాపకము చేయును. ఒకప్పుడు చిత్రకారుడు తెలివిగలవాడైనచో చిత్రమును అసలువానికంటె ఎక్కువ చక్కగ లిఖింపగల్గునట్లే గాత్రము కంటెగూడ యంత్రమున మిగుల సున్నితముగగాని మిగుల విజృంభింప (Develope) చేయుటయు గాని గల్గింపనగును. ఈగానము

గ్రామార్థకాముమోటునె మనియు, నీని రసాను
భవము లేనివారు పుచ్ఛవిషాణహీనులగు
పశుతుల్యులనియు పెద్దలు నుడివియున్నటులు
వ్రాయబడినది. యీగానమునందలి స్వరముల
కు రూపములు, వర్ణములు, వాసస్థలములు
మొదలగునవియును, గానివలన వస్తు, శారీరక,
ఆధ్యాత్మిక (Material, Physical and
Spiritual) లాభములు గలవనుటకు ననేక
పూర్వోదాహరణములు నిరూపింపబడినవి.
'వైదిక వ్యాఖ్యా లౌకిక గానప్రభేదము'లు
చర్చింపబడినవి. రెండవ సంచికయందు గాన
మున గల్గు స్వరములు, స్వరములం గలుగు
శ్రుతులు వాటినిగురించి వ్రాయబడినది. శ్రుతులు
ఇరువదిరెండని కొందఱు, ఇరువదినాల్గని మఱి
కొందఱు; దీనివిషయమై తీవ్రమగుచర్చ వేంక
టేశ్వరదీక్షితులను వేంకటమఖి యనువారి
నూతనపద్ధతి అనగ 12 స్వరముల మధ్య
22 శ్రుతుల నిముడ్చుట ప్రాచీనపద్ధతికి విరో
ధముగ నుండుట, దీనికి చక్రనిరూపణము,
ఈ శ్రుతులకు ఇటలీ, ఫ్రెంచి, జర్మను,
ఇంగ్లీషు, హైందవ, యీజిప్టు మొదలగుదేశ
ములందు వీటికి పర్యాయనామములు, అందరి
కిని యీశ్రుతు లిరువదిరెండేయగుట, వీటిలో
(Relative vibration, Ratio), నాదతరంగ
పరస్పర సంబంధాదికములు లిఖింపబడినవి.
మిమ్మటమూడవదానియందునొక్కొకస్వరము
నకు నాదతరంగబలము, పరస్పరసంబంధ పరి
మాణము కనుగొనుటకు సాధనములు,మాను
ష్యశారీరమున నెన్ని స్వరస్థాయులు పల్కు
నదియు, నిత్యాదికములు చర్చితములు; అనగ
ఎద్దులుఱంకె, ఉరుము, మొదలగు వాటికి
గూడ స్వరనిరూపణము. వీనికి నాదతరంగబల
నిరూపణము లుదాహృతములు. మిమ్మట పంచ
మసంచికను, స్వరములలో వాది, సంవాది,
అనువాది, వివాది భేదములు, ఎయ్యవి వీనుల
కింపగును, ఎయ్యవి కటువుగ నుండును అను
విషయమును విపులముగ వ్రాయబడినది. పా
శ్చాత్యగానమునకు మనగానమునకు గల
సంబంధములు భేదములుగూడ వ్రాయబడినవి.
అనంతరము నారవదానియందు గానము
భక్తిరహితమగుటవలన ప్రయోజనము
లేదనియు, గానము భక్తిరసయుక్త మగు
నప్పుడే దానికి "మణినా వలయం వలయేన
మణిః" అనునట్లు సార్థక్యమనియు నిరూపింప
బడినది. దీనికి వాగ్గేయకారకు లగు వారి
స్వానుభవ పూరితములగు కీర్తనము లనే
కము లుదాహరింపబడినవి. తరువాత నెనిమి
దవసంచికయందు అట్టి భక్తియుతగానము
ధాతలిఖితమగుచో మాత్రము అరుదుగ నరు
నకు లభించుననినిరూపింపబడినది.శృంగారరస
యుతగానము, దానిముఖ్యోద్దేశము, తద్వ్యతి
రేకపరిణామము వేదాంతమువలెనే అసి
ధారావ్రతముబోలినదనియు,గనుక దీనినవలం
బించుట కంటె భక్తిరసయుతగాన మొక్కటే
సులభైక సాధనమనియు బెక్కు లుదాహరణ
ములతో నిరూపింపబడినది. తరువాత దశమ
మున గ్రామములవిషయమై విపులముగవ్రాయ
బడినది. షడ్జమధ్యమగ్రామములు మాత్రమే
అవలంబితములగుటకు కారణములు, గాంధార
గ్రామము స్వర్గమునమాత్రము అవలంబితమను

టకు గారణములు, వీటికి నేత్వ్రాలుచక్రములు, వ్రాయబడినవి. వీటిలో పూర్వశాస్త్రవిరోధములు, ఆధునిక నిరూపితములు, పాశ్చాత్యగానమున గానసగు (Major, Semi, Minor-tones) అసగ పెద్దస్వరము, అరస్వరము, చిన్నస్వరములకు సమన్వయము, వ్రాయబడినది. షడ్జమధ్యమగ్రామములుదక్క శేషించిన ఋషభ, గాంధార, పంచమ, ధైవత, నిషాద గ్రామముల స్వీకరింపకుండుటకు కారణములుదాహరింపబడినవి.

పిమ్మట పదునొకండవసంచికయందు పై గ్రామములందున నేర్పడు మూర్ఛనలు, వాటి నామములు, వాటి కధిదేవతలు, సంగీతరత్నాకరమున నిరూపింపబడినవి, క్లిష్టముగ వ్రాయబడినవి. ఇయ్యవి మొదటిసంపుటములోని వ్యాసములు. ఇక రెండవసంపుటమందు ప్రథమసంచికలో నిదివర కుదాహరింపబడిన మూర్ఛనలందున గల్గు తానభేదములు వివరింపబడినవి. "తన్యతే విస్తార్యతే (విస్తారముగ చేయబడినదాటచే) తానమనియు, శుద్ధతానము, కూటతానమనియు, భేదములు, తానము, తన్నాకరము, వీటిసంఖ్యాదికములందు భరతాదులభేదాభిప్రాయములు; ఇందు నెయ్యవి వర్జ్యములు, ఎయ్యవి గ్రాహ్యములు, పునరుక్తములు, వీటి సంఖ్యాదివివరములు; ఏకాది సప్తస్వరతానములు, వీటినామములు, ఉపయోగములు, ప్రస్తారాదిక్రమము, పౌనరుక్తకూట తానసంఖ్యానిరూపకచక్రము నిందు వ్రాయబడినవి.

పిమ్మట మూడవసంచికయందు ప్రస్తారముచేయుక్రమము దీనియందు పాఠాంతరములు, ఖండమేరుప్రస్తారక్రమము, చక్రము, నష్టోద్దిష్టతానచక్రము, దానివివరము, అనగ, సంఖ్యదొరికినదానిప్రస్తారముకనుగొనుటయు, బ్రస్తారముదొరికినదానిసంఖ్యకనుగొనుటయు, వీటికిచక్రములు మార్గములు వ్రాయబడినవి. షడ్జాదిసప్తస్వరహీనతానములు వాటినామములు, అధిదేవతలు ఉపయోగములు, ఏయవి గానముచేసిన నైహికాముష్మికాదిసుఖములందగునని గలదో వాటివివరములు లిఖింపబడినవి.

తరువాత నాలవసంచికయందు, గానక్రియాప్రభేదములగు వర్ణము, అలంకారము, చౌకవర్ణము, తానవర్ణము, స్వరజతి, జతిస్వరము, జానళి, తిల్లాన, శబ్దము స్వరజతి వీటి ముఖ్యోద్దేశములు, వీని పూర్వలక్షణమునకును ప్రస్తుతమున వాడుకలోనుండువానికినిగల ప్రభేదములు, విపులముగ వ్రాయబడినవి. ఇక ఐదియ ఐదానియందు గమకప్రభేదములగూర్చి వ్రాయబడినది. ప్రస్తుతమున వాడుకలోనుండు దశవిధ గమకములకై యుదాహరింపబడిన "స్ఫురిత" ఇత్యాదిశ్లోకమున గమకనామము లెనిమిదే కానవచ్చుచున్నవి. మఱియొక శ్లోకమున "ఆరోహ మవరోహంచ" యని యారంభించి ఆరోహణావరోహణములను గూడ గమక ప్రభేదముక్రింద బ్రస్తుతము వాడుచున్నారు. దీనికర్థము నంతగ గానము. ఆరోహణము అవరోహణముగూడ గమకములే యనుట బొత్తుగ హాస్యముగ నున్నది. రత్నాకరాది

పూర్వగ్రంథములందునను ఇటీవలి గ్రంథమగు చతుర్దండిప్రకాశికయందును గమకలక్షణమును శ్రోతృచిత్త సుఖావహముగ నుండునట్లు లోక శ్రుతినాదఛాయను మఱియొక శ్రుతినాద ఛాయను బొందునట్లు చేయుటయని తెలుపుచున్నది. అట్టి గమకప్రభేదములు తిరుపము మొదలగునవి పదునైదు పేర్కొనబడినవి. వీటికి ప్రత్యేకముగ లక్షణములు, వీణయందునను గాత్రమునను ఎట్లు పల్కింపవలసినదియు సప్రమాణముగ ప్రత్యేకముగ స్పష్టముగ నిరూపింపబడినవి. యీ పదునైదింటిలో ఆరోహణము, అవరోహణము చేర్పబడియుండలేదు.

ఇదిగాక యొక్కొక్క దానియందునను పూర్వికులచే పూర్వశాస్త్రానుగుణముగ లక్షణయుక్తముగ నేర్పరుపబడిన రాగములకు లక్షణాదికములు, వాటివాటి ధ్యానాదిశ్లోకములు, అనంతరము ధీమంతులగువారిచే లిఖింపబడిన వాటిచిత్రలేఖనములు ముద్రితము లైనవి. అందు ఆరుపురుషరాగములు, ఒక్కొక్క పురుషరాగమునకు నైదుభార్యలగు రాగిణులు వీని యొక్క విగ్రహములు, వానిక్రింద ధ్యానశ్లోకాదికములు, తద్ధ్యానములు, లక్షణములు గేయకాలాదినిర్ణయము,నామపారాంతరములు పూర్వ మేర్పరుపబడిన స్వరములు, గ్రహ అంశములు ఏమూర్ఛనకు జెందినదియు మొదలగునంశములు విరళముగ వ్రాయబడినవి. వీటిని వివరముగ దెలియవలెననిన నాయాసంచికలందున జూచుకొనవచ్చును.




# మనవియోగంబు కాదు

అధికార్ల సూర్యనారాయణరావు గారు, బి. ఏ., బి. యల్.,

ఆర్యముని కాంతులే కిరీటాలు కాగ
పొదుపు వెదచల్లు జానకీ! పూవులిచట
అర్యముని కాంతులను కిరీటాలుకల్గు
పూలతావులు నీప్రేమ బోలలేవు.

ఆకు లనిలమ్ము చే నాడ నాడుచుండు
నీడలనుబోసె జానకీ నిమ్మ లిచట!
ఆకు లనిలమ్ము చేనాడనాడుచుండు
నీడ లతివ! నీబాహుల కీడురావు.

విసువు గనకుండ జానకీ! యిసుకలోన
నాడుచున్నారు పసివారు హాయిగాను;
యిసుకలందున పసివారి విసుగు లేని
యాటపాటలు నీనవ్వు సాటిరావు.

ప్రణయరాగము పురికొల్పబతులతోడ
పలుకుచున్నారు జానకీ! వనిత లిచట;
పతులతోడుత హాయిగా పలుకుచున్న
వనిత లెవ్వరు నీసాటివారు కారు!

కనుల దుఃఖాశ్రువులు రాల మనుజుడొక్క
డేకతమ జానకీ! విచారించు నిచట!
కనుల దుఃఖాశ్రువులు రాల్చు మనుజు నాత్మ
గాల్చు వేదన మనవియోగంబు కాదు!




# నేల గుల్లబారుట

## ౨

శ్రీ శేటి జోగిరాజు గారు

వెనుకటి వ్యాసమున నేల గుల్లబారుట యన నేమియో అనియు, ఎట్లు గుల్లబారునో, గుల్లబారుటవలన చెరుకుతోటకెట్టి సత్ఫలము గలుగునో తెలుపబడెను. ఇందు నేల గుల్లబారుటవలన వరి మొదలగు నితరసస్యములకు గలుగు మేలుకీడులను గూర్చియు, నేల గుల్లబారకుండ కాపాడుటకును, గుల్లబారిన నేలను బాగుపరచుటకును సాధనములను గూర్చియు చర్చింపబడును.

వరికిగూడ నేలయొక్క గుల్లదనము కొంత మేలు చేయుననియే చెప్పవచ్చును. మెట్టదుక్కి దున్నిన నేలలలో (ముఖ్యముగ నల్ల నేలలలో) వరిపంట అనుకూలముగ నుండునని రైతుల యనుభవము.

సామర్లకోట వ్యవసాయక్షేత్రమున జరిగిన కొన్ని ప్రయోగములవలన నిది యథార్థమని ఋజువపడెను. ఒక ప్రయోగమున నారుమడిలో నేలను దమ్ముచేసి వరి నాటబడెను. రెండవదానిలో ముందు మెట్టదుక్కిదున్ని నీరుపెట్టి వరి నాటబడెను. నాల్గు సంవత్సరముల సగటు మీద దమ్ముచేసినమళ్లు ఎకరమునకు 365 పౌనుల ధాన్యమును, 543 పౌనుల గడ్డిని హెచ్చుగ నిచ్చెను. మరియొక ప్రయోగమున నారుమడి కెట్టినను మెట్టదుక్కిదున్నబడి నాటుటకుముందు దమ్ముచేయబడెను. రెండవదిగ ఇట్లు దున్నకరోజే యుంచబడి నాటుటకు ముందు దమ్ముచేయబడెను. ఇందును దమ్ముచేసినమడి నాల్గుసంవత్సరముల పైనను సగటున ఎకరమున 689 పౌనులధాన్యము నెక్కువ యిచ్చెను.

మెట్టదుక్కి దున్నుటవలన నేల వెనుకటివ్యాసమున వ్రాసినట్లు గుల్లబారుటయే యిందుకు కారణమని చెప్పవచ్చును. కాని మెట్టదుక్కి దున్నుటవలన నేల బెల్లు విరచినంతలోతుగగాని అంత మిక్కిలిగగాని గుల్లబారదు. దున్నినపుడు మన్ను మృదువుగ నయి, తడిసినపుడు మరల రేణువులు దగ్గరగ జేరుటచే బెల్లువిరచిన నేలయంతటి గుల్లబారదు. నేలను దమ్ముచేసినపుడు మంటిరేణువులు మరింతదగ్గరగ జేరి నేల యారినపుడు గట్టి పడిపోవును.

చెరుకువంటి తోటసస్యమునకు గుల్లనేలలో తేమ హెచ్చయి చెడుననుటకు వీలున్నను, ఎల్లపుడు నీటితో నుండు వరిమళ్లలో గట్టినేలకును గుల్లనేలకు ఏలవ్యత్యాసముండవలెనని ప్రశ్న బయలుదేరును. వరిమళ్లలో నెపుడును నీరున్నను ఈనీరు మురుగుట చేనికి మంచిది కాదు. కొంతవరకు నీరు క్రిందికిని ప్రక్కలకును జరుగుచుండుట చేనికి మంచిది. గుల్లనేలకు నీటిని పట్టియుంచు శక్తి హెచ్చుగ నుండుటచేనందు నీరు పెట్టినపుడును తీసివేసినపుడునే తప్ప నిలవగట్టినపుడు క్రిందికిగాని ప్రక్కలకుగాని చలన మంతిగా నుండదని తోచును. ఈయూహను ఈక్రింద యాచారము బలపరచుచున్నది. ఏలేటి పాడుపల్లక్రింద కొన్ని వరినేలలను మెట్టదుక్కి దున్ను ఆచారము గలదు. సామాన్యముగ మెట్టదుక్కి దున్నిన నేలలకు నీరు తిరుమ కట్టి తీసివేసి నేలను మధ్యమధ్య ఆరనిచ్చుచుందురు. దమ్ముచేసిన నేలలో నిట్లుకాక నీరు నిలువగా నుండనిత్తురు. మరియు చాలచోట్ల మెట్టదుక్కి దున్ని వరిపైరుపెట్టిన మళ్లలో తరువాత తొలకరు (మాగు) చల్లిన పయరచేలు బాగుగ పెరుగునని రైతుల యనుభవము. మెట్టదుక్కి దున్ని నాటిన నేలను శీతకాలమున నెక్కువ తేమను కట్టియుంచుటయే యిందుకు కారణము. కొన్నిచోట్ల నట్లు మెట్టదుక్కి దున్నగా దున్నగా నేల 'ఉబ్బ' చేసిఆరక, పయరచేలు చల్లుటకైనను వీలుగానిస్థితిలోనికి వచ్చుచుండుట గలదు. ఈయుదాహరణలు మెట్టదుక్కి నేలయందు నీటియొక్క సంచలనము

సరికట్టుటను కూడాను బలపరచుచున్నవి. కాని యీవిష
యమయి దగినపరిశోధనలు జరుగవలసి యున్నది.

గుల్లనేలలో సామాన్యముగ చేనిపెరకునకు దగినంత
గాలికి యుండదనికూడ చాలమంది యభిప్రాయము.
చామర్లకోట వ్యవసాయస్థానమునందలి యొకప్రయోగ
మున నాల్గుసంవత్సరములపై సగటున మెట్టదుక్కి దున్ని
న నేలలో ధాన్యమునకును గడ్డికిని ప్రమాణము(ratio)636–
1000ను, దమ్ముచేసిన నేలలో 813–1000ను ఉండెను.
మరియు, గుల్లనేలలోని ధాన్యము గట్టినేలలోని ధాన్య
ముకంటె తేలికగా నుండునని కొందరందురు. కాని
యీ విషయమును సక్రమముగ నిర్ధారణచేయవలసి
యున్నది.

మెట్టదుక్కి దున్నిన నేలలలో, దమ్ముచేసిన
వానిలో కంటె ఎఱ్ఱ తెగులు హెచ్చుగా పట్టును. *

మెట్టసస్యము లన్నిటికిని సామాన్యముగ గుల్లదన
ము మంచిది. ఇవి వర్షాధారమున పెరుగుటచే నేల తేమను
పట్టియుంచుట యవసరమే. ముఖ్యముగ వర్షకాలము
నకు పిమ్మట పెరుగు పెసర, మినుము, పయార, నూవు
మొదలగుసస్యములకు గుల్లదనము కొంతో ఆవశ్యకము
దుంపపంటలకును నేల గుల్లగనుండుట ఆవశ్యకము. వర్ష
కాలమున పైరుచేయబడు సస్యములకుమాత్రము అతివర్ష
ముగురిసినపుడొక్కొక్కప్పుడు గుల్లదనమువలన చెరుపు
గలుగవచ్చును. క్రొత్తగా నాటు ఫలవృక్షములు మొద
లగువానికిని గుల్లదనము హెచ్చుగ నుండుట మంచిది
కాదు.

సామాన్యముగ నిసుకకొడినేలలకంటె బంకనేలలు
త్వరలో గుల్లబారును. బంకనేలలు తడిసియారగనే గడ్డ
కట్టుటయు యెండినపుడు పగులుటయు నిందుకు కారణ
ములు. ఇసుకకొడినేలలు పగులుపోవుటచే బెల్లు విరచు
టకు వీలుపడదు. దున్నినపుడు గడ్డలుగ రాక మన్ను
విడిపోవును. మరల వర్షము గురిసినపుడుగాని నీరు పెట్టి
నపుడుగాని మరల దగ్గరగ సర్దుకొనును.

చెరకుతోట వేయునేలను గుల్లవిరుగకుండ జేయు
టకు ఒకసారివేసిన నేలలో చాలసంవత్సరములవరకు
చెరకుతోట మరలవేయుటగాని, మెట్టదుక్కి దున్నవల
సిన పయిర, నూవు మొదలగు సస్యములు గాని పెట్టక
యేటేట నేలను దమ్ముచేసి వరిపైరును నాటుదురు, ఆ పై
రును కోసికొనుటకు ముందు పెసర, మినుము, జనుము
మొదలగు పయిరసస్యములను తొలాకు (దూకు) చల్లు
చుండవలెను. మెట్టసస్యములతోగాని, తోటసస్యములతో
గాని పరివర్తనము పనికిరాదు. ఒకసారి చెరకువేయు
నిమిత్తము బెల్లువిరగుటవలన గుల్లపడిన మట్టి సరిగ
పోవుటకు నేలనేటేట దమ్ముచేసి వరి నాటవలసివచ్చిన
యెడల సుమారు 10 సంవత్సరములు పట్టునని చెప్ప
వచ్చును. కావున చెరకుతోటను వరినేలలలో 10 సంవ
త్సరముల కొకసారికంటె తరుచుగ నొకేతోటవేయుట
మంచిదికాదు. అప్పుడప్పుడు 5, 6 సంవత్సరము లయినను
వ్యవధి యుండవలెను

చెరకుతోట వేయునేలను సామాన్యముగ బెల్లు
విరువరాదు. ఇందుకు బదులు లోతుగ దున్ని మెత్తనమ
ట్టిని సరియైనపదును కనిపెట్టి దున్నవలెను. మన్ను
ఎంతమృదువుగ నుండునట్లు దున్నిన నంత మంచిది.
బాగుగ దున్నినమన్ను పశువులనుగాని మేకలను గొఱ్ఱె
లను గాని మంచిగట్టించ మరింత మంచిది. ఇట్లుచేయు
టచే మొదట బాగుగ దున్నుటవలన నేల గుల్లబారినను
మరల మన్ను అణగబడి గుల్లదనము తగ్గును. నేల సత్తు
వయు పెరుగును. క్రొత్తగా తోటలు వేయునేలలలో
దుక్కికంటె బెల్లువిరగుటయే మొదట శ్రేష్ఠముగ
గనుపడినను ఒకటిరెండుసార్లు ఇట్లు బెల్లువిరచి తోట
వేయునప్పటికి నేల గుల్లబారి, బెల్లువిరచిన నష్టము కన
బడును. దున్ని మంచిగట్టు నాచారము గల గోదా
వరికి ఆనకట్ట కట్టినప్పటినుండియు తోటలు వేయుచుం
డిన ప్రదేశములందు దప్పుదుకూడ తోటబాగుగ నెదుగు
చుండ నిటీవలనే తోటలు బెల్లువిరచివేయ నారంభిం
చిన ప్రదేశములందలి తోటలు క్షీణదశలో నున్నవి.

---

* ఎఱ్ఱతెగులనగా నేమియో యింకను నిర్ధారణగావింపబడలేదు. నేలయొక్కయు, శీతోష్ణాదిస్థితిగతుల యొక్కయు ప్రతికూలతచే వరివేర్లు తమ పనిని తామసరిగా నిర్వహింపజాలకపోవుటచే నాకులచివర లెఱ్ఱబారునని యొకరియభిప్రాయము.

చెరుకుతోటలో నీరునిలువకుండ నరిగానికి పోవు వన్నతోటల నేల గట్టిపడినను అనుకూలపడుల యభిప్రా యము. తోట తీసివేసిన తరువాత జనుము గాని తీగ పెసర గాని పచ్చి రొట్టెలపైరుగా పెరిగిన ఎరువుగా దున్ని వేసినచో నేలగుణము బాగుపడునందురు. కాని కొందరు విస్తా రము పరిశోధనలు చేయగా గుల్లను పోగొట్టునని నందురు. కాని యీ విషయము పరీక్షింపబడుచున్నది.

ఎర్రజావా (J 247) సారావిజావా (J 33 A) మొదలగు కొన్నిరకములు చెరుకులు గుల్లనేలలకైనను నరిపోవుచున్నవి. (బంగారుతీగలు, సన్నమొగిరి మొద లగునవి కొంతవరకు తాళగలవు. ఎర్రజావా మొదల గునవి నేలలో బంగారుతీగలకంటె వేళ్లెక్కువ లోతుగ చొచ్చుకొని పోవునవి యగుట గాన నవి గుల్లనేలలకు తట్టుకొనుచు నెక్కువగా పనికివచ్చు నవి.

గుల్లనేలలోని చెరుకువేళ్లు మిక్కిలి మెండుగ నరియగునవి కానరానేరవు, వేళ్లు నుండి యుష్ణము తగ్గిపోవునట్లు నారంభించును. క్రిందనిచ్చిన కొలతను నేల పైభాగమున క్రొత్తవేళ్లను పెట్టుటచే దుబ్బు బాగుగ నుండును. అందుచేత కాల్వలు తీసిన తోటలలో క్రిందనున్న చివరనుండి వేళ్లు బాగుపడుటకు వీలుచేసినతోటలో నున్నను, పైభాగము వేళ్లలో ఎండిపోవు చుండును. ఇట్టివేళ్లు విస్తారముగ నుండుటచే నీ తోటలలో నీరు సరిగా పెట్టినతోటలకు పైవేళ్లకు సరిగా ఆలము. క్రిందవేళ్లు సరిగా నెక్కువగా యిచ్చుటకే వచ్చి యుండుటచే నీపైవేళ్లే దుబ్బు బాగుగ నుండుట కాధా రము. కావున తోటకు నీరు సమృద్ధిగా లేదని తోచు స్థితి యందైనను తోటలకు నీరు పెట్టుచుండుట యావశ్యక మగును.

19వ శతాబ్దాంతమున గోదావరిజిల్లాలోని చెరుకు తోటలు 'Colletotricum falcatum' అను నొక శిలీంధ్రమువలని తెగులు(ఎఱ్ఱతెగులు)చే నాశనము గుచుండెను. అప్పటినుండియు చెరుకుతోటలకావు తెగులు తోట్టిన ముచ్చెలను నాటుటవలన గలుగుచున్నదనియు ముచ్చెల నేరుటయందు శ్రద్ధవహింపవలె ననియు హెచ్చరింప బడుచుండెను. తెగులున్న ముచ్చెలను నాటుట మంచిది

కాదనువిషయము నిశ్చయమే కాని యిటీవల వచ్చిన దుబ్బులన్నిటిలో తెగులుచిహ్నములు కానరాకపోవుట చేతను, శ్రద్ధగా నేరిన ముచ్చెలను నాటినతోటలో గూడ నేల గుల్లగానుండు కొట్టి తోట పనిచ్చుటచేతను, కొన్ని తోట్లు తెగులున్న దుబ్బులుకూడ చావకుండుట చేతను, యీ తెగులునకు నేలగుల్లగారుటయే ప్రధానకారణమని యొకరి యభిప్రాయము. జావాద్వీపమున గూడ నిట్టి యభిప్రాయమే ప్రబలియున్నది.

నరి నేలలు మెట్టదుక్కి గున్నటచే గుల్లబారినపుడు కొన్ని సంవత్సరములవరకు మెట్టదుక్కిగాని దమ్ముచేయు ట మానవలెను. మెట్టదుక్కి దున్ననలసివచ్చి నప్పుడైనను నాటుటకు ముందు దొకసారియైనను దమ్ముచేయుట మంచిది.

నాటినవంటనే తోటలు గుల్లబడకుండ రక్షించు టకు పరియోపాయము. కొందరు గుల్లబారిన మళ్లలో జనుమువేసి పశువులను మేపుదురు. జనప ఆకు కొంత రాలి నేలకు సత్తువచేయుటయే కాక పశువుల త్రొక్కు డువలన గుల్లదనము తగ్గునందురు.

మెట్టదుక్కి దున్నుటకు తప్పనియెడల నీరుపెట్టు టకు కొంచెము ముందుగా దున్నుట మంచిదా? లేక, నీరు పెట్టినగాని పిమ్మట నెప్పుడైన వర్షముగురిసినపుడుగాని దున్నుట మంచిదా? యను ప్రశ్న బయలుదేరును. ఈవిష యమయి భేదాభిప్రాయములు గలవు. రామచంద్రపురం తాలూకా రైతులు కొందరు నీరుపెట్టుటకుముందే దున్నుటయే మంచిదందురు. పెద్దాపురంతాలూకా రై తులు నీరుకట్టినుండియు దున్నుట మంచిదందురు. పెద్దా పురంతాలూకాలోని నేలలు రామచంద్రపురంతాలూ కాలోని నేలలకంటె తేలికనేలలగుటచే నచట ముందుగ దున్నినదుక్కి బాగుగ నారి తొలకరి నాటికి గడ్డలులేక మన్ను మృదువుగనగుటచే గుల్లతన మంతగా కనుపిం పదని అచటిరైతుల సమాధానము. రామచంద్రపురము తాలూకాలోని నేలలిట్లు ముందుగ దున్ననియెడల నేల గడ్డలు గడ్డలుగ లేచి యవి ఆరి బీటలుదీయుటచే నేలగుల్ల బారును. గుల్లబారినవరిమళ్లలో నిదివరలో సూచింపబడి నట్లు అప్పుడప్పుడు నీరు తీసివేసి ఆగనిచ్చుట మంచిది.

వరులలోఁగూడ కొన్ని గల్లనేలలో సైరిఘు బాగుగ పెరుగునని యుండవచ్చును. కాని యీవిషయమై పరిశోధనలు జరుగవలసియున్నవి. లేకరి యనుభవమును బట్టి పునాస, అక్కళ్లు కొంతవరకు గల్లను సహించునని తోఁచును.

మెట్టసస్యములకు కొంతవరకు గల్లదనము హానిచేయని యిదివరలో వ్రాయబడెను. గడ్డలుగడ్డలుగ నున్న నేల, మెత్తగ నున్న నేలకంటె నెక్కువ గల్లగా నుండును. కావున మెట్టసస్యములకు నేలను మృదువుగ నుండునట్లు దున్నినయెడల నేలయందు సిద్ధాహారము వృద్ధినొందుటయేకాక, అనుకూలమైనంత గల్లదనముమాత్రమే కలుగును. పశువులనుగాని, గొఱ్ఱెలను, మేకలనుగాని మందగట్టుట గల్లదనమును తగ్గించుటకు మిక్కిలి యనుకూలమయిన పద్ధతి. ఇందువలన నేలకు సత్తువచేరుటయు గల్లదనము కొంతవరకు తగ్గుటయు రెండుమేళ్లును చేకూరును. మిరపమొదలగు సస్యములకు లోతుదుక్కి ప్రశస్తము. కాని ఒక్కొక్కప్పుడీలోతుదుక్కి దున్నిన నేలలందు అధికవర్షము గురియుటచే మొక్కలు చెడును. ఇట్లు చెడకుండుటకుగాను కొందరు తెలివిగల రైతులు మొదట లోతుగదున్ని మొక్కలను నాటుటకుముందు నేలకు మందగట్టి అటుపిమ్మట నాగటిని తేల్చి పైపైని దున్నుదురు. ఇందువలన మందగట్టుటచే కొంతవరకు గట్టిపడిన యడుగునేల మరల గల్లబారక, వర్షము వలని నష్టము తగ్గును. ఈపనినే అమెరికాలోను యితర నాగరిక దేశములలోను 'Subsoil Packing' అందురు. ఆ దేశములలో ఇందుకు తగినసాధనములు గూడ నిర్మింపబడియున్నవి. కాని మన దేశమున నీపని అట్టి పనిముట్లు లేకయే మందగట్టుట వలననే నెరవేర గలదు. విశాఖపట్టణపు జిల్లాలో మెట్టనేలలో మిరపనారు, పొగనారు మొదలగునవి నాటుటకుముందు నేలపై మట్టితోలు ఆచారము గలదు. ఇందువలన నేల బదునగుటయేకాక మందగట్టినప్పటివలెనే కొంచెముగ కుదుమబడును.

మామిడిమొదలగు ఫలవృక్షములను నాటుటకు, సామాన్యముగ పెద్దపెద్ద గోతులుతీసి యందు సంపిలిమన్ను పోయుదురు. బత్తాయి నారింజ నిమ్మతోటలను వేయుట కొక్కొక్కప్పుడు ఎత్తయినవంపుమంటిదిమ్మలను పోయుదురు. గోతులలో మంటిని పోసిన వెంటనే కాని, దిమ్మలను వేసిన వెంటనేకాని మొక్కలను నాటుట మంచిది కాదు. ఒకవర్షకాలమయినను గడచి గల్లదనము కొంత వరకు తగినపిమ్మటనే వీనిని నాటవలెను. తొలకరిలో దిమ్మలనువేసిన వర్షకాలాంతమున నాటవచ్చును. మరియొక వర్షకాలముగూడ పోనిచ్చుట మరింత మంచిది. సామాన్యముగ దిమ్మలిడి యరటితోటవేసి రెండుమూడు సంవత్సరము లిదిపెరిగి తీసివేసినపిమ్మట నిమ్మ బత్తాయి మొదలగు జాతులను నాటుట ఆచారమైయున్నది. ఇది మంచిపద్ధతి.

అదివరకు వ్యవసాయవాసన లేక క్రొత్తగా వ్యవసాయ మారంభించువారికిని కొందరు సామాన్య వ్యవసాయదారులకునుగూడ వ్యవసాయమన నేలను దున్నుట, యెరువువేయుట, విత్తుట, కలుపుతీయుట, కోతకోసి కైలు చేసికొనుట మొదలగు పనులను జేయుటయనియే కాని, ఆ పనులను జేయుటలో నీవ్యాసమున వివరింపబడినవానివంటి సూక్ష్మవిషయములలో రవ బుద్ధి నుపయోగింపవలసియుండునని తెలియదు. వ్యవసాయమున గూడ తక్కిన కళలందువలెనే బుద్ధి నుపయోగించిన నంతలాభకరముగ నుండుననుటకు సందేహము లేదు.






గరిగిపాటి రామమూర్తిగారు

చండభానుఁడు సూపు నుష్ణంబువలనఁ
గరము వేదనఁ బడి, తమ కడకు వచ్చు
పాంథులకు సాదరంబుగఁ బర్ణఛత్ర
మొసఁగి, నూత్న ఫలాహార మొగినిగూర్చి
అహము సర్వమ్ము శ్రమఁజెంది యలసిపోయి
వృక్షరాజము లిప్డె విశ్రమించె !

* * * *

"అకట! సృష్టికి నెల్ల మీ రాదియయ్యు
ధీమహామహిమం గల్గి దీప్తులయ్యు
రసపరిప్లుత హృదయ సామ్రాట్టులయ్యుఁ
గరుణఁ ద్యజియించి ధర్మమ్ముఁ గట్టిపెట్టి
తప్పుదారులఁ జరియింపఁ దలఁచినారు
హింసయే ముఖ్యమనుచు యోజించినారు--"
అనుచు నొకకొంత విసుపుతో నహరహమ్ము
కలుష మతులకు నీతులఁ గఱపు విహగ
వితతి వేసరి యిటనుండి వెడలిపోయె—

* * * *

అంబరమ్మను నాట్యరంగంబునందు
తనదు కౌశల్యముం జూపఁ దలఁచిరాజు
విరహిణీప్రేక్షకులు తన్ను వెలితిసేయ
క్షీణుఁడై యిప్పుడిప్పుడే మిన్నువీడె—

* * * *

సర్వ మత్యంత భయద నిశ్శబ్ద తమస
పూరితమ్మై సమాధియుఁ బోలెఁ జెలఁగె
అఖిల జీవులు విశ్రాంతి నందియుండె—

* * * *

దూరముననున్న మల్లియ తోపులెల్ల
మేలుకొనియుండెఁ గాఁబోలు! మెల్లమెల్ల
గంధవాహునిఁ బిల్చి సుగంధవార్త
లల్లనల్లనఁ బుత్తెంచి యమరలోక
సుఖము మానవులకుఁ జవిచూపుచుండె.

* * * *

మినుకు మినుకని నభమందు మెఱయుచుక్క-
లంతియే!—
సకలమ్ము గాఢాంధకార
మగ్న;—
మఖిలమ్ము నిశ్శబ్ద మాంద్యయుతము!






ఆకొండి వేంకటశాస్త్రిగారు

సూర్యోపాసన ప్రాచీనార్యసంప్రదాయ సిద్ధము. ఆర్యులు ప్రకృతి సౌందర్యా రాధకులు. ప్రకృతియనంతయు వైచిత్ర్యవిలసితము. ఈ ప్రపంచములో సృష్టివిలాసములను పరికింతుమేని, నిర్మలశ్యామలగగనము [illegible] ములచే ప్రకాశింపఁజేయుచున్న గుంపుగుంపులకు చిన్నపుష్పములను పూయుచున్న త్రోవలోని యొక పొలక మొదలు మహామహిమాన్వితములైన సూర్యచంద్రాది గ్రహములవరకును మనకు మానసికానందమును చేకూర్చునవియే యైయున్నవి.

మధ్యాసియాలో నివసించుచుండిన యార్యులకు తమ భౌతికనేత్రములయెదుట పొడకట్టు, సకలసస్య ఫలపుష్ప వృక్షాదులను, నదీ పర్వతాదులను, వివిధపశుపక్ష్యాది ప్రాణితతిచే శోభించుచున్న భూదేవిని కనుగొని మహదానందమునొంది, కృషిని గావించి తమయైహికవ్రతమగు పాడిపంటల సంపదను పొంది ధన్యులైరి. అటుపిమ్మట తమదృష్టులను సూర్యచంద్రాది మహాగ్రహ విరాజితమగు వినీలాకాశమువంక త్రిప్ప నదియు దేవతామహిమాస్ఫురణమును వారికి కలుగజేయగల్గెను. వారి చర్మచక్షువుల కిట్టి దేవతామహిమమెట్లు పొడకట్టినదన, వారి కాధ్యాత్మిక మును [illegible] లున్న [illegible] ముగను వేదములలో ప్రకటించుచున్నది. ఋగ్వేదమునందలి సూర్యస్తోత్రములు, వరుణేంద్రాది దేవతలను [illegible] స్తోత్రములు, సూర్యుని యగ్నిరూపముగ యగ్నిని గూర్చిన స్తోత్రములతో విరాజిల్లుచున్నవి. ఆర్యులు మధ్యాసియాను విడిచి గుంపులు గుంపులుగా పలుదేశములకు పోయిరని మనకు హిందూదేశచరిత్రవలన తెలియవచ్చుచున్నది. ఒకశాఖ యూరపుఖండమునకును ఒకశాఖ, ఈజిప్టు దేశమునకును, ఒకశాఖ ఆసియాఖండముయొక్క యీశాన్యమూలకు—యిప్పటి జపాను, చైనాదేశముల వైపునకును—వెళ్లి, యచ్చట స్థిరనివాసము నేర్పరచుకొని యొకవిధమైన నాగరకతా పరిణామమునకు తావొసంగినవి. ఆర్యులలో నొకశాఖ గ్రీసుదేశమున స్థిరనివాసమేర్పరచుకొని యొకవిధమైన నాగరకత నభివృద్ధిచేసినది. హైందవార్యులసంప్రదాయముతే గ్రీసుదేశస్థులగు ఆర్యులయొక్క దేవతారాధనలందును, ఈజిప్టు దేశస్థులగు ఆర్యుల నాగరికత యందును పరిస్ఫుట మగుచున్నవి. గ్రీకులును, ఈ జిప్టుదేశస్థులును కూడ సూర్యాది గ్రహములను నివ్వెరతో గని,

వానిని దేవతామహిమ కలవిగనే సంభా
వించి యారాధించిరి. సూర్యుని విషయమై
గ్రీకుల కెట్టియభిప్రాయము లుండెడివో
కనుగొందము. మానవ శరీరములో నిగ్గ్రత
లను పోగొట్టగల సామర్థ్యము గల దైవమని
"అపోలో" అను పేరుతో గ్రీకులు సూర్యు
నారాధించుచుండిరి. ఇట్టి యభిప్రాయమే
హిందువులకు మనకును గలదు. మన దేశ
మున మయూరుడను నొక కవి కుష్ఠరోగ
బాధితుడై సూర్యు నుపాసించి తద్రోగ
విముక్తు డయ్యెను. సూర్యు నుద్దేశించి నూరు
శ్లోకములను రచించి స్తోత్రము చేయుసరికి
[illegible] రోగ వినిర్ముక్తుడయ్యెను. ఆమ
యూరకవి సూర్యశతకములోని శ్లోకములన్ని
యు [illegible] స్రగ్ధరా
వృత్తములు. [illegible] యుండుట నొక
శ్లోక [illegible]ను.

[illegible]

భూత్వా [illegible]
[illegible]
[illegible]
[illegible]
భూషా [illegible] భువన
స్యాస్య [illegible];
విభ్రాంతి[illegible] విభాతు విభవో
[illegible] సా విభాసః.

—[illegible] సూర్యశతకమునుండి.

ఉ. ప్రాచిని దోచి శుభ్రరుచి
ప్రాభవమూంచి కుసుంభదంభముం
ద్రోచుచు నేచి, పూచుచు స
రోజిని మించుగ, లోకలోచనా
సేచనక త్రిలోకగృహ
చిత్రవిభూషణమై, సువిభ్రమ
శ్రీచయరాజితం [illegible]
రీచి యసీచత దాచ నేచెడున్.

—కీ. శే. [illegible] శాస్త్రిగారి తెలుగుసేత.

గ్రీకులు 'అపోలో' అను పేరుగల సూర్య
భగవానుని వలన నెట్టిరోగమునుండియైన
విముక్తి కాదలంతురేని సూర్యప్రీతికై ధనము
సర్పింపవలెనని విశ్వాసముకలవారై యున్నా
రు. వారు రోగగ్రస్తులై నప్పుడు 'అపోలో'
నుద్దేశించి తాము రోగమునుండి విముక్తు
లగు నెడల ఇండ్లు, భూములు, చిత్రప్రతి
మలు సమర్పింతుమని మ్రొక్కుచుండిరి. ధని
కులు చాల ధనరాసులను సమర్పింతుమని
మ్రొక్కుచుండిరి. కొందఱు చక్కని శిల్ప
కళను ప్రకటించు విగ్రహములను, ఓడలను,
గ్రంథములను, సూర్యునికి సమర్పింతుమని
వాగ్దానము చేయుచుండిరి. వాగ్దానములు
చేసిన పిమ్మట నొక ఫలకముపై
మైనము పూసి దానిపై "నా కీరో
గము కుదిరినచో నాయోడలలో నాలుగు
సూర్యునికి సమర్పింతును" అని దానిపై
వ్రాయుచుండిరి. అట్లు వ్రాసిన వాగ్దాన
ఫలకములను సూర్యుని దేవళములలో
సూర్యుని విగ్రహమునకు సమీపమున
వ్రేలాడగట్టుచుండిరి. రోగి రోగవిముక్తుడై
తన వాగ్దానము ప్రకారము తాను ఫలకము
పై వ్రాసినట్లు వాగ్దానము నెరవేర్చుచో,
దేవాలయములోని పూజారి ఆఫలకముపై

"కానుకలు అప్పోలోచే నంగీకరింపబడినవి. రోగి ప్రార్థనలు సిద్ధించె"నని వ్రాయుచుండెడి వారు. అట్టి ఫలకములలో కొన్ని అప్పోలో దేవళములో ఇప్పటికిని భద్రముగ జాగ్రత్తపెట్టబడియున్నవి. ఒక బాలుడు చిన్న తనముననే, కుంటివాడై, తనతోడి బాలుర సుఖమనుభవించుట చూచి తన స్థితికి నగచి సూర్యుని ప్రార్థించి తన వాగ్దానము నొక ఫలకముపై వ్రాసి యా ఫలకమును 'అప్పోలో' దేవళములో దేవుని సన్నిధిని వ్రేలాడగట్టెను. ఆ ఫలకము పై "నాకు సూర్యునిదయవలన కాలు వచ్చునెడల నేను పండ్రెండు గోళీకాయలను కానుకగా సమర్పింతును" అని వ్రాసెను. కొంతకాలమున కతని కాలు ఆరోగ్యస్థితికి వచ్చెను. కాన దీనినిబట్టి చూడ శరీర మారోగ్యస్థితియందుండుటకు సూర్యకాంతి యత్యావశ్యకమైనదని తెలియుచున్నది.

సూర్యకాంతి తీక్ష్ణమైనచో మనుజుల శరీరచ్ఛాయ నల్లనై మృదువుతప్పియుండును. ఆఫ్రికా ఖండములో భూమధ్యరేఖ మీదనుండు స్థలములలోని జనులు నల్లని దేహచ్ఛాయగలవారై నీగ్రోలని పిలువబడుచున్నారు. సమశీతోష్ణమండలములలోని వారును, అతి శీతలమండలములలోనివారును, శ్వేతవర్ణముగల దేహచ్ఛాయ గలవారై యున్నారు. చైనా, జపాను దేశములవారును, హిందువులును,కొందరు శ్వేత,సువర్ణ దేహచ్ఛాయలుగలవారై యున్నారు. శీతలదేశములలోని జంతువులు చలినుండి రక్షణమునకై శరీరమునిండ ఉన్ని గలిగియుండునట్లు దైవముచే సృజింపబడియున్నవి.

సూర్యకాంతిని పుష్కలముగ పొందని వృక్షములు, ఆకులలో ఆకుపచ్చనిరంగును గోల్పోయి పాలిపోయియుండును. సూర్యకాంతియే వృక్షముల కట్టిరంగుల నీయగల్గుచున్నది. సూర్యుని శ్వేతకిరణములలో సప్తవర్ణము లిమిడియున్నవి.

(మనపూర్వులు సూర్యుని మహిమ నెఱింగిన వారగుటచేతనే ప్రతి దినమును ప్రాతఃకాలమున దేహపరిశ్రమ చేయుటలో 'సూర్య నమస్కారము'లను సాధకములుగా నియమించుకొన్నారు. సంధ్యోపాసన,సూర్యున కర్ఘ్యములు మొదలైనవి మన సంధ్యావందనములలో నిమిడియున్నవి.కొందరరుణోదయ కాలముననే లేచి సూర్యశతక శ్లోకములను చదువుచుందురు. వర్షకాలమున కొన్ని సమయములయందు సూర్యుడు మేఘములచే మఱుగుపడినప్పుడు జీవతతి యెంతయు గ్లానపొందును!! సూర్యుడు కనుపడనిచో కొందరట్టి దినమును దుర్దినముగనే యెంతురు. కొందరు హిందూసాధ్వులు, తమ బిడ్డల కెప్పుడేని యొకప్పుడు ప్రాణాపాయమగు రుగ్మతలుకలిగి, యట్టిరుగ్మతల నుండి విముక్తినొంది యారోగ్యభాగ్యము వారికి కలుగునెడల తాము యావజ్జీవము తమ పుత్రుని యారోగ్యమునకై సూర్యదర్శనము చేసి, నమస్కరింపనిదే భుజింప మని ప్రతినచేసి యట్టి ప్రతిజ్ఞను నెరవేర్చుకొందురు. ఇటీవల వైద్యులు కొందఱు సూర్యాతపస్నానమువలన మంచి శరీ

రారోగ్యముకలుగునని కదళీపత్రములపైమను జులు పరుండి సూర్యుని తీక్ష్ణమైన కిరణములు శరీరములో సర్వావయములకును తాకునట్లు చేసినచో చర్మరోగములను నశింపజేయుటయే కాక కొన్ని రుగ్మతలను (శరీరములో నున్నవానిని) నిర్మూలింప గలవని వక్కాణించు చున్నారు.

అమెరికాలో కాలి ఫోర్నియా రాష్ట్రమునందును, అమెరికా సంయుక్తరాష్ట్రములందును, అమెరికను శాస్త్రజ్ఞులు సూర్యకిరణముల నొకచోజేర్చి కిరణములనుండి గ్రహించి దానిని నిలుపుకొని యుంచుకొన గలవియు గొప్పప్రతిఫలన శక్తికలవియునగుఅద్దములతో నమర్చబడినలోహపు తొట్టెలనమర్చి యటులు జాగ్రత్త పెట్టుకొనిన వేడితో యంత్రములను కూడ నడుప గలుగుచున్నారు. ఇంటికప్పుల మీద నడుపు సూర్యకిరణములనుండి వేడిని గ్రహించి యావేడిని పొయ్యిలలోనికి జేరునట్లు చేసి, ఆవేడివలన దుంపల నుడుకపెట్టుట, రొట్టెలను కాల్చుట మొదలైన పనులు చేయగలుగుచున్నారు. సూర్యుడే ప్రతియింటికిని పొయ్యిలోని వంట చెరుకువలె నుపయోగపడుచు వంటలవాడగుచున్నాడు. ఫ్రాన్సులో 'పైఫర్' అను ఫ్రెంచిశాస్త్రజ్ఞుడొక సూర్యకిరణోష్ణ గ్రాహి యంత్రమును వేడి నాకర్షించుకొను నద్దములతో తొట్టె నిర్మించి దానివలన సంగ్రహించిన వేడితో అచ్చు వేయు యంత్రమును నడుపగలుగుచున్నాడు. సూర్యబింబమును మేఘములు కొంచమునేపైనను మరుగుపరచకుండునెడల అతి శీఘ్రముగ సూర్యునుండి యుష్ణమును నిలువచేయ వచ్చును. ఇట్లు గ్రహించినవేడితో బాయిలర్ల (Boilers) లోని నీటిని కాచగా కలిగినయావిరి 30కిలోమీటరులశక్తిగలిగిన యింజనును నడపగలిగియుండెను. మధ్యాహ్నము మొదలు 5 గంటలకాలములో జాగ్రత్త చేయబడిన వేడితో "సూర్యపత్రిక" యను పేరుగల యొకపత్రికను ముద్రించిరి. అమెరికాలో మార్సు అను శాస్త్రజ్ఞుడు సూర్యునివేడితో ఇంటిలోపల నంతయు వెచ్చగ నుండునట్లేర్పాటుచేయగలిగెను. సూర్యునివేడితో, నీటినితోడుటకుకూడ నొకశాస్త్రజ్ఞు డొకయంత్రమును నిర్మించెను.

ఇవ్విధమున నొక్క యమెరికాలోనే కాక, ఫ్రాన్సులోను, యూరపుఖండములో కొన్ని దేశములలోను సూర్యునికిరణముల తీక్ష్ణత ననుభవింపని దేశములలో సూర్యుని వేడి నివ్విధమున మనుజుని యుపయోగమునకు గొనివచ్చుటకు ప్రయత్నించుచుండ, సూర్యునివేడిని పొందు భాగ్యముగల హిందూదేశములోను, ఆఫ్రికాలో కొన్నిభాగముల లోను సూర్యుని యుష్ణమును గ్రహించుటకు ప్రయత్నములు చేయుశాస్త్రజ్ఞులు లేక పోవుట కడుశోచనీయము. ఇటీవల బొంబాయిలో నొక శాస్త్రజ్ఞుడు సూర్యకిరణముల నుండి వేడిని సంగ్రహించి దానితో యంత్రములను నడిపించుటకు ప్రయత్నములు చేయుచున్నట్లు తెలియుచున్నది. "Solar Heat; Its Practical Applications by Charles H. Pope' అను

గ్రంథమువలన అమెరికాలో ఎంతమంది యెన్నివిధముల సూర్యునికిరణముల నుండి వేడిమిని గ్రహింప జూచుచున్నారో తెలియ వచ్చెడిని. దీనినిబట్టి సనాతనులుగను, ఆర్యులచే ప్రత్యక్ష దైవముగను, ఆదిదైవముగను నుపాసింప బడుచు నచ్చిన సూర్యభగవానుని ఉపాసించి మన మారోగ్యభాగ్యము బడసి సుఖింతుముగాక.

శ్లో. ఆరోగ్యం భాస్కరా దిచ్ఛేత్
శ్రియమిచ్ఛే ద్ధుతాశనాత్,
ఐశ్వర్య మీశ్వరా దిచ్ఛేత్
మోక్ష మిచ్ఛే జ్జనార్దనాత్.



# వలపు

పండితారాధ్యుల నాగభూషణం గారు

౧

శ్వాన పుచ్ఛంబు సవరణ సల్పవచ్చు
పాదరసమును నొకచోటఁబట్టవచ్చు
కట్టతెగి వచ్చు సెలయేరు నెట్టవచ్చు
వలపుబలుపు నడంపగా వలనుపడదు.

౨

ఉప్పరంబునఁ జుక్కలఁ జెప్పవచ్చు
ఇన్నియని సాగరోర్ముల నెన్నవచ్చు
విరహిచిత్తంబు మాటికి వెలువరించు
విషయచింతల లెక్కింప వీలులేదు.

౩

విత్తమెల్లను బరజనాయత్తమైన
మిత్రులెల్లరు నొకసారి శత్రులైన
కష్టమైనను, మనుగడ భ్రష్టమైన
వలపు సంకెల నెవ్వాఁడు వదలలేడు.

౪

న్యాయ మన్యాయ మంచును నరయనీదు
మంచిచెడ్డల నెంచి యోచింపనీదు
లాభనష్టంబులైనఁ దలంపనీదు
వలపు వాల్లభ్యమెట్టిదో తెలుప రాదు.

౫

భూతిగీతలఁ గస్తూరి పూఁతఁ జేయు
అరుత రుద్రాక్ష నాణిముత్యంబు సేయు,
నరగఁ బెనుఁబోఁకి నొకదాన శౌండి సేయు
వలపునకుఁ గలబలము నెవ్వ రెఱుంగు.

౬

యోగి భోగి నొనర్చుచు యోగ మెఱుఁగు
ముక్తు, సక్తునిగాఁ జేయు యుక్తి యెఱుఁగు
భీరు, ధీరునిగాఁ జేయు తెఱఁ గెఱుంగు
వలపునంగల్గు మహిమ లెవం డెఱుంగు?






గండికోట సత్యనారాయణమూర్తి గారు, యమ్. ఏ.

[వెనుకటి సంచిక తరువాయి]

## 3 వ ప్రకరణము

### ఆర్థికన్యాయములు – వినియోగము

### ౧. ఆర్థికన్యాయముల స్వభావము

తక్కిన శాస్త్రములందువలె అర్థశాస్త్రమునందును కొన్ని న్యాయములు లేక ముఖ్యసూత్రములు వర్తించుచున్నవి. అయితే గణితాదియగు శాస్త్రములందువలె అర్థశాస్త్రమునందలి సూత్రములు నిశ్చలమైనవి కావు; సర్వకాలసర్వావస్థలయందును నిరాటంకముగా వర్తింపవు. అర్థశాస్త్రము సంఘశాస్త్రము సంఘశాస్త్ర సమితిలో చేరినది. దేశకాల పాత్రభేదములంజేసి రాజనీతిశాస్త్రమందలి న్యాయములెట్లు మారుచుండునో అటే విధముగ ఆర్థికసూత్రములుమారి పరిణామమొందుచుండును. దేశపు శీతోష్ణస్థితి, భూసారము, కార్మికుల నిపుణత, విద్యాసంపత్తి, మానసిక శక్తులు మొదలగు కారణములంజేసి అర్థశాస్త్రసూత్రము లెల్లెడలను ఒకేవిధముగ వర్తింపవు. ప్రత్యేకస్థితిగతుల వలననే ఆర్థికన్యాయ ప్రవర్తనము ప్రచ్ఛన్నముగా నుండును. ఇట్టి సూత్రస్వభావము ఒక్క అర్థశాస్త్రమునకే కాదు, అన్ని శాస్త్రములందును కానవచ్చుచున్నది. గణితశాస్త్రసూత్రముల వలె ఆర్థికసూత్రములు నిశ్చయముగా నుండకపోవుట అర్థశాస్త్రమునకు కొరత లోపమని భావింపగూడదు. మనుజుని వాంఛలు, యత్నములు, చర్యలు, ఆశయములు ఎల్లప్పుడు నొకేతీరున నుండవు; మారుపుల నొందుట వాటికి స్వభావసిద్ధమైన గుణము. అర్థశాస్త్ర మిట్టిమనుజులతోను మనుష్యసంఘములతోను సంబంధించి యుండును గాన ఇది వాస్తవముగా శాస్త్రమాయని సందేహింపగూడదు. సాంఘిక దేశీయవ్యవస్థలయందు ప్రతి దినమును దేనిముఖ్యసూత్రముల సాహాయ్య మావశ్యకమగుచున్నదో అట్టిది శాస్త్రమనుట నిస్సందేహము. ఈ శాస్త్రమందలి నియామములు దేశపుస్థితిగతుల ననుసరించి యుండును. ఆర్థికన్యాయములను శాస్త్రకారులు అనుభవవేద్యమగు సంగతులం బరిశీలించియే సిద్ధాంతీకరించిరి.

వినియోగఖాండమునకు సంబంధించిన మూడు ముఖ్యసూత్రములంగూర్చియే ఈప్రకరణమందు విచారించెదము; తక్కిన ఆర్థికన్యాయములను రాబోవు ప్రకరణములలో సందర్భానుసారముగ విశదపరచెదము.

### ౨. వాంఛాతృప్తిన్యాయము (అంత్యోపయుక్తి న్యాయము.)

మనుజుల కోరికలు లెక్కపెట్ట నలవికానివి. ఆ కోరికలమొత్త మెప్పుడును తృప్తినొందదు; నాగరకత, విజ్ఞానము ఇవి అభివృద్ధి యగుచున్నకొలది క్రొత్తక్రొత్త వస్తువులయం దభిలాషలు కలిగి మానవవాంఛలు వృద్ధినొందుచునే యుండును. కాని మనుజుడు సాధారణముగా వాంఛించే ప్రయోజనకరమగు వస్తువును వినియోగించెడువానికి కలతృప్తియొక్క ఆద్యంతముల తత్త్వమును జాగ్రతగా పరిశీలించినచో, ఆవస్తువునందు వానికిగలఅభిలాష ఒకసరిహద్దు చేరువఱకుమాత్రమే సుఖదాయకముగ నుండుననియు ఆసరిహద్దు దాటిన

పిదప కష్టదాయకముగనుండుననియు తేటపడుచున్నది. మనము వినియోగించువస్తువులసంఖ్య అతిశయించిన కొలది ఆయావస్తువినియోగములవలన కలిగెడుతృప్తి క్రమక్రమముగా తగ్గుచుండును. ఒకసరిహద్దు చేరినపిదప తృప్తిసుఖము సున్న; మీదుమిక్కిలి కష్టము సంభవించును. కొన్నివస్తువులయం దీన్యాయము వర్తించియుండుట సులభముగా గ్రహింపవచ్చును; మరికొన్నివస్తువులయం దీన్యాయము వర్తించలేదనేభ్రమ కలుగును గాని స్థితిగతులప్రభావము జాగ్రతగా శోధించినచో న్యాయము వర్తించుచునే యుండును. ఇదియే వాంఛాతృప్తిన్యాయము; దీనినే అంత్యోపయుక్తిన్యాయమని కూడ చెప్పెదరు. ఒకటిరెండు ఉదాహరణములను గమనించినచో ఈన్యాయము స్పష్టముగా బోధపడును. ఒకబాటసారి పిపాసాపీడితుడై "దాహం దాహం! గొంతుక ఆరిపోవుచున్న"దని చెప్పుచు ఒకధర్మాత్ముని ఇంటికి వెళ్లెననుకొందము; ఆయన యీదాహపీడితుడగు పాంథుని కొకపెద్దచెంబెడుమంచినీళ్లున్ను అవి పోసుకొని త్రాగుట కొక చిన్నగ్లాసున్ను ఇచ్చెననుకొందము. మొదట ఒకగ్లాసునీరు త్రాగి ప్రాణమును నిలబెట్టుకొనుటచేత దానిఉపయుక్తి ఇంతింతయని చెప్పుటకు వీలులేనంతదిగా నుండుటవలన ఆద్యోపయుక్తి గణనాతీతముగా నుండును. రెండవగ్లాసునిండ నీరు త్రాగుట కిష్టముగా నుండునుగాని ఉపయుక్తి మొదటిదానికన్న తగ్గియుండును. ఇట్లు 3-వ గ్లాసునీరు మన పాంథుడు త్రాగినను దానిఉపయోగము రెండవదానికన్న తగ్గియేయుండును. ఈవిధముగ 5 లేక 6 గ్లాసులనీరు త్రాగేసరికి సంపూర్ణమైన తృప్తికలుగును. ఇకమీదట మరికొన్నిగ్లాసులనీళ్లు త్రాగమని బాటసారిని నిర్బంధించినచో వాని కతికష్టముగాను అసహ్యముగాను ఉండును. ఈఉదాహరణమందు సూచించిన విధమే ఇంచుమించుగ మనవాంఛల దీర్చుకొనుటకై మనము వినియోగించుపదార్థముల కెల్లను వర్తించును. ఉపయుక్తిని మనమంకెలసహాయమున కొలతచేయగలుగుదు మనుకొందము; ఒకానొకసరిహద్దువరకు మన మే వస్తువునైనజాస్తిగా వినియోగించుచూవచ్చినచో ఉపయుక్తి క్రమక్రమముగా క్షీణించుననియు (10,9,7,5,2,1,0,2, 3,5,8. ఈవిధముగా ఉపయుక్తి తగ్గుచుండును), ఆసరిహద్దుకు వచ్చేసరికి ఉపయుక్తి సున్న అగుచుండుననియు, ఇంకను వినియోగించుట మాననియెడల సుఖదాయకంబగు ఉపయుక్తికి బదులుగ కష్టదాయకంబగు అసహ్యత, నిరుపయోగము ఘటిల్లించుచున్నదనియు మనము తెలుసుకొనుచున్నాము. "తినగాతినగా గారెలు కనరెక్కు" ననే లోకోక్తి ఈన్యాయము ననుసరించినదియే.

వినియోగ్యపదార్థమందలి అన్ని భాగములయొక్కయు సుఖమును మొత్తము చేయుటవలన లభించెడు ఉపయుక్తికి పూర్ణోపయుక్తి లేక సమాసోపయుక్తి అని పేరు; ప్రతిగ్లాసునీరు త్రాగుటవలన కలుగుసుఖమును మొత్తముచేసినచో నీటియొక్క పూర్ణోపయుక్తి వచ్చును. వినియోగింపబడు రాశి మిగుల కొంచెముగా నున్నపుడు కలుగు పెద్దసుఖము ఆద్యోపయుక్తి. మీద ఉదాహరణమునందు మొదట ఒకగ్లాసునీరు త్రాగగా గలిగిన ఉపయుక్తియే ఆద్యోపయుక్తి. రాశినిబట్టి ఆరాశిలోని అంత్యభాగమై తత్పూర్వభాగములకన్న తక్కువయగు సుఖము నిచ్చునదియైన దానివలన లభించు ప్రయోజనము అంత్యోపయుక్తి. వినియోగించురాశి అతిశయించినచో దాని అంత్యభాగమువలన కలుగుసుఖము తగ్గుచుండుననియే ఈసూత్రముయొక్క ముఖ్యాభిప్రాయము.

ఇతరవాంఛల సమ్మేళనము కలిగినప్పుడు ఈ సూత్రము వర్తించదని మనకు తోచవచ్చును. ఒకతీపి పదార్థమగు మిఠాయినే తినమనినచో ఎవడైనను కొంత వరకే తినునుగాని అందుతో కారపువస్తువులుకూడ అప్పుడప్పుడు తినవచ్చునని పకోడీలు కారంబూందీ మొదలగు వాటి నిచ్చినట్లయిన జాస్తిమిఠాయి తినగలడు.

ఈసూత్రప్రవర్తనము గమనించుటలో కాలభేద ప్రభావముకూడ మనము మరువకూడదు. పగటిపూట ఆకలితీరునట్లున్ను తృప్తికరముగను మనము భోజనముచేసినను, రాత్రిపూట యథాప్రకారము భోజనమునకు సంసిద్ధులమై యుండుట అనుభవసిద్ధమే. ఇచ్చట ఈన్యాయము వర్తించలేదని వాదించకూడదు; కాలభేద ప్రభావమును గమనించినగాని ఈ న్యాయముయొక్క ప్రవర్తనము మనము సరిగా కనుగొనలేము.

కొన్నివాంఛలను మనుజుడు సులభముగా తృప్తి నొందింపగలడు; అంత్యోపయుక్తి నతిశీఘ్రముగా

పొందగలము. నిద్రాహారవాంఛల నెవడైనను సుళువుగా తృప్తినొందింపగలము; కాని సాధారణముగ విద్య, నాగరికత, ధనము మొదలగువాటియందలివాంఛలను తీర్చుట సులభసాధ్యము కాదు. వాస్తవమైన విద్యావంతుడింక ఎక్కువ విద్యాసంపాదనమునకే పాటుపడుచుండును; లోకమందలి జను లెప్పుడు వారి బ్రాహ్మీకులకన్న ఎక్కువనాగరికతయు, విజ్ఞానమును కలవారైనను ప్రజ్ఞానంతు లింక ఉన్నతమగు అభివృద్ధి నపేక్షింతురు; ధనవంతు డింక ఎక్కువధనమును సంపాదింప యత్నించును. ఈవిషయములలో కూడ ఈసూత్రము వర్తింపదని తీర్మానించగూడదు. అన్యోన్యయుక్తికన్న అంత్యోపయుక్తి హెచ్చైయుండును. ధనవిషయములో మనము ముఖ్యముగా గమనింపవలసిన దేదియన భాగ్యవంతున కొక దమ్మిడీయందు సాధారణముగా అంతలక్ష్య ముండదు; బీదవాడు దానినే పెద్దసొమ్ముగా పరిగణించుచున్నాడు; ధనవంతునికన్న బీదవానికి ధనముండలి అంత్యప్రయోజనము ఎక్కువగా నుండును.

అంత్యోపయుక్తియొక్క ప్రాముఖ్యము భాగ్యరాశిలో చేరిన అన్నివస్తువులందును వర్తించుచున్నది. దీనిని అనుసరించియే వస్తువులవిలువ ఏర్పడుచున్నది. వర్షకాలమందు చెరువులలోను నూతులలోను నీరు సమృద్ధిగ నుండును; ఆకాలమందు మనము నీటిని ఇష్టానుసారముగ వాడుకొందుము. ఎండకాలములో నూతులలోను, చెరువులలోను కల నీరెండిపోయి ఎక్కడనో కొన్నిస్థలములందుమాత్రము కష్టముమీద కొంచెమునీరు లభించినప్పుడు మన మజాగ్రతగాను ఇష్టానుసారముగను ఆనీటిని ఉపయోగింపగల్గుదుమా! ఎంతో జాగ్రతగా నీటిని వాడెదము. కారణమేమన అప్పుడు నీటియొక్క అంత్యప్రయోజనము అతిశయించియుండును. ఎండకాలములో ఇంటింటికి దూరముగానున్న తటాకపునీటిని అమ్మెడువారు ప్రతిబిందెడు నీటికి ఎక్కువవెల నిమ్మనెదరు.

అంత్యప్రయోజనముయొక్క ప్రాముఖ్యము తెలిసికొందుమేని, దానినిబట్టి విలువ, విలువనుబట్టి వెల, వెలలవలన క్రయవిక్రయములు, క్రయవిక్రయములంజేసి వ్యవహారములు ఏర్పడుచున్నవని తేటపడును. ఈవాంఛాతృప్తిన్యాయము, లేక అంత్యోపయుక్తిసూత్రము ఒక్క వినియోగకాండమునకే కాదు అర్థశాస్త్రమంతటికిని ముఖ్యమని చదువరులు గ్రహింతురుగాక.

## 3. మూల్యమునకున్ను మనముకొనెడు వస్తురాశికిన్ని కలసంబంధమును తెలిపెడు సూత్రములు: (డిమాండుసూత్రములు)

అర్థమనిపించుకొను ప్రతివస్తువునకు మూల్యము, ప్రయోజనము అనే రెండుగుణము లుండును. కోరికలం దీర్చి తృప్తినొసగుగుణమే ఉపయోగము లేక ప్రయోజనము. ఇతరులవద్దనుండువస్తువులను కొనుటకనుకూలించుటయే మూల్యము లేక విలువ అగుచున్నది. ప్రతిదేశమందును సర్కారువారి అధికారముచే అప్పులను దీర్చుటమొదలగు ఒడంబడికలను నెరవేర్చుటకై నాణెములు నిర్ణయింపబడినవి. ఆనాణెముల సహాయముతో మూల్యము లేక విలువయొక్క పరిమాణము వెలగా నిర్ణీతమగుచున్నది; దీనికే ధర, క్రయము, ఖరీదు మొదలగు పదములు నామాంతరములు. మనకు వస్తువులందుకల అభిరుచివలన గిరాకి యేర్పడుచున్నది. వస్తువుల ధరలకున్ను కొనబడు వస్తురాశికిన్ని కలసంబంధ మిక వ్యక్తపరచెదము. సాధారణముగా ఏవస్తువుయొక్క అయినను వెల జాస్తిగా నుండినప్పుడు కొనబడువస్తురాశి తగ్గుచుండుటయున్ను, వస్తువులవెలలు తగ్గినప్పుడు కొనబడు వస్తురాశి హెచ్చగుటయున్ను అనుభవవిదితము. ప్రియముగానున్నపుడు తక్కువవస్తువులును చౌకగానున్నపుడు ఎక్కువవస్తువులును చెల్లుచున్నవి. ఈసూత్రమును మనము అనుభవవేద్యములగు ఈక్రిందివిధమున నుండు బజారుధరలను బట్టియే నిర్ణయించుచున్నాము.

మంచినెయ్యి వీశె ౧-కి రూ. 6 అయిన సాధారణపు కుటుంబీకుడు నెయ్యికొనడు.

| | | | | |
|---|---|---|---|---|
| రు | 4 | అయిన | 1 వీశెడు నెయ్యి | కొనును. |
| ,, | 2 | ,, | 3 వీశెలు | ,, |
| ,, | 1 | ,, | 5 | ,, |
| ,, | $\frac{1}{2}$ | ,, | 8 | ,, |
| ,, | $\frac{1}{4}$ | ,, | 10 | ,, |

ఇట్టి 'డిమాండు' పట్టీలను అనుసరించి యే పైన చెప్పినసూత్ర మేర్పడుచున్నది. ఈసందర్భమున మనము గమనింపవలసిన సూక్ష్మాంశము లెన్నియో కలవు. వాటిలో ముఖ్యములకొన్నిటినిమాత్రము సూచించెదము. వీశె 1-కి రూ 4 అయినను అందరు నెయ్యికొనగలరా? పేదవాండ్రున్ను కొందరు సామాన్య కుటుంబస్థులును నెయ్యి కొననే కొనరు; కారణమేమన అంత్యోప యుక్తి ఎక్కువ; ఆనెయ్యిని కొనగలిగినను సొమ్ముతో ఇంకా ముఖ్యమైనట్టియు, ఎక్కువ అంత్యోపయుక్తి కల్గినట్టియు ఇతరపదార్థములను కొనుట ముఖ్యమని తలం తురు. ఎవడో భాగ్యవంతుడు రూ. 4 లకు 1 వీశెడు నెయ్యి కొనవచ్చును. కొందరు వారికిగల ఆవశ్యకతను బట్టి ఎంతధరఅయినను సరి ఆవస్తువును కొనితీరుదురు. మన హిందూకుటుంబీకుడు తన ఇంటిలో శుభకార్య దినమున బ్రాహ్మణసంతర్పణచేయసమకట్టినపుడు నెయ్యి ఆవశ్యకమగుటంజేసి వీశె 1 కి ధర 4 లేక 5 రూపా యలైనను నెయ్యి తప్పక కొనుచున్నాడు. ఇంకొక సంగతి. తేయాకుడబ్బా వెల రూ. 1½ అనుకొందము. ఆవెల తగ్గినపుడు మీది సూత్రానుసారము ఎక్కువ టీ డబ్బాలు చెల్లుబడి కావలసియుండును. అయితే ఒకవేళ తేయాకు నీరుత్రాగే సాంప్రదాయము వైద్యులారో పించెడు దోషములు ప్రజలకు నచ్చుటచేతనో, కాఫీగాని కోకోగాని త్రాగుట రుచికరముగా నుండునని ప్రజలకు తోచుటచేతనో టీడబ్బాలకు ఉండు 'డిమాండు' తగ్గి పోవచ్చును. ఇందులకు వ్యాఖ్యానము తేయాకుడబ్బాల అంత్యోపయుక్తి సన్నగిల్లుననియే.టీడబ్బా లంతగాచెల్లు బడికావు. అంత్యోపయుక్తి ననుసరించి కొనబడురాశి ఏర్పడునని మనము జ్ఞప్తియందుంచుకొనవలెను.మరియొక సంగతి: కొన్నివస్తువులధరలు హెచ్చినను మనము మామూ లుగాకొనేరాశిని తగ్గించక యేకొనుచున్నాము;మరికొన్ని వస్తువులవిషయములో ధర తగ్గినచో వస్తువుల యందలి అభిరుచి అధికరించి ఎక్కువరాసులను కొనుచున్నాము; ధరలు హెచ్చినచో కొనబడురాశి తగ్గుచుండును. ఈ సూత్రములు వస్తువుల ముఖ్యాముఖ్యత్వమును బట్టియు వస్తువులను కొనువారి అంతస్తులు, స్థితిగతులు, అభిరుచులు వీటిని బట్టియూ మారుచుండును. మన దేశములో సాధారణముగా బియ్యము వెల హెచ్చిన మాత్రమున కొనబడుట తగ్గును; బియ్యము ముఖ్య పదార్థము కావున దానివెల అధికరించినను ప్రజలు తినుటకు కావలసినన్ని బియ్యమును కొనియే తీరుదురు; ఇతరకర్చులలో తగ్గించుకొందురుగాని వెలలు జాస్తిఅని బియ్యముకొనుట తగ్గించి ఒకపూట తిండితో నుస్తు ఉం డరు. మిక్కిలి పేదలగువారిలో కొందరు కాటకపు దినములలో బియ్యము ప్రియముగానున్నందున కొనలేక ఉపవాసము చేయవలసివచ్చును. ఉప్పువిషయములో కూడ అంతే. ఏమన ఇదికూడ ముఖ్యపదార్థములలో చేరినవస్తువే. మోటారుకార్ల వెలలు పూర్వముకన్న 100రూ తగ్గినను పేదవారు, మధ్యతరగతి భాగ్యము కలవారు జాస్తి మోటారుకార్లను కొందురా? వారు అసలే కొనరు; ఏమన వారిఅంతస్తునకు తగనికర్చు మోటారుకార్లను కొనుట. కొందరు భాగ్యవంతులను కనుమాత్రము మోటా రుకార్లవిషయములో 'డిమాండు' సూత్రము వర్తిం చును. కావున కొన్నిసమయములందును కొందరివిషయ మునను, కొన్నివస్తువులవిషయమునను వెలలహెచ్చుతగ్గల ననుసరించి కొనబడు వస్తురాసులమొత్తము భేదించుచుం డును; మరికొన్ని అవస్థలలో ఆసూత్రము తిన్నగా వర్తిం పదు. చాలవెలగలవియు మోజుమిరపసులలో చేరినట్టియు అయినబట్టలవెలలు తగ్గినయెడల భాగ్యవంతులాబట్టలను జాస్తిగాకొందురు. అట్టి బట్టలవెలలు(అసలు జల్తారుజరీగల మొదటిరకము పట్టూలు కండువాలనుకొనుడు)తగ్గినను హెచ్చినను బీదవారికొకటియే. వారు ఆమేలిమిబట్టలను అసలే కొనలేరు; కొంచెము ముతగనేసినైనను ఖద్దరు కండువాలతోనే సంతృప్తినొందెదరు; వారికాఖద్దరు కండువాల ఖరీదుకూడ జాస్తిఅయినయెడల ఇంకా తక్కు వధరలకు మిల్లులో నేయబడిన చౌకరకముగుడ్డలనే కొందురు. ఇంకొకసంగతి : బీదకుటుంబమువారుకూడ వారలవాటుపడిన వస్తువులవెలలు అధికముగా నున్నను ఎక్కువవెలల నిచ్చే ఆవస్తువులను కొనుచున్నారు. ఈదేశ ములో తయారగు ఖద్దరుబట్టల వెలలకన్న యంత్రసా ధనములద్వారా మాంచెస్టరుఫ్యాక్టరీలలో నేయబడు తాను గుడ్డలధరలు తక్కువగా నున్నను ఖద్దరుధారణమున కలవాటుపడినవారు ఖద్దరువస్త్రములనే కొనుచున్నారు; ఈదేశపుకాపు లనేకులు పొగాకు నములేఅభ్యాసము కల వారు కావున పొగాకుధర హెచ్చినను వారికి కావలసిన

యున్ను అంత్యోపయుక్తియున్ను లభించుచున్నదని భావించెదము. (విషయవైశద్యమునకే ఈఅంకెలు వేయ

| ఖర్చుగుసొమ్ము | పాలయొక్క పూర్ణోపయుక్తి | పాలయొక్క అంత్యోపయుక్తి | పంచదారయొక్క పూర్ణోపయుక్తి | పంచదారయొక్క అంత్యోపయుక్తి |
|---|---|---|---|---|
| 1 అణా | 10 భాగములు | 10 భాగములు | 9 భాగములు | 9 భాగములు |
| 2 ,, | 18 ,, | 8 ,, | 16 ,, | 7 ,, |
| 3 ,, | 24 ,, | 6 ,, | 20 ,, | 4 ,, |
| 4 ,, | 29 ,, | 5 ,, | 23 ,, | 3 ,, |
| 5 ,, | 32 ,, | 3 ,, | 25 ,, | 2 ,, |
| 6 ,, | 34 ,, | 2 ,, | 26 ,, | 1 ,, |

బడినవిగాని పూర్ణాంత్యోపయుక్తులను కొలవేయు శాస్త్రీయసాధనములు కావు) —

9 అణాలపాలును, పంచదారయును అనేకవిధ ములకొనవచ్చును. వాటిలో కొన్నివిధముల కష్టసుఖ ములనే ఇచ్చట పైపట్టీ సహాయమున విచారించెదము. 6అణాలపాలును,3అణాలపంచదారయును కొనినట్లయిన, మీదపట్టీ ప్రకారము వాటి అంత్యోపయుక్తులు 2, 4; మొత్తపుపూర్ణోపయుక్తి(34 + 20) లేక 54భాగ ములు. 5అణాలపాలున్ను 4అణాలపంచదారయునుకొన్న ట్లయిన అంత్యోపయుక్తి రెండింటికి సమానముగా నుం డును. అనగా 3 భాగములు, మొత్తపు పూర్ణోపయుక్తి (32 + 23) లేక 55 భాగములు, 4 అణాలపాలును, 5 అణాల పంచదారయును కొనినట్లయిన అంత్యోపయు క్తులు 5, 2; మొత్తపు పూర్ణోపయుక్తి (29 + 25) లేక 54 భాగములు. ఇట్లు విమర్శించిచూడగా, 5 అణాల పాలున్ను, 4అణాలపంచదారయున్ను కొనుటయేలాభక రమన్నటులు కానవచ్చుచున్నది. ఏమన, మొత్తపుపూర్ణో పయుక్తి జాస్తిగా నుండుటయేకాక అంత్యోపయుక్తి పాలవిషయమందును పంచదార విషయమందును సమా నముగా నున్నది. ఇంకొకవిధమున 9 అణాలు ఖర్చుచేసి నచో పాలకు తగినపంచదార లేకపోవుటయో పంచ దారకు తగినపాలు లేకపోవుటయో సంభవించును. సాధా రణపు బుద్ధిగలవాడుకూడ కష్టదాయకంబగు వ్యవహార మునకు బనులు సుఖదాయకంబగు వ్యవహారమునే చేయును. కుటుంబనిర్వాహకత్వము, వ్యవహారనిపుణత, ఈన్యాయమునే అనుసరించుచున్నవి. ఒక్క వినియోగ విషయముననే కాదు అర్థోత్పత్తియందు కూడ (వస్తు రచన మొదలగునవి) ఈ సమానాంత్యోపయుక్తి న్యా యము వర్తించుచున్నది. ఎక్కువవెలగల వస్తువునకుబదు లుగ తక్కువవెలగలవస్తువు భర్తీచేసి ప్రజలు లాభము నొందుచుందురు. ఒకశేరు ఆవుపాలవెల 4 అణా లయి నప్పుడు 5 శేర్లపాలను అమ్మి రూ. 1-4-0 కు బదు లుగ 2 శేర్లనీటినికలిపి రూ. 1-12-0 సొమ్మును గొల్ల వాళ్లు సంపాదించుచుండుటలేదా. అనేకవ్యాధు లకు దివ్యౌషధముగనట్టియు, ఖుద్దు 1-కి 8 అణాల వెల కలదియు అయిన ఒకమందుగాక దానికి బదులుగ ఎవరైన తక్కువవెలగల ఓషధుల సహాయమున అట్టిమందునే తయారుచేయగల్గినచో పైమందు సీసాధర సన్నగిల్లదా! క్రొత్తమందు తయారుచేయు ఉత్పాదకునకు చాల లాభము వచ్చును. మనదేశమున కొన్ని భాగములందు మిక్కుటముగా పైరగు నీలిమందునకు బదులుగ జర్మనీ రసాయన శాస్త్రజ్ఞులు వారిప్రజ్ఞావిశేషమున కనిపెట్టి తయారుచేసిన కృత్రిమపు నీలిమందు ప్రాబల్యము నగదా మన నీలిమందుపంట కెంతయో నష్టమువచ్చినది. కృత్రిమమగు నల్లమందును కనిపెట్టుటకు అమెరికాదే శీయులు యత్నించుచున్నటులు తెలియుచున్నది. ఇట్టి విషయము లన్నిటియందు వర్తించు సమానాంత్యోప యుక్తి న్యాయమునకే "ప్రత్యామ్నాయ న్యాయము" లేక, (Law of Substitution) అని నామాంతరము.

## ౫. వినియోగజనకశేషము

ఏ వస్తువునైన కొనుటకు ఖరీదు నివ్వవలెను. ఖరీదునిచ్చుట కష్టమే. ఈకష్టముకన్న వస్తు లాభము వలనకలుగు సుఖము ఎక్కువగా నుండునని తోచి

నప్పుడే ఖరీదు నిచ్చి వస్తువును కొందుము. ఆ సుఖము నుండి యీ కష్టము మినహాయించగా మిగిలిన సుఖమే వినియోజక శేషము. వినియోజకుడన వస్తువు నుపయోగించి అనుభవించువాడు. వాడుకొనిన వస్తువు నుండి కలిగెడుసుఖము తానిచ్చు ధనరూపకమగు వెల వలన సంభవించెడు కష్టముకన్న అధికరించియుండును. ఇందుల కుదాహరణములు అరణాపోస్టుకార్డు ఉప్పు. పోస్టుకార్డునకై ఒక అరణా ఇచ్చుట కష్టముగా నుండ వచ్చునగాని అందువలన కలిగెడు లాభము ఇంతింతన రానిదిగా నున్నది. ఆకార్డుమీద ఒక జాబువ్రాసి దానిని టపాలపెట్టెలో వేసినయెడల మనఉత్తరము దేశములో నున్న ఎట్టిస్థలమునకైనను, ఎట్టి పై విలాసమునకైనను రవాణా చేయబడును. ఈ సౌకర్యమువలన కలిగెడు లాభము ముందర అరణాకర్చు కష్టమేపాటిది! అరఅణాకు లోభించి ఉత్తరము వ్రాయుటయే మానివేయువారు బహుస్వల్పముగా నుందురు. వినియోజక శేషము పోస్టుకార్డునందెంతయో అధికముగా నుండుటంజేసియే ఈ మధ్య మనగవర్నమెంటువారు రెవిన్యూ అధికరించుటకొరకు పూర్వము ¼ అణాకు అమ్మబడెడు పోస్టుకార్డువెలను రెట్టించిరి. ఇప్పటివెలను ద్విగుణించినను పోస్టుకార్డువలన లభించెడు వినియోజక శేషము హెచ్చుగానే యుండును. అయితే పోస్టుకార్డులవెలలను జాస్తీ చేయుమని దొరతనమువారిని ప్రోత్సహించుట మామతముకాదు; ఏమన వినియోజకశేష మెట్లున్నను కారణాంతరములవలన మనదేశము మొత్తముమీద బీద దేశము కావున పోస్టుకార్డులను వినియోగించువారి సంఖ్య తగ్గిపోయి గవర్నమెంటువారి రెవిన్యూ తగ్గుటయేకాక కొందరు వినియోజకుల కెంతయో కష్టముగా నుండును. ఉప్పువిషయములోకూడ వినియోజక శేషము ఎక్కువగా నున్నది. ఈకారణముంజేసియు ఉప్పు జనసామాన్యమంతయు వినియోగించే పదార్థమగుటంజేసియును మన దొరతనమువారు ఉప్పుపన్ను విధించుటచే ఉప్పువెల జాస్తీఅయినను మనము కొనెడుఉప్పును తగ్గించుచుండ లేము. ఉప్పువిషయములో వినియోజక శేషము ఎక్కువగా నున్నదని మనదొరతనమువారు ఉప్పుపన్నును ఇంక అధికము చేయరనియే మానమ్మకము; కారణమేమన ఉప్పు ఆవశ్యకపదార్థసమితిలో చేరినది కావున ఎక్కువ ఉప్పుపన్ను విధించినయెడల ఈదేశపుబీదల కెంతయో కష్టముగా నుండును.

## ౬. మూల్యప్రయోజనములకుగలసంబంధము.

ఈవిషయము వినిమయకాండములోని ప్రధానాంశమైనను వినియోగకాండమునకు కూడ సంబంధించినది కావున ముఖ్యమగు సంగతుల గొన్నిటి నీదిగువ వివరించెదను. ఏవస్తువునకైన విలువ లేక మూల్యము ఎందువలన నేర్పడుచున్నది? ఆవస్తువు హేరాళముగా దొరకక సరఫరా తగ్గియుండుటవలనను, ఆవస్తువు ప్రయోజనసహితంబగుటజేసియు. ఒక్క ప్రయోజన మున్నమాత్రమున వస్తువునకు విలువ లేక మూల్యము ఉండదు. గాలి నిష్ప్రయోజనమైనదని ఎవరు వాదించగలరు? అయినను అది ఎచ్చటనైనను విస్తారముగా నుండునుగాన దానికి విలువలేదు. పూర్ణోపయుక్తికిని అంత్యోపయుక్తికిని కలభేదమును బాగుగ గ్రహించినచో మూల్యమెట్టి ఉపయుక్తి వలన సంభవించునో మనకు తేటపడును. గాలికి పూర్ణోపయుక్తి విస్తారమని ఎల్లరకును తెలిసిన సంగతియే. అయితే గాలికి అంత్యోపయుక్తి అంతగా లేదు. కావుననే గాలికి విలువలేదు. గాలిబజారులో వెలకు కొనబడుపదార్థము కాదు. మూల్యము దానింజేసి వెలలేకపోవుట గాలియొక్క గౌరవమునకు కొరత కాదు. సర్వవ్యాపియగు భగవంతుని అపరావతారమో యనునటుల ఎల్లెడలను వ్యాపించి ప్రాణికోటిని రక్షించునది గాలియే. ఒకానొకప్పుడు గాలికికూడ అంత్యోపయుక్తి ఏర్పడుచున్నది. లోతుగా నుండుగనులలో పనిచేయుకార్మికులకు గాలి అత్యంతావశ్యకము; ఆసురంగాంతర్భాగములలో గాలి దుర్లభముగా నుండుటంజేసి యంత్రములద్వారా పరిశుభ్రమైన గాలి అప్పుడప్పుడు సరఫరా చేయబడుచుండును. అట్టి గాలికి అంత్యోపయుక్తి మిక్కుటముగా నుండును. ఇంకొకసంగతి. వజ్రవైడూర్యములకన్న జలాహారాదులకు పూర్ణోపయుక్తి అధికమనుటకు జనుల అభిప్రాయమే సాక్షి. వజ్రవైడూర్యములు లేకపోయినను ప్రజలు హాయిగా జీవించవచ్చును గాని జలాహారములు లేనిబ్రతుకసంభవము. బంగారము, ఇనుము—ఈరెండు లోహములలో ఇనుమే ఎక్కువప్రయోజనకారియని అందరకు తెలిసినదే! పదిదినములకు ఫలర్థముజలాహారా

దుల నిచ్చినను ఎవ్వడైన ఒకతులమెత్తు వజ్రము నిచ్చునా? నాలుగుతులములు ఇనుము నిచ్చినను చిన్నమెత్తుబంగార మెవడిచ్చును! వజ్రవైడూర్యములు, బంగారము— వీటిసరఫరా తక్కువ. వస్తువులసరఫరా తగ్గుటవలన వాటిఅంత్యోపయుక్తి అధికరించి వెలలు హెచ్చును గాని పూర్ణోపయుక్తి తగ్గిపోవును. కరవుకాలములో ధాన్యాదుల సరఫరా తగ్గియుండునుకదా! కొద్దిగా లభించెడు ధాన్యాదుల అంత్యప్రయోజనమున్ను దానింజేసి వాటివెలలున్ను అధికరించినను పూర్ణోపయుక్తిమాత్రము తగ్గిపోవును. ఈవిశేషాంశములను గుర్తెరిగియుండుటకు మూల్యప్రయోజనముల అన్యోన్యాశ్రయతయును అంత్యప్రయోజనమువలన గాని పూర్ణోపయుక్తివలన గాని వెల తేర్పడవనియును పాఠకులు జ్ఞాపకముంచుకొనవలెను.

## 4-వ ప్రకరణము

## ఆర్థిక విమర్శనోపయుక్త వివరములు, వినియోగమార్గములు

### ౧. విమర్శనావశ్యకత

ఆర్థికవిషయముల దెలిపెడుశాస్త్రమే అర్థశాస్త్రముకావున ఆర్థికవిషయవిమర్శన మీశాస్త్రజ్ఞానాపాదనమున కవశ్యము. శాస్త్రకారులు పేర్కొనిన కొన్ని ఆర్థికసూత్రములను మనసునం దిడుకొని తర్కించిన మాత్రమున ఈశాస్త్రజ్ఞానమంతగా నలవడదు. ఈ శాస్త్రము సంఘశాస్త్రసమితిలో చేరినదగుటంజేసియు, మనుజుల ఆర్థికస్థితిగతు లెప్పుడును ఒకేవిధమున నుండక దేశకాలపాత్రానుసారముగ మారుచుండుటం జేసియు, ఆపరిణామకారణములు చరిత్రాత్మక విషయము లగుటంజేసియు, ఆవిషయములను, తత్సంబంధమైన వేర్వేరు వివరాంశములను ఓపికతో సేకరించి, యుక్తియుక్తముగ విభజించి, పట్టీలరూపకముగా వ్రాసి, ఇతర విషయములతో సరిపోల్చి, తారతమ్యములను విచారించి, ఇంకనెన్నియోవిధముల శ్రమపడినగాని ఆర్థికవిషయతత్వము సరిగా బోధపడదు. ఇదియే ఆర్థిక విమర్శనస్వభావము. కుటుంబాదాయవ్యయపట్టికలు, గ్రామనగర సంబంధములగు ఆర్థికవివరములు, జనాభాలెక్కలు, వ్యాపార వివరములు, జననమరణజాబితాలు, దేశపుభాగ్య మింతయని అజ్మా (అంచనా) వేయుటకు పలువిధ వివరములు, వస్తువుల బజారుధరలు, నాణెములముద్రణము, ప్రశస్తలోహముల (బంగారము, వెండి) ఉత్పత్తివివరములు, ఆలోహముల బజారుధరలు, అంతర్దేశీయవర్తకమందొక దేశపు నాణెము ఇంకొక దేశపు నాణెముల కెన్నిటికి సమానముగ నెంచబడుచున్నదో వివరించు జాబితాలు, ఎగుమతి దిగుమతుల వివరంపు, యానసౌకర్యముల వివరములు వ్యవసాయాది పరిశ్రమల క్రియల వివరములు, పరిశ్రమల (హస్తశిల్పములు, యంత్రశిల్పములు) వివరములు, దేశమందలి బ్యాంకులయొక్కయు నిధులయొక్కయు పరస్పర సంఘములయొక్కయు వివరములు, పన్నులవివరములు, దొరతనమువారి ఆదాయవ్యయపట్టికలు మొదలగునవి ఎన్నియో ఆర్థికవిమర్శనమునకవశ్యములై యున్నవి. ఇట్టి విమర్శనలవలన వెల్లడియైనవిషయములే శాస్త్రకారులు సూత్రరూపకముగ నిర్ణయించిరి. ఆర్థికసూత్రముల ప్రసక్తి నిట్టివిధమునముందుగ నిర్ణయించుటకు సాంఘిక రాజకీయపరిస్థితులను, కాలప్రభావమును మొదలగు వాటిని గమనింపవలసియున్నది. ఏదేశముయొక్క గాని ఆర్థికస్థితిని విమర్శింపవలసివచ్చినపుడు పైని పేర్కొనబడిన విషయములను సేకరించి, ఆవివరములను జాగ్రత్తగా పరిశీలించవలెను. ప్రతిదేశపు ఆర్థికవిషయములు ప్రత్యేకపరిస్థితులు. విమర్శనోపయుక్తంబగు వివరముల కొన్నిటిని దేశము నేలెడి దొరతనమువారే ఉద్యోగస్థుల నియమించి వారిద్వారా సేకరించి ప్రకటించుచున్నారు. అర్థశాస్త్రజ్ఞులు, ఆర్థికవిమర్శకులు వాటిని సముచితముగ నుపయోగించుటయు, ఇంక కావలయువివరములను వారేసేకరించియు ఆర్థికసిద్ధాంతముల జేయుచుందురు.

### ౨. కుటుంబాదాయవ్యయపట్టికలు

ఏకుటుంబముయొక్కగాని ఆదాయ వ్యయముల దెలుపు జాబితాలను సూక్ష్మబుద్ధితో పరిశీలించినచో మీది ప్రకరణములలో వివరింపబడిన ఆర్థికన్యాయముల యాథార్థ్యము స్ఫుటముగా తెలియుటయేకాక కుటుంబపురాబడి ఏయే సామాన్య న్యాయముల ప్రకారము వెచ్చింపబడుచున్నదో కూడ విశదమగును. అట్టి ఆర్థిక విమర్శనచేయుట సులభసాధ్యము కాదు. ఏలనన కుటుంబములగూర్చి సరియగు విమర్శ చేయబూనినపుడు

పట్టణాధికారులు వారివారి రాబళ్లు వాస్తవముగ నెం
తయో, ఆరాబడి (వస్తురూపకముగ నున్ననుసరి, నగదు
రూపకముగ నున్ననుసరి) ఏయేవిషయములకై వెచ్చింప
బడుచున్నదో, ఆదాయము వ్యయముకంటె హెచ్చో, వ్య
యములు ఆదాయముకన్న జాస్తిగా నున్నవో, కర్చుక
న్న రాబడి ఎక్కువగానున్న ప్రత్యాదాయ మెట్లుప
యోగింపబడుచున్నదో, రాబడికన్న కర్చులు జాస్తి
అయినప్పుడు కావలసిన జాస్తిసొమ్ము మొత్త మాకుటుం
బస్థు లెంతవడ్డీకి అప్పువాడుచున్నారో మొదలగు అంశము
లన్నిటినిగూర్చి వాస్తవమైన లోగుట్టు ఆర్థికవిమర్శకుల
కిచ్చినగదా, వారు గణబుద్ధివిశేషములంజూపి మొత్తము
మీద కుటుంబాదాయవ్యయము లీయాసూత్రముల నను
సరించి యుండునని తర్కించి సిద్ధాంతీకరింతురు. ఇట్టి
ఆర్థికవిమర్శనలు అమెరికా జర్మనీమొదలగు దేశములలో
జయప్రదముగా జరిగెనవి. మనదేశములో నంతబాగుగ
జరుగలేదనియే చెప్పవచ్చును. ఇప్పుడిప్పు డిట్టి విమర్శ
నము లారంభమైనవి, పైనజెప్పిన సంగతులగురించి ఏ
ఆర్థికవిమర్శకుడైన ఒక కుటుంబీకుని ప్రశ్నించినచో
"ఈగోల నీ కెందుకయ్యా! మా రాబడి ఇంత జాస్తిగా
నున్నదని సర్కారువారికి తెలియజేసి రాబడిపన్ను బిగిసే
టట్లు చేయుటకా నీవు నియమింపబడితివ"ని హేళన
సేయవచ్చునుగాని విమర్శకులు వేయుప్రశ్నలకు సదుత్తర
ముల నిచ్చి ఆర్థికవిమర్శన జయప్రదముగ కొనసాగించు
టకు సాధారణముగా అనేక కుటుంబస్థులు సహాయ
పడరు. కొద్దిగనో, గొప్పగనో ఇట్టికష్టము ప్రతిదేశమం
దును ఉన్నది. ఇంకొక కష్టము. ఏఆర్థిక విషయము
గురించి అయినను అనుభవవిదితములగు కుటుంబాదాయ
వ్యయముల తత్త్వమును పరిశోధించి కనుగొనుట కొకటి
రెండుకుటుంబముల వివరాంశముల జేపట్టిన మాత్రమున
కార్యసిద్ధి కలుగదు. వందలకొలది వేలకొలది కుటుంబ
ముల ఆర్థికస్థితులను గమనించినగాని సిద్ధాంతము సేయ
గూడదు. ఇట్టిశ్రమమునకోర్చి కొన్ని దేశములలో తరహా
తరహా అంతస్తులుకల అనేక కుటుంబముల జమాకర్చు
లెక్కలను శోధించిన విమర్శకుల సిద్ధాంతములు కొన్ని
కలవు; వాటి నీదిగువ పొందుపరచుటయేకాక ఆసిద్ధాంత
ములు మనదేశమున కెంతమట్టుకు వర్తించుచున్నవో మన
దేశీయు లవలంబించెడు అర్థవినియోగ మార్గములున్ను,
అవిభక్తపు కుటుంబపద్ధతి, ఉంఛవృత్తి, అతిబాల్యవివా
హములు మొదలగు సాంఘికాచారములు అర్థవినియోగ
మున కెట్లు సంబంధించియున్నవో
తెలిసికొనుటకు తగినవిమర్శనము లత్యంతావశ్యకమని
కూడ హెచ్చరిక సేయుచున్నాము. మనదేశములో
కూడ కొందరార్థికవిమర్శకులు అన్యదేశీయుల సిద్ధాంత
ముల గొన్నిటిని స్థిరీకరించియున్నారు; కుటుంబాదాయ
వ్యయపట్టికలవలనను వాటిని సంబంధించెడు సాంఘికా
చారములవలనను కలుగులాభనష్టములను అభిప్రాయము
లను సంపర్కాంతరములలో స్పష్టీకరించియున్నారు.

## 3. అర్థవినియోగవిషయిక విమర్శనవలన లభించెడు అభిప్రాయములు

కుటుంబపురాబడి జాస్తిఅయినకొలది భోజన
పదార్థముల విషయమున మొత్తముమీద తక్కువకర్చే
అగుచుండును. ఈఅభిప్రాయముయొక్క అంతరార్థము
రాబడి ఎక్కువగుకొలది తనివిచేతను కుటుంబస్థులు
తిండి తగ్గించుకొనుట కాదు. రాబడి అతిశయించి
నపుడు ఎక్కువ వెలగలవస్తువులను మేలిమిపదార్థములను
భోజనాదులకై ఉపయోగించుట సహజమైనను, జాస్తి
రాబడి ఇతరకర్చుల కెక్కువగా వినియోగింపబడును.
రూ. 1000 సంవత్సరపు రాబడికల సామాన్యకుటుంబము
భోజనపదార్థములకై రూ. 420 సెలవు చేయుచున్న
దనుకొందము. 50 వేలరూప్యముల సంవత్సరపు రాబడి
కల కుటుంబము రూ. (420 × 50) లేక రూ. 21,000
ఒక్కభోజన విషయముననే వెచ్చించుచుండుట లేదు.
రూ. 420కన్న జాస్తిసొమ్ము వ్యయము కావచ్చునుగాని
రూ. 21,000భోజనపుకర్చు ఉండదు. వెయ్యిరూపాయలే
రాబడిగలకుటుంబమునకు లేనిభోజనేతరవ్యయము 50వేల
రూపాయలరాబడికలకుటుంబమున కెన్నియో కలవు. మేలి
మిరకముల దుస్తుల ధరించుట, గుర్రముబండ్లు, మోటారుకార్లు
మొదలగువాహనములనుపయోగించుట, వివాహములు, శ్రా
ద్ధములు మొదలగుకార్యములకు విశేషముగ కర్చుసేయుట,
స్థిరచరాస్తుల నధికముగసంపాదించుట—ఇట్టి ఇతరవిషయ
ములనుగురించివెచ్చింపబడుసొమ్ముమొత్తములో భోజనపు
కర్చు ఒకచిన్నభాగము. తరహాతరహా అంతస్తులు కలిగిన
ట్టియు, 100 రూ. మొదలు ఒక్క లక్షరూప్యముల

పరకు సంవత్సరపు ఆదాయవ్యయముల వేర్వేరు కుటుంబముల రాబళ్లనుకర్చులను జాగ్రత్తగా పరిశీలించి సగటుసరి లెక్కలు చేసినయెడల ఈవిషయము విశదపడును.

ఒకకుటుంబపురాబడి హెచ్చినకొలది ధరించుట కుపయుక్తములగు బట్టల కగుకర్చు విస్తారము జాస్తిగా నుండును. ఇంటిఅద్దె, వంటచెరుకుకర్చు, దీపములనిమిత్తమైనకర్చు— ఇవికూడ అట్టిసూత్రము ననుసరించియే యుండును. విద్య, ఆరోగ్యము, విశ్రాంతి, మొత్తము మీద సుఖము నొసగుసాధనములు— వీటినిమిత్తమై అగుకర్చు రాబడి హెచ్చిన కొలది హెచ్చుచునే యుండును. "లక్షాధికారి వద్దా భిక్షాధికారికంటె" అనే లోకోక్తి ఈఅభిప్రాయము ననుసరించినదియే. తక్కువ రాబడికలవా రిట్టివిషయముల గూర్చి ఎక్కువకర్చు సేయ లేరనుసంగతిమనకందరకు తెలిసినదియే. జాస్తిరాబడి కలవారికి వాంఛలనేకము లుండుటయేకాక ఆవాంఛలం దీర్చుకొనుటకు వలయుద్రవ్యసాధనముకూడ నుండుట వలన జాస్తీకర్చు చేయుచుందురు.

ఎవడైన తానార్జించిన విత్తముతో ప్రాణసంరక్షణమున కత్యవసరమగు ఆవశ్యకపదార్థములనే మొదట సేకరించుకొనును; తినుట కన్నము, కట్టుటకు బట్ట, నివసించుటకు వసతి—ఇవి ఆవశ్యకములు. ఇవి సమకూడినపిమ్మట మనుజునిప్రవృత్తి సాధారణముగా అలంకారపదార్థములవైపు పోవును. "మ్రింగ మెతుకు లేనివాని మీసములకు సంపెంగతైల మెందు"కనియెడి లోకోక్తి ఈసామాన్యవిషయము ననుసరించినదియే. ప్రజలరాబడి హెచ్చినకొలది మీదజెప్పినవిధమున అలంకారపదార్థ వినియోగమునకై ద్రవ్యము వెచ్చింపబడుచుండును. కూలిపనిచేసి జీవించువాడుసైతము వానిరాబడి కొంచెమతిశయించినచో మేలిమిదుస్తుల ధరించును; హుక్కా పీల్చును; కల్లుత్రాగును; విలువైనపాదరక్షలు తొడుగును; చక్కనిగొడుగుల నుపయోగించును; కాఫీ, టీ, కోకో మొదలగువాటిని సేవించును; వివాహాది కార్యము లతిఆడంబరముతో జేయును; ఇంక నెన్నెన్నియో విధముల తనజీవనావస్థను ఉన్నతదశకు తెచ్చుట కుద్యుక్తుడగును. నాగరికత, విజ్ఞానము, భాగ్యము ఇవి అభివృద్ధియగుచున్నకొలది ఆవశ్యకములు, అలంకారములు వీటియందలి అనేకతరహాలవాంఛలు ప్రబలి ప్రజలజీవనావస్థ ఉన్నతదశకు వచ్చునంతవరకు ఏదేశమునకైన సహజముగా నున్నది. మనహిందూదేశమందుకూడ జనుల జీవనావస్థలు నానాటికి [illegible] వహించుచున్న వనుటకు కొన్ని గొప్పసాక్ష్యము లున్నవి. ఆవశ్యకములు వస్తువులతో తృప్తినొందక నాగరికతాచిహ్నంబులనదగు అలంకారపదార్థము లెన్నియెన్నో మనవా రన్యదేశములనుండి దిగుమతిచేసుకొని వాడుచున్నారు. పూర్వీకు లెరుగని సదుపాయముల నెన్నియెన్నో మనవా రనుభవించుచున్నారు. అలంకారయుక్తములును, సదుపాయకరములును అయిన యీదిగుమతిచేయబడిన వస్తువులను లక్షలకొలది ద్రవ్యము నెచ్చించి 1914–వ సంవత్సరమున నే హిందూదేశీయులు [illegible] తెలియవచ్చుచున్నది:—

| దిగుమతికాబడు వస్తువులు. | | వాటిఖరీదు. |
|---|---|---|
| అన్యదేశపు మేలిమిచక్కెర | 1447 | లక్షలరూ, |
| కిరసనాయిలు | 286 | ,, |
| యంత్రములలో తయారగునూలుబట్టలు | 6054 | ,, |
| పట్టుబట్టలు | 252 | ,, |
| ఉన్ని (ఉలెన్) బట్టలు | 306 | ,, |
| ఇతరచిత్రమగుదుస్తులు | 306 | ,, |
| పాదరక్షలు | 74 | ,, |
| నానావిధములగు లోహనిర్మిత పదార్థములు | 789 | ,, |
| అగ్గిపుల్లలు | 90 | ,, |
| సబ్బుబిళ్లలు | 74 | ,, |
| చెక్కలు | 123 | ,, |

హిందువులజీవనావస్థలు ఉన్నతదశ నొందుచున్నవనుటకు మీదజెప్పినవస్తుజాలము నుపయోగించుట, అన్యదేశీయుల సంపర్కమున లభించెడు సుగుణము లలవడుట ఒకవిధమగుమంచిసాక్ష్యమే కాని అన్యదేశీయుల సుగుణములతో పాటువారిదుర్గుణములనుగూడమనవారనుకరించితమద్రవ్యమును త్రాగుడుమొదలగు దుర్వ్యసనములందునిరర్థకముగావినియోగించుచున్నారనియు, వివాహశ్రాద్ధాదుల విషయమున అంతస్తునకు మించిన జాస్తికర్చులు చేయుటవలన అనేకకుటుంబములు కూలిపోవుచున్నవనియు, తమరాబడికి మించినకర్చుల నొకవేళ చేయవలసివచ్చినపుడు తక్కువవడ్డీల కప్పులు లభింపక

సాలీనికి కాని, నూటికి 15 లేక 20 రూ. చొప్పున వడ్డీ సమర్పించినగాని అప్పులు దొరకక ప్రజలు కష్టపడు చున్నారనియు మనము వినుచున్నాము. ఇంతేకాదు. ఇతరదేశములందువలె యీదేశములో తక్కువవడ్డీలకిచ్చు బ్యాంకులు, నిధులు మొదలగునవి అంతగా లేవు. తాము వాంఛించు పదార్థములను చౌకగా కొనుటకు వీలు కలుగజేయు వినియోజకసంఘము లీదేశములో తక్కువగా నున్నవి. ఒకరికొరకు కావలసిన వస్తువును టోకువర్తకునియొద్ద నాతనికిమ్మనిన రొక్కమిచ్చి కొనుటకు బదులుగ వినియోజకు లనేకులుచేరి మొత్తముమీద ఎక్కువసరుకును ఉత్పాదకులవద్దనే కొనినచో లాభముగా నుండును! ఈసదుపాయమును కలుగజేయునవియే వినియోజకసంఘములు. అమెరికా జర్మనీదేశములం దిట్టిసంఘము లెన్నియో కలవు. మనదేశమందలి గ్రామములలో ముఖ్యముగా అవి ప్రబలియుండకపోవుటకు కారణములు వారిఅజ్ఞానము, ఐకమత్యము లేకపోవుట అని ఒక విమర్శకుడు వ్రాసెను.

హిందువులు మొత్తముమీద సుప్రసిద్ధమగు ధర్మచింత కలవారేకాని కష్టపడి అర్థ మార్జింప నొల్లనిస్పృహకాయులకు నైనను దానధర్మములు చేయుట ఒక పెద్ద శిష్టాచారమై యున్నందున ఉంఛవృత్తి పురాతన కాలమునుండి ప్రబలియున్నది. ప్రజలను పీడించి బ్రతుకుట సగౌరవజీవనోపాయములలో నొకటిగా పరిగణింపబడుచున్నది. భిక్షావృత్తి నీచమనెడు బుద్ధి మనదేశీయులకు తోచి ఇతరదేశములందువలె ఉంఛవృత్తి నవలంబించువారి విషయమున దగినసంస్కారము లీదేశమందు కూడ జరిగినగాని ప్రజల జీవనావస్థలు వెంపొందవు.

మన అవిభక్తపు కుటుంబములవలన కొన్ని ఇక్కట్లు వాటిల్లుచున్నవి. కుటుంబములో ఎవడైన ఒకడు సంపాదనపరు డుండిన వానినే నమ్మి అనేకులు ఎదిగిన పెద్దవారుకూడ ఊరక కూర్చుండి తినుచున్నారు. ఇయ్యది సోమరితనమునకు బహుమాన మిచ్చినట్లుకాదా! వృద్ధులు శిశువులు మొదలగువారు ప్రవేశ్వర్జనము చేయకున్నను అవిభక్తపు కుటుంబకర్త వారిని పోషించుట శ్లాఘనీయముగాని ఊరక కూర్చొనినవారు ఒకరిద్దరు కుటుంబీకులార్జించినదాని నంతయు వినియోగించుచు వచ్చినచో ఆర్జనపరుల ఉత్సాహము తగ్గిపోవును. ఆర్జింపబడిన విత్తమునకు సద్వినియోగ మెల్లప్పుడు ఉండదు; గృహకలహములు మెండుగా నుండును. కుటుంబకర్త అప్పుల పాలగును. ఇవిఅన్నియును అనుభవవేద్యము లని అవిభక్తపు కుటుంబముల స్థితిగతులను జాగ్రతగా విమర్శించు పాఠకులకు తెలియనచ్చును. సద్గుణముల కాలవాలంబులగు కొన్ని అవిభక్తపు కుటుంబములుకూడ దేశమందు లేవనిచెప్పుట మావాతము కాదు. ఆర్థికదృక్పథంబున శోధించినచో ఈఅవిభక్త కుటుంబపద్ధతివలన కలిగెడు నష్టము లే యెక్కువగా నున్నట్లుల తోచకమానదు.

మనహిందువులు మతాచారములంజేసి సంతానాపేక్షాపరులగుటవలనను అతిబాల్యవివాహముల కీదేశము ఆటపట్టగుటవలనను, ఇంక అనేకకారణముల బట్టియు జనసంఖ్య నానాటికి పెరుగుచునేయున్నది. జనసంఖ్యాధిక్యములకు తగిన ఆహారపదార్థాధిక్యము ఈ దేశమందు లేదని కొందరు విమర్శకులు చెప్పుచున్నారు. కుటుంబమునుపోషించు శక్తిలేనివారుసైతముబాల్యమందే పెండ్లిచేసుకొని పిల్లలను కనుట దేశపుటార్థిక పురోవృద్ధి కొకపెద్ద అభ్యంతరము. ఈవిషయముల నింకొకసందర్భమున రాబోవుప్రకరణములలో విపులముగా చర్చించెదము. జనసంఖ్య అభివృద్ధి అగునప్పుడు కుటుంబ భాగ్యము గాని దేశభాగ్యముగాని వృద్ధినొందక అదే స్థితిలో నున్నచో తప్పక ముప్పు వాటిల్లునని చెప్పకతీరదు.

## ౮. ఆదాయవ్యయ పట్టికలవలన కలుగు లాభములు

ఆర్థికన్యాయవైశద్యమే కాక కుటుంబాధికారి కర్చు వెచ్చములను సరిచూచుకొనుట కట్టిపట్టీ లెంతయో సహాయపడును. రాబడిని మించిన కర్చు చేయవలసినప్పుడు కుటుంబ మప్పులపాలు కాకుండ ఆదాయ వ్యయముల నేయేవిధముల సంస్కరించిన బాగుగనుండునో తెలిసికొనుట కాపట్టీలు మార్గదర్శకములుగా నుండును. ముఖ్యపదార్థవిషయిక వ్యయమునకు భంగము రాకుండ అముఖ్యవిషయములకర్చు వెచ్చములు తగ్గించినచో సమానాంతోన్నపయుక్తి న్యాయము వర్తించునో స్పష్టపడును.

ఒక్కొకటింబ విషయమునందే కాదు; మునిసిపాలిటీ, తాలూకాబోర్డు, డిస్ట్రిక్టుబోర్డు, సరగణా దొరతనము వారు, దేశమునేలెడి సర్కారు – రూపాన జమాకర్చుల నెప్పటికప్పుడు జాగ్రతగా గమనిచేసుకొని కాలోచితముల సంస్కారములజేయుచున్నారు. ఇప్పటికి [illegible] యాన్యాయపద్ధతిలను [illegible] పరిశీలించినచో ఒక్కొక్క [illegible] విషయమునందే కాదు. పరిత్రాణ[illegible] గలవారు [illegible] తెలిసికొనుచున్నాము.

వినియోగి కాంగ్రెసు – సమాప్తము



# ఆత్మార్పణము

భమిడి ఉమామహేశ్వరావధాని గారు

నాథ! నీసుందరాకృతి నయనములకు  
బ్రీతిగావింపకుండ నేర్చెదవుగాని  
హృదయదర్పణ మందున నింపుగల్గు-  
నట్టి ప్రతిబింబమును జూడ నడ్డగలవె?

నీసుధామధురోక్తులు నెమ్మిమీర  
నానుభాగ్యంబు లేదయ్యె గాని నాకు  
జగదతీతంబు నీదైన సచ్చరితము  
వీనులారంగ వినగనే విఘ్నమొలయు?

ఎదుట జరిగించుచుండి నిన్నెలమిఁగోడ  
'నాథ' యనిపిల్చుకొనెడు పుణ్యంబులేదు  
కాని నీదు నామంబు హెచ్చైన భక్తి  
నెల్లకాలంబు జపియించ నేమియడ్డు?

ఒకట నతిభక్తి పాదంబు లొత్తి కనుల  
కద్దుకొనజాలినట్టి భాగ్యంబులేదు  
పూర్వ సంచిత పాపంబు పొసగినట్టు  
లైన గావింపలేనె యాత్మార్పణంబు






భాగవతుల దక్షిణామూర్తి శాస్త్రి గారు

సం. నమోస్త్వనంతాయ సహస్రమూర్తయే, సహస్రపాదాక్షిశిరోరుబాహవే,
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే, సహస్రకోటి యుగధారిణే నమః.

కర్మకాండ యనియు, జ్ఞానకాండ యనియు, వేదము ద్విధా విభాగించబడినది. అందు ప్రథమకాండము ప్రవృత్తి నివృత్తి ఉభయ రూపమైనది. అజ్ఞులచే కర్తృత్వాభినివేశముచే ఫలము నభిసంధించి యాచరింపబడి స్వర్గపశు విత్త పుత్రాదిఫలకమైనది ప్రవృత్తిరూపమైనది. ముముక్షువులచే సత్వశుద్ధికొరకు కర్తృతా బుద్ధిని ఫలాభిసంధిని వదలి పరమేశ్వరారాధన బుద్ధిచే యనుష్ఠానము ననుష్ఠింపబడు కాయిక వాచిక మానసిక రూపమైనది నివృత్తి రూపమైనది.

ప్రకృతమందు కృష్ణభగవాను డర్జునుని నిమిత్తముగా చేసుకొని కర్మ నిరపేక్షమైన జ్ఞానము సనకాద్యసాధారణమనియు, బ్రహ్మ మానసపుత్రులగు సనకాదు లీశ్వరవచ్ఛుద్ధ సత్వోపాధికులు, మహావైరాగ్య సంపన్నులు అతివాహిత దేహధారులు గనుక నాత్మ యందు భ్రాంతికృతమగు కర్తృత్వ భోక్తృత్వరూపమగు నజ్ఞానము నారోపించుకొను స్వభావమున కాస్పదులు కానేరరనియు నుడివెను. వాసిష్ఠమందు,

"శ్లో. ఉభాభ్యామేవపక్షాభ్యాం యథాఖేపక్షిణాంగతిః,
తథైవ జ్ఞానకర్మభ్యాం జాయతే పరమం పదమ్."

అని యున్నది. అనగా రెండుపక్షముల చేత విహంగ మాకసమునందు సమముగా నెట్లు సంచరించునో, అట్లు జ్ఞానకర్మలచే మోక్షము ప్రాప్తించును. ఇచ్చో జ్ఞానకర్మలకు సముచ్చయము సంభవించెనని బుధులు భ్రమించకుందురు గాక! జ్ఞానముచేతనే కైవల్యమని సిద్ధాంతము; కాని కర్మ జ్ఞానమున కుపస్కారభూతము.

భగవద్గీతాతృతీయాధ్యాయమందు జ్ఞానయోగము కర్మయోగము అనునవి ముముక్షువునకు ప్రత్యేకమైన రెండు స్వతంత్రమార్గములని చెప్పబడియుండెను. అందు "కర్మయోగము" అనుదానికి "యోగః కర్మసు కౌశలమ్" అనునట్లు 'కర్మలను చేయుటలో కుశలత్వబుద్ధి లేక నేర్పరితనము'యనియర్థము. అనగా కర్మ చేయుచుండినను చేయనట్లు "నేను సాక్షి స్వరూపుడను నిష్క్రియుడను" అను బుద్ధిచే వర్తించుట.

భగవద్గీతయందు—

"శ్లో. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ! తత్కురుష్వ మదర్పణమ్. శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః".

అనియున్నది. అనగా "నీ వేపనిని చేయుదువో, యే హోమమును చేయుదువో, దేని భక్షింతువో, దేనిని దానముచేతువో, దానిని నా యర్పణముగా చేసితివేని నీపుణ్యాపాప రూపమగు కర్మబంధమును విడగొట్టి నాలో నైక్యము చేసుకొనుభారము నాది" యని.

మరియు నైదవ యధ్యాయమున కర్మసన్న్యాస, కర్మయోగములలో నేది శ్రేష్ఠతరమైనది యని యర్జునుడు ప్రశ్నింపగా, కృష్ణభగవానుడు, "తయోస్తు కర్మ సన్న్యాసాత్ కర్మయోగో విశిష్యతే" అని కర్మలను పూర్తిగా వదలివేయుటకంటె ఫలాభిసంధి లేకుండ అభిమానరహితముగా సుఖదుఃఖోత్పాదకమైనట్టి కర్మఫలమును సమశీతోష్ణ బుద్ధితో సహించియుండు కర్మయోగియే శ్రేష్ఠతరు డని నుడివెను. అటులే పదునెనిమిదవ యధ్యాయమందు సన్న్యాసముయొక్కయు, త్యాగముయొక్కయు తత్త్వమును బోధించుమని యడిగిన నర్జునునకు,

"కామ్యానాం కర్మణాం న్యాసం సన్న్యాసం కవయోవిదుః, సర్వకర్మ ఫలత్యాగం ప్రాహు స్త్యాగం విచక్షణాః."

యని కామ్యకర్మ నిషిద్ధమైనది; కాని ఆశ్రమ విహితమైన కర్మ యత్యాజ్యమనియు, త్యాగ మనగా కర్మఫలత్యాగముగాని కర్మత్యాగము గాదనియు నిష్కృష్టముగా ప్రకటించెను. ఇట్లుండగా భగవద్గీతలు సనకాద్యసాధారణ మగు నివృత్తిజ్ఞాన రూపబోధక మెట్లగును? అందుచేతనే

"[illegible]దసక్తః సతతమ్ కార్యం, కర్మ సమాచర."

యనియు,

"స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్."

అనియు, జ్ఞానియైనను కర్మ చేయుచునే యుండుట శ్రేయస్కరమనియు, కొంచెమైనను కర్మయోగము నాచరించినవా డధికమగు జననమరణ దుఃఖప్రవాహరూపమగు సంసారము నుండి యీవల పడుచున్నాడనియు కర్మయోగమునందు తనకుండు నధిక విశ్వాసమును వ్యక్తపరచెను.

మరియు భక్తియోగమందు

"ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే,
యేచా ప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః"

యను ప్రశ్నయున్నది. ఇందు "యేచాపి" అనుపదముచే పూర్వవ్యావర్తకము స్పష్టమగుచున్నది. అనగా పూర్వాధ్యాయాంత్య శ్లోకప్రకారముగా భగవత్కర్మయందు ప్రవృత్తులైనట్టియు, సర్వాత్మకము, సర్వైశ్వర్యయుతము, సవిశేషము, విశ్వరూపము నైన ఏకపాద్విభూతి రూపమును ధ్యానించువారలలోను, మరియు బాదరాయణులో మ్యాదిమతానుసారముగ బాల్యాదేవసన్న్యస్త సర్వకర్ములై పూర్వోపదిష్టమగు సవిశేషరూపము మాయికమనియు అందుచే నది యుపాస్యాయోగ్యమనియు, "యత్త దద్రేశ్య మగ్రాహ్య మస్థూల మనణ్వి"త్యాది శ్రుత్యుపదిష్టమగు నిర్గుణము, నిర్విశేషమునగు కూటస్థత్రిపాద్విభూతిరూపమును ధ్యానించువారలలోను నెవ్వరు శ్రేష్ఠతములని యడుగ నాప్రశ్నకు

"మ య్యావేశ్య మనో యే మాం
నిత్యయుక్తా ఉపాస్యతే,

శ్రద్ధయా పరయోపేతా
  స్తేమే యుక్తతమామతాః."

అనగా, యేసాధకులు సర్వజ్ఞుడ నైనట్టియు సవిశేషుడ నైనట్టియు నన్నుపాసించెదరో వారిరువురిలో శ్రేష్ఠతరులని సమాధానమునిచ్చెను.

"శ్లో. యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే,
  సర్వత్రగ మచింత్యంచ కూటస్థ మచలం ధ్రువమ్.
  తే ప్రాప్నువంతి మామేవ సర్వభూత హితే రతాః,
  క్లేశోఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్.

అనగా నవ్యక్తమగు నిర్విశేషనిష్ఠుల కధికతరమైన క్లేశము సంభవించును. సనకాదులకు నిర్గుణనిష్ఠ సుకరమైనను, రాజసప్రకృతులగు నస్మదాద్యశేషజీవులకును సర్వత్ర సమబుద్ధియు, సర్వభూతహితాచరణోద్యుక్త మగు చేతస్సును, సార్వకాలికనిర్వికల్పసమాధియును, దుష్కరమగుటచే "క్లేశోఽధికతరః" అని చెప్పబడియున్నది. కనుక నే రాగద్వేషమత్తులచే బాల్యప్రభృతి సన్న్యాసాది సాధనపూర్వకమైన నిర్విశేషాక్షరోపాసన మతికష్టమని భగవాను డుత్తరమిచ్చెను.

ఈవిషయమం దొకసందేహము వొడమినది. సవిశేషనిష్ఠులకు విశ్వరూపప్రాప్తి యుక్తమేకాని నిర్గుణాక్షరోపాసకులకు గూడ సగుణప్రాప్తియందువేయదియెట్లనిన, అక్షరతత్త్వగత మగు చిచ్ఛక్తియొక్క సంకోచ వికాసములచే సవిశేషనిర్విశేషభేదము గల్గును. ఆచిచ్ఛక్తి (అనగా విమర్శకరూపమగు తెలివియొక్క) సంకోచసమయమందు సుషుప్తియందువలె పరమాత్మయందు లీనమైనప్పటికి తిరిగి (యెండవలె) వికాససమయమందు నిఖిల విద్యాప్రపంచరూపముచే విలసన స్వభావము గలిగియుండును. కనుక నిర్విశేష నిష్ఠులకును పునః సవిశేషరూపాపన్నత్వ మపరిహార్యమనియే పల్కుచున్నాడు కృష్ణుడు.

శ్లో. "యేతు సర్వాణి కర్మాణి, మయి సన్న్యస్య మత్పరాః,
  అనన్యేనైన యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే,
  తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్.

ఈ మొదటిశ్లోకమునందు 'తు' అనుశబ్దముచేత బాదరాయణులోమ్యాది మతావలంబులగు సగుణమిథ్యాత్వవాదులును, నిర్గుణోపాసకులును అట్లుండురుగాక. కాని, యెవరు సర్వకర్మలను సర్వాత్మకుండనగు నాయందు సన్న్యసించి (ఇచ్చట సర్వకర్మ సన్న్యాస మాత్రమరూపమైనదిగాదు. అదియశక్యము గనుక పూర్వమే నిరాకృతము) అనగా "కర్మణ్యకర్మ యఃపశ్యేత్" అనురీతిగా సర్వకర్మలును సర్వాత్మకమైన బ్రహ్మయే యను దృష్టిచే కర్మను నిర్బాధకముగా చేసుకొని అనన్యయోగముచేత, అనగా అహంగ్రహోపాసనముచే నాభక్తులగుదురో వారవిద్యావృత్తి కాగానే జీవద్దశయందే నన్నుపొందుచున్నారు. కనుక నిర్గుణనిష్ఠకన్న సగుణనిష్ఠయే అస్మదాదులకందరకు స్వీకారయోగ్యమనియు, సగుణము చిచ్ఛక్తివికాసముచే నిర్గుణముకన్న భిన్నమగునట్లుతోచుచున్నది; కాని పరమార్థతః రెంటికి నభేదమని తేలుచున్నది.

కర్మయోగము - జ్ఞానయోగము

"శ్లో. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా
  పురా ప్రోక్తా మయాఽనఘ!

"జ్ఞానయోగేన సాంఖ్యానాం
కర్మయోగేన యోగినామ్."

అను భగవద్గీతాశ్లోకమును బట్టి కర్మయోగమార్గముజ్ఞానయోగమార్గము రెండును స్వతంత్రములైనవే యనియు, మరియు నందు ముముక్షువైనవా డన్యతరము నధిష్ఠించి మోక్షమును జేరుచున్నాడనియు తేలుచున్నది. ఈయభిప్రాయమే ఐదవ అధ్యాయమందు,

"శ్లో. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి న పండితాః,
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విందతే ఫలమ్."

అనగా జ్ఞానయోగము కర్మయోగము రెంటికిని భేదమును పండితులు కల్పించరు. ఈరెంటిలో నేదైన నొకమార్గము నాజన్మాంతము తీవ్రముగా ననుష్ఠించిన బ్రహ్మప్రాప్తి యగుననియు రెంటికిని వేర్వేరు స్వతంత్రత్వమును భగవంతుడుపపాదించెను.

పై నుదహరించబడినదాని యుత్తరశ్లోకమునం దే బ్రహ్మస్థానము కర్మసన్న్యాసులగు సాంఖ్యులచే పొందబడుచున్నదో అదియే కర్మయోగుల చేతను పొందబడుచున్నదని స్పష్టముగా విశదీకరింపబడెను. కాని సంప్రదాయప్రవర్తకులు కర్మయోగము జ్ఞానయోగమునకు పూర్వాంగమైనదని సిద్ధాంతీకరించుటలో నభిప్రాయము తెలియదు.

జ్ఞాని కర్మచేయుటకు వీలున్నదా, చేయవచ్చునా యనువిషయ మొక్కింత నాలోచింతము. తృతీయాధ్యాయమందు

"తత్త్వవిత్తు మహాబాహో! గుణకర్మవిభాగయోః,
గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా నసజ్జతే."

అనియున్నది. తత్త్వవేత్త యగువాడు కర్మ చేయుచున్నను తనస్వరూపమును సర్వవిలక్షణముగా చూచుకొనుచు కర్మ చేయనివాడే యగునని యర్థము. మరియు,

"ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతిధారయన్,
బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగంత్యక్త్వా కరోతియః;
లిప్యతే నసపాపేన పద్మపత్రమివాంభసా".

అనియు,

"నైవ కించిత్కరోమీతియుక్తోమన్యేత తత్త్వవిత్"

అనియు జ్ఞానియగువాడు యోగయుక్తుడై (సమత్వబుద్ధిగలవాడై) కర్మచేసినను దానిచే సంటబడడని స్పష్టముగానున్నది. కనుక జ్ఞాని కర్మచేయుటకు వీలున్నది.

తరువాత జ్ఞాని కర్మ చేయవచ్చునాయను విషయ మాలోచింతము.

"లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి,
యద్యదాచరతి శ్రేష్ఠః లోకస్తదనువర్తతే." అని

తృతీయాధ్యాయ మందు నుడువబడెను. అనగా జ్ఞానియైనవాడు కర్మనుచేయుట మూఢమైన లోకమురొక్క సంగ్రహార్థమనియు, అట్టిశ్రేష్ఠుడగువా డేదిప్రమాణముగాచేయునో లోకము దానినను వర్తించుననియు కనుక జ్ఞాని కర్మను వదలినచో మూఢమైన లోకము త్వరితముగా కర్మసన్న్యాసమొనర్చి యధఃపతిన మొందకుండ సహాయకారియగుననియు తేలుచున్నది. ఈ విషయమున సాక్షాత్ సర్వశక్తియుతుడైనట్టి భగవంతుడు తన కెట్టికర్మతో నావశ్యకము లేకపోయినను లోకము నుద్ధరించు నిమిత్తమై కర్మ చేయుచుండెననియు

"నానవాప్త మవాప్తవ్యం వర్తఏవ చ కర్మణి,
నమే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన."

యనియు జ్ఞానియైనవాడు కర్మ చేయుటలో బాధకము లేదనియు, చేసిన దో లోకోద్ధరణ కారకమగుననియు న్యాయముగా నందులకు తన్నే దృష్టాంతముగా నుదాహరించు కొనెను.

ఇక త్యాగవిషయమునుగూర్చి కొద్ది విచారింతము.

"శ్లో. శ్రేయోహి జ్ఞాన మభ్యాసాత్
జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే,
ధ్యానాత్ కర్మఫలత్యాగః
త్యాగా చ్ఛాంతి రనంతరమ్."

అనగా అవివేకపూర్వముగా నొకవిష యమందే పునఃపునః చిత్తస్థాపనముకంటె సర్వప్రపంచము బ్రహ్మాభిన్నమను బుద్ధి గొప్పది. దీనికన్నను జ్ఞానపూర్వకమైన ధ్యానము గొప్పది. దీనికంటెను కర్మఫలత్యాగ శ్రేష్ఠమైనదని సాక్షాదీశ్వరుడు కర్మఫల త్యాగమును శిరోభూషణముగా జేసి యగ్రతాంబూలము నిచ్చె. ఆహా! కర్మఫల త్యాగమహిమ !! దీనివలన ప్రధానశత్రువై నట్టియు, దురాసదమైనట్టియు కామము యొక్క యుపశమనము సంభవించును. ఐహి కాముష్మికములు రెండియుందును,

"జహి శత్రుం మహాబాహో! కామరూపం దురాసదమ్."

అనునట్లు కామమే సర్వానర్థమూలము. దానిని జయించిననే కాని మోక్ష ప్రాప్తికి ద్వారము తెరువబడదు. అట్టిది సమత్వబుద్ధి (అనగా సుఖమువచ్చిన హర్షింపకుండుట, దుఃఖమువచ్చిన నుద్వేగమునొందకుండుట) చే కర్మఫలసన్న్యాసము చేసిననే కాని సిద్ధింపదు.

కాని యాత్యాగ మెప్పుడును సాత్త్విక రూపముగా నుండునట్లును, రాజస తామస ములలోనికి పోకుండునట్లును చూడవలయు. ఈవిషయమున భగవానుడు:—

"శ్లో. నద్వే ష్ట్యకుశలం కర్మ కుశలే నాను షజ్జతే,
త్యాగసత్త్వసమావిష్టో మేధావీ ఛిన్న సంశయః."

అని ఏ త్యాగియైనసాధకుడు కర్మఫల త్యాగియగునో వాడు క్రమముగా సత్త్వసమా విష్టుడై, తద్వశముచే మేధావియు ఛిన్నసంశ యుడునునై అకుశలమైన కర్మను ద్వేషిం పడు; కుశలమైనకర్మయందు సక్తుడునుగాడు అనగా సమత్వమును బొంది యోగారూఢు డగుననియర్థము. ఆహా, త్యాగమెంతగొప్పది!





గేయము

[హారీతకృతము]

౧

చూడరా కనువిచ్చి లోకముఁ
గూడరామనసిచ్చినాకము-చూడరా
దొడ్డతనమునఁ జెడ్డవెదకే
తులువతనమే కాని, చెడ్డను
దొడ్డతనమును జూచి మురిసే
త్రోవలోనే దేవుఁ డెదురగు - చూ.

౨

మంచిచెడ్డల నేర్పఱించే
మలఁకబుద్ధి నశింపవలెరా!
మంచిచెడ్డలవివరములు నీ
మనసులోని వికారములురా - చూ.

౩

మనసు వికృతిని గడచి నడచిన
మంచిచెడ్డలు లేవురా!
మంచిచెడ్డలు లేని-చోటను
మదికి నిలుకడ గుదురురా చూ.

౪

మదికి నిలుకడ కుదిరినంతనె
మాయతెఱ విడు; మనికి కన్పడు;
మాయకానలి మహిమఁ గనరా
మతములన్నిఁటి సారమదిరా - చూ.

౫

కలఁగు నొక్కఁడు కలిమిలేమికిఁ;
జెలఁగు నొక్కఁడు కలిమికలిమికి;
అలరునొక్కఁడు లేమికలిమికిఁ
గలిమిలేముల మెలికలేక - చూ.

౬.

కలిమిఁగులుకకు లేమికులుకకు
కలిమిలేముల కలఁత నలుగకు
కలిమిలేములు కలలు దళుకులు
తెలివికళిక వెలుంగు నీలో - చూ.



ప్రథమ ఆర్యవైశ్యయువజనమహాసభ, చెన్నపురి (2-1-26)



శ్రీ తుంపూడి వేంకటానంద భగవత్ గారు, బి. ఏ.

ఆహ్వానసంఘాధ్యక్షుడు

ఆర్యవైశ్య యువజనమహాసభ—చెన్నపురి



శ్రీ దర్శి చెంచయ్య బి. యస్. సి.

అధ్యక్షుడు

ఆర్యవైశ్య యువజనమహాసభ—చెన్నపురి



శ్రీమతి వేముగంటి పాపాయమ్మగారు

1926 జనవరి 11 వ తేదినాడు కాకినాడయందు జరిగిన నూలువడకు పోటీపరీక్షయం దీమె మొదటిబహుమానము బడసినది. ఈమె కాకినాడకాంగ్రెసు జనరల్ సెక్రెటరిగా నగు శ్రీ నేత్రకంటి శ్రీనివాసరావుగారి సోదరి



# జాతీయవిద్య

కొలపలమ కృష్ణసోమయాజి గారు, యం. ఏ., యల్. టి.

[వెనుకటి సంచిక తరువాయి]

## 3

### గురుకులోద్యమము

జాతీయవిద్యా విషయ ప్రశంసలో గురుకులోద్యమము మున్ముందు చెప్పబడినది. కాని జాతీయవిద్య యను పేరు ప్రచురమైనట్లు గురుకులము గామిచే దెలిసిన దానితో మొదట నారంభించుటయ్యెను. 'స్వదేశీ' యుద్యమమననీ, యసహాయోగమననీ దేశము నంతను కలచివైచినది. అవి యంతరించినను వాని కంగములుగ బయలుదేరిన జాతీయవిద్యాలయములు ప్రజల మనస్సుల నిలిచియున్నవి. గురుకులోద్యమ మట్లు లేదు. గురుకులోద్యమ మార్యసమాజమున కంగము. ఆర్యసమాజము దాదాపుగ ౫౦ సంవత్సరములనుండి పనిచేయుచున్నను, తత్ప్రచార మెక్కువ యుత్తరదేశమునందే యుండుటచేతను; ఆర్యసమాజసిద్ధాంతములు కొన్ని ప్రస్తుతాచారవ్యవహారములకు భిన్నములుగనుండి ఆర్యసమాజము చెప్పున దంతయు విపరీతార్థమని జనుల కొక దురభిప్రాయము పడియుండుటచేతను, తదంగమగు గురుకులవృత్తాంతముగూడ యాంధ్రదేశమున కభిమతము, ప్రమము గాలేదు.

ఆర్యసమాజముం బ్రశంసించుట కిది తావుగాదు గాని యిటీవల ననగా నాంగ్లరాజ్యముక్రింద భారతోద్ధరణమునకై చేసిన మహోద్యములలో నెల్ల నదిమిన్న యనిమాత్రము చెప్పవలసియున్నది. రాజ్యకాంక్షలందేమియు నగుపడకుండవచ్చును. ధర్మమే లక్ష్యముగ నుండవచ్చును. ప్రజలు స్వధర్మము నెఱిగి దాని నాచరించుటకు వలయు శిక్షణందినచో రాజ్యము దనంతట దానె వచ్చునను తృణీకారమే యందుండవచ్చును. కాని రాజ్యమునకేమి, ధర్మమునకేమి ప్రజలకువలయు సంభార మంతయు దానగలదు. భారతజాతీయసంప్రదాయముల కనువగు ధర్మశిక్షయందు గలదు. సిద్ధాంతమైనంతవరకు నేడు మాత్రమే కాక యిక నూరుసంవత్సరములకును బయలుదేరుచుండు దేశసమస్యల కన్నింటికి సమాధానము లందు సూత్రీకరింపబడియున్నది. లోపము లుండుగాక. సవరింపవగు. గుణవిశేషముల జూపుటె యిచట లక్ష్యము. శ్రీస్వామి దయానందు లింతకాలమునకు వచ్చి మరల నా వేదధ్వజమెత్తిన దదియే చాలును. అపార్థముల దిద్దికొందము. అపవాదముల సమర్థింతము. మూలము చెడకుండ నీరు వోసిన మహనీయు డతనికి వేయివందనములు. శ్రీ స్వామి దయానందులు కేవలము పరలోకసాధకములగు వైదికధర్మసూత్రముల బోధించు నతడే కాక భారతీయుల లౌకికపారలౌకికధర్మసమన్వయాత్మకము లగు వేదరహస్యముల దెలుప సమకట్టిన యాచార్యపరంపరలోనివాడు.

ఆర్యమతమున భారతీయులందరు నార్యులు. ఆర్యావర్తమే యార్యులజన్మభూమి. ఆర్యులకు వేదమే ధర్మగ్రంథము. వేద మపౌరుషేయము; దివ్యము. వేదము సకలజ్ఞానసారము. వేదధర్మ మైహికాముష్మిక ఫలప్రదము. తద్ధర్మసాధనము సామాన్యతః వర్ణాశ్రమ పరిపాలనము. వర్ణము జాతిగతముగాక గుణకర్మానురూపము. బ్రాహ్మణులు జ్ఞానస్వరూపులై ధర్మప్రవృత్తికి దోడ్పడవలసినవారు. వారికి విద్యార్జన విద్యాదానములు ముఖ్యకర్మలు. వేదము ధర్మబోధకమగుట భాషాధికార ముండినసరి సర్వగమ్యము. ఆర్యభాష సంస్కృతము. ఆర్యవిద్యా

స్థానములు గురుకులములు. విద్యకు గురుశుశ్రూషయే మార్గము. బ్రహ్మచర్యమే మహావ్రతము. ఇవి ముఖ్యసూత్రములనిన చదువరులకు చూచాయగ దెలియగలదు. ఇట్లు లక్షణసమన్వితమై పూర్వము భారతవర్షము నన్నెక్కెననియు భారతవర్షము పునః ఉచ్ఛస్థితికి రావలయుననిన యటులే లక్షణోపేతము గావలయు ననియు తదాశయము.

మనముగూడ నేడార్యులమని యనుకొనుచున్నాము గద! భారతదేశము పూర్వమునందువలె సుసంపన్నమై తత్ప్రజ సుఖభాక్కులు గావలయు ననుచున్నాముగద! ఇప్పుడు మనము పడుచున్నకష్టములకు మనయజ్ఞానము, మనయవినీతి మనధర్మ నిరసనము మన నైకమత్యాభావమె కారణమనిగూడ ననుకొనుచున్నాముగద! మన యజ్ఞానము మున్ముందు దొలగి ప్రజాసామాన్యమునకు దేశభాషా ధర్మములం దభిమానము గలుగు టెట్లని విచారించుచున్నాముగద! ఇందుకు పరులభావ, విద్య, బాధకములనియు, స్వభావ, స్వవిద్య సాధకములనియు, వానినెటులైన నెలకొలుపవలయుననియు బరితపించుచున్నాముగద! ఇక నాదయానందులకు బ్రత్యక్షమైన భారతస్వరూపము, భారతభారతీస్వరూపము మన కేలగా లేదు? మనజాతీయవిద్యాపరిషత్తువారికి దయానందులపేరైన జ్ఞప్తికి రాలేదా? ఆర్యసమాజమువారు పాంచాలమున కళాశాలలు, కన్యావిద్యాలయములు, గురుకులము స్థాపించి వేలకొలది విద్యార్థుల కాశ్రయమొసంగుట వీరికి తత్కాలమునకు స్ఫురింపకుండెనా? ఎంతయు నాశ్చర్యము!

కాని యట్లు స్ఫురింపకుండుటకు, స్ఫురించినను దానిని తలపెట్టకుండుటకు గారణములున్నవి. శ్రీదయానందులకు స్ఫురించిన జాతీయవిద్యాస్వరూపము వీరికి స్ఫురింపకుండుటకు వీరికి పూర్వభారతజ్ఞానము లేకుంటయే కారణము. దయానందు లెట్లేని వేదశాస్త్రముల పారము నధిగమించిన యార్యపండితుడు. ప్రాతయిల్లు పడిపోయినప్పుడు క్రొత్తయింటిని గట్టువాడు ప్రాతసామానుల నన్నింటిని దీసి జాగ్రతచేసి కావలసినవానికై యత్నించుచు గార్యము సాగించును. అట్లేదయానందులకు జాతీయవిద్య గావలసినపట్ల పూర్వస్థితి నరసి తత్సామగ్రి వీలయినంతవఱకు గ్రహించి నూత్నసంస్కారము లీ ఘనగురుకులసూత్రముల బన్నగల్గెను. కాని మననాయకు లీవిద్యాపరిషత్తులో పైఁజెప్పినట్లు వీరికి పూర్వవాసన లేమియు లేవు; పూర్వమునందు వీరికి విశ్వాస మభావము. పూర్వ మొక పెద్దగొయ్యి. ముందు ప్రభువులు త్రవ్వినదే పెద్దనుయ్యి. దీనింబడక దానింబడక తప్పించుకొనుమార్గ మగుపడదు. ఆర్యసామాజికులకే యున్న పూర్వస్మృతివిశ్వాసములు వీరికి గలవో నింక కొన్నివిభేదములు గల్పించియైన జాతీయవిద్యాప్రణాళిక యొకటి పన్నియుందురు. ఇదియొకటి.

రెండవది దయానందులకు నార్యసమాజమునకు లేని బాధ వీరికొకటి దాపురించినది. వారికిని లేదనరాదు గాని యీవిషయమున వారికిని మనకును లక్ష్యభేదముండుటచే మనకు నేడు బాధకమైనట్లు వారికి గాలేదు. అది యేమనగా ఆర్యమహమ్మదీయ సమస్య. దయానందుని జాతీయత ధర్మమూలమంటిమి. అనగా భారతధర్మము వైదికధర్మమే యనియు నన్యధర్మముల కిచట తావు లేదనియు నుండినట్లే యెంచవచ్చును. కాని యంతమాత్రమున కత డసహిష్ణుఁ డనుట సాహసమగును. ఆయన ధర్మైక్యప్రతిపాదనమునకు గారణము లేకుండలేదు. భారతమునందలి యన్యధర్మము లనగా మతములు, సమాజస్థితులకేర్పడినవిగాక యసాధారణములు, నాక్షేపణీయములు నగుస్థితుల బ్రబలినవని దయానందుల యభిప్రాయము. చరిత్రకారులందఱి యభిప్రాయము గూడ నైయున్నది. మహమ్మదీయులు ప్రభువులై ప్రజలను చాలమందిని మహమ్మదీయులఁ జేసివైచిరి. నేడు నట్లే ప్రభువులు క్రైస్తవులగుట ప్రజలెట్లు క్రైస్తవమతావలంబకు లగుచున్నారో యందఱకు దెలిసినసంగతియే. నేడు మన మశక్తసుజనత్వమున గతంగత మనుటయే కాక గచ్ఛత్తు ననగా గంటియెదుట జరుగుచున్న దానిని సైతము గతముగ భావించి యూరకుండునంతటి యౌదార్యము, క్షమ గలిగియున్నాముగాని దయానందు లట్లు భావింప లేదయ్యె. కాలాంతరముల గారణాంతరముల బరవశులై యన్యధర్మములబడినవారి నెట్లయిన స్వధర్మమునకు దేవలయుననియు, నట్లు తెచ్చుట సాధ్యమె యగుననియు, నట్లు దెచ్చినగాని భారతీయులు నిరాతంకముగ భారతధర్మసముద్ధరణ మొనర్ప నధికారులుగా

జాల రనియు, పిచ్చినమ్మకము గలవాడు కనుకనే ఆర్య సామాజికుల ధర్మవీరుల జేయసమకట్టెను. "కృణ్వంతో విశ్వమార్య"మ్మనగా (నీ భారతము నేకాదు) విశ్వమునంత ను ఆర్యమయముగ జేయుదు మను ప్రతిజ్ఞ వీరిచే బట్టించె ను. ఇక దాను దలచినది కాలపరిణామమున సిద్ధించినట్లే భావించెనో లేక యిరుగులమాటయటుంచి జనసమాజము నకే చేతనైన పని చేయ నెంచెనో నైనను విద్యావిధాన మునే యవలంబించెను. భారతదేశమునందుండు వివిధ మతములవారి విధి పరిశోధించెను, భారతీయుల కార్య సమునుకొనువారికైన పూర్వసంస్కృతి, ప్రస్తుతానుభవములు, భావిపరిణామావిర్భావము నను సమగ్ర విద్యావిధాన మొకటి సిద్ధించినది. ఇది ఆర్యసమాజ మార్యలోకము నకై యుద్ధరించి యిచ్చిన జాతీయవిద్య.

## ౪

## ఆర్యమహమ్మదీయ సమస్య

ఇది యెట్లుండగినను, ఆర్యులను భారతీయుల కిది సర్వశ్రేయమే యగునని భావించినను, అసహాయోగ మూనిన మననాయకులుగాని, యిన్నియు ప్రస్తుత జాతీయ విద్యాపరిషత్తుగాని, దీని నవలంబింపజాలరైరి. ఏమన గా నసహాయోగమున ఆర్యమహమ్మదీయసఖ్య మొక ముఖ్యాంగము. అట్టిచో వారి భావాభిప్రాయములకు వారి నన్న నెక్కుడుత్సాహము, ఉగ్రత జూపితిమి. వారికి విరుద్ధమైనదిగాని వారిని గూడదీసికొనరానటు వంటిదిగాని మనకు ప్రాణప్రదమైనను త్యజింపుటే యని నిశ్చయము సర్చికొని యుంటిమి. ఇట్టి మననాయ కుల జాతీయవిద్య యుభయులను సరిసమనట్టిది గావలసి వచ్చె. ఇది సులభమా? సాధ్యమా? నాయకులు వికావిక లైరి; పరిచిరి. ఇచ్చట బాధకములు రెండు: భాష, ధర్మము. మహమ్మదీయులు కొందఱు ఉర్దూమాటాడు దురు. ఇది ప్రత్యేకము పవిత్రభాషయైనట్లు భావింతురు. ఈభాష కొసంగిన గౌరవము దమకొసంగినట్లే భావింతు రు. జాతీయవిద్యావిధానమున ఉర్దూభాష సాధనమైనచో వీరి కభిమతముగ నుండును. ఇతరభాష లను వీరి నభిముఖుల జేయుట కష్టము. కాని యీవిధ మమై విద్యాపరిషత్తువారు దనస్రస్యత్నమే మొనర్చిన చో నీబాధకములు తొలగకుండ వనిపించెడిని. ఏమనగా ఉర్దూభాషావిషయమున మహమ్మదీయులలో సామా న్యముగనున్న దురభిప్రాయములు దీర్చి వారల సంతుష్టి పఱుపవలసియున్నది. ఉర్దూభాష మహమ్మదీయులను కొనునట్లు వారికి స్వకీయమై భారతీయులలో గొంద అనుకొనునట్లు వీరికి విజాతీయముగాదు. ఇతరదేశభాష లవలెనే ఉర్దూ యిచటబుట్టి యిచటనే పెఱిగినది. మఱి యు నితరభాష లన్నిటివలెనే సంస్కృతమునుండి పుట్టినది. హిందీభాష యెంతసాంస్కృతికమో ఉర్దూ గూడ నంతియ. హిందీభాషలో వాడు తద్భవక్రియలే మొత్తముగ నుర్దూభాషలో వా డు దు రు. నిత్యవ్యవ హారములో వచ్చు నామములు, స ర్వ నా మ ము లు, విశేషణము లన్నియు రెండిట సమములు. లింగ భేదము రెండిట నొక్కటి. వ్యాఖ్యానము రెండిట నొక్కటి. కాని మహమ్మదీయులు మతరీత్యా అరబీ పారశీకభాషలతో నెక్కుడుసంబంధము గలవారగుటచే నాభాషాపదములు విరివిగ దెచ్చి వాడుదురు. వాడి దాని నన్యభాషగ దలంతురు. ఇది భాషల నేర్చినమా ల్వీలు, విద్యావంతులకేకాని జనసామాన్యమునకు గాదు. కనుక స్వచ్ఛమగు నుర్దూ యనదగినభాష సాంస్కృతిక ము. భారతీయమగుటచే మహమ్మదీయుల వాంఛలు దీర్చి మనమది దేశమునకంతకు సామాన్యభాషగజేసి జాతీయ విద్యావిధానముగూడ నందే సాగించవచ్చును గాని యీ భాష యితరభాషలవలె వ్యాప్తిగలది గాదు. అధిక సంస్కారము నొందియున్నదిగాదు.

మహమ్మదీయు లీదేశపు 33 కోట్ల జనులలో దాదాపుగ ౭ కోట్లుండు రనుచున్నారు. కాని వీరంద ఱు నుర్దూమాటలాడువా రనరాదు. వంగ దేశముననే రమారమి 2½ కోట్లజను లున్నారు. వీరందఱు వస్తుతః దేశీయులై యన్యమతస్వీకారమొందినవా రగుటచే వీ రింకను దేశభాషయగు వంగభాషనే మాట్లాడుదురు గాని ఉర్దూభాష నేర్చినవా రత్యల్పముగ నున్నారు. ఇట్లే సింధుదేశములోనివారు సింధీభాషనే మాటాడు చున్నారు. మలయాలమున మలయాలము, ద్రావిడమున ద్రావిడము దప్ప మహమ్మదీయు లన్యభాష లెవ్వియు నెఱుంగకుంట్లు యందఱకు దెలిసిన సంగతియే. ఆంధ్ర దేశమున మహమ్మదీయులు బస్తీలలో నుండునంత వఱ

# दक्षिण-भारत में 'हिन्दी' ने क्या किया?

आजसे कोई ७ वर्ष, ११ महीने और २८ (अट्ठाइस) दिनके पहले मद्रास राजधानीके आन्ध्र, तमिल, केरल और कर्नाटक प्रान्तोंमें प्रातःस्मरणीय महात्मा गांधीने अपने सुपुत्र श्री देवदास गांधी और भारतवर्षके एक सच्चे राष्ट्रीय सन्यासी श्री स्वामी सत्यदेवजीके हाथों राष्ट्रभाषा हिन्दीका प्रचार शुरू कराया था। इसके पहले दक्षिण भारतकी क्या हालत थी, आप लोग जानते हैं।

अपनी धुनके पक्के कुछ वीर युवक अपने हाथोंमें हिन्दीका झंडा थाम कर बाहर निकल पड़े। उनमें कुछ न कुछ कर डालनेका जोश भरा हुआ था, देशमाताकी सेवामें अपने तईं न्यौछावर कर देनेकी उनके हृदयोंमें उमंग भरी हुई थी। अपने देशबन्धुओंका स्नेहालिंगन करनेके लिये उन्होंने अपनी दोनों भुजाएँ फैलायीं, कोसों पैदल चलकर धूम-धाम मचानेकी बिजलीकी ताकत उनके पैरों में उमड़ पड़ी, भूखे-प्यासे, सुबह-शाम, रातों रात जागकर, धूप-बरसातमें चलकर जब, जहाँ कहींसे, अपने सेना-नायकका हुक्म हुआ अपने कार्य-क्षेत्र पर जा डटे। घर-द्वार, मा-बापका प्यार-दुलार, भाई-बहिनोंका स्नेह, अपनी प्रियतमा पत्नीका प्रेम और जीवनकी सब महत्वाकांक्षाएँ ठुकराकर राष्ट्रभाषा प्रचारके लिये वे चले थे। नम्रता और प्रेमसे अपना मस्तक झुकाकर सबसे पहले उन्होंने गाँवोंमें अपने देशके अन्नदाता किसानोंकी झोंपडियोंमें प्रवेश किया। उन्हें हिन्दीका राष्ट्रीय सन्देश सुनाया। नाकोंमें, खेतोंकी मेंड़ोंपर उनके बाल-बच्चोंके साथ बैठकर "भारत हमारा देश है", "अयि मातृभूमि तेरे", "वैष्णव जनतो तेने कहिये" और "मोहन मंत्र सिखादे मैय्या" के गीत गाये। उन्हें हिन्दी भाषा सिखायी। बडे बडे शहरोंमें, जहाँ तिजारत, धंधा, लेन-देन, और धूम-धडक्केकी चहल-पहल मची रहती है, जहांके सभ्य, शिक्षित पुरुष और महिलायें ऐशो-इशरत, आमोद् प्रमोद् और विलासिता में मशगूल रहते हैं, वहाँ भी प्रचारकने अपनी सेवा का-क्षेत्र तैयार किया। अपने विरोधी वातावरणमें भी उसे काम करना पडा और उसे विजय मिली। बडे बडे लायर, वकील, न्यायाधिकारी, व्यापारी, रईस, साहूकारों और स्कूल कालेजोंके प्रोफ़ेसरों तथा विद्यार्थियोंमें अपने विनय और विश्वाससे राष्ट्रभाषा–हिन्दी का प्रेम उत्पन्न किया। इसके पहले जहाँ यह हालत थी कि मुश्किल ही से कोई दक्षिण–भारतीय हिन्दी और देवनागरीका नाम जानता था, मुसलमान भाइयोंकी–सोहबतमें आये हुए कुछ पढ़े लिखे लोग शुद्ध हिन्दी–हिन्दुस्थानीके बदले टूटीफूटी हिन्दुस्थानीको "तुरक-भाषा" कहा करते थे वहां अब, सैकडोंकी बात नहीं, हज़ारों दक्षिण–भारतीय देशबंधु राष्ट्रभाषाके प्रेमी बने हैं। अन्तःपुरों में रहनेवाली आन्ध्र, तमिल, केरल और कर्नाटककी कुललक्ष्मियों ने भी भारतमाताकी सबसे बडी लाडली बेटी राष्ट्र–भारती हिन्दीकी आरती उतारनेके लिये प्रेमपूर्वक अपने मंगल–मन्दिरके द्वार खोलकर हृदयसे उसका स्वागत किया। श्रीतुलसी रामायण, सूरदास, तुलसी, मीरा, कबीरके अनेकों कीर्तन तथा राष्ट्रीय–गायन उनके कण्ठके हार बनकर शोभा पाने लगे।

मातृभूमिका कोई सच्चा सपूत आकर देखे, कि गुंटूरके श्रीशारदानिकेतन, बंदरकी जातीय-कला-शाला, काकिनाडा के विद्यार्थिनी-समाजका महिला-विद्यापीठ, श्रीमती दुर्गाकी बालिका-हिन्दी पाठशाला और कई हिन्दीप्रचार आश्रमों में क्या हो रहा है? प्रोफेसर श्री. अ. रामय्यर एम ए., श्री. वी. रामनाथय्यर बी. ए. बी. एल., श्री. पं. जन्ध्याल शिवन्न शास्त्री आदि २ विद्वानों की रोशन कलम से हिन्दी की कैसी मुहावरेदार, चित्ताकर्षक सरल सुन्दर धारा निकलती है जिसमें जिज्ञासा की गरिमा और भावोंकी गंभीरता भरी रहती है । श्री उमाबाई, सौ. विमला देवी बी. ए., सौ. राधाबाइ, सौ. रमणम्मा, कमला देवी आदि २ देवियां भी हिन्दीमें स्त्रीशिक्षा, मातृकर्तव्य आदि विषयोंपर अपने हृदयके कैसे मधुर,कोमल, सरल भाव प्रकट करतीं हैं । इधर आन्ध्र, तमिल, केरल और कर्नाटकके दृढव्रती कुछ वीर युवकों ने हिन्दी-साहित्य-सम्मेलनकी 'विशारद' परीक्षाके मलिक मुहम्मद जायसी कृत पद्मावत, तुलसी--कवितावली, विहारीकी सतसई, केशवकी रामचन्द्रिका जैसे उच्च कोटिके साहित्यिक ग्रंथोंका रस, अलंकार और छंद सहित मंथन कर डाला है । और, आज भी सैकडों हिन्दी प्रेमी वीर युवक सूरदास, तुलसी, केशव, मतिराम, पद्माकर, कबीर और भारतेन्दु हरिश्चन्द्रके ग्रंथोंका अध्ययन करने लालायित हैं । ५ वर्ष के बच्चेसे लेकर ७० वर्षके बूढों तकने हिन्दी भाषा का अभ्यास किया है । हमारे द. भा. पूज्य नेता लोगोंने--हिन्दीका सम्मान कुछ कम नहीं किया । उसका जन्म-सिद्ध अधिकार कबूल किया । श्रद्धास्पद श्री. नागेश्वर राव पन्तुलुजीकी सुप्रसिद्ध दैनिक आन्ध्र-पत्रिका और मासिक 'भारती' में हिन्दी के लेख निकले हैं । श्रीमती एनी बिसेंट के 'न्यू-इंडिया' में पहले हिन्दीके कालम निकला करते थे और अब अडयार से थियोसफीके पवित्र शान्त सिद्धान्तोंका प्रचार करनेके लिये, श्रीमतीजीकी संरक्षकतामें, हिन्दीमें एक सर्वांग सुंदर सचित्र मासिक पत्र का (मद्रास- हिन्दीप्रचार प्रेस में छपकर) इसी मास में अवतार हो चुका है । उसका शुभ नाम है 'युग-प्रवेश' ।

यह सब जोकुछ हो रहा है, हिन्दी-प्रचारकोंकी निःस्वार्थ अकिंचिन तपस्या, सम्मेलन का नाम और पूज्य बूढे बापू जी की वरद हस्त कमलकी छत्र छाया का फल है । अभी इस राष्ट्रीय महायज्ञकी पूर्णाहुति नहीं हुई है । हमारे सामने बहुत भारी काम पडा है । उत्तर और दक्षिण भारतको मिलाकर एक विशाल संयुक्त स्वतन्त्र भारतवर्षका स्वराज्य-मन्दिर निर्माण करना है जिसके पुजारी एक जातीय धर्म, एक जातीय भाव, एक जातीय वेश और एक जातीय (सामान्य) राष्ट्रभाषाके उपासक होंगे । चलिये, इस आगे होनेवाली तैयारी के लिये अब सन्नद्ध हो जायं । राष्ट्रभाषा हिन्दी प्रचारका उद्देश्य आन्ध्रदेशकी मातृभाषा आन्ध्र वाणीकी पवित्र महत्ता न्यून या नष्ट करना कदापि नहीं है । मातृभाषाका स्थान सर्व प्रथम है उसके उपरान्त राष्ट्रके हितके लिये राष्ट्रीय भाषा हिन्दीका स्थान है । भारत माता की जय !

"हिन्दी प्रचारक"






ఉ. ఆయత నీలమేఘగణమట్టివఁయై విలసిల్లు నీతను
చ్ఛాయలు భూనభోంతర విశాల దిశావలయంబు నిండ నే
చాయల నుంటివో యనుచు ఛాందసునట్టులు రోయనేల? కృ
ష్ణా! యిదె నీశుభోజ్వలిత శ్యామలకాంతుల లీనమయ్యెదన్.

సీ. చూపులు మెరపులంచును సాటి తేనేల? మెరపులై చూపులే మెరయుచుండ
నురుముతో నీరావ ముపమింపగా నేల? నీరావ మురుముగా నెగడుచుండ
కృప వర్ష సమమని కీర్తింపగానేల? వర్షమై కృపయె పెంపారుచుండ
మాయచే నను గప్పి మసలినావననేల? మాయయు నీవయై మలయుచుండ
సస్యశ్యామలమైన యీ శ్రావణోర్వి, బోలె దీవంచు వెదకుచు బోవనేల?
వెదుకబో నొక యడుగిడ్లు పెట్టినపుడె, కదియు నీరూపు తమిదీర గౌగిలింతు.

సీ. మెరపు మెరయు నప్డె మెరపులో గలియక, కనుమూసికొనునాదు కర్మ మేమొ!
చినుకులు వడునప్డు చినుకుల గలియక, వలువముసుంగిడు వ్రాతయేమొ!
ఉరుము లురుముచునప్డు నురుములం గలియక, వెలవెలబోవు దుర్విధి యదేమొ?
మాయ గప్పిన యప్డు మాయలో కలియక, మాయకై వెతజెందు మతక మేమొ?
ఏమొ? యీ శ్రావణాంబుదశ్యామ లాంక, మైన నీతనుకాంతి నైక్యంబు గాక
నెచట నుంటివిరా! కృష్ణ! కృష్ణ! యనుచు, మాయగప్పిపోయితివంచు మరగుచుండ?

సీ. పలికించుకొనరాదొ? పలుకులం బలుకుగా, నీమేఘగంభీర నిస్వనముల
చిలికించుకొనరాదొ? చినుకులం జినుకుగా, వర్షించునీకృపా వర్షమందు
మెరయించుకొనరాదొ మెరపుల మెరపుగా, మెరయించునీచూపు మెరపులందు
మరలించుకొనరాదొ మాయలమాయగా, మహిగప్పు నీమేటి మాయలందు
నాపలుకు నాదుకులుకును, నాదుమెరపు, నాతనువుకూడ నీవు విన్నాణ మమర
అవల శ్రీకృష్ణ భగవానుడగుచు నీవు, శ్రావణంబగుచు నేను దోచంగరాదొ?






## స్త్రీరత్నములు (వచనము)

గ్రంథకర్త: కోన వేంకటరాయ శర్మ గారు

సుబోధినీ గ్రంథనిలయము, తెనాలి.

క్రౌను ౧౮౪ పేజీలు, వెల ౦-౧౨-౦.

ఆంధ్రదేశమున నేఁటివల గ్రంథమాలలు, గ్రంథనిలయములు క్రమక్రమముగ పెచ్చు పెరుగుచున్నవి. అవి యేవేని గ్రంథములను బ్రకటించి యన్నివిధముగ నాంధ్ర భారతీసేవను జేయుచున్నవి. ఆసేవ నానాముఖముల భాషాభివృద్ధితోపాటు దేశాభివృద్ధికి నైనయుఁ దోడ్పడుచున్నది. ఈ సుబోధనీగ్రంథనిలయము ఈ పుస్తకముతోఁ బండ్రెండుపుస్తకములను బ్రకటించినది. ఈ నిలయ మిట్లే యింకను పెక్కుగ్రంథములఁ బ్రకటించుచుఁ జిరస్థాయియై వెలయుఁగాక!

ఈ గ్రంథమునఁ దొమ్మిది కథ లున్నవి. స్త్రీల యొక్క పాతివ్రత్యము, సౌశీల్యము, ధైర్యము, శౌర్యము, సాహసము, వివేకము, విజ్ఞానము, నీతికౌశల్యము మొదలగు సుగుణముల నవి చాటుచున్నవి. వానిలో సావిత్రీసుకన్యల కథలు పురాణప్రసిద్ధములు. తక్కినవి చారిత్రకములు.

'అసామాన్య' కరుణాతిశయము మెచ్చఁదగినది. 'అహల్యాబాయి, దుర్గావతుల' యొక్క సాహసౌదార్యములు, నీతిజ్ఞత, రాజ్యపరిపాలన సామర్థ్యము కొనియాడఁదగినవి. 'పరందేవి' ప్రేమ, ధైర్యము, త్యాగము వాకొనఁదగినవి. 'రత్నావతి'యం గామె ప్రార్థనము నంగీకరించి ఉదయసింగు పూర్వవైరమును బాటింపక ఆపత్సమయమున మానసింగునకుఁ దోడుపడుటయు, మానసింగును కృతజ్ఞతతో ఉదయసింగునకుఁ దనకూఁతు రగు రత్నావతి నిచ్చి పెండ్లిసేయుటయు ఉదారగుణమునకు మంచి నిదర్శనములు. 'జేబున్నీసా' కథ చరిత్రప్రసిద్ధమైనను నీతిదాయకముగాఁ జూపట్టదు కాన దాని కిందు స్థాన మొసఁగకుండిన బాగుండెడిది.

కథలన్నియు మొత్తమున నాంధ్రసోదరీమణుల హృదయముల నూత్నభావములఁ దావొసంగి యథారుచిగ వారిపురోభివృద్ధికిఁ దోడ్పడఁగలవు. కథలశైలి ఇంకను సరళముగానుండిన బాగుండును.

ప్రాచీనభారతదేశము మాత్రము నారీరత్నములఁ బడసినది కాదు. ఎందఱో యుందురు. వారిచరిత్రలు సువర్ణాక్షరముల నెందో ముద్రితములై గుప్తములుగ నుండును. అవి లోకమునకు వెల్లడికావలసియున్నవి. ఆభారము చారిత్రపరిశోధకులపై నున్నది. శ్రీశర్మగారును ఆభారమును గొంతవహించి యింకను ఇట్టి కథలను సేకరించి యాంధ్రనారీలోకమున కొసంగి తత్కృతజ్ఞతకుఁ బాత్రులగుదురు గాక!

*　　*　　*

## శ్రీకృష్ణావతార తత్త్వము-భాగము ౧.

గ్రంథకర్త: జనమంచి శేషాద్రిశర్మ గారు, కావ్యతీర్థ, ప్రధానాంధ్రోపాధ్యాయులు, మునిసిపలు హైస్కూలు, కడప.

శ్రీశర్మగారి ప్రాజ్ఞత, వైదుష్యము, పరిశీలనము, పరిశ్రమ వీరురచియించిన యాంధ్ర బ్రహ్మాండపురాణ శ్రీమదాంధ్ర రామాయణాది గ్రంథములవలన నాంధ్రలోకమునకు సువిదితములే. అట్టిశర్మగారే యీ కృష్ణావతారతత్త్వమును రచియించి రనుటకన్న దీనిప్రాశస్త్య

మును వెలుగఁజెప్పనక్కరలేదు. కాని యాంధ్రలోక
మున కీగ్రంథపరిచయమును గలిగించుటకై యొకటి
రెండుమాటలు చెప్పుట నావశ్యకము కాదు.

ఈనాఁడు భరతఖండమున సనాతనార్యధర్మ
ములు సన్నగిల్లుచున్నవి. ఆధ్యాత్మికచింత యడఁగారు
చున్నది. దైవభక్తికిఁ దావు లేకున్నది. వీనినన్నిటిని బాగ
రుద్ధరింపఁజాలినంత గ్రంథసామగ్రి యున్నను, ప్రస్తుత
విద్యావిధానమున దానిఁజదువు ప్రవృత్తికైన మరల్పుటకు
వలనుపడకున్నది. తరువాతఁగూడ నుదర పోషణార్థము
లౌకికవ్యాపారాదుల నవలంబింపవలసి యుండుటచే
వానిని బరిశీలించుటకు వలసినంత యవకాశము లభింప
కున్నది. ఇందువలన, యిట్టి యధోగతికి వైదేశిక
నాగరికతావలంబనాభిలాషయుఁ గారణమగుచున్నది.
ఇట్టి దుస్స్థితిని దొలఁగించి భారతదేశమునకుఁ బ్రాచీ
నౌన్నత్యమును గలిగించు భారము ప్రాజ్ఞులపై
నున్నది. వారు నవీనసిద్ధాంతపరాయణులై సామాన్యజన
దురవగాహము లైన గ్రంథములను బరిశీలించి యందలి
యుత్తమవిషయముల నేర్చి కూర్చి తదితరుల కుపకృతి
గావింపవలయును. మన శేషాద్రిశర్మగారు ఈ గ్రంథ
మును రచియించి అట్టి పుణ్యమును గొంత కట్టుకొనిరి.
ఈ గ్రంథప్రయోజన మట్టి పరమార్థమునుగూర్చియే.

శ్రీ కృష్ణపరమాత్మ చారిత్రకపురుషుఁడని కొంద
రు నవతారపురుషుఁ డనుచున్నారు. నిర్గుణము, నిరాకారము,
స్వయంప్రకాశము నగు పరబ్రహ్మమని వేదములు, వేదాం
తములు, శాస్త్రములు పురాణములు స్పష్టముగఁ
జాటుచున్నవి. శ్రీకృష్ణపరమాత్మయే గీతలయందీయ
ర్థమును స్వయముగ నర్జునునకు బోధించెను. హరి
హరాది నామరూపభేదముల విలసిల్లునది యా పరబ్ర
హ్మమే. "యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" —
అను గీతావాక్యము ననుసరించి ఉత్పన్నధర్మములను ధ్వంసింప
బహురూపముల నవతరించునది అపరబ్రహ్మమే. శ్రీకృ
ష్ణపరమాత్మ యట్టి యవతారములలో నొక్క యవతారము.
ఏతద్విషయకము లగు పురాణగాథ లొకదానికొకటి వి
సంవాదము లగుటచే నిజమిథ్యమని తత్త్వము తెలియరాక
కుతర్కముల కవకాశము నిచ్చుచున్నవి.

ఈ గ్రంథరచనమున శ్రీ శర్మగారు కావించిన
పరిశ్రమ మత్యధికము. విష్ణు, బ్రహ్మ, బ్రహ్మాండ,
బ్రహ్మవైవర్తాది పురాణములను, భారత భాగ
వత దేవీభాగవతాదిగ్రంథములను ఆమూలాగ్రము
పరిశీలించి శ్రీ కృష్ణవిషయికములగు గాథల
నన్నిటిని ఏర్చిరి. వాని నొకతీరున సమన్వయించి, క్రమ
ముగ నిందు వచనముగఁ గూర్చిరి. బహుగ్రంథస్థములు,
పరస్పర విసంవాదములు నగు నీగాథల నాధారముగాఁ
గొని సిద్ధాంతము గావింపఁగుదురకున్నను ఆయాగాథల
సారాంశములను గరతలామలకముగా వివరించిరి. లోక
మునొక్క వర్తమానస్థితికిఁ బరితపించుచు నుపదేశ
వాక్యములఁ దెలియ నుడివిరి. ఏయేగ్రంథములనుండి
యేయేగాథలను గైకొనిరో యాయా గ్రంథముల పేరు
లను, వానిప్రసంఖ్యను దెలిపిరి. పాఠకులయందుఁ గొన్ని
క్లిష్టములని స్తోత్రములయొక్క సంస్కృతమూలమును గూడ
సన్నుటఁ జేర్చిరి. శైలి కుంటువడక ధారాళమై
నాతిక్లిష్టమై స్త్రీలకు సైతము సుగ్రహముగ నున్నది.

ఏతద్గ్రంథపఠనము శ్రీ కృష్ణపారమ్యమును భార
తీయ హృదయమున నెలకొల్పుననుట సాహసము గాదు.
కాన ఆంధ్రలోకమున నెల్లరును దీనిని బఠించి కృతార్థులగు
దురుగాక! ఆంధ్రలోక మీగ్రంథము నెడఁ జూపు సమా
దరణమే గ్రంథకర్త పరిశ్రమ కుచితమైన ఫలము.
దీనితో పాటు అచిరకాలమున వెలువడనున్నది రెండవ
భాగమును. ఆంధ్రలోక మద్దానికిని సుస్వాగత మొసఁ
గునుగాత!

ఇదివఱకే కృష్ణలీలామృత మనుపేర నిట్టివిష
యమునే వివరించు నొక గ్రంథమును శ్రీ వావిలికొలను
సుబ్బారావుగారు రచియించియున్నారు. మరల శ్రీ
శర్మగారట్టి యీగ్రంథమునే రచియించినారు. పలువు
రొక్కవిషయమును గూర్చియే పరిశ్రమించుటవలన లాభ
మేమి? వేలువేలు విషయములఁ గూర్చి పరిశ్రమించిన
ననేకవిషయములు లోకమున వెల్లడియగును కదా!

ఇంకను ఇతరావతారములయొక్క తత్త్వమును
గూర్చియు నిట్టిగ్రంథములను రచియించి యాంధ్రలోక
మున కొసంగి శ్రీ శేషాద్రిశర్మగారు లోకకృతజ్ఞతకుఁ
బాత్రులగుదురుగాక!

ఉత్తమగ్రంథరచయితలగు శ్రీ శర్మగారు ధన్యులు.

క్రొను పుట్టపల్లి శేషం.

వెల రూ ౧-౮-౦.

# గ్రంథస్వీకారము

### ౧. శ్రీ శృంగారకాదంబరి.

గ్రంథకర్త: చింతలపల్లి నరసింహశాస్త్రి గారు.
ప్రధానాంధ్రోపాధ్యాయులు, మునిసిపలు హైస్కూలు, బళ్లారి.

భట్టబాణుఁడు రచియించిన సంస్కృతకాదంబరి కిది తెలుఁగుసేఁత. పద్యకావ్యము. పూర్వభాగము ఆఱాశ్వాసములు, ఉత్తరభాగము నాలుగాశ్వాసములు.

రాయలు ౪౮౦ పేజీలు.

అట్టబైండు రూ ౨. కాలికోబైండు రూ ౩.

నెల చందాదారులకు రూ ౧-౪-౦.

ఇతరులకు రూ ౧-౮-౦.

ప్రాప్తియిటరు: కలాభివర్ధనీపరిషత్తు, రాజమహేంద్రవరము.

* * *

### ౨. రక్షాబంధనము—నవల.

గ్రంథకర్త: పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు
డిమ్మీ ౩౬౨ పేజీలు.

* * *

### 3. శ్రీ ప్రసన్న కృష్ణదేవరాయవిజయము. (ఐదంకముల చారిత్రాత్మక నాటకము.)

గ్రంథకర్త (కన్నడము): రాయబహద్దర్ సి. హెచ్. గౌడగారు, బళ్లారిసరసవినోదినీసభాధ్యక్షులు.
అనువాదకర్త (ఆంధ్రము): బి. మాధవరావుగారు, జనరల్ మేనేజరు, బళ్లారి సరసవినోదినీసభ.

---

## శైలి

కం. కనకమ్మ గారు

దానము సూతపుత్రునకు, ధర్మము ధర్మసుపాల మూర్తికిన్
మానము రాజరాజునకు, మంత్రము తంత్రము కృష్ణమూర్తికిన్
గానము నారదాఖ్యునకు, జ్ఞానము నాసహదేవసూరికిన్
ధ్యానము యోగిచంద్రునకు, మానవశక్తి కిరీటి కౌంతేయున్.

ధ్యానము గోపకాంతలకి, హాస్యమదెల్ల తెనాలివానికిన్
కానలు తాపసావళికి గాథలు బోధలు పెద్దమాంబకున్
గోనలు దుష్టజంతులకు, గూరిమి బేదల కెందునే దగః
ప్రాణము తీయుటన్న నది రంభకు వేసకకున్, సదా హరీ

జానులు కోర్కెవైఖరిని గాంచి, తదీయగతిన్ జరింపగా
బూనుదు రజ్ఞులయ్యొ! యటువంటి నన వారిని బోలవచ్చునే
కానగ వారి గాథలకు గారణ మజ్ఞుల బోధ చేయుటే
కాని వృథాభిమానమును గాదది యీర్ష్యయుగాదు కాదు సూ

హానము బూనలేమి, ఖలమానవకోటికథాళికిన్ బలెన్
మానుపు మిట్టిపోకడల మాధవ! వ్యాధులుపాధివాసనల్
దీనులు జీవులన్న, భవతీరము జేర్పగదన్న, యెన్న నే
నెన్నియు బూర్ణభాగ్యమున నెవ్వరికైన దివాకరంపటే!

# సాభిప్రాయవిశేషములు

**లోకర్నో యొడంబడిక**

ప్రపంచపరిస్థితులు శ్వేతజాతులకు గల సంబంధబాంధవ్యముల నొకదరిని నతియు సంవత్సరాంతమునకు జేర్చవచ్చునని విశదము చేయుచున్నవి. సర్ ఆస్టెను చేంబర్లిను బ్రిటీషు రాజ్యనీతిని నానాజాతిసమితి నిర్ణయములతో ననుసంధానము చేయుటకు జేసిన ప్రయత్నములు శ్లాఘ్యములు. చేంబర్లినుగారు ఫ్రాన్సుదేశ నాయకుడైన బ్రియండుగారిని నీమార్గానుయాయినిగను జేయుటయును శ్లాఘ్యముగ నున్నది. ఈమార్గావలంబనము సకలవిధములను బ్రిటీషు సామ్రాజ్యప్రయోజనములకును ఫ్రాన్సు ప్రయోజనములకును ననుకూలముగ నున్నది. ప్రపంచమునందు వర్తమాన బ్రిటీషు సామ్రాజ్యస్థితి ఉచ్ఛదశ యందున్నది. ఫ్రాన్సు సామ్రాజ్యస్థితియును నున్నత దశయందున్నది. ఈ రెండు సామ్రాజ్యములును ఆసియా ఆఫ్రికాఖండములందు విశేషభాగముల నాక్రమించుకొని సామ్రాజ్య సంజాతములైన భాగ్యభోగముల ననుభవించుచున్నవి. ప్రపంచమునందు గల ప్రధాన రాజ్యముల మహాసభయైన నానాజాతిసమితి ఈయుభయ సామ్రాజ్యముల యుచ్ఛదశను నంగీకరించిన యెడల రెండుజాతులకును పరమప్రయోజనము గలుగుచున్నది. సంగ్రామసమయమునందు మిత్రమండలితో జేరిన ఇటలీ బెల్జియము.....ప్రభుత్వములు లోకర్నో యొడంబడికల నామోదించుట సహజము. జర్మనీ రుష్యారాజ్యములు నానాజాతి సమితియందు జేరి లోకర్నో యొడంబడికల నామోదించనంతవరకును యూరపురాజ్యములకు శాంతిదుర్లభము. యూరపురాజ్యముల యశాంతస్థితి బ్రిటీషుసామ్రాజ్య క్షేమమునకు ప్రతికూలము గాని యనుకూలముగాదు. బ్రిటీషు రాజ్యము ప్రపంచమునందు పొందవలసిన లాభముల నన్నిటిని పొందినది. బ్రిటీషుసామ్రాజ్యమున కన్ని ప్రాంతములందును ఛిద్రములేర్పడుట కవకాశములు గలవు. ఇరాకు, పరిషియా, ఆఫ్ఘనిస్థానము, ఇండియా, ఈజిప్టు మొదలగు ప్రదేశములు ఛిద్రప్రదేశములు. ఈ ఛిద్రప్రదేశముల సంరక్షణమునకు నానాజాతిసమితి ప్రతిష్ఠను వినియోగించుట రాజ్యనీతి. ఛిద్రస్థానములకు పరరాజ్యభయము గలుగనపుడు సామ్రాజ్యాంతర్భాగములన్నియును స్వాధీనములై యుండగలవు. సర్. ఆస్టెను చేంబర్లిను బాల్డువిను గారలీ మార్గము నవలంబించుట ప్రపంచశాంతికి ప్రయోజనకరము గాకపోయినను బ్రిటీషుసామ్రాజ్య స్థితికి ప్రయోజనకరము. మోసులువిషయమై నానాజాతిసమితి చేసినతీర్మానము సమితి బ్రిటీషు ప్రయోజనముల కుపయోగపడగల విధమునకు నిదర్శనముగ నున్నది. జర్మని నానాజాతిసమితియందు జేరుటకంగీకరించినది. డాక్టరుస్ట్రెస్మనును . . కొర్లెటు.

బర్కన్‌స్టారుఫును ప్రతినిధులనుగ బంపుటకు జర్మనుప్రభుత్వము నిర్ణయించినది. రుష్యా ప్రవేశమున కవకాశములను గల్పించుటకు సమితిసమావేశము మార్చిమాసాంతమున కాఁబడినది. అమెరికాయును తుదకు సమితి సమావేశమునకు వచ్చుట కంగీకరించినది. సమితియందు యోచింపబడనున్న ముఖ్యాంశము భిన్నరాజ్యములందును యుద్ధాంగమును నియమించుటమైయున్నది. ఈపనికి కొంత నరికీసమావేశమునం దేర్పాటులు జరుగునని సమ్మవగియున్నది. జినివాసమావేశము నసూరప్రరాజ్యములకు ప్రయోజనముల కుపయుక్తమైనను పరాధీనజాతుల ప్రయోజనములకుపయుక్తముగాదని భారతసామ్రాజ్య శాసనసభయందు గతవారమునందు జరిగిన చర్చ విశదము చేయుచున్నది. భారతదేశమునకు లోకర్నో ఒడంబడికయందు చేరుట వలనను గలుగగల సాధక బాధకములను తెలుపుటకుగాని చర్చించుటకుగాని ప్రభుత్వము నిరాకరించినది. భారతీయులు వ్యయభారమును వహింపవలసియున్నను ప్రయోజనములను గనుగొనుటకైనను నోచుకొనలేదు. లోకర్నోసమావేశము పరాధీనజాతులకు ప్రతిబంధకమైనను శ్వేతజాతులకైనను శాంతిసాధనమైన లోకమునకు కొంత యుపక్షాంతి గలుగగాదు. లోకర్నో సమావేశము యుద్ధాంగ నియమమును సకలదేశములకును జేయగలిగినపుడు భరతవర్షమునందు యుద్ధాంగవ్యయభారమైనను తగ్గి దేశమునకు కొంత ప్రయోజన మేర్పడగలదు. రాజ్యాంగనిర్ణయములందు నోరులేని భరతవర్షమునకీ ప్రయోజనమైనను గలుగునని యూహించుట కవకాశములు లేవు.

* * * *

సామ్రాజ్య శాసనసభ

శ్రీ రీడింగుప్రభువు సామ్రాజ్యశాసనసభారంభ సమయమునందుఁ జేసిన ప్రసంగము దేశమునందు వ్యాప్తమైన నిరుత్సాహము నభివృద్ధిచేయుటకు వినియోగపడినది. రీడింగుప్రభు వధికారాహంకారభరితుడై సభ్యులను బడిపంతులువలె బెదరించి మందలించెను. బర్కెనుహెడుప్రభువు కోరిన యభినయమును సంపూర్ణముగను పండిత మోతిలాలు నెహ్రూగారు ప్రదర్శింపలేదని యాక్షేపించి యధికారాహంకారమును లోకమునకు వ్యక్తముచేసిరి. త్యాగమూర్తులును త్యాగపరాయణులునైన లాలాలజపతిరాయలు మదనమోహనమాలవ్య మోతీలాలు నెహ్రూగారలు మొదలగు ప్రముఖులు దేశప్రతినిధిచేసిన యనేకప్రసంగములను నాకర్ణించియును చేయగలది గనుపడకున్నది. రాజ్యాంగసంస్కరణము విషయమై రీడింగుప్రభువును, సర్ ముడ్డిమను గారును జేసిన ప్రసంగములు నిరాశను గలుగజేసినవిధమును వివిధపక్షముల యభిప్రాయములును విశదముచేయుచున్నది. ఉభయులును మోతీలాలుగారు పాదాక్రాంతులగుటకు నింకను తరుణము మించిపోలేదని చెప్పుటమాత్రము విశేషముగనున్నది. బ్రిటీషుప్రభుత్వము రీడింగుప్రభువు ముఖమునను ప్రసాదించిన వరములందు వ్యవసాయ విమర్శన పంచాయతి యొక్క వరముగ

నున్నది. ఈపంచాయతియును ఇర్విను ప్రభువుని రాకయును సువర్ణశృంఖల బంధములను శిథిలముచేయుటకు బదులు దృఢతరముచేయుట సహజమని రాయలుకమిషనుల యనుభవము విశదము చేయుచున్నది. ప్రజల దృష్టియును నాయకుల దృష్టియును ప్రభుత్వదృష్టియును రయితులమీదను గ్రామసీమలమీదను లగ్నమగుచున్న సమయమునందు వ్యవసాయపంచాయతి సంఘమును జేయగల నిర్ణయము లనేకములు గలవు. పంచాయతిసభ బ్రిటీషుప్రయోజనముల దృష్టిని విసర్జించి భారతీయప్రయోజనముల లక్ష్యమునుబూనుట వర్తమాన పరిస్థితులందసంభవమైనపుడు రాయలుకమిషనులు బంధకమునకు వినియోగపడునటులు విమోచనమునకు వినియోగపడజాలవు. రీడింగు ప్రభువు దైవదత్తమైన యైదేండ్లకాలము నిరర్థకము చేసిన విధమును వారి పరిపాలనాకాలము విశదము చేయుచున్నది.

శాసనసభయందు రెండువారములు నడచిన యుదంతము ప్రభుత్వమునకును ప్రతినిధులకును గుణపాఠమును నేర్పదగియున్నది. ప్రభుత్వ నిర్ణయములకనేకసారులు పరాజయము గలిగినను నిరంకుశాధికారాభిమానమునకు బుద్ధిగలుగలేదు. స్వరాజ్యపక్ష మవలంబించుచున్న ప్రతిఘటనతంత్రము ప్రబలుచున్నను వ్యవహారములందు ప్రయోజనము గలుగుటలేదు. రాజకీయ నిర్బంధితుల విషయమునను ప్రభుత్వమునకు పరాజయమును అనధికార సభ్యులకు విజయమునుగలిగినది. ప్రివికౌన్సిలు సభ్యులజీతముల విషయమునను కార్మికసంఘముల శాసన నియమములందును న్యాయస్థానములనిరాదరణ శాసనమునందును నిరుద్యోగసమస్యయందును నితర సందర్భములందును ప్రభుత్వమునకు పరాజయము గలిగినను ప్రభుత్వ లక్ష్యముమాత్రము మారలేదు. శాసనసభ్యులు ప్రభుత్వవిధానమునందు ప్రతిష్టంభనమును గలుగజేయ గలవిధమును సభావ్యవహారములు విశదముచేసినవి. ప్రమేయము నుపేక్షించి రాజ్యాంగరథమును నిరంకుశప్రభుత్వము నడుపగల విధమును వ్యవహారములు విశదముచేసినవి. ప్రభుత్వాధికారులకు గల చాకచక్యములు సర్ డెనిసుబ్రె, సర్ అలగ్జాండరు మడ్డిమనుగారల వ్యవహార విధానము విశదముచేసినది. లోకార్నో నిర్ణయములకు సంబంధించిన ప్రశ్నను రాజప్రతినిధి ప్రతిషేధించినను, సభాధ్యక్షుడు విట్టలభాయి పటేలామోదించి స్వాతంత్ర్యమును ప్రదర్శించినను బ్రెగారి చాకచక్యము నిరుపయోగమును జేసినది. పటేలుగారి యధ్యక్షత స్వాతంత్ర్య ప్రదర్శనమునకవకాశమును గలుగజేసినను ప్రయోజనము మాత్రము గలుగకున్నది.

* * * *

దక్షిణాఫ్రికా నిర్బంధములు

దక్షిణాఫ్రికా నిర్బంధములు శ్వేతజాతుల నావహించిన స్వార్థపరత్వమును దురహంకారమును విశదము చేయుచున్నవి. భారతీయుల నేయుపాయముచేతనైనను దేశాంతర్గతుల జేయుటకు దక్షిణాఫ్రికా ప్రభుత్వము

నిశ్చయించినది. భారతీయుల నివాసస్థలము లకును వ్యాపారసాధనములకును వసతులకును ప్రతిబంధకములను గల్పించుటకు నిశ్చయించినది. గాంధి స్మట్సుయొడంబడిక నతిక్రమించి భారతీయుల హక్కులను ప్రతిషేధించుటకు శాసనసభయందు శాసనమును మంత్రి ప్రవేశపెట్టి దుస్తంత్రమును వ్యక్తము చేసెను. భారతీయ రాయబారులు భరతవర్షమునందంతటను సంచారముచేసి ఆఫ్రికా భారతీయుల దుర్దశను విశదము చేయుచున్నారు. అబ్దురరహీము గోడ్ఫ్రేగారులు మొదలగు వారి ప్రసంగములను వినినవారలకు భారతీయులదుర్దశ విశదమగుచున్నది. ఆండ్రూసుగారు దక్షిణాఫ్రికాయందు వారి యావచ్ఛక్తిని వినియోగించుచున్నను ప్రయోజనము గనుపడకున్నది. మొదటనుద్దేశించిన శాసనమటులుండగను నల్లజాతి ప్రతిషేధశాసనము శాసనసభయం దామోదింపబడినది. ఇదివరలో సుప్రీము కోర్టుచేసిన తీర్మానమును నిరుపయోగము చేయుటకు క్రొత్తశాసనమును శాసనసభ నిర్మించుచున్నది. స్మట్సుగారి హితోపదేశము మంత్రికి తలకెక్కలేదు. అధికసంఖ్యాకుల ప్రయోజనముల నడుగంటింప జేయదలచిన శాసనము దక్షిణాఫ్రికాక్షేమమునకు ప్రయోజనకరముగాదు. స్మట్సుగారు తెలిపినటులు పశ్చాత్తాపకారణము ముందురానున్నను ప్రస్తుతము భారతీయులస్థితియును స్వదేశస్థులస్థితియును దుర్భరముగ నున్నది. రాష్ట్రప్రభుత్వములును కేంద్రప్రభుత్వములునుగూడి చేయుచున్న శాసనములు ప్రస్తుతము తెల్లవారి కానందప్రదములైనను దేశక్షేమమునకు వేరు పురుగులని భావికాలము విశదముచేయగలదు. ఈవిషమస్థితియందు రీడింగుప్రభువు హార్డింజి ప్రభువువలె ధైర్యస్థైర్యములను బూనకుండుటయును వారి యుదాసీనతను విశదము చేయుచున్నది. స్వదేశమునందును విదేశములందును భారతీయులమోక్షము వారిహస్తములందేకలదు. స్వదేశమునందులేని ప్రతిపత్తి విదేశములందు సాధ్యముగాదు. ఆఫ్రికా సమస్యయందు భారతీయులందరును నేకాభిప్రాయమును ప్రకటించుచున్నను ప్రయోజనములేదని భారతీయుల నిస్సహాయస్థితి విశదము చేయుచున్నది. వర్తమాన పరిస్థితులందు కర్తవ్యము దుర్గ్రాహ్యమై దేశ మయోమయస్థితియందున్నది. దక్షిణాఫ్రికా భారతీయులు గాంధిమహాత్ముడు సరోజినిదేవి మౌలానా మహమ్మదాలిగారల నాఫ్రికాకు వెళ్ళి రక్షింపవలయునని కోరుచున్నారు. మహాత్ముడారోగ్యము చెడి యస్వస్థస్థితియందున్నారు. సరోజినీదేవి మహమ్మదాలిగారులైననుపోయి చేయగలది కనుపడదు. ఆండ్రూసుగారు పెడినను కమిషనును చేయలేని పనిని వీరుచేయుట దుర్లభము. దక్షిణాఫ్రికాయందు తిరిగి సత్యాగ్రహాచరణము శరణ్యమని వ్యవహారములు విశదము చేయుచున్నను వర్తమాన పరిస్థితులందదియును సాధ్యమగునటులు కనుపడదు. పరిణామ మెటులున్నను భారతీయులందరును దక్షిణాఫ్రికా యవమానములను దలపోసి యేకాభిప్రాయులై స్వధర్మనిర్వాహణమునకు బూనుకొని స్వదేశమునందును విదేశములందును భారతీయ గౌరవమును గాపాడుకొనుటకు భగవంతుడు శక్తిననుగ్రహించుగాత !

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G.T. Madras.


విషయానుక్రమణిక





## చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—శ్రీ కృష్ణమూర్తి - యమున; బిల్లిగన్నేరు.

సాధారణ చిత్రములు:—శ్రావస్తి చిత్రములు; చింపంజి తల, మామత్ కొమ్మలు; అభినవాంధ్ర నటశేఖరులు—శ్రీ కొంగర కోటయ్యనాయుడు, భోగరాజు కృష్ణమూర్తి పంతులుగార్ల అభినయచిత్రములు; ఇతరచిత్రములును.





శ్రీ కృష్ణమూర్తి - యమున

చిత్రకారుఁడు: శ్రీ యల్. కృష్ణదాసుగారు, బి. ఏ., బి. యల్.



చెన్నపట్టణము మార్చి ౧౯౨౬

సంపుటము 3 క్రోధన సంవత్సరము ఫాల్గుణమాసము సంఖ్య 3

# శ్రీ కృష్ణదేవరాయలు

జి. జాషువ కవి గారు

ఆంధ్రులభావనాట్యస్థానములలోన, నాడు నీకావ్యకన్యకలఁ గాంచి
అనిఁ గన్నుమూయ కింకను దోఁచు నీసమి, త్కంఖాణఖురళికాంకములఁ జూచి
కలితశౌర్యజ్వాలఁ గరఁగించి పోసిన, జయశాసనస్థిరాక్షరము లరసి
పెద్దనార్యునిమనోవీధి కందక దాటి, దిశలఁ దాండవమాడు తేజమెంచి

గీ. చిరము నీరాజ్యలక్ష్మి వర్షించు బాష్ప, పూర మదె తుంగభద్రాఖ్యఁ బూని పారు
చుండు నెప్పుడు బళ్లారిమండలమున, ఆంధ్రకవిచంద్ర ! కృష్ణరాయక్షితీంద్ర !!

సీ. మహితాంధ్రభోజనామకరత్నము వహించి, క్రాలు విశాలవక్షస్స్థలంబు
పరభీకరప్రభావమ్ము బయ ల్పిమ్ము, సరిలేని కోరమీసములజంట
చతురబ్ధివలయితక్ష్మాభారమునకుఁ బెం, పున నిక్కి కనుచుండు భుజయుగంబు

దురమున నిప్పుక ల్గురిసి దీనులయందు, దయలు వర్షించు నేత్రద్వయంబు
అష్టదిగ్గజవాగమృతార్ద్ర మగుచుఁ, బావనంబైన నీసభాభవనవిభవ
మక్కటా! జీర్ణనగరకుడ్యాంతరములఁ, బండి నిద్రించెనే కృష్ణపార్థివేంద్ర!

సీ. భాషాసముద్రకుంభజుఁడ వీవయ్యును, విద్వత్కవుల గౌరవించినావు
ప్రతిపక్షరాజభార్గవరాముఁడవ యయ్యు, వెన్నిచ్చువారి విడిపించినావు
వైరికిరీటశుంభత్పదాబ్జుఁడ వయ్యుఁ, బెద్దనపదము సేవించినావు
అర్థార్థిజనకల్పకానోకహుఁడవయ్యు, సత్కృతులకుఁ జేయి సాచినావు
ఔర! శ్రీకృష్ణరాయ నీయాత్మవాని, దివికి నర్పించుకొన్న మాదేశజనుల
భాగ్యహీనత నొక్కిఁ జెప్పంగలేక, చిలువరాయఁడు వేయినాల్కలు సహించె.

ఉ. ఆయతవర్ణనావిభవ మచ్చుపడం బనిఁబూని విష్ణుచి
త్తీయము వ్రాసినావు కవిధీరులగుండెలు తత్తరిల్ల నేఁ
డీ? యొకఁడేని మీసముపయిం జెయివైచి రచించు సత్కవి
ధ్యేయుఁడు? క్లిష్టకావ్యమన కేమి? యశర్తులు కృష్ణభూవరా!

సీ. కవిసింహములు నీకుఁగా సృష్టిగావించు, కృతిపుత్త్రికలను దుఃఖితలఁ జేసి
ఆవాడసింధురాజాగ్రణు ల్పుత్తెంచు, కానుకబండ్లు వెన్కకు మరల్చి!
మునురువెన్నెలఁ జిందు ముత్యాలగద్దియ, పరరాజధూర్తుల పాలుసేసి
నిరతంబు పగర నెత్తురుటేరుల మునుంగు, కత్తి కాఁకటిచిచ్చుఁ గలుగఁ జేసి
కుడియెడమలను నీతోడఁ గూడి తిరుగు, సుకవికులకోకిలమ్ముల శోకజలధి
ముంచి యలబృహస్పతివ్రాత మంచి దగుట, దివికిఁ బోయితె శ్రీకృష్ణదేవరాయ!

సీ. ఆశీర్వదించినారా వ్యాసవాల్మీకి, బృందారకమునీంద్రు లెదురువచ్చి?
కన్నావె కవిభయంకరుఁ గాళిదాసు భోజుండున్నవాఁడె విశ్రుతగుణుఁడు?
రంభ నీతోడఁ గేరడ మాడునే దాన్నఁ, గోపించునే నలకూబరుఁడు?
బలభేది వేయుఁ గన్నులఁ జూచి నిను గౌరవించుచున్నాఁడె కోవిదులలోన?
గీ. తిరిగి నీ నెయ్యపుం గవీశ్వరులగోష్ఠి, జరుగుచున్నదె దేవేంద్రపురమునందు?
యెచట నుండిననేమి శ్రీకృష్ణరాయ! భరతపుత్త్రుల నొకకంట నరయుమయ్య!



# పాండురంగ మాహాత్మ్యము—తెనాలి రామకృష్ణ కవి

విద్వాన్ డి. రామమూర్తి శాస్త్రిగారు

కీ. శే. కందుకూరి వీరేశలింగము పంతులుగారు 'వెలయుమమంగియగురవభూవిభుని పెద్దసంగిభూపాలమణి వ్రాయసప్రవర్తి......... రామానుజయ్యసుతుండు......విరూరివేదాద్రి శౌరి,......... మంగయగురవరాజ పుత్త్రుం పెదసంగిభూపాల శత్రు క్షేత్రుం.........గొల్చి వేదాద్రి నిత్యలక్ష్ములందలిర్చు' "అను గ్రన్థస్థములగు తేటగీతల నాధారముగాం గొని (1 ఆ. 20-80) యీసంగిరాజు తండ్రి గురవరాజు క్రీ. శ. 1545 వ సంవత్సరమున సదాశివదేవరాయనికాలములో దేవుని నిమిత్తము నాలుగు గ్రామములు సంపాదించినట్లు చెన్నపురిలోం బ్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు మెకంజీదొరగారు వ్రాయించినస్థానిక చరిత్రమువలన విశదమగుచుండుటంజేసి యీతని కొడుకైన సంగరాజును, నాతని వ్రాయసప్రవర్తియగు విరూరివేదాద్రియు, నాతనికిం గృతియిచ్చిన రామకృష్ణకవియు, క్రీ. శ. 1560-70 ప్రాంతమున నుండనోపుదురనియు, తే. గీ. "పట్టమేనుంగు శ్రీరంగపతికి...కందాళయప్పగారు;

శా. తత్త్వాదృగ్విభవప్రభావనిధిం గందాళప్పగారిన్.........గొల్చుచుం దదాశీర్వాదలభోన్నతిన్, హర్త్తిన్ దాను విరూరమంత్రిమణి వేదాద్రీశుఁడు" — (ఆ. 77-78) అనుపద్యముల నాధారముగాంగొని, యీవిరూరివేదాద్రిగురువగు కందాళప్పలాచార్యులే విప్రనారాయణచరిత్ర వైజయంతీవిలాసకర్తయగు సారంగుతమ్మయ్యకును గురువగుటం జేసియు, సారంగుతమ్మయ్య వైజయంతీవిలాసమును క్రీ. శ. 1581-1612 ప్రాంతమునం నున్న మహమ్మద్ శాహికిం గృతియిచ్చియుండుటంజేసియుం గందాళప్పలాచార్యులు క్రీ.శ. 1581-1612 కాలపువాండనియు, నాతండు గురువుగాంగల విరూరివేదాద్రియు నాకాలపువాండేయనియు, నాతనికిం గృతియిచ్చిన రామకృష్ణకవియు నాకాలపువాండేయనియు, క్రీ.శ. 1585-1614 వఱకుం జంద్రగిరిలో రాజ్యము చేసిన వేంకటపతిరాయలకాలములో నున్నట్లు నిదర్శనములు గలవనియు వ్రాసి గ్రంథకాలమును గ్రంథకర్తృకాలమును దేటపఱచిరి; కాని వేంకటపతిరాయలకాలములో నీకవి యుండుటకుం దగిన నిదర్శనములమాత్రము చూపియుండలేదు.

కాని వీరు ప్రథమమునం బ్రమాణముగాం బరిగ్రహించిన 'పట్టమేనుంగు శ్రీరంగపతికి' అనుపద్యమే కృతిభర్తగురువగు కందాళప్పలాచార్యులు క్రీ. శ. 1574-1585 వఱకుం జంద్రగిరిలో రాజ్యముచేసిన శ్రీరంగరాయలకుం బ్రధానుండు లేక ముఖ్యుండు, లేక గురువు నైయుండెడివాండని విశదీకరించుచున్నది. కాన నాతనిశిష్యుండైన వేదాద్రియు, నాతనికిం గృతియిచ్చిన రామకృష్ణకవియు నాకాలపు

వాఁడే యనఁదగును. మఱియు వైష్ణవు లక్కాలమున రాజగురువులుగా నుండుట సుప్రసిద్ధమగుటచేతను, పైని నిరూపించినకాలమున కియ్యది బాధకముగా కుండుటచేతనునీగ్రంథము వసుచరిత్ర కృతిభర్తయగు తిరుమలదేవరాయలకుఁ గుమారుఁడగు శ్రీరంగరాయల కాలములో రచింపఁబడినదనుటకుఁగాని, రామకృష్ణకవి యక్కాలమున నుండెననుటకుఁగాని సందేహము లేదని తోఁచుచున్నది.

మఱియు,

"కం. శ్రీరంగరాజసేవా
పారంగతహృదయకమలభవవంశపయః
పారావార సుధాకరమార
సమానావతార మాదయపెద్దా!

శా. కందాళప్పగురుఁ డి వివేకనిధిలో
క ఖ్యాతు వర్ణించుచుఁ

కం. ఆ దేశికపదకమలము
లాదరమున హృదయవీధి ననవరతంబుఁ
మోదమున నిలిపి శ్రీలల [యుఁ.
నాథుని గొలుతురు నారనయు మాదన

అను చిత్రభారతపద్యములవలన, జిత్రభారతకృతిభర్తయగు నిమ్మలపల్లి పెద్దనామాత్యుఁడు శ్రీరంగరాయలకాలములో నున్నట్లును నాతనితండ్రియుఁ బెదతండ్రియుఁ గందాళప్పయ గురువునే కొల్చుచున్నట్లును విశదమగుచుండుటంజేసి కందాళప్పలాచార్యులు శ్రీరంగరాయలకాలములో నున్నట్లు దృఢముగాఁ జెప్పనోపును. కాన నాయప్పలాచార్యులే పాండురంగమాహాత్మ్యకృతి భర్తయగు విరూరివేదాద్రికిని గురువగుటంజేసి యీగ్రంథము శ్రీరంగరాయలకాలములో రచింపఁబడినదనుటకును వసుచరిత్రమునకుఁ దరువాత రచింపఁబడినదనుటకును సందేహము లేదు.

((ఈకృతికర్తయగు రామకృష్ణకవి మొదట శైవుఁడైయు విద్యానగరరాజానుగ్రహసంపాదనార్థము పిదప వైష్ణవమతమునుబరిగ్రహించెననియుఁ జెప్పుదురు. తదనుగుణముగాఁ గూర్మపురాణకర్తయగు రాజలింగకవి సుకవిస్తుతి సందర్భమున 'రామలింగని' యని యీ కవిని స్తుతించియున్నాఁడు. ఈతనింగూర్చి యసభ్యములగు కొన్ని పుక్కిటిపురాణములు ప్రసిద్ధములై యున్నవి మఱియు నీకవి కృష్ణరాయసభాలంకారులైన యష్ట దిగ్గజములలో నొకఁడని ప్రసిద్ధిగలదు. ఈయంశము లెంతవఱకు సత్యములో నిర్ణయించుటకుఁ దగిన యాధారములు గానరావు.

కాని యిష్టదేవతాస్తుతి సందర్భమునఁ బార్వతీపరమేశ్వరులను గూడ స్తుతించుటం బట్టియుఁ గాశీవర్ణనాసందర్భమున శివుని వర్ణించుటంబట్టియు 'దక్షజిద్వైభవా'యనికృతిభర్తను సంబోధించుటంబట్టియు, 'చేసాఁచఁగా వచ్చు శివుమీఁద నేనియుఁ, బూనికతోఁబల్కి బొంకఁడనుచు' (ఆ. 1-63) అని శివునిమీఁదఁ జేయివైచి ప్రమాణము చేయవచ్చునని చెప్పుటంబట్టియు "పూర్వవాసన తలఁకుచెట్లు" అని తాను వాక్రుచ్చినట్లే పూర్వపు శివభక్తి తన్ను విడువలేదని నిశ్చయింపనగును. కాని యీతని ప్రబంధము నామూలాగ్రముగాఁ బరిశీలింప నీతఁడు గృహస్థోచిత మార్గగామి

యగు విష్ణుభక్తాగ్రేసరుండనియే నొక్కి-వక్కాణింప నవకాశము గలదు.))

మనుజుఁడు సుమా రెనుబది తొంబది సంవత్సరములు జీవించుట కవకాశము గలదు గాని గృష్ణరాయలయంతిమదినములలో నీతఁ డిరువదియేండ్లవాఁడై రాయలయాస్థానమున నుండనోపును.

'శీలేన శోభతే విద్యా' అనున ట్లెట్టి విద్వాంసుఁడైనను శీలము మంచిది గాకున్న నాతనివిద్య వన్నె కెక్క-కుండుటయు, నాతఁడు ప్రసిద్ధుఁడు గాకుండుటయుఁ బ్రసిద్ధము. కావున నీకృతికర్తయగు తెనాలి రామకృష్ణకవి యెట్టి ప్రతిభావంతుఁడయ్యును, ఎట్టి విద్వాంసుఁడయ్యును, నంతర మెఱుంగక పెద్దలను, బండితులను, రాజకీయోద్యోగులను సదా పరిహాసమాడుచు నవమానించుచుండుటం జేసి కావలయు నీతనివిద్య యక్కాలమునఁ బ్రసిద్ధిలోనికి రాకుండఁ బండితులు, రాజమంత్రులు, మున్నగువారు చేసియుందురు. తన్మూలమున నక్కాలపురాజులకు సైతమీతనిపై నసూయ యుదయించియుండును. అక్కారణమున నీతనికి రాజులయొద్ద గౌరవము లేక పోయియుండును. మఱియు నీతఁడు తన ప్రతిభను బలుల బరాభవించుటయందే చాల కాలము వినియోగముచేసి యవసానకాలమున రాజానుగ్రహ సంపాదనార్థము వైష్ణవ మతప్రవిష్టుండయ్యును మొదటివాఁడు కనుసరించి రాజానుగ్రహముఁ బొందఁజాలక యొక బ్రాయన ప్రవర్తికిఁ గృతియిచ్చి తన్మూలమున రాజానుగ్రహముఁబొంది వేంకటపతి రాయల యాస్థానములోఁ బ్రవేశించి యుండు నేమోయని తోఁచుచున్నది. నిరాధారము లగు నీవిషయముల నూహలచేతనే యెల్ల పను సమర్థించియున్నారు. కవి స్వానుభవ సిద్ధవిషయములనే స్వగ్రంథమునఁ బ్రతిఫలింపఁజేయఁ గల్గునుగాని తదితరాపూర్వవిషయములఁ బ్రతిఫలింపఁ జేయఁజాలఁడు. ఆతఁడట్లు తలఁచుకొనకున్నను అయత్నసిద్ధముగా నాతనిలేఖిని యావిషయముల నాతనిగ్రంథమునఁ బ్రతిఫలింపఁజేయక మానదు.

చ. పరిఘనిజాశ్రయంబు పరి
పాటిఁదలిర్పఁ బదాఱువన్నెబం
గరువునసైన రాజగృహ
కల్పనకర్ణిక గాఁగ గంధసిం
ధురములు తేట్లుగై మెఱయ
దొరపుఁగొమ్మలు తేకులట్లుగా
ధరయను కొల్నిలో మొలచుఁ
దామరపూననఁ గోట మీటగుఁ.

ఆ. 1, 106

సీ. సమ్మర్దగళితభూపారత్నమంజరీ
యోజితరథ్యాప్రపూజనంబు
విస్తీర్ణవిపణీ విన్యస్తవస్తుప్రజ
ప్రకటితరత్నగర్భాజఠరము
కైలాసశైలసంకాశసౌధనివేశ
కౌముదీకవచిత గగనతలము
విపులపవమాన తాండవ వేషమాన,
లాంఛనధ్వజ పట్టపల్లవలలామ
పరాళిరచితకళాకృత్యహేళిహాయము
దీపితంబగు (శ్రీ)కాశికాపురంబు.

ఆ. 103

కం. పురికోట యొప్పు కనకమయంబై.

ఆ. 105

ఇచట వర్ణింపఁబడిన రీతిగా మహోన్నతదశలోఁ గృష్ణరాయల కాలమునందే విద్యానగర మున్నట్లనేకులు చరిత్ర గ్రంథకర్తలు వ్రాసియుండుటచేతను రామకృష్ణకవి విద్యానగర రాజాస్థానములఁ గృష్ణరాయల కాలమున నైతె నుండనోపును. మఱియు

సీ. వీడియం బెడలించి విధురత్నకినకాలు.
కాంచితాంబువు పుక్కిలించి యుమిసి
యుదరిబంగరువ్రాఁతపోఁబట్టువ లెవాటు
సడలించి వెసఁ గటిస్థలిసజుట్టి
యనుమాయిపృథుకహస్తాంతరన్యస్తోష
దోచితార్థముతాన యుద్వహించి
యంగుళీసంజ్ఞ సంయములఁ బ్రత్యేకంబు
మును మున్న లోనికిఁ జన నోసర్చి
గీ. ద్వారపార్శ్వస్థవేదికావలుల జరఠ
రక్షివర్గంబు టంక్రియారభటివఱలు
వలయమకుటాదికంబుగ నిలిచిమ్రొక్క
నగవుచూపులఁ జూచుచునగరుసొచ్చి."

అని కుమారుఁడు తండ్రిదరి కేగు సందర్భమునఁ గలవర్ణనయే యీ రామకృష్ణకవికిఁ గల విద్యానగర రాజాస్థానమర్యాదాభిజ్ఞతను వెల్లడిచేయఁ జాలియున్నది. మీఁది పద్యమున నిరూపింపఁబడిన కృత్యములు తండ్రియొద్దకుఁ బోవు కుమారుఁ డాచరించునవి కాకుండుటచేతను రాజసమీపమునకుఁ బోవు రాజకీయోద్యోగి యాచరింపవలసిన వగుటచేతను, నడుమునకు వస్త్రముచుట్టుట విద్యానగర రాజాస్థానమర్యాద యగుటచేతను స్వానుభవసిద్ధవిజయనగ రాస్థానమర్యాదలనే కవి యిట్లు నిరూపించె నని చెప్పుటకు సందియము లేదు.

మఱియుఁ గవి "లోపాముద్రాగస్త్యులు తుంగభద్రలో స్నానమాచరించి తత్తటమునఁ బంచవారంబు లుండి యవ్వారిపూరంబు విసర్గ మించి విరూపాక్షుని సేవించి స్వామిశైలమునకుఁ జని"రని లోపాముద్రాగస్త్యులయాత్రను వర్ణించియున్నాఁడు. (చూ. పం. 1. ఆ.)

విజయనగరము తుంగభద్రా తటినీ తటమున నున్నట్లును, విరూపాక్షదేవాలయ మచ్చోటనే యున్నట్లును జరిత్ర గ్రంథ ప్రసిద్ధమైన విషయమై యున్నది. కావున నట్లే వర్ణించిన రామకృష్ణకవి విద్యానగరము నెఱుంగునని చెప్ప నవసరము లేదుగదా!

ఇంతియ కాక యీ సందర్భమును బట్టి విద్యానగరము రామాయణీయ కిష్కింధకనతిదూరములో నున్నదని విశద మగుచున్నది. పంపాతరంగ శీకరవాహియగు శీతలవాతపోతములచే సంసేవ్యమానుండై యగస్త్యుఁ డెండవేఁడిమిని సహింపఁజాలక శిథిలపవనుఁడై, యలసమృదులావయవయై యొగుచెంచు నిజదారకు "వనితా! యిది మాల్యవంతము. ఇయ్యది మతంగాశ్రమము. ఈ శైలమున వాలి సంహారవిహారకారణుం డగు శ్రీరాముఁడు విహరించెను." అని తత్తత్ప్రదేశముల నెఱుఁగఁ బఱచుచు నిగిడి చని తుంగభద్రను జేరి స్నానమాడి విరూపాక్షు నర్చించెనని క్రమముగాఁ బంపాసరోవరమును, మాల్యవంతమును, మతంగాశ్రమమును ఋశ్యమూకమును వర్ణించుటం

బట్టియు, నీ పర్వతమందే శ్రీరాముఁడు వాలిని జంపి విహరించె'నని విశేషించి వర్ణించుటం బట్టియుఁ బిదప మఱియొకప్రదేశమును వర్ణింపక నిగిడి చని తుంగభద్రనే కాంచిరని వర్ణించుటం బట్టియు నట్లే యనుపదమందే యవ్వారిపూరంబు వినిర్గమించి విరూపాక్షు నర్చించిరని వర్ణించుటం బట్టియు విద్యానగరమును,విరూపాక్ష దేవాలయమును దుంగభద్రా తటినీతటంబున నొక్కచో నుండుట సుప్రసిద్ధ మగుటంబట్టియు, విద్యానగరము రామాయణీయకిష్కింధాప్రాంతమున నిర్మింపఁబడెననికాని, విద్యానగరమునకనతిదూరములో రామాయణీయ కిష్కింధ యున్నదని గాని చెప్పుట కవకాశము గలదు. "దండకాటవి మొదలు పంప తుదిగాఁ గల తీర్థపటలమెల్ల" అని కవి దండకాటవికూడఁ గొలఁదిదూరములోఁ గలదని వాక్రుచ్చియున్నాఁడు.

క్రీ. శే. కే. వి. లక్ష్మణరావు గారును, "రామాయణీయకాలములోఁ గిష్కింధయనఁ బడు పర్వతప్రదేశమందుఁ దుంగభద్రా దక్షిణ తీరమందు విద్యానగరము కట్టఁబడినది. ఆ ప్రదేశమునందుఁ దుంగభద్ర రామాయణము లో వర్ణింపఁబడిన 'అంజనపర్వతము, మాల్యవంతము, మతంగపర్వతము, ఋశ్యమూకము,' అను పర్వతముల నంటుకొని ప్రవహించుచుండెను" అని హిందూదేశకథాసంగ్రహము, మహమ్మదీయమహాయుగము, 299 పుటలో వ్రాసియున్నారు. కాని యట్లనుటకుఁ బ్రమాణములమాత్రము వారు చూపలేదు.

కావుననే మద్గురువర్యులగు బ్రహ్మశ్రీ వఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు తమ వసుచరిత్రవిమర్శనమున 111పుటలో "విజయనగరము రామాయణీయకాలపుఁ గిష్కింధ యను స్థలముననే కట్టఁబడినదను నిరాధార విషయమును నిస్సందేహముగాఁ జెప్పుట సాహసము" అని కే. వి. లక్ష్మణరావుగారి వాక్యముల నిరాకరించిరి.

లక్ష్మణరావుగారు, 'ప్రదేశ'పదప్రయోగముచేఁ దత్ప్రాంతమనియే భావించియుందురు గాని యాకిష్కింధాస్థలముననే యని భావించియుండరని నాకుఁ దోఁచుచున్నది. కాన నీ పాండురంగమాహాత్మ్యవిషయమునుబట్టి వారి వాక్యములు సార్థకములే, సాధారములే, నిస్సందేహములే యని చెప్పుట కవకాశము గలదని తోఁచుచున్నది.

ఉపరినిరూపితాంశములనుబట్టి రామకృష్ణకవి విజయనగరము మహోన్నతదశలో నున్న కాలమునుండి యుండెననియు, విజయనగర రాజాస్థానమర్యాదాభిజ్ఞుఁ డనియుఁ జెప్పనొప్పును.

ఇంతియ కాక లోపాముద్రాగస్త్యులు విరూపాక్షదేవుని సేవించిరని వర్ణించియు నచ్చోనుండు సుప్రసిద్ధపట్టణరాజమగు విద్యానగరమును వర్ణింపకుండుటంబట్టిచూడ నీ ప్రబంధము క్రీ. శ. 1565 తాళికోట యుద్ధానంతరము రచింపఁబడియుండునని తోఁచుచున్నది. లేనిచో నచ్చోనుండు ననేకస్థలముల వర్ణించిన యామహాకవి సుప్రసిద్ధమహాపట్టణముండెనని యొక్కవాక్యముతోనైనఁ జెప్పి

యుంచఁడా? కాన నీ గ్రంథనిర్మాణకాలము నకు విజయనగరము తురుష్కులచే విధ్వస్త మయ్యెనని యూహింపవలసియున్నది. మీఁద నిరూపింపఁబడిన రామకృష్ణ కవికాలమున కియ్యది బాధకము గాకుండుటచే నట్లూహించుట యుచితమేయని తోఁచుచున్నది.

ఈగ్రంథమునకు 'పౌండరీకమాహాత్మ్యము, పాండురంగమాహాత్మ్యము, పాండురంగ విజయము.' అను మూఁడునామములు గలవు. ఇందు మొదటి రెండునామములును గవికల్పితములే? తుదినామముమాత్రము కవి యెచ్చటను వాడియుండలేదు. ఇందు మొదటినామము స్థలనామము ననుసరించి పెట్టఁబడినది. రెండవది యం దావిర్భవించిన దేవుని నామమునుబట్టి యుంచఁబడినది. మూఁడవదికూడ దేవనామమును బట్టి కల్పింపఁబడినదే. కాని యానామము లీగ్రంథవిషయమును వెల్లడించున ట్లియ్యది వెల్లడిచేయఁజాలకుండుటచేతను, దద్ద్వయము చు గవ్యుక్తి వగుటచేతను నియ్యది కృత్రిమమని చెప్పవలసివచ్చినది. పుండరీకుఁడను భూసురపుంగవుని తపస్సునకు మెచ్చి శ్రీమన్నారాయణుండు ప్రత్యక్షమై భక్తవాంఛితము నీడేర్ప నెచ్చోఁ బుండరీకుఁడు తపమాచరించె నచ్చోఁ బాండురంగఁ డను పేరుతో నవతరించెనఁట. పుండరీకుఁడు తపమాచరించుట నప్పదేశము పౌండరీక మనఁబడుచున్నది. అట్టి పౌండరీకస్థల మాహాత్మ్య మీగ్రంథమున వర్ణింపఁబడెను గాన నీ పుస్తకమునకు పౌండరీకమాహాత్మ్య మను పేరు మిగుల యుక్తముగా నున్నదనఁదగును. అట్టి పౌండరీకమున నవతరించిన దేవుఁడు పాండురంగఁడు. ఆపాండురంగదేవుని మాహాత్మ్య మీగ్రంథమున వర్ణింపఁబడెను గాన నీ గ్రంథమునకుఁ బాండురంగమాహాత్మ్య మను నామమును సముచితముగానే యున్నదనఁదగును.

సశేషము.



# దేవకీ పరిదేవనము

భోగరాజు నారాయణమూర్తి గారు

గుటగుటఁ జనుబాలుగ్రోలి పూతనఁబట్టి, చంపువింతను చూడఁజాలనైతి
విశ్వమంతయు నోటవెలయింప నాపాడు, కనులతో వీక్షించి తనియనైతి
ఎన్నిత్రాళ్లను గట్టనెంచినన్ జాలని, నీబొజ్జ ముద్దాడ నేరనైతి
కాళీయపన్నగాగ్రమున నీనాట్యంబు, చూచునంతటి నోమునోచనైతి
ప్రసవవేదన నాపాలఁ బడినవంతు, నీదుముచ్చటల్ గనుట యశోదవంతు;
బిడ్డఁడుండియు దేవకి గొడ్డురాలు, సుతునిఁ గనకుండినను బుత్రవతి యశోద.



# విశాఖపట్టణపు తెలుగు

— విద్వాన్ గరిమెళ్ల సోమన్నగారు, యం. ఏ, యల్. టి.

విశాఖట్టణ ప్రాంతములలోని తెలుగునందు పెక్కువిచిత్రపదములు = ఇతరాంధ్రమండలములలో తెలియరానివి- వాడుకలో నున్నవి. ఈజిల్లా ఓఢ్రదేశమునకు చేరువ నుండుటచే ఓఢ్రమునుండి కొన్నిమాటలు తెలుగులో చేరియున్నవి. కోదులుఁ గదపలు, సవరలు మున్నగువారిమాటలు కొన్ని తెలుగున జేరినవి. మహమ్మదీయులు చాలకాలము ఈజిల్లాను పాలించియుండుటచే హిందూస్థాని పదములు ఈప్రాంతపు తెలుగున ఎక్కువగ జేరియున్నవి. మిగత తెలుగుజిల్లాలలో హిందూస్థాని పదములు స్వల్పముగ నుండును. గ్రంథస్థముగాని ఇట్టిపదముల స్వరూపము నెఱుంగుట అవసరము. ఈపదములవ్యుత్పత్తి నిర్ణయింపవలసియున్నది. దిగువ వాక్యములలో ఈ అసాధారణపదములు చేర్పబడినవి.

“నీకు బెత్తాయించినపని సొర్లాచేసేవు గదా. నాకు ఎంతకిచ్చాటుగ ఉన్నదో నీకు తెలియదు. నీకుచోద్యంవల్ల నేను చాలా అఘోరించవలసి వచ్చింది. మీఅన్నకులికిద్రంచేత నావాటాపోయింది. భూములశిస్తులు చెడావులుకాలేదు. ఉభాలలో నీరు లేకపోయింది. తర్వాత పరుజాలు ఈయకుండ వానలు బజాయించినవి. ఒకవూరు బోగట్టా మరొకవూరికి అందలేదు. వానవెలియగానె ఫర్వాలేదనుకున్నాము. అప్పుడు నావంట్లో కులాసాగా లేకుండెను. ఉష్ణం వస్తూఉండెను. ఆరోజులలోనేమా మేనల్లుడిపెళ్లి రహితమయింది. వాడితండ్రికిమాత్రం మామూలుగ కోపంగానే ఉండెను. హోత్తేరి, ఇప్పుడు పెళ్లిఏమిటి అని పెళ్లికిరాకుండ చపాయించినాడు. నాకు ఆకించ పోలేదు. దాన్ని మభ్యపఱచలేను. మొన్నజరిగిన చోరీకి ఆచోకిదొరకలేదు. చెప్పిన చహరా గలవాళ్లు కనబడలేదు. పోలీసువాళ్లు బందోబస్తుచేసి గస్తు తిరుగుచున్నారు. గోల్మాలు జరుగకుండ చూడవలెను. బద్ధకపడరాదు. మనము సబోరీగాఉంటే ఫసందు కాని కావేషీలు పెంచుకుంటే ఫాయిదాలేదు.

మనం పరాయివాళ్లము కాము. తంటాలు పేచీలు మనకు లాయికుకావు. మనలను గురించి లోకంలో షోరు ఎక్కువగా ఉన్నది. రివాజులేని పని చేయుటకు కుమ్మక్కు ఎవరు చేస్తారు?

తలివన్నా కబుర్లు అటుంచు. దర్జా చెడ కూడదు. టప్పాలు చెప్పరాదు. డచ్చీలుకొట్ట రాదు. డాబుచేయరాదు. షోకు చేయరాదు. వ్యవహారం సాభీగ ఉండవలెను. లోసుగుఉండకూడదు. సజావుగపోవలెను. మా నౌకరు ఫికరులేకుండ పోయినాఁడు. వాడు షరారిఅయినట్టు మొన్ననే వాకబయినది. ఇవాళ ఎంత ఘుమాయిస్తోందో చూడు. ఒక్కరినటవేస్తే బాగుండును. మా నౌకరు పత్తాలేకుండ చెలాయించినాడు కాని వాఁడుఉంటే చాలామద్దత్తుగఉండును. కాచంపోనియడు. బహుఉషారుగ ఉంటాఁడు.

బడాయికోరుగాడు. లాలోచిపడడు. పురమాయించినపని అంతలో సర్వరాచేస్తాడు. పండుగబరాతంమాత్రంతీసుకుంటాఁడు. డావులు అంటె వాడికిప్రియం. వాడికి దేనిపైని మోజు ఉంటే దాన్ని కొనితీరుతాడు. పస్తాయించడు. వీడిమాటంటే తక్కిన నౌకర్లకు ఖరోడా ఉంటుంది. వీళ్లని ఇచ్చటచ్చట మావలత్తులు చేయనీయడు. వీడు చూడడానికి వట్టిబైతులాగుంటాఁడు. వాడికి కోపం వస్తే వాడితడాకా చూపిస్తాడు. వీడుమినహా తక్కినవాళ్లు దగాఖోరులు. వస్తువులు పలామలుచేస్తారు. వీరిలో అప్పన్న మరీ కొంకారి. వీడికి ఎంతవయసువచ్చినా శకాళితనం పోలేదు. అందఱిని కొంకులుపెడతాడు. డబ్బులంటె గోటాపన ఎక్కువ. వీడి ఆస్కారము మాకులేదు. వీడిచేతికి డబ్బు ఇస్తే తిరకాసులేకుండా అప్పచెప్పడు. ఎన్నో దభాలు తేడావచ్చింది. మన తెలుగును నెల్లూరి తెలుగును తైపారువేసిచూస్తే ఫరకులు ఎక్కువగ తేలును."

విశాఖపట్టణపు తెలుఁగులో పైని చూపినరీతిని పెక్కుఅసాధరణశబ్దములు కానవచ్చును. వీని వ్యుత్పత్తులను విజ్ఞులు కనుగొందురుగాక!



# ఆరాధనము

దుర్గుమహంతి సీతారామశర్మ గారు

కలఁగన్న యప్పుడైన మేలుఁకువయందైనఁ, బొడఁగాంచుచుందు నీముద్దుమోము
మౌనంబునందైన మాటలయందైనఁ, దలపోయుచుందు నీచెలిమితీరుఁ
గష్టంబునందైనఁ గల్యాణమందైనఁ, గాంక్షించుచుందు నీకరుణఁ బడయ
విలయాగ్నియందైన మలయాద్రియందైన, విహరింతు నీచాయ వెంబడించి

తే. గీ. నాదుప్రేమరాశి! నాపాలిదైవమా! నాదువ్రతఫలంబ! నాధనంబ!
నిన్ను విడువ వీవు నన్నెడబాయవు, కాలమెల్ల నిటులఁ గడచుఁగాత.

# పరశురామ కవిగారి పద్యోపన్యాసము

౨

ఓలేటి వేంకటరామశాస్త్రి గారు

శ్రీ నడుచు-ఇంచుమించుగా నెలదినముల క్రిందట-నేను-నాయంతట నేనే-వినోదార్థముగాఁ ద్రిలింగదేశాభివర్ధనీసభ కరిగి-అక్కడ-పరశురామ కవిగారు చెప్పుచున్న పద్యోపన్యాసమును, సభ్యులు సలిపిన సంభాషణావిశేషములను సంక్షిప్తలేఖనమునఁ జక్కగాఁ జరజర వ్రాసికొంటిని. క్రొత్తగా నే నాంధ్ర సంక్షిప్తలేఖన (Telugu Short-hand Writing) పరీక్షోత్తీర్ణుఁడనై యుండుటచే, నాత్మశక్తి విశ్వాసపరీక్షణాభిలాషమున నూరకయే యప్పు డాపద్యోపన్యాసమునట్లు వ్రాసితినిగాని, యా వ్రాఁతవిషయమై యన్య ప్రేరణాదికమావంతయు లేదనుట యసత్యవిషయము గాదు. అదృష్టముపట్టుకాలము వచ్చినప్పుడు-అట్టిబుద్ధులు-అప్రయత్నపూర్వకముగనే పుట్టుచుండునుగాఁబోలును! ఆయనంతరమున నట్లు నే నాయుపన్యాసము వ్రాసిన సంగతి-ఆనోటను నానోటను, గ్రమక్రమముగా నా గ్రామమంతటను వ్యాపించుటయు, నాంధ్రదేశాభివృద్ధికై యహర్నిశము నత్యధికశ్రద్ధతోఁ బాటుపడుచున్న యా త్రిలింగదేశాభివర్ధనీసభానాయకు లా సమాచారము నాలకించి యత్యంతాదరాతిశయముతో నన్నుఁ బిలిపించి, యామూలాగ్రముగా-తూ,చా, దప్పకుండ నేను వ్రాసిన యాపద్యోపన్యాసమును జిత్తగించి, నా సంక్షిప్తలేఖన సామర్థ్యమున కానందించి, క్రొత్తగాఁ బ్రతిష్ఠింపఁబడిన యాసభపక్షమున నాసభాకార్యాలయమున నెలకు నిరువదియైదురూప్యములవేతన మేర్పఱిచి యాంధ్ర సంక్షిప్తలేఖకోద్యోగము ననుగ్రహించిరి. నేను-బ్రాహ్మణుఁడ నగుటచే నీదినములలో నుద్యోగము దొరకక జీవయాత్రకై యల్లాడుచున్న నేను-"బ్రతుకుముజీవుడా" యని మొన్న పంచమీసోమవారము నాఁడు పరమమిత్రతారయగుటచే బాగుగా నున్నదని భావించుకొని భగవదనుగ్రహమునఁ బ్రస్తుతోద్యోగమునందుఁ బ్రవేశించితిని.

పాఠకమహాశయులారా! ప్రఖ్యాత పురుషకోటిలోనివాఁడను గాకుండుటచే-మీకు-అజ్ఞాతపూర్వుఁడనగు నేను-నన్ను-మీకుఁబరిచితునిఁ జేయవలసిన భారము నామీఁదఁగలదేమోయని తలంచుకొని పైఁజెప్పిన నా చరిత్రకు సంబంధించిన యీనాల్గుమాటలును-అప్రస్తుతప్రాయములే-అయినను జెప్పినందులకు నన్ను మన్నించి క్షమింపఁగోరుచున్నాను.

నిన్న సాయంకాలము 3 గంటల 30 నిమిషములకుఁ ద్రిలింగదేశాభివర్ధనీసభా ప్రథమవార్షిక సమావేశ మహోత్సవము తత్సభాకార్యాలయమున మహావైభవముతో జయప్రదముగానే జరిగినది. ఆయుత్సవసందర్భముననే సభాస్థాపకుల యభ్యర్థనమునఁ బరశురామకవిగారు మఱియొక పద్యోపన్యాసము నిచ్చుటకు విచ్చేసిరి. వెనుకటి యుపన్యాసమును విని విసుగుకొన్న వారుగూడఁ బద్యోపన్యాసశ్రవణాసక్తిచేఁ గాకున్నను—బహువిధాలంకృత నూతనసభాభవనావలోకన కుతూహలముననేమి, ఫలాహారస్వీకారాభిలాషాతిశయముననేమి, పలువురు స్త్రీపురుషులు రాక మానలేదు. కావున సభారంగమంతయు యథాపూర్వముగ సభ్యమహాశయాలంకృతమై కిటకిటలాడుచుండెను. ఈసారి యీసభకు వీరభట్ల విశ్వపతిశాస్త్రులవారు అధ్యక్షులుగా వరింపఁబడి యగ్రాసన స్వీకార మొనర్చిరి. పరశురామకవిగారును—ఉపన్యాసపీఠము నలంకరించి యొకసారి యగ్రాసనాధిపతివంకఁ జూచి నమస్కరించి సభవైపు తిరిగి సభక్తికముగాఁ జేతులుమోడ్చి కన్నులుమూసికొని పరమశాంతస్వరముతోఁ బ్రతివిశేషణాంతమున నొక్కించుక నిలుపుచుఁ బ్రకాశముగాఁ బద్యోపన్యాసము నిట్లు ప్రారంభించిరి.

పరశురామకవి:—

శా. శ్రీమద్విశ్వపతీ!

ఒకయువకుఁడు— (మెల్లఁగా) ప్రెసిడెంటు (Presi-

dent) శాస్త్రులుగారిని ప్రైజు (praise) చేయుటకుఁ బ్రారంభోత్సవమైనదా? శుభమస్తు, అవిఘ్నమస్తు, నూతో(?)ాన, కానీ! మఱీ, కానీ!

పరశురామకవి—

సమస్తజగతీ క్షేమక్రియోద్యన్మతీ!

పై యువకుఁడు—(మెల్లఁగా) ఈ విశ్వపతిశాస్త్రులు గారు దేశభక్తులలోఁ జేరినవాఁడా యేమి? (అగ్రాసనాధిపతివైపు చూచి) అట్లయినయెడల—ఆ నెత్తిమీఁద ఆవుల్లఁ బెడ్డ నెందులకుఁ బెట్టినాఁడో?

—పరశురామకవి

స్వామీ! సర్వదయాపరా! సకలర
క్షాదక్షవీక్షా! మహో
ద్దామా! భార్గవరామ! సద్గుణగణా
ధారా! మహోదార! ని
త్యామేయాత్మక! నిర్మలా! నిభృత! ని
త్యానందమహోజ్జ్వలా!

(అని నమస్కరించుచుఁ గనులు మూసికొని యుండెను)

మఱియొక యువకుఁడు—(పై యువకునితో సహేళనముగా) అయినదా? పరాభవనామసంవత్సరమైనదా? ప్రెసిడెంటును—ప్రైజు చేయుటగాదది! భగవంతుని ప్రయర్ (prayer) చేయుటగాని—తెలిసినదా?

మొదటియువకుఁడు— (వెలవెల వోవుచు) ఔనురా! పప్పులో నడుగువేసినాను.

పరశురామకవి—(అట్లే నమస్కరించుచుఁ దలఁగొంచెము వెనుకకును ముందునకు నూఁచుచు)

శా. దేవా! దేవమునీంద్ర సంతతసము
ద్గీతాధికాశ్చర్యకృ
ద్భావా! భావభవాతిరేకి నిజరూ
పద్రష్టృభక్తవ్రజా
జీవా! జీవదయాపరా! శుభకరా!
చిత్రప్రభావాకరా!

నీవాఁడన్ దయఁజూచి కావఁగదె తం
డ్రీ! భార్గవా! భార్గవా!!

(అని కొంచెము మూరకుండెను)

ఒకసభ్యుఁడు— భేష్! పద్యములు మహాభక్తిపూరితములుగా నున్నవి. మా చక్కఁగాఁ జదివినాఁడు బ్రాహ్మణుఁడు!

మఱియొకఁడు—(తనప్రక్కవానితో) ఈయన—"భార్గవా, భార్గవా"—యని పరశురామప్రార్థన మారంభించినాఁడేమిది? బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, గారు—సరస్వతీ లక్ష్మీ పార్వతులు, గారు—సీతారాములు, గారు—రుక్మిణీవాసుదేవులు, గారు— గజాననుఁడు, గాఁడు—కార్తికేయుఁడు, గాఁడు—విభావసుఁడు, గాఁడు—విష్వక్సేనుఁడు, గాఁడు— కవిసమయవిరుద్ధముగా—ఎక్కడనో పరశురామునిఁదీసికొనివచ్చిపెట్టినాఁడేమిది? తన పేరు పరశురామకవి యనియా యేమి?

ప్రక్కవాఁడు—ఒకవేళ—ఈయన — ఓఢ్రుఁడేమో? పేరునుబట్టిచూచినను బ్రార్థనను బట్టి చూచినను నా కాలాగునఁ దోఁచుచున్నది. ఓఢ్రులకుఁ బరశురాముఁ డిష్టదైవమని విన్నాఁడను. కాని—ఓఢ్రుఁడే యైనయెడల — ఆంధ్రకవిత్వ మింత నిశితముగా — ఎట్లు చెప్పఁగలఁడని సందే—

పైసభ్యుఁడు—(అగ్నోక్తియందే) సరి! మీ కాసందేహమక్కఱలేదు; అన్యవారిలో—ఆంధ్రభాషా పండితశిరోమణులు లేరా? కర్ణాటులలో— కావ్యకర్తలైన కవిరాజశిఖామణులు లేరా? మహమ్మదీయులలో మంచి యాంధ్రకవీశ్వరులు లేరా? ఇంతె యెందులకు? ప్రస్తుతాంగ్లేయులలో నిస్తులాంధ్రభాషాభినివేశము గలవారు లేరా? దానికేమిలెండు:—

పరశురామకవి—(భక్త్యతిశయముతోఁ గొంచెము బిగ్గరగా)

ఉ. తారకమూర్తి! భక్తజన
తాపరిపోషణలబ్ధకీర్తి! ని

ష్కారణభూతదర్ప మదగర్విత
శాత్రవభూమిపాల సం
సారసమూలసంహరణ
సాధనవిత్తమవర్తి! యోగని
ద్రారసవర్తి! మాపరశు
రామ! కృపాపరిపూర్తి! మ్రొక్కెదన్.

(అశ్లోకములువ్రాసికొని నమస్కరించుచుండెను.)

ఒకసభ్యుఁడు—(మొగము చిట్లించి, ఏమి దీర్ఘసమాసములు? ఏమి యంత్యప్రాసములు? ప్రాసముల వలెఁ జెవులు మూసికొనిపోవుచున్నవి.

మఱియొకఁడు— అబ్బా! నీగొంతుఁగొయ్య! ఎంతపెద్ద కంఠమయ్యా! ఏమి? అంత చించుకొనవలసిన యవసరమేమివచ్చిన దిప్పుడు!

వేఱొకఁడు—హియర్! హియర్! (Hear, hear) పోతన్న! అభినవపోతన్న!!

పరశురామకవి—(భక్త్యుద్రేకముతో మఱియుఁ గొంచెము బిగ్గరగా)

ఉ. మ్రొక్కెద; నీపదాబ్జముల
ముంగల నెల్లపు; డిట్లుచాఁగిలన్
మ్రొక్కెద;—

(అని సాష్టాంగముగా బల్లపై బోరగిల్లఁబడి చేతులు మోడ్చి)

నార్తరక్షక! న
మోనమయంచు నిరంతరంబునే
మ్రొక్కెద; నిత్యసౌఖ్యపద
ముం గరుణింపుమటంచు నిన్ను నే
మ్రొక్కెదఁ; గావవే! సతత
ముం గృపఁజూడవె! నన్ను భార్గవా!

(సభలో "అద్దీ! అద్దీ!" యని కొందఱు చప్పట్లు గొట్టిరి, కొందఱు ఈలలు వైచిరి.

ఒకసభ్యుఁడు—(మహోత్సాహముతో) ఆహా! ఏమి కవితాప్రవాహము! ఏమి రసోద్రేకము! ఏమి యావేశము! ఏమి తన్మయత్వము! ఏమి భక్తి! ఏమిరక్తి! నేఁడు—జన్మము సార్థకమైపోవుచున్నదే!

పరశురామకవి—(అదరిపాటుగా లేచి యాశ్చర్యసూచకమైనదృష్టితో నటునిటుచూచి కుడిచేతితో నిర్దేశించి చూపుచు)

మ. అదె! ఋష్యాశ్రమ; మల్లవే! ఋషుల పు
ణ్యావాసభాగమ్ము; ల
య్యదె! భృగ్వాశ్రమ; మాతఁడే; భృగుఁడు;వ
హ్వా! యామెయే! రేణుకా
సుదతీరత్నము! చెంతనున్న యతనిం
జూడుండు తత్పుత్త్రకుం
డదిగో! దివ్యమనోహరాకృతికిఁ దా
వై యాడుచున్నాఁడదే!

ఒకయువకుఁడు—ఆడుట లేదు, పాడుట లేదు; మతిపోయి నీవుమాత్రము తెయితక్కలాడుచున్నావు.

మఱియొకఁడు— అదేమి? ఆయన—ఆలాగున—పట్టిచూపు చూచుచున్నాఁడేమి?

పరశురామకవి—(మహానందముతో నెదుటనున్న పిల్లవాని నెత్తుకొనఁబోవునప్పుడు వంగునట్లు కొంచెము ముందునకు వంగి చేతులు సాచి)

ఆ. రార! ముద్దులయ్య! రారా! మనోహరా
కార! రార! నన్నుఁ గన్నతండ్రి!
రార! భక్తలోకరాజీవహిమధామ!
రార! పరశురామ! రంగధామ!

ఒకసభ్యుఁడు— (స్నేహితునితో వ్హాటీజ్ దిస్! హి సీమ్సులైక్ ఎ మ్యాడ్ ఫెల్లో. (What is thı ? He seems like a mad fellow)

స్నేహితుఁడు—(పైవానితో) నో, నో, హి ఈజ్ ఎ రోగ్, ఆర్ ఎ క్రాక్.(No,no;He is oa rogue, a crack ).

ఒక విశ్వాస్తి—పాపము! భక్తునికి—భగవంతుఁడు—పసిపిల్ల వానివలెఁ బ్రత్యక్షమైనాఁడుగాఁబోలు నమ్మా!

పరశురామకవి—(ఆనందాతిశయమునఁ జేతితోఁ దాళము వేయుచు వెనుకకును ముందునకును జిందులు ద్రొక్కుచు)

జయ! పరశురామా! జయ! భవ్యధామా!
జయ! భక్తకామా! జయ! సార్వభౌమా!
జయ! విశ్వశిల్పా! జయ! శేషతల్పా!
జయ! మంజుజల్పా! జయ నిర్వికల్పా!
జయ! సర్వశక్తీ! జయ! దీనరక్తీ
జయ! సదాశక్తీ! జయ! దివ్యభుక్తీ!
జయ! భానుతేజా! జయ! జగద్బీజా!
జయ! కల్పభూజా! జయ! రాజరాజా!

(చిఱునవ్వుతోఁ దలయూఁపుచు)

ఆ. లేఁడిపిల్లనోట లేఁతదర్భలు వెట్టి
యాడుకొనుచు నుంటివా? కుమార!

(అర్థానుగుణమైన యభినయముతో)

రాకయుంటి వేమి? రాజీవదళనేత్ర!
నాదుపిలుపు చెవుల నాటలేదె ?

ఆ.వె. ఆటదృష్టి మఱచి యట్లుంటివా? క్రొత్త
వాఁడ ననుచు నాదువంకరాక
యూరకున్నవాఁడవా? రమ్ము! నేను నీ
వాఁడనే చుమయ్య ! వనజనాభ !

ఒకసభ్యుఁడు—(ప్రక్కవానితో) ఈయన కేదియో భక్త్యావేశము గలిగినట్లున్నది.

ప్రక్కవాఁడు—(పైసభ్యునితో) లేనియెడల—పాపము! వట్టియమాయికుఁడు—పరమశాంతుఁడు—మేఁకవంటి వాఁడు—భాగవతపుటంగుసేయువానివలెఁ బరవళ్లు ద్రొక్కునా యిట్లు?

పరశురామకవి—(వేడుకతో)

సీ. ఈచిన్ని బొజ్జలో నెటుపట్టెఁ బదునాల్గు
భువనమ్ములును ? మహాద్భుతచరిత్ర !
యీముద్దుకనులలో నెటులున్నవారు మి
త్రక్షపాకరులు ? చిత్రప్రభావ !
యీచిట్టిబొడ్డులో నెటుపుట్టె నిఖిలవి
శ్వవిధాత ? నిరుపమాశ్చర్యనిలయ !
యీబుచ్చినెమ్మేన నెటు లాక్రమించి తీ
యఖిలప్రపంచమ్ము ? నప్రమేయ !

గీ. యిట్టి యీపొట్టివడుగ వీ వెట్లుసకల
భువనరక్షణ మొనరింపఁ బ్రోడ వైతి ?
నీమహత్త్వంబు లన్నియు నీక తెలియ
వెలయుఁ గా కన్య లెఱుఁగంగ వలఁతు
[లొక్కొ.

ఒకవిశ్వాస్త—ఆహా! మహాత్మా! నీకన్నులకగపడుచున్న యాపొట్టిపిల్లవాఁడు—మా కన్నుల కేల కనఁబడకున్నాఁడు నాయనా! మాకన్నులంత పాపపుఁగన్నులా?

ఒకసభ్యుఁడు—(స్నేహితునితో) ఏదో కన్ఫ్యూజన్ ఆఫ్ మైండు (Confusion of mind) వచ్చినఁగాని ఆలాగున నుండఁడు.

స్నేహితుఁడు—(పైవానితో) అదికాదు! ఇమోషన్ ఆఫ్ డివోషను(Em^tion of devotion) ఎక్ట్స్రీమ్ (extrem^) అయినప్పుడు—భక్తుఁ డున్నాఁడే—నిజమైనభక్తుఁడు—వాఁడు—అచ్చముగా—పిచ్చివాని వలెఁ గనఁబడును. వాఁడలేదా? ప్రహ్లాద అండ్ అదర్స్ (Prahlada and o hers)

పరశురామకవి—(సాభినయముగ)

క. ఏమిా ? నీయాటలు ! వ
హ్వా! మాయమ్మనోము లవియెట్టివియో !
యామాముద్దుటాటలంగని [నహహో.
యామెయి సంతోషమగ్న యగుచుండె

ఒకసభ్యుఁడు——(సమీపస్థునితో) ఈకలియుగములో— ఈకవిగారి కన్నులకు భగవంతుఁడు కనఁబడవచ్చి నాఁడా (పెదవివిఱచి) ఇదంతయు వట్టినటన.

సమీపస్థుఁడు——(పైసభ్యునితో) అయ్యా! అవధానులు గారూ! అట్లనరాదు. ఏపుట్టలో — ఏపామున్నదో యెవ్వరికిఁ దె?యును? ఆయన పరమశాంతుఁడు; చూచుచుంటిమిగాదా—వారి వీరివలె—అల్లరి చిల్లర వాఁడుగాఁడు——మనస్సు పరిపక్వమైనవాఁడుగాని,

పైసభ్యుఁడు——చాలులెండయ్యా? మీవెఱ్ఱి. ఇవి యన్నియు వట్టితెమాషాలు. మీరెఱుఁగరు! పాపము! మీ కేమి తెలియును?

సమీపస్థుడు——అయ్యా! అవధానులుగారూ! మీకుఁ గోపమువచ్చినఁ జెప్పఁజాలను గాని—వేదజడు లగు మీకుమాత్ర మేమి తె?యును? (తీవ్రముగా) అట్టి వంటి మహానుభావుఁ డూరకే తమాషా లెందులకుఁ జేయును? కొంటెవాఁడా? తుంటరివాఁడా?

పైసభ్యుఁడు——(కోపముతో) ఆ. అందఱును మహానుభావులే. తమాషా లెందులకా? చెప్పుదునా? కోటి విద్యలును—కూటికొఱకు; తెలిసినదా?

పరశురామకవి——(సానునయముగా)

గీ. నాయనా! చేయి తెగునేమొ! నాదుమాట
వినుము! గొడ్డలిజోలికి వెళ్లబోకు [లుపు
మదిగొ! మీతండ్రి యగ్నికార్యంబు స
చున్నవాఁ డచ్చటికిఁబొమ్ము కన్నతండ్రి!

ఒకసభ్యుఁడు——పాపము కాలరిక్ టెంపర్డ్ మ్యాన్; కొంచెము శాంతించినయెడల బాగుగ నుండును.

పరశురామకవి——(సాభినయముగ)

గీ. వేదమా? శాస్త్రమా యది? నీదుతండ్రి
చెప్ప నేర్చుచున్నాఁడవా ప్పాగులుక
(చిఱునవ్వుతో)
వేదపాఠంబుఁ జేసెడు వేళఁగూడఁ
బరశువేటికిఁ జేతిలో భవ్యచరిత!

ఒకపెద్దమనుష్యుఁడు——(లేచి కార్యదర్శితో) అయ్యా! కార్యదర్శిగారూ! ప్లీజ్ (p ease) మీరు గాని యగ్రాసనాధిపతిగారు గాని— ఆయనతో— "ఇఁక నుపన్యాసవిషయము నందుకొమ్మఁ" డని చెప్పుటమంచిది. లేకున్నచో నాయావేశ మత్యధికమై బాధింపవచ్చును.కనుక—ఆదృష్టిమరల్చుట యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. యస్! స్ట్రైక్ లీ!! అనికూర్చుండెను.

కార్యదర్శి——(లేచి) అయ్యా! కవిగారూ! తమ యుపన్యాసవిషయమును విననలయునని సభ్యులు చాలఁ గుతూహలపడుచున్నారు. కావునదయచేసి ప్రస్తుత-

పరశురామకవి——(అర్ధోక్తియందే చేయెత్తి ససంభ్రమముగా)

గీ. వలదు! తల్లిని జంపఁగావలదు! పరశు
వెత్తకుము! తల్లి!—నినుఁబెంచియెత్తుకొన్న
తల్లి!!-యుత్తమకాంతామతల్లి!!-యామె!
భార్గవా! భార్గవా!! వీడు, పరశువింక!

ఒకసభ్యుఁడు——లాభము లేదింక, ఈవేళ నీయనకేదియో మతిభ్రమణము గలిగినది.

మఱియొకఁడు——మాదుము మ్రింగ లేదుగదా?

పరశురామకవి——(భయవిషాదస్వరముతో)

గీ. గొంతుతెగిపోయి చిమ్మనగ్రోవినుండి
వెడలెడువసంతమట్టులు వెడలుచుండె
నెత్తు; రమ్మయ్యొ!-రేణుకా! నీసుతుండె
నీదుతలఁగొట్టె! నక్కటా! నీల్గిపోతె?
(వెక్కి—వెక్కి— యేడ్చెను)

కార్యదర్శి——(లేచి) అయ్యా! అదియేమి? అదియేమి? విచారింపకుఁడు!మీకేదియో చిత్తవిభ్రమము కలిగినట్లున్నది. అంతియే కాని-ఇక్కడ-మీభావమునందలి ప్రమాదమేమియు జరిగియుండలేదు. ఇంక మీరా విషయమును విరమించి మీరు చెప్పఁదలఁచికొన్న యుపన్యాసమును జెప్పుఁడు. లేదా? ఆమనోవికారము మాఱఁగువఱకును గొంచెము సే పూరకకూరుచుండి స్థిమితపడుఁడు.

పరశురామకవి—(కార్యదర్శిమాటలు వినిపించుకొనక)

శా. ఖ్యాతంబైన పవిత్రవంశమునఁ గ
ట్టా! నీవుజన్మించి, స
త్పాతివ్రత్యధురీణవై బహుతపః
పాకంబునం బొల్చి, త
ల్లీ! తత్త్వార్థవిచక్షణుం డయిన మా
నీశానుఁ జేపట్టి యీ
మాతృద్రోహినిగంటివేమి యిటుల
మ్మా! రేణుకా! పల్కవా?

(ఏడ్చుచు)

గీ. పల్కవా? యింక నెక్కడిపలుకు లపుడె
పాంచభౌతికదేహంబుఁబాసి—

(ఆనందాశ్చర్యములతో)

వచ్చి
పరశురామునిలో నేకభావమంది
కొడుకుచెక్కులుముద్దిడుకొనుచు నుంటె!

(అట్టెచూచి మరల విషాదముతో)

గీ. అక్కటా! సోదరులు జ్యేష్ఠు లక్కటకట!
యరఁటిదవ్వాల నఱకినయట్లె నఱకి
వైచినాఁడవె? చే యెట్లు వచ్చె నీకు?

(తలయూఁచుచు)

నౌనులే! తల్లికంటె వా రధికు లౌనొక్క—?

(సప్రశంసముగా)

క. జనకాజ్ఞఁ దలను దాల్చి
ఘనపరశువుఁజేతఁ బట్టి ఖండించితివా?
జననీసోదరులను? నో
యనఘా! నీకింతభక్తి యా జనకునెడన్?

(పరశురామకవిగారి పద్ధతిఁజూచి, వింతచేతఁ గొందఱును, విశ్వాసముచేతఁ గొందఱును, వినోదముచేతఁగొందఱును, భక్తిచేతఁ గొందఱును భయముచేతఁ గొందఱును—మొత్తముమీఁద సభలోనున్న స్త్రీపురుషు లందఱును—నిశ్శబ్దముగా నిశ్చేష్టులైచిత్తరువులోనిబొమ్మలవలెఁ జూచుచుండిరి.)

పరశురామకవి—(సప్రశంసాశ్లేషనయముగా)

గీ. అద్దిరా! యేమిశాంత మాయాననమున
నెట్లు విలసిల్లుచున్నదో? యేది!—యేది!—
పరశు వచ్చోట నొకసారి పాఱవైచి
రమ్ము; నాతండ్రి! నన్నుఁజేరంగరమ్ము!

(సానునయముగా నానందభైరవిరాగముతో)

సీ. రాఁగదే! నాకోర్కె లీఁగదే! యిటువచ్చి
పోఁగదే! యొకమాఱు; పుణ్యపురుష!

(సంతుష్టిగా)

నచ్చితే! నాకోర్కెలిచ్చితే!—

(ససంప్రశ్నముగా)

యిటుచేర
వచ్చి, తేరగఁబోతె వనజనాభ?

(సప్రణయముగా)

పోకురా! ననువీడిపోకురా! నీకెంత
శోకురా! నాముద్దుసుందరాంగ

సభలోని యొక పెద్దమనుష్యుఁడు—లేచి—అయ్యా! కార్యదర్శిగారు! ఆయనకు నెదుటనున్న వస్తువులు సైతము గనఁబడుచున్నట్లు లేదు; ఈ ప్రపంచజ్ఞాన మున్నట్లింతకంటెను గనఁబడుట లేదు. కావున నా మహావేశములో—అట్లు నలుప్రక్కలఁ దిరుగునపుడు— ఆబల్లగాని కుర్చీలుగాని యాయనకుఁ దగులవచ్చును. లేదా ఆయన యాబల్లపైనుండి క్రిందఁబడినను బడవచ్చును; కనుక దయచేసి యాయన నెట్లయినఁ గ్రిందికి దింపుట యుక్తమని తోఁచుచున్నది. (అని చెప్పి కూరుచుండెను.)

మఱియొకరెవ్వరో—ఔను! అట్లుచేయుట యుక్తమే కాక యత్యావశ్యకముగూడను. (అని పలికిరి.)

కార్యదర్శి—(లేచి) పరశురామకవిగారి సమీపమునకుఁ బోయి రెండుప్రక్కల రెండుచేతులతో మెల్లఁగాఁ బట్టుకొని దింపఁబోయెను)

పరశురామకవి—(సానందాతిశయముతో,

వచ్చితే! ననుఁజేర వచ్చితే కౌఁగింట
గ్రుచ్చితే! నన్నేలు కూర్మికాఁడ!

(కార్యదర్శిని గట్టిగాఁ గౌఁగిలించుకొని)

గీ. విడకు, మీఁపట్టు! ప్రేమంపుఁబీడుపట్టు
పట్టు వదలైన నాలోనిగుట్టువదలు

(కార్యదర్శి విడిపించుకొను చుండెను; సభ్యులు నవ్విరి.)

పరశురామ—(సానునయముగా)

కదలుచున్నాఁడవా? నీవు కదలవలదు
భవ్యరూపాభిరామ! నా పరశురామ!

కార్యదర్శి—(ఎట్టకేలకుఁ గవిగారి పట్టు విడిపించుకొని వచ్చుచుండెను.)

పరశురామ—(నృత్యము సేయుచు)

రామా! పరశు, రామా! భక్త,
కామా ! భవ్య,ధామా!

(నిలిచి)

దేవా! మృదుశ, భావా! శత్రు,
దావా! దేవ,దేవా!

(నిలిచి)

వీరా! ప్రకృతి, శూరా! నిర్వి,
చారా! ప్రేమసారా !

(నిలిచి)

స్వామీ! విమల,గామీ! రావ,
దేమీ! కావ,వేమీ!

(అట్టె నిలువఁబడెను)

అగ్రాసనాధిపతి—(లేచి) అయ్యా! సభ్యమహాశయులారా! కవిగారి కిప్పు డేకారణమువలనో యేదియో మనోవికారము గలిగి యొకవిధమైనయావేశమువచ్చిన దన్నమాట వాస్తవమైనట్లు స్పష్టమగుచున్నది. అది యిప్పుడు మనము మరలించుటకు శక్యముకానిదియుఁ గాఁదుచున్నది. పోనిండు! రేపో మాపో యీయావేశము లప్పుడు తగ్గినసమయమున చెప్పుచున్నాఁడు గాని పనికి మాలినమాటలు చెప్పుటలేదుగదా? మనము కొంచె మోపికపట్టినయెడల నీధోరణి మఱికొంతసేపటికి మానిపోయినను మానిపోవచ్చును. శాంతించినను శాంతింపవచ్చును; కావునఁ గొంతసేపు వారి యావేశ ప్రకారము పోనిచ్చుట యుక్తమని నా యభిప్రాయము. అయ్యా! మీరందఱును దయచేసి యింకఁ గొంతసేపు చిత్తగింపఁగోరుచున్నాను. (అని కూరుచుండెను. అంతకుఁ బూర్వమే యత్యాశ్చర్యముతో నన్యాయత్తచిత్తులై చూచుచున్న సభ్యులందఱును "ఆఁ, ఊఁ" అనకుండ నట్టే చూచుచుండిరి).

పరశురామకవి—(సావహేళనముగా)

క. వారా? సహస్రబాహుఁడు
గారా? రారేమి? రండు!—

(దృష్టి మరలించి)

ఖండింపఁగదే
భూరుహశాఖలు త్రుంచిన
తీరునఁ దద్బాహుచయము దేవా! వేగ.

(దృష్టిమరల్చి సక్రోధముగా)

శా. జిహ్వేత్తుండవుగాక, నీవతనితోఁ
జేఁగల్పఁగా నేర్తువే?
బ్రహ్మాదుల్ దాఁ గ్రిందువడ్డ నెదిరిం
ప నేర్తురే యాపర
బ్రహ్మం,బవ్యయ,మాద్య,మచ్యుత మహం
భావాభిభూతాత్మకా!
బ్రహ్మద్వేషము కీడురా! చెడెదుసూ!
పాపాశయోజ్జృంభితా!

(ఇటునటుఁ జూచి)

మ. ఎవరో తుచ్ఛులు తండ్రిఁ జంపిరని నీ
విట్లగ్ని యీసర్వభూ

ఘన సంహారము సేయఁబూను టిది స
ధర్మంబె? నీపంత మిం
త విరుద్ధంబౌకొ? బ్రాహ్మణుండవుగదా?
ధర్మాత్మ! నీకిట్టిదీ
ర్ఘ విరోధంబులు కూడునే? భృగుకుమా
రా! నీతిఁ బాటింపుమీ!

(సాక్షేపముగ)

గీ. అక్షమాలికఁ ద్రిప్పెడు హస్తయుగము
పరశువుం ద్రిప్ప నది యెట్లు పాలుపడును?
నవ్యనవనీత మైనమనంబు సర్వ
రాజసంహారమున కెట్లు రక్తిఁ జెందు?

ఉ. రాజులు లోకరక్షణ ప
రాయణచిత్తులు; వారి కల్గినన్
భూజనసౌఖ్యసంస్థితికిఁ
బోకడ పెట్టుటగాదె? నీమహా
తేజము, తెంపు, తేఁకువయు
దేవతలేని భరింపలేరు; ని
ర్వ్యాజ కృపాకటాక్షమున
రాజులజోలికిఁ బోకు భార్గవా!

ఉ. వీణియగాదు వీనులకు
విందుగ మీటుకొనంగ; శాత్రవ
ప్రాణసమీరణాపహృతి
పన్నగరాజు! విరోధివహ్నిని
ర్వాణమహాబలాహకము!
పట్టినవాఁడవు గండగొడ్డలిన్
బాణితలంబునం, దదిగో!
భార్గవరామ! భయంకరంబుగన్.

(సప్రశంసాభినయముతో)

గీ. బ్రాహ్మణుఁడవయి పుట్టి, తపంబు సలిపి
బ్రహ్మతేజంబు దిక్కులఁ బ్రజ్వరిల్లఁ
గీర్తిఁ గైకొన్న యవతారమూర్తివౌర!
బళిరె! నీవెంతవాఁడ, వోపరశురామ!

(భయసంభ్రమాశ్చర్యములతో)

మ. అదిగో! నెత్తురు! నెత్తురే యది? ప్రవా
హాకారముల్ దాల్చి, పె
న్నదులై పాఱుచునున్న దల్లదె! జగ
న్నాథా! కసాంజాల! నె
మ్మది నాకేవయుఁ, గక్కసంబు జనియిం
పంజొచ్చె; నేనింక న
య్యది వీక్షింపఁగఁ జాల; జాలమిఁక నే
లా? వేగఁ జాలింపవే!

(శాంతించి)

చ. పరశువుఁ జేతఁబట్టుకొని
పార్థివలోక శిరోధినాశముల్
నఱకుచునుంటివా? యిపుడు;
నాయన! బ్రాహ్మణజాతివాఁడవై
కఱకుఁదనంబుఁ దాల్చితివి
గా? యిపు డిట్టులు తాల్పకున్న నే
నెఱుఁగున భూభరం బడఁగుఁ
దెల్పు,మటంచు వచించుచుంటివా?

(నమ్రభావముతో)

గీ. ఏమి తెల్పుదు? తెలుప నే నెంతవాఁడ?
నన్ను నీ విట్లు ప్రశ్నింప న్యాయమగునె?
తండ్రి! సర్వజ్ఞ! విష్ణ్వవతారమూర్తి
యేమి తెలుపుదు! తెలుప నే నెంతవాఁడ?

గీ. అఖిలవేత్తవు, సర్వభూతాంతరాత్మ
వఖిలసాక్షివి, నీవు న న్నడుగుచుంటి
వపును! నీవట్టులడుగవా? యజ్ఞుఁడైన
యేను నిన్నట్టు లడిగిన నేమనెదవు?

(తలయూఁచి, కనులుమూసికొని, ముఖమును పైకెత్తి)

మ. అకటా! తల్లిశిరంబుఁ ద్రుంచితివి బా
ల్యంబందు; రాజన్యమా
రక దుష్కీర్తి గడించుకొంటివి కుమా
రత్వంబునన్; నీకు వా
ర్ధకమందేనియు శాంతి చేకుఱదు; వి
ప్రత్వంబుతో ఘోరపా
తకకృత్యంబులు సేయుచుంటి; విదియా
ధర్మంబు? బ్రహ్మాన్వయా!

(విచారముగాఁ దలయూఁచును)

మ. మెడలోనున్నదిజందెమా? భుజముపై
మృత్యూగ్రదంష్ట్రాకృతిన్
బెడిదంబైన పరశ్వధంబ? యకటా!
విప్రత్వవిఖ్యాతి కె
క్కడ నేనాఁడునులేని దుర్భర కలం
కం బిట్లుగావింపఁ బా
ల్పడి తున్మాడితి జాతిదోషమున భూ
పశ్రేణి; నయ్యయ్యయో!

(పశ్చాత్తాపముతోఁ దొట్రుపడుచు)

శా. ఏమంటిన్? నినునేమియంటి? నకటా!
యేమంటి? నాదేవ! నా
స్వామీ! నాభగవంతుఁడా! పరమ తు
చ్ఛస్వాంతయుక్తుండనై
నీమీఁదం గలుషంబుమోపితినె? నిన్
నిందించుచున్నాఁడనే?

(రెండుచేతుల వక్షము నడఁచికొని)

హా! మూఢాత్ముఁడ,దుర్మదాంధుఁడ వృథా
హంభావ నిర్దగ్ధుఁడన్.

(సవిషాదాభినయముతో)

శా. అయ్యో! నామెడఁగోపగించితివొకో?
యేమో మదట్లున్న; దే
మయ్యా! చెప్పవు? చెప్పవా? యలుగ నే
లా? నీదు భక్తుండను! నీ
నెయ్యంబున్ మదిఁగోరి యెమ్మెడలఁగా
నీ నిన్నె నే నమ్మి, ని
చ్చెయ్యందింపఁగఁ గోరుభక్తుఁడుగదా!
చీ! యట్లు కోపింతురే?

(కోపముతో)

ఆ. పాపబుద్ధి, నిన్నుఁ బరిపరివిధముల
నిందఁ జేసినట్టి నీచుఁ బట్టి
పరశుధార శిరముఁ బగులఁగొట్టవదేమి?
పరమశాంత! ధరణిపతికృతాంత!

పలయూఁచును, సాభినయముగా

గీ. దేవపతిచెంతఁగొన్న ప్రతిజ్ఞఁదలఁచి
వెఱచుచుంటివి కాఁబోలు వెఱ్ఱితండ్రి!
రమ్ము! గొడ్డలితోడ శిరమ్ముఁద్రుంచి
పొమ్ము! నిను నిందచేసిన పొగరుబోతుఁ!

శా. ఔలే! నీహృదయంబు ప్రేమ పరిపా
కార్ద్రంబు; నీవిప్డు నా
కేలా యెగ్గొనరింపఁ జూచెదవు? తం
డ్రీ! భక్త కల్పద్రుమా!
పాలింపం దగునాఁడ; నీకరుణకుం
బాత్రంబ; నాదోషపూ
ర్ణాలాపంబుల నీమహత్త్వమున కే
లానేగి వాటిల్లెడున్?

కం. రాజులు బహుధనసైన్యవి
రాజులు నీకొక్కనికె పరాజితులై ని
స్తేజులయి ప్రాణభయమున
గాజులు దొడిగించుకొనిరిగాదే? తండ్రీ!

ఉ. పాణిఁ బరశ్వధం బూనఁడ
పట్టి విసర్గమదాంధభూపతి
శ్రేణిమహోగ్ర కాననముఁ
జేరి సమూలము ప్లోగించి, త
త్త్రోణి సమస్తముం గొనిన
శూరుఁడ; వద్దిర! వీరమాతమా
రేణుక యేమిపుణ్యమొన
రించెనొ యిట్టికుమారు నీగ గనఁ

(యోచించి సంశయములో సానునయముగ)

గీ. సాధుసద్బ్రాహ్మణుండవా? క్షత్రియుఁడవ!
తాపసాగ్రేసరుండవా? తామసుఁడవ?
రాగివా? యోగివా? లోకరక్షకుఁడవ?
లోకశిక్షకుఁడవ? దయాళూ! వచింపు!

(దృష్టి మరల్చి)

గీ. పాఱిపోకుఁడు భూపాలపశువులార!
పందలా? వచ్చుచున్నాఁడు భార్గవుండు
పరశుధారాభిహతిఁ జచ్చి పడినవారు
చూఱఁగొందురు వైకుంఠసుఖసమృద్ధి

(ఇటునటుఁజూచి)

గీ. అకట! నీమన సెట్టిదో యంబుజాక్షు!
దారుణము! రక్తమునఁ బిత్రుతర్పణములు
సలుపుచున్నాఁడ వదియేమి? చాలుఁజాలు
రక్కసియుఁ జేయనట్టి కార్య మదిగాదె?

(పశ్చెంమకొనునుఁ గోపముతో)

కం. నెత్తుటఁ దడిసిన చేతుల
నెత్తెదవా నన్ను? రాకు; మొత్తకు! మిట కీ
వొత్తిగిలిపొమ్ము! పొమ్ము!! వి [మీ!
యత్తలమున; కపరిశుద్ధుఁడా! నను ముట్టకు

(విషాద పశ్చాత్తాపములతో)

గీ. అయ్యయో! పోవుచుంటివా? యాకసమున
కేల? నామొఱ నాలింపవేయి, కృపాళు!
పలుకవా? నాకుఁ గన్నులలోపం బులెఱిఁగి
తెలుపవా? వాని నెఱిఁగి నే గ్రద్ద కొందు!

(సానునయముగా నభినయించుచు నానందభైరవి రాగ
ముతో)

సీ. పలుకవా? బంగారు చిలుకవా? నామీఁదఁ
జిలుకవా? నీకృపాశీకరములు?
చూడవా? నీవింతవాఁడవా? నన్నుఁ గా
పాడవా? "నీవు నావాఁడ"వనుచు?
కానవా? గారాలకూనవా? నా వంక
నూనవా నీ సుజానూనకరుణ?
వింటివా? నీ వింతకొంటివా? నన్నుఁ జే
కొంటివా? రేణుకచంటివాఁడ!

గీ. లేదె? నను నీవు చేకొనలేదె? విడిచి
పోదువా? యెచ్చటికిఁ బోదు? పొమ్ము!
[పొమ్ము!!
వలదు లే-యిందు-నీవు-రావలదు లే-మ
నమ్ములో మాత్ర మిది నిల్పు కొమ్ము!
[పొమ్ము!

(దృష్టి మరలించి సభయముగా)

గీ. ధారుణీధవ కంఠకర్తన నిశాత
పరశుధారాకరాళ దుర్భర మహోగ్ర
కాంతిగాఁబోలు నాకన్నుఁగవ నడంచి
యడలు గొలిపెడు! రక్షింపుమయ్య! తండ్రి!

(సవిమర్శగాఁ బరికించి)

సీ. అదియేమి? యాచేత? నవి దర్భసమిధలా?
యాచేత నదియేమి? యంపగుదియ?
యాప్రక్క నదియేమి? యది ధనుర్వల్లియా?
యాప్రక్క?-సాంగకృష్ణాజినంబ?

యది యేమి భుజముపై? నది బ్రహ్మసూత్రమా?
  యాతలన దియేమి? యల్లెత్రాడ?
యావంకనదియేమి? యది గండగొడ్డలా?
  యదియేమి? కకపాల గోగా యవలను?

గీ. ఆ వెలుంగు బ్రహ్మతేజమా? యామహోగ్ర
  తీక్ష్ణదీధితి క్షాత్త్రమా? దేవదేవ!
  దివ్య తేజోమయాకార దీనరక్ష!
  కంటి! నీ దివ్యరూపంబుఁ గంటి!! నదిగో!

(మహానందముతో)

కం. ధాత్రి "నిదం బ్రాహ్మ్య మిదం
  క్షాత్ర" మ్మనుపలుకు నిలిపి సార్థకముగ; నీ
  శత్రువులఁ గెడపి తపమతి
  చిత్రంబుగ నిచట నిలిచి చేయుచునుంటే?

(దృష్టి మరల్చి)

ఉ. అన్యనృపాలబుద్ధి నటు
  లాతనిఁ దాఁకెద వేల? రాజసా
  మాన్యుఁడుగాఁడు! భూభరము
  మాన్పఁగఁ బుట్టిన విష్ణుమూర్తి! రా
  జన్యతినొంది, యాజనక
  జాతను జేకొని మిత్రబంధుతా
  సైన్యసమేతుఁడై పురికిఁ
  జయ్యన నేగెడు నేగ నీఁగదే!

గీ. అతఁడు నీవును నొకటె కాదా తలంప?
  విష్ణునవతార మూర్తులు వీరవరులు!
  మాకు మీలోన భేదమేమి గలదయ్య!
  యెఱుఁగనట్టులె యెదిరించె దేల యతని?

గీ. ముసలితనమున నెచటనో ముక్కుమూసి
  తపముఁ జేసికొనుచునున్నఁ దప్పదొక్క—
  తామసము నీకు? నిట్టివార్ధకము వేళఁ
  దగదు తగదిది; మర్యాద దక్క దింక

(దృష్టి మరల్చి సాభ్యర్థనముగా)

కం. రామా! సద్గుణ మణిగణ
  ధామా! లోకాభిరామ! దశరథ రామా!
  యీ మహితుని మా భార్గవ
  రాముని రక్షింపుమయ్య! రఘుకులసోమా!

గీ. పేరుగలవాఁడు, విప్రుండు, పెద్దవాఁడు
  తాను నీవలె నవతారమైనవాఁడు
  వైష్ణవ శరాసనమున నున్నవాఁడియమ్ము
  విడువకుముసుమ్మి! దశరథ విభుకుమార!

(సంతోషముతో)

కం. సాహంకారులు మీ రిపు
  డాహా! యన్యోన్యభేద మడఁగించి మహా
  స్నేహార్ద్ర హృదయులయినా
  రోహో! మీ యైక్యమెంత యొప్పెయుండెన్

(దృష్టి మరలించి సప్రశంసముగా నానందభైరవి రాగముతో)

సీ. చేతిలో చక్రంబు ఛేదించె నక్రంబు
  గజరాజు మొఱవిన్న గడియలోన
  వ్రేలిసన్ననిగోరు వ్రీల్చె రాక్షసవీరు
  నగతికుంఠై బాలుఁ డార్చినపుడు
  మనసులో పలిచెల్మి మలపించెఁ గడుఁగల్మిఁ
  జినుఁగుపాఁతల విప్రగనినతోన
  పొదిలోని బాణమ్ము పోయించెఁ బ్రాణమ్ము
  ద్విజరాజు, సుతుచావు దెలిపినంత

గీ. ఏమి సామర్థ్యమో? యదియేమి తెఱఁగో?
  యేమి కరుణాస్వభావమో! యేమి దయయొ!
  యేమి వాత్సల్యమో? యదియేమి కృపయొ!
  యేమి జాలియొ భక్తులయెడలఁ దండ్రి!

(ఇటునటుఁ జూచి బల్లపైన గ్రాసనాధిపతిగారికి గౌరవార్థముగాను నలంకారార్థముగాను నుంచిన పుష్పఫలాదులను జేతిలోఁ జూపుచు)

మ. ఇదిగో! స్నానజలంబు; కైకొనుము నీ
వీనవస్త్రయుగ్మమ్ము; ర
మ్మిదిగో! గంధము నక్షతల్ గొనుము; ని
న్నిపుష్పజాలంబుతో
నిదె! పూజింతు నివేదనం బిదుదు నీ
కీపండ్లు; తాంబూల, మి
య్యదె! చేకొమ్ము ననుం గృతార్థుఁ గనుగం జే
యంజూడవే భార్గవా!

(సప్రశ్నముగా నానందభైరవిరాగమున)

సీ. ననుఁగంటఁజూడవా? నాయింటఁగుడువవా?
నాపూలుముడువవా? నాదుతండ్రి!
ననుఁగటాక్షింపవా? నా మొరాలింపవా?
ననుఁగౌఁగిలింపవా? నాదుతండ్రి!
ననుఁబ్రీతిఁగూర్చవా? నాముద్దుఁదీర్చవా?
నాసద్దులార్చవా నాదుతండ్రి!
నను వీటఁబుత్తువా? నాభక్తి మెత్తువా?
నావెంట వత్తువా? నాదు తండ్రి!

గీ. తండ్రులకుఁ దండ్రివైన మాతండ్రి! రమ్ము!
తల్లులకుఁ దండ్రివైన మాతండ్రి! రమ్ము!
తాతలకుఁ దండ్రివైన మాతండ్రి! రమ్ము!
తాత తాతల తండ్రి! మాతండ్రి! రమ్ము!

ఉ. ఏటికిరావయా? శబరి
యెంగిలిపండులె తిన్నవాఁడ; వా
పాటియుఁజేయవా పరమ
భక్తినొసంగిన నాదుపండ్లు? నా
మాటల కుత్తరం బిడుము!
మంచితనంబుగవచ్చి పుచ్చుకో!
మ్మేటికి నామొడం బరుస;
మేటికిఁ బంతము దంతిరక్షకా!

ఆ. ఇష్టులైనవార లిచ్చిన వన్నియుఁ
దిన్నవాఁడవేకదే? కుచేలు
ముఱికిప్రాఁతకొనను ముడిచిన చప్పని
యటుకుగింజ లడిగి యట్టితినవె?

(మహావిచారముతో)

శా. అయ్యో! నన్నిటు వేఱుసేయఁ దగు
నయ్యా! యిప్పు డీపండ్లు నేఁ
దయ్యంబొప్ప నొసంగిఁ జేకొనవు గా
దే? నీప్రసాదంబు నా
కియ్యంజూడవుగాదె? నే నిచట నిం
కెం తేడ్చినంగాని నా
కుయ్యాలింపవుగాదె? యింకె కదే! హా!
గోవింద హా! శ్రీహరీ!

అని పరశురామకవిగారు, నిట్టసలులుపుసఁ జూప
చట్టుగా సుభాలుమని క్రిందఁబడిపోయిరి. సభ్యు లంద
ఱును గలఁతపడి యాయనచుట్టును మూగఁ నొడఁగిరి.
భయంతియు గగ్గోలయ్యెను. సభలోఁ గొందఱు పెద్ద
మనుష్యులు "లేవనలను! లేవనలను! సద్దుచేయకుఁడు!"
అని నివారింపఁ గడఁగిరి. మఱికొందఱు "సివమెత్తినది!
సివమెత్తినది! సాంబ్రాణి! సాంబ్రాణి! కాదు! సగ్గి
లము! సగ్గిలము!" అని అఱచిరి. అగ్రాసనాధిపతిగారు
లేచివచ్చి కవిగారి చెవులుమూసి, "మంచితీర్థము! మంచి
తీర్థము! నీళ్లుతెండు! నీళ్లుతెండు!" అనిబిగ్గరగాఁ గేకలు
వేసిరి. అంతట, నాసభ్యులలో నొక్కరుగానున్న, యా
యుర్వేదభూషణ, వైద్యశిరోమణి,నవీనధన్వంతరీత్యాది
బిరుదాంకితులగు శ్రీయుత పండిత నీలకంఠశాస్త్రిగారు
ముందునకువచ్చి కవిగారి కుడిచేయిపట్టుకొని కొంతసేపు
ను, వామహస్తమును బట్టుకొని మఱికొంతసేపును ధాతు
పరీక్షచేసి, రోగస్వభావమంతయు, నవగతమైనట్లు తల
యూఁచి, యగ్రాసనాధిపునితోడను, మఱికొందఱు
పెద్దమనుష్యులతోడను, "అయ్యా! ఈయన కిప్పుడు
చేతిలో మహాపైత్యముగానై యున్నది. నాతోఁగూడ
నేగముగా నెవ్వరినైనఁ బంపినయెడల మా యింటియొద్ద

క్రొత్తగా ఒకసారు చేసిన ప్రశస్తమైన మహాపైత్యాంతక రసమున్నది. అదియును, మేహగజాంకుశమును రెండును గలిపి మూడుమోతాదులతో మూడుపొట్లములుగట్టి పంపించెదను. మొదటిపొట్లము నిమ్మకాయ రసముతోను, రెండవపొట్లము, జీలకఱ్ఱరసముతోను, మూడవపొట్లము అల్లపురసముతోను, జాముకొక్కొక్కటి చొప్పున నిచ్చినయెడలఁ దత్‌క్షణమే యిది తగ్గిపోవునని చెప్పి యొక పిల్లవానిని దీసికొని వెడలిపోయిరి. అంతలో దైవవశమున నావీథినిబోవుచున్న డాక్టర్ డి. కృష్ణమోహన మొదలియారు (యమ్. బి. సి. యమ్) గారి నెవ్వరో లోపలికిఁ దీసికొనివచ్చి కవిగారినిజూపి సంగతులన్నియు జెప్పిరి. ఆయన జేబులోనుండి (stethoscope) దీసి చెవులకుఁ దగిలించుకొని కవిగారి హృదయప్రదేశమునను, పార్శ్వములయందును, బెట్టి పరీక్షించి, కడుపునంతయు బిసికిచూచి తన యెడమచేతి వ్రేళ్లను కవిగారి కడుపు మీఁదనుంచి వానిపైఁ గుడిచేతివ్రేళ్లతో వాయించి నాడీస్థానము నొకచేతఁబట్టుకొని మఱియొకచేతనున్న ముంజేతి గడియారము (wrist watch) వంకఁ జూచుచుఁ గొంత సేపుండి చొంగ "సెలైవా ఫ్రం దిమౌత్" (saliva from the mouth) వచ్చినదాయని ప్రశ్నించిరి. అక్కడనున్న పెక్కండ్రకా ప్రశ్నమున కర్థము తెలియకున్నను అగ్రాసనాధిపతికొంచె మాంగ్లభాషాగంధము నాఘ్రాణించిన శాస్త్రియే యగుటచే "నో, నో" (no no) యని ప్రత్యుత్తరమిచ్చెను. డాక్టరుగారు కొంచె మాలోచించి "ఐ థింక్ హి ఇజ్ ఎఫెక్టెడ్ విత్ ఎపిలెప్సి (I think he is affected with epilepsy) ఆల్ రైట్ (Allright) ఫరవాలేదు—కొంచెము—ఐస్ అనఁగా మంచుగడ్డముక్క హెడ్డు (head కిఁ గట్టి ఫ్రెష్ ఎయిర్ (fresh air) లోపలకు పాస్ (pass), అగునట్లు డోర్సు (doors) ఓపెన్ (open) చేసి—ఒక రూమ్ (room) లో వెల్లకిలఁ బరుండఁబెట్టుఁడు నేను టూపౌడర్సు (two powders) పంపించెదను; గంట కొకటిగా లోపలికిండు. విత్ వాటర్ (with water). నేను—సెవెన్—ఆర్—హాఫ్‌ఫాస్టు సెవెనుకు (seven or half-past seven) వచ్చి మరలఁజూచెదను. అప్పటికి కాన్షస్‌నెస్ (Consciousness) రావచ్చును. వుయ్ షల్ సీ ఆఫ్టర్ వర్డ్సు, ఐ షల్ గో (We shall see afterwards I shall go)." అని వెడలిపోయిరి. అప్పుడచ్చటి పెద్దమనుష్యులలో నొకరెవ్వరో కవిగారిని మెల్లఁగాఁ బడకకుర్చీపైఁ బరుండఁ బెట్టించి తమ యింటికిఁ దీసికొనివెళ్లిరి. సభ్యులలోఁ జాలమంది కవిగారి భక్తిపరత్వమునకును, భావపరిపాకమునకును, కవితాసామర్థ్యమునకును మెచ్చుకొనుచు, నప్పుడాయన యట్లు పడిపోయినందులకు నొచ్చుకొనుచు నుండఁగా, సభానాయకులు తరువాత జరపవలసిన సభాకార్యముల నెట్లో జరపి, నాఁటిసభ ముగించివైచిరి.

ఇట్లు
త్రిలింగ దేశాభివర్ధనీసభాంధ్రసంక్షిప్తలేఖకుఁడు.





# సందేశము

శ్రీ శివశంకరశాస్త్రి గారు [సాహితీసమితి]

అవగతం బయ్యె నారహస్యమ్ము నీకు
చెల్లెలా, యెన్నినాళ్ళొ దాచిన యుదంత
మిట్టె నానోట నిపుడు పల్కించినావు
అవుర నీ బుద్ధి విభవ మే మనగ వచ్చు

నాకు తోబుట్టు వట్టిదానవు, గభీర
హృదయ, వుపకార పారీణ వీ వటంచు
సిగ్గు విడనాడి యిపుడు వచించినాను
మదనురాగవిధానపు మర్మ మెల్ల.

సంశయము లేని గాటంపుచనవుతోడ
నడుగుచున్నాను వరము ని న్నాప్తురాల,
ఆమెయంతికమునకు నీ వరుగవలయు
నీదినంబున శ్రమ మని యెంచకుండ

తెల్ల మాయెను గాదె మదీయచరిత
మెల్ల, గత్యంతరంబు కాన్పించ దామె
నిపుణముగ నాయవస్థ వర్ణించి యచట
ప్రాణముల్ నిల్పు కార్య సాఫల్యయుక్తి.

సేతుపార్శ్వమునందు విస్తీర్ణకాయ
మాన రమ్యశాఖావలీ మహిత మగుచు
ఉన్నతం బైన వటవృక్ష మొకటి కలదు
ప్రాఙ్ముఖంబుగ జూడు మప్పట్టునుండి

వివిధ భూమిజమండలావృతమనోజ్ఞ
సౌధశిఖరంబు లోచనసరణి దోచు,
శ్యామలోజ్జ్వల పర్ణసంఛన్న మైన
వికసిత సితాంబుజాతంబు విలసనమున.

కొంతదూరంబు నా ప్రచో గోచరించు
వామభాగమ్మునందు నావరణరూప
వితతభిత్తిక యిష్టికా విరచితంబు
శోణకాశేయమేఖలా సుషమతోడ.

అవల దక్షిణముఖముగా వేదియుగ్మ
రోచనం బను చంద్రకరూపమునను
నీల పాషాణ ఫలక వినిర్మితోరు
పట్టభంగపరంపరా ప్రభలు నీకు

ఆయతం బైనతోరణ మధిగమించి
అజిర భాగంబువెంట నీ వరుగునపుడు
సంభ్రమంబున పుష్పవర్షంబు గురియు
పవన కంపిత పున్నాగ పాదపంబు.

సవ్యముగ నాలుగడుగులు చనిన వెనుక
తావకాగమనోదితా దరముతోడ
చామరము వేయు సహకార భూమిజంబు
సాంధ్యపవమాన సంచలచ్ఛాఖికలను

ఉన్నతం బైన మొగసాల యొప్పు నచట
వేత్రదారు పటాసన వితతితోడ
లంబమాన ప్రదీపగోళములతోడ
ఆవృతిస్తబ్ధ చిత్రపటాలి తోడ.

పురుషు లెల్ల వాహ్యాళికి బోయి యుంద్రు
ఎదురు పడిరేని పనికత్తె లెవ్వరేని
ఓసరిల్లుదు రాదరయుక్తితోడ
శాంతగతి నంగణమువెంట జనగవచ్చు.

అంత ప్రాచీముఖమ్ముగా నరుగు మనస్మ
ప్రణయినీకరకోమల స్పర్శచేత
పులకితం బయి యహరహాపుష్టి గాంచు
వకుళభూమీరుహము కానవచ్చు నీకు.

అపుడు స్వాగత మను మదీయానురాగ
భాజనం బైనవకుళభూమీజశాఖ
లలితముగ గుల్కు మత్తకలాపికాంత
శ్రవణసుభగమ్ముగా వల్గు షడ్జమునను.

కడచి యంగణరమ్యభాగమ్ము కొనను
చెల్లెలా, జామిచెట్టు కాంచెదవు సుమ్ము,
తరువుపై నున్నశుకము నీదర్శనమున
రక్తకంఠమ్ముతో త్రివారమ్ము పలుకు.

పార్శ్వమందు నారోహణపంక్తి యమరు
భామినీభ్రూమనోజ్ఞ రూపమ్ముతోడ
స్నిగ్ధ చంద్రాశ్మఫలక వినిర్మితంబు
సప్తపరిమిత సోపాన సంయుతంబు.

అచటిరమణీయకక్ష్యయం దామె యుండు,
సంశయము లేదు. నీచనుసమయమునకు:
కోయుచుండును ప్రియజపాకుసుమములను
విస్తృత విపులవాతాయన వీధినుండి.

అట్లు కాదేని మృదులపటాసనమున
వాలియుండి మదీయకావ్యమ్ము కేల
బట్టుకొని యామె యుద్రిక్తభావయగుచు
చదువుచుండును కాకలీస్వరముతోడ.

కానిచో నామె తోరణగండ్లదరిని
ధవళిమోజ్జ్వల పర్యంకతలముమీద
బండుకొనియుండి నాచిత్రపటమువంక
జూచుచుండును నిష్పందలోచనముల.

ఆమె యొకవేళ రమ్యవేత్రాసనమున
కూరుచుండి సూచికలతో కూర్మిమీర
నాగరాక్షరము ను మన్నామధేయ
మల్లుచుండును కౌశేయకాంచలమున.

ఇట్లు కాకున్న వీణ వాయించుచుండు
కంకణరవమ్ము గీతిలో గలసిపోవ
కర్బుర మనోజ్ఞ మగురత్నకంబళమున
స్నిగ్ధహృదయాంబుజాతయాసీనయగుచు.

కరతలాబ్జ సమర్పిత గండభాగ
అర్ధమీలితనయనయు నై యనేక
విధముల న్నన్నుగూర్చి భావించుచుండ
బోలు జాలనిషణ్ణమై పూర్ణహృదయ.

మందయానముతోడ తన్మందిరమ్ము
జేరి సోపానపాళికాశ్రేణివెంట
నరుగులోనికి నిను గాంచినంత నామె
పల్కరించు పురాతనపరిచయమున.

జీవితేశ్వరి నిను సుఖాసీన జేసి
ఆదరముతోడ భాషించునవసరమున
నాయుదంతంబు మిగుల విన్నాణముగను
ప్రియమధురరీతితో దలపెట్టు మమ్మ !

ప్రీతితోడ దరత్రప పెనగొనంగ
ఆమె నీభాషణంబుల నాలకించు
నీసుధారసనిష్యంది నిస్స్వనమున
తెలుపుమామెకు ప్రణయసందేశమిట్లు:—

జీవితేశ్వరి, యేల జాలము
చేయుచుంటివో తెలియ దయ్యో !
వివిధచింతలతోడ నామతి
వికలమై పోయెన్ !

ఈర్ష్యచే, నీతోడ నాపై
నెవ్వరేని నిరాపనిందలు
సృష్టిచేసి యనేకభంగుల
చెప్పలేదుగదా ?

హేయభావము నీకు నాపై
నెట్టులేని జనింపజేయగ
ఖలులు నీతో నెన్నియేనియు
కల్లలాడరుగా ?

మధురవాక్యము లెన్నియేనియు
మత్సమీపమునందు బల్కుచు
చాటుగా నపకృతియె సల్పెడి
జనము కలదుసుమీ !

నిష్కలంకవు సరలహృదయవు
నీవు లక్ష్మీ, నిక్కవంబుగ :
ఎల్లరును నీలాటివా రని
యెంచబోకు సుమీ !

అన్యవాక్యము లెంతమాత్రం
బాలకింపక ధీరవృత్తిని
నన్ను ప్రేమను జాతు వనియే
నమ్మియున్నాడన్ !

ఎల్లవేళల నీవు లక్ష్మీ,
హృదయనాథునిగా దలంతువు
నన్ను నిశ్చలబుద్ధితో నని
నమ్మియున్నాడన్ !

కొంతకాలమునుండి లోచన
కువలయమ్ములు లక్ష్మి, తావక
వదనరోచిర్విరహితము లై
వాడిపోయినవి !

ఐన నేటికి చూపు లిక ప్రియు
రాల, హృదయము లమలశాగ్ర
ప్రబలసూత్రముతోడ దృఢముగ
బద్ధమై యుండన్ ?

కాలయాపన మగుటచే ని
ష్కారణమ్ముగ, గుండె తరిగెడి
భూరిఘోర నిరాశ యెడ నెడ
పొడమచుండు జుమీ !

నీస్వరూపము నాయెడందను
నిండియుండుటజేసి లక్ష్మీ,
అన్యవనితకు తావు లే దీ
యంతరంగమునన్ !

ప్రియతమా, నే నిరుపమాన
ప్రేమపూర్ణ విలోచనమ్ముల
నెదురుచూచుచునుందు నీకై
యెల్లవేళలను !

సాహసమ్మును మామకీన
స్థైర్యగుణము గ్రహించియును నీ
వింక నేటికి జంకుచుంటివొ
యెరుగకున్నాడన్ !

విమలహృదయం బాదరంబును
విశదముగ గ్రహియించియును నీ
వింక నేటికి జంకుచుంటివొ
యెరుగకున్నాడన్ !

పారద్రోలు మద్ధైర్యవృత్తిని
ప్రాణకాంతా, ధైర్య మూనుము :
వీరసతి వయ్యెదవు గేహము
వెడలి యరుదేరన్ !

కదలి రా ప్రియురాల, నీయా
గమనకాలమునందు యుష్మ
త్స్మరణి కవరోధంబు చేయగ
జాల రెవ్వారల్ !

రమ్ము మాణిక్యంపుబొమ్మా
రమ్ము నాబంగారుచిలుకా
రమ్ము రమ్మోరాజహంసీ
రమ్ము శీఘ్రముగన్ !

పరిణయోత్తర కాలమందున
పయన మగుదము ప్రాణకాంతా
భరతవర్ష విలోకనోత్సుక
భావభరితులమై.

దంపతులమై వివిధరమ్య
స్థలములందు విహారలీలలు
సలుపగల్గుదు మంతరంగము
శాంతి నొందంగన్.

కూర్మితో సౌఖ్యమ్ము నీకొస
గూర్ప నేను మెలంగుచుండగ
ఏవిధంబున నుందువో నీ
వెంచి చూడగదే !

ప్రణయినీ, నీ కమర నన్మ
ద్బాహు వృషధానంబుగా నీ
వెట్టిస్వప్నము లపుడు కాంతువొ
యెంచి చూడగదే !

మ్లాన మెరుగని కుసుమగుచ్ఛము
మాడ్కి నిరతము నాథుమస్తక
మండనంబై వెలయుదువు సుకు
మార భావముసన్.

సాహచర్యముచేత ప్రతిభా
శాలినీ, కవితామృతము నీ
విమలవాక్కున లీలమై నా
విర్భవించు జుమీ !

గానకవితా శిల్ప సులలిత
కళలతో నొప్పారి యస్మ
న్నవ్యగేహము కేవలం బా
నందధామ మగున్ !

విశ్వగాయకమౌళి కృష్ణుని
వేణువటు మనజీవనమ్ములు
దివ్యగాన తరంగములలో
తేలియాడు జుమీ !

అన్ని వేళల నాదరించుచు
సఖలవిధముల మేలు చేయుచు
మిగుల నను ప్రేమించుచుండెడి
మిత్రు లున్నారు.

అందు నస్మత్ప్రాణసము లగు
నాప్తు లెందరొ కలరు: వారలు
కవులు, నీ కంకితము లిత్తురు
కావ్యబంధములన్.

అమలహృదయముతోడ నాసుఖ
మభిలషించెడి స్నిగ్ధశిల్పులు
మధురముగ జిత్రింత్రు నీముఖ
మంజురూపంబున్.

సరససారస్వతము లక్ష్మీ,
సఖులచే ననివారితంబుగ
నిన్ను గూర్చి యనేకరీతుల
నివ్వటిల్లు జుమీ !

రమ్ము రమ్మోకమలనయనా
రమ్ము రమ్మోచంద్రవదనా
రమ్ము రమ్మోముద్దుగుమ్మా
రమ్ము శీఘ్రముగన్ !

ఎల్లవేళల నీదురాకకు
నెదురుచూచుచు యుగములట్టులు
కఠినవైఖరి వాసరంబులు
గడపుచున్నాడన్ !



# పండితత్రయము

నిడుదవోలు వేంకటరమణ గారు, బి. ఏ.

ఆంధ్ర వాఙ్మయమునఁ బ్రామాణికాగ్రగణ్యులుగ నెన్నఁబడిన కవిత్రయముఁబోలె, శైవమత వాఙ్మయమునఁ బండితత్రయమను పేర ముగ్వురు మహనీయులుగలరు. వారిలోఁ బ్రథముఁడు శ్రీపతిపండితుఁడు; రెండవవాఁడు శివలెంక మంచనపండితుఁడు; మూఁడవవాఁడు మల్లికార్జున పండితారాధ్యులు. వీరు ముగ్వురును సృష్టిస్థితిలయకారణభూతులును, పురాణదైవతములును నగు త్రిమూర్తుల నాధిక్యముఁబోఁద్రోసి, శివుఁడే పరదైవమనియు, జగత్పరిణామమునకు శివుఁడే హేతుభూతుఁ డనియు, సిద్ధాంతముచేసి వీరశైవమతము నాంధ్రదేశమున సుస్థిరముగ నెలకొల్పిన మహానుభావులు. ఈవిషయముఁగూర్చి పాల్కురికి సోమనాథకవి తనపండితారాధ్యచరిత్రమునం దిట్లు చెప్పియున్నాఁడు:

"ద్వి. కడునర్థి నుత్పత్తి కర్తనా బ్రహ్మ
వడి బ్రహ్మమను బ్రహ్మవాదులఁ ద్రుంచి
హరు భక్తియుత్పత్తి కధిపతి నాఁగ
బరగెఁ దాఁ దొల్లి శ్రీపతిపండితయ్య
స్థితికర్త హరి నుమాపతికి మ్రొక్కించి
క్షితి విష్ణువాదులఁ గీటణఁగించి
చెనసి భక్తిక్రియాస్థితి కర్త యనఁగఁ
జనియెను లెంక మంచనపండితయ్య
గాఢమై సంహారకర్తయ యనుచు
సాధారణముగ నీశ్వరుఁ బల్కు భక్తి
దూరాన్యసమయసంహారుఁడై చని మె
సూరంపు మల్లికార్జునపండితయ్య
ఖ్యాపితభక్తికిఁ గారణపురుషుఁ
డై 'పండితత్రయం'బన భువిఁ జనియె
తనరు నీపండితత్రయములో మాన్యుఁ
డనఁ నొప్పు మల్లికార్జునపండితయ్య"

పండితా. దీక్షాప్రకరణము.

ఇట్లు సోమనాథుని కాలమునకు ననఁగా క్రీ. శ. 12వ శతాబ్దమునకే పండితత్రయమును వాసికెక్కియున్నట్లు పైవ్రాఁతవలన స్పష్టమగుచున్నది.

## శ్రీపతిపండితుఁడు

ఈతని నివాసస్థలము తెలుఁగుదేశమునందలి ప్రాచీనప్రసిద్ధపట్టణములలో నొకటియగు విజయవాటిక (బెజవాడ). ఈతఁడు పండితత్రయములోఁ బ్రథముఁడు. ఈతఁడు శివుఁ డొక్కఁడే దైవమనియు, నొక శివభక్తునితోఁ గోటిబ్రాహ్మణులైనను సరిగారనియు, నిప్పులు కొంగున మూటఁగట్టి శివభక్తిమాహాత్మ్యముఁ జూపించిన మహనీయుఁడు. ఈవిషయమే పండితారాధ్యుల శివతత్త్వసారమునందును, శివభక్తవిజయమునందును నిట్లు ప్రశంసింపఁబడినది.

క. ఒక్కఁడె దైవము శివుఁ డని
నిక్కము సేయుటకు ముడిచె నిప్పులు చీరన్
స్రుక్కక శ్రీపతిపండితుఁ
డక్కజముగ విజయవాడ నల జమ్మిశివా!

క. అతులిత శివభక్తునితోఁ
బ్రతిసేయఁగ రారు కోటిబ్రాహ్మణులని శ్రీ
పతి పండితయ్య నిప్పులఁ
గుతుకమతి న్మూటఁగట్టెఁ గొంగునను శివా!"

ఈతనికాల మిదమిత్థమని నిర్ణయింప వలనుగాకున్నది. క్రీ. శ. 1168లో లింగైక్యమునుం జెందిన బసవనకన్న నీతఁడు ముందువాఁడని నిశ్చయింపవచ్చును. ఈతఁడు క్రీ. శ. 9వ శతాబ్దమున నుండెనని కొందఱు పండితుల యభిప్రాయము. 1915 వ సంవత్సరమునఁ బ్రభుత్వమువారు ప్రకటించిన ప్రాచ్యలిఖిత పుస్తకభాండార పుస్తకావళిలో నొకచోట 'శ్రీపతిపండితులు గురువులుగా చాళుక్యరాజగు విష్ణువర్ధనుఁడు రాజ్యమేలుచుండెను' అని చెప్పఁబడియున్నది. చాళుక్యులలో ననేక విష్ణువర్ధనులు గలరు. పైని చెప్పఁబడిన విష్ణువర్ధనుఁడు క్రీ. శ. 918 మొదలు క్రీ. శ. 925 వఱకును బాలించిన యేడవ విష్ణువర్ధనుఁడైనయెడల నీతనికాలము 9 వ శతాబ్దమని చెప్పవచ్చును. భావిపరిశోధనమునఁగాని సత్యము బయలుపడదు.

ఈతఁడు శైవుఁడగుటచేతను, శైవమతవ్యాపనమునకు శివకవులు దేశభాషలలోఁ గవనము సెప్పుట యాచారమగుటచేతను నీతఁడు తెలుఁగున నేమేనిగ్రంథములువ్రాసెనో తెలియరాదు. ఈతఁడు బసవపురాణమునఁ గవిగాఁ జేర్కొనఁబడియున్నాఁడు. సంగమేశ్వరుఁడు జంగమరూపంబున బసవనయొద్దకు వచ్చి యీఁడవ కన్నడుగ సంపర్కమున నిట్లు చెప్పఁబడియున్నది.

"ది. కోరిమీఁ పరిహాసకులు కళియంబ
గారు వాగీశనైనారు పాఠకుఁడు
శ్రీపతిపండితుల్ శివుఁడ! మీకవులు
నాపండితయ్యగా రనుఁగుఁబండితులు"

ఈతఁడు బ్రహ్మసూత్రములకు శివపరముగ వ్యాఖ్యను 'శివదీపిక' అను పేర రచించినట్లు శివకవులయందిట్లున్నది.

"కం. శ్రీపతిపండితకవి శివ
దీపిక విరచించి శైవదీక్షాగురుఁడై
చేపట్టె ముక్తిపేరిటి
రాపట్టని విజయనగరరామయలింగా!"

ఈతఁడు రచించిన భాష్యము శ్రీకంఠశివాచార్యులు వ్రాసిన శివాద్వైతపరమగుభాష్యమునకు ముందు రచింపఁబడినదో వెనుక రచింపఁబడినదో తెలియరాదు. వెనుకనే రచించిన నీతఁడు తెలుఁగుననే రచించెనని యూహింపవచ్చును. ఈతఁడు విజయవాడ (బెజవాడ) లో నుండినవాఁ డగుటచేతను, శైవుఁ డగుటచేతను యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనమునందలిమధ్యాక్కరలీతఁడు రచించినవేమోయను సందేహముపొడముచున్నది. క్రీ. శ. 927 మొదలు 934 వఱకు రాజ్యమేలిన యుద్ధమల్లునికాలమునం, దీతఁ డాంవేళ తొమ్మిదవశతాబ్దపువాఁడైన పక్షమున, శాసనము వ్రాయుట యసంగతము కానేరదు. ఆశాసనకర్తయే యీతఁడైనయెడలఁ దెలుఁగు కవులలో నీతఁడు తొలివాఁడగును. ఈవిషయమై శివకవులయం దీవిధముగఁ గలదు:

"కం. అలయుద్ధమల్లుపనుపునఁ
దెలుఁగున మధ్యాక్కరలను దెలిపెను దొ
నిల శ్రీపతిపండితకవి [లిఁ దా
లలితగతి న్విజయనగరరామయలింగా!

శివలెంక మంచనపండితుఁడు [1]

ఈతనిచరిత్ర సోమనాథుని బసవపురాణమున పఞ్చమాశ్వాసమున వర్ణింపఁబడియున్నది. ఈతఁడు శ్రీకాశీక్షేత్రమునందువిశ్వేశ్వరస్థానమునందుండెడివాఁడు. అచ్చట ముప్పూటలను దనపద్రవేళ్లను శివున కర్పించుచు మగుడఁబడయుచు వర్తించుచుండెను. ఇంతియకాక, యన్యసర్వులముక్కు పైఁ'గత్తి'యనియొక టెక్కెముప్పరి నెత్తించి తనతో వాదింపఁ దివురువారలలో వాదించి వారి నోడించి పంపుచుండెను. అంప నచటిపండితులం

1. ఈ'మంచన' అనుశబ్దము 'మంచెన' అనికూడ వాడుకలోనున్నట్లు తెలియుచున్నది. బసవపురాణమున రెండుచోట్ల 'సేయుఁడు లెంకమంచెన పండితులకు' అనియును, వేఱొకచో 'శ్రీరమణుండు మంచెన పండితయ్య' అనియును ఇట్లు మార్చరాని ప్రాసాదిస్థలములయం దుండుటచే నీరూపముఁగూడ గ్రాహ్యమే. క్రేయూరబాహుచరిత్రమున 'మంచన నామధేయునన్నుం' అని పాఠముమొదల నుండుటచే నీవిషయము తెలియఁబడ దయ్యె.

డఱు నొక్కుమొగి నాతనిపైకిఁబోయి వాదించిరట! మంచనపండితుఁడు శ్రుతి స్మృతి పురాణశాస్త్రార్థ సహితముగ వారితో వాదించి అసమానప్రతిభఁగాన్పించి వారి నోడించుటయేకాక శివమాహాత్మ్యముఁ జూపింతునని అచ్చట విష్ణుదేవుని శివునకు మ్రొక్కుమని పిలిచి వారం దఱుఁ జూచుచుండగ శివునకు మ్రొక్కించెనట. అప్పటివారందఱు నాశ్చర్యపడి మంచనగారి భక్తి మహత్త్వమును బొగడుచుఁ దమయిండ్లకు నేగిరఁట!

బసవపురాణమున మంచనపండితునిఁ గూర్చినకథ యింతియ. ఈతని గ్రంథరచనఁగూర్చికాని తదితర విశేషములఁగూర్చిగాని తెలియరాదు. ఈతఁడు శ్రీపతి పండితునితరువాతను, పండితారాధ్యునికిఁ బూర్వమును వర్ణింపఁబడియుండుటచే నీతఁడు బసవనకంటెఁ గొంచెము పూర్వుఁడుగ నుండవచ్చును. శివతత్త్వసారమున నీతనిప్రశంస కానరాదు.

## మల్లికార్జున పండితారాధ్యులు

"కం. శివకవిపండితుఁ డన నీ [illegible]
యవనిం బేరందు పండితారాధ్యుని, దు
ర్భవభవ కుధరవిదారణ
పవినిం భవదూరు నెంతు భక్తి మెయిశివా!"

"మ. అవనిన్ శ్రీ శివతత్త్వసారమును బ్ర
ఖ్యాతంబుఁ గావించి, సం
స్తవముల్ పెక్కులొనర్చి యాంధ్రధరణీ
సత్కీర్తి గన్నట్టి, స
త్కవినిన్ బండిత మల్లికార్జునుని హృ
త్పద్మమ్మున న్నిల్పి, పా
ర్థివలింగాకృతి నొప్పు నిన్గొలిచెదన్
శ్రీవిశ్వనాథప్రభో!"

శ్రీమల్లికార్జున పండితారాధ్యుఁడు పండితత్రయములోఁ దృతీయుఁడు. కర్ణాటదేశమున బసవనస్థాపించినవీరశైవమతమును సంస్కరించి తెలుఁగుదేశమున శైవమతమును జిరస్థాయిగ నెలకొల్పిన మతసంస్కర్త. ప్రస్తుతమాంధ్రదేశమున నారాధ్యులమని చెప్పుకొను లింగధారుల మతిసంప్రదాయముల కితఁడే మూలపురుషుఁడు. ఈతనిచరిత్రను నీతనివెనుక మిఱి నలుబదేండ్లకు శ్రీపాల్కురికి సోమనాథుఁడు పండితారాధ్య చరిత్రమనుపేర నైదుప్రకరణములుగల ద్విపద మహాకావ్యముగ రచించియున్నాఁడు. ఈతనిచరిత్రమున కిదియే మూలము.

పాల్కురికి సోమనరచించిన తెలుఁగుకావ్యము నకు నాతని బసవపురాణమునకుఁబోలె గురురాజనుకవి సంస్కృత భాషాంతరీకరణమును, నీలకంఠుఁ డనుకవి క్రీ.శ. 15 శతాబ్దమున కన్నడ భాషాంతరీకరణమును గన్నడదేశమునఁ గావించిరి. మఱియుఁ బదునాల్గవ శతాబ్దమున శ్రీనాథుఁ డీద్విపద యారాధ్యచరిత్రమునే పద్యకావ్యముగా రచించినట్లు లోకమున నున్నది. కాని యది యిప్పుడుఁగానరాదు. కావున కాలమందును, ప్రమాణమునందును సోమనాథుని గ్రంథమే గ్రాహ్యమనుట నిర్వివాదాంశము. మఱియు 1921 సంవత్సరమున నాంధ్ర సాహిత్య పరిషత్తువారు పండితారాధ్యుని శివతత్త్వసారమును శ్రీలక్ష్మణరావుగారి పీఠికతోడఁ బ్రకటించిరి. దానివలనఁగూడఁ బండితుని వృత్తాంత మెంతయో తెలియనగును.

ఈతఁడు గోదావరీమండలమున భీమేశ్వరమున భీమేశ్వరలింగమునకుఁ బురోహితుఁ డగు భీమనపండితునకును గౌరాంబకును బుత్త్రుఁడు. ఈతఁడే సుప్రసిద్ధుఁడగు వేములవాడ భీమన యగునేమో యను సందేహము పొడముచున్నది. భీమకవియు దాక్షారామ నివాసి. దాక్షారామభీమేశనందనుఁడని చెప్పుకొని యున్నాఁడు. మఱియుఁ బండితునివంటి మహనీయుఁడు జన్మించుట కేవల మీశ్వరప్రసాదియగు భీమనకుఁ గాక మఱియొకనికిఁ జెల్లదు. అయినను భీమనచరిత్రమున నాతఁడు పురోహితుఁడుగా నున్నట్లుగాని యతనికి భార్యాపుత్త్రాదులున్నట్లుగాని తెలియుటలేదు. ఏది యెట్లున్నను నూహ కభ్యంతర ముండఁగూడదుగదా!

ఈతఁడు ఋగ్వేదియనియు, గౌతమ గోత్రజుఁడనియు చతుర్వేదసారనిర్ణయమను నొక సంస్కృతపుస్తకమునందుఁ జెప్పఁబడినది. ఆరాధ్యచరిత్రమున నీవిషయమై యేమియుఁ జెప్పఁబడలేదు. శ్రీలక్ష్మణరావుగారు పై పుస్తకమెంతవఱకుఁ బ్రమాణమో చింత్యమనిరి. కాని

రమారమి నూటయిరువదియేండ్లక్రిందటనుండిన ములుఁగు మృత్యుంజయారాధ్య కవి తన గౌరీపరిణయ కావ్యము నం దిట్లు చెప్పియున్నాఁడు:

శా. శ్రీమద్గౌతమ గోత్రజుం
గురువరుఁ శిష్యప్రశిష్యాన్వితుఁ
శ్రాస్త్రాది...రు బుజ్జినగ మశా
ఖాధ్యక్షునిం బండిత
స్వామిం వంశగురుండుగాఁ బడసె శై
వజ్ఞానసంసిద్ధిచే
భూమిం బావనసాంప్రదాయ మగుచుఁ
బొల్పొంచె విఖ్యాతితోఁ.

—ప. ఆ.

కావున నిది వంశపరంపరాగతమైన వృత్తాంత ముగానఁ బ్రమాణముగాఁ గొనవచ్చును.

భీమేశ్వరమునొద్దనున్న కోటిపల్లి నివాసుఁడైన ఆరాధ్యదేవర యాతని గురువు. ఆరాధ్యదేవర గురువు అవాంతరయ్య. పండితయ్య ఆరాధ్యదేవరయొద్ద శైవ దీక్షనొంది శైవమతరహస్యములఁ జక్కఁగాఁ దెలిసికొని, శైవాచారపరాయణుఁడై విలసిల్లుచుండ నచటిబ్రాహ్మణులువచ్చి యాతని శైవాచారములను నిందించిరి. అంత పండితుఁడు వారికి విభూతిమహిమ, రుద్రాక్షమహిమ, గురుపాదోదకమహిమ, లింగార్చనమహిమ, ప్రసాద స్వీకారమహిమ, శ్రుతిస్మృతిపురాణోక్తి సహితముగ బోధించి, ఘంటాకర్ణాదిపురాతనభక్తచరిత్రములఁ జెప్పి వారిని మెప్పించెను. అటుపైని శివతత్త్వసారమను కృతి రచించి, దాని ననుసరించి నడచుచుండెను.

అంత పోరండ్ల సూరసానమ్మయను భక్తురాలును, బెలిదేవి వేమనారాధ్యుఁడును మతిగొందఱు జంగములునుఁ బండితుఁ జూడవచ్చిరి. అప్పుడు పండితుఁడు శివపూజాసమయమున నున్నను జంగములు లింగరూపులు గాన వారినిఁ బూజించెను. వారు పండితునకు బసవేశుమహిమలఁ దెలిపిరి.

అంత సవదవోలు (చందవోలు) రాజగువెల నాఁటి చోడనిగురువు బౌద్ధపదాచార్యుఁడను బౌద్ధుఁడు, పండితుని శైవమునకు సహింపఁజాలక రాజును సభఁ జేయఁ బ్రోత్సహించి పండితు నటకు రప్పించెను. అంత పండితు లక్కడికు వచ్చిన సర్వమతములవారి మతములను ఖండించి శైవమతము నెలకొల్పెను. పండితుఁ డనేకప్రతిజ్ఞలఁ గావించి, 'రుద్రమహిమ' అనుకృతి నచట రచించెను. తరువాత బౌద్ధుఁడు పండితుని నిందించినందులకై యాతనిఁ బండితుని శిష్యు లిరువురు చంపిరి. రాజది తెలిసికొని పండితుని విచారింప నాతఁడు నేనే చేసితినని నేరమంతయుఁ దనమీఁద మోపుకొనెను. అంత రాజు పండితునికన్నులు తీయించెను. పండితుఁడు రాజునకు శాపమువెట్టి శిష్యసహితముగ నమరావతికిఁ బోయెను. చందవోలులో నున్నప్పుడు లింగోద్భవదేవుపై 'లింగోద్భవదేవగద్య' యను కావ్యమును బండితయ్య రచించెను.

అమరావతిఁ జేరఁగనే పండితుఁడు శివనింద విన్న పాపమును, చోడునితో సంభాషించినపాపమును పోవుటకు సహస్రగణనామములఁ బఠించెను. అంత పండితుని కన్నులు తిరిగివచ్చెను. అచ్చటనే 'అమరేశ్వరాష్టకముఁ' జెప్పెను.

పండితుఁ డమరావతిలో నుండఁగాఁ బసవేశ్వరుఁ డతనికి భస్మము పంపెను. అచ్చటనే యాతఁడు కర్ణాట కవిత్వముఁ జెప్ప మొదలిడెను. తరువాతఁ బండితుఁడు బసవేశ్వరునిఁ జూడవలయునని కల్యాణపురమునకు బయలుదేరెను. దారిలో నిడుముగులనుచోటఁ దనశిష్యుఁడైన దోనయ్యగారికి అన్నయైన వీరచాకిరాజయ్యగారిచే గౌరవింపఁబడి పానుగంటికిఁ బోయెను. ఇచ్చట యుద యనుఁడను రాజు పాలించుచుండెను. పింగళి గోవింద ప్రధాని యాతనిమంత్రి. ఆతఁడు పండితభక్తుఁ డగుటచేఁ బండితుని గౌరవించెను. ఇచ్చట ధవళేపునామయ్య యను భక్తుఁడు, పండితసేవలో మైమఱచి రాజుసేవ నే యకుండెను. రాజుకోపమున నాతనిఁ బిలిపించి యడుగ 'దేహము మీదిగాని ఆత్మమీది కా' దని చెప్పి గుడిశిఖరముపై యురిపెట్టుకొనెను. పండితుఁ డారాజునకు శాపమిడి పయనము సాగించెను.

వనిపురమున శంకరయ్యయనుభక్తునిచేఁ బూజలఁ గొని కల్యాణకటమునకు బయలుదేరఁగానంతటఁ బూర్వ

పెంచిమిశ్రితముల క్రింపటనే బసవన లింగైక్యముఁ జెంది నట్లు తెలియఁ బండితుఁ డమితఖేదము నంది మిక్కిలి ప్రలాపించెను. అంతట బండితుఁడు శ్రీశైలమునకుఁ బోవ దలఁచి వెల్లటూరియొద్దకు వచ్చి తన ప్రియశిష్యుఁ డగు పోతయ్యను శ్రీగిరిప్రదక్షిణముఁ జేసి తన ప్రవేశమాస్తి కొంచెముగఁ జెప్పె యాతనికి 'పర్వతవర్ణనము' నుడివెను. పోతయ్య గిరిప్రదక్షిణముఁ గావించి వచ్చినతోడనే పండితయ్య భార్యాపుత్రాదులతో వెల్లటూరిలో లింగైక్యముఁ జెందెను.

పండితునికాలము శ్రీ లక్ష్మణరావుగారే నిర్ణయించిరి. ఆరాధ్యునితో సమకాలికులగు (1) వెలనాటి చోడుఁడు—(1163-1180), (2) ఉదానవనీశుఁడు—(1162), (3) బిజ్జలరాజు (1171), మొదలగువారికాలములఁ బట్టి ఆరాధ్యుఁడు (1120-1190) ప్రాంతముల నుండె నని తేటపడుచున్నది.

ఆరాధ్యుఁడు వ్రాసిన పై గ్రంథములలో శివతత్త్వసార మొక్కటియే చిక్కుచున్నది. కన్నడభాషలోని తన 'గణసహస్రనామ' అనుకావ్యముగలదని కన్నడకవి చరిత్రమందున్నది. శివతత్త్వసారములో నేఁడు ప్రకటింపబడినదానిలో 489 కందపద్యములున్నయవి. ఇవియొక సహస్రముగా నుండియుండవలెనని కొందఱు పండితుల యభిప్రాయము. ఇదియే పండితారాధ్య చరిత్రమునకు మూలము. ఇందులోని విషయములును, సంక్షేపముగాఁ జెప్పఁబడినభక్తుల చరిత్రములును బండితారాధ్యచరిత్రములో విపులముగా వర్ణింపఁబడినవి. ఇందలికందపద్యములనే సోమనాథుఁడు ద్విపదలలో మార్చుచేయక వాడియున్నాఁడు. ఇందు మకుటనియమముగాని, సంఖ్యానియమముగాని లేకపోయినను, నాకాలమున నిది శతకముగా వ్యవహరింపఁబడుటచే నిది యాంధ్రశతక వాఙ్మయమునకుఁ బునాది యని చెప్పవలెను. మఱియు నన్నయ తిక్కనల నడిమికాలమునఁ బుట్టినగ్రంథములలో నొకటి యని స్పష్టముగఁ జెప్పఁదగినదియై, సలక్షణశైలిని వ్రాయఁబడి శతక రాజములలో నద్వితీయమై యలరారుచున్నది. ఇయ్యది బసవని లింగైక్యమునకు, ననఁగా, క్రీ. శ. 1167 తరువాత రచింపఁబడినది.

పండితుఁడు భగవదంశసంభూతుఁడు. 'శివభక్తి, సంపూర్ణసర్వజ్ఞత, భృంగినిష్ఠ, దూర్వాసాదులశాపశక్తి, అక్షపాదాదుల యతులితవాగ్విలక్షత, ఉపమన్యుసద్గురుత్వంబు, రుద్రప్రమథగణాధిపుల సహజస్వకీయ ప్రసాదైకనిరతి, ప్రాక్తన నూతనభక్తగణముల స్తోత్రపుష్ట ప్రత్యయారూఢమహిమ, వీరభద్రుని శౌర్యము' నను నీ గుణము లాకమూర్తిగా నీశ్వరాజ్ఞవలన జన్మించినాఁడు. బసవన, జంగముతీసి తినవాదములోఁ గలియు మనఁగా 'శక్తిమీఱి నలపు బ్రాహ్మణ్యంబుతోఁ బొత్తు బాయలేదు నేను బసవలింగ' అని ప్రత్యుత్తర మిచ్చెనఁట. దీని వలన నితనిస్వమతాభిమానము, బ్రాహ్మణ్యాభిమానముఁ గూడ స్పష్టపడుచున్నవి.

ఈతఁడు వానసవంశ బ్రాహ్మణుఁ డైనట్లు చంపకోలు కైఫీయతువలనఁ దెలియుచున్నది.

కవులలోఁ గవియై, పండితులలోఁ బండితుఁడై అపారమహిమాన్వితుఁడై, యత్యద్భుతశక్తులఁ జూపి, యాంధ్రదేశమున శైవమతమును జిరస్థాయిగ నుండునట్లు చేసిన శ్రీమల్లికార్జున పండితారాధ్యుఁడు, సర్వాంధ్రదేశీయులకు పరమపూజ్యుఁడు. ప్రాతస్స్మరణీయుఁడు. ఆంధ్రదేశీయు లీతనిచరిత్రము శ్రద్ధతోఁ బఠింతురుగాత! సోమనాథుఁడు వ్రాసిన యీతనివర్ణనతో నీచరిత్ర ముగించెదను.

"ద్వి. శ్రీశైవసమయదేశికచక్రవర్తి
పాశవిమోచన పటుకళామూర్తి
శుంభద్దిగంత విస్ఫురితసితకీర్తి
శాంభవదీక్షాభి జాతానురక్తి
ఉత్తమోత్తముఁడు, సంయుతవీరభక్తి
వృత్తచిత్తుఁడు చతుర్వేదార్థవేత్త
గహనసంసృతి శిరఃఖండనహేతు
మహితపంచాక్షరమంత్రసిద్ధుండు
వేదాగమపురాణ విహితశాస్త్రోప
పాదితరుద్రాక్షభసితభూషణుఁడు
యమనియమాది వ్రతాచారసార



శ్రావస్తియొక్క సింహద్వారము






బుద్ధాలయము. (జేతవనము).

శమదమోత్కృష్ట నిష్ఠాగరిష్ఠుండు,
అంతర్బహిర్ధ్యాన యజనవంతుం డ
వాంతరయ్యయనంగ హారగణాఢ్యుండు,
వారిశిష్యుండు దుర్వారసంసార
దూరవీరవ్రతోద్ధార వర్తనుండు,
శైవధర్మోత్తమాచార్యుండు సతత
దైవంబు నద్వైత తత్త్వతత్పరుఁడు
న్యాయవైశేషికోదాత్త శాస్త్రను
పాయదర్శన పరిపాలనక్షముఁడు,
స్వకులావలోకనో త్సారితశిష్య
నికరమలత్రయనిరసితేంద్రియుఁడు,
తంత్రాధిగతవీరతంత్రసుతంత్ర
మంత్రాధిగతరాజమంత్రసిద్ధుండు
వేదవేదాంత వివిధపురాణోప
పాదిత కేవలభక్తివర్ధనుఁడు
పండితనతపాదపద్ముండు, సుకవి
మండలివిబుధ సమాజపూజితుఁడు
ఆరూఢిఁ గీర్తిశుఁడగు కోటిపల్లి
ఆరాధ్యులనఁగ లోకారాధ్యమూర్తి
అసమతదీయలోకారాధ్యశిష్య
విసరాగ్రగణ్యుండు వీరవ్రతుండు
చను 'సరుద్రో నాత్ర సంశయో' యనఁగ
జనియించినట్టి సాక్షాద్రుద్రమూర్తి
పశుయోగవాదాది పరవాది విసర
విశసన ప్రత్యక్ష వీరభద్రుండు
దండితాఘుఁడు, జగత్పావనకార
ణుండు విశ్రుత జగన్నుతసితకీర్తి
అధికశాపానుగ్రహాసమగ్రబలస
మధిగత దివ్యపంచాక్షరీవేత్త
వాదదూకానీకవాగ్బంధనక్రి
యావిశారదుఁడు, లోకారాధ్యమూర్తి
పరగి 'శైవే దశ ప్రత్యయా' యనగ
పరువడిఁ జను దశప్రత్యయాన్వితుఁడు
ధన్యుండు, దేశికోత్తముఁడు, లోకైక
మాన్యుండు, పండిత మల్లికార్జునుఁడు"

(పండితారాధ్యచరిత్రావతారిక)



# ప్రేమ

('స్కాట్' మహాశయుని పద్యఖండమున కనువాదము)

బాలాంత్రపు సత్యనారాయణరావు గారు

విమలమగుప్రేమము ప్రశాంతిసమయ మం
గొల్లబోయని పిల్లనగ్రోవి నూఁదు [దు
రౌద్రభూయిష్ఠఘోరసంగ్రామ మందు
ధీరుఁడై పోరు యోధుని తేజి నెక్కి
లచ్చి నృత్యంబుఁ గావించు రచ్చలందు,
కమ్రవసనాదిభూషలఁ గానవచ్చు
పామరజనంబు నివసించు పల్లెలందు
నవ్యశాద్వలభూముల నాట్యమాడు
ప్రేమయే శిబి రాస్థాన సీమ లేలు!
ప్రేమయే భువి మానవధామ మేలు!
ప్రేమయే దివి దేవతాధామ మేలు!
ప్రేమస్వర్గంబు, స్వర్గమే ప్రేమ మరయ !




పిడమర్తి సత్యనారాయణమూర్తి గారు, బి. ఏ. [సారస్వత సమాజము]

శ్లో. సర్వథా వ్యవహర్తవ్యం కుతో హ్యవచనీయతా,
యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః.

—భవభూతి.

ఆంధ్రభాషా చరిత్రమున నేఁడొకనూతనాధ్యాయ మారంభ మగుచున్నది. మార్పు రానున్నదని గలుగునై పరీక్ష్యము లెల్లను నేడును గోచరించుచున్నవి. ఇంతవరకును మనకవులు సంస్కృతమునందు వివరింపబడిన సాంప్రదాయములను శిరసావహించి పనిచేసిరి. కాలము గతించినకొలదిని మార్పులు రాకతప్పదు. మూడు శతాబ్దములు నిరాఘాటముగ సాగినప్రబంధముల పలుకుబడి సన్నగిలినది. స్వేచ్ఛయెడ అభిమానము హెచ్చుటయేకాక ప్రాచీనసాంప్రదాయములయెడ గౌరవము తగ్గెను. అందుచే ప్రాచీనసాంప్రదాయానురక్తులకును స్వేచ్ఛానురాగులకును సంఘర్షణము సంభవించినది. ఇట్టిసమయమున జిందిపడిన నెరుసులలో నీకృష్ణపక్షమొకటి.

ఇది భావకవితాలతపై పూచినపువ్వు. దీనినే యాంగ్లమున 'లిరిక్కు' అనియందురు. ఆంగ్లమునందలి భావకవులలో నలువురు ముఖ్యులు గలరు. వారు బైరను, షెల్లీ, కీట్సు, వర్డ్సువర్తుఅనువారు. బైరనువాణి యుద్ధృతశక్తి సమన్వితమైనది. సంఘముచేసెడి దురంతకార్యముల నతడు ప్రళయఝంఝూనిలప్రేరితోత్తుంగ తరంగగంభీరభీషణములైన భాషణములలో వెలువరించి ఆంగ్లభాషను, తనభావములను అమృతములుగా నొనర్చెను. షెల్లీ కూడ బైరనువలె సంఘముయొక్క నికృష్టకార్యముల సేవగించి కష్టపరంపరలకు లోనయ్యెను. ఈతనిభావములు ఆకాశమధ్యమున కెగిరిపోయి పంచభూతములందును లీనమై మధురగానముగా స్రవించినవి. కీట్సు ప్రకృతియొక్క సౌందర్యభావము నుపాసించి పురాణముల గొప్పతనము నాశించి యమరుడయ్యెను. వర్డ్సువర్తు సామాన్యులసుఖదుఃఖములనుండి తన యితివృత్తముల నేరి తీసికొని వానికి వలయు నందచందముల గల్పించి నిత్యజీవనమునందు నిరవధికసౌఖ్యమును జూపెను. ఈనలువురును జీవితమును నాలుగు దిక్కులనుండి చూచి జనుల కుపకారముచేసిరి. ఆంధ్రమునందు వారిని బోలువారు నేఁ డుదయించలేదు. ఇప్పటివారు అట్టి మహాపురుషుల యాగమనమునకై వలయు స్వాగతోపచారములను సలుపుచున్నవారు మాత్రమే.

భావగీతములందలి వస్తు వొక్కయభిప్రాయముపై నాధారపడియుండును. పురాణములందును, ప్రబంధములందును కవికిని పాఠకునకును మధ్య పాత్రములు కొన్ని నిలచి కవియొక్క భావములను పాఠకునకుఁ దెలియజేయును. అందుచే నాగ్రంథములందున్న యభిప్రాయములలో నేవి కవియభిప్రాయములో యేవిపాత్రలయభిప్రాయములో మనము సులభముగ గ్రహింపలేము. వానియందు కవి ప్రచ్ఛన్నుడై యుండును. భావకవిత్వమునందు కవి పాఠకునితో ప్రథమైకవచనమున ప్రసంగించును. మనల నాతడు తనయాంతరంగిక వర్గములో జేర్చికొని తనసుఖదుఃఖములను మనకు జెప్పుటయేకాక తన జీవితమునందలి సూక్ష్మవిషయముల నన్నిటిని మనకు జెప్పుచుండును. అందుచే నీతని కవిత మనకు బూర్తిగ నర్థము కావలెనన్నచో కవియొక్క జీవితము మనకు తెలియవలెను.

ఈగ్రంథమును రచించిన కృష్ణశాస్త్రిని నేను స్వయముగ నెరుగుదును. సంఘమునం దున్న ప్రఢాతనిచరుకు

దనము, చిరునగవుచే మండితములగు విశాలనయనములు, బద్ధసూక్ష్మతనెరింగించు చిహ్నములచే నొప్పుఅతనిఫాల తలమును ప్రేక్షకుల నాకర్షించుటయేకాక అతఁడొకయానంద పురుషుడను భావమును గలుగజేయును. అతడు మాట్లాడ దొరకొనగనే యాభావము ప్రేక్షకునందు దృఢపడును. అంగుచేసని డతని భావగీతముల నన్వయముచేసికొను నభిలాషగలవారై కృష్ణపక్షమును గరమునగీలించి తెరచి పఠింప నుద్యుక్తుడగుచున్నాడు. కాని పినరకపోయినతరువాత—అవసరము లేదు సగమునరకుఁ జూచిన తరువాతనే—సాహితీసమితిసభాపతి యన్నట్లు 'దీర్ఘనిశ్వాసము' వెడలును. కారణమేమి? శాస్త్రి చదివినపుడు వినిపించలులూపితిమే? యని చదువరి ప్రశ్నించును. అంతకులాసాగాతిరుగాడు శాస్త్రి కిదుఃఖపూర్ణమగుహృదయమెక్కడిది? కవియగు శాస్త్రికిని, గాయకుడును మిత్రుడునగు శాస్త్రికిని భేద మున్నదాయేమి? యను సంశయముతో నుండును చదువరి.

ఆకులోఆకునై పూవులోపూవునై
కొమ్మలోఁకొమ్మనై నునులేత రెమ్మనై
*　　*　　*　　*
ఆకలా దాహమా చింతలా వంతలా
ఈకరణివెఱ్ఱినై యేకతమదిరుగాడ
ఈయడవి దాగిపోనా　　——యెట్లైన
నిచటనే యాగిపోనా?

(పుట 10)

అని యడుగు సుకుమారకవికి

క్రౌర్యకౌటిల్యకల్పిత కఠినదాస్య
శృంఖలములు తమంతనె చెదరిపోవ
గగనతలము మాఱ్మ్రోగగ గంతమెత్తి
*　　*　　*　　*
చిత్తమానందమయమరీచికలసోల
హృదయ మానందభంగమాలికల దేల(?)
కనుల నానందజనితాశ్రుకణము లూర
జగమునిండి స్వేచ్ఛాగాన ఝరుల నింతు.

(పుట 11)

*　　*　　*　　*
కలవిహంగమపక్షమున లదేలియాడి
తారకామణులలోఁ దారనై మెరసి
మాయమయ్యెదను నామధురగానమున
నవ్విపోదురుగాక నా కేటిసిగ్గు?
నాయిచ్ఛయేకాక నా కేటివెఱపు?

పుట 18

అని యెలుగెత్తిచాటు కార్యనిశ్చయునకు ఈ జడత్వ మెక్కడిది? మానవుని సుఖదుఃఖములను, ఆశానిరాశలను లిన హృదయక్షేత్రమున ఓంఓంపజేసికొని విశ్వము యొక్క యాక్రోశమును గరుణరసమై ప్రవహింపజేయ వలసినవని కేవలము జడత్వమునకును నిర్వేదమునకును స్థానమిచ్చి దుఃఖించుట అసమంజసము.

మీరెమనసారగా నేడ్వ నిదు నన్ను
నన్ను విడువుడు..........................
*　　*　　*　　*
ఈమహానందవీచికాస్తోమసోలి
కాగ్రముల నింక నే నాట్యమాడలేను,
నేను చిరునవ్వు పెదవుల నిలుపలేను.

(పుట 74)

అని విచారించుచున్నాడు. ఒక మానవుని విచారమును జూచి మరియొకడు విచారించుట సహజము. కాని ఆ విచారమునకు హేతువగుకార్య మాతని శక్తికిని యిచ్ఛకును మించినదై నింద నాతనిపై మోపకున్నచో మన సానుభూతి నాతడు పూర్తిగా చూరగొనును. అటుగాక నిర్హేతుకముగ దుఃఖించుచు వెఱ్ఱివానివలె సంచరించు నాతనితో మనకు సానుభూతియుండదు. అపుడు:

నన్నుగని యేరు జాలిచెందంగ వలదు

(పుట 71)

అని మనల నాతడడుగ నవసరముండదు. పైపాట ముతో నారంభమగు దుఃఖమున కర్థము నాకు తెలియుటలేదు. అతడు 'శోకభీకరతిమిర లోకైకపతి' యట; 'కంటక కిరీటధారి' యట; 'పొంగి యుప్పొంగి యు

ష్పించి' విలపించుచువాడటు; 'కన్నీటి సరులదొంతరలు' ను, 'నిరుపమనితాంత దుఃఖంపునిధులు'ను గలవాడట. అయిననేమి? అతని కంటెకన్న నింకను ఎక్కువయుండ వచ్చును. అవిచెప్పినంగుణలన నొలికిన కవిత్వమేమి? భావమేమి? అట్లు తమ దుఃఖమే ఆనందమని యెంచువారుందురనియా కవి యుద్దేశము? అవు నట్టివారున్నారు. గ్రీకుపురాణములందున్న హెకేబు దీనికిప్రమాణము. ఆమె నిరంతరచింతాక్రాంతచిత్త. చీకటిగుహలందు నివసించుచు విచారమున గాలము నామె వెళ్లబుచ్చును. అట్టివారి జీవితమునందును దుఃఖమునందును కవితాయోగ్యమగు వస్తు వుండదు. వారిదుఃఖాంధకారమున భవిష్యత్తు శూన్యమైనది. అట్టివారిని జూచి మనమేల జాలిచెందవలెను? కృష్ణశాస్త్రిదుఃఖము నట్టిదే. లీలామాత్రమగు నీజగత్ క్షేత్రమును అకారణముగ నపుడపుడు బాధించి నొంపు సంగతులవలన నాతనిదుఃఖము జనించుట లేదు. విపక్రిమిన్యాయముగ నాదుఃఖ మాతనికి సుఖప్రదమగు చున్నది. అది మానవజాతి కారోగ్యము నిచ్చువిషయమునుగాదు; ఆత్మను ఫలవంతముగజేసి ఆనందము నిచ్చువిషయమునుగాదు. ఈసమితి సభ్యుడేయగు సత్యనారాయణశాస్త్రి గూడ తనకవితలో దుఃఖమునకు దావు నిచ్చియున్నాడు. దుఃఖపరంపరలతో నవసిపోయిన యాతని సుకుమారహృదయము

> ఈనవవేణుదండ మిటు
> లేటికి చెక్కెదవేల చిల్లులై
> పోనొగిలించెదం చడలి
> పోయితి; వ్యర్థపు టూర్పుగాడ్పులన్
> గానముగాగ మార్చుటకె
> కాయని యిప్పుడు నేగ్రహించితిన్;
> కాని విశీర్ణ మీహృదయ
> నాళ మిటు ల్పలికించుచుపో? ప్రభూ!

అని యాక్రోశించినది. ఇది యీహప్రపంచమున సంభవించిన కష్టములకై విలపించుటగాదు. ఈదుఃఖతిమిరము ఆశాకిరణప్రసారము లేక యమలోకవాసనలతో నిండియున్నదికాదు. హృత్పిండమును చిదిపివేయు దురంతదుఃఖపరంపరలచే విసిగి వేసరినకవి ధీరుడై యోధుడై వానినెల్ల నోర్పుతో సాధించుచు "వ్యర్థపు టూర్పుగాడ్పులన్ గానముగాగ మార్చుటకెగా" యని ధన్యవాక్యములను బలికి విజయోల్లాసియై, వినమ్రుడై మనమ్రోల నిలచినాడు. ఇతనికష్టములను మనము సానుభూతిచిత్తులమై విననలతుము. ఇతని ధైర్యమును నిశ్చయమును ప్రశంసింపవలతుము. కాని అన్యము లెట్లు మన మనము నాహరింపగలుగును?

ఏకవిజీవితచరిత్రమును త్రిప్పిచూచినను అందలి యొక్కొక యధ్యాయమున నొక్కొక భావము తీవరించి యుండును. ఆతని రచనలం దదియే స్థాయీభావము. మిగిలిన భావములు దానిముందు ఛాయామాత్రములు. ఈకవియం దట్టిభావముయొక్క నిలకడ కనిపించుట లేదు. ఒకమారు

> ఏవిరామ మేనిలేని యీశుభోత్స
> వప్రణయకేళికామోద భార మింక
> నేను వహియింపలేను; జీవింపలేను.

(పుట 74.

అనియు, మరొకమారు

> స్వాదుసంగీతకలనాలసద్విపంచి
> గరమునం దుంచి జీవితభరము వాయ
> బాడుకొమ్మంటి తియ్యనిప్రణయగీతి.

(పుట 75)

అనియు గానముచేయు నీకవికి జీవితము కష్టముగ నున్నదియో, ఆనందకరముగ నున్నదియో యెరుంగుట కష్టము. పోనీ సంశయోపేతుడా యని చూచినచో నాతనియున్నితము సుకుమారమునగు హృదయమును గలంచుచున్న తలపులైనను మనకు ఎరుక లేదు. (కన్నీటినుండి పునర్ముద్రితములగు రెండుమూడు కావ్యములు మాత్రమే యీభావమును వెల్లడించుచున్నవి.) దీనిని బట్టిచూడ నితనివిషయము దుర్గ్రాహ్యమగుచున్నది. అట్లుగాదేని యీపుస్తకమునందు బింబితములగు భావము లేమియు నాతని విచారము నరికట్టకపోవుటయేకాక ఆతని యనుభవమునగూడ లేనట్లగపడును. ఇట్లు పరస్పరసామ్యము

నందజాలని భావప్రకటనము విశ్వాసార్హము (sincere) కాకపోవుటచే ఉత్తమకవితాలక్షణము కాజాలదు. ఒకయూర్పునసే రెండుపుటలమూరమైనను లేకుండగనే

రాజరాజేశ్వరులకు నలభ్యమైన
సదమలామూల్య తారకానదృశదివ్య
మణివిరాజిత కల్యాణమకుటరాజ
మిడితి నామస్తకాన;

అనియు (పుట 75)

కంటకకిరీటధారినై, కాళరాత్రి
మధ్యవేళల, జీమూతమందిరంపు
గొలుపుకూటాల, నేకాంతగోష్ఠిదీర్చి.

(పుట 71)

యందుననియు వ్రాయ దటస్థించు టెట్లు? పైన చెప్పి నట్లు ఏదో యొకభావప్రాబల్యము లేకపోవుటే దీనికి గారణము.

దీనిని బట్టిచూచినచో నీకవికిగల స్వేచ్ఛాభిలాష యెంతవరకు నిజమని యాలోచింపవలసివచ్చును. నేటి కవులందరును స్వాతంత్ర్యాభిలాషుల మని కంఠశోషతో జాటువారే. కాని వీరు చేసిన సాహసకృత్యము లేమి? తరతరములనుండి మనసంఘమునందు వేరులు నాటుకొని ప్రబలుచున్న దురాచారములను, అనర్థకభావ సముదాయమును, బ్రతిఘటించి వీరులై నిలిచినవారు చాల అరుదుగా నున్నారు. బైరను షెల్లీలవలె తమ యభిప్రాయ ప్రకటనము కొరకు భౌతికసుఖములను, సర్వసంపదలను త్యజించి మాతృదేశముకొరకును మానవకోటికొరకును ప్రాణసమర్పణముచేసిన కవులును మనయందు ఒకరిద్దరి కంటె లేరు. మరి వీరిస్వాతంత్ర్య మెట్టిది? తెలియుట లేదు. తొంబదిమూరు పుటలుగల యీగ్రంథమునందు వీరరసప్రధానమగునట్టిదిగాని,అణచివేయుటకువలనుగాని వీరునియాత్మ కష్టపరంపరా భారమును ఓర్పుతోను, క్షమతోను సహించి తనయందలి దివ్యగుణమును బ్రకటింప విజయముతో బయికివచ్చు సునమగు విషయముగాని లేదు. మరి యీస్వేచ్ఛాభిలాష యెట్టిది?

కవిత స్త్రీవంటిది. రెండును కోమలములు, పవిత్రవంతములు. స్త్రీకి సౌందర్యము భగవత్ప్రసాదితము. అతని దయవలనవచ్చిన యాసౌందర్య మలంకారాదుల వలన నెక్కుడ చేయవచ్చును. ఈ రెండవది మానవునకు ప్రయత్నసాధ్యము. అటులే కవితకు భావము ముఖ్యము. అది తెచ్చుకొనుటకు కష్టమైనది. పవిత్రమగు జీవనము వలనను, తపస్సువలనను వీనిరెంటిని మించి భగవంతుని దయవలనను సాధ్యమగునది. ఆభావమునకు మనోహర మగు రూపమునిచ్చునది భాష. ఇయ్యది సాధనచేసాధ్య మగునది. కొందరు తలచినటుల భావమునుబట్టి భాష వచ్చుననుట పొరపాటు. భాష సాధనచే సాధ్యమగును. మహాకవి తిక్కన భాషయందు లేని మృదుత్వముతిమ్మన యొద్ద చేరినది. రామరాజభూషణునిభాషలో మోహన కరమగుధ్వనియున్నది. వారిభావములు మాత్రము సామాన్యములు. తన్మయత్వము జెంది స్వప్నవీథుల దిరుగాడి యానందముతో వారు మాటాడలేదు. మాటలాడ లేక పోయిరి.

కృష్ణశాస్త్రి వాడిన భాషయందు కొంచెము సాధన గోచరించుచున్నది. మన భావకవులలో జాల మంది రెంటికిని జెడిన రేవళ్లగుచున్నారు. చదువరుల మనస్సు రంజిల్లజేయగల భావములను వారికి భగవంతుడు ప్రసాదింపలేదు. కాని లోపల యుబలాటము లావగుటచే వారు ముద్రణాలయమును ప్రవేశించవలసిన దురవస్థ ప్రాపించుచున్నది. అట్లని వారు భాషాసైపుణ్యము నైన జూపగలరా? లేదు. ఆ విషయమున దగు సాధన యుండదు. వారి చేతకానితనమునకును, సోమరితనమునకును మాత్రము మనము బాధపడుచున్నాము. శాస్త్రి యీతెగకు జెందడు. ధ్వనిగల కవిత యితనిది. కాని యిందుభావస్ఫురణము తక్కువ. రాయప్రోలు సుబ్బారావు వలె

ఎండినబీళ్లయందు నుద
యించిన పచ్చిక కండ్ల పండువై
యుండగ జూడియాలు తల
లూపుచుబోయెడి; క్రొత్తనీటిచే
నిండె తటాకగర్భములు
నిష్కుటము ల్గడుశ్యామలంబులై

మెండుకొని నవ్వఁజే మొగిలు
మేసె ప్రభాతములందు కొండలఁ.

అనువర్ణిం 'చూడఁగాలు' 'క్రొన్నురువు మీఁగడ తెప్పలు' మొదలగు పదముల ప్రయోగముచే పదునితియందు వివిధములగు భావముల నుదయింపజేసి యానందము పుట్టించు శక్తి యితనియందు దక్కును. కాని యితని పదముల పొందిక గంభీరమైన శ్వాసతో నిండి చదువరి నీచివరనుండి యాచివరకొక్కయూపున గొంపోవును. చూడుడు.

అమృతగాన
మధురమందాకినీభంగ మాలికాంబు
శీకరవితానమోహన చిత్రనటన
మెన్ని యెన్ని రీతుల జూపుచున్న వారో?

* * * *

ప్రాజ్యపీఠపురీ మహారాజ్య భాగ్య
లక్ష్మి కొలువుదీర్చు చిరత్నరత్నఖచిత
భాసమానకల్యాణ సింహాసనమ్ము;
అది వెలమ శౌర్యమూర్తి రణావనీవి
హారవిక్రమ కేళికానంతరమ్ము
శాంతినుండు విలాసవిశ్రామవేది;.
అది సభాసీనసకలబుధావతంస
ఘనకవీశాన విజ్ఞానకాంతి మత్ప్ర
సన్న వీక్షణస్నాపిత స్వర్ణపీఠి;
అది మహీపతి రామరాయావనీంద్ర
కరకమలవీజ్యమాన చామరసమీర
పులకిత భవన్మృదుశరీరభూషితంబు.
(పుట 90)

వికృతక్రూరక్షుభిత మృత్యుకఠోర
వికటపాండురశుష్క వదనదంష్ట్రాగ్నిలో
నవ్వేలా?
(పుట 64)

కాని దీనియర్థ మేమి?

అవసరమైనవు డెక్కడికక్కడ విరిగిపోయి అర్థమును సులభగ్రాహ్యముగను హృదయమునకు దట్టినట్టులును జేయగల చిన్నిమాటల నుపయోగించుటకూడ నితనియందుకలదు.

కరము కరమున గీలించి కలసిమెలసి
మన్న సహధర్మచారిణి, మధురమధుర
మూర్తి, ప్రియురాలు, సఖురాలు, ప్రూర్ణ [రాగ
కలిత, నాదుఃఖ మసుపులే తొలగిపోవ
వీడిపోవునేమోయను వెరపువలన
నాకు మరణమ్ము వలదనినాను;—
(పుట 91)

చూచితిరొ లేదొ చిన్నికృష్ణునిసొబంగు(?)
పెదవి చివురుసంజల నరవిచ్చునవ్వు
వెన్నెల, చలించు తుమ్మెదబెళుకుచూపు,
లోలపవనచాలిత కుటిలాలకమ్ము.
(పుట 30)

ఈసహజ సరళముగను ముదావహముగనునున్నది. ఇట్టిసారళ్యము నేమరి యోరుచితులియు యో కొన్నిత్రావు లందు లక్కువరకపు శయ్యనువాడి రసభంగము చేయుట కూడ నీతనియందుగలదు.

ప్రావృడంభోధరస్వామి, జీవనంపు
భారము తొలంగిపోవ నెవ్వారికేని
కోరి నీసొదలను జెప్పికొందువేమొ [వేళ.
గొణుగుకొనుచుందువయ్య యొక్కొక్క
(పుట 65)

ఎదకరగునట్లు సన్ననియెలుగుతోడ
నట్టె తలలెత్తి పాటకూ కొట్టు చేద్చు
గౌతమీవీచికాళి నగంబు నిదుర;
(పుట 96)

ఈపైపంక్తులందుగల 'ప్రావృడంభోధరస్వామి', 'తలలెత్తి పాటుహాకొట్టుచేడ్చు' అనుపదములను 'ప్రాజ్యపీఠపురీ మహారాజ్య' అనుపదములతోఁ బోల్చినపుడు

'నక్కయేడ దివిజాధ్యతాలయంబేడ'

అను తిరుపతివేంకటకవుల వాక్యము స్మరణకు వచ్చును. సహజసుందరమగు పదగుంఫన మీతనికొరకయే. కాని నోపికతో సాధనచేసి రాణింపునట్లు చేయవలెను. ఛందోవిషయమున పూర్వకవుల యాచారానుసారముగ యతిప్రాసములను వాడుచుండును.

సకల గోపాలగోపికాగణముతోడ

(పుట 28)

ఆయగమ్య తమస్సాంద్ర యవనికాంత
రంపు టేకాంతమునఁ బడి యాక్రమక్ర
మా స్తమిత నూపురారవాహ్వానములను

(పుట 93)

అను చోటులందు యతిచెదరినది. బుద్ధిపూర్వకమో? ప్రమాదమో!

అర్థము పూర్తియైనచో పాదపూరణముకొఱకు వ్యర్థపదములనువాడక ఆపాదము నచటనే సమాప్తముగావించి యితడు క్రొత్తమార్గము నవలంబించెను. కొన్నికొన్ని తావులందు సంగీతప్రధానముగ గీతములనువ్రాసెను. అవి బాగున్నవి.

చిన్నిపూవే వాడెనా
తన
కన్నెవలపుల వీడెనా
తన
చిన్నెలన్నియు వన్నెలన్నియు
మన్నులో గోల్పోయెనా?

(పుట 56)

కాని చెప్పినభావమునే మరల చెప్పుచుండుటచే నిందలి సొగసు చెడుచుండును. పైపద్యముక్రింద

కాంతు నెఱుగని కన్నెగాదా
సిగ్గువీడని మొగ్గగాదా
మొన్నమొన్ననె ముద్దువల్లిని
మొనలు దీరెనుగా!

యన్న దెందుకు?

ఇకజూడవలసిన దీతని ప్రేమవిషయము. ఇతని హృదయక్షేత్రమున ప్రేమోపాసయమైనది.

ఏల నాహృదయంబు ప్రేమించు నిన్ను?
మావిగున్నకొమ్మను మధుమాసవేళ
బల్లవము మెక్కి కోయిల పాడు టేల?
పరుల దనియించుటకొ తనబాగుకొరకొ?
గానమొనరింపక బ్రదుకుగడవబోకొ

(పుట 38)

అని యడుగుటవలన అది నిర్హేతుకమును అవ్యాజమునని తేలుచున్నది. అది యుత్తమమైనది. కాని

క్రౌర్యకౌటిల్య కలుషపంకంబువలన [య్యో
మలినమౌనా హృదయముధామమెటు ల
నతివిశుద్ధము మధురము నఘరహితము
ప్రణయమునకంచు సందియపడుదువేమొ?
ప్రేయసీ! శర్వరీతమోవీథుల బడి
చందురుడు రాడె పూర్ణతేజస్వియగుచు;
అఘవిదూషిత మీహృదయంబునందె
ప్రేమకోమలతమము పవిత్రమయ్యె.

(పుట 40)

అని ప్రశ్నించుకొని సమాధానపడుటజూడ నీతనిప్రేమ విషయ మారంభమున కాఠిన్యముతో గూడినదా యను సందియము వొడమును. అదియునుగాక యీ ప్రేమకు నిధానము భగవంతుడా లేక స్త్రీయా యనుసంశయము కూడ కలుగుచున్నది. ఈగ్రంథమునందలి కొన్ని ప్రేమగీతములను భగవంతునిపరముగ నన్వయముచేయవచ్చును. కాని

ఇదెవచ్చుచున్నాను ప్రియురాలా
ఇకనిలువలేను నాప్రియురాలా!

(పుట 94)

ప్రేయసీ ప్రేయసీ
ప్రియుడనే ప్రేయసీ
వేయికన్నులుదాల్చి
వెదకుచున్నానే!

(46 పుట)

ప్రణయమలయానిలోర్మికాపటలినూగు
సౌరభమ, గానమా, నిండుశాంతి నిండు!
ప్రాణమునకును బ్రాణమా ప్రాణకాంత
యూర్పుతరగల నోలాడియున్నవారె?

(పుట 42)

మొదలుగాగల పద్యముల కర్థము తేలదు. పై పద్యముల వలన ఆప్రేమనిధానము విచ్ఛిన్నమగుటచే నాతనికి దీరని దుఃఖ ముప్పొంగించి యాతని హృదయతటమును గలచివేయ

......దుఃఖాశ్రు సలిలవృష్టి
కంబొకటి నాదు ప్రణయపీఠమును గప్ప
ఏనొదీనుడ నేనీకనైన నోదిగి
మ్రోడునై రాయినై నిల్చిపోదు నకట!

(పుట 49)

అని వాపోవుచున్నాడు. ఈప్రేమమూలమున నతడందిన సుఖము మనకు తెలియుటలేదు. సుఖింపనే లేదేమో?

భావభరమైన హృదయబింబంబునందు
రక్తిలిఖియించుకొంటి నే రమణిరూపు
అదియె ముదమీక యలతకాస్పదమ య
గ్రహణగతమైన చంద్రునికళవిధాన.[య్యో

(రాయప్రోలు సుబ్బారావు)

అని వాపోవువారిలో నితడొకడు.

ఈదుఃఖాంధకారమునుండి వెలువడి వచ్చినచో నితనియూహ కొంతవరకు విశాలముగ గాన్పించును.

అట్టి తరుణములం దొక్కొకప్పుడు తన్మయుడై యాలపించును.

మలయపవను కౌగిలిలోన పులకరించి
హాయిగా కంఠమెత్తు ప్రాయంపువంశి
విశ్వమోహను జలిబిలిపెదవులంటి
యవశమైపోయి యేమిచేయంగలేదు.
బాలగోపాలుపోలెదు పాటగాని
గనివినిమెరుంగ మెన్నండు; కరములోని
మురళినే కాదు, నాలోనిమోడు టెడద,
నీశిథిలజీవనమ్ము మ్రోయింపగలదు.
నందగోపకుమారు నానందమురళి
కామనోహర సుషిరాపగాతరంగ
జాలముల దారకా రవిచంద్రతతులు
కరగిచినిచిన్నిగీతులై కలిసిపోవు.

(పుట 30)

స్వాదుసంగీతకలనా లసద్విపంచి
గరమునందుంచి జీవితభరమువాయ
బాడుకొమ్మంటి తియ్యనిప్రణయగీతి
తంతులనుద్రెంచి మెట్లు విదల్చి స్వామి!
ఎటుల బాడుదు నీబ్రదుకెల్లువుత్తు.

(పుట 75)

ఇట్టి తరుణములం దాతని హృదయవేదన మార్దవ మండితము.

......................ఆపుకోలేనిపాట
యెడద రొదసేయునో లేదా యింకిపోవు
నంతలోనసే కటకటా! యంతులేని
దారిలేని శోకంపు టెడారులందు.
అంతలజ్జావిషాద దురంతభార
వహనమున కోర్వలేని యీపాడుబ్రతుకు
వంగిపోవును మరిమరి క్రుంగిపోవు
లోతెఱుంగని పాతాళ లోకములకు.
మూగవోయిన నాగళమ్ము ననుగూడ
నిదురవోయిన సెలయేటి రొదలు గలవు
ఐన నేమాయె——

(పుట 78)

మధురమగు నీవిచారసమయమునం దతఁడు

(పుట 77)

> ఏనుగాటంపు నిర్ఘరలోన మేను
> మఱచువేళల భవదీయ మధురవేణు
> మృదుల గానపక్షములపై మెల్ల మెల్ల
> నేగుదెంచి మామకశుష్కహృదయపాత్ర
> నింపివైతువు ప్రణయార్ద్రనిస్వనముల.
> అంత మేల్కాంచి యెంతో దాహమ్ముగొన్న
> శ్రవణముల విచ్చి నీగీతరవముకొఱకు
> కడల బరకించి శూన్యలోకమ్ము గాంచి
> హోరుహోరుమటం చేడ్తు నోయిస్వామి!

(పుట 77.)

అనుచు భక్తిమార్గము నవలంబించుచున్నారు. కాని యీ భావ మాతనియందు నిలుకడగాంచుటలేదు. శ్రావణమాసపు టెండవలె అరుదుగను, క్షణభంగురముగను ఉన్నది. ఈచాంచల్యము నవలకుఁ బారద్రోలుటకు దీక్షాసాధనములు కవి కలవడవలెను. అపుడు మాత్రమే

> యుగయుగంబులనుండి మ్రోగెడు
> విశ్వగాన వియత్తరంగిణి
> భంగముల నుప్పొంగునాతని
> గీతశీకరముల్.

(పుట 35)

అంతవరకును

> ఏవిధినైన పాడుమని
> యే వచియింతువ యేని ప్రేమమై
> నీవె రచించి నాకుఁ గరు
> ణించిన వీ ప్రణయార్ద్ర గీతికల్
> గావున నావిశుష్కిత
> గళంబును నీకరుణారసామృత
> శ్రీవిభవంబు నింపి మధు
> రింపుము నేశ్రుతి గల్పి పాడెదన్.

—వేదుల సత్యనారాయణశాస్త్రి

అని ధైర్యముతో నన లేదు. ఇది

> తుది మొదలుకాని కానరానిది మహాంధ
> కార కలుషిత కృష్ణపక్షంపువీధి.

(పుట 91)

ఇతడు

> స్వచ్ఛమైనట్టి ప్రణయంపు సలిలధార
> బోసిపెంచిన స్నేహంపు బూలతీవ
> తావులనుజిమ్ము నలరుల దాల్పకుండ
> గాలితాకున నేలపై వ్రాలె నకట!

(పుట 51)




3 3 6

# అనార్కలి

రెండంకముల నాటిక.

విశ్వనాథ సత్యనారాయణ గారు

(నాంది)

నాసాంతే కృతదృష్టి రవ్యవహితభ్రూః వ్యాఘ్రచర్మాసనే
నిష్ఠామర్దితబాహ్యవస్తువిషయా యా బ్రహ్మరంధ్రోద్గతైః,
తేజోభి ర్భృశ మైందవైః ప్రచలితై ర్మూర్ధ్నాఽవృతే వాంశుభి
స్సర్గస్థిత్యపహారహేతు రవతాత్ శైవార్ధసీమంతినీ.

తేపకుఁ దేపకున్ మొలకతేరిన భక్తిని మత్పితృప్రతి
ష్ఠాపితశైవలింగము గడంక భజించెద నాత్మ; వారణా
సీపురినేత భృంగిరిటశిష్యుని దిగ్వసనున్ త్రిలోక ర
క్షాపతి నందమూరుపురసక్తు మదశ్రుకణాళిహేతువున్.

అమృతపదార్థమున్ తెలిసినట్టిరు యోగులు తన్మనోఽంబుజ
భ్రమరము నున్మనీచరమభాగవిరాజిత బిందుశేఖర
స్థము పరతత్త్వ మం చెఱుక చాలియు చాలక, చాలకే రఘూ
త్తమునిగ నెంతు మంత్రమహితాక్షరబద్ధసుమూర్తి నిత్యమున్.

శైవాంశం బని చెప్పనా! దశశిరస్సంత్రాసచండాకృతిన్
శ్రీవాయూద్భవు డందునా! అనిలు వంచించెన్ మహాయోగియై
పోహో! కేసరికోతికూన యననా! ముక్తేంద్రియభ్రాంతు న
న్నావేశించిన రామచంద్రపదపద్మాధీనచేతస్కునిన్.

ఝణఝుంఝణఝుంఝణఝణ
ఝణాఝణాఝణమనోజ్ఞసంరావితకిం
కిణీపద సుమరద తాండవ
చణశారద మన్మనోఽచ్ఛజలధి మథించున్.

## పూ ర్వాం క ము

### రంగము. ౧

ప్రదేశము - వసంతోద్యానము

ప్రవేశము - సలీము

ఆకన్నుదోయిలో స్వర్గజ్యోతిస్సులు వెలుగు చున్నవి.

ఏ మాసౌందర్యము!

ఈమావిగున్న యింత విరియపూయవలెనా!

నామన స్సీచివురాకుమీాదనే నిలుచుచున్నది.

[నిష్క్రమణ]

ప్రవేశము - అనార్కాళి

నెమ్మదినెమ్మదిగవిచ్చు మల్లికాకుసుమము వలె ముహుర్ముహుర్నవీకృత శోభాయమాన ముగ నున్నది!

శరత్పూర్ణిమా యామినివలె స్వచ్ఛముగా నున్నది!

మక్కానగరగోపురముపోలిక స్వర్గశిఖరము తలపించుచున్నది!

అతని సౌందర్యమేమి!

[నిష్క్రమణ]

చివురుకన్నె

మసృణ సంధ్యాకాల మధురకాంతులలోన
ఘుసృణమందార సంకుమదరోచులలోన
దాచుకున్నాను నాతరుణారుణచ్ఛాయ
వేచుకున్నాను నావిభునిరాకలదాక.

ముసలి సంజలతమ్మిమొగ్గమూతలలోన
కసటుప్రొద్దుటి లేతకలువవేపులలోన
నాకన్నె సిగ్గుటందము దాచుకున్నాను
నాకంఠమాల ప్రాణపతివచ్చెడుదాక

పసిలేడిచొక్కంపు పాలబుగ్గలలోన
నుసలని సెలయేటి నురుసునవ్వులలోన
పదిలించుకొంటి నాప్రాయంపుమిసిమెల్ల
మదనమోహనుడు నామధువురాకలదాక

రేపు వచ్చును సామి మాపు వచ్చును సామి
యీపూట తప్ప దం చిన్నాళ్లు వేగగా
సౌందర్యమునకన్న సౌందర్యపుంగుప్ప
యిందు రానేవచ్చె నీమనోహరమూర్తి

రావమ్మ నవమల్లె రావమ్మ మాగధి
రావమ్మ మాధవి రావె శేఫాలికా
రావమ్మ పున్నాగ రావమ్మ మాకంద
రావమ్మ యిందీవరంబ ముద్దులగుమ్మ

రండు రండమ్మ పేరంటాండ్రు మీారెల్ల
దండలై మదనసుందరుడు రానే వచ్చె
స్వామి నీకొరకు పూజాద్రవ్యములు తెచ్చి
యేము కాచెదము రావే మోహనాకార.

వసంతుడు

ఇది యుషస్సతిమోము నదిమి కొన్నపరాగ
మిది సంజలేగటాః బొడుగుశోభారాశి
యిది పూపకన్నెలో పొదలు తేనెలవాక
యిది రసాంభోరాశి పదునుగొన్నకణంబు.

పుష్పకన్యకలు

ఇతడు మావిచివుళ్ళ నెగచి వేసినజోదు
ఇతడె యందపుకోన లెల్ల ముచ్చిలురాతు
సెలయేళ్ళయిసుకతిన్నెల నేలురా జితడె
ఇతడె ప్రాతఃకాల సతిమేన సితరోచి.

మాధవి

చేరిరారే ప్రదక్షిణముగా స్వామికి
మీరు కేల్కేలుప్వాని మేలికన్నియలార

యెన్నాళులకు వచ్చె నీదయావనరాశి
కన్నులవత్తులై కాగిపోతిఁగదమ్మ

మాగధి

ప్రావసంతాలమ్మ పూవసంతాలు
మావనాంతములందు మధులతాంతాలు
తల్లి క్రొంబొదుగువద్దకుఁ బోవు వసిలేడి
మెల్లగా చెండు స్వామికి నాడుకొనుటకు

శేఫాలిక

కస్తూరికొనిరంపు కైవసంబయినాడు
శిస్తుపూయుదమ యీచిత్తేశు డీనాడు.

అందఱు

చిలుపవానలకు పరువులు పెట్టిన
సెలల యిసుకపొరలో
మొగలితావి పస బుగులుకొన్న పు
ప్పొడులమేలితెరలో
కలసియాడుదము పాటలుపాడుచు
మలగిపోవుదము వనిలో
జిలుగుపూ లెసగుపచ్చనిబయలులఁ
గలసిపోద మా మనిలో.

పుష్పకన్యకలు

బాలమృణాలీలీలకరా-మ
త్తాళిమనోహరనీలకచా!-స
మ్మోదవనీపులకీకృతదేహా!
(నృత్యము)
చిలుపవానలకు పరువులు పెట్టిన
సెలల యిసుక పొరలో
కలసి పోవుదము పాటలుపాడుచు
మలగిపోవుదము వనిలో.
(నృత్యము)

కవి

శ్రీఖండానిలగంధసంకలితమై
శేఫాలికామాధవీ
రేఖామంజులవాసనాలహరి ప
ర్వేన్ ప్రాతరానీతశో
భాఖద్యోత విలాసరాగలలిత
ప్రాంశుప్రభన్ మాతస
చ్ఛాఖాపల్లవరాజి కెంతయుఁ బరి
ష్వంగమ్ములై వొల్చెడిన్.
ఈమలయానిలయంబులు వ
హించిన శైత్యము లెంతధూర్తముల్
లేమలతాపమెల్లఁ బది
లించుకొనెన్ దమలోనమందమం
దామలయానవైఖరుల
కబ్బిన పాంథవిలాసినీమనః
కోమలతాపదంబు లుషు
ర్కున్ నడివేసగి పల్లవంబులై.
ఊరక నాహ్లాదంతరము
నూచెడుఁగోరిక లేకరక్తపుం
నీరజపత్రకాంతులకు
నెయ్యములై తగుఫాల్గుణాంతవే
ళారుచిరంబులై యుదయ
లాలితనవ్యవనీవసంతశో
భారమణీయమైన నవ
పల్లవరక్తిమ మెంతక్రమమో.

రంగము. ౨

మిత్రుడు

ప్రభూ! ఏమి విచారించుచున్నారు.

సలీము

మిత్రమా! అనార్కాళి యనగా నేమి?

మిత్రుడు

దానిమ్మపూవు.

సలీము

అది గులాబికన్న మల్లెకన్న రమ్యమైనదా?

మిత్రుడు

ఏపూవున కాపూవే. ఏపూవురమ్యత దానిదే.

సలీము

గులాబి మల్లెలలో వాని సౌందర్యమునకు వానివాసన సహాయకారి యగుచున్నది.

మిత్రుడు

వాసన లేకున్నను గులాబి మనోహరమైనదే.

సలీము

దాని వాసనచేత నిదివరకే సమాకృష్టమైన నీ హృదయము దాని యందలి పక్షపాతమును వీడ జాలదు. జన్మతఃగల వాసనచేత గులాబిని మల్లెను మనము మిక్కిలి గౌరవించుచున్నాము. వానిని వాని వాసనకు గౌరవించుచున్నామేకాని వాని సౌందర్యమునకుగాదు. సౌందర్యముకూడ నున్నదా యుండనిమ్ము. వాసనా విరహితములైన ప్రసవములలోనున్న సౌందర్యము పక్షపాతముచేత మన మెప్పుకొనునది కాదు. అనర్కాళి చూడుము. దాని రక్తిమ,దానిసౌందర్యము! నా మనస్సు నంతకంతకు వశపఱచుకొన్నది.

మిత్రుడు

అపును ప్రభూ! తాము మునుపటివలె మావితోటలకు బోయి క్రొత్త యంట్లు కట్టుటను గూర్చి విచారించుట లేదు. శిల్పులను పిలిచి వారితో శిల్పప్రసంగములు చేయుటలేదు.

సలీము

నా మనస్సు ననార్కాళి యాక్రమించుకొన్నది.

మిత్రుడు

సరే! ఇంక దానిమ్మ తోటలు వేయించి యందు గూడ నొక క్రొత్తవిధమైన ఫలములు గనుగొనుడు.

సలీము

(హాసము)

మిత్రుడు

ప్రభువు లన్యాయత్తచిత్తులై యున్నారు.

సలీము

ఆమె యన్యకాదు. అవివాహిత.

మిత్రుడు

ఆమె యెవరు?

సలీము

అనార్కాళీ.

మిత్రుడు

స్వర్గవాహిని చవిటి పఱ్ఱల మీద బ్రవహించుచున్నది.

సలీము

ప్రేమ వాహిని వంటిది. దానికి నిమ్నోన్నతత్వములు సమానము.

మిత్రుడు

(హాసము)

రంగము. 3

అనార్కాళి

అజీజ్! ఇప్పు డెంత ప్రొద్దు పోయినది?

అ జీ జ్

రెండు ఝాము లైంది.

అ నా ర్కా ళి

నాకు నిద్ర వచ్చుట లేదు.

అ జీ జ్

ఎంచేత?

అ నా ర్కా ళి

మనస్సున నేదియో యావేదనగా నున్నది.

అ జీ జ్

దీనికోమందుంది చెప్పనా?

అ నా ర్కా ళి

ఊఁ.

అ జీ జ్

భరతపక్షి వుందే. అది గుడ్లుపెట్టి మేత కెళ్లినపుడు నెమ్మదిగా చెట్టుమీది కెక్కి, అందులో ఒకగుడ్డుకీ చిన్న బెజ్జం చేసీ, అందులో రసంఅంతా ఓడ్చేసీ దాన్నిండా పాదరసం పోసి యేం యెరగనట్టుగా దిగిరావాలి. తల్లి వచ్చి తనగుడ్లు సరిగానే వున్నవని సంతోషిస్తుంది. మనం పాదరసం పోశామని తెలియదుగా! అది తనగుడ్లను పొదుగుతుందా! మన పాదరసం గుడ్డునుగూడా పొదుగుతుంది. మన పాదరసంగుడ్డు తెల్లనిపిట్టవుతుంది. ఆపిట్ట యాకలుతెచ్చీ అవికాల్చి బూడిదచేసీ తేనెలోకలిపి పొద్దునా సాయంత్రం ఒకమండలం రోజులు సేవిస్తే యెటువంటిరోగం నిమిషంలో కుదురుతుంద.

అనార్కాళి

ఈమందు నీకెవరు చెప్పినారు?

అ జీ జ్

సారాదుకాణంవాడు.

అనార్కాళి

మరల నక్కడకు వెళ్లుచుంటివా? నేను వెళ్లివద్దని చెప్పితిని గదా!

అ జీ జ్

ఊరికే వెళుతున్నాను. తాగడం లేదు. కాని తాగితేయేం? ఎంతోవుత్సాహంగా వుంటుందే.

అనార్కాళి

లోపల నరములును మాంసమును చెడిపోయి మృత్యువు శీఘ్రముగా తటస్థించును.

అ జీ జ్

ఇంతేగదా?

అనార్కాళి

ఏమట్లంటివి?

అ జీ జ్

చచ్చిపోతే బతికించడానికి నాదగ్గిర మందుందిగా.

అనార్కాళి

అదేమిటి?

అజీజ్

జెముడు కాకి వుందా, అది మేతకెళ్లినప్పుడు దాని గూడెత్తుకొచ్చి గంగలో పారేస్తే అందులో సంజీవిపుల్లని ఒకటుంటుంది. అది ప్రవాహాని కెదు రీదు తుంటుంది. అది తీసుకువచ్చి చచ్చిపోయినవాళ్లకి ముట్టిస్తే అందరూ లేచి కూర్చుంటారు!

అ నా ర్కా ళి

నీకు చదువు చెప్పెదను. నేర్చుకొందువా?

అ జీ జ్

నాకు చదువుకోవాల్నే వుంది.

రంగము. ౪

ర సీ

అనార్కాళీ! నీవు చాల యందెకత్తెవు.

అ నా ర్కా ళి

రసీ! నీవు చాల తీయని దానవు.

ర సీ

నీ యంత ప్రశస్తమైనదానను కాదుగా!

అ నా ర్కా ళి

అనార్కాళి పసందు అనార్కాళిది. రసీపసందు రసీది. ఇది పూవు. అది పండు.

రసీ

పూవును కాయ కాచి పండు గాక యెప్పుడును పూవుగానే యుండునా ?

అనార్కాళి

పూవు పూవు గానే మాడి పోవచ్చును.

అజీజ్

మాడి పోయినా పువ్వు పువ్వే. దాని వాసనతో నాలుగు దిక్కులూ గుబులాడి పోతై.

రంగము ౫

అనార్కాళి

మిత్రమా ! మరల వచ్చితివి.

రసీ

ఉస్తాదు మరల పంపించినారు.

అనార్కాళి

అయ్యో నాకేమియు నోపికగాలేదు.

రసీ

పాఠశాల చూచుటకు వచ్చునది యువరాజు సలీము గారట.

అ నా ర్కా ళి

(మౌనము)

ర సీ

ఏ మందువు?

అ నా ర్కా ళి

నీ యిష్టము.

ర సీ

తప్పక రమ్మని.

అ నా ర్కా ళి

అంత వరకు వచ్చినను నృత్యము చేయలేనేమొ!

ర సీ

నీవు వచ్చిన చాలునన్నారు ఉస్తాదుగారు.

అనార్కాళి

గుర్వాజ్ఞ బలవత్తరముగా నున్నది.

( కొంచె మెడము )

రసీ

స్నానమైనదా?

అ నా ర్కా ళి

ఆ.

రసీ

దుస్తులను వైచుకొని కన్నులకు గాటుక దిద్దుము. ఇదుగో నృత్యశాల.

అనార్కాళి

ఓపిక లేని నేను నృత్యము చేయుచున్నప్పుడు కాలుజారి పడెదనేమొ!

రసీ

భయము లేదు.

అనార్కాళి

నా హృదయము కొట్టుకొనుచున్నది.

రుసీ

భయము లేదు.

అనార్కాళి

నా కంఠము వణకి పోవుచేమొ!

రుసీ

మాటలాడకుండ గూర్చుండుము. ఇంతలో కబురు వచ్చును.

ఉస్తాదు

జహాపనాహ్! క్షమించుము.

సలీము

చెలికాడా! ఫర్మానా చూపించుము.

(ఫర్మానాకళ్లకద్దుకుని) ఉస్తాదు

జహాపనాహ్! బిడ్డకు జ్వరముగా నున్నది. తమ యాజ్ఞాబలమే యామెను రక్షించినది. తప్పులు క్షమించవలయును.

మిత్రుడు

ఫరవాలేదు. కానిండు.

ఉస్తాదు

బిడ్డా, అనార్కాళి!

అనర్కాళి

నీ పదమ్ముల యంద నిలచి యున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!
ఈ మహాఝురి యందు నీదు లాడగనైన
కాలు నేతులు రావు కరుణించవే నాథ!
హేనాథ! నీపాద మీా దాసి కన్నీట
కలుషితం బైనచో క్షమియింపవే నాథ!
ఈ తుమ్మి పువు కన్నె యెంత బేలయొ కాని
భృంగరాజును జూచి బెంగ కొన్నది చూడు.
హేనాథ! హేనాథ! హేదయావనరాశి
కలుషాత్మ యగు దీని గాల్చివేయుమునాథ!

(మూర్ఛ)

ఉస్తాదు

రుసీ! రుసీ!

మిత్రుడు

అయ్యో!

ఉస్తాదు

ప్రభువుగూడ మూర్ఛ పోవుచున్నాడు. దయావనరాశి యీామహారాజు.

రంగము ౬

సలీము

నీ పదమ్ముల యంద నిలచియున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!

ప్రాణప్రియా! నాహృదయమును నీయందే నిలచియున్నది. మాతండ్రిచే కఠినముగా విధింపబడిన నాప్రవర్తనము నిన్ను నేనుదర్శించుటకుగూడ వీలులేకుండ జేయుచున్నది. అప్పటికిని నృత్యమును చూడవలెనను మిష చేత నిన్ను దర్శించుటకు వచ్చితిని. అపుడు నాదురదృష్టముచేత నీవు జ్వరార్తవైయుంటివి. అప్పటి నీజీర్ణశృంగారము నాకనుల కంట గట్టినట్లున్నది. మనోహారిణీ!

దేవీ! ఇదిగో! ఈప్రకృతి వికసించినది. నీహృదయము నాయెడల వికసించలేదేమి? నీవు నాయెడల నెట్టిభావములు గలదానవో తెలిసికొనకుండ నిన్ను దేవీయని సంబోధించుచుంటిని క్షమింపుము.







జేతవనస్తూపము. 2.

నీ కీ బానిసవృత్తి లభింపజేసిన దైవ మెంత యనుల్లంఘనీయముగ నున్నది. నీవు బానిసవు గాకపోయిన దో నీవిషయము నాతండ్రితో జెప్పి మనయిర్వురము నాయన యనుమతిమీదనే వివాహము చేసికొనెడివారము. ఇప్పుడు వారి యనుమతి లేదుగాన మనసమాగమము దూరమగుచున్నది.

నిన్ను చిన్నతనములో తెచ్చి బానిసగా నమ్మినవాడెవ్వడు? నీ వేయింట నుద్భవించితివో తెలియదే! ఏ సత్కులమునందైన నే సంపన్నగృహస్థు నింటనైన నీవు పుట్టినచో నా దుర్మార్గుడు నీకెంత మహాపకారము చేసినవాడగుచున్నాడు.

ఆహా! ఈబానిసవృత్తి యెంత చెడ్డది! చక్రవర్తులుగూడ భోగలాలసులై యిదియే పనిచేయుట యెంత దేశారిష్టదాయకము! ఈవృత్తికి రాజులు సానుకూల పడుచున్నారు. చక్రవర్తులు ప్రోత్సహించుచున్నారు.

కానిమ్ము! బానిస మనుష్య కాకపోయినదా? భగవంతునియొక్క చిద్విలాస మామెలో లేకపోయినదా? ప్రేమయను నమృతపదార్థ మామెలో దొరకదా?

ప్రియా! నీకు దత్తమైన నాహృదయము మరల నేను లాగుకొనలేకున్నాను.

అనార్కాళి బానిసకూతురు. నేను చక్రవర్తికుమారుడను. మాయిరువురి వివాహము రాష్ట్రమునకుగాని రాజునకుగాని యనుమతి యెట్లు? ఇట్టి సంబంధము గలిపించుకొని నా తండ్రికిని రాష్ట్రప్రజలకును నిష్టములేని పని యేల చేయవలయును? మానుకొందునా?

పుష్పకన్యకలు

ప్రాతర్వికసిత పంకజనిర్గత
బంధుర రమణీయామోదంబులు
నీలో దాగెనులే

వసంతుడు

ప్రాలేయాంచిత శాఖోబిందులు
మీలో దాగెనులే.

పుష్పకన్యకలు

బాలమృణాలీ లీలకరామ
త్తాళి మనోహర నీలకచాస
మ్మోదవనీ పులకీకృత దేహా
(నృత్యము)

పుష్పకన్యకలు

కైదండలుగొని కమలపరాగము
లాదట విసరెదు సరసులలో
పోదము మలయసమీరము సారము
పొల్చుకొన్న దారులలో.

వసంతుడు

సిగ్గేటికి వాసంతిక రావే
చేబూనవె నా ప్రాణసఖి
మ్రుగులు వెట్టితిపరాగ సంతతి
పూలువిరియు నీవనిలో.

అందరు

చిలుప వానలకు పరువులు పెట్టిన
సెలల యిసుకపొరలలో.
కలసిపోవుదము పాటలు పాడుచు
మలగిపోవుదము వీనిలో.

సలీము

ఆహా! ఏమాసౌందర్యము! తలంచు కొన్నిన కొలది నాయీ యూహాలువమ్మై పోవునట్లు

శోధించుచున్నది. ఏమైనను నేమిచేయుగాను.
నా మనస్సెంత శేలయిగునేమి! ప్రియా! ఆనా
హ్లాదిని, మనోహారిణీ!

కోకిల

వికసించిన వసంత సుకుమారకుసుమముల్
ప్రకృతియందున నూత్నపరిణామమునుపొందె
నామనోహర గీతికా మరందము గ్రోలి
యేమందు పులకితంబే యయ్యె విశ్వంబు
కామినీ కంఠసంగతమైన బాహువు
రామణీయక మెల్ల రాణించుకొన్నది
ప్రకృతిలో తనయాత్మ ప్రతిఫలించుట చూచి
భగవంతుడును గూడ పులకితుం డైనాడు!
సకలస్వరమ్ము లాశానినాదము మాని
పంచమ స్వరములోపల నైక్యముం బొందె.

సలీము

ప్రణయినీ! నీవే నేను; నేనే నీవు. మన యిర్వు
రకును భేదము లేదు. నీ లతాకుసుమబాహు
వులు నాకంఠము చుట్టును పెనవేయుము
మనోహారిణీ! ఈ కృత్రిమమైన యారామము
నందే వసంతు డిట్లు విజృంభించినాడు. ఇంక ప్ర
కృతి రమణీయములగు మహారణ్యము లెట్లు
న్నవో. వసంతుడా! నీవు నన్ను లొంగించు
కొన్నావు. నీకు జోహారు! జోహారు!!

మాయిరువురి యాత్మలు నొకటియై మ్రో
గినవి కాని బాహిరమైన యీభేదము దృశ్య
మగుచునే యున్నది. ఏమిచేయుదును?

కవి

శ్రీమతంబగు నీవసంతము వికా
సించెఁ నవోద్యానపుఁ
సీమాంతంబుల మావిపూవులివినా
సించెఁ, పువుల్ వాసనా
ప్రామాణ్యంబుగ చాల్గొ కట్టుటను నా
రామేందిరా ప్రోల్లస
త్సీమంతంబన నీ తమాల కుటజ
శ్రేణుల్ ప్రకాశించెడిఁ.

ఈ మధువాసనా లహరి
యీ మధుమాస పికారవంబు నీ
కోమల మల్లికా మసృణ
కుట్మల నిర్గత వాసనాపగల్
మా మనసుల్ దహించెడు కు
మార సమీర తరంగ పాళి మా
కేమొ విరోధి వర్గమున
నే సమకూడె నిదేమి చిత్రమో!

ఎంత విరోధ భావము వ
హించిన నేమి మదంతరంబునఁ
వింతలు పుట్టెబో ప్రకృతి
భేదములేక సమాన భావపుఁ
శాంతి ఘటిల్లె నా హృదయ
సారసముద్ధత భావవీచికా
క్రాంతమ సర్వవస్తు బహి
రంతరనవ్యసదైకమందెడుఁ

సలీము

నేను గూడ బానిస జన్మమైన నెత్తితిని కా
దు. నేను చక్రవర్తి కుమారుడనై యేలపు
ట్టవలె! నేను చక్రవర్తి కుమారుడనై పుట్టి
యీ స్వాతంత్ర్యములేక బ్రతుకుట కంటెబా
నిసనై పుట్టిన బాగుండెడిది. ఇప్పుడు నాకు
బానిస యన నేమొ, చక్రవర్తి యన నేమొ

తెలిసినది. ఇరువురును బానిసలే. బానిస నని చక్రవర్తికి తెలియదు. బానిసనని బానిసకు తెలియును.

ఇంతగా సంస్కారము కల్గినను నా మనస్సున కింకను శంకారహితత్వము గలుగలేదు. ఉన్న యీచక్రవర్తిత్వము తప్పుట యెట్లు? మనస్సు సమాధాన పఱచుకొన్న యీ సమానత్వ మాచరణకు దెచ్చుకొనుట యెట్లు?

కవి

భ్రూపుటంబున దృష్టి నిల్పుకొని యోగి
ప్రకృతి బహిరంత రంబుల పరిధవిల్లు
నాత్మ తత్త్వంబు చూచి యూహా ప్రపంచ
మందగా రాని యానంద మనుభవించె.

ప్రకృతి భేదమ్ముచే కట్టుబడిన నాట్లె
తన మహావస్థగని తన్ను దానె చూచి
నవ్వుకొని మున్గిపోయె నానంద వార్ధి
సర్వవస్తు సమత్వంబు సంఘటిల్లె.

మధుర మధుమాస మరుదెంచి మధుకరీవి
లాస రాగంబు లాశావికాసమయ్యె
దృష్టియెచ్చట బఱపిన చింతయనుచు
చెప్పగా రాని యానంద సిద్ధి కలిగె.

సలీము

మధుమాస వశమున బులకితమైన యీ ప్రపంచ మింత యానందదాయకముగా నుండి నాలో నున్న యీ శంకామాలిన్యమును క్షాళితము జేసినది. ఇంతవఱకు సందేహ వార్ధిలో నేనేల మహావాయుధూత నౌక వలె నల్లలాడుచుంటిని? దేవీ! అనార్కాలీ! నీవే నా మనస్సున కధినేత్రివైతివి. భావిభారత చక్రవర్తిని నీవే. కాదా, నీకొఱకు నేను బానిస నయ్యెదను. నీవు లేని నా కీరాజ్యమెం దులకు? భోగము లెందులకు? దేవి! సర్వము నీకర్పించితిని. నాజన్మలో ప్రప్రథమమున నాదృష్టి నీ మీదనే తగిలినది. నీవు మహారాజపుత్రివి కానిమ్ము, బానిసవు కానిమ్ము! నాజీవితాంతమ్మును నీవే యధినాయకు రాలవు. దేవీ! కటాక్షింపుము. ప్రియా! అనుగ్రహింపుము!

---

## కోర్కె

పెనుమర్తి వెంకటరత్నము గారు [యువకవిమండలి]

దేవుండు

ఏమి కావలె వరము కోరుము
మీమహాతపములకు మెచ్చితి
భూమిలోపల నైంద్రలక్ష్మి
భోగమడిగెదరా ?

భక్తుడు

విసిగిపోయితి నైహికంబుల
ముసుగు వెట్టితి జ్ఞానదీపము
రక్తి లేదిక భోగములలో
ముక్తినిమ్ము గురూ !

యోగి

లోకమంతా మిథ్యకాదా!
శోక మొకటే ప్రాకిరాదా!
నాకొసగు సాయుజ్యపదవిని
నాయనుగు తండ్రీ !

కవి

తనివి తీరదు! యెంత పాడిన
తనివి తీర దికెంతఆడిన
ప్రకృతిలోపల నిన్ను చూస్తూ
పాడుకొందు గురూ !




శ్రీమతి రాజ్యలక్ష్మీదేవి

[హిందీభాషనుంచి అనువదించినది]

౧

సాయంకాలము వకీలు బజారునుంచి ఇంటికి రాగానే ఆయన భార్య మోహిని ఉత్కంఠతో చూచి "ఈవాళకూడా మరిచిపోలేదుకద?" అన్నది.

వకీలు మందహాసము చేసినాడు. మోహిని వికాసముతో ఆయన చేతిలోనుంచి "లెవెండరు" సీసా అందుకొన్నది.

సరిగా ఆవేళకే ఆయనపరిచారికకొడుకు కేశవుడు అక్కడికి పరుగెత్తుకు వచ్చాడు. సంతానము లేని ఆదంపతులహృదయాలు శిశు ప్రేమతో నిండిఉన్నవి. కేశవుడు వారి ప్రేమకు పాత్రుడు కావడానికి గుణముతో పని లేకపోయింది. బాలకులకు సహజమైన సారళ్యముతో కూడిన వానిచిరునవ్వు మోహిని చీరకొంగునుంచి అనురాగమునూ ఆనందమునూ ఆకర్షించగలిగింది.

కేశవుడు వకీలు చెయ్యి పట్టుకొని "బాబుజీ, 'టోపీ తెచ్చారా?" అన్నాడు.

"తేలేదు కేశూ. ఈవేళకూడా మరిచిపోయాను" అన్నాడు వకీలు.

నిరాశవల్ల కేశవుని కళ్లనిండా నీళ్లు తిరిగినవి. మోహిని చూడలేకపోయింది. ఆమె కోపము తెచ్చుకొని "అయితే దీనికి శిక్ష యేమిటి?" అన్నది.

"సర్కారువారి చిత్తం!" అన్నాడు భర్త.

భర్తకొత్తటోపీ—క్రిస్టీకంపెనీవారు తయారు చేసింది—వంకెమీదినుంచి తీసి మోహిని కేశవునికి ఇస్తూ "తీసుకో కేశూ, ఇది తీసుకుపో" అన్నది.

కేశవుడు టోపీ తీసుకొని సంతోషముతో తల్లిదగ్గరకు పరుగెత్తుకొనిపోయినాడు. మోహిని చూస్తూ ఉన్నది. భార్యవిధించినశిక్షను అపరాధి అయినభర్త నిశ్శబ్దముగా స్వీకరించి నవ్వినాడు.

౨

"ఊఁ, నేను తప్పకుండా ఉత్సవానికి వెళ్లుతాను" అన్నాడు కేశవుడు.

"ఎవ రన్నారు? అంతా వుత్తది! ఈవాళ ఏమీఉత్సవంలేదు కేశూ!" అన్నది తల్లి.

కేశవుడు తల్లిచెయ్యి పట్టుకొని వసారాలోకి తీసుకుపోయి "చూడు, ఎంతమంది గుంపుగా వెళ్లుతున్నారో? ఇంకా ఉత్సవం లేదంటున్నావు!" అన్నాడు.

"కాని నిన్ను వెళ్లనివ్వను" అని తల్లి బెదిరించింది.

కేశవుడు కళ్ళ నీళ్లుపెట్టుకుని "ఇవాళకు మాత్రం వెళ్ళనీ. ఇంక మళ్ళీ యెన్నటికీ వెళ్ళ నమ్మా!" అన్నాడు.

తల్లి కేశవునితల నిమురుతూ "కేశవా, చిన్న వాడవు. ఒంటరిగా జనసంఘంలోకి ఎలా వెడతావు? బళ్ళకింద పడిపోతావేమో నాయనా!" అన్నది ప్రేమతో.

ఏమీ తోచక పిల్లవాడు గుంపుకేసి చూపుతూ "ఎంతెంతమంది చిన్నపిల్లవాళ్లు వెళుతున్నారో. నే నొక్కణ్ణే చిన్నవాడనా? కాస్తదూరం వెళ్లివస్తాను. నిజంగా, అమ్మా!" అన్నాడు.

ఎన్నివిధాల చెప్పినా కేశవుడు వినకపోవడము చేత చివరకు తల్లి "సరే, వెళ్లు. అయితే సూర్యాస్తమానం కాకముందే ఇంటికి రాకపోతే ఎరుగుదువుగా!" అన్నది.

కోరిక నెరవేరడమువల్ల బాలకుని ముఖము శోభాయమాన మయింది. వాడు ఉప్పొంగుతూ "తప్పకుండా వస్తా అమ్మా" అని పరుగెత్తబోయినాడు. తల్లి వానిచెయ్యిపట్టుకుని "ఈమురికిగుడ్డతో వెడతావా? పద, మంచి చొక్కా తొడుక్కుందువుగాని" అన్నది.

కేశవుడు పెట్టెలోనుంచి కొత్తచొక్కా తీసుకుని తొడుక్కున్నాడు. "టోపీకూడా పెట్టుకో" అన్నది తల్లి.

కేశవుడు వెంటనే "అమ్మా! ఆరోజు బాబుగా రిచ్చారే, ఆటోపా?" అన్నాడు. టోపీ శిరస్సుమీద ఉంచి "జాగర్త, పారేసేవు!" అన్నది తల్లి.

తెల్లటోపీ పెట్టుకుని కేశవుడు ఉత్సవము చూడడానికి బయలుదేరినాడు. సంతోషముతో తల్లి పిల్లవానికేసి చూచింది.

విదేశవస్త్రదహన మవుతుందని కేశవునికి త్రోవలో తెలిసింది. ఒకాయన విదేశవస్త్రాలు పోగు వేస్తున్నాడు. ఆయన కేశవునివద్దిరికి వచ్చి "తే, నీటోపీకూడా" అన్నాడు.

"ఎందుకూ?"

"కొంచెం సేపటిలో ఈవిదేశవస్త్రాలపోగు తగలబడిపోతుంది"

"అయితే, ఈటోపీకూడా తగలేస్తారా యేమిటి?"

"భారతవర్షపు ఉన్నతికోసం యజ్ఞం జరుగుతుంది. దాంట్లో విదేశవ్యాపారం ఆహుతి అవుతుంది."

బాలు డేమీ గ్రహించలేక "ఊఁహూఁ, నా టోపీ ఇవ్వను. టోపీ పోగొట్టుకోవద్దని మా అమ్మ చెప్పినది"అన్నాడు.

"చూడు. అందరూ తమబట్టలు ఇచ్చేశారు. నీవుకూడా తే"అని ఆయన బోధించాడు.

"నే నెలా ఇస్తాను? మాఅమ్మకు ఏం చెప్పను. అమ్మ నడిగివచ్చి యిస్తాను" అన్నాడు కేశవుడు.

ఆయన నవ్వి "సరే"అని వెళ్లిపోయినాడు.

తన ముద్దులటోపీని భద్రముగా చంకలో పెట్టుకొని కేశవుడు ఉత్సవము జరిగేచోటికి వెళ్లినాడు. అక్కడి విదేశవస్త్రాల రాశి ఆకాశము అంటుతున్నది. రకరకాల పట్టుబట్టలూ,

విప్పినబట్టలు రంగులబట్టలూ, చాలాచాలా ఖద్దరు కలిపి పడవేసి వున్నవి. ఇంకా జనులు టోపీలూ, బట్టలూ పడవేస్తున్నారు. అంత అంతకు గుట్ట పెద్ద దవుతున్నది. ఆదృశ్యము చూచి కేశవుడు దగ్గరవున్నమనిషితో "ఈ బట్ట లెందుకు తగలేస్తున్నారు?" అని అడిగాడు.

"విదేశవ్యాపారం మనదేశాన్ని నాశంచేసింది. ఇప్పుడదేనాశనం అవుతున్నది" అని చెప్పినాడు.

"నాటోపీకూడా విదేశంలో చేసిందేనా?"

"అవును"

"నేను దీన్ని తగలబెడితే ఏమైనా లాభముంటుందా?"

"తప్పకుండా"

బట్టలూ టోపీలవర్షమూ వెలిసింది. మహాత్మాజీ వస్త్రాలకుప్పకు అగ్నిసంస్కారము చేయడానికి ముందరికి వచ్చారు. కేశవుడు వెనకనుంచి చప్పున ఆయనచెయ్యి పట్టుకుని ఆపినారు.

మహాత్మాజీ వెనకకు తిరిగిచూచారు. చక్కనిపిల్లవాడు చేతులో ఫెల్టుటోపీ పట్టుకుని "అప్పుడే కుప్పకు నిప్పంటించకండి. కాస్త సేపాగండి. నా బట్టలుకూడా పడేస్తాను" అన్నాడు.

అప్పుడు కేశవుడు ప్రపంచమే మరిచిపోయినాడు; తన కిష్టమైన టోపీ, తల్లిమాటలూ మరిచిపోయినాడు. తక్షణము తన ముద్దుల టోపీని కుప్పమీదికి విసిరివేసినాడు. చొక్కా పడవేయడానికి విప్పుతున్నాడు.

మహాత్మాజీ వాత్సల్యముతో కుర్రవాడికంఠము కౌగిలించుకుని "రా, వత్సా! ననస్త్రాలు లేకపోతే యజ్ఞము పూర్తికాలేదు. భారత పుత్రుడూ సరసహృదయుడూ అయిన చిన్నపిల్లవానిత్యాగము వల్లనే ఈసాధన సఫలమవుతుంది" అని చెప్పినారు.

కేశవుడు చొక్కావిప్పి విసిరివేశాడు. మహాత్మాజీ ఆనందముతో తన తెల్లటోపీ బాలుని శిరస్సున ఉంచారు.

బాలుడు పులకితుడైపోయి "భారతవర్షకీజై" అని కేకవేసినాడు. విదేశీనిప్పంటైపై విదేశవ్యాపారాన్ని భస్మీభూతము చేసింది.

అగ్నిజ్వాలలు సప్తసముద్రాలూ దాటి ఈ వృత్తాంతము ప్రకటించినవి. స్వర్గానవున్న స్వదేశవ్యాపారము ఆకాశమునుంచి పుష్పవర్షము కురిపించింది.

## 3

పొద్దు కూకింది. నిశాసుందరి పృథివిమీద మొదటిఅడుగుపెట్టింది. కేశవుడు ఎంతసేపటికీ ఇంటికి రాకపోవడముచేత తల్లి వ్యాకులముతో వానిరాకకు ఎదురుచూస్తున్నది. కాస్త చప్పుడయితే కేశవుడు వస్తున్నాడనే భ్రమతో వాకి వైపు చూస్తూఉన్నది. నిరాశ కలిగినప్పుడల్లా కళ్ల నీళ్లుపెట్టుకొని తనకుమారుని భద్రముగా ఇల్లుచేర్చమనిభగవంతుణ్ణి ప్రార్థిస్తున్నది. పొద్దు పోయినప్పటికీ కేశవుడు ఇంటికి రాకపోవడముచేత తల్లి మోహిని దగ్గరకువెళ్లి

ఏమి చెయ్యమంటారని అడిగింది. మోహిని బనారసుచీరెమీద లెవెండర్ చిలుకుతున్నది. ఆమె సీసా బిరడా బిగిస్తూ "ఇప్పు డప్టే పొద్దు పోలేదు. వస్తానే వుంటాడు, ఎందుకు వృధాగా దిగులుపడతావు?" అన్నది.

సమీపములో ఉన్నతలుపు చప్పున తెరుచుకున్నది. స్వదేశవస్త్రాలు ధరించిన కేశవుడు తల్లిదగ్గరకు పరిగెత్తుకొని వచ్చి "అమ్మా, ఇక్కడ వున్నావా? నిన్ను వెతికి వెతికి ఇక్కడికి వచ్చాను" అన్నాడు.

కేశవుడు రాగానే తల్లి కోపముతో చెయ్యి పట్టుకొని "వచ్చావు మలపా! ఇంత పొద్దుపోయినచ్చినందుకు శాస్తి జరుగుతుంది, పద! ఇంటికి వచ్చావేమి ? ఇంతసేపూ ఎక్కడువున్నావో అక్కడికే వడు. నీయిల్లు ఇక్కడ లేదు? సరేకాని, నీకొత్తబట్ట లేవి ? టోపీ యెక్కడ పారేశావు?" అని కూకలేసింది. బాలుడు సానుభూతికోసము మోహినికేసి జాలిగా చూచి తల్లితో "అమ్మా, ఉండు, కాస్త అలుపు తీర్చుకోనియ్యి. అంతా చెబుతాను. నేను చెప్పేదివింటే నన్ను కొట్టవు" అన్నాడు.

తల్లి కోపముతో "నీటోపీ యే మయింది" అని అడిగింది,

"అమ్మా, నాదగ్గిరనుంచి టోపీ ఎవరూ లాక్కోలేదు. స్వయంగా నిప్పులో పడేశాను"

"టోపీ తగలేశావా? ఎందుకూ?"

ఎందుకా,? అది విదేశీది. అది పెట్టుకుంటే పాపమని విన్నానమ్మా! ఎందుకో తెలియదు కాని టోపీ నెత్తిమీదవున్నంతసేపు కొండంతపాపం వున్నట్టు తోచింది. ఈతెల్లటోపీ మహాత్మాజీ తమచేత్తో నాశిరస్సున వుంచారు. నేను రాజకుమారుణ్ణి అయినట్టూ నాశిరస్సుమీద కిరీటంపెట్టినట్టూ అప్పుడు తోచింది. విదేశీ బట్టలు విప్పి నిప్పులోవేసి స్వదేశీబట్టలు ధరించివచ్చాను. అమ్మా, ఈ సఫేద్‌టోపీ నాకు ఎంతో బాగాలేదా చెప్పు నిజంగా!"

తల్లి ఆశ్చర్యముతో స్తంభించి ఏమీ బదులు చెప్పలేదు. మోహిని ముగ్ధురాలై ముందుకు వచ్చి "నేను చెప్పనా కేశవా! ఎంత శోభ తెచ్చిందో? భారతవర్షానికి తెల్లటి హిమాలయకిరీటము ఎంత శోభతెచ్చిందో ఈతెల్ల టోపీ నీకు అంత శోభ తెచ్చింది" అని చెప్పింది.

బాలుడు ఆనందముతో తల్లివైపు తిరిగి "అమ్మా, ఈవాళనుంచీ విదేశీవస్తువు యేదీ ముట్టుకోనని ప్రతిజ్ఞచేశాను; పద అమ్మా, ఏవి విదేశీవో నేను గుర్తించలేను. పెట్టెలోనుంచి విదేశీవస్తువు లన్నీతీసి తగలవెయ్యి" అన్నాడు.

తల్లికేమీ తెలియలేదు. అయితే గ్రహణశక్తిగల ఆమె అక్కడ లేకపోలేదు. కేశవుని మాటలన్నీ ఆమె చాలా శ్రద్ధతో విన్నది. అప్పుడామె చేతిలో లెవెండరుసీసా చప్పున కిందపడిపోయింది. నిస్పృహచెందిన కాముకుని హృదయమువలె ఆసీసాబద్దలయి పోయింది.

కేశవుడదిచూచి మోహినితో "అయ్యయ్యో, పిన్నమ్మగారూ, ఎంత చక్కటి సీసా పగిలి పోయింది" అన్నాడు.

"మంచిపని జరిగింది కేశవా! దీనిగతి యింతే కావలె!"

"ఏమిటి! ఇదకూడా విదేశీ దేనా!"

"అవును"

"అయితే సరిగ్గానే జరిగింది!"

తల్లి కేశవుని చెయ్యిపట్టుకుని "పద, నాయనా, అన్నం తిందువుగాని, ముఖమంతా వాడి పోయింది" అన్నది.

కేశవుడు చెయ్యి వదిలించుకొని "అమ్మా, ఉండు. ఈవిదేశీసీసా పగిలిపోయికూడా భార తీయులమీద కసితీర్చుకోడానికి కాళ్ళల్లో గుచ్చుకుంటుంది. పెంకులేరి మహాసముద్రం లో విసిరిపారేస్తాను" అన్నాడు.

పగిలిపోయిన సీసాపెంకులు ఏరివేసి కేశవుడు తల్లివెంట వెళ్లినాడు.

మోహిని ఇంట్లో మూలమూలలూ వెతికి విదేశీవస్తువులు పోగుచేస్తున్నది. వకీలు అక స్మాత్తుగా ఇంట్లోకి వచ్చినాడు! వచ్చి అదం తాచూచి ఉలిక్కిపడి "ఏమిటి చేస్తున్నావు" అని భార్య నడిగినాడు.

"ఏమిలేదు, విదేశీవస్తువు లన్నింటికీ స్వస్తి చెపుతున్నా; తెల్లవారే టప్పటికి మనయిం ట్లో పరదేశపువస్తువు ఒక్కటీవుండగూడదు" అని భార్య చెప్పింది.

వకీలుతల గిర్రున తిరిగింది. నక్షత్రాలు ఒక్కొ క్కటే కళ్ళముందరిగా వెళ్ళిపో తున్నట్టు అయింది. ఆయన మోహినితో "సిగ్గు కాపా డుకోటానికైనా బట్టఉండనీ" అన్నాడు.

"ఇప్పుడు మనదేశంలో సిగ్గుకూడానా? విదే వస్త్రాలుకొని సిగ్గువదిలే శానక ఇంకా రక్షణ యెందుకు? సీతాసావిత్రులమానము కాపా డిన దేశీయువల్కలాలను దయాస్వరూపిణి అయిన ప్రకృతి మన కివ్వదా? బట్టలుకోసం భరతఖండం చింతిస్తుందా? ద్రౌపదికి అనంత వస్త్రరాశి యిచ్చిన భగవంతుండు మనకు వస్త్రాలు లేకుండా చేస్తాడా?"

ఈమాటలంటూ ఆవిడ వంకెమీదఉన్న చీరె తీసి కిందబట్టల కుప్పలో పడవెయ్యబోతూ ఉంటే భర్త అడ్డమువచ్చి "అయ్యో, అది విదేశీది కాదు, స్వదేశీ బనారసు చీరె" అన్నాడు.

"కాని విదేశీదుర్గంధం వస్తున్నది దాంట్లో నుంచి"

"ఏం దుర్గంధం?"

"వాసన చూడండి"

ఆయన చీరె వాసనచూచినాడు. లెవెండరు పరిమళము ఘుమఘుమలాడింది. ఆయనఏమీ మాట్లాడలేదు.

విదేశీబట్టలన్ని అంగణములో పోగుచేసి మో హిని కొరివి అంటించబోతున్నది. బయటి నుంచి బిచ్చగత్తె యిలా ప్రార్థించింది. "అమ్మా! రెండుమూడుబట్టలు ఇందులోనుంచి నాకు దయచెయ్యండి, తగలబెట్టకండి. మీ పేరు చెప్పుకుంటూ శీతాకాలంలో నేను, నాపిల్లలూ వెచ్చగా కప్పుకుంటాం అమ్మా!"

దాని మాటలు లెక్కచెయ్యక మోహిని "ఈవిదేశీవస్త్రాలలో ఒక్కొక్కపోగు వేల

కొన్నే సూదులై నీశరీరాన్ని గుచ్చుకుంటవి" అని చెప్పింది.

భిక్షుకురాలు అంతటితో ఊరుకోక మళ్లీ "దీనురాలను, బికారిని! అమ్మా, కట్టుకోటానికి ఒక్కబట్టయినా లేదు. ఒక్కటైనా ఇవ్వాండమ్మా !" అని వేడుకున్నది.

"మన దేశంలో జనమంతా వస్త్రవిహీనంగానే ఉంది. అంతాదరిద్రులే సుఖంగా వున్న దెవరు? పో, వెళ్లిపో, మన దేశానికి స్వరాజ్యం వచ్చేవరకూ శీతకాలం ఇలాగో గడుపు. పో" అని మోహిని చెప్పింది.

అగ్ని తగలగానే విదేశీవస్త్రాల పోగు భస్మమవుతున్నది. ఆనందముతో చేతులుతట్టుతూ గంతులు వేస్తున్న చిన్న కేశవులు అగ్నికాంతిలో మోహినికి కనుపించినాడు.



# డాఁగురుమూఁతలు

సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు గారు

గమనవేగభరమ్మునఁ గలఁగి, మిత్ర!
బహుళదుర్దమాయాస సంభ్రమసమ
తాంతరంగుఁడ వగుచు, దినాంతసమయ [న్వి
మున నరుణకాంతు లాననమునఁ జెలంగ
సరసులఁ బసిండిపడుగులు చాఁచినట్లు
కదిసి తరగల మిడుఁగురుల్ చెదరినట్లు
వలితెరల జాళువావన్నె యలఁదినట్లు
ముదిరమోములఁ గెంపులు వొదిగినట్లు
తోఁచి తోఁచనిజాడలఁ దోఁచుచుండి
సౌమ్యసంసక్తమైన కెంజాయ దనరు
పశ్చిమాశాంతరాంబరపటలిఁ జొచ్చి,
నవ్యతేజంబు నందు లీనం బొనర్చి,
కడఁగి వెన్నాడుచెలికిఁ గన్పడని మాడ్కి
నాఁగి, మబ్బుల నందందు డాఁగిడాఁగి,
యెడనెడను నీవు పొడమి పర్వెడుచు నుండఁ
గాంచి, పూర్వాద్రి ధవళమేఘములవటుమఁ
జనుచు, నల్లన నెందొ డాఁగొనుచు, వగలఁ
గనుచుఁ, జలివెలుంగుల నెల్లకడలఁ జిందఁ
గోరి, పదునాఱుకళలు నిండారఁ బొలిచి,
సుప్రసన్నముఖుండయి సుస్వభావ
గరిమ విలసిల్ల, నెంతయు మురువుహెచ్చ,
బరువెసంగఁ, దీప్త్యోత్సాహపటిమ వెలయఁ,
బ్రీతి నిన్ను వెన్నంటుజాబిల్లి నెఱిఁగి—
మీరు డాఁగురుమూఁతల మెలఁగ నిట్లు
దవ్వుదవ్వుల నుండి మీతంతు దెలిసి
పలుదెఱంగుల మురియు దిక్కులఁ దలంచి—
ఈవినోదంపుఁ గలిమి హెచ్చించు వేడ్కఁ
దఱుచు మీకడ్డువడు జలదముఁ జూచి—
పెరిమఁ గనుమూసి గంతలువెట్టి సమత
నెల్లజగముల —'మిమ్ము'— క్రీడింపఁజేసి
యుల్లమున సంతసిల్లెడు తల్లి నెంచి—
చిన్నిబుడుతలు— కవులు హర్షింత్రుగాదె?




పండిత పురాణం సూర్యనారాయణతీర్థులుగారు

## ౨

మహాలదేవుఁడు—మిత్రమా కండరీకా! ఇంక మీరు చూచినదిగాని, విన్నదిగాని, అనుభవించినదిగాని యేదియో ఒకఘటన వర్ణింపుఁడు.

కండరీకుఁడు—అటులేని వినుఁడు. నేను విన్నదియు, కన్నదియుఁ గాక అనుభవించినఘటనయే చెప్పెదను. నేను బాల్యావస్థలో వినయవిధేయతలు లేక అల్లరిపిల్లకాయలతోఁ జేరుకొని యిచ్చకు వచ్చిన మచ్చున విచ్చలవిడిగా పెచ్చుపెరిఁగి చాల అల్లరిచేయుచుండెడివాఁడను. నాప్రవర్తనవలన చాల కష్టములకు పాలయి దుఃఖపడి యెట్టులయిననేమి తుట్టతుదకు నాతల్లిదండ్రులు నన్నింటినుండి గెంటివైచినారు. "పీడ వదలినది. నిత్యము వీండ్లపోరే తప్పిపోయినది బ్రదుకు జీవుఁడా! అని సంతోషించుచు నే ననేకములగు దేశములు, పట్టనములు, పల్లెలు, తిరుగుచు—తిరుగుచు తుద కొకానొక గ్రామమునకు చేరుకొన్నాను. ఆగ్రామములో లెక్కకు మిక్కిలిగా గోవులు, బఱ్ఱెలు (గేదెలు), మేకలు గొఱ్ఱెలు, ఏనుఁగులు, గుఱ్ఱములు మొదలయిన గ్రామ్యపశువు లుండెడివి. మఱియు, నానావిధములైన పుష్పఫలాదులతో నిండినతోఁటలెన్నియేని ఆయూరి చుట్టును ఉన్నవి. ఆయూరివారందఱును సమృద్ధిగాపాడిపంటలతోను, ధనధాన్యసంపదలతోను తులతూఁగుచుండెడివారు. ఆగ్రామమునకుబయటను గొప్పమఱ్ఱిచెట్టొకటి ఉన్నది. ఆచెట్టుక్రిందనో, మీదనోకాని కమలనామము గల యక్షుఁ డొకఁ డుండెడివాఁడు. ఆతనిప్రభావ మిట్టిదని చెప్ప నలవికాదు. ఆతనిని పూజించి నమస్కరించి తమతమకార్యములు నెఱవేర్చుకొనుటకై చాలమంది మహాజనులు భక్తిశ్రద్ధాతాత్పర్యముతో శుద్ధనిర్మలవస్త్రములు కట్టుకొని పుష్పఫలధూపదీపనైవేద్యాదులగు వస్తువులు పట్టుకొని, ఆయూరివారును, చుట్టుపట్టులనున్న గ్రామములవారును వచ్చుచుండెడివారు. అట్లు వచ్చి వచ్చి అతనిని పూజించి నమస్కరించి వారువారు తెచ్చిన ఉపహారములు సమర్పించి వాంఛితములయిన వరములను పొంది యిండ్లకు పోవుచుండెడివారు. అది యంతయు చూచి నేనుకూడ ఆయక్షునికి నమస్కరించుటకై పోయినాను. నే నచటకు పోవునప్పటికి గ్రామస్థులు చాలమంది అచ్చట ఇచ్చకు వచ్చినమచ్చున ఆట లాడుకొనుచున్నారు. మఱికొంచెమునేపటికే అస్త్రశస్త్రములతో సజ్జితులయిన గొప్పదొంగలగుం పొకటి 'పట్టండి, కట్టండి, కొట్టండి, లాగికొండి, చంపండి' మొదలయిన కఠోర ధ్వనులు చేయుచు అచ్చటికి వచ్చినది. ఆగుంపును చూడఁగానే ఆటలాడుకొనువా రందఱకును చాల భయము కలిగినది. అందఱును అటు ఇటు తమరక్షణోపాయమును వెదక మొదలిడినారు. అపు డకస్మాత్తుగా వా రచటనే పడియున్న యొక కరుబూజాకాయ చూచినారు. సరి. దానిని చూడఁగానే జనులందఱకును కంఠగతములయిన ప్రాణములు నిలిచినవి. నేను వారును అందఱ మందఱును ఆకరుబూజాకాయలోఁ దూఱినాము. ఎట్టులయిననేమి? మేమందఱమును అందులోఁ బ్రవేశించి, ఆనందముగా క్రీడించుచుంటిమి. అవతల ఎపుడు చోరులు మ మ్మచట చూడక ఎనటికో పాఱిపోయినా మని తెలిసికొన్నారో అపుడే వారును నిరాశులయి వచ్చిన దారినే పోయినారు. దొంగలు పాఱిపోయినా రని ఆలోచించుకొని మేము అందుండి బయటికి రావలయు

ననియే ఆలోచించుచున్నాము. ఇంతలో ఒక మేఁక యెక్కడనుండియో మేయుచు మేయుచు అక్కడకు వచ్చి మే మందుఁడుమను దాఁగుకొనియున్న ఆకర్బూజా కాయ మ్రింగివైచినది. అంతటితోనే క్షేమము కలుగ లేదు. అట్లాకాయను మ్రింగి మేఁక తనదారిని పోవుచుండఁగా దాని నొకకొండచిలువ మ్రింగివైచినది. ఆ కొండచిలువ నొకగృధ్రపక్షి మ్రింగినది. వెంటనే అది ఆసమీపములో ఉన్న పెద్దమఱ్ఱిచెట్టుకొమ్మమీఁది కెగిరి కూర్చున్నది. ఏసమయమున ఆపక్షి కొమ్మపైని వ్రాలి కూర్చున్నదో అపుడే ఒకరాజు సైన్యముతో ఎక్కడకో పోవుచు ఆమఱ్ఱిచెట్టుక్రిందను బసచేసినాఁడు. అతనికి మదోన్మత్తమైన యేనుఁగొకటి ఉన్నది. దాని మావటి వాఁడు క్రిందికి వ్రేలాడుచున్న పక్షితాలూకు ఒకకాలు చక్కని మఱ్ఱియూడ అనుకొని దానికి తన యేనుఁగును కట్టినాఁడు. కొంచెమునే పటికి అనఁగా, ఎంతలో ఆపక్షి తనకాలు మీఁది కెత్తినదో అంతలో ఏనుఁగు మీఁది కీడ్వఁబడినది. దానికి కష్టము కలిగినందున ఘీంకారము ప్రారంభించినది. అంతలో మావటివాఁడు 'ఎవ్వరోకాని యేనుఁగును మీఁది కెత్తుకొనిపోవుచున్నారు' అని కేకలువేయుచు, అటు ఇటు పరుగులెత్తుటకు ప్రారంభించినాఁడు. ఆ సంగతి వెంటనే రాజుగారికి తెలియవచ్చినది. ఆయనయు తన యోధులను పిలిపించి 'యేనుఁగు నెట్లయినను విడిపించి తోడుకొని రండు' అని ఆజ్ఞాపించినాఁడు. రాజాజ్ఞ అగుటయే తడవుగా భటులుపరుగెత్తినారు. వారు తమశస్త్రములతో ఆపక్షి కాలు నఱికినారు. ఒకకాలు తెగిపోవుటచేత నాపక్షి క్రిందను పడిపోయినది. వెంటనే రాజు దానికడుపు చీరుమని యాజ్ఞాపించినాఁడు. కొందఱు నౌకరు లాయుధములతో దానికడుపు చీరినారు. అందులోనుండి కొండచిలువ బయలువెడలినది. దానిని చూచి కొందఱు భయపడినారు. రాజుగారు 'దానికడుపుకూడ చీరుఁ'డని యాజ్ఞాపించినారు. కొందఱు భటులు సాహసించి దానికడుపును చీరినారు. అట్లు చీరఁగానే అందు మేఁక కనుపడినది. ఈయాశ్చర్యమును చూచి రాజుగారు 'మాతము, దీనికడుపులో నేమున్నదో దీనినికూడ చీరు'డన్నారు. ఒకఁడు దానిని, పట్టి చట్టున కడుపు చీరినాఁడు. అందులో కరుబూజా కనుపడినది. అప్పటి వారికి కలిగిన యాశ్చర్యమునకు హద్దు మిత్తి లేకపోయినది. రాజుగారు నిశ్చేష్టితులే అయిపోయినారు. కొంతసేపటికి తెలివితెచ్చుకొని 'ఇంకను ఏమి యాశ్చర్యము బయలుపడునో, ఇది పగులఁగొట్టుఁడు' అన్నారు. ఆ కాయ పగులఁగొట్టినప్పటికి దానిలోనుండి నేనును, గ్రామస్థులును చేతులతో పట్టుకొన్న కఱ్ఱలతోకూడ ఆడుచు, గంతులువేయుచు బయటికి వచ్చినాము. ఇట్లొకదానిని మించి యింకొక ఆశ్చర్యమును కలిగించు దృశ్యమునకు రాజుగారికిని, తత్సేనకులకును కలిగిన యాశ్చర్యపరంపరకు మేర లేకపోయినది. గ్రామస్థులంపఱును తమకుఁ జేసిన ఉపకారమునకు తమ కృతజ్ఞతను సూచించు వందనమాలికలు సమర్పించి యెవరి యిండ్లకు వారు వెళ్లిపోయినారు. రాజుగారుతమ సేవకులను వెంటఁబెట్టుకొని పట్టణమునకు వెళ్లిపోయినారు. నేను వారి యొద్దను సెలవుపుచ్చుకొని బయలుదేఱి తిన్నగా ఈ యుజ్జయినీపట్టణమునకు చేరుకొని మీతో కలిసికొన్నాను. ఇదియే నా కనుభూతమైనకథ.

ఏలాషాఢుఁడు—అన్నా! ఇప్పుడుమీరు చెప్పిన సంగతులన్నియు నాకేమో ప్రత్యక్షరమును సత్యమే అని తోఁచుచున్నది.

కంఠకీకుఁడు—అన్నా! మీ కసత్యమనితోఁచిన పక్షమున, ఒక కర్బూజాలో ఒక గ్రామములోనివారందఱును ఎట్లిముడిఁ గలిగినారో సెల వీయవలయును.

ఏలాషాఢుఁడు—అన్నా! మీరు విష్ణుపురాణములోని కథ వినియుండలేదా యేమి? ఇదివఱకు వినియుండని పక్షమున నే నిపుడు చెప్పెదను వినుఁడు. అం దిట్లున్నది: మొట్టమొదట నీలోకములో జలములప్పుడు ఏమియును లేదు. అప్పటికి భూమి, తేజస్సు, వాయువు అనుపదార్థములు లేవు. వానితోపాటుగా ఆకాశమునకు సైతమును అభావ మేర్పడియున్నది. ఆయేకార్ణవ జలములో పెద్దగ్రుడ్డొకటి యెప్పటినుండియో తేలుచు తిరుగుచున్నది. ఇట్లది జలతరంగములలో మునుఁగుచు, తేలుచు, క్రీడించుచు నాకస్మికముగాపగిలిపోయినది. తునకలు రెండుగా విడిపోయినది. అది యట్లుకాఁగానే దానిలోనుండి దేవతలు, మనుష్యులు, పసువులు, పక్షులు మొదలుగాఁగల జీవరాసు లన్నియు, బయటికి వచ్చినవి. ఆ

ప్రస్థశాలూకు అడుగుభాగము భూమియు, పైభాగ మాకాశముగాను మాఱిపోయినవి. ఆపురాణములో వ్రాసినసంగతులు-అనఁగా, ఒకప్రస్థములో ఇంతపెద్దది యగు భూమి, ఇన్ని జీవరాసులును ఇముడఁజాలుట నిజమయి నప్పుడు కరుబూజాకాయలో ఒకచిన్నగ్రామములోనివ సింపఁజాలినవా రిముడుట ఏమంత గొప్పసంగతి? ఇది గాక, భారతారణ్యపర్వములో మార్కండేయఋషి ధర్మరాజుతో తా ననుభవించిన యొక సంగతి చెప్పియున్నాఁడు. అది యీ క్రింద వివరింపఁబడుచున్నది: ఆమహానుభావుఁ డిట్లు చెప్పియున్నాఁడు. "ధర్మరాజా! యుగాంతమం దీభూమి యంతయు జలమయ మైపోయినది. అప్పు డీసంపూర్ణ జగత్తుతో పాటు నేనును తరంగములలో మునుఁగుచు, తేలుచు నుంటిని. అట్టిసమయమున నే నొకప్పుడు కన్నులు విప్పి చూచునప్పటికి మేరుపర్వతమునంటి పెద్దమఱ్ఱిచె ట్టొకటి యెదుటను కనుపడినది. సరి, దానిని చూచి బ్రదుకుజీవుఁడా! అనుకొని నే నానీటినుండి బయలు దేఱి యెట్టకేల కామఱ్ఱిచెట్టెక్కి, ఒకకొమ్మమీఁదను కూర్చున్నాను. నాతోపాటుగానే సముద్రతరంగము లలో మునుఁగుచు, తేలుచు ఉన్న మిగిలిన దేవతలు, మనుష్యులు మొదలయినవారి నంద ఱను సముద్రములోనే విడిచిపెట్టినాను. నేను కూర్చుండియున్న మఱ్ఱికొమ్మ తాలూకు ఒక ఆకుమీఁదను నిరుపమానము లయిన రూపలావణ్యములుగల పసిబాలుఁ డొకఁడు వెల్లకిలఁ బరుండి యున్నాఁడు. నా కాబాలుని చూడఁగానే జాలి కలిగినది. "ఇట్టిసమయమున, ఇటువంటిపసిబాలుఁ డెక్కడనుండి వచ్చి యీమఱ్ఱియాకుపైని పరుండి యున్నాఁడు? ఇదేటిసంగతి యయియుండునో కదా" అని నే నాశ్చర్యభరితుఁడ నయిపోయినాను. అపుడు నే నిట్లన్నాను. "వత్సా! నీ వీలోఁతునీటను పడిపోయి నచో ప్రాణములు దక్కవు. కావున నాబుజము పట్టు కొనుము. అప్పుడు నీ కేవిధమయిన భయమును ఉండదు" ఇట్లని నేను నాబుజము నాబాలునివయిపు చాఁచితిని. వెంటనే నాబుజము పట్టుకొని, ఆబాలుఁడు నేను తనవిషయమున చూపినదయకు ప్రతిఫలముగా నన్నా బాలుఁడు మ్రింగివేసినాఁడు. నేను వానికడుపు లోనికి పోయి చూచునప్పటికి గొప్పగొప్పపర్వతము లును, దట్టములయిన- అడవులును విశాలమయిన భూమి యు నాకు దృష్టిగోచరమయినది. నేను తిరుగుటకు ప్రారంభించినాను. దేవమానమున వేయిసంవత్సరముల కాలము విశ్రాంతిని గాంచకుండనే తిరిగినాను. కాని యచ్చటిభూమి కంతము కనుపడలేదు. తుట్టతుదకు నే నలసిపోయి యొట్టులో బయటను పడినాఁడను." అని చెప్పినమార్కండేయమహర్షి కథనలన దేవతలు, మను ష్యులు మొదలగు సమస్తజీవరాసులతో నిండియున్న భూమి పసిబాలునికడుపులో ఇమిడియున్నప్పుడు, కర్బూజాకాయలోపలను ఒకచిన్నగ్రామములో ఉండె డువా రిమిడియుండుట అసంభవముగా దని స్పష్ట మగు చున్నది గాదా?

కండరీకుఁడు—సరియే కానిండు, ఇదియేమో నాబుద్ధికి నచ్చినది. కాని, ఒకపక్షికడుపులో అజగ రము, దానికడుపులో మేఁక, దానికడుపులో కరు బూజాకాయ, దానిలోపల గ్రామస్థులు, ఈప్రకార ముగా ఈపరంపర ఒకదానిలో ఒకటి యేప్రకార ముగా ఇమిడి యున్నది? అని నాకు సందేహము కలుగు చున్నది. తగినసమాధాన మేమయినను ఉన్నపక్షమున, చెప్పి నాసందేహమును తీర్పవలయును.

ఏలాపాకుఁడు—అన్నా! చిత్తగింపవలసినది. దీనికి సైతము తగుసమాధానము చెప్పెదను. శ్రీవిష్ణుభగ వానుఁడు—అనఁగా శ్రీకృష్ణమూర్తి దేవకీదేవి తాలూకు చిన్నకడుపులో ఉన్నాఁడు. అతనికడుపులో అనేక ములయిన నదులును, పర్వతములు మొదలగువారితో నిండినభూభాగ మంతయు ఉన్నది. ఈసంగతి పలు పురాణములలో వ్రాయఁబడియే యున్నది. కావున, ఇది సత్య మనక తప్పదుగదా! ఇది నిజమని అంగీక రించినప్పుడు పక్షికడుపులో అజగరము, దానికడు పులో మేక మొదలయినవి యిమిడి యున్న వనుటలో అసత్య మేమున్నది గనుకను.

కండరీకుఁడు—అన్నా! మీరు చెప్పినయీసం గతియు నే నంగీకరించుచున్నాను. కాని, కర్బూజా కాయలోపల నేను, గ్రామస్థు లందఱును ఎట్లు బ్రదికి యుండఁగలిగినామో, మఱియు నందులో ఆడుచు

గంతులు వేయుచు నెట్లు మసలఁగలిగినాఁడో అదిమాత్రము చెప్పవలసియున్నది.

ఏలాపాథుఁడు—అన్నా! దీనికిని సమాధానము కావలసి యున్నదా? అటులేని చిత్తగింపుఁడు. ఏప్రకారముగా భూమిమీఁదను ఋషులు మొదలగువారి వేదాధ్యయనాదులును, వీరపురుషులయుద్ధాదిక్రియలును గృహస్థులయిండ్లలో వివాహోద్యుత్సవాదులును జరుగుచునుండెడివో, మఱి, దానిపయిని ఉండెడివారు బ్రదికియుండిరో, ఆభూమి శ్రీకృష్ణుని ఉదరములో ఉండఁగలిగినదో అదేప్రకారముగా కరుబూజాకాయలోపల మీరంపఱును ఆడుచు, గంతులువేయుచు జీవించి యుండవచ్చును. ఇందులో అసంభవ మేమున్నది?

కండకీకుఁడు—అన్నా! మీ రిపుడు సెలవిచ్చిన దానిలో నా కొక్కసంశయ మేర్పడినది. శ్రీకృష్ణుఁడు తనకడుపులో జగమంతయు నెట్లుంచుకోఁగలిగినాఁడో, అతనికడుపులో అ దెట్లిముడఁగలిగినదో నాకు బోధపఱుప వేఁడెదను.

ఏలాపాథుఁడు—వినుం డన్నా! వినుఁడు. సెనుకనొకప్పుడు బ్రహ్మకును, విష్ణువునకును వివాదము తటస్థించినది. "నా ముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, ఊరువులనుండి వైశ్యులు, పాదములనుండి శూద్రులు, ఈప్రకారముగా నాలుగువర్ణముల వారును పుట్టియున్నారు. కాఁబట్టి, నేనే జగత్తులకు కర్తను" అని బ్రహ్మదేవుఁ డన్నాఁడు. అతఁ డన్న మాటలు వినఁగానే కోపించి శ్రీవిష్ణుఁడు "ఓరీ మూర్ఖుఁడా! నీ వనఁగా నేసాటివాఁడవురా! నీవు నా సేవకుఁడవు కావా? నీ కిట్లహంకరించి మాటలాడుటకు సిగ్గయినను లేకపోయిన దేమిరా? భూమ్యాకాశములు దవుడలు, పర్వతములు గడ్డము, సముద్రములు జిహ్వాయును గాఁగల నాముఖమునం దొక్కసారి తూఱి చూచినపక్షమున నీ కీజగత్తంతయు కనుపడునే! నీపుట్టుపూర్వోత్తరములే నీకు తెలియనియట్టు లున్నవి. నీవు నానాభికమలమునుండి పుట్టినవాఁడవే కావఁటరా? అట్టు లుండినప్పటికిని నిన్ను నీ వెఱుఁగఁజాలక నాయెదుటనే యెంతో గొప్పవాఁడ వయినట్టుగా నోటికి వచ్చినట్లెల్ల మాటలాడుచున్నావుగా! చంద్రునిప్రభావాను గ్రహములవలన వికసించిన కలువపువ్వు చంద్రునే వెక్కిరించునటయా? వాహ్వా వాహ్వా! ఏమి నియనాత్మజ్ఞత? చాలు, నీపాటికి నోరు మూయుము" అన్నాఁడు.

కండ—పోనిండుకాని, అన్నా! అంతట పెద్దపక్షి–అనఁగా, తనకడుపులో అజగరాదులను ఇముడ్చుకోఁదగినంతటిపక్షి యెక్కుడనయినను ఉండెఁజాలునా? అది యెట్లు సిద్ధమగునో సరిగా సమాధానము చెప్పుదురుగాక!

ఏలాపాథుఁడు—అన్నా! మీరు ద్రౌపదీదేవి స్వయంవరమునాఁటి ధనుస్సంగతి యెఱుఁగనియట్టులే మాటలాడుచున్నారే! దానిమీఁదను పర్వతములు మొదలగునవి స్థాపింపఁబడినవి గావా? ఒకవేళ, మీ రాకథ వినియుండని పక్షమున నే నిప్పుడు చెప్పెదను. చిత్తగింపుఁడు. ద్రుపదమహారాజు తనకుమారికయగు ద్రౌపది వివాహమువిషయమున "ఏపురుషుఁడు దేవతాధిష్ఠితమయిన మాయాధనుస్సు నెక్కువెట్టి లక్ష్యమును తప్పక కొట్టఁగలుగునో, ఆతనికి నాకూఁతు నిచ్చి పెండ్లి చేయుదును" అని చాటింపించినాఁడు. ఆ చాటింపు విని ధనుర్ధరులగు రాజు లెందఱో వచ్చినారు. గొప్పగొప్పబలవంతులని పేరుపడిన వీరులుసైతము ధను వెక్కుపెట్టఁజాలకపోయినారు. తుదకు శిశుపాలుఁ డెక్కువెట్టుటకు బయలుదేఱినాఁడు. అప్పుడు శ్రీకృష్ణుఁడు వెంటనే ఆధనుస్సుపయిని మేరుపర్వతము, గరుత్మంతుఁడు, హలముసలములు, సర్పము, శంఖము, చక్రము, గద మొదలగు నిన్నివస్తువులు భార మెక్కువయగుటకై ఉంచినాఁడు. కాని, అంతమాత్రమున శిశుపాలుఁడు చలింపనే లేదు. అతఁడు సులభముగానే ఆధనుస్సు నెత్తి నారి బిగింపుటకు ప్రారంభించినాఁడు. అది చూచి కృష్ణుఁడు, చంద్రుని, సూర్యుని, అగ్నిని, సముద్రములను, పర్వతములను, భూమిని మఱింతబరువుకోసము దానిపై నుంచినాఁడు. ఎన్నివస్తువులు జోడించినప్పటికిని శిశుపాలుఁ డెక్కుపెట్టఁగలిగినాఁడు. ఒక్క అర్ధాంగుళముమాత్రమే అంతర మున్నది. ఆసమయమున కృష్ణుఁడు ధనుస్సును తనకాలితో తన్నినాఁడు. అందువలన ధనుస్సమేతముగా శిశుపాలుఁడు క్రిందను పడిపోయినాఁడు. అటు

పెదకాలి వర్ణము తాకనున్నను తనచేత నందుకొన్నాఁడు. కాని దానిభారమును భూమి సహింపలేకపోయినది. కావున, అర్జునుఁడు ధనుర్జ్యాకారమును భీమునిచేతుల యందుంచి దాని నెక్కుపెట్టుట కుద్యుక్తుఁ డయినాఁడు. తుదకు నెక్కుపెట్టి క్రిందు చూచుచు ధనుస్సును చెవివఱకును లాగి మత్స్యయంత్రమునకు తగులునట్లు బాణమును విడిచినాఁడు. వెంటనే పెండ్లికూఁతురు పూలమాల పెండ్లికొడుకుమెడలో వేసినది. ఇంక నాలోచింపుఁడు. చంద్రుఁడు, సూర్యుఁడు, భూమి మొదలగు పదార్థములు పెట్టుటకు చాలనంత ధనుస్సు ఉండుట సంభవించినప్పుడు ఒకపక్షి అంత విశాలముగా నుండుటలో కాని, దానికడుపులో సర్పాదిక మిమిడిపోవుటలో కాని, దానికాలిలో వ్రేలాడి యేనుఁగు మీఁది కీడ్వఁబడుటలోఁగాని సందేహ మేముండును? ఇదిగాక, ఇట్టిదే యింకొకదృష్టాంతము రామాయణములోనయితము లభించును. అదిగూడ విన్నచో మీమనస్సు నిస్సంశయ మగును. అది యెట్లుండురేని వినుఁడు:—

రావణుఁడు దండకారణ్యమునుండి సీతను హరించుకొనిపోవుచుండఁగా జటాయు వనుపక్షి వానితో పోరాడి సీతను విడిపించునుద్దేశముతో ఎదురుగా వచ్చినది. కొంతకాలము వానితో యుద్ధముచేసినది. తుట్టతుదకు రావణుఁడు తనచంద్రహాసముతో దానిఱెక్కలు నఱికివైచినాఁడు. అంతతో అది నేలపైని పడిపోయినది. తనకు సాయపడ వచ్చినజటాయు వనుపక్షికి తటస్థించినదురవస్థ చూచి సీతాదేవి "ఓపరోపకారీ! పక్షిరాజా! ప్రస్తుతము దుర్దైవవశమున నీఱెక్కలు తెగిపోయినవి. కాని నేను చెప్పుచున్నాను వినుము. నాశీలవ్రతప్రభావమువలన నీఱెక్కలు మరల రాఁగలవు. ఎప్పుడు నీకు శ్రీరామచంద్రుని దూతల సంపర్కమగునో అప్పుడు తప్పక వచ్చును" అని వర మిచ్చినది. తుదకట్లే జరిగినదిచూడుఁడు. మఱికొన్నాళ్లకు శ్రీరామచంద్రుని ఆజ్ఞవలన సీతామహాదేవిజాడ తెలిసికొనుటకై తిరుగుచు తిరుగుచు హనుమంతుఁడు ఱెక్కలు తెగిపడియున్న జటాయుపక్షియొద్దకు చేరినాఁడు. ఇదేదో ఒకగొప్పపర్వతము అని యతఁ డాలోచించుకొన్నాఁడు. దీనిపై నెక్కి నలుదిక్కులును చూచెద ననుకున్నాఁడు. దీనిశిఖరముపై నెక్కి చూచినపక్షమున చాలదూరమువఱకును ఉన్నభూప్రదేశము దృష్టిగోచరమగు ననుకొన్నాఁడు. అతఁ డిట్లాలోచించుకొని సమీపించునప్పటికది తా ననుకొన్నట్లు పర్వతము కాదనియును, ఏదో గొప్పపక్షి యనియును నిశ్చయించుకొన్నాఁడు. అంతట 'నీవెవరు? ఎక్కడినుండి వచ్చియున్నావు'? అని జటాయు వడిగినాఁడు. నేను శ్రీరామచంద్రునిదూతను. సీతామహాదేవిజాడ తెలిసికొనుటకై బయలుదేఱి తిరుగుచున్నాను. అని హనుమంతుఁడు బదులు చెప్పినాఁడు. అతనిమాటలు విని జటాయువు "నాయనా! సీతాదేవిని రావణుఁడు లంకలోనికి తీసికొనిపోయినాఁడు. నీవిట్లు నిష్కారణముగా నీయడవులలోను, కొండలపైని ఏల తిరిగెదవు? ఇంక నీవు వేగముగా వెళ్లి సీతసమాచారము శ్రీరామునితో చెప్పుము. నేను సీతను కాపాడుటకై చాలవఱకు ప్రయత్నించినాను కాని, కృతఘ్నునికి చేసిన ఉపకారమువలె నా ప్రయత్న మంతయు వ్యర్థమే అయిపోయినది! తుట్టతుదకు రావణుఁడు నాఱెక్కలు తెగఁగొట్టినాఁడు. అంతట నే నిచ్చట పడిపోయినాను. ఇట్టులే ఉండిపోయినాను" అన్నాఁడు. ఇట్లు చెప్పినజటాయుపలుకులు విని హనుమంతుఁడు "పుణ్యమూర్తీ! నీవల్ల నయినంతవఱకు రావణునితో యుద్ధము చేసితివి. నా కిప్పుడు సీతాదేవిజాడ చెప్పితివి. కాఁబట్టి నీకు మేలు కలుగును గావుత మని నే నాశీర్వచించుచున్నాను." అన్నాఁడు. ఇంక నేమున్నది? హనుమంతుఁ డట్లాశీర్వచించినదే తడవుగా తెగిపోయినజటాయుపక్షి ఱెక్కలు మొలచినవి. అది ఆకాశమార్గమున ఎగిరి స్వర్గమునకు పోయి చేరుకొన్నది. కాఁబట్టి, జటాయుపక్షి కొండంతదియై యున్నప్పు డొకగృధ్ర పక్షి అంత పెద్దదిగా నుండుటలో నేమి యాశ్చర్యమున్నది? అన్నా! ఇంతతో నీస్వాంతములోని సందియము లన్నియు తీఱియుండును గదా?







నాళము కృష్ణారావు గారు


## కాలయాపనము

ప్రొద్దుపుచ్చఁగ నొకసారి పూలతోఁట
కేగియుంటిని-అక్కటా! ఏమి చెపుదు?
బూచులో యనఁ గనుపట్టె పూలచెట్లు,
గాలి సోఁకినగతి చల్లగాలి సోఁకె.

ఉబుసుపోకకు వెడలితి నొక్కనాఁడు
నాదుమిత్రులతోఁ గూడి నావపైని,
పయిరగాలికి నల్లాడుపడవవోలె
ఉల్ల మెంతయుఁ జింతచే నూఁగులాడె.

ఎట్టులెట్టులో కాలంబు నెట్టిపుచ్చ
అనుఁగుమిత్రునిఁ గూడి వయాళి వెడల,
అనునయింపఁగ నతఁడు మాటాడినట్టి
పలుకు లన్నియు నక్కటా! ములుకు లయ్యె.

నాటకముఁ జూడ నే నొక్కనాఁటిరాత్రి
అనుఁగు నెచ్చెలికానితో నరిగియుంటి,
ఏమి చెప్పుదు— నాతోడ నీవు లేమి
నాటకం బెల్లఁ గనుపట్టె బూటకముగ.

అక్కటా! ఏమి చెప్పుదు — నొక్కరేయి
నీవు తలఁపునఁ బొఱంగ నిదుర రాక
దిగ్గు రని పాన్పుపైనుండి డిగ్గనుఱికి
క్రుమ్మరిల్లితి కొఱవిదయ్యమ్మురీతి.

నిన్నుఁ గన్నట్లు ముద్దిడుకొన్నయట్లు,
కౌఁగిలించినయట్టులు కలలు గాంచి
ఉలికిపాటున లేచి నే నొక్కరేయి
పడినదురవస్థ యెల్ల దైవంబె యెఱుఁగు.

ఏను పురవీథిఁ జనుచుండ, హితుఁ డొకండు
'కొడుకు లెందఱు నీ' కని యడిగె నన్ను;
పిడుగుఁ బోలినయామాట వినినయంత
చిత్తరువురీతి నిలిచితి చేష్ట లుడిగి.

నేఁడు నడువీథిఁ జనుచుండ నిన్నుఁ బోలు
బూరిబుగ్గలబుడుతండు తారసిల్ల,
కాంక్ష దీఱ నెగాదిగఁ గాంచుచుంటి
వ్రీడచే వాఁడు నెమ్మోముఁ ద్రిప్పుకొనియె.

బుడుతఁ డెవ్వఁడో చావ, నాపొంతఁ జనుచు
కంటఁ దడిపెట్టితిని నీవు జ్ఞప్తి రాఁగ,
చుట్ట మని మెచ్చి వారు నాచుట్టుఁ జేరి
గొల్లు మని యేడ్వ, సురిగితిఁ దెల్లవోయి.

చుట్టములు నన్నుఁ బిలువంగఁ జూడ నేగి
నేఁడు చూచితి నీయీడుజోడువాని
పాప నొక్కని— ఏమిపాపంబొ కాని—
గుండె జల్లన నేలపైఁ గూలినాఁడ.

అకట! నీతోనె నాయాస లంతరించె,
వాంఛ లడుగంటె, తలఁపులు వ్యర్థ మయ్యె,
చిత్త ముడివోయె, పొల్లయ్యె జీవితంబు;
ఎట్లు గడపుదు కాలంబు నింకమీఁద ?

కేలఁ జిక్కినరత్నంబు గోలుపోయి
గాజుపూసను గని తృప్తిగాంచినట్లు,
విమలగుణనిధివగు నిన్ను వీడనాడి
కడపుచుంటిని రిత్తసౌఖ్యములఁ దవిలి.

## శత్రువులు

కొడుకు చావఁగ నే మూలఁ గూలియుండ,
ఇదియె యదన నని నాశత్రు లదయు లగుచు
పొక్కపెట్టనఁ జెలరేఁగుచున్నవారు;
తాళ నేర్తునె వారియౌద్ధత్యమునకు ?

పిడుగు మొత్తఁగఁ గూలినబడుగువాని
కొఱవిచేఁ బట్టి కాల్చినకరణి నకట !
కొడుకుచావునకై వంది కుందుచున్న
నన్ను శత్రులు వెతబెట్టుచున్నవారు.

ఒక్కయెడ నాత్మజవియోగ, మొక్కచోట
భీషణం బగు శాత్రవదూషణంబు
తట్టుముట్టాడ, రెంటిమధ్యమునఁ జిక్కి,
యుంటి నడకొత్తులో వక్కగొంటు రీతి.

ఇంతకాలమునుండి న న్నెంతొ ప్రీతిఁ
నాదరించుచునున్నట్టి యనుఁగుసఖులె
శత్రులుగ మాఱి రిపు డేమి చిత్ర మొక్కొ?
కటకటా ! ఏమి సేయుదుఁ గాలమహిమ !

నాదుపుత్త్రుఁడె శత్రుఁడై నన్ను వీడ,
అనుఁగుమిత్త్రులు శత్రువు లగుట యరుదె ?
అకట ! దైవోపహతుఁ డైనయట్టివాని
కఖిలజగమును బ్రతికూల మగును గాదె ?

పుత్త్రుఁ డైనను గావలె, మిత్త్రుఁ డైనఁ
గావలయు నంప్ర మనజుని గాసిపెట్ట;
అకట ! పుత్త్రుఁడు మిత్త్రులు నొకట నన్ను
వెతలుబెట్టఁగ నేరీతి వేగువాఁడ ?

శత్రువులు నన్నుఁ దిట్టిన నాత్రపడక
మంచిమాటలచే బతిమాలియుంటి,
ఎంత వేఁడిన నించుక శాంతి గొనక
దాడివెడలుచు నున్నారు వాడి నూపి.

అనునయోక్తులఁ బ్రతిపక్షజనుల వేఁడి
కొనుటయెల్లను జేరి జోకొట్టు టయ్యె;
వారి శాంతింపఁ జేయ నావశము గాదు,
సుప్రసన్నులఁ జేయవే ! అప్రమేయ !

తన్ను పగతురు నొంచిరి, తాను పగఱ
నొంచితి నటంచు కించిజ్జ్ఞుఁ డెంచుచుండు;
అరయ దేహంబునకె కాని యాత్మ కెందు
చెలిమికారంబు వైరంబు కలుగఁ బోవు.

చెవికి నింపగుపలుకులచే హితుండు
పరుషనిష్ఠురవాక్యాలాపముల వైరి
తనదుచేతల నారసి తప్పు దిద్దు;
శత్రుమిత్త్రవిభేదంబు ధాత్రిఁ గలదె ?

ఎక్కసక్కెపుమాటల నెత్తిపొడిచి
తాను చేసినదుష్టకృత్యములఁ దెలుపు;
శత్రుఁ డెన్నంగ శత్రువేషమున నున్న
మిత్త్రుఁడే కాని కేవలశత్రు వగునె ?

తనదుదోసంబు లారయు, తప్పులెన్ను,
ఎగ్గులను జాటు, పాపంబు లుగ్గడించు,
దుర్నయంబులు వెలిపుచ్చు, దోసఁగు లెంచు;
శాత్రవునికంటె నాప్తుఁడు జగతిఁ గలఁడె ?

చండకరుఁ డయి తమ మ్లోఁ జెందు నొకఁడు
శీతకరుఁ డయి మనసు రంజించు నొకఁడు
శత్రుమిత్త్రులు భాస్కరచంద్రులట్లు
వారు పరమోపకారులు కారె జగతి ?

మువ్వురే నాకు శత్రులు పుడమియందు
'కొడుకు లెందఱు నీ' కని యడుగువాఁడు,
'పాప' యనుపేరు నే విన బలుకువాఁడు,
చిన్నిపాయంపుమురిపంపుపిన్నవాఁడు.




సుదత్త స్తూపము. (కచ్చికూటి)
శ్రావస్తి




పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారు

" వెంకయ్యా!"

" ఏమి తల్లీ? "

" ఏమని సెలవు? "

" ఇదిగో కైజారు "

"ఇదుగో కైజారు"

" రాజుగుండెలు తీయడానికేనా? "

" అదెలాగ మాతల్లీ."

"ఏమీ? వెలమబిడ్డను గాదుటోయీ? "

" అది పురుషుల పని తల్లీ!"

" వెలమల ఆడవాళ్లు చేతగానివాళ్లా? "

" స్త్రీలు అసూర్యంపశ్యలు కాదుటమ్మా?

" అంటే ?"

" మీరు బైటికి రాగూడదు. "

" వస్తే? "

"వెలమస్త్రీ పురుషుని కంట పడ్డాక ఇక మాకు మర్యాదయెక్కడిదమ్మా?"

"ఎంత పాపిష్ఠి బ్రతుకోయీ మాదీ? మాలమాదిగల దగ్గరనుంచి బ్రాహ్మలదాకా అన్ని జాతుల స్త్రీలూ అవసరమైనప్పుడు వీథిలోకివస్తూన్నంటే వారికి లేని మానభంగం మా కెలా వస్తుందోయీ? "

" మొదటినుంచీ అద మనఆచారం కాదా అమ్మా! "

" స్థితి విషమించినప్పుడు కూడా అంతేనా?"

" తెగించినవాళ్లకి విషమించడం యేమిటి తల్లీ? "

" అదీ మాట, మరి మేము తెగించ కూడదూ? "

" అవశ్యమూనూ."

" ఎందాకూ? "

" ప్రభువు ఆజ్ఞ నెరవేర్చడానికి "

"గొంతుకు పిసుక్కోడానిగ్గాదూ?"

"... ... ... ..."

"మాట్లాడ వేమోయీ?"

"ఏమి చెప్పను తల్లీ?"

"ఏమి చెబుతావో? ఎంతకర్మమోయీ మాకూ? శత్రువు వచ్చి గొంతుకుమీద కూచున్నప్పుడేనా—మగవాళ్లకి తలదాటి వచ్చినప్పుడేనా—"

"వెలమబిడ్డలికి తలదాటిరావడం యేమిటి తల్లీ?

"అయితే యిప్పుడు నీరాకకిఅర్థంయేమిటీ?

"అది ప్రభువు ఆజ్ఞ."

"అదే నోయీ! ప్రభువు యెందు కిలా ఆజ్ఞాపించవలసివచ్చిందీ?"

"మానభంగం కాకుండా వుండడానికి"

"మానభంగమా?ఎవరికీ? వెలమస్త్రీలకే? ఎంత మాటా? బొబ్బిలి వెలమస్త్రీలకే!మేము యుద్ధంలోకి వెడితే పగవాడు యింతకంటే కఠినంగా మాట్లాడతాడా?"

"తర్కానికిదా సమయం తల్లీ?"

"అది నేనడుగుతూవున్న మాట. వెలమ స్త్రీలు బైటికి రాకూడ దన్నది సామాన్య ధర్మం. స్థితి విషమించినప్పుడు యెందుకు రాకూడదూ?"

"వెలమలు ఇదివరకు చేసిన యుద్ధాల్లో ఎప్పుడేనా స్త్రీలు కత్తిపట్టడం—"

"శత్రువుమాట విని పైవారు కోట విడిచి పొమ్మనడమూ- శత్రువు దుష్ప్రయత్నాలు ఫలించడానికి సిద్ధంగా వుండడమూ—"

"ఒకదాని కొకటి యెప్పుడేనా పోలికి వుంటుందిటమ్మా?"

"మరి ఆమాట యెందుకూ యింకా? అప్పటప్పటి వెలమస్త్రీలు యుద్ధాల్లోకి యెందుకు వెళ్లేరుకాదో మన కేమి తెలుసునూ? కాకపోయినా యిప్పుడు మనకి వచ్చిన అవస్థ వంటి అవస్థలు వారికి వచ్చా యనీ, అయినా అప్పటి వెలమస్త్రీలు యుద్ధంలోకి వెళ్లక అంతఃపురాల్లో పొడుచుకు చచ్చిపోయారనీ నిదర్శనా లేవీ? అవీగాక వారు వీరమాత లైనా వీరాంగన లనిపించుకోవా లని ముచ్చట పడక పోవచ్చు. ఇప్పుడు మేము—నేనలా కాదు. నాశౌర్య మంతా యేమి కానూ? కత్తిపట్టా లని నాకు సరదా పుట్టింది. నేను వీరమాత నగుదునో కాదో తెలవడానికి నా కొడుకు పాలబుగ్గలవా డాయె. నేనువీరవనిత ననిపించుకోవాలి. చిన్నతనములోనే"మల్లమ్మ విచక్షణత కల స్త్రీ" అని పేరు తెచ్చుకున్నాను. నీప్రభువికి తగినస్త్రీ ననిపించుకున్నాను. మరి యింక పూసపాటి విజయరామరాజుకి కాళికాశక్తి ననిపించుకోవద్దుటోయీ?

"........."

"ఏమంటావు వెంకయ్యా? వెలమల ప్రయత్నాలు—అంటే పురుషుల శౌర్యం నిస్తేజం—"

"ఏమన్నావు తల్లీ?"

"ఉలికిపడకు. నువ్విప్పు డేమి చెయ్యడానికి వచ్చావో తెలుసుకుని మాట్లాడు. చూడూ. బొబ్బిలివెలమవీరుల శౌర్యం నిస్తేజం అయినప్పుడు—"

"విసలేను. అమ్మా! నారక్తాన్ని వేడెక్కనివ్వవద్దు."

వేడెక్కితే విక్రమిస్తావు. స్త్రీలమీద. కదూ వెంకయ్యా? నిజంగా నేడు వెలమ వీరుల రక్తంలో ఉష్ణగుణమే వుంటే యింకా శత్రు వలా కులుకుతూ వుంటాడా? ఏమి దుష్కాలం?

కాలం దుష్టమైపోయింది కనకనే ప్రభువు ఆజ్ఞ యిలా వుంది."

"అలా కాదు. కాలం దుష్టమైపోయింది కనకనే స్త్రీలుకూడా కత్తిపట్టాలి. తెలిసిందా? శ్రీరాజా రావు రంగారావుదొరవారికి నేను ధర్మపత్నినే. నేను వారికి సహధర్మచారిణ్ణనిపించుకోవద్దుటోయీ?"

"కాక యిప్పు డేం లోటువచ్చింది తల్లీ?"

మళ్లీ మొదలూ. ఏమి మిగిలింది నాయనా, బొబ్బిలిరాణీకి మూడువ్రాళ్లు ముండభరణం యిస్తా నన్న రాజు బ్రతికి వుండగా? బొబ్బిలిరాణి–నాకింతకంటె మాన భంగం యేమిటోయీ?"

"..........."

మీ ప్రభు వెక్కడ?"

హాజారంలో–వెలమవీరుల మధ్య–సర్వ సన్నద్ధుడై–అంటే అటోయిటో తేల్చివెయ్యడానికి సిద్ధంగా–"

"పోయి యీసంగతి చెప్పిరా."

"ఆజ్ఞ లేదు తల్లీ!"

"పోనీ నేనే వెడతాను. నా కడ్డేమిటీ?"

"సీకడ్డేమిటి తల్లీ? అయితే ముందు–ఈకైజారు పుచ్చుకుని–యిక్కడ పొడిచి–"

"అది మల్లమ్మ చేసే పని గాదు. నేను కైజారు దూయడమే వస్తే అది రాజు పేగులు బైటికి తియ్యాలి. స్వజనంమీదటోయీ నా ప్రతాపమూ? వెంకయ్యా! నాకింక నాదేవుని దర్శనం లేదూ!"

"ఈక్షుద్రమానవకళేబరం విడిచిపోయిన తరవాత. అది శాశ్వతమే కాదుటమ్మా?"

"ఈకళేబరం వున్నంతసేపే యీపగా, యీకసీసీ"

"వాగ్వాదం చాలించవు తల్లీ?"

"బొబ్బిల్లోని శేరీస్త్రీలు పగవాళ్లని తూనికరాళ్లతో చీకాకుపరిచారుట. వెలమస్త్రీలు ఆమాత్రమేనా కారుటోయీ?"

"..........."

"ఏమంటావు?"

"ప్రభువు వార్తకోసం కనిపెట్టుకొని వుంటాడు"

"చెలికాని వెంకయ్య జనానాని నరికేశాడన్న వార్త వినడానిక్కాదూ? ఏమి కర్మం వచ్చిందోయీ మాకూ? సత్యభామ కాసె బిగించి విల్లు వంచి నరకాసురుణ్ణి గజగజలాడించింది. రాజపుతానాలో క్షత్రియస్త్రీలు ఒక్కొక్కప్పుడు కత్తిదుయ్యగా తురకసేనలు బేజారైపోయావి. ఓరుగంటిలో రుద్రమా, పల్నాటిసీమలో నాయకురాలూ కత్తిపట్టగా పరసేనలు చెల్లాచెదరై పోయాయి. మరి బొబ్బిల్లో మల్లమ్మ కైజారుదూస్తే రాజేమయి పోతాడో లోకానికి తెలవనివ్వవుటోయీ?"

"సాహసానికేమి భాగ్యం తల్లీ?"

"ఏమిటీ? సాహసమా? అవు వెలమల— అంటే వెలమస్త్రీల శక్తి తెలిసినమాటే?"

"..............."

"అయ్యో! ఈ సమయంలో మీ అన్నయ్య లేకపోయాడుగదా? ఆంధ్ర పాపారాయడే వుంటే కార్యం యిలా మించ నిచ్చునా?"

"పాపయ్య కీవార్త తెలిసిందో లేదో?"

"అవును. పాపయ్య కీవార్త తెలిసిందో లేదో? పాపయ్యే లేడు. తక్కినవా రంతా? బీరాలు పలికిన వెంగళరావేడీ? చెలి కాని వెంకయ్య సంగతి తెలుస్తూనే వుంది. లావు చిన్నయ్య, దామెరదమ్మన్న, పంతెన బుచ్చన్న, ఇనగంటి నరసన్న, కాకర్లపూడి వేంకటరామరాజు ఏరోయీ వీరంతాను? ఏంచేస్తున్నారోయి? రాజు దుర్మరణవార్తనినా చెవిని వెయ్యగల మగవాడు బొబ్బిలికోటలో లేడుటోయీ?"

"..............."

"మాట్లాడకు, కాకపోయినా యేమని మాట్లాడతావ్? కత్తిదూసి జనానామీదకి వచ్చావు. మంచిపని పెట్టేడు ప్రభువు నీకు. నాయనా! వెలమస్త్రీలకు పగవాళ్లని పొడ వడానికి వీల్లేకపోయినా సొంతంగా పొడుచు కోడానికేనా అవకాశం వుండనియ్యి. నూరు కుటుంబాల వెలమస్త్రీలు! మంచి సమ యంలో యెంతశక్తి వ్యర్థం అయిపోతూవు న్నదీ! ఇష్టం లేకపోతే జయించినా మేం బతకం. చచ్చిపోడానికేనా యుద్ధంలోకి వెళ్ల నీవ్వ మనవోయీ మీప్రభువుతోటీ."

"ప్రత్యుత్తరం యెందుకు తల్లీ సెలవా? అక్కడ రంగారావు మాట యెంతో యిక్కడ మల్లమ్మమాట అంతే మాకు."

"అయితే యుద్ధంలోకి వెడదాంపద."

"అది రాజాజ్ఞకి వ్యతిరేకం తల్లీ!"

"సరే. ఇంకెందుకూ మరి పొగడ డమూ?"

"నేను రావువారి సేవకుణ్ణి కాదు టమ్మా? దొరవారి ఆజ్ఞ అలా వుంది."

"దొరగారి ఆజ్ఞ యేమిటి? ఇది దొర సానిగారి ఆజ్ఞ. వెళ్లి మీదొరని తీసుకురా యిలాగ."

"వచ్చిన పని కాకుండా కళ్లపడ్డానికి ఆజ్ఞ లేదుతల్లీ!"

"అంతే? ఎంత చెప్పినా యేమీ ప్రయోజనం లేదూ? మనం పోయినా లోకం వుంటుంది. తెలుసునా? బొబ్బిలి వెల మలు అమానుషచర్య నడిపిన విజయరాముణ్ణి పొడిచేయ్యలేకపోయా రనీ, ఆపని చెయ్య డానికి స్త్రీలు సిద్ధపడంగా అడ్డువచ్చా రనీ— తెలుస్తోందా?"

"..........."

"వెంకయ్యా!"

"ఏమి తల్లీ?"

"ఏమంటావు?"

"ఆలస్యం అవుతోంది."

"అలా అన్నావా? అనవూ మరీ? దొరకి తగిన జెట్టివోయి నువ్వూ. ఆలస్యం

అయిందికదూ? ఏమంటే యేం చెబుతావు దొరకి? మగవాణ్ణి పోడిచెయ్యవలసిన కైజా రుని పెళ్లాంమిాదకి త్రిప్పించాడా అని అడిగిం దని చెప్పేం. పట్టుమంటే గుప్పె డుండదు ప్రాణం. దానికోసం కాదుసుమా యీరా ద్ధాంత సిద్ధాంతాలూ. మగవాడు కాని మాటలనడమూ మగవాడు కానిచేత చెయ్యడమూనూ. ఒళ్లు మండిపోతోం దోయీ! చిత్రవధ మేలుసుమా యింత కంటే! ఆత్మహత్య మహాపాతకం అన్నారు పెద్దలు. బొబ్బిలిరాణి కదే సంభవించింది. పొడిచి పొడిచేసు కుంటే యీదుఃఖమూ, యీతహ తహా లేకపోవును. ఇప్పుడే మను కుంటే యేంవుందీ! రంగారావంతటి వీరుడి పెళ్ళానికి యిలాంటిగతి తప్ప నప్పుడింక యేంవుందీ? బొబ్బిలికోట మిాద యిక విజయనగరం జెండా యెగురుతుందా? బతికివుంటే బొబ్బిలి రాణికి భరణమేయిస్తాడు రాజు——"

"అమ్మా!

"ఏమి నాయనా? ఆలస్యం అయిందా? వెలమలకి శత్రుసంహారానికి మల్లమ్మ అడ్డు వచ్చిందికదూ? ఏదీ కైజా రిలా తే. పదునుగావుందా? మిా ప్రతాపం లాగ మొక్కపోయిందా?"

వెంకయ్యా! ఇంతసేపట్నుంచీ వాగేను. ఏంవచ్చిందీ? అయితేతే. పగతీరకుండా చచ్చి పోయాటప్పుడు ఇక యేది యెలా అవుతే నేమిా? ఇదుగో నిన్ను పంపేస్తున్నాను.

నారాయణమూర్తీ! సూర్యచంద్రుల్లారా! బొబ్బిలిదుర్గాధిదేవతా! నాభర్త చెయ్యవలసిన పని నాబిడ్డచేత చేయించండి. అంతే చాలు నాకు. అప్పుడేనా నామాతన పోతుంది.




"కైజారు పదునుగానేవుంది.........శ్రీహరీ!"

వెంకయ్యా! నాదేవుడికి నానమస్కా రాలు చెప్పవోయి! మంచీచెడ్డా చెప్పేదే కాని చివరికి మల్లమ్మా ఆజ్ఞని జవదాటేది కాదని చెప్పు. కైజారు పదునుగానే వుంది. లేకపోయినా సాహసం వుంటే తడిపాతే చాలుతుంది యెంతకేనా. శ్రీహరీ!"




(నైషధరచన ననుసరించి)

శ్రీమాన్ కో. వేం. కృష్ణమాచార్య లయ్యావారులు గారు

మామిడిసింగమంత్రితపమా యిది? యాంధ్రజనోత్కరమ్ముపై
నామురవైరి సేయు కృపయా యిది? నీకనుమ్రోలఁదోఁచి పే
రామెతలిచ్చు వాణియిడునాన యిదో? యిది భట్టహీరుచి
న్తామణిచిన్తనాఫలమొ ? నైషధకావ్యము నీవొనర్చుటల్.

ఉ. సౌరవచఃప్రబంధమును సత్కవి నైషధమంచు నాడ శృం
గారమునా విశేషపదకల్పన మేటికిఁ జేసితీవు? సిం
గార మొకింత పూర్వకవికావ్యమునందున లేనిచోట నీ
వా రచియించినావొ? పునరాలపనమ్ముల రూపుమాపితో ?

చ. మునుపటి నన్నపాదికవిముఖ్యులు సంస్కృతకోశజాతముం
దెనుఁ గొనరింపలేదె? భవదీయసుకావ్యమునందుఁ బోలె నం
దునఁ గల యెల్లవాకులఁ దెనుంగొనరించిరె? నూతనంబుగాఁ
దెనుఁగొనరించుఫక్కికను దెచ్చితి వీవ యటంచు నెంచెదన్.

ఉ. శ్లోకము శ్లోక మాంధ్రముగఁ జొప్పడకుండిన నుండనీ? కథా
లోకము వృద్ధినాశములలోఁ బడి మ్రగ్గిన మ్రగ్గనీ? ప్రథా
నాకలనీయవృత్త మొక హ్రస్వతఁ గాంచినఁ గాంచనీ? య
థాం ధ్రీకరణ మ్మటం చనెడురీతిని మార్చితి వీవు చాతురిన్

ఉ. ఆద్యవచఃప్రబంధములయందు విమర్శ మొనర్చి చూచుచోఁ
బద్యముగాక గద్య మనుబాసనుఁ గానము గాన నీకృతిం
బద్యము గద్యరూపపరివర్తనమందుట హృద్యరీతియే
గద్యములందు నేమిటికిఁ గల్పనఁ జేసితి? శ్లేషభాషలన్

ఉ. శ్లేషవచస్తతిం దెనుఁగుసేయక మానితి? వాంధ్రశబ్దవి
శ్లేష మొనర్చి యేకపదలీననిజాంఘ్రిచతుష్టయాబుధా
త్తోషవిధాయిసూక్తులను దూర్చితి కారణమేమి తెల్పుమా
ఘూషములం భుజింపు మనుమాటను సింగన విస్మరించనే ?

శా. అంతం దెల్పితి వాద్యకోశగతపాదానీకముం జొన్పి ర
వ్వాంతే స్తేయభయంబు లోకభయ మీస్వాంతమ్మునం జేరదే ?
యాంతర్యమ్మగు భావముం దెలుపుమయ్యా ! వ్యాఖ్య కాంధ్రక్రియా
సంతానమ్మునకున్ విభేదము సతీసాదృశ్యసంభూతమే ?

చ. అమృతముఁబోలు శ్లోకముల నాపొసనం బొనరించితేల ? ర
మ్యముల విశేషణంబులను మాయఁగఁ జేసితివేల ? పాద సం
ఘములను బూర్తిసేయు పెనుకాంక్షను నీస్వకపోలకల్పితా
ర్థముల వచించితేల ? విబుధప్రకరం బిపు డిచ్చగించునే ?

ఆ. వె. శబ్ద మనుసరించి స్వాంతమ్ము నీక్షించి, రస మలంకృతులఁ గరంబుఁ బెంచి,
అనుచితమును డించి యౌచిత్యము గడించి, నైషధమ్ముఁ జేసినావ నీవు?

మ. 'యజమానప్రమదావికస్వరభగన్యస్తాశ్వదీర్ఘస్మర
ధ్వజదండం' బనఁ 'బిప్పలచ్ఛదముఁ గెల్వంగాఁ దలంచెజుమీ
రజనీశామలవక్త్ర' నానుడివినన్ రంజిల్లునే హేయబు
ద్ధి జనింపందగదో? ప్రజాతతికి నెంతే నీవుయోజింపుమా ?

సీ. శృంగార మనునుడి చెవి సోఁకినంతనే, వ్యభిచారి కవియంచుఁ బలుకునాఁడు
స్తనము లున్నతముల్ న సల్లపనము విన్న, బూతుకూఁత లటంచుఁ బొంకునాఁడు,
'మక్షికిమక్షిని' మదిచినాఁ డితఁడంచు, సారస్య మెఱుఁగక చాటునాఁడు,
ఆయర్థమిడుపదం బదికాఁదు నిజమని, చేయెత్తి పెద్దలు చెప్పునాఁడు
తే. గీ. పాదపూరణమయమంచు వదఱునాఁడు, ప్రతిపదము నాస్తి యనునుడి ప్రబలునాఁడు
తావకీనోక్తిచాతురిఁ దలఁచి తలఁచి, యాత్మ నతివేలహర్షము నందువాఁడ.

సీ. కనకాభిషేకంబుకత నిరామయమయి, యాంధ్రలోకమ్మున నలరుఁగాత !
బూతుల దిద్దెడుబొంకు నాశము గాంచి, ప్రాచీనపాఠముల్ ప్రబలుఁగాత
ఒకనుడి దూష్య మంచకట ! ప్రబంధమ్ము నశియింప కవనిలోనాటుఁ గాత !
దోషమ్ములందైన దొఱకుగుణమ్ములఁ, దలపోసి విబుధాళి తనరుఁగాత !
తే. గీ. నైషధాంతోక్త్యక్తముల లక్షణములనరసి, కృతులు గృతులనురహిఁ బెనిఁగింత్రుగాత !
శాశ్వతంబుగ శ్రీనాథసత్కవీంద్రుఁ, డమరలోకానఁ గీర్తిచే నలరుఁగాత !






రాయసం వేంకటశివుడు గారు, యం. ఏ., యల్. టి.

సీతాకాంతుని శోకము

"దుఃఖితే మనసి సర్వమసహ్యమ్." మనసు విచారములో మునిఁగియుండునపుడు లోకమంతయు నసహ్యముగఁదోఁచును. దుఃఖమును, అకాలవైరాగ్యమును హృదయము నలముకొనుటచేత, మన ప్రేమకుఁ దావలమగు మనుజులును, మనము కొనసాగింపఁగల యుద్యమములును ప్రపంచమున లేనట్టు గానవచ్చును. ఒకటేల? భూమియే గొడ్డుపోయినటు లుండును. కన్నుల కీధరణీతలమున నొక పచ్చని మొక్కయైనఁ గానరాక, అంతయు దరిలేని యిసుకయెడారివలె నుండును.

సీతాకాంత మిప్పుడట్టి దుఃఖమున కగ్గమయ్యెను. కొన్ని సంవత్సరముల క్రిందట నతనికిఁ గలిగిన నష్టమపారమైనదే. అది యెంతవంత గలిగించినను, వ్యాపార సంబంధమగు నష్టమే. కావున శీఘ్రముననె యతఁడు తెప్పిరిల్లెను. కాని దానికిని, ఇపుడాతనికాపాదిల్లిన యిక్కట్టునకును బోలికయే లేదు. చేతికెదిగిన చెట్టంత కొడుకు కూలిపోవుటకన్న దురదృష్ట మీలోకమునఁ గలదా? వేఱుసంతతి లేకపోవుటయు, తానును, భార్యయు నడివయస్సు దాఁటియుండుటయు వాని దుఃఖమును ద్విగుణీకరించెను. అతఁ డెన్నియో మంచికార్యములు చేసియుండెను. కాని యవియేవియుఁ గుమారుని గండమునుండి కావవయ్యెను! సీతాకాంత మీలోకమున నింకఁ జేయవలసినకార్యము లేవి? లోకమునకు వానికి నింక సంబంధ మేమి? "విఫల మనోరథుఁడనైన నే నేల కష్టపడవలయును? ఎవరికొఱకు? భోగములేల? వినోదములు వ్యాపారములు నేల?" అని యతఁడు వైరాగ్యమూని తన యుద్యోగమును, ఇతరులతోడి సంబంధమును విడిచివైచెను. ఇపు డతనివ్యాపారమంతయు పగలెల్ల వాకిట పచారుచేయుటయు, రాత్రులు మంచము గఱచి పట్టుకొని పండుకొని యుండుటయును.

మనుష్య ముఖావలోకనమే సీతాకాంతమునకు దుస్సహామగుటవలన ఎల్లపుడు వారి వీథితలుపు వేసియుండును. కుమారుని మొదటిమాసికమునాఁటి మధ్యాహ్నము పెత్రికోపము విచారమును నాతని మనస్సు నావహించెను. గొడ్డలితీసికొని, దొడ్డిలోనున్న చెట్లన్నియు నతఁడు గొట్టివైచెను. దీర్ఘవిచారముతో ముసుఁగుపెట్టుకొని యరుఁగుమీఁదఁ

బంధుకొనియుండె జానకమ్మ భర్తచేయుచుండి
గనులారఁ జూచుచుండెను. మగవారికంటె



'గొడ్డలి తీసికొని, దొడ్డిలోనున్న చెట్లన్నియు
నతఁడు గొట్టివైచెను.'

నాఁడువారికిఁ జెట్లయం దెక్కువ ప్రీతి. ఐనను, చేతులారఁ బెంచిన తనయుఁడే సమసినప్పుడు, ఈపాడుచెట్లు ప్రగ్గుట కావనిత వనటఁ జెందునా? ఇదిగాక తా నెంతటి దుఃఖమున నున్నను, ఒకకంటఁ బతిసేమ మాసాధ్వి గనిపెట్టుచునే యుండును. తనకడుపుచిచ్చు తుది లేనిదయ్యెను, మీఁదుమిక్కిలి నడివయస్సు దాఁటిన తనభర్త కీవిపత్తుగలుగుట కాయింతి యెంతయు వగచెను. ఆసలన్నియు సుతుని మీఁదఁబెట్టుకొనిన ముసలివానిసంగతి యిటు లమ్మోయని తలపోయునపుడు, జానకమ్మయమ్మలిక మధికమగుచుండెను. కావున నేవిధముననైన నాథుని మనమునకు వ్యావర్తనము గలిగి యతఁడు దుఃఖోపశాంతి గనుచున్నాఁడని యామె మనస్సును సమాధానపఱచుకొనెను. వృక్షచ్ఛేదనము నెఱపి గొడ్డలి నొక మూలవైచి, సీతాకాంతము కూర్చుండి "అమ్మయ్యా! ఇప్పటికైనది! చనిపోయిన తనయునికంటె నీచెట్లెక్కువా? ఇవి యెపుడు తమ్మునాటిన వానినే జ్ఞప్తిచేయుచు, మనస్సును బాధించుచుండును. మొక్కలు మొదలంటఁగోసివైచినమనమిఁక పుత్త్రకునిమీఁది మోహమును మునుముట్ట గోసివేయఁగలము సుమీ!"యని వెఱ్ఱినవ్వు నవ్వి యతఁడు సతి నూరడించెను.

బిల్లగన్నేరు మొక్క

తనహృదయసీమవలెనే పెరడంతయు నెడారియగుటవలన సీతాకాంతమునకు వెఱ్ఱి సంతసము గలిగెను. ప్రేమ మిత్రత్వముల కీప్రపంచ మనువగు ప్రదేశముగానట్టి పచ్చని యాకుగాని, ఎఱ్ఱనిపూవుగాని తలచూపుటకు తమదొడ్డి యుచితప్రదేశము గారాదని యతఁడు నిర్ధారణము చేసికొనెను. ఏమూలనో గడ్డిమొలక యొకటి గానవచ్చెనా యచటికిఁ బోయి దానినిఁ బెఱికివైచినఁగాని సీతాకాంతముమనసు కుదుటఁబడదు! ఒకనాఁ డితఁడు వాకిటఁ దిరుగుచు దూరమున నొక పచ్చని మొలకఁజూచి, యాగ్రహావేశ పరవశుఁడై, యింటిలోనికిఁజని కత్తితీసికొని, వేవేగమే యాతావునకుఁ బోయెను. దైవ వైపరీత్యమునఁ బతికిఁ గలిగిన తాత్కాలికమగు నీమతిభ్రమణమున కచ్చెరువందుచు జానకమ్మ భర్త

జాడలు గనిపెట్టుచుండెను. సీతాకాంత మం కెనాఁచెన్నువోట్టి కరఁగి, “భయములేక నీవు చిగిరించుచున్నావా? ఉండు, నీకనిక్కైదను” అని యామొక్క వేరుపట్టి లాగి, అది తెగక పోవుటచేత కత్తితో చుట్టును త్రవ్వసాగెను. చెట్టిదివఱకే చచ్చిపోయినను, వేరు నాశ్రయించుకొని చిన్నకొమ్మయొకటి పైకిలేచెను. వేరు కదలుటచేత నిపుడాకొమ్మ భయముచే వణఁకుచున్నదాయనునట్లు సంచలింపసాగెను. కొమ్మనిండ చిన్నయాకులు మొగ్గలును గాన వచ్చెను. ఇదిచూచి సీతాకాంతముక న్నోకింత చెమ్మగిల్లెను. కత్తితాఁకుడుచేఁ గదలుచుండు బిళ్లగన్నేరుమొక్కను జూచునపుడు మృత్యువాసన్నమగునప్పటి తనతనయుఁ డతని జ్ఞప్తికి



“అతనికన్నులనుండి యశ్రువు లోడికలుగట్టెను”

వచ్చెను! వెంటనే కత్తినేలపైచి యొకమూల కొఱగిన యతనికన్నులనుండి యశ్రువు లోడి కలుగట్టెను. ఇది యంతయుఁ గనిపెట్టుచుండిన జానకమ్మ భర్తనుజేరవచ్చి చేతనున్న చెంబులోని యుదకముతో సొమ్మసిల్లిన పతి ముఖమును జెట్టు మొదటఁగడిగి చేయిపట్టుకొని యతనిని“ఎండ తీక్ష్ణముగనున్నది; లోనికి రండు!” అని గృహములోనికిఁ గొనిపోయెను.

అప్పటినుండియు సీతాకాంతము మనోరంగమున ఆకులు మొగ్గలతోఁ గూడియున్న యాచిన్నమొక్క నాట్యమాడుచుండెను. “ఈపాటి కాకొమ్మయాకులు వాడిపోవును! మొగ్గలు మాఁడిపోవును” అని పాప మాపురుషుఁడా రాత్రి తీవ్రజ్వరమునఁ బలుమాఱుఁ బలవరించెను. దేహస్వాస్థ్యము కలిగిన యొకటి రెండుదినములకొకనాఁ డాతఁడు వాకిట బచారుచేయుచుండెను. దూరమునఁ బచ్చఁగఁ గానఁబడ అదియేమగునా యని యచటికిఁ బోయి; చూచునంతకు తానుగొన్నిదినముల క్రిందటఁ బెటికివేయఁబూనిన బిళ్లగన్నేరు మొలక యాతనికిఁ గానిపించెను. ఆమొక్క యపుడె చచ్చిపోయెనని యాతఁ డెంచెను. దానివిషయమే యతఁడు మఱచిపోయెను. అదియిపుడు క్రొత్త కొమ్మలు పెట్టి పూవులు పూచుచుండుటవలన నతనికెంతో సంతోషముగలిగెను. ఆచెట్టుచుట్టును పాదుచేసి జానకమ్మ యనుదినము నీరుపోయుచుండుట చేత నదియింత త్వరితముగ నెదిగెను. పుత్త్రస్మృతి తొలఁగిపోవలయునని చెట్లు చెండాడినసీతాకాంత మిపుడు పుత్త్రునిస్మృతికొఱకే వానిఁబోలిన యాచిన్నిమొలకను గాపాడఁబూనెను! ఆపూవులచెట్టుచుట్టును నేలచదును చేసి, నీరుప్రవహించుటకై యతఁడు బోదెలు

కట్టెను. త్వరితకాలములోనే యీమొక్క బాగుగఁ బెరిగి దర్శనీయ మయ్యెను.

వేకువ నిద్ర లేవఁగనే సీతాకాంత మా మొక్క దగ్గఱకుఁ బోయి లెక్కలేని యెఱ్ఱని పూలనుబెట్టి కనుల పండువుచేయు దానిని దర్శించి ముదమందుచుండును. ఆచెట్టును దనసుతునికి మాఱుగాఁ జూచుకొని, దానిపోషణముననే యతఁడు కాలము గడుపును. చీడపట్టినయాకులు త్రుంపివేయును. చుట్టునుండు రాలఁదాలఁగించి, మెత్తనిమట్టిచేర్చును. కలకల నవ్వు నటులుండు దానిపూవులను దన పుత్త్రుని మందహాసములని భ్రమించును! మలయమారుతమున కించుక చలించు దానికొమ్మలను దనను జేరఁబిలుచు సుతుని మృదుకరములని తలపోయును! వేకువనె రాలు మంచుబిందువులు, రాత్రియంతయుఁ దనవియోగమునకు వగచి, కొమరుఁడు రాల్చు కన్నీరని యతఁడు భావించి కంటనీరు వెట్టుకొనెను.

ఒకనాఁటియుదయమున సీతాకాంతము పూవులమొక్కవైపునకునడచిపోయెను. చెట్టునిండ పుష్పములు వికసించియుండెను. కోమలములగు నాయరుణకుసుమము లవలోకించిన కొలఁది వానిమనసు గంభీర భావపూరిత మయ్యెను. పగ లెపుడుచూచినను ఆమొక్క క్రొత్తపూవులతోనె చెన్నొందుచుండును. ఎపుడు వీక్షించినను గిలకల నవ్వుచుండును. దీనిభావమేమి? మల్లె మొదలుగాఁగల కుసుమములకుఁగల సువాసనలు దనకు లేవని తల వ్రాల్చి పరిమితముగాఁబుష్పించుటకు మాఱుగ నీచెట్టు లోకులుకోరని యీకోరకముల నిట్లు కుప్పలుకుప్పలుగఁ దాఁపగనేల? నోరులేని యీచిన్నిమొలకవలనఁ దాను నేర్చుకొనఁదగుధర్మము లేదా? చెట్టునకంటె నన్నియో మడుఁగుల లధికజ్ఞాన ప్రజ్ఞాదులచే భాసిల్లు మనుష్యజన్మమెత్తిన సీతాకాంతము, ఇహలోకమునఁ బ్రాపించిన కష్టములకేల యింతగ వెతనొంది, ధైర్యవిహీనుఁడై యసమయవైరాగ్య మూనవలయును? దుఃఖమున కింతగఁ గ్రుంగి తనకు దైవమిడిన శక్తుల నడవిపాలైన వెన్నెలవలెఁ జేసి ఆతఁడు నియతకార్యముల నేల విడిచిపెట్టవలయును? "లేలెమ్ము, సీతాకాంతమా! ఇంక నీవిచారమును ద్యజించి కర్తవ్యమునకుఁ గడంగుము" అను సుమన స్సందేశ మాతని వీనులకు వినవచ్చినటులుండెను!

చెట్లు తన బంధుగణములోనివే యని భావించి సీతాకాంత మిపుడు తన పెరటిలోనింకను మొక్కలు నాటఁజొచ్చెను. అచిరకాలముననె వారిదొడ్డి మొక్కలతోను తీగెలతోను సొబగొందుచుండెను. వట్టివ్యసనమున వెతనొందు పతి కిట్టి వ్యాపృత్తి గలుగుటకుఁ గొంత సేద దేరి, జానకమ్మ, తోఁట పనియందు దోడ్పడి వానికి నిక్కంపు సహధర్మచారిణి యయ్యెను.కొలఁదికాలములోనె తాముగల్పించుకొనిన యీక్రొత్తపనియందు, పుత్త్రుని మఱచిరని చెప్ప వలను పడదుగాని, పుత్త్రశోకమొకింత యాదంపతులు మఱచిపోయిరి. వారిపుడు పెరటిలో నాటు చెట్లన్నియు దమ కొమరుని స్మృతి కొఱకు వేసినవే. ప్రియపుత్త్రుని గూర్చియె వారాచెట్లకు సంరక్షణ చేయు

చుండిరి. తమ తోటకుఁ గోమరుని నామమే యొసంగిరి.

### కుక్కపిల్ల

ఈవ్యావృత్తివలన నాదంపతులు కొంత దుఃఖోపశాంతి గాంచియున్నను, ఇంకను వారు వీధి ముఖము చూచుటకు సాహసింపరైరి. ఇటీవల వారు పూనిన వైరాగ్యమే దీనికిఁ గారణము. మనస్సంకల్పితములగు సంకెలలు పేయుట కష్టము. ఒకనాఁడు, సీతాకాంతము వాకిటఁదిరుగుచు నొక కుక్క యేడుపువినెను. ఆయార్తనాదమే రాత్రియంతయు ఆదంపతుల వీనులకుఁ దగులుచుండి వారినిద్దురఁ బాపెను. ఇంతవఱకుఁ దా మాకుక్కసంగతి కనిపెట్టకుండుటకు వారంత వెతఁజెందిరి. వేకువనె సీతాకాంతము వీధితలుపు తెఱచి, గాయముచే మూలుగుచున్న యొకకుక్కపిల్లను జూచెను. గోతిలోనుండి యాకుక్కపిల్ల నీతఁడు వెలికిఁదీసి బురద గడిగివైచి, గాయము పరీక్షించుచుండగా చుట్టుపట్టులవారు వచ్చిరి. రెండుదినముల క్రిందట బండిచక్రము దానిమీఁదుగాఁ బోవుటచేత కుక్కపిల్లకా లిపుడు వాచియుండెనని వారు చెప్పిరి. మనుష్యుల బాధలే లెక్కచేయని లోకులు కుక్కలబాధలు పాటింతురా? కావున నేయీ రెండుదినములనుండి యాకుక్కపిల్ల బాధతోఁ గొట్టుకొనుచుండెను. సీతాకాంతమపుడు దానినిఁ బశుచికిత్సాశాలకుఁ గొనిపోయి, యచట దానికిఁ గట్టు కట్టించెను. ఆతఁడిట్లు వెంటనె యానోరెఱుఁగని జంతువును గొనిరానిచో బాధ మితిమీఱి, చికిత్స యసాధ్యమై యది చనిపోయి యుండెడిదని వైద్యుఁడు చెప్పి, వాని భూతదయ నభినందించెను. కొన్నిదినము లిట్లు కుక్కనిమిత్తమై తిరుగుచు సీతాకాంతము లోకవ్యవహారములఁ బాల్గొన నారంభించెను. అంత నొకనాఁడు మధ్యాహ్నము వీధితలుపునొద్ద శబ్దము విని తలుపుతీయగా స్వస్థపడి వచ్చిన కుక్కపిల్ల సీతాకాంతమునకుఁ గనఁబడెను. అది తనదారిని దానుబోక, తోఁకయాడించుచు రక్షకునియెడ ప్రేమ కృతజ్ఞతలు దెలుపుచు వానితో లోనికి వచ్చెను. మృత్యువునోటినుండి తప్పించుకొనినయాకుక్కమీఁద నాగృహస్థులకు జాలి పుట్టి వారు దానినిఁ బోషింపఁదొడంగిరి. క్రమక్రమముగ వారికి శునకము మీఁదఁబ్రేమ పెరిగెను. సంసారమునందలి తగులాటము లిటుల




"సీతాకాంతము కుక్కపిల్లను......వెలికిదీసి.......
గాయము పరీక్షించుచుండగా...చుట్టుపట్టులవారువచ్చిరి"

నానాఁట విజృంభించి, తమ వైరాగ్యమును వారఁ ద్రోలుచుండుట కాదంపతు లాశ్చర్య



"తలుపుతీయగా...కుక్కపిల్ల సీతాకాంతమునకుఁ గనఁబడెను"

పడియు, చేయున దేమియు లేక, నియతకార్యములే చేయుచుండిరి!

### శాంతమ్మ

చేతులకుఁ దగినంత పనియున్నను, ఆదంపతుల మనస్సు మాత్ర మొక్కతఱి పూర్వపుదుఃఖవిషయమునకు మఱలుచుండెను. కాని వారి హృదయక్షేత్ర మిపుడు నిర్జలప్రదేశమగునెడారి కాక, ప్రేమనదీ జలార్ద్రమయ్యెను. ఆదయాంబువులఁ గ్రోలి జీవించున విపుడు కొన్నిచలన మెఱుఁగని చెట్లును, నోరులేనిజంతువులును! మనుజుల కాదయామృత మింకను లభ్యముకాకుండెను. నరుల కృపాకృతజ్ఞతలయం దాదంపతులకు నమ్మకము సడలిపోయె, వారు తమదయకు యోగ్యులుకారని భావించిరా యనునట్లు లింకను వారి వీధి తలుపు నిరంతరము మూయఁబడియే యుండును! ఒకనాఁడెవరో వచ్చి పిలుచుటచేత వారు తలుపు తీసిరి. వచ్చినవారు శాంతమ్మయు కుమారుఁడును. చిన్ననాఁడు బీదస్థితియం దుండునపుడు శాంతమ్మ కాదంపతులు మిక్కిలి సహాయము చేసిరి. వారివలననే తన విద్యాపరిపోషణ మయ్యెనని గుర్తెఱిఁగి తాను జేయఁగల సహాయ మీకష్టసమయమున వారికిఁ జేయుటకే, భర్త యనుమతిఁగైకొని యిపుడాకాంత కొంతకాలము వీరిని గనిపెట్టుట కిచటికిఁ బిల్లవానితో వచ్చెను. పరామర్శమను పేరుతో విందులారగింప శాంతమ్మ వచ్చియుండలేదు. వాఙ్మాత్రమునఁగాక, క్రియారూపమునఁ దనభక్తిప్రేమలచే నాదంపతులను బూజింపవలయుననియే యాకోమలి యిపుడు వారియిలు ద్రొక్కికొనివచ్చెను!

వారువచ్చిన కొంతతడవునకు శాంతమ్మయు జానకమ్మయుఁ గలసి ముచ్చటలాడుచుండిరి. నాలుగైదేండ్లు వయసుగల శాంతమ్మ చిన్నికుమారుఁడు వాకిటనున్న బిళ్లగన్నేరుపూవులంకోసి, తప్పటడుగులతో నడచివచ్చి, "తాతా! ఇదుగో!" నని సీతాకాంతమున కొకపూవిచ్చి, అమ్మమ్మచేత నొకటి యుంచెను. ఇది యుపేక్ష్యమగు సంగతియే. కాని, మనజీవితమునందలి పరిస్థితుల ననుసరించి, స్వల్పవిషయములె ఘనమైనవిగఁ బరిణమిల్లుచుండును. దైన్యోపహతులగు నాదంపతుల కీబాలకుఁ డిచ్చు రెండుచిన్నపూ

పులును, ఉరవిరిసియున్న తమహృదయములకుఁ బరిపూర్ణోన్మీలనము వెలయింపఁ బరమేశ్వరుఁ బనిచిన రెండుదివ్యసాధనములాయ నునట్లు తోఁచెను! పిల్లవానిని వారిరువురు ముద్దుపెట్టుకొనిరి. చిరకాలశోకనిమగ్నులైన వారిహృదయములందు ప్రేమాదిసద్గుణములు పల్లవింపఁజేయఁ బ్రయత్నించుచుండెను.

కొలఁదిదినములలోనే తాతమనుమలకు, ఏనామెతలోను గనుపట్టనంతటి మైత్రీత్వము వాటిల్లెను! అనుభవజ్ఞుఁడగు తాత నిపుడు చిన్నమనుమఁడు, గ్రుక్కత్రిప్పకుండ ప్రశ్నములు వేయుచుండును. చిన్నచిన్న పనులందుఁ దాతకు మనుమఁడు కుడిభుజమయ్యెను చిన్నమనుమని కెట్టి కథలు చెప్పి యెట్టి వినోదములు గల్పింతమా యని తాత యహర్నిశ మాలోచించుచుండును. ఇట్టి నూత్నప్రేమకుఁ దావలమైనదిగావుననే, సీతాకాంతము మనోగగన మిపుడు దుఃఖమేఘవిముక్తమై, సంతోషదీప్తులతోఁ దేజరిల్లుచున్నది. బాలకుని జూచుకొనుచున్న యానందమున సీతాకాంతమిపుడు తన దుఃఖమును మఱచిపోయెను.



"తాతా ఇదుగో"

ఆదంపతులు క్షణకాలము తమచింతమఱచి యెదుటనున్న బాలకుని ముద్దాడిరనిన,మానవహృదయము,దుఃఖాంధకారముచే నెంతయావరింపఁబడినను, మిన్కుమిన్కుమను నానందజ్యోతి దానియందింకను వెలుంగుచుండుననియే మనము గ్రహింపవలయును! ప్రేమామృతమింకను, ఆహృదయముల నిగిరిపోలే దనియే మనము భావింపవలయును. ఇట్టిసంగతులు పరికించి సంతసించిన శాంతమ్మ, తన యుపచారమువలన నింకను వీరిని సేదదేర్చి,

క్రమముగ నతఁడు సాంఘికజీవనమునఁ దిరిగిపాల్గొనుచు, పరోపకారకార్యనిమగ్నుఁడై యుండెను. విపద్దశయందుఁ దాఁజిక్కుకొని యుండు నపుడు తనకన్నులు విప్పి చరణములను దిన్నని త్రోవఁ ద్రొక్కించి, చేయూఁతనొసంగిన వారి సందఱిని దనకుఁ దరణోపాయముఁ జూపినవారని యతఁడు భావించును. ఉలంతివిషయములే తనకన్నుల పొరలూడ్చెనని యతఁడు చెప్పుకొనుచుండును. కావుననే బిళ్లగన్నెరు

మొలక వానికిఁ దులసియుఁ గల్పవృక్షము న య్యెను!

ఇప్పుడు శాంతమ్మయే యావంతులకు గూఁతురు, కొడుకును! ఆపాలఁతి ప్రోత్సాహము ననే జానకమ్మ దుఃఖము నణఁచుకొని, క్రమ ముగ దేశహితైకకార్యములలో నభిరుచి గలది యయ్యెను. నగరమందలి నారీమణు లి పుడు నడుపుచున్న సేవాసంఘమునకు జాన కమ్మయే కార్యదర్శిని. పట్టణమున జరిగెడి సకల సత్కార్య సమావేశములకును వారియిల్లే యిపుడు కేంద్రస్థానము!



# యమునాప్రాభవస్మృతి

పండిత పెనుమచ్చ సత్యనారాయణరాజు గారు

అమలాత్ముండును యోధుఁడున్ బృథుజగద్వ్యాపారమర్మజ్ఞుఁడౌ
　కమలానాథుఁడు బాల్యచేష్ట లెచటం గావించె సానందుఁడై
　ప్రమదానం గని తత్స్థలంబులు జలప్రత్యాళితాఘౌఘు యో
　యమునా! నీవగుసైకతస్థలు లటం జక్రుల్ ధరన్ రాల్చెదన్

గీ. పెరిఁగి పెద్దయై యేతీర పరిసరమున, నస్త్రశస్త్రాదివిద్యల నభ్యసించె
　నందనందనుఁ డాతీరమంది తీవె, యంచుఁ గన మేను బులకించు నమ్మ, యమున!

గీ. భవ్యభవదీయనీలాంబుపటలితోడఁ, దనదుమేచాయ లెంతయు మొనసి యాడ
　జాములకొలంది యేనీట స్నానమాడు, బాలకృష్ణుండు తజ్జలమాల నీవె.

గీ. దేని పావనోదకములచే ననాథు, లైన పాండవుల ప్రతప్తమానసములు
　శాంతి పొందింపఁబడియెనో వంత లుడుగ, నామహానది వగుదమ్మ, యమున! నీవె?

గీ యమునరో! దేవకీదేవి యఖిలవేది, నిఖిలజగదంతరవ్యాపి నీరజాక్షుఁ
　డైన శ్రీకృష్ణు నుదరమ్ములోన నెమ్మి, నిడికొని యెటకుఁ గ్రుంకిడ నేఁగుదెంచు
　　నామహాపవిత్రాపగ వగుదు వీవ.

ఆనందాస్రులు గన్నులన్ వెడల రోమాంచంబుతో నీశ్వర
ధ్యానాహ్లాదహృదంతరాళ యగుచుం దా దేవకీదేవి లో
నే నీతీరమునందు గర్భగతుఁడౌ నిందీవరశ్యాముకున్
నానార్థంబుల నృద్ధి గోరునపుడైనం బుట్టనైతిన్ నదీ!

సీ. ప్రాకారసంశోభి తాకాశవాహినీ, నీకాశ శ్రీధ్వజానీకములును
కాంతాజనస్వాంత కాంతలతాక్రాంత, ప్రమదావనానూన సముదయంబు
నైజకాంతిచ్ఛటా నైగనిగ్యవిజిత, చంద్రమండలమహా సౌధములును
పరిపంథిఘనకంధి వరమందరాచల, రంగద్వితతచతురంగబలము

గీ. కలిగి యొప్పారు కోటలఁ గట్టి రేచటఁ, గోర్కి వ్యయపెట్టి కోటాన కోట్లు ధనము
పాండవులు దండకాటవీ పటలి నఱకి, యామహానదీరత్నమ వమ్మ నీవె!

*　　*　　*　　*　　*　　*

అట్టి నీస్వరూపముఁ గాల మట్టిమార్చె, నాపదల కోర్చి నీకడు పగిలిపోయె
గమ్రముఖబింబ మెంతయుఁ గమలిపోయె, రమ్యభ్రూయుగ్మరోమముల్ రాలిపోయెఁ
బద్మసన్నిభనేత్రముల్ వాఁడిపోయెఁ, జారుఫాలస్థతిలకమ్ము జాఱిపోయె
నవశిరీషకోమలదేహ మవసి పోయె, ఏమిచిత్రంబొ యమునరో యెఱుఁగలేము
నీదు తీరమ్మునందున నేఁడు చూడ, నట్టిపట్టన మొక్కటి యైన లేదు
అట్టి యావాస మొక్కటి యైన లేదు, అట్టివైభవ మిసుమంత యైన లేదు
అట్టి సత్ప్రతాపటిమ మనలు లేదు, అట్టియోధకదంబమ్ము కట్ట! లేదు
అట్టి త్రిజగదారాధ్య రాజ్యంబు లేదు, అట్టి భక్తచాతకకంద మయ్యొ! లేదు

*　　*　　*　　*　　*　　*

కర్కశాత్మకులు తురుష్కముష్కరులును, తార్తరీయులు నిఖిలజనార్తికరులు
ఆగమధ్వంసకులగు నామొగలువారు, దోసకారులు ఘనులు పరాసువారు
పరుషకరవాలధారల నఱికినట్టి, నీదుకాయంబు గాయముల్ బాధపెట్ట
నదరుగుండె బెదరుగుండె యగుట నయ్యొ, చెదరిపోయినముంగురుల్ చెదరియుండ
బెదరుచూపులు చూచుచుఁ బెదవులెండ, స్వస్థతం జెంద లేకిటు శ్వాసములను
దల్లి! యమునరో! విడువంగఁ జెల్లు నమ్మ!!



# ప్రాచీనవృత్తివిద్యావిధానము

మల్లంపల్లి సోమశేఖర శర్మ గారు

పూర్వము వేదములు, శాస్త్రములు మొదలగు వైదిక విద్యలన్నియు బ్రాహ్మణుల యధీనమున నుండెను. మిగిలిన విద్యలు అనగా కమ్మరము, కుమ్మరము, కంచరము, నగలు నాణెములుచేయుట, ఇండ్లు మిద్దెలు మేడలు కట్టుట, వంతెనలు కట్టుట, చెరువులుత్రవ్వుట, దేవాలయములు గోపురములు నిర్మించుట, రథములు బండ్లు చేయుట ఈ మొదలగునవన్నియు ద్విజేతరుల యధీనమున నుండెను. బ్రాహ్మణ,క్షత్త్రియ,వైశ్యులు ద్విజులు. ద్విజులుగ పరిగణింపబడని చతుర్థవర్ణమున జేరువారు పైనుడివిన యట్టి పారిశ్రామికవిద్యలకు అధికారులుగ నుండిరి.

### వృత్తివిద్య, కులములు

ఒక్కొక్కవృత్తి నవలంబించువారు ఒక్కొక్కసంఘముగా నేర్పడిరి. ఇట్టిసంఘములకే కులములనిపేరు. ఇప్పటి కులములన్నియు వృత్తుల ననుసరించి యేర్పడినవే. ఒక్కొక్క కులమువారు ఒక్కొక్కవిద్యను కాపాడి పోషించుచువచ్చిరి. అందువలన నట్టి కులములవారు రక్షించి పోషించినవగుటచేత అట్టివిద్యలకు కులవిద్యలనియు, వేఱువేఱు వృత్తులకు సంబంధించిన వగుటచేత వృత్తి విద్యలనియుపేరు. ఈవిధమైన విద్యనే ఇప్పుడు సాంకేతికవిద్య (Technical Education) అందురు.

ఇట్టి వృత్తివిద్యను నేర్పుటకు పూర్వము మనదేశమున నిప్పటివలె కళాశాలలుకాని, విద్యాలయములుకాని ఉండెడివికావు. ఆయా కులములలో వృద్ధులైన వారు- నిపుణులైన వారు తమతమ కర్మశాల (Work shops)లందే తమతమకులములలోని బాలురకు విద్యాప్రదానము గావించువారు. అందువలన నట్టి బాలురు పొందువిద్య స్వానుభవముతో కూడి ప్రపంచమునకు ఉపయోగపడునట్టిదిగ నుండును. చాలకాలము ఇట్టివృత్తివిద్య నేర్చుకొనువిద్యార్థి వినయవిధేయతలవలనను, ఆవృత్తియందలిభక్తి శ్రద్ధలవలనను తనయజమానియైనగురువు యొక్క మనస్సు రంజించి ఆతనిని మెప్పించినచో ఆతనివివేకమును, శ్రద్ధను, ఆసక్తిని కనిపెట్టి ఆతడావిద్యార్థికి వృత్తిరహస్యములను, ఆవృత్తిలోని విజ్ఞానరహస్యములను ఉపదేశము చేయువాడు. అందువలన తన వృత్తియందేమాత్రమభిమానమున్నవాడైనను, ఆవిద్యను నేర్చుకొనవలెనని ఏమాత్రము దీక్షపట్టినవాడైనను ఒడలు వంచి వినయ విధేయతలతో పనిచేసి తనగురువును మెప్పింప జూచువాడు. విద్యార్థి ఏమాత్రము విద్యనేర్చుకొనినను స్వానుభవ పూర్వకముగ పడసినవిద్య యగుటచేత నాతడు తన జీవయాత్ర సుఖముగ గడుపుకొనుట కది

తోడ్పడుచుండెను. ఏయేవృత్తిలోనైనను నిపుణులైనవారు ఎచ్చటనున్న నచ్చటికేగి విద్యార్థులు విద్య నేర్చుకొనుచుండువారు. తండ్రియొద్ద కొడుకు విద్య నేర్చుకొనినను, అన్నయొద్ద తమ్ముడు నేర్చుకొనినను నేర్చుకొనునంత కాలము బంధుభావముతో గాక గురుశిష్యభావముతోనే వారు కాలము గడపువారు. అందువలన కర్మశాలలో పనిచేసినందుకు తండ్రి కొడుకునకుగాని, అన్న తమ్మునికిగాని జీతము నంగువాడు; కాని శాల వీడి యింటికివచ్చిన వో ఇంక వారు గురుశిష్యులు గారు—తండ్రి కొడుకులే; అన్నతమ్ములే. సాధారణముగ హిందువులది సమష్టికుటుంబము గనుక కర్మశాలలో తండ్రియిచ్చిన జీతమును కొడుకును, అన్నయిచ్చిన వేతనమును తమ్ముడును ఇంటికివచ్చినపిదప మరల బంధుభావమున వరుసగా తండ్రికిని, అన్నకు నిచ్చివేయువారు: ఇంటియొద్ద బంధుభావసరళి; కర్మశాలలో గురుశిష్య సంబంధము. అందువలన నీవృత్తి విద్యలన్నియు పూర్వము తండ్రినుండి కొడుకునకు, అన్ననుండి తమ్మునకు ఈవిధమున వంశపారంపర్యముగ వచ్చుచుండెడివి. ఒక్కొక్కవృత్తిలో పనిచేయు కులమువారు ఆవృత్తినేకాని, అనగా ఆకులముయొక్క విద్యనే కాని యితరవృత్తులనుగాని, యితరకులవిద్యలనుగాని నేర్చుకొనగూడదు. తనకులవిద్యనువిడిచి ఇతరకులవిద్యను చేపట్టుట కులద్రోహముగ పరిగణింపబడుచు వచ్చెను. స్వధర్మమే శ్రేయోదాయకము; పరధర్మము భయావహము; కావుననే పరధర్మమాచరణయోగ్యము కాదు. ఇట్టి అభిప్రాయమును నమ్మకమును ప్రబలముగ వ్యాపించి యుండుటయే

> వెలివిద్య లెన్నియైనను
> గలవిద్యకు సాటిరావు గంభినిలోనక్
> వెలకాంత లెందఱున్నను
> గలకాంతకు సాటిరారు గువ్వలచెన్నా!

మున్నగు పద్యములు పుట్టుటకు కారణమయ్యెను. ఈవిధమున నాయాకులములవారు తమతమ కులముల కేర్పడిన విద్యలను ప్రాణతుల్యముగ నెంచి పోషించుచు వచ్చిరి. ఆయాకులములకు సంబంధించిన కర్మశాలలే వృత్తివిద్యాలయములుగ నేర్పడెను. అట్టి విద్యాలయములే గొప్ప పారిశ్రామికనిలయములై పేరుగాంచి దేశైశ్వర్యమును పెంపొందించెను. నేటివలె భౌతికశాస్త్ర విజ్ఞానము వికసింపని ఆ 'మోటు' దినములలోనే ప్రపంచ మంతటిలో పేరుపడిన వస్తుజాలమును తయారుచేసి హిందూదేశపారిశ్రామికుడు ఖండాంతరులచేతగూడ సంస్తుతులను బొంది, పల్లెటూరిలోని తనచిన్న కుటీరముముందు తనవృత్తివిద్యానైపుణ్యమునకు గర్వసూచకముగ విజయస్తంభమును పాతి దానికి కీర్తిపతాక వ్రేలగట్టియున్నాడు.

ఎన్నెన్నివృత్తులు కలవో మన దేశమున అన్నన్ని పరిశ్రమలుకలవు. వీటిని నడపునది జీవములేని యంత్రములుగాక బుద్ధివైభవమును, ప్రతిభాసంపదయుగల దివ్యచైతన్యాంశాసంభవుడగు మానవుడగుటచేత అవి పారిశ్రామికకళలై పరిఢవిల్లెను. హిందూదేశ పరిశ్రమలను గుఱించి యిచట వ్రాయుట అనవసరము.

కులసభలు, నిధులు

స్వధర్మసంరక్షణమునకై ఈకులములకు కులసభలు, పంచాయతులు నుండెడివి. హిందూ ధర్మశాస్త్రములు కూడ ఈకులసభలను గౌరవించి, ఆయా కులములకు సంబంధించిన వివాదములను పరిష్కరించుపద్ధతి వాటికేవదలి పెట్టెను. పూర్వము ధర్మశాస్త్రకారులకు ఈవృత్తులయం దెంతటిగౌరవము కలదో ఈవిధమైన ధర్మశాస్త్రనిబంధనలను గాంచిన తెలియగలదు. ఈకులములవారికి సభలుమాత్రమేకాక ప్రత్యేకము నిధులుకూడనుండెడివి. ఈనిధులు ఇప్పటి బ్యాంకులవంటివి. రాజులు మొదలగువారు ఎవరికైన ఒక్కకులమువారు లేక ఒక్కవృత్తివారు తయారుచేసిన పారిశ్రామిక సంపదను దానముచేయ దలచినను, ఆదానము ఆచంద్రార్కముగ సాగుచు, శాశ్వతముగనుండవలెనన్నను ఎంతో కొంతమూలధనము-అనగా తాము దానము చేయదలచిన దానివిలువకు సరిపోయినవడ్డీ నొసంగు మూలధనమును-ఆకులమువారినిధిలో వేయువారు. అట్లుచేసిన ఆమూలధనముమీాదవచ్చువడ్డితో నాధర్మము ఆచంద్రార్కస్థాయిగ నడచుచుండెడిది. ఈవిధమైన పద్ధతి మూలమున రెండు లాభములు కలుగుచుండెను. (౧) ధర్మము ఆచంద్రార్కస్థాయిగ సాగుట, (౨) ఆమూలధనమువలన నాపరిశ్రమ అభివృద్ధి గాంచుట. ఈవిధమైన నిధులు, నిబంధనలు క్రీస్తుశకారంభమునకే, అనగా- ఆంధ్రరాజులు పాలించు నాటికే కలవు. క్రీస్తుశకారంభకాలమునాటికే ఆయావృత్తి సంఘములు, అనగా కులములు చక్కని వికాసముకలిగి అభివృద్ధి గాంచినవి.

ఏవృత్తి కావృత్తియే చాలగౌరవప్రదమై నదిగ నెన్నబడుచుండెను. హిందూసంఘమున పూర్వ మిట్టివృత్తులవారికి గౌరవస్థానముండెను. ఈవిషయము ప్రాచీన హిందూగ్రామవ్యవస్థను పరికించినచో సువ్యక్తమగును. వ్యవసాయకప్రజాతియగుటచేత హిందువులు ముఖ్యముగ నూటికి తొంబదితొమ్మిదివంతుగ గ్రామములలోనే నివసించువారు. హిందూసంఘ పరిపాలనమునకేమి, మఱియితర విషయములకేమి పూర్వము - పూర్వమే యననేల ఇప్పటికి-గ్రామమే ప్రాతిపదిక. హిందూదేశమునంతను కంపింపజాలు ఏవిద్యుత్సంచలనము కలిగినను అది గ్రామమునుండియే ప్రాదుర్భవించు చుండెను. ఏసంస్కర్తకాని, ఏరాజకీయ తంత్రజ్ఞుడుకాని పూర్వము ప్రకృతియొక్క పాలబుగ్గలపల్లెటూరిని లాలింపగలిగెనా, ఆతడు హిందూదేశమునంతను పరిపాలింపగలబలము సంపాదించినాడన్నమాటయే. పూర్వము, మనస్సు నువ్విళ్లూరజేయునట్టి హిందూసంఘమహాదుర్గమును,మహాసంస్థయునైన గ్రామమున'కులపతి'యైన పారిశ్రామికుడు ప్రధానస్థానమును సంపాదించెను. పారిశ్రామికుడు లేక ఏసంఘమును ఏకాలమునను అభివృద్ధి చెందలేదు.

బ్రాహ్మణవిద్య, వృత్తివిద్య

బ్రాహ్మణుడు తనవశముననున్న వైదిక విజ్ఞానము ప్రజలకొసంగినను పారిశ్రామికుడు ములేనిచోనిలువనీడయుండునా?భోజనాదికము

లమర్చుకొనుటకు ఉపకరణములును సాధనములు నుండునా? పారిశ్రామిక విజ్ఞానము లేనిచో ఆధ్యాత్మికజ్ఞాన ముండియు సంఘము అభివృద్ధి నొందజాలదు. ఆధ్యాత్మికవిజ్ఞానము లేని పారిశ్రామికజ్ఞానము అపాయకరము. ఆధ్యాత్మిక, పారిశ్రామిక విజ్ఞానములు రెండును ఒకదానిలో నొకటి అంతర్భాగములు. వీటిలో ఏది కొఱవడినను రెండవదానికి ప్రశస్తిలేదు. పారిశ్రామికవిజ్ఞానము సుందరమైన, హృదయాకర్షకమైన నాగరకతను సృష్టించుచుండ ఆధ్యాత్మికవిజ్ఞానము దానికి తేజస్సునొసగి ప్రాణము పోయుచున్నది. హైందవ నాగరకతయంతయు పల్లెటూరి పారిశ్రామికుని చిన్నికుటీరమునుండియు, నిరాడంబరజీవియు ఆధ్యాత్మికవిద్యాసంపన్నుడునైన అగ్రహారికునినుండియు పెరిగి పెంపుగాంచినది. ఈ రెండువిధములైన జ్ఞానవిభాగములకుగల అన్యోన్యసంబంధమును గుర్తెరింగినది కనుకనే మనప్రాచీనగ్రామ మీ రెంటికి ప్రధానస్థానమొసంగి సఖ్యత సమకూర్చినది. కావుననే మన ప్రాచీన గ్రామవ్యవస్థలో వైదిక విద్యాసంపన్నుడైన బ్రాహ్మణుని కెట్టిస్థానము గలదో అట్టిస్థానమే వృత్తివిద్యానిపుణుడైన పారిశ్రామికునికి నుండెను. ఈవిధమున ప్రాచీనగ్రామము ఈ రెండువిధములైన విజ్ఞానమును సమన్వయముచేసి నేటిపారిశ్రామికసమస్యను, దానికి సంబంధించిన యితరములైన చిక్కులను 'ఆధునికనాగరకత' కన్నులు తెరవకమునుపే చక్కగ పరిష్కరించెను. పారిశ్రామికునికి గ్రామవ్యవస్థలో 'వృత్తి'రూపమున స్థానముండుటచే వృత్తివిద్య కెట్టిగౌరవముండెడిదో తెలియగలదు. పూర్వము బ్రాహ్మణుడు, పారిశ్రామికుడు—ఇరువురును హిందూసంఘమునకు రెండు కండ్లవలెనుండి పరస్పరము సహానుభూతిని కలిగియుండుట నేర్చుకొని, ఆధ్యాత్మికవిద్య కధికారులై ఉన్నతాదర్శములనుజూపి మానవునియందలి ఆధ్యాత్మికసంపదను దోహదముచేసి యొక్కరును, ఆధిభౌతికవిద్యకు ఆచార్యులై సౌందర్యరస పరిప్లుతములగు కళారచనలను గావించి జీవితమును సౌఖ్యానంద ప్రదముచేసి మరియొక్కరును సంఘమును నడిపించి దేశమును పరిపాలించువారు.

'భటవృత్తి' మాన్యములు, గ్రామవ్యవస్థ

ఈ పైకారణములమూలమున ప్రతిగ్రామమునను కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి ఈ మొదలగు వారికందఱికి వృత్తు లుండెడివి: అనగా వారికి మాన్యము లుండెడివి. గ్రామము ఏర్పాటగునప్పుడే ఈవృత్తు లేర్పడుచుండెడివి. ఇట్టివృత్తులవా రుండుటవలననే పూర్వము ఒక గ్రామము ఇంకొకగ్రామముమీద నాధారపడవలసిన అవసరము లేకపోయెను. గ్రామసంఘమున కాయావృత్తులవారు భటులుగ నుండి సంఘశరీరమును కాపాడువారు. కావుననే ఆయావృత్తులవారి కేర్పడిన మాన్యములకు 'భటవృత్తి మాన్యము' లనియు, 'జాతికట్టు మాన్యము'లనియు పేరు. పూర్వము గ్రామమే కాక గ్రామమునందలి దేవస్థానముకూడ ఆయావృత్తులవారికి మాన్యము లిచ్చి గౌరవించి పోషించుచుండెడిది. దక్షిణదేశమున నేమాత్రము ప్రసిద్ధికెక్కిన దేవాలయమున నైనను

కమ్మరి, కుమ్మరి, కాసె (తాపీపని) వాడు, వడ్రంగి, స్వర్ణకారుడు వీరలెల్లరుకూడ నుండు వారు.[1] ఇట్లు మహాసంస్థయైన గ్రామమును, అందలి ఉపసంస్థయైన దేవస్థానమునుకూడ ఆ యావృత్తులవారికి తమతమ విద్యలలో గడి తేరుటకును, చేయితిరుగుటకును ప్రాథమికా భ్యాసశాలలుగ నుండెడివి.

గ్రామవ్యవస్థ ఆయా వృత్తులవారు వారివారి విద్యలలో నిపుణు లగుటకు ఈవిధ మున అవకాశమిచ్చుచుండ ధనికులు, సామం తమండలేశ్వరులు, మండలేశ్వరులు, రాజులు మొదలగువారు నూతులు త్రవ్వించియు, చెఱు వులుకట్టించియు,గుళ్లుగోపురములు నిర్మించియు ఈవిధమున పనివాండ్రకు తమ పనితనము చూపుటకు అవకాశ మిచ్చి ఆదరించువారు. పనివాడు తనపనితనమును జూపె తనకృతిపతిని మెప్పించినచో ఆతడు ఆవృత్తివిద్యావిశారదు నకు కొంత భూమిదాన మొసంగువాడు. ఇట్లు పూర్వము పారిశ్రామికులైన విద్యావంతు లకు కళాభిరుచిగలవారు భూమి రూపమున నొసంగిన బహుమానదానశాసనము లనే కము కాన్పించుచున్నవి.[2] ఇట్లు భూరూపబహు మానముల నొసంగుటయే కాక వారిపనితన మును మెచ్చుకొని విద్యాప్రియులైన ప్రభు వులు సాంఘికముగ వెనుకబడియుండువారికి కొన్ని కొన్ని స్వాతంత్ర్యమర్యాదలను కూడ నొసంగి సంఘమున వారికి గౌరవోన్నతస్థాన ముల నొసంగి, క్రమక్రమముగ సంఘమున వారిమర్యాద హెచ్చునట్లు చేయువారు. ప్రాచీ నశాసనావళిని గాంచినచో మనకిట్టి శాసనము లును గానబడును.[3] అనగా నాయావృత్తు లలో విద్యావంతులైనవారిమూలమున ఆయా కులములకు హిందూసంఘమున గౌరవము హెచ్చుచు వచ్చెను. విద్యావంతులు ఆయా కులములకు జీవగఱ్ఱవలెనుండి దేశమును సౌభాగ్యవంతముగ దిద్దుటకై తమ మేధాశక్తి ని, ప్రతిభాసంపదను వినియోగించువారు.

### పంచాణంవారు, వారిపనితనము

లలితములైన పారిశ్రామికకళలను పోషిం చి, కాపాడి దేశమునకు సౌభాగ్య సౌందర్య ములను ఒనగూర్చినవారు ఈ పారిశ్రామిక జాతులవారే. వీరిలో 'పంచాణం' వారు అన బడు విశ్వకర్మవంశజులు ముఖ్యులు. బ్రహ్మ కుమారుడైన విశ్వకర్మకు అయిదుగురు కొడు కులుకలరు. వారైదుగురు అయిదువృత్తులకు కారకులైరి. ఆవృత్తులేవన (౧) కమ్మరము,(౨) వడ్రము, (3)కంచరము, (४)శిల్పము,(౫)స్వర్ణ కారకము(కుందనపుపని). ఈయైదువృత్తులవారి కి ఐదాయులనియు పేరు. శాసనములలో వీరు 'పంచాణం' వారనుపేర బరగుచున్నారు. వీరు తమపేళ్ల చివర 'ఆచారి' పదము చేర్చుకొందు రు. పూర్వపు శాసనములలో వీరిపేళ్ల చివర 'ఆచారి'పదముకంటెను 'ఓజు' పదము ఎక్కు వగ గన్పట్టును. వల్లభోజు,బసవోజు, వేమోజు,

1. Ep Coll. No. 729-1920; Ep. Coll. No. 674-1920; Ep. Ind. Vol. V. P. 142; S. I. I. Vol II. Part III. No 66; Ep. Coll. No. 157-1913. Etc.

2. Ep Coll. No 436-1920; Ep. Coll 683-1917 Etc.

3. S. I. I iii, i, 47, 1899; Ep. Rep. 1911 p 75 Etc.

లమచ్చుకొనుటకు ఉపకరణములును సాధనములు నుండునా? పారిశ్రామిక విజ్ఞానము లేనిచో ఆధ్యాత్మికజ్ఞాన ముండియు సంఘము అభివృద్ధి నొందజాలదు. ఆధ్యాత్మికవిజ్ఞానము లేని పారిశ్రామికజ్ఞానము అపాయకరము. ఆధ్యాత్మిక, పారిశ్రామిక విజ్ఞానములు రెండును ఒకదానిలో నొకటి అంతర్భాగములు. వీటిలో ఏది కొఱవడినను రెండవదానికి ప్రశస్తిలేదు. పారిశ్రామికవిజ్ఞానము సుందరమైన, హృదయాకర్షకమైన నాగరకతను సృష్టించుచుండ ఆధ్యాత్మికవిజ్ఞానము దానికి తేజస్సునొసగి ప్రాణము పోయుచున్నది. హైందవ నాగరకతయంతయు పల్లెటూరి పారిశ్రామికుని చిన్నికుటీరమునుండియు, నిరాడంబరజీవియు ఆధ్యాత్మిక విద్యాసంపన్నుడునైన అగ్రహారికునినుండియు పెరిగి పెంపుగాంచినది. ఈరెండువిధములైన జ్ఞానవిభాగములకుగల అన్యోన్యసంబంధమును గుర్తెరింగినది కనుకనే మనప్రాచీనగ్రామ మీ రెంటికి ప్రధానస్థాన మొసంగి సఖ్యత సమకూర్చినది. కావుననే మన ప్రాచీన గ్రామవ్యవస్థలో వైదిక విద్యాసంపన్నుడైన బ్రాహ్మణుని కెట్టిస్థానము గలదో అట్టిస్థానమే వృత్తి విద్యానిపుణుడైన పారిశ్రామికునికి నుండెను. ఈవిధమున ప్రాచీనగ్రామము ఈరెండువిధములైన విజ్ఞానమును సమన్వయముచేసి నేటిపారిశ్రామికసమస్యను, దానికి సంబంధించిన యితరములైన చిక్కులను 'ఆధునికనాగరకత' కన్నులు తెరవకమునుపే చక్కగ పరిష్కరించెను. పారిశ్రామికునికి గ్రామవ్యవస్థలో 'వృత్తి' రూపమున స్థానముండుటచే వృత్తివిద్య కెట్టిగౌరవముండెడిదో తెలియగలదు. పూర్వము బ్రాహ్మణుడు, పారిశ్రామికుడు—ఇరువురును హిందూసంఘమునకు రెండు కండ్లవలెనుండి పరస్పరము సహానుభూతిని కలిగియుండుట నేర్చుకొని, ఆధ్యాత్మికవిద్య కధికారులై ఉన్నతాదర్శములనుజూపి మానవునియందలి ఆధ్యాత్మిక సంపదను దోహదముచేసి యొక్కరును, ఆధిభౌతికవిద్యకు ఆచార్యులై సౌందర్యరస పరిప్లుతములగు కళారచనలను గావించి జీవితమును సౌఖ్యానంద ప్రదముచేసి మరియొక్కరును సంఘమును నడిపించి దేశమును పరిపాలించువారు.

### 'భటవృత్తి' మాన్యములు, గ్రామవ్యవస్థ

ఈ పైకారణములమూలమున ప్రతిగ్రామమునను కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, కంసాలి ఈమొదలగు వారికందఱికి వృత్తు లుండెడివి: అనగా వారికి మాన్యము లుండెడివి. గ్రామము ఏర్పాటగునప్పుడే ఈవృత్తు లేర్పడుచుండెడివి. ఇట్టివృత్తులవా రుండుటవలననే పూర్వము ఒక గ్రామము ఇంకొకగ్రామముమీద నాధారపడవలసిన అవసరము లేకపోయెను. గ్రామసంఘమున కాయావృత్తులవారు భటులుగ నుండి సంఘశరీరమును కాపాడువారు. కావుననే ఆయావృత్తులవారి కేర్పడిన మాన్యములకు 'భటవృత్తి మాన్యము' లనియు, 'జాతికట్టు మాన్యము'లనియు పేరు. పూర్వము గ్రామమే కాక గ్రామమునందలి దేవస్థానముకూడ ఆయావృత్తులవారికి మాన్యము లిచ్చి గౌరవించి పోషించుచుండెడిది. దక్షిణదేశమున నేమాత్రము ప్రసిద్ధికెక్కిన దేవాలయమున నైనను

అంతేకాదు; మఱల తిరిగి రెండువందల సంవత్సరములలోనైనను ఇట్టినగరమును నిర్మించుటకు కాదు." అని సుల్తాన్ మహమ్మదువ్రాసెనట.[1] ఈసుల్తాను ఘజ్నీకి తిరిగివెళ్లినప్పుడు ౫,౩౦౦ మంది హిందువులను ఖైదీలుగ గొనిపోయెను. వీరిలో చాలమంది శిల్పులు, వృత్తి విద్యా నిపుణులు నుండియుండురనుటకు సందియములేదు. ఏలయన గాంధార దేశములోనీసుల్తాన్ మహమ్మదు రాజధానియైన ఘజ్నీలోనున్నన్ని ప్రాసాదములు, దివ్యభవనములు, జలాశయములు, కేళీగృహములు, మంటపములు- ఈ మొదలగునవి ప్రాగ్దేశనగరములలోఁదేనిలోను గాన రావనియు, వీటినన్నిటిని నిర్మించినవారు హైందవ శిల్పులే యనియు తెలియుచున్నది. తైమూరు క్రీస్తుశకము పదునాలుగవ శతాబ్దము కడపట హిందూ దేశముపైదండెత్తివచ్చి డిల్లీనగరమున లక్షలకొలది జనులను దారుణవధపాలుచేసి, పిదప చాలమందిని ఖైదీలుగపట్టుకొనెను. వారిలో శిల్పులు మొదలగు కళాకుశలు రెందఱుండిరో లెక్కవేయించి, వారిని తనరాజధానియైన సమర్ఖండునకు గొనిపోయి, వారిలో చాల గొప్పవారిని కొందఱిని అచ్చట నొకమసీదు కట్టుటకు తన యాస్థానముననుంచుకొని, మిగిలిన వారినందఱిని తనక్రిందిసామంతరాజులకు, అమీరులకు నొప్పగించి, వారిపోషణభారము వారిపై మోపెను. ఈవిధమున నెన్నియుదాహరణములనైన నొసంగవచ్చును. మహమ్మదీయులు హిందువులకపుడు శత్రువులయ్యు మతవిషయకదృష్టిని పగబూని హిందూవిగ్రహములను, హిందూదేవాలయములను భగ్నముచేయుచు వచ్చినను కళాకుశలుర కౌశల్యమును మెచ్చకపోలేదు; మెచ్చి వారి నాదరింపక పోలేదు. ఇంతయేల, శత్రురాజులుహిందూదేశముపైదండెత్తివచ్చినపుడువారిశిల్పకళారచనల నుజూచి ముగ్ధులై అట్టి శిల్పవిద్యా వాచస్పతులను తమతమ దేశములకుగొనిపోయి గౌరవ సమ్మానము లొసంగి వారి శిల్పకళారచనలకు ప్రోత్సాహ మిచ్చియున్నారు. అందువలన హైందవశిల్పకళ దేశదేశములకు ప్రాకి అచ్చటచ్చటవలసలను ఏర్పాటుచేసికొనెను. తుదకు బాగ్దాదునగరమును కట్టినదికూడ హైందవ శిల్పులేయని తెలియుచున్నది.

### స్వదేశప్రభువుల కళాభిమానము

శత్రురాజుల మాటయటుండ దేశీయులైన రాజాధిరాజులు కూడ కళలనాదరించి యుండిరనుటకు పెక్కునిదర్శనములు కలవు. అట్టివొకటిరెండు నుడివిన జాలును.[2] "అశోక వర్ధనుని కాలమున శిల్పులొకవిధముగ రాజు కొలువులోనివారుగనే పరిగణింపబడుచుండిరి. చేతులుపోగొట్టికాని, కళ్లుపోగొట్టికాని,...... వృత్తివిద్యావిశారదుని శక్తి సామర్థ్యములను కుంటుపఱిచినవారికి శిక్షశిరఃఖండనమే. నౌకానిర్మాతలు, కవచ (armour) నిర్మాతలు వేతనములనుబడయురాజసేవకులుగనుండిరి. వారు రాజుకేకాని యితరులకు పనిచేయగూడదను నిర్బంధ ముండినట్లు చెప్పుదురు. వడ్రంగులు, కమ్మరులు మొదలగువారిని రాజుప్రత్యేకము

1. Ferishta, Brigg's Translation, Vol 1. p 59.
2. V. A. Smithi's Early History of India, p.

కనుగొనుచు తణిఖీచేయుచుండువాడు." ఢిల్లీ పాదుషాయైన అక్బరుకొలువులో పెక్కురు కళాకుశలురు, వృత్తివిద్యానిపుణులు నుండు వారనియు, వారివారి రచనలలో అత్యుత్తమములైన వాటికి ప్రత్యేక బహుమానముల నొసంగి పాదుషా వారిని గౌరవించుచుండు వాడనియు ఆతని మంత్రియైన 'ఆబుల్ ఫాజల్' 'అయిని అక్బరీ' అను గ్రంథమున వ్రాయుచున్నాడు.

ఈపైనొసంగిన యుదాహరణములనుపరిశీలించినచో దేశీయులైననేమి, విదేశీయులైననేమి ప్రభువులగువారు ఇట్టి విద్యావంతులను ఆదరించి గౌరవించి, వృత్తివిద్యలను కళలను పోషించువారనియు, పరరాజులు దేశమును జయించినప్పుడు చతురులైన శిల్పాచార్యులను, శిల్పాచార్య విరచితములైన కళాకావ్యరచనలను తమదేశమునకు గొనిపోయి తాము జయించిన రాజులను పరాభవించువారనియు తెలియుచున్నది.

ఇట్లే కర్ణాటసార్వభౌముడైన కృష్ణదేవరాయలుకూడ ఉదయగిరిదుర్గముపై కెత్తివెళ్లి దానినిపరిపాలించుచుండిన గజపతిరాజులనుజయించి యాకోటలోనియొక దేవాలయముననున్న యత్యంత సుందరమైన బాలకృష్ణమూర్తివిగ్రహమును పెల్లగించి తనరాజధానియైన విజయనగరమునకు గొనిపోయెను.

ఉపసంహారము

ఈపై విషయములన్నియు హైందవులైననేమి, హైందవేతరులైననేమి, మనపూర్వులకుగల కళాభినిరతిని సహస్రకంఠముల నుచ్చైస్స్వనమున నుద్ఘోషించుచున్నవి. ఆరితేరి, సిద్ధహస్తులైనశిల్పులు, స్థపతులు మొదలగు కళాకుశలురు దేశమునకు కీర్తితెచ్చు నలంకారములనియు, వారే దేశముయొక్కసంపదయనియు, వారులేనిదేశము—అనగా లలితకళాభివృద్ధి-శిల్పకళావిజ్ఞానము-వర్ధిల్లనిదేశము దేశమేకాదనియు వారు భావించియుండిరని పైవిషయములవలన విశదమగుచున్నది. తుదకు తంజావూరు, మధురానగరములు రాజధానులుగ పరిపాలించిన నాయకరాజులు కూడసుప్రసిద్ధులైన శిల్పాచార్యులను పోషించి, కళలను వృత్తివిద్యలను ఆదరించిరనుటకు వారికాలముననిర్మింపబడిన గొప్పగొప్పదేవాలయాది నిర్మాణములే తార్కాణము.

ఈసంగతులన్నిటినిబట్టిచూడగా పూర్వము ప్రభువరేణ్యులు అగ్రహారముల నొసంగి బ్రాహ్మణవిద్య నెట్లాదరించిరో, బహుకళాకావ్యరచనలు చేయించి వృత్తివిద్యా విశారదులనుకూడ నట్లేసమానముగనే బహూకరించిరని స్పష్టపడగలదు. బ్రాహ్మణునిచేతిలో మతవిద్య యెట్టియాధ్యాత్మికపుఔన్నత్యమున నందెనో అట్లే పారిశ్రామికునిచేతిలో వృత్తివిద్యయు కళాభిధానమును పొంది మహోత్కృష్టదశ నందివిరాజిల్లెను. ఈరెండువిధములైనవిజ్ఞానము నెంతటి యౌన్నత్యదశ నందినను దానికి గ్రామమే ప్రాథమికక్రీడారంగము. పల్లెటూరిపారిశ్రామికుడు తనకర్మశాలలో వెలిగించిన యీ విజ్ఞాన జ్యోతి దేశాంతరములను కూడ ప్రకాశవంతము చేసి, సౌందర్యరససృష్టికి పరమావధి యయ్యెను. అట్టిది మనపూర్వపు వృత్తివిద్య, అంతటి నిరాడంబరమైనది తద్విద్యా విధానము; అంతటి ఉత్కృష్టమైనది దాని ఫలితము.

# అంగుళిమాలాస్తూపము.

## శ్రావస్తి



(పక్కీమాటి ప్రాతస్థానము)



# బ్రాహ్మణక్రాక శాసనము

వంగోలు వెంకటరంగయ్య గారు, బి. ఏ., బి. యల్.

నెల్లూరుజిల్లా కావలి తాలూకా కావలి గ్రామమునకు నైరృతిభాగమున బ్రాహ్మణక్రాక యను నొక యగ్రహారము గలదు. తనతండ్రికి ముక్తిగలుగు నుద్దేశముతో హరిహరరాయలు దీనిని కొందఱు బ్రాహ్మణులకు దానము జేసినటులు శాసనములోని యీక్రింది శ్లోకమువలన దెలియుచున్నది. సపిండీకరణకాలమున నిచ్చిన ట్లచటివారు చెప్పెదరు.

శ్లో. శాకే ఽష్టే నందదినగ్రణితే నళేఽబ్దే
పౌరే తిథౌ ప్రథమకే బహుళే తపస్యే;
క్రాకం ఫలంచిత మనంచిత మగ్రహారం
ముక్త్యై పితు ర్హరిహరో ఽయమదా ద్ద్విజైః.

దీనివలన ఈ యగ్రహారదానము శకాబ్దంబులు ౧౨౯౮ కి సరియగు నళనామసంవత్సర ఫాల్గునబహుళ ప్రథమా భానువారమున జరిగినటులు కన్పడుచున్నది. ఇది క్రీస్తుశకమున 1376 యగునటు లున్నది.

శాసనములోని ౭-౧౩-౧౪ శ్లోకములవలన హరిహరుని వంశావళి యిటు లేర్పడుచున్నది.

ఇందువంశమున యదువు గలిగెను. ఆతనిపరంపర యందు సంగమమహీపతి, ఆతనికి బుక్కనృపతి, బుక్కరాజునకు హరిహరుడు. ఈతడే యగ్రహారదాత.

గ్రంథాంతరములందు సంగమునికి హరిహరుడు, బుక్కరాజు, ఇత్యాదులు కలిగినటులును, ఈ బుక్కరాజునకు హరిహరుడు పుట్టినటులును ఉన్నది. ఇందువలన ఈశాసనకర్త రెండవహరిహరరాయలుగ (Hari Hara II) గణింపబడవలయును.

శాసనాంతమున "శ్రీ విరూపాక్ష" యను నక్షరములు తెలుగున నున్నవి. ఈవిధమగు సమాప్తి ఈ వంశపురాజుల దానశాసనములం దొకసంప్రదాయముగ నున్నటులు తోచుచున్నది. ఇది శ్రీ పంపాక్షేత్రమున నెలకొన్న శ్రీ విరూపాక్షేశ్వరునిపై భక్తిసూచకమై యుండును.

శాసనభాగమంతయు ఆకాలపు నాగరాక్షరములతో అయిదు రాగిరేకులపై ఇరుప్రక్కల నింపియున్నది. కొన్నికొన్ని యక్షరముల స్వరూపము యిప్పటి నాగరాక్షరములపోలిక నుండవు. ఈ యైదు రాగిరేకులను పాత్రస్వరూపచిహ్నితమగు ముద్రగల రాగియుంగరమున గూర్పబడియున్నవి.

శాసనమున కొంతవరకు మాత్రమే శ్లోకసంఖ్య గలదు. ఆద్యంతములు నూటపదునొకండు శ్లోకము లున్నటులు తోచుచున్నది.

దాన మియ్యబడిన గ్రామమునకు తొలిపేరు క్రాకు అయినటులు ౨౦-వ శ్లోకములోని "క్రాకం" అను ప్రయోగమువలనను, ౨౧-వ శ్లోకములోని "క్రాకు ర్విభాతి" యనుటవలనను దెలియుచున్నది. దీనికి బుక్కరాయపుర మను పేరుబెట్టి దానము చేసినటులు ౨౧-వ శ్లోకమున గలదు:—

యః పాకనాటివిషయే సవిధే పయోధేః
క్రాకు ర్విభాతి ఫలితో జలవంకి కామ్యే
శ్రీబుక్కరాయపుర మాహ్వయతో విధాయ
సద్విప్రసాఘకతతిం సహ సర్వభోగైః.

క్రాత లేక క్రాకు యన నేమియర్థమో తెలియ లేదు. కొండ తిప్పలోనగు ఉన్నత ప్రదేశముల క్రింది యూరికి క్రాకుఅను పేరుగలదని యొకరు చెప్పిరిగాని దీనికాధారము మృగ్యముగ నున్నది.

ఈ పేరునను గ్రామనామము పేర్కొనిన గొన్ని గలవు. ఈ బ్రాహ్మణక్రాక సమీపమున చినక్రాక, క్రాకుటూరు, తిరువళ్లూరి సమీపమున "క్రాకవాక" ఇత్యాదులు. బహుశః కాకనాడ "క్రాకనాడ"యొక్క వికారమైయుండునా? హైమవాసనాగ్ని ధూమముచే నల్లబడిన యింటి కప్పులు కలది యగుటచే నగ్రహారమునకు "నల్లిండ్లు" అను పేరు వచ్చినట్లు శబ్దరత్నాకరమునగలదు. అగ్రహారమును "నల్లిండ్లు" అనుటకు యర్రాప్రగ్గడ హరివంశపూర్వభాగమున ప్రథమాశ్వాసమున నొక ప్రయోగము గలదు. మైరావణచరిత్రమునందుండి యొక యుదాహరణము శబ్దరత్నాకరమున జూపబడియున్నది. ఈవిధమునను శ్రోత్రియాగారములయందలి త్రేతాగ్నులచే క్రాగుచుండు నిండ్లు గలిగియుండుటచే క్రాక యని పేరు గలిగి యుండునా? "క్రాగు" ధాతువు ననుసరించి "క్రాక" యేర్పడినటులు శబ్దరత్నాకరము దెలుపుచున్నది.

ఈశాసనములో ఈగ్రామము హద్దులచే నిర్దేశింపబడియున్నది. ఆహద్దులు యిప్పటికిని గొన్ని కలవని యచటివారు చెప్పుదురు. ఈహద్దులకు వాడుకలోనుండు పేర్లే చెప్పబడినవి. ఇటు లనేకశాసనములందు గలదు. ఈ గ్రామనిర్దేశముచేయుటలో "జలవంకియామ్యే" యని యొకస్థళి నిరూపణము చేయబడియున్నది. ఆప్రాతకాలమున "జలదంకి" యొక గొప్పగ్రామముగనుండి యందొక పాళెగాడు "సామంతుడు యుండినటు లున్నది. ఈ జిల్లాలోని కోవూరుతాలూకా వెల్లిచర్ల శాసనమునను "జలదంకిస్థళే పాంకనాండి సీమ్ని" యని యున్నది.

"ప్రోక్తాః పంచ యుతా షష్టి బుక్కరాయ పురాధిపాః" యని శాసనాంతిమభాగమున నుండుటచే ఈ యగ్రహారము అరువదియైదుభాగములు జేయబడి దానమియ్యబడినటులు స్ఫురించుచున్నది. ప్రతిగ్రహీతృనామములు అరువదినాలు గగపడుచున్నవి. ౪౯-వ శ్లోకమునను అరువదినాలుగు చెప్పబడినవి:—

"అంశా స్తత్రచతుష్షష్టి" శాసనపు కడభాగమునను "భాగా ఋగ్వేదినాం సార్థ త్రయోవింశతి రీరితాః "యజుర్వేదాం పునస్సార్థ ష ట్త్రింశ త్పరికీర్తితాః "శ్వే సామవేదినో ర్భాగా స్వభాగా శేశవేశయోః "ఏవంభాగా శ్చతుష్షష్టిరేవ" యనియే యున్నది. ఈ అరువది యైదవభాగ మెవరికో స్పష్టపడలేదు. బహుశః గ్రామాధికారులకిగ నుండును

ఈ శాసనమందలి విశేష మేమనగ:—ఋగ్యజుస్సామవేదులు మువ్వురికి అంశముల నిచ్చుటయే కాక, దానముగొనిన ఒక్కొకరియం దొక్కొక యాధిక్యముగూడ జెప్పబడియున్నది. వేదశాస్త్రపారగులుగను శ్రౌతస్మార్తనిధులుగ నుండువారుగాక ఆయుర్వేదవిదులకును, జ్యోతిశ్శాస్త్రవేత్తలకును కళానిధులకును ద్వైతాద్వైత తత్త్వజ్ఞులకును వారివారి యధికారములనుబట్టి దానము లీబడినవి. నృహరియను నొకరు అద్వైతద్వైత సదనమని ప్రశంసింపబడియున్నారు. నాగదేవపుత్రులు రామాచార్యులవారు "ద్వైతభూః యజుషాం గృహం." వీరుమాధ్వసంప్రదాయములోచేరినవారుగనుందురు. ఇంతియకాక "ప్రభూతాచారభూషణు" డొకడు "ధైర్యభూమి" యొక్కడు "మంత్రవేది"యొక్కడు "కవీశ్వరు" డొక్కడుగూడ ఈ యంశభాక్కులలో గలరు. ఇట్లు వేదశాస్త్ర మంత్ర తంత్ర కళా వైద్య జ్యోతిష కవిత్వాభిమానముల యోగపద్యముగ జూపిన శాసనను లితరములు గలవా యని సందియముగ నున్నది.

ఈ యన్నిటికంటెను గొప్పవిశేష మేమనగ: వేదభాష్యమును రచించిన సాయణాచార్యులవారు ఈ బ్రాహ్మణక్రాకలోని యొక అగ్రహారికుడని తెలియుచున్నది.

"యో భాష్యకర్త ధీమాన్ మాయణాచార్య నందనః,
అసౌ శ్రీసాయణాచార్యో భారద్వాజో యజుర్ని ధిః;
పదవాక్యప్రమాణానాం ప్రధానం యజుషాం పదమ్."

అని శ్రీసాయణాచార్యులవారి ప్రస్తావ మిందు గలిగి యున్నది. దీనినిబట్టి సాయణమాధవుల కాలనిర్ణయము మొదలగునంశముల కాధారము గలుగవచ్చును. వీరి కాంధ్రదేశ సంబంధ మేర్పడుచున్నది.

అసర్వణశాఖవా రాకాలమునకే లోపించిరి కాబోలు! అట్లుకాకున్న ఆ శాఖవా రొక్కరైన యుందు బేర్కొనబడియుందురు. ఆ వేదమునకును సాయనభాష్యము గలదు.

ఈ ప్రతిగ్రహీతలలో నొక్కొక్కరును వేద విద్య యజమానవిద్యయందు సంపూర్ణ పాండిత్యము గలవారుగ నున్నారు. సాయణాచార్యులవారు తప్ప మిగిలినవారు వ్రాసిన గ్రంథము లెవ్వియైన గలవో లేవో విచారింపవలసియున్నది.

దానముల గొనినవారందరును కరణకమ్మలట. ఇప్పటికిని శేషించియుండు అగ్రహారికులు కరణకమ్మలుగ నేయున్నారు. దానశాసనములోని ౩౬-వ శ్లోకము నందుండు కురవివారిప్పటికిని ఉన్నారు. మిగిలిన యింటి పేరటి వారెందుగలరో విచారింపవలయు.

కరణకమ్మలు విశేషముగ కన్నడదేశమునగలరు. విజయనగరరాజ్యస్థాన మాదేశమున నుండుటచే రాజాభిమానమును పొందిన విప్రులకీ యగ్రహార మీబడుట యుక్తముగనే యున్నది.

మూలశాసనము నాకు లభింపలేదు. దాని నే జూడలేదు. ప్రతిబింబము నొకదాని యగ్రహారికులలో నొకరియ్యగ దానిబట్టి ఈప్రచారము జరిగింపబడు చున్నది. నెల్లూరుజిల్లాలోని శాసనముల శోధించిన బట్టవర్తు వేణుగోపాలచెట్టిగార్లు దీని జూచినట్లు వారి గ్రంథమున లేదు. ఏకారణముననో మూలప్రతి యెవ్వరికిని జూపబడినట్టులలేదు. పురాతన విషయశోధన శాఖవారికి పూర్ణాంశములకు దీనియందేమియైన విశేష మున్నట్లు తోచినవారు యత్నింపవలయును. నాకు లభించిన బింబమును పంపితిని. దానియందు లేఖక దోషములు మెండుగ లేవుగాని మూలములో వర్ణక్రమ భంగో వ్యాకరణాది భంగములు కొన్ని యున్నట్టుల తోచుచున్నవి. మూలశాసనము లభించినంతట వీని నన్నిటిని శుద్ధములు జేయవచ్చును.

ప్రాచీనశాసనవిమర్శలయందు నేననుభవము గలవాడను గాను. ఈశాసన మపరీక్షితపూర్వమని తలచి శాసనశోధకులిందేమయిన విశేషముల కనుగొనుదురను ఉద్దేశముతో దీని ప్రకటించితిని. సాయనాచార్యుల పేరిందుండుట ఆంధ్రుల నుత్కర్ష హేతువు కాగలదు.

## శాసనము - మూలము

శ్రీమహాగణాధిపతయేనమః, శ్రీ సరస్వత్యైనమః

శ్లో. యా సాహిత్యకలాకలాపం యా సంగీతసుధాస్పదం।
యా పదం సంవిదాం నిత్యం సా మాం పాతు సరస్వతీ॥

యాష్టాంతకాంతి దవసీ మవలంబమానా
　　శోపంటిని మిల తటిల్లతికా విభాతి।
యాయా ద్వరాహవపుషా పరిదీప్యమానం
　　పద్మాపతే స్తదిద మప్యుతరం స్వరూపం॥

యస్యాచ్ఛదంతముకుళప్రతిబింబితాని
　　శంభో ర్ముఖాని సముదీక్ష్య గిరీంద్రకన్యా।
భాతీతి పంచకమలీశరదిందుగర్భే
　　సమ్మోహతే ప్రతికళం స గజాననోఽవ్యాత్॥

లక్ష్మీ సుధాసురభికౌస్తుభకల్పభూజ
　　భ్రాంత స్సుధాకర కరస్ఫురణాభిరామ।
చంద్ర త్వదీయవపు రేధితసర్వలోక
　　శ్చూడామణిః పశుపతే రవతా న్నితాంతం॥

యా శాలిమంజరిక యాంచితపాణిపద్మా
　　యా జీవజీవనకళా సకలాత్మికా యా।
యాంతస్స్ఫురత్తటిదితి ప్రవిభావ్యమానా
　　సాన్నిధ్య మావహతు సా సరసానుబంధం॥

ఆధారకంద మఖిలాగమవల్లరీణా
　　మాక్రీడభూమి రమితార్థప్రదద్రుమాణాం।
ఆరక్తకాంతి రగజాపతి రబ్జహాళి
　　రాకల్ప మాకలయతా దవనీ మనంతా॥

అస్తి ప్రశస్తచరితా యదు రిందువంశే
　　వంశేఽస్య సంగమమహీపతి రావిరాసీత్।
తస్మా దశేషధరణీభరణార్క బాహు
　　శ్రీవీరబుక్కనృపతి ర్నృపతీందు రాసీత్॥

యస్యాసినేను రసితా నిశితాగ్రధారా
　　సంగ్రామసీమ్ని రిపుజీవతృణాంకురాణి।
ఆఘ్రాయ సర్వభువనేషు ముహు ర్దుహానా
　　క్షీరం యశాం స్యహహ సంచరతే వ్రషే॥

కాంతారసీమని వనానల మద్రిశృంగే
　　మార్తాండకాంతి మహానం లవణాంబురాశౌ।

ఔర్వానలంర రిపవః పరివీక్ష్య తత్ర
తత్రైవ భ్రమం త్యహహ శంకితయత్ప్రతాపాః॥

తస్య ప్రభూతమహిమా నృపనీతిమూర్తిః
కీర్తిప్రతాపపరిపూరితభూనభోఽంతః।
సర్వోపధా స్వతిశుద్ధ మతిప్రసార
శ్రీమాన నంతరస ఆవిరభూత్ప్రధానః॥

యన్నీతివాగరికయాఽరిన్పృగా గృహీతా
స్వాం స్వాం మహీ మభినవా మభిత స్త్యజంతి।
యత్పాదపద్మ గరుడోపలకాంతిజాల
దూర్వాంకురా ననుతపేవ పునశ్చరంతి॥

తస్మిన్ ప్రధానతిలకే ఽఖిలసిద్ధతంత్రే
భారం భువః పరినిధాయ స బుక్కభూపః।
అధ్యాస్య హస్తినగరం నగరానతంసం
వీర శ్రియా సహ సమస్తసుఖా న్యభుంక్త॥

వీరారిహా హరిహరో ధరణీశ్వరో భూ
త్తస్మాత్కుమారఇవ తారకజిన్మహేశాత్।
యో దానవారిరివ రాజిత శంఖచక్ర
పాణి ర్మహేంద్రఇవ సాంకుశవజ్రపాణిః॥

కిం సంక్రమః స్వకళాబుధా ఇచ్ఛినోతి
కిం జాహ్నవీ విలయతే విమలాం సహస్రాం।
కిం క్షీరవారినిధి రాతను తే ప్రమోదం
లక్ష్మీపతే రితి యదీయయశ స్తనంతి॥

దావానలః కిముత వా బడబానలో వా
కల్పానలోఽయమితి సార్వభూమిపాలైః।
దందహ్యమానహృదయైః ప్రతితర్క్యమాణో
యస్య ప్రతాపతపనః పరితో విభాతి॥

యస్యాపి రుగ్రమహిమా బహుశో రణేషు
హత్వా సపత్నినికరా నన నందకోఽభూత్।
సాణిస్తుదైవతితరు స్సహ కామధేనుం
జిత్వా ముహుం పచరితం నితరా మియాసీత్॥

యద్దానవారి పృషతా విదుషాం కరేషు
ముక్తా ఫలంతి రసహాస్తితురంగమంతి।
రత్నాంలి భూమి నకాంబరభూరుహంతి
ధేన్వాదిదానమణిమందిర విభ్రమంతి॥

తం హిందురాయసురతాణముఖండ శౌర్య
మాత్మోద్భవం హరిహరం ధరణీశతార్క్ష్యాం।
విజ్ఞాయ బుక్కధరణీపతి రాత్మనైవ
స్వం ధర్మసంచయమహీమనుభోక్తుమైచ్ఛత్॥
తేన క్షితీంద్రతిలకేన కృతాభిషేకః
సింహాసనం జయరమాజనన ప్రధానం।
ఆరుహ్య రోహణగిరిం ద్యుమణి ర్యథాఽసౌ
భూరంజనం హరిహరో విజయంచ ధత్తే॥

శాకేఽష్టనందదినకృద్గణితే నశేఽద్బే
సారే తిథౌ ప్రథమకే బహుళే తపస్యే।
క్రాకుం ఫలంచిత ముదంచిత మగ్రహారం
ముక్త్యై పితుర్హరిహరో యమదా ద్ద్విజేభ్యః॥

యః పాకనాటివిషయే సవిధే పయోధేః
క్రాకు ర్విభాతి ఫలితో జలపంకితూమ్యే।
శ్రీబుక్కరాయపుర మాహ్వయతో విధాయ
సద్విప్రసాత్కతతిం సహ సర్వభోగైః॥
అస్య సీమాః ప్రవక్ష్యన్తే గ్రామ స్యాస్య చిరంభవాః।
పాతురాయీ జమ్మినద్యాం పుట్ట స్ప్రోప్పి సాదాన్వితః॥
కనుమగ్గకాలునప్రాచ్యామాగ్నేయ్యాం పిడ్వాలిప్రాదః।
దక్ష్యవాచ్యాం నిల్వురాయి ర్దిన్నో దోవలసంజ్ఞికః॥
నక్కలోవపదో గట్టు ర్నిల్వురాయిశ్చ కీర్తితః।
పైబుత్యాం కుదుమురాలగట్టు స్థిరపదో మతః॥
ప్రతీచ్యాం విడ్వేంచః కుంటః కలవలాహ్వయః।
చీకురేఁలకుంటశ్చ కుంటః కెద్దుగసంజ్ఞికః॥
తథా మోదుగమద్దుశ్చ వాయవ్యాం కామసాగరః।
కట్టః కామసముద్రస్య విస్తృతో రెంటకుంటలుః॥
ఆరికుండం జొడ్డినుద్దు రుదీచ్యాం మురరీప్రతః।
ఈశాన్యాం బొల్లపాతాయకుంటః ప్రోక్తనసమ్మతః।
గజేంద్రై రష్టభి రివ ధ్రియమాణవసుంధరా।
సహసీమాభి రష్టాభి ర్దిక్షు గ్రామోః ప్రకాశతే॥
అంశా స్తత్ర చతుష్షష్టి స్తేనాంల్పల్ప స్త భూభుజా
అంశాధీశాః ప్రవక్ష్య న్తే శాఖాగోత్రాహ్వ యాన్వితం॥
మహీజా మేరువద్ధీరో మానీ బొమ్మరసాత్మజః।
ఋగ్వేదీ రాయవామాత్యో భారద్వాజాన్వయాగ్ర
వేదాంతవ్యాకృతిస్థాన మప్పణార్యతనూభవః। [జీః॥

ఋగ్వేద మాయణసుధీ ర్విశ్వామిత్రస్య గోత్రజః।
ప్రసమామ్నాయపారీణః ప్రశమాభరణాన్వితః॥
భారద్వాజో దేవణార్య సుతో మాయణ కోవిదః
యజ్ఞ్యాజ్ఞికాగ్రణీ స్తర్కవిద్యామూలమృచాంపదం॥
కాశ్యపః పెద్దిభట్టో ఽసౌ చాంఢిభట్టతనూభవః।
ఋగ్వేదీ తద్విధానజ్ఞో తల్లక్షణవిహారభూః॥
గామయార్యసుతో రామో భరద్వాజో ఽన్వయో
దయః।
ఋగ్వేదజన్మభవనం భవనం స్మార్తసంపదాం॥
భరద్వాజ శ్శుండయార్య స్సోమసూరివరాత్మజః।
ఋగ్వేదనిధి రాత్రేయ స్సచ్చరిత్రవిభూషణః॥
కేశవః కరుణాభూమిః కురవప్పయ్యనందనః।
ఆహు ర్యదన్వయం తజ్ఞా ఋచా ముత్పత్తికారణం॥
మాధవార్యసుత స్సోయం గౌతమ స్తిప్పయ్యాభిధః।
ఋగ్వేదవేదినా మాద్యః కేశవార్యతనూభవః॥
ఆంగీరసగార్గ్యతగోత్ర స్సింగయ్యా కోవిదః।
ఋచాం ప్రధానపదవీ విష్ణుభట్టు స్వనందనః॥
విశ్వామిత్రః కల్లిదేవ సుధీ స్సుకృతినాం వరః।
సుధీ రధీతవేదాంత స్సోఽప్పార్య తనూభవః॥
శ్రీవత్సగోత్రసంభూతో హోన్నప్పార్యఋచాంపదం।
విజ్ఞాతప్ర, మామ్నాయో విద్యాభరబుధాత్మజః॥
కృపానిధి శ్చంద్రసూరిః కాశ్యపాన్వయసంభవః।
శింగయార్యసుతో ధీమాన్ భారద్వాజాన్వయోద్భవః॥
ఋగ్వేదీ కరుణాసింధుః పోచనార్యో మహాయశాః।
వాసిష్ఠః పిన్నయార్యాత్మజాతో జాతకృపాంతరః॥
అంతరాసక్త నృహరీ నృహరి ర్యాత్రిమా న్నృచాం।
యజుర్విదా మగ్రసరః తద్విధానవిధా మపి॥
గౌతమో భైరవ స్సోయం పెద్దిసూరితనూభవః।
అధీతి ప్ర, మామ్నాయ శ్శ్రౌతస్మార్తకళానిధిః॥
కౌండిన్య స్సింగయసుధీః భైరవార్యతనూభవః।
విధిజ్ఞో విద్వా న్నందో విశ్వామిత్రకులోద్భవః॥
చాంఢిభట్టుసుతో విద్వాన్ ఋగ్వేదీఅన్నపాభిధః।
ప్రధాన మృగ్విదాంపాత్రం పరం సుకృతిసంహతేః।
కాశ్యప శ్శింగయ శ్శ్రీమా న్నృప్పవిశల నందనః॥

విశ్వామిత్రః పవిత్రాంతః పుత్రో ఽన్నయమనీషిణః।
ఆధార స్సంవిధానానా మృచా మన్నయకోవిదః॥
ఆత్రేయగోత్ర స్సనై త్రిపాత్ర మృగ్వేదపారగః।
నరసింహో మహాప్రాజ్ఞో నారాయణబుధాత్మజః॥
భారద్వాజాన్వయజని పోచనార్యతనూభవః।
ప్రథమామ్నాయపదవీ శ్రీమా నప్పయకోవిదః॥
ఋగ్విదా మగ్రణీ రగ్రగామీ స్మార్తకలావిదాం।
శ్రేయోనిధి ర్దేవణార్య శ్శ్రీవత్సో నాడపార్యజః॥
యదీయమానసే సాంగ మృగ్వేదం పరిజృంభతే।
సహాయసం పెద్దిసూరిః కాశ్యప శ్శుండవార్యభూః॥
ఏతే ప్రత్యేకమంశేశాః అర్ధార్ధాంశాధినాయకాః।
గోపాలసూరితనయ శ్శ్రీమా నృగ్వేద పారగః॥
మౌద్గల్యగోత్రజో విద్వాన్నాగ్రిమహో ఽర్ధాంశకాధిపః।
ఏవం సమ్మిశ్రితాస్సార్థత్రయోవింశతి రంశకాః॥
యో వేదభాష్యకృద్ధీమాన్ మాయణాచార్యనందనః
అసౌ శ్రీసాయణాచార్యో భారద్వాజో యజుర్నిధిః॥
పదవాక్యప్రమాణానాం ప్రధానంయజుషాంపదాం।
ఆత్రేయసూరి స్సోసింప్రసూను ర్విశ్వేశ్వరో బుధః॥
త్రికాండ కూచిభట్టార్య తనూజ స్తర్కతంత్రభూః।
కాశ్యపో యజుషాం శ్రీమాన్ రామచంద్రో బుధాగ్ర
అద్వైతద్వైతసదనం సదనం యజుషా మపి। [ణీః॥
నందిసూరిసుతో విద్వా న్నృహరిః కాశికాగ్రణీః॥
యజుర్విదా మగ్రసరః శ్రౌతస్మార్తవిదామపి।
హారీత స్సూరిభట్టస్య సూను రెల్లయకోవిదః॥
నందనో నాగదేవార్య స్యాచలానందవత్సలః।
రామాచార్యో భరద్వాజో ద్వైతభూ ర్యజుషాం
గృహం॥
ఆయుర్వేదవిదాం శ్రీమాన్ యజుర్వేదవిదాగ్రణీః।
శ్రీవత్స శ్శ్రీగిరి ర్విద్వాన్ శ్రీవల్లభబుధాత్మజః॥
అధీతియజురామ్నాయో బోధాయనహరే స్సుతః।
విద్వా న్నరహరి ర్జామదగ్న్యవత్సాన్వయోద్భవః॥
జ్యోతిశ్శాస్త్రంయజుర్వేదో యదన్వయవిభూషణం।
సవిశ్వనాథతనయో గార్గ్యో మల్లయ కోవిదః॥
అన్నయార్యసుతో విద్వా ననంత శ్శాంతిమానసః।
కళానిధి ర్యజుర్వేదీ కౌశికాన్వయసంభవః॥

తాలంకాయనవంశో యో శ్రౌతస్మార్తవిహారభూః।
సోఽయం యజుర్విత్సూరార్య స్తిప్పనార్యతనూభవః॥

భారద్వాజో యజుర్వేదీ దైవజ్ఞశరణాగ్రణీః।
భారద్వాజోఽన్వయో ముఖ్యః ప్రభూతాచారభూషణః॥

విఖ్యాతనయో విద్వాన్ కృష్ణలంభప్పో యజుషాం మహీం।
హారీత శ్రౌతసదనం స్మార్తమూర్తి రుదారధీః॥

అన్నయార్యాత్మజోఽధీతయజు ర్నాగవదీక్షితః।
యజు స్సాంగం సవేదాంతం సతంత్రం యత్ర శోభతి॥

కాశ్యపోఽసౌ నృసింహార్య శ్రీకేసరిబుధాత్మజః।
యత్కులంకలయాం త్యార్యా స్తర్కతంత్ర యజు
ర్గ్రహం॥

కౌశికోఽప్పయభట్టాత్మజాతోఽసౌ భాస్కరో బుధః।
మంత్రాచార్యతనూజాతో హారీతో యజుషాం నిధిః॥

సిద్ధాన్తసంహితా హోరా వేడిపోచన దైవవిత్।
యజుర్వేదవిదా మగ్రసర శ్రౌతవిదా మపి॥

శ్రీవత్సవంశో నంతార్యః పెరమాడి బుధాత్మజః।
కలావాన్ శాబ్దికాగ్రీయో అక్కయార్యతనూభవః॥

పోతిసూరి ర్యజుర్వేద శ్రీవత్స శ్రీవిలాసభూః।
అప్పయార్యాత్మజో విద్వాన్ యజుర్వేదవిదాంవరః॥

హారీతః కామదేవార్య సూర్యానంద గుణోదయః।
యస్మిన్ సాంగంయజుర్భాతిహారీతాన్వయమండనే॥

పోచనార్యసుతస్సోయం నిట్టశింగయకోవిదః।
ఏతే ప్రత్యేక మంశేశాః అథార్ధాంశాధినాయకాః॥

గుణాధారో యజుర్వేదీ గోవిందార్యతనూభవః।
హారీతాన్వయభూః పెద్దసూరి రర్ధాంశకాధిపః॥

అథా విశిష్టభాగేశాః కథ్యంతే యజుషాం క్రమాత్।
లఖియార్యస్య తనయో లీలాశాలా యజుశ్శ్రియః॥

కౌశికాన్వయ సంజాతః కృపావాన్ మల్లికార్జునః।
భూమిగ్గయాంబపుణ్యానాం భారద్వాజా న్వయో
ద్భవః॥

కామయార్యో యజుర్వేదీశాంతిమాన్ శింగయార్యజః।
యస్మిన్మమ్మడిభట్టస్యసూనౌ సాంగంయజుః కలాః॥

ప్రకాశంతే స్వతస్సోయమాత్రేయో యెల్లుకోవిదః।
జ్యోతిర్విద్యానిధి ర్జ్యోతి గంగాధరబుధాత్మజః॥

కాశ్యపో యజురామ్నాయ వేత్తా మల్లయ దైవవిత్।
యద్వంశో యజుషాంమూలం ద్వైతాద్వైతవిదామపి॥

కేదారార్యసుతస్సోయం శ్రీవత్సో నృహరిర్బుధః।
భర్గసేవాసమాసక్తో భార్గవాన్వయ సంభవః॥

శింగయార్యో యజుర్వేదీ విశ్వనాథ బుధాత్మజః।
పరాశరాన్వయో ముఖ్యో దేవరార్యస్య నందనః॥

అన్నయార్యో ధైర్యభూమి రధీతయజురాగమః।
శాలావంత శ్శమాధారః శాలాశేషయజు శ్శ్రియః॥

అహోబలార్యశ్చ ధాన్ధ్యో రామసూరి తనూభవః।
భీమార్యతనయో ధైర్యధరణీ గౌతమాన్వయః॥

మంత్రవేదీ యజుర్వేదీ మానీ భైరవకోవిదః।
శ్రౌతమూలంస్మార్తమూలంయజుర్మూలంయదన్వయః॥

సింగయోఽసౌ భరద్వాజో కుంకుటప్పయ్యనందనః।
పెమ్మయార్యాత్మజ శ్శబ్దశాస్త్రాలంకృతిపారగః॥

అప్పాయభట్టరో యజుషాం సూతి శ్రీవత్సవంశజః।
అప్పాయార్యాత్మజోఽధీత యజురాత్రేయగోత్రజః॥

విద్వా న్నరహరి శ్రీమాన్ విజ్ఞాతవిధిభాగవః।
సీమా జ్యోతిర్విదాం శ్రీమాన్ యజుషాం పెల్ల
యార్యజః॥

శ్రీమా నన్నయ సజ్జః శాండిల్యాన్వయసంభవః।
అధీతయజు రాదిత్యసూరిసూనుః కవీశ్వరః॥

జ్యోతిఃకలాకులగృహం శ్రీవత్సః పోచనో బుధః।
తాంత్రిక స్తార్కిక శ్రీమాన్ నాగదేవబుధాత్మజః॥

హారీతో యజురాకారో బొమ్మకంద్యోభల సుధీః।
ఏతే ప్రత్యేక మంశేశా ఏతదంశాస్తు సంఖ్యయా॥

సార్ధషట్కం యుతా త్రింశ దేవం సమ్యగుదీరితాః।
శల్లారురాయతనయో శాలా వ్యాకృతితర్కయోః॥

గౌతమ స్సానవేదాఢ్యో వాసుదేవః కలానిధిః।
పుత్రి శ్శల్లారురాయస్య విదుషో విదుషాంవరః॥

అధీతసామవేదశ్రీ విఠ్ఠలో గౌతమాన్వయః।
ఏతే ప్రత్యేకమంశేశా ద్వావుక్తా సామవేదినా॥

శ్రీపాదకమలోద్భూతా విభాతి విబుధాపగా।
యస్యాసౌ కేశవ శ్శ్రీమా నేతద్గ్రామాధిదైవతః॥
రామేశ్వరో రాజమౌళిః రామచంద్రప్రతిష్ఠితః।
సోఽసౌ విభాతి గౌరీశో ఏతద్గ్రామాధిదైవతః॥
ఏతౌ ప్రత్యేకమంశేశౌ ద్వావుక్తౌ కేశవేశ్వరౌ।
భాగా ఋగ్వేదినాం సార్ధత్రయోవింశతి కీర్తితాః॥
యజుర్వేదాం పునస్సార్ధ షట్త్రింశ త్పరికీర్తితాః।
ద్వౌ సామవేదినో ర్భాగౌ ద్వౌభాగౌ కేశవేశయోః॥
ఏవం భాగా శ్చతుష్షష్టి రేవ తద్భాగభోగినః।
ప్రోక్తాఃపంచయుతాష్షష్టిబుక్కరాయపురాధిపాః॥
సాష్టైశ్వర్యాస్సాష్టభోగాఃసానందౌదార్యమాసతే।
సర్వమాన్యం హరిహరస్యాజ్ఞోయం పరిపాలితం।
త మంగుళ్యాపి నిర్దేష్టుం శంకతే రాజపూరుషః॥
సర్వే తే శంకరా స్సర్వమంగళాసక్తమందిరః।
విజయంతేతరా విప్రా బుక్కరాయపురేఽనిశం॥

పాథోధర శ్శిఖివరానివ సాభిలాషా
న్పద్మాకరః కవివరానివసానుబంధాన్।
శ్రీబుక్కరాయపుర మేత ద మూన్ద్విజేంద్రా
నానందయత్వనుకులం సరసాభిరామం॥

సామాన్యోయం ధర్మసేతు ర్నృపాణాం
కాలేకాలే పాలనీయోభవద్భిః।
సర్వా నేతాన్ భావినః పార్థివేంద్రాన్
భూయోభూయో యాచతే రామచంద్రః॥

బహుభి ర్వసుధా దత్తా రాజభి స్సగరాదిభిః।
యస్యయస్య యదా భూమి స్తస్య తస్య తథాఫలం॥

దానపాలనయో ర్మధ్యే దానాచ్ఛ్రేయోఽనుపాలనం।
దానా త్స్వర్గ మవాప్నోతి పాలనా దచ్యుతంపదం॥
శత్రుణాపి కృతో ధర్మః పాలనీయః ప్రయత్నతః।
శత్రురేవ హి శత్రుస్స్యా ద్ధర్మశ్శత్రు ర్నకస్యచిత్॥
స్వదత్తాం పరదత్తాంవా యో హరేత వసుంధరాం।
షష్టిర్వర్ష సహస్రాణి విష్ఠాయాం జాయతే క్రిమిః॥
సహస్రేణ తటాకానా మశ్వమేధశతేన చ।
గవాం కోటిప్రదానేన భూమిహర్తా నశుధ్యతి॥
ఏకైవ భగినీ లోకే సర్వేషాం భూభుజాం మహి।
న భోగ్యా నకరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా॥
శ్రీమద్రామకథాప్రధానవిబుధా
శ్రీపాదపద్మాళినా।
శ్రీమద్రామకృపావిలాసవిలస
ద్విద్యానవద్యాత్మనా॥
శ్రీమత్సోమనసూరిణావిరచితం
సత్శ్లోక్తి ముక్తాన్వితం।
శ్రీమ చ్ఛాసనమేతదత్రజయతా
దాచంద్రమాతారకం॥
ఏతస్మి న్నగ్రహారే హరిహర ధరణీ
పాల దానాంబురాశే
రుత్పన్నే ఽతీవరమ్యే స్ఫురదురు మహిమో
దారసీమాభిరామే।
సద్వృత్తైస్సత్ప్రకాశైస్సతతగుణయుతే
సత్పదంసంశ్రితానా
మంకానాం నాయకాయావనిసురనికరా
యాస్తు రాశాప్రశస్తం॥
శ్రీ విరూపాక్ష





# వనలక్ష్మీ సమాగమము

గుళ్ళపల్లి నారాయణమూర్తి గారు

ఎన్ని భవములగల్గు వనేందిరాస
మాగమసుఖం బనంతనిర్మలసుధాభి
షేచనము కాదె? ఈశుష్కజీవి కద్ది!
వేకువనె నిద్రమేల్కాంచి వెడలి చేసి
నాడ నొక రసాలవనసందర్శనంబు.

తొలికృశించియు, సన్నమై, మెలికలంబడి,
రానురాను విస్తరిలి, భూరమణి వేయు
కీలుజడభంగి, పూర్ణవినీలనీర
ములనొసంగుచు నాచూతఫలతరులకు,
నవ్యభావ ప్రబోధనానైపుణీవి
లాసముల నొప్పు బాలతరంగమధుర
నిస్వనాలాపముల స్వాగతస్వరాళి
బాడె, సెలయేటికన్నె, ప్రాపంచికవ్య
థాదవానలతప్త చిత్తంబునకును,
నవరసాలపల్లవ భోజనం బొనర్చి,
అభ్రచుంబిత శాఖాగ్ర మధివసించి,
ధాతృవదన విముక్త వేదములనెల్ల
మంజుల సుధారవంబున మార్చివైచి,
చిలికి, కల్పించె, పికమౌని జీవితాశ;
ఫుల్లవికసిత కుసుమ సంపూర్ణగుచ్ఛ
తాళవృతంబులను దమతావులెల్ల
నాపయికె వీచె లేగులాబీపడంతు
లట్టె యిరుదెసల న్నిల్చి, అలదె మేన
చందన ద్రుమాంగన నిజసౌరభముల,
తుమ్మపూగొమ్మ మేనపుష్పమ్ములెల్ల
రాల్చియొనరించె పీతాంబర ప్రదాన;
మంతమందార కుసుమాంగి యాననమున
రేకొకటియుంచి కల్యాణరేఖగూర్చె;
అలుముకొనె శిరీషసుమపంకిలమునాద
ములకు లత్తుకపూతయై, మ్రొక్కెవృద్ధ
నారికేళాంగనకు; శోభనప్రధాన
శయ్యకై యూడకంబముల్ సాచి పాతి,
పందిరిని వైచి, పచ్చికపరుపు సిద్ధ
పరచిన వటవృక్షచ్ఛాయ కరుగుచుండ
దర్శనమొసంగెను రసాలతరునవోఢ
మాధవీలతాంబరము రమ్యముగ దాల్చి
గంధవాహుని కొకవంక గన్నుగుట్ట
స్కంధమున ఫలగుచ్ఛకుచంబు లదర
సిగ్గుచే నగ్రశాఖాంక శిరము వంచి
ప్రమద మొనగూర్చె; నెన్నిభవములకల్గు
నవయుషఃకాలశోభ బ్రాణప్రతిష్ఠ
కల్గువనలక్ష్మితో సమాగమసుఖంబు



# రామాయణమునందు వానరు లెవరు?

గో. రామదాసు గారు, బి. ఏ., యమ్. ఆర్. ఏ. యస్.

ఈపై శీర్షికతో నొకవ్యాసము 'భారతి' క్రోధన సంవత్సర చైత్రమాసపు సంచిక పు.105–108లో బ్రచురింపబడియుండె. మ.రా.రా. చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసిన వ్యాసమునకు ఖండనగా బ్ర. కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు వ్రాసినది:

'శారద' 1924 సం. జూలై మాససంచిక పు. 567–573లలో 'రామాయణమునందలి వానరులు' అను శీర్షికతో నొకవ్యాసమును బ్రచురించినారు. ఈ రెండింటియందును శ్రీ శాస్త్రిగారు ఇట్లు స్పష్టముగ వానరులవిషయమై వ్రాసినారు.

"ఇట్టివా రిప్పటి క్రోతులవంటి శాఖామృగములు కానేరరు; కాని వాలములు గలిగి హీననాగరికత గలిగియుండు నొకతెగమానవులుగా గన్పించుచున్నారు." మరియు,

"రామాయణ కాలమందలి రామసేనయగు వానరులు మానవత్వమునందు, దేహనిర్మాణమునందును, మెదడుయొక్క ప్రమాణమునందును, కొంతకొంతను కొంతపశుత్వమును, కలవా రగుటచే వారిని హీనమానవు లంటినేకాని యపవిత్రు లనుతలంపున నే నట్లనలేదని లోకము తలంచుగాక! శ్రీమద్రామాయణమునందలి వానరులు పల్లెకాపులు మున్నగువారివలె దేహాదిధర్మములచే నరత్వపరిపూర్తి నందనివారు కారనియు, స్వల్పముగ పశుత్వమును, నధికముగ మానవత్వమునుగల యొక మిశ్రజాతివారని లోకము గ్రహించుకొనునుగాక."

వానరులకు మేధాశక్తి అల్పమైనయెడల రామాయణమునందలి వానరుల కట్లు చెప్పలేదే! అందరికంటె పెద్దతోకగల హనుమంతునికే బుద్ధితక్కువైతే అంతపని నెటుల చేయగలుగును? ఒక్కొక్కసమయములో వీరు చెప్పునీతులు ఎంతమేధాశక్తి వీరికిగలదో యని సూచించుచున్నది. ఆలోచనలో నైతేనేమి, ధైర్యస్థైర్యముల నైతేనేమి, పరాక్రమమునం దైతేనేమి వీరు ఏమానవునకు తీసిపోదురు? అటువలెనే సుగ్రీవుడు, జాంబవంతుడు మొదలైనవా రంత విస్తారమేధాప్రమాణము గలవారనియే తోచుచున్నది. వానరస్త్రీయైన తార యెంతబుద్ధిశాలియో, యెంత ఆలోచనపరురాలో చూడుడీ!

స్వల్పముగా పశుత్వము ఈవానరులయందున్నదట. మానవులయందుమాత్రము పశుత్వము లేదా! "ఆహారనిద్రా భయమైథునాదిసామాన్య మేత త్పశుభి ర్నరాణామ్" అని ఇవి నరులకు పశువులకు సామాన్యగుణములే కదా? ఇట్టి పశుత్వమే ఆ వానరులయందు

గూడ నున్నది. ఇంతకంటె వీరియందు అధిక పశుత్వ మేమున్నది? తోకలా?

ఈ వానరులకు తోక లున్నవని స్థాపించుటకు శ్రీశాస్త్రిగారికి ఆధారము ఆఫ్రికా, బెషూనాల్యాండులో దొరికిన పుఱ్ఱెయొకటిన్ని, బోర్నియో అడవిలో నున్న ఒకజాతి మనుష్యులు నట! అట్టి పుఱ్ఱెలుగల మానవ జంతు వొకటి యుండియుండవచ్చును. చిన్న చిటికెన వ్రేలంత తోక గలిగిన మానవజంతువులు ఉండవచ్చును. కాని ఆయాధారముపైన రామాయణమునందు వర్ణింపబడిన వానరులకు నిజమైన వాలము లున్నవని స్థాపించుటెట్లు? వారు మనుష్యులకును, కోతులకును మధ్యనుండి ఇప్పుడంతరించిపోయిన సృష్టియని చెప్పుటెట్లు? వీటికి అసలు గ్రంథమం దేమైన నాధారము లున్నవా?

వానరస్త్రీలకు తోక లెచ్చటనైనా వర్ణింపబడియున్నవా? యను ప్రశ్నకు ఉత్తరముగా వీరు ఉత్తరకాండలో వాలి సుగ్రీవుల యుత్పత్తి ఘట్టము వీరికి ప్రమాణము. ఉత్తరకాండ వాల్మీకి వ్రాసినది అవునా కాదాయని విద్వాంసులందరు సంశయించుచున్నదే. అట్టి సంశయాస్పదమైనది ప్రమాణ మెట్లగును? అదిగాక మరి యేకాండయందైనను వానరస్త్రీలకు వాలము లున్నట్లు చెప్పబడియున్నదా? ఇంతే కాదు ఉత్తరకాండలో వ్రాసియున్న కొన్ని యంశములు శాస్త్రపరిశీలనకు తాళవనిగూడ ముందుచూపబడును.

నిజముగా లేనితోక లున్నవని సమర్థించుటకు పుఱ్ఱెలు తోకలు వెతుకుటకన్న ఈ వానరుల భాషను, ఆచారములను వెతకి కనుగొని వాటివల్ల వీరిజాతినిష్కర్ష చేసిన బాగుండును. ఈ విషయమై శ్రీశాస్త్రిగారు కొంత చర్చ చేసినారు గాని పూర్తిగా చేయలేదని నా తాత్పర్యము. భూగర్భమునుండి బైలువెడలు ఎముకలు మొదలైనవస్తువులు సృష్టిచరిత్రము నెట్లు వెల్లడిచేయునో భాషలలో పాతుకుబడిన పదములుగూడ నట్లే మానవజ్ఞానాభివృద్ధిచారిత్రమును తేటపరుచును. కాన వానరభాషాన్వేషణము ఈ జాతి మానవులవిషయమై ఉన్న సంశయములను పోగొట్టగలదు.

కాని వానరభాష ఏదో కనుగొనుట కవకాశము లేదని శ్రీశాస్త్రిగారి నమ్మకము. శ్రీ మద్రామాయణము సంస్కృతములో వ్రాయబడియున్నది. అందులోనే వానరభాష వేరేయున్నదని చెప్పియున్నది. శ్రీఆంజనేయులవారు సీతతో మొట్టమొదట మాట్లాడ నుద్యుక్తులై యిట్లాలోచించును:

వాచం చోదాహరిష్యామి
మానుషీ మిహ సంస్కృతామ్,
యది వాచం ప్రదాస్యామి
ద్విజాతి రివ సంస్కృతామ్;
వానరస్య విశేషేణ
కథం స్యా దిహ భాషణమ్.

సుందర. ౩౦,౧౮-౧౯

దీనివలన వానరభాష యొకటి వేరే యున్నదని స్పష్టమగుచున్నది. అది ఏది? దానిని యెట్లు రామాయణము నుండి తెలిసికొననగును.?

గ్రంథము సంస్కృతమునం దున్నప్పటికి ఏప్రదేశమందున్న స్థలములు, ఆప్రదేశ భాషానామములతోనే చెప్పబడును. ఊరు, పల్లె మొదలైన ద్రవిడపదములు సంస్కృతములో వ్రాయబడిన అలహాబాద్ శాసనమునందు మార్పుచెందకయే, కొత్తూరు, ఏరండపల్లి అను నామములం దున్నవి. ఏభాషయందు మన దేశచరిత్రమును వ్రాసినను అలహాబాద్, ఆగ్రా,డిల్లీ మొదలైననామములు మారవుగదా! అటువలెనే గంగానదీ ప్రాంతమునుండి లంకవరకునున్న ప్రదేశములో చెప్పబడిన స్థలముల యొక్కయు మనుష్యులయొక్కయు పేరులు అచ్చట నివసించియుండు జనులభాషయందే యున్నవి. వాటియర్థమును, ఉత్పత్తిని బరిశీలించినవారు ఉంటే భాషయేదో తేలును.

ప్రతివస్తువుకున్ను ఉండేపేరు ఆవస్తువులో వ్యక్తమయ్యేగుణమును దెలుపునదే. ఇట్టివాటికే సార్థకనామములు. కావుననే ప్రతి నామమునకును పూర్వ వ్యాఖ్యాతలైతేనేమి కవులైతేనేమి అర్థముసాధించుటకుయత్నించిరి. దశగ్రీవుడంటే పదిమెడలవాడని, త్రిశిరుడంటే మూడుతలలవాడని, శూర్పణఖయంటే చేటలవంటి గోళ్లుగలదని, సీతయంటే నాగలని మొదలైన యర్థము చెప్పిరి. ఈయుద్దేశముతోనే 'వాలి' యనుపేరునకు తోకలోనుండి పుట్టినవాడని యర్థము చేసి దానిని స్థిరపరచుట కొకకథకూడ జెప్పినారు. కావున పేర్లవలన ఆపేరుగలవస్తువుకు ఆపేరువలన తెలియబడు గుణము ఆవస్తువందు బహుళముగా నుండునని మనపూర్వులు సహితము ఒప్పుకొన్నదే. మనముగూడ ఆధర్మము ననుసరించియే పరిశీలన చేసిన తప్పేమున్నది? దీనిని మనస్సునం దిడుకొని రామాయణమునందు చెప్పబడిన స్థలములయొక్కయు జనులయొక్కయు నామములను బరిశీలింతము.

అన్నిటికంటెను ముందు రావణుని ముఖ్యస్థానమైన 'లంక'యొక్క నామమును పరీక్షింతము.

'లంకా'యను పదముయొక్క అర్థమును నిఘంటువులలో జూచిన 'రావణుని ముఖ్యపట్టణమ'నియే యున్నదిగాని మరి యేమియు లేదు. మనదేశమందున్న భాషలన్నిటిలోను ఇదియే యర్థము. ఒక్క తెనుగులోమాత్రము 'లంక' లంటే చుట్టు నీటిచే చుట్టబడియుండు భూప్రదేశము. ఈయర్థమెట్లువచ్చెనో ముందు విచారింతము.

రావణుని పట్టణమునకు 'లంకా' యని పేరు బెట్టుటకు కారణమేమో? ముందుచెప్పినట్లు ఈనామము ఆస్థానమునందున్న బహిరంగగుణమును తెలియజేయవలెను. అట్టిగుణము రావణునిపట్టణమున కేదియున్నది? దానిని జూచినవారు దానిని వర్ణించుచు జెప్పినమాటలను బరిశీలించిన ఆగుణము వ్యక్తమగును. రావణుని పట్టణమును జూచిన విదేశీయులు ఇద్దరు దానిని జూచినతోడనే వీరికి తట్టినగుణమేమియో చూతము.

హనుమంతుడు దానిని జూచినవారలలో మొదటివాడు. ఆయన తిరిగివచ్చి రామునితో దానినిట్లువర్ణించెను. "శైలాగ్రే రచితా దుర్గా సా పూ ర్దేవపురోపమా"(యుద్ధ.3,3) పర్వత

శిఖరమందున్నదట ఆకాశసదృశము. అనగా చాలా ఉన్నతప్రదేశమందున్నదని యర్థము.

కొండపవాడు రాముడు. సముద్రమును దాటిన వెంటనే రావణుని పట్టణమునుజూచి లక్ష్మణునితో నిట్లు సెలవిచ్చినారు.

"ఆలిఖంతీ మి వాకాశ
ముదితామ్........
మన సేవ కృతాం లంకాం
నగాగ్రే విశ్వకర్మణా."

యుద్ధ. ౨౪-౯

అటు తర్వాత బాగా పరిశీలించుటకు సువేలాచలము నెక్కి యిట్లు చెప్పిరి.

"శిఖరం తత్త్రికూటస్య
ప్రాంశు చైకం దివిస్పృశమ్,
సమంతా త్పుష్ప సంఛన్నం
మహారజతసన్నిభమ్;
శతయోజన విస్తీర్ణం
విమలం చారుదర్శనమ్,
శ్లక్ష్ణం శ్రీమన్మహచ్చైవ
దుష్ప్రాపం శకునైరపి;
మనసాఽపి దురారోహం
కింపునః కర్మణా జనైః,
నివిష్టా తత్ర శిఖరే
లంకా రావణపాలితా."

యుద్ధ ౩౯-౧౭, ౨౦

త్రికూటముయొక్క శిఖరమునకు పక్షులుకూడ వెళ్లలేవట. మనస్సే వెళ్ళలేదట. అలాటిది పైకెక్కవలెనంటే ఏదైనా ఆధారము లేనిది యెక్కలేని మనుజునిమాట చెప్పనవసరమే లేదు. అంతయెత్తున నున్న శిఖరముపైని రావణునిపట్టణమైన లంకా యున్నదట. వీరిద్దరకుగూడ దాని ఉన్నతస్థితియే బాగా తట్టిన గుణము.

'అతివేగముగా యెక్కి వెళ్లుదు' నని సుగ్రీవుడు రామునితో చెప్పెను.

యుద్ధ. ౨-౫

ఎన్నడూ 'లంకా' నెరుగనివారికి చూచేసరికి తట్టిన గుణము ఔన్నత్యము.

దానిరాజైన రావణుడు సీతతో తనస్థానమువిషయమై చెప్పినప్పుడు గూడ తనపట్టణము పర్వతశిఖరముపై నున్నదనే చెప్పెను.

ఆర. ౫౭-౨౭

కాన 'లంకా' యను పదము వ్యక్తపరుచుగుణము ఔన్నత్యమయ్యే యుండవలెను. ఈయర్థమున సంస్కృత భాషయందు ఈపదమునకు వాడుక లేదు. మరి యేభాషలోనిదై యుండునో?

పంపాతీరమునందున్న 'శబరి' యను ముదుసలిదానికి రామకథలో నేమియుసందర్భమున్నట్లు గన్పించదు. సీత పోయినదని వెదకుచు దుఃఖించుచున్న రామునికి సీతజాడలు చెప్పువారు ముఖ్యముగాని గురుశుశ్రూషమొదలైన కబురులు అంత సందర్భముగా గన్పించవు. అయితే వాల్మీకివంటికవి ఈవ్యక్తిని యేలయిచ్చట జెప్పవలెను. అనగా ఈప్రాంతపుజనులజాతిని వెల్లడి చేయునిమిత్తమే ఈమె నిచ్చట చెప్పినట్లు గన్పించుచున్నది.

శబర భాషయందు 'లంకాఞ' అంటే 'ఎత్తు, మీద, పైన'యని అర్థము. పొడవాటి

మనుష్యుని 'లంకా మంత్ర' యందురు. మిరప కాయలు పొడవుగానున్న మిరియముగాన 'లంకా మిర్చ్' యందురు. ఎత్తైన చాపాటి కట్టు 'లంకా డాంగ్.'

'లంకాణ' శబ్దములో తుది నకారపొల్లు పోయిన 'లంకా'యని ఆకారాంతశబ్ద మగును. కాన నిది స్త్రీలింగ శబ్దముగా సంస్కృతమున వాడబడును. ఇది నామలింగాను శాసనము 3 వ కాండ 5 వ సర్గ 5 వ శ్లోకములో చెప్ప బడినది.

"స్త్రీ స్యా త్కాచి న్మృణాళ్యాది
ర్వివక్షాపచయే యది
లంకా శేఫాలికా టీకా
ధాతకీ పంచికాఢకీ."

వివక్షకొఱకు చెప్పినప్పుడు మృణాల్యాది శబ్దములున్ను అంత్యలోపము గలిగినప్పుడు కొన్ని శబ్దములు స్త్రీలింగము లగుచున్నవి. 'లంకా' అను శబ్దము వివక్షకొఱకైనదిగాదు. కాని అపచయమును బొందిన పదముగాన స్త్రీలింగమైనది. కాన ఈశబ్దమున కేదోలోప ము గలిగినదని స్పష్టపడుచున్నది. ఏమిలోపిం చినదో పైనజూచితిమిగదా! ఇందువలన నవర నామము సంస్కృతమునందుకొంతలోపమును బొంది 'లంకా' అయినదని స్పష్టమైనది.

రాక్షసులు కొండపై నున్నయెడల సమ తలప్రదేశమైన దండకారణ్యప్రాంత వాసులను హింసించుటెట్లు? ఆర్యులను బాధపెట్టి దాగొ నుటకుగాని, ఆత్మరక్షణ చేసుకొనుటకుగాని కొండదిగువ నొకస్థానము వీరి కుండవలె. అ ట్టిదే జనస్థానము. ఇచ్చట రావణుడు పదునా లుగువేల రాక్షసుల నుంచినట్లు చెప్పినాడు. (అర. ౩౬-౫౫)వీరలను రాముడు నాశనము చేసెనని తెలిసి బలశాలులైన రాక్షసులను ఎనమండుగురిని తిరుగా పంపించినాడు. (అర. ౩౮-౧౮, ౨౦) గాన జనస్థానము ఆర్యులతో దగ్గరగానుండి పోరాడుటకు రాక్షసులచే ఏర్ప రుపబడిన వలసయని స్పష్టమగుచున్నది.

జనస్థానమను పదమునకు జను లుండే స్థలమని యర్థము. ఆ జను లెవరంటే రాక్షస జనులు. ఇట్లుచూచిననూ కొండపైనున్న రాక్ష సులకు వలసఅయిన స్థాన మని కన్పించు చున్నది.

కొండలపైనున్న వారు పల్లపుప్రాంతముల కు దిగువ యని చెప్పుట సహజమే. విశాఖప ట్టణపు ఏజన్సీప్రాంతములయం దున్నవారు. విశాఖపట్టణము మొదలైన పల్లపుగ్రామాల కు వెళ్లునప్పుడు దిగువకు వెళ్లుదుమని చెప్పు దురు. తిరుపతికి వెళ్లువారు కొండదిగువనున్న పట్టములో బసచేసి మఱి కొండయెక్కవలెను. ఈ కొండదిగువ నున్న పట్టముకు దిగువ తిరుపతి యని పిలుతురు. కాన లంకలోనున్న వారికిది దిగువ. 'లంకా'యను పదము వచ్చిన భాషలో 'జైతాణ' అనగా 'దిగువ' సంస్కృ తములో 'జనస్థాణ' అని సులభముగా నగును.

ఈజనస్థానసామీప్యములోనే 'జటాయు' వనే యొకవ్యక్తి యుండెను. ఇతను 'పితృసఖా ఒహం' అని రామునితో జెప్పెను.

'ఉవాచ వత్స! మాం విద్ధి
వయస్యం పితు రాత్మనః.'
అర. ౧౪-౩

గాని రామునితండ్రికి తానెట్లు స్నేహితు డా
యెనో ఎచ్చటనూ చెప్పబడలేదు. సీతాన్వే
షణముకొఱకై వెళ్ళిన వానరులు సీతను గాన
లేక సముద్రపుతీరమున గూర్చొని దుఃఖించు
చుండగా, సంపాతి విని, "నాయనా! జటా
యువు దశరథున కెట్లు స్నేహితుడాయెను?"
అని ప్రశ్నించెను.

తస్యైవచ మమ భ్రాతు స్సఖా దశరథః కథమ్.
అర. ౫౬-౨౪

వానరులు దానికి జబాబు చెప్పక తిరిగి అలా
గుననే చెప్పుదురు.

"రామస్య తు పితు ర్మిత్రం
జటాయు ర్నామ గృధ్రరాట్."
అర. ౫౭-౯

దశరథునికి జటాయువునకు స్నేహము జరిగిన
ట్లెచ్చటనూ చెప్పలేదు. రామునికే ఇతను
విశేషస్నేహితుడు. సీతను రావణునినుండి
తప్పించుటకుతనప్రాణమునుగూడనిచ్చివేసెను.
కాన 'పితృసఖా' అనుదానికి ఏమిసందర్భము
గానరాదు. 'జటాయు' అనుపదమున కిది
అర్థమేమో. ?

నవరభాషలో 'యువ' అంటే తండ్రి;
'జటా'అంటే జట్టు. 'జటాలే' అంటే'జట్టుగా'
యని యర్థము. నవరఁలభాషలో 'ఆ' షష్ఠీవి
భక్తి ప్రత్యయము. ఇదిచేర్చిననూ 'యువా'
యనుపదముమారదు. కాన'జటా + యువా'
అనగా తండ్రికిజట్టు (వాడు); ఇది 'జటాయు'
అయినది.

ఆర్యులకు రాక్షసులకు కలహకారణ
మైన దండకారణ్యమువిషయమైచర్చచేతము.
దండకారణ్య మనగా దండునియొక్క అరణ్య
మని అర్థముదీసి దీని కీపేరు వచ్చుట కొకగాథ
ఉత్తరకాండలో జెప్పియున్నది. దండుడనే
రాజుడట పూర్వ మీ ప్రదేశము. శుక్రకూతు
నితడు చెరబట్టెనట. అది తెలిసి రాక్షసగురువు
దండుని శపించగా వానిరాజ్యమెల్ల జంతుజాల
రహితమై భస్మమయ మైనదట.

"సప్తరాత్రేణ రాజా ఽసౌ
సభృత్య బలవాహనః,
పాప కర్మ సమాచారో
వధం ప్రాప్స్యత దుర్మతిః.
సర్వసత్త్వాని యానీహ
జంగమ స్థావరాణిచ,
సర్వేషాం పాంసు వర్షేణ
క్షయః క్షిప్రం భవిష్యతి.
దండస్య విషయో యావత్
తావద్వ నసమాశ్రమమ్;
పాంసు భూత మివాకస్మాత్
సప్తరాత్రా ద్భవిష్యతి.
... ... ...
తదా ప్రభృతికాకుత్స్థ
దండకారణ్య ముచ్యతే."

జంతువులు, స్థావరములు లేవట; భస్మమయ
మైనదట. శ్రీమద్రామాయణమందు అరణ్య
కాండలో దండకారణ్య మెట్లు వర్ణింపబడి
యున్నదో పరిశీలించిచూతము. మొదట
ఈయరణ్య మెచ్చటనుండి ఎంతవర కున్నదో
తెలిసికొనవలెను.

అత్రిమహాముని యాశ్రమమును వదలి కొంతదూరము వెళ్లుసరికి దండకారణ్యా మారంభమాయెను.

"ప్రవిశ్యతు మహారణ్యం
దండకారణ్య మాత్మవాన్."
అర. ౧-౧

ఇచ్చటనుండి ప్రయాణము చేసిచేసి ఆశ్రమమునుండి యాశ్రమమునకు వెళ్లివెళ్లి తుదకు పంచవటిలో బసచేసియుండిరి. అచ్చట సీతను రావణుడు యెత్తుకొనిపోగా, సీతను వెదకికొనుచూవెళ్లి చావసిద్ధమైన జటాయువును జూచి అతనిని దహనము చేసి కొంతదూరము వెళ్లుసరికి దండకారణ్యము వదలి క్రౌంచారణ్యము ప్రవేశించినారట.

తతః పరం జనస్థానా త్త్రిక్రోశం
గమ్య రాఘవౌ;
క్రౌంచారణ్యం వివిశతు
ర్గహనం తౌ మహౌజసౌ."
అర. 3-౫

గాన అత్రి ఆశ్రమమునకు సమీపమునుండి జనస్థానము దాటి మూడుక్రోశములు దూరమువరకూ ఈదండకారణ్యము వ్యాప్తమైనది. ఈప్రదేశము యెన్నియోభాగములుగా ఋష్యాశ్రమములనుబట్టి విభజింపబడినది.ఒక్కొకభాగముయొక్క నైసర్గికరూపములను బరిశీలించిన మొత్తముపైన యావత్తు ప్రదేశముయొక్క నిజస్వరూపము తేలును.

మొట్టమొదటే యొక తాపసాశ్రమమున్నది. ఇదిట

"శరణ్యం సర్వభూతానాం
సుసమ్మృష్టాజిరం తదా,
మృగై ర్బహుభి రాకీర్ణం
పక్షిసంఘై స్సమావృతమ్."
అర. ౧-3

మృగగణములు, పక్షిసంఘములు ఫలవంతమైన ప్రదేశము గాకపోతే యెట్లుండ గలవు? దీని నతిక్రమించి వెళ్లగా విరాధుని కునికిపట్టైన యడవి యున్నది. ఇది.

"నానామృగ గణాకీర్ణం
శార్దూల వృక సేవితమ్.
ధ్వస్తవృక్షలతాగుల్మం
దుర్దర్శ సలిలాశయమ్."
నిష్కూజనానాశకుని
ఝిల్లి కాగణనాదితమ్."
అర. ౨-౨,3

ఈవర్ణన జూచిన వర్షాధికముగల ఉష్ణప్రదేశములయందుండే కికారణ్యముగా దోచుచున్నది. ఇచ్చట విరాధుని చంపి శరభంగాశ్రమమునకు వెళ్లిరి. ఇచ్చటనుండి వెడలిపోవుచుండెను. ఆవెళ్లుచున్న ప్రదేశములో పెక్కుయేళ్లను దాటెనట."

"స గత్వాదూర మధ్వానం నదీ స్తీర్త్వా బహూదకాః."

తరువాత ఒక పెద్దకొండ యున్నదట. దీనిని దాటి వెళ్లగా వివిధములగు వృక్షములు గల అరణ్యమును ప్రవేశించిరట ఇచ్చట సుతీక్ష్ణాశ్రమమున్నది. ఈప్రదేశములో అనేకులు

ఋషులున్నారట. మూలములకు ఫలములకు లోపము లేదట.

"అయమే వాశ్రమో రామ
గుణవా న్రమ్యతా మిహ,
ఋషిసంఘానుచరిత స్సదా
మూలఫలాన్వితః."

అర. ౭-౧౫

గనుక రామలక్ష్మణులు సీతతోగూడ నిచ్చటనే నివాసముండిరి. ఈచుట్టుపట్ల అనేకాశ్రమము లున్నవట. వాటిని జూచుటకు రామలక్ష్మణులు సీతతోగూడ వెళ్లిరి. ఈప్రదేశ మెటులున్నదంటే:

"ఫుల్లపంకజషండాని ప్రసన్నసలిలాని చ,
కారండవవికీర్ణాని మయూరాభిరుతాని చ;
సప్రాజ్యఫలమూలాని పుష్పితాని వనానిచ,
ప్రశస్త మృగయూథాని శాంతపక్షిగణానిచ."

అర. ౮-౧౩,౧౪

జలాశయములతో నిండి ఫలవంతమైన ఈప్రదేశములో పదివత్సరములు గడపెను.

"తదా సంవసత స్తస్య
మునీనా మాశ్రమేషు వై
రమత శ్చానుకూల్యేన
యయు స్సంవత్సరా దశ."

అర. ౧౧-౨౫

తిరిగి సుతీక్ష్ణాశ్రమమునకు వచ్చిరి. ఇంతకాలమూ వీరు తిరుగుచున్న నిర్మలోదకజలాశయములు నదులుసరస్సులు,కొండలపైనుండి కుప్పిగంతులు వేయుచు వచ్చుచున్న సెలయేళ్లతో నిండి ఫలవంతమై వాసయోగ్యమై యుండెనట

సుతీక్ష్ణునియొద్ద సెలవు పుచ్చుకొని అగస్త్యమహర్షి దర్శనము కొరకై దక్షిణముగా వెళ్లిరి. ఈమధ్యప్రదేశ మిట్లు వర్ణింపబడినది:

"స్థలీప్రాయే వనోద్దేశే పిప్పలీవనశోభితే;
బహుపుష్పఫలే రమ్యే నానాశకుని నాదితే;
పద్మిన్యో వివిధా స్తత్ర ప్రసన్నసలిలా శ్శివాః,
హంసకారండవాకీర్ణాశ్చచక్రవాకోపశోభితాః

అర. ౧౧-౪౦,౪౧

అగస్త్యాశ్రమము 'రమణీయే వనోద్దేశే బహుపాదపసంవృతే' యందున్నది. అగస్త్యుని సెలవుపడసి పంచవటికి వెళ్లి అచ్చట పర్ణశాల గట్టుకొనినారు. ఈస్థలమునకు సమీపముననే గోదావరి యనునది యున్నది. దీనికి సమీపములో ఖరుడు మొదలైనరాక్షసులు నివసించి యున్నస్థలము.

ఈప్రాంతమంతయు దండకారణ్యమని ఇదవరకే తెలిసికొంటిమి. ఈపైన ఉదహరించిన వర్ణనలవల్ల ఇది పశుపక్షిమృగాదులు లేని భస్మభూయిష్ఠమైన ప్రదేశము గాదనియు జలసమృద్ధిగలిగి ఫలవంతమైన గుల్మలతావృక్షాదులచేతను, పశుపక్షులచేతను నిండి జనులకు వాసయోగ్యమైన దేశమనియు తేలుచున్నది. 'ఉత్తరకాండలోని గాథకును దీనికిని ఎంతభేదమున్నది ? ఈరెండు ఒక్కవాల్మీకియే వ్రాసియున్న ఇట్టిభేద ముండునా? కాన అరణ్యకాండలోని వర్ణన వాల్మీకి వ్రాసినది.

ఉత్తర కాండలో జెప్పిన కారణము తప్పితే ఈప్రదేశమున కీపే రెట్లు వచ్చి యుండును?





1, బంగారు పూసలు. 2, రాతి పూసలు.
(ప్రక్కనుండు సంపుటమున దొరకినవి)



3. జేతవనమున నొక స్తూపమున నొకచో దొరకిన శల్యసంపుటము (Reliquary)



4 బోధిసత్వ విగ్రహముయొక్క పీఠము. జేతవనమున నున్న యొక స్తూపమున దొరకినది





2 శాలవస్తికుత్తరమున కశ్యపగ్రామమున దొరకిన శల్యనిధానము.



3 జలపాత్రము జేతవనమున దొరకినది



1 జేతవనములోని యొక పతకము మట్టితోఁజేయఁబడినది.

పైనజూపిన వర్ణనలవల్ల దండకారణ్య ప్రదేశములో జలసమృద్ధి గలిగినట్లు స్పష్టముగా నగుపించుచున్నది. కాన దీనిపేరు ఈస్వభావమును దెలుపునదై యుండవలెను.

సవరభాషలో "దాఁ" అనగా నీరు; 'డాక్' అనిగూడ నందురు. సవరభాషా సంబంధములైన మూండారీ మొదలైనఅన్ని భాషలలోనూ నీటికి 'డాక్' అనియే అందురు. విశేషము నీరు అని చెప్పుటకు దాఁ-డాక్. విశేషపలచన యనిచెప్పుటకు 'పలపలాచన' అనిచెప్పినట్లుగానే 'దఁ-డాక్' అగును. దీనికి షష్ఠీవిభక్తి ప్రత్యయమైన 'ఆ' చేర్చిన 'దండకా' అగును. ఇది 'విశేషనీటియొక్క' యని అర్థమగును. దండకా + అరణ్యముఅంటే విస్తారము నీరుగలిగిన అరణ్యమని యర్థము. ఈయర్థము పైవర్ణలకుసరిపోవుచున్నది. కాన 'దండకా' అనేది సవరభాషనుండిఉత్పన్నమైన పదము.

క్రౌంచారణ్యము దాటి వెళ్లగా 'కబంధుడ'ను రాక్షసుడు గనిపించెను. వీనికి సహజమైన గుణము లేమీ కనపడవు. కాని ఈ పేరు 'బండ' అనుపదముతో సంబంధించినట్లు కనబడుచున్నది. తెనుగులో 'బండ' అంటె పెద్దరాయి. తెలివిలేని మనుజునకు 'బండముండాకొడు'కని అనుట వాడుకైయున్నది. సవరభాషలోగూడ ఈపదము ఉన్నట్లు ప్రస్తుతము దొరకు వాక్యావళీలు (Vocabularies) లో నగుపడకపోయినప్పటికి కొన్ని స్థలనామములలో ఈమాట కనిపించుటవల్ల సవరలు గూడ నీపదమును ఈయర్థముతో వాడినట్లు కనిపించుచున్నది. కావున వాడలో వక్షముగా పీడుంచుటవల్లనూ, ఇతడొకడను జోవువారికి కష్టము గలుగజేయువాడగుటవల్లనూ, తండను గోయి త్రవ్వి తిరుగ ద్రోయబడినవాడగుట చేతను వీనినామము 'బండ' యనుదానితో సంబంధించినట్లు కనబడుచున్నది.

వీనివద్దనుండి రామలక్ష్మణులు పంపాతీరమునకు వెళ్లిరి. పంపాసరస్సులో వెన్నముద్దనంటిపక్షు లున్నవని కబంధుడు చెప్పినాడు.

"ఘృతపిండోపమాన్ స్థూలాం
స్తాన్ ద్విజాన్ భక్షయిష్యథః."
అర. ౭౩-౧౪.

ఇవి భయము నెరుగవు గాన మనుష్యులను జూచి యెగిరిపోవట.

"నోద్విజంతే నరా న్దృష్ట్వా
వధస్యాకోవిదా శ్శుభాః."
అర. ౧౩-౧౪.

ఇవి ఎన్నడూ కొట్టబడుట నెరుగకపోతే 'మీరు తినెద'రని కబంధు డెట్లు చెప్పగలుగును? అచ్చటివారు వాటిని చంపి తినకపోతే వాటిని తింటారని యెట్లు చెప్పెను. కాన మనుష్యులను జూచి భయపడి యెగరిపోలేవంటే యెగురశక్తిలేదని మృదువుగా చెప్పుటయే. ఇట్టిపక్షులు మరెచ్చటనూ ఉండినట్లు చెప్పలేదు. గాన ఈపంపాసరోవరము ఈపక్షులకే యునికిపట్టు. కాన ఈపక్షులనుండి ఈసరస్సుకు పేరొచ్చి యుండవలెను.

పక్షుల వర్ణమునుబట్టి చూడగా నివి బాతులవలె దోచుచున్నది. వెన్నముద్దలవలె

స్థూలముగా నుండి యెగురలేని పక్షులు బాతులే. సవరభాషలో బాతుకు 'పపారా' అందురు. ఇతర ముండారీభాషలలో హంస యను సంస్కృతపదమునే యవలంబించినారు. కాని ఒక్క సవరభాషలోమాత్ర మీమాట ఇంకనూ నిల్చియున్నది. ఈ 'పపారా'యే 'పంపా' అయినట్లు తోచుచున్నది. ఏమనగా సంస్కృతపదము 'హంస' ఈ'పంపా' పదము. 'హంస' ఈ'పంపా' పదమునుండి ఉద్భవించినది. కొన్ని భాషలలో 'ప' అనుశబ్దమునకు బదులు 'హ' వాడుట గలదు. విశాఖపట్టణపు కొండలలోని దేశీయులు 'పాణి'-తెనుగు నీరుకి 'హాణీ' అందురు. కన్నడములో 'ప'కుబదులు 'హ' ఉపయోగించుట అందరికీ తెలిసినదే. కాన'పంపా', 'హంపా' అయినది. దీని వికల్పమే. 'హంపి' కన్నడదేశములోని ఒకస్థలమునకు పేరు. ఈ పేరుండుట బట్టియే 'పంపా' అక్కడనే యుండెనని జనవాడుక. 'హంప' పలుకుటకు కష్టమని 'హంస' అయినది. చూడగా 'పపారా' లోనుండి 'హంస' ఉద్భవించినట్లు తోచుచున్నది. (సశేషము)



# పండ్లబేరము

[లోహితశర్మ]

వాడు కాలకించి, వారడి కనిపెట్టి, విత్తనాలు, విలువ, వినికిచూచి
వాలువీలుగలుగు, వర్తకమనిసేతు, నమ్మకాలు, మాటనమ్మకాలు.

ఉ. బోజనసేతురా ? రుచికిపూ చిది సీమపసందు, పాదిరీ
"రాజు"కు టోపిమేసి, మనరావుదొరో ర్లోకయంటు దెచ్చి మా
మోజుగ పెంచిరండి, నలుమూలల బాకినదండి, నేనురి
వ్యాజుగ నేట గుత్తగొని, వందలు మేలును దెచ్చి గొప్పమా
రాజులకమ్మి నాలుగువరాలు గణించి బరింతు పొట్ట, ఆ
వాజిబినాశమై పలుకబారని బెట్టలు తట్టకెత్తి, యే
నాజుకు పేరొ పెట్టుకొని నాసి రకాలను సొమ్ముచేసి, ఆ
రోజుకురోజు కాయికము రోతనిపించిరి బేరగాళ్లిలె
క్కా జమ లేదు, గొప్పయదికారులముందట, "దచ్చికోరరీ
వాజలు, మాట లమ్ముదురు వట్టిదగా" యనిపించి, రాళ్లతో
యేజత సెయ్యకండి, సిసలే, యసలే నసలేని జాతులే.

సీ. కుళ్లుమాటనరాదు కొమ్మంటుమచ్చండీ, పట్టితే రసముట్టి పడుసుమండీ
మూసూసి మొగమిట్టె ముడుచుతారేమండీ, కడిగితే సొనకంపు కానమండీ
ఇమ్మపైకాసింత చిలికితే తెలదండీ, కొసముట్ట దీనకుండె కసరకండీ
పింపుట నసీలేక పిసరంతజీడండీ, పట్టియెంచిన మాకు కట్టదండీ
ఆ. అది తయారుకాని యాకుచాటుది కొద్ది, గొప్పటెంక పుల్పు తప్పదండీ
కొసరకండి మీరుకొనని తినని బేర, మొంపుకండీ, గంపయెత్తిపొండి.

సీ. సీమపసందంట్లు చెమటూడిచి గణించి, నదరైన-చోటుల కుదురుచేసి
యేజాతి కాజాతి యేరి సూటిగ నాటి, మఱచిపోకుండగా గుఱుతు లుంచి
పరగదపసినోళ్ల బడకుండ కట్టుబా, టులుచేసి దిష్టిబొమ్మలు తగిల్చి
వాడి నీరసమైన జాడ తోచినతోనె, సరసపుష్టిగ పోటిజంటచేసి
ఆ. పెంచినోరు జాతి మంచిచెడ్డలుచెప్ప, గలరుగాని గుత్తగాళ్లు కాడ
తెచ్చిమారుధరకు తెగనమ్మమాకేల, చెట్టులేక, ఆటి పుట్టకేల?

సీ. ఇసలాముతోటలో నిమ ముద్దినుపసందు, జట్టిచేసిన సుబ్బిశెట్టిగనుడె
బంగాళసరుకని బంగిని పిల్లితో, ముంచెత్తు సత్తెయ్య మంచివాడె
కలకటేరంటులు కలగల్పుతో డబ్బు, దోచెడి రెడ్డెయ్య దొడ్డవాడె
పెదరసాలనిపేరు పెట్టి గడించునా, రాయుడు శానగరానమనిసె
ఆ. అయినసరుకుతెచ్చి, అసలు దరలకిచ్చి, పలుకుబడినిగన్న పాతకాపు
పిలిచియివ్వగానె పలచనై పోనాడు, మాయకాలమూర మాయపజలు!

సీ. సీమంటు లనగానె మామిళ్లపిల్లి వో, రిరుచుకుపడి బుట్టవిప్పసీరు
నాటురకాలంటె నోటబెట్టరు రావు, వోరు సీమరకాల కూరుతారు
చచ్చొచ్చుపుచ్చు సీమసరుకంటె తమకచ్చు, పాటని కొంటారు కూటమోరు
సీమపళ్లెప్పుడు చీకుతోనుంటారు, అంతగొప్పో రుపాద్యాయులోరు
ఆ దేశవాళి శాన తీపంట, గొప్పంట, సీమజాతి వట్టిజీడిదంట
మీరు తెలిసినోరు, ఆరుపుల్లాయలా, శానబేర, మింక సాగిపొండి.





# శ్రావస్తి

(ఒక ప్రసిద్ధపురాతన బౌద్ధనగరమును తత్సంబంధమగు కొన్ని కథలును)

కే. నరసింహాచార్యులు గారు

శ్రావస్తి బౌద్ధులచరిత్రయందు సుప్రసిద్ధనగరములలో నొకటి. ఇది యుత్తరకోసలదేశములో అయోధ్యానగరమునకు ఉత్తరమున సుమారు 56 మైళ్లదూరమున నున్నది. దీనికి ఉత్తరపుటెల్లయై ప్రవహించుచుండిన 'రప్తి' నది, శిథిలావస్థ నొందిన తర్వాత నీనగరమునంటి ప్రవహింపనొల్లక కాబోలు తనమార్గమును మరింత యుత్తరమునకు ద్రిప్పుకొని ప్రవహించుచున్నది. ఆకారమున శుక్లపక్షసప్తమినాటిచంద్రునిబోలిన యీనగరమునకు, వ్యాసము కొంచెము లోపుగలిగి, 11/3 మైళ్లపొడవై, 'రప్తి' నదియొక్క పూర్వమార్గమునకు సమాంతర (Parale) మై యొప్పుచున్నది. నగరముయొక్క చుట్టుకొలత సుమారు 3¼ మైళ్లు. నగరముయొక్క యావరణము ప్రస్తుతము 25 అ. మొదలు 50 అ. వరకు భేదించుచుండు ఎత్తు కలదై కానుపించుచున్నది. ఈశాన్యమున 'రప్తి' నదియు, తక్కినభాగముల కొకయగడ్తయు రక్షకములై యుండియుండవలెను. ఆవరణము పొడవునను ననేకద్వారములును, బురుజులును యుండినట్లు చిహ్నములు కలవు. బుద్ధునికాలమున నత్యున్నతస్థితియందుండి ఆయనపాదధూళివల్ల పవిత్రమయిన శ్రావస్తినగరము బుద్ధునియనంతరము 11వ శతాబ్దమునాటికి మిక్కిలి క్షీణించి శిథిలమై వైశాల్యమునందు చిన్నదై యుండినందున ఉత్తరహిందూస్థానమున క్రీ. శ. 637 సం॥న యాత్రసల్పిన చీనాదేశయాత్రికుడగు హి. వెన్‌త్సాంగ్ ఈప్రదేశమును దర్శించి అప్పుడు దీనిని నగరమని చెప్పుటకు వీలుపడక శిథిలావస్థయందుండు 'అంతఃపురమని' లేక 'రాజభవన' మని వర్ణించెను.

2. శ్రావస్తి పురాణప్రసిద్ధి జెందిన నగరము గూడనైయున్నది. సూర్యవంశమున జన్మించిన పదియవరాజగు యువనాశ్వునిపుత్రుడు శ్రావస్తుడు దీనిని నిర్మించెను. వాయుపురాణమున నీనగరమును శ్రీరాముని పుత్రుడగు లవుడు పాలించెనని పేర్కొనబడియున్నందున నిది ఆయుగమునం గూడ అయోధ్యారాజ్యములో జేరినదై యుండెనని తెలియుచున్నది. మరల నీనగరము భారతవర్ష రంగస్థలమున పునర్నిర్మితమై ప్రవేశించినపుడు మహాకోసలుడను రాజుయొక్క కుమారుడు ప్రసేనజిత్తుని ముఖ్యపట్టణమై యుండెను. ప్రసేనజిత్తు బౌద్ధమత మవలంబించి బుద్ధుని కాప్తమిత్రుడును ఆదరువునై యుండెను. కాని ప్రసేనుని కుమారుడు విరూఢకు డనువాడు శాక్యవంశద్వేషియై వారి రాజ్యనాశనము కావింప బద్ధకంకణుడై తన్మూలమున తానుగూడ నశించెను.

3. మరలకాలయవనికాభ్యంతరితమై శ్రావస్తి కనిష్కునియనంతరము ఒకశతాబ్దము తర్వాత ననగా బుద్ధునికి 5 శతాబ్దములు వెనుక విక్రమాదిత్య పాలితమగుచు ప్రపంచనాటకమున గనబడుచున్నది. విక్రమాదిత్యుడు బౌద్ధమతద్వేషి. ఇతనికాలమున బౌద్ధగ్రంథమగు విభాషశాస్త్రకర్తయగు మనోర్హితుడు మతవాదమున బ్రాహ్మణులచే పరాజితుడై యాత్మహత్య కావించుకొనెను. విక్రముని యనంతరము మరల మనోర్హితుని శిష్యుడు వసుబంధునిచే బ్రాహ్మణులు లోడింపబడిరి. తదనంతరము అనగా క్రీ. శ. 275–319వరకు శ్రావస్తి మగధలోని గుప్తవంశపురాజులకు లోబడియుండెను. గుప్తుల క్షీణ

యిశతో శ్రావస్తియు క్రీ. శ. 4000 మొదలు క్షీణదశను పొంద నారంభించెను.

4. శ్రావస్తి యుండినప్రదేశమునకు ప్రస్తుతము సాహెత్ మాహెత్ అని పేరు. ఇందు మాహెత్ శ్రావస్తినగర ప్రాకారములోని భాగమును, సాహెత్ నగర బహిఃప్రదేశమున జేతవనమను భాగమును నైయున్నది. జేతవనమునకు పోవలెనన్న శ్రావస్తియొక్క నైరృతి మూలనున్న ద్వారమునుండి సుమారు $\frac{1}{2}$ మైలు పోవలెను. నగరమున నంతటను ననేక స్తూపములును ఆలయములును, కూపములును ఉండినట్లు వాటిశిథిలీభూతభాగములు కలవు. ఇందు ముఖ్యమైనవి రాజగు ప్రసేనజిత్తుని భవనము, మంత్రియు, జేతవననిర్మాతయు, అనాథ పిండదుడను సార్థక నామాంతరముగల సుదత్తుని గృహస్తూపములు, అంగులీమాల్యుల స్తూపము జేత వనము, గంధకుటి, కోశాంబకుటి, శోభనాథా(జైనా) లయము, ఇంకకొన్ని కూపములును నైయున్నవి.

5. జేతవనము హిందూదేశమున మిగుల ప్రసిద్ధిచెందిన అష్టబౌద్ధవనముల (ఆలయములు)లో నొకటియై యుండెను. దీనినిగురించి చిన్నకథ సింహళచరిత్రలలో నీకీతి వ్రాయబడియున్నది.

బుద్ధుని జీవితకాలమున శ్రావస్తికి ప్రసేనజిత్తుడు రాజైయుండెను. ఆయన బౌద్ధుడు. మీదు బుద్ధునికాప్త మిత్రుడును శిష్యుడునైయుండెను. అట్టిరాజునకు సుదత్తుడను మంత్రి యుండెను. సుదత్తుడు దయార్ద్రహృదయుడు, గొప్ప దానశీలుడు. అనాథజనుల కెంతయు పోషకుడునై యుండినందున నితనికి అనాథపిండదుడను సార్థకనామము కలదు. ఇతడుకూడ బుద్ధశిష్యుడు. శ్రావస్తియందు జేతుడను రాకొమరునికి ప్రీతిపాత్రమగు వన మొకటియుండెను. ఆవనము 1000 మూరలు పొడవును అంతియ వెడల్పును గలది. బౌద్ధుని గౌరవార్థముగా నొకగొప్పమఠమును కట్టించవలయునని సంకల్పించుకొని సుదత్తుడు దాని కనువగు ప్రదేశము నరసి మరియెందునుకానక తుదకీజేతునివనమును తనకియ్యమని కోరెను. ప్రాణసమానమగు వనమును ఇతరుల కిచ్చుట కిష్టగించనివాడై దుస్సాధ్యమగు మూల్యమును గోరిన యొడల వనమును కొననాశను వదలుకొందురను నూహచే తోటయంతయు నేలనుపూయుటకు కావలసినన్ని 'మసురణము' (బంగారునాణెము) లను మూల్యముగా కోరెను.

ఎంతగొప్పమూల్యమునైన నిచ్చుటకు సిద్ధముగా నుండిన సుదత్తుడు మూల్యమునకు వనమును ఇచ్చెదనని జేతుడుచెప్పగానే ధనమును తెచ్చి తోటలోనియున్ని చెట్లను పెకలించినాణెములను నేలపైపరపించెను.(మామిడి, చందనముచెట్లనుమాత్రము పెకలింపక విడిచెను.) అట్లు పరచిన నాణెములు సుదత్తు (అనాథపిండదుని) కోశాగారము లేడింటినుండియు దీయబడె 18 కోట్లు కెక్కు డయ్యెను. ఇంతతో వెనుదీయక పెల్లగింపక విడిచిన వృక్షముల స్థలమునుగూడ లెక్కకు దీసికొని పూర్తిస్థలమునకు కావలసిన ధనమునుగూడ కోశాగారమునుండి దీయ నాజ్ఞాపింపగా జేతు డానందాతిశయమున మేను మరచి బుద్ధునియందొక నూతనగౌరవ మంకురింప సుదత్తునితో ధనకాధన మక్కర లేదనియు తనవనమును ఉచితముగా నిచ్చెదననియు జెప్పెను. కాని మొదట చెప్పిన ప్రకారము మాట చెల్లించుకొనక తీరదని సుదత్తుడు ధనము నిచ్చి వనమును దిసికొని యందొక విహారమును మఠములను గట్టించెను. విహారమును జుట్టి గురువులకు నివేశనములును పుష్పఫలయుతములగు వనములును కలవు. జేతవనమునుచుట్టి 18 అ. ఎత్తుగల ప్రాకారము కలదు. ఈ ప్రాకారమునకు చేరి వెలుపలకూడ ననేకవిహారములు, వనములు, తటాకములు వేర్వేరు ప్రాకారములతో గూడుకొనినవి కలవు. సుదత్తనిర్మితమగు నీవనమునకు మరింత శోభ నిచ్చుటకు జేతుడు తనవనమును విక్రయించిన ధనమంతయు వెచ్చించి జేతవనమునకు నలువైపులను ఏడంతస్తుల మేడలను కట్టించెను. ఈ మేడల యందన్నింటిలోను అహోరాత్రములు తెరపిలేక ధూపదీపములు శోభిల్లుచుండెడివి. జేతవనమున (అనాథ పిండదవనమున)కు తూర్పునను ఉత్తరమునను రెండు ద్వారములు కలవు. ఇందు తూర్పుద్వారమునకు రెండు ప్రక్కలను * 70 అ. ఎత్తు స్తంభము లుండినవట. ప్రస్తుతము వీటిపటములుమాత్రము నిలిచియున్నవి.

---

* హియెన్‌త్సాంగు లిఖితమగు గ్రంథమున నిట్లు వర్ణింపబడియున్నది.

జేతవనవిహారమున నొకచోట బుద్ధుని గొప్ప విగ్రహము (చందనపుగ్రానితో జేయబడినది) ఒకటి దొరకినది. ఈవిగ్రహము బోధిసత్త్వునిదనియు, పుష్పసు, సింహమిత్రుడను, బలత్రిపిటకుడు అను మువ్వురు సన్న్యాసులచే సమర్పింపబడినదనియు ప్రదేశనామము శ్రావస్తియనియు విగ్రహపీఠముపై లిఖితమైయున్నది.

5. అనాథపిండదవనమునకు ఈశాన్యముగా పైజెప్పబడిన స్తంభములకు ఉత్తరమున మరియొకస్తూపము కలదు. దీనికి సంబంధించిన శిథిలములు 24½ అ. ఎత్తు కలవియై యున్నవి. ఇటుకలు పూర్వకాలపు పద్ధతి ననుసరించి యొక్కొక్కటి 24 × 10 × 3½ పరిమాణము కలవిగా నున్నవి. (ప్రస్తుతకాలపు ఇటుకకన్న 13 రెట్లు పెద్దవి.) బుద్ధుడు ఒకానొకవ్యాధిపీడితుడగు భిక్షుని శరీరమును సమ్మర్దించి వ్యాధి నివారణ గావించెను. భిక్షుండు వ్యాధిబాధితుడగుటను చూచి బుద్ధుడు అతనికి గల బాధ యేమని యడిగెను. భిక్షుండు తాను పూర్వము వ్యాధిగ్రస్తుల జూచి వారి కేవిధమగు సహాయమును జేయక కఠినహృదయుడై యుండినదానిఫలిత మిపుడు తానే రోగపీడితుడైన కాలమున పరిచరించువా రొక్కరైన లేక బాధపడుచున్నట్లు దీనముగా దెలుపుకొనెను. బుద్ధుడు భిక్షునిపై గనికరించి వాని శరీరమును పవిత్రకరములచే స్పృశించిన మాత్రమున వాడు రోగనివారితుడయ్యెను. పిదప భిక్షుని నొకక్రొత్త చాపపై గూర్చుండ నియమించి స్నాతుని గావించి నూతనవస్త్రముల నొసగి యుపచరించెను. ఈయుదార కృత్యముయొక్క జ్ఞాపకార్థ మీస్తూపము కట్టింపబడెను.

6. బుద్ధుడు శ్రావస్తికి విచ్చేసినపుడు అచట శారిపుత్రుడను న్యాయాధికారి యొకడు మహాజ్ఞానియు దైవజ్ఞుడును ఉండెను. బుద్ధుడు శ్రావస్తివెలుపల 'అనవతప్త' సరపరిసరమున దేవమానుషగణపరివేష్టితుడై సభ గూడియుండెను. ఆసభకు శారిపుత్రుడుమాత్రము గురువుల సభకు పోవునపుడు ధరింపవలసిన వస్త్రములను సవరించుకొనుచుండినందున వ్యవధి చాలమి సకాలమునకు రాజాలడయ్యెను. బుద్ధుడు శారిపుత్రుని దోడ్కొనిరమ్మని తన శిష్యుడు ముద్గలపుత్రుని పంపెను. శారిపుత్రుడు తాను గురువులగోష్ఠిని దర్శించుటకు యోగ్యమగు వస్త్రాదుల ధరించుకొనుచున్నానని కొంచెము తాళుమని చెప్పినను వినక ముద్గలపుత్రుడు వానిని యనవసరపడుచు శీఘ్రముగా రానియెడల శారిపుత్రుని వానిగృహముగూడ తనయోగబలమువల్ల గొంపోవువాడ నని గర్వముతో బలికెను. అంతట శారిపుత్రుడు తననడుముపట్టను క్రిందబడవైచి 'నీవు దీనిని కదల్పగలిగినయెడల నన్నును కదల్పగలవు' అని ధైర్యముగా బదులుచెప్పెను. ముద్గలపుత్రుడును తన మానవమంత్రబలమును వినియోగించి యీపట్టను కదల్పజూచెను. కాని యతనివలన కాలేదు. ఇట్లువ్యర్థప్రయత్నుడై నిట్టూర్పులు నిగుడించుచు బుద్ధునిసన్నిధికి వచ్చునప్పటికి అంతకుపూర్వమే శారిపుత్రుడు సభ నలంకరించియుండెను. అప్పుడు ముద్గలపుత్రుడు మంత్రబలముకన్న జ్ఞానబల మెక్కుడయని యెప్పుకొనెను. ముద్గలపుత్రుడు శారిపుత్రునినడుముపట్టను కదల్పజాలక భగ్నప్రయత్నుడైన స్థలమున నొకస్తూపము కలదు. ఇది అనాథపిండదవనమునకు వాయవ్యమున నున్నది.

7. ద్రోణోదనుడను రాజునకు దేవదత్తుడను పుత్రు డుండెను. బుద్ధునిసమకాలికుడు, మిక్కిలిగర్వి, అసూయాపరుడు నగు నీదేవదత్తుడు 12 సంవత్సరములు ప్రయాసపడి న్యాయశాస్త్రములోని 80,000 శ్లోకములను కంఠస్థములుగా జేసికొనెను. తర్వాత బుద్ధునికి గలగౌరవమును ప్రాముఖ్యమునుచూచి యోర్వలేక బుద్ధునికిగల యోగ్యతయు, విద్యాబుద్ధులును శిష్యగణమును తనకు గూడ నున్నందున తానును బుద్ధునియంతవాడ ననియు, బుద్ధునిబోధలన్నియు నబద్ధము లనియు, అనాదరణీయము లనియు బోధింపసాగెను. ఇందులకు ప్రతిగా బుద్ధుని శిష్యులగు శారిపుత్ర, ముద్గలపుత్రులు లోకమందంతయు బుద్ధునియోగ్యతల గురించియు న్యాయమును ధర్మమును గురించియు బోధించుచుండిరి. దేవదత్తుడును తననునోరగ మీడేరమి నీర్ష్యగలవాడై బుద్ధుని చంపుటకై తన నఖములయందున విషము నిడికొని చాలదూరమునుండి శ్రావస్తికి బుద్ధునికి సానుభూతి యొసగు నెపమున కపటముగా వచ్చెను. కాని మార్గమున భూమియందు గహ్వరమొకటియేర్పడి దేవదత్తు డాకూపమున బడిపోయెను. ఈకూపము జేతవనమునకు తూర్పున 250 అ. దూర

మున కలదు. దీని పొడవు 600 అ. వెడల్పు 250 అడుగులు. 1వ పటము చూడుడు.

8 నేలకు త్రుంగిపోయిన స్థలమునకు దక్షిణముగా 200 అ. దూరమునకు తామరపూవు వంటి తటాకము కలదు. ఇచ్చట కుకాళీయను దేవదత్తుని శిష్యురాలు బుద్ధుని అపకీర్తిపాలుగావింప నిలచినందున నరకకూపమున బడెను. ఈకూపమునకు దక్షిణమున 2000 అ. దూరమున 600 అ. పొడవును, 400 అ. వెడల్పునుగల చించామాణవికకూపము కలదు. బుద్ధుని యపవాదపరుచుటకై యతనివిరోధులు చించామాణవికయను స్త్రీని పంపిరి. చించామాణవిక కొయ్యనొకదానిని కట్టుకొని గర్భిణీ వేషము దాల్చి బుద్ధుని పరివేష్టించియుండు జనమును సమీపించి "నీవెంతో గొప్పగా నెంచిపూజించు బుద్ధుడు నాతో రమించెను. అతనిబీజమునే యీ నాగర్భమున ధరించియున్నాను" అని కేకలువేసెను. పామరులీవార్త సులభముగా నమ్మిరి. జ్ఞానులుమాత్రము నమ్మరైరి.

ఇట్టిసమయమున పామరుల మూఢ్యమును దొలగించి నిజమును వెల్లడిసేయనెంచి శక్రుడు తానొక శ్వేత మూషకాకృతిదాల్చి యాబ్రాహ్మణస్త్రీ గర్భమున గట్టుకొనియుండిన కొయ్యకట్లను త్రెంచి క్రిందబడ జేసెను. అంతట జనులంత కీయపవాదు మబద్ధమని తెలిసి నందున మిక్కిలి నానందించి బుద్ధుని మరింతగొనియాడిరి. తత్క్షణమే యచ్చట నేర్పడిన భూగహ్వరమున బడి చించా, "అవీచీ" నరకకూపమున బడెను.

వర్షఋతువునందు తక్కిన కూపతటాకాదులు నిండి పొరలి పారుచుండినను, పైన పేర్కొనబడిన దేవదత్త, కుకాలీ, చించాకూపములు మాత్ర మొక్క బిందువైన నిలువక యింకిపోవుటవల్ల నివి మిక్కిలి యగాధములని తెలియుచున్నవి.

9. జేతవనమునకు తూర్పున నతి దూరమున రెండు ఆలయములు కలవు. ఇందొకటి బౌద్ధాలయము. * దీనియున్నతి 60 అడుగులు. దీనియందు బుద్ధుని విగ్రహ మున్నది. ఈవిహారమునందు ప్రాచ్యమున బుద్ధుని పాదముద్రలతో సత్యగాత్రము కానవచ్చుచుండెను. రెండవది బ్రాహ్మణుల ఆలయము. ఈ దేవళము బౌద్ధవిహారమునకు తూర్పున నున్నది. సూర్యు డుదయించినప్పుడు బ్రాహ్మణుల దేవళపునీడ బౌద్ధవిహారముపై బడదు. సూర్యు డస్తమించునప్పుడు బౌద్ధుల విహారపునీడ బ్రాహ్మణుల దేవళముపై పడును.

10. బ్రాహ్మణాలయమునకు 3500 అ. తూర్పున విశాఖాస్తూపము కలదు. విశాఖాదేవి శ్రావస్తిలోని యొక ధనవంతుని కుమార్తె; ధనంజయనాముని పుత్రిక. 15 సం. ప్రాయమున నీదేశవాసులలోని మిగారుడను మరియొక ధనవంతుని పుత్రుడగు పూర్ణవర్ధనుని విశాఖాదేవి వివాహమాడెను. పదారి నామె బౌద్ధమతమునే యవలంబించియుండెను. ఈమె తనశ్వశురుడగు మిగారుని బౌద్ధుని గావించెను; కాన 'మిగారమాత' యను నన్వర్థనామమున నొప్పుచుండెను. నూతనబౌద్ధమతావలంబినులగు స్త్రీలకు బోధకురాలై యుండెను. తనయంత్యకాలమున బుద్ధునిగౌరవార్థము ఒకవిహారమును గట్టింపదలచి తనయాభరణముల నమ్మజూచెను; కాని వాటిని గొనదగు ధనవంతు లెవ్వరును లేనందున నగరమునకు తూర్పున గల వనము నొకదాని ప్రతిగా దీసికొని యచ్చట నొక గొప్పదియు ప్రసిద్ధమునగు విహారమును కట్టించెను. దీనికి పూర్వారామమని పేరు.

11. పూర్వారామమునకు సమీపమున నొకస్తూపము కలదు. ఇట విరూఢకుడు 500 శాక్యకన్యలను చంపించెను. ప్రసేనజితుడను శ్రావస్త్యధీశుడు శాక్యుల చుట్టరిక మభిలషించి తనకొకకన్య నిమ్మని వారినికోరెను. శాక్యులు తమకులగోత్రములకు తక్కువవాడని ప్రసేనజితునికి ఒకహీనకులజయగు కన్యను వేషవిధమున పరిణయము కావించిరి. ప్రసేనజితుడును ఆస్త్రీని పట్టమహిషిగా నేలుకొనుచుండెను. కాలక్రమమున నామె విరూఢకుడను కుమారుని గనెను. విరూఢకుడు తనమాతులులగు శాక్యులనగరమునకుపోయి విద్యనభ్యసించగోరె-

* ఈవ్యాసమున పేర్కొనబడిన ఆలయములు ప్రస్తుతమున నామమాత్రావశిష్టములై వాటి పునాదులును కొన్నికొన్నిచోట్ల వాటి కుడ్యములు మాత్రము నున్నవి. వర్ణనలును, కథలును చీనాదేశయాత్రికు డగు హ్యూయెన్‌త్సాంగ్ చే చూడబడి, వర్ణింపబడినరీతి, ననుసరించి వ్రాయబడినవి.

గలవారై బయలుదేరెను. శాక్యులు తమనగరమగు కపిలవస్తు బహిర్భాగమున బుద్ధదేవుని యాదరణార్థమొక గొప్పభవనమును గట్టించి యుండిరి. విరూఢకుడు కపిలవస్తు నగరమును సమీపించి యాభవనమునందు తన పరివారముతో విడియగా లోకోత్కృష్టుడగు బుద్ధుని కొరకు గట్టింపబడిన యాభవనమునందు హీనకులజసంజాతుడగు విరూఢకుడు విడియ నర్హుండు కాడని వానిని వెడలగొట్టిరి. ఈయవమానమును సహింపక మనసున నేయుంచుకొని తాను రాజ్యాధికారమును బొందగనే తన పూర్వవైరమును దీర్చుకొనదలంచి గొప్పసైన్యముతో కపిలవస్తుపై దండెత్తెను. అప్పుడచ్చటి పాలకుల యందు కృషికకృత్యములయందు నిపుణులైయుండిన 4గురుశాక్యవీరులు విరూఢకుని సేనల నెదిర్చి మహాపరాక్రమమున బోరి వారిని బారదోలి జయజయ ధ్వనులతో నగరమును బ్రవేశించిరి. శాక్యుల సత్యాగ్రహ దీక్షకు విరుద్ధగ దురాగ్రహ దీక్షను వహించి విరూఢకుని సైన్యముల జెండాడి రని యా నలుగురు శాక్యవీరుల నభినందించుటకు మారుగ పురమునుండి వెడలనడచిరి. ఇట్లు పురమునుండి వెడలగొట్టబడిన నలుగురు శాక్యవీరులును క్రమముగా ఉత్తరాభిముఖులైపోయి 'బన్యాను' 'ఉద్యాన' 'హిమతల' 'శాంబి' యను 4 దేశములకు రాజులై పరిపాలించుకొనుచుండిరి.

విరూఢకుడు మరల నొకసారి కపిల వస్తుపై దండెత్తెను. ఈమారు సత్యాగ్రహ దీక్షవహించిన శాక్యులు ఎవరును తన్నెదుర్చుటకు రామి నిరాటంకముగ వారినందర జంపి తనజయచిహ్నముగా 500 శాక్యకన్యలను రావణుడు దేవకన్యలనువలె చెఱబట్టి తననగరమునకు కొనపోయెను. ఆకన్యలను తనమహిషుల గమ్మని నిర్బంధించగా మానమే ప్రాణముగా దలంచు నాధీరలు విరూఢకుని యాజ్ఞోల్లంఘన మొనర్చిరి.

ఛీగ్ధాకుడైన విరూఢకుడు కామాంధకారమగ్నమానసుడై యుక్రూరుణుడై వారినందరి జంప నుత్తరువు చేసెను. అదేవిధముగ రాజసేవకులు 500 శాక్యకన్యలకును కరవాల ఖండనమొనర్చి వారినొక యగాధకూపమునందు బడద్రోసిరి. ఇచ్చటనే యొకస్తూపము వెలయుచున్నది. ఈదారుణ కృత్యము నెఱింగి బుద్ధుడాకన్యల దర్శించి వారికి సదుపదేశము నొనర్చి దుఃఖమూరులను మోక్షగాములను జేసెను. తర్వాత తన దుష్కృత్యఫలముగా విరూఢకుడు సప్తరాత్రములకు దగ్ధుడగునని యానాగతము నెఱింగించెను. అదేవిధముగ నేడవనాటికి తనసకల బంధువులతోగూడ విరూఢకుడు దగ్ధుడయ్యెను. ఈప్రదేశము విరూఢకకూపమని ప్రసిద్ధికాంచి వెలయుచున్నది.

## అంగుళిమాలాస్తూపము

అంగుళిమాల్యులు శ్రావస్తిలోని యొక చోరసంఘమువారు. జనులకీడించియు చంపియు వారి ధనాపహరణమునల్ల జీవయాత్ర సలుపు కఠినహృదయులు. వారికి మానుషభీతియు, అంతకుముందే దైవభీతియు లేదు. వారు చంపినమనుజుల యంగుళులను మాలగా తలలయందుధరించు నియమముగలవారు కాన వారికి అంగుళీమాల్యులను సార్థకనామము కలదు.

ఒకసమయమున వారి నాయకుడు తన యంగుళీమాలకు వ్రేళ్లు కొన్ని కొరతవడినందున తనతల్లినిచంపి యామెవ్రేళ్లను ధరింపసంకల్పించుకొనగా బుద్ధుడిదియెఱింగి యానిర్భాగ్యుని దుర్ణయమునుండి మాన్పనెంచెను. బుద్ధునిచూడగనే అంగుళీమాల్యుడు వీరావేశము పెరుగ బుద్ధుని చంపిన తనకు స్వర్గప్రాప్తి కలుగునని యెంచి తల్లినిచంపుట తర్వాత చూచుకొనవచ్చునని యొక కత్తితో బుద్ధునిపై కురికెను. ఇట్లు తనపైకి వేగముగా వచ్చుచుండిన యా కిరాతునిజూచి బుద్ధుడు మందగమనమున వానియెదురవచ్చుచుండెను. కిరాతుడు సమీపించగనే కరుణామయుడగు బుద్ధుడు "కిరాతా నీవేల యిట్టి దారుణకృత్యములకు గడంగెదవు? నీమనసు కరుణ నెరుగదా? నీవలెనే జనులందరు దారుణకృత్యముల జేయుచున్నారా? వారికిలేనిస్వర్గము దారుణకృత్యముల జేయు నీకుమాత్రము లభించునని యెట్లు నమ్మెదవు?" అని గంభీరముగను మృదుమధురముగను కిరాతుని మనసు కరగునట్లు పలికెను. చోరుడును తత్క్షణమే చలితమనస్కుడై తన పూర్వకృత్యముల దలచుకొని సిగ్గుపడి బుద్ధుని శరణుచొచ్చి తన్ను ధర్మమార్గమున బ్రవేశపెట్టునట్లువేడుకొనెను. బుద్ధుడును వానికి సద్బోధగావించెను.

కాలక్రమమున తన భక్త్యతిశయమున గొప్పవాడై అంగులీమాల్యుడు (వీరి తెగకే అంగులీమాల్య నామము నిలిచినది) 'అర్హాత్' అను సంఘపదవిని పొందెను.

## అప్తనేత్రవనము

జేతవనమునకు వాయవ్యమున నొకయడవి కలదు. ఇందు బుద్ధుడు వ్యాయామార్థ (నడచుట) మేతెంచుట కలదు. ఈప్రదేశముననే ఋషులు తపమొనరించుచుండిరి. ఈదేశభాగమున 500 చోరులుండి చుట్టుపట్లనుండు జనుల బాధించుచుండిరి. శ్రావస్తిరాజగు ప్రసేనజిత్తుడు వారినందరినిబట్టి వారి నేత్రముల నూడబెరికించి యొక మహారణ్యమున విడిపించి దండించెను. పిమ్మట నాచోరులందరు కన్నుగానక మహారణ్యమునబడి తపించుచు బుద్ధునిగూర్చి పలవింపసాగిరి. బుద్ధుడపుడు జేతవనమున నుండినవాడై తన జ్ఞానదృష్టిచే వారి దీనస్థితి నెఱింగి యొక మందమారుతము వీచునట్లు చేసెను. ఆ మారుతవశమున పరిసరపర్వతములనుండిన యోషధులు కొన్ని చోరులనేత్రములపై బడగా వారంతయు పునర్లబ్ధనేత్రులై బుద్ధుని మహిమను వేనోళ్లబొగడి పూజించిరి. ఈవనమునకును తత్కారణమున అప్తనేత్రవనమని పేరు గలిగెను.

## గంధకూటి

జేతవనప్రాకారములోని యనేకబౌద్ధాలయములలో నిదియొకటి. దీనియందు ఒకగొప్ప సభామంటపము కలదు. జేతవనమునందు దొరకినదని వ్రాయబడిన బుద్ధుని చందనవిగ్రహ మీగంధకూటియందే యుండినది. గంధకూటియొక్క కుడ్యములు 6 అ. మందముగలవిగానున్నందున నిదియొక గొప్పభవనముగానుండియుండవలెను. దీని కేడంతస్తు లుండినవట. అహోరాత్రములు ఈభవనమందు దీపధూపము లొప్పుచుండినవట. ఒకనాడు మూషక మొకటి గ్రహచారవశమున నీదీపములందు వెలుగుచుండిన వత్తి నొకదాని నోటగరచుకొని గృహమున నితర భాగములయందు పరుగిడునప్పుడు నిప్పంటుకొని సర్వమును దగ్ధమయ్యెను. జేతవనమున కోశాంబకూటియను మరియొక ఆలయము ముఖ్యమయినది.

### చూతవృక్షము (బర్మాదేశ బుద్ధకథలలోనిది)

బుద్ధుడొకమారు తా నొకమామిడిచెట్టుక్రింద తన మహిమలను చూపుటకు ఒప్పుకొనెను. ఆయనవిరోధులగు తీర్థికులను వారి సంగతివిని శ్రావస్తికి బహిరంతరములనుండిన చూతవృక్షములనన్నింటిని నాశనముచేయుతలంపున నాటినవన్నింటిని క్రయమునకు తీసికొనిరి. కాని నిర్ణీతదినమున బుద్ధుడు తన భిక్షాపాత్రమును వాడుకప్రకారముగా గైకొని తనశిష్యబృందములతో పురద్వారమును సమీపించి వచ్చుచుండెను. అదేదినమున రాజుయొక్క తోటమాలి గండంబుడనువాడు తోటలో పోవుచుండగా నొక మామిడిపండ్లగుత్తిని చూచెను. అది మామిడిపండ్లకు కాలము కానందున ఆపండ్లను రాజునకు అరుదగుకానుకగా సమర్పించినరాజు సంతసించునని యెంచి తోటమాలి యాపండ్లు గైకొని నగరమునకు పోవుచుండెను. మార్గమున బుద్ధుడగుపడగా వాడు "నే నీ ఫలములను రాజున కొసగిన నాకు గొప్పబహుమానము లభింపగలదు కాని అది ధనమో ధాన్యమో కాగలదు. బుద్ధదేవుని కీఫలముల సమర్పించిన యెడల నాకీదుఃఖభాజన మగు జన్మమునుండి విముక్తికలిగి మోక్షమే లభించగలదు"అని యెంచియాపండ్లను భక్తిపూర్వకముగ బుద్ధునికి నివేదించుకొనెను. బుద్ధుని శిష్యుడగు ఆనందుడు దాని గైకొని, బుద్ధుని కాప్రదేశమున నొకయాసనము నేర్పరచి విశ్రమింపజేసి యాఫలమును తిన నొసగెను. బుద్ధు డాఫలమును భుజించి విత్తనమును మరల తోటమాలి కిచ్చి దాని నచ్చటనే నాటుమని చెప్పెను. ఆసమయమున దేవత లచ్చటికి వచ్చియుండి గండంబునికిమాత్రము గోచరించుచుండిరి. బుద్ధుడు తనచేతిని కడుగుకొని యానీటిని మామిడిటెంకపై చల్లుమని ఆనందుని కాజ్ఞాపించెను. నీరు చల్లగనే సద్యఃఫలితముగా నొకమామిడిచెట్టు 5 పెద్దకొమ్మలతోను వేలకొలది చిన్నచిన్నకొమ్మలతోను నగరమునకంతయు నీడనొసగుచు 300 మూరల చుట్టుకొలతకలిగి మొలచెను. దానియందుపుష్పములును, ఫలములును సమృద్ధిగనుండెను. బౌద్ధేతరులు (ప్రత్యక్షవాదులు), ఆచెట్టులోనిపండ్లను భుజించగనే మతిభ్రమకలిగి ఇటునటు పరుగులిడ నారంభించిరి. కోసలరాజు తానాచిత్రమును చూడనోచుకొననందులకు చింతించెను. వృక్షమునకు పాషండులవల్ల

శేషానివయిలేకంపోచ్చిట్లు కన్పట్టుటు లుంపబడెరి ఈశాన్య కృము క్రాన్త్రప్రసపటమునకు జేవిరనపునకు ఈశాన్యమున నుంచు నక్రభంతాగారము అనుకోటు నుండినది. ఇప్పటి కిని ఇచ్చట నొకమామిడిచెట్టు కలదు.

పూర్వనికాలమున ఆయనపాదధూళిచే పవిత్రమై బౌద్ధులకు పుణ్యభూమియై వెలయుచుండిన శ్రావస్తి నగరమునియనంతరము 5 లేక 6 శతాబ్దములకు బౌద్ధమత ద్వేషులు, అయోధ్యరాజులును పుష్యమిత్రులచేనిన్నివిధ ముల నవస్థలఁ బడి నాశమునొంద నారంభించెను. అందు వల్లనే ఒకానొకప్పుడు సకలైశ్వర్యసంపన్నమై యుండిన యీనగరము 1½ మైలు పొడవై యుండియు ఫాహి యాన్, హిఎన్‌ట్సాన్‌గ్ యాత్రికులనాటికి క్రమముగా క్షీణదశనొంది 200 కుటుంబములుమాత్రము కలిగియుం డినది. హిఎన్‌త్సాన్‌గ్ తర్వాత మరల క్రీ. శ. 607–648 సం. పర్యంతముండిన కనోజ్ దేశపాలకుడగు హర్ష వర్ధనుని సుపరిపాలనక్రింద బౌద్ధమతము వృద్ధినొంద నారంభించి 2 శతాబ్దములు మంచిస్థితియం దుండెను.

---

# నమ్మకము

మిన్నికంటి గురునాథ కవిగారు

ఉ. నేత్రయుగంబు దేనిఁ గననేర్చినచో సఫలత్వ మొందునో?
గాత్ర మొగిం బవిత్రమయి క్రాలునొ యేపురి నున్కి? నట్టిసు
క్షేత్రము కాశికాపురము సేరి త్రిశంకుతనూజుఘట్టముం
జిత్రములం గనుంగొనుచుఁ జేరితిఁ గార్తిక పూర్ణిమాతిథిన్.

ఉ. నే నటఁ జేరునంతకు జనించెనొ? లేదొ? విభానుబింబ మా
శానిచయంబులం దలమి సాంద్ర తుషారపటానకుంఠముం
బూని ధరాపురంధ్రి కను వోడిమి మాఁపుటఁ జూడఁ జాలఁగా
లే నయితిన్, దరుల్ పృషతలేఖల నెల్లెడ రాల్చుచుండెడిన్.

ఉ. గట్టున నెవ్వరేఁ జిదుగుఁగట్టెయలన్ రగిలించి మంటకుం
జుట్టును గూరుచుండిరొకొ? చుక్కతెఱంగున మిణ్కుమిణ్కుమం
చెట్టులొ తాను వారిచలి నించుక వాపుచుఁ గూర్కుచుండె న
ప్పట్టున, దివ్వెయుం జమురు వాసిన మల్గెడిరీతి దోఁపఁగన్.

ఉ. తెల్లని చీరడాలు వలితేజున డాఁగురుమూఁత లాడఁగా
ఘల్లున మ్రోఁగుచుండ నిరుకాళ్లఁ బెనంగొనుసొమ్ము, జాళువా
పళ్లెరముం బయంటకొన వాలిచి నందిట నిల్చి యంచనా
నల్లన రేవుసేరె నరయం దనభావిశుభోదయంబులన్.

వ. ఆలతాంగి యయ్యెడం గంగం గనుంగొని యుప్పొంగుచుం గైమోడ్పులర్పించి.

గీ ఒకపవిత్రస్థలమ్మున నుంచి పళ్లెరమ్ము భద్రముగాఁగ, స్నానమ్ము సలిపి
గౌరిఁ బూజింపుచుం దాలిఁ గన్నుఁ గవకు, నద్దుకొనె భక్తితో నోట ననుచునేమొ.

చ. కలుముల నీను ముద్దియ నిగారపుటిల్లగు మేలుతామరా
కుల బెడఁగారుదొప్ప నెలకొల్పి సుమంబులఁ బూజ సల్పి, ప్రా
వ్రుల చవినేతి నిల్పి, మది వ్రాంగఁగ వత్తిని సల్పి, నల్వగా
వెలుఁగఁగ జేసి జోతికిని వేయు తెఱంగుల జోత లిచ్చుచున్.

కం. అమ్మా! జ్యోతీ! సౌభా, గ్యమ్మిమ్మా ప్రియుని ప్రేమఁ గాపాడుమ నా
కిమ్మా కడిపెడుబిడ్డల, నమ్మా! పదివేలు మ్రొక్కు లప్పన సేతున్.

కం. కరుణింపు మంచు, సన్నున్, మఱువ కనుచు జయరమారమణ గోవిందా
హరియంచుఁ బదిలముగ నా,దరి కేగి జలంబుల న్వదలె నాజ్యోతిన్.

గీ. అతులకవితా ప్రవాహంబునందుఁ దవిలి, సరసుచిత్తము వ్యుత్తుగఁ బరువులెత్తు
నట్లు గంగా ప్రవాహంబునందు నదియు, నాగరిత భావము హరించి యరుగఁదొడఁగె.

సీ. ఉరణించు తరఁగల యుయ్యాలలకు నల్ల, నడయాడు నామెడెందమ్ముతోడ
తెలి నీటిపుల్గులయులివుఁ బెన్బుజ్జగిం, తలనూఁగు నాగరితతలతోడ
ఎడనెడఁ బఱతెంచు బుడిబుడి పరకల, నాఁగు నాప్రోయాలి యాసతోడ
నడిపాయఁ గడలేని సుడిగుండములవడిఁ, జొచ్చి తిరుగు నామెచూపుతోడ
మలుఁగఁబోయి మంచు మండి మలుఁగఁబోవు, సిమసిమమను మఱలఁ జిటపటమను
కనుల నీరు గ్రమ్మి కడసేరుఁ బొడవాఱు, పడఁతి కపుడు గుండె దడదడమన.

ఉ. ఇక్కరణిన్ లతాంగి హృదయేక్షణ చేష్టల నాఁచికొంచు నా
చక్కని గొంతదూర ముపచారము నేసి యదేమి మాయయో?
గ్రక్కున నాఱిపోయెఁ బొడ గన్పడదాయెను జోతి కావల
న్నెక్కడను వింత యేమనుచు నెల్తను నిశ్చల దృష్టిఁ జూచినన్.

ఉ. అక్కట! జోతిమగ్గఁ గనులందలి సోయగ మాఱె నింతికిన్
జెక్కులు వాడె, మోముపస చెల్వఱె, దీర్ఘములయ్యె నూర్పులున్,
గ్రక్కునఁ బాఱె బాష్పములు గంటికి మంటికి నేకధారగా,
ఘక్కున గుండెయుం బగిలె, వ్రాలెను నేలకుఁ దీవ పోలికన్.

కం. తననిక్షేప మెదో పో, యిన యట్టులఁ దలఁచుఁగాని యేకతమునఁ బో
యెనో? యించుకయుం దలఁపద, మనమున నమ్ముద్దరాలు మఱి యేమందున్.

కం. చల్లనిగాడ్పులు వీచుట, వల్లనో? జలకణము పైనిబడుటవలననో?
చల్లాఱె జోతి యని యపు, డుల్లంబున నాకుమాత్ర మూహాజనించెన్.

వ. మఱియు భారత నారీమణుల విశ్వాసంబును స్మృతిపథంబునంబడియె.

మ. అరరే! దీపము చూపుమేరవఱ కావంతైన నైజప్రభా
స్ఫురణం బాయక యున్న దంపతులకుం బూర్ణానురాగంబు లొం
డొరులం బాయక యుండునంట సత మేయోజ న్వియోగవ్యథా
భరమే కల్గదఁటంట యెంతదొకో? విశ్వాసంబు కాంతాళికిన్.

# వేదాంత విమర్శాఖండన నిరాసనము

యస్. కామశాస్త్రి గారు

(1) బ్రహ్మశ్రీ సునర్ల కామశాస్త్రిగారు 'శంకరాదిప్రతిపాదిత భాష్యత్రయ ప్రతిపాదితార్థము కంటె వ్యాసతాత్పర్యము భిన్నముగ నుండవచ్చును' అని వ్రాసెరి.

బ్ర-శ్రీ. వేమూరి నృసింహశాస్త్రిగారు దీనిజూచి 'కామశాస్త్రిగారికివ్యాసాభిప్రాయము నూతనముగ పొడగట్టినదని తోచెడిని' అని యాక్షేపించిరి.

సమాధానము

పరమ ప్రమాణమగు వ్యాససూత్రములకు మూడభిప్రాయము లుండవచ్చును. అవి ప్రమాణములు కావచ్చును; కాని కామశాస్త్రిగారి చతుర్థాభిప్రాయ ముండకూడదు; ప్రమాణమును కాకూడదు, అనెడు ఈనృసింహశాస్త్రిగారిపంచమాభిప్రాయముమాత్ర మెట్లు ప్రమాణమగునో?

(2) 'ఉపాస్యోపాసక భావము కుదురమి, అద్వైతులు నాస్తికసము'లని కామశాస్త్రిగారు వ్రాసిరి.

నృసింహశాస్త్రిగారు దీనిజూచి,'బ్రహ్మమైన విదేహముక్తునకు ఉపాస్యోపాసక భావము నంగీకరింపకున్నను,సాధకులకు దాని నంగీకరించియేయున్న అద్వైతులు నాస్తికసములనుట కామశాస్త్రిగారికి సాహసముకాదా?' అని పూర్వపక్షమును వ్రాసిరి.

సిద్ధాంతము

నృసింహశాస్త్రిగారి వాక్యమును బట్టి విచారింపగా అద్వైత విదేహముక్తులు నాస్తికసములు కావచ్చునుగాని, ఉపాసకులయిన సాధకులనుగూడ నాస్తికసములలో గలుపుట కామశాస్త్రిగారి పొరపాటే.

(3) 'అద్వైతులు ప్రచ్ఛన్నబౌద్ధు' లని కామశాస్త్రిగారు వ్రాసినారు.

నృసింహశాస్త్రిగారు దీనిజూచి

శ్లో 'ఐక్యశ్రుతీనాంసర్వాసా
మప్రామాణ్య ప్రకల్పనాత్,
బౌద్ధానాం ద్వైతినాం చైవ
భేదం నోపలభామహే.'

అను నొక శ్లోకమును వ్రాసి ఐక్యశ్రుతులకు అప్రామాణ్యముం జెప్పుట ద్వైతులే బౌద్ధసము'లని పూర్వపక్షము వ్రాసిరి.

సమాధానము

వారు ప్రమాణముగజూపిన యీశ్లోక మెందులోనిదో శాస్త్రిగారు తెలుపలేదు. పూర్వ మీమాంసమునందున్న

స్రు. 'ఆదిత్యోయూపః'
'యజమానః ప్రస్తరః'

ఇత్యాద్యభేదశ్రుతులకు సూర్యుడే యూపము, యజమానియేరాయి, అని యర్థమును

చెప్పిన బాధించుననియే సాదృశ్యవివక్ష నంగీకరించి, యూపము సూర్యునివంటిది, యజమాని ప్రస్తరసముడు అని యర్థమును చెప్పినారు.

అట్లనే 'తత్త్వమసి' అను శ్రుతికిగూడ కనబడుచున్న అర్థమును చెప్పినచో సంసార మహాదుఃఖసముద్రములో మునిగి తేలుచున్న జీవుడు నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము గల పరమాత్మయే కాడు కనుకనే సాదృశ్యవివక్షచే నర్థము చెప్పవలయును అని ద్వైతులు సమన్వయము చేసినారుగాని ఆశ్రుతులప్రమాణ మనుట లేదు.

కాని (1-1-11) 'శ్రుతత్వాచ్చ' అను సూత్రభాష్యములో 'పరాపర విషయత్వేన సందిహ్యమాన వాక్యగతిపర్యాలోచనయా నిర్ణేతవ్యం భవతి' అని వ్రాయబడి యున్నది ఈవాక్యముచే బ్రహ్మద్విత్వము కల్పింపబడినది. కామశాస్త్రిగారికి భాష్యవాక్యాభిప్రాయము తెలియలేదను సంశయమును నివారణచేయుటకు, శాంకరభాష్యటీకయగు రత్నప్రభయందు 'విద్యావిషయో జ్ఞేయం నిర్గుణత్వం సత్యం' 'అవిద్యావిషయ ఉపాస్యం సగుణత్వం కల్పితం' అనివ్రాసి యున్నది. ఇట్లు బ్రహ్మమునందు ద్విత్వమును గల్పించి, 'ద్వాసుపర్ణా' ఇత్యాది ద్వైతశ్రుతులలో:—వ్యావహారికః, అవిద్యా, నిర్గుణః, మిథ్యా, ఉపాధిః, సగుణముక్తిః, నిర్గుణముక్తిః, మాయయా, ఔపాధికః, అనిర్వచనీయః, భేదో భ్రమః' ఇత్యాదివాక్యములదూర్చి వాటి పవిత్రార్థమును పాడుచేయుటయుచితమో, సగుణ నిర్గుణ శ్రుతులను బ్రహ్మమునందు సమన్వయించుట యుచితమో నృసింహశాస్త్రిగారు నిష్పక్షపాతముగ నాలోచించిన బాగు.

మరియు—"భేదవ్యపదేశాచ్చ; భేదవ్యపదేశాచ్చాన్యః; భేదశ్రుతేః; అధికంతు భేదనిర్దేశాత్; జగద్వ్యాపారవర్జం;" ఇత్యాదిసూత్రములకు పూర్వముచూపిన 'అవిద్యా' 'భేదో భ్రమః' ఇత్యాది కల్పితవాక్యములను విడిచి నృసింహశాస్త్రిగారు మరల భాష్యమువ్రాసిన బాగుగనుండును.

నృసింహశాస్త్రిగారు స్కాందపురాణాంతర్గత సూతసంహితలో యజ్ఞవైభవఖండపూర్వభాగమున 37-వఅధ్యాయములోనున్న 'అథాతస్సంప్రవక్ష్యామి ...... అద్వైతం సర్వదా సత్యం భేదాభావాత్కథంచన' అను శ్లోకము వరకువ్రాసి, బ్రహ్మద్వైతము సత్యము, ద్వైతమసత్యము అని యాశ్లోకములుపదేశించుచున్నవని వ్రాసినారు.

సమాధానము

కామశాస్త్రిగారు జీవబ్రహ్మభేదమున్నదని వ్రాసినారు. ఇందుచే బ్రహ్మైకత్వమునకు భంగమేమి?

నిత్యశుద్ధ, నిత్యబుద్ధ, నిత్యముక్త, సర్వజ్ఞ, సర్వశక్తికబ్రహ్మము, అవిద్యకు స్వాధీనమయి కర్మబద్ధుడయి కించిజ్జ్ఞుడయి నరకాదులలోబడి దుఃఖము ననుభవించుచునున్నాడని అనని మొదల బ్రహ్మద్వైతము సిద్ధింపదా? పోతేపోనీగాని బ్రహ్మము నరకాది దుఃఖముల ననుభవించుచున్నదని యనెడువాడు లోకమునం దెవ్వడేని యుండునా?

మరియును నృసింహశాస్త్రిగారు, 'తత్త్వమసి' అనుశ్రుత్యర్థమును ప్రతిపాదించెడు బ్రహ్మగీతలలోని 'త్వం శబ్దార్థో...... త్వమర్థైక్యం ప్రతీతిచ' అనువరకు శ్లోకములను వ్రాసి యీశ్లోకములు జీవబ్రహ్మైక్యమును బోధించుచున్నవని వ్రాసినారుగాని ఆశ్లోకములు చైతన్యధర్మపురస్కారమున జీవబ్రహ్మైక్యమును, స్వరూపముచే జీవబ్రహ్మభేదమును చెప్పుచున్నవి. దీనికే సాదృశ్యవివక్ష యని యర్థము. కనుకనే శ్రీ శంకరులు:—

'అంశో నానావ్యపదేశాత్'

(2-3-43)

ఇత్యాది. సూత్రభాష్యాంతమున

'చైతన్యం చావిశిష్టం జీవేశ్వరయోః,
యథాగ్నివిస్ఫులింగయోరౌష్ణ్యం అతో
భేదాభేదాభ్యామంశత్వావగమః'
'ప్రకాశాదివన్నైవంపరః.'

(2-3-46)

ఈసూత్ర భాష్యాంతమున' అవిద్యానిమిత్తజీవభావవ్యుదాసేన బ్రహ్మభావమేవ జీవస్య ప్రతిపాదయంతి వేదాంతాః, 'తత్త్వమసి' ఇత్యాదయః. ఇట్లనిరి. కావున సర్వదా జీవబ్రహ్మభావ మసంగతము.

ఇందు విషయము శ్రీమహాభారత, వాసిష్ఠ, లైంగ, సూతసంహితలలోనున్న శ్లోకములు వ్యాసప్రోక్తములుగాని బృహన్నారదీయములో నున్నవని కామశాస్త్రిగారు వ్రాసిన 'తత్త్వమస్యాది వాక్యోత్థం' అనుశ్లోకమును, బ్రహ్మాండ పురాణములోని 'ప్రసిద్ధస్థూలసూక్ష్మాది' అను శ్లోకమును మాత్రము కావు కాబోలు.?

మరియును

'అసత్యమప్రతిష్ఠంతే జగదాహురనీశ్వరమ్'

(గీత. 16-8)

'సర్వ బ్రహ్మాత్మవేత్తారో జీవబ్రహ్మాత్మవేదినః, సర్వేయాంతితమో ఘోరం.........'

(స్కాందపురాణమ్)

'అధికంతు భేదనిర్దేశాత్'

(బ్ర. 2-1-22)

'జీవేశ్వరభిదాం భ్రాంతిం కేచిదాహుర పండితాః.........'

(మహాసంహిత)

'చేతనస్తు ద్విధా ప్రోక్తో జీవ ఆత్మేతిచ ప్రభో, జీవా బ్రహ్మాదయః ప్రోక్తాః.........'

(పద్మపురాణం)

'ద్వేవావ బ్రహ్మణోరూపే ఆత్మాచైవానాత్మా చైవ, తత్ర య ఆత్మా స నిత్యః ...అథహాయోఽనీశః.........'

(తలవకార బ్రాహ్మణమ్)

'సఆత్మా పూర్ణగుణకః
సనూక్ష్మ స్సర్వగస్సదా,
సర్వోత్తమత్వా త్సత్యంత
జ్జీవాభిన్నం తథాసురాః.
విద్ధి ర్నత్వం తథా విద్ధి
శ్వేతకేతో! కదాచన,
కింతు బ్రహ్మేస్వథ కస్సర్వ
దేవదేవేశ్వరః ప్రభుః.

పృథగే వాహ మత్యల్పశక్తిర్జ్ఞాన సు-దిశః
ఇత్యేవవిద్ధిసతతమత్తోమోక్షమవాప్స్యసి.
ఏష తత్వమసీత్యాదిస్తుతేరర్థోఽస్తిసువ్రత'
(బ్రహ్మాండపురాణమ్)

'అస్య ఈశ స్తథానోఽహ
మితిజ్ఞానం వినశ్చితామ్'
(మహాభారతమోక్షధర్మమ్)

'జుష్టం యదా పశ్య త్యన్యమీశ మస్య
మహిమాన మితి వీతశోకః'
(ముండకోపనిషత్)

'అభేద మీశరూపాణాం
భేదం జీవేశయో రపి
యః పశ్యేత్ స్థిరయా బుద్ధ్యా
భక్తిమా న్నవిముచ్యతే'
(భవిష్యత్పురాణమ్)

'ఏత మేవ బ్రహ్మేత్యాచ చక్షతే, నహి జీవమేవ బ్రహ్మేత్యాచచక్షతే (ఇంద్రద్యుమ్న శాఖ)
(స. ఆ. 3-2-3)

ఇవి అన్నియును నృసింహశాస్త్రిగారి మతమున వ్యాసప్రోక్తములు కావు కాబోలు.

---

# ఋతుమాల

శ్రీమతి జూలూరి తులశమ్మ గారు

చైత్రం జింక రామినిఁ జింతతోడ
నున్న వనకాంత కోకవార్త విన్నవింప
వచ్చి కోయిలయెంతయో మచ్చికలర
కొలఁదిధ్వనితోడఁ గూసెను గూయటంచు
అట్టి యవ్యక్తమధురిమ నాలకించి
యెంతొ రహిమించి పులకించి సంతసించి
వింత తళుకొత్త నన లెత్తి వేడ్క హత్తి
పోవ నున్నట్టిప్రాణముల్ పొందుపఱుచు
గతిని జివురుల నలనల్లఁ గండ్లుదెరిచి
ప్రాత వస్త్రంబు లూడిచి నూతనంపుఁ
బట్టుపుట్టంబులనుగట్టుపగది మెఱసి
తనదుచెలులకు వేవేగ ధవునిరాక
దెల్పెనోయన వనపంక్తి తేట గలిగి
చివురుచేతుల నలదూతఁ జేరఁ బిల్చు
దారి ముత్యాలకెంపుల తోరణాలు
లీల వనవాటికల సొంపు గ్రాలుచుండె
లతలఁ దరువుల నరవిరి ప్రతతికొంత
మొగ్గదొడిగిన తీవలమొత్త మొకట
నిండఁబూచిన పందిళ్ల నెలవులొకట
పూఁతలో నుండి తలసూపు లేఁతపిందె
తార వేయేల లేమావితరువుపైన
నుండి చివురుల మేయుచు నొక్కపికము
పాడఁ దొడఁగెను మిత్రమా పాటయొకటి
యెంత మృదుతరగానమో యెఱుకపడదు
యెంత చక్కనిహాయియో యెఱుకపడదు
యెంత రుచిగలవస్తువో యెరుకపడదు
యెంతవిలువగలయదియొ యెఱుకపడదు
యెంతయాలింపఁ దృప్తియో యెఱుకపడదు
యెందు నేర్చెనో యప్పిక యెఱుకపడదు
యెందుఁ బుట్టెనో తన్నాద మెఱుకపడదు
శిశువులెఱుఁగును దద్రుచి పశుగణమ్ము
ఫణులెఱుంగును స్థిరములౌమణుల కెఱుక
యెందుమ్రోఁడులు నన లెత్తి నిండఁబూచె
మలయపవనుండు వీచెను మందగతిని
కొదమతుమ్మెదకదుపులు కోరిపాడు
ఎట్టిదోసఁగులనైనను బాసఁగు హాయి
యెట్టిమూఢులమనసైన నింపుచెందు
అట్టిసంగీతలహరిచే నవనియెల్ల

హర్షపులకల నొందించె నొరపికము
యాదినంబునఁ దాలేచి యింపుమీఱ
పాడఁదొడఁగెను దనపేర్పు ప్రచురపడఁగ
పాటలో పాట యింకొక్కపాటగలదు
మాటలోమాట యింకొక్కమాట గలదు
మందపవనుండు చోరుని మాదిరిగను
కుసుమవాసనలెల్లను గూర్చి తెచ్చి
యిచ్చి హాయిని గలిగించు నెవరికైన
తేటికదుపులు గుమిగూడి పాటపాడె
మాసముల మంచి దీమధుమాస మొకటె
ఋతువులను హృద్యమగున దీఋతువొకండె
అంతకంతకు ద్విజసేన లతిశయిల్ల
మంత్రి సామంతవరులతో మాధవుండు
విడిసె నెలమావితిన్నెల వేడ్కమీఱ
పాటలను హాయి కోకిలపాట యొకటి
పల్కులను హాయి చిల్కల పలుకొకండు
నడకలను హాయి రాయంచనడక యొండె
తోఁటలన్నియు లేఁతలై తోఁచె పూఁచె
తీవలన్నియుఁ గాచెను మావులన్ని
వెండిగరగించి పోసినవిధము తోఁప
వస్తుజాలంబు చూడఁ బ్రశస్తమగుచు
నుండ నాచందురుం డపు డుదయమయ్యె
తాటియాకులపందిళ్లు తరుచులయ్యె
వట్టివేళులచాపలు వఱలెనయ్యె
డలను వీవనల్ చాపలుఁగనఁగనయ్యె
గదులు మంచాలు పరుపులు కానివయ్యె
పంచువెన్నెలబయళులఁ బడకలయ్యె
అగరుధూపంబు లంతట నధికమయ్యె
చందనంబును బూవులుఁ జెకయయ్యె
అందరకు నిట్టిరోజులే హాయియయ్యె
పాపలెల్లను దమతల్లి దాపు కరిగి
అన్న మిడఁగదె వెన్నెలలందు మాకు
వెండిగిన్నెను పెరుగునఁ బండువేసి
యనుచు వేడంగ దల్లిదా నట్లుసేయు

తల్లి యెఱుఁగునుపిల్లల తలఁపులెల్ల
బూటపూట వసంతంబు పోడవడంగఁ
నాటనాటను గ్రీష్మమే యలవరించె
యిచ్చి పుచ్చుకొనుటయును వచ్చిపోవు
టనెడి లోకోక్తి తిరమయ్యె నౌర యిందు
తానొసంగిన రసరూప ధనము మరల
గైకొనుట కేమి కమలను గనుట కేమి
చండతరవర్తి ప్రచుర మార్తాండమూర్తి
తనకుగల వేయికరములఁ దరిమి సాచి
గైకొనంబూనెఁ దనసొమ్ము కరుణమాలి
నదులు లోగుంటె నదములు నల్లవారె
సరసులును దీర్ఘికలుగూడ సన్నమయ్యె
నోషధులు పల్కవయ్యె సంతోషముగను
తరువులెల్లను ఋణమునే మరచిపోయె
లతలు తలవాల్చె కిసలయప్రతతినంత
భానుఁడును రోషవిస్ఫురద్భానుఁడగుచు
మండి తనచండకిరణముల్ మహిమమొప్ప
వేఁడినిట్టూర్పు గాలిచే విసరి విసరి.
మున్ను తా నిడ్డ రసమెల్లఁ బుచ్చికొనియె
ఆతపముగాదు నిప్పిదియ యనెడువారు
అగ్గికిని గాలి తోడయ్యె ననెడువారు
పేర్చి సుడిగాలివీచెను భీకరగతి
వచ్చె నెద్దడి త్రాగగా వారిలేదు
తానమాడుట కటమున్నె కానఁబడదు
లోకమంతయువేఁడి నాకులతఁజెందె
భూతములు తాపములచేతఁ బొక్కుచుండె
కాల మొకరీతి నేరికిఁ గడువఁబోవ
దార మారుట నైజంబెయగునుగాన
మెరుము లురుములు మబ్బులు మింటవెడలె
గాలియెంతయుఁ జల్లనై క్రాలఁజొచ్చె
బాటపాటగఁ జినుకులు పడఁగఁజొచ్చె
అంతలోనన వడగండ్లు బంతులగతిఁ
బడఁగ నచ్చెరువందుచు పడఁతులెల్ల
నేరఁజొచ్చిరి కరకల నేమొకాని (సశేషము)



1



2



3



4



5



6



7



8



9





10



11



12

13

1. ఒక స్త్రీయొక్క తల. 2. బుద్ధుడు. 3. ఒకతల (బంకమట్టితో జేయబడినది.) 4. తొండమును కాళ్లనువిరిగిన ఏనుగు. 5. వరాహము. 6. ఒకకుక్క; రెండుపిల్లలు పాలు ద్రాగుచున్నవి. 7. కూజా (మట్టిది). 8. మట్టికూజా. 9. లోహములుకరగించు మట్టిచిప్ప. 10. పగిలినగిన్నె. 11. దీపపు ప్రమిదె. 12. ఒక మట్టి పాత్రము. 13. ఒక కూజామెడ.




1 లోకనాథుడు (బుద్ధుడు)



2 త్రైలోక్యవిజయుడు.





4 ఒకస్త్రీవిగ్రహము.

3. గణేశుడు.

1. లోకనాథుడు, జేతవనములో తూర్పున నొకమఠమునందు దొరకిన శిలావిగ్రహము. 6½ అంగుళములెత్తు. ఎడమచేతియందు కమలమున్నది. 2. త్రైలోక్యవిజయుడు, బౌద్ధుల దేవతలలో నొకడు. నాలుగు ముఖములయందు ఒకటి వెనుకప్రక్కనున్నది. కిరీటమునందు ధ్యాన బుద్ధవిగ్రహముకలదు. పైమఠమునందు దొరకినది. 3. గణేశుడు. బ్రాహ్మణుల విగ్రహము. 2'—1½" ఎత్తు. నాలుగుచేతులయందును మూడువిరిగిపోయినవి. నాలుగవచేతియందుండునది వేత్రము. పైమూలలందు గంధర్వులు పుష్పమాలికలను తెచ్చియున్నారు. పైమఠమునకు వాయవ్యమున నొక దేవాలమునందు దొరకినది. 4. ఒకస్త్రీవిగ్రహము; 9 అంగుళములఎత్తు, ఆభరణాలంకృతము పైదేవాలయమునందు దొరకినది.




# ఆరోగ్యమే భాగ్యము

డాక్టరు ముత్తు గారు

క్షయరోగమును సాంఘికాచారము

క్షయరోగ కారణ పరిశీలనార్థమై క్రిందటి వత్సరమునుండి నేను భారతదేశమునందు సంచారముచేయునపుడు నామనస్సునకు నాటిన కొన్నిసంగతులను నాదేశజనుల కెఱుకపరుపఁ గుతూహలాయత్త చిత్తుండనైతి నందులకుఁ గడంగితిని. నే నేరాజకీయవ్యావహారికసంబంధిని గాకుండుటచే, నాయుద్దేశముల నిష్పక్షపాతబుద్ధితో నుడువఁగలను. భారతీయులందఱును వివిధాభిప్రాయులయ్యు, స్వరాజ్య మెన్నఁడో యొకనాఁడు తప్పకవచ్చునని యేకభావము కలిగియున్నారు. కాని దానిఁ గైకొనుటకు సర్వతస్సిద్ధులమై యుంటిమా; అది రానున్నప్పుడు దాని స్వీకరింపఁ దగుదుమా; లేకున్నఁ దగియుండుటకుఁగాను ప్రయత్నము చేయుచుంటిమా; అనునీముఖ్యప్రశ్నలు భారతదేశములోని ప్రతిసాంఘికుని యొక్కమనంబును వేధించుచున్నవి.

పరిశుభ్రమగు గృహములలోను ఆరోగ్యకరంబగు ప్రదేశములలోను నివసించుచు ననుపమానసౌఖ్యారోగ్య జీవనంబుల గడుపు ప్రజలచేతనే యేదేని రాజ్యరక్షణంబు కలుగ గలదనుట స్వతస్సిద్ధమగు సత్యము. ఏజాతియైన బలమైనదై దేహసామర్థ్యము గలదైన నాగరకత, స్వాతంత్ర్యసౌఖ్యామృతబిందువులఁ గ్రోలఁగలదనియు, దానిచే, తాము, వంశపారంపర్యముగాఁ దమసంతతి వారి కొప్పఁ జెప్పుదురనియు విని సంతృప్తుఁడనైతి. ఈయార్థికపు టొత్తిడి దినంబులలో, నీభయంకర పారిశ్రామికపుఁ బోటీరోజులలో, నేరాజ్యమునం దెక్కు డారోగ్యవంతులు, నెక్కుడు సామర్థ్యవంతులు నగుపనివాండ్రు గలరో యట్టిరాజ్యమే తలయెత్తును. అట్టిరాజ్యమే తదితర దేశవ్యవహారములపై నధికారము కలిగియుండును. వేయేల నట్టిరాజ్యమే ప్రపంచ మంతటిలో ననంత జయప్రదాయియై చెలంగును.

వ్యాధుల కానుగుణ్యమగు నేల.

ఈనాటి మనయాధిక్యత యేమి? పైసంగతులన్నియు నాలోచించిచూడ నేటిమన భారతీయుల దశయేమి? ఒకదేశాభివృద్ధికై పాటుపడు ప్రతివర్ణమువారును ప్రతిపర్యాయమును నిష్ఫలమనోరథు లగుచుండిరి. కనుక మనస్థితిగతుల నాలోచించిచూతము. లోకములో, భారతదేశములోనున్న దారిద్ర్యము, అశుభ్రత, యనారోగ్యము నితర దేశములలో వేటియందైన నేటిదినమున గలవే? మహామారి, విషూచి, మశూచి తాపజ్వరాదులు మన భారతదేశములోఁ బ్రబలినటుల నేదేశములలోనైనఁ బ్రబలుచున్నవే? ఇవి చాలవా

యట్లు వీనికిఁదోడుగా క్షయరోగ మేభాగమం దుఁజూచినను ముఖ్యముగా యౌవనవంతు లగు స్త్రీపురుషులయందుఁ బ్రబలుచుఁ జెప్ప శక్యముగానిబాధను నుడువవలనుగాని నష్ట మును గలుగఁజేయుచున్నది. మనచంటిబిడ్డ లనేకులు చనిపోవుచున్నారు. ప్రపంచము లోని యేయితరదేశమందు నింత బిడ్డల నష్ట ముండుటలేదు. వేలకువేలు యువకులు, పురుషు లనక స్త్రీలనక జీవనరంగమునందుఁ ఘోర నసమర్థులై, పీతబలులై జీవితకుసుమం బునందే, క్షయరోగ పీడావృతులౌటచే, వాడి, పటుత్వము తరిగి నశించుచుండిరి. యౌవన దశ యందలి జను లనేకులు దేశోపకారంబునకుఁ బనికివచ్చుసమయంబున హేమంతఋతువునం దలి మలయమారుతంబుల వలన నేలకురాలు పండ్లవిధాన నీక్షయరోగబాధచే పుడమికి వ్రాలుచుండిరి. వీనియన్నిటికిని గారణంబేమై యుండును? పునాదిగట్టిలేమియని తేలకమా నదు. తల్లి నీరసపుఁదల్లి; పిల్లమాత్రము నీరస ముగానుండక గట్టిగా బలముకలిగి యెటులుం డఁగలదు? ఆ నీరసత్వం బాబిడ్డరక్తనాళంబు లలో దాని జీవితకాలమంతయు నల్లే ప్రవ హించుచుండును. ఇటీవల వైద్యశిఖామణు లనేకులు క్షయరోగాగమాభివృద్ధులకు సాం ఘిక పారిశ్రామి కార్థికపరిస్థితులు చాలఁ గార ణభూతంబులని గ్రహింపగలిగిరి.

విత్తనముకన్న నది నాటఁబడునేల ము ఖ్యము. భూమి మిక్కిలి సారవంతంబైనచో నేక్రిమికీటకాదులవలనిభయం బనావశ్యకంబు ఈసంగతినే నే ననేకవత్సరములకుఁ బూర్వ ము తెలియఁబరచి యుంటిని. దీనినే యిప్పు డిప్పు డనేకులువైద్యులు తప్పక గ్రహించు చుండిరి. మానవుడే తన దేహములో నస్వస్థత ప్రవేశింప నట్లు చేయువాడు. అటులు స్థాపిత మైన యస్వస్థతయే రోగంబుగా పరిణమిం చును. దారిద్ర్యము, నశుభ్రత నొకవంకయు, వేఱొకప్రక్క తరుగనితంపిగా బహువత్సర ములనుండి పెరుగుచున్న సాంఘికాచారం బులు నలవాటులును భారతదేశములో క్షయ వ్యాధిప్రబలఁ గారణభూతములుగా నొప్పు చున్నవి. కానఁ దమబిడ్డలు దృఢకాయులై యుండునటుల ప్రతిజననీ జనకులును చూచు కొనుట వారి ముఖ్యవిధియైయున్నది. వారు తమబిడ్డలకు పిత్రార్జితముగా ధనమీయకున్న మానె; ఆరోగ్యభాగ్యమునైన నీయవలదా?

౭౹ పెద్దనష్టము

అతినీచము నతిస్వల్పము నగు తిండి; మురికి కాలువలచేతఁ జుట్టఁబడి పాడువీధు లలో దుర్గంధకూపముల దరినుండు జీమూత సంభూతగృహంబులు; ఈపాడు పరిస్థితులలో నారోగ్యవంతులగు స్త్రీపురుషుల యభివృద్ధి అత్యంతకష్టము. పదమూఁడు, పదునాల్గువ త్సరముల పిల్లతల్లుల గర్భమున జన్మించిన బాల లెట్లు ప్రపూర్ణారోగ్య యౌవన తేజ శ్శాలులై యుండగలరు? తల్లులే పిల్లలు. అట్టి చోనది యసంభవంబేకదా? ఈబాల్య వివా హములే, మనజాతియొక్క క్షీణదశకుఁ గారణ భూతములు. బాలికలుగానుండుకన్యకల వివా హము చేసికొనుటగాని వారికి వివాహము

చేసి సంసారభారంబు వారి భుజంబుల మోపు టగాని మానవిక దైవిక విరుద్ధముగాఁ జేయు నొక గొప్పతప్పిదము. నవనాగరక దేశమం దెచ్చటను నీదురాచారము కనఁబడదుగాని, మన దేశమందుమాత్రము బహుప్రబలముగా నున్నది. వేలకు మిక్కుటముగా బాలమాత లుబ్బసముచే మరణించుట గాని, జన్మించుట తడవుగాఁ గాలధర్మమొందు చిన్నశిశువులఁ గనుచుండుటగాని, తటస్థించుచున్నదన నబ్బుర పడవలసిన యవసరము లేదు. ఈపిల్లతల్లులు బలవంతులు,ఆరోగ్యవంతులునగుబిడ్డలఁగనుట కుఁగాను శక్తిబలంబులు లేకుండుటచే నతిసీరసులు బలహీనులునగు బిడ్డలఁ గాంచుచుండిరి.వీరు తమకన్న బలహీనులగు బిడ్డలజన్మమునకుఁ గారణభూతు లగుచుండిరి. ఇటులనే యొక తరమునుండి యింకొకతరము క్షీణించు చున్నది.

మనజాతియంతయు నొక పర్యాయము కండ్లను విప్పి యొడలు తెలిసి ధైర్యసాహసంబులఁబూని, యీ పెద్దనష్టమును దొలఁగింపఁ బూనకున్న నీలోకములోన మనపే రుండకుం డునటుల రూపుమాసి పోవలసివచ్చుదినములు రానున్నవి. నాయనుభవమునుబట్టి చూడ నాకు గోషాపద్ధతియు బాల్యవివాహములును క్షయరోగమున కెక్కుడు కారణభూతము లుగాఁ గన్పట్టుచున్నవి. ఈక్షయరోగము పురుషులలోనికన్న స్త్రీలలో మూఁడురెట్ల ధికనష్టమును గలుగజేయుచున్నది. ఈసాంఘిక దురాచారవిరోధమునకు శాస్త్రనిర్మాణ చట్టములపై నాధారపడుట మననైతిక నీరసత్వంబును వెలిపుచ్చక మానదు. రాజకీయ సాహాయ్యమును గోరకయే యీ చెడుగుల స్వదేశాభిమాన విశ్వాసముగల ప్రతియొక్కరును సాహసించి సవరింప సమకట్టవలెను. ప్రతిజననియు జనకుండును తమకుమారికలకుఁ బదునెనిమిది వత్సరములలోను, కుమారుల కిరువది వత్సరములలోను వివాహములు జరుపమని దైవముముందరఁ బ్రతినసల్పి యటులునడచుకొనినఁ జాలవఱకు సవరణయగును.

దైవము, భారత దేశమున కసమాన తేజస్స్ఫూర్తి బహుమానముల మరియేజాతియైన గలిగియుండిన, గర్వించునట్టివాని నిచ్చియున్నాడు. కనుక మన సాంఘికాచారములచే తను స్వకపోలకల్పితము లగు చెడుగులచేతను మనసంతతిని బాధుచేయకుఁడు; లోకము నందలి మనహక్కులను గోల్పోకుఁడు.

[ఆర్. కృష్ణశాస్త్రి—అనువాదకుఁడు]



# కలియుగధర్మములు

మల్లాది సూర్యనారాయణశాస్త్రి గారు

(ఆంధ్రభవిష్యపర్వములోని కొన్ని పద్యములు)

కలియుగపూర్వసంధి యిది కావున నింతకు ధర్మకర్మముల్
దలఁగకయుండె నింతట నధర్మము జాతుల నాశ్రమంబులన్
గలఁచుట, యల్పకర్మ మధికంబగు ధర్మము గూర్చుటన్న నీ
పలుకుల విస్మయంబగుఁ గృపన్ వినిపింపు కవిప్రభావమున్.

క. అని యడిగిన నాద్వైపా, యనముని నిజయోగదృష్టి నరసి కలియుగం
బున నయ్యెడు పలువింతల, జనమేజయనృపున కిట్లు చక్కఁగఁ దెలిపెన్.

సీ. నరులకష్టసుఖంబు లరయక నరపతుల్, బలిమిమై నదిమి కప్పములుగొందు
రక్షత్రియులు భూమి కధ్యక్షు లగుచాత్మ, భోగ్యభాగ్యంబులఁ బొంగుచుందు
రవనిదేవతలు శూద్రాశ్రయంబునఁ జిక్కి, కష్టజీవనమును గడపుచుందు
రాశూద్రు లవనీసురాచారు లగుదురు, బ్రాహ్మణు లాయుధపాణు లగుదు
రఖిలవేదోక్తకర్మంబు లంతరించు, నెల్లజాతులవారలు నేకపంక్తి
నారగింతురు పానమాంసాశనములఁ, గాంక్ష హెచ్చును బ్రజలకుఁ గలియుగమున.

గీ. తస్కరాచారు లగుదురు ధరణిపతులు, ధరణిపాలకు లగుదురు తస్కరులును
విధి నిషేధంబు లెంతయు వీటఁ బుచ్చి, యెల్లవారును విహరింతు రిష్టమతిని.

క. ధనమునకుం గలగౌరవ, మున నొకవీసంబు సుగుణముల కబ్బదు నీ
చున కయ్యెడి తేటఁగున స, జ్జనునకు నొకచిన్నపనియు సాగదు కలిలో.

గీ. అన్న మమ్ముదు రూరూర నఖిలజనులు, వీధివీథిని విప్రులు వేదములను
వెలకొసంగెద, రందందుఁ గులముకులము, కాంత లమ్ముదు రంగముల్ కలియుగమున

గీ. కపటసన్న్యాసులు వితంతుకామినులును, పుత్రముఖవీక్షణసుఖంబు పొందఁగలరు.
పదియునాఱేండ్లు నిండని బాలకులును, కలినిబిడ్డల తండ్రులై వెలయఁగలరు.

క. తెలుపగుపండ్లును నున్నని, తలలును లాతాము కోర్కితలఁగిన పలుచి
న్నెలు కావిరంగుబట్టలు, నలవడఁ గలివేళ బోడ లగుదురు కాఁపుల్.

గీ. ఉచితకర్మంబు లెల్లరు నుజ్జగింప, బ్రహ్మవాదంబు నూఁతగాఁ బడయఁగలరు
కులమతభ్రష్టు లనియెడి [illegible] మన్నన పడయఁగలరు.

గీ. ఏమి యేమోయి యేమండి యేమిర! యని, యెచ్చుతగ్గులఁ గనిపెట్టి యెచ్చరించు
నట్టిపిలుపులు తారుమా రగుచునుండుఁ, దలఁగు నుత్తమమధ్యమాధమవివక్ష.

చ. ఋతువులు తల్లక్రిందగును, వృష్టియుఁ జిత్రవిచిత్రఖండ ప
ద్ధతిఁ గురియంగఁజొచ్చు గడితప్పనిదూడలు దుక్కిటెద్దులోఁ
గుతలము చౌడువాఱి జిగిఁగోల్పడుఁ గోడులు మెట్ట చేలగున్
హితరుచిఁ బాయు ధాన్యములు నెల్లఫలంబులు కూరగాయలున్.

క. పుడమికడ నున్న మ్లేచ్ఛులు, నడుభూమికి వత్తు రల్ల నడిచోటి జనుల్
కడఁ జొత్తు రిందు నందును, కుడియెడమలు లేక వారికోర్కులు తీరన్.

క. కొని యమ్ముట మోసంబున, ధన మార్జించుటయు దొంగతనమును గలిమిం
గని త్రుళ్లిపడుట వదరుట, యనునివి సామాన్యగుణము లగు నందఱకున్.

క. చెడునడవడిఁ బూర్వార్జిత, మెడలించి సమస్తభోగహీనుం డగుచున్
గడియింప నేర కుండిన, జడమతిఁ బెండ్లాము ప్రోచుసమయము వచ్చున్.

క. విడనాడి సిగ్గు శీలము, తొడవులు, జడముడియె తమకుఁ దొడవుగఁ బడఁతుల్
చెడుతెరువంటుట పడుచుల, గడితము మగవారి కొఱఁత కలిలక్షణముల్.

గీ. వయసుమీఱక వచ్చెడి వార్ధకంబు, హద్దుమీఱిన కోర్కులు వ్యసనములును,
తరుణజనము నణంచు నందఱను నణఁచుఁ, దస్కరాగ్ని నృపత్రయోత్పాతభీతి.

క. వికలాంగు లగుచు నాఁకట, నకనకఁబడువారి యార్తనాదము వెలిగా
నొకనిముస ముండ దట్టులె, యొక కబళము పెట్టు నిల్లు నుండదు కలిలో.

క. ఈసును ద్రోహంబును బే, రాసయుఁ బరదూషణంబు నాత్మస్తవమున్
రోసము బ్రహ్మద్వేషము, దోసపుఁ జేఁతలును జనులతోడన పుట్టున్.

క. వడగండ్లవాన వేండ్రము, వడగాలియు గాలివాన వనపావకమున్
పిడుగులు నుల్కాపాతముఁ, గడునడిఁ దలచూపుచుండుఁ గలియుగమందున్.

సీ. వేదాంతవిద్యావివేకంబు సంసార, పోషణ సాధనంబుగ ఫలించు
ధర్మశాస్త్రపురాణదక్షత్వ మభినవా,చారముల్ సాధింప సందడించుఁ
జదివినకొంచెంబు సాధుసమ్మతిఁ బాసి, సర్వజ్ఞభావంబు సంతరించు
శబ్దార్థభావ సౌష్ఠవదూర నిస్సార, నవనవకావ్యసంతతి జనించు
నఖిలవర్ణంబులు ద్విజత్వ మధిగమించు, నగ్రవర్ణంబుల మహత్త్వ మంతరించు
దయయు సత్యంబు శౌచంబుఁ దత్తరించుఁ, గనఁ దరంబొకో కలికాలజనము సంచు.

గీ. సమయములఁ బత్త్రముల సాక్షిశపథములను, స్వీయకరలేఖనంబుల వేఱుచేసి
యుత్తమర్ణాధమర్ణుల యోగ్యవిధులఁ, బాడి తప్పుదు రన్యాయవాదు లగుచు.

క. పరలోకంబును బూర్వో, త్తరజన్మంబులును బండితమ్మన్యులచే
నరమరఁబడు శాస్త్రంబుల, పరమార్థం బప్రమాణపద్ధతి నరుగున్.

క. కులమత వర్జితకృత్యం, బులు చేసెడివాఁడు సంఘమునఁ బెద్ద యగున్
కులటాపుత్రు లపాంక్తే, యులు క్రతువులు చేయఁ గడఁగుచుందురు కలిలో.

గీ. తల్లిదండ్రుల నియమించుఁ దనయుఁ డెందు, నత్తమామలఁ గోడలు నాడిపోయు
నాలు మగని మగండును నాలి మొఱఁగి, తిరుగుదురు శిష్యుఁ డెదిరించు గురువరేణ్యు.

క. ఉపకారము శూన్యంబగు, నపకారము హెచ్చు నతిథి నభ్యాగతునిం
గృపఁ జూచు గృహస్థుండఁడు, జపహోమ సురార్చనాదిసత్క్రియ లణఁగున్.

క. అందఱు కవనము చెప్పుదు, రందఱు నీతులు వచింతు రందఱు పరకాం
తం దడవుదు రొరులధనం, బందఱు చవిగొందు రంద ఱధికులు కలిలో.

క. లోకం బివ్విధి బహురో, గాకీర్ణము నీచగుణము నల్పాయుష్కం
బై కాఱియపడియెడు హా, హాకారం బెసఁగఁ గలియుగాంతమునందున్.

చ. ఎవనికి వాఁడె యెల్లజగ మేలఁగఁ బూనిన లోభవృత్తిచే
నవనితలంబు నల్గడల సాహసమేర్పడి కీడు మూడు భూ
ధవులు విధించుపన్ను లమితంబగు భూము లొకింతయేని పం
డవు కఱ వెంతయుం బాధనడంచును లోకుల దాన వారలున్.

చ. దారుణమైన యాఁకటికిఁ దాళక యిం డ్లెడఁబాసి దేశసం
చారము చేసి చేసి యొకచక్కిని గూడును గుడ్డలేక కాం
తారసముద్రతీర వసుధాధరభూములఁ జొచ్చి లోకులున్.
నారలు చీర లాకు లశనంబుగ బొందెల నుందు రెట్టులో.

గీ. అట్లు లోకంబు కుతకుతలాడునపుడు, పుడమి నిస్సారమై గొడ్డుపోవు నపుడు
తారకంబులు తమగతుల్ తప్పునపుడు, మొదలులేకుండ ధర్మంబు పోవునపుడు.

వ. ......ప్రచ్ఛన్న వేషులై వనాంతరంబుల నందందు నివసించు మహాత్ములగు తపోధనుల
యనుగ్రహంబున.

చ. అమితవిపత్పరంపరల నవ్విధిఁ జేష్పడియున్న వారికా
హిమరుచి రాహునోట వెలుఁగేది పదంపడి తోఁచినట్లుగాఁ
గ్రమముగ హీనమై కలియుగంబు తుదకు మొదలు వెలుంగు పూ
ర్వపు నీతిధర్మమునం గృతయుగాదిని గన్నులపండువై జనుల్.






[సంపుటము ౨. సంచిక ౧౨ లిరకాయి]

వ. పీతాంబరధరా! మీసాలోక్యంబు నాకు నీభూలోకంబుననే సిద్ధించియున్నది; మీసామీప్యంబు హృదయకమలంబున లభియించె; సారూప్యంబు మీధ్యానంబున నిలిచినది; సాయుజ్యంబు నిద్రాసమయంబునం గలదు; నీకు శరణుసొచ్చినం బాపవిముక్తి సేతునంటివిగావున జీవన్ముక్తి సమకూడె. నీవు నన్నెడబాయకుండుటం జేసి సదానందానుభవంబు గలిగె. నీపై భక్తి యొసంగినందువలన జన్మశుద్ధి యయ్యె. నాలుకకు మీనామామృతంబొసంగినకతన నమృతపానంబుదొరకె. మఱియు మీదాసులసంగతిని యోగము నలవడె. ఇంక నిన్నడిగెడిదేమి? నన్నింటం గృతార్థుల మైతిమి. నమో నమ శ్రీవేంకటేశ్వరా!

వ. శార్ఙ్గాయుధధరా! నిన్ను భజియించి యేమియైనను గోరి యడిగెదనంటినేని నీకంటె నుత్తమవస్తువు లెక్కడ నున్నవి? నీయందే మూర్తిత్రయంబును, ద్వాదశాదిత్యులును, నేకాదశరుద్రులును, నవబ్రహ్మలును, పంచశరన్మరుత్తులును, వసువులును, దిక్పాలకులును, మునులును, సిద్ధగంధర్వపదంబులును, అణిమాద్యష్టైశ్వర్యంబులును, చతుర్దశభువనంబులును, కులాచలదిగ్గజమహానాగసింధుగంగానదీ ముఖ్య తీర్థ సకలసామ్రాజ్యంబులును నున్నవి; పరమపదం బున్నది. మీరు గలచోట నన్నియుం గలవు; మిమ్ముల నాత్మ దలంచిన మాకు సకలసౌఖ్యంబులుం గలవు. నమోనమ శ్రీవేంకటేశ్వరా!

వ. నీలమేఘశ్యామలా! అణువులకు నణువవు; మహాత్ములకు మహనీయుండవు; ప్రకృతిపురుషలకుం బరమాత్మవు; మూఁడుమూర్తులకు మూలమవు; చరాచరంబులకు సాక్షివి; ఊహించిచూచిన నొక్కండవే దేవుండవు; ఏర్పరచిచూచిన ననంతుండవు; తలఁచిన నభేద్యతత్పదుఁడవు? విచారించిన నిర్గుణుండవు; వినంగణాగినఁ గల్యాణగుణుండవు; కన్నులం జూచిన సాకారమవు; స్వరూపవ్యాప్తిని నిరవద్యుండవు; స్వాతంత్ర్యంబున జీవచైతన్యమవు; భక్తిపరులకుఁ బ్రసన్నుండవు; తుది విచారించిన జగత్కర్తవు; యిట్టి నీగురుతు తెలియంగవచ్చు నయ్యా, పెక్కురూపంబులు గలవాఁడవు; పెక్కునామంబులు గలవాఁడవు; వేదవాదులకునునగోచరుండవు. నిన్నుం జేపట్టి కొలువనేరము, నీవే కరుణించి కావవే నమోనమ శ్రీవేంకటేశ్వరా!

కోనేటినిలయా! విరజానదిపర్యంతంబును విడువని ప్రాకృతదేహంబులు మొలచిన జీవులు

తమతమసామర్థ్యంబుల జీవన్ముక్తుల మయ్యెదమన నెట్లువచ్చు? ఇట్టి ప్రకృతిసంబంధంబున వచ్చినయింద్రియంబు లేల జయింపనిచ్చు? అందులకుఁ గారణంబైన మనస్సు నేరీతి నిర్మలంబగును? తన్మూలంబునం జేసినకర్మంబు లేల శాంతింబొందు? అయిన నాఁగాకేమి! ఇందులకు నేల భయంబునొంద? అందులకుఁ గారణం బిన్నివిధంబులం బ్రవర్తిల్లెడు నీమాయ. నిన్నుం గొల్చినవారికి నీమాయ నుపసంహరింపనేర్తువు. తాళముచే యొకవంక నుండగాఁ దలుపు తెఱచునట్టికథ గా నేల? ఇది యెఱింగికదా మున్నిట్టివారలు కొందఱు మీదాసులయి మిమ్ముం బొగడి మీకు శరణు సొచ్చియును మహాత్ములయిరి. ఏము నిదియ యుపాయంబని యెఱుంగుకొంటిమి. నమోనమ శ్రీవేంకటేశ్వరా!

వ. అప్రమేయా! భువి నెన్ని మాయోపాయంబులు గలిగిన మీదాస్యమునకు నీడు రావు. సేయవచ్చుబహువిధపుణ్యంబులు; నీవు దేవుండవని తెలియు విజ్ఞానమునకు సరిగావు. నేరందగుయోగాభ్యాసంబులు; ఇవి నీభక్తితో సరిగావు. ఉండుఁగాకేమి పెద్దతనంబులు కొందఱికిని; మీశరణాగత ధర్మంబుతోఁ బురుణింప రావు. వెలయుచున్నవి పెక్కుశబ్దంబులు; మీతిరుమంత్రస్తోత్రంబువలెఫలంబు లొసంగవు ఇదియెఱుంగుదు. ఇంక నానావిద్యలు; మీసంకీర్తనవిద్యం బోలవు. నెగడెదరుముప్పదిమూఁడు కోట్ల దేవతలు; మీవంటి బలవంతులు గారు. మీ రిచ్చువరంబులకు హానిలేదు. మిమ్ముం గొలిచినవారి పదవులు ధ్రువపట్టములు. యిది లోకదృష్టాంతము. మీచరిత్రలు గణుతింపనలవిగావు. మరియు నితరమార్గంబులు యెండమావుల నీళ్లవంటివి; మిణుఁగురుఁబురువుల ప్రకాశమువంటివి; కాకిపగడలసొమ్మువంటివి; కప్పచిప్పల వెండివంటివి. ఇట్టి భ్రమలం బొరలక మీ(శ్రీ)పాదంబు గతి యని యున్నవారలు ధన్యులు. నమోనమ శ్రీవేంకటేశ్వరా!

వ. నారాయణా! పుట్టువులు హేయమూలమనంగా నూరక రోయుటే కాని అవి యెవ్వరికి నపకారంబులని తెలియఁబడవు. కర్మంబుల ఫలంబులొసంగునని చేయుటకాని యవి మాన నొడంబడుటలేదు. సంసారభారంబున నూఱక జడియుటకాని యది యెవ్వరికి నసహ్యంబని తోఁపదు. మోక్షంబు మంచిదనంగా నాసపడి వెదకుటకాని అది తొల్లి యనుభవించి చూచినదిగాదు. నీవు సర్వేశ్వరుండనంగా విని మ్రొక్కుటగాని నిన్ను నింతటివాఁడవని తెలియ నలవిగాదు. ఏమని విన్నవించెద? నాజ్ఞానంబనగా నెట్టిది? తొలిజన్మంబున నామీఁద మీకటాక్షం జేపాటిపెట్టితిరో యీజన్మంబున మీదాసుండం గాఁ గలిగె. నమోనమ శ్రీవేంకటేశ్వరా! (సశేషము)





# అనుతాపము

చింతలపాటి వెంకట శ్రీరాములు, బి. ఏ., యల్. టి.,

తాప మడరించుచుండు నిదాఘవేళ
స్నిగ్ధనింబతరుచ్ఛాయ శీతవాత
పోతముల సోఁకునఁ మేను పొంగుచుండ
పూఁపవేఁపశలాటువు నాపయిఁ బడ
మోము పైకెత్తి కాంచితి వేముమీఁద
దట్టమగు నాకుజొంపముల్ తనువు నాఁచ
శోణకాంతుల వెదచల్లు శుకముఖంబు.

* * * *

పరిణతరసాలఫలముఁ జెఱకుగడల
మెసవి కేరెడి కీరంబు నసి దొఱంగి
క్షుద్రపిచుమందవృక్షానఁ జొక్కుచుంట
కానఁగానయ్యెఁ బాపిష్ఠికాలమహిమ.

* * * *

అనుచు నటనుండి కదలెడునంతలోన
కంటకావృతమై కుఱంగటఁ జెలంగు
బర్బురానోకహంబుపై బాలపికము [అని
కూయఁగాఁజొచ్చె నెలుఁగెత్తి 'కుహుకుహు'

* * * *

ప్రకృతి నీతిదొఱంగినపగిదిఁ దోచెఁ
జంగమస్థావరంబులభంగి మాఱె.

* * *

ధర్మహానికి నోడక తగవుమాలి
ఆశ్రయనికృష్టతను నెంచ కక్కటకట
కుక్షి నింపుచున్నారు కూళజనులు

* * * *

పక్వఫలములు మంజులపల్లవములు
దుష్టమానవతృష్ణచే దూరమైన
సద్ద్విజాళికి సత్పథసంచరులకు
మరణమె తెఱంగు కాదుసూ మార్గమొండు.

* * * *

జలదముల జారు నీరాను చాతకంబు
చౌటిపడె నాశ్రయించునె చావనున్న ?
కొదమసింగంబు లేనుఁగుమెదడు లేమిఁ
బూరిఁ గఱచునె జీవంబు పోవనున్న ?

* * * *

హెచ్చుపదవుల బిరుదుల నిచ్ఛగించి
స్వీయదేశంబు, స్వప్రజ, స్వేచ్ఛ నాక
త్యాగశీలురు, ధీరు, లుదారమతులు
నీతిపథమును వీడఁగా నేర్తురెట్లు ?

* * * *

ప్రాజ్యమౌ స్వారాజ్యమునకై పాటుపడిన
దాసు, నిజదేశదాసు, నాత్మార్పణంబు
కొలఁది గ్రహియింప నల్పులు వలఁతులెట్లు ?





# హిందీ 'సంత' వాఙ్మయము

పందిరి మల్లికార్జునరావు గారు

పదమూడవ శతాబ్దారంభమునుండి హిందీ వాఙ్మయోత్పత్తి కాదికాలమని చెప్పవచ్చును. విక్రమ శకము* 700 నుండి 1200వరకు పుష్పకవి మొదలయిన వారు జన్మించి తమ రచనలనుగావించి యుండిరి. కాని, యప్పటి గ్రంథములు కాలగర్భమున లీనమైపోయియుండుటచేతను, ఆకాలము నాటిభాష అపభ్రంశభాషా స్వరూపమును సంపూర్ణముగ వీడక, హిందీభాష యొక ప్రత్యేక స్వరూపమును దాల్పకపోవుటచేతను విక్రమ శకము పదిరెండవశతాబ్దాంతిమచరణమందు జన్మించిన 'చందబరదాయీ'నే ఆదికవిగ నెంచుట సమంజసము.

## 'రాసో' యుగము

వి. శ. 1200 నుండి వి.శ. 1500 వఱకును'రాసో యుగ' మని చెప్పవచ్చును. 'రాసో' లనగా రాజపుత్రుల వంశావళులను తెలియజేయు గ్రంథములు. రాజపుత్రుల యొద్దనుండు వందిమాగధులవంటి చారణులచేతను, భాటులచేతను వ్రాయబడిన వర్ణనలు. ఈచారణులు, భాటులు తమరాజు లొనరించినయుద్ధములు,వారిశౌర్య ప్రతాపములు, కీర్తి మొదలగువానిని ఆసువుగను, గ్రంథ రూపముగను వర్ణించుచుండిరి.అట్టివానినే నేడు'రాసో' లనెదరు.

మహమ్మదీయు లాకాలమున భారతవర్షముపై దాడివెడలి, హిందూరాజ్యములను ధ్వంసము చేయుచు, తమరాజ్యములను స్థాపించుచుండిరి. కావున ఆకాలమంతయు యుద్ధములయందు గడచెను. రాజపుత్రులు తమరాజ్యములను సంరక్షించుకొనవలసిన యావశ్యకత కూడ కలిగెను. అందుచేతనే మనము 'రాసో' లయందు యుద్ధవర్ణనలు, రాజుల శౌర్యప్రతాపముల నుద్దీపింప జేయు వీరరసవర్ణనలను చదువగలుగుదుము. సారాంశమేమన, ఆయుగమును మనము సంగ్రామయుగమనికాని 'రాసో'యుగమనికాని చెప్పుట అనుచితము కానేరదు. అందు 'చందబరదాయీ' కవిచే నారంభింపబడి ఆతని కొడుకగు జల్హణకవిచే పూర్తి గావింపబడిన 'పృథ్వీరాజు రాసో' జగనికకవిచే రచియింపబడిన 'ఆల్హాఖండము' శారంగధరునిచే రచింపబడిన 'హమ్మీర్ రాసో' మొదలైనవియును 'విజయపాలరాసో బీసలదేవరాసో' లును ముఖ్యములైనవి.

## సంఘసంస్కరణము: దేశభాషావిజృంభణము

'రాసో' యుగమునకు పిమ్మట దేశము మహమ్మదీయాధిపత్యమునకులోబడిస్వాతంత్ర్యమును గోల్పోయెను. మహమ్మదీయ సంపర్కముచే దేశముయొక్క పరిస్థితులు కొంతవరకును మార్పుచెందినవి. సంఘమునందది వఱకే కొన్నిదురాచారములు వ్యాపించినవి. జాతిభేదము సంకీర్ణమయ్యెను. అది మహమ్మదీయ సంసర్గమున మరియు దృఢముగ పాదుకొనెను. ఉచ్చనీచభావము పెంపొందెను. మతాధిపతులందరును సంస్కృతపండితులైయుండుటచేత మతగ్రంథము లన్నియు సంస్కృతమునందే యుండెను. జనులు మతవిషయక జ్ఞానమును పొందుటకుగాని, జటిలసమస్యలను బరిష్కరింపవలసివచ్చినప్పుడుగాని పండితుల నాశ్రయింపవలసివచ్చుచుండెడిది. అందుచే సామాన్యజనులకు పండితుల సంస్కృత పాండిత్యము తృప్తికరముగ నుండకపోవుటయే కాక, అట్టిజ్ఞానము సులభముగ నందుబాటులో కూడ లేకపోయెను. కావున, వారి వాంఛలను నెరవేర్చుటకును, సంఘమునందు వ్యాపించిన దురాచారములను నిర్మూలము గావించుటకును ఒకమహాప్లవము జరిగెను.'యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత,అభ్యుత్థాన

* ఈవిక్రమశక సంవత్సర సంఖ్యనుండి 57 తీసివేసిన క్రీస్తుశక సంవత్సర మగును.

మహర్షస్య తదాఽఽత్మానం సృజామ్యహ’ మ్మను సూక్తి కనుగుణముగ సమస్తజాతులందును మహాపురుషు లావిర్భవించి దేశభాషలలో పద్యములు, గీతములు, పాటలు, పదములు, మొదలయినవి రచించి తద్వారమున తమభావములను సర్వతోముఖముగ వ్యాపింపజేసిరి. వారు వినిర్మలభావములను మధురముగ గానముచేసియుండిరి. ఉపదేశములనొసంగిరి. ‘దేశికవిత’లో వాఙ్మయమునుసృష్టించిరి. అట్టిదియే నేడు హిందీభాషయం దున్నతస్థానము నధిష్ఠించి ‘సంతవాఙ్మయ’ మను పేరిట విరాజిల్లుచున్నది. ఈవాఙ్మయ ముదారభావపరిపూరితము ఇందు సంకీర్ణత కొంతమాత్రమును తావులేదు. ఇందు దాంభికముగాని, ఆడంబరముగాని మందుకైనలేదు. భక్తి చిప్పిలుచుండును. ఇది సరళహృదయు డగు పసిశిశువు చిరునవ్వువలె తేటయైనది.

సంస్కృతము పండితులభాష. సామాన్య జనుల భాష హిందీ. సంస్కృతమునుచదివి,సంస్కృతములోనికి తమభావముల ననువదింపగలవాడు పండితుడని యాకాలపుపండితులు తలచుచుండెడివారు. జనసామాన్యము వాడు దేశభాషలయందు కవిత్వము చెప్పుట నీచముగ నెంచుచుండిరి. అంతియకాక పూర్వాచారశృంఖలాబద్ధులును, దంభాచార పరాయణులును, శుష్కతర్కప్రియులు నగు పండితోత్తము లిట్టివాఙ్మయమునెడ తిరస్కారభావమును కలిగియుండుటయం దాశ్చర్య మిసుమంతయు లేదు. ఆనాటి ఇట్టి వాఙ్మయమును పండితులు నిరసించుచుండి రనుసంగతి కబీరుయొక్క ఈక్రింది పద్యమువలన విదితమగును.

**संस्कृतहिं पंडित कहै, बहुत करै अभिमान ।**
**भाषा जानि तरक करे, ते नर मूढ अजान ॥**
**संस्किरत संसार में पंडित करे बखान ।**
**भाषा भक्ति दृढ़ावही न्यारा पद निरवान ॥**

(పండితులు సంస్కృతములో మాటలాడుటకు చాల గర్వపడెదరు. హిందీభాష నేర్చి. దానిలోనే తర్కము కావించినచో మూఢత్వము, అజ్ఞానము నను కొందురు. పండితుడు ప్రపంచమున సంస్కృతమునే మాటలాడనిమ్ము. కాని. హిందీభాషయే భక్తిని దృఢపఱచును. అని తాత్పర్యము.)

## గోరఖనాథుడు

ఇట్టి ‘దేశికవితా’ రచనకు మొట్టమొదట ప్రయత్నించినవాడు బాబాగోరఖనాథుడు. ఇతడుహఠయోగ గ్రంథములందుండు మత్స్యేంద్రనాథుడను పేర బరగుచున్న ‘మఛందరనాథు’ని శిష్యుడు. గోరఖనాథుడు హఠయోగమునందు పరిపక్వతను గాంచినవాడు. కావున, నితడనేక చమత్కారములనుకూడ చేయుచుండెడివాడు. ఇతడు శైవమతము నుద్ధరించెను. అది యిప్పుడు ‘గోరఖపంథ’ అనునామముతో వ్యవహరింపబడుచున్నది. ఇతడు సంస్కృతమున గొప్పవిద్వాంసు డయ్యు హిందీభాషాన్యూనత తొలగించుటకై హిందీభాషలోకూడ గ్రంథరచన చేసెను. హిందీలో గ్రంథరచనచేయబూనిన సంస్కృతపండితులలో నితడే మొదటివాడు. ఇతడు సంస్కృతమునందును హిందీలోను సుమారేబదిగ్రంథములను రచియించెను. ఇతనికిని, సంతమతమునకు నెట్టిప్రత్యక్ష సంబంధమును లేకపోయినను, ఇతని రచనాప్రభావము ‘సంతమతము’పై స్పష్టముగ కాన్పించుచున్నది.

## రామానందుడు

అటుతరువాత రామానందుడు వైష్ణవమతమును వ్యాపింపజేసెను. అతడు హిందీలోకూడ పద్యములను రచించెను. అనేక హీనజాతులలోనివారిని తనశిష్యులుగ జేర్చుకొనెను. రామానందునికాలమునుండి భక్తిమతము చాలబాగుగ విజృంభించెను. కబీరు, మంగలిజాతియందు పుట్టిన ‘సేనా’ అనువాడు,తనరాజ్యమును విడచి సన్యాసమును గ్రహించిన ‘పీపాజీ’, ‘జాట్’ కులములోని ‘ధనా’, మాదిగజాతియం దుద్భవించిన ‘రైదాసు’ మొదలయినవా రంద రితని శిష్యులే.

‘సంతవాఙ్మయము’ విశేషముగ గేయరూపమున వర్ధిల్లినది. ఈవాఙ్మయమును పోషించినవారిలో చాలమంది అక్షరపరిజ్ఞానము లేనివారే. కావున ఈ వాఙ్మయము మొట్టమొదట పుస్తకరూపమున వ్రాయబడక, ముఖతః పాటలు, పద్యములు, గేయములు ఇత్యాది రూపముల వెలువడి ప్రజలలో వ్యాపించెను. అటుతరువాత నా రచనలన్నియు సంపుటీకరణము చేయబడినవి. ‘సిక్కుల’వేదముగ పరిగణింపబడు ‘గ్రంథసాహెబ్’ అనునదిట్లు సంపుటీకరణము చేయబడినదే.

## కబీరు

రామానందుని శిష్యులలో నగ్రస్థానమును వహించినవాడు కబీరు. ఇతడు జన్మచే హిందువైనను హిందూ మతదౌర్భాగ్యముచే బట్టలు నేయు మహమ్మదీయునింట పెరుగవలసివచ్చెను. ఇతడు బ్రాహ్మణ వితంతువునకు జన్మించెను. పాప మాసుకస్పృష్టసంతురాలయిన వితంతు వ్రతాన నుద్దేశించి గారాబముగ లాలించుటకు నోచుకొనకపోవుటచే కటిక చెంతనే కొని కాశీలో నొకచోట విడువవలసివచ్చెను. అటుల తరువాత మహమ్మదీయుని యింట పెరిగెను. బట్టలనేత అతనివృత్తియయి నట్లు అతని రచనలను స్పష్టముగ తెలియుచున్నది.

ఇతనిపేరిట సుమారు డెబ్బదియైదు గ్రంథములు కానవచ్చుచున్నవి; కాని అందులో నివి కొన్ని కబీరు రచించినవి కావు. కబీరునకు చదువురాదు. అతనిసూక్తు లన్నియు ముఖతః నచ్చినవే. అటుపిమ్మట నాతనిశిష్యులు మొదలైనవారువానిని గ్రంథరూపమునసమకూర్చిరి. అతని గ్రంథములలో 'బీజక్' 'ఆదిగ్రంథము'లు ముఖ్యములైనవి. కబీరుయొక్క గ్రంథము లితరులచే సంపుటీకరణము చేయబడినవి గనుక అందు పెక్కుమార్పులుకూడజరిగెను. అప్పుడప్పుడు కబీరు చాటువులుగ జెప్పినవగుటచే నొక పుస్తకమందు చూపినగు కొన్నివిషయములు మరలమరల నితరపుస్తకములయందుకూడ కన్పట్టును. ఇతని గ్రంథములయం దన్నిటను మతసిద్ధాంతములు మాత్రమే గోచరమగును. కావున, సాహిత్యజనితానందమును గ్రోలనలెననువారికిం దాశాభంగమగును.

కబీరును హిందువులును మహమ్మదీయులును సమానముగ నాదరించెదరు. హిందువులు 'భక్తకబీ'రనియు, మహమ్మదీయులు 'పీర్‌కబీ'రనియు పిలుచుచుండెడివారట.

రామానంద ఉగ్రాపపండితుడు. ఇతడు పరుమ 'సూఫీ' (Sufi) సంప్రదాయకులతో వాద ప్రతివాదములను జరుపుచుండెడివాడు; కావున కబీరునకుకూడ సూఫీ (Sufi) సిద్ధాంతములను తెలిసికొనుట కనకాశ మేర్పడియు నెను. ఇందువలననే కబీరురచనలయం దాసిద్ధాంతములుకూడ కనబడును. ఇంతేకాకుండ కబీరు రచనల యందు హిందూమత ప్రాబల్యము స్పష్టముగ పొడగట్టును. ఉపనిషత్తులలోని భావములకు సరిపోలుఅనేక ఘట్టము లిందు కలవు. ఇతనిది సఖీసంప్రదాయమైన భక్తి. గురువునుకూడ నితడు చాల పూజ్యభావముతో జూచుచుండెను. ఈశ్వరునిగురువాని గురువునే గౌరవముగ జూచుచుండెను. ఈతని రచనలయందు ప్రేమ, భక్తి, నీతి, అహింస మొదలగువిషయములను గురించినవి కూడ చాల కలవు. ఆచారవ్యవహారములయందు కృత్రిమత్వమును పూజాడంబరమును సర్వదా త్యాజ్యమని ఇతడునమ్మెను. సర్వసుటవ్యాపకుడగు బ్రహ్మను విగ్రహరూపమున పూజించుట మూర్ఖమని తలచెను కావుననే ఇట్లు వచించెను.

**दुनिया ऐसी बावरी, पत्थर पूजन जाय।**
**घर की चकिया काहे न पूजे, जिसका पीसा खाय॥**

(ప్రపంచము పిచ్చిది, ఏలయన రాతిని పూజ చేయును. ఇంటిలోని తిరుగలి నేల పూజచేయరాదు? అది విసరినపిండిని మనము తినుచున్నాము.)

ఇస్లాముమతమునందుకూడ నాతడు దాంభికమును కనుగొనెను. కావున దాని నిట్లు తీవ్రముగ నిరసించెను.

**काँकर पाथर जोरिकै, मसजिद लई चुनाय;**
**ता चढ़ि मुल्ला बाँग दे, क्या बहिरा हुआ खुदाय?**

(రాళ్లు, కంకర ప్రోగుచేసి మసీదును కట్టెదరు. ముల్లా దానిమీదనెక్కి గొంతుకచించుకొని యరచును. భగవంతునికి చెవుడు వచ్చినదా?)

మతముపేరిట వ్యాపించిన అశాంతినికూడ నతడు సరమయినదిగ తలంచెను.

**साधो देखो जग बौराना,**
**साँचि कहौ तो मारन धावै झूठे जग पतियाना।**
**हिन्दू कहत है राम हमारा मुसलमान रहमाना।**
**आपसमें दोऊ लड़े मरत हैं मरम कोई नहीं जाना।**

(మాడుము ప్రపంచము పిచ్చది. నిజముచెప్పినచో కొట్ట వచ్చును. అబద్ధమును నమ్మును. రాముడు మా వాడని హిందువులు చెప్పెదరు. రహీమ్ మావాడని ముసల్మాను లనెదరు. ఇద్దఱునుకూడ తమలోతాము కొట్టుకొనె దరు. కాని, రహస్యము నెవరునుగూడ కనుగొనలేరు)

కబీరు హిందూమహమ్మదీయ మతముల యందు కన్పట్టు భేదములను తొలగించి రెండుమతములను ఏకీకరణము చేయవలెనని ప్రయత్నించెను. ఇతని యనంతర మితని శిష్యులు కబీరుమతమును వ్యాపింపజేసిరి. హిందూ మహమ్మదీయ జాతుల రెంటియందును నేడు కబీరుపంథ నవలంబించినవారు కలరు. కాని, వీరిలో చాలమంది 'నీచ జాతు' లనబడువారియందే విశేషముగ గలరు. వారి గురువులుకూడ నాజాతులందు పుట్టినవారే. కబీరు మొదలగు సంత వాఙ్మయకర్తలు ఎవరికివారే ఒకపంథ నిర్మించు కొని దానిని జనులలో ప్రవర్తింపజేసిరి. ఒక్కొక్క పంథ వారి కొక్కొక్కవిధమైన వేషాచారములు కలవు.

## రైదాసు

ఇతడుకూడ కబీరుకాలమునందు జన్మించినవాడే మాదిగకులమునందు ఉద్భవించెను. ఇతని తండ్రిపేరు 'రగ్ఘూ', తల్లిపేరు 'ఘురబినియా' రైదాసు కాశిలో జన్మించెను. ఇతడుకూడ రామానందుని శిష్యుడే.

రైదాసునకు జ్ఞానమువచ్చినదాదిగ సాధువుల యొక్కయు, సత్పురుషుల యొక్కయు సేవయందు కాలముగడుపుచు, సంపాదించినధనము నంతయు వారి కొరకు వెచ్చించుచుండువాడు. అందుచేత ఇతడనిన తండ్రికి గిట్టదాయె. అతడు చిల్లిగవ్వయైననీయక భార్యా సహితముగ నితనినింటినుండి వెడలగొట్టెను. అయినను రైదాసు ఎంతమాత్రమును ధైర్యమునుగోల్పోక చెప్పులు కుట్టుకొనుచు, జీవయాత్రను గడుపుచు రేయింబవళ్లు భగవదారాధన చేయుచు సద్గోష్ఠియందు కాలము గడుపుచుండెను. మాంసమునుగాని, కల్లుసారాయములను గాని ఇతడు ముట్టనైన ముట్టెడువాడు కాడు.

గుజరాతుప్రాంతమునందితని మతము నవలంబించిన జనులు లక్షలకొలదిగలరు. వారిని 'రవిదాసీయు' లందురు. 'మీరాబాయి' కితడు గురువు. ఇతని కవిత్వమున భక్తిరసము చిప్పిలుచుండును.

**हरि सा हीरा छाँडि कै करै आन की आस।**
**ते नर जमपुर जाहिंगे सत भाषै रैदास॥**
**रैदास राति न सोइये दिवस न करिये स्वाद।**
**अहनिसि हरिजी सुमिरिये छाडि सकल प्रति-**
**वाद॥**

(హరియంటి రత్నమును విడిచి, ఇంకొకదాని కాశించువాడు యమలోకము జేరునని రైదాసునిశ్చయముగ నక్కాణించుచున్నాడు. రేయింబవళ్లు నిద్రాహారములను విడిచి, తర్కములనుమాని, ఎల్లప్పుడును హరినే స్మరింపుము.)

## ధర్మదాసు

ఇతడు వైశ్యకులమునందు పుట్టెను. 'బాంధవగఢనగరము'నందు మంచి ప్రతిష్ఠగలిగిన వర్తకుడు. ఇతడుకూడ కబీరునకు సమకాలికుడు.

ధర్మదాసు చిన్ననాటనుండియు భక్తికలిగి, సాధువులను సత్పురుషులను పండితులను ఎక్కువగ నాదరించుచుండెను. అనేకపుణ్యక్షేత్రములను గూడ దర్శించెను.

మథురానగరమునుండి వచ్చునపుడితడు కబీరును కలిసికొనెను. విగ్రహారాధనను, యాత్రలను, వ్రతములను మాన్పించి, కబీరితనిని 'సంతమతము'లో జేర్చుకొనెను. అటుపిమ్మట ధర్మదాసు కబీరువలన తన సంశయములను నివారించుకొనుచుండెను. కబీరునకును ఇతనికిని జరిగిన సంభాషణ 'అమరసుఖనిధాన' మను గ్రంథమందు విపులముగ వర్ణింపబడెను. అందు జ్ఞానసంబంధమైన విషయములు చాలకలవు.

కబీరుమతములోనికి వచ్చినపిమ్మట ధర్మదాసు తనధనము నంతయు త్యజించెను. కబీరు పీఠమున కాతని యనంతరము ధర్మదాసే అధిపతి యయ్యెను.

## దాదూదయాళ్

ఇతడు వి.శ: 1601 జన్మించెను. ఇతని జన్మస్థానమును గురించికాని, జాతినిగురించి కాని బాగుగ

తెలియుట. కొందరు బ్రాహ్మణుడని, అహమ్మదాబాదు వని కొందరి మతానుసారముగ చెప్పెదరు. ఇతడు గుజరాతీ బ్రాహ్మణుడని కొందరును, మాదిగవాడని మరి కొందరును, దూదేకులవాడని యింక కొందరును జెప్పె దరు. కాని ఈవిషయము ఇదమిత్థమని నిర్ణయించుటకవ కాశము లేదు. సామాన్యజనులలో నీతడు దూదేకులవా డని వాడుక.

దాదూదయాలుని గురువునుగూర్చి కూడ మనకు తెలియదు. కబీరనికొందరును, కబీరుకొడుకైన "కమాల్" అని కొందరును చెప్పెదరు, కాని ఇతడు గురువు నెడ చాల పూజ్యభావమును కలవాడని ఇతని రచనల వలన తెలియును.

ఇతడు చాల దయార్ద్రహృదయుడు కావున నిత రని 'దయాళు'డని పిలుచుచుండెడివారు. దాదూ అంద రిని 'దాదా'అనిసంబోధించుచుండుటచే నీతనికి'దాదూ' అను నామము కలిగెను.

దాదూదయాలుడు 'ఆమేర్', 'జయపురము' 'మార్వాడము', 'బికనీరు' మొదలైనప్రదేశములయందు సంచరించి జయపురమున కిరువది క్రోసులదూరమున నుండు 'నరానా'అనుప్రదేశమందుకొంతకాల మాగిపిదప అక్కడకు మూడునాలుగుక్రోసులదూరమున నుండు 'భరానా' కొండదగ్గరకూడ కొంతకాలముండి, తుద కచ్చట వి. శ. 1660 లో శరీరమును విడిచెను. కావు ననే ఆస్థలమును చాలపవిత్రమైనదిగ నెంచి 'దాదూ' పంథావలంబకులుగౌరవింతురు.'దాదూపంథీ'ల'రాధికారి' ఆప్రదేశముననే యుండును. అక్కడ దాదూదయాలుని మందిరముకూడ కలదు. ఇప్పటికిని, ఆతనిపుస్తకములును బట్టలును అక్కడ ఉన్నవి. ఫాల్గుణశుద్ధ చతుర్థినుండి ద్వాదశివరకును అక్కడ గొప్పయుత్సవము జరుగును.

'భేసధారీవిరక్తు(వేషధారివిరక్తు)'లనియు'నాగా' లనియు రెండుతెగల సన్న్యాసులు యీమతమునందు కలరు. 'భేసధారీవిరక్తులు కాషాయవస్త్రములను ధరించి' భగ వన్నామకీర్తనమునందు తమకాలమును గడిపెదరు. 'నాగాలు' తెల్లనివస్త్రములను కట్టుకొనెదరు. వీరు సేద్యము, వైద్య మునందుగాని సేనలోజేరిగాని తమ జీవితమును గడపె దరు. జయపురరాజ్యమునందలి నాగాలసైన్యము చాలప్ర ఖ్యాతిగన్నది. ఈరెండురకములసాధువులును బ్రహ్మచర్య వ్రతము పాటించి పెండ్లి చేసికొనరు. గృహస్థుల బాలు రను తమమతమునందు జేర్చికొనుచు, మతమును రక్షింపు చుండెదరు. వీరు బొట్టుపెట్టుకొనరు. కంఠమాలనుగూడ వేసికొనరు. తరుచు చేతిలో జపమాలను పట్టుకొనెదరు. తలపై టోపీనిగాని, తలపాగానుగాని ధరించెదరు. వారు ఒకరినొకరు కలసికొనినపుడు 'సత్' (సత్యం) అని పర స్పరము అభివందనములు చేసికొందురు.

ప్రపంచమం దనంతకాలమునుండియు విశ్వరహ స్యమును తెలిసికొనుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. భగవానుని లీలలను పృథ్విపైచూచి ఆనందరసమును పా నముచేయవలెనని దీక్షవహించు సాధకులు సరళ ప్రయ త్నములచేతనే కృతార్థులు కాగలరు. కఠినమైన నియమ నిష్ఠలచేత నారహస్యముగోచరింపదు. కావుననే దాదూ దయాళు డిట్లు నుడివెను.

**ना घर तजा न वन गया ना कुछ किया कलेश।**
**दादू ज्योंही त्यों मिला सहज सुरत उपदेश ॥**

(నే నింటిని వీడలేదు; అరణ్యమునకును వెళ్ల లేదు; క్లేశమునుకూడ పడియుండలేదు. సరళమగుప్రేమ చేతనే నేను పృథ్విని, వాని (భగవానుని) రూపమందు జూచితిని.)

దాదూదయాళుడు నిరంజనము నిరాకారమునగు పరబ్రహ్మము నుపాసించెను. ఆ పరబ్రహ్మమునే ఆతడు సమస్తమందును రమించు రాముడని ధ్యానించువాడు.

హిందీ, పార్సీ, గుజరాతీ, మార్వాడీ, మహా రాష్ట్రము మొదలగు నేకభాషలీతనికి వచ్చును. హిందీ గుజరాతీభాషలలోని ఇతని కవిత్వము రసపరిప్లుతమై హృదయమునకు బాగుగ నాటుచుండును. దాదూ దయా ళుని పాటలందు ప్రేమభావము బాగుగ పరిస్ఫుటమగును. కబీరువలె నీతడుకూడహిందూమహమ్మదీయ భేదము నంగీ కరింపనట్లు ఇతని రచనలవలన కన్పట్టును.

ఈసంతమతమును వ్యాపింపజేసినవారిలో నామ దేవు, చరణదాసు, భీగోదాసు మొదలైనవారనేకులు కలరు. 'సంత' వాఙ్మయము హిందీభాషయందొక ప్రత్యేకరూపమును వహించి యలరారుచున్నది.

ఈవాఙ్మయమందలి భక్తివిషయకప్రభావము, తరువాత వచ్చినకవుల రచనలయందును గూడ జూడ నగును. ఒకహస్తమందు ఖడ్గమును, రెండవ హస్తమందు 'కురాన్‌షరీఫ్'ను ధరించి ఇస్లాము మతస్థులు హిందూమతము నెదుర్కొనినపుడు. దానిని చాలవరకు కాపాడినది 'సంతవాఙ్మయమే'. ఈవాఙ్మయము హిందూ మహమ్మదీ యైకమత్యమునకును, సమ్మేళనమునకు నెక్కువపనిచేసి, హిందువులకును, హిందూమతమునకును ఒనగించినలాభ మపారము.

## గురునానకు

ఈవిధమైన ప్రయత్నమునకు తోడ్పడిన మహామహు డింకొకడు కలడు. ఆతనిపేరు గురునానకు. అతడు రెండుమతములను సమన్వయముచేసి నూతన సిద్ధాంతములను ప్రతిపాదించి తన నూతన మతమును వ్యాపింపజేసెను. దానినే నేడు 'సిక్కు'మత మందురు. ఇతడు హిందువుల పుణ్యక్షేత్రములతోపాటు మహమ్మదీయుల పుణ్యక్షేత్రమగు మక్కాపట్టణమును గూడ సేవించెను. ఇతని రచనలు 'గ్రంథసాహెబ్' నందు గాన నగును. 'గ్రంథసాహెబ్' అందు నానకునితోపాటు అనేక 'సంతమత' ప్రవర్తకుల రచనలుకూడ నున్నవి.

సంతవాఙ్మయము చదువుటకు హృద్యముగను లలితముగను సరళముగను ఉత్తమభావపూరితముగను నుండును. కావుననే నేటికిని ఉత్తరహిందూదేశమునందు పండితులును, పామరులునుకూడ సమానముగ దీని నాదరించుచున్నారు. ఈగేయములుకాని, కీర్తనలుగాని ఒకటి రెండైన నెరుంగని హిందీభాషీయుడుండ డనిన నతిశయోక్తి కానేరదు: ఈవాఙ్మయమందలి సూక్తులు ఇప్పటికి హిందీసాహిత్యమునందంతటను ఉదాహరణరూపమునను, లోకోక్తులుగను వ్యాపించినవి.




# పట్టుగొమ్మ

పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

తానుతునిర్మాణమును స్వాతంత్ర్యముగఁ జేయు
సాలిపురుగట్లు పంచభూతాలఁ జేసి
యొకటొకటినేసి రెండేసి యొనరఁ గూర్చి
మూఁడిటిం జేర్చి నాల్గింటిఁ గూడఁ బెట్టి
యైదు నైక్యమ్మునేసి యిట్టటులు మార్చి
పట్టి గారడివాఁ డాడుబంతులట్లు
తూల్చి యాడించి క్రిందుమీఁదుగ నొనర్చి
విధివిరామము లేకయ విసుపు లేక
అలసతయు లేక తగునాశయమ్ము లేక
కావ్యనాయికఁ జిత్రించుఁ గవియుఁబోలె
వన్నియల నెన్ని యోఁ బూసి ప్రకృతిఁ జేసి
చూచి యానంద మొంది లోఁజొచ్చి తిరిగి
త్రిప్పి సర్వమ్ము నంతలోఁ దృప్తి లేక
చెఱిపి యన్నియు నిర్మలక్షీరజలధి
నలల మెలిలోనఁ దూఁగుటుయ్యాల నూఁగు
సచ్చిదానందమూర్తి యాసత్త్వపుంజ
మమలవిజ్ఞానదీప మనంతరసము
నైన చిరునవ్వు మొలక నే నాశ్రయింతు.




# రేవతీ!

శ్రీమతి పి. రుక్మిణీబాయి గారు

సంతసించితి నీదుగుణముకు
రేవతీ ! యొక్కింతనిలువుము
నీదుసొగసును గోరినట్టి సుహూప
పూరుషు డెంతయున్

నిన్ననుసరించునునుండెనూ_వెను
దిరిగిచూడక పోకుమూ_ఆతనింగడు
వంతబెట్టగలే వెదీ మరిలాభమూ_
మదితలచిచూడంగన్

కటకటా! ఏమాయె ప్రేమలు
కనులలోపల కారముంచవె
బ్రతుకుబాశల భగ్నపరచవె
ఒక్కపరిగా రేవతీ !

యేమిటిది మతి పోయనా నీ
కేమిటికి సిగ్గూ మరిఎందు కీబెదురూ
వెనుదిరిగిచూడక చెరచెరన్ బో
ఎక్కడే నీవు దాగుదూ_

ఆతడెరుగని చోటెదీ_నీకునిల్వగ
తావెదీ_దాగిపోవగ దారెదీ_తప్పి
పోవగపథమెదీ_యిష్టపడి యాతడే
కరుణ నీకున్నన్

ఆతడెంతో పొంగుచూ_పొర్లివచ్చె
ఆసలన్నియు లోప లణచుక నిను
పలుకరించు నెపమ్ముజూపుచు
నిలిచె చాట దరిన్

కన్నెవలపుల కన్నుసైగల
జేసి నిన్నత డపహరింపడు
వశముచేసుకు చిక్కబట్టడు
ఒక్కపరిచూడన్

తేనె చిలికేమాటలందును- సుధలు
విరిసే నవ్వులందును- మనసునందూ
చేతలందూ- యెన్నడే నొక్కింతపల్కెనె
మనసు నొప్పింపన్

చూచు కొండంతాశతో నిను- పల్కరింపగ
మారుభావము- నీదుముఖమున జూచిఏమో
నిలిచిపోయెను వెనుదిరిగిచూచియె
పల్కరించవె యాతనిన్

"ప్రేమపథమును మరచి పడతీ నా
ప్రేమపటమును తూలగొట్టెదె"
అనుచు కన్నుల నీరునించెడి
యాతనింగను రేవతీ !

పాపహేతువు సుమ్ముచెల్లీ !
పల్కరింపకే పారిపోవుట
పెంచుకొన్నా చిన్ని మొగ్గను
చిదిమివేయుట రేవతీ !

సరసిజాతము శిరమువంచిన
చాడ్పున నీవు పలుకరింపక
యుంటచే నతడెంత యేనియు వీరి
డింబలె చూచుగా.







గంధకూటి.
జేతవనము.



'చింపంజి' అను నొకజాతికోతిపిల్ల. ఇటీవల 'కాంగో' లో ఇది చిక్కినది. ఈతల యించుమించుగా మనుష్యుని తలను బోలి యుండు టాశ్చర్యమును గొలుపుచున్నది.



'మామత్' అను ఒక జంతువుయొక్క అస్థిపంజరము. పైచిత్రమున గనుపడుచున్న దంతము ఇప్పుడున్న పెద్దఏనుగుల యున్న వానికంటె చాల పెద్దవి. 'బ్రిటిషు కొలంబియా' లో 'డాసను' సమీపమున నున్న 'సిల్వరు క్రీకు' నందు అలాస్కా సరిహద్దులలో భూమిని త్రవ్వగా నిది దొరకిన.




గండికోట సత్యనారాయణమూర్తి గారు, యం. ఏ.

[వెనుకటి సంచిక తరువాయి]

## ఉత్పత్తి కాండము

### 5-వ ప్రకరణము

### అర్థోత్పత్తికి ఆధారములు: ప్రకృతి

#### ౧. ఉత్పత్తి

ఈ శాస్త్రమునందు ఉత్పత్తి అన దేవునివలె వస్తువులను సృష్టించుట కాదు. మనుజున కట్టి ప్రభావము లేదు. అర్థోత్పత్తివిషయమున మనుష్యునకు సాధ్యమైన దెద్దియన వస్తువులకుండు నైసర్గిక శక్తుల నుచితరీతిని స్వాధీనపరచుకొని అందలి ప్రయోజనములను వినియోగమునకు తగినటుల జేయుటయే. వస్తువులకు స్థలరూపాది భేదంబుల గలుగజేసి వాంఛాతృప్తికి వలయు ప్రయోజనములను గలిగించుటయే ఉత్పత్తి. ముత్యములు కావలసినచో ముత్యపుచిప్పలు దొరకెడుస్థలము కనిపెట్టవలెను; వాటిని తీసుకరాగలిగిన పనివాండ్రుండవలెను; తదుపరి అనేక యంత్రోపకరణసాహాయ్యముచేతను మానుష ప్రయత్నములచేతను ఆముత్తెపుచిప్పలపైని ఎంతయో పనిచేసినగాని ముత్యములు లభించవు. కర్రతో చేయబడు కుర్చీ కావలెనన్న గట్టిమూలముల నివ్వగల చెట్టు నుకొట్టి, దూలమును రంపముతో కోసి, చిన్న చిన్న ముక్కలుగా నరికి, వాటిని కుర్చీకివలయు రూపాదిభేదములు కలుగజేసి, వాటినన్నిటిని పనిముట్లతో సరిగా అమర్చి ఇంక ఎంతయో పనిచేసిన కుర్చీ లభించును. భూమికి వసుమతి అని నామాంతరమున్నది గాని తనంతట వలయుధాన్యాదులను మన కివ్వదు. నీటిసదుపాయముగల తగిన క్షేత్ర ముండవలెను; అటుపిమ్మట దున్నుట, ఎరువువేయుట, విత్తనములజల్లుట మొలకలను తావు మార్చుట మొదలగుపనులన్నియు కాలోచితముగను యుక్తియుక్తముగను వ్యవసాయదారులు జరిగించినగాని ధాన్యాదులు సమకూడవు. వస్తువులకు స్థలరూపకాలభేదములం జేసియే ప్రయోజనములు కలుగుచుండును; సాధనసహాయమున అట్టి ప్రయోజనముల గలిగించుటయే ఉత్పత్తి.

#### ౨. ఉత్పత్తికి ఆధారములు:

ప్రకృతిలోనుండు నైసర్గిక వస్తు శక్తి సముదాయము, మానవశ్రమ (పురుషకారము), మూలధనము (పెట్టుబడిసామానులు) ఈ మూడున్ను అర్థోత్పత్తికి ముఖ్యాధారములు. ఈమూడింటినిన్ని ఉచితరీతిని సమ్మేళనము చేయు నిర్వాహకశక్తి, దేశమునేలెడిదొరతనము వీటినిగూడ భాగ్యోత్పాదక సాధనములుగా గ్రహింపవచ్చును. భూమి (క్షేత్రము, స్థానము), శీతోష్ణస్థితి మొదలగు నైసర్గికస్వభావములు, గనులు, అడవులు, నదులు, పర్వతములు, సముద్రములు మొదలగున వన్నియును ప్రకృతిజాలములోనివే. ఎట్టి భాగ్యోత్పత్తికైన శ్రమ ఆవశ్యకము; శ్రమ రెండువిధములు: దేహశ్రమ, మనశ్శ్రమ. అర్థబాహుళ్యమునకు మూలధనము ముఖ్యమగు కారణము! వినియోగ్యమగు వస్తురూపము నింకపొందని అపక్వపదార్థములు (బట్టలు నేయుటకు వలయు ప్రత్తి, పనిముట్లను, ఇతరవస్తువులను చేయుటకు వలయు ఇనుము, రాతిబొగ్గు మొదలగునవి), యంత్రములు, ఉపకరణములు, ఆయుధములు, పనిముట్లు, ధనము మొదలగు

పెట్టుబడి సామానులన్నియు మూలధనములో చేరినవే, ఇవిఅన్నియును సంపాదాయకంబగు ఫలములను గడించుటకే, అనగా అర్థోత్పత్తికొరకే ప్రయోగింపబడుచున్నవి. పెట్టుబడిసామానులు మనుజుని శ్రమవలనను ఉత్సాహమువలనను జాతమగుచున్నవి. ఏకార్యమునైనను సుళువుగాను వేగముగాను చేయుటకు కొన్ని యంత్రోపకరణసాధనములను సేకరించుకొనుచున్నాము. ఒక పల్లపుస్థలమునుండి మెరకప్రదేశమునకు నీరు పారునటుల చేయుటకు పట్టిచేతులసహాయముతో ఎంతవరకు పని చేయగలము? ఒక మట్టికుండ లేక బిందెసహాయమున కార్యము సులభమగును; ఏతము సహాయమున పని మరింతశీఘ్రముగ నగును; యంత్రసాధనముపయోగించినచో ఒక సెలయేటిజలమునుగూడ మెరకప్రదేశమునకు సుళువుగాను వేగముగాను తోడవచ్చును. దేవునిచే సృజింపబడిన ఈభూమిఫలసాయము మన మనుభవించునటుల పూర్వుల శక్తిసామర్థ్యములచే తయారుకాబడిన పెట్టుబడి సామానులు లేక మూలధనమును మనభాగ్యాభివృద్ధికి సాధనముగా జేసుకొనుచున్నాము. రస్తాలు, వంతెనలు, ఆనకట్లు, వాహనములు, బండ్లు, ఇనుపదారులు, కర్రసామానులు, పొగయోడలు, విద్యుచ్ఛక్తిసాధనములు మొదలగు ననేకములు ఇప్పుడు తయారుచేయబడినవికావు; చాలకాలము క్రిందటినుండియు ఏర్పరుపబడినవి. ప్రతి పురుషాంతరమందును వీటిలో కొన్ని మారుదల నొందుచున్నవి; క్రొత్తవి తయారగుచున్నవి. శాస్త్రవిజ్ఞానము, నాగరికత వృద్ధి అయినకొలది పంచభూతములన్నియును మూలధనసంపత్తిచే మనకు స్వాధీనపడి సేవకావృత్తి చేయుచున్నవి. గాలి,ఆవిరి,విద్యుచ్ఛక్తి మొదలగునవి మనకెన్నియో అద్భుతకార్యములం జేయుచున్నవి. మైసూరురాజ్యములోను నీలగిరిజిల్లాలోను నిర్ఝరములబలముచే విద్యుచ్ఛక్తి ఉద్భవించి పట్టణములకు దీపపువెలుతురు కలిగించుటలోను, గనులలో పని చేయుటకు వలయుకార్యములకును సహకారిగానున్నది గదా ! ఇటులనే విద్యుచ్ఛక్తిప్రభావము ప్రతినాగరికపుదేశమందును భాగ్యోత్పత్తికెన్నియోవిధముల ననుకూలించుచున్నది. సముద్రతరంగములును, సూర్యరశ్మియున్ను విద్యుచ్ఛక్తివలె అర్థోత్పత్తికి ప్రశస్త సాధనములుగా నుండెడి వృధాయగుచున్నవని పలువురుశాస్త్రజ్ఞులు విచారించుచున్నారు. ఆధునిక శాస్త్రవిజ్ఞానప్రాబల్యమునుగూర్చియు, పదార్థ విజ్ఞాన రసాయన శాస్త్రములలో నిత్యము జరుగుచున్న అద్భుతపరిశోధనలగూర్చియు నాస మాలోచించినచో శీఘ్రకాలములో అవికూడ మన భావిభాగ్యోత్పత్తికి తోడ్పడవచ్చునని తోచక మానదు. ప్రకృతి, శ్రమ, మూలధనము వీటిని అర్థోత్పత్తికొరకు బాగుగ సంయోగించెడు వ్యవహార నిర్వాహకశక్తికూడ ఒకదివ్యమగు అర్థసాధనము. ఇంతేకాదు. దేశమందంతటను కలహములున్ను పరదేశీయుల దండయాత్రలున్ను నివారించి ప్రజలభాగ్యసంపత్తిని కాపాడివారి హక్కులను బాధ్యతలను నెలకొలిపి నౌకాశయములు, కాలువలు, ఇనుపదారులు మొదలగు సాధనముల నేర్పరిచి, హస్తకళలకును యంత్రకళలకును వాణిజ్యవ్యాపారాదులకును ఎన్నియోవిధముల నుపకారములజేసి దేశము నుద్ధరించునని ఆదేశపుదొరతనమువారి పరిపాలనక్రమమే కావున అదికూడ అర్థోత్పత్తికి ఒకముఖ్యమగు ఆధారముగ పరిగణింప బడుచున్నది.

### 3. ప్రకృతి (భూమ్యాదులు)

ప్రకృతులలో గాలివలె అనంతములు కానివి అర్థోత్పత్తికి మిగులముఖ్యము. మిశ్రప్రకృతులలో ఎన్నదగినవి పంటలు పండించుటకు, పరిశ్రమల నెలకొలుపుటకు అనుకూలములైన పొలములు, క్షేత్రములు, గనులు, అడవులు, నదులు, కొండలు, సముద్రము మొదలగునవి. ఈప్రపంచమందున్న భూభాగమును హెచ్చించుటకుగాని తగ్గించుటకుగాని మనకు వలనుపడదు. ఆభూమిమీదనే వ్యవసాయాది కృషులను సలుపవచ్చును. జాగ్రతగా గమనించినయెడల ఏవస్తువైనను భూమినుండియే ఉత్పన్న మగుచున్నటుల తెలిసికొనుచున్నాము! ధాన్యాదులు భూమినుండియే పుట్టుచున్నవిగదా! మన ముపయోగించెడు కంబళము గొర్రెవెంట్రుకలతో తయారుచేయబడుచున్నది; గొర్రెలదేహమునుండి వెంట్రుకలు లభించుచున్నవి; ఆగొర్రెల కాహారము గడ్డి మొదలగునవి; అవి అన్నియును భూమిమీదనే పెరుగుచున్నవి. ఇదేవిధముగ మన మేవస్తువును విమర్శించి చూచినను భూమి ప్రత్యక్షముగనో పరోక్షముగనో ఉత్పత్తి

స్థానమని గ్రహింతుము. భూమి మన కనేకవిధముల ఉపకరించుచున్నది. భూమి విరివిగా నున్నందుననే ఉండుటకు చోటుదొరకుచున్నది. చాలచోట్ల భూమి యొక్క విస్తీర్ణతయే భాగ్యకారణము. ఇంక భూమి యొక్క స్థానమాహాత్మ్య మెంతయో ఐశ్వర్యమునకు హేతువగుచున్నది. పట్టణములందుండుభూమి పల్లెటూరి భూమికన్న ఎంతయో ఎక్కువ విలువగలది; రైలుస్టేషన్‌కు దగ్గరగానున్న భూమి దూరముగానున్నభూమి కన్న కొన్నిసమయములందు జాస్తీఖరీదు చేయుచున్నది. బజారువీధులలోనుండు కాళీస్థలము ఒకమారు మూల నుండు కాళీస్థలముకంటె ఎక్కువఖరీదు. ఇందులకు కారణములు చదువరులే సులభముగా గ్రహింపకొన గలరు. భోజనపదార్థములన్నిటికిని భూమియే ఉత్పత్తి స్థానము. సమస్తజీవకోటికి భూమియే ప్రియమైన తల్లి యని చెప్పవచ్చును. ధాన్యాదులకున్ను వృక్షజాతుల కున్ను **వలయు ఆహారపదార్థములన్నియు** భూమియందే లీనమై యున్నవి. అంతేకాదు. నేలబొగ్గు కిరసనూనె, పాదరసము, అభ్రకము, బంగారము, వెండి, ఇనుము మొదలగు లోహములన్నియును గనులలో నుద్భవించును. ఇనుము నేలబొగ్గు అన్యోన్యసమీపస్థములుగా నుండుట వలననే ఇంగ్లాండు మొదలగుదేశములు భాగ్యవంతము లైనవి. సేలముజిల్లా మొదలగుస్థలములలో ఇనుపగనులు న్నవిగాని సమీపమందు రాక్షసిబొగ్గు లేనందున అవి యింకను విశేషప్రయోజనమునకు రాలేదు. ఇనుము కరుగుటకు ఈనేలబొగ్గే మిగుల ఉపయోగించుచుండును. లోకమునందలి ఖనిజసంపదయంతటను హిందూదేశమే అగ్రస్థానము వహించుచున్నదని ప్రసిద్ధి. అడవులుకూడ అర్థోత్పత్తికి మిగుల తోడ్పడి దేశమునకు శుభదాయక ములుగా నున్నవి. ఉష్ణదేశములలో అడవులు ప్రాణ సమానముగా పరిగణింపబడవలెను. వర్షపునీరంతయునిర ర్థకముగ కొండప్రక్కల ప్రవహింపకుండునటుల చేసి ఎల్లకాలములందును నదుల నేకరీతిని మందముగ ప్రవ హించునట్లు చేయుచున్నవి. అడవులందలి చెట్లక్రింద రాలు ఆకులు భూమిలోను ఊరి మంచిఎరువుగ నేర్పడు చున్నది. చెట్ల ఆకులవలన నీటిఆవిరి నాలుగు ప్రక్కల వ్యాపించి గాలియొక్క వేడిమితగ్గి దేశముశాంతమొందు చున్నది. పంటచెరుకునకును ఇండ్లుకట్టుటకును వలయు కలప అడవులనుండిగదా మనకు విశేషము లభించును. అడవులు జంతుసమూహమునకు మేతకై కసవు నొసగు చున్నవి. అడవులలోనుండు వృక్షరాజి మేఘముల నాక ర్షించి వర్షము నొసగును. ఇంతేకాదు; వాణిజ్యోప యుక్తములగు వస్తువులెన్నియో మనహిందూదేశపు టడ వులలో దొరకుచున్నవి. కర్పూరతైలము, మైనము రబ్బరు, లక్క, వెదురు, వార్నిషులు, మంచి గంధపు, తిరువులు, కరక్కాయలు, గుగ్గిలము మొదలగునవి ఎన్ని యో మన యడవులనుండియే సంపాదించు చున్నాము. పూర్వకాలమందు కామ్యక ద్వైత దండకారణ్య వనము లెన్నియో మనదేశమందుండినవని పురాణప్రసిద్ధి. బుద్ధి హీనుల ప్రభావముంజేసి ఆ యడవులన్నియు నాశన మొంది మన దేశమిప్పుడు ఘోరదేవత పాలబడినది. ఇప్పుడు అస్సాము, మైసూరు, తిరువాంకూరు మొదలగు కొన్ని ప్రదేశములలోమాత్రము అడవు లున్నవి. మన ఇంగ్లీషుప్రభుత్వమువారు అటవీప్రదేశముల లాభములను సత్తెరిగినవారు కావున ఈదేశమున మిగిలియుండు అడ వులను రక్షించుటకును లేనిచోట ఉత్పత్తి చేయుటకును శాసనముల నేర్పరిచినారు. గవర్నమెంటు లెక్కల ప్రకారము 24,9000 చదరపుమైళ్ల వైశాల్యముగల అడవు లీదేశమం దున్నట్లు తెలియవచ్చుచున్నది. 1915–1916 లో సుమారు 116 లక్షల రూపాయల రాబడి అడ వులనుండి వచ్చెను. కొండలుకూడ దేశమున కెంతయో ఉపకరించుచున్నవి. నీళ్లక్కడక్కడ నిలిచి చెరువులుగా నేర్పడుటకును, నదులుపుట్టుటకును, మేఘనిరోధ మొనర్చి వానలుగురిపించుటకును, రాళ్లు దొరకుటకును, చల్లగా నుండుటవలన దేహారోగ్యార్థము ఎండకాలమందు నివాస స్థానములుగా నుండుటకును కొండ లెంతయో అనుకూ లించుచున్నవి. ఇక నదులు, నిర్ఝరములు, సెలయేళ్లుకూడ దేశమున కుపకారము చేయుచున్నసంగతి అందరకు తెలిసినదే. మన దేశమందు భూముల నెన్నిటినో సార వంతముగా నుండునటు లొనర్చినవి నదులే. నదులు ప్రజల కనుకూలించునట్లు దొరతనమువారు వంతెనలను, ఆనకట్లను నిర్మించి, కాలువలుత్రవ్వించి, పోగయోడలను నడిపించి ఇంక నెన్నియోవిధముల పాటుపడుచున్నారు. శాఖోపశాఖలుగ భూమిలో ప్రవేశించి వంకరటొంకర్ల

గానుండు తీరములుగల సముద్రములు ఓడ ప్రయాణము లకును, చేపలుపట్టుటకును అనుకూలములై యున్నవి ఐరోపాఖండమందలి దేశములకు సముద్రతీరములే వాణి జ్యమున కెంతెయో సహాయపడుచున్నవి. మన హిందూ దేశమందు బొంబాయితప్ప మరెక్కడను స్వభావసిద్ధ ముగ నౌకాశ్రయములుండుటకు వీలు గాకున్నది. చెన్న పట్టణము, కలకత్తా మొదలగు స్థలములందు నౌకాశ్రయ ములున్నను బొంబాయి నౌకాశ్రయమునకు సరిరావు. నౌకాయాత్రలవలనగదా ఈకాలములో ఎసమతి దిగు మతివర్తకములు జరిగి నానాదేశముల అర్థసంపత్తిసమ కూడుచున్నవి! దేశపు శీతోష్ణస్థితికూడ జనులస్వభావ ములకు దేశమందుత్పన్నమగుబవస్తుసముదయమునకు హేతుభూతంబై ఉన్నది. ఉష్ణప్రదేశములుకొన్నిపంట లకును సమశీతోష్ణప్రదేశములు మరికొన్ని పంటలకును, ప్రత్యేకముగా అనుకూలించియుండును. శీతోష్ణస్థితిం జేసియే మొత్తముమీద మనదేశీయులు విశేషముగ శ్రమపడి పనిచేయక చురుకుతక్కువవారుగను, ఆంగ్లే యులు వారిదేశములో చలి మిక్కుటముగా నున్నందున ఉత్సాహముతో ప్రయాసపడి తెలివితేటలు గలవారు గను ఉన్నారు. ప్రకృతిజాలమును శీర్షిక క్రింద మనము ముచ్చటించిన విషయములన్నియును భాగ్యోత్పత్తికి మూలాధారములై యున్నవి.

## ౪. అధికహీన సమవృద్ధిన్యాయములు

మనము భూమిని సాగుచేసి అనేకఉపకరణముల యొక్కయు మూలధనముయొక్కయు సహాయముతో శ్రమపడి రాబడిని పొందుచున్నాము. క్రొత్తగా సాగు చేయబడిన పొలములు అధికముగ ఫలసాయము నిచ్చును; అట్టిభూములలో ఎరువుమొదలగువాటిని వేసి సత్తువచేసిన యెడల రెండింతలుకన్న ఎక్కువ ఫలసాయము వచ్చును; రెండింతలువేసిన నాలుగింతలుకన్న ఎక్కువరాబడి వచ్చును. దీనినే అధికవృద్ధిన్యాయ మనెదరు. ఎట్టిసార వంతమైన భూమి అయినను కొంతకాలమునకు సారహీ నతనొందును. భూమిలో స్వభావసిద్ధముగనున్నట్టియు పంటలుపండించు శక్తికలవియు అయిన సారవంతము నిచ్చు పదార్థములు కొన్నిపంటలతో అంతమొందును. అప్పుడు ఎరువు మొదలగువాటివిషయమున ఎక్కువ పెట్టుబడిచేయగా పూర్వమునలెకాక యథాక్రమమున మాత్రము ఫలసాయము నిచ్చును. ఇందులకే సమవృద్ధి న్యాయమని పేరు మనము వినియోగించెడు శ్రమయున్ను ఉపయోగించెడు మూలధనమున్ను హెచ్చించినకొలది భూమినుండి సాధారణముగ హెచ్చులాభమునే పొంద వచ్చునుగాని ఎప్పుడును ఒకేవిధముగా కర్చునకుతగిన అధికరాబడిని పొందలేము. జాస్తిరాబడి ఒక హరిహద్దు చేరునరకు మాత్రము వచ్చుచుండును; తదుపరి పెట్టుబ డికి తగినరాబడి రాదు. ఇదియే హీనవృద్ధిన్యాయము. ఈదిగువనుదాహరించిన పట్టికనుచూచినచో ఈ న్యాయము విశదమగును.

| శ్రమ, మూలధనము మీటిమదింపు | భూమినుండి రాబడి | ఒక్కొక్కరూపా యికి రాబడి |
|---|---|---|
| రూ 10 | 50 పుట్లు | 5 పుట్లు |
| ,, 20 | 120 ,, | 6 ,, |
| ,, 30 | 210 ,, | 7 ,, |
| ,, 40 | 240 ,, | 6 ,, |
| ,, 50 | 250 ,, | 5 ,, |
| ,, 60 | 255 ,, | 4¼ ,, |

రూ 30 కర్చుచేసేవరకు రూ 1కి రాబడి హె చ్చుగానే యున్నది; తదుపరి మొత్తముమీద రాబడి జాస్తిఅగుచున్నను మనము కర్చుచేసెడు ప్రతిరూపా యికివచ్చే రాబడితేటు స్పష్టమున్నది. కావున ఆభూమి మీద రూ. 50 కు మించిన పెట్టుబడి పెట్టుటకన్న ఆ ద్రవ్యము నింకొక భూమినిగూర్చి కర్చుచేసిన లాభకర ముగా నుండవచ్చును.

హీనవృద్ధిన్యాయము ఒక్కవ్యవసాయ వృత్తి యందేకాదు గనులు, అడవులు, మత్స్యాశయములు, వీటియందును గూడ వర్తించుననని తెలుసుకొనవలెను. గనులయొక్కలోతు హెచ్చగుకొలది లోహాదులను త్రవ్వి తీయుట కష్టమగుచున్నది. లోహశోధనశాస్త్ర జ్ఞులను, యంత్రముల నడిపించువారిని, పందలకొలది నిపుణులగు కర్మకరులను నియమించి ఎన్నియోసాధన ముల నుపయోగించి ఎంతయోద్రవ్యమును మూలధన ముగా వినియోగించినగాని సురంగాంతర్భాగములలో

నుండు లోహాదులు లభింపకున్నవి. ఖనిజపరికర్షణ పరిశ్రమలలోకూడ ఒక సరిహద్దుచేరినపిదప పెట్టుబడికి తగినరాబడి ఉండదు. కొంతకాలము పరికర్షణ పరిశ్రమ జరిగినపిదప ఎంత పెట్టుబడిపెట్టినను లాభముండదు; కారణమేమన గనులలోనుండు ఖనిజసంపత్తియే అంతమొందును. చేపలవిషయమందుకూడ అంతే. మొదట సులభముగా దొరుకునవే విశేషముగ లభించెడు చేపలు రానురాను సముద్రము మొదలగు జలాశయములలో ఎంతయోదూరము పడవలలోబోయి మంచిమంచి వలలు మొదలగుసాధనముల నుపయోగించినగాని దొరకవు; రానురాను పెట్టుబడిసొమ్ము అధికరించును; శ్రమహెచ్చును; గాని ఇందులకు తగినఫలితము మాత్రము ఒకసరిహద్దునకు పిదప ఉండదు. అడవులవిషయములోకూడ హీనవృద్ధిన్యాయము వర్తించుచుండును. అడవులలో సమీపస్థమగు చెట్లను నరుకుట సులభముగను తక్కువకర్చునకును కావచ్చును. అయితే సమీపమందున్న చెట్లు నరుకబడినపిదప, ఇంకను నరుకదగుచెట్లు దూరస్థమై రాకపోకలు కష్టతరములుగా నుండును; కష్టమునకు తగిన ఎక్కువ ఫలితము ఉండకపోవచ్చును. అడవులలో వేటాడి మృగములనుజంపి మాంసము గైకొనువారి విషయమునగాని కేవలము మృగయావినోదమునే అపేక్షించు వేటకాండ్ర విషయమునగాని ఈన్యాయము వర్తించుచునేయున్నది; మొదట అడవిలో ప్రవేశించి ఆయుధప్రయోగము మొదలగు క్రియలను నిర్వర్తించిన వెంటనే కొన్నిమృగము లగుపడవచ్చును; కష్టమునకుమించిన సౌఖ్యము సమకూడవచ్చును. అయితే ఒకప్పుడు వేటకాడు అటవీప్రదేశముల లోభాగములో ప్రవేశించి తిరిగితిరిగి వేసారినను ఒకమృగమైన లభించక ఎన్నియోకష్టములకుపాలుకావచ్చును. ఈవిషయము మన హిందూపురాణేతిహాసములలో తరుచుగావినుచుందుము.

## ౫. హీనవృద్ధి న్యాయము-యంత్రకళలు

ఈహీనవృద్ధి న్యాయమువ్యవసాయాది పరికర్షణ క్రియలకే చెల్లునా? లేక, హస్తకళల విషయమందును యంత్రకళల విషయమందునుగూడ వర్తించునా అనే సమస్య విచారణీయము. ఏవృత్తికైనను ఏపరిశ్రమకైనను కావలసిన నైసర్గికవస్తువులన్నియును భూమి నుండియే సంపాదింపవలసియుండుటచేతను ఆయావస్తువులను హీనవృద్ధిన్యాయానుసారముగ మితిలేని రాబడి పదార్థములుగ పరిగణించుటకు వీలులేని కారణమునను తుదకు హస్తకళలనుండియు యంత్రకళల నుండియు గ్రహింపబడు లాభముకూడ హీనవృద్ధిసూత్రమునే అనుసరించునని ఒప్పుకొనక తీరదు. హస్తకళలకు యంత్రకళలకు వలయు అపక్వపదార్థసంచయమంతయు భూమ్యాదులనుండియే గ్రహింపబడుచున్నదనుసంగతి మనము మరువకూడదు. కేవలము వ్యవసాయాదివృత్తుల నవలంబించినవారికన్న యంత్రకళలే జీవనాధారముగా నుంచుకొనినవారు భాగ్యవంతులుగ నున్నారుగదా! కావున యంత్రకళలందు హీనవృద్ధిన్యాయము వర్తించనేవర్తించదని వాదించుట తప్పు. కొంతవరకు యంత్రకళల విషయమున అధికవృద్ధిన్యాయము చెల్లుననుట వాస్తవమే. అందువలననే ఐరోపాఖండమువారు కోట్లకొలది మూలధనము ఫ్యాక్టరీలలో వెలవుచేసి యంత్రకళలను నడిపించుచున్నారు. ఏసరిహద్దు దాటినపిదప రాబడి తగ్గుచున్నదనుచున్నామో ఆసరిహద్దు చేరేసరికి యంత్రకళల విషయములో చాలకాలము పట్టును. కాని సర్వకాల సర్వావస్థలయందును పెట్టుబడికి తగిన ఎక్కువ రాబడి యంత్ర కళలందుండునని తీర్మానించి చెప్పలేము. యంత్రోపకరణముల ఉత్కృష్టతవలనను వ్యవహార నాయకుల బుద్ధిసూక్ష్మతవలనను యంత్రకళలలో ఆసరిహద్దు శీఘ్రకాలములో చేరకుండయుండునట్లున్ను పెట్టుబడికనుగుణ్యముగ ఎక్కువరాబడి వచ్చేటట్లున్ను ఫ్రాన్సు జెర్మనీ, ఇంగ్లాండు, జపాన్ మొదలగు దేశములందుండు పారిశ్రామిక నాయకులు విశ్వప్రయత్నములు సలిపి కృతకృత్యులై విశేషముగ భాగ్యసంపాదనము చేయుచున్నారు. యంత్రకళల విషయమునగూడ అమితముగ పెట్టుబడివలన అమితముగ రాబడి రాదు. అందువలననే ఎంత మూలధనము వెచ్చించినను ఎన్ని నూతనవిధానముల నవలంబించినను, లోకమందుండు జనుల కందరికి వలయు బట్టలు, ఒక్క ప్రత్తిఫ్యాక్టరీనుండి తయారు చేయుటకు వీలుకాదు. యంత్రకళలందును హస్తకళలందును, అధికవృద్ధిన్యాయము ననుసరించి చాలకాలమువరకు ఎక్కువ రాబడి వచ్చుచున్నట్లు మన

మెన్ని నిషిద్ధవస్తువులను జూపగల్గినను వాటియందు గూడ ఒక పరిహారము చేరించబడిన హీనవృద్ధిన్యాయము వర్తించుచున్నదని వ్రాసి ముగించెదను.

## ౬. భూమివలన లభించుపంటలు

భూమినుండి మనము గ్రహించు ఉపయుక్తము లైనపంట లెయ్యవి? భూమిని భాగ్యవృద్ధికి హితవగు నట్లు చేయుటెట్లు? హీనవృద్ధిన్యాయమునకు ప్రతికూలమగుకారణము లెవ్వి? ప్రజాభివృద్ధికి తగినఆహారపదార్థాభివృద్ధిఅగుచున్నదా? ఈసమస్యలు దేశపుటార్థికపురోభివృద్ధిని సంబంధించిన చర్చలవలన చర్చనీయములు.

ఈప్రపంచమందుండు భూభాగములు గణుతింపనలవికానిపరిమితి కలవని చెప్పుటకు వీలులేదు. వాటిలో కొన్ని భాగములే వ్యవసాయవృత్తికి ఉపకరించుచున్నవి; అందులో కొన్ని భాగములు సారవంతములుగను మరికొన్ని భాగములు నిస్సారరహితములుగను ఉన్నవి. ప్రతిభూమి మీదను అన్నిపంటలు పండవు. ఏపంటయైనను చాల భూములమీద పండించుటకు వీలైనను భూసారము క్షీణించియుండుటవలన ఒకేవిధమగు పరిమితిగలపంట ఆభూములన్నిటినుండియు లభింపకున్నది. ఇట్టి అవస్థలు మన హిందూదేశమందుకూడ వర్తించుచున్నవి. ఈదేశములో వ్యవసాయవృత్తి కుపకరించుచున్న సాగుబడి భూములపరిమితి 2230 లక్షల ఎకరములు; ఇంకసాగుబడికి రానట్టియు, సేద్యపడుటకష్టము నున్నట్టియు భూములవిస్తీర్ణము 1650 లక్షల ఎకరములు. హిందూదేశపు టుత్తర దక్షిణభాగములందు సింధు, గంగ, బ్రహ్మపుత్ర, మహానది, వంశధార, గోదావరి, కృష్ణ, పెన్నారు, కావేరి, వైను మొదలగు గొప్పనదులు శాఖోపశాఖలుగ ప్రవహించుచుండుటవలన ఆనదులేయే ప్రదేశములగుండ పారుచున్నవో అవి బహు సారవంతములుగానుండును. సింధు, గుజరాతు, రాజపుటానా, పంజాబు, సంయుక్త పరగణాలు, బంగాళము, అస్సాము, చెన్నపురి రాజధానియందలి ముఖ్యముగా గోదావరి, కృష్ణా తంజావూరుజిల్లాలు—ఈ ప్రదేశములందుండు భూమి నదీప్రవాహములగుండ వచ్చెడు బురదవలన సారవంతమై వ్యవసాయవృత్తి కెంతయో అనుకూలించియున్నది. వీటిలో కొన్ని భాగములందు వరిపంటఅధికము. సుమారు 1,90,000 చదరపుమైళ్ల వైశాల్యము గల ప్రదేశములలో మనదేశమందలిజనులకు ముఖ్యాధారమైన వరిధాన్యము పండుచున్నది. పశ్చిమోత్తర పరగణాలలో చాలభాగము, హైదరాబాదు, కైతైవాడు మొదలగుప్రదేశములభూమి వరిపంటల కంతసారమైనది కాదు. వీటిభూసారము ప్రత్తికి, జొన్నలకు, గోధుమలకు, పప్పుదినుసులకు (అనగా ఉలవలు, పెసలు, కందులు, పటాణీలు మొదలగునవి) తగియున్నది. వరి, గోధుమలు, ప్రత్తి, పప్పుదినుసులు ఈపంటలలో కొంత భాగము ఈదేశీయులు విదేశములకు ఎగుమతి చేయుచున్నారు; 1922వ సంవత్సరములోనే మనవారు ఎగుమతి చేసిన ఈసరకులవెల 8396 లక్షల రూపాయలు. ఉష్ణప్రదేశములందును అందులో విశేషించి రేగటినేలలందును ప్రత్తివిశేషముగ పెరుగును. సుమారు 1,58,44,000 ఎకరముల భూమిలో ఇది పైరగుచున్నది. విదేశపుఫ్యాక్టరీలలో వస్త్రరచన కుపయోగించునదియు, 5,865 లక్షల రూప్యముల వెలగలదియు అగు ప్రత్తి 1919 వ సంవత్సరములో మనదేశమువారు ఎగుమతిచేసిరి. ఈదేశపు టితరపంటలలో పేర్కొనదగిన వనేకములున్నవి. నూనెగింజలు (అనగా సెనగలు, నువ్వులు, ఆముదములు, ఆవాలు వేసు, ఇప్ప మొ.) బంగాళము, బొంబాయిరాష్ట్రము, చెన్నరాజధాని, మధ్యపరగణాలు ఈ ప్రదేశములలో జాస్తిగా పండుచున్నవి; అందులో బంగాళములో పంట ఎక్కువ. ఈపంటలలో కొంతభాగముకూడ విదేశములకు ఎగుమతి చేయుచున్నది. 1920లో 2627 లక్షల రూపాయల నూనెగింజ లెగుమతి కాబడినవి. చెరకు, అల్లము, ఉల్లగడ్డ మిరపకాయలు, ఉల్లి మొదలగు తోటజాతిపంటలలో ముఖ్యమైనట్టియు, పంచదారబెల్లము తయారుచేయుట కుపయుక్తమైనట్టియు చెరకు మనదేశమందంతటను 21 లక్షల ఎకరముల విస్తీర్ణముగల భూములలో పైరగు చున్నది; సంయుక్త రాష్ట్రములు, పంజాబు, బంగాళము, బీహారు, ఈప్రదేశములలో చెరకుపంట జాస్తి. పీచుజాతుల పంటలలో పేర్కొనదగినవి గోగునార, కొబ్బరినార, కిత్తనార, అనాసనార, అరటినార మొదలగునవి. వీటిలో ముఖ్యముగునట్టియు, మన దేశపు గుత్తపంటగానున్నట్టియు ఇతరదేశీయు లీదేశమునుండి అవశ్యముగా దిగుమతిచేయవలసినట్టియు పంటగోగునార; ఈపంట బంగాళమునం

ధికము. 1917 వ సంవత్సరపు లెక్కల ప్రకారము మన దేశమందు 27,29,700 ఎకరముల విస్తీర్ణముగల ప్రదేశము లలో గోధుమలు పైరవుచున్నవి. ఇతరపంటలలో ముఖ్యమైనవి ప్రొగాకు, గంజా, గసగసాలు, పొక, వక్కల పాకులు, మిరియాలు, జాజికాయ, తేయాకు, కాఫీ, నీలి మందు నానావిధములపండ్లును, కాయలును వీటిలో గంజా మొదలైనవి విషావస్తువులలో చేరినవి. పొగాకు ఈదేశమందంతటను సుమారు 10 లక్షల ఎకరములభూమి యందు సేద్యము చేయబడుచున్నది. తేయాకుపంట ఉత్తరహిందూస్థానమున విశేషము; సుమారు 6,50,823 ఎకరములప్రదేశములలో ఇది పైరగుచున్నది. నూటికి 92 వంతులపంట ఉత్తరహిందూస్థానములోనే. 1916వ సంవత్సరములో 33,84,70,262 పౌన్లతూనికగల తేయాకీదేశమునుండి ఎగుమతికాబడినది. తేయాకుపంటకన్న కాఫీ పంట తక్కువ; మైసూరు, కొచ్చిన్, తిరువాంకూరు, వైనాడు, నీలగిరి ఈప్రదేశములలో కాఫీపంట ఎక్కువ. నీలిమందు రంగుపదార్థములలో ముఖ్యమైనది; ఇది చాల కాలమువరకు మనదేశమున విశేషముగ పైరుచేయబడి అన్యదేశముల కెగుమతి చేయబడుచు వచ్చినను జర్మనీ దేశపు రసాయనశాస్త్రజ్ఞులు వారి బుద్ధిసామర్థ్యముల వలన నీలిమందునుకృత్రిమముగతయారుచేయగలిగినపిదప నీలిమందీదేశములో విశేషము సేద్యము కాలేదు. మన మిచ్చట సంక్షేపముగా వివరించిన పంటలన్నియును కొద్దిగనో గొప్పగనో హిందువుల కుపకరించుచున్నవని ఒప్పుకొనకతీరదు; ఈపంటలలో కొన్ని మనదేశమువారే వినియోగించుచున్నారు; కొంతభాగము పక్వపదార్థరూపమునసే అన్యదేశముల కెగుమతి చేయబడుచున్నది.

## 7. వ్యవసాయమందలి హీనవృద్ధి సూత్రము నడ్డగించుట కుపాయములు:—

ఈపంటల పరిమితిని మనయిష్టానుసారముగ అధికముచేయలేము; ఇవి అన్నియును వ్యవసాయకృషికి సంబంధించినవే. ఈపంటలు పైరుకాబడు ప్రదేశములు కూడ హీనవృద్ధి సూత్రమునకు లోబడి కర్చుకాబడు మూలధనమునకును, వినియోగింపబడు శ్రమకును తగిన ఎక్కువ రాబడి నివ్వకున్నవి. కావున జనసంఖ్య హెచ్చినకొలది ఆహారపదార్థములు కరువు కావలసియుండును. ప్రజాభివృద్ధి ఎంతవేగముగ జరుగుచున్నదో అంతకన్న వేగముగ ఆహారపదార్థము లభివృద్ధియించినగాని ఏదేశమందైనను సుభిక్షము కలుగదు. ఈసమస్య ప్రతిదేశముయొక్క ఆర్థికసమస్యలలో ముఖ్యతమమైనదని చదువరులు గ్రహించవలెను. ఆహారాదుల కాకరంబగు వ్యవసాయాదికృషులలో హీనవృద్ధిన్యాయ మతిశీఘ్రముగ వర్తించకుండునట్లు చేయుమార్గములెవ్వి? జనసంఖ్య విశేషము విస్తరించకుండునట్లు ఉపకరించు సాధనము లెవ్వి? వాటిని సంస్కరించుటెట్లు? జనసంఖ్యతోపాటు ఆహారపదార్థాభివృద్ధి అగుచున్నదా?

ఈ రెండువిషయముల నిందుకు జాగ్రతగా పరిశీలించవలసి యున్నది.

మన హిందూదేశములో వ్యవసాయమునే జీవనోపాయముగ జేసుకొనువా రెక్కువగా నున్నారు. వెనుకటినాలుగుజనాభా లెక్కల ప్రకారము ఈదేశములో నూటికి ఎంతమంది వ్యవసాయవృత్తిని ఆశ్రయించియున్నారో ఈక్రింది పట్టీనుండి తెలిసికొనవచ్చును.—

| జనాభా సంవత్సరము | నూటికెంతమంది వ్యవసాయదారులు? |
| --- | --- |
| 1891 | 62 |
| 1901 | 68 |
| 1911 | 72 |
| 1921 | 72 |

అన్నివిధములగు సేద్యపునేలల వైశాల్య మీదేశములో సుమారు 2470 లక్షల ఎకరములు; వ్యవసాయమునే నమ్మినవారు 1780 లక్షలప్రజలు. ఇంగ్లాండు మొదలగు పాశ్చాత్యదేశములలో వ్యవసాయవృత్తి నాశ్రయించినవారు చాలతక్కువ; వారులాభకరములగుయంత్రకళలపైననే ఆధారపడియున్నారు. అయినను వ్యవసాయమందలి ప్రశస్తమార్గముల నవలంబించుటవలన ఆంగ్లేయులు ఎకరము 1–కి సుమారు 1919–పౌన్లు తూనికగల గోధుమలు పండించుచున్నారట; మన హిందువులో ఎకరము1–కి 814 పౌన్లే. ఒక్క ఇంగ్లాండేకాదు;యిరోపాఖండమందలి దేశములు, ఉత్తర అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, చీనా, జపాను మొదలగు దేశములందలి వ్యవసాయవృత్తిమనదేశపువ్యవసాయపువృత్తికన్నఎంతో

ప్రశస్తముగానున్నదని విమర్శకులు నిదర్శనముల జూపు చున్నారు. ఈవ్యవసాయకృషిలో నిత్తింపు హీనస్థితి సూత్రము నడ్డగించు ఉపాయములు నాలుగు కానవచ్చుచున్నవి:—(1) లాభకరములైనట్టియు ఎక్కువకాలమధికవృద్ధిన్యాయ మనుసరించునట్టియు హస్తకళలు, యంత్రకళలు మొదలగువాటి నాశ్రయించుట. ఈప్రకరణములోకాదు; ఇంకొక సందర్భమున ఈ విషయము గూర్చి ముచ్చటించెదము. (2) ఇంకను సాగుబడిక్రిందికి రాని భూములను సాగుబడికి దెచ్చుట లేక పాశ్చాత్త్యులవలె ఇతరదేశములకు వలసలుపోయి అచ్చట సుఖజీవనోపాయములను గల్పించుకొనుట. ఈదేశమందెన్నియోభూములింక సేద్యము కాలేదు. బర్మా, అస్సాము, మధ్యపరగణాలు, మధ్యఇండియా, చెన్నరాజధాని—ఈప్రదేశములలో క్రొత్తభూములను కష్టమనకున్న కర్చనకున్న వెనుదీయనియెడల సాగుచేయవచ్చును; లేదా పాశ్చాత్త్యులవలె విదేశములకు వలసపోవచ్చును. ఐరోపా ఖండమువారనేకులు ఆఫ్రికా, ఆస్ట్రేలియా, న్యూగినీ, అమెరికా మొదలగు ప్రదేశములకు వలసపోయి సుఖముగా జీవించుచున్నారు. కాని బలపరాక్రమశూన్యులైనట్టియు,ఐకమత్యమంతగా లేనట్టియుమన హిందువులు ఇతరరాజ్యముల నాక్రమించి ఐరోపాదేశస్థులవలెభాగ్యవంతులగుటకుయత్నించుటహాస్యాస్పదము. కొండప్రదేశములను అడవిప్రదేశములను కష్టపడిసాగుచేసి లాభదాయకంబగు పంటలను పండించవచ్చును. (3) వ్యవసాయవిధానముల నభివృద్ధిచేయుట, జపాన్, అమెరికా మొదలగుదేశములలో భూమినిదున్నుట, విత్తనములుచల్లుట, కలుపుదీయుట, కోయుట, పంటలన మార్చుట మొదలైనపనులలో మిగుల అనుకూలించెడు నూతనవిధానములను ప్రజ లవలంబించి భూఫలసాయమధికముగజేయుచున్నారు. మనవ్యవసాయదార్లు పూర్వాచారములను కట్టిపెట్టి లాభకరములగు క్రొత్తపద్ధతుల ప్రకారము పేడ, గత్తము,బోనీమీలు,సూపర్ఫాస్ఫేట్లు మొదలగు ఎరువులను వేసినయెడల భూసారము పొరరించి భూమినుండివచ్చెడురాబడి అతిశయించును. వ్యవసాయవృత్తిలోకూడ ఇప్పుడు పాశ్చాత్త్యులు యంత్రసాధనములను ఉపయోగించుచున్నారు. తాతముత్తాతల సాంప్రదాయములను కట్టిపెట్టి నూతన మార్గములను త్రొక్కినచో వ్యవసాయముకూడ లాభకరమైన వృత్తి అగును. భూమి సారవంతముగా నుండుటకు జలాధారము ముఖ్యము. పెద్దచెరువులు, నూతులు, కాలువలు త్రవ్వించినచో పంటలు పండుటకెంతయో అనుకూలముగా నుండును. కాలువనీటి సౌకర్యము మనదేశములో సుమారు 48 మిలియన్ల ఎకరముల భూములకే కలదు;ఇంక సుమారు 200 మిలియన్ల ఎకరములభూముల కట్టిసౌకర్యము లేదు; కాని క్రొత్తకాలువలను త్రవ్వించి అట్టిసౌకర్యమును కలుగజేయుట కవకాశము లేక పోలేదు. పయిరులకున్ను ఫలవృక్షములకున్ను తరచుగా సంభవించెడు వ్యాధులను నివారించుటకు వ్యవసాయ శాస్త్రజ్ఞులచే కనిపెట్టబడిన పద్ధతులననుసరించినచో రాబడి అధికముగుననుట నిస్సంశయము. నదీప్రవాహము లుప్పొంగి పంటభూములను పాడుచేయకుండ తగినఏర్పాట్లు జరిగించినచో ముఖ్యముగా నీదేశములో పంటలకెంతయో అనుకూలముగానుండును. మీద పేర్కొనినట్లు వ్యవసాయశాస్త్రసమ్మతమైన మంచిఎరువును ఉపయోగించినచో ఎకరా 1కి పండెడు ధాన్యాదులరాశి వృద్ధినొందుననుటకు పరిశోధనచేసిన పండితోత్తము లీదిగువ పట్టీలో వివరింపబడిన సంగతులను కనిపెట్టినారు.

| ధాన్యాదులపేరు | ఎరువు వివరము | నూటికి ఎంతెజాస్తీపంట లభించును? |
|---|---|---|
| వరి మొదలగునవి | పేడ, గుత్తము, బోనీమీలు, పెట్లుప్పు పదార్థములు, కైనిట్ | 159,219,220,227 |
| ప్రత్తి | సోడానైట్రేటు, సూపర్ఫాస్ఫేటు, కైనిట్, | 200,300 |
| గోధుమలు | సురేకారపువస్తువులు, గత్తము | 48,90,120 |
| ఉరలగడ్డలు | సూపర్ఫాస్ఫేటు, పొటాషుసల్ఫేటు | 140,150 |
| జొన్నలు | ఆకులఎరువు, సూపర్ఫాస్ఫేట్లు | 140,225 |

మూడవకాలములో వేయబడినఅంకెల అర్థమే ఎరువులు ఏమియు వేయనియెడల ఎకరా 1కి పంట 100 మణుగులైతే, రెండవకాలములో చెప్పబడిన ఎరువులను శాస్త్రోక్తముగా ప్రయోగించినట్లయిన (100 + 159) (100 + 219), (100 + 220) లేక 259, 319, 320 మణుగుల పంటపండునని తెలుసుకొనవలెను. ఒక్కొక్కపంట విషయముననే వేర్వేరు ఎక్కువలాభము లుండుటకు కారణము తక్కినవిధానములు భేదించి యుండుట.

(4) వ్యవసాయకళ నుద్ధరించు మార్గముల నవలంబించుట. అప్పులవారి పాలబడి కఠినవడ్డీలను సమర్పించి వ్యవసాయదార్లు చెడిపోకుండ "సహకారపరపతి సంఘములను" (కోఆపరేటివ్ క్రెడిట్ సొసైటీస్) స్థాపించినచో సులభమైన వడ్డీలకు అప్పులు దొరకును. వీటి క్రమమును గూర్చి ఇంకొకసందర్భమున వివరించెదను. జర్మనీదేశములో ఇట్టిసంఘములు వ్యవసాయముననేకాక ఇతర పరిశ్రమలకుకూడ సహాయపడుచున్నవి. మనదేశములోకూడ ఇట్టిసంఘములు కొన్నికలవు; ఇంకా అట్టివి అధికముగా వలెనని విమర్శకుల అభిప్రాయము. నూతనవిధానములను వ్యవసాయ శాస్త్రోక్తముగ గరపు పాఠశాలలు ఈదేశమం దధికముగనున్న వ్యవసాయకళ వృద్ధినొందదని పలువురి అభిప్రాయము. కోయంబత్తూరు పూనా మొదలగు స్థలములలో అట్టి కళాశాల లున్నవిగాని ఈదేశమందలి కాపులవ నేలను దున్ని జీవించెడువారికి అవి అనుకూలించియుండ లేదని కొందరి అభిప్రాయము. గ్రామపాఠశాలలోను ఉన్నతవిద్య గరపు కాలేజీలలోను వ్యవసాయముకూడ పఠనీయశాస్త్రముగ ఏర్పడినచో కొంతవరకు లాభముగా నుండును. ఈకళవిషయమున క్రొత్తక్రొత్త విధానములను దొరతనమువారే అధికద్రవ్యమును వెలవు చేసి అవలంబించి ప్రజలకు మార్గదర్శకులైనచో వ్యవసాయవిషయమున క్రొత్తసంస్కారములు కలుగుననియు, ఇప్పుడు సర్కారువారు ఈవిషయమందు చేయుచున్న పరిశ్రమ ఇంక నధికముగావలెననియును చాలమంది ప్రజ లభిప్రాయ పడుచున్నట్లు కానవచ్చుచున్నది.



# ప్రణయసౌధము

మామునూరు నాగభూషణరావు గారు

లలితసంతోషమలయానిలంబు లేని
ప్రణయకారాగృహంబులో పట్టువడితి
కాంత నీకంటిరెప్ప లొక్కింత విచ్చి
ప్రేమగంధవాహము నన్ను బీల్వనిచ్చి
నీపవిత్రనామంబు ధ్యానింపనిమ్ము.

* * * *

అమలజలమాధురీశూన్యమగు భవద్వి
యోగపుటెడారుల తపించుచున్నవాడ,
అతివ నీదుకటాక్షపీయూషామృతముల
రాలుచిన్కుల నను తప్పద్రావనిచ్చి
నీపవిత్రనామంబు ధ్యానింపనిమ్ము.

* * * *

చిరవియోగాబ్ధి మున్గుచు దరికి జేర
లేక వెత జెందు నామనోనౌక నేడు
కాంత నీచిరునగవు చుక్కాని జేసి
చారుతరప్రేమతీరంబు జేరనిచ్చి
నీపవిత్రనామంబు ధ్యానింపనిమ్ము.

* * * *

ఈవు నను గావ వత్తువో రావో కాని
నేను నీప్రేమసౌధసోపానసవిధ
భూతలము గాచియుంటి నోపొలతి నీదు
సరసపీయూషప్రసాదభిక్షం బొసంగి
నీపవిత్రనామంబు ధ్యానింపనిమ్ము.

* * * *




## శ్రీ భద్రాచల రామదాసు చరిత్రము

ప్రకాశకులు: శ్రీయుతులు ఆర్. వేంకటేశ్వర్ అండు కంపెనీవారు, చెన్నపురి.

రామదాసుపవిత్రనామమును, రామదాసు కీర్తనలను, ఎఱుఁగనిఆంధ్రులుండరు; కాన గ్రంథమునుగూర్చి యిట నేమియుఁ జెప్పనక్కరలేదు.

ఇటఁ జెప్పవలసినవి ప్రకాశకులు, పరిష్కర్తలు (బ్రహ్మశ్రీ. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు) కావించిన పరిశ్రమనుగూర్చియే.

ప్రకృతముద్రణమున 'కథానాయకుని చరిత్రాదిక ప్రశంస' గలదు. ఇది మిగుల విలువగలది. ఏతద్రచయిత లింపుఁ గంచర్ల గోపన్న యను నిజనామముగల రామదాసుని వంశాదికచరిత్రము, ఆ భక్త శిఖామణికిని అక్కన్న మాదన్నలకును గలసంబంధము, వారి చరిత్రము, ఈ రామదాసు చరిత్రకారులగు వరదరామదాసు, సింగరిదాసుల చరిత్రము, ప్రకృత గ్రంథమా యుభయుల కృతులను, రామదాసుగారి కీర్తనలనుగలిపి యుద్ధరించిన విధము, సప్రమాణముగ విరివిగఁ జర్చించినారు. ఈ రామదాసు చరిత్రయందుఁ గల గేయములు కొన్ని భిన్నభిన్నాంధ్ర పద్యగేయముల ఛందః పరిణామములని చెప్పమొదలిడి తోహరానుగూర్చి మాత్రము సోదాహరణముగఁ జెప్పి విరమించినారు.

"ఈచరిత్రలో దాదాపు ఏఁబదిరకముల దరువులు మన ప్రాచీన గేయములగు ద్విపదలనుండియు, రగడలనుండియు, చూర్ణికలనుండియును గ్రహింపఁబడి విచిత్ర సంస్కారముతోఁ గ్రొత్తరూపమునఁ జెలఁగుచు మన కానందమునుగూర్చుచున్నవి. ఈవిషయమును మఱొక్కమాఱు విస్తారముగాఁ జర్చించెదము" అని గ్రంథ విస్తర భీతిని సూచించినారు. సూచియు నిందుఁ బెక్కితరశతకముల నుండియు, గేయగ్రంథములనుండియు గేయములు, పద్యములుఁ జేర్పబడినవని చెప్పిరి; కాని, అవి యేయే గ్రంథములనుండి కైకొనఁబడెనో చెప్పక యున్నక విడిచి స్థలాభావమును శంకించినారు. అమూల్యములును, అత్యావశ్యకములును, నగు నిట్టియంశముల నుజ్జగించుటచే ఆస్తికాగ్రణులగు ప్రకాశకులు తమధర్మమును బూర్తిగా నిర్వహింపమిపోడకట్టుచున్నది. ఇంతియకాక, ఇట్టి యభిగోజ చర్చలు విజ్ఞులగు పాఠకుల కాశాభంగమును సైతముఁ గలిగింపవచ్చును. ఒక్కచో సూచించినట్లు ప్రకాశకులు మున్ముందు గల్గింపనున్న సౌకర్యములలో నీలోపమును దీర్చుట మొట్టమొదటిది.

ఇందొక్కొక్క కీర్తనయును, పల్లవి, అనుపల్లవి, నడుగులు వేఱువేఱుగా నుండునట్లు ముద్రించినారు. గ్రంథాంతమునఁ గీర్తనలయు, పద్యములయు నకారాద్యనుక్రమణికలను జేర్పించినారు. ప్రకాశకులు విశ్వసించున ట్లీవిధముగ ముద్రించుటవలన సంగీతధోరణి చాలినంత లేని వారలకుసైతము పాడుకొనుటకు ననుకూలముగ నుండుననుట నిశ్చయము.

అక్కన్న మాదన్నల చిత్రములు, ఇతి వృత్తమునకు సంబంధించిన ఇతర చిత్రములును ఇందుఁగలవు.

బ్రహ్మశ్రీ పంచాగ్నుల దక్షిణామూర్తి శాస్త్రిగారు రచియించిన అధ్యాత్మ విజ్ఞానపరిపూర్ణమగు పీఠిక గలదు. సప్రౌఢముగ నుండుటచే నాపీఠికవలనఁ బ్రయోజన మంతగా గలుగక పోవునేమో?

తప్పులు కుప్పలుగఁ బనికిమాలిన కాగితములపైఁ ముద్రితమై జదువరులకుఁజీకాకును గల్గించుచుండిన యీ రామదాసుచరిత్రము నిట్లు సర్వాంగ సుందరముగ సిద్ధముచేయించిముద్రించి యాంధ్రలోకమున కర్పించిన శ్రీ వేంకటేశ్వరకంపెనివా రభినందనార్హులు.

*          *          *

## చెన్నపట్టణములో

గ్రంథకర్త: శ్రీయుత.వేమూరి శ్రీనివాసరావుగారు, బి.ఏ., బి. యల్.

అచ్చుముచ్చటలు గూర్చుచున్నది. డిమ్మీ౮పేజీల ౨౭౦ పుటలుగల యీనవలవెల రు. ౧-౪-౦ మాత్రమే.

ఇటీవల సెన్నియో నవల లాంధ్రవాఙ్మయ ప్రపంచమున సృష్టింపఁబడుచున్నవి. వానిలో ననేకము లన్యభాషా పరివర్తనములు. ఈనవల యట్టిదికాదు. స్వతంత్రముగఁ గల్పింపఁబడినది. కథానాయకుఁడు మణిపుర సంస్థాన నివాసుఁడగు సోమేశ్వరుఁడు. అతడు బాల్యము నుండి జరిగిన తనవిచిత్రజీవితమును ముప్పదిప్రకరణములఁ జెప్పినాఁడు. ఇదియొకక్రొత్తతీరనవచ్చును

కథాలేశము: సోమేశ్వరుఁడు రాజమహేంద్రనగరము కళాశాలలో వేదాంతశాస్త్రమున బి.ఏ. ప్యాసయి, సంస్థానమునను, చెంతనున్న తక్షశిల యందును ఉద్యోగమునకుఁ బ్రయత్నించి విఫలమనోరథుఁడయ్యెను. తక్షశిలకుఁ బోయినపు డచట మిత్రుఁడగు విశ్వసుందరుని చెల్లెలు శశిరేఖనుజూచెను. ఆమె లేఁబ్రాయమున నున్న సుందరి; వితంతువు; నవనాగరకురాలు. ఆమె చెన్నపురియందుఁ గళాశాలలో నున్నతాంగ్లవిద్యాభ్యాసము గావింపఁబోయెను. ఆమెయందమును గాంచి సోమసుందరము ముగ్ధుఁడై,యుద్యోగవిషయము నేకాక తల్లిదండ్రులను,ప్రియపత్నిని, ప్రపంచమునుమఱచి యూరుఁ జేరెను. అతని మనస్సుమాత్రము శశిరేఖతోఁ జెన్నపురిఁజేరెను. పిదపనతఁడు శరీరమునుగూడఁ జెన్నపురిం జేర్చుట కెత్తులెత్తెను."ఇతర శాస్త్రములను జెన్నపురికి వెళ్లి చదివినఁ గాని తన కుద్యోగము దొరకదని"యతఁడు తండ్రికి నచ్చఁజెప్పి వెంటనే బయలుదేరి చెన్నపురిఁజేరెను. తిరువల్లిక్కేణి వల్లతంబివీథిలో బసచేసెను. శశిరేఖప్రవేశించిన కళాశాలలోనే సోమేశ్వరుఁడును ప్రవేశించెను. అది మొదలు నవకాశములను గలిగించుకొని యామెతోఁ బరిచయము గలుగునట్లు పలుతెఱఁగులఁ బ్రయత్నించెను. తుద కామె తన్నుఁ బ్రేమించునట్లు చేసికొనెను. వారిరువురు నొండొరులఁ బెండ్లాడఁదలంచిరి. వీరి యిక్కడి సంగతు లుభయుల తల్లిదండ్రులకుఁ దెలిసెను. పరమ సాధ్వియు,నమాయకురాలునగు సోమేశ్వరుని భార్య ప్రియంవద దీనముగ నీవిషయమును గూర్చి యుత్తరమువ్రాసి తనమనోదుఃఖమును భర్తకు వెల్లడించెను. ఈయుత్తరము సోమేశ్వరుని మనమున సంక్షోభ పూర్వకమగు గొప్పమార్పును గల్గించెను. ఆహా! పతివ్రత లెట్టి మహిమగలవారలు! వారి కసాధ్యమేది గలదు? వెంటనే తనకడ కేతెంచిన శశిరేఖ కాయుత్తరమును జూపెను. ఆయువతి ఆశ్చర్యచకితయై "సోమేశ్వరా! మీకు వివాహమయ్యెనా" అనెను. వారపు ఆయువతి యింతవఱకు నాతఁ డవివాహితుఁడనియే తలఁచుచుండెను. అతఁడు తన్ను వంచించు మొఱఁగడు కాన నీయుదంతముచే నామెకుఁ దలపైఁ బిడుగుపడినట్లయ్యెను. ఆమె మనోవృత్తియు మాఱెను. తన్ను గాఢముగఁ బ్రేమించి, అట్లే తన ప్రేమను గాంక్షించి సుశీలయై, వశవర్తినియై మెలఁగుచు సంతతము సంతసమును గూర్చు కులకాంతను వీడి, పరకాంతను గోరెడు నవినీత వర్తనుఁ డెట్టిపాపకృత్యములనైనఁ జేయ నించుకయు శంకింపఁడన్న నిట్టి నసత్యమాడ వెనుదీయునా?

ఈ యిరువురు నిట్లు తమతప్పిదములను గుర్తెఱిగి తమ పూర్వభావములను వీడి యదిమొదలు సోదరులవలె నొండొరులఁ బ్రేమించుచుండిరి. సోమసుందరునకుఁ బ్రియంవద ప్రియంవదయై ముదమునుగూర్చుచు నాతనిని సుఖమయజీవితునిఁజేసెను.

ఈగ్రంథమున శ్రీనివాసరావుగారు సముచితరీతిని జాత్రపోషణము గావించిరి. ఇందలి శశిరేఖా సోమేశ్వరుల సారస్వత చర్చలు, స్త్రీ పునర్వివాహాది సాంఘిక చర్చలు, సంభాషణములు, ఉత్తర ప్రత్యుత్తరములు, మొదలయినవి వీరి నవనాగరకతకు, సంఘసంస్కరణాభిలాషకు నుత్కృష్ట నిదర్శనములు. గ్రంథనామమును సార్థకముఁ జేయుటకై యిందుఁ జెన్న

పురిలో నున్నతకళాశాలాంధ్రవిద్యార్థుల జీవితము చక్కఁగాఁ జిత్రింపఁబడినది. మఱియు, కాఫీహోటలులు, హోటలులు, బీచిషికారులు, సినీమాలు మొదలగు పెక్కువిషయములనుగూర్చి చమత్కారముగఁ జర్చింపఁబడినది. స్వానుభవములేనివారల కీవిధముగవర్ణింప శక్యము గాదనిన సత్యదూరముగాదు. శ్రీరావుగారు చెన్నపట్టణమున నున్నత కళాశాలలయందు విద్యాభ్యాసము గావించెడు నవనాగరకయువకుల వింతవింతపోకడలను దెలుపుటకై దీనిని రచించినట్లు చూపట్టుచున్నది. వారి యుద్దేశ్య మట్టిదే యగునేని దాని నిందు సముచితముగ నిర్వహించి రనఁదగును. అంతయేకాక దీనివలనఁ గొంత సాంఘికాభి వృద్ధియుఁ గలుగవచ్చును. మొదటినుండి తుదివఱకుఁ గథ పొందికగాఁ గూర్పఁబడినది. శైలియు సరళముగనున్నది. ఇతరోపయోగములతోపాటు వినోదముగ నుబుసుపుచ్చుకొనుటకై ఆంధ్రుల కీగ్రంథపఠన ముపకరింపఁగలదు.



# జెండాపాట

పెమ్మరాజు లక్ష్మీపతి గారు

పల్లవి

ఎగురుచుండె జండా - నిగ నిగలు జగతి నిండా

అనుపల్లవి

భారతీయ నవభావపథంబున, భాసిలుచున్న మనోరథంబుపై —నెగురు.

౧. అచ్చపుచీకటు లంతరింపగా, హెచ్చిన వైరములెల్ల ద్రెళ్లగా
పచ్చని యెఱ్ఱని కాంతులతోడ, వియచ్చరపథమున నాట్యముసేయుచు —ఎగురు.

౨. జనని దాస్యమును దలగుతలంపున, ననిమిషనాథుని యమృతపుభాండము
గొనిరా నరిగెడు వైనతేయుఁడో, యననాకసమున రెపరెపలాడుచు —ఎగురు.

౩. పుట్టితి గాంధిమహాత్ముహృదయమున, కట్టితి తురకల హిందువులను, చే
పట్టితిరాటము ధర్మచక్రమని, మిట్టిపడుచు మిరుమిట్లు గొలుపుచును —ఎగురు.

౪. హైందవ క్రీస్తుమహమ్మదీయజన, బృందంబులు దనక్రింద మహాత్మా
గాంధికి 'జే'యను సంగావము మి,న్నందజేయు కోలాహలంబుతో —ఎగురు.

౫. నాగపురములో తనుగట్టిన నవ,నాగరికుల కళ్లెల్ల ద్రెంచుకొని
సాగరములపై నగములపై నూ,రేగుచు ధర్మోజయయని చాటుచు —ఎగురు.

౬. మాటవలదు పోరాటమువల దా, రాటమువల దీరాటముచేతనె
మేటిజయము నేకొనెదనునేనని, చాటుచు తనపటు ధాటిచూపుచును —ఎగురు.

౭. తెల్లజాతులను నల్లజాతులను, ఎల్లజాతులను నేకముసేయుచు
ముల్లోకంబుల నొకచోజేరిచి, చల్లనిరాజ్యము స్థాపించెదనని —ఎగురు.

# అభినవాంధ్ర నటశేఖరులు





పోలిపల్లి ఫార్సు

## శ్రీయుత కొంగర కోటయ్యనాయడుగారు

వీరిది విజయనగరము. వీరు విజయనగరము వాణీవిలాస సభయొక్క ముఖ్య నటకులలో నొకరు. హాస్యరసప్రధానము లగు పాత్రములను ధరించి చక్కగా నటించి పెక్కురచేత బహుమానముల నొందినారు. విజయనగరమునందలి 'ఆంధ్ర భారతీ తీర్థ' వారివలన ప్రథమతరగతి డిప్లొమాను పొందియున్నారు. వీరు ఇంకను రసపుత్ర విజయమునందు "గులాం" "ఫకీర్" "దొంగల" పాత్రలను ధరింతురు. ప్రహ్లాదలో పాములవాని (snake charmer) పాత్రను ధరింతురు. వీరు పాత్రధారులై రంగమున నున్నపు డధికపరిచయముగలవా రయినను వీరిని గుర్తింప జాలరు. అభినయము సద్భుతముగా నుండును.

విజయనగరమునకు 10 మైళ్ళ దూరమున పోలిపల్లి యను గ్రామము కలదు. అక్కడ ఏటేట అమ్మవారి పండువుకు ఉత్సవము జరుగును. వేలకొలది జనులు ఆ యుత్సవసమయమున నక్కడకు వత్తురు. అక్కడ జరిగే విలాసవతీ విలాసవంతుల చర్యలను వర్ణించుగాథ పోలిపల్లి ప్రహసన మనబడును. అందు వీరు ప్రధానపురుష పాత్రమును ధరించి కడు రసవంతముగ నభినయింతురు.



పాములవాడు



గులామ్

## శ్రీయుత భోగరాజు కృష్ణమూర్తి పంతులు గారు

వీరును విజయనగరమువారే. 'విజయరామ డ్రమాటిక్ ఎకాడమీ' నటులలో నొకరు. వీరు పోలిపల్లి ప్రహసనములో ప్రధాన స్త్రీపాత్రమును ధరించి తమ నటనాకౌశల్యమును ప్రదర్శించి ప్రేక్షకులకు సంతోషమును గూర్తురు. మఱియు, భారతి, మంజరి, చిత్రాంగి మొదలగు పాత్రములను ధరించి మెప్పును గాంచినారు. వీరికిని 'ఆంధ్ర భారతీ తీర్థ' వారు మొదటి తరగతి డిప్లొమా నొసగియున్నారు. —ఒక నాట్యకళాభిమాని

# సాభిప్రాయ విశేషములు

ప్రపంచ వ్యవహారము లధ్వాన్నముగ నున్నవి. మాటలయందు శాంతి, చేతలయందు కలహము ప్రపంచస్థితిగను బరిణమించుచున్నది. బాల్డ్విసుగారి ధర్మోపదేశములు, సర్ ఆస్టిను ఛేంబర్లినుగారి స్వస్తివాచకములు మంచిమాటలుగ నున్నవి. మాటల కనురూపమైన కార్యము కొంచెమైనను కార్యములందు గనుపడదు. లోకర్నొయొడంబడికను సఫలము చేయుటకైనను ప్రబలరాజ్యములు పూనుకొనకున్నవి. ఆంగ్లసైన్యములు కొలోనుప్రాంతమును విసర్జించినవి. ఫ్రాన్సునుబట్టినజర్మను బ్రహ్మరాక్షసి భయము మాత్రము విడువలేదు. జర్మనుబంధనమున కేర్పడిన నిర్బంధములను శిథిలము చేయుటకు ఫ్రాన్సు అంగీకరించుటలేదు. జర్మను ప్రభుత్వము నానారాజ్యసమితియందు చేర్చుకొనుటకు విన్నపమును జేసినది. జర్మచు దేశము నానారాజ్యసమితియందుజేరుట ఫ్రాన్సునకు సంతాపకరముగ నున్నది. జర్మను లధోగతిపాలైనను ఫ్రాన్సునకు మనశ్శాంతి గలుగలేదు. ద్వేషపూరితమైన చిత్తమునకు శాంతిగలుగుట యసంభవము. ఫ్రాన్సును విజయోన్మాద మావహించినది. జర్మనులను పీల్చిపిప్పిచేయుటకు ఫ్రాన్సు నిశ్చయించినది. జర్మనురాజ్యము నన్నివైపులను పాశబంధములచే బంధించినది. జర్మను దేశమధ్యమునను హృదయకీలకమైదుర్భరమైనదుఃఖవేదనను గలుగజేయుచున్నది. జర్మను దేశాక్రమణముచేసిన పరదేశసైన్యములు ధర్మనాశనమును చేయుచున్నవి. జర్మనులమానాభిమానములు మంటగలిసినవి. జర్మనులు క్రోధావేశపరాయణులైనను నిస్సహాయులై పరాజితజాతుల కలంఘనీయమగుదుఃఖవేదన ననుభవించుచున్నారు. జర్మనులు స్వయంకృతాపరాధమునకు తగినఫలము ననుభవించుచున్న విధమునను ఫ్రాన్సును, కాలాంతరమునను స్వయంకృతాపరాధమున కనురూపమైన ఫలము ననుభవించుట సహజము. బలాంధకారము వివేకమును పాడుచేయగలవిధమును ఫ్రాన్సు ఉదంతము విశదము చేయుచున్నది.

ఆల్సేసులోరేనులు గలుగజేసిన సంగ్రామదావానలమునకు నూరురెట్లు సంగ్రామదావానలమును వర్తమాన పరిస్థితులు సిద్ధము చేయుచున్నవి. ఫ్రాన్సుదేశ మపారమైన సైన్యమును గూర్చి యున్మాదప్రస్థానమునకు బూనినది. సిరియా మొరాకో ప్రస్థానము లింకను సాగుచున్నవి. మంత్రాంగములు, రహస్యాలోచనలు, గూఢవ్యవహారములు, యథాప్రకారము నడచుచున్నవి. సంగ్రామబీజములకు సంగ్రామఫలము సహజముగను గలుగ నున్నది. పరాసుల దురాగ్రహము జర్మనుల దురహంకారము మహాప్రళయరూపమును దాల్చుటకు నిమిత్తకారణము లేమూలను నేవేళను బుట్టినను పుట్టవచ్చును. పూర్వమునలెనే వైరబీజములు రాజ్యముల నడుమను పెరుగుచున్నవి.

రుష్యా రుమేనియాలు, తుర్కీ-గ్రీసులు, సర్వియా బల్గేరియాలు, జగోస్లావియా పోలాండులు, ఫ్రాన్సు ఇంగ్లాండులు, తుర్కీ-పరిష్యాలు, గ్రేటు బ్రిటను, ఫ్రాన్సు మొదలగు రాజ్యములకు నడుమను వైరబీజములు వర్ధిలుచున్నవి. ఇటలీమహాసామ్రాజ్య ప్రస్థానమున కుపక్రమించినది. ముస్సోలినిగారు ప్రజాస్వాతంత్ర్యములను ప్రతిఘటించుచు నిరంకుశరాజ్యమును జేయుచున్నారు. స్వాతంత్ర్యనామస్మరణమును జేసెడి జాతులను ధిక్కరించుచున్నారు. జర్మనులకు ఇటలిదేశస్థులకు వాక్కలహములు పెరుగుచున్నవి. గ్రేటు బ్రిటనుసామ్రాజ్యప్రస్థానము నఖండముగను జేయుచున్నది. ఇండియా, ఈజిప్టు, ఇరాకు, అరాబియా మొదలగు ప్రాంతములందు సామ్రాజ్య దురభిమాన మశాంతిని పెంపొందించుచున్నది.

అమెరికా ఆఫ్రికా రాజ్యములందు శ్వేత జాతులకును శ్వేతేతరజాతులకును వైరము ప్రబలుచున్నది. శ్వేతజాతుల దురహంకారము శ్వేతజాతులందును శ్వేతేతర జాతులందును ప్రబలద్వేషమును ప్రజ్వరిల్లజేయుచున్నది. విల్సనుమహాశయుని ధర్మసూత్రములు, వర్సేలు సంధినియమములు, నానారాజ్య సమితి నిర్ణయములు సామ్రాజ్యాభిమానమున కెగరగొట్టుకొనిపోయి ధర్మాభిమాన మంతర్ధాన మగుచున్నది. ఈ మహావిలయావస్థయందు రుష్యాయం దుద్భవించిన సాంఘికవిప్లవము జర్మను దేశమునకును చీనా మొదలగు దేశములకును వ్యాపించు నపుడు ప్రపంచమునకు సంప్రాప్తముగానున్న మహోపద్రవము దురవగాహము. భారతదేశస్థితి ప్రపంచస్థితి కనురూపముగను దుర్భరముగను నున్నది. నిరంకుశత్వము వ్యయభారము నిస్సహాయత్వము విభేదములు సర్వసంహారమును జేయుచున్నవి. మతము, ధనము, బలము, ధర్మము, సాహిత్యము చైతన్యము శిథిలములగుచున్నవి. సర్వావృతమైనపరావలంబనస్థితియందు కర్తవ్యము దురవగాహముగనున్నది.

* * * *

భారతప్రభుత్వ విధానము

భారతప్రభుత్వవిధానమునందు సంస్కరణము గలుగకపోయినను ప్రభుత్వహృదయము నందైనను మార్పు గలుగలేదు. శ్రీ రీడింగు ప్రభువు సామ్రాజ్యశాసనసభాసభ్యులకు జెప్పిన గుణపాఠమునె రాజ్యసభాసభ్యులకును జెప్పి నిరంకుశాహంకారమును సువ్యక్తముచేసెను. రాజ్యసభాసభ్యుల తోడ్పాటున కభినందించుచు క్రొత్త సభాసభ్యులకు ప్రభుత్వారాధనధర్మము నుపదేశించి నిరంకుశలక్ష్యమును విశదముచేసెను. శిష్టుల కీ యుపదేశవిధాన మనవసరమని రీడింగుప్రభువునకు దెలిసియున్నను పునరుక్తిదోష మీసందర్భమునందు ప్రభుత్వమునకు లాభదాయకముగాని నష్టదాయకము గాదుగదా? శిష్టసభయం దెందరో మహానుభావులు గవర్నరుజనరలుయొక్కయాజ్ఞను శిరసావహించుటకు సిద్ధముగ నుందురుగదా? ఆజోహుకుం మహానుభావుల కీ యధికారోపదేశముతే వేదవాక్యములు. రాజప్రతినిధి యుపదేశవాక్యములకు దలల నూగించుచు తోకల నాడించెడివారలకు ప్రభుత్వ

సత్కారము సిద్ధముగదా? సామాన్యదృష్టిని ఉద్యోగములును, బిరుదములును, పదవులును నాకర్షించిన విధముగను నిష్కామమైన దేశభక్తి యాకర్షింపజాలదు. నిష్కామమైన దేశభక్తి గాంధిమహాత్మునివంటి మహాత్ములకు సాధ్యము. సేవాఫలము త్యాగమునందువలె లాభమునందు సాధ్యముగాదు. ప్రజలు ప్రతినిధులు త్యాగదీక్షను బూనినగాని దేశవిమోచనమునకు సాధనము గనుపడదు.

దేశభక్తిపరాయణులు వాచాలుకపర్దులు శిష్టసభయందు ప్రభుభక్తిపరాయణులగునపుడు శిష్టసభాప్రభావము సర్వత్ర విదితమగుచున్నది. శిష్టసభయందు స్వరాజ్యవాదులవాదము లరణ్యరోదనములుగ నున్నవి. రాయలుకమిషను నియామకము విషయమై నేత్నాగారితీర్మానయుదంతము శిష్టసభాప్రభావమును విశదము చేయుచున్నది. రాయలు కమిషనువలనను దేశమునకు ప్రయోజనము గలుగదని తెలిసి యున్నది. సామ్రాజ్య శాసనసభ రాజ్యాంగసంస్కరణములను విమర్శించుటకు రెండుటేబిలు సమావేశ మవసరమని నిర్ణయించినది. శిష్టసభ రాయలు కమిషనుతో సంతృప్తిని బొందగోరినది. సర్ మూడిమనుగారి ప్రసంగము ప్రభుత్వ హృదయమును విశదముచేసినది. దేశహితపరాయణులు పాదాక్రాంతులై సంపూర్ణసహకారమును బ్రకటింపనంతవరకును బ్రభుత్వ హృదయము మారుట కవకాశములు లేవని మూడిమనుగారు విస్పష్టము చేసిరి.

కాన్పూరుకాంగ్రెసు తీర్మానము నిస్సారమైనను ప్రభుత్వాధికారమునకుసాకుగనేర్పడినది. అసహాయోద్యమమును కాంగ్రెసుసంత్యజించినది. కాంగ్రెసుపక్షమునను సభ్యులకు శాసనసభాప్రవేశమునంగీకరించినది. స్వరాజ్య పక్షప్రతినిధు లుపసంఘములందు సభ్యత్వము నంగీకరించి పనిచేయుచున్నారు. సామ్రాజ్యశాసనసభ ప్రభుత్వాభిప్రాయముల కనుకూలము గనుబ్రవర్తించుచున్నది. అన్యాయమైనన్యాయస్థాన తిరస్కారశాసనము నామోదించినది. అమరనాథదత్తుగారు బెంగాలు నిర్బంధ శాసనముల నుపసంహరించుటకు జేసిన ప్రతిపాదన మోడిపోయినది. ప్రభుత్వము కోరినమొత్తములు చాలవర కంగీకరింప బడినవి. శాసనసభ నిరాకరించిన మొత్తములను రాజప్రతినిధిపునరుద్ధారణ చేసెను. ప్రభుత్వ వ్యవహారములు సభ్యుల తోడ్పాటుతోను తోడ్పాటు లేకను యథాప్రకారముగను సాగుచున్నవి. ఇంకను నెవరు పాదాక్రాంతులు గావలయునో తెలియకున్నది. కాన్పూరు కాంగ్రెసు తీర్మానమునందుగల"అసహాయయోగసిద్ధాంతము" ను కాంగ్రెసురంగమునుండి తొలగించినగాని ప్రభుత్వమునకు బెంగ తీరదు. స్వరాజ్యసంపాదనమునకు శాసనతిరస్కారము శరణ్యమని కాంగ్రెసునం దన్ని పక్షములవారును నంగీకరించుచున్నారు. శాసనోల్లంఘనసిద్ధాంతమును సయితముపసంహృతము గానంతవరకును భారతీయులయపరాధమును ప్రభుత్వము మన్నింప జాలదు. ఈ యుద్దేశమును సఫలముచేయుటకు సమయోచిత సహాకారపక్షము స్వరాజ్య పక్షమునుండి బయలు దేరి

నది. పిజకలు జక్కీసుపక్షములు సమయోచిత సహకారమును చేసి యనుభవించినభాగ్యము తెలిసియున్నది. అట్టిభాగ్యమే ముందును సహకారమునకు గలుగగలదు. ముస్లిముపదవులు గొప్పయుద్యోగములు బిరుదములు లభించినను నిరంకుశప్రభుత్వము మాత్రము నిర్విఘ్నము గనుసాగగలదనుటకు సామ్రాజ్యశాసనసభల వ్యవహారములు తిరిగి విశదముచేసినవి.

వైస్రాయిమూలమున స్వరాజ్యపక్షము నిరాకరించినపుడు సర్ ఛార్లెసుఇన్నెసు చేసిన హేళనకరమైన ప్రభుత్వవిధానమునకు కంతయును సన్వయించుచున్నది. శాసనసభ నిరాకరించిన విషయముల నన్నిటిని సమర్థించుటకు ప్రభుత్వమున కధికారముగలదని ఇన్నెసుగారు బెదరించిరి. ఆ బెదరింపులు రంగాచార్యులు శివస్వామయ్యరుగార్ల హృదయములను కరిగింపజాలకపోయినను జిన్నాగారు ప్రతిఘటించి వారి యాత్మగౌరవమును విశదముచేసిరి. సభ్యులు ప్రతిఘటించినను రాజ్యాంగరథము నిరభ్యంతరముగను నడుచుచున్నది. ప్రభుత్వవిధానమును నియమించుటకు సామ్రాజ్య శాసనసభకును రాష్ట్రీయ శాసనసభలకును శక్తిలేదని తెలిసియును నాయకులు మామూలుమార్గముననే నడుచుచున్నారు. దేశావృతమాంద్యమును శాసనసభావ్యవహారములు విశదము చేయుచున్నవి. బడ్జెటు ప్రవేశానంతరము స్వరాజ్యపక్షసభ్యులు శాసనసభను విడిచిపోయినను రాజ్యాంగ రథము నడుచుట కభ్యంతరములు గలుగజాలవు.

ఈనెల ఆరవతేదిని డిల్లీనగరమునందు గూడనున్న అఖిలభారత జాతీయోపసంఘము కాంగ్రెసు రాజ్యాంగ ప్రస్థానమును నిర్ణయింప నున్నది. ఈ సమావేశము కాన్పూరు కాంగ్రెసు తీర్మానమును పునః ప్రతిపాదనమును జేయగూడదు. ఆ ప్రతిపాదనమునందయినను క్రొత్తయేర్పాటులు చేయుట కవకాశములు గనుపడవు. సామ్రాజ్య శాసనసభాసభ్యులు వారి స్థానములనువిసర్జించి ఎన్నిక సంరంభము నారంభించుట సహజము. ఎన్ని కలెట్టులున్నను స్వరాజ్యసందర్శనము మాత్రము స్వప్నసందర్శనముగ నుండగలదు.

* * * *

నౌకాదళ నిర్మాణము

రాజ్యసభయందు రీడింగుప్రభువు ప్రకటించిన వరములందు భారతనౌకాదళ నిర్మాణము సంభ్రమమును గలుగజేసినది. ప్రపంచరాజ్యములందు నామరూపములులేని భరతవర్షమునకు నౌకాదళధ్వని యాశాంకురములను గలుగజేయుట సహజము. సత్త్వము లేనిబీజములంకురించుట యసంభవము. సైనికదళమునందు ప్రతిపత్తిలేని భారతీయులకు నౌకాదళమునందు ప్రతిపత్తి గలుగుట యసంభవము. నౌకానిర్మాణాశ్రయములులేని దేశమునందు నౌకాదళనిర్మాణ మసంభవము. యుద్ధసాధనములను నియమించుటకు యత్నములు జరుగుచున్న సమయమునందు బ్రిటీషు రాజ్యాధికారులు సంగ్రామసాధనములను విస్తరింపజేయుటకు బూనుకొనుట యసంగతముగ నుండగలదు. సింగపూరు నౌకాశ్రయనిర్మా

ణము, భారతనౌకాదళనిర్మాణము, బ్రిటీషు సంగ్రామతంత్రఫలము గ నుండ గలదు. ఆకాశయానములనిర్మాణానంతరము యుద్ధనౌకల ప్రయోజనము తగ్గినది. భారత ప్రభుత్వము నౌకాదళమునకుబదులు వాయు దళనిర్మాణమునకు బూనుకొంటయైనను కొంత ప్రయోజనకరము. ప్రయోజనము లేనిపనుల నుపక్రమించుటయును ప్రయోజనముగలపనుల నుపసంహరించుటయునుభారతప్రభుత్వము నకుపరిపాటిగనున్నది. సైన్యవ్యయభారము క్రింద క్రుంగుచున్న దేశముమీదను నౌకాదళ వ్యయభారమునుసయితము మోపుట శాంతికిని సౌఖ్యమునకును సాధనముగాదు. భారతీయుల పారతంత్ర్యము దారిద్ర్యము నౌకాదళనిర్మాణమును నిరర్థకము చేయుచున్నవి.

* * * *

### ఆర్థికస్థితి

సామ్రాజ్యశాసనసభయందును నితరశాసనసభలయందును నాదాయవ్యయముల యంచనాలను ఆర్థికమంత్రులు వ్యక్తము చేసిరి. ఆర్థికవ్యవస్థలందు గణనీయమైన విషయము గనుపడదు. పన్నులను హెచ్చించుటకుగాని తగ్గించుటకుగాని క్రొత్త ఏర్పాటులు లేవు. నూలు సుంకమును తీసివేయుట గణనీయాంశము. చిరకాలమునుండియును దూదిపరిశ్రమకు ప్రతిబంధకముగనున్న సుంకమును తీసివేయుటవలనను దూదియంత్రములకు కొంత ప్రయోజనము గలుగగలదు. సైన్యవ్యయమునందుజూపిన తగ్గుదల యతిస్వల్పము. సైన్యవ్యయము 50 కోట్లకు నియమించవలయునని నిర్ణయమైనను వ్యయముతగ్గుటలేదు. దేశాదాయమునందు సగముభాగము సైన్యపోషణమునకు వినియోగపడుచున్నపుడు దేశక్షేమము దుస్తరము. రాగలసంవత్సరమందు 55 కోట్లు సైన్యవ్యయము గతసంవత్సరము కంటెను రాగలసంవత్సరమునందు 50 లక్ష లధికముగా నున్నది. గతసంవత్సరమునందు రైలుశాఖవలనను ప్రభుత్వాదాయమువృద్ధిని బొందినది. రైలు శాఖయందు నూతనకార్యములకు వ్యయమధికముగను జేయబడుచున్నది. రైలుసామానులకధికముగ వ్యయముచేయుటవలన సొమ్ము బ్రిటీషుద్వీపములకు జేరగలదు. గతసంవత్సరమునందంచనాకంటెను 1, 06, 00, 000 నిలువఏర్పడినది. రాగలసంవత్సరమునం దాదాయము రూ.133,43,00,000లు, వ్యయము రూ. 130,38,00,000లు నిలువ రూ. 3,05,00,000లు. గారడివాని హస్తలాఘవమువలెను బ్లాకెటుగారు ఆర్థికపత్రమును జూపగలిగిరి. రాగల సంవత్సరము మూడుకోట్లు నిలువ యేర్పడునపుడు దానిని సద్వినియోగము చేయుట యవసరము. చెన్నరాష్ట్రపుకప్పమును పూర్తిగను దీసివేసినగాని రాష్ట్రమునకు విమోచన సాధనములేదు. రాజ్యాంగసంస్కరణములకును ఆర్థికసమస్యలకును సంబంధమును గల్పింపజనదని బ్లాకెటుగారు కోరుట విచిత్రము. భారతీయులు కోరునది నిర్ణయాధికారముగాని లెక్కలుగాదు. సొమ్మునిలువయున్నను నిర్ణయాధికారము నిరంకుశప్రభుత్వమునందున్నంతవరకును దేశక్షేమమునకు సాధనముగనుపడదు.

చెన్నరాష్ట్రాదాయ వ్యయ ములను దేశావృత్తమైన దుర్దశను విశదము చేయుచున్నవి. గతసంవత్సరాదాయము రూ. 16,41 96,000, వ్యయము రూ. 16,35,77,000 లు. గతసంవత్సరపునిలువ 61,91,000. రాగలసంవత్సరమునందాదాయము రూ. 16,34,20,000 వ్యయము 17,10,66,000, లోటు 76,46,000. రాగల సంవత్సరమునందు క్రొత్తపనులకు వ్యయము రూ. 62,50,000లు. ఇందువిద్యాభివృద్ధికి రూ. 15,59,000 వినియోగపడగలదు. గతసంవత్సరమునందు వరదలవలనను రాబడితగ్గినది. స్టాంపుల ఆదాయము 5½ లక్షలు పెరిగినది. జలాశయములకుదక్షిణ దేశమునందు ద్రవ్యము వ్యయపడుచున్నటు ఉత్తరప్రాంతములకు వ్యయపడుటలేదు. మోయిరుగారార్థికస్థితి చక్కగలేదని యంగీకరించిరి. చెన్నరాష్ట్రము సామ్రాజ్య ప్రభుత్వమునకు సమర్పింపవలసిన కప్పము తగ్గనంతవరకును నార్థికవిషయములందు చెన్నరాష్ట్రమునకు మోక్షసాధనము గనుపడదు. పరావలంబనము గలుగజేయుచున్న యనర్థపరంపరలను సామ్రాజ్య ప్రభుత్వార్థికస్థితియును రాష్ట్రప్రభుత్వముల యార్థికస్థితియును విశదము చేయుచున్నవి. నిరంకుశప్రభుత్వము ప్రాతపద్ధతులనే యవలంబించునని యధికారుల ప్రసంగములు విశదముచేసినవి. బడ్జెటునంతయును నిరాకరించి స్థానములను ఖాళీచేయుటకు స్వరాజ్యపక్షము సంకల్పించినది. స్వతంత్రపక్ష సహాయములేక యిది సాధ్యముగాదు. స్వరాజ్యపక్షము స్థానములను వెంటనే ఖాళీచేయుటవలనను ఎన్నికలయందు కొంతలాభము స్వరాజ్యపక్షమునకు గలిగినను రాజ్యాంగరంగమునందు భేదము విశేషము గలుగజాలదు. హిందూమహమ్మదీయవిభేదములు, బ్రాహ్మణ, కమ్మ, కాపు, వెలమ కులభేదములు, స్థానిక ప్రయోజనములు, రాజకీయపక్షభేదములు రాజ్యాంగరంగమును బీభత్సముచేయుచున్నవి. ప్రజలు స్వకుల లాభములను స్వపక్ష లాభములను పరిత్యజించి దేశప్రయోజనముల నారాధించుటకు గాంధిమహాత్ముని నిర్మాణ విధానము సాధనముగాని శాసనసభలు సాధనభూతములు గాజాలవు. శాసనసభల యనుభవము సమ్మోహమును పోగొట్టినగాని నాయకుల చిత్తవృత్తి మారజాలదు. స్వరాజ్యపక్షమునకు శాసనసభలయనుభవము గలుగుటకుగాను ప్రజలు రాగలయెన్నికలయందు స్వరాజ్యపక్షాభ్యర్థులకు సమ్మతుల నిచ్చి కాంగ్రెసు ప్రతిభను గాపాడుటకు బాటుపడుటధర్మము. దేశము సందిగ్ధస్థితియందున్న సమయమునందు ప్రజలు కాంగ్రెసుప్రతిష్ఠను గాపాడుటకు యావచ్ఛక్తిని వినియోగించెదరని నమ్ముచున్నాము.



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G.T. Madras


విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—శ్రీలక్ష్మీదేవి; పండ్లపడుచు.

సాధారణ చిత్రములు:—మహాత్మ కబీరు; రీడింగుప్రభువు, ఇర్విను ప్రభుదంపతులు, మంతాజుబేగము ఆమెనూతనవరుడు, భూపాలుబీగము, ఆమెముగ్గురుమనుమరాండ్రు; వరశుల్క మహిమ, మనోవ్యాధి, మైసూరు క్రొత్తదివాను, 'సైకికా' అనుపత్రిక సంపాదకురాలు, ఆమెకుక్క; సాహితీసమితిద్వితీయవార్షికసమావేశము, మదరాసు శాసనసభనుండి వెడలివచ్చిన స్వరాజ్యపక్షసభ్యులు; ఇతర చిత్రములును.





శ్రీ లక్ష్మీదేవి

శ్లో. కింజల్క రాజిరివ నీలసరోజలగ్నా, లేఖేవ కాఞ్చనమయీ నికషోపలస్థా;
సౌదామినీ జలదమండలగామినీవ, పాయాదురస్స్థలగతా కమలా మురారేః.



చెన్నపట్టణము ఏప్రిల్ ౧౯౨౬

సంపుటము 3 | అక్షయ సంవత్సరము చైత్రమాసము | సంఖ్య ౪

# అక్షయసంవత్సర ప్రార్థన

నెట్టి లక్ష్మీనరసింహము గారు

శ్రీక్షమతో గమలోఁడం, బక్షివరతురంగమంబుపై నున్న జగ-
ద్రక్షకుఁ డొసంగుఁగాత మన, కక్షయసంవత్సరమున నక్షయసుఖముల్.

ఉ. అక్షయభక్త్యపాళి ద్రుపదాత్మజభాండమునన్, తదంగమం
దక్షయచేలముల్ కలుగునట్లొనరించిన నందనందనుం
డీక్షితి కన్నవస్త్రముల నెట్టి కొఱంతయుఁ గల్గనీయ కీ
యక్షయవత్సరంబు మన కక్షయసౌఖ్యకరంబుఁ జేయుతన్.

తే. ఏడు కొండల శ్రీవేంకటేశు కరుణ, దాఁటితిమి యేడు గుడులు క్రోధనయుఁ గూడ;
అక్షయంబగు తత్కృప నక్షయసుఖ,దాయకంబయి యక్షయ తనరుఁ గాక!

తే. తెలివిమాలినయుత్తరాహులును దాక్షి,ణాత్యులును, "క్షయ,క్షయ యే"యనంగఁ, దెలిసి,
తెలియ, "కక్షయ" యందురు తెలుఁగువారు; అక్షయత వారి సుఖముల కబ్బుఁ గాక!



# పాండురంగ మాహాత్మ్యము—తెనాలి రామకృష్ణ కవి

విద్వాన్ డి. రామమూర్తి శాస్త్రి గారు

[వెనుకటి సంచిక తరువాయి]

మఱియు శ్రీనాథకవి విరచిత కాశీఖండమందును, నగస్త్యుని యాత్రాక్రమము వర్ణింపఁబడినది. కాని యీవిషయమునఁ బాండురంగమాహాత్మ్య కాశీఖండములు విభిన్నమార్గములఁ ద్రొక్కియున్నవి.

లోపాముద్రాగస్త్యులు కాశినుండి వెడలి వింధ్యగర్వమడంచి పంపాశీతల వాతపోతములచే సంసేవ్యమానులై పోయి విరూపాక్షు నర్చించి యాంధ్రదేశము నంటిపోవుచు సప్తగోదావరమున మునిఁగి, భీమేశ్వరు సేవించి, కొల్లాపురీలక్ష్మిని నుతించి శ్రీశైలమున కేగిరని కాశీఖండమున వర్ణింపఁబడినది. ఈపాండురంగ మాహాత్మ్యమున నట్లుగాక లోపాముద్రాగస్త్యులు కాశినివిడచి వింధ్యగర్వము నణఁచి కొల్లాపురలక్ష్మిని సేవించి, పంపాశీతల మారుత సేవ్యమానులై కుంతలదేశము నంటిపోవుచుఁ దత్ప్రాంతస్థ మాల్యవంతమును మతంగాశ్రమమును ఋశ్యమూకమును సందర్శించుచు నట్టి మధ్యాహ్నమునకుఁ దుంగభద్రం జేరి స్నానమాడి యచ్చోఁ బంచ వారంబు లుండి తద్వారిపూరంబు వినిర్గమించి విరూపాక్షు సేవించి స్వామిశైలమునకుఁ జనిరని వర్ణింపఁబడినది. 'లోపాముద్రాగస్త్యులను పంపావాయువు సేవించెను, లోపాముద్రాగస్త్యులు విరూపాక్షు నర్చించిరి, లోపాముద్రాగస్త్యులు కొల్లాపురీలక్ష్మిని సేవించిరి' అనునంశములు తప్పఁ దక్కిన తద్యాత్రావర్ణన మంతయు గ్రంథద్వయము నందు విభిన్నమే యైయున్నది.

ఈపాండురంగ మాహాత్మ్యకథయుఁ గాశీఖండ కథయు స్కాందపురాణాంతర్గతములే యైనను నొకేయంశమున నిట్టిభేదము గల్గుటకుఁ గారణ మూహింపవలసియున్నది. ఈభేద మీకవిద్వయము గల్పించుకొనినదో లేక స్కాందపురాణ నిరూపితమో స్కాందపురాణము నాకు దొఱకమి నిశ్చయింపఁజాలనైతిని.

కాని స్కాందపురాణమున నొకచో నగస్త్యుఁడు వింధ్యాహార్యగర్వాపనోదార్థ మొకత్రోవఁ బోయెననియు మఱియొకచో మఱియొకత్రోవఁ బోయెననియు విభిన్నముగా నగస్త్యునియాత్రాక్రమము వర్ణింపఁబడియుండదనియుఁ గవులు తా మెఱింగిన దేశములే కాక స్వాభిమానపాత్రములగు దేశముల వర్ణించుటకై యీకథాసందర్భమును దమ యిష్టానుసారము మార్చిరనియుఁ దత్తత్సందర్భ పరిశీలనమువలన నూహించుచున్నాను. శ్రీనాథున కాంధ్రదేశము, సప్తగోదావరము, ద్రాక్షారామము మున్నగుస్థలము లభిమానపా

త్రములు లేక పరిచితములగుటచే వానినివర్ణింప నాతఁడు లోపాముద్రాగస్త్యుల యాత్రాక్రమమునట్లు మార్చియుండును. అట్లే రామకృష్ణకవియు తుంగభద్రాదులు స్వాభిమానపాత్రములు లేక స్వపరిచితములగుటం జేసి యగస్త్యయాత్రాక్రమ మిట్లు మార్చియుండును. మఱియు నగస్త్యుఁడు తుంగభద్రలో స్నానమాచరించి, గంగాయమునాది నదులకంటె నుత్తమనదియని యన్నదింబో గడి కాశికావిరహమును బోఁగొట్టుకొనె నని తుంగభద్రను సర్వనదులలో మేటిగా నిరూపించుటంబట్టి కవి కానదియందుఁగల యధికాభిమానము వెల్లడి యగుచున్నది.

మఱియుఁ గుమారస్వామి యగస్త్యునకు వినిపించిన నదీమాహాత్మ్యవర్ణనాసందర్భమున నిరూపించిన నదులలోఁ జాలనదులు పశ్చిమదేశములోనివే యైయున్నవి. అందుఁ దుంగభద్రంగూడఁ జేర్చియున్నాఁడు. శ్రీనాథకవి వర్ణించిన గోదావరీనది నీతఁడెచ్చటను మాటవరుసకైన నెత్తుకొనలేదు. ఈసందర్భమంతయుఁ బరిశీలింప నీతనికి గోదావర్యనంతరప్రదేశమే పరిచితమైన దనియుఁ దత్పూర్వదేశ మీతని కపరిచిత మనియు నాకుఁ దోఁచుచున్నది.

ఈగ్రంథమునకుఁగల నామత్రయమును గూర్చియు వానియౌచిత్యమును గూర్చియు నిదివఱకే వ్రాసియున్నాను. ఇఁక నీగ్రంథమునందలి కథాసందర్భాదుల నొక్కింత విమర్శింతును.

ఈగ్రంథమున సర్వోత్కృష్టములగు తీర్థక్షేత్రదైవములుగల పౌండరీకస్థలము వర్ణింపఁబడినది. కావున నిందుఁ గొన్ని యితిహాసములు తీర్థమాహాత్మ్యమును, గొన్ని క్షేత్రమాహాత్మ్యమును, గొన్ని దైవతమాహాత్మ్యమును నిరూపింప నిల్పఁబడినవి.

ఇయ్యది యైదాశ్వాసముల మహాప్రబంధము. అందుఁ బ్రథమాశ్వాసము సర్వోత్కృష్టములగుతీర్థక్షేత్రదైవతములు మేళవించియుండు నెలవెద్దియను ప్రశ్నతోడనే పరిసమాప్తమైనది. పుండరీక వృత్తాంత వర్ణనముతోడను, పాండురంగదేవుని వర్ణనముతోడను, తీర్థక్షేత్రదైవతముల పట్టికావర్ణనముతోడను ద్వితీయాశ్వాస మంతమొందెను. నృసింహతీర్థ మాహాత్మ్యద్యోతనార్థము వర్ణింపఁబడిన నిగమశర్మోపాఖ్యానముతోడను, శ్రీమన్నారాయణుండు కృష్ణావతారమును స్వీకరించుటకు బీజభూతమగు రాధావర్ణనముతోడను తృతీయాశ్వాసము ముగిసెను. షడృతువర్ణనము, రాధాతపోవర్ణనము, బాలకృష్ణవర్ణనము, సుశీలాజంపతీ చరిత్రవర్ణనము గాక హంస శుకనాగసరభూధేనుకథావర్ణనము, మున్నగువానితోఁ జతుర్థాశ్వాసము క్రమాప్తమయ్యెను. సంగమతీర్థప్రభావప్రకాశమగు వేడికథతోడను, పౌండరీకమాహాత్మ్యద్యోతకమగు ధర్మజకథతోడను, గుండల పద్మతీర్థమాహాత్మ్యద్యోతకమగు సుశర్మోపాఖ్యానముతోడను, పాండురంగదేవమాహాత్మ్యప్రకాశకము లగు పార్ష్ణిగ్రాహముక్తకేశీకథలతోడను బంచమాశ్వాసము పరిసమాప్తమయ్యెను.

"ఇఁక నీతఁ డీకథ నెట్లు పెంచెను? అపెంచుటలో నౌచిత్యము నెంతవఱకుఁ

బాటించెను?" అను సంశయములు విమర్శింపవలసి యున్నవి.

(మహాప్రబంధ మనిపించుకొనుటకై "శ్లో. సంధ్యా సూర్యేందురజనీప్రదోషధ్వాంతవాసరాః, ప్రాతర్మధ్యాహ్నమృగయాశైలర్తువనసాగరాః; సంభోగవిప్రలంభౌ చ ముని స్వర్గపురాధ్వరాః, రణప్రయాణోపయమ మంత్రిపుత్రోదయాదయః; వర్ణనీయా యథాయోగం సాంగోపాంగా అమీ ఇహ" అను నాలంకారిక మహాకావ్యలక్షణము నూతగాఁగొని ప్రసక్తి యున్నను లేకున్నను దత్తత్సందర్భములఁ దత్తద్వర్ణనములఁ జేయుచుఁ బ్రబంధమును బెంచుట ప్రబంధకర్తల యాచారమైయున్నది. అట్లే రామకృష్ణకవియుఁ గాశీపురవర్ణనము, కుమార ప్రయాణవర్ణనము, షడృతుసమాగమవర్ణనము, పార్వతీ పరమేశ్వరుల యుద్యానవనవిహారసంభోగవర్ణనము మున్న గు వానింజేర్చి ప్రథమాశ్వాసమునంత మొందించెను. మూఁడువంతుల ముప్పాతిక మహాకావ్యలక్షణ మీప్రథమాశ్వాసముననే యిముడ్పఁబడినది(చూ. ప్రథమాశ్వాసము;119-137, 130,135,181 మొ. 186-190,99-118, 158-170) పద్యములలోఁ గ్రమముగాఁ బ్రాతర్మధ్యాహ్నశైలర్తుసంభోగపుర ప్రయాణ వర్ణనములు నిల్పబడినవి.

తీర్థక్షేత్ర దైవతములు తుల్యప్రాధాన్యములై యుండు నెలవెద్దియనుప్రశ్నతోఁ బరిసమాప్తమైన ప్రథమాశ్వాసమునందలిప్రశ్నకు నీశ్వరుఁడు ద్వితీయాశ్వాసాది నొక్కపద్యముతో నుత్తర మిచ్చియున్నాఁడు. ఇఁకఁ గథ నడచు టెట్లనితలంచిపుండరీకకథావర్ణనపూర్వకముగాను తీర్థక్షేత్రదైవతముల పట్టికనుదాహరించి, ద్వితీయాశ్వాసమును గొంతవఱకుఁబోషించెను. దానఁ బ్రథమమున శౌనకాదులు సూతు నడిగినట్టియు, ననంతరమున నగస్త్యుఁడు కుమారస్వామి నడిగినట్టియు, పిదపఁ బార్వతి పరమేశ్వరు నడిగినట్టియు ప్రశ్నమునకు సంపూర్ణముగాఁ బ్రత్యుత్తరము దేలిపోయెను. ఇకఁగథ పెంచు టెట్లని యాలోచించి నారదు నీశ్వరుని కడకుఁ దెప్పించి తిరుగ నాతనిచే నాప్రశ్నమే యడిగించి మున్ను నిరూపించిన తీర్థక్షేత్రదైవతములలో నొక్కొక్కదానిమహిమను, దద్భేదములను వేర్వేఱ నిరూపించుచు ద్వితీయాశ్వాసమే కాక తృతీయ చతుర్థపంచమాశ్వాసములను సైతము తుదిముట్టించెను. కావున నీగ్రంథమున నితరగ్రంథములందువలెఁ గథకైక్య మగుపడకున్నది. కానఁ బ్రథమమునఁ దీర్థక్షేత్రదైవతములు మూఁడును, "తుల్యప్రాధాన్యములై మేళవించియుండు నెలవెట్టివి" అనుప్రశ్నకుఁ మాఱుగా దీర్థక్షేత్రదైవతములు మూఁడును, తుల్యప్రాధాన్యములై మేళవించియుండు నెల వెద్దియో తత్తన్మాహాత్మ్యవర్ణనాపురస్సరముగా విశదపఱచుము' అని ప్రశ్నించెనని చెప్పియుండిన నాప్రశ్న కీపుస్తకవిషయ మంతయు నుత్తరమై యుండు నేమోయని తోఁచెడిని. మఱియుఁ గథకుఁగూడ నైక్యము సంభవించు నేమో?

ఇఁకఁ గుమారప్రయాణవర్ణనము, పార్వతీ పరమేశ్వరుల సంభోగవర్ణనము, ఋతువర్ణనము

మున్నగుసందర్భములం గవి యౌచిత్యము నంతగాఁ బాటించిన ట్లగపడదు. సర్వోత్కృష్టతీర్థ క్షేత్రదైవత సమ్మేళనముగల స్థలమెయ్యదియో తెలిసికొనఁ దండ్రిదరికిఁ బోవుకుమారుఁడు త్రిదశసేనతోడను, ప్రమథగణములతోడను, నప్సరోగణముతోడను, యుద్ధమునకుఁ బోవువిధమునఁ బోయెననివర్ణించుటలో నౌచిత్య మేమున్నది?

మఱియుఁ గాళిదాసాదిమహాకవులు కథాసందర్భమునఁగల్గిన ప్రసక్తినిబట్టి పార్వతీపరమేశుల సంభోగము వర్ణించినను నాలంకారికులద్దానిని దోషముగఁ బరిగణించి యున్నారు. ప్రకృతమునఁ బ్రథమాశ్వాసమునఁ గల యుమామహేశ సంభోగ వర్ణనమున కట్టిప్రసక్తి లేకపోవుటయేకాక యం దౌచిత్యమును గానరాకున్నది. జగత్పితరులగు నాది దంపతుల సంభోగవర్ణనమే యనుచిత మనఁదగి యుండగా నెండలో వారిని విహరింపఁజేయుట యనౌచిత్యకారణమని వేఱుగఁజెప్పనేల? (చూ. పాం. 1ఆ. 188 మొ.ప.)భుక్తిముక్తికరులగు నాజంపతులకు నిష్కుటమున సౌధములు లేవే! చల్లని పూఁపుంబొదలు లేవే! మఱియొక విధముగాఁ బార్వతీపరమేశ్వరులు సంతోషమనుభవించి రనరాదా? అట్టిసంతోష సమయమునఁ బార్వతి యాప్రశ్న యడిగె ననరాదా! ఈశ్వరుఁడు సంతుష్టుఁడై యున్నపుడు పార్వతి యాప్రశ్నయడిగెననుటకై సంభోగవర్ణనమే యావశ్యకమా! లేకున్న నీశ్వరుఁడు మఱియొకవిధముగా సంతుష్టుఁడుగాఁడా! కవి పాత్రనెట్లుచిత్రించిన నడ్డము చెప్పవా రెవరు లేరుగదా! కాన గవికాంతా సమ్మితములగు మహాకావ్యములలోఁ బాత్రల నౌచిత్యము నాలోచించి చిత్రించుట యుచితము. కావున నీవర్ణనము మిగుల నౌచితీవిరహమై యున్నదని చెప్పనగును. అట్టి సంభోగవర్ణనమును జేయఁదలంచియే కవి యద్దానికుద్దీపనముగా షడృతు సమాగమవర్ణనమును ముందుఁగా నిల్పియున్నాఁడు. కావున నీవర్ణనలకు నీప్రబంధ మాలంకారిక లక్షణలక్షిత మహాప్రబంధమని వాసికెక్కుటయే ప్రయోజనమని యూహింపనగును. ఇట్లే కొన్నివర్ణనలం దౌచిత్యము నంతగాఁ గవి పాటింపలేదు.

కాని నన్నయాది ప్రాచీనకవులవలె రామకృష్ణకవియు సంస్కృతపురాణముల నాంధ్రీకరింపఁ బూనినందున నట్టియాంధ్రీకరణనియమములేని రసాత్మక ప్రబంధమునందువలె నష్టాదశవర్ణనలయుఁ, బాత్రములయు, నౌచిత్యమును విచారించుట యనావశ్యకమని తలంచి కావలయుఁ గవియెట్టటో యవకాశమును గల్పించుకొని యచ్చటచట నట్టివర్ణనములఁ జేయుచు వచ్చెను. మూలగ్రంథము లభింపమి నట్టివిషయముల నిర్ణయింప లేకపోయితినని మున్నే వ్రాసియున్నాను.

మఱియు.—

"మ. కని యేకారణ మేగుదెంచిరొకో యీ
కామాధరుం డీమునుల్
కన జిత్రంబగుఁ గంటిఁగంటి స్వకృత
స్కాందోక్తియం దావహి

ల్లిన సందేహముఁ దండ్రిచేఁ దెలియుహా
శ్రీ స్వామిఁ దోకొంచుఁ గ్రొం
చనగోద్భేదియు వచ్చె నిట్లగుటకుర్వీ
శంకింప నింకేటికిన్."

(చూ. పాం. 2 ఆ. 180) అని కుమారాగమనమునకుఁ గారణమును దన దివ్యదృష్టిచే గ్రహించిననారదుఁ డీశ్వరుఁ డేమియుత్తరమిచ్చెనో తెలిసి కొనఁజాలకుండెననుట యనుచితముగదా! ఇచ్చో నారదునకు దివ్యజ్ఞానమున్న కథనడవదుగదా! కావునఁ గవికథావిస్మృతికై యిచ్చో నౌచిత్యమును బాటింపలేదనఁ దగునుగదా!

మఱియుఁ గవి స్వపాండిత్య స్వజ్ఞాత విశేష విషయప్రకటనార్థము గొన్నిస్థలములఁ నౌచిత్యమును బాటింపలేదు. కుమారస్వామి తమ్ములము నుమిసి పుక్కిలించి వలెవాటువేసి కొనిన పట్టుపుట్టమును నడుమునకుఁ గట్టియుపాయన పదార్థమును దానె యుద్వహించి మునుమున్న యంగుళీ సంజ్ఞచే మునులలోనికి బూమ్మని ద్వారపాలకులు నమస్కరింప నగవు చూపులచేతనే వారలగౌరవించి నగరు సొచ్చెనని వర్ణింపఁబడినది. తండ్రిదరికేగు కుమారున కింతవినయ మనావశ్యము. లోకములో నిట్లుచటఁజేయుట యప్రసిద్ధము. ఇట్లే కుమారస్వామియెక్కిన నెమిలి కొంతదూర మరుగునప్పటికిఁ దెల్లనిగుఱ్ఱ మయ్యెననియు, నద్దానిని చతుర్విధ గతులచేతను భంజళ్యాదిగతి విశేషములచేతను బరుగెత్తించె ననియు వర్ణింపఁబడినది. నెమిలి గుఱ్ఱమగునా? లోకములో నిట్లగుట కలదా! కావునఁగవిస్వ రాజ్యస్థానమర్యాదాభిజ్ఞతను, స్వజ్ఞాతాశ్వగతివిశేషములను గ్రమముగాఁ బ్రకటింప నిట్లు వర్ణించియుండు నేమో యని తోఁచుచున్నది.

పూర్వాపరసందర్భ విరుద్ధములగు స్థలములును గొన్ని యీయాయాశ్వాసముల నగపడుచున్నవి.

"చ. వినుమునినాథ నన్ ఋషులు
వేఁడినయర్థముబోధ తీర్థము........
......దీనిపెంపుఁ గనఁ
జాలరు తక్కినవార లెవ్వరుం
దనుజరిపుప్రసాదజని
తప్రతిభానిధి నేనుదక్కఁగన్."

అని తనకుఁదప్పఁ దక్కినవారి లీక్షేత్రదైవత తీర్థము లోకచో మేళవించియుండు నెఱుంగరని (పాం. 2 ఆ. 207 పద్యమున) నీశ్వరుండ పన్నట్లు వర్ణించెను. ఆపద్యమున కుమున్న (పాం. 2 ఆ. 161) పద్యమున బ్రహ్మాదులకును నీస్థలము తెలియదని వర్ణించియున్నాఁడు. (పాం. 2ఆ. 220 వపద్యమున)

ఉ. ఈసముద్రగ్ర తత్త్వపద
మేనొకరుండ నెఱుంగుదున్, సరో
జాసనుఁడొక్కరుండెఱుగు
నబ్ధితనూజ యొకర్తెఱుంగు న
వ్వాసవుఁ డొక్కరుండెఱుఁగు
వాఙ్మనుభోగిపతాప్సుతాంబుజాక్షుఁ బ్ర
గ్వాసనమైనెఱుంగుదురు
గాని తదన్యు లెఱుంగ రెవ్వరున్."

అని బ్రహ్మాదులందఱు నెఱుంగుదురని వర్ణించియున్నాఁడు. ఈసందర్భమునుబట్టి కవియాయా

స్థలములఁ దనకుఁదోఁచినట్లు తత్స్థలమాహాత్మ్యవర్ణనావేశముతో ముందువెన్క లరయక ప్రసంగించెనని చెప్పకతీరదు.

మఱియుఁ బుట్టినదిమొదలు గిట్టుదనుకఁ బాపకర్ముండైన నిగమశర్మ సంగమతీర్థతీరమునఁ జచ్చి నంతమాత్రమున శాశ్వత పదమొందెనని వర్ణింపఁబడినది.

ఇట్లే పంచమాశ్వాసమున నిగమశర్మంబోలు సుశర్మయుఁ బద్మతీర్థజలముఁద్రావి యచ్చోనున్న రావిగోడఁ గూర్చుండినంత మాత్రమున వానికిఁ శాశ్వతవైకుంఠవాససుఖముగల్గెనని వర్ణింపఁబడినది. ఇట్లేచతుర్థాశ్వాసమున ధేను వొకటి పాండురంగవిభుని గానము నాలకించి హర్షముచే మేనుమఱచి క్షీరములఁ గురిసెననియు నందొకబిందువు గాలివశమున నెగిరి పాండురంగని పాళిపైఁబడెననియు నక్కారణమున నాధేనువొక వైష్ణవునకుఁ బుత్రికయై జన్మించెననియుఁ బిదప ముక్తినొందెననియు వర్ణింపఁబడినది. కాని నిగమశర్మ సుశర్మాదులవలె మోక్షము నొందెనని వర్ణింపక వైష్ణవవరునకుఁ బుత్రికయై పుట్టి పాతివ్రత్యాభిరామయై యొప్పుచు వటురూపధారియై యేతెంచిన విష్ణునకు నన్నము పెట్టినకతమున ముక్తినొందెనని వర్ణింపఁబడినది. తన్మూలమునఁ గవి కావ్యపాఠకులకు నన్నదాన మాపాండురంగక్షేత్రమునఁ జేసినవారికిఁ గల్గుఫలమును నిరూపించుటకును, పాతివ్రత్యమువలనఁ గల్గులాభముల నిరూపించుటకును, భార్య దుర్మార్గుఁడైనను భర్త నవమానింపరాదని బోధించుటకును, నట్లౌచిత్యమును విడిచి యాయా విషయముల వర్ణించెనని తోఁచుచున్నది. వస్త్వతిశయప్రకటనార్థ మహౌచిత్యమును విచారింపకుండుట సాధారణముగా గ్రంథకర్త లందఱకు నలవాటైయున్నది. కావునఁ జతుర్థపంచమాశ్వాసములందలియుపాఖ్యానములన్నియుఁదత్తన్మాహాత్మ్యాతిశయప్రకటనార్థమే నిల్పఁబడినవగుటచేత వాని యౌచిత్యమును బ్రసక్తిని విచారించుట యనుచితము. మఱియు మూలగ్రంథములోని విషయము లాంధ్రీకరింపక తీరనందున నిట్టిదోషము లీగ్రంథమున నుండుట తటస్థించెనేమో యని మున్నె వ్రాసితిని.

మఱియు నీగ్రంథమున సంస్కర్తల ప్రమాదవశమునఁ బండితంమన్యుల సంస్కరణవశమునఁ బెక్కుచోటులఁ దప్పుపాఠములుఁ, దప్పుయతులు, దప్పురూపములు నుండుట తటస్థించినది. గ్రంథవిస్తరభీతిచే రెండు మూఁడుదాహరణముల మాత్రమే చూపెదను.

"తే. తప్పుగల్గినచోటనే యొప్పుగల్గు
నరసికావలికవితల యవగుణముల
సరసకవితావచోక్తుల సరణియందు
నమృత ధారాప్రవాహంబు లడరుఁగాదె"
అని ప్రాచీనపాఠము.

"తే. తప్పుగల్గినచోటనే యొప్పుగల్గు
సరసకవితావచోక్తుల సరణియందు
గప్పుగల్గిన నీహారకరునియందు
నమృతధారాప్రవాహంబు లడరుఁగాదె."
అని నవీనపాఠము.

ఇయ్యది పాండురంగ మాహాత్మ్యములోని కుకవినిందా సందర్భము. సంస్కర్తలు 'అరసికావలి కవితల యవగుణములచే సుకవుల వాక్యముల నమృతధారాప్రవాహ మెట్లడరును? 'తప్పుగల్గినచోటనే యొప్పుగల్గు' అను వాక్యమున కియ్యది సమర్థకవాక్య మెట్లగును? అని యనుమానించి కావలయుఁ బ్రాచీన పాఠమునందలి రెండవ పాదమును దీసివేసి తత్స్థానమున నందలి మూఁడవపాదమునే నిల్పి 'కప్పుగల్గిన నీహారకరునియందు' అని మూఁడవపాదమును గ్రొత్తగాఁ గల్పించి 'చంద్రునియం దెట్లు మచ్చయు నమృతధారాప్రవాహంబును సమానాధికరణములై యుండునో యట్లే తప్పుగల్గినచోటనే యొప్పును నుండును' అని సరిపెట్టిరి. కాని

"కాన దోషాత్ములైన దుష్కవులకతన
గరిమవహించు కవిరాజ కావ్యమహిమ
బహుళపక్షంబు చీకటి బహుళమగుటఁ
జాయవెన్నెల తఱితీపుఁ జేయుకరణి"

అనుపద్యములోని 'కాన'అనుపదమున కర్థమేమో, హేతుహేతు మద్భావము సరిపడునో లేదో యాలోచింపరైరి. ఇట్లు దిద్దుటవలన మహాకవుల కావ్యములఁ దప్పొప్పులు సమానాధికరణములై యుండునను విపరీతార్థము గూడ స్ఫురించునని తలంపరైరి.

తప్పనిన దే లేకున్న నియ్యది యొప్పని చెప్పు టెట్లు? కావునఁ దప్పుండు స్థలమున నొప్పున్న నాతప్పునుబట్టి యియ్యది యొప్పని యెన్నఁబడును.

అట్లే తప్పులకుప్పలగు కుకవుల గ్రంథములవలన సుకవులపుస్తకము లొప్పులని యెన్నఁబడును. కావున "నరసికావలికవితలయవగుణములే సుకవుల రసకవితావచోక్తుల సరణియందు నమృతధారాప్రవాహ మపరజేయుటకుఁ బ్రధానకారణములు." అనునది కవ్యభిప్రాయము. అమృతధారా ప్రవాహ మనఁగా సరసుల కాహ్లాదాతిశయమును బుట్టించునని యభిప్రాయముగాని సంస్కర్తలనుకొనినట్లు నిజమైనయమృతధారగాదు. ఇట్లర్థముఁ జేయునపుడే 'అరసికావలి కవితల' అను పాఠముండునపుడే 'కాన'అను క్రిందిపద్యమునకును దీనికిని హేతుహేతుమద్భావము సరిపడును. కావున నీదిద్దుబాటు సరికాదని యనఁదగును. ఇట్లే సంస్కర్తలు వారలకు సంశయమును బుట్టించుచోటుల నెల్లఁ దమయిచ్ఛానుసారముగా దిద్ది వాఙ్మయమునఁ గవిప్రయుక్తమెయ్యదియో తెలియనంతటి యవస్థను గల్పించుచున్నారు.

"చ. ...ని, ర్భయభవ సాగరోత్తరణ
నావికులాదిమ వైష్ణవాగ్రితుల్."

ఇందు భకారమునకు లేక రేఫమునకు నకారము యతి నిల్పఁబడినది.

"లైనదినముల సాపత్న్యమెంతకీడు"

ఇందు'ఎ'అనునచ్చునకును నైకారమునకును యతి యగుపడుచున్నది.

"విరితలిరాకు బోడియును
లీకవిశిష్టుఁడు దుష్టచేష్టులన్."

ఇందువకారమునకు ళకారముతో యతి యగుపడుచున్నది. ఇట్టియుద్గ్రంథమును రచించిన

మహాకవికి యతిజ్ఞానములేదనుట పొసగదు గదా! కాన నిట్టిస్థలములు సంస్కరింపవలసి యున్నవి.

సామాన్యముగా నాంధ్రవ్యాకరణములన్ని యునాంధ్రవాఙ్మయోదయానంతరమందే రచింపఁబడిన వగుటంజేసి యాంధ్రవ్యాకరణరచనకాంధ్రవాఙ్మయమే ముఖ్యాధార మయ్యెను. కావున సంస్కృతవైయాకరణులవలె వ్యాకరణమునకే ప్రామాణ్యమొసంగి మహాకవి ప్రయోగములుదప్పులనియొప్పుట యసంగతము. వ్యాకరణము లన్నియు మహాకవిప్రయోగశరణములేయైనను దివ్యదృష్టి పాణిన్యాదులకుండుటంజేసి వారు సాధింపని పదము లేదని సంస్కృత వైయాకరణుల యాశయము. అట్టిసిద్ధాంత మాంధ్రవైయాకరణులకుఁ బనికిరామి సుమా రెనుబదితొంబది సంవత్సరముల క్రిందట రచింపఁబడిన బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణాదులను బట్టి నాలుగైదువందల వత్సరముల క్రిందట రచింపఁబడిన మహాకవిగ్రంథములందలి ప్రయోగము లసాధువులని యనఁజనదు. సంస్కృత వ్యాకరణ వాసనావాసితులైయేరైన నట్లనిన నయ్యది యయుక్తమని గ్రహింపవలసి యుండును. కావున నసమగ్రములగు నాంధ్రవ్యాకరణములను బట్టి మహాకవి ప్రయోగము లసాధువు లనుటకంటెఁ మఱికొన్ని సూత్రములఁ గ్రొత్తగాఁజేర్చి వానికిసాధుత్వ మొసంగుట యుచితమును యుక్తిసిద్ధమును నై యుండును. బాలవ్యాకరణకర్త విడిచిన మహాకవి ప్రయోగములఁ బ్రౌఢవ్యాకరణకర్త యనంతరమున సాధించి యుండెనుగదా! కావున నీప్రబంధమునఁ దప్పురూపము లున్నవని కొంద ఱుదాహరించిన ప్రస్తుతవ్యాకరణ విరుద్ధరూపములు సాధువులేయనఁ జనును. బాల ప్రౌఢ వ్యాకరణములు సాధింప నంతమాత్రమున రామకృష్ణ ప్రయుక్తపదము లసాధువు లగునా? ఇఁకనీగ్రంథమునకుఁగల టీకనుగూర్చి కొంచెము వ్రాసెదను. ఛందస్సునకు భంగము వాటిల్లినను యతిప్రాసములు భ్రష్టములైనను నాయాస్థలములందలి పదముల కస్లే యర్థమును వ్రాయునుగాని యవ్వానిని నిరూపింపదు. వలసినస్థలములఁ బదార్థములను సైతము నిరూపింపదు. కొన్నిస్థలములఁ బదార్థమును గూడ విరుద్ధముగా నుపపాదించును. క్లిష్టము లగు పద్యములందు రెండుమూఁడు పదములకుమాత్రమే యర్థమునువ్రాసి యావలి పద్యమునకుఁ బోవును. సంస్కృతాంధ్ర లక్షణ విరుద్ధప్రయోగముల నిరూపించుటయు, నేకదేశాన్వయాది యర్థగతదోషముల నుపపాదించుటయుఁ, గ్లిష్టకల్పనముగల స్థలములందైన నభిప్రాయమును బ్రకాశముచేయుటయుఁ, బాఠభేదాదుల నుపన్యసించుటయుఁ, బాత్రౌచిత్యాదులఁ జర్చించుటయు నీటీక ముఖ్యోద్దేశమే కాదు. టీక సందేహమునుబుట్టించు స్థలములకు స్పష్టార్థమును నిరూపింపఁజాలియుండవలెను. కాని యియ్యది సందేహము నినుమడింపఁజేయఁ జాలియున్నది. కాన నీగ్రంథమును జదువువార లీలఘుటీకార్థము నపేక్షింపక స్వానుభవస్వజ్ఞానములచేఁ దత్తత్స్థలముల యర్థమును గ్రహింపవలసి యుండునని చెప్పుట సాహసముగాదని తోచుచున్నది.

చతుర్థాశ్వాసమునందలి రాధాతపోవర్ణనము కుమారసంభవములోని పార్వతీ తపోవర్ణనమును బోలియుండుటచేతను "పశ్యంత్య సంఖ్యాపథ గాం త్వదాన జలవాహినీస్, దేవత్రిపథగాత్మానంగోపయత్యుగ్రమూర్ధని" అను కుమారసంభవ శ్లోకముంబోలి దానధారార్థి మఘలప్రధాననదుల, వెచ్చబెట్టుటందలంకియో వి బుధతటినిదరుణశశిమౌళిజడలోన దాఁగియుండె.(పాం.1.ఆ.72) అనుపద్య మ్ముండుటచేతను గాదంబరియందువలెనే యిందును "స్మర శశి తటిదజపవమా, నరవిసుధాసలిలమునిఘన ఘ్మోరిష్టా, సురమృత్యు జ్వలనజలగు, సురవేశ్యలు గొలిచిరపుడు సుబ్రహ్మణ్యున్" అని యప్సరసోత్పత్తిని వర్ణించుటచేతను గొన్ని యెడలగద్యలు కాదంబరీగద్యలనే పోలియుండుటచేతను ప్రథమాశ్వాసమున వర్ణింపఁబడిన షడృతు సమాగమ వర్ణనము మేఘసందేశములోని 'హస్తేలీలాకమలం' అను వర్ణనమును బోలియుండుటచేతను, శాకుంతలమునందలి కణ్వాశ్రమ వర్ణనముంబోలి మతంగాశ్రమవర్ణన ముండుటచేతను కాశీపట్టణ రాజప్రాసాద కేతువర్ణనము "ప్రజతే దివియద్గృహావళీ చలచేలాంచల చండతాడనాః, వ్యతరన్న రుణాయ విశ్రమం సృజతే, హేళి హయాళి కాలనాం" అను నొకపదమును బోలియుండుటచేతను "కిమివహిమధురాణాం మండనం నాకృతీనాం" అను శాకుంతల శ్లోకపాదము 'ప్రకృతి మధురజులకు వేషరచననేల' అని యాంధ్రీకృతమగుటచేతను సంస్కృత కావ్యానుసరణమే యెక్కువగాఁ గానవచ్చుచున్నదని చెప్పవచ్చును. దీనివలనఁ గవికి సంస్కృత భాషాభిమానము హెచ్చని నిశ్చితమగుచున్నది అచటచట నరసభూపాలీయ వసుచరిత్ర పద్యములను బోలిన పద్యములును గలవు. (చూ. పాం.3.ఆ.183;వసు.2-37;పాం. ఆ.41;నరస;ఆ.1.97;పా.ఆ.1.63;నర. 5ఆ.22 పా. 2ఆ.178;నర. 5ఆ. 44) కాని పద్యపాద చౌర్యముమాత్రము గానరాదు. మఱియు నాంధ్రప్రబంధము లన్నియు నొకేపద్ధతిగా రచింపఁబడిన వగుటచేతఁ దత్తత్సమాన సందర్భములనభిప్రాయైక్య మగుపడుట సహజము. ఇంతియకాక రామరాజ భూషణునికిఁ దరువాతివాఁడీకవి యగుటంజేసి యట్లగుటయు నవిరుద్ధము.

((విరోధాభాసాద్యలంకార భూషితములును దీర్ఘసంస్కృత సమాస బంధురములును నగు కాదంబరీగద్యలంబోలు వచనములు పెక్కుగలవు. ఇట్టివచనములు తృతీయచతుర్థ పంచమాశ్వాసములందే యగపడుచున్నవి. నారికేళపాకముగల పద్యములు పెక్కుచోట్లలం దగపడుచున్నవి. ఒకచో సంస్కృత దీర్ఘసమాసములతోడను నొకచోఁ గేవ లాంధ్ర పదములతోడను, నొకచో నుభయమిశ్రముగను బద్యములను జిత్రించియున్నాఁడు.

ఈతనికి గోరంతది కొండంతయుఁ గొండంతది గోరంతయుఁ జేయు నద్భుత శక్తి గలదు. పదిపద్యములతో వర్ణించిన దశావతారధర్మముల నొక్కపద్యముతో నోడధర్మములనుసైతం మందే సమకూర్చి వర్ణించి

యున్నాఁడు. మఱియు నిట్లే రెండుమూఁడు చోటుల నొక్కపద్యముతో దశావతారముల వర్ణించియున్నాఁడు. ఇంతియెకాక 'శక్తిజాతర, గార్హాస్థ్యము'మున్నగు సందర్భములను లోక స్వభావసిద్ధముగా నతి మనోహరముగా వర్ణించియున్నాఁడు. ఈతని వర్ణనలు నిరుప మానములు. చదివిన కొలఁది చదువవలెనను నాసక్తిని బుట్టించును. విష్ణుభక్తి పూరితము లగు నాబాలకృష్ణుని వర్ణనములు రాయినిఁ గూడ విష్ణుభక్తి పాల్సేయఁ జాలియున్నవి. మధ్యాహ్నవర్ణనము మున్నగుస్థలము లతిమ నోహరములుగా నున్నవి. తత్తత్స్థలములఁ బరిశీలింప నన్నివిషయముల నాంధ్రవాఙ్మయ మున వసుచరిత్రమునకు నీప్రబంధము తర్వా తిదనిచెప్పుటకు సందియములేదు. అర్థపుష్టిని గలిగింపని వ్యర్థపదము లంతగా నీతని కవిత్వ మునఁ గానరావు. మహాకవు లనిపించుకొని పండిత జనజేగీయ మానులును కీర్తిశేషులు నగు మహాకవుల పద్యములందు సైతము యతి ప్రాసస్థలముల నిరర్థకపదము లుండక మానవు. కాన నద్దాని నొకదోషముగఁ బరిగణింపఁ జనదు. 'పాండురంగ విభుని పదగుంభనం బును' అనునార్యోక్తి నన్వర్థము చేయుచుఁ బదముల పొందిక లలితమై యర్థగాంభీర్యము గలిగి ప్రౌఢమై యొప్పారుచున్నది. కేవల శబ్ద చిత్రముగల రచన లంతగాఁ గానరావు. చక్కని లోకోక్తులతో విలసిల్లుచు రసవంతమై శైలి యెంతయు మనోహరమై పరమాహ్లాద మును గలిగించుచున్నది. కావున నీకవి పం డిత వరేణ్యుఁడని చెప్పుట కాటంకము లేదు. పుండరీక వృత్తాంతమువలన మాతాపితల యందు భక్తిగలిగి యుండవలెననియు నిగమ శర్మవృత్తాంతమువలన దుర్వృత్తిగలవాఁ డధిక దుఃఖములపాలగును గానఁ గేవలకామ పరవశుఁడు గారాదనియుఁ, దాతముత్తాతలు సంపాదించినసొత్తును వ్యయముచేసి ఋణముల పాలు గారాదనియు, వేశ్యాలంపటుఁడు గారా దనియు, నుపకారము చేసినవారి కపకార మొనర్పరాదనియు, రాధాతత్పతి చరిత్రము వలన నెట్టి దుశ్చర్యకలవాఁడైనను బతిని భార్య యవమానింపక తదాజ్ఞా వశవర్తినియై సేవింపవలెననియు, భూతతృప్తి చేయుచుండ వలెననియు దైవభక్తి గలవానికి దేవుఁ డధిక సుఖములఁ బ్రసాదించుననియు నీతులు విశద ము లగుచున్నవి.

సర్వ జగద్రక్షకుండగు భక్తపక్షపాతి యునగు పరమపదనాథుండు శ్రీశుండీ గ్రం థమునకునాయకుండై విరాజిల్లుచున్నవాఁడు. కావున నుత్తమ నాయకోపేత మగుటంజేసి యు మహాకావ్యలక్షణలక్షితంబగుటంజేసియు గాంతాసమ్మితమై ప్రవృత్తినివృత్త్యుపదేశ క్షమ మగుటంజేసియు నియ్యది మహాప్రబంధ మనుటకు సందేహము లేదని యింతటితో విర మించెదను. ))





# ఆదిహిందూవిలాపము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

మ. అరయంబోరు త్రయీయథార్థములు ధర్మాలాపముల్ సేయుచుం
దురు చేయెత్తి ధనాశపెట్టినయెడన్ నూత్నార్థముల్ సృష్టిచే
తురు శాస్త్రాలకుఁ బంచమోద్ధరణమున్ దూషింతు రీ ఛాందసుల్
గుఱిగింజల్ తమక్రిందనున్న నలుపున్ గుర్తింపఁగాఁ జాలునే?

శా. మాతో విందుల నారగింపుఁ డనుచున్ మాతోడ వియ్యంబులం
బ్రీతిం బొందుఁ డటంచుఁ గాని మిము స్వామీ! మేము ప్రార్థింప మే
రీతిన్, మిమ్మును మమ్ము మానవులుగా సృష్టించె నా బ్రహ్మ క
ష్టా! తప్పింపకుఁడయ్య మాదగు మనుష్యత్వంబు మీ ప్రజ్ఞచేన్.

మ. పరమేశుం దరిసింపఁగా గుడికిఁ బోవంగూడ దంటట్లు పో
యిరి పో దైవము మైలఁ బొందునఁట యీదృఙ్మోహముం గొన్న పా
మరులౌ ఛాందసు లీశు శుద్ధుగఁ ద్రయీమంత్రంబులం జేతురం
టరరే! దేవుఁ డిఁకేల? దేవుపయివారై యుండ రీఛాందసుల్.

మ. మనహిందూమత మే విశాలమగుధర్మంబుం బ్రసాదింపఁ జా
లె నిటుండన్ బహుమంది హైందవజనుల్ క్రైస్తీయులై పోయి రే
లని ప్రశ్నించికొనుండు మీదయిన స్పృశ్యాస్పృశ్యతాభేదబు
ద్ధినిగాదే మనదేశ మింతటి విపత్తిన్ మున్గెనో ఛాందసుల్!

శా. హిందూమాత యఖండభాగ్యము త్రయీబృందంబు మీ రొక్కరే
పొందంజూతురె ఛాందసాగ్రణులు! మేమున్ బొందఁగారాదె? యీ
చందం బెచ్చటనుండె మీరె చెప్పుఁడీ చర్చింపుఁడీ! బాగుగా
గ్రంథంబుల్ సవిమర్శదృష్టిఁ గని రాగద్వేష శూన్యాత్ములై.

మ. మనదేశంబునఁ గాదె గౌతముఁడు జన్మంబొంది బోధించె నె
ట్టన సౌభ్రాత్రము నాదిశంకరుఁడు చండాలున్ గురుంగాఁ దలం
చెను శూద్రుం డయినట్టిసూతుఁడు రచించెం బెక్కుధర్మంబు లి
జనముల్ మూర్ఖమతుల్ తలంచినటులన్ సామాన్యులే చెప్పఁడీ?

గీ. 'స్వర్గకామోయజేత' యన్ వాక్యమునకు, నెచ్చట నిషేధవిధి లేమి నెల్లవర్ణ
జాతులును యజ్ఞకర్మముల్ సలుపవచ్చు, ననుచు దృఢముగా బాదరిముని వచించె.

ఉ. వైదికకర్మలందు మనవారలు బ్రాహ్మణునట్లు శూద్రునిం
గాదనకుండ భాగరినిగా గ్రహియించి రటంచుఁ దెల్పఁగా
వైదికమంత్రముల్ కల వపారముగా ననుచున్ వచింపఁడే
బాదరి రీతిగా శబరపండితుఁ డాతనిభాష్యమందునన్.

గీ. వైదికములందు శూద్రుల భాగరులుగ, సమ్మతింపని జైమిని సంయమియును,
శూద్రులగు రథకారనిషాదులకును, వైదికక్రతువులయందు భాగ మిచ్చె.

గీ. శ్రుతికి భిన్నార్థముగఁ దోఁచుస్మృతులు ద్రోసి, రాజనుమటంచు జైమిని వ్రాసినాఁడు
అల్లమాలలఁ గూర్చి యూడుచున్న, స్మృతులు శ్రుతిహితములు గామియెఱుఁగవలయు.

శా. విద్యారణ్యయతీశ్వరుండు మొదటన్ వేదం బపార్థంబుగా
హృద్వ్యాకారుఁ బరాత్పరుం గుఱిచి స్తోత్రింపం బ్రవర్తిల్లు ఋ
క్పద్యాలం బశుహింస సేయు మనుచున్ వ్యాఖ్యానముం జేసె సం
పాద్యంబానె? తదర్థ మందమగునే? ప్రౌఢోక్తి కాకారయన్.

మ. పరమాత్మం గని ద్వేషరాగములనున్ వర్జించి దీవ్యత్తపో
నిరతిం బొందిన సంయమీంద్రులె శ్రుతుల్ నిక్కంబుగా వ్రాసి రా
కరణిం గాక యహంక్రియామతులు రాగద్వేషయుక్తుల్ మునుల్
విరచింపంగఁ దగున్ స్మృతుల్ కనుక భావింపుండు భేదంబులన్.

కం. శ్రుతియర్థం బొకవిధమగు, స్మృతి ఫక్కిక దోఁచు భిన్నరీతిగ శ్రుతికిన్
సుతరాం ప్రతికూలములయి, శ్రుతిస్మృతుల కాపురాణసూక్తులు దోఁచున్.

ఉ. వేదములందుఁ బేర్కొనిన వేలుపు లావరుణాగ్నిశక్రు లే
కాదె! తదన్యదేవతలు కల్పితమాత్రుల యట్టి వేల్పులన్
ఆఁదటఁ బాదుకొల్పి గుడియందునఁ గల్పితశాస్త్రఫక్కిఁ బూ
జాదులుచేత కెట్టిశ్రుతు లాజ్ఞనొసంగెను మమ్మువద్దనెన్.

మ. పరమాత్మం గని ద్వేషరాగములనున్ వర్జించి దీవ్యత్తపో
నిరతిం బొందినసంయమీంద్రులె శ్రుతుల్ నిక్కంబుగా వ్రాసి రా
పరమశ్రేష్ఠులు ముట్టరానితనమున్ వర్ణించి వేదంబులం
జెఱుపం బాపము కట్టుకొందురె? మదిం జింతింపుఁడీ లెస్సగాన్.

గీ. బ్రాహ్మణస్త్రీకి శూద్రునివలనఁ బుట్టినట్టివారలు చండాలు రనఁబడుదురు
పతితవృత్తులువారలు వారలకును, స్మృతివిధించెఁ బ్రాయశ్చిత్త మెల్లభంగి.

ఉ. నూటికొ! కోటికో! యొకత నూల్కొనఁగాఁ జెడిపోవునేమొ! యీ
చేటులు గన్న సంతతి యశేషము బ్రాహ్మణసంఖ్య మీరునే?
గాటముగా మదిం దలఁపఁగా మనపూర్వమతంగజాతులున్
నేటిమతంగజాతులు గణింపఁగ భిన్నులుగాఁగఁ దోఁచెదున్.

శా. పందుల్ కుక్కలు గాడిదల్ నడుచుత్రోవన్ సాటిమర్త్యుండు పో
వం దత్పాపము చింది రౌరవము సంప్రాప్తించునే? దేవుఁడీ
చందంబైన వ్యవస్థ సేయునటు? విజ్ఞానంబు కుంఠించునే?
సందర్భములు లేని ధోరణులనుం జర్చింపఁగా నేటికిన్?

చ. ప్రతిదినమందుఁ గోర్టులకు వచ్చి యబద్ధములాడుచున్న దు
ర్మతులయి నీతి జాతులను మాలి పరాంగనఁ గూడుచున్న స్వా
ర్థతతికి నెంత నైచ్యమును దారువ కాంచుచు నున్న మేడిపం
డ్లతెఱఁగునన్ వచింతురు జనప్రవరుల్ సిరిరంగనీతులన్.

ఉ. చెమ్మట లూర్చి కష్టములు సేయుచు దేహము దాఁచుకోక ధా
న్యమ్ములు పండఁజేయుచు జనాళికి నన్నము పెట్టుమాలవాం
డ్రమ్మహితోపకారమున కాఁదట సేసెడుమేలు దవ్వుగాఁ
బొమ్మని రాజమార్గమునఁ బోవుట వద్దనియున్ విధించుటల్.

గీ. ఈశ్వరుఁడు సృష్టిచేసిన యీవిశాల, విశ్వగృహము విభాగించి వివిధభంగి
గదులుకల్పించుకొని యిఱుకటము సేసి, కొనిరి సోదరమానవకోటి యెల్ల.

సీ. కడుపుఁ గక్కుఱితికై పడపువృత్తి వహించి, మనెడు వేశ్యాంగనాజనము లొకట
విధవలై............సగముచచ్చిన మనసోదరీ జనములొకట
గాలి నైనను దాఁకఁగా రాక వెలినిఁ బొం, దిన యాదిహైందవజనము లొకట
గతిలేక పరదేశగతులయి కష్టముల్, గనుచున్న కార్మికజనము లొకట
గీ. మాకు ముక్తి నొసంగుండు మాకు మాక, టంచు మొఱపెట్టుచుండిరో యయ్యలార!
అంపపుంగోఁత వారి దుర్గతిదలంపఁ, గనికరింపుండు వారలఁగట్టుచేర్ప

సంపూర్ణము




# కావ్యేషు నాటకం రమ్యమ్

గొల్లపూడి శ్రీరామశాస్త్రి గారు

'కవృవర్ణే' అను ధాతువునుబట్టి రసభావాదికమును వర్ణించువాఁడు కవి యనఁబడును. 'కవిఃక్రాంతదర్శీ' అనియు గోవిందరాజీయ వ్యాఖ్య. అతీతమును దర్శించువాఁడనియర్థము. దర్శించువాఁడుగాన ఋషియనియుఁ జెప్పబడును. దర్శనశబ్దమునకు 'విచిత్రభావధర్మాంశతత్త్వ ప్రఖ్య' యని యాలంకారికుల నిర్వచనము. అంతరింద్రియమునకును బాహ్యేంద్రియమునకును గోచరమగుతత్త్వమును వర్ణించువాఁడు కవియనఁబడునని తెల్లమగుచున్నది. కనుకనే "నానృషిఃకురుతే కావ్య" మనుట. అట్టి కవియొక్క వ్యాపారమే కావ్యమనఁబడును.

## కావ్యస్వరూపము

కావ్య స్వరూప నిర్ణయములో ననేకమతములున్నను 'రసాత్మకం వాక్యం కావ్య' మను నిర్వచనము నన్నియు, 'దాసోఽహ' మ్మని చెప్పవలసినవే యైయున్నయవి. 'అదోషౌ' ఇత్యాది కావ్యనిర్వచనములఁ గావించిన సాహిత్యవేత్తలు కవియొక్క స్వాతంత్ర్య మరికట్టి, వారిని లక్షణపాశబద్ధులఁ గావించియున్నారనియు, 'రసాత్మకం వాక్యం కావ్య'మని నిర్వచించిన విశ్వనాథాదులు విశాలహృదయులై కవి కెక్కుడు స్వాతంత్ర్య మొసంగి యున్నారనియు మనపండితవర్యులలో, కొందఱి యభిప్రాయ మైయున్నట్లు స్పష్టము. ఆలోచింప నాలంకారికు లెల్లరును నీవిషయమునఁ, దుల్యాభిప్రాయముగలవారనియే చెప్పనగును. మొదటితరగతికిఁ జేరిన మమ్మటభట్టాదులు వీరిలోనుండగనే కట్టెవిరచినట్లు చెప్పవలసిన మాటలఁ జెప్పియున్నారు. రెండవతరగతికిఁ జేరినవారు నడుమలోనికివచ్చిన సిమ్మట నానాలుగుమాటల నేకరువు పెట్టినారు. కొంత తిరుగుళ్లుతప్ప నెవరుచెప్పినను కావ్యమునందు దోషము లుండగూడదు. గుణము లుండవలయును. అలంకారములును నుండవలయు. దోషములున్నను, గుణములు లేకపోయినను కావ్యము రసహీనముగ నుండుననియే. విశాలహృదయులని పేర్కొనఁబడుచున్న లాక్షణికులును దమ గ్రంథముల దోషప్రకరణమునందు 'దోషా రసాపకర్షకాః, రసాపకర్షకా దోషాః' అని త్రిప్పించి మళ్లించి చెప్పియే యున్నారు. కనుక 'కావ్యము రసాత్మకముగ నుండవలయు' ననుట నిర్వివాదాంశముగాన మన కితరవర్ణ్యలతోఁ బనిలేదు.

## కావ్యవిభాగము

ఇట్టికావ్యము దృశ్యమనియు శ్రవ్యమనియు, రెండువిధములుగఁ బరగుచున్నది. ఈరెండువిధములయందును కావ్యత్వముండునపుడు ఈవిభాగము వలని ప్రయోజనమేమని సంశయము గలుగవచ్చును. శ్రవణేంద్రియగ్రాహకమగు శ్రవ్యమునందు (రామాయణాదులు) దృశ్యత్వము లేక పోవుటచేతను, దృశ్యమునందు శ్రవ్యత్వదృశ్యత్వములు రెండు నుండుటచేతను విభాగ మావశ్యకమేయగును. కనుకనే 'దృశ్య శ్రవ్యత్వ భేదేనపునః కావ్యం ద్విధామతమ్' అని సాహిత్యదర్పణకారుఁడు వచించియుండుట.

## దృశ్యకావ్యభేదములు

దృశ్యమునకు * రూపకమనియు నామాంతరము గలదు. రామాది నాయకుల రూపమును నటుఁడు దనయం దారోపించుకొనుటచే నిద్దానికి రూపకమని పేరు

---

* రూపకభేదములలో నన్యతమమునకే నాటకశబ్దవ్యవహారము శాస్త్రసిద్ధమైనను, రూపకసామాన్యమునకు నాటకశబ్దమాదినుండి వ్యవహరింపఁబడుచున్నట్లు పెక్కునిదర్శనములు గలవు.

వచ్చినది. ఈ దృశ్యకావ్యము పాఠ్యము, గేయము, అని రెండువిధములు గలది. అందు పాఠ్యము:

నాటక, ప్రకరణ, నాటికా, సమవాకార, ఈహామృగ, డిమ, వ్యాయోగ, ఉత్సృష్టిక, అంక, ప్రహసన, భాణ, వీథీ, సట్టకములు మున్నగు భేదములతో నొప్పుచుండును. ఇందు నాటకము మొదలు వీథ్యంతము వఱకుండు రూపక భేదములు వాక్యాభినయస్వభావముగలవియు, భరతముని ప్రతిపాదితములునై యున్నవి. సట్టకముగూడ నట్టిదేయని కొందఱి యభిప్రాయము.

## గేయము

డోంబికా, భాణ, ప్రస్థాన, శింగక, భాణికా, ప్రేరణ, రామక్రీడ, హల్లీసక, రాసక, గోష్ఠీ, శ్రీగదిత, రాగ, కావ్యము అను నీ మొదలగు భేదములుగలది. ఈడోంబికాది గేయములు పదార్థాభినయ ప్రధానములైనవి.

ఆచార్య హేమచంద్రుఁడు తనకావ్యానుశాసనమునపై రూపక భేదములగుఱించి ముచ్చటించుచు "ప్రపంచస్తు బ్రహ్మభారత, కోలాహలాది శాస్త్రేభ్యోఽవ గంతవ్యః" అని వ్రాక్రుచ్చియున్నాఁడు. దీనింబట్టి సంస్కృతభాషలో రూపకములును, దద్విమర్శనములును నెంత విరివిగనుండినవో తెలిసికొనవచ్చును.

సాహిత్య దర్పణకారుఁడు 'రూపకములు, ఉపరూపకములు' అనిదృశ్యమును రెండువిధములుగవిభజించి, యందు రూపకములు పది యనియు, నుపరూపకములు పదునెనిమిదియనియు, విభాగించుచు, భాణభేదములగు 'ఉత్సృష్టిక, సమవాకార, సట్టక' ముల నుపరూపకములలోనే చేర్చి, యన్నిభేదములకు లక్షణోదాహరణంబుల నొసంగియున్నాఁడు. ధనంజయ మహాకవి దశవిధరూపకముల గుఱించి 'దశరూపక' మనుపేరుతోఁ బ్రత్యేకముగ నొక గ్రంథమును వ్రాసియున్నాఁడు.

అనుకరణాత్మకమైనను రూపకము వస్తునేతృరసములచేఁ బెక్కుభేదములతో వ్యవహరింపఁబడుచున్నది. కనుక నిట్టిరూపక భేదములకు విషయభూతములగు నితివృత్తాదుల గుఱించి సంగ్రహముగ ముచ్చటించుటతో నీవ్యాసోద్దేశమును గొంతవఱకైన నెరవేర్చుకొందము గాక.

## ఇతివృత్తము

ఇతివృత్తమనఁ గథ. దీనికే వస్తువనియు నామాంతరము. ఇయ్యది నాట్యమునకు శరీరము వంటిదగుటచే నేతత్సంవిధానచాతుర్యమునందే నాటకకథ యాధారపడియున్నదని యేర్పడుచున్నది. నాటకమునందుఁగల్పనాస్థాలిత్యమొదవెనేని దక్కినగుణము లెన్ని యున్నను వ్యర్థములే యగును. కథాసంవిధాన విశేషమును బట్టియే కావ్యమునుండి నాటకము వేఱైనది. శ్రవ్యము వర్ణనాప్రధానమనియు, దృశ్యము కథాప్రధానమనియును దలంపఁజనును. అట్లని తక్కిన యంశములకు నాటకమునం దవకాశము లేదని యూహింపనలదు. కథాప్రవాహము నిరర్గళముగఁ బ్రవహించుటయ యిందు ముఖ్యగుణము. నాటకమునం దనవసర ప్రసంగముల కేమాత్రమేని నవకాశ ముండదు. కవీశ్వరుని యాశయము సయితము పాత్రముఖముగానే యథోచితముగ నిందు నెల్లడింపవలసి యుండును. పాత్ర స్వభావము ననుసరించియే కథయు నడవవలయును.

## నాటకాంగములు

ఈ కథా సంవిధానమునందు స్థాలిత్యము వొడమకుండుటకై ప్రాచీన సాహిత్యవేత్తలు గ్రంథములఁ బరిశీలించి కొన్నిపద్ధతుల వ్రాక్రుచ్చియున్నారు. అవియ యర్థప్రకృతులనియు, నారంభాద్యవస్థలనియు, ముఖాది సంధులనియు, బేర్కొనఁబడుచున్నవి.

స్వాయత్తసిద్ధుఁడగు నాయకునకు సంపాద్యమగు నర్థమునందు 'బీజ, బిందు, కార్యము' లను ప్రకృతులు (స్వభావవిశేషములు) మూఁడువిధములు. అందు మొదటిది సర్వవ్యాపారహేతువు. విత్తనమొక్కటొలుత స్వల్పముగనుండి యనేక శాఖోపశాఖలుగ విస్తరిల్లునో యట్లు కథయు మొదట చిన్నదిగనుండి యనేక నాయక, ప్రతినాయకాది భేదములతో ననేకవిధములుగ విస్తృతమై కార్యరూపమునఁ బరిణమించుచున్నది. ఆ కార్య సాధకంబగునట్టి కారణవిశేషమే బీజము నాఁబడు. అనుసంధానాత్మకము బిందువు. కథాభాగము వీడిపోక యుండునట్లు నంతిరకార్యమునుగూర్చుటకు హేతువగునది బిందువనఁబడును. కథాభాగములోఁ బ్రధానఫలము

నిర్వహించుననది కార్యమనఁబడు. ఇవిగాక పతాక ప్రకరులని యర్థప్రకృతు లింకను రెండుగలవు. అవి సచివాయత్తసిద్ధుఁడగు నాయకుని విషయమున నుపయోగపడును.

ఆరంభ, ప్రయత్న, ప్రాప్తిసంభవ, నియత ప్రాప్తి, ఫలయోగములను నవస్థలును నితివృత్తమునకు సంబంధించినవై నాయకుఁడు ఫలసిద్ధికై గ్రహించిన వ్యాపారరూపమైన యుపాయమునకుఁ గలుగు నవస్థలేయని యెఱుంగునది. అర్థప్రకృతు లారంభాద్యవస్థలతోఁ గూడినపుడు కలుగునవియే ముఖాదిసంధులు. సంధియన నొక ప్రయోజనముతోఁగూడిన కథాంశమునకు నవాంతరమైన మఱొక ప్రయోజనముతో సంబంధము గలుగుటయే. ఈముఖ, ప్రతిముఖ, గర్భ, అవమర్శ, నిర్వహణములను సార్థకనామములతో నొప్పు పంచ సంధులు ఇతివృత్తభాగములు. ఈసంధులకు నుపక్షేపాదులగు నఱువదినాలు గంగములు గలవు. ఇవియు నితివృత్తముయొక్క యవాంతరభాగములుగనే యెఱుంగునది. ఈసంధి సంధ్యంగప్రయోజనమే మన — వివక్షితమైన ప్రయోజనమును జెప్పుట, గోప్యమైనదాని మఱుగుపరచుట, ప్రకటింపఁదగిన దానిఁ బ్రకటించుట, అభినయప్రదర్శనముచే సామాజికులకు సంతోషానురాగముల గలిగించుట, కథను జమత్కరించుట, కథను విస్తరింపజేయుట, యనునవి. రసాంగభూతమగు కథాభాగముయొక్క ప్రశస్తినిసంపాదించుటయే యీసంధ్యంగప్రయోజనమని భరతాచార్యులు నుడువుచు, దత్ప్రయోజనము నిట్లు వాక్రుచ్చియున్నాఁడు.

"శ్లో. ఇష్టస్యార్థస్యరచనా వృత్తాంతస్యానపక్షయః,
రాగః ప్రీతిః ప్రయోగస్య గుహ్యానాంచైవ గూహనమ్.
ఆశ్చర్యవ దభిఖ్యానం ప్రకాశ్యానాం ప్రకాశనమ్,
అంగానాంషడ్విధం హ్యేతత్ దృష్టంశాస్త్రే ప్రయో
[జనమ్."

ఆనందవర్ధనాచార్యు లీసంధిప్రయోజనమును గుఱించి చర్చించుచు, నీసంధ్యంగములు రసాభివ్యక్త్యపేక్షచేఁ గావ్యమునందుఁ గూర్పవలయుఁగాని కేవలశాస్త్రస్థితి సంపాదనేచ్ఛచే ననవసరముగ వానినాటకమునం జొటిపఁదగదు అనినుడువుచు, వేణీసంహారములో ద్వితీయాంకములో ప్రతిముఖసంధ్యంగమైన విలాసమునునది ప్రకృతమగు వీరరసమునకు ననుగుణమైనను భరతమతము ననుసరింపనుద్దేశించి కాఁబోలునాకవి నెలకొల్పియున్నాఁడని యాక్షేపించియున్నాఁడు. కావ్యము రసాత్మకముగ నుండవలయునన్న విభావాద్యౌచిత్య సుందరమగు కథాశరీర మత్యావశ్యకమని యాపండితవర్యు నియాశయమై యున్నది. అందు భావౌచిత్యమును గుఱించి యామహాశయుఁడు చర్చించిన విషయములో దిఙ్మాత్రముగనైన నిచట ప్రదర్శించుట యావశ్యకము గాకపోదు.

భావౌచిత్యము.

భావౌచిత్యమన, ప్రకృత్యౌచిత్యము. ప్రకృతి యుత్తమ మధ్యమాధమభావములచేతను, దివ్యమానుషాది భావములచేతను బెక్కువిధములుగ నుండును. కావున నాయాప్రకృతి ననుసరించి యౌచిత్యమును బోషింపవలయును. దివ్యాశ్రయములైన యుత్సాహాదులకును, మానుషాశ్రయములైన యుత్సాహాదులకును నెంతయో తారతమ్యముగలదు. కనుకఁ దద్విశేష మెఱుంగక కావ్యరచన యొనర్పఁబడునేని యయ్యది యనౌచిత్యభాజన మగును.

మఱియు కేవల మనుష్యులైన రాజాదుల విషయమున వర్ణింపఁబడిన సప్తార్ణవలంఘనాదివ్యాపారము సౌష్ఠవభృతమైనను నీరసముగానే చూపట్టును. అద్దాని కిఁగారణ మనౌచిత్యమే. ఈసందర్భమున లోచనకారుని యభిప్రాయమును గనుఁడు.

"యత్ర వినేయానాం ప్రతీతిఖండనా నజాయతే తాదృగ్వర్ణనీయం తత్ర కేవలమానుషః ఏకపదే సప్తార్ణవలంఘన మసంభావ్యతయా అనృతమితి హృదయే స్ఫురదుపదేశ్యస్య.........సోప్యలీకతాం బుద్ధౌ నివేశయతి." (ధ్వన్యాలోకము)

(గ్రంథమునందు వర్ణింపఁబడినవిషయముసామాజికులకు విశ్వాసపాత్రముగ నుండవలయు. కేవలమనుష్యుఁడు. సప్త సముద్రముల దాటినాడనుట యసంభావ్యము కావున ప్రేక్షకుల కనృతమను బుద్ధి జనింపవచ్చును. కనుక నట్టివర్ణన మసంగతము) ఆదికవియగు వాల్మీకిమునిచంద్రుఁడు లీలామానుష విగ్రహుఁడగు తనకావ్యనాయకుని యర్ణవలంఘన వ్యాపారమును మా

న షా శీ ప్ర ము గ వర్ణింపకుండుటకు హే తు వు చు తేమియుండును ? అట్లయిన రాజలవిషయమున, ప్రభావాతిశయ వర్ణనము నిషిద్ధమేనా ? యను సంశయము గలుగవచ్చును. కేవలమానుషాశ్రయమైన యుత్పాద్య కథయందు దివ్యమగుచౌచిత్యనిబంధనమసంగతము. దివ్యమానుషాశ్రయమైన కథయందైననో నుభయమునన విరుద్ధమేయగు. తాదృశ్యముగఁ బాండ్వాదిచరితమును గైకొనవచ్చును. కనుకనే నాటకమున కితివృత్తము ప్రసిద్ధమైనదిగను, నాయకుఁడుప్రఖ్యాతుఁడుగను నుండవలయునని భరతాద్యాలంకారికులు వచించియుండుట. ప్రఖ్యాత వస్తువర్ణనాసందర్భమున కవి యౌచిత్యమును బోషించుటయందు సామాన్యముగ విమోహితుఁడుగాఁజాలఁడు. అప్రసిద్ధ నా య కు ని వర్ణించుచో నెట్టికవికిఁ గాని ప్రమాదము సంభవింపవచ్చును. కనుక కవియైనవాఁడు శాస్త్ర లోకాద్యనుభవములఁ బురస్కరించుకొని విభావాద్యౌచిత్యమును యథార్థముగఁ బోషించుటలోఁ దగినప్రయత్నమొనరింపవలసియుండు. ఔచిత్యమును గుఱించి చర్చించుచు క్షేమేంద్రమహాకవి 'ఔచిత్యం రస సిద్ధస్యస్థిరంకావ్యస్యజీవితం' (రససిద్ధమైనకావ్యమునకుజీవితమౌచిత్య)మనివచించియున్నాఁడు. ఆనందవర్ధనాచార్యులీసందర్భమునఁ జెప్పినమాటలు సదాస్మరణీయములై యొప్పెడివి.

> "అనౌచిత్యమునకంటె రసభంగకరము మఱొకటి లేదు. ఔచిత్యమే రసనిబంధనము."

మఱియుఁ బ్రఖ్యాతములగు రామచరితాదుల నాటకముగ రచించుచో రసానురూపములగు నంశముల యథౌచిత్యముగ మార్చుకొనవచ్చును. ఇందులకుఁ బ్రమాణము శాకుంతలాది నాటకములే. అట్లని ప్రఖ్యాత చరితమును సామాజికవిశ్వాసానర్హముగ మాత్రము మార్చుట తగదు. పైయభిప్రాయమునే యీక్రిందివిధమున నానందవర్ధనాచార్యులు వచించియుండుటఁ గనుఁడు.

> "శ్లో-సంతిసిద్ధరసప్రఖ్యాఃయేచ రామాయణాదయః,
> కథాశ్రయా నతైర్యోజ్యా స్వేచ్ఛారసవిరోధినీ."

ఆలోచింప రసాభివ్యక్త్యపేక్షం బురస్కరించుకొని గ్రంథరచన యొనర్చునపుడు కవినిరంకుశుఁడు కావచ్చునను భావమే ప్రాచీన లాక్షణికాగ్రగణ్యుల కును గలదని స్పష్టమగుచున్నది కదా. కనుకఁ బ్రాచీన లక్షణములనినతోడనే ఘతినొందక యవ్వాని పరిచయమును గౌరవించుకొనుట నేఁటినాటకకవులకుఁ బరమోపకారమనుట నిస్సంశయము. ప్రకృతమునకు నించుక దూరములైనను కొన్ని యంశముల నిటఁ జర్చింపఁబూనినందులకు క్షమింపఁ బ్రార్థితులు.

## కావ్యహేతువులు

లక్షణ పరిచయ మిసుమంతయైన లేక నేఁటి నాటకకవులలోఁ గొందఱు తమకృతులయం దొనరించు నవలక్షణము లసంఖ్యాకము లనుట సహృదయగోచరంబ. విన్యమానాంధ్రకవులలోఁ గవిత్వశక్తిగలవారు పెక్కండ్రు గలరు. ఈశక్తివలన కవిత్వధాటి నిరాఘాటముగఁ బ్రసరించుటయు నిక్కము. కనుకనే 'కావ్యమునకు నీశక్తికారణమనియు, నిది ప్రాక్తనవాసనా లభ్యమనియు, నిదిలేనిది కవిత ప్రసరింప నేరదనియు, బ్రసరించినను బరిహాసభాజన మగుననియు కావ్యప్రకాశకారుఁ డిట్లు వచించియున్నాఁడు.

> "శక్తిః కవిత్వబీజభూతసంస్కారవిశేషః యాం వినా కావ్యం నప్రసరేత్; ప్రసృతంవా అపహాసనీయం స్యాత్."

ఇట్టి శక్తిమాత్రమున్నంతనే ప్రయోజనము లేదు. ఇయ్యది యొకవేళఁ బ్రతికావ్యాసములకుఁ గొంతవఱ కుపయోగించిన నుపయోగించుఁగాక. రసవత్కావ్యరచనకు నిష్ప్రయోజనమను తలంపుతోఁగానోపు !

> "సాచవ్యుత్పత్త్యభ్యాసాభ్యాం సంస్కార్యా"
> (ఆశక్తివ్యుత్పత్త్యభ్యాసములచే సంస్కరింపఁదగినది)

అని ఆచార్యహేమచంద్రుఁడును,

> "శక్తిర్నిపుణతాలోకశాస్త్రకావ్యాద్యవేక్షణాత్,
> కావ్యజ్ఞశిక్షయాభ్యాస ఇతిహేతు స్తదుద్భవే."

(శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసములు మిళితములై యొకటిగనే కావ్యనిర్మాణసామగ్రి యగుచున్న యది) అని మమ్మట భట్టును నుడివియున్నారు.

కావ్యాలంకారకర్తయగు రుద్రటుఁడు కావ్యప్రయోజనమును గుఱించి ముచ్చటించుచు "అనంతరత్న

నిలయమగు సాగరంబుమాడ్కి, ననంతగుణాకరంబగు కావ్యమును నెవ్వాడు సమగ్రముగ నిర్వర్తింపఁజాలు? అయినను బురుషార్థసిద్ధిప్రదంబును, నిర్మలయశోదాయకంబునునగు కావ్యనిర్మాణమునకు నధిగతసకలశాస్త్రులగు కవులే సర్వవిధములఁబూనవలయు. రమ్యకావ్యనిర్మాణమునకు శక్తి, వ్యుత్పత్తి, అభ్యాసము లనునవి యత్యంతావశ్యకములు" అని నుడువుచు నాసాధనత్రయమును గూర్చి వివరించియున్నాఁడు.

"శ్లో. తస్యాసారనిరాసాత్సారగ్రహణాచ్చచారుణః
కరణే త్రితయమిదం వ్యాప్రియతే శక్తిర్వ్యుత్పత్తి రభ్యాసః."

రాజశేఖరుఁడు 'కవికి కావ్యనిర్మాణకార్యమందు శక్తిలోపమువలనఁ గలుగు దోషమును వ్యుత్పత్తి కొంతవఱకుఁ గప్పిపుచ్చఁగల'దని కావ్యరచనయందు వ్యుత్పత్తికి ప్రాశస్త్యమొసగియున్నాఁడు. ఈవ్యుత్పత్త్యభ్యాసములు అనుపదములు నిత్యవ్యవహారసిద్ధములగుటచే సర్వసామాన్యములుగ భావింపఁబడుననుతలంపుతో వాని నిర్వచనము లిట్లు వివరింపఁబడినవి.

"లోకశాస్త్రకావ్యేషు నిపుణతా వ్యుత్పత్తిః.
లోకే స్థావరజంగమాత్మకే లోకవృత్తేచ, శాస్త్రేషు శబ్దచ్ఛందోఽను శాసనాభిధానకోశ ప్రుతిస్మృతిపురాణేతిహాసాగమ తర్క నాట్యార్థకామ యోగాది గ్రంథేషు, కావ్యేషు మహాకవిప్రణీతేషు, నిపుణత్వం ఉత్త్వవేదిత్వం వ్యుత్పత్తిః."

"కావ్యానచ్ఛిన్నలయా పునః పునఃప్రవృత్తి రభ్యాసః, కావ్యంకర్తుం జానంతి విచారయంతివా యేతే కావ్యవిదః కవిసహృదయాః...... అభ్యాససంస్కృతాహి ప్రతిభా కావ్యామృత కామధేను ర్భవతి."
(కావ్యానుశాసనము)

చూచితిరా, వ్యుత్పత్త్యభ్యాసములచే సంస్కరింపఁ బడిన ప్రతిభయే కావ్యామృతకామధేనువట. కనుకనే "విద్వత్కవయః కవయః కేవల కవయస్తుకేవలంకపయః" అను చాటూక్తి పెద్దలచే నాదరింపఁబడినది.

## ఆంధ్రకవితావిజృంభణము

ప్రకృతిములో నాంధ్రదేశములోఁగవితాశక్తియథేచ్ఛముగవిహారము సలుపుచున్నయది. 'ఇద్దరాంధ్రులొకచోటనుండిన నందొకరు కవిత్వము చెప్పువాఁడు గనే యుండు'నని యిటీవలనొకరు పత్రికలోఁ బ్రకటించినది సత్యదూరమన వీలులేదు. ప్రతిదిన మాంధ్రదేశము నుండివచ్చు గద్య పద్యాత్మకములైన వ్యాసముల సమగ్రముగఁ బ్రకటింపవలయునననిన నాంధ్రపత్రికవంటి దైనిక పత్రిక లైదున్నను కొఱఁతగనే యుండుననుట యతిశయోక్తి కానేరదు. కాలచక్రభ్రమణములో నీశతాబ్ద్యంతము ఆంధ్రదేశములో వాసికెక్కినదని చెప్పనగును.

కాని యిదంతయు స్థూలదృష్టికిమాత్రమేమో యని సంశయమయ్యెడి. ఏమన ఒకచరిత్రకారుఁడీ కాలపు టాంధ్రదేశసారస్వతవిజృంభణమును గుఱించి వ్రాయమొదలిడినచో నెట్లారంభించి యెట్లుముగించునో మహాశయులే యించుక యాలోచింపఁ బ్రార్థితులు. ఇద్దానికి హేతువు మఱిమియుఁ గాదు. లభ్యమైన శక్తి సంపద సంస్కారరహితమై యొప్పుటయే యని నా యాశయము.

## ప్రాచీనలక్షణ గ్రంథనిరసనము

మఱియు నిక్కాలమున, గవితాశక్తికల వారందఱును, గావ్యనాటకముల రచించు వారేయని యెల్లరెఱింగిన దేకదా! వీరిలో నేకొలఁదిమందియో ప్రాచీన లక్షణగ్రంథములఁ గాంచియుందురనితలఁచెదను. ఈవిషయమైయేగ్రంథమందుఁజర్చింపఁబడియున్నదో తెలియని వారికంటెఁ బ్రాచీన మనినతోడనే నిరసించువారధిక సంఖ్యాకులుగలరని చెప్పనగును. ప్రాచీను లొనర్చిన మహోపకారము నేటికాలమున మనకిట్లు విషమముగఁ బరిణమించుటకు హేతువు వారి దురదృష్టమో మనదురదృష్టమో నిలకడమీఁదఁగాని బోధపడనేరదు.

నేనిట్లు పలుమారు చెప్పుచుండుటనే, ప్రాచీన లక్షణ మంతయు మనకవశ్య గ్రాహ్యమనియు, నయ్యది నిర్దుష్టమనియు నాయుద్దేశముగఁ గొందఱకుఁ దోఁచవచ్చునేమో! మఱిచింత. ఇటీవల నొకమిత్రుఁడు పత్రికాముఖమున నన్నిట్లు హెచ్చరించికూడ నున్నాఁడు. "ప్రాచీ నాలంకారముల నాదర్శముగఁగొని కవులను నెప్పటికిని లేవలేనిగోతిలోపడునట్లు శ్రీశాస్త్రిగారు రుపదేశించుట సరికాదు" అని. పాపమెపరో గిట్టని వారట్లు వారికి భీతిఁగలి

గించిరి కాబోలు! అట్టియుద్దేశ మా కాలపు కవులకుఁ గాని లాక్షణికులకుగాని లేనట్లు వారిగ్రంథములఁబట్టియే సులభముగఁ దెలిసికొనవచ్చును. లక్షణ గ్రంథములన్నియుఁ బ్రాచీన లక్ష్యగ్రంథములఁ బట్టియే వ్రాయఁబడినవి కదా! లక్ష్యగ్రంథములన్నియు నిర్దుష్టములని యెవ్వరైనఁ జెప్ప సాహసింతురా? అట్లే యున్నయెడల నొక్కొక్క లక్షణగ్రంథమందును గొంత భాగము దోషవిమర్శన ముండు టెందులకు? మఱియుఁ బ్రాచీన కవులలోనే లక్షణోల్లంఘన మొనరించిన వారు పెక్కండ్రు గలరు. తరువాతి వారు వారియాశయములఁ బ్రమాణముగఁ గైకొని యుండలేదా? కనుక నట్టి యభిప్రాయము సర్వవిధముల నసంగతమేయగు. "పురాణమిత్యేవ నసాధుసర్వం నచాపి కావ్యం నవమిత్యవద్యమ్" అని మహాకవియగు కాళిదాసు ఘంటాపథముగఁ జెప్పియే యున్నాఁడు కనుక ప్రాచీనసాహిత్యవేత్తలు నిర్ణయించిన విషయ మిట్టిదనియైనఁ దెలిసికొనక 'ప్రాచీనుల పిచ్చికూతలని' నిశ్శంకముగఁ బత్రికలలోను, గ్రంథములలోను బ్రకటించు మిత్రులసాహసమున కెంతయు విచారింప వలసి యున్నది.

మఱియుఁ బ్రస్తుతములో మనదేశములో నుత్తమగ్రంథములు వెలువడకుండుటకు మహారాజవైముఖ్యమును హేతువని చెప్పవలసి యుండును.

## మహారాజవైముఖ్యము

అవుగాక! లక్షణగ్రంథ పరిశ్రమ మొనరించిన వారు కలరుగదా! వారేల మంచిగ్రంథముల వ్రాయఁ గూడదు; అని యడుగుదురేమో! ప్రాచీన సారస్వతమును జక్కఁగఁ బరిశోధించినవారు కలరు. ఉత్తమగ్రంథము లున్నవి. కాని లెక్కపెట్టఁదగినవన్నియున్నవా యని యు సంశయము. వానినిఁగాని, వారినిఁగాని యాదరించు వారును బ్రకృతములో లేరనియే చెప్పనగు. వారైనఁ దొలుత నాగ్రంథములఁ బొరపాటున వ్రాసిరనియే తోఁచెడి. తరువాత వారును దమతప్పెఱింగి పశ్చాత్తాపతప్తులై రైలులో నమ్ముఁదగినపుస్తకములనే యనాయాసముగ వ్రాయుచున్నారు.

"శ్లో. కస్త్వంభోః? కవిరస్మి, కావ్యభినవా
సూక్తిస్సఖే పఠ్యతాం
త్యక్తా కావ్యకథైవ సంప్రతి మయా
కస్మాదిదం? శ్రూయతామ్,
య స్సమ్యగ్వివినక్తి దోష గుణయో
స్సారం స్వయం సత్కవిః
సోఽస్మిన్ భావుక ఏవనా స్త్యథ భవే,
ద్దైవాన నిర్మత్సరః."

(నీవెవ్వరవు? నేకవిని. అట్లయినమిత్రమా! యొక నూతనపద్యమును బఠింపుము. నేనిప్పుడా కావ్యప్రస్తావనమునుగూడఁ దలపెట్టుటలేదు. ఎందువలన? వినుము. తాను కవియై గుణదోషపరిజ్ఞానముగలిగి విమర్శింపఁ గల సరసుఁడిప్పుడు కానరాఁడు. ఎచటనైన నదృష్టవశమున నుండెనుపో నాతఁడు మత్సరుండైయుండును. కనుక కావ్యరచనవదలితి.) రాజశేఖరుఁడు తన కావ్యమీమాంసలో నుదాహరించిన యీశ్లోకమునుబట్టి యిట్టి కాలము నొకప్పు డుండెడిదనియే తోఁచెడి.

మఱియు విచారింప, మనకవులు త్యాగభోగములకు దూరులగుటయు, వాఙ్మయమున కిట్టిహైన్యము గలుగుటకు కారణము గాకపోదు. త్యాగమునకును కవీంద్రులకును నేకాలమందైన చాలదూరమనియే చెప్పనగును. ఎంతదూరము విచారించినను పోతనామాత్యుఁ డొక్కరుఁడుదక్క నన్యుఁడు మందునకైనఁ గానరాఁడు. కనుక దంతశదానిం గూర్చియే విచారింపవలసి యున్నది. అయ్యది మనకవులకుఁ బుస్తకపాఠముచెప్ప ననుభవములో లేదనుట ముమ్మాటికిని సత్యబద్ధమే యగును. కవి యైనవాఁడు కుటుంబయాత్రకై పడవలసిన కష్టములన్నియుఁ బడి, యెట్టకేల కించుకయవకాశమును గల్పించుకొని యాలోచింప మొదలిడినయో నింతలో పోలిశెట్టిగారి గుమాస్తా వేసిన కేక, కేకికివ్యాధునిధనుష్టంకారమువంటిదై వినంబడ, దనభావనాశక్తి నాగుమాస్తాగారి ననునయించి పంపుటలో నుపయోగించిన నేకదా మఱునాఁడాతఁడు తలయెత్తుకొని తిరుగఁగలుగుట! ఇన్నియవస్థలనుదాఁటి కవిగారు గ్రంథమును బరిసమాప్తినొందించిరనుకొనుఁడు. అయ్యది యెన్ని యవస్థలతో నుండునో యోజించితిరా?

"వ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె మాత్మ కింపయిన భోజన మయ్యెల"

అని పెద్దనగారనినట్లు విందుముకదా! ఆలోచింప నిం దొకొక్కటియు కవికి ముఖ్యమనదగియున్నది. రాజ శేఖరుడును దనకావ్య మీమాంసలోఁ గవిచర్యనుగు ఱించి ముచ్చటించుచు, "కవికి శుచిత్రయమావశ్యకము. అందు వాక్ఛౌచ మనశ్శౌచములు శాస్త్రములవలనఁ బడ యనగును. మూడవదియగు కాయశౌచము, తాంబూల సేవనము, చందన లేపనము, పుష్పధారణము, లోనగు వానివలన సిద్ధించు. చిత్రకారుని యాకారము ననుసరించి చిత్రముండువిధమున కవిస్వభావము ననుసరించి కావ్య మునునుండును. కనుక నాతనికి స్మితపూర్వాభిభాష ణము, గంభీరవాక్కు లోనగునవి ముఖ్యములు. అతని గృహము లక్ష్మీనివాసమై వృక్షవాటికలతో నిండి యు య్యెలలోనగు వానిచే విరాజిల్లుచుండవలయు." అని వచించి యున్నాఁడు

రెండుమూఁడు శతాబ్దులనుండి మన యాంధ్రకవులస్థితి గతులు మనకుఁ గరతలామలకమే కదా. పెద్దమ్మ కునికి పట్టులై పెంటకుప్పలతో నొప్పు గృహములలో వసిం చుచుఁ గొంపెమ్మకోరికలఁ గోరుచుండు కవు లుత్తమ గ్రంథముల నెట్లు వ్రాయఁ గలుగుదురు?

"ఎంగరైనచోఁ బనుపకరీంద్రము నిల్పి
కేలూఁతనొసఁగి యెక్కించుకొనియె,
మనుచరిత్రం బంకితమొనవేళఁ బురమేగ,
పల్లకి తనకేలఁ బట్టియెత్తె,"

ఇట్లు పూర్వపు కవిసింహములకు జరిగినయు పచారములు-కావంచెకం బె నూరుమడుంగు లధికము లగు నుపచారము-లిక్కాలమున గ్రామసింహములకు జరు గుచుండుటచేతనే వారి ప్రభతగ్గి వీని ప్రభ హెచ్చినది. మనయిప్పటి శ్రీమంతులలోఁ బెక్కండ్రకు పండితుల సన్మానించుట కాదట్లనుటయే యెంతయో గౌరవహాని యని యెల్లరకుఁ దెలిసినవిషయమే.

కావ్యమీమాంసకారుఁడు రాజచర్యను గుఱించి చర్చించుచు "రాజులు భాషాభిమానులై పండితసభలఁ గావించి, వారికి బహుమతులను బట్టములను నొసంగు చుండవలయు. పూర్వముజ్జయిని పాటలీపుత్రము మున్న గు మహానగరములలోఁ బండితసభలు గావింపఁబడుచుం డెడివి." అని నిదర్శన పూర్వకముగ నుడివియున్నాఁడు.

అట్లయిననే యేభాషయైన నుచ్చస్థితి నందఁగలుగును. నేఁ జెప్పవచ్చిన దేమన! ప్రకృతమునలోఁ బ్రతిభావి శారదు లుండియు నపూర్వగ్రంథరచన లేక పోవుటకు కవీంద్రుల దారిద్ర్యమును మహారాజనైన్యముఖ్యమును హేతువులు గాకపోవని.

మహోత్కృష్టములైన భారత రామాయణముల రచించి, యీ యిరువదవ శతాబ్దిని చిరస్మరణీయ ముగ నొనరించిన 'శ్రీయుత కవిరాజు కృష్ణమూర్తి శాస్త్రిగారిని, శ్రీ శేషాద్రి శర్మగారిని నాదరించు ప్రభువులుగలరేమో స్మరింపుఁడు. ఇటీవల శ్రీయుత శర్మగారితో సంభాషించునప్పుడు 'తాము ధన్యులరు. ఉద్గ్రంథ మొకదాని నాంధ్రలోకమునకుసమర్పించితిరి" అనవారు చెప్పినమాటలను వినుఁడు. "ఏమోనండి! గ్రంథరచన ఆత్మహత్యయనితోఁచెడి. కారాగృహమున కెప్పుడు పోవలసినచ్చునో యని భయపడుచున్నాను." ఆ గ్రంథరత్నము మాడ్కి నీమాటలును భాషాభిమా నులమనుకొను మనశ్రీమంతుల మానసములఁ జిత్రిత ములై, యిప్పటి కాలస్వభావమును భవిష్యచ్చరిత్ర కారు లకుఁ దెలుపునదిగనుండుఁగాకను తలంపుతో నెల్లడించి నందులకు శర్మగారును మన్నింపఁ బ్రార్థితులు.

ఇతరగ్రంథములమాట యటుండనిండు. ప్రకృత ములో నాటకముల నంబఱును గౌరవించుచున్నారు. నాటకసమాజములవలన నెంతయో ద్రవ్యమును వచ్చుచు న్నది గొప్ప శ్రీమంతులును సొంతముగ నాటకసమాజ ముల స్థాపించి నాటకములఁగూడ సొంతముగనే వ్రా యించి తత్ఫలనమువలనను ద్రవ్యమును సేకరించుచుఁ బ్రసిద్ధిఁ గాంచియున్నారుకదా. కాని యాలాభగౌరవ ములలోఁ దత్కర్తల కొక్కమైనఁ జెందినదేమో విచా రింపుఁడు. ఆకవు లానాటకములం దుపయోగించినది స్వప్రతిభా వితేషముగాదు, ఇఁకేమన, ఆసమాజపునటుల యోగ్యత. ఇంతయేల కొన్ని నాటకము లాకవులనెత్తురు కండ్లుఁ జూచినవనియే భావింపుఁడు. మహాప్రయత్నముతో రాజపాత్రమునకుఁ గొన్ని పద్యములవ్రాసి, రసవంతము లుగ నున్నవని తానెంతయో సంతసించి; మఱునాఁడు తనసంతోషములో మేనేజరుగాదికిని భాగమియ్యవలయు నని తలంపుతో వారిదివ్యసన్నిధికేతెంచి వారి తొందర

పనులు ముగియువఱకును, వాకిటనున్న మీరాసాహే
బుతో మాటలాడుచుండి, యుత్తరువైనపిమ్మట లోని
కేగి యాపద్యముల వినిపింపగనే, "యెంకయ్యపద్యాలు
పాడగలఁడటయ్యా పిచ్చిబ్రాహ్మణుఁడా! ఇందుకోసరమే
స్టేజీసంగతి మీకేమియుఁ దెలియదని చెప్పినాను. ఇంత
టనైన ఆపద్యాలు పేకిపారవేసి వానికిబదులు నాలుగు
పాటలఁ దగిలించండి" అని యుత్తరువిచ్చెను. ఇట్లే
యొక్కొక్క పాత్ర విషయమునను రాద్ధాంత
సిద్ధాంతములు జరుగుచు నాటకము ముగియునప్పటికి
కనీస మాఱుమాసములకాలమైనఁ బట్టును. అట్లు పూర్తి
చేసి యానాటకమును వారికి సమర్పించిన వారు బహు
మతిక్రింద 50-100 రూప్యముల నిచ్చెదరు. ఇంతస్వల్ప
ముగనిచ్చుటకుఁ గారణము వారియ్యలేనివారగుటయని
భ్రమింపవలదు. కవిగారు నాటకరచనాప్రయత్నమున
మగ్నులైనవయుచుండుటచే కుటుంబవ్యయమాకాలమున
నంతకంటె నధికముకాదని వారికిఁ దెలియును. సమాజా
ధ్యక్షు లెన్నికష్టములనైన నోర్చుకొందురుగాని యిట్టి
యనవసరకార్యముల నధికముగ ద్రవ్యవ్యయ మొనర్చి
సమాజమునకు నష్టముఁదెచ్చుటకుఁ బాల్పడరు. మొట్ట
మొదటనే తమశక్తి వంచనలేక ప్రయత్నించి తక్కువ
మొత్తము నంగీకరించుకవులకే యాహ్వాన మంపెదరు.
మఱచితి; అట్లు పూర్తియైన యానాటకమును కవిగా
రచ్చొత్తింపఁగూడదు. మఱొకరు ప్రదర్శింపఁగూడ
దనియు తప్పక నియమముండును. ఎప్పుడైన నెవరైనఁ
బ్రదర్శనమునుగాంచి, నాటకము చాలబాగుగనున్నదని
నచో వెంటనే మేనేజరుగారు 'శాస్త్రుల్లచేత మేము దగ్గ
రకూర్చొని వ్రాయించినాము' అనిచెప్పును, 'కాబట్టే' అని
యాతఁడనును. ఇఁక కవిగారి కంతకాలముచేసిన పరిశ్ర
మమునకు నబ్బినఫలము చిల్లరంగడిలో బాకీపడిన రూపా
యలుమాత్రమే. నేనీవిషయ మింతదూరము ముచ్చటిం
పఁబూనుటకు హేతువు ఇక్కాలపు కవులజీవయాత్రను
మహాశయుల స్మృతిపథమునకుఁ దెచ్చుటకేకాన క్ష
మింపఁ బ్రార్థితులు.

ఆంధ్రభారతిని ఔన్నత్యమును జూపి లోకోత్త
రవిఖ్యాతిఁ గాంచవలయునన్న నాలోచింప మహితగ
తులు రెండే కాన్పించుచున్నవి. ఐహికమును దుచ్ఛ
ముగఁదలంచు పోతినామాత్యులైన మరలఁ గొంద అవత
రింపవలయు. లేదా, యీకాలపు శ్రీమంతులలోఁ గొంద
ఱైన భాషాభిమానముగలవారై కవిరాజులకుఁ జేయూఁ
తయైన నొసఁగవలయు. ఇంతకంటె మార్గాంతరము
మృగ్యము.

ఇక నాయకభేదములగుఱించి విచారింతము.

## నాయకుఁడు

"నయతి ప్రాప్నోతి ఇతివృత్తం ఫలం చేతి=నాయ
కః" కథను వ్యాపించి తత్ఫలమును నొందువాఁడు నాయ
కుఁడనఁబడు. ఈనాయకుఁడు ధీరోదాత్త, ధీరోద్ధత,
ధీరశాంత, ధీరలలితులని నాలుగు విధములుగఁ బఱగు
చుండు. గాంభీర్యాదిగుణములుకలవాఁడు ధీరోదాత్తుఁడ
నియు, మాత్సర్యాది గుణములుకలవాఁడు ధీరోద్ధతుఁడని
యు, వినయాదిగుణసమన్వితుఁడు ధీరశాంతుఁడనియు, సౌం
దర్యాదిగుణసముపేతుఁడు ధీరలలితుఁడనియు, నుడువుచు
సాహిత్యవేత్తలు ఈ నాయకులకు దక్షిణాదిశృంగార
నాయకుల యవస్థలఁ గల్పించినపుడు పదునాఱువిధము
లనియు, నా పదునాఱు నాయకభేదములకు మరల
జ్యేష్ఠత్వాది కల్పనచే (16 × 3=48) నలుబది యెనిమిది
నాయక భేదము లుత్పన్నములగు ననియుఁ జెప్పి
యున్నారు. ఇట్లే స్వీయ, పరకీయ, సామాన్య, అని
నాయికను మూఁడువిధములుగ విభజించి, పిదప ప్రోషిత
భర్తృకాద్యష్టవిధ నాయికలగుఱించి వివరించుచుఁ
బెక్కునాయకా భేదములఁ బేర్కొనియున్నారు. ఈ
నాయికానాయకని రూపణ మలంకార శాస్త్రముల
యందేకాక, ప్రత్యేకముగ రతి మంజర్యాది గ్రంథముల
యందేకాక, విశేషముగఁ జర్చింపఁబడియున్నది. అం
దైన నన్ని భేదముల వివరించుటకు సాధ్యపడక (1152)
నాయికాభేదము లేర్పడునని స్థూలముగ గణనవేయఁ
బడియున్నది.

## నాయికా నాయక విభాగము వలని ప్రయోజనము

ప్రాచీను లీ విషయమున నింతదూరము
చర్చించుటవలనఁ బ్రయోజన మేమియుండునని సంశయ
ము గలుగవచ్చును. కావ్యభేదమునకుఁ దగిననాయకుఁడు,

నాయకభేదమునకుఁ దగిన నాయిక, వీని కనువగు రసము, ఇట్లన్నియు సమకూడినపుడే కావ్యము హృదయంగమముగనుండునని స్థూలదృష్టిని విచారించినను దోఁపక మానదు. కనుక లక్షణవేత్తలు తాము సంపాదించిన లోకశాస్త్రాద్యనుభవజన్య జ్ఞానముం బురస్కరించుకొని వైవిధ్యమున విభాగమొనరించి యర్వాచీనులకు మార్గదర్శకులైనట్లు తెల్లమగుచున్నది.

మఱియు నాటకమునకు ధీరోదాత్తుఁడు నాయకుఁడుగ నుండవలయుననిన తుచ తప్పకుండ నాలక్షణగ్రథితగుణములతో నా నాయకుఁడు వర్ణింపఁబడవలయునని వారియాశయమై యుండునా? పాంచభౌతికమగు మానవప్రకృతి నిర్వికారముగనుండునని యెవరైనఁ జెప్పఁగలరా? కేవల గుణవిశిష్టముకాని, కేవల నిర్గుణము గాని ప్రపంచములో నేవస్తువైన నున్నదేమో యోచింపుఁడు. కనుక నొక్కొక్కవస్తువును దోషగుణమిశ్రితమై కానవచ్చెడి. అట్లయ్యు మనము కొన్నిటిని మంచివానిఁగను, గొన్నిటినిఁ జెడ్డవానిఁగను విభాగించుచున్నాము. అట్లు విభాగింపఁగలుగుట యాగుణముల యాధిక్యమును బట్టియే. అట్లే ప్రాచీనులును నాయక విభాగ మొనరించి యున్నారని యవగతమయ్యెడి. కనుకనే కావ్యనాయకులలోఁగూడ ధీరోదాత్తుఁడు క్వాచిత్కముగ ధీరోద్ధతాది గుణముల నవలంబించుటయుఁగలదు. ఇట్లే తక్కిన నాయకులును.

విచారింప నీధీరోద్ధతాది విభాగము అవస్థాభేదమునుబట్టి చేయబడినది కాని జాతినిబట్టి కాదు. అట్లే యైనచో జాతి యనపాయియగుట వలన మహాప్రబంధములయందు విరుద్ధానేకరూపాభిధాన మసంగతమగు. దృష్టాంతముగ భవభూతి విరచిత మహావీరచరితమునే కైకొనవచ్చును. ఒక జామదగ్న్యుఁడే యొకచోట ధీరోద్ధతుఁడుగను, మఱియొకచోట ధీరోదాత్తుఁడుగను, నింకొకసందర్భమున ధీరప్రశాంతుఁడుగను వర్ణింపఁబడి యున్నాఁడు. ఇట్లే ప్రాచీనకావ్యనాయకు లందఱును నవస్థాభేదములచే నాయకాంతరగుణముల నవలంబించినట్లు స్పష్టమగుచున్నది.

ఈ యంశమును శాంతముతోఁ బరిశీలింపక "ప్రాచీన కావ్యనాయకులందఱును నిర్జీవప్రతిమలు, లక్షణపాశబద్ధులు, విఱచినవిఱుగరు, పొయిలో బెట్టిన మన్నుఁగాలరు" అని కావ్యనాయకులపైధ్వజ మెత్తునేఁటి కొందఱు పండితప్రకాండుల కౌశలము వర్ణనాతీతము. అధ్యయనములో లోకజ్ఞాన మొకభాగముగఁ దలంచి, మీఁదుమిక్కిలి కవియగువానికి ప్రాపంచకజ్ఞాన ముచ్ఛ్వసితమని విశ్వసించి, శాస్త్రాద్యధ్యయనాదులచేతనే గాక కృత్రిమమగు దేశాటనముచేతను లోకజ్ఞానమలవఱుచుకొని యాయనుభవమును గ్రంథరూపమునఁ బ్రకటించిన ప్రాచీనపండితులవచనములు నేఁటికాలమున 'పిచ్చికూత' లుగ మాఱుటలో నాశ్చర్యమేమి? ఇక ప్రకృతము ననుసరింతము. రూపకభేదోత్పత్తికిఁ దృతీయకారణంబగు రసమునుగూర్చి యీసందర్భమున విచారింపవలసి యున్నను, నావిషయము నిదివరలో విపులముగఁ బత్రికాముఖమున వెల్లడించియున్నవాఁడ నగుటచేతను, విస్తరభీతిచేతను ప్రకృతములో విరమించుచు నాటకప్రయోజనమును గుఱించి కొంతవఱకు విచారించి యీవ్యాసమును ముగించెదఁగాక! ప్రాచీనసాహిత్యవేత్తలయాశయముల వెలిపుచ్చుటయు నీవ్యాసోద్దేశము గాన, ప్రాచీనమతానుసారముగఁ గావ్యసామాన్య ప్రయోజనమును దిఙ్మాత్రముగనైనఁ దొలుతఁ జర్చించుట యావశ్యక మనియే తలఁచెదను.

### కావ్యప్రయోజనము

భరతముని కావ్య మైహికాముష్మికసుఖసాధనంబని వచించియున్నాఁడు. అద్దానిఁ బురస్కరించుకొని తరువాతి యాలంకారికులు కొన్ని యంశములఁ జేర్చుచుఁ గావ్యప్రయోజనముల నసంఖ్యాకములఁ గావించియున్నారు. అందుఁ గావ్యప్రకాశ కారుఁడు:

"కావ్యం యశసేఽర్థకృతే
వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యఃపరనిర్వృతయే
కాంతాసమ్మితతయోపదేశయుజే."

(కావ్యము కీర్తి, ధనము, వ్యవహారజ్ఞానము, అమంగళనివారణము, సద్యః పరనిర్వృతి గలుగఁజేయుటయే కాక, కాంతవలె హితోపదేశమునకు హేతువగును) అని వచించుచు, గావ్యనిర్మాణమువలన నెవరెవ రేయేలాభముల నొందినదియు దృష్టాంతీకరించి

యున్నాఁడు. దీనింబ్రమాణముగఁ గైకొని రుద్రటుఁడు మొదలగు నాలంకారికులు ఇంకను కొన్ని ప్రయోజనములఁ జేర్చియున్నారు.

ధనార్జనము, వ్యవహారజ్ఞానము, అనర్థనివారణము మున్నగునవియు, కావ్యప్రయోజనములుగ నిర్ణయించుటలో కొంతయాక్షేపము లేకపోలేదు. ఇట్టి యాదృచ్ఛికములు కావ్యప్రయోజనముగ నంగీకరించుచోఁ దక్కినవానికంటెఁ గావ్యనిర్మాణమం దాధిక్య మేమియుండును? సామాన్యవిషయములలోనె యిదియు నొకటిగఁ బరిగణింపఁ బడవలసివచ్చునుగదా! అనితరసాధ్యములు కావ్యప్రయోజనముగనంగీకరించుచో 'శతేపంచాశ' న్న్యాయముననఁ దక్కినవియు నద్దాన సిద్ధించునని సహజముగనే యేర్పడును. అనైకాంతికత్వమును ధనార్జనమును గావ్యప్రయోజనముగఁ దలంచుటకు మొదలిడుటయే సంస్కృతవాఙ్మయమునకేమి, యాంధ్రవాఙ్మయమున కేమి కళంకమాపాదిల్లుటకు హేతు వనవచ్చును. ఆలంకారికాగ్రగణ్యుఁడగుమమ్మటభట్టంతటివాఁడుధనార్జనమునుగూడఁ గావ్య ప్రయోజనముగ నంగీకరించుచు 'శ్రీహర్షాదేః ధావుకాదీనామివధనం' అని యుదాహరించుట శోచనీయము. ఏకాలమందును కడుపు కక్కుఱితిగలవా రుండుట యనివార్యము. కవులందఱును పోతనామాత్యునివంటి మహనీయులే యై యుండినచోఁ గావ్యప్రపంచమేకాక లౌకికప్రపంచమును మఱొకవిధముగ మాఱియుండదా? అయిన నట్టిదాని విజ్ఞులగువారు నిరసించుట భావ్యము గాని, ప్రమాణముగఁ గైకొనుట యసమంజసమనక తప్పినదికాదు. తరువాత నుండిన యాలంకారికులలో మమ్మటభట్టుమతమును నిరసించిన యాతఁడు కావ్యానుశాసనకర్తయగు ఆచార్య హేమచంద్రుఁడు ఒక్కఁడే యనితోఁచెడి. ఆపండితవర్యుని కావ్యప్రయోజనచర్చ కడుంగడు హృద్యము.

"కావ్య మానందాయ యశసే కాంతా తుల్యతయోపదేశాయచ" ఆనందము, కీర్తి సత్కళత్రమువలె హిత ముపదేశించుట అనునవియే కావ్యప్రయోజనము లని యాతని యభిమతము. ఈ ప్రయోజనత్రయమును ననితరసాధ్యమని వేఱచెప్పఁ బనిలేదు.

"సద్యోరసాస్వాదన జన్మా, నిరస్తవేద్యాంతరా
బ్రహ్మాస్వాదనసదృశీ ప్రీతి రానందః
ఇదం సర్వప్రయోజనోపనిషద్భూతం
కవిసహృదయయోః కావ్యప్రయోజనమ్."

(వెంటనే రసాస్వాదన జనకమును, నిరస్తవేద్యాంతరమును, బ్రహ్మాస్వాద సహోదరమును, నైనప్రీతియే యానందము. ఈయది కవిసహృదయులకు సర్వార్థదాయకము) అని వివరించుచు మమ్మటాదిమతమును ఖండించియుండుట నరయుఁడు.

"ధనమనైకాంతికం
వ్యవహారకౌశలం శాస్త్రేభ్యోఽపి,
అనర్థనివారణం ప్రకారాంతరేణాపి
ఇతి న కావ్యప్రయోజనతయా ఽస్మాభి రుక్తమ్."

(ధనము కారణాంతరములవలనను సాధ్యము. చాణక్యాది ప్రణీతములగు శాస్త్రములవలన వ్యవహారకౌశల మేర్పడును. అనర్థనివారణము వేఱువిధముగఁ గూడఁ గావచ్చును. కనుక వీనిఁ గావ్యప్రయోజనములుగ మే మంగీకరింపము. ఈసందర్భమునఁ దద్వ్యాఖ్యాత యుదాహరించిన శ్లోకము సంస్మరణీయము.

"శ్లో. ఉపశమ ఫలాద్విద్యా బీజా త్ఫలం ధనమిచ్ఛతాం
భవతి విఫలో యద్యాయాస స్తదత్ర కిమద్భుతమ్;
ననియతఫలాః కర్తు ర్భావాః ఫలాంతర మీశతే
జనయతిఖలు వ్రీహే ర్బీజం నజాతు యవాంకురమ్."

(ఉపశమ ప్రయోజనమగు విద్యవలన ధనమును గాంక్షించువాని యాయాసము విఫలమగునేని నందచ్చెరువందఁ బనియేమి! నియతఫలములగు కర్తయొక్క భావములు ఫలాంతర మియ్యఁజాలునా? వడ్లగింజ యెప్పుడును యవాంకురము (ధాన్యవిశేషము) పుట్టింపఁజాలదు.)

## నాటక ప్రయోజనము

ఇక నాటక ప్రయోజనమును విచారింతము. ప్రభు సమ్మితములై శబ్దప్రధానములైన వేదముల కంటెను, మిత్రసమ్మితములై యర్థప్రధానములైన పురాణములకంటెను, రసోత్పాదకములగు కావ్యములయందు కాంతాసమ్మితోపదేశత్వము విలక్షణమనుట సర్వపండి






ఇర్విను ప్రభువు
నూతన రాజప్రతినిధి



ఇర్వినుప్రభ్వి
నూతన రాజప్రతినిధి గారి సతి

కాలములోఁగూడఁ గావ్యప్రయోజనములలో నన్యములు పౌరాణికగాథలలోఁ బరిగతములై యనుభవదూరములైనను కాంతాసమ్మితతత్త్వముమాత్రము కావ్యమును విడిచినదికాదు. శుల్కరూపమునఁ గాంతవలె విక్రయరూపమునఁ గావ్యమును ధనాగమైక ప్రయోజనముగఁ గదాయుండుట! కాలధర్మమునుబట్టి యిప్పుడిట్లు పరిణమించినను కావ్యప్రయోజనము లోకోత్తరమైనదనుట నిస్సంశయము. శ్రవ్యకావ్యము వలననే యిట్టి యద్భుత ప్రయోజనమున్నట్లు విదితమగుచుండ, శ్రవ్యత్వ దృశ్యత్వములుగల నాటకప్రయోజనమును గుఱించి చెప్పవలయునా ?

ఇంద్రియములలో నెల్లఁ జక్షురింద్రియము పరమోత్కృష్టమైనది. ఏవిషయమునైనఁ బెక్కుసారులు వినుటకంటె, నోట నుచ్చరించుటకంటె, నొక్కమాఱు కన్నులారఁ గనినంతనే యెంతయేని యానందముద్భవించును. మీఁదు మిక్కిలి యావిషయము మానసమున దృఢముగ నాటుకొని సామాన్యముగ విస్మృతిపాలుగానేరదు. ఇంతయేల? ప్రశ్నోత్తర రూపకముగ నెట్టిక్లిష్టవిషయమును సుబోధమగుచుండ నావిషయమట్లే పాత్రముఖముగఁ జక్షురింద్రియగోచరమగునట్లు ప్రదర్శించిన నయ్యది యెట్లుకరతలామలకమగునో యోజింపుఁడు. కనుక, నాటకశాలలు విద్యాపీఠములుగ నెన్నుటకుఁ దగిన వనవచ్చును. పండితులు, పామరులు, రసికులు, అరసికులు, అనుభేదములేక యందఱ నానందాబ్ధి నోలలాడించుచు సదుపదేశమును గఱపు నాటకరంగములకంటె నన్యములు వ్యగ్యములనియే తోఁచెడి. దేశాభిమానము, మతాభిమానము, లోనగువాని జనసామాన్యమునకుఁ గలుగఁజేయఁగలయునని నాటకరంగములు పరమోపకారకములు. చెన్నపురిలో నొకప్పుడు శివాజీ చరిత్రమును రసవంతముగ ప్రదర్శించుచుండ సామాజికులకు వీరావేశ ముద్భవించినదని యొకమిత్రుని వలన నాకర్ణించితి. అట్లే నివృత్తిమార్గము నుపదేశించుటకును నియ్యది సద్గురు తుల్యమనవచ్చును. ప్రబోధచంద్రోదయ నాటకములో సూత్రధారుని సంభాషణము.

> "తేన శాంతిపథప్రస్థితేన ఆత్మవినోదార్థం ప్రబోధచంద్రోదయాభిధానం నాటక మభినేతుమాదిష్టోఽస్మి త దాదిశ్యతా భరతావర్ణికా పరిగ్రహణాయ."

(వీరరసోజ్జృంభణకర్తయగు కీర్తివర్మమహారాజుగారుశాంతమార్గమునఁబ్రవర్తింపఁదలఁచినవారై. యాత్మవినోదార్థము ప్రబోధచంద్రోదయ మను నాటకమును బ్రదర్శింప నాజ్ఞాపించిరి. కనుక నటుల వేషములదాల్చుట కాజ్ఞాపింపవలసినది) ఇట్లు ప్రవృత్తినివృత్తుల కాస్పదంబగుటచేతనే భరతాచార్యులవారు ఈనాట్యప్రయోజనము నిట్లు వాక్రుచ్చియున్నారు.

శ్లో. ధర్మ్యం యశస్యమాయుష్యం హితంబుద్ధి వివర్ధనమ్,
లోకోపదేశజననం నాట్య మేత ద్భవిష్యతి.

ఇట్టినాట్యమునకు హేతుభూతమైన దగుటచేతనే నాటకము సర్వోత్కృష్టమై 'కావ్యేషునాటకంరమ్యం' అని పండిత ప్రకాండులచేఁ గొనియాడఁబడినది.

---

## సే వాం జ లి

### శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు

వినవచ్చు నీపల్కు లని యూరితిని దేరి, శ్రుతులనింప విదేమి చోద్యమయ్యా !
కనవచ్చు నీ రూప మని పొంగితిని దేవ, కనులఁదేర్ప విదేమి కర్మమయ్యా !
చనవచ్చు నీత్రోవ నని నమ్మితిని దేవ, పదమునిల్ప విదేమి పంతమయ్యా!
మనవచ్చు నీచెంత నని యుబ్బితిని దేవ, తలఁపు గొల్ప విదేమి ధర్మమయ్యా !
అల్పుఁడగు నేను పరమాణువైన నేను, ఘనతరుని నిన్నుఁ ద్రిభువనగర్భు నిన్నుఁ
దగుదునని కొల్వఁ దలఁచుటే తప్పటయ్యా, సత్కృపాధామ ! దేవతాసార్వభౌమ!




# మొల్ల యపకీర్తి, యామె నామవృత్తాంతము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

శ్రీమహిమాభిరాముఁడు వసిష్ఠమహామునిపూజితుండు సు
త్రామవధూ కళాభరణ రక్షకుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వామలసన్నిభాంగుఁడు మహాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు ప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్లకాలముల్.

— మొల్లరామాయణము

సుమధురమై, మృదులమై, మనోజ్ఞమై, కవిపండిత జనస్తుత్యమై, సకలజనసుబోధ్యమై యలరారు రామాయణములు రచించి మహావిదుషీమణియు, ఆద్య కవయిత్రియు నగు మొల్ల యపకీర్తిని వహించినది. స్త్రీలలోఁ జదువుకొనినవారు తక్కువ. చదువుటయే కొంత నేర్చినవారున్నను వ్రాయఁగలవారు కొలఁది. వచనరచన కొంత చేయనేర్చినవారున్నను పద్యములల్ల నేర్చినవారు మొదలే పూజ్యము. విశేషనాగరికతయందున్న యిక్కాలమునఁగూడ స్త్రీలస్థితి ఇట్లున్నది. అట్టిచో నాల్గుశతాబ్దములకుఁ బూర్వము స్త్రీవిద్యావ్యాప్తి కెట్టియవకాశము లేనియుగమున, పురుషులకే విద్యాగంధము లేని కుమ్మరకులమున జనియించి, యిట్టి యపూర్వరామాయణమును రచియించిన మొల్ల యాంధ్రమహిళామండలమును బావనముచేయ నుదయించిన యపరభారతిగాని లాఁతి స్త్రీకాదని తోఁచెడిని.

భారత భాగవతోపాఖ్యానములతోపాటు, దాశరథీ భాస్కరాదిశతకములతోపాటు, మొల్లరామాయణముగూడ పూర్వపు వీథిబడులయందును, నిప్పటి యున్నత పాఠశాలలయందును ముఖ్యపఠనీయగ్రంథమై యొప్పుచు, మొల్ల యశశ్చంద్రికలను దిగంతములకు వ్యాపింపఁజేయుచున్నది. కాని పరమ పావనులగు సీతారాముల దివ్యచారిత్రమును భక్తిగర్భితముగను, సరళసుమధురపదసంయుతముగను రచియించి తననిరుపమాన కవితాపటిమచే, పాండిత్యప్రకర్షచే నాంధ్రకవయిత్రీమణులలో నగ్రస్థానము వహించిన మొల్ల జన్మాదికవృత్తాంతములు మాత్ర మామెయశస్సునకుఁ దగినట్లుగ లేవు. ఆంధ్రజననీగాత్ర సంశోభితవిదుషీ మౌక్తికహారమున మించు మణిపతకమన నొప్పు మొల్లకవయిత్రీమణి యొక్క కీర్తిచంద్రికల మైల్యపఱచుచున్న విషయము సామాన్యమైనది కాదు. ఏది స్త్రీలనిహపరదూరలనుగాఁ జేయునో, ఏది శీలసంపదకు భంగకరమైనదో, ఏది చిరకాలమునుండి ప్రవృద్ధమగుచున్న యశోలతను పుటుక్కున త్రుంచి వేయునదో, ఏది మహావమానకరమైన మాటయో, అట్టికులటాపదము మొల్లజీవితమునకుఁ దుడువరానిమచ్చయై కళంకపఱచుచున్నది. అకటా! ఆఁడుదానికింతకన్న నపకీర్తి యేమికావలెను? నిప్పులంబొరలినను, నీళ్లంబడినను, శిరశ్ఛేదము గావించుకొనినను, మఱి దేనిచేనైనను నీయపయశము మాయునే? ఏకవిత్వము, ఏపాండిత్యము, ఏరామాయణము ఈదుష్కీర్తిని బాపఁగలదు! లేదని మాకెఱుకయే! అయినను నొకవిదుషీమణి యహేతుకముగ నపయశమునకుఁ బాల్పడి యశఃపతిత యగుటను గన్నులారఁ జూచుచు నూరకొనుట

కంటె నామెను కులటామండలమున కీడ్వఁబడిన కారణములను బరికించి సహేతుకములు కానిచో వెల్లడించుట తోడి నారీమణులధర్మమగుట యాధర్మనిర్వహణనిమిత్త మీవ్యాసము వ్రాయఁబడినది. విజ్ఞులగు చదువరులందఱిలోపముల సైరింతురుగాక యని నా తొలి మనవి. మొల్ల కులట యనుటకు నాల్గుకారణములు సాధారణముగాఁ జూపఁబడుచున్నవి. (౧) మొల్ల తన రామాయణమునం దసభ్యములగు స్త్రీవర్ణనముల జంకుకొంకులు లేక పురుషకవులవలెనే కావించియుండుట; (౨) తన రామాయణమునందు తనయత్తింటివారి ప్రశంసగాని భర్తప్రశంసగాని చేయకుండుట, (౩) మన ఆంధ్రదేశమున పూర్వము పుష్పనామములను కులటాంగనలుమాత్రమే పెట్టుకొనుచుండుట; మఱియు (౪) ఆమె కృష్ణదేవరాయల యుంపుడుకత్తెయని లోకప్రవాదముండుట. ఆలోచించి చూడఁ పైనాల్గుకారణములును మొల్లను కులటనుగా జేయునంతటి బలవత్తరములు గావని నా తలఁపు. చూడుఁడు! మొల్ల తనరామాయణమునందలి సుకవిస్తుతియందు శ్రీనాథునితరువాతికవులను బేర్కొనలేదు. కాన యామె పదునాఱవశతాబ్దమునకు ముందే యుండవచ్చునని యనేకుల యభిప్రాయము. అటులయినచో కృష్ణదేవరాయలు రాజ్యముచేసినకాలమును మొల్ల కాలమును నొక్కటియే యగుచున్నది. రాయలకాలము సంపుటలె మఱియే కాలమునందును మన యాంధ్రభాష యట్టి రాజసత్కారములు మంత్రులమన్ననలు, పండితపూజలు, కవిగౌరవములు, నందియుండలేదు. మఱియు నది శృంగారమునకుఁగూడ మంచిప్రాభవకాలము. పదునేనవ శతాబ్దమున శ్రీనాథాది కవీంద్రులచే నాటఁబడిన శృంగార రసాంకురము పదునాఱవశతాబ్దమున పెరిగి పెద్దదై యేచి పేచి కృష్ణదేవరాయల యాస్థానకవులపోషణలో ఫలవృక్షమైనది. ఇఁక నక్కాలపుకవులస్థితి యెట్లున్నది? ప్రతికవికి శృంగారరసముపై మోహమే. అందుచే నాకాలపుకవులు తమకవితాలత నాశృంగార వృక్షమునకుఁ బ్రాకించినఁగాని మనోజ్ఞముగ నుండదని, రాజాదరముఁ బడయదని, ప్రజాగౌరవ మందదని భ్రమించి శృంగారరసమున కాలవాలమగు ప్రబంధములను రచించి పేర్గాంచిరి. కవులహృదయము లిట్లు శృంగారరస మోహముచే నిండి నిబిడీకృతమై, స్త్రీలసిగ్గును బుగ్గిచేసెడి యసభ్యవర్ణనములు గల గ్రంథములను వెలువరించెడి యక్కాలముననే మొల్లగూడ యున్నదనువిషయమైనకింత జ్ఞప్తికిఁ దెచ్చుకొందము; మొల్ల తన స్త్రీత్వము నెంతచక్కఁగా నిలుపుకొనెనో విశదమగును. శృంగారమునకుఁ దావులేని, భక్తికి దావలమైన సీతారాములకథ నామె వ్రాసినదికాని, శృంగారరసాత్మకమగు కావ్యము వ్రాసెనా? "స్తనభరంబున నీపోఁకి దనరిసట్టి" ఇట్టి పద్యపాదములు నాకీరచితగ్రంథమునందుండుట యసభ్యమేయనియు, కులకాంత లిట్టి పదములుగల పద్యములు వ్రాయఁజాలరుగాన నామె కులటయనియు కొందఱందురు. ఇట్టి యసభ్యపదములు ఆధునిక కవయిత్రీమణుల పాటలలోను, పద్యములలోను గూడఁగలవు. ఆధునిక కవయిత్రీమణిచే వ్రాయఁబడిన లక్షణాపరిణయమను పద్యకావ్యమునందును నిట్టిపదములు గలపద్యము గలదు. పుస్తకము ముద్రణమగువఱకు నాపదమును జూడనైతినని యాకవయిత్రీమణియే మాతో స్వయముగఁ జెప్పెను. అంతమాత్రముచేతనే యాసాధ్వీమణి నెవరు కాదందురు? దుష్కరయతిప్రాసనియమముచేతనో, వ్యాకరణప్రకారమో లేక, ప్రమాదవశముననో, ఇదియొక దోషముగాపాటింపని తత్త్వజ్ఞురాలగుటనో, లేక యప్పటి కాలపరిస్థితులనుబట్టియో, లజ్జాకరములేయగుఁగాక, నాలుగైదుపదములట్టివి పడినంతమాత్రమున నామె కులటయనుట యక్రమమును, అతి సాహసమును గదా!

తండ్రిప్రశంసతోపాటు అత్తవారి ప్రశంసచేయకుండుట మొల్లపై మోపఁబడిన రెండవనేరము. స్త్రీలకు బిడియము సహజగుణము. కాన పతిప్రశంసచేయుటకు నెంతవయసు చెల్లినపడఁతులుగూడ లజ్జింతురు. అందును తల్లిదండ్రులు గురువులు మున్నగు పెద్దలసమక్షమున బాహాటముగ గ్రంథములయందు భర్తనుగూర్చి వివరించుటకు లజ్జించుట స్త్రీస్వభావమునకు విరుద్ధమైన విషయము గాదు. అదియట్లుండె మొల్ల బాలవితంతువని ప్రసిద్ధమైన వాదముగలదు. తన గ్రంథమునఁ జూపిన యసమానవైదుష్యమువల్లనేమి, తనభర్తనుగూర్చిగాని యత్తవారినిగూర్చిగాని రామాయణమునందు ప్రశంసింపకుండుటచేనేమి మొల్ల బాలవితంతువై యుండుటయే నిజమైయుండునని తోఁచుచున్నది. మొల్ల తనయాత్మీయులలో తండ్రినితప్ప వేరెవరిని బ్రశంసింపలేదు. తన

విద్యాప్రదాతయెవరో యాతనినైనఁ దెలుపలేదు. 'గురుడాతుకూరి కేసయవర పుత్త్రి'నని చెప్పినది. గురుఁడన తండ్రియు విద్యాప్రదాతయుఁగూడఁ గావచ్చును. వేఱుగురుని చెప్పమిచే బహుశః తండ్రియే యామెకుఁ జదువుచెప్పిన గురుఁడైయుండును. కావుననే యతనిని ఘనముగాఁ గీర్తించినది.

గణితశాస్త్రజ్ఞురాలగు లీలావతి తండ్రి బాలవితంతువగు తనపుత్త్రికి గణితశాస్త్రమును నేర్పి విద్వాంసురాలినిగాఁ జేసెను. అట్లే కేసయగూడ బాలవితంతువగు తనకొమార్తెకు విద్య నేర్పియుండును. బాలవితంతువు కావుననే మొల్ల తనయత్తింటిపేరునుగాని భర్తపేరునుగాని చెప్పియుండలేదు. ఆమెయే యననేల? ఆధునిక కవయిత్రీమణుల గ్రంథములను జూడుఁడు. ఒక్కరైననుదమ భర్తపేరును వ్రాయుచుండిరేమో? ఆధునికవిదుషీమణులలో నొక్కరగు శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారు తమయత్తింటిపేరగు ద్రోణంరాజువారి నామమును వ్యవహారమునందువాడుటయే యుజ్జగించిరి. లక్షణాపరిణయ గ్రంథకర్త్రియగు సౌభాగ్యవతి గుడిప్రాటి యిందుమతీదేవిగారు తమ కావ్యమునందు పతిపేరెత్తుకొనలేదు, ఈవిషయముగ మనకన్నుల ముందఱ ననేకులు, పతిప్రశంసచేయని, యత్తింటి ప్రశంసచేయని విద్యావతులు మాంగల్యవతులలోను, విధవలలోను గూడ గానవచ్చుచుండ నన్నూరేండ్ల క్రిందటి మొల్ల తనగ్రంథమున భర్తపేరు చెప్పలేదని, యతని యింటిపేరు తెలుపలేదని యామె కులటయని నిర్ధారించుట ఎంత యహేతుకమో చూడుఁడు.

ఇఁక మొల్ల మూఁడవనేరము: పుష్పనామములను మన దేశమునఁ బూర్వము కులటాంగనలుమాత్రమే పెట్టుకొనుచుండుట. కులటయన వ్యభిచారిణి యనియర్థము. కాన వారాంగన కావచ్చును. లేక, నీతిచెడిన మఱేజాతి స్త్రీయైన కావచ్చును. వేశ్యలు తమతండ్రియింటిపేరును తమయింటిపేరుగాఁ జెప్పుకొనుటగాని తమతండ్రిపేరును బ్రతిష్ఠగాఁ జెప్పుకొనుటగాని లోకవిరుద్ధమైన విషయము. వెలయాండ్రకు తమతల్లికిఁగాని, తమకుఁగాని శాస్త్రోక్తముగా వివాహమాడిన యొకభర్త లేమిచే వారికి తమ తల్లి యింటిపేరే వరుసగావచ్చుచుండును. వివాహితలైన స్త్రీలకు వారిలోఁగూడ భర్తృగృహనామమే వారికిఁ గూడ జెందును. మొల్ల తన రామాయణపీఠికయందు

"క. వారాంగన శ్రీరాముని
పేరిడి రాచిలుకఁ బిలిచి పెంపు వహించెన్
నేరుపుగల చందమ్మున
నారాముని వినుతిసేయ హర్షము రాదే."

వారవనితయే చిలుకను 'రామా'యని పిలిచి మోక్షము నందినది. ఇఁకఁ దాను సద్గతినందుట కేమి సందియమని గదా పై పద్యభావము! ఇట్లు వారవనిత యల్పత్వమును బేర్కొనుటచే మొల్ల వేశ్య కాదనుట స్పష్టము. మనుజులకు నామకరణము పుట్టిన కొలఁదిదినములలో తల్లిదండ్రులో, యితర పెద్దలో చేయుదురు. కాని యెవరికి వారు పెట్టుకొనరు. కులటాత్వము వయసు వచ్చినవారైనవెనుక యేర్పడు దుర్గుణము కాని శైశవముననే సన్నిహితకాదు. ఇక కులటాంగనలు మాత్రమే పెట్టుకొనెడి పుష్పనామము మొల్లకెట్లువచ్చినది? తల్లిదండ్రులు నీతిచెడినవారై యుండవలెను. లేక మొల్ల పెద్దదైనవెనుక తననామమును మార్చుకొని యుండవలెను. భర్తను వలెనే తల్లినిగూడ నామె తన గ్రంథమున బ్రశంసింపక విడిచినది. తండ్రినిగూర్చి

"క. గురులింగ జంగమార్చన
పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్
గురుఁ డాతుకూరి కేసయ
వరపుత్త్రిని మొల్లయనఁగ వఱలినదానన్."

అని యెంతో ఘనముగఁ జెప్పుకొనినది. ఇట్టి దైవభక్తుఁడగు నామె జనకుఁడు నీతిమాలినవాఁ డనుట దోషము గదా! ఇఁక నామెయే పేరు మార్చుకొనిన దనుకొందమనిన నెక్కుడైన బుద్ధులకు మాఱుకమున్నది కాని పేరులకు మార్పుండునా? కాన పేరుచేత నామెకు కులటాదోష మాపాదించుట న్యాయముకాదు.

ఇఁక నాల్గవది మొల్ల కృష్ణదేవరాయల యంతఃపురము గత్తెలలో నొకతెయనుట. ఎక్కడ నెల్లూరు మండల గోపవరము! ఎక్కడ కృష్ణదేవరాయల విద్యానగరము! పోనిండు రాయలు దిగ్విజయమూర్తియై యాంధ్రదేశమెల్ల పర్యటనముచేసెను గాన మొల్లనుబట్టి

తెప్పించి తన యంతఃపురమునకుఁ జేర్పించెనే యను కొందము. రాయల యుంపుడుగత్తెయేయైనచో మొల్ల, కవియు, కవిపోషకుఁడును, కవితా ప్రియుడును, విశేషించి మహారాజును నైన రాయలనుగూర్చి తన రామాయణమున నొక్కింతయైన ప్రస్తావింపకుండునా, అంతియే కాక మొల్ల

"ఉ. సల్లలితప్రతాపగుణ
సాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామ నర
పాలకునిన్ స్తుతిసేయు జిహ్వకున్
జిల్లర రాజలోకమును
జేకొని మెచ్చఁగ నిచ్చపుట్టునే
అల్లము బెల్లముం దినుచు నప్పటికప్పటి
కాననేయునే."

అని రాజలోకమునెల్లఁ దృణీకరించినది. మొల్ల కృష్ణదేవరాయల యధీనమునను స్త్రీయైనచో నితరులెల్లవచ్చి గ్రంథములను వ్రాసి తనప్రభువునకుఁ గృతియిచ్చుచుండెఁ దాను తనరామాయణ మాతనికంకితము నేయకుండుటయే కాక "చిల్లరరాజలోకమును జేకొని మెచ్చఁగ నెవ్వరికిచ్చపుట్టు"నని తిరస్కారబుద్ధితో వ్రాసి యుండునా? అట్లు నిరసించిన యుంపుడుగత్తెను రాయలు హర్షించి యుండునా? మఱియు పెద్దన రామరాజ భూషణుఁడాదియగు మహాకవులఁ దన సుకవిస్తుతి యందుఁ జేర్కొనక యేల విడుచును? కాన మొల్లకును రాయలకును నెట్టి సంబంధమునులేదు. బహుశః యేరాజైన రామాయణమును గృతినందఁగోరి మొల్లచేఁ దిరస్కృతుఁ డయ్యెనేమోయనిమాడఁ బైపద్య మూహింపుటకు తావొసఁగుచున్నది; కాని యింతమాత్రమున నే నిర్ధారింప వలనుగాదు.

మొల్లపైఁ గులటాత్వమును మోపుచున్న కారణములు సహేతుకములు గావని పైవిషయములు తేటపఱచినవి. ఇఁక మొల్ల పేరునుగూర్చి నాకుఁగల సందియములను విన్నవించుకొందును.

మొల్లతనరామాయణమునందుఁ దనతండ్రి శివభక్తి రతుఁడనిస్పష్టము గాఁ దెలిపినది. మఱియు తాను "విఖ్యాత గోపవరపు శ్రీకంఠ మల్లేశువరముచేత, నెఱిఁ గవిత్వంబుఁ జెప్పఁగా నేర్చికొంటి"ననియుఁ దెలిపినది. కాన పైరెండు కారణములచేతను నామె నామము మొల్లగాక మల్లియై యుండునని యు, శివభక్తుఁడగు నామె జనకుఁడు తన యిష్టదైవమగు మల్లేశ్వరుని పేర తన కొమార్తెకు మల్లి యని పేరిడియుండె ననియుఁ మల్లీ నామము మొల్లగా జనవాడుకమీఁద మాఱియుండుననియుఁదోఁచుచున్నది. మల్లమ్మ, మల్లయ్య, మల్లీ యను పేరు శూద్రులలో (తెలుఁగుదేశపు అన్ని తెగలలో) సాధారణముగాఁ బెట్టుకొనెడిపేరే కావున నాదికవయిత్రి నామము మొల్లయనుటకంటె మల్లి యనుటయే సమంజసముగను సహేతుకముగను నున్నది. మఱియొక యుదాహరణము: నే నీమధ్య 'కృష్ణకుమారి' యను విదుషీమణిచే వ్రాయఁబడిన 'భారత విదుషీమణులు,' అను చిన్ని హిందీపుస్తకమును జదివితిని. దానియం దనేకవిదుషీమణుల చరిత్రములు గలవు. వారిలో ముక్కాలు మువ్వీసమువంది యుత్తర భారతమువారే. ఇట్లు గ్రంథము చాలవఱకుఁ జదివినను నస్మద్దక్షిణభారతదేశమునందలి విదుషీమణి చారిత్ర మొక్కటియుఁ గానరామి నామనంబు చిన్నవోయెను. ఏమి? దక్షిణభారతదేశమున విదుషీమణులే లేరా? ఉండినను నుత్తరాహులు మనలను చిన్నచూపుచూచి మన దేశపు విదుషీమణుల సచ్చరిత్రములను దమగ్రంథముల వ్రాయమానిరా! అను కుశంకలు నామానసమున నుపయించి యాగ్రహమును నుదయింపఁజేసెను. కాని ఏదేశమువారైనను విదుషీమణులు పూజనీయులే యను భావమునఁజాలవఱకు జదువఁ జినఱపు మధురవాణి, మోహనాంగి, వల్లీ, అభయా, నాచీ, యను నేవురు దక్షిణ భారతదేశపు విదుషీమణుల చరిత్రములు నేత్రపర్వముగ హృదయాహ్లాదకరముగఁ గాన్పించెను. అందు మల్లీయను నామెచరిత్ర మీవిధముగా వ్రాయఁబడియుండెను. "ఈమె దక్షిణ భారతదేశమున జన్మించియుండెను. రాజా కృష్ణదేవుని కాలమున నీ యశస్విని సాహిత్యక్షేత్రను నలంకరించి యుండెను. ఈమె యొక కుంభకార పుత్రి. విద్యాభ్యాసమునం దీమెకు మిక్కిలి యనురాగము. ఈమె కవిత చెప్పఁగలిగియుండెను. ఈమె కవిత్వమునం దీమెయొక్క పూర్ణవికాసము గాన్పించుచుండెను. ఈమె స్నానముచేసి చెంద్రుకల నారఁబెట్టుకొను సమయమున

కవిత నల్లునుండెననియు, ఈవిధముగా నీమె యొక్క రామాయణమును రచియించి యుండెననియు తెలియు చున్నది. ఈమె రామాయణమును విద్యాలయముల యందు పాఠ్యపుస్తకముగా పండితులు నిర్ణయించి యున్నారు." ఈపై చరిత్రాంశములనుబట్టి ఈమొల్ల మనము మొల్ల గావాడుమన్న యామెయేయని తేటపడుచున్నది. ఈచరిత్రమును జదివిన తరువాత నాకపరిమితానందము గలిగెను. ఆ యానందము రెండువిధములుగా నుండెను. దక్షిణ భారతదేశమున విదుషీమణులే లేరని వాపోవు సమయమున మొల్ల మనపరువు నిలిపినదిగదా యను సంతోష మొకటియు, చిరకాలమునుండి మొల్లపేరు మల్లిగాని మొల్లగాపను నాయూహ యుత్తరదేశమందైనం బ్రచారమున గలదుగదా యను నానంద మొక్కటియు నా సంతసము నినుమడింపఁజేసెను.

మన ఆదికవయిత్రియగు మల్లిచరిత్రమును సంక్షేపముగాఁదేలిన యంశముల సంగ్రహముగా నీవిషయమున నిర్ణయింపవచ్చును. ఈమె కుమ్మరకొలమున జన్మించినది. ఆమె తండ్రి శివభక్తిపరుఁడు గావున తన కొమార్తెకు మల్లియని పేర్వెట్టి యుండును. మల్లి వితంతువు. కాన లీలావతికి తండ్రి గణితశాస్త్రమును నేర్పి విద్వాంసురాలినిగాఁ జేసినట్లు మొల్లతండ్రిగూడ తన కొమార్తెకు విద్యనేర్పినాఁడు. మొల్ల వితంతువగుటయేకాక బాలవితంతువుగూడనై యున్నది. కాన నత్తింటి ప్రశంసగాని భర్తప్రశంసగాని చేయలేదు. తన విద్యాభివృద్ధికి జనకుఁడే కారణమగుట నామె యాతనిమాత్రమే తన గ్రంథమునఁ జేర్కొనినది. మల్లి యాత్మగౌరవము గల విదుషి. ఐహిక సంపదలఁ జీరికిఁగొనని విరాగి. కాన రాజమాత్రులఁ దృణీకరించినది. మల్లి భక్తురాలు. కాన రామకథనే వ్రాసి రామునకే కృతియిచ్చి కృతకృత్యురా లయినది. మఱియు, మల్లి వినయ సంపదగల సతీమణి కాన తనచరిత్రమును డంబముగా వ్రాసికొనుటగాని, కుకవి నిందసేయుటగాని సేయలేదు. మల్లి తత్త్వజ్ఞురాలు. కాన పదములయౌచిత్యానౌచిత్యములలెక్క సేయలేదు. మల్లి

"నిమువపెన్నెఱివేణిజడలుగా నవరించి
మలినజీర్ణాంబరం బొలియఁగట్టి
భూమిరజంబు విభూతి పూఁతగఁబూసి
తన దివ్యమూర్తిఁ చిత్తమున నిల్పి
నిరశనస్థితిత్రోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మ మంత్రంబుఁ బఠింపుచు"

దపముసేయుచుండెడి మహాతపస్విని గాని సామాన్య స్త్రీ గాదు. రసగ్రంథమును రామాంకితము సేయుటలోఁగాని రాజమాత్రులఁదృణీకరించుటలోఁగాని మల్లి భాగవతగ్రంథకర్తయు, మహాభక్తుఁడును నగు పోతన యడుగుజాడలలో నడిచినది. అంతియేకాదు. పద్యరచనలోఁగూడ నామె పోతననేయనుకరించినది. చూడుఁడు. మచ్చునకు రెండుపద్యములు

"క. పావని కనుఁగొనెనప్పుడు
పావన విఖ్యాతసుగుణ భావోపేతన్
సేవిత దనుజవ్రాతన్
భూవనితాజాత నిత్యపూతన్ సీతన్.

మొల్ల రామాయణము.

క. భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడె పృథుగుణమణిసం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ ముఖకాంతి విజిత సితఖద్యోతన్.

భాగవతము.

పై విషయములనల్ల నిష్పాక్షికబుద్ధితోఁ బరికించువారికి ఆదికవయిత్రి నామము మల్లిగాని మొల్లగాదనియు, నామె యుత్తమస్త్రీగాని కులటగాదనియు నగపడకపోదు. పండితులును, కవులును, చారిత్రక పరిశోధకులును, మొల్లయొక్కచరిత్రమును సాధించి మొల్ల మల్లియనుట సహేతుక మగునో, కాదో శోధించి, నెల్లూరు మండల గోపవరమున మల్లికేశ్వరాలయముగలదా, లేక నాటిరేడు గోపవరముననైన నున్నదేమో విచారించి నిర్ధారింతురు గాక యని వేడుచున్నాను. మొల్లనామము మల్లియే యైన నారీతిని రూపించియు, కాక మల్లియైనచో నారీతి సంస్కరించియు మొల్ల యపయశమును బాప బ్రయత్నించెదరు గాక యని ప్రార్థించుచున్నాను. నావాను గ్రహమువలన మొల్ల మల్లిగా నెల్లర యంగీకారమును బడసెనేని మొల్ల కాపాదింపఁబడిన కలంకాదోషము కొంతవఱకు బాయునని నామనవి.



# మేఘము

(సంపుటము 3, ౨ వ సంచిక తరువాయి)

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, శతావధాని

అమృతాసార మనోహరంబులగు వర్షాంబుప్రసారంబులన్
గమనీయంబగు కాల మేర్పఱుచు నీ గన్గొన్న చేతోవికా
సము నైసర్గికతావకీనసుషమాసౌభాగ్యసంభారసా
రము నేత్రద్వయపర్వ మౌటఁ దెలుపున్ బ్రావృట్పయోవాహమా!

మ. రమణీయేందుమరీచిశోభితము తారాస్ఫార మాశావలం
బమునౌ వ్యోమవితాన మూడ్చి చపలామాలావిలాసంబు మి
శ్రమశీరోచిరుదారవాసవధనూరమ్యంబు నీభవ్యరూ
పము మేల్కట్టుగఁ దీర్చెఁ గాల మవురా! ప్రావృట్పయోవాహమా!

చ. రతనములట్లు చుక్కలు గరంబు హొరంగుల రంగు లీనుచున్
వితతమరీచికానిచయవీథులలో దయివార రాత్రులం
దతులితచిత్రశోభిత మహాద్భుతరీతుల రత్నకంబళా
కృతిఁ దనరారుమింటిపయికిన్ దగియుండెదు ప్రావృడభ్రమా!

చ. విలసితకాంతిపూరముల వెల్లువలౌ హరినీలకుట్టిమ
స్థలుల మెఱుంగువన్నియల జానగు చక్కఁదనాల మల్లెపూ
వులు విలసిల్లురీతులను బోలి నఖద్యుతితారకావళుల్
సెలఁగు వినీలవిష్ణుపదసీమ మెలంగెదు ప్రావృడ్భ్రమా!

మ. పొగగుంపుల్ కలభంబులట్లు మహిషంబుల్ పోల్చు చందంబునన్
బొగరొప్పంజనుసూకరావళివలెన్ బొంకంబుగా భంగికా
స్థగితాకారవిశేషరేఖల సమంచద్వైఖరిం గ్రాల సొం
పగుసంచారము సల్పుచుం బొలుతు వౌరా! ప్రావృషేణ్యాభ్రమా!

శా. మేలౌనీరజబాంధవోజ్జ్వలరుచుల్ మీసాలలో నవ్వులై
చాల న్నీలిమఁ బొల్చు నీజిలుఁగుసంచారంబులం దోఁచఁగా

కేళీలోలవిలోలమానసగతిన్ ఖేదాపనోదక్రియల్
గ్రాలంగాఁ జెరలాడుచుండుఁ జదలన్ బ్రావృట్పయోవాహమా!

ఉ. ఒక్కనిమేషమం దోఁ యు నుజ్జ్వలతల్ మఱియొక్క రెప్పపా
టెక్కినఁగానరావు వహీయింతువు పుష్కరరంగ భూమిపైఁ
బెక్కగువేసముల్ స్తిమితవీక్షణులై రసికుల్ గనుంగొనన్
చక్కఁదనంబు నీకడనె జాల్కొనుచుండెడి వర్షకాభ్రమా!

ఉ. కుంకుమచల్లినట్లు కడుఁ గ్రొత్తగఁ గ్రోలెడు కెంపుసొంపులన్
బొంకముఁ బాయనట్టి వయి పొల్చెడు తారక లుల్లసద్విలా
సాంకములై చెలంగఁ జెలువారునభోమయవేదియందుఁ బ
ల్వంకలరంగవల్లికల బాగుగఁ దీర్చెదు ప్రావృడభ్రమా!

ఉ. వెచ్చగ నూర్చుచుం దలయు వెన్ను గనంబడ నీట మున్గి యం
దిచ్చకువచ్చుదాఁకఁ బరితృప్తి మెలంగి యుపాంతభూములన్
బచ్చికఁజూచుచున్ జలముఁబాసి కొలంకున నుండి యేపునన్
వచ్చెదు సైరిభంబనగ వర్తిలు దొక్కెడ వర్షకాభ్రమా!

చ. నిచయముగాఁ దలిర్చికమనీయతఁ జూపుట మాని నల్పు సం
కుచితముగాఁగ ధూమ్రరుచిఁ గొంచుఁ గ్రమంబుగ నింతలింత లే
సి చిదురులేర్పడన్ కళలు చిందెడి యందము లొప్ప నిష్టకా
రచనలు సేయుచుందు బళిరా! నభమందునఁ బ్రావృడభ్రమా!

మ. అనపాయావరణాతిగూఢవరశుద్ధాంత ప్రచారార్హాది
గ్వనితావశ్యరహస్య రక్షణము నిర్వర్తించు వ్యోమావలం
బన లోలాంచల మాలికల్ యవనికల్ ప్రాలేయ సందోహశో
భనసామ్యావహ తావకావరణముల్ ప్రావృట్పయోవాహమా!

చ. పలుచని నల్పులన్ దెలుపుఁబాయని ధూసరకాంతిరేఖలన్
బొలిచి వినోదభూమికల పొందిక లందముగాఁ దగిల్చి పాం
థుల హృదయంబులందు బరితోషముఁ బ్రోది యొనర్చుచుండునీ
పొలుపగు రామణీయకము బుద్ధిదలంచెద వర్షకాభ్రమా!

ఉ. పొల్పగు గాంచనప్రసవభూషిత మేచకహంసతూలికా
తల్పమనంగ నీలమయి తారలఁ గ్రాలునభంబునన్ దదా
కల్పము మాయకుండుటకుఁ గప్పిన గాసెన నాఁగ మోదమున్
గొల్పుచునుందు ధూసరతనుద్యుతిఁ బొల్చుచు వర్షకాభ్రమా!

ఉ. వెన్నెలజేని మచ్చవలె వింతగఁ గొమ్మలు రెమ్మలేర్పడన్
జెన్నెసలారుచుండి కడుశీఘ్రముగా గుమిగూడి మేచకా
భ్యున్నతకాంతిదంతురత నొందుచుఁ గస్తురిచేతలిప్తమై
యున్న విశాలవేదియన నొప్పెదు నప్పుడె వర్షకాభ్రమా!

ఉ. చిన్నెలవన్నెలన్ జలువఁజిమ్ముచు శాంతిమరందబిందు సం
పన్నతఁ గూర్చుచున్ భువికి వర్షజలోపజనిష్యమాణహ
ర్షోన్నతికిన్ మనుష్యహృదయోజ్జ్వల సౌధములం దుపశ్రుతిన్
బన్నుచుఁ బుష్కరాంగణమునం జరియించెదు ప్రావృడబ్దమా!

చ. ఇలకు నభస్తలంబునకు నెంతయు భూషణమై కరంబురా
జిలు రవిదీధితిన్ జిలుగుచేవ మెఱుంగుల కప్పడాలు రే
ఖల బలమొప్పఁగప్పుచు నఖండిత తత్కరదీప్తి దివ్యమం
గళమగు నీదువిగ్రహముఁ గాంచి చెలంగెదఁ బ్రావృడభ్రమా! [సశేషము]

---

# దేవదేవప్రశంస

### శంకరనారాయణులు

విరియు వినఁగలేని విశ్వమోహనగీతి, కలకంఠి కులికించు గళములోన
తెలిసి తెలియలేని వలపులవెన్నెలల్, పువ్వులు విరజిమ్ము నవ్వులోన
అరసి యారయలేని యామోదసౌఖ్యంబు, తెమ్మెర ల్వీవచల్లు తెఱపిలోన
చూచి చూడఁగలేని చోద్యంపుఁ దళతళల్, మెఱుపులుదులకించు నొఱపులోన

గీ. దాన దీన నసఁగనేల తావకీన, భవ్యవిజ్ఞానతేజంబు ప్రకృతిలోన
నిత్యసంజీవనమెసంగ నెగడుఁగాదె! దివ్యమంగళవిగ్రహా! దేవదేవ!



# అనార్కాలి

విశ్వనాథ సత్యనారాయణ గారు

[వెనుకటి సంచిక తరువాయి]

రంగము ౭

అనార్కాలి

అజీజ్!

అజీజ్

అక్కా! నన్ను తమ్ముడా యని పిలువరాదా!

అనార్కాలి

తమ్ముడా!

అజీజ్

ఊఁ!

అనార్కాలి

నాకేమియు దోచుటలేదు.

అజీజ్

ఏంచేత?

అనార్కాలి

బానిసలమైనమన కేకోరికయు సిద్ధించదుగదా!

అజీజ్

ఏ కోరికో నాతో చెప్పు.

అనార్కాలి

ఇప్పుడు మన మెచ్చటికైనపోవలె నన్న నెట్లు పోగలము?

అజీజ్

ఎక్కడికైనా సరే కష్టంలేకుండా వెళ్లటానికి ఒకవుపాయం వుంది. అదినాకు తెలుసు.

అనార్కాలి

ఏమిటది?

అజీజ్

పాము యెన్నేళ్లుబతుకుతుంది? వెయ్యేళ్లు! తొమ్మిదివందల తొంభైతొమ్మిదియేళ్లు వచ్చిన తరువాత దానికి రెక్కలువస్తయి; అప్పుడదియెగిరిపోతూంటుంది. ఆవేళకి సరిగ్గాచూచి అది ఒకగజమెత్తు యెగిరినవెంటనే దానితోకపట్టుకొని గుంజితే అది నీచెప్పినమాటవింటుంది. దాన్ని కాల్చి భస్మంచేసి కాళ్లకు బూసుకుని యెక్కడకెళ్లాలని తల్చుకుంటే అక్కడ కెడతాం.

అనార్కాలి

ఆ పామెక్కడ కనబడును?

అజీజ్

అడవుల్లోకెళ్లి వుండాలి మరి.

అనార్కాలి

ఈ వసంతకాలములో నడవు లెట్లుండును?

అజీజ్

ఆకూత దేంది?

అనార్కాలి

కోకిలది.

అజీజ్

బుల్ బుల్ పాట బాగుంటుందా! దీని పాట బాగుంటుందా?

అనార్కాళి

రెండును బాగుండును.

అజీజ్

నాకు బుల్ బుల్ పాటే బాగుంటుంది.

అనార్కాళి

నీవు నీమనస్సులో నున్నది చెప్పుటలేదు.

అజీజ్

నేను చెప్పేంది నీవు నమ్మకుండా నన్నుమాటి మాటి కెత్తిపొడిస్తే నేనేమి చెయ్యగల్గును. నిజంగా నన్ను యువరాజు సలీంగారు పిలిపించి కొన్నాళ్లనుండి యీగౌరవం చేస్తున్నారు. లేకపోతే నాకు యీఅత్తర్లూ దివ్యవస్త్రాలూ యెక్కణ్ణుంచి వస్తై. మళ్లీ రేపురమ్మన్నారు సలీంగారు.

అనార్కాళి

ఎందుకు నిన్నాయన యిట్లు గౌరవించుట?

అజీజ్

నాకేం తెలుసు?

అనార్కాళి

నేడు వెళ్లెదవా?

అజీజ్

నీయిష్టం, నువ్వు వెళ్లమంటే వెళతా!

అనార్కాళి

ఇదివరకు నన్నడిగి వెళ్లితివా ?

అజీజ్

అక్కా! నావద్ద నెన్నియైన దుర్గుణములుండవచ్చును. కాని రెండుమాత్రము లేవు. వ్యభిచారము; నీయెడలద్రోహము. నాతల్లిదండ్రు లెవరో నాకు తెలియదు. నీతల్లిదండ్రు లెవరో నీకును తెలియదు. మన మిర్వురమును చిత్రమైన యీరాజాంతఃపురములో పెరిగినాము. నీకునాకు రక్తసంబంధము లేకపోయినను నీ వక్కవు, నేను తమ్ముడను ఐనాము. అందరు బానిసలకు తలొకయిల్లువలెనే మన యిరువురకు నీయిల్లు ప్రసాదింపబడినది. నిన్ను నే నెట్లు ప్రేమించుచుంటినో నీవెఱుగక పోలేదు. నీయందు నాకు గల గౌరవము నాలో నాకే తెలియును. నా యనుకో దగిన వారెవరైన నున్నచో నాకీలోకములో నీవుదప్ప నెవరును లేరు.

అనార్కాళి

తమ్ముడా! క్షమింపుము: యధార్థము తెలిసికొనుటకు గ్రుచ్చిగ్రుచ్చి యడిగితిని.

అజీజ్

వెళ్లుమనెదవా?

అనార్కాళి

వెళ్లుము. ఎందుకో నిన్నిట్లు గౌరవించుట కనుగొని రమ్ము.

అజీజ్

నాకేమియు తెలియుటలేదు.

అనార్కాళి

క్రమముగా నదియే తెలియగలదు. నిదుర పొమ్ము.

(అజీజ్ నిద్ర)

అనార్కాళీ

అజీజ్ నిదురపోవుచున్నాడు. నేనేమో యీ వనములో వచ్చి ప్రవేశించితిని.
బానిసకూతునైన నేనెక్కడ! సకల భారత సామ్రాజ్యమునకు గాబోవు చక్రవర్తి యతడెక్కడ? ఏమి యూహాసౌధము! ఆకాశ పుష్పము! గొంతుకయెండి యెండమావులలో నీరు గల్పించుకొనుచున్నాను.

ఈ వెన్నెలలు నన్నీచోటికిదఱుముకొని వచ్చి నవి. కాని మీమ్మాచెట్టునీడ నిలచెదను. ఈ చంద్రుడు చుట్టుఁజుట్టుకొని పండుకొన్న గోదుమ వన్నె త్రాచువలె నున్నాడు.

ఆజీజ్ లేచి నాకై వెదకునేమొ! పోయెదను. పోయి పరున్నచో నిదురపట్టదు గదా! ఈ తాప మెట్లోర్చుకొందును? ప్రథమదర్శనము ననే నాహృదయప్రవేశ మొనర్చితివి ప్రియా! అది స్వప్నవృత్తాంతమని యెంచుకొనుచుండ నృత్యశాలకు వచ్చి దానికి దోహదము చేసితివి. నాప్రాణములు నీవేల హర్చించుకొని పోవుచుంటివి? ఈ దీనురాలిని రక్షింపుము!

నీవు నాయందు కోరికచేతనే నర్తనశాలకు వచ్చితినని సమన్వయము చేసికొను చుంటిని. అది తప్పేమో జగత్ప్రభూ! ఈ నీచురాలిని క్షమింపుము. బానిసనై తలకుమించిన యూహలు చేయు నీతుచ్ఛురాలి నేమి చేసెదవు? ఉరితీయింపుము. బ్రతికియుండగనే యొడలి చర్మ మొలిపింపుము! బానిసలకు విధింపబడు శిక్షలివియే నటగదా!

వసంతుడు

మీ తావులలో మునిగిపోయితిని
మీ తారుణ్యములందు జిక్కితిని
లేత వెన్నెలలు గ్రమ్ముకొన్న యవి
స్మిత మరంధము లుద్భవించినవి.

పూలకన్నెలు

నీకంఠంబును కౌగిలించితిమి
నీకై దండలుపూని నారమును
నీకే యర్పణమైతిమి దేవా!
శ్రీకర! మోహన! ఆనందమయా!

వసంతుడు

చిలుపవానలకు పరువులుపెట్టిన
సెలలయిసుకపొరలో
కలిసి పోవుదము పాటలు పాడుచు
మలగిపోవుదము వనిలో.

అనార్కలి

ఈవసంత రామణీయకము నన్నెంత యూహరించుకొన్నది! ఈవనమ్మున నెచ్చట చూచి నను పూవులు వికసించినవి. ఈపుష్పకన్యకల యీవనమందు వసంతుడు మూర్తీభవించి నాడు. ఈవెన్నెలలో ఈ మధుమాసరాత్రుల యందు ఈ వసంతకాలమున ఈపూవుల నెత్తావులు గుబులుకొన్నప్పుడు మనోహరా! నేను నీవశనైనాను.

ఆహా! ఆసౌందర్య మేమని చెప్పుదును!

స్థలకమల గంజనమ్ములగు నాపాద తలమ్ములు నా స్తనాగ్రములపై మోపుదు నెప్పుడు!

నవశిరీషకుసుమ సుకుమారమ్ములైన యీరాజగిత్ప్రభువు పాదములు నా చేతులతో నొత్తుదు నెప్పుడు!

కమలినీ సబ్రహ్మచారులగు నా మనోనాయకుని చరణతలంబుల నాభావకుసుమంబులసమర్పించుదు నెప్పుడు!

రమ్యమోహనములగు నాకుమార చక్రవర్తి యడుగుజాడలు నే ననుసరింతు నెప్పుడు!

ఆమనశ్చోరుని సుకుమార వక్షస్స్థలమ్ము నా యెదురుఱొమ్ము నానుకొను నెప్పుడు!

రమ్యమందార కుసుమ కేసరసహోదరమ్ములైన యానాథునిభాగ్యబంధురసహజారుణలోచనాంతములు నేను ముద్దిడుకొనుదు నెప్పుడు!

నాయీ ప్రాణము లాతని పాదముల నర్పింతు నెప్పుడు!

భ్రమరి

అరుణ జలజాతరమ్య కేసరములంటి
నవవిలాసరక్తచ్ఛాయతవులుకొన్న
నామనోనాథు డెక్కలు నాకుచూచు
చుండనే దూరమైపోయె

ఇటుల చనినాడు తేనియ లిటుల తెచ్చి
నాకు నందిచ్చినాడు నానాథు డకట
మరల చనినాడు తమ్మిపూవరయ మూత
పడి వియోగమ్మునాకు సంప్రాప్తమయ్యె.

అంతటి మనోహరాకారు నంతటి సుకు
మారగాత్రుని నంతటి మాన్మథాత్రి
మధురసౌందర్య వార్నిధి విధివశాన
నెడము పొంది నాప్రాణమ్ము లెట్లు నిలుచు!

ఈవిలాస చంద్రికలు తామేమొ శిశిర
రమ్యములువోలె వచ్చి నాప్రాణములకు
తెగబడెడు నీవియోగ మేతెంచునంత
తిరుగబడిరి స్నిగ్ధులు గూడ రిపు లట్లు.

నాపతి హరించుకొన్న యీ నలినపత్ర
శేఖరంబులు విడలేక ఘన్నమైన
యాశపైనాశ వదలక యకట యిట్టు
లీ పొలమ్ముల బడి భ్రమరించుచుంటి.

అనార్కాళి

నావన్నియు వృధా వాంఛలేమొ! మధురస్థల
ముల నుండుటచేత మధురభావము లుత్పన్న
ము లగుచున్నవి. జగత్ప్రభువు సలీము యువ
రాజెక్కడ? బానిసను నేనెక్కడ?

కోకిల

ఈరసాలకిసాల యేతరాహారంబు
తా రుచించదు మాకు తరుణకంఠములకు
గొంతుకోయగ నిమ్ముకూహూస్వనానంద
రావమ్ము మధునిర్ఝరమువోలె పాడదా!

ఈనాల్క తెగిపోవ నీ పంచమము గాక
మానోటనింకొక్క స్వరముపుట్టదుసుమ్ము
అతిసుకుమార మోహనుడు మాధవుడిదే
విహరించుచున్నాడు విపినవీధుల యందు.

అనార్కాళి

నామనస్సు ప్రభూ! నీపాదారవిందములయందే
చిక్కినది. తీసికొందమన్నను వచ్చుటలేదు.
పెకలించినచో నెత్తురులు వచ్చునేమొ! ఈ
దాసిని క్షమింపుము. ప్రభూ! నెత్తురులే ప్రవ
హించనిమ్ము!

నీపదమ్ములయంద నిలచియున్నది మనసు
ఆపదుద్ధారకా ఆనందమయ నాథ,
నిన్ను మన్నించు చున్నాను రా ఓనాథ,
నిన్ను ప్రేమించుచున్నానురా ఓనాథ!
మరల ప్రేమింతువో మరల ప్రేమించవో
ఎంచి నేనది విచారించనురా నాథ!
నిజముగా నిన్ను భావించుటకైనను
తగనురా నాథ నీదాసికి దాసిని
ప్రాచుర్యమైన యత్యాచార మిదియెట్లు
నిచిత్తమునయందు నిలిపి మన్నింతువో!
ఈపాదుపుర్వు వాంఛించుచున్నది చూడు
గగన స్రవంతికా కమలినీ మధురుచుల్.

ఉషారమణి

ప్రాభాత వేళా శుభానిలమ్ములువీచ
శిశిరసౌందర్యలక్ష్మి మోహనమ్ములు
ఈశుక్లపక్ష శర్వర్యంత చంద్రికల్
క్రమముగా నశియింపగాజొచ్చె నింతలో
ప్రాచీదిగంగనా బంధుర హాసంబు
లీయుషఃకాలరోచిస్సు లావృతమయ్యె

అనార్కాళి

అహో! తెల్లవారవచ్చినది. అజీజ్ లేచనేమో;
పోనలయును.

రంగము. ౮

అజీజ్

ఏమమ్మా! ఎట్లావుంది? జరమేమన్నా తగ్గిందా

అనార్కాలి

తగ్గలేదు. ఎచ్చటికో వెళ్లి వచ్చితివి.

అజీజ్

ఎక్కడకీ వెళ్ళలా.

అనార్కాలి

బజారునకు పోయి రెండు మామిడిపండ్లు తెచ్చి పెట్టెదవా?

అజీజ్

నే నెళ్లి లేనిప్పుడు.

అనార్కాలి

నోరరుచిగానున్నది. మామిడిపండ్లు తినవలె ననిపించుచున్నది.

అజీజ్

కోరికలకేం చాలా వుంటై; అవి అణుచుకోన టమే ప్రజ్ఞంటే.

అనార్కాలి

నాకేమియు కోరికలు లేవు.

అజీజ్

ఇదేమిటి మళ్లీ.

అనార్కాలి

జ్వరమువచ్చుటచేత నోటికి రుచి పోయినది.

అజీజ్

మళ్లీ యిదేమిటి?

అనార్కాలి

ఏమిటది?

అజీజ్

సలీముగారు న న్నిన్నాళ్లటినుంచీ గౌరవిస్తున్నారే దానికి ఫలితం.

అనార్కాలి

అదియేమిటో చెప్పుము.

అజీజ్

కనపట్టంలేదా? ప్రణయప్రత్యుత్తరం.

అనార్కాలి

అప్పనుగాని నేడేమిటి అట్లు మాటలాడు చుంటివి?

అజీజ్

ఎట్లు మాటాడుతున్నా?

అనార్కాలి

ఏటికింతకాఠిన్యము? నాయెడల నేమైన దోష మున్న నది యిదని చెప్పుము.

అజీజ్

నీవల్ల తప్పంటే నేనెవ్వర్ని చెప్పేందుకు? నీఅంతదానవు నీవు. నాఅంతవాణ్ణే నేను.

అనార్కాలి

నాయనా! అట్లు మాటలాడెదవేమి? నీ వను కొన్నదోషము నావద్ద లేకపోవచ్చును. మన మీశ్వరము నేకగర్భజనితులము గాకపోవ చ్చును. మనపుట్టుకలుగూడ మన కొకరికొక రికి దెలియకపోవచ్చును. కాని నాకు తల్లి లేదు; తండ్రి లేదు; బంధువులు నెవ్వరును లేరు. చక్రవర్తి నాయీశరీరమున కధిపతి గావచ్చు కాని నాయభిమానాదికములు నా యధీన మున నే యున్నవి. అవి నాతమ్ముడవగు టచేత నాకన్న చిన్నవాడవైనను మగ వాడవుకాన నాతండ్రివంటి వాడ వనుకొని నీ యనుజ్ఞ లేనిది యెవరియధీనములును కావు. నాయందు నీవృథానుమానమునకు కారణము నీవనుకొన్నట్లు మాత్రము కాదని గట్టిగా చెప్పుచున్నాను.

అజీజ్

ఈ యుత్తరము యువరాజు గారు నీకిమ్మని యిచ్చినారు.

అనార్కాళీ

ఇదిగానా నీకు కోపకారణము ?

అజీజ్

అవును.

అనార్కాళీ

అందులో నేమున్నది ?

అజీజ్

నేను చదువలేదు.

అనార్కాళీ

ఎందుచేత ?

అజీజ్

ఆయనవద్ద నేనిది విప్పి చదువనని యొట్టుపెట్టు కొన్నాను.

అనార్కాళీ

భగవంతుని మీదనా?

అజీజ్

కాదు.

అనార్కాళీ

ఎవరి మీద మరి ?

అజీజ్

నే నెక్కువ గౌరవించు నొక ప్రాణిమీద.

అనార్కాళీ

ఎవరా ప్రాణి చెప్పరాదా ?

అజీజ్

ఎవరా! అనార్కాళీ.

అనార్కాళీ

మరి అంతప్రేమగల నామీద నీకీ కోపమెందులకు ?

అజీజ్

అక్కా! మనము బానిసలమే కానిమ్ము! యువరాజు మనకేల యుత్తరమువ్రాయ సాహసింపవలెను ?

అనార్కాళీ

అదియెట్టి యుత్తరమోచూచి తరువాత నాక్షేపింతము.

అజీజ్

చదువుము.

అనార్కాళీ

నీవే చదువుము.

అజీజ్

నీకే వ్రాయబడినది.

అనార్కాళీ

అదుగో మరల నామాటయేమి?

అజీజ్

కాదులే చదువ వమ్మా!

అనార్కాళీ

నేను చదువను; నీవే చదువవలయును.

అజీజ్

[చదువును ఉత్తరము]

ప్రియురాలా !

నా యీసంబోధనమున నీకు కోపము వచ్చునేని నన్ను మన్నింపుము. నిన్ను ప్రథమమున నంతఃపురమున చూచిననాటగోలె నా హృదయము నీయెడ బద్ధప్రేమమైనది. నాట నుండియు నిన్ను మరల నెప్పుడు చూతునా యెప్పుడు చూతునా యని దుఃఖించి మా తండ్రివద్ద నృత్యము పరీక్షించుట కనుమిష మీద మరల నీదర్శనము చేసికొంటిని. నాడు నా యభాగ్యమువలన నీవు జ్వరపడియుండుట

రంగము. ౮

అజీజ్

ఏమమ్మా! ఎట్లాన్నుంది? జరమేమన్నా తగ్గిందా

అనార్కాళి

తగ్గలేదు. ఎచ్చటికో వెళ్లి వచ్చితివి.

అజీజ్

ఎక్కడకీ వెళ్ళలా.

అనార్కాళి

బజారునకు పోయి రెండు మామిడిపండ్లుతెచ్చి పెట్టెదవా?

అజీజ్

చే వెళ్లి లేనివ్వడు.

అనార్కాళి

నోరరుచిగానున్నది. మామిడిపండ్లు తినవలె ననిపించుచున్నది.

అజీజ్

కోరికలకేం చాలా వుంటై; అవి అణుచుకోవటమే ప్రజ్ఞంటే.

అనార్కాళి

నాకేమియు కోరికలు లేవు.

అజీజ్

ఇదేమిటి మఱి.

అనార్కాళి

జ్వరమువచ్చుటచేత నోటికి రుచి పోయినది.

అజీజ్

మఱి యిదేమిటి?

అనార్కాళి

ఏమిటది?

అజీజ్

సలీముగారు నన్నిన్నాళ్లటినుంచీ గౌరవిస్తున్నారే దానికి ఫలితం.

అనార్కాళి

అదియేమిటో చెప్పుము.

అజీజ్

కనిపట్టంలేదా? ప్రణయప్రత్తరం.

అనార్కాళి

అప్పుడుగాని నేడేమిటి అట్లు మాటలాడుచుంటివి?

అజీజ్

ఎట్లా మాటాడుతున్నా?

అనార్కాళి

ఏటికింతకాఠిన్యము? నావలన నేమైన దోషమున్న నది యిదని చెప్పుము.

అజీజ్

నీవల్ల తప్పుంటె నేనెవ్వర్ని చెప్పేందుకు? నీఅంతదానవు నీవు. నాఅంతవాణ్ణి నేను.

అనార్కాళి

నాయనా! అట్లు మాటలాడెదవేమి? నీ వనుకొన్నదోషము నావద్ద లేకపోవచ్చును. మన మిద్దరము నేకగర్భజనితులము గాకపోవచ్చును. మనపుట్టుకలుగూడ మన కొకరికొకరికి దెలియకపోవచ్చును. కాని నాకు తల్లి లేదు; తండ్రిలేదు; బంధువులు నెవ్వరును లేరు. చక్రవర్తి నాయీశరీరమున కధిపతి గేమో కాని నాయభిమానాదికములు నా యధీనముననే యున్నవి. అవి నాతమ్ముడవగుటచేత నాకన్న చిన్నవాడవైనను మగవాడవుకాన నాతండ్రివంటి వాడ వనుకొని నీ యనుజ్ఞ లేనిది యెవరియధీనములును కావు. నాయందు నీవృథానుమానమునకు గారణము నీవనుకొన్నట్లు మాత్రము కాదని గట్టిగా చెప్పుచున్నాను.

అజీజ్

ఈ యుత్తరము యువరాజు గారు నీకిమ్మని యిచ్చినారు.

అనార్కాళి

ఇదిగానా నీకు కోపకారణము ?

అజీజ్

అవును.

అనార్కాళి

అందులో నేమున్నది ?

అజీజ్

నేను చదువలేదు.

అనార్కాళి

ఎందుచేత ?

అజీజ్

ఆయనవద్ద నేనిది విప్పి చదువనని యొట్టుపెట్టుకొన్నాను.

అనార్కాళి

భగవంతుని మీదనా?

అజీజ్

కాదు.

అనార్కాళి

ఎవరి మీద మఱి ?

అజీజ్

నే నెక్కువ గౌరవించు నొక ప్రాణిమీద.

అనార్కాళి

ఎవరా ప్రాణి చెప్పరాదా ?

అజీజ్

ఎవరా! అనార్కాళి.

అనార్కాళి

మఱి అంతప్రేమగల నామీద నీకీ కోపమెందులకు ?

అజీజ్

అక్కా! మనము బానిసలమే కానిమ్ము! యువరాజు మనకేల యుత్తరమువ్రాయ సాహసింపవలెను ?

అనార్కాళి

అదియెట్టి యుత్తరమో చూచి తరువాత నాక్షేపింతము.

అజీజ్

చదువుము.

అనార్కాళి

నీవే చదువుము.

అజీజ్

నీకే వ్రాయబడినది.

అనార్కాళి

అదుగో మరల నామాటయేమి?

అజీజ్

కాదులే చదువ వమ్మా!

అనార్కాళి

నేను చదువను; నీవే చదువవలయును.

అజీజ్

[చదువును ఉత్తరము]

ప్రియురాలా !

నా యీసంబోధనమున నీకు కోపము వచ్చునేని నన్ను మన్నింపుము. నిన్ను ప్రథమమున నంతఃపురమున చూచిననాటగోలె నా హృదయము నీయెడ బద్ధప్రేమమైనది. నాట నుండియు నిన్ను మరల నెప్పుడు చూతునా యెప్పుడు చూతునా యని దుఃఖించి మా తండ్రి వద్ద నృత్యము పరీక్షించుట కనుమిష మీద మరల నీదర్శనము చేసికొంటిని. నాడు నా యభాగ్యమువలన నీవు జ్వరపడియుండుట

తటస్థించినది. నీవటిస్థితిలో నుండియు నాడు వచ్చుటచేత నామీాద నీకుగూడ ప్రేమయున్న దనుకొంటిని. నేను కామాంధుడ నగుటచేత నే యట్లనుకొంటినేని నన్ను క్షమింపుము.

మనోహారిణీ! జీర్ణ సుందరమైన యానాటి నీ వదన మండలమిప్పటికిని నాకన్నుల కంటగట్టి నట్లున్నది.ఇంతవరకు నాదేహములో ప్రాణము లున్నవన్నచో కారణ మానాటి నీమనోహర ప్రణయరూపము నాకు నిత్యసన్నిధాన వర్తిని కనుకనే.

ఈదినమ్ములెల్ల నేను మన్మధాగ్నిలో వేగింప బడుచున్నాను. నీకొఱకు నేనొక్క మాట చెప్పవలసియున్నది. ఈమహాగ్ని దేవీ, మహా పవిత్రమైనది. నాహృదయ మిదివరకెవ్వరికిని దత్తము కాలేదు. నీవే దానిని హరించితివి. నీవు నన్ను మరల ప్రేమించుము. ప్రేమించ కుము. నాజీవితాంతము నీయెడల తప్ప నా మనస్సన్యధా చరించదు.

నీవు బానిసవు. నేను చక్రవర్తి కుమారుడను. మన వివాహము బహిర్గతమైన ముప్పువాటిల్లు నందువా? అది నేను రాజ్యాధికారి నగువఱకు రహస్యముగా నుంచబడును. అప్పుడు దేవి! మన మిర్వుర మొక్కసారిగా నేను కుడిపాద మును నీ వెడమపాదమును భారతరాజ్యసిం హాసనమున నుంచుదము. కాదీ లోపుననే మనసంగతి తెలిసి చక్రవర్తి నన్ను నిన్ను దూరముచేయఁబ్రయత్నించునాభగవత్సాక్షి గా చెప్పుచున్నాను; నన్నును భారతరాజ్య లక్ష్మిని నెడబాపగలడు గాని నిన్నును నన్ను మాత్ర మెడబాపజాలఁడు.

ఈయుత్తరము ముగించుచుంటిని. దీని వలన నీకు కోపమువచ్చినా తెలియజేయుము. ఇతడు జీవితాంతము మరల నిన్ను పలుక రించడు. జీవితాంతము బ్రహ్మచర్యమో లేక యేమగునో గతి. దయగలిగినా సశాస్త్రీయ ముగ నిన్ను వివాహమాడగలడు.

(సలీము)

అనార్కాళి

అయినదా!

అజీజ్

అయినది.

అనార్కాళి

ఇందు నా తప్పేమియు లేదుకద.

అజీజ్

అక్కా క్షమింపుము! నేనేపొరపాటుపడితిని.

అనార్కాళి

నాయనా! ఫరవాలేదు. నీకింత యభిమాన గౌరవము లుండుట నాకు సంతోషము కాదా.

అజీజ్

అక్కా! నీవేదో దేవతామూర్తివి.

అనార్కాళి

ఈయుత్తరమునకు సమాధాన మేమందువు?

అజీజ్

ఆమహారాజు వివాహవిషయము ప్రస్తావించి నాడుగాన నాకిష్టము. ఆయనయెడల నీవు సానురాగవైతివేని, బానిసలము నిఱుపేదల యింట పెన్నిధి వచ్చి కూర్చున్నట్లు; కాని,ఆక్బ రుచక్రవర్తి జీవించి యున్నంతకాలము మన బ్రతుకు త్రాచుకోరలమీాది చెరలాట.

అనార్కాళి

నాకీజ్వరము తగ్గినట్లున్నది చూడుము.

అజీజ్

తగ్గినది.

అనార్కాళి

నేను స్నానము చేసెదను. నీవు మామిడిపండ్లుతెచ్చిపెట్టెదవా ?

అజీజ్

డబ్బులిమ్ము.

రంగము. ౯

రుసీ

మీ అక్కగారున్నదా !

అజీజ్

ఉన్నది.

రుసీ

(లోనికి పోబోవును.)

అజీజ్

(నవ్వుచు) లేదు.

రుసీ

ఎక్కడకు వెళ్లినది.

అజీజ్

స్నానముచేసి వచ్చుటకు చక్రవర్తితోటలోని చెరువువద్దకు వెళ్ళినది. దేనికి?

రుసీ

ఉస్తాదు పిలుచుకొని రమ్మన్నాడు.

అజీజ్

దేనికి.

రుసీ

ఏమో! వెళ్లెదను.

అజీజ్

కొంచె మాగుము.

రుసీ

దేనికో చెప్పుము.

అజీజ్

మీ రింకెన్నాళ్లు నేర్చుకొనవలయును?

అయిపోవచ్చినది. ఇంక నాలుగైదురోజులేనట.

అజీజ్

తరువాత నీ వేమి చేసెదవు?

రుసీ

నృత్యము చేసుకొని జీవించెదను.

అజీజ్

వివాహము చేసుకోవా?

రుసీ

ఉస్తాదు నాకై యెదురు చూచు చుండును. పోవలెను.

అజీజ్

సౌందర్య మన్న పదార్థము చాలయుత్కృష్టమైనది. దానిని వృథాచేయరాదు. నీచముగా నుపయోగించను రాదు.

రుసీ

బానిసలకు పెండ్లి యెందుకు?

అజీజ్

బానిసలు మనుష్యులు కారా?

రుసీ

పెండ్లి చేసికోవలయునన్న చక్రవర్తి యనుమతి పొందవలెను.

అజీజ్

పొందవచ్చును.

రుసీ

మాకు నృత్యము నేర్పించు చక్రవర్తి యుద్దేశ మదికాదు. ఆయన రాజసభలో మేము నృత్యము సేయవలెనని. మేము వివాహము చేసికొన్నచో నది తటస్థించదు గదా!

అజీజ్

వివాహము చేసికొందుమన్న చక్రవర్తి యొప్పుకొనునని నాయుద్దేశము.

రసీ

నేను పోవలయును.

అజీజ్

ఒప్పుకొన్నచో వివాహము చేసికొందువా?

రసీ

ఈ నీచపుబ్రతుకు కన్న వివాహము చేసికోవలయుననియే యున్నది.

అజీజ్

చేసికొన్నచో నెవరిని చేసికొందువు?

రసీ

ఉస్తాదునాకై యెదురుచూచుచుండును. పోవుచున్నాను.

అజీజ్

మాఅక్కయిప్పుడే వచ్చును. అదుగో వచ్చుచున్నది.

రసీ

ఏది? వచ్చుటలేదే.

అజీజ్

ఇప్పుడే వచ్చును. నీవివాహమునకు నీయిష్టమేనా?

రసీ

అనార్కలీ నాకు బ్రియతమురాలు. ఆమె యిష్టము.

అజీజ్

నీవు ఒక్క అందకత్తెవే కాదు. మంచిదానవు కూడను.

రసీ

నేను మీ అక్కకన్న నందకత్తెనా?

అజీజ్

మాఅక్కయేమంత అందకత్తె? ఆమె సద్గుణ పేత.

రసీ

మీఅక్క యంత యందకత్తె యీపట్టణమున లేదట.

అజీజ్

మీఅక్కగారికన్న నీవే యందకత్తెవు.

రసీ

సరేలే; నేను వెళ్ళవలయును.

అజీజ్

(చేయిపట్టుకొని) రసీ! మాఅక్కగారు వచ్చువరకు నిందుండుము.

రసీ

వదలిపెట్టుము.

అజీజ్

ప్రియా!

రంగము ౧౦

వసంతుడు

ఇసుకతిన్నెలమీద నింపారు పుప్పొళ్ళ
పసమీరు చివురుదొప్పల మీద విహరింతు
అంభోజకుసుమకన్యకల యౌవనముల
రంభావిలాస పత్రముల నానందింతు
మాకందకుసుమకన్యాకపోలములందు
శేకత్తు మల్లెల శేలందు నిద్రింతు
పరువు లెత్తుచునుంటి ప్రాకులాడుచునుంటి
తరుణసాయంసుసంధ్యారాగములయందు
చివురు శేఫాలికా సీమంతమునయందు
తవిలి క్రొమ్మించు ముక్తాహారములు గూర్తు
సాయంసమయమందచారు మాగుతములు
కోయిల నును తేనె కొసరించుపాటలు

పుష్పంధయానంద మోహన రావముల్
గీష్పతుల్ గూడ రాగిలు శుకాలాపముల్
నాకు పుల్కలు కూర్చునన్ను మోహింపించు
నాకు నానందసంధానంబు గావించు
ఈమహాభోగమ్ము లెన్నాళ్లనుభవించి
ఏమితృప్తియులేదు నింతయూ యని లేదు
ఈ మహానందవాహినులందు నీదాడి
యేమియు శ్రమలేదు నికజాలునని లేదు.

పుష్పకన్యకలు

మమ్ము కన్మొరగించి మూగవా వచ్చితే
సమ్ము నిన్నెడబాసి సనుగవములు లేవు
నీవె లోకమ్మని నీవె ప్రాణమ్మని
నీవెంటవచ్చు మమ్మేవెంట తత్తిపోను
రావయ్య మావెంట రమ్యమోహన మూర్తి
ఈ వనాంతములందు నెపమేది విహరింప

వసంతుడు

మీకునాకు సభేదమే లతాంతములార
నాకున్న యందమంతయు మీరయనుకొంటప
ఇట నెగసి కానెపు నిట నాన కురిసెపు
చిటిపాటి సొగసొల్లు చిందులాడ దొడంగు
రమణీయ పుష్పితారామ సీమలయందు
సమ్మోహకన్యకలార యనుగమ్ము మనమొల్ల
రావె శేఫాలికా రావె యోమాగధి
రావె యోముకుంద రావె యోమాధవి
ఓనవమల్లె రావే నీవు నిలుపకు
రానేరవటు నీవు రమణీయ కురవకీ
ఒక్కరొక్కరి చేతు లూని నేనే రసపు
తక్కు వెన్నెలలె సౌందర్యంబు లందున
నేను పోవుచునుంటి పూని నావెనువెంట
రం డాడు కొందాము రండు భోగింతాము.

అనార్కలి

ఆహా! ఈవనమ్మున వసంత మెంత శోభాయ
మానముగ నున్నది! ఈస్థలమ్ము నిర్జనముగా
నున్నది. ఉత్తరముతీసి చదువుకొనెదను.
"అప్పుడు దేవి! మన మిర్వుర మొక్కసారిగా
నేను కుడిపాదమును నీ వెడమ పాదమును
భారత రాజ్యసింహాసనమున నుంచుదము."
ఈప్రేమకు నేనేమి బదులీయ గల్గుదును.
ప్రభూ! ప్రభూ! ఈదాసిమీద నీ కెందు కింత
కృప? ఇంత ప్రేమ కీదాసి యనర్హ.

చిలుక

ఈవసంతమునందు నేపెంపుచూచిన
ఏమి చెప్పుదు తీపియే కాని మరి కాదు
నీవు చాటుగ జేసి నేదాగు కొన్నాను
నీవు చెప్పకు మేరితోను మాకందంబ!
ఇన్నిపండులు తెచ్చి యేభుజించుదుకూర్మి
కోరిక వేసెద నేను కోరనిపండ్లెల్ల
ఈకు గ్రొన్నాంబ్రెల్ల నేసికొంచున్నాను
పోకుండ నేనేమొ కోరికవేసిన పండ్లు
నానోటికి కెంగిలన్నది లేదు కాబోలు
నానుడుల్ వనమునందమ్ములు కాబోలు
నామాట లానంద నవ్య గీతమ్ములో
నామేను సొగసు నన్నని పట్టు కాబోలు
నేను పల్కినయంత నిజముగా వసమొల్ల
పూని సమ్మోదాంబు పూరంబునన్ దేలె.

అనార్కలి

ఈచిలుక నేమి ముద్దుగా పలుకుచున్నది.
దీనిమాటలు వినినకొలంది నా కేమొ క్రొత్త
భావములు పుట్టుచున్నవి. ఈయుత్తరము నం
దిచ్చుట నేమో వ్రాయబడియున్నది. ఇదియిది
పరకు చూడలేదు.

"ఆనాడు నీవు పాడిన గీతమే నాకు జపము చేసికొను మంత్రమైనది." ప్రభూ! ఇన్నాళ్ళ దనుక తూష్ణీంభావము వహించిన యీ బానిస దండనార్హ. ప్రభూ! అప్పటి కిప్పటికి నీపాదమున యందె నిలిచియున్నది మనసు ఆపదుద్ధారకా ఆనందమయ నాథ!

కోకిల

ఈవసంతమ్ము చిన్నెలు తోచెనల్లెడ
యేవంక చూచిన నెంతొ మోహనమయ్యె
బంతులుగట్టి యీభ్రమర సంతానంబు
పరుగులువెట్టు పుష్పమరందముల కొర్కి
ఈలేడి ప్రాయమ్ము నెనసి రెణ్ణెలయ్యె
ప్రాలేయ బిందు చుంబనము గావించెడు,
ఇంతవాయువు వీచెనో లేదో యీలత
కౌగిలించినది శాఖాగ్ర భాగమ్మును
ఈరసాలకిసాలయేత రాహారమ్ము
తా రుచించదు మాకు తరుణ కంఠములకు.

అనార్కాళి

అక్కటా! ఈవిరహబాధ నేనెట్లపనయింప గల్గుదును. మనోహరా! దయజూడు! దయ జూడు!

కోకిల

ప్రకృతిలో పురుషుండు ప్రతిఫలించిన నాడె
సకలప్రపంచంబు సామరస్యం బందె
తావి పుష్పంబులో తన్మయత్వంబందె
తేనెలోపల తీపి ద్రిమ్మరించుకుపోయె
చివురులో శ్యామలచ్ఛవి యంటుకొనిపోయె
ప్రవిమలచ్ఛాయలోపల శైత్యమేపారె
కవితలో శబ్దమైక్యంబంది పొలుపెత్తె
పంచమస్వరములో భాసిల్లె రసధుని.

అనార్కాళి

మనోహరా! నీ స్వహస్త లిఖితములైనయీపవిత్రాక్షరములుగల యీలేఖ నాకుచాగ్రములపై నుంచుకొని యీతాప మపనయించుకొందును.

కవి

ఈమధుమాస కోకిల లి
వేమిటి కోమల మాకరంద కూ
హూమధురారవంబుల న
హో! పులకింపగ జేయు నల్దెసల్
నామన సంత కంతకు ఘృ
ణాకలితంబయి యీవసంత శో
భామహనీయతా జలధి
భంగములందున నూగులాడెడిన్.

ఈమందానిల మెంత మంజులమొతా
నీ పుష్పవాటీ సుమ
శ్రీమాహాత్మ్యము లెల్ల గొల్లగొనితా
రెంబో సుధాభంగ భృం
గీమంథానవికస్వరస్వర భవ
క్రీడానవా నీత భృం
గీమంజీర నినాదకంఠలహరీ
గీతంబు లూగించుచున్.

అరయ దరప్రఫుల్లకుసు
మాంతరలగ్నహిమాంబు పూరముల్
వరలు కవోష్ణహా జలజ
బంధుకరమ్ముల నాహ్వాతంబులై
పారవిరజిమ్మి నూత్న వధు
వుల్ వలె సిగ్గరి చానలై ప్రసూ
నరమణు లందపున్ విలస
నమ్ముల వొల్చెడు లేతయెండలో.

అనార్కాళి

ఈ ప్రకృతికి గూడ నామీద నింత వైరస్య మెందులకో! మనోహరా! నీప్రాణ నాయికను

వచ్చి రక్షించుకొనుము. నీవె జాగు చేసితివా దుర్మార్గుడైన యీమన్మథుడునీమనోహారిణిని నీకు దక్కనీయడు.

మన్మథుడు

నన్నెందుల కుపాలంభించెదవు?

అనార్కాలి

నీవెవ్వరవు?

మన్మథుడు

నీవు నన్నెందులకు దూషించెదవు?

అనార్కాలి

నీవెవ్వరవో నిన్ను నే నెఱుఁగను. నిన్ను నేను పిలువలేదు. పాదుషాహి యీయనోద్యాన మితరులకు జేరరాదు. నీ వెవ్వర, విచ్చటకెట్లు వచ్చితివి?

మన్మథుడు

నన్ను నీవెఱుంగవా? నేను నీలోననే చిన్ని యగ్నిశకలముగాలె నున్నాను. నీవు బాల్యము వీడి యౌవనావతరణము చేసినది మొదలు నీతోనే యున్నాను. నాకును యౌవనమునకును భేదములేదు. నేను నేడు నీకు ప్రత్యక్షమైతిని.

అనార్కాలి

నేడు నాకేల నీవు ప్రత్యక్షము గావలెను. ఇన్నాళ్ళనుండి నీవు నాలోనుంటివా? నిన్ను నే నెఱుంగకుండుట యెట్లు?

మన్మథుడు

నీవు యువరాజు సలీమునుగూర్చి వలపుగొని విరహమనుభవించు చున్నావు.

అనార్కాలి

ఛీ, ఛీ, పిచ్చిమాటలు మాటాడకుము. లేనిపోనినిందలు మోపకుము.

మన్మథుడు

ఏటికట్లు మృషాపూర్తిచేసెదవు. వెన్నెలలో నుండి కాంతిని పూవులోనుండి తావిని నీటిలో నుండి రసత్వమును నెట్లువేఱుచేయ జాలవో యట్లే భావములోనుండి నన్నువేఱు చేయ జాలవు. నిరంతరము నీమనస్సులో నివాసించుచున్న నేను నీమనస్సులోని భావము లెఱుంగకుండుట యెట్లు? నేను నీమనోభావము లెఱుగ ననుట నేను రసమునుగానని జలమే జలముతో వాదించు కొన్నట్లు.

అనార్కాలి

స్వామీ! నీవెవ్వరవు?

మన్మథుడు

నేను నీమనస్సులో బుట్టినాను. నేనెవ్వరనో నీకే తెలియదు. నాకెట్లు తెలియును?

అనార్కాలి

ఇప్పుడు దేనికి వచ్చితివి?

మన్మథుడు

నీవు ప్రేమించుచున్న యీసలీము మనుష్యుడు అతనికి జరామరణము లున్నవి. నామాటవిని యతనిమీది యాస వదలుము.

అనార్కాలి

ఇది నాకిష్టములేదు. నామనస్సిదివరకే యామహాభాగునికి దత్తమైనది. నేను మరల దానిని గ్రహించ జాలను.

మన్మథుడు

అటులైనచో నింకొకమాట చెప్పెదను. అతని యౌవనము శాశ్వతము కాదు. శాశ్వతయౌవనము మ రవ్వరినైన వరించుము.

అనార్కాళి

ప్రభూ! నేనును మనుష్యునే. శాశ్వత యౌవనను కాదు. అతనినే వరించెదను.

మన్మథుడు

అతనికన్న అందమైనవానిని చూపెదను. అతనినివరింపుము.

అనార్కాళి

అతనికన్న అందగాడు పృథ్విమీద లేడు.

మన్మథుడు

అన్నిటికన్న అందమైన దేమిటి?

అనార్కాళి

మనస్సు.

మన్మథుడు

నేను మనస్సునుండి పుట్టితిని. అందుచేత నాకన్న అందముకలవాడు లేడు.

అనార్కాళి

మనస్సునకు రూపము లేదు. నీకు రూపమెట్లున్నదో నాకు తెలియదు.

(వెనుకనుండి సలీమువచ్చి కనులు మూయును)

అనార్కాళి

నాకనులు మూయకుము.

సలీము

నాపేరు చెప్పుము.

అనార్కాళి

నీపేరు నీకే తెలియదాయెను. నా కెట్లు తెలియును.

సలీము

నాపేరు నాకు తెలియకేమి? నాపే రనార్కాళీమనోహరుడు.

అనార్కాళి

అనార్కాళీ మనోహరుడవు నీవు కాదు.

సలీము

మరెవ్వరు?

అనార్కాళి

నీవే యెరుంగుదువు.

సలీము

తెలియదు చెప్పుము.

అనార్కాళి

నేను చెప్పను. నాకు సిగ్గుగానున్నది.

సలీము

నీవు చెప్పకుండ నుండలేవు.

అనార్కాళి

అవును. సకలభారత సామ్రాజ్యభావి చక్రవర్తి సలీము

[సలీము మహానందమున చేతులు తీయును. అనార్కాళి నివ్వెఱ]

మన్మథుడు

మాకందబాల పల్లవము సందడి గ్రోలి
కోకిలాకన్యక కుహూకుహూస్వనము జేసె
మల్లికాసుమ మాకరంద ధునీభ్రాంతి
చెల్ల రేతుమ్మెద శ్రీగీతములు పాడె
అరుణకేసరరమ్యమైన తమ్ములమీద
పవనకుమారుండు పఱవళ్లు వెసద్రొక్కె
నిత్యకళ్యాణంబు పచ్చతోరణమునై
యత్యంతసౌభాగ్య మందె నీవనసీమ.
పల్లెమ్ములో పెట్టి ఫలరసంబుల నెల్ల
కళ్యాణమంజురాగము దీసె కోకిల.
ఇంపు గుల్కెడు వనమ్మిది పెండ్లిపీటయై
చాంపేయమంటప చారుతల్ ప్రకటించె.

ఇది పూర్వాంకము




నాళము కృష్ణరావు గారు

### పండుగులు

ఏఁడవు నాచిన్ని నూఁటికిఁ గాని నాకు
పండుగులమీఁద పండుగుల్ వచ్చినట్లు
ఈవు నన్నుఁ బాసి పోయితివే నాకు
ప్రళయములమీఁదఁ బ్రళయంబు నడచి యట్లు.

నిరుడు కృష్ణాష్టమికి నీవు నిండు వేడ్క—
ఉట్టి కొట్టఁగ నెగురుచు నుర్విఁ బడితి;
వకట! యుట్టికె యెగుర లేనట్టివాఁడ
వెట్లు స్వర్గంబునకు నిక్క మేగితయ్య?

అన్ని పండుగులను వినాయకచతుర్థి
మఱతు నన్నను నాకెప్డు మఱపు రాదు;
నాఁడు మాపాలిగణపతి నాఁగ నీవు
కానవత్తువు కన్నులకిప్పుడేల.

వేడుకలు మీఱ నిదె వచ్చె విజయదశమి;
చిన్నిగిలకలబద్దను చేతఁబూని
'ఏమిరా కృష్ణ గుంగిడఁగేల' యనుచు
పదము పాడుచు నాచెంతఁ గదియ వేమి?

ప్రొద్దునె లేచి నేఁ దట్లతద్ది యనుచు
తోడి బాలురు వీథుల నాడుచుండ,
నిన్ను లేపఁ దటాలున నిదుర లేచి
నద్దటిల్లితి నాప్రమాదంబు నరసి.

వచ్చె దీపాలపండుగ వైభవమున
దీపకాంతులఁ బురమెల్లఁ దేజరిల్లె!

నేఁడు నాగృహదీపంబు నీవు లేమి
శూన్యమై తోఁచె నాయిల్లు శోభగక్క—.

'పుట్టలోఁ బోయుదున పాలు, పొట్టలోన?'
అనుచు నే నన, 'నీపొట్టయందె' యంచు
పలికితివి కాదె నిరుడు నాగులచవితికి;
నేఁడు నాపొట్టఁ జిచ్చిడినాఁడ వేమి?

మున్ను ముక్కోటి శ్రీరంగమునకు నేగి
దాటినాఁడవు వైకుంఠద్వార మీవు;
ఇపుడు ముక్కోటివచ్చెనో యింక లేదొ
ప్రాఁతకాఁపైతి వైకుంఠపట్టణమున.

నిండువేడుక సంక్రాంతిపండు గంచు
ఎల్లజనములు సత్తువారింట్ల కేగి
హర్షవారాశిలో నోలలాడుచుండ,
అకట; పడియుంటి నింట దివాంధమట్లు.

ఉత్సవంబులలోన సంవత్సరాది
సకలజనులకు సంతోషజనక మయ్యె,
అధికసంతాపకారిణ మయ్యె నాకు
స్మృతికిఁ దెచ్చుటఁ జేసి నీమృతిని గూర్చి

### విపర్యయము

సకలజనులును దమదినచర్యలెల్ల
నగని శోధించెదరు వత్సరాదినాఁడు,
నాదినచర్య పరిశోధనంబు సేయ
అన్నిపుటలను శోకంబె యాక్రమించె.

అకట! యెంతటి తారతమ్యంబు గలదొ
నాదు బ్రదుకున నొక్క యేఁడాదిలోనె?
నాఁడు నావంటిధన్యమానసుఁడు లేఁడు
నేఁడు నావంటిదీనుండు లేఁడు జగతి.

నిరుడు నామానసంబున నిశ్చలతయు
నిర్విచారత నిశ్చింత నిండియుండ,
నేఁడు నిర్వేదము నిరాశ నిస్పృహతయు
రాజ్య మేలుచు నుండె నిరంకుశముగ.

తావకవియోగ శస్త్రఘాతంబు చేత
గంటువడియున్న నాగుండెగాయ మింక
కుదురువోవక లోలోన కుళ్లి కుళ్లి
అలముచున్నది నానాట సెలలు నాటి.

నీవు మరణించి పదిరెండు నెలలు గడచె;
కాలము గతించుకొలఁది శోకంబు గూడ
అంతకంతకు నగ్గల మయ్యెఁ గాని,
ఇంచుకంతయు శాంతి వహింప దయ్యె.

ఇంత కాలమునుండియు నీవు నాకు
నందనుఁడ వయి కూర్చునానందమునకు
పెక్కుమడుగుల నెక్కుడై పిక్కటిల్లె
నీదుమరణంబుచేఁ గల్గు ఖేదభరము.

సుఖము లబ్బినయప్పుడు శోక మడఁగు
నంచు నందురు; సౌఖ్యంబు లబ్బినపుడె
ఎక్కు డయ్యెను సంతాప, మీవు లేని
లోప మధికతరం బయి తోఁప నాకు.

గాఢ మగు నీదుప్రేమశృంఖలముచేత
మున్ను లొంగని మదగజంబు నగు నన్ను
శిశు వొనరించి లొంగఁదీసితివి యిట్టె
చటుల తీవ్ర వియోగాంకుశమున నేఁడు

శోకమా! నిన్ను నాకూర్మిసుతుఁడు చనుచు
దనకు మాఱుగఁ జూచికొ మ్మనుచు నాకు
అప్పగించెను గావున నందికొంటి
ప్రేమ మీఱఁగ నినుఁ బెంచి పెద్ద సేయ.

చైత్రసఖుఁ డంచు మాధవపుత్త్రుఁ డంచు
కవులు కీర్తించుచుందురు కాముఁ గూర్చి
చైత్రఋతువున మాధవోత్సవము వేళ
కాముఁ డీల్గెను కటకటా! కాలమహిమ.

నాదు సంసారవనమున బ్రోదిగాంచు
బాల సహకారవృక్షంబు నేలఁగూలె;
విమలమగు నాదుమానసకమలమందు
నిచ్చఁ గ్రీడించు రాయంచ యెగిరిపోయె.

నాతలంపుల మొలక, వాచేతి చిలుక
కొంగుబంగర, మరచేతి బొంగరంబు,
దొడ్డిలోపలి వేలుపుగిడ్డి, నాదు
పున్నెములమూట అక్కటా! నన్ను వీడె.

ఎవఁడు నాసౌఖ్యముల కెల్ల నవధి యంచు
నమ్మియుంటినొ యాతండు నన్నువీడె;
ప్రణయమా! నీవు నన్నింకఁ బాసిపొమ్ము
మరణమా! నీవె నాపాలి శరణ మగుము.

### కృతిప్రశంస

నీయెడల నాకుఁ గలిగిన నిండుప్రేమ
వెల్లడింపఁగఁ బదములు వెలితివడును
కుంటువడు ధార పద్యముల్ కూర్చునెడల;
ఎట్లు వర్ణింతునో నాకె యెఱుక లేదు.

గాఢశోకానలంబునఁ గ్రాఁగి క్రాఁగి
హృదయ మను కుప్పెలోపల నివిరియున్న
భావరసమును గన్నీటఁ బదనుకొలిపి
వ్రాయుచుంటిని నీపేర పద్దియములు:





అబ్దుల్ రహమాను గారు
మంతాజు బేగముయొక్క నూతనవరుడు



మంతాజు బేగము
నూతనవధువు

బొంబాయి నివాసియు, కోటీశ్వరుడును నగు బావలాగారు తనప్రాణములను, ఇండూరు మహారాజుగారు తన రాజ్యమును త్యజించిన దీమెకొఱకే. ప్రకృత మీమెను అమృతసరమునందలి సంపన్న వర్తకులు అబ్దుల్ రహమానుగారు వరించి పెండ్లాడినారు.





భూపాలు బేగముగారి ముగ్గురు మనుమరాండ్రు



భూపాలు బేగముగారు
చాన్సలరు దుస్తులతో నున్నారు!

వీరందఱు నిప్పు డింగ్లాండున నున్నారు

అక్కరము కొక్కకన్నీటిచుక్క గాఁగ
వ్రాయుచుంటిని నీపేర పద్దియములు;
ఎంతవ్రాసిన పద్యంబు లంత మొండ,
విరుగఁబాఱదు కన్నీటి యేటిజాలు.

సవియోగవ్యథాంబుధి నిస్తరింపఁ
గడఁగి, శబ్దంబు తెప్పగాఁ గైకొనంగ,
పైని తేలించుటకు మాఱు లోని కీడ్చి
ముప్పతిప్పలఁ బెట్టి నన్ ముంచుచుండె.

హస్తమునఁ బట్టి యపుడు నీపుస్తకంబు
నారసినారసి నాసక్తిఁ జదువుచుందు;
ఎన్నిసారులు చదివిన నేని కాని
మరల నొకసారి చదువంగ మనసు పుట్టు.

ఇంతను బుట్టినవాఁడగా నింతవనుక
లేఁడు నే నియుఁ బ్రఖ్యాతి లేనినాఁకు
కలిగె 'పాపాయిశాస్త్రి' యన్ గౌరవంబు
పద్యములు నీపేర వ్రాయుకతన.

ఎన్ని జనులు నిన్నుఁ గని విని యుబ్బఁగట్టి
వారు ప్రేమమున జాబులు వ్రాసినారు
పుస్తకంబును నిన్నును బ్రస్తుతించి;
అహహా! ఎంతటిధన్యుండ వయ్య నీవు?

"సుతులు చావరె? వారలస్మృతులపేర
కవివరుల మెచ్చి పద్యకావ్యములను
వ్రాయరే నేఁడు సుకృతుల్? వాని నెల్ల
నీదుకృతితోడ సరిపోల్ప రాదు కాక!"

"రాణ నొప్పారె నాంధ్రసారస్వతాబ్ధి
కావ్యమణు లెన్నియో నేఁటికాలమందు;
వాని నెల్లను సరిపోల్పవచ్చు నొక్క
తావకానూన కావ్యరత్నంబు తోడ.

మేలు మే లని 'శారద' చాల మెచ్చె
ఔర యని 'ఆంధ్రపత్రిక' యభినుతించె,
బళిబళీ యని 'భారతి' తలను దాల్చె;
అహహా! ఎంతటిధన్యుండ వయ్య నీవు?

పుస్తకంబును వీ.పీ.గ పుచ్చుకొంచు
పలువు రెన్నేని జాబులు వ్రాసినారు;
సుతునిమృతిఁ గూర్చి వ్రాసినకృతిని గూడ
భృతికి నమ్మెడు కష్టంపుమతులు గలరె?

సుతులు మృతి నొందు వారల స్మృతులపై
కృతుల రచియించి యమ్ము నికృష్టజీవి
కడఁగి పీనుంగుమీఁదను గంచ ముంచి
కడుపు నింపుకొను కక్కుర్తికాఁడు గాఁడె?

మృతుని బ్రతికించు సాధనంబుఁ గృతి యటంచు
చెప్పుదురు గాన నీకృతి చేసినాఁడ;
ధరణి నీకృతి వెలయునందాఁక నీవు
బ్రతికియున్నట్లు భావింతు భావమందు

తండ్రిబిడ్డల యన్యోన్యతత్పరత్వ
మవని నెందాఁక నుండునో, అంతదాఁక
వెలయుఁ గావుత 'పాపాయి' విమలకీర్తి
విబుధమానసరాజీవవీథులందు.

సంపూర్ణము




# ఇట్లుండునా?

సి. హెచ్. సత్యనారాయణరావు గారు

[సచిత్రము: చిత్రకారుడు: శ్రీ వై. సుబ్బారావుగారు, రాజమండ్రి]

## ౧

నారాయణరావుది అమలాపురం తాలూకా లోని ఒకకుగ్రామము. నియ్యోగుల పిల్ల వాడు. పాపం, చాలాచిన్నప్పుడే తండ్రి కాలంచేయడం వల్ల, స్థిరచరాస్తు లంతగా లేకపోవడంవల్ల మారేదిక్కెవ్వరు లేకపోవడంవల్ల తల్లితోపాటు మేనమామ ప్రకాశరావుగారిఊరు రాజమండ్రీ రావలసివచ్చింది. వారి పెట్టుపోతలలోనే చెప్పుచేతల్లోనే ఉండవలసివచ్చింది. ఏవిధమైన ఆధారం లేకపోవడంవల్ల నారాయణరావు చదువువిషయమై చాలా ఆదుర్దాపడేదితల్లి. పరమేశ్వరుడు నారాయణరావుకు ధనధాన్యంబు లివ్వకపోయినా తెలివి తేటలుమాత్రం పూర్తిగా అనుగ్రహించాడు. చిన్నప్పటినుంచీ ప్రతీపరీక్షలోనూ మొదటివాడుగానే ఉండేవాడు. పదిహేనుసంవత్సరములు పూర్తికాకుండానే స్కూలుఫయినలు ప్యాసుచేసినాడు. తల్లికి కొంచెం ధైర్యం కలిగింది. సంతోషం, శాంతికూడా, కలిగాయి. ఇంటర్మీడియటు చదువుటకు గవర్నమెంటు ఆర్ట్సు కాలేజీలో ప్రవేశించాడు.

## ౨

ప్రకాశరావుగారు రాజమండ్రీలో పేరుగాంచిన వకీలు. మ్యునిసిపలు కౌన్సిలరుకూడాను. ఇంతేకాదు. రాజకీయ (అసహాయనిరాకరణోద్యమము) సాంఘిక మత సంస్కారములందుకూడా పాల్గొనెడువారు. అందులో ముఖ్యంగా సంఘసంస్కారమంటే ప్రకాశరావు గారు ఎక్కువగా పనిచేసేవారు. చిన్నప్పటినుండీ వీరేశలింగంపంతులుగారు పెదబాబయ్యగారు అంటే అభిమానం గౌరవం. అందుచేతనే సంఘసంస్కారమంటే కొంచెం ఎక్కువప్రీతి. కులభేదములు పాటించరు ప్రకాశరావుగారు. అందుచేతనే తరుచు ప్రతి భోజనము (Cosmopolitan Dinners)లకు వెళ్లేడువారు. నిమ్నజాత్యుద్ధరణమునకై ధనసాహాయ్యముచేసెడువారు. రజస్వలానంతరవివాహములు మంచివని బహిరంగముగా ఉపన్యాసము లిచ్చెడువారు. గౌరుగారి వివాహపునష్టమును పూర్తిగఆమోదించారు. ప్రకాశరావుగారికి ఒకకుమార్తె. ఆయన పిల్లవిషయంలో ఏంచేస్తారో చూద్దాం అని మాత్రం ప్రజలు అనుకొనేవారు.

## ౩

నారాయణరావు కేవలము చదువుటయందేకాక ఆటలందు, అందులో ముఖ్యంగా టెన్నిసునందు, ప్రావీణ్యం చూపించేవాడు. ఈఆటయందు రెండుమూడుసారులు బహుమానములుకూడా పొందెను. అందుచే నారాయణరావుఅంటే కాలేజి ప్రిన్సిపాలుగారికి, ప్రొఫెసర్లకు, చాలాయిష్టం, అభిమానము. ఇతడింతగౌరవము సంపాదించుటచే తోడిసహాధ్యాయులకు ద్వేషం. అందుచే నారాయణరావుకు స్నేహితులు బహుతక్కువ. ఇతనికి ముఖ్యస్నేహితుడు ఒక్కడే. అతడు మహమ్మదీయబాలకుడు. పేరు అబ్దుల్ రజకు. వీరిరువురు ప్రాణస్నేహితులు. ఇద్దరు అద్భుతమగు తెలివిగలవారు. ఎక్కడికివెళ్లినా వీరిద్దరు వెళ్లేవారు. టెన్నిసులోకూడా కలిసే ఆడేవారు. క్లాసులోఒక్కచోటనే కూర్చుండేవారు. నారాయణరావో లేక రజకో క్లాసులో మొదటివారుగ నుండెడువారు.

## ౪

రజక్ గౌరవముగల కుటుంబమునకు చెందినవాడు. అతనితండ్రి హుస్సేనుగారు యింగ్లండువెళ్లి బారిష్టరు పరీక్షప్యాసై మద్రాసుహైకోర్టులో వకీలుగా ప్రవే

శించినారు. వకీలుపని మొదలుపెట్టిన పదేళ్లలోనే సబుజడ్జీ; అదయిన కొద్దికాలంలోనే జిల్లాజడ్జీకూడాఅయింది. ప్రస్తుతం రాజమండ్రీలో ఉన్నారు. వీరింట్లో పద్ధతులన్నీ నవీనం; ఘోషా ఎంతమాత్రం లేదు. హుస్సేనుగారి భార్యకూడా బియ్యే ప్యాసయింది. ఆయునకు ప్రస్తుతం ఒక కుమారుడు, ఒక కుమార్తె. కుమారుడు రజక్; నారాయణరావుతోటివాడు. కుమార్తెకు పంద్రెండుసంవత్సరములు. 7వ క్లాసులో చదువుతున్నది. చాలాతెలివైంది. చురుకైంది. మంచిరూపసి.

## ౫

ప్రకాశరావుగారు సంఘసంస్కార ప్రియులు గనుక నారాయణరావు మనస్సుకూడా ఆధోరణిలోనే పడింది. అదిగాక నారాయణరావు చాలా యోచనాశక్తి, సత్యాసత్యవిచారణాసక్తి కలవాడు. సంఘంలో ఉండే దురాచారములు గాని వాటికి విద్వాంసులు కూడా సలిపే దాస్యంగాని, చాలా విచారించేవాడు. ఇదిగాక గాంధిమహాత్ముని జాతీయసందేశము, అందులో ముఖ్యంగా సాంఘికవిషయము నారాయణరావుమదిలో నాటుకొంది. నిమ్నజాత్యుద్ధరణము, హిందూమహమ్మదీయ సమ్మేళనము, గోవుగారి విమోచనకట్టం మొదలగు సమస్యలనుగురించి తీవ్రంగా ఆలోచించేవాడు. అప్పుడప్పుడు రజక్‌తో చర్చించేవాడు. హిందూసంఘంలో ఉండే దురాచారాలన్నీ పోయి, ఐకమత్యంకలిగి సోదరభావం జనించి, సంఘంలో నిరంకుశాధికారం సల్పుచు, హిందువులను శృంఖలాబద్ధులనుచేసిన పురాణాచారపరాయణత పోతేనేగాని స్వరాజ్యం రావడం కష్టమని నారాయణరావు అభిప్రాయము.

## ౬

రజక్ తరుచు నారాయణరావును తనయింటికి తీసికొనివెళ్లి కాఫీ ఫలహారాలు యిచ్చుచుండెను. నారాయణరావు ఎంతమాత్రం సంకోచించక పుచ్చుకొనుచుండెడువాడు. వీరిద్దరేకాక హుస్సేనుగారితోను వారి భార్యాబిడ్డలతోను కలిసి ఒకబల్లకడనే వారితోను పుచ్చుకొనుచుండెను. నారాయణరావు సంగతి అంతికపూర్వమే రజకువల్ల హుస్సేనుగారికి తెలిసినది. నారాయణరావు అంటే ఆకుటుంబానికంతా ఎంతోగౌరవము; ప్రేమ. అట్లే వారియెడలను నారాయణరావుకు. వారితో కలిసి తరుచు షికారుకూడావెళ్లుచుండెడువాడు. ఇదంతా చూస్తే చాలామందికి నారాయణరావుయెడల ద్వేషం, కోపం. తనసహాధ్యాయులు అప్పుడప్పుడు పరిహాసం చేసేవారు కాని వాటిని నారాయణరావు లెక్కపెట్టడు. మౌనమంత్రం ఉపయోగించేవాడు. ఈసంగతులన్నీ కిట్టనివారెవరో మెల్లగా ప్రకాశరావుగారి చెవులో ఊదారు. పైగా నారాయణరావు హుస్సేనుగారియింట్లో భోజనాలు కూడా చేస్తున్నాడని కల్పించారు. కాని ప్రకాశరావుగారు దీన్నిగురించి ఏమీ నారాయణరావును అడగలేదు. ఎందుచేతననగా ఆయనకూడా అందరితో కలిసి భోజనము చేసినవాడే.

## ౭

నారాయణరావు రజకులిద్దరు బి. ఏ. పరీక్షయందు రాజధానిలో మొదటియిరువురుగా ప్యాసయినారు. ముందుచేయవలసిన విషయం ఇద్దరూ బాగుగ ఆలోచించుకొని లాకాలేజిలో ప్రవేశించుటకే నిశ్చయించుకొన్నారు. ఇంతలో హుస్సేనుగారికి హైకోర్టు జడ్జీ అయినట్టు తంతివార్త వచ్చింది. ఇంతకంటే వేరేమికావాలనుకొన్నారు స్నేహితులిద్దరూ. నారాయణరావు తన మనోభీష్టమును మేనమామతో చెప్పాడు. ఆయన ఏమియు అభ్యంతరపెట్టలేదు.

## ౮

ప్రకాశరావుగారికి కుమాళ్ళులేరు. యిద్దరుకుమార్తెలు. మొదటిపిల్ల మాణిక్యాంబకు పంద్రెండు సంవత్సరములు నిండాయి. అందమైనదే. ఫస్టుఫారం ప్యాసు అవడంతోనే ప్రకాశరావుగారికి యిష్టంలేక పోయినా యింట్లో ఆడవాళ్ళ పోరుపడలేక చదువుమాన్పించారు. ఇంకా పెళ్లి చేయలేదని యిరుగుపొరుగువారల ఆక్షేపణలపోరేకాక ఇంట్లోవాళ్లదికూడా రోజురోజూ ఎక్కువయినాయి. ప్రకాశరావుగారి అవస్థ ఏమని చెప్పడం? ఆయనహృదయ రంగమందు ఘోరయుద్ధం ప్రారంభమయింది. పెళ్లిచేయడమా లేక మానివేయడమా? షేక్స్పియరుపడ్డ అవస్థలోపడ్డారు. పెండ్లిచేస్తే వీధిలో తలెత్తుకొని తిరగడానికివీలుండదు. చెయ్యకపోతే యింట్లో పోరుపడ

లేరు. శాంతి అనేది లేనే లేదు. నిర్బంధ గాంధర్వములు, ప్రేమ్పలు ఉంటాయి. ఆసంవత్సరం పెళ్లి చెయ్యక తప్పద న్నారు తాడవాళ్లు. మేనల్లుడుయింట్లోనే ఉండగా ఎందు కాలోచన; త్వరలో ముహూర్తం పెట్టించి వివాహం చెయ్యమని బలవంతం పెట్టారు. ప్రకాశరావు గారికి ఏమి చేయుటకు తోచడంలేదు.

## ౯

ఒకనాటి ఉదయం నారాయణరావు తనగదిలో కూర్చుండి కాఫీతాగుచుండగా అతనితల్లి వచ్చి మెల్లగా పెళ్లి సంగతి ఎత్తింది. నారాయణరావు ఇంతవరకు పెళ్లి గురించి అంత దీక్షగా ఆలోచించియుండలేదు. యింత చిన్నతనంలోనే, ఒకరి ఆధీనంలో ఉండగానే, పెండ్లి చేసికోవడ మంత విచారకరమైన సంగతి ఇంకొంటి లేదన్నాడు. చదువు పూర్తి అవుతేనేకాని పెండ్లిసంగతి ఎత్తుటకు వీల్లేదన్నాడు. అదీగాక చిన్నప్పటినుండి తన చెల్లెల్లా చూచుకొనుచున్న మాణిక్యాంబను పెండ్లిచేసికోవడం అసందర్భంపని అన్నాడు. తల్లి ఏమేమో అనేక విధాల చెప్పింది పెండ్లిచేసికోమని; కాని నారాయణరావు ప్రస్తుతం ఏమిమాట్లాడవద్దని స్పష్టంగా చెప్పివేశాడు. ఈసంగతులన్నీ ఇంట్లోవాళ్ళకు తెలిసాయి. ఆసాయంత్రమే ప్రకాశరావుగారు మేనల్లునితో తిరిగి వివాహ విషయం ప్రసంగించారు. ఉదయం తనతల్లితో ఏవిధంగా చెప్పాడో ఇప్పుడుకూడా అదేవిధంగా మేనమామతో చెప్పెను. పైగా "ఏం మామా, చాలాకాలమునుండి రజస్వలానంతరవివాహములనుగురించి తీవ్రంగా ఉపన్యాసాల నిస్తూ, వ్యాసముల వ్రాస్తూ నీవే స్వవిషయంలో పప్పులో అడుగువేస్తే ఏలా" అనిపరిహాసంగా అన్నాడు. ఈమాటలు బల్లెపుపోట్లవలె నున్నాయి ప్రకాశరావు గారికి

## ౧౦

"చదువు పూర్తిఅయ్యేవరకూ ఏలాగో యింట్లో వాళ్లి పోరుపడదాం. రెండేళ్లు కళ్లుమూసుకొంటే గడిచిపోతాయి. ఈకాలంలో పెళ్లిచేయుట ప్రాణసంకటంగా వుంది. చిన్నప్పటినుండి చదువుచెప్పించి పెద్దవాణ్ణి చేసిన మన యెడల కృతఘ్నుడుగా ఉండజాలడు. రెండేళ్లు అయ్యేసరికి నారాయణరావు భావాలు మారిపోకూడదా. బి. యల్. అవడంతోనే తిరిగినచ్చచెప్పుదాం. తప్పక పెండ్లిచేసికొంటాడు. సందేహయం లేదు" అని ప్రకాశరావుగారు ఆడవాండ్లను సముదాయించి ప్రస్తుతం పెండ్లి ఆపుచేసినారు.

## ౧౧

వేసవి సెలవులు పూర్తిఅవడంతోనే నారాయణరావు చెన్నపట్టణంకు బయలుదేరి వెళ్లి లా కాలేజీలో ప్రవేశించాడు. అతని ప్రాణస్నేహితుడు సోదరతుల్యుడునగు రజాక్ కూడా ప్రవేశించాడు. వీరి స్నేహము అద్వితీయము. నారాయణరావుకు హుసేనుగారి కుటుంబముఅంటే చాలా గౌరవము, భక్తి, ప్రేమ. అందుచేతనే వారియింటికి వెళుచునుండెను. హుసేనుగారి కుమార్తె జిజియా స్కూలు ఫయినలుప్యాసయి గవర్నమెంటు క్వీనుమేరీ కాలేజీలో యింటర్మీడియటు చదువుటకు ప్రవేశించింది. నారాయణరావంటే జిజియాకు అనేకవిధమైన గౌరవము, ప్రేమ. అట్లే నారాయణరావు కూడా జిజియాయెడల.

## ౧౨

హుసేనుగారు విశాలహృదయులు; భక్తిసంపన్నులు; సత్యాన్వేషులు. వారికి అన్నిమత గ్రంథములయెడల సమానభక్తి గౌరవము. మతమతభేదము లెన్నడు చేసేవారుకారు. అన్నిమతగ్రంథములు ఈశ్వరప్రేరితములే. ప్రతిదానియందు వేర్వేరులక్షణములుకలవు; ఈశ్వరుడు ఏ గుడియందోకాక ఏ మసీదునందోకాక ఏ చర్చియందోకాక విశ్వమంతా వ్యాపించియున్నాడు. అతడు సర్వాంతర్యామి; సర్వవ్యాపి; అని నమ్మినవారలలో నొకరు హుసేనుగారు. వీరియింట్లో నిత్యం ఉదయం, సాయంత్రం కుటుంబప్రార్థనలు సలుపుదురు. నారాయణరావుకూడా వీటియందు పాల్గొనుచుండెడివాడు. అప్పుడప్పుడు ప్రార్థనకూడా చేసేవాడు నారాయణరావు. హుసేనుగారి కుటుంబములోని వాడుగనే మెలగేవాడు. శనివారం, ఆదివారాలు వారి యింటివద్దనే గడిపేవాడు; భోజనంకూడా అక్కడే.

## ౧౩

ప్రకాశరావుగారికి పైసంగతులన్నీ తెలిసాయి. తెలియకపోవడం ఆశ్చర్యంకాని తెలియడం ఎంతమాత్ర

ఆశ్చర్యంకాదు. నారాయణరావుఅంటే కిట్టనివాళ్లెవరో ప్రకాశరావుగారికి తెలియనివిధంగా కల్పించి వ్రాసియుందురు. నారాయణరావుఅంటే కాలేజీ ప్రిన్సిపాలుగారికి, ప్రొఫెసర్లకు చాలయిష్టం. వారితో నిత్యంచనువుగా ఉంటాడు. ఇదిగాక హుసేనుగారి కుటుంబముతో కలిసిమెలసి తిరగడం, వారిమోటారు బండిమీద నారాయణరావుకొరకు లాకాలేజీకి రావడం చూచి సహించలేనివారు అనేకమందిఉన్నారు. ఈసంగతులు విన్నప్పటినుంచి ప్రకాశరావుగారికి ఏమీ తోచడం లేదు. ఆకలినిద్దుర అసలే తోచడంలేదు. నారాయణరావు తల్లి దుఃఖసముద్రంలో మునిగిపోయింది. అందరూకలిసి ఆలోచించి సత్వరం వివాహం చేస్తే నారాయణరావుకు అన్నీ సదురుతాయి అని నిశ్చయించి ముహూర్తంపెట్టించి సత్వరం 20రోజులు సెలవు తీసికొనిరమ్మని నారాయణరావుపేర వ్రాసినారు. ఆఉత్తరం చూచుకొని నారాయణరావు ఆశ్చర్యపడ్డాడు. ఎందుకింత తొందరగా పెండ్లిచేయ దలచుకొన్నారో అర్థంకాలేదు. తిరిగి ఈక్రిందివిధంగా జవాబువ్రాసాడు.

"ప్రకాశంమామయ్యగారు మేనల్లుడు నారాయణరావు అనేకనమస్కారములు. నీవు వ్రాసిన ఉత్తరం చూచుకొని చాలా ఆశ్చర్యపడ్డాను. ఇంత అవసరంగా ఎందుకు పెళ్లిచేయదలచుకున్నారో నాకింతమాత్రము అర్థంకావడంలేదు. చదువు పూర్తి అయితేనేకాని పెళ్లిచేసికోనని యిదివరకే చెప్పియుంటిని. పెళ్లిచేసికొన్నతరువాత ఒకరి ఆధీనం ఉండడం నాకేమీ యిష్టంలేదు. అదిగాక మాణిక్యాంబను నేను స్వంత చెల్లెలువలె ఇంతవరకు భావించుచున్నాను. అట్టిసమయంలో నేను ఆమెను పెళ్లిచేసికోలేను. నామనస్సాక్షి ఎంతమాత్రము ఒప్పుకొనుటలేదు. మనస్సాక్షికి వ్యతిరేకంగా నడచుట నాకు యిష్టములేదు. అట్లు వ్యతిరేకంగా ఎన్నటికి వర్తించను. పెండ్లివిషయంలో నాకు సంపూర్ణస్వాతంత్ర్యము యిప్పించగలందులకు వేడుచున్నాను. ఇట్లువ్రాసినందుకు క్షమింపవేడెదను.

ఇట్లు నీప్రియమైన మేనల్లుడు,

నారాయణరావు."




"ఈ ఉత్తరం చూచుకొని ప్రకాశరావుగారు నిలువునా నీరైనారు."

## ౧౪

ఈఉత్తరం చూచుకొని ప్రకాశరావుగారు నిలువునా నీరైనారు. ఇంట్లోవాళ్ళతో ఆలోచించి చెన్నపట్నంవెళ్లి స్వయంగా నారాయణరావును తీసికొని రావడమే మంచిదని నిశ్చయించి ఆరాత్రే బయలుదేరి వెళ్లినారు. రైలుదిగడంతోనే తిన్నగా లాకాలేజీకివెళ్లి నారాయణరావును కలుసుకొని రాజమండ్రీకి ప్రయాణం అగునన్నారు. కాని నారాయణరావుది మునుపటి ధోరణే. నయాన్న, భయాన్న, అనేకవిధాల ప్రకాశరావుగారు చెప్పినను లాభంలేకపోయింది. ఇటుపైన చదువు చెప్పించననికూడా బెదరించారు. నారాయణరావు బదులుచెప్పలేదు. ప్రకాశరావుగారికి ప్రాణం విసిగింది. హుసేనుగారితో సంగతిసందర్భములన్ని చెప్పి నారాయణరావుకు బుద్ధిచెప్పించ దలచుకొని ఆసాయంకాలము వారియింటికి వెళ్లి హుసేనుగారితో అన్నీవిన్నవించుకొన్నారు ప్రకాశరావుగారు. వారుకూడా అక్కడే

వ్వంది. "నాతో చెప్పడంలో మీఅభిప్రాయ మేమో నాకు తెలియ లేదు. అయినను ఒక్క సంగతి చెప్ప దలుచుకొన్నాను. నారాయణరావు చిన్నవాడుకాడు. తెలివితేటలుగలవాడు. యోచించగలశక్తి బాగా ఉంది; అతనికి ఈవివాహం చేసికోవడాని కిష్టం లేనప్పుడు బలవంతపెట్టడం కేవల మన్యాయము. ఏవిషయంలో నైనా బలవంతపెట్టవచ్చునుగాని పెళ్లి విషయంలో బలవంత పెట్టకూడదనియే నానిశ్చితాభిప్రాయం. పెండ్లిఅంటే ఆజన్మాంతం ఉండే పవిత్రసంబంధం కానివేరొకటికాదు. యిష్టంలేకుండా పెళ్లిచేసికోవడం కంటె మహాపాతకం యింకొకటి లేదు." అని మెల్లగా మృదువుగా హుస్సేనుగారు బదులుచెప్పిరి. ప్రకాశరావుగారు మరిమాట్లాడ లేదు; తలవంచుకొని వేయున్నారు హుస్సేనుగారు మాట్లాడినంతసేపు. కొంతసేపైనతరువాత సెలవుతీసికొని వెళ్లిపోయినారు. నారాయణరావుతో యింకొకసారి చెప్పి చూచారు. లాభం లేకపోయింది. తిరిగి రాజమండ్రీబయలుదేరివచ్చేశారు. నారాయణరావు విషయంలో నిరాశ చేసికొని డబ్బుపంపించడం ఆపుచేసినారు.




"నారాయణరావుకు ఒకకవరువచ్చింది. అందులో ఒక ఉత్తరం, ఒక నూరురూపాయలనోటు వున్నవి."

## ౧౫

యింటివద్దనుండి డబ్బురాక పోవడంవల్ల పాపం నారాయణరావుకు కష్టంగా ఉంది. అందుచే ఇంకా చదువుచాలించి ఉద్యోగముకొరకు ప్రయత్నాలు మొదలుపెట్టాడు. ఈసంగతి రజక్ తో చెప్పాడు. రజక్ తండ్రితో సంగతి అంతా చెప్పాడు. రెండురోజులుపిదప నారాయణరావుకు ఒక కవరువచ్చింది. అందులో ఒక ఉత్తరం, ఒక నూరురూపాయలనోటు ఉన్నవి. ఉత్తరంలో యిట్లు వ్రాసియున్నది.

"ప్రియమైన నారాయణరావుకు:— ఇందుతో పంపిన నూరురూపాయలను దయతో సంగ్రహింపుము. ఈశ్వరునియందు పూర్ణవిశ్వాసముంచుము. మనస్సాక్షి చెప్పినరీతి ఎన్నికష్టములువచ్చినా నడచుకొనుము. ఈశ్వరుడు నీకుధైర్యము, శక్తి, శాంతి యిచ్చునుగాక!

ఇట్లు,

ఈశ్వరపుత్రుడు."

ఈ ఉత్తరం ఎవరువ్రాసింది, ఎక్కడనుంచివచ్చినది నారాయణరావుకు తెలియలేదు. కవరుమీదిముద్ర చాలా అలుక్కొనిపోవుటచే ఏవూరినుంచివచ్చింది చెప్పుటకు వీలులేకుండా ఉంది. ఆకష్టసమయంలో ఈశ్వరప్రేమ మహిమ ననుగ్రహించాడు నారాయణరావు. ధన్యవాదం బులుఅర్పించాడు. ప్రతినెల యిట్లే నారాయణరావుకు డబ్బు వచ్చుచుండెను; అతనికి ఈశ్వరునియెడల విశ్వాసము ప్రేమ ఎక్కువగుచుండెను.

## ౧౬

రజక్ నారాయణరావులు బి.యల్.ప్యాసు అగుసరికి జిజియాయింటర్ మీడియటు పూర్తిచేసింది. అయిదేండ్లక్రిందట బయలుదేరిన స్నేహభావము దినదినం వృద్ధిఅగుచు వివిధరూపములు దాల్చింది. జిజియాకు అంతే నారాయణ రావుకు అత్యంత గౌరవము, ప్రేమ. అట్లే జిజియాకు నారాయణ రావు యెడల. ఒకరి నొకరు నిత్యం చూచుకొనకపోతే తోచదు. ఆరోజు వృథాపోయినట్లుండెడిది. తన పెండ్లివిషయమై అనేకదృక్పథముల

నుండి తీవ్రంగా ఆలోచించారు. ఎన్నటికైనా ఎన్ని కష్టాలుసంభవించినా, ఎంతమందిబంధువులు, స్నేహితులు విడనాడినా, కులములోనుంచి వెలివేసినా జమీలానే పెండ్లి చేసికొనుటకు నిశ్చయించారు. కాని యింకా ఎవ్వరితోనూ చెప్పలేదు. నారాయణరావు యొక్క తెలివితేటలు చూచి, మనోనిశ్చలతను జూచి, హృదయ నైర్మల్యమును గాంచి, ఆత్మశక్తిని పరికించి జమీలా కూడా నారాయణరావునే ఎన్ని అడ్డంకులు వచ్చినా పెండ్లాడుటకు నిశ్చయించుకొన్నది. ఈమె కూడా యింకా ఎవ్వరితోనూ చెప్పలేదు.

## ౧౭

నారాయణరావు యం. యస్. చదువుతూ (apprentice course) కూడా పూర్తిచేసినాడు. జమీలా బి. యే. రాజధానిలో మూడవతరగతిలో ప్యాసయింది. నారాయణరావు యం. యస్. ప్యాసయి హైకోర్టు వకీలుగా చేరినాడు. బి. యస్. క్లాసులోనుండిగా ఎక్కడినుంచి డబ్బువచ్చేదో ఇప్పుడుకూడా అట్లేవస్తూవుంది. హుస్సేనుగారు పంపుచున్నట్లు అనుమానంతోచింది. ధైర్యంచేసికొని హుస్సేనుగారిని అడిగినాడు. ఆయన అప్పుడు "నాయనా, నీయందు ఈశ్వరునికి పూర్ణప్రేమ గలదు. తన్ను నమ్మినవారి కీశ్వరుడెల్లప్పుడు సహాయము చేయుచునే యుండును. నీకు పంపునదేమి నీవు మాత్రం ఈశ్వరునియందు విశ్వాసము వీడక, ఆయన యిచ్ఛయే నెరవేర్చుచుండుము. నీ కట్టియిక్కట్లు రాలేవు." అని బదులు చెప్పినారు.

## ౧౮

జమీలాను చూచినప్పటినుండీ నారాయణరావుకు అదొకవిధమైన వికాసం కలుగుతుంది. అతని హృదయంలోకి అదొకవిధమైన తేజస్సు ముమ్మరించి వెళ్లుతుంది. వినయవిధేయతలు గొప్పయింటివారి పిల్లలందుండుట అరుదు; కాని ఎక్కడైనా ఉన్నవంటే, జమీలా యందున్నవి. ఆమెమాట్లాడుతూ ఉంటే తేనెలొలుకుతూ ఉండును. ఆమె జ్ఞానం ఎక్కువగుచున్నకొలది వినయం ఎక్కువగుచున్నది; మనస్సు వికాసము చెందినకొలది హృదయమందు ప్రేమ అభివృద్ధి, పవిత్రత గాంచుచున్నది. ఒక విధమైన చిఱునవ్వు– హృదయ పవిత్రతను వెలిపుచ్చు చిఱునవ్వు– చుట్టుప్రక్కల ఉండు చీకట్లనే దుఃఖాన్ని పటాపంచలుచేసి వెలుతురనే ప్రేమను వెదజల్లే చిఱునవ్వు– ఆమె పెదవులమీద నిత్యం నాట్యంచేస్తూఉంటుంది ఆమె ఈశ్వరభక్తివిశ్వాసములు అపారములు.

## ౧౯

ఒకనాడు మూడునాలుగు గంటలకు జమీలా తనగదిలో కిటికీదగ్గర ఏదోపుస్తకం చూస్తూ కూర్చుండెను. నారాయణరావు ఆమె గదివద్దకువచ్చి తలుపు దగ్గరగావేసి ఉండుటచే మెల్లగా తట్టాడు. 'ఎవరో రావచ్చును' అని మృదుమధుర కంఠస్వరంతో జవాబు



"లోపలికివెళ్లి జమీలాతోపాటు ఫలహారము చేసి పుచ్చుకొన్నాడు."

వచ్చింది. లోపలికివెళ్లి జమీలాతోపాటు ఫలహారం చేసి పుచ్చుకొన్నాడు. ఏదైన ప్రశాంతస్థలానికి ఒంటరిగ షికారు వెళ్లవలెనని ఉంది. 'నీవుకూడా వచ్చెదవా' అని నారాయణరావును అడిగింది. నారాయణరావు అక్కడికివెళ్లడం ఉద్దేశంకూడా జమీలాతో మాత్రం కలిసి షికారు వెళ్లవలెననియే. అట్లు అడుగగనే తన కోరికలన్నిటిని ఈశ్వరుడు తీర్చుచున్నాడనుకొని మన

స్సులో కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించి 'సరే వస్తా'నని బదులుచెప్పినాడు. ఇద్దరూకలసి మోటారులో యిక్కియాట్ బీచికిపోయి ఒకఏకాంతస్థలమును చూచుకొని సముద్రపు ఒడ్డుననే కూర్చొని కొంతసేపు ఏవేవో మాట్లాడిన పిమ్మట నారాయణరావును ప్రార్థనచేయ మని జిజియా కోరింది. ఆమె అడగడం, నారాయణ రావు చెయ్యక పోవడమునా? అందులో, అట్టి ప్రశాంత స్థలమందు, పవిత్ర సమయమందు విశ్వగానంతో రన గానం ఐక్యంచేసి, మనస్సును పడెలపరిచి, హృదయ మును పవిత్రంచేసి, కరములు జోడించి,తలవంచి, ఈశ్వ రుని ధన్యవాదములు సల్పుటకంటె వేరొక మన కార్య మేముంది. కాని "నీవుమాత్రము ముందుగా భక్తి రసపూరితములగు హిందూస్థానీకీర్తనలు పాడినతో ప్రార్థనచేసినచో మరింత ఉత్సాహము, ఉద్రేకం కలు గు"ననినారాయణరావుచెప్పినపిమ్మటరెండుకీర్తనలనుత నసహజ మృదుమధురకంఠము నెత్తిపాడింది.నారాయణ రావు ప్రార్థనచేసినాడు. ఆసమయమందు వీరి హృదయ కవాటముల తెరువబడి అదొకవిధమైన వెలుతురు ప్రవేశిం చింది. వీ రిరువురు తమతమ హృద్భావములను గ్రహిం చారు. జిజియాకు నారాయణరావు పవిత్రస్వరూపుడు వలె కనబడితే జిజియా నారాయణరావుకు ప్రేమ స్వరూపంగా కనపడింది."హృదయసామ్రాజ్యపట్టభద్ర" వన్నాడు జిజియాతో నారాయణరావు. "నాసర్వస్వం- నాదేహం - మనస్సు - హృదయం, నీదే" అంది జిజియా. ఒక్కక్షణం వారిదేహాలు తోపాటు ఆత్మ లుకూడా ఆలింగనంచేసి కొన్నాయి. ఇరువురు ఆనంద బాష్పాల్ని రాల్చారు. 'ఈశ్వరుని ధన్యులు, మనము ధన్యులమైతి' మనుకొన్నారు. తిరిగి యింటికి బయలు దేరి మోటారులో కూర్చున్నంతసేపు మాట్లాడుకో లేదు; కాని ఆనిశ్శబ్దం (silence) లో మాట్లాడుకొనుచునే యున్నారు- నోటితో కాదు, ఆత్మలతో.




"ఒకక్షణం వారిదేహాలుతో పాటు ఆత్మలుకూడా ఆలింగనం చేసికొన్నాయి."

## ౨౦

హుస్సేనగారు జిజియాకుపెండ్లిచేసిన బాగుం డుననితలంచి ఆమె అభిప్రాయమును తెలిసికొనుటకు గాను ఒకనాటిసాయంకాలము జిజియాతో మాట్లాడు టకు మొదలిడినారు. 'వివాహం విషయంలో నీయిష్ట మెట్లో అట్లేజరుగునుగాని మరియొకలాగున జరుగనేర' దని మాత్ర మభయమిచ్చినారు. కొన్ని సంబంధముల గురించి హుస్సేనుగారు చెప్పినారు. ఆయన చెప్పినదం తయువిని'నేను నెలరోజులక్రిందటనే ఈశ్వరునియెదుట నారాయణరావును పెండ్లిచేసికొన్నాను.'అని మెల్లగా తలవంచుకొని బదులుచెప్పింది. హుస్సేనుగారికి ఆశ్చర్య సంతోషాలు ఒక్కసారి బయలుదేరినవి. నారాయణ రావువంటి అల్లుని సంపాదించుటకంటె తనకు నేరుసం తోషమయింది లేదన్నారు. తమకుమాత్ర అభీష్టమును మరునాడు నారాయణరావుతో చెప్పినారు. తమపిల్లను పెండ్లిచేసికోవడంవల్ల కలిగే సాధకబాధకములన్నీ విపు లంగా చెప్పినారు. "పరమేశ్వరు దుస్సప్నము దుఃఖము లన్నీ సంతోషంగా మారును.ఈశ్వరునిమీదనే భారము నిడితిని.జిజియాను పవిత్రప్రేమతో ప్రేమించాను; ప్రే మించుచున్నాను;ఇటుపైనప్రేమించెదను.జిజియానుతప్ప ఇతరులను పెండ్లిచేసికొననని ఈశ్వరునియెదుటనిశ్చయిం చుకొన్నాను." అని నారాయణరావు జవాబుచెప్పాడు.

## ౨౧

ఏదోఒక సెలవుదినమున వివాహమును రిజిస్టరు చేయించిన బాగుండునేమోయని బిబియాతో హుస్సేను గారు చెప్పినారు. "రిజిస్టరు చేయుట యనవసరము. ఈశ్వరునియెదుట హృదయపూర్వకంగా హృదయఫలకమందు బంగారుఅక్షరములతో రిజిస్టరు చేసికొన్నప్పుడు వేరే ఆచార్యుణ్ణి తీసికొనివచ్చి రిజిస్టరుచేయడం నాకెంతమాత్రము యిష్టంలేదు. అట్లుచేసినచో నారాయణరావును నొప్పించినదాన నగుదును. ఈశ్వరునియెడల, నారాయణరావుయెడల అవిశ్వాసకురాల నగుదును." అని బిబియా బదులుచెప్పగానే హుస్సేనుగారు మరి మాట్లాడలేదు. వీరిరువురి ప్రేమనుచూచి లోపల అమితానంద పడి ఈశ్వరునికి ధన్యవాదములు సల్పి వారిని చిరాయువులుగను ఈశ్వరప్రేమయందు దినదినాభివృద్ధి గాంచునటుల ఆశీర్వదించి వెడలిపోయెను. మరునాడు వివాహసందర్భమున తమస్నేహితులకు ఒక విందొనర్చినారు. ఆసందర్భమున అనేకులు పెద్దలు గవర్నమెంటుఉద్యోగులు బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు కూడావచ్చి వధూవరుల నాశీర్వదించిరి.

## ౨౨

తానిట్లు హుస్సేనుగారి కుమార్తెను పెండ్లిచేసికొన్నట్లుగా ప్రకాశరావుగారికి నారాయణరావు జాబు వ్రాసినాడు. అందరూ నిశ్చేష్టితులైనారు. తనకొడుకు పల్లకటా అన్నగారి కుటుంబానికి గౌరవహాని కలిగించెనని విచారించి కొడుకుచేసిన పనిచూచి, సహించలేక నారాయణరావుతల్లి ఆత్మహత్య చేసికొంది. ఈసంగతి తెలుపుతూ నారాయణరావుకు ఒకజాబు వ్రాసినారు. తమ యింటికిమాత్రము రావద్దని స్పష్టంగా తెలియపరిచినారు. నారాయణరావు బిబియాలు చాల విచారించారు. ఎంత రావద్దనివ్రాసినా రాజమండ్రీవెళ్ళి చూడవలెనని నిశ్చయించి ఆరాత్రియే బయలుదేరి వెళ్ళినాడు. మేనమామ యింటికివెళ్ళగా ఎవ్వరూ పలుకరించినా మాట్లాడలేదు. లోపలికి రావద్దన్నారు. పాపం నారాయణరావు చాలా దుఃఖించాడు. 'ఈశ్వరేచ్ఛ నెరవేరునుగాని మానవేచ్ఛ ఎన్నటికి నెరవేరదు' అనుకొని విచారగ్రస్తుడై ఆరాత్రే తిరిగి చెన్నపట్నంబయలుదేరివెళ్ళిపోయినాడు.

## ౨౩

ప్లీడరుపని మొదలుపెట్టిన అయిదారుసంవత్సరముల లోపుగనే నారాయణరావు మేధాశక్తిని, వినయవిధేయతలను, న్యాయబుద్ధిని, విశాల హృదయమును, మనోధైర్యస్థైర్యములను హైకోర్టు జడ్జీలు పూర్తిగ గ్రహించి మొదటనే జిల్లాజడ్జీపని యిచ్చినారు.

## ౨౪

జీవితకాలమంతయు ఈశ్వరపుత్రు డనిపించుకొన్నాడు నారాయణరావు.

---

# తాత్త్వికాహంకారము

కే. బి. కోటిలింగం దేవర గారు

ఐంద్ర జాలికు కరజనితామ్రభూజ
　　మట్టుసంకల్పమున భువనాళి సతముఁ
దోపఁగాఁజేసి క్షణములో మాపుచుండు
ప్రకటితాద్భుతమూర్తి మాంత్రికుడ నేనె?

తారహారంబులోని సూత్రంబు పగిది
సకలవేధోండగత చరాచరసమూహ
మెడపకయ ధరియించి వెల్గించుచుండు
సన్ప్రతర్క్యుండనైన సూత్రాత్మ నేనె?

బంతులాడొంటి నంటక పట్టివిసరు
నాటలో మేటియైన కన్యకవిధాన
సర్వగోళంబులం ద్రిప్పిసాకుచుండు
నఖిలద్రుహిణాండకోటి నాయకుడ నేనె?

సంద్రమున నీటిబుగ్గల చందమునను
దేనిలోన బ్రహ్మాండాళి దేహమూని
పెఱిగి, విఱిగి విలీనమై పేరు మాయు
లీలతో నట్టి చిన్మయలింగ మేనె?

చిత్తరువునొండొనర్పఁగాఁ జిత్రకార
వర్ణవస్తువుల్ వేర్వేర వలసినట్లు
చిత్రతమమైన నిమ్మహాసృష్టి సలుప
కర్తృకారణ కార్యోపకరణ మేనె?

శీతలామోదయుత వాతపోతమందు
చందనతుషార శీకరాసారమందు
శారదాపూర్ణిమా చంద్రచంద్రికలను
గలుగు శీతలసుఖభావ కలన నేనె?

నే నఖిలజీవజంతు సంతాన ముఖ్య
ప్రాణకారణమైన సూత్రాత్మనగుట
క్రియహీనజగత్ప్రాణవాయుకంబె
ప్రబలతరమైన దృష్టాంతరంబు గాదె?

నే ననంత కోట్యర్కవితాన కలిత
మహిత విద్యుత్ప్రభాభాసమానుఁడగుట
కీవికర్తన తారకాగ్నీందుమండ
లాది విద్యోతపటలి సాక్ష్యములుగావె?

కండ్లుచెదరిన వేళ నాకాశవీథి
పింఛములు, ముత్యములును గాన్పించురీతి
చిత్తచలనంబుచే, లేని చిత్రజగము,
లున్నటులఁ దోపఁగాఁ జేయుచుందు నేనె?

గాలిచే వర్ధిలిన పావక ప్రహేతి
గాలిచేతనె నాశంబు గాంచునట్లు
కల్పితజగంబు సత్యసంకల్పముననె
నాశమొనరించుచుండుట నాగుణంబు.

నాపవిత్ర సంకల్ప చిన్మాత్రమందె
సర్వవేధోఽండజాల సంసర్గమగును
నాయచలపూర్ణభావ శూన్యత్వమందు?
సర్వసంవర్త కార్యముల్ జఱుగుచుండు.

లేనిజగముల రూపంబు నూని చూపు
నాత్మగతమూల మాయామయాంధకార
పటలిగాల్పఁగ విద్యుత్ప్రభాభ మైన
జ్ఞానమే బ్రహ్మ; మద్దియే నేను సుమ్ము!

మానసాదీంద్రియంబులు లేవి నిలకు
నిశ్చలసచేతసత్త్వంబు నిలుచునెడల
నేప్రశాంతనైజస్థితి నెసఁగుచుందు
నట్టి పరిశుద్ధచైతన్య మరయ నేనె?

కల్లుద్రావిన బాల మర్కటమురీతి
నొక్కవిషయంబు వదలి వేరొక్క దాని
మనసు పొందెడు వేళ నమ్మధ్య గల్గు
సూక్ష్మతర నిర్మలావధిఁ జూడ నేనె!

చలన మొందని నిర్మలజలమునందు
నడుగుభాగంబు విస్పష్టమైనయట్లు
వృత్తిరహితమౌ సన్మనస్సత్త్వమునందు
శుద్ధనిర్గుణుఁడగు నన్నె? చూడవచ్చు

గాఢనిద్రావశస్థితిం గాంచునపుడు
గలుగు; వచియింపరాని యఖర్వసుఖము
జాగ్రదావస్థనో! జ్ఞానసహితముగనో! (?)
గాంచువారలు నాస్థితిం గాంచుచుంద్రు.

అలలు, బుద్బుదఫేన హిమాశ్మచయము
లుదకమునకంటె వేరయియుండనట్లు
చేతనాచేతనాత్మక మిజ్జగంబు
నాకు వేరయియుండు టెన్నఁడును లేదు.

ఉండియును సర్వశూన్యమై యున్నవాఁడ
నేకమయ్యు ననేకత నెసఁగువాఁడ
పోవకయ యన్నిచోట్లకుఁ బోవువాఁడ.
చేతనంబయ్యు జడమయి చెలఁగువాఁడ!

బయలులో వెలిఁగల బట్టబయలు నేనె ?
ఎఱుకమఱపుల నెఱిఁగెడు నెఱుక నేనె ?
నేను నేననుభావంబు నేనుగాను
నే ననెడివృత్తిశూన్యమే నేను సుమ్ము!

ఇట్టినన్నుఁ గాంచుకొఱకు యత్నింప, నాత్మ
నేనె, నీవనినెఱినమ్మి నిశ్చయముగ
ప్రతిఫలాపేక్ష శూన్యసద్భావమంది
ధర్మ మొనరింపు లోకహితంబుపొంద ?



# నదీతీరము

కృ. రఘునాథరావు గారు

ప్రశాంతనీలాకాశమున నసంఖ్యాకములగు తారలు లజ్జతో నవ్వుచుండినవి. చంద్రుఁడు నిజశీతలకిరణములతో వసుధాతలమున నమృత తుషారములఁ గుఱియించుచుండెను. స్నిగ్ధశ్యామలవృక్షములు శాంతముగ నక్షత్రముల నృత్యమును విలోకించుచుండెను. ప్రేమోన్మత్తలగులతలు వృక్షభుజములఁ గౌఁగిలించుకొని చంద్రునివంకఁ గాంచుచుండెను. తన చంచలకల్లోలములపైఁ జంద్రప్రకాశముపడఁ దళతళమని మెఱయుచు, శ్రవణసుఖదాయకనినాద మొనర్చుచు నది ప్రవహించుచుండెను. ప్రవాహము శాంతముగనుండుటచే నక్షత్రములు కుతూహలముతో జలవిహారము సల్పుచుండెను. మొత్తముమీఁద నాదృశ్య మొక్కటి యుదాసీనచిత్తునైనను సంతోషస్వాంతునిగఁ జేయకమానదు.

నదీతీరమున నొకఱాతిపైఁ గూరుచుండి బాలికయొకతె నీటిలోని నక్షత్రప్రతిబింబములను జూచుచుండెను. ఆమెచేత నసంఘ్రాణపుష్పహార మొకటి యుండెను. ప్రక్కనింకను బువ్వులు పడియుండినవి. నదీగానముతోపాటు నడుమనడుమ నామెయుఁ దనమధురస్వరము గలుపుచుండెను. కొంతసేపు హార మల్లును; మఱికొంతసేపు చంద్రునేకాగ్రదృష్టిఁ జూచును. ఇంకఁ గొంతసేపు నక్షత్రములగణింపసాగును. ఈయన్నిఁటిలోను జుక్కల లెక్కపెట్టుటే యామెకు సంతోషదాయకముగఁ గాన్పించెను. కాని యామె కది యలవియగునా? తుదకు విసిగి మరల మాల నల్లసాఁగెను. ఇట్లెంతయు సేపు శ్రమపడి యామాలను ముగించెను. తన కుసుమకోమలహస్తమున దానిఁ బైకెత్తి దాని రామణీయకమును విలోకించెను. ఒక్కచిఱునవ్వునవ్వి యామె దానిఁ దనప్రక్క నుంచుకొనియెను. మరలఁ జంచలచిత్తయై యాఱాతిపై నిలిచి యామె మార్గము వంకఁ జూడఁదొడంగెను. కాని యామె విషణ్ణముఖమును జూడ నామె యాప్సితము నెఱవేరలేదని తోఁచుచుండెను. ఇంతలో దూరమున గుఱ్ఱపు డెక్కల చప్పుడులు వినవచ్చినతోడనే యామె యధరములపై మధురహాసము గాన్పించెను. తనప్రేమోజ్జ్వలదృష్టిఁ జంద్రునివంకఁ బఱపి యామె మధురముగఁ బాడఁజొచ్చెను.

వీణానాదమునుగూడ ధిక్కరించు నామధురగానరవ మెల్లెడలను బ్రసరించిపోయెను. ఆశ్చర్యచకితుఁడైన చంద్రుఁడు మంత్రముగ్ధుని రీతి నామెవంకఁ దదేకదృష్టి నవలోకించుచుండెను. ఆమెగానము నభినందించుచు, గానమహిమను వర్ణించుచు గాలివీవసాఁగెను. సుధా

కరుఁడు, నక్షత్రమాల, వృక్షసమూహము, నది మున్నగునవి యామెపాటనువిని ముక్కు-పై వ్రేలిడుకొనియెను. అంతకంతకు నామె గానావేశ మధికమయ్యెను. కన్నులనుండి యానందబాష్పములు వెలువడినవి. ఆనంద మున నామె శరీరము రోమాంచమయ్యెను. క్షణకాల మామె యున్మత్తరీతి నయ్యెను.

అశ్వఖురఘాతములు దగ్గరదగ్గర వినఁబ బడుచుండెను. ఆమె యానందభరమున నిమీలితనేత్రయై కరములు చాచెను. తన సమీపమున కరుదెంచిన యువకుని నామె గాఢాలింగన మొనర్చుకొని, కన్నీటితో నతని వక్షస్థ్సలమునంతయుఁ దడిపివైచెను.

దాపుననుండు వృక్షసమూహమునుండి దీర్ఘకాయుఁడగు మఱియొకయువకుఁ డాస్థలమున కరుదెంచెను. గాఢప్రేమసాగరమగ్నయై యుండిన తరుణిగాని యామె భుజపాశబద్ధుఁడై యుండిన యువకుఁడుగాని యా నూతనపురుషుఁ జూడనేలేదు. అతఁ డాయిరువురఁదిలకించి స్తంభితుఁడైపోయెను. ముఖము వివర్ణమయ్యెను. అత్యంతక్రోధావేశమునశరీరముకంపింపసాగెను పెదవినిగొఱికికొనుటచేనందుండి రక్తముప్రవహింపఁజొచ్చెను. కన్నులనిప్పులు రాలుచుండెను.తటాలున నొఱనుండి ఖడ్గమును సగము బయటకులాగి మరలనందే దానినుంచివైచెను. కఠోరస్వరమున నతఁడు "శభాస్! కమలాకుమారీ! శభాస్! అంబేరాధిపుని కోడలగుటకు నీవెంతయు యోగ్యురాలవు" అని కేకవైచెను.

తలపైఁ బిడుగు పడియుండినను కమల యంత యులికిపడియుండదు! ఆమె తటాలున వెనుక కొదిగెను. భయభ్రాంతితోఁ గన్నులు తెఱచెను. అయ్యో! ఎట్టి భయంకరస్థితి! ఆమె హృదయేశుఁడును, రాకుమారుఁడును నగు మానసింహుఁ డామెవంకఁ గఠోరదృష్టి నవలోకించుచుండుటయుఁ, దా నెవ్వని మానసింహుఁడని తలంచి గాఢాలింగన మొనర్చుకొనియెనో యతఁ డెవ్వఁడో యొక మహమ్మదీయవీరుఁ డగుటయుఁ దెలిసికొనియెను. కెవ్వున కేకవైచి యామె మూర్ఛవోయెను.

ఆమెస్థితిని గాంచినంతనే యామహమ్మదీయ వీరున కెంతయుఁ జింతగలిగి కోపము వచ్చెను. కాని యామెకు శైత్యోపచారము లొనర్చుటకు వానికి ధైర్యము రాదయ్యె. మానసింహుని క్రోధమునుగాంచి వానికి భయము కలుగకపోలేదు. కాని వాఁడుఱిచ్చివోయి యుండెను. ప్రస్తుతస్థితి యొకక్షణములోసంభవించుటం జేసి, వానికిఁ దన చిత్తవృత్తినిమరలఁ గూర్చుకొనుట కెంతయు సేపుపట్టెను. మానసింహుఁడును నిశ్చేష్టుఁడై నిలిచియుండెను. ఏయమ నతఁడు తన జీవనసర్వస్వమని తలఁచుచుండెనో, యేయమ ప్రేమాంగణమున నతని యాశావృక్షము పరిపూర్ణాభివృద్ధి యగుచుండెనో, యట్టి కమలాకుమారి -తన జీవితేశ్వరి- నాఁడు పరపురుషుని-మహమ్మదీయుని-హృదయముపై నశ్రువర్షమును గుఱిపించుటఁ జూచి యతని కెంతయాశ్చర్యమై యుండునో, యెంత క్రోధము కలిగియుండునో, యెంతదుఃఖముకలిగి

యుండునో, హృదయమెంత విదీర్ణమైయుండునో యూహింపనలవియే !

అక్కడకుఁ గొంతిదూరమున నొక ప్రచండ వృక్షచ్ఛాయను నిలిచి యుండిన నలువురాశ్వికులీస్థితినిజూచి పరుగున నరుదెంచిరి. తన సేవకులఁగాంచినంతనే యాయవనవీరునకు ధైర్యమువచ్చెను. మానసింహుని ముఖవైఖరి మాత్రము మార్పుఁ జెందలేదు. అతఁడట్టులే తీవ్రదృష్టిని వారిఁ జూచుచుండెను.

క్షణములో మానసింహుని తేజోమయ ఖడ్గము చంద్రప్రకాశమున మెఱుపుఁదీగెలవలె మెఱసెను. ఈసూచనమున నాయేవురును దమతమశత్రులను దూసిరి. యవనయువకుఁడు క్షణములోఁ దన యశ్వము నెక్కెను. ఇట్లొకపక్షమున ననేకశస్త్రాస్త్ర సమేతులగు నేవురాశ్వికులకును, మఱియొకపక్షమున నేక ఖడ్గపాణియై నేలపై నిలిచియుండినవీరునకొక్కనికిని ఘోరయుద్ధము ప్రారంభమయ్యెను.

తమప్రతిస్పర్థి యొక్కరుఁడేయగుటఁ దమకుమిగుల నష్టము కలుగకనే శత్రునాశనమొనర్పవచ్చునని యా యవనులు తలఁచియుండిరి. కాని తనగర్వమెఁ డాశసంతయు నాశనము గావించిన శత్రువుతన ప్రాణాల నుండుటఁ గాంచి మొదటనే నిప్పులు గ్రాల్చుచుండిన మానసింహుఁడు తన ప్రాణము నైన లక్ష్యముసేయక పోరుచుండెను. ఎంతసేపైన నెవ్వరు నోడరైరి. కాని యా యేవురట్లుఁ బోరుచుండుటచేఁ దన బలముమాత్రము మించు కించుక తగ్గుచుండెనని మానసింహునకుఁ దోఁచుచుండెను. తుదకతఁడేమోతలపోసి, ప్రాణమును దెగించి పోరుటగాంచి శత్రువు లొండొరుల ముఖములు చూచుకొనుచు మిన్నక నిలిచిరి. ఈసమయముగనిపెట్టి మానసింహుఁ డొక్కయెగురునఁ దన దగ్గరనున్న యాశ్వికు నశ్వసహితముగఁ గూలనేసెను. వెంటనే మఱియొకనిపైఁబడ వాఁడును గ్రిందఁ బడిపోయెను. తత్క్షణము మానసింహుఁ డా యశ్వము నారోహించెను. అతనిబలము ద్విగుణితమయ్యెను. ఆవేశమునఁ దక్కినవారిపైకురికెను. ఆతని ప్రచండఖడ్గమెంతయు వేగముగఁ దిరుగుచుండెను. ఖడ్గములొండొంటికిఁ దగిలి యగ్నికణము లెగురఁజొచ్చెను. తన ప్రతిస్పర్థి యసామాన్యుఁడనియు, నతని యెదుటఁ దమ యాటలేమియు సాగవనియు యవన వీరుల కప్పుడు తెలిసి కడసారి ప్రయత్నింపవలయునని వారందఱు నొక్కమారుగనే ఖడ్గము లెత్తిరి. కాని యాశత్రువులు క్రిందికి వచ్చునంతలోనే యొక్కనిశిర మెగిరిపోయెను. మఱొక్కని ఖడ్గహస్త మెగిరిపడియెను. యవన వీరుఁడు క్రోధావేశుఁడై మానసింహునిపైఁబడెను. కాని మానసింహుఁడు మూర్ఖుఁడు కాఁడు. అతఁడు తన శక్తినంతయు నుపయోగించుచుఁ బ్రచండ ఖడ్గముతో యవన యువకుని హస్తముపై వ్రేటువేసెను. వెంటనే వానిఖడ్గము చేతినుండి యూడి యాకాశమున గిరగిరఁ దిరుగుచుఁ బోయి నదిలోఁ బడిపోయెను. యవనవీరుఁడు శస్త్రహీనుఁడై మానసింహు నెదుటఁ దల వంచి నిలిచెను.

"పొమ్ము! ఇఁక నీవు నాయెదుటఁ నిలువకుము. పొమ్ము. శస్త్రహీనుఁడైన శత్రువును రాజపుత్రుఁ డెన్నఁడును జంపఁడు" అనిమానసింహుఁడు కఠోరస్వరమునఁ బలికెను.

ఇంతలో నేడ్పువినవచ్చెను. పాపము! కమలాకుమారిని శీతల వాయువే స్మృతికిఁ దెచ్చెను. ఆమె కన్నియు నప్పుడు జ్ఞప్తికిరాఁ దొడంగెను. "చిత్తవిభ్రమమున నే నెట్టి భయంకరపాతకము నొనర్చితిని! పరపురుషు నాలింగనమా! అక్కటా! ఆ తలంపును వలదు! మానసింహుని దోషమేమి? అది నా మూర్ఖతయే! జీవితేశ్వరుని చిత్తమున జనించిన భయంకరసంశయ మెన్నఁటికైనఁ బోవునా? అతఁడు మరల నెప్పటివలెనే నన్నుఁ బ్రేమించునా? నన్నింకఁ జేరఁదీయునా" అని యామె తీవ్రవేదన పడసాగెను. జగమంతయు నామె కనుల కంధకారబంధుర మైనట్లుండెను. ఆమె వెక్కి వెక్కి యేడ్వఁజొచ్చెను.

మానసింహుఁడు గుబ్బుమదిగి యామె కడ కేఁగి "రసపుత్రకన్యా!" అని పిలిచెను.

కమలాకుమారి యులికిపడి కన్నులు తెఱచెను; ఎదుటఁ దనప్రాణవల్లభుఁడు నిలిచి యుండెను. దాపున నే నలుగురాశ్వికుల మృతకళేబరములు పడియుండుట కనఁబడెను. రక్తముతో నిసుకతిన్నె లెఱ్ఱనైయుండెను. యవనవీరుఁ డవనతవదనుఁడై నిలిచియుండెను. తన ప్రాణప్రియుని యతుల పరాక్రమమునకుఁ గుమారి పరమానందభరితయై యతనిఁ గౌఁగిలించుకొనఁ గరములు చాచి ముందఱకు వచ్చెను. కాని మానసింహుఁడు తన కఠోరహస్తములతో నామెను వెనుకకుఁ ద్రోసి "ఛీ! తుచ్ఛరసపుత్రకన్యా! ఆవలనుండుము. శాంతముతో నా పల్కులువినుము" అనెను.

కుమారి దీనవదనయై యున్మత్తరీతిని తనని వంకఁ జూడసాగెను. అతనికోపోద్దీపితముఖమునుజూడఁ జాలకపోయెను. అతఁడు కఠోరస్వరమునఁ బల్కఁ దొడంగెను. "అంబేరాధిపతి యగు నాజనకుఁడు, నీతండ్రిని నగరమునుండి వెడలఁదఱిమి, యతనితో మైత్రి యొనర్చువారలకుఁ బ్రాణాంతకశిక్షనిత్తునని యాజ్ఞాపించెను. కాని, నేను నాజనకుని నాకన్నతండ్రి యాజ్ఞనిసుమంతయు లక్ష్యము నేయక,నీకై - కేవలము నీకై - యిచ్చటవచ్చుటకు సాహసించితిని. అంతియేకాదు; ఎన్నియేనికష్టములైనఁబడి నా శక్తినంతయు ధారపోసి, నీ తండ్రిని మరల రాజ్యమునకు రప్పించుటకు నేఁడు నాజనకుని యాజ్ఞాపత్రికను బ్రకటింపించి యా యానందదాయక వృత్తాంతమును నీకుఁ దెలుపనత్యుత్కంఠితుఁడనై యానందావేశమున శరీరము సహితము నెఱుఁగక యిక్కడకు వచ్చుచుంటిని! కాని యెప్పటిచొప్పున నీయొద్దకే రాక మొదట మీగృహమునకుఁజని యానంతోషవృత్తాంతమందఱకుఁ దెలిపి యిటకరుదెంచితి. నేఁడు నీతో నెవ్విధమున మెలఁగ వలయును, ఎట్లు పలుకవలయు, ననువిషయమును నిశ్చయించుకొనుచు నెంతొ సంతోషముతో వచ్చితిని. కాని-దైవమా! వలదు! వలదాతలంపు తలంపు! తలఁచినంతనే యసహ్యావేదనమగుచున్నది. శిరము తుత్తునియలై పోవుచున్నది. ఇఁకఁబొమ్ము! ఇచ్చట నేడ్వకుము! దేవుఁడు నిన్ను రక్షించునుగాక!"

కమలాకుమారి గజగజ వణఁకుచుండెను. ఆమె నయనయుగళిమునుండి యొక్కమొగిఁ గన్నీరు పొర్లిపొర్లి వచ్చుచుండెను. నోట నొక్కమాటయు రాదయ్యె. మానసింహుఁడు మఱలినంతనే యామె, యస్ఫుటకంపితస్వరమున "నాథా! నేను బూర్ణముగ నిరపరాధిని! వలయునేని మీకై యల్లినయీ పుష్పహారము నందుకొనుఁడు" అనెను.

యుద్ధమునందాను హతవీర్యుఁడైయుండె నేంతయు నౌదార్యమున మానసింహుఁడు, తనకుఁ బ్రాణదాన మొనర్చుటఁగాంచి మొదటనే యాశ్చర్యచకితుఁడైయుండిన యవనయువకుఁడా భయంకరదృశ్యమునుగాంచి నిశ్చేష్టుఁడయ్యెను. నిక్కఁపువీరుని హృదయము వజ్రముకన్నఁ గఠోరముగను, సుకుమార పుష్పముకన్న మృదువుగను నుండును. వాఁడు గద్గద స్వరమున నిట్లనియెను. "యువరాజా! పాపమీమె నిక్కముగ నిరపరాధియే. దోషమంతయు నాయది. కొన్నాళ్ల క్రిందట నేనామెనుగని మోహితుఁడనైతిని. కోపగింపకుము! నాకీమె సందర్శన మెపుడబ్బునా యని యెడరాని శ్రమ పడుచుంటిని. ఈమె నిన్నుఁ బ్రేమించుట నే నెఱిఁగియేయుంటిని. కాని మోహాంధుఁడను. తుదకీమె నీకై ప్రతిరాత్రియు నిచ్చటవచ్చుట నెఱింగి, నేఁడామె సందర్శనసుఖముఁగొన నిశ్చయించుకొంటిని. నేనువచ్చునప్పటికామె నీ నామస్మరణమునే సేయుచు,నీపైని ప్రేమయొక్కరసమునే గ్రోలుచునుండుటచేత జ్ఞాపునకువచ్చినది నీవే యనితలఁచి నన్నాలింగన మొనర్చుకొనియెను. నిక్కమరయ నీమె యింతకుమున్నెన్నఁడును నన్నుఁ జూచియే యుండలేదు. అట్టిభ్రాంతితోనైన లభించిన యాలింగనసుఖమును నవమానపఱచి దూర మొనర్ప నాకు ధైర్యము కలుగదయ్యెను. ఈదోషము నాయదియే. కావున నీయిష్టప్రకారము నన్ను శిక్షింపుము. కాని యీమెను గోపగింపకుము. ఈమె పరిపూర్ణముగ నిర్దోషి, నిర్దోషి,నిర్దోషి. ఈమెనుక్షమించితిననుము. నేను వెడలిపోయెదను."

మానసింహుని హృదయమున నాందోళనము కాసాఁగెను. ఆతని కామెపైఁ బ్రేమగాఢముగానుండుటచేనావృత్తాంతము నాకర్ణించి నపిదప నామెపైని సంశయముదూరమయ్యెను. అతఁడాయవనయువకు నంపివైచి కమలా కుమారికడ కేతెంచెను. "ఏమియాశ్చర్యము!ఆమె యా ఱాతిపైఁ గూరుచుండి పాడుచుఁ, దానల్లినహారములోని పుష్పమునొక్కొక్క దాని నిదీసి నదిలోనేయుచుఁ బ్రవాహముతోఁ బోవు పూలనుగాంచి నవ్వుచుండెను. మానసింహుడు తనదగ్గరకువచ్చుటయు నామె చూడలేదు ఆమె కృత్యమున కతఁ డాశ్చర్యమందెను.

మాన—"కమలా! ఏమిచేయుచున్నాను? నీకేమి కావలయును?"

కమలా—"ఈపుష్పములవలె నేనును నదిలో నొంటరిగఁ దిరుగుచుండవలెనని నాకాశగలిగినది. నాదేహమంతయు మండుచున్నది."

మానసిం గులికి పడియెను. "రమ్ము! కమలా! ఇఁక మన యింటికిఁబోవుదము రమ్ము" అనెను.

కమలా—"నేనిప్పుడు రాను. వలయునేని మీరు పోవచ్చును. ఇచ్చటనే యుండవలయునని నాకాశగనున్నది. అదిగో-అదిగో-ఆప్రవాహమునఁ గూర్చుండవలెను. మీరును నాతో వచ్చెదరా? నే నొక్కతెనే పోయిన నాకు భయమగునా యేమి; చెప్పుఁడు!" అని యామె ప్రవాహమువంకఁ గాంచి యనెను.

ఆమెయొక్క యీయసంబద్ధ భాషణము విని మానసింహుఁడు దిగులొందెను. అతఁడు భయముతో "కమలా! ఇఁక లెమ్ము. తండ్రిగారు నీకై యెదురుచూచుచుందురు" అనెను.

కమలా—"నాకు అదిగో ఆతీగెలోనిపువ్వులు కావలయును. మొదట వానిని దెచ్చియిండు. హారమల్లెదను. పిమ్మట నింటికి వచ్చెదను."

ఆమె యెన్నఁడును నాఁటి వలెఁ బట్టు పట్టి యుండలేదు. నిరుపాయుఁడై యతఁడు తీగెలయొద్దకుఁ జనెను; పువ్వులు గోయుచు నామెనే చూచుచుండెను. తత్క్షణమామె లేచినిలిచి నదీప్రవాహమున దుమికెను. మొదట నీరు కొంచెమేయుండెను. ఆమె నీళ్లలో నడుచుటగాంచిమానసింహుఁడుభీతిఁ జెంది"కమలా కమలా! మఱలుము! వెనుకకు మఱలుము!" అని కేకలిడుచుఁ బరుగున వచ్చెను.

కమలాకుమారినేత్రము లప్పుడు తేజోమయములై ప్రకాశించుచుండెను. ఆమె స్థిరస్వరమున "వలదు, వలదు ముందునకు రావలదు. అచ్చటనే యుండుఁడు. నా కాపువ్వులు వలదు. నాకీప్రవాహమునఁ గాన్పించు నక్షత్రములు కావలయును. వానితో మాలనల్లి మీకంఠమున వేయుదును" అనెను.

మానసింహుఁడు కంపిత హృదయుఁడై "కమలా! కమలా! నా కానక్షత్రములువలదు; నీవే నా నక్షత్రమవు." అని కేక వేసెను.

కమలా కుమారీ మృదులాధరముపై మధురహాసము శోభిల్లుచుండెను. ఆమె "నేను నక్షత్రమునా? అట్లయిననిప్పుడు నేనునక్షత్రమునై యదిగో, అక్కడ-అక్కడ-ఆకాశమునఁ బోయి కూర్చుందును. మీరును నాతో వచ్చెదరా? మన మిద్దఱము నెంతో సంతోషముగా మాటాడుకొనుచుఁ గూరుచుందము" అనెను.

ముఖము తేజస్వంతమై ప్రకాశింప నీటనుండు కమలసుందరియొక్కయు, హతాశుఁడై యామెముఖచంద్రునే చూచుచుండిన మానసింహుని యొక్కయుఁ జిత్రముల నెవ్వఁడేని నిపుణచిత్రకారుఁడు చిత్రించునేని యయ్యది యెంతయు హృదయద్రావకమైయుండునుకాని మాలేఖిని మాత్ర మద్దానిని జిత్రింప సమర్థమైనది కాదు.

కమల పాడసాఁగెను:—

"అక్కట! యిట నీటఁ
జుక్క లవిగో రాలెఁ
జక్క వెదకి చూడఁ
జిక్కెనె యిఁక నాకుఁ."

ఆమె పాడుచునేయుండెను. పాపము! మానసింహుఁడు భ్రాంతచిత్తుఁడై నిలిచియుండెను. ఆకస్మికముగ నీటఁ జప్పుడయ్యెను.

అక్కటా! మానసింహుని హృదయేశ్వరి ప్రవాహములోని పుష్పముల నేరఁబోయెను! ఆమె వెన్వెంటనే మానసింహుఁడును నీట దుమికెను. అంతటను గలయ వెదకెను. కమల కాన్పింపదయ్యెను. ఒకమాఱు మానసింహుఁడు పైకివచ్చెను; నలువంకల నొకమాఱు చూచెను. మరల నీటఁ జప్పుడయ్యెను. అతఁడు మరల బయటకు రాలేదు.

ముగిసెను! మనకథ. నదీతీరమునఁ బ్రారంభమై నదీతీరముననే ముగిసిపోయెను.

[మహారాష్ట్రీయము నుండి]



# శ్రీ కృష్ణ స్తవము

గర్భాం అప్పారావు గారు, బి. ఏ.,

మునికోటి తనుఁ గానఁగను మాటికిని గోపి, కలయిండ్ల మూలలు కలయ వెదుకఁ
హృల్లసన్మణితల్లజోల్లసద్వల్లవీ, పల్లవాధరకోటి ప్రణుతి సేయఁ
మలయనగముల చెంతఁ గలవాసనలదొంత, దలమోసి పవనుండు వెలసిపోవ
కనుపూరి తలనంచి తినులేళ్లు మరలించు, మురళీనినాదంబు మ్రోయుచుండ

గీ. చలితపికమృదునినదసంకలితమధుర, మధురవనముల గోవుల మరలఁగొట్టి
పలుపునేలలఁ జివురుజొంపముల నీడఁ, జెలఁగు గోపాలబాలు భజింతు నెదను.

శా. నారీరత్నము లక్ష్మిగాఁగ గృహముల్ నాకాదిలోకంబులున్
నీరేజాసన శంబరారులు సుతుల్ నీకేమి ప్రేపల్లెలోఁ
చీరల్ వెన్నలు దొంగిలించుటలు, యాచింపంగఁ బాంచాలికిన్
ఘోరారణ్యముఁ బట్టుపాండవులకై కొంపోవఁగాఁగాక, యా
రారా! చేష్టలు మాయలై వెలయుఁ గృష్ణా! నిన్నుఁ బూజించెదన్.

శా. కారాగారమునన్ జనించి ఖలులన్ గంసాదులన్ ద్రుంచి, మ
త్తారాతిప్రభు ధార్తరాష్ట్రహిత సైన్యశ్రేణితోఁ గూల్చి, గీ
తారూపంబునఁ గ్రీడికిన్ దెలిపి తద్భాషారహస్యంబు నా
కారాగారనివాసికే తెలుప శక్యం బౌనటంచెంచి స
ద్ధీరోదారుఁడు లోకమాన్యువలనన్ దెల్పింపవే కేశవా!






శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవి గారు, బి. ఏ.

[సచిత్రము: చిత్రకారుడు:—శ్రీ వరదా వెంకటరత్నం గారు]

సింధుదేశపు పాదుషాయైన అహమ్మదుషా గ్రీష్మభానుని ప్రతాపమున కోర్వలేక రజతకాసార తీరముననున్న తనశీత భవనమునకువచ్చి విందు లారగించుచు విశ్రాంతిని బడయుచుండెను. అతఁడు యువకుఁడును, మహాబలశాలియు, శౌర్యవంతుఁడును నైయుండుటయేకాక, రణరంగమునఁజూపిన శౌర్యప్రతాపములకును, కవనమునకును, విశిష్టకళాపోషణమునకును, గూడ మిగుల ప్రఖ్యాతి గాంచియుండెను. అతఁడొక వెన్నెలనాఁటిరాత్రి తనమిత్రబృందముతోఁగూడి వివిధాలంకృతమైన తెప్పలోఁగూర్చుండి యారజతకాసారమునందలివృక్షద్వీపముల చుట్టును దిరుగుచుఁ దనవందిమాగధులుపాడు పాటలను, ఆలపించు రాగములను విని యానందించుచుండెను. అప్పుడాపాదుషా ఇహలోకసౌఖ్యశిఖరమున నాసీనుఁడైనట్లు తలఁచుచుండెను. మహామన్నదీయగాయకులు అతని విజయములను గురించియు, అతనికై స్వర్గమున వేచియున్న యప్సరసాంగనల గురించియు, భరతపక్షికిని గులాబిపువ్వునకునుగల ప్రేమానుబంధమును గురించియు, వివిధగతులగాన మొనర్చుచుండిరి. ఆతరుణమం దొక హిందూస్త్రీప్రశంసకుఁ డాఁడు లేడికన్నులను మించునేత్రములు కలదియు, రాముని సహధర్మచారిణియగు సీతాదేవి కెనయగునదియని, తెలివిని, సౌందర్యమును కలదియునగు నొక రాజపుత్రిని వర్ణించుచు గొంతెత్తి పాడమొదలిడెను. ఇంద్రజాలము వంటియాపద్యధారను హిందూదేశపు శశికళల క్రీడవిన్నప్పుడు ఆపద్యరత్నములలో వర్ణింపఁబడిన యాసౌందర్యవతియందు ఆపాదుషా హృదయమునను రాగాంకురములు మొలకలెత్తెను. "ఈస్త్రీశిరోమణి యెవనిభాగ్యము, ఎవ్వడీభూమినలంకరించి పావనముచేసెను? ఏహిందువు, ఏవిగ్రహారాధకుఁడు ఆమెను చేపట్టెను?" అని ఆతురతతో పాదుషా యాగాయక శిఖామణి నడిగెను. "ఆమె యిప్పుడు జీవించియున్నది. ఆమె కింకను వివాహము కాలేదు. ఈ సౌందర్యవతి రాజపుత్రప్రముఖుఁడైనపర్వతసింగుని పుత్రికామణి యగు 'లాలా' లలనా తిలకమని గాయకుఁడు మనవి చేసెను. ఆమె నీవు వర్ణించినంత సుందరియే యైన నాభార్యకాక తప్పదు. లేనియెడల నీ యతిశయోక్తులకు నీశిరమును ధారపోయవలసియుండును."



అప్పుడాపాదుషా ఇహలోకసౌఖ్యశిఖరమున నాసీనుఁడైనట్లు తలఁచుచుండెను.

యభేద్యమని యెంచి ఆప్రయత్నమును విడలి పురమును జుట్టు ముట్టడించిరి.

రెండుమూడు మాసములు గడచెను. నగరులోని వస్తువులన్నియు ముగియవచ్చెను. వెలుపలనుండి సహాయమునచ్చునన్న మాట కలలోని వార్త అయ్యెను. పురమిప్పుడో యప్పుడో శత్రువులకు లోబడునట్లు తోచుచుండెను. పర్వతసింగు తనకొమార్తెను పాదుషాకిచ్చుటకు నప్పుడైన నొడంబడి సంధిచేసికొని యుండినయెడల సంధినియమములు అనుకూలముగానే యుండియుండును. పర్వతసింగు తన పుత్రికారత్నము నిచ్చుటకుమాత్ర మొప్పుకొనలేదు. అదిలేనిది సంధియే పొసగనేరదు.

రాజపుత్రులు మానమును గాపాడుకొనుటకై ప్రాణములనైన నర్పింప సంసిద్ధులైయుండిరి. వారు రణరంగమున హతులైనయెడల వారిభార్యలును పుత్రికలును మహమ్మదీయుల రాణివాసము చాలపడుదురు. ఈకళంకమునుండి తప్పించుకొనుటకు జోహారను ఘోరకార్యమును జేయుటతప్ప మరేయుపాయమును వారికి కానరాదయ్యెను. జోహారొనర్చుట యనగా స్త్రీలును పిల్లలును నిప్పులో దుముకవలెను. తరువాత వీరులు చావునకు వెరువక శత్రుసైన్యముపైబడి ప్రాణములకు దెగించి పోరవలయును.

రాజపుత్రవనిత లందరును ఉత్సాహపూర్వకముగా నీవిషాదకార్యమునెరవేర్పదలచుటను బ్రకటించిరి. కొందరు ప్రాణప్రీతిచే నవమానమును సహింపనుండినను ఏమ నీచపుదలంపును బయట పెట్టినయెడల నంచఱు నిందింతురనుతలంపుతో నూరకుండిరి. మరికొందఱు తమ భర్తలతోను భ్రాతలతోను గలసి సంగరరంగమున బోరాడ సమకట్టి పెద్దలయనుమతినిబడసి యుద్ధసన్నద్ధులై యుండిరి.

పర్వతసింగు భార్య మాత్రము కొంచెమైనను వెనుదీయక, భయమును, విచారమును నొక్కిపెట్టి "తాను తనతోడి స్త్రీలును గలిసి చిచ్చులోనుజొచ్చి తమబంధువులను బ్రియులును స్వర్గమునందు గలుసుకొనగల"మని ధైర్యముతోను,నిశ్చలభావముతోను భర్తతో విన్నవించెను. ఆరాత్రియే పెద్దచితినిబేర్చి రగులబెట్టిరి. అందు మొట్టమొదట వీతిహోత్రునకు బ్రీతిగాడపనాతమనగలనన్నిటిని బాఱవైచిరి. తరువాత స్త్రీలంపఱును బెద్దయనక, చిన్నయనక, బిడ్డలను జంకబెట్టుకొని కోటయందు ఆడుపురుగుగూడ లేకుండునట్లు నాంటలోబడి అగ్నిదేవుని కాహుతి యైరి.

ఇప్పటి కాడువారిపని తీరిపోయినది. ఇకచేయవలసినపనియంతయు మగవారిదే. వారికిని శత్రుసైన్యధారకై అయిప్రాణములనుగోల్పోవు సమయము వచ్చినది. తమప్రార్థనలను, పూజలను విధ్యుక్తముగాజరిపి తెమతల పాగలలో తులసికొమ్మలనుదోపి, సాలగ్రామములను మెడలోగట్టికొని, స్వర్గనివాసులకునప్సరసల చిత్రములను జెక్కినకిరీటములధరించి యుద్ధసన్నద్ధులై నిలువబడిరి. ప్రాతఃకాలమున మూడువేల రాజపుత్రవీరులు పీతాంబరములధరించి, వారలకలసికొనుట కిల్లయనితలంచి విచారముతో అన్యోన్యాలింగన మొనర్చుకొనిరి. అప్పుడే దినకరుడు తనసువర్ణకిరణములచే నిశినిజెండాడి ఉదయగిరిపై బొడగట్టుచుండెను. హిందూవీరులును కోటగుమ్మములను దెఱచి ముట్టడించిన శత్రుసైన్యముపై నొక్కుమ్మడిని బడిరి.

మహమ్మదీయుల సంహారము పెద్ద బర్వుగ జెంగామెఱయుచుండెను. పర్వతసింగును, ఆతనికుమారరత్నముగు రామసింగును సేనాధిపతులుగా నుండి హిందూసైన్యమును శత్రుసైన్యమునకున్న పాదుషా పట్టపుగుఱ్ఱముపై బడికొనిరి. మరసమయమున దుఃఖము ననుభవించుటకునంపఱు సమానులేయని తెలుపుటకు బర్వతసింగును, రామసింగునుగూడ సైనికులతో గలసి నడుచుచుండిరి. కాని పర్వతసింగు రాజనితేజయుటకు రాజచిహ్నముగు ఛత్రము నాతని శిరముపై బట్టియుండిరి. ఛత్రముమీద రాజపుత్రచిహ్నములును, వంశపారంపర్యమును దెలుపు సూర్యచంద్రబింబములును జిత్రముగా జిత్రింపబడియుండినవి. ఛత్రము శత్రువులకంటను రాజుని పునకాకర్షించుటచే గొడుగుపట్టుట కూడ బ్రమాదకరముగనుండెను. కాని దీనికై చింతయేల? అందఱును చావునకు దృఢనిశ్చయులైనవారే. స్వర్గము నలంకరించుట కొంతగడియవెనుకైననేమి; ముందైననేమి?

అడ్డుగవేసిన పెద్దగట్టొకటి మహమ్మదీయ సైన్యమును గాపాడుచుండెను. కాని ఈముట్టడిదెబ్బరాజపుత్రు

మొండెను. కాని తనకన్న నెక్కుడుమంది శత్రువులను హతమార్చిన పిమ్మటనే రాజపుత్రులు తమప్రాణములను గోల్పోయిరి.

తాను కష్టపడి సంపాదించికొనిన తన పెండ్లికొమార్తెను ఆనిరాధారమైన దుర్గమునుండి తీసికొనిపోవుటకు అహమ్మదుషా లోపలికిఁ బ్రవేశించెను. కాని యచట పీనుఁగులప్రోవులుతప్ప మరేమియుఁ గానరావయ్యెను. ఆపట్టణమంతయు నిర్జనమైయుండెను. కోటకు లోపలనేమి, బైటనేమి, ఎటు గాంచినను బీనుఁగులకుప్పలే. ఇంతవఱకును జేసినట్లే ఇప్పుడును రాజపుత్రులు తమధైర్యమును, సాహసమును బ్రకటించిరి. చచ్చినను రాజపుత్రులు మానము పోఁగొట్టుకొనువారు కారని ప్రపంచమునకు వెల్లడిచేసిరి. మగవారును, ఆఁడువారునుగూడ శౌర్యముతో తనుకముందు వారితో వీరస్వర్గము నలంకరించిరి. మేచ్ఛులకులోఁబడక స్వాతంత్ర్యమును సంపాదించుకొనుఁడని తమతరువాత వారినిగూడ హెచ్చరించి కీర్తిశేషులైరి.

ఇట్లు తనవలపువలన గలిగిన దుఃఖఫలమునుజూచి కొంతసేపేమియుఁదోఁచక బాదుషా విచారసముద్రమున మునిఁగి యుండెను. కానికొంతసేపటికొక గూఢచారుఁడువచ్చి లాలాలలన ఆ అహోరుమంటలో దగ్ధము కాలేదని చెప్పగానే అహమ్మదుషాకు విచారము పోయి ఆశాంకురములు జనించెను. శత్రువులు తనపట్టణమును ముట్టడివేయక ముందే పర్వతసింగు తనకు మిక్కిలి నమ్మకముగల ఒకసామంతరాజు నొద్దకు తనపుత్రికారత్నమగు లాలానుబంపి యుండెను. ఈ సంగతిని వినగానే అహమ్మదుషా తానువలచినయావనితను తనకొప్పగింపవలసినదని ఆ సామంతరాజున కాజ్ఞాపించెను. పర్వతసింగునకుఁ బ్రాణమిత్రుఁడైన ఆ సామంతరాజు ఆపిల్లను బాదుషా సాహసమునుండి కాపాడుటకుఁ బ్రాణములనైన నీయనిశ్చయించుకొనియుండెను. కాని ఆలాలాలలనామణి తనదేశీయుల రక్తముచే భూమిని మరలఁ దడుపుట కియ్యకొనలేదు. "బాదుషా నన్ను వివాహమాడఁ గంకణము కట్టుకొని యున్నాఁడు. కనుక అతని కోరికయే నెఱవేరనిండు." అని ఆమె తన జాతివారితోఁ జెప్పెను. ఆమె బాదుషాను వివాహమాడుట కొప్పుకొనుటయే కాక పెండ్లికొడుకునకుఁ బాణిగ్రహణ సమయమున ధరించుటకై గొప్పగొప్ప జరీబట్టలను, నగలను బంపుటకుఁగూడఁ గృతనిశ్చయురాలైయుండెను. ఎవఁడు తనవంశమును, జాతిని నాశనము చేసెనో, ఎవని చేతులు తనతండ్రియొక్కయు నన్నయొక్కయు రక్తముచే నెఱ్ఱవాఱెనో, అట్టివానిని ఆలాలాలలన వివాహమాడ నొప్పికొనినందులకై, ఆ నీచురాలిని రాజపుత్రులందఱును దూషింపసాగిరి.

రజత కాసారపు మధ్యనున్న బాదుషాగారి స్ఫటిక శిలా భవనము నందుఁ బెండ్లిజరుగుటకు నిశ్చయింపఁబడెను. ఇది రాజ వివాహమగుట చేతను, మతాంతర వివాహమగుటచేతను మిక్కిలి వైభవముతోఁ జరుగుటకుఁ దగిన ప్రయత్నములు గావింపఁబడియుండెను. ఆ అహమ్మదుషాకూడఁ దన [illegible] వేలుపనియు, హిందువులును మహమ్మదీయులును [illegible] నమ్మకముతో మెలఁగఁగలరనియుఁ దాను [illegible]ధిపతియై దేశమునంతయుఁబరిపాలింపఁగలననియుఁ గొండంత యాశతోనుండెను. తనఆశ [illegible] బద్ధవిరోధులుగానున్న రాజపుత్రులసంపదను గ్రహించి [illegible] క్షమార్పణాపత్రముఁగూడఁ బంపెను. [illegible] ప్రకారము పెండ్లి జరుగుటకు నిశ్చయింపఁబడెను. వేలు బ్రాహ్మణుల కాశుభదినమున [illegible] దగిన ప్రయత్నములు జరుగుచుండెను. [illegible] నుండియు, ఇతర దేశములనుండియు గుంపులు గుంపులుగా జనులు వచ్చుచుండిరి. [illegible] జాతిస్వైక్యమిచ్చుచుండెను.

ఇట్లు కోరికలన్నియును [illegible], అత్యంత [illegible] దశయందున్న అహమ్మదు బాదుషాను [illegible]. ఇది ఆయన పెండ్లిదినము. ఆనాఁడును, లాలాలలనా [illegible] యునొక్కటే సింహాసనము నలంకరించియుండిరి. వారి మేడలయందుఁ గర్పూర దీపములు ప్రకాశించుచుండెను, లావణ్యవతియగు నా పెండ్లికూఁతురు దివ్యాంబరాభరణ భూషితయైయుండెను. బాదుషాయును దన [illegible] ప్రాతఃకాలమునఁ బంపబడిన మేలిదుస్తులను ధరించియుండెను. వానియందుఁ గూర్పఁబడిన రత్నములు ధగధగ మెఱయుచుండెను. పూర్వాచారసంప్రదాయములను మహమ్మదీ



అహమ్మదుషా లాలా లలనామణిని బాణిగ్రహణమునఁ బరిగ్రహించెను.

యులు నీకా సహాయము చేసిరి. హిందూవిధ్యుక్త ప్రకారముఅహమ్మదుషా లాలాలలనామణిని పాణిగ్రహణమునఁ బరిగ్రహించెను.

ఈరీతిని పెండ్లితంతంతయు ముగిసినపిమ్మట లాలా లలన వనస్థలమునుండి మెల్లదిగా లేచి తనభర్త చేయిపట్టుకొని అతనిని సూర్యకాంతిలోనికిఁ దీసికొనివచ్చి "నాథా! మీరు కొంచెము వెలుపలికి దయచేసి మీ ప్రజభక్తులకుం దర్శనము నొసఁగి వారిని సంతోష పెట్టుఁడు" అని పలికెను.

పాదుషా వెలుపలికివచ్చి చూచునప్పటికి ప్రజలు మట్టుప్రక్కలనంతను గుంపులుగుంపులుగాఁ గ్రిక్కిరిసియుండిరి. వారును అందమైన దుస్తులను ధరించియుండిరి. అతనిని జూచినతోడనే సంతోషముచే నుప్పొంగి చప్పటలుగొట్టి నాగంభించిరి. వీనినన్నిటిని జూచినప్పుడు పాదుషాయొక్క మనస్సులో సంతోషమువెల్లివిరిసినదన్న నేమియాశ్చర్యము? ఆరజత కాసారము చుట్టును మానుష్యులే. ఎంతదూరము చూచినను తనదేశమే. ప్రతిపర్వతమును, ప్రతిమైదానమును తనదే. తనదికాని ప్రదేశమే లేకుండెను. శత్రువుల నందఱను జంపి జయించితెచ్చిన తనరూపవతియగు భార్యనుజూచి పాదుషా మరింత యుత్సాహంగుచుండెను.

కాని ఆలాలాలలనామణి ఇప్పుడు తనభర్తనుఒక వింతచూపుతోఁజూచుచుండెను ఆమెచూపు లజ్జతోఁ గూడినయువతీమణిచూపు కాదు. ఇట్లు గంభీరముగా నాతని మొగముచూచి "నాథా! గమనింపుము. చాల గొప్పస్థితియందున్న మనుష్యులఁజూచి దేవతలోర్వఁ జాలరు. మనమున్నమో మంచి ఆరోగ్యస్థితియందున్నారము. నిండు జవ్వనమునందున్నారము. అనురాగపూరితులమై యున్నారము. గనుక ఇన్నియు, ఏదినములో ఏగడియలో నంతరించునో మనకుఁ దెలియదు" అని పలికెను. అహమ్మదుషా చిఱునగవుతోను, వినయముతోను బ్రత్యుత్తరమిచ్చుచుండెను. అతఁడు తనభార్యయం దత్యంత ప్రేమగలవాఁడగుటచే, ఆసుందరీ రత్నముయొక్క మాటలును, క్రియలునుగూడ నతనికి మరింతసంతోషము నిచ్చుచుండెను. అతనికన్నులకు ఆలలనామణి లావణ్యపుగనిగాఁ గనఁబడుచుండెను. ఆభవనములోని వందిమాగధులును, చెఱువుచుట్టును గుంపులుగుంపులుగాగూడిన ప్రజలును, పాదుషాబట్టలమీఁద నుండులవంటి వజ్రపు కాంతులను జూచి ఆశ్చర్యపడుచుండిరి. సూర్యకిరణములచే నాకాంతులును మంటలవలెనే తోఁచుచుండెను. ఇట్లుండ నకస్మాత్తుగా నొకజ్వాల అతని కుడిభుజముపైఁ గనఁబడవచ్చెను. అందఱు నాశ్చర్యముతోఁ జూడఁజొచ్చిరి. వారు తమకన్నులను దామే నమ్మలేకుండిరి. ఆలాలాలలనామణిఆపాదుషాదుస్తులపైఁ బూసినవిషద్రవముపై సూర్యకిరణములు పనిచేయ మొదలిడెను. అహమ్మదుషా యుద్ధమున వీరుఁడేకాని తాను వలచినవనితచే భయంకర మృత్యుముఖమునఁ ద్రోయఁబడినప్పుడు, అతఁడు సాధారణ మానవులతో సమానుఁడయ్యెను. శరీరమునుండి మండుచున్న విషపుబట్టలను తీసివేయుటకుఁ బ్రయత్నించుచు, అటునిటు పరుగెత్తుచు, బాధ కోర్వలేక కేకలు వేయసాగెను. అతనిని బాధ చాలకాలము పీడించలేదు. మంట లతనిశరీరమంతటను భీకరముగా నలముకొనెను,

నిమిషములో గర్విష్ఠుఁడగు పాదుషాయును, అతని దివ్యాంబరాభరణములును భయంకరమైన భస్మరాశి యయ్యెను. ఇంతలో ఆ బాలాలలనామణి కోటగోడపై కెక్కి దుఃఖముతోను, సంతోషముతోను, పెండ్లికుమారునిఁజూచుచు, తనభ్రాతృపితృమరణమునకు, దనవంశనాశనమునకు దగినట్లు కసిదీర్చుకొంటినను సంతృప్తితో



ఆ రజతకాసారపు లోఁతునీళ్లలోఁ దల్లక్రిందుగాఁబడి కీర్తిశేషురాలయ్యెను.

---

# రాగతనము

సండూరి వెంకట సుబ్బారావు గారు, బి. ఏ.

కొమ్మలో కోకిల 'కో' యంటదే
రాగతనమోయేమొ బాగుహోగెరుగదే!

యెంకి దూరానుండ,
యేటి దరి నేనుంటి,
"సావాస మింకెవరో
సందడెవరో" నంటి
కొమ్మలో కోకిల 'కో'యంటదే.

పూలెరుగు నాకోడ!
నీలెరుగు నామోడ!
"మనుగడల కెవరిత్రో
మనుసు కలిపే" నంటి
కొమ్మలో కోకిల 'కో'యంటదే.

యేటికడుపున దాగి
తోట నిదరోయింది
"ఆలనా నాసొదకు
పాలనా" యనుకొంటి
కొమ్మలో కోకిల 'కో'యంటదే.

తరిమి తరిమేశాను
తిరిగి "కో" "కో" యంది
ఆడిందె ఆటగా,
పాడిందె పాటగా!
కొమ్మలో కోకిల "కో"యంటదే
రాగతనమోయేమొ బాగుహోగెరుగదే.





కాశీనాథుని భైరవమూర్తి గారు

శ్లో. చతుర్ణాం పురుషార్థానాం త్యాగం యస్మాత్ కరోత్యతః,
త్యాగరాజ ఇతి ఖ్యాతం సోమాస్కంద ముపాస్మహే. (చతుర్దండి ప్రకాశిక)

ఇట్టుపైన రాగములవివరము, వాటి ప్రస్తారము మొదలగువాటినిగూర్చి వ్రాయకపూర్వము రాగమనగ నెట్టిదని మన పూర్వగ్రంథాదులం దుదాహరించి యుండిరో, ప్రాచీన గానపద్ధతియందు రాగాదికముల నెట్లు గానము చేసియుండిరో, దానిని గురించియు జాతుల గురించియు మున్ముం దుదాహరింతము.

శ్లో. యోఽసౌ ధ్వనివిశేషస్తు
స్వరవర్ణ విభూషితః
రంజకో జనచిత్తానాం
స రాగః కథితో బుధైః.
"యోగరూఢశ్చవా రాగో
జ్ఞేయః పంకజశబ్దవత్.
(సంగీత రత్నాకరము, సంగీతదర్పణము)

శ్లో. రంజకః స్వరసందర్భో
రాగ ఇత్యభిధీయతే.
(సంగీత పారిజాతము)

శ్లో. రంజయతి మనాంసీతి
రాగాస్తే దశ లక్షణాః.
(చతుర్దండి ప్రకాశిక)

రాగము అనగ ననురాగము, ప్రేమము, ఆశ అని తాత్పర్యము. వినువారి కానందమును బుట్టించునది అని యర్థము. ఈరాగభేదములందు

శ్లో. గ్రహాంశతారమంద్రాశ్చ
న్యాసాపన్యాసకే తథా,
అపి సన్న్యాస విన్యాసౌ
బహుత్వం చాల్పతా తథా;
ఏతాన్యన్తరమార్గేణ
సహాత్మాణి జాతిషు;
షాడవౌడ వితేక్యాపి
త్యేవమాహుస్త్రయోదశ.
గ్రహాంశ మంద్ర తారాణాం
న్యాసాపన్యాసయో స్తథా

అల్పత్వస్య బహుత్వస్య
షాడవౌడవయో రపి
అభివ్యక్తి ర్యత్ర దృష్టా
సరాగాలాప ఉచ్యతే

(సంగీతరత్నాకరము, చతుర్దండి ప్రకాశిక)

ఇట్లు సంగీతరత్నాకర గ్రంథకర్త లగు శార్ఙ్గదేవులనువారు (1) గ్రహ, (2) అంశ (3) తార, (4) మంద్ర, (5) న్యాస, (6) అప న్యాస, (7) సన్యాస, (8)విన్యాస, (9) బహుత్వ, (10) అల్పత్వములని దశవిధ లక్షణముల బేర్కొని యున్నారు. "సప్తగీతి రాచష్ట"అని రత్నాకరమున మతంగముని మతమున రాగ లక్షణము లేదని వ్రాసియున్నారు. భరతులు "చతస్ర ఏవగీతీ రుక్తవాణ్" నాల్గని చెప్పినట్లును వ్రాసియున్నారు.

(1) గ్రహము

శ్లో. ప్రారభ్యతే యేనగీతం
సస్వరో గ్రహకో మతః.

(చతుర్దండి ప్రకాశిక)

శ్లో. లక్షణాని దశైతాని
రాగాణాం మునయో బ్రువణ్
......యేనాదాగీయతేగీతే
స్వారేణ స భవేత్ గ్రహః.

(సంగీత సారామృతము)

ఏరాగమునుగాని గానముచేయప్రారంభించునపుడు ప్రథమమున నేస్వరమున నారంభింపవలసినదిగా పూర్వసాంప్రదాయమో ఆస్వరమును ఆరాగమునకు గ్రహస్వరమనిగలదు.

(2) అంశము.

శ్లో.బహుశో గీయతేయేన
స్వరే ణాంశః స కథ్యతే,
అంశస్వరోఽన్యసావేవ
జీవస్వరఇతి స్మృతః.

(సంగీత సారామృతము)

ఏదేనియొక రాగమునుపాడునపుడు ఆ రాగమునకు జీవకళ బోలిన స్వరము మిగుల తరుచుగ వాడుక నుండునట్టిది అంశస్వర మని కలదు. పంచాక్షరిమంత్రమున "మ" యును, అష్టాక్షరిమంత్రమున "రా" యును అనునట్లు ఏస్వరమును వర్జింపుదో నారాగముయొక్క కళ, జీవము పోవునో అట్టి స్వరమును అంశ స్వరమనిరి.

(3) మంద్రము.

శ్లో.నీచైః స్వరేణ యద్గానం,
స మంద్రస్వర ఉచ్యతే.

(సంగీతసారామృతము.)

ప్రస్తుతగానమున నియ్యది మిగుల యగుదుగ గాన నగును. ఇప్పటిశ్రోతలు ఎంతవరకును గాయకుడు మిగుల హెచ్చుస్థాయిన బాడుటయు, గట్టిగని అకారాదుల గాత్రమున బల్కించుటచే నానంద నిమగ్నులగుచున్నారు. ఇయ్యవి రెండునులేనిదే ఆధునిక గానసభాపూజ్యత పూజ్యమనియే చెప్పనొప్పు గాని పూర్వగానసంప్రదాయమున నొక్కొక్క రాగమును బాడునపుడును మంద్రమున ననగ మిగుల తగ్గుస్థాయిలో చాల కృషిసల్పి కష్టసాధకముల గనపఱచుచుండెడివారు. అప్పటికయ్యది మిగుల మెప్పు వడయుచుండెడిది.

ఇప్పటిగాయకుల కిది యరుదు. అట్లు మిగుల తగ్గుస్థాయిస్వరములలో బాడుటయే మంద్ర మనబడును.

(4) తారము

"శ్లో. ఉచ్చైస్స్వరేణయద్గానం
సతారస్వరఉచ్యతే.
(సంగీత సారామృతం.)

మంద్రమున బాడిన మంద్రమగునట్లే తారయనగ నక్షత్రముచుక్కలలో పాట యనియు వాడుక కలదు. ఇయ్యది విశేషముగ నుత్తరమున హిందూస్థానమున జొత్తరగానమున గానమగును. మిగుల శీతలప్రదేశమున నుండువారిరీతినే పాడుదురు. వారి గాత్రమట్లే యలవడియుండును. మిగుల నుష్ణప్రదేశమున నివసించువారికి మిగుల మంద్రస్థాయి యలవడును. దీనికి తార్కాణముగ పాశ్చాత్యులు స్త్రీలు గానముచేయునపుడు వారికంఠము కీచుగనుండుటయు మన దేశపువారికంఠము మిగుల మంద్రమున నుండుటయు సాధారణముగ గనుచున్నాము. అట్లే మిగుల హెచ్చుస్థాయిస్వరముల బాడుటయే తారమని కలదు.

(5) న్యాసము

శ్లో. గీతసమాప్తికృన్న్యాసో
వర్ణ్యతే చాంశకః పునః.
(చతుర్దండిప్రకాశిక.)

శ్లో. న్యాసస్వరః సకథితో
యేన గీతం సమాప్యతే.
(సంగీత సారామృతము.)

ఏదేనిరాగము నొకదానిని గానముచేసి తుట్టతుదకు ఏస్వరమందు సాంప్రదాయానుసారము నిలుపవలెననికలదో దానినే న్యాసస్వరమని యందురు. న్యాసమనగ నుంచుట యని తాత్పర్యము.

(6) అపన్యాసము

శ్లో. అవాంతరసమాప్తిం యో
రాగస్య వితనోతి సః,
అపన్యాస సన్సస్స్మృతోఽన్య
స్త్వాత్యంతికసమాప్తికృత్.
(సంగీత సారామృతము)

రాగమును బాడునపుడు మధ్యమధ్యను ముగించుస్వరమును అపన్యాసస్వర మనిరి.

(7) సన్న్యాసము

శ్లో. ఇతిభేదో భవేన్న్యాసా
పన్యాసస్వరయోఃద్వయోః,
సన్న్యాసో నామగీతాద్య
ఖండస్యైవ సమాప్తికమ్.

ఏదేనియొక రాగమును ఖండములుగ బాడునపుడు ఆయాఖండమును ముగించు స్వరము సన్న్యాసస్వర మని యుదాహరించి యున్నారు.

(8) విన్యాసము

శ్లో. గీతఖండాద్యవయవ
స్యాంతేతిష్ఠతి సస్వరః,
విన్యాస ఏతే సన్న్యాస
విన్యాసౌ భరతాదిభిః,
అంతర్భూతావపన్యాస
స్వరఏవేతి కీర్తితమ్.
(సంగీతసారామృతము)

పైన నుదహరింపబడినటుల రాగమును ఖండములుగ బాడునపుడు, ఒక్కొక్క ఖండాంతమునందునను పలుమారు గానముచేయబడు స్వరము విన్యాసస్వరమని నుడివియున్నారు.

మఱియు నీ సన్యాస విన్యాసములు అపన్యాసమందలి యంతర్భాగములే యని భరతాదుల యభిప్రాయమని కలదు.

(9) బహుత్వము

శ్లో. అలంఘనం తదభ్యాసో
బహుత్వం ద్వివిధం మతమ్,
స్వరస్యాఽస్పర్శనంయ త్త
ల్లంఘనం పరికీర్తితమ్,
సాకల్యేన స్వరస్పర్శ
స్త్వలంఘన మితి స్మృతమ్.
యదేకస్య స్వరస్యైవ
నైరంతర్యేణ వాఽథవా.
వ్యవధానేన స్యాదభ్యాయో
భూయోఽప్యుచ్చారణంహి తత్,
అభ్యాస ఇతిశంసతి
బహుత్వం ద్వివిధం తతః.

(సంగీతసారామృతము)

అనగ నేదేని యొకరాగమును బాడునపుడు ఎడతెగక కాని లేక మిగుల తరుచుగ గాని వచ్చు స్వరమును బహుత్వ మనిరి.

దీన రెండు అంతర్భాగముల భేదొక్కనిరి: ప్రథమము-అలంఘనము; అనగ నేదేనియొక స్వరమును రాగాలాపమున వర్జింపక సాకల్యముగ నే స్వరస్పర్శము రాగమున గలుగునో అది అలంఘనస్వరమని కలదు.

ద్వితీయము-అభ్యాసము; అనగ వ్యవధానముగ తరుచుగనా రాగాలాపమున నుచ్చరింపబడునట్టిదియుగాని నిరంతరము నుచ్చరింపబడినట్టియు అభ్యాసమని నుడివియున్నారు. ఎట్లయిన బహుత్వమే ప్రధానము.

(10) అల్పత్వము

శ్లో. అల్పత్వంచ ద్విధాప్రోక్తం
అనభ్యాసాచ్చ లంఘనాత్,
పూర్వోక్తాభ్యాస రాహిత్య
మనభ్యాసః ప్రకీర్తితః;
పూర్వోక్తాలంఘనాభావో
లంఘనం పరికీర్తితమ్.

(సంగీతసారామృతము)

ఇయ్యది పై జెప్పబడిన బహుత్వమునకు వ్యతిరేకముగ నుండునది. అనగ నొక రాగాలాపనమందు బొత్తిగ నుచ్చరింపబడక కాని, బహుస్వల్పముగ నుచ్చరింపబడికాని యుండు స్వరమును అల్పస్వరమనిరి. దీనను రెండువిధములు: బొత్తిగ నొకరాగమున వర్జ్యమగుస్వరము లంఘనమనియు (ఉపవాసదినము వలె), ఎపుడేని స్వల్పముగ ప్రయోగింపబడుస్వరము అనభ్యాసమనియు జెప్పియున్నారు.

శ్లో. ఉక్తదశలక్షణానాం
న్యూనం స్యాత్ గౌరవం పురా,
దేశ్యామి హి పునస్తేషాం
సమ్మతం పరివర్తనమ్.
వ్యవహారే లక్షణానాం
త్రయాణా మేవ వర్ణనమ్
దృశ్యతే కృతభూచార్యైః
పరయం లక్ష్యేఽనువర్తినః.

గ్రహన్యాసాపన్యాసానాం
నియమా స్సాంప్రతం హితే.
యథాయోగ్యం నైవలక్ష్యే
దృశ్యంతమితి సమ్మతమ్.
(చతుర్దండి ప్రకాశిక)

అనగ నీ దశ విధ రాగ లక్షణములును పూర్వకాలమున గౌరవింప బడుచుండెననియు, తన కాలమునకు గ్రహాంశన్యాసములుమాత్రమే శేషించిననియు, వాటి లక్షణము మాత్రము తానుదాహరించిన రాగములకు నిరూపించియుండెననియు, వేంకటమఖి యను వారు తమ చతుర్దండి ప్రకాశికలో వ్రాసి యున్నారు. ఈ దశ లక్షణ శ్లోకములకు రత్నాకరాది గ్రంథములు కొంచెము పాఠ భేదములున్నను గ్రంథవిస్తరభీతిని వివరింప లేదు.

ఇక కొన్ని రాగములకు-యీలక్షణాదికములే లేనివాటికిగతియేమి యనిన

శ్లో. గ్రహాంశౌ యత్ర నోచ్యేతే
తత్ర షడ్జో విదుర్బుధః
(సంగీతరత్నాకరము)

గ్రహాంశాదికముల జెప్పకనని రాగములకు షడ్జస్వరమే యని గ్రహించునదిగా శార్ఙ్గదేవులు వ్రాసియున్నారు. మఱియురత్నాకరవ్యాఖ్యానకర్తలగు కల్లినాథులు:

శ్లో. యేషాం శ్రుతిస్వరగ్రామ
జాత్యాదినియమో నహి;
నానాదేశగతిచ్ఛాయా
దేశీరాగాస్తు తేమతాః.
కామచారప్రవర్తిత్వం
దేశీరాగత్వ లక్షణమ్
నియమేతు సతి తత్ర
మార్గత్వ మనులక్షితమ్
(సంగీతరత్నాకరము)

రాగములను విభాగించునపుడు మార్గ రాగములనియు దేశీరాగము లనియు నుడివిరి.

శ్లో. మార్గో దేశీతి తద్ద్వేధా
తత్ర మార్గస్స ఉచ్యతే,
యోమార్గితో విరించాద్యైః
ప్రయుక్తో భరతాదిభిః.
దేవస్య పురతః శంభోః
నియతాభ్యుదయప్రదః,
దేశేదేశేజనానాం యత్
రుచ్యాహృదయరంజకమ్,
గానంచ వాదనం నృత్యం
త ద్దేశీత్య భిధియతే.
(సంగీతరత్నాకరము)

"మార్గిత ఇతి" మార్గ్యం=అన్వేషింపబడినదనియర్థము. "సామవేదా దిదం గీతంసంజగ్రాహ పితామహః" (రత్నాకరము)అనునట్లు వేదములందు వెదకి ఏరుకొనబడిన పాటచే మార్గరాగములనియూ ఆయాదేశస్థులచే వారి వారిఇష్టానుసారముపాడుటచే వారికిహృదయ రంజకములగు రాగములు దేశీయదేశ్య రాగములనియు బెప్పనినవని రత్నాకరమందు గలదు.

ఘనరాగములలో ముఖ్యములగునవి 264 సంఖ్య రత్నాకరమం దుదాహరించి

యున్నారు. ఆ రాగము లిపుడు వాడుకలో లేవనియు దేవలోకమునమాత్రము గాంధార గ్రామమువలె, వాడబడుచున్నవనియు గలదు. వీటివిషయమై ప్రత్యేకముగ వ్రాయవలసియున్నది. ఇందునను (1) గ్రామరాగము, (2) ఉపరాగము, (3) రాగము, (4) భాష, (5) విభాష, (6) అంతరభాషయని యారువిధముల నిరూపించి యుదాహరణముల నిచ్చియున్నారు.

ఇక రెండవది: దేశీయ=దేశ్యరాగము లందును, రాగాంగోపాంగ భాషాంగక్రియాంగములు నాలుగువిధములని కలదు.

శ్లో. రంజనాద్రాగతాభాషా
రాగాంగాదే రపీష్యతే,
దేశీరాగతయాప్రోక్తం
రాగాంగాది చతుష్టయమ్.

(1) రాగాంగము

శ్లో. రాగచ్ఛాయానుకారిత్వాత్
రాగాంగ మితి కథ్యతే.

(సంగీతదర్పణము)

ఈ రాగాంగ మనునది విశేషముగ పూర్వపు సరపూర్ణ మేళములుగానున్నది. అనగా మేళరాగములు=జనకరాగములు; వీనినుండి జన్యరాగములు జనించునట్టివి. ఈ మేళముల విషయము ముందు వివరముగ నాదినుండి ప్రకృతపుస్థితి వరకును వ్రాయబడును.

(2) ఉపాంగము

శ్లో. కించిత్ ఛాయానుకారిత్వాత్
ఉపాంగమితి కథ్యతే.

(సంగీతదర్పణము)

ఇయ్యది రాగాంగరాగమున జన్యమై ఆరాగమునకున్న పోలికలన్నియు గలిగి జనకరాగస్వరములనే కల్గి ఔరస పుత్త్రునివలె నుండున దనదగును.

(3) భాషాంగము

శ్లో. భాషా ఛాయాశ్రితా యేన
భాషాంగం తేన హేతునా.

(సంగీతదర్పణము)

ఈరాగము తన జనకరాగమగు రాగాంగరాగముయొక్క పోలిక లనగ శుద్ధ వికృతి స్వరములం గల్గియు, అన్యరాగాంగ రాగముయొక్క స్వరఛాయను కొంచెముగ గల్గియున్నదనికలదు. పరకీయా పుత్త్రుని బోలినదనదగును.

(4) క్రియాంగము

శ్లో. కారణోత్సాహసంయుక్తం
క్రియాంగం తేన హేతునా.

(సంగీతదర్పణము)

అనగ కార్యసక్తులుగ జేయుటయం దమితోత్సాహమును బుట్టించురాగములని తాత్పర్యము. "కరణ సంబంధం కారణం" ఇంద్రియములను ప్రేరేపింపజేయునట్టి రాగము లని తాత్పర్యము.

ఇదిగాక మతంగులు

శ్లో. శుద్ధఛాయా లగాంప్రోక్తాం
స్సంకీర్ణాశ్చ తథైవచ.

అనియున్నారు.

"తత్ర, శుద్ధరాగత్వం నామ శాస్త్రోక్త నియమాత్ రంజకత్వం భవతి; ఛాయాలగత్వం

నామ అన్యఛాయాలగత్వేన రక్తిహేతుత్వం భవతి; సంకీర్ణరాగత్వం నామ శుద్ధఛాయాలగముఖ్యత్వేన రక్తిహేతుత్వం భవతి; ఇతి కల్లినాథేనోక్తమ్."

అర్థము స్పష్టము. అనగ రంజకత్వము శాస్త్రోక్తగానమున జనించునది శుద్ధమనియు, మఱియొకరాగఛాయను తగిలించి గానము చేయుచుమాత్రము జనించిన రంజకత్వము ఛాయాలగమనియు, ఈ రెండు కలసిననే రక్తి జనించురాగములు సంకీర్ణము లనియు గలదు.

శ్లో. కాంపరణాతుకథితా
　　తారస్థానేషు శీఘ్రగా;
గమకై ర్వివిధై ర్యుక్తా
　　కౌశలేన విభూషితా.

(సంగీతదర్పణము)

అనగ వేగముగ హెచ్చుస్థాయిన బాడిననే రక్తిజనియించురాగములు కాంపరణమనియు గలదు. ఇదియుగాక:

శ్లో. పంచధా గ్రామరాగా స్స్యుః
　　పంచగీతి సమాశ్రయాత్,
గీతయః పంచ శుద్ధాద్యా
　　భిన్నా గౌడీచ వేసరా.
సాధారణేతి శుద్ధాస్యాత్
　　అవక్రై ర్లలితై స్స్వరైః,
భిన్నా సూక్ష్మైః స్వరై ర్వక్రై
　　ర్మధురై ర్గమకై ర్యుతా.
గాఢైః త్రిస్థానగమకై
　　(?)హాటిలలితైః స్వరైః,
అఖండితస్థితిస్థాన
　　త్రయే గౌడీమతా సతామ్.
ఓహాటీకంపితై ర్మందైః
　　ద్రుతద్రుతతరైః స్వరైః,
హాకారోకార యోగేన
　　హృన్యస్తే చిబుకే భవేత్.
వేగవద్భిః స్వరై ర్వర్ణ
　　చతుష్కే వ్యతిరక్తితః,
వేగస్వరా రాగగీతిః
　　వేసరాచోచ్యతే బుధైః;
చతుర్గతిగతం లక్ష్మ
　　శ్రితా సాధారణీ మతా.

(సంగీతరత్నాకరము

రత్నాకరకర్తరాగములు శుద్ధము, భిన్నము, గౌడీ, వేసర, సాధారణము లని ఐదు విధములఁ జెప్పిరి. అర్థము స్పష్టము.

1. శుద్ధము: అవక్రములు లలితములగు స్వరములు గలదనియు; 2. భిన్నము; ఈషద్వక్రముగల్గియు మధురగమకయుత స్వరముల గల్గినదనియు, 3. గౌడీయనునది త్రిస్థానగమకయుక్తహాటీలలితము లగు స్వరములు గలదనియు;—హాటీ యనుదానికి వేగయుక్తకంపితగమయుక్తస్వరములనికలదు. స్థానత్రయమందునను అంఖండితస్థితి గల్గిన దనిరి.— 4. వేగవంతము లగు స్వరములచే రక్తి గల్గురాగములు వేగస్వరములు=వేసరము లనియు, నీపై నాల్గు లక్షణములు నాశ్రయించిననే రక్తిజనించురాగములు సాధారణరాగములనియు జెప్పియున్నారు.

ఇదిగాక వేంకటమఖియనువారికి బూర్వులగు రామామాత్యులనువారు తమచే రచింపబడిన స్వరమేళకళానిధి యనుగ్రంథమునందు యీరాగములందు

శ్లో. ఏతేషు వా మతాః రాగాః
ఉత్తమా మధ్యమా అపి
అధమా శ్చాపి సకలాః
కథ్యంతే తే వివేకతః.

ఉత్తమమధ్యమాధమము లని మూడు విధములరాగములను విభజించి యున్నారు. అందున నుత్తమోత్తమరాగము లిరువది యని యు అవి అసంకీర్ణము లగుటచే గీతిప్రబంధ కాలాపయోగ్యములని నిరూపించియున్నారు. ఇట్లే మధ్యమరాగములుపదునైదనియు లోక వ్యవహారమున విశేష ముపయోగింపనివనియు నుడివియున్నారు. మఱియు నధమ రాగముల కొన్నిటిని వ్రాసి వీటి విషయమున నిట్లు వ్రాసి యున్నారు.

శ్లో. సర్వేష్వేవ పురోక్తేషు
మధ్యమే షూత్తమేషు చ,
అంతర్భూతాశ్చ సంకీర్ణాః
పామరభ్రామకాశ్చ తే.
రాగా స్తావత్ ప్రబంధానాం
అయోగ్యాః బహుళాశ్చ తే,
తస్మా న్నతే పరిగ్రాహ్యా
రాగాః సంగీతకోవిదైః.

(స్వరమేళ కళానిధి)
(సంగీతరత్నాకరము)

కనుక నధమరాగముల గానకోవిదు లగు వారు ప్రబంధాలాపాదికముల కుపయోగింప రనియు, కూడదనియు, వ్రాసియున్నారు.

ఇటీవల వేంకటమఖి యను వారు పూర్వపుసంప్రదాయములనుసాధ్యమగునంత వరకు ననుసరించి స్వయముగ కొన్నిటి పై రించి సంపూర్ణ షాడవ, ఔడవ, భేదములుగ నేర్పఱచియున్నారు. వీటివిషయము ముందు వ్రాయబడును. వీరు,రామామాత్యులు స్వర మేళ కళానిధిలో వ్రాసియున్న రాగమేళముల యొక్క అసందర్భములను తన గ్రంథమున క్రోడీకరించియున్నారు.దానికి మఱియు బూర్వ మున నున్న రత్నాకరమందలిజాతులవివరము:

శ్లో. శుద్ధాస్స్యుర్జాతయస్సప్త
తా షడ్జాదస్వరాభిధాః
......................
..................
వికృతా న్యాసవర్జ్యైతత్
లక్ష్మహీనాః భవన్త్యమూః.

శుద్ధజాతులు ఏడనియు శేషించిన జాతు లు పదునొకండనియు అష్టాదశజాతు లనియు, వీటికి అంశలు ముప్పదియారనియు గలదు.

ఇకను వీటియందు గ్రామవిభాగమున నిట్లుగలదు.

శ్లో. చతస్రః షడ్జశబ్దిన్యో
నైషాదీ ధైవతీ తథా;
ఆర్షభీచేతి స ప్తైతాః
షడ్జగ్రామస్య జాతయః.
శేషాః స్యు ర్మధ్యమగ్రామే
పూర్ణత్వా ద్యథు నోచ్యతే.

జాతులు: 1. షాడ్జీ, 2. ఆర్షభీ, 3. గాంధారీ, 4. మధ్యమా, 5. పంచమీ, 6. ధరతీ, 7. నైషాదీ, 8. షడ్జకైశికీ, 9 షడ్జోదీచ్యవా 10. షడ్జమధ్యమా, 11. గాంధారోదీచ్యవా 12. రక్తగాంధారీ, 13. కైశికీ, 14. మధ్య

మోదీచ్యవా, 15. కార్మారవి, 16. గాంధార పంచమి, 17, ఆన్ధ్రి, 18. నందయన్తి. వీటి యందున గొన్నిటికి, ఆంధ్రులలో గ్రామనామములు కొన్ని సామాన్యముగ నింటిపేర్లైనట్లు, దేశములబట్టినామములున్నట్లు తెలియనగును గాంధారీ,మధ్యమ, నైషాదీ,ఆన్ధ్రియివ్వివిస్పష్టముగ దేశీయనామములని కన్పడుచున్నది. ఆయాదేశములం బాడురాగములజాతి ననుసరించి యాయాజాతినామములు వచ్చినట్లు కన్పడుచున్నది.

ఇవిగాక సంగీతదర్పణమున నిట్లు రాగములగూర్చి వ్రాసియున్నారు.

శ్లో. శివశక్తిసమాయోగాత్
రాగాణాం సంభవో భవేత్,
పంచాస్యాత్పంచరాగాః స్యుః
షష్టస్తు గిరిజాముఖాత్.
సద్యోవక్త్రాత్తు శ్రీరాగో
వామదేవా ద్వసంతకః,
అఘోరాత్ భైరవోఽభూత్త
త్పురుషాత్పంచమోభవత్.
ఈశానాఖ్యా న్మేఘరాగో
నాట్యారంభే శివా దభూత్,
గిరిజాయాః ముఖాల్లాస్యే
నట్టనారాయణోఽ భవత్.

ఇట్లు రాగములు పురుష స్త్రీ జాతులుగను, అవి యీశ్వరుని పంచవక్త్రములనుండి జనించెననియు 1. సద్యోజాత ముఖమునుండి శ్రీరాగమును, 2. వామదేవ ముఖమునుండి వసంతరాగమును, 3. అఘోరముఖమునుండి భైరవిరాగమును, 4. తత్పురుషముఖమునుండి పంచమరాగమును, 5. ఈశానముఖమునుండి మేఘరాగము ఆనంద నాట్యారంభమునందును, 6. పార్వతీముఖమునుండి నట్టనారాయణియు బుట్టెననియు, శివశక్తి సమాగమము వలన నితరరాగము లుద్భవించెననియు, వీటి కధిదేవతలు, కులములు, వేదములు, గుణములు, గానకాలములు మొదలగు అంశములు పెక్కుగ నిచ్చియున్నారు. స్త్రీరాగములు= రాగిణులు, దూతరాగములు, సంకరరాగములు, పుత్త్రరాగములు, మిత్రరాగములు శత్రురాగములు. వీటికి ధ్యానశ్లోకములుగలవు. వీటినిగురించియే, లోగడ సంచికలందున క్రమముగ విగ్రహాయుక్తముగవ్రాయబడుచుండెనది.

వీటియందునను హనుమన్మతము,నారద మతము, మతంగమతము, మొదలగు పాఠభేదములుగలవు. వీటిని ఆయారాగముల విగ్రహాదులు, రాగముల వివరములు అందందు నిరూపింపబడియున్నవి కాననగును. ఇంకను వివరములుముందు రాగాధ్యాయమున నొక్కొక రాగవిషయము చర్చింపుచో దానిచారిత్రము పూర్వపురీతి ప్రస్తుతపు పరిణామములు మొదలగునవి మిగుల విపులముగ వ్రాయబడును. గమనింతురుగాక!                (సశేషము)



3    4    11




౧

## మున్నంగి లక్ష్మీనరసింహశర్మగారు

### సీమ-నాడు

సీమ, నాడు వ్యవహారమును గురించి నా కుపలబ్ధములైనట్టియు నాబుద్ధికి గోచరించినట్టి యంశములను శక్తికొలఁది నిట సమన్వయింతును.

సీమ, నాడు, ఆణెము-అనునవి దేశవిభాగములు. వీనిలో నంతస్సీమావిభాగములుం గలవు. ప్రపంచమున సూర్యప్రమాణముంబట్టి దిక్కు లేర్పడినవి. భారతఖండమున మేరుపర్వతమును బురస్కరించుకొని దేశభాగములు నిర్ణీతములైనవి. మేరువునకు దక్షిణదిక్కున నున్న భాగము దక్షిణదేశము. దాక్షిణాత్యులకు అందు ముఖ్యముగ ఆంధ్ర, ద్రవిడ, కన్నడులకు— శ్రీశైలము దిక్సూచిక యైనది. శ్రీశైలమునకుఁ బడమటి దిక్కున నున్న ఆంధ్ర మండలము లన్నియుఁ గలసినభాగము పడమటి సీమ— ఇదియే పశ్చిమాంధ్రరాష్ట్రము. శ్రీశైలమునకుఁ బూర్వభాగమున నున్న గుంటూరు మండలము తూర్పు సరిహద్దుమొదలు గంజాము మండలము చివరవఱకుఁ దూర్పునా డనఁబడుచున్నది.

శ్రీశైలమునకుదక్షిణముననున్న భాగముతమిళనాడు. ఇదియే ద్రవిడరాష్ట్రము. పడమటి సీమకుఁ దూర్పునాడైనభాగము దక్షిణమునకు ఉత్తరాదియగును. పడమటిసీమ పూర్వదక్షిణములకుఁ బశ్చిమముననే యున్నది. వంగరాష్ట్రము తూర్పునాటి కుత్తరము. వంగమునకుఁ దూర్పునాడు దక్షిణము. పడమటి సీమకు నిజామ్ రాష్ట్రముత్తరము: ఇవి దిగ్భాగములు

ప్రకృత మాంధ్రదేశమందలి యంతస్సీమావిభజనములును, వానినిర్మాణనియతులును, వాని స్వరూప స్వభావాదులను ఇంత తెలిసికొందము.

భరతఖండములోని మధ్యదేశమందలి దిగ్విభాగమునకు శ్రీశైలము దిక్సూచిక యని ముందుఁజెప్పియుంటిని కదా! ఖండమున కంతకు మేరుగిరియు, మధ్యదేశమునకు శ్రీశైలము దిక్సూచికలని మన సంకల్పవిధానమే తెలుపుచున్నది.

"శుభతిథౌ శోభనే ముహూర్తే అర్య బ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేతవరాహకల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే భరతఖండే మేరోర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య... ప్రదేశే" అనునంతవఱకు నందఱకు సమానము.

ఆంధ్రరాష్ట్రమందు, గుంటూరు, కర్నూలు, కడప, బళ్ళారి, అనంతపురము, చిత్తూరు, నెల్లూరు, చెంగల్పట్టు మండలముల వారు — "కృష్ణా కావేర్యోర్మధ్యదేశే..." అని సంకల్పింతురు. గంజాము విశాఖపట్టన మాండలికులు "గంగా గౌతమ్యో ర్మధ్య దేశే" యందురు. తరువాత "......అస్మిన్ వర్తమానేన......" ఇత్యాదితో సంకల్పవిధానము పూర్తి. ఈసంకల్పవిధానమునే నైజాముమండలములవారు, వారివారియునికినిబట్టి యనుకరించుచుందురు.

### పడమటిసీమలోని విభాగములు

బళ్ళారిమండలమందలి పంపా (హంపి) ప్రాంతి ముగట్టమసీమ యనఁబడును. అనంతపురము, కడప, మండలములమధ్యగతభూమి రేనాడు—రేనాటిసీమ—యనఁబడును. కడప మండలములోని ప్రొద్దుటూరు, జమ్మలమడుగు, కర్నూలు మండలములోని, నోసము. ఉయ్యాలవాడవఱకు వ్యాపించిన భూభాగమును రేనాడందురని ప్రాణ్యము తెలుపుచున్నది. కాని అనంతపురము మండలములోని రాయల్ చెఱువుగ్రామము మొదలు అటునా

మిడే, యావత్కి గ్రామములవఱకును ఇటు చీపలవాగుపల్లి తాటిపర్తి తాలూకాలోని పెక్కు గ్రామములవఱకు అనఁగా కడపమండలమునందలి ప్రొద్దుటూరు తాలూకా సరిహద్దువఱకు రేనాడనియే వ్యవహరింతురు.

కృష్ణా తుంగభద్రా నదీతట నైజాము రాష్ట్రభాగము మొలకసీమ యనఁబడును. చిత్తూరు మండలమునందలి చంద్రగిరి తాలూకా సరిహద్దు మొదలు కడపమండలములోని పుల్లంపేట తాలూకా సరిహద్దువఱకు రాచవారి సీమయనఁబడును. నెల్లూరి మండలములోని యాగ్నేయభాగము మారేళ్ళసీమ ఉత్తరభాగము కమ్మసీమ, గుంటూరుమండలములోని తూర్పునందలి తాలూకాలు కొన్ని చేరి కొండవీటిసీమయైనది. పశ్చిమదిక్కున నున్న నరసారావుపేట, వినుకొండ మున్నగు తాలూకాల ప్రాంతము పలనాటిసీమ. పలనాటిసీమకుఁ బడమట దొనకొండసీమ కలదు. కొండవీటిసీమమొదలు నెల్లూరిమండలములోని గుడ్లూరు గ్రామమువఱకుఁ బాకనాటిసీమ, తూర్పు నాడునందలి కృష్ణా గోదావరీ మండలములలో వేగినాటిసీమ, జల్లిసీమ, రెడ్డిసీమ, కోనసీమ మొదలగునవి కలవు. ఈసీమావిభాగము లేనియతుల ననుసరించెనో విచారించెదము. ఇట్టివానికిఁ గావలసి నన్ని యాకరములు లభింపవు. దొరకిన కొన్ని యాకరముల నాధారము చేసికొని ఊహలతో సమన్వయించుకొన వలసినపని ఇతిహాస పరిశోధకులకు విహితము.

## ౧. గట్టమసీమ.*

దీని స్థానము పైనఁ జెప్పఁబడెను. పూర్వము, గర్ణాట ప్రభువులచేఁ బాలింపఁబడినట్టి దుద్వంశమునకు జెందిన కట్టమ్మ యనుపేరి స్త్రీ యొకర్తు ఉండెననియు, ఆమె దానగుణ ఖనియనియు ఆయమపేర నీప్రస్తావనలోని యంతర్భాగము గట్టమసీమగా వాడఁబడుచున్న దనియుఁ కొంతకాలముక్రింద నాప్రాంతమునఁ బర్యటనము సేయునప్పుడు వింటిని. ఇందు నిజ మెంతకలదో పరిశీలింప సాధనములు లేవు. నావిన్న యీవృత్తము ఐతిహ్యము—ఆభాణకము—అనియే నా నమ్మకము. ఈ శుభ్రాణమున కను వుగఁ గలిగిన నాయూహల నను సంధింతును.

గట్టమసీమ ప్రాంతమున బసవమతి మెక్కుడు వ్యాప్తియందున్నది. అచటివారి పేర్లు సాధారణముగవిశిష్టాద్వైత వైష్ణవుల పేర్లుకొప్ప లింగాయతమతమునుసరించినవిగ నుండును. గుండుడు గుండప్ప గుండురాయఁడు, గుండమ్మ, పుట్టప్ప, పుట్టన్న, పుట్టమ్మ, తాయప్ప, తాయిమ్మ, గట్టప్ప,గట్టమ్మ పేర్లపరిపాటికావున నావినిన గట్టమసీమకు నాయూహ పుష్టి నియ్యదా ?.

## ౨ కర్నాడు.

పైగట్టమసీమ, ఈ కర్నాడులోని యంతర్భాగము. కర్నాడు, కర్ణాట సామ్రాజ్యములోని యంతస్సీమ. నాడు, నాడికి దేశపర్యాయపదములు. కర్నాడు యొక్క వ్యుత్పత్తి కరిణి + నాడు, లేక కరటినాడుగ నుండునని యూహించెదము. కరటికి, కరిణి శబ్దములకు ఏనుగు అర్థము. కర్నాడు—కన్నడ—సీమా ప్రారంభమునఁ బంపాతటమున, 'ఆనెగొంది' యని చిన్న సంస్థాన మొండుగలదు. ఇది రాయల వంశ్యుల పాలనమునసే నేఁటికి వర్తిల్లుచున్నది. 'ఆనె' అనఁగా అరవమునను, కన్నడమునను ఏనుగు అని యర్థము. ఈ 'ఆనె' గొందినిఁబట్టి కరిణినాడు—కర్నాడుగ వ్యవహృతమగుచుండునా? కాదేని కటి + నాడు"కర్నాడై యుండునాయని శంకింపఁ దగును. 'కటి' యనిన నలుపు ఈ కర్నాడు ప్రాంతమంతయు నల్లరేగడభూమి. మఱియు బళ్ళారి మండలమున నెక్కుడుగ మానిసిపేరికి ముంగు 'కటి' చేర్చుకొనుచుందురు ఇట్లు కటిచేర్పఁబడిన పేర్లవారు బ్రాహ్మణేతరవర్ణములలోఁ బెక్కురుందురు. ఉదా; కటిబసప్ప, కటినాగప్ప, కటిలింగప్ప— మొదలగునవి. స్త్రీలపేర్లకుఁగూడ ముందు ఈ కటిశబ్దము గూర్పఁబడియుండును. కరిణినాడు కర్నాడయ్యెనో, కటినాడు కర్నాడయ్యెనో కనుఁగొనుభారము ఇతిహాస పరిశోధకులపై నుంతును! వారేసవర్ణులు.

మఱియొక్కవిషయము: కర్ణాటకమునకు కర్నాడు విప్పువమను భ్రమ మనలోఁ బెక్కురనింకను బూర్తిగ వదలలేదు. కర్నాడు కన్నడమయ్యెననియు కర్నాడు నకుఁగర్ణాటకము సాంకృతిక మనియు నానమ్మకము.

* పోతకరెక్కలకును నల్లజీబపప్పునకుఁ బ్రంధము.

నాయీసమ్మతమును బలపఱచు నీయభిప్రాయము ప్రాక్తమంగ నుఁడు.

"తెలుఁగు అనునది త్రిలింగభవముకాని యట్లే కన్నడశబ్దము కర్ణాటశబ్దభవము కానేరదు. సంస్కృతీకరణమునఁ గర్ణాటమైనదని తోఁచుచున్నది, 'కన్నడ' అనునది దేశ్యపదము. అద్భుతమని యర్థముగలది. అర్థమునలె స్పష్టమైనదని తాత్పర్యము స్ఫురించుచున్నది.... ... ... ... "*

అని బ్రహ్మశ్రీ ఆచంటవేంకట సాంఖ్యాయన శర్మగారు, ఆంధ్రభాషా స్వరూపనిర్ణయము సేయుపట్టున వివరించిరి

మఱియుఁ గీ. శే. కొ. వేం. లక్ష్మణరావుగారు "'త్రిలింగము' నుండి 'తెలుఁగు' పుట్టెనా? లేక, 'తెలుఁగు' నుండి 'త్రిలింగము' పుట్టెనా?" అను మకుటముతో నొక వ్యాసమువ్రాసిరి,§ అందుఁ జక్కఁగఁ జర్చించి తెలుఁగునుండియే త్రిలింగముపుట్టెనని, తెలుఁగు సంస్కృతీకరణమగుట సిద్ధాంతమని నిరూపించిరి. ప్రతి విషయమును సప్రమాణముగఁ జూపిరి.

పైయాకరములన్నియు నాయూహలను బలపఱచి, కర్నాడు సంస్కృతీకరణమున కర్ణాటమై సామ్రాజ్యమున కంతకు రాష్ట్రనామమై వర్తిల్లెనని సూచింపఁబడుచున్నవి.

## 3. రేనాడు

ఈరేనాడు కడప కర్నూలు అనంతపురమండలములమధ్య గతప్రదేశమని జ్ఞాపకముచేసెదను. ఱేడు + నాడు ఱేనాడయ్యెనని కొందఱు, ఱేడ్డి + నాడు రేనాడయ్యెనని మఱికొందఱు చెప్పుదురు. రేగడి + నాడు రేనాడయ్యెనని ఇఁకఁగొందఱనుచున్నారు. 'రే' (రేయి) నలుపునకర్థము. ఈరేనాటి సీమయందుఁ జాలవఱకు నల్లరేగడిభూమిగా నుండును. కావునఁ గడపటి 'రే' నాడే సమంజసమని నాయభిప్రాయము. అయిన నీవిషయము విచార్యమాణము.

## ౪. పాకనాడు

దీనియావరణమును పైనవివరించితిని. "శ్రీశైలము తూర్పుటంచు నంటుకొని గుండ్లకమ్మనదికి నుత్తర దక్షిణ పార్శ్వములందు సముద్రముదాఁక వ్యాపించిన దేశము పూఁగినాఁడని ప్రోలయవేముని శాసనమందున్నది. పూగి, పూంగి, పోఁక, పాక, పదములకు శబ్దార్థ సంగతి కలదు. పూంగినాఁడే పాకనాఁడు కావచ్చును. అట్లే యగునేని నేఁడది కర్నూలు, గుంటూరు, నెల్లూరు, కృష్ణామండలములలో సంక్రమించినదగును. †" అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చెప్పిరి. శ్రీశైలమునకుఁ బ్రాగ్భాగమున నుండుటచేఁ 'బ్రాక్'శబ్దము 'పాక'యై, నాడునుగూడి పాకనాడయ్యెనను వారుగలరు. ఇదియు నాలోచింపఁదగినదే. ఇట నింకొకయంశము విచారింపవలసియున్నది. 'పూగి' తద్భవము 'పోఁక' యయ్యెననుటకంటెఁ 'బోఁక'యే సంస్కృతీకరింపఁబడి 'పూగి' యయ్యెనని చెప్పుటయే సమంజసము. ఇందు మఱియొక విశేషముకూడఁ గలదు. తెలుఁగు త్రిలింగమైనట్లు, కర్నాడు కర్ణాటకమైనట్లు, పాకనాడు పూగినాడయినది. నాడులపేళ్లు తొలుత రాష్ట్రభాషలో నెలుకొని సాంస్కృతికముల సంప్రదాయము పరిరక్షితమగును. ఇదియే విశేషము.

## ౫. పల్నాడు

దీనితొంటిపేరు పల్లెనాడు. ఇది కొండవీటి సీమకుఁ బడమటియెల్ల; పాకనాటిసీమలోని యంతస్సీమ. ఈయంతస్సీమ కేలికయొకఁ డుండెననియు, ఆతనిపేరు పల్లె- పల్ల- పోల- నాయఁడనియు, ఆతనిపేర నీసీమ వ్యవహరింపఁ బడుచున్నదనియు బ్రాహ్మణ్యాదులు తెలుపుచున్నవి. ౫ శతాబ్దములకుఁ బూర్వము జరిగిన యుద్ధములకు రంగముగానుండిన ఈసీమ 'పోలి నాడు' అనిపేర్కొనఁబడెనని కొందఱందురు. అంతకుఁ బూర్వ మీ భాగమంతయుఁ బాకనాటిలోనిదేయగుట పాకనాడనియే వాడఁబడుచుండెననియు నందురు.

---

* 1923-వ సం. మున గుంటూరిమండలములోని నంబూరుగ్రామమున జరిగిన 6-వ శారదస్వతసభ కధ్యక్షుత వహించి ప్రారంభోపన్యాసమునఁ జెప్పిరి.

§ 'ఆంధ్రపత్త్రిక-' మొదటి ఉగాది సంచిక 1910 సం. 81-వ పుట.

† 'శృంగార శ్రీనాథము' ప్రకరణము. ౧, పుట ౫.

౧౪-౧౫ శతాబ్దములనాఁటి గ్రంథములలోఁగూడ 'పల్లెనా' యగపడుచున్నది. దీనికి సమాధానము?

౬. వేఁగినాడు

ప్రస్తుతము కృష్ణామండల విభజనమునఁ బశ్చిమ గోదావరీ మండలమునఁ జేర్పఁబడిన ఏలూరుపురమునకు సమీపమున నున్న పెదవేఁగిపేరే యీ సీమకంతకు వర్తించుచున్న దందురు. ఈ వేఁగి, "ఆంధ్ర మహాభారత" కృతిపతియగు విష్ణువర్ధన పాలితమనుట ప్రసిద్ధము; కావుననే ప్రశస్తము.

'వేఁగి' యనిన 'పురి' యనియర్థము. ఇది 'వ్యాఘ్ర' శబ్దభవము. వ్యాఘ్రసీమ వేఁగినాఁడయ్యె నని కొందఱందురు. పూర్వప్రభువంశములు నిజరాజధానీ నగరములకు— రాష్ట్రములకుఁగూడ— స్వీయ పరాక్రమ లాంఛనములపేర్లిడుకొనుచుండెడివారు. ఉదా. జయపురము, విజయనగరము, మహీశూర, సింహపురి, బొబ్బిలి— బెబ్బులి, వెలిగోడు— వెలిగొడుగు (శ్వేతచ్ఛత్రము)— మున్నగునవి. వేఁగి వ్యాఘ్రమయ్యెనా? లేక, వ్యాఘ్రము వేఁగియయ్యెనా?

౭. కమ్మనాడు-తెలుఁగునాడు

కమ్మనాడు సంస్కృతీకరణమునఁ గర్మనాడు అని వ్యవహృతము. ఈకమ్మనాడు, నెల్లూరు— గుంటూరు మండలముల సరిహద్దులగు సంగమోలు—కొండవీడిమి సీమ యని వినఁబడెను. దీనిసమీపమునఁగల కొంతభాగము తెలుఁగునాఁడని వాడఁబడుననియు, బూర్వమీప్రాంతము తెలికనాఁడనివ్యవహరింపఁబడుచుండెననియు, ఈనాడులో తెలిక (తైలక—గాండ్ల) కుటుంబములు చాలఁగ నుండెననియు, ఇచటినుండి శుద్ధమగు నువ్వులనూనె దేశాంతరముల కెగుమతి యగుచుండెననియు ఐతిహాసికాధారములగపడుచున్నవి.

ఈనాడులను, ముఖ్యముగఁ దెలుఁగునాడును గూర్చి కీ. శే. కో. నం. లక్ష్మణరావుగారు సవిమర్శముగఁ జర్చించిరి.* అందుండి నాడులకు సంబంధించిన భాగము నిట నుద్ధరింతును.

"నైజాము రాజ్యమును రెండుచీలికలుగ విభాగింపవచ్చును. తూర్పుభాగమునకు 'తెలంగాణ' అనియు, పశ్చిమభాగమునకు 'మరాఠవాడి' అనియు పేరు. ఈతెలంగానులోఁ బెద్దవియగు 8 జిల్లాలుకలవు. అత్రాఫ్ బల్దా, వరంగల్, నల్లగొండ, మెతుకు, కరీంనగర్, మహబూబ్ నగర్, నిజామాబాద్, అదిలాబాద్—అను జిల్లాలు శుద్ధాంధ్రమని చెప్పవచ్చును. ఇంతవైశాల్యమును జనసంఖ్యయుఁగల తెలుఁగుదేశమును గుఱించి మనమేమియుఁ దెలిసికొనకుండుట న్యాయమా? ఈతెలుఁగు భాగము మనకంటె నూఱేండ్లువెనుక నున్నందున, పూర్వకాలపు గ్రామ సంఘములయొక్కయు, ఆచార వ్యవహారములయొక్కయుఁ జరిత్ర కనుఁగొన నలయునన్న నీప్రాంతమునందుఁదప్ప మఱియెచ్చటను మీకుఁ గానరాదు.

తెలంగాణము

ఇదియే అసలు తెలుఁగుదేశ మనియుఁ జెప్పవచ్చును. తురకలుదీనికిచ్చిన తెలంగాన్ అనుపేరు 'తెలంగాణము' అను మనమాటయే. 'అణ' శబ్దము దేశపరము. మహారాష్ట్రదేశమునకును, కన్నడ దేశమునకును దగిలియున్న దేశమునకు తెలంగాణముఅన్న పేరుండెను. ఇచ్చటి బ్రాహ్మణులే తెలంగాణ్యులు, ఇచటవ్యవసాయముచేయు కాఁపులే తెలఁగాలు. మొదటిది 'తెలంగ' రూపము; 'తెలుంగు' తరువాతి రూపము. ఈతెలఁగాణము మొదట నితర నాఁడులవలె నొక నాడి. వెలనాడు, కమ్మనాడు, పాకనాడు వంటిదే యిదియొకటి. వెలనాటిలోని బ్రాహ్మణులు వెలనాటి వారు; కాఁపువారు వెలమవారు. కమ్మనాటిలోని బ్రాహ్మణులు కమ్మ బ్రాహ్మణులు; కాఁపులు కమ్మవారు. కమ్మ బ్రాహ్మణులనే మనమిప్పుడు కరణ కమ్మలనియెదము.

పాకనాటిలోని బ్రాహ్మణులు పాకనాటివారు; కాఁపులు పాకనాటి రెడ్లు. కరణకమ్మలను వారిని పూర్వము 'కరణ' శబ్దములేకయే 'కమ్మ బ్రాహ్మణు' లనుచుండిరనుటకు శాసనప్రమాణము లున్నవి. చాళుక్య రాజులలో అమ్మరాజు నామముగల రెండవ రాజుయొక్క యొక శాసనమునం దిట్లున్నది:—

"ఆసవిమయుతవా స్తవ్యో దేవార్యో దేవసన్నిభః,
భారద్వాజాన్వయః కమ్మకులజః కులవర్ధనః."

* ఆంధ్రపరిశోధక మహామండలి—(చిత్రాడ) యొక్క నవవార్షికోత్సవమునకధ్యక్షులవహించియొసఁగినయుపన్యాసము.

......ఇట్లు మిక్కిలి పురాణ కాలమునఁ దెలుంగుదేశము చిన్నచిన్న నాళ్లుగా విభాగింపఁ బడి యుండెను. కొంతకాలము పోగా నా నాళ్ళలో తెలగాణమను దానికిఁ బ్రముఖత సంభవించి, యదియే దేశమంతటకును, అన్ని నాళ్ళకును తననామమే యొసంగెను. అదియే యీ నాళ్ళలోని భాషకుఁగూడ నామమయ్యెను. ఇందు నాశ్చర్యమేమియు లేదు.

ఇట్లు నైజాము రాజ్యమందలి తెలంగాణము తెలుగు దేశచరిత్రమునకు విత్తనమువంటి"

తెలుఁగునాడు—తెలఁగాణెమును గుఱించి నేను పైనిదెల్పినదానికిని, కొ.వేం.ల.రావు గారు వ్రాసినదానికిని సంబంధమే లేదు. రెంటికినిఆధారము లున్నవి తెలికనాడు తెలుఁగునాడయ్యెనో తెలంగాణమే తెలుఁగునాడయ్యెనో లేక దానివాటకది, దీనిపాటకిది వర్తిలుచుండెనో పరిశోధకులు నిర్ణయింపఁ గలరు.

౮. వెలినాడు

వెలినాడు దీవిసీమలోనిదని, పొన్నుపల్లిగ్రామము వెలినాటిలోనిదని, శ్రీనాథకృత పొన్నుపల్లి తామ్రశాసనము తెలుపుచున్నది. చూడుఁడు:

౧. శాసనము

"శ్రీకొండవీటిసీమాయాం వెలనాటిస్థలేశుభే,
కృష్ణవేణ్ణా మహానద్యాఃదక్షిణేరోధసిస్థితం.
పొన్నుపల్ల్యా హ్వాయంగ్రామంసర్వసస్య సమన్వితం"

౨. శాసనము

"ప్రాదాత్త్రిలింగ విషయేవెల్నాండో ద్దీవి సీమని,
కృష్ణవేణ్ణా త్తరంగిణ్యాః ప్రతీరేపర్యవస్థితం."

"పొన్నుపల్ల్యాహ్వాయం గ్రామంనిథీనం సస్య సంప[దాం."

శ్రీనాథకృతకసుకుఱ్ఱు తామ్రశాసనమున—

"ప్రాదాత్త్రిలింగవిషయే వెల్నాండౌప్యాసీమని,
తుంగభద్రాతరంగిణ్యాః ప్రతీరే పర్యవస్థితం."
"గ్రామం కసువుకుఱ్ఱాఖ్యం"

కొండవీటిసీమలోను, దీవిసీమలోను వెలనాడు గలదనియు, పొన్నుపల్లి యీవెలనాటిలోనిదనియు, నిది కృష్ణవేణీమహానదియొక్క దక్షిణతీరమున నున్నదనియు పొన్నుపల్లిశాసనమునఁ గానవచ్చుచున్నది. వెలనాటిసీమలోని కసువుకుఱ్ఱు తుంగభద్రాతీరస్థమని కసుకుఱ్ఱుశాసనమునఁ గలదు. పై యాకరములనుబట్టి వెలనాడు కృష్ణాతుంగభద్రల మధ్య వ్యాపించినదని తెలియుచున్నది. అనఁగా కృష్ణకు దక్షిణమునను, తుంగభద్రకుత్తరమున నీవెలనాడున్నదన్నమాట. ఉనికి తెలిసినది. వెలనాడనుపే రెట్లువచ్చెనను ప్రశ్నమిగిలినది. నాయూహ ననుసరించి రెండుసమాధానములు తోఁచుచున్నవి.

ప్రస్తావనలోని వెలనాటిసీమ చౌటినేల యగుట మొదటికారణము. కొన్ని నాడులు భూవర్ణమునుబట్టి పేర్కొనఁబడుటను గుఱించి పైనఁదెలిపితిని. వెలినాడు వెలనాడు వెల్ల నాడు— వల్నాడు—వీనికన్నిటికి శ్వేతసీమయనునర్థమొప్పియున్నది.కటినాడువలెనే యీవెలినాడు భూవర్ణముం దెలుపుచున్నది.ఇట్లేకానిండు;దక్షిణమున ఎఱనాడు—ఎర్నాడు, కురునాడు—కుర్నాడు,కోర్నాడు మలెనాడు—మల్నాడుగలవు. ఎర్నాడురంగు ననుసరించినది. అచటనేల యెఱ్ఱచెక్కనేల కోర్నాడునకు మొదటిరూపము కురునాడు; ఇది మాయవరం తాలూకాలోనిది. కురువంశరాజులచేఁ బాలింపఁబడుటచేనీప్రాంతమునకు కురునాడు— కోర్నాడుఅని పేరువచ్చినదని ఇచట ఏలూరి హైస్కూలులోఁ జేచరుగనుండు నొకదాక్షిణాత్యమిత్రుఁడు దెలిపెను. భూవర్ణమును ఆకృతినిఁబట్టి సీమలకు నాడులకుఁ బేళ్ళు వ్యవహృతము లగుచుండుట క్రొత్తగాదు.

౯. మురికినాడు

ఇదియుఁ బ్రకృతనిజాము సర్కారులోనిదే. దీనిరూపాంతరము ములికినాడు. ఏతత్సీమానిర్దేశమునెడఁ గొంత భిన్నాభిప్రాయమున్నట్లగపడుచున్నది. వివాదాంశము నటుంతము. నామకరణముం గూర్చి విచారింతము. నా కీవిషయమునఁ దోఁచిన లంబాహలు రెండు ములికినాడు, తొలుతముల్కి-నాడుగనుండి క్రమాగతమున, ములికి (మురికి) నాడైయుండునాయనియొకఁడూహ. ముల్కి అనునది ఉరుదుభాషాశబ్దము. దేశము, రాష్ట్రము అనునర్థము ముల్కి, ములికి, మురికిగమా

అట వింతకాదుగదా! ముల్కినాడు—ములికినాడు అనిన రాష్ట్రీయాంతర్గతసీమ అని యర్థము. సామ్యము ఇందునకు దార్కాణగా నొకవిషయము.

నిజామురాజ్యమున కృష్ణా–తుంగభద్రా నదుల మధ్యను, కృష్ణాతీరమునను గల యొకభాగము ములకసీమ యనఁబడుచున్నదని నున్ను తెలిపిరి. జటప్రోలు సంస్థానమునకుఁ జేరియున్న గోపాలపేట అనుచిన్నసంస్థానముగూడ మొలకసీమలోనిదే. పైముల్కి (ములికి)నాడు వలెనే ఈమొలకసీమ, తెలుగు ముల్కిసీమయని వ్యవహరింపఁబడుచుండియుండునా? అట్లుకాదేని, ఆములికినాడు, ఈమొలకసీమ రెండును పూర్వము 'మలక' సీమ యని పేర్వడియుండునా? అనునది మఱియొకసమస్య. 'ములక' శబ్దమునకు సరియగు అర్థము ప్రసిద్ధము. విచారణానంతరము మొదటిదో కాదో ఒకవేళ సరిపడకపోయినను రెండవదానిసామాన్యమాత్రము సరిపడవచ్చునని నమ్మెదను. మొలకసీమ, ములికినాడు రెండునొకటిగా లేక, వేఱా? విమర్శింపఁదగును.

కర్ణాట రాజధానిలోని యంతర్భాగములలో 'ములక' అనునంతర్భాగమొకఁడు గలదనియు, అది నర్మదానదికుత్తరమున నున్నదనియు, కర్ణాటకమునకు 'ములక' ఉత్తరపు టెల్లయనియు నొకరు ప్రచురించిరి * ఈములక యే 'ములక' యో!

## సీమలు

మొలకసీమనుగుఱించి పైనఁదెలిపికొంటిని. మఱి కొన్ని సీమలఁగూర్చి దిఙ్మాత్రముగ సూచింతును. గట్టమసీమనుగూర్చి మనవిచేసితిని. రాచవారి సీమయొక్క యునికినిమాత్ర మెఱిఁగించితిని. దానిస్వభావమునింత వివరింతును. ప్రసిద్ధమగు ఐతిహాసికకాలమున నీరాచవారిసీమ అత్యంతవైభవము ననుభవించినది. ఈసీమయందు 'రాచవారు' అను పెద్దతెగయొకటియుండెడిదఁట. ఈతెగ, నాడుమిగులప్రశస్తిఁ గాంచినదఁట. ఇప్పటికినీసీమలోఁ బలుచోట్ల రాచవారికుటుంబములు గానవగును. కాని యీకుటుంబములవారు లేమిడిజీవనముగాఁగలిగి కర్షకాదికార్మికవృత్తులతోఁ గడుపునింపుకొనుచున్నారు. కడపమండలములోని నంద- (నందు)-లూరు మొదలు కోడూరువఱకుఁ జేరిమొదటనో చివరనో 'రాజ' శబ్దముతోఁగూడిన గ్రామములుగలవు, తక్కినమండలములందలి తాలూకాలలో రాజశబ్దసహితమగు గ్రామనామములు లేనేలేవనికాదు. పుల్లంపేట తాలూకాలో నుండు నన్ని రాజశబ్దసహిత గ్రామములుండవని చెప్ప దగును.

ఉదా: రాజంపేట; వెంకటరాజంపేట; నాగరాజుపేట; పోత్రాజుకాల్వ—మొదలగునవి. వీనిలో నెక్కుడు స్త్రీలపేర్లకు సంబంధించినవనియు నెఱుఁగఁదగును. ప్రస్తాపనములోని రాచవారు నాలవవర్ణమునకుఁ జెందినవారుగనున్నారు. వీరిలోఁ బురుషులకు జందెము కూడనున్నది. కాని ఉత్తరసర్కారులలోని రాజులతో వీరికిఁ గలయిక యుండదు.

కృష్ణామండలములో జల్లిసీమ, రెడ్డిసీమ ఉదాహరణమునకుఁ గొనవచ్చును. జల్లిసీమలో రెండంతస్సీమా విభాగములున్నవి. మొదటిది బహార్జల్లి; రెండవది భిత్తర్జల్లి. ఈసీమ మహమ్మదీయ విజృంభణమున నేర్పడినట్లు చెప్పుదురు. ఇది కొల్లేటిప్రాంతము నున్నది.

ఇందుఁదఱచు అగ్నిభయములుగలిగి గూడెములు గూడెములు మాడిపోవుచుండుటచే నీదహనభాగమునకు 'జలీ' అని తురకసర్కారు వ్యవహరించెనఁట. శిస్తుదస్తులు వసూలుచేయుట కనుకూలముగ నీప్రాంతము రెండుచీలికలుగ విభజింపఁబడెననియు, కొల్లేటిప్రాంతము తఱచు అగ్నిభయములు గలుగుచుండినభాగము— 'భీతర్ జలీ' అనిరనియు, దీనికి వెలుపలభాగము 'బహిర్ జలీ' అనిరనియు బహుకాలప్రవృత్తియు, ఇతిహాస పరిశోధనదృష్టి గల అనుభవజ్ఞులగు శ్రీ. శే. శ్రీకాశ్యహరి నరసింహాముగారొకప్పుడు తెలిపిరి.

ప్రకృతము పశ్చిమగోదావరీ మండలమునందలి ఎర్రగూడెము—ఎఱ్ఱనగూడెము—తాలూకా రెడ్డిసీమలోనిదనియు, జంగారెడ్డిగూడెము, లక్కవరము మొదలగు ఏజన్సీ భాగములుగూడ నీరెడ్డిసీమలోనివే యనియు, రెడ్డిప్రభుత్వమున నీసీమ రెడ్డిసీమ పేరొందుననియు,

* The Karnataka Hand book, Introduction, Pages 11&12.

రెడ్డిగూడెము, రెడ్డిపోలవరము జంగారెడ్డిగూడెము-లోనగు 'రెడ్డి' శబ్దసహిత గ్రామములు సీమయందెక్కుడుగనున్నవనియుఁగూడ శ్రీ నరసింహముగారు సెలవిచ్చియుండిరి.

గోదావరీ మండలమునఁ గోన సీమాదులుగలవు. వానికిని నిర్మాతృలైకాదిమ కథనమున్నది. మఱియొకప్పుడీకథ సాగింతును. విషయ మిప్పటికే దీర్ఘమైనది. పత్రికాధిపతులకేకాక పఠితలకుఁగూడ విసుగొదవింపను. విసుగుగలిగెనా నా విషయము వెగటగును. కావున నీవిషయమునకుఁ బ్రకృత మింతట స్వస్తిచెప్పెదను.

పైవిషయములు చాలవఱకు ఊహా జనితములే కాని సిద్ధాంతములుగావు. వీనిని బాగుగఁ బరిశీలించి నా యూహలయందలి తప్పులు చూపెదరేని ఒప్పికొందును. మఱియు నాతప్పులు తెలిసినప్పుడే నేను కృతార్థుఁడ ధన్యుఁడనని సంతసింతును.



# అమృత ప్రేమ

మునిమాణిక్యం నరసింహారావు గారు, బి.ఏ., (సాహితీసమితి)

కటికచీకట్ల గన్నీరుగార్చికార్చి
సూర్యకాంతిరవంత పైసోకినంత
ప్రణయహృదయకవాటముఁ బారఁదెఱచి
నళిని యేటికి పకపక నవ్విపోవు ?

ఘోరనైదాఘతీక్ష్ణతఁ గుమిలికుమిలి
పొగలుగ్రమ్మెడు నిట్టూరుపులను విడచి
తొలకరించినయంత నెందులకుపుడమి
కట్టునోయాకుపచ్చనిపట్టువలువ ?

పగలుపగలెల్లఁదీరని వగలఁబొగిలి
కూయనేకూయబోని చకోరకంబు
పండువెన్నెలవెల్లి చూపట్టినంత
యేల యుప్పొంగి పాడుచు నీదులాడు?

ఒంటినెచటనెయున్న మయూరమేల
యానవాషాఢలక్ష్మి నీలాంబుదాల
ముసుగుకై నేసినంతనే మురిసిపోయి
యవశయైపురివిప్పి నాట్యంబు సలుపు ?

మబ్బుపట్టినయంత సంబరముఁజెంది
యేల చాతకి మినుముట్ట యెగురులాడు
అటులె నీమనోహర వదనాంబుజాత
మధురదరహాస మృదుపరిమళమునచ్చి
సోలిపడియున్న నాయెదసోకినంత
విరియు నవ్యక్తమధుర ప్రవృత్తులెన్నొ

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

భూరిసంతృప్తియపుడు కన్మూసివేయు
నేను నాచిరునవ్వులో నిన్నెచూతు.

సంపూర్ణము



# రామాయణమునందు వానరు లెవరు?

గో. రామదాసు గారు, బి. ఏ., యమ్. ఆర్. ఏ. యస్.

[వెనుకటి సంచిక తరువాయి]

ఈసరస్సునకుతూర్పుగా 'ఋశ్యమూక' పర్వతమున్నది. ఇది పిల్లఏనుగుల కాస్థానమట. (ఆర. 31, శిశునాగాభిరక్షితః — ఈ) కొండశేపు 'ఏనుగులుగలదని' యర్థమీయ నలెను. 'ఏనుగులకొండ' (ఆనై + మలై = ఆనమలై) అనుకొండలు దక్షిణదేశమందు లేవా? 'శిశునాగా'అనగా, పిల్లఏనుగులని అర్థముచేసినాడు గాని అట్లుగాదు 'శిశునాగులు'ని యొక జాతివా రుండేవారవు వారికొండవద్ద ఉండేవారని యొక రర్థముచేసినారు. కాని అదిసమర్థించుట కేమీఆధారములుగాన రావు.

ఇంతస్పష్టముగా (పేరునకును) అచ్చట ఉండేవాటికిని సంబంధము కనబడుచున్నను జటాధరుడనువ్యాఖ్యాత 'ఋశ్యో మృగో మూకో యత్ర' యనియర్థము జెప్పినాడు. ఈకొండవద్ద మృగము-లనగా లేళ్లు ఉన్నట్లే యెచ్చటను చెప్పబడలేదు. కాన ఈయర్థము సరిపడలేదు.

'మూక' అనునది ద్రవిడపదము. సముదాయమని యర్థము. సవరలు ఏనుగకు 'రా' అందురు. దీనికి బహువచనము 'రాజి' దీనికి షష్ఠీప్రత్యయమైన 'ఆ' చేర్చిన రాజ్య + మూక, (ఏనుగులగుంపు) అని అగును. ఇదియే ఋశ్యమూక అయినదని తోచును.

ఈ పర్వతమెక్కుట చాలాకష్టమట. (అర. 31. సుదుఃఖారోహణమ్.) ఈకొండకవతల అనగా పంపావైపునుండి వెళ్లిన కొండకు వెనుకప్రక్కను 'కిష్కింధ' యున్నది. 'కిండాక్' అనగా సవరభాషలో 'వెనుక' 'కిష్ + కిండాక్' అనగా 'కిష్'కు వెనుకప్రక్క. అతికష్టసాధ్యమైనది గాన 'కిష్' అని చెప్పియుండవచ్చును. సవరభాషలో 'కియాస్' అనగా 'చావు'-యెక్కుటకు దుర్లభమైనది. ఒక్కరాత్రి దానిపైన బరుండిన జనులు చచ్చిపోవుదురు (అర. 73. 36.) కావున ఇట్టికష్టసాధ్యమైనదానిని 'చావును గలుగజేసేది' అనిన తప్పేమున్నది? కియాస్ + కిండాక్ (కష్టసాధ్యమైనదాని + వెనుకనున్నది) అనునది ఆర్యులవాక్కులో 'కిష్ + కింధ = కిష్కింధ'అని అయినది.

ఈ సవరనామములు చిత్రకూటమునకు దక్షిణమునందున్న స్థలములకు, జనులకే కాదు, చిత్రకూటమున కుత్తరమందుగూడ, గన్పించుచున్నవి. కాని, ఈ ప్రాంతమందు ఆర్యప్ర

చారము అధికముగా నుండుటవలనను ఆ
యనార్యరూపము విస్తారముగా మారిపోయి
సంస్కృతస్వరూపమునుదాల్చినవి. అయినను
కొన్నికొన్నిచోట్ల అనార్యులు నివసించియుండి
పోయియుండుటచే ఆస్థలములకు ఆర్యనామ
ములుగూడ అనార్యనామములతో జేర్చబడి
యున్నవి. అట్టినామములలో 'శృంగిబేరము'
ఒక్కటే మనరామాయణమునందు జెప్పబడి
యున్నది.

'శృంగిబేరము' నిషాదులస్థానమని, ఇది
కోసలరాజ్యముకు వెలుపల గంగఒడ్డున ఉన్న
దని రామాయణము చెప్పుచున్నది. ఇందు
'శృంగి'—'బేరము'అని రెండుపదము లున్నవి.
'శృంగి','శింగి' అనుమాటలు కొండయొడ్డున
యున్న గ్రామముల కుండును. 'శింగిపురం'
'రామ్‌శింగి' మొదలైనవి కొండతలములం
దున్నవి. అలాగున 'శృంగిబేరము' గూడ
కొండయొద్ద యుండవలెను. 'బేర' అనగా
'కొండ' సవరభాషలో. కాన 'శృంగి' అను
నది 'బేర' అనుపదమునకు సంస్కృతము.
ఆర్యులకూ అనార్యులకూగూడ దీనినైసర్గి
కము దెలియుటకై 'శృంగిబేర'మని పిలువ
బడెను. ఇది అనార్యులు ఆర్యులలోఁ గలి
యుటను సూచించుచున్నది.

ఇది యొక్కటేకాదు 'గంగా' యమునా
మొదలైననామములుగూడ అనార్యులభాషల
లోనివనే తోచుచున్నవి, కాని వాటివిష
యమై స్థిరముగా సప్రమాణముగా జెప్పుట
కింకనూ ఆధారములు దొరకక పోవుటచే
వాటివిషయమైన చర్చ వదలితిని.

కొన్ని రాక్షసనామములుగూడ అనా
ర్యజన్మమును సూచించుచున్నవి. రాక్షసులు
వానరులకు తుల్యజాతివారే. హనుమంతుడు
మొట్టమొదట రావణునితో మాట్లాడినప్పుడు
'నీఅన్నదమ్ముడైన సుగ్రీవుడ'ని రావణునితో
జెప్పెను.

"అహం సుగ్రీవసందేశా
దిహప్రాప్త స్తవాలయమ్;
రాక్షసేశ! హరీశ స్త్వాం
భ్రాతా కుశల మబ్రవీత్.
(సుందర. ౫౧-౨)

సుగ్రీవాదులు వానరులు, వారిభాష సవర
భాషయని ఇదివరకే చూస్తిమికదా; కాన
రాక్షసభాషగూడ ఈ సవరభాషాసంబంధ
మైనదే. సవరలు, గదబలు, అసురులు,
మూండారీలు, మొదలైనవారందరూ ఒక్క
జాతిలోనివారే యని శ్రీ గ్రియర్‌సన్ దొర
గారు నిర్ధారణచేసిరి. రాక్షసరాజైనరావణుని
సాధారణముగా 'రావణాసురు' డని చెప్పుట
అందరికిని తెలిసినదే. కాన రాక్షసులు'అసుర'
జాతివారని స్పష్టము. ఈజాతివారు ఇప్పటికిని
స్వల్పముగా మధ్యహిందూస్థానమందున్నారు;
క్రమేణక్షీణించిపోవుచున్నారు. వీరిమొదటిభా
షఅంతా నశించిపోయినది. అసలుభాషలోని
పదములు కొద్దిగామాత్రమే ప్రచురింపబడి
యెను. అయినను వీరిభాష ఇతరమూండారీ
భాషలతో సంబంధించియుండుటచే రాక్షస
నామములవ్యుత్పత్తి తెలియనగుచున్నది.

రావణునివంశోత్పత్తి ఉత్తరకాండలో
ఉన్నది. 'సంధ్య' కూతురైన 'సాలకటంకటా'

యనునామె సంతతిలో బుట్టినవాడట రావణా సురుడు. 'సాలకటంకటా' అను పదోచ్చారణమే అనార్యధ్వని నిచ్చుచున్నది. 'సాలోం-అక్' అం కెసవరభాషలో 'కూతురు'. 'కటిక-చీకటి' అన గా తెలుగులో 'విస్తారముచీకటి' యని. విస్తారార్థ మందు ఆపదమునే రెండుసారు లుచ్చరించుట కూడ గలదు. కాన 'కటిక' అన్న 'చీకటి' యన్న ఒక్కే అర్థము తోచుచున్నది. లేకున్న 'కటికవాడు' అనుపదములో 'కటి క' కు యేమియర్థము? విస్తారమైనవాడని చెప్ప వీలులేదు. జంతువులను జంపి వాటిమాంస మునమ్ముట దుర్మార్గపుపని. దుర్మార్గమును, చీకటితో పోల్చుట గలదు. కావున కటిక వాడైనాడు. ఈ 'కటిక' యనుపదము 'కటం కట' శబ్దమునుండి వచ్చినదానివలె గన్పించు చున్నది. గాన 'కటంకట' అనగా 'చీకటి' అని అర్థమై యుండును. ఈమె 'సంధ్య' యొక్క కూతురుగాన 'సోలాం + అక్ + ఆ + కటంకట.' ఇదిఆర్యులనోట్లో సాలకటంకట అయినది. రావణుని వ్యుత్పత్తినిజముగాసీ మానసీగాని దీనివలన రాక్షసజాతి తెలియ నగుచున్నది.

రావణుడు రాక్షసుడుగాన అనార్యుడే. అయినను వానినామము అనార్యభాషోత్పన్న మైనదని సూచించు వాక్యములేవి రామా యణమునందు గానరాకున్నవి. అయినప్పటికి 'రావణ' అనుపదము 'రామేక్' యొక్క సంస్కృతస్వరూపమేమో? సవరలు పిల్లికి 'రామేక్' అందురు. ఈ యర్థమును కొంచె ముగా సూచించు వాక్యములు ఒకటి రెండు మాత్ర మున్నవి.

"కామరూప మహం భద్రే
పశ్యమాం కామదం పతిమ్"
ఆరణ్య—౪౭, ౮.

అని రావణుడు సీతతో చెప్పినట్లున్నది. ఇచ్చట 'కామరూపిణం' అనుపద ము 'కామరూపీ' కి ద్వితీయా ఏకవచన ముగా వచ్చును. అట్లైనట్టయితే 'కామరూపీ' అంటే 'అడవిపిల్లి' అని యర్థమగుచున్నది. ఈయర్థమే తీసుకొనినయెడల 'నేను అడవి పిల్లిని నన్ను నీభర్తగా వరించుమ'ని పైవాక్య మున కర్థమగుచున్నది.

పిల్లి మామూలుగా అరచినప్పుడు గాక కోపముతో అరచిన నెంత భయంకరముగా నుండునో అందరకూ తెలిసినదే. తన అరుపు లచే లోకములను భయపెట్టుదునని రావణుడు సీతతో జెప్పెను. (నాహైర్య్ఖ్యాతవిరావిణమ్). కాన ఈ రెండింటినిబట్టి 'రావణ' అను నామ ముయొక్క అర్థము సూచితమగుచున్న దని భావింపనగును. అందుచే 'రామేక్' (పిల్లి) అనుశబ్దమునుండియే 'రావణ' అయి యుండు నని తలపవలసి వచ్చెను.

ఇంతియకాక హిందువులలో గోత్రములవలెనే ఈ మొదటిజాతులలో కూడ గోత్రము (Totem) లున్నవి. ఒకగోత్రములోనివారు వివాహములు చేసుకొనటులే, ఈజాతులలో గూడ ఒక్కే గోత్రమువారు వివాహ మాడరు. వీరిగోత్ర ములు మృగములు, చెట్లు పేర్లుగలిగి యుండును. అసురజాతిలో అనేకగోత్రము లున్నవి. అడ విపంది గోత్రమని, తాబేలుగోత్రమని ఇట్లు న్నవి. పిల్లిగోత్రమని యుండియుండును. అం

దులో పెద్దకు ఆగోత్రనామమున జెప్పియుండ వచ్చును. అట్టివాడే రావణుడు.

రామలక్ష్మణులు వానరులతోగూడ లంకాపట్నమును ముట్టడించియుండగా రామలక్ష్మణులవని మాయతలలు దెచ్చి సీతకు జూపగా ఆమె విశేషముగా దుఃఖించుచుండెను. అట్టిసమయములో ఆమెకు ధైర్యము చెప్పి ఓదార్చినది విభీషణుని భార్యయైన సరమా. ఈమె ఈ ఒక్కచోటనే చెప్పబడియున్నది. ఈమె 'వల్గుభాషిణీ' అనియు 'మృదుభాషిణీ' అనియు జెప్పబడెను. మృదు మనోహరముగా మాట్లాడునదే 'నోరు'. అట్టి పదముల నుచ్చరించునదే 'నోరు', గాని ఇతరములైనవి నోళ్లుగావని పండితులు చెప్పుదురు. శబరజాతులందరుగూడ, ఒక్కగదబజాతితప్ప, నోరని చెప్పుటకు సంస్కృత పదములైన 'ముఖం' గాని 'తుండం' గాని వాడుదురు. గదబలుమాత్రము 'సార్మో' అని అందురు. ఈపదము పూర్వము అందరూ వాడేవారుగాని ఆర్యసంబంధముచే నామాట మరచిపోయిరి. వీరొక్కరే ఇంకనూ ఆపదమును వాడుచున్నారు. ఈ 'సార్మో' సంస్కృతములో, సరమా, అయినట్టు తోచుచున్నది.

'త్రిశిరు'డను రాక్షసుడు రెండుచోట్ల చెప్పబడియున్నాడు. మొదటివాడు ఖరుని సైన్యమునకు మొనగాడు. వీడు రామునిపైకి వెళ్లగా, సారథిని, గుఱ్ఱములనున్ను గొట్టివేసెనట. అందుపైన వాడు ఖడ్గము తీసుకొని ఎగిరివెళ్లుచుండగా రాముడు కొట్టిన బాణము రొమ్ములో తగిలి నేలబడిపోయినాడట.

'తతో హతరథా త్తస్మా
దుత్పతంతం నిశాచరమ్,
బిభేద రామ స్తం బాణై
ర్హృదయే సోఽభవ జ్జడః.'

ఆర. [illegible]

అప్పుడు రాముడు మూడు బాణములచే వానిమూడుతలలను నరికినాడట.

సాయకై శ్చాప్రమేయాత్మా
సామర్ష స్తస్య రక్షసః.
శిరాం స్యపాతయ ద్రామో
వేగవద్భి స్త్రిభి శ్శరైః.

తెలివితప్పి పడిపోయిన వాని తలలు నరకుట యోధునికి ఖ్యాతియా? ఇట్లు చెప్పుట రామునిపరాక్రమమునకు లోపముగాదా? ఇట్లు వాల్మీకి వ్రాయునా? ఈసర్గలో ౧౮, ౧౯ సంఖ్యగల శ్లోకములు వదలివేసిననూ కథాసందర్భము చెడదు. కాన 'త్రిశిర'అను నామముకు 'మూడుతలలు' అను అర్థము స్థాపించుటకు ఎవరో, ఈశ్లోకములను మధ్య దూర్చినట్లు కనబడుచున్నది.

ఈపేరున్న రెండవవాడు రావణునికుమారుడు. వీడుయుద్ధమువిషయమై తండ్రికిసలహా ఇచ్చునప్పుడుగాని, లేదా వాడు స్వంతముగా యుద్ధమునకు వెళ్లినప్పుడుగాని మూడుతలలు వానికున్నట్లు వర్ణించలేదు. వీడు హనుమంతునితో యుద్ధము చేసెను. ఆంజనేయులు కొట్టినదెబ్బతగిలి సొమ్మసిలి పడిపోయినాడట. అప్పుడు వీనిచేతిలోని కత్తినిలాగుకొని హనుమంతుడు గర్జించగా ఆశబ్దమువలన వీనికి తెలివి వచ్చినదట. అదిజూచి ఆకత్తితో వాని మూడు

తలలను వాయుపుత్రుడు నరికినాడట. బాగా సూక్ష్మదృష్టిని జూచిన ఇదంతయు 'త్రిశిర' అంటే మూడుతలలనే యర్థమును ప్రచురము చేయుట కెవరో దూర్చినట్లు కనిపించునుగాని వానిని మూడుతలలున్న వానివలె వర్ణించుట వాల్మీకి యుద్దేశమున్నట్లు తోచదు. 'దశశిరః'అంటే పదితలలని యర్థముచేసి రావణునకుపదితలలుండేవనిలోకప్రఖ్యాతియెట్లుగావించిరో'త్రిశిరస' అంటేమూడుతలలవాడని యర్థముచేసిరి. వాల్మీకియెచ్చటనుకూడ రావణునికిపదితలలు, యిరువది బాహువులు ఉన్నట్లు చెప్పలేదని లోగడ 'శారదలో' సప్రమాణముగా వ్రాసియుంటిని. అలాగుననే త్రిశిరుడు గూడ మూడుతలలుగలవాడు గాడు. కాని వీని కీపే రెందుకువచ్చెనో చెప్పసూచన లేమీ గ్రంథమందు లేవు. అయినను పైనచేసిన చర్చవలన అన్నినామములు శాబర భాషోత్పన్నములని తేలినదికదా! అందువలన ఈ పేరుగూడ ఆభాషదై ఉండును. గదబ భాషలో 'తీర్' అంటే పొడవనిన్ని 'సిరాఇ' అనగా 'దయ్యము'— 'తీర్ + సిరాఇ' అనగా పొడగైనదయ్యము. క్రూరునకు తగిననామమేకదా యిది. 'తీర్—సిరాఇ'యే'త్రిశిర' అయియుండును. ఈ'తీర్ 'యొక్క రూపమే 'తిరు'లో గన్పించుచున్నది. ఎత్తైనది అనగా పొడవైనదే గౌరవయోగ్యమైనది. ఎత్తైనస్థలములయందున్న స్థానముల నామములలో ఈ'తిరు' అనేమాట కనిపించుచున్నది. దీనిచర్చ వేరేచేయబడును.(తిరుపతి, తిరు+శిరపల్లి)

ఇతరరాక్షస, వానరనామములుకూడ వాటిపూర్వోత్తరములను చెప్పగలుగునేమో కాని వాటిరూపు చాలామట్టుకు మారిపోయినది. కొన్నిటికి బహుశః అర్థమైన సంస్కృతపదములనే ఉపయోగించియుండును. అవి ప్రస్తుతము కనుగొనుట, కవకాశ మేమీ లేదు. వాలి, సుగ్రీవ, అంగద, జాంబవంత, శూర్పణఖాదులైననామములు యెట్లుకలిగెనో కనుగొనుటకే మీ యవకాశము లేదు. ఇవి బహుశః మొదటినవరనామములకు సమానమైన సంస్కృతపదములేమో?

పైన చేసినచర్చవల్ల వానరులు, రాక్షసులు గూడ శాబరజాతులలో చేరినవారని తెలియనైనది. అయితే వీరితోకలు మొదలైన అమానుషాంగములు వీరికుండుట యెట్లు కలిగెనను ప్రశ్న కుత్తరువు గ్రహించుటకు రామాయణమునందు వర్ణించబడిన వీరిఆచారవ్యవహారములను పరిశీలించవలెను.

రామాయణమునందు జెప్పిన రాక్షసాచారములను లోగడ, శారదలో నొకవ్యాసము ప్రచురించితిని. కానవారి యాచారముల నిచ్చట తిరుగి చర్చించుట యవసరములేదు. వానరాచారములనుమాత్రమే పరిశీలింతము,

కిష్కింధా వాస్తవ్యుల గుణములను, ఆచారములను బరిశీలించిన అందరి వానరుల యొక్క సామాన్య వ్యవహారములు బోధయగును.

పంపాతీరమును వదలి కిష్కింధవైపున వచ్చుచున్న యన్నదమ్ములను జూచి ఋశ్య

మూకముపైనున్న సుగ్రీవుఁడు భయపడి పారి పోయినాడట.

"తతో దృష్ట్వా మహాత్మానౌ
భ్రాతరౌ రామలక్ష్మణౌ,
వీరాయుధధరౌ వీరౌ
సుగ్రీవశ్శంకితోఽభవత్.
ఉద్విగ్నహృదయ స్సర్వా
దిశ స్త మవలోకయన్,
నవ్యతిష్ఠతి కస్మింశ్చి
ద్దేశే వానరపుంగవః."

ఇప్పుడు సమేతము విశాఖపట్టణము, గంజాం జిల్లాలకొండల ప్రాంతమందున్నవారు నాగరిక జనులను జూచినతోడనే పారిపోయి దాగికొనెదరు. కాని వారలలో ఒకరిద్దరు మాత్రము పట్టణవాసుల సాంగత్యముచే ధైర్యమును, మర్యాదలను నేర్చుకొని యుందురు. ఎవరైనా ఈదేశీయుల గ్రామములకు వెళ్ళినచో ఈనాగరికత నేర్చినవారేవచ్చి ఆహ్వానము చేయుట, మాటలాడుట మొదలైనవి చేతురు. రామలక్ష్మణుల యొద్దకు ధైర్యముగా వచ్చి మాట్లాడిన హనుమంతుడు పట్టనవాసులతో కలసి మెలసి తిరిగి ప్రాపంచికజ్ఞానము నేర్చిన దేశీయుని వంటివాడు.

ఇప్పటికొండజనులవలెనే కిష్కింధావాసులుగూడ తంబురా, తముకు, మొదలైన వాద్యములతో పాటలు పాడుకుంటూ ఉత్సవములు చేసేవారు.

"గీతవాదిత్రనిర్ఘోష
శ్శ్రూయతే జయతాంవర!
నర్దతాం వానరాణాంచ
మృదంగాడంబరై స్సహ.
లబ్ధ్వా భార్యాం కపివరః
ప్రాప్య రాజ్యం సుహృద్వృతః,
ధ్రువం నందతి సుగ్రీవ
స్సంప్రాప్య మహతీం శ్రియమ్."

కిష్కిం-౨౯

తమ్ముడు అన్నచచ్చినతర్వాత అతనిభార్యను పెండ్లి చేసుకొనును. వాలిభార్యయైనతారను సుగ్రీవుడు పెండ్లియాడెను.

"స్వాంచ పత్నీ మభిప్రేతాం
తారాం చాపి సమీప్సితామ్,
విహరంత మహోరాత్రం
కృతార్థం విగతజ్వరమ్."

కిష్కిం-౨౭,౪

చిన్నవాడు పెద్దవానిభార్యను పెండ్లియాడవచ్చును గాని పెద్దవాడు చిన్నవానిభార్యను ముట్టగూడదు. అందుచేతనే వాలిని వధించుటకు రామునికి నేరము దొరకినది.

"అస్య త్వం ధరమాణస్య
సుగ్రీవస్య మహాత్మనః,
రుమాయాం వర్తసే కామాత్
స్నుషాయాం పాపకర్మకృత్."

కిష్కిం-౧౮,౧౯

ఈపైనజెప్పిన ఆచారములన్నీ ఇప్పటి సవర జాతిలో నున్నవి. పైగ్రామాలకు వెళ్లినప్పుడు పగలల్లా యెవరిపనిమీద వారుపోయి రాత్రికి అందరూ ఒక్కచోటనే చేరియుందురు. ఈ యలవాటు వానరులకుగూడ నుండెను.

"విచిత్య దివసం సర్వే
సీతాధిగమనే ధృతాః
సమాయాంతిస్మ మేదిన్యాం
నిశాకాలేషు వానరాః."

కిష్కిం-౪౭,౪

సారా, కల్లు, మొదలైన నిషాద్రవములు త్రాగునపుడు ఆకులతో చేసిన దొన్నెలలో ఆద్రవమును బోసికొని రెండుచేతులతో నెత్తి త్రాగుదురు. వానరులుగూడ నిట్లుత్రాగినట్లు చెప్పబడియున్నది.

"మధూని ద్రోణ మాత్రాణి
...హుభిః పరిగృహ్యాతే,
పిబంతి కపయః కేచి త్సం
ఘశ స్తత్రహృష్టవత్."

సుందర-౬.

సవరలకు ధాన్యము మొదలైన భోజన పదార్థములు నిలవలై యున్నను అడవిలో దొరకు కందమూలాదులు తినెదరు. వానరులు సహితః మట్లే చేసేవారు.

వీటిఅన్నిటికంటెను వానరులకును సవరలకును జాతివిభజనయందెక్కువ సామాన్యతగన్పించుచున్నది. కోతియనియర్థమిచ్చే పదములో కొన్నిమాత్రమే రామాయణమున ఉపయోగింపబడియున్నవి. 'వానర' అనుపదము ౧౦౫౦సార్లున్ను, 'హరి' ౫౩౫సార్లు, 'కపి' ౪౧౧సార్లు, 'ప్లవంగ' ౨౩౭మార్లు, 'శాఖామృగ' ౨౨సార్లు, 'వనచారః' ౯పర్యాయములు, 'వనకోవిద'౧మారు,'వనౌకస'౪౪సార్లు, 'కాననౌకస' ౭ సార్లు వాడబడి యున్నవి. 'మర్కట' అనుపదము ఒక్కసారి యైననూ ఉపయోగించలేదు. కాన స్వల్పముగావాడిన పదములు ప్రాసకొరకు, ఛందస్సుకొరకు ఉపయోగించినట్లు అగుపడుచున్నవి.

విశేషపర్యాయములు ఉపయోగించబడినపదముల నెట్లు సమర్థించనగును? వనమునం దుండేవారు గానవానరులైరి. కొన్నిచోట్ల కవియే 'వానర' అనుపదమును 'వనచారీ' అను పదముచే వారినిజస్వభావమును దెలియజేసెను. వేగముగా పరుగెత్తేవారుగాన 'ప్లవంగము' పదము సార్థకమైనది. ఇట్లు అన్ని పదములు సార్థకములే యని చూపవచ్చును గాని 'కపి' అనుపద మెట్లు సార్థకమగును?

సవరవారలలో నొకజాతికి 'కోతు' లని వారిభాషానామ మొకటి యున్నది. 'అర్సి' లేక 'అరిశి' అనగా సవరభాషలో 'కోతి' యని యర్థము. వీరికి సామీప్యములో నుండు ఓఢ్రులు ఈ 'అర్సి' జాతివారిని 'లంబోలంజియా' (పెద్దతోక గలవారు) అని పిలుతురు.

"A tribe of savaras is called Arsi or a risi which means a monkey in the language of the Savaras. By their Oriya neighbours they are called 'Lambo Lanjia' (Long tailed) which is the Oriya equivalent to Arsi. they got the name from a long piece of cloth which the males allow to hang down." (Castes and tribes of S. India, Thurston)

ఈ 'అర్సి' అనునామము మొగవారి బట్టకట్టువలన ఆజాతికి వచ్చినది. అందుచేతనే రామాయణమునందు గూడ మొగవారికే

తోకలున్నట్లు చెప్పియున్నది. కాని ఆడువారికి తోకలున్నట్లు చెప్పలేదు. ఉత్తరకాండలో నెచ్చటనో ఒకదగ్గర యున్నదంటే అది తగిన ప్రమాణముగాదు. ఉత్తరకాండలోని హాంశములకును, కడమకాండలలోని హాంశములకును సరిపోదని ఇదివరకొకనిదర్శనము చూపించబడియె.

'అర్శి' అనుపేరును 'లంబోలంజియా' యని ఓఢ్రులు వారిభాషలోనికి తర్జుమా చేసి యెట్లు ఇప్పుడు చెప్పుచున్నారో, పూర్వము వాల్మీకికాలములో వానరులకు సమీపమునందు నివసించియుండు ఆర్యులు వారిభాషలో 'కపి'యని మార్చి చెప్పియుండిరి. కవిత్వము చెప్పవలసినచ్చినప్పుడు ఛందస్సుకొరకు 'కపి'కి ఉన్నయావత్తుపర్యాయపదములు వాడుటకు అవసరముండును. అయినప్పటికి కేవలము కోతిమృగమునకే అర్థమిచ్చే 'మర్కటము'మాత్రము ప్రయోగించలేదు.

ఈజాతివారు కట్టుబట్ట తోకలాగు వ్రేలాడగట్టుదురు గాన వీరికి 'అర్శి' అనగా 'కపి' అనునామము వచ్చినది. ఈతోకను ఆదరువుగా దీసికొని వాల్మీకివీరిని 'ఋక్షాః', 'వానరాః', 'గోలాంగూలాః' అని మూడు జాతుల నేర్పరచినాడు.

'ఋక్షః' అంటే ఎలుగుబంట్లు అని అందరూ అర్థము చేసియున్నారు. అదేనిజమైతే ఎలుగుబంట్లు కోతు లెట్లగును? ఋక్షజాతివారికి పెద్దయైన జాంబవంతు నెన్నిచోట్లనో 'మహాకపిః' అని చెప్పియున్నది ఋక్షరజస్సు కొమారుణ్ణి 'కపి' అని చెప్పియున్నది. గాన 'ఋక్షః' అనగా ఈసవరలలో ఒకజాతికి పేరైన సవరపదముయొక్క సంస్కృతతర్జుమా అయి యుండవలెను.

'వానరాః' అనుపదముఅడవియందుండే అన్నిజాతుల సవరలకూ చెందును.

'గోలాంగూలాః' అనగా కొండముచ్చులని యర్థముచేయుచున్నారు. 'గోలాంగూలాః' అనుపదమునకు 'గోవుపుచ్ఛము వంటి పుచ్ఛముగలవారని' యర్థము. గోవుతోకకు కొనను చామరమువంటి కుచ్చుండును. ఇట్టి కుచ్చు కొండముచ్చులతోకలకి ఉండదే! కాన ఈయర్థము సరిపోలేదు.

సవరలు బహుచిత్రముగా నలంకరించుకొందురు. తలజుత్తు నడినెత్తికి యెత్తి ముడివేతురు. అందులో పొడవాటి పిట్టపెంపకలు పెట్టి కట్టుదురు. అవి లేకుంటే జుత్తు మొదట మాత్రమే ముడివైచి మిగిలినజుత్తును కుచ్చువలె వ్రేలవేతురు.

'Usually a Saora's dress (his full dress) consists of a large bunch of feathers (Generally white) stuck in his hair on the crown of his head, a coloured cloth round his head as a turban, and worn much on the back of the head, and folded tightly, so as to form a good protection to the head, when feathers are not worn, the hair is tied up on the top of the head or a little at the side of it. (Castes and Tribes of Southern India, by Thurston)

నడినెత్తిని ఒక్కచుట్టచుట్టి మిగిలిన జుత్తును వ్రేలాడించిన 'గోపుచ్ఛాకారము' స్ఫురించును. కావున 'గోలాంగూలు' లంటే ఇవ్విధముగా జుత్తును వ్రేలాడవేశే సవరవాండ్రని యర్థము.

ఈకాలపు సవరలకు వారి యలంకారములవలన జాతిభేదము గలిగినటులే పూర్వమందుగూడ వారికి జాతిభేదము బట్టకట్లవల్ల, అలంకారములవల్ల గలిగియుండెను.

ఈ పైచర్చవలన వానరుల భాష సవరభాష, వారిజాతి సవరజాతి అని తెలినది. వీరికి నిజముగా దేహమందు ఒక అవయవముగా నుండే తోకలేదు. కాని మొగవాండ్రు పొడవుగా ముందువెనుక తోకవదలి బట్టకట్టుట చేవారికి వారిభాషలోనే కోతియను అర్థమునిచ్చుపదము నామమై యున్నది. అందుచే వీరిని కోతులనిచెప్పనారే కాని నిజమైన కోతులని కాదు.

రామాయణకాలమందు ఈ సవరలు మూడుజాతులుగా భాగింపబడినట్లువారిభాషా పరిశీలనవల్ల తేలుచున్నది.

కోసలదేశపు దక్షిణసరిహద్దైన 'స్యందికా'నదినుండి చిత్రకూటమువరకు నున్న సవరవారు ఆర్యులతో విశేషసాంగత్యము గలిగి వారితో కలసిమెలసి తిరిగేవారు. రామలక్ష్మణులు సీతతోగూడ వచ్చినారని వినినతోడనే అచ్చటిసవరరాజైన గుహుడు ఎదురువచ్చినాడు. రాముడు వాని నాలింగనము చేసికొనినాడు. రామునికి భోజనపదార్థములను గుహుడు తీసుకువచ్చినాడు. కాని రాముడు 'ఫలమూలాశన' వ్రతధర్ముడగుటచే వాటిని పుచ్చుకోలేదు.

అయోధ్యా—౫౦,౪౪.

తరువాత భరతుడు వచ్చినప్పుడు ఈలాగే గుహుడు సామగ్రులను దెచ్చి భరతునికే కాదు. అతనితో వచ్చినవారి కందరకూ భోజనము పెట్టెను.

అయోధ్యా—౮౪, ౧౭; ౮౫, ౨.

'శృంగిబేర'మనునామము సగము ఆర్య సగము అనార్యపద మెటులయ్యెనో అటులే, ఈజాతిసవరలు గూడ కొన్ని ఆర్యాచారములను, గొన్ని అనార్యాచారములను అవలంబించియుండేవారు. వీరిని 'నిషాదుల'ని చెప్పియున్నది.

వీరివృత్తులు ఓడలుగిట్టుట, గంగపై ఓడలు నడపుట, ధనుర్బాణములు ధరించి అడవులలో నేటాడుట మాత్రమే చెప్పయున్నవి. వీరు ఆర్యులతో గలసిమెలసి యుండుటచే ఆర్యసంఘమర్యాదలు వీరి కబ్బినవి. రామలక్ష్మణులు వచ్చియున్నప్పుడు వారినెదుర్కొని వారికి తగినమర్యాదలను జేసినారు.

"తతో గుణవ దన్నాద్య
ముపాదాయ పృథగ్విధమ్,
అర్ఘ్యం చోపానయ త్క్షిప్రం
వాక్యం చేద మువాచహ."

అయోధ్యా—౫౦, ౩౭.

భరతుడు సైన్యముతో వచ్చుచుంటే రాముని పైకి దాడివెడలుచున్నాడేమో అనుకొని భరతుని నెదుర్కొనుటకు యత్నముచేసెను.

"రక్షిష్యామి ధనుష్పాణి
స్సర్వతో జ్ఞాతిభి స్సహ"
అయోధ్యా—౫౦, ౭౮

రెండవ జాతివారు 'శబరి' వలన తెలియ పరుపబడినారు. పల్లవప్రదేశములయందు నివసించి ఆర్యులతో గలసి తిరిగివారియాచారములను బూర్తిగానవలంబించినజాతి ఇది. ఈజాతి వారికి పంపా మొదలు చిత్రకూటమువరకున్న ప్రదేశములో ప్రచారముండెను. అందుచేత నే 'మీరు చిత్రకూటమునకు వచ్చినది మొదలు మీసంగతి వింటున్నానని' శబరి రామునితో జెప్పినది. "చిత్రకూటం త్వయిప్రాప్తే విమానై రతులప్రభైః" (అర. ౭౪-౧౪). గురుశుశ్రూష, ఆతిథ్యము మొదలైన ఆర్యాచారములను బాగుగా నవలంబించినజాతి యిది. ఈజాతి మూలపురుషుడు 'మతంగుడు.' (అర—౭౪, ౨౧—౨౩) మతంగజాతివా రిప్పటికిని ఉన్నారు. వీరు సవరలలోనివారే......

మూడవజాతివారు కిష్కింధావాసులు. వీరి యాచారములను ఇదివరకే పరిశీలించి చూచినాము. అడవులలో తిరిగి కందమూలాదులను దినుచు, వ్యవసాయముచేసి పాడిపంట గలిగి యుండేవారు. వీరినివాసము కొండలపైనే యుండుటచే కొండలపైన వేగముగా తిరుగగలరు. వీరికి ధనుర్బాణములున్నట్లు రామాయణములో చెప్పియుండలేదు. ఇప్పటి సవరలకుగూడ ధనుర్బాణములు అంత ముఖ్యాయుధములు గావు. 'సవర' యనునొకవిధమైన గొడ్డలి ప్రతివానిచేతిలోనూ ఎల్లకాలములయందు నుండును. దీని నుండియే వారి కాపేరు వచ్చెనని యొకవిద్వాంసుడు చెప్పియున్నాడు. రామాయణకాలములో వీరు రాళ్లతోను, చెట్ల కొమ్మలతోను యుద్ధము చేసినట్లు కనబడుచున్నది. రాముడు లంకనుండి తిరుగా అయోధ్యకు వెళ్లునప్పుడు వానరస్త్రీలనుగూడ తీసుకువెళ్లి అయోధ్యాపట్టణమును జూపెంచెనట. ఈతెగవారిని 'వానరు ల'ని రామాయణమునందు జెప్పియున్నది. వీరే 'అర్శ' జాతివారు.

రామాయణమునందు చెప్పియున్న వానరులు వీరు—కొండలపైనుండు సవరలు. వీరలలో మొగవారు బట్టకట్టునప్పుడు శోకవదులుదురు గాన వీరికి 'అర్శి' (కోతి) జాతి యని పేరు వారివారే చెప్పెదురు. నేటికిగూడ ఈ జాతివా రట్లే శోకవదలి బట్టగట్టుదురు. గవర్నమెంటు లెక్కలలో సహిత మీజాతివారికి 'లంబోలంజియా' జాతియని ఓఢ్రపు నామము వ్రాసియున్నది. ఆకాలములోగూడ నిటువలెనే 'అర్శి' అనుసవరనామములకు 'కపి' అని సంస్కృతములోనికి మార్చి చెప్పిరే కాని వారు నిజముగా శోకలుగల కోతులు గారు.



# కవి జిజ్ఞాస

శ్రీ శేషాద్రి రమణ కవులు, శతావధానులు

హరియే దైవమటంచు నొక్కరుఁడు, పుణ్యస్థానసందర్శన
స్మరణంబే యపవర్గమంచు నొకఁ, డీ సంసారమే మోక్షసు
స్థిరకల్యాణమయంబటంచు నచియించెన్ వేఱొకం, డీపర
స్పరవైరుధ్యము దిద్దుటెట్టులగు దేవా, సర్వలోకేశ్వరా!

శా. కాలక్రూర దురంతకాసర మహాఘంటారవంబుల్ శ్రవః
పాళిన్ భిన్నము చేయుచో నినుస్మరింపన్ నేర్తునో నేరనో
కాలాసన్నము గాకముందు మదిలోఁ గాంక్షింతు విజ్ఞానల
క్ష్మీలాభం బొనగూర్పుమయ్య, గుణరాశీ, సర్వలోకేశ్వరా!

మ. పరసేవాకరణశ్లథంబయిన భావం బెట్లు నీనామసం
స్మరణానందము నొందనేర్చు? కలుషాచార ప్రచారంబులం
బరుగుల్ పెట్టుచునున్న జీవితము నీపాదాంబుజాతద్వయీ
పరిచర్యావిధి నెట్లు ధన్యమగు దేవా? సర్వలోకేశ్వరా!

మ. కవితాకాంతకు బుద్ధి, భాషకు సమగ్రంబైన యూహాదివై
భవముల్ కావ్యరసప్రపంచమునకుం బ్రాణంబు, సంసారసం
భవకష్టార్థము మే నొసంగిన కళాపారంగతుం డెట్లు నీ
స్తవముం జేయఁగలాఁడు తీఱికగ నీశా, సర్వలోకేశ్వరా!

శా. ఏరూపంబున నున్నవాఁడవని యూహింపంగ నేర్తున్ మఱే
పేరం బిల్చెద నెందు నుందువనుచుం బేర్కొందు నెం దేఁగుదున్
దారాపుత్ర దురీషణావృత దురంతక్రూర సంసార చిం
తారంగస్థలి దాటుటెట్లు పరమాత్మా, సర్వలోకేశ్వరా!

మ. మునుముం దెప్పుడొ భక్తియోగకలనంబుం బూన నౌనంచు నా
మనముం దెంచితిఁగాని, యప్పటికి నేమార్పానో యీనాఁడె నీ
యనుఁగుం బిడ్డను నన్నుఁ గావుమనుచుం బ్రార్థింపఁ బ్రాల్మాలితిన్
చనె నజ్ఞానము ప్రోవరావె పరమేశా, సర్వలోకేశ్వరా!

మ. తనువో చంచలమం చెఱుంగుదును గాంతావ్రాత సంపర్కముల్
ఘనవిజ్ఞానహారంబుగాఁ దెలియుదున్, గర్మానుబంధంబులే

జననప్రాప్తికి మూలకారణముగాఁ జర్చింతునే కాని నా
మనముం నీపయి నిల్పనేరఁ గనుఁగొమ్మా సర్వలోకేశ్వరా!

మ. కవితాకల్పనముం, రసప్రచురశృంగార ప్రబంధంబులుం
నవభావాకరనాటకాదికములుం నాదృక్పథంబందు ను
త్సవముంగూర్చును గాని; మోక్షమహితార్థగ్రంథసంబంధముం
చవి గా వెట్లు తరింపఁగాఁ గలనో యీశా, సర్వలోకేశ్వరా!

శా. ఈదేహంబది పంచభూతమయ, మెం దేవేళనో తూలు మ
ర్యాదాలేశమె నిల్చు శాశ్వతముగా, నర్థంబులుం జుట్టముల్
పాదం జీవముఁ వాసినట్టియెడఁ దోడ్పా టెంపఁ గాఁబోరు తృ
ష్ణాదైన్యం బెటు వీడఁజాలుదు ననన్యా, సర్వలోకేశ్వరా!

మ. బ్రతుకా? యన్యజనావలంబము, శరీరంబా రుజాభూమి, స్వా
ర్జితమా నాస్తి, సహాయబంధుజనులా సర్వత్ర పూజ్యంబు, నా
గతి ముం దెట్టులుమాఱునో యనుచు శోకం బందునే కాని పం
డితుఁడైనన్ విడలేఁడు సంసృతిని దండ్రీ, సర్వలోకేశ్వరా!

శా. క్రీడారంగము నీకు లోకము, మహాకీలాలవారాశి నీ
రాడంగూర్చు సరోవరంబు, పటుసత్త్వాకీర్ణ ఘోరాటవుల్
వీడంజాలని నిష్కుటంబులు నభోవీథీ స్పృశచ్ఛైలముల్
మేడల్ నీ కగు నెందు నిస్గనెద స్వామీ, సర్వలోకేశ్వరా!

మ. మతముల్ సర్వము నీమహత్త్వమును సంభావించి బోధించు, స
ద్గతి కీవొక్కఁడవే ప్రదాతవని లోకంబెల్ల వాక్రుచ్చు, శా
స్త్రతతుల్ నిన్ దెలుపం బరస్పరవిభేదం బూని వర్తించు నే
వితముం గైకొనఁ జాలుదుం విగతగర్వీ, సర్వలోకేశ్వరా.

మ. తినుబండారముఁ దెమ్మటంచు నిసువుల్, దివ్యాంబరశ్రేణికై
వనితారత్నము, గ్రంథసంతతి కభిప్రాయార్థమై స్నేహితుల్,
ధనసంపాదనకై దురాశయును, సంతాపజ్వరజ్వాలలం
దనిశంబుం దహియింత్రు సత్కవుల నీశా, సర్వలోకేశ్వరా!

శా. ఆంధ్రం బిడ్డల నెంతదన్నినను మేలా లేదు సుంతేని, ప్రా
యాంధ్ర స్నిత్యముఁ గూడినన్ వలపు నిప్పాపంతయే నార దై
వ్యాంధ్రం గొల్చినఁగాని సంసరణ దుర్భారంబు పోకార దో
తండ్రీ, నీవొకరుండె దిక్కు దయరాదా సర్వలోకేశ్వరా!




కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గారు

మన దేశమునకు హిందూదేశమనియు మనమతమునకు హిందూమతమనియు మనకు హిందువులనియు వాడుక చిరకాలమునుండి వచ్చుచున్నది. ఈయది పరదేశములందును మనదేశమునందును గూడ విశేష వ్యాప్తి నందియున్నది. ఇట్టి లోకప్రసిద్ధిగల యీపదము మంచిదికాదనియు పరులచే నిందాద్యోతకముగా నీయఁబడినదనియుఁ గొందఱు వాదించుచున్నారు. ఈవాదమును నతి నవీనముకాదు. కొంతకాలమునుండి సాగుచున్నది. ఔననియు కాదనియు వాదప్రతివాదములు నడచినవి. నిందాద్యోతకము కాదని నేనిదివఱకే రుజువుచేసి యుంటిని. ఇట్లుండ నీనడుమ నొక రీసంజ్ఞ పారస్యాది భాషలలో 'బానిసీడు' 'దొంగ' అను నర్థము నిచ్చునదియనియు, పరులు తమ్ము నిందించుటకై వాడిన యీపదమును భారతీయులెల్లరు వాడుకొనుట శోచనీయమనియు, నీనింద్యపదము మనవారు వాడుకొనునంతకాలమును బరులకు దాసులైయుండక తప్పదనియుఁ గాన దీనిని వ్యవహారమునుండియు సారస్వతమునుండియు లాగివేయవలెననియు, దీని నుచ్చరించువారినోరు నొక్కవలెననియు, నట్లుచేసినంగాని భారతీయులకు గతులు లేవనియుఁ బ్రమరింపఁజొచ్చిరి. కాన దీని యాథార్థ్యముం గూర్చి నేను మఱల కొంత ముచ్చటించుకొన వలసి వచ్చినది.

హిందూశబ్దమును మనము తప్పక వాడుకొని తీరవలసినంత యవసరము లేదు. అది వ్యవహారమునుండి తొలఁగిపోయినంతన హానిలేదు. కాని యయ్యది వాడుకలో నుండినను నేవిధమగు చిక్కును లేదు. పైఁగా నిది వ్యవహారములో నుండుటయే లాభకరమని కొందఱు భాషావేదులు తలఁచుచున్నారు. అది యటుండ నిది విశేషవ్యాప్తి నందియున్నదని ప్రతివాదులే యంగీకరించియున్నారు. ఇంత వ్యాప్తిగల యీపదముపై దాడిసలిపి దీనిని దుడిచివేయఁ బ్రయత్నమేల చేయవలెను? ఈయది సులభముగాఁ దొలఁగిపోవునా? బహుకాలమునుండి సార్వత్రిక వ్యవహారములోనున్నది యింతలో మాసిపోవునా! భారతీయులెల్లరు బహుకాలము వఱకు విశ్వప్రయత్నము చేసినంగాని యిది వ్యవహారమునుండియూడిపోదు. అంతశ్రమ తీసికొన నవసర మింతయుఁ గాన్పించుటలేదు.

భారతీయు లన్యదేశీయుల మ్లేచ్ఛులని నిందించినట్లే యన్యదేశీయులు భారతీయుల హిందువులని నిందించిరనియు నట్టి నిందావాచకమును భారతీయులు తామే నిశ్శంకముగా వాడుకొనుట యనుచితము కాదాయనియు భారతీయులు నిందాద్యోతకముగా నన్యదేశీయులపట్ల వాడిన మ్లేచ్ఛశబ్దమును నన్యదేశీయులు వాడుకొనుచున్నారా యనియుఁ బ్రతివాదులు శంకింతురేని హిందూశబ్దము నిందాద్యోతకమగుచో నాశంక తగియే యుండును. కాని పరికించిచూడ వారివాదము సత్యదూరముగాఁ గాన్పించుచున్నది.

## హిందూశబ్దము నిందాద్యోతకమా ?

మనము వాడుకొనుచున్న హిందూశబ్దము నిందాద్యోతక మెంతమాత్రమును కాదు. "ఇది యేదోయొక పామరజన వ్యవహారమే కాక ప్రాజ్ఞులు, కళాకోవిదులు, బుధులు, విద్యాసంపత్తి గలిగిన పండితవరేణ్యులు సహితము మేము హిందువులమని చెప్పుకొందురు" అని ప్రతిపక్షులే లిఖించిరి. పరులు తిట్టుతిట్లను వివేకనిధు లెవరైనఁ దమపట్ల వాడుకొందురా? ఇది నిందాద్యోతకము కాదు కావుననే వివేకులగు భారతీయులెల్లరుఁ దాము హిందువులమని చెప్పుకొనుచున్నారు.

### ఎట్టివారు దీనిని వాడుకలోఁబెట్టిరి?

పండితకవి శేఖరుండగు నాంధ్రకవితా పితామహుఁడు తన కాశ్రయుఁడగు శ్రీ కృష్ణదేవరాయల వారిని "........హిందూరాజ్య రమాధురంధర" అని సంబోధించి యున్నాడు. మహమ్మదీయులతో సదా పోరాటము సలిపి విజయమునందుచు వచ్చిన వీరాగ్రేసరుఁడు కృష్ణదేవరాయఁడు. నిజముగ నాతని కాలమునఁ దురుష్కులు నిందార్థ ద్యోతకముగా భారతీయుల హిందువులని బిలుచుచు వచ్చినయెడల నివేకులు సహింప నొల్లని యీ తిట్టును పెద్దనార్యుఁడు పెద్దగాఁ దీసికొని సమస్త భారతీయులచే గౌరవింపఁబడుచున్న వీరపుంగవుండగు తన కృతిపతిని 'హిందూరాజ్య రమాధురంధరా' యని పిలుచునా? తురుష్కులు వాడు నిందా వాక్యములఁ బెద్దనార్యుడును రాయలవారును గ్రహింపఁ గొనఁజాలక సద్భావ ద్యోతక వాక్యములనుగాఁ దీసికొనిరనుట తగునా? వారట్టి యల్పులు కారనుసంగతి మన మెఱుంగుదుము. కాన హిందూశబ్దము నిందాద్యోతకమనియు, నయ్యది విగ్రహారాధనమును నిందించు మహమ్మదీయులనుండి మనకు వచ్చినదనియుఁ దలంపరాదు. అది ఘనతను సూచించుపదము కావుననే పెద్దనాది మహాకవులు గౌరవార్థ ద్యోతకముగా వాడియుండిరి.

### ఎప్పటినుండి యీశబ్దము వాడుకలో నున్నది?

ఈ విషయమై ప్రతిస్పర్థి లిట్లువ్రాసిరి:

"అన్యదేశీయు లీదేశమునకు వచ్చినప్పు డందు ముఖ్యముగా క్రీస్తుశకము 711 వ సంవత్సరప్రాంతమున మహమ్మద్ బిన్ ఖాసిం అరబ్బీదేశమునుండియు, వాని తరువాత 994 సంవత్సరప్రాంతమున గజ్నీ మహమూద్ తండ్రి సిబక్తజీను పారసీకదేశము నుండియు, ఈదేశమునకువచ్చి ముసల్మానులుగఁ దిరుగుట కభ్యంతరములు సమకూడగాఁ బ్రచ్ఛన్నవేషములఁదాల్చి ఆసేతు శీతాచల మధ్యదేశమంతయు మెట్టివెడలి ఇక్కడిప్రజలను నిందించు సందర్భమున "వారి స్వభాషలో "హిందు-చానిసీడు-చండాలుఁడు అని పేరిడినారు." ఇది సత్యమగు వ్రాఁత కాదు. హిందూశబ్దము సంస్కృతపదమేయని కొందఱు వాదించుచున్నారు. తారానాథ తర్కవాచ స్పత్యము, శబ్దకల్పద్రుమము మున్నగు ఘనకోశములందు నియ్యది సంస్కృత పదముగానే యీఁబడి వ్యుత్పత్తి యొసంగబడి యున్నది. మేరు తంత్రాది ప్రాచీన సంస్కృత గ్రంథములందు నీపదము కాన్పించుచున్నది. బహు సంస్కృత శాసనములలోనిది కలదు. కాని వేదాదులందుఁ గానరాదు. అయినను వేదమువలెనే ప్రాచీనమగు జందవేస్తా యందు మనదేశపరముగా నిది వాడబడి యున్నది. అందు "హింధవ" అని కలదు.

హీబ్రూ భాషయందుకూడ మనదేశమునకు 'హాంవ్' అను పదము వాడబడియున్నది. యహూదియానుల (యూదుల) మతగ్రంథమగు బైబిలు పూర్వ భాగములో (Olotas a meni) 17 వ పుస్తకమగు (The Book of Esthar) ప్రథమాధ్యాయములో "హిందూ" దేశ ప్రశంసకలదు. ఈపూర్వ నిబంధనము క్రీస్తు పుట్టుటకుఁ బూర్వము 500 సంవత్సరములనాటిది. దీనిలో ఆహాసురస్సు అనురాజు "హాంవ్ మొదలు ఈథ్రీయోపియా వఱకును రాజ్యముచేసెను" అని హీబ్రూ భాషలో వ్రాయఁబడియున్నది. ఈ "హాంవ్" మన హిందూదేశము కాననే యింగ్లీషు బైబిలులో నీవాక్యమిట్లు భాషాంతరీకరింపఁబడి యున్నది.

"Now it come to pass in the days of Ahasuerus, this is Ahasuerus which reigned from India even unto Ethropia, over an hundred and seven & twenty provinces"

కావున హీబ్రూ బైబిలులోని "హాంద్" మన హిందూదేశమనుట కెంతయును సందేహము లేదు. 'హింద్' అను సంజ్ఞ లేక 'హాంవ్' అని యుండుటకు కారణ మేమందురేని దానికి మంచి కారణముకలదు. యహూదియా యనులచే నీపదము "పారశ్య" (పార్సీ) భాషలోనుండి గ్రహింపఁబడినది. పారశ్యులు చిరకాలముక్రిందనే యహూదియానులను జయించి యాదేశమునఁ బరిపాలనము గావించిరి. ఆహేతువుచే హీబ్రూభాషలో పారశ్యభాషాపదములు చాలకలిసినవి. జందవేస్తాలోని "హింధవ" శబ్దము నుండియే హీబ్రూభాషలోని 'హాంద్' అను పదము పుట్టినది. జందోభాషలో ఇకారముతో ప్రారంభమైనపదములు

చాలవఱకు హీబ్రూభాషలోనికి వచ్చునప్పుడు అకార ముతోఁ గూడియుండుట కలదు. ఎట్లన:

| జందోభాష | హీబ్రూభాష |
|---|---|
| కిరియాన్ | కరయాయన్ |
| శికినా | సకనా |
| హిసియా | అశయ |
| హిజరస్ | యజానుస్ |
| బిరజోన్ | బర్జాన్ |

కాన జందోభాషలోని 'హిందవ' శబ్దము హీబ్రూ భాషలో "హంద్" అగుట యుచితముగానే యున్నది. 'హిందవ'లోని తుది వ యెట్లు లోపించె నందురేని హీబ్రూ భాషలో స, గ, ఘ, న, చ, ఝ, డ మొదలయిన యక్షరముల యుచ్చారణము కలిగినపుడు వానికిఁ దుది నుండు వ, స, జ యలు లోపించుట కలదు. ఎట్లన

సద్దవ సద్ద (లేక) సద్ద్
గడవ్ గడ్
దాడవల్ దాడవ్

ఇత్యాదులు చూచుకొనునది.

కాన సర్వనియమముల'హిందవ'శబ్దము హీబ్రూ భాషలో 'హంద్' (హాన్ద్) అయినదనిన సమ్మతిగిరయే యున్నది.

పైకారణములచే మన దేశమునకుఁగల "హిందు" సంజ్ఞ మిక్కిలి పురాతనమైనదని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ప్రతివాదులు తలంచినట్లుగా క్రీస్తు పుట్టిన పిదవాత మహమ్మదీయు లీదేశమునకువచ్చి యిచ్చటి విగ్రహారాధనాదర్శము గని యసహ్యించుకొని నిందార్థమై భారతీయుల హిందువులని పిలుచుటచే వచ్చినదికాదు.

ఈ హిందూశబ్దార్థ మేమి?

సౌరాష్ట్రియులు, హీబ్రూలు భారతీయుల నిందించుటకై హిందువులని పలికి యుండలేదు. గౌరవార్థ మయ్యేయట్లు పిలిచియుండిరి. హాన్ద్ శబ్దము విక్రమ, గౌరవ, విభవ ప్రజాశక్తి ప్రభావాదులను బోధించు చక్కనిశబ్దమై యున్నదిగాని నిందాద్యోతకమైన యర్థము కలదికాదు. డాక్టరు హేగ్ దొరవారి హీబ్రూ వ్యాకరణము (ఇంగ్లీషుభాషలోనున్నది) చూచిన నీ విషయము తెలియఁగలుగు. షరాషూస్ నామకుడను నొకగ్రీకు గ్రంథకర్త"భారతవర్షీయవిక్రమమును గౌరవమును గనిపెట్టియే యహూదియాను లాదేశమును "హన్ద్" అని పిలుచుచుండిరి"యని వ్రాసియున్నాడు. బైబిలు (ప్రాతనిబంధనము) లో జెప్పబడినదావీదు కుమారుడైన సాలోమాన్ కాలములో మన యీభరతవర్షము విద్యాధనములకు మిక్కిలి ప్రసిద్ధికెక్కి యుండెడిది. ఆకాలమున నితరదేశములన్నియు హీనస్థితి నుండగా మనదేశము సమస్త నాగరికతలచేతను ప్రసిద్ధికెక్కి లోకమునకు మార్గదర్శకమై యుండెడిదని యందఱును నంగీకరించి యున్నారుగదా! సాలోమాన్‌యొక్క విశ్వవిఖ్యాతిమైన గృహము నిమిత్తమై కట్టెలు, సున్నము, ఱాలు మొదలగు వస్తువులు మన హిందూస్థానము నుండియే వెళ్లినవి. అంతియకాక మోక్సుమూలరు దొరవారు వ్రాసిన "ఇండియా వాటిట్టుకన్‌టీచస్సు"(India, What it Can teach us) అను గ్రంథమును బట్టి చూడగా సాలోమాన్ జ్ఞానమునకుగూడ మన హిందూస్థానమే మూలమైనట్లు కాన్పించుచున్నది. మఱియును మెగాస్తనజ్ అనునతఁడొకచోట "యహూదియనులు పారశీలవలన జ్ఞానమును శిక్షయును,భరతఖండవాసులవలన నైశ్వర్యమును రాజకీయధర్మములను సంపాదించుకొనిరి." అని వ్రాసియున్నాఁడు. ఇట్టి "యహూదియనులు" భరతఖండ వాసులను "దొంగలు; దాసులు" మొదలగు నీచోక్తుల పాలుచేయుదురనిన నమ్మదగినది కాదుకదా? షరాషూసు నామకగ్రీకు గ్రంథకర్త వ్రాసినట్లు భారతవర్షీయు విక్రమమును గౌరవమును జూచియే యహూదియనులు "హన్ద్" (హందు) అనుసంజ్ఞ నిచ్చియున్నారనుట నిర్వివాదాంశము.

చీనాదేశస్థులు మన దేశమును పశ్చిమ స్వర్గమనియనారని యాదేశమందలి బౌద్ధమత గ్రంథములు నుడువుచున్నవని (క్రోఢీకృత) పుష్యమాసపు భారతి (పుట 111) వలన దెలియనచ్చుచున్నది.

ఇంకను హిందూకుష్ పర్వతము మొదలుకొని అటక్ సమీపమువఱకు నుండుజనులు పుష్తూభాష యందు

లాడెదరు. వీరు పారశీలలో నొకశాఖవారని చెప్ప వచ్చును. పారసీభాషతో వీరి పుష్తూభాష చాల సంబంధము కలదై యున్నది. వీరును మొదట అగ్నిపూజ చేయువారే. వీరి పుష్తూభాషలో హన్ద్ శబ్దము 'హన్దు' అని యుకారాంతముగా వాడబడియున్నది. పుష్తూ వ్యాకరణ నియమానుసారముగా 'ఉ' ప్రత్యయము యుక్తార్థము నిచ్చుచున్నది. దీనినిబట్టి శక్తి, గౌరవ, విభవ ప్రభావాదులు కలవారు హిన్దుజాతివారని తేలుచున్నది. ప్రాచీనార్య హిందూజాతియొక్క గౌరవ పవిత్రత్వ విభవాదులను జూచియే పుష్తూభాష మాటలాడువారు 'ఉ' ప్రత్యయముయొక్క ప్రయోగమును గావించియుండిరి. ఈ పుష్తూభాషలో హన్దు (హన్ద్) శబ్దము గౌరవవాచకము. ఈవిషయమై ప్రమాణముగా నీ క్రింది పుష్తూభాషాపద్యములను జూచుకొనునది.

(1) "పుర్ రోలబోడె జంగీర్ ఫేజోయాన్
ఉరోఉరో నన్‌లాఖ్ కూల్ లదేజంగేరే
హన్దుజేల్ ఫాల్ గో."

(2) "దేవాట్ డేర్ జుజరర్ ఉహేరమ్
కత్ లేచే పత్వేదేశ్ లర్ గో
హన్దుపీక్ సాడేరో."

ఇక పారశీమాట నాలోచింతము. పారశ్య లేఖకుడు జాకోలియెత్ (Joquo'ieth) తన గ్రంథములలో "అసాధారణబల, అసాధారణ విద్వత్తల కారణమున పూర్వకాలమున భారతవర్షము భూమిలోని సమస్త జాతులవారి యాదరణమునకు పాత్రమైయుండె" అని వ్రాసియున్నాడు. పారశీల జందో మన ఛందస్సు యొక్క వికారమే. ప్రాచీన పారస్యులు మనదేశ విషయమై చాల గౌరవము కలవారే. ఇట్టివారు హిందువులను దొంగలనియు దాసులనియు నెంచిరనుట యుచితమా? ఎంతమాత్రమును గాదు. ఇక నేనునింతకుపై నుదహరింపఁబడిన గ్రీకు గ్రంథకర్త చెప్పినట్లుగా భారతవర్షీయుల విక్రమ విభవాది యుత్తమ లక్షణములను బట్టియే వీరికి హిందుసంజ్ఞ కలిగినదనుట నిర్వివాదాంశ మగుచున్నది. తొల్లి యన్యదేశీయులు యాత్రార్థమయియును, దండయాత్రార్థమయియును యీదేశమునకు వచ్చి వని దీనిగూర్చి కొంత ముచ్చటించియుండిరి. వారి ముచ్చటలన్నియు భారతీయులు, జ్ఞానులు, సత్యవాదులు, మాయలేనివారు, దొంగతనమెట్టిదో యెఱుంగనివారు, వ్యవహారముపట్ల ఋజుమార్గముకలవారు ఋణదాతలకును, ఋణస్థులకును వ్రాత పత్రములులేకయే వ్యవహారము సాగించుకొనెడివారనియు లిఖించియున్నారు. అట్టివారిని పూర్వులగు నన్యదేశీయులు మరల దొంగలని పిలిచిరని తలంపవచ్చునా? అదిగాక పూర్వభారతీయులన్యులచే జితులై వారికి దాస్యముచేసినవారు కారు. సత్యరతియే యున్నయెడల పరులు వారిని దాసులనుట కెట్లు సాహసింపగలరు? ఈదేశ మానేతు హిమాచలము ప్రచ్ఛన్నవేషముతోఁ జూచినట్లిన సిబక్షిజేను మున్నగు వారి దేశస్థుల దాసులని పిలిచిరనిగదా ప్రతివాదులు చెప్పుచున్నారు. ఆకాలమునాఁడు భారతీయు లెవరికిని లొంగియున్నవారు కారే. అట్టవారిని దాసులని వారెట్లు భావించిరి? సత్యరతి యున్న నట్లు భావింపఁ జాలరు.

ఈవిధముగా నితరదేశస్థుల ప్రాచీన గ్రంథముల వలన విక్రమ విభవాదులనుబట్టి మనకును మనదేశమునకును హిందుసంజ్ఞ కలిగినట్లుగా దెలియవచ్చుచుండగా ప్రతివాదులు దీనిని నిందాద్యోతక మనుట యెంతవఱకు?

## మనప్రాచీనగ్రంథములంబట్టి

మన నిఘంటు బీజములంబట్టిచూచినను నీయది ఘనతనుసూచించు పదరాజమైయున్నదని యింతవఱకే వ్రాసినాను. ఇందునుగూర్చి వాచస్పత్యములో నిట్లున్నది "హిందు, పుం." హీనం దూషయతీతి దుష్-డుః (పృషోదరాదిత్వాత్సాధుః) జాతిభేదే" శబ్దకల్ప ద్రుమములో నిట్లున్నది. "హిందుః, పుం. హీనం దూషయతీతి దుష్-డుః పృషోదరాదిత్వా త్సాధుః-జాతివి శేషః." మన ప్రాచీన సంస్కృత గ్రంథములను బట్టిచూచినను నీయది ఘనతను సూచించు సంజ్ఞగనే కన్పడుచున్నది. ఈవిషయమై మేరు తంత్రములో నిట్లు వ్రాయఁబడి యున్నది. "హీనంచ దూషయత్యేవ హిందురి త్యుచ్యతే ప్రియే 'హీనందూషయతీతి హిందుః' అను నుత్పత్తి దీనివలనఁ దేలుచున్నది. ఈయుత్పత్తి నిప్పటి పండితులు కల్పించినట్లుగా ప్రతివాదులు తలంచు



వరశుల్క మహిమ

విద్యావతియు బుద్ధిమతియు నగు కన్య!

"అయ్యయ్యో! వరశుల్క పిశాచమా! ఎందఱు తలిదండ్రులను నీపొట్టను బెట్టుకొంటివో కదా! నా తలిదండ్రుల పైని నీ కన్ను పడెనే! వలదు, వలదు! నన్నే మ్రింగివేయుము."



మనోవ్యాధి

చితాచింతా ద్వయోర్మధ్యే, చింతానామ గరీయసీ;
చితా దహతి నిర్జీవం, చింతా ప్రాణయుతం వపుః.

వైద్యుడు:—"నీవు జేనినిగూర్చియు దీర్ఘముగా యోచింపకూడదు. నీ యారోగ్య మింకను చెడునుసుమా!"

రోగి:—అబ్బ! "నా కేవిచారమును లేదుసుమండీ! కాని తమ కీయవలసిన సొమ్ము విషయము మాత్రము................"



మీర్జా ఇస్మాయిల్
మైసూరు క్రొత్తదివాను గారు



'సైకికా' అనుపత్రిక సంపాదకురాలు,
అద్భుతమగు మేధాశక్తిగల ఆమె కుక్క

ఈ పత్రిక 'పారిసు' నగరమున ప్రకటింపబడునది. చిత్రమునందలికుక్క తన కుడికాలితో దశస్థానములను, ఎడమకాలితో ఏకస్థానములను లెక్కించి, తన వయస్సు, తన యింటినెంబరు మొదలయినవి చెప్పగలదు. మఱియు, సంకలన, వ్యవకలన, గుణకార, భాగహారముల లెక్కలను లెక్కించి ఫలితములను సరిగా చెప్పగలదు. తన్నడిగిన యెల్లప్రశ్నములకు 'అవును, కాదు' అను ఉత్తరము నీయగలదు.

చున్నారు. అది సరికాదు. అది ప్రాచీన తంత్రాదులందే కాన్పించుచున్నది.

ఈవిధముగా నన్యదేశస్థుల ప్రాచీన గ్రంథములును మనపురాతన గ్రంథములునుగూడ నీపదమును ఘనతను సూచించు దానిగాఁ దెలుపుచుండఁగా నియ్యది నిందను బోధించు పదమని వాదించు టసామంజస మని సర్వ్వరతులు సమ్మతింపక పోరని తలంచెదను. ఇది యోగ్యతను దెలుపునది గావుననే ప్రాజ్ఞులగు పెద్దనాదులు దీనిని దమగ్రంథములందు నిజ యాత్రేయుల గౌరవాతిశయమును వ్యక్తీకరించుటకై వాడియున్నారు. నీతియందుఁగాని జాతియందుఁగాని రాజ్యాదివిభవ విఖ్యాతియందుఁగాని, ప్రాచీన హైందవులు, పారసీలు మున్నగువారికి నెంతమాత్రమును దీసిపోవువారుగారు. విశేషించి వారిని మించినవారై యున్నారు. అట్టిస్థితిలో నన్యదేశస్థులు భారతీయులను నీచులనియు దొంగలనియు దాసులనియు బిలుచుట కవకాశ మింతయును గాన్పించుటలేదు.

## హిందూశబ్దము నిందార్థద్యోతకమని కొంద ఱెంచుటకు కారణ మేమి ?

ఇప్పటివారు హిందూశబ్దము నిందార్థ ద్యోతక మని తలంచుట కొక కారణముగలదు. ఇప్పటి తురుష్క భాషలలో నీ హిందూ శబ్దమునకు దొంగ, దాసుడు మొదలగు నర్థములుగూడ గలవు. ఇప్పటి భారతీయులందు దాస్యముకలదు. ఆహేతువుచేఁ గొందఱు భ్రమపడి మనకుగల హిందూశబ్దము దొంగ, దాసుఁడను నీచార్థము నిచ్చుదానినిగాఁ దలంచుచున్నారు. ఇది వట్టిభ్రమ. అరబ్బీ భాషయందును పారశ్య భాషయందును గూడ దొంగ దాసుఁడు నను నర్థములున్నట్లుగాఁ గాన్పింపదు. ఏమన నాయా భాషల దరచిచూచి విపుల నిఘంటు రాజమును వ్రాసిన యేట్సు దొరవారు తమ నిఘంటువులో నీ హిందూశబ్దమునకు క్రింది యర్థములను మాత్ర మిచ్చిరి.

Hindu—A. P. 1. A negro, a black, Arabian, Indian or Ethiopian.
2. A Gentoo
3. A mole or lock (of a mistress)

3 4 14

జాన్ షేక్స్పియరు దొరవారు వ్రాసిన బృహన్నిఘంటువునందుగూడ నిట్లే యున్నది. వీనింబట్టిచూచిన యీ శబ్దమున కంతగా నిందార్థ మున్నట్లు గాన్పింపదు ఆయా భాషలం బట్టి యర్థములు కలవన్నను వానియందైనను దొంగ, నీచుఁడు దాసుఁడను నర్థములు మాత్రమే యీశబ్దమున కీయబడి యుండలేదు. వారి నిఘంటువులందు హిందూశబ్దమునకు హిందూదేశము, తద్దేశస్థుఁడు, దొంగ, దాసుఁడను వివిధార్థము లీయఁబడి యున్నవని కొంద ఱనుచున్నారు. అందుచే పారశ్యభాషయందును అరబ్బీభాషయందును హిందూశబ్ద మేసందర్భమున నున్నను నిందాద్యోతకమే యనవచ్చునా? తుదకు పై నిఘంటువులనుబట్టి యరబ్బీదేశస్థుఁడను నర్థముగూడ కలుగుగదా! మన భాషయందుగల శ్రీ శబ్దమునకు లక్ష్మి యనియే కాక విషమను నర్థముగూడ నుండినంత మాత్రమున నాపదము లోకములో నిందార్థమునకు సిద్ధమై పోయినదా? పోలేదుకదా? అట్లే హిందూ శబ్దమునకు పాశ్చాత్య భాషలలో దొంగ దాసుడను నర్థము లుండినను హిందూదేశస్థుఁడను నర్థము గూడకలదు. కావున నీ యర్థమున దానిని నిందాద్యోతకముగా తీసికొన రాదు. హిందుశబ్దము పారస్యాది భాషలలో దాస్యము బోధించునది యని వాదము నిమిత్త మంగీకరించినను దానిని నామముగా దాల్చిన భారతీయులు దాసులై పోలేదు. స్వాతంత్ర్య విరాజితులై పరాక్రమ ధురీణులై వీరాగ్రేసరులై తొల్లి ప్రకాశించిన హిందువులిక్కాలమున క్రమక్రమముగా యోగ్యతా విహీనులై దాసులై పడియుండుటచే వీరిమూలముగా నుత్తమభావముగల హిందూశబ్దము న్యూనత కాస్పద మగుచున్నది. ఇక్కాలమున హిందువులనిననే దాసులను నర్థము కలుగుటలేదు. భారతీయులన్నను నాయర్థమే కలుగుచున్నది. ఆర్యావర్త దేశస్థులన్నను నాభావమే కలుగుచున్నది. కారణమేమి? ఈదేశస్థు లిక్కాలమున దాస్యము పాలగుట చేతనే. కాన ప్రాజ్ఞులగువారు వృథా వాదములను బెట్టుకొని హిందూశబ్దోచ్చారణము చేసిన వారినోళ్ల నొక్క సాహసింపకుందురు గాక! తమ దౌర్భాగ్యస్థితికి తమయుత్తమ పురుషలక్షణహీనత్వమే కారణముగాని తాము దాల్చిన హిందూశబ్దము కారణము కాదని తెలిసికొందురు గాక !

## వ్యుత్పత్త్యంతరము

శబ్దశాస్త్రచరిత్రమును, భారతదేశీయ చారిత్రమును నెఱింగియున్న పండితవర్యులు శబ్దశాస్త్రమును బట్టి మన హిందూశబ్దమునకు వ్యుత్పత్త్యంతరము నిచ్చుచున్నారు. మన సంస్కృతభాషలో సకారముతో ప్రారంభమగు పదము లనేకములు మనభారతవర్ష ప్రాంతములనున్న పారశ్యులభాషలో హకారముతో ప్రారంభించుట తెలియుచుగ గలదు.

| సంస్కృతభాష | పారశ్యభాష |
|---|---|
| సప్త | హప్త |
| సింధు | హిందు |
| సప్తసింధు | హప్తహిందు |

మున్నగు నుదాహరణములు చూచుకొనునది. ఈ పారశ్యులు మన సింధుశబ్దమును హిందుశబ్దముగా వాడుటచే క్రమక్రమముగా మనదేశమునకు హిందూదేశమను పేరు వచ్చినదని కొందఱు పండితులు చెప్పుచున్నారు. ఈ విషయమై కీ॥ శే॥ కొ॥ వెం॥ లక్ష్మణరావుగారు తమ హిందుదేశ కథాసంగ్రహములో నిట్లు వ్రాసిరి.

"హిందూస్థానమను పేరు మన పురాతనగ్రంథములలో చెప్పటను గానరాదు. ఇది పారసీకులు, రోమకులు, హూణులు మొదలయిన పరదేశీయులచే మనదేశమునకు బెట్టబడిన పేరు. ఈనామముయొక్క వ్యుత్పత్తిని గురించి యనేకు లనేక యూహలుపన్నిరి. వాని యన్నిటిలో నీక్రింది యుత్పత్తి నమ్మదగినదిగా నున్నది. ఈ దేశములోని మిక్కిలి గొప్పదియగు సింధూనదమును జూచి పరదేశీయులు దీనిని సింధూదేశ మనజొచ్చిరి. 'సింధూ' శబ్దమే 'హిందూ' శబ్దముగా బారసీకభాషన నూరెను. పారశీకుల వేదమగు 'జెండవేస్తా' లో సింధూనదని దానిలో గలసిన యుపనదులను నుద్దేశించి 'హాప్త హేందు' అని చెప్పబడియున్నది. ఈశబ్దము 'సప్తసింధూ' శబ్ద భవము గాన ఈ వ్యుత్పత్తియే నమ్మదగిన దని చెప్పనమ్మను."

బహుదేశములందలి భాషాభేదములు నమ్మదున్న యీ వ్యుత్పత్తిని బట్టిచూచినను హిందూశబ్దమునకు దొంగ, నీచుఁడు లోనగు నింద్యార్థము లున్నట్లుతలచుట కవకాశ మింతయు కాన్పించుటలేదు. ఎదుటి పక్షము వారు కారణమును జూపకయే యీ వ్యుత్పత్తిని వ్రోసి రాజనజూచిరి. అట్లుచేయుట యుచితముగాదు. హిందీ భాషలోని సరస్వతీ పత్రికలో పండితులచే హిందూ శబ్దార్థ విచారము కూలంకషముగా గావింపబడి యీ యది నునకను సూచింపు నుత్తమభావము కలదిగా లిఖింపబడియున్నది. చదువరుల యుపయోగార్థమై యా వాక్యరత్నముల నీ క్రింద నిచ్చుచున్నాను.

"హిందూశబ్ద కదర్థబోధకనహీ. హిందూశబ్ద గౌరవ గరిమా విక్రమ ఔర్ వీరత్వకా వ్యంజక్ హై. లోక హీరహే. క్యా ఆప్ అబ్ హిందూనామ ఛోడ్‌నా చాహతే హైఁ? జో ప్రాణశీతలకారీ బ్రహ్మవిద్యాకా ఆకార హై; జో విక్రమ ఔర్ విభవకీ ఖనీహై; వహీ పవిత్ర ఔర్ ప్రశస్తహిందూనామ హమారే మస్తకకీ మణిహై; హమారే దేశకా గౌరవ హై, హమారీ జాతికే మహత్వకా వ్యంజకహై; ఔర్ వహీ ఇస్ అధః పతిత అర్ధ మృతపదానత భారతీయజాతికే జాతీయజీవనకా పునరుద్దీపక హై; హిందూ ఏక్ ఐసాశబ్దహై; ఏక్ ఐసా నామహై; జిస్‌కే ఉచ్చారణసే భగ్నహృదయమే సిర్ ఆశాకా సంచార హో జాతాహై; క్షీణనసోమే బలస్రోత ఫిర్ వేగసే బహనే లగతాహై; అంతఃకరణమే జాతీయ గౌరవకా ఫిర్ అభ్యుదయ హోనాహై; ఔర్ మనమే బ్రహ్మానందకా అతిరిక్త అనుభవహోనేనే లగతాహై; తబ్ హిందూనామ హమ ఛోడేఁక్యం!"

ఈ హిందూశబ్దము నింద్యార్థబోధకము కాగు. ఈ శబ్దము గౌరవ, గరిమా, విక్రమ, వీరత్వాది వ్యంజకమైనది. కావున దానిని మనమిపుడేల విడుచుటకు యత్నింపవలెను. అది జ్ఞానవిజ్ఞానాది సర్వశాస్త్రీయ తత్త్వములకు నద్దమనంటిది. అది ప్రాణ శీతలకారియగు బ్రహ్మవిద్యయొక్క రూపము. అది విక్రమ విభవములకు గని. పవిత్రమును ప్రశస్తమును నైన హిందూనామము మనకు శిరోమణి. మనదేశమునకు గౌరవప్రదాయకము. మనజాతి మహత్త్వమును దెలుపునది. నుఱియు నది యీ యడుగున బడియున్న, సగము చచ్చియున్న, పదానతులై యున్న భరతవర్షములోని ఆర్యజాతికి స్వజీవనమును మరల నుద్దీపింప జేయునది. హిందూ అనునది యెట్టిశబ్ద

(నామ) మనగా దాని యుచ్చారణవలన — భగ్నహృద
యములలో మరల నాశా సంచారము గలుగను.
క్షీణించిన దేహములలో బలప్రవాహము వేగముగ
ప్రవహింపజేయును. అంతఃకరణములలో నుజ్జ్వలజాతీయ
గౌరవాభ్యుదయమగును. మనస్సులో అతర్కిత బ్రహ్మా
నంద భవనమగుచున్నది. అట్టి సంగతిలో మనము హిం
దూ నామమునేల విడుతుము?

కాబట్టి మనజాతి హిందూజాతి యనుకొనుట
కును మనమతము హిందూమత మనుకొనుటకును మనవా
రెవరును సందేహింపఁ బనిలేదు. ఇది మంచిపేరు. ఈ
పేరును దీసివేసికొనుటకు నవసర మింతయు గాన్పింపదు.
ప్రతివాదము సల్పు పండితవరులు బాగుగ విమర్శ పరి
శోధనమును జేసి సత్యమును గనుగొందురు గాక.



# గంగాస్తవము

నేరెళ్ల వెంకటసుబ్బారావు గారు

శ్రీమద్వ్యోమ తరంగిణీ! ప్రథితకాశీ క్షేత్రసంస్థాయినీ!
నామోచ్చారణమాత్రపంకదమనీ! నాకేశముఖ్యామర
స్తోమస్తుత్యపదారవిందయుగళీ! తుభ్యంనమో యంచు నిన్
నేమంబొప్ప మదిన్ దలంతుఁ గరుణ న్వీక్షింపు భాగీరథీ!

కం. సురగరుడోరగ విద్యా, ధర ఖేచరముఖ్యదేవతాతతిచేతన్
బరిచర్యలొందు దేవుని, శిరమున గాఁపుంటివేమి చెప్పదుఁ దల్లీ!

మ. జననం బచ్యుతపాదయుగ్మము నివాసంబీశు మూర్ధంబు, శాం
తనపుం డాత్మజుఁ డిద్ధతేజుఁడు, మనోనాథుండు రత్నాకరుం
డనయంబున్ విహరించు మార్గములు నార్యావర్తమధ్యస్థపా
వనభూముల్, జగదేకపావనివి నీభాగ్యంబు సామాన్యమే!

మ. అమితోద్రేకమనస్కులై సతత మన్యోన్యంబుఁ బోరాడుచున్
తమసామ్రాజ్యముతోడ హైందవులు స్వాతంత్ర్యంబుఁ గోల్పోయి య
న్యమహీనాథులదాసులైరనెడు చింతావ్యాప్తి శోకించెదో
విమలోత్తుంగతరంగఘట్టనసమావిర్భూత రావంబునన్.

శా. "(శ్రీ)వైకుంఠపురాధినాథపదరాజీవోద్భవన్ గాన, నా
ప్లావంబొందు సమస్తమానవులు దుర్వారోగ్రపంకంబు లీ
లేవన్ ద్రిప్పి రసాతలైకపురవాటిన్ ద్రోతు" నన్నట్లుగాఁ
బ్రావిర్భూతములై చెలంగు భవదీయావర్త సందోహముల్.



# ఈశావాస్యోపనిషత్

## భాగవతుల దక్షిణామూర్తిశాస్త్రి గారు

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే ।
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవావశిష్యతే॥ ఓం శాంతి శ్శాంతిశ్శాంతిః.

'శాస్తీతి శాస్త్ర'మను వ్యుత్పత్తిచే శాస్త్ర మెప్పుడును మాతృవద్ధిత శాసకమై అజ్ఞుడును అవివేకియు నగుపురుషుని స్వభావ ప్రవృత్తియైన యనర్థమునుండి నివారించి తత్త ద్వర్ణాశ్రమోచిత కర్మలను ఉపాసనలను విధానించి తదనుష్ఠాన చిత్తశుద్ధిక్రమవైరాగ్యముచే ముముక్షుత్వదశయందు "ఈశావాస్యమి" త్యాదివాక్యముచే తత్త్వసాధనమగు ఆత్మైకత్వజ్ఞానము నుపదేశించుచున్నది.

మూలమ్ ౧. ఓం ఈశావాస్య మిదగ్ం సర్వంయ త్కించిజ్జగత్యాంజగత్; తేనత్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనమ్.

ఈజగత్తునందు మహదాది భూతభౌతికాత్మకమగు కార్యరూప మెంతగలదో అందొక్క పరమాణువునుగూడ త్యజింపక సచ్చిదానంద కూటస్థరూపమగు, విశ్వరూపుడగు పరమేశ్వరునిచే నాచ్ఛాదనీయము. (ఈట్ శబ్ద సారస్యముచే) సర్వైశ్వర్యయుత పరమేశ్వరాభిన్న మను దృష్టిచే ద్రష్టవ్యమనియర్థము. పరమార్థతః ఆత్మయొక్కటేయైనను అవిద్యాదోషముచేత ఉపాధులుగను, ఘటపటాదులుగను (ఆకాశమువలె భిన్నముగా భాసమగుటవలన) అనర్థభాక్కులగు పామరులకు కన్పట్టుచున్నది.

"ఏకఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః;
ఏకధా బహుధాచైవ దృశ్యతే జలచంద్రవత్".

'జలచంద్రవత్ 'అనుశ్రుతిసంశయచ్ఛేదకముగా ఆత్మైకత్వమును ఘోషించుచున్నది. ఈపాడగట్టు జగత్తు భూతభౌతికాత్మకముగాదు. అను జగద్దృష్టి త్యాగముచేత నీయాత్మను పాలించుకొనుము. జీవు డజ్ఞానముచేత నే నీశరీరమును, నేనుమనస్సును యనునట్టి సంకోచస్వభావముగల మనస్సును పరమార్థతః భూర్భువస్సువర్లోకములను వ్యాపించినవాడైనను అణుస్వరూపు డగుచున్నాడు. ఆకారణమున ఆత్మోద్ధరణహేతువగు నాత్మ పరిపాలనము అనగా 'ఈమూడులోకములనిండ నేను వ్యాపించియుంటిని. ఈలోకములు నాకంటె భిన్నములు గావు' అనుజ్ఞాన ముపదేశింపబడినది. ఇట్లాత్మైకత్వదర్శియగు నీవు పూర్వసంస్కారము ననుసరించి ఒకానొకని ధనమందును కాంక్షనొందకుము. ఇట్లు సర్వత్యాగముచేత దేహయాత్ర, విహితకర్మపాలనము సిద్ధించక పొయ్యేవి యనుశంక విషయమై,

మూ. ౨. కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ంసమాః; ఏవం త్వయి నాన్యథేతోఽస్తి నకర్మ లిప్యతే నరే.

ఇచ్చట క్రియారూపత్వత్యాగమును స్వీకరించినచో దేహయాత్రాదికముసిద్ధించదు. కనుక నిది యశక్యమగుటచే సర్వత్యాగము క్రియారూపము గాదు. కింతు; ఈశావాస్య మను దృష్టినిమాత్ర ముపదేశించుచున్నది.

"మనసై వేదమాప్తవ్యం నేహ నానా స్తికించిన్"

యను శ్రుతిగూడ పైయభిప్రాయమునే వ్యక్త పరుచుచున్నది. ఇహలోకమందు తత్త్వద్వర్ణాశ్రమోచితకర్మల నాచరించుచునే శతసంవత్సరములు 'జిజీవిషేత్' గడుపవలయు. ఇచ్చట 'జిజీవిషేత్'అను పదము జీవితేచ్ఛను వ్యక్తపరుచునదిగాదని బుధులు గ్రహింతురుగాక! జీవితమందును, మరణమునందును గృధిని చేయ కూడదు, కర్మకరణమందును, కర్మాకరణ మం దు ను వి ద్వాం సు న కు ప్ర యో జ నా భా వ ము స మా న మే యై న ను లోక సంగ్రహార్థము కర్మ నాచరించుటయే శ్రేయస్కరమని తాత్పర్యము. "ఆస్తైకత్వ దర్శికినైనను" నహి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః" అనుగీతావాక్య ప్రమాణముచే జీవద్దశయందక్రియత్వ సంభావాపత్తి దుష్కరము. కర్మచేసిన పక్షమందు కారణకార్యన్యాయముద్వారా కర్మఫల మనుభవింపవలసివచ్చునేమో యనుశంకనుపోగొట్టుటకు'నకర్మలిప్యతేనరే'యని యాత్మజ్ఞాని కర్మత్వదర్శి గాకపోవుటచేతను,కర్తృత్వము, ఫలాభిసంధియుజ్ఞానముచేత నివృత్తమునగుటంజేసి కించిత్తైనను కర్మలేపమున కాస్పదుడు కానేరడు. ఇట్లుపదేశించి సర్వత్యాగాభావమందు సంసారము దుర్వారమని,

"మూ. ౩. అసూర్యానామ తే లోకాః అంధేన తమసాఽఽవృతాః, తాం స్తే ప్రేత్యాభిగచ్ఛంతి యేకే చాత్మహనోజనాః"

ఏఆత్మహనులగు జను లాత్మ యద్వితీయానందరూపముగ గుర్తెరుగజాలరో, యెవ రాత్మ స్వయంప్రకాశ జ్యోతీరూపముగా పరిపాలించుకొనలేరో ఆయసమర్థులు బ్రహ్మలోక పర్యంతము లబ్ధజన్ములు, ఆసుర ప్రకృతికములు పరిచ్ఛిన్న దేహాభిమాన లక్షణయుక్తములు నగులోకములఁ జేరుచున్నారు.

మూ. ౪. అనేజ దేకం మనసో జవీయః నైనందేవా ఆప్నువన్ పూర్వమర్షత్; తద్ధావతోఽన్యాన త్యేతి తిష్ఠ త్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి.

బ్రహ్మ తత్త్వతః ఆకాశవన్నిశ్చలము; ఏకము; కాని నిద్రావశము చేస్వప్నమునందువలె జాగ్రద్దశయం దవిద్యావశముచే నధ్యస్త పరిచ్ఛిన్న దేహాత్మభావము గలదై మనోనిమిత్తముచే వేగము గలదివలె గన్పట్టుచున్నది. రూపహీనమగుటచే నాత్మతత్త్వమును చక్షురాదిదేవతలు పూర్వమే యది సర్వత్రసిద్ధమగుటవలన గోచరింప చేసుకొనలేవు. ఆత్మతత్త్వము విశ్వరూపముచే మృత్యువాయు గరుడములను జవముచే నతిక్రమించి పోవున ట్లగపడును. మరియు ఆకాశవన్నిశ్చలమై సర్వాధిష్ఠానమై యస్మదీయస్వప్నదశయందువలె నధ్యస్తసర్పరజత జలస్థానీయములగు సూక్ష్మస్థూలభూత పంచకమును, వ్యష్టిజీవ సంఘములనుధరించుదానివలె కన్పట్టుచున్నది.

మూ. ౫. తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే; తదంతర సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః.

ఆబ్రహ్మ మాయచే విశ్వరూపమునందు చలించున ట్లగపడును. సత్యత్వేన స్థిరమగు భేదభ్రమచే దూరమునం దున్నట్లును అంతిక మునందున్నట్లును పొడగట్టును. ఈపరిదృశ్య మానమగు సర్వమునకును, జంగ మస్థావరా త్మగను, కార్య కారణాత్మగను; మూర్తామూ ర్తముగను, స్థూల సూక్ష్మాత్మగను, అభ్యంత రమునందును బాహ్యమునందును వ్యాపించి యున్నది. అనగా నిరంతరమైనదని నిష్కృష్టార్థము.

మూ. ౬. యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యేవా నుపశ్యతి;సర్వభూతేషు చాత్మానం తతోనవిజిగుప్సతే.

ఆత్మైకత్వదర్శి బ్రహ్మాది పిపీలికాంతము లగు ప్రకృతి మహదాదులను అధిష్ఠానమగు నాత్మయందు మరుజలవత్, ద్విచంద్రవత్ అధ్యస్తములైనవని చూచునో, అటులనే పూర్వోక్తములగు సర్వభూతములందును తన యాత్మ నఖండరూపముచేత నధిష్ఠానతయా యనువర్తించునో అజ్ఞాని సర్వత్యాగ సహిత మగు నాజ్ఞానముచే నేను మరణించుచున్నాను నరకమునకు పోవు చున్నాననియు, జీవద్దశ యందు తదితరుల దృష్ట్యా తాను రిక్తుడననియు భ్రమించడు; కళాహీనుడుగాడు.

మూ. ౭. యస్మిం త్సర్వాణి భూతాని ఆత్మైవాభూద్విజానతః;తత్ర కోమోహః కశ్శోకః ఏకత్వ మను పశ్యతః.

ఎవ డీభూతభౌతికమంతయు తనయాత్మ విభూతినాచ్ఛాదించి ప్రపంచత్వేన భాసించు చున్నవోయవి యసత్యములనియు, తనకంటె భిన్నమగు వస్తువే లేదనిగురూపదేశ మనుస రించునో అట్టి విద్వాంసుడు శోకమునకుగాని, మోహమునకుగాని యేూస్పదు డెట్లగును? ఇచ్చో 'అభయంవై జనక ప్రాప్తోసి; అభయప్ర తిష్ఠాం విందతే' ఇత్యాది శ్రుత్యంతరములచే నభయప్రతిష్ఠ విహితము. అజ్ఞానదశయందును ద్వితీయవస్తువు లేనప్పటికి తనయాత్మయందే భేదకల్పన చేయుటచే భయప్రసక్తి గలదు. కాని విద్వాంసున కది దూరము.

ఇక బ్రహ్మస్వరూప నిరూపణము.

మూ. ౮. సపర్యగాచ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరగ్ం శుద్ధ మపాపవిద్ధమ్, కవి ర్మనీషీ పరిభూ స్స్వయం భూర్యథాతథ్యతోఽర్థాన్ వ్యదధాచ్ఛాశ్వతీభ్య స్సమాభ్యః.

ఆత్మస్వరూపము సర్వగతము, అద్వితీయము,శుద్ధముస్వయంప్రకాశమునైయున్నది. శరీరత్రయ మవిద్యాకల్పిత మగుటచే అవిద్యానివృత్తికాగనే రజ్జుసర్పన్యాయముగనే తుచ్ఛమగు స్థూలసూక్ష్మకారణత్రయరహితమైనది. నిత్యాసంగుడగుటజేసి పుణ్య పాపరూపకర్మ బాధారహితుడును, సర్వసాక్షియు, మనోనియంతయు స్వతస్సిద్ధుడునునైయున్నాడు. సంవత్సరాఖ్యులగు ప్రాజాపత్యులకును స్వస్వసుకృతానుసారముగా అవిద్యపాపసములైనను స్వమాయాశక్తిచే భోగ్య పదార్థములను సృజించి ఇచ్చుచున్నాడు.

"మూ. ౯. అంధం తమః ప్రవిశంతియే ఽవిద్యా ముపాసతే; తతో భూయ ఇవ తేతమోయ ఉ విద్యాయాగ్ం రతాః.

ఇచ్చట అవిద్య కార్యకర్తృత్వాద్యభిమానము గలదగుటచే విహితాగ్ని హోత్రాది శ్రౌతస్మార్త కర్మయర్థము. ఎవరు కేవలకర్మ నధిష్ఠింతురో వా రజ్ఞానరూపపతితు లగు

దురు. ఎవరువిద్యయందు అనగా గౌణవృత్తిచే కేవలోపాసన తత్పరులో వారు కర్మఫలమున కన్న నెక్కుడు తమమున కాస్పదులు. విద్యాదాది దేవలోకములు కేవలోపాసనాఫలములు వానిని పొందినను కర్మసహకారాభావముచే సుఖస్వల్పత్వము, పునరావృత్తియు, క్రమముగా దురభిమానాతిశయమునుగల్గును. కనుక నుభయ సముచ్చయము శాస్త్రవిహితమగుటచే స్వీకరణీయము.

మూ. ౯. అన్యదేవాహుర్విద్యయా,అన్యదాహురవిద్యయా ;ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్తద్వ్యాచచక్షిరే.

కేవల కర్మచేతను, కేవలవిద్యచేతను, కర్మసముచ్చితోపాసనచేతను, విలక్షణఫలమగు అర్వాచీనమగు పునరావృత్తి సహిత దేవలోకప్రాప్తి విద్వాంసులు చెప్పుచున్నారు. కేవలకర్మచే పితృలోకమును జెప్పియున్నారు. ఏఆచార్యులవారు మాకు కర్మఫలమును, ఉపాసనఫలమును అసంకీర్ణముగా చెప్పిరో వారియుపదేశ వాక్యములే ఈక్రిందవిధమున చెప్పబడినవి.

మూ. ౧౦. విద్యాం చావిద్యాంచ యస్తద్వేదోభయగ్ంసహ; అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృతమశ్నుతే.

ఇట్లు కేవలకర్మకును కేవలోపాసనకును స్వల్పఫలతాదర్శనముచే ఉభయ సముచ్చయమును చెప్పుచున్నారు. ఏయధికారి ఉపాసనను,కర్మను,ఏకకాలమునం దనుష్ఠించునో వాడవిద్యచే స్వభావప్రవృత్తిరూపమగు మృత్యువును అనగా చిత్తమును జయించి విద్యచే స్థిరమైనదియు సమృద్ధసుఖమునునై దేవతాసాయుజ్యమును పొందుచున్నాడు.

మూ. ౧౧. అంధంతమః ప్రవిశంతి యేஉసంభూతి ముపాసతే;తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాగ్ంరతాః

బ్రహ్మ కార్యకారణోభయ విషయత్వముచే ద్వైవిధ్యము, అసంభవము గలదగుటచే నెవ రసంభూతి ననగా ఉత్పత్తిరహితమగు కారణరూపమును కేవలము వ్యాకృతమగు కార్యమాత్రవైరాగ్యముచే నుపాసించెదరో వారు తమమున కాస్పదులు. యెవరు కేవల సంభూతియు కార్య బ్రహ్మరూపమునం దాసక్తులో వారుగూడ నజ్ఞానబోధితులు.

మూ. ౧౨. అన్యదేవాహు స్సంభవా దన్యదాహు రసంభవాత్ ఇతి శుశ్రుమ ధీరాణాం యేన స్తద్వ్యాచచక్షిరే.

(మూ. ౯. అర్థము—సంభవాసంభవ పద ప్రయోగ యుక్తము)

మూ. ౧౩. సంభూతించ వినాశంచ యస్తద్వేదోభయగ్ంసహ; వినాశేన మృత్యుం తీర్త్వా உసంభూత్యాஉమృత మశ్నుతే.

అసంభూతి యనగా ఉత్పత్తిరహితమైన యవ్యాకృతమును సంభూతిని (కార్యబ్రహ్మము) ఒక్కమారుగా నెవరు ఉపాసింతురో వారు వినాశేన (కార్యోపాసనచే) అనైశ్వర్య లక్షణమగు మృత్యువును నతిక్రమించి అసంభూత్యా (కారణోపాస్తిచే)ఆపేక్షమైన ప్రకృతిలయ ప్రసిద్ధమగు అమృతము నవస్థను ననుభవించుచున్నారు.

మూ. ౧౪. హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితంముఖమ్, తత్వంపూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే.

ఓ సూర్యమండలాభిమాని ప్రహ్మాస్వరూపా! నీమండలముఖము స్వర్ణవికారమగు జ్యోతిచే సముపక్రాంతమైనది. యథోక్తలక్షణయుతమగు ధర్మోపాసనచేసిన నాకు నీది వ్యదర్శన మొసంగుము.

మూ. ౧౬. పూషన్నేకర్షేయ మసూర్యప్రాజాపత్య వ్యూహరశ్మీం త్సమూహ తేజః, యత్తేరూపం కల్యాణతమం తత్తే పశ్యామి యోసా వసౌ పురుష స్సోఽహమస్మి.

ఓపోషకుడా! (హేకర్షే, ఏకఏవఋషతి గచ్ఛతీతి) ఓ సర్వసంయమనకర్తా! తావకీన కిరణములను కొంచెము సంకోచపరచుకొనుము. తీక్ష్ణాంశువులకు తాళజాలకున్నాను. అట్లొనర్చినచో పారమేశ్వరమగు కళ్యాణతమమగు బంగారువికారమగు నీజ్యోతిస్వరూపమును సాక్షాత్కరించుకొని ధన్యుడనయ్యెదను. నన్నన్యథాతలంపవద్దు. నాశరీరమునందుండువాఁడవు నీవే; నీకు నాకు నభేదము.

మూ. ౧౭. వాయురనిలమమృతమథేదం భస్మాంతగ్ంశరీరం, ఓంక్రతో స్మరకృతగ్ంస్మరక్రతో స్మరకృతగ్ం స్మర.

నాప్రాణలింగమగు వాయువు సూత్రాత్మయగు అనిలమును పొందుగాక!

నాస్వరూపము జ్యోతిర్మండలాంతర్గతుడవగు నీయందైక్యమైన పిమ్మట నాశరీరము భస్మావశేషమగుగాక!! సంకల్పాత్మయగు నోమనస్సా!! ఓంకారవాచ్యుడగు పరమేశ్వరుని స్మరింపుము!!! ప్రమాదము నొందకుము. (అంతేమతి స్సాగతిః) నీచేసినసర్వకర్మయు ఉపాసనయు మాటిమాటికి నను సంధించుకొనుము.

మూ. ౧౮. అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవవయునాని విద్వాన్, యుయోధ్యస్మ జ్జుహురాణ మేనో భూయిష్ఠాంతే నమఉక్తింవిధేమ.

కృష్ణతారాభిమాన, ఓఅగ్ని దేవా! ఉపాసకుడనగు నాకు సర్వకర్మ ఫలములను చేకూర్చి ప్రాయోపాస్య దేవతాసాయుజ్యమగు పునరావృత్తిరహితమగు ఉత్తరమార్గమును చేకూర్పుము. నాజన్మమందు ప్రమాదవశమున సంభవించిన కుటిలవచనరూపాఘ విఘటన మొనర్పుము. శరీరత్యాగ సమయమున నీసేవను నమస్కారమాత్రము చేయుచున్నాను. (ఆకారణమున నే అగ్నిహోత్రకర్మ నిత్యవిధియందుంచుటకు కారణమని తెలియునది.)

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణ మేవావశిష్యతే॥
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సంపూర్ణము



# తేజో లేఖనము

వింజమూరి కృష్ణమాచార్యులు గారు

[2 వ సంపుటము 11 వ సంచికతరువాయి]

## ఎనిమిదవ ప్రకరణము

### నెగెటివులందలి లోపములు, వాటిని నివారించు మార్గములు

దోషరహితమగు నెగెటివునందు హెచ్చు వెలుతురు గలభాగములు వెలుతురు చొరకుండునంత దట్టముగను, (Opaque) హెచ్చునీడగల భాగములు ఒకప్రక్కనుండి వరియొకప్రక్కకు వెలుతురు బాగుగా పోవునంత స్వచ్ఛముగను (Transparent) ఉండి మిగిలినభాగములన్నియు వెలుతురునీడలయొక్క మేళనమును సూచించుచుండవలయును. ప్రవీణుడగు తేజోలేఖకునిచే దీయబడినట్టి మంచి నెగెటివు నొకదానిని బరీక్షించిననో దోషరహితమగు నెగెటి వెట్లుండవలయునో సులభముగా బోధపడగలదు. ఏవిధమగు లోపములును లేనట్టి అత్యుత్తమమగు నెగెటివు మనకెల్లప్పుడును లభ్యమగుట యసంభవము. అందుచే ఈప్రకరణమునందు నెగెటివులను తయారుచేయుటలో నూతనాభ్యాసకు లొనరించు లోపములును వీలగునంతవరకు వాటిని నివారించు మార్గములును దెలుపబడినవి. కాని సాధ్యమగునంతవరకు అసంతృప్తికరమగు నెగెటివులను సరిచేయ బూనుకొనుట కంటె తిరిగి క్రొత్తవాటిని తయారు చేసుకొనుట మంచిపని.

1. వెలుతురు నీడలయొక్క మేళనము సరిగానుండియు నెగెటివునందెచ్చటనుగూడ వెలుగు చొరనీయని (Opaque) భాగములు లేకుండుట కారణము—(1) డెవలప్‌మెంటు చాలకపోవుటవలన; (2) డెవలపర్ ద్రావకము ప్రాతదై శక్తి తగ్గుటవలన; (3) డెవలపర్ ద్రావకము మిక్కిలిచల్లగా నుండుటవలన. నివారణము—రససంబంధముగు ద్రావకమునందు యీక్రిందివిధముగా నెగెటివును బలపరుచుటవలన. ఈపనికి ఇన్‌టెన్‌సిఫికేషన్ (Intensification) అనిపేరు. ఫిక్సుచేయబడి బాగుగా కడిగినపిమ్మట నెగెటివునందు పైలోపము లగుపడినచో దానినొకతొట్టియందుంచి యీక్రింది ద్రావకము నందుపోసి, నెగెటివునందలి హెచ్చువెలుతురు గలభాగములు బలపడి వెలుతురు చొరనంతదట్టముగా మార్పుచెందుటతోడనే ద్రావకమునుండి నెగెటివును పైకిదీసి బాగుగాకడిగి ఆరబెట్టవలయును.

మెర్క్యురిక్ అయొడైడ్ (Mercuriciodide) 45 గ్రెయిన్లు
సోడియం సల్ఫైట్ (Sodium sulphlite) 2 అవున్సులు
మంచినీరు 10 అవున్సులు

తేజోలేఖన పరికరముల సమ్మకపు షాపులలో సిద్ధముగా తయారుచేయబడినట్టి పేటెంటు ఇన్‌టెన్‌సిఫికేషన్ ద్రావకములు విక్రయింపబడును. వాటినుపయోగించువిధము బుడ్లపై దెలుపబడియుండును.

నోటు—ఇన్‌టెన్‌సిఫికేషన్ చేయవలసిన నెగెటివు కొంతకాలముక్రిందట డెవలప్‌మెంటు గావింపబడినదైనచో, దానిని ప్రథమమున సుమారొకగంటకాలము మంచి

3 4 1

నీటియందు వానబెట్టి పిమ్మట పై ద్రావకమునం దుంచవలయును.

ఈక్రింద ఒకే నెగెటివునుండి ఇన్‌టెన్‌సిఫికేషన్ చేయక పూర్వమును పిమ్మటయును దీయబడినట్టి చిత్రములు చూపబడియున్నవి.

చిత్రము ౧



ఇన్‌టెన్‌సిఫికేషన్ చేయక పూర్వము — ఇన్‌టెన్‌సిఫికేషన్ చేసిన పిమ్మట

2. వెలుతురు నీడలయొక్క మేళన ముండియు నెగెటివునం దంతటనుహాడ వెలుతురు చొరకుండునంత దట్టముగా (Dense) నుండుట; కారణము—హెచ్చుకాలము డెవలప్‌మెంటు చేయుటవలన నివారణము—నెగెటివుయొక్క సాంద్రత (Density) నీ క్రిందివిధముగా తగ్గించుటవలన. ఈపనికి రెడక్షన్ (Reduction) అని పేరు. ప్రథమమున ఈక్రింది నిలవ ద్రావకమును తయారుచేసుకొనవలయును.

సెరిక్ సల్ఫేట్ (Ceric sulphate) 1 అవున్సు
గంధకద్రుతి (Sulphuric acid strong) ½ అవున్సు
మంచినీరు 10 అవున్సులు.

ఈద్రావకమును స్వయముగా తయారుచేసుకొనుటకంటె తయారైనదానినే రప్పించుకొనుట మంచిది. 1 భాగము ద్రావకమునందు 5 మొదలు 10 భాగములవరకు నీరుకలిపి, తొట్టిలో పోసి, అందు నెగెటివు నుంచవలెను. ద్రావకములో నెగెటివు నుంచుటకు పూర్వమును పిమ్మటనుహాడ దానిని బాగుగానుంచి నీటితో కడుగవలయును. ద్రావకమునందు నెగెటివు నుంచునపుడును పైకి దీయునపుడును వేళ్లకు ద్రావకము తగులకుండులాగున జాగ్రత్తగా జూచుకొనుట మంచిది. ద్రావకమునందు నెగెటివు నుంచవలసినకాలపరిమితి, తగ్గవలసిన దట్టము (Density)ను బట్టియుండును. కాని ద్రావకమునందు నెగెటివు నుంచుటతోడనే దానిదట్టము మరుకగా తగ్గుటకు మొదలిడును; కాన వలయుదానికంటె హెచ్చుగా తగ్గకుండునటుల జాగ్రత్తగా చూచుకొనుచుండవలయును. నెగెటివులను ఇన్‌టెన్‌సిఫికేషన్ చేయుటకును, రెడక్షన్ చేయుటకును డెవలప్‌మెంటునకువలె చీకటిగది యగత్యము లేదు. వెలుతురునందు జేయనచ్చును.

హెచ్చరిక:—పైన దెలుపబడినట్టి ద్రావకములు రెండును ప్రమాదకర మగు విషపదార్థము లగుటచే, నోటికిని కండ్లకును తగులనీయరాదు. ఈద్రావకములు చేతికి తగిలిన ప్రతిపర్యాయమును తప్పక చేతులు పరిశుభ్రముగా కడుగుకొనుట ముఖ్యము.

3. వెలుతురు నీడలయొక్క మేళనము చాలినంత యుండక మొత్తముమీద నెగెటివంతయు నొకేవిధముగా నుండుట. కారణము—(1) ఎక్సుపోజరు హెచ్చగుటవలన; (2) డెవలపర్ ద్రావకమునందు నీళ్లు హెచ్చుగా కలియుటవలన; (3) డెవలపర్ ద్రావకము మిక్కిలి చల్లగా నుండుటవలన. నివారణము—పై లోపములుగల నెగెటివును (ముఖ్యముగా, ఆలోపములు ఎక్సుపోజరు తేడావలన గలిగినవైనచో) సరిచేయుట కంతె అవకాశము లేదు. తిరిగి మరియొకదానిని తయారుచేసుకొనుట మంచిపని.

4. హెచ్చువెలుతురుగల భాగములుమాత్రము మిక్కిలిదట్టముగానుండి మిగిలిన భాగములన్నియు వెలుతురు బాగుగా చొచ్చునంత పల్చగానుండుట. కారణము—(1) ఎక్సుపోజరు చాలకుండుటవలన డెవలప్‌మెంటుచేయునపుడీలోపము దిద్దుకొనకుండుటవలన. నివారణము—ఈలోపమునుహాడ నివారించుట కంత యవకాశము లేదు. తిరిగి మరియొక నెగెటివును తయారుచేసుకొనవలసినదే.

ప్రక్కపుటయందు తక్కువఎక్సుపోజ రీయబడినట్టి నెగెటివునుండియు, సరియగు ఎక్సుపోజ రీయబడినట్టియు, హెచ్చుఎక్సుపోజరీయబడినట్టియు నెగెటివులనుండియు దీయబడినట్టి చిత్రములు చూపబడియున్నవి.

5. సూది బెజ్జములవంటి చిట్టిఅద్ద మగుపడుమచ్చలు (Pinholes). కారణము—(1) ప్లేట్లనుగాని తయారుచేయునపుడు వాటిపై దుమ్ము, నలుసులు అంటుకొనుటవలన;

(2) ఎక్స్పోజు చేయునపుడు కెమీరాతిత్తులయొక్క లోపలిభాగమునుండిగాని, ఆడార్కు స్లయిడులోనుండి గాని, దుమ్మునలకలు ప్లేటుపై పడుటవలన; (3) డెవలపు మెంటుచేయునపుడు యింటిపైకప్పునుండి దుమ్మునలకలు ప్లేటుపై పడుటవలన. నివారణము—ప్లేట్లను తయారు చేయునపుడు వాటిపై దుమ్ముపడకుండునట్టి ఏర్పాటులు తప్పక గావింపబడును గాన, యీకారణమును మనము నిరూపింపుకొనరాదు. కెమీరా తోలు తిత్తులయొక్క లోపలిభాగము, డార్కుస్లయిడుయొక్క లోపలిభాగము పరిశుభ్రముగా దుమ్ములేకుండునటుల తుడిచి, పిమ్మట ప్లేటును మెత్తని పట్టుగుడ్డతో గాని, కుంచెతో గాని, (యీపనికై ప్రత్యేకింపబడినట్టిది) తేలికగాతుడిచి డార్కు స్లయిడునం దుంచుటవలన సూదిబెజ్జముల వంటి చుక్కలు రానేరవు.

చిత్రము ౨



తక్కువ ఎక్స్పోజ రీయబడినట్టి నెగెటివునుండి తీయబడినది.

చిత్రము 3



సరియగు ఎక్స్పోజ రీయబడినట్టి నెగెటివునుండి తీయబడినది.

చిత్రము ౪



హెచ్చు ఎక్స్పోజ రీయబడినట్టి నెగెటివునుండి తీయబడినది.

6. డెవలపర్ ద్రావకము ప్లేటుపై సరిగా ప్రవహించనందువలన ఏర్పడుమరకలు. కారణము (1)—ప్లేటు పూర్తిగా మునుగుటకు చాలినంత ద్రావకము లేకుండుట వలన; (2) ద్రావకమును ప్లేటుపై అంతట ప్రవహించునటుల పోయకుండుటవలన. నివారణము—ప్లేటు పూర్తిగా మునుగుటకు చాలినంత ద్రావకము నుపయోగించవలయును. ప్రథమమున ప్లేటును మంచినీటియందు 2, 3 నిమిషములు నాననిచ్చి పిమ్మట నీళ్లుపారబోసి, ప్లేటం దయు నోకేపర్యాయము కప్పునటుల ఒకచేతితో తొట్టె నాడించుచు, రెండవచేతితో డెవలపర్ ద్రావకమును ప్లేటుపై పోయవలయును. ఇట్లు చేయుటవలన యీ మరక లేర్పడనేరవు.

7. డెవలప్‌మెంటుచేయునపుడు ప్లేటుపై వస్తురూప మగపడుటకు మారుగా పొగకప్పినటు లుండుట. కారణము—ప్లేట్లపెట్టె తెరచి యుంచబడిన సమయమందు ప్రమాదవశమున చీకటిగదిలోనికి బైటితెల్లవెలుతురు వచ్చుటవలన. నివారణము—ప్లేట్లను, ఎర్రని దీపపు వెలుతురునందు తప్ప మరి యేవిధమగు యితరదీపపువెలుతురునందును, వాటిపెట్టెనుండి బైటికి తీయరాదు. ఎర్రదీపపువెలుతురైనను, అనవసరముగా హెచ్చుకాలము డెవలప్‌మెంటుచేయుటకు పూర్వము ప్లేట్లకు తగలరాదు.

8. నెగెటివున కడ్డముగా నల్లనిగీత లేర్పడుట. కారణము—(1) డార్కుస్లయిడుయొక్క తలుపునందలి మడతలో సన్ననిరంధ్రములుపడి వానిగుండా వెలుతురు లోనికి జని ప్లేటుపై పడుటవలన. నివారణము— డార్కుస్లైడును బాగుచేయించుకొనవలయును.

9. నెగెటివుపై చెట్లవ్రేళ్లవంటి గీతలేర్పడుట. కారణము—(1) ప్లేట్లపెట్టెలనుగాని, ప్లేట్లుగలదారుక్లైడులను గాని, చెమ్మగా నుండుప్రదేశమునం దుంచుటవలన; (2) ప్లేట్లను విశేషకాలము నిల్వయుంచుటవలన. నివారణము—ప్లేట్లపెట్టెలను, ప్లేట్లుగలదారుక్లైడులను, చెమ్మతగులనట్టి చోట జాగ్రత పెట్టుకొనవలయును.

10. డెవలపరుద్రావకమునం దుంచుటతోడనే ప్లేటుయొక్క ఫిలిమ్ మెత్తబడి, చివరలందు అడ్డము విడిచి ఊడివచ్చుట, లేక కరగిపోవుట. కారణము—(1) డెవలపర్ ద్రావకము, నీరు మొదలగునవి వెచ్చగానుండుటవలన; (2) వేసవికాలమునందు ఎండవేడిమి హెచ్చుగా నున్నపుడు డెవలప్‌మెంటుచేయుటవలన; (3) డెవలపర్ ద్రావకము యొక్కయు, నీటియొక్కయు, శీతోష్ణస్థితియందువిశేషతారతమ్య ముండుటవలన.

నివారణము—వేసవికాలమునందు, ఎండవేడిమి హెచ్చుగానున్నపుడుగాక, ప్రాతఃకాలమునమాత్రము డెవలప్‌మెంటు చేయవలయును. వాడుకచేయునీరు చల్లగానుండులాగున చూచుకొనవలయును. మరియు, డెవలప్‌చేయునపుడు ప్లేటుయొక్క ఫిలిమ్ మెత్తబడుచున్నటు లగుపడినచో, మామూలు హైపోద్రావకమునకు మారుగా యీక్రింది ఆసిడ్ హైపోద్రావకమునందు ఫిక్సుచేయవలయును. ఈ ఆసిడ్‌ఫిక్సింగ్ ద్రావకను మెత్తబడుచున్నట్టి ప్లేటుయొక్క ఫిలిమునువెంటనే గట్టిపడునట్లుచేసి తృప్తికరముగా ఫిక్సుచేయ గలదు.

| | |
|---|---|
| పొటాసియం మెటాబైసల్‌ఫయిట్. (Potassium Meta-bisulphite). | 2 అవున్సులు |
| క్రోమ్‌పటిక (Chrome alem) | 10 గ్రెయినులు |
| హైపో | 1 పౌను |
| మంచినీరు | 40 అవున్సులు |

ఈద్రావక మెంతకాలమైనను చెడిపోకుండ నిల్వయుండును.

## ఫోటోకాగితములపై నచ్చువేయుటకు నెగెటివులను సిద్ధముచేయుట.

డెవలప్‌మెంటు పూర్తిగావింపబడినపిమ్మట బాగుగా కడిగి ఆరబెట్టబడినట్టి నెగెటివులనుండి, చిత్రముయొక్కనకలుప్రతుల నెన్నిటినైనను, ప్రత్యేకపుఫోటో కాగితములపై నచ్చుచేయవచ్చును. కాని, నెగెటివునుండి చిత్రపుప్రతుల నచ్చువేయుటకుపూర్వము, దానియందలి లోపములను సరిచేసుకొనుట మంచిది. ప్రతినెగెటివునకును ఇన్‌టెన్సిఫికేషన్, రెడ్యూసింగ్ మొదలగు పనులు చేయవలసినంతటిలోపము లుండకుండినను, వెలుతురున కెదురుగా పట్టుకొని పరీక్షించితిమేని, సన్ననిసూదిబెజ్జములవంటిచుక్కలు, గీతలు మొదలగునవి మన కగుపడగలవు. వాటినన్నిటిని, సన్ననిమొనగల నెం. 1 కుంచెతో. (No. 1. Spolling Brush), ప్లానులు వ్రాయునట్టి ఇండియన్‌ఇన్‌కు (Indian Ink) సహాయమున, కనబడకుండు లాగున దిద్దవలయును.

వెలుతురునీడలయొక్క మేళనమందలి భేదాలు, మనుష్యముఖములందలి ముడతలు, మొటిమలు, కండ్ల క్రిందనుండునీడలు, ముక్కునకుమాయముగా చారికపలెనుండువెలుతురు మొదలగువాటిని పెన్సలులతోను రంగులతోను దిద్ది సరిపెట్టి, ముఖమునకు సౌందర్యమును తెచ్చుట కవకాశముకలదు; కాని, యీపనియంతయు చిత్రలేఖనమువంటిది. దీనికి రీటచింగ్ (Retouching అనిపేరు. ఈరీటచ్చింగ్‌పనియందు ప్రవీణతగల పనివానియొద్ద కొంతకాలము అభ్యాసపూర్వకముగా నేర్చుకొనినపిమ్మటగాని నెగెటివులను రీటచ్చింగ్ చేయుటకు బూనుకొనరాదు. కట్టడములు, రాజబాటలు, వనములు, జలాశయములు, జనసమూహములు మొదలగు దృశ్యములకు జెందిన నెగెటివుల కీరిటచ్చింగుతో నెంతమాత్రమును పనియుండనేరదు. వాటిని రీటచ్చింగ్ జేయబూనుట కూడనిపని. చుక్కలు, గీతలు మొదలగు వాటిని దిద్ది సరిపెట్టుకొనిన చాలును. ఒక్కమనుష్యరూపములకు జెందిన నెగెటివులనుమాత్రమే తప్పక రీటచ్చింగ్ చేయవలసియుండును. వాటినైనను విధాయకముగా రీటచ్చింగు చేసి తీరవలయునను నియమము లేదు. సరిగా రీటచ్చింగ్‌చేయుటవలన ముఖమునకు చాలవరకందమేర్పడును గాని, హెచ్చుగా చేయబడినను, సరియగువిధముగా చేయబడకుండినను రూపము మార్చిపోవుట తటస్థించును. ఈపని నభ్యసించుటకు వీలగునట్టికొన్నివివరములు "మనుష్యరూప పటములనుదీ

యుట" (Portraiture) యను వేరొక ప్రకరణమందు దెలుపబడును.

## 9-వ ప్రకరణము

## నెగెటివులనుండి ఫోటోకాగితములపై నచ్చువేయుట

నెగెటివులనుండి చిత్రపునకలుల నచ్చువేయు ఫోటోకాగితములం దనేకములున్నను, వాటినన్నిటిని పగటివెలుతురునం దచ్చువేయుటకు తగినవనియు (day light printing paper) దీపపువెలుతురునం దచ్చువేయుటకు తగినవనియు (Artificial light printing papers), రెండుముఖ్యతరగతులుగా విభజింపవచ్చును. పి. ఒ. పి. (P O P), సెల్ఫ్ టోనింగ్ పేపర్ (self toning paper) మొదలగునవి మొదటితరగతికిని బ్రోమైడ్ పేపర్, గ్యాస్‌లైట్ పేపర్ (Bromide paper, Gas-light) మొదలగునవి రెండవతరగతికిని జెందగలవు. ఈ ఫోటోకాగితములు కొంచె మెచ్చుతగ్గుగా మనదేశమునందు తప్ప పాశ్చాత్యదేశములన్నిటియందును తయారు చేయబడుచున్నవి. కాని, ఇంగ్లాడునందలి ఇల్‌ఫర్డు కంపెనీవారిచే (I ford Ltd.) తయారుచేయబడినట్టి కాగితములు మనదేశమునం దెచ్చుమందిచే వాడబడుచుండుటచేతను, మనదేశపుశీతోష్ణస్థితికి తగినటుల ప్రత్యేకముగాజేయబడిన వగుటచేతను, వీటినుపయోగించుమార్గములుమాత్ర మీ క్రింద దెలుపబడియున్నవి. ఇతర కంపెనీలచే తయారుచేయబడినట్టి కాగితముల నుపయోగించువిధము వాటినుంచబడినట్టి ప్యాకెటులపై దెలుపబడియుండును; ద్రావకములు మొదలగువాటియొక్క సాంద్రతయందలి కొద్దిమార్పులుతప్ప, మిగిలినపనులన్నిటికిని యీక్రిందిమార్గములు సరిపడగలవు.

ఫోటోకాగితములందు పలురకము లుండినను, అచ్చువేయువిధముమాత్ర మన్నింటికిని కొంచె మెచ్చుతగ్గుగా సమానమే. ప్రింటింగ్ ఫ్రేము అనబడు అచ్చువేయుచట్టమునందు (Printing frame) నెగెటివును ఫిల్మ్ గలవైపు పైకుండులాగున నుంచి, దానిపై సరిపడు కొలతగల ఫోటోకాగితపుముక్క నొకదానినిపెట్టి (మందు పూతగలవైపు క్రిందికుండులాగున) ఫ్రేముయొక్క తలుపును బిగించి, ప్రకాశమానమగు వెలుతురులో నుంచి, కొంతతడవైనవెనుక ఫ్రేమునునీడలోనికి దెచ్చి, తలుపుదెరచి, తరుచుకాగితముపైనెగెటివునుండి అచ్చుపడుచుండుచిత్రమునుపరీక్షించుచు, తయారైనచిత్రముకంటె కొంచెము హెచ్చుపట్టుముగా (Deep) నచ్చుపడుటతోడనే ఆకాగితమును వైటకిదీసి, వెలుతురు తగలకుండునటుల భద్రపరిచి, మరియొకకాగితము నిదే విధముగా నచ్చువేయవలయును. పై విధముగా నచ్చువేయుటకు పీ. ఓ. పీ. సెల్ఫ్‌టోనింగ్ పేపరు, మొదలగు మొదటి తరగతికి జెందిన కాగితములు మాత్రము పనికివచ్చును. రెండవతరగతికి జెందిన బ్రోమైడ్, గ్యాస్‌లైట్ మొదలగు కాగితములైనచో ప్రింటింగ్ ఫ్రేములో నెగెటివునుంచి దానిపై చీకటిగదిలో ఎర్రగాజుపు వెలుతురునందు కాగితమును పెట్టి తలుపుమూసి, తెల్లని దీపపువెలుతురున కెదురుగా 2, 3 నిమిషములుంచి, దీపమునార్పి యిమ్మట ఎర్రని దీపపువెలుతురులో యీకాగితమును వైటకి దీసి వెలుతురు తగలకుండులాగున జాగ్రత్తపెట్టి, యిదే విధముగా మరియొకకాగితము నచ్చువేయవలయును.

చిత్రము ౫



Printing Frame
ప్రింటింగు ఫ్రేము
A. నెగెటివ్, B ఫోటోకాగితము C. తలుపు

### Printing on P O. P.

### పీ. ఓ. పీ. కాగితముపైనచ్చువేయుట

పగటి వెలుతురులో నచ్చువేయుటకు వీలగునట్టి ఫోటోకాగితములలో పీ.ఓ.పీ. ప్రధానమైనదిగా నెంచ

బడుచున్నది. ఈ పీ. ఓ. పీ. కాగితములందు నున్నని మందుపూఁతయు (Glossy surface), నునుపు లేనట్టి మందుపూఁతయు (Matty surface) గల రెండు రకము లుండును. నున్ననిమందుపూఁతగల గ్లాసీ కాగితములపై నచ్చువేయబడినట్టి చిత్రములయొక్క పై భాగములకు తళతళలాడునట్లు మెరుఁగుపెట్టవచ్చును. రెండవ రకపు కాగితమున కీవీలులేదు కొన్ని చిత్రములు నునుపుకాగితముపై నచ్చువేయబడినపుడును, వరికొన్ని నునుపులేనట్టి కాగితములపై నచ్చువేయబడినప్పుడును హెచ్చు అందముగా నుండును.



# జీవితాదర్శము

పంగనామముల రామచంద్ర రావు గారు

వెనుకటి సంచిక తరువాయి

ఉ. ఒకరన కెందఱో యిటులెయుండ జితేంద్రియ శక్తిలేమి మా
మకచలచిత్త మాసఁగొని మక్షిక పుంజును జూచుమాడ్కి నా
శకరవిదేశ పద్ధతులు జాతికిఁ గీడని యెంచకుండవే
డుకపడఁ, గొల్చియుంటి నెపుడున్ బెళువారల సంప్రదాయముల్.

సీ. పింజెలారెడి కావి పెంపెక్కు దోవతి, చీలమండకుఁ బైన జీరువాఱఁ
జలిగాలి తాకిడి నలికిన చొక్కాయ, తాల్చునాలోచన తట్టకుండ
నత్యుష్ణ సూర్యచండాతపా నిలఘాటి, లక్ష్యపెట్టనిమేనిలావు గలిగి
నీర్కావిబలిసి కంటికి నింపు నించెడి, ముతకనూలుపటంబుఁ బూన్చిపైన
హైందవాచారసంప్రదాయములఁ జూచి, దేశభూగోళశాస్త్రరీతిని గ్రహించి
వస్త్రధారణ మిట్లుండవలె నటంచుఁ, జెప్పిపోయిరి మనకుఁ బ్రాచీనబంధులు.

మ. అకటా! వీనిని గంగలోఁ గలిపి మోహభ్రాంతిచే నన్యవ
ర్తకు లంపించు నిసర్గసుందరపటీ రాజిన్ మెయిం దాల్చుచే
యొకలోపం బనకున్న వారివలెనే యున్మాదునిం బోలి యం
శుకముల్ గట్టితిఁ జిత్రమార్గరచనా మోదంబు మల్లాడఁగన్.

గీ. బదులు తోరంపుఁ బరిధాన బంధములను, నీసడించుచుఁ బశ్చిమవాసులకును
దవిలి కాణాచి యగు 'లాగు' తగునటంచు, నవదరించితి మోహాని స్తంద్రుఁడ నయి.

గీ. ఆయధోంశుక మిట్లుండ వాయువునకుఁ, జొరుటకును సందులేకుంట క్షోభపడితిఁ
జెమట పిరిగొన్న దాని వర్జింపలేదు, నేఁటి చదువరి నేవ నిందింప నట్లు.

క. మనదేశం బూష్మంబునకును బెట్టినపేరు; చెమట కోలుమసఁగుటన్
గని యూర్ధ్వాంగం బేయను, వ్రున నేమూసితినో మందపుం గోటు లచేన్.

శా. వాతాంకూర మనోహరాగమనముల్ పాటింప కొక్కింత దీ
ర్ఘాతాత్పర్యముతోడ నూపిరిని బిగ్గంబట్టినట్టుల్ మనః
ప్రీతిం గంఠము గుడ్డపేలికలతో (Neck tics)బిడించి బంధించి యీ
రీతిం జక్కఁదనంబునన్ మురిసితిన్ ప్రీడాపరిత్యాగినై.

ఉ. వేసినకోటు వేయక వివేకముఁ బోఁవగఁ ద్రోచి సంతతా
భ్యాసముగాఁగఁ బశ్చిమ నివాసులతో నుపమింపఁ గోరి యా
వేసముఁ గన్నులిండుపుగ వేసితి నాచిబుకాస్తచర్మవి
న్యాస కఠోర 'ఫూర్వ' పరిణాహసమాన్వత మస్తకుండ నై.

ఆచిబుకాస్త— మస్తకుండనై గడ్డమువఱకు త్రోయబడిన చర్మము గలిగి గట్టిగానుండు ఫేటు (Hat) యొక్క వైశాల్యముతో బాగుగా నావరింపఁబడిన శిరోభాగము గలవాఁడనై.

క. ఇన్నిటి కింటన్ ధనమా, సన్నగిలంజొచ్చెఁగాని జన్మశ్యామం
బున్నలువగు నా దేహం, బున్నది యున్నట్లె యుండె నుత్తలపడినన్.

ఉ. తెల్లమొగంబు లేదనుచుఁ దేహకు నద్దము వంకఁజూచుచున్
దెల్లమొగంబు వేసితి విధిన్ బడఁ దిట్టితి నింద్యదుర్వచో
భల్లచయప్రసారమునఁ బాపను జానపదుల్ మితంబుగా
నుల్లసమాడఁ గా మొఱకు లోపరటంచును దూలనాడితిన్

చ. నడుమునఁ గాసెకోక, వదనంబునఁ బువ్వాడి దుమ్ముపూఁత క
న్నడియు సులోచనా లెనయు భాగ్యము మైమఱువుల్ విలాసపుం
గొడుగులు 'లాగు బూట్లు' లలకుత్తుకకట్లు శిరాన బుట్ట యిం
కడిగెడిదేమి నేను 'దొర' యైతిని ఖల్లెజనంబు నవ్వఁగన్.

వ. ఇవి యెల్ల నిట్లుండ నాంధ్రకవితారచనాభ్యాసంబు కొంత కొంత యలవడఁగాఁ గైత కన్నియను శృంగార రస సముద్రంబున ముంచి తేలించుకోరిక లీరికలెత్తు నప్పుడు.

మ. రసవత్పద్యపదౌచితుల్ నిపుణతన్ వ్రాయంగఁ జేఁగాక పా
పసమగ్రంబయి మార్గయాయియువతీ భాస్వద్వపుర్వర్ణనో
ల్లసితంబైనకవిత్వ మేఁడ్చితి ననల్పస్వల్ప భేదోప ప
త్తిసమేతుండవు కావుగాన విను నాతిక్రాంధ్ర పద్యంబులన్.

* * * * * * * * * * *

మ. ఋతురాజంబని యీవసంతమును గీర్తింపన్ ఫలంబేమి శ్రే
స్థతమోద్యానవికుంజపుంజములసీడన్ మల్లెపూఁబాన్పుసం
గతిఁ గ్రీడించెడి రాచవారలకు సౌఖ్యం బిచ్చునే కానినా
స్థితిలోవారికి నెత్తిపైఁగొఱవి సందేహంబులే దారయన్.

* * * * * * * * * * *

సీ. జారచోరవిసర్గ సంచార రోగంబు, సమయఁ జేయించునౌషధరజంబు
జలజబాంధవ పీడఁగలఁగి పోవుచకోరి, ప్రాణంబు నిపు మకరధ్వజంబు
మలయ వాయున్నపైని జెలికాఁడు చంద్రుండు, చిలకరించిన మహాస్నేహభరము
పొలయల్కలనువీడు ముగ్ధాంగనామణుల్, పతులపైనించు నిబ్బరపుఁ బ్రేమ
యనఁదగిన శరత్కాల చంద్రాతపంబు, దీర్ఘరోగులకు నుపశాంతిని నొసంగి
జీవులకునెల్ల హాయిని నావటించి, నిండియున్నది బ్రహ్మాండభాండమందు.

* * * * * * * * * * *

గీ. అనుచు నేమేమొ సందర్భమనుసరించి, కొన్నిఁటిందక్కఁ గీర్తిఁ గొమ్మకతలె
ప్రకృతిసుభగను గూఁతు రోపడఁతికొఱకు, సాఁక నిచ్చితి ఛాందసజనకుఁడనయి.



# కర్ణాటకము

## హిందూదేశమందలి బ్రిటిషుసామ్రాజ్యమునుగూర్చి మేజరు యివాన్సుబెల్లుగారి 3 వ లేఖ

### వేలూరి రామమూర్తిగారు

ఎక్కువగ మనకృతజ్ఞతకు పాత్రమైనట్టియు, ఆంగ్ల రాజు స్వయముగ వ్రాసిన లేఖలలో నిచ్చినవాగ్దానములచే మనము బద్ధులమగునట్టియు రాజవంశము, హిందూదేశములో నెల్ల కర్ణాటక నబాబువంశము తప్ప మరియొకటి లేదు. ఫోర్టుసెంటుజార్జి అధ్యక్షుడు ౧౭౬౯ ఫిబ్రవరి ౮ వ తేదీని వ్రాసిన మినిటులలో నొక భాగమున నిటులున్నది. "మనతో నన్నివిధములను సంబంధము గలిగియున్నట్టియు, మన ఆదరణను అవశ్యముగా కోరుచున్నట్టియు, విశ్వాసవంతుడును, చిరమిత్రుడును అగు నవాబునకు మనము అన్నివిధములను గౌరవరక్షణలను చూపవలసియున్నాము" అని, "ఆతడును; ఆతని వంశమును, మన సత్యసంధతకు నిదర్శనములై చిరకాలముండురుగాక" అను ముఖ్యములగు పదములతో ఆమినిటు ముగిసెను.

మహమ్మదాలీ వాలాజా నబాబునకు పరిచయుడగు నొక సమకాలిక చరిత్రకారుడు డీ దిగువ విధముగ వ్రాయుచున్నాడు. 'మనకును, పరాసువారికిని జరిగిన గొప్ప యుద్ధాంతమున ఆతని యోగ్యతను గూర్చియు, ఆతడు మనకు ఇతఃపూర్వము కావించిన ఉపకారమును గూర్చియు, ఎల్లపుడు ఆతడు చూపగలమైత్రిని గూర్చియు, దక్షిణదేశస్థులగు ఆంగ్లేయుల కట్టిగౌరవమున్నాగన్యతయు గలవో యీవ్రాతనుబట్టి మనకు బాగుగ తెలియగలదు. "ఇంచుమించుగ బెంగాలులోవలెనే ఆంగ్లేయులు, దక్కనులోను, బలవంతులైయున్నారు. మహమ్మదాలీని కర్ణాటకనబాబుగా మనము సంరక్షించుచున్నాము. ఆతడు తనరాజ్యరక్షణమునకై మనసైన్యమునకగు వ్యయములను భరించుచున్నాడు. ఒకమాదిరిగా మనకును ఆతనికిని పరస్పరశ్రేయోవిరుద్ధములగు కోరికలు లేవు. అతనివలన మనము కర్ణాటకమున ప్రముఖత వహించుచున్నాము. మన బలముచేతనే ఆతడు ప్రభుత్వము చేయగల్గుచున్నాడు."'

"మహమ్మదాలీ యొక్క వైఖరి చూచినంతనే అపరిచయుడతనిని ప్రేమించును. స్నేహితుడాతనికి వశంవదుడగును. క్రొత్తవాడాతని కనినంతనే ఆతని క్షేమ మభిలషించును. మిత్రుడాతని విడువజాలడు. శాంతుడై దయారసమొలికించుచు, పరిపూర్ణ దర్పవంతుడై యుండుటలో ఆసియాఖండస్థునియందలి ఉన్నతగుణములతో ఐరోపీయునియందలి సరళతను మేళవించి మెరుగు నిచ్చెను. మహమ్మదాలీయందు ప్రాచ్యులలో సహజముగు కుటిలత కానరాదు. ఆతనికి ఆశయున్నను, దానితో సహజముగ కన్పట్టుదుర్గుణములు లేవు. ప్రభువున కర్హమగు నట్టిదియే ఆతనిరాజనీతి. "గొప్పవాడు తనభావములను గూఢముగ నుంచవచ్చునుగాని పరులను మోసగింపరాదు. నా యౌవనకాలమున నాకు ఋజువర్తనమే ఆదర్శమైయుంచుకొను భాగ్యము గల్గెను. అట్టిఋజువర్తననుండి భ్రష్టుండనై దుర్మార్గవర్తనయందెన్నడును నేను చరింపలేదు. వారికి ప్రియమగు సరళతతో నేనుబ్రిటిషువారితో సంచరించితిని. ఉదారహృదయులగు ఆంగ్లేయులతో సహచరించుటవలన నాకు గౌరవమున్ను, క్షేమమున్ను చేకూరినవి." అని అతడు గడచినయుద్ధాంతమున కర్ణాటకరాజ్యమును నిరభ్యంతరముగా స్వాధీనపరచుకొను సందర్భమున పలికెను. ఆతని తండ్రియొక్క సైన్యమున కధిపతియై పరాసువారు కలుగజేసెదమన్న లాభములను నిరాకరించి, ఫోర్టుసెంటుడేవిడునందలి ముట్టడిని నివారించినప్పుడుగూడ నాతడిట్టిఅభిప్రాయములనే కల్గియుండెను.

మదరాసు గవర్నరు థామస్ రంబోల్డుగారు ౧౭౮౦ సం. జనవరిలో నబాబుయొక్క మైత్రివలన

కలిగినలాభములను గూర్చి యిటుల వ్రాసినాడు—"మనయొక్క ఐశ్వర్యమునకును, గడచినయుద్ధమందు పరాసువారిపై మనకుగల్గిన జయమునకున్ను, ప్రస్తుతయుద్ధమందు పరాసువారికి గల్గిన అపయజమునకును యీ నబాబుగారి బలమే కారణము. ఈప్రస్తుత యుద్ధమున పరాసువారికి గల్గినఅపజయమే చూడగా, ప్రాచ్యఖండమందలి మనఅసలు ఉనికికే ఆధారమైనది. అందుల కెంతయును మన మాతనికి కృతజ్ఞత చూపవలసి యున్నాము."

మనతోడిమైత్రివలన నబాబు గొప్పలాభములను పొందెననియు, మనయొక్కబలమువలననే ఆతడు స్వతంత్రప్రభువు కాగల్గెననియు, కొందఱు చెప్పవచ్చును. అందులకు సమాధానములు రెండు. మొదటిది, ఆనవాబులలో నెవ్వరును వారుపొందినమేలును ఒప్పుకొనకపోలేదు. అందులకు బదులుగ మనమున్ను వారియెడల కృతజ్ఞత జూపవలయుననియే అనుచున్నారు. రెండవది, పరాసువారు, చందాసాహేబును, కర్ణాటకమునకు ప్రతికక్షునబాబుగా నుంచుటకు మహమ్మదాలీయందలి విరోధము కారణముకాదు. అసలు, అతనితో మైత్రిచేయుటకై పరాసువారు ఎంతయో యత్నించిరి. అందుచే వారతనియందువిరోధమునగాక ఆతనిసాయమునే ముఖ్యముగా పొందియున్నమనలను చికాకుపరచి ఎదుర్కొనుటకే వా రట్టిపనిని గావించిరి.

౧౭౬౪ జూన్ ౧-వ తేదీని (కంపెనీయొక్క) కోర్టుఆఫ్‌డైరక్టర్లు ఆతనికి వ్రాసినజాబునందు, ఆతడు కావించినసాయములకు కృతజ్ఞతను యిటుల తెల్పిరి:— "తా మెప్పటికిని మాయెడల స్నేహభావముతో నుందు"రని, మదరాసుగవర్నరు పిగట్‌గారు ఎక్కువరూఢిగా చెప్పినారు. మరియు, మదరాసు, పుదుచ్చేరి ముట్టడీలఖర్చులనుమీ రేభరించుటవల్లను, మదరాసుప్రాంతముననున్న కొన్నిభూములనుమాకంపెనీకియీనాముగాయిచ్చుటవల్లను మాయందు మీకుగల ఆదరణ, ప్రేమలను దృఢముగ వెల్లడించినారు. అందులకు మా కెంతయు సంతసమగుచున్నది. ఇంతవరకును మీయందు మాకుగల సద్భావమునుగూర్చియు, ప్రస్తుతము మీయెడల మాకున్న గౌరవాతిశయములను గూర్చియు మీ కెంతయు నమ్మకము కల్గింప నెంచుచున్నాము. తమయొక్క పాలనమునకై మీ కెంతయు తోడ్పడెదము. ఆప్రభుత్వము మీవంశమునకు శాశ్వతముగ పరంపరానుగతమై యుండునట్లు, మాశక్తివంచన లేకుండునట్లు యత్నించెదము. ఇంతకన్నను మీయెడల మాకు గల కృతజ్ఞతను ఎట్లు తెలుపగలమో తెలియజాలము." అజీముజా, సరాసరి, వాలాజానబాబుగారియొక్క పురుషసంతతిలోనివాడే.

ఈవాగ్దత్తము యింతకంటెను ఉన్నతమగుస్థానమునుండి పునర్దత్తమయినది. ౧౭౭౧ మార్చి ౧౯ వ తేదీని 3 వజార్జి ప్రభువు వాలాజానబాబుగారికి స్వయముగా నిటుల వ్రాసెను. "కడచిన జులై నెలలో మా యీస్టిండియాకంపెనీవారిద్వారా మీరుపంపిన లేఖయు కానుకలున్నూ మాకు అందినవి. అందు మీరంపిన తమ కుటుంబపు చిత్తరువును ఎంతయో హర్షముతో దర్శించుచుండెదము. ఏలన, తాము ఎల్లప్పుడును మా యెడల జూపు ప్రేమ, మే మాపటమును గాంచినంతనే జ్ఞప్తికి వచ్చును. మరియు ఆప్రేమను తమ సంతతిగూడ మాయెడల జూపగలవని తలంచెదము. అంతియకాక మాస్నేహరక్షణలను మీకును మీసంతతికిని, మాఉత్తరాధికారులు తరతరముల వెంబడిని చూపగలరనియు నమ్ముచున్నాను. మిమ్ములను, కంపెనీవారిని అనుల్లంఘనీయమగు ఒక సంబంధముచే నైక్య మొనరింప నెంచుచున్నాము. అట్టి అవిచ్ఛిన్నపరస్పర సంబంధములు గల మీయిరువురకును ఏపరిస్థితులయందైనను, మాస్నేహము రక్షణలు అవసరమగునని తలచి మాయొక్క గొప్పనౌకాదళభాగము నొకదానిని హిందూదేశమునకు పంపుట ఉచితమని తలంచినారము. కొంతకాలము సైన్యాధిపతియు, రాయబారియు నైయున్న సర్ జాన్‌లిండ్‌సేగారిని మాయొద్దనుంచుకొని మా నౌకాదళాధికారులలో నొకరగు సర్ రాబర్టు హార్లాండుగారిని మీయొద్దకు రాయబారిగా పంపుచున్నాము. మీకిచ్చుటకై యీ యుత్తరమునున్ను కానుకలుగా మాస్వంత ఆయుధాగారమునుండి రెండుపిస్తోలులను, మా దేశవస్త్రములను కొన్నిటిని ఆతనికిచ్చి పంపుచున్నాము. మాకు మీయెడల నిరంతరముండగల గౌరవసూచకముగ వీని గ్రహింప

గోరెదము. మీయెడల మాకున్న గౌరవమును గూర్చి మా రాయబారిగారే నచ్చజెప్పగలడు. మా పక్షమున ఆతడు పల్కినవన్నియును మామాటలుగనే నమ్మగోరెదము. తమ భావిఐశ్వర్యమును ఎంతయును అభిలషించుచు మీసెలవు పుచ్చుకొనుచున్నాము. [ఈ యుత్తరము, పదిహేడువందల డెబ్బది ఒకటవ సంవత్సరము మార్చి పందొమ్మిదవ తేదీని, అనగా మాపాలనమున పదునొకండవ సంవత్సరమున మారాజమందిరమగు సైంటు జేమ్సుభవనమున యీయబడినది.]

తమ ప్రియపుత్రుడు,

'జార్జి రాజు.'

ముప్పదిమూడేండ్లు గడచినతరువాత అనగా, లార్డు హారిసుగారిమాట నమ్మనగుచో, వారివంశపుహక్కులన్నియును త్యజించినట్లు ఎంచదగిన క్రొత్తసంధి అయినతరువాత, అజీముద్దౌలా, తాను సింహాసనమునకు వచ్చితినని తెల్పిన జాబునకు జవాబుగా, జార్జిప్రభువే యీవిధముగ వ్రాసెను. "తమ పూర్వుల సింహాసనమును తా మధిష్ఠించినందులకు మే మెంతయు అభినందించుచున్నాము. తత్సింహాసనమున గౌరవ, సౌఖ్యములతో చిరకాలము పాలన మొనరింతురు గాక! తమ యెడలను, తమ సంతతి యెడలను, మే మెల్లపుడును విశేషమగు మైత్రిరక్షణలను చూపగలమని నమ్ముడు" యీజాబునకు "పదునెనిమిదివందల నాల్గవసంవత్సరము జనవరి యిరువదియేడవ తేదీని మాపాలనమున నలుబదినాలుగవసంవత్సరమున మారాజమందిరమగు సైంటుజేమ్సు భవనమున" అని తేదీ, స్థలములనిర్ణయ మున్నది. ఈ రాజలేఖ వ్రాయబడిన అజీముద్దౌలాగారి కుమారుడును, ప్రతినిధియును అయి, రాజమన్నన, రక్షణలను వాగ్దాన మిచ్చిన యీజాబు వచ్చినప్పటికే ఉండియున్న అజీముజా, మూడవజార్జిగారి ఉత్తరాధికారియు, ప్రతినిధియు అయిన ప్రభువునుండి "ఆమన్నన రక్షణలను" కోరుచున్నాడు. ఆతనికోరిక నిరాకరింపబడునని నమ్మజాలను. ఈయుత్తరము వచ్చినయనంతరము, వారికీయబడిన యీ రాజరక్షణలను కోల్పోవదగిన క్లేమియు ఆవాలాజానవాబువంశస్థులు కావించియుండలేదు.

అజీముజాయొక్క పూర్వులు, తమగౌరవము, హోదా, ఆదాయములు తమవారసులకు శాశ్వతముగ నుండవలెనను నుద్దేశముతో బ్రిటిషుప్రభుత్వమునకు తమ రాజ్యమును అధికారమును అప్పగించిరి. అట్టిహామీనుంచి భద్రపరచికొనిన ఆగౌరవము, హోదా, ఆదాయములకు, అజీముజా, ఉత్తరాధికారికాడని త్రోసివేయుటకై యత్నించుచు, లార్డు హారిసుగారు ౧౮౫౫ అక్టోబరు ౨౫-వ తేదీని[1] తమమినిటులో చూపినవిధములగు వాదనలను ఖండించుటకు నెట్లు ఎక్కడనుండి ప్రారంభింపవలెనో తెలిసికొనుటకష్టము. లార్డుహారిసుగారు చెప్పినప్రతివిషయమును ఖండించుచు, ఆదేపనిగ ఎన్నియోసంగతులు చెప్పి చదువరులను విసిగించుటకంటె ఆయనను సమర్థించుటకు ఏమాత్రమైనను అవకాశమున్నదా యని అన్వేషించుటయే యిష్టముగా నున్నది. పార్లమెంటరీ దస్తావేజులను చదివిచూచినమీదట, మదరాసుగవర్నరుగారి నిజరూపము బయలుపడును. ఆతడు తననాయకుడైన డాల్హౌసీప్రభువు చెప్పిన ప్రతివిషయమును నియమముతప్పక ఆచరించుచుండెను. బలవంతుల చాంచల్యము, రాజనీతులబారినుండి బలహీనులను రక్షించుటకై ఏర్పడినసంధిషరతులన్నింటిని పటాపంచలు చేయుటలో డాల్హౌసీప్రభువు మహాదక్షుడు. ఈయన ఆయనకష్ట గుణపాఠమును నేర్చుకొనిన అనుచరుడు.

కర్ణాటకనబాబు ౧౮౫౫ అక్టోబరు ౭ న తేదీని పరలోకగతుడాయెను. ఆతనిని డాల్హౌసీప్రభువు ఉదకమండలమున నివసించుచుండెను. తన యుద్దేశములను తలపులను మదరాసుప్రభుత్వమువారికి వెనువెంటనే తెల్పెను. అక్టోబరు ౩౩ వ తేదీని కార్యదర్శి ఎడ్మండ్సన్ గారు "౧౮౦౧ సం.రం సంధికి తరువాత అయిన పట్టాభిషేకసమయములందు ఏమేమి జరిగెనో" యని ప్రశ్నించుటతోనే యీక్రిందివిషయములను గూడ వివరించెను.

"3. కీర్తిశేషులగు నబాబుగారికి కుమారు లెవ్వరును లేరనియు, అందుచే సింహాసనము నధిష్ఠింపదగిన వారసుడు లేడనియు గవర్నర్ జనరల్ గారు తెలుపుచున్నారు.

1 Papers relating to the Nawab of Karnatic, 1860, P. 12.

౪. ఈపరిస్థితులయందు యికముందు కర్ణాటక నబాబు బిరుదును ఏమిచేయవలయునో అవసరముగా ఆలోచింపవలెనని వా రూహించుచున్నారు.

౫. ఇంతలో, అనగా అనధిష్ఠిత సింహాసనమును గూర్చి ఆలోచనజరిగి నిశ్చయించువరకు కర్ణాటక నబాబుయొక్క ఉత్తరాధికారిగగాని ప్రతినిధిగాగాని, ఎవరిని మదరాసుప్రభుత్వమువారు ఒప్పుకొనరాదనితలంచుచున్నారు."

అట్టి ఆలోచనలకు ముందుగనే ఒక నిశ్చయమునకు వచ్చినటుల యిందు సూచన స్పష్టముగ కానవచ్చుచున్నది. ఆయభిప్రాయములే గవర్నరు జనరల్ గారి యుత్తరువులట్లు అంగీకరింపబడియెను. ఆ యుదకమండలమునుండి చలాయింపబడెను ఆప్రభుత్వాధికారమును మదరాసుప్రభుత్వమువారు ధిక్కరింపజాలక పోయిరి. లార్డు డాల్హౌసీయే, అంత ఆసక్తితో, అంత సులభముగ, జాలోను, సతారా, జాన్సీ, నాగపూరువంటి మహాజంతువులను దిగమ్రింగి, అయోధ్యరాజ్యమును కూడ కబళింప నిశ్చయించినపుడు లార్డుహారిసు, ఆతడు వర్ణించినటుల 'వట్టి ఆడంబరమైన యీనామమాత్రపు' కర్ణాటకనబాబు హోదావంటి ఒకమశకమును రక్షించుటకై అంత శ్రమపడుట ఎందులకు? ఇట్టిసందర్భములో అసలు దిగమ్రింగనా వద్దా యని అనుమానించుట అసంభవము. అక్టోబరు ౨౫ వ తేదీని లార్డుహారిసుగారు మినిటును వ్రాసియుంచెను. నవంబరు ఆరంభమునసే ఉదకమండలమునుండి లార్డుడాల్హౌసీ మదరాసుకువచ్చి కార్యనిర్వాహకసభయందు పాల్గొని "అవిపులమును, సమర్థమును పూర్తిపరిష్కారమును అగు" ఆపత్రికనుగూర్చి తాను సంపూర్ణామోదమును తెలిపెను.

లార్డుహారిసు యీ విధముగ నిర్ధారింప నెంచెను. ఒకటి: ౧౮౦౧ సం.రం సంధిలోపాల్గొనినఅజీముద్దౌలా యునుఆతనికుమారుడగుఅజీమజాయునుఆతనిమనుమడు, గతనబాబున్ను అయిన మహమ్మదుగౌసున్నూ వంశపారంపర్యపుప్రభువులుకాక, (౬౬-వ శీర్షికలో) ఏసమయమునందైనను "తాను రద్దుపరుపగల్గెడు కొన్నిహక్కు-అధికారము, పింఛనులను" సార్వభౌమప్రభుత్వము యీయనెంచినసామంతులు మాత్రమేయని. రెండు: ౧౮౦౧ సం.రం లోనిసంధి అజీముద్దౌలాతోనే ప్రత్యేకముగా కావింపబడినదనియు అందు 'వారసులు, ఉత్తరాధికారులు' అనుమాటయే లేదు. ఆతనిఅనంతరము, కుమారుని, మనుమని, కేవలమును అనుగ్రహించి, రాజ్యము చేయనిచ్చినను ఆతనిమరణానంతరము ఆసంధి బ్రిటిషుప్రభుత్వమును బంధింప నేరదు.

ఇట్టియుద్దేశము సమంజసమా యని నిర్ణయించుటకు ౧౮౦౧ సం.రం సంధిషరతులను గమనింపవలెను. ఆసంధియొక్క అవతారికయందు 'అజీముద్దౌలా, యింతవరకును కర్ణాటకనబాబులైయున్న ఆతనిపూర్వులహోదా, ఆస్తి, రాజ్యములయందు, ఈస్టుయిండియా కంపెనీవారిచే ప్రతిష్ఠాపింపబడియెను' అనియున్నది. కావున తరువాత చర్చనీయాంశము, 'యింతవరకును, కర్ణాటనబాబులైన, ఆతనిపూర్వులహోదాఏది?' అని. ఏలన, అసంధిప్రకారము, ఆతనిపూర్వులవలె ఆహోదాయందు, అజీముద్దౌలా ప్రతిష్ఠాపింపబడియెను. అంతియకాక, తరువాత నున్న "ఇరుపక్షములయొక్క సంబంధమును ఎల్లకాలము ఉండదగిన స్థిరపద్ధతిమీద ఏర్పరుచుచు." అనుమాటలు యీపైమాటయొక్కబలమును తగ్గించలేదు. ఈ పైమాటలు ఒకనిజీవితాంతమువరకే ప్రత్యేకముగా కావింపబడిన ఏర్పాటునందుండవలసినట్టివి కావు.

(౬౬-వ శీర్షికలో) లార్డుహారిసు యిట్లవ్రాసెను. "కర్ణాటకరాజ్యమందలి వారివంశపారంపర్యపు హక్కును, అధికారమును, రాజబిరుదమున్నూ వారిచే వహింపబడి మనవల్ల నంగీకరింపబడినవి. కాని అవి మొగలుప్రభువుపాలనలోని ఒకముసల్మానుపారునకు యీయదగునట్టివి కావు అని తలచెదను" నేను యింతటితో ఆగి, లార్డుహారిసు యీవిషయమునంతను ఒప్పుకొనినట్లు రూపింపవచ్చును. ఏలన, 'వంశానుగతపుహక్కు-రాజాధికారములు, నబాబులస్వాధీనమైయుండి మనవలన అంగీకరింపబడిన' వని చెప్పుటనే అవియే, ఆతని పూర్వుల 'హోదా ఆస్తి, రాజ్యములయందు' ౧౮౦౧ సంవత్సరపు సంధిచే నియమింపబడిన అజీముద్దౌలాకును చెంది యుండవలెను.

కాని యీవిషయమైతొందరపడ నక్కరలేదు. చారిత్రకములగు యథార్థ విషయములను జాగ్రతగ

జ్ఞప్తికి తెచ్చుకొందము. ఢిల్లీపాదుషాచే, నైజాము, దక్కనుసుబేదారుగానియమింపబడగా,అతనిచే,యీవంశపు మూలపురుషుడగు అన్వరుద్దీనుఖాను కర్ణాటకపాలకుడుగా నియమింపబడెను. మొదటపుట్టిన దానపట్టాలననుసరించి యీరెం డుద్యోగములు వంశపారంపర్యములు కావు. కాని యీదేశమున, పూర్వాచారముల బట్టి యిట్టి ఉద్యోగములు వంశపారంపర్యము లగుట కామామూలు. అదియుగాక, మొగలు సామ్రాజ్య క్షీణదశయందు గొప్పసుబేదారీలగు, దక్కను, అయోధ్య, వంగదేశములకు, నానాటికి ఆక్రమణలవల్లను, సమయానుకూలమునుబట్టి చక్రవర్తులనుండి బలవంతముగ పొందిన హక్కులవల్లను యిట్టి వంశపారంపర్యపు హక్కులు, స్వాతంత్ర్యమున్ను కలిగెను. ఇట్టిహక్కులు ఆక్రమణలకు ప్రభువులుయిచ్చుటుసమయములందు అంగీకరించు చుండిరి. వారికిప్పటికిని ఆచారానుసారముగా మర్యాద, రాజభక్తి చూపుట, కొన్ని సందర్భములయందు కప్పములను చెల్లించుటయు కలదు. అట్టులే మహారాష్ట్రరాజులున్నూ, మొదటపేష్వాక్రింద సుబేదారులై సామంతులైయుండి, క్రమశః తమ రాజ్యములందు సర్వస్వతంత్రులై తమపై మొదట సర్వాధికారియైయున్న పేష్వాను తమపై వట్టి సంయుక్త ప్రభువు హోదానునిలిపి వంశపారంపర్యపు రాజులైరి.

ఈరాజవంశపు మూలపురుషుడు అన్వరుద్దీనుఖాను నడతయందు పరిశుద్ధుడుకాకున్నను, ఆంగ్లేయులతో నెల్లప్పుడును మైత్రినవహించియేయుండెను. ౧౭౪౬ లో సైన్యనౌకాబలములయందు పరాసువారు తాత్కాలికాధిక్యము చూపగల్గినపుడు అతడు మదరాసు, కడలూరునందలి మన సెటిల్‌మెంటులను సంరక్షించెను. అన్వరుద్దీనుఖాను ముదుసలియై అంబూరునందు ఫ్రెంచివారితోడను, వారు బ్రిటిషువారియధికారమును నాశ మొనరింపనెంచి పోటీకి కర్ణాటకనబాబుగా నిలువబెట్టిన చందాసాహెబుతోడను పోరి ౧౭౪౯ ఆగష్టు ౩ వ తేదీని రణరంగముననే చనిపోయెను. ఫ్రెంచివారిఅత్యాశను, డూప్లేగారు బాహాటముగా తెల్పు పన్నుగడలను చూచి మూడు రాజధానులగవర్నర్లును పూర్తిగా యిప్పటి వెరగందిరి. ఒకదేశీయప్రభువునకు సాయమొనర్చుచున్న మిషతో పరాసులునత్యధికరాజ్యాభివృద్ధికై పెద్ద యెత్తుగడను చేయుచున్నట్లు విశదమయియుండెను. ఈప్రబలశత్రువులతో వారి యుపాయముతోనే అనగా కర్ణాటకరాజ్యమునకు ప్రతినబాబు నొకనిని నిలువబెట్టి పోరాడుటకంటె మనకు వేరుమార్గము లేకుండెను. ఇట్టి యుద్దేశముతో మహమ్మదాలీ తెలిపిన పద్ధతుల కంగీకరించి బహిరంగముగ నాతనికైనను యథార్థముగ మన కొరకే రణమునకుపూనుకొంటిమి. మన యత్నము సఫలమాయెను. మనచేదొరైన నబాబుయొక్క హోదాను, ౧౭౬౩ లో పారిసునగరమున పరిష్కరించబడిన సంధిలోని ౧౧ వ షరతులో ఫ్రెంచిప్రభువు పూర్ణముగా అంగీకరించెను.

ఈ రాజనీతిననుసరించియే చాలా రాయబారములు జరిపి, నైజాముక్రింద సామంతస్థితినుండి మహమ్మదాలీని సంపూర్ణముగా విముక్తునిజేసి, ఢిల్లీప్రభువుచే, ఒకఫర్మానావల్ల, 'వాలాజాఆమీరూల్ హింద్, (హిందూదేశమందలి గొప్పప్రభువు) అనుబిరుదముతో నాతనిని వంశపారంపర్యనబాబుపదవికి తెచ్చితిమి. వారు అనుమతించు నెడల, లార్డుహారిసుగారిమాటలనే స్వల్పభేదముతో మారుపలికెదను. "మొగలాయిలపౌరుడైన ముసల్మానునకంటెకంటె, ఏఅధికారమున్ను, శాస్త్రీయముగ పరిగణింపబడజాలదని తలంచెదను."

౧౭౭౮ అక్టోబరులో వాలాజానబాబు, కంపెనీయొక్క కోర్టుఆఫ్‌డైరక్టర్లకు ఇటులవ్రాసెను. "దైవకృపవలన నేను ఒకవంశపారంపర్యపు ప్రభువను. మరియు గ్రేటుబ్రిటనుప్రభువుయొక్క స్థిరమిత్రుడనై, హిందూదేశపుప్రభువులలో నెల్ల, ఆంగ్లేయులతో నత్యంతమైత్రిని కలిగియున్నాను." తరువాత చాలాకాలమునకు (౧౮౦౧ మార్చి ౧౮ తేదీని) ఊర్పదత్ ఊల్ ఉమ్రాగారికాలమున న్యాయశాస్త్రరీత్యా యొకయిబ్బంది పరిష్కరింపబడవలసివచ్చినప్పుడు మదరాసుప్రభుత్వాధికారులు కోర్టుఆఫ్‌డైరక్టర్లకు యిటులువ్రాసిరి. "యీవిషయమునుగూర్చి అటార్నిజనరల్ (ప్రభుత్వపక్షన్యాయవాది)తో సంప్రదించి లేటరుగారికి, కర్ణాటకనబాబు స్వతంత్రప్రభువని మేమంగీకరించినట్లు తెలిపినాము"

కావున మహమ్మదాలీ వాలాజానబాబు స్పష్టముగా, ఒకవంశపారంపర్య స్వాతంత్ర్య ప్రభువు, కాని,

కంపెనీవారిసామంతుడు కాడు. ఆతని కుమారుడు అగు ఉమ్దత్ ఉల్ ఉమ్రా ఆతని తరువాత రాజ్యము నేలెను. కాని అతని పరిపాలనకాలమున ఆతనికిని, కంపెనీవారికిని ఎట్టినూతనపుఏర్పాట్లున్నూ జరుగలేదు. ఆతనితమ్ముని కుమారుడగు అజీముద్దౌలా ఆతనితరువాత రాజ్యమునకు వచ్చి ౧౮౦౧ లోని సంధిచే యింతవరకును కర్ణాటక నవాబులుగానున్న ఆతనిపూర్వులహోదా ఆస్తి రాజ్యములయందు ప్రతిష్ఠాపింపబడియెను. ఆతడెట్లుతనవంశపారంపర్యపుహోదాను కోల్పోయి,కంపెనీయిష్టమువచ్చినపుడు రద్దుచేయగలిగిన హోదా అధికారము, అంగీకారములతో కంపెనీయొక్క సామంతుని స్థితికి ఎట్లు, ఎప్పుడు అధఃపతితుడాయెనో తెల్పుడని లార్డు హారిసుగారిని, లార్డుడాల్‌హౌసీగారిని మనము అడుగవచ్చును.

అజీముద్దౌలాయొక్క పట్టాభిషేకసమయమునందును, ఆతనిపాలనమందితరసమయములందునుగూడ స్వతంత్రప్రభువని ఆతనిహోదా అధికారములు బ్రిటిషు అధికారులచే సంపూర్ణముగా అంగీకరింపబడియెను. వీటిలో యిచట రెంటిని ఉదాహరణములుగా చూపెదను.

౧౮౦౧ సం.రం సంధికి మూడుసంవత్సరములు తరువాత మదరాసు గవర్నరుగారు అజీముద్దౌలానవాబుగారికి ఇటుల వ్రాసెను.

"రాజ్యమందలి ద్రవ్యవివాద సంబంధమైనట్టియు (Civil), సేనాసంబంధమైనట్టియు వ్యవహారముల యందు నిర్వహణము మాయందే యుంచుకొని ప్రభుత్వమువారు మిమ్ములను కర్ణాటకరాజ్యసింహాసనస్థుల చేసిరి. తమ స్వాతంత్ర్యప్రభువుహోదా, గౌరవదర్పముల సంరక్షించుటకున్నూ రాజోచితములగు అత్యుదార దానధర్మముల కొరకున్నూ ప్రభుత్వాదాయమునుండి తగినంతమొత్తము ప్రత్యేకింపబడినది.[1]"

తరువాత తొమ్మిదేండ్లకు కోర్టుఆఫ్ డైరక్టర్లు యీవిధముగ వ్రాసిరి: "కర్ణాటకనవాబుయొక్క స్వతంత్రప్రభుత్వపుహక్కులు ప్రధాన న్యాయసభాపతులచే అంగీకరింపబడి రూఢికావింపబడి స్థానిక న్యాయస్థానముయొక్క అధికారమునుండి తప్పింపబడియెనని ప్రభుత్వపక్షన్యాయవాది ౧౮౧౦ సం.రం సెప్టెంబరు ౨౨న వ్రాసిన నివేదికనుబట్టి తెలియుచున్నది."[2]

వాలాజానవాబునకున్ను యీస్టుయిండియా కంపెనీకిన్ని ఏనిర్ణయముగాని, సంధిగాని, ఏర్పాటుగాని, లేకయే ౩౦ సంవత్సరముల కెక్కుడుగగూడ అత్యంతమగు స్నేహసంబంధ ముండెను. మదరాసు ప్రభుత్వము వారు బ్రతిమాలగా బ్రతిమాలగా సైన్యనిర్వహణము కొరకై అత నీయవలసిన ధనమును నిర్ణయించుటయే ముఖ్యోద్దేశ్యముగా నొకసంధిని ౧౭౮౭ లో కంపెనీవారు వాలాజాగారితో చేసుకొనిరి. ౧౭౯౨లో వార్షికముగ నాతడు సైన్యనిర్వహణము కొరకై యియ్యవలసిన ధనము ఆతని శక్తిని మించుటచే ౧౭౯౨ లో లార్డు కారన్‌వాలిస్ వాలాజాగారికనుకూలమగు సంధియొకటి చేసి అందువలన నవాబుగారిభారమును కొంతతగ్గించెను. ఈ సంధులలో రెంటియందును కొంత దేశభాగమును కంపెనీకి యిచ్చుటను

1. ౧౮౦౪ మే ౨౨ వ తేదీని లార్డు విలియం బెంటిక్‌గారు అజీముద్దౌలా నవాబుగారికి వ్రాసినజాబు. Papers relating to Carnatic Stipendaries, Madras, 1858, p. 97-98

2. ౧౮౧౩ సం.రం ఫిబ్రవరి ౨౩ వ తేదీని కోర్టుఆఫ్ డైరక్టర్లు మదరాసుగవర్నరుగారికి పంపినలేఖనుండి. Carnatic Stipendaries, Madras. 1858;p 138)

మిల్‌గారి హిందూదేశ చరిత్రనుండి తీయబడిన యీదిగువభాగము తగినంత చేటపల్లమై యున్నది.

"ఫ్రెంచివారితోటి పోరాటమున కర్ణాటకమునందు మహమ్మదాలీకి ఆంగ్లేయులు సాయ మొనర్చిరి. ఆయుద్ధాంతమున ఆతనిని తద్దేశపు స్వతంత్రప్రభువుగా నంగీకరించిరి. కావున సైన్యాధికారము, ఆర్థికాధికారములను, రాజ్యాధికారముఖ్యాంగములను ఆతని యధీనమున నుంచిరి. ఆతని యనుమతివలన కొన్ని అధికారములను సంపాదించి ఆతనియందు భక్తివిశ్వాసములుకలిగియుండి ఆతనిక్రింద సామంతముగ కంపెనీయుండెను".

గూర్చి ఏమియును లేదు. ఆతనితరువాత ఉమ్దత్ ఉల్ ఉమ్రా ౧౭౯౫లో రాజ్యమునకు వచ్చెను. ఆతనిపాలన కాలమున అతనికి బ్రిటిషుగవర్నమెంటుతోడిసంబంధమే మాత్రమునుమార్పు చెందలేదు. కాని ఆతడు చనిపోగానె గొప్పమార్పును కలుగచేయవలయునని (కంపెనీవారు) ఎంచుచునేయుండిరి. నబాబుగారిమరణమునకుపూర్వము చాల సం.నుండియే—ముఖ్యముగా౧౭౯౨లో తాముగావించిన యుద్ధములవల్ల లార్డుకారన్‌వాలిసు టిప్పుసుల్తానుయొక్క బలవిచ్ఛేదముగావించిననాటినుండియు—కర్ణాటకమందలి సామాన్యసైన్యపరిపాలనమంతయు సంపాదించుటకున్నూ, అటులసామాన్యపాలనము మూలముగ నాతని ప్రభుత్వాదాయములో నెక్కువభాగమును కాజేసి, నబాబును నామమాత్రుని గావించి పింఛనునిచ్చుట వారియొక్క ముఖ్యోద్దేశమై యున్నది. ఈనీచస్థితికి వచ్చుటకు వాలాజానబాబుకే కాక ఉమ్దత్ ఉల్ ఉమ్రాకును ఒకేమాదిరిగా యిష్టములేదు. అయ్యది కంపెనీవారి కెక్కుడు ఆశాభంగము కలిగించెను. ఈమూర్ఖపు పట్టుదలకు 'స్వార్థపరులగు కుట్రకారుల దుస్సలహాలే' కారణములని కంపెనీవారు అనిరి.

ఉమ్దత్ ఉల్ ఉమ్రా యొక్క కాలములో యీవలసిన సైన్యనిర్వహణార్థపుధనము వాయిదాతప్పక యీయబడుచుండెను. కాని రాజ్యపాలనము మిగుల జనకంటకముగను దుబారాగను జరిగెనని కంపెనీవారనిరి. యిది నిజమయిన కావచ్చును. బంగారపు గుడ్లతోపాటు కోడినిగూడ నబాబు నాశమొనరించుచుండెను.(అనగా యికముందు క్రమముగ ధనమువచ్చుటకు వీలులేకుండ దేశమును పాడుచేయుచుండెనని అభిప్రాయము). క్రమము తప్పకుండ బంగారుగుడ్లను రాబట్టగలశక్తి కంపెనీవారికే యుండెను. ౧౭౯౫ లో ఉమ్దత్ ఉల్ ఉమ్రా రాజ్యాధిష్ఠితు డయినంతనే మదరాసు గవర్నరు లార్డు హోబర్టుగారు కర్ణాటకరాజ్య ప్రభుత్వమును కంపెనీపరము చేయుమని ఎక్కువ పట్టుదలతో తిరిగి ప్రయత్నింపజొచ్చెను. అట్టిమార్పుదల ముఖ్యావసరమని తానెంచినట్లు అనేకమగు మినిటులను నాతడు వ్రాసెను. ౧౭౯౧ ఆగష్టు ౩౧ వ తేదీని కోర్టు ఆఫ్ డైరక్టర్లు మదరాసుప్రభుత్వకార్యనిర్వాహక వర్గాధ్యక్షునికి ఇటుల వ్రాసిరి. "మీరు కోరిన ఆ సవరణను అంగీకరించుటకు నబాబు ఒప్పింపబడలేనందుకు మేమెంతయు చింతించుచున్నాము. ఈసవరణ (అనిన వారుకోరెడిఆప్రభుత్వపు మార్పుదల) మూడేర తిరిగి వారిని గోరుటకై మీ కధికార మిచ్చుచున్నాము. మఱియు, హెచ్చరించుట,సమాధానము బోధనము మూలముగ ఆ నబాబుగారి యొక్క సమ్మతిని పొందగల్గుదురేని కంపెనీవారికి సమ్మతమగు సేవగావించినవా రగుదురు. ఎన్నిప్రయత్నములచేతను, నబాబుగారి సమ్మతిని పొందలేకపోయిరి. కంపెనీవారు హఠాత్తుగా జోక్యము కలుగజేసికొనుటకు తావీయకుండునట్లుగ నిర్ణయకాలములోననే సైన్యనిర్వహణపు ధనము చెల్లింపబడుచుండెను. ౧౭౯౮ లో లార్డ్ మార్నింగ్‌టన్‌గారు (తరువాత మార్క్వెస్ వెల్లస్లీ అయిరి.) గవర్నరుజనరల్‌గా వచ్చిరి. వారు మదరాసుకు చేరినంతనే క్రొత్తసంధిచేయు నుద్దేశముతో నబాబుతో రాయబారములు సలిపెను. కాని (అతడు కోర్టుఆఫ్ డైరక్టర్లకు తెల్పినటుల) నబాబుగారు ఈక్రొత్త ఏర్పాటునకు పూర్ణముగా విముఖుడై యుండెను ౧౭౯౯ ఏప్రిల్ నెలలో గవర్నరు జనరల్‌గారు కలకత్తానుండి ఆవిషయమునుగూర్చియే వాదయుక్తముగ అరువది శీర్షి కలుగల యొక దీర్ఘలేఖను నబాబునకు వ్రాసెను. కాని నబాబు ౧౭౯౨ సంధియొక్క సవరణనుగూర్చి (కంపెనీవారు చేసికొనిన) ఆ నిశ్చయాభిప్రాయమును ప్రతిఘటించెను.

కాని, ౧౭౯౯ వత్సరాంతమున ఉమ్దత్ ఉల్ ఉమ్రాగారి ఆరోగ్యము చెడుచున్నదనికలకత్తాకువార్త వచ్చెను. అంతట లార్డు మార్నింగ్‌టన్‌గారికొక యుక్తి తోచెను. మనము గమనించేయెడల అందు తుదకుతాము కోరిన ఏర్పాటును కావించుకొరకై యోచించినయుపాయము యొక్క బీజము యిచ్చుట గాననగును. కలకత్తానుండి ౧౮౦౦ మార్చి ౨౬ వ తేదీని మదరాసు గవర్నరుగారికివ్రాయబడినబాబు ఉమ్దత్ ఉల్ ఉమ్రాగారి మరణము సందర్భమున గవర్నరుగారి ప్రవర్తన సూచన చేసెడి సలహాలున్నట్టి ఉత్తరమునుండి ఒక దీర్ఘభాగమును యీ క్రింద జూపవలయును.

"౧౭౯౨ లోని సంధి, వాలాజా నబాబుగారి యొక్కయు, వారి యుత్తరాధికారుల యొక్కయు

తేరను, లరఫునను కావింపబడినప్పటికిని ఆవంశములోని వారై ప్రస్తుత నబాబుచే నియమింపబడినవా రెవ్వరైనను న్నయెడల వారి అర్వాతవివావస్థమై సందేహాస్పదమై యున్నయెడల అట్టివారిని సింహాసనాధిష్ఠితుల చేయుటకు గాని సహాయమొనర్చుటకు గాని, ఆసంధిలోని ఏ షరతులవల్లను మనము బాధ్యులము గాము."

తన కుమారుడని ఉమ్దత్ ఉల్ ఉమ్రా చెప్పుచున్న ఆతని జననమునుగూర్చి అనేక వదంతు లున్నవి. ఏమయినను యీ యువకునితల్లి తక్కువజాతి దని, నబాబు ఎన్నడును ఆమెను వివాహము చేసుకొనలేదనుట స్పష్టము. యీతడు రాజ్యమునకు వచ్చినచో[1] (నబాబు తమ్ముడగు) అమీరుల్ ఉమ్రాగారి కుమారునికి యింతకంటె నెక్కువహక్కుగలదని తలంచువారు అందుకై శక్తివంచనలేక ప్రతిఘటింతురనుట నిస్సంశయము."

"ప్రస్తుత స్థితిగతులయందు యిరుకక్షులలో నెవ్వరికిని యిప్పటికున్న సంధులనుబట్టి సాయ మొనర్పజాలము. అందులో నెవ్వరికి మనము సాయము యిచ్చెదమో నిశ్చయించునపుడు కర్ణాటక రాజ్యములో ఆంగ్లేయుల లాభములను మొత్తము రాజ్యముయొక్క ఐశ్వర్యమున్ను, ప్రజాసౌఖ్యమున్ను మనహక్కు బాధ్యతలను నెక్కువ ముఖ్యములుగా నెంచవలయును."

"యీపద్ధతి ననుసరించి మనము సింహాసనాధిష్ఠితులచేయు నాతినినుండి ప్రస్తుతము కర్ణాటకమునకు కలిగిన యిక్కట్టులను సక్రమముగ నివారించుటకై తగిన షరతులను విధించవలయును."

"ఇందుకొరకు, ఉమ్దత్ ఉల్ ఉమ్రాయొక్క ఉత్తరాధికారి సామాన్యసైనిక పరిపాలనమునంతయు సంపూర్ణముగ కంపెనీవారిపరముగావించి ఒక కోటను గాని, ఒక సేనను గాని, ఏ విషయమిూద నైనను ఉంచుకొనరాదు."

మొదటగా నీషరతులను ఉమ్దత్ ఉల్ ఉమ్రా కుమారుడగు ఆలీ హుస్సేనునకు అంగీకారమునకై ఎదుటబెట్టవలయును.

"నబాబుయొక్క కుమారుడని చెప్పబడునాతడు యీనబాబు మరణానంతరము ౨౪ గంటల లోపుగా యీషరతులను తిరస్కరించినగాని లేక ఒప్పుకొనుటకు ఆలసించినగాని అమీరుకుమారునికి ఆషరతులను ఒప్పుకొనినమీదట సింహాసనము నెక్కుటకు అధికారము నొసంగుడు."

(సశేషము)



1. ఇతడు అజీముద్దౌలా. తుద కీతడే సింహాసనము నెక్కెను.





# అర్థశాస్త్రము

గంటికోట సత్యనారాయణ మూర్తి గారు, ఎం. ఏ.

[వెనుకటి సంచిక తరువాయి]

## ౮. ప్రజావృద్ధిసమస్య

ఇక జనసంఖ్యాభివృద్ధిగూర్చియు అందులకుపగిన ఆహార పదార్థాభివృద్ధి యగుచున్నదా అనే సమస్యను గూర్చియు విచారించవలసి యున్నది. పదు నెనిమిదవ శతాబ్దాంతమం దొకపాశ్చాత్యుడగు అర్థశాస్త్రజ్ఞుడు (మాల్థూసీ) ఏదేశమందైనను జనసంఖ్య ఆహారాదులకన్న ఎక్కువగా వృద్ధినొందుచున్నదనియు, యుద్ధము, జాడ్యములు, స్వాభావిక మరణములు మొదలగు కారణముల వలన ప్రజానాశన మగుచున్నను, స్త్రీ పురుష సంగమ సంజనిత సంతానాభివృద్ధికి ఇంద్రియ నిగ్రహము మొదలగు కొన్ని అభ్యంతరములు ప్రజలు కల్పించుకొనని యెడల జనసంఖ్యాభివృద్ధికి తగిన ఆహారపదార్థాభివృద్ధి కలిగి దేశము సుభిక్షముగా నుండదని సిద్ధాంతీకరించెను; 3,6,12,24,48,96,192— ఈ విధమున దేశమందలి జనసంఖ్య విస్తరించుచుండుననియును, 3,5,7, 9,11,13,15— ఈవిధమున వ్యవసాయాది వృత్తులవలన లభించెడు ఆహారాదులు అతిశయించుచుండుననియును వాని అభిప్రాయము. ఈ సిద్ధాంతము దేశపుటార్థిక విషయములలో వర్తించుచున్నదా అని ప్రతిదేశపువారున్ను వాద ప్రతివాదము లొనర్చిరి. కొందరీసిద్ధాంతము మాల్థూసుగారియొక్కయు వారి శిష్యులయొక్కయు ఊహా ప్రపంచమందు మాత్రము కల్పింపబడినది గాని వాస్తవ ప్రపంచమం దిదివర్తించుటయే లేదనిన్ని, మరికొందరు సత్యమించుక కలదనియున్ను మాల్థూసుగారి అంతరార్థము గ్రహింపవలెను గాని ప్రతిపదార్థశోధన మొనరించి తప్పులెంచుట హేత్వాభాసమనియున్ను అభిప్రాయపడిరి. గ్రంథవిస్తరభీతిం జేసి ఈవాద ప్రతివాదములతో సంబంధించిన సూక్ష్మాంశము లన్నిటిని చర్చింపలేము గాని మొత్తముమీద తెల్లమగుచున్న విషయములను వాటికి యథార్థ్యమున ఇందుక గమనించెదము. యుద్ధములు, ప్లేగు, కలరా, ఇన్‌ఫ్లుయంజా, కాటకములు మొదలగువాటివలన సంభవించెడు మరణములు కొంతవరకు జన నాశన మొనర్చుచున్నను, జననముల సంఖ్య తగ్గినట్టుల అతిబాల్యవివాహములు, వితంతూద్వాహములు, తినుటకన్నను సరిగా లేనివారుకూడ పెండ్లిచేసుకొని పిల్లలనుకనుట మొదలగు సాంఘికాచారములు కట్టిపెట్టినచో ఇదివరకే జనసంఖ్య జాస్తిగా నున్నట్టియు, భాగ్యోత్పత్తి విశేష మతిశయించుటకు వలయు సాధన సామగ్రి లేనట్టియు దేశములు బాగుపడును. ఇంకొక సంగతి. ఒక్క జనసంఖ్య అధికరించినచో దేశమున కనర్థములు వాటిల్లునని చెప్పలేము; ఏమన దేశపు భాగ్యమును వృద్ధిచేయగలవా రెందరో అవతరించవచ్చును; నాగరికత ప్రబలి జనుల జీవనావస్థలు ఉన్నతదశ నొందవచ్చును. ఈ అభిప్రాయము లన్నిదేశములకును అన్ని కాలములకును వర్తింపవు. లోకమందలిదేశముల ఆర్థికావస్థలు వేర్వేరు యుగములలోను, శతాబ్దములలోను భేదించియున్నట్లు దేశచరిత్రలు ఘోషించుచున్నవి. కొన్ని దేశములవారు జనసంఖ్య కొలదికాలములో అధికరించనియెడల దేశపుటార్థిక రాజకీయ వ్యవస్థలు విపరీత పరిణామ మొందునని విచారించి ఇతర దేశములవారి కసంబద్ధమని తోచెడు ప్రజాభివృద్ధిమార్గముల నవలంబింతురు; స్త్రీ పునర్వివాహము లనుచితములని వాదింపక ఆ మూలమున సంతానవంతులగుదురు; ఇతరులకు వ్యభిచారమని తోచెడుఅభ్యాసములు వారికిసదాచారములు. కొన్నిదేశములవారు జనసంఖ్య విస్తరించినచో కష్టమని స్త్రీ పురుషులు 25, 30 ఏండ్లకు పెండ్లిచేసుకొందురు; కొన్నిదేశములలో 40 ఏండ్ల కన్యలున్నారు. మరికొందరు పెండ్లికూతురికన్న పెండ్లికుమారుడు చిన్నవాడైనను

తప్పులేదని అట్టివారికి పెండ్లిండ్లు జరుపుచుందురు. మరి కొన్ని దేశములలో స్త్రీలు సంతానవతులైనచో కుటుంబ పోషణము కష్టమౌనని గొడ్డుమందులను తినెదరు; లేదా నవనాగరికులలో "మాల్థూసియన్సు" నాబడుచున్న సూచన విధానములను స్వీకరించెదరు. మరికొన్ని దేశములలో బొమ్మలపెండ్లిండ్లో యనునటుల ఆరేడేండ్ల ఆడుపిల్లల కున్ను ఏడెనిమిదేండ్ల మగవారికిన్ని వివాహములు జరుగును; 14 ఏండ్లు దాటకుండగనే వారు సంతాన ప్రాప్తులగుదురు. ప్రజాభివృద్ధి అయిన కానిండు; అందులకుతగిన భాగ్యోత్పత్తి చేయవలెను గాని ప్రజావృద్ధి కభ్యంతరములు కల్పించుట పౌరుష హీనమని కొందరు వాదించెదరు. లోకములో నిట్టి వేర్వేరు స్థితిగతు లుండుట వలన ప్రజావృద్ధి సమస్య పలువురకు పలువిధములుగా గోచరించుచుండును.

ఈ సందర్భమున హిందూదేశపుస్థితిగతుల నించుక విచారించెదము. జనాభా లెక్కల ప్రకారము ఈదేశపు జనసంఖ్య నానాటికి పెరుగుచున్నట్లే కానవచ్చుచున్నది. బ్రిటిషిండియా జనసంఖ్య (స్వతంత్రరాష్ట్రము లిందులో చేరవు) 1891 లో 221. 2 మిలియన్లు; 1901 లో 231. 6; 1911 లో 244. 3; 1921 లో 247. కొన్ని నిర్ణీతకాలములలో నూటికి జననముల రేటెంతయో మరణముల రేటెంతయో తెలిపెడు ఈదిగువ పట్టీ గమనించ తగినది.

| సంవత్సరములు | నూటి 1కి జననములరేటు | నూటి 1కి మరణములరేటు | వృద్ధిరేటు |
|---|---|---|---|
| 1894–1898 | 34.77 | 31.10 | 3.67 |
| 1899–1903 | 38.33 | 32.99 | 4.34 |
| 1909–1908 | 38.55 | 35.86 | 2.69 |
| 1909–1913 | 38.62 | 30.91 | 7.71 |

కాటకములు, ప్లేగు, మలేరియా మొదలగు కారణములవలన అనేకులు మరణించుచున్నను, జనసంఖ్య వృద్ధినొందుచునే యున్నది. బ్రిటిష్వరిపాలనమునకు పూర్వము మాదేశపు జనాభాలెక్క లెట్లుండెనో మనకంతగా తెలియవుగాని రామాయణ భారతాది యుగములలోను ఆంగ్లేయులకు ముందీదేశము నేలెడి ప్రభువులకాలములోను యుద్ధములు తరుచుగా జరుగుచుండెడు కారణముచేతను, దేశమందన్ని భాగములు నివాసయోగ్యముగా నుండని కారణముచేతను జనసంఖ్య అప్పుడు తగ్గియేయుండునని ఊహించవచ్చును. ఇప్పు డీదేశములో యుద్ధములవలన ప్రజానాశన మతి స్వల్పము. మరణకారణంబులగు వ్యాధులను నివారించుటకును నిర్మూలించుటకును అనేక విధముల ఆరోగ్యము నెలకొల్పుటకున్ను సౌకర్యము లేర్పడినవి. శిశుహత్య, నరహత్య, సహగమనము మొదలగు దురాచారములు కఠిన శాసనములంజేసి నిషేధింపబడినవి. అయితే ప్రజావృద్ధికారంబులగు పెండ్లిండ్లు జరుగుచునే యున్నవి. జరుగుటయే కాదు; అధికరించుచున్నవి. వితంతూ ద్వాహము శాస్త్రీయమని వాదించు పూర్వాచార పరాయణు లీదేశమందెంతమంది యున్నను వన గవర్న మెంటువారు స్త్రీ పునర్వివాహము హిందూలా (ధర్మశాస్త్రము) వలె ఉచిత ధర్మమని ప్రత్యేక శాసన మేర్పరుచుటంజేసియు సంఘ సంస్కారకర్తల ఆందోళనము పలువురకు రుచించుటవలనను ఇప్పుడు నూటికి 60 మంది స్త్రీ లీదేశములో నిరాటంకముగా వితంతూద్వాహ మొనర్చుకొని సంతానవతు లగుచున్నారు. విరుద్ధ సంబంధములు విసర్జనీయములని హిందూలా ఘోషించుచున్నను విరుద్ధసంబంధము లనేకములు సంఘాచార ప్రాబల్యమునంజేసి న్యాయ సమ్మతములని తీర్మానించెడు హైకోర్టుతీర్పులున్నవి. కొందరు ఇద్దరు ముగ్గురు స్త్రీలను పెండ్లియాడుచున్నారు. మన దేశమందలి కొన్ని భాగములలో 1921 న సంవత్సరపు లెక్కలప్రకారము వివాహము చేసుకొనిన పురుషులు స్త్రీలు వెయ్యిటికి ఎంతమంది యున్నారో తెలియజేయు ఈదిగువ పట్టీ గమనించతగినది:— మా. పట్టీ 1.

పైపట్టీ నాల్గవకాలములో "పెండ్లిచేసుకొనినవా"రనగా పుష్పవతులుకాని కన్యలనికాదు; పెనిమిటితో కాపురము చేయువారనియే. కొన్ని ప్రాంతములలో 15 ఏండ్లు రాకుండగనే పురుషులు, స్త్రీలు సంతానవతు లగుచున్నారు. 1921 లో వెయ్యిటికి వివాహ మింక చేసుకొనని పురుషులు, స్త్రీలు, బంగాళములోను ఇంగ్లాండు-

పట్టీ 1.

| రాష్ట్రము | ఏయేవయస్సులకు మధ్యస్థము | వెయ్యిటికి ఎంతమంది పురుషులు పెళ్లిచేసుకొనినవారు | వెయ్యిటికి ఎంతమంది స్త్రీలు పెళ్లిచేసుకొనినవారు |
|---|---|---|---|
| బెంగాల్ | 15—19 | 228 | 881 |
| | 20—39 | 795 | 784 |
| బీహారు ఒరిస్సాలు | 15—19 | 450 | 792 |
| | 20—39 | 807 | 824 |
| పంజాబు | 15—19 | 263 | 753 |
| | 20—39 | 660 | 890 |
| సంయుక్తరాష్ట్రములు | 15—19 | 459 | 870 |
| | 20—39 | 743 | 862 |
| బొంబాయి రాజధాని | 15—19 | 328 | 831 |
| | 20—39 | 746 | 840 |

వేల్సులలోను (1911) ఎంతమందియున్నారో ఈ దిగువ పట్టీ వివరించుచున్నది:—

| ఏయేవయస్సులకు మధ్యస్థము | బంగాళము | | ఇంగ్లాండు-వేల్సు | |
|---|---|---|---|---|
| | పురుషులు | స్త్రీలు | పురుషులు | స్త్రీలు |
| 15—20 | 766 | 55 | 998 | 988 |
| 20—25 | 410 | 20 | 857 | 757 |

25 ఏండ్ల వయస్సుకు ఆంగ్లేయస్త్రీలలో నూటికి 75 గురు వివాహము చేసుకొనరు. కావుననే 30 లేక 40 ఏండ్ల వయస్సు ఉన్నను కొందరు ఆంగ్లేయ స్త్రీలు అవివాహితలగు కన్యలే. అట్టివారు బంగాళములో నూటికి ఇద్దరు స్త్రీలుండుట అరుదు. తక్కిన ప్రాంతములందు కూడ ఈదేశమందంతటను ఇదేరేటు వర్తించునని ఊహించవచ్చును.

చెన్నపురి రాజధానిలో 1871 మొదలు 1921 వరకు క్రింద వివరింపబడిన జనాభా లెక్కలను గమనించినచో ప్రజాభివృద్ధి అగుచున్నదని తెల్లమగును:—

| సంవత్సరము | జనసంఖ్య |
|---|---|
| 1871 | 31636276 |
| 1881 | 31181940 |
| 1891 | 36064408 |
| 1901 | 38653558 |
| 1911 | 41870160 |
| 1921 | 42794155 |

1881 లో జనసంఖ్య తగ్గుటకు కారణము 1877-1878 మహాకాటకము.

పైన పేర్కొనబడిన వివరాంశములంజేసియు, కారణములంజేసియు ఈ దేశమందలి జనసంఖ్య నానాటికి హెచ్చుచున్నదనుట నిర్వివాదాంశము.

ఆహార పదార్థములు జనసంఖ్యతోపాటు వృద్ధినొందుచున్నవా అను అంశ మిక విచారించెదము. ఆహారపదార్థోత్పత్తి కృషి వాణిజ్యాదు లెంత వికసించినను హీనవృద్ధిసూత్రము ననుసరించి యుండునను సంగతి మరువరాదు. రానురాను జనుల జీవనావస్థలు, వాంఛలు, యత్నములు, చర్యలు పెంపొందు చుండుటంజేసి ప్రతి మనుజునకును ఆహారపదార్థముల విషయమై భూమినుండి గ్రహింపబడు పంటలలో ఇన్ని మణుగులు లేక ఇన్ని టన్నులు ప్రతిసంవత్సరము కావలసియుండుననని నిష్కర్షగా అంచనావేయుట కెన్నియో విమర్శనోపయోగ సాధనము లుండవలెను. ఎదిగినపురుషులయొక్కయు, స్త్రీలయొక్కయు, వేర్వేరువయస్సులుగల బాలురయొక్కయు, బాలికలయొక్కయు ఆహారపదార్థ పరిమాణము భేదించుచుండును. మొదటితరగతి భాగ్యవంతులు షడ్రసోపేత మగునట్టియు విలువగల పదార్థములతో కలిసినట్టియు ఆహారమును భుజింతురు. సామాన్యపు కుటుంబస్థులు తినుచున్న ఆహారపదార్థము లంత విలువ గలవి గాక సామాన్యముగా నుండును. బీదలు ఎట్టితిండి తినినచో ఆకలితీరి మనుజుల కుండవలసిన సాధారణపు

బలముకూడ ఉండదో అట్టి తినుబడి వస్తువులనే తినుచుందురు. ఈ తుదిని పేర్కొనిన జాతివారికి (వారిలో వేర్వేరు వయస్సులు గమనింపబడెను) మొత్తము మీద సంవత్సరమునకు ఆహారవిషయమై ఇన్నిటన్నుల తూనిక గల ధాన్యాదు లావశ్యమని మనము నిర్ణయించి అట్టివారే దేశమందున్న ప్రజలందరున్ను అని భావించి లెక్కలు వేసినచో మన అంచనా సర్వ సామాన్యముగా నుండును గాని అతిశయోక్తికాదు. ప్రతిసంవత్సరము వాస్తవముగా దేశములో పండుచున్న ధాన్యాదులు ఇన్నిటన్ను లనియును ఆహారార్థ ముపయోగించున విన్నిటన్ను లనియును లెక్కవేయుట మీది అంచనాకన్న సులభతరము; ఏమన దొరతనమువారు సేకరించిన వివరాంశములనే ముఖ్యముగా ఆధారము చేసుకొనవచ్చును. జనాభా లెక్కల ననుసరించి ఆహారార్థము ప్రజల కీయా సంవత్సరములలో ఇన్నిటన్నుల ధాన్యాదు లవశ్యమనిన్ని, ఆయా సంవత్సరములలో దేశములో పండిన ధాన్యాదులలో ఆహారార్థ మిన్నిటన్నులు వినియోగించుచున్న వనిన్ని పైనచెప్పిన గొన్ని వివరముల సంకలతో ఒక పట్టీలో ప్రదర్శించి నట్లయిన జనసంఖ్యా వృద్ధితోపాటు జనులకుతిప్పక కావలసియుండు ఆహారపదార్థముల ఉత్పత్తి వృద్ధినొందు చున్నదో లేదో నిర్ణయించవచ్చును. ఇదియే ఈసమస్యకు వలయు ఆర్థిక విమర్శనా పద్ధతి సంక్షేపముగా మీద వర్ణింపబడిన పద్ధతి ననుసరించుటకు కావలసిన విమర్శనోప యుక్త వివరములను ఓపికతో సేకరించి వాటిని యుక్తి యుక్తముగా నుపయోగించి ఇట్టి సమస్యలను 5 లేక 10 ఏండ్ల కొకసారి విచారించుచుండుడని పాఠక మహాశయులను ప్రార్థించుచున్నాము.

మన హిందూదేశములో ఒక ఏడాది వయస్సు నుండి ఏబది ఏండ్లకు మించిన వయస్సువరకు ఎంతమంది ప్రజలున్నారో 1911 మొదలు 1918 వరకు ప్రతి సంవత్సరము వారికి సాధారణపు బలము కలిగి యుండుటకు కావలసిన ఆహారపదార్థము లెన్నిటన్నులని అర్థ, ఆరోగ్య గణితశాస్త్రముల ప్రకారము సేకరింపబడిన విమర్శనోపయుక్త సాధనముల సహాయమున నిర్ణయించి ఆయా సంవత్సరములలో నుండెడు జనసంఖ్యలను, ఉత్పాదింపబడిన ధాన్యాదులను గమనించి సారాంశములను "వాడియా" అను అర్థశాస్త్ర పండితుడు సుబోధకముగా తెలియజేసెను. (ఇకనామిక్ జర్నల్ ఆఫ్ ఇండియా, మూడవ సంపుటము, పేజీలు 84–111, 167–183). ఆయన అవలంబించిన విమర్శనాపద్ధతి నంతయు ఇచ్చట నిరూపింపలేము గాని సారాంశములను మాత్రము పట్టీలరూపకముగా ప్రదర్శించుచున్నాము. 1911 వ సంవత్సరము బ్రిటిషిండియా జనాభా లెక్కలప్రకారము ప్రజావిభజనమును, వేర్వేరు వయస్సులుగల జనులాహార విషయమున వినియోగింపవలసియున్న ధాన్యాదుల పరిమాణమును ఈదిగువ 'ఏ' షెడ్యూలులో వివరించుచున్నాము. 'ఏ' షెడ్యూలు యూడవకాలములో వేయబడిన ఔన్సుల అజ్ఞాలెక్క నిర్ణయించుటకు మన గవర్నమెంటువారు ప్రమాణించినట్టి జెయిలు మాన్యువలు, క్షామకోడ్సు (ఖైదీలకున్ను, కరువుపనులు చేసెడువారికిన్ని ఇవ్వబడు ఆహార పదార్థముల వివరము లీగ్రంథములలో వివరింపబడియుండును) – ఆధారము; జనాభా లెక్కలవు "సెన్సస్ రిపోర్టు" ఆధారము.

ఏ–షెడ్యూలు

| వయస్సు ఏ యే సంవత్సరములకు మధ్యస్థము | 1911 జనసంఖ్య (మిలియన్లలో) | ఒక్కొక్కని కొక్కొక దినమునకు వలయు ధాన్యాదులు ఔన్సులు | జనసంఖ్య కంతటికి దినమునకు వలయు ధాన్యాదులు టన్నులు |
|---|---|---|---|
| 0—1 | 8 | ... | ... |
| 1—2 | 4 | 5 | 558.0 |
| 2—5 | 21.2 | 8 | 4732.1 |
| 5—10 | 34.5 | 12 | 11551.3 |
| 10—15 | 27.0 | 16 | 12053.6 |
| 15—50 (పురుషులు) | 61.0 | 28 | 47656.3 |
| 15—50 (స్త్రీలు) | 60.6 | 24 | 40580.4 |
| 50 ఏండ్లకు మించిన వారు | 28.0 | 22 | 15625.0 |
| | | దినమునకు వలయు మొత్తము ... | 132756.7 టన్నులు |
| | | సం॥నకు వలయు మొత్తము ... | 48.46 మిలియన్ల టన్నులు |

1912వ సంవత్సరమునుండి 1918వ సంవత్సరమువరకు నియ్యి 1కి 5 నరు జనుల సాగిన జనసంఖ్య వృద్ధియగుచున్నదనుకొనినచో (ఈ అంకె అతి తక్కువగానున్నది) పైనిగా పట్టే విధానము ననుసరించినచో 1911-1918 సంవత్సరములలో ప్రజలకు కావలసియుండే ధాన్యాదుల అంచనా లెక్క ఈదిగువ 'బి' షెడ్యూలులో నున్నవి:—

బి–షెడ్యూలు

| సంవత్సరము | కావలసినధాన్యాదులు (టన్నులలో) |
|---|---|
| 1911—1912 | 48.46 మిల్లియన్లు |
| 1912—1913 | 48.70 |
| 1913—1914 | 48.94 |
| 1914—1915 | 49.18 |
| 1915—1916 | 49.43 |
| 1916—1917 | 49.68 |
| 1917—1918 | 49.93 |

వ్యవసాయపు డిపార్టుమెంటువారి లెక్కలప్రకారము (అగ్రికల్చరల్ స్టాటిస్టిక్సు) పశువులు మొదలగువాటికిన్ని విత్తనములకున్ను కావలసిన ధాన్యాదుల సరిమొత్తము 'బి' షెడ్యూలు మొత్తములతో కలుపగా లభించిన మొత్తములు ఆయా సంవత్సరములలో తప్పక కావలసియుండు ఆహారాదుల మొత్తములు; ఆవివరము ఈదిగువ 'సి' షెడ్యూలులో నున్నవి:—

1911—1918 లో ప్రతి సంవత్సరము బ్రిటిషు హిందూ దేశములో వ్యవసాయవృత్తివలన పండుచున్న ధాన్యాదుల లెక్కలలోనుండి విదేశములకు ఎగుమతి అగుచున్నట్టియు అనేక కారణములంజేసి కలుగుచున్న తరుగులున్ను తరుగులున్ను (అనగా పంటలు చెడిపోవుట, తూనికతగ్గుట, ఎలుకలు, ఉడుతలు, పిచ్చుకలు, పందులు, కుక్కలు, నక్కలు మొదలగునవి తినుట, పంచుట, చెరుగుట మొదలగు క్రియలవలన తరుగులు, వివాహ శ్రాద్ధాది కార్యముల కగు అసాధారణపు ఖర్చులు, వరదలవలన నష్టము, మరుసటి సంవత్సరము పంటలు పండేవరకు కావలసిన ధాన్యాదులు నుంచవలసిన బాపతులు) మినహాయించగా శేషించిన ధాన్యాదుల రాబడి జాబితా ఈదిగువ 'డీ' షెడ్యూలులో ఉన్నది.

డీ–షెడ్యూలు

| సంవత్సరము | సీ–షెడ్యూలు మొత్తములు | వినియోగార్హమగు ధాన్యాదుల రాబడి | లోటు |
|---|---|---|---|
| 1911–1912 | 64.33 | 54.80 | 9.53 |
| 1912– 13 | 63.60 | 52.95 | 10.65 |
| 1913– 14 | 63.03 | 48.46 | 11.57 |
| 1914– 15 | 65.16 | 54.04 | 11.12 |
| 1915– 16 | 65.83 | 56.32 | 9.51 |
| 1916– 17 | 66.19 | 57.90 | 8 29 |
| 1917– 18 | 66.40 | 58 06 | 8.31 |

(మిల్లియను టన్నులు)

ఇంతవరకు మన మొనర్చిన తర్కమువలన లభించిన దేమిటి?

మన హిందూ దేశములో జనసంఖ్యాభివృద్ధికి తగిన ఆహార పదార్థాభివృద్ధి లేదు; అభివృద్ధియంతయు

సీ–షెడ్యూలు

| సంవత్సరము | ప్రజలకు కావలసిన ధాన్యాదులు | పశువులకు కావలసిన ధాన్యాదులు | విత్తనములకు కావలసిన ధాన్యాదులు | మొత్తముమీద ఆహారాదులకు కావలసిన ధాన్యాదులు |
|---|---|---|---|---|
| 1911—12 | 48.46 టన్నులు | 13.73 టన్నులు | 2.14 ట | 64.33 టన్నులు |
| 1912—13 | 48.70 | 12.77 | 2.13 | 63.60 |
| 1913—14 | 48.94 | 12.07 | 2.02 | 63.03 |
| 1914—15 | 49.18 | 13.80 | 2.18 | 65.16 |
| 1915—16 | 49.43 | 14.23 | 2.17 | 65.83 |
| 1916—17 | 49.68 | 14.27 | 2.24 | 66.19 |
| 1917—18 | 49.93 | 14.19 | 2.28 | 66.40 |

(మిల్లియను టన్నులు)

యటుండెనిందు; 'డ్రెమ్మా'లు మూడవకాలములో విన రింపబడిన ధాన్యాదులరాబడి దేశమందలి జనులందరు కైదీలు, కిరువుబత్తెములు పుచ్చుకొనువారు భుజించునట్లు భుజించెడ మన్నను చాలదు. ఆ కారణముచనే మన దేశము బీదదేశము. వ్యవసాయ మగ్రవృత్తిగా గలదియు, లక్షలకొలది అపక్వపదార్థములను విదేశముల కెగుమతి చేయునదియు అగు హిందుదేశములో ఎంతమందియో జనులు తినుటకు సరిగా తిండిలేక మలమల మాడుచుం డుట శోచనీయము. ఏతద్విషయమై ఇంకను ఈ ప్రక రణమందే చర్చించుట అధికప్రసంగమగును గాన ప్రజా వృద్ధిసమస్యను తీర్మానించుట కెయ్యవి కర్తవ్యములో వాటినిగూర్చి కొంచెము చెప్పి విరమించెదము.

ప్రజావృద్ధికి తగిన ఆహారవృద్ధి దేశమందు లేన ప్పుడు ప్రజావృద్ధి తగ్గించుటకు యత్నించవలెను; లేదా ఆహారపదార్థోత్పత్తి ఇంక విస్తరించుటకు వలయు సదు పాయములను కలిగించవలెను. ప్రజావృద్ధి తగ్గించుట అనగా రోగుల కౌషధముల నివ్వక వారిని చంపుట కాదు; కలరా, మశూచి, ప్లేగు, కాటకము, జ్వరము ఇత్యాది మరణదేవతల నారాధించి మీసన్నిధికి మమ్ము లను గొనిపొండని వేడుకొనుటకాదు; కొంతవరకు దేశ మందలి జననములసంఖ్య తగ్గునటుల యత్నించవలెను; వివాహ విషయములలో ఈ దేశమువారు చేయవలసిన సంస్కారము లెన్నియో ఈపేరా ఆరంభమందు మనము ముచ్చటించిన విషయములలో లీనమైయున్నవి. వాటి లో ఎయ్యవి అవలంబనీయములో సంఘసంస్కార సం ఘములవారు జాగ్రతగా గమనించి అనుసరణీయము లగు సంస్కారములను సంఘమం దొనర్చుటకు ఉచిత ప్రయ త్నములను చేయవలెను. ఆహార పదార్థాభి వృద్ధికై 7 వ పేరాలో వివరించిన మార్గముల నవలంబించి వ్యవసాయ వృత్తియందలి హీనవృద్ధి న్యాయము నడ్డగించుటకు తగిన ప్రయత్నము లింకను చేయవలెను. ఇంతే కాదు. హీన వృద్ధి సూత్ర మతిశీఘ్రముగా వర్తించని హస్తకళలను, యంత్రకళలను పెంపొందించి అందువలన దేశమందలి అర్థోత్పత్తిని అధికరించవలెను. ఈవిషయములో ప్రజలు న్ను దేశమునేలెడి దొరతనమువారున్ను ఏకీభవించి ఉచిత ప్రయత్నము లొనర్చినచో ప్రజావృద్ధిసమస్య యే కాదు, ఇతర అర్థిక సమస్యలుకూడ చక్కగ తీర్మా నింప బడునని మా నమ్మకము.

## 6 వ ప్రకరణము

### 1. శ్రమ:—

శ్రమపడకుండ భూమి మొదలగు నైసర్గిక సాధన ములు మనకు ఫలించవు. శ్రమ ప్రయాసతో గూడినది. ఈ ప్రపంచమందుండు వస్తువులను మన కనుభవయోగ్య ముగునటుల జేయుటకై మనము దేహబలముననగాని బుద్ధి బలమున గాని పాటుపడుటయే శ్రమ అనబడును. కష్టి పడనియెడల ఫలముండదు. "కష్టేఫలే" అను లోకోక్తి అందరకును తెలిసినదే. మన్ను త్రవ్వుట, రాళ్లను మో యుట మొదలగుపనులలో దేహపరిశ్రమమే అధికముగా కానవచ్చుచున్నది. చిత్తరువుపని, నగిషీపని మొదలగు ప్రశస్త వృత్తులలో మనశ్శ్రమయే విశేషముగా కనబడు చున్నది. అయితే ఎట్టిపని చేయుటకైనను కొంచెము గనో హెచ్చుగనో బుద్ధిసూక్ష్మత దేహదార్ఢ్యము ఈ రెండును అవశ్యకము లగుచున్నవి.

### 2. శ్రమ అర్థోత్పత్తి నెట్లుచేయుచున్నది ?

వ్యవసాయము, మత్స్యగ్రహణము, లోహ పరి కర్షణము మొదలగు పరిగ్రహణ క్రియలచే ప్రకృతిలో నుండి భాగ్యము లభించుట శ్రమ సహాయముననే గదా! శ్రమ వినా ధాన్యలోహ మీన మాంసాది పరిగ్రహణ మ సంభవము. వస్తువులను కష్టపడి పనిచేసి రూపభేదములు గలిగించియే వినియోగార్హమగు పదార్థములను సంపా దించుచున్నాము. ధాన్యము, ప్రత్తి ఈ అపక్వ పదార్థ ముల బుచ్చుకొని ఎందరియో శ్రమపడి పనిచేసినగాని అన్నవస్త్రాది రూపములబొంది ఉపయోగమునకురావు. బెంగుళూరిలో దొరకు పట్టుచీరలు కలకత్తాయందలి స్త్రీలు ధరింపవలెననిన మొదట ఆరీగలు రూనపౌకర్య ముల సహాయమున తేబడనిది నారికి ఉపకరింపవు. ఉత్పాదకులును, వినియోజకులును, ఎప్పుడును ఒకే చోటను ఉండరు. ఉత్పాదింపబడిన వస్తుజాలమును వినియోజకులకడకు తీసుకవెళ్లినగాని ప్రయోజన ముండదు. ఇంతేకాదు సంపాదింపబడినభాగ్యమును భద్రపరచుట కెన్నియో పాత్రములు, పెట్టెలు, ఇండ్లు,

గోడౌన్లు మొదలగునవి కావలసియుండును. వీటిని సిద్ధపరచుటకు కూడ శ్రమ ఆవశ్యకము. ఉలి, రంపము, బాడిస, కత్తి, గొడ్డలి, కొడవలి, నీటి ఆవిరియంత్రము, నాగయోడ, నాగబండి మొదలగు ఉపకరణములు లేనిచో ఏట్టి దేహపరిశ్రమవలన అనేక కార్యములు నెరవేరవు; వీటిని నిర్మించుటకుకూడ శ్రమ అవసరము. క్రయ విక్రయములవలన అర్థోత్పత్తి చేయుటలో ఎవరికి ఎంతమట్టుకు కావలెనో మొదట అంచనా వేసి అందులకు తగిన వస్తువులనే తయారుచేయుట సుగమమైనపనియని మనకు తోచవచ్చునేమో కాని వాస్తవముగా అట్టి అజ్ఞలువేసి అజ్ఞలకు మించకుండ వస్తునిర్మాణం మొనర్చుట శ్రమతో కూడినదే. హిందూదేశమందలి వినియోజకులకు ఒకానొకసరకు ఎంతమట్టుకు కావలెనని అజ్ఞలువేయించుటకే ఇంగ్లాండు మొదలగుదేశముల పారిశ్రామిక నాయకులెంతయో ద్రవ్యము వెచ్చించి ఉద్యోగస్థుల నియమించుచుందురు. గొప్ప ఫ్యాక్టరీలలో కార్మికులు యథావిధిగ వారిపనులను చేయుచున్నారా లేదా అని విచారించుట కొరకే కొన్ని ప్రత్యేక ఉద్యోగశాఖ లేర్పడుచున్నవి. ఆధునిక వాణిజ్య విస్తరణంతయు యంత్రోపకరణముల వలననే జరుగుచున్నది; వీటిని నిర్మించుటకున్ను సరిగా నడిపించుటకున్ను కేవల దేహబలము పనికిరాదు; బుద్ధిబలము తోడ్పడిన గాని కార్యసిద్ధి ఉండదు. ఇదే విధముగ మానుషశ్రమ లేక పురుషకారము అర్థప్రాప్తికి సాధనమగుచున్నదని చదువరులు గ్రహించవలెను.

### 3. శ్రమయొక్క ఉత్కృష్టత:—

ఏదేశమందైనను శ్రమ అనెడు అర్థసాధనము ఉత్కృష్టదశయందుండవలెనన్న కార్మికులకు శక్తియుక్తు లుండవలెను; తక్కువవేతనములు లభించుచున్న స్వంతప్రదేశమే స్వర్గమని భావించక కార్మికు లెక్కువ జీతములుదొరకు స్థలములకుపోయి తమ తెలివితేటల నుపయోగించవలెననెడు సాహసము చలనశక్తి కల్గియుండవలెను. కార్మికుల గుణవిశేషములవలనను వారిని నియమించి పనిచేయించుకొనువారి పాలనాక్రమములవలనను శ్రమకరుల నిపుణత ఏర్పడుచున్నది. వినయము, విధేయత, బుద్ధిసూక్ష్మత, పట్టుదల, నేర్పు, చురుకుతనము మొదలగు సుగుణములే శ్రమకు వికాసము కలిగించును.

శకాలములో కర్మకరులకుకూడ అనేకతరహాల పారిశ్రామిక విద్య ఆవశ్యకము. అట్టి విద్యలనుగరపు పారిశ్రామిక పాఠశాల లుండవలెను. ఏపనికైన వలయు శ్రమ యొక్క పరిమాణము నేర్పరుచుటకు కార్మికుల సంఖ్య, వారు దినమున కెన్నిగంటలు పనిచేయుదురో ఆగంటల సంఖ్య ఇవిరెండున్ను ముఖ్యమగువిషయములు. ఉష్ణప్రదేశము లందుకన్న సమశీతోష్ణప్రదేశములలో ఎవరైన ఎక్కువకాలము పనిచేయగలరు; ఆపనికూడ చురుకుగా చేయబడును. ఇప్పుడు నాగరికదేశము లన్నిటిలోను దినమునకు 8 లేక 10 గంటలకన్న కర్మకరులు ఫ్యాక్టరీలలో పనిచేయగూడదని చట్ట నిబంధన లున్నవి. ఈహిందుదేశములో కార్మికుల స్థితిగతు లంత బాగుగ లేవనియే చెప్పవచ్చును. విద్యావ్యాప్తిలేదు; చలనశక్తి తక్కువ; నిపుణతకూడ కొరతపడియున్నది. జాతి మతభేదములం జేసియు, చేతిపనులయందు అసహ్యత, నిర్లక్ష్యము కలిగియుండుటచేతను, చాలమంది విద్యావంతులు చేతిపనుల కర్మాగారములందలి బుద్ధినేర్పులతో చేయవలసినపనులు వీటి ప్రాంతమునకేపోక వాటిని విద్యావిహీనులకు ఘంతలపాలు చేసినారు. మనదేశపు కర్మకరులకు పూర్వాచార పరాయణత్వ మింకను బాధించుచున్నది. వారింకను మూఢాళ్లకు, పూర్వాచారములకు దాసులై యున్నారు. కొందరి కింకను సముద్రయానమన్న పీడకలే. పారిశ్రామికవిద్య అతితక్కువ. అట్టి విద్యను గరపు పాఠశాలలే కరువు ఈదేశములో. పూర్వ మీదేశము బట్టల నేత కంతయో ప్రసిద్ధి. యంత్రసహాయమున తయారు కాబడు విదేశపుబట్టల పోటీవలన మనదేశపు సాలెవాండ్రెంతమందియో వారివృత్తిని వదలుకొని ఇతరములగు బ్రతుకుతెరువులు వెదుకవలసినవారైరి. యంత్రముల పోటీవలన వస్తువులవెలలు సన్నగిల్లుటవలనను చేతిపనులు చేసెడువారు తక్కువ వెలలకు తమవస్తువుల నమ్మిన కిట్టకపోవుటచేతను సాలెవృత్తి మొదలగునవి ఈదేశములో నానాటికి క్షీణించినవి. వంశ పారంపర్యముగ వచ్చెడి చేతిపని నేర్పుకూడ చాలమట్టుకు అంతరించినది. స్వదేశములో తయారగుబట్టలనే ధరించెదమను ప్రతిజ్ఞ లిప్పుడిప్పుడు అనేకులకు కలుగుట ఎన్నియోవిధముల శుభదాయకము. ముఖ్యముగా మనదేశపు సాలీలు వారిశ్రమయొక్క ఉత్కృష్టతను జూపుట కదను కలిగినది. ఇతరదేశము

లందువలెె కర్మకరుల కీదేశములో అనేకవిషయములందు పారిశ్రామిక విద్యను గరపినచో వీరుకూడ శక్తియుక్తులుగల నిపుణులగుదురు; కార్యదక్షులగుదురు. ఇయ్యది నిస్సందేహము.

ఇంతవరకు నేనను చెప్పినది కర్మకరుల కుండవలసిన గుణవిశేషములంగూర్చి. శ్రమయొక్క ఉత్కృష్టతకు గుణవిశేషములేకావు; పరిమాణముకూడ ఒక కారణము.

శ్రమయొక్క పరిమాణము జనసంఖ్య హెచ్చిన కొలది హెచ్చుచున్నది. జనసంఖ్య విస్తరించుటకు కారణములును అది ఒకప్పుడు తగ్గుటకు హేతువులును, వెనుకటి ప్రకరణములోనే కొంతవరకు ముచ్చటించితిమి. జనసంఖ్య అధికరించుటవలన నష్టములు కొన్ని సంభవించుచున్నను లాభములేదని నొక్కిచెప్పలేము. ఏమన జనసంఖ్య హెచ్చినకొలది భాగ్యోత్పత్తికినలయు కార్మికుల సంఖ్య అధికరించుచున్నది. మనదేశీయులుకూడ కొంతమంది అన్యదేశములకు వలసలుపోయి అచ్చట భాగ్యాభివృద్ధికి సహాయకులగునట్లు శ్రమపడి జీవించుచున్నారు. ఈదేశమందుకూడ ప్రజానాశన కారణములు ప్రబలి జనసంఖ్య క్షీణించిపోయినచో శ్రమకరులు తక్కువై పరిశ్రమ లెన్నియో చెడిపోవలసివచ్చును. అయితే మేరలేని ప్రజాభివృద్ధివలన ఏదేశపు క్షేమమునకైన భంగము కొంతవరకు ఉన్నదని ఒప్పుకొనకతీరదు. వెనుకటి ప్రకరణములో చెప్పినట్లు ప్రజావృద్ధి కనుగుణ్యముగు ఆహారాదుల వృద్ధి లేనియెడల అనిష్టము లెన్నియో వాటిల్లును. ఇంగ్లాండుదేశమువలె జనసంఖ్య మిక్కుటముగాగల చిన్నదేశములవారు ప్రజావృద్ధియన్న కొంచెము భయపడుచుందురు. ఇటీవలజరిగిన మహాసంగ్రామములో ఐరోపియనులు లక్షలకొలది మరణించినందున కార్మికులసంఖ్య మొత్తమునతగ్గిపోయినది. యూరపుఖండములో వృద్ధనున్న దేశముల కీవిషయమున కష్టముసంభవించినది; ప్రజాభివృద్ధి శీఘ్రముగాగానున్నచో గొప్ప శ్రమకరుల సంఖ్య నానాటికి సన్నగిల్లి దేశపుటార్థికసమస్యలు విపరీతస్థితినొందునని సంతానాభివృద్ధికై కొన్ని దేశములవారు విశేషప్రయత్నములు చేయుచున్నారు. ఒక్క జనసంఖ్య హెచ్చుగానున్న ఏదేశముయొక్కగాని ఆర్థికస్థితి బాగుగనున్నదనుట తప్పు. గుర్రములు, ఎద్దులవంటివారు వేలకొలదియున్నను భాగ్యాభివృద్ధి ఏర్పడునా? శిక్షితులు కాని కార్మికులనేకులున్నమాత్రమున దేశమందు వస్తూత్పత్తి అతిశయించునా? ఎంతమట్టుకు జనులు బుద్ధిశాలురుగను, నేర్పరులగను, దేహబలము కలవారుగను ఉందురో అంతమట్టుకే జనసంఖ్య వివిధిలవలన భాగ్యాభివృద్ధి ఏర్పడునని చెప్పవచ్చును. ఇంకొకసంగతి. జనులేదేశమందైనను మొత్తముమీద విస్తారముగానున్నను అన్నిప్రదేశములందును జనుల విస్తారము ఒకేవిధముగా నుండదు. సారవంతములైన ప్రదేశములలో జనులు మిక్కుటముగానుందురు; ఆకారణమునలననే మనదేశములో గంగాతీరప్రాంతములందు జనసంఖ్య మిక్కుటము; హిమాలయపర్వత ప్రాంతములందును మధ్య ఇండియాలోని ప్రదేశములలోను జనసంఖ్య తక్కువ. ఏప్రదేశమందైన జనసంఖ్యయొక్క హెచ్చు తక్కువలకు కారణములు ఆ ప్రదేశముయొక్క భూసారము, వర్షవిస్తారము, పరిశ్రమల ప్రాబల్యము, నాగరికతయున్ను. ఈదేశములో పల్లెటూళ్లలో పరిశ్రమ లతితక్కువకావున పల్లెటూళ్ల జనసంఖ్య తక్కువ. పట్టణములలో జనులెక్కువగానుందురు; 100,000 కు మించిన ప్రజలున్న పట్నము లీదేశములో చాలతక్కువ; కారణమేమన ఈదేశపు అగ్రగవ్యత్తివ్యవసాయము. ఈదేశములో నగరవాసులు నూటికి 9.5; ఇంగ్లాండులో 78.1; జర్మనీలో 45. 6; బొంబాయి, కలకత్తా, కాన్పూరు, ఢిల్లీ, చెన్నపురి, మధుర, కుంభకోణము, నాగపురు, కరాచీ, అహమదాబాదు, రంగూన్ మొదలగు స్థలములలో అనేకవిధములగు పరిశ్రమ లుండుటంజేసి ఆస్థలముల జనసంఖ్య హెచ్చుగానుండును; కర్మకరులసంఖ్యకూడ విస్తరించియుండును; ఈక్రింది పట్టీగమనించినచో అనేకదేశముల జనసంఖ్య, ఆయాదేశములందు ఒక్కొక చదరపుమైలు వైశాల్యముగల ప్రదేశమునందు ఎంతెమంది జనులున్నారో స్పష్టపడును:—

| దేశము | జనసంఖ్య (కోట్లలెక్క) | ఒక్కొక్కచదరపు మైలునందుండు మొత్తపు జనసంఖ్య |
|---|---|---|
| ఇంగ్లాండు | $4\frac{1}{2}$ | 500 |
| రష్యా | 15 | 54 |
| ఫ్రాన్సు | 4 | 186 |
| జర్మనీ | 6 | 250 |
| యునైటెడ్ స్టేట్సు | $8\frac{1}{2}$ | 20 |
| ఇండియా | 30 | 184 |
| చీనా | 30 | 270 |
| జపాన్ | 5 | 284 |

ఈ సందర్భమున నింకొక సంగతి మనము ముఖ్యముగా తెలిసికొనవలసినది. ఇప్పటి యిరోపియన్లు తమపూర్వులకన్న బుద్ధిబలము, దేహబలము, కలవారని చెప్పుటకు ప్రశస్త నిదర్శనములున్నవి; బహుశతాబ్దములకు పూర్వము యిరోపాదేశములందుండిన యుద్ధభటుల కవచము లిప్పటి సంతతివారికి సరిపోక యుండుటయే యిప్పటివారు పృథగాత్రులనుటకు సాక్ష్యము; బుద్ధివిశేషములలో ఇప్పటివారికన్నను పూర్వపు యిరోపియన్ల ఘనతను మించినదనుటను దేశచరిత్రలే వేయినోళ్లముల చాటుచున్నవి. మనదేశమందో ఇందులకు విరోధముగు సాక్ష్యము లున్నవి. మనపూర్వీకులు ధరించెడు బట్టలు ఉపయోగించెడు పాత్రములు మన కెంతయో పెద్దవిగా నున్నవి. ఇక బుద్ధివిశేషములలో ఈకాలపు హిందువులు పాశ్చాత్యదేశీయుల సంపర్కమునంజేసి తామెంతేనియు నాగరికతకలవారమైతిమని గర్వించినను మనపూర్వీకులకున్న చేతిపనుల నేర్పు కగకౌశలము, మనవారికిప్పుడనేకులకు లేకపోవుట సరికదా నూలినోజ్జీనముల కాధారములైన యంత్రకౌశలక్కతకలదా అనివిచారించి చూచినను మనమెంతయో వెనుకపడియున్నామని తోచకమానదు. అన్నింటికిని మూలమైన దేహబలము మనవారికనేక కారణములంజేసి నానాటికి క్షీణించుచున్నది. దేహపరిశ్రమ విషయమై సరియైన జాగ్రత్తపుచ్చుకొనకుండుట, అతిబాల్యవివాహములు, కల్లు గంజాయిమొదలగు నిషావస్తువులను సేవించుట అనారోగ్యమగానుండు ప్రదేశములలో నివసించుట, విద్యాబుద్ధు లంతగాలేక అజ్ఞానమందుండుట, పాశ్చాత్యులసదాచారముల నంతగా ననుసరింపక దురాచారములనే విశేషముగా స్వీకరించికథలలో చెప్పబడు తెల్లకాకులవలెనుండుట, మొదలగునవి మనబలహీనతకు కారణములని తెలియవచ్చుచున్నది. ఇది మనకర్మఫలమనియును, యీకారణములను పారదోలుట దేవుని పనిఅనియును కూరకొనక దొరతనమువారిప్పుడిప్పుడొనర్చు సదుపాయములతో తృప్తినొందక, ఇంకను దేహబలాభివృద్ధికి వలయు సంస్కారములు శ్రద్ధతో ప్రజలున్ను గవర్నమెంటువారున్ను గమనింపవలసియున్న పని మాచదువరులు గ్రహింతురుగాక. మీదచెప్పిన కారణములవలననే హిందువులకు ఆయుఃపరిమాణమున్ను శ్రమయొక్క ఉత్కృష్టతియున్ను నానాటికి తగ్గుచున్నది. నానాదేశములందుండు ప్రజలు మొత్తముమీద జీవించియుండే ఆయుఃపరిమాణ సూచక సంవత్సరముల సంఖ్య యీ దిగువపట్టిలో ప్రదర్శింపబడినవి.

| దేశము | ఆదేశీయుని మొత్తపు ఆయుఃపరిమాణము |
|---|---|
| స్వీడెన్ | $50\frac{3}{4}$ |
| డెన్మార్కు | $50\frac{1}{4}$ |
| ఫ్రాన్సు | $45\frac{1}{2}$ |
| ఇంగ్లాండు | 44 |
| యునైటెడ్ స్టేట్సు | 44 |
| ఇటలీ | $42\frac{3}{4}$ |
| రష్యా | 41 |
| ఇండియా | 23 |

మనదేశము పట్టీలో అడుగుపడియుండుట ఎంత అనర్థదాయకమో బుద్ధిమంతులగు మాచదువరులు తప్పక గ్రహింతురని మానమ్మకము.






పొన్నలూరి నరసింహము గారు

కరిఁ గాపాడిన మేటివంచు నెదలోఁ గాంక్షించియున్నాఁడ సు
స్థిరభక్తిం; "గలుషాత్ముఁడుం జడుఁడు దుశ్శీలుండు వీఁ" డంచు శ్రీ
వర! నీ మానసమందు నెంచ కనుకంపావారిధీ! నన్ను నీ
దరిఁ జేర్పంగదవయ్య మ్రొక్కెద; ననంతా!, సత్యనారాయణా!

మ. వరహాలున్ మొహరీలు మాడలును దేవా! కోరఁగాఁబోను; ని
ర్జరలోకంబుల సౌఖ్యముల్ వలదు; కోరం బుత్ర కాళిన్; భవ
చ్చరణాబ్జద్వయ సేవకుండ నయి నిచ్చల్ మిమ్ము దర్శింపఁగా
వరమీవే స్థిరభక్తి వేఁడెదను. దేవా, సత్యనారాయణా!

మ ధనకాంతాదులయందు భ్రాంతివిడి, యెద్దానిన్ విలోకింప, కా
ర్తిని నీదివ్యకథల్ పఠింప, వినఁ గోర్కిం గల్గి, యట్లాచరిం
చిన సత్పూరుషు జన్మ ధన్యమయి వాసింగాంచు లోకంబునం
దున, లేనట్టి నరుండు దుఃఖములఁ బొందున్ సత్యనారాయణా!

మ. నినుఁగా కన్యుల వేఁడ నంటి, నెపుడున్ నీపజ్జకే వేచికొం
టి, ననుంబ్రోవఁగ నీదె భారమనియుంటి న్నోర్వలేనంటి ని
న్పైను బాధల్; తొలఁగింపునాదొసఁగులం బ్రేమంబునన్; నీదుచెం
తను నేనుండ ననుజ్ఞ నాకిడు మనంతా, సత్యనారాయణా!

మ. నిను ధ్యానించెడు వారి కేకొఱఁత రానీకుండఁ గాపాడి, ము
క్తిని వేయిత్తువటంచుఁ బెద్ద లతిభక్తిన్ దెల్పఁగా నిన్నుఁ జిం
తనముం జేయుచునుంటి నిత్యము మహాత్మా, ప్రోచినన్ బ్రోవకు
న్నను నాభారము నీదె నమ్మి మిఁక నన్నా, సత్యనారాయణా!






పందిరి మల్లికార్జునరావు గారు

ఆంధ్రదేశమునందు కబీరునామ మెఱుంగనివా రరుదుగ నుందురు. కబీరు ఒక సుప్రసిద్ధభక్తుడనియు, అలౌకిక శక్తిసంపన్నుడనియు పలువు రెఱుగుదురు. కబీరుదాసు కీర్తనలు విశేషముగ నేటికి ప్రజనముచే సమాదృతములై యలరారుచున్నవి.

## జన్మము: బాల్యావస్థ

విక్రమ శకము 1455 సంవత్సరమున జ్యేష్ఠశుద్ధ పౌర్ణమినా డితడు జన్మించెనని కబీరు పంథావలంబకులు నుడివెదరు. ఇది చాలవఱకు సమంజసముగ నుండుటచే పండితు లనేకులు దీని నొప్పుకొనుచున్నారు.

కబీరుయొక్క జన్మవృత్తాంతమునుగూర్చి పలువురు పలువిధములుగ వచించెదరు. మహాపురుషుల జీవితచరిత్రలయందు విచిత్రవిషయములను జొప్పించుట చాల కాలమునుండియు జరుగుచున్న యాచారమే. అటులనే కబీరునుగూర్చికూడ అనేక కల్పితకథలు గలవు. కబీరుపంథావలంబకు లితనిపుట్టుకనుగురించి యొక అద్భుతకథా కల్పనమును గావించియుండిరి. పైనుదహరింపబడిన పూర్ణిమనాడు గగనతలము మేఘాచ్ఛన్నమై యుండెను; విద్యుల్లతలు మెఱయుచుండినవి; కమలములు వికసించియుండెను; పుష్పగుచ్ఛములపై భ్రమరములు ఝంకారముచేయుచు దిరుగుచుండెను; [illegible] చకోరములు కలకలము చేయుచు స్వాగతగానము నాలపింపుచుండెను; అట్టితరి పునీతంబగు కాశీనగరమందలి 'లహరతారా' అను సరోవరమునొద్ద నొకానొక యలౌకిక కార్యము జరిగెను. అదియేమన, ఆసరోవరపశ్చిమభాగస్థితమైయున్న యొక వికసితసుందరారవిందముపై నాకాశమండలమునుండి యొక మహాపురుషుడు దిగెను. అతడే కబీరు. పిదప నతడు పుణ్యవతియగు 'నీమా' అనునామె యంకస్థలమును, 'నీరూ' అనువానిగృహమును సమలంకృతము గావించెను. ఇది కబీరు పంథావలంబకులగు భావుకులు చెప్పు వృత్తాంతము.

కాని, కబీరుపంథావలంబకేతరులగు వా రిట్టికథలను విశ్వసనీయముగ దలంచరు. వారు నిజమైనచరిత్రను దెలిసికొనినగాని సంతృప్తినొందజాలరు. కబీరు కాశీలో జన్మించెననుట ఈక్రిందిపద్యములవలన దెలియుచున్నది.

'तू बाम्हन मैं काशी का जुलहा बूझहु मोर गियाना।'
(ఆదిగ్రంథము)

'सकल जनम शिवपुरी गँवया,
मरति बार मगहर उठि धाया'
(ఆదిగ్రంథము)

'काशीमें हम प्रगट भये हैं रामानन्द चेताये।'
(కబీరశబ్దావలీ)

కబీరుతల్లిపేరు 'నీమా', తండ్రి 'నీరూ'. వీరికి కబీరు ఔరసపుత్రుడు గాడనియు పోష్యపుత్రుడు మాత్రమేయనియు చెప్పెదరు. కబీరుయొక్క తలిదండ్రులు మహమ్మదీయమతానుచరులు. వీరివృత్తి బట్టలనేత. 'నీరూ' అత్తవారియింటనుండి తనభార్యను వెంటబెట్టుకొని వచ్చుచుండగా కాశీదగ్గఱనున్న 'లహరతారా' అను చెఱువునొద్ద నొకానొక శిశువు పడియుండుటను గాంచెను. 'నీమా' కళంకభయముచే భర్తను వారించినను 'నీరూ' ఆపసిబిడ్డను తీసికొనివచ్చి పోషించెను. ఆశిశువే పిదప కబీరనునామమున ప్రపంచమున ప్రఖ్యాతి కెక్కెను.

ఆశిశువు ఒకబ్రాహ్మణవితంతువునకు జనించెననియు, ఆమె లోకభయముచే తనగారాబుపట్టిని కటికగుండె చేసికొని 'లహరతారా' చెఱువునొద్ద విడచిపెట్టినదనియు లోకమునం దొకప్రవాదము కలదు. ఇది సత్యమని యంగీకరించుటకు సందేహ మనావశ్యకము. ఏల

యన, కబీరుపంథానలంబకులుకూడ నతనిని 'నీమా' 'నీరూ' ల ఔరసపుత్రుడుగాడని ఒప్పుకొనుచునేయున్నారు. కాని, కబీరుయొక్క ఉత్కృష్టతను వ్యాపింపజేయుటకై గగన మండలమునుండి దిగివచ్చెననుకథను కల్పించియుందురు.

కబీరు బాల్యావస్థనుగూర్చి బాగుగ తెలియదు. కాని, అతడు చిన్ననాటనుండియే సాధుస్వభావముగలవాడనియు ధర్మపరాయణుడనియు మాత్రము తెలియుచున్నది. ఇతనికి జ్ఞానము వచ్చినదాదిగ నిర్మలభక్తియందు నిరతుడగుటనుగాంచి గురూపదేశమును పొందుమని ప్రజలు సలహానిచ్చుచుండిరి. అందుచే కబీరునకు గురువును వెదకవలసిన యవసరము కలిగెను. ఇప్పటికి కబీరునకు బాగుగ జ్ఞానముకలిగి బాల్యావస్థ నతిక్రమించినవాడై యుండనోపు.

## మంత్ర గ్రహణము

కబీరు హిందువని కొందఱందియు, మహమ్మదీయమతావలంబకుడని మఱికొంతమందియు జెప్పెదరు. కాని, ఇతని రచనల నవలోకించినచో రామానందుని శిష్యుడని ప్రత్యక్షముగ తెలియనగును.

రామానందుడు మాదిగకులమునం దుద్భవించిన 'రైదాసు' మొదలగువారికి దీక్షనొసగినను, మహమ్మదీయునింట పెరిగినవాడగుటచే కబీరునకు మంత్రోపదేశము నొసంగ లేదట! కబీరు ఎంతవేడినను ప్రయోజనము లేకపోవుటచే నొకయుక్తిని పన్నెను. రామానందుడు ప్రతిదినము వేకువజామున గంగాస్నానమును జేయుటకు వెళ్లుచుండెడివాడు. అట్టిసమయమున నొకనాడు కబీరు 'మణికర్ణికా' ఘట్టమునొద్ద మెట్లమీద చీకటిలో పండుకొనెను. పాపము రామానందుడు చూడక కబీరుపై కాలువేసెను. వెంటనే "రామ, రామ" అని అనుకొనెను. దానినే కబీరు మంత్రోపదేశముగ నంగీకరించి రామానందుని గురువుగ భావించుచుండెను. తుదకీసంగతి రామానందునకు తెలిసి కబీరుభక్తికిని, అతని పవిత్రహృదయమునకు మెచ్చుకొని మఱల నతనికి సక్రమముగ దీక్ష నొసగెను. రామానందుడు గురువనువిషయము కబీరు రచనలయందు పెక్కుచోటులగానవగును.

కబీరు చిన్ననాటనుండియును మహమ్మదీయునియింట పెరిగియుండుటచే స్వాభావికముగ నీతని మనస్సు కొన్ని మహమ్మదీయాచారములును, భావములును ఆక్రమించియుండెను. కావున అతనిరచనలయం దక్కడక్కడ మహమ్మదీయభావములు కనపడుటయం దాశ్చర్యమనవసరము. ఇంతమాత్రమునచేత నతనిని మహమ్మదీయుడని చెప్పుట కవకాశము లేదు.

కబీరునకు గురువు నడుమనత్యంతసన్నిహితసంబంధముండెనని అతనిరచనలవలన స్పష్టముగ తెలియుచున్నది. రామానందుడు వైష్ణవసాంప్రదాయకుడు. కావున, నతనిశిష్యుడగు, కబీరు భావములు హిందూమతమునను జెందినవిగాక యేమన్యము లెట్లగును?

ఇంకొక విషయమేమన— రామానందునకును, మహమ్మదీయమతస్థులగు 'సూఫీ' (Sufi) సంప్రదాయకులకును చాలవాద ప్రతివాదములు జరిగియుండెను. కాబట్టి కబీరునకు తెల్లప్పుడు ఆ'సూఫీ' సంప్రదాయకుల భావములను వినుట కవకాశ మేర్పడియుండుటచే నతని రచనలయందుకూడ మహమ్మదీయభావములు వ్యాపించియుండుటకు సందియ ముండనేరదు.

సారాంశమేమన, కబీరు రచనలయందు మహమ్మదీయ మతవిషయాచారములు కొన్ని కన్పట్టుచున్నను అతనిభావ వాహినియంతయు హిందూమత ప్రవాహపరిప్లావితమే. కావున కబీరుహృదయము హిందువుదే అనుట సమంజసము.

## జీవయాత్ర

కబీరు బట్టలునేసి, తనజీవితమును గడుపుచుండెడివాడని

**'हम घर सूत तनहिं नित ताना'**

అను నిత్యాగివాక్యములచే తెలియుచున్నది. ఇతడు బట్టలునేయువాడని ప్రబల ప్రమాణములు గలవు.

కబీరు వివాహము చేసికొనలేదని కొంతమంది చెప్పెదరు. కాని యది సముచితముగ కనుపించదు. ఏలయన,

**नारी तो हम भी करी, जाना नाहिं बिचार ।**
**जब जाना तब परिहरी, नारी बड़ा बिकार ॥**

(చాణాసీ అంగకీ సాఖీ)

అనుపద్యమునుబట్టి చూచిన అతడు వివాహము చేసికొనినట్లు తెలియుచున్నది. ఇతని భార్య పేరు (లోయీ). కబీరునకు 'కమాల్' అను కొడుకును, 'కమాలీ' అను కూతురును గలరు.

## స్వభావము

కబీరుస్వభావమును తెలియజేయు కథలుకూడ చాలకలవు. కాని వానినన్నిటిని ఇక్కడ వ్రాయుట కవకాశము లేదు. వానివలన నితడు దానపరాయణుడనియు, పరోపకారచింతగలవాడనియు తెలియనగును. ఇతడు చాలనిర్భీకుడైన ట్లితనిరచనలయందు గాంచ నగును. తాను చెప్పబోవు విషయములను ప్రజల వనో భావములకై వెఱువక స్పష్టముగను,ఖండితముగనుజాటు వాడు.

## మతప్రచారము

పాటలు, పదములు, గేయములరూపమున కబీరు తనమతము నుపదేశించెను. ప్రజలు వాడుకొను సామాన్యభాషలోనే పాటలు మొదలైనవానిని రచియించి, వానినిపాడి తనమతసిద్ధాంతములను వ్యాపింప జేయుచుండెడివాడు.

ప్రపంచమునందు మహత్కార్యము లొనరించు మహాపురుషులయందొకానొక ఆకర్షణశక్తియుండును. అట్టిశక్తియే కబీరునందు కూడ కలదు. భావగర్భితములగు నితని పాటలచేతను పవిత్రస్వభావముచేతను, ప్రజలాకర్షింపబడి చాలమంది ఇతనిమతములోనికి చేరుచుండెడివారు. ఇతని మతమును అవలంబించినవారిలో మహమ్మదీయులకన్న హిందువులే యెంతుగ గలరు.

## ప్రతికూలురు

కబీరునకు హిందూమహమ్మదీయ నాయకు లుభయులునుకూడ ప్రతికూలురైరి. మహమ్మదీయుడగు వానినోట నుండి హిందూమతసిద్ధాంతములు ప్రతిపాదింపబడుచుండుటచే హిందువులును; మహమ్మదీయుడై హిందూమతము నవలంబించి, వ్యాపింప జేయుచుండుటచే మహమ్మదీయులును ప్రతికూలురైరి. అందుచే కబీరు హిందూమహమ్మదీయమతముల రెంటిని తీవ్రముగ విమర్శింప నారంభించెను. ఆప్రతికూలభావము మఱియుమఱియు నెక్కువ కాదొడంగెను. తుద కితడనేకకష్టములనుగూడ పొంద వలసి వచ్చెను. ఈకాలమున ఉత్తర హిందూదేశము నందు సికందరలోదీ పరిపాలించుచుండెను. 'శేఖ్ తకీ' అనువాడును, ఇంకను కొంతమంది మహమ్మదీయులును కలసి కబీరునెడ లోదీకి క్రోధాగ్నిని ప్రజ్వలింపజేసిరి. సికందరలోదీ కబీరునకు కొన్ని కష్టములను కలిగించెను. కాని కబీరు ఫకీరగుటచే నాతనికి విముక్తికలిగెను.

## అంతిమకాలము

కబీరు అవసాన దశయందు కాశీక్షేత్రమును విడచి 'బస్తీ'జిల్లాలోని 'మగహర' అనుగ్రామమునకు వచ్చెను. వి.శ.1549లో మగహరకువెళ్లెననియు, వి. శ. 1552లో ఆశ్వియుజశుద్ధఏకాదశినాడుపరమపదమును జేరెననియు 'భక్తిసుధాబిందుస్వాద'ను గ్రంథమువలన తెలియుచున్నది. అతడు 'మగహర' గ్రామమునందే చనిపోయెను అక్కడ నిప్పుడుకూడ కబీరుయొక్క సమాధి కలదు. ప్రతిసంవత్సరము నక్కడ నొక ఉత్సవముకూడ జరుగుచుండును. కబీరుపంథానలంబకులగు మహమ్మదీయు లక్కడ కనిపించెదరు.

కబీరు మహమ్మదీయునియింట పెరిగి, మహమ్మదీయులగు ఫకీర్లతో సంబంధము కలిగియుండుటచేత మహమ్మదీయులకుగూడ స్వాభావికముగ ప్రేమ ఉండెను. అతడు హిందూగురువునకు శిష్యుడగుటచే హిందువులుకూడ నాదరించుచుండిరి. కావుననే కబీరు చనిపోయినప్పుడు అతనిశవమును దహనము చేయవలయునని కాశీరాజగు వీరసింహుడును, సమాధిచేయవలయునని 'బిజిలీఖాన్'అను నొక పఠానును కత్తులతో పోరాడుకొనిరి. దీనిని గమనించి కొంతమంది ఈపోరాటమును మాన్పించుటకై కబీరు శవమునుకప్పిన గుడ్డక్రింద కొన్ని పూవులను వేసిరి. ఆ పువ్వులలో సగమును హిందువులు దహనముచేసి, ఆభస్మముపై సమాధిని నిర్మించిరి. ఇదియే కాశీలోని కబీరుపంథావలంబకుల పవిత్రస్థానము. మిగత సగమును మహమ్మదీయులు 'మగహర' గ్రామమునకు తీసికొనివెళ్లి సమాధిస్థముజేసిరి. నేడున్న సమాధి అదియే. ఈరెండుకబీరుపంథావలంబకుల పవిత్రస్థానములు. గురునానక్ శవమును గూర్చి కూడ నిట్టివిషయమునే చెప్పెదరు.

## గ్రంథములు

కబీరునకు అక్షరపరిజ్ఞానము లేదను విషయము ఈ క్రిందిపద్యమువలన తెలియుచున్నది.

**'मसि कागद तो छुयो नहिं कलम गही नहिं हाथ।**
**चारिहुँ युग माहात्म्य तेहि कहिके जनायो नाथ॥'**

(బీజక్)

కావున, కబీరు పుస్తకములనుగాని, మతగ్రంథములనుగాని రచియింపలేదని తేటపడుచున్నది. కబీరు సంప్రదాయమునకు జెందిన గ్రంథములు, అతనియనంతరము శిష్యులచే సంపుటీకరణము చేయబడినవి. కబీరుభావములు శిష్యులచే పద్యములు పాటలు మొదలైనవిగ రచియింపబడి కబీరుయొక్క గ్రంథములని చెప్పబడుచున్నవి. కాని, కబీరు నామముగల పాటలు కబీరు రచియించినవేయని తెలియుచున్నది. కబీరు ప్రతిపాదించిన భావములు స్పష్టముగను, నిర్భయముగను గన్పట్టుచుండును. కావున, కబీరు స్వయముగ రచియించినపాటలు మొదలైనవానిని మనము కొంతవఱకును తెలిసికొనవచ్చును.

కబీరుగ్రంథములు అతని తదనంతరము ఏబదిసంవత్సరములలోపుగ సంపుటీకరణము చేయబడినవని శిష్యులచే ఊహింపబడుచున్నది. ఈగేయములు మొదలైనవి ఇతరులచే సంకలితము చేయబడినవిగనుక కబీరుయొక్క సిద్ధాంతములను తెలిసికొనుట కొంచెము కష్టము. ఏలయన సంపుటీకరణము చేసినవారు తమభావములనుగూడ నందుజొప్పించిరి. భగ్గూదాసు అనుకబీరశిష్యుడు కబీరుయొక్క 'బీజక'మను పుస్తకమును దొంగిలించెనని రీవా రాజగు విశ్వనాథసింహుడు వ్రాయుచున్నాడు. పూర్ణదాసనుమఱియొకసన్న్యాసి కబీరుయొక్క బీజకగ్రంథమునకు టీక వ్రాసి అపార్థములను గల్పించి కబీరుభావములను తాఱుమాఱుచేసెను. వీనినిబట్టి జూచిన కబీరుచే రచియింపబడిన గ్రంథములను తెలిసికొనుటకు సరియైన అవకాశము లేదు.

కబీరుశిష్యులచే సంపుటీకరణము చేయబడిన గ్రంథములన్నియు కాశీలో 'కబీరుచౌరా' అను ప్రదేశమునందు గలవు. ఆగ్రంథసముదాయము నాతని పంథావలంబకులు 'ఖాస్‌గ్రంథ'మని పిలిచెదరు. 'ఈఖాస్‌గ్రంథము నందు 21 రచనములు గలవు. ఇందు కబీరు సిద్ధాంతములు విపులముగ వర్ణింపబడినవి. కబీరు గ్రంథములలో 'బీజక్' ఆదిగ్రంథములు ముఖ్యములైనవి. కబీరుపేరున ఇప్పటివరకును సుమారు డెబ్బదియైదు గ్రంథములు కానవచ్చుచున్నవి. కాని యిందెన్ని కబీరు రచియించినవో తెలిసికొనుట కష్టము.

ఈగ్రంథములయందలి కవిత్వము చాలభాగము సాధారణశ్రేణికి జెందినది. కాని కబీరుచే పూర్వప్రాంతపు భాషయందు రచియింపబడిన గీతములు మొదలైనవి చాల నుత్కృష్టములై రసపరిపూరితములుగ నుండును. ఛందోభంగదోషము చాలవఱకు కానవచ్చును. అక్కడక్కడ అశ్లీలతకూడ కలదు. కబీరు ఇతరమతముల నెదుర్కొనునపుడు తన్నుదాను మఱచి వానిని తీవ్రముగ ఖండించును. అట్టిచోట్లయందే అశ్లీలకవిత్వము తఱచుగ దృష్టిగోచరమగును. ఇతనిగ్రంథములు అంతకవిత్వపుష్టికలవి కాకున్నను, సిద్ధాంతములను తెలిసికొనుట కెక్కువ యుపయుక్తములుగ నుండును. కబీరు తనభావములను మిగుల స్వతంత్రముగను, దృఢముగను నొక్కి వక్కాణించెను. ఇంతనిర్భయముగ జాతీయకవు లుండుటరుదు. ఇతడు సూక్ష్మదృష్టికలవాడగుటచే ఇతడు రూపకములు, ఉపమానములు, ఉత్ప్రేక్షలు మున్నగు నలంకారముల మూలమున తన యున్నత భావములను స్పష్టముగను సులభముగను వ్యక్తపరచెను.

## కబీరుపంథ

కబీరు పంథావలంబకులు సంయుక్తరాష్ట్రముల ములంగును, మధ్యరాష్ట్రమందును విశేషముగగలరు. పంజాబు, బీహారులయందును, పశ్చిమహిందూదేశమునందునుకూడ కొలదిగ కలరు. కబీరు పంథయందు పదిరెండుశాఖలు గలవు.

క్రీ. శ. 1901 సంవత్సరపు జనసంఖ్య ననుసరించి 843171 కబీరు పంథావలంబకులు కలగని తెలియుచున్నది. ఇందు చాలమంది నీచజాతు లనబడువారే కలరు. 'ఉచ్చజాతు'లవారు నామమాత్రముగ నున్నారు. వీరిగురువులుకూడ చాలవఱకు 'నీచజాతు'లవారే. ఈపంథయందు సన్న్యాసులు, గృహస్థులుకూడ కలరు.

వీరెక్కువుగ హిందూ మతాచారములనే యవలంబించెదరు. కాని మతసిద్ధాంతములయందు మాత్రము కబీరు మతమునే యనుసరించెదిరు. వీరు చాలమంది హిందువుల దేవుళ్లను, అమ్మవార్లను పూజించెదరు. సన్న్యాసులు పూర్వము హిందూ మతాచారములకు చాలవఱకు దూరముగ నుండెరు. కాని, వారుకూడ నప్పుడప్పుడు హిందువుల యాచారముల నవలంబించెదరు. మొత్తముమీద వీరు హిందూమతమునకు దూరముగ నుండురనుమాట సత్యము.

## సిద్ధాంతములు

కబీరు ఏకేశ్వరవాదమును, సామ్యవాదమును, భక్తివాదమును, జన్మాంతరవాదమును, అహింసావాదమును, ప్రపంచ నిస్సారత్వమును ప్రతిపాదించెను, మాయావాదము, అవతారవాదము, హింసావాదము, విగ్రహారాధన, కర్మకాండ, వ్రతాదికములు, తీర్థయాత్రలు, వర్ణాశ్రమధర్మములు మొదలయినవానికి ఇతడు ప్రతికూలవాది.

కబీరు భావములు చాలవరకు హిందూమతమునకు జెందినవే. రామానందుని శిష్యుడగుటం జేసి యాతని గ్రంథములయందు విశేషముగ వైష్ణవమత ప్రాబల్యమే దృష్టిగోచరమగును

ఇతని ఏకేశ్వరవాదము కొంచెము భిన్నమైనది. ఇతని ప్రభువు విలక్షణమైనవాడు. ఈశ్వరుడు, బ్రహ్మ, పరబ్రహ్మలకంటెను, సగుణ నిర్గుణములకు సమస్తమైన వానికంటెను శ్రేష్ఠమైనవాడు. వైష్ణవ గ్రంథముల యందు సగుణబ్రహ్మను గురించి చెప్పినట్లే కబీరుకూడ తన ప్రభువు 'సత్యలోకవాసి' యని చెప్పెను. ఆసత్యము గురుప్రసాదమువలన, భక్తివలన లభ్యమగునని కబీరనును. ఆ సత్యలోకమునే కబీరు ఒకసారి 'సాకేత'మనికూడ నీ క్రింది పద్యమందు చెప్పెను.

**"जाय जाहृत में खुद्द खाविंद जहँ वहीं मकान**
**'साकेत' साजी ।**
**कहै कबीर ह्वाँ भिश्त दोज़ख़ थके बेद कीताब**
**काहृत. काजी ॥"**
(బీజక్)

వైష్ణవసంప్రదాయకులు శ్రీరామచంద్రుని సాకేత లోకనివాసియని వర్ణించెదరు. కబీరుకూడ నట్లే రచియించి యుండుటచే నతని రచనలయందు గన్పట్టు వైష్ణవమత ప్రాబల్యము తెలియనగును.

కబీరు తనప్రభువును తరుచు 'రామ' నామముచే సూచించుచుండును. కాని, తన రచనలయందు హరి, నారాయణ, సారంగపాణి, సమర్థ, కర్త, కరతార, బ్రహ్మ, పారబ్రహ్మ, నిరక్షర, సత్యనామి, మురారి ఇత్యాది నామములనుగూడ నాతని కొనియాడి యుండెను. తన ప్రభువును 'సాహెబ్' అను పేరున పిలుచుట యతనికి చాల ప్రియమనియతని రచనలవలన విదితమగుచున్నది.

వైష్ణవసంప్రదాయమునందువలె భక్తికి కబీరుకూడ ప్రధానస్థానము నిచ్చెను. వైష్ణవగ్రంథములలోని భావములకు సరిపోలు ననేక రచనలు కన్పట్టుచున్నవి. కావున కబీరుయొక్క భావస్రోతస్సునకు ఉత్పత్తిస్థానము హిందూమతమే.

కబీరు రచనలయందు వైష్ణవమతమునకు ప్రతికూలముగ నుండునవి రెండుకలవు. అందొకటి అవతారవాదము; రెండవది విగ్రహారాధన. కబీరీరెంటిని అంగీకరింపలేదు. ఈ రెండుభావములు కబీరు మహమ్మదీయ మతమునుండి గ్రహించి యుండవచ్చును. అవతారవాదమును గూర్చి అప్పుడప్పుడు అంగీకరించెను. కాని, అంగీకరించుటకంటె ఖండించుటయందే విశేషముగ ప్రాధాన్యము నిచ్చెను. అత్యంతము ఉత్సాహపూరితుడై, తన్ను దాను మరచిపోయి పరవశుడైయుండు సమయముల యందు కబీరావాదము నంగీకరించును. కావున, నితనికి అవతారములయందు నమ్మకమింతగాలేదని చెప్పవచ్చును.

విగ్రహారాధనమును కబీరు తీవ్రముగ నిరసించెను. విగ్రహారాధనానిరసన పెక్కుతావులయందు కనిపించును. సర్వఘటవ్యాపకుడగు బ్రహ్మను విగ్రహరూపమున పూజించుట మూర్ఖమని తలచెను. కావుననే, ఇట్లు వచించెను—

**'दुनिया ऐसी बावरी, पत्थर पूजन जाय ।**
**घर की चकिया काहे न पूजै, जिसका पीसा खाय॥'**

(ప్రపంచము పిచ్చిది. ఏలయన, రాతిని పూజచేయును. ఇంటిలోని తిరుగలినేల పూజింపరాదు? అది విసరినపిండిని మనము తినుచున్నాము.)

హరియొకటి చూడుము.

**'पाहन पूजे हरि मिलैं तो मैं पुजूँ पहार ।'**

(రాతిని పూజించిన భగవంతుడు కనిపించినచో నేను పర్వతమునే పూజచేయుదును!)

ఆచార వ్యవహారములయందు కృత్రిమత్వమును, పూజాడంబరమును సర్వథా త్యాజ్యమని నమ్మెను. ఈ క్రింది పద్యమున భేషజమును ఖండించెను.

ఇస్లాము మతమునందుకూడ నతడు డాంభికమును కనుగొనెను కావుననే, నిట్లు తీవ్రముగ నిరసించెను—

**' काँकर पाथर जोरिकै, मसजिद लई चुनाय:**
**ता चढ़ि मुल्ला बाँग दे, क्या बहिरा हुआ खुदाय?'**

(రాళ్లు, కంకర ప్రోగుజేసి మసీదును కట్టెదరు; ముల్లా(పూజారి) దానిమీదనెక్కి గొంతుక చించుకొని యరచును. భగవంతునకు చెవుడు వచ్చినదా?)

**'मन न रँगाए रँगाए जोगी कपरा'**
**आसन मारि मँदिर में बैठे**
**नाम छाँड़ि पूजन लगे पथरा ।**
**कनवा फड़ाय जोगी जटवा बढ़ौलैं**
**दाढ़ी बढ़ाय जोगी होइ गैलैं बकरा ।**
**जंगल जाय जोगी धुनिया रमौलैं**
**काल जराय जोगी बनि गैलैं हिजरा ।**
**मथवा मुँड़ाय जोगी कपड़ा रंगौलैं**
**गीता बाँच के होइ गैलैं लबरा ।**
**कहत कबीर सुनो भाई**
**साधो जम दरवजवाँ बाँधल जैबे पकरा॥'**

తీర్థయాత్రలను గురించి యిట్లు నుడివెను—

**'तीरथ गये ते बहि मुये जूड़े पानी न्हाय ।**
**कह कबीर संतो सुनो राक्षस ह्वै पछिताय ॥**
**तीरथ भइ विख बेलरी रही युगन युग छाय ।**
**कबिरन मूल निकंदिया कौन हलाहल खाय ॥'**

(బీజక్)

దీనిని బట్టిచూచిన కబీరు తీర్థయాత్రల నెంత మాత్రము నంగీకరింపడని విశదమగుచున్నది.

కబీరు హిందూ మహమ్మదీయ జాతుల నేకీకరణముచేసి, మతముపేరిట వ్యాపించిన యశాంతిని పారద్రోలుటకు ప్రయత్నించెను

ఆ అశాంతిని అనవసరమైనదిగ తలచి యిట్లు చెప్పెను—

**'साधो देखो जग बौराना '**
**साँचि कहौ तो मारन धावै झूठे जग पतियाना।**
**हिन्दू कहत है राम हमारा मुसलमान रहमाना।**
**आपसमें दोऊ लड़े मरतहैं मरम कोई नहीं जाना॥**

(చూడుము. ప్రపంచము పిచ్చిది. నిజముచెప్పినచో కొట్టవచ్చును. అబద్ధమును నమ్మును. రాముడు మావాడని హిందువులనెదరు. రహీమ్ మావాడని ముసల్మానులు చెప్పెదరు. ఇద్దరునుకూడ తమలో తాము కొట్టుకొనెదరు; కాని, రహస్యము నెవరునుగూడ కనుగొనలేదు.)

రెండు మతములవారును నిస్సంశయముగ నవలంబింపదగిన మత మొకదాని నీతడు నెలకొల్పెను. ఇట్లు చేయుటకై యితడు రెండుపనులను జేసెను.

అందు మొదటిదేదన; కబీరు అవతారముల నంగీకరింపక పోయినను తాను ప్రజల నుద్ధరించుటకై పంపబడిన దేవదూతనని సామాన్య జనులను నమ్మించి, తన పక్షమున జేర్చికొనుటకు ప్రయత్నించెను.

**'काशीमें हम प्रगट भये हैं रामानंद चेताये ।**
**समरथ का परवाना लाये हंस उबारन आये ॥'**

(కబీర శబ్దావలీ)

అని తన్నుదాను దేవదూతగ జెప్పుకొనెను.

రెండవది హిందూ మహమ్మదీయ మతాధిపతులను, వారి పవిత్రములగు మతగ్రంథములను నిరసించుట. అట్లు నిరసించి తన మతసిద్ధాంతములు సత్యములని చెప్పుకొనెను.

**'चार बेद ब्रह्मा निज ठाना ।**
**मुक्ति का मर्म उनहुँ नहि जाना ॥**
**हबीबी और नबीबी के कामा ।**
**जितने अमल सो सबै हरामा ॥'**

(బీజక్)

ఈ విధముగ పరమతములను ఖండించి స్వమత ప్రతిపాదన గావించుకొనుట చాలకాలమునుండి వచ్చుచున్న ఆచారమే.

ఉపసంహారము

కబీరు మహాపురుషుడు. తన జీవితమును సార్థకము జేసికొనినవాడు. అసాధారణ శక్తిసంపన్నుడు. సంఘసంస్కారమునకై పూనికొని సఫల మనోరథుడయినవాఁడు. సర్ విలియమ్ హంటర్ గారు కబీరు పదునైదవ శతాబ్దమందలి 'హిందూదేశపులూథర్' అని చెప్పినదిచాల సుచితముగ నున్నది. కబీరు భావములన్నియు సమ్మతములుగాఁ బోయినను, అతను చెప్పినవన్నియు పరిశుద్ధ హృదయమునుండి వెలువడినవనుటయందు సందియ మిసుమంతయు నుండఁజాలదు. సంఘసంస్కారదృష్టిని బరికించిన నితని రచనలు అమూల్యములనవలెను. సర్వప్రపంచమునకు జ్ఞానప్రదాయిని యగు భారతమాతృ గర్భమున నిట్టి మహాత్ముడు జనించుట భారతీయులు గర్వింపదగిన విషయము.



# ఒకనాటి రేయి

సహదేవ సూర్యప్రకాశ రావుగారు

ఆత్మనాథునిచెంతకే నరుగఁదలఁచి
వల్లు గమనమ్ముతో సౌధవాటి దాటి
బయలుదేరితి నొంటిగా బరిమళప్ర
సన్నమధు మాసరజనీ ప్రశాంతవేళ.

ప్రణయగీతాలఁ బాడదు పక్షిరాజి
ముగ్ధకాంతలవలె మౌనముద్రఁ దాల్చె
అలరుఁదీవలతోడ సయ్యాట మాని
బాలపవనుండు స్తబ్ధభావము వహించె.

కాళ్లయందెలు కడియాలు గల్లురనుచు
అడుగడుగునకు పెద్దసందడు లొనర్ప
క్రమ్ముకొనివచ్చు లజ్జాభరమ్మువలన
నదరిపడిపోయి విసవిసయగుచునుంటి.

కోమలలతానిగూఢ నికుంజమందు
వెడలి యూపిరిఁ బిగఁబట్టి వీనులొగ్గి
దెసల నాలించుచుంటి నాదేవదేవు
నడుగుచప్పుడు వినవచ్చునని యాస.

ఆకు జొంపాలు గుసగుసలాడ మానె
పండుకొని నిద్రవోయెడు పాళెగాని
సరసఁబడియున్న చంద్రహాసంబు రీతి
నిశ్చలత నుండెను స్రవంతీమతల్లి.

ఆత్మనాథుండువచ్చి నాయంతికమునఁ
గూరుచుండినతఱి నా శరీరమెల్ల
వడవడవడంకిపోయె నాయెడఁదకలఁగె
మూఁతవడిపోయె నానేత్రములు తమంత.

రాత్రిగాఢాంధకార నీరంధ్రమయ్యె
మబ్బుతెర గ్రమ్మె తారకా మండలమున
అనిలుఁ డేతెంచి దీపంబు నార్పివైచె
నాయెద వెలుంగు నాభరణంబు దివ్య
కాంతులను గ్రక్కుచున్న దేకరణి దీని
దాఁచుటో నేనెఱుంగ. ...............



# సాభిప్రాయ విశేషములు

రాజప్రతినిధులు

బ్రిటీషు రాజప్రతినిధుల యుదంతములు భోజరాజు సింహాసనారోహణ కథలను స్మరింపజేయు చుండును. భోజరాజు దానకర్ణుడు, పండితుడు; పండిత పోషకుడు. అయినను విక్రమార్కుని సింహాసనము నెక్కుట కర్హుడుగాకుండెను. విక్రమార్కుని నిర్యాణానంతరము మహారాజెక్కిన సింహాసనమును మంత్రులు భూస్థాపితము చేసిరి. కాలాంతరమునను సింహాసనముగల పొల మొకబ్రాహ్మణునకు సంక్రమించినది. బ్రాహ్మణుడు పొలమునందు మొక్కజొన్న చేనును వేసి చేనును గాచుటకు సింహాసనము గల స్థలప్రదేశమున నొకమంచెను నిర్మించెను. పిట్టలను తోలుటకు మంచెమీద నెక్కినపుడు దారిని పోయెడివారలనుజూచి "అయ్యలారా! పండియున్న జొన్న కండెలను కోసికొనిపొండు" అని సవినయముగ ప్రార్థించెడివాడు. మంచె దిగి రాగానె "పరుల ధనమిట్లేలయపహరించుచున్నారు" అని కలహమునకు బూనుకొనుచుండెడివాడు. బ్రాహ్మణుడొకక్షణమున నయాచితముగను దానకర్ణునివలె ప్రవర్తించుటయును, రెండవక్షణమునను పరమలోభియై తిట్టుటయును జనుల కాశ్చర్యమును గలుగజేయుచుండెను. భోజరాజీయుదంతమును విని పండితులతో సంప్రతించెను. పండితులు బ్రాహ్మణుని కీదాన ప్రధానము స్థలమాహాత్మ్యమువలనను గలిగినదని గ్రహించిరి. మంచవేసిన స్థలమును పరిశోధించి నపుడు విక్రమార్కుని సింహాసనము బయటపడినది. భోజరాజు దివ్యాంబరాభరణ భూషితుడై పరమోత్సాహముతో సింహాసనము నెక్కబోవు నపుడు సింహాసనమునందుగల సాలభంజికలు విక్రమార్కుని విక్రమదానధర్మ సాహసాది గుణముల నభివర్ణించుచు "భోజమహారాజా! నీకిట్టి గుణగణంబు లుండనేని సింహాసనము నెక్కుము" అని నివారించు చుండెడివి. విక్రమార్కుని కథను వినినతరువాత సుముహూర్తము దాటి పోగానె భోజుడు లజ్జితుడై మరలి పోవుచుండెను. రీడింగు ప్రభువై దేశ పరిపాలనానంతరము డిల్లీయందు శాసన సభ్యులకుజేసిన కడపటి ప్రసంగము భోజరాజు సింహాసన కథలను సంస్మరింపజేయుచున్నది. ఈకథ రీడింగుప్రభువునకు మాత్రముగాకను రాజప్రతినిధులకు సామాన్యముగ నన్వయించుచున్నది. ఆంగ్లరాజ్యతంత్రజ్ఞులు బ్రిటీషు సామ్రాజ్యాధిపత్యాహంకారములో స్వీయశక్తిసామర్థ్యములను, భారతసింహాసన ప్రభావమును గ్రహింపకను నధికారకాలాంతమునందు హతాశులై

యవ్యక్త ప్రలాపములను జేయుచుందురు. ఆరంభ శూరత్వము, కార్యాంతవిషాదము రాజప్రతినిధుల క్లైబ్యమును దెలుపుచున్నవి బొంబయినగరమునందు స్వాగతపత్రములను స్వీకరించునపుడు చేసెడి ప్రసంగములకును, డిల్లీనగరమునందు వీడుకోలుపు సమయము నందు జేసెడిప్రసంగములకును, రాజ్యధర్మ నిరీక్షణమునందు గలభేద మాంగ్లేయరాజ్యాధి కారుల సంకుచితహృదయమును వ్యక్తము చేయుచున్నవి. భరతఖండమునందు న్యాయ నిర్వాహణమును జేయుటకు ప్రతిజ్ఞను జేసినరీడిం గుప్రభువు రాజ్యాధికారమును సన్యాయాచ రణములతో నంతము నొందించెను. రీడింగు ప్రభువు చిత్తప్రవృత్తియందు సత్సంకల్పము లను గలిగియున్నను కార్యమునందు ప్రయో జనము గలుగలేదు. ప్రయోజనము లేకపోవు టయెకాకను దేశమున కపారమైన నష్టము సంఘటితము గలిగినది. ఈపరిణామము బ్రిటీషు సామ్రాజ్య విధానమునందె కలదు. భారతప్రజా హృదయమున కపరిచితులైన, బ్రిటీషు రాజ్య తంత్రజ్ఞులును మేధావంతులైనను సదయహృ దయులైనను సత్సంకల్పమును గలవారైనను బాహాటముగను భారత స్వాతంత్ర్యసిద్ధికి దోడ్పడజాలరు. బ్రిటీషుసామ్రాజ్యప్రయోజన ములను, స్వీయప్రయోజనములను నారాధిం చుటకువచ్చిన రాజ్యాధికారులు విశాలహృద యములతో భారతసామ్రాజ్య ప్రయోజనము లను నిరీక్షింపజాలరని చిరకాలానుభవము విశదముచేయుచున్నది. పాలకజాతికిని పాలిత జాతులకును సామ్రాజ్యపాశబంధమునకు సాధ నభూతములైన భాషయందును, భావములం దును,మతాచారసాంప్రదాయములందును ప్ర యోజనములందును సామ్యత్వము లేదు. భాష లువేరు; భావములువేరు; ప్రయోజనములువే రు; మతములువేరు; సంస్కారమువేరు. భారతీ యులను బ్రిటిషుసామ్రాజ్యమునందు లీనముచే యుట దుర్లభము. బ్రిటిషురాజ్యమునకును, భరతఖండమునకును సంయోగపాశమును కాల ముశిథిలము చేయుచున్నది. కాని బలతరము చేయుటలేదు. రాజప్రతినిధు లధికారస్వీకార కాలమునందు సదభిప్రాయములనుగలిగియున్న ను రాజ్యాధికారస్వీకారానంతరమువారిచిత్త వృత్తిమారుచుండును. రాజ్యాధికారము బ్రిటీ షుప్రయోజనములను బ్రిటీషుప్రతిభను, బ్రిటీ షుజాతిని, బ్రిటీషుసంస్కారమునుగాపాడుటకు వినియోగపడుచుండును. భారతీయ ప్రయోజ నములకును, బ్రిటీషు ప్రయోజనములకును సంఘర్షణము లేనంతవరకునుసకాలవ్యవహార ములును ధర్మయుక్తముగ నుండును. సంఘర్ష ణము గోచరమగునపుడు సకలమును విపరీతా కారమునుదాల్చును. రాజప్రతినిధుల ధర్మప్రతి జ్ఞ లంతరించును. బ్రిటీషుసామ్రాజ్యప్రయో జనములు స్ఫురించుచుండును. సామ్రాజ్యనిర్వ హణమున కిదిసహజఫలము. రీడింగులు, కర్జ నులు, హార్డింజిలు, ఇర్వినులు చేసిన ధర్మ ప్రతిజ్ఞలకును, రాజ్యవ్యవహారములకును గలి గిన భేదముల కిదియె మూలకారణము.

*　*　*　*

భారతసామ్రాజ్యము

భారతసామ్రాజ్య సంస్కార మతి ప్రాచీ నము. ప్రాచీన మతములకు, ధర్మములకు,

వేదాంతములకు, విజ్ఞానమునకు జన్మస్థానము. వీర్యవంతులైన ముప్పదికోట్ల ప్రజలు గలరు. పరరాజ్య పరిపాలనములెన్ని యోవచ్చి భారత సంస్కారమునందు లీనములైనవి. యవన హూణమహమ్మదీయ సంస్కారములు భారతీయసంస్కార మహాప్రవాహమునందు మేళగించినవి. నేటి ఆంగ్లోహైందవ సంస్కారమును ఈ పూర్వచరిత్రమును తిరిగి స్మరింపజేయుచున్నది. ఆంగ్ల సంస్కార మాంగ్లోహైందవ సంస్కారముగను మారుచున్నది. భారతీయసంస్కార మవిచ్ఛిన్నముగను ప్రవహించుచున్నది. భారతీయసంస్కారమునందు బాహ్యబలముక్షీణించినను ఆత్మబలము తేజోవంతమై విలసిల్లుచున్నది. అసహాయోద్యమము భారతీయాత్మబల ప్రభావమునువిశదము చేసినది. భారతీయుల కాత్మసంస్మరణము గలిగినది. భారతీయాత్మబలప్రభావ మాంగ్లేయులను నిర్విణ్ణులను జేసినది. ఆంగ్లప్రాబల్యము నిరర్థకమని గ్రాహ్యమైనది. దేశమునందసహాయయోగముసాధ్యమైనపుడు బ్రిటీషు బలములు, బ్రిటీషు తంత్రము నిరుపయోగమని యధికారవర్గమునకు విశదమైనది. రీడింగుప్రభువు తనశక్తిసామర్థ్యములను అసహాయయోగమును ధ్వంసముచేయుటకు వినియోగించి బ్రిటీషు రాజ్యతంత్రజ్ఞుల కృతజ్ఞతకును భారతీయుల నిరాదరణమునకును పాత్రుడయ్యెను. రీడింగుప్రభువర్యుని పరిపాలనకాలమునందు స్వరాజ్యరథ మొకయడుగైనను ముందునకుబోలేదని భారతీయులకు దెలిసినది. రీడింగుప్రభువర్యుని పరిపాలనాకాలము నీదృష్టితో నవలోకించినపుడు లోకాభిప్రాయము ప్రతికూలముగ నుండునుగాని యనుకూలముగ నుండజాలదు.

* * * *

## రీడింగుప్రభువుయొక్క ప్రగల్భనులు

రీడింగుప్రభువు వారి పరిపాలనాకాలమునందు కమిషనులను నియమించి న్యాయవాదివిశారదత్వమును వ్యక్తముచేసినను, స్వరాజ్యవికాసమునకుమాత్రముతోడ్పడియుండలేదు. రీడింగుప్రభువు వారి తెలివితేటలను ప్రజలను నిర్బంధించుటకు వినియోగించినవిధమును శరపరంపరలుగను శిక్షాస్మృతిని వారికాలమునందు వినియోగించినవిధము విశదముచేయుచున్నది. ఏ రాజప్రతినిధి కాలమునందును నింతమంది దేశారాధకులు నిర్బంధములననుభవించియుండరు. ముప్పదివేల దేశారాధకులను కారాగృహవాసులను జేయగలిగిన రాజప్రతినిధి వేరొకడు గనుపడడు. లోకోత్తరుడైన గాంధిమహాత్ముని నిర్బంధించినరీడింగుప్రభువు, వంగదేశ నిర్బంధముల నామోదించిన రీడింగు ప్రభువు బాధ్యతాయుత స్వరాజ్యస్థాపనమునకు వారి శక్తిసామర్థ్యములను వినియోగించి నటులు ప్రగల్భములనుగొట్టుట పరిహాసాస్పదముగను గనుపడును. రీడింగు ప్రభువు వారి చివర ప్రసంగమునందు వారి పరిపాలనాకాలమును స్వరాజ్యస్థాపనమునకు వినియోగించినటులు సమర్థించుట న్యాయవాది హృదయమును విశదము చేయుచున్నదిగాని ధర్మహృదయమును విశదముచేయుటలేదు. స్వాతంత్ర్య సమస్య

వలెను ఆర్థికసమస్యలును భారతీయాశయములకు ప్రతికూలముగను నిర్ణయింపబడినవి. వీరికాలమునందు కోట్లరూప్యముల పన్నులు పెరిగినవి. పన్నులతో నాదాయమును పెరిగినది. ఆదాయముతో లీకమిాషను దండుగ వ్యయమును నేర్పడినది. భారతీయుల నుక్కుపంజరమునందు స్థిరముగ బంధించుటకు యూరపియను ఉద్యోగస్థులకు సంవత్సరమునకు రెండుకోట్లరూప్యము లధికముగను వేతనాదుల యభివృద్ధి గలిగినది. నూలుమిాద సుంకమును తీసివేయుట యొక ఘనకార్యమైనను, నిర్బంధములతోను నధిక వ్యయముతోను పోల్చినపుడు నీఘనకార్యమునకు పేరుప్రతిష్ఠలుండజాలవు. ఏవిధమున జూచినను రీడింగు ప్రభువర్యుని పరిపాలనాకాలము భరతవర్ష బంధనమునకును బ్రిటీషుప్రభుత్వ ప్రయోజనములకును వినియోగపడిన దని అన్నిపక్షముల భారతీయులును నంగీకరించుచున్నారు. రాజప్రతినిధి రీడింగుప్రభువైనను, ఇర్విన్‌ప్రభువైనను స్వాతంత్ర్యస్థితి మాత్రము సాధ్యము గాదని భారతరాజ్యాంగ విధానము విశదము చేయుచున్నను భారతీయుల దృష్టిమాత్రము మారకుండుట బ్రిటీషు పరిపాలనము గలుగజేసిన సమ్మోహమును విశదము చేయుచున్నది. ఈ సమ్మోహము భారతీయులను నిర్వీర్యులను జేసి బ్రిటీషుప్రభుత్వ మప్రతిహతముగను సాగుటకు వినియోగపడుచున్నది. వర్తమాన కాలమునందు దేశమునందు ప్రబలుచున్న రాజకీయ పక్షములు దేశమునకు సంప్రాప్తమైన యధోగతిని విశదము చేయుచున్నవి.

రాజకీయపక్షములు

పరాధీనపాశబద్ధమైన దేశములందు స్వాధీనదేశములందువలె రాజకీయపక్షములస్థితికవకాశము లుండజాలవు. విదేశీయ నిరంకుశప్రభుత్వమును ప్రతిఘటించుట యన్ని పక్షముల కార్యమును నై యున్నపుడు భిన్నపక్షములకును నంతఃకలహములకును నవకాశములు లేవు. భారతీయులదురదృష్టమువలనను దేశమున కిట్టి దుర్దశ సంప్రాప్తమైనది. చింతామణిగారు చచ్చిన లిబరులుపక్షమును పునరుద్ధారణ చేయుటకు శంఖమును పూరించుచున్నారు. స్వపక్షదౌర్బల్యమును గ్రహించి యితరపక్షములసంయోగమునభిలషించుచున్నారు. వీరి ద్వేషమంతయును నిరంకుశప్రభుత్వము మిాదను ప్రసరింపక స్వదేశీయులైన స్వరాజ్యమువారిమిాదను ప్రసరించుచున్నది. స్వరాజ్యపక్షమున కిచ్చిన సమ్మతులు నిరంకుశపక్షమున కిచ్చిన సమ్మతు లని చింతామణిగారు చెప్పుట క్షంతవ్యముగాదు. రాగల యెన్నికలయందు, గతించినయెన్నికలయందు సంప్రాప్తమైన పరాజయమే యిట్టిపక్షమునకు సంప్రాప్తముగాగలదు. శ్రీమతి బెజంటమ్మగారు కన్వెన్షనుపక్షమునకు ప్రాణముపోయుటకు యావచ్ఛక్తిని వినియోగించుచున్నారు. జిన్నాగారు స్వతంత్రపక్షమున కూపిరిపోయుటకు యత్నించుచున్నారు, మాలవ్యాగారు నూతనముగను జాతీయపక్షమును నిర్మించుటకు బూనుకొనుచున్నారు. సమయోచిత సహకారపక్ష మితరపక్షములతో సంయోగమును బొందుటకు బూనుకొనుచున్నది. ఈ కల్లోలస్థితియందు

ప్రజాసామాన్యమునకువారికర్తవ్యము దుర్గ్రాహ్యముగ నుండగలదు. ప్రజాభీష్టమును సఫలముచేయుట కేర్పడిన కాంగ్రెసుకులదేవతనే ప్రజలు కొలువవలసిన యవసరమును దేశపరిస్థితులు వేయిముఖములను విశదముచేయుచున్నవి. రాగలయెన్నికలయందు ప్రజలు వారిచోట్లను స్వరాజ్యపక్షమున కిచ్చి వారి స్వరాజ్యకాంక్ష నేకగ్రీవముగను వ్యక్తము చేయవలసిన శుభసమయ మాసన్నమైనది. ఆశుభసమయమునందు ప్రజలు కుల దేవతయైన కాంగ్రెసును గొలిచి కామితార్థములను బడయుదురు గాత!

*  *  *  *

కాంగ్రెసు అభ్యర్థులు

కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించి ఎన్నికలయందు విజయప్రస్థానమును చేయుటకు దేశమునందంతటను ప్రయత్నములు జరుగుచున్నవి. గతవారమునందు మద్రాసు శాసనసభకు కాంగ్రెసు అభ్యర్థులను నిర్ణయించుట కాంధ్రరాష్ట్రీయ జాతీయోద్యమసంఘము బెజవాడయందు గూడినది. ఆసభయందు ప్రజలుచూపిన యుత్సాహము ప్రశంసనీయమైనను గనుపరచిన భేదములు శోచనీయములు. కులభేదములు, భావభేదములు, స్థలభేదములు, మతభేదములు, పక్షభేదములు దేశమును చీల్చివేయుచున్న విషయమును సంప్రతింపులు, ప్రసంగములు విశదము చేయుచున్నవి. కాంగ్రెసుపక్షమును ప్రతిఘటించుటకు జస్టిసు పక్షము విశ్వప్రయత్నములను జేయుచున్నది ఇట్టి కల్లోలస్థితియందు స్వరాజ్య సంపాదనము నకు సాధనమును గిట్టకొనిన కాంగ్రెసుసంస్థను బలపరచి దాని ప్రతిభను గాపాడుట యె ప్రజల కర్మమై యున్నది. అన్నిమతములవారును వారిప్రదేశములందు గల విభేదములను విడనాడి ఏకగ్రీవముగను కాంగ్రెసు సేవాపరాయణులను జాతి, మత, కుల, భేదము లను పాటింపక ను అభ్యర్థులనుగ ను నిర్ణయించి వారివిజయమునకు పాటుపడి స్వాతంత్ర్య సంపాదనమును సాధ్యము చేయుదురుగాత! రాజప్రతినిధులునచ్చినను పోయినను స్వరాజ్యస్థాపనమునకు ముఖ్యమైన ప్రజాశక్తియే సాధనముగ నున్నది. వర్తమానపరిస్థితులందు ప్రజాశక్తిని వ్యక్తముచేయుటకు కాంగ్రెసు ప్రతినిధులకు ఎన్నికలయందు విజయమును సమకూర్చుట ప్రజాధర్మమై యున్నది.



Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras



# అమృతాంజనము

చక్కని డబ్బీతో సహా సీసా 1–కి అణాలు 10 మాత్రమే


విషయానుక్రమణిక

## చిత్రములు



 'రాజగృహము' అనువ్యాసమునకు సంబంధించిన చిత్రములు జ్యేష్ఠమాస సంచికయందు ముద్రింపబడును.



చెన్నపట్టణము మే ౧౯౨౬

సంపుటము 3 | అక్షయ సంవత్సరము వైశాఖమాసము | సంఖ్య ౫

# ప్రణయ రాధిక

శ్రీ శేషాద్రి రమణ కవులు

రాఁగదవోయి యాదవవరా! వసుదేవకుమార! మాధురీ
స్వాగతగీతి నాదుహృదయం బిదె మెల్లఁగ నాలపించె నీ
వాగమృత ప్రసిక్తమగు వంశరవంబును దానఁగూర్చి బృం
దాగహనస్థ గోపి సముదాయ మెలర్పఁ గదోయి మాధవా!

చ. తరళలతాంత మియ్యది కదంబము నవ్యశరన్మనోజ్ఞ సుం
దర సువిశాల మిద్ది యమునాపులినంబు ప్రసన్న దిగ్గిగం
తరమిది చంద్రికానిశ మనం బలరించినచోటఁ జేరి క్రొ
వ్విరుల మరంద మూరుగతి వేణువు నూదఁగదోయి యాదవా!

ఉ. అదెయదె విశ్వమోహనసుధాంశు నిసర్గమనోజ్ఞ చంద్రికా
స్పదమగు సైకతంబుపయిఁ బాడెడిఁ గృష్ణుఁడు వేణువంచు ని
న్నెదఁ గదియించుకొన్నసతులెల్లరుఁ బోవుచు నున్నవారు నీ
వదనసుధాంశు దర్శనము వారికిఁ గూర్పవె నందనందనా!

ఉ. రావిదియేల కృష్ణ! మధురాపురమెల్ల శరత్సుశాంత బృందా
దావన సన్నివేశ పులినంబునఁ జేరెఁ దరంగమాధురీ
రావముపేర నీ యమున రమ్మనుచున్నది ఒక్కమాఱు రా
వా! వినిపింపవా! పలుకవా! రసభావములొల్క యాదవా!

చ. ఇది తుదియౌ శరన్నిశసుమీ? జలజాప్తుఁడు క్రుంకుచుండె ది
గ్వదనములందుఁ బ్రాగరుణవైభవచంద్రిక సాంద్రమయ్యె మా
యెదలను దొందరించె శ్రవణేచ్ఛ యిఁక నీ ద్యుతి సైతువేని మా
బ్రదుకు లసాధ్యముల్ ప్రణయవార్ధి నిమగ్నము లౌట యాదవా!



# స్మృతి కణము

దు వ్వూ రి రా మి రె డ్డి గా రు

కనులు మూసినఁ దెఱచినఁ గానుపింతు, వింట నడయాడినట్టులె యిందువదన!
సంతతధ్యానలీనమౌ స్వాంతమునకు, వెలుగుఁ జీఁకట్లభేదంబు దోఁచునేమొ!

గీ. తెల్లవాఱినఁ, బూదండ దీసివైవఁ, దరుణి వేఁశిక నిల్చు నెత్తావి పోల్కి,
మర్త్యమౌ నీస్వరూపము మాటువడియు, సారవర్ణాంకితస్మృతి సమసిపోదు!

గీ. చావుబ్రదుకులమధ్య విశాలమైన, కలలవంతెన గట్టితిఁ దలిరుఁబోఁడి;
కార్యలంపట దినమున కన్నఁ, బ్రకృతి, ముసుఁగుఁదీసెడిరాత్రి నా కొసఁగుఁ బ్రియము.

గీ. పవలు రేయికిఁ గల భేదబాంధవములె, యిహపరంబులయందు నూహింపఁగలము!
రెంటికూడలియగు సంజ, మింటికొనల, విమలరాగంబు వెదచల్లు; వెఱపు నిడదు.






# పింగళి సూరనార్యుఁడు - ఆతని కావ్యములు

కోటమర్తి చినరఘుపతిరావు గారు

ఆంధ్ర ప్రబంధకవులలోఁ బింగలి సూరనార్యుఁ డొక్క మహాకవిగా వన్నెకెక్కెను. ఈతఁ డాంధ్రమునఁ బెక్కు గ్రంథములను రచించినట్లు చెప్పుకొనియున్నాఁడు. గారుడమును, రాఘవపాండవీయమును, కళాపూర్ణోదయమును, ప్రభావతీప్రద్యుమ్నమును, నీతఁడు రచించెను. గారుడమను గ్రంథ మిప్పు డెచ్చటను గానరాదు. తనభాషాపాండిత్యమును జూపుటకై రాఘవపాండవీయమును, గాథావిధానమును, గనపర్చుటకుఁ గళాపూర్ణోదయమును, రసపోషణమును బ్రకటించుటకుఁ బ్రభావతీప్రద్యుమ్నమును నీతఁడు రచించినట్లు ద్యోతక మగుచున్నది. ఇట్లు వ్రాయుటచే గళాపూర్ణోదయమున రసపోషణము లేదని కాని, ప్రభావతీప్రద్యుమ్నమునం దితివృత్తనైపుణ్యము కానరాదని కాని, రాఘవపాండవీయమునం దీ రెండును లేవని కాని, నాయభిప్రాయము కాదు. ఆయా గ్రంథములయం దాయావిషయములకుఁ బ్రాధాన్యమిచ్చి కవి యాయా గ్రంథముల విరచించెను. ఈతనికి సమకాలికుఁడైన రామరాజభూషణుఁడు వసుచరిత్రమును జాలవఱకు శ్లేషతో నింపి యున్నాఁడు. అందుచే నీతఁడుగూడఁ దనభాషా పాండిత్యమును జూపఁదలంచి రామాయణభారతకథలను గలిపి యొక్క ప్రబంధములోనే ప్రతిపద్యమును ద్వ్యర్థమునిచ్చునట్లు వ్రాసినాఁడు. దీనింబట్టిచూడఁగా నీగ్రంథమును మొదట కవి రచించునప్పటికి నీతనికిఁ బ్రబంధము శ్లేషకావ్యముగా నుండవలెనను భ్రాంతి కలిగియుండవచ్చును. ఈభ్రాంతియే యాతని మొట్టమొదటికావ్యమును శ్లేషకావ్యముగా రచించునట్లొనర్చినది. కాని రానురాను భ్రాంతి మారినది. ఈతని కవిత్వదృక్పథము మారుటఁబట్టినే రెండవగ్రంథమైన కళాపూర్ణోదయము నీతఁడు రచించెను. ఈ రెండవగ్రంథమును వ్రాయునప్పటి కీతనికిఁ గల్గిన యభిప్రాయములఁ గవి తనగ్రంథాదినే చెప్పుకొనియున్నాఁడు.

"సీ. పొసఁగ ముత్తెపుసరుల్ ల్పోహళించిన లీల
దమలోన దొరయు శబ్దములుగూర్చి
యర్థంబు వాచ్యలక్ష్య వ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు నర్హంబుగ వైదర్భి
మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు
ప్రాణంబు లింపుగాఁ బాదుకొలిపి

గీ. యమరనుపమాదులును యమకాదులునగు
నట్టియర్థశబ్దాలంక్రియలు ఘటించి
కవితచెప్పంగనేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసంగనివారు గలరె.

(కళా. ప్రథ. 81)

కళా పూర్ణోదయమును రచించునప్పటి కీతనికిఁగలిగిన కవిత్వ లక్షణమును పైరీతిని జెప్పికొనియున్నాఁడు. కాని యిదికూడ నాతనికి సరిపడలేదు. కాలము గడచినకొలందిని ఈతనికిఁ గవిత్వలక్ష్యము మాఱినది. ఈమార్పునుబట్టియే యీతఁడు మూఁడవగ్రంథమైన ప్రభావతీ ప్రద్యుమ్నమును రచించెను.

ఈతఁడు ప్రభావతీప్రద్యుమ్నమును రచించుటకుఁ గారణము:

మ. జనము ల్మెచ్చఁగ మున్రచించితి నుదంచద్వైఖరిం గారుడం
బును శ్రీరాఘవపాండవీయముఁ గళాపూర్ణోదయంబు న్మఱిన్
దెనుగుం గబ్బము లెన్నియేనియును మత్పిత్రాదివంశాభివర్ణన లేమిం బరితుష్టినా కవి యొనర్పంజాల వత్యంతముస్"

"మ. * * * * దర్పణక్రియచే నాపినతమ్ముఁ డెట్టిన యొనర్చెందంద్రి కాహ్లాదముస్.

కం. ఏనుం బితృపూజన నాచే నైన న్లెద్దియైనఁ జేయఁగ వలయున్
గానఁ గృతియిచ్చి మేదిని
పై నిలుపుదు నతనికీర్తిఁ బరమేశుకృపన్."

(ప్రభావతీప్రద్యుమ్నము)

అని చెప్పెను కాని యిందులకుఁ గారణము వేఱొక్కటికూడఁ గలదు. అది యీతని కావ్యలక్ష్యము. వయస్సుతోపాటీతనికిఁ గావ్యలక్ష్యముగూడ మారుచు వచ్చుటచేతనే యీప్రభావతీప్రద్యుమ్నమును రచించెను. ఈతని కప్పటికిఁ గల్గినకవితాశయము యీ క్రిందరీతిని వ్రాసుకొని యున్నాఁడు:

సీ. శబ్దసంస్కార మెచ్చటను జాఱగనీక
పదమైత్రి యర్థసంపదలఁ బాదల.
* * * *
నొకట బూర్వోత్తరవిరోధ మొందకుండ
దత్తదవయవ వాక్యతాత్పర్యభేదములుమహాకావ్యతాత్పర్యమునకునొనరఁ
బలుకనేర్చుట బహుతపః ఫలముగాదె!!

(ప్రభా: ద్వితీ: ౩-౨ ప)

సరియైనపద్ధతి నీతని కీయభిప్రాయాన్నత్యముల కతిశయము గలిగించినవయోవిశేషమే యీకవిని ప్రభావతీప్రద్యుమ్నమును రచించునట్లు చేసినది. అందుచే నీతనిత్రివిధకావ్యములలోఁ దుదిగ్రంథమయిన ప్రభావతీప్రద్యుమ్నము మిన్నయై యున్నది.

కళాపూర్ణోదయముతోఁ గవి సంతృప్తుఁడు గాలే దనుటకు వేఱొక్క కారణముఁ గూడఁ జెప్పవచ్చును. ఈకావ్యమునం దితివృత్త మెక్కుడుగను రసము కొంచెముగను నుంచి కవి యీగ్రంథమును రచించెను.

ఇందులకు నిదర్శనముగాఁ గళాపూర్ణోదయ ములో నెక్కడనైన వరుసను రెండుపద్యముల దీసివైచిన నీకథ యదుకు కొనదు. అందుచేఁ గళాపూర్ణోదయమునం దితివృత్తమే ప్రధానము. కావునఁ గవి యీగ్రంథమునం దితివృత్తమునకుఁ బ్రాధాన్య మిచ్చి యీకా వ్యనిర్మాణమును జేయుటచే నిందు రసమున కప్రాధాన్య మిచ్చెనని వ్రాయవలసివచ్చినది. మరియు దీనిని సర్వలక్షణ సమన్వితముగఁ జేయవలెనని కవి కథను సహజముగా రచింపక నక్కడక్కడ కథ నపక్వపరిస్థితులలోనికిఁ దెచ్చి కళాపూర్ణోదయమును రచించెను. "సర్వలక్షణ ములను బలాత్కారముననైనఁ దెచ్చి రాసి వేయవలయునని సందేశము చేసికొన్నవాఁడ గుటచేఁ గథను సహజముగఁ బక్వతకు రాని య్యక యచ్చటచ్చట నూదరవేసియుండుట" కళాపూర్ణోదయమందలి యొక లోపముగాఁ గవిత్వతత్త్వవిచారమున శ్రీయుత కట్టమంచి రామలింగారెడ్డిగారు రచించిరి. ఇదెంతయు సమంజసముగా నున్నది. ఇందుఁ బ్రబంధలక్ష ణములను సర్వమును నిమిడ్చి వ్రాయవలెనని యభిప్రాయమున్నట్లు కవి తనకళాపూర్ణోద యాంతగద్యమం దిట్లు వ్రాసుకొనియున్నాఁడు.

"ఇది నిఖిలసూరిలోకాంగీకార తరంగిత కవిత్వవైభవ పింగళియమర నార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతంబ యిన కళాపూర్ణోదయంబను మహాకావ్యంబు నందుఁ బ్రబంధపూర్తి శోభనంబైన యష్టమా శ్వాసము సర్వంబును సమాప్తము."

లక్షణ సమన్వితముగా రచించినంత మాత్రమునఁ గళాపూర్ణోదయము పరిపూర్ణ భావములతో నిండియుండలేదని తలంచిరో ప్రభావతీ ప్రద్యుమ్నమును గవి రచించెను. రసైకజీవికుఁడగు కవి తన గ్రంథమునందురసము చిప్పిలునట్లును పరిపూర్ణ భావములు భాసురం బగునట్లును రచింపవలెనుగదా! ఇందుచేతనే సూరనార్యుఁడు తనప్రభావతీ ప్రద్యుమ్నాంత గద్యమునం దీక్రిందిరీతిని వ్రాసియున్నాఁడు.

"ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగిత కవిత్వవైభవ పింగళి యమరనార్యతనూభవ సౌజన్యజేయ సూరయనామధేయ ప్రణీతం బైన ప్రభావతీ ప్రద్యుమ్నంబను మహాప్రబం ధంబునందుఁ బరిపూర్ణభావభాసురంబైన పంచ మాశ్వాసము."

ఇంకుచే వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సువారు కళాపూర్ణోదయమునందలి భూమికలో 'నీతఁడు (పింగళి సూరనార్యుఁడు) రచించిన గ్రంథములలోనెల్ల నిదియే ముఖ్య మైనది' అని వ్రాసినవ్రాఁత సమంజసముగాదు. ఈతని గ్రంథములలోనెల్లఁ బ్రభావతీప్రద్యు మ్నమే మిన్నయైయున్నది. ఈయుత్కృష్ట గ్రంథమును రచించుటలో కవికి వేఱొక్క యభిప్రాయముకూడ నుండి యుండవచ్చును. ఈకావ్యము కేవలము ప్రబంధమే యైనను దృశ్యకావ్య లక్షణములతోఁగూడ దీనిని రచిం చెను. దృశ్యకావ్యమునందలి ప్రధాన విష యము సంభాషణము. ఈగ్రంథమునందున్నది పాత్రల సంభాషణ వైచిత్ర్యమే. ఈగ్రంథము లోని కథను వర్ణనలనుగూడ సంభాషణ

పూర్వకముగానే తెలియఁబఱచి యున్నాఁడు. కొంచెము మార్పులతో నిది యొక చక్కని దృశ్యకావ్యముగా • మారఁగలదనుట నిర్వివాదాంశము.

ఇట్టి యుత్తమకావ్యములో కవి హంసిని రాయబారినిగ నియోగించుట సమంజసముగ లేదని కొందఱును, పంచాశ్వాసములుగల గ్రంథములోఁ గవి ప్రధానపాత్రయైన నాయికను దృతీయాశ్వాసాంతమందుఁ బ్రవేశపెట్టుట కథారచనమునకు బాగుండదని కొందఱును ఆక్షేపణచేయుచున్నారు. మొదటి ఆక్షేపణమునకు సమాధానము——

హంసీరాయబారము నీకవియే వాడియున్నాఁడా? వేఱొక్కఁ డెవ్వఁడైనఁగూడ వాడియున్నాఁడా యనువిషయమును దీసికొందము. శృంగారనైషధములో శ్రీహర్షమహాకవి హంసనురాయబారిగ నియోగించినాఁడు. నిషధదేశపురాజై చక్రవర్తియైన నలునిగుణములను దమయంతికి వర్ణించుటకును, దమయంతివలపుపలుకులు నలుని కెఱింగించుటకును గవి హంసరాయబారమును గల్పించినాఁడు. విదర్భరాజు సామంతరాజు- దమయంతితండ్రి. నలచక్రవర్తి సామంతరాజకన్య- నందు సాటి రాజకన్యను- వివాహమాడఁదలచుకొనినప్పుడుగాని, ముందొకరినొక రెఱుంగుటకుఁగాని- కవిహంసరాయబారమునేల పెట్టవలెను? దూతికలులేరో! వార్తాహారులుగ మానవులే పనికిరారో!!

"కావునం దీరంబులేని విరహభారంబను పారావారంబున మునుంగం బొఱుచున్న నాకుఁ జెప్పగా విరించి నిన్నుఁగల్పించినాఁడు. ........పొమ్ము. కార్యము సాధింపుము!"

అని నలచక్రవర్తి భీమరాజకన్యను వివాహము చేసుకొనుటకై హంసను రాయబారిగఁ బంపుట సమంజసము గాదు. కాని కవి చమత్కారముగ పలుకులపులుగును రాయబారిగాఁ బెట్టియున్నాఁడు. కాని ప్రభావతీ ప్రద్యుమ్నమునందు మాత్రము సమంజసమౌనో కాదో కొంత తర్కించిచూతము.

ఇందలిపాత్రలస్థితిగతులను బట్టి కొంచె మాలోచించెదము. ఇందు నాయికానాయకులు ప్రభావతీప్రద్యుమ్నులు. ప్రభావతి దానవబాలిక. వజ్రనాభునికూఁతురు. వజ్రనాభుఁడు చండశాసనుఁడు. దేవమానవవిరోధి. ఇట్టి దానవబాలిక ప్రద్యుమ్నుని వరించినది. ప్రద్యుమ్నుఁడు మర్త్యుఁడు. శ్రీ కృష్ణుని పుత్త్రుఁడు. శ్రీకృష్ణుఁడు రాక్షసాంతకుఁడు. అన్యోన్యవైరములును, సహజవిరోధములును గల్గిన యీ రెండుకుటుంబముల బాలబాలికల కుద్వాహ మొనర్చుట కెట్టినేర్పరులు సంధానకర్తలుగా నుండవలెను? ఇట్టి కార్యముల నొనర్ప సమర్థులైనవారిని నియోగించుటలోనే కవి సామర్థ్యము గన్పడవలెను. నాయికానాయకులు దానవమర్త్యజాతివార లౌట సంధానకర్త సహజముగ నీరెండుజాతులవారిలో నొకజాతికిఁ జెందియుండవలెను. మానవ రాయబారము వలనుపడదు. మారుతాతపములకు న్నిజానుమతిఁదక్క బ్రవేశ మొనర్ప రానియట్టి వజ్రపురిలోనికి, అందంతఃపురము లోనికి మర్త్యుఁ డెట్లు పోఁగలఁడు? పోనిండు.

కవి దానవరాయబారమును నిర్మించెననుకొందము. నాయకున కారాయబారియెడ నెట్లు విశ్వాసము గలిగియుండును. ఆ రాయబార మంతయు రాక్షసుల మాయాకృత్యములుగా నాయకుఁడు గ్రహించుకొనవలసినవాఁడౌనే. కావున దానవరాయబారము సమంజసము గాదు. సర్వసాధారణముగా రాయబారులు, సంధానకర్తలు, నుభయపక్షములకు జెందని వారుగా నుండవలెను. అట్లయిన నిందలి రాయబారి యెట్టివాఁడుగా నుండవలెనో నిర్ధారణ చేయవలసియున్నది. దేవపక్షపాతులుగను, వజ్రపురప్రవేశానుమతి గలిగినవారుగను అం దంతఃపురములఁ జొర వీలైన వారుగను, యి ది వ ఱ లో నిట్టిసంధానకర్తలుగా ను ం డి న వా రు గ ను, సకలవిద్యల నెఱింగినవారుగను నున్నవారినిగదా కవి సంధానకర్తగ నియోగించవలెను. అందులకయియే కవి మొదటినుండియు దేవేంద్రునిపక్షమున నుండినట్టియు, వజ్రపురిలోనియంతఃపురపరిసర సరస్సులలో విహరింప ననుమతి గల్గినట్టియు, నిదివఱలో నాదిదేవులై ప్రణయకలహకారణమున నెడబాటుగలిగిన బ్రహ్మసరస్వతులకే సంధానకర్తయైనట్టియు, సరస్వతీదేవి తనయంతదానిగ దిద్దుకొనినట్టియు, శుచిముఖియను హంసీమతల్లిని కవి రాయబారిగ నియోగించెను. అందుచే నిందలి హంసీరాయబారము న్యాయసమ్మతము. ఇంతియేకాక యీహంసీరాయబారమును గల్పించియే కవి తనకావ్యమునకు వన్నె తెచ్చినాఁడని నాయభిప్రాయము.

రెండవశంకకు సమాధానము

ప్రభావతీ ప్రద్యుమ్నమునందు నాయిక తృతీయాశ్వాసమునందు రంగస్థలమునకుఁదీసుకొని రాఁబడెను. కాని మనుచరిత్రమునందు వలె నిందు కవి నాయికానాయకులను మూఁడాశ్వాసములవఱకును మఱచిపోలేదు. ప్రభావతి జన్మాదికము స్వప్నవృత్తాంతము శుచిముఖివలన నింద్రునకుఁ జదువరులకుఁ దెలియఁజేయఁబడినది. ద్వితీయాశ్వాసమునందు నాయకున కీ నాయిక గుణరూపాదులు శుచిముఖి వలనఁ దెలుపఁబడినవి. కాఁబట్టి సరియైన ప్రభావతీపాత్రమును రంగస్థలముపైకిఁ బ్రవేశపెట్టకపోయినను బ్రభావతీ విషయమునంతను చదువరులకుఁ బూర్తిగఁ దెల్పియున్నాఁడు. శ్రవ్యదృశ్యకావ్యములలోఁ గవి నాయికా నాయకులనుఁ బ్రథమాశ్వాసములోనే తీసికొనివచ్చి గ్రంథాంతము వఱకును వారిని నిలువఁబెట్టనక్కఱలేదు. షేక్స్పియర్ వ్రాసిన (Julius Ceaser) జ్యూలియస్ సీజర్ నాటకములో 'సీజర్' తృతీయాంకప్రారంభమున నే ఘోరహత్య గావింపఁబడినాఁడు. అంతమాత్రమున మిగిలినకథకు లోపమురాలేదు. 'Julius Ceaser' యొక్క ఆత్మశక్తియే మిగిలిన నాటక మాడించినది. ఇందుచేతనే Shakespeare నాటకమునకు 'Julius Ceaser' అని పేరుపెట్టియున్నాడు. ప్రభావతీప్రద్యుమ్నకారుఁడు పూర్వభాగములోఁ బ్రభావతీకథ నన్యపాత్రలచే వినిపించి యుత్తరభాగమునందుఁ బ్రభావతిని బ్రవేశపెట్టి కావ్యమును బూరించినాఁడు. కాన దీనియందు మనుచరిత్రమున కున్నదోషము నారోపించుటకు వీలులేదు.




శ్రీ శివశంకర శాస్త్రి గారు (సాహితీసమితి సభాపతి)

విమల దీధితుల దిశాముఖంబులు వెల్గుచున్న వోహో
కమలభవాండము చూచుచుండగనె కలకదేరె నెంతో.

నీలగళుం డీపూతదివసమున నిఖిలలోక శశ్వ
త్పాలనకొరకై హాలాహలమును భక్షణచేసెను గాదే!

ఎంతకృపానిధి సర్వవంద్యుడో యీశ్వరుండు భళిరా!
సంతోషమ్మున విషమ్ము గళమున స్తంభీభూతము చేసెఁ.

ఏ నీదినమున నగణితపుణ్యం బేమి చేసినానో
దీనుని శీతలదృష్టి గాంచితివి దేవదేవ శంభో!

క్షాళిత మయ్యెను మాలిన్యం బీక్షణములోన భవదీ
యాలోకామృతవృష్టివశమ్మున నార్తజనుని మీదన్!

ఈ మహిమోజ్జ్వల పుణ్యదినమునం దీశ కృప న్నను నీ
ధామంబునకే చేర్చుకొన్న-చో ధన్యుడ నౌదును నాథా!

సకలలోకముల శైవమహాత్త్వము జయము గాంచు బహుధా
సుకృతమునం గైవల్య మెల్లరును చూరగొంద్రు గాతన్!

ఎంతయుదాత్తం బెంతమనోజ్ఞం బీశ్వరరూపం బోహో
ఎంత మనోహర మెంతయఘహరం బీశ్వరనామం బాహా!

జయ మృత్యుంజయ జయమదనాంతక జయజయ త్రిపురహారా!
జయ గంగాధర జయ గౌరీప్రియ జయ ఖండేందుధరా.

జయజయ హరహర జయజయ శివశివ జయజయజయజయ యీశా
జయజయజయజయ శంభో శంకర జయజయజయజయ సాంబా!






పారనంది జగన్నాథస్వామి గారు,
యమ్. ఏ., యల్. టి.

ఆంధ్రప్రచారిణీగ్రంథమాలలోని నవలలు సాధారణముగా అనువాదములనిన్నీ లేక పరిశోధక కథలనిన్నీ నాకొక అభిప్రాయ ముండుటచేత ఈ క్రొత్తనవల చదవడము ఆలస్యమైంది. ఇది స్వతంత్రమైన సాంఘికకథఅనిన్నీ, చదవతగినదనిన్నీ నా గురువులు శ్రీ రావుసాహేబు గిడుగు రామమూర్తి పంతులు గారివలన తెలుసుకొంటిని. ఇది బాఙ్లకు నవలలను పోలియున్నదనే వారిఅభిప్రాయమును సమర్థించుటకు నాకు గల బాఙ్లకు పరిచయము చాలకపోయింది. కాని దీని కథ నేనొకస్నేహితునితో ముచ్చటించగా వారికి బంగాళీగ్రంథములలోని కొన్నికొన్ని స్థలములు స్ఫురణకు వస్తున్నట్లు వారు చెప్పేరు. నేను మాత్రము ఈ గ్రంథమునూ, దానిరచననూ, దానికథనూ స్వతంత్రములుగానే తలుస్తూ ఈవ్యాసమును వ్రాస్తున్నాను.

నవలవిషయములన్నిటిలోనూ కథాకల్పన చాలా క్రొత్తగాను, చమత్కారముగాను ఉన్నాదని చదువరులందరూ అంగీకరించకతీరదు. "ఇప్పటినవలలో ఇది యొక నూతనపద్ధతి" అనే సంపాదకీయవాక్యముప్రకారము, ఈపద్ధతి మునుపులేనిదికావడముచేతనే క్రొత్తది కాకుండా, నూతనమైన ప్రతీని కనబరచవలసిన స్వతంత్రత, ధైర్యసాహసములు, ఉత్సాహగాంభీర్యములు, దీనిలో కనబడతవి.

ఈలక్షణములు కథాకథనమువిషయమై వర్తిస్తవి. ఈనవలవ్రాయుటలో కవి కథాసందర్భమునం దెక్కడు శ్రద్ధతీసికొనలేదని విన్నపములో గ్రంథమాలా సంపాదకులు వ్రాశారు. అది నిజమ్మే! కథనము వింతగా ఉంటుంది. జరుగుతూ ఉన్నకథను జరుగుతూఉన్నట్లు కాకుండాను, జరిగిపోయినదానిని జరిగిపోయినట్లు కాకుండాను, జరిగిపోయినదానిని కథకుడు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నట్లు కథనము నడిపించుట దీనియందొక విశేషము. కథావసానముతో పుస్తకము ప్రారంభమవుతుంది. కథ మధ్యనప్రారంభించి కొంతభాగమైన తరువాత గతించినదానిని చెప్పడములో కొంతసొగసూ, కొంత చిక్కూ రెండూ ఉంటవి. అప్పుడైనా కథనము సులువుగా ఉండాలంటే అదే ముఖ్యప్రయోజనమై యుండాలి. అలాగుగాక భావములు, ఊహలు, వాంఛలు, ఆలోచనలు, ఆదర్శములు ఈమొదలైన మనోవృత్తుల వర్ణనా పరంపరలతో కథనమును నింపివేస్తే కథ వీటిమధ్య మునిగిపోయి పాఠకులకు ఇబ్బంది కలుగజేస్తుంది. దీనికి తోడుకథలోనిపాత్రలే కథకులుకావడము ఒకటి సంభవించింది. అలాగని అందరు గ్రంథకర్తలు చేసేటట్లు ఒక్క యేపాత్రనో వక్తగాచేయక, ఈకవి ముఖ్యులైన ముగ్గురిచేత మూడుభాగాలుగా కథను చెప్పించడముచేత, కథంతా ముక్కలుముక్కలుగా విడిపోయింది. ఒకొక్క పాత్ర తనకథను తనమాటలలో చెప్పేటప్పుడు, తన కెంతవరకు జోక్యమో అంతవరకే చెప్పి ఊరుకోవడము సంభవిస్తుంది. భాస్కరుడు, భారతి, సీతారాముడు, వీళ్లు కథకు ఎంతముఖ్యులైనా ఈముగ్గురుచేసినపనులే కథ కాదు. దుర్గ, శ్యామల, కృష్ణమూర్తి, వెంకట్రావు, రంగమ్మ, మానవరావు – వీరికందరికీ కథతో చక్కని సంబంధ మున్నపుడున్నూ, వీరివీరిచర్యలు ముగ్గురికథనములలో ముక్కలుగావస్తూఉండడము తప్పకపోయినప్పుడున్నూ, వాటినన్నిటినీ కలుపుకొంటేనేకాని కథ పూర్తికానప్పుడున్నూ కథనము ఈఏర్పాటువల్ల చిక్కుపడక ఏమవుతుంది? ఇట్టిచిక్కువల్ల కథయందు చదువరులకు ఆసక్తి ఎక్కువవుతుందని చెప్పవచ్చును; కథకు ఒకఅపూర్వమైన సొగసు వస్తుందనికూడా చెప్పవచ్చును. కావచ్చు, కాకపోవచ్చు. కాని కథ క్లిష్టమైనంతమాత్రాన లాభ ముండదు.

జరిగినకథను జ్ఞాపకము తెచ్చుకొంటూఉన్నట్లు కథనముఉన్న అన్ని చోట్లా ఉండేలోపమొకటి ఇక్కడా తప్పిందికాదు. ముందు రాబోయేసంగతులకు చేసే సూచనలు ఆచెప్పేవానికి పూర్వానుభూతములైనట్లు చదువరులకు తెలియడముచేత అవి సూచనలు కాక పోవును. "ఇకముందు మనసమావేశముల కంతరాయము కలుగునట్లు తోచుచున్నది" అని చేసినసూచన ఆఅంతరాయములను అనుభవించినతరువాత జ్ఞప్తికి తెచ్చుకొంటూ భారతి చెప్పిందని చదివేవారికి తెలిస్తే, ఆమాట సూచనగా నెరవేరదుగదా. సరే, పాత్రకుతెలిసినా చదివేవారికి తెలియదు. కాబట్టి సూచనే అని ఒక సమాధానము చెప్పవచ్చును. అది సమాధానమే.

పాత్రలూ, కథకులూ ఒక్కరేకావడముచేత, తమలోతాము అనుకొన్నమాటలకున్నూ, కథకులుగా చెప్పేమాటలకున్నూ స్పష్టమైనభేదము చేయవలసి ఉన్నది. అందుకొరకు " " అనే గురుతులు ఉపయోగిస్తారు. ఈగురుతును వాడుటలో సాంకర్యముంటే భేదము అస్పష్టమై కథనము చెడుతుంది. అంతే కాకుండా " " అన్నగురుతుకున్నూ ' ' అన్నగురుతుకున్నూ భేదముచేయుట సంప్రదాయము; ఆలాగు కాకుండా ఇదీ అదీ వాడితేకూడా సాంకర్యము కలుగుతుంది. ఇందుకు నిదర్శనముగా 74-వ పుటలో "భారతీ! ఇకముందు........." అన్నమాటలనుండి ప్రకరణము తుదివరకు పరీక్షించవలెను.

ఈకారణములవల్ల గ్రంథకర్త కథనమునకై శ్రద్ధ తీసుకొనలేదని చెప్పిన విన్నపవాక్యములో ధ్వని ఉన్నదా అని స్ఫురించింది. ఏది ఏలాగైనా కథాకథనమునకు చూపినశ్రద్ధకంటె భావములవర్ణనలకు ఎక్కువశ్రద్ధ చూపెనని మనము భావించవచ్చును. ఒకొక్కచోట భావములఉద్రేకము తీవ్రమై ఆమధ్య కథాంశము ఒక్కొక్కటిచెప్పుట తటస్థించింది. ఇందుకు నిదర్శనముగా పదోప్రకరణము చదువవచ్చును. సాధారణముగా ప్రతీప్రకరణము ప్రారంభాన రెండుమూడుపత్రములలో ఏమేమో భావములు, ఊహలు, కల్పనలు, భావనలు కుప్పలు కుప్పలుగా చేర్చి, తరువాత కథనుచెప్పుట కవి యొక్కపద్ధతి. ఆలాగు ఒకఘట్టమునుండి వేరొకఘట్టమునకు తంతులువేస్తూ భావముల వర్ణనలమధ్య, సంభాషణలమధ్య కథ నడుస్తూఉంటుంది. కాబట్టే కథకు శ్రద్ధ తక్కువైందని చెప్పవచ్చును. ఆలాగని కథలేదనికాని, కథ ఒకమిషఅనికాని నేను చెప్పను. కథ చెప్పుటకు అవలంబించిన పద్ధతిలో కొంతలోపము, కొంతఅసాధారణతకూడా ఉండుట సంభవించింది.

ఏలాగైనా పాత్రలశీలము పాత్రలహృదయము విప్పివర్ణించుటకు కవి ప్రయత్నించుట నిజము. పాత్రల ఆలోచనలు, ఆదర్శములు, ఊహలు, కల్పనలు, తెలియజేసి వీటిద్వారా సంఘముయొక్క దుస్థితిని ప్రకటించుటకు కూడా కవి ప్రయత్నించినట్లు కనబడుతుంది. బాల్యవివాహములపైని వ్యక్తి స్వాతంత్ర్య నిరోధనముపైని ప్రేమరహితవివాహసంప్రదాయముపైని గ్రంథకర్త చేయింపించిన గంభీరోపన్యాసములు చూస్తే గ్రంథమునకు ముఖ్యప్రయోజనము సాంఘికాదర్శమునొకదానిని నిరూపించుట అని చెప్ప సాహసిస్తాము. మంచిజ్ఞానము సంపాదించి, మంచిచెడ్డలభేదము తెలుసుకొని, ప్రేమయొక్క ఆవిర్భావము అనుభవించి, గాంధర్వమున వివాహమాడుట ఒకఆదర్శముగా కవిచూపించెనా అని తోస్తుంది. ఇందుకు భారతి దుర్గాంబల నిద్దరినీ అన్వయవ్యతిరేకోదాహరణములుగా కవి పొందుపరచెననిన్నీ చెప్పవచ్చును. ఈరెండింటిలో భారతి వివాహమే ఆదర్శముగా చెప్పుట నాకూ ఇష్టము. కాని ఈలాగు చెప్పకుండా ఇందుకు ప్రతిపక్షముగా దుర్గ వివాహమే ఆదర్శమనిన్నీ, సంఘసంప్రదాయములు ఉల్లంఘించి ప్రవర్తిస్తే విఘాతము సంభవిస్తుందనిన్నీ సంఘశక్తికి విరోధముగా వ్యక్తిస్వాతంత్ర్యమును ఉపయోగించకూడదనిన్నీ చూపించుటకై కథ ఉపకరిస్తుందని ఏలచెప్పకూడదో! ఏకారణమువల్లనైతే ఏమి ఒక కన్యను పెండ్లాడి దానిని ఏలుకోకుండా ఎదిగిన ఒకపిల్లను చూచి మోహపడ్డపడుచువాళ్లందరూ భాస్కరుడుమాదిరిగానే భ్రష్టులవుదురనిన్నీ సంప్రదాయములను పడగొట్టుటకు భీష్మించేవారందరూ మాధవరావువలె మోసపోదురనిన్నీ ఈకథ బోధపరుస్తుందని చెప్పే ప్రతిపక్షసమన్వయమును ఖండించుటెట్లు అని నాకూ తోస్తున్నది. కథచూస్తే ఈలాగున్నది. పోనీ గ్రంథములో

ఉన్న ఉపన్యాసాలనుపట్టి తర్కిస్తామంటే ఉపన్యాసాలన్నీ ఒక్కవిధముగానే లేవు. పాత్రలందరూ సంస్కారప్రియులే కారు. వారందరిశీలమూ ఒక్కరీతిదే కాదు. మాధవుడు సంస్కారములగురించి ఉపన్యసిస్తే, భాస్కరుడు వ్యక్తిత్వముగురించి ఉపన్యసిస్తే, సీతారాముడు సంప్రదాయములగురించినీ, సంఘశక్తిగురించినీ ఉపన్యసిస్తాడు. ఇందులో వేటిని మనము ఆదరించాలి అని అడగవచ్చునుకదా! అందుచేత ఈ ప్రతిపక్షసమన్వయము సిద్ధిశేప్సు అని నిర్లక్ష్యముగా అనలేమని నామనవి.

సంఘమునకు ఒక ఆదర్శమును బోధపరచుటకే గ్రంథము వ్రాశారని చెప్తే కుదరదు కాని మానవహృదయమును విశదీకరించుటకు అని చెప్పేటప్పుడు ఈ ఇబ్బంది ఉండేదు. మానవహృదయమున కొక ఆదర్శముగా గాక మానవహృదయస్థితినే వర్ణిస్తే నానాత్వము సంభవమవుతుంది. అలాగు సాంఘికాదర్శము చెప్పకుండా సంఘస్థితివర్ణనే చెప్తే నానాత్వము సంభవమే అవుతుంది కాని నవలలో సంఘస్థితివర్ణన ఉన్నదని చెప్పుటకంటె మానవహృదయవర్ణన ఉన్నదని చెప్పుట ఎక్కువ సమంజసము. భాస్కరుడెట్లు భావించేవాడో, ఎట్లు పరితపించేవాడో చక్కగా వ్యక్తమవుతుంది. ఒకప్పుడు మహాశక్తిసంపన్నుడువలె విజృంభిస్తూ విర్రవీగుతాడు; ఒకప్పుడు చాలా చిన్నవిషయములకు లొంగిపోయిన పిరికివలె కుంగిపోతూ ఉంటాడు; ఒకప్పుడు తనగుణములచే చదువరుల నాకర్షిస్తాడు; ఒకప్పుడు తనహృదయమును ఆవరించుకొనియున్న పశుగుణములచే చదువరులకు శోకము కలుగజేస్తాడు. ఇట్లు విరుద్ధమార్గముల పరుగెత్తేహృదయమును వ్యక్తపరచుటకే భాస్కరుడు నిర్మింపబడ్డాడు. అలాగే పాత్రలందరూ వారివారి హృదయమును వ్యక్తపరుస్తారు. ఉన్నవాళ్లు భాస్కరుడంత సమ్మిశ్రితస్వభావముకలవారు కాకపోవుటచేత, భాస్కరునిభాగములో ఉన్నంతస్వభావవ్యక్తీకరణము భారతిసీతారాముల భాగములలో కానరాకపోవచ్చును.

శ్లీవిషయములో ప్రవర్తనసూత్రములు ఎక్కువస్పష్టముగా కనిపిస్తవి. భారతి చరిత్రలో స్వయంవరణాచారము సీతారామునిచరిత్రలో భాస్కరునివెదుకుట వారి ప్రవర్తనలకు ప్రయోజనములుగా కనిపించును. కాని ఆప్రకరణాలలోకూడా మధ్యమధ్య వారివారిఅభిప్రాయాలు పొంగుతూ ఉంటవి. సీతారాముడు కేవలము భాస్కరునివెదుకుటకే ఉపచరించలేదని తెలియజేయుటకు కాబోలు శ్యామలావృత్తాంతమును కవి కల్పించెనని నేను ఊహిస్తాను. నవలకథతో సాక్షాత్తుగ సంబంధములేని ఈఅనుబంధకథను కల్పించుటకు ప్రయోజనమేమైయుండునంటే సీతారాముని హృదయనిరూపణకు అవకాశము కల్పించుకొనుటకేమో అని నేను ఊహిస్తాను.

పాత్రలభావము లన్నిటిలోను ఎక్కువవ్యాపకమైనది ప్రేమగానేను అభిప్రాయపడుతున్నాను. ప్రేమతత్త్వమును నిరూపించుటకు నవల ఉపయోగిస్తుందని కూడా చెప్పగలము. భారతి దుర్గాంబ శ్యామలలు ముగ్గురియెడల భాస్కరుడు చూపిన ప్రేమమోహములనూ, అలాగే ఆముగ్గరూ భాస్కరునియెడల చూపిన భావములను కవి వర్ణించియున్నాడు. కేవల ప్రాకృతమోహము ఒకరిలోను ధర్మప్రబోధకమైన నిర్మలప్రేమ ఒకరిలోను స్వచ్ఛమైన సాంసారికప్రేమ ఒకరిలోను, పశుతుల్యమైన బంధకరూపప్రేమ ఒకరిలోను, నియమరహితమై వర్తిల్లినప్రేమ ఒకరిలోను, ఇట్లు నానావిధప్రేమమార్గములను కవి వర్ణించియుండుటచేత ప్రేమతత్త్వనిరూపణ గ్రంథప్రయోజనముగా కవి భావించినాడా అని తోచింది. ఈఈసందర్భములలో ప్రేమ అనగా ఎట్టిదో కవి వ్యాఖ్యానముకూడా చేసియుండెను. (మా. పుట 177.)

నిర్మలప్రేమ సంబద్ధవివాహము, వ్యక్తిస్వాతంత్ర్యము, సాంఘికనిరోధము, దేశాభిమానము, ఆంధ్రత్వాభినివేశము ఈమొదలైన కొన్ని సమస్యలచర్చలు కవి కల్పించుకొనెను. పాశ్చాత్యులఆచారములు మనకు సరిపడునా, వర్ణాంతరవివాహములు అంగీకార్యమా, పాశ్చాత్యులవిజ్ఞానము సంపాదించవలెనా అనే కొన్ని కొన్నిప్రశ్నలకు జవాబులుకూడా ఉన్నవి. ఇవి కథకుగాని పాత్రలశీలమునకుగాని ఆవశ్యకములు కానందున వాటిచర్చ అప్రస్తుతము. ఇట్టిసమస్యలుగాకాకున్నా, చిన్నచిన్నతునకలుగా కొన్నిఅంశములు మధ్యమధ్య

వస్తూఉంటవి. కాఫీహోటేలు వర్ణన, పిస్తూలీలతో పోట్లాట, గోదావరీప్రవాహప్రళయము ఈమొదలైనవి కధకు అవసరములు కావు. ఇవి చదువరులలో నవ్వు పుట్టించుటకుగాని చదివేటప్పుడు ఇంపుగాఉండుటకు గాని, చదువరుల నాకర్షించుటకుగాని ఉపచరించవచ్చును. కాని ఇవి సంభవములుకానివి కాబట్టి, సాంఘిక నవలలో అత్తియుండవు. సంభవములుగా తోచనివి ఇంకా ఎన్నో చిన్నచిన్నవి కొన్నిసంగతు లున్నవి. మాధవునిఇంట్లో ఎవరికీ భాస్కరునిచర్య వింతగా ఎందుకు తోచలేదు? భారతికూడా ఎందుకు ఈవిషయమై ఎవరితోనూ ముచ్చటించలేదు! భాస్కరునిపూర్వపు చరిత్ర తెలుసుకొనుటకు ఏమాత్రమూ ఎవరూ ఎందుకు ప్రయత్నించలేదు? రంగమ్మకు తెలిసినతరువాత ఎవరితోనూ ఎందుకుచెప్పలేదు? వెంకట్రావు మాధవరావుగారిఇంట్లో అతిథిగా ఉండినీ్న దుర్గవిషయమై మాధవరావుగారితో ఏలసంప్రతించలేదు. కృష్ణమూర్తిగారి ఉత్తరము వచ్చినతరువాత మాధవరావుచేసినపని ఏమిటి? ఇట్టివి ఇంకా కొన్నిఉన్నవి. వీటినిగురించి చర్చించుటవలన గ్రంథము పెరుగునని విరమిస్తున్నాను. సమాధానము వీటికి చెప్పరని నాఅభిప్రాయము కాదు; కాని అవన్నీ సమాధానములే అవుతవి.

గ్రంథమంతటిలోను భాస్కరుడు నన్నుచాలా ఆకర్షించాడు. ఉన్నపాత్రలవలె భాస్కరుడు ఒక నియమమునకు తనజీవితమును అర్పించుకొనలేదు. నిర్మలమైన మాధవరావుగారి గౌరవాతిథ్యమునకున్నూ, స్వచ్ఛమైన సీతారాముని స్నేహమునకున్నూ, దివ్యమైన భారతిప్రేమకున్నూ పాత్రుడైన భాస్కరుడు ఏఒక నియమమునూ ఆదర్శమునూ కల్పించుకొని తనజీవితమును నిర్బంధించుకొలేదని చెప్పితే వింతగా తోచవచ్చును. ఈస్వభావములోనే వానిఆకర్షణశక్తియున్నది. భాస్కరుని ప్రవర్తనఅంతా నీతియుక్తము కాకపోవచ్చు. విమర్శకుల నిందలకు పాత్రుడు కావచ్చు. కాని గాతిగట్టుదాటి పొంగిపైబడుతూ ఉండే నిర్మలనిర్ఝరవారిని భూమిలోనికి ఇంకింప ప్రయత్నించేనియమము లేవీ భాస్కరుడు ఎరుగడు. తనహృదయమందు నిష్కపటముగా ఉద్భవించే వాంఛలకు నియమ మని నిరోధము కల్పించక జీవితము నడిపే స్వభావముకలవాడు. భాస్కరునికి ప్రకృతియే ప్రమాణము. మంచిచెడ్డలు ఎరుగనివాడు కాడు; ఎరిగినీ్న వాటిభేదమును ప్రవర్తనయందు చూపనందుకు మనకు ఆగ్రహము కలుగవచ్చు. కాని కపటీ, దొంగాకాడు. స్వతంత్రుడూ అస్వతంత్రుడూ కూడా. ఇట్టివ్యక్తిని సృజించి ధైర్యముగా నవలలో వర్ణించిన కవిని మనము మెచ్చుకొనవచ్చును.

భాస్కరుని హృదయమువలెనే కవిభావకూడా ఉందని చెప్పితే క్షమించవలెను. కొండఎక్కేవాడు అనుభవించే ఎత్తుపల్లములవలె ఈనవలలోని శైలి చదివే వారికి కనబడుతుంది. పెద్దపెద్ద సంస్కృతసమాసములనే అత్యున్నత శిఖరములు ఎక్కి అక్కడనుండి సామాన్యమైన గ్రామ్యమనే అగాధనిమ్నదేశములకు దిగే వాని అనుభవము నవలచదువుతూఉంటే కలుగుతూ ఉంటుంది. తీవ్రమైన సంస్కృతము, ప్రబంధముల శైలి, గంభీరోపన్యాసములఫక్కి, పచ్చిగ్రామ్యము చక్కని కవితాధార-వీటివల్లకలిగే భాషాసంక్షోభము భాస్కరునిహృదయసంక్షోభమునకు బాహ్యచిహ్నాలని నాకు తోచింది.



# హనుమంతుఁడు—మైనాకుఁడు

మండలేముల వేంకట శాస్త్రి గారు

సీతాన్వేషణపరుఁడై, వాతాత్మజుఁ డాకసమున బరతెంచునెడన్
ప్రీతిమెయిన్ మైనాకుం, డాతనిఁగని యిట్లుపలికె నతికుతుకమునన్.

చ. వనచరలోకనాయక! యవార్యపరాక్రమశాలి వౌట ని
వ్వనధి నతిక్రమింప నిటువచ్చితిగాక మహాత్ము లెవ్వ రీ
పని నొనరింపఁజాలరు కృపామతి నా శిఖరమ్ములందు నొ
క్కనిమిస మాగి యేగుము సుఖమ్మునఁ గార్యము సిద్ధిబొందెడిన్.

చ. అగణిత బాహువిక్రమ సమగ్రయశోనుతవైభవుం డనన్
జగతిఁ బ్రసిద్ధినొంది దివిజస్తుతలీలఁ దనర్చె నెవ్వఁ డా
సగరునిపేర నొప్పినది సాగర మాతని వంశదీపకుం
డగు రఘుపుంగవుం డనిచినట్టి మహాత్ముఁడ వీవుగావునన్.

క. కృతమునకు మారుగా నుపకృతి సలుపుట యార్యజనవిహితధర్మము నేఁ
డతిభక్తి సాగరుఁడు ని, న్నతిథిన్ శ్రీరాము దూత నర్చించు నిటన్.

క. శరణార్థినైన నాయెడఁ, గరుణాపరుఁ డగుచు మున్ను గాపాడిన సా
గరు మేలుఁ దలఁచి నేఁ, డిత్తెఱఁగున నినుఁ గొల్వ నరుగుదెంచితి ననఘా!

ఉ. పావనమూర్తియైన రఘువల్లభుఁ డంపఁగ బ్రహ్మచర్య దీ
క్షావిభవమ్మునన్ వినుతిఁ గాంచిననీ విటులేగుచుండ నేఁ
డీవనరాశి నిన్ను భజియించుట చోద్యమె? పావనీ! సుహృ
ద్భావము మీఱ మత్కృతసపర్యలఁ గైకొని విశ్రమింపుమీ.

గీ. "చంద్రునికి నూలుపోగ"న్న సామెతగను, పరువమును మధురిమయును పరిమళమును
మించు ఫలమూలతతుల నర్పించి నిన్ను, నాకొలందిని బూజించు నోకపీంద్ర!

ఉ. అంతియకాక సద్గుణగణాఢ్యు బలాఢ్యు నితాంత నిర్మల
స్వాంతుఁ బ్రశాంతుఁ దాంతు విలసన్మతిమంతు మహాత్ము నిన్ను న
ర్చింతునటంచు నెమ్మదిఁ బొరింబొరి నున్నది గావునన్ హనూ
మంత! ప్రభుత్వవంత! నను మన్ననచేసి యనుగ్రహింపవే!

క. నినుఁ బూజించినచో న,య్యనఘుఁడు మీ జనకుఁ డనిలుఁ డర్చితుఁ డగుఁ గా
వున నాయర్చనములఁ గొను, మనఘా! వివరింతు దీన నగుగారణమున్.

క. కృతయుగిమునఁ బూర్వము ప,ర్వతరాజము లెల్లఁ బక్షవంతములై ది
క్తతులెల్లన్ వాయుమనో,గతులం గ్రుమ్మరుచునుండె గపికులతిలకా!

చ. గరుడసమీరవేగమున క్ష్మాధరవర్గము లాకసమ్మునం
దరుదుగ సంచరించుచు భయంకరలీలఁ దనర్చుచుండ భూ
ధరములు నేలరాలు నని తాపసకోటియు దేవబృందముల్
ధరఁగల భూతజాలమును దైన్యమునన్ భయమొందె నెంతయున్.

ఉ. ఆవిధమున్ గనుంగొని భయాకులమానసులైన ప్రాణులున్
దేవతలున్ దపోధనులు దీనతివాసి ముదమ్ము నొంది సం
భావన సేయుచుండ సురవల్లభుఁ డంతట వజ్రమూని శై
లావళి పక్షయుగ్మముల నచ్చటనచ్చటఁ ద్రుంచె నుగ్రతన్.

క. ననుఁ గని క్రోధోద్దీపితుఁ, డనిమిషపతి వజ్రమూని యదలింప భవ
జ్జనకుఁడు గరుణాపరుఁడై, నను వననిధిఁ జేర్చి రక్షణ మ్మొనరించెన్.

ఉ. ఆయెడ నన్నుఁగాచిన మహాత్ముని పుత్త్రుఁడవౌటఁ జేసి ని
న్నీయెడ నేను గొల్చు టిది యెంతయు యుక్తముకాదె? సాగరుం
డా యినవంశసంభవున కట్లు కృతజ్ఞుఁడు గాఁడె? కావునన్
మా యొనరించు నీ యతిథి మన్నన లంది యనుగ్రహింపవే?

చ. అన విని వాయుసూనుఁడు "మహాత్ములు మీ రొనరించునట్టి య
ర్చనములకేఁ గృతజ్ఞుఁడ గరమ్ము ముదమ్మును బొందె నెమ్మన"
మ్మని తపనీయశైలశిఖరాగ్రము నల్లనఁ గేల నంటి రి
వ్వున గగనంబునం జెగసిపోయె నిశాచరువీటిదిక్కునన్.

సంపూర్ణము



# జడకుచ్చులు

నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు, బి. ఏ., [సారస్వతసమాజము]

జడకుచ్చులను రచించినది రాయప్రోలు సుబ్బారావుగారు. వీరి నామ మాంధ్రులకు చిరపరిచితమైనది. ప్రబంధములపలుకుబడి పూర్తిగా సన్నగిల్లకపూర్వము, అష్టావధానశతావధానములపై సభిలాష మెండుగా నున్నకాలమున ననుశ్రుతముగ వచ్చుచున్న తెనుగుకవిత్వముయొక్క రీతులను విసర్జించి, ఆంగ్లకవుల భావోద్రేకమును, పోతనాదుల భాషామాధుర్యమును, వంగీయుల మర్మమును, మిళితముచేసి రసికులకు హృదయానందము నొడగూర్చిన భావకవులలో సుబ్బారావు ముఖ్యుడు. ఇతని పూర్వకృతులు తెనుగుతోట, కష్టకమల, స్నేహలత మొదలగు చిన్నకావ్యములు. ఇతని రచనాసామర్థ్యమును, భావోద్రేకమును, భాషామాధుర్యమును బూర్ణముగ జాటుచున్నవి.

రచనావిధానమున జూపిన స్వాతంత్ర్యమునే సుబ్బారావు గ్రంథమునకు బేరిడుటయందును జూపెను. ఆయన అప్పుడప్పుడు రచించి ప్రచురించిన భావగీతముల నేరి యీగ్రంథమునందు జేర్చెను. అట్టి దీనికి జడకుచ్చులని పేరిడెను. ఆశబ్దమునకును పుస్తకమునందలి వస్తువులకు నెట్టిసంబంధమును లేదు. గ్రంథమునందలి విషయమును గొంతవరకు దెలియబరచునామమును బుస్తకమున కిడుట మనయాచారము. కాని యిది యట్టిదికాదు. దానియర్థము చదువరికి వ్యక్తమగుటకు గాను

కం. పాయలుపాయలుగా విడి
పోయిననా తెనుగుకన్నె ముంగురులకు నే
డీయోగ్యాభరణముగా
నీయెడ జడకుచ్చు లిడి యిచ్చితి బ్రీతిన్"

అని ప్రథమముననే చెప్పెను. పద్యము సరసముగ నున్నది. కాని ముంగురులకు వేణి యేమియని కొందరు నన్ను ప్రశ్నించినారు. ఈయాచారము మనయందింక నక్కడక్కడ నున్నది. చిన్నపిల్లలకు ముందు జడకుచ్చులు పెట్టి జడవేసి పూవులుంచుదురు. భారతయుద్ధమునకు సన్నద్ధులగుచున్న వీరవ్రాతమును జూడవచ్చిన దేవాంగనలు అలకలవిరులతో నొప్పుచుండిరని తిక్కన నుడువుట చూడ మనదేశమున పెద్దవారుకూడ ముంగురులలో కుచ్చులను, పుష్పములను నుంచుచుండెడివారని తేలును.

"తురగఖురోద్ధూత ధూళియప్సరసల
యలకపువ్వులతోడ జెలిమిసేయ"
(భారతము)

వర్షర్తువను శీర్షిక క్రింద వ్రాసిన పద్యమునందు మేఘములగూర్చి

"ఆకాశంబున జీరుకాడె సొగసై
ఆషాఢయోషానితం
బాకీర్ణాలక జాలకంబులన..............."

అని వ్రాసెను. 'అలకజాలకము'లు 'నితంబాకీర్ణము'లగుట సంభవమా? కనుక అలకశబ్దమును కేశవాచకముగా వాడెనా యనుసందేహము పొడమును. అట్లయినచో శబ్దార్థము పొరబాటయినను పైప్రశ్నకు తావుండదు.

పాశ్చాత్యకళాభ్యాసమునకు ఫలితముగ ప్రాచ్యకళానిరసనమునకు బాల్పడి 'రెంటికిని చెడిన రేవడ' కాడు సుబ్బారావు. ప్రాచీనులకార్యములన్నను, ఆచారములన్నను, ఇతనికి ప్రీతి మెండు. అట్టియుదారహృదయ ముండుటచేతనే నేటివిద్యార్థులకు గోచరింపని యందములు కొన్ని తెనుగువారి నిత్యజీవనవిధానమునందు అతనికి గోచరించుచున్నవి. వానిని మనహృదయమునకు దట్టినట్టులు చెప్పుటలో నితనికున్న ప్రజ్ఞ చూడవలెను.

ఏపూర్వపుణ్యమో యేయోగబలమొ
జన్మించినాడ వీస్వర్గలోకమున
ఏమంచిపూవులఁ బ్రేమించినావొ
నినుమోచె నీతల్లి కనకగర్భమున.

అని తాను భరతదేశమునందు జన్మించినందుకు దన్ను దా నభినందించుకొని

"శ్రీలుపొంగిన జీవగడ్డయి
పాలుపారిన భాగ్యసీమయి
వ్రాలినది యీభరతవర్షము
భక్తి పాడర తమ్ముడా!"

అనుచు మాతృసంకీర్తనము చేసినాడు. మాతృదేశాన్నత్య మీతనికట్టెదుట నంతయున్నతముగ నిలుచుట చేతనే

"అనమాన మేలరా అనుమాన మేల
భరతపుత్రుఁడనంచు భక్తితో బలుక?"

అని యెలుగెత్తి పలికినాడు. ఈగౌరవభక్తి విశ్వాసములే 'ఆచారత్రయ' మను పద్యచతుష్టయమునందును గోచరించును.

సుబ్బారావు 'భావకవు'లని నుడివితిని. భావకవి, భావకవిత్వము ననుపదము లపార్థమునకును దూషణమునకును గురియగుటచే నాపదముల నుపయోగించుటకు బూర్వము వానియర్థమును సూక్ష్మముగ జెప్పెదను. భావకవిత్వమన నిదియొకటి మాత్రమే భావముగల కవితయనియు, నందుమూలమున దదితరములు భావశూన్యములని ధ్వనించుచున్నదనియు జెప్పుచు కొందఱు పండితు లభిప్రాయపడినారు. అది నాయుద్దేశము కాదు. ఇది ఇంగ్లీషునందలి 'లిరిక్సు' అనుదానికి పర్యాయపదము. ఈలిరిక్కులు ఖండకావ్యములు. ఇందు కవి తనమనస్సునందు తాత్కాలికముగ నుదయించిన యొకభావమును మాత్రము తనచుట్టుపట్లనున్న ప్రకృతితో సమన్వయపరచి పలుకును. అట్లు ఏకభావ ప్రకటనము మాత్రమే ఈఖండకావ్యముయొక్క యుద్దేశము. కావ్యమునందువలె పాత్రపోషణ మొదలగు వివిధాశయము లిందు మరుగుపడియున్నవి. ఇట్లు ఒకేభావమునకు ప్రాముఖ్య మీయంబడుటచే నీతరగతి కవిత్వమునకు భావకవిత్వమనియు, నీకవులకు భావకవులనియు వ్యవహారమునందు వచ్చినది. ఈపదములయర్థ మసమగ్రమైనచో సమగ్రపదనిర్మాణమును బుధులు చేయుదురుగాక!

భావకవిత్వమునకు పరవశత ముఖ్యలక్షణము. ఈయన భావకవి. కాని ఇతనిది 'ఒళ్లుతెలియనిశివ' కాదు. పరవశమున మొలకలెత్తిన భావాంకురములను మనసులో బ్రోదిచేసి పెంచి ననకమొలుకునట్లు చేసి సరసరచనలలో వెలిపుచ్చువానివలె కనుపించును. ఇతని కవికవిత్వమునం దక్కడక్కడ మర్త్యకవితాచ్ఛాయలు కన్పించుచున్నను ఇందలికుచ్చులు చాలవరకు దేటగానున్నవి. 'ప్రవాసరాధిక' ఇట్టివానికి ప్రశస్తమగు ఉదాహరణము. అందుగల ఆరుపద్యములును ఆరువజ్రముల వంటివి. వానియందలి భావములును, భావమయును పుష్పము దానియొక్క సౌందర్యమువలె నద్వైతభావమున విలసిల్లుచున్నవి. ఒకదానినుండి రెండవదానిని విడదీసి యిది యిట్టిది యది యట్టిదని చెప్పుటకు నలవుపడకయున్నది. చూడుడు:

"కడలఁగాల్నడసేగుత్రోవరుల నై
గల్గానగా రావు, చే
పెడుపాలిండ్లరుచు ల్మరు ల్గొలుప గో
బృందమ్ము పోలేదు, పెం
పుడు లేళ్లైన కదంబకుంజముల దా
పుండేర వీసంజరా
యిడి వీథీముఖమందు నెం డలసితో
యీ, ముగ్ధగోపాలకా!"

ఇటులే మేఘమునందలి

"ఎండినబీళ్లయందు నుద
యించిన పచ్చికకండ్లపండువై
యుండగ మాడియూలు తల
లూపుచు బోయెడి క్రొత్తనీటచే
నిండె దటాకగర్భములు,
నిష్కుటముల్ కదుశ్యామలంబులై
మెండుకొనె న్వనిఁ, మొగిలు
మేసె ప్రభాతములందుఁ గొండలఁ."

అనుపద్యము నింపుగ నున్నది.

'కోయిల' కూడ నిట్టులనే నగుచు సొంపయి యున్నది.

"పారలుపగలని బిసవుల్లావిరులసరణి
బాలభావల పగిది నవ్యక్తసూక్ష
రీతులకి సారళ్యసంక్రాంతిభగయు
గ్రుమ్మరించెదు..........."

కోయిలయొక్క గీతి విని

"పవనమును దియ్యగించి మార్దవము పెంచి
వనవనంబున గసమును మొలవరించి
చిత్రకులపను కవులకుజ్జీవమును ల
గించు..............."

సప్రయత్నముగ కవి దీనిని పాడినట్లు కాన్పించదు.

'ప్రాణంపుసుధాకణంబు'గు నాపాట వినినపుడు కవిహృదయమున ననేకములగు తలపు లుద్భవించెను.

"తగులపుందీపియును, బిడ్డమొగము పైడల
తెగనికాంక్షయు స్వార్థవృత్తినిరతియు, త్య
జించి తనదేశమాత సేవింపవీరు
డెవని మరచితివో నచింతువు పికంబ!"

అనియు

"ముత్తెపుటశ్రువుల్ నయన
　　　ముద్దిగజారగ మాటరాని డ
గ్గుత్తికతోడ నంపకపు
　　　గూతుగవుంగిటం బాయలేని యే
మొత్తనితల్లికన్న చెలి
　　　మిక్కమనురంగుగం గీరితింతువో"

అనియు

"సెలవినురువులతోడ పచ్చికలు రాల్చి
నిలువంబడుమోములను సాచి సెమలుమూచి
పాడియావులు నీముద్దు పాటవినుచు
నెదియొ పరమార్థ మందుల నొందవుననుచు"

తనభావములను కవి మనోహరముగ వెలిపుచ్చెను.

పైనుదహరించినపద్యములను జదివినవెనుక నితని పద్యముల కింతప్రచార ముండుటకు గలకారణమును మన మరయవచ్చును. ఇందు భావమధురిమయేకాక భాషామాధుర్యముకూడ లెస్సగా గలదు. భావభరితులై భాషాసారళ్యమున గొరవడినవారు మనలో చాలమంది కలరు. కవితకు భావము ప్రాణము. అది రాణించుటకు నలయుభూషణములలో భాష ముఖ్యమైనది. భావమునకు దగినభాష యలవడినపుడే కవిత రాణించును. ఇటిని భాష యట్టిది. మనకవులు కవితలో నుపయోగింపవలసినమాటలకును వచనమునం దుపయోగించవలసిన మాటలకును భేదము నంతగా నేర్పరచియుండలేరు. కవితయందున్న భావములకును, గాంభీర్యమునకును, నడకకును తగినమాటలుమాత్రమే యుపయోగించవలెనను నియమము కూడలేదు. ఆధునికులకైతేని దీక్షతో బరిశీలించినచో వారియందు బ్రయత్నముగనో అప్రయత్నముగనో యీవిషయము వెల్లడియగును. అటులు 'కవితాశయ్య' నుపయోగించినవారికి దారిచూపినది సుబ్బారావు. అందుచేతనే ఇతనికవిత్వమున నవత్వము మొలకలెత్తుచుండును. 'ఉరుమురుమునకు నంకురమగు వేణువు మొలకలవలె' ప్రతిపదమునందు నానందము చిప్పిలుచుండును. చూడుడు—

"హేమపాత్రల చందన మెండిపోయె
ద్వారములు వ్రేలాయుచున్నవి హారములను
సానలం దింకె స్నానకషాయగంధ
మబల ఎవనికోసము నగ మయి కృశింతు.

నెక్కుచెదరని పాపట చిక్కువడియె
వేణిబంధంబు శిథిలమై పిరుదులంటె
కరగిచెరగిన తిలకరేఖలను దుడువ
వతిన! యెవ డాహరించె నీయార్ద్రహృదిని.
పాలుపొంగినగతి పొంగు ప్రణయరక్తి
నాపుకొనలేని పడుచు ప్రాయంబుతోడ
నమ్మి యెవనికి నీమన మమ్మికొంటివి
వువిద ! యీ మేఘమాస నవోదయముల."

సుబ్బారావు వ్యక్తిత్వము కవితాశయ్యయందు మాత్రమే కాక భావమును స్ఫురింపజేయునట్టి పదప్రయోగమునందు గూడ కన్పించుచున్నది. ఒక మాటను ప్రయోగించి దానిమూలమున ననేకభావముల సమ్మేళన మొనర్చి తా నేమిచెప్పదలచెనో యేమిచెప్పుచుండెనో మనకు దెలియనీయక యొకయనిర్వాచ్యానందప్రపంచమున విహరించు కవులలో నితడొకడు.

'ఎండినబీళ్లయందు'ని పైనుదహరించిన పద్యమునందలి 'చూడిదూడలు' అనుపదమును

"నింగి బాలెంతనడికట్టు కొంగు లనగ
జారు నతసీపయోదప్రసన్నరేఖ

*      *      *      *

పత్రవస్త్రాపహరణ పాపంబు కతన
చిన్నపోయిన కొమ్మల సిగలమీద

*      *      *      *

మినమినలాడుచు కొన్నరుగు మీగడ తెప్పలు
తేలుచుండ

*      *      *      *

పాడేటిరాటాల పాలుతీసిన కీతి
సన్నదారముదీయు జాణతనము"

అనువానియందలి పదములు నట్టివి.

ఆంధ్రసారస్వతమున బ్రహ్మయుగము స్వతంత్రతతో గూడిన యాంధ్రీకరణము అనగా ఆకాలపు కవుల గ్రంథములకు మాతృకలు సంస్కృతమునం దుండెను. కాని వారు మూలమునం దున్నదున్నటుల వ్రాయక స్వతంత్రించి కొన్నిమార్పులు తెచ్చిరి. రెండవది ప్రబంధయుగము. ఈరెంటియందును గూడ కవులేరిన యితివృత్తములు సామాన్యుల జీవితమునుండి గ్రహింపబడినవి కావు. తెనుగువారి అనుదినజీవితమునందు గవిత నుత్తేజింపజేయగల యంశము లున్నవి. పూర్వులది గ్రహించలేదు. [రుద్రకవియొక్క నిరంకుశోపాఖ్యానము మాత్రమిందు మినహా.] తిరుపతి వేంకటకవుల 'శ్రవణానంద' రచనాకాలము నుండియు పూర్వపుటభిప్రాయములు మారినవి. ఇటీనికివిషయములయం దది పుష్పించినది. జడకుచ్చులందలి 'సంసారము', 'ఎనరు' మొదలైనవి అట్టివే. ఆంగ్లకవియగు వర్డ్సువర్తు వచించినటుల సామాన్యుల జీవితమునందలి సుఖదుఃఖములు కవులు గ్రహింప దగినవై యున్నవి. అవి శ్రుతికి సమ్మేళనము చేయబడిన వీణయొక్క తంత్రుల వంటివి. కవి దానిని మేళగించి మీటినచో ఆనందామృత మొలుకును. దానియథార్థమును మన తెలుగుకవులలో నితడొకడు.

ఈతనిగుణవర్ణనముం జేయుటకు గాని నేను చెప్పదలచిన సంగతి యొకటిమాత్రము మిగిలియున్నది. ఇతను పదునైదుసంవత్సరములకు పైబడి రచించుచున్నను కవనల సంఖ్యయును, బరిమితియును జాలతక్కువగ నున్నవి. వీనినిబట్టి చూచినచో నితనికవితాసృష్టి మిక్కిలి విశాలముగ గన్పట్టదు. వర్తమానకాలము కవితారచనకు మిక్కిలి అనువైనది. ప్రాచీనాధునికనాగరికతలకు మహాసంఘర్షణ మేర్పడినది. మానవజాతియొక్క భావమునందు పరివర్తన మేర్పడి భావుకులహృదయసాగరము నల్లకల్లోలము చేయుచున్నది. మానవకోటియొక్క ఆశాదుఃఖముల భయంకరదీనారావములు గగనకుహరమున మారుమ్రోగుచున్నవి. ఈతరుణమున గవులవేణువు లూరకయుండనేరవు. కాని యితని కవి యేమియు వినిపించినటుల కనుపించదు. మిల్టనుమహాకవియొక్క గభీరవాణివలె సుబ్రహ్మణ్యవాణి సిద్ధమై మేల్కాంచి పలుకునో లేక మూకీభావము వహించునో చూడవలసియున్నది.






# భార్గవ ప్రతివచనము

అష్టావధాని బ్రహ్మరాజు జానకిరామ శర్మ గారు

పరమ పతివ్రతామణికి భర్తయనుజ్ఞను మించి సుంతయున్
జరుగఁగరాదు, పుత్రునకు సద్గుణరాశికిఁ దండ్రియాజ్ఞనున్
నెఱపఁగ ఘోరవహ్నియగునేన్ బడిపోవుట తప్పగాదు నీ
వెఱుఁగక యిట్టి యర్థము వచింతువె! నన్ జననీ నిహంతగన్.

చ. తలఁపున నన్యచింతనము దాటిచెనో తనయాజ్ఞ సేయకే
నిలిచెనొ యేమిచేసెనొ మునిప్రవరుండు సదేకదృష్టి సం
లలితుఁడు-తండ్రి-యోగికవిలాసుఁడు తల్లిని జంపుమన్న ను
జ్జ్వలిత తదీయవాక్య పరిపాలన శౌండత నుజ్జగింతునే!

చ. వనమున ముక్కు-మూసికొని వార్చు తపోధను శుష్క-కంఠమున్
వనతరుజీర్ణ కుట్మలనిభంబుగఁ ద్రుంచినఁ గేల విల్లుఁ బూ
నిన యెవఁడే సహించునె పునీతుని దుర్మరణంబుగూర్చు పా
పిని మఱి వాని వారలను బృథ్విని నిల్పిన ధర్మముండునే?

చ. అవనిని బ్రహ్మవిత్తమున హాలహలం బది తిన్నవానిఁ గా
క వినయతద్ధతాత్మతనుజాదిసమేతముగా హరించు ధే
నువునకు నాసఁజేసి యదనుంగని మౌనిని జంపినట్టి భూ
ధవు జననమ్ముచేఁ గలుషితమ్మగు వంశము భూమినిల్చునే?

చ. సముచితవాజపేయమగు ఛత్రమునీడ మెలంగినట్టి మ
స్తము నొకక్షత్త్రబంధుఁ డడిదంబునఁ గోయ నదల్చువేళ "హా
కొమరుఁడు రాఁడె?" యంచు జడి గొన్నకనుల్ దిశలందుఁ జేర్చుచున్
శమమును గన్నతండ్రిఁ గని క్షత్త్రియుఁ డోర్చునొ నేమొ! నెమ్మదిన్.

ఉ. రావణుఁ గాఱిఁద్రోచిన పరాక్రమధన్యుఁడు ధర్మమూర్తి నా
గ్నేవలకీర్తిఁ గన్న శ్రుతినిష్ఠుఁడు ధీరుఁడు శాస్త్రవీర్యుఁడే

భూవిబుధస్వసంగ్రహణ పూర్ణమనోరథుఁడైన ముష్కరుల్
త్రోవయు డొంక లేని నృపతు ల్గణనార్హు లె? ధర్మపద్ధతిన్.

ఉ. ఏలిక దిగ్వరాంశభవుఁడే యని పూజ లొనర్ప నర్ఘ్యపా
ద్యాలు గ్రహించి కమ్మగ నవామరధేను ఘృతాక్తశాక భ
క్ష్యాల భుజించి వేచనక కావలులై యట తిన్న యింటి వా
సాలను లెక్కపెట్టిన నిషాదులు రాజులె? గోద్విజాపహుల్.

ఉ. శాపము చాప మొక్కమొగి సాధనఁజేసితిఁ దుల్యపద్ధతిన్
మూపునను న్బలాశమును భూరినిషంగమును న్బరించితిన్
చూపును బ్రహ్మమందున నమూనశరాగ్రమునందు నిల్పితిన్
పాపమొ! పుణ్యమో! యెఱుఁగఁ బాసెను చీకటి లోన వెల్పలన్.

చ. కఱచితి విద్యలన్ బ్రశయకారుని సన్నిధిఁ గ్రౌంచభేదితో
నొఱయికగల్గ సర్వభువనోత్కర మాతృకరంబునన్ మధూ
కరమును దింటి విద్యల నఖండముగాఁ గయికొంటి నిట్టి దె
ప్పరమును జూచిసూచి సయిపంగలయోరిమి నాకుఁ గల్గునే?

ఉ. "హీనులఁ జంపు రామ" యని యిర్వదియొక్కటఁ జీరె తల్లి య
ద్దానిఁ దదాజ్ఞఁగాఁ దలను దాల్చి హరించితి గండ్రగొడ్డటన్
మానవనాథకంటకసమగ్రమహాతరుబాలవృక్ష దు
ష్కాననవాటిక న్బడి యఖండవిషాదము నన్ని మార్లుగన్.

చ. కలుగునుగాదె? చెట్టు చెడుకాలమునందునఁ గుక్కమూతి పిం
దెలటు కృతావసానమున నీచులు రాజులు గుక్కగొడ్గుల
ట్లలమికొనంగ ధాత్రి విమలావనినాథకులాంకురంబులన్
కలుపునుఁదీసి కాచితి సుఖంపడ గోద్విజసత్పతివ్రతల్.

చ. కొఱపడి యెట్టిప్రాణియును గొబ్బునఁ బ్రాణము వీడనేని యూ
పురుషుఁడు కాక గృధ్రముఖముంగని పిండము ముట్టరాఁడు త
ద్గురుతర కాంక్షితమ్ము నొడగూర్చుట ధర్మముగాదె? తండ్రికిన్
బరగతిఁగూర్పఁగాదె జననమ్ము తనూజున? కీ వెఱుంగవే!

మ. తనగోవు న్గొనినట్టి రాజు మృతి వృత్తంబెంచి తా వెచ్చనూ
ర్చినను న్మెచ్చని శాంతిమందిరుని దుశ్శీలత్వ మొప్పంగఁ ద

ధ్వనితాబాహులతావితాన పథమధ్యంబందె చెండాడిన
ట్టి నరేట్కీటకకోటిని న్బరశుత్రోటిఁ గీటడం జేయనే? (?)

ఉ. భాసురయోగమార్గమునఁ బ్రాణము వీడక యొక్కదుష్టు ఘో
రాసినిఁ జచ్చి శస్త్రమరణాఘమున న్బడి పోవు తండ్రి పెఁ
గాసినిఁ జూచుటో కరుడుగడ్డలనిల్పి నృపాస్రవాహినిఁ
వాసిఁబిత్ర్యాణము న్దొలఁగఁ బాచుటో మే లెఱుఁగంగఁ దెల్పుఁడీ!

చ. మునులని బ్రహ్మతేజులని భూరిశమాంచితులం చెఱుంగకే
కనులకుఁదట్టి రాజ్యబలగర్వము వారలసొత్తు వారికే
పనుపడకుండఁ జేయు నృపవర్గము నూడ్చితి నాతపంబొ? యొ
క్కని తపమేమి లెక్క? చెడుగాక! మదన్యులు మేలుఁ బొందరే!

సీ. పుట్టినాఁడను జగత్పూతాద్యయుగ శక్త్య,లఘు రేణుకాగర్భ రత్నపేటిఁ
బట్టినాఁడను లోకపాలనదీక్షోఘ్య, కమలలోచనధృత కార్ముకంబు
కట్టినాఁడను ధరా ఘనభారవారణ, కారణదారుణ కంకణమ్ము
ముట్టినాఁడను లయాద్భుతవీరరుద్రహ,స్తాగ్రకుఠారసాధ్యాయపరశు(?)
గీ. కొట్టినాఁడను రాజన్య ఘోరవనము, నిగురుపెట్టకయుండగ నిఱువదొంట
సర్వమష్థులకు నొసంగి చన్నవాఁడ, చెడ్డదో, మంచిదో నాదుజీవిత మిది.

సీ. అల శమంతక పంచకాస్రవాహినిలోనఁ, దడిపి కాషాయము దాల్చినాఁడ
అధికార సంగ్రహణార్థమై వచ్చిన, విలు దాశరథిచేతఁ బెట్టినాఁడ
అంబుదమాలికా చుంబిదక్షిణవార్ధి, వీచి గొడ్డలి పాఱవైచినాఁడ
శాంతమహేంద్రాద్రి సాన్వాశ్రమాగమ, చ్ఛాయల విశ్రాంతి సల్పువాఁడ
గీ. కదలక మెదలకయె యెట్లొ కాలమింక, గడుపనెంచిన నాప్రాఁత కథలు చెప్పి
పొడువఁబనియేమి? యింక మీ ముందుగల్గు, దెప్పరముదాటఁగలయట్టి తెఱువుఁగనుఁడు.






విశ్వనాథ సత్యనారాయణ గారు

[వెనుకటి సంచిక తరువాయి]

## ఉత్తరాంకము

### రంగము ౧

ప్రవేశము-సలీము (ఆసీనుడై)

ప్రొద్దెక్కిన కొలంది నెండలు మండిపోవు చున్నవి. వసంతకాలము వెనుకబట్టినది.

సేవకుడు (ప్రవేశించి)

జహాపనాహ్! తోటమాలీలు వచ్చిరి.

సలీము

రమ్మను.

(సేవకుడు నిష్క్రమించును. తోటమాలీలు ప్రవేశింతురు.)

సలీము

ఏమి విశేషము?

తోటమాలి

ప్రభూ! తమరు చెప్పినట్లుగా నా రెండు మామిడికొమ్మలను గలిపి అంటు కట్టినాము. కాని తక్కువజాతి మొక్క మాడిపోయినది.

సలీము

అయ్యో! బ్రదికినచో నింకొక క్రొత్తజాతి మామిడిపండు బయలుదేరెడిదే. కానిమ్ము! యథాశక్తికముగ బ్రయత్నించుదము. ఇంకొకసారి చూడుడు. బ్రదుకనిచో నాశ వదలు కొందము.

తోటమాలి

చిత్తము.

(నిష్క్రమింతురు.)

సలీము

వృక్షశాస్త్రము నాకు బాగుగా తెలియును. మామిడియంట్లవిషయము సమగ్రము. ఇది యేల మాడిపోవలె?

సేవకుడు (ప్రవేశించి)

జహాపనాహ్! శిల్పులు వచ్చిరి.

సలీము

రమ్మను.

(సేవకుడు నిష్క్రమించును. శిల్పులు ప్రవేశము)

సలీము

ఏమి విశేషములు, కూర్చుండుడు.

౧ శిల్పి

ఖుదావంద్! అనేకములైన పాకములు చేసితిని. గిలాబు చేసితిని. సూర్యరశ్మి కెండ నిచ్చితిని. గొడ్డలితాకునకు గిలా బాగుట లేదు.

౨ శిల్పి

ప్రభూ! రంగులు కల్పితిని. చిత్రించితిని. ఎండనిచ్చితిని. ధారగా నీళ్లు పట్టగా రెండు గడియ లాగినది. తరువాత నిలువలేదు.

3 శిల్పి

పాలగచ్చునకు బ్రయత్నించి మెఱుపు తళతళలు తెచ్చితిని. ప్రభూ! అగ్నిచూపించితిని. అది పోయినది.

సలీము

ఏమిచేయుదుము? మరల మరల నదే ప్రయత్నించుడు. 'యత్నే కృతే యది న సిధ్యతి కోత్ర దోషః.'

శిల్పులు

చిత్తము.

(నిష్క్రమింతురు)

సలీము

ఈ విషాదమేఘములు నన్నేల ముసగు?

సేవకుడు (ప్రవేశించి)

జహాపనాహ్! ఎవరో కవియట!
తమ దర్శనార్థము వచ్చినాడు.
(కవి ప్రవేశించును. సేవకుడు నిష్క్రమించును.)

కవి

జహాపనాహ్! క్షమించుము. రాజులయొద్దకు వచ్చినపు డాశీర్వదించవలయును. కాని యాశీర్వదించుశక్తి నాకు లేదు.

సలీము

ఎందుచేత?

కవి

ప్రభూ! నేను కవినయి గాని పుట్టలేదు.

సలీము

కూర్చుండుము!

కవి (కూర్చుండి)

నా పూర్వజన్మసంస్కారముచేత ఛందోదేవి నా జిహ్వాగ్రమున తాండవించుచున్నది. శబ్దబ్రహ్మసాక్షాత్కారము గూడనైనది. నిత్యపరిచయము వలన ధారకూడకుంటువడదు.

సలీము

మఱి లోపమేమియును లేదే!

కవి

నే నానందదేవత నుపాసించలేదు.

సలీము

మరి విషాదదేవతనా యుపాసించితిరి?

కవి

ఆమెకును నాకే జన్మనా ఆరభ్యస్నేహము.

సలీము

మఱి యేగీతమైన పాడుము.

కవి

నాకు వచ్చినవే విషాదగీతములు.

సలీము

అదియే యొకడు పాడుము.

కవి

అతిమనోహర మీ సుసాయంతనమున
నా హృదంతరమునుండి బాహిరిలెడు
నీమనోహరభావమ్ము లెల్ల చెదర
నీవిషాదమేఘములు నన్నేలముసరు?
మలయగిరి కందరోపాంత మసృణగంధ
సార తరు పత్త్రములలోన సాగులాడి

కదలి చనుదెంచు నీచల్ల గాలివేళ
హా విషాదభావములు నన్నావరించు.

ఇదిగో పశ్చిమదిక్కున కృష్ణపక్ష
శాంబరీరమ్య చంద్రఖండంబు పొడిచె
అగ్నిశిఖవోని దందశూకాస్యవిషము
లూరయుచున్నవి హృదయకోటరమునందు.

సలీము

మధుర తరముగానున్నది. స్వామీ! విషాద గీతమైననేమి? మీవుల బాగున్నది. విషములో కూడ నమృతమున్నది కావలయును!.

కవి

అగు; విషాంభోధిలోగూడ నమృతమున్న
దాయమృత వాంఛచేసి దేవాసురులు మ
థించి చివరకు భాగముల్ తెగక తారు
తారె పోరాడుకొని శాంతిదూరులైరి.

ఈ మహాతృష్ణ కంతులే దెంతపొంది
పొందనట్టులుగా వగ పందుచుండు
ఈదురాశా మహాంభోధి నీదులాడు
మానిసియు తుష్టితీరమ్ము కానలేడు.

అమృతగాంగధునీ శీకరములచేత
సంభ్రమించుచు నున్న దీ షట్పదంబు
కొనలను పసిండిమెఱుగు గ్రక్కినదళాల
హైమ జలజాత మధులుబ్ధమై భ్రమించు.

సలీము

స్వామీ! ఏమికావలయునో కోరుకొనుడు.

కవి

నేను ధనాశచే రాలేదు. యువరాజు సలీము మహారసికుడని జనప్రతీతివిని నాగీతములు రెండు నీచెవిని వేసి పోదమని వచ్చితిని.

సలీము

అనుగ్రహింపఁ బడితిని.

కవి

ఇంకొక్కడు:
కనులుమూసి హైమలతేక్షు ఖండకోటి
బద్ధమధుకరీజ్యాశర భ్రమణ మెంతు
కనులు తెరచి హోమాగ్ని శిఖా ప్రచుంబి
గగన తరు శేఖరమ్ములు గాలజూతు.

నిత్యకుండోత్థ తారాధ్వ నికష సహోమ
వహ్నికాజ్వాలికా ప్రతప్తమ్ము గాగ
రస్పర విఘట్టితాస్మ దుద్భ్రాంతహృదయ
చేతములు పండ కాలి రంజిల్లి పోయె.

ఈమహోగ్ర శిఖామండలీమహాగ్నిఁ
గాలుచున్న నాహృదయము కానిపించు
నిప్పు డిందీవరమ్ముగా నిపుడుపుంజ
రీకముగను కోకనదమ్ము రీతి నిపుడు.

సెలవు తీసికొందును. మరల దర్శించెదను.

(నిష్క్రమించును)

సలీము

అతిమనోహర మీసుసాయంతనమున
నా హృదంతరమునయందు బాహిరిలేడు
నీమనోహరభావమ్ములెల్ల చెదర
నీవిషాదమేఘములు నన్నెల ముసరు.

(తెరలో)

ఖుదావంద్ ! సాయంకాలమైనది.

[తెర]

రంగము ౨

(ప్రవేశము-రుసీ, అజీజ్.)

రుసీ

మనోహరా !

అజీజ్

ప్రాణప్రియా!

రసీ

నేను నిన్ను వివాహము చేసికొన్నాను. మఱి సభలలో నృత్యము సేయవచ్చునా ?

అజీజ్

చేయరాదు.

రసీ

చక్రవర్తికి చెప్పకుండ గానిసలు వివాహము చేసికొనవచ్చునా ?

అజీజ్

చేసికొనరాదు.

రసీ

ఈచేయరాని రెంటిని నేను చేయవలసి వచ్చినది.

అజీజ్

ఎందుచేత ?

రసీ

చేయరానిపనులు చేయుటవలన గలుగు శిక్ష యనుభవించుటకీత మొగమున వ్రాయబడి యుండుటచేత.

అజీజ్

ప్రియా! ఊరడిల్లుము. అంతశిక్షయే కలుగునేని నాకు లేనిశిక్ష నీకు లేదుగదా! సుఖములో మనయిర్వురిజీవితము లెట్లు ముడిబడినవో దుఃఖములోగూడ నట్లే ముడిబడనిమ్ము.

రసీ

నాథా!

అజీజ్

ఏమి ?

రసీ

తనకు గలిగినబాధ నోర్చుకొనవచ్చును గాని ప్రియతములైనవారి బాధ యోర్చుకొనరానిది.

అజీజ్

నాబాధ నేనే యోర్చుకొందును.

రసీ

ప్రియా! నీవు నేను నొకటియే. కాని యనార్కాళికి గలిగినబాధ నేనోర్వజాలను.

అజీజ్

భావిభారతసామ్రాజ్యచక్రవర్తిని. మా అనార్కాళి కేమిబాధ యున్నది ?

రసీ

అట్లుగాదు. పాదుషాహా నాల్గు రోజులలో లాహోరునకు దేనికో ప్రయాణము గట్టుచున్నాడు. సకల పరివారముతో బోవునట యచ్చటకు. మావిద్య పూర్తియైనదని తెలిసి నన్నును ననార్కాళిని ప్రయాణము గమ్మని కబురంపినాడు.

అజీజ్

నీచేత నక్కడ నృత్యము చేయించుటకా ?

రసీ

కాకపోయిన మేమెందులకు?

అజీజ్

భావిభారత సామ్రాజ్య చక్రవర్తిని సభలో నిలిచి నృత్యముచేయునా? చేయదు.

రసీ

కాని నేమిచేయవలయునో తెలియుటలేదు. ఈవివాహవిషయము చక్రవర్తికి తెలియనైన

దెలియనలెను. లేదా నృత్యము చేయుట కను
మతించనైన ననుమతించవలెను.

అజీజ్

తెలియజేసినచో నేమగును ?

రుసీ

మొదల నీకు నాకు ప్రాణదండన తప్పదు. అనా
ర్కాళికిగూడ తప్పదేమొ! సలీము రాజ్య
భ్రష్టుడుగూడ నగునేమొ !

అజీజ్

ఆ !

రుసీ

అవును మఱి! అక్బరుచక్రవర్తి చండశాసనుడు

అజీజ్

కానిమ్ము. మహల్వీయును సలీము యువరాజును
నీ విషయములు నిర్ణయించగలరు. మన మేమి
చేయగలుగుదుము ?

రుసీ

మహల్వీవద్దకు పోదము.

[తెర]

రంగము 3

(ప్రవేశము అనార్కాళి, సలీము)

అనార్కాళి

జహాపనాహ్ ! నమస్కారము.

సలీము

దేవీ! నమాజుచేసితివా?

అనార్కాళి

చిత్తము.

సలీము

అజీజ్ను అతనిభార్యయు క్షేమముగనుండిరా?

అనార్కాళి

తమరిదయవలన క్షేమముగనే యున్నారు.

సలీము

మహల్వీగారు ఖుషీగానున్నారా ?

అనార్కాళి

చిత్తము.

సలీము

కార్యాంతరములచేత నాకు వచ్చుటకు వీలు
లేక పోయినది. మనోహారిణీ! క్షమింపుము.

అనార్కాళి

జహాపనాహ్ ! అంతమాటయా యీ బానిస
యెడల?

సలీము

దేవీ ! నీవు యువరాజు సలీము భార్యవు.
బానిసవు గావు.

అనార్కాళి

అనుగ్రహింపబడితిని.

సలీము

ఏమి విశేషములు ?

అనార్కాళి

ఏమున్నవి ప్రభూ ! పదిదినములైనది తమ
దర్శనమై.

సలీము

దేవీ ! నన్ను గవుంగలించుకొమ్ము.

(ఇరువురును కౌగిలించుకొందురు)

సలీము

దేవీ ! ఏమో విషాదముగ నున్నది నీవదన
చంద్రబింబము.

అనార్కాళి

ఏమియును లేదు. తమకోస మెదురుచూచు

చుంటిని. మీ రెన్నాళ్లకును రాలేదు. ఈ వ్యాజమున నేనే వచ్చితిని.

సలీము

నజరానాలతో మేనా, యనగనే తెలిసినది. అందుకనియే నాయీగదిలోనికి బట్టించితిని. అనివార్యము లయిన కార్యములవలన రాలేదు. ఏమియు ననుకొనకు.

అనార్కాళి

ఈదాసి కంతగా చెప్పవలసినదని లేదు.

సలీము

దేవీ! మాటిమాటికి 'దాసి', 'దాసిని' యనకుము. నాకు మనస్సునకు కష్టముగా నుండును.

అనార్కాళి

ప్రభూ! ఈదాసినిమీద నీకెందుకంత ప్రేమ?

(సలీము అమ్మాయిపైనాని గోడప్పను)

సలీము

(కూరడించి) ఇదయేమి? వృథాగా నేడ్చెదవు.

అనార్కాళి

నాకేలనో భయముగా నున్నది.

సలీము

అయ్యో! ఎందుచేత! దేవీ! నాకు దూరముగా నుంటివనియా! కొద్దిరోజులలో మన మిర్వర మొకచోటనుండుటకే యేర్పాటు చేయుచున్నాను.

అనార్కాళి

ప్రభూ! నిన్నొకటడిగెదను.

సలీము

మహాప్రసాదము.

అనార్కాళి

(సిగ్గుపడును)

సలీము

దేవీ! సిగ్గెందుకు? నీదాసుడు సిద్ధముగా నున్నాడు నీయడిగినకోర్కె తీర్చుటకు.

అనార్కాళి

(సిగ్గుపడును)

సలీము

(గడ్డముపట్టి) నామీద నొట్టు. నీ వడుగదలచినదేమో చెప్పుము.

అనార్కాళి

స్త్రీ సహజమైనలజ్జమాని యడుగుచున్నాను.

సలీము

కానిమ్ము! అయ్యో! మరల మానివేసితివి. ఇదియేమి సిగ్గు?

అనార్కాళి

(ఏడ్చును).

సలీము

(ఓదార్చి) దేవి! ఏల వృథాదుఃఖించెదవు! అడుగుము.

అనార్కాళి

ప్రభూ! నన్ను వివాహమాడితివి. నేను నీకర్థాంగినిగదా!

సలీము

అదియా! దేవీ! నిన్ను నేను వివాహమాడినది దివ్యమైన నీప్రేమ నభిలషించిగాని తుచ్ఛమైన యీశరీరసౌఖ్య మభిలషించి కాదు. నేను యువరాజును. భావిభారతమునకు చక్రవర్తిని కావచ్చును. అప్పుడు నీవు చక్రవర్తిని వగుదువు. అంతవరకు నీకాస్థితిరాదు. నేనుభారత

రాజ్య సింహాసనమున నున్నప్పుడు నీవు చక్రవర్తిని వైనప్పుడే నిన్ను నే ననుభవించెదను. అటుల గాకపోయిన నీకేదో నేనొక యపకారము చేసినవాడ నగుదునని నాకు తోచుచున్నది.

అనార్కాళి

ఏమి టాయపకారము ప్రభూ!

సలీము

నేను చెప్పలేకున్నాను.

అనార్కాళి

మఱి నన్ను వివాహమే యపుడు చేసికొనక పోయిరా!

సలీము

నీకు నాయందు సంపూర్ణ విశ్వాసము గలుగుట కట్లు చేసితిని. ఈ మనవివాహము రహస్యము జనులెఱుంగరు. ఇప్పటి యీ వివాహము నీ వెఱుంగుటకును భగవంతు డెఱుంగుటకును చేసితిని. జనులెఱుంగకుండ నీయౌవనము హరింతునా, నేను జారుడ నగుదును.

అనార్కాళి

ప్రభూ! నీరహస్యము తెలిసినది.

సలీము

ఏమిటది?

అనార్కాళి

నీకు నాయందుకన్న ధర్మమునందే యెక్కువ ప్రేమ.

సలీము

నీకన్న నాకుఎక్కువ ప్రియమైన వస్తువు, నీ యీయలినీల మనోహరములైన కనులు సాక్షిగా చెప్పుచున్నాను, లేదు. ధర్మముచేత నిన్ను నాయందు మరింత దృఢబద్ధనుగా చేసికొనుచున్నాను.

అనార్కాళి

ఇక నే నీరాత్రివచ్చిన పని చెప్పుటకు సెలవిండు.

సలీము

పూర్ణిమాచంద్రబింబ సమానమైన నీవదనము నేనుచూచి సంతోషించుటకు.

అనార్కాళి

చిత్తము. ఇంకొకపనికూడ నున్నది.

సలీము

చెప్పుము.

అనార్కాళి

రేపు చక్రవర్తి లాహోరునకు ప్రయాణమట గదా!

సలీము

అవును!

అనార్కాళి

రునీయు నేనును నృత్యముచేయుటకు రావలెనట.

సలీము

(మౌనము.)

అనార్కాళి

మీరువచ్చిన చెప్పెద మనుకొంటిని. రేపేకాన నీరాత్రి మీతో తప్పక చెప్పవలెనని యీ వ్యాజమున వచ్చితిని.

సలీము

నీకు జబ్బుగా నున్నదని తప్పించుకొనరాదా?

అనార్కాళి

రసీ ?

సలీము

(మౌనము)

అనార్కాళి

భావిభారత సామ్రాజ్య చక్రవర్తిని నృత్యము చేయునా అని యభ్యంతరపెట్టుచున్నారు మా అజీజ్.

సలీము

రసీమాత్ర మెల్లుచేయును ?

అనార్కాళి

తమరే విచారించుడు.

సలీము

మనసంగతి నేను తెలుపగదా !

అనార్కాళి

మనకు తెలియదా ?

సలీము

మాళ్వీగారిని సంప్రతించవలెను.

అనార్కాళి

వారు మీతో మాట్లాడవలెనన్నారు.

సలీము

రేపుమధ్యాహ్నమా ప్రయాణము ?

అనార్కాళి

అవును.

సలీము

రేపుప్రొద్దున మాట్లాడెదను. నేనే మాళ్వీ వద్దకు వచ్చెదను. నీవీరాత్రి యిందే పరుండు. తెల్లవారుకడ వెళ్లవచ్చును. నీ వాశయ్యపైన పరుండుము. నేనిందు పరుండెదను.

అనార్కాళి

చిత్తము.

[నిద్రింతురు]

రంగము ౮

(ప్రవేశము - సలీము. అజీజ్.)

సలీము

భాయీ ! లాహోరిదియేనా ?

అజీజ్

జహాపనాహ్ ! ఇదియే. తమరిదివరకు చూడలేదా ?

సలీము

చూచితినిగాని జ్ఞాపకము లేదు. ఇప్పుడు పొద్దు గ్రుంకవచ్చినదివలె నున్నదే !

అజీజ్

చిత్తము.

సలీము

గుసగుసాష వచ్చినదా ?

అజీజ్

రాక యెట్లుండగలదు ?

సలీము

నీ వనార్కాళిని చూచితివా ?

అజీజ్

చూచితిని.

సలీము

ఎట్లున్నది ?

అజీజ్

చాలసంతోషముగ నున్నది.

సలీము

మొన్న రాతిరి చాల ఖిన్నయై యున్నది.

అజీజ్

రేపు రాత్రి కేనట నృత్యము.

సలీము

చక్రవర్తివచ్చినపని యైనదా?

అజీజ్

ఏమియును పనిలేదు. విహారార్థమే వచ్చినది.

సలీము

అది యెవరిగుడారము?

అజీజ్

రాజా మాన్‌సింగుగారిది.

సలీము

(ఆవైపునే చూచును.)

అజీజ్

జహాపనాహ్ !

సలీము

(మౌనము)

అజీజ్

చక్రవర్తిమీద మానసింగునకు కడువిశ్వాసము.

సలీము

నేను రాత్రికి హూల్వీగారి గుడారమునకు వచ్చెదను.

అజీజ్

అనార్కాళియు, రునీయు, రావలెనా ?

సలీము

తీసికొనిరమ్ము.

(తెర)

రంగము ౫

(ప్రవేశము. అనార్కాళి, రునీ)

అనార్కాళి

నేను తప్పకుండ నృత్యము చేసెదను.

రునీ

యువరాజుగారును హూల్వీగారును ఒప్పుకొనక పోయినచో?

అనార్కాళి

చెప్పి యొప్పించెదను.

రునీ

ఏల యింతలో నిట్లు తిరిగిపోయితివి?

అనార్కాళి

ఏలనో నాకే తెలియదు.

రునీ

చెలీ! నీవు నృత్యముచేసిన బాగుండదు.

అనార్కాళి

నేను తప్పకుండ నృత్యము చేసెదను.

రునీ

నాకేమియు నిష్టము లేదు.

అనార్కాళి

నాకు చాల ఉత్సాహముగా నున్నది.

రునీ

ఎందు కీ యుత్సాహము?

అనార్కాళి

వీణతంత్రులను నావిద్యుతహూ గాన
మేలాగుపుట్టెనో యెవడు చెప్పగలండు?
వాసాలలోగాలి పోసుకొని రొదచేయు
నాధ్వని యేలాగొ యెవడుచెప్పగలండు?
చివురాకులోనున్న శ్యామల చ్ఛవియెట్లు
చొచ్చెనో యెవ్వండు చూచి చెప్పగలండు ?

రునీ

ఏమిటిది?

అనార్కాళి

సంగీతము.

రునీ

ఎందుకు?

అనార్కలి

నాకుత్సాహముగా నున్నది.

రుసీ

ఎందులకింత యుత్సాహము

అనార్కలి

నాలోనేలనో సంతోషము విహ్వలమై నురుగు
చున్నది. ఎందుచే నింత సంతోషమగుచున్నదో
నేనేమి చెప్పగలను?

జలజల ప్రవహించు సెలయేటి కడకేగి
సెలయేరు! పాటికే చేసెదు గానమ్ము
తెలుపవే యని నీవు పలుకరింపుము కాని
సెలయేరు నీకేమి సెలవిచ్చునో రుసీ!

జామపండులు తిని చక్కగా పలికెడు
నామనోహర శుకము చెంతను కడకేగి
ఏమె రామచిలుక నీవేల కూసెదవని
యేమైన నడుగగనే యేమనునో రుసీ!

అదుగో బుల్‌బుల్ విరామమ్ముగ నృత్యము సేయు
కదిసి నీవేటికే కడగి నృత్యము చేతు
వదలవే యని నీవు పలుకరింపుముదాని
అదియేమి నీతోడ ననగలదో రుసీ!

రుసీ

ఇంత విచారకరమైన వేళ నీకేటికో యింత సం
తోషము?

అనార్కలి

అగు మేను శాశ్వతమ్మగు సుఖమ్మో దుఃఖ
మగుదుఃఖమే సుఖమ్మగు నేది యెట్లైనో
తెగులు మానిని నీకేమి తెలియునే యద్దాని
సాగసెల్ల కాలమ్మొ చూపగల్గును రుసీ!

రుసీ

ఈసంగీత మిప్పటిలో నాకు వాయేమి?

అనార్కలి

పగుచుండిన సెలయేటినద్దకుపోయి
గుసగుసపొమ్మని యెవ్వ డాన పెట్టెను చెప్పు
పలుకుచుండినయట్టి చిలుకనద్దకు పోయి
పలుకవద్దని యానపట్టె నెవ్వడు చెప్పు
నటియించు బుల్‌బుల్‌ను నటియించ వలదని
నుటియించు నాజ్ఞ నిక్కడ నెవ్వడో చెప్పు
కాలక్రమేణ లోకమున సర్వమ్మును
కాలపాశ నిబద్ధగతి పోవు నాగును.

రుసీ

నేను పోవుచుంటిని.

అనార్కలి

పోయెదవా! పొమ్ము! ఒక్కటి చెలికత్తెవు;
సహాధ్యాయినివి. రెండు నా తమ్ముని పెండ్ల
మవు. మన యిర్వురి బంధమును పెద్దదే)
పోయెదనందువా! పొమ్ము!

పోనిచ్చ గలిగెనా పొమ్ముపొమ్ము బిరాన
రానిచ్చ గలిగెనా రమ్మురమ్ము బిరాన
పోనో రానో నీకు బుద్ధిపుట్టినయట్లు
గాని నాచెప్పినకరణి చేతువె నీవు
నీవె పోదువా లేక నేనె పోదునో రుసీ!
నీవు నేనును గూడ నిలువజాలమొ రుసీ!

రుసీ

నేను వెళ్లుచుంటిని.

[నిష్క్రమణ.]

అనార్కలి

రుసీ వెళ్లినది. కానిమ్ము
ఈవీణతంత్రిలో నేలాగయినగాని
నేనైక్యమగు గీత నాకు వ్రాసెనో లేదో

కీచకమ్ముగ దూరి కెరలిగానము సేయు
నాగాలినేనైన నెంత బాగుండును!
ఈచివురాకులో నెనయు నీలిమ యెల్ల
నేనౌదునా యేని యెంత బాగుండును!
తోఁచితోఁచని మహాదోషమ్ము నాయందు
దాచుకొన్నాను నిత్యము దేహమను మిష
మట్టిలోపలనుండి మట్టి యుద్భూతమై
మట్టిలోపల జేరి మలగిపోవును తుద.

అజీజ్ (ప్రవేశించి)

ఏమి టీపాటలు?

అనార్కాళి

సంగీతము!

అజీజ్

ఇవి యెవరు వ్రాసిరి?

అనార్కాళి

నేనే చెప్పుచుంటిని.

అజీజ్

నీకు కవిత్వము వచ్చునా?

అనార్కాళి

రాదు.

అజీజ్

ఛందస్సు నేర్చుకొంటివా?

అనార్కాళి

లేదు.

అజీజ్

అట్లైనచో కవిత్వము వ్రాయరాదు. తప్పులు పడినచో నాపదలువచ్చును.

అనార్కాళి

పరవాలేదు.

అజీజ్

ఈపద్యములనిండ తప్పులే.

అనార్కాళి

అయిననేమి?

అజీజ్

అందుచేత నీవుపాడనద్దు.

అనార్కాళి

నానోటివెంట వచ్చుచుండగానే నెట్లాఁగగలుగుదును?

అజీజ్

మౌనవృత్తి నవలంబించుము.

అనార్కాళి

నాచేతగాదు.

అజీజ్

నేను వెళ్లిపోవుచున్నాను.

అనార్కాళి

వెళ్లిపొమ్ము.
ఈనదీజలము సంద్రాన కూడెనుగాని
నంబుజాప్తాగ్నిచే నావిరైయై పోయె
కలసికొన్నామన్న ఘనమోదమేకాని
యల విడిపోవుశోకాగ్ని నెవ్వడు చూచె
కలసినప్పటిమోద జలధివియోగాగ్ని
దహియించుకొని పోవు తరుణమం దేమయ్యో?

(అజీజ్ నిష్క్రమించును)

అనార్కాళి

మా అజీజ్ వెళ్లినాడు. సరే! వెనుక మా గురువుగారు నేర్పిన గీత మొకటు జ్ఞాపకము వచ్చుచున్నది.
ఈనౌక యెచ్చోటికేగుచున్నదో కాని
యానందధామమై యతిశయించెను చూడు
ఏరేవునుండి తానేగుతెంచునో కాని
మా రేవు సకలసంపదల కాకరమయ్యె

ఈమహావార్ధిలో నీదులాడెడు నౌక
ఏ మహావాయువు నెనయ కెట్లుండునో
ఈనౌక సౌందర్య మింకెంత యనుచు నాక
నానేత్రయుగము నానందంబునఁ ముంచె.

మౌల్వీ (ప్రవేశించి)

బిడ్డా! ఏమిచేయుచుంటివి?

అనార్కాలి

చిన్నప్పుడు తమరు నేర్పినగీతము నొక దానిని పాడుకొనుచుంటిని.

మౌల్వీ

ఇప్పు డెందుకు?

అనార్కాలి

రాత్రికి పాడవలయునుగదా!

మౌల్వీ

ఏమి యాగీతము.

అనార్కాలి

(పాడును)

మౌల్వీ

అకాలమున నీ కీసంగీత మెందుకు?

అనార్కాలి

నేను నేడేలనో సంగీతము పాడకుండ నూరకుండ లేకున్నాను.

మౌల్వీ

బిడ్డా! దయ యుంచి మానివేయుము.

అనార్కాలి

స్వామీ! నాచేత కాదు.

మౌల్వీ

నేను వెళ్లుచున్నాను.

అనార్కాలి

గురూ! నాకు చదువుచెప్పిన ఉస్తాదువు. పెండ్లి చేసినమౌల్వీవి. నన్ను వదలిపెట్టి వెళ్లెదవా?
ఈ మహానౌక ఝంఝామారుతముచేసి
ఈ మహాంబుధిలోన నెచటమున్గునో కదా
అరయ రమ్యంబు లీసారచాప లే గాలి
చిటిగిపోవునో నాదుచిత్తమ్ము తపియించు
జౌను చూచుచుటకు మహారమ్యమైనట్టి
ఈనౌక సైతమ్ము లానెట్లు మునుగునో?
ఆరంభ మేవస్తువైనపొందెన గోని
గూరసినట్టి దాని కంతమ్ము నున్నది.

[మౌల్వీ నిష్క్రమణము]

అనార్కాలి

మాగురువుగారు వెళ్లినారు.
దానిన నగునేను భాగత సామ్రాట్టు
రాణివాసమున కైనాను చోద్యము చూడు
ఉష్ణసంద్రంబున నుద్భవించినముత్యె
మహ్పార్థివుని కిరీటాంచలంబున నుండె.

సలీము

(ప్రవేశించును)

అనార్కాలి

(చూడక)
లేగదూడలుగూడ తూగి వాంఛించని
యాగడ్డిపోచ వాహినిలోన బడిపోయి
ముఖరించు నీమహాంభోరాశి తరగల
శిఖరడిండీరలక్ష్మీమనోజ్ఞత దాల్చె.

సలీము

ఏమిటిపాడుచుంటివి?

అనార్కాళి

(లేచి) జహాపనాహ్ ! దయచేయుడు.

సలీము

(కూర్చుండును)

అనార్కాళి

జహాపనాహ్ ! ఇప్పుడెట్లు వచ్చితిరి ?

సలీము

మాల్వీగారితో పనియున్నట్లునటించివచ్చితిని.

అనార్కాళి

దేనికి?

సలీము

మహానందమున నున్నావట. నిన్నుచూచి పోవుటకు.

అనార్కాళి

ఎవరుచెప్పిరి?

సలీము

అజీజ్ !

అనార్కాళి

సాయంతనమున నృత్యముచేయుటా, చేయకుండుటా?

సలీము

నీవు చేయుటకే నిశ్చయించితి వటగదా!

అనార్కాళి

చిత్తము.

సలీము

ఎందుచేత?

అనార్కాళి

మాల్వీగారెంతవారో నృత్యవిద్యలో నేనంతదాన నైనాను. నాయానృత్యకౌశలము తమరు చూడలేదు.

సలీము

ఆరోజున చూచితిని గదా!

అనార్కాళి

ఆనాడు నాకు జబ్బుగా నున్నది. ఆనాడు నేనసలు నృత్యమే చేయలేదు. నేడు నానృత్యము జగన్మోహనముగా నుండును.

సలీము

నీకెట్లు తెలియును?

అనార్కాళి

నా యిప్పటి యీ యుత్సాహమే నన్నట్లనిపించుచున్నది. ఇక నేను మరల నృత్యము చేయుటకు వీలుండదు. ఈనాడు నాప్రజ్ఞయంతయు సంపూర్ణముగా చూపించి విరమించెదను.

సలీము

అట్లయిన నేటిరాత్రి తప్పకుండ నృత్యము చేసెదవన్నమాటయే.

అనార్కాళి

చిత్తము. తమరు మాత్రము విషణ్ణులై కూర్చుండకుడు.

సలీము

కూర్చుంటినా, నీమందహాస మొక్కడునన్ను మహానందాబ్ధిమగ్నుని గావించదా?

అనార్కాళి

అనుగ్రహింపబడితిని.

సలీము

(కౌగలించుకొనును)

[తెర]

(సశేషము)




బులుసు వేంకటరమణయ్య గారు

"ప్రకటా! రాత్రిం గన్నుమూసి మది బాహ్యజ్ఞానము న్వీడి జీ
వకవాంఛంబు ప్రభాతకాంతు లవిగో! ప్రాచీదిశం బొల్చె నే
గ్రకవాకౌఘము మేలుకొల్పి విధిసత్కృత్యంబు నీడేర్పు" నం
చకలంకాత్ముఁడు లేచె[1] భార్గవుఁడు పూర్వాశావకాశంబునన్.

ఉ. కుక్కుట మొక్కటి మొదట లేచి నిజకూజిత పాటవ ముప్పతిల్ల వేఁ
"గొక్కొరొకో" యటంచు మఱి కోటిని నిద్దుర మేలుకొల్పఁగాఁ
దక్కిన కుక్కుటంబులు గతానుగతిత్వము లోకధర్మమున్
మ్రొక్కుచుఁ బెక్కులొల్చె సుమనోహరభావ లసద్రవంబునన్.

గీ. ఒక్కదిక్కున వినిపించు కుక్కుటరవ, మల్పకాలాన దిఙ్మధ్య మాసరించె
నొక్కరుఁడు గాంతినిండు విద్యుత్ప్రభాస, మఖిలదిగ్వ్యాప్తరూపమై యలరునట్లు.

మ. రజనీమందిరదీప్తులై పిన జగద్రక్షాకరుం డాదటన్
యజనాహారకరుండు శీతకిరణుం డాదిత్య మార్గాంతమున్
కజమిత్రు న్మేలుకొల్పి లోకజనరక్షార్థంబు విశ్రాంతికై
నిజవాసంబున కేగుచుండె ననఁగా నిస్తేజుఁడై యొప్పెడిన్.

క. కుక్కుటరవ మప్పటికిన్, మక్కువకాదంచు గున్నమామిడి చివరన్
వక్కాణించు మనుంగను, గుక్కూరావంబు భరతభూమిని మెలమిన్.

మ. అలసాంగంబును నశ్వరాజము నియంత్రాఘాత సంపర్క ని
శ్చలవేగత్వము నూని మాంద్యగుణమున్ సాంతంబుగా నీడురే

* ఈవర్ణన మొకకాలమునుండి క్రమక్రమముగఁ దోఁచు స్వాభావికములచేఁ వ్రాయఁబడినది. ఒక్కొక్క విషయమునే కొన్నిచోట్ల గండుపద్యములచే వర్ణించిన నందలి చమత్కృతిభిన్నముగను సమంజసముగను జూపట్టి కొన్ని పద్యములలో సమానార్థకములగు ననేకపదములు వ్యస్తముగను సమస్తముగను జూపట్టుచున్నను నిరర్థకములని భ్రమింపక పదప్రయోజనము నాలోచించి గ్రహింపఁదగు. వర్ణనము సూర్యకాంతులు జగమునఁ గ్రమ్మెడిలనల్లు కొనువఱకు దోఁచుటచేఁ బరభృతభృంగ వృత్తాంతములు వర్ణింపఁబడె. బు. వేం. రమణయ్య.

1. భార్గవుండు=శుక్రుఁడు, వేగుచుక్క యని యర్థము.

తి లసచ్ఛక్రుఁడుఁ గుక్కుటారవములన్ దీండ్రించి మేల్కొల్పఁగా
నలుదిక్కుల్ దెలివొంచెఁ దోఁచెఁ దమముల్ నామావశిష్టంబులై.

మ. తొలుతన్ దిగ్విజయార్థియై యహితసందోహమ్ముఁ గారాగృహ
స్థలికిం బంచి తదీయసూతుఁడు హరిత్ స్థానంబుఁ జూపించుచున్
నలుపన్ సత్క్రియఁదూర్పుకొండ చివరన్ సాంద్రప్రభాభాస్వరుం
డలరెన్ భానుఁడు తప్తహేమమయ బింబాకారముం బొల్చుచున్.

క. బలముగల రిపుబలంబులఁ, దలపడ సారంబులేక తద్దయుఁ గుహర
స్థలిఁ జేరువారి చందము, నలరెన్ గాఢాంధకార మవనీస్థలిపై.

క. కమలాకరకమలంబులు, కమలాప్తుని రాకఁ జూచి కడు హర్షమునన్
గమలాకమలాలయలో, కమలాపహ కాంతిఁ గ్రిగ్గి కలకల నవ్వెన్.

ఉ. చుక్కలతేఁడు గ్రుంకెనని చూడ్కులు మాంద్యము నొంద దీధితుల్
దక్కఁగ నైల్యమబ్బఁగు ముదంబులు వెల్వొలఁబాఱెఁ గాని యా
జక్కవ సంతసించె జలజంబులు జొక్కె సుమిత్రుఁజూచి హా!
ఒక్కరి సంతసంబులు మఱొక్కరి దుఃస్థితి కాకరంబులా.

గీ. భాస్కరుని దీధితులు మేఘపంక్తులకును, రంగుఁబూయంగఁ గెంజాయ నింగినంటె
నదియు సురలోకజనగణం బాఱఁబోయు, పసుపు కుంకుమరీతిఁ జూపట్టుచుండె.

చ. అరుణగభస్తిమాలికలు హాటకకాంతిఁ జెలంగి కాంతిచేఁ
దరువిటపంబులన్ సురభితంబులఁజేసి బహూకరింపఁగాఁ
బరభృతముల్ సువర్ణమయ పల్లవజాలము లన్న భ్రాంతిచేఁ
బరవశతం జెలంగి కడుపారఁగ మెక్కి సుఖించె నెంతయున్.

గీ. పర్ణగతసర్వ సుమములు స్వర్ణకాంతిఁ, జెలఁగి యన్నియుఁ జంపకములను బోల
నన్నియుం జంపకంబులే యనుచు భ్రమసి, అళికదంబము పుష్పవాంఛలను వీడె.



# జైనుల మతకథలు

## ౫. పురోహిత శ్రీభూతి కథ

పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి గారు

శ్లో॥ యా సర్వజ్ఞ సుబోధానాం వ్యక్తం సర్వోపకారిణామ్,
విరాగస్థం పరం జ్యోతి ర్వందే విశ్వవిభూషణమ్.

—ఆచార్యపద్మనంది.

పూర్వం మన యీ భారతదేశంలో సింహపుర మని పట్నం ఒకటి వుండేది. దాన్ని ఏలేటి వాళ్లంతా చాలా అంగబలసంపన్నులే అనేవారు! మన కథాకాలానికి దాని ప్రభువు సింహసేనుడు. సింహసేనుడు ప్రజానుకూలుడైన ప్రభువు. ఆయన భార్య రామదత్తాదేవి కూడా అతని కన్ని ప్రజాహితకార్యాలలోను సహధర్మచారిణే అయ్యేది. ఆమె రాజకార్యాలలో మంత్రిగాను; గార్హస్థ్యంలో భాగ్యనిధిగల దేవేరిగాను; వుంటుండేది. కాబట్టి సింహసేనుడి పాలనకాలము మూడుపువ్వులూ ఆరుకాయలుగా, వర్ధిల్లుతూ వుంటుందని పెద్దలు వ్యాఖ్యానిస్తూ వుండేవారు.

శ్రీభూతిఅనే బ్రాహ్మణుడు అతనికి పురోహితుడు. పురోహితుడంటే ఆషామాషీలబాపు గాడు. ఆ కాలంలో రాజ్యాంగమున ఆయన ఒకసాంశగా వుంటూ వుండేవాడు. శాస్త్రాలలో పెద్దలు చెప్పినట్లే ఆయన పురోహితత్వం వున్నది కూడాను. పెద్దలు అన్న దేమంటే—

రాజ్ఞః పురోహితః కార్యో యస్తు విద్వాన్బహుశ్రుతః,
ఉక్తో సవిమృశ్య ధర్మార్థౌ సప్రమేధా వనంతరమ్;
ధర్మాత్మా మంత్రవిద్యేషాం రాష్ట్రం రాజన్పురోహితః,
రాజా వైవంగుణో యేషాం కుశలం తేషు సర్వతః.

[విద్వాంసుడై యుండి - వృద్ధులను సేవించుట మూలాన బహుశ్రుతుడై- ధర్మార్థతత్త్వములను చక్కగా ఎరిగివున్న-బ్రాహ్మణ్ణి- రాజులు పురోహితులుగా ఎన్నుకోవలెను. ఈలాంటి లక్షణాలుగల పురోహితుని ఏరాజు చేర్చి పెట్టుకొనునో; అట్టిరాజు పాలనమునందే ప్రజ లుందురో; వారికి అన్నివిధాలా- అంతటా- కుశలమే అవుతుంది—అని భావం.]

మన శ్రీభూతికూడా పదవినిబట్టి ఇల్లాంటివాడే అనవలసి వచ్చినా, గుణాలనుబట్టి అల్లా చెప్పటకు వీలు లేదు. కావడమున కితనికిన్ని సంహితలన్నీ కలసినవి. మానవధర్మము సమగ్రంగా చదివాడు. ఊహాపోహాలలో నేర్పు అబ్బింది. అథర్వణతంత్రం అనర్గళంగా పరిపాటి యున్నది. ఎంతెంత అవగ్రహదోషాలు వచ్చినా, త్రుటిలో- శాంతిక పౌష్టికాలు జరిపి- వారించే శక్తి కూడా అలవడ్డది. అయితేమాత్రం ఏం? దిక్కుమాలిన లోభితనమున్నూ- కానికి గడ్డితినే స్వభావమున్నూ మాత్రం-మారలేదు. అయినా డొక్కశుద్ధి అయినముండావాడు కాబట్టి, దంభంతో తనలోని లోపాలు కనబడకుండా సవరించుకొంటూ- అమిత ధర్మశ్రేష్ఠ గల వానికిమల్లే- నటించేవాడు.

ఇక్కడిక్కడ ఇల్లా వుండగా, ఆవూరికి సముద్రదత్తు డనే కోమటి వర్తకుడు వచ్చినాడు. ఇతని వాసస్థానము పద్మఖండపురము. మంచి ప్రతిభాప్రాభవములు గల స్నేహపాత్రుడగు మిత్రుడున్నూ - ఓర్పు నేర్పున్నూ గలవాడైనందున, సముద్రదత్తుడు చక్కగా శ్రీభూతి యింటికే వచ్చి బస చేసినాడు. తనంతతానై ఇంటికి వచ్చిన అతిథి కావడంచేతనున్నూ, తన యతిశయభాగ్యగతుల యాదరమహిమను లోకానికి ప్రదర్శించుకోదలచడంచేతనున్నూ, శ్రీభూతి యతనికి గొప్పగా స్వాగత వచనములు పలికి గౌరవించాడు. పిమ్మట సముద్రదత్తుడుకూడా ఆకృతజ్ఞతను ప్రసన్నవదనముతో వెలిబుచ్చినాడు.

తర్వాత వాళ్లిద్దరున్నూ పరస్పరం యోగక్షేమాలు విచారించుకోవడంలో చాలాకాలము గడచింది. సముద్రదత్తుడు తాను వ్యాపారంకోసం ద్వీపాంతరం

వెళ్లడాన్ని సూచించి చెబుతూ; శ్రీభూతిని అతనిస్థితిగతు లను చెప్పమని కోరాడు. శ్రీభూతి మహోత్సాహంతో, తనప్రతాపప్రభావాల నన్నింటినీ ఏకరువుపెట్టడమే కాకుండా, తనయాజ్ఞఅంటే అడ్డు లే దనిన్నీ, రాజు తానెంతచెబితే అంతా అనిన్నీ, ఒక్క ఆవూళ్లోమాత్ర మే కాక ఆచుట్టుప్రక్కలంతా-తన్ను మహాగౌరవంతో చూస్తారనిన్నీ, ఇంతకూ కారణం- తన పరోపకార శీలమూ భూతదయా సర్వసమత్వం తప్ప- మరేమీ లేదనిన్నీ, ఏమేమో ప్రగల్భంగా చెప్పాడు. ఇదంతా చాలా శ్రద్ధతో విని, తర్వాత సముద్రదత్తుడుకూడా, మళ్లాడు వూరుచూడడమనే మిష పెట్టుకొని, తిరిగి విచారణచేసి "శ్రీభూతి అంటే- కొంత గాకున్నా కొం తైనా పేరూప్రతిష్ఠా కలవాడే"—అని విశ్వసించాడు.

కాబట్టే ఆయన అనుకొన్నాడు రత్నద్వీపానికి ప్రయాణమై పోతూ, తనను ఊరిచివర ఏటిదాకా సాగనంపవచ్చిన శ్రీభూతితో—"మిత్రమా శ్రీభూతీ! ఇవిగో ఇవి ఏడు రత్నాలు. ఒక్కొక్కటి కోటిరూ పాయలవిలువ. నేను పరదేశం వెళ్లుతున్నాను. గనుక ఎల్లావచ్చి ఎల్లావచ్చునో! వీనిని నాకు మాఱుగా దాచి పెట్టి నేను మళ్లా రాగానే నాకిచ్చివేయుము"—అని చెప్పి యిచ్చెను. ధగధగ వెలుగుతూవున్న ఆరత్నాలు చూడగానే శ్రీభూతికి మతి చలించింది. అయినా ఒక్కత్రుటికాలంలో ఆతంపరనంతా అణుచుకొని,— "ఆహా! ప్రియమిత్రమా! ఇంతబరువు నాపై మోపుట న్యాయ్యమా? 'భారం విన్యాసరక్షణమ్'—అన్న పెద్దలమాట నీవు వినలేదా"—అని అంటూ "అయినా మిత్రవాక్యం గనుక విధిలేక ఒప్పుకొంటున్నాను"— అనిపలికి వాటిని తీసికొన్నాడు. సముద్రదత్తుడు తన భారం వదలిపోయిం దని మహానందపడ్డాడే గాని, ఉత్త రత్రా రాబొయ్యే సంగతిని ఆలోచించాడు కాడు. ఎందుకు ఆలోచిస్తాడూ? "యాదృశీ కర్మణో వృత్తి స్తాదృశీ మతిః"—అని కదా పెద్దలు చెప్పారు.తర్వాత ఎవరిదారిని వారు వెళ్లారు. కాని, నిజానికి సముద్ర దత్తుడికంటె శ్రీభూతిఆనందమే గొప్పది. అప్రయత్నం గా అమూల్యరత్నాలు హస్తగతమైనవాడికి గాకపోతే తక్కినవాడికి ఆనందం వస్తుందా? అందులో మహానంద, దం!—చెప్పండి మాటి! న్యాసమస్తువును ప్రత్యర్పణ చేసే దాకా పరితపించే ధర్మసూక్ష్మవిదులైన మహాత్ములకు ఈ ఆనందకాల మునకూ చాలా అంతరం వున్నది గదా!

రత్నద్వీపం చేరడంతోటే సముద్రదత్తుడు నానా విధాలా కష్టపడి ఆర్జించడం ఆరంభించాడు. ఇది కృత్య మని కానీ, ఇది అకృత్యమని కాని, చూడక, ఎన్నెన్ని తరహాల వ్యాపారాలు వున్నవో అన్నీ చేసి నాలుగేండ్ల లో దాదాపు ముప్పదికోట్లను సంపాదించాడు. అతని ఆర్జనలోభం అంతలో సంపూర్తి జరిగింది. చివరకు సముద్రదత్తుడు ఆర్జించిన ఆ ధనమంతా తీసుకొని, రత్నాలంలో బయలుదేరుతున్న 'అహోలోభ్య' అనే నావ లో (అయిగోట్ట అని ప్రా. సిం.) స్వదేశానికి బయలు దేరాడు. పాపమైనాసరే పుణ్యమైనాసరే ఉత్కృష్ట మైపోతే ఇక్కడే ఫలం కనిపిస్తుందంటారు పెద్దలు. ఈ మాటలు సముద్రదత్తుని విషయంలో సుమాత్రమునకు యథార్థాలే అయినవి. కొంతదూరం వెళ్ళేసరికి అహోలోభ్య విఫలం జేరింది. ఓడమీద వుండే లెక్కసహస్రసంఖ్యాకు లంతా ముప్పాతికవంతు సముద్రపాలు అయ్యారు. ఒక్క పీసంపాలు మిగిలింది. మిగిలినవారిలో సముద్రదత్తుడు నొకడు. "దానం భోగో నాశ స్తిస్రో గతయో భవంతి విత్తస్య, యో న దదాతి న భుంక్తే తస్య తృతీయా గతి ర్భవతి" అని పశ్చాత్తాపపడుతూ, ఎల్లాగో ప్రా ణాలు అరచేతిలో పెట్టుకొని ఆసముద్రంలోనే నాల్గు రోజులు గడపినా డతడు. అయినప్పటికీ ఆదోవనే సింహపురికి వచ్చే ఓడరాగా, దానిలో ఎక్కి ఎల్లాగో గట్టున బడ్డాడు సముద్రదత్తుడు.

ఇక కొంచెము శ్రీభూతిసంగతికి వత్తాము. శ్రీ భూతి మునుపటిశ్రీభూతి కాడు. మహైశ్వర్యసంపన్ను డైనాడు. కావలసినంత పెద్దరికం వచ్చిపడ్డది. దానికి దంభముకూడా తోడైంది. ఎప్పుడూ ఇంటిచుట్టూనిండా మూగి అతన్ని స్తుతించడానికి పెద్ద పరివారం ఏర్పడ్డది. రాజుకుకూడా అతనియెడల మంచిగౌరవం; ఇనుమడిం చింది దానితో ఆయనప్రభావం.

---

* తస్య తృతీయా గతి ర్భవతి—అని భర్తృహరి పాఠము.

ఒకనాడు శ్రేష్ఠి శ్రీభూతి తన అనుచరులతో, పరివారంతో సముద్రస్నానం చేయనున్నాడు. ఆరోజు సముద్రం నుండి చింకిపేలికలతో ... సముద్రదత్తుణ్ణి చూచినట్లు చేసినాడు. ... ఉన్నది. అయినా ధైర్యం అవలంబించి— "మిత్రులారా! ఎంత చెడ్డకాలం వచ్చినది! ... ప్రజల్లో ... చింతా ... కలిగిస్తున్నవి. ... ప్రజలే అనేకులు అఘటిస్తున్నారు. ... రాజనగరిలో పరీక్షిస్తున్నారు గదా! ... ప్రమాణాలూ తప్ప మాట్లాడరు. అయ్యయ్యో! కాలం ఎంతలో మారింది!!......"

శ్రీభూతిమాటలు పూర్తి కాకముందే ఇంతలో సముద్రదత్తుడు ప్రవేశపెట్టబడినాడు. కాని శ్రీభూతి అపరిచితునిగా ప్రవర్తించాడు. ఉగ్గబట్టుకొన్న మానప్రాణాలతో ... సముద్రదత్తుడు ఎగుడుదిగుడుగా చూచాడు. అప్పటికీ అతను పలకరించలేదు. సముద్రదత్తుడు ... ఉన్నాడు. విసుగు పుట్టింది. ... ప్రయోజనం లేదని స్థిరం చేసికొన్నాడు. ... సంభాషణ ఆరంభించాడు.

సము :—మిత్రమా! శ్రీభూతీ, నన్ను మరచితివా! నేను నీమిత్రుడను సముద్రదత్తుడను గానా ?

శ్రీభూ :—(ప్రక్కనున్న వారితో నవ్వుచు కనుగీటి) వినండి పురజనులారా! ఎంత అందంగా వుంటాడో చూడండి.

సము :—పురజనులారా ? నన్ను నీవు పోల్చుకోన లేనట్లున్నావు నిజమే. ఇప్పటి నాస్థితి ఇది. నీదగ్గర యేడురత్నాలు దాచుటకిచ్చి రత్నద్వీపం వెళ్లాను. వెళ్లినందుకు బాగానే ఆర్జించాను. అయితే నేం ? నా ఖర్మ మిట్లయి సముద్రములో ఓడ బద్దలై తప్పరిల్లి వచ్చాను. ఈస్థితిలో నారత్నాలు నాకిస్తే నన్ను ఉద్ధరించినవాడవౌతావు.

శ్రీభూ :—(ప్రక్కవారితో) విన్నారా! నేనిప్పుడే గదా చెప్పినాను. ఇంతలోనే ఉదాహరణం చూడండి. ఇట్లాంటి ధూర్తులుంటే 'న్యాయ్యం న్యాయ్యం' అంటే, ఏం న్యాయ్యమయ్యా? అన్యాయం గానీ!!

శ్రీభూతిమాటలను అక్కడివారందరూ గొల్లుమనిరి. తల తోక లేని మాటచెప్పిన సముద్రదత్తుడిని పిచ్చివాణ్ణిగా పెట్టిరి. కాని వాతావరణం దైన యతని కెక్కలేదు. అయినా అక్కడినుండి వెళ్లిపోక పదేపదే వనకటిమాటలనే మాట్లాడుతూ ప్రార్థించటం ఆరంభించాడు. శ్రీభూతి ఎన్ని చెప్పినా వినిపించుకోకుండా కేకలువేస్తూ—'ఆహా! ధూర్త ప్రపంచం! ఎంతనక్కగా వుంది!'—అంటూ, నౌకరులను పిలిచి మెడబట్టి సముద్రదత్తుణ్ణి ఆవలికి గెంటించివేశాడు. దానితో శరమై—కళాకాంతులు లేకుండా—మెదడు లెండిపోయేట్టు—గొణుతూ — సముద్రదత్తుడు పిచ్చిలో పాలబడ్డాడు.

సుఖాన వున్న ప్రాణాన్ని దుఃఖపెట్టుకొన్నట్లయింది అతనిపని. "ఏదో వున్నదానితో తృప్తి పడకుండా ఆరత్నద్వీపం వూసు కేల పోవాలె? పోయినా నేపో, ఏదో మితంగా ఎందుకు రాకూడదు? పోనీ అమితాశకే పోయినా ఆసముద్రంలో కూలిపోయినవాళ్లలో తన్నుగూడా ఒకణ్ణిగా చేయకుండా దేవుడు తన్నేల మిగల్చవలెను? మిగిల్చినాడే పో, శ్రీభూతికి ఈబుద్ధి ఏల పుట్టాలె? పుట్టెనో పో మెల్లగా సమాధానం చెప్పి పంపరాదా? అట్లాకాక మెడబట్టి గెంటించనేల? అయ్యయ్యో! దైవమా!"— అని రాత్రిందివాలూ ఆలోచిస్తూ మూడుగోణులు శ్రీభూతి ఇంటిఎదుట్నే ఒక్క చేతబట్టుకొని నిలవబడ్డాడు సముద్రదత్తుడు. అయినా ఆలనాపాలనా లేదు. జాలీ గీలీ కలుగలేదు. క్రమంగా సముద్రదత్తుడిపని ఈ న్యాయదావస్థలోకి వచ్చింది. తల విరియబోసికొని ఊరంతా తిరగడం మొదలుపెట్టినా ఫలితం. కేవలం తిరగడమే కాకుండా—"నాయనలారా! ఒక్క ధర్మ ప్రభువైనా ఈపట్నంలో లేడా? శ్రీభూతి నా రత్నాలు ఏడింటిని—ఏడూ ఏడుకోట్ల విలువజేసేవి హరించాడు. విచారించరా? న్యాయదేవత సహించిందా? అయ్యయ్యో!"—అంటూ అవిరతంగా కేకలు పెడుతూ ఊరంతా గగ్గోలు పెడుతున్నాడు.

తర్వాత, ఇది విని కొందరు నవ్వారు. కొందరు తుళ్లారు. మరికొందరు అయ్యో! పాపం పిచ్చివా డన్నారు. ఇంకా కొందరు శ్రీభూతిని నిజస్థితే మని అడిగారు. ఏమడిగినా ఏమీ ప్రయోజనం కనపడలేదు రాజుగారిదాకా కూడా ప్రాకింది. కాని ఫలితం తేలలేదు. చివరకు అందరూ "మతిపోయింది గాబోలు. ఉన్మత్తుడికి యుక్తాయుక్తవిచక్షణతా - వాచ్యావాచ్య జ్ఞానమూ ఉంటుందా? ఏదో నోటికి వచ్చింది ప్రేలుతుంటాడు. కాబట్టి ఇంతమాత్రంచేత మనం శ్రీభూతిని నొప్పించడం బాగుండదు" అనుకొన్నారు. కాబట్టి రానురాను సముద్రదత్తుడిక్షోభ లక్ష్యపెట్టేవారే లేకపోయినారు. ఏంచేతాం? లోకం స్థితే యింతా.

కాని దాదాపు ఇట్లా ఆరునెలలు గడుస్తున్నా సముద్రదత్తుడిలో మార్పు కనబడలేదు. ఎప్పుడూ ఒకటే మాట. ఒకటేపాట. జానెడులోతుకు పీకుకొనిపోయిన పొట్టతో కండ్లు గుంటలుబడి మూర్తీభవించిన దీనంలాగా "అహోరాత్రాలూ శ్రీభూతీ- రత్నాలూ- ఏడుకోట్లూ" అనే అరపుతో సముద్రదత్తుడు తిరుగుతూనే వున్నాడు. రాత్రిపూట ఏఅరక్షణమైనా కన్నుమూస్తాడో లేడో చెప్పలేము. ఇట్లాంటి స్థితిలో రాజుగారి అంతఃపురప్రాసాదంక్రింద వీథిలో రాత్రిభాగంలో అప్పుడప్పుడూ అరవడంకూడా ఆరంభం చేశాడు. అక్కడమాత్రం ఇతని అదృష్టం తిరుగుతుం దని నిశ్చయమా? కాని అత డిది తప్పడం లేదు.

ఇంతలో తక్కిన ఆరుమాసాలుగూడా గడచి పోవచ్చినవి. ఒకనాడు తెల్లవారకట్ల పట్టపురాణి సింహసేనుణ్ణి అడిగింది—'ప్రభూ! మీరు పరమధార్మికులున్నూ దీనరక్షణచింత గలవారున్నూ గదా! అదిగో ఆపిచ్చివాడిగ తేమనుకొన్నారు?—'అని అందుకు ప్రభువు చెప్పాడు—"ఏంచెయ్యనూ? వాడు పిచ్చివాడు మాత్రమే కాకుండా గ్రహావేశం అయినవాడుగా గూడ వున్నట్టున్నది. నిజ మేమిటో చూతా మని ఎన్నెన్నో ప్రయత్నాలు చేశాను. ఈపిచ్చివాడిమాట తప్ప శ్రీభూతి మీద నేరం మోపడానికి నాకు ఇతరఆధారం ఏమీ సాధ్యపడలేదు. నీకు చేతనైతే ఏమైనా వీలు కలిగేట్టయితే యత్నించి చూడు—" అని.

రామదత్త:—(కొంచెంసే పాలోచించి) సరే. నేను యత్నిస్తాను. నా కవసరమైన సహాయాలన్నీ మీరు చెయ్యాలె.

సింహ:—అభ్యంతర మే ముందీ! అట్లానే చేస్తాను.

రామ:—అయితే శ్రీభూతికి ఆజ్ఞ పంపండి. నేను మొదలు తొమ్మిదిరోజులు రాణి ఉపవాసం చేస్తుం దనిన్నీ, ఈతొమ్మిదిరోజులూ నగరిలో హాజరుండి వ్రతానికి కావలసిన ఏర్పాట్లు చెయ్యవలసినిన్నీ.

సింహ:—సరే! ఇదుగో పంపుతున్నాను.

అని వెంటనే శ్రీభూతికి ఆజ్ఞ పంపినాడు. రాజాజ్ఞ ననుసరించి శ్రీభూతి నగరిలోకి వచ్చి రాణిగారి కూడా లాలో ఆదిపురాణం వినిపిస్తూవున్నాడు. రాణీగారు అనేకవిధాల ఈ తొమ్మిదిరోజులూ అతన్ని పరీక్షించింది. కాని సందు దొరకలేదు. చివరకు తొమ్మిదో నాడు అతనికి బహుమానం చేసి వ్రతసమాప్తిగా సుఖలం తీసికొన్నది. శ్రీభూతికి వలసినన్ని రత్నాభరణాలూ వస్తువాహనాలూ దొరకినవి. మహాసంతోషపడ్డాడు. చివరకు సెలవుతీసికొని ఇంటికి వెళ్లుటకై రాణీగారి దగ్గరకు వచ్చాడు. రాణీగారన్నది—"శ్రీభూతిగారూ! మీదయవల్ల వ్రతం పూర్తిఅయింది. కాని ఈరాత్రి జాగరణచేయవలసే వుంటుంది. కాబట్టి దొరవారు ఇక్కడికి ఇప్పుడు దయచేస్తారు. సూరియోదయం ప్రొద్దు పోకకై మీతో కాస్తసేపు చతురంగము ఆడవలె నని యున్నది. దాన్ని పూర్తిచేయరా?—"అని.

శ్రీభూతి కొంచెం తటాపటాయించడం ఆరంభించాడు. ఇంతలో రాజుగారు కూడా అక్కడికి వచ్చి ఏమి సమాచార మని అడిగాడు. రామదత్త తన కోర్కె చెప్పింది. రాజుగారు "ఫరవాలేదు ఆడండి" యన్నాడు. శ్రీభూతి విధిలేక రాజుమాటకు కట్టుబడ్డాడు.

ఆట ఆరంభమైంది. మొదటిఆటలో శ్రీభూతే గెల్చాడు. పందెం పెట్టుకొన్నప్రకారం రాణి అతనికి చెల్లించింది. రెండో ఆటలో రాణి గెల్చింది. ఆమె పందేనికిగాను శ్రీభూతి చిటికెనవ్రేలి మొహరుంగరం అడిగింది. అనుమానపడుతూ పడుతూ శ్రీభూతి ఉంగరం

ఇచ్చివేశాడు. రాణి మూడోఆట సగంఆడి-క్రిందికి వెళ్లివస్తానని చెప్పి-లేచి పోయింది. పిమ్మట నిపుణిక అనే దాసీని పిలిచి ఏమేమో బోధించి ఒకక్షణంలో మళ్లావచ్చి ఆట పూర్తిచేసింది. ఈసారి ఆటలో మళ్లా శ్రీభూతే గెల్చాడు; కాని శ్రీభూతి తనఉంగరము ను పందెంగెల్చుకొని ఇవ్వమని కోరాడు. రాణి సరేనంటూ ఇంకోఆట ఎత్తింది. ఈఆటలో ఎంతసేపు ఆడినా గెలుపుఓటములు రాకుండా మొండిపట్టుతో ఆడ డం ఆరంభించింది. ఎంతసేపటికీ తెమలలేదు.

ఇంతలో నిపుణిక శ్రీభూతిఇంటికి వెళ్లింది. ఆయనభార్యతో—'అమ్మా! బాబయ్యగారు దొరగారి దగ్గర వున్నారు. ఎవరో గొప్పసర్దారులు వచ్చారు. ఆ రత్నాలబేరంలో మీయింట్లో ఏయేరత్నాలు ఉన్న వనీన్నీ- వాటిని చూచి సర్దార్లు ఆమాదిరిరత్నాలు కొనవలసిం దనీ బాబయ్యగారు చెప్పారు. రాజుగారు సరే నన్నారు. బాబయ్యగారు నన్ను మీయింటికి వెళ్లి రత్నాలు పట్టుకొని రమ్మన్నారు ఇవ్వండి' అని అడి గింది. శ్రీభూతిభార్య—మాయింట్లో రత్నాలూ గిత్నా లూ లేవు. పొమ్మని కసిరింది. నిపుణిక కొంచెం దూరం వచ్చి, కాస్త ఆలస్యం చేసి మళ్ళావెళ్లి అడిగింది. ఇదిగో బాబయ్యగారు శ్రీముద్ర యిచ్చి పంపారు. తీసికొని ఇకనైనా విశ్వాసంతో ఇచ్చి పంపమన్నారు—అని ఉంగరం ఇచ్చింది. శ్రీభూతిభార్య కాస్తసేపు అనుమా నించి "ఆడదాన్ని నాకేం తెలుస్తయి? అవి ఎక్కడున్న వో ఏమో? ఆయననే వచ్చి తీసికో పొ"మ్మన్నది. నిపు ణిక కాస్త సందుదొరికిం దని సంతోషపడుతూ వచ్చి రాణీతో సూచించింది. ఇంతలో ఆటముగిసి శ్రీభూతి ఓడిపోయినాడు. రాణి పందెంసొమ్ముకు బదులుగా ఆతనిమెడలోని యజ్ఞోపవీతాన్ని ఒకదాన్ని కోరింది. శ్రీభూతి ఉంగరమిస్తే ఇస్తానన్నాడు. రాణి సరే యని ఇచ్చింది. శ్రీభూతి మళ్లా ఆట ఆరంభించాడు. ఇంత లో నిపుణికకు రాణి సైగచేసింది. అది మెల్లగా ఆ యజ్ఞోపవీతం పట్టుకోపోయి శ్రీభూతిభార్యకు ఇచ్చి— అమ్మా! బాబయ్యగారూ చాలా ఆపదలో నున్నారం డీ! రాజుగారికి కోపం వచ్చేట్టున్నదట. వీటు దీన్ని చూపి—ఎట్లైనా ఆరత్నాల్ని తెచ్చి తనఆబూరు దక్కిం చమంటున్నారు—" అన్నది. శ్రీభూతిభార్య గడగడ వణుకుతూ ఆరత్నాలను తెచ్చి యిచ్చింది. నిపుణిక వా టిని పట్టుకొని వచ్చి రాణిగారిచేతికి ఇచ్చింది. రాణి గారి ముఖం కళకళ్లాడింది. శ్రీభూతి ఎందుకో వెలవెల బోతున్నాడు. ఈసంగతిని కనిపెట్టి రాజుగారు అన్నా రు—'ఏం అయిందా?' అని.

రాణి:—సగం గెల్చాను. ఆపిచ్చివాణ్ణి పిలిపిస్తే తక్కిన సగంగూడా గెలుస్తా.

రాజు:—సరే అన్నాడు.

ఇంతలో నిపుణిక వెళ్లి ఆపిచ్చివాణ్ణి తీసికో వచ్చింది. వాడు వెనుకటి మల్లేనే—"శ్రీభూతీ-రత్నా లూ! ఏడుకోట్లూ—" అంటూ వచ్చి కూలబడ్డాడు. శ్రీభూతికి ఢక్కు మన్నది. "చిత్రార్పితారంభ ఇవ ప్రశాన్తః" అన్నట్లు కూచున్నవాడు కూచున్నపాళాన కొయ్యబారి పోయినాడు. ఇంతలో రామదత్తాదేవి తన స్వంతరత్నాలను నాలిగొన్నింటిని వాటితో కలిపి పళ్లెంలో పోసుకొని వచ్చి రాజుచేతికి ఇచ్చింది. రాజు సంగతిని కనిపెట్టి ముందు శ్రీభూతిని పిల్చి—"మీ యింట్లోనుండి రత్నాలను రాణిగారు తెప్పించి ఇందు లో కలిపింది. ఈపళ్లెంలో నారత్నములున్నూ మీ రత్నములున్నూ వున్నవి. వీటిలో మీరత్నాలు మీరు ఏరి తీసికొనవలెను. పొరపాటుననైనా నారత్నాలను ముట్టుకొంటిరా? తలతీయిస్తాను. జాగ్రత్త. నీరత్నాలను నీవు ఏరి బయటపెట్టూ—"అన్నాడు. శ్రీభూతి గంట సేపు తంటాలుపడ్డా రత్నాలను గుర్తుపట్టుకొనలేక పోయి నాడు. తర్వాత రాజుగారు పిచ్చివాడితోగూడా అట్లాగే చెప్పి రత్నాలపళ్లాన్ని ముందు పెట్టాడు. సముద్రదత్తు డు ఒకనిమిషంలో తనరత్నాలను ఏరి బయటపెట్టి నాడు. రామదత్తి నవ్వుతూ 'నేనే గెల్చా' నన్నది. రాజు చాల కోపంతో శ్రీభూతివైపు తిరిగి "ఛీఛీ! ధూర్తుడా! ధర్మధ్వజా! నిన్ను వురిదీయిస్తా" నని గద్దించి పలికి కైదుచేయించాడు. ఆరాత్రి ఎట్లాగో గడచి పోయింది.

తెల్లవారేసరికి ఈసంగతింతా వూళ్ళో పొక్కిం ది. ఏడుప్రహర లయినా కాకముందే రాజు అధికరణ స్థానానికి వచ్చాడు. జనులు మూగిపోయినారు. అధికరణి

కులతో రాజు జరిగినదంతా చెప్పి దండన ఏమిచేయ వలెనో చెప్పుమన్నాడు. వారు చాలాసేపు ఆలోచించి ఆలోచించి ఈక్రిందివిధంగా తీర్పు చెప్పారు.

> సర్వస్వహరణం మల్లత్రింశత్సుష్టిస్తయోఽథవా
> కాంస్యపాత్రత్రయాపూర్ణ నవగోమయభక్షణమ్—
> [అని.

[అనగా అపరాధి బ్రాహ్మణుకాబట్టి అతని సర్వ ద్రవ్యాన్నీ రాజు తీసికొని అతన్ని కట్టుబట్టలతో వెళ్లగొట్టించడం మొదటిశిక్ష. ఇది ముఖ్యము. ఈ శిక్షకు అపరాధి అంగీకరించకపోతే—ఇందులకు బదులుగా మంచి బలవంతులయిన జెట్టీలను పిలిపించి వారిచేత ముప్పయిగ్రుద్దులు గ్రుద్దించి పంపడమనేది రెండోశిక్ష. అథవా దీనికిన్నీ ఇష్టము కాకపోతే మూడుగిన్నెల- గోమయాన్ని- అనగా ఆవుపేడను తినిపించడం. ఇది మూడోది. ఇందులో అపరాధికి ఏది ఇష్టమైతే దాన్ని విధించి వదలివెయ్యడం న్యాయంగా వుంటుంది—అని తాత్పర్యము.]

రాజుగారు సరే నని శ్రీభూతివైపునకు తిరిగి— 'అయ్యా మీరు బ్రాహ్మణోత్తములు. అందులో దోషాదోషాలనూ కార్యాకార్యాలనూ ఎరిగిన అధర్వణులు. (అంటే పురోహితు లన్నమాట.) కాబట్టి ఇంకోవిధంగా మిమ్మ దండించడం నా కెంతమాత్రం ఇష్టం లేదు. ఈమూడురకాల శిక్షలలో ఏదో ఒకదాన్ని మీరే నిర్ణయం చేసికొనండి. మీయిష్టప్రకారం జరిగిస్తాను. బాగా ఆలోచించుకొని ఒకగడియలో చెప్పండి— అన్నాడు.

శ్రీభూతి ఆఒక్కగడియలోనే చాలా బాగా ఆలోచించుకొన్నాడు. ఇన్ని కష్టాలు పడీ చివరకు తాను ఆర్జించిన ఆరత్నాలు రాళ్లైనవి గదా! ఇటుపైని సర్వస్వమూ (ఉన్నఆస్తిఅంతా) గూడా పోయ్యేస్థితి అతనికి చాలా దుర్భర మనిపించింది. కాని రాజుగారు చెప్పిన మూడురకాల శిక్షల్లో ఏదైనా ఒకటి తప్పని మాట కూడా స్థిరమైన సంగతే. కాబట్టి సర్వస్వం పోగొట్టుకొనేదానికంటే, తక్కిన రెండింటిలో ఏదో ఒకటి అనుభవించడం మంచిదని తోచింది. వాటిలో గూడా మూడుగిన్నెల గోమయం తినడమంటే నావూహీగా (అమర్యాదగా) తోచింది. కాబట్టి దెబ్బలే తనకు సమ్మత మన్నాడు.

సింహసేనుడు సరే నన్నాడు. వస్తాదులు తొడిగిన జెట్టీలు ఇల్లురు వచ్చారు. రాజు వారిలో ఒకరిని శ్రీభూతినే కోరుకొమ్మన్నాడు. శ్రీభూతి సన్నని జెట్టీని చూపినాడు. కాని వాడు ఉక్కుముక్క. దెబ్బలు కొట్టించేప్పుడు శ్రీభూతిని సల్లురికీ కనుపడేట్టు ఒక ఎత్తైన స్థలమున నిలవబెట్టించాడు రాజుగారు. వెంటనే రాజాజ్ఞ కాగానే జెట్టీ శ్రీభూతిని వంగబెట్టి వదునుమీద ఒకటీ – రెండూ– మూడూ– అంటూ గుద్దులు గుద్ద సాగినాడు. సరిగా పదిదెబ్బ లయ్యేదాకా శ్రీభూతి ఓర్చుకోగలిగినాడు. కాని తర్వాత నిలవజాలక పోయెను. పదకొండో గ్రుద్దు తినడంతోటే—న స్తిని దేవుడా అంటూ క్రిందికి వాలినాడు. సభ అంతా ఘొల్లు మన్నది. రాజు ఆగొల్లును వారించి మ శే మన్నాడు. శ్రీభూతి 'తాను దెబ్బలు తినలేననీ, సెలవైతే మూడు గిన్నెల గోమయం తింటాననీ అన్నాడు. రాజు సరేనన్నాడు. వెంటనే గోమయం(ఆవుపేడను)తెచ్చి ముందు పెట్టినారు. శ్రీభూతి ఒకగిన్నెలోది సగమైనా మింగగలిగాడో లేదో అప్పుడే డోకులు ఆరంభమైనవి. ఉక్కిరిబిక్కిరవుతున్నది ఈతనిపని. రాజుగారు రీసంగతికని పెట్టి ఏ మన్నారు. "బాబూ! ఇంకోక్షణం కంటె జీవించను. నాసర్వస్వాన్నే తీసికోండి. నాకు మంచి ప్రాయశ్చిత్తమైంది చాలు." అంటూ శ్రీభూతి గోలుగోలుమన్నాడు. రాజుగారు సముద్రదత్తుడివైపు చూశాడు. ఆయన రామదత్తువైపు చూచి మరల రాజువైపు తిరిగి- ఈవిధంగా- బ్రతిమాలుకొన్నాడు.

"మహాప్రభూ! ధర్మాపేతులకు తగినట్లు దండన ఇచ్చి ధర్మాన్ని నిలిపిన ప్రభువులు మీరు. కాబట్టి సెలవైతే ఇంతతో శ్రీభూతిని వదలిపెట్ట వేడెదను" అన్నాడు. రాజుగారు సముద్రదత్తుడి బుద్ధికి మెచ్చుకొని, శ్రీభూతికి పురోహితపదవిని రద్దుచేసి, అతనిధన మతనికే యిచ్చినట్లు ప్రకటించి సభాప్రదక్షిణముచేసి పొమ్మని కోరాడు. శ్రీభూతికి కొనఊపిరి నిల్చింది.

అతడు మెల్లగా లేచి చేతులు [illegible] సరిమొట్టూ తిరుగుతూ—

శ్లో. జ్ఞాత్వా [illegible]
[illegible]
[illegible] ప్రసన్న జైనేంద్ర [illegible]
[illegible]

అని ప్రార్థించి నమస్కారం. [illegible] విచ్చిపోయింది. శ్రీభూతి విగతప్రాణుడై వెళ్లిపోయినాడు.

శ్లో. అసురసురనరేంద్రైః ఖేచరేంద్రైః ప్రపూజ్యో
జినపతి రిహ భక్త్యా సర్వసందేహహర్తా,
సుమతిజనరమాణీ సారసౌఖ్యస్య ఖాని,
ర్దిశతు మమ శివాని ప్రభాచంద్రదేవః.

ఇట్లు జైనులమతికథలయందలి ౫-వ కథయగు పురోహితశ్రీభూతికథ ముగిసినది.

సంపూర్ణము

# పొన్న

పూడిపెద్ది వెంకటరమణయ్య గారు

చివురుఁగొమ్మలఁ బొందలేదు చిన్నిగాలి
అతులితమ్మైన మలయమారుతము విసరి
మేలుకొలిపెదు! నా ప్రేమ కీ లెఱింగి
నిర్మలంబైన యీ పొన్ననీడ యహహా!
మోహనాలాపగీతిఁ బూని మోహలతిక
నల్లనల్లని నాహృదయమునఁ బెంచు!
ముదుగులుకుల తళ్కులఁ గ్రొందెలువన్న
శ్యామకళ లొక్కటొక్కటి చక్కఁజిలికి
కమలలోచనుఁ బ్రేమాస్పదముగ నిల్పు!
లలిత లావణ్యరూప విలాసములను
నవ్యకోరకములు ప్రేమ నాటఁ బాఁడి
మాధవుని మందహాస సామ్యమునుబొందు!
పూవు, రేకులు నొండొంటఁ బొందుపఱచి
తనివి తీరఁగ నిడు నేకతాళ గతికి
విడిన యీ పొన్నపూవుల వింతశోభ
ముద్దుటుంగుల నాడి యీ పొద్దుపొడుపు
ప్రణయగీతిని స్వేచ్ఛగా రాగమాల.

* * * *

ఈ నవచ్ఛాయ గోపాలకృష్ణుఁ డెలమి
మున్ను తన గానపీయూషమును రవంత
చల్లెఁ గాఁబోలు దీన నా బాడ లమరు

* * * *

అట్టి గానామృత ప్రవాహమును దరిసి
ఇదియ చేతనపూట దా నిట్లునిలిచె,
నేనగుదు నేని నిలువెల్ల నీరమగుచు
కరగి యావాహినీ వీచికలను గలసి
పోవకుందునె? నాకంత పున్నెమున్నె!

—గోపిక.

సంపూర్ణము



# విధిప్రేరితము

## ఒక హైందవ యువతీమణి

(టాల్‌స్టాయి గారి కథ)

వ్లాడిమరు అను నొక పట్టణమున అయి వనుడెమిట్రిచ్చిఅస్కనాఫ్ అను నొక వర్తకు డుండెను. అతనికి రెండు దుకాణములు నొకయిల్లు నుండెను.

అస్కనాఫు ధనికుడై యుండుటచే త్రాగుటకును, నిర్లక్ష్యముగ ద్రవ్యము వెచ్చించుటకును అలవాటుపడియుండెను. ఈ విధమున కొంతధనము నష్టపరచియుండెను గాని వివాహమైన తరువాత త్రాగుట మానివేసెను. ఎప్పుడైన త్రాగుచుండెడివాడు.

వేసవికాలములో నొకదినమున అస్కనాఫు సమీప గ్రామమున జరుగు సంతకు బోవుచు భార్యయొద్ద సెలవుపుచ్చుకొనుటకు వచ్చెను. భార్య "నాథా! యీదినము మీరు పోవలదు. రాత్రి నాకొక పీడ కల గలిగెను" అని చెప్పెను.

అస్కనాఫు నవ్వుచు 'నేను మరల త్రాగుడులో ప్రవేశించుతా ననియా నీ భయము?' అనెను. భార్యమాత్ర మతి దీనముగ "భయ మెందులకో నాకే తెలియదు. నాకు రాత్రి వచ్చిన స్వప్నముమాత్రము దురదృష్టచిహ్నమే. మీరు తిరిగి యింటికివచ్చుసరికి మీ జుట్టంతయు నెరసియున్నట్లు కలగంటిని. గనుక పోవలదు" అని ప్రార్థించెను.

"అయిన నది యదృష్టమే. నేను మన సరుకంతయు విక్రయించి నీకు బహుమతులు గూడ తెచ్చెదను. భయపడకుము" అని ధైర్యము చెప్పి వెడలి పోయెను. మార్గమధ్యమున చిరపరిచితుడైన యొక వర్తకు డగుపడియెను. ఇరువురును నొకపూట కూటింటియందు బస చేసి తేనీరు త్రాగి చెరియొక గదిలోను పరుండిరి.

అస్కనాఫు తెల్లవారుజామున లేచి గుఱ్ఱమును సిద్ధముగ నుంచుమని తన పరిచారకున కుత్తరవుచేసి తాను పైకము చెల్లించుటకు వెనుకవైపుననున్న యజమానియొద్దకు బోయి రాత్రి భోజనముచేసిన పైకము నిచ్చివేసి తన దారిని బోయెను.

సుమా రిరువదియైదు మైళ్ల దూరము పోయినతరువాత గుఱ్ఱమునకు మేత వేయించుటకు మరియొక సత్రమునొద్ద నాగెను. అచ్చట స్నానమునకు వేడినీటిని కాచుమని తనయొద్ద నున్న ఫిడేలును తీసి వాయించుకొనుచు ఆనందమున మునిగి తేలుచుండెను.

అప్పుడు సర్కారు ఉద్యోగి యొకడు యిరువురు రక్షకభటులతో నచ్చటికి వచ్చెను. అతడు అస్కనాఫునొద్దకు వచ్చి "రాత్రి నీ వెక్కడ బస చేసితివి?" అని యడిగెను అందుకతడు సరియైన సమాధాన మిచ్చి "నాతో తేనీటిని పుచ్చుకొని మరి వెళ్ల రా!" అనెను. ఆయుద్యోగి దానికి ప్రత్యుత్తర మీయకయే "రాత్రి నీ వెక్కడ పరుంటివి? యెచ్చటనుండి వచ్చుచుంటివి? నీతో నెవ్వరైన వర్తకుడుండెనా? ఉన్నచో నీయుదయమున నతని చూచితివా?" యని యొక్కుమ్మడిగ ప్రశ్నలన్నియు వేసెను.

అస్కనాఫునకు ఈప్రశ్నలన్నియు వింతగ దోచెను. ఏమి చెప్పుటకును తోచలేదు. అతిప్రయత్నమున ఆదినమున జరిగినదంతయు చెప్పుచు "ఏల యిట్లడిగెదరు? నే నేమైన దొంగతనముగాని హత్యగాని చేసితినా? నా సొంతపనిమీద నేను పోవుచున్నాను. వర్తకపుసరుకులు కొనుటకు ఎనిమిదివందల రూపాయలు తీసుకుపోవుచున్నాను."

"రాత్రి నీతో బస చేసిన వర్తకుడు ప్రక్కలోనే చంపబడియున్నాడు. పీగతలుపు లోనగొళ్లెము వేయబడియే యున్నది. గనుక నీబట్టలమూట చూడవలసియున్నది." అని యాయుద్యోగి భటులకు సంజ్ఞ చేసెను. వారతనిమూట విప్ప దానిలో రక్తమయమైన కత్తి యగుపడెను. అస్కనాఫునకు ఆదుర్దా హెచ్చెను. "కత్తి నీదేనా?" యని యుద్యోగి యడిగెను.

అస్కనాఫు తత్తరపడుచు తనకు తెలియదని చెప్పెను. "ఆవర్తకుని చంపినది నీవే యని తోచుచున్నది. ఎంతధనము తస్కరించితివి?" అని యుద్యోగి యాతని తొందర చేసెను. అస్కనాఫుమాత్రము తేనీరు త్రాగినతరువాత నావర్తకుని చూచియుండలేదు.

అంత నారక్షకభటులు అస్కనాఫును కాళ్లుచేతులు కట్టి బండిలో పడవేసి సమీపముననున్న ఠాణాకు తీసుకొని పోయిరి. అతని ప్రమాణములన్నియు బూటకము లయ్యెను. రోదన మరణ్యరోదన మయ్యెను. అతని ప్రవర్తనకుగాను వ్లాడిమరుకు వ్రాసిరి. పూర్వము విస్తారము త్రాగి ధనము వెచ్చించెననియు నిప్పుడు మాత్రము సన్మార్గముననే యున్నాడనియు నచ్చటి వర్తకులు చెప్పిరి. విచారణ జరిగెను. ఆవర్తకునియొద్దనున్న యిరువదివేల రూప్యములు నపహరించి యతనిని చంపినట్లు స్థిరపడెను.

భార్య యీసంగతి విని పిల్లలను తీసికొని కారాగృహమునందున్న భర్తను చూచుటకు బోయెను. లోనికి బోవుటకు సెలవు దొరకలేదు. నాలుగైదుసారులు బ్రతిమాలుటచే సెలవు దొరకెను. సంకెళ్లు వేయబడి అతిదీనముగ నున్న భర్తను చూచియామె మూర్ఛిల్లెను. స్మృతిగలిగినతరువాత నామె యింటియొద్దసంగతులన్నియు చెప్పి "ముందేమి చేయవలయు"నని యడిగెను. "ఏపాప మెరుగని వానిని రక్షించుమని రాజున కొకమనవి పంపు"మని భర్త చెప్పెను. "వ్రాసిన నిష్ప్రయోజనమయ్యె" నని భార్య చెప్పెను.

అస్కనాఫు యేమియు ననలేక తలవంచి యూరకుండెను. భార్య, "ప్రియా! నిజముగ

నేరము చేసినది నీవుగాదా? అర్థాంగినైన నాతోనైన చెప్పరాదా?" యనెను.

అస్కానాఫు ఆశ్చర్యపడెను. "నీవుగూడ నన్ను సందేహించెదవా?" అని రెండుచేతులతో కండ్లుమూసికొని యేడ్చెను. ఇంతలో నొకరక్షకభటుడు వచ్చి వారిని వెడలిపోవలసినదని యుత్తరవు చేసెను. పిల్లలను తీసికొని యామె యతికష్టమున భర్తయొద్ద సెలవు పుచ్చుకొని వెడలిపోయెను.

వారు వెళ్లినతరువాత భార్యనుగూడ తన్ను సందేహించినవిధము తలచికొని అస్కానాఫు విచారించెను. "భగవంతునికి మాత్రమే నానిర్దోషత్వము తెలియును; కావున, రక్షించుభారము మతనిదైయున్నది. ఇంక మనుష్యమాత్రుల తలవరాదు." అని మనస్సుదృఢపరచికొనెను.

ఆ దినమునుండియు సర్జీలనువ్రాయుట మానివేసెను. దినమెల్లయు భగవన్నామస్మరణతో కాలక్షేపము చేయుచుండెను. అస్కానాఫును గనులవద్దకు బంపి శరీరమంతయు గాయములు పడునట్లు కజ్జలతో మోదిరి. అవి మానినతరువాత సైబీరియా జైలుకు బంపిరి. అచ్చట నిరువది ఆరు సంవత్సరములు ఖైదుగ నుండెను. తలయు గడ్డము తెల్లగ నెరిసియుండెను. మితభాషి. ఎప్పుడును నవ్వునది యతనిముఖమున లేకుండెను కాని యెక్కువగ ప్రార్థించెడివాడు.

అస్కానాఫు బంధిఖానాలోనుండగ చెప్పులుకుట్టుట నేర్చుకొనెను. ఆవచ్చిన పైకముతో సత్పురుషులజీవితములు కొని ప్రతిదినము చదువుచుండెడివాడు.

కంఠము బాగుగనుండి ప్రతిఆదివారము పాడెడివాడు. ఖైదీలందరును తాతా యని పిలిచి గౌరవించెడివారు. ఇతర ఖైదీలు వాదములాడుకొన్నచో తీర్పునకు అస్కానాఫు వద్దకు వచ్చి యతనుచెప్పు సమాధానమునకు సంతృప్తులయ్యెడివారు.

అస్కానాఫునకు యింటియొద్దనుండి క్షేమసమాచారము లేవియు వచ్చుటలేదు. భార్యాపుత్రులక్షేమము తెలియలేదు.

ఒకదినమున కొందఱు క్రొత్త నేరస్థులు శిక్ష ననుభవించుటకు వచ్చియుండిరి. ప్రాతవారందరును వారివద్దకుపోయి ఏగ్రామము నుండి వచ్చినదియు యెందులకు వచ్చినదియు నడుగుచుండిరి. అస్కానాఫు తలవంచుకొని యాలకించుచుండెను.

వచ్చినవారిలో నరువదియేండ్ల దృఢశరీరముగల యొక పొడగరి యిట్లని తన వృత్తాంతము చెప్పెను.

"నేనేమియు దొంగతనము చేయలేదు. నామిత్రుడైన యొకని గుఱ్ఱమును నా యవసరమునకై తీసికొంటిని. అతని బండికి కట్టబడియుండ విప్పితిని. నాయవసరము తీరినతరువాత నిచ్చివేయవలెనని తలచితినిగాని దుర్మార్గుడైన యా యశ్వాధికారి నన్ను దొంగ యని పట్టియిచ్చెను. మిత్రద్రోహమనియైన నెరనిక నతడు రక్షకభటులకు అప్పగింప వివేకశూన్యుడైన యధికారి నాకు శిక్ష విధించెను. నే నది

వరకు చేసిన నేరమునకు శిక్ష ననుభవింపవలసి యుండెను కాని యస్క్నాఫు ప్రస్తుతము లేదు."

"ఎచ్చటినుండి వచ్చితివి" అని యొకరడుగ 'వ్లాడిమ' రని యతడు చెప్పెను. అస్క్నాఫు తలయెత్తి "నీవు వ్లాడిమరులో అస్క్నాఫు వర్తకుల నెరుగుదువా?" అనెను.

"నేను యెరుగుదును. ఆయన కొమారులింకను ధనికులుగనే యున్నారు. కాని తండ్రి మాత్రము మనవలెనే యొక నేరస్థునిగ నిచ్చట నున్నాడట. తాతా! నీవెచ్చటినుండి వచ్చితివి?"

అస్క్నాఫు తనపాటు కష్టము చెప్పలేదు గాని యచ్చటివారందరును చెప్పిరి. అతడు వచ్చి యిరువదియారు సంవత్సరములైనదని వారు చెప్పిరి. "ఎంతో ఆశ్చర్యము! అప్పుడే ముసలివాడవైతివే!" అని క్రొత్తవాడొకడైన మాకరనెను.

"మీ కిదివరకే పరిచయము గలదా?" యని యొకడడిగెను. అస్క్నాఫతనినిపవడికి వింతపడి "నీవు నన్ను నెప్పుడు చూచితివి? లేక నాసంగతివిని యడుగుచుంటివా?"

"వినుటకేమి? అందరును వినుచున్నారు; కాని చాలాకాలమగుటచే జ్ఞాపకము లేదు."

"ఎవరు చంపినదియు నీకు తెలిసియుండ వచ్చును. చెప్పగలవా?" అని అస్క్నాఫడిగెను.

అంత మాకరు నవ్వుచు "కత్తి యెవరి మూటలో నగుపడెనో యతడే దొంగ. ఎవరైన చంపి కత్తి నీ మూటలో దాచినను అతను పట్టుబడువరకు నీవే దొంగవు. ఐనను ఒకరుచంపి కత్తిని నీమూటలో యెట్లుపెట్టగలుగుదురు?" అని ప్రత్యుత్తర మిచ్చెను. తనకు బదులు శిక్ష యనుభవించ వలసిన హంతకు డితడే యని అస్క్నాఫు మనసుకు దృఢపడెను. లేచి యక్కడనుండి వెడలి పోయెను. పరుండెనుగాని మనస్సు కలతనొందియుండెను. తనశిశువు లిరువురు నగుపడిరి. తాను సంతకు బోవుదినమున నగుపడినట్లుగ భార్య కనిపించెను. ఎదురుగనుండి మాట్లాడుచున్నట్లు తోచెను. అప్పటి సంతోషదాయకమగు తన యౌవనపుదినములు ఎదుట ప్రతిబింబించెను. సత్రమునొద్ద పిడేలువాయించుచునప్పుడు గక్షకభటులు తీసుకుపోయి ఖైదులో పెట్టినసంగతి జ్ఞాపకమువచ్చెను. తాను యిరువదియారు సంవత్సరములు శిక్ష ననుభవించి రక్షకభటుల వద్ద పడినపాట్లన్నియు జ్ఞాపకము వచ్చెను గతము తలచికొనిన ఆత్మహత్య చేసికొనవలె నన్నంత విరక్తి గలిగెను.

మాకరునందు కోపము హెచ్చెను. అతనిమీద కసిదీర్చుకొనవలెనని మనస్సున సంకల్పించుకొనెను. అస్క్నాఫు ఆరాత్రియంతయు ప్రార్థనతో కాలక్షేపము చేసెను. మరునాడంతయు మాకరుతో మాట్లాడలేదు. అతనికి రాత్రులయందు నిద్రయు మనశ్శాంతియు నశించెను.

ఒకదినమున రాత్రి అతడు నిద్రాశూన్యుడై పచారు చేయుచుండెను. కాలిక్రింద మట్టి కదలుచుండెను. ఏమైనదియు పరీక్ష చేయ నెంచి వంగెను. మన్ను త్రవ్వుచున్న

మార్క రగుపడెను. చూచియు చూడ కుండ పోదలచెను గాని మార్క రతనితో "మనము పారిపోవుట కొకమార్గము చేయుచున్నాను. నీవిప్పు డూరకున్నచో నీవుకూడ తప్పించు కొన వచ్చును. అల్లరిచేసినచో నిన్ను చంపెదను." అనిచెప్పెను.

"నాకు తప్పించుకొను నుద్దేశము లేదు. నీవు నన్ను చంప నవసరములేదు. న న్నిదివరకే చంపితివి. అప్పటికి భగవంతుని యుద్దేశ మెట్లో యట్లు చెప్పెదను." అని అస్కనాఫ్ బదులు చెప్పెను.

మరునాడు ఖైదీలందరును పనిలోనికి బోవునప్పు డొకఖైదీ కాలిజోటిలోని మట్టిని గూడ తీసికొనిపోయి యచ్చట ప్రతిదినము గుమ్మరించు చున్నట్లు యొక రక్షకభటుడు గ్రహించెను. అంతట కారాగృహమును బరిక్షసేయ రహస్యద్వారము బయటపడెను. పెద్దయధికారి వచ్చి యీపని చేసినది యెవరని యడిగెను. అందరును తమకు దెలియదని చెప్పిరి. తెలిసినను మార్కరు మరల దండనకర్హునిగ జేయ నిష్టపడలేదు. గవర్నరు విసిగి అస్కనాఫువైపునకు దిరిగి "నీవు సత్యముగలవాడవు. దైవసాక్షిగ నిప్పుడు నిజము తెల్పుము." అని యడిగెను.

మార్కరు నిర్లక్ష్యముగ నధికారివంక చూచుచుండెను. అస్కనాఫు ముఖమువైపుకు చూచుటలేదు. అస్కనాఫు మనస్సులో నిట్లు తర్కించుకొనెను "అతనికి శిక్షవేయించిన నేమిప్రయోజనము? మరల నిర్జీవునిగా జేయుదురు. వెనుకటి నేరమునకు నేను యిరువదియారుసంవత్సరములు శిక్షననుభవించి యుంటిని. ఇంక నాకాలము తీరినది. మృత్యువున కెదురుచూచు నాకేల యింకను నతనిమీద కోపము. శిక్షించినను రక్షించినను పరమేశ్వరుడే కాని నావలన నేమియగును?"

అధికారి మరల "గోడక్రింద కన్నము నెవరు త్రవ్వినదియు నిజము చెప్పుము."

అస్కనాఫు మార్కరువైపునకు జూచి "స్వామీ! నేను చెప్పజాలను. చెప్పవలదని భగవంతునియాజ్ఞయై యున్నది. నన్ను యేమి చేసినను సరే! మీస్వాధీనుడను."

నిజము చెప్పించుటకు బ్రయత్నించియు ప్రయోజనము లేకపోవుటచే నాయధికారి వెడలిపోయెను.

ఆరాత్రి అస్కనాఫు నిద్రపోబోవు చున్నసమయమున మార్కరు నిశ్శబ్దముగవచ్చి ప్రక్కను గూర్చుండెను. అస్కనాఫు చూచి "ఏమికావలయును? ఎందుకు వచ్చితివి?" అని యడిగెను.

మార్కరు మాట్లాడ లేదు. అస్కనాఫు లేచి కూర్చుండెను. "నీకేమి కావలయును? వెంటనే లేచిపొమ్ము. లేవ ననినచో నిచ్చటి రక్షకభటుని పిలిచెదను" అని గద్దరించెను. మార్కరు "ఇరువదియారు సంవత్సరములకు పూర్వము వర్తకుని జంపి కత్తి నీమూటలో పడవేసినది నేనే. నిన్నుగూడ జంపు నుద్దేశముతో నచ్చితిని గాని గుమ్మము నొద్ద మనుష్యులయలికిడియగుటచే కత్తిని నీమూటలో దాచి పారిపోయితిని."



కొత్తా సుబ్బారావు పంతులు గారు (శ్రీ. శ్రీ. పూర్ణానందము పంతులుగారి కుమారుడు)



శ్రీ. శ్రీ. కొత్తా పూర్ణానందము పంతులుగారు(బెజవాడలో పూర్ణానందవిలాసమను అన్నసత్రమును కట్టించిన వారు

అక్సనాఫ్ యేమియు తోఁచక యూరకుండెను. మాకరు మంచమునుండి దిగి క్రింద మోకరించి కూర్చుండి "నన్ను క్షమింపుము. వర్తకుని చంపిన నేరమును నేను రేపే యొప్పుకొందును. వెంటనే నీకు విడుదలయై నీభార్య వద్దకు నీవు పోవచ్చును."

"చెప్పుట తేలికగాని నేను నీకొఱకు ఇరువది యారుసంవత్సరములు శిక్ష ననుభవించితిని. ఇప్పు డెక్కడికి పోవుదును? నాభార్య చని పోయి యుండును. పుత్రులు నన్ను మరచి యుందురు. నేను వెళ్లుట కవకాశము లేదు"

మాకరు నెత్తి బాదుకొనుచు, "నన్ను క్షమింపుము; నన్ను కొట్టినప్పుడైన [illegible] గాని లజ్జగాని లేకుండెను గాని నిన్ను [illegible] సిగ్గగుచున్నది నీకు నామీఁదనుండు ప్రేమచే నీవిదినమున నిజము చెప్పియుండలేదు. నన్ను క్షమింపుము. నేను దుర్మార్గుడను" అనిరోదనము చేసెను.

"భగవంతుడే నిన్ను క్షమించును! నీకంటె నేను దుర్మార్గుడ నేమో!" అని యనుచుండ నతని హృదయభారముతగ్గి యింటికి బోవు నాశ నశించెను. ఇంక చావునకు నిరీక్షించుచుండెను.

అక్సనాఫువలదని బ్రతిమాలుచున్నను మరునాడు మాకరు తాను చేసిన నేరమును తానే చెప్పెను. వెంటనే విడుదలకు పత్రిక వచ్చెను. గాని దైవ మాతని నీప్రపంచ దుఃఖమునుండి విముక్తుని జేసెను.




# నీ ఋణం బెట్లు తీర్తునో నీరజాక్షి!

[ఎవరో?]

మండుటెండలు లోకంబు మాడ్చునంత
తీవ్రముగఁ గాయు నీ చైత్ర దినములందు
దీక్షతోడుత నేను పరీక్షకొఱకుఁ
బాఠములు వల్లెవేయుచు బడలియుండి,
మెదడు బరువెక్కి సాయంసమీర సేవ
నొదవు విశ్రాంతి యనుచును మదిని దలఁచి
గదిని వెలువడి సౌధ ప్రఘాణరచిత
కుట్టిమస్థలిఁ గూర్చుండఁ గొంత సేపు;
ఎదుటి సౌధాన నీవప్పు డెదురుపడుచుఁ
గనుల పండువొనర్తు వకారణముగఁ
భ్రాత రరుణార్కుఁ జూచు నబ్జాతమటులు
నూతనోత్సాహ మొందు మచ్చేత మపుడు!
దర్శనీయ ముదావహ తావకీన
దివ్యమంగళ విగ్రహదీప్తు లస్మ
దంగముల సోఁకి, దక్షిణాశానిలప్ర
సార ఘనసార నీహారవారిపూర
నీరజారాతు లొసఁగఁగా నేరనట్టి
చల్లఁదనమిచ్చి బడలిక నెల్లఁ దీర్చు;
నపరిచితవయ్యు నింతసాయంబుఁ జేయు
నీఋణంబెట్లు తీర్తునో నీరజాక్షి!

# జానకి

(ఒక చిన్నకథ)

భమిడిపాటి రామసోమయాజులుగారు, బి. ఏ.



"చూసేవా, యీ గోదావరీ ప్రవాహంతో కొట్టుకొనిపోకుండా, ఆనక్షత్ర ప్రతిబింబాలు నీటిపై తేలి తమస్థానాలు వదలకుండాయే తీరుననిలచి వున్నవో?—అదుగో, అట్లాగే కాలంతో అంతరించి పోకుండా, నా చిన్ననాటనుండిన్ని జరిగిన సంగతులన్నీ నామనస్సులో పైకి తేలినిలచి వుంటవి." అన్నాడు సుదర్శనం మెల్లని గొంతుకతో.

"నిజమే, యెన్నాళ్లుగడచినా మరపుండదు కొందరికి. నాకు మాత్రం నిన్నటిసంగతు లీరోజునే జ్ఞాపకముండవ" న్నాడప్పారావు కొంచెం బిగ్గరగా.

సుదర్శనం పెద్దనిటూర్పు విడచేడు. తరువాత కొంతసే పూరకున్నాడు. ఏమిచెప్తాడా సుదర్శనం యీపైనని ఆత్రంతో, తొడమీద చేతిముడుకు నానుకొని, చేతిపై గడ్డమునానుకొని ఆ చీకట్లో కొంచెం కొంచెం కానవస్తూన్న సుదర్శనం ముఖంలోకి చూస్తూన్నాడు అప్పారావు. రెండునిముషా లట్లేవుండి, మరొకనిట్టూర్పు విడచినాడు సుదర్శనం. సుదర్శనం కళ్లంట నీళ్లు కారుతున్నవని అప్పారా వనుకున్నాడు. కొంచెం భయపడుతూనే అతడి కన్నులు తన వ్రేళ్లతో నంటి నీళ్లు రాలేదుకదా అని సంతుష్టిపడి ఆ సంతోషంవల్లనే కాబోలు మరం కొంచెం కదల్చే డప్పారావు, 'సుదర్శనాని కంతసులువుగా కన్నీళ్లు వస్తాయా?' అనుకున్నాడు మనస్సులో.

వా రిద్దరూ కూర్చున్న పడవ చల్లగాలికి కొంచె మూగుతున్నది. గోదావరిలోని పిల్లతరగలు ఆ పడవకు తగిలి "కళక్కు" మని చిన్నచప్పుడు కలిగిస్తున్నవి. అంధకారము ప్రపంచము నంతనూ తనచల్లని కడుపులో పెట్టుకొన్నది. ఆ ప్రదేశమంతా కేవలమూ నిర్మానుష్యం కాకపోయినా, నిర్మానుష్యమేమో అన్నట్టు లున్నది.—పడవల మీద నక్కడక్కడ కొందరు గాఢనిద్రాపరవశులై యున్నారు.

"అయితే, తరువాత నేమి జరిగింద" న్నాడు అప్పారావు, గడ్డంకింది చేయి మార్చుకుని.

— —

"ఇటువంటి విషయాలు జ్ఞాపకం వచ్చినప్పుడు, నాకు మనస్సులో అనేకములైన ఆలోచనలు పరుగులెత్తి పోతవి—దానితో ప్రపంచమే మారిపోతాను—అని మరొక పెద్ద నిట్టూర్పు విడిచి, అంతఃకాగంలో లీనమై పోయిన పవిత్ర గోదావరీ జలమునపు వాలితో నిండి పోయిన మాపులు [illegible], సుదర్శనం.

"అయితే. చివరకు, పురుషోత్తం జానకిని వదలి పెట్టివేసేగాదేమిటి?"

"వదలి పెట్టలేదుగాని, విశాఖపట్టణంలో పుట్టి నింటికి పంపించేశాడు తాను. జానకిమాత్రం పురుషో త్తం మనస్సు సంపూర్ణంగా మారి పోయిందనీ, తనమీద అతడికి ప్రేమలేశమున్ను లేదు సరిగదా, తాను అతడి తో బ్రతుకటే ఆతడికి అసహ్యమనీ తెలుసుకున్నది.— జానకికి, పెద్ద తెలివితేట లుండేవా అంటే నేను చెప్పలేను కాని, సామాన్యమైన తెలివి లేకపోలేదు. పురుషోత్తం ఆఖరుదినాల్లో అనుకున్నట్లు ముగ్ధమాత్రం కాదు. అందుచేత భర్తయొక్క మనస్సు ఆమె కనిపెట్టలేక పోతుందా? అందులోనూ పురుషోత్తం తనమనస్సు భార్యకి తెలియకుండా దాచ గలడా?—

"కొన్నాళ్లు, పుట్టింటికి వెళతానని జానకి అన్నప్పుడు, యెన్నోవిధాల బ్రతిమాలి, 'నీవు దగ్గర లే కుంటే నా బ్రదుకంతా అంధకారంగా వుంటుం'దని, 'నిన్ను విడచి నేను చెన్నపట్నంలో వుంటే, చదువే తోచ దనీ' చెప్పి పంపించకుండా వుండే, పురుషోత్తమ శర్మ,— యిప్పుడు జానకి నేవెళ్లను వెళ్లనంటూంటే బలవంతపెట్టి విశాఖపట్టణం దిగబెట్టి పోయేడంటే,—యెంతబుద్ధి తక్కు వపిల్లయినా జానకి ఆమాత్రంపోల్చుకోలేకుండావుంటుం దా? ఇదొక్క విషయమేనా? పుట్టింటికి పంపే ముందైనా ఒక నెలదినాలు తనతో భర్త సరిగా మాటే ఆడకపోవడమూ, తానేదైనా పొరపాటు పనిచేస్తే విప రీతంగా మండిపడి పోవడమూ, వంట యెంత బాగాచేసి నా, బాగులేదని తిట్టడమూ మొదలుగాగల మార్పులు అనేకం కనిపెట్టింది జానకి—

"విశాలాక్షిని చూచి పురుషోత్తం మోహించి నాడని కూడా, జానకికి తెలిసింది. తానంటే యింత అసహ్యానికి అదే హేతువని ఆమె బాగా యెరుగును. విశాలాక్షిని చాలాసార్లు జానకి చూచినది. మైలాపూ రులో వారింటికి అనేక సార్లు జానకి వెళ్లినది కూడాను. మొట్టమొదట కొన్నాళ్లు విశాలక్షి అంటే జానకికి చాలా ప్రీతిగానే వుండేది; ఆవిడ మాటంటే చాలా యిష్టంగానే వుండేది; కాని, క్రమ క్రమంగా, జానకి హృదయంలో విశాలాక్షిని తల్చుకునే సరికి మంటలు మండడము ప్రారంభించినవి. కలలలోకూడ విశాలాక్షి తనకు శత్రువుగా కానవస్తూండేది. మొట్టమొదట విశా లాక్షిని చూచినప్పుడు, ఆమె యెంత అందంగా వున్న దని అనుకున్నదో చివరకంత అసహ్యకరమైన దృశ్యం గా మారిపోయిం దామె ముఖం. ఆ సోగకన్నులూ, ఆ నిడుపైన ముక్కూ, ఆ పగబట్టిన పాముమూతివంటి మూతిన్ని—నిత్యం జానకి హృదయంలో తహతహ కలి గించేవి. కట్టకడపటికి అందంగావున్న స్త్రీలను యెవ రిని చూచినా ఆవేదనపుట్టడం ప్రారంభించింది జానకి మనస్సులో—"

"విశాఖపట్టణం తీసుకొనువెళ్లి తన్ను పుట్టినింట విడచి పెట్టడము, తిరుగా చెన్నపట్టణానికి తీసుకొని వెళ్లే అభిప్రాయంతో కాదని జానకి తెలుసుకున్నాది. అయినా చూతామని రెండు ఉత్తరాలు వ్రాసింది జానకి పురుషోత్తానికి - వచ్చి తన్ను తీసుకుపొమ్మని. ఆ రెండు ఉత్తరాలకీ జవాబు యివ్వడమే మానివేసేడు పురుషోత్తం. జవాబులు రాక పోవడము చూచి మరింత ఆందోళన యెక్కువై జానకి చెన్నపట్టణం ప్రయాణమౌదామని నిశ్చయించుకొన్నది. తల్లితోగాని, తండ్రితోగాని, ఒక్క నాతోతప్ప, మరెవ్వరితోనూ కూడా చెప్పలేదు. జానకి పురుషోత్తం చేసినమోసం— ఏసంగతైనా నాతో మాత్రంచెప్పేది. నేనంటే ఆమెకు విపరీతమైన నమ్మ కం. జానకిఅంటే నాకు కేవలం ప్రాణమే అని నీ వెరుగుదువు కదా!

"చెన్నపట్టణం తాను వెళ్లినట్లు, తనయింటివద్ద పురుషోత్తం లేకుంటే, మైలాపూరులో విశాలాక్షి బసకు తానువెళ్లి పురుషోత్తాన్ని పిలచినట్లు, 'నా ప్రాణేశ్వరుని నీవు పిలుస్తావా? గెంటించి వేస్తాను మా'డని గుడ్లెర్ర చేసి, విశాలాక్షి తన్నువీధిలోనికి గెంటి తలుపు వేస

నట్లు, ఒకనాటి రాత్రి జానకికి కలవచ్చింది. ఆ రాత్రియంతా, నిద్రపట్టక ఆకల తలచుకొని దుఃఖపడుతూ, యేవిధంగానైనాసరే చెన్నపట్టణం వెళ్ళి పురుషోత్తాన్ని కలుసుకొని, విశాలాక్షి వలలోనుండి ఆతడిని తప్పించి తిరుగా తన వాడినిగా చేసుకుందామని సర్వనిశ్చయం చేసుకున్న దాపతివ్రత. ఈ కాలంలో నిజమైన పతివ్రతలు లేరంటారు కొందరు. నాకుమాత్రం ఆనమ్మకం లేదు. కాలంతో సంబంధం లేకుండానే మహాత్ములు పుట్టుతూంటారు. జానకి మహాపతివ్రత. పురుషోత్తాన్ని నిజంగా దేవుడని నమ్మివుండేది. ఆపె ప్రేమ, అదొక మహాసముద్రం. నిముషం ఆతని విడచివుంటే యెంతో బాధ అనిపించేది, ఆతల్లికి. అదుగో! నాకుకళ్ళకు కట్టినట్లు కానవస్తున్నాది జానకిఇప్పుడు! ఆవాలుజడ;ఆ తేటకన్నులు; ఆ అమాయికపు పెదవులు; ఆ నిలుచుంట; పాపం! అప్పారావు! యీ తరువాత జానకి నామనస్సుకి యెన్నోసార్లు కాన వచ్చిందికదా; యెప్పుడైనా కంట నీటితోనే కానవచ్చిందోయి—అట్లా మారిపోయిందా తల్లిజీవితం! యీ భర్త మోసంచేసేవరకూ ఆపె కంట నీరు పెట్టియెరుగదు. ఒక్కసారి మహాసంతోషంలో నుండి మహాదుఃఖం లోనికి దిగి పోయిందా విశ్రబ్ధమకు.

"అట్లా నిశ్చయించుకొని, మరునాడు తల్లితో 'చెన్నపట్టణం బయలు దేరుతున్నా'నని చెప్పింది. తల్లికి చాలావింతగా తోచింది.— జానకి చాలా అమాయకురాలు; గడుసుదనమెరుగని ముద్దరాలు; మితభాషి— పొరుగింటికైనాసరే యెన్నడూ తానొక్కతే పోనేరనిది— తల్లికి చాలావింతగా తోచింది. 'పురుషోత్తం రాకుండానే, తానే తనంతట చెన్నపట్టణం బయలుదేరుతున్నదే— ఆహా! భర్తంటే అంతప్రేమ ఉంటుంది కదా!' అనుకున్నది మనస్సులో. అయితే, జానకి యెవ్వరి సహాయమూ లేకుండా చెన్నపట్టణం వెళ్ళజాలదని తల్లి బాగా యెరుగును.

"సరే! నీకంతగా వెళ్ళాలని ఉంటే వెళ్లు. మీ నాన్నగారూళ్లో లేరు: పోనీ! నే వస్తానూ?"

"అక్కరలేదు; సుదర్శనం వస్తాడు."

"అతడు వస్తానన్నాడా?"

"అన లేదు గాని రమ్మంటే వస్తాడు. ఈ దినమే బయలుదేరుతాను. మీయల్లుడు యేమికారణమునన్లరా లేదో,- అక్కడ ఆయన కెవ్వరూ లేరు"-

అని చెప్పి జానకి నన్ను పిలిచినది. నాతో తన దురవస్థంతా కన్నీరుతో చెప్పినది. "ఈ యాపదసమయంలో నాకు సహాయంచేసేవాడవు నీవేసుమా!" అని చెప్పి ముఖ మెర్రబారేలాగు యేడిచినది. నేను చెన్నపట్టణం తీసుకొనివెళ్ళి భర్తదగ్గర విడచిపెట్టుతానని చెప్పితే,- "అలాగునకాదు, కొన్ని దినాలు నీవక్కడుండి, నా ఆపద తొలగిపోయాక తిరిగి వత్తువుగాని లే!" అన్నది నేను 'సరే' అన్నాను. అంతకుముందు యీప్రపంచంలో నేనొక్కడనే కష్టజీవితం గడుపుతున్నాననుకున్నాను. జానకివంటి పుణ్యాంగనకి భగవంతుడిట్లు ఆపద లీయజాలడనుకున్నాను — పోనీ జానకి నన్ను పెండ్లియాడకున్నా, సుగుణవంతుడు, ప్రేమమూర్తియైన పురుషోత్తాన్ని పెండ్లియాడినది. ఆతడు బాగా చదువుకున్నవాడు, జానకికి ఆతనికి సముద్రానికి వెన్నలకు, ఉన్నంతటి ప్రేమ.— బాగానే ఉన్నది. జానకి సంతోషమే నా సంతోషము: జానకిసౌఖ్యమే నా సౌఖ్యము- అనుకొని కాలముగడపేవాడను. జానకి నన్ను పెండ్లియాడనప్పుడు నాకు పెండ్లి వరి వద్దని మానివేసినాను— సరే, ఆగొడవ యెందుకులే.— ఈదురవస్థంతా చెప్పినతరువాతసరే, జానకివిచారము నావిచారము జానకికష్టము నాకష్టము,— అంగువలన యీ యాపదలనుండి జానకిని తప్పించే భాగ్యమంతా, నాదేకదా అని, "ఈ యాపదసమయంలో నాకు సహాయంచేసేవాడవు నీవే సుమా!" అని జానకి యేయుద్దేశం మనసులో పెట్టుకొని అన్నదో తెలుసుకుని - తప్పకుండా జానకిదేవిని, యీవిపత్తునుండి రక్షించాలని మనోనిశ్చయం చేసుకున్నాను. చెన్నపట్టణానికి ప్రయాణం ఆరోజునే యేర్పరచినాము. నేను తనతో వస్తున్నాను కదా, తన కింక ఫరవాలేదని చాలా ధైర్యంతో బయలుదేరినది జానకి."—

ఇంతసేపటికి మళ్లీ పెద్ద నిట్టూర్పొకటి విడిచినాడు సుదర్శనం. అంత చీకటిలోనూ, ఆతడికన్నులు

మెరసినవి. గోదావరీప్రవాహం ఎడతెగకుండా సాగిపోతున్నది. ఆ అంతులేని ఆకాశంలో నక్షత్రాలు మెరిసిపోతున్నవి. ఆవేసవి రాత్రిలో సగముపైగా గతించినది. మంచమూగుచు నిద్రపోయే శిశువులను జోకొట్టుచున్నది పగలు విసిగిపోయిన గాలితోనిండి దినలో తనకే ఊపిరిసలుపకుండావున్న రాజమహేంద్రవరము నిద్రలోనున్న పసిపాపవలె శాంతం వహించినది.—అప్పారావు మరొక పెగ్గు గ్లాసులోకింకొకటేయి నాగభూషణం, తానుకూడా ఒకసిగరెట్టువెలిగించి, సుదర్శనంవైపు చూస్తూ పోతున్న ఆత్రంతో చూస్తున్నాడు. అట్లా కొంచెం సేపూరకుని, మళ్లీ చెప్పడం మొదలు పెట్టాడు సుదర్శనం. కథ యెంతసేపైనా నాకు విసుగ్గానూ మెల్లగానూ చెప్పుతున్నాడు సుదర్శనం. 'ఛీ!' అని ముఖం చిట్లించడం కూడామరచిపోయి వినోదంగా వింటున్నాడు అప్పారావు. 'పాపం! జానకి అంటే సుదర్శనానికి ఎంత ప్రేమఉండబట్టే, ఆవిడ చిత్రాన్నే తనవద్దనుంచుకుని యీ మహాప్రపంచంలో మరెవ్వరినీ దేనినిప్రేమించడంమాని కాలం గడుపుతున్నాడు! ఓహో! యేమి ఔదార్యంకదా! కూర్మంలో యీతడిగంభీరహృదయంలోకి తొంగి చూచినవాడు లేడు; యితని మెచ్చినవాడులేడు; పిచ్చివాడని కొందరూ, దొంగఅని మరికొందరూ. ఆహాహా! యీమానవప్రపంచం గుడ్డిదికాదా?' అనుకుంటున్నాడు మనస్సులో అప్పారావు. అప్పారావు యెన్నడైనా మెచ్చాడుకాని అనుజన్మమాత్రనిందించడం యెరుగడు. సుదర్శనం, నిట్టూర్పులు గ్రహించేసుకొని, తనవిషాదకావ్యం గానంచేయడం ప్రారంభించాడు ఈతీరున—

"అదినం మెయిలులో బయలుదేరినాము చెన్నపట్టణానికి, జానకి నేను— మరునాటి ఉదయం తొమ్మిదిగంటలకు చెన్నపట్టణంలో ట్రిప్లికేనులో పురుషోత్తంయింటికి చేరాముజట్కామీద. బండిదిగి లోపలకు వెళ్లినది జానకి. పెట్టె పరుపు తీస్తూబండివద్ద నిలువబడ్డాను నేను. లోపలకు వెళ్లి తిరుగావచ్చి సామానుతీసుకు నన్ను లోపలకు రమ్మన్నది జానకి. సామానుపట్టించుకొని లోపలకు వెళ్లినాను నేను. పురుషోత్తం లోపల చావడిలో క్రాపుదువ్వుకుంటున్నాడద్దంచూచుకొని. అప్పుడే స్నానంచేసివచ్చిన ట్లున్నాడు. దువ్వుకుంటూనే ఒకసారి నన్ను చూచాడు పురుషోత్తం. ఆచూపులో నారాక తనకిష్టంగాలేదని గ్రహించాను. అతడియిష్టం కోరకపోతే లేకుంటేదా అని మనస్సులో సంతుష్టిపడ్డాను. అతడేమైన చెప్తాడేమో చూస్తూ నిలుచబడ్డాను చావడిలో నేను. చావడి పక్కసావిడితో నే కలసివున్న వసారాలో కూర్చున్నది జానకి. పాపం ఆమెకు రైలుబండిలో రాత్రిఅంతా నిద్దురలేదు — అంతకుముందే లేదు చాలరోజులనుండి. రెండుమూడు దినములనుండి భోజనంకూడా సరిగా లేదు. క్రాపు దువ్వుకొని బనియను షర్టుతొడుక్కొని, ఒకతువాలు పైనవేసుకుని, నాతోగాని జానకితోగాని మాట్లాడకుండా జోడుతొడుక్కొని తానొక్కడే యింట్లో నున్నట్లు సంచరిస్తూ వీథిలోకి నడచేడు పురుషోత్తం. జానకి నావైపు జాలిగా చూచింది. ఆమెవైపు నేను చూచాను. అచ్చటనే చతికిలబడ్డాను నేను. ఒక అరగంట అట్లాగునే కూర్చున్నామిద్దరమూ సంభాషణ లేకుండానే. అంతలో తిరిగివచ్చాడు పురుషోత్తం. వచ్చి కోటువేసుకుని, బీరువాలోని పుస్తకములు తీసుకుని, జానకివద్దకు వచ్చాడు. జానకి లేచినిలువబడి తలవంచుకున్నది. అయిదునిముషాలు పురుషోత్తం ఆమె ముఖపద్మంమీదకు యీటెలవంటి చూపులు పంపేడు. అంతవరకూ జానకి తలవంచుకునే నిలచింది. తరువాత—



"జానకి లేచి నిలువబడి తలవంచుకున్నది."

"యేం? వంటైనా చేయకుండా అలాగు కూర్చున్నావు? నాభోజనమైంది. నేను కాలేజీకివెళ్తాను. టేబిలుమీదనున్నవి తాళాలు"

అని పురుషోత్తం వెళ్లిపోతూ నావైపు మరమర చూశాడు. అతడి చూపులనూ అతడినీ ఒకగడ్డిపరకకంటెనూ చులకనగా చూసి మాటలాడకుండానే కూర్చున్నాను నేను. 'యెంత మారిపోయాడు పురుషోత్తం' అనుకున్నాను. మేమిద్దరమూ చిరపరిచయులము. అయినా పలుకరింపలేదు నన్ను. 'సరే యితడిపలుకరింపునాకెందుకు? పోమ్మన్నా నే పోయేబాపతుకాద'ని మనస్సులో అనుకున్నాను నేను. పురుషోత్తం కాలేజీకి వెళ్లిపోయినాడు. జానకివెళ్లి వీధితలుపు మూసింది. తిన్నగా నావద్దకువచ్చింది. ఆపెముఖం విశాఖపట్టణంలోకంటె రైలులోను, రైలులోకంటె, యిప్పుడు మారింది. జానకిముఖం అంతనీరసంగా కానరావడ మంతకుముందెన్నడూ నేచూడలేదు. కన్నులులోతునకు పోయినవి: కాని అందులో తీక్ష్ణమెక్కువైంది.—తిన్నగా నావద్దకువచ్చింది జానకి—

"చూశావా సుదర్శనం?"

"అయ్యో చూశెను – సరేలే. యింతమాత్రానికి నీవు భయపడ నక్కరలేదు. యింకా చూడవలసినవి చాలాఉన్నట్టు కానవస్తున్నాది."

"తగుమనిషివస్తే పలుకరించకుండానే వెళ్లిపోయారే– యెన్నడైనా యీమనిషివద్ద యిట్టిప్రవర్తన యిదివరకు చూశావా?"

"అతడి పలుకరింపుకోసం నేను లేదులే."

"ఆమడతకుర్చీలో కూర్చో నీవు. వంటచేస్తాను నేను. నాకోసంనీవు శ్రమపడుతున్నావు: పాపం !"

"నాకు శ్రమన్నదిలేదు. అందులో నీకోసం యేమిచేసినా నా కదియంతా సంతోషాన్నే యిస్తుంది. నీకొరకై పొందిన అవమానంకూడా నాకు యిష్టంగానే వుంటుంది. వెళ్లిత్వరగా వంటప్రయత్నంచేయి."

జానకిలోపలకువెళ్లినది. నేను ఆసావడి, దాని ప్రక్కనున్న గది పరిశీలిస్తూ ఒకగంటకడపేను.

"పురుషోత్తమశర్మయొక్క— అద్భుతచరిత్రంలో, జానకి నాకుచెప్పిన తరువాతిది కొంత సంగ్రహించాను. ఆగంటలో– సావడి, గది, పరీక్షిస్తే నాకు యీ రెండువస్తువులు దొరికినవి. ఇరువది సంవత్సరములు వయస్సుగల ఒక అందమైనస్త్రీయొక్క— ఛాయాపటము వకటి– విశాలాక్షివ్రాసిన జాబు వకటి– ఒకదినంక్రిందట కూర్చబడి చేమూచినప్పటికి బాగానలిగిపోయియున్న మల్లెపూలచెండు వకటి. గదిలోపుస్తకములమధ్య దొరకినది ఛాయాపటము. అతడి కోటుజేబులో దొరకినది జాబు. గదిలో నొకమూలను పడియున్నది చెండు. ఆ జాబుచదివాను. అది యీతీరుగావున్నది.

'My dearest Purus'ıottam,

మీయింటి పక్కయింట్లోకి నేనూ మాఅమ్మకూడా రేపు వచ్చివేస్తాము. నీవద్దనుంచి యింతదూరంగా నేనుండజాలను. కాలేజీకి వస్తున్నాను కాని నామనస్సంతా నీపైనేవున్నది. యీసాయంకాలం అయిదుగంటలకు మాయింటికి నీవువస్తే చాలాసంతోషిస్తాను. యీదినం పౌర్ణిమ. నీవు నావద్దలేకుంటే నాకిది అమావాస్య అయిపోతుంది. తప్పకవస్తావని నమ్ముతున్నాను. మేడపైనుండి నీకొరకు గవాక్షమునవు చూస్తుంటాను. అయిదుగంటలకు నీవు కానరాకుంటే నే జీవింపలేను. యీకాగితం నీవుచదివినవెంటనే చింపి పారవేయి.

మైలాపూరు నీప్రియురాలు.
...-3-1920 (Visalakshi) విశాలాక్షి.'

ఆవుత్తరం పదగొండుగంటలక్రిందట వ్రాయబడినది నేవచ్చిననాటికి. ఈపాటికి విశాలాక్షి వెళ్లి పక్కయింట్లో దిగివుంటారు అనుకున్నాను. పూలచెండు నాకిప్పుడు బాగాఅర్థమైంది. ఆఛాయాపటంకూడా విశాలాక్షిదే కదా అనుకున్నాను. ఛాయాపటంలోనేచూసిన విశాలాక్షి నిలుబడియున్నది. కుర్చీపై చేతినానుకొని వదులుగావేసుకున్న వాలుజడ తెలుస్తున్నది. తెల్లనిజాకెట్టు, తెల్లని, అంచులేనిచీర, మేజోడు, జోడు, చాలా అందంగామాత్రం వున్నది. మెడలో నగలులేవు. సన్నని బంగారు గొలుసుమాత్రం పైటపైనుండే మెడలో వ్రేలాడుతున్నది. సోగకళ్లు, నిడుపైనముక్కు, చిన్న పెదవులు చక్కనిగడ్డమూ, అంతపలుచగా కాకుండా, లావుగా కాకుండావున్న శరీరం.

"అక్కడనుంచి [illegible] నాకు కొన్ని [illegible] ప్రతివాదాలు జరిగాయి. నేను యిప్పుడు [illegible] యం జానకితో చెప్పనా మాననా? చెప్పితినా, జానకి మహాదుఃఖంలో మునిగిపోతుంది. చెప్పకపోయినా జానకి [illegible] చివరకు చెప్పకుండా దాచాలని నిశ్చయించుకున్నాను. ఆ [illegible] పండమాత్రం తీసి నా [illegible] పెట్టను. [illegible] దాచాను. [illegible] పట్టినేశాను. అంతలో జానకివచ్చింది.

'[illegible] స్నానం చేయమన్నది జానకి. స్నానం చేశాను. భోజనం చేశాను. [illegible] భోజనం చేసి, యిల్లంతా [illegible] [illegible] కుంటానని చెప్పి [illegible] కొంతసేపు [illegible] వెళ్లినాను. నేను తిరుగా సాయంకాలం అయిదుగంటలకు [illegible] వెళ్లినాను. నేను యిల్లువిడిచి వెళ్లినతిరువాత [illegible] [illegible] గంటల [illegible] వచ్చినాడు పురుషోత్తం. జానకినాకు [illegible] చెప్పింది.

"పురుషోత్తం యింటికి వచ్చేసరికి జానకిగదిలో మంచంమీదనే పండుకొనియున్నది. నిద్రమాత్రం లేదు. పక్కపైన అక్కడక్కడ [illegible] పోయిన పుల్లల్లు [illegible] రేకులు చూచి, చాలా [illegible] చెందిన మనస్సుతో నున్నది జానకి. పురుషోత్తంవచ్చి, జానకి తాను విశాపట్టణంవచ్చి తీసుకొనిరాకుండా, యెందుకువచ్చిందని చాలా కోపం తోమాటలాడాడు. నాతో కలసివచ్చినందుకు మరింత మండిపడ్డాడు. నేను తనయింటివద్ద నుండకూడదని గట్టిగా శాసించాడు. ఆతడికోపం తగ్గినతిరువాత అమాయకురాలైనజానకి యీతీరున పురుషోత్తంతో పలికింది.

"నేను రెండుత్తరాలువ్రాస్తే నాకు జవాబైనా వ్రాయడం మానివేస్తారా? యిదిమీకు న్యాయమేనా? నామీద నింతకోపం మీకు కలగేటంతటి అపరాధం నేను యేమిచేశాను? నామీద కొండంత ప్రేమవుండేది మీకునిన్నాళ్లు. యిప్పుడు ప్రేమరవంతైనా లేదుసరికదా; నాపెండే అసహ్యంగా కానవస్తున్నాది. విశాలాక్షితో పరిచయమెక్కువైన కొద్దీ నామీద నయిష్టమెక్కువైందిమీకు. అదినేనెరుగుదును. నేను మీపాదాలే నాకు దేవుళ్లని నమ్ముకున్నాను. నన్ను యింత అన్యాయంచేసి త్రోసివేయడం మీకు న్యాయమా? యీమంచంమీద నీమల్లెపువ్వురేకులు యెట్లావచ్చాయి?మీకిదియేమైనా బాగున్నదా? విశాలాక్షిపాటి చేయను కానా నేను? ఇకనైనా మీరు ధర్మం విచారించండి. నన్ను చంపివేయకండి. నాప్రార్థన మన్నించండి" అని కాళ్లపైబడి, "మిమ్ము వదలలేక అతడి సహాయంతోవచ్చాను; పంపివేయమంటే అతడిని పంపివేస్తాను; మీరు యేమిచేయమంటే అదిచేస్తాను; యెట్లావుండమంటే అట్లా వుంటాను; విశాలాక్షితో స్నేహంమాత్రం" అనేసరికి కాలితో తన్నాడుపురుషోత్తం. "నోటికివచ్చినట్లల్లా పేలుతావేం?" అన్నాడట. "విశాలాక్షి పూసత్తితే నోరు నొక్కేస్తా"నన్నాడట. నోరు మూసుకొని వూరుకున్నది జానకి. సాయంకాలం నాలుగుగంటలకు, వంటచేయుమని చెప్పి సముద్రపుఒడ్డుకి షికారువెళ్లాడు గురాత్ముడు. నేను వెళ్లేసరికి వంటచేసుకుంటున్నది జానకి. నన్ను వెళ్లిపొమ్మన్నది జానకి. ఈవూరినుండివెళ్లను; మీయింటినుండి వెళ్లిపోతానని చెప్పి నాపెట్టెపరుపుతీసుకుని బయలుదేరి వెళ్లిపోతూ అప్పటప్పట వచ్చి నీక్షేమంకనుక్కుంటానులే, అన్నాను నేను. జానకి కన్నీరు విడిచినది. మాటాడలేదు. నాగుండె నీరైపోయినది. విచారిస్తూనే వచ్చాను నేను. వెళ్లి ట్రిప్లికేనులోనే మరొక స్నేహితుడి బసలోవుండి నాప్రయత్నాలేవో చేయడం మొదలుపెట్టాను."

మరొక పెద్దనిట్టూర్పు విడిచాడు సుదర్శనం. యిప్పుడాచీకటిలో సుదర్శనంకళ్లు నిప్పులవలె మెరుస్తున్నవి. పైన యెంత చల్లగా హాయిగానున్నా, సుదర్శనంలోమాత్రం చాలావేడిగా బాధగానున్నది. తాను యెంతసేపు మాట్లాడుతున్నా మరం కదల్పలేదు. మనిషి రవంత చలించలేదు. మెల్లగా, చెపుతున్నాడుకథ.అప్పారావుమాత్రం కథసాగినకొలదీ, అనేక రకాలుగా కూర్చుంటూ అనేకభావాలతోమునిగిపోతూ, కన్నీళ్లు తుడుచుకుంటూ విపరీతమైన ఆర్తంతో వింటున్నాడు. 'యెన్నికథలువిన్నా ఈప్రపంచంలో దుఃఖంతో నిండిపోయినకథలే వింటున్నానుకదా' అనుకుంటున్నాడు మనస్సులో. 'జానకిని పురుషోత్తం'కాలితోతన్నినప్పుడు తానైనా, సుదర్శనమైనా అక్కడనుంటే, పురుషోత్తే

పని యేమానా' అనుకున్నాడు మనస్సులో. 'బహుశా యీ పురుషోత్తం జానకిని తిరుగా విశాఖపట్నం పంపించి వేసివుంటాడు;తప్ప'దనికూడాఅనుకున్నాడుఅప్పారావు. ఆలాగున అనుకొని "ఆతరువాత నేమిజరిగింద"న్నాడు. అప్పారావునకు కథవింటూన్నప్పుడు అనేకసార్లు కన్నీళ్లువచ్చేయి. సుదర్శనంమాత్రం ఒకసారైనా కంట లెడి పెట్టుకోలేదు. మళ్లీ ప్రారంభించాడు సుదర్శనం.

"నేను కనుక్కుంటే,విశాలాక్షి జాబులో వ్రాసిన ప్రకారంనచ్చిమరునాడేపురుషోత్తంయింటిపక్కయింట్లో బసచేసినట్టులు స్పష్టమైనది. తరువాత విశాలాక్షిని నేను చూచాను. విశాలాక్షిమాత్రం అందకత్తె అగును. పురుషోత్తంకంటె గట్టిగుండెవున్నవాడైనా మోహిస్తాడేమో ఆమె గాలిసోకితే. కాని జానకి భార్యయై యుండగా యెంత మూర్ఖుడైనా, ఆపె యెంతఅందంగా వున్నా యెట్లామోహించాడా అనుకుంటూ! అయితే జానకిలోవున్న ఘనతయేమో పురుషోత్తం గ్రహించుకోలేకపోయాడు. వేయిపుటములుపెట్టినా విశాలాక్షి జానకికి సాటివస్తుందా అనేసంగతి తెలుసుకోలేక పోయాడు. కొంచెం చామనచాయగానుండి చూచేసరికి అందంగా చురుకుగా కానవచ్చేస్త్రీ కాకపోగానే మోహం తగ్గింది పురుషోత్తానికి. విశాలాక్షితో స్నేహం వృద్ధికాగానే జానకిపై అనురాగమే నశించింది పురుషోత్తానికి. నాకు మాత్రం విశాలాక్షిని చూచేసరికి వళ్లుమండింది. జానకికి కాదు: నాకు సవతివలె కానవచ్చింది విశాలాక్షి."—

కంటినీటితోనే పకపకనవ్వాడు అప్పారావు. సుదర్శనం విశాలాక్షిని యిప్పటికిన్నీ తనసవతిగా భావిస్తూన్నట్లు చిరునవ్వైనా నవ్వలేదు.

"యేవిధంగా, పురుషోత్తాన్ని జానకిని యెప్పటి భార్యాభర్తలుగా చేయడమా అనే ఆలోచనతో నాకు రాత్రి నిద్దురపట్టలేదు: భోజనముపై మనసుపోలేదు.ఒకసారిపురుషోత్తాన్నికలుసుకుని అతడికి ధర్మోపదేశంచేతామా అనుకున్నాను. మరొకసారి మరియేదైనామోసంచేసైనా విశాలాక్షికిన్ని పురుషోత్తానికిన్నీ కలసంబంధం తెగగొడదామా అనుకున్నాను. మరొకసారి జానకిచేతనే సెమ్మదిగా బ్రతిమాలించి, చాకచక్యంగా కథనడపి పురుషోత్తం బుద్ధిమార్చుదామా అనుకున్నాను. ఇంకొకసారి విశాలాక్షితో స్నేహంచేసి ఆమెకు యెవరినైనా భర్తనుకుదిర్చి వారికి వివాహముచేయించి తద్వారా విశాలాక్షికి పురుషోత్తంపైనున్న వ్యామోహం పోగొడదామా అనుకున్నాను. ఏమియుతోచక నెత్రివానివలె కొంత కాలం రాత్రులుకూడా ఆత్రిప్పికేను వీధులంటతిరిగాను. కట్టకడపటకు యెందుకైనా మంచిదని విశాలాక్షితో పరిచయంగలిగించుకుందామని నిశ్చయించుకున్నాను. విశాలాక్షి తల్లితో వకనాడు వెళ్లి మాట్లాడాను. ఆమెకు విపరీతమైన స్వాతిశయమున్నట్లు గ్రహించాను. కూతురు బి. యే. పరీక్షకు చదువుతున్నాననేగర్వం, తాను యమ్ ఏ. పాస్ అయినంతటిగొప్పదనం గలిగించిందావిడ హృదయంలో.—తనకూతురు చాలా తెలివితేటలు కలదనీ, క్లాసులో అందరికంటెను బాగా చదువుకుంటున్నాదనీ చెప్పినదామె. తెలుగులో కొంచెం కవిత్వంకూడా చెప్పుతుందని చెప్పింది. ప్రసంగవశంగా చెప్పినట్లుగా ఆవిడతోనే కవినని పరిచయంచేసాను. బి. యే. పాసయినానని చెప్పినాను. కొన్నిగ్రంథాలు నావి అచ్చుపడినవనిచెప్పినాను. "ప్రేమగీతావళి" ఒక కాపీ ఆవిడకు యిచ్చినాను. ఉదయంగాని, సాయంకాలంగానివస్తే విశాలాక్షి యింటివద్ద నుంటుందనిచెప్పి,ఆమె విశాలాక్షినిచూచి మరీ నేను చెన్నపట్నంనుండి వచ్చాలనీ, కవులంటే విశాలాక్షికి మరిభోజనముకూడా అక్కరలేదనీచెప్పినది. ఈరూపంగా విశాలాక్షితో మైత్రికలగడానికవకాశం దొరకినందుకు చాలాసంతోషిస్తూ నాబసకువచ్చాను.

"క్రమక్రమంగా విశాలాక్షికీ పురుషోత్తానికీ ప్రేమ హెచ్చిపోయింది. కాలేజీ చదువూ అవకాశం వుంటే చూచుకునే వ్యాపారంగా కానవస్తున్నది వారికి. జానకిఉనికి వారికిచాలా కష్టంగా కానవస్తున్నది.పురుషోత్తం జానకితో మాటలే చాలావరకూ కట్టిపెట్టాడు. ఆయింట్లోజానకి బ్రదుకుచాలా హీనంగా వున్నది. పురుషోత్తంయింట్లోకి విశాలాక్షి జానకి ఉన్నప్పుడే రెండు మూడుసార్లువచ్చినది. జానకి వంటచేసుకుంటూన్నప్పుడు వారిద్దరూ గదిలోకుర్చీలపైకూర్చుని మాటలాడుకోవడమూ, నవ్వుకోవడమూకూడా ప్రారంభించినారు.వారికంతధైర్య మెట్లాకలుగుతున్నదా అని అనుకోనేది

తెలుస్తున్నది. సుదర్శనమాత్రం కాలం నడచిపోతూం డడము పరికించనే లేదు. జానకిని మనసులో తలుచు కుంటూ, యీప్రపంచమంతా 'అనిత్య'మని 'రసహీన' మని అనుకుంటున్నాడు. కొంతసే పట్లాగేఉండి తిరుగా ప్రారంభించాడు చెప్పడం సుదర్శనం "అయితే, జాన కిని మళ్లా విశాఖపట్నం పంపించివేశాడా యేమిటి" అన్నాడు అప్పారావు.

"ఒక ఉదయపువేళ విశాలాక్షిని దర్శించాను నేను. ఆపెతల్లి అంతకుముందే ఆపెతో చెప్పడంవల్ల, "ప్రేమగీతావళి" అప్పటికే చదవడంవల్ల నేనంటే కొంత గౌరవంకుదిరింది విశాలాక్షిమనస్సులో నేవెళ్లి నప్పుడు నాతో చాలామర్యాదగా మాట్లాడింది విశా లాక్షి. విశాలాక్షితో మాట్లాడుతూంటే అదొకతమాషాగా వుంటుంది. మాటలాడేటప్పుడుచేతులు, పెదవులు, కను బొమలు, కన్నులుకూడా అభినయించేస్తవి. ఒకొక్కవిష యంఒకొక్క క్రొత్తఉత్సాహంతో చెపుతూంటుందివిశా లాక్షి. మంచిచురుకున్నదిబుద్ధిలో. ఆదినంపుసంభాషణం తాకవిత్వపూ ఆగోలతో నిండిపోయినది. తరువాతనొకటి రెండుసార్లాపెతో మాట్లాడడముతో బాగాపరిచయం కలిగింది. ఈసంపాదించిన పరిచయాన్ని జానకి విపత్తు తొలగించే మహాకార్యంలో ఉపయోగపరచడాని కవ కాశం లేకుండానే కొన్ని ఆటంకములు వచ్చేయి. అది దైవకృతం: నేనేంచేస్తాను ?

"క్రమంగా జానకిని యింటివద్దవిడచి, రాత్రి వేళకూడా, విశాలాక్షియింట్లోనె గడపడము ప్రారం భించాడు పురుషోత్తం. జానకి ఆపదలు హెచ్చైపో తున్నవి. నా కేమిచేయడానికీ అవకాశం కానరాలేదు. ప్రతిదినమూ జానకిచెప్పే విషయాలువింటే శరీరం కంపించిపోతూంది. జానకి చాలానీరసపడిపోయి వికృ తాకారం దాల్చింది. పురుషోత్తానికి జానకిచేసే ప్రతి పనీ అసహ్యంగానే కానరావడం ప్రారంభించింది జాన కిని చూస్తేనే వళ్లుమండుతూంది అతడికి.

"ఒంటరిగా రెండుమూడురాత్రులు యింటిలో పరుండి, నిద్రలేక, మహాఆవేదనతో బాధపడి, బాధపడి, జానకి, ఒకనాటిరాత్రి తలుపులు తెరచుకొని వీధి లోనికివచ్చి విశాలాక్షి యింటితలుపు కొట్టింది. కొంచె మునేపటివరకున్నూ యెవ్వరును తలుపుతీయ లేదు తరు వాత విశాలాక్షితల్లివచ్చి తలుపుతీసి "యెవరువార"న్న ది. జానకి ప్రత్యుత్తర మీయకుండనే లోపలకు ప్రవే శించి తొందరతొందరగా అప్రక్కనున్న గదివద్దకు నడ చినది. ఆగదిలో పెద్ద కాంతితో దీపము వెలు గుచున్నది. ఒక మంచ ముపై విశాలాక్షిన్ని, పురుషోత్తం దగ్గరగా ఒకరిచేయి నొకరు పట్టు కొని కూర్చున్నారు. జానకిలోనికి పరుగెత్తి విశాలాక్షిని చేయి పట్టు కొని పైకీడ్చి తా నా మంచముపై కూర్చుకొ న్నది. పురుషోత్తానికి ధైర్యం యావత్తు పోయి, ఒకనిముషం అక్కడనే స్తంభమువలె నిలచిపోయి తరువాత పైకివెడలిపోయి నాడు. విశాలాక్షికూడా



"జానకి......తా నామంచముపై కూర్చున్నది,"

భయపడి ఆవలకుపోయినది. రెండునిముషములు లాంతరుప్రక్క పైననేకూర్చుండి తరువాత లేచినది జానకి. జానకికిభయం పోయినది. దుఃఖంవిపరీతమైపోయిమెండిపెత్తిపోయినది. అంతలో విశాలాక్షితల్లి పెద్దగుడ్డుకేసుకునివచ్చి జానకిని మెడపట్టి వీధిలోనికిగెంటి తలుపు బిగించినది. నాలు గైదుసారులు చేతులు రక్తముచిమ్మేటట్లు తలుపుబ్రద్దలు గొట్టి దుఃఖములో గోడ్డుమీదకువచ్చి నిలువబడి పెద్ద రోదనముచేసినది జానకి. ఈబ్రహ్మాండమంతా తనపైనలిగినట్లు కానవచ్చింది జానకికి. మహాప్రళయమధ్యంలో తానునిలచినట్లు తోచింది జానకికి. భగవంతుడు ఆనాడే చచ్చిపోయాడనుకున్నది జానకి. ఆతలుపునేసి తలపగలగొట్టుకొని ఆత్మహత్య చేసుకుందామనుకున్నది జానకి. కొంతసేపటికి కాగోడ్డుమధ్య కూలబడినదిజానకి. లోలోనకుళ్లి కృశించిపోయినదిజానకి. ఆహాహా! ఈ విశాలమైన బ్రహ్మాండంలో దిక్కూదిశా లేకపోయింది మహాపతివ్రతయైన జానకికి! కొంతసేపట్నుండి తిరుగా యింటిలోనికివెళ్లి చావడిలోపడి కళ్లువరదైపోయేలాగు రోదనం చేసింది జానకి."

ప్రారంభించినప్పటి శాంతంతో చెప్పలేకుండా వున్నాడు సుదర్శనం. ఆతడిమనస్సు పెద్ద కొరుచిచ్చై పోతున్నది. కొలిమిలో యినుమువలె అతడి హృదయం పైకితెలియకుండానే కాలిపోవుచున్నది. నిట్టూర్పులు క్రమంగా దగ్గర పడుతున్నవి. అప్పారావు అప్పటప్పట ఊపిరి తీసుకోడంకూడా మరచిపోయి వింటున్నాడు యీదుఃఖచరిత్రం. వారికి బైటనుమాత్రం ప్రపంచం చాలాచల్లగా, శాంతంగా, హాయిగా వున్నది. ఆపవిత్రగోదావరి, వారిపడవక్రిందుగానే నిశబ్దంగా, మందగమనంలో అతిగంభీరమైన హృదయంతో సాగిపోతున్నది.

మరునాడు జానకితో చెప్పకుండా, పురుషోత్తం విశాలాక్షిని ఆపెతల్లినితీసుకొని రత్నగిరికి బయలుదేరాడు. రత్నగిరి వకపల్లెటూరు. విశాలాక్షి తండ్రికట్టించినయింట్లో బసచేశారు. సెలవుదినాల్లో విశాలాక్షి, తల్లి, అక్కడనేవుండడము మామూలు. వారికక్కడ భూములున్నవి. మంచి పలుకుబడికూడా వున్నది. జానకితో చెప్పకుండా ఆడువారిసలహాప్రధానంచేసుకుని పురుషోత్తంరత్నగిరియెట్లాపోయాడాఅనుకుంటూ. జానకినివదల్చుకోవడాని కదేమార్గమని తోచింది కాబోలు! యెట్లా తెలిసినదో జానకికి. మరుచటిరైలులో బయలుదేరినది జానకి, రత్నగిరికి జానకికి. భయం, సిగ్గు, జేలదనంవదలిపోయి, ఆడుపులివలె సాహసం యెక్కువైనది. అవకాశంలేక, జానకి నాతోగూడా చెప్పలేదు రత్నగిరి వెళ్లుతానని. రత్నగిరినుండి నాకొక ఉత్తరముమాత్రం వచ్చినది జానకివద్దనుండి. అది యిట్లాఉన్నది.

"సుదర్శనానికి నమస్కారాలు!"

"నాతో చెప్పకుండా, విశాలాక్షిని దానితల్లిని తీసుకుని, నాభర్తగారు రత్నగిరి వెళ్లడంచాత, ఆసంగతి అదృష్టవశాత్తు నాకు తెలియడంచాత నాకు నిన్ను కలసికొనుటకు అవకాశం లేకపోవడంచాత నీకు చెప్పకుండా యిక్కడకు ఒంటరిగా వచ్చాను.

"యిక్కడకువచ్చి తిన్నగా విశాలాక్షి యింటికి వెళ్లాను. నాభర్తను కలసికొన్నాను 'నాకుతెలియకుండా అట్లా నన్ను చెన్నపట్నంలో వదలిపెట్టి వెళ్లిపోవడము న్యాయమా అని అడిగాను. అందుకు నాకు సమాధానం చెప్పలేదు. నాతో ఆయనమాటలాడలేదు. నాకువారింటభోజనమైనా పెట్టలేదు. పెట్టినా నాకు భోజనాపేక్ష లేదులే. నాబ్రదుకు చాలా హేయంగావున్నది. నేనీ తీరుగా యెన్నోదినాలు జీవించలేను. ఈఆకాశంక్రింద నాకు నిలవడానికి నీడ కానరాకుండావున్నది. నీవొక్కడవుతప్ప నాహృదయ మెరిగినవా రింకొక రెవ్వరూ లేరు. నన్ను చూచి జాలిపడేవారు లేరు. నాచావున కేడ్చేవారు లేరు. నేను చావడం విశాలాక్షికేకాదు నాభర్తకుకూడా చాలా ప్రీతిగావుంటుంది. విశాలాక్షితల్లి చాలా దుర్మార్గురాలు; సాహసురాలు. నేను చచ్చిపోవడానికి సిద్ధంగానేవున్నాను. ఈస్థితిలో బ్రతకడముకంటె చావే చాలాసుఖం. నీవిచ్చుటకు వంటనేవస్తే నిన్ను చూచి మరీచేస్తానాపని. ఈజాబందగానే యిచ్చటికి వస్తావని నమ్ముతున్నాను.

రత్నగిరి.　　　　నీసోదరి, జానకి"

ఇంకొకసారి నిట్టూర్పులో మునిగాడు సుదర్శనం. ఈసారి సుదర్శనం కన్నులు మూసికొనిపోయినాయి. ప్రపంచమంతా భూకంపంవచ్చి కదలినట్లు కదలుతూం

దా అనిపిస్తున్నది తడికి. అప్పారావునకు మతిపోయినది. ఈసారి మాటామంతీ మానివేసేడు అప్పారావు. తొడుక్కొన్నషర్టు ముందువైపంతా తడిముద్దైపోయింది అప్పారావుకి. 'కొంపదీసి జానకి ఆత్మహత్య చేసుకోదుకదా!' అనుకొని బిగిసిపోతున్నాడు అప్పారావు. అంతలో ఒక పెద్దగొలుసు తెచ్చి పడేశాడు పడవవాడు అప్పారావు వెనక. త్రుళ్లిపడి ఆ చప్పుడికి సుదర్శనంమీద పడిపోయాడు అప్పారావు. దానితో యిద్దరకూ కళ్లు బాగా విచ్చవి. తెల్లవారుతున్నాదని తెలిసినది. "అప్పుడే తెల్లవారిపోతూందోయి" అన్నాడు అప్పారావు. సుదర్శనాని కదోక వింతగా కనిపించలేదు కాబోలు 'ఔను' నేనా అనలేదు. సుదర్శనం చెప్పడం అందుకున్నాడు.

"వెంటనే రత్నగిరికి వెళ్లాను నేను. విశాలాక్షి యింటికి వెళ్ళగానే జానకి నూతిలోపడి ప్రాణములు విడిచిందని తెలిసినది. ఊరిలో కొందరు నాతో రహస్యంగా 'విషంపెట్టిచంపి నూతిలోపడవేసి తెల్లవారక ముందే దహనంచేశారు. ఆవిడంతట ఆవిడే నూతిలో పడలేదన్నారు.' కారణమేదైనా, జానకి యీలోకం విడచి, నన్ను కడలేని దుఃఖంలో విడచి వెళ్లిపోయింది."

సుదర్శనం చెప్పడం ముగించాడు. కన్నులు మూశాడు. ఆకన్నులంట కొంచెము నీరు కారుతున్నది.

[చిత్రకారుడు: భ. రా. సో.]



# రహస్యప్రణయము

సముద్రాల వెంకటరాఘవాచార్యులు గారు

సకియ! భవదీయమగు కటాక్షమ్మునుండి
పరువులిడువాగతీత లావణ్యలహరి
బ్రదుకు కడు స్వల్పమయ్యెను బ్రతి నమస్క-
రించి యర్పింప నీదు దాతృత్వమునకు.

ఎంతహరిభక్తిపరులు లజ్జించినారు
కోమలశ్యామలారాళకుంతలముల
ప్రేమ గోప్యవారలె సంచరించిరనుచు
వినుట నారెంత మది విలాపించినారు.

దుఃఖబాష్పోపహతము నాదు హృదయంబు
త్రుంపబడియెనుగద తునాతునకలట్లు
కాని నీవేత్రహాత్రికి సగ్గమగువారి
కెన్నఁడునుగాని శాంతి లభింపఁబోదు.

నీపదములందు గర్వము న్విడచి ఫాల
తలము సోక మ్రొక్కెద విశుద్ధప్రియమున
నీహృదయసన్నిధిని వస్త్రనియతి నున్న
నీవపరిచితుఁడవటందు నేల నన్ను?

ఓరహస్యప్రణయినీ! మహోగ్రదుఃఖ
కాననముల నిర్భీతి మజ్జ్ఞాను పగిది
ప్రేమవాగ్దాన నూత్న నివేదనమ్ము
దాల్చి భవదుపలబ్ధికై తిరుగువాఁడ.





# అత్తవారిల్లు

అప్పిరిట్ల సూర్యనారాయణమూర్తి గారు

చేతిలో కాగ్డపట్టుకొని రామరాజు లోనికి వచ్చెను. అప్పుడే సీతమ్మ కాఫీతయారుచేసి 'రండి అయింది' అని ముందటింటి వైపునకు వచ్చుచుండెను.



"ఉత్తరం వచ్చింది" అని రామరాజు మెల్లగా ననెను.

సీత—ఎవరిదగ్గరనుంచి?

రాజు—చెప్పుకో చూతాం;

సీత—బహుశా మానాన్నగారి దగ్గరనుండి అయివుంటుంది.

రాజు—లేదు. గోవిందరావుదగ్గర నుంచి

సీతమ్మ ఆమాట వినడంతోనే కొంచెం నివ్వెరపడ్డాది. "ఏమీ! యెందుకు రాలేదూ. ఇంక నాలుగురోజులే కదా ఉంది పండుగ?" అని అనుకుంటూ రామరాజుతో లోనికి పోయింది. తరువాత వీరిరువురు కాఫీ పుచ్చుకొనేగదిలో కూర్చొని కాఫి తాగుచున్నారు.

కాని సీతమ్మకు మట్టుకు యేమీ తోచనట్లు తడబడుచున్నది. రామరాజుకికూడా కొంచెం మనసులో అదేదో ఒకలాగ ఉంది.

సీత—ఏమిటండీ యిలా చేశారు; మావాళ్లు యీ మాటు?

రాజు—అయితే నేమిలే; పండుగ యిక్కడ కూడదా యేమిటి?

సీత—ఎక్కడఅయితే ఏమని మీ కుంటుంది. వచ్చి యెన్నాళ్లయిందో తెలుసునా? ఇన్నాళ్లిదాకా మావాళ్లు ఊరుకోడం చూస్తే...

అని కొంచెము మొఖం వేలవేసుకొని బొటనవ్రేలు క్రింది రాస్తూ చూస్తున్నాది. ఇంతలో రామరాజు ఆమెవైపు చూచుసరికి ఆమెకంటినుండి చిన్నకాలువ కూడా ప్రవహించ నారంభించినది. నిజం చెప్పకపోవడం తప్పుచేసినానని రామరాజు సీతను దగ్గరకు

తెచ్చుకొని "లేదులే, మామయ్యగారు రాశారు. యిదిగో రేపు యిలాంటప్పటికి మీ అమ్మ చల్ల చేస్తూ ఉంటే, గోకురు కోసానికి నువ్వు, రత్నం—

సీత—పోనీలెండి, మీ మాట లెప్పుడు యిలాగే. 'నాయనా అన్నానికి రా' అని మీ అమ్మ పిలిచినప్పుడో?

* *

రాత్రి యేడుఘంటలయింది. రామరాజు అప్పుడే వీథిలోనుండి వచ్చి, గదిలోనికి వెళ్లేసరికి, సీత పెట్టెలో తనబట్టలన్నియు సర్దుకొనుచుండెను.



రాజు—హార్మోని మరిచిపోకు.

సీత—హార్మోని యెందుకు? అక్కడ నేను పాడాలా యేమిటి?

రాజు—మీనాన్నకి పాటఅంటే సరదా. తీసుకెళ్లు. ఇక్కడ నేనేమిటిచేస్తాను, నువ్వు లేనిదే? అదెందుకు తీస్తున్నావు?

సీత—ఏది?

రాజు—ఘరేది. నువ్వు యిప్పుడు బట్టమడతలో పెడుతున్నది.

సీత—అది లేకపోతే యేలాగు? నారాజు నా దగ్గర ఉండొద్దూ!

రాజు—సరేలే—నీవస్తువులన్నీ పెట్టుకో, ఏదీ మరచిపోవద్దు. మళ్లీ యెన్నాళ్లకువస్తావో!

ఈమాట అనేసరికి ఆమెభావంలో మార్పు కలిగింది. మరియేమీ మాటాడలేదు. పెట్టె తాళం వేసేసింది. రామరాజు కూర్చొన్న సోఫాదగ్గరకు వచ్చి అతనికాళ్ల దగ్గర కూర్చొని, అట్టే అతనిమొగంవేపు చూస్తూన్నది.

రాజు—ఏం? అలాగ చూస్తున్నావు. రేపు యిలాంటప్పటికి మీరత్నం అక్కయ్య ఒచ్చిందని అతిసంతోషంతో గెంతుతాడు. నువ్వు పాడుతూఉంటే—

సీత మాట్లాడలేదు. అట్లే చూస్తున్నాది.

రాజు—మీఅన్నయ్యరేపనుకు వస్తాడేమో. క్రిందటిమాటు మీ నాన్న ఒచ్చారు కదూ!

సీత యింకను అట్లే చూచుచున్నది. మాట్లాడలేదు.

రాజు—జట్కా దిగేసరికి—నాకట్లోనే ఉంటుంది మీ అమ్మ; రెండుచేతుల్తో కౌగలించుకుంటుంది.

అప్పటికి నేమీమాట్లాడలేదు. ముఖవైఖరిచూస్తే యేడ్పువచ్చేటాగున్నట్లు ఉంది. అది చూచి రామరాజునకు యేమియు తోచక— "సీతా! యెందుకే అలాగున్నావు" అనేటప్పటికి ఆమె రెండుచేతులూ మెడచుట్టూ వేసి "రాజ్యం" అని వెక్కి వెక్కి యేడ్చుచున్నది. కాని అతను ధైర్యవంతుడు. మనసులో ఆమెను విడుచుటకు విచారముగలవాడయినా, పైకి "అలా, యేడవకూడదు—తప్పు. పుట్టింటికి వెళ్లేటప్పుడు యెవరైనా యేడుస్తారా తప్పుకదూ!"

తప్పో, ఒప్పో ఆమెకు తెలియదు. కంటికి వెంటమట్టుకు నీళ్లువస్తున్నాయి.

రాజు—అలా యేడవకు. ఇన్నాళ్లు నాదగ్గిర ఉన్నావుకదా! మరికొన్నాళ్లు అక్కడ ఉండవాలం లేదా? కని పెంచారువాళ్లు.

ఇట్లిరువురు భావసముద్రంలో మునిగేటప్పటికి, వేళ యెంతయిందో వాళ్లకి తెలియలేదు.

ఇంతట్లో "భోజనానికి వేళయింది రండి" అని క్రిందనుండి కేక రావడంతోనే వదల లేక వదలుతూ, రామరాజు, సీతమ్మ క్రిందికి దిగివచ్చినారు.

* * * *

రయిలువేళ అయింది. బండీ వాకట్లో నిలబడ్డాది. సామాన్లన్ని దానిలో పెట్టడం కూడా అయినది. కాని రామరాజు, సీతమ్మ యింకా మేడ దిగలేదు. "వేళ అయింది" అని కేక క్రిందినుండి వచ్చింది. ఒకఅడుగు ముందుకు, ఒకఅడుగు వెనకకు వేస్తూ సీతమ్మ దిగుచున్నది. "ఉత్తరాలు రాస్తారు కదూ" అని మరీమరీ చెప్పి, "అత్తమ్మగారూ వెళ్తా" నని, తనఅత్తగారివద్ద సెలవుపుచ్చుకొని, సీత బండియెక్కినది. రామరాజు స్టేషనువద్దకు వెళ్లి టిక్కెట్టుకొని, వెంటవెళ్లు మనిషితో 'జాగ్రత్త' అని హెచ్చరించి, రయిలుపోయిందాకా అక్కడే ఉండెను. ఇంతలో రయిలు వచ్చింది. అంతలో రయిలు పోయింది. రామరాజు ఒక్కడూ అక్కడ నిలబడి, కొంతసేపయ్యేటప్పటికి, ఇంటికివచ్చి, తనమంచం మీద వెల్లకిల పడుకున్నాడు.

* * * *

రెండునెలలు అయింది. సీతమ్మ పోస్టు జవానుకొరకు యెదురుచూస్తూ వీధి అరుగు మీద కూర్చుంది. అనుకున్నట్లే ఒక కవరు వచ్చింది. కాని యీమాటు తనపేర లేదు. వాళ్లనాన్నగారికి వచ్చింది. వెంకటచలంగారు కాలేజినుండి అప్పుడే యింటికి వచ్చిరి. బల్లమీద పెట్టబడిన ఉత్తరంతీసి చదువుకొని యేమియు ననక జేబులోనుంచుకొని వీధిలోనికి వెళ్లిరి. సీతమ్మకుమాత్రం మనసు ఆందోళనగా ఉంది. తనరాజ్యం రమ్మని రాసినారని మాత్రం ఊహచేసుకుంది. రాత్రి భోజనాల దగ్గర వెంకటచలంగారు "అమ్మన్నను త్వరలో పంపమని అల్లుడు రాశినాడు."

కనకమ్మగారు మాత్రం అప్పుడే కూతురిని పంపివేయవలెనని విచారిస్తున్నాది. భోజ

నాలు అయినతర్వాత తల్లీ పిల్లా ఒకచోట కూర్చుండిరి.

కనకమ్మ—ఇవ్వాళ త్రయోదశికాదూ; అయితే నవమివెళ్లిన దశమినాడు వెళ్ల వచ్చును.

సీత—నువ్వు యీమాటు నాతో రావాలి.

కనకమ్మ—నే నెందుకే మీవాళ్ల యింటికి?

"మీవాళ్లు" అనేసరికి సీతమ్మ కొంచెం కొత్త చూపు చూసింది. కాని ఏమీ అన లేదు. ఎంత కని పెంచినా యింతేకదా అని అనుకుంటూ కనకమ్మ కంట నీరు పెట్టుకుంది. అది చూచి సీతమ్మకుకూడా యేడుపువచ్చింది. ఇక ఎవరిబాధ వారి కన్నీట్లో ప్రవహించిన తర్వాత రోజులు లెక్కపెడుతూ యిద్దరూ గడిపినారు.

* *

నవమి వెళ్లింది. దశమి వచ్చింది. సీతమ్మ ఆవేళ మెయిల్లో అత్తవారింటికి వెళ్లడానికి ఉంది. బట్టలన్నీ పెట్టెలో పెట్టుకొని పసుపుకొమ్ములు, కుంకుం మూటలోకట్టి యిచ్చినజరీ చీరకట్టుకొని నిలబడ్డాది. వాళ్ల నాన్నగారు వీధిలో బెంచీమీద కూర్చున్నారు. "చెల్లెమ్మా వేళయింది రా" అని వెంటగానున్న సీతమ్మ అన్న తొందరపెడుతున్నాడు. రత్నం అక్కడ నిలబడి చూస్తున్నాడు. ఏమి తెలియదు. చిన్న పిల్లడు. కనకమ్మ కంటివెంట నీటి చుక్కలు



రాలుతున్నాయి. కూతురు చూడకుండా ఉండవాలని, యెంత ప్రయత్నం చేసినా అవి రావడం మానలేదు. సీతమ్మమాట చెప్పనే అక్కరలేదు. ఇంట్లో పెద్దది ముసలమ్మ "అలా యేడవకూడదు, తప్పు. యెవరింటికివాళ్లు వెళ్తారు" అని యెంతచెప్పినా వారిదుఃఖమునకు మేర లేదు. "అమ్మా వెళ్తాను" అనేమాట నోటినుండి వచ్చుచూ వచ్చుచూ గద్గదికంలో ఉండిపోయింది. "పదే చెల్లెమ్మా" అని అన్నయ్య తొందర చేయుచున్నాడు. ఇంక సీతమ్మ బండి యెక్కింది. బండి నడవసాగింది. కనకమ్మ కళ్లు మూతవెయ్యకుండా తూము దగ్గర బండీ మళ్లినంతవరకు చూస్తూ వీధి అరుగుమీద నిలబడియుండెను. రాధారిమనుష్యులు యెవరు వెళుతారో ఆమెకు తెలియదు. ఎదురుగుండా ఉన్నవారు అరుగులమీద నిలబడ్డారు. ఎవరున్నారో తెలియదు. సీతమ్మ బండీలో అల్లే యుండెను. కొంతసే పయ్యో

టప్పటికి, బండీ నిన్చిపోయింది. సీతమ్మ పైటచెరగంతా తడిసేను. సీతమ్మ చీరంతా చీరకొంగులకే.

రాత్రి యెనిమిదిఘంట లయింది ఊరికి వచ్చేసరికి. బండిలో సామానంతా లోపలికి వచ్చేసింది. భోజనాలు అయినాయి. తరువాత మేడమెట్లెక్కి సీతమ్మ గదిలోకి వచ్చింది. వచ్చేసరికి—ముహూర్త మాత్రంలో రామరాజు, సీతమ్మ ఒకరిలో నొకరున్నారు. సీతమ్మ సంతోషానికి మేరలేదు. రామరాజు ఆనందానికి అవధిలేదు.

* * * *



రాజు—అయితే నాకోసానికి యేమిటి తెచ్చావు?

సీత—మీ కేమిటి కావాలో అదే.

రాజు—ఏమిటిగదా!

సీత—'నేనే' అనేసరికి రామరాజు సీతనుమరీ దగ్గరకు తీసుకున్నాడు.

రాజు—అయితే యీకొంటెమరక లేమిటీ. చీరకొంగుకి?

సీతమ్మ జవాబుచెప్పలేదు. వేరు విధంగా ప్రత్యుత్తరం ఇచ్చుచున్నది.

సంపూర్ణము

# పలుకరాదష్మా!

గేయము (హారీత కృతము)

శకుంతల—

చెలువుగని తొలివలపుఁ గొంటినా!
వలచిచెలువము కలిమిఁగంటినా!
చెలువువలపుల చెలిమినేమో
తలఁపుఁ దలఁపునఁ బులకరింతలు
పలుకరాదమ్మా! నావలపుదలఁపు.

ప్రియంవద—

తలఁపులేని పలుకువెలయదు
పలుకులేని తలఁపు దెలియదు
తలఁపుఁబలుకులు దారసిల్లినఁ
దోలకరించును బులకరింతలు
పలుకవేమమ్మా! నీవలపు సొలపు.




# హిందువుల సృష్టిపరిశీలన

[విద్యావిషయికము]

సేపూరి లక్ష్మీ నరసయ్యగారు, యం. ఎ., యల్. టి.

ఉ. "పూచిన పూలలోని వలపుల్ నన లెత్తు చివుళ్ల నిగ్గు కా
ణాచితనంబు లేఁదలిరునన్ జెలువందెడి మంచుచిన్కులం
దోఁచు నిసర్గకాంతియుఁ గనుంగొనినంతన నీదురూపమున్
జూచిన యట్టులుండెఁ బొడసూపవదేటికి భక్తవత్సలా!"

[శ్రీ శేషాద్రి రమణకవులు]

దాదాపు 25 సంవత్సరములకు బూర్వము సృష్టిపరిశీలనావిషయములు ప్రాథమికపాఠశాలలందే కాక యితరపాఠశాలలందు గూడ వాడుకకు వచ్చియుండలేదు. ఇది విద్యాక్రమమునందు నూతనముగా జేర్పబడినది. నూతనముగా జేర్పబడినదని చెప్పుటచేత దీనిని నూతముగా గనిపెట్టిరనిగాని ఇదివరలో దీని విషయమెవరికి దెలియదనికాని తలంపవీలు లేదు. సృష్టితోడనే సృష్టిపరిశీలన పుట్టినది. మనుజుడు కొంతజ్ఞానవికాసము గలిగినప్పటినుండియు సృష్టిమహిమను జూచి యద్భుతపడుచుండును. మన మేవిధముగా తెలిసినవాని ద్వారా తెలియని విషయములను గురించి నేర్చుకొనుచున్నామో అదేవిధమున సృష్టిపరిశీలనమందు విషయసృష్టినుండి నిర్విషయ సృష్టిజ్ఞానమును, తద్వారా దైవజ్ఞానమును, కలుగునని శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. ఈ విషయమునుమనస్వానుభవమునుండిగ్రహింపవచ్చును. కావున సృష్టిపరిశీలన యొక నూతనాంశముకాదు. ఇదిమిక్కిలి పురాతనమైనది.

పూర్వమునుండియు మనవారీ సృష్టిపరిశీలనమందు పేరువడసినవారు. కొందరు శాస్త్రజ్ఞులు సృష్టిపరిశీలన జ్ఞానమును దేహసౌఖ్యము నిచ్చు మార్గములయందు వినియోగించుచున్నారు. మనపూర్వులన్ననో, వారు సృష్టిపరిశీలనమునుండి తత్త్వసారము గ్రహింపగలిగిరి. "యోగాభ్యాసము ప్రప్రథమమున సృష్టిపరిశీలనతో గలిగినది. కప్పలయొక్కయు, పాములయొక్కయు, తాబేళ్లయొక్కయు అలవాట్లను గమనించుటయందు యోగాభ్యాసపు రహస్యములు తెలిసినవి" అని శ్రీయుత, నాగేంద్రనాథ మజుందారుగారు తమ "పురాతన హిందూదేశవిద్యాచారిత్రము"నందు వ్రాసియున్నారు. రాతినడుమ జీవింపగలిగిన కప్పకేయభ్యాసము స్వాభావికముగ గలిగినదో, ఆయభ్యాసమును మనుష్యుడు సాధించిన

మొదల, యోగాభ్యాసమును సాధించిన వా రగును. మనపూర్వుల సృష్టిపరిశీలన జ్ఞానముం డినదో కాని ప్రతి వస్తువునందును దైవమహి మను గాంచుచుండెడివారు. అందు చేతనే ప్రహ్లాదునిచే సవిస్తరముగ బలికించిరి.

"క. ఇందుగలఁ డందు లేఁడని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన,
నందందే కలఁడు, దానవాగ్రణీ! వింటే."

వారిసృష్టి పరిశీలనజ్ఞానము సాహి త్యాదికళలయందుగూడ గానవగును. "ఎవరు హిందువుల యొక్క గాఢమైన సృష్టి ప్రేమ నంగీకరింపరో, వారు వాల్మీకి కాళిదాస కవుల యొక్కయు, హైందవకళానైపుణ్యము యొక్కయు, అంశమును గ్రహింపజాలరని తలం చుచున్నాను" అని హ్యావెల్ (Havell) దొరం గారభిప్రాయ పడియున్నారు.

సంస్కృత పండితుల యభిప్రాయములే కాక మనకు మన యాంధ్రవాఙ్మయమున గొన్ని నిదర్శనములుగూడ నున్నవి.

"భాగవతము"నందు

"అందు గుళింగ నురిం దగిలి యొక్క చిక్కంబులో నైచినంజూచి దుఃఖించి కుళింగ పక్షి యిట్లనియె.

చ. అడవుల మేఁతమేసి మన
మన్నుల కెన్నఁడు నెగ్గుసేయ కి
క్కడ విహరింప నేఁ డకట,
కట్టడి బ్రహ్మ కిరాతుచేతులోఁ
బడుమని వ్రాసెనే నుదుటఁ
బాపపుదైవము కంటికింత యె
క్కుడు బరువయ్యెనే బ్రదుకు
గోమలి యేమని నేర్తుఁ జెల్లరే.

క. ఒకమాటు మసల నందఱఁ
బ్రకటించి కిరాతువలలఁ బడఁజేయక ని
న్నొకతిఁ వలఁబడఁ జేసిన
వికటీకృతదక్షుఁడైన విధి నేమందున్.

ఉ. ఱెక్కలురావు పిల్లలకు
ఱేపటనుండియు మేతగానమిం
బొక్కెడు గూటిలో నెగసి
పోవగనేరవు మున్ను తల్లి యీ
దిక్కుననుండి వచ్చునని
ద్రిప్పనిచూడ్కుల నిక్కినిక్క న
ల్దిక్కులు చూచుచున్న వతి
దీనత నెట్లు భరింతు నక్కటా"

అనుభాగమును జదివినవారి కందరికిని మన పూర్వుల సృష్టిపరిశీలనజ్ఞానము భూతదయ యుద్యోతకమగును.

మరియు "భారతమున" మహాప్రస్థానిక పర్వమున—

"చ. జనులు నుతింపగా సుకృత
సంపదఁ జేసియు మర్త్యభావముం
గనియును జెంద కిట్లునికి
కార్యమె ద్రౌపది భీమసేను స
ద్యునుఁ గవలం ద్యజించుటకు
సువ్రత చాలితి చాలవయ్యెదీ
శునకము విడ్వ నిత్తెఱఁగు
సూరిసుతుండగు నీకు పర్వమే?"

అని శోధింపబడినప్పుడు ధర్మరాజు తన వెంట వచ్చిన శునకమును విడువనొల్లక

సీ. "...........జేసెద నేను విన్న

గీ. ఎంబు భీమముఖ్యులును బ్రాణదియుఁజచ్చి
లేను వారల విడువక యేడ్చుచున్న
వత్తురే తోడవచ్చి చావని శునకము
విడవకుండుట తప్పుగా నుడువఁ దగునె.

అని ప్రత్యుత్తర మిచ్చెను. వెంటవచ్చినశునక మెంతటి కృతజ్ఞతకు కారణమైనదో దీనివలన దెలిసికొనవచ్చును.

శకుంతలనుబెంచినశకుంతములు, సీతకై పోరాడిన జటాయువు "పంచతంత్ర" నీతిచంద్రిక"లయందు వచ్చుపశుపక్ష్యాదులు జంతువర్గము నుండి గ్రహింపబడిన పాత్రలే యని వేరుగ జెప్పవలసిన యవసరము లేదు. "రంగయ్య అను సోమరి బాలుడు" పశుపక్ష్యాదుల నుండియే నీతి గ్రహించి యొట్టివాడాయెనో మనము విని యున్నాము. "అహింసా పరమో ధర్మః" అనునీతివాక్యము సృష్టి పరిశీలనమునుండి గలిగినదని చెప్పవచ్చును.

మరియు "భాగవతము" నందలి ఈక్రింది పద్యమును జూడుడు.

ఉ. అన్నములేదు కొన్నిమధు
రాంబువులున్నవి త్రావుమన్న, రా
వన్న, శరీరధారులకు
నాపదవచ్చిన వారియాపదల్
క్రన్నన మాన్చి, వారికి సు
ఖంబులు సేయుటకన్న నొండుమే
లున్న దె, నాకుదిక్కు పుర
షోత్తముఁడొక్కఁడెసుమ్ము, పుల్కసా!"

"నృసింహశతక" కర్త [illegible]మముగా భగవంతుని గొలిచెనో చూడుడు:

"సీ. అడవిపక్షులకెవ్వఁ డాహార మిచ్చెను,
మృగజాతి కెవ్వఁడు మేతబెట్టె
[illegible] కెవ్వఁడు [illegible] మొసఁగెడిప్పించె,
చెట్ల కెవ్వఁడు నీళ్లు చేదిపోసె
స్త్రీలగర్భములందు శిశువు నెవ్వఁడు పెంచె,
ఫణుల కెవ్వఁడుపోసెఁ బరగవిషము
మధుపాళి కెవ్వఁడు మకరంద మొసరించెఁ
బసుల కెవ్వఁ [illegible] బచ్చిపూరి;

గీ. జీవకోట్లను బోషింప నీవెకాని
లేరెయొకదాత లేఁ [illegible] వెదకి చూడ
భూషణవికాస, శ్రీధర్మపురనివాస,
దుష్టసంహార, నరసింహ, దురితదూర."

"భక్తచింతామణి" యందలి ఈ పద్యమును దిలకింపుడు:

"శా. ఏయాహారం [illegible] బాలుఁడు నె
స్సై [illegible]
జీవుల్ లేని [illegible] క్రిమి
చేఁ [illegible] యందుండి యం
తో యందంబగు [illegible] ప్రా
దుర్భావ మొందించునో
[illegible] నీ వెకద దే
వా! భక్తచింతామణీ!"

శ్రీ శేషాద్రిరమణకవు లేవిధముగా సంస్మరించుచున్నారో కనుడు:

"చ. కలువలతేని వెన్నెలని
గారము తెమ్ము లతావిప్రోవులన్,
కలకలలాడు బాలుర మొ
గమ్ములు, లేఁదలిరాకు జొంపపుం
దళతళలన్ దలంచుకొని
నన్ భవదీయ మనోజ్ఞకల్పనా
కలనము గొంత దేటపడుఁ
గాదె బుధాళికి భక్తవత్సలా!"



# కలవరము

పి. వి. రమణయ్య గారు

తెలుఁగు పుస్తకాల సైఁడి తేనెపై నెక్కి
సలువరాణికి మ్రొక్కి - నాపైని గృపను
సారథ్య మొసరింప సమ్మతింపఁగను
మంజరీ మాణిక్యమయమగు స్రోసఁ
బయనమైపోతిని భావిష్యకేని
దినరాజు కేవెల్గు దివ్యకాంతులను
దేదీప్యమానమై దిక్కులనిండ
చూపుదారని లేక చూడఁగల్గితిని
భూమి నాకసమునుఁ బాల్పొందునట్లుగఁ
బచ్చపచ్చని గయాల్ పై ముత్యములును
జిగురుమామిళ్లనుఁ జోలఁగి పోసు
గంపఁగో [illegible] గాలి రసంబు
సెలగుమ్మలలిసుతి చెంగట సవ్విధము
ఘల్లుఘల్లను కాలి గజ్జెలు నాఁగ
ప్రకృతికాంతను జూచు భాగ్యంబుగలిగెఁ
గొంతదూరమునవ్వ కోసిసీమలను
వనవిహారముసల్పి బడలికఁ బడియు
శౌర్యసంపద వాని జన్మహక్కుగను
ఆకుకదలుమాత్ర సతిభీకరముగ
తలమెత్తి చెవియొగ్గి ధ్వనినాలకించి
తోకకుచ్చును మెల్లఁ దూగాడఁజేసి
కోరచూపులుచూచు కొదమ సింగముల
నాసాత్తులని దేవి సవ్వచుఁ బలుక
నాశ్చర్యమగ్నుఁడ నై పోతినపుడు
అంతట రివ్వున సంతరిక్షమునఁ
గనుమూసి తెఱచిన కాలంబులోన
నెట్లుపోయెనో యేమొ యెఱుఁగ నారథము!
బ్రహ్మవర్చస్సునఁ బ్రబలిన కాంతి
విస్తరించిననుదుర్ వెడఁదయురంబు
పసిఁడి నిగ్గులు దేలు బాహు యుగంబు
ఉరువునై కన్పట్టు నుదరభాగమున
యజ్ఞోపవీతంబు లందంబు నొసగ
గోష్పదమంతటి కొద్దిజుట్టలర
నెఱసిన వెండ్రుకల్ నిగనిగలాడ
సన్నుఁ జూచుచుఁ జిఱునవ్వునవ్వుచును
సన్నయ తాతయ్య నాకుఁ గన్పింప!
నానందబాష్పంబు లపుడు రాలగను
బడితెల్ల గగురుపాటొదయించె నాకు
ఏదియో మనమున నిచ్చ జనించి
సెలవుగై కొననెంచఁ జిత్రమాభూమిఁ
బామనచాయయుఁ జలువదోవతియు
కర్ణకుండలకాంతి గప్పుకొనంగ
ద్విగుణీకృతంబైన దివ్యకాంతియును
మొగమునఁ జిఱునవ్వు మొలక లెత్తగను
అతిపవిత్రమైనట్టి యావిలోకనము
భారతార్థముఁ దేటపఱచుచునుండ
మాతండ్రి తిక్కన! మన్నింపుమనుచు
కండ్లారఁ జూచి నేఁ గాళ్లపైఁబడితి!
మెలకువ వచ్చె నేమియు లేదు! నేను
బోరగిలంబడి మ్రొక్కుచునుంటి.

# రాజగృహము

కె. నరసింహాచార్యులు గారు

భారతయుగమున ప్రసిద్ధివహించిన రాజ్యములలో మగధరాజ్యము ఒకటి. ఆకాలమున బృహద్రథుడనురాజు గిరివ్రజము రాజముఖ్యపట్టణముగా మగధ నేలెను. వానియనంతరము కడుబలిష్ఠుడగు జరాసంధుడు రాజై, దుష్టుడై జనకంటకుడైనందున కృష్ణార్జునులసహాయమున భీమునిచే మల్లయుద్ధమున మృతినొందెను. పిదప జరాసంధతనయుడగు సహదేవుడు కొంతకాలమురాజ్యమేలెను; కాని వానితర్వాతివంశానుక్రమము మన కంతచక్కగా తెలియకపోయెను.

క్రీ. పూ. 500 మొదలు క్రీ. శ. 1200 వరకు బింబిసారాదిశైశునాగవంశస్థులును, చంద్రగుప్తాది మౌర్య వంశస్థులును, పుష్యమిత్రాదిసుంగవంశస్థులును, శంకరాదిత్యాది బ్రాహ్మణవంశస్థులును, శ్రీగుప్తాదిగుప్తులును, గోపాలాదిపాలవంశమువారును మగధరాజ్యమును పాలించిరి. తర్వాత ఈరాజ్యము క్రమముగా మహమ్మదీయుల యధీనమయ్యెను.

ఇందు క్రీ.పూ. 500 సం. మున ఆమగధ నేలుచుండిన బింబిసారుడు బుద్ధుని సమకాలికుడు. జరాసంధాదులకు ముఖ్యపట్టణముగా నుండిన గిరివ్రజమే బింబిసారునికి రాజధానియై యుండెను. ఇతనికాలమున గిరివ్రజము కుశాగారపురము, రాజగృహమను పేరుల బిలువబడుచుండినది. గోరథము, ఋషభము, వైహారము, ఋషిగిరి, చైత్యకాద్రియను 5 పర్వతముల మధ్యనుండునది కాన దీనికి గిరివ్రజ మనునది సార్థకనామము. ఈపర్వతములకు ప్రస్తుతము వైభారగిరి (వ్యవహారగిరి), విపులగిరి, రత్నగిరి, ఉదయగిరి, శోణగిరి అని పేళ్లు. ఇవి కాకయష్టివనగిరి, గృధ్రకూటగిరి, శైలగిరియను శిఖరములుగూడ నగరమును చుట్టియున్నవి. (1 పటముచూడుడు) కుశాగారపురమును యష్టివనము, కరండవేణువనము, అనుప్రఖ్యాతివహించినవనములు కలవు. నగరమునగల మరియొకవిశేషాంశమేమనగా నిచ్చటచ్చట గలవేడినీటిబుగ్గలు. ఈబుగ్గలు సరస్వతీనదియొక్క పొడవునను, వైభారగిరియొక్క తూర్పుసానువునను, విపులగిరియొక్క పడమటిసానువునను కలవు. (1)గంగాయమునా, (2) అనంతరిషి, (3) సప్తరిషి, (4) బ్రహ్మకుండము, (5) కశ్యపరిషి (6) బియాన్‌కుండము, (7) మార్కండేయకుండము అనునవి వైభారగిరియందున్నవి. ఇందు సప్తరిషిబుగ్గలు చాలవేడియైనవి. విపులగిరియందుగల బుగ్గలు (1) సీతాకుండము, (2) సురాజకుండము, (3) గణేశకుండము, (4) చంద్రమాకుండము, (5) రామకుండము, (6) శృంగిరిషికుండము అనునవి విపులగిరిలోనివి. హుయాన్‌ట్సాంగ్ (చీనాదేశయాత్రీకుడు) క్రీ. శ. 650 సంవత్సరమున నీనగరమును చూచినప్పుడు ఈబుగ్గల నుండి నీరు ప్రవహించుటకు మార్గములను కట్టినందముగా సింహ, గజరూపములుగా గట్టియుండినట్లు చూచితినని వ్రాసియున్నాడు.

పంచపర్వతపరివేష్టితమగు రాజగృహము శత్రుదుర్భేద్యమైనది. దీనిపర్వతానగరము సుమారు 25 మైళ్లు పొడవైనది. దీనిలోపల 4½ మైళ్ళ పొడవుగల మరియొక కుడ్యావరణము గలదు. ఈ కుడ్యములు హిందూదేశమునగల పురాతనకట్టడములలోకల్ల పురాతనమైనవిగా నున్నవి. గోడలలోని శిలలు 3 మొదలు 5 అడుగులనిడివికలిగి చక్కగా సమర్చబడి వాటిమధ్యసందులయందు నూకరాళ్లు నిండియున్నవి. మట్టికాని, గారకాని ఇందు కానరాదు. ఉత్తరదక్షిణములయందు గల పర్వతములవరుసలమధ్య బాణగంగాలోయ కలదు. ఈలోయకు పూర్వపశ్చిమములయందు గలగోడలు మాత్రము వాటిపూర్వోన్నతియగు 12 అడుగులఎత్తుగలిగి

యున్నవి. కాని ఛక్కానశైల, వ్యవహార, విపుల, రత్న గిరులపైగలకుడ్యములు శిథిలములై 7 లేక 8 అడుగుల ఎత్తునకు మించక యున్నవి. గోడలమందము ఒక్కొక్క పర్వతముపైనను ఏకరీతిగా నుండక వ్యత్యాసపడియున్నవి. ఈవెడల్పు సరాసరి 17½ అడుగులైయున్నవి. కోటలనుగురించిన విశేషమేదియనగా ఎచ్చటగోడలు బలహీనముగా నున్నవో యచ్చట గోడలవెలుపల బురుజులను ఆధారకుడ్యములనుకట్టబడియున్నవి. ఒక్కొక్క బురుజును పాదమున 47 నుండి 60 అడుగుల పొడవును, 34 నుండి 40 అడుగుల వెడల్పును కలిగియున్నది. ఇట్టి బురుజులు ఏడు బాణగంగాలోయకు సమీపమునను, నాలుగు * పురాతనరాజగృహముయొక్క ఉత్తరద్వారసమీపమునను, అయిదు వ్యవహారగిరిపైనను కలవు. మరియు గోడలలోపలప్రక్క కుడ్యోపరిభాగములకు ఎక్కుట కనుకూలముగా గోడమందములోనే మెట్లుగాని ఏటవాలుమార్గములుగాని కట్టియున్నారు. ఇట్టిఏటవాలుమార్గములు (Ramps) సోపానమార్గములును శోణగిరి యుత్తరపార్శ్వమున గానవచ్చుచున్నవి. ఒక్కొక్క సోపానము 5½ అ. వెడల్పును 15 అ. పొడవును కలిగి యున్నది. కోటకు ఇట్టిసంరక్షణలేకాక అచ్చటచ్చట భటులుండుటకు గుహలును మండపములును గూడ కలవు. వ్యవహారగిరియందు నిట్టిసంరక్షకగృహములు రెండు కలవు. ఒకటి శోణగిరియందుగల వేడినీటి బుగ్గలకు పైన కలదు. దీనినే పరివ్రాజకులు, ఫాహియాన్, హుయన్‌త్సాంగులు వర్ణించిన ప్రసిద్ధిచెందిన పిప్పలశిలాగృహమని పోల్చుకొనియున్నారు. (4 పటము చూడుడు.)

పిప్పలశిలాగృహము భూమట్టమునుండి 26 అ. ఎత్తునందుండి, శిఖరమున 81½ అ. పొడవును. 78 అ. వెడల్పును నైయున్నది. ఈగృహమున క్రిందిప్రక్క 6½' × 3½' అడుగుల వైశాల్యముగలగదులు తూర్పున రెండును, ఉత్తరమున అయిదును, పశ్చిమమున ఒకటియు, దక్షిణమున ఒకటియు నున్నవి. వీటిద్వారముల ఎత్తు 3 అడుగులు. తొలుదొలుత నీగదులను కోటను సంరక్షించు భటుల విశ్రమార్థము కట్టియుందురు కాని, కాలక్రమమున నివి సన్యాసుల తపఃప్రదేశములయ్యెను.

ఇంకను ఇట్టిబురుజులు రత్నగిరియందు తూర్పుశిఖరమున నొకటియు, విపులగిరియందు నాలుగును ఉన్నవి.

## గృధ్రకూటగిరి

ఈపర్వతము కిరీటాకృతి కలిగి రత్న, శైలగిరుల మధ్య నిలచియున్నది. శిఖరోపరిభాగమున శృంగారమగు పచ్చిక బయళ్లావరించి, గంభీరమై రాజగృహమును చుట్టియుండు పంచపర్వతములలో నెత్తయి సదా గృధ్రావాసమగుటంబట్టి సార్థకనామమై యున్నదని ఫాహియాన్ వర్ణించియుండెను. పర్వతశిఖరము తూర్పు పడమరలుగా సాగి ఉత్తర దక్షిణములుగా వెడల్పు తక్కువయైయున్నది. (3, 4 పటముల చూడుడు.)

పర్వత పశ్చిమావధియందు అగాధమగు పల్లము కలదు. ఈపల్లమునకు తూర్పున నొకరాతియందు ఊట యొకటి కలదు. బుద్ధుడు రాజగృహమున నుండినకాలమున నీయూటనీటియందే తన కాషాయాంబరము నుదికి యారవేసికొను చుండెను. బింబిసార చక్రవర్తి బుద్ధుని సందర్శనార్థమై విశేషపరివారసమేతుడై పోవునపుడుపయోగించిన సోపానమార్గ మింకను గృధ్రకూటగిరియందు కానవచ్చుచున్నది. ఈమార్గము కోటగోడలపై గట్టబడినందున నగరసంరక్షణ విషయమునగూడ మిగుల నుపయోగకారియై యుండెను. మరియు నీమార్గము ఉదయగిరి శిఖరమునుండి గృధ్రకూట శిఖరమువరకు మధ్యగల లోయకడ్డముగా గట్టబడి నగరమున కుత్తరదక్షిణముల గల కోటగోడలను జేర్చుచున్నవి. పెనురాలచే గట్టిన యీమార్గము 20 మొదలు 24 అడుగులవెడల్పు గలిగియున్నది. మార్గమధ్యమున బింబిసారుడు రథావతరణమొనర్చి పాదచారియైన ప్రదేశమునను, బుద్ధ సందర్శనార్థమేగునపుడు తనవెంట వచ్చుచుండిన పరివారమును వెనుక నిలిపినస్థలమునను స్తూపములు కలవు.

తథాగతుడు (బుద్ధుడు) ఈప్రపంచమున నవతరించి తన యహింసాధర్మమును లోకమునకు బోధించు కాలమున చాలవరకు గృధ్రకూటముననే వసించియుండెను. ఇచ్చట బుద్ధుడు శరీరవ్యాయామార్థము చరించుచుండిన శిలయొక్కటి గొప్పది కలదు.

* నూతనరాజగృహము మరియొకటి కలదు. దీనినిగురించి వెనుకవ్రాయుచున్నాను.

దానిప్రక్కనే 60 అ. చుట్టుకొలతయు, 15 అ. ఎత్తును కల మరియొకశిల కలదు. బుద్ధునిమాతులుడగు ద్రోణోదనుని కుమారుడు, బుద్ధునిభార్యయగు యశోధరకు సోదరుడునగు దేవదత్తుడు బుద్ధునియౌన్నత్యమునుజూచి యసూయాపరుడై తత్పదవికి తాను రాజూచుచుండెను. కాని విఫలమనోరథుడైనందున బుద్ధుని చంపినయెడల తన కాయున్నతపదవి లభింపగలదను దురాశతో ప్రవర్తించుచుండెను. గృధ్రకూటమున బుద్ధు డుండిన కాలమున దేవదత్తు డాయనపై నొకగొప్పశిలను వైచెను. బుద్ధుని కందువలన నేబాధయు రాదయ్యెను. ఈ రాయివైచినప్రదేశమున కనతిదూరమున కొండచరియలో నొకస్తూపము కలదు. ఇందే బుద్ధుడు, సద్ధర్మపుండరీక, సురంగమాది సూత్రముల నుపదేశించెను. ఇచ్చట మరియొకబ్రహ్మాండమగుశిల కలదు. ఆనందుడను బుద్ధశిష్యుడు ఇచట సమాధిగతుడై యుండగా మారుడు* గృధ్రరూపము దాల్చి ఆనందుని సమాధిభ్రష్టుని గావింపనెంచి కృష్ణపక్ష నిశీథములయందు వికృతధ్వనుల జేయుచు భయపరచుచుండెను. భయభ్రాంతుడై ఆనందుడేమిచేయుటకును తోచక నిర్విణ్ణుడై యుండగా బుద్ధుడు దివ్యదృష్టిని ఆనందుని దీనావస్థను కనుగొని "ఇవి యన్నియు మారుని దుశ్చరితములే కాన నీవు భయపడవలద"ని అభయ మొసగెను.

## పిప్పలశిలాగృహము,( 6 పటముచూడుడు.)

వ్యవహారగిరియందలి వేడినీటియూటలసమీపమున పిప్పలశిలాగృహము కలదు. బుద్ధుడు ఈగృహమున నివసించుచుండెను. గృహమునకు వెనుక నొకఅగాధమగు కనుమ యందు అసురగృహము కలదు. సమాధినభ్యసించు సిద్ధు లనేకులు పిప్పలగృహమున నుండిరి కాని సింహ, వ్యాఘ్ర, సర్పాదిక్రూరసత్వస్వరూపములు కాన వచ్చుచుండుటవలన అచ్చట తప మాచరింపవచ్చువారికి చిత్తభ్రమయు, భయమునుకలిగి పెక్కు రాస్థలమును చేర వెరచుచుందురు. జితేంద్రియులగువారి కట్టివి ప్రతిబంధములు కానేరవుగదా! ఒకానొకకాలమున ఋజువర్తనుడును, పరిశుద్ధాత్ముడు నగువాడు భిక్షుడు ఏకాంగియై సమాధియం దుండుటకు పిప్పలశిలాగృహమునకు వచ్చెను. అచ్చట నుండినవారిలో నొకడు ఆప్రదేశము పిశాచగ్రస్తమనియు,అందు ప్రవేశించినవారు యమలోకప్రవేశ మొసరించుచున్నారనియు చెప్పి భిక్షుని వారింపజూచెను. భిక్షుడు కొంచెమేనియు చలింపక తానట్టి ప్రదేశమునందే సమాధినుండి యచ్చటగల భయకారణమును తొలగించుట ధర్మమని బుద్ధునిధ్యానించుచు ఆగృహమున ప్రవేశించి తనయోగదండమునందు ప్రతిష్ఠించి పిశాచధ్వంసక మంత్రములనుపఠించ మొదలిడెను. 10దినము లీరీతిగా మంత్రపఠనము జరుగునప్పటికి ఆలయగర్భమున నొకగుహనుండి యొకస్త్రీవ్యక్తి భిక్షుని కెదురై సాక్షాత్కరించి "భిక్షువరా! నీ వెంతయు అహింసావ్రతుడవనియు,బుద్ధుని శిష్యుడవనియు లోకక్షేమం కరుడవనియు చెప్పుకొనుచుండి నన్ను నా యనుచరులను నిట్లు బాధించుచు నీవ్రతభంగము కావించుకొనుచున్నావు. నీమతధర్మమునకు వ్యతిరేకముగా వర్తించుట నీకు న్యాయమా!" యని అతి కరుణకముగా నడిగెను. భిక్షుడు "నీవన్నట్లుగా నేను బుద్ధునిశిష్యుడనే యగుదును. నాయది అహింసాధర్మమనునదియు నిశ్చయము. నేనొనర్చుకార్యముల యం దహింసాదీక్షకు వ్యతిరేకమగువిషయ మెద్దియు లేదే; ఏల నాపై జీవహింసాపరాధమును మోపెదవ"నెను. స్త్రీయును "అయ్యా నీయుచ్చరించుమంత్రప్రభావమున నాగృహమంతయు నగ్నికాహుతియగుచున్నది. నేను నాయనుచరులును దగులగుట కిక నెక్కుడు కాలము పట్టదు కాన మాయందు కరుణించి నీమంత్రపఠనమును చాలించి మమ్ములకాపాడు"మనెను. పరివ్రాజకుడు "నేనొనర్చుమంత్రపఠనమే దారుణమైనయెడల నిచ్చట నాపూర్వము సమాధినిష్ఠయందుండిన బౌద్ధుడు నిరపరాధి ప్రాణముల గోల్పోవుట నీయొక్క

* మారుడు కలిపురుషునివంటివాడు. ఇతనికి కామక్రోధాదులు పరిచారకులు. పిశాచములు పరివేష్టించియుందురు. సజ్జనహంతకుడు, సద్గుణవైరియు, మూర్తీభవించిన కామమును అగు మారుని నివాసస్థానము కామధాతుశిఖరమున 'పరనిర్మితవశవర్తినీ' నామలోకము, దేవదత్తాదినాస్తికులును, దుష్టులును, మారప్రేరితులు. చిత్రములయందు నూరుచేతులతోను, గజారూఢుడుగను చూడనగును.

దుండగములవల్లనే కదా! నీవిచ్చట జేరి వికృతాకారములదాల్చి వికృతతిరస్కారముల నొనర్చి భక్తుల ప్రాణముల గొనుచుండుటకు ప్రతిఫలము నీవనుభవింపక తప్పదు" అనెను. అంతట నాస్త్రీయు తనవల్ల నిక నెవరికిని ఏలాటిహానియు కలుగకుండునట్లు వాగ్దానముచేసి భిక్షుకుని ప్రసన్నునిజేసికొని అతనివల్లనిక నేయుపద్రవమును లేకుండునట్లు వరముగొని నడచి పోయెను.

## కరండవేణువనము, లేక వేణువనవిహారము

గిరివ్రజ పురోత్తరద్వారమునకు సుమారు 700 అడుగులయుత్తరమున వేణువన మొకటి యుండెను. అందొక శిథిలమైనవిహారమున్నది. గిరివ్రజమునకు పూర్వమున కరండుడను గృహస్థు డుండెను. ఇతడు నాస్తిక పక్షవాదియై యుండినందున నాస్తికుల విశ్రమార్థ మొక వేణువనము నొసగియుండెను. ఇట్లుండగా నొకనా డుత్సవమున కరండుడు బుద్ధునిదర్శించి ఆయన బోధ వినుట తటస్థించెను. బౌద్ధధర్మముల వినినవాడై నాస్తిక మతద్వేషము జనించినందున తత్క్షణమే తనవేణువనమునగల నాస్తికుల నెడల దరిమెను. తదనంతరము కరండుడు ఆవనమున నొకవిహారమును గట్టించి బుద్ధునికి సమర్పించెను. వనమధ్యమున నొక చిన్నయేరు పారుచున్నది. నదియొడ్డునను పర్వతముపైగల యూటల యొక్కయు జలమే నదమునకుగల జలాధారము. వేణువనవిహారమునకు సుమారు 500 అ. ఉత్తరమున నొకతటాకము కరండహ్రదమనునది యున్నది. వనమునకు తూర్పునగూడ నొకవిహార మున్నది. ఈస్తూపమున బుద్ధునియస్థులు కలవు. బుద్ధనిర్వాణానంతరము ఆయనయస్థులను అష్టదిగ్రాజులును విభాగించుకొనిరి. అందుమగధరాజ్యమునకు తాత్కాలికాధిపతియైన బింబిసారునిపుత్రుడు అజాతశత్రుడు తనభాగమును పైజెప్పిన స్తూపమును గట్టి అందుంచెను.

క్రీ. పూర్వము 500-వ సంవత్సరమునందు బింబిసారుడు మగధాధిపతియై యుండెను. ఇతడు బుద్ధునికి సమకాలికుడు. క్రీ. పూ. 484-న బింబిసారునిపుత్రుడజాతశత్రుడు రాజ్యమునకు వచ్చెను. తర్వాత ఆరేండ్లకు బుద్ధుడు నిర్వాణముచెందెను.

## సప్తపర్ణిశాలలేక శతపర్ణశాల

(1 పటముచూడుము)

వేణువనమునకు నైరృతిమూల నొకగొప్పయరణ్యము కలదు. తన్మధ్యమున గొప్పశిలాగృహ మొకటి కలదు. బుద్ధనిర్వాణానంతరము జరిగినప్రథమబౌద్ధమహాసభకొరకై అజాతశత్రుడు దీనిని కట్టించెను. మహాకశ్యపునియాధిపత్యమున 999 అర్హతులు (బౌద్ధగురువులు) సమావేశమయిరి. ఈసభయందు బౌద్ధధర్మసూత్రోద్ధారణ మొనర్చి 3 పిటకములను భాగములుగా సేకరించిరి.

మహాకశ్యపుడు అరణ్యమధ్యమున తపోనిష్ఠయందుండగా అతని కొకదివ్యజ్యోతి కానబడెను. భూమి కంపించెను. వెంటనే కుశనగరమున రెండుసాలవృక్షముల మధ్య బుద్ధుడు నిర్వాణము చెందుచున్నట్లు తన దివ్యదృష్టి నెరింగెను. తత్క్షణమే కశ్యపుడు శిష్యజనములతోగూడి కుశనగరమునకు పయనమయ్యెను. వానికి మార్గమధ్యమున దివ్యకుసుమము చేగొని వచ్చుచుండిన బ్రాహ్మణుడెదురయ్యెను. అతనిని "బుద్ధుడుండు ప్రదేశమును గురించి నీకేమయిన తెలియునా" యని కశ్యపు డడిగెను. బ్రాహ్మణుడు "నేనిప్పుడే కుశనగరమునుండి వచ్చుచున్నాను. మీయాచార్యుడు నిర్వాణముచెందుటయును, దేవగణములాయనకు దివ్యకుసుమాదిపదార్థముల నర్పించుటయును చూచితిని. నాచేతి యీకుసుమము అచ్చట లభించినదియే" యనెను. మహాకశ్యపుడు దుఃఖితుడై "జ్ఞానసూర్యు డస్తమించెను. ప్రపంచ మజ్ఞానాంధకార మగ్నమయ్యెను. మానవలోకమునకు మార్గదర్శియు ఉద్ధారకుడు నగు బుద్ధుడు, లేనందున నీభౌతిక శరీరములకు నరకప్రాప్తి యయ్యెను." అని తనలో చింతింప దొడగెను. కాని తదితరభిక్షులు బుద్ధుని నిర్వాణమునకు ఖేదమును పొందుటకుమారుగా ముదితులై "స్వాయధర్మశాస్త్రపాశబద్ధులము; ఇకమీద స్వేచ్ఛగా నుండవచ్చునుగదా; బుద్ధునియనంతరము మనల నడంచియుంచువారు లేరుకదా" అని తలంచుచుండిరి. మహాకశ్యపునకు ఇట్టి వేషధారులగు భిక్షుకవర్గమును చూడగనే దుఃఖము మరింత హెచ్చెను. బౌద్ధులు ధర్మేతరమార్గమును త్రొక్కకుండుటకై ధర్మసూత్రముల నన్నిటిని సేకరించి దుష్టశిక్షణకై పాటుపడ గృతనిశ్చయుడై కశ్యపుడు

కుశనగరమున బుద్ధుడు నిర్యాణము చెందిన సాలవృక్షములజేరి బుద్ధునిగురించి ధ్యానించెను. అప్పటికి నానాదిశలనుండియు బౌద్ధులు నాలుగు తరగతులవారును వచ్చియుండిరి. బౌద్ధులు వారివారి బౌద్ధమతాచారాను ష్ఠాన యోగ్యతలను బట్టియు, శాస్త్రప్రావీణ్యతలను బట్టియు నాలుగుతరగతులుగా విభజింప బడియుండిరి. ప్రాథమిక స్థితియందుండువారు స్రోతాపన్నులు. ఇట్లే కొంతకొంతయోగ్యత లతిశయిల్లు కొలదిని, సకృదాగామినులనియు, అనాగామినులనియు, అర్హాతులనియు కలరు. అర్హాతులకు తపోబలమును దివ్యదృష్టియు గూడ గలదు. కశ్యపుడు బౌద్ధధర్మములవీటిబుచ్చక జను లాచరించునట్లు చేయుటకు ఇచ్ఛకలవాడై సుమేరుపర్వతము నెక్కి యచ్చటగల యొక గొప్పగంటను వాయించుచు "రాజగృహనగరమున నొక గొప్పయాచార్యసమావేశము జరుగనున్నది. అందులకు అర్హాతులందరు రావలసినది" అని చాటించెను. ఈఘంటానాదమును అనేకులు భౌతిక కర్ణములచే వినియు, అనేకులు మహాత్ములు తమ దివ్యజ్ఞానముచే నెరింగియు సభ నలకరింప నేగిరి. వేనవేలు జనులు రాజగృహనగరమున నీ బౌద్ధమహాజన సభకు వచ్చియుండిరి. కశ్యపుడు వారినిజూచి "బుద్ధుడు నిర్యాణము చెందినందున లోకము నాధరహితమయ్యెను. ఆయనయందుగల గౌరవమును సూచించుటకై యాయన మతము నుద్ధరించుటకై ధర్మపిటకమును సేకరించవలసినది మనవిధియై యున్నది. సామాన్యజను లీమహాకార్యమును సాధించుటకు తోడ్పడజాలరు కాన త్రివిద్యలయందారి తేరి షడభిజ్ఞులై (6 విధములగు అమానుషశక్తులు గలిగి) బౌద్ధధర్మ పరాయణులై, యుక్తాయుక్తవివేచనా శక్తికలవారలే యీసభయందుండవలసినద"ని కోరెను. లక్షణసమన్వితులగు నిట్టివా రామహాసమావేశమున 999 మంది మిగిలిరి. మహాసభయందు మూడుఅగ్రస్థానము లుంచబడినవి. కుడిప్రక్కపీఠమును మౌద్గలాయనుడును, ఎడమప్రక్కపీఠమును శారిపుత్రుడును, మధ్యపీఠమును మహాకశ్యపుడును అలంకరించిరి. బుద్ధునిసహచరుడగు ఆనందుడుమాత్రము అర్హాతుడుకాడని బహిష్కరింపబడెను. ఆనందుడు చింతాక్రాంతుడై యొకయడవికిపోయి అర్హాతపదవి నొందుటకై తప మొనరించెను. దీర్ఘకాల

మయ్యెను. బలము లేనందున నిస్పృహాజనింప నొకచోట విశ్రమింప బోయెను. ఆతని శిరము నేలదాకినంతనే దివ్యజ్ఞానోదయమయి అర్హాతుడయ్యెను. అంతనతడు సంతసించి మహాసభకు రాగా సత్తపణ్ణిగుహా (సభాస్థానము) ద్వారము మూసియుండెను. వెలుపల నుండియే ఆనందుడు ప్రవేశమును కోరగా కశ్యపుడు "నీవర్హాతుడవయినయెడల ద్వారమును దెరువకయే లోనికి రాగలిగిన రమ్మ"నెను. ఆనందుడును మహా సంతోషముతో తాళపుగంధ్రము మూలమున లోనికివెళ్లి సభకు వందనమొనరించి యాసీను డయ్యెను. సభకూడి ఇప్పటికి వర్షావసానము(ఋతువు)నందు పదునైదుదివసములు కడచెను. కార్యతత్పరుడగుకశ్యపుడు సభ నవలోకించి యానసరము బుద్ధుని ఎడబాయకుండి ఆయనసూత్రముల నన్నిటి నెరింగిన ఆనందుడు సూత్రపిటకమును, లోకమునందెక్కుడు ఖ్యాతివహించి బుద్ధుని వినయపద్ధతి నెఱింగిన ఉపాలియనునాతడు వినయపిటకమును, కశ్యపుడను నేను అభిధర్మపిటకమును సేకరింపవలసినదని ప్రకటించెను. వర్షఋతుమాసములు మూడును కడచునప్పటికి పిటకములు మూడును పూర్తియయ్యెను. కశ్యపుడు స్థవిరు (అగ్రాసనాధిపతి)డయినకారణమున నీసభకు స్థవిరమహాసభ యని పేరు.

స్థవిరమహాసభనుండి బహిష్కరింపబడినబౌద్ధులు బుద్ధనిర్వాణమునకు పూర్వము తమకుండినగౌరవమును బుద్ధునియనంతరము తమకగు గౌరవార్థము కూడుసభకు పోవుయోగ్యతగూడ లేకపోవుటను తలదుకొని దుఃఖితులై తమకు గల గురుభక్తిని వెల్లడింప గుతూహలురై లక్షజనము మరియొకప్రదేశమున సభగూడిరి. ఇందు సూత్రపిటకము, వినయపిటకము, అభిధర్మపిటకము, సన్నిపాతనికాయపిటకము, ధారణీపిటకము, అను అయిదుపిటకముల సేకరించిరి. పండితపామరభేదము లేక సర్వసమత్వముతో గూడినసభకాన నిది మహాసంఘాఖ్యను బరగుచున్నది. ఇచ్చట అశోకచక్రవర్తి యొక స్తూపమును గట్టించెను.

## నూతన రాజగృహము

కుశాగారపురము(రాజగృహము)నకు ఉత్తరమున నూతనరాజగృహము కలదు. బింబిసారుడు కుశాగారపు

పతియై యుండగా ననేకసర్యాయములు జనులగృహములు దగ్ధములగుటయు, నిలువనీడలేక వారు తపించుటయు తటస్థించుచుండెను. చక్రవర్తి లిచప్రజల కిట్టి యాతిబాధలు కలుగుట తనపుణ్యలోపమునల్ల నేమో యని పరితపించుచుండెను. మంత్రులు రాజును జేరి "రాజా మీయొక్క ప్రభుత్వమున నేలోపములును లేవు. దేశము సుభిక్షమై జనులు యశస్సంపదలతో సుఖమున్నారు. కాని అప్పుడప్పుడు కలుగు నీయగ్నిబాధకుమాత్రము జనులయజాగ్రత్తియే కారణమయి యుండును. మనపురమునకు ఉత్తరమున శీతవనమను అడవిని జనులు శ్మశానముగా నుపయోగించుచున్నారు. ఏవైనగృహములు దగ్ధము లయ్యెనేని తత్కారకుడగు మనుజుని బట్టి శీతవనమునకు దరుమగొట్టినయెడల అగ్నిబాధ లుండవ"నిరి. రాజును అదేవిధముగా నూరజాటింపించెను. ఒకనాడు గ్రహచారవశమున రాజాంతఃపురమే దగ్ధము కాజొచ్చెను. సత్యశీలుడగు రాజు కాన తన ప్రకటనకు తానే ఇప్పుడు బద్ధుడై బింబిసారుడు కుమారుడగు అజాతశత్రునికి పట్టముకట్టి శీతవనమునకు పోయెను. పెద్దరాజు రాలేడని యెరింగి వైశాలి(పాటలీపుత్రము లేక పాట్నాకు ఈశాన్యమున 27 మైళ్ళదూరమున నున్నది.)రాజు కుశాగారముపై దండెత్తివచ్చెను. అదివిని మంత్రిసామంతులందరును రాజసంరక్షణార్థము శీతవనమునకు పోయి యచ్చట నొకనగరమును గట్టిరి. ఇదియే నూతనరాజగృహము. అజాతశత్రుడును నూతనరాజగృహముననుండియే రాజ్యమేలెను. అజాతశత్రునియనంతరము చంద్రగుప్త, బింబిసారులనువారును ఇచ్చటనే యుండి రాజ్యమేలిరి. కాని, ఆతరువాత రాజైనఅశోకుడు తనరాజధానిని పాటలీపుత్రమునకు మార్చుకొనెను.

## ఇంద్రశిలాగుహ

రాజగృహమునకు కొంచెము పూర్వోత్తరముగా గిర్యేకమను పర్వతము కలదు. దీనిశిఖరముపై నొకగుహలో ఇంద్రుడు తనకు 42 సందేహములుకలవని వాటిని తీర్చుటకు బుద్ధుని కోరెను. ఒక్కొక్కప్రశ్నను రాతిపై ఇంద్రుడు వ్రాయుడు బుద్ధు డాసందేహములదీర్చుచువచ్చెను. ఇంద్రశిలాగుహాగలపర్వతమునకుప్రక్కన మరియొకపర్వతశిఖరము కలదు. దానిపై హంససంఘారామమను మఠము కలదు. దానినిగురించి ఈక్రిందికథ యొకటి కలదు. కొందరు సన్న్యాసులు మఠమున నుండగా వారిలో కడుప్రధానుడు వ్యాయామము (యోగాభ్యాసము) కొరకు తిరుగుచుండినవాడు ఆకాశమున బోవుచుండి అంచపిండును చూచెను. తనసంఘమున గల యతులు ఆహారార్థము పడుబాధల జూడజాలక మాంసమును వర్జించినవాడయ్యును వేడుకగా హంసల జూచి, "పక్షులారా! మహాసత్త్వలారా! మే మాకట తపించుచున్నాము. మాయందు దయచేసి కరుణించక పోవుట మీకుతగునా" యని యడిగెను. తత్క్షణమే యొకహంస చచ్చి వానికట్టెదుట పడెను. యతి యాఘోరకృత్యమునకు తాను కారణమగుటకు చింతించి తనసహచరుల కీవృత్తాంతమును తెలిపెను. వారును దుఃఖాక్రాంతులై బుద్ధుడు తెలిపిన 'మహాయాన' పద్ధతి నవలంబింపజాలక 'హీనయాన' పద్ధతి నవలంబించి పాపుల మైతిమిగదా యని పశ్చాత్తప్తులై యాహంస శరీరముపై నొకస్తూపమునుగట్టి దాని యౌదార్యమును స్తూపముపై లిఖించియుంచిరి. ప్రస్తుతము జరాసంధ పేటమన బరగు కట్టడమొకటి ఈగిరిశిఖరముపై గలదు. తత్సమీపమున హంసచిత్రములును ముద్రికలును దొరకినందున నదియే హంసయొక్కకళేబరముపై గట్టిన స్తూపముగా నుండునని తోచుచున్నది.(13పటము చూ.)

## మణియార్ మఠము(7-10 పటములు)

పురాతనరాజగృహమధ్యమున నిదియొక ఆధునిక దేవాలయము. ఆధునికమనగా క్రీ. శ. 18-వ శతాబ్దము లోనిది. ఆలయమునందు ముఖ్యముగా నాగవిగ్రహములును, గణేశ, శివవిగ్రహములును కలవు. (8 పటము చూడుడు.)

నాగులలో నొకరు మణికారనాగులు. ఈ దేవతయొక్కనామమునల్లనే కాబోలు దేవాలయమునకు మణియార్ మఠమని పేరు.

మణియార్ మఠమును ప్రదక్షిణముగా చుట్టివచ్చిన యెడల దేవాలయభూమిక (పీఠము; Base) యందు (1) లింగము, (2) బాణాసురుడు, (3) నాగుడు, (4) నాగుడు, (5) నాగి, (6) గణేశుడు, (7) నాగుడు,

(8) నాగుడు, (9) నాగుడు, (10) శివుడు, వీరవిగ్రహములు గూండ్లయందు అమర్చబడియున్నవి. ఈఆలయము పురాతనమగు నొకబౌద్ధస్తూపముపై నున్నది. స్తూపము శిథిలమై అడుగుభాగముమాత్రము దిబ్బగా నేర్పడియున్నది. ఎవరో యొకరాజు తనధనమును ఒకకూపమున దాచియుంచి దానిపై నొకగృహమును కట్టి మణికార నాగుని, కోశాధిపతిగా నియమించినట్లును తర్వాత హిందువులు మణికారుని పూజించుచు వచ్చినట్లును నొకకథ కలదు. జైనులును శాలిభద్రుడనునాయన ఒక కూపమునందు ధనమును దాచినట్లును ఆకూపముపై నుండు ఆలయము శాలిభద్రునిదైనట్లును చెప్పుకొనెదరు.

ఇట్లు రాజగృహము క్రీ. పూ. 500 నుండి క్రీ. పూ. 263 వరకు మగధరాజ్యమునకు ముఖ్యపట్టణమై యుండి మహోన్నతదశ ననుభవించి బుద్ధులపుణ్యక్షేత్రములలో నొకటియై దాని పూర్వవైభవమును ఇంకనుగట్టియుంచినగుడ్డివలె నున్న ప్రస్తుతశిథిలస్తూపముల వల్లను, దుర్గప్రాకారపునాద్యాదులవల్లను, వనములవల్లను శిలాశాసనములవల్లను గుహలవల్లను తెలియజేయుచున్నది.



# కాలము

పానుగంటి విజయరాఘవరావు గారు

తనువుఁ బాసినజనుల కందమును గూర్చి
గోపురములన్ని శిథిలమై గోడలుపడి
పాడువడుచున్న పూర్వపు పట్టనముకు
నూతనపుశోభ నొసఁగుచు ఖ్యాతినిచ్చు
నద్ది కాలమే కాదొకో అహహ భువిని!
కర్మవశమున హృదయంబు కమలిపోయి
గాయములుపడి రక్తంబు కాల్వలీల
పాఱునప్పుడు దిట్టమౌ పట్టువైచి
ఒప్పుగా గాయమందుండు నొప్పిఁ దీసి
వైద్యుఁబోలెను, సుఖమిచ్చువానిలీల
కాలమేకాదె నటియించు కరుణతోడ!
తప్పటూహాల మదిలోనఁ దాల్చియుండు
మనల దిద్దుచు న్యాయపు మార్గమందు
కాలు నిడఁ జేయుఁగాదొకో కాల మహహా!

సత్వమును ప్రేమనిల్పెడు స్థానములను
తగు పరీక్షను గావించి తగినతావు
కనుల ముంగిట నిడుఁగాదె కాలమహహా!
ఎందఱెందఱో వేదాంతు లిలను గలరు
కాని నిజమగు వేదాంతి కాలమొకఁడు!
ఇపుడు కాకున్న మఱియు నింకెపుడొ కాని
కసినిదీర్చెడు నద్ది యీ కాలమొకఁడు!
కాలమా! నాదుకరములు కనులు, హృదయ
మెన్నియును వందనము లిచ్చు నందుకొనుమ!





# ఐరిషుఅసహకారము

'మాతలి'

## ప్రస్తావన

ఇటీవల నూతనముగ ప్రాపంచికస్థితిలో ఇంగ్లండు కలిగించినమార్పు లనేకములు. దానియొక్క వ్యాప్తి యల్లెడలను గోచరమగుచున్నది. అమెరికాఖండము లోని స్వతంత్ర దేశమయిన సంయుక్తరాష్ట్రములు కేవలము ఆంగ్లప్రాయములై యున్నవి. వీనికి నుత్తరమున నానుకొనియుండు కనడారాష్ట్రము ఇంగ్లండున కనువర్తియై సహాయవాదియును, సహాయకారియును నై యున్నది. జపానుకును మనదేశమునకును సమీపముననున్న ఆస్ట్రేలియా ద్వీపఖండమున్ను ఇంగ్లండు కనుసారియై యున్నది. ఆఫ్రికాలోని దక్షిణభాగమున నింగ్లీషువారి రాజ్యమున్నది. ఇవియన్నియును స్వతంత్రరాజ్యములే; కాని తమస్వలాభము నపేక్షించియే ఇంగ్లండుపక్షమునను న్నవి. ఇవ్విధముగ ప్రపంచమున నలుదెసలను నింగ్లీషు వారిబలముసుస్థాపితమై లోకమును పాశమునఁ జుట్టుకొని యున్నది. ఇట్టిబలీయమైనస్థితికి ముఖ్యమైన కారణము ఇంగ్లండునకు భారతదేశము లభించి యుండుటయేతక్క వేఱుకాదు. ఇంతటి ప్రాబల్యముగల ఇంగ్లండిటీవల ముగిసిన గొప్పజర్మనీయయుద్ధమున నీప్రదేశములప్రభుత్వములన్నియును దోడ్పడుటయును తుద కమెరికాలోని సంయుక్తరాష్ట్రదేశాధ్యక్షుడైన విల్సనుయొక్క మిత్రభేదపుమధ్యస్థతీర్మానము తోడ్పడుటయును కారణములయి యింగ్లండునకును తన్మిత్రులకును జయమును దెచ్చినవి. ఇపుడున్నలో ప్రపంచమున నింగ్లీషు వారి కన్నుపాఱనిప్రదేశము లేదని చెప్పవచ్చును.

యుద్ధమున జయమునుగాంచిన యింగ్లండిపుడైరోపాఖండమున ముఖ్యదేశమై యున్నయది. దీని వార్త యాఖండమున కాజ్ఞయై యున్నయది. దీనియిష్టము లాఖండములలోని యితరదేశముల కన్నింటికిని శాసనకల్పము లయియున్నయవి. ఇంతకును మూలకారణము మనహిందూదేశము ఇంగ్లీషువారికి లోబడియుండుట. ఇట్లుండుటలోనను మనదేశముయొక్క వ్యాపారము వీరి స్వాధీనముననుండుట వారికి విశేషబలము. హిందూదేశముయొక్క వ్యాపారము యూరపుఖండములో నెవరిచేత జిక్కియుండునో వారాఖండమునకు నాయకు లగుదురని యాఖండస్థుల చిరకాలపురూఢియైన నమ్మకము. అది యిపు డింగ్లండువిషయమున ననుభవమునకు వచ్చియున్నది. ఈవ్యాపారమును దానిమూలమున లభ్యములైన యైశ్వర్యాధికారములను శాశ్వతముగా దక్కించుకొనుట కింగ్లీషువా రెన్నియేని ప్రయత్నముల గావించుచున్నారు. జర్మనీతోటి మహాసంగ్రామము ముగిసినయప్పటినుంచి యూరపుఖండముయొక్క పశ్చిమభాగమున నున్నదేశము లన్నియు నింగ్లండునకు భృత్యభావ మవలంబించియున్నవి. ఈదురవస్థను జర్మనీదేశముకూడ దప్పించుకొన జాలియుండలేదు. కనుక నిటీవల నూఱుసంవత్సరముల చరిత్రముయొక్క సారాంశమేమన ప్రపంచముయొక్క అయిదుఖండములలోనను ఇంగ్లీషువారివ్యాప్తియును, వ్యాపారమును, నధికారమును, దర్పమును సుస్థాపితములై యుండుటయే.

ఒకవైపున నింగ్లండుయొక్క యభివృద్ధి హెచ్చుచుండ మఱియొకవైపున దీనికి విఘ్నములు పుట్టుచునే యుండినవి. వాస్తుప్రదేశమును లెస్సగ పరిశీలించకయు, సంస్కరింపకయు నెత్తయినగోడలనుకట్టి మేడలను లేపువానియింట పందికొక్కులు సురంగముల ద్రవ్వుపగిది ప్రపంచమునంతటను తనవ్యాపారవర్షమును కురిపించి యైశ్వర్యసస్యములను పెంచుకొనుచున్న యింగ్లండునకు ననతిదూరముననే ఐర్లండులో దాని యైశ్వర్యమునకు విఘ్నములు పొడముచుండినవి. సుమారు ఎనిమిదివందల సంవత్సరములుగ నెలకొనియుండిన ఐర్లండుమీది పారపత్యము యింగ్లండు చేతినుంచి మొన్ననే (అనగా 1921 సంవత్సరం డిసెంబరు నెల తే 6దిన) తొల

గిపోయినది. ఐరిషువారికి స్వరాజ్య సూర్యోదయమైనది. సిన్ ఫెయిన్ సంకల్ప పూర్తిచంద్రికలా దేశము నంతటను ప్రకాశించుచున్నయవి. దూరదేశముల క్షితిగతులను తనహస్తగతములుగ జేసికొనినట్టిదియు, గొన్ని స్వతంత్రదేశములను భృత్యపదవికి దెచ్చినట్టిదియు, నగు నింగ్లండు శతాబ్దముల పర్యంతము తనచేత జిక్కియుండిన ఐర్లండును కోలుపోవుటాశ్చర్యముకదా? ఈచరిత్రాంశము మనదేశమున కీతరుణమున నెంతయు మార్గదాయిగ నున్నది. అనేకసందర్భముల నైర్లెన్డు యొక్క పారతంత్ర్యమునకును మనదేశముయొక్క పారతంత్ర్యమునకును సామ్యమును గనవచ్చును. ఆపారతంత్ర్యమను పెనుచీకటి యాదేశమున కష్టెటబాసిపోయినదో తెలిసినయెడల మనపారతంత్ర్యమును వెలువరించుట మనకు సుసాధ్యమగును.

అయిన నీవిషయమున నొకగొప్పభేద మున్నది. దానిని మనము గమనించవలెను. అది యెద్దియనిన నైర్లండు వారికి యాయుధసహాయ ముండినందున వారిప్రయత్నములు కేవల సాత్త్వికములు గాక కొంతవఱకు రాజసతామసములై జననాశమునకును మనోవ్యధకును గారణము లయియుండినవి. ఎవ్విధముననో మన దేశమున నాయుధ దుస్సంపర్కము లేనందున మనప్రయత్నములు రాజసతామసములు గాక కేవల సాత్త్వికములుగానే యుండును. ఇది గొప్పవిషయము. మన స్వాతంత్ర్యము కేవలము సద్ధర్మమార్గములనే సాధింపబడును. ఐరిషువారి స్వరాజ్యప్రాప్తి చరిత్రను చిత్రరూపముగ వ్రాసినచో నదిరక్తసంపర్కమువలన నెఱ్ఱనై రౌద్రముగ దోచును. మన స్వరాజ్యప్రాప్తి చరిత్ర చిత్రమున వ్రాయునపుడదిస్వచ్ఛమైన తెల్లనిపటము మీద వ్రాయబడి కంటికి ఆనందము నిచ్చును. ఇది సత్త్వగుణాదర్శమై మనసునకు శాంతిదాయియై యాత్మశక్తికి ఉద్ధారకమై వెలయును. మన కనాదిగ మూలాధారమైయున్న సత్యపరత్వమునకును ధర్మాత్మను రక్తికిని యాత్మచేతనే యాత్మోద్ధారణము చేసికొనుశక్తికిని నూతనతేజమును దెచ్చును. అపుడు మనదేశము సమస్తప్రపంచమునకు నిదర్శనమును నాదర్శమును నై భౌతికస్వర్గమునకు దారిచూపును.

కాన నైరిషువారు తమయిక్కట్టుల నెట్టిధైర్యస్థైర్యములతో బాపుకొనిరో యాచరిత్రను మన మెఱుంగుట యావశ్యకము. ఈచరిత్రమునకు కొన్ని విషయములలో హెచ్చరికల నిచ్చి మఱికొన్ని విషయముల మార్గము చూపును.

## సిన్ ఫెయినుయొక్కయుద్భవము

ఐర్లండునకును ఇంగ్లండునకును చాలకాలము వైరము పొడమియుండినది. ఇక్కాలమునంతటను నింగ్లండు ఐర్లండును స్వాధీనపఱచుకొని యాదేశస్థుల నణగద్రొక్కుచుండినది. పెక్కుమాఱు లైర్లండు తనపారతంత్ర్యమును తప్పించుకొన బ్రయత్నించెను. ఆప్రయత్నములను గుఱించినచరిత్ర చాల దీర్ఘమైనది. దానినంతటిని నిచట వ్రాయుట యనవసరము. కాని యైర్లండున కిటీవల స్వాతంత్ర్యమును సంపాదించిన సిన్ ఫెయినుల యుద్యమముయొక్క చరిత్రను మాత్ర మిచట వ్రాయనెంచితిమి. ఈయుద్యమము నెఱవేఱినది. కావున దీని చరితమే మనకు ప్రస్తుతమున ముఖ్యము.

ఈయుద్యమముయొక్క మూలభావము అసహాప్రవృత్తి. దీనినే యింగ్లీషుభాషలో 'నాన్ కోఆపరేషన్' అనెదరు. ఈపద్ధతిని అవలంబించి కొనసాగించి ఫలముగనిన దేశములలో నైర్లండు ప్రగణ్యమైయున్నది. దీనికి కలిగిన రాజకీయాటంకములు లెక్కకు మించినవి. అయినను వాటి నన్నింటిని దప్పించుకొని దరి జేరినందున నైర్లండుయొక్క యసహాప్రవృత్తిచరిత్ర మనదేశస్థుల కనుసరణీయమై యున్నది.

ఐర్లండులోని యసహాప్రవృత్తికిని స్వయంవ్యక్తికిని నాదిగురువు, ఆర్థర్ గ్రిఫిత్తు అనువాడు. ఇతడు యూరపుఖండములోని హంగేరిదేశముయొక్క స్వాతంత్ర్యార్జనచరితను వ్రాసి ఐరిషువారి కీయుద్యమమునం గావలసిన నీతిని విశదముగ దెలిపి మార్గమును జూపినవాడు. ఇతడు హంగేరిదేశమున ఫ్రాన్సిస్ డీక్ అను స్వరాజ్యవాది యవలంబించిన యసహాప్రవృత్తిని స్వయంవ్యక్తిమార్గములను వర్ణించిఐర్లండులోనను నట్టిమార్గములను నవలంబించ ప్రయత్నపడెను. నీప్రయత్నముతొలుత1904 సం.మున నంకురించెను. ఆసం.న సిన్ ఫెయినను నైరిషు

స్వరాజ్యసంఘమొకటి యేర్పరుపబడి 1905-వ సంవత్సరపు నవంబరునెలలో దానిప్రథమసభ గూడెను. ఈసభలో ఆర్థర్ గ్రిఫిత్తు తనకార్యక్రమమును విశదముగ సభకు దెలియజెప్పెను. ఇతను కోరినమార్గములను లెస్సగా పరిశీలించి చూచిన సిన్‌ఫెయినునీతి యెంత కార్యసాధకమైనదియును తెలియును. ఇంగ్లీషువార్తాపత్రికలుదీనినిగుఱించి లోకమునకెంతయు నసహ్యకరమైనవార్తల జెప్పి దానిపై నింద్యచర్యల మోపి వ్రాయుచుండినవి. అది కేవలము దౌర్జన్యభూయిష్ఠమనియు జననాశనమునకు వెనుదీయని రౌద్రస్వభావము కలదనియును నింగ్లీషువారు దూషించుచుండిరి. ఈ సాకున దానిని అణగద్రొక్కుటకు ఇంగ్లీషువారు చాల క్రూరకృత్యములను గావించి వానినన్నింటిని రాజ్యావసరమని రాజనీతిగా సమర్థించి లోకమును గెలుపుచుండిరి. కాని కడకు సత్యము వెలువడెను. సిన్‌ఫెయినులయుద్యమము ఇంగ్లీషువారు చెప్పినంత హేయముగ నుండలేదు. సిన్‌ఫెయినురాజనీతి యైరిషువారిజీర్ణోద్ధారణకై పుట్టి నెఱవేరిన మహాస్త్రము.

సిన్‌ఫెయినుల మొదటిప్రయత్నము స్థానికసభలకు తమపక్షమువారిని బంపుట. జిల్లాసభలు, గ్రామసభలు, దీనరక్షణసభలు, ఓడరేవుల పారపత్యపుసభలు మున్నగువానిలో నట్టివారినే నింపుట. ఇందుమూలమున స్థానికప్రభుత్వములలో సిన్‌ఫెయిన్ అభిప్రాయములను నెలకొలిపి వారినీతికి ప్రాముఖ్యము నిచ్చుట, వారియుద్దేశమై యుండెను.

ఇవ్విధముగ తొలుత స్థానికప్రభుత్వము సభలలో సిన్‌ఫెయిను నీతిని స్థాపించి తరువాత వీనిచేత నెన్నుకొనబడు ఐరిష్ దేశీయసభను సిన్‌ఫెయినుప్రాయముగజేయ నుద్దేశించిరి. ఈదేశీయసభలో మూడువందల సభ్యు లుండవలెను. ఈసభ యింగ్లండుయొక్క పార్లమెంటువలె సర్వాధికారి యగును. ఈసభగాని దీనికి చేరినవారుగాని ఐర్లండుకు సంబంధించిన రాజ్యవిషయములను గుఱించి యన్యదేశీయుల్లతో వారిపట్టణమున కలిసి వ్యవహరించకూడదని తీర్మానించుకొనిరి. అనగా నీసిన్‌ఫెయిన్ దేశీయసభ యింగ్లండుకు వెళ్లి దాని ముఖ్యపట్టణమైన లండనున దానిపార్లమెంటులో చేరి తమదేశీయవిషయములను గుఱించి వ్యవహరించుట పారతంత్ర్యసూచకమని యెంచి దానిని నిషేధించిరి. సిన్‌ఫెయిన్ దేశీయసభ ఐర్లండునకు ముఖ్యపట్టణమైన డబ్లినులోననే కలియవలసినదిగాను ఐర్లెండున కది సర్వాధికారముగల దేశీయప్రభుత్వసభగా నుండవలెననియు వీరియుద్దేశము. ఈసిన్‌ఫెయిన్ దేశీయసభయొక్క తీర్మానములను దేశమునందరును నామోదించి యనుసరించులాగున దేశము వారినందరిని ధర్మపూర్వకముగా నొప్పించుటకు వారు ప్రయత్నించిరి. తొలుత తొలుత వీరుచేసినతీర్మానము లింగ్లీషుప్రభుత్వమువారిచట్టములకు విరుద్ధములుగ నుండలేదు.

స్థానికప్రభుత్వములమూలమున కొన్ని క్రొత్త పన్నులను విధించి ధనము జేర్చి దేశమందల్లెడలను గరిడీస్థానములను స్థాపించుటకున్ను, ఐరిషుదేశీయచరిత్రను చదివించుటకు కావలసిన వసతులను స్థాపించుటకున్ను వినియోగపఱచుటకు సిన్‌ఫెయినులు తీర్మానించిరి. ఇది స్వయంవ్యక్తికి ప్రథమప్రయత్నము. ఇట్టి యితరమార్గములవలన నైర్లండు దేశమునకంతకును స్వతంత్రోద్యమములను స్వాతంత్ర్య నిర్వాహమును నలవరించి యైరిషువారికి స్వశక్తిని నిరూపించి దేశముయొక్క యోగక్షేమములను సాధించ సిన్‌ఫెయినుల యుద్దేశము. ఇదియే గ్రిఫిత్తు కోరినమార్గమున్ను. కాలక్రమేణ నతని యాదర్శములు దేశమునందంతటను మెప్పువడసెను.

## సిన్‌ఫెయినుల విద్యావితరణ

ఐర్లండులో నింగ్లీషువారు స్థాపించియుండిన విద్యాశాలలు ఐరిషువారికి అననుకూలములై యున్న సంగతి గ్రిఫిత్తు తొలుత నేరూపించి యుండెను. ఐరిషువారి యాత్మగౌరవమున్ను దేశాభిమానమున్ను నీచదువుమూలమున నడుగంటి పోవుచుండినవి. ఐరిషువారి దేశభక్తిని వారినాగరికతను దూరుటయు దూషించుటయు నింగ్లీషువారి సామ్రాజ్యతేజముల నుద్ఘోషించి స్తుతించుటయు నీవిద్యాదానముయొక్క నీచమైన దురుద్దేశమైయుండెను.* మనోమారకమైన నీవిద్యాభ్యాసమునకు ప్రతిగా

* మనదేశములోని రాజకీయ విద్యాశాలలుకూడ నీయుద్దేశమును నెఱవేర్చుచున్నవి.

ఐరిషువారు తమ కనుకూలముగ నుండునట్లు బాలురకు పాఠశాలలను స్థాపించుకొనిరి. వీనిఖర్చులకుగా నంపలి చదువు బాలురపోషకులున్ను ప్రపంచమునం దచటచట నున్న ఐరిషువారందరును చందాలనిచ్చి యీపాఠశాలలను నిర్వహించుచుండువారు. ఈచందాఅంతయు పడి దేశీయవిద్యానిధియను పేరంబరగెను. అంతకుపూర్వ మింగ్లీషుప్రభుత్వమువారి పాఠశాలలో చదువుచుండిన బాలురందఱును నొక్కుమాటేకముఖముగ వెలువడివచ్చుటకు గ్రిఫిత్తుఒప్పుకొనలేదు. ధనము చాలకుండినందున వీటికెల్లరకును దేశీయపాఠశాలలను స్థాపించుట యసాధ్యము. ఆకారణమున క్రమేణ దేశమునం దెల్లెడలను దేశీయపాఠశాలలను స్థాపించినతరువాత; బాలురనందఱిని రాజకీయపాఠశాలలనుండి విడదీయవలెనని గ్రిఫిత్తుయొక్కయుద్దేశము. ఆత్మనాశకమైన యింగ్లీషువిద్యాభ్యాసము నణగద్రొక్కి యాత్మభావకమయిన దేశీయపద్ధతులను స్థాపింప నుద్దేశమున సిన్‌ఫెయినులున్ను వారిపక్షమువారున్ను యింగ్లీషువారితో టెట్టియేలాటి సంబంధమును పెట్టుకొననొల్లనివారై దేశీయపక్షపాతులై యున్న గ్యాలికుసంఘమువారితో మైత్రిగావించుకొని తమయుద్యమమున్ను కొనసాగించుటకు ప్రయత్నపడిరి. తమబాలురవిద్యకు మార్గదర్శకులు తాముగాని యింగ్లీషురాజ్యసభయైనపార్లమెంటు కాదని సిన్‌ఫెయినులు ఘోషించితమదేశస్థులకుబోధింప దొడంగిరి. ఈదేశీయపాఠశాలలను స్థాపించుటకు కావలసిన ధనమునకై గ్రిఫిత్తు వార్త ననుసరించి సవరకొక పెన్ని (యనగా 240-వ) వంతున పన్నులను మండలసభలు వసూలుచేసి సిన్‌ఫెయినుదేశీయరాజ్యసభయొక్క తీర్మానముల ననుసరించి దేశమందంతటను దేశీయవిద్యాశాలలను స్థాపింపసాగిరి. ఇద్ధనసహాయముననే యెల్లెడలను జనసామాన్యమునకుపయోగపడునట్లు సరస్వతీభండారములను (లైబ్రరీలను)న్ను, విచిత్రవస్తుభవనము (మ్యూజియము)లనును గరిడీస్థానములను స్థాపించిరి.

ఇంగ్లీషువారిపరిపాలనకాలమున నైర్లండులోని దీనరక్షణాధికారులు గావించుచుండిన యన్యాయములు పెక్కులుండినవి. ఈయధికారులు పేదలయిన యైరిషువారికి వారిదేశముననే వృత్తివ్యాపారములను కలిపించి జీవనోపాయమును గలిగించుటకు మారుగ వారిని యితరదేశములకు కూలీలుగ బంపుచుండిరి. దేశములో వృద్ధికాతగినవ్యవసాయమును వ్యాపారమును చేతిపనులను వదలిపెట్టి బీదలకుగాను పరదేశములనుంచి యెక్కువధరలకు బట్టలను గొనియు వారియాహారమునకుగా నితరదేశములనుంచి ధాన్యాదులను గొనియు నైరిషువారికలసి వసూలయిన పన్నులద్రవ్యము నితరదేశములకు పంపి యైరిషువారిని దారిద్ర్యమునకును నష్టమునకును పాత్రముగా జేసి పరదేశములకు లాభమును కలిగించుచుండిరి. ఈదుర్వ్యయమును దారిద్ర్యమును తొలగించుటకు బీదలకొఱకు తమదేశములో నుత్పత్తియైన వస్తువులనే కొనవలయుననియు నైరిషువారికి వృత్తులను వ్యాపారములను కలిపింపవలెననియు సిన్‌ఫెయినులు దీనరక్షణాధికారులకునొక్కి చెప్పుచుండువారు. దేశమున నాలవభాగము వ్యవసాయార్హముగానో లేక వనార్హముగానో యుండగా పనిచేయగలిగియుండిన లెక్కలేని బీదవారిని త్రుప్పుపట్టిపోవునట్లుగ నిరుద్యోగులుగజేసి కార్యాలయములనియెడి కారాగృహములలో వేసియుంచుటకు సిన్‌ఫెయిను లెంతయు నాక్షేపించుచుండిరి. ఈనిరుద్యోగదుఃఖమును బాపుటకున్ను దేశమున వ్యాపారవృద్ధియగుటకును మార్గములను నిర్మించుటకు మండలసభలు తమతమ ప్రాంత్యములలో కొన్ని కాలువలను త్రవ్వించవలెనని సిన్‌ఫెయినులు ప్రోత్సాహపఱచుచుండిరి. దీనరక్షణసభలలోను మండలసభలలోను నున్న 6000 మంది యుద్యోగస్థులు ఐరిషుదేశీయనియోగమునకు మూలబీజముగావలెననియు వీరుగాని యితరఐరిషువారలుగాని యింగ్లీషువారిక్రింద నుద్యోగము నంగీకరింపరాదనియు సిన్‌ఫెయిను లభిప్రాయపడి యీలాగు నడచుకొనసాగిరి.

## ఐరిషువృత్తిప్రవృద్ధి

ఆర్థర్ గ్రిఫిత్తుయొక్క మూలమంత్రములలో ఐరిషువారివ్యాపారమున్ను వృత్తులున్ను వృద్ధికావలెననుట యొకటి. వీని నణగద్రొక్కుటవలననే ఇంగ్లీషుప్రభుత్వము ఐరిషువారిని బానిసలుగ జేసి వర్తకసంపత్తునకును నార్థికస్వాతంత్ర్యమునకును దూరులుగ జేసి దారిద్ర్యమునకు నిలుపట్టుగా గావించియుండిరి. ఈలోపములన్నిం

టిని తొలగించుటకు గ్రిఫిత్తుబోధించిన యీస్వతంత్రవర్ధన సూత్రమును ఐరిషువారు తత్క్షణమే యామోదించి యందుకొని స్మరణచేయసాగిరి. ఏలనన నిందువలనను తమకు సిరిసంపత్తులు చేకూరుననని వారు నమ్మిరి. తొలుతనే ఈప్రయత్నమును కొనసాగించుటకు ఐరిషు వ్యాపారసంఘములకు ధనాదిసహాయము నిచ్చుట యావశ్యకమని సిన్ ఫెయినులును వారిపక్షమువారును గ్రహించిరి. ఈసహాయము నెట్లియ్యనగును? ఇంగ్లీషువృత్తి నాయకులచే ప్రేరేపింపబడిన ప్రభుత్వము వీనికెంతయు నెగ్గు చేయుచుండెను. కావున దేశస్థులే యాక్రిందియేర్పాటులను జేసికొని దాని ననుసరించి తమయుద్యమమును నెఱవేర్చుకొనిరి.

(౧) జనులెల్లరును ఐర్లండులో నుత్పత్తియైన వస్తువులనే యుపయోగించవలయును.

(౨) స్థానికాధికారసంఘములు తమకు కావలసిన వస్తుభండారములను ఐరిషువ్యాపారసంఘములద్వారా ఐరిషువస్తువులనుగాఁజూచి తీయవలసినది.

(౩) ఓడరేవులఅధికారసభలు అన్యదేశములనుండి దిగుమతియగు వస్తువులమీఁద నెక్కుడు సుంకములను విధియించవలయును. అట్టివస్తువు లెవరిపేరటనికి దిగుమతియైనదియు వివరముగ వ్రాయించి వానిజాబితాలను ఆసభలు ప్రకటించవలెను.

(౪) ఐరిషువారు తమవ్యాపారధనమునంతయును ఐరిషువారివృత్తులవృద్ధికొఱకే వినియోగ పెట్టవలయును. ఐరిషువారిచేతిపనులు వృద్ధియగుటకు కావలసిన సమస్త సహాయమును దేశప్రజలొనర్పవలయును.

ఈయేర్పాటుల ననుసరించి యింగ్లండులోని వ్యాపారనిధులలో జిక్కియుండిన తమ ఐదుకోట్లసవరల ధనమును ఐరిషువారు తత్క్షణమే వెలిదీసి ఐరిషువ్యాపారపోషణమున కుపయోగపఱుప సాగిరి. ఇంతియే కాక యింగ్లీషువారినిధులలో నుండినతమధనమును ఐరిషు స్థానికప్రభుత్వసంఘములుకూడ విడదీసి యైరిషుదేశీయనిధి నొకదానిని స్థాపించిరి. తమదేశములో వర్తకప్రచారము హెచ్చుటకుగాను ఐరిషువారొకభండారమారాటము(Stock Exchange)నుకూడ నిర్మించుకొనిరి. దళాలీ (బ్రోకరు) లందరును నీయుద్యమమునకు చాల దోడ్పడిరి.

ఐరిషువారు స్వదేశములోని వృత్తులను వృద్ధిపఱచి వ్యాపారములకు వ్యాప్తి నిచ్చుటకు తోడుగ పరదేశములతో తమవ్యాపారములను ప్రాబల్యమునకు దెచ్చుటకు గావలసినయుద్యమముల గావింపదొడగిరి. గ్రిఫిత్తు సలహాను క్షణమున గైకొని వ్యాపారనావికముల స్థాపింపసాగిరి. ఐర్లండునకుఁ గావలసిన నావికసన్నివేశములు చాలనున్నవి. దానిరేవులు యూరపుఖండమునకంతకు నుత్కృష్టములు. కావున నార్వేదేశములోని జనులందఱు నెవ్విధముగ నావికవ్యాపారమువలన ధనవంతు లయిరో యట్లే ఐరిషువారును నావికవ్యాపారమున కుత్సహించిరి. నార్వేదేశములోని జనులలో నోడవ్యాపారసంఘములో భాగస్థుడు కానివాఁ డరుదు. అచ్చటికూలివాండ్రును వర్తకులును తమధనమును నిధులలో నిడుటకుబదులు నోడవ్యాపారమున కుపయోగపఱచి లాభమును మెండుగా బొందుచుందురట. వారినిజూచి ఐరిషువారును వారివలెనే చేయబూనిరి.

ఇతరదేశములలో తమవర్తకము వృద్ధిచెందుటకు తగినప్రయత్నములను చేయుటకుగా నైరిషువారాయా దేశములలో ప్రశంసకు (కాన్సెలు)లను నియమింపసాగిరి. ఆర్థరుగ్రిఫిత్తు యీపనిచాల ముఖ్యమని యెంచెను. ప్రతిసంవత్సరమునకు నిరువదియయిదువేలసవరలను ఖర్చుపెట్టి యేనుబదిమంది యైరిషువారిని పార్లమెంటు సభ్యులుగ లండనులో భరించుటకన్న నిందులో సగము మందిని ఇతరదేశములలో వర్తకప్రచారమునకై ప్రశంసకులుగ నునిచి వారిని భరించుట దేశమున కెంతయు లాభకారియని గ్రిఫిత్తు చెప్పియుండెను. ఈప్రశంసకులను నియమించునధికారము ఐరిషుదేశీయరాజ్యసభదిగా నుండెను.

## సిన్ ఫెయిన్ ధర్మాసనములు

ఐరిషువారితరవిషయముల నన్నిటను స్వాతంత్ర్యమును స్థాపించుకొనినమీదట ధర్మపాలనవిషయమున నింగ్లీషుప్రభుత్వము వారిప్రతినిధులతోగాని వారిధర్మాసనము(కోర్టు)లతోగాని యేలాటిసంబంధమును

నుండవలెనని వారు తమస్వకీయశాసనములను నేర్ప ఱచుకొన నిశ్చయించుకొనిరి. ఇంగ్లీషుప్రభుత్వ మేర్పఱచియుండిన శాసనములు జనులకు కేవలము ధనవ్యయమునకుమాత్రము కారణమయి న్యాయవిరోధములును నార్జవరహితములును నయియుండెను. వీనినాశ్రయించి ధనమును వ్యయపఱచుకొని న్యాయమును కోలుపోయి నష్టమునకు పాలుపడుచున్న నైరిషువారు విశేషధనవ్యయము లేకనే తమదేశీయపంచాయతి సభలతీర్మానముల ననుసరించినవారయి యింగ్లీషుప్రభుత్వమువారిబలమును నాదాయమును గౌరవమును తగ్గించి తుద కడుగంటించిరి.

తనపారతంత్ర్యమును పారద్రోలి ప్రపంచమున నలుదిశలను తనప్రతిభను వెలయజేయగలిగినస్థితికి ఐర్లండును తేవలెనని సిన్ ఫెయినులయాదర్శము. అనగా ఐర్లండును జీర్ణోద్ధారము చేయుటయే. దీనికి మూలాధారము ఐరిషువారికి స్వశక్తియందు దృఢమైన నమ్మకమును ధైర్యమును కలుగుటయే. మనయిల్లు బాగుచేయుటకు తగినవారు మనముగాక ఇతరు లెట్లగుదురని వారి వాదము. అన్యాధీనతయును, నన్యదేశీయులచేత నిర్మితములయిన శాసనములును తమదేశమున కొకనాటికిని దారి జూప జాలవని వీరి యనుభవమును నభిప్రాయమును నైయుండినవి. తమ్ముతాము నమ్మి గౌరవించుకొనలేనట్టి జనుల కితరదేశమువా రెన్ని బండ్లచట్టములను చేసినను అవి సంపత్ప్రదములు కాజాలవు మనకడుపులోనినొప్పి యితరుల కెట్లు తెలియ నగును? ఒకరిస్వాతంత్ర్యప్రాప్తికి వారిమనస్థైర్యము మూలాధారము. స్వయంశక్తికి స్వాధీనమును కారణముగాని, పరుల ప్రశంసగాని పరులసేవగాని కారణము కానేరదు. మన పురోవృద్ధికి మనముతప్ప నితరులు కారకులు కాజాలము; కాగూడదు. అట్లుకాగగుదుమని యితరులు తమయధికారపర్వమున ప్రేలపనములుగాని యిదెట్లు. ఇంగ్లీషువారి పార్లమెంటులోని ఉదారులు (లిబరల్), ఉదాసీనులు (టోరీలేకకన్సర్వేటివు)లను రెండు తెగలున్నయవి. ఉదారులు తమదేశవిషయముల నుదారబుద్ధితో వర్తింతురే కాని యన్యదేశములవిషయముల నాసమబుద్ధితో నౌదార్యము నూనినడచుకొనుటలేదు. అన్యదేశములయెడ నుదారులును నుదాసీనులును సమానమైన యశ్రద్ధనే వహించియున్నారు. వారిరువురును బ్రిటిషుసామ్రాజ్యమునందు దురభిమానము మెండు. కావున పరతంత్రములయియున్న యితరదేశములయెడ వారిరువురు నుదాసీనులే. వారందఱును నట్టియన్యదేశముల స్వాతంత్ర్యమునకు విరోధులే. ఐర్లండునను ఐరిషువారిట్లు ప్రక్క-మఱియొక్క-రివలన సత్ఫలితముల యబ్బనేరదు. సిన్ ఫెయినుల యాదర్శ మింగ్లీషువారిదుష్పాలనలవలని లాభపదములను మాన్పుకొనుటమాత్రమే కాదు. ఆయాసంస్కరింపబడినను నింగ్లీషుప్రభుత్వము తమదేశమునకు శ్రేయస్కరము కాజాలదని వానిని నిరాకరింపవలెనని వారిసిద్ధాంతముగా నుండెను. ఇంగ్లీషువారిదుష్పాలనము నెదిరించుటకు దేశాభిమానులెల్లరును సముత్సాహులై యేకముఖమై యేకమనస్కులయి యుద్యమించిరి. [సశేషము.]

---

# కొనకుఁడీ మాత్ర మీకు వైకుంఠయాత్ర

## పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

జ్వరమువచ్చినదంచు స్వప్నమ్ము రాఁగానె, ధనమబ్బినట్లు సంతసము నొందు
చెయిచూడుఁడని యెవ్వరయినఁ బిల్చినతోనె, వడివడిగా ముందె పర్వులెత్తు
మం దిమ్మనెడివారి మాట విన్పడఁగానె, రొక్కమిమ్మని ముందె నొక్కి యడుగు
పథ్యమేమని రోగి ప్రార్థింప నీకిష్టమైన వస్తువులె తిన్మనుచుఁ జెప్పు

గీ. చేయిచూచుట మందులు చేయుటయును, నాడిపోల్చుట మొదలుగుణాలు సున్న
వహ్వారే? వైద్యులఁట! ఇట్టివారిచేత, కొనకుఁడీ మాత్ర మీకు వైకుంఠయాత్ర!



# మూడవవజ్రహస్తుని బొడ్డపాడుతామ్రశాసనము

శ. ౯౮౭

మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు

సుమారు ఇరువదేండ్లక్రిందట బొడ్డపాడు నివాసులైన వెలమనక్క అప్పల నాయుడుగారు తమ యూరికి తూర్పుదిక్కున ఏబదిగజముల దూరమున నున్న తమ పొలమును సరిసాగుకు అనుకూలమగు పల్లము చేయించుటకై త్రవ్వించుచుండగా ఈ తామ్రశాసన మందు దొరకినది. ఈశాసనము దొరకినస్థలమునకు ౧౦ గజముల దూరమున స్థాపితమైన యొక లింగము కూడ కానవచ్చినది. దానికి పూర్వమున్న పేరు తెలియదు కాని యిటీవల బొడ్డపాడుగ్రామనివాసులు మల్లీశ్వరుడని పేరిడిరి. ఈలింగమున కుత్తరదిశను ఇరువదిగజములదూరములో 'లింగాలబండ' అను నొక చిన్న కోనేరు కలదు. ఈ విషయము లన్నియు ఆంధ్రదేశచరిత్రమున విశేషాభిమానముగల కంబకాయ నివాసులైన శ్రీ ఖైరి అప్పలస్వామినాయడుగారివలన నాకు తెలియవచ్చినవి. వారే ఈశాసనము బొడ్డపాడు గ్రామమున గలదని తెలిసికొని వారి సోదరులైన శ్రీ కొర్ని వెంకట్రావు నాయడుగారి ద్వారా దానిని సంపాదించి ప్రకటనార్థము నాకు బంపిరి. ఇందులకు వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

ఆకారాదికములు

శాసనమునందుగల రాగిరేకులు అయిదు. ఒక్కొకరేకుపొడవు ౮.౪ అంగుళములు; వెడల్పు 3.3 అంగుళములు. రేకులు కుడి, యెడమవైపుల కొంచెము వెడల్పుగను, నడిమి భాగమున కొంచెముసన్నముగను ఉన్నవి. రేకుల యెడమభాగమున అంచులకు .౮ అంగుళము దూరమునగల రంధ్రములగుండ నొక రాగికడియమును పోనిచ్చి, తద్ద్వారమున ఈ రేకులను బంధించియున్నారు. కడియము యొక్క వ్యాసము 3.౫అంగుళములు; ఈకడియ మొకరాజముద్రికలో సతికింపబడియున్నది. రాజముద్రికమీద స్ఫుటముగ నొకనంది చెక్కబడియున్నది. ఆనంది కిరుప్రక్కల చంద్రుడు, అంకుశము, నాగలి, శంఖము, మత్స్యము, స్పష్టముగ ఇదియని తెలియరాని దేవో మరియొకచిహ్నము—ఇవి కలవు. మొదటిరేకు మొదటిపెడమీదను, అయిదవరేకు రెండవ పెడమీదను వ్రాత యేదియు లేదు. పుస్తకమునకు అట్టలవిధమున ఈశాసనమునకు ఈ రెండు పెడలును ఉపకరించుచున్నవి.

లిపి—భాష

శాసనలిపి నాగరి. ఇది మూడవ వజ్రహస్తుని చిక్కాలవలసశాసనము[1]నందలి లిపిని బోలియున్నది. అందువలన అక్షరముల విషయమున జెప్పవలసిన విశేషములు చిక్కాలవలసశాసనమునందలి వాటికంటె నేవియు కనబడవు. ఆశాసనమునందువలెనే ఇందును తరచు బకారమునకు వకారమే వ్రాయబడినది. (పం. ౬, ౮, ౧౧, ౧౬, ౧౮, ౨౪, ౨౮, ౪౨, ౪౬); శవర్ణమునకు మాఱుగ సవర్ణము వ్రాయబడినది. (పం. ౧౨,౨౧,౨౨,౩౨,౩౬, ౪౦,౪౩); ఇట్లే సవర్ణ ముండవలసినచోట్ల శవర్ణమును గలదు. (పం.౩, ౩౨, ౩౬, ౪౦); రేఫమునకు వెనుకవచ్చు క,గ,చ జ,త,ద,న, భ,య,వ లు ద్విత్వయుక్తము లైనవి; అట్లు ద్విత్వమును పొందనివి ష, థలు మాత్రమే. 'ర్ఌ' అను అక్షరము 'ర౯' వలె వ్రాయబడినది (పం. ౪౭). మిగిలిన విశేషములకు చిక్కాలవలసశాసనము చూచునది.

భాష సంస్కృతము: శాసనము వ్రాసినవాడు చాల అశ్రద్ధతో వ్రాసి యున్నాడు; కొన్నిచోట్ల దిద్దుబాటులు కలవు; కొన్నిచోట్ల సవరణలు కలవు; మరికొన్నిచోట్ల తప్పులుకలవు.'ప్రక్షాలిత'అనుటకు'ప్రక్ష్యాలిత'అనియు (పం.౩), 'పృథ్వీమ్'అనుటకు'ప్రిథ్వీమ్'అనియు (పం. ౧౯),'విషయే' అనుటకు 'విషయో' అనియు (పం. ౪౦), లోహకారిణే అనుటకు 'లోహకారీ'అనియు (పం. ౫౨) అప ప్రయోగములు కొన్ని కానవచ్చుచున్నవి. మొట్టమొదటినుండి ౩౯ పంక్తులవఱకు ఈ శాసనము వజ్రహస్తుని చిక్కాలవలస శాసనమునకు నకలు. దానముచేయబడు గ్రామమును గుఱించిన ప్రస్తావము వచ్చినప్పటినుండి ఈ శాసనమును, ఆ శాసనమును భేదించుచున్నవి.

శాసనవృత్తాంతము

ఈ శాసనము కళింగ గంగవంశజు డైన అనంతవర్మాభిధానుం డగు మూడవ వజ్రహస్తదేవునిది. ఈ రాజు కళింగదేశమును శాలివాహనశకము ౯౬౧ మొదలు ౯౯౨ వఱకు, అనగా క్రీ. శ. ౧౦౩౮ మొదలు ౧౦౭౦ వఱకు పాలించినవాడు.

శాసనమున మొదట ఆత్రేయ గోత్రులైన త్రికళింగాధిపతు లగు గంగవంశజుల ప్రశస్తికలదు(పం. ౧-౧౦). పిదప గుణమహార్ణవ మహారాజుకొడుకులైన మొదటి వజ్రహస్తునినుండి కామార్ణవభూపతికిని, వైదుంబవంశమను పాలసముద్రమున దుద్భవమందిన వినయమహాదేవికిని జన్మించిన మూడవవజ్రహస్తుని వఱకుగల గంగవంశపు రాజుల వర్ణనాదికములు కలవు (పం. ౧౧-౨౭). ఈ మూడవ వజ్రహస్తుడే మనశాసనము నందలి దాత. ఈతని యితర శాసనములలోవలెనే ఇందును ఆరాజు శకాబ్దములు ౯౬౦ లో పట్టాభిషిక్తు డయ్యెనని తెలుపబడినది (పం ౨౮-౩౧). పిదప న్యాయ్యమును, ప్రజారంజకమును నైన యతని పరిపాలనము వర్ణింపబడినది(పం.౩౦-౩౬).అటుతరువాతపర

1. భారతి, సం. ౨, సంచిక ౨, పుట ౧౩౮.

మమాహేశ్వరుడును; పరమ భట్టారకుడును, మహారాజాధిరాజును, త్రికళింగాధిపతియును నైన శ్రీ మదనంతవర్మ-యను వజ్రహస్త దేవుడు కళింగనగరమునుండి తన తల్లిదండ్రుల యొక్కయు, తనయొక్కయు పుణ్య యశోభి వృద్ధికొఱకు సమస్తామాత్య ప్రముఖజనపదు లను పిలిచి వారి సమక్షమున శకాబ్దములు కరములు (౨), వసువులు (౮), నిధులు (౯) అనుసంఖ్యలచేత అంకితమైన సంవత్సరమున అనగా ౯౮౨ వ శకవర్షమున ఉత్తరాయణ సంక్రాంతినాడు కోలువర్తని విషయములోని అవరెంగ అనుపేరుగల గ్రామమును చతుస్సీ మావచ్ఛిన్నముగను, సజలస్థలముగను, సర్వ పీడావివర్జితముగను అనగా జలసహితముగను స్థలసహితముగను ఏవిధమైనపన్ను పర్యాయ ములబాధలు లేకుండజేసి ఆగ్రామమున విజ యంచేసియున్న జలేశ్వరస్వామి అనుపేరుగల దేవునికి భోగముచేసి అనగా దేవునికి చెల్లే గ్రామముగ ఏర్పాటుచేసి దాన మొసంగబడి నది (పం. ౩౬-౮౩). జలేశ్వరదేవునికి చేసిన ఈదానమును తెలుపుటకే ఈశాసనము పుట్టినది. ఈగ్రామమును జలేశ్వర స్వామికి దానమునొసంగు సందర్భముననే మరి యిరు వురు గ్రామస్థులకు (౧) ఎరయముడు అను వానికిని (౨) మహాక్షశాలి[1]యు, స్వర్ణలోహ కారకుడు అయిన వల్లెమోజుకును వృత్తులొ సంగబడినవి (పం. ౮౩-౮౫; ౫౨-౫౩). పం క్తులు ౮౫ మొదలు ౫౨ వఱకు దానము చేయబడిన గ్రామముయొక్క సరిహద్దులు తెలుపబడినవి. చిట్టచివర దానశాసనములకు వ్రాయబడు మామూలు శ్లోకములు కలవు. (పం. ౫౩-౫౫). కడపటి రెండుపంక్తులలోను శాసనమును వ్రాసిన వానిపేరు, శాసనమును చెక్కినవానిపేరు తెలుపబడినవి. శాసనమును వ్రాసిన యతడు మావురయకుమారు డైన దామోదరుడు. ఇతడు మహాకాయస్థుడనియు, సంధివిగ్రహి అనియు తెలుపబడినాడు. సంధి విగ్రహి అనగా యుద్ధము ప్రకటించుట, సంధి సేయుట అను కార్యములను బరిశీలించు మంత్రి. శాసనమును చెక్కినవాడు నూంక మోజు కొడుకైన వల్లెమోజు. శ. ౧౦౦౩ నాటి అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనమును వ్రాసిన వారును, చెక్కిన వారలునుకూడ వీరలే.[2] ఇది శాసనమునందలి వృత్తాంతము.

'మాదరమానవర్తికము'

ఎరయముడు అనువాని కిచ్చిన వృత్తి 'మాందరమనవర్తికము'అనిశాసనమున చెప్ప బడినది. ఇప్పుడు మనము 'మనోవర్తి' అను నదియే ఈ 'మనవర్తికము' అని నా యభిప్రా యము. తెలుగు, సంస్కృతము కలిసిన యీ విచిత్రసమాసపదము ఇప్పటి యర్థమున క్రీ. శ. పదవ శతాబ్దినాటికే రూఢమై యుం డుట ఆశ్చర్యకరము. అసలు, మనుట అనగా బ్రదుకుట; మనువృత్తి అనగా జీవనాధార ముగ నేర్పడిన వృత్తి: అదియే 'మనవర్తిక కము' (పం. ౮౫) అనియు, 'మనవర్తికా' (పం. ౫౨) అనియు శాసనమున వ్రాయబడినది.

1. భారతి, సం. ౨, సంచిక ౮, ౭౭ వ పుట.

2. భారతి, సం. ౨, సంచిక ౮, పుట ౮౭.

ఈవృత్తి 'మాదరమనవర్తికము' అని తెలుపబడుటవలన ఈవృత్తిమంతుడైన ఎరయముడు మాదరవంశజు డని యూహింపనగును. ఇప్పుడు మేదరలు అనబడువారలను పూర్వము మాదర లనుటయు కలదని మన్మిత్రులైన బ్రహ్మశ్రీ పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు తెలిపియున్నారు. ప్రాచీనవాఙ్మయము చూచినను అట్లే కానవచ్చుచున్నది. పాల్కురికి సోమనాథప్రణీత మైన తెలుగు బసవపురాణమున నీక్రిందిపంక్తులలో మాదర పదము కన్పట్టుచున్నది. అది యిప్పటి మేదర యనుట స్పష్టము.

"నంబకళము గ్రోలు నప్పుడు శివుడు
మాదర చెన్నయ్య మహిమ యెఱింగి
మాదేవు భక్తుల మాలరనాగ
గూడునె బ్రాహ్మణ కూళిర్పులకును.
—బసవపురాణము[1].

కర్ణాటభాషలో కూడ మాదర, మేదర అను రెండురూపములును కానవచ్చుచున్నవి.[2] కాల క్రమమున మాదరపదము మేదరగా మారినట్లు ఊహింపనగును. వెదురుతో బుట్టలు తట్టలు అల్లువారు మేదరులు. జలేశ్వరస్వామికి మేదరులు చేయవలసిన పనులు చేయుచుండుటకై ఈ 'మాదరవృత్తి' యొసంగబడినట్లు నే నూహించెదను. ఈ యెరయముడు వేస్య (శ్య ?) గోత్రోద్భవుడు. మేదరులు, దొమ్మరులు మొదలగు వారికి గోత్రములు కలవనుటకు ప్రాచీన శాసనములే ప్రమాణము. ఎరయముని యొక్క తండ్రి పేరు మాచయ; తల్లి పేరు కంచమ. తాత పేరు ఎరయముడు.

కాలనిర్ణయము

గ్రామమును దాన మొసంగినది శకవర్షము ౧౦౭౧ లో ఉత్తరాయణ సంక్రాంతినాడు; అనగా ఈశాసనము క్రీ.శ. ౧౧౪౯-౫౦ వ సంవత్సరమునాటిది యగును. తిథి వారములు పేర్కొనబడకపోవుటచేత క్రీ. శ. సంవత్సరమును గురించిన వివరములు సరియైనవి తెలిసికొనుటకు వీలు లేదు.

స్థలనిర్దేశము

దానము చేయబడిన గ్రామము అవరెంగ. ఇది కోలునర్తని విషయములోనిదని చెప్పబడినది. ఈవిషయమే చిక్కాలవలస శాసనమునను పేర్కొనబడినది.[3] జల్మూరు, కుద్దాము మొదలగు గ్రామము లున్న యిప్పటి శ్రీకాకుళము తాలూకా (గంజాం జిల్లా) పూర్తిగనో, లేక కొంతభాగమో కోలువర్తనీ విషయమని ప్రాచీనకాలమున పేరొందియుండినట్లు చిక్కాలవలసశాసనమువలన దెలిసికొని యున్నాము. ఆనిర్ణయమునే యీశాసనము బలపఱుచుచున్నది. దానముచేయబడిన అవరెంగ అనుగ్రామ మిప్పుడు అవలింగి అను

1. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములోని తాళపత్ర గ్రంథప్రతి నెం. ౧౨-౬-౭-పుట ౧౫౩; లిఖితప్రతి, నెం. ౧౩-౪-౧౩, ఆ. ౩, పుట ౭౬౪.

2. Kittell's Canarese—English Dictionary.

3. భారతి, సం. ౫, సంచిక ౭, పుట ౧౩౭.

పేర బరగుచున్నది. ఇది శాసనములు దొరకిన శ్రీకాకుళము తాలూకాలోని బొడ్డపాడు గ్రామమునకు తూర్పుదిక్కున సుమారు ఒక మైలు దూరమున, పర్లాకిమిడి ఎస్టేటు శ్రీకాకుళము తాలూకాలు రెంటికి సరిహద్దున పర్లాకిమిడితాలూకాగ్రామముగ నున్నది.[1] ఈ గ్రామమునకు సరిహద్దులుగ నన్నియు పుట్టలు, చెట్టులు గుట్టలే చెప్పబడినవి కానిఒక్కగ్రామమైన పేర్కొనంబడలేదు.

గాంగ, గంగ వంశములు

గాంగ, గంగ వంశములను గుఱించిన చిన్నవిమర్శనముతో నీశాసనచర్చనుముగించెదను. అనంతవర్మ చోడగంగదేవుని కొర్ని శాసనములను ప్రకటించిన నామిత్రులైన శ్రీయుత గిడుగు వేంకట సీతాపతి (బి. యే. యల్. టి.)గారు కళింగదేశమునేలిన రాజులు ఒక్కసంతతివారు కారనియు, మొదట పరిపాలించినవారు గాంగవంశపు రాజులనియు, వారి తరువాత పరిపాలించినవారు గంగవంశపురాజులనియు, రెండవ వంశమునకు గాంగ వంశమని పేరుపెట్టుటకు ఆధారము కనబడదనియు వ్రాసియున్నారు.[2] వంశనామమునకు ఆమాత్రపుభేదముండుటచే నది యొకవంశము కాదనియు, రెండువంశము లనియు చెప్పుట అంత యుక్తియుక్తముగ దోచదు. అదియును గాక శాసనప్రమాణముకూడ నందులకు విరుద్ధముగనే యున్నది.

కళింగదేశమును పరిపాలించిన 'మొదటి రాజు' లనబడువారు తమ శాసనములలో తాము గాంగవంశజుల మనియే కాక 'గంగ' వంశజుల మనియు (గంగామలకులతిలకులు) చెప్పుకొనియున్నారు. చూడుడు :

(౧) రాజేంద్రవర్మ కొడుకైన అనంతవర్మదేవుని అలమండశాసనము.[3]

(౨) వజ్రహస్తుని పర్లాకిమిడిశాసనము.

(౩) అనంతవర్మదేవుని కొడుకైన దేవేంద్రవర్మ శ్రీకాకుళము శాసనము.[5]

(౪) ఇంద్రవర్మ శ్రీకాకుళము శాసనము.[6]

(౫) మహేంద్రవర్మదేవుని కుమారుడైన పృథ్వీవర్మదేవుని గంజాముశాసనము.[7]

(౬) దేవేంద్రవర్మదేవుని కుమారుడగు సత్యవర్మదేవుని శ్రీకాకుళము శాసనము.

---

1. అచలింగిగ్రామమునకు సంబంధించినవివరములు శ్రీభైరి అప్పలస్వామి నాయుడుగారే తెలిపియున్నారు. మూడవవజ్రహస్తుని నడగాం శాసనము (Ep. Ind. IV. 183)న కోలువర్తని విషయములోనిదిగ తెలుపబడిన నుగిలగ్రామము అప్పలస్వామినాయుడుగారు తెలిపినట్లు శ్రీకాకుళముతాలూకాలోని గుగ్గిల అయియుండవచ్చునని యే నమ్మెదను.

2. భారతి, సం. ౨, సంచిక ౧, పుటలు ౭౬-౭౯.

3. Ep. Ind. Vol. III, P. 17.

4. Ep. Ind. Vol. III, P. 220.

5. Ind. Ant. Vol. XIII, P. 275.

6. Ind. Ant. Vol. XIII, P. 120.

7. Ep. Ind. Vol. IV, P. 198.

8. Ind. Ant. Vol. XIV, P. 10.

మొదట పరిపాలించి రనబడు రాజులు తా మిట్లు గంగామలకులతిలకులమనికూడ చెప్పు కొనియుండ, వారి తరువాత పాలించి రనబడు రాజులు అనగా మనవజ్రహస్తుడు మొదలగు వారు తాము గాంగవంశజుల మైనట్లును చెప్పుకొనియున్నారు. చూడుడు :

(౧) నరూపాడు వజ్రహస్తుని నడగాం శాసనము.[1] (గాంగానా సులంకరిష్ణోః)

ఈ కారణములవలన కళింగదేశము నేలిన రాజులెల్లరు ఒక్కవంశమునకే—అది గాంగవంశమైన నేమి, గంగవంశమైన నేమి—చెందినవారని చెప్పవలసి వచ్చుచున్నది.

## మూ ల ము[2]

మొదటి రేకు : రెండవ పెడ

1. ఓం[3] స్వస్తిశ్రీమతామఖిలభువన వినుతనయవినయదయాదాన[4] దాక్షిణ్యాసత్యశౌ

2. చ[5] శౌర్య్య ధైర్య్యాది గుణరత్న పవిత్రకాణా[6] మాత్రేయ గోత్రాణామ్[7] విమలవిచారాచార[8]

3. పుణ్యసలిల[9] ప్రక్షాలిత[10] కలికాలకల్మష మషీణాం మహామహేన్ద్రాచల[11]

4. శిఖరప్రతిష్ఠితస్య సచరాచరగురోః[12] సకలభువన నిర్మ్మాణైక సూ

5. త్రధారస్య శశాఙ్కచూడామణే[13] ర్భగవతో గోకర్ణ్ణ స్వామినః[14] ప్రసా

6. దాసేమాసాదితైక[15] శఙ్ఖభేరీపఞ్చమహాశబ్ద[16]ధవలచ్ఛత్ర హేమ

7. చామరవరవృషభలాఞ్ఛన సముజ్జ్వల సమస్తసామ్రాజ్య మహిమ్నా[17]మనేక

---

1. Ep. Ind. Vol. IV, P. 183. నడగాంశాసనమున 'గాంగానామన్వయ' మని కలదు. కాని రేకుల మూలములో చూడగా 'గా' అని దీర్ఘము కనబడలేదు. వజ్రహస్తుడు మొదలగువారు గంగవంశజులే యైనను, పర్యాభిధానము కల కళింగాధిపతులుకూడ తాము గంగవంశజులమనియు చెప్పుకొనియుండుటచేత ఈ రెండువంశ ములకు భేదము పాటింపదగదు.

2. నాదగ్గరనున్న రేకుల ననుసరించి. 3. ఇదియొక గుర్తువలన చూపబడినది. 4. లేఖకుడు మొదట 'హాన' వ్రాసి దానిని 'దాన'గా దిద్దెను. 5. లేఖకుడు మొదట 'శౌయ' అని వ్రాసి పిదప దానిని 'శౌచ'గా దిద్దెను. 6. 'పవిత్ర కాణా' మన్నమాటలో లేఖకుడు కాను దీర్ఘమును మొదట నిచ్చుట మఱచి పిదప నిచ్చెను. 7. లేఖకుడు మొదట 'మాత్రి గోత్రాణామ్' అని వ్రాసి పిదప 'మాత్రేయ గోత్రాణామ్' గా దిద్దెను. 8. లేఖకుడు మొదట 'విచారోద్భావ' అని కాబోలు వ్రాసి దానిని 'విచారాచార' అని దిద్దినాడు. 9. 'సలిల' అని చదువవలెను. 10. 'ప్రక్షాలిత' అని చదువవలెను. 11. లేఖకుడు ముందు 'మహీన్ద్రాచల' అని వ్రాసి దానిని 'మహేన్ద్రాచల'గా దిద్దెను. 12. లేఖకుడు ముందు 'చరాచారగురోః' అని వ్రాసి పిదప దానిని 'చరాచర గురోః' అని దిద్దెను. 13. 'శశాఙ్కచూడా' అన్నచోట నేవియో దిద్దుబాటులు కలవు. 14. లేఖకుడు ముందు 'స్వమినః' వ్రాసి పిదప 'స్వా'కు దీర్ఘమిచ్చినాడు. 15. 'దసమాసాదితైకం' అని చదువవలెను. 16. 'మహాశబ్దం' అని 17. లేఖకుడు 'మ్నా' అను నక్షరమును వ్రాయుట మరచిపోయి పిదప దానిని 'హి'కి 'మ'కు మధ్య క్రింద వ్రాసెను.

రెండవ రేకు : మొదటి పెడ

8. సమరసఙ్ఘట్టసముపలబ్ధ[18] విజయలక్ష్మీ సమాలిఙ్గితోత్తు[19] ఙ్గభుజదణ్డము

9. ణ్డితానాంత్రికలిఙ్గమహీంభుజా[20] గఙ్గానా మన్వయమలంకరిష్ణో ర్విఙ్ణో రివ

10. విక్రమాక్రాన్తధరామణ్డలస్య గు[ణ] [మ*]హార్ణ్ణవ మహారాజస్యపుత్రః ॥ పూ

ర్వ్వంభూపతి

11. భి ర్వ్విభజ్య వసుధా యా పఞ్చభిః పఞ్చధాభుక్త్వా భూరిపరాక్రమో భుజవలా[21]

12. త్తామేక ఏవస్వయమ్ ఏకీకృత్యవిజిత్య సత్రునివహాన్[22] శ్రీవజ్రహస్తశ్చతుశ్చ

13. త్వారిమ్[23]శతమత్యుదార చరితః సర్వ్వామరక్షీ నేమాః[24]॥ తస్యతనయో [గు]ణ్డ

మరాజా[25]వ

14. ర్ష త్రయమపాలయత్ మహీంమ్॥ తనుజః[26] కామార్ణ్ణవ దేవఃపఞ్చత్రింశత మబ్ద

కాన్॥[27]

రెండవ రేకు : రెండవ పెడ

15. తస్యానుజో వినయాదిత్య [ః*] సమాస్త్రిస్ర [ః*]॥ తతః కామార్ణ్ణవాజ్జా(తా)త్తో

జగతీకల్పభూ

16. రుహః। యోరాజద్రాజత(ః)చ్ఛాయోవజ్రహస్తావనీపతిః॥ ప్రశోచ్చ్యేదన్మదగన్ధలుబ్ధ[28]

17. మధుపవ్యాలీఢగణ్డాగ్గజాన(౨)ర్థిభ్యఃసమదా[త్ *]సహస్ర[29]మతులో యస్త్యాగి

నా మగ్రణీ [ః*]

18. స(ః) శ్రీమాననియఙ్కభీమ నృపతి గ్గఙ్గాన్వయో తంసకః[30]పఞ్చత్రింశతమబ్దా[31]

19. కాన్సమభున క్ష్మిర్త్వీమ్[32] స్తుతః పార్థివైః॥ తదగ్రసూనుః సూరరాజ[33]సూను

20. నాసమస్సమస్తాం సమితారి[34]మణ్డలః స్మపాతికామార్ణ్ణవభూపతిర్భ్బవం

21. సమృద్ధిమానర్ద్ధసమా[ం*]సముజ్వలః॥[35][త] దనుతదనుజన్మో[36]చిత్తజన్మోప

18. ౦సముపలబ్ధ౦ అని నదునవలెను.
19. ౦సమాలిఙ్గితోత్తుఙ్గ౦ అని.
20. ౦మహీంభుజాం అని.
21. ౦భుజబలాం అని.
22. ౦శత్రునివహాన్ అని.
23. ౦చత్వారింశతం అని.
24. ౦మరక్షీత్సమాః అని.
25. రాజో అని.
26. తదనుజః అని.
27. ౦మబ్దకాన్ అని.
28. ౦లుబ్ధా౦ అని.
29. సహస్రం అని.
30. ౦గంగాన్వయోత్తంసకః అని.
31. ౦మబ్దాం అని
32. పృథ్వీమ్ అని.
33. సురరాజం అని.
34. శమితారి౦ అని.
35. సముజ్జ్వలః అని.
36. ౦జన్మా౦ అని.

మూడవ రేకు : మొదటి పెడ

22. మానో గుణనిధిరనవద్వ్యో[37]గుణ్డమాఖ్యోమహీసః[38]సకలమిదమరక్షత్త్రీణి

23. వర్షాణిధాత్రీవలయమలఘుతేజో[39]నిర్జితారాతిచక్రః॥తస్యోర్ద్వైమాతురస్తస్య

24. మధుకామార్ణ్ణవో[40]నృపః । అవతిస్మావనీమేతామద్బా[41]నేకార్ణ్ణవింశతిమ్[42]॥౦॥

అధవ

25. జ్రహస్తనృపతే[43]రగ్రసుతాదఖిలగుణిజనాగ్ర[గ*]ణ్యాఃకామార్ణ్ణవాత్కవీన్ద్రప్ర

26. గీయమానావదాత శుభకీర్త్తేః[44]॥ శ్రియఇవై[45]వైదుమ్యాన్వయ[46]పయః పయో

27. నిధిసముద్భవాయాశ్చ యః సమజని వినయమహాదేవ్యాః[47]శ్రీవజ్రహస్తఇతి [సు

28. తనయః॥వియద్రుతు[48]సంఖ్యాంయాతి[49]శాకాబ్దే[50]సఘ్నేదినకృతివృషభస్థే రోహిణీభే

29. లగ్నేధనుషిచసితపక్షేసూర్య్యవారేతృతీ(౦)యా(౦)యుజసకలధరిత్రీం

---

37. ౦రనవద్యో౦ అని.

38. ౦మహీశః అని.

39. ౦తేజో౦ అనుదానిలో ముందు'జ'వ్రాసి పిదప లేఖకుడు 'జో'వ్రాసెను.

40. ౦కామార్ణ్ణవో౦ అన్నమాటలోని 'మా'ను లేఖకుడు ముందుమఱచిపోవుటచేత'కా'కు,'ర్ణ్ణ'కుమధ్యపైన × ఈగుర్తుపెట్టి క్రింప 'మా' వ్రాసెను.

41. ౦మబ్దాం అని.

42. ౦నేకాన్నవింశతిం అని.

43. లేఖకుడు ముందు 'నృపతి'వ్రాసి పిదప 'నృపతే' అనిదిద్దెను.

44. లేఖకుడు ముందు 'కీర్త్తిః' అనివ్రాసి పిదప 'కీర్త్తేః' అని దిద్దెను.

45. శ్రియఇవ అని.

46. వైదుమ్బాన్వయం అని.

47. '౦మహాదివ్యాః' అని ముందువ్రాసి లేఖకుడుదానిని పిదప 'మహాదేవ్యాః'గాదిద్దెను.

48. వియద్రుతుం అని.

49. 'ఆతిం' అని ముందువ్రాసి లేఖకుడుపిదప దానిని 'యాతి'గా దిద్దెను.

50. ౦శాకాబ్దం అని.

మూడవ రేకు : రెండవ పెడ

30. రక్షితుం యోభిషిక్తః॥ న్యాయ్యేన యత్ర సమ మాచరితుం త్రివర్గే మార్గేణర

31. క్షితిమక్షీమ్మహిత ప్రతాపే నివ్వ్యాఖ్యాధయశ్చ నిరఘాశ్చనిరాపదశ్చశశ్వత్ప్రజా

32. భువిభవన్తి విభూతిమర్త్యాః[51]॥ వ్యాప్తే[52]గఙ్గ[53] కులోత్తమస్య యసశా[54] దిక్చక్ర వాలేశ[శి]

33. ప్రద్యోతామలినేన[55]యస్యభువనః ప్రహ్లాదసమ్పాదినా సిన్దూరై[56]రతిసా

34. న్ద్రపఙ్కపటలై [ః*]కుమ్భస్థలీపట్టకే[57]ష్వాలిమ్పన్తి[58]పునఃపునశ్చ[హ]

35. రితామాధోరణావారణాన్॥ అనురాగేణగుణినో[59]యస్యవక్షో ము

36. ఖాబ్జయోః[60] ఆశీనే[61](శ్రీ)సరస్వత్యా వనుకూలే విరాజతః॥౦॥కలిఙ్గ

37. నగరాత్పరమమాహేశ్వర[62]పరమభట్టారక మహారాజాధిరాజత్రిక[63]

---

51. 'ంమర్త్యాః'—అని.

52. లేఖకుడు మొదట 'వ్యాప్తి' అని వ్రాసి పిదప దానిని 'వ్యాప్తే'గా దిద్దెను.

53. లేఖకుడు మొదట 'గఘ' వ్రాసి పిదప దానిని అవస్థపడి 'గఙ్గ'గా దిద్దెను.

54. 'యశసా' అని.

55. లేఖకుడు మొదట 'ద్యా'కు ఇత్వమిచ్చి పిదప దానిని కొట్టివేసి ఏత్వమిచ్చెను.

56. లేఖకుడు మొదట 'సిన్దూరో' వ్రాసి పిదప దానిని 'సిన్దూరై౦' అని దిద్దెను.

57. లేఖకుడు మొదట 'పట్ట కి' వ్రాసి పిదప దానిని 'పట్టకే'గా దిద్దెను.

58. లేఖకుడు 'స్వా' వ్రాసి, సాపాట్టులో అయిమూల గీటిచ్చుటవలన దానిని 'షా'గ మార్చెను.

59. లేఖకుడు 'అనురాగేణ' అనుపదములో మొదట 'గి' వ్రాసి పిదప దానిని 'గే'గ దిద్దెను: అట్లే 'ఘణినో' అను పదములో మొదట 'నా'కు ఇత్వమిచ్చి పిదప దానినికొట్టివేసి ఏత్వమిచ్చెను.

60. 'ంముఖాబ్జయోః' అని.

61. 'ఆసీనే' అని.

62. లేఖకుడు మొదట 'మహేశ్వర' వ్రాసి పిదప దానిని 'మాహేశ్వర'గా దిద్దెను.

63. లేఖకుడు మొదట 'త్రింయ' వ్రాసి దానిని పిదప 'త్రిక' గా దిద్దెను.

నాలుగవ రేకు : మొదటి పేడ



38. లిఙ్గాధిపతి (శ్రీ)మదన న్తవమ్మా౯[64]వజ్రహ స్తదేవః[65]కుశలీ సమస్తామాత్య ప్రము
39. ఖ జనపదా న్సమాహూయ సమాజ్ఞాపయతి[66]విదితమస్తుభవతామ్॥ కోలువర్త౯ని
40.వి[ష*]యే[67]అవరెఙ్గాఖ్య[68]గ్రామః। చతుఃశీమావచ్ఛిన్నః[69]సజలస్థలఃసర్వ్వ౯పీడా
41. వివర్జ్జిత మాచన్ద్రార్క్క౯క్షితి సమకాలం యావన్మాతాపిత్రో రాత్మనః[70]పు
42. ణ్యయశోభి వృద్ధయే[71]॥ కరవసు నిధిశాకాబ్దే[72]। ఉత్తరాయణ సంక్రాన్త్యా
43. అస్మి౯ గ్రామనివాసినే[73]॥ జలేశ్వరదేవాయ[74] భోగంకృతమ్[75]॥ విస్వా(?శ్వా)గోత్రో
44. త్పన్నః ఏరయమః। తస్యపుత్రః। మావయః। తస్యభార్యాకంచపా। తయోర్జ్జా౯
తాయ[76]ఏరయమాయ

45.మాదరమనవర్త్తి౯కంప్రదత్తమ్॥అస్యైవగ్రామస్యసీమా(ం)నో[77]లిఖ్యన్తే[78]॥పూర్వ్వ౯తః

64. ఇచ్చట 'మ్మా౯' దగ్గఱ ఏవియో తుడుపులు కలవు.
65. లేఖకుడు మొదట 'స్త' వ్రాయుట మఱచిపోయి, పిదప దానిని 'దే' అను అక్షరముపైని వ్రాసెను.
66. లేఖకుడు మొదట 'సమాజ్ఞాపయతి'లోని 'మా' వ్రాయుట మఱచిపోవుటచేత దానిని 'స' 'జ్ఞా'లకుమధ్య [క్రింద వ్రాసెను.
67. 'విషయే' అని.
68. లేఖకుడు మొదట 'అవరింగాఖ్య' అని వ్రాసి పిదప దానిని 'అవరెంగాఖ్య'గా దిద్దెను.
69. 'చతుస్సీమావచ్ఛిన్నః' అని.
70. 'ంరాత్మనః' అని.
71. లేఖకుడు ముందు 'వృద్ధయో' అని వ్రాసి పిదప దానిని 'వృద్ధయే'గా దిద్దెను.
72. 'శాకాబ్దే' అని.
73. లేఖకుడు ముందు 'గ్రామనివాసినో' అని వ్రాసి పిదప దానిని 'నివాసినే'గా దిద్దెను.
74. లేఖకుడు ముందు 'దివాయ' అని వ్రాసి పిదప దానిని 'దేవాయ'గా దిద్దెను.
75. లేఖకుడు మొదట 'కృజమ్' అని వ్రాసి పిదప దానిని 'కృతమ్'గా దిద్దెను.
76. 'తయోర్జ్జా౯తాయ' అన్న పదములో 'యో' ఇప్పటి నాగరిలిపిలోవలె వ్రాయబడినది; 'ంజ్జా౯తాయ ఏరం' అన్నచోట ఏవియో వ్రాసి కొట్టివేసిన తుడుపులు కలవు.
77. లేఖకుడు మొదట 'సీమానో'లోని 'నా'కు ఇత్వమిచ్చి పిదప దానిని కొట్టివేసి ఏత్వమిచ్చెను.
78. లేఖకుడు మొదట 'లిఖ్యాన్తే' వ్రాసి దానిని 'లిఖ్యన్తే'గా దిద్దెను.

నాలుగవ రేకు : రెండవ పెడ



46. నింవ[79]సహిత వల్మీకః। పరతః వనరాజీ।[80]ఆగ్నేయతః తింత్రిణీకవృక్షత్రికూ

47. టః॥ దక్షిణతః వనరాజీ। పరతః సావనరాజీత్రికూటః ॥ నైరఋత్యతః [81]గర్త్తా

48. త్రికూటః ॥ పశ్చిమతః అర్జునాఖ్యగర్త్తా ॥ పరతః తింత్రిణీకవృక్షసహిత సేతు

49. ః॥ వాయవ్యతః మణ్డలాకార పాషాణాః సహితగర్త్తా[82]। ద్వాగర్త్తా స

50. ంగమేన[83]। పరతః అర్జ్జునవృక్షః। తత్పరతః తింత్రిణీక వృక్షౌద్వా [॥*]

51. ఐశాన్యతః నింవసహిత [84]వల్మీకః పరతః గర్త్తాస [మీపత్రికూటః॥]

52. అనేన [85]మహాక్షశాలయో [86] వల్లేమోజాయ[87]।స్వర్ణ్ణలోహకారిచ[88] [మనవర్త్తి

కాస్మి]గ్రా

53. మే [89]ప్రదత్తా॥ భూమిం యః ప్రతిగృహ్ణా[90]తి యచ్చభూమిం ప్రయచ్ఛతి ఉభౌ

తౌ పుణ్య

---

79. 'నింబం' అని.

80. లేఖకుడు మొదట 'ంయూజీ' అని వ్రాసి పిదప 'ంరాజీ'గా దిద్దెను.

81. 'నైరృత్యతః' అని.

82. 'ంపాషాణసహితగర్త్తా' అని.

83. 'ంమిన' 'ంమేన'గా దిద్దబడెను.

84. 'నింబం' అని.

85. 'అనిన' 'అనేన'గా దిద్దబడెను.

86. 'ంశాలయి' 'ంశాలయో'గా దిద్దబడెను.

87. 'ంమోజాయా' అని మొదట వ్రాయబడిన పదము 'ంభోజాయ'గా దిద్దబడెను.

88. 'ంలోహకారిణేన' అని.

89. 'గ్రామి' అని మొదట వ్రాయబడిన పదము 'గ్రామే'గా దిద్దబడెను.

90. 'ప్రతిగృహ్ణాతి' అని.

అయిదవ రేకు : మొదటి పెడ



54. కర్మ్మార్జ్జణో నియతౌ(ం)స్వర్గ్గగామినో ॥ షష్టింవర్ష సహస్రాణి స్వర్గ్గే మో
దతి భూ

55. మిదః। ఆక్షేప్తా [91]చానుమన్తాచ తాన్యేవ నరకే వసేత్ ॥ మహా [కాయస్థ సన్ధి]వి

57. గ్రహిమావురయస్య సూనునాదామోదరేణలిఖితమ్॥మహాయక్షశాలి[92]నుంకమో

57. జస్య[93]సూనునా వల్లేమోజేన ఉత్కీర్ణ్ణితమ్॥



## ఆ వే ద న

నరహరిసెట్టి వెంకటరత్నము గారు

దైవతమ్ముల కాది దైవంబవగునీమ
హానంద మయమూర్తి నరయలేక;
విశ్వవిశ్వమున నీవిమల తేజోమయా
కృతివెల్లివిరియుట నెఱుఁగలేక;
అాఁకగప్పకునైన మేఁత వెట్టెడునీక్రృ
పామహత్వము జూడఁబట్టలేక;
మఱపులో నొఱుక నేర్పుఱచు నీప్రేమము
గ్ధప్రభావ మెడందఁదలఁపలేక
ఆ నలకుఁజిక్కి యాత్మ జిజ్ఞాసఁదక్కి
యంతులేని యగాధభవాబ్ధి యందు
మునిఁగి తేలుచునుంటి, నన్ గనికరించి
ఓయమృతమూర్తి దరిజేర్పవోయి స్వామి!



---

91. లేఖకుడు మొదట 'ఆక్షిప్త' వ్రాసి దానిని 'ఆక్షేప్తం'గా దిద్దెను. 92. 'మహాక్షశాలి'అని.
93, 'నుంకమోజస్య' అని.

# డాక్టరు వెంకట్రామయ్యగారు

వీరు, సుప్రసిద్ధాంధ్రులు, విజయనగర సంస్థానము దివానులునైన శ్రీయుత ఏచూరి నరసింహం పంతులు గారి కుమారులు. వీరు విజయనగర కళాశాలలోనే విద్య నభ్యసించి భౌతిక శాస్త్రమున నుత్తమజ్ఞానమును గడించి కొంతకాల మచ్చటనే భౌతికశాస్త్రపరిశోధనమును గావించిరి. తరువాత కలకత్తాకుబోయి యచ్చట ప్రొఫెసరు రామనుగారితోగూడ శాస్త్ర పరిశోధనమును గావించి వారి మెప్పువడసిరి. వీరు 'ఓజోను' అను వాయువును యుక్తపరిమాణముననుత్పత్తిచేయు యంత్రము నొకదానిని గనిపెట్టిరి. ఈ విషయము పత్రికల మూలమున ఖండాంతరములకును వ్యాపించి వీరికి బ్రఖ్యాతిని గడించినది. యూరపు దేశమునందలి భౌతికశాస్త్రవేత్తలందఱును వీరి పాండిత్యమును మెచ్చుకొనిరి. పట్టపరీక్షయందుత్తీర్ణులు కాకపోయిరను కారణమున నమూల్యమగు వీరి విజ్ఞానసంపద నుచితరీతిని బహూకరించు భాగ్యము భారత దేశ విశ్వవిద్యాలయములకు లభింపకపోయినది. ఆ కారణమువలననే ఇంగ్లాండులోనను 'డాక్టరు' బిరుదమును వీరు పడయజాలకపోయిరి. ఆంగ్లదేశమువారు వీరి యుత్తమ భౌతిక విజ్ఞానమును మిగుల మెచ్చుకొని అభినందించినను వీరి నర్హవిధమున సత్కరింప సాహసింపరైరి. తరువాత వెంకటరామయ్యగారుఫ్రాన్సులోనిప్యారిసునగరమునకుబోయిరి. 'సైన్సు'నం దుత్తమత్వమును గడించిన యా పారిసువిశ్వవిద్యాలయమువారు వీరి పాండిత్యమునకు మెచ్చుకొని, కనీసము రెండు మూడేండ్లయినను శాస్త్రపరిశోధనమును, ప్రయోగపరిశీలనమునుగావించి గురువుల మెప్పును బడయనిదే పొందరాని "డాక్టరు" బిరుదము నొసగు పరీక్షకు, వీరిని ప్యారిసు చేరిన 17 దినములలోనే రానిచ్చిరి. వీరిని పరీక్షించుటకయి ఉర్బైయిను, పెర్రిను, ఆగరు, లను సుప్రసిద్ధులగు ఫ్రెంచి విజ్ఞానవేత్తలు ముగ్గురు 1925 సం. డిసంబరునెల 22 వ తేదీని ఒక (పరీక్షక) సభ గూడిరి. ఈ సభవారు ఫ్రెంచి భాష సరిగ రాకున్నను వెంకట్రామయ్యగారు కావించిన శాస్త్రవిషయక పూర్వపక్షసిద్ధాంతముల కాశ్చర్యమును జెందిరి. మఱియు వారిని పరీక్షయందు గృతార్థులనుగ



నిశ్చయించి భౌతిక (ఫిజిక్సు) శాస్త్రమున సంపూర్ణపాండిత్యము గలవారల కా విశ్వవిద్యాలయ మొసంగు ఉత్తమ బిరుదమగు 'డాక్టరు' బిరుదమునొసంగి, గౌరవించిరి. ఆసమయమున నా పరీక్షక సభాధ్యక్షు లగు ఉర్బైయినుగారు వెంకట్రామయ్యగారి నిట్లు కొనియాడిరి. "మీశాస్త్రప్రయోగ పాండిత్యమపూర్వ మయినది. మీయట్టి సమర్థులు మాతో సమముగ బండితబదవి కర్హులుగాని మాకు శిష్యులుగ నుండదగినవారు కారు. మీ రీప్రాచీనవిశ్వవిద్యాలయమున మాచే బరీక్షితులు కాగోరుటచే మా గౌరవము మఱింత వన్నెకెక్కినది. మీరు శాస్త్రప్రయోగముల యందు కావించిన సిద్ధాంతములు ఎల్లవిధముల ఫ్రెంచిసిద్ధాంతములను బోలుచున్నవి. మీరు నూతనముగ గనిపెట్టిన విషయములు నట్టివే. ఇట్టి యమూల్యమగు తమవిజ్ఞానపాండిత్యమును కనులార గాంచి కొనియాడ సంభవించుట ఫ్రెంచిపండితుల భాగ్యమే." మఱియు ఉర్బైయినుగారు భారతదేశమున నీనాడు వ్యాపించుచున్న విజ్ఞానాభివృద్ధిని మెచ్చుకొనుచు "వెంకట్రామయ్యగారూ! భారతీయ విద్యార్థుల విజ్ఞానపాండిత్యము నా కాశ్చర్యమును గలిగించుచున్నది. వారు 'కెమిస్ట్రి'లోని సుగ్రహములు కానివిషయములనుగూడ సులభముగా గ్రహించుకొనగలిగి యున్నారు. మా ఫ్రెంచివిద్యార్థులనుగూడ, మిమ్మును నిదర్శనముగా గొని, విద్యావిషయమున దమ సంకుచితభావములను, విడిచి వివిధశాస్త్ర పరిజ్ఞానమును గడించి సాహసముతో పరిశోధనలను చేయుచు ప్రఖ్యాతులుకండని యుద్బోధించుచున్నాను" అనిరి ఆసభయందునిండియున్న వారందఱు (పండితులు, విద్యార్థులుమున్నగువారు) వెంకట్రామయ్యగారి నభినందించిరి. ప్యారిసు నగరమువారు ఏ నిబంధనములకు లోనుగాక వెంకట్రామయ్యగారి నిట్లు గౌరవించుటచూడ వారికి విజ్ఞానవ్యాప్త్యభివృద్ధుల యెడ గల విశాలభావము పొడకట్టకపోదు. భారతీ యాంగ్ల విశ్వవిద్యాలయములవారును నట్టి విశాలభావములతో సమర్థులగువారికి దగినంత ప్రోత్సాహమును గలిగింపనంతవఱకు భారతదేశమున నుత్తమ విజ్ఞానమువికాసము గాంచగల్గు ననుటసంశయింపవలసిన విషయమే. అచిర కాలమున రూపము దాల్పనున్న ఆంధ్రవిశ్వవిద్యాలయమైనను సుప్రసిద్ధాంధ్రు లగు వీరి విజ్ఞానసంపద నుపయోగించుకొన గంకణము గట్టుకొనును గాక యని యాశించుట సాహసముకాదు.



# ఆయుర్వేదము-గృహిణీధర్మములు

వైద్యరాజ. దం. సు. అవధాని గారు, యల్. సి. పి. యస్.

విద్యలు వివేకప్రదములు. విద్య లెల్లవారికి నావశ్యకములు. కలవారికి లేనివార లకు గృహిణులందఱకు విద్యాగ్రహణము లేనిచో గృహమందు శాంతిపొసగదు. అట్టి విద్య గురుముఖమున నలవడును. పితరులు విద్యాప్రదు లగుదురు. పరంపరాగతమైన గృహసంప్రదాయములు విద్యాప్రదములు. జ్ఞానమునకు గ్రంధము లాధారములు. వృద్ధ సేవవలన వివేక ముదయించును. అక్షరాస్యు లుకాని వారైనను గొందఱు గృహిణులు వివేకవతులై యుందురు. వీరలకు గీతరూప మున గ్రంథస్థములన్నియు జిహ్వాగ్రమం దుండును.

ఉ. "పాటలక్రిందఁ బాడుదురు
భారత వర్షమునందు సంగనల్
హాటకగర్భునోట నుద
యంబగు వేదమునందు నర్థముల్
తేటగ భారతాదుల సు
ధీవరగాథలు నేటి కక్కటా
"క్యాటును డాగు" విద్దె లొకొ
కాంతల కెల్లెడ వేంకటేశ్వరా!"

ధారణాబలంబున నెంతలేసి విషయం బులు బరంపరగా గృహిణులు నేర్చుకొని బిడ్డలకు నేర్పుచుందురు. పాఠశాలలయందు విద్యల నేర్పుటయు నొక పద్ధతియే. భారత సంప్రదాయానుసారమైన సంస్థలు నేటికి వెలు వడకుండుటచే నీపద్ధతి ఫలప్రదము కాలేదు. అదియు నందఱి కందుబాటులో లేదు. గృహి ణికక్షరపరిచయముతోపాటుగా "నిలుతీర్చు కొనుటకు" నలయు వివేక మెంతేని యావ శ్యకము.

ప్రధానముగా నీవ్యాసమున వైద్య శాస్త్రసంబంధమగు విషయములు గృహిణి కెంత యావశ్యకమో వ్రాయబడును. ఈవి వేచనము స్వయముగా గృహకృత్యము నెర వేర్చుకొనువారి కవసరము. అంతకన్న సేవ కులను నియమించుకొని వారివలన శాస్త్రీయ మయిన కృత్యముల జేయించుటకు సంప న్నుల కత్యవసరము. నైపుణ్యములేని గృహి ణికి నింటిదాసదాసీజనులు విధేయులై యుం డరు.

(౧) "గృహమునకు శోధన సేచన క్షాళన ధూపనంబు లహరహంబుఁ గర్తవ్యం బులు."

ఈకర్మల కుపయోగించు ద్రవ్యములు, వానిగుణములు ఋతుభేదములం దాకర్మల నెట్లు నిర్వహించునది గృహభేదమునుబట్టి శోధనాదులెట్లు మారునదియు వాని వివరణ ములు గృహిణి యెఱింగి యుండవలయును.

(౨) "గృహారామంబున హితకరంబులగు శాకఫలమూలంబులును సుందరమైన పత్త్రపుష్పాదులను బెంచుచుండవలయును."

శాకఫలాదులకుఁ దగిన కాలములను దోహదములనునవి యేయేఋతువుల గ్రాహ్యములో యేయేఋతువుల నగ్రాహ్యములో యెఱింగియుండవలయును. కోమల, మధ్య, పూర్ణపక్వ ఫలభేదములచే వాని గుణాగుణంబు లారయందగును.

ఉ. వంకాయలు, బీరకాయలు మొదలగునవి లేతవి మంచివి. కూష్మాండంబు కోమలంబహితంబు.

గన్నేరు. సదాప, తులసి, మాచిపత్త్రి, మొదలగు నానావిధద్రవ్యంబుల గుణంబులెఱింగి వానిని విశేషించి పెంచుకొనుచుండవలయును.

(౩) "భాండార భాండపాత్రవసనాదులప్పటికప్పుడు కాలోచితంబుగా బరిశోధనీయంబులు."

భాండారమునందు నిలువయున్న తండులాదులు కృమిదూషితంబులు గాకుండ గాపాడుకొను విధానంబును, నేఋతువున నేవి సంగ్రహింప దగియుండునదియును, నన్నాదులపచనంబునకు భాండభేదగుణంబులును, పిత్తళాది లోహపాత్రంబులందలి దోషంబులును, దత్పరిశోధన విధానంబులును సవిమర్శంబుగ నెఱుంగదగు.

ఉచ్ఛిష్టరేతోమూత్రాది దూషితంబులైన లోహదార్వాదిమయంబులగు పాత్రంబులకు నేర్వేరు శోధనవిధానంబు లారయందగు.

నూలు పట్టు మొదలగు వానితో జేయబడిన దిండ్లు పరుపులు, తివాసులు మొదలగు ద్రవ్యములలో తెలిసిన ధూపనాది కర్మలకు నేవి తగినవో, వానికి మలాదిస్పర్శ కలిగినప్పుడు గ్రహింపదగినవేవియో, త్యజింపదగినవేవియో ముఖ్యముగాఁ దెలియందగు.

(౪) "మధురాదిరసంబులు ద్రవ్యాశ్రితంబులై వాతాది దోషత్రయంబునకు ధద్ధాతురసరక్తాదిధాతువులకు వికారసామ్యంబుల గలిగించు గాన వానిభేదంబులెఱిగి పదార్థంబుల పాకంబున నుపయోగించునది."

ఆంగ్లేయ వైద్యశాస్త్రమునవలెగాక, ఆయుర్వేదమునందు భక్ష్యములగు ద్రవ్యములు, ధాన్యములు, మినుములు, పెసలు, మెంతులు, నానావిధ కరివేపాకు, మేక, వాలుగ జింక మొదలగు సమస్తద్రవ్యములకు రసవీర్యాదులు స్పష్టముగ వ్రాయబడియుండుటచే గృహిణులు వానినెల్ల నెఱింగి యింటిలోని వారి సత్వసాత్మ్యములకనుగుణంబుగ నుపయోగించు కొనునది.

వరుగులు వడియంబులు మొదలగు శుష్కద్రవ్యంబుల గురుత్వ లఘుత్వంబులు నెఱింగి వాడుకొనదగును. వసంతాదిఋతువుల కనుకూలమగు నాహారరచనయు, పానకల్పనము నెఱుంగునది.

(౫) "గృహధూమలూతాతంత్వాది విషదూషితపదార్థములు వివేచనము గృహిణి కత్యావశ్యకము"

విషస్పర్శ కలిగినప్పుడు ఆర్ద్రింబులగు దధిక్షీరంబులు, స్నిగ్ధింబులగు ఘృతాదు లెట్లు మాఱునో, మల్లె మొదలగు పుష్పములు తమలపాకు మొదలగు పత్రంబులు నన్నము, నపక్వఫలము లెట్లు మాఱునో యావస్తువులకు నప్రయత్నముగ గృహమందు లభించు నగ్న్యాద్యుపకరణములచే బరీక్ష యెటులో తెలియందగు.

ఇదికాక కృత్రిమవిషంబులును శత్రువులు గృహసేవకుల వలన నాహార పదార్థంబులయందు బ్రయోగింతురు గాన వాని పరీక్షల నెఱుంగునది. దీని నాయుర్వేదమున నన్న రక్షాజ్ఞాన మందురు. ఆంగ్లేయశాస్త్ర విధానములో రసాయనశాస్త్రపారంగతులు విష పరీక్షకు నియమింపబడినను వారు సర్వసులభులు కారుగావున సకాలమునవారిసహాయము తటస్థించదు కావునను, విషాన్నమును భుజించిన పిదప గాని వారి సహాయ మపేక్షించుటకు వీలులేకపోవుటచేతను నాయుర్వేదమున జెప్పబడినవియు, వెలలేనివియు, సర్వసులభములునువియు నగు పరీక్షావిధానము లెఱుంగదగు.

(౬) "రజోదర్శన సమయమున నవలంబించవలసిన బ్రహ్మచర్యాది నియమంబులన్నియు దా నాచరించి దుహితృస్నుషాదులచే నాచరింపజేయునది"

శాస్త్రము లెఱుంగకపోయినను సదాచారమునందు విశ్వాసముగల గృహిణులెల్లరీ దేశంబున రజస్వలావిధి నిషేధంబుల బాటించి యారోగ్యవతులై సౌందర్యవతులై సుఖప్రసవలై సత్సంతానవతులై పెంపొందెదరు.

పాశ్చాత్యు లీనియమంబు లెఱుంగరు. ప్రసిద్ధుడగు "కిస్కు" (henry Kisch) అను జర్మనీడాక్టరిప్పట్టున నీనియమంబులు పాశ్చాత్యు లెఱుంగకుండుట శోచనీయమని వ్రాయుచు వాత్స్యాయన సుశ్రుత మతములను దానామోదించితి నని తన 'Sexual life of woman, by' గ్రంథరాజమునందు లిఖించెను.

పాశ్చాత్యు లెఱుంగకుండుటంజేసి యీ నియమముల నవసరములను తలంపుచేతను, ప్రాచీనాచారమునందలి యవిశ్వాసముచేతను, నిప్పట్టున నాయుర్వేద మతాచార్యుల యభిప్రాయములు దేశభాషలందు జాలినంతగా బ్రకటింప బడకపోవుటచేతను, దేశమున ఋతుశూలలు ప్రదరములు కష్టప్రసవములు మెండై గృహిణులు దుర్దమమగు రోగముల పాలగుచున్నారు.

శాస్త్రము కష్టసాధ్యమగుట విధినిషేధములన్నియు నొకపాటగా దల్లులు బిడ్డలకు జెప్పుట మనదేశమున నాచారమై యున్నది. అదియు బరిశోధించి పొందదగినంతగా నదృశ్యమగుచున్నది.

(౭) "భర్తృసమాగమమునకు సత్సంతానమే పరమప్రయోజనముగాన దదానుకూల్యము నెఱింగి ప్రవర్తించునది."

ఋతువ్యతిరిక్తాది వర్జ్యదినంబులును, వంధ్యాత్వంబు నొనంగు నాహారవిహారంబులును విడచి, మహాపురుష చిత్రపటాది మనో

హార వస్తుసంపన్నంబులగు శయనాగారము లందు బతుల సేవించునది.

విశేషము లిప్పట్టున "వాత్స్యాయన సూత్రము"లందును "రతిరహస్యము"నందును వివరముగ వ్రాయబడి యున్నవి.

(౮) "ఉచితాహార విహారములుగల గర్భవతి నవమాసాంతమున సుఖప్రసవము గాంచును."

రూక్షాహారసేవనము, బీభత్సరసప్రధానమగు నాటకదర్శనము, చింతాశోకములు విడువదగ్గినవి. తల్లి యాహారములకు బిడ్డగుణములకు సంబంధముకలదని యాయుర్వేదాచార్యుల అభిప్రాయము. శ్రోత్రప్రియ మగు గానము, చిత్తశాంతికరమగు దేవతాదర్శనము, పాపమోచనకరంబగు పురాణశ్రవణంబును గర్భిణులకు హితకరంబు.

సుభద్ర భర్తవలన రణవ్యూహంబులను విని అభిమన్యుని గనియెను. లీలావతి నారదునివలన దత్త్వమును విని భక్తాగ్రేసరుండగు ప్రహ్లాదునిం గనియెను.'

అన్నపానాదులయందు బథ్యము నెఱుగకయు, బ్రసవానంతరమందు గటిబంధమును మఱచియు, మలమోచనకరంబులగు పిప్పలీమూలాదిలేహ్యంబుల సేవింపకయు, సూతికలింతంత యనరాని యిడుమల గుడుచుచు స్తన్యహీనలై శిశుపోషణమం దసమర్థలగుటచే జాతి నానాటికి నిర్వీర్యమగుచున్నది.

(౯) "శిశువునకు మాతృస్తన్య ముత్తమాహారము"

తదభావమం దుపమాతృకలు సవర్ణలు గ్రాహ్యులని యాయుర్వేదాచార్యులు వచింతురు.

అకటా! భరతసంతతికి మాతృస్తన్యము కరవై పాల సీసెలు చప్పరించు నభాగ్యము పట్టెగదా నేడు!

పిల్లలకు పాలీయరాదను నొక యపోహ కూడ దల్లులయందు స్తన్యరాహిత్యమునకు గారణము. మెలినిన్స్ఫుడ్డు పిల్లలు గోడలమీది ప్రకటనలలో ముద్దుగా నుందురుగాని వాస్తములో వాడివత్తలయిపొట్టలు పెరిగియుందురు.

గృహ సంప్రదాయములు నశించుటచే బురుషులకుగూడ నార్యవిద్య లబ్బకపోవుటచే సదాచారములయం దాస్తిక్యము తగ్గుటచే నారీరత్నములకు వలయు వైద్యవిజ్ఞానము కొఱత వడుచున్నది.

సంపూర్ణము



# జగదంబ

గున్నేపల్లి మృత్యుంజయ కవి గారు

ప్రకటంబౌ పరమాత్మయందలి గుణప్రాధాన్యపవ్యక్త నా
మకమూల ప్రకృతి స్వరూపిణివియౌమాయంబ! సర్వ ప్రపం
చకసృష్టిస్థితి సంక్షయంబులు యథేచ్ఛన్ జేయుచున్ శుద్ధసా
త్వికచిచ్ఛక్తివహించియుండు నినుసంప్రీతిన్ బ్రశంసించెదన్.

మ. అరిషడ్వర్గము మున్ జయించి బుధు లార్యప్రోక్తలక్ష్యార్థ త
త్పరులై బ్రహ్మముఁగాంచఁ గన్బొమల మధ్యన్ వెల్గు తచ్చిత్కళా
గరిమంబున్ గనుచోఁ ఝణీ, ఝిణిఝిణీ ఘంటాదినాదమ్ములన్
బరమానందము నొందుటెల్ల జగదంబా! నీప్రసాదంబెకా!

మ. పరమార్థమ్ము నెఱుంగు శ్రీహరిహర బ్రహ్మామరేంద్రాదు లీ
శ్వరునిట్టూరుపులైన సర్వనిగమస్వారస్యముల్ వించు నీ
కరుణన్ బ్రత్యుత్తరరూపకంబయిన యోంకారమ్ము నెవ్వేళ హృ
త్సరసీజమ్మున నిల్పి తద్రవచమత్కారమ్ములన్ జొక్కరే?

మ. జననీ! డెబ్బదిరెండువేల నరముల్ షట్చక్రముల్ గల్గిదే
హనిగూఢంబగు బ్రహ్మదండి నిజమూలాధారకోణస్థలిన్
మనుచున్ గుండలినీ సమాఖ్యను సుషుమ్నానాళ మధ్యమ్మునన్
గననౌ నీవెకదా! బిసాంతరమునన్ గన్పట్టు తంతుక్రియన్.

శా. సోమార్కానల తప్తకాంచన తటిజ్జ్యోత్స్నా ప్రవాళాబ్జరా
గామూల్యద్యుతు లుట్టిపడ్డగతి భక్తాంతర్హృదాకాశమం
దేమూలంగనుఁగొన్నఁ గానఁబడు దీవే చిత్కళామూర్తివై
నీమాహాత్మ్య మనంత మెంతయని వర్ణింతున్ మతిన్ దల్లిరో!

(సావిత్రీచరిత్రము)






[వెనుకటి సంచిక తరువాయి

## 7—వ ప్రకరణము

## మూలధనము

### ౧. మూలధన స్వభావము

అర్థోత్పత్తికి మూలధనము ముఖ్యాధారము. ప్రకృతిచేతను శ్రమవలనను ఇది పుట్టుచున్నది. భాగ్యవృద్ధికి సాధనమగు సామగ్రిఅంతయుమూలధనమే; హస్తకళలకు యంత్రకళలకున్ను ఉపయోగింపు కట్టడములు, యంత్రములు, ఉపకరణములు, తోలు, ఇనుము, ప్రత్తి మొదలగు అపక్వపదార్థములు, శ్రమకరుల వేతనములకు వలయుధనము ఇవిఅన్నియును మూలధనములో చేరినవే. దేశమందు తయారుకాబడు అర్థమంతయు వెంటనే వినియోగింపబడి నశించదు; అందులో కొంతభాగము ఇతరఫలప్రాప్తికి ఉపకరించుచున్నది. ఇదియే మూలధనము. భావిభాగ్యాభివృద్ధి నుద్దేశించి ప్రజ్ఞావంతులు ఉత్పాదింపబడిన అర్థమునంతయు వెంటనే వినియోగించి నశింపజేయక కొంతభాగమును యంత్రోపకరణములు మొదలగు అర్థోత్పాదక కలాపమును సేకరించుట కుపయోగించుచున్నారు. నాగరికత పెరుగుచున్న కొలది మూలధన మనిపించుకొను వస్తుసముదయమే దేశమందైనను అతిశయించుచున్నది. ఏ దేశమందైన మూలధన మధికరించుటకు ఆ దేశపు ప్రజలకు దీర్ఘదర్శిత్వమనే సుగుణ ముండవలెను. రాబోవు కాలమున కిప్పటినుండియు అర్థసాధన సంపత్తిని సేకరించవలెనన్న బుద్ధి ఆవశ్యకము. “యంత్రోపకరణముల కింతధనము వెచ్చించుటయా! తుదకది నిరర్థకమగునేమో” అని భయమొంది నిరుత్సాహులుకాక ప్రజలు సాహసముతో మూలధనమును సంపాదించవలెను. ఈవిషయమున మనకున్ను పాశ్చాత్యులకున్ను చాలభేద మున్నది. పాశ్చాత్యులవలె మనవారికి అర్థసాధక కలాపమును సేకరించెడి బుద్ధిగాని సాహసముగాని అంతగాలేదు. ఉపకరణములు, యంత్రములు, పనిముట్లు, పెట్టుబడి ద్రవ్యము మొదలగువాటి సహాయమే లేనిచో మనుజు డిప్పు డనుభవించుచున్న వస్తుజాల మసంభవము. యంత్రోపకరణ సహాయమునగదా ఆవిరిశక్తి, విద్యుత్కాంతి మొదలగునవి మనకు లొంగి ఎన్నియోవిధముల సేవకావృత్తి చేయుచున్నవి.

### ౨. అర్థమునకున్ను మూల ధనమునకున్ను గల వ్యత్యాసము

మూలధనమంతయు అర్థమని చెప్పవచ్చును గాని అర్థమంతయు మూలధనమనుటకు వీలులేదు. కారణమేమన అర్థములో కొంతభాగము తాత్కాలికానుభవమునకు వినియోగింపబడుచున్నది గాని ఇంక జాస్తిభాగ్యము నుత్పాదించుట కనుకూలించక యున్నది. అట్టిఅర్థము మూలధన మనిపించుకొనదు. ఉ. మనము తినెడు అన్నము. ఎట్టిఅర్థము ఇంకను అర్థమును సృష్టిచేయుట కుపకరించునో అది మూలధనము. ఉ. విత్తనములుగా నుపయోగింపబడు ధాన్యము. ఇంకొకవిషయము నీసందర్భమున గమనించవలసియున్నది. ఏఅర్థమునైననుసరి అప్పటికిమాత్ర మనుభవనీయమైనదిగాని లేక భావిఫలమునిచ్చునదిగాని భావించవచ్చును. కావున ఉపయుక్తినిబట్టి ఏదిఅయిన మూలధన మవునోకాదో నిర్ణయించవచ్చును. “ఇది ఎప్పుడును మూలధనము; అది ఎప్పుడును మూలధనముకాదు” అనిచెప్పి వస్తువిభజన చేయలేము. కల్లు త్రాగెడువానికి కల్లు వినియోగ్యమగు సాధారణపుటర్థమే; అయితే ఆకల్లు విక్రయించేవాని కది మూలధనము కావచ్చును; ఏమన కల్లు

వెల లతిశయించినచో తానింక జాస్తీఅర్థమును సేకరింపును. ఉద్దేశ్యమాత్రమున ఏదైనను మూలధనమో కాదో చెప్పవచ్చును. వైద్యుడు తనవద్ద మందును సేవించెడు రోగులస్థితిగతుల నారయుటకు ఎక్కిపోయెడు గుర్రపుబండీ ఉత్పత్త్యర్థముకావున అది మూలధనమే. తానున్ను తనమిత్రులున్ను విలాసముగా షికారువెళ్ళుటకే ఆబండిని ఉపయోగించినచో అప్పుడాబండి వినియోగార్థరాశిలో చేరుచున్నదిగాని మూలధన మనిపించుకొనదు.

## 3. స్థావరజంగమ మూలధనములు

కార్ఖానాల కిచ్చు ధనము, చేతిపనులకువలయు విలువగలసామగ్రి, ఏపరిశ్రమకైన వలయు యంత్రోపకరణములు మొదలగునవన్నియును మూలధనమనిగదా చెప్పియుంటిమి. వీనిలో ధనము, విలువగలసామగ్రి, ఇవి అర్థోత్పాదనమార్గములలో రూపపరిణామమునొందుచున్నవి. ప్రత్తిఅనే అపక్వపదార్థము వస్త్రమనేవస్తువుగా రచింపబడుటలో రూపభేదము నొందుచున్నది. ఇట్లే ధాన్యము బియ్యమగుటలో ఇంకొకరూపము దాల్చుచున్నవి. వస్త్రమునుండి ప్రత్తినిగాని బియ్యమునుండి ధాన్యమునుగాని తిరిగి గ్రహింపలేము. అయితే యంత్రోపకరణములుమాత్రము రూపభేదమొంది వెంటనే నశించక అర్థోత్పత్తికి అనేకపర్యాయములు ఉపయోగపడుచున్నవి. పుస్తకములను అచ్చువేసేయంత్రముతో ఎన్నియో పుస్తకములను అచ్చువేయవచ్చును; బట్టలనుకుట్టుట కుపయోగించెడు సూదితో ఎన్నియోబట్టలను కుట్టవచ్చును. యంత్రోపకరణములు మొదలగు పెట్టుబడిసామగ్రి స్థావరమూలధనమనియు, ప్రత్తిధాన్యము మొదలగునవి జంగమమూలధనమనియు అర్థశాస్త్రజ్ఞులు మూలధనమును రెండువిధములుగా విభజింతురు. అచిరములు చిరములు, అచలములు చలములు అని స్థావరజంగమములకు నామాంతరములు. స్థావరమూలధనము చిరకాల మేకరూపముతోనే యుండును; జంగమమూలధన మట్లుండదు. స్థావరమూలధన మనేకపర్యాయములు అర్థోత్పత్తికి ఉపకరించును. జంగమమూలధన మట్లుకాదు. ఈసందర్భమున మనము గ్రహించవలసిన విశేషాంశములు కొన్నికలవు. దృఢమైనట్టియు శాశ్వతమైనట్టియు స్థావరమూలధనమును నిర్మించుటకు కొంత కాలము పట్టును. భావిఫలాపేక్షవలన కాలవిలంబమునకున్ను పెట్టుబడిఖర్చునకున్ను ఓర్చియుండవలెను. ఐరోపా హిందూదేశములకు సులువుగా నౌకాయాత్రలు జరుగుటకు "సూయజ్"అనుచోట సముద్రములకు సంధియేర్పడుటకున్ను, ఓడలు నిరాఘాటముగా నడుచుటకు వీలైనంతకాలువను త్రవ్వుటకున్ను ఎన్నియో సంవత్సరముల కాలము పట్టెను; లక్షలకొలది ద్రవ్యము ఖర్చు కావలసివచ్చెను. ఇట్టిపనికివలయు మూలధనము సేకరించుట ఒకనికి సాధ్యముకాదు. ఎంతమందియో చందాలువేసి ధనము ప్రోగుచేసి ఇట్టి సౌకర్యమును, కలుగజేసిరి; మిగుల విలువగల యంత్రసాధనములను గూర్చికూడ ఈసంగతులు వర్తించుచున్నవి. స్థావరమూలధన మనేకసంవత్సరములు స్థిరముగా నుండును. కాబట్టి భావివ్యవహారపుస్థితిగతు లెట్లుండునను దూరదృష్టియు, స్థితిగతు లెటులవిషమించినను సర్దుకొనగల మను ధైర్యమున్ను సాహసమున్ను లేనిది ఎవరైన విలువగల యంత్రోపకరణములను నిర్మించరు. కొంచెము కాలములో పెట్టుబడిగా వెచ్చింపబడిన మూలధనమునకు ప్రతిఫలము రాదు; ప్రతిఫలము చేరేవరకు ఓరిమితో నిరీక్షించవలెను. ఇంగ్లాండులో మొదట రైల్వేలువేసినప్పుడు ప్రజ లనేకులు లాభార్థులై కంపెనీలలో షేర్లు (1) భాగములుకొనిరి; గాని రైల్వే శీఘ్రకాలములోతగిన ప్రతిఫలము నిచ్చునదికాదు. ఎన్నియో విషయములకై మొదట ద్రవ్యమును వెచ్చించవలెను. ఖర్చునకుమించిన ప్రతిఫలము చేకూరినప్పుడే షేర్ హోల్డర్లకు (భాగస్థులకు) "డివిడెండు" (లాభము) రూపకముగా ప్రతిఫలము వచ్చును. అప్పటి ఇంగ్లాండుదేశపు ప్రజలు ఈ సంగతులను గమనించనివారగుటవలనను, గమనించినను అంతదనుక కాచుకొనియుండే ఓర్పులేని వారగుటచేతను ఆ "షేర్ల"ను ఈలోననే అమ్ముటకు యత్నించి కొనువారలులేక ఎన్నియో కష్టములకు పాలైరి. ఈవిషయములు మూలధనసంశ్లేషమున కాస్పదములైన "జాయింటుస్టాకుకంపనీల"కు సంబంధించినవి; సందర్భాంతరమున ఈకంపెనీల క్రమమునుగూర్చియు గుణదోషములను గూర్చియు ముచ్చటించెదము.

భాగ్యమున కాస్పదమగు ఇంగ్లాడుమొదలగు దేశములలో స్థావరమూలధనమే అధికరించియున్నది.

మన దేశములో అది తక్కువ. ఆర్థికౌన్నత్యము కల పాశ్చాత్య దేశములలో యంత్రసహాయము లేకుండ ఏకళయందు గాని పరిశ్రమయందుగాని పనులు జరుగు చుండ లేదు. మన దేశమందలి భాగ్య మున్నను కళాచక్రమున కుపకరించునట్టి ధన మతిస్వల్పముగా నున్నది. లక్షలకొలది కోట్లకొలది ధన మీ దేశములో నగలరూపముననో నాణెములరూపముననో పాతుడుపడియున్నదని ఒక పెద్దప్రతీతి కలదు. కూడబెట్టినధనమును లాభకరము లగు బ్యాంకులు మొదలగునిధులలో వేసిన సమంజసముగా నుండుననుబుద్ధి ప్రజలకు అంతగా లేకపోవుటచేతనో ఆంగ్లేయులకు పూర్వ మీ దేశమునేలెడువారి కాలములో దేశమందు శాంతి లేక దొంగతనములు మితిమీరియుం డెడుకారణముచేతనో ఆప్రతీతి కొంతవరకు సత్యమే కావచ్చును గాని రూమర్లకనుగుణమైన ద్రవ్య మీబీద దేశములో లేదనియే మానమ్మకము. ఈసంగతి యెట్లు న్నను, అర్థాభివృద్ధినపేక్షించి పాశ్చాత్త్యులవలె ఈదేశము వారుకూడ అర్థోత్పత్తి కవశ్యమగు యంత్రోపకరణ ములు మొదలగువాటిని తెలివితేటలతో సేకరించవలసి యున్నదనుట నిర్వివాదాంశము. నూతనాదర్శముల నిప్పు డిప్పుడే మనవారు గ్రహించి మూలధనాపాదనము చేయ దొడంగుట శుభసూచకమే.

## 8-వ ప్రకరణము

## అర్థోత్పాదకసాధనసంయోగము

### ౧. ఆర్థికయుగములు

ప్రకృతి, శ్రమ, మూలధనము ఈమూడున్ను అర్థోత్పత్తికి అవశ్యకములు; వీటినిసరిగా సమ్మేళనముచే యుటయే పారిశ్రామిక నాయకులకు కర్తవ్యము. ఈసాధ నములు మూడున్ను భాగ్యాభివృద్ధి నుద్దేశించు పలువురు వ్యవహారజ్ఞులకు తోడ్పడుచున్నవి. అందువలననే ఈనవ నాగరిక కాలములో భూస్వాములు, కార్మికులు, ధనా ఢ్యులు, పారిశ్రామిక నాయకులు అనే వేర్వేరు తెగలవారు ప్రతి దేశమందును ప్రబలియున్నారు. అయితే పూర్వకా లమం దీఆర్థికజాతులప్రాబల్యము లేదు. అప్పటిజనులు అనాగరికులు; దట్టముగ పెరిగిన అడవులలో వేటాడి మాంసభక్షణ మొనర్చియో ఫలమూలశాకాదుల దినియో కాలము గడుపుచు వచ్చిరి. ఆకాలమునకే మృగయా యుగమని చరిత్రకారులు నామకరణముచేసిరి. రాను రాను ప్రజలు ఆవులు, మేకలు మొదలగు మృగములను పెంచి వాటివలన లభించెడు పాలు పెరుగు మాంసము మొదలగువాటితో కాలక్షేపము చేయుచూ, పచ్చిక, కసవు, ఆకులు మెండుగ బలిసినచోట్లకు మందలను నడిపించు కొనుచు, చర్మములతో బట్టలను కల్పించుకొని, పశువు లనే ధనముగ భావించి వేరసాగములను నడిపించుకొను చు వచ్చిరి. ఇదియే పశుపాల్యయుగము. తదుపరి జనులు చెట్లను చేవలను కొట్టి భూమిని చదునుచేసి కొన్ని ప్రదేశముల నాక్రమించి వ్యవసాయవృత్తి నవలంబించి, పంటలనుపండించుట కారంభించిరి. ఇదియే వ్యవసాయయు గము. ఈయుగమందుండెడు ప్రజలకు నాగరికత పెంపె క్కుటచే అందరు ఒకేవృత్తి ననుసరించక కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, మంగలి, చాకలి మొదలగు బ్రతుకు తెరవు లేర్ప రచుకొనిరి. పూర్వయుగములలో భూమికి స్వంతదార్లగు భూస్వాములు, మూలధనప్రాబల్యమునకు తోడ్పడు ధనాఢ్యులు, శ్రమపడి పనిచేయు కర్మకరులు, పారిశ్రామిక నాయకులు అనే ఆర్థికజాతులవారు ఏర్పడలేదు. పశు పాల్యయుగమునకు తరువాత జనులు కలిసి గ్రామములలో నివసించుట కారంభించి తామాక్రమించుకొనిన పొలము లను దున్ని పంటలు పండించుకొనియో లేక స్వగ్రామ వాసులగు ఇతరులపొలములను దున్ని వ్యవసాయముచేసి ఇందువలన లభించెడు పంటలో కొంత రాజ భాగము పోగా శేషించిన పంటతో పొట్టలు పోషించుకొనుచూ వచ్చిరి. ఇట్టిస్థితిలో కొం దరు భూములకు స్వంతదార్లును మరికొందరు శ్రమపడి పనిచేయు కర్మకరులున్ను అయిరి. ఈవిధముగా నాగ రికతప్రబలి పట్టణము లేర్పడి, రానురాను చేతిపనులు, యానసౌకర్యములు, నాణెములు, వ్యాపారములు పెరిగి ప్రస్తుతము మనము కనుగొనుచున్న భూస్వాములు, కర్మ కరులు, ధనాఢ్యులు పారిశ్రామిక నాయకులు అనే ఆర్థి క తెగ లేర్పడినవి. ఈప్రస్తుతపు యుగమునకు పరివర్తన కళాయుగమని కొంద రర్థశాస్త్రజ్ఞులు పేరు పెట్టిరి. మన హిందూదేశములో వ్యవసాయవృత్తిని నమ్ముకొనియే జీవయాత్ర నడపువారు నూటికి 72కు పైగా నున్నారని జనాభా లెక్కలవలన తెలియుచున్నది. ఇతర పరి

శ్రమలు తక్కువ. ఇంగ్లాండుమొదలగు దేశములందువలె యంత్రకళ లంతగా లేవు. వ్యవసాయాది పరిగ్రహణ కళ లున్నవిగాని పరివర్తన కళప్రాబల్య మీదేశములో తక్కువ. పశ్చిమఖండనివాసులకు వ్యాపార వాణిజ్యాదులే జీవనాధారములు అయితే రానురాను ఇతర నాగరిక దేశములందువలె యీదేశములోకూడ మీదజెప్పిన ఆర్థిక తెగ లొకవిధముగా నేర్పడుటయేకాక ఆధునిక వ్యవహార లక్షణములుకూడా అలవడుచున్నవి. మన దేశమందు వేయబడిన ఇనుపదారులను గమనించినచో ఈ క్రిందిఆర్థిక విషయములను గ్రహింపవచ్చును; భూమి సర్కారువారిది. డ్రైవరు, గార్డు, స్టేషన్మాస్టర్, సిగ్నలర్, పోర్టర్ మొదలగుఉద్యోగస్థులలో అనేకులున్ను వేలకొలది దారిలో పనిచేయు కూలివాళ్లున్ను ఈదేశపువారే. ఆఇనుపదార్లను వేయించుటకున్ను నడిపించుటకున్ను ఖర్చుకాబడు మూలధనమం దధికభాగము ఆంగ్లేయధనాఢ్యులభాగ్యము.

## ౨. వ్యాపార నాయకత్వము

గొప్ప ద్రవ్యవంతులనద్ద వ్యాపారమునకు వలయు మూలధనము గ్రహించి తగినస్థానమందొక కర్మాగారము నెలకొల్పి శక్తియుక్తులుగల కార్మికుల నియమించి అర్థాభివృద్ధిచేయు ప్రముఖులే పారిశ్రామిక నాయకులు. పైపేరాలో చెప్పిన మూడు జాతులవారుకాక వీరింకొక నాల్గవ జాతివారు. మన దేశమందున్న తేయాకు తోటలను కాఫీతోటలను గమనించినచో అర్థోత్పత్తికి ఈ నాలుగు తెగలవారు ముఖ్యులని తేటపడును. ఆతోటలలో పనిచేయుకూలివాండ్రు హిందూదేశీయులే; స్థానమో సర్కారువారికి చెందినది; ఖర్చుచేయబడుచున్న ద్రవ్యమో, బ్యాంకులనుండి ఋణము తీసుకొనబడినది. ఈవిధముగా మూడుజాతులవారికి సంయోగము కలుగజేసినవాడే. "ప్లాంటర్" నాబడు అన్యదేశీయవ్యాపారనాయకుడు వీనివలె తెలివితేటలతోను ఉత్సాహముతోను వ్యవహారచక్రమును నడిపించెడువారే పాశ్చాత్యదేశములందు అర్థబాహుళ్యమునకున్ను నాగరితాభివృద్ధికిన్ని కారణభూతులగు చున్నారు. వ్యాపార నిర్వాహకుల బుద్ధిబలమువలననే, అర్థోత్పాదకములగు ప్రకృతిస్థానము మొదలగునవి శ్రమ, మూలధనము, సార్థకములగుచున్నవి; హెచ్చాళముగాభాగ్యవృద్ధి యగుచున్నది. పాశ్చాత్యదేశములందువలె వ్యవహారచక్రమును సమంజసముగా నడిపించు కుశాగ్రబుద్ధు లీదేశములో అతితక్కువ.

## ౩. శ్రమవిభాగము

శ్రమపడిపనిచేయు నానాజాతుల కర్మకరుల నొకస్థలమందుచేర్చి వారిచేత ఉచితకార్యముల జేయించుటవలన కలిగెడులాభ మధికము. అనేకులుకూడి సంఘీభావబలమున సాధించగలుగుపను లనేకములు. ఒక పెద్ద దూలమును రంపముతో బల్లలుగా కోయవలసియున్నచో మీద నొకడు రంపమునెత్తిపెట్టి కోయుటకును క్రింద నొక డారంపమును సరిగాలాగుటకును కావలసియుండురు. వీరిద్దరు అతిసుళువుగా చేయగల్గినపనిని ఒక్కొక్కడే చేయవలసివచ్చిన యెడల ఒక్కనిబలమున కెన్ని యోరెట్లు బల మవసరమైయుండును. యంత్రోపకరణ సహాయము పెరిగినకొలది ఒక్కొకవృత్తి వ్యాపారము పెక్కుభాగములుగను చిన్నచిన్నవిభజింపబడి సుళువుగానుత్వరగాను చేయబడుచున్నది. పురాతనకాలములో మనుష్యు లరణ్యవాసులుగా నున్నస్థితిలో పురుషులు వేటాడి మృగములను జంపి మాంసమును తెచ్చుచుండిరి, స్త్రీలామాంసముతో ఇండ్లవద్ద వంటలు మొదలగు గృహకృత్యముల జేయుచు వచ్చిరి. రానురాను ప్రజ లవివేకము, నాగరికత హెచ్చినకొలది వారికి కర్తవ్యములగు వృత్తులు వేలకొలది ఏర్పడినవి; ఇట్టిస్థితిలో ప్రతివృత్తి వ్యాపారమునకువలయు శ్రమ అనేకచిన్నచిన్నవిభాగములుగవిభజింపబడి ఆయాభాగములపనులను తిన్నగా చేయుటకు తగినవారు నియమింపబడుచువచ్చిరి. మనమొకఫ్యాక్టరీకివెళ్ళినచో ప్రతివాడున్ను ఏదోయొక చిన్న సూక్ష్మభాగపు పనిమాత్రము చేయుచుండుట కనుగొందుము. ఆధునికమార్గముల ననుసరించి ఏదైన ఒకసామాను తయారుచేయుట కనేకులు కార్మికులు కావలసియుందురు. ఈకాలములో సుమారు 800 కార్మికులు కలిసి ఒక చిన్నగడియారమున్ను, సుమారు 100 మంది కలిసి మనము పాశ్చాత్యసీమనుండి దిగుమతిచేయుచున్న ఒకజత పాదరక్షలున్ను తయారుచేయుచున్నారు. మన మసాధారణముగ ఒకదమ్మిడీవెలకు కొనుచున్న చిన్న

సూదినికూడ వందలకొలది శ్రమకరులు యంత్రసహాయ మున కర్మాగారములలోనే తయారుచేయుచున్నారు. పాశ్చాత్య పారిశ్రామిక కర్మాగారములను. బాగుగ పరిశీలించిన ఎంతో ఆద్భుతముగా నుండును. ఏసామాను తయారు చేయుటకైనను ఎన్నియో వందల కూలివాండ్రున్ను, ఎన్నియోవేలు లక్షలు మడింపుచేయు యంత్ర శాలలు, నీటిఆవిరియంత్రములు విద్యుచ్ఛక్తిసాధనములు అతివిచిత్రముగా నుండు లోహనిర్మితోప కరణములు ఆఫీసుగదులు, మేజాబల్లలు, కుర్చీలు, ఘంటానినాదములు, గుప్పుగుప్పుమను శబ్దముతో యంత్రములనుండి పొగ బయలువెడలుట, స్పర్శమాత్రముననే యంత్రోపకరణములెన్నియో చిత్రములగు లగువులు వేసి తుదకొక మూలతొట్టిలోనో ఇంకొక ప్రదేశముననో తయారగుచున్న వస్తురాసులున్ను, ఇంకొకచోట ఆవస్తువులను పేకట్లుగా కట్టుటయున్ను, అందు పైవస్తువుల మాహాత్మ్యము దెలుపువ్రాత లచ్చుపడుటయున్ను మొదలగు అద్భుతకార్యముల నెన్నిటినో మనమొక ఆయిదునిముషముల కాలములోనే చూచుచున్నాము. ఇట్టియంత్ర సహాయ మపేక్షించక వట్టిచేతులతో ఇట్టిపనులను చేయుటెంతయో కష్టముగా నుండుటయే కాక చాలకాలము గూడా పట్టును; ద్రవ్యవ్యయ మధికమగును లోహనిర్మిత వస్తురచన కెన్నియోతరహాల పను లావశ్యకములు. లోహమునుకరుగుట, కడ్డీలుకొట్టుట, చిన్న చిన్న ముక్కలుగా జేయుట, వాటిని సాపుచేయుట, రంధ్రముల పొడుచుట మొదలగునవి. ఈపనులన్నియు ఇప్పటిఫ్యాక్టరీలలో ఒక్కడు చేయడు; ఒక్కొక్కపనిచేయుట కెంతమందియో నిపుణులగు కర్మకరు లుందురు. వీరు తిన్నగా పనిపాటలు చేయుచున్నారో లేదో విచారించుటకుకూడా వేర్వేరు ఉద్యోగస్థు లుందురు. శ్రమవిభాగసూత్రము ననుసరించి యంత్రసహాయమున పరిశ్రమల నెరవేర్చుట నవనాగరిక ధర్మమై యున్నది.

## 4. శ్రమవిభాగమువలనకలుగు లాభనష్టములు

పైనజెప్పినవిధమున ఏపనియందైనను కార్యవిభాగము, వృత్తివిభాగము, శ్రమవిభాగము వృద్ధిఅయినకొలది హస్తకళలు యంత్రకళలు, నానాటికి దిట్టపడి పేరాశముగా భాగ్య మధికరించును. వస్తురచనకు శ్రమవిభాగసూత్రమనుసరించినప్పుడు కొన్ని లాభములుకొన్ని నష్టములు కలుగుచున్నవి. లాభము లనే మొదట విచారించెదము. అనేకవిధములగు పనులను గమనించకుండ ఒకే పనిని చేయుచుండుటవలన కార్మికునకు నేర్పున్ను, ఉత్సాహమున్ను అలవడుచున్నవి; కొంచెముకాలములో ఎక్కువపని అగను. కార్మికు లెవరెవరి యోగ్యతలకున్ను నిపుణతకున్ను ఆసక్తికిన్ని తగినటుల పనులజేసి జీవించవచ్చును. ఒకేపనిని చాలపర్యాయములు ప్రతిదినము చేయుచుండుటవలన ఆపనిని సులువుగాను శీఘ్రముగాను చేయుటకు నలయు క్రొత్తఏర్పాట్లు, యంత్రసాధనములు పనివారిబుద్ధికి తప్పక గోచరించును. ఇంగ్లాండు మొదలగు దేశములలో బహుఅల్పుల సపనివాండ్రే అనేకప్రశస్తయంత్రసాధనములను కనిపెట్టియున్నారు. ప్రతిపనియున్ను ప్రత్యేకముగా కొంచెముమంది కర్మకరులే చేయుచుండుటచేత యంత్రోపకరణములు మొదలగు పెట్టుబడిసామానులు కొంతకాలము ఖాళీగానుండక ఎప్పుడున్ను ఉపయోగపడి భాగ్యాభివృద్ధిఅతిశయించును. శ్రమవిభాగసూత్రమువలన నష్టములుకూడ కొన్ని కలవు. ఒకేవిధముగు పనిచేయుటవలన కర్మకరులప్రశస్తగుణములు నానాటికి క్షీణించి ఒకపనియందలి 50వ భాగమునో 60వ భాగమునో నిర్వర్తించుటకు మాత్రము వలయు నేర్పుగలవారై ఆపనియందే ఇతరభాగములపనులను చేయుటకుగాని ఇతరవృత్తుల నవలంబించుటకుగాని పనికిమాలిన వారగుచున్నారు. కాబట్టి ఏదేని ఒకవృత్తికిగాని, పనికిగాని ఆపద తటస్థించినయెడల ఆవృత్తిని ఆపనిని అనుసరించియుండెడు పారిశ్రామికనాయకులకు నష్టమగుటయేకాక అందులననుసరించుకొనియున్న ఇతరవృత్తులకును, వ్యాపారమునకును, కష్టనష్టములనేకము లేర్పడి వేలకొలది కార్మికులు కూలిలేక ఇంకొకవిధమున పొట్టపోషించుకొన నేరక మలమల మాడవలసి వచ్చును. కావుననే వస్తువులు విస్తరించుటవలన భాగ్యవృద్ధి అగుచున్నను అందులకు తగినటుల ఆనందము సుఖము ఏర్పడుచున్నవని చెప్పలేము. ఇంతేకాదు శ్రమవిభాగసూత్ర మవలంబించెడు ఆధునిక కర్మాగారములలో యంత్రములను ఉచితకాలములందు త్రిప్పుట, త్రోయుట, వాటిలో బొగ్గువేయుట మొదలగు సులువుపనులెన్నియో యుండును. అవి కార్యవి

ధికముఖ్యమైన పనులైనను బలిష్ఠులగు పురుషులే వాటిని చేయవలయునన్న నిబంధన మనవసరము; కావున అట్టి పనులలో స్త్రీలను చిన్నపిల్లలను నియమించే ఆచారము ప్రబలుచున్నది; అందువలన చాలమంది మగవారికి పనులు దొరకకపోవుటయే కాక స్త్రీలయొక్కయు చిన్నవాండ్రయొక్కయు దేహారోగ్యముల కెంతయో ప్రతిబంధక మేర్పడి దేశాభ్యుదయమునకు నానాటికి కొరత కల్గుచున్నది. ఈనష్టములు కలుగుచున్నను యంత్రకళాపాల్యమునకు శ్రమవిభాగసూత్రావలంబన మెంతయో ముఖ్యము. కాని శ్రమవిశ్లేషసూత్రమున కనుకూలించెడు సమయములను మనము మరువరాదు. వస్తురచన క్రియలు వేర్వేరుగా జేయుట కనువైనవిగా నుండవలెను; కర్మకరుల నిర్ణీతకాలమున కంతటికిని సరిగా పనులుండవలెను. ఈసూత్రావలంబనమున కర్మాగారములలో తయారగువస్తురాసులను కొనగల్గువా రుండవలెను. ఈ కాలములో యంత్రసాధనములంజేసి విస్తారవ్యాపారము లుప్రబలుచుండుటవలన యీశ్రమవిభాగ సూత్రమునను సరించి కార్యములు నెక్కుపెట్టినచో మొత్తముమీద లాభమేకాని నష్టముండదు.

౫. స్థానమాహాత్మ్యమునంజేసి పరిశ్రమ లేర్పడుట: ఏదేశమందైనను పరిశ్రమలు విస్తరించుకొలదిఆ దేశమందలి కొన్ని ప్రత్యేక భాగములలో కొన్ని పరిశ్రమలు, వృత్తులు ప్రబలియుండును. ఇట్టి పరిస్థితులకు కారణము లనేకములు. మనదేశమందు బొంబాయిరాజధానిలో దూదిపంటకుఅనువైన నల్లరేగడభూమి విస్తారముగా నుండుటవలన ఆ వ్యాపారమున కాప్రదేశము ప్రసిద్ధి. బంగాళములో జనుపనారపంట విస్తరించియుండుటం బట్టి కలకత్తాలో జనుపనార విషయమగు పరిశ్రమలు బలిసియున్నవి; కోలారుగనులలో బంగారము దొరకుచుండుటవలన మైసూరురాష్ట్రములో బంగారపుగనుల పనులు నెలకొల్పబడియున్నవి. ఇంగ్లాండునందు లంకాషైర్‌లో ప్రత్తిపరిశ్రమలు, యార్కుషైర్‌లో ఉల్‌సంబంధమగుపనులు, బర్మింగాములో ఇనుపపనులు మొదలైనవి విస్తరించియున్నవి. రేవు పట్టణము లెగుమతి దిగుమతి వ్యాపారములకు ముఖ్యము కావున బొంబాయి, కలకత్తా చెన్నపురి మొదలగు రేవుపట్టణములు విశేషముగా వర్తకము నాకర్షించుచున్నవి. ప్రవాహధారలచేతను జలపతనములచేతను లభించిన విద్యుచ్ఛక్తి సహాయమునను, నీటిశక్తి సహాయమునను యంత్రములు నడుపుచుండుట ఈకాలములో సర్వసాధారణమైనదిగా నున్నందున అనేకవ్యాపారములు గొప్పగొప్ప నదులయొద్దను స్థాపనకు వచ్చినవి. ఈదేశములో ముఖ్యముగా పుణ్యక్షేత్రములు రాజనివాసస్థానములు వర్తకమునకు శరణ్యములై యుండినవి. వీటినాశ్రయించుట కేతెంచు జనసమూహములే ఇందులకు కారణము. తగినశీతోష్ణస్థితి, జలాశయముల సౌకర్యములు. అపక్వపదార్థములు విస్తరించియుండుట, ఇనుము, రాతిబొగ్గున్ను, దొరకెడుగనులుసమీపమందుండుట, కర్మకరులు హెరాళముగా లభ్యమగుట, యానసౌకర్యములు వస్తువుల నమ్మబడిచేయుటకు వలయు సాధనములున్ను కలిగియుండుట మొదలగు కారణములంజేసి కొన్ని ప్రత్యేకపరిశ్రమలు కొన్ని ప్రత్యేకప్రదేశములందే నెలకొల్పబడి వానికెక్కుచుండుట మనము కనుగొనుచున్నాము.



# సూర్యనారాయణరాయాస్తయము

శ్రీమాన్, కో. వేం. కృష్ణమాచార్యులయ్యవారులు గారు

ఆకసము పోలిక ననన్తమైన యవని
రే పవలు నొంటిపాటఁ జరించుచుండు,
శ్రమముఁ గొనుటయు, దాన విశ్రమముఁ [గొనుట,
నణునిమేషము నందైన నరయ నకట!

* * * *

రేపవలు నొంటిపాట జరించు నపుడు
తనకు దైవాజ్ఞ యిది యంచుఁ దలఁతు, గాని
కొంచ మొక్కింతయును నహంకార మీవు.

* * * *

స్వార్థ గంధ విరహిత క్రియాకలాప
ములనుఁ బనిసేయు పట్టుల మొనసి 'ద్వ్యక్తి
రోభవేన్మృత్యు'వను నుడి రూఢి నెఱిఁగి,
మర్మమునుఁ గాంచుచుండుదు మానసమున.

* * * *

బాహిరమ్మగు నాంధ్యమ్ముఁ బాప రవియు,
నాన్తరమ్మగు నాంధ్యమ్ము నడుప నీవు,
సత్క్రియాతతిఁ బోషించు నడి నిరువురు
లోకబాంధవ శబ్దమ్ము లోక మెఱుఁగఁ
గ్రమముగఁ ద్రిమూర్తి. మూర్తులై యమరు [చుంద్రు

* * * *

భగవదేకాశ్రయమ్ము బింబమ్ము; గాన
సూర్యనారాయణుండన సూర్యుఁ డెసఁగె
భగవదేకాశ్రయమ్మగు భావ మూని
సూర్యనారాయణుండను సుకృతివైతి.
ఆంధ్ర గీర్వాణవిద్యల నధిగమింప
నాంధ్ర గీర్వాణవిద్యాలయమ్ము నిలిపి
యాంధ్ర దేశీయబాలుర యాస్య పద్మ
ములను పద్మమ్ము లెల్లెడ నలరు చుండ
గోష్పదక్షేత్ర మయ్యెఁ ద్వద్గోష్పదముగ.

* * * *

అఖిల జనములఁ దమిగమ్మునందు ముంచి,
యజ్ఞభవు నాన నెదయుదము నుంచి,
యస్థిరమ్మగు సర్వమ్ము సవఘటించి,
యస్తమించి తివే! సంశ్రితాళి డించి.

* * * *

అజ్ఞహితుఁ డస్తమించెడు నవసరమున
నాగమోక్తినిఁ దలపోయ నాత్మతేజ
మగ్నియందును నోషధులందు నిలుపు
నీదు తేజమ్ము నేమొక నిలిపి తీవు,

* * * *

నమ్మ ముక్తుని 'నోపజనం స్మరన్ని
దం శరీ' మ్మటంచని తత్త్వవిద్య
వలుకుచుండగ ముక్తినిఁ బడసి నీవు
పాఠశాలనుఁ దలఁతువు భావమునను.

* * * *

ఛాత్రజన మనిశమ్మును సంతసింపఁ
బాఠశాలను బోషించు భార మెల్ల
నాంధ్ర దేశీయముఖ్యుల కప్పగించి,
సూర్యనారాయణా! నిత్యసుఖము గనుము!

* * * *



# * అమెరికా సంయుక్తరాష్ట్రములం దొకపల్లెటూరు

(చిత్రములలో)

మాగంటి బాపినీడు, బి. యస్. (కార్నెలు), యస్. యస్. సి. (కాలిఫోర్నియా)



రైతు

1922-వ సం. సెప్టెంబరు మాసమున కార్నెలు విశ్వవిద్యాలయ (న్యూయార్కు రాష్ట్రమున) సమీపముననున్న ఇంటరులేకను అను పల్లెటూరు వెళ్లి ఫ్రీస్టోనురైతుతో కొన్ని దినములు గడిపి అచటి గ్రామజీవన పరిస్థితులతో పరిచయము చేసికొంటిని. నా కిరుప్రక్కల ఫ్రీస్టోనుదంపతు లున్నారు. నూరు ఎకరముల భూస్వామి. 60 యెకరముల ఆపిలు తోట. మిగిలినదానిలో గోధుమలు మొక్కజొన్నలు పశువులమేతకు గడ్డి పండించును. యంత్రసహాయముచే పనియంతయు స్వయముగా చేసికొనును. మే మిద్దరము పనిచేయుచు మన దేశపు కబుర్లు చెప్పుకొనుచుండెడివారము.

మన పల్లెటూళ్ళు అతి పురాతనమైనవి. కేవలము రైతుల నిలయమై యుండు. అచట పైజెప్పినట్లు అయిదారు మైళ్ళ చుట్టుపట్లనుండు రైతులకు క్రయవిక్రయమునకు, వినోదమునకు, దైవప్రార్థనమునకు, విద్యాసంస్థలకు కావలసిన కూడలియే పల్లెటూరనబడును. రక్తనాళములు లేనిదే హృదయమెట్లుండదో రైతులు లేనిదే ఇట్టి పల్లెటూళ్లుండవు. పై పటము ఒకపల్లెటూరి వీథి. ఇరుప్రక్కల మోటారు బారులు దీర్చి ఎట్లున్నవో చూడుడు.



పల్లెటూరు

* అక్షయ సంవత్సరాది సంచికయందలి నా వ్యాసము చూడుడు.

రైతుగృహము



ఆదేశమునమనదేశపు రైతులవలె నందరు ఒకచోట నివసించి ప్రాతఃకాలమున పొలమునకుపోయి సాయంకాలమున వచ్చుటగాక, ఎవరిపొలమున వారు స్థిరనివాస మేర్పరచుకొనియుందురు. గృహములు తోటలనంటియుండును. సాధారణముగ రైతు కొక మోటారుండును. పైపటమునందు రైతు తన తపాలాపెట్టె విప్పుచున్నాడు. గృహము పరిశుభ్రముగ గ్రంథములు, పత్రికలు, సంగీతపుపెట్టె, టెలిఫోను మున్నగు నాగరికతకు అవసరమగువాటితో నిండియుండును.




## ప్రాథమిక పాఠశాలలు

దేశముయొక్క భవిష్యదభివృద్ధియంతయు బాలబాలికలపై నాధారపడియుండును. పిల్లలశ్రద్ధలోనే జాతి మోక్షముండును. అందులకే అమెరికాదేశమున రైతులు ఎంతదూరముగనున్నను వారిపిల్లలవిద్య కేలోటు నుండదు. కొండమీద ఎచట గృహములు లేకున్నను పాఠశాలలు దృష్టి నాకర్షించును. విద్య ఉచితము; నిర్బంధము. ఆదేశమున నూటికి 95 గురు చదువగలవారున్నను మనదేశమున నూటికి 15 గురే గలరు. ప్రారంభవిద్యకు ప్రతివిద్యార్థికి రు 6 లు ఖర్చుపెట్టుచున్న, మనదొరతనమువారు 0-2-0 మాత్రమే ఖర్చుపెట్టుచున్నారు. కాలిఫోర్నియాలోని ఒకపల్లెటూరియందలి ప్రాథమిక పాఠశాలలు.



ఉన్నతపాఠశాల

ప్రతిపల్లెటూరియందు గాని [illegible] బాటల యొద్దగాని ఒకటి లేక రెండు ఉన్నతపాఠశాలలుండును. ప్రభుత్వ సహాయముతో గాని లేకస్వయముగాకాని రైతులే నడపెదరు. తమ బాలబాలికలకు స్వయంశక్తి జ్ఞానము నిచ్చు Vocational & Cultural education) విద్య గరపెదరు. విద్యాలయము నంటియుండు పొలములో బాలురకువ్యవసాయము, బాలికలకు గృహనిర్వాహము, కుట్టుపని నేర్పెదరు.



30 లక్షల విద్యాలయము

విద్యకై ధన మెంత వినియోగించెదరో ఈ పటమునందుండు మున్నగల గల ఉన్నతవిద్యాలయమువల్ల దెలియగలదు. తమవిద్యాసంస్థలకు పన్ను వేసికొనెదరు. మానదేశమునకు అట్టిని త్యాగ మ్యెగు నాసింది.



గ్రంథాలయము

నూటికి 95 గురు వ్రాయ చదువగలవా రున్నపుడు నిర్బంధవిద్య యున్నపుడు ప్రతిపల్లెటూరియందు గ్రంథాలయము లేక నాగరికతగల ప్రజ లెట్లుందురు. గ్రంథాలయమే కాక పత్రికయుండును. పౌరజ్ఞానము గల వారు గాన అందరు పత్రికలు చదివెదరు. ఆంధ్రదేశమున గ్రంథాలయములు లేని గ్రామము లెన్నో కలవు. పత్రికలు మచ్చుచూడని ప్రజ లెందరో కలరు. ఇట్లున్న దేశ మె ట్లభివృద్ధికి వచ్చును. సంచార గ్రంథాలయముల ద్వారా రైతు ఏమారుమూలనున్నను, గ్రంథములు నందచేయుదురు.

వ న భో జ న ము



ఎంతదూరమునను్న సాంఘికజీవన ముండును. అప్పుడప్పుడు చుట్టుప్రక్కలనున్న వారంద రొకచోట గుమిగూడి వనసంతర్పణ జరిపెదరు. పైపటమునందు చెట్లక్రింద గూడి కాలమెట్లు విశ్రాంతిగా గడుపుచున్నారో చూడదగును. ఇట్టి సంస్థలు మనకున్నవి. కాని శిథిలమయి పోవుచున్నవి.





రైతుసంఘములచే రైతులు తమహక్కులను కాపాడుకొందురు. క్రయవిక్రయములకు సహకారసంఘము లుండును. రైతు సంఘప్రతినిధులవల్ల ప్రభుత్వమునందు పలుకుబడి సంపాదించెదరు. వ్యవసాయసమస్యలు పరిశీలనముచే పరిష్కరింతురు. పైపటము నందు మోటారులపై వచ్చి ఇట్టిపరిశీలన చేయుచున్నారు.






కోన వేంకటరాయశర్మ గారు, బి. టి. యస్. (వాఙ్మయ సమితి మంత్రి)

పాలలోపల నూట రత్నాలమూట
నిధులలోపల నిగ్గు సన్నిధుల జగ్గు
కలలలోపలి కీలు దీప్తులకు జాలు
తెలివితో దానితత్త్వంబుఁ దెలిసికొనుమ.

తనువు చిల్లులు పడిపోయి తపముసేయు
చుండు జడదారి తా నొక్కరుండుగాక
అన్యులెవ్వరు దేని యథార్థశక్తి
నెఱుఁగరో దాని నేనెట్లు తెలుఁగనేర్తు.

సకలవర్ణాశ్రమాచార సమితికెల్ల
మూలమంత్రమ్ము నా నొప్పి పూజ్యులందు
సంచరించుచు నుండెడి శాస్త్ర మేది?
దాని వివరించి వచియింపఁ దరమె నాకు.

ఏదికాలంబులకు నెల్ల నాదికాల
మేది మోక్షంబులకు నెల్ల నాదిమోక్ష
మేది శక్తులకును నెల్ల నాదిశక్తి
అట్టి యేకాంతవస్తు వేమందు సఖుఁడ!

అన్నితత్త్వమ్ములకుఁ గూడ నాదితత్త్వ
మైన యధ్యాత్మ. తత్త్వమ్ము దేనివలనఁ
బ్రకటితమ్మగుచుండు నాపరమధామ
మెవ్వనికి నబ్బు వాఁడెపో యీశ్వరుండు.

రాజ్యములలోన నుత్తమ రాజ్యమైన
మోక్షసామ్రాజ్యమునకయి దీక్షఁబూని
తపముఁజేసెడి యాతపోధనులు గూడ
దేని నాశింతురో దాని నేను గంటి.

మహిని గ్రంథమ్ములకు నేది మార్గదర్శి
కవికులమ్మున కెయ్యది కల్పశాఖి
ముక్తికాముల కెయ్యది ముక్తిపదము
దాని నెఱిఁగిన వాఁడెపో జ్ఞానధనుఁడు!

జ్ఞానహీనుల కేది యాకాశ సుమము
బోధయుండినవారికిఁ బూర్ణదృష్టి
యఖిల విజ్ఞాన సాధనమైన దానిఁ
దెలిసికొనుమయ్య సఖుఁడ!......



# మన దేశములో పెన్సిలు పరిశ్రమ

'పరిశ్రమాభిలాషి'

మన దేశములో పెన్సిలుపరిశ్రమను ముఖ్యమైన పరిశ్రమలలో నొకటిగ, గణింపవచ్చును. అదియును చులకనగ చూడదగినది గాదని చెప్పవచ్చును ఏలయన 1923–24 సంవత్సరములో మన దేశములోనికి విదేశములనుండి 9,33,112 రూ. విలువగల 30,48,990 డజనుల పెన్సిళ్లును 1924–25లో 9,21,736 రూ.ల విలువగల 26,89,183 డజనులును దిగుమతియైనవి. ఇందులో 1,12,825 రూ. విలువగల 2,75,602 డజనులును, 1,38,305 రూ. విలువగల 382,927 డజనులును మన రాజధానిలోనికి దిగుమతి యైనవి. సంవత్సరమునకు లక్షలకొలది రూపాయల విదేశముల కంపించుకృషి అల్పమైన దెట్లగును.

పెన్సిలు తయారు చేయుటకు ముఖ్యమైన వస్తువులు గ్రాఫైటు, కర్ర లక్క, ఇవి యిరివిగా మన దేశములో నున్నవి. వాని నుపయోగించి పని నడిపింపగల పనివేత్తయు మన దేశములో నున్నారు. ధనము పుష్కలముగా గలదు. తయారైన పెన్సిళ్ల నుపయోగించు ప్రజాసముదాయము అపారము. కాబట్టి మన దేశములో పెన్సిలుకృషి అభివృద్ధిలోనికి వచ్చుటకు సందియము లేదు.

చెన్నపురిలో మదరాసు పెన్సిలు ఫ్యాక్టొరి అను పేరుతో నొకగొప్పఫ్యాక్టొరీ యున్నది. దీనంత పెద్దది జపానులోకూడ లేదు. అది ప్రస్తుతము 50 గ్రోసులు (600 డజనులు) పెన్సిళ్లుమాత్రమే తయారు చేయుచున్నను దినమునకు 250 గ్రోసులు తయారుచేయ శక్తి గలఫ్యాక్టొరీ. అందిప్పుడు 100 మంది మాత్రమే పనివాండ్రు పనిచేయుచున్నారు. అనగా 100 కుటుంబములకు (500 మంది ప్రాణులకు) అది నిత్యము అన్నమునిచ్చుచున్నది. విరివిగా పనిచేసినప్పుడు దానివలన 2000 ప్రజలకు సుఖజీవనము కల్గును. మనము కొంచెము దీక్ష గల వారమై మన కృషుల మనము రక్షించుకొని మనప్రజలకు మనము జీవనోపాధుల గల్పించుకొనవలెననుసుజ్ఞానము కలిగినప్పుడు, మన దేశమునకు కావలసిన 30 లక్షల 50 వేల డజనుల పెన్సిళ్లలో ముప్పాతిక వంతైనను మనము యింకను ఫ్యాక్టొరీలగట్టి అందు తయారుచేసుకొనునప్పుడు, యీకృషివలన 10 వేల మందికి తక్కువకాని పాటకపుజనమునకు బ్రతుకు గలుగును. అనుదినము 10 వేల మందికి అన్నము పెట్టగల కృషి అల్పకృషియా? ఇప్పుడు క్షణక్షణము మనకంటికి ఎదురై "నాయనా, అన్నము లేదు; అమ్మా, ఆకలి" అని

దీనత నొందు ప్రజలలో 10వేల మంది యీకృషివలన రక్షింపబడుదురు. అట్టిదీనులలో పదివేలమంది తగ్గిపోవుదురు. ఇంకను మనచదువుకొన్నవా రెందరో పనిలేక యున్నారు. వారిలో పెక్కుమందికి గూడ నిది పని కల్పించును.

మదరాసు పెన్సిలుఫ్యాక్టొరీలో స్టారు ఆఫ్ ఇండియా అను ముద్రతో అనేకరకముల పెన్సిళ్లు తయారగుచున్నవి. మామూలువ్రాతపెన్సిళ్లు, కాపీపెన్సిళ్లు, రంగుపెన్సిళ్లు, డ్రాయింగుపెన్సిళ్లు, లావువి, సన్నవి, పొట్టివి, పొడుగువి. ఇంతేల పెన్సిలు విషయములో ఎన్నెన్ని రకములుగలవో అన్నియు నిక్కడ మనోహరమైనవి తయారగుచున్నవి. రంగుకణికలుగూడ చేయుచున్నారు. ఈపెన్సిళ్లు అనేక ప్రదర్శనములకు పోయి మెడల్సు, సర్టిఫికేట్లు పొందియున్నవి. సీమలో జరిగిన వెంబ్లీ ఎగ్జిబిషనులో గొప్ప పతకమును సంపాదించియున్నవి. ఈపెన్సిళ్లు మనదేశములోనేకాక ఆస్ట్రేలియా, న్యూజిలాండు మున్నగు విదేశములలో గూడ అమ్మకమగుచున్నవని తెలిసి మనమందరము గర్వపడవలసినదే. మరియు ఇండియాలో బ్రిటిషు గవర్నమెంటున్ను, కాశ్మీరము, బరోడా, తిరువాన్కూరు మున్నగు సంస్థానపు గవర్నమెంటులును స్టార్ ఆఫ్ ఇండియా పెన్సిళ్లనే ఉపయోగించుచున్నారు. బరోడా గవర్నమెంటువారు తమ ఆఫీసులలో స్టార్ ఆఫ్ ఇండియా పెన్సిళ్లనే ఉపయోగింప వలసినదని గెజటులో ప్రచురించియున్నారు. ఇట్లు ప్రతిచోటను గౌరవము గాంచుచున్న యీ పెన్సిలును మనమందరము విరివిగా నుపయోగించుట న్యాయముగదా!.

ఇంతకును వీనినికొని ఉపయోగించుటవలన మనకు నష్టములేదే. రెండణాలు మూడణాలుఇచ్చి విదేశపుపెన్సిలుకొనేదానికి మారుగా అణన్నర ఇచ్చి అంతబాగున్న స్టారు ఆఫ్ ఇండియా కాపింగ్ పెన్సిలు కొనుట మనకు లాభమేకద "నిరుడు మాకు గవర్నమెంటు సప్లయిచేసిన విదేశ పెన్సిలుకంటె ఈసంవత్సరమిచ్చిన స్టారు ఆఫ్ కాపిఇంగ్ పెన్సిలే అనేకరెట్లు బాగున్నది" అని గొప్ప గవర్నమెంటు ఉద్యోగస్థులు సామాన్యముగ చెప్పుకొనుమాట. నల్ల పెన్సిళ్లుగూడ అట్లనేవిదేశవాటికంటె చాకగా వానికంటె బాగున్నవి. రంగుపెన్సిళ్లు డ్రాయింగుపెన్సిళ్లునుగూడ అట్లనే యున్నవి. కనుక మనము పెన్సిలు కొనేటప్పుడు దానిమీద స్టార్ ఆఫ్ ఇండియా అని వున్నదే కొనుచుండవలెను. ఇట్లు కొనుచుండినచో మనకు విశేషలాభ ముండును. చూడుడు, రాజమహేంద్రవరములోని మనపేపరుమిల్లు ఏల పనిచేయడం లేదు? డబ్బులేక కృషులలో నమ్మికలేక, మనుష్యులలో నమ్మికలేక, కృషుల నడపించువారికి ఓరిమి, వివేకము, సహనము, సమర్థతలేక. ఇప్పుడు అది నడచునన ఆశ మనకేమియు లేదుగద. ఒకవేళ నడచినను ఏవిదేశీయుని చేతికో పోవును. ఇక నేచెప్పునది వినుడు. ఈస్టార్ ఆఫ్ ఇండియా పెన్సిళ్లు ఆరునెలలు ప్రతిఆంధ్రుడును పూనికతో ఉపయోగింపుడు. ఏడాదినాటికి పేపరుమిల్లుకు కావలసినడబ్బును సమకూర్చి దానిని సాగింపగల్గుదుము. ఈఒక్క బాణమువలన రెండుపక్షులు; చిక్కును. కావున ఆంధ్రులెల్లరును కొద్ది గొప్పచిన్న పెద్ద,ఆడుమగ అందరును, సర్వవిధముల లాభకరమైన స్టారుఆఫ్ ఇండియా పెన్సిలుతప్ప వేరేదీ ముట్టమని శపథముపట్టుడు.

మదరాసు పెన్సిలు ఫ్యాక్టొరీలో మరియొక విశేషము గూడ గలదు. సాధారణముగా మనదేశములోని కృషులు ఇంగ్లీషువారి యాజమాన్యముక్రిందనో, ఇంగ్లీషువారి పెట్టుబడివల్లనో ఇంగ్లీషు పరిశ్రమవేత్తచేతనో నడుపబడుచున్నవి. బకింగుహాము మిల్లు, చామర్లకోట పంచదారఫ్యాక్టొరీ మున్నగునవి చూడుడు. ఇది అట్లుకాదు. ఇందులో పనిచేయుపరిశ్రమవేత్త మల్లాది సుబ్బరావుగారు టి. ఇ. ఇ.(టొక్కియొ). ఈయన తెలుగువారు. తెలుగుదేశమున పెన్సిలు కృషి పేరుచెప్పినప్పుడు ఈయనపేరు జ్ఞాపకమురానివారుండరు. ఈఫ్యాక్టొరికి యజమానులు సుప్రసిద్ధులైన పెరుమాళ్సెట్టికంపెనీవారు; వీరు తెలుగువారు. వీరు ధనమును జలమువలె వాడుచు నీకృషిని స్థాపించుటకు పట్టుపట్టి యున్నారు. ఇది సాగినచో ఇంకను ఎన్ని కృషులకైనను పట్టుబడి పెట్టుదురు. ఇట్టిస్థితిలో మనమందరము దీనికి తోడ్పడవలదా. ఈతోడ్పాటువలన మనకే లాభమున్నది. ఈఫ్యాక్టొరీకి సామానులుగూడ తెలుగుదేశమునుండియే వచ్చుచున్నవట. బకింగుహాము

మిల్లు మొదలైనవానివలె విదేశసంస్థకాక కేవలము తెలుగు సంస్థయై ఇన్నివిధముల తెలుగుదేశమున కుపకరించు చున్నప్పుడు దీనిని స్థిరముగా స్థాపించుటకు తోడ్పడుట తెలుగువారికి ధర్మముగదా!

ఆంధ్రమహాజనులారా, మీకొకవిన్నపము. మన దేశములోని దుర్భరమగు క్షామమును పారదోలుటకు పరిశ్రమాభివృద్ధితప్ప వేరుమార్గము లేదు. కాని భావిపరిశ్రమాభివృద్ధికి ఒక గొప్ప అడ్డంకి ఏమన మనకు పరిశ్రమల యందు నమ్మకము లేకుండుటయే. ఫ్యాక్టొరీలను గట్టి చక్కగ నడిపింపగలమను ఆత్మవిశ్వాసము మనకు లేదు. అట్లు నడిపించుచున్న ఫ్యాక్టొరీలును నిదర్శనములు లేవు. కనుక యీవిశ్వాసమును కలిగించుకొనుటకు ఇప్పుడు పనిచేయుచున్న ఫ్యాక్టొరీలతో తయారగుసామానుల విధాయకముగ నుపయోగించుచుండి వీనిని ప్రోత్సహించుచు సుస్థాపితముచేయవలెను. మనభరతఖండముయొక్క భావిశ్రేయోభిలాషియైన ప్రతివానికిని యిదియిప్పుడు పరమ ధర్మము. గడచిన దినములలో నెట్లున్నను ఇప్పుడు స్వదేశివస్తువుల గొనుటలో కష్ట నష్టము లెంతమాత్రమును లేవు. సరుకుగుణములో విదేశీవాని కెంతమాత్రమును తీసిపోవక వెలలో సరసముగ నున్నది. ఇక కావలసినది కొంచెము శ్రద్ధయు అభిమానమును బజారుకు పోయి నప్పుడు దుకాణదారుడు ఏదియిచ్చిన నది తీసుకొనుట కాక నాకు స్వదేశియే కావలెనని అడిగి పుచ్చుకొనుట యావశ్యకము. దుకాణము మీదఅనేకవస్తువులగుపడును, అందులో ఏది మనకు యిష్టమో అది అడిగి పుచ్చుకొనుట మనపనిగదా. మీరు యీసాటి అభిమానమును శ్రద్ధయు చూపినచో ఒకటిరెండు సంవత్సరములనాటికి ఇప్పుడున్న కృషులు సుస్థిరములై క్రొత్తవి తలచూపు చుండును. దానివలన నిప్పుడు పనిలేక అన్నవస్త్రము లకు కరవై బాధపడుచున్న లక్షలకొలది మనప్రజలు సుఖపడుదురు. నిరుద్యోగులై దారిగానక నిరుత్సాహులై తిరుగుచున్న మనవిద్యావంతులైన యువకులకు విరివిగా పనికలుగును. విదేశములకుబోయి అనేక శ్రమల కోర్చి ధనమును ఖర్చుపెట్టి మనవారు సంపాదించుకొని వచ్చిన పరిశ్రమవిద్య ఉపయోగములోనికి వచ్చును. దేశములోని ధనము, దేశములోని మేధాశక్తియు దేశము యొక్క సంపదభివృద్ధికై విరివిగా నుపయోగించును. ఇట్టి మహాకార్యము "నేను స్వదేశవస్తువునే ఉపయోగింతు" నను ఒకస్వల్పనిశ్చయము మీరు చేసికొనుట వలన చేకూడును. ఇట్లుచేయుట శ్రేయమో లేక ఉపేక్షచేసి ప్రజలను మన తోడబుట్టినవారిని, క్షామపిశాచమున కొప్పగించుట శ్రేయమో యోచించి పనిచేయుడు.

---

# పుష్పసమయము

## వెలగపూడి దానయ్యచౌదరిగారు

పసిడి రేకులఁగూర్చి వెస రచించినరీతి
  మిసమిసలాడెడు కిసలయములు
రసపూరితమ్ములై పసరు రంగు వహించి
  మించుకోమల పత్ర సంచయంబు
మొనదేరి వికసింప మొదలుపెట్టిన యట్టి
  గురుతరంబౌ పుష్ప కోరకములు
రమణీయరాగాభిరంజనం బింపాఱి
  దెసలఁ దావులఁజిమ్ము కుసుమపాళి
కడుపాఱఁ బల్లవ ఖాదన మ్మొనరించి
  కోయంచుఁ దిరుగాడు కోకిలములు
భ్రమణంబు చెలువొంద సుమసుమంబున కేగి
  మకరందమును గ్రోలు మధుప చయము

గీ॥ త్రోటులఁ జేతపిందెలు ద్రుంచివిడుచు
  క్రీడలందేలు చక్కని కీరతతులు
  గలిగి; నేత్రోత్సవంబయి వెలయుచుండుఁ
  బుష్పసమయంబు సకలర్తుభూషణంబు.

చెన్నరాజధానియందు 1925సంవత్సరము ఏప్రిల్-జూన్ నెలలలో ముద్రితములై ప్రచురింపబడిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక

## పద్యకావ్యము-౧. ప్రబంధము

కన్యకావిజయము—భోగరాజు నారాయణమూర్తి

నిర్వచనకుశలవాభ్యుదయము—అనంతార్యరత్నాకరము

## పద్యకావ్యము-౨. పురాణము

కుచేలోపాఖ్యానము

గజేంద్రమోక్షము

గరుడపురాణము

రుక్మిణీకల్యాణము

## ౩. ఇతిహాసము

అయోధ్యాకాండము—(రామాయణము) వాల్మీకి

ఆంధ్రమహాభాగతము—ఆదిపర్వము

,, ఉద్యోగపర్వము

నిర్వచన సంగ్రహానంద రామాయణము—ఆకెల పూర్ణానందగుప్త

మహాసంకల్పము

వాసిష్ఠరామాయణము-వెరిగొండ వెంకమ్మ

## ౪. శతకము

కుమారశతకము—గ్రోంరాజు సీతారామరావు

,, మునగపాటి చినహనుమయ్య

,, యం. వి. చెన్నకేశవులు

కుమారీశతకము

,, వల్లూరి పద్మనాభరాజు

కొండకామేశ్వరశతకము—అల్లముశెట్టి అప్పయ్య

గురునాథేశ్వరశతకము—దోమా వెంకటస్వామిగుప్త

జానకీప్రియశతకము—ఆకుండి వెంకటశాస్త్రి

జానకీవరశతకము—జయంతి కామేశ్వరపంతులు

దీనరక్షానిధి—పాటిబండ్ల వెంకట్రామయ్యచౌదరి

నాగలింగేశ్వరశతకము—పింజల సుబ్రహ్మణ్యం

పన్నగాచలనాయకశతకము—పులహరి ఫిరోజి వేశిశేంద్రులు

మహాత్మగాంధిశతకము—వానమ్ శంకరశర్మ

మహాత్మశతకము—జీడిగుంట శ్రీరామమూర్తి

రామరాఘవశతకము—గుండాల వీరస్వామి

రామశతకము—పి. పాపిరెడ్డి

వేమనశతకము

శారదాంబాశతకము అను ప్రజాహృదయము-సత్తెనపల్లి హనుమంతరావు

శ్రీనివాసశతకము—కోతి శ్రీనివాసరావు

శ్రీరామచంద్రశతకము—డి. రామానుజాచార్యులు

శ్రీరామశతకము—యామర్తి వెంకటసుబ్బయ్య

సుప్రకాశశతకము—ఆర్. సుబ్బదాసు

## ౫. ఇతరములు

ఆశీర్వచన రత్నావళి

కర్ణామృతము అనుశృంగార పద్యావళి

కళావంతోద్ధరిణి—దూసరి వెంకటేశ్వర్లు

కీచకవధ—పి. సత్యనారాయణరాజు

గురుదక్షిణ—కరణము కృష్ణారావు

పరీక్షిత్తు—నూతలపాటి పేరరాజు

పాపాయి—నాళము కృష్ణారావు

శుద్ధాంధ్రనిర్వచన నిరోష్ఠ్యసుందరీ సుందరచరిత్ర—బుద్ధరాజు శేషగిరిరావు

శ్రీరామనక్షత్రమాల—డి. కొండమాచారి

సీతారామవిలాసము—యి. సూర్యనారాయణశర్మ

పద్యకావ్యము—నీతి

బాలనీతిప్రకాశిక—యస్. లక్ష్మీనారాయణరావు

## వచనకావ్యము—౧. కథలు

ఇల్లాలు ప్రవర్తనము—శ్రీరాజాచెలికాని జగన్నాథ రావుబహద్దరు

కాళిదాసచరిత్రము—పులవర్తి అన్నపూర్ణయ్యశాస్త్రి

పూలదండ (ప్రథమభాగము)— శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి

పోలిస్వర్గము—మూల సుబ్రహ్మణ్యం
బాలభక్తులు—యస్. యస్. రామయ్య
భగీరథచరిత్ర—శిష్టా పార్థసారధి
భారతకథావళి—కందుకూరి వీరబసవరాజు
భారతివీరపూజ—డి. యస్. రామారావు
విభీషణుడు—వెంకట నృసింహం
శ్రీరామచంద్రుడు—పి. సుబ్బరామయ్య
శ్రీవేంకటేశ్వర రథచక్రప్రార్థనచరిత్రము—యం. వి. రుద్రయ్యనాయుడు

## ౨. నవల

కమలాక్షి—రాయసం వెంకటశివుడు
కాంచనమాల
చంద్రగుప్త
చిన్నకోడలు
తానీషా—దూబగుంట వెంకటరమణయ్య
పచ్చపుదొంగ—అవసరాల శేషగిరిరావు
ప్రమద—కృష్ణరఘునాథరావు
భారతీభాస్కరము—పోలవరపు రామబ్రహ్మము
భీమణప్రతిహింస—కేతవరపు రామకృష్ణశాస్త్రి
రహస్యభేదనము— ,,
శోభావతి—ఏ. పి. పిగట్టమ్మ
సింహగడము
సీమంతిని—ములుకుట్ల వెంకటకృష్ణశాస్త్రి

## 3. చరిత్ర

ప్రశ్నోత్తర హిందూదేశచరిత్రము—యం. అబ్దుల్ కరీము
హైందవచక్రవర్తుల జీవితములు—కొమర్రాజు లక్ష్మణ
హైదర్ అన్డ్ టిప్పుసుల్తాన్—యం. సీతారామరావు

## ౪. జీవితము

పోకల దమ్మక్కగారిచరిత్రము—రామనరఘుల రామశాస్త్రి
అల్లూరి సీతారామరాజుప్రశంస—భమిడిపాటి సత్యనారాయణ
గౌరాంగస్వామి శ్రీ కృష్ణచైతన్య జీవితము—పి. సీతారామశాస్త్రి
పండిత మదనమోహన మాళవ్యా జీవితము—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
రామకృష్ణ పరమహంసజీవితము—ఓంకారస్వామి
రాక్షసలంకలు—యస్. యస్. మాక్లెలర్
సాధుసుందరసింగు—సాలప్రగ్గి నరసింహం

## ౫. ఇతరములు

అయిదవ గోదావరిమండల సహకారసభ అధ్యక్ష—ఉపాధ్యాయుల సీతారామచంద్రం
అక్షరశిక్ష—జోస్యుల నారాయణమూర్తి
ఆంధ్రపత్రిక పదునారవ సంవత్సరాదిసంచిక
ఆచార్య ప్రఫుల్ల చంద్రరేగారి ఉపన్యాసములు
ఆత్మబలము
ఆరవవాచకము
ఇంగ్లీషువారి సంసారపద్ధతులు
ఉపాధ్యాయుని యోగ్యతలు—ముగిగంటి పార్వతీశం
ఒంగోలు తాలూకాఓటర్లసభ అద్దంకి
ఒకచిన్నకోడిపెట్ట మొదలైన సంగతులు I-వ తరగతి పుస్తకము—యస్. మాక్యులేయి
కాశీమాహాత్మ్యము—గానకొండ అన్నయ్యశాస్త్రి
గాంధిసేవుసే
గ్రంథాలయసర్వస్వము
తెలుగు అనువాదము-ప్రచారక బంధు
తెలుగు ప్రారంభముచేయువారి కొరకైన ఉపాధ్యాయబోధిని—గూడ్రిచ్ స్టోర్జు ఛార్లస్
ఠాకూర్ హరనాథ బాబాగారి ౫౪-వ జన్మోత్సవము
ద్వితీయాంధ్రనటసభ—పెద్దిభట్ల వెంకటచలపతిరావు
నరసారావుపేట తాలూకాఓటర్లసభ—చిలుకలూరిపేట
నాల్గవవాచకము—కె. వీరేశలింగం పంతులు
నీతికథామంజరి—డి. యస్. రావు
ప్రకృతిబోధకవాచకము అయిదవపుస్తకము—వి. కృష్ణమాచార్యులు
బాలనీతిచంద్రిక—డి. సీతారామరావు
భక్తకమాలుతీర్థయాత్ర—గుండాల వీరస్వామినాయుడు
భద్రగిరి సీతారామ కల్యాణము—పి. సీతారామానుజాచార్యులు
భద్రాచల రామదాసు కైంకర్యము

మొదటితరగతి క్రొత్త తెలుగువాచకపుస్తకము—
యస్. భూషణమ్
యథార్థభారతి—మళయాళస్వామి
రామాయణకథా కందార్థరత్నములు—తుర్లపాటి అన్న
పూర్ణమ్మ
రెండవవాచకపుస్తకము—యం. వెంకటరత్నం
" క. వీరేశలింగంపంతులు
విద్యామాలిక మూడవ పుస్తకము
విద్యామాలిక రెండవ పుస్తకము
పులివెందుల యుపాధ్యాయసంఘపు వ్యాసములు
వేదోక్త మూల స్తంభనము
సన్మార్గసద్బోధిని—వి. రామరాజు
శ్రీసర్వరత్న భాండాగారము పాకశాస్త్రసహితము

## నాటకములు

అర్జునప్రతిజ్ఞ—ప్రతాప వెంకటేశ్వరకవి
కాంతామతి—గూడూరి కోటేశ్వరరావు
కుశలవ పట్టాభిషేకము—రామనారాయణకవులు
గాలవఋషినాటకము లేక చిత్రసేనోపాఖ్యానము—
డి. వెంకటరమణయ్య
చిత్రనళీయము—చక్రావధానుల మాణిక్యశర్మ
జయంతజయపాలము
జారవిలాపము—హనుమంతనర్సుల జగన్నాథశర్మ
తులసీదేవి—ముత్తనేని వెంకటచెన్న కేశవులు
ద్రౌపదీవస్త్రాపహరణము—సోమరాజు రామానుజరావు
భక్తతుకారాము—త్యాడి వెంకటశాస్త్రి
మనోరమ అను జూమిలియా నాటకము—పొన్నలూరి
సూర్యనారాయణశర్మ
మహానంద—బద్దిరెడ్డి కోటేశ్వరరావు
యమగర్వభంగము అను మార్కండేయనాటకము—కేతవ
రపు రామకృష్ణశాస్త్రి
రాజసూయము—సండేల్రాడి శ్రీహరిరావు
రాధాకృష్ణ—నాటకసరస్వతి సీతారామ
లలిత చంద్రహాస నాటకము — అప్పాల వీరవెంకట
జోగయ్యశాస్త్రి
వరవిక్రయము—కాళ్లకూరి నారాయణరావు
వీరప్రతాప్—ఆవటపల్లె హనుమయ్య

శకుంతల—సోమరాజు రామానుజరావు
శ్రీకృష్ణసంజయరాయబారము—పెనుమాక వీరప్ప
సంగీత పద్మవ్యూహము—తాటిపర్తి గోపాలదాసు
సంగీత సావిత్రినాటకము—గరికిపాటి కామేశ్వరరావు
సత్యనారాయణ స్వామినాటకము—యస్. అప్పయ్య
సరస్వతి—పానుగంటి లక్ష్మీనరసింహారావు [కవి
సరోజినీ—భట్టిప్రోలు నిత్యానందకవి
సావిత్రీనాటకము—శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి
సీతాకల్యాణము—రాజశేఖర శతావధాని
సునగ్గసాత్ర

## ప్రహసనములు

తంపులమల్లయ్య—ఆతుకూరి కామేశ్వరరావు
మాయతిత్తి—ఏ. పాపారావు
రాజరంగేళి

## నాట్యకళ

ఆంధ్రనాటక సంస్కరణము
నాట్యోత్పలము
విమర్శక పారిజాతము

## వ్యాకరణము

కావ్యచంద్రిక—యం. డేవిడ్

## జ్యోతిషము

కేరళప్రశ్నలు
క్రోధనజ్యోతిష మార్గదర్శిని—వి. సోమేశ్వరరావు
బృహజ్జాతకము—వరాహమిహిర
ముహూర్తదర్పణము

## గణితము

గణితసంగ్రహము, రెండవభాగము—డి. రామమూర్తి

## వైద్యము

అనుభవగృహవైద్యము—గ్రంధి సుబ్బారాయగుప్త
బాహటము అను అష్టాంగహృదయము
బైరాగి చిటికెలు
మాతృబోధిని—లాసన్
మిక్సారరసము
వస్తుగుణదీపిక—యర్రా వెంకటస్వామి

విచిత్రగృహము
సర్వసూక్తికా యోగమంజరి—కందుల లక్ష్మీపతి

## మతము

అప్పంకి తిరుమలవారి తనియనులు
ఆచార్య హృదయము
ఆశ్వలాయనోపనయనప్రయోగము
గురుపరంపర తనియనులు
బ్రాహ్మణుల మతగౌరవము
ముక్తకశ్లోక ముక్తావళిః
వింజమూరివారి గురుపరంపర తనియనులు
వీరశైవ వివాహవిధిః
వేదమతము—ఆత్మూరి లక్ష్మీనరసింహసోమయాజి
దైవావలోకనము
వేదపఠనప్రదర్శనము—హెచ్. యఫ్. షాఫర్

## వేదాంతము

అచలగురుశిష్య సంవాదము—పలికర్ల హనుమయ్య
అనుష్ఠానవేదాంతము
ఆంధ్రభగవద్గీత
జీవబ్రహ్మైక్య వేదాంతరహస్యము
జ్ఞానప్రియ—కొండిపర్తి వీరభద్రాచార్యులు
పరతత్వబోధిని—వంగూరి వీరరాఘవకవి
ప్రకృతితత్వ ప్రకాశిక—వి.షణ్ముఖదాసు
మోక్షమార్గ ప్రదీపిక—గంగనపల్లె శంకరరావు

## స్తోత్రము

అంబికాసహిత గురునాథేశ్వరస్తోత్రమాలా—పల్లె పూర్ణప్రజ్ఞాచార్యులు
దండకరత్నావళి—సూర్యప్రకాశరావు
నారాయణానందలహరి—అల్లమరాజు రంగశాయికవి
భజగోవింద శ్లోకములు
భారతి—విక్రాల నరసింహాచార్య
మహాయోగము—పొత్తూరి రామరాజయోగి
మీనాక్షీదండకము—ములుగు చంద్రమౌళీశ్వరశాస్త్రి
ముత్యాలమ్మవారి దండకత్రయము
రామతారకస్తోత్రరాజము—హెచ్.మల్లికార్జునశాస్త్రి
వీరబ్రహ్మేంద్ర స్తోత్రమంజరి—కే. శరభాచార్యులు
వేంకటేశ్వర స్తోత్రపంచకము
వేదాద్రి పంచ నారసింహ దండకము—యల్. బుచ్చ
శివస్తోత్రములు [య్య
శ్రీ రాఘవతారావళి—దామరాజు రామచంద్రరావు
శ్రీరామమంత్రము
సత్యనారాయణ తారావళి—మహాశివభట్టు బుచ్చిరాట్కవి
సోమేశ్వరస్తవ నక్షత్రమాల—జి. సత్యనారాయణ శాస్త్రి
స్తుతికదంబము—వాడ్రేవు రంగనాయకమ్మ

## మాహాత్మ్యము

గయామాహాత్మ్యము—రావకొండ అన్నయ్యశాస్త్రి
ధనుర్మాసమాహాత్మ్యము
భద్రాచలక్షేత్రమాహాత్మ్యము
శ్రీకూర్మక్షేత్రమాహాత్మ్యము

## సంగీతము-హరికథ

కుశలవవిజయము—బి. బాలాజీదాసు
యోగదేవుచర్య
లక్ష్మణామూర్ఛా విమోచనము—ఆవుల సుబ్బయ్యదాసు
సీతాకల్యాణము—పి. యస్. నాసర్వాంగిబాబు[ర్యులు
సురాభాండేశ్వరము హరికథ—అయ్యంకి వీరబ్రహ్మాచా

## గేయము

అచలఅనుభవవేదాంత తత్వములు—షేక్ హుసేన్‌దాసు
కృష్ణలీలలు—మోగంటి నరసింహదాసు
దశావతారములపాట—బద్దిరెడ్డి కోటీశ్వరరావు
ద్రౌపదీవస్త్రాపహరణములోని కీర్తనలు—పోపట్ల లక్ష్మీకాంతకవి
పద్మావతి వేంకటేశ్వరుల భజనకీర్తనలు—యం. హరిభూషణమునాయుడు
పారిజాతపల్లవి
పెండ్లి గోవిందనామములు
భక్తకర్ణామృతము—పెనుమర్తి సూర్యప్రకాశకవి
భగవన్నామావళిః
భద్రాచల రామనామామృతము



# ప్రయాణము *

**నిడుమోలు కనకసుందరం గారు**

సుహృదులార నేవీడ్కొనుసుసమయమున
నాదుమేల్గోరుఁ డదె యరుణోదయచ్ఛ
రాగభరితంబుగా నంబరంబు మెఱసె!
రామణీయకమయ్యె మార్గంబునాకు!
అడుగకుం "డేటుగొనిపోవ ముడుపులెవ్వి"
యనుచుఁ—గమనోన్ముఖుండ నైనట్టి నాకు
రిక్తములు కేలు, నాశాప్రయుక్తమెడఁద.

మేనఁ గీలింతుఁ గళ్యాణ సూనపంక్తి,
పాంథులపరాగ దూషితాంబరము కాదు
నాధరించినయది. యాతనాధికంబ
యైనను బథంబు, వీతభయంబు మనము!
పొడుచునా సంజరిక్కయుఁ బొదలు సాంధ్య
సమయగేయ విషాదగీతములు, ప్రభుగృ
హాంగణమ్మున నా ప్రయాణాంత మందు

---

* రవీంద్రుని గీతాంజలి 94వ పద్దెమున కనువాదము.



# కలగూర గంప

ఆర్. కృష్ణస్వామి, బి. ఏ.

"టిట్ బిట్స్"(Titbits)పత్రిక యిట్లు వ్రాయుచున్నది:

1. "అమెరికా ఖండమునందలి మెక్సికో దేశమున 'మెగ్వీ' (Megwi) అను నొక వృక్షము న్నది. ఆవృక్షపు పట్టనుండి ప్రత్తి నుండి వచ్చుదారమునకన్న మూడింతలు గట్టిదైనదారము దీయనగును."

2. "ఇంగ్లాండున 'క్లైడ్'బ్యాంకు ప్రాంతమున నొక గొప్ప గోపురము నిర్మింపబడుచున్నది. దానిపేరు 'సింగరు' గోపురము. ఆ గోపురముననాంగ్ల సామ్రాజ్యమునం దెచ్చటను గానరానంత గొప్ప గడియారము నిముడ్చుటకు బ్రయత్నములు జరుగుచున్నవి. ఆగడియారముయొక్క నడిమికొలతమాత్రము 26 అడుగులు. ఇది 'గ్రీనిచి'నుండినడపింపబడును.

3. "నూతనముగా నొకరొట్టెలు చేయు యంత్రము బయలు వెడలినది. ఈయంత్ర సహాయమున7నిమిషములలో 470 రొట్టెలుతయారు చేయవచ్చును. ఈపనినే నూర్గురు-మనుష్యులు చేయుచుందురు."

4. "ఇంగ్లాండున కత్తులు చేయుటయందు ప్రసిద్ధికెక్కిన షెఫీల్డు (Sheffield)లో నొక పేనాకత్తి తయారుచేయబడి యున్నది. ఈ కత్తియందు 1151 అలుగులు ఇముడ్చబడి యున్నవి."

5. "సైబీరియాదేశమునందలి యతిశీతల ప్రదేశములందు మేఘశూన్యమైన యాకసమున నొక యింద్రధనస్సు పొడసూపిన నది మాయక పగలు సంధ్యంగంటల కాలము నిలిచియుండును."

క్రైస్తవ ప్రపంచమున యువతీయువకులు తమ కొండొరులపై గలయనురాగమును బహిరంగముగ బహిరంగ స్థలములలో వెలిపుచ్చుట పురాతనకాలపు 'ఈస్టరు'ఉత్సవ పద్ధతి. ఈ పద్ధతి నేటికిని ఇంగ్లాండున చాలచోట్ల వాడుకలోనున్నది. ఈయుత్సవానంతరము మొదటిమంగళవారమునాడు వీథుల లోను నేయువతినైనను యువకులు నిరాటంకముగ ముద్దిడనచ్చును."

* * * *

"టైమ్సు ఆఫ్ ఇండియా" (Times of India) పత్రిక యిట్లు వ్రాయుచున్నది:

1. "పున్నమనాటిచంద్రుని వేడిమి 250 గజములదూరమున వెలుగుచుండు మైనపువత్తిదీపపు వేడిమికి సమానము."

"హాలెండు దేశమున మిస్ క్యాటీవాన్ డైక్ అనునొకస్త్రీ కలదు; ఆమె కన్నియ. ఆమెవయసు 21 సంవత్సరములు; కాని యామె యాకారము రాక్షసాకృతిమె. ఆమె 7 అడుగులు, 11 అంగుళములపొడవై 350 పౌనుల బరువుగలిగియుండును. ఈయువతికు యుక్తవర

నిశ్చయముకూడ నైనది. తనకు ఈడుజోడయి 9 అడుగులు, 3½ అంగుళములపొడవై యుండు పురుషుని మోహించి పెండ్లియాడ నెంచి యున్నది."

3. 'కెంటుకీ'యందలి 'నికోలసుకౌంటీ'లో మెరిడిత్ స్టాన్లీ టేలర్ (Meredith Stanley Taylor) అను పేరుగలిగిన యొకబిడ్డ యున్నది. ఆబిడ్డవయసు 3సంవత్సరములు. ఆమెతూకము 110 పౌనులు.

* * * *

3. "మాడెర్న్ రివ్యూ" (MOdern Review) లోనిట్లున్నది:

"స్పెయినుదేశమున హిల్డిగార్డు ఫర్నాండెస్ కార్బలైరా (Hildeguard Fernandez Carbaleira) అను నొక బాలిక కలదు. ఆమెకిపుడు పదునొకండుసంవత్సరములు. ఏడుసంవత్సరముల బాలికయై యున్నపుడె విశ్వవిద్యాలయమున మెట్రికులేషను పరీక్షయందు కృతార్థురాలాయెను. ఇప్పుడు బి. ఏ. పట్టపరీక్షకు మూడు శాస్త్రములను పూర్తిచేసినది. ఇంకను చంటిబిడ్డయై యుండు నపుడె, తన పదునొకండవ మాసమున నీమె స్వేచ్ఛగ చదువగలిగి యుండెను. ఆమె వివిధభాషలయందు కడునేర్పరి. పియానాను మిగుల నేర్పుతో వాయించును. ఇట్టి యపూర్వబుద్ధికౌశలమునకు ఆమె రాచమన్ననల బడయుచున్నది."

2. "హిందూదేశములందలి శాసనసభలింకను "వయోనిర్ణయ" శాసన విషయమున పురుషుని పొందుటకు చట్ట నిబంధనలకు తగునట్లు స్త్రీయొక్క యొప్పుదల వయసును పండ్రెండునుండి పదుమూటికి హెచ్చింతుమా, లేక పదుమూటినుండి పదునాలుగునకు హెచ్చింపనగునాయని సంశయించుచు వాదులాడుచుండ గుజరాతునందలి మోర్వి (Mourvi) సంస్థానాధీశుడు, తన రాజ్యమున వయోనిర్ణయమును పదునారు సంవత్సరములుగ జేయుటకుసాహసించెను; అందు నిమిత్తమై యొక నూతన చట్టమును ప్రకటించెను. ప్రజాభిప్రాయము ప్రతికూలముగనుండినను కొంకక వీరు తమ యభీష్టమును నెరవేర్చికొనిరి."

* * *

౪. "జాగ్రాఫికలు రివ్యూ" (Geographical Review) అను పత్రిక ఇట్లు వ్రాయుచున్నది:

ఉత్తరఅమెరికాఖండమున నుండు న్యూమెక్సికో రాజ్యము ప్రకృతి విచిత్రముల కునికిపట్టు. ఈరాజ్యమునకు సంబంధించి పడమరగ 50 మైళ్ల దూరమున కొంత కొండ ప్రదేశము కలదు. అచ్చట మానవస్పర్శ లేకయే ప్రకృతినిర్మితమైన మంచుగుహ యొకటికలదు. ఈగుహయొక్క పొడవు 50 అడుగులు ఎత్తు 14 అడుగులు. దీనిని నలుప్రక్కలను ఆవరించి యుండునది బలమైన మంచుగోడయే. ఈమంచుగోడ నీలవర్ణముగ నుండును; ఇది పొరలుపొరలుగ నున్నది. ఒక పొర యేర్పడుటకు ఒకసంవత్సరము పట్టును. కాన నీగుహకు, ఎన్నిమంచుపొర లున్నవో అన్ని యేండ్లవయస్సని శాస్త్రజ్ఞులు తలంచుచున్నారు.

* * * *

౫. "పబ్లిక్ ఒపినియన్" (Public Opinion) అను పత్రిక ఇట్లు వ్రాయుచున్నది:

"బ్రిటిషువారు అమెరికా దేశమునకు బాకీపడియుండు విషయమై కామన్సుసభలో

ప్రసంగించుచు నింగ్లాండువారు మూడు పురుషాంతరములవఱకు (అనగా 60 సంవత్సరములు) దినమునకు ఒకలక్షసవరనుల చొప్పున అమెరికావారికి చెల్లించవలయు నని బ్రిటిషు మంత్రాంగసభ్యు లగు చర్చిల్ మహాశయులు నుడివిరి.

*　*　*　*

౬. "కరెంట్ హిస్టరీ" (Current History) అను పత్రిక యిట్లు వ్రాయుచున్నది:

"1925వ సంవత్సరమునకు లాయిడ్‌గారి రిజిస్టరుప్రకారము, ప్రపంచమునందలి ముఖ్య దేశము లన్నియు మొత్తముమీద 855 వ్యాపారపు ఓడలను తయారు చేసినవి. వీనియందు చాలభాగము ఇంగ్లాండు దేశమునకే సంబంధించి యున్నది!



# శ్రీరామనవమి

(కృష్ణభక్తుఁడు)

అమల సత్కవితా శాఖ నధివసించి,
గోము చెన్నారఁగా రామరామయనెడు
అమృత మధుర త్వదీయ నామాక్షరములఁ
గూజితము సేసి, వాల్మీకి కోకిలమ్ము
జన్మరహితమ్ముగాఁగ మోక్షమ్ము వడసె;
మఱియు నెందఱో సత్కవుల్ మహితమతులు
నిన్నె కీర్తించి, వాసియు వన్నెఁగనిరి;
ఇట్టి కరుణాబ్ధివౌట, లోకైకనాథ!
యుష్మదవతార దివ్యమహోత్సవమున,
భావ మానందరస వార్ధిఁ బారమెద్దు,
స్వామి! యొక కోర్కె నినువేఁడ సాహసింతు;
అడుగ సంపద; స్వర్గమ్ము నడుగఁ బోను;
ఆసపడ జన్మ మోక్షాదు లడిగి విసిగింప;
ఇచ్చ యొక్కటె; పను సెఱుఁగ నిచ్చకొనెద;
చిన్ని యీ వంశనాళమ్ము చిత్తగించి,
దుష్టకలుషమ్ము లెల్లను దొలఁచివైచి,
హెచ్చు తేటని కాంతుల నెసక మెసఁగఁ,
గూర్మి నిద్దాని నీ పెదవిఁ గ్రోవిఁజేసి,
హాయిమీఱంగ, నుఱుసు పోనట్టినేళ్ళ,
నిచ్చ వచ్చినరీతి, వాయించుకొనుము;
అరిది నీమోవి తాఁకు మోహమున మునిఁగి,
కమ్మ లేయూర్పు వలపు నాళమ్ము నిండ,
గానపూరమ్ములోన లోకమ్ము గరఁగు
మురళి యానంద, మదియె నామోహవాంఛ!

# గ్రంథస్వీకారము

ఈ క్రింద చేర్కొనిన గ్రంథములను వందనములతో నందుకొంటిమి:

౧. మంగతాయి—(ఏకాంకనాటకము) గ్రంథకర్త: శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు, జగన్నాథపురము, కాకినాడ. ఇందలి ఇతివృత్తము "మానసంబునుబట్టి పిప్పిచేయుచున్న దుర్వ్యసనములలో నగ్రగణ్యమైన వేశ్యాటనమునుండి నష్టములను సువ్యక్తము చేయున"దని శ్రీ శాస్త్రిగారి పీఠికయందు గలదు. వెల రు ౧-౦-౦. పుస్తకము గ్రంథకర్తగారియొద్దనే దొరకును.

౨. శివపురాణము (మహాదేవసంపుటము) వచనము—పురాణగ్రంథమాలికకు మహాదేవకుసుమము. ఇది పిఠాపురమున పురాణగ్రంథమాలికా సంపాదకులగు శ్రీ నడకుదుటి వీరరాజు పంతులుగారికడ దొరకును.

౩. (ఏ.) భారతీభాస్కరము—సాంఘికనవల—గ్రంథకర్త:—పోలవరపు రామబ్రహ్మము గారు, బి. ఏ, వెల రు ౧-౮-౦.

(బి.) భూతగృహము—(డిటెక్టివు నవల) భాగము ౧. గ్రంథకర్త: శ్రీ జి. సుబ్రహ్మణ్యశర్మగారు. [ప్రకాశకులు: శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు, ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము, కాకినాడ.

౪. ఉద్భటారాధ్యచరిత్రము, (ప్రబంధము)—గ్రంథకర్త: తెనాలి రామలింగకవి (పాండురంగమాహాత్మ్యకర్త). ప్రకాశకులు శ్రీ ముదిగొండ బసవయ్యశాస్త్రిగారు, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల రు. ౦-౧౨-౦.

౫. ఆంధ్ర గద్యవాఙ్మయచరిత్ర—గ్రంథకర్త: శ్రీయుత గొబ్బూరు వెంకటానందరాఘవరావుగారు, ప్లీడరు, యాలమంచిలి. వెల రు. ౧-౯-౦.

౬. భాషోత్పత్తిక్రమము — భాషాచరిత్రము—రచయిత: శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు, యమ్. ఏ., అధ్యాపకులు, మహారాజాకళాశాల, విజయనగరము. రచయితగారు ౧౯౨౫ సంవత్సరము తణుకులో జరిగిన ఆంధ్రసాహిత్యపరిషత్సభలో చదివిన వ్యాస మిది. వెల రు. ౦-౮-౦.

౭. సంస్కరణకథావల్లరి (ప్రథమభాగము)—మరంగంటి పార్థసారథి, బి. ఏ., గారు దీనిని రచియించిరి. ప్రకాశకులు డాక్టరు మరంగంటి శేషాచార్యులుగారు, యల్. యమ్. యస్., మేనేజరు, ఆంధ్రభాషాసేవకసంఘము, గొడుగుపేట, మచిలీపట్టణము.

౮. కమలావతి—ఒక చిన్న సాంఘికనవల. దీనిని శ్రీమతి దేశిరాజు లక్ష్మీనరసమ్మగారు రచియించిరి. ప్రకాశకులు శ్రీ రామవిలాసగ్రంథమాలవారు, చిత్రాడ, పిఠాపురముపోస్టు. వెల రు. ౦-౧౦-౦.

౯. శ్రీ కృష్ణదేవరాయ పూర్వదిగ్విజయము (అయిదంకముల నాటకము)—గ్రంథకర్త: శ్రీ మండ కృష్ణమూర్తిగారు. ప్రకాశకులు: దస్తాల నారాయణరావుగారు, సెక్రెటెరి, ఆంధ్రసేవాసంఘము, నరిసిపట్ణము, విశాఖపట్టణముజిల్లా. వెల రు. ౧-౦-౦

౧౦. (ఏ) హిందీ తెలుగు స్వబోధిని—గ్రంథకర్త: శ్రీ. హృషీకేశశర్మగారు (మూడవ ముద్రణము.) వెల రు. ౦-౧౨-౦

(బి) హిందీ తెలుగు అనువాదమాల—కర్త: "హిందీప్రచారకబంధు"వటు. వెల రు. ౦-౬-౦

(సి) హిందీ తెలుగు వ్యాకరణము—గ్రంథకర్త: శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారు. వెల రు. ౦-౧౪-౦

(డి) హిందీ తెలుగుకోశము—గ్రంథకర్త: శ్రీ. జంధ్యాల శివన్నశాస్త్రిగారు. వెల రు. ౨-౮-౦

(ఇ) తెలుగు హిందీకోశము—గ్రంథకర్త: శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రిగారు. వెల రు. ౧-౦-౦

ప్రకాశకులు: హిందీసాహిత్యసమ్మేలన ప్రచారకార్యాలయము, తిరువల్లిక్కేణి, మద్రాసు.

౧౧. అన్నపూర్ణ (సాంఘికనవల)—గ్రంథకర్త: బ్రహ్మశ్రీ, పండిత పురాణం సూర్యనారాయణ తీర్థులుగారు. ప్రకాశకులు: కనుపర్తి మార్కండేయ శర్మగారు, "స్వధర్మప్రకాశిని" కీల్ పాకు, మద్రాసు.




భారతభూమి పరాధీనదేశములకు సహజమైన దుఃఖవేదన ననుభవించుచున్నది. స్వదేశపరిపాలనమునందు బాధ్యతలేని ప్రజలు దుఃఖవేదన ననుభవించుట సహజము. విదేశపరిపాలనము బాహ్యాడంబరములందు సంభ్రమమును గలుగజేయుచు నాత్మహత్యకు సాధనం బగుచున్నది. పరాధీనత ఆత్మవిశ్వాసమును నిర్మూలము చేసినది. స్వయంసహాయమును దుర్లభము చేసినది. ప్రభుత్వావలంబనము సకల వ్యవహారములందును నవసరమైనది. ప్రభుత్వావలంబన మంతఃకలహములను, నంతర్విభేదములను, నిర్లేపత్వమును వృద్ధిచేయుచున్నది. అధికార కటాక్ష మంతఃకలహములను వృద్ధిచేయు చున్నది. నాయకులు దేశప్రయోజనములను విస్మరించి సంఘప్రయోజనములను, పక్షప్రయోజనములనునారాధించుచుమహాసంక్షోభమునుగలుగజేయుచున్నారు. ఉద్యోగములు, పదవులు, గౌరవములునాయకులను అనుచరులను ఆకర్షించిన విధమున నిరాడంబరమైన ప్రజాసేవ యాకర్షింప జాలకున్నది. ఉద్యోగ గౌరవాధికార లాభములు ప్రజలను పశువులనువలె కలహములకు బురికొల్పుచున్నవి. రాజ్యాంగసంస్కరణము లీ దుస్థితిని నూరురెట్లు వృద్ధిచేసినవి. నోరెంచిన నాగరిక వేషములవలె సంస్కారణములు ప్రజలకు సంక్షోభమును గలుగజేసినవి. స్థానికసంస్థలయందును శాసనసభలయందును నిత్యజీవనమునందును సహకార కాంక్ష విజృంభించి అంతఃకలహములుసహజావస్థగను బరిణమించినవి.

వివిధసంఘములందు సంఘారాధనము, దేశారాధనస్థానము నాక్రమించినది. హిందూ మహమ్మదీయ విభేదములు, బ్రాహ్మణ బ్రాహ్మణేతర విభేదములు దేశము నందంతటను వ్యాపించినవి. ప్రజాదృష్టి మహత్తరమైన దేశీయమహాసభనుండి మరలిసామాన్యములైన శాఖాసభలయందు లగ్నమగుచున్నది. హిందూమహమ్మదీయ మహాసభలు విజృంభించుచున్నవి. ఆమహాసభలకు దోడుగను బ్రాహ్మణ క్షత్రియ వైశ్య కాపు కమ్మ దేవాంగ నాయి పంచమాది కులసభలువిజృంభించుచున్నవి. కులసభలు, మతసభలు, పక్షసభలు దేశమునావరించినవి. ప్రజలదృష్టివిశాలమైన దేశప్రయోజనములనుండిమరలి సంకుచితములైన స్వప్రయోజనములందులగ్నమైదేశస్థితి దుర్భరమగుచున్నది. నిరంకుశ ప్రభుత్వమున కీదుర్దశ యాహ్లాదకరముగనున్నది. శాంతికి విదేశీయులును కల్లోలములకు స్వదేశీయు

లును కారణభూతులుగను నిర్ణయించుచు విభేదములకుమూలమైన విదేశప్రభుత్వమును శాశ్వతము చేయుచున్నారు. పరమానర్థములకు మూలమైన విభేదము లంతరించి దేశమునకు శాంతిసౌఖ్యములు గలుగగలసాధనము దుర్లభముగ గనుపడుచున్నది.

*　*　*　*

కలకత్తా యల్లరులు

గతమాసమునందు కలకత్తాయందు సంప్రాప్తమైన ఘోరకార్యములు భారతీయులదుర్దశను విశదము చేయుచున్నవి. మహానగరమైన కలకత్తాయందు నిరపరాధులు నిర్హేతుకముగను ప్రాణములను గోల్పోయిరి. ప్రజలు హింసలకు పాలైరి. దోపిడీలుజరిగినవి. వ్యాపారము నిలిచినది. రాకపోక లాగినవి. నగరజీవితమంతయును స్తంభించినది. హిందూమహమ్మదీయ క్రూరకార్యములకు కారకులు హిందువులైనను, మహమ్మదీయులైనను మహాపరాధమును జేసి నింద్యార్హు లగుచున్నారు. దురాత్మార్గులను రేగగొట్టుట సులభము, గాని శాంతింపజేయుట సులభము గాదు. కలహబీజములకు సంఘటననాయకులుగారకులైనను, మాల్వీలు గారకులైనను దుష్ఫలమును దేశమంతయును ననుభవించుచున్నది. ఢిల్లీనగరమునందు జరిగిన బీభత్సము కలకత్తాయందు జరిగినది. కలకత్తానుండి యితర ప్రాంతములకు వ్యాపించుచున్నది. ఏమూల నేవేళ కలహ జ్వాలలు రగులునో తెలియకున్నది.

అల్లరులు నిరంకుశాధికారారాధకులకు నిర్బంధవిధానసమర్థనమున కాధారములను గలుగజేయుచున్నవి. సర్ మైకెలు ఓడ్వ్వయరు మామూలుపాటను పాడుచు నిరంకుశత్వమును సమర్థించుచున్నాడు. ఆంగ్ల-ఇండియను పత్రికలు ఓడ్వ్వయరు పల్లవినే పాడుచున్నవి. అల్లరులకు ప్రజలును, శాంతికి నిరంకుశాధికారులును బాధ్యు లనుట యాచారమైనది. ఈసిద్ధాంతమునంగీకరించినను కలకత్తాయం దల్లరుల నాపుటకు వంగప్రభుత్వము చూపిన నిర్లక్ష్యభావము ప్రభుత్వహృదయమును విశదము చేయుచున్నది. కలకత్తా రక్తపాతముచే పరితపించుచున్నను లిట్టనుప్రభువు డార్జిలింగు కొండలమీదను సంచలనములేకను చల్లగాలి ననుభవించుట ప్రభుత్వలక్ష్యమునకు నిదర్శనము. కలకత్తా రక్షకభటులును గవర్నరుమార్గము నవలంబించుట సహజము. ఇట్టి పరిస్థితులందు ప్రజలు లిట్టనుప్రభువుయొక్క నిర్గమనమును గోరుట సహజము. కార్యకారణసంబంధము లెటులున్నను నధికారు లుదాసీనభావమును బూనినను సాంఘిక కలహముల నంతరింపజేయవలసిన భారము ప్రజలమీదనె కలదు. వర్తమాన విషమదశయందు పరాధీనస్థితియందు వివిధ సంఘముల సంయోగమే స్వరాజ్య సంపాదనమునకును దేశకళ్యాణమునకును రాజమార్గము. ఈరాజమార్గమును సాధించుటకు త్యాగము వలె లాభము సాధనముగాదు. గాంధిమహాత్ము డనవరతము బోధించునటులు హిందువులు త్యాగ పరాయణులై సాంఘిక కలహముల నాపుటధర్మము. సాంఘికసంయోగము, పక్షముల సంయోగము రాజ్యాంగ బలమునకును

స్వరాజ్య సంపాదనమునకును ముఖ్య సాధనము.

*    *    *    *

**రాజ్యాంగపక్షములు**

పరాధీనరాజ్యములందు రాజ్యాంగపక్షముల కవకాశము లేదని ప్రపంచచరిత్రమును నిత్యానుభవమును విశదము చేయుచున్నను మమకారాహంకారములు వివిధపక్షముల నిర్మాణమునకు గారణంబు లగుచున్నవి. పరాధీనదేశములందు ప్రభుత్వపక్షము, ప్రజాపక్షము రెండుపక్షములు మాత్ర ముండుట కవకాశములు గలవు. భరతవర్షమునందు ప్రజాపక్షమును భారత జాతీయమహాసభ వహించుచున్నది. ఇతరపక్షము లన్నియును మమకారాహంకారములకుగురియగుచున్నవి. జాతీయపక్షము, లిబరలుపక్షము, హోము రూలుపక్షము, జస్టిసుపక్షము, హిందూ పక్షము, మహమ్మదీయపక్షము,యూరపియను పక్షము మొదలగు పక్షములన్నియును దేశక్షేమమునకు ప్రతిబంధకములుగాని సాధకములు గావని గత కాలానుభవము విశదము చేయుచున్నను నాయకులందు జ్ఞానోదయము గలుగలేదు.ఈపక్షములకుదోడుగనుకాంగ్రెసు నందునుమూడుపక్షము లేర్పడినవి.బహిష్కారపక్షము, స్వరాజ్యపక్షము, సమయోచిత స్వరాజ్యపక్షము. బహిష్కార పక్షమునకును స్వరాజ్యపక్షమునకునుసంప్రాప్తమైన సంరంభమిపుడుమూడుపక్షములకు వ్యాపించినది.

అసహాయయోగము నిర్ణయించిన బహిష్కారధర్మము నగ్రాగ్రమునుండి దొరలునపు డెచటనిలువగలదో నిర్ణయించుట దుస్తరము. ఢిల్లీకాంగ్రెసు యొడంబడికకును, సబర్మతి యొడంబడికకును గల యంతరము మహత్తరము. సహకారయోగము నారాధించుచు నసహాయయోగ గీతమును బాడుట యధర్మము. ఈయోగాభ్యాసము కేవల మాత్మవంచనముగ నున్నది. కేల్కారుగారు యథోచిత సహకారయోగమున కధికారస్వీకారము ఫలమని చాటుచున్నపుడు నెహ్రూగారి సమర్థనము నిరర్థకము. దేశబంధు చిత్తరంజనదాసు గారుద్వంద్వప్రభుత్వమును నాశనముచేయుట స్వరాజ్యపక్షాశయమునుగనుస్వీకరించిరి. వారి స్థానము నాక్రమించుచు స్వరాజ్యపక్షనాయకత్వము వహించుచున్న నెహ్రూగారును నీసిద్ధాంతము నారాధించుట ధర్మము. యథోచిత సహకారపక్షము, జాతీయపక్షము నెహ్రూగారికి భయభ్రాంతులను గలుగజేసి వారిని సబర్మతి యొడంబడికకును, ద్వంద్వప్రభుత్వారాధనమునకునుబలికొలిపినవి. అంగీకారము, ప్రవేశము,సహకారము,ఉద్యోగస్వీకారము స్వరాజ్యపక్షముపూనినకార్యవిధానమునకుక్రమఫలములు.నెహ్రూగారి సంకల్పమీయంతరములకు ప్రతికూలమైనను కేల్కారుగారి సంకల్పము ప్రతికూలముగాదు. అసహాయ యోగమునకును,సహాయయోగమునకును నంతరములు సాధ్యముగావు.కపటోపాయములను విరమించి పూర్వవిధానము నవలంబించుట యుచితము గాని చెప్పునది యొకటియును చేయునది మఱొకటియును యుక్తముగాదు. సహకారమార్గము నవలంబించుటకు ప్రభుత్వ విధాన

మునందు మార్పు గలుగలేదు. అసహాయ యోగారాధనమును జేయుటకు నాయకులకును ప్రజలకును నలసటగలిగి శక్తి చాలకున్నది. దీనిని గ్రహించి చేయగలపనిని కాంగ్రెసు ముఖముననను చేయుట యుక్తముగాని పక్షములు వ్యక్తులు వారివారి యిష్టానుసారముగను కాంగ్రెసు సిద్ధాంతములకు వ్యాఖ్యానముచేసి కార్యవిధానమును నిర్ణయించుట సమంజసముగాదు.

సబర్మతి యందు గూడిన యన్ని పక్షముల వారును గలిసి అసహాయయోగమునకు పదచ్యుతిని గలుగ జేయగలరు గాని స్వరాజ్యమున కవసరమైన సాధనవిధానమును నిర్ణయింప జాలరు. రీడింగు బర్కేను హెడు ప్రభువులు కోరిన సహకారమును కాంగ్రెసు అంగీకరించినను రాజ్యాంగరథమెప్పటివలెను నిరంకుశాధికారుల ప్రాజాపత్యముక్రింద సాగుచుండును గాని భారతీయుల ప్రాజాపత్యముక్రిందను సాగజాలదు. కాంగ్రెసు విధానమును ప్రత్యేక కాంగ్రెసును జరిపిగాని అస్సాముకాంగ్రెసునందును గాని మార్చుట శ్రేయస్కరము గాని వ్యక్తుల యిచ్ఛానుసారముగను మార్చుట శ్రేయస్కరము గాదు. కాంగ్రెసు విధానమునందు మార్పును గోరెడివారు కాంగ్రెసునందు జేరి వారివారి బలానుసారముగను మార్పులనుజేయుట ధర్మముగాని వెలుపలనుండి మార్పులను జేయగోరుట ధర్మము గాదు. వివిధ పక్షములును వారిపక్షధర్మసూత్రములను సంరక్షించుకొనుచు కాంగ్రెసు ధర్మసూత్రములనుమాత్రము నాశనముచేయగోరుట భారత రాజ్యాంగపక్షముల దుస్థితిని విశదము చేయుచున్నది. సబర్మతిసమావేశపు ఫలము రాజ్యాంగపక్షములదుర్బలము విశదము చేయుచున్నది. వివిధపక్షముల సంయోగ సాధనములను నిర్ణయించుటకును, సబర్మతి యొడంబడికను సమర్థించుటకును, హిందూ మహమ్మదీయ సమస్యను నిర్ణయించుటకును ప్రత్యేక కాంగ్రెసును సమావేశము చేయుట యవసరమని తోచుచున్నది. సబర్మతి సమావేశము ప్రత్యేక కాంగ్రెసు సమావేశమును నిరాకరించినది. భావికర్తవ్యము సందిగ్ధస్థితియందున్నది. యథోచిత సహకారుల హృదయము వ్యక్తమైనది. పండిత మోతీలాలు నెహ్రూగారి సంభ్రమము తొలగినది. కేల్కారు జయకరువర్గము కార్యనిర్వాహకసంఘమునందు పాల్గొనుటకు సయితము నిరాకరించినది. రెండుపక్షముల నాయకులును నొడంబడిక కొండొరు లపార్థము చేసినటులు నిర్ణయించిరి. కేల్కారు జయకరువర్గ మొడంబడికయందు స్వల్పములైన మార్పుల నైనను జేయుటకు నిరాకరించిరి. నెహ్రూగారు చేయునదిలేకను వారి పొరబాటును నంగీకరించిరి. అఖిలభారత జాతీయోపసంఘ సమావేశము నెహ్రూగారికి వందనములతో నంతము నొందినది. సభ్యులు సబర్మతియాత్రను సేవించి స్వస్థలములకు మరలిపోయిరి. నెహ్రూగారును సరోజినిదేవిగారును నీసమావేశమును జేయుటయందు విచక్షణను జూపకుండుట శోచనీయము. మోతిలాలు నెహ్రూగారు దేశబంధు దాసుగారి మార్గము నవలంబించి కాంగ్రెసు

ప్రతిభను గాపాడినందులకు వంద్యులు. జయకరు కేల్కారువర్గపు బెదరింపులను లక్ష్యము చేయకను కాంగ్రెసునాయకులు స్వధర్మనిర్వహణమును జేసి ప్రజావిశ్వాసమును సంరక్షించుట వర్తమానపరిస్థితులందు శుభావహముగ నున్నది.

* * * *

దక్షిణాఫ్రికాసమస్య

దక్షిణాఫ్రికా ప్రభుత్వము భారతీయుల స్థితిగతులను నిర్ణయించుట కుభయరాజ్యములును కలిసి సలహాసంఘమును నియమించుట కంగీకరించినది. ఈవార్త సంతృప్తికరమైనను ఫలము సంతృప్తిని గలుగజేయుట సులభము గాదు. యూరపియనుల జీవయాత్రకును భారతీయుల జీవయాత్రకును నేకమానమును నిర్ణయించుట సాధ్యముగాదు. రెండుజాతులకును సంఘజీవనమునందును భోజనపానీయ విహారములందును భేదము గలదు. రెండుజాతులకును నీవిషయములం దేకప్రమాణమును గల్పించుట సాధ్యముగాదు. సాధ్యమైనను ప్రయోజనకరముగాదు. ప్రవర్తనమునందును పారిశుద్ధ్యము నందును ప్రమాణమును గల్పించుట సాధ్యము. ప్రమాణనిర్ణయమును జేయుటకు గాంధిమహాత్ముడు, శ్రీనివాస శాస్త్రిగారు, ఆండ్రూసు మహాశయుడువంటి ధర్మాత్ములు సమర్థులు గాని రాజ్యాంగ ప్రవర్తకులు సమర్థులుగారు. దక్షిణాఫ్రికా సమస్యనీస్థితికి దెచ్చుటకు ముఖ్యుడైన ఆండ్రూసుమహాశయు డుభయరాజ్యముల కృతజ్ఞతకును పాత్రుడు. అత్యంతసహనముతో ప్రవర్తించిన పాడిసనుకమిషను సయుక్తము ప్రశంసలకు బాత్రముగనున్నది. ఇంతటితో భారతీయసమస్య గట్టెక్కినదని యూహించుట కవకాశములేదని ఆండ్రూసుగారు తెలిపిన యభిప్రాయములు విశదము చేయుచున్నవి. దక్షిణాఫ్రికా ప్రభుత్వమేవిధమునైనను భారతీయులను వెడలగొట్టుటకు సంకల్పించినది. భారతీయుల హక్కులను గాపాడుటకు ప్రజావిశ్వాసమునకు పాత్రులైన సమర్థులను నియమించుట భారతప్రభుత్వమునకు ధర్మమై యున్నది. గాంధిమహాత్ముడు, శ్రీనివాసశాస్త్రిగారువంటి ప్రతినిధులను నుపసంఘసభ్యులనుగ నియమించి భారతప్రభుత్వము స్వధర్మనిర్వహణమును జేయునని నమ్ముచున్నాము.

* * * *

ధనబల కార్మికబల సంరంభము

బొగ్గుగనుల పనివారిసమ్మె గ్రేటుబ్రిటనునందు సోమవారమునాడు సమ్మెకట్టును ప్రారంభించుట శోచనీయవిషయముగ నున్నది. బొగ్గుగనులందు యజమానులకును పనివాండ్రకును నాలుగేండ్లనుండియును రగులుచున్న సంరంభము సమ్మెయందు బరిణమించినది. గతించిన రెండేండ్లయందును ప్రభుత్వము యజమానులకు మూడుకోట్ల రూప్యముల ధనసహాయమును జేసి విషమపరిస్థితుల నరికట్టినది. ప్రభుత్వమును, యజమానులును నుపసంఘము చేసిన నిర్ణయములు నాచరణమునందు బెట్టుటకు పూనుకొనలేదు. యజమానులు జీతములను తగ్గింపవలయుననియును పనిచేసెడి కాలమును ఎనిమిదిగంటలకు హెచ్చింపవల

యుననియును పట్టుపట్టిరి. పనివాండ్రు జీతము
ను తగ్గించుట కంగీకరించినను పనికాలమును
హెచ్చించుటకు నిరాకరించిరి. ఉపసంఘ
నివేదిక నాచరణమునందు బెట్టుట ప్రభుత్వ
ధర్మము. అది సాధ్యముగానంతవరకును
యథాప్రకారము వ్యవహారములను జరుపుట
ధర్మము. బాల్డువిను ప్రభుత్వ మిందులకు
భిన్నముగను ప్రవర్తించి ప్రజా విశ్వాసమును
గోల్పోయినది. కన్సర్వేటివు ప్రభుత్వమున
కును గనుల యజమానులకును గల సాను
భూతియే ఈదుస్థితికి గారణము. పార్లమెంటు
నందు ప్రభుత్వాచరణమునకనుకూలురు 308,
ప్రతికూలురు 108 తేలిరి. ఈబలాధార
మునను బాల్డువిను ప్రభుత్వ మీవిపరీతా
చరణమునకు బూనుకొనినది. బాల్డువిను
ప్రభుత్వము రాయబారమును నడుపుటకు
బదులు యజమానులపక్షమును బూని ప్రభు
త్వబలసంపదలను సమ్మెను విధ్వంసముచేయు
టకు వినియోగించుచున్నది. దేశావసర
శాసనమును ప్రకటించినది. ఈయాచరణము
కార్మికులందావేశమును పెంచినది. థామసు
రామ్సే మేక్డొనాల్డుగారల ప్రసంగములు కార్మి
కుల నిశ్చయమును విశదము చేయుచున్నవి.
బొగ్గుగనులపనివాండ్రు 10లక్షల మందియును,
నితరపరిశ్రమలపనివాండ్రు 15లక్షలమందియును
పనులనుచాలించికూర్చున్నారు. ఈసమ్మెవలన
నుగ్రేటుబ్రిటనుకర్బుదములనష్టముసంప్రాప్తము
గానున్నది. ద్రవ్యనష్టముతోపాటు సాంఘిక
విప్లవమునుగలిగిన విచిత్రములేదు. ఇటలీ
యందలి ఫాసిటుతరంగము లింగ్లాండునకును
వ్యాపించినవిధమును దేశపరిస్థితులు విశదము
చేయుచున్నవి. కన్సర్వేటివుప్రభుత్వ మధి
కారబలమును ధనబలమునుజూచి మురియుట
ప్రయోజనకరముగాదు. ప్రభుత్వము యజ
మానులకు పూర్వమువలెనే ధనసహాయ
మునుజేసి వెంటనే పరిశ్రమ పునర్నిర్మాణ
మునకు బూనుకొని దేశమునకు సంప్రాప్తము
గానున్న సంక్షోభమును వెంటనే యరికట్టుట
వివేకము.

* * *

### ఆంధ్రవిశ్వవిద్యాలయము

ఆంధ్రవిశ్వవిద్యాలయోపాధ్యక్షులు
శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డిగారు
చైత్ర శుద్ధ చతుర్దశీ సోమవారము నాడు
ఆంధ్ర విశ్వవిద్యాలయమున కారంభో
త్సవమును జరిపి ఆంధ్రాభ్యుదయము నందు
నూతనాధ్యాయము నారంభించిరి. రెడ్డిగారికి
వివిధసంఘములుచేసిన సత్కారములునువారి
గుణశీలసంకీర్తనములును నుపాధ్యక్ష పదవికి
వారి యర్హతను విశదము చేయుచున్నవి.
ఉపాధ్యక్షులు, ప్రాచ్యప్రతీచీ విద్యావిధానము
లందు విశేషానుభవముగల కార్యదక్షులు.
వారి ప్రసంగములు వారి యుదార సంకల్ప
మును విశదము చేయుచున్నను దేశకాల పరి
స్థితుల నతిక్రమించి నూతన విశ్వవిద్యాలయ
మును నిర్మించుటదుష్కరముగ నున్నది. వర్త
మాన విద్యావిధానమునందు వృద్ధిపొందిన
పాఠశాలలు కళాశాలలు ప్రత్యక్షముగ గను
పడుచున్నవి. వర్తమాన విద్యావిధానమునం
దభిమానముగల విద్యాశాఖాధికారులు మం

త్రులు ప్రతిక్షణమునను ప్రత్యక్షమగుచుందురు. సంకల్పసిద్ధి కవసరమైన సాధనసంపత్తి దుర్లభ ముగనున్నది. విశ్వవిద్యాలయమునకవసరమైన ద్రవ్యము, విజ్ఞానము, కార్యపరత్వము దుర్లభ ముగ నున్నవి. కార్యాలయస్థాపనమున కను కూలమైన భవనము లభించుటయును దుస్తర మైనది. ప్రభుత్వము నియమించిన యుపసంఘ సభ్యులును వర్తమాన విద్యావిధానప్రియులు గను గనుపడుచున్నారు. ఈసందర్భములందు నూతన విశ్వవిద్యాలయనిర్మాణమునకు గల ప్రతికూల వాతావరణము సర్వత్ర ప్రత్యక్ష మగుచున్నను శ్రీయుత రామలింగారెడ్డిగారి ప్రతిభయంతరాయముల నతిక్రమించి ఆంధ్రా భ్యుదయమున కనురూపమైన ఆంధ్రవిశ్వ విద్యాలయమును సార్థకముచేయుటకు దోడ్ప డునని నమ్ముచున్నాము.



# పారవశ్యము

సి. యస్. శ్యామారావు గారు

గున్న లేమావికొమ్మపై గూరుచుండి
కసరుకిసలయమ్ముల మెక్కి కమ్రఫణితిఁ
బంచమస్థాయి హాయిగాఁ బాటఁబాడు
వరవసంతవాసరములఁ బరభృతంబు;

సొబగుబంగరుచాయల సోయగమునఁ
జిరముఁ దనియించు నొకమొక్కజీడిపండుఁ
జేరి, మెక్కుచుఁ గులుకుచుఁ జిత్స్వరమున
నల్లకీరంబు సంగీత మాలపించు;

ప్రకృతివైచిత్రి కుప్పొంగి పరవశుఁడయి
పూవు వికసించుతోడనే తావికూడ
బయలు వెడలుట గనే లోకో పాలువోక
శుకపికాళిక వేటిగా సుకవి పాడు;

తారకును దానియుందలి తళుకునకును
నింగికిని దానిలోనున్న నీలిమకును
అక్షరంబునకును దాని యర్థమునకుఁ
బ్రకృతికిని బరమపురుషభావమునకుఁ;

గల పరస్పరసంబంధ కారణంబు
నరయఁజాలక వెఱ్ఱిగా నహరహంబుఁ
జిందుఁద్రొక్కుచునుండు నాచిత్త మరయ.

Edited and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7. Thambu Chetty Street. G. T Madra


విషయానుక్రమణిక

# చిత్రములు

త్రివర్ణ చిత్రములు:—వేణుగానవినోది.

సాధారణ చిత్రములు:—వెనుకటిసంచికలోని 'రాజగృహము' అను వ్యాసమునకు సంబంధించిన చిత్రములు ౧౩; ఫోటోబహుమానమునకు సంబంధించిన చిత్రములు ౩; ఆంధ్రపరిశోధక విశ్వవిద్యాలయప్రదర్శనము, ౧-౨౬, విజయనగరము; స్వవృద్ధి విద్యార్థి సంఘము, కొజ్జిల్లిపేట, బందరు; ఇతర చిత్రములును.






చెన్నపట్టణము జూన్ ౧౯౨౬

సంపుటము 3 అక్షయ సంవత్సరము జ్యేష్ఠమాసము సంఖ్య ౬


# దివ్యబోధ

[కేనోపనిషద్గ్రథితము]


పెనుమర్తి వెంకటరత్నము గారు


౧

అప్పుడు జరిగిన దేవాసురాహవమున, బ్రహ్మకారుణ్యవారి ధారాసహస్ర
శీతలంబైన విజయలక్ష్మీవరణము, తమ స్వశక్తియే యని దేవతలు తలంచిరి.

తనతనయుల్ తమస్సముదితచ్ఛవిలోఁ బడి పోయిరంచు చిం
తనాగయు భారతీహృదయ తాండవమూర్తి ముఖాంతవీథికాం
గణ దరహాస నిస్స్రుతవికాసము, శారదకాశ మాధురీ
జనని ప్రస్ఫురత్ప్రతిష్ఠల భృశిం బాలయంగ నటల్ వెలింగెనన్.

ఆమెసలారు సర్వభువనాద్యజని ప్రభ దివ్యకాంతి మా
లాయతభూమి విస్మయ సమాహిత చిత్తులునై దివౌకసుల్
మాయురె యేమికాంతి, దినమండల మీయతిలోకదీప్తిలో
నే యిఁగురించెఁబోలును! క్రమించును సర్వదిగంత వీథికల్.

తొలుత నగ్నిని "తచ్ఛవీజ్వలనమేమొ, చూచిరావోయి" యనినారు సురలు గర్వ
సంభృతజ్వాల లంబుద సదృశధూమ, పంక్తినభ్రతలంబునఁ బ్రబలితముగ.

ద్వి. అగ్నిదేవుఁడువచ్చి యఁట నిలంబడెను భగ్నరోచిస్సుల బలమటిపోయి.

ఆపుకోలేని చిఱునవ్వుతో పితామహుండు పలికె "నెవండవో? నిండు మనము
తోడ నేదేని పూన్కి వత్తువో? వచింపు" మన్న నద్యస్సముద్గమస్విన్నుఁ డగుచు.

"నేనా! లోకసమూహ భక్షణలయాంతేవాసి నస్మత్ప్రితా
పానానచ్ఛవిలోని మిణ్గురు మహీయస్సారవారింధనం
బీ నాయాజ్ఞకు నామరత్నఖుఁడు తో డేనిఁ యుగాంతజ్వాల
న్నా నాజంతులయప్రవాహముల నానందమ్ముఁ జూరాడెదన్.

ద్వి. అటువచించిన యగ్ని నట్టె వీక్షించి, చటుల చాటూక్తి నీసరణి వచించె
పలికెడుపలుకు లోపల ననంతత్వ, వలమాన తేజ మిట్టలముగఁ గ్రమ్మ.

"అగ్నిభట్టారకా మేలు! అటులనోయి?, ఇదిగో తృణము దహింపు చూచెదముగాక!"
విశ్వవిభువాణి దిక్కుల విక్రమింప, క్రుంగె నగ్ని ప్రభుండు దిక్కులను జూచి.

కనుఱెప్ప కాలమున భూమిని ననలజ్వాలలం గ్రమింపఁగ వెలిఁగె
అనుపమహోచిష్మంతుఁడు, పొనుఁగువడె విషాదధూమముల ఖిన్నుండై!

"ఓదివౌకసులార నాయూహకందఁ, జాలనే చాల దా సముజ్జ్వల మరీచి"
అనిన వాయువుఁబిలిచి "పోవయ్య! నీవు, కనుఁగొని వచింపు మతనివర్తనము" ననిరి.

౨

భీషణాయాతవాయు సంభిద్యమాన, వివిధపాదపలయకాలానేత్రసుస
మాతరిశ్వుఁడు లోక సామ్రాజ్యనేతఁ, జేరి నిలఁబడె స్నిగ్ధ గంభీరమూర్తి
ఎవరని సంశయింతు వెఱఁగింతున నేన, మదీయవిక్రమ
ప్రవణభుజాపదానము లపారము లాయురగాధిరాజు తా
నవశుఁ డెఱుంగనేరఁ డతఁ డాదట నాపొనరించువాయుదా
నవశగతాసుఁ డాపయి మనంబునతార వెఱింగి చూడుఁడా!

"వాయుభట్టారకా! తృణవల్లి దీని, కదపఁగలవోయి" యనె జగత్కారణుండు!
ఈష దుచ్ఛ్వాసకోష్ణుఁడై యెంతయేని, బెనఁగి లజ్జించిపోయి వచ్చెను దివంబు.

ఆపరాభూత మిత్రుల నరసి నేన, పోదునని పోయె శతమఖుఁ డా దవీయ
మైన తేజస్సుకడకు సద్యః ప్రకాశ, చంచలయువలె బ్రహ్మనిష్క్రమణ చేసె.

అట దిగులువొందు మఘవునాస్యంబుఁజూపి, పలికె మాహేశ్వరిగళా పణితవాణి
"అతఁడు బ్రహ్మ, జగచ్ఛయ మతనిహాస, మందు వికసించు భ్రూకుటియందు సృష్టి."

"అతఁడ నిన్ను జయశ్రీకిఁ బతినిజేసె, అతఁడ నీకుఁ జిరంప జీవితము నిచ్చె
అతఁడ నీలోని సూక్ష్మమై వితతినొందె, అతఁడ నీవును నేనును నఖిలమునను.

ఆమహేశ జాయావినిర్యద్వచోఽంత, రాళముల బ్రహ్మదీప్తి పూరములె లేఁగ
గాఢతమసంబు విఱిగి స్వర్గంబువారు, నిత్యనిర్నిద్రకాంతిలో నిలిచినారు.



# మాలవికాగ్నిమిత్రము నాటకము కాదు?

శ్రీ. స. చ. వరదాచార్యులయ్యవార్లు గారు

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే!
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మిత తయోపదేశయుజే"

ఆనుపూర్వికాలములనుండి గల కావ్యములు శ్రవ్య కావ్యములు దృశ్యకావ్యములు అని రెండువిధ ములుగా విభజింపబడియున్నవి. అందు శ్రవ్యకావ్య ములు ఆఖ్యాయికా సమగ్రప్రబంధము గాది భేదములచే నొప్పారుచుండును. దృశ్యకావ్యములు దశవిధ రూపక ములు, ఉపరూపకములు అని విలక్షణ లక్షణానుసారముగ ననేకవిధములుగ విభజింపబడెను. శ్రవ్యకావ్యములనగా "శ్రోతుం యోగ్యం=శ్రవ్యం" అను వ్యుత్పత్తిచే శ్రవణ మాత్రయోగ్యములుగ నుండునవి. కాని నటాద్యభినయ పురస్సరముగ చక్షురింద్రియ గోచరములగుటకు వీలుం డదు. అందుచే రసానుభవము శ్రోతకు శ్రవణమాత్రమున కలుగక కవి ప్రతిపాదనానుసారముగ మానసిక చిత్రఫ లకమునందు రంగమును చిత్రించుకొని ఆపైన రసాను భూతిని చేయుచున్నాడు. అట్టి అవస్థ యను లేకుం డుటకై "ద్రష్టుం యోగ్యం = దృశ్యం" అను వ్యుత్పత్తి నాశ్రయించి దృశ్యకావ్యములను రచి యించి సహృదయులకు మిక్కిలి సాహాయ్యమును చేసిరి. కావుననే "కావ్యేషు నాటకం రమ్యం" అను లోకో క్తి కలిగినది. అట్టి నాటకములే సర్వోత్కృష్టములైనవి. అందును కాళిదాసుని నాటకములే సర్వసహృదయ సమాదరణ పాత్రములై విలసిల్లుచున్నవి. ఇమ్మహాకవి యొక్క సూక్తులయందు అనితర సాధారణమగు నర్థగౌ రవమును, అభినన్దనీయమగు శబ్ద ప్రయోగ చాతురియును సహృదయైకవేద్యమగు నాశయగామ్భీర్యమును, రచన యందలి సౌకుమార్యమును, రీతియందలి మాధుర్యమును వస్తుఘటనయందలి యౌచిత్యమును సహృదయసందోహ మానసములయందు ప్రతిఫలించుచున్నవి. ఈకవిచే రచి యింపబడిన మాళవికాగ్నిమిత్రమును నేననేకపర్యాయ ములు చదివియుంటిని. దానిని కవియే

"మాలవికాగ్నిమిత్రం నామనాటకమ్ అస్మి
న్వసన్తోత్సవే ప్రయోక్తవ్యమ్"

అని సూత్రధారముఖమున నాటకముగ నిర్దేశించి యున్నాడు. కాని మిక్కిలి యాలోచించి చూచినను సాహిత్యదర్పణమందు చెప్పబడిన ఈక్రిందివిధమగు లక్ష ణమే సమన్వయించుచున్నది.

"నాటికా క్లృప్తవృత్తా స్యాత్
స్త్రీప్రాయా చతురఙ్కికా,
ప్రఖ్యాతో ధీరలలిత
స్తత్ర స్యా న్నాయకో నృపః.
స్యా దన్తః పురసమ్బన్ధా
సఙ్గీతవ్యా పృతాథవా;
నవానురాగా కన్యాత్ర
నాయికా నృపవంశజా.
సంప్రవర్తేత నేతాస్యాం
దేవ్యా స్త్రాసేన శఙ్కితః;
దేవీ పున ర్భవే జ్జ్యేష్ఠా
ప్రగల్భా నృపవంశజా.

పదేపదే మానవతీ తద్వశ
స్సంగమో ద్వయోః;
వృత్తి స్స్యాత్ కైశికీ స్వల్ప
విమర్శా స్సన్ధయః పునః."

ఇందు 'క్లిప్తవృత్తా' అనగా 'అప్రసిద్ధచరితప్రాయా' అనివ్యాఖ్యానము చేసియున్నారు. ఇందలి అగ్నిమిత్రచరిత మెందును ప్రసిద్ధముకాదు. ఇక 'స్త్రీప్రాయా'. ఈ రూపకమందు స్త్రీప్రవేశము లేని రంగమే లేదు. ఇక 'చతురఙ్కా.' నాలుగంకములు కలదై యుండవలయును. ఈవిషయమునందుమాత్రము కొద్ది వ్యత్యాస మున్నది. కాని ఇదియైనను సంపూర్ణవిరుద్ధముకాదు. ఏలననగా పైన

'స్వల్పవిమర్శాస్సన్ధ యః పునః'

అని చెప్పబోవుచున్నాడు. దాని యభిప్రాయమును వ్యాఖ్యాత ఇట్లువివరించి యున్నాడు.

"స్వల్పవిమర్శాః ప్రాయేణ విమర్శరహితాః స త్యావశ్యకే కించిద్విమర్శేనాపిసహితాః ఇతి భావః" అని.

కావున చతుర్థాఙ్కాదియందు "తామాశ్రిత్యశ్రుతిపథ గతాం" అను శ్లోకమునందు "ప్రాసఙ్గికం ప్రదేశస్థం చరితం ప్రకరీమతా" అను సాహిత్యదర్పణ లక్షణానుసారముగనుండు మనసిజతరూత్పత్తి వృద్ధిరూపచరితమును ప్రకరీస్థానమందు నిలిపిమరికొంతదూరమున

రాజా—

(నిశ్వస్య సపరామర్శమ్) సఖే! కి మత్ర
కర్తవ్యమ్?

విదూ—

(విచిన్త్య) అత్థిఏత్థ ఉవాఓ

రాజా—

క ఇవ?

విదూ—

(సదృష్టిక్షేపమ్)కోవి అదిట్ఠోసుణోదికణ్ణేదే

కహేమి (ఇత్యుపశ్లిష్య కర్ణే) ఏవ్వం విఅమ్. (ఇ త్యావేదయతి.)

అను విషయమునే

"అపాయా భావతః ప్రాప్తి ర్నియతాప్తిశ్చ నిశ్చితా"

అను లక్షణానిరుద్ధమగు నియతాప్తిగా నుదాహరించెన కావున

"యథా సంఖ్య మవస్థాభి
రాభి ర్యోగాత్తు పఞ్చభిః,
పఞ్చ ధైవేతి వృత్తస్య
భాగా స్స్యుః పఞ్చ సన్ధయః."

అను లక్షణమునుబట్టి యథాసంఖ్యముగ నీరెంటి సమవాయమును "ముఖం ప్రతిముఖం గర్భో విమర్శ ఉపసంహృతిః" అను ఐదింటియందును నాల్గవదియగు విమర్శసన్ధి యగుచున్నది. అద్దాని లక్షణము:

యత్ర ముఖ్య ఫలోపాయ
ఉద్భిన్నో గర్భతోఽధికః,
శాపాద్యై స్సాన్తరాయశ్చ
స విమర్శ ఇతి స్మృతః.

అని యున్నది. అట్లే ఇదియును గర్భసన్ధికంటె నధికముగ నుద్భిన్నమగు ముఖ్యఫలోపాయము గలదై ఇరావతీ దర్శనరూప అన్తరాయసహితఫలప్రాప్తి గలదై విమర్శసన్ధి అనిపించుకున్నది. అనగా ఇంతకును ముఖ్యాభిప్రాయము ఇందు విమర్శసన్ధి కన్పట్టుచున్నది అని. అందువలన నాలుగు సన్ధులు సామాన్యముగ నిందుదాహరియమాణము లగుచో నాల్గంకములు చాలుననియు, ఐదుసంధుల నుదాహరించినపుడు ఐదవ యంకము గూడ చేర్పరుపవచ్చు ననియు నౌచిత్యప్రాప్త మగు లక్షణ మేర్పడుచున్నది. కావున పంచమాంక మాకారణమున చేర్చబడిన ట్లగపడుటచే అదియును నాటికాత్వ విరోధమును సంపూర్ణముగ కలిగింపదు. తర్వాతి లక్షణము

"ప్రఖ్యాతో ధీరలలితః
స్తత్రస్యా న్నాయకో న్నృపః"

ఇందలి అగ్నిమిత్రుని ప్రఖ్యాతుడని సిద్ధయింపుటకు విశేషముగ శ్రమపడ నవసరము లేదు. ఏలనన నాటకత్వస్థితియందైనను నాయకుడు ప్రఖ్యాతుడయియే యుండవలయును గదా. కావున నెవ్వ డెట్టి ప్రఖ్యాతర్వము వానియందుండెనో అనియే ఇందును గ్రహింపబడును. మరియు నీకపయే సత్పూర్వకృము నందు సముద్రగృహారంగమున మాలవికానకులావళికల యెదుట ప్రతిజ్ఞచేయునుండు రాజునే నిట్లు చెప్పించెను:

"దాక్షిణ్యం నామ బిమ్బోష్ఠి
బైమ్బికానాం కులవ్రతమ్,
తన్మే దీర్ఘాక్షి యే ప్రాణా
స్తే త్వదాశా నిబన్ధనాః."

అని. అందునే నీరాజు ప్రఖ్యాతిమైన బైమ్బికవంశపువాడని తేలుచున్నది. ధీరలలితు డనుటకు వీని విలాసములే సాక్ష్యలు. కావున నీలక్షణముగూడ నప్రతిహతముగ నున్నది. మరియు,

"స్యాద న్తఃపురసమ్బన్ధా
సఙ్గీతవ్యాపృతాథవా;
నవానురాగా కన్యాత్ర
నాయికా నృపవంశజా"

నాటికయందుండు నాయిక కీలక్షణము లుండవలయును. ఆప్రకారమే ఈమాలవికయందన్నివిశేషణములును పరిశోధ్యము లగుచున్నవి. మాలవిక ప్రథమమున నంతఃపురమున ప్రవేశించినట్లు ప్రథమాంకమున మిశ్రవిష్కంభమున వకులావళిక ఇట్లు చెప్పుచున్నది:

"తేణసిప్పాహిఆ ఆగేజోగ్గా ఇ అందారి అ త్తి
బణేలభ ఇణీఏ దేవీఏ ఉవాఅణం పేసిదా"

ఇదియే ఆరంభముగ నంతఃపురమున సంబంధించియున్నది. సంగీతవ్యాపారమునందు ఆసక్తయై యున్నదనుటను వకులావలికాగణదాసుల సంభాషణమునందు మాలవిక ఎట్లు సంగీతము నేర్చుచున్నదను ప్రశ్నకు గణదాసు డిచ్చిన యుత్తరమే చెప్పుచున్నది. విదర్భరాజుని పితృవ్యపుత్రి యనియు నగ్నిమిత్రునితో సంబంధము చేయుటకునమ్ముదు త్రోవలో నెవరిచేతనో పట్టునడినారనియును ప్రథమాంకమునందు మంత్రి చదివిన లేఖయందే యున్నది. అదిగాక పంచమాంకాంతమున కవియే ధారిణీముఖమున స్పష్టముగా

"ఏదా ఏరాఅదారిఆఏ అహిజణేణఏవ
దిణ్ణో దేవీ సద్దో కింపుణరుత్తేణ"

అని నృపవంశజ యను సంగతిని తెలియపరచియున్నాడు. సంబంధము చేయుటకు వచ్చుచుండినా రనుటచే కన్యయని తెలియుచున్నది. ఇక నవానురాగ యని రసజ్ఞులగు సహృదయులకు నేను వేర చెప్ప నక్కరయే లేదుగదా!

"సంప్రవర్తేత నేతాస్యాం
దేవ్యా స్త్రాసేన శఙ్కితః"

ఈలక్షణము నిరాఘాటముగ ప్రవర్తించుచున్నది. ఇందుకొక చిన్నయుదాహరణము.

రాజా—

(సాశఙ్కమ్)

"వయస్య! ఏషా కుసుమాపచయవ్యగ్రహస్తా
సఖ్యా స్తే పరిచారికా చంద్రికా సన్ని
కృష్టమాగచ్ఛతి.ఇత స్తావ దావాం భిత్తి
గూఢౌ భవావః."

అని చంద్రికచూచి దేవితో చెప్పునేమోయని భయపడుచు చాటుచాటున దాగుచు నానావస్థలు పడుచు సంకేతస్థానమునకు వెడలుచున్నాడు. మరియొకచోట

"కిన్తు కేవలం ధారిణీ ఏ చిత్తం రక్ఖన్తో ప
హుత్తేణం దంసేది"

అని దేవివలన భయపడుచున్నా డను విషయమును స్పష్టముగా తెలియజేయుచున్నాడు.

"దేవీ పునర్భవే జ్యేష్ఠా
ప్రగల్భా నృపవంశజా"

ఇందు ధారిణీదేవినృపవంశజ యనియు ప్రగల్భయనియు జ్యేష్ఠయనియు నిర్ణయించుట యొక గొప్పవిషయము కాదు. ఐనను వినోదమున కొకచిన్న యంశము నుదాహరించెదను. హరదత్తగణదాసుల వివాదమునకు తీర్పు చెప్పుటకొరకు వారిశిష్యలచే ప్రదర్శనము జరుపుటకు నిశ్చయించినపుడు దేవిరాజునుగురించి చెప్పిన ప్రగల్భ వాక్యము,

"జఇ రాఅకజ్జేసు ఈరిసీ ఉవాఅణిఉణదా
అజ్జఉత్తస్సతదోసోణ్హాంభవే" ఇదిగాక
"తదోఅవహీరిఅవఅణో భట్టా దేవీం పు
ణో అణుబంధిదుం సంకిదో"

అని ప్రథమాంకమునందే మిశ్రవిష్కంభమునందేటీముఖమున దేవియొక్క ప్రాగల్భ్యమును కవి చెప్పియున్నాడు. ఈలక్షణము దీనియందు ద్రప్రతిహతముగ నున్నది.

"పదేపదే మానవతీ
తద్వశ స్సంగమో ద్వయోః"

దీనియర్థము "దేవి మాటిమాటికి కోపమును జూపుచుండవలయును. ఈనాయికానాయకులసంగమము చివరకు దేవికి హస్తగతమై యుండవలయునని. అట్లే ప్రథమాంకమున కొన్నియో యుపాయములచే మాలవికా నాట్యప్రదర్శనమును తప్పింపవలయునని చూచి అది సాధ్యము కాకపోవుటచే కోపముజూపుచు,

"మూఢే పరివ్వాజి ఏమం
జాగ్గంతిం పిసుత్తం అకరేసి"

అనుచు అసూయతో మారుమొగము పెట్టెను. అపుడు రాజు దేవిని పరివ్రాజికకు చూపెను. అంతట పరివ్రాజిక

"అనిమిత్తమిన్దువదనే
కిమత్రభవతః పరాఙ్ముఖీ భవసి;
ప్రభవన్త్యోపిహిభర్తృషు
కారణకోపాః కుటుమ్బిన్యః"

అని ప్రసాదింపజేసెను. తర్వాత రెండవవిషయము ఈక్రింది దానివలన స్పష్టముగా దెలియును. పంచమాంకమున దేవి మాలవికయొక్క నిజస్వరూపము తెలిసిన తర్వాత తానుచేసినని రపాటని తెలిసికొని మాలవికను రాజునకు స్వయముగా నీదలచి పరివ్రాజికయొక్క యనుమతిని కోరెను. ఆమె నీయిష్టమని చెప్పెను. అపైన మాలవికను స్వయముగాచేతతిగిచి

"ఇదం అజ్జఉత్తోపిఅణివేదణాణురూవం పారితోసి అం పడిచ్ఛదు"

అనియెను.

అంతట రాజు ఆమెను పరిగ్రహించెను.

"వృత్తిస్స్యాత్కైశికీ"

నాటికయందు కైశికీవృత్తి యుండవలయును. అద్దానిలక్షణము సాహిత్యదర్పణమునందీక్రిందివిధముగ నున్నది.

"యా శ్లక్ష్ణనేపథ్యవిశేషచిత్రా
స్త్రీసఙ్కులా పుష్కలనృత్యగీతా;
కామోపభోగప్రభవోపచారా
సా కైశికీ చారువిలాసయుక్తా."

ప్రథమమున వృత్తియనగా నేమో తెలిసికొనవలయును.

"తద్వ్యాపారాత్మికావృత్తిః"

అనగా నాయకాదివ్యాపారమే వృత్తియని చెప్పబడును. అందు శృంగార ప్రధానమైనన నాయకాదుల వ్యాపారము కైశికియని చెప్పబడును. దాని లక్షణము పైన చూపబడియే యున్నదికదా. ఇంతకును

"వృత్తిస్స్యాత్కైశికీ"

అనుదానికి నాయకాదివ్యాపారము శృంగార ప్రధానమగునదిగా నుండవలయును అని విపులార్థము. ఈసామాన్య స్వరూపముగల కైశికీవృత్తిని

"నర్మచనర్మ స్ఫూర్జో
నర్మస్ఫోటోఽథ
నర్మగర్భశ్చ
చత్వార్యఙ్గాన్యస్యాః"

అని నాలుగంగములు కలదానినిగా విభజించి యున్నారు. అందు నర్మను మరల మూడు విధములుగ చెప్పినారు. దీని లక్షణములును ఇందలి యుదాహరణములును గ్రంథ విస్తరభీతిచే నిట వ్రాయుటకు జంకుచున్నాను. ఎట్లయిన నిది కైశికీవృత్తి యనుటకు మాత్రము సంశయమేమియు లేదు.

"స్వల్ప విమర్శా స్సంధయః పునః"

ఈ లక్షణము నిచట సోదాహరణముగ ప్రదర్శించుటకంటె గ్రంథమునకు వేరొక వ్యాఖ్య వ్రాయుట సులభము. దీని యభిప్రాయములు, ఉదాహరణములు అంక నిర్ణయావసరమునందే వివరించి యుంటిని. కావున మరల నిచట వ్రాయుట యనావశ్యకము.

ఇంతవరకును వ్రాసినదానివలన లక్షణములన్నియు నాటికాలక్షణములని స్పష్టముగా తెలియబడుచున్నవి. ఈపైన రసవంతములగు నాటికలని సర్వసహృదయ సముదయ సమాద్రియమాణములగు శ్రీహర్షకృతములైన ప్రియదర్శికా, రత్నావళులకును దీనికిని గల కల్పనాసామ్యములను కొన్నిటి నుదాహరించెదను:

(1) విదూషకునినిదురమత్తుచే రహస్యోద్భేదమగుట.

మాలవికాగ్నిమిత్రమునందు నాల్గవయంకమున సముద్రగృహద్వారరంగమున విదూషకుడు కూర్చుండియే నిద్రించుచుండగా ఇరావతీ, నిపుణికలువచ్చి వానినిచూతురు. అంతటవిదూషకుడు నిదురమత్తుచేనోడలు తెలియక

"భోది మాలవిఏ"

అని కలవరించును. అపుడు నిపుణిక వానిని బెదరించుటకై పామువంటి వంకరకఱ్ఱను వానిపై విసరివేయగా వాడుబెదరి రాజు నాక్రోశించును. రాజుమాలవిక మొదలగువారు బయటకు పరుగెత్తుకొనివచ్చి ఇరావతికంటబడుదురు. దానివలనరహస్యమంతయు బయల్పడును. అట్లే ప్రియదర్శికయందు మూడవయంకమున కౌముదీమహోత్సవములలో వాసవదత్తాచరితమును ఆడుటకనిఆరణ్యకా, మనోరమాదులను ఆజ్ఞాపింపగా నందు వత్సరాజనేపథ్యధారిణి యగు మనోరమనాయకునకు నాయికాసమాగమమును గూర్చుటకై తనకు బదులుగా వత్సరాజునే నాట్యరంగమునకు పంపెను. విదూషకుడు కొంతసేపు నాటకముజూచి నిద్రవచ్చుచున్నదని చిత్రశాలాద్వారమునకు వెళ్లి నిద్రించెను. వాసవదత్త కొంతసేపు చూచి కల్పనయధికముగ నున్నదని చూచుట కిచ్చగింపక లేచి వెళ్లుచుండగా నిందీవరిక వసంతకుడు చిత్రశాలాద్వారమున నిద్రించుచున్నాడనిచెప్పెను. అంతట వాసవదత్త అట్లయినచో రాజుకూడ నిక్కడనేయుండునని యాలోచించి వానిని లేపుమండగా నిదురమత్తుచే,

"మణోరమే కింణచ్ఛిఅ ఆఅదో పిఅవ
అస్సో ఆదుణచ్ఛది ఏవ్వ"

అని యడిగెను. ఆపైన రహస్యమంతయు బయల్పడెను.

(2) దేవిచే నాయిక బంధింపబడుట.

మాలవికాగ్నిమిత్రమున చతుర్థాంకమున రాజునకు విదూషకునకు జరిగిన ఈక్రింది సంభాషణవలన తెలియుచున్నది.

రాజా—

గౌతమ కో వృత్తాన్త స్తత్ర భవత్యా స్తే
సఖ్యాః?

విదూ—

జో బిడాలగహీదా ఏపరహుదీ ఆఏ

రాజా— (సవిషాదమ్) కథమివ?

విదూ—

సాఖు తవస్సిణీ తాఏ పింగలచ్ఛీఏ సార
భాండభూఘరఏ గుహా ఏవిఅ ణిక్ఖిత్తా

ఇక ప్రియదర్శికయందు చతుర్థాంకారంభమున ప్రవేశకమున మనోరమ ప్రవేశించి,

"అహోదీహరోసదా దేవిఏ పత్తిఅం కాలం బద్ధాఏవి ఆరణ్ణిఅస ఉవరి అణుగ్గహం ణగేణ్హాది."

అనుచు నాయిక బంధింపబడినదను విషయమును విశదీకరించుచున్నది. ఈ విషయము రెంటియందును సమముగ నున్నది.

(3) దేవికి గోష్ఠియందు పరివ్రాజిక యొకర్తె యుండుట.

మాలవికాగ్నిమిత్రమున మాధవసేనుని మంత్రియగు సుమతియొక్క తోబుట్టువు కౌశికి యనునామె పరివ్రాజికావేషధారిణియై ధారిణీదేవికి గోష్ఠియందున్నది. అట్లే ప్రియదర్శికయందు సాంకృత్యాయని యను పరివ్రాజిక గోష్ఠియందు కలదు.

(4) నాయికను సంకేతమునకు జేర్చుటకు మాయోపాయములను ప్రదర్శించుట.

మాలవికాగ్నిమిత్రమున నాలుగవ యంకమున విదూషకుడు పాముకరచినదను మిషచే బాధను నటించుచుండగా విషవైద్యుడగు ధ్రువసిద్ధిచెంతకు పంపబడెను. అంతట విదూషకుడు వానిచే నాగముద్రితాంగుళీయకము కావలయుననిపించి దానిచేత తీసికొని బంధనస్థానమందలి ద్వారరక్షికలకుచూపి మాలవికను విడిపించి సంకేతమునకు చేర్చెను. ఆరీతిగనే రత్నావళీనాటికయందు తృతీయాంకమున సాగరికను వత్సరాజుకడకు జేర్చుటకు సుసంగతవిదూషకుల కుపాయము ఈ క్రింది విధముగ చెప్పెను.

"అజ్జ క్ఖు దేవీఏ చిత్తఫలఅఉత్తంతసంకిదాఏ సాఅరిఅం మమ హత్థే సమప్ప అంతిఏజంత్తా ఏపిణత్థం ణేవత్థం పసాదీకిదం, తదో తేణ జేవ్వ విర ఇదభట్టిణీవేసం సాఅరిఅం గేహిఅ అహంపి కంచణమాలా వేసధారిణీ భవిఅ ఏదో ఏవ్వే భట్టిణో సఆసం ఆగమిస్సం తుమంపి ఇహ జవ్వట్టిదో చిత్తసాలిఆదువారే సజ్ఞి ఆలంబిస్సని. తదో మాహవీలదామండవే తాఏ సహ భట్టిణో సంగమో భవిస్సది."

అని. ఈవిషయముకూడ నాటికాపద్యమునకు సహాయకారిగ నున్నది.

(5) నాయిక రాజునొద్దకు సంబంధమునకై తీసుకుపోబడును మార్గమధ్యమున చిక్కులుపడి ఎట్టకేలకు రాజగృహముచేరి ప్రచ్ఛన్నవేషమున నున్నటు నుండుట.

మాలవికను తీసుకొని వచ్చుచుండగా మాధవసేనుడు పట్టుబడుటయును మిగిలినవారు పారివచ్చుచుండగా నాటవికబలము దారిని ఎదురుకొని కొట్టుట కారంభించి మాలవికనుగూడ ఎత్తుకొనిపోయి వీరసేనుని కొప్పగించుట. వీరసేనుడు దేశాన్తదుర్గమునకు కర్త. ఈవిషయము రత్నావళియందు రత్నావళిని తీసుకొని వచ్చుచుండగా తుఫానుచే ఓడమునిగి ఆపైని వారు పడిన చిక్కులన్నిటికిని పోలికయగుచున్నది.

నాయిక పుట్టినింటినుండి వచ్చినవారు నాయికను గుర్తించుట. మాలవికాగ్నిమిత్రమున విదర్భదేశమునుండి వచ్చిన ఇద్దరు శిల్పకారికలు మాలవికను గుర్తించిరి. రత్నావళియందు రత్నావళిని వసుభూతియను సింహళాధిపామాత్యుడు గుర్తించును. ఇవ్విధముగ ప్రియదర్శికయును రత్నావళికిని సామ్యము నొందుచున్నది. ఇట్లుగాక నింకను స్వల్పవిషయములనేకములు సమానముగనున్నవి. ఈలక్షణములన్నియు సమన్వయించుచుండుటచే నియది నాటికయేయగుచున్నది కాని నాటకమనుటకు హేతువేమియును కనుబడుటలేదు. ఈ మాలవికాగ్నిమిత్రమునే మాతృకగా నుంచుకొని యొకరు కొంత యాంధ్రీకరణముగను, కొంత స్వేచ్ఛగను మాలవికా నాటకమని యొక గ్రంథమును రచియించి ప్రకటించి యున్నారు. ఈ మాలవికాగ్నిమిత్రము నాటకమా నాటికయా అను విషయమిదివరకు సంశయము లెవ్వరైనను చర్చించి సిద్ధాంతీకరించి యున్నారో లేదో తెలియుటలేదు. కాని సాహిత్య దర్పణమునకు నవీనవ్యాఖ్యయగు రుచిర వ్యాఖ్యాకారు డగు శివదత్తశర్మ మూలమునందు వీథి యను రూపకమున నుదాహరణముచూపుచోట "యథా

మాలవికా" అనియుండగా దాని వ్యాఖ్యానము చేయుచు మాలవికా-నతుమాలవికాగ్నిమిత్ర మితిశేష్యమ్, ఏతస్య నాటకత్వేన వ్యపదిష్టత్వాత్" అని వ్యాఖ్యానము చేసి యున్నాడు. (వీనీ లక్షణము లేవియు దీనియందు లేవ లెండు) "ఇవట నాటకత్వేన వ్యపదిష్టత్వాత్" అను దాని యభిప్రాయము మాకెగా నిదియెప్పుడో దర్శింపబడి నాటకమనియే ధ్రువపరుపబడియున్నట్లు తోచుచున్నది. కాని ఆదర్శ మెచటను కనుపడుటలేదు. ఆ హేతువుచే పండితులయెదుట నేనో యొకవిధముగ నారంభించినచో వారే నిర్ణయింతురను ముఖ్యాభిప్రాయముతో నొకపక్షము నవలంబించి ఇట్లు వ్రాయ సమకట్టితిని.

**సంపూర్ణము**

## గీత మాల

(కవికాంతుఁడు)

సంజ కెంజిగి సరసవాసనల నొంది?
పుష్పరూపమ్ము లొందెనాఁ బొలుపు
యిప్పుడిప్పుడె రేకుల విప్పఁ జూపు [మీఁటి
లలిత నవమోహనములు గులాబిపువులు;
పసిమివెలికాంతి కౌగిళ్ల పసఁ దనర్చి
నెఱివలపు లీను తెల్లగన్నేరి విరులు;
అచ్చ తెలివన్నె తళతళల్ పెచ్చువెలయు
రజతముగ్ధమ్ము నందివర్ధనసుమమ్ముఁ;
గలయఁగూరిచి యో ముద్దు వలపులాడి
యిచ్చెదే నాకుఁ బువుఁగాన్క నిచ్చమెచ్చి!
పంచసుమమాత్రమగు నీ యుపాయనమును
బంచకోటుల ధనరాశి మించఁగలదె?
సంఖ్యయున్నదె యందంపు జగతియందు?
పరిమితం బెట్లు గణియింపఁ బరిమళమునఁ
గానియది కాదు సన్నుతి కారణమ్ము;
వలపు పొలుపు లగణ్యత వఱలుఁగాని
వీడిపోవె సుమమ్ములు వాడిపోవ?
వలపుగాదది హృదయంపు వలపుగాని;
వన్నెగాదది ప్రేమంపు చెన్నుగాని;
కాన్క ప్రియమయ్యెఁ జెలియ తార్కాణ మాత్ర
మంత్యరహిత త్వదీయ రాగాబ్ధిఁ దెలుప;
హద్దులెఱుఁగ నీ ప్రేమరాజ్యమున కబల;
పట్ట మెటుగట్టితివొ నన్నుఁ బ్రభు నొనర్చి!
ఏతదుపకృతి కేనేమి యిచ్చువాఁడఁ?
బ్రీతి నర్పింతుఁగాని యీ గీతమాల.

**సంపూర్ణము**




(క్రీ.శ. 1220)

నిడుదవోలు వేంకటరమణగారు, బి. యే.

## శతక ప్రాశస్త్యము

నేఁడు మనకుఁ దొరికినంతవఱకుఁ దెలుఁగుభాషలోఁ బుట్టిన శతకములలో వృషాధిపశతకమే మొదటి శతకమని చెప్పనొప్పును. ఈశతకము సుప్రసిద్ధశైవకవి యగు పాల్కురికి సోమనారాధ్యునిచే క్రీ.శ. 1220 సంవత్సర ప్రాంతమున రచియింపఁబడినది. అయినను దీనికి పూర్వము నన్నె తెలుఁగుభాషలో నిప్పటిశతకములం బోలిన చిన్నిచిన్ని కావ్యములు బయలువెడలినవి. వానియందు సంఖ్యానియమముగాని, మకుటనియమముగాని, లేకుండుటచే నవి శతకరూపమునను న్నను వానిని శతకము లని చెప్పవలనుపడదు. కాని యాయాకవుల తరువాతివారు వానిని శతకములనియే వ్యవహరించుచు వచ్చిరి. ఇందుల కుదాహరణముగా క్రీ. శ. 1120 మొదలు క్రీ. శ. 1190 వరకు జీవించియున్న మల్లికార్జున పండితారాధ్యుని 'శివతత్త్వసారమును' దీసికొనవచ్చును. ఇందు నేఁడు దొరకిన గ్రంథము ననుసరించి రమారమి యైదు వందలకందపద్యములున్నవి. అన్నియుఁ గందపద్యములే యైనను మకుటము మాత్రము వేఱువేఱుగ నున్నది. ఒకచోట 'శివా'యని, వేఱొకచో 'మహేశా'యని, మఱియొకచో 'నజా'యని యిట్లనేక విధములుగ సంబోధనలు గలవు. అయినను శైవులుదీనిని శతకముగనే వ్యవహరించుచున్నట్లు పాల్కురికి సోమన పండితారాధ్య చరిత్రమువలనఁ దెలియవచ్చుచున్నది. చూడుఁడు:

"ద్వి. శ్రుతిపంచ గద్యలు రుద్రుని మహిమ
శతకంబు శివతత్త్వసార మాదిగను
గద్యపద్యంబు లాకాంక్షఁ జదువుచు
హృద్యంబుగా సత్కవీశ్వరుల్ పొగడ."

వా. ప్ర. 173-వ పుట.

అనియు,

వేఱొకచో

ద్వి. శ్రుతి సూక్తములు మహాస్తోత్ర సూక్తములు
శతకము శివతత్త్వసారమును, గీత
కళికయు, ఉదాహరణము, సుదాహరణ
ములు, గద్యసాహిత్యములు, ముక్తకావళులు.

స. ప్ర. 369-వ పుట.

అనియుఁ జెప్పఁబడియున్నది.

కావున నిది వృషాధిపశతకముకన్న ముందుఁ బుట్టినదైనను, శతకలక్షణములు లేకుండుటచే నిది యొక చిన్నకావ్యమే యనియు, మనకుఁ దొరికినవానిలో వృషాధిపశతకమే ప్రథమశతకమనియు మనము నిశ్చయింపవచ్చును.

## శతక కర్తృత్వము

ఈ శతకమునకుఁ గర్త పాల్కురికి సోమనారాధ్యుఁడని యాంతమునఁ జెప్పఁబడియున్నది. ఈతఁడు దక్షిణహిందూదేశమున జన్మించిన శైవకవులలో సుప్రసిద్ధుఁడు. సంస్కృతాంధ్రములు నేకాక, తమిళము, కర్ణాటకము మొదలగు ననిమిది భాషలలోఁ గవిత్వము చెప్పిన మహాకవి. చతుర్వేదపారగుఁడై, సకల శ్రుతిస్మృతి పురాణేతిహాసముల సంపూర్ణముగ నాకళించిన నిరుపమానప్రతిభాశాలి. గొప్పవైన చార్వాకాది మతములకుఁ బ్రక్కలో బల్లెమై తన లోకోత్తరసాహిత్యముచే జనుల మనంబుల నుఱ్ఱూతలూఁగఁజేసి, కర్ణాటాంధ్రదేశముల వీరశైవమతవ్యాపనమునకుం దోడ్పడిన మహానుభావుఁడు. నూతనకవితారీతులఁ గల్పించి తనతరువాతి తెలుఁగుకవులకు భిక్షము పెట్టిన లాక్షణికకవి సార్వభౌముఁడు. ప్రత్యక్ష భృంగీశావతారమనియు, నవ్యశైవకోలాహలుఁడనియు నభినవవ్యాసుఁడనియుఁ బొగడ్తకెక్కిన

వాఁడు. వేయేల వీరశైవులీతని ప్రథమునిగనే భావింతురు.

ఈశతకము నతఁడే రచియించినట్లీ క్రిందిపద్యమే తెలుపుచున్నది:

వ. అకుటిలలీల జంగమ సమగ్రదయాకటాక్షప్రసాద పాలకురికిసోమనాథుండతిలౌల్యమునన్ బసవన్న దండనాయకునకు నొప్పనీశతకమున్ బ్రకాశించి నిలచె బఠించువారికి వినువారికిం గలుగు శ్రీయును నాయువు భుక్తి [ముక్తియున్

మఱియు నితఁడు రచించిన పండితారాధ్య చరిత్రమునఁగూడ నితఁ డీశతకమును రచించినట్లు ధ్వనించుచున్నది.

ద్వి. బసవన్నమాహాత్మ్య మఖిలంబు భక్తి
బసరించితిని గద్యపద్యాదికృతుల

అనతారిక

పదునాల్గవ శతాబ్దమునుండి, సోమనద్విపద బసవపురాణముఁ బద్యకావ్యముగ నొనరించి యాతని శతస్థలిసగముఁ గృతినొసఁగిన పిడుపర్తి సోమనాథకవిగూడ దీనిని సోమనకృతులలోఁ జెప్పియున్నాఁడు.

సీ. బసవపురాణంబు, పండితారాధ్యుల
చరితంబు ననుభవసారమును జ
తుర్వేదసారసూక్తులు, సోమనాథభా
ష్యమ్ము, శ్రీరుద్రభాష్యంబు, బసవ
రగడ, గంగోత్పత్తిరగడ, శ్రీబసవాఢ్య
రగడయు, సద్గురురగడ, చెన్న
మల్లుసీసములు, నమస్కారగద్య, వృ
షాధిపశతకంబు, నక్షరాంక
గద్యపద్యములు"

కావున నిది సోమనాథకృతియని నిస్సంశయముగఁ జెప్పనొప్పును.

## శతకరచనాకాలము

ఇంక నీశతక మెప్పుడు రచియించినదియుఁ దెలిసికొనవలెను. ఇతఁ డీశతకరచనాకాలముఁ జెప్పక పోయినను, మనము కొంతవఱకు నీకాలము నిర్ణయింపవచ్చును. సోమనాథకవి, క్రీ. శ. 1190 మొదలు 1260 వఱకు జీవించియున్నట్లు పెక్కుప్రమాణములచే నిశ్చయింపవచ్చును. మఱియు శతకాంతమున సోమనాథుఁ డిట్లు చెప్పినాఁడు.

చ. బసవఁడు ప్రీతిఁగైకొనియె,
భక్తిమెయిన్ రచియింపనాఁడు మున్
బసవపురాణమందు ననుఁ
బ్రస్తుతి సేయుదు రట్లుకాన నీ
యసమదయాధురీ ఇలికు
నంకితపాటునుటిల్లమంట నన్
వసిగొని ప్రోవుమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

సోమన క్రీ. శ. 1190 సం. ప్రాంతముల జన్మించినయెడల నీశతకమును దనకు ముప్పది, ముప్పదిరెండేండ్ల వయసున ననఁగా క్రీ.శ. 1222 సం. ప్రాంతముల రచియించియుండును. ఇంతియే కాక 1222లో నున్నట్టి కావ్యము వ్రాసిన కన్నడకవి యగు సోమరాజు తనకావ్యములో "సముదంచద్వృషభస్తవామరమహీజారామనమ్ సోమనమ్" అని సోమనను స్తుతించియుండుటచేతను, నాతఁడు సోమనబసవపురాణాది కావ్యములు రచియించినకాలమునే పైస్తుతివలన సూచించుటచేతను నీశతకము క్రీ. శ. 1220 సం. ప్రాంతముల రచియింపఁబడినదనుట సత్యదూరము కాదు.

## శతక విషయము

ఈశతకమున పైని వివరించిన రెండుపద్యముల తోఁగలసి నూటతొమ్మిది పద్యములు గలవు. శతకమంతయుఁ జంపకోత్పలమాలికలతోఁ జెప్పఁబడినది. "బసవా! బసవా! బసవా! వృషాధిపా!" అను మకుటము గలది. మకుటము నీవిధముగ నుంచుటలోనే సోమన భక్తి తాత్పర్యములు విశదపడుచున్నవి. "కవితనేరుపు యతి పూర్వకైపుదెలుపు" అనునట్లిందలి యతి యెంతయుఁ గొనియాడఁదగియున్నది. బసవా! యను రెండవ సంబోధనాంతమున యతినిల్చుచున్నది. అట్లుండుటవలన స్వరవ్యంజనయతులసమసూహులతయేకాక కేవల విశ్రమస్థానమై యీవిశ్రమము చెవుల కింపు నింపుచున్నది. బసవా యను నామమంతయింపు నింపదే! ఇంపేయన నేల! మహాత్త్వముఁగూడ గలిగియున్నది. చూడుఁడు:

భ్యాగత సంశ్రితార్తి కవి
పండిత గాయకచక్రవర్తి! దే
వా! గతి నీవె మాకు బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ముప్పదినాలుగునుండి నలుబదివఱకును లాటాను
ప్రాసముతోఁ జెప్పఁబడినవి.

చ. గురుపదపద్మసక్త యవి
కుంఠిత జంగమశీలశీల సు
స్థిర మృదుహాసమోద సకు
దీర్ఘ విశేషమహార్తి వార్తివని
ర్భరభుజశౌర్యధుర్య పరి
రంజితభక్తిశక్రగోత్ర ము
ప్వరద శరణ్యమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

నలుబదినుండి నలుబదియైదువఱకును ప్రతిపాదాను
ప్రాసముఁ జెప్పఁబడినది.

చ. సరసవచస్క నిర్మలయశ
స్క శిష్టైక్యమనస్క భక్తహృ
త్సరసిజగేహ శక్తిభవ
దాహ నగాహసగిరిశాహ ! చిత్సుఖో
త్తర నిజకల్ప భక్తిపర
తల్ప మహావృషకల్ప మన్మనో
వరదశరణ్యమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

చ. ఉరుతరభాగ్య మన్మహిత
యోగ్యజగత్ప్రియ మృగ్య పాపసం
హరణసమర్థ సద్గ్రచరి
తార్థలసద్గుణసార్థ భావభా
స్వరనయసాంద్ర కీర్తిజిత
చంద్ర వివర్జితతంద్ర మన్మనో
వరద శరణ్యమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

నన్నెచోడుని కుమారసంభవమునఁ గూడ నిట్టి యను
ప్రాసములు కలవు.

చ. కరమువిచారి తద్దయు వి
కారి మనం బది సారినోలె నే
తిరిగెడుగాని నిల్వ దిది
దీనిచలత్వముమాని నీపదాం
బురుహములందు సంస్మరణఁ
బొంద దయన్ సురబృందవంద్య సు
స్థిరముగనిల్పు, తత్త్వవిధిఁ
దెల్పు, సమస్థితినిల్పు శంకరా!
ఆ. ౬. 804 పద్యము

ఇట్లనేక స్థలములంగలవు.

నలువదినుండి మూడుపద్యములు ముక్తపదగ్రస్తా
లంకారముతోఁ జెప్పఁబడినవి.

చ. ఇహపరసిద్ధ సిద్ధవృష
భేశ్వర యీశ్వరభక్త భక్తహృ
ద్గహనవిలోక లోకహిత
కారణ, కారణజన్మ, జన్మదో
షహరణదక్ష, దక్షరిపు
సన్నిభ, సన్నిభరూప రూప ని
ర్వహణ శరణ్యమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

నలువదిమూఁడునుండి నలుబది యెనిమిదివఱకును,
సమాస ఘటితములు ప్రార్థన పద్యములు.

చ. ప్రమథగణాధినాథసము
పాసనభాసుర పార్వతీమనో
రమ రమణీయహృత్కమల
రాజిత నవ్యపతంగ సౌరభ
భ్రమరవిలోలతామధుక
రాయిత దివ్యశరీర సత్ప్రభా
వసహిత నీవెదిక్కు బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ఉ. ఆప్తగణప్రవిష్ట సక
లార్తిహరాయ నమోనమో సుఖా
వాప్తికరస్మితాంచిత క
టాక్షదయాయ నమో నమో సము
ద్దీప్తగుణాయ తేయనుచు
దీనగతిం బ్రణుతింతు నిన్నుని

రావశ్యప్తజగత్ప్రపంచ బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

రెండవది సంస్కృతభాషాదిస్తుతి దాని నీక్రింద వివరించెదను.

## సంస్కృతము

ఉ. హృన్నలినే స్మరామి భవ
దీయపదద్వితయం భవాటన
స్విన్నతనుశ్రమాపహ మ
శేషజగత్ప్రిణుతం మదీశ ని
ష్పన్నదయానిధే! యనుచు
సంస్కృతభాష నుతింతునిన్ను వి
ద్వన్నుతనామధేయ బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

## ద్రావిడము (తమిళము)

చ. పరమనె యెన్నె యాండవనె,
పన్నగతానె యనాథనాథనే
పెరియవనే పుణిందవనె
పేరుడయానె పిరానె యప్పనే
తరిమురియయ్యనే యనుచు
ద్రావిడభాష నుతింతు మన్మ
నోహర కరుణానిధేయ బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

## కన్నడము

చ. హసుళెయరెన్న రక్షిసువు
దారయ దెన్నవనీతనెందు మ
న్నిసువుదు నిమ్మడింగెరగు
నిమ్మప్రసాదిరె నిమ్మతొత్తనే
కసిగతియంచు భక్తినినుఁ
గన్నడభాష నుతింతు వర్ధన
శ్వసన శరణ్యమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

## అవార్యభాష లేక ఆరెభాష (మహారాష్ట్రభాష)

ఉ. దేవవరా తుమ్హాచగురు
దేవమ్హణూనుతరీతుమ్హాచగో
సావతురా తుమ్హాచ తుసి
సానప్రసాదఅవిూన్కృపాకరా
యీవగదాయటంమనుతి
యించెదనిన్ను నార్యభాష నే
నావినుతార్యలీల బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

## మణిప్రవాళము

(కర్ణాటమున దేశభాషయు, సంస్కృతము కలిసిన మిశ్రభాషకు మణిప్రవాళము అని పేరు)

ఉ. హాదు వనామహాగసన
నంఘ్రియుగప్రమాణసుసద్గుణా
మాదు నయర్చనంబిగె స
మగ్రనుతి త్వయి సత్క్రియక్ దగన్
గాడిమణిప్రవాళమునఁ
గోరి నుతింతును సంచితార్థముల్
పాడిగ నివ్వటిల్ల బసవా!
బసవా! బసవా! వృషాధిపా!

## పెక్కుభాషలు

చ. తిగుఘుడి నామనంగుసను
డే హృదయేశ్వర కింవిధీయతాం
పరపర త్వం పురాణ వను
పాహిం విభో అమావాపితా అమా
వరద నసుల్లెయంచు నినుఁ
బ్రస్తుతి సేయుదుఁ బెక్కుభాషలన్
వరద వివేకశీల బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ఇట్లే సోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమునందుఁ బర్వతప్రకరణమున శ్రీశైలయాత్రను వర్ణించుసందర్భమున నేదేశప్రజను లేభాష మాట్లాడిరో యాభాష నే వ్రాసియున్నాఁడు. దీనివలననే సోమనాథ నియష్ట భాషాసుకవిత్వరచనా బిరుదాంకము సార్థకమగుచున్నది

మూఁడవభాగమున బసవనమహిమలును, మడివాలు మాచయ, కిన్నరబ్రహ్మదేవయ్య, కక్కయ్య, షోడ్డల దేవర బాచిరాజు, మోళిగమారయ్య, ముసిండి చౌడయ్య,

కవికేళ బ్రహ్మయ్య, తెలుఁగుజొమ్మయ్య, కన్నడ బ్రహ్మయ్య, శంకరదాసిదేవుఁడు, శివనాగమయ్య, అల్లమప్రభువు, చెన్న బసవన్న, సురియ చౌడయ్య, శృంగి బొప్పయ్య, మురటపంకయ్య, హాలీనహల్లికల్లిదేవుడు, అరియమరాజు, మల్లికార్జునపండితుఁడు మొదలగుమహాభక్తవరుల మహిమలు పేర్కొనఁబడినవి. వీరలచరిత్రములన్నియుఁ బండితారాధ్యచరిత్రమునను, బసవపురాణమునను విపులముగా వర్ణింపఁబడియున్నవి. అయినను భక్తులచరిత్రము లెన్నిమాఱులు పఠించినను విసువుజనింపఁ జేయవు. కానవానిలోఁ గొన్నిఁటి నుదాహరించుచున్నాఁడను.

ఉ. చిత్తజవైరి విక్రమము
చెప్పకుచెప్పకు త్రావనోడి దా
కుత్తుకనిల్పెనంచు కడు
ఘోరతరంబగు కాలకూటముల్
కుత్తుకఁబంటిఁ గ్రోలినయ
కుంతివి విక్రమచక్రవర్తి భా
స్వత్తమ నీసదిక్కు బసవా!
బసవా! బసవా! వృషాధిపా!

ఉ. దీప్రమునీ మహామహిమ,
దివ్యమునీ మహనీయవిక్రమం
బప్రతిమంబునీ చరిత
మాద్యము,నీనిజరూపమంచు న
ల్లప్రభుఁడర్థితోడ నుప
లాలనసేయఁగ నొప్పుచున్న దే
వా!ప్రణుతింతు నిన్ను బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ఉ. దండితవాతియై శివుడ
దైవముగా గని గన్నులిచ్చి తా
నిండుమనంబుతో నిలువు
నిద్దపుగన్నులు దాల్చిపొల్చుమా
పండిత మల్లికార్జునుడు
ప్రస్తుతిసేయఁగ నేర్చు నిన్ను శై
వ్యం ము నుతింప నేర్చు బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ఈక్రిందిపద్యము చూచినతోడనే భాస్కర రామాయణమునందలి పద్యమొకటి జ్ఞాపకమువచ్చుచున్నది చూడుఁడు.

ఉ. స్వీకృత భక్తలోక యమ
శీకృతకర్కశపాపభూక, యూ
రీకృతసద్వివేక, యుర
రీకృతజంగమ భక్తభూక, దూ
రీకృత దుష్టపాక, యధ
రీకృతవేద విరుద్ధశాస్త్ర చా
ర్వాక శరణ్యమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ఉ. స్వీకృత భక్తశీలుఁడు వ
శీకృత సర్వనిలింపనాథుఁడూ
రీకృత ధర్మమార్గ డుర
రీకృత నీతివిశారదుండు దూ
రీకృత దుష్టచేష్టుఁడు న
రీకృత వానరవల్లభుండు మో
ఘీకృత వీరవైరి సుమ
శీకృతధీరుఁడు రాఘవుండిలన్
—భా. రా. 625 పుట 2622 పద్యము

ఈక్రింద రెండుపద్యములును సోమనారాధ్యుని భక్తిని వెల్లడించుచున్నవి.

ఉ. బసవనిధానమా బసవ
భవ్యనిధీ బసవామృతాంబుధీ
బసవమహానిధీ బసవ
ధర్మగిరీ బసవా మరుద్రుమా
బసవమహాబలీ బసవ
బండరువా బసవోల్లసన్మణీ
వసిగని బ్రోవుమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

ఉ. నాయొడయండ నావిభుఁడ
నాహృదయేశ్వర నామనోరమా
నాయిలువేల్ప నావరద
నాగురులింగమ నాదుజంగమా
నాయధినాథ నావరుడ
నన్నుఁ గృపామతిఁ బ్రోవుమయ్య దే

వా యమినంస్కృగూప బస
వా! బసవా! బసవా! వృషాధిపా!

శతకమంతియు సలక్షణముగ వ్రాయఁబడినది. ఈక్రిందిపద్యమున ధ, ఢ, ప్రాసములు వచ్చుచున్నది. *

ఉ. ఏడులు నూరటన్న శ్రుతు
లేకము శ్రీగిరిమీఁద నాఱు నూ
ఱేడులు సంచరించి సక
లేశ్వరదేవర మాదిరాజు నా

ఏడులు నూ యున్న భువి
నిష్ఠురఘోరకాల మహోగ్రదృష్టిక్రౌ
ర్యాఢ్యు లణంపుమయ్య బస
వా! బసవా! బసవా! వృషాధిపా.

ఆంధ్రభాషలో ఇట్టి ప్రశస్తములును భక్తివిలసిత ములు నగు నీవృషాధిపశతకము నాంధ్రసోదరులు భక్తిమై బఠించెదరు గాక.



# శ్రీ భీష్మశరణాగతి

మహాస్వామి శ్రీకుమార ఆదివరాహాచార్యులు గారు

హరి! హరి! శ్రీహరీ! నరసఖా! తమ దివ్యసుధాతరంగభా
స్వరమగు సూక్తిమాలయుఁ, బ్రసన్నకృపారసశీతలంబు లౌ
సరసదృగంతకోణములు, సౌమ్యమనోహరమైన మూర్తియుఁ
మెఱయఁగ నా హృదబ్జమున మేకొని దర్శనమీయు మచ్యుతా.

మ. నెనరుంజిల్కు ప్రశాంతశీతలమునౌ నీ క్రేగనుం జూపు పె
ల్లున నిచ్ఛాయతి నోలలాడుతఁడవా లుప్తశ్రమంబై క్షణం
బునకుం దీటుగ నేఁగె, నీక్షణము సంభూతశ్రమం దా యుగం
బునకుం దీటుగఁ దోరమయ్యెను భవన్మూర్తి న్విలోకింపమిన్.

శా. మేనంగాఁడిన యీశరాగ్రములు సంభేదింపఁగా సాగె, నె
మ్రాణం జిక్కిన యింద్రియంబులును మూర్ఛాధీనతం గాంచెఁ, బ్ర
జ్ఞానం బెంతయు డిల్లవోయె, మఱి నీ సందర్శనాపేక్ష ను
న్మానంబై యెసవోయియుండె నుచితంబా? ఇట్లు కన్మూయుటల్.

చ. ముదుకఁడ బాణవిద్ధుఁడను మూర్ఛితుఁడం దిట దప్పియుంటి నే
తెది గతిలేనివాఁడ భవదీయపదంబులె నమ్మినాఁడ నీ
వెదుటనె యుండినం గని గ్రహింపఁగఁ జాలనివాఁడ వేఁడువాఁ
డ దయకుఁ బాత్రమౌటకు నెడంబు నొసంగుము రుక్మిణీధవా!

---

* ఈ పద్యము ఈ క్రిందివిధముగఁగూడ పెక్కుమాతృకలలో గలదు. అందువలన పాలకురికి సోమనాథుడు ధ, ఢ ల ప్రాసమును ఉపయోగించెననుట సమంజసముగా జూపట్టదు. [భా. ప. సం.]

ఉ. ఏఁడులు నూఱటంచు శ్రుతులెన్నఁగ శ్రీగిరిమీఁద నాఱు నూ, ఱేఁడులు సంచరించు సకలేశ్వరదేవర మాది రాజు నా, ఏఁడల నూరుమన్న భువినిష్ఠురకాల మహోగ్రదృష్టి క్రౌ, ర్యాఢ్యుఁడు లణంపుమయ్య బసవా! బసవా బసవా! వృషాధిపా!

చ. విరివిగ సన్యులం బరిభవించితిఁ, గోమలిఁ గోలవెట్టితిన్,
గురునిఁ దిరస్కరించితిఁ, బ్రకోపవశంవదుఁ డైతిఁ, దల్లిప
న్పరయక మీఱితిం, దెలియనైతి హితం బహితంబు, నిన్ను నీ
నిరుపమభక్తునిన్ సిలుగు నించితి, ముంచితి వాడియంపలన్.

ఉ. ఇంకను నే నెఱింగినవి యేను నెఱుంగని వెన్ని యున్నవో
యంకెకు మీఱుసెట్ట లవియన్నియు నీ కిటఁ దేటతెల్ల మో
శంకర! భక్తమానసవశంకర! వాని గణించితేని నా
కింకఁ బునర్భవంబు లభియించునె నిష్కృతి సంభవించునే.

ఉ. నమ్మితినయ్య యెట్టి యపునర్భవమైన ప్రియంబె కాని నీ
వమ్ముని కోలతో విమలహాసముతో నుపదేశముద్రతో
నెమ్మది దర్శనంబొసఁగి నిల్చితివే పదివేలు నాకు నీ
సొమ్మిది యెందుఁ జేర్చినను జూపిడియుండుట నీ భరంబెకా.

చ. ఇదియును నేను కోరఁ గత మేమియు లేదు స్వకీయమైన సొ
మ్మదెసఁ బ్రభుండు చూడ్కినిడి ప్రోచుటయేని స్వభావసిద్ధమే
కద యయినన్ గడంగుదురు గానక నాత్మభరార్పణంబునం
బదిలములేని నాచపలభావము తాఁ బలికించు నిట్టులన్.

శా. ఐనం దీనశరణ్య నీకరుణయే యాధారమై యున్నదం
చేనేమేమియు కోరుచుంటి నిటఁ దండ్రీ యాజగన్మాత యెం
తే నీవల్ల భయమ్మాట. నాజనని నుద్వీక్షించియే కాని యీ
దీనుం బ్రేముడిఁ గాంచి నర్మిలిఁ బ్రసాదింపంగదే యీశ్వరా!

సీ. వెనుకాళ్ల నాని లేచినవారువంబుల, పగ్గము లొకకేలఁ బట్టి యాఁపి,
వెనుకకు మఱలి పార్థునిఁ జూచునెడ నిలు,కడ కొకకేల మోకాలు నాని,
వాఱుఁ జేరిచిపట్టి తేర్మిపై నూదిన, మునికోల నొకకేలఁ బొందుపఱచి
క్రీడి బ్రబోధించు ప్రీతిమై నొకకేలు, మునుసాచి యుపదేశముద్ర వట్టి

గీ. గరిమ నాలీఢపద్ధతిఁ గాలునిడి కిరీటి తేరినొగల్ కృతార్థీకరించి
నట్టి నీదివ్యసుందరమయిన మూర్తి, నాదుచరమధారణమునఁ బాదుకొనుత.

మ. భగవద్భవ్యగుణాళి మాటి పరిదీవ్యత్కాలరుద్రాత్మకం
బగు భీమాకృతిఁ దేరిముంగలను సూతాకార లక్ష్మీధరం

బగు శాంతాకృతిఁ దేరియందును జగద్భాసంబుగా నిల్చి చి
త్రగతిం గ్రాలిన యైంద్రజాలికుని పాదద్వంద్వముం గొల్చెదన్.

ఉ. చూపులలో సుధారసము జొబ్బిలఁ బాఁగినమోముఁ గాంచి గీ
తోపనిషత్తుఁ జెప్పుచు సుశోభముఁ జూడఁగరేని శ్రీమహా
రూపముఁ జూపుచున్ గలనఁ దూకొను నల్లుఅ నన్నుఁగట్టి నే
నాపదమందు గ్రాల్ కపట నాటక సూత్రధరుం భజించెదన్.

చ. చెనఁటితనాన నేను హరిచేత నె చక్రముఁ బట్టఁజేతు నం
చని వెడబింకముం బలికినందుకు భక్తుని మాట నిల్పఁగాఁ
దన ప్రతినం దృజించిన స్వతంత్ర చరిత్రుఁడు భక్తవత్సలుం
డనయము నాహృదంబుజమునందు వసించునుగాఁత ప్రీతిమై.

ఉ. తాతయటంచుఁ బ్రేమముకతంబునఁ గొట్టని క్రీడికిం బ్రకో
పాతిశయంబుఁ గూర్పఁ జరణాశ్రయు నిమ్మదిభక్తునిన్ జగత్
ఖ్యాతయశస్కుఁ జేయ ననఘా యది కొండొకలీలగాక శ్రీ
నేతకు నిర్వికారునకు నీకు శరాహతిబాధ యున్నదే?

సీ. నొగలనుండియెదూకు నెగపునజారెడు, స్వర్ణచేలంపు పచ్చని వెలుంగు
కరమున దిర్దిరం దిరిగి తేజోమాల, వరగించు చక్రపు టపుణాసృష్టి
చెలిమి నాతోడ డాఁగిలి మూఁతలాఁడుచు, విహరించు లేనవ్వు విశదకాంతి
గాలితాఁకిడిని మొక్కలముగాఁ జెఱలాడు, నిడుదమూంగురుల వినీలరుచులు
గీ. చేరి శబలితమై మృదుశ్రీలు చెలఁగ, నడరు వాత్సల్యసూర్యుని పొడుపుమోర్లి
వెడలు చిత్రవర్ణంబుల విభల నించి, నట్టిప్రోడఁడు నాయెడ నలరుఁగాఁత!

చ. విజయుఁడు కేలుదోయిఁ బెనవేసి దిటంబుగ లాగుచుండ గా
ఢజవముతోడ నాపయి వడం గమకించి ప్రపాతపాతవే
గజుపదుపత్యకాక్రమణ కాలవిఘూర్ణిత వాహినీ నికా
శజవనమూర్తియైయడరు స్వామిపదంబుల నాశ్రయించెదన్.

శా. బావా! తొందరయేల? యీపరిజనున్ భావించుమా? యంచు నెం
తే వివ్వచ్చుఁడు వేఁడుచుండ వినకే దివ్యస్మహామేఘుగ

జ్ఞావిస్ఫూర్జితధీరఘోషమున భీష్మా! కాచికొమ్మంచు నా
పై వేంచేసినభాగ్యమూర్తికృప నాభావంబునం బొల్చుతన్.

ఉ. కోపముపూఁతచే మురువుఁ గుల్కుచు నిద్దములైన క్రేఁగనుం
జూపు వెలుంగులున్ సరససౌమ్యసుదర్శనచక్రదీధితుల్
నాపయిఁ బెల్లుఁగట్టి కరుణాసుధ నిమ్ముగఁ జిమ్ముచుండ 'నీ
యేపడఁగింతుఁ గాచుకొను మీ' యని వచ్చినధీరుఁ గొల్చెదన్.

ఉ. గాటఁపువెల్గులం జెసలఁ గ్రమ్ముచుఁ గేల రహించుఁజక్రపుం
బోటరి యొంపలం గలిసి ముగ్ధతరస్మితచంద్రికాఝరుల్
నేటున గోరువెచ్చనగు స్నిగ్ధతరప్రభ నింప నాపయిన్
దాటున వచ్చినట్టి శుభధామము నాయెదఁ బాదుఁగొంచుతన్.

శా. నీసంకల్పముచేఁ గుశాగ్రము కడుం దీండ్రంపుబ్రహ్మాస్త్రమై
గాసింబెట్టె జయంతుసంతటి దొరన్ గాలాత్మ! యీవృద్ధుపై
నీసర్వంకషచక్రమే వలయుటల్ నీదివ్యకారుణ్యల
క్ష్మీసామ్రాజ్యము వీనిభాగ్యమెకదా? కృష్ణా! జగన్నాయకా!

మ. పరుషజ్వాలము వైష్ణవాస్త్రము భవద్వక్షంబునం బూలదం
డ రహిం గాంచఁగ నాశరోత్కరమె తీండ్రంబయ్యెనే నీకుఁ గం
ఠరకాళీయ మహాహిదంష్ట్రములకన్నన్ నీప్రతిజ్ఞన్ ద్యజిం
చి రథాంగంబు గ్రహించి నాపయికి రా శ్రీకృష్ణ! భక్తప్రియా!

చం. ప్రమ కరుణాప్రవాహమునఁ గ్రమ్ముకరుళ్లగు శ్రీదృగంతవి
భ్రమముల కాన్తమిత్రము, ప్రసన్నమనః కుముదాళికిం బవి
త్రము నగు పండువెన్నెల, యధార్మికలోకము కన్నుఁగట్టు ది
వ్యము నగు నైంద్రజాలికము నచ్యుతు లేనగవుం భజించెదన్.

మ. ఇదియే చాల్ పదివేలు నాకు నిఁక వేఱేలా? యదార్తైన చూ
డ్కిదిటంబై మది నంటియుండెఁ గద క్రొంశేవన్ దదానీంతనం
బు దయారోషకరంభితంబు కరుణాముగ్ధంబు నీమూర్తి యే
విదళంగాని శుభాశ్రయంబిది మనోబింబంబునం బాయునే.

చ. నిగనిగలాఁడు మించుల వినిర్మల చిత్రకలా కలాపముం
దెగడు చిరత్నరత్నరుచిదివ్యమునౌ మునికోల కారుమ
బ్బుగములఁ గేరుమేనఁ బాలుపుంగన సింహకిశోరమట్లు చి
త్రగతుల నాక్రమించిన చిరంతనతేజము నాశ్రయించెదన్.

చ. అనుపమ శంఖచక్ర వరదాభయరాజిత పాణిపద్మ, మా
పనిపద, మర్కకోటి ప్రతిభంబగు నీదు పరస్వరూప ము
న్నను మునికోలతో మొలకనవ్వులతో నుపదేశముద్రతో
దనరెడు సూతవేషమునఁ దర్శన మీఁగదె పార్థసారథీ!

చ. కరుణ ననుగ్రహింపు మనఘా! కుహనామయ సారథీంద్ర! నీ
చరమ మహోపదేశము ప్రసన్నత వీనులఁదోఁచునట్లు నీ
సిరిఁ దగుసూతమూర్తి కృప చెన్నరఁ గన్గవ నుండునట్లు నీ
నిరుపమహాసచంద్రికలు నెమ్మది నిల్చెడునట్లు నెప్పుడున్.

క. కరుణింపుమయ్య తండ్రీ, శరణించితినయ్య నీదు చరణాబ్జములన్
కరుణావరుణాలయ యే, పరిణామము లేని నీదుపదవి నొసఁగుమా!

గీ. అలరుఁ గాఁత నీదివ్యమంగళము మూర్తి, జయముఁ గాంచుత నీసుప్రసన్నకరుణ
పాదుకొనుఁగాత హితము నీపయిని భక్తి, వెలయుఁగాఁత నీయుపదేశవిధులు సతము.





# పరశురామకవిగారి పద్యోపన్యాసము

ఓలేటి వేంకటరామశాస్త్రి గారు

## 3

నిన్నటిసభ ముగిసిన తరువాత నే నింటికిఁబోయి వెంటనే భోజనముచేసి పరశురామకవిగారి సంగతి పరామర్శింపఁ దలఁచి యాయనను దీసికొని వెళ్లిన పెద్దమనుష్యు లెవ్వరో, వారి యిల్లెక్కడనో, యని విచారింపఁగా బారువారివీథినున్న భాగవతుల పార్వతీశ్వరరావుగారని తెలియవచ్చినది. తత్క్షణమే నేనక్కడకుఁ బోతిని. నేను బోవునప్పటికిఁ బరశురామకవిగారు పడుకకుర్చీలోఁ గూరుచుండి ప్రక్కను వేఱొకకుర్చీలోఁ గూరుచున్న పార్వతీశ్వరరావు గారితో మాటలాడుచున్నారు. నన్నుఁ జూచినతోడనే వారుభయులును సగౌరవముగాఁ బలుకరించి నా కొక యుచితాసనము నొసఁగిరి. నేను బరశురామకవి గారిని వారి యారోగ్యమును గుఱించి ప్రశ్నించుచుండఁగా నింతలోఁ గవిగారిని జూచుటకు డాక్టర్ కృష్ణమోహన మొదలియారుగారు విచ్చేసి పార్వతీశ్వరరావుగారితో 'ఏమండి సార్ (Sir) ఐ థింక్ హి ఈజ్ ఆల్‌రైట్ నౌ (I think he is all-right now) మెడిసన్ (medicine) బాగుగనే పనిచేసినట్లున్నది. నే నిచ్చిన యా పౌడర్సు (powders) ఉన్నవే—అవి—వండర్‌ఫుల్ వర్కు (wonderful work) చేయునవి' అని పలుకుచుఁ గవిగారి సమీపమునను్న కుర్చీలోఁగూరుచుండి కవిగారితో "ఏదీ! మీ హార్టు (heart) చూడవలెను; ఒకసారి తిన్నఁగాఁ గూర్చుండుఁడు" అనెను. అంతటఁ బార్వతీశ్వరరావుగారు సంశయముతో నెమ్మదిగా డాక్టరుగారి నుద్దేశించి చెప్పలేక చెప్పలేక "అయ్యా! నిన్నసాయంకాలము సభనుండి యిక్కడకుఁ దీసికొని వచ్చునప్పటికే కవిగారికిఁ దెలివివచ్చి యథాపూర్వముగా నారోగ్యము గలుగుటచేఁ దమరు దయచేసిన పొట్లము లీయలేదు; ఇప్పు డింక నీయవలసిన యవసర ముండదనుకొనెదను. ఎక్స్క్యూజ్ మి (Excuse me) తమరేమి సెలవిత్తురు? అవసర మున్నయెడల నిప్పు డిచ్చెదను. ఈజ్ ఇట్ నెససరీ నౌ? (Is it necessary now?) అని పలికెను. ఆమాటలు విని డాక్టరుగారు కనుబొమలు చిట్లించుకొని చటాలున లేచి "ఆల్‌రైట్" (All-right) తలయూఁచి, "నాట్ నెససరీ" (not necessary) అని క్రిందికిఁ జూచుచుఁ గొంచె మూరకుండి—"దెన్ ఐ షల్ గో" (Then I shall go) అని పలుకుచు వడివడిగా నడచుచుండఁగా మే మందఱము నాయనను వీథిగుమ్మము దాఁటువఱకు సగౌరవముగా సాగనంపి వచ్చితిమి. ఆరాత్రియంతయుఁ బరశురామకవిగారు సుఖముగా నిదురించిరి; ఏవిధమైన బాధయు లేకుండెను. సాయంకాలము సభలోఁ బడినప్పుడు తలమీఁదఁ దగిలిన దెబ్బమాత్రము నిమ్మకాయయంత బొప్పికట్టినది కాని, దానిపైని గొంచెము క్రొత్తసున్నము పట్టు వేయుటచే దానిబాధయుఁ దగ్గిపోయినది.

తెల్లవాఱినతోడనే పరశురామకవిగారు త్రిలింగదేశాభివర్ధనీసభాస్థాపకుల పేరఁ దాను నేఁటి సాయంకాలము మరల నుపన్యసింతుననియు, నిన్నటిసభలో నేనో యసందర్భముగాఁ బ్రవర్తించినందులకుఁ దనకు మిక్కిలి లజ్జగా నున్నదనియు, నీనాఁడు తప్పక యుపన్యాసము జరుపుటకుఁ దగినప్రయత్నము చేయింపవలయుననియు వర్తమానించిరి. దానిపై సభాస్థాపకులు నేఁటిసాయంకాలము 3½ గంటలకు మరల నుపన్యాసము జరుగునని ప్రకటించిరి. సభాకాలమునకు మే

మచ్చటి కరిగితిమి. నిన్నఁ బరశురామకవిగారి భక్తిపార వశ్యము తమభావములకు నచ్చుటచేఁ గాఁబోలు నసేకులు పురజను లీయుపన్యాసమునకుఁగూడ దయచేసి కూర్చుండిరి. పరశురామకవిగా రుపన్యాసవేదికపై కెక్కినప్పటికి దిక్కులు ప్రక్కలగునటు లొక్క పెట్టుగా సభాసదులందఱుఁ జప్పట్లు చఱచిరి. అప్పుడు పరశురామకవిగారు రెండుచేతులును జోడించి యిట్లుపన్యసింపఁ దొడఁగిరి.—

పరశురామకవి—

క. నాయనలారా! నిన్నటి
సాయంకాలమున నిచటిసభలో నటునే
మీయుత్సాహం బాఱడి
సేయుటచే నిపుడు మిగుల సిగ్గిలుచుంటిన్.

ఒకయువకుఁడు—(తనమిత్రునితో మెల్లఁగా) దైన ప్రార్థన చేసినయెడలఁ దలతిరుగునని కాఁబోలు నీసారి దానిని జల్లఁగా దాఁటవేసినాఁడు.

మిత్రుఁడు—కాదు! కాదు! ఇది అప్టు డేట్ ఫ్యాషన్ (up-to-da'e fashion)

ఇఁకనొకఁడు—సిగ్గిలుచున్నవాఁడవు మరల నెందులకు స్థిరము కావలయును?

మఱియొకఁడు—అందులకు సిగ్గుపడ నవసరము లేదు. మీరేమిచేసినారు? పాపము!—

పరశురామకవి—

చ. పలువురు పెద్దలుండిన స
భాస్థలిలోన నుపన్యసింపఁగా
నిలుచుట సాహసం; బటులు
నిల్చి సభాసదులెల్ల మెచ్చఁగాఁ
బలుకఁగలేక యందు నగు
బాటులు వాటిల సంచరించువా
రలకగు శృంగభంగము క
రంబు భరంబగుఁగాదె యారయన్.

ఒకసభ్యుఁడు—"తనకు శృంగ మున్న"దని యనుకొను వానికి భంగముకాని నిరహంకారులకు మీకేమిభంగము మహాశయా?

ఒకయువకుఁడు—అనుభవజన్యజ్ఞానముగలవారు గనుకఁ దమరిట్లు మనవిచేయుచున్నారు. ఈసంగతి యందఱకును దెలియునదికాదు.

పరశురామకవి—

గీ. అపును! దలపోయ నదియెల్లయనును!

పైయువకుఁడు—(తోడివానితో)విన్నావురా వీరభద్రరావు! నామాటలకు సమ్మతించి కవిగా రేమనుచున్నారో!

తోడివాఁడు—ఏడ్చినావులే. ఆయన చెప్పునది నీమాటలకు సమాధానము గాదు. విను!పై సంగతి విను!

పరశురామకవి—

కాని

(అనియేదో గుణాలోచించ నాను)

పైయువకుఁడు—కానిగాను లేదు. ఏగానియు లేదు; ఆలాగున నొప్పుకొని తీరవలసినదే.

పరశురామకవి—

గీ. బుద్ధిపూర్వకముగ మిమ్ముఁగొంట్ల యెదుట
సిగ్గువిడనాడి యేనిట్లు సేయ లేదు
చేయుచున్నట్టు లెఱుఁగ మచ్చిత్తమునను

తోడివాఁడు—(పై యువకునితో) సరిగదా? తెల్లముగము వేసినావా?

మఱియొకవిద్యార్థి—(మెల్లఁగా) నీవు బుద్ధిపూర్వకముగఁ జేసినావని యెవ్వరన్నారయ్యా! "గుమ్మడికాయలదొంగ" యనఁగనే భుజములు తడుముకొనె దవేమి?

వేఱొకసభ్యుఁడు—పాపము! అమాయికబ్రాహ్మణుఁడు నిన్నటిసంగతిని గుఱించి చాలఁ బశ్చాత్తాపపడుచున్నాఁడు.

ఒకవిశ్వస్త—నీవేమి యెఱుఁగుదువు పత్తితంత్రీ! అప్పుడు నీమనస్సు నీకుస్వాధీనమైనదా? భక్తిలోమునిఁగి

పోయినది. కఱ్ఱమాత్రము భూమిమీఁదఁ బడిపోయి నది. నీ వేమిచేయఁగలవు?

పరశురామకవి—

క. ఎప్పటికెయ్యది వచ్చునో
చెప్పంగాలేము దైవచిత్తము నెఱుఁగన్
డెప్పరము! తద్విలాసము
చొప్పున సర్వంబు నడచుచుంబోవుఁగదా!

విశ్వస్త—అవును! నాయనా! అవును? భగవద్విలాసము గాక మఱియేమున్నది.

ఒకసభ్యుఁడు— ఆహా! సాక్షాత్తు మహానుభావుఁడు! మాట్లాడుచున్నట్లే మహామధురముగా మంచిశేమాషా గాఁ జెప్పఁగలఁడు పద్యము లీయన.

పరశురామకవి—(సంక్యావసానముల యందుఁ గొంచె మాపుచు)

ఉ. ప్రొద్దుట లేచినాఁడు—పరి
పూర్తిగఁ జల్దిభుజించినాఁడు

ఒకసభ్యుఁడు—(ప్రక్కవానితో) ఇది యేమియోకాని యీయన యుపన్యాసపద్ధతియంతయు బహువిచిత్ర ముగాఁ గనుపట్టుచున్నది. ఇంతవఱకు రెండుపన్యా సములు విన్నానా? ఏవిషయ మారంభించినాఁడో, యేమిచెప్పినాఁడో యేమిచెప్పఁబోవుచున్నాఁడో, యెందులకుఁ జెప్పుచున్నాఁడో, యెట్లు ముగించు చున్నాఁడో యేమియుఁ దెలియదు గదా? వట్టి యధ్వాన్నము.

ప్రక్కవాఁడు—అయ్యా? యీయనదంతయు నిదియొక తృతీయపంథ.

మఱియొకఁడు—అదికాదు! పాప మీయన కేవలము పూర్వాచార పరాయణుఁడు. ఇప్పటి స్పీచెస్ (speeches) సంగతు లంతగా నెఱుఁగఁడు.

సబ్జక్టు (subject) ఎట్లు ఏనలైజ్ (analyse) చేయవలెనో, యెట్లు బిగిన్ (begin)చేయవలెనో, ఎట్లు డెవలప్ (develop) చేయవలెనో ఏట్లు కంక్లూడ్ (conclude) చేయవలెనో తెలియదు. అదికొంత యిం గ్లీష్ (English) స్టడీ (study) చేసినఁగాని పట్టుపడ దు. దట్స్ ఏన్ ఆర్టు (That's an art).

అన్యుఁడు—అయ్యా! అట్లుకాదు; తమరన్యథా తలఁచు చున్నారని నాయభిప్రాయము. క్షమింపవలయును; ఆయన పైకట్లుశుద్ధవైదికబ్రాహ్మణునివలెఁ గనుపట్టి నంతమాత్రమునఁ దెలియనివాఁడని నే ననుకొనను; తానుజెప్పఁదలఁచుకొన్న విషయము నేదో చమ త్కారముగా మార్చి నవీనపద్ధతిగా శ్రోతల హృద యములందుఁ బ్రవేశపెట్టవలయునని యిట్లొకక్రొత్త ఫక్కి నవలంబించినాఁడని నేను నమ్ముచున్నాను. కొంచెముపరిశీలనపూర్వకముగఁ జిత్తగించినయెడలఁ దమకీసంగతి విశదము కాఁగలదు. చూఁడుఁడు! మొదటియుపన్యాసమంతయు జ్ఞానవిషయికమైనది. రెండవది భక్తికి సంబంధించినది. ఇది మూఁడవది గదా? ఒకవేళ వైరాగ్యమును గుఱించినదియైనఁగా వచ్చును. అంతయు విన్నతర్వాత విమర్శింతము.

పరశురామకవి—

................................రెం
డెద్దుల మోటఁగట్టి పొల
మెల్లను నిండఁగ నీరుతోడి నాఁ
డెద్దియు బద్ధకంబెఱుఁగఁ
డించుక యేనియుఁబాప! మంతలో
నిద్దురవోయినట్లె మర
ణించినవాఁ డొకచేనికట్టపై.

ఒకకృషికుఁడు—ఔను! పాపము! దుక్కముక్కలాగు న్న ధూళిపూడి బుచ్చెన్నకొడుకు దుక్కిచేను గట్టు మీఁదనేకాదు కిక్కురుమనకుండ గ్రుక్కడుప్రాణ ము నిట్టే విడిచివేసినాఁడు?

పరశురామకవి—

క. పాముని విషమని యెదియో
గామని దయ్యమని వానిగ్రహగతియని యే
మేమో నొడివిన నెదియో
యీమరణమ్మునకు హేతు వవిదిత మ [య్యెన్.

ఒకఁడు—"శుభమస్తు" అని ముందుగా ఆసంగతి యేం చుల కిప్పుడు? సుభము పలుకురా పెండ్లికొడుకా యనఁగా అవిరేణికుండలదగ్గరఁ జచ్చినట్లే కూర్చుం డెన నన్నాఁడఁట. అలాగున నున్నది యీయన చెప్పునది.

పరశురామకవి—

శా. వార్చెన్ భోజన మాచరించెఁ
దొడిగెన్ వస్త్రంబు లేవేవియో
కూర్చెన్ భూషణముల్ సభాస్థలమునం
గూర్చుండి కార్యక్రియా
చర్చల్ గొన్నియొనర్చెఁ దక్కిన సభా
స్తారుల్ విలోకింపఁగాఁ
గుర్చీలోననె కూరుచుండి యసువుల్
గోల్పోయెఁ జిత్రంబుగన్.

ఒకఁడు—అవు నవును మొన్న నీనడుమనే— ఈసంగతి జరిగి యెంతో కాలము కాలేదు.

పరశురామకవి—

క. హృద్రోగంబునఁ డది శ్లే
ష్మోద్రేకంబనుఁడు! లేకయొండొక్కఁడనుం
డద్రివలెఁగూలె నపుడా
భద్రాకారుండు తత్సభామధ్యమునన్.

ఒకసభ్యుఁడు—రియల్లీ! ఇట్ మస్టు బి ఏ హార్టుడిజీజ్! Really! it must be a heart disease.

పరశురామకవి—

ఉ. కూరిమిమీఱఁ దల్లి తన
కుంగల వస్త్రవిభూషణాది శృం
గారవిశేషయుక్తిఁ గడు
గారవ మొప్ప నలంకరించి ము
ద్దారఁగఁ బాఠశాల కడ
కప్పుడ పంపిన చిన్నిబాల దు
ర్వారవిధి ప్రభావమునఁ
బ్రాణముఁ గోల్పడెఁ బాఠశాలికన్.

ఒకసభ్యుఁడు—(విచారముతో) నారాయణ! నారా యణా! యెంతపని జరిగినది?

పరశురామకవి—

క. బడినుండి మిగుల నాఁకటఁ
బడి తనగారాబుపట్టి వచ్చునటంచున్
వడివడి గిన్నియ నన్నము [గున్
నిడి యెదురుగులుచూచు తల్లి యేమియెఱుం

(సభ్యులలోఁ బెక్కండ్రు వస్త్రాంచలములతోఁ గన్ను లొత్తుకొనిరి.)

పరశురామకవి—

క. తన ప్రాణవల్లభుఁ డొక
యనికిం జని శత్రునిహతుఁడై మడసినవా
ర్తను విన్న వెలఁది తాని [గటా!
ల్వాన నీరయి యట్టియసువులు వోఁబంగెఁ

ఒకవిశ్వస్త—ఆహా! ఎంత పుణ్యాత్మురాలనమ్మా! తల్లీ! విధవ బ్రతుకు బ్రతకకుండ వేగముగా వెళ్లిపోయి నావు మా తల్లీ! పూర్వపుణ్యబలముగల యిల్లాలవు గనుక పుణ్యస్త్రీమరణము తటస్థించినది. ఇదిగో! నావంటి నిర్భాగ్యురాండ్రము! ఈలాగున బ్రతికి యున్నాము; ఎందుకు పనికిరానిబ్రతుకు?

పరశురామకవి—

గీ. తనవిభుండు రణంబున ధైర్యశౌర్య
సాహసంబులఁ బగతుర సంహరించి
మెచ్చుఁగన్నట్లు శుభవార్త వచ్చెనేమొ
యనుకొనినకాంత కావార్త యశనియయ్యె.

ఒకసభ్యుఁడు—అయ్యో! పాపము! ఎంత యాశాభంగ మైనది!

పరశురామకవి—

మ. తన కేదో యొకదైవయోగమున వి
త్తం బెంతయో ప్రాప్తమ
య్యె నటం చిట్టె హఠంబుగా వినిముదం
బెంతేని యుప్పొంగ "ఆఁ"

యని యూఁకొట్టి యకింపనుం డొకఁడు
ప్రాణాపాయముం జెందె బా
చినవార్లా నిదేమిచిత్రమని ని
శ్చేష్టత్వముం జెందఁగన్.

ఒకఁడు—అవును! ఇది ఆవనసుమ నక్కడనో జరిగినదని విన్నాను.

మఱియొకఁడు—కంపరాష్ట్ర గ్రామములో— "కనకదండి కాంతయ్య" అనే కంట్రాక్టరు—కలకత్తా కంపెనీలో—లాటరీ గెలిచినల్ల లాభము వచ్చినదని విని సంతోషముచేతనే కాదా వారు ప్రాణము విడిచిపెట్టినాఁడు?

పరశురామకవి—

క. సంతోషమె విషమించెనో!
వింతయె యాతనికి నట్లు విషమయ్యెనో! త
త్స్వాంతంబున నేమయ్యెనో!
యంతంబు నరించెనపుడె యాత్మణమున నే.

ఒకసభ్యుఁడు—ఎక్సెస్ ఆఫ్ ఎనీ ఫీలింగ్ ఈజ్ వెరీ డేంజరస్ (Excess of any feeling is very dangerous).

పరశురామకవి—

మ. అనుఁగుంబ్రేయసిఁగూడి రాత్రిరి ముదై
కాయత్తచిత్తంబుతోఁ
దనశయ్యంబవళించియుండి నిజకాంతా
బాహుబంధంబులో
నసె ప్రాణోత్క్రమణంబుఁగాంచెను గటా!
నాథుండు; తత్పత్ని హా
యని యల్లాడుచు శోకనిర్దళితచి
త్తాంభోజయై క్రుంగఁగన్.

ఒకఁడు—ఇది మఱియుఁ జోద్యముగా నున్నది.

పరశురామకవి—

ఆ.వె. ప్రాణకాంత బాహుబంధంబునందుండి
కాలపాశబంధకలితుఁడైన
మనుజుఁడేటికట్టి మరణంబుఁజెందెనో
మనకుఁదెలియఁదగిన మార్గమేది?

ఒకసభ్యుఁడు—విచిత్ర హేతుకల్పన మొక్కటియే దానికి మార్గము. వేఱొకమార్గ మేమున్నది?

పరశురామకవి—

ఉ. బాలికగాదు! కుందనపు
బంగరుబొమ్మ! సమస్తసద్గుణ
శ్రీలకుఁ బట్టుగొమ్మ! కడు
చిన్నతనంబున రోగబాధకుం
బాలయి "లేదు, లే" దనఁగఁ
బ్రాణభయంబున నుండి వెండియున్
గాలికి మళ్లినట్లు బ్రతుకం,
బదియేఁడులునిండె దానికిన్.

ఒకవనిత—ఇదియునుజావుకబురేనా యేమిటినాయనా?

పరశురామకవి—

చ. పరిణయయోగ్యమౌ వయసు
వచ్చుటఁ గన్గొని తల్లిదండ్రు లా
తురపడిపెండ్లికై మిగులఁ
ద్రొక్కిసలాడుచు సత్కులీనుఁడౌ
వరునొకనిన్ వరించుకొని
వానికిఁ గన్యక నీయనెంచి యా
జరుగఁగఁబోవు పెండిలికి
సన్నహానంబొనరించి రంతయున్.

ఒకవృద్ధస్త్రీ—(కన్ను లొత్తుకొనుచు)చాలు నాయనా! ఇక నెందుకుఁ జెప్పెదవు? మా వెంకమ్మతల్లి మాయకూఁతురిమాట జ్ఞాపకము వచ్చుచున్నది.

ఉ. వత్తురు పెండ్లివా రికఁ; వి
వాహము రేపగు; నంచు సర్వమా
యత్తము సేయఁగాఁబడియె
నేమనిచెప్పఁగవచ్చు నంత నా

పుత్త్రుడిబొమ్మయట్టె చనిపోయెఁ
బురాకృతకర్మబద్ధులై
యుత్తలపాటుతో జనకు
లొక్కుమొగిఁ దురపిల్లుచుండఁగన్.

(సభలోఁ బెక్కండ్రు కనులనీరు దుడిచికొనుచు "హరి హరీ" యనిరి).

పరశురామకవి—

గీ. చిన్నతనమున జబ్బెంత చేసినపుడు
బ్రదికి, తుదకిప్డు పదియేండ్లప్రాయమందుఁ
బెండ్లియత్నంబు జరిగినపిదప నేల
యెగిరిపోయెనో యాబాల? యేరికెఱుక?

ఒకఁడు—ఎవ్వరికెఱుక? నాయనా! అంతయు భగవ న్మాయ!

పరశురామకవి—

మ. భగవంతుండగు రామభద్రుని
గృపాపాత్రేఁబు భక్తిఁ భజిం
పఁగ భద్రాచలయాత్ర కేగుటకునై
భావించి సంతోషమొ
ప్పఁగఁ బెక్కండ్రొకనౌక నెక్కి
గృహిణీబంధ్వాప్తభృత్యాదియు
క్తిగ గోదావరి నావమున్గుటయు
వార్ధిం దేలి రయ్యయ్యయో!

ఒకసభ్యుఁడు—కటకటా! సంఘుమరణము!

పరశురామకవి—

గీ. తప్పుపనికాదు! భగవంతుదరిసెనంబు
సేయఁబోవుచునున్న యాస్తికులు వారు!
కొందఱేనియు దరిఁజేరఁగూడదొక్కొ?
సంఘుమరణం బదట్లేల సంభవించె?

(పరశురామకవిగారి యుపన్యాసమునందలి పరిశుద్ధ భావములు బాగుగా వినుటచేఁ బరమవైరాగ్యము నొంది కొందఱు సభాసదు లెవ్వరును సద్దుచేయక శాంతముగా వినఁగోడఁగిరి).

పరశురామకవి—

గీ. గట్టికుండయె; పదిలమ్ముగా బుజానఁ
బెట్టుకొని నీళ్లకనిపోగఁ బేదరాలు
నీళ్లతోవచ్చునప్పు డానిండుకుండ
వింతగా దారినడుమను విచ్చిపోయె!

క. మును పెన్నఁడుఁ దఘ్ఘటమునఁ
గొనితేలేదా! జలంబుక్రొత్తగ నేఁడే
కొనివచ్చెనె? యానాఁటిది [చెప్పుఁడా!
తనయంతనె పగులుననుచుఁ దలఁచునె

ఉ. గట్టిగ నున్నయట్టులనె కన్పడెఁ
గన్పడి చూచుచుండఁగా
నిట్టె చితుక్కుమంచు నశియించెఁగదా
యప్పుడట్లు తద్ఘటం
బట్టిదె యీశరీరమును నంత
కు మిక్కిలి దీనికేమియుఁ
గట్టితనంబు నిశ్చతయుఁ గానఁ
గరాను తలంచి చూడఁగన్.

ఆ. వె. అట్లుకుండపోవుననియామె యెఱుఁగదు
తాను దానికెదియు హానిగలుగు
తప్పు సేయలేదు; తనయంత తద్భాండ
మవిసిపోయె; నేమి యనఁగ వచ్చు?

క. ఏరోగంబును లేకయె
యారోగ్యబలాతిశయ సమన్వితులై యొ
ప్పారెడువారలు నయితం
బీరీతి గతించుచుండ నిదియెటు సతమా?

ఉ. గాలికిఁ జాప యెత్తుకొని
గట్టును దెన్నును గానలేక యు

య్యాలలనూఁచు భంగనివహంబున
కల్కుచు ఘోరవార్ధిలోఁ
దూలెడునావ యెప్పుడెటు
త్రొట్రిలి మున్గిన మున్గిపోవు; నే
గాలియొ యేతరంగమొ విఘాతి
మొనర్చక పోవ దెప్పుడో.

ఉ. వాయువశంబునన్ జ్వలితవర్తి
బలంబున నింటిమీఁదికిం
బోయిన యొక్క కాగితపుబుట్ట
వియత్స్థలి నెంతసేపు సా
పాయము గాకయుండు ననపా
యసుఖస్థితి నెంతకాలమా
వాయుపథంబునం దటులు వర్తి
లనేర్చు! వచింపుఁడీ బుధుల్.

గీ. గాజుబుడ్డికిఁ గలయంత గట్టితనము
గానరా దొక్కయప్పుడీ కాయమునకు
గాలిలోనున్న దీపంబుకరణి నిత్య
విప్లవాపహతంబు జీవితము తెలియ.

క. తములము సేయుచుఁ బానీ
యముఁ గ్రోలుచుఁ గూరుచుండి యన్నముఁ
దమయంతనె యిట్టె ప్రా [దినుచున్
ణములన్ విడనాడినట్టి నరులం గనమే?

గీ. సంతసంబునఁ జావు; విషాదమునను
జావు; తుమ్మిన దగ్గినఁ జక్కనగినఁ
దిన్నఁ దినకున్న నూరకేయున్నఁ జావు;
చావునకుఁ గారణం బేమి కావలయును?

ఆ. గీ. కాన మృత్యుదేవి కన్నుఁ బ్రామినవారి
గాన మెందు; ముందుగాని వెనుకఁ
గాని యెల్లవారు గతియించువారలే
పుట్టినట్టి దెల్ల గిట్టునదియె.

గీ. అరసి చూడఁగ సూక్ష్మతృణాగ్రమందు
వ్రేలుచుండెడు హిమబిందు విధము గలిగి
నిత్యపతనోన్ముఖం బయి నిలిచియున్న
దేహ మస్థిరమనఁగ సందేహ మేమి?

ఉ. ఇంత యశాశ్వతంబయిన
యీతనువున్ మదినమ్మి మానవుం
డెంతయు విఱ్ఱవీఁగుఁ దన
కింక నొకప్పుడుఁ జావులేని య
ట్లంతియెకాని మృత్యుముఖ
మందె వసించు టెఱుంగఁ డద్దిరా
వింతలలోన వింత యిది!
విశ్వమునం బరికించి చూడఁగన్.

చ. ఎఱుఁగుదు మెల్లవార మిది
యిట్టు లశాశ్వతమంచు నైన నే
మఱుదుము నిత్య; మద్దియొక
మాయ; తదీయ విచేష్టితంబులన్
మఱపు జనించుచుండు మన
మానసమం; దటుగాన మాయకుం
దెరవు నొసంగ రాదెపుడు
ధీబల సంపద పెంపుమీఱఁగన్.

గీ. ఇంతకును జెప్పవలసిన దేమియనఁగ
నెప్పటికి నేదియెట్లౌనొ యెఱుకపడదు
నూనముగ నుత్తరక్షణమైన మనది
గాదు; దీనిని మఱవఁగా రాదు మనము.

(తల క్రిందికివంచి)

మ. ఇదిగోఁ జూడుఁడు! బొప్పిగట్టెఁ దలపై;
నీదెబ్బ యేసుంత బె
ట్టిదమై తాఁకిన వెండి యీ మహితపీ
ఠిన్ నిల్చి మీసన్నిధిన్

బదిలంబొప్ప నుపన్యసించుట
కుఱాఁ బాటిల్లకేపోవు; ని
ట్టిదే—యీపాటిదే—యీశరీరమును బా
టింపంబనేమున్నదిక్.

సభ్యులు—అయ్యో! పాపము! గట్టి దెబ్బయే తగిలినది.

పరశురామకవి—

క. తగిలిన దెబ్బకు నేమది
నొగులుటలే; దిపుడు దాన నొప్పియులే;గ
తగువారలకు ననంతు [టిక్.
ష్టిగ మెలఁగితిఁ గాయటంచుఁ జింతిలుచుం

సభలో నుండి యొకరు—(ప్రకాశముగా) అయ్యా! మీరేమిచేసినారయ్యా! జరిగినదేదో జరిగిపోయినది. మీరట్లు చింతింపవలసిన పని లేదు.

పరశురామకవి—

క. నిత్యము సన్నిహితంబై [యుక్
మృత్యువుమానవుని వెంట మెలఁగుచునుం
సత్య మిదియనుచు లోక [రొకో?
స్తుత్యులు మనపూర్వపండితులె నొడువ

క. తనువిది యశాశ్వతమెగా
యని రేపటిభుక్తిముక్తు లరసికొనకయుం
డనురాదు! శాశ్వతంబను
కొనినట్టులుగింజుకొననుగూడదుమనకున్.

ఆ. అయ్యలార! మీరలందఱుఁ బరమాద
రమున వచ్చి, యెదియొరిమ్యవిషయ
మితఁ డుపన్యసించు నలమిమై వినవచ్చు
నని తలంచియుందు రాసఁ జెంది.

ఉ. అంతటివాఁడఁగాను; వివి
ధార్థములన్ వివరించి మి కునే
సంతసముం బొసఁగూర్చుటకుఁ
జాలినవాఁడనుగాను! గాని, మీ
రింత దయాస్వభావమున
నిచ్చోటకుం జనుదెంచి యూబుజ
న్వాంతత వెల్లడించితిరి;
చాలముగింపు ఘటిల్లె నామదిన్.

క. నిన్నటివిషయము మీతో
విన్నప మొనరించి సెలవు గైకొనఁగనే
నిన్నిపచించితి తప్పులు [రా!
మన్నింపుఁడు సరససహృదాత్మ మానసులా

అని పరశురామకవిగారు వుపన్యాసపీఠమునుండి దిగిరి. సభ్యులందఱును కరతాళధ్వనులు గావించిరి. సభ ముగింపఁబడెను.

ఇట్లు,

త్రిలింగ దేశాభివర్ధనీ సభాంధ్ర
సంక్షిప్త లేఖకుఁడు.



# వేసవి

చావలి సుబ్బారాయుడు గారు

వేసవి వచ్చెనాయె నిఁక వేడిమి కోర్చుట కష్టమాయె మా
కోసము తల్లిదండ్రు లటఁ గూరిమి గైకొనియుండుటాయె నీ
మాసపుభాగ్యమేమి! కడు మంచిదిగూడి సుఖంపుమంచు మా
భ్యాసను మించుటాయె సుమహారము లెక్కువయాయె మాకు నా
వాసము దూరమాయెఁ బెను బాధలపా లగుటాయె నింక నా
యాసము నెక్కుడాయె మఱి హాయిని గాంచుట సున్నయాయె మా
గ్రాసము తక్కువాయె నిఁక ఘర్మకణంబులు జిమ్ముటాయె మా
టాసులు బంద్ గాయె నిఁక దప్పము వీడుట తప్పదాయె మా
హాసము వృద్ధియాయె మరియాదకుఁ బూర్తిగ భంగమాయె నీ
వేసము కష్టమాయె నిటు భేషజమంతయు వీడుటాయె మా
వేసిన వస్త్రులన్నియును వెలతనంబు వహించుటాయె సం
త్రాసము దూర్చు సత్తి పెనుధూళి కనుంగవ గప్పుటాయె బె
ల్లాసగఁ జెప్పినట్టి కవిత హాస్యమునొందుట గల్గుటాయెఁ బైఁ
బూసిన పూఁతలన్నియును బూర్వపురీతిని బొందుటాయె మా
నాసికయందు నీరు కడు నాట్యముచేయుట గల్గుటాయెఁ గా
మూసినకన్ను లెంతకును మూఁతలు వీడకయుండుటాయెఁ గ్రొ
న్నిమ్మాసము లంతకంత పొలిమేరలు మీఱుటయాయె నక్కటా
మాసిన దేహమున్ బిగుల మార్దవహీనతయాయెఁ బక్వహా
కోసిన పండ్లకన్నిటికిఁ గూసలు లేచుట గల్గుటాయె హా
వేసరి యుండ్లలోపలను గడు వింతగ నుండుట గల్గుటాయెఁ గా
కేసరివంటి మానవులు కించనుబొందుట తప్పదాయె వే
కాసులనిచ్చినన్ మనకుఁ గాలముపుచ్చుట కష్టమాయె బెన్
మోసముచేయువారలును మూలలఁ గూర్చుని యుండుటాయె నీ
వాసిని జెందుభోగులును భాగ్యము వీడి కృశించుటాయె స్వా
శ్వాసము పేతులై బయట గాటపునిద్రకులోను గాఁగ బల్
దోసపుఁ దస్కరాళి యిలు దూఱి హరించుట లెక్కువాయెఁ బో,
పోసిన చల్లనీరు మఱి భూమిని బూర్తిగ నింకుటాయె ము
క్కోసపుగాలియైన నిటు వీచుట దుర్లభమాయె వేసవిం
గాసిలుచుంటఁ దక్క సుఖకారణమున్నదె? చూడగా సుఖా
భాసముగాక యింక భగవానుఁడు గూర్చిన సౌఖ్యమేదియో?






[వెనుకటి సంచిక తరువాయి]

రంగము ౬

(ప్రవేశము సలీము, వంది)

వంది

ఆది మిత్రోష్ణముల్ గడచి
 నంతన మధ్యమునందు భీష్మముల్
మేదుర మల్లికా సుమసమే
 తములై యట స్వచ్ఛవాసనా
శ్రీదము లంతకంత శిశిరీ
 భవదంగములైన గ్రీష్మవే
ళాదివసంబు లివ్వి సుఖ
 లాలసదివ్యజనైక భోగ్యముల్.

విరచిత మల్లికా ప్రసవ
 వీధి చరన్మధుకృత్కుమారికా
పరిణతగానరమ్యములు
 భాసురముల్ శ్రమవారి దేహసం
చరదమృతానిలార్భక ప్ర
 సాదితసౌఖ్యము లంగనా మనో
హర దృగనంత కాంతి మధు
 రాకృతు లీదివసంబు లెంతయున్.

ఈనవమల్లికాకుసుమ
 మెంతగభృంగకుమారుచిత్తమున్
దీనతఁ బొందఁజేయు సము
 దీర్ణనిజాంచిత పత్రనిర్గత
శ్రీనవమాధునిర్ఝర వశీ
 కృతమున్ బొనరించి దివ్యగం
గానళినోదరభ్రమిత
 గానము భృంగ మిఁకెంత బేలయో!

సలీము

ఏమయ్యా! మీరు రాజపుత్ర దేశస్థులా?

వంది

చిత్తము ప్రభూ!

సలీము

మీ రెవ్వరికొలువులో నున్నారు?

వంది

రాజా మానసింగుగారి కొలువులో.

సలీము

నేడిట్లు వచ్చితి రేమి?

వంది

జహాపనాహ్! తమరిదయ సంపాదన కొఱకు

సలీము

మాదయ యెందుకు?

వంది

మహాప్రభువులు.

సలీము

(హాసము)

వంది

శ్రీమన్మంజులతాగ్రభాగముల వా

సించెఁ లతాంతానళుల్
ప్రేమోద్దీపితలైన కన్యకల శ్రీ
కృష్ణప్రభా కేశపా
శీమధ్యంబుల నందమై తిరుగు వో
లేదీ వసంతాంత వే
ళామల్లీ లతికావితాన సుమ
మాలావాసనానిర్ఝరుల్.

ఈభృంగమ్మిది యెంత జేలయొకదా
బృందారకాంభస్సర
శ్రీభంగంబుల నూగెడుఁ గనక
నీరేజమ్ములో తేనియల్
క్షోభించుఁ దనకోసమై యిటుల
నిల్చుఁ దాను నైరంభసం
బాభూమీతటంబులందు తుమ్మిపువు
లం దన్నన్న! యీరీతిగా!

సలీము

ఇతడు మరలమరల నదేగీతము పాడుచున్నాడు. నారహస్యము వ్యక్తమైనదా?

వంది

ఈక్షోణీస్థలిఁ బాసి పద్మముల
కెంతేశోకముఁ గూర్చుచుఁ
లాతూరక్తిమపోవనల్లనగుచుఁ
లాలిత్యముఁ వీడుచుఁ
ప్రక్షీణమ్మయి సాంధ్యరాగములు
దిక్పర్యంతముఁ బోయెడిఁ
పక్షుల్ శ్రేణులుగట్టి యంబరమునఁ
బాఱుఁ చలత్పక్షముల్.

ఉత్తమజాతిభృంగమ వ
హా! నిను మెచ్చగవచ్చు లెమ్ము నీ
చిత్తము నీచభావముల
చెందదు చందిరులేత వెన్నెలల్
పొత్తులుగా వయఃపటిమ
పొందిన వెన్నెలపుల్గు లింటిలో
జొత్తుల కాంతికిఁ సొగసి
సోలునె? అన్న? కుమారభృంగమా!

సలీము

ఏమయ్యా! వందీ! ఇంక చాలును పొమ్ము.

వంది

సెలవుతీసికొందును!　　[నిష్క్రి]

సలీము

అనిర్భేద్యమైన యీరహస్య మెట్లు బయలు ప్రాకినది? ప్రియా! అనార్కాళీ! మనలో నీ రహస్యమును చెప్పువా రెవ్వరును లేరే. నా చహారా కనిపెట్టిన రాజభటులును, పురుషులును నీవిషయము కనిపెట్టిరా? నాప్రియురాలియెడ వైముఖ్యము గలిగించుట కిది పన్నబడి నట్లున్నది. దేవీ! నాహృదయము నీయెడలనే బద్ధమైనది. ప్రాణములు పోవలెను. నీయందు నేను చలించను. ప్రియా! నీవను మానించకుము.

ఈరహస్యమే వెలికి ప్రాకినచో దీనికి తగినట్లుగా చక్రవర్తి యేదైన విచారించడా! మాయనార్కాళియెడ ధూర్తముగఁ బ్రవర్తించెనా! ఏమి చేయవలయును? ఏమో! నామనస్సు నిలుకడ తప్పినది. ఏమిచేయుదును? అయ్యో!

సేవకుడు

[ప్రవేశించి] జహాపనాహ్!

సలీము

ఏమి!

సేవ

అనార్కాలీ నృత్యము చేయ బోవుచున్నదట, ప్రభువులను రమ్మనుచున్నారు.

సలీము

(కోపముమ్రింగి) అప్పుడేనా?

సేవ

చిత్తము!

సలీము

నేనింకను భోజనము సేయలేదు.

సేవ

దేవరవారి చిత్తము.

సలీము

కానిమ్ము! వచ్చియే భోజనము చేసెదను.

(తెర)

రంగము ౭

(ప్రవేశము. అనార్కాలీ, అజీజ్, రుసీ, షహాలీ, సలీము, సేవకుడు.)

సలీము

ఏమిరా! మా తండ్రిగారు రాలేదేమి?

సేవ

సౌధగవాక్షము గుండ చూచుచుందురట. నృత్యము ప్రారంభింపు మన్నారు.

సలీము

మానసింగుగారైన రాలేదేమి?

సేవ

వారికి శిరోభారముగా నున్నదట.

సలీము

తక్కిన సరదార్లను రాలేదే యెవ్వరును!

సేవ

జహాంపనాహా! తెలియదు.

సలీము

ఈనృత్యము నేను చూచుటకేనా! అట్లైనచో నా గుడారము నద్దనే చేయించుకొనవచ్చును.

సేవ

ఖుదావంద్! సార్వభౌములు గుడారమునుండి చూచుచున్నారు.

సలీము

నేనును నా గుడారము నుండియే చూచెదను.

సేవ

ప్రభూ! తమరిందే యుండవలెను. వచ్చినవారు వెళ్లగూడదని రాజాజ్ఞ!

సలీము

మేమేమి శత్రువులమా! మాకు తాఖీదులు చూచి మమ్ము బంధించుటకు!

సేవ

సేవకుని క్షమింప వలయును.

సలీము

(కూర్చుండును)

సేవ

అనార్కాలీ! నృత్యము చేయుము.

అనా

(తనలో) ఈ యవమాన మేమిటి?

సలీము

నీవురా ఆజ్ఞ యిచ్చునది?

[భారతి మాఘమాససంపుటము ఏడవసంచికలోని 'రాజగృహము' అను వ్యాసమునకు సంబంధించిన చిత్రములు]

చిత్రము ౧. విపుల, రత్నగిరుల మధ్యమార్గము



సేన

చక్రవర్తిగారి యాజ్ఞ నిర్వర్తించుచున్నాను ప్రభూ!

అనా

(సలీము వంక దిరిగి) ప్రభూ! ఆజ్ఞయా!

సలీము

(తలవంచుకొనును).

అనా

(నృత్యము).
నేనెవ్వరను నాథ నీవెవ్వరవు నాథ
నేనె నీవును మఱి నీవ నేనును నాథ.
ఈదేహములు రెండు నింత భేదము చేయు
లేదు భేదము మహాలీల నీకును నాకు.
కడలి లోపల నీరు కదలి యావిరి రీతి
వడి వానయై నదీ వైఖరి కలయును.
నీ నాకు భేదమ్ము నిర్ణయించగలేరు
హేనాథ! దివ్య విద్యానాథులునుగూడ.
తెలిసి సుజ్ఞాన దీధితులు గాంచు నొకండు
తెలిసియు నజ్ఞాన తిమిర మొందు నొకండు.
ఒక్కకొమ్మన పూవు లుద్భవించును రెండు
ఒక్కగాలి చలించి యొక్కచోట లయించు
నీ వెవ్వరవు నాథ నే నెవ్వరను నాథ
నీవె నేనును మఱి నేనె నీవును నాథ
ఈ దేహములు రెండు నింత భేదముచేయు
లేదు భేదము కృపాలీల! నీకును నాకు.
(అనార్కాళి నవ్వును.) (సలీము నవ్వును.)

అనా

ఈదేహములు రెండు నింత భేదము చేయు
లేదు భేదము కృపాలీల నీకును నాకు.

సేవ

(ప్రవేశించి) జహాపనాహ్! చక్రవర్తిగారు రమ్మనుచున్నారు.

(సలీము నిష్క్రమించును.)

అనా

(ఆగును.)

సేవ

(ఆమెను బంధింతురు.)

(తెర.)

రంగము ౮

(ప్రవేశము సలీము, నిద్రపోవుచు)
(వృద్ధసేవకుడు ప్రవేశించును)

వృ. సే.

ప్రభూ! ప్రభూ!

సలీము

(లేచి) ఎవరు నీవు?

వృ. సే.

ప్రభూ! నెమ్మదిగా మాటాడుము!

సలీము

ఎవరు నీవు?

వృ. సే.

నేను.

సలీము

నీవా! తాతా! ఇప్పుడు వచ్చితివేమి?

వృ. సే.

నాయనా? ఏమిచేయుచుంటివి?

సలీము

నిద్రపోవుచుంటిని.

వృ. సే.

మనస్సున కంతసుఖముగా నున్నదా?

సలీము

కొంచె మాందోళనగానేయున్నది కాని, మా నాయనగారి సమాదరవచనములచేత కొంచె మోదారినది.

వృ. సే.

మీతండ్రి యేమన్నాడు?

సలీము

మిక్కిలి సమాదరించి పంపించినారు.

వృ. సే.

నీవు ప్రమత్తత గలిగియుంటకా?

సలీము

విశేషములేమో చెప్పుము.

వృ. సే.

అనార్కాలికి రేపుప్రొద్దున నురిశిక్ష విధించినారు.

సలీము

(స్తబ్ధుడై పోవును.)

వృ సే.

ప్రభూ! అనార్కాలి బ్రదుకగలదు.

సలీము

(నిశ్వసించును.)

వృ. సే.

అనార్కాళిని బ్రతికించుకొనుట నీచేతిలో నున్నది.

సలీము

(ఊరక చూచును)

వృ. సే.

ఇట్లయినచో లాభములేదు. ఈరాత్రియే నీవు తొందరపడవలయును.

సలీము

ఇప్పుడేమి చేయవలయును?

వృ. సే.

పోయి కారాగృహాధికారికి లంచమిచ్చి యామెను వదలించుకొని దాటిపోవలెను.

సలీము

ఆమె కురిశిక్ష యెందులకు?

వృ. సే.

నృత్యముచేయుచు నీవంకచూచి నవ్వినదట. రాజకుమారులను మోసము చేసి తనవలలో వేసికొన ప్రయత్నించుచున్నదట. అందుకని.

సలీము

ఆహా!

వృ. సే.

మీరిరువురును వివాహము చేసికొనిరని వదంతి ప్రబలినది. ఇదివరకే యేవిధముగా నైన నామెను హరించగా ప్రయత్నములు చేయుచున్నారు. రాజధానిలో నీవని జరిగిన కల్లోలము గలుగునని యీ యాజ్ఞ నీయూరులో నిచ్చుట కిచ్చుటకు వచ్చిరి.

సలీము

ఈమాత్రము వార్త నాకిది వరకు చెప్పక పోతివా!

వృ. సే.

చక్రవర్తి నామీద కన్ను వైచియే యున్నాడు. నే నెప్పుడు బయలుదేరి వచ్చినను నా కురిశిక్షయే. ఇప్పుడు కన్నుగప్పి యేమయినను సరే యని వచ్చితిని.

సలీము

ఇప్పుడేమి చేయవలయును?

స్నే.

కారాగృహము వద్దనున్న వానికి లంచమిచ్చుట దక్క యింకొక వీలేలేదు.

(తెర)

రంగము ౯

[కారాగృహము.] ప్రవేశము. అనార్కాలి, (మూర్ఛిత సలీము.)

సలీము

అయ్యో! ప్రియురాల! (మూర్ఛపోవును.)

కావలివాడు

(ప్రవేశించి) ఆహా! ఇదియేమి? ఇరువురు నిట్లుండిరి; చక్రవర్తికి యుసురు తప్పక తగులును. (నీళ్లు తెచ్చి చల్లును.)

సలీము

(లేచి) దేవీ! (అనార్కాళిని కౌగిలించుకొనును.)

అనార్కాళి

(లేచి)మనోహరా! (ఇర్వురును కౌగిలించుకొని యేడ్తురు.)

కావలి

జహాపనాహ్! ఇట్లు మీరిర్వురును దుఃఖించుచుండ నెట్లు? ప్రభూ! కాలముగడచుచున్నది.

అనార్కాళి

జహాపనాహ్! మీ రిచ్చటి కెట్లు వచ్చిరి?

సలీము

ఈ మహానుభావుని దయవలన.

కావలి

జహాపనాహ్! మాట్లాడుట తొందరగా కానిండు. నే నిప్పుడే వచ్చెదను. కోడి కూయువేళ గూడ నైనది.

[నిష్క్రమించును.]

అనార్కాళి

అయ్యో! తెల్లవార వచ్చినదా! (ఇరువురును కౌగిలించుకొని యేడ్తురు.)

సలీము

ప్రియా! ఏడ్చి యేమిలాభము? మనము పారిపోవుదము రమ్ము!

అనార్కాళి

ఎచ్చటకు?

సలీము

ఏచ్చటకో!

అనార్కాళి

ప్రభూ! నామూలమున నీకు రాజ్య నాశన మేల?

సలీము

నీవు లేకున్న ప్రాణనాశమున కొప్పుకొందునా?

అనార్కాళి

అయ్యో! (ఏడ్తురు.)

కావలి

(ప్రవేశించి) జహాపనాహ్! ఇక దయచేయుడు

సలీము

నీకు రెండు లక్షలిచ్చెదను. మమ్ము పోనిమ్ము

కావలి

అమ్మో!

సలీము

నీకేమిభయము?

కావలి

ప్రభూ! రేపు నన్ను చర్మ మొలిపించరా?

సలీము

అట్లయినచో నీవుకూడ మాతోరమ్ము!

కావలి

కాదు! ప్రభూ! కాదు.

(నిష్క్రమించును.)

సలీము

ప్రియా! రమ్ముపోదము.

అనార్కలి

వాడొప్పుకొనడు.

సలీము

నే నొప్పించెదను గదా!

అనార్కలి

ప్రభూ! ఈదాసికై మీరింత త్యాగము చేయ నేల? నేను నశించిపోయెదను.

(ఏడ్చును)

సలీము

ప్రియా! (ఏడ్చును)

కావలి

(ప్రవేశించి) ప్రభూ! చక్రవర్తివచ్చుచున్నాడు

సలీము

ఇప్పుడా!

కావలి

చిత్తము.

సలీము

ఎప్పుడైన నిట్లువచ్చునా?

కావలి

పెద్దపెద్ద ఖయిదీ లెవరైన నున్నప్పు డిట్లే వచ్చుచుండును.

సలీము

నిజముగా వచ్చుచున్నాడా?

కావలి

నానాలుక కోయుడు!

అనార్కలి

అయ్యో! హతవిధి! (మూర్ఛ)

సలీము

నాకు భయములేదు. నేను లేవను.

కావలి

ప్రభూ! ఈదీనునియందు దయయుంచుడు!

సలీము

(అనార్కలిని చూచి) అయ్యో!

కావలి

ప్రభూ! ఇంతలో మరల రావచ్చును. చక్రవర్తిగారు వెళ్లిపోయిన వెంటనే మరల వత్తురు గాని ఇక్కడనే యొకరహస్యప్రదేశమున్నది అందుండి మరల రావచ్చును.

సలీము

నేను నడువలేకున్నాను. నన్ను తీసుకొని పొమ్ము!

కావలి

క్షమింపుడు.

సలీము

(అవ్యక్తముగ) పరవాలేదు. (తెర)

రంగము ౧౦

(ప్రవేశము సలీము, సేవకుడు)

సలీము

చక్రవర్తి వెళ్లినా?

సేవకుడు

లేదు.

సలీము

నానాల్క తడియారుచున్నది.

సేవకుడు

దాహమిత్తునా?

సలీము

వలదు. చక్రవర్తి వెళ్లెనా?

సేవకుడు

జహాపనాహ్! వెళ్లలేదు. కొంచెము విశ్రమించుడు.

సలీము

నాగొంతుక యెండిపోయినది.

సేవకుడు

ప్రభూ! కొంచెము దాహము పుచ్చుకొనుడు

సలీము

ఊ!

(సేవకుడు మత్తుమందుకలిపి సారాయిచ్చును. సలీము త్రాగి నిద్రపోవును)

[తెర]

రంగము ౧౧

(ఇద్దరు కటికవాండ్రు ప్రవేశము)

మొదటివాడు

ఓయొయ్యాయి పెజల్లార!

'ఎక్కువోళ్లతో పెళ్లిళ్లు తక్కువోళ్లు
శేశికోరాదు సూస్తిరా శిన్నపడుసు
కుయిఁకుమనకుండ కత్తితో గొంతుకంట
కోశియేసినాము తెలిసికోండు మీరు!'

రెండవవాడు

ఓయొయ్యాయి పెజల్లార! మావోడు శెప్పిన మాట యినుకోండి.

'మేము యేమిపాపాలు శేశేము కాని
బాబుయిల్లాగ యెట్టాంటివాళ్లగొంతు
లేమి శేద్దుము నాయనా యిట్టెకోత్తు
మెనక తీయము పాపాలకెన్ని అయిన!

మొదటివాడు

జనముల్లార! తెలిశిందా!
'మేలిపడుసుది సక్కదనాలసుక్క'
శింతశివురంటి దిట్లాగ గొంతుదాక
నులికియేశాము గొప్పయింటోళ్లతోడ
తక్కువోళ్లకు పెళ్లిళ్లు తగవు తగవు.

రెండవవాడు

నిజమైనమాటకి బాబో! ఆళ్లు ఈళ్లు ఒకెత్తు ఆళ్లు అయితేనేగాని పెళ్లిగాని తగవుకాని పెట్టుకోకూడదంటారు పెద్దోళ్లు.
"తేనె లాగుంది ఆ పసిదాని నెత్తు
రయ్యో నా శేతులంటె యోయమ్మ! తల్లి
మా అలచ్చిమి దయ సూడు మా యిలాంటి
వోణ్ణి యేమి నిలుత్తుంది బాంది నాది?."
నా వంటోడికి పెళ్లాం బిడ్డలు నిలవరు బాబో!

మొదటివాడు

ఏడిశేవు లేవోయి. వూరుకో! ఎవడి రుత్తి యెవడు మాడుతాడోశ్. ఎవడో యెదవ

నాయాలకాని. ఒ య్యోయి జనముల్లార!
మీకు నిజముగా పేనాల మీద ఆస
అంటు వున్నదా సరి నాయమైన బతుకు
బతుకుడా నాది సురకత్తి వాడిమొనది
మొనకలేదు రాజాగ్గె శెల్లించి తీరు."

రెండవవాడు

ఓయబ్బ! కటిక తనమంత నీకాడె వుందిరా

సలీము

(ప్రవేశించి) ఎవరురా మీరు?

మొదటి

ఎవరో పెబువల్లె వున్నాడురా!

రెండవ

అవునురా!

మొదటి

మేము కటికోళ్లము సామీ!

సలీము

ఏమిటో కేకవేయుచున్నారు!

మొదటి

(1-వ పద్యము చదువును)

సలీము

ఎవరురా ఆచిన్నపిల్ల ?

మొదటి

బానిసోళ్లట బాబూ మెవల్లో! ఆళ్లపిల్ల,
రాజుగారికొడుకు గారిమీద కన్నేశిందిట
సామీ! రాజుగారి ఆగ్గెమీద సంపేశాం
సామీ!

సలీము

(రుద్ధకంఠుడై) ఆమె పేరేమిరా?

మొదటి

మాకు తెల్దు పెబో!

సలీము

హా! హా! ప్రియా! (మూర్ఛవోవును.)

మొదటి

మన కెంగకు పదరా పోదాము.

(కటికవాండ్రు నిష్క్రమింతురు.)

సలీము

(లేచి) ఈరాజపురుష వేషముతో నాకేందు
లకు? (ఏడ్చుచు దుస్తులు తీసివేయును.) ఇట్ల
గుసని కలలో నైన తలంచ: పోలినిగదా.
(దుమ్ము కొట్టకొనును.) నాకేమి నిద్రపట్టి
నది. ఆపాడునిద్ర నాకెక్కడనుండి వచ్చినది?
అయ్యో! నాకు మెలంకువ యిప్పుడు రావల
యునా? (ఏడ్చును.) నా ప్రియురాలిబదులు
నేనైన యురి కొయ్యనెక్క యుందునే!
అయ్యో? నా ప్రాణములు పోవుచున్నవి.
(మూర్ఛపోవును.)

(ఇరువురు సేవకులు ప్రవేశింతురు.)

ఒకడు

ఓహో! చూచితిరా? యువరాజుగారు!

రెండవ వాడు

పోయి యంతఃపురమున చెప్పుదము పద!

సలీము

(లేచి) ఎవరుమీరు?

రెండవ వాడు

ప్రభూ!

సలీము

ఓరీ! రాత్రి మత్తుపదార్థముగలిపి మద్యమిచ్చి నది నీవు కాదు గా?

రెండవ వాడు

కాదు! కాదు.

సలీము

(వానిని పొడిచి చంపును.) (మొదటివాడు పారి పోవును.)

సలీము

ఓహో! ప్రియురాలు! పోకు పోకుము. నేను గూడ వచ్చుచున్నాను! (పొడుచుకొనబోవు చు) ఇదియేమి? ఇది మృత్యుదేవత నాల్క వలె నున్నది. (అని కత్తి పారవేయును) ఇది భూమి! ఇది యాకాశము. అనార్కాళీ! నీవు భూమిలో దూరితివా? ఆకాశమున కెగిరి పోయితివా? నేను పలుగులతో ద్రవ్వి సాధిం చెదనని నీకు తెలియును. భూమిలో దూర లేదు. ఆకాశమున కెగిరిపోయినావు. నేను నీ వెంట నెగిరిపోయెదను. నన్ను ముద్దు పెట్టు కొమ్ము (నవ్వును) అనార్కాళీ! అనార్కాళీ (భజన చేయును) ఎవ్వరు నీవు నాకడ్డమువచ్చు చున్నావు? అక్బరువా! ఛీ! ఛీ! ఆకడకు పొమ్ము. నీవు నరమాంసభోక్తవు. నన్ను ముట్టు కొనకుము. ఏమి, నీవు నాకు తండ్రివా? నమ స్కరించుచున్నాను! వీడెవ్వడు? రాజామాన్ సింగా? ఎందుకురా వికారముగ నవ్వెదవు? పో! పో! నీజాతిపౌరుషము ధ్వంసము కాను. నాజోలి నీకెందుకు?

మహాల్వీ

(ప్రవేశించి) ప్రభూ! నీ కీదీనావస్థ యేమి? (ఏడ్చును)

సలీము

ఎవరునీవు నన్నుచూచి యేడ్చెదవు. పో! పో! నన్నుచూచి నవ్వుము! నే నెవ్వరనో యెరుం గుదువా? నే నానందమూర్తిని. నేనును మా యనార్కాళియు తేజోరూపమగు నీయనంత పథమునఁ బ్రవర్తించుచున్నాము! నీకు కన బడుట లేదా?

మహాల్వీ

అజీజ్‌ను రసీని నురితీసినారు ప్రభూ! ప్రభూ! (ఏడ్చును.)

సలీము

ఉరి! ఛీ! ఉరిలేదు. ఏమియును లేదు. నేను పొడుచుకొని చచ్చినాను. నీవుకూడ చచ్చి పొమ్ము! లేదా! నిన్నుకూడ నురి తీసెదరు. అజీజ్ యెవరు? నీ వెవరు?

నీవెవ్వరవో నాకు తెలియునులే నీవు పరబ్ర హ్మవు ఇక్కడకేల వచ్చితివి. రమ్ము రమ్ము మనమిద్దర మానంద మనుభవింతము.

రాజభటులు

(ప్రవేశించి) ఇదుగో ఆమహాల్వీ; పట్టుకొనుము.

మహాల్వీ

ఆహా చచ్చితిని.

(రాజభటులు మహాల్వీని బంధింతురు.)

మహాల్వీ

న న్నెచటికి తీసికొనిపోదురు?

రాజభటులు

ఉరికొయ్యకడకు వారును నీవును వరుసగా ముగ్గురిని నిలుచుండఁబెట్టి యురితీతురు. అ

క్కడ వారిర్వురికి నీవు మరల వివాహము చేయుము సరిపోవును.

మహాల్వీ

(ఓదార్చి) అవును. అదియే శాశ్వతమైన వివాహము పదండుపోదము.

సలీము

మీరందరును పరబ్రహ్మ నాశ్రయించెదరు. దేనికి? నిత్యానందమైన పద మభిలషించియా? పొందుడు. ఆపదమునే నందితిని. నేనుకూడ వచ్చెదను తీసికొనిపోదురా? నేనును మా అనార్కాళియు వచ్చెదము

1. రా. భ

(నిదానించిచూచి) ఓరి యువరాజు

2. రా భ

అమ్మో నీవుపోయి చక్రవర్తి గారితో చెప్పుము.

1. రా భ

[నిష్క్రమించును.]

(మహాల్వీని లాగుకొనిపోదురు.)

సలీము

నేనుగూడ వచ్చెదను. నన్ను తీసికొనిపోరా? (నవ్వి) మీకర్మము నేనవ్యయానందానంద పథమున తిరుగుచుండగా నన్ను మీరు తీసికొనిపోరా? సరే పొండు; నాసామ్మేమిపోయినది. అనార్కాళీ, రమ్ము; మనమిర్వురము చెట్టాపట్టాలు పట్టుకొని తిరుగుదము. ప్రియా! నీవెంతమోహానమూర్తివి? మోక్షలక్ష్మివి నీవేనా! రమ్ము రమ్ము. నన్ను దృఢపరిష్వంగమున దేల్పుము.

(రాజపురుషులిద్దరు ప్రవేశింతురు).

సలీము

ఎవరోయి మీరు దివ్యపురుషులా? దేనికో వచ్చిరి? నన్నును మాయనార్కాళిని దివ్యవిమానములమీద నెక్కించుకొని పోవుటకా?

1. రా. పు

ప్రభూ! మేము సేవకులము. చక్రవర్తి పాదుషాహా సమతండ్రిగారు తమ్ముతీసికొని రమ్మన్నారు.

సలీము

(నవ్వి) నాకు తండ్రియెవరు? ఛీ! ఛీ! పొండు; పోవద్దు పోవద్దు నా వెంటరండు. మన మందరమును గలసి యాకాశమున దివ్యవిమానముల మీద విహరింతుము. మా యనార్కాళిని మీరు చూడలేదు కాబోలును మోక్షలక్ష్మి. ఆమెనుచూచిన మీరెల్ల ముక్తు లగుదురు. రావే! ప్రియురాలా! రమ్ము! రమ్ము! నేనా మోక్షలక్ష్మిని ప్రసన్నను జేసికొనెదను. ఇదిగో జపము చేసెదను. అనార్కాళీ, అనార్కాళీ, అనార్కాళీ. (అనుచుండును)

1. రా. పు.

ఈయన కీపిచ్చి యెట్లు పోవును?

2. రా. పు.

పిచ్చివలననే బ్రదుకు చున్నాడు. పిచ్చిపోయెనా! ప్రాణములుకూడ పోవును.

1. రా. పు.

ఎందుచేత?

2. రా. పు.

అట్టి మహాప్రేమ కదియే ఫలితము!

1. రా. పు.

అట్లుకాదు. పిచ్చి పోయెనా, సంపూర్ణముగా అనార్కాళిని విస్మరించు నట్లే చేయనచ్చును.

2. రా. పు.

అల్లా తరము గాదు.

1. రా. పు.

అటువంటి యౌషధము లున్నవి. అవి యన్ని యు చక్రవర్తి యిదివరకే తయారు చేయించి యుంచినాడు!

2. రా. పు.

అట్టి యౌషధము లున్నవా?

1. రా. పు.

ఏల లేవు?

2. రా. పు.

ప్రకృతివంచనముగా నున్నది; మనుష్యుని దుష్ప్రేక్ష భగవంతునియెడ నెంత యపరాధిని యగుచున్నది! ప్రభూ! క్షమింపుము.

సలీము

క్షమించితిని. పో! నీపాపములు నశించినవి. మా అనార్కాళికిగూడ నీయం దనుగ్రహము గల్గినది.

1. రా. పు.

ఈయన యిపుడు మనవెంట నెట్లును రాడు. ఈయన ననుసరించుచు నెచ్చట నీయన సొలసి పడిపోవునో అచ్చట నుండి తీసికొని పోదము.

2. రా. పు.

బాగున్నదిలే పద.

(ఇరువురు నిష్క్రమింతురు.)

సలీము

ఇదుగో! నాకు భగవంతుడు సాక్షాత్కరించు చున్నాడు! భగవతీ! నమస్కారము. ప్రియా మనోహారిణీ! భారత సామ్రాజ్యభావిచక్ర వర్తినీ! ప్రాణమా! దేవీ! అనార్కాళీ! రమ్ము నాకౌగింటిలో నొదుగుము.- అదుగో! నాప్రి యురాలు! నా యొద్దకు వచ్చి నన్ను జూచి నవ్వి నన్ను కౌగిలించు కొనుచున్నది. ఆహా! ఆహా! సుఖము. ఆనందము. మాధుర్యము.

కవి

(ప్రవేశించి) నీవా! తెలిసినది. నీవు యువరాజు సలీము. నీకు పిచ్చియెత్తినదికాదూ! అవును! అంత రసతన్మయతగల నీకేల పిచ్చి యెత్తదు?

సలీము

నాకేమి పిచ్చి? నీకు పిచ్చి! నేను మహానంద మనుభవించు చున్నాను. నే నవ్యయానంద స్వరూపుడను.

కవి

" అగు శరీరమ్ముపైన వృథాభిమాన
మంతరించిన దుఃఖమ్ము నగును సుఖము
సుఖము దుఃఖమ్ము నగు మనస్సునకు నంతు
లేని యానంద మనుభూతమగును యోగి."

" మునువిషాదాబ్దములచేత ముఖరితమ్మ
యైన నాహృదయాకాశ మంతకంత
శాంతమై శరత్కాల స్వచ్ఛగగనంబు
పోలె హంసాభిరమ్యమై పొలుచుచుండె."

" ఈభవమ్ముఖ దర్శనం బెంతవరకు
నాకు నానందదాయినైనది? వియోగ

మనుచు సంయోగ మని భేద మంతరించు
నెప్పు డద్దియశాంతిసూ హృదయమునకు.

సలీము

నీవెవ్వరవు? నిన్నెక్కడనో చూచినట్లున్నది!
ఇన్నాళ్లుగా నవ్యయానంద స్వరూపుడను నేనే
యనుకొనుచున్నాను.

కవి

ఆనాడు వచ్చి నావిషాద గీతములు వినిపించ
లేదా?

సలీము

ఓహో! అవును.

నేనెవ్వరను. స్మరణకు వచ్చుచున్నది.
సలీమును.

(నిర్వ్యాజతో) కవీ! ఆనావిషాదనాటకమునకు
నాంది పాడి నేడు భరతవాక్యము పాడవచ్చి
తివా?

దేవీ! అనార్కా—!! [మూర్ఛ]

(తెర)



# తన్మయత

కొంపెల్ల జనార్దనరావు గారు

గానము విపంచికనుమీఱెఁ, గమలసౌర
భంబు లుద్యానసుమసౌరభములఁ గలసె.
కలితవాహినీ జలతరంగస్వనంబు
మృదుల తరులతారవముతో మేళవించె.

అంబరాంగన ప్రకృతియద్దంబులందు
నందమును జూచుకొని ప్రీతినొందుచుండె
సుందర పయోజమందిరమందుఁ దేఁటి
మధురమధుపానమున మేను మఱచి యుండె.

క్షణము క్షణమును బెంపొందు కాలచరిత
గానముజ్జ్వలతారాని కాయమందు
నిర్మలతలో సకలము గన్పింపఁ దొడగె
నిశ్చలతలో నిఖిలము విన్పింపఁదొడఁగె.

అన్ని గానంబులైక్యమై యలరసాగె
నెల్ల భావాలు లీనమై యొసఁగఁ గడఁగె
విశ్వమంతయు నవశమై వెలయుచుండె
మానసంబున కాత్మసంధాన మొదవె.





# పురాణ ప్రామాణ్య మీమాంస

వా. ప. సూర్యనారాయణశాస్త్రి గారు

జ్ఞానమయ శరీరుడైనట్టి నిత్యుడున్నూ అయిన పరమేశ్వరునివలన ముందు ప్రణవ మావిర్భవించెను. దానివలన వర్ణసమామ్నాయ ముదయించెను. దానివలన నష్టాదశవిద్యలు విలసిల్లినవి. ఋక్కు, యజస్సు, సామము, అధర్వణము అనే వేదములు నాలుగున్నూ, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము అనే వేదాంగములు ఆరున్నూ, పురాణము, న్యాయవిస్తరము, మీమాంస, ధర్మశాస్త్రము అనే ఉపాంగములు నాలుగున్నూ, ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అనే ఉపవేదములు నాలుగున్నూ కలిసి యష్టాదశవిద్యలని ప్రఖ్యాతము లయినవి.

ఉపపురాణాదులు మహాపురాణముల యందే అంతర్భవించును. న్యాయమునందే వైశేషికమున కంతర్భావము. ధర్మశాస్త్రమునందే మహాభారత రామాయణాదులున్నూ సాంఖ్యపాతంజల పాశుపత వైష్ణవాదులున్ను అంతర్భూతములయినవి. ఈఅష్టాదశవిద్యలున్ను భగవంతుని జ్ఞానమయ శరీరమనియును, నిత్యములనియును జెప్పుదురు. "కారణగుణాః కార్యే సంక్రామంతి," అనే న్యాయముప్రకారము నిత్యజ్ఞానస్వరూపుడయిన భగవంతునివలన నీవిద్య లుదయించుటచే నివి నిత్యములున్నూ, జ్ఞానస్వరూపములున్నూ అయి విరాజిల్లుచున్నవి. ఈఅష్టాదశవిద్యలయొక్క స్వరూప విశేషములున్నూ, వాటి ప్రయోజనములున్ను, విస్తరించి యాయాగ్రంథములయందు జెప్పబడినవి. ఇట పురాణస్వరూపాదులను కొంత విస్తరించెదను.

పురాణము అనగా వేదార్థోపబృంహకమును, ప్రపంచముయొక్క పూర్వావస్థను వివరించునదియును, వ్యాసాదిమహర్షిప్రణీతంబును, సర్గప్రతిసర్గాది లక్షణలక్షితమునునగు శాస్త్రవిశేషము. పురాణములు భగవదవతారుడయిన వ్యాసునివలనను ప్రాయికముగా నావిర్భవించినవి. మహాపురాణములు, ఉపపురాణములు, ఉపోపపురాణములు అనే త్రివిధభేదములు కలిగి పురాణములు ఏబదినాలుగుసంఖ్యగలవియై యున్నవి. ఈపురాణములన్నియు సర్గప్రతిసర్గాదులను ప్రతిపాదించుచు ధర్మాచరణను ప్రోత్సహించును. అట్లు ప్రోత్సహించుటయే ఈపురాణముల యొక్క పరమప్రయోజనము. అందువలనే పురాణములు ధర్మప్రస్థానములుగా పరిగణింపబడినవి. వేదములయొక్క సత్యార్థజ్ఞానము పురాణములచేతనే కలుగును. "ఇతిహాసపురాణాభ్యాం,వేదం సముపబృంహయేత్" అని మనువుచెప్పినాడు. "పూరణాత్ పురాణం" వేదమును పూరించుటచే పురాణమని వ్యుత్పత్త్యర్థము. వేదముకాని దానిచే వేదమునకు పూరణము, లేక ఉపబృంహణముగాని సంభవింపదు. సువర్ణ కంకణమును సీసముచే నెవ్వరైనను పూరింతురా?కావున పురాణములు వేదైకదేశములని సిద్ధించును. ఋగాదివేదములలోను, పురాణాదులలోను ఉన్న పదకదంబము నిఖిలశక్తి విశిష్ట భగవద్రూపైకార్థప్రతిపాదకమును, అపౌరుషేయమునునగుటచే ఈయిభేదములవలనపురాణములను వేదశబ్దముచే వ్యవహరింపవచ్చును. ఉదాత్తాదిస్వరక్రమము ఋగాదులలోనుండి పురాణాదులలో లేకపోవుటచేతను వేదములనుండి పురాణములను వేరుచేసి వ్యవహరించుటకూడా సోపపత్తికమే యగును. పురాణములకు అపౌరుషేయత్వ మెట్లందురేని చూడుడు!

మాధ్యందినశ్రుతియందు—

శ్రు. ఏవంవారేఽస్య మహతోభూతస్య నిశ్వసితమే తత్ యదృగ్వేదోయజుర్వేద స్సామవేదోఽధర్వాంగిరస ఇతిహాసః పురాణం,"

ఋగాదులున్ను, ఇతిహాసపురాణములున్ను భగవంతుని నిశ్వాసరూపములు. మన నిశ్వాసములవలెనే భగవంతుని నిశ్వాసరూపమైన వేదపురాణాదులు పురుషేచ్ఛ లేకుండ తమంతటతామే బయలువెడలినవని విశదమగును.

అథర్వశ్రుతియందు—

శ్రు. సబృహతీం దిశ మను వ్యచలత్ త మితిహాసశ్చపురాణంచగాథాశ్చ నారాశం సీశ్చానువ్యచలన్, ఇతిహాసస్యచవై సపురాణస్యచ గాథానాంచ నారాశంసీనాంచ ప్రియం ధామ భవతియ ఏవంవేద"

సామవేదీయగోపథబ్రాహ్మణమందు—

శ్రు. "ఏవమిమే సర్వే వేదా నిర్మితా స్సకల్పాస్సరహస్యా స్సబ్రాహ్మణా స్సోపనిషత్కా స్సేతిహాసాస్సాన్వ్యాఖ్యాతాస్సపురాణాస్సస్వరాః."

ఛాందోగ్యోపనిషత్తునందు—

శ్రు. "ఋగ్వేదంభగవోఽధ్యేమి యజుర్వేదంసామవేదమా థర్వణం చతుర్థ మితిహాస పురాణం పంచమం వేదానాం వేదం."

తైత్తిరీయ బ్రాహ్మణమునందు—

శ్రు. "యత్పురాణా నీతిహాసాన్ గాథానారాశగంసీర్మేదాహుతయః."

ఛాందోగ్యోపనిషత్తునందు—

శ్రు. "ఏవం విద్వాన్వాకో వాక్యం ఇతిహాసః పురాణమిత్యహరహ స్స్వాధ్యాయ మధీతే తఏవంతృప్తాస్తర్పయంతిసర్వైః కామై స్సర్వై ర్భోగైః."

పై శ్రుతులు ఇతిహాసపురాణములను వేదసమ్మితములుగా పేర్కొనుటచే వాటికి అపౌరుషేయత్వము సర్వసమ్మాన్యత్వము నిర్వివాదముగా సిద్ధించును.

శ్లో. "పురాణం మానవో ధర్మ స్సాంగో వేదశ్చికిత్సికమ్ ఆజ్ఞాని సిద్ధాని చత్వారి నహంతవ్యాని హేతుభిః."

—విష్ణుస్మృతి.

పురాణము, మనుధర్మశాస్త్రము, షడంగములతో వేదమున్నూ మీమాంసయున్నూ భగవదాజ్ఞచే సిద్ధములయినవి. కుతర్కముచే వీటిని హింసింపకూడదు. ఆజ్ఞాసిద్ధము లనుటచే పురాణాదులకు నపౌరుషేయత్వము సిద్ధమయినది.

శ్లో. "వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్."

—స్మృతి.

ఈస్మృతి మహాభారతమునకు పంచమవేదత్వమును ప్రసాదించుచున్నది.

పై శ్రుతులలో పేర్కొనబడిన యితిహాసపురాణములు మహాభారతాదులు కావు. వేదములలోనే ఇతిహాసపురాణములను కొన్ని భాగములు గలవని కొందరందురు. అది యవిచారమూలకము. వారి మతప్రకారము ఇతిహాసపురాణములు నాలుగువేదములలో నంతర్భవించినచో "ఇతిహాసపురాణంపంచమంవేదానాంవేదం" అనుశ్రుతి ఇతిహాసపురాణములకు పంచమవేదత్వము నేట్లుచెప్పును? కావున శ్రుతులచే పేర్కొనబడిన యితిహాసపురాణాదులు మహాభారతబ్రాహ్మణము లేయని యంగీకరింపక తప్పదు. రామకృష్ణావతారప్రశంస వేదములలో నున్నటను కానరానిని, అది వ్యాసకపోలకల్పితమై పురాణములయందు మాత్రమే కానవచ్చుచున్నదనిని కొందర ఆక్షేపించుచున్నారు. ఇదియు నవిచారరమణీయమే.

తైత్తిరీయసంహిత:

"శ్రు. ఆపోవాఇద మగ్రే సలిల మాసీత్... సవరాహో యూపంకృత్వోపన్యమజ్జత్. సపృథివీమధ ఆర్ఛత్"

ఈశ్రుతి భగవంతుడు వరాహమై భూమి నుద్ధరించినాడని స్పష్టముగా చెప్పుచున్నది.

ఐతరేయబ్రాహ్మణము:

"శ్రు. ప్రోవాచ రామో భార్గవేయః విశ్వాంతరాయః"

ఈశ్రుతి పరశురామావతారమును ప్రతిపాదించును.

ఛాందోగ్యము:

"శ్రు. కృష్ణాయ వాసుదేవాయ"

తైత్తిరీయారణ్యకము:

"శ్రు. నారాయణాయ విద్మహే, వాసుదేవాయ ధీమహి తన్నోవిష్ణుః ప్రచోదయాత్"

ఈశ్రుతులు కృష్ణావతారమును ప్రశంసించుచున్నవి.

ఋగ్వేదము విష్ణుసూక్తము:

"శ్రు. ఇదం విష్ణు ర్విచక్రమే త్రేధా నిదధే పదం"

"త్రీణిపదా విచక్రమే విష్ణుర్గోపా అదాభ్యః"

శతపథబ్రాహ్మణము:

"ప్ర. దేవాశ్చవా అసురాశ్చోభయే ... నామనోహి విష్ణుం లాస."

ఈగ్రంథములు సమానముగా ఇతిహాసమును బహుధా ప్రశం సించుచున్నవి. ఇట్లే వేదములయందు గల పతి మున్నగు దేవతలప్రశంసలు గలవు. ఆవిషయములే పురాణాదుల యందు విస్తృతముగా కానవచ్చును.

ఈవిషయమును శ్రీశంకరాచార్యులువారు శారీరిక మీమాంసాభాష్యమునందు అనేకవిధములుగాసుంబా కొట్టివ్రాసియున్నారు.

భా. తస్మాత్ ఋషీణామపి మంత్రబ్రాహ్మణదర్శినాం సామర్థ్యం నాస్మదీయేన సామర్థ్యేన ఉపమాతుం యుక్తం. తస్మాత్ సమూల మితిహాసపురాణం."

"మంత్రబ్రాహ్మణములను దర్శించినఋషుల సామర్థ్యము నిరుపమానమయినది. అట్టిఋషులచే ప్రోక్తము లయిన యితిహాసపురాణములు ప్రమాణములయినవి" అని చెప్పియున్నారు. కావున పురాణాదులు వ్యాసాదిము నికపోలకల్పితములు కావు. వైదికదేశములున్నూ వేద మూలకములున్నూ అయియున్నవి. వేదవ్యాసులు వేద ములను విభజించినట్లు శతకోటి ప్రవిస్తరమయిన పురా ణరాశిని సంగ్రహించి ప్రతిద్వాపరయుగాదిని భూలో కమునందు నావిర్భవింపజేయుచున్నాడు. ఈకారణము చేతనే పురాణాదులు వ్యాసప్రోక్తము లని ప్రతీతిని గాంచినవి. ఈయర్థము పురాణాదులయందు విపులము గాగలదు.

"శ్లో. ఇతిహాసపురాణానాం వక్తారం సమ్యగేవహి;
మాంచైవ ప్రతిజగ్రాహ భగవా నీశ్వరః ప్రభుః.
ఏక ఆసీ ద్యజుర్వేద స్తం చతుర్ధా వ్యకల్పయాత్;
చాతుర్హోత్ర మభూ త్తస్మిం స్తేన యజ్ఞమకల్పయాత్.
ఆధ్వర్యవం యజుర్భిస్తు ఋగ్భిర్హోత్రం తథైవచ
ఔద్గాత్రం సామభి శ్చైవ బ్రహ్మత్వంచాప్యథర్వభిః
ఆఖ్యానై శ్చాప్యుపాఖ్యానై ర్గాథాభిర్ద్విజసత్తమాః.
పురాణసంహితా శ్చక్రే పురాణార్థవిశారదః;
య చ్ఛిష్టంతు యజుర్వేదే ఇతి శాస్త్రార్థనిర్ణయః."
—వాయుపురాణము.

మొదట యజుర్వేద మొక్కటిగానే యుండెను. దానిని నాలుగువిధములుగా విభజించి యజుస్సులచే ఆధ్వర్యవమున్నూ, ఋక్కులచే హౌత్రమున్నూ, సామ లచే ఔద్గాత్రమున్నూ, అథర్వములచే బ్రహ్మత్వము న్నూ అనే చాతుర్హోత్రమును చేసి యజ్ఞమును కల్పిం చెను. యజుర్వేదమునందలి విశిష్టములయిన యాఖ్యా నాదులచే పురాణ సంహితాదులను నిర్మించెను అని స్పష్టముగా నున్నది. యజ్ఞోప యోగులుగాని యజు ర్వేదభాగములచే పురాణములను నిర్మించెనని చెప్పు టచే పురాణములకు వైదికదేశత్వము సహేతుకము గా నిరూపితమయినది.

శ్లో. పురాతపశ్చకారోగ్రమమరాణాం పితామహః;
ఆవిర్భూతా స్తతో వేదా స్సషడంగపదక్రమాః.
తతః పురాణ మఖిలం సర్వశాస్త్రమయం ధ్రువమ్;
నిత్యశబ్దమయం పుణ్యం శతకోటి ప్రవిస్తరమ్.
నిర్గతం బ్రహ్మణోవక్త్రాత్ తస్యభేదా న్నిబోధత.
"బ్రాహ్మం పురాణం ప్రథమం...ఇత్యాది—"
—స్కాందప్రభాసఖండము.

బ్రహ్మ పూర్వమందు తపస్సుచేయగా వాని ముఖములనుండి నాలుగువేదములున్నూ, శతకోటి సంఖ్య గల పురాణములున్నూ బయలువెడలినవి. బ్రాహ్మము స్కాందము మున్నగునవి ఆపురాణప్రభేదములే.

శ్లో. ఇతి హాసపురాణాని పంచమం వేద మీశ్వరః;
సర్వేభ్య ఏవ వక్త్రేభ్య స్ససృజే సర్వదర్శనః.
—స్కాందతృతీయస్కంధము.

బ్రహ్మ పంచమవేదమయిన యితిహాస పురాణ ములను తనసర్వముఖములనుండి సృజించెను.

"శ్లో. కాలేనాగ్రహణంమత్వా పురాణస్యద్విజోత్తమాః;
వ్యాసరూప మహంకృత్వాసంహరామి యుగేయుగే.
..................
చతుర్లక్ష ప్రమాణేన ద్వాపరే ద్వాపరే సదా;
తదష్టాదశధాకృత్వా భూలోకేఽస్మిన్ ప్రభాష్యతే.
అద్యా ప్యమర్త్యలోకేతు శతకోటి ప్రవిస్తరమ్
తదర్థోఽత్రచతుర్లక్షస్సంక్షేపేణనివేశితః" ఇత్యాది.
—మాత్స్యపురాణము

భగవంతుడు తాను వ్యాసరూపమును ధరించి ప్రతియుగము పురాణముల నుపసంహరించుచు తిరిగి ద్వాపరయుగమందు చతుర్లక్షసంఖ్యగల యష్టాదశపురాణములను భూలోకమునందు ప్రవర్తింపజేయుచున్నట్టున్నూ నేటికిన్నీ దేవలోకమందు శతకోటిప్రవిస్తరమై పురాణము వ్యాపించినదనియును దానియర్థమే నాలుగులక్షలుగా సంక్షేపింపబడినదనియును చెప్పబడినది. దీనిచే వ్యాసులు పురాణములకు నిర్మాతగాక కాడనియును పూర్వయుగసిద్ధము లయిననాటిని సంక్షేపించినాడనియును వ్యక్తమగును.

"శ్లో. సంక్షిప్యచతురోవేదాన్ చతుర్ధా వ్యభజ ద్విభుః,
.............
పురాణ మపి సంక్షిప్తం చతుర్లక్షప్రమాణతః;
అద్యాప్యమర్త్యలోకేతు శతకోటిప్రవిస్తరమ్."
—శివపురాణము

వ్యాసులు వేదములను సంక్షేపించి నాలుగు వేదములుగా విభజించెను. నాలుగులక్షలసంఖ్యగా పురాణమును సంక్షేపించెను. దీనిచేతను వ్యాసులు వేదములను పురాణమును సంక్షేపించినవాడుగాని నిర్మించినవాడు కాడని తెల్లమగును.

"శ్లో. కార్ష్ణం చ పంచమం వేదం యన్మహాభారతం
స్మృతం... పురాణం పంచమో వేదః
ఇతిహాసః పురాణంచ పంచమో వేద ఉచ్యతే."
—భవిష్యపురాణము.

ఈవచనములు ఇతిహాసపురాణములకు పంచమవేదత్వమును ఘోషించుచున్నవి.

"శ్లో. భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థః ప్రదర్శితః;
వేదాఃప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్రసంశయః"
—వైష్ణవము.

భారతమనేమిషచే వేదార్థము ప్రకటితమయినది. వేదములన్నియు పురాణములయందే నిలిచి యున్నవి.

శ్లో. వేదార్థాదధికం మన్యే పురాణార్థం వరాననే
వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్రసంశయః.
—నారదీయము.

వేదార్థముకన్న పురాణార్థమే అధికమయినది.

"శ్లో. వేదవన్నిశ్చలం మన్యే పురాణార్థం ద్విజోత్తమాః
వేదాః ప్రతిష్ఠితా స్సర్వే పురాణే నాత్రసంశయః.
బిభేత్యల్పశ్రుతా ద్వేదో మామయం ప్రహరిష్యతి."
—స్కాం-ప్రభాసఖండము.

పురాణార్థము వేదమువలె నిశ్చలమయినది. పురాణములయందే వేదములు నిలిచియున్నవి. వేదము తనను పాడుచేయునేమో యని యల్పవిద్యగలవానివలన భయపడుచుండును.

శ్లో. ఇతిహాసపురాణైస్తు నిశ్చలోఽయంకృతః పురా;
యన్నదృష్టంహి వేదేషు తద్దృష్టం స్మృతిషు ద్విజాః
ఉభయోర్యన్న దృష్టంహి తత్పురాణైః ప్రగీయతే."
—స్కాం-ప్రభాసఖండము.

ఈవేదము ఇతిహాసపురాణములచే నిశ్చలముగా చేయబడినది. వేదములలో కానరానివిషయములు స్మృతులయందు కానబడును. రెంటియందును కానబడని విషయములు పురాణములచే చెప్పబడును.

"శ్లో. శ్రుతిస్మృతి పురాణాని విదుషాంలోచనత్రయమ్;
య స్త్రిభి ర్నయనై స్సమ్యక్ పశ్యతి స్స మహేశ్వర
[స్స్మృతః.
ఆన్మనో వేదవిద్యాశ్చ ఈశ్వరేణ వినిర్మితాః;
శౌనకేయాశ్చ పారాశ్చ గ్రంథశాస్త్రాణి తత్త్వతః.
తస్మాద్విద్యా ఇమా ముఖ్యా స్సర్వశాస్త్రార్థనిర్ణయే;
పురాణం పంచమో వేద ఇతి బ్రహ్మానుశాసనమ్.
యో న వేద పురాణం హి న స వేదాత్ర కించన;
ఆత్మా పురాణం వేదానాం పృథగంగాని తానిషట్."
—స్కాం-దశేవాఖండము.

శ్రుతిస్మృతిపురాణములు పండితులకు మూడు నేత్రములు. ఆమూడు నేత్రములచే చూచువాడు ఈశ్వరాంశసంభూతుడు. వేదవిద్య, పౌరాణికవిద్య, ధర్మశాస్త్రవిద్య, అనే మూడువిద్యలు ఈశ్వరునిచే నిర్మితములయినవి. సర్వశాస్త్రముల యర్థనిర్ణయమును జేయుటకు నీమూడువిద్యలు ముఖ్యములయినవి. పురాణము పంచమవేదమని బ్రహ్మ యనుశాసించెను. పురాణమును తెలియనివాడు అజ్ఞుడు. పురాణములే వేదమునకు శరీరము. శిక్షాదులు వేదాంగములు.

ఈప్రామాణ్యబలముచే పురాణేతిహాసాదులు ప్రతి ద్వాపరయుగము భగవదవతారుడయిన వ్యాసుని మూలమున భూలోకంబున నవతరించుచున్నవని తెలియనగును. కొన్నియెడల పురాణములు అనిత్యములని చెప్పుట వాని యావిర్భావతిరోభావములవలననేకాని యుత్పత్తి వినాశములచే కాదు. ఇట్లు వైదికైకదేశమయిన పురాణాదులయందు సూతాదుల కధికారము విశేషవిధిచే కలిగినదని యంగీకరింపవచ్చును. కొన్ని వైదికకర్మవిశేషములందు రథకారాదులకు నధికారము విశేషవిధిచే సంభవించినది. అట్లే ఇదియును సమాధేయము. సర్వవేదసారము లయిన భగవన్నామమహామంత్రములయందు సర్వజనుల కధికారము ప్రసాదింపబడినట్లు పురాణములయందు సూతాదుల కధికారము ప్రసాదింపబడిన దనియును సమాధేయము. ఇట్లు పౌరాణికమతసంప్రదాయప్రవర్తకులు పురాణాదులకు పంచమవేదత్వమును సప్రమాణముగా నిరూపించిరి. పౌరాణికులు పురాణములను వైదికైకదేశములుగా నిరూపించినను మైమాంసకులు స్మృత్యైకదేశములుగా భావించియున్నారు.

స్మృతిలక్షణము—బ్రహ్మసూత్రభాష్యము. ౨-౧-౧.

"శాం. భా. స్మృతిశ్చ తంత్రాఖ్యా పరమర్షిప్రణీతా
శిష్టపరిగృహీతా."

స్మృతియనగా పరమఋషులచే ప్రణీతమై శిష్టులచే గ్రహింపబడిన శాస్త్రము.

ఈస్మృతిలక్షణము మను యాజ్ఞవల్క్యాది స్మృతులయందును పురాణములయందును శిక్షా వ్యాకరణాదులయందును వ్యాపించియున్నది. పురాణాదులున్నూ పరమర్షులయిన వ్యాసాదులచే ప్రణీతములయినవి; శిష్టులచే గ్రహింపబడినవి.

"సర్వసిద్ధాంతపదార్థలక్షణ సంగ్రహము" అనే గ్రంథమందు స్మృతిలక్షణము ఇట్లునిర్వచింప బడినది. "స్మృతిః=ధర్మశాస్త్రం వేదార్థస్మరణపూర్వకం రచితం శాస్త్రమ్. ఋషిప్రణీతత్వేసతి వేదార్థానుభవ జన్యత్వే సతి వేదార్థానువాదకం వా". ఈరెండు లక్షణములున్నూ పురాణములయందున్నూ వ్యాపించియున్నవి. "స్మృతిః= స్మర్యతే అనయా ప్రత్యక్షస్య పరోక్షస్య వా వేదస్యార్థ ఇతి స్మృతిః," ప్రత్యక్షముగాని పరోక్షముగాని యయినవేదముయొక్క యర్థము దీనిచే స్మరింపబడును గాన దీనికి స్మృతి యని నామమిడిరి. ఈవ్యుత్పత్తి పురాణములకున్నూ స్మృతిత్వమును సంపాదించుచున్నది. "అధ్వర మీమాంసాకుతూహలవృత్తి" అను మీమాంసాగ్రంథములో స్మృతిప్రామాణ్యాధికరణములో అనుమానప్రయోగముచే అష్టకాదిస్మృతులకు ప్రామాణ్యమును జెప్పి

"ఏవ మితిహాసపురాణాద్యప్యుదాహార్యమ్."

"ఇతి స్మృత్యధికరణం" అని వ్రాసియున్నారు. ఈ మీమాంసా గ్రంథము పురాణములకు స్మృతిత్వమును ప్రామాణ్యమును నిరూపించినది. శ్రీ శంకరాచార్యులువారు సూత్రభాష్యములో నేడెనిమిది స్థలములయందు విష్ణుపురాణ మహాభారత గీతావచనములను స్మృతులక్రిందను భావించి యుదాహరించి యున్నారు.

"శ్లో. వేదోఽఖిలోధర్మమూలం స్మృతిశీలేచతద్విదామ్
ఆచారశ్చైవ సాధూనా మాత్మన స్తుష్టిరేవచ.
—మనుస్మృతి.

సర్వవేదమున్నూ, స్మృతిన్నీ, వేదవేత్తల శీలమున్ను, సాధువుల యాచారమున్నూ, ఆత్మతుష్టియున్నూ ధర్మమూలములు. ఈమనువచనమునకు వ్యాఖ్యానమును జేసిన నందనపండితుడున్నూ, వైద్యనాథ దీక్షితులున్నూ, "స్మృతిః=ధర్మశాస్త్రేతిహాసపురాణాని" అని వ్రాసి స్మృతిపదముచే నితిహాసపురాణములను గ్రహించినారు. అట్లు గ్రహింపనిచో మనువుకు శ్రుతి విరోధము దుర్నివారమగును.

"శ్రు. స్మృతిః ప్రత్యక్ష మైతిహ్యం. అనుమాన శ్చతుష్టయమ్."
—తైత్తిరీయారణ్యకము.

"భా. స్మృతిః=మన్వాదిశాస్త్రం, ప్రత్యక్షం= వేదః; ఐతిహ్యం=ఇతిహాసః మహాభారతాది, అనుమానః= శిష్టాచారః."

ఈశ్రుతి మహాభారతాదులకు ప్రామాణ్యము నంగీకరించుచున్నది. పురాణాదులకు పంచమవేదత్వమును ఘోషించు ననేక శ్రుతిస్మృతులను ఉదాహరించియే యున్నాను.

"శ్లో. పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగ మిశ్రి
తాః, వేదాఃస్థానాని విద్యానాం ధర్మస్యచ చతుర్దశ.
—యాజ్ఞవల్క్యస్మృతి

వ్యా. పురాణేతి, పురాణం=బ్రాహ్మాది, న్యాయః=తర్క
విద్యా, మీమాంసా=వేదవాక్యవిచారః, ధర్మశాస్త్రం=
మానవాది, అంగాని=వ్యాకరణాదీనిషట్; ఏతైరు
పేతాశ్చత్వారోవేదాః. విద్యాః=పురుషార్థసాధనాని. తాసాం స్థానానిచతుర్దశ. ధర్మస్యచ
చతుర్దశస్థానాని=హేతవః. ఏతాని త్రైవర్ణికైరధ్యేత
వ్యాని. తదంతర్గతత్వా ద్ధర్మశాస్త్రమప్యధ్యేతవ్యమ్.

పురాణములు, న్యాయము, మీమాంస మున్నగు
పదునాలుగున్ను, పురుషార్థసాధనములును ధర్మహేతు
వులనియును నీస్మృతిచెప్పుచున్నది. ఇట్లుశ్రుతి స్మృతులు
పలుతావులయందు పురాణాదులకు ధర్మమూలత్వము
నంగీకరించుచుండి మనువు తద్విరుద్ధముగా పురాణములను
ప్రమాణకోటినుండి దిగద్రోయునా? మనువుచెప్పిన
శీల, ఆచార, తుష్టులలో పురాణాదుల కంతర్భావము
పొసగదు. కావుననే నందనాదులు పురాణాదులకు స్మృ
తియందు నంతర్భావమును జెప్పియున్నారు.

సూ. ధర్మజ్ఞసమయః ప్రమాణం: వేదాశ్చ.
—ఆపస్తంబధర్మసూత్రము

దీనిలో ధర్మజ్ఞసమయమున్ను వేదములుమాత్రమే
ప్రమాణముగా చెప్పబడినవి. పూర్వోక్తశ్రుతిస్మృ
తులకు విరోధములేకుండ ధర్మజ్ఞసమయమందే పురాణ
న్యాయ మీమాంసాదులకు నంతర్భావమును జెప్పవల
యును. శాస్త్రకారులు పలుతావులయందు "శిక్షా
స్మృతి, వ్యాకరణస్మృతి యని స్మృతిపదసమభివ్యా
హారముతో శిక్షాదులను గ్రహించియున్నారు. కుల్లూక
భట్టు మున్నగు వ్యాఖ్యాతలు అట్లు వ్యాఖ్యానములను
జేయకున్నను పురాణాదులకు స్మృత్యంతర్భావమువారికి
సమ్మతమనుటకు వారి వ్యాఖ్యానములే పలుతావుల
యందు పురాణవచనములను ప్రమాణముగా గ్రహిం
చుచు సాక్ష్యము నిచ్చుచున్నవి.

"ధర్మశాస్త్రంతు వై స్మృతిః" అను ప్రమాణముచే
కేవల మన్వాదిశాస్త్రమే స్మృతియని కొంద రందురు.
అది సమంజసము కాదు. ధర్మశాస్త్రమనగా ధర్మమును
ప్రతిపాదించు శాస్త్రమని దానియర్థము. యాజ్ఞ
వల్క్యుడు పురాణాది చతుర్దశవిద్యలకున్ను ధర్మస్థాన
త్వము నంగీకరించినందున పురాణాదులకున్ను ధర్మ
శాస్త్రత్వము స్మృతిత్వము నిరబాయముగనే యగును.
ఈకారణముననే "స్మృతిశీలేచతద్విదాం" అను మను
వచనమునకు కొందరు వ్యాఖ్యాతలు "స్మృతిః=మన్వాది
ధర్మశాస్త్రం" అని వ్యాఖ్యానముజేసి ధర్మశాస్త్ర
పదము పురాణమీమాంసాదులను సంగ్రహించు నని
భావించియుండిరి. స్మృతిపదమే పురాణమీమాంసా
దుల కుపలక్షకమయినను స్మృతి, ధర్మశాస్త్రము,
మీమాంస, పురాణము అని పృథగ్వ్యవహారము శాస్త్ర
ములయందు లోకమందు కానవచ్చుచున్నది. అది యెట్లు
సమంజసమగునని ప్రశ్న యంకురించును. దాని కిట్లు
సమాధాన మివ్వవచ్చును. లోకములో పృథగ్వ్యవహార
ముండినను శాస్త్రములో గ్వచిత్ప్రవ్యవహారము కానవచ్చు
చున్నది. శ్రుతిపదముచే పలుతావులయందు స్మార్త
శ్రుతిని కూడా గ్రహించినారు "శాస్త్రయోనిత్వాత్"
అను శారీరకసూత్రములో శాస్త్రపదముచే వేదములను
గ్రహించినారు. ధర్మశాస్త్రపదముచే మహాభారత రా
మాయణసాంఖ్యపాతంజలాదులను గ్రహించినారు.
కొన్నియెడల పురాణపదముచే నితిహాసమును ఇతిహాస
పదముచే పురాణములను గ్రహించియున్నారు. స్మృతి
పదముచే శిక్షాద్యంగములను పురాణములను గ్రహించినా
రని మున్నే నిరూపించియున్నాము. కావున పురాణ
ములు స్మృత్యేకదేశ మనుటలో విప్రతిపత్తి లేదు.

"శ్లో. శ్రుతిస్మృతిపురాణేషు విరుద్ధేషు పరస్పరమ్;
పూర్వంపూర్వంబలీయస్స్యా దితిన్యాయవిదోవిదుః.

పరస్పరవిరుద్ధము లయినప్పుడు స్మృతిపురాణ
ములకన్న శ్రుతియును, పురాణములకన్న స్మృతియును
బలవత్తరములు.

ఈప్రామాణ్యబలాబలనిర్ణయముచే ఆయాగ్రంథ
ములకుగాని తత్కర్తలకుగాని అశ్వస్తాప్రామాణ్యమును
గాని న్యూనతనుగాని ఆపాదింపవీలులేదు. "యథోత్త
రం మునీనాం ప్రామాణ్యం" అని చెప్పుటచే పాణినికిగాని
పాణినీయమునకు గాని వరరుచి పతంజలుల కంటెను
వార్తికమహాభాష్యములకంటెను న్యూనతాదులు వాటి

[భారతి మూడవసంపుటము పదవసంచికలోని 'రాజగృహము' అను వ్యాసమునకు సంబంధించిన చిత్రములు]



చిత్రము ౫. బాణ గంగా లోయ



చిత్రము ౬. పిప్పల శిలాగృహమును దానిక్రింద నుండు జైనదేవాలయము

ల్లునా? "పూర్వాపరనిత్యాంతరంగాపవాదానాముత్తరోత్తరం బలీయః" అనుపరిభాషచే ఉత్తరోత్తర బలీయస్త్వము, పూర్వపూర్వ దౌర్బల్యము సంప్రాప్తమగుటచే ఆయా శాస్త్రములకు సహితము అప్రామాణ్యముగాని, న్యూనతనుగాని ఆపాదింపవీలగునా? శ్రుతులలో కూడా నిట్టి బలాబలవిచారములు గలవు. "శ్రుతిలింగవాక్యప్రకరణస్థానసమాఖ్యానాం సమవాయే పారదౌర్బల్యమర్థవిప్రకర్షాత్" అను జైమినిసూత్రముచే పూర్వపూర్వప్రాబల్యము ఉత్తరోత్తర దౌర్బల్యము సిద్ధించుచున్నది.

మన్వర్థవిపరీతమైన బృహస్పతిస్మృతి ప్రమాణము గాదు. కలియుగమందు పరాశరస్మృతికే యెక్కుడు ప్రామాణ్యము. రాగద్వేష దూషితములయిన స్మృతులకు ప్రామాణ్యమును నిరాకరించిరి. మాతులకన్యాపరిణయమును బహుశ్రుతిస్మృతులు నిషేధించినను దాక్షిణాత్య శిష్టాచారమే ప్రబలప్రమాణమై దాని ననుగ్రహించినది. సన్న్యాసపలపైతృకాదులు శ్రుతిస్మృత్యనుగృహీతము లయినను కలియుగమున నాదిత్యాదిపురాణములు, ధర్మజ్ఞ సమయము, వానిని నిషేధించినవి. మంత్రద్రష్టలయిన ఋషులవచనములలో నేకదేశమునకు ప్రామాణ్యమును ఏకదేశమునకు అప్రామాణ్యమును కల్పించినచో ఆస్తిక మతమే యస్తమించును. ఆర్షవచనము లొకటి యప్రమాణమనిన నానావచనములను నానాదేశకాలములయందు అనుష్ఠాపకతాలక్షణప్రామాణ్యము లేదని చెప్పవలయును గాని యత్యంతాప్రామాణ్యమును చెప్ప నవునుగాదు. "కపిలో యది సర్వజ్ఞః కాణాదో నేతి కా ప్రమా" ఈ న్యాయముచే సర్వజ్ఞులు వారిశాస్త్రములును తుల్యప్రమాణములు. సాక్షాన్నారాయణావతారుడయిన వ్యాసునిచే ప్రణీతములయిన పురాణాదులు ప్రత్యేకదేశములన్నను సమష్ట్యేకదేశములన్నను ఫలభేదము లేదు కావున రెండువిధములునూ సమరసభావముగలవియై యున్నవి. ఇట్లు శ్రుతిస్మృతిసమ్మితములయిన పురాణములే మన ప్రాచీన భారత జ్ఞాన విజ్ఞాన సర్వస్వములు. అరువదినాలుగుకళలు పురాణములయందే ప్రతిష్ఠితములయినవి. మన ప్రాచీన మహాపురుషాదులవంశచరిత్రములు, దివ్యక్షేత్రతీర్థమాహాత్మ్యములును దేవాలయాది ప్రతిష్ఠాతంత్రములును పురాణమాత్రశరణములు. పురాణజ్యోతిసెలుంగకున్న నీనాస్తికలోకము గాఢాంధకార నిమగ్నమే యగును. నేడు మనవారు శ్రుతిస్మృతుల నధ్యయనము చేయకున్నను పురాణములను పఠించుచు నాటియందు శ్రద్ధాసక్తులు గలవారైయున్నారు. బహుప్రయోజనమును ననంతసారమునునగు పురాణవారాశిని మథించి తత్సారమును లోకమునకు ప్రసాదించుట విబుధుల కర్తవ్యమని విన్నవించి విరమించుచున్నాను.

సంపాదకుడు

# గంగాదృశ్యము

సరిపెల్ల విశ్వనాథశాస్త్రి గారు

శ్రీ హరిద్వారమునుదాటి యావలఁ గల
నాటుదారినిజనుచు మిన్నేటితోడఁ
గొండలెక్కుచు దిగుచును గొంతదవ్వు
నరిగియుంటిని నచట ననంతవిభవ
యుతము గంగాలకానంగ మొప్పుచుండు

సంగసమతలంబుననుండి గంగఁగనఁగ
లోయలందలివనములలోన వెడలి
చుట్టియున్నట్టి హిమగిరిఁ జోద్యములను
బొరలివచ్చుచు గంగలోఁ బొంగికలయు
చున్న సెలయేళ్లసంపద నెన్నుకొనుచు

సానుతలమున నెల్లైనస్థలముంగాఁగ
నిలచికనిఁ నిసర్గశోభలవచింతు.

* * * *

వెల్లజిగిపింఛుఁ జల్లుచు విరియనవ్వు
వనరమణి హసించుచునున్న దనఁగఁజూచి
సరభసంబుగఁ బరువిడు సరణిఁజూడఁ
బుట్టినింటికిఁబోవు పూఁబోఁడిపగిది
సూర్యసంతాపమున జేసి సుక్కు భువిని
కుంభవృష్టిఁగఁ బాలు దా గ్రుమ్మరింపఁ
గామధేనువు గురియు దుగ్ధంబులనఁగ
వెండికొండను రహిమించి వెలయు శివుని
భారమూనినశ్రాంతిచే బహులమగుచు
నందిముఖమునఁ వెడలు ఫేనంబునాఁగ
నాఁడు పాతాళమున బలి నయముగదూర
హరియె చెయిచాఁప ధీరతఁ గరమునందు
ధారలిడినయశః పూరధారలనఁగ
చంద్ర సూర్యులే, చొరరాని సాంద్రవనము
నందు వసియించు వనలక్ష్మి నరయఁగోరి
యామె కోపంబు రవ్వంత యపనయింప
జీవధారల రూపొంది చెలఁగు కరణి;
మంచుకొండల రాయని మించు దేహ
మందయిన నాడి శాస్త్రేణియనువు దోఁప.
నాథులసురులఁ జిక్కి యనాథులగుచు
వనములంగల ఋషిపుణ్యవాటి కలను
దాఁగియుంటకై బరువెత్తెఁదలఁచి యేమొ
యమరకాంతలు దిగివచ్చిరంచుఁ దోఁప;
సజ్జనావళి సంకల్ప సముదయంబు
దుర్జనుల కెడఁగల్గఁగఁ దొలఁగిచనుచు
గలుగు సిద్ధంతులను నెల్ల గెలుచుకొనుచు
కపటు ఫలసిద్ధిఁగాంచుచు గతిఁ దనర్చి;
దానవుల కోడి యింద్రుండు దీనుఁడగుచు
జలములను దాఁగ ధైర్యంబు చల్లఁబడుచు
నప్సరఃస్త్రీలు చూపిన హస్తములను
బట్టుటకై పోవ దివిని విడి బయలు వెడలి
గంగచల్లనిగర్భానఁ గలసిపోవ
సంభ్రమంబునఁ బరువిడు సమయమునఁగ
జారిపోయెను సంస్కృతి జారిపోఁగ;
ఆర్యసంతతి విచ్ఛిన్నమగుటకల్ల
ఆర్యజీవన సంస్కార మెపుడు మనుగ
నార్యభూమిని పేరేగ నలుగుఁగొనుచు
చాటి చెప్పుటకో యనుచాయ దోఁప
యజ్ఞభాగంబు లర్పించి యాన్నమిడుచుఁ
దమ్ముఁబోషించు భారతధాత్రి ననుచు
మునఁగ నమృతము గురిసి రసుసులంగ
పాలవెల్లునపాయులై పాఱె ననఁగ
వేదసారంబు శాఖలై వివిధగతుల
నార్యభూమిని విరివిగా నలము ననఁగ
తరులమూలలసంకులు దాఁగిపోయి
మంచుగడ్డలయాపగున మణఁగిపోవు
భూరిపాతాళముదనుకఁ బోవు యుబికి
యందమగు మంచుబంతులు నాడుకొనుచు
నొక్కచో మెల్లన డిగుచు నొక్కచోట
ఘనశిలావళిఁ ద్రోయుచు గంతులిడుచు
దూరమునఁబార్ల్లి పొరలు దాఁ దూలుకొనుచు
గణనమించిన ధార లక్కజము గూర్చె.





# ఆంధ్ర వాఙ్మయ యుగములు

దిగవల్లి వేంకటశివరావుగారు బి. ఏ. బి. యల్.

### ఆంధ్రము ఆర్య సాంప్రదాయము

ఆంధ్రు లార్యులు కారనువారు కొందరున్నను ఆంధ్ర వాఙ్మయము ద్రావిడమనువారు మాత్రము లేరు. ఆంధ్రులార్యులు. వీరి నాగరికత, భాష ఆర్యములే. పెక్కువందలేండ్లక్రింద టాంధ్రపండితులు సంస్కృతమునే మాట్లాడుచు సంస్కృతమునందె తమ విద్యల వెదచల్లుచుండిరి. వేదోచ్చారణమున ఆంధ్రులను చెప్పి మఱియొకరిని చెప్పవలె శాస్త్రమున, తర్కమున తక్షశిల కాశీవిద్యాలయములం దాంధ్రులు పేరువడసిరి. కాకరపర్తిలోని, కోనసీమలోని ఆంధ్రవిద్వద్వరేణ్యులలో చెన్నపురి విశ్వవిద్యాలయ పట్టపరీక్షలకన్న కఠినతరములగు విద్యాపరీక్షల దేరినవా రుండిరి. నలందా, ఉజ్జయిని, అమరావతి పట్టణములలో విద్యల నభ్యసించినవారు నానారాజసందర్శనము చేసి పండితసభలలో బిరుదుల నందినవారు ఆంధ్రులలో పెక్కండ్రుండిరి.

### ఆంధ్ర సంస్కృతకవులు

సంస్కృతవాఙ్మయములోని వ్యాఖ్యాతలలో కవులలో వైయాకరణులలో శాస్త్రజ్ఞులలో ఆంధ్రులనామములు సువర్ణాక్షరములతో లిఖియింపబడినవి. ఆంధ్ర గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథము లిప్పటికిని పఠియింప బడుచున్నవి. మహానుభావుడగు కబీరునిగురువు రామానందు డాంధ్రుడు. పండితరాయ బిరుదాంకితుడగు జగన్నాథపండితుడు— ఢిల్లీసామ్రాజ్యాస్థానకవి—ఆంధ్రుడు. ఇతడరబ్బీభాషనుండి రేఖాగణితమును సంస్కృతమున వ్రాసెను. ఉత్తర రామచరిత్ర గ్రంథకర్త భవభూతి, కృష్ణ కర్ణామృత కర్తలీలాశుకుడు, నారాయణతీర్థులు ఆంధ్రులని ప్రతీతి. ఆంధ్రకవిత్వ విశారదుడగునన్నయ సంస్కృతమున వ్యాకరణము రచియించెననియు అది పండితులు చదువుచుండిరనియు మనము వినుచున్నాము. శ్రీనాథమహాకవి నైషధమునకు వ్యాఖ్యానము వ్రాసెను. సర్వజ్ఞసింగన రసార్ణవసుధను వ్రాయుటయు, విద్యానాథుడు ప్రతాపరుద్రీయమను అలంకారశాస్త్రమును వ్రాసియుండుటయు మన మెఱుగుదుము, ఆంధ్రులు రచియించిన గ్రంథముల నామములను వ్రాయదొడగినచో భారతిలో ప్రకటింపబడు ముద్రిత గ్రంథనామావళిగ పరిణమించును.

## ఆం ధ్ర లి పి

ఆంధ్రవాఙ్మయము క్రీస్తుశకము పదవ శతాబ్దివరకును సంస్కృతమునందే ఇమిడి యున్నదని, ఆంధ్రులు ఆర్యనాగరకతయందే పాల్గొనుచు తృప్తిజెందియుండిరని చెప్పుట చరిత్రకు విరుద్ధము కానేరదు. తెలుగులిపి సంస్కృత లిపినుండి జనించినది. బ్రహ్మీలిపి నాగరలిపి వికృతమనియు దానినుండి ప్రాచీనాంధ్రలిపి యుద్భవించినదనియు మనము పురాతన శాసనములలోని నలుచతురపులిపిని చూచినచో గ్రహింపగలుగుదుము. చాళుక్య కాలమునాటి ఆరవశతాబ్దిలోని శాసనములలోని దానికన్నను, ఎనిమిదవశతాబ్దిలోని యుద్ధమల్లుని బెజవాడ శాసనములోని దానికన్నను పదునొకొండవ శతాబ్దిలోని నందంపూడి శాసనలిపి గుండ్రనగ నున్నది. చతురస్రములో నుండి త్రికోణాకారముగను, దానినుండి వలయాకారముగను మారినది. మన భాషాలిపులను సంస్కరించినది నన్నయ. అప్పటినుండి ఆంధ్రభాషయు, లిపియు వాఙ్మయమును ప్రత్యేకముగ, వ్యక్తిస్వాతంత్ర్యముతో స్వేచ్ఛాజీవనముతో వర్ధిల్లినది.

### ఆంధ్రవాఙ్మయయుగములు

ఆంధ్రవాఙ్మయచారిత్రము నైదుయుగములుగ విభజింపవచ్చును.

౧. పురాణయుగము:—ఇందార్యనాగరికతా విజ్ఞానముల వెదచల్లు పురాణములు సంస్కృతమునుండి భాషాంతరీకరింపబడినవి. అందచ్చటచ్చట సంస్కృత కావ్యధోరణియు కానసగును. ఇందు ప్రధానరసము భక్తి. మతము నీతియు సాహిత్యమున కనబడును. సంస్కృత పురాణములకన్న నాంధ్ర పురాణములు రమణీయములని ఉభయభాషావిదులు అనుచున్నారు.

౨. ప్రబంధకావ్యయుగము:— ఇందు సంస్కృత కావ్యములను తెలుగుచేయుట. మహాత్మ్యములు, ఉపాఖ్యానములు, ఖండకావ్యములు వ్రాయుట—ముఖ్యముగ ప్రబంధరచన, సంస్కృతభాషనే ఆదర్శముగ నుంచుకొని అందలి విజ్ఞానమునే ప్రకటించుట ఆకాలమునాటి కవి ఆదర్శము. కావ్యముయొక్క కృతి స్ఫూర్తియు, భావము, రసము భగవంతుని సముఖమునందో, దేవునిగుడిదగ్గరనో, దేవుని భక్తుల జీవితమునందో కనబడును.

౩. శృంగారప్రబంధయుగము:— ఇందు సంస్కృత విజ్ఞానము, అలంకారములు, శాస్త్రములు శృంగారమును మునిగినవి. నాయికానాయకుల జీవితమున ప్రేమ, శృంగారమును చూపగా మిగిలిన సందులలో తక్కిన రసములు, భావములు, విజ్ఞానము చూపబడెను. ఉద్యానవనపుటందము, చంద్రకాంత శిలాకుడ్యముయొక్క లలితసరణి, పండితుని శాస్త్రజ్ఞానము, రసికుని శృంగారమును మనోహరమూర్తియగు నాయికయే మనకు చూపవలెను!

౪. గద్యకావ్యయుగము:—ఇది వీరేశలింగయుగమని చెప్పవచ్చును. గద్యకావ్య మీయుగమున పరిపక్వమొందినది. సంస్కరణము, విమర్శ, పాశ్చాత్యభాషాంతరీకరణము, పాశ్చా

త్య విజ్ఞాన ప్రకటనము సేయుగమున వీరేశలింగముగారు చేసిరనిన నతిశయోక్తి కానేరదు. ఇందే నవల, నాటకము, చిన్నకథ, వ్యాసము, ఉపన్యాసము నుదయించినవి. తరువాత మొదటి నాల్గుయుగములలోని యుత్తమపద్ధతులను గ్రహించి భాషకు వన్నెపెట్టినకవులు నీయుగమున మనకుగలిగిరి. మఱియు నవయుగ రచనములకు దారిచూపిన కవిపుంగవు లీయుగమున జనించిరి.

౫. నవయుగము:— ఇందు పద్యము, గద్యము క్రొత్తరుచులు తెలుపుచున్నది. వివిధకళాపరిజ్ఞానము, నానాదేశ నాగరకతా సమ్మేళనము, నవయుగ విజ్ఞాన ప్రద్యోతక భావములును గలసి ఉద్రేకము నొక్కచోటను, లాలిత్యము నింకొకచోటను, విజ్ఞానము నింకొకచోటను చూపి ఆనందమును కలిగించుచున్నవి. ఇందు వృద్ధులు బాలురుకూడ పాల్గొనుచున్నారు. సారస్వతము పరిపూర్ణతనొందుటకు ప్రయత్నించుచున్నది.

## వాఙ్మయ రంగములు

ఆంధ్రవాఙ్మయచారిత్రమునవిజ్ఞానమునకు, పండితులకు నునికిపట్టులగు ప్రదేశములు కాలానుగుణ్యముగ మారినవి. రాజాశ్రయము గోరు కవిజనులు పలుచోటుల చేరిరి. పోతనామాత్యునివంటి తపోధనులు తప్ప తక్కిన వారు రాజులనె యాశ్రయించుచు వచ్చిరి. అందువలన నాంధ్రదేశమునందలి పండితులు, కవులు మహారాష్ట్రమున, తమిళదేశమున, నుత్తర హిందూస్థానమున గూడ కనబడుచున్నారు. చోళరాజులు, తొండమాన్ ప్రభువులు, తంజాపురీనాథులు, మాత్రమేకాక, బహమనీ సుల్తానులు ఢిల్లీచక్రవర్తులును మనకవుల నాదరించినట్లు మనగ్రంథములవలన, చాటూక్తులవలన తెలిసికొనుచున్నాము. అయిన నాంధ్రవిజ్ఞానమును ముఖ్యముగ నాదరించి ప్రోచినది 11వ శతాబ్దిలో రాజరాజ నరేంద్రుడు; 13,14 శతాబ్దములలో రెడ్డిరాజులు; 14,16శతాబ్దములలో విజయనగరాధిపులు. రాజమహేంద్రవరమును, నెల్లూరును, ఏకశిలానగరమును, విజయనగరమును, మైసూరు, మధుర, పుదుక్కోట, తంజావూరు, కాళహస్తి, గద్వాలలు ఆంధ్రపండితుల కాశ్రయములుగ నుండెను. ఆధునికయుగమున పిఠాపురము, బొబ్బిలి, విజయనగరమును, కాకినాడయు, ఏలూరు, బందరు, చెన్నపురియు, రాజమహేంద్రము, నెల్లూరులతోపాటు ఆంధ్రవిజ్ఞానమున కాటపట్టులుగనున్నవి. అట్లన నితరములగునూళ్లు నిరక్షరులతో నిండియున్నవని నాతలంపు కాదు.

## వాఙ్మయ స్వరూపము

మొదటి మూడుయుగములందును పద్యరచన మెక్కుడు ప్రాముఖ్యమునొందినది కాని వచనరచన యంతగ వాడుకలోనికి రాలేదు. ఆకాలమున మూడువందలమంది ముఖ్యకవులును వేయిమంది సాధారణకవులు నుండిరి. నాటకములుతప్ప తక్కిన వాఙ్మయాంగములు చక్కగ వృద్ధిజెందినవి. సంస్కృతము పండితభాషయై పోయినది. ఆంధ్రమే వాడుక భాషయైనది. ఈకాలమున రచియింపబడిన గ్రంథములలో చాలవరకు కాలవాహినిలో కలసిపోయినవి; శైవ వైష్ణవ జైన బౌద్ధ

మహమ్మదీయ మతకలహముల కాహుతియై పోయినవి; కృతులపేరు మాత్రమే నిలచినవి 82 కలవు. నశించిన వెన్నికలవో! శైవ గ్రంథములును వైష్ణవ గ్రంథములును మన భాషయం దాయామతములు విజృంభించిన రీతిని తెలుపుచున్నవి. కాని వీనియం దద్వైత సూత్రములే ప్రబలముగ నుండుటవలన ప్రజలద్వైతప్రియులని స్పష్టపడుచున్నది.

## పురాణయుగము

నన్నయకును నన్నెచోడునికిని పూర్వముండిన ఆంధ్ర వాఙ్మయమునుగూర్చి మనము వినుచున్నను వాఙ్మయము మాత్రము కనబడుటలేదు. పురాణ యుగమునాటి ప్రథమగ్రంథము లీ యిరువురివె. శ్రీమదాంధ్ర మహాభారతమును, కుమారసంభవమును. 11-10శతాబ్దములలో పురాణములనే కవులు వ్రాయజొచ్చిరి. పదునెనిమిది పురాణములును తెలుగుచేసిరి భాగవత రామాయణముల నద్భుతముగ తెనుగున వ్రాసిరి. చక్కనిభాషలో కథాభాగము మనోహరముగ వ్రాసిన ఆంధ్రకవులరచనలు నేటికి నప్రతిమానములుగ నిలిచియున్నవి. పురాణములలోని ఉపాఖ్యానములను దీసిచూచినచో నొక్కొకటి యొక్కొక కావ్యమనవలె నుండును. ఆదికవులు నిర్భయముగ తమ యభిప్రాయములను వెల్లడించిరి. వారి రచనలందలి ప్రకృతి సౌందర్యవర్ణనములు, స్వభావప్రదర్శనము నప్రతిమానములు. నన్నయ తిక్కన ఎఱ్ఱాప్రగ్గడ పోతన శ్రీనాథుల కవనము సొంపు వర్ణనాతీతము. ఈకవులు శైవ వైష్ణవ పురాణములను తెనిగించుచున్నట్లు అద్వైతవేదాంతమునే బోధించుచు వచ్చిరి.

ఈకాలమునాటికవులకు రాజ సమ్మానముండెను. కవులు కుద్యోగమునిచ్చిన తెలుగు ప్రభువులు నుండిరి. ఆంధ్రదేశ మాతరుణమున మొత్తముమీద మంచిస్థితిలో నుండెను. అశ్వములు, ఆయుధములు, పట్టువ్యాపారము సాగుచుండినట్లు శ్రీనాథుడు చెప్పుచున్నాడు. మోటుపల్లి గొప్ప సముద్రవర్తకస్థానముగ నుండెను. అయినను తెలుగు నాయకు లొండొరులతో పోరాడుకొనుచుండిరి. ఇంతలో మహమ్మదీయులును దండయాత్రలు సలుపజొచ్చిరి. ప్రజలు సుఖముల మరగిరి. రాజులు ధనమదాంధులైరి. వేమన, రామానందుడు, మున్నగు సంఘసంస్కర్తలు వేదాంతము బోధించుచు దిరుగసాగిరి. త్యాగరాజు తన భక్తియోగమును పాడజొచ్చెను. గోపన్నగారు నదుపాకు తత్త్వబోధ చేయసాగెను. కవులువ్రాసిన పురాణములు, స్థలపురాణములు, మాహాత్మ్యములు నీకరిస్థితులను చక్కగ తెలుపుచున్నవి. ప్రబంధములనుకూడ కవులువ్రాయజొచ్చిరి కాని యవి తరువాత కాలమునసె విజృంభించినవి. శ్రీనాథుడీయుగమున నుండి ప్రబంధకావ్యయుగమునకు దారిదీసినాడు.

## ప్రబంధకావ్య యుగము

ప్రబంధకావ్యయుగము ఆంధ్రుల చారిత్రమున మిగుల నుత్కృష్టమగు కాలము. పురాణయుగమునాటి కవులు ప్రబంధరాజములను రచియింపసాగిరి. ప్రౌఢకావ్యములు మా

హాత్మ్యములు, ఉపాఖ్యానములు, నీయుగారంభమున కనబడును. ప్రబంధకావ్యములే యీకాలమున స్పష్టపడినవి. నాయకప్రభువుల వైభవమును కవులు వర్ణించిరి. ఆకాలమునాటి రాజకీయ సాంఘికములగు పరిస్థితులు, నాగరికత సారస్వతమున ప్రతిఫలించుచున్నవి. జగద్విఖ్యాత మాగు విజయనగర సామ్రాజ్య మీకాలముననే స్థాపింపబడినది. ఈసామ్రాజ్యవిభవమును మాచి ఖండాంతరముల నుండి వచ్చిన రాయబారులును పాంథులును, వర్తకులును వారి ఆశ్చర్యపడిరి. పేయస్, నికెటిక్, న్యూనిజ్, అబ్దుల్ రజాకులు వ్రాసినవర్ణనలద్భుతములు. ఆకాలమున నవధాన్యముల వలెనె రత్నరాసులు సంగళ్లలో పోసికొని యమ్మెడివారట! విజయనగరవిభవమును పాశ్చాత్యులు కూడ చూచి మెచ్చుకొనిరి. శ్రీకృష్ణదేవరాయ లీకాలమునకు శిఖామణి. ఈత డనేక ప్రబంధములకు గృతినాయకుడు. ఆయన ఆస్థానమున అష్టదిగ్గజములని పేరువడసిన కవిపుంగవులు రచియించిన ప్రబంధములాంధ్రభాషయం దుత్తమగ్రంథములుగ పరిగణింపబడుచున్నవి. ఈప్రబంధలక్షణము లెల్ల సంస్కృతకావ్యములననుసరించియేయున్నవి. మనుచరిత్రయు, వసుచరిత్రయు, పాండురంగమాహాత్మ్యమునీకాలమునాటివే. తనకవులచేత నుద్గ్రంథములను వ్రాయించుటయేకాక కృష్ణరాయలుకూడ ఆముక్తమాల్యదనువ్రాసి యశమును గడించెను. ఇది పదునాఱవశతాబ్దినాటి సంగతి. పదునేడవశతాబ్దియందుకూడ ప్రబంధము లనేక కవులు రచియించిరి. అయిన నిపుడు వారు స్వకపోలకల్పనములను చేయబొచ్చిరి. వింతసంగతులు, కథాచమత్కృతి, పాత్రపోషణము కలిగి పద్యరూపమున వ్రాసిన యాఖ్యాయికవంటి ప్రబంధమునువ్రాసి ఆంధ్రభాషకు వన్నెపెట్టినది పింగళి సూరన. ఈకవికళాపూర్ణోదయము ప్రబంధరాజమని చెప్పనచ్చును.

### శృంగారప్రబంధయుగము

ప్రబంధయుగముననే చేర్పవలసియు నింకొకతెగయందు చేర్పవలసిన ప్రబంధములు 17,18 శతాబ్దములలో చాల విరివిగ వ్రాయబడినవి. ఇంతకు పూర్వముకూడ ఇట్టివానిని కవులు వ్రాసిరి కాని ఈకాలముననే ఇవి వృద్ధిజెందినవి. ఇది శృంగారప్రబంధము. ఇందు నాయికానాయకుల శృంగారకథనమే ఇతివృత్తము. తక్కిన యంశములు సందర్భోచితముగ వ్రాయబడునవి. అచ్చటచ్చట పచ్చిశృంగారము వర్ణింపబడినను దీనియందలి కథాకల్పనము పాత్రపోషణము బాగుగనే యున్నవి. ప్రకృతి సౌందర్యస్వభావసౌమ్యప్రదర్శనమున నివి నిరుపమానములగు గ్రంథములని చెప్పవచ్చును. వీరేశలింగము పంతులుగారు కఠినముగ విమర్శించిన తారాశశాంక మీయుగమునాటి గ్రంథము. వీరేశలింగము పంతులుగారే పరిశోధించి ప్రకటించిన విజయవిలాసము నీయుగమునాటిదే. సారంగధరచరిత్రము, బిల్హణీయము మున్నగు శృంగారప్రబంధము లీకాలమునాటి కృతులు. "ఈచేమకూర చక్కెర మడిలో అమృతముపాఱించి పెంచినదిగాని మట్టిలో నీరు పాఱించి పెంచినదికాదు" అని సారం

గధర చరిత్రనుగూర్చి బ్ర. శ్రీ. వేదము వెంకట్రాయశాస్త్రి గారు వ్రాసినారు. హంస వింశతిని విమర్శించువా రందలి హంసనియతిని గమనింపరు. ముద్దుపళని వ్రాతలు రోతలుగాక పోయినను శ్రీమతి నాగరత్నమ్మ వీరేశలింగ ముగారివంటి సంస్కర్తచేసిన విమర్శనము నెగతాళి చేయకుండిన బాగుండెడిది.

కొన్ని వాఙ్మయభాగములు

ముఖ్యవాఙ్మయాంగములను పురస్కరించుకొని వాఙ్మయ యుగములను నిర్ణయించు సందర్భమున ఇతర వాఙ్మయభాగములను గమనింపమైతిమి. ఇందు ముఖ్యముగ ద్విపద కావ్యము పురాణయుగమునను ప్రబంధయుగమునను కూడ ప్రఖ్యాతి జెందినది. శ్రీనాథుని పలనాటివీరచరిత్రము, రంగనాథుని రామాయణమును సుప్రసిద్ధగ్రంథములు. శ్రీకృష్ణుని రాముని సంబోధించుచు వ్రాయబడు వీరగీతి, బొబ్బిలికథ, విజయనగర మహారాష్ట్రకథలు నుండెను.

ఆంధ్రసాహిత్యమున కీర్తనలు, పలపాటలు, తత్త్వములు, హరికథలు చిరకాలము నుండి ప్రసిద్ధి జెందినవి. వీనియందు భావకవిత్వము, నీతి మతసాంఘికవిషయములు కనబడును.

ఆంధ్ర వాఙ్మయమున ప్రత్యేకముగ పేర్కొనవలసిన వాఙ్మయాంగము శతకము. 12, 13 శతాబ్దములనుండియు శతకములు కనబడుచున్నవి. ప్రథమమున భగవంతునిసంబోధించుచు శైవ, వైష్ణవ, అద్వైతసాంప్రదాయాను సారముగ కవి తన హృదయమును వెలిపుచ్చుచు, కృతిచెప్పుచుండెను. క్రమక్రమముగా తన స్వీయచరిత్రను చెప్పకొనెను. పిదప తన కాలమునాటి రాజకీయ మత, సాంఘిక పరిస్థితులను వర్ణించసాగెను. పదునారు పదునేడవ శతాబ్దమునాటి శతకములు-కవిచౌడప్పశతకము, కుక్కుటేశ్వరశతకము, రామలింగేశ్వర శతకము, వేమనాగారిశతకమును- సాంఘిక విమర్శనములు, పాశ్చాత్య వాఙ్మయముల యందలి విమర్శకకవిత్వము (Satire)ను పోలియున్నవి.

దండకమును సంస్కృతమునుండి మన కవులు గ్రహించి శతకములవలెనె ప్రత్యేక వాఙ్మయాంగముగ చేసిరి.

18 మొదలు 19 శతాబ్దమువరకును మనకు కనబడువాఙ్మయ మంత సుప్రసిద్ధమైనదికాదు. చాలగ్రంథములు వ్రాయబడెను. గాని ఉద్గ్రంథములు తక్కువ వ్రాయబడినవైనను పూర్వకవ్యనుకరణములే. ఈ కాలమున రాకపోకలు, దొమ్మియుద్ధములు, కలహములు వృద్ధియై వివిధభాషలు తారసిల్లుటవలన కన్నడము, మహారాష్ట్రము, ఉర్దూ, పారసీభాషల ప్రోద్బలమాంధ్రమున కలిగెను. చిత్ర కవిత్వము మాత్రము వృద్ధిజెందెను.

గద్యకావ్యయుగము

పాశ్చాత్య సామ్రాజ్యస్థాపన మీకాలమున జరిగెను. పండితులు మన సంగతులను వారికి చెప్పుటకు కావలసివచ్చిరి. (ద్విభాషి) "దుబాషు"లు బయలు దేరిరి. తూర్పుఇండియాకం సంఘప్రభుత్వమున ఇంగ్లీషు

చదువనేర్చిన యుద్యోగములునచ్చునను నాస కలిగినది. తెలుగుబడులందు ఆంగ్లాక్షరములు చెప్పసాగిరి. ప్రభవ విభవలు, బాలరామాయణమునకుబదులు ప్రైమరులు, గ్రామర్లు రీడరు వచ్చినవి. ఈకాలమున తెలుగును దేశీయులుపేక్షింప సి. పి. బ్రౌనుగారు చూచి, గ్రహించి, తెలుగునం దభిమానించి, పనిచేయసాగిరి. ఆంగ్లేయ రాజ్యాంగ విధానమున వెలసిన విద్యావిధానమును భారతీయులకు నిజదేశ దేశభాషల యందలి యభిమానమును పోగొట్టి ఆంగ్లదేశ భాషలయం దభిరుచి పుట్టించుటకు ప్రయత్నములు సలుపజొచ్చినవి. పాశ్చాత్య జీవితాదర్శములు, తుచ్ఛములు మనవారి కలవడినవి. ఆంధ్రము, పల్లెటూరివారి పఠనాసక్తిపైనను చెన్నపురి గుజిలీబజారులోని పీచుకాగితపు పుస్తకములపైనను ఆధారపడి జీవచ్ఛవమునలె కొనయూపిరితో నిలిచి యుండెను.

విద్యార్థులు కళాశాలలో చదువసాగిరి. వీరిలో ఆంగ్లసారస్వతములోని మంచిపుస్తకములను చదివిన యువకులకు విశాలదృష్టి, ఔదార్యము, దేశభక్తియు, ఉద్రేకమును కలిగెను. మన యాచారములయందలి లోపములను చూచి సంస్కరింప నూహ కలిగెను. అంత రాజారామమోహనరాయలు, వివేకానందస్వామి బోధనములు ప్రజలయందు నూతన సంచలనము కలిగించెను. సంస్కరణాభిలాష యొకవంక, సనాతనధర్మోద్ధరణాభిలాష మింకొకవంక నుఱ్ఱూతలూగించెను.

ఈనూతనోద్యమముల సంపర్కము కలిగినవారు యోచనానిమగ్నులైరి. తమ నాగరకతను వాఙ్మయమును విమర్శకదృష్టితో చూచుకొనసాగిరి. సంఘసంస్కరణము, సారస్వతసంస్కరణము, సనాతన ధర్మోద్ధరణము, ప్రాచీన వాఙ్మయోద్ధరణము నొక్క తరుణముననే జరిగెను.

నవయుగారంభమునకు పునాదులువేయ ప్రయత్నించినవాడు, భావోద్రేకమున మునిగి తేలిన యుగపురుషుడు కీర్తిశేషుడగు కందుకూరి వీరేశలింగముగారు. ఈయన ఆంధ్ర సంస్కర్త, విద్యాధురీణుడు, కవి. ఈతనినామ మాధునికాంధ్ర వాఙ్మయచరిత్రమున సువర్ణాక్షరములతో లిఖియింప తగినది.

ఆయనకాలమును వీరేశలింగయుగమని చెప్పవచ్చును. ఈయన రచనలందు ఆంగ్ల సారస్వత ప్రోద్బలము కనబడును. భాష, సారస్వతము నీయన చేతులందు క్రొత్తయందము దాల్చినవి. చక్కనివచనరచనము, సరసములగు నభిప్రాయములు, విరసములు కాని విమర్శనములు నీయనకృతులకు వన్నెపెట్టినవి. వచనమున కథ, ఆఖ్యాయిక, ప్రహసనము, వ్యాసము, ఉపన్యాసమును మనోహరముగ రచించి దారిచూపినది వీరేశలింగముగారె. చిన్నయసూరి గారు వ్రాసిన నీతిచంద్రిక తప్ప ఆకాలమున చక్కని వచనగ్రంథ మే లేదనుట యతిశయోక్తి కాదు. నాటకమును కావ్యమును వీరేశలింగమువారు రచియింపక పోలేదు. వీరి శాకుంతలము నేటికిని మన్నన లందుచున్నది. వీరేశలింగముగారు తమ గ్రంథములందు సంఘసంస్కరణాభిలాషను పూర్తిగ నిర్భయముగ వెల్లడించిరి. తుదకు ఆంధ్రభా

షలో స్వీయచరిత్రమును వ్రాయు భాగ్యమును వీరికే కలిగినది. వీరేశలింగముగారి సమకాలికులగు కొక్కొండ వేంకటరత్నం పంతులుగారును, నడ్డాది సుబ్బారాయుడుగారును, ఆకుండి వ్యాసమూర్తి శాస్త్రిగారును తమకృతులతో ఆంధ్రభాషామతల్లికి వన్నె పెట్టినారు. ఈకాలముననె వేదము వేంకటరాయ శాస్త్రులుగారు తమ యద్భుతనాటకము ప్రతాపరుద్రీయమును వ్రాసినారు. వీరి సంస్కృతభాషాంతరీకరణము లప్రతిమానములు. తిరుపతివేంకటేశ్వరుల భారతనాటకములును, ధర్మవరం కృష్ణమాచార్యులు, కోలాచలం శ్రీనివాసరావుగార్ల నాటకములును మనభాషకు లభించినవి. వీనిని ప్రత్యేకముగ పేర్కొని వ్రాయవలెనన్న నొక గ్రంథమగును. తిరుపతికవులు ప్రాచీనాధునికకవనముల సమ్మేళనమున నిపుణులు. వీరికవిత్వ మాదికవులను అభినవకవులను కూడ జ్ఞాపకమునకు దెచ్చును. వీరి శ్రవణానందము సరసమగు శృంగారప్రబంధము. వీరి శతావధానములు భావకవిత్వముతో, విజ్ఞానముతో, రసముతో నిండియున్నవి. వావిలికొలను సుబ్బారావుగారు తిరుపతి కవులకు వలెనె ప్రాచీనాధునిక సమ్మేళనమును ప్రదర్శించుచున్నారు. వీరిసుభద్రావిజయము, రామాయణమును వీరిని ప్రాచీనకవిగ చేయుచున్నవి. వీరి కృష్ణలీలామృతహితచర్య,మాలికలు వీరిని గొప్ప విమర్శకునిగ వచనరచయితగ చేయుచున్నవి. వీరి శైలి మృదుమధురము. వీరి వ్యాసరచన మద్భుతము.

నవయుగము

ఇరువదవ శతాబ్ది శాస్త్రజ్ఞానమునకు, రాజనీతిజ్ఞులకు పాశ్చాత్య నాగరకతా విమర్శకులకు మునికిపట్టు. పాశ్చాత్యసారస్వతమున గొప్పగ్రంథకర్త లుద్భవించినకాలము. లలితకళాభిజ్ఞులు, నటకులు, గాయకులు నుద్భవించినకాలము. విద్యుచ్ఛక్తియువిద్యుచ్ఛక్తినంటి తలంపులు వరసినకాలము. పాశ్చాత్య నాగరకత మనదేశమునను ప్రసరించినది. రవీంద్రుడు, జగదీశచంద్రుడు, ప్రఫుల్లచంద్ర రాయి, బాలగంగాధరతిలకు, అనీబిసెంటు, రామానుజం, కోడి రామమూర్తియు తమ యసమాన ప్రతిభల చూపినకాలము. ఈశతాబ్ది పరోపాయుత సంగ్రామమును గాంధిమహాత్ముని చూచినది. ఇట్టిశతాబ్దియందు లలితకళావిజ్ఞానమును సారస్వతమున నూతనకాంతు లుద్భవించుటలో నాశ్చర్య మేమున్నది? చరిత్రపరిశోధన, వాఙ్మయోద్ధరణము, స్వకపోలకల్పనాభిలాష, స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, ఆనంద మహోపారత్వములు నీ యుగమువారి యాదర్శములు. వావిలికొలను సుబ్బారావుగారు తిరుపతి వెంకటేశ్వరులు నీయుగకార్యక్రమమును ప్రారంభించినారు. ఈ యుగము యొక్క ప్రథమ పుత్రులు చిలకమర్తి లక్ష్మీనరసింహము, గురుజాడ అప్పారావు, పానుగంటి లక్ష్మీనరసింహారావుగారలు. ఈయుగమున రెండవతరమువారు చిలుకూరి వీరభద్రరావు, కొమర్రాజు లక్ష్మణరావు, వంగూరి సుబ్బారావుగారలు. మూడవతరమువారు రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామకృష్ణారావు, సాహితీ సమితివారు, వేంకటపార్వతీశ్వరకవులు.

ఇందు మొదటి తరమువారు రచియించిన నవలలు నాటకములును చిన్నకథలును, రెండవ తరమువారి చరిత్రలును, మూడవ తరమువారి భావకవనములును ఆంధ్రమహాజనులు చవిగాంచుచు తల లూపుచున్నారు. పరిశోధనమున లక్ష్మణరావుగారును, మానవల్లి రామకృష్ణకవిగారును, జయంతి రామయ్యగారును చాలపని చేసిరి.

నవల యీ కాలమున పరిపక్వము చెందినది. ప్రత్యేకముగ పేర్కొనదగినవి చాల కలవు. చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి నవలలును విమలాదేవి రాణీసంయుక్తయు దుర్గేశనందని ప్రమదావనములుగాక వంగభాషనుండి పరివర్తింపబడు నవ రాధ పరిశోధక నవలలును మన భాషయం దనుదినము వెలువడుచున్నవి. చిన్నకథ ఆంధ్రవాఙ్మయమున నొక అంగముగ నిలిచినది. పానుగంటి లక్ష్మీనరసింహారావుగారి కథలు సాహితిసమితి వారికథలును ప్రథమ ప్రయత్నములైనను చక్కగ నున్నవి.

వ్యాసరచనము నొక కళగ వ్రాసి చూపించుచున్నది పానుగంటి లక్ష్మీనరసింహారావుగారును, ముట్నూరి కృష్ణారావుగారును. సాక్షివ్యాసములు, కృష్ణాపత్రిక వ్యాసములు మనోహరములు. లలిత కళాభివృద్ధికి భాషాభివృద్ధికిని సంబంధము కలదు. ఆంధ్ర సారస్వతము నందువలె చిత్రకళయందు వింతరీతులనుచూపి ఆంధ్రుల నలరించిన కీర్తిశేషుడు దామెర్ల రామారావు. వాఙ్మయమునకు శోభగూర్పజాలిన చిత్రశిల్పి యకాలమృత్యువువాతనుబడుటయు, కొమర్రాజు లక్ష్మణరావుగారును చనిపోవుటయు మన దురదృష్టము. ఈకొఱతదీర్పప్రతిభాశాలురు మఱల మనకు కలుగుదురుగాక.

నవయుగమున ముఖ్యముగ నాంధ్రవాఙ్మయాభివృద్ధికి తోడ్పడినవి మనపత్రికలు. ఆంధ్రపత్రిక, శారద, భారతియు విజ్ఞానమునకు వికాసము కలిగించినవి. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలు మనకుచేసిన మహోపకారము మనము మరువజాలము. ఇతర మాసపత్రికలు వారపత్రికలును భాషాసేవ బాగుగ చేయుచున్నవి.






# వేమన యోగీంద్రుఁడు

జి. జాషువ కవి గారు

కనుఁగొన్నావుగదా? పరాత్పరుని శృంగారస్వరూపంబు ఛీ!
యనుకొన్నావుగదా? సమస్తమును దీవ్యత్స్వర్గసౌధంబులో
మనుచున్నావుగదా? సదా దివిజభామాచామరచ్ఛాయ నే
మన యోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానముల్.

మ. చనినా వెన్నఁడొ; కీర్తికాయము ధరాచక్రంబునన్ నిల్పి "వే
మన" యన్నామసదక్షరత్రయము నాట్యంబాడెడిన్ సర్వస
జ్జన జిహ్వాగ్రములన్ విమోహలతికాశాతాస్త్రవిఖ్యాతి వే,మన యోగీ!......

మ. మనుజాంతఃకరణంబునన్ గలుగు దంభంబెల్ల నిక్షించి చ
క్కని కావ్యామృతధారలోఁ గలిపి లోకశ్రేణికిన్ వెల్లడిం
చిన నీగంటము హస్తపద్మమున భాసిల్లన్ దివిన్ డిగ్గి వే,మన యోగీ!......

మ. నిను నాకంబున గౌరవించెదు సురానీకంబు మేమిచ్చు న
ర్చనము ల్చేకొనఁగోరి భూమి కరుదేరం బోవరా నీయ రై
నను మార్గంబు లభించు నీకు మనసున్నన్ సత్కృపాసాంద్ర వే,మన యోగీ!....

మ. ఘనయోగంబు వహించి మాకిపుడు సాక్షాత్కారమున్ బొందఁజా
లిన సామర్థ్యములేనివాఁడవె? నరాళిం గావఁగా నందనం
దనుఁడై పుట్టిన విష్ణుమూర్తి వనుకొన్నా మీవు కాదన్న వే,మన యోగీ!......

మ. వినవా? మాయభివాదము ల్సురవధూవీణారటద్గీతికా
ని నదస్యందిమరందబిందుబలమందీభూత. చిత్తుండవై
కొనవా? పద్యనవ్యారవిందములు నీకున్ గానుకల్సేయ వే,మన యోగీ!......

మ. నిను మన్నింపఁగ నీమహత్త్వమును వర్ణింపంగ దక్షుండు గ
ల్గునె? లోకంబునఁగాని నీయెడల మాకుం గల్గు సద్గౌరవం
బును బ్రత్యబ్దము వెల్లడించెద మిటు ల్పుణ్యోత్సవం బొప్ప వే,మన యోగీ!......

మ. నునుముం జెల్లి శరీరభోగవిషయాంభోరాశిలో మున్గి యీ
దిన నీస్వానుభవంబె మానవుల నీతిప్రాప్తి కాధార మ
య్యెను నేనేల మహోపకారియన నీవే వేఱుగాలేరు వే,మన యోగీ!......

మ. అనుకూలింపని మాటలన్ గుజను లందందాడుచో నీకు వ
చ్చిన లోపం బదియేమి? శైనతతి లక్ష్మీనాథునిన్ గాదనన్
వినమో నీ కనుమాన మేమిటికి నీవే మాకు సర్వంబు, వే,మన యోగీ!......

మ. కనకంపుందునుకల్గదా? భవదభంగజ్ఞానసూత్రంబు లె
ల్లను, ద్రాక్షా మధుమాధురీ సహితము ల్గాదా? కవీ! నీదు జీ
వనగాథావివిధాంశము ల్కవిత చెప్పన్ జొప్పడంబోవు, వే,మన యోగీ!......

మ. నిను గర్భంబునఁ గన్న కారణమునన్ నిక్కంబు మాభారతా
వనిపూతంబయి వెల్గుచున్నది, భవద్వాక్సీయుషం బేమొకో
కన దాకాశతరంగిణీఘనతరాఖ్యంబూని పెంపారు, వే,మన యోగీ!......

మ. పుసరాకారత జన్మమెత్తిన దయాబుద్ధుండవో లోకమో
హాస మర్త్యాకృతి సంచరించిన సముద్యద్భక్తి పుంజంబవో
యని నిర్ధారణ సేయనీయదు మహాత్మా! నీప్రభావంబు, వే,మన యోగీ!.. ...

మ. వసధిప్రాణము నీయనంతగుణము ల్వర్ణించెడిన్ వీచికా
ధ్వనులన్ బున్నమచందురుం డమలశీతజ్యోత్స్నలన్ నీయశో
ధనముల్ వెల్లడి సేయుచుండె నిదిగాదా? నీకు సాక్ష్యంబు, వే,మన యోగీ! ......

మ. అనయంబున్ గను రెప్పవేయక త్వదీయాకారము న్గాంచి కాం
చనగు న్నిక్కము దేవకోటు లనిమేషత్వంబు, మేమొక్క మా
రనిమేషస్థితిఁ దాల్పఁ గాంచనమణీయానం బధిష్ఠించి, వే,మన యోగీ! ......

మ. ఘనము న్గూర్చినవానితో సదియు నంతంబందు నంతంబునం
దని మూల్యంబు యశంబుగా నెఱిఁగి యేతన్మూల్యమున్ వేగ నా
ర్జనము న్జేసిన బుద్ధిమంతుఁడవు మర్త్యవ్యక్తివే నీవు, వే,మన యోగీ! ......

మ. మునులన్ బిడ్డలుగా గనుంగొనిన బూవుంబోఁడులందెల్ల నీ
జననీగర్భము ధన్యమైనది, భవత్సాన్నిధ్యమం దిప్పడా
వనితారత్నము సంతసించునుగదా! స్వర్గాంగనాకోటి, వే,మన యోగీ!......

మ. మనుచున్నార లజాగళస్తనములై మర్త్యుల్ ధరామండలిన్
చనుచున్నారలు నీటిబుగ్గలవలెన్ సర్వంబుఁబోనాడి, నీ
జననంబట్టిదియా నయాచరణ పూజ్యం బార్య వైద్యంబు, వే,మన యోగీ!......

మ. అనవేమన్న ధనంబు సత్కవుల కీయంజొచ్చి యొక్కింత కీ
ర్తినిఁ గొన్నాఁడట వాని కాసుగుణవర్తిత్వంబు నీనామవా
సనచేఁ గల్గుటగాక దాని కొకవ్యాజం బున్నదా? లేదు, వే,మన యోగీ!......

మ. జనులానంద మనోరవిందులయి యశ్రాంతంబు నీపేరు బో
రనఁ గీర్తించుటకెల్లఁ గారణముగాదా నీప్రభావంబు, కా
దన నెయ్యంబున వియ్యమందికొనినావా? వారితో నీవు, వే,మన యోగీ!......

మ. ఘనమందారవనీ విహారమణి మార్గస్వర్ణ సౌధాంగనా
జనము ల్వాదము లొత్త లేఁ జిగురుమేల్పయ్యావళిం జేరి వ్రా
సిన నీనూతన దివ్యకావ్య మధురక్షీరంబు వర్షింప, వే,మన యోగీ!......

మ. కనుఁగో మన్నన గోరకున్న నరుఁడొక్కండేనియున్ లేఁడు లేఁ
డని మున్మౌనులెలుఁగెత్తి పల్కుటకు సాక్ష్యంబేది దా! భారతా
వని నీవే యుదయింపకున్న నిపుడా భావంబుఁ బోనాడి, వే, మన యోగీ!......

మ. మనుజుల్ దివ్యపయోముఖోగ్రవిషకుంభ ప్రాయు లవ్యక్త
వర్తను లిందుండంగరాదు గండమని స్వర్గంబెక్కి దీపించు నా
వనమూర్తి న్నినుఁ బిల్వ నిట్టులు వెడలింపన్ ప్రేమ మన్నించి, వే, మన యోగీ!......

మ. ఇనబింబం బపరాంబుధిన్ బడకమున్నే మత్సభాకన్యకీ
వనజాస్యంబు కళావిహీనత వహింపం బోకమున్నే ద్విజ
స్వనము ల్చెందకమున్నె మాకనుల చాపల్యంబు లోపింప, వే, మన యోగీ!......

మ. అనుమానించితి మట్లు నీకచట సౌఖ్యం బిం దసౌఖ్యంబు నుం
డునె? పంచాగ్నుల మధ్యమందయిన నుండు న్నీకు సచ్ఛాంత జీ
వన మానందములో నశాంతము సృజింపన్ జాలవా నీవు, వే, మన యోగీ! ......

మ. అనయంబు న్ననుచూపులం దమల దైవాకారమున్నిల్పి బు
ద్ధిని బంధించి శరీరయాత్ర యొకరీతిన్ సాఁగిరాఁ గష్టభా
జనభూమీ నిలయంబు వాసి విబుధస్వర్గంబుఁ గొన్నావు, వే, మన యోగీ! ......

మ. అనఘా! నీకిడగా నిగారపు మణీహారంబులన్ దేము, భ
క్తినిబద్ధంబగు తారకాసరము నర్థిం దెచ్చియున్నాము, చే
కొని మందస్మిత మంకురింపఁగఁ గనుంగొమ్మంచి యేచాలు, వే
మన యోగీ! దయచేసి యందుకొనుమయ్యా గౌరవస్థానమున్.






# మోసగాండ్ర కథలు

పురాణం సూర్యనారాయణ తీర్థులు గారు

## 3

ఇద్దఱి స్వప్నము లయిన పిదపను కంఠీరవుఁ డిట్లనాఁడు:—

కంఠీరవుఁడు:— మిత్రమా! ఏకాక్షా! ఇంతవఱకు మీ రనుభవించినది కాని, ప్రత్యక్షముగా చూచినది గాని, మీ చెవులార విన్నదిగాని యేదియే నన్ను వశ్యము కలిగింపలేదు.

ఏలా— నేను పడుచువాఁడనై యుండినప్పుడు గృహస్థాశ్రమమునకు వలయు ధనము సంపాదింపవలెనను నుద్దేశముతో కొండలమీఁదను, కొండగుహలలోపలను, నిర్జనములగు నడవులలోను తిరుగుచుండెడి వాఁడను. మఱియు నానావిధములయిన మంత్రతంత్రాదులను క్రియలను సిద్ధము చేయుచుండెడి వాఁడను. ఇట్లు జరుగుచుండఁగా, ఒకప్పుడు నే నున్న స్థలమునకు వేయియోజనముల దూరములో తూర్పున ఒక గొప్పపర్వత మున్నదనియును, ఆ కొండపయిని సహస్రవేధి యను నొక రసకుండ మున్నదనియును, అది యొకయోజనము వెడల్పును, అంతియే పొడుగును గల ఱాతిపలకతో మూయఁబడి యున్న దనియును విన్నాను. ఆ సంగతి వినుటయే తడవుగా తూర్పుదిక్కునకు బయలుదేఱినాను ఒక్కొక్క అడుగు తీసి అడుగు పెట్టునంతలో నూఱుయోజనములదూరము చొప్పున పోవుచు మెల్ల మెల్లఁగా పైని చెప్పఁబడిన పర్వతముదగ్గఱకు పోయి చేరుకొంటిని. నేను పోయి చూచునప్పటికి నిజముగానే అక్కడ రసకుండ మున్నది. దానిమీఁదను మూయఁబడియున్న ఱాతి నెత్తి నే నొకఓరను ఉంచినాను. ఆ స్వర్ణకుండములోనుండి నాకు కావలసినంత రసము తీసికొన్నాను. ఎప్పటియట్లు ఱాతిని మూఁత పెట్టినాను. ఆ రసము పట్టుకొని బయలుదేఱి యిల్లు చేరినాను. ఇంక నా కేవిషయమున లోపమున్నది? ఆరసమునుసంయోగమువలన నేను బంగారమును తయారు చేయుట కుపక్రమించినాను ఆకారణమున నేను కుబేరునివలె ధనవంతుఁడ నయిపోయినాను: అనఁగా, అంతబంగారము చేసినా నన్నమాట. ఆధనము కర్చుపెట్టి నానావిధములయిన భోగము లనుభవించుచు, యాచకులకు యథేష్టముగా ఇచ్చుచు, బంధువులను సుఖపెట్టుచు ఉండెడివాఁడను. ఒకనాఁ డేమిజరిగిన దనఁగా— నేను నాపడకయింటిలో సుఖముగా నిద్రపోవుచున్నాను. అర్ధరాత్రసమయమున ఐదువందలమంది దొంగలు ప్రవేశించి మాయిల్లు దోచుటకు ప్రారంభించినారు. నేను బ్రదికి యుండఁగానే నాధనమును దొంగలు పట్టుకొనిపోవుట యా? ఆ సంగతికి నేను సహింపలేకపోయినాను. వెంటనే సాహసించి దొంగలపైని పడినాను. నా-ఒక్కొక్క బాణముచేతను పదుగురేసిదొంగలు భూమిమీఁదను పడిపోవమొదలిడినారు. అపుతల చంపు, నఱుకు, కొట్టు అనుమాటలు విని యింటనున్న నౌకరులు మొదలగువారు ప్రోగయినారు. అప్పటికి దొంగ లిట్లాలోచించుకొన్నారు:—"ఇంక మనము వీరిని తప్పించుకొని పోజాలము" అని యాలోచించి వారందఱును ఒక్కటిగా చేరి యొక్కసారిగా నాపైని పడినారు. వారిలో ఒకఁడు నాతల నఱికివైచి దొడ్డిలో ఉన్న రేఁగుచెట్టుకొమ్మకు వ్రేలఁగట్టినాఁడు. మిగిలినమొండెము తుండ్లుతుండ్లుగా ఖండించి బయటను పాఱవైచినాఁడు. పిదపనాతను వారు

నిర్భయముగా మాయిల్లంటియు దోఁచుకొని వెళ్లి పోయినారు. మరునాఁడను జరిగిన నాతలతోలూక నష్ట చిత్తగింపవలసినది. రేఁగుచెట్టున దట్టముగా పండ్లు పండియున్నవి. నా కాఁకలియు మిక్కిలిగా కలిగియున్నది. అందువలన కడుపునిండునట్లు రేఁగుపండ్లు తిన్నాను. ఇంతలొ తెల్లవాఱినది. దారిని పోవువారు నాతల రేఁగుపండ్లు తినుచుండుట చూచినారు. అప్పు డది బ్రదికి యున్నదనియే భావించి చెట్టునుండి విప్పినారు. మొండెముతోలూకు ప్రతి-అవయవమును దెచ్చి తెచ్చి సరిగా అమర్చినారు. నాతల ఆ మొండెముతో జవిపెట్టినారు. ఇఁక నేమున్నది? ఒకటిగా చేర్చుటయే పడవుగా నే నెప్పటియట్లు రూపలావణ్యాదులు గలవాఁడనై బ్రదికినాను. ఇది నేను ప్రత్యక్షముగా అనుభవించిన ఘటన. ఒకవేళ మీ కెవరికైనను ఈ విషయమున నమ్మిక లేనిపక్షమున మోసగాం డ్రందఱకును భోజనము చేయింపవలయును. నమ్మిక ముండినపక్షమున-అనఁగా దీనిని నిజ మని నమ్మినచో ప్రాచీనగ్రంథములనుండి తగిన ఉదాహరణము లు చూపింపవలసినది.

అని యీప్రకారముగా ఏలాషాథుఁ డనువాఁడు తనకథ చెప్పఁగా విన్న వారిలో శంసుఁ డనువాఁ డిట్లన్నాఁడు.

శంసుఁడు—అన్నా ! ఏలాషాఢా ! ఇప్పుడు మీరు చెప్పినకథ ప్రత్యక్షరమును సత్యమే కాని కల్పన యేమియును లేదు. కడమవారిమాట నేను చెప్పఁజాలనుగాని యిందువిషయమున నా కెట్టిసందియమును లేదు. పురాణములలోను, స్మృతులలోను, భారతాదిగ్రంథములలోను ఇట్టిసంఘటనలు పెక్కులు వర్ణింపఁబడియున్నవి.

ఏలా—అటు లేని మంచిదన్నా ! నిర్జీవమయిన నాతల సజీవ మెట్లయినదో ముందుగా బుజువుపఱిచెదరా?

శంసు—ఇదియు నొక గొప్పసంగతియా? చిత్తగింపుఁ డన్నా ! పూర్వకాలములో జమదగ్ని అనుఋషి యొకఁ డుండెడువాఁడు. ఆయనభార్యపేరు రేణుకాదేవి. ఆమె సచ్ఛీలమువలనను, పతివ్రతాత్వప్రభావమువలనను పుష్పములు ప్రాణించునట్లు ఆమె కోయఁబోఁగానే పండ్లు నేలఁ బడుచుండెడివి. ఒకానొక సమయమున ఎవఁడో గంధర్వరాజు జమదగ్ని మహాముని యాశ్రమము దగ్గఱనుండి పోవుచు రేణుకను చూచి మోహితుఁడయిపోయినాఁడు. మోహితుఁ డగుటలో ఇట్లు-అట్లునా? ఇంక రేణుక లక్ష్యపెట్టనిచో తన జీవనము వ్యర్థ మనియు, తాను జీవించుటయే అసంభవము అనియు [illegible] మోహమున [illegible]. [illegible] సమయమునఁ [illegible] జమదగ్ని యోగములకో చూచునప్పటికి [illegible] వంగుచుండెడివి [illegible]. ఆ కారణమువలన [illegible] భంగము నొందినది. ఇందులో సందేహము లేదు అని ముని విశ్వాస మేర్పడిపోయినది. వెంటనే పరశురాముఁడను కొడుకును పిలిచి "నాయనా! నీవిప్పుడు పరమపాపాత్మురాలయిన నీతల్లితల తెగనఱుకుము" అని ఆజ్ఞాపించినాఁడు. కొడుకు తండ్రి చెప్పిన చొప్పుననే వెంటనే తల్లితల నఱికినాఁడు. మొండెము మొకవైపునను, తల వేఱొకవైపునను భూమిమీఁదను పడి కొట్టుకొన మొదలిడినవి. కొడుకు చెప్పఁగానే తన-ఆజ్ఞను నెఱవేర్చినందులకు తండ్రి కెంతో సంతోషము కలిగినది. "వత్సా! చెప్పినమాట చెప్పక విన్నందులకు నాకనీయం దనుగ్రహము కలిగినది. ఇప్పుడు నీ వేవర మడిగినను నిరాటంకముగా ఇచ్చుటకు సంసిద్ధుఁడనైయున్నాను. అడుగుము" అన్నాఁడు. పరశురాముఁడు చేతులు జోడించుకొని "నాన్నగారూ! తమకు నాయందు నిజముగానే అనుగ్రహము కలిగినపక్షమున దయదలఁచి నాతల్లిని బ్రదికింపఁ గోరుచున్నాను" అని ప్రార్థించినాఁడు. "తథాస్తు" అని జమదగ్ని అన్నాఁడు. ఇఁక నేమున్నది? ఆమునినోటినుండి ఆమాటవచ్చుటయే తడవుగా రేణుకశిరము మొండెములో చేరుకొని సజీవితమయిపోయినది. ఇంక మీ రాలోచించుకొనుఁడు. ఆసంగతి నిజమయినపక్షమున తెగిపోయిన మీతల బ్రదికిపోవుటలో అసత్య మేమున్నది? ఇంకను ఇట్టి వనేకములుదాహరింపవచ్చును. జగత్ప్రసిద్ధమయిన యీ ముందు సంగతి మీరు వినకుండెదురా? అదేమందురేని వినుఁడు. పూర్వము శ్రీకృష్ణునితో యుద్ధముచేయు సందర్భ

[భారతి షష్ఠసంపుటము పదవసంచికలోని ‘రాజగృహము’ అను వ్యాసమునకు సంబంధించిన చిత్రములు]



చిత్రము ౧౦. మణియార్ మఠము



చిత్రము ౧౧. మణియార్ మఠము-నాగులవిగ్రహములు

[భారతి మూడవసంపుటము ఐదవసంచికలోని 'రాజగృహము' అను వ్యాసమునకు సంబంధించిన చిత్రములు]



చిత్రము ౧౩.

గిర్యేకముపైని జరాసంధపీఠమనబడు హంసస్తూపము



చిత్రము ౧౪. మణియార్ (మణికారనాగ) పీఠమునందలి గణేశవిగ్రహము

మున జరాసంధుఁడను మగధదేశపురాజు శరీరము రెండు భాగము లయిపోయినది. తరువాత నారెండు ఖండము లును పరస్పరము కలిసికొని యేకమయి ప్రాణమువచ్చి లేచి యుద్ధముచేయ మొదలిడినవి. ఒకవేళ, ఇది సత్య మయినపక్షమున అనఁగాశరీరముతాలూకు రెండువేఱయి పోయినఖండములును కలిసికొని బ్రదికియుండుట నిజ మయినపక్షమున, మీరల మొండెముకలిసికొని యెప్పటి యట్లు జీవించియుండుట యేమంత ఆశ్చర్యకరమయిన సంగతి?

ఇట్టిదే యీ విషయమున నింకొక దృష్టాంత మున్నది. కావలసినపక్షమున చెప్పెదను వినుఁడు. సుం దుఁడు, నిసుందుఁడు అను రాక్షసు లిద్ద ఱన్నదమ్ములు. సర్వలోకములవారిని నాశనము నొందించుటకై యము రాజుతో సమానముగ ఉద్యుక్తులై యుండిరి. అప్పుడు వారివలనిబాధలను సహింపఁజాలక దేవత లందఱును ఐక మత్యమును వహించి వారినిచంపునిమిత్తము తమతమ శరీర ములనుండి యొక్కొక్క-తిలబీజము (నువుగింజ) అంతంత అంశమును తీసి యొకచోట నుంచినారు. విలక్షణమైన యీయంశముల సంయోగమువలన తిలోత్తమ అనుపేరుగల ఒక అప్సరసయొకంటి పుట్టినది. అది అట్లుపుట్టి వెంటనే "నాకేమి ఆజ్ఞ?" అని వారినడిగినది. మీరేపనిచెప్పినను చేయుటకు సిద్ధముగాఉన్నానని అదిఅన్న వెంటనే దేవత లేకముఖముగాఁ అమ్మాయీ! సుందనిసుందులను రాక్ష సులవలన మేము మందఱమేకాకుండ నెల్లలోకములవారును చాల భయపడిపోవుచున్నారు. కాబట్టి నీ చేతనయినన్ని ప్రయత్నములు చేసి యేలాగుననయినను వారిని చంపి మమ్ములను మిగతలోకములను రక్షింపవలసినది" అని ప్రార్థించినారు. అది మంచిదే, ఇదెంత పని? అని వారి కభయమిచ్చి వారియొద్దను సెలవుపుచ్చుకొని తిన్నఁగా సుంద-నిసుందు లున్నచోటికివచ్చి వారిని తనహావభావ విభ్రమవిలాసములతోఁగూడిన నృత్యముచేతను మోహి తులనుగా జేసివైచినది. క్రమముగా వారిద్దఱును దాని రూపలావణ్యములును, హావభావ విలాసములును, ఆట పాటలయందలి నేర్పును చూచి మోహసముద్రములో మునుఁగుచు తేలుచు దరి దాపు గానక విషయాంధులై పోయినారు. తుదకు మత్సరగ్రస్తులై పరస్పరము యుద్ధ ముచేయుట కుపక్రమించినారు. ఆయుద్ధములో ఒకనిచేత నొకఁడుచచ్చి యిద్దఱన్నదమ్ములును యమలోకమునకు దయచేసినారు. అందులకే యేమహానుభావుఁడో కాని యీక్రిందిశ్లోకము చెప్పినాఁడు:—

"శ్లో. స్త్రీణాం కృతే భ్రాతృయుగస్య భేద<br>
స్సంబంధభేదే స్త్రియ ఏవ మూలమ్,<br>
అప్రాప్తకామా బహవో నరేంద్రా<br>
నారీభి రుచ్ఛేదిత రాజవంశాః."

అనఁగా—స్త్రీలనిమిత్తమున సహోదరులలో నయితము భేదము కలుగుచున్నది. ఏమా? సంబంధములను భేదించు టకు స్త్రీలే మూలకారణము. అనఁగా ఆడుదానివలన ఎటువంటి తెగనిసంబంధమయినను పుటుక్కు-మని తెగి పోవును. ఈలాగున మనస్సున కిష్టమయిన స్త్రీలు లభిం పని కారణమున జగడమాడుకొని యెందఱో రాజులు నిర్వంశు లయిపోయినారు.

అన్నా! పైకథ చిత్తగించినారు గదా! ఇంక నాలోచించుఁడు. దేవతల తిల-తిలప్రమాణాంశములొక టిగా కూడి తిలోత్తమ అను మత్తకాశిని తయారయి నప్పుడు ఖండఖండములయిన మీ అవయవము లేకమయి మీరు సజీవులయినారనుటలో ఏమంతాశ్చర్యమున్నది? ఇదియునుగాక నే నింకొక దృష్టాంతము మనవిచేసెదను. చిత్తగింపుఁడు. దానివలన మీ డెందమందు పొడుకొన్న సందేహము పూర్తిగా తొలఁగిపోఁగలదు. పూర్వకాల మున ఒకప్పుడు బాల్యావస్థలో పవనకుమారుఁడయిన హనుమంతుఁడు తనతల్లియైన అంజనాదేవిని సమీపించి "అమ్మా! నాకెప్పుడయినను ఆఁకలి కలిగినప్పుడు నన్నేమి చేయుమన్నావు?" అని అడిగినాఁడు. నాయనా! ఎఱ్ఱని అడవిపండ్లు కోసికొని తినుచుండుము." అని తల్లి బదులు చెప్పినది. అతఁ డాకలిగొన్నప్పుడెల్ల నటులే చేయుచుం డెడివాఁడు. ఇట్లు కొంతకాలము గడచిన పిదప నొక మాఱు చాల ఆఁకలిగొనియుండఁగా ఎఱ్ఱనిపం డెక్కడ నయినను చిక్కు-నా అని నలువైపులను చూచుచుండఁ గా నింతట సూర్యుఁ డుదయించుచు నతని కగపడి నాఁడు. "ఇదియును ఒకవిధమయిన యెఱ్ఱనిపండే కాఁబో లును" అనుకొని దానిని పట్టుకొనుటకు ప్రయత్నించి నాఁడు. అందువలన సూర్యభగవానునికి చాల కోపము

కలిగినది. అప్పుడు హనుమంతుని కిన్నర కరప్రహారముల చేతను మూర్ఛాతిమూర్ఛముగా చేసివైచినాఁడు.అది చూచి అంజనాదేవి యేడువమొదలిడినది. పవనునకుతన పుత్రుని వియోగమువలన చాల దుఃఖము కలిగినది. ఆదుఃఖము క్రమముగా సూర్యునిపైని కోపముక్రింపను మారిపోయినది. వెంటనే అతఁడు పాతాళలోకములోనికి పోయినాఁడు. పవనుని అభావమువలన సర్వలోకములవారును వ్యాకులపడిపోవుచున్నారు. కొందఱు చచ్చిపోయినారు కూడాను. ఆవృత్తాంతమును చూచి దేవతలందఱును మిక్కిలిగా చింతించినారు. అప్పుడు చేయునదిలేక వారందఱును పాతాళలోకమునకు పోయి 'నాయనా! పవనదేవా! నీవే మా అందఱికంటెను గొప్పవాఁడవు నీసాయము లేకుండ మేమేమియు చేయఁజాలము. కాఁబట్టి మా అపరాధమును మన్నింపుము. చచ్చిపోయిన నీకుమారుని మేము తప్పక బ్రదికింతుము. నీవిప్పటి యట్లే సంచరించుచు మాకు తోడుపడుచుండవలసినది"అని బ్రతిమాలుకొని అతనిని బయటికి తోడుకొనివచ్చినారు. వెంటనే హనుమంతుని మూర్ఛితాంగములన్నియు ప్రోచేసి బ్రదికించినారు. ఆప్రోచేయు సందర్భములో ఒక భాగము కనుపడినదేకాదు. కావుననే హనుమంతుఁడు ఏకహనువు, అనగా అంశరహితుఁడై ఉండిపోయినాఁడు. అతఁడు చచ్చిపోయి మరల బ్రదికినవాఁడు. కావుననే అతనికి హనుమానుఁడని పేరు వచ్చినది. (హనుశబ్దమున కర్థము మృత్యువు).ఇంకను చిత్తగింపుఁడన్నా! మూర్ఛితిమూర్ఛమయిపోయిన పవనుని కొడుకు మరల బ్రతికియున్నప్పుడు మీరు సజీవులగుటలో నెవరికి సందేహముండును? నే నిన్ని దృష్టాంతములు చూపించినప్పటికిని మీసందేహము పూర్తిగా తొలఁగలేనట్టు మీ మొగము చూడఁగా స్పష్టమగుచున్నది. కాఁబట్టి యింకొక దృష్టాంతము చెప్పుచున్నాను. సావధానముగా చిత్తగింపుఁడన్నా! "రామరావణయోర్యుద్ధం రామరావణయోరివ" అన్నట్టు రామరావణులకు ఘోరాతిఘోరమయినపోరు జరుగుచుండు సందర్భములో రావణునియోధుల అస్త్రశస్త్రములవలన పెక్కుండ్రు వానరుల కంఠములు తెగిపోయినవి. రావణుఁడు శక్తిని ప్రయోగించి లక్ష్మణుని భూమిపైని పడఁబెట్టినాఁడు. అప్పుడు శ్రీరామచంద్రుఁడు శోకగ్రస్తుఁడై యేడ్వమొదలిడినాఁడు. ఆసమయమున హనుమంతుఁడు ద్రోణపర్వతమునుండి విశల్య అను ఓషధిని తెచ్చి లక్ష్మణునియొక్క [illegible] శక్తిగాయమును తొలఁగఁజేసినాఁడు. చచ్చిన వానరులను సయితము బ్రదికించినాఁడు. ఈ చెప్పఁబడిన రామాయణము ననుసరించి చనిపోయిన వానరులు బ్రదుకుట సత్యమయినప్పుడు మీరు బ్రదుకుట [illegible] సత్యమగునన్నా! ఇంకను ముఖ్యమయిన దృష్టాంతము చెప్ప నేమఱచిపోయినాను. మీరు [illegible] (కుమారస్వామి) తాలూకు పుట్టుపూర్వోత్తరములు వినియుండలేదా ఏమి? విననియెడల నిప్పుడు వినుఁడు! పూర్వ మొకప్పుడు మహాదేవుఁడును, పార్వతియు [illegible] గుహలో క్రీడించుచుండిరి. ఆకాలమున తారకుఁడను పేరుగల రాక్షసుఁడు [illegible] లోకములలో చాల ఉపద్రవము చేయుచు విజృంభించినాఁడు. వానిచేతల వలన దేవతల కెంతయో కష్టము కలుగ మొదలిడినది. మహాదేవునివలన పుట్టినవాఁడు [illegible] యెవ్వరిచేతను చావఁడు" అని [illegible] దుగు. కాని పాపము! వారేమి చేయఁగలరు? మహాదేవుని కాఠిన్యంబగు ప్రవృత్తియు [illegible] కలుగకున్నది. ఇట్లాగున నాపురారి [illegible] నుండఁగానే దేవమానవముల [illegible] గములు గడచిపోయినవి. ఇంతలో రాక్షసుఁడు పెట్టు బాధలు సహింపరానివి యున్నవి. [illegible] నిర్భయుఁడై బయటికి రా[illegible] నున్నాఁడు. అట్టిసమయమున దేవతలందఱును ఒకచోట సభ గూడి "యెవరి వయినను శివదేవుని సన్నిధికి [illegible] సంపుదము" అని తీరుమానించుకొన్నారు. ఎవరికి వెళ్లుటకును భయమే అయెను. మేము వెళ్లఁజాలము మేము వెళ్లఁజాలమని ప్రతివారును నిరాకరించినారు. తుట్టతుద కగ్నిదేవుని వేఁడుకొని "అగ్నిభట్టారకా! నీవే మా-అందఱికంటెను గొప్పవాఁడవు. నీవలననే మేమింత అన్నము తినుచున్నాము. నీవే మాయందు దయతలంపనిపక్షమున మా బ్రదుకు నిరర్థకమయిపోవుఁగదా? నీవంటి పరోపకారపరాయణుఁడు మాదేవలోకములోనే కాక యే లోకములోను లేఁడను టతిశయోక్తి గాదు. ప్రకృతము తటస్థించినయాపదవస్థ నీవలననే తొలఁగవలసి యున్నది. నీ విప్పుడు మాయందు దయతలఁచుము. దేవత లంద

లును దుఃఖసముద్రములలో మునిఁగియున్నారు. తారకాసురుఁడు చెప్పుటకు వీలుకానిప్రకారముగా దేవతలందఱ ప్రాణములను కంఠగతము లగునట్లు చేయుచున్నాఁడు. సర్వాంతర్యామి వయిన నీతో అవి యన్నియు వాకొనుట నిష్ప్రయోజనము. ఇప్పట్టున నీకుఁ దక్కఁ దక్కినవారెవరికిని మమ్ము రక్షించుటకు శక్తి లేదు. నీవు [illegible] అనుగ్రహింపఁదలఁచినచో మా ప్రార్థనను మన్నించి కొండగుహాలోనికి వెళ్లి యీశ్వరుని కగపడితివేని, తప్పక ఆయన క్రీడావిహారమునుండి విరామమును గైకొనఁగలఁడు. అదియే మాకిప్పుడు నీవలనఁ గావలసిన-ఉపకారము. అట్లాయన విరమించిన పక్షమున మా కార్యము సానుకూల మగును. ఇది యెట్లును నీవుఁ జేయవలసినపని. అట్లుపయిని నీవయ్య, దేవతల-అదృష్టము." అని యింద్రాదిదేవతలు కార్యార్థులగుటచే వినయముగ నివేదించుచు వేఁడినవేఁడికోలు విని అగ్నిదేవుఁడు "దేవరాజ! దేవతలారా! ఖట్వాంగమును (మంచపుకోడు) ధరించువాఁడును, శూలపాణియు, నరకపాలధారియు, శ్మశానవాసియు అగు మహాదేవునిసన్నిధికి పోవు ప్రయత్నమునందు వెళ్లుటకునయితేము భయము కలుగు నన్నసంగతి మీ రెఱుఁగనిది కాదాయెను. అట్టిస్థితిలో వెళ్లుట నాకిష్టమును గాదు. ఇది యాయనకు పరమానందసంధాయక మయిన సమయమాయెను. ఇటువంటిసమయమున తనసన్నిధికి తానుగా కల్పించుకొనుటకై అయినయెడల నెవరు వెళ్లఁబూనుదురు? ఇదిగాక ఆయన పలువురు మాయమండఁగాఁగూడ ఒడలుపైఁ దెలియక లింగోత్తాలనడేసి తాండవ మాడుచుండు సందర్భమున, తక్కినవారిమాటకు లెక్క యేమి? ఇంద్రుని యంతటివాని కేనియుఁ గూడ భయము కలుగక మానదన్నప్పుడింక నావంటివానిసంగతి చెప్పవలసిన దేమున్నది? ఒకవేళ మీమాటలు విని సాహసించి వెళ్లిన తోడనే యీశ్వరుఁడు నాపైని కోపించినపక్షమున నాదశ యేమగును? కాఁబట్టి మహానుభావులారా! మీరు నన్నీ-ఆపదలోనికి దింపకుందురుగాక యని చేతులు జోడించుకొని మిమ్ము ప్రతిమాలుకొనుచున్నాను" అని ప్రార్థించినాఁడు.

అతఁడు చెప్పిన-ఒప్పితమయినమాటలు విని యింద్రుడు "పావకభగవానుఁడా! నీవీశ్వరునివలన నెందులకును భయపడవలసినది లేదు. ఏమందువా! ఇప్పుడాయన పార్వతికి స్వాధీనుఁడై యున్నాఁడు. ఎవ్వరికిని లొంగనిమహామహామహానుభావులనయితేము నిస్సంశయముగా అంగన లొంగఁదీయఁగలదు. ఒకవేళను పార్వతి యిప్పట్టున అకార్యము చేయుమన్నను వెనుకముందు చూడక చేయుటకు సిద్ధపడక మానఁడు. సమయమట్టిదిగదా! అందును నిజముగానే యీశ్వరుఁడు పార్వతికి భయపడుచుండును. నీ వాయన పార్వతికి భయంపడుట యెప్పుడును చూచి యుండలేదా యేమి? మా మాటవిని సంశయింపక, భయపడక యీశ్వరునియొద్దకు వెళ్లుము. ఒకవేళను, ఆయన నీపైని కోపించునే అనుకొనుము. అది నిజమయిన కోపము గాదు. పార్వతిని సంతోషపెట్టుటకయి యుండును. అంతియేకాని నీకేవిధమయిన ఉపద్రవమును చేయఁడు" అని యనేక ప్రకారములుగా బోధపఱిచినాఁడు. విధిలేక తుట్టతుదకంగీకరించి అగ్నిదేవుఁడు హిమాచలమునందలి గుహలోనికి ప్రవేశించినాఁడు. చాటుగా ఉండి చూచునప్పటికీశ్వరుఁడు తనపనిలో తానుజాగరూకుఁడైయున్నాఁడు. ఎట్టులో అగ్నిని చూచినాఁడు. తనసుఖమునకు విఘ్నముగా ఆలోచించినాఁడు. పట్టరానికోపము వచ్చినది. శివుఁడగ్నిని కొట్టుటకు పరుగెత్తినాఁడు. తుదకు పార్వతి ఆఁపినది. కొంచెమునేపటికి క్రోధోద్రేకము తగ్గినది. ఇంచుక శాంతమును వహించి "ఎవఁడవు నీవు?" అని అడిగినాఁడు. "నేనొక బ్రాహ్మణుఁడను. యాచకుఁడను. భిక్ష అడిగికొందమని వచ్చియున్నాను." అని శివున కగ్ని బదులు చెప్పినాఁడు. అతనిమాటవిని శివుఁడు "అటులేని నీ విపుడు నా తేజస్సును త్రాగుము" అని అతనికది త్రాగనిచ్చినాఁడు. దానిని త్రాగినతోడనే అగ్ని దానివేఁడికి తాళఁజాలక కొట్టుకో మొదలిడినాఁడు. తుద కక్కడ ఉండఁజాలక పాఱిపోయినాఁడు. తుద కెట్టులో సముద్రములో దానిని వమనము చేసినాఁడు. ఆనాఁడుమొదలుకొని సంసారములో సముద్రములో దొరకురత్నములన్నియు ఈశ్వరవీర్యమువలనఁ బుట్టినవి అన్నవాడుక ప్రసిద్ధమయిపోయినది. అట్లు వమనము చేసినప్పటికిని ఇంకను కొంచెముభాగ మగ్నిభట్టారకుని కడుపులో శివుని తేజస్సుండిపోయినది. అద్దానిబాధను నయితేము సహింపఁజాలక వారల పద్మసరోవరమునకుపోయి అందు

లో వసనము చేసినాఁడు. ఆ దేసమయమున అందులో కృత్తికలను పేరుగల అప్సర మచ్చెకంటులు స్నానము చేయుచున్నారు. దైవవశమున ఆ తేజస్సు వారి గర్భాశయములో ప్రవేశించినది. వారు గర్భవతు లయినారు. కాలాంతరమున ఆ ఆరుగురు కృత్తికలును తల, బాహువులు, హృదయము, పృష్ఠభాగము, శరీరము, పాదములు అను ఆ అంగములను ప్రసవించినారు. అందువలన వారికి మిక్కిలి ఆశ్చర్యము కలిగినది. అందఱును కలిసి శరీర భాగము లన్నియు నెచ్చట నుంచవలసినవాని నచ్చట ఉంచునప్పటికి పాదరసమువలె నేకలిసిపోయినవి. సాంగోపాంగముగా బాలకుఁడుగా మాఱినప్పటి వారిఆశ్చర్యమునకు మితిమేర లేకపోయినది ఆబాలకుఁడే స్కందుఁడు, కార్తికేయస్వామి మొదలగుపేళ్లచే వాడుకలోనికి వచ్చినాఁడు. అతఁడు దేవతలకు సేనానాయకుఁడై తారకుని యుద్ధములో చంపినాఁడు. ఈప్రకారముగా అగ్నిదేవుని ప్రయత్నమువలన దేవతలకష్టముతొలఁగినది. వేఱువేఱు గర్భములనుండి పుట్టిన ఆఱుభాగములు కలిసి జీవ మేర్పడి కుమారస్వామిగా తయారయినప్పుడు మీతల, మిగిలినమొండెమ్ము కలిసిన దనుటలో సందేహ మెందుల కుండును? కాఁబట్టి, అదేనిజమయినప్పు డిది మాత్రము నిజ మెందులకు కాదు?

ఏలాపాథుఁడు—కానిం డన్నా! కానిండు. మీరిపుడు చెప్పిన యీఆఱుదృష్టాంతములవలనను తెగి వేఱయిపోయిన నాతల మొండెము ఏకమగుట సిద్ధమయినది కాని నా తెగిపోయినతల రేఁగుబండ్లెట్టులు తినినదో ఆ సంగతికూడ ఏదేని శాస్త్రముచే సాక్ష్య మిప్పించి నాకు నచ్చఁ జెప్పుదురుగాక!

శంకుఁడు—ఆలా గనుగుం డన్నా! దీనికికూడ తగినప్రమాణ మున్నది. చిత్తగింపుడు. ఒకప్పుడు విష్ణు భగవానుఁడు తనచేతి చక్రముచేతను రాహువుతల ఖండించినాఁడు. అది మొదలుకొని నేఁటివఱకును రెండు భాగములును ఆకాశముపైని తిరుగుచున్నవి. సూర్యుని చంద్రుని పట్టుకొని అప్పుడప్పుడు మ్రింగుచున్నవి. ఇది నిజమా? అసత్యమా? అసత్య మనుటకు వీలుగాదు గదా! అప్పుడు మీతలయు రేఁగుబండ్లు తినుట నిజమే, ఇందులో అసత్య మెంతమాత్రమును లేదు.

ఏలాపాథుఁడు—అన్నా! ఇఁక నొకచిన్న సందియ ముండిపోయినది. నే నొక్కొక్కఅడుగు దీసి అడుగు పెట్టునప్పటికి నూఱుసియోజనముల మార్గము నెట్లు దాఁటఁగలిగియుందునో సెలవిప్పించవలె నన్నా!

శంకుఁడు—ఏమన్నా! తుద కిటువంటిప్రశ్నలడుగుచున్నారు? సరియే చెప్పెదను వినుఁడు. విష్ణుభగవానుఁడు వామనమూర్తియై బలిని యాచింప బయలుదేఱినాఁడు. యజ్ఞసమయమున బలిచక్రవర్తి మూఁడడుగులభూమి దాన మీయ నంగీకరించినాఁడు. అప్పుడు విష్ణుదేవుఁడు తనమూఁడేమూఁడుపాదములతో పర్వతాదులతో కూడియున్న సమస్తభూమిని అతిక్రమించినాఁడు. అది నిజ మయినప్పుడు మీ ఒక్కొక్కఅడుగులో నూఱుసియోజనముల భూమి నతిక్రమించుటలో మాత్ర మసత్య మేమున్నది?

ఏలాపాథుఁడు—మంచిది. కానిం డన్నా! ఇప్పుడె జ్ఞప్తికి వచ్చినది. దీనికికూడ సమాధానము చెప్పెదరా? నే నంతపెద్దతాతిని-అనఁగా యోజనము వైశాల్యము గలదానిని రసకుండముపైని మూఁత వేయఁబడినదానిని ఎత్తి వాఱొకచోటను నెట్టులు పెట్టఁగలిగినాను? ఇది మనుష్యోచిత మగునా? ఈఒక్కదీనికిని సమాధానము చెప్పితిరేని ఇంక మిమ్మేదియు నడుగవలసినది లేదు. సెలవీయుఁడు.

శంకుఁడు—అన్నా! ఇదియే కాదు; ఇంక నెన్నియడిగినను జరిగినవి చెప్పుటలో సంకోచపడవలసినవాఁడను కాను కాని, మీ రిట్టి-అనావశ్యకమయిన ప్రశ్నలు చేయుచున్నందులకు నాకు వింతగా ఉన్నది. అంతే మీరుమాత్రము రామాయణ మెన్నిమార్లు చదివియుండరు? ఎన్నిమార్లు వినియుండరు? మీకు తెలియక కాదు గాని నాచేతను చెప్పింపఁదలఁచి అడుగుచున్నారని నిశ్చయించుకొన్నాను. వినుఁడు. రామరావణయుద్ధములో రావణుఁడు ప్రయోగించినశక్తి లక్ష్మణునకు తగిలినది. అప్పు డాంజనేయుఁ డాతనిని బ్రతికించుటకై విశల్య అను-ఓషధి తెచ్చుటకు వెళ్లినాఁడు. చట్టున ఆ-ఓషధి కనుపట్టినదిగాదు. దానితోనే ద్రోణపర్వతము నూడఁదీసికొని వచ్చినాఁడు. ఋషిప్రోక్తమై వేదతుల్యమయిన రామాయణమువంటి గ్రంథము ప్రమా

ణముచలన నిది నిజ మయినప్పుడు—అనఁగా హను మంతుఁ డొక్కఁడును అనేకశిలలతో కూడిన పర్వతమును ఊడఁదీసికొని వచ్చినప్పుడు, మీ రొక్కఁ డాతి నెత్తి బయటను వేయుటలో ఏమంత ఆశ్చర్య మున్నదో అన్నా! సెలవిండు. ఇం కొక్కదృష్టాంతము—ఒకసారి విష్ణుదేవుఁడు వరాహావతారమును ధరించి హిరణ్యాక్షుఁడు చాప చుట్టినట్లు చుట్టి సంకఁ బెట్టుకొని పోయిన భూమిని తన ఒక్కదంష్ట్రితో నెత్తి దానిపైనే ఉంచి తెచ్చియున్నాఁడు. ఇది నిజ మనియెదరా అసత్య మనియెదరా? ఈసంగతి వ్యాసభగవానులు వ్రాసిన పలు పురాణములలో ఉన్నందున అసత్య మనుటకు వీలు గాదుగదా! కనుక మీరు ఱాతిపలక నెత్తుటయు అసత్య మంటమాత్రమును కాదు. ఇంత యేల? మొన మున్నను గోకులములో నందయశోదల సంతనుఁడై పుట్టిన కృష్ణుడు—ఐదా ఱేండ్ల యీడున నుండఁగా దేవేంద్రుఁ డెంగులతో రోపించి పుష్కలావర్తక మేఘములచేతను ఱాలవాన కురిపించుట కుపక్రమించినాఁడు. ఆసమయమున గోవులు, గోపకులు తల దాఁచుకొనుటకు చోటు లేక యేడున మొదలిడినారు. అ బాలుఁడు వెంటనే గోవర్ధనపర్వతమును గొడుగుగా పట్టి ఒక నాఁడా రెన్నాళ్లా; ఏడుదినములు తనయెడమచేతి చిటికెనవ్రేలిపైని దాని నుంచి తనవారి నందఱను కొండ క్రిందను హాయిగా నుండునట్లు చేసి వర్షము నిలువఁగానే మరల వారి నందఱను బయటికి పొమ్మని ఆ కొండ నెప్పటియట్టులు నేలమీఁదను పెట్టినాఁడు. ఇది ఆబాలగోపాలము ఎఱిఁగినసంగతియే కదా! అంత చిన్నపిల్లవాఁ డంతగొప్పకొండ నేడుదినము లెత్తి పట్టుకొన్నప్పుడు అట్టిపిల్లవాండ్రకు తాతలుగా ఉండఁదగిన మీ రామాత్రపుఱాతిపలక నెత్తి యప్పుడే వేఱొకచోటున నుంచుటలో ఆశ్చర్య మే మున్నదండీ! అన్నా?




# క వీ!

పువ్వాడ శేషగిరిరావు, చోడవరపు జానకిరామయ్య గార్లు

“నేత్రలను పైకెత్తి పైనె చూపుల నిగుడ్చి
  చూచెదేమని చోద్యంబుఁ జూచెదోటు?
కవివరా! పిచ్చివాడవుగాని నీవు
శూన్యతలమునఁ జోద్యంబుఁ జూడఁదలతె?”
యనుచు నాడెడివారల సరయకుండ
దృష్టులను వేరువంకకు ద్రిప్పకుండ
విమల కవితాస్రవంతిసీవీచికలను
దేలియాడుచు భావసందీప్తి నొంది
తన్మయత నొందె దీవు మిత్రా! వహావ్వా!

కలము కాగితమును భావములనుబూని
ప్రచలితానందవార్ధితీరముల సౌధ
జాలముల గట్టెదీవు భాషాలతాంగి
కాపురంబుండ శిల్ప మక్కజముగొల్ప.
శిల్పమున విశ్వకర్మ నీ చేతిక్రింద
రాదగును నీకు నిట్టికర్మం బదేమి?
తాటియాకులపాక నీ కాటపట్టు
కావు లేమి? చవిటిగోడ కర్మమేమి?

* * * *

వంటచెఱకయిపోయె నీ యింటివెనుక
దొడ్డిలోనున్న యా చిన్న తుమ్మక్రింద
నెండి రాలిన చిదుకుల నేరితేర
నీతరుణి పోయె పల్లెక చేతగొంచు.
"అమ్మ! అమ్మ!" యటంచు "బాయిమ్మ" టంచు
గొంతుచేసమున నీ సుతుం డింట పోరు
పెట్టి యేడ్చెడు "రమ్మ"ని పిలువవేల?
కుఱ్ఱవానిని లాలించుకో వదేల?
"నాయనా! రార! ముద్దియరా!" యటంచు
నక్కునంజేర్చి ముద్దాడవా? యదేల?

* * * *

బావగా రిరలను జూచిపోవ నదిగొ
యిరువురనుచరుల్ తోడరా నేగుదెంచు
చుండె వేగమె లెమ్ము కూర్చుంటివేమి?
"కాళ్లు సేతులు కడుగుకో నీళ్లి నిన్ని
తెచ్చి దూరాగమంబుచే నొచ్చినట్టి
బావగారికి తత్పరివారమునకు
నీయుమా వేగిరమ్మ యమ్మా!" యటంచు
భార్య నెలుగెత్తిపిల్చుకోవా? యదేమి?
యింత యేమరుపాటేమి? సుంత యేని
సహజమర్యాదవలవదా? మహిని జనులు
గర్వియని నిన్ను దూషింత్రు గాదె? చెపుమ.
బావగా రేమి యనుకొందురు? తావకీన
గృహకవాటము నాఱునూరైన మఱల
త్రొక్కిచూచునె? యంతకు లెక్కగొనవె?

* * * *

నేయియును కూర నేను లేనేయటంచు
పత్ని గుజగుజలాడు నా వంటయింట
పెట్టి యింటికి భోగము నే ర్పట్టిపడగ
"నిగ్రహము నీవు నాగ్రహ మీవటంచు
పొగడి యుబ్బించి యున్న యీ ప్రాతకేని
సరిగ పాడి నేయి తెచ్చి నీ తినుటకేన్ము.
పుస్తకంబును కలము నాముందు పెట్టి
కూర గోసపేర నడుగనేలా? రంగా.

* * * *

ప్రొద్దు నెత్తికివచ్చెను భోజనంబు
సంగతియె విస్మరింతొ కాసంత వినుము!
"కాగితంబును కలము చిక్కవలెగాని
పొట్టనేయుండు దన్న మెన్నాళ్లకైన"
నంచు పలుకుదు నీ యందమైనట్టి యంత
నూరకుండక నీవంక నోరజూచు
కలికి మేలంబునకు మారు పలుక నేల
నాతి చిరునవ్వునకు మారు నగవదేల
సుదతి వాల్చూపులకు మారు చూడవేల
వ్రాయు కవితను నిన్మయత్వంబుగంటు.






# అభాగిని

సహదేవ సూర్యప్రకాశరావు గారు

౧

వకుళ అయిన నీటిలో పుట్టిన బాలిక. సరళా సరళ నిసుపుగా పరిమళకు అక్కలు. వారిలో ఒకరికొకరికున్న ప్రేమానురాగాలు చెప్పటము కంటె ఊహించుకుంటే నేమంచిది. వారి ముగ్గురికులు సౌభ్రాత్రము మూర్తీభవించి ఉంది. వారు ఏకగర్భవాసులయినా ఆకృతిలో మాత్రం సమాత్రము పోలిక లేదు. అలాగ చెప్పటమువల్ల ఒకరికంటె ఒకరు సుందరముగా ఉన్నారని కాని అందవికారముగా ఉన్నారని కాని ఊహించవద్దు. ముగ్గురు మోహన సంనోజ్ఞమూర్తులే! ముగ్గురు నవనవోన్మేషమయనయన ప్రగల్భలే! ముగ్గురు విద్యాధికలే!

వారి ముగ్గురికి ఒక్కొక్క సంవత్సరం తేడా వయస్సులో. పూలగుత్తుల్లో ఉండే పూలన్నీ ఒక్కమోస్తరుగానే ఉంటవా? అలాగ ఉండకపోవటమువల్ల వాసనలో గాని మెత్తదనములోగాని అందములోగాని కొంచెమైనా తేడా ఉంటుందా? పరిమళే కడగొట్టు బాలిక.

పేరిక బుద్ధి తెలిసి జ్ఞానమువచ్చినప్పటినుండీ వీరు చాలా అన్యోన్యంగా ఉన్నారు. ఇరుగు పొరుగువారిచేత ఇంతటి మంచిపిల్లలు లే రని పించుకున్నారు. పాఠశాలల్లోకూడా మొదటి తరగతుల్లో పరీక్షలందుచూ మంచి మంచి బహుమతులు పుచ్చుకున్నారు.

ముగ్గురికి ఊహ తెలిశాకే ఒకరి తరువాత ఒకరికి వివాహా లయినవి. కాలక్రమంగా యౌవనం పొడసూపినది ముగ్గురికిని.

ప్రప్రథమం వకుళ అత్తవారింటి కివెళ్లింది. వీరి ప్రేమలతను ఎవ్వరో తెలియకుండా తెగకోసి నట్లయినది. ఒడ్డు ఒరసుకొని ప్రవహించే వీరి రసవాహినీ గర్భంలో ఎవరో చేయిపెట్టి కలచి నట్లయినది.

అత్తవారింటికి వెళ్లేటప్పుడు చిట్టి చెల్లెళ్లిద్దర్ని బిగ్గకౌగిలించుకున్నది వకుళ. కనుగొలకులనుండి బాష్పమౌక్తికాలువకుళకోమల కపోలభాగాలపై నుండి క్రిందికి జాలువారినవి ఆమె నిట్టూర్పులు వేసవిగాడ్పులయ్యాయి. వదనం చూస్తే వ్యక్తమవుతుంది ఎంత ఆరాటము ఎంత ఆవేదన అనుభవిస్తున్నదో వకుళ హృదయం. గాలికి ఊగులాడే తమలపాకు తీగలాగు ఆమె దేహం అంతా వణికింది ఒకసారి.

చెల్లెళ్లతో మాత్రం ఒక్కమాటైన ఆడలేదు. సరళా పరిమళ లిరువురు అనిమేషాంగనలయారు అక్కగారి బండి కనుచూపు దాటేవరకు. బండి కనుమరగింది. నిలువబడిన

చోటనే కుప్పగా నేలకూలిపోయారు ఇరువురు. అప్పటినుంచి పరిమళాసరళల హృదయాల్లో విషాదచ్ఛాయ లావరించాయి.

౨

ఆశకు వలెనే కాలానికీ రెక్కలున్నవి. అందులో కాలాని కొక్కమహత్తరమైన శక్తి ఉన్నది. సుఖాల్ని దుఃఖాల క్రింద దుఃఖాల్ని సుఖాల క్రిందమారుస్తుంది శరీరముమీద ఉండే గాయాల్ని ఎట్లు మాన్పుతుందోఅట్లే హృదయంలో ఉండే గాయాల్నికూడా మాన్పుతుంది. సరళకూడా అత్తవారింటికి వెళ్లింది పరిమళను ఒంటరిగా విడిచిపెట్టి. అత్తవార్కిళ్లకువెళ్లిన కొన్నిదినాల్లోనే పరిమళపై ఉన్న అనురాగ లతికను త్రెంపుకో కలిగినారు వకుళాసరళలు. చాలా కాలాన్నించి పాదుకొని పెరిగి పూవులుపూసి వాసనను అన్నిదిక్కులకు వ్యాపింపజేసిన ప్రేమలతికను ఒక్కసారిగా నేలమట్టము చేయటం కష్టముగదా! పరిమళపై ఉన్న అనురాగాన్ని కొంచెమయినా మరచి పోవటానికి కారణము లేకపోలేదు. ప్రేమవాహినిచేత వారి హృదయాల్లో ఉండే దుఃఖ పంకాన్ని తుడిచివేయ గలిగే ప్రణయ మూర్తులువారివద్దఉన్నారు. పరిమళో ఏకాకి.

ప్రాణసమానలగు తన ఇరువురి అక్కల వియోగాన్ని భరించలేక పోయినది పరిమళ. ఆమె హృదయములో నుంచి పొంగి పొరలి వచ్చే దుఃఖప్రవాహాన్ని అరికట్టలేక పోయి నది. పాపము పరిమళ కృశిస్తున్నది రోజు రోజుకి.

పరిమళ అన్నం తినడం మానివేసినది. మానివేయటమం టేఆకలి వేయక్కాదు. నోటికి రుచింపకే! నిద్రకూడాసరిగాపోయి ఎరగదు పరిమళ. ఎప్పుడో నిద్రపోతుంది. ఆ నిద్రైనా గాఢనిద్ర కాదు. ఆకలతనిదురలో కలవరింపులూ, కలలూను. వారుముగ్గురు కలసి మాట్లాడుకునేమాటలు వారివేగ్గిపలికేది కలవరింపుల్లో.కలలు అక్కలతో ఆడుకున్నట్లూ, పువ్వులుకోసి తలలో ముడుచుకొన్నట్లూ, క్రొత్తరకాలచెట్లు పాతున్నట్లూ, నీళ్లుతోడి చెట్లకి పోస్తున్నట్లూ,పాడుకుంటున్నట్లూ; చదువుకొంటున్నట్లూను. ఒక్కొక్కప్పుడునిద్రలో కెవ్వుమని కేకవేసేదికూడాను. పాపము! తలిదండ్రు లెంత ఆదరిస్తున్నా ఆఆదరణ మాత్రం పరిమళ హృదయాకాశాన్ని అలుముకొని ఉన్న దుఃఖ మేఘాల్ని చెదరగొట్టలేకపోయినది.

“ఈదుఃఖం శాశ్వతంగా ఉండదు. త్వరగా కార్యంచేసి అత్తవారింటికి పంపిస్తే పరిమళ దుఃఖమంతా మరచిపోతుంది” అని తలిదండ్రులు ధైర్యంతో ఉన్నారు. ఎవరు కష్టాల్లో మునిగి తేలుతూఉంటారో వాళ్లకే కష్టాలు దొంతర దొంతర్లగా వస్తవి. సుఖాలువచ్చినా అలాగే వస్తవి.

ఒకరోజున పరిమళ చిలుక పంజరందగ్గర కూర్చుని చిలుకకు మాటలు చెపుతూ అదిపలికే మాటలువింటూ హృదయంలో ఉండే దుఃఖాన్ని మరచిపోయి ఆనందిస్తున్న సమయంలో తపాలవాడు వచ్చి తంతివార్త ఒక

టిచ్చి కాగితంమీద పరిమళ చేత సంతకం చేయించుకొని వెళ్లిపోయినాడు.

పరిమళ టెలిగ్రాం తీసుకొని తల్లి వద్దకు వెళ్లి "అమ్మా! నాన్నగారికి టెలిగ్రాం వచ్చింది ఇదిగో!"

"ఎక్కడనుంచి?"

"తెలియదు నాకు."

"మీనాన్నగారు ఇంట్లో లేరట్టున్నారే."

"చాలాసేపయింది బజారుకి వెళ్లి. ఈపాటికి వస్తుంటారు."

"ఎప్పుడువస్తారో! ఎక్కడనుంచివచ్చిందో తెలిసికోవాలని నాకు చాలా ఆదుర్దాగా ఉన్నది. నువ్వుచదవగలవుకదూ, చదువు!"

"ఒకరికి వచ్చిన ఉత్తరాలు ఒకరు చదవకూడదు. నాన్నగారు ఏమంటారో"

"ఫరవాలేదు. నాన్నగారు ఏమంటారు?"

పరిమళ టెలిగ్రాం విప్పి ఇలాగ చదివింది.

"మోహనబాబు ముకుందరావు స్వర్గస్థుడయినాడు." అని చదివి టెలిగ్రాం అక్కడ పారవేసి "అమ్మా" అని కేకతో తల్లి ఒడిలో పడిపోయింది. తల్లీకూతుళ్ల హాహాకారాలతో ఇల్లంతా ప్రతిధ్వనించి పోయినది. ఎక్కడపని అక్కడ విడిచిపెట్టి గుండెలు చేతితో పట్టుకొని వారిదగ్గరకు పరుగెత్తుకొని వచ్చారు పరిచారకులంతా. కొంతసేపటికి పరిమళ తండ్రి వచ్చినాడు. సంగతి విన్నాడు. "హా! పరిమళ శాశ్వతవైధవ్య మనుభవించ వలసిన దేనా? ఉన్న దుఃఖముతో పాటు ఈకొత్తగా వచ్చిన దుఃఖంలో మునిగికొట్టుకొని పోవలసిన దేనా? పరిమళ జీవితం వ్యర్థమేనా" అని చింతించినాడు

## 3

కొంచెము కొంచెము మానుకువస్తున్న పరిమళ హృదయములోనిగాయం మళ్లీ రేగింది. ఈసారి ఆగాయాన్ని మాన్పటము తల్లిదండ్రులకు కష్టమని తోచినది. ఏమిచేయగలరు? వారూ పరిమళతోపాటు దుఃఖించేవారు; దుఃఖించటంకంటే వారేమి చేయగలరు, పాపము! చేయవలసిన దేదో దేవుడే చేశాడుగదా. ప్రేమ పూర్ణులగు వకుళాసరళల వియోగానికే పరిమళ లేత హృదయము కుములికుములిపోతుంటే గోరుచుట్టుపై రోకటిపోటన్నట్టు మగనిచావు. చూడండి!ఆ ముగ్ధహృదయానికి చిన్నప్పుడే ఎన్నితూట్లు పడ్డాయో!

'మనస్సులో ఉండే దుఃఖాన్ని పోగొట్టి ఆనందమిచ్చే వింతవస్తువొకటి ఉంది. ఆ వస్తువుకి జీవనంకూడాఉంది. అది ఇప్పుడు కాకపోతే మరొకప్పుడైనా వచ్చి కల్లోలంగాఉన్న హృదయానికి ప్రశాంతం కలుగజేస్తుంది' అని పరిమళహృదయములో లీలగా తట్టేది.మగని చావు తెలిశాక ఆఊహ ఎలాగయితే పుట్టినదో అలాగే - అంతరించినది.

తన కిక ఆనందమన్న మాటే లేదనుకున్నది పరిమళ. పరిమళ కన్నుమూసినా తెరిచినా దుఃఖదేవత నృత్యంచేస్తున్నట్టూ, తన్ను చూచినవ్వుతున్నట్టూ,ఒకొక్కప్పుడు"నిన్ను

సంపూర్ణముగా ఆకర్షించాను చూచావా. దుఃఖములో ఎంతఆనంద మున్న దనుకున్నావు. నువ్వా కొంత కాలము దుఃఖములో ఉండే ఆనందాన్ని మాధుర్యాన్ని అనుభవించ గలుగు తావు" అని హెచ్చరిస్తూ చెప్పినట్టు కనపడేది.

సకలభోగభాగ్యాలు అనుభవించే ఈ శూన్యలోకముతోటి తనకిక సంబంధములే దనుకున్నది పరిమళ. తనకుఆనందము ఇచ్చి ఆనందము పొందేవారు తనకిక నెవ్వరు లేదను కున్నది. ఆఉద్దేశముతోటే మంచము పట్టినది పరిమళ.

తల్లిదండ్రుల గుండెల్లో రాయిపడినది. తిండీ తిప్పలుమాని పరిమళకు పరిచర్యలు చేయటం మొదలుపెట్టారు. అపరధన్వంతరి లాంటి వైద్యుడినికూడా పెట్టినారు.

మనోవ్యాధికి మందులేదుకదా

అలాగే కొన్నిరోజులు నిశ్శబ్దముగా గడ చిపోయినవి. అది వర్షాకాలము. మబ్బులు ఆకాశాన్ని దట్టముగా కప్పినవి. హోరుమంటూ వీస్తున్నదిగాలి. వర్షముకురవటము ప్రారంభించి నది. కురిసిన కాస్తసేపూ భూమికి ఆకాశానికి ఏకధారగా కురిసినది వర్షము. మబ్బులకు బరు వుతగ్గినది. నల్లటి మబ్బులల్లా తెల్లటిమబ్బు లకింద మారిపోయినవి. గాలి విసురుకూడా కొంచెంతగ్గినది.

ఆ సమయములో వకుళాసరళలు ఒక్కసారే బండిదిగి లోపలికి వెళ్ళినారు. గోడ నంటి పెట్టుకొని ఉన్న బల్లిలాగ మంచాన్ని అంటి పెట్టికొని ఉన్న పరిమళను చూచి వెల్లువలై వచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక గోలు గోలున ఏడ్చారు. అక్కడ ఉన్నవారు "ఏడవ కండి, ఏడిస్తే రోగికి నిద్రాభంగమే కాకుండా బాధకూడా ఎక్కువవుతుంది." అని చెప్పి ఊర డించారు. ఏడ్వటం మాని పరిమళ మంచం దగ్గరకు వెళ్ళి కూర్చున్నారు వకుళా సరళలు. అక్క లిద్దరూ వచ్చారని తెలియనే తెలియదు పరిమళకి. ఆమె కన్నులుమూసికొనే ఉన్నది. ఆమె వదనము పాలిపోయి ఉన్నది. జీవ కళ ఏమాత్రము లేదు. ఆమె శరీరము చిక్కి శల్యమైనది. అప్పుడప్పుడు నిట్టూర్పులు విడుస్తూ ఉన్నది. కొంత సేపటికి కన్నులు తెరచి ఏడుపు మొగాలతో తనపక్క కూ ర్చుని ఉన్న అక్కల నిద్దరిని చూచింది కాంతి విహీనాలయిన కళ్లతో. కాస్తసేపు రెప్పలు మూయకుండా చూచి కనులు మూసుకొ న్నది. తిరిగి కొంత సేపటికి కళ్ళు తెరిచినది. తెరిచీ తెరవటముతోటే పరిమళ శుష్కనే త్రాలనుండి కన్నీళ్లు బొటబొట రాలాయి. అదిచూచి ఇదివరకునుంచి దుఃఖాన్ని దిగ మింగి ఉన్నా వకుళా సరళ లిరువురు బొరు మని ఏడ్చారు. అదిచూచి ఇంట్లోవాళ్ళంతా గొల్లుమన్నారు ఒక్కసారి.

ఒక్క దీర్ఘనిశ్వాసం విడిచిపుచ్చి ఆపు కోలేకుండా వస్తూఉన్న నిద్రాభరానికి కళ్లు మూసుకొన్నది పరిమళ.

వర్షపు చినుకులకు తడిసి ఉన్న చెట్ల యాకులను గాలివచ్చి కదల్చటమువల్ల నీటి బొట్లు జలజలా నేల రాలాయి. పరిమళకు ఇష్టమైన గులాబిపూవుకూడా తల ఊపడము

వల్లపూగేకులమీదనుంచేనీటిచుక్కలు క్రిందికి రాలాయి. కిలకిలలాడే పక్షులు ఆనాడు కిక్కురుమనకుండా పిచ్చిచూపులతో నట్టి బయల్ని చూస్తున్నవి. హృదయములోని ఆవేదన భరించలేక ప్రకృతికాంత విడుస్తున్న ఊర్పుగా ఉప్పులో అన్నట్టు గాలికూడా వీస్తున్నది.

నెమ్మదినెమ్మదిగా వచ్చి చీకటి తెరలు విచారంగాఉన్న ప్రకృతికాంతవదనాన్ని మనుష్యమాత్రుల కెవ్వరికీ కనపడకుండా కప్పినవి.



# ఫ ణి ఫ ణ న ట న ము

విద్వాన్ కత్తి కామేశము గారు

శ్రీమద్భోగీంద్ర భోగాంచిత సుమణిమయ శ్రేష్ఠపీఠస్థమై త
ద్భామా కోష్ణాక్షిధారా పరికలిత సుఖాభ్యంజన స్నానమై భ
వ్యామేయామోద గోపీవ్యతి కరతరళా పాంగనీరాజన శ్రీ
వ్యామర్శశ్యామలంబౌ ఫణిఫణనటనప్రౌఢపాదంబుఁ గొల్తున్.

తనకుం భోగీంద్రుఁ డెంతేఁదవిలి కడియమై తద్దయుం జెల్వుమీఱం
గనుదానుం బూనించి యాపన్నగకులపతికిం మాన్యమౌ శేఖరంబై
కన నిట్లన్యోన్య శోభాకరణఘనవిధి ఖ్యాతమై సర్వలోకా
వనమై సంకీర్తితంబౌ ఫణిఫణనటనప్రౌఢపాదంబుఁ గొల్తున్.

నాగాధీశస్ఫుర ద్దంష్ట్రిలవిషమున నున్మగ్నమయ్యుం విభాస్వత్
శ్రీగంగాదివ్యధారం జెలఁగు నమృతమున్ జెచ్చెరం జూపుచుం ద
ద్భోగాంచ ద్రత్నదీప్తి స్ఫురణఁదవిలియుం భూరినైల్యంబునం దా
బాగొప్పం దీపితంబౌ ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

కాకుత్స్థుం డేనదీశీకరముల భువికిం ఖ్యాతసంజీవనంబున్
వీఁకం గల్పించెనో యావిమల సురనదీవీచికాశీకరోద్యత్
సేకంబుం గొల్పివే మూర్ఛితునిగ ఫణినిం జేసి చాతుర్యలక్ష్మీ
వ్యాకోచోద్దీపితంబౌ ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

భ్రమరీసందోహ శంకాస్పదతకబరీ భాసురామర్త్యనారీ
చమరీ జాంచత్కరాంభోజ కలితకుసుమ స్ఫార సౌరభ్యశుంభ
ద్భ్రమద భ్రభ్రాంతి బిభ్ర ద్భ్రమరకులకలధ్వాన సంతానతాన
ప్రమిళన్నాట్యోద్ధృతంబౌ ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

అలయామ్లచ్ఛాయ నైల్యం బలరి మిగుల నింపైన బంగారుపేళ్ల ము
వ్వలకుఁ నీలాబ్జమిచ్చుఁ వరసుధ ననుచుఁ స్వచ్ఛ గంగాస్రవంతీ
కలితంబై యొప్పుఁ దన్నుఁ గలియు నళులకుఁ ఘల్ ఘలిల్ ఝంకృతుల్ చూ
ప లసద్వైదంబు నొప్పు ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

కాళీయస్వీయనాగాగ్రము బహుళతరంగాభిషిక్తంబుగాఁ ద
ల్లోలాక్షీలోచనాళిం ద్రుతగతి జలముల్ పొంగి పొర్లాడు వేసఁ
పోలఁ గాళీయశీర్షంబున నెది బలిమిఁ ముద్రితం బౌచు సర్వ
వ్యాళోచ్ఛిష్టైకశిక్షామహా ఫణిఫణనటనప్రౌఢపాదంబుఁ గొల్తున్.

యమునా గంభీరవారి హ్రదసుచిర నివాసాబ్ధి[illegible]భోగి గేహ పా
దమువల్లఁ తానెపో తత్ హ్రదము విడిచెనో, తాను నైల్యోద్ధతంబై
రమణీయ స్వచ్ఛగంగా ప్రజనక మగుచుఁ గ్రాలునో యేది లోక
ప్రమదాత్యంత ప్రజాగ్రణి ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

వినతా సూనుండు చూడఁ వెఱవఁగ భువి నిర్భీతి శీర్షంబు నెత్తఁ
ఫణి తాఁ గోరంగఁ దద్భావము నిక నెఱవేర్పంగఁ దన్మూర్ధమొంతే
నణఁగంగాఁ ద్రొక్కి యాశ్చర్య జనకగతి వాంఛావళిం దీర్చుచుఁ భో
భనకీర్తి స్ఫూర్తి నొప్పు ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

ఫణమర్దక్రుద్ధ సర్పప్రభు సకృపణతా ప్రార్థనఁ రాహుదేహం
బున జాతిప్రీతి మించఁ భువిని గవిజనప్రోక్త తత్పాదలక్ష్మ
ఘనతన్నీలోత్పలేశుఁ గడఁగుచు విధునిఁ గాంచి బాధింపఁ బోవఁ
పనితంబై మించు చంచత్ ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

బలికిఁ శీర్షంబుపై దుర్భరతరశిలయై భారగంభీరశుంభత్
శిలకుఁ సంజీవనంబై చెలఁగు ఫణులకుఁ శేఖరంబై మహాదు
ష్టుల శిక్షింపంగ నాశిష్టులను గరుణతోఁ జూచి మన్నించి ప్రోవఁ
బలితంబై మించు చంచత్ ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

కవిరాజుల్ దివ్యకావ్యోత్కర లలితకళాగౌరవ శ్రీగనం భా
గవతుల్ మేల్ భాళి సెభాష్ భళిరభళిరమేల్ భాళియా నంచు మించఁ
భువి లోకుల్ గాంచి మోదంబునఁ బరవశులై పొంగ సంసారసరో
ద్భవ పీడాభంజకంబౌ ఫణిఫణనటన ప్రౌఢపాదంబుఁ గొల్తున్.

---






# పిట్టకథలు

రాముడు, సీత, లక్ష్మణుడు అడవిలో పర్ణశాలలో కాపురం చేస్తున్నారు.



రామలక్ష్మణులు ఆహారానికి అడవిలోకి వేటకెళ్లారు. రెండుఝాములయింది; ఇంకా రాలేదు. పితృదేవతలకు పిండప్రదానం చెయ్యాలి. అన్నీ సిద్ధంగాఉన్నాయి. కాని వేళయిపోతోంది. సీత కేమీ తోచిందికాదు, పోనీ తానే చేతామని తలంచుకుంది.

అగ్ని వెలిగించి మంత్రాలతో పితృదేవతలనందరినీ ఆహ్వానంచేసింది. అంతా అదృశ్య

రూపంతో వచ్చారు. ఎన్నోరత్నాలంకా రాలతోనిండిన చాలాచేతులుపిండం అందుకో కన్నానా; సరే నన్నారు" యథావిధిగా పిండ ప్రదానం అయిపోయింది. అప్పుడు దశరథుడు





డానికి బైటికిజాపారు. అప్పుడు సీత "మీారెవ రెవరో నాకుతెలియదు. పేరువరసల చెప్పాలి" అని అంది. అప్పుడు అదృశ్యరూపంతోనే దశ రథుడు తననీ తక్కినవాళ్లనీ చెప్పాడు. "నేను ధన్యురాలను సరే కాని మీారిల్లా వచ్చినారని నేచెప్పితే రాముడు నమ్మడు ఎల్లాగ"అని సీత అడిగింది. నిజమేను; సాక్షులెవ్వరినైనా పెట్టు కోమనివాళ్లన్నారు. అప్పుడుసీత తమపర్ణశాల ప్రక్కనుంచి పారుతూన్న ఫల్గుణీనదినీ, దాని యొడ్డున మేస్తూన్న గోవునీ, ప్రక్కనున్న డొంకలోంచి తొంగిచూస్తూన్న మొగలి పువ్వునీ సాక్ష్యం ఉండమంది. వాళ్లు "యింత

"ఈనాడు మేమంతా నీవలన చాల సంతృప్తుల మైనాము" అని, "సుశీల" యని సీతను మెచ్చాడు. వెళ్లిపోయారంతాను.

రాముడు, లక్ష్మణుడు, ఇద్దరూ అలిసి పోయి యింటికి వచ్చారు. బాగా పొద్దెక్కి పోయింది. అడావడిగా సీతని వంటచేయ మన్నాడు రాముడు. పితృదేవతల నాహ్వానిం చాలన్నాడు. సీత నవ్విందంతే. రాముడికి కోపంవచ్చింది. అదిచూచి సీత "అప్పుడే అంతా స్వయంగావచ్చి తృప్తులై వెళ్లారు" అని చెప్పింది. రామలక్ష్మణులు నవ్వి "వింత గానే ఉంది; ఇంతనిష్ఠ యున్నాళ్లనుండి మనం

చేస్తే యెవ్వరూ రాలేదే; సీత పిలుస్తే స్వయంగా వచ్చారట, ఇదేం చిత్రం" అని నవ్వా



రు. దానితో సీత సాక్ష్యంపెట్టుకున్న ముగ్గురినీ పిలిచి అడిగింది. కాని వాళ్లు భయంచేతనో, బెదురుచేతనో నిజంచెప్పక చల్లగా ఊరుకున్నారు. దానితో యింక లాభంలేదనుకొని మళ్లీ వంటచేసింది. రామలక్ష్మణులు మంత్రాలతో నిష్ఠగా పితృదేవతల నారాధించి పిలిచారు, అప్పుడు వాళ్లు "మేమిదివరకే వచ్చి పుచ్చుకొనివెళ్లాం, మళ్లీ యెందుకు పిలుస్తారు?" అని అడిగారు. ఆశ్చర్యపోయి రామలక్ష్మణులు ఇల్లాంటిస్త్రీ మాయింటికోడలవడం మా వంశానికంతా కీర్తివచ్చిందని మెచ్చారు.

అప్పుడు సీత సాక్షుల మోసానికి కోపం వచ్చి "మాటయిచ్చి ఇల్లాచేశారు; మీ కింతే శాస్తి" అల్లాగని ఫల్గుణీనదినిఎండిపోవాలనీ, కేతకిని శివపూజ కనర్హం కాలనీ, గోవుని ముఖం చూస్తే పాపంవస్తుందనీ శాపం పెట్టేసింది.

పాపం అల్లాంటి మంచియిల్లాలిని మోసం చేసినందుకు ఆపెద్దనది, ఆచక్కనిపువ్వు, మా లక్ష్మిలాంటి ఆవు ఎల్లా శాశ్వతంగా శాపదష్టులయారో చూసారా!

'కమల'

---

(శ్రీ) [illegible] సాహిత్య [illegible] శంకర [illegible] సంపర్కమున జరిగిన సభయందు [illegible] శాస్త్రిగారిచే [illegible] శంకరనవరత్నములు

యుతవ్రైు మంజులవాఙ్మయై త్రిజగదేకాచార్యుండై లోకస
న్నుతి పాత్రుండయి సత్కవీంద్రుడయి యెందున్ సాటిరా రీ మహా
మతి కంచుం బుధు లైకకంఠ్యముగ నేమాన్యుం బ్రశంసింత్రు ది
క్తతి మార్మ్రోయఁగ నట్టి శంకరు గురున్ ధ్యానింతు నేప్రొద్దునున్.

ఉ. యోగులు పుణ్యభాగులు వియోగ సుయోగములందు ద్వేషమున్
రాగము నంటకుండెడు విరాగులు వేదవిశారదుల్ దమ
స్త్యాగుల నైన సజ్జనులు తత్త్వమెఱింగి భజింతు రే మహా
యోగిపదమ్ము లాతని గుణోజ్జ్వలు నిన్నుఁ దలంతు శంకరా!

సీ. ఇల నుద్ధరించుట యెట్లని శంకరా, మించువేడ్క నవతరించినావు
నిగమముల్ మూర్తమై నినుఁ బరివేష్టించె, ననఁగ శిష్యచతుష్టయమ్ముఁ గొలువ
పాషండ కుటిలసంవాద వికర్తన, క్రమమున నెందు నుగ్రత వహించి
పక్షపాతగతికి వశ్యమొందక గీత, బహునరుల్ చెలియంగఁ బల్కినావు
గీ. కువలయానంద దాయకుండవు త్రయీమ,యుఁడవును శుచివి సర్వసముఁడవు నిన్నుఁ
బోలనేర్తురే యేమూలపూరుషులును, స్వార్థ సంత్యాగి శంకరాద్వైతయోగి.

ఉ. అంకురమెల్ల ఖేదముల కాధుల కుద్భవకారణమ్ము ని
శ్శంకిత పూర్వరంగక మసద్గతికిన్ మదదంతికి న్నిరా
తంకవిహారభూమి యనృతమ్మునకున్ నిలయమ్మనో మహా
హంకృతి పెంపడంచు భవదద్భుతవాగ్ఝరి గొల్తు శంకరా!

గీ. ద్వైతి దంతావళాంకుశా ద్వైతిలోక, గురుని నిర్మల భాష్యవాగ్గుంఫనములు
మసలు సకలేశు కైలాసమందిరమున, వెలయు సద్ధర్మబోధినీ విమలసభను.






## లోలక్కులు

బావిలు సాధారణముగా ప్రతి స్త్రీ ధరించే [illegible]. చెవులకు [illegible] [illegible]ందేవి. [illegible] బంగారపుపువ్వులుండేవి. ఇప్పుడు [illegible] [illegible]. నాగరికత హెచ్చు[illegible] [illegible]. చెవికి [illegible] పొడిగి[illegible]. [illegible] కొన్నాళ్లకు పాతబడి పోయాయి. ఎర్రపొడిదుద్దు లొచ్చాయి. [illegible] 'లోలక్కు'[illegible] యింకో విధమైన ఆభరణంగా వచ్చింట అమలులోకి.

'లోలక్కు' అనే పేరు వినగానే నాకాశ్చర్యం [illegible]. ఇదివరకు 'బోలక్కు' అనే శబ్దం నాకు బాగా పరిచయం అయింది. ఇది గ్రామ్యంలో వాడ్యే శబ్దవిశేషం. అది నవ నాగరకులయిన యువస్త్రీల కెందుకొచ్చిందా అని ఆలోచించాను. ఇంకో ఆలోచనకూడా కలిగింది నాకు. ఇది 'నాసక్కు' లోనించిగాని వచ్చిందా అని. లోలక్కు కన్న 'నాసక్కు' అన్న ముక్క బాగా వినబడుతూంది కాదూ? 'నాసక్కు' అనే పదం 'వచ్చినాను' 'పోయి నాను' లోంచి వచ్చింది అనుకుంటాను. పోనీ, 'లోలక్కు'కూడా అలాగ యెక్కడనుంచేనా వచ్చిందేమో అని 'భారతి' వెదకడం మొదలెట్టాను. భారతి చదవడం అంటే నాకు మహా యిష్టము. కాని కొనడం యిష్టం లేదు. ఎందుచేత నంటే నాకు యింగ్లీషు పేపర్లు చాలా వస్తాయి. భారతిలో యెక్కడైనా లోలక్కులనుగురించి వేస్తాడేమోనని చాలా వెతికాను. ఎక్కడా దొరకలేదు.

చివరకు నాకీవిధముగా తోచింది. లోలక్కు అనగా "లోల+లక్కు" అనే పదములకూడిక. 'లోల' అనగా 'చలించేది' అని కదండీఅర్థం. లక్కు అనేది కలిపారు. లోల, లక్కు క్రమముగా వ్యాకరణ సూత్రములను బట్టి 'లోలక్కు' అయింది. ఇంకో ఆలోచన కూడాపుట్టింది. లో+లక్కు(Low+luck) అని రెండు యింగ్లీషుమాటలు కలిపి యీవిధముగా మార్చి నారేమోయని అనుమానం కూడావుంది. ఇంకా యింగ్లీషులో వున్న లాక్కు (Lock) శబ్దమునకు దీనికి సంబంధముందేమోఅక్షరతత్వవేత్తలు(Philologists) చెప్పప్రార్థితులు.

లోలక్కులనేవి పందిరి బీరకాయలలాగు చెవినుండి క్రిందికి వేలాడుతూవుంటాయి. ఇది మనదేశానికి కొత్తగాదిగిన సౌందర్యం. ఇవి ధరిస్తే సౌందర్యంవస్తుందని మగవాళ్లు పేపర్లలో చదివారు. ఆడవాళ్లకు చేయిద్దామనుకున్నారు. కాని డబ్బో-భయపడి పోయారు. ఆడవాళ్లని చూచేసరికలాంటివిచేయిద్దామను

కొనేవారు. కాని పైకిమాత్రం చెప్పలేదు. చెపితే ప్రాణాలుకొరికేస్తారు చేయించే నరకూ.

దాగుతుందీ మగవాళ్లు చెప్పకపోతే? ఆడవాళ్లుమాత్రం చదూకోలేదు. వాళ్లుమాత్రం పేపర్లు చూడలేదు? కాని, మగవాళ్లు పేపరు చూడడానికి, ఆడవాళ్లు పేపరు చూడడానికి చాలా భేదముంది. మగవాళ్లు "వాంటెడు" (Wanted)లు చదువుతారు. ఆడవాళ్లు ఆర్నమెంటులు (Ornaments)ను గురించి చదువుతారు. "లోకోభిన్నరుచిః" కదండీ! ఆడవాళ్లకి సర్కసుయిష్టం; మగవాళ్లకి నాటకం యిష్టం. ఆఖరికి లోలక్కులు చూశారు. నాకు లోలక్కులు చేయిద్దామని బుద్ధి పుట్టింది. కాని మీదనుచెప్పానుకాను! భయపడిపోతాను. కొనకు తప్పింది కాదులెండి. దేశమంతా పాకిపోయింది లోలక్కుల పెర్రి. ఎలాగ పాకిపోయిందో చెప్పనా?

## ౨

రుక్మిణిభర్త చిన్నప్పుడే మదరాసులో చదువుతూ చనిపోయినాడు. వెంటనే ఆమె తండ్రి మధుసూదనరావుగారామెను చెన్నపట్నం చదువుకొనడానికి పంపించేశారు. ఇప్పుడామె క్వీనుమేరీకళాశాలలో ఇంటర్మీడియేటు చదువుతూంది.

రుక్మిణి యింటర్మీడియేటు చదువుతున్నప్పుడు కొత్తగా ఒకఉపాధ్యాయిని (మిస్ట్రెసు) లండనునుంచి లోలక్కులు తెచ్చింది. అవిచూసింది రుక్మిణి; వెంటనే అలాంటివి చేయించుకోవాలని బుద్ధిపుట్టింది. అలాంటి విదివరకెప్పుడూ చూడలేదు రుక్మిణి. అవి పెట్టుకోడంవల్ల దొరసాని మొహానికెంతో అందంవచ్చింది. రుక్మిణికూడా అలాంటివి చేయించుకుందామని బుద్ధిపుట్టింది. చక్కగా వుంటాయనికాదు సుమండీ.

అసలు రుక్మిణి అందకత్తె. లేడికన్నులు రెండు కమలపాకులాంటి శరీరము. నాగుపాములాగు పిరుదులవరకు వేలాడుజడ. జడకొనని ఉంగాలుముడి. అందమునకేమి లోపములేదు. ఆమె కంతకన్న అందమునవసరముకాడాను; కానిలోలక్కులు చేయించుకుందామనిసరదామాత్రంపుట్టింది. అవిచెవులను పెట్టినమనస్సు హాయిగా వుంటుంది. తన తనస్వదనముచేత నొకరిని మెప్పిద్దామనికాదు. ఎందుకైనా లోలక్కులు చేయించుకుందామని బుద్ధిపుట్టింది.

వెంటనే రుక్మిణి దొరసానిదగ్గరకు వెళ్లింది. తనఉద్దేశ్యం చెప్పింది. దొరసాని తన లోలాకులుపైకితీసి రుక్మిణిచేతికిచ్చింది. ఒకజత లోలక్కులు చేయించమని దొరసానిని ప్రార్థించింది. ఈలోపున పరీక్ష లైపోయినందున రుక్మిణి లోలక్కులసొమ్ము దొరసానిచేతికిచ్చి తన తండ్రిదగ్గరకు విశాఖపట్నం వచ్చినది. దొరసాని లోలక్కులు తయారుకాగానే పంపిస్తానని చెప్పింది.

## ౩

రుక్మిణి యింటర్మీడియేటుపరీక్షపోయింది. అందుచేత నామె చెన్నపట్నంవెళ్ల నవసరములేదు. ఇంటివద్దనే యుండిపోయినది. ఒకనాటి యుదయమున పోస్టుబంట్రోతు పార్సెలు

తీసికొనివచ్చి రుక్మిణి కిచ్చేడు. రుక్మిణిపార్సల్ విప్పి లోలక్కులు చూచినది. ఒకమారు చెవులకు తగిలించి అద్దంలో చూచుకొంది. మళ్లీ తీసేసింది. ఇంతలో గదితలుపు తోసిన చప్పుడయింది. వెంటనే రుక్మిణి లోలక్కులు దాచేసింది. కూర్మారావు ప్రవేశించాడు లోపట; కాని, రుక్మిణి దాచివేయడం చూశాడు. లోపట—'ఏమిటి దాచేశావు' అని అడిగాడు—'ఏమీ లేదండీ'—అన్నది రుక్మిణి. వెంటనే అతనికి చూపుట కామె కిష్టము లేదు.

కూర్మారావు ప్రతిమాలడం మొదలెట్టాడు. లాభం లేకపోయింది. గడ్డం పట్టుకోబోయాడు. రుక్మిణికి కోపం వచ్చింది. కూర్మారావు మొహం మాడిపోయింది. మళ్లీ ప్రతిమాలడం మొదలెట్టాడు.

కూర్మా—ఒక్కసారి చూపెట్టవు?

రుక్మి—నాకు కావలసిన వస్తువే నీకూ కావాలంటావు.

కూర్మా—నీకు కావలసిందె నాకూ కావాలి. నీ కేవస్తువందు ప్రేమో నాకూ దానియందే ప్రేమ.

రుక్మి—ఏమన్నా సరే, నే నివ్వను.

కూర్మా—ఒక్కసారి చూడనీ. తిరిగి యిచ్చేస్తాలే.

కొంతవరకు లొంగుబాటుకు వచ్చిన రుక్మిణిని ప్రక్కకులాగి, ఆమెపెట్టె నెత్తి, అందున్న చిన్నడబ్బిని పైకి తీసింది. డబ్బి మూతతీయగనే లోలాకులు కనబడెను.

కూర్మారావు వాటివంక రెప్పవాల్చక కొంతసేపు చూచి

"నాకు కావలసినవే నీకును కావలె. కాని, యిప్పుడివి నీకున్నవి. నాకులేవు" అనెను.

"నీకు లేని దేమిటి? కావలసినంత ధనమున్నది; చదువున్నది. బి.ఏ. ప్యాసయినావు. ఇంకా—"

"చెప్పు, ఇంకా చెప్పు—"




"హూ—ఒక్కసారి చూపెట్టవు?"

రుక్మిణిమాటాడలేదు.

"ఇవి నీచెవులకు పెట్టకుంటే కొత్త అందం వస్తుంది"

కోపముతో రుక్మిణి మోమును త్రిప్పివైచెను.

"లోలక్కులు నాకో మాటియ్యవు?"

"ఎందుకు?"

"చెప్తే యేమిస్తావు?"

"ఏం కావాలి?"

"నీకు తెలియదు?"

కోపంతో మొహం తిప్పేసింది రుక్మిణి.

"ఈ లోలాకు లెవరిదగ్గరుంటే వాళ్ల మీద ప్రేమ హెచ్చవుతుంది."

"అది తప్పభిప్రాయం."

"నిజమే. వాటిని చూడగానే యే ఆడదానికైనా మతిపోతుంది."

ఇవ్వ డియ్యను. తరవాత యిస్తాలే."

చాలా రాత్రి యైనందున కూర్మారావు తనయింటికి వెళ్లెను.

౪

రుక్మిణి లోలాకులను చెవులకు తగిలించుకొంది. ఇరుగుపొరుగు స్త్రీలందరును వాటిని చూచి పోవుచుండిరి. ఒక్కొక్కరే వచ్చి మజూరీ మొత్తైన దనుచుండిరి; బంగార మెంత పడినదనుచుండిరి. ఎక్కడ చేయించావనుచుండిరి. మునసబుగారి భార్య నేనూ చేయించుకుంటానంది. కలక్టరుగారి భార్య నేనూ చేయించుకుంటానంది. జడ్జీగారి భార్య "మాపిల్లలకో నాలుగు జతలు చేయించా"లంది. "మా ఆయన కమానునుంచి రాగానే నాకో జత చేయించుకోవా"లని ఇనస్పెక్టరుగారి భార్య చెప్పింది.

నిజంగా నీ మొహానికికో క్రొత్తకళ వచ్చిం' దని మేష్టరుగారి పెళ్లాం చెప్పింది.



"నిజంగా నీ మొహానికో క్రొత్త కళ వచ్చింది."

హైస్కూలులో చదువుచున్న కొందరు బాలికలు రుక్మిణి దగ్గరకొచ్చి లోలాకుల నొకసారి చూచి పోయిరి.

పదిహేను రోజులలో విశాఖపట్నమంతా లోలాకుల మయమై పోయింది. చెవులను లోలాకులు లేనట్టి స్త్రీయే లేదు.

౫

కూర్మారావు రుక్మిణికి మేనత్తకొడుకు. తనకు అవివాహిత యగు తోబుట్టువుకూడ నున్నది. పెద్ద ఆస్తిపరుడు; విశాఖపట్నంలో పెద్దమేడకూడా వుంది. తాను స్కూలు ఫైనలు చదువుచున్నప్పుడు తండ్రి చనిపోయెను. కూర్మారావుకు స్వాతంత్ర్యము వచ్చెను. అతడు యింటర్మీడియేటు, బి. ఏ. క్లాసులు చెన్నపట్నంలోనే చదివెను. చెన్నపట్నంలో నున్నప్పుడు ప్రతిరోజూ సాయంత్రం రుక్మిణి

నొకసారి చూచేవాడు. తాను బి. ఏ. పరీక్షకు వెళ్లినప్పుడే రుక్మిణి ఇంటర్మీడియేటు పరీక్షకు వెళ్లింది. చెన్నపట్నంనుంచి ఇద్దరూ కలిసే వచ్చారు. కూర్మారావు బి.ఏ.ప్యాసయినాడు. రుక్మిణి పరీక్ష పోయింది.

విశాఖపట్నం వచ్చిన తరువాత కూర్మారావు తరుచు మేనమామగారి యింటనే యుండి రుక్మిణితో చదువుతూ, పాఠం చెప్తూ వుండేవాడు. అకస్మాత్తుగా అతడు రుక్మిణిగదిలో ప్రవేశించాడు.

తన దగ్గరకు అందరూ రావడము, తన లోలక్కులు చూడడము, అంతా చెప్పింది రుక్మిణి.

కూర్మారావుకూడా వాళ్లో అందరూ యిదే చేయించుతున్నారని చెప్పాడు.

"లోలాకులు నాకోమాటియ్యావుకదూ. నాకు నాలుగురోజులుమాత్ర మియ్యి. చాలా అవసరంగా వున్నాయి."

"ఎందుకు?"

"మా చెల్లెమ్మకియ్యాలి, నన్ను చంపేస్తున్నాది అమ్మ నమ్మని"

"ఏమిటో వెర్రి!"

"వెర్రి కాదు—అవి కొత్త అందం తెస్తాయి మొహానికి"

"ఇదిగ తీసికొనివెళ్లి వేగం తీసికొనిరా?"

౬

కూర్మారావు లోలక్కులు తీసికొని పోయి రెండురోజు లైనది. ఇంకా రాలేదు. ఎప్పుడూ రుక్మిణిని చూడకుండా యున్నాళ్లుండలేదు. రుక్మిణికి కారణం తెలియలేదు. ఎప్పుడూవచ్చి యేవో పనికిరాని మాటలాడుతూ వుండేవాడు. పనికిరాని మాటలు కాకపోవచ్చును. వాడుచేసే పనులుమాత్ర మలాగుండేవి. సహజంగా స్త్రీలంటే కూర్మారావుకు యిష్టం. అందులో రుక్మిణి అంటే మరీయిష్టం. రుక్మిణికి యిష్టం లేకపోవచ్చును. ఇప్పుడుమాత్రం కూర్మారావు రాకపోతే రుక్మిణికి మనస్సేదోలాగుంది.

మనస్సు తిప్పుకుందామని చాలా ప్రయత్నించింది. అది చాల తప్పని సమాధానపడింది. మనస్సు తిప్పుకుంది. తనపుస్తకం తీసికొని చదువ మొదలు పెట్టింది. కాని యామెలో మరోరుక్మిణి యున్నది. ఆమె మనోరుక్మిణి. ఆమెకు కూర్మారావు చేతలయందు తప్పు కనబడలేదు. బాహ్యరుక్మిణి మనోరుక్మిణినిఅణచివైచింది. బాహ్యరుక్మిణి చదువ నారంభించును. మనోరుక్మిణి లోలక్కులకొరకాతురత పడజొచ్చును. రుక్మిణి మేనత్తగారింటికి వెళ్లమనును. బాహ్యరుక్మిణి వెనుకదీయుచుండును.

కూర్మారావు రెండు రోజులు కాగానే తిరిగి వచ్చెను. రుక్మిణికి ప్రాణం లేచివచ్చింది. మనోరుక్మిణి బాహ్యరుక్మిణిలో లీనమై పోయింది. ఇప్పు డున్న దొక్కటే యే రుక్మిణి. ఆమెను చూచి కూర్మారావు చిన్న నవ్వు నవ్వెను. మాట్లాడనైన లేదు.

రుక్మిణీకి మాత్రము మనసుండ బట్ట లేదు; కూర్మారావును లోలక్కులనుగూర్చి ప్రశ్నించ మొదలిడెను.




"ఏమోయి బావా! లోలక్కులేవీ? నిన్న మీచెల్లెలినిచూశాను.దాని చెవులను లేవే?"

కూర్మారావు నవ్వుతూ కూర్చున్నాడు. లోలక్కులమాట చెప్పడు. ఆమె మొహం వేపే చూస్తాడు. ఆచూపులలోనే తనయా లోచనలు వెలిపర్చడం మొదలెట్టాడు. ఆమె స్వభావ మాతనికి నచ్చినది. ఆమె గుణము లతనికి సంతోష మిచ్చినవి. ఆమె సౌందర్యము మాత్ర మాతని మనస్సు కలంచినది. ఆచూపుల యర్థము రుక్మిణి గ్రహించినది కాబోలును? "రుక్మిణీ! రాత్రి మాయింట భోజనము చేయవలెను. అమ్మ మిమ్మల నందరిని తీసికొని రమ్మంది. మామయ్యా, అత్త వస్తా నన్నారు."

రుక్మిణికి లోలక్కులయందు ఆతురత హెచ్చాయెను. ఆమె కూడ పెళ్లిటకు సమ్మతించెను.

రాత్రి ఏడుగంటలుకాగానే మధుసూదనరావుగారు కుటుంబముతో తన చెల్లెలు యింటికి బయలుదేరి వెళ్లిరి. అందరునుకలిసి భోజనముచేసిరి. కూర్మారావును, రుక్మిణియును మాట్లాడుకొనుచు మధుసూదనరావుగారి కెదురుగ కూర్చొనిరి. కూర్మారావు, రుక్మిణితో షెల్లీకన్న (Shelly) బైరను(Byron) గొప్పవాడని వాదించుచుండెను. షెల్లీకన్న బైరనుకు ధారహెచ్చనిమాత్రము మధుసూదనరావుగా రనిరి. రుక్మిణి లోలక్కులను గూర్చి మెవ్వరిని అడుగలేదు. ఎందుచేతనో?

మధుసూదనరావుగారికి రుక్మిణియును, కూర్మారావు నొక్కచో కూర్చొనుట చూడగనే మన స్సదోలా గయిపోయింది. రుక్మిణిని కూర్మారావు పెళ్లాడుతే బాగుండును ననుకొన్నారు. ఏమో? ఎవరు చెప్పగలరు? పాప మొక్కకూతురు. అందుచేత నే వారిద్ద రొక్కచోట కూర్చుంటే చూస్తూ ఊరుకొనేవారు. ఇప్పుడాయన కళ్లు చల్లగావున్నాయి.

భోజనాలు కాగానే అందరూ మధుసూదనరావుగారింటికి బయలుదేరి వెళ్లారు. కూర్మారావు వారిని దిగబెట్టడానికి వెళ్లినాడు. అత్తతోను, మామతోనుచెప్పి రుక్మిణిగదిలోనికి వెళ్లినాడు. ఒకరికే పోకరు చూశారు. తటాలున కూర్మారావు రుక్మిణిని దగ్గరకులాగి చెప్పేడు :

“రుక్మిణీ! ఇవిగో నీలోలక్కులు. నీకొరకే తీసికొన్నాను. అనే నీప్రేమ నాప్రేమకూడా”
...... నిన్ను నేను ప్రేమించితిని.”

“సర్వదత్తె”



సంపూర్ణము

## వందనములు

వెలగపూఁడి దాసయ్యచౌదరి గారు

విశ్వమెల్లను బూర్తిగా విస్తరించి
యనునిమేషము మార్పుల నందుచుండి
యబ్బురముఁ గూర్చు ప్రకృతికి నధిపుఁడైన
వాని కొనరింతు నాదగు వందనములు.

అర్క కిరణంబులకు వేఁడి నమరఁగూర్చి
చంద్రకిరణంబులకు మంచి చలువనిచ్చి
క్షితికి సర్వంబు వహియించు గతినొసంగి
నజలు చాతుర్యనిధికి నా వందనములు.

రాత్రి దివ మననొప్పు చక్రద్వయంబు
గలుగు కాలంపుబండిపైఁ గష్టసుఖము
లునిచి వేగంబుగాఁ దోలుచుండునట్టి
వాని కొనఁగూర్తు భక్తితో వందనములు.

ముందు రానున్న సుఖదుఃఖములనుగూర్చి
లేశమైనను దెలిసికోలేనియట్లు
సలిపి; జీవాళి నాడించు చతురమతికి
భక్తి మీఱఁగ నొనరింతు వందనములు.

గరళమును నమృతమును నొక్కకడలియంద
మేటిరత్నాలు రా లొక్కచోటునంద
సంభవింపఁగఁ జేయు ధీశాలి కేను
భక్తిమీఱఁగఁ జల్పుదు వందనములు.



# మాతృ నిర్వేదము

నీలంరాజు వేంకటశేషయ్య గారు

౧

త్రీనయుడు రెండేండ్ల ప్రాయముననుండ భర్త గతించెను. "కష్టములెన్నడును ఒంటిగ రావు." భర్తృమరణముతో భాగ్యలక్ష్మియు తఱలెను. పతి బ్రతికియున్నంత కాలమును బంధువర్గ మెడబాయకుండిరి. సంపన్న గృహస్థులై యుండునంతవరకు సన్నిహితబంధువులని తలంచినవారెల్లరు భర్తృమరణానంతరము జలమింకను తటాకమందలి కప్పలవలె కనుమరగువారైరి. కాలమా! కాటకముల కాలవాలము. ధనధాన్యములా! పూటకూటికిచేత చిల్లిగవ్వయైనను లేనపుడు మాట యేల? ఒకటి రెండు జీవములు బ్రతుకవలెను జీవనమా! దుస్సహము. అటులని ఈదేహయాత్ర నింతటితో ముగించి ఆత్మత్యాగము గావింపనా? ఆ...ఆ ...ఎటులు! ఆ-త్మ-త్యా-గ-మా? సాధ్యమా? సాధ్యమే యైనను ధర్మమా?"

దరిదాపుగాని, నిలువనీడగాని 'నా'యను వారుగాని లేక తనమృదుబాహువులు దండను దినదినప్రవర్ధమానుడగు ఆ రెక్కలురాని పక్షిని యనాథ నీ దిక్కుమాలిన ప్రపంచమున, ఈయగాధకూపమున, కఠినకర్కశశిలాహృదయయగు నీప్రకృతి గర్భమున విసరి వేయుటయే! అగుచో ధర్మచ్యుతి గలుగదా? గతులు దప్పవా? కాన బ్రతుకుట- ఎటులో- బ్రతుకుట కర్తవ్యము. మరల జీవనసమస్య. ఉన్నత కులశీలసంపన్నురాలు గలిగి గౌరవాధిక్యముగల కుటుంబమునకు జేరినదయ్యె సదాచారసంపత్తిచే వన్నెకెక్కిన ఆమె. కానికాలమునను పతిరాని... చున్నను పతి మృతుడగుటచే ... నను ఎటులో బ్రతుకుట నంగీకరించునా? బ్రతికిచెడగాని చెడి బ్రతుక రాదు. ఇక భావ్యార్థమేమి? మనస్సాక్షికి విరుద్ధముగా నట్టి ఆత్మగౌరవమునకు హానిగలుగనిని సద్భావనైన చేయక తప్పదు. కాయకష్టముచేసి జీవించుటను కృతనిశ్చయురాలాయెను.

పతివియోగదుఃఖ మొకవంకను, పసిపాపనిపోషణభారము వేరొకవంకను క్రుంగదీయుచున్నను, ఆదీనురాలిజీవములు నిలుచుట కాపసికూనయే ఆధారమాయెను. వినిర్మలశాంత్యాకాశపథమున దాయమ కాచిన్ని కుఱ్ఱడే నక్షత్రకాంతి. గంభీరబుంధిమధ్యమున ఆనిసువాక్కుడే తన కాశ్రయ మగుచెప్ప. సర్వదా ఆతనిదన్యసుందరమూర్తిని తనివిదీర వీక్షించుటచే కృశించిపోవుచున్న ఆయమమానసారామమందలి యాశాలతలు

[భారతి మూడవసంపుటము ఐదవసంచికలోని 'రాజగృహము' అను వ్యాసమునకు సంబంధించిన చిత్రములు]




చిత్రము ౧౨.

క్రమక్రమముగ పెరిగిరి. అనిర్వాచ్యస్వరా
లెట్టెటులో కష్టములకు కనులు మూసి, ఆరు
సంవత్సరములు గడపెను. దినమంతయు
చెమట లార్చి, కష్టించి గృహమున కరు
దేరగనే, ముద్దులమూటగు నిద్దలను
ముద్రితమైయుండు జగన్మోహనలావణ్యస్వ
రూపము, నేత్రానందకరముగ గోచరమగు
నంతనే "అమ్మా!" యను అవ్యక్తమధుర
మధురాలాపము వినిన యంతనే సర్వకష్ట
ములను మరచి అమితానంద మనుభవించు
చుండెను. తా నెవరికొరకై తనమేనప్రాణ
ములు బిగబట్టి దుర్భరజీవితము గడుప
సంకల్పము గావించుకొనియెనో, ఆతనికోమల
స్వరము వినుటకు గాని, తన్మనోహరమూర్తిని
సర్వదా సందర్శించుటకు గాని, తనివారనాతనికి
పరిచర్య సల్పుటకు గాని, నోచనగినది మరెద్ది
యైన గిరిజా!

## ౨

ఆనాటి సాయంసమయమున గగనమండ
లము నిర్మలమై పడుమర దెసయందుమాత్రము
అర్ధచంద్రాకృతిని తరుణారుణకాంతులావరించి
యుండెను. మరీచిమాలిని యగు లోకబాంధ
వుడు దినకృత్యములను నిర్వర్తించి తన నెల
వున కరుగుచుండెను. తాము సేకరించిన ఆహా
రమును ముక్కులం దిడుకొని విహంగపంక్తులు
ఎడతెగక బారులుతీర్చి తమతమ కులాయము
లకుజనుచుండెను. మన యనాథవనితయు తన
జీర్ణపటకుటీరద్వారమును జేరెను. కాని అహో
తుకముగ నాయమ మానసమంతయు ఆనాడు
కలచిన ట్లుండెను. హృదయము మతి త్వరితగతిని
కొట్టుకొనదొడంగెను. తను వేలకో కంపింప
మొదలిడెను. ఆపాదమస్తకము ముచ్చెమటలు
గ్రమ్మసాగెను. అప్రయత్నముగ నామె పెద
వులనుండి యొక వేడినిట్టూర్పు బయల్పడెను.
కారణములేని యీచిహ్నము లేలనో ఎవని
కెరుక? ముందు రానున్న సంఘటనముల కిది
సూచనయా? చూతము.

మోహనచంద్రుడు చినిగియున్న చాప
పై నిశ్శబ్దముగ బోరగిలిపరుండియుండెను. తల్లి
ద్వారమునొద్దకువచ్చి నిలచెను. మోహనుడు
వదనమునెత్తి తనదృష్టి నొకపరి తల్లివంకకు
మరల్చెను. వెంటనే తిరిగి తనచూపుల
నుపసంహరించుకొనియెను. కాని ఎప్పటివలె
తల్లిని కౌగిలించుకొనుటకై పరుగుపరుగున
బోలేదు. "అమ్మా!" యని పిలువలేదు. మంద
హాససుందరవదనమును జూపలేదు. పాప మా
యువిద గుండియలు ఝల్లుమనియెను. అత్యా
తురతతో "మోహనా! నాతండ్రీ!" యని
ఎలుగెత్తి యామె పలుకరించెను. పిలుపుతో
నైనను బాలుడు తనచెంతకువచ్చునని యా
శించెను. కాని భగ్నాశయయ్యెను. అడుగులు
తడబడుచుండ ఆతనిదరి జేరెను. ఆత డేడ్చు
చుండెను. బోరగిలబడియున్న తనయుని లేవ
నెత్తి, తనచీరకొంగుచే కనులనుండి స్రవించు
బాష్ప ధారల తుడిచి, చిందరవందర
లైన ముంగురులను తనయంగుళులతో సరి
చేసి, బుజ్జగించుచు "నాయనా! ఏడ్చెద
వెందులకోయీ!" యని ప్రశ్నించెను. బాలు
డు పలుకడాయెను. మరల "మోహనా!
చెప్పుము. నిన్నెవరేమనిరి బాబూ! నీకేమి

తినని [illegible] చక్కటివానన్నను, తాను మేన[illegible] నన్ను [illegible] తానే చక్కఁ; [illegible]!"

[illegible] యున్న [illegible], [illegible], [illegible]. [illegible] సార్వరభా[illegible] [illegible], [illegible] నేత్ర [illegible] విన [illegible] వాతల్లి [illegible] కన్నటి ధార [illegible] అసంతోష్యత వాపు [illegible].

## 3

ఆనాఁడు విజయదశమి. నగరమంతయు సర్వా లంకారశోభితమై విలసిల్లుచుండెను. పట్టణ మున [illegible] ఆసంగ దేవతలకొలువు దీరియుండెను. విశాలములగు రాజబాట లన్ని యుచిత్రవిచిత్రగతులనలంకరింపఁబడెను. గృహ ప్రాంగణములన్నియు రంగవల్లికలు ముగ్గులు కన్ను లపండువు సేయుచుండెను. సాయంకాలమైన అస్తవా [illegible] ప్రాంతములన్నియు [illegible] గోరి కళావాసు కలిగినటులు భక్ష్యభోజ్యము లతో విందులు చేయుచుండిరి. వీధిబడు లందు జడుపుబాలురు కోఁతులను విల్లంబులను జేబూని గుంపులుగుంపులుగ "అయ్యవారికి జాలు ఐదువరహాలు, పిల్లవాండ్రకుజాలు పప్పు బెల్లాలు" అని "జయవిజయీభవ" గీతములను పాడుచు సేగజొచ్చిరి. ఊరిలోనిపూజారులంద రకు నాఁడు తలమున్కలుగ పని. పౌరోహితు లెల్లర మొలలోఁతు సంతర్పణలు; తులలేని సంభావనలు; ఎచటఁజూచినను నూతన వస్త్ర ధారులే. ఎచ్చోట నాలకించినను మంగళ తూర్యనిస్వనంబులే. ఏవాడ జనినను సుమ సౌరభపరిమళమే! ఆనందము; ఎల్లెడల నానందమే.

ఈ యానందసరోవరమున కావలిదరి యందు మనశిథిలపటకుటీరము గలదు. విజయ దశమిహర్ష తరంగములు ఆకుటీరమును డాయ జాల వాయెను. మోహనచంద్రునకు నాటి కైనవసంకణము. శరీరము చాల కృశించియుం డెను. నేత్రములు పచ్చనై నిస్తేజము లాయె ను. పెదవులు మధురిమను వీడెను. మొల నున్న గోఁగుమొలనూలు తుంటిక్రింది దిగ జారి పోసాగెను. అట్టిస్థితియందున్న ప్రియసూ నుని ఆయనాథవనిత కనురెప్పవలె గాపాడుచు పరిచర్య నలుపుచుండెను. ఐదుదినములనుండి యు ఇరుగుపొరుగువారుచెప్పిన కూరగాయ వైద్యము లన్నియు జేసెను. "కాని కాలమం దెట్టిప్రయత్నములును సానుకూలములు గా వు." ధనాశాపిశాచము లగు అభినవడాక్టరు లకు బోయుట కానిర్భాగ్యదేవతకు శక్తి లేదాయె. ఇక కర్తవ్యమేమి? వైద్యులలోనెల్ల వైద్యుడగు నాశ్రీహరియే పరమవైద్యుడు. ఔషధములలోనెల్ల నౌషధమగు ఆతని

పవిత్రనామస్మరణమే దివ్యౌషధము. ఏకాగ్ర చిత్తముతో శ్రీహరిని ధ్యానించెను. భజించెను. కీర్తించెను. కాని భగవానుడు ప్రసన్నుడాయెనా? ప్రపంచమం దెటనైన సర్వసాక్షిభూతు డనబరగు ఈశ్వరుడుగలడా? కలిగిన నాతడు దీనదయాపరు డనియు, లోకబాంధవు డనియు, సుజనజీవను డనియు, నుడివెడి నుడువులందు సత్యముగలదా? ఆయమ కద మెల్ల సంశయమై కన్పట్టె. డోలాందోళిత మనస్సు సత్యాన్వేషణమునకై పరితపించు చుండెను.

ఉన్నటులుండి ఆమె కర్ణపుటములకు "అతడు జీవింపగలడు" అను ధ్వనియొకటి జీవనసుధవలె సోకినట్లుండెను. కంటికి కగుపడని, మనసునకందని, యొక్క మహాశక్తి పరోక్షమునబల్కినఆమాటను విశ్వసించి తనమనోవాంఛ ఈడేరెగదాయని, తన కష్టములు గట్టెక్కినవిగదాయని, తన తనయుని కిక భీతిజెంద నక్కరయే లేదని ముమ్మాటికి నమ్మెను.

కాని దుర్విధిని దప్పింప నెవరితరము. చిమ్మచీకటియందు తళుకున మెరసిన మెరపు గాంచి వెలుగుగలిగెగదా యని సంతసించెను. కాని యాప్రకాశ మొకత్రుటికాలము మాత్రమే యని తెలియజాలక పోయెను. దారి డొంకలేక మలమలమాడు ఎడారియందు ఎండమావులను గాంచి నీరని యాశించెను. కేవల భ్రమయని ఎరుగదాయెను.



"అమ్మా!" యనెను మోహనుడు. ఆతని ముద్దుపలుకులకు మంగళహారతి ముగిసెను: ఆతని చిన్ని పెదవులపై చిరునగవు సంచరించెను.

౪

సాయంసమయమున రెండుమూడు గడియలు గడచెను. గంగాతీరమునను శ్మశానవాటిక నతిదూరమున కనుచూపుమేరను కొందఱొక శవమును మోసికొనివచ్చుచు ఏకాంతముగ ఏకాకియై తిరుగుచున్న అనాథవనిత యొక్క పరుగున వారినిజేరెను.

"నాతనయుడు మోహనుడేవాడు. నా మోహనుని మీరేల మోయుచుంటిరి? నాబాలుని సన్నిధికొనరింతు! నాతనయుని స్పృశించి పతితపావనా! మీస్పర్శచే నాతనికి కుసుమకోమల




# ఆంగ్ల శాసనసభలు


కె. రంగాచారి గారు, యం. ఏ., బి. యల్.


## ౨

నడవడినిబట్టి జేమ్సు (King James) ప్రభువు శాసనసభ నత్యంతమనాదరముతోఁ జూచుచుండెను. మనకుఁ దోచినను గొన్నివ్యవహారములం బట్టి గూడిన రాజున కట్టియనాదరమునభయం దున్నట్లు కాన్పింపదు. ప్రజల ప్రతినిధులగుటంజేసి శాసనసభ్యులకున్న యధికారమునకు రాజు వెఱచినట్లు మన మూహింపవచ్చును. ఇందులకుఁ దార్కాణముగఁ గొందఱు చరిత్రకారు లీక్రింద జెప్పఁబడినకథలం జెప్పుచున్నారు. ఒకనాఁ డావిశ్యనుసారముగ రాజు కావించుచున్న కార్యములం గూర్చి దృఢోక్తిపూర్వకముగ నిషేధించుటకుఁ బండ్రెండుగురుసభ్యులు శాసనసభచే నియమింపఁబడి న్యూమార్కెట్టు (New Market)లో నున్న రాజు సమక్షమునకుఁ బోవుచుండ నరపాలుఁడు వారలంజూచి "కుర్చీలు తెండు; కుర్చీలు. ఇదుగో పండ్రెండుగురు రాజులు" అని చెప్పెనఁట. రెండవకథ యెట్టిదనిన: సామాన్యముగ నెమ్మదిగనుండు గుఱ్ఱము నొకనాఁడు ఉద్ధరోహింప నది యల్లరిచేయ నారంభించెనఁట. అది చూచి "నీవల్లరి లేక నెమ్మదిగ నుండకపోయిన నిన్ను శాసనసభయందుండు నేనూఱుమంది రాజులకడకుం బంపెదను" అని ప్రభువు నుడివెనఁట. క్రైస్తవలోకమున 'విద్యావిశిష్ట మూర్ఖాగ్రేసరుండు' అని విఖ్యాతిఁ జెందిన యీప్రభువుయొక్క స్వాధికారాన్యాయప్రయోగమును, నీయన తరువాత రాజ్యమునకువచ్చిన యాతని పుత్రుండగు మొదటి చార్లసుప్రభువు (King Charles I) దుష్పరిపాలనయూ దేశమున నుపప్లవములం బుట్టించి రుధిరప్రవాహములం బ్రసరింపఁ జేసినవి.

మొదటి చార్లసుప్రభువు [illegible] సం. జనకునితో [illegible] ప్రారంభమైన [illegible] గర్జిత [illegible] శాసనసభతోఁ గలహముఁ బెట్టు [illegible] కొనుటకు [illegible] యింపఁబడెను.

మొదటి చార్లసుప్రభువు పరిపాలన మారంభించిన యొక సంవత్సరములోపలనే శాసనసభతో వివాదపడెను. ఆయన కిష్టుఁడును మంత్రియు నగు బకింగుహామ్ (Duke of Buckingham) అను నమాత్యుని కాడిజు సైన్యప్రస్థాన దుర్నిర్వహణముల (Failure of the Cadiz expedition)నక్షేపించిన శాసనసభ్యు లుద్యుక్తులైరి. అట్లు తన యమాత్యుల కార్యముల నక్షేపించుటకు సభ్యుల కధికారము లేదని స్పష్టముగఁ బల్కి వారలను రాజు [illegible] నుడివెను. రాజాక్షేపణముల సభ్యులు సరకుగొనక యక్షేపించిన విషయములఁగూర్చి తీవ్రముగఁ జర్చఁగావించి [illegible] విషయమును విస్తారముగఁ [illegible] లో సర్ జాన్ ఇలియట్టు (Sir John Eliot) సర్ డిగ్గెస్ (Sir Dudley Digges) అను నిద్దఱుసభ్యులను రాజు చెఱసాలయం దుంచెను. [illegible] సభ్యులు చేయవలసిన కార్యములఁగూర్చి గంభీరముగఁ జర్చఁ గావించుటకు సిద్ధమైరి. అప్పుడు [illegible] జేయవలసిన పనులను నిర్వర్తింపవలయును అని సభ సహర్షముగ "కూరుచుండుము; మా స్వాతంత్ర్యమును దిరుగ మేము సంపాదించువఱకు నితర కార్యములఁ

[illegible]యను" అని [illegible] అప్పటి [illegible] [illegible] వినిపిష్టి [illegible] [illegible] [illegible] [illegible] ప్రభువు [illegible] [illegible] [illegible] "సభ [illegible]" అని [illegible] [illegible] రాజకార్యమును [illegible] [illegible] [illegible] [illegible] [illegible] [illegible]

[illegible] అన్ని [illegible] సభ్యులే [illegible] [illegible] [illegible], [illegible] శాసనసభా [illegible] పన్నుల విధియింప [illegible]. [illegible] హాంప్డెన్ (Hampden) [illegible] పన్నులం [illegible] [illegible] ప్రభుత్వ [illegible].

క్రీ. శ. 1628 సంవత్సరము [illegible] శాసనసభ [illegible]. [illegible] ప్రార్థ [illegible] [illegible] [illegible]. ఆ ప్రార్థన [illegible] [illegible] [illegible].

"That no man hereafter be compelled to make or yield any gift, loan, benevolence, tax, or suchlike charge withou- common consent by Act of Parliament; that none be called to answer or take such oath, or to give attendance or be confined or otherwise molested or disquieted concerning the same or for refusal there of; that no freeman in any such manner as is before mentioned be imprisoned or detained: that your Majesty would be pleased to remove the said soldiers and mariners and that your people may not be so burthened in time to come that the aforesaid commissions for proceeding by martial law may be revoked and annulled; and that hereafter no commissions of the like nature may issue forth to any person or persons whatever, to be executed as aforesaid.

"ఇఁకమీఁదట శాసనసభానిర్మిత శాసనరూపసామాన్యసమ్మతిఁబడయకుండగనే రాజేమనుజునైనను దానమునుగాని, యప్పునుగాని, శుల్కమునుగాని యిమ్మనిబలవంతపెట్టఁగూడదు. ఇట్టి దానాదుల విషయమైకాని తన్నిరాకరణ సమయమునఁగాని దేశవాసుం డెవ్వండైనను బ్రమాణము చేయుటకుఁగాని హాజరుగానుండుటకుఁగాని యాజ్ఞాపింపఁ బడకుండుటయేకాక కారాగార నివాసక్లేశము చెందునట్లుగాని మఱియేవిధమగు చిక్కులకుగాని లోనగునట్లు చేయఁగూడదు. ప్రభువులైన తాము ప్రజలపైకిఁబంపిన నావికులను సైనికులనుబిలిపించి యికముందెన్నఁడు నట్టివారిని బ్రజలపైకిఁ బంపఁగూడదు. మీఁదఁజెప్పఁబడిన సాంగ్రామికధర్మానుసారముగ పనులుచేయుటకై తమచేఁజేయఁబడినయా దేశములను దాముతిరుగ నిరర్థకములుగ నొనర్పవలయును. దేశధర్మ పౌరజనాధికారవ్యతిరిక్తముగ దేశస్థులు వధింపఁబడకుండుటకై యేతన్నారీతి ముందు సాంగ్రామికధర్మానుసారముగ న్యాయమును బ్రవర్తింపఁజేయుట కెవ్వారలకును నట్టియాదేశముల నీయఁగూడదు"

కొంతవఱకుఁ బ్రభు వీప్రార్థన సంగీకరింపకుండుటకై ప్రయత్నించెను కాని శాసనసభలో శాసనరూపమున నగి సాధింపఁబడుటచే దానికిఁ దన యంగీకారము నొసంగెను. శాసనసభ యంగీకారమును బడయకుండఁగనె విధియించిన నావికాసంబంధమగు పన్నుల విషయమై రాజు కనుపఱచిన విశేషాధికారముల సభ్యులు త్రుంపఁ బ్రయత్నింపనందులకుఁ గుపితుఁడై రాజు శాసనసభను వ్యాక్షేపించెను.

తిరుగసభ సమావేశమైనపుడు రాజు సభ్యులను వశపఱచుకొనుటకుఁ గావించినయేర్పాటులు వ్యర్థములగుటచే నధ్యక్షుని లోఁబఱచుకొని సభ్యులకార్యముల వ్యర్థపఱుపఁ బ్రయత్నించెను. ఆకాలమున సర్ జాన్ ఫించ్ (Sir John Finch) అనునాతఁ డధ్యక్ష పీఠము నలంకరించుచుండెను. క్రీ. శ. 1629 సంవత్సరమున

నిమయొద్దనుండి సందేశము నపేక్షింపలేదు. నాకీయునీ యాంగ్లేయదేశముఁ బరిపాలించిన పాలీయేరు జాను శక్తి వంచన లేకుండఁగ మావిశిష్టాధికారముల రక్షించుటయందు నాకన్న నెక్కుడు జాగ్రత్తతోఁ బ్రవర్తింపవలసి నను రాజద్రోహి విషయములో నెవ్వానికిని విశిష్టాధికారములు లేవు. కాన నభియోగింపఁబడినవారలెవ్వరైన నిచట నున్నారో లేరో యను వృత్తాంతమును దెలిసికొనుటకై నే నిచటకు వచ్చితిని" అని చెప్పెను.

అంతటను దృష్టిప్రసరింపఁజేసి వారి నెవ్వరి నటఁ గన్గొననేరక రాజద్రోహుల రక్షింపఁ బ్రయత్నించినయెడల సభ యన్యాయప్రవృత్తిగలదిగఁ బరిగణింపఁబడు ననియు, ధర్మానుసారముగ న్యాయస్థానము నా రాజద్రోహుల వ్యవహారములు నిర్ణయింపఁబడుననియుఁ జెప్పి లెంథల్ (Lenthall) అను సభాధ్యక్షుని వైపు తిరిగి రాజద్రోహు లెక్కడకేగిరని ప్రశ్నించెను. మోకాలిపైబడి యాయధ్యక్షుఁడీరీతిగ గంభీరవచనములఁ బల్కెను.

"ప్రభూ; ఈసభయొక్క భృత్యుండనగుటం జేసి యీసభామందిరమున సభానియమితరీతినిం దక్క వేఱు మార్గమునఁ జూచుటకుఁ గన్నులుగాని చెప్పుటకు నాల్కగాని నాకులేవు. కాన నేలినవారడిగిన ప్రశ్న కీజవాబిచ్చుటకు నేను నశక్తుఁడనై యున్నందులకు క్షమింపవేఁడుచున్నాను."

రాజు పిమ్ (Pym) మొదలగువారిఁ బట్టుకొనుటకుఁ జేసిన ప్రయత్నములన్నియు నిష్ఫలములై లండనుపట్టణమున సంక్షోభమును గలిగించెను. పురవాసుల చేతకర్రలైన నాయకులను బట్టుకొనుఁ బట్టుకొనఁ బ్రయత్నించెను గాని రాజనిశ్చయమైన సభల మనోరథముదు కాలేకపోయెను. మరియుఁ బ్రజలను రాజెవని కనుమానముంగూడఁ గావించిరి. తానుగావించిన నిష్ఫల ప్రయత్నములన్నియు నేమి చేయుననో యను భయముచే రాజ్ఞప్రభువు లండను నగరమును విడిచి హాంటన్ కోర్టునకుఁ జనెను.

అంతవరకు రాజును బ్రజలు నిరువురు స్వాతంత్ర్యమును గాపాడుకొనుటకు యుద్ధమును జేయుటకుఁ గావించుకొనుచుండిరి. రాజభక్తులు కొందఱు ప్రజల మనోనిశ్చయములను వారి యుద్యోగములను గుర్తించిన వారలగుటచే రాజునకును బ్రజలకును గొంత సామరస్యము గల్గునటులఁ బ్రయత్నములు సల్పి ప్రభువును గొంతవఱకైనను శాసనసభకు లోఁబడునటుల ప్రోత్సహించిరిగాని యాతఁడట్టి సుబోధకుల నిరసించి తాను బట్టినపట్టును వదలక ప్రజలతో యుద్ధము గావించుటకు సగినరీతి నేర్పాటులం గావించెను.

---

# ఉపాయము

### పూడిపెద్ది వెంకటరమణయ్యగారు

ప్రణయభానూదయంబునఁ బద్మమట్లు
విరియునీముఖసీమ గన్పించు నేని
నతులితానందమునఁ దన్మయత్వమంది
కరఁగి నిలువెల్ల నే నొకసరసినగుదు.

* * * *

ప్రణయశారదచంద్ర బింబంబుపగిది
నవ్వు నీముద్దుమోము గన్పడినయంత
సొగసి మిన్నందు మబ్బుతో నేకమగుచుఁ
గరఁగిమెల్లన నిర్మలాకాశ మగుదు.

* * * *

అందమొలికెడు నీదుముఖాబ్జసీమ
వికచనీరజమో, లేక విమలచంద్ర
మండలమొ పోల్చ రాకున్న మదిఁ దలంచి
యాకసమ్మును వాహినినై చరింతు
ప్రవిమలాకాశమై నీటఁ బ్రతిఫలింతు
నంబుదశ్యామ! నా కుపాయంబులేదె!

(రాధిక)



# ఐరిషు అసహకారము

'మాతలి'

[వెనుకటి సంచిక తరవాయి]

## ఐరిషు స్వరాజ్యస్థాపనము

**1904** వ సంవత్సరమున సిన్ ఫెయినులయుద్యమము ప్రారంభించునప్పటికి ఐరిషువారనేకులు దేశీయవాదులు (నేషనలిస్టు)గ నుండిరి. దేశీయవాదుల ప్రతినిధులనేకులు ఇంగ్లీషు పార్లమెంటులో స్వల్పసంఖ్యాకులుగాను సభ్యులుగ నుండిరి. వీరి కోరిక యేమి యనగా కెనడా, ఆస్ట్రేలియా, దక్షిణాఫ్రికా యున్నను వానివలె ఐర్లండునకు బ్రిటిషుసామ్రాజ్యముక్రిందనే సామంతస్వాతంత్ర్యమును క్రమముగ స్థాపింపవలె నని. ఈ యభిప్రాయమునకు తొలుత దేశమున ననువాద మెక్కుడులేకుండినను తరువాత నెంతసహాయము కలుగ సాగెను. కాని 1904 వ సంవత్సరము మొదలు 1914 వరకును ఇంగ్లండులోని ప్రభుత్వముసల్పిన ఉదారవాదులే సామంత స్వాతంత్ర్యస్థాపన విషయమున జూపిన యశ్రద్ధలనను నాలస్యములనను నైరిషువారికి స్వయం సహాయ మరియొక విధమున తమస్వాతంత్ర్యమును సంపాదించుకొనవలెనని దృఢమతి పుట్టెను.

## జర్మనీయ మహాయుద్ధము

ఇంతలో యూరపులో జరిగిన జర్మనీయ మహాయుద్ధమువలన సంపర్కములు మారిపోయినవి. ఈయుద్ధమున నింగ్లండునకున్ను తత్పక్షమువారికిన్ని కావలసినంత సహాయము చేయవలయునని ఐరిషు దేశీయవాదులభిప్రాయపడిరి. కాని యీయభిప్రాయ మైరిషు జనసామాన్యమునకు సమ్మతముగా నుండనందున దేశీయవాదులకు దేశమున ననువాదము తగ్గిపోసాగెను. జనులమార్గమొండును వీరిమార్గమొండును నాయెను. అట్టి తరుణమున సిన్ ఫెయినులకు బలముహెచ్చి యైరిషువారికి స్వాతంత్ర్యాపేక్ష యినుమడించెను.

1916-వ సంవత్సరమున ఏప్రెయిల్ నెలలో ఈస్టరు పండుగ కాలములో డబ్లినుపురమున నొక రాజనిరోధము సంభవించెను. దీనికి నాథులు సిన్ ఫెయిను నాయకులు. వీరికి ముఖ్యసహాయము కార్మికసంఘమువారు. ఈరాజనిరోధమున కప్పటిలో నపజయము కలిగెను. కాని తరువాత సిన్ ఫెయినుకు ప్రాబల్యము హెచ్చెను. ఎట్లన నీనిరోధము నణచుటకు నింగ్లీషుప్రభుత్వమువారు గావించిన క్రూరకృత్యములు వారి కెగ్గుదెచ్చెను. అపుడింగ్లండున ఆస్క్విత్తు శిరఃప్రధానిగ నుండెను. అనేకులు వలదన్నను నాప్రభుత్వముయొక్క యుత్తరువు చొప్పున నిరోధనాయకులలో పన్నిద్దఱు తుపాకులతో కాల్చబడిరి. వీరిలో కార్మిక నాయకుడైన జింకన్నలి యనువాడొకడుండెను. తరువాత మఱియొక జనానువాదిని విచారణలేకయే ప్రభుత్వమువారు కాల్పించినందున జనుల కింగ్లీషువారియెడ నసూయయు స్వరాజ్యముపైని నాసక్తియు స్థైర్యమున్ను హెచ్చెను. ఈసమయమునకూడ నైరిషు దేశీయవాదు లింగ్లీషువారికి యుద్ధమునకై సహాయము చేయవలయునని యభిప్రాయ పడినందున ననేకులకు వీరియందు నమ్మికతగ్గిపోయి వారు సిన్ ఫెయిను పక్షము నంగీకరించిరి. ఐరిషు స్వరాజ్యము ననువాదించిన పెద్దమనుష్యులను కొందఱిని యింగ్లీషు ప్రభుత్వమువారు శిరశ్ఛేదనకు విధించినందున నైరిషువారికి దినదినమునకును 'ఆత్మనా౽౽త్మాన ముద్ధరేత్' అను సనాతనధర్మము మనసున నంటసాగెను.

సిన్ ఫెయిను ప్రాబల్యము హెచ్చుటకు గారణము లింతటితో నిలిచినవికావు. బ్రిటిషు ప్రభుత్వము వారైర్లండున నిర్బంధయోధత్వము (కాన్‌స్క్రిప్షన్) ను విధించ నెంచియుండిరి. అపుడు జరుగుచున్న జర్మనీయయుద్ధమునకై సైనికులను జేర్చుటకు ప్రతి యైరిషు

మొదటి సిన్ ఫెయినుసభవారే నతని నైరిషుప్రభుత్వమున కధ్యక్షునిగ నియమించి యుండినందున నిప్పు డానిగూ మకును నీ 'డెయిల్ ఎయిరియన్' సభ స్వీకరించెను. ఐరిషుప్రభుత్వసభ వారియొక్కయు తెలపగ తన రాజ్య నీతిని యీ క్రిందినీతిని తెలియపఱచెను.

"ప్రజల కయిష్టముగ నీదేశమున రాజ్యముసల్పు చున్నవారిని మేము లెక్కసేయము. వారి విషయమున మేము సెలవు నిచ్చిన ప్రవర్తింతుము. వారిచట్టములు నాదేశమున కింక సంబంధములని నూకుదామనో అంత వఱకే వానిని మే ముపయోగింతుము." ఈయుద్దేశముల నావలంబించి డెయిల్ ఎయిరియను సభ ఐర్లండునకు స్వాతంత్ర్యప్రభుత్వసభయయి సంపూర్ణాధికారమును గ్రహించెను. ఇదియే తొలుత ఆర్థర్ గ్రిఫితుకోరినదియును.

ఐర్లండునందు వందల సంవత్సరములుగ భూమికి చాల గిరాకియుండెను. ఇంగ్లీషువారి ప్రభుత్వముక్రింద సామాన్యజనులకు భూమి దొరకనందున జీవనోపాయము లేక వేలకొలదిజనులు దేశమును విడిచి అమెరికా మున్నగు పరదేశములకు వెళ్లి యచట నునికిపట్లు నేర్పరచుకొనియుండిరి. జనులీవిధముగ దేశమును వదలిపెట్టి పోవుచుండుటవలన 1846–వ సంవత్సరమాదిగ ఐర్లండులోని జనసంఖ్య తగ్గుచు వచ్చెను. సిన్ ఫెయిను ప్రభుత్వము యొక్క భూవిభాగ న్యాయముయొక్క ఫలముగ ఐరిషు వారికి భూమి సులభముగ దొరక నారంభించినందున వారి ప్రభుత్వపు తొలియేటనే దేశమున జనసంఖ్య హెచ్చెను. వ్యవసాయముచేయువారికి సహాయముగ నీ ప్రభుత్వమువారొక గొప్ప నిధిని యేర్పాటుచేసి వారికి భూములనుపంచి నిచ్చిరి. ఈప్రయత్నమున సిన్ ఫెయినువారికి బ్రిటిషుప్రభుత్వమువలన కొంత ప్రాతికూల్యము కలిగెను. అయినను సిన్ ఫెయినుల స్థైర్యమున నమ్మకము గలవారయి జనులు దేశముననే నిలిచి తమ స్థితిని బాగుపఱచుకొనుట సిద్ధులయిరి.

గ్రిఫిత్తుయొక్క యభిప్రాయముచొప్పున డెయిల్ ఎయిరియను అన్యదేశములలో నైరిషు ప్రశంసకుల నేర్పరుప దొడగెనని యింతకు పూర్వమే చెప్పియున్నాము. ఈప్రశంసకుల పనియేమన నాయాదేశములలో తమదేశమునకు వ్యాపార సౌకర్యముల నేర్పరచుకొనుట. ప్రపంచమందు ప్రసిద్ధిచెందియున్న పారిశ్రామిక పురనగరములలో నెల్ల నైరిషు ప్రశంసకులు స్థాపింపబడిరి.

గ్రిఫితుయొక్క మఱియొక గొప్పయుద్దేశమేమన దేశములోని యడవులను బలపఱచవలెనని జర్మనీతో జరిగిన యుద్ధమునకై యోడలను కట్టుటకు బ్రిటిషుప్రభుత్వమువా రైర్లెండులోని యడవులనన్నిటిని నఱికించి కొయ్యయన్న మాటలేకుండఁ జేసియుండిరి. బోడిచేసిన యడవులకుమాఱుగ క్రొత్తయడవులను నిర్మించినవారు కారు. ఈపనిన్ని డెయిల్ ఎయిరియను చేయ పూనుకొనెను. ఇంతియేకాక నైర్లెండు చుట్టునున్న సముద్రమున చిక్కఁగొనిన మత్స్యాదులను సేకరించి వాని నుపయోగించుటకును డెయిల్ ఎయిరియను బూనుకొనియెను. దేశములోని వాసగృహములను బాగుపఱచుటకుగూడ నీ ప్రభుత్వసభ ప్రయత్నముల జేయసాగెను.

## వృత్త్యుద్ధారణ.

ఐర్లెండులో నేయేవృత్తులకు నేయే సౌకర్యములుండెనో యెట్టివానికి సహాయము చేయనగునో దానిఁ దెలియుటకుగాను డెయిల్ ఎయిరియ నొక విచారణ సభను నిర్మించెను. ఈసభ దేశమునంతటను సంచరించి యాయాప్రదేశముల వృత్తిపరులను వృత్తినాయకులను గలసిమాటాడి యేయేవృత్తులకు నేయేసహాయసంపత్తులుండినవిన్ని వివరముగా తెలుసుకొనసైయుండెను. ఈసభ చాల నుపయోగమైనపని గావించుచుండెను. అయిన బ్రిటిషుప్రభుత్వమువారు దీని ప్రాబల్యమున కోర్వఁజాలక దానిసంచారప్రచారములకు సంకటములగావించుచుండిరి. తుదకు దీనిని నిర్మూలముచేయు నుద్దేశముతో నిదియొక కుట్రకూటమని చెప్పి యెల్లవిధములను దీనికి నిబ్బందుల గలిగింపసాగిరి.

స్థానికప్రభుత్వసభలును నితర సంఘములవారును దీనికి యేలాటిసహాయమునుగాని చేయరాదని ప్రభుత్వమువారు శాసించిరి. తుదకు 1920 వ సంవత్సరము జనవరి 21 తేదీన కార్కుపురముయొక్క పురసౌధములో

జరుగుచుండిన నీసభను ప్రభుత్వమువారు సిపాయిలచేత తుపాకులతో బెదరింపించి బయట తోలించిరి.

ఈ బెదరింపులకుగాని విఘ్నములకుగాని డెయిల్ ఎయిరియను జంకినదికాదు. బ్రిటిషువారు పెట్టు యిబ్బందులు హెచ్చినకొలదియును దీని స్థైర్యము మఱియు హెచ్చసాగెను. సిన్ ఫెయినుద్యోగస్థుల సంపదను జేర్చి ఐరిషు నియోగముగా నేర్పరచిరి. ఈనియోగము (సర్వీస్)నకధికారి డెయిల్ ఎయిరియనేకాని బ్రిటిషుప్రభుత్వముకాదు. అంతట బ్రిటిషుప్రభుత్వమువారు డెయిల్ ఎయిరియనునుకూడ కూటసభయని చెప్పి యాగ్రహింపసాగిరి: కాని యీసభ విడువక రహస్యముగనే కూడియుచుండెను. డివలెరాను బ్రిటిషుప్రభుత్వమువారు ఖైదీ పట్టియుండిరి. అతడిట్లో తప్పించుకొని యమెరికాకు వెళ్లి యచటి బలవంతుల యభిమానమును సిన్ ఫెయిను వారికిగా సంపాదించి డెయిల్ ఎయిరియనుయొక్క కార్యభాగముల కాధారముగ అప్పు సంపాదించెను.

ఐర్లండులో నెవ్వరును ఐరిషు సిన్ ఫెయిను పార్లమెంటయిన డెయిల్ ఎయిరియనుకు ధనసహాయముచేయ కూడదని బ్రిటిషుప్రభుత్వమువారు నిషేధించి యుండిరి. డెయిల్ ఎయిరియనునకు దేశస్థు లిచ్చియుండిన యప్పు సంబంధమైన పత్రములు మున్నగువానిని రాజవిరోధమని చెప్పి వానిని నాశముచేయసాగిరి. డెయిల్ ఎయిరియనుపక్షమున నప్పుమరతులను ప్రకటించిన కారణమున నిరువది వార్తాపత్రికలను నిలిపివేయించిరి.

ఈయప్పునకుగాను దేశమంతటను తిరిగి పైకము నువసూలుచేసినవారినిన్ని పైకమిచ్చినవారినిన్ని బ్రిటిషువారు కారాగృహముల కనుపసాగిరి. ఇంతటితో నిలువక సిన్ ఫెయినువారి ధనములుండిన నిధులను (బాంకులను) దౌర్జన్యముతో పట్టుకొని యీధనము నపహరించుటకుకూడ నీ ప్రభుత్వమువారు ప్రయత్నించిరి. అయితే నిధులయధికారులు తమ ధర్మమును వదలక నీ దౌర్జన్యము నెదిరించి మొండొడ్డి యీధనమునియ్యజాలమని ప్రతిఘటించిరి.

## ప్రజాపక్ష ధర్మాసనములు

న్యాయపాలనకై డెయిల్ ఎయిరియను ప్రజాపక్షధర్మాసనము (రిపబ్లికన్ కోర్టు)లనున్ను భూమిని గుర్తించిన తగాదాలనతీర్మానించుటకు పంచాయతిసభలనున్ను స్థాపించెను. ఈ న్యాయాధికారుల తీర్మానములకు సాలుల జరుపుటకు స్వంత పోలీసువారినిన్ని స్థాపించెను. అంతియు ప్రజాస్వామ్యసేన (వాలంటియరు) యొకటి స్థాపింపబడి యుండెను. ఇంగ్లండులోని సర్కారు పోలీసువారు 1920 వ సంవత్సరమునుండి వారివిధియైన కావలిపని చేయక ప్రభుత్వపక్షమున సిన్ ఫెయినుల నణచుచుండి జనవిరోధులై యుండెను. ఈ కాలమున దేశమున దొంగతనములు హెచ్చి జనులకు ప్రభుత్వమున్నదో లేదో యను సందేహమును బుట్టించెను. అట్టి దురవస్థలో న్యాయసభలు వేగముగ తీర్పుల జరుగుచుండె కానీ కానుకలనిచ్చు దొంగలనుపట్టి శిక్షించుటలనను మిక్కిలి సాయము జనోపకారులయి జనులప్రీతి విశ్వాసములను సంపాదించి యుండిరి. వీరి కార్యక్రమములున్ను చాల ప్రశస్తములుగా నుండెను. దొంగలను వీరు ప్రజాపక్షపు పోలీసు కోర్టులకు కొనిపోయి యచట విచారణయయినతరువాత వీరి నగ్గుపైన నుంచి యుపయోగకరమయిన పని చేయుటకు విధించువారు. ఆపనిని చేసి దానివలన సంపాదించిన ధనముతో తాము దోచినదో పిల్లనష్టములకు నేరస్థులు ప్రతిఫల మిచ్చినపిదప వారిని శైలకనుంచి విడుదల చేయువారు. గొప్పనేరములను జేసినవారిని విచారణయయి తీర్పు చెప్పినవంటనే స్వదేశముగ వాసమునిచ్చి గొనిపోవుచుండిరి. కాలక్రమమున నింగ్లీషుప్రభుత్వమువారు తమక్రింద పోలీసువారికి విధించియుండినపనులు మిక్కిలి హేయముగానుండినకారణమున నాపోలీసువారు నేటి లసూయ చెంది రాజీనామా లియ్యసాగిరి. పోలీసువారుదడలి పోవనారంభించినంతటనే బ్రిటిషువారి ప్రభుత్వము యొక్క బలము రూపాయకు పదియేడణాలు తగ్గిపోయెను. వారిదర్ప మడుగించెను. వారియెడ దేశస్థులకు విశ్వాసగౌరవములెంతమాత్రమును లేవయ్యెను. జనులకు స్వాభిమానము స్థైర్యము హెచ్చి స్వాతంత్ర్యము నెడలను స్వరాజ్యమునందును నభిరుచి హెచ్చసాగెను.

## సిన్ ఫెయినులు ప్రభుత్వము నాక్రమించుట

1920 సంవత్సరమున బ్రిటిషుపార్లమెంటుకుగా జరిగిన సభ్యనియామక ములలో సిన్ ఫెయినులే విశేష

ముగ [illegible] గా. [illegible] యుండ్రి [illegible] జరి [illegible] సిక్కు [illegible] ఫయినులు [illegible] యుండెను. [illegible] ఫయినులు ప్రము [illegible] రి.

[illegible] ఫయినులు ప్రబలు లుగ [illegible] యధికార మును [illegible]. ఇంగ్లీషు [illegible] మెంటును [illegible] నవి. [illegible] జరిగెంచిన [illegible] మున్న [illegible] స్థానిక ప్రభుత్వ [illegible] పురుషుల [illegible] యములు జరుగు [illegible]. [illegible] బనులుంగ బ్రిటిషు ప్రభుత్వము [illegible] మునుపటివలె ధనము నిచ్చుటకు [illegible]. కాని జను లా[illegible]సహాయము లేనం దున [illegible] యుబ్బంగుల నుత్సాహముతో నోర్చుకొని యుండెకేకాని బ్రిటిషువారి [illegible]లు కారైరి. కొంతకాలమునకు బ్రిటిషువారు ధనమునియ్యనిచో వారికి పన్నులను [illegible] జనులు నిశ్చయిం చుకొని యుండిరి.

## పంచాయతిసభలు

[illegible]ఫయినువారు తమ ధర్మాసనముల వలనను పంచాయితీ సభలవలనను కావించిన ధర్మపాలననుగురించి థిల్లగ్సు అనునొక ఐరిషు గ్రంథకర్త యీక్రింది యభి ప్రాయములను [illegible]న్నాడు.

"ఈప్రజాపక్షధర్మాసనములు జనులకు సమ్మతములయి యున్నయవి. వానియెడ జనులకుగౌరవము దినదినమునకు హెచ్చుచున్నది. కావున వాని ప్రాబల్యమున్ను హె చ్చుచున్నది. భూమితగాదాలను విచారించు ధర్మాసన ములున్ను పంచాయతి సభలున్ను నిష్పక్షపాతముగను ధైర్యముతోడను జరిగించు తీర్మానములు జనులకు గౌర వనీయములయి వారిచే శిరసావహింప బడుచున్నవి. భూ మిపైగాదాలు మునుపటివలె ఘోరములై యుంటలేదు. అన్యాయాక్రమములు చాల తగ్గిపోయినవి. భూమియో యను ప్రాగ్వపుశ్వాస యిపుడు చెవికి దూరమయిపోయి నది! సమిష్టికి సిక్కుఫయినులు స్థాపించిన ధర్మాసనములు న్యాయపాలనకు చేరువబడినవి యని వారికి ప్రతికూల ములయిన వార్తాపత్రికలుకూడ స్తోత్రము చేయసాగెను. ధర్మాసనములకు ముఖ్యసహాయకర్తలు ప్రజాపక్షము నకు చెందిన పోలీసువారును నభిమానభటులును. వీరు దినము జాగరితులై నేరములను కనిపెట్టుచును యితరవిధ ముల జనుల క్షేమమును కాపాడుచును సిక్కుఫయిను ప్రభు త్వమునకు మంచిపేరు దెచ్చిరి.

ఇదిసూత్రముగాక సిక్కుఫయినులు దేశములోని త్రాగుబోతుతనమును నణచుచునచ్చిరి. బ్రిటిషుప్రభుత్వ మక్రింద జనులెంతత్రాగినను నాక్షేపణలేకయుండెను. ఏలయన దీనివలన వారికి సారాయి మున్నగువాని మీద సెక్కుడుపన్ను వసూలగుచుండినది. జనులకు సన్మార్గ ముల గఱపుటకున్ను దుర్మార్గముల ధనవ్యయమును మాన్పుటకున్ను నీదసాదలు దివాలెత్తక యుండుటకు న్ను సిక్కుఫయినులు త్రాగుబోతుతనము నాప సకల ప్రయత్నములను జేయుచుండిరి. వారధికారపదవికి వచ్చినవెంటనే తొలుత దొంగతనముగ సారాయిని దింపుటను నిలిపించిరి. సారాయిగిడ్డంగులను కొద్దికా లమే తెఱచియుండవలెనని యుత్తరువు చేసిరి.

వీరిట్లు జనాభివృద్ధికై పనిచేయ సాగినంతటనే రాజకీయప్రభుత్వమున్ను ధర్మాసనములున్ను నిందకు పాత్రములు కాసాగెను. ఆధర్మాసనములకు న్యాయము నపేక్షించి పోవువారే లేకపోయిరి. జనులచ్చటికి రానం దుల కచ్చటి న్యాయపతులు జనులనుతిట్టి వారిపై వృథా కోపములజేసి తమయెడ వారు చూపిన యశ్రద్ధకును నగౌరవమునకును కోపించుకొనసాగిరి. కాని దీని వలన నేమిఫలము? రాజకీయ ప్రభుత్వమున కంటియుం డిన నిప్పు బాగుగ నిపుడు రాజసాగెను. కొలది కాల ములోననే నది ప్రజ్వరించి రాజకీయ ప్రభుత్వమునంత టిని భస్మసాత్కరించుటకు సిద్ధమయియుండెను. ఎంతటి మూఢజనులయినను తమ సంకెళ్లను తామే తొడుగు

కొందురా? నారొస్పృకున్న నారి నితరులు పరిపాలింప నలవియగునా? అది యంతయు కల్ల.

### సమ్మెకట్టు

పాశ్చాత్యుల సాంఘిక ఆర్థిక వ్యవహారములలో సమ్మెకట్టుల యుపయోగము చాలగొప్పది. బలవంతులని యెంచిన ధనికులను వర్తకులను వారిలాభములనే యపేక్షించు ప్రభుత్వములను ముకుక్కుకుర్తాడునేసి యొంటెను వంచినట్లు వంచునది యీసమ్మెకట్టు. దీనికి ముఖ్య ప్రాణము ఐకమత్యము. ఐరిషువారికి బ్రిటిషు ప్రభుత్వమువారిపద్ధతు లేనాడు సహింపరాని వాయెనో నాటి నుంచి యీసమ్మెకట్లు హెచ్చసాగెను. [illegible]వల కిబ్బందుల పెట్టునట్టియు, వారిని నిర్బంధించునట్టియు చట్టములను ప్రభుత్వమువారు నిర్మించినపుడెల్లను జనులీవిధమున వారి యధికారనిరాకరణమును ధిక్కారమును చూపువారు. ఐర్లండులోని ప్రతినరుడును జర్మనీతోటి యుద్ధమున పోరుటకు యోధులుగా పోవలెనని ప్రభుత్వమువారు నిర్బంధపు చట్టమును ప్రవేశింపనున్న పుడు ఆనాడు దేశమునం దంతటను పనులన్నియును సమ్మెకట్టు నిలిచినట్లు నిలిచిపోయెను. అం[illegible] లలో [illegible] జరుగవాయెను. ఇరువదినాలుగుగంటల కాల మైర్లాండు [illegible] గట్లు [illegible]యుండెను. యంత్రాదాలు ప్రాణిశూన్యములయి [illegible] దైలుబం [illegible] ఓడ [illegible] కానరా [illegible] దైరుహో జరు. [illegible] మును [illegible] తా [illegible] జనాలు [illegible] తె'యనే [illegible]రి. అపుడు ప్రభుత్వమువారు [illegible] మును విప్ప[illegible] పెట్టిరి.

## ప్రణయచింత

మల్లాది సోమన్నగారు

శ్రావనము యీతోపు
అన్నిలోయలు గుహలు
పళ్లు పూపొదరిండ్లు
ఎన్నెన్ని తిరిగినా
ఈ భావనమే వచ్చుగా,
దైవమా,
యిటులనే వేధింతువా!

చిగురుటాకులమోవి
చిన్నారి నా నాతి
మనసు వ్రక్కలు చేసె—
మది ధైర్యమును బాసె
దుఃఖానలము నార్పవా,
దైవమా,
దోసిలొగ్గుచు నుంటిరా!

ప్రణయవీచికలన్ని
ప్రజ్వరిల్లుచు లేచు
ప్రతిఫలిత బింబ చుం
బనమునకు మదియీందు
తీరు వికేందో చెప్పవా,
ప్రైసమా,
దీనుడను రక్షింపవా!

భావి కాముకభ్రమలు
భంగంబు లయిపోయె
ప్రవిమలాత్మయు ప్రళయ
పవనఘాతమునందె
తిమిరవాహినినుండి నే,
దైవమా,
తేలుమార్గము లెవ్వియో!

౩. ఏషియాటిక్ పెట్రోలియముకంపెనీ కిరసనాయిలుడిపో-కాకినాడ



సి. బసవరాజు అండ్ సన్సువారు తీసిన ఛాయాచిత్రము

[రెండవబహుమానము]



# కోతులభాష

శ్రీమతి గుడిసేవ నాగమణి దేవిగారు

ఈ విజ్ఞానయుగమున మన కెన్నియో అద్భుతవిషయములు అనుభవమునకు వచ్చుచున్నవి. ఆర్యనాగరకత ఉన్నతశిఖరమున నున్నపుడు ఆర్యులు తమబుద్ధిబలము చేతను, నిరంతర కర్మపరాయణత చేతను ప్రకృతిని తమకు దాసినిగా జేసికొని ఎన్నియో ప్రకృతి రహస్యములను వెల్లడించినట్లు మనకు పూర్వగ్రంథములవలన తెలియుచున్నది. సింధు హైదరాబాదులో నొక మహమ్మదీయునివద్ద నొకగొప్పపురాతన పుస్తకాలయమున్నదనియు జర్మను మున్నగు దేశీయులు దానిని చాలధరపెట్టికొనగోరగా ఆయన అందు కియ్యకొనక సమర్థులెవ్వరేని లభించిన భారతీయులకే దానిని అమ్మెదననియు చెప్పినటులు 'కర్మవీర్', అనునొక హిందీపత్రికలో నొకరు వ్రాసిరి. ఆ గ్రంథాలయములో వాయువార్తలు, విమానములు మున్నగు అధునాతన అద్భుత విషయములను సూచించు గ్రంథము లెన్నియో కలవట. ఆహా! ప్రవృత్తినివృత్తి మార్గములు పారంగతులైన ఆర్యసంతతి వారు నేడు కట్టుకొను గుడ్డకూడ విదేశములనుండి తెప్పించుకొనవలసిన దుస్స్థితి వచ్చినది. మన పూర్వులలో పెక్కుమంది పశుపక్ష్యాదులతో స్వేచ్ఛగా మాటాడగలవారు ఉన్నటులు మనము మనపురాణాదులలో చదువుచున్నాము. కాని యిప్పు డెవ్వరును, అట్టివారు ఉన్నటులు గను పట్టను. నిరంతర ప్రకృతిశోధనాపరులగు యూరోపువాసులు ఇప్పుడట్టి యద్భుత విషయమును క్రియారూపమున జూపుచున్నటులు మనకు ఆంగ్లేయపత్రికలవలన తెలియుచున్నది.

డాక్టరు గార్నరు ఆఫ్రికా అడవులయందు కోతులభాషను నేర్చుకొనెను. మిస్ సిమోల్టన్ పేరుగల ఒక అమెరికాస్త్రీ ఆఫ్రికా వెళ్లి ఆయనను కలసికొనెను. అప్పటికి డాక్టరు మహాశయునకు తనకృషియందు అధిక సాఫల్యము గలిగెను. ఆయన స్వేచ్ఛగా కోతులతో సంభాషించుచుండెను. తరువాతఆయన కోతులభాషకు ఒక నిఘంటువునే తయారు చేసెను.

గార్నరు సంపూర్ణనామము డాక్టరు రిచర్డు ఎల్. గార్నరు. కోతులభాష నేర్చుకొనవలయునను సంకల్పము గలిగినదిమొదలు ఆయన తన అన్నిపనులు విడిచిపెట్టి ఆపనియందే మగ్నుడై ఆఫ్రికా అడవులలో సంవత్సరముల కొలది తిరుగుచుండెను. మనుష్య సంపర్కము వదలి తాను కోతులకు సహవాసిఅయ్యెను. గోరిల్లా, చిమ్పాంజీఅను పేరుగల కోతులు చాల భయంకరములైనవి. వానితో ఉండుట ప్రాణాపాయకరమైన పని అయినను ఆయన తనపనిని సాధించుచునేయుండెను. కృషిపరా

యత్నమునకును, దృఢనిశ్చయమునకును, నేవి అసాధ్యములు? తుదకు ఆయన మనోరథము నెరవేరెను. ఆయన కోతుల భాష నేర్చుకొనెను. తన పనియందు సఫలతను పొందిన తరువాతనే ఆయన మరణించెను.

మనుష్యులవలె, పశుపక్షులుగూడ సంఘములుగానుండును. అవి ఒండొరులందు స్నేహభావము గలిగియుండునని వాని ప్రవర్తన వలన తెలియుచున్నది. జంతువులలో కోతులుచాల బుద్ధిగలవై యున్నవి. వాని బుద్ధిచాతుర్యము చూచిన ఆశ్చర్యమగును. ఏదైన ఒకదానికి కష్టము రాగానే అవిఅన్నియు పోగయి దానిని రక్షింపబూనును. అవి దెబ్బతిన్నవారికి పరిచర్యగూడ చాలజాగ్రత్తతో చేయుచున్నవి. అవి ఒండొరులభావమును బాగుగ తెలిసికొనగలుగునపుడే ఇట్లు చేయుటకు వీలగును గాన కోతులకుగూడ ఏదేని భాష గలదా యని యిక్కడ ప్రశ్నగలుగుచున్నది.

డాక్టరు గార్నరు కోతులభాష నేర్చుకొనుటకు బాగుగ ప్రయత్నము చేసెను. తాను మొదట కోతులపనులన్నిటిని బాగుగ పరీక్షించెను. అందుపై తాను కోతులకుగూడ భాషగలదని నిశ్చయించుకొనెను. ఒకసారి తాను ఒకతోటకు వెళ్లెను. అక్కడ ఒక పంజరములో ఒకపెద్దకోతి బంధింపబడి యుండెను. దానికి రెండవభాగములో కొన్ని చిన్న కోతులు బంధింపబడియుండెను. అవి దానివలన భయపడుచుండెను. భయపడినపిమ్మట కోతులు ఒకవిశేషవిధమగు ధ్వనిచేయుటయు, దానిని విని తక్కిన కోతులుగూడ, భయపడుటయు గార్నరు గుర్తించెను. ఇదేవిధముగ ఈయన ఒకసారి ఆఫ్రికాలో నున్నపుడు ఈయనకు ఒకకోతి కనుపించెను. అది బంధింపబడి యుండెను. దాని సహచరులు తోటలనుండి ఫలములు తినుటకు వచ్చునపుడు అచ్చట నేదేని భయంకరస్థితి కనుపించినచో అది ధ్వనిచేసి తన సహచరులను హెచ్చరికచేయుచుండెను. ఇట్టి మాటలచే గార్నరుకు కోతులు పరస్పర సంభాషణను చేయుచున్నవని విశ్వాసము కలిగెను.

ఇటలీలో మగ్గటపాలు నెరింగిన మరియొక పండితుడుండెను. వానివలన గార్నరుకు ఎక్కువసహాయము లభించెను. వాని దగ్గరఒకకోతియుండెను. దానిపేరు 'జాక్ కేమో.' దాని యజమాని కేవలము 'జాక్' అని పిలచెడివాడు. డాక్టరు గార్నరు ఆకోతిని కొనగోరెను. కాని వాడు ఒప్పుకొనలేదు. వాడు, జాక్‌ను కౌగలించుకొని, "లేదు, లేదు; నేను దానిని ఎన్నటికిని అమ్మజాలను" అని చెప్పెను. ఆకోతిగూడ వాని అభిప్రాయము తెలిసికొనినట్లుండెను. కోతులభాషను నేర్చుకొను కోరిక గలిగినప్పటినుండి ఆయన వానియొక్క ధ్వని పైననే ధ్యానముంచసాగెను.

కోతులు ఒండొకటితో ఏవిధముగా ధ్వని చేయుచుండెడివో దానియొక్క సరియైన ఉచ్చారణను వ్రాసికొనుచుండెడివాడు తరువాత ఆయన వేఱు కోతులవద్దకు వెళ్లి వానిశబ్దముల ఉచ్చరించు చుండెడివాడు.

ఇట్టి దృష్టాంతములు నెన్నటినో చూచిన పిమ్మట, ఆయన కోతులకుకూడ భాషగల దనియు అవి ఒకటిచెప్పినమాట మరియొకటి గ్రహింపగలిగినదనియు నిశ్చయించుకొనెను. ఆయన నానాకోతులను వేరు వేరు గదు లయందుంచి పరీక్షించియుండెను. ఆయన ఒక కోతియొక్క ధ్వనిని స్వరగ్రాహయంత్రము (గ్రామఫోను)లో నింపెను. తర్వాత ఆయన రెండవకోతి యుండుచోట అక్కడ గ్రామ ఫోనుపై ఆరికార్డు పెట్టెను. దానిని ఆకోతి విని వ్యాకులముచెంది నలుప్రక్కలనున్న తన సహచరులను వెదుక సాగెను. మరల ఈ కోతియొక్క ధ్వనిని నింపి మొదటి కోతి దగ్గరకు తీసికొనిపోయెను. దానిని విని అది కూడ అనేకముగా అఱవసాగెను. గొట్ట ములో చేయిపెట్టి అటనున్న సహచరులను వెదుకసాగెను.



కోతులు మఱియొకకోతిని యుద్ధమునకు కవ్వించునపుడు ఒకవిధమైన ధ్వనిని చేయును. గార్నరు ఆధ్వనినికూడ నింపి మరి యొక కోతికి వినిపించెను. కవ్వింపు విన గానే ఆకోతి కోపగించెను. మరియు అది కూడ అట్లనే శబ్దముచేయుచు తన ప్రతి పక్షిని వెదుకసాగెను. ఈప్రకారము ఒక శబ్దముచే అన్నికోతులును ఒక విధమైన పనిచేయుటచూచి గార్నరు ఆశబ్దముల యొక్క అర్థములను గ్రహించెను. ఈప్రయ త్నములో ఆయన కోతుల భాషయందు 'దప్పిక' అర్థముగల శబ్దమును తెలిసికొనెను. దానిని ఉపయోగించుటకు ఆయన ఒక కోతి పంజరము దగ్గరకు వెళ్లెను. ఆకోతి చాల బుద్ధిగలది. గార్నరు కోతులభాషతో దప్పికయను శబ్దము నుచ్చరింపగనే ఆకోతి పరుగెత్తుకొని తన గిన్నెను తీసికొనివచ్చెను. దానిలో పాలుపోయగా అది విశ్వాసముతో త్రాగెను. ఈఉపాయముతో ఆయన కోతుల భాషలోని వాక్యములు వాని అర్థములు తెలిసికొనెను. గార్నరు కోతులభాషను తాను నేర్చుకొనినటులనే కోతులకు మనుష్యభాషనుకూడ నేర్పుటకు ప్రయత్నము చేసెను.

ఆయనకు ఒకపెంపుడు కోతి యుండెను. దానిపేరు 'మోజేజ్'. అదిఇంగ్లీషులో 'మామ' జర్మనీలో, 'బీ' మరియు ఫ్రెంచిలో 'ఫ్యు'అని ఉచ్చారణచేయుట నేర్చుకొనెను. ఫ్రెంచిభాషలో 'ఫ్యు' అనగా నిప్పు. గర్నరు ఆకోతికి నిప్పుచూపి, మాటిమాటికి 'ఫ్యు' అని చెప్పుచుండేవాడు. అందుచేత

'మోజేజ్' నిప్పుచూచినప్పుడు 'హ్య' అని అఱచుచుండేది.

దాని పేరు. 'సూసీ' అను ఒకసారి ఫోటో తీయబడెను. రెండవసారి మరల ఫోటో తీయవలసియుండగా అందుకది సిద్ధము గాలేదు. తరువాత గార్నరు దానికి దానిభాషలో తెలియజేసెను. వెంటనే అది చాలసంతోషముతో ఒప్పుకొనెను. ఈ ప్రకారము ఒకసారి ఆయన జంతుశాలయందు 'చిమ్పాంజీ' అను పేరుగల కోతుల పంజరము నగ్గరకు వెళ్లెను. అన్నికోతులును, నిద్రపోవుచుండెను. ఆయన వెళ్లి వానిభాషలో '[illegible]' అని శబ్దము చేసెను. అన్నికోతులు ఒక్కమారుగా మేలుకొనెను. మరియు గార్నరుకు జవాబు ఇయ్యసాగెను. ఇతరజాతుల వారు తమభాషను విని అవి చాల ఆశ్చర్యపడెను. ఇట్టివింతలు అనేకములు జరిగెను.



కోతులభాష నేర్చుకొనిన పిమ్మట గార్నరు వానిలో బాగుగ మాటలాడుచుండెడివాడు. ఆయనదగ్గిర ఒకఆడకోతి యుండెను.




# వేఁడికోలు

వెలగపూఁడి దానయ్యచౌదరి గారు

భవదీయమూర్తి నేపగిదిని గన్గొందు, నంచు మానసమందు నెంచుచుంటి
భవదీయపదములఁ బడి మ్రొక్కవలయు సద్వాంఛతో నిరతంబు వేచియుంటి
భవదీయకరుణ కెట్లుగఁ బాత్రుఁడనౌదు, నను చింతమార్గంబు నరయుచుంటి
భవదీయనామ సత్స్మరణంబు ననిశంబు, మించినభక్తిఁ గావించుచుంటిఁ
గాన నీ దివ్యమూర్తిని గనఁగఁ జేసి, పదములకు మ్రొక్కఁగా నిచ్చి భవ్యమైన
కరుణఁ దిలకించి సతతంబు గావుమయ్య, పరమకరుణాలవాల, శ్రీ భక్తపాల!





# పుస్తకబంధనము

## [Book Binding]

నింబయూరి కృష్ణమాచార్యులుగారు

వ్రాత గ్రంథములుగాని, ముద్రింపబడినట్టి గ్రంథములుగాని [illegible] నుండుటకును, పురుగులచే [illegible] కాపాడుటకును, వాటిని నుపయోగించునప్పుడు [illegible] చిరిగిపోకుండుటకును, పుటలన్నియు [illegible] క్రమముగా [illegible] పుస్తకబంధనము లేక బైండుచేయుట యని పేరు. [illegible] పైగాని రాతిపలకలపైగాని చెక్కబడినట్టి పురాతన శాసనములను కాపాడుటకు ప్రత్యేక [illegible] మేదియు అవసరము లేకుండినను, క్రమముగా తాళపత్రములు భూర్జపత్రములు మొదలగు వాటిపై గ్రంథములను వ్రాయుట ఆచరణలోనికి వచ్చుటతోడనే [illegible] కాపాడు మార్గములు కనుగొనబడియుండెను. వ్రాతగ్రంథములను కాపాడుటకు వివిధ దేశములందు వేరువేరు మార్గము లవలంబింపబడుచుండెడివి. దేశాచారములను బట్టియు, ప్రజల యభిరుచులను బట్టియు, నాగరికతనుబట్టియు బంగారుపని చేయబడినట్టియు, నగిషీ చెక్కబడినట్టియు, కర్రబల్లలు రేకులు మొదలగువాటిని పుస్తకరక్షణమునకు వాడుచుండెడివారు. చిత్రవిచిత్రములగు నగిషీపని చేయబడిన కర్రబల్లలతో బంధించి కాపాడబడినట్టి మనపూర్వుల నాటి [illegible] గ్రంథముల నిప్పటికిని మనము చూచుచునే యున్నాము. వారు వ్రాతగ్రంథములను ప్రాణతుల్యముగా జూచుకొనెడివారు. ఇప్పటికిని పురాతనపు వ్రాతగ్రంథముల బాహుళ్యముగా నెంచబడుచున్నవి. అచ్చుయంత్రములును, కాగితములును కనుగొనబడినపిమ్మట ప్రపంచమునందంతటను గ్రంథరూప మొక్కమారు మార్పుచెందినది. లిపిభేదము తప్ప యిపు డన్నిభాషలలోని గ్రంథములును ఒకేరూపమును దాల్చియున్నవి. ఈవ్యాసమునందు పుస్తకములను బైండుచేయు నవీనపద్ధతులుమాత్రము దెలుపబడును.

బైండుపని నభ్యసించువారు కాగితములయొక్కయు పుస్తకములయొక్కయు కొలతలను దెలిసికొనుట మంచిది. పుస్తకముల నచ్చువేయుకాగితము క్రింది కొలతలు గలిగియుండును.

ఫుల్ స్క్యాపు 17″ × 13½″; మీడియం 24″ × 19″; క్రవున్ 20″ × 15″; డిమ్మీ 22½″ × 17½″; రాయల్ 25″ × 20″; సూపర్ రాయల్ 27″ × 21″; ఇంపెరియల్ 30″ × 22″.

నిండుకాగితము నొకసారి మధ్యమునకు మడచినపుడు ఫోలియో అనియు, తిరిగి దానిని రెండవసారి మధ్యమునకు మడచినపుడు క్వార్టో అనియు, మూడు సార్లు మడచిన ఆక్టేవో అనియు, 4 సార్లు మడచిన **16 M. O.** అనియు పుస్తకపు కొలతలకు పేర్లు గలవు. అచ్చు వేయబడినపిమ్మట మడతపెట్టినట్టి నిండుకాగితములకు "సెక్షనులు" లేక విభాగము లనిపేరు. ఈవిభాగములు సామాన్యముగా 8,16,32 పుటలు గలిగి యుండును. అచ్చువేయబడిన కాగితములను విభాగములుగా మడచు పని సాధారణముగా ముద్రాలయములయందు జరుగుచుండునుగాన ఆవివరముల నీవ్యాసమునందు దెలుప బూనుకొనలేదు.

### పరికరములు

బైండుపని నభ్యసించుట కీక్రింది సాధన సామగ్రినికలిగి యుండవలయును.

1. మడతిపెట్టిన పుస్తకవిభాగములను నగ్గరగా నొక్కు ప్రెస్సు. (ఉత్తరములకు కాపెలుగీయు ప్రెస్సు వంటిది.) Hot Press.

2. విభాగముల నన్నిటనిజేర్చి పొత్తిగా కుట్టు ప్రెస్సు. (Sewing Press.)

3. చేతిరంపము. (Hand Saw.)

4. పుస్తకపుచివరలనుకోయు కోతియంత్రము. (Cutting Press.)

5. వీపులనేర్పరచుప్రెస్సు.(Backing Press.)

6. వీపులనేర్పరచుబల్లలు,(Backing Boards.)

7. కోతబల్లలు. (Cutting Boards)

8. సుత్తి, కత్తెర, కత్తి, సూదులు, దారము, ట్వయిన్, జిగురు, అట్టలు, క్యాలికో, తోలు మొదలగు చిల్లరసామానులు.



చిత్రము ౧

## బైండుచేయు మార్గములు

బైండుపనిని, కుట్టుట, చివరలుకోయుట, వీపులు గుండ్రడనచేయుట, అట్టలుకట్టుట,అట్టలను,పుస్తకపువీపు, లను చేర్చు లతలు మొదలగువాటితో నలంకరించుట యను 5 శాఖలుగా విభజింపనగును. పెద్ద బైండుపా పులందును ముద్రాలయములందును ఈశాఖలకు జెందిన పనులనుజేయుటకు ప్రత్యేకపు పనివాండ్రను నియమించెదరు.

### 1. పుస్తక విభాగములు కుట్టుట

ప్రథమమున పుస్తకముయొక్క మడిచి పెట్టబడి నట్టి విభాగములన్నిటిని (Sections) పేజీనంబరు తప్ప కుండులాగున పొత్తిపెట్టిప్రెస్సులోనుంచి గట్టిగా మరను బిగించవలయును. ఇట్లు ప్రెస్సులో నొత్తుటవలన విభాగములన్నియు నల్లగాను యెత్తుగాను ఉండక దగ్గరగా నణగియుండగలవు. (చిత్రము ౧.)

పిమ్మట ఆవిభాగముల పొత్తినంతను ప్రెస్సునుంచి వెలుపలకుతీసి మడతలుగల వెనుక భాగమును హెచ్చుతగ్గులు లేకుండులాగున నొక్కబల్లపైపెట్టి, సుమా రొక ¼" మాత్రము పైకి మించుగా నుండునటుల వీపుల నేర్పరుచు ప్రెస్సునందు బిగించవలయును. చివరలనుండి 1½ అంగుళములు క్రిందనుండి 1½ అంగుళములను భాగించి మిగిలినదానిని పుస్తకము పెద్దదైనచో 5 సమానభాగములుగను, చిన్నది పైచో 4 భాగములుగను విభజించి, పెన్సిలుతో గురుతులకొరకు గీతలు గీయవలెను. అనగా 4 భాగములైనపుడు 5 గీతలును, 5 భాగములైనపుడు 6 గీతలును ఉండవలయును. పిమ్మట యీగీతలపై చేతిరంపముతో సుమారొక నూలులోతుగ గాటు మట్టముగా కోయవలయును. ఇట్లు కోయబడినట్టి విభాగములలో దేనిని పరీక్షించినను దానిమడతయందు గాట్లనుబట్టి రంధ్రములు ఏర్పడియుండును. (చిత్రము ౨, 3)

పుస్తకములయొక్క విభాగములన్నిటిని వైవిధముగా సిద్ధముచేసినపిమ్మట వానిని కుట్టుటకు ప్రారంభింపనగును. ఈపనికై ప్రత్యేకపు కుట్టుప్రెస్సు ఒకటి ఉండవలయును. దానియొక్క చిత్రము జూపబడియున్నది. ఈప్రెస్సుయొక్క మరస్తంభముల పై నుండు అడ్డుకర్ర కిని; పీటలోనిగాడికి క్రిందనుండు టీపుకును 20 లేక 25 నూలులపొడుగుల నొకదారముగా మెలిపెట్టి పుస్తక విభాగములయొక్క వెనుకభాగమునందలి రంపపుకోత

లను సరిగా కుట్టుటకు పట్టులుండును. అప్పుడు ఇన్ని క్రిందనుండి పైకిగల ముక్కల నన్నిటిని పైకి

చిత్రము 2




పుస్తకవిభాగములకు రంపపుగాట్లు కోయుట

A. చెక్కల బిగించు ప్రెస్సు; B. పుస్తక విభాగముల పొత్తి; C. రంపము D. రంపపుగాట్లు.

చిత్రము 3




రంపపుగాట్లు కోయబడిన విభాగముల పొత్తి; A. విభాగములు; B. రంపపుగాట్లు.

త్రిప్పుటవలన యీభాగములు గట్టిగా బిగియును. విభాగములందలి పైగాని క్రిందగాని విడిచి, సాయముగా 3 గాట్లున్నచో మూడుదారములను, 4 గాట్లున్నచో నాలుగు దారములను కట్టవలయును. పిమ్మట విభాగముల పొత్తిలోని మొదటి విభాగముతో కుట్టు మొదలిడవలయును. విభాగముయొక్క మడతను మధ్యముగా విడదీసి దాని మధ్యభాగమునందు రంపపుకోత రంధ్రములు ప్రెస్సునకు కట్టినదారముల నంటియుండునటుల ప్రెస్సుయొక్క పైనుంచి, సూదిలో దారముగుచ్చి తలవైపు మొదటి రంధ్రముగుండా లోపలకు పోనిచ్చి, రెండవ రంధ్రముగుండా వెలుపలకులాగి ప్రెస్సునకు కట్టిన మొదటి దారముచుట్టి, తిరిగి ఆరంధ్రముగుండానే లోపలకు గుచ్చవలయును. ఇదేవిధముగా మిగిలియున్న దారములనుచుట్టి ఆఖరు రంధ్రమునుండి వెలుపలకు దారమును రానిచ్చి, కుట్టు ప్రారభించిన మొదటి రంధ్రమువద్ద 2,3 అంగుళములదారముమాత్రము మిగులునటులు దారమునంతను వెలుపలకు లాగివేయవలయును. ఇట్లు చేయుటవలన ప్రెస్సునకు కట్టబడినదారములు కుట్టు దారముచే చుట్టబడి విభాగముయొక్క రంపపుగాట్లలో సరిగా నిమిడియుండగలవు. పిమ్మట మరియొక విభాగమును తీసికొని మొదటిదానివలెనే కుట్టి, దారపుకొస గట్టిగా వెలుపలకు లాగి బిగించవలయును, కాని యీ రెండుభాగములకును చివరరంధ్రమునద్ద మాత్రము సంబంధ ముండనేరదు. గాన ప్రథమమున విడిచిపెట్టి యుంచిన దారపుకొసను కుట్టు దారముతో కలిపి ముడివేయవలయును. ఇదేవిధముగా మిగిలియున్న విభాగముల నన్నిటిని కుట్టవలయును. మూడవవిభాగమునుండి ప్రతిదానిని, కుట్టు చివరకు వచ్చినపిమ్మట దారమును బిగలాగి దాని క్రింది విభాగముతో సంబంధమేర్పడునటుల దారమును మెలికవైచి బిగించుచుండవలయును. ఈవిభాగములను

భాగమునను వలుపైపుల నుండి అంచు ఖాళీగా వదలి వేయబడును. ఈ ఖాళీ భాగమే పుస్తకపు చివరలుగా నేర్పడును. కోయునపుడు ఎక్కువగాని తక్కువగాని వచ్చి నచో, ముద్రితభాగమునకు చుట్టు నుండు ఖాళీసమముగా నుండక మానము లసమానముగ నుండును.

ముద్రాక్షరశాలలయందును, పెద్దబైండుషాపు లందును, పుస్తకపు చివరలను కోయుటకు కోతయంత్ర ములుండును. గంటయందు గంటకు వందలకొలది పుస్తక ములను స్వల్పకాలమున కోయుచున్నను కొద్దిపాటి బైండుపని చేయువారగుటను, యీపనిని వృత్తిగా పెట్టుకొనక విలా సార్థముగ నిజ స్వంత పుస్తకములను మాత్రము బైండు చేసికొనువారగుటను, కోతయంత్రములు హెచ్చువెల గలిగి యుండుటచే చిన్న కోతప్రెస్సులను వాడుక చేయుచుం దురు. కోతయంత్రము యొక్కయు యీ కత్తికోత ప్రెస్సు యొక్కయు రూపము లీక్రిందిచిత్రములందు చూపబడియున్నవి.

కత్తికోతప్రెస్సునందు పుస్తకపు చివరల నీక్రిం దివిధముగా కోయవలయును. పుస్తకముయొక్క వెనుక భాగము తప్ప మిగిలిన మూడువైపుల ఖాళీప్రదేశము (margin)నం దెంతవరకు కోసివేయుట అవసరమో నిర్ణయించుకొని, అచ్చట పెన్సిలుతో ఆనవాలుకొరకు

చిత్రము ౮



కోతయంత్రము.

చిత్రము ౭




కత్తికోతప్రెస్సు.

A. A. ప్రెస్సుదిమ్మలు; B. B. దిమ్మలను బిగించు మరలు; C. కోతకోయుచిత్రిక. D. చిత్రికనుముందువెనుకలకు నడుపుమర.

వట్టముగా గీతలు గీయవలయును. పిమ్మట పుస్తకములయొక్క ముందుచివరనుండి ఎంత వరకు కోసివేయవలయునో సూచించు గీతకు సమముగా నొక కోత బల్లను (Cutting Board) పుస్తకముతో సమ ముగా వెనుకభాగమున మరియొక్క బల్లను పెట్టి కోతప్రెస్సు దిమ్మలను విడదీసి వాటి మధ్యమముగా కదిలి పోకుండ పెట్టి, గట్టిగా మరలను త్రిప్పి బిగించవలయును. చివర నుండి కోసివేయు భాగమును సూచించు గీతయు దానితో సరిగా పెట్టినట్టి కోత బల్లయొక్క పైభాగమును, ప్రెస్సుదిమ్మల యొక్క పైభాగములతో సరిపోవలయును.

చిన్నుల వెనుక చెమ్మయుండినీ కాదింకొక విధమైన పద్ధతి కత్తిరించుట

కోత సాధనమునకు మాయముగాను దాని చివరను రెండుచేతులతో పట్టుకొని కొంచెము కొంచెముగా దగ్గరకు త్రిప్పుచు, ముందునకును వెనుకకును చిత్రిం తోము నట్టుల త్రోయుచు వచ్చుటవలన, పుస్తకపు చివర సరిగా గీతవద్దకు తెగగలదు. ఇదే విధముగా మిగిలిన రెండు చివరలనుగూడ కోసివేయవలయును. కుట్టుటవలెనే యీ కోతయు, పనిచేయునపుడు చూచుట వలన సులభముగా బోధపడగలదు.

## వీపుల నేర్పరచుట [Backing]

పుస్తకముల చివరలు కోసివేయబడినపిమ్మట వాటివీపులను అర్ధచంద్రాకారముగా నుండునట్లుల చేయవలసియుండును. ఈపనికి వీపుల నేర్పరచుటలేక బ్యాకింగు [Backing] అనిపేరు. వీపుల నేర్పరచనియెడల, పుస్తకములు చూచుటకు అందముగా నుండకపోవుట మాత్రమేకాక చదువుటకు అంత వీలుగాగూడ నుండనేరవు. వీపుల నేర్పరచువిధ మీక్రింద తెలుపబడి యున్నది.

పుస్తకమునకు వీపు నేర్పరచుటకు ముందుగా దాని వెనుకభాగమును అర్ధచంద్రాకారముగను ముందు భాగమున నదేవిధమైన పల్లముగను, వచ్చులాగున చేతి వ్రేళ్లతో నదిమిపట్టుకొని, Backing Boards అన బడు కొయ్యపలకలను వీపునకు $\frac{1}{8}$ అం. క్రిందుగా నిరుప్రైపులను యీక్రిందిపటమందు జూపబడినటులు చేర్చి ప్రెస్సులో బిగించవలయును. పుస్తకవిభాగములను రంపపుగాట్లు కోయునపు డుపయోగించిన ప్రెస్సు యీవీపుల నేర్పరచుటకుకూడ పనికి వచ్చును.

పిమ్మట సుత్తితో వీపుభాగమునంతను పటమునందు జూపబడినటుల నున్నగను అర్ధచంద్రాకారముగను వచ్చునటుల బాగుగాకొట్టిజిగురుపూసి, తలపైపున క్రింది భాగమున $\frac{1}{2}$ అంగుళము తక్కువగాను యిరుప్రక్కల అంగుళము హెచ్చుగాను నుండునట్టి పలుచనిగుడ్డ నొక దాని నతికించవలయును.




వీపుల నేర్పరచుట.

A. A. ప్రెస్సుచెక్కలు. B. B. వీపు నేర్పరచుటకొరకు బిగించబడిన పుస్తకము. C. అర్ధచంద్రాకారముగ చేయబడిన పుస్తకపువీపు. D. D. బ్యాకింగ్ బల్లలు.

## అట్టలు కట్టుట

పుస్తకములకు వీపుల నేర్పరచినపిమ్మట మిగిలిన పని వాటికి అట్టలను కట్టుట. తోలుతో గట్టిదనము చేయునపుడును హెచ్చువెలగల పుస్తకములకును మిల్ బోర్డు లనబడు అట్టలను (Mill Boards) సాధారణపు పనికొరకును గడ్డిఅట్టలును (Straw Boards) వాడుక చేయ బడుచున్నవి. గడ్డిఅట్టలు 25 × 30 అం. కొలతగలిగి యొక్కొక్కఅట్ట $\frac{1}{2}$ పౌనుమొదలు 3 పౌనులవరకు బరువు కలిగియుండును. వీటిబరువు హెచ్చుచుండిన కొలది వెలకూడ హెచ్చుచుండును. పుస్తకముయొక్క లావును బట్టి అట్టలయొక్క మందమును నిర్ణయించుకొన వలయును. సాధారణముగా 1 అంగుళముకంటె తక్కువలావుగల పుస్తకములకు 1 పౌను అట్టలును అంతకుమించిన లావుగలవాటికి 2 పౌనుల అట్టలును వాడబడు చున్నవి.

పుస్తకపు లావునకుతగినట్టి అట్టనొకదానిని తీసుకొని, దానినుండి పుస్తకపు కొలతకంటె వీపుతప్ప మిగిలిన మూడుప్రైపుల 3/16 అంగుళము (మూడుపదారులు) మించియుండులాగున రెండుముక్కలు తెగగొట్ట వల

యును. పిమ్మట నీపులు [illegible] పైకి పెరిగిన కోణములను [illegible] పుస్తకమున కిరువైపుల యీఅట్ట ముక్కలను [illegible] మించగుండ [illegible] గున [illegible] కట్టవలయును. పిమ్మట పుస్తకపు నీపు [illegible] పైకి [illegible] నట్టినూ లుదారపు కొనలు సరిగా అట్టల [illegible] యుండునటు యేటవాం లుగా [illegible], ఆ [illegible] నూలుదారముల కొనలనా [illegible] అట్టల కతికించవలయును. ఈ క్రింది చిత్రము [illegible]

చిత్రము ౧౦




పుస్తకమున కట్టల నతికించుట.

A. పుస్తకము; B. B. B. పుస్తకపు వీపునందలి రంపపుగాళ్లలోని అట్టల కతికింపబడిన నూలుదారములు. C. C. అట్టలు. D. అట్టల పైన కప్పుతోలు.

తోలుతో బైండుచేయునపుడును, పుస్తకము మిగుల భారముగా నున్నప్పుడును మాత్రమే పైవిధముగా అట్టలను ముందుగా పుస్తకమున కతికింతురు. క్యాలికో గుడ్డలో బైండుచేయునపుడును చిన్న పుస్తకములకును యిట్లు గావింప నవసరముండదు.

## తోలుతో బైండుచేయుట

పుస్తకములను బైండుచేయుటకు పనికివచ్చు తోలునందనేకరకములు గలవు. సాధారణముగా బాగుచేయబడినట్టి మేకచర్మములును గొర్రెచర్మములును తరుచు వాడుకచేయబడును. పెక్కురంగులలో లభ్యమగు మొరా కోయనబడు తోలును హెచ్చువెలగల పుస్తకములకుమాత్రము వాడుదురు. పైన తెలిపినటుల పుస్తకమునకు అట్టల నతికించినపిమ్మట పుస్తకమునంతను కప్పి అన్నివైపుల అట్టలకంటె 1 అంగుళము మించియుండునంత తోలు ముక్కను కత్తిరించి దానికంతటను మంచిజిగురుగల పిండి రాసి, ముందుగా నొకయట్టపై నంటించి, వీపునకు సరిపడునంత సన్నని అట్టకాగితపుముక్క నొకదానిని కత్తిరించి వీపుభాగమును కప్పుతోలుపై నంటించి, మిగిలియున్న తోలును రెండవఅట్టపై గట్టిగాలాగి అంటించవలయును. పిమ్మట అట్టలకంటె మించుగానుండు తోలుయొక్క మూలలు కత్తిరించి లోపలకు మడిచి, పుస్తకమునకు లోగడ అంటించియుంచిన రెక్కకాగితపుపై పొరలను, వీపునకు అంటించిన గుడ్డయొక్క మించులను అట్టలకు అంటింపవలయును. ఇంతటితో అట్టలకట్టుపని కొంచెముచ్చుతిగ్గుగా ముగిసినదని చెప్పవచ్చును. ఇక చివరకు మిగిలియున్నపని అట్టలపైనను వీపులపైనను చిత్రములు పుస్తకపుపేర్లు మొదలగునవి చిత్రించుట. పుస్తకములను నిండుతోలుతో బైండుచేయుటకుమారుగా వీపులకును అట్టల చివరలకును తోలును మిగిలిన భాగములకు క్యాలికోగుడ్డయును కూడ నుపయోగింప వచ్చును. ఈవిధముగాచేయుపనికిసగము తోలుబైండుఅని పేరు.

## క్యాలికోగుడ్డతో బైండుచేయుట

హెచ్చువలలేనట్టియు అంత భారముగా నుండనట్టియు పుస్తకములను బైండుచేయుటకు తోలునకు మారుగా పెక్కురంగులలోలభ్యమగు క్యాలికోయనబడు గుడ్డ వాడుదురు. క్యాలికో నంటించుటకు తోలునకువలె పిండిగాక సరీసులేక వజ్రముఅనిపిలువబడు జిగురు (Glue) మాత్ర ముపయోగింపవలయును. తోలు బైండునకువలె అట్టలను ముందుగా పుస్తకమునకు తగిలించుట కూడ యనవసరము. పుస్తకమునకు సరిపడు క్యాలికో గుడ్డ ముక్కపై జిగురుపూసి, దానిమధ్యముగా వీపంత కొలతగల సన్నని అట్టముక్క నొకదాని నతికించి, దాని కిరువైపుల 3/16 అం. ఖాళీవదలి అట్టల నతికించి మించుగానుండు చివరలను లోనికి మడిచివేయవలయును. పిమ్మట యీ అట్టలలో పుస్తకమును సమముగానుంచి రెక్కకాగితపు పొరలను వీటి కతికించవలయును.

### అట్టలపై లతలు, పేరులు, మొదలగునవి వేయుట

పుస్తకములను తోలుతోగాని క్యాలికోతోగాని బైండుచేసినపిమ్మట చేయవలసినపని వాటిపై లతలు, గ్రంథనామములు, మొదలగునవి చిత్రించుట. ఈపనిని సామాన్యముగా ముద్రాక్షరశాలలందు యంత్రసహాయమున చేయుచుందురు. అట్టలపైనను, వీపు భాగములందును, ఏవిధముగ చిత్రింపవలయు ననుకొందుమో అదే విధముగ లతలు, రూళ్లు, అక్షరములు మొదలగు సీసపు దిమ్మలను ముద్రాయంత్రముయొక్క పట్టెయందు బిగించి, కాగితములపై ముద్రించునటులే పుస్తకపు అట్టలపై ముద్రించెదరు. పిమ్మట వీటిపై సిరాఆరుటతోడనే వాటిని పుస్తకపు రేకు కాగితముల కతికించెదరు. అట్టలపైనను, వీపులకును, బంగారురేకుతో పేర్లు లతలు మొదలగునవి వేయవలయుననిన, ప్రత్యేకపుపనిముట్లుండవలయును. అట్టల నతికించిన పుస్తకమును ప్రెస్సులో బిగించి బంగారురేకులను (Gold leaf) సన్నని పేలికలుగా కత్తిరించి పేర్లు, లతలు మొదలగునవి వలయు చోట్ల కోడిగ్రుడ్డుసొన రుసుమాత్రము పూచి, దానిపై జాగ్రత్తగా నుంచవలయును. పిమ్మట ఇత్తడియక్షరములతో చేర్చిన పేర్లు, లతలు మొదలగు చిత్రములుగల పనిముట్లను నిప్పులలో కాల్చి, బంగారురేకుముక్కలు గల చోట్ల గట్టిగా నొక్కుచుండవలెను, దిమ్మలయొక్క వేడిచే బంగారురేకు తగిన నొక్కబడిన భాగములందు గట్టిగా నంటుకొనును. నొక్కబడని భాగములందు కొనగల మిగిలియుండు రేకును మెత్తని గుడ్డతో తుడిచిన పోవును. ఈపనిని చేయుటకు అభ్యాసమును నేర్పును ఉండవలయును. బైండుచేయుటకు వలయు సరుకులన్నియు కలకత్తాయందలి Calcutta Book Binding Materials Trading Co., 68 Bautkhana Road నందు ముద్రాయంత్రములు, టైపులు మొదలగు సామానుల నమ్ము యీ కంపెనీవద్దను లభ్యముకాగలవు.

---

# బుద్ధదేవుని యుపదేశ రత్నములు

రాజావాసిరెడ్డి శ్రీ దుర్గా సదాశివేశ్వర ప్రసాదు గారు

తలఁపు కెక్కిన దానినే పలుకుచుండు
పలికినంతయు నేఁబూని సలుపుచుండు
నామనోవృత్తమే యిట్లు నాకుఁ గూర్చె
నన్నుసువిచార సంపదల్ చెన్నుమీఱ.

వీఁడు తిట్టెను కొట్టెను వీఁడు గెలిచె
దోఁచుకొనె వీఁడు నన్నని దుఃఖపడెడు
వారి కడఁగదు క్రోధ మీ వ్యసనములను
జిక్కుకొనదేని వైరముఁ జేరదతని.

ద్వేషము శమించదెన్నఁడు ద్వేషమునను
సంతతప్రేమచే నది శాంతినొందు
నాదికాలమునుండియు నలరుచున్న
సత్యసిద్ధాంత మిదె సుఁడీ శ్రమణులార!

జనుఁడు విషయేచ్ఛ విడిచి సంసారమందుఁ
దిరుగుచో నింద్రియములు స్వాధీనములగు
నిట్టి శ్రద్ధాళులను నిర్జితేంద్రియులను
భూరిసత్త్వుల మారుఁడు చేరఁబోఁడు.

సంయమిజితేంద్రియుఁడు గుణిసత్యవాది
యగునరుఁడె కావిఁగట్టగా నర్హుఁడవని
నన్యుఁడు పవిత్రమగు కావి నంటనేని
సత్యనియమముపాసియుంచు జడుఁడెవాఁడు.

తల్లక్రిందుగ ధర్మపదంబు నల్లఁ
జదువుగాక జనుండట్లు సల్పఁడేని
యతఁడు భిక్షువుగాఁగూడ నట్టివాఁడు
పరులయావుల లెక్కించు ప్రజుఁడు వాఁడు.




గంపిహోట సత్యనారాయణమూర్తి గారు, యమ్. ఏ.

[ నసుకోటి సంచిక తరువాయి]

## ౬. యాంత్రికశాలలు

కేవలము మానవ హస్తపాదములు ఉపయోగించిన పనులను యంత్రముల ద్వారా ప్రత్యేకముగా కొంతవరకు నివారించగలుగుచున్నది. యంత్రసాధనలనగా యంత్రముల సహాయమున జరుగు పనులు, బట్టలను నేయుట, లోహములను కరగించుట మొదలగు క్రియలు, యంత్రసహాయమున్నచో వస్తువులు అతిత్వరితముగను సులభముగను అధికముగ అనుసంగతి అందరకు తెలిసినదే. కాళ్ళతో నడిచి ప్రయాణము చేయుటకంటె ఎద్దుబండ్లు బగ్గీలు, గుర్రపుబగ్గీలు, వీటి నెక్కిపోవుట త్వరితగమనముగను; ఇంధనమున్నను ఆవిరి విద్యుచ్ఛక్తుల చే పోవు బండ్లు ఎన్నిరెట్లో సుఖములు మేలు. చేతిమగ్గములతో దినమునకు గజాల బట్టను నేయుటయెంతో కష్టసాధ్యము. యంత్రములతో గంటకు వందలకొలది బట్టలు నేయవచ్చును. అనేకానేకములగు పనులెన్నియో యంత్రసహాయమున నెరవేర్చబడుచున్నవి. దేశపు ఆర్థికాభ్యుదయమునకు యంత్రశిల్పప్రాబల్యమే మూలకారణమని ఈకాలపు దేశచరిత్రలు ఘోషించుచున్నవి. కావుననే యంత్రోపకరణనిర్మాణసంస్థలు, నవే అర్థోత్పత్తికి ముఖ్యాధారమని వెనుకటి ప్రకరణములో నొక్కి చెప్పితిమి. స్టీమింజన్, స్టీంబోట్, ట్రాంకార్, రైల్వే, టెలిగ్రాఫ్, టెలిఫోన్, ఎయిరోప్లేన్ మొదలుగాగల యానసౌకర్యములన్నియు యంత్రసహాయమునగదా నడచుచున్నవి. ప్రజలకు వీటివలన కలుగులాభములు, సదుపాయములు గణనాతీతములు. బహుత్వరితముగ రాకపోకలొనర్చుటకు ఒకస్థలమునుండి ఇంకొక ఎట్టిదూరస్థలమునకైన వార్తల నంపుటకు, వాణిజ్యవ్యాప్తికి, సరకుల నొకస్థలమునుండి ఇంకొకస్థలమునకు ఎగుమతిచేసి క్షామబాధల నివారించుటకు, అపక్వపదార్థముల నుత్పత్తిస్థానముల నుండి కర్మాగారములకు తీసుకపెళ్ళి అచ్చటనవి పరివర్తనముబొంది వస్తువులుగ తయారుకాగానే వాటిని నానాప్రదేశములందుండు వినియోజకులకడకు తీసుకపెళ్ళి వారి వాంఛలను తీర్చుటకును యంత్రసహాయమున నడుచు యానసౌకర్యములుగదా కారణభూతము లగుచున్నవి. విజ్ఞానరసాయనశాస్త్రాభివృద్ధియు, నాగరికతాభివృద్ధియు అగుచున్నకొలది యంత్రప్రాబల్యమతిశయించుచుండును. వ్యవసాయాదికృషులు, వస్తురచనక్రియలు, వాణిజ్యవ్యాప్తి ఇవిఅన్నియును కొద్దిగనో గొప్పగనో యంత్రసహాయమునే అపేక్షించుచున్నవి. ఈయంత్రములనన్నిటిని క్లుప్తముగా వర్ణింపబూనినను ఒకగ్రంథమగునుగాన అట్టి సాహసమునకు దొడంగుట కిది స్థలముగాదు. వీటిప్రాబల్యముననే అర్థోత్పత్తి అనేకవిధముల నతిశయించి పాశ్చాత్యులు జపానువారును మిగుల భాగ్యవంతులైరి. యంత్రకళాప్రాబల్యము ఆదేశములందువలె మనహిందూదేశమం దంతగా లేకున్నను మనవారుకూడా ఆవిషయమున బొత్తిగా ఏమరియుండలేదని చెప్పవచ్చును. మనదేశములోకూడ యంత్రశాలలు, మిల్లులు, కార్ఖానాలు, ఫ్యాక్టరీలు కొన్ని గలవు. ఈసందర్భమున మనదేశముయొక్క యంత్రరూప మూలధన ప్రవృద్ధిని దెలుపుసంగతుల వివరములను కొన్నిటి నిచ్చట పొందుపరచెదను. మనదేశమందలి పెద్దమిల్లులు కార్ఖానాలు ఫ్యాక్టరీలుకలసిమొత్తము5,312. ఇందుగవర్న మెంటువారియాజమాన్యమున పనిచేయుజనులసంఖ్య 123695. ప్రతిదినము మొత్తముమీద 13,69,136 మంది మిల్లులలో పనిచేయుచున్నారట. బంగాళాదేశములో పెద్దమిల్లులు కార్ఖానాల సంఖ్య మొత్తము 1,000; వీటిలో 8,32,515 మంది పని

చేయుచున్నారు. బొంబాయిరాజధానిలో 950 ఉన్నవి; ఇందుపనిచేయువారు 3,12,741. బొంబాయి కలకత్తా నగరములలోనే మిల్లులు కార్ఖానాలు విశేషముగానున్నటులు కానవచ్చుచున్నవి. ఇండియాలోనుండు మిల్లులు కార్ఖానాలలో దూదివస్త్రములసంబంధమగు మిల్లులు నూటికి 39 చొప్పున ఉన్నవి. ఈ దిగువపట్టీలు గమనించతగినవి:

ఇండియా బట్టల మిల్లులు

| రాష్ట్రము | మిల్లుల సంఖ్య | పనిచేయు జనులసంఖ్య |
|---|---|---|
| బొంబాయి రాజధాని | 182 | 2,09,830 |
| చెన్నపురి | 21 | 25,297 |
| సంయుక్త రాష్ట్రములు | 17 | 15,998 |
| బేరారు | 13 | 14,621 |
| బెంగాలు | 12 | 12,093 |

మొత్తముమీద నూటికి 68 చొప్పున బట్టల మిల్లులు బొంబాయి నగరమందున్నవి.

| రాష్ట్రము | ప్రత్తినుండి విత్తులుదీయుమిల్లులు | దూదిబస్తాలు కట్టుమిల్లులు |
|---|---|---|
| బొంబాయి | 559 | 36,600 |
| బేరారు | 415 | 29,335 |
| సంయుక్తరాష్ట్రములు | 132 | 12,078 |
| చెన్నపురి | 149 | 13,663 |
| పంజాబు | 189 | 12,961 |
| మధ్యపరగణాలు | 194 | 106,93 |

ఇటుక పెంకు మొదలగునవితయారగుమిల్లులు

| రాష్ట్రము | మిల్లుల సంఖ్య | పనిచేయు వారి సంఖ్య |
|---|---|---|
| బంగాళము | 91 | 2,92,318 |
| చెన్నపురి | 3 | 2,833 |
| సంయుక్తరాష్ట్రములు | 1 | 890 |

జూటు (జనుపనార) ప్రెస్సులు

| రాష్ట్రము | ప్రెస్సులసంఖ్య | పనిచేయు జనుల సంఖ్య |
|---|---|---|
| బెంగాల్ | 179 | 3,983 |
| బీహారు ఒరిస్సాలు | 26 | 1,470 |
| చెన్నపురి | 4 | 285 |

ఇంజనీరింగు ఇత్తడి బాగి కార్ఖానాలు ఇనుము కార్ఖానాలు నౌకా నిర్మాణాలయములు

| రాష్ట్రము | కార్ఖానాల సంఖ్య | పనిచేయువారి సంఖ్య |
|---|---|---|
| బంగాళము | 105 | 32,008 |
| బొంబాయి | 24 | 6,291 |
| బీహారు ఒరిస్సాలు | 16 | 5,989 |
| బర్మా | 21 | 2,465 |
| చెన్నపురి | 9 | 1,407 |
| సంయుక్తరాష్ట్రములు | 7 | 1,175 |

ఇవిగాక రైలుట్రాము కార్ఖానాలు 7ఉన్నవి; అందులో 89,389 మంది పనిచేయుచుందురు.

పెద్ద ధాన్యము మరలు (ప్రెస్సిల్సు)

| రాష్ట్రము | ప్రెస్సిల్సుసంఖ్య | పనిచేయువారి సంఖ్య |
|---|---|---|
| బర్మా | 336 | 35,388 |
| చెన్నపురి | 133 | 7,694 |
| బెంగాలు | 108 | 4,703 |

గొప్ప ముద్రాక్షరశాలలు

| రాష్ట్రము | ముద్రాక్షర శాలల సంఖ్య | పనిచేయువారి సంఖ్య |
|---|---|---|
| బెంగాలు | 21 | 4,776 |
| బొంబాయి | 20 | 4,988 |
| చెన్నపురి | 29 | 4,089 |
| సంయుక్తరాష్ట్రములు | 10 | 1,748 |

[illegible] లను [illegible] యుండును: [illegible] 16 కార్ఖానా లున్నవి; అం
దులో 26,959 [illegible], పనిచేయుచుందురు. తాతా
యినుప [illegible] 20,805 గురు పనిచేయుచుందురు.

తోలుకార్ఖానాలు [illegible] చెన్నపురిలో 55; సంయుక్తరాష్ట్ర
ములలో 10; బొంబాయిలో 15; వంగాలులో 18
[illegible] 108; అస్సాములో 15;
బొంబాయిలో 1; చెన్నపురిలో 4 [illegible] మను
[illegible] హైదరాబాదులో 42; [illegible]
[illegible] 2; [illegible] 3; సంయుక్తరాష్ట్ర
ములలో 8. [illegible] కార్ఖానాలు సంయుక్తరాష్ట్రము
లలో 5; [illegible] 8. సిద్ధపంచదారఫ్యాక్టరీలు
చెన్నపురిలో 9; హైదరాబాదులో 2; సంయుక్తరా
ష్ట్రములలో 14. ఇవిగాక అనేక కార్ఖానాలుకూడ
పనిచేయుచున్నవి. మీద నుదహరింపబడిన వివరాంశముల
వలన [illegible] దేశము పరిశ్రమలలోను యంత్రకళల
లోను [illegible] చున్నదని ఆనందించుటకు వీలులేదు.
యంత్రకళావిషయమున మనవారు పూర్తిగా తటస్థులై
[illegible] లేదనుటకే [illegible] వివరాంశములు
సాక్ష్యము. మన హిందూదేశములో నూటికి 72కి పైగా
వ్యవసాయకృత్యములనే ఆధారపడియున్నారనుట మన
ము నూటికినూటికి జ్ఞాపకము తెచ్చుకొనవలెను; శేషిం
చిన 28 గురుమాత్రమే ఇతరవృత్తుల నాశ్రయించియు
న్నారు. ఇంగ్లాండులో నూటికి 71 మంది పరిశ్రమలు,
యంత్రకళలు, వర్తకము వీటిని ఆశ్రయించియున్నారు;
శేషించిన 29 గురు ఇతరవృత్తులను స్వీకరించుచున్నారు;
అందులో నూటికి 38 గురుమాత్రమే వ్యవసాయాది
కృషులలో నున్నారు. అపక్వపదార్థోత్పత్తి ఈదేశ
ములో మెండు; లక్షలకొలది విలువగల అపక్వపదార్థ
ములు విదేశయాత్ర చేయుచుండును; కారణమేమన
ఈదేశములో వస్తురచనయు యంత్రకళాబాహుళ్య
మున్ను అతితక్కువ. యంత్రరూపకము మూలధన
మీదేశములో సన్నగిల్లియున్నది. వ్యవహారచక్రమును
నడుపగల కార్యదక్షులు, ప్రజ్ఞావంతులు, వ్యాపారనా
యకులు ఈదేశములో బహుస్వల్పముగా నున్నారు;
శక్తియుక్తులుగల కార్మికులసంఖ్య అతితక్కువ. అన్నిటి
కిని మూలము తగినంతవిద్యావ్యాప్తి లేదు. పారిశ్రామిక
విద్య పూర్తిగా తక్కువ. ఇట్టి పరిస్థితులతో పరితపించు
చున్న మనదేశమువారు మీదచెప్పిన కొద్దిపాటి కార్ఖా
నాలసంఖ్యతో నానందించక దేశమందలి యంత్రకళలు
అధికముగా వికసించుటకు నలయు ప్రయత్నములు
సలుపవలెను.

## ౭. మితామిత భాగ్యోత్పత్తులు

యంత్రకళాప్రాబల్యమువలన దేశమం దర్థోత్పత్తి
అధికరించుననియు, పాశ్చాత్యదేశముల భాగ్యమున కిది
యే మూలకారణమనియు జెప్పియుంటిమి. పాశ్చాత్యులు
బట్టలనేత, లోహపుపనులు మొదలగు పరిశ్రమలను నెల
కొల్పి యంత్రోపకరణ సహాయమునను వ్యాపారనాయ
కుల బుద్ధికుశలతచేతను, కార్మికుల శక్తియుక్తులచేతను
మూలధనబాహుళ్యమువలనను విస్తారోత్పత్తి చేయుచు
న్నారు. ఈవిస్తార వ్యాపారమాత్రము అన్నిపరిశ్రమల
యందు అన్నిసమయములందును వర్తించదు. ఇందులకు
కారణము లనేకములు. కొన్ని పరిశ్రమలలో పెట్టుబడి
ఎక్కువయగుకొలదిరాబడి ఎక్కువయగుచునేయుండును.
అనగా అవి అధికవృద్ధిన్యాయమునకు లోబడియుండును.
ఇవికూడ ఒకసరిహద్దువరకుమాత్రముఅధికమైనఫలము
నిచ్చుచుండును; తదుపరి పెట్టుబడికితగిన ఎక్కువరాబడి
లేకపోవుటయో రాబడియే పెట్టుబడిద్రవ్యముకన్న
సన్నగిల్లుటయో తటస్థించును. మరికొన్ని పరిశ్రమలలో
అమితభాగ్యవృద్ధిమాత్ర మంతగా నవలంబించుటకే వీలు
కాదు యంత్రోపకరణములు వ్యవసాయాదికృషులలో
ఎక్కువగా ప్రయోగించి భాగ్యవృద్ధిచేయుట సాధ్యప
డదు. కొన్నిపాశ్చాత్యదేశములలో వ్యవసాయవిషయ
మందుకూడ యంత్రసాధనము లుపయోగింపబడినట్లు
తెలియుచున్నను వస్తురచనావిక్రియలందువలె వ్యవసా
యమందు యంత్రసాధనసంపత్తి అంతగా అనుకూలిం
పదు. అమితభాగ్యోత్పత్తికి వలయు సాధనోపకరణముల
లేమింజేసియు, వాటిని ఉపయోగించినను కిట్టుబడి
లేకయుండుటవలనను, యంత్రసహాయముల ద్వారా ఒకే
మాదిరివస్తువులు లక్షలకొలది కోట్లకొలది తయారగుచు
న్నను అట్టి వస్తువులకు తగిన "డిమాండు" లేకపోవుట
చేతను కొన్నివృత్తులు కొన్నిపరిశ్రమలు మితాభివృద్ధి
మార్గములతోనే తృప్తినొందవలసి వచ్చుచుండును. దేశా

భ్యుదయమునకు అమితభాగ్యాభివృద్ధిసూత్రమే అనుసరణీయ మని కొందరున్ను మితభాగ్యాభివృద్ధిసూత్ర మవలంబనీయమని మరికొందరున్ను చెప్పుచున్నారు. ఈవాదప్రతివాదముల యాథార్థ్యము కనుగొనుటకు రెంటింటివలన కలుగు లాభనష్టములను విచారించుటయేకాక కొన్ని పరిశ్రమలు విస్తారవ్యాపారమున కొప్పదంబులనియు మరికొన్ని టివిషయములో కష్టపడి ఎక్కువ మూలధనమును వెచ్చించినను అందులకు తగిన జాస్తివస్తురాశి లభించకున్నదనియున్ను వస్తురాశి లభించినను అందులకుతగిన "డిమాండు" లేక తుదకు నష్టమే ఏర్పడుననియున్ను, యంత్రకళలకన్న హస్తకళలకు తక్కువ పెట్టుబడి సరిపోయినను యంత్రకళలధాటికి ఓర్వజాలక హస్తకళలు వెనుకంజవేయుచున్నవనియున్ను మనము జ్ఞాపక ముంచుకొనవలెను.

## ౮. విస్తారవ్యాపారములవలన కలుగు లాభములు

పెద్దపెద్దపరిశ్రమలను జయప్రదముగా నడిపించుటకు పెట్టుబడిసామానులు విస్తారముగా కావలసియుండును; ఆయపక్వపదార్థములను గొప్పగొప్పమొత్తములుగా కొనవచ్చునుగాన అవి చిల్లరబేరములకన్న నయముగా దొరకుటవలన ఖర్చు తగ్గును. పుట్టెడుసున్నము కొనుటకున్ను నూరుపుట్ల సున్నము కొనుటకున్ను ఖరీదురేట్లు భేదముగానుండి ఎక్కువసరకు ఒకేపర్యాయము కొనుటయే లాభదాయకముగా నుండలేదా? వేలకొలది కార్మికులను నియమించి వారిసహాయమున యంత్రములందలి అన్ని భాగములను నడిపించి విశేషముగా వస్తురచన చేయవచ్చును. ఏకళయందైన లభించిన అముఖ్యపదార్థములు విరివిగానున్నచో అవి వ్యర్థములుకాక వినియోజ్యములగుటయో ఉపకళ లుత్పన్న మగుటయో ఆర్థికప్రపంచమున మనము సాధారణముగా కనుగొనుచున్నాము. ధాన్యపుమర (రైస్మిల్లు)లో మనము ఏరాశముగా తెల్లబియ్యమును తయారు చేయించునప్పుడు విశేషముగా లభించెడుఊక వ్యర్థముకాకుండ కాల్చుటకు పనికివచ్చుచున్నది. నువ్వులు, వేరుశెనగలు వీటిని గానుగలలోపోసి నూనెకొరకు కాడించినప్పుడు లభించు గానుగపిండి (తెలకపిండి) ఎన్నియోవిషయముల కన

కహించుచున్నది. పెద్దపెద్ద [illegible] పుస్తకములను "బైండు" చేసే కార్ఖానాయందులలో అంచులుకోయగా వచ్చిన చిల్లరముక్కలు వ్యర్థము కాకుండ చిన్నచిన్న జేబు నోటుపుస్తకములుగా [illegible] యబడుచున్నవి. ఇదే [illegible] గరి యంత్రోపకరణముల సహాయమునందు కార్ఖానాములలో [illegible] [illegible] వాటి రచనతో పాటు లభించెడు [illegible] పనికి వచ్చుచున్నవి. 10 మంది పనివాళ్లను నియమించి వారిచే [illegible] 10 [illegible] వేయనగల [illegible] ; 500 మంది పనివాళ్లను [illegible] 1-కి రూ. 10 [illegible] 50 [illegible] ; 10 రూ [illegible] 15 [illegible] [illegible] [illegible] నియమించి కార్య [illegible] , మన విస్తారవ్యాపారనాయకు [illegible] లాభములను [illegible] . [illegible] 1-కి 1 రూపాయి అయినప్పుడు [illegible] వేలకొలది ఫ్యాక్టరీలలో [illegible] వ్యాపారనాయకు [illegible] 1-కి 7 అణాల [illegible] అమ్మినను [illegible] లాభకరముగాను [illegible] గాను ఉండును. ఇట్టి కారణములవలన [illegible] దేశములో [illegible] యంత్రోపకరణ సహాయమున తయారగు [illegible] చెల్లుచున్నవి. ఫ్యాక్టరీలు కార్యక్రమమునకు పెద్దపెద్ద పనులను చేయించుటకున్ను [illegible] పెట్టుబడి సామానులను వ్యాపారనాయకులు [illegible] కొనగు; [illegible] ఎక్కువనెలలు [illegible] ; ఆ వస్తువు [illegible] ఏరాశముగా ఉత్పత్తి అవునో [illegible] మొత్తము మీద కొనినయెడల ఎంతో సులువుగాను నవుకగాను ఉండును. ఈకాలములో నిర్మింపబడు వస్తురాసులనేకములు ఉత్పాదకుని స్వంతవినియోగమునకుకాదు; అన్యదేశముల కెగుమతిచేసి లాభమును పొందుటకే కోట్లమతింపుగలవస్తువులు తయారగుచున్నవి. ఇట్టి వస్తురాసులు

యంత్రోపకరణ సహాయమున పెద్దపెద్ద ఫ్యాక్టరీలలోనే నిర్మింపబడవలసినవైనవి. యంత్రకారులు అధికవృద్ధి న్యాయమును ననుసరించి యుండుటవలన రచింపబడు వస్తు రాశి ఎక్కువగానుండగలది వ్యయప్రయాసలు తగ్గి వెలలు దిగజారును. హస్తకారుల విషయమున అట్లుకాదు; ఉత్పా దితమగు వస్తురాశి కొంచెము; దానిని హెచ్చించుటలో విశేషముగా లాభమునిచ్చుటకు వీలులేదు; యంత్రకార లతో పోటీచేసి గెలువగల్గుట సాధ్యపడదు. ఆకారణ మునననే మాంచెస్టరు ప్రత్తిఫ్యాక్టరీలలో తయారు కాబడు బట్టలు హింద్వోపయోగములుగ మనదేశమునకు దినసరి అనుమానింపబడినను అవి ఎక్కువగలకు చెల్లు బడియగుచున్నను గ్రామికుల హస్తకారులు నశించుచున్న వనియు మనదేశప్రజాలాంఛనము గుడిసెలలో మగ్గిపడినవని యున్న స్వదేశకారులను ప్రోత్సహించవలెనని పెద్ద ఆందోళనము జరుగుచున్నది. "స్వదేశీవ్రత"మవలంబించి నేతబట్టలనే కట్టుకొనవలెనని ప్రతిజ్ఞలుచేయువారిసంఖ్య అధికరించు కొలది సాలెవాండ్రు నేయుబట్టలకు కొంత డిమాండుకలిగి వారికి కొంచెము పూర్వముకన్న లాభము కలుగుననుట నిస్సందేహమైనను చేతితో బట్టలనునేయుట మొదలగు హస్తకారులు యంత్రకారులతో పోటీచేసి జయ మొందుదురని చెప్పుట కష్టము. విస్తారవ్యాపారములవలన కలిగెడు లాభము లింకను నున్నవి. ఇట్టి వ్యాపా రములలోనే ఎక్కువ ఖరీదు గల యంత్రోప కరణముల నుపయోగించవచ్చును; యంత్రోపయోగ మువంజేసి వస్తురాసుల నధికముగా నిర్మించుట కవకాశ మున్నను యంత్రములకయ్యేఖర్చు భరించుట సామాన్య వ్యాపారులకు వలనుగాదు. యంత్రప్రాబల్యముగల పెద్ద ఫ్యాక్టరీలలో నూతనపరిశోధనల కెంతయో అవకాశ మున్నది. విస్తారవ్యాపారులు ఖర్చులకు లక్ష్యముసేయక దేశదేశములలో ప్రకటనలంజేసి జనులకు తాము తయా రుచేయు వస్తువులయందు ఆసక్తిన్ని, రక్తిన్ని కల్పిం తురు. తుదకు వారు ప్రకటనలకు వెచ్చించెడుద్రవ్యము వెలలరూపకముగా వినియోజకులవద్ద తీసికొన్నను మొత్త ముమీద వినియోజకుల కావెలలు సరసముగానేయుండు ను. విస్తారవ్యాపారములను నడిపించెడు గొప్పవ్యవహార నిర్మాతలు తమపరిశ్రమల కనుకూలించునట్టియు ప్రతి కూలించునట్టియు విషయములను జాగ్రతగా పరిశీలించి కాలోచితసంస్కారము లొనర్చి లాభములనే సర్వదా పొందుటకు యత్నించుచుందురు. పరిమితవ్యాపారుల పరములైన యానుకూల్యములును కొన్నికలవు. వాటిలో ముఖ్యమగునవి గమనించతగినవి. చేతిపని నేర్పు బుద్ధి చాతుర్యము కాన్పింపదగు జల్తారుబట్టలను నేయుట మొదలగు వృత్తులవిషయమున యంత్రోపకరణసహాయ మంత అవసరము కాదు; విస్తారవ్యాపారమాత్ర మవలం బించుటకుకూడ వలనుపడదు. వస్త్రాభరణాదులందుం దనేకము మేలిమిరకములు హస్తవిరచితములుగానే యుం డును; హస్తవిరచితములు విస్తారవ్యాపారమున కనుకూ లించుట అతికష్టము. అధికమగు వస్తురాసులనే తయారు చేయు యంత్రములు ప్రజలకోరికలను, అభ్యాసములను అనుసరించి ఎల్లప్పుడున్ను వారికి కావలయు సామగ్రినే తయారుచేయుట దుష్కరము; కారణమేమన ప్రజల అభిరుచులు మారుచుండుటంజేసి వస్తునిర్మాత లొకప్పుడు వారివస్తువులు చెల్లుబడికాక ఆర్థికక్షోభ లుద్భవిల్లి కష్ట నష్టముల పాలగుదురు. పరిమితవ్యాపారులు తామే స్వయముగా అన్నికార్యములను విచారించుకొనవచ్చును; వీరు మధ్యవర్తులైన మేనేజర్లను విచారణకర్తలను నమ్మి యుండవలసిన విధిలేదు. స్వల్పముగా వస్తురచనచేయు ఉత్పాదకులు మామూలుగా వారివద్ద వస్తువులుకొను వారిమనస్సుల కుచితముగా నుండునట్టియు, ప్రియముగా నుండునట్టియు వస్తువులను తయారు చేయుచుందురు. మరమ్మత్తుపనులు మొదలగునవి విస్తారవ్యాపారమాత్ర మున సాధ్యపడవు. (స శేషము)






పండిత శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు

శ్రీల నడిమింట వెలుగొందు గోలకొండ
వైభవ సహస్రభానుగభస్తిచయము
జ్వాలదసూయాఖ్య భూతదర్పణము సొచ్చి
చిచ్చు రగిలించె నౌరంగజేబు మదిని.

మహితగుల్బర్గ సాధుసమాధిగూర్చి
వింతవింత వదంతులు వెల్లడించి
ప్రబల చతురంగబలముతో వచ్చి తాకె
నింతలో గోలకొండ డిల్లీశ్వరుండు

"నిర్జరుల మర్త్యులనుబోలె నెనరుగూర్చి
తురకలను హిందువుల నొక్క త్రోవ నడపి
కంటి "తానాశాహ" బిరుదు నిష్కంటకముగ
బాపు నీనేర్పు పొగడ నెవ్వని తరమ్ము?"

"కాఫరుల సుఖపెట్టుట కడిది వ్రతము
కులగురుడు రామదాసు, భక్తుల వలంతి;
భద్రగిరిరాము డిలువేల్పు భళి! సెబాసు
ఎల్లవిధముల కృతివి నీకేమి కొదువ?"

"వైభవ మపారము; తెలుంగుబాపనయ్య
లనుగు ప్రెగ్గడ గమికాండ్రు; యవనజాతి
శత్రువు, మరాటి, శంభాజి సఖుడు నీకు
పరువుతక్కువ మాస్నేహబాంధవమ్ము"

"అనుగతుండను నేను మహాత్ముడున్నకు;
ప్రభువు నాపతి నాకు ప్రవర్తకమ్ము
వేడుకలు కట్టిపెట్టు తానాశహ; నిపుడు
రాయబారపుటాస వ్యర్థప్రయాస."

"మును ఖురేషుల రక్తవాహినుల దోగి
పూతమైన మహమ్మదు చేతి కత్తి
జాతివిద్రోహ శోణితస్రుతుల బరపి
ధరణి తానాశహ బాపు నుద్ధతి చెలంగ."

ఈగతి జవాబొసంగె డిల్లీశ్వరుండు;
కురిసె నిప్పులవాన గోల్కొండ నెత్తి;
చల్లచల్లగ నేడుమాసములు చనియె
కరడుగట్టిన యోధరక్తమ్ము ప్రక్క.

నిబ్బరించిన తానాశహ నెమ్మనమ్ము
వ్రయ్యవారదు భీతివజ్రంపుహతికి;
అనగొన్న డిల్లీశు హృదంతరమ్ము
పగిలిపోదు నిరుత్సాహ పరశుహతికి.

ఆటలకుమారు వరవళ్లు; పాటబదులు
బిరుదుబొబ్బలు చెలరేగి విడువరునికి
భోగలాలస లగు నెల్ల ముద్దరాండ్రు
బొమలు ముడిచిరి గోల్కొండపురము నందు.

బాపల వికాసముం గాంచి పగతువారి
కొంటెమాటలు విని తానాశహ కూర్మిసతులు
కడగి యక్కన్న మాదన్నగార్ల శిరము
లరికి నజరులు వెట్టి రత్యార్తలగుచు.

అపు డలంగీరు భేదతంత్రానుసరణి
కాంచనాద్రులు గాంచి దిగ్భ్రాంతు లగుచు
కొదువ గోల్కొండదళపతుల్ కుక్కలైరి
ఖాను డొక్కడు లారీ యొకండు దక్క.

పడియె తానాషాహ శిరమున పరశుధార,
కురిసె డిల్లీశు శిరమున కుసుమవృష్టి,
జరిగె నేతాముపెట్టగ సంగరమ్ము
నడచె నొకనాడు వాయువేగమున మరల.

హృదయ ముట్టూత లూగు టూహించి తెలిసి
అభిజాత్యమ్ము తేలిక యగుట కాంచి
కాంతిపేరిటి జవరాలు ఖానువర్యు
చెంప పై గొట్టు బంగరుచెప్పుతోడ.

శస్త్రనృపుల గ్రుంచు చింతయు, సాటివీరు
డగుల గలిసిన వంతయు నవశు జేయ
నురికె హయ మెక్కి లారీ మహోగ్రు డగుచు
వైరిపీనుగులు చీకాకుపడి కలంగ.

చేతి కందిన శిర మ్మెల్ల చిదిమిచిదిమి
పోరుల నెత్తురు టేరుల మునిగిమునిగి
దర్పమున పీనుగుగుట్టలు దాటిదాటి
నోటి కెద్దు రీదు చేసినా నెసగె నతడు.

అరచి పైబడి డిల్లీశు నాజ్ఞనంది
విక్రమించిరి పదుగురు వీరు; లతని
కాయమున బ్రెక్క నారల ఖడ్గలతలు
పూచె నెర్రని పుష్పాలు ముమ్మరముగ.

అనగ నడుమ మనోగతి ననుసరించి
చినుకుతోడి సబాగళి ననుకరించి
మెలగుట సతంపు గుఱ్ఱముమీద వ్రాలి
మించు ననురాగమున కౌగిలించుకొనియె.

తురగరింఖాసముద్భూతధూళిపటల
మెల్ల నడగార శేగి డిల్లీశుబలము
కృత్తవైరి శిరోఘట బృంద మెత్తి
చనియె మున్ముందు కలయంపి చల్లుకొనుచు.

అపు డలంగీరు బద్ధారిన్నృపతి యగుచు
కడురయమ్మున గోల్కొండ గద్దె యెక్క;
వాడవాడలు సొచ్చి తద్భటసహస్ర
మనుభవించెను స్వేచ్ఛావిహారసుఖము.

కల ధన మ్మెల్ల ధనికులు కాన్క వెట్టి
ముక్తిబడసిరి విజ్ఞానపూర్ణ లగుచు;
చూచుచుండగ సుర లైరి సోమయాజు
లంబువులు చల్లి దీవించి రచటి సతులు.

ఆసమై నాస వర్జించి వాసిగన్న
యోధవరులకు బహుమతు లొసగునపుడు
తెచ్చి విడిచిరి భటు లరసచ్చియున్న
ప్రణతు డగు వీరు నొకని రారాజునెదుట.

మెరసె సభ చూడ్కు లాతని మేనినిండ
రేగె కోలాహలమ్ము లారీ యటంచు
వేషభువు మాటుకొనుచు పృథ్వీవిభుండు
గద్దె దిగి పిడి నుదు రంట కత్తియెత్తె.

ఏడుపదుల గాయమ్ములతోడ నపుడు
సకరుణమ్ముగ రణవైద్యశాల సొచ్చి
ఒక్క నెల యుండి లారీ మహోదయుండు
వర్ధమాన సుధాంశుని పగిది వెడలె.

ఆసతో కబు రంపె రాజాధిరాజు
కొనలుసాగెడు భావియోచనలతోడ
ఈసుతో వచ్చె లారీ కరీంద్రువోలె
నిజవిభునిమీద నుడిపెట్టు నెనరుతోడ.

గాటముగ రాలె నపుడు చెంగలువపూలు
కురిసె పీయూషబిందువుల్ కొసరికొసరి
మేటి గమికాండ్రతో నెకిమీండ్రతోడ
నలరు కొలువెల్ల కలగె మహాబ్ధివోలె.

చూచియును జూడని విధాన లేచి నిలిచి
అందికొనినట్లు జోహారు లాచరించి
కరుణ చూపిన యట్టు లాదరము చూపి
పెద్దసేనాని కుడిదెస గద్దె చూపి.

"మిత్తినెదిరించి శౌర్యము గుత్తగొనిన
మేటి వీరుడు పొడచూపె నేటి" కనుచు
కొండ యెక్కించి రారాజు కోరె నతని
శంక వోనాడి ఢిల్లీ నలంకరింప.

కర మెసద నాని యెదురొమ్ము విరిచి నిలిచి
బొమలు ముడిచి దృగాశుగమ్ములను గ్రమ్మి
మనసు గుబగుబలాడించి మారు పల్కె
కూలిపోయిన గోల్కొండ కూర్మిజోదు.

"ప్రాణములు నిల్పితివి నాదు ప్రణతి గొనుము
గెల్చికొంటివి రాజ్యలక్ష్మిని బడయుము
పెట్టిపుట్టినాడ వనుభవింపుము సిరి
కక్కురితిమాట లిక చాలు కట్టిపెట్టు".

"పిలువకుము నన్ను నుద్యోగఫలము చూపి
నాల్క యొక్కటినాకు డెందమ్ము నొకటి:
విడిచి గోల్కొండ వేరొకయెడకు చనుట
భండనమునకొ కాకున్న స్వర్గమునకొ"

"ప్రాణముల నొడ్డి, రక్తస్రవంతు లీది
ప్రభువుతానాశాహ కొలువున బడసినాడ;
మొదలు సామ్రాజ్యరక్షణమునకు గాదు
శిక్షణమునకుగాని నా చేతి కత్తి.

"సుతునిపోలిక తానాశాహ చూచె నన్ను
చన వొసగి గౌరవము చేసి, ధనము గూర్చి;
క్షుద్రుడను నేను విజయమ్ము గూర్పనైతి
మీదుకట్టగ వలదె యీ మేని నైన!

"కత్తి విడిచి ఢిల్లీశుపు కాసు విసరె
చాలు గోల్కొండ కీగొప్ప; శాశ్వతమ్మ
జీవనము? సొంతపురిజేరి చిత్రకథల
తేజరిలుమయ్య వేగ, నీరాజు నేడు;

మాట ముగియుట తడవుగ మరలిపోయె
జేత నుడికించి యతడు విజేతవోలె;
అరిగె నౌరంగజేబు దీనాస్యు డగుచు
విజితుని విధాన నవరాజ్యవిభుత గనియు.





# ప్రొఫెసరు యస్. రాధాకృష్ణయ్యగారు

దేశభట్ల లక్ష్మీనరసింహము గారు

సుప్రసిద్ధ తత్త్వశాస్త్ర పారంగతులును ప్రస్తుతము కలకత్తావిశ్వవిద్యాలయము లోని తత్త్వశాస్త్రాచార్య శిఖామణులు నగు సర్వేపల్లి రాధాకృష్ణయ్యగారు, ఐరోపా అమెరికా మున్నగు ఖండములలోని మహా విద్యాలయముల యాహ్వాన మంగీకరించి యచ్చటచట కొన్ని యుపన్యాసములొసగ నియ్యకొని ఏప్రిలు 28-వ తేదిన చెన్నపురినుండి ప్రయాణమైనారు. ఇంతియకాక ; కొన్ని దినములలో లండను నగరమున జరుగబోవు బ్రిటిషుసామ్రాజ్యమందున్న యెల్ల విశ్వవిద్యాలయముల మహాసమావేశమున వీరు కలకత్తా విద్యాలయపక్షమున ప్రతినిధులుగ నెన్నుకొనబడినారు. పశ్చిమఖండములలో వీరిచే గావింపబడు హైందవతత్త్వశాస్త్రమును గూర్చిన యుపన్యాసములు భరతఖండమున కెటుండగా పండితవర్యుని జన్మభూమియగు నాంధ్రలోకమున కత్యంతమూర్తిని దెచ్చుననుటకు సందియములేదు.



ఆదియందు నెల్లూరు మండలవాస్తవ్యులుగ నుండి రాధాకృష్ణయ్యగారి ప్రపితామహులు చిత్తూరు మండలమందలి కార్వేటినగర సంస్థానమునకు వలసవెళ్లి తిరుత్తనిలో సంస్థాన తహశీలుదారు పదవిని పెక్కుసంవత్సరము లలంకరించి యుండిరి. తర్వాత వీరితండ్రిగారు సైతము తహశీలుదారుగ నుండిరి. రాధాకృష్ణయ్యగారు బాల్యదశయందు తిరుత్తనితిరుపతులలో విద్యనభ్యసించి యుత్తమ శీలుడగుగ నెల్లూరు పురమునకేగి యచట 1904వ సం॥న యఫ్.ఏ. పరీక్షయందు త్తీర్ణులై, బి.యే. క్లాసులో జేరుటకు గాను చెన్నపురి నగరమునకు వచ్చిరి. ఇచట క్రిస్టియన్ కాలేజీలో ప్రవేశించి 1906వ సం॥న

బి. యే. పరీక్షయందు మొదటితరగతిలో నుత్తీర్ణులై 1908 వ సం॥న యమ్. ఏ. పరీక్షనిచ్చిరి. రాధాకృష్ణయ్యగారి గురువర్యులగు డాక్టరు స్కిన్నరు, ప్రొఫెసరు హాగ్గు మున్నగుదొరలు శిష్యునిబుద్ధివిశేషముల శ్లాఘించుచు భావిదశయందుఅతనికిరానున్నమైశ్వర్యపదవులగూర్చి ముచ్చటించు కొనుచుండెడివారు.

యమ్. ఏ. పరీక్ష కాగానే రాధాకృష్ణయ్యగారు సర్కారువారి ప్రెసిడెన్సీకాలేజిలో తత్త్వశాస్త్రమునందు సహాయాధ్యాపకులుగ నియమింపబడిరి. తమ యుపన్యాసములచే విద్యార్థులమనముల సంపూర్ణముగ రంజింపజేయుటయేకాక ప్రపంచమందంతటను ప్రఖ్యాతివడసిన "Mind" "Quest" "Hibbert journal" మున్నగు మాసపత్రికలలో వీరిచే ప్రచురింపబడుచుండిన వ్యాసములచే 5,6 సంవత్సరములలో వీరిప్రతిభ నలుదిశలను వ్యాపింపదొడగెను. చెన్నపురి సర్కారువారు సైతము మీవిషయమును గుర్తెఱిగి రాధాకృష్ణయ్యగారిని సహాయాధ్యాపకపదవినుండి అధ్యాపకశ్రేష్ఠపదవికి మార్చిరి. ఇంతలో మైసూరు సర్కారువారు తమ విశ్వవిద్యాలయమునకు వీరిని రప్పింపగోరి, చెన్నపురివారి యనుమతిని 500 రూప్యముల వేతనముమీద తత్త్వశాస్త్రాచార్యునిగ నియమించుకొనిరి. ఈమధ్యకాలములో రాధాకృష్ణయ్యగారి కీర్తిమఱింత వ్యాపింప జొచ్చెను, "రవీంద్రనాథటాగూరుగారి వేదాంతము" ("The Philosophy of Rabindranath Tagore") అనుగ్రంథము నొకదానిని కొన్నివ్యాసముల రూపమున "Quest" పత్రికలో వీరు రచించుచుండగా, రవీంద్రనాథుడే యాశ్చర్యపడి "నాగ్రంథములలోని వేదాంతతత్త్వమును గూర్చిన తమ వ్యాసముల నీపత్రికలోజూచి కృతజ్ఞతాపూర్వకముగు విస్మయముతో జదివితిని..." యనుచు నొకయుత్తరమును వ్రాసి పంపెను. అటుతర్వాత మఱియొకగ్రంథము "The Reign of Religion in contemporary philosophy" అనుపేరిట మైసూరు విశ్వవిద్యాలయమునందుండగా రాధాకృష్ణయ్యగారు రచించిరి. ఈగ్రంథము ప్రపంచమునందలి పెక్కు తత్త్వజ్ఞప్రముఖుల మనముల నాకర్షించెను.

ఇది ముద్రణములోనున్నకాలమున కలకత్తానగర విశ్వవిద్యాలయమువారు తమ తత్త్వజ్ఞశాఖకు నిర్వాహకునిగ రాధాకృష్ణయ్యగారిని చెన్నపురి సర్కారువారి యనుమతినిపొంది 1000 రూప్యముల వేతనమున నియమించిరి. కలకత్తా విద్యాలయము వారు ప్రవేశించి యిప్పటికి 5 సంవత్సరములు గడచెను. 5,6 మాసములక్రిందట నే వీరి స్వీయగ్రంథరాజము "Indian Philosophy" అను దానియందలి మొదటి సంపుటము వెలువడినది. తత్క్షణమే పశ్చిమఖండపు తత్త్వజ్ఞుల యాహ్వానపత్రికలు మెండుగ రా నారంభించెను. ఆయాహ్వానముల నంగీకరించి రాధాకృష్ణయ్యగారు, ఇంగ్లాండు, ఫ్రాన్సు, అమెరికా మున్నగు ప్రదేశములలో హైందవతత్త్వశాస్త్రమునుగూర్చి కడచిన మేనెల 19 వ తేదినుండి సెప్టెంబరునెల కడపటివఱకు నుపన్యసించుచుండెను.

విశ్వవిద్యాలయాధికారులును, సంఘాధికారులును రాధాకృష్ణయ్యగారి నిట్లాహ్వానించి గౌరవించుట భరతవర్షమును గౌరవించుటయేకదా!



# వినుటకైనా రాదటే?

తురగా వేంకటరామయ్యగారు

వెలుగువలె నాయందు
మెఱసి, కురిసే భాష్ప
ధారకొంగున నొత్తు
తరుణాన మరపించి
తళుకుమని పరువెత్తెనే! నాప్రియుడు
దారిగోదని వెదుకనే!

కనుపించులోకాల
వినుపించురాగాల
మురిపించుభావాల
కరగించుగీతాల
నుందునని మును బలికెనే! నావిభుడు
ఉండియును గనుపించడే!

అన్నికొండల నెక్కి—
ఉన్న యేళ్లనుదాటి
ఈవేళ సీమ్రాల
నిట్టకనులంబడిన
వెలుగు చూడకపోతినే! హృదయేశు
పలుకు వినలేనైతినే!

ఆసీమ లెట్టివో
ఆగడియ లెట్టివో
ఆపుణ్యమెచటిదో
ఆజీవమెవరిదో
తలచి నిలువంజాలనే! నానాథు
తళుకు నిలుపగజాలనే!

ఆనందమయమైన
ఆదృశ్యమేనేడు
నామనఃప్రాణాల
నమలకే దిగమ్రింగు
కాలసర్పంబాయెనే! నాప్రభుని
గాంచ కేక్రియ నిల్తునే!

రూపాలుమారుచో
పాఫాలు తీరితే
నిలిచి పలికించి నా
వలపుగొని పరుగెత్తు
దొంగ దొరకకపోవునా! హృదయేశు
లొంగదీయకపోదునా!

పాపాలు పుణ్యాలు
ప్రబలిబాధించునో?
పాటలో లీనమై
ప్రణయాబ్ధి దేలునో?
తర్కింపగాజాలనే! మాధవుని
దాక్షిణ్యమే చాలునే

ఆడవే కోయిలా!
పాడవే తీయగా
మనస్సెల్లనతనికై
మరగించు రాగాలు
వినుటకైనా రాదటే! రసమయుని
గనధన్యులము గామటే




# వసుమతి

## శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ గారు

వసుమతి ఒకచక్కని చిన్న సాంఘికనవల. సంఘమందుగల దురాచారముల పారద్రోలుటకు పాఠకుల ప్రబోధించుట పరిపాటి అయ్యెను. ఉపన్యాసముల మూలమున, కరపత్రములమూలమున నవలలమూలమున ప్రజల హృదయమున సంస్కారబీజములు నాటి తన్మూలమున సంస్కారఫలితము నందుటకు లభించునట్లు చేయుటకు సంస్కర్తలు ప్రయత్నించుట ఆచారముగ నున్నది. శ్రీ. శే. వీరేశలింగంపంతులుగారు మున్నగు సంఘసంస్కర్తలు ప్రహసనములు, నవలలు, నాటకములు రచియించి సంఘదురాచారముల నంతమొందించుటకు కృషిచేసిరి. సౌభాగ్యవతి వరలక్ష్మమ్మగారును అట్టి సంఘసంస్కరణార్థులలో నొకకర్త్రిక యనువిషయము దన ప్రథమ ప్రయత్నమగు నీ చిన్నినవలవలన పాఠకమహాశయులకు స్పష్టముకాగలదు.

పొరుగూరియందు, యింగ్లీషువిద్య నభ్యసించుచున్న ఆనందుడు, చెడుసహవాసమువలన వేశ్యాలోలుడై తండ్రిలేని కొరతను దీర్చుచున్న అన్నగారితో తగవులాడి, ఆస్తినిపంచుకొని గుంటూరునందు తనభార్యయగు వసుమతితో కాపురముచేయుట కేగెను. నాగమణి యనువేశ్య వసుమతిసౌందర్యమును జూచి రూపసియగుభార్య కెట్టివాడేని లొంగునని అనుదినమును ఆనం[illegible] సమయమున అతని యింటికివచ్చుచు పోవుచు సమయము దొరకినప్పుడెల్ల వసుమతిపై లేనిపోనికొండెముల ఆనందునితోఁ జెప్పుచు వసుమతిజీవితమును కష్టములపాలు చేసెను. పాపము! [illegible], నిస్సారముగ [illegible] పరిభవించినను సాధ్వీమ[illegible] వసుమతి [illegible]. అన్నయగు [illegible] ఆమె భర్త [illegible] నాయనకు జెప్పుచుండెను. [illegible] నాగమణితో ఆనందుడు [illegible]. [illegible] నూతన [illegible] నాగమణి ఆనందుని [illegible] నాగమణి ఆనందుని [illegible]. ధనహీనుడు [illegible] నాగరించెను.

భర్తకు వసుమతియెన్నియో యుత్తరములు వ్రాయుచుండెడిది. కాని నాగమణి ఆ యుత్తరములనన్నిటిని ఆనందునకు జూపక చింపివేయుచుండెను. తుద కానందుడు ఒక ఆంధ్రునికడ నుద్యోగమును సంపాదించెను. ఉద్యోగము నొసంగిన సుందరరావుగారు ఆనందుని జీవితరహస్యము నెరింగి ఆనందుని మంచిత్రోవను బెట్టుటకు ప్రయత్నించెను. తనవద్ద అధికముగ ధనము లేకుండుటవలనను, నాగమణి మరియొకనిచేరుటవలనను ఆనందుడు వేరుగ నొకగదియం దుండవలసినవాడయ్యెను. అట్టితరి భార్యవసుమతి వ్రాసిన యుత్తరమునుజదివి ఆనందుడు మిగుల విచారము నొందెను. గృహమున కేగి వసుమతిని జూడవలయునని మనమున నాతని కాందోళనము గలిగెను. తరువాత నాతడూరుచేరి తనహృదయపరివర్తనమునకు గారకురాలగు వసుమతితోగలసి సౌఖ్యముగ సంసారము గడుపుకొనెను.



ఆంధ్రపరిశోధక విశ్వవిద్యాలయ ప్రదర్శనము-౧౯౩౬, విజయనగరము



పదునెనిమిదవ వార్షికోత్సవము, స్వావృద్ధి విద్యార్థిసంఘము, సప్తమశాఖ
కొజ్జిల్లిపేట, బందరు (౨౬-౧౨-౨౫)

ఇందు స్త్రీస్వాతంత్ర్యము నుచితముగ పోషింప బడినది. సంసర్గోచితముగ ప్రకరణములు విభజింప బడెనవి. కాని పురుషపాత్రపోషణమునందుమాత్ర మిం చుక లోపమున్నట్లు కన్పించుచున్నది. రసనమున తప్పు లంటగా లేకున్నను సంస్కృతపదభూయిష్ఠమై యొకింత ప్రౌఢముగ నున్నది. పాశ్చాత్యాచారానుసారము మన కలవాటుగానందున్న కొన్నికల్పితపదములు కూర్పబడి నవి. నూతనానుసరణమున కిది ప్రథమ ప్రయత్నమగుటయే దీనికి గౌరవముకావచ్చును. సహవాసదోషములు, కన్యా వరశుల్కములం దర్శనములు, వెలయాలి మాయలు, పవిత్ర చరిత్రలగు హైందవబాలికలకు పతులపైగల ప్రేమ మొద లగునవి యిందురమ్యముగ వర్ణింపబడినవి. మఱియు నీనవల ననేకవిధములగు నీతులను బోధించుచున్నది. ఇట్టిగ్రంథ మును నూతనాంధ్ర విశ్వవిద్యాలయమువారు పఠనీయ గ్రంథములలో నొక్కటిగ పరిగణించుట సమంజసముగ నుండును. మఱియు నీరచయిత్రి గ్రంథముల రచియించి యాంధ్రలోకముయొక్క కృతజ్ఞతకు పాత్రమగుగాక!



# ప్రణయగీతము

కొల్లూరు ధర్మారావు గారు

[illegible]:—

రమ్ము, ప్రేయసి, రమ్ము పోదము
రమ్ము రమ్మని నంటుఁగట్టుచు;
చిమ్ముచీకటి గ్రమ్ము భూమి నె
మ్మనందున సౌఖ్యమౌ?— రమ్ము.

కాలచక్రముచే నధోగతి
పాలుచెందిన జగతి విడిచి, మ
రాళయుగళమురీతి మనము, వి
శాల జలనిధిపైఁ జరింతము;— రమ్ము.

ఐహికాముష్మికద్వంద్వము
దేహ మొక్కటి ననుభవింపఁగ
మోహమే యౌషధము గద, సం
దేహమేటికి దానిఁగొనుటకు;— రమ్ము.

కోరికల నిడు కల్పవృక్షముఁ
గోరనేటికిఁ బ్రణయసుఖమున,
స్వైరసంచారము నొనర్పగ
వేఱుగతి మన కెందుఁ గలుగదు;— రమ్ము.

చీకటులె మన చేతిదీపిక
లై, కళన్ వెలుఁగొందుచుండును,
ఆకసంబున కంటుతరఁగలె
నాకపథసోపానవిధమగు;— రమ్ము.

దిక్కులన్నిటిఁ జుట్టఁబెట్టుచు
నొక్కపెట్టున వీచుగాలులు
ప్రక్కపై శయనించు మనకై
చక్కఁగా నొక "జోల" పాడును;— రమ్ము.

నీలిచీరను గగనమున కు
య్యాలరీతిగఁ బ్రకృతి బాలిక
వ్రేలునట్లుగ గట్టియుంచెను,
బాల, మన కది తగినపానుపు;— రమ్ము.

ఇల్లు వాకిలి విడిచిపోవుట
నొల్లనంచును బల్కెదవు,—నీ
కిల్లు నా మదియందుఁ గట్టితి,
చల్లగా నచ్చట వసింపుము;— రమ్ము.



# సాభిప్రాయవిశేషములు

శ్రీకృష్ణభగవానుడు విభూతి యోగమునందు "మాసానాం మార్గశీర్షోఽహం ఋతూనాం కుసుమాకరః" అను గీతావాక్యమునందు ఋతువులందు వసంతఋతువు భగవద్విభూతులను గల ఋతువుగ వర్ణించెను. వసంత కాలమునందు ప్రకృతియంతయును చైతన్యప్రదమై, మనోహరమై, నవలతాపల్లవకుసుమాలంకరణములతోను, కుసుమ వాసనలతోను విహంగగానములతోను శోభిల్లుచు విశ్వకల్యాణమహోత్సవమును చాటుచున్నది. ఈ మనోహర కాలానంతరము మహాగ్రీష్మము ప్రారంభమై లోకమునంతయును బరితపింపజేయుచున్నది. కాలజ్ఞులు నిర్ణయించిన కాలస్వభావమును మానవ స్వభావము వలె మారినది. వసంతమాసములైన చైత్రవైశాఖమాసము లిపుడు గ్రీష్మమాసము లైనవి. గ్రీష్మమాసములైన జ్యేష్ఠాషాఢమాసములు వేరొకరూపమును దాల్చినవి. ఏ యుగమునందే దేశమునందు చైత్రవైశాఖములుమనోహరమైన వసంతరూపమును దాల్చి యున్నవో ఇపుడు దురూహ్యముగ నున్నది. లోకమునందంతటను కాలస్వభావము మారుచున్న విధమును ప్రకృతిపరిస్థితులు విశదము చేయుచున్నవి. వైశాఖమాసమునం దీయేడు ప్రబలిన వేడిగాడ్పులు దేశమునం దంతటను హాహాకారములను బుట్టించుచున్నవి. నేఁడి గాడ్పులు దుస్సహములై ప్రాణప్రయాసమును గలుగఁజేయుచున్నవి. వైశాఖశుద్ధాంతమునను ఉష్ణప్రమాణము మద్రాసునందు 108, మచిలీపట్టణమునందు 113, కాకినాడయందు 101, కడపయందు 108, కర్నూలునందు 107, నెల్లూరునందు 114, అంశలు ప్రబలి మనకు సంతాపమును గలుగఁజేయుచున్నది. పరిశీ ప్రఖ్యాతినిబడసిన ఉదకమండలము నందును చలితగ్గి వేడిమివ్యాపించుచున్నటుల అనుభవజ్ఞులు తెలుపుచున్నారు. పరమసంతాపమును గలుగఁజేయుచున్న వైశాఖమాసము మధుమాసముగను బరిగణింపుట విచిత్రముగ నున్నది. వర్తమాననాగరికప్రపంచమునందు నాగరకులు నామరూపములకు సంబంధము లేని విధముగను మాసకాలములకు సంబంధము లేకున్నది. అంతరంగమున మాలిన్యమును గలిగియున్నను బాహ్యమునందు సురుచిరాంబరములు, మందహాసములు, ఫలాహారములు, పరిహాసోక్తులు నాగరకలక్షణములై గౌరవభూషణంబులుగ నున్నవి. ధనమునకుగల ప్రతిభ ధర్మమునకు లేకున్నది. భ్రష్టులైనను ధనవంతులకుగల ప్రతిష్ఠ పావనులైనను నిరుపేదలకు లేకున్నది. లోకమునందంతటను ధనతృష్ణ వర్ధిల్లుచు ధర్మకాంక్ష క్షీణించు

నున్నది. ధనముగల జాతులకుగల ప్రతిపత్తి, ప్రతిభ [illegible] లేకున్నది. విశ్వాసము [illegible] ధనములకుగల ప్రతిభ ధర్మమున [illegible]. ఈనాస్తికయుగమున ప్రపంచ [illegible] నుండుట నిత్య యోగము. ప్రపంచమున దేశములకు దృష్టిని ప్రస [illegible] గోచరింపబడుచున్నది. [illegible] నవనాగరకతయంత [illegible] ప్రత్యేకములు [illegible] [illegible], [illegible] [illegible], విద్యా [illegible], దానధర్మ [illegible] [illegible] [illegible] [illegible] ప్రబలు [illegible], [illegible], దానధర్మ [illegible] భోగారాధనము [illegible] [illegible] కోటీశ్వరుల [illegible] [illegible] ధనార్జనో [illegible] [illegible] నాగ్రహము [illegible] బడుచున్నవి. గ్రేటుబ్రిటనునందు [illegible] ధనాధికారబలములు నిర్మూలము [illegible]. ఫ్రాన్సు, స్పెయినులు పశుబలము [illegible] స్వాతంత్ర్యమును మంటను గలిపె [illegible]. ఇటలీయందు సామ్రాజ్యాభిమానము ప్రజాస్వాతంత్ర్యమును నిర్మూలము చేయుచున్నది. దక్షిణాఫ్రికాయందు శ్వేతేతరవర్ణ ప్రతిషేధశాసనము స్వదేశవాసులకును భారతీయులకును నిలువను నీడలేకుండ జేయుచున్నది. అమెరికాయందు ధన భోగాభిలాషలు దురంతములను గలుగజేయుచున్నవి. భరతఖండమునందు బ్రిటిషు సామ్రాజ్యాభిలాష భారతీయుల నధోగతిపాలు చేయుచున్నది. విశ్వవ్యాప్తమైన యధర్మస్థితియందు మానవకోటికి తరణోపాయము గనపడకున్నది. అధర్మారాధనము కాలాంతరమునను సర్వవినాశనమునకు గారణంబైనను ప్రస్తుత మహోన్నత్యమునకు సాధనంబుగ నున్నది.

* * * *

### బొగ్గుసమ్మె పరిణామము

గ్రేటుబ్రిటనునందు నాలుగువారములకు బూర్వ మారంభమైన బొగ్గుపనివాండ్రసమ్మె యింకను సాగుచున్నది. ఇతరపరిశ్రమలం దారంభమైన సమ్మెను పనివాండ్రు విరమించి ప్రజలసానుభూతిని గడించిరి. సమ్మెసమయమునందు బాల్డ్వినుప్రభుత్వముచూపిన చాకచక్యము ధనాధికారబలప్రభావమును విశదము చేయుచున్నది. సమ్మెను భంగముచేయుటకు ప్రభుత్వ మవలంబించిన పద్ధతులు కార్మికప్రపంచమునం దావేశమును గలుగజేసినవి. ప్రభుత్వము సంపన్నవర్గమునకు జూపిన సానుభూతిని కార్మికవర్గమునకు జూపియుండలేదు. ప్రజాద్రవ్యమును నిరాటంకముగను సమ్మెను విచ్ఛిన్నముచేయుటకు బాల్డ్వినుప్రభుత్వము వినియోగించినది. సర్ జాన్ సైమను, బాల్డ్విను, వింట్సను, చర్చిలుగారులు చేసిన ప్రసంగములు ప్రభుత్వహృదయమును విశదముచేసినవి. సైమనుగారు సమ్మెలవిషయ

మయి ప్రతిపాదించినన్యాయసూత్రములుటోరి ప్రభుత్వహృదయమును విశదము చేయుచున్నవి. కార్మికులు మొత్తపుసమ్మెను నిలిపినను బాల్డువినుగారి వాగ్దానములు సార్థకములు గాలేదు. గనులపనివాండ్రసమ్మె సాగుచున్నది. గ్రేటుబ్రిటనునందు పరిశ్రమలు స్తంభించినవి. గనుల యజమానులు వారి పట్టుదలను విడువలేదు. పనివాండ్రు కూలిని తగ్గించుటకుగాని, ఎనిమిదిగంటలకాలము పనికిగాని యంగీకరించుట లేదు. మే మాసాంతముతో యజమానులకు ప్రభుత్వముచేయుచున్న ధనసహాయము నిలిచినది. నెలదినములనుండి సమ్మెసాగుచున్నను ప్రభుత్వము సాహసించి కార్యవిధానమును నిర్ణయించలేదు. బొగ్గుపరిశ్రమను పునర్నిర్మాణము చేయవలసిన యవసరము విషయమై కోటీశ్వరుడు ఫోర్డుగారుచేసిన హితోపదేశమును ప్రభుత్వమును, యజమానులును గమనించి కార్యవిధానమును నిర్ణయించుట శ్రేయస్కరము.

బొగ్గుగనులపనివాండ్రసమ్మె, వారి స్థిరసంకల్పమును కార్యదీక్షను విశదము చేసినవి. సమ్మెప్రారంభమై నెలదినములు గడిచినను పనివాండ్రు శాంతస్వభావమును గలిగి యున్నారు. ప్రపంచమునందంతటను పనివాండ్ర పట్లనుగల సానుభూతిని వారు పొందుచున్న సహాయము విశదముచేయుచున్నది. హామరు స్మిత్తు ఎన్నికయందు కార్మికసభ్యుడు పొందిన విజయ మాంగ్లప్రజల సానుభూతిని విశదము చేయుచున్నది. ఈయెన్నికయందు కన్సర్వేటివునకు పరాజయము కార్మికునకు విజయము గలిగినది. బాల్డువినుగారు తమ పక్షాభ్యర్థికి విజయమును సమకూర్చుటకు ప్రజలకు జేసిన హెచ్చరిక నిరర్థకమైనది. ఈపరాజయమైనను ప్రభుత్వమునకు జ్ఞానోదయమును గలుగజేసి సమ్మె నాపుటకు ప్రభుత్వబలమును వినియోగించుట శ్రేయస్కరము. ధనస్వాములకును, పనివాండ్రకును రానున్న మహాసంరంభమున కీ బొగ్గుపనివాండ్ర సమ్మె బీజాంకురముగ నున్నది. ఆంగ్ల సామ్రాజ్యనికాయము కార్మికసమస్యను విశాలహృదయముతో నిర్ణయించుట సామ్రాజ్య యోగక్షేమములకు నవసరము. బ్రిటీషుద్వీపముల స్థితియు సామ్రాజ్య స్థితియును బొగ్గుమీదను కార్మికుల మీదను నాధారపడియున్నది. రుష్యాయందు స్థాపితమైన బోల్షివతత్త్వము యూరపునందలి ధనస్వాములకు భయకంపమును గలుగజేయుచున్నది. ఇటలి, పోలెండు, పోర్చుగీసు రాజ్యములందు ప్రజా స్వాతంత్ర్యము నిర్మూలమై నిరంకుశాధికారము స్థాపితమగుచున్నది. ధనస్వాములకును కార్మికులకును సంరంభము సకలరాజ్యములకును సంస్థితమగుచున్నది. ఈసంరంభమునునిలుపుటకు సామోపాయము సాధనముగాని దండోపాయము సాధనము గాదు. బ్రిటీషు రాజ్యాధికారులీ పరమార్థమును గ్రహించి ఫాసిలువిధానమును నిరసించుటయును, ప్రజాస్వాతంత్ర్యమును సంరక్షించుటయును శ్రేయస్కరము. స్వదేశస్థితి విషమస్థితియందుండగను సామ్రాజ్యాంతర్భాగముల స్థితియును విషమముగ నున్నది.

ఇర్విను ప్రభువు చేయగలది గనుపడదు. చేయగలది స్వల్పమైనను హార్డింజి ప్రభువు వలెను ఇర్విను ప్రభువు సంపూర్ణమైన సానుభూతి నైనను ప్రకటించి భారత ప్రభుత్వ నిర్ణయమును దెలుపుట ధర్మము. ప్రతినిధుల సమావేశము శ్వేతజనపక్షపాతపూరిత మైన దక్షిణాఫ్రికాపట్టణములందు గూడుట నిరుపయోగము. సమావేశము భరతఖండమునందు సాధ్యముగానియెడలను తటస్థప్రదేశ మైన లండననగరమునందు గూడుటయును, ధర్మపరాయణులను ప్రతినిధులనుగను నియమించుటయును ప్రయోజనకరము. శ్వేతాంగులకు దక్షిణాఫ్రికాయందు పూర్ణమైన ప్రతిబంధకము లిదివరకే కలవు. ఆ ప్రతిబంధకములను పూర్తిగను తొలగించుట మానవధర్మము. తొలగించకపోయినను ప్రతిబంధకములను శాసించుట యమానుషము. ఉభయప్రభుత్వముల ప్రతినిధులును గలిసి అనుకూలమైన కార్యవిధానమును లండననగరమునందు గాంధిమహాత్మునితోను స్మట్సుసేనానితోను సంప్రతించి నిర్ణయించుట కార్యసాధనము. భారతప్రభుత్వము స్వధర్మనిర్వహణమును జేయుటకు సాహసధైర్యములను బూనునని నమ్ముచున్నాము.

* * *

భారతరాజ్యాంగస్థితి

భారతరాజ్యాంగస్థితి దిన దినమును నయోమయావస్థనుబొందుచున్నది. బర్కెనుహెడ్ ప్రభువర్గ ముక్కుకవచమును బిగదీయుచున్నది. రాయలుకమిషనులు బంధనములను బిగదీయుటకు వినియోగించుచున్నవి గాని సడలించుటకు వినియోగపడుట లేదు. ఇర్విను ప్రభువు రీడింగుప్రభువువలె ధర్మసూత్రములను ప్రతిపాదించకపోయినను స్వధర్మ నిర్వహణమునందు సమానప్రజ్ఞను జూపుచున్నాడు. ఇర్విను ప్రభువు చూపిన యాభిప్రాయములు నిగ్రహమును దెలుపుచున్నను కార్యాచరణమునందు ప్రతిభను జూపుట లేదు. రాజ్యాంగనిర్మాణము యొక్క [illegible] చున్నది. [illegible] చున్నవి కాని [illegible] లును ఉద్యోగస్వామ్యమునకనుగుణ [illegible] చేయుచున్నవి. నూతనరాష్ట్రాంగ [illegible] నకు ఇర్విను ప్రభు [illegible] యము [illegible]. దేశమును కలవరపెట్టుచున్న దక్షిణాఫ్రికా [illegible] స్వామ్య విషయమును రాజ్యాంగ సంస్కరణము విషయమును ఇర్వినుప్రభువు [illegible] మును [illegible] చున్నాడు. ఆ ప్రశ్నసమూహ [illegible] సమయోచితముగ [illegible] నున్నది. [illegible] ఇర్విను ప్రభువు నియమించు [illegible] బూనుకొనుట యవసరము.

రాజ్యాంగము అయోమయావస్థ కను కూలముగను సంఘకలహము ప్రచారముగను పెరుగుచున్నవి. అన్ని సంఘములును స్వకీయ సాంఘిక ప్రయోజనములకు పెనుగులాడుచున్నవి. గతమాసమునందుగూడిన హిందూ మహాసభయును ఖిలాఫతుసభయును దేశావృతమైన వాతావరణమును విశదము చేయు

నాయకులు జయకరుగారిపుడు జాతీయ పక్షమునందు జేరినటులు తెలియుచున్నది. జయకరుగారు అసహాయపక్షమును స్వరాజ్య పక్షమును యథోచితసహకారపక్షమును స్వతంత్రపక్షమును నవలంబించి భారత రాజ్యాంగపక్షముల యసంభవమును విశదము చేసిరి. దేశమునందు కాంగ్రెసుపక్షమును ప్రభుత్వపక్షమును నుండుట కవకాశములు గలవు గాని యితరపక్షముల కవకాశములు లేవు.

*    *    *    *

కాంగ్రెసుపక్షము

కాంగ్రెసుపక్ష మాంగ్లేయ బూర్క్రాసు శాసనసభల బహిష్కారమును నిర్ణయించినను ఇపుడు శాసనసభాప్రవేశము నామోదించుచున్నది. భిన్నరాష్ట్రములందును కాంగ్రెసునంస్థ లభ్యర్థులను నిర్ణయించుచున్నవి. ఆయభ్యర్థులకు విజయమును సమకూర్చుట యే కాంగ్రెసుసభ్యుల ధర్మము. కాంగ్రెసు నిర్ణయముల నవలంబించుట కభ్యంతరములు గలవారు తటస్థులుగ నుండవచ్చును గాని ప్రతిఘటనమును జూపుట యసమంజసము. ఆంధ్రదేశమునందు స్వరాజ్యపక్ష పక్షమున నుండదగిన యభ్యర్థులను ఉపసంఘము నిర్ణయించినది. ఆనిర్ణయములను ఆంధ్రరాష్ట్రీయ జాతీయోపసంఘమును స్వరాజ్యపక్ష కార్యనిర్వాహకసంఘమును ఆమోదించినవి. కాంగ్రెసుపక్షాభ్యర్థులకు విజయమును సమకూర్చుటకు ప్రజలందరును పాటుపడి కాంగ్రెసు ప్రతిష్ఠను గాపాడుదురుగాక !

*    *    *    *

గాంధిమహాత్ముడు - కాంగ్రెసు

కాంగ్రెసునీతినుండి అసహాయోద్యోగము పదభ్రష్టతి గలిగినను గాంధిమహాత్ముడు యథాశక్తి కాంగ్రెసుసేవను [illegible] సిద్ధముగ నున్నాడు. గాంధిమహాత్ముని సా[illegible] ములన్ని ఫలింపకుండు [illegible] గము నాటకీర్తి [illegible] సాధనములు [illegible] విదేశీయులు గాంధిమహాత్ముని [illegible] టకు సిద్ధముగ నున్నారు. [illegible] మహా[illegible] [illegible] మోహమున [illegible] [illegible] సనము. [illegible] [illegible] [illegible] నిష్కళంకమైన దేశసేవను, [illegible] జేయుచున్న గాంధిమహాత్ముని [illegible] దేశ మాంతమునకు గాంధిమహాత్ముని చూపిన త్యాగము [illegible] మైన త్యాగమున్నను [illegible] నీయులు మహాత్ముని చర్యలను [illegible] సుశుభము. రాటమునందేశమును, ఖద్దరు ప్రయోజనమును అహింసాధర్మమును అసహాయోద్యమతత్త్వమును గ్రహించుటకు గాంధి మహాత్మునివలె సత్యాగ్రహాభ్యాసమును జేయుట సాధనము గాని రంధ్రాన్వేషణము చేయుట సాధనము గాదు. నాయకులును నారియనుచరులును వారికిగల యావకాశములను పరులదోషాన్వేషణమునకుగాక ఆత్మోద్ధరణమునకై వినియోగించుచు మహాత్ముని వలెస్వధర్మానుష్ఠానమును జేయుచు చరితార్థులగుట ప్రయోజనకరము.

Printed and Published by K. NAGESWARA RAO, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, G. T. Madras.